# శ్రీమదాంధ్ర వచన భారతము.

సంస్కృత భారతమునకు సరియైన తెనుఁగు.

సభా, అరణ్య, విరాట, ఉద్యోగపర్వములు.







శతఘంటము వేంకటరంగ శాస్త్రి.

శ్రీ కాళహస్తీశ్వరాయ నమః.

# శ్రీమదాంధ్ర వచన భారతము.

సంస్కృత భారతమునకు సరియైన తెనుఁగు.

## సభా, అరణ్య, విరాట, ఉద్యోగపర్వములు.

ఇది

శ్రీ కాళహస్తిసంస్థానము పండితులగు

శతఘంటము వేంకటరంగ శాస్త్రిగారిచే

రచియింపఁబడి

పిండ్లచెరువు రామయ్య, బి. ఏ., చే

ప్రకటింపఁబడినది.



28, కచ్చాలేశ్వర అగ్రహారము, చెన్నపురి.

శ్రీమదాంధ్రవచన భారతమునకు సంవత్సరమునకు చందా 3-3-0.

తపాలాఛార్జి సహా ఆది సభాపర్వముల వెల 2-14-0.

అరణ్య విరాట ఉద్యోగపర్వములు వెల 5-5-0.

ఆదిపంచకము వెల 8-0-0.

శ్రీకాళహస్తీశ్వరాయనమః.

# స భా ప ర్వ ము.

## ప్ర థ మా శ్వా స ము.

క॥ శ్రీనిగమ కల్పశాఖశి
ఖానుపమమనోజ్ఞకిసలయాయితదుర్జ్ఞే
యానందచిత్ప్రదీపా।
నానావిధకార్యకారణద్వయరూపా॥

దేవా. నాయెడ ననుగ్రహింపుము.

తదనంతరమున వైశంపాయనమునీంద్రుఁడు జనమేజయనరేంద్రున కిట్లనియె.

యమునాతీరమున వాసుదేవునితోడ సరససల్లాపంబు సల్పుచు సుఖాసీనుఁడై యున్నయర్జునునకుఁ గేలుమోడ్చి మయుఁడు మహాత్మా! యీజనార్దనుఁ డాదహనుఁడును నాయెడ నెంతయేఁ గోపించియుండినను నీదయకలిమిం జేసి బ్రదికితి. ప్రాణరక్షకుఁడ వగునీకుం బ్రత్యుపకారంబుఁ జేయ నే నెంతవాఁడను. అయినను రాక్షసులకు విశ్వకర్మ నగునేను నేర్చినకొలఁది నీ కెద్దియైనం బ్రీతిమైఁ జేయనున్నవాఁడ నానతిమ్మనియడిగె. మయునివచనము విని యర్జునుఁడు రాక్షసేంద్రా! మాయెడ నిరంతరప్రేమ నెఱపుము; అంతియ చాలు. మేమును నీయెడఁ బ్రీతులమై యున్నవార మనవుడు మయుఁడు వెండియు నిర్బంధపూర్వకముగ నడుగఁగ నర్జునుఁ డట్లగు నేని వాసుదేవుఁ డానతిచ్చుదానిం జేయుమనియె. అటమయప్రేరితుండై పురుషోత్తముండు కొండొక చింతించి మయుం బిలిచి శిల్పివర్యా! యనేకవిధదివ్యాభిప్రాయవిలసితంబై యతిరమణీయంబుగా నొకసభను ధర్మరాజునకుఁగా నిర్మింపు మనివక్కాణించె. అందుకు సంతసిల్లి మయుఁ డట్లచేయుదు ననియొడఁబడియె. కృష్ణార్జును లతనితోడఁ బురంబు సొత్తెంచి ఖాండవదహనాదివృత్తాంత మంతయు ధర్మరాజునకు వివరించి మయుం జూపి యతనిసభానిర్మాణోద్యోగముఁ దెల్పఁగ యుధిష్ఠిరుఁ డతని నుచితముగ సత్కరించె. అంత నొకశుభదినమున మయుఁడు మంగళస్నాతుఁడై సాయసాన్నమున బ్రాహ్మణసహస్రంబునకు సంతర్పణంబుఁ జేసి యతిరుచిరంబుగ సభను నిర్మింపఁ బూని నాలుగు దెసలఁ బదివేలజేనలు గలుగునట్లుగా నొకప్రదేశంబుఁ గొల్పించె.

అంత నొక్కనాఁడు వసుదేవనందనుఁడు తల్లిదండ్రుల నవలోకింప ద్వారకకుఁ బోఁదలఁచి ధర్మపుత్రునకు మ్రొక్కి యతనియానతిం గొని యట గుంతియొద్దకుఁ జని యద్దేవికిం బ్రణమిల్లి యనుజ్ఞాతుండై సుభద్రకడ కరిగి యాసతికి హిత ముపదేశించి గారవించి తల్లిదండ్రులు మొదలగువారికిఁ దదీయకుశలసందేశంబు గ్రహించి దీవించి పోయివత్తు ననిచెప్పి యనంతరంబ పాంచాలరాజపుత్రిం గనుంగొని యప్పరమసాధ్విం బలుతెఱంగులఁ గొనియాడి పదంపడి ధౌమ్యునిచరణంబుల కెఱఁగి యాశీర్వాదపురస్సరంబుగఁ దదాజ్ఞం బడసి యాత్రాదానము లొనర్ప నెంచి స్నానంబుఁ గావించి ధౌతపీతాంబరముల ధరించి యలంకృతుండై వివిధయాత్రాదానముల నొనరించి దధిఫలాక్షతపూర్ణము లగు పాత్రములఁ దాల్చి స్వస్తివచింపుచున్న బ్రాహ్మణుల గంధమాల్యాదుల నర్చించి యమితధనముల నొసంగి ప్రదక్షిణనమస్కారంబు లాచరించి శుభముహూర్తమునఁ బాండవులు వెంటరాఁగఁ దఱలి మొగసాల గడచి వచ్చి శైబ్యసుగ్రీవాదితురంగయోజితంబును, గరుడకేతనంబును, గదాచక్రాధిసాధనసంభృతంబును, దారుకసారథికంబును నగుకాంచనరథం బారోహించె. పదంపడి యుధిష్ఠిరుండు దారుకుం దొలంగు మని తానే నొగ లెక్కి పగ్గములు గొని సారథ్యంబు సేయుచుండె. అర్జునుఁడు రథారూఢుఁడై చామరవ్యజనమున దామోదరుం బరిచరింపుచుండె. భీముఁడుం గవలును దగినవారు తోడరాఁగ నామురవైరి వెంటఁ బోవుచుండె. ఆవిధంబున వారెల్లరుం బరివేష్టించి రాఁగఁ బ్రియశిష్యపరివృతుఁడైనయాచార్యుని తెఱంగునం బోవుచు నర్ధయోజనం బతిక్రమించి యచట నిల్చి ధర్మరాజునకుఁ బ్రణమిల్లి భీమార్జునులం బ్రణతులైనమాద్రేయులనుం గాగిలించుకొని వారందఱియనుజ్ఞం బడసి యందఱు నిలువుం డనిచెప్పి దారుకసారథికంబైనయారథం బెక్కి ద్వారవతికిఁ జనియె. పాండవులుం బుండరీకాక్షునరద మగపడునఱకు నాదెసం జూచుచుండి యెట్టకేలకు మగిడి యమ్మురాంతకుం దలంచుచు నింద్రప్రస్థపురము సేరి సుఖముండిరి. అట నారాయణుండు త్వరితగమనంబున ద్వారకఁ జేరి తల్లిదండ్రులకును బెద్దలకును మ్రొక్కి రుక్మిణీప్రభృతిసుందరీరత్నములఁ గూడి సుఖముండె.

## మయుఁడు సభను నిర్మించి ధర్మరాజున కిచ్చుట.

ఇట మయుఁడు పార్థుఁ జూచి యర్జునా! కైలాసపర్వతమున కుత్తరమున హిరణ్యశృంగపర్వతమున బిందుసరస్తీరంబునందు దానవులు తొల్లి యజ్ఞము లాచరింపుచుండ వృషపర్వుఁ డనురాక్షసేంద్రునకుఁగా నే నొకసభ నిర్మింపఁ బూని వివిధమణిమయపదార్థముల నాసరస్సున నుంచియుంటిని. అవి యుండెనేని వానిం దెచ్చి నా నేర్చినకొలఁది సుందరముగ సభను నిర్మించెద. మఱి

యు నాబిందుసరస్సున వృషపర్వుఁడు తనగద నుంచియున్నవాఁడు. అది శతస
హస్రాయుధములనైన భంజించును. నీకు గాండీవంబువలె భీమున కది తగినది.
దానిం దెచ్చి యమ్మహాబలున కిచ్చెద. వెండియు నచట దేవదత్తం బనువరుణ
శంఖము గలదు. ఆశంఖము ధ్వనిని వినినంతన సకలభూతములు గడగడవడంకు
ను. ఆశంఖముం దెచ్చి నీ కిచ్చెద. పోయివచ్చెద ననిచెప్పి యతం డీశానదిగ్భా
గంబునఁ జని గంగానయనోద్యతుం డైనభగీరథునితపస్థ్సానంబును, బ్రహ్మరుద్రేం
ద్ర నరనారాయణాదులయజ్ఞవాటంబును నగునాబిందుసరస్సు సేరి సభాపరికరం
బుల గ్రహించి మణిమయప్రాకారభాసురంబును బహువిచిత్రవిరాజితంబునుంగా
దేవసభలకంటె నతిసుందరంబుగా నొకసభను నిర్మించె. మఱియు నాసభయం
దు వైదూర్యమయపర్ణములు మణిమయనాళములు నగుకాంచనకమలంబులును,
స్వర్ణమయకూర్మమత్స్యాదిజలజంతువులును, స్ఫటికసోపానంబులును, బల్లవితపు
ష్పితఫలితనానాతరుపరీతతీరంబులును, విమలశీతలసలిలంబులునుం గలసరోవరం
బులం గల్పించి జలస్థలభేదంబు గానరాకుండ నేర్పున నపూర్వవిలాసంబు సొం
పారఁ జమత్కరించె. ఆప్రకారమున నాసభను దశకిష్కుసహస్రప్రమాణఁబుగాఁ
బదునాలుగునెలలు నిర్మించి మయుండు మహాకాయులు మహాబలులు నగుకింక
రు లనురాక్షసులచే మోపించుకొని వచ్చి ధర్మరాజునకు సమర్పించి గదాశంఖ
ముల భీమార్జునుల కిచ్చి వారియనుజ్ఞఁ గొని యతఁడు యథేచ్ఛముగ నరిగె.
యుధిష్ఠిరుఁడు శుభముహూర్తమునఁ బదివేవురుబ్రాహ్మణుల గంధపుష్పాదుల
నర్చించి వివిధభక్ష్యభోజ్యములను బహువిధమాంసములను దనిపి వారికెల్లరకు
నుత్తమవస్త్రముల ననేకధేనువుల నొసంగి తదాశీర్వాదములఁ బడసి వివిధవా
ద్యశోభనరవంబులు చెలంగ నాసభలోనఁ దమ్ములతోడఁ బ్రవేశించి దేవతాస్థా
నముల నిష్టదేవతలఁ జేర్చి నటవైతాళికాదులు గొలిచియుండ సుధర్మాసీనుఁ
డైనసురపతివిధంబున వెలుంగుచుండె. అత్తెఱంగున వెలుంగుచున్న యాధర్మనం
దను నంగవంగకళింగాంధ్రపుండ్రకకిరాత మగధమత్స్యపాండ్యకేకయకరూశ
కాంభోజమద్రకాదిసకలదేశాధీశు లగురాజు లందఱు నుపాసించియుండిరి. కా
ర్ష్ణేయసాంబసాత్యకిసుధర్మానిరుద్ధశైబ్యాదు లపుడ యర్జునునియొద్ద ధనుర్వేదం
బభ్యసింపుచుండిరి. అట్టియెడ శ్రీవేదవ్యాసుఁడు, శుకుఁ, డసితుఁడు, దేవలుఁడు
సుమిత్రుఁడు, మైత్రేయుఁడు, శునకుఁడు, తిత్తిరి, యాజ్ఞవల్క్యుఁడు, ధౌమ్యుఁ
డు, సపుత్రుఁ డగురోమహర్షణుఁడు, బలి, పర్ణాదుఁడు, మాంజాయనుఁడు, వా
యుభక్షుఁడు, పారిజాతుఁడు, పర్వతుఁడు, మార్కండేయుఁడు, గాలవుఁడు, రై
భ్యుఁడు. భృగుఁడు. కౌండిన్యుఁడు, గౌతముఁడు, శాండిల్యుఁడు, కాలాపుఁడు,
కఠుఁడు, సుమంతు, జైమిని, పైలాదు లగువ్యాసశిష్యు లైనమేమును బోయి

పుణ్యకథల బోధించితిమి. అంత నొక్కనాఁడు షడంగవేదవేదాంతేతిహాసపురాణపురాకల్పమీమాంసాధర్మతత్త్వవిదుఁడును ప్రధానాంగవాక్యములనైక్యకల్ప

—॰ నారదుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట. ॰—

నము నిత్యకామ్యానుష్ఠానవిశేషము నేకకార్యమున ననేకధర్మసమావేశసంభవంబును నెఱింగినవాఁడును, హితమితభాషణుండును, ప్రగల్భుండును, ధీరమేధావిలసితుండును, బూర్వోత్తరస్మృతిమంతుండును, నీతిశాస్త్రవిశారదుండును, విచక్షణుఁడును, దత్తదధికారిసముచితంబుగ జ్ఞానకర్మకాండముల బోధించువాఁడును ప్రత్యక్షాదిప్రమాణపరిష్కృతసిద్ధాంతుండును, ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనము లనుపంచావయవంబులం గూడినయనుమానవాక్యమున గుణదోషములఁ బరిశీలించువాఁడును, సాంఖ్యయోగవిభాగవిజ్ఞుఁడును, సంధివిగ్రహతత్త్వజ్ఞుఁడును, సకలశాస్త్రవిశారదుఁడును, ప్రపంచమెల్లఁ బ్రత్యక్షముగఁ దెలిసినవాఁడును, గలహప్రియుఁడును, గానరతుఁడును నగునారదమునీంద్రుఁడు లోకముల సంచరింపుచుఁ బారిజాతశైవతాదిమునిసమన్వితుఁడై యాధర్మరాజుసభకు విచ్చేసె. విచ్చేసినయమ్మునీంద్రుం గాంచి ధర్మనందనుండు తమ్ములుం దాను ప్రత్యుత్థానాభివాదనముల నాచరించి యమ్మునినాథు నున్నతాసనంబున నాసీనుంజేసి వినయమున నర్ఘ్యపాద్యమధుపర్కాదుల నర్చించె. నారదుఁ డాపూజఁ గైకొని సంతుష్టుఁడై శుభాశీర్వచనముల వారి ననుగ్రహించి ధర్మకామార్థసమేతంబుగ నిట్లని యడిగె.

ధర్మనందనా! నీయర్థములు నెఱవేఱుచున్నవియె? మనస్సు ధర్మరతమైయున్నదియె? పితృపితామహాదిపరంపరాప్రాప్తంబును ధర్మార్థసహితంబునైనయుత్తమవృత్తి నవలంబించి మనోవ్యథలఁ బాసి సుఖింపుచుందువే? ధర్మార్థకామములఁ బరస్పరవిరోధంబు పొసంగనీక యుచితసమయంబున నయ్యైవాని సేవింతువే? వక్తృత్వము, ప్రాగల్భ్యము, మేధ, పూర్వోత్తరస్మరణము, నీతిపరిజ్ఞానము, విచక్షణత్వము నను గుణము లాఱు గలిగి బలాబలములఁ బరికించి సామదానభేదదండమంత్రౌషధేంద్రజాలము లనుసప్తోపాయముల నుచితక్రమంబునఁ బ్రయోగించి దుష్టశిక్షణము, శిష్టరక్షణము, దూతప్రేషణము, వేగువాండ్రఁ బంపుట, బంధుసత్కారము, ప్రజారంజనము, ధర్మాచరణ, మస్త్రవిద్యాపరిచయము, చేయరానిపనుల విడుచుట, నిత్యక్రియాకరణము, ననుపదింటిం జక్కఁగఁ బరీక్షింతువే? తనకుం బెఱవారికిం గలభేదము నెఱింగి కృషి, వణిక్పథము, దుర్గము, సేతువు, గజబంధనము, రత్నపుగనుల రాజభాగము గ్రహించుట, సువర్ణఖనికరగ్రహణము, జనులులేనిదేశములందు జనులఁ జేర్చుటయు నను నెనిమిదికృత్యముల నడపుచుందువే? స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలము లనుసప్తప్ర

కృతులు కృత్రిమదూతలకు లోఁగక నీయెడ ననురక్తములె? నీచేయురహస్యవిచారము నీవలనఁగాని మంత్రులవలనఁగాని వెలిగాకుండునె? రాజునకు జయము రహస్యవిచారరక్షణమునఁ గలుగుఁ గాన నది యవశ్యముగ రక్షించుకొనవలయును. తనకుఁ దగినవారు జ్ఞానవయోగుణవృద్ధులు, నిర్దోషులు, జంకక హితమునే బోధించువారు, మహాకులీను లనురక్తులు నగువారల మంత్రులఁ గా నియమించితివే? మంత్రి యొక్కఁడైన మేధావి శూరుఁడు శాంతుఁడు నేర్పరియు నయ్యేనేని రాజునైన రాజపుత్రునైనను మహాధనసమన్వితుం జేయును. శాస్త్రవిదు లగునట్టియుత్తమమంత్రులచే సురక్షితంబై రాజ్యము శత్రువులకుఁ జొర నలవిగాకున్నదే? కేవలనిద్రావశుఁడవుగాక జాగరూకుఁడవై వేఁబోకను మేల్కాంచి రాజ్యతంత్రముల నాలోచింతువే? ఒక్కరుఁడవొంటె మఱియనేకసహితుఁడవై యొంటె నాలోచింపవుగదా? హితమంత్రులతోడఁ జింతించి యల్పయత్నమున మహాఫలము చేకూఱునట్లుగఁ గార్యముల వేగమ చేయుదువే? కార్యఫలములఁ బ్రత్యక్షముగఁ దెలిసికొనియెదవే? పర్యవసానమున ఫలము చెడకుండఁ బరీక్షింతువే? దుష్టసంసర్గము చేటులకెల్ల మూలము. గాన నాప్తులు నలుబ్ధులు క్రియస్థులు నగువారిని నియమించి పర్యవసానమునఁ దక్క ముందుగ నెవ్వరు నెఱుంగకుండఁ గార్యములఁ జేయింతువే? సకలశాస్త్రముల ధర్మములను దెలిసినపెద్దలు కుమారుల ధర్మజ్ఞులను యోధముఖ్యులనుగఁ జేయుదురే? మూర్ఖులు వేవు రుండిన నేర్పున నేర్పఱిచి పండితుం గ్రహింతువే? పండితుఁడు కార్యసంకటములు ఘటింప నేయుపాయముననైన మేలు సమకూర్చును. వివిధదుర్గములు ధనధాన్యాయుధోదకయంత్రాది పూర్ణములై శిల్పిధనుర్ధరరక్షితంబులై యుండునే? శత్రురాష్ట్రముల మంత్రి పురోహితుఁడు యువరాజు, సేనాపతి, ద్వారపాలకుఁ, డంతఃపురవిచారకుఁడు, కారాగృహాధికృతుఁడు, భాండాగారాధికారి, రాజాజ్ఞం బ్రచారంబు సేయువాఁడు, వాదిప్రతివాదులగుణదోషములఁ బ్రశ్నప్రతిప్రశ్నములఁ బరిశీలించి న్యాయము నడపువాఁడు, సేనకు జీత మిచ్చువాఁడు, నగరపాలకుఁడు, సేనదక్కఁ దక్కటివారికెల్ల జీతములనిచ్చువాఁడు, సభాపాలుఁడు, ధర్మాధికారి, దండనాధికారి, దుర్గరక్షకుఁడు, రాష్ట్రాంతంపుపొలిమేరలఁ బాలించువాఁడు ననుపదునెనమండ్రును, స్వరాజ్యమున మంత్రి పురోహిత యువరాజులు దక్కఁ దక్కటివారలఁ బదునేగురనుం జక్కఁగ నెఱుంగ నొకళ్లొకళ్ల కెఱుక లేకుండ వేఱువేఱ మువ్వురమువ్వుర వివిధవేషధారు లగువేగువారిం బంపి వారిగూఢతాత్పర్యములఁ బరీక్షింతువే? వినయసంపన్నుఁడు కులీనుఁడు బహుశాస్త్రవిదుఁ డసూయలేనివాఁడు నిర్దోషుఁడు నగుబ్రాహ్మణుని సత్కరించి పురోహితునిగ వరించితివే? యజ్ఞప్రయోగప్రవీణుఁడు మతిమంతుఁ

డకుటిలుఁడు నగువాని యాజ్ఞికుంగా వరించితివే ? అతఁడు హుతమును హో మముచేయఁబోవు దాని నాయావేళల నివేదించునే ? నీజ్యోస్యుఁడు జ్యోతిశ్శా స్త్రము సాంగముగఁ దెలిసినవాఁడే ? లెస్సగఁ బరిశీలించి శుభాశుభములఁ దెలు పునే ? భృత్యులలో నుత్తమమధ్యమాధముల నేర్పఱిచి వారల నుత్తమమధ్య మాధమకార్యముల నియోగింతువే? కులక్రమాతులు కానుకలనైనం గ్రహింప నివారు శుద్ధులు నగువారలఁ బరీక్షించి యుత్తమరాజకార్యముల నియమింతు వె? మంత్రులుగాని నీవుగాని యుగ్రదండనమున జనులఁ బీడింపరుగదా? అట్ల గునేని యాజకులు పతితుని స్త్రీలు వ్యభిచారియైనపురుషుని నవమానించువిధం బున జనులు రాజు నవమానింతురు. ధీరుఁడు శూరుఁడు మతిమంతుఁడు శుద్ధుఁడు కులీనుఁ డనురక్తుఁడు సమర్థుఁడునగువాని సేనాపతిఁగా నియమించితివే? మేలు చేసినవీరయోధుల బహువిధబహుమానములనిచ్చి జీతముల నెచ్చుచేసి యా దరింతురే?భృత్యుల కయ్యైకాలముననన్నము జీతము నిచ్చుచున్నవాఁడవే? కా లాతిక్రమం బయ్యెనేని వారు నిఱుపేద లగుదురు. దానవెంతయేఁ జేటురాజున కు మూఁడును. కులపరంపరాప్రాప్తు లగుయోధవీరులు రణముల నీకుఁగాఁ బ్రాణములనైన విడుతురే ? ప్రాణత్యాగమునసైన మేలుచేసిన యుత్తమవీరుల భార్యలఁ బ్రేమమైఁ బోషింతువే ? సేనలోనెవ్వఁడేనియు నిచ్ఛమై నొకసమయ మున యుద్ధకార్యములనాజ్ఞ నతిక్రమించి విధింపఁడుగదా ? శరణాగతుని బలహీ నుని సమరమున నోడినవానిం బుత్రవాత్సల్యమున రక్షింతువే? విద్యావినయవి జ్ఞానసంపన్ను లగుపెద్దల నభిమతదానపూర్వకంబుగాఁ గొనియాడుదువే? భూ మింగలప్రజలనెల్ల బిడ్డలనుగా భావించి రక్షింతువే? శత్రువులకు వ్యసనకాలముఁ బ్రతీక్షింపుచుండి వారికిఁ దెలియకుండఁ బ్రభుమంత్రోత్సాహశక్తిసమన్వితుం డవై సహాయసంపన్నుఁడవై జయపరాజయములఁ బరిశీలించి సేనకెల్ల ముందుగ జీతములిచ్చి శత్రురాష్ట్రమున బలముఖ్యులకు రత్నాదు లిచ్చి వారల లోఁజేసి కొని జితేంద్రియుఁడవై తన్ను గెలిచికొని ప్రమాదంబులేక సామదానభేదదండ ములనునుపాయముల నాల్గింటిం జక్కఁగఁ బ్రయోగించి రథాశ్వగజపదాతియం త్రాయుధౌషధధనము లనునెనిమిదియంగములు శ్రే,ణ్యాటవిక, భృతక, మూ లబలంబు లనునాలుగుబలంబులుం గలిగి నిపుణసేనాపతిరక్షితం బైనమహాసేన వెంటరాఁగ దండయాత్రపోయి శత్రుశేషంబు కొంచమైన మిగులకుండ జయించి యాదేశములఁ జక్కఁగఁ బాలింతువే ? భాండాగార, గోష్ఠ, వాహన,ద్వారా, యుధములయందును ధనార్జనమునందు నధికృతు లగువారు క్రమములఁ దమ తమపను లనుష్ఠింతురే?మంత్రిపురోహితసేనాపతిప్రభృతు లగునాభ్యంతరులును దౌవారికాదిబాహ్యపరిజనులును నీయెడనొండె, వారిలో నొకళ్లొకళ్లపైనొండెఁ

గీడుఁ దలంపరుగదా ? వారు పూర్వాహ్ణమునఁ బానద్యూతాదుల నాసక్తులు గారుగదా ? ఆయమునఁ నాలవపాలుగాని మూడవభాగముగాని మఱి సగముగాని వ్యయము చేయఁదగు. అంతకంటె నెక్కుడుగా ధనవ్యయముఁ జేయవుగదా ? ఆయవ్యయముల లెక్కించి వ్రాయువారు ప్రతిదినంబునుం బూర్వాహ్ణంబున నప్పటప్పటి యా యవ్యయము దెలుపుదురే ? తప్పు కొంచెమైనఁ జేయక కార్యముల జాగరూకులై నీమేలు గోరువారలఁ దగ్గింపవుగదా ? లుబ్ధుల, దొంగల, విరోధుల, వ్యవహారజ్ఞానశూన్యులం బనుల నియమింపవుగదా? బంధువులు, గురువులు, వృద్ధులు, వణిజులు, శిల్పకారు, లాశ్రితులుం బేదలుగాకుండఁ దగినధనధాన్యము లిచ్చి మన్నించి వారల రక్షింతువే ? రాజ్యమునఁ జెఱువులు విశాలములు జలపూర్ణములునై యుండునే ? కృషిఫలము వర్షమాత్రాధారంబుగాకుండ బహువిధముగ జలసమృద్ధిఁ గల్పింతువే ? కృషీవలు లన్నమునకు విత్తనమునకుం గొఱఁతలేక ధాన్యము గలిగి సంతుష్టులై యుందురే ? లేనివారికి నాలవపాలు వడ్డిగా ఋణము నిత్తువే ? వర్తకమున లోకమునకు సౌఖ్యము గలుగుఁ గావున నదికొఱఁతలేక సాగుచున్నదియె? కార్యారంభోపాయము, పురుషద్రవ్యసంపద, దేశకాలవిభాగము, విపత్ప్రతీకారము, కార్యసిద్ధి యనునైదింట సమర్థులగు బుద్ధిమంతులు నీకు క్షేమ మొడఁగూర్తురె ? నగరరక్షణార్థముగ గ్రామముల నగరములరీతి, ఘోషముల గ్రామములవిధమునం జేయుదువే ? అంగలు నీకే వశులై యుందురే ? చారులు శత్రురాష్ట్రముల నమవిషమాదిసకలప్రదేశముల సంచరింతురే? స్త్రీలు సురక్షితలై యుందురే? వారిరహస్యవచనముల నమ్మి తత్ప్రియంబుగా నెప్పుడు నంతఃపురమునఁనుండవు గదా? ప్రతిదినమును బ్రాతఃకాలమున నలంకృతుఁడవై ప్రజలకు దర్శన మిత్తువే? రక్తవస్త్రముల ధరించి ఖడ్గములఁ బూనిన భటు లెల్లపుడు రక్షణార్థముగా నినుగొలిచియుందురే? ప్రియుల నప్రియులం బరిశీలించి శిక్షార్హులకుయమునివిధమునఁ బూజార్హుల కతిశాంతునివిధమున నగపడుదువే? శరీరరోగముల నౌషధములను లంఘనాదినియమములను నడఁగింతువే? అష్టాంగం బగువైద్యశాస్త్రమున సమర్థులగుచికిత్సకులు నీయెడ ననురక్తులై నీశరీరసౌఖ్యమెప్పుడుం గోరుచుందురే? మనోరోగములఁ బెద్దలసేవచేఁ బోఁగొట్టుకొనియెదవే? లోభమోహాదులవలన ధనవంతులను యాచకులను నవమానింపవుగా? ఆశ్రితులజీవనములఁ బరిహానముననైన నిషేధింపవుగదా? రాష్ట్రమునఁగలపౌరజానపదు లందఱు శత్రువులవలన ధనాదుల గ్రహించి నీతోడఁ గలహింపరుగా? నీదుర్బలశత్రువును బలవంతుఁ డగుశత్రువు బాధింపడుగా? మంత్రబలమునవారి నిద్దఱను నీవు లోఁజేసుకొనియెదవే? సామంతరాజు లందఱు నీకైఁ బ్రాణము

లనైన విడువఁ బూనుదురే? విద్యాగుణములఁ బరిశీలించి విద్వాంసుల సత్కరింతువే? జ్ఞాతిగురువృద్ధదేవమునుల, నశ్వత్థాదిపూజ్యవృక్షముల, బ్రాహ్మణులం, బ్రతిదినంబును నమస్కరింతువే? రసవంత మయినయన్నమున నిత్యంబును బ్రాహ్మణసంతర్పణం బొనరింతువే? వాజపేయపౌండరీకాదియాగముల విధియుతముగ నాచరింతువే? శోకక్రోధములు నినుఁ జేరవుగదా? మంగళద్రవ్యములఁగొనినపరివార ముభయపార్శ్వములనినుఁగొలిచియుండునే? ఇట్టిసద్వృత్తి నెల్లపుడుం బ్రవర్తింతువే? ఇది యాయుష్యము యశస్కరము ధర్మకామార్థానుగతంబు. ఇట్టిసద్వృత్తిం బ్రవర్తిల్లురాజు భూమండలంబెల్ల నిజాజ్ఞావిధేయంబుగఁ జేసికొని సుఖించును. మఱియు నిశ్చయముగ ముచ్చిలింపనియోగ్యుని ధనలోభమున మంత్రులు దండింపరుగదా? మఱి చేసినవాని నతనివలన ధనముగ్రహించి దండింపకమానరుగదా? వెండియు ధనమునకు లోఁబడక న్యాయవిషయమున ధనవంతుని దరిద్రుని నొకటిగాఁ జూతురుగదా? నాస్తిక్యం మసత్యము, క్రోధము ప్రమాదము, తగినవేళలఁ గార్యములఁ జేయమి, జ్ఞానవంతులఁ జూడమి, సోమరితన, మింద్రియముల జయింపమి, యొక్కఁడుగ నాలోచించుట, యనర్థజ్ఞులతోడఁ జింతనము, నిశ్చితకార్యములఁ జేయమి, రహస్యవిచారంబురక్షింపమి, మంగళకృత్యముల నాచరింపమి, యెల్లవారియెడం బ్రత్యుత్థానంబు ననుపదునాలుగురాజదోషంబులఁ బరిహరించితివే? అగ్నిహోత్రఫలములగు వేదములు, దానభోగఫల మగుధనము, రతిపుత్రఫలము లగుకళత్రములు, శీలవృత్తఫలములగు శాస్త్రములును నీయెడ సఫలములై యుండునే? దూరదేశమునుండి లాభముకొఱకు వచ్చి వర్తకముచేయువణిజు లుచిత మగుసుంకముఁ జెల్లింతురే? పురమున రాష్ట్రమునను సమ్మానితు లగువారు తగినతెఱంగునఁ గానుకలు సమర్పింతురే? సర్వజ్ఞు లగుపెద్దలు బోధించునట్టి ధర్మార్థసహితహితవచనము నెల్లపుడును బ్రీతిమై నాకర్ణింతువే? కృషిమొదలగువానివలన లభించుపదార్థముల ముందుగధర్మార్థముగ బ్రాహ్మణుల కిత్తువే? శిల్పుల కందఱకు నాలుగునెలలకుఁగొఱంతగాకుండ ద్రవ్యోపకరణముల నెల్లఁ జేర్చియుందువే? చేసినమేలు దెలియుదువే? తెలిసి పెద్దలసమక్షమున వానిం బ్రశంసింతువే? హస్త్యశ్వరథసూత్రముల గ్రహింతువే? కుమారులు లెస్సగ విలువిద్య నేర్తురే? శత్రుజయార్థముగ సకలాస్త్రముల విషయోగములం బరిశీలించి సంగ్రహించితివే? అగ్ని, దుర్జంతు, రోగ, రాక్షసాది భయము గలుగకుండఁ బ్రజల నేలుచున్నవాఁడవే? అంధుల, మూఁగలఁ, గుంటుల, వికలాంగుల, భిక్షుకుల, బంధుహీనుల నాదరంబునఁ బోషింతువే? అధికనిద్ర, సోమరితనము, భయము, యోగ్యులయెడఁ గ్రోధము, మెత్తఁబాటు, సమయమునఁ గార్యము లొనర్పమి యనుషడనర్థముల డగ్గఱఁ జేరనీక చూచికొని

మెదవుగదా? యని యడుగంగ ధర్మనందనుండు నారదమునీంద్రనిహితప్రశ్నమంతయు నాకర్ణించి సంతుష్టుండై యమ్మునివరేణ్యునిపదారవిందమ్ములకు సవినయమ్ముగ వందనం బాచరించి మహానుభావా ? భవదుపదేశమున ధర్మముల నెఱింగితి. మీబోధించినవిధంబున యథాశక్తిని న్యాయవిరోధము గాకుండ రాజ్యమేలెద. తొల్లింటిపెద్దలరీతి సత్పథమున వర్తింపందలంతుం గాని యట్లు చేయ మాబోంటివారి కలవియగునే! యని విన్నవించికొంతసేపున కమ్మునివర్యుని విశ్రాంతునిగం దెలిసి యుధిష్ఠిరుండు మఱియు మహాత్మా! సకలలోకముల మీరు చూడనవి లేవుగదా. యిట్టిసభ నెచ్చటనైనం గంటివేయనియడుగ నారదుండతని కిట్లనియె. యుధిష్ఠిరా ! మనుష్యలోకమున నిట్టిసభ నెచ్చటం జూడను. మఱివినను. ఇంద్రయమవరుణకుబేరులసభలను బ్రహ్మసభనుం జూచితి. తత్ప్రకారం బాకర్ణింపం గోర్కెయేని వినరించెదననిన ధర్మరాజు నారదుం జూచి మునీంద్రా! వారిసభ లెంతప్రమాణంబు గలవి? ఏరీతి నుండునవి; ఎవరు వారి నుపాసించియుందురు? వివరింపు మనియడుగ నారదుం డాయుధిష్ఠిరున కిట్లనియె.

(లోకపాలసభావర్ణనము.)

ధర్మరాజా! దేవేంద్రసభ నూఱుయోజనముల వెడల్పును నూటయేంబదియోజనములనిడుపును నైదుయోజనములపొడవునుం గలిగి యాకాశమున నుండునది. ఇచ్చమైం జరించునది. సూర్యునితెఱంగున వెలుంగునది. రుచిరసరోవనముల నలరారునది. పుణ్యప్రభావంబునం జొరందగినది. దాని నింద్రుండు తపోమహిమంబున నతిసుందరంబుగ సృజించె. అచట జరాశోకాదిదుఃఖములు చేరరావు. ఆసభయందుం త్రైలోక్యరాజ్యలక్ష్మీసముల్లసితుండైనదేవేంద్రుడు కిరీటాంగదాదిమణిమయాభరణంబులు దివ్యకుసుమమాలికలు విమలాంబరంబు ధరించి శచీదేవీసమన్వితుండై దివ్యవిమానముల నారోహించి వచ్చినమహామహిము లగుభృగుపరాశరపర్వత ప్రభృతిదేవర్షులు బ్రహ్మర్షులు రాజర్షులు సప్తర్షులుం గొలిచియుండం గొలువుండు. మఱియు నియతవ్రతంబు లాచరించినమహాత్ములు హరిశ్చంద్రుం డనురాజు యజ్ఞవాహాము లయినసప్తవింశత్యగ్నులు గ్రహనక్షత్రంబులు విశ్వేదేవు లశ్వినులు ధాత విధాత విశ్వకర్మ యగ్నిషోములింద్రాగ్నులు ద్వాదశాదిత్యులు విద్యుత్సమన్వితంబు లయినమేఘములు మూర్తిమంతంబు లయినయజ్ఞములు దక్షిణలు యజ్ఞమంత్రంబులు ధర్మార్థకామములు జలము లోషధులు తూర్పుదిక్కు శ్రద్ధామేధాసరస్వతులుం గొలిచియుందురు. గురుశుక్రులాసభలో నెడంబాయకయుందురు. సిద్ధసాధ్యచారణగంధర్వాప్సరసలు స్తుతిగీతహాస్యవాద్యనృత్యంబుల వినోదంబుం జూపుచుందురు.

యమునిసభ నూఱుయోజనముల వెడల్పును నిడుపునుం గలిగి విశ్వకర్మనిర్మితంబై తేజోమయంబై శీతోష్ణక్షుత్పిపాసాదిద్వంద్వరహితంబై సూర్యప్రకాశంబై యత్యంతస్వాదుభక్ష్యభోజ్యాదిసంభృతంబై దివ్యపరిమళపరిసరవిలసితపాదపపరీతంబై యకృతవ్రతుల కసత్యవాదుల కశాంతుల కపరిశుద్ధుల కగమ్యంబై కామగమనంబై యత్యంతరమణీయం బగు. దానియం దగస్త్యమతంగాదిసిద్ధమును లగ్నిష్వాత్తాదిపితృదేవతలు దక్షిణాయనమృతులు కాలకింకరులు బహుయజ్ఞముల నాచరించి విమలయశోవిరాజితు లైనయయాతినహుషమాంధాతృనృగశిబిమరుత్తభరత భగీరథపురుకుత్సదిలీపోశీనరదుష్యంతసుద్యుమ్నభూరిద్యుమ్నేంద్రద్యుమ్నపృథూపరిచరులు మీతండ్రి యగుపాండురాజు నాదిగా ననేకరాజులు మూర్తిమంతంబు లయినకాశకుశపలాశాదులుఁ గాలచక్రంబు వైశ్వానరుఁడుం గొలిచియుండ ధర్మాసనాసీనుండై యముఁడు శరీరులశుభాశుభములఁ బరిశీలింపుచుండు.

వరుణసభ యమసభయంతియ వెడల్పును నిడుపును శుభ్రప్రాకారతోరణంబులు కామగమనంబునుం గలది. అందలిపుష్పితఫలితనానావర్ణమణిమయతరుగుల్మంబుల నెప్పుడుం బెక్కుపులుఁగులు వీనుల కింపుగ మ్రోయుచుండు. జలస్తంభముఁ గావించి జలమధ్యమున విశ్వకర్మ దాని రమణీయంబుగ నిర్మించె. సురలు బలిప్రభృతు లగురాక్షసులు వాసుకిప్రభృతిపన్నగులు పుత్రపౌత్రగోనామపుష్కరసమేతుఁ డగుసునాభుఁ డనుమంత్రి శరీరంబుఁ దాల్చినచతుస్సముద్రంబులు గంగాయమునాదిమహానదు లనేకపుణ్యసరస్తీర్థంబులు దిక్కులు భూమి సకలజలచరంబులు పర్వతంబులునుం గొలువఁగ వరుణుఁడు దివ్యాలంకారభాసురుండై వరుణానితోడ నాసభయందుఁ గొలువుదీఱియుండు. నేనుం బలుమాఱు లచ్చటికిఁ బోయినవాఁడను.

కుబేరునిసభ డెబ్బదియోజనముల వెడల్పు నూఱుయోజనముల నిడుపునుం గలిగి చంద్రధవళంబై కైలాసశిఖరసన్నిభంబై వెలుంగు. మఱియు నది యనేకరత్నవిచిత్రంబై యంతరిక్షచరంబునై క్రొక్కాఱుమెఱుంగులం గూడినయంబుదంబు ననుకరించు. అచట నలక యనుకొలను నితాంతసుందరం బగునుద్యానంబునుం గాంచువారికి నయనానందంబుఁ బొందుపఱచు. ఆసభయందుఁ గుబేరుఁడు విచిత్రాభరణపరిధానుఁడు తరుణీసహస్రపరివృతుండునై లలితశీతసురభిమారుతప్రచారమున కిచ్చ మెచ్చుచు దివ్యసింహాసనమున నాసీనుఁడై యుండు. నరకిన్నరనాథు లయినవిశ్వావసుహాహాహూహూచిత్రసేనచిత్రరథాదిగంధర్వులు మణిభద్రశ్వేతభద్రగజకర్ణవరాహకర్ణాదియక్షులనేకగుహ్యకకిన్నరులు రంభామేనకాద్యప్సరసలు నృత్తగీతవాద్యాదివినోదంబులఁ జూపుచు

నాకుబేరుని గొలిచియుండురు. మఱియు రాక్షసగణపరివృతుఁ డై నవిభీషణుఁ డు నలకూబరుఁడు కింపురుషనాయకుఁ డై నసముద్రుఁడు భగదత్తాదిరాజులు నుపాసింతురు. మేరుమందరకై లాసాదిపర్వతంబులు నిధులు నతనిం గొలచియుం డు. వెండియు నాకుబేరుఁడు మైత్రీవిశేషమున నచ్చటికి విచ్చేసిననకలపార్షణపరి వృతుం డై నమహాదేవుం బార్వతీసమన్వితు లోకనాథు నమస్కరించి యాదే వదేవునానతిం బడసి యాసభలోఁ గొలువు దీఱియుండును. నేనుం బెక్కుమా ఱులు దేవర్షిసమేతుఁడనై పోయి చూచుచుందును.

ఇఁక బ్రహ్మసభాస్వరూపంబువివరించెద. తొల్లి నే నీమనుష్యలోకమునఁ గొంతకాలముండి యీలోకముఁ గనుంగొన మనుష్యరూపుఁడై వచ్చినసూ ర్యునివలన బ్రహ్మసభావిశేషంబుఁ బ్రసంగవశమున విని యాసభఁ గాంచఁ దలం చి యేతపమున బ్రహ్మలోకముఁ జూడ నగునని సూర్యు నడిగితి. అతండు నియ మమున సంవత్సరసహస్రంబు బ్రహ్మవ్రత మనువ్రత మాచరించిన దానిం గాంచ నగుననియె. నేనుందత్క్షణంబ హిమవత్పర్వతమునకుఁ బోయి యచట యథో క్తంబుగ వ్రత మనుష్ఠించుటయు సూర్యుఁడు నన్నా బ్రహ్మసభకుఁ దోడ్కొనిపోవఁ గ దానిం జూచితి. తత్స్వరూపంబు నిరూపింప నలవిగాదు. దానిపరిమాణంబు గణింపరాదు. అది ప్రతిక్షణంబున నూహింపరాని కామరూపము ధరించును. నానావిధదివ్యాభిప్రాయముల విలసిల్లు.తనమహిత తేజమున సూర్యచంద్రాగ్ని తే జములను నడంచు. మఱియు నానారూపమణినిర్మితం బంతరిక్షచరంబు నిత్యం బు సర్వకాలసుఖప్రదంబునై చెలంగు. అందుఁ జేరినవారి నెన్నఁడైనను ద్వం ద్వదుఃఖములు చేరరావు. అందుఁ బత్నీసహితు లగుదక్షకశ్యపాదిప్రజాపతులు వాలఖిల్యులు గౌతమాగస్త్యజమదగ్నిమార్కండేయ భరద్వాజాదిమహామును లు యోగాచార్యు లగుసనత్కుమారాదులు సూర్యాదిగ్రహములు నక్షత్రము లు వసురుద్రాదిత్యసిద్ధసాధ్యమరుద్గణంబు లశ్వినులు వైరాజాగ్నిష్వాత్త*గార్హ పత్య †సోమపు లనునలువురు మూర్తిమంతు‡ లేకశృంగ§చతుర్వేద¶కలు లను ముప్పురం గలిసి సప్తపితృగణంబు లనన్నికఁ గాంచి తమతృప్తిచే సోముం ద న్పునట్టిపితృదేవతలు విశ్వేదేవులు సాధిరాజు లనుద్వంద్వదేవతలు వాయువులు విశ్వకర్మ పార్వతీసమేతుఁ డగుమహాదేవుఁడు లక్ష్మీసమన్వితుఁ డగునారాయణుఁ డూర్ధ్వరేతస్కులు లయినయెనుబదివేవురుమహామునులుప్రజావంతులయినయేఁ బదివేవురు మహర్షులు హ్రీస్వాహాదిదేవు లిరువదియేడుగంధర్వాప్సరోగణంబులు దైత్యదానవయక్షరాక్షసగుహ్యకపిశాచనాగసుపర్ణాదులు గురుశుక్రాపాపరుల

* †, ‡, §, ¶ ఈగురుతులుంచినవానికి మనుస్మృతిలో నామాంతరములు చెప్పఁబ డియున్నవి.

గుమహాత్ములు ప్రకృతి మహదహమాదులు మనోబుద్ధులు పంచభూతములు శబ్దస్పర్శరూపరసగంధములు సంకల్పప్రాణములు మూర్తిమంతంబు లయినచతుర్వేదంబులు శిక్షావ్యాకరణాదిషడంగము లష్టాంగం బయినయాయుర్వేద ముపవేదములు సకలశాస్త్రములు పురాణము లితిహాసములు భాష్యములు కావ్యము లాఖ్యానాఖ్యాయికలు వివిధగాథలు ధర్మార్థకామములు హర్షద్వేషతపోదమములు యజ్ఞములు గాయత్రి సప్తచ్ఛందోవిలసితంబయినవాణి మేధాధృతిస్మృతిప్రజ్ఞాబుద్ధిశాంతులు క్షణములు లవములు ముహూర్తము లహస్సులు రాత్రులు బ్రాహ్మదైవపైత్రమానుషంబు లనుచతుర్విధాహోరాత్రములు పక్షములు మాసములు ఋతువులు సంవత్సరపరివత్సరేడావత్సరానువత్సరేద్వత్సరంబు లను పంచవిధవత్సరంబులు కృతత్రేతాద్వాపరకలియుగంబులుం గూడినకాలచక్రంబు ధర్మచక్రంబునుం గొలిచియుండ బ్రాహ్మీవిలసితుఁడైనబ్రహ్మదేవుఁడు పద్మాసనమున నాసీనుఁడై తన్ను సేవింపవచ్చుమహనీయులఁ బలుదెఱంగుల నాదరింపుచు విరాజిల్లుచుండు. పాండునందనా! యీసభఁ జూచినవాఁడ. మనుష్యలోకమున నీసభ కెనయగునట్టిమఱియొకసభ నైనం జూడను. ఇదియ యత్యుత్తమంబై సొంపు పెంపారుచున్న దనినవిని ధర్మనందనుఁడు వెండియు నారదునకిట్లనియె. మునిపుంగవా! ముఖ్యముగ యమసభయందు రాజమండలంబు వరుణసభయందు దైత్యపన్నగులు సరిత్సముద్రంబులు కుబేరసభయందు యక్షరాక్షసగుహ్యకగంధర్వాప్సరోగణంబులు భగవంతుఁ డగువృషభవాహనుఁడు బ్రహ్మసభయందు మహర్షులు నిఖిలామరులు సకలశాస్త్రాదులు దేవేంద్రసభయందు దేవగంధర్వాదులు మహర్షులు హరిశ్చంద్రనృపాలుఁడు నొక్కఁడు న్నవా రనివివరించితివి. రాజలోకంబెల్ల యమసభయం దుండఁగ హరిశ్చంద్రుఁ డొక్కరుండ యింద్రసభలో నుండఁగ నేమికారణంబు? ఆనృపాలుఁ డేతపోమహిమమున నాకలోకం బధిగమించె? మఱియు యమసభయందు మాతండ్రి యగుపాండురాజును గాంచితివికదా? ఆనృపాలుఁడు మాకేమి చెప్పుపుత్తెంచె? వినవలతుం జెప్పవే యనియడుగ నారదుఁ డతని కిట్లనియె.

ధర్మరాజా! హరిశ్చంద్రుఁ డమితవిక్రమమున సప్తద్వీపముల జయించి రాజలోకంబెల్లఁ గానుకలు సమర్పింప విఖ్యాతుఁడై రాజసూయయాగం బాచరించె. ఆయాగమున నతఁడు యథోక్తమునకంటె నైదింత లధికముగ దక్షిణలు ఋత్విజుల కిచ్చె. మఱియుఁ బ్రసర్పకమున నానాదేశాగతు లయినబ్రాహ్మణు వివిధరత్నముల నపరిమితధనముల నొసంగె. వెండియు వివిధభక్ష్యభోజ్యాదిస్వాద్వన్నముల బ్రాహ్మణులకెల్ల సంతర్పణంబుఁ గావించె. సకలరాజులా హరిశ్చంద్రునాజ్ఞచే బ్రాహ్మణులకు నానాపదార్థముల వడ్డించిరి. ఇట్లు సకలవిధ

ముల విప్రసంతర్పణం బొనరించి తదాశీర్వాదంబులఁ బడసి యథావిధి నిర్విఘ్నం బుగ రాజసూయంబు నెఱవేర్చి సురల దనిపి సామ్రాజ్యాభిషిక్తుఁడై హరిశ్చంద్రుఁడు భూమండలంబునం గలసకలరాజులకంటె నధిక తేజోయశోవిలసితుండై తత్ప్రభావమున నాకలోకము నధిగమించి యింద్రసమ్మానితుండై సుఖనున్నవాఁడు. నియమమున రాజసూయము ననుష్టించినవారును యుద్ధమున వెఱవక తెంపుమై విక్రమించి వీరమృతిం జెందినవారును పరమతపోనిధులు నయ్యుత్తమలోకముఁ బడయఁగలరు. యమసభనున్న పాండునృపాలుఁడు హరిశ్చంద్రువిభవమునకు విస్మితుఁడై యిచ్చటికి రాఁదలంచియున్న నన్నుఁ గాంచినమస్కరించి మునీంద్రా! భూలోకమున మత్పుత్రుఁ డగుయుధిష్ఠిరుం జూచి రాజసూయాధ్వరానుష్ఠానమహిమంబున హరిశ్చంద్రుఁ డింద్రలోకంబు సేరుట వివరించి మహాబలవిక్రము లగుతమ్ములసహాయమున దిగ్విజయంబు చేసి రాజసూయం బాచరింపు మని యయ్యుధిష్ఠిరునకు నామాటగా బోధింపుము. అతం డయ్యజ్ఞముఁ జేసిన నేను నింద్రలోకముఁ జేరి సుఖింపఁ గల నని చెప్పినవాఁడు. నేనును భూలోకమునకుఁ బోయిన నవశ్యముగఁ జెప్పెద నంటిని. మీతండ్రిసంకల్పంబు నెఱవేఱ రాజసూయం బాచరింపుము. తత్ప్రభావమున నీవు పితృపితామహాదుల తోడ నింద్రలోక మధిగమింపఁగలవు. ఆయజ్ఞమునకు బ్రహ్మరాక్షసులవశ్యముగ విఘ్నములు చేయన వెదకుచుందురు. అది నిరంతరాయముగ నెఱవేఱెనేని బహుప్రజాక్షయకారణం బగుమహాయుద్ధము గలుగును. విచారించి యుక్తంబు నడుపుము. ప్రజారక్షణమున జాగరూకుఁడవై సర్వసంపత్సమృద్ధిఁ జెందిసంతోషంబుఁ గాంచుము. నిరంతరంబు బ్రాహ్మణపరిచర్యాపరాయణుండవగుము. నేనును ద్వారకకుఁ బోయెద నని చెప్పి నారదమునీంద్రుఁడు తనతోడవచ్చినమునులం దోడ్కొని యరిగె.

(ధర్మరాజు నారదబోధితుఁడై రాజసూయంబుఁ జేయ నాలోచించుట.)

అంత ధర్మరాజు కొండొకచింతించి తండ్రియానతిమెయి రాజసూయం బవశ్యముగఁ జేయఁ దలఁచి యయ్యజ్ఞము నాచరింపఁ బ్రజాక్షయం బగునో యనివగచి యుద్దియుం జేయను జేయకుండఁగను నిర్ణయింపఁ జాలక ప్రజలహితముఁ గోరుచు నెవ్వరియెడను ద్వేషములేక యజాతశత్రుఁ డనఁబ్రఖ్యాతుఁడై భీమునిబలము సవ్యసాచిశౌర్యము సహదేవునిధర్మపరిశీలనము నకులునివినయమునుం దనధార్మికత్వమునకుఁ బెంపుఁ గావింపుచుండ న్యాయమున రాజ్య మేలుచుండె. ధర్మనిరతుఁడై నయయ్యజాతశత్రుఁడు రాజుగాఁగఁ గోరినరీతి వర్షము గురియుచుండె. వృద్ధిజీవిక క్రతుసామగ్ర్యము గోరక్షణము కృషి వాణిజ్యమునుం జక్కఁగ సాగుచుండె. మఱియు జను లందఱు ధనధాన్య

వృద్ధు లగుటంజేసి రాజభాగం బయినధనమును సంవత్సర మతిక్రమింపకను
న్న యిచ్చుచుండిరి. రాజధనగ్రహణార్థం బయినప్రజాపీడనము గలుగదయ్యె.
రోగాగ్నిచోరాదిభయములం బ్రజ లెఱుంగరైరి. రాజకీయాధికారులును బ్రజ
లయెడ వంచనం జేయరైరి. సామంత రాజులు సంధివిగ్రహాదులం బ్రియంబు చే
సి కరములు సమర్పింపుచుండిరి. వణిజులెల్ల వాణిజ్యవ్యాపారముల రాజభాగ
ములం గ్రమముగ నిచ్చుచుండిరి. సర్వవ్యాపకుండు సకలగుణవిశిష్టుండు సర్వము
సహింప నర్హుండగు రాజవరేణ్యుండు నగుధర్మరాజుం దల్లిదండ్రులంగ భావింపు
చునకలదిక్కుల నున్నయాగోపాలవిప్రంబుగ సకలజను లత్యంతానురక్తులైరి.
ఆధర్మరాజొకనాడు మంత్రుల రావించి రాజసూయంబు సేయ నాకుం దగునే
యనియడుగ వారిట్లనిరి. మహారాజా! రాజసూయంబున నభిషిక్తుండై వరుణగు
ణం బగుదానగుణము సాధించినమహనీయుండు సామ్రాజ్యము వహింపం గలం
డు. ఆయాగమున సామమంత్రముల గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు త్రి
ణాచికేతంబులు ననపడగ్నులును జయనంబు చేయంబడు. మఱియు నాయాగ
మున దర్వీహోమాద్యంతర్యాగముల నాచరించి యవభృథమున నభిషిక్తుండై
యజమానుండు సర్వజిత్తన నెగడు. ఆరాజసూయం బనుష్ఠింప నీవ యర్హుండవు.
అందు కిది సమయం బని సుహృదు లందఱుం దలంతురు. వేఱు చింతింపక యచి
రంబుగ దాని ననుష్ఠించునది యని యెల్ల వారు నొక్కటిగను బ్రత్యేకంబుగను జె
ప్పంగ విని యిది తగు నని తలంచియు నంతటం దృప్తి సనక ధౌమ్యద్వైపాయనా
దుల నడిగె. వారు నయ్యాగంబు నాచరింప నీవ యర్హుండవు. కాన నవశ్యంబుగం
జేయు మనిరి. ధర్మరాజు క్రతువువలనం బ్రజాక్షయంబుకలిమికిం గరంబు చింతిం
చి సామర్థ్యయోగముల దేశకాలముల నాయవ్యయముల లెస్సగ విచారించి చే
యుట యుచితంబు గాన యజ్ఞారంభము కేవలాత్మనిశ్చయమునం జేయరాదు.
మఱి యప్రమేయుండనంతుండు సర్వజ్ఞుండు సకలకర్మసాక్షి సకలలోకగురుండు న
గుజనార్దనుండు లీలార్థంబుగ వసుదేవనందనుండై యవతరించినవాడు. భక్తవ
త్సలుం డైనయమ్మహాత్మునకు విన్నవించి తదనుజ్ఞాప్రకారం బనుష్ఠించుట లెస్సయ
నినిర్ణయించి యాజగన్నాథుం దోడ్తెర దూతను బంపె. వాడు వేగంబ ద్వార
కకుంబోయి ధర్మజు ప్రార్థనంబు విన్నవింపంగ జనార్దనుం డింద్రసేనాదులతోడ నతి
త్వరితప్రయాణంబున నింద్రప్రస్థముం జేరి పాండవులం దమనారి నెల్లరనుచితరీతిం
గౌరవించె. ధర్మరాజు నారాయణుని విశ్రాంతునిగ నెఱింగి వాసుదేవా! రాజ
సూయంబు సేయవలయుననసి మాతండ్రి యానతిచ్చినవాం డని నారదుండు బోధిం
చె. అంతయు సర్వాంతర్యామి యగునీకు విదితంబకదా. దాని నందఱుం జేయం
గలరే! నే నందుల కర్హుండనే? సుహృదు లది నాకుం దగు నందురు. కొందఱు స్నే

హామున దోషముల గణింపరు. కొందఱు స్వార్థపరత్వమునఁ బ్రియములఁ బల్కుదురు. కొందఱు చక్కఁగఁ జింతించి తమకు హితముగఁ దోఁచినది ప్రియం బని బోధింతురు. కాన నే నెవ్వరివచనంబుల నాదరింపను. నీవు కామక్రోధాదుల దొల్లింటికారణంబుల విడిచి యుక్తంబు బోధింతువు కాన నీయానతిచ్చు దాసిన చేయ నున్నవాఁడ నని నివేదించుటయు శ్రీకృష్ణుఁ డిట్లనియె.

(శ్రీకృష్ణుఁడు ధర్మరాజును రాజసూయంబు సేయు మనుట.)

మహారాజా ! సర్వవిధముల రాజసూయము సేయ నీవ యర్హుఁడవు. నీకు సకలంబు దెలిసియున్న నొక్కటి చెప్పెద. తొల్లి పరశురాముఁడు సకలక్షత్రియక్షయంబు సేయఁగ నిక్ష్వాకుపురూరవులవంశములవారు దక్క లాఁతివా రుత్తములు గారైరి. ఆవంశములు క్రమమున నేకోత్తరశతవంశము లయ్యె. మఱియు యయాతిభోజులవంశములు పదునాలుగయ్యె. ఇట్టిసకలక్షత్రియుల జయించి జరాసంధుఁడు నిఖిలరాజ్యలక్ష్మీసముల్లసితుఁడై సార్వభౌముఁ డన నెగడియున్నవాఁడు. వానివిక్రమంబు చెప్ప నలవిగాదు. అతనికి మాయాయుద్ధనిపుణుఁడు మహాబలుఁడు చేదిరాజు నగుశిశుపాలుఁడు సేనానాయకుఁడు. మఱియు హంసడిభకు లనువారు మహాబలపరాక్రమములు కౌశికచిత్రసేను లనునామములఁ బరఁగువా రతనికి ముఖ్యసహాయులు. దంతవక్త్రకరూషకలభమేఘవాహనాదు లతని నాశ్రయించిరి. వరుణునంతటి బలవంతుఁడు పశ్చిమదిఙ్నాథుఁడు నగుభగదత్తుఁడు మీతండ్రికి మిత్రుఁ డగుటం జేసి మనంబున మీయెడఁ బ్రేమ గలిగియున్న నాజరాసంధునకు వెఱచి వాక్కర్మముల నతనియెడఁ బ్రీతిఁ జూపుచున్నవాఁడు. పశ్చిమదక్షిణదేశమున కధిపతి యగుపురుజితుఁ డొక్కఁడు నీమేనమామ గాన నీయందే ప్రేమ నెఱపుచున్నవాఁడు. వెండియుఁ జేదిదేశమునఁ బురుషోత్తముఁడు మున్న నేఁ జంపకునికిం జేసి గర్వించియున్నవాఁడు. వంగపుండ్రకిరాతరాజు పౌండ్రకవాసుదేవుఁడు నాచిహ్నములఁ దాల్చినవాఁడు. ఇంద్రసఖుఁడు భోజపతియు నగుభీష్మకుఁడు పరశురామసఖుఁ డగుసోదరుఁడు సహాయుఁడుగా విద్యాబలసంపన్నుఁడై పాండ్యక్రథకైశికముల గెలిచినవాఁడు, మనము ప్రియము చేయుచుండినను సంబంధు లగుమనకు విప్రియములే చేయుచుఁ గులబల్లముల నెంచక పోతరించినవాఁడు. వీరందఱు నాజరాసంధుపక్షంబువారు. మఱియు నుదీచ్యులు భోజు లష్టాదశవంశములవారు నాజరాసంధునకు వెఱచి పశ్చిమదిశఁ జేరిరి. శూరసేనభద్రకారసాల్వపటచ్చరసుస్థలకటాదకులిందకుంతిసాల్వాయనపాంచాలకోసలమత్స్యులును దమతమదేశములవిడిచి వానినే సేవించుచున్నవారు. అస్తి, ప్రాప్తి యనువారల జరాసంధపుత్రకలఁ గంసుఁడు పెండ్లియై శ్రేష్ఠత్వంబు సాధించి గర్వించి బంధువులకుఁ జెఱుపు చేయుచున్నంత వారందఱు నతనియొపచా

రంబుఁ దెలుప నే నాకంసుని వధించితి. బలరాముఁడు సునాముం జంపె. అది కారణముగాఁ గంసభార్యలు మాయెడ ద్వేషము బోధింపుచుండ దుహితృవచనమున జరాసంధుఁడు మా కుపద్రవములఁ జేసె. ఆజరాసంధుఁడు మహాసేనాసమన్వితుండై శస్త్రహతులు గానిహంసడిభికులతోడ మధురపైఁ గవిసె. వారు మువ్వురు ముల్లోకముల నోర్వఁ గలరు. సామాన్యులు గారు. అట్టివారితోడ నేను మహాశూరులు యదువృష్ణిభోజాంధకులు పదునెనిమిదివేవురు బాసటగాఁ బోరునకుఁ గట్టాయితం బగుటయు వారికి మాకుఁ బదునేడుమాఱులు మూడేండ్లు పోరు ఘోరం బయ్యె. ఆసమరమున మేమమ్మాగధసేన నంతయుఁ జెండాడనేరకుండ బలరామునిప్రహారమున హంసుఁడు మూర్ఛపోయె. అంతన హంసుఁడు హతుఁడయ్యె నని విని డిభికుఁడు వాఁడు లేనిజీవనం బేల యని వగచి యమునం జొచ్చి మృతుఁడయ్యె. కొంతసేపునకు హంసుఁడు తెలిసి డిభికునిమృతికి జింతించి ప్రాణతుల్యుఁడైనమిత్రుఁడు పోలివోయె. ఇఁక బ్రతుకరాదు. వానిపోయినత్రోవం బోయెద నని యమునం జొచ్చి తనువుఁ దొఱఁగె. అట్లు హంసడిభికులు సమయుటయు నిస్సహాయుఁడై జరాసంధుఁడు నిర్వేదించి మగిడి నిజపురికిఁ జనియె. అంతట మే మాజరాసంధునితోడి వైరంబు బలవంత మగుడు మధుర నుండఁ జన దనినిశ్చయించి సముద్రమునఁ గుశస్థలమునకు వచ్చి రైవతకపర్వత మాధారముగాఁ ద్రియోజనాయతంబు యోజనాధికైకవింశతిస్కంధంబు యోజనాంతంబున శతద్వారంబు వీరవిక్రమతోరణంబునుంగా మహాదుర్గంబుఁ గల్పించి నిర్భయులమై సుఖమున్నవారము. మఱియు నాజరాసంధుఁడు తపోబలమున నమితవిక్రముఁడై రాజుల ననేకులఁ బట్టి తెచ్చి గిరికందరంబున నేనుంగులఁ జెఱఁ బెట్టుసింగంబు తెఱంగున గిరివ్రజపురమునఁ జెఱఁ బెట్టి భూతనాథునకుఁ బ్రీతిగా నారాజుల బలిచేయుచున్నవాఁడు. ఆదుర్వృత్తుఁడు జీవించియుండ నీకు సామ్రాజ్యంబుఁ బడయరాదు. కావున నచిరంబుగ వానిం జంపి చెఱలో నున్నరాజుల విడిచిపుచ్చవలయు. అది యవశ్య మనిన ధర్మరాజు కృష్ణునకిట్లనియె. వాసుదేవా!

(శ్రీకృష్ణభీమార్జునులు ధర్మరాజున కుత్సాహంబు గలిగించుట.)

నీవు విచారింప సందేహములెల్లఁ బాసె. ఈవిధంబున బోధింప నీవు దక్క వేఱొక్కరుండు సమర్థుఁ డగునే? రాజులు తమతమయిండ్ల నుండి ప్రియములఁ జేసికొందురు గాని సామ్రాజ్యంబుఁ బడయఁ జాలరు. అది సులభ మగునే? పరోత్కర్షములఁ దెలిసినవాఁ డాత్మస్తుతిఁ జేసికొనఁడు. లాఁతివారిపొగడ్తఁ గాంచినయతఁడే పూజనీయుఁడు. భూమండలం బనఁ జాల విశాలంబు. బహురత్నసంభృతంబు. దాని నెల్ల నెఱింగిన మేలుఁ గాంచనగు. కాన జరా

సంధాదులవిక్రమంబుఁ బరిశీలింప నూరకునికియ లెస్స యని తలంచెద. కాకు న్న నాయాగ మాచరించి సామ్రాజ్యంబు సాధింప నగునే ? సత్కులసంజాతు లగుశాంతు లిట్లే తలంతురు. కాలవశమున నొక్కొకవేళ నొక్కొక్కఁడు శ్రేష్ఠుఁడు గాఁ గలఁడు. మేము నామాగధునిదుస్స్వభావమునకు వెఱతుము. నీవే వానికి శంకింపఁగ నీక నాబోఁటివాఁడు బలియుఁడ నని యూహింపఁ దగునే ? నీవుగాని బలరాముఁడుగాని భీముఁడుగాని యర్జునుఁడుగాని యొకవేళ సమరమున జయింతురు కాఁబోలు. అదియు నంతగ నమ్మరాదు. ఇందు నేఁ జెప్పవలసినదియుం గలదే ? మదీయసకలకార్యములు భవదధీనములు. నీవు చింతింపు మనిన విని భీముఁడు ధర్మరాజున కిట్లనియె. మహారాజా ! యత్నముఁ గొననిరాజు క్రమక్రమమున వల్మీకమువలె నశించు. ఉపాయం బెఱుంగక బలవంతు నెదిరించువాఁడు బలియుఁడయ్యు దుర్బలుఁ డనఁబడు. దుర్బలుండును బ్రమాదంబుఁ బొరయక జాగరూకుఁడై హితముఁ బరిశీలించుకొని యుచితోపాయముల బలవంతు నెదిరించి యవశ్యంబు జయంబుఁ బొందు. కృష్ణునినీతి, నాబలం, బర్జును విజయంబు నుండఁగ నీకు వగవనేల? త్రేతాగ్నులు యజ్ఞమునుం బోలె మేముము వ్వుర మాజరాసంధుని సాధింతు మనినఁ గృష్ణుఁ డిట్లనియె. మహారాజా ! ప్రజానురంజనమున మాంధాత పాలనమున భగీరథుఁడు తపోవీర్యమునఁ గార్తవీర్యార్జునుఁడు బలమున భరతుఁడు సంపత్సమృద్ధిచే మరుత్తుండును సామ్రాజ్యంబు వహించిరి. ఈగుణంబు లన్నియు నీకుఁ గలుగుటంజేసి సామ్రాజ్యసాధనమునుల భము. మఱియు వివేకహీనుఁడు ప్రయోజనము విచారింపక కార్యములఁ జేయఁబూనును. అట్టిశత్రుని గెలుచుట సుకరంబు. పెద్దలసమక్షమున వశ్యరీతిని మంత్రణంబుఁ జేసిచూచిన ధర్మార్థనీతుల నన్నింట నాబృహద్రథపుత్రుఁడైన జరాసంధుఁడు సుఖముగ నిగ్రహింపఁ దగియున్నవాఁడు. క్షత్రియు లేకశతకులములవారును రత్నాదుల సమర్పించి సేవింపుచుండిన నాజరాసంధుఁ డన్యాయమార్గప్రవృత్తుఁడై సంతోషింపఁడు. మూర్ధాభిషిక్తుల నిరపరాధుల బలాత్కారంబున నిగ్రహించి లోఁజేసికొనియె. వారల నూఱుగుర బలి చేసి భూతనాథుఁ దృప్తిఁ జేయనున్నవాఁడు. ఇప్పటికితం డెనుబదియాఱుగురఁ బట్టి తెచ్చి చెఱఁబెట్టె. ఇఁకఁ బదునలుగురం జేర్పవలయు. అందఱను సాధించి తనపూనికి నెఱవేర్చును. బలవంతులు గానిరాజులు వాని నెదిరింప నేర్తురే ? వారల నతండు పశువులఁబోలె బలిఁ జేయనున్నను వేఱొక్కయుపాయంబు లేమి జీవితం బసహ్యించుకొనుచు దిక్కుమాలి బ్రతుకుచున్నవారు. క్షత్రియుఁడు యుద్ధమున శత్రునిహతిం బుణ్యలోకంబు వడయుఁగాని దీనసద్గతిఁ బడయునే ? కావున నెల్లవారి నుపద్రవింపుచున్నయాదురాత్ముని మనము వధింపవలయు. వెండియు వా

నిప్రయత్నమునకు విఘ్నముఁ జేసి వానిం జయించిన నీకు సామ్రాజ్యంబు సిద్ధంబనిన యుధిష్ఠిరుఁడు కృష్ణున కిట్లనియె. జనార్దనా! సామ్రాజ్యంబుఁ గోరి కేవలస్వార్థపరుండనై తెంపు చేసి మిమ్ము నాజరాసంధునియొద్ద కెట్లు పంపుదు? నీవు నాకు మనస్సు. భీమార్జునులు నేత్రములు. మీరు పోయిన మనోనేత్రవిహీనుఁడనై నే నెట్లు జీవింపనేర్తు? ఆజరాసంధు నెదిరించి యముఁడైనం గెలువఁ జాలఁడు. ఇఁక మీరు జయింతు రనుటెట్లు? అవశ్యంబుగ నిందు చేటు మూఁడును. కావున నెంత చింతించినను రాజసూయంబు చాలించుటయ లెస్స యని తలంతుననిన నర్జునుఁ డిట్లనియె. మహారాజా! లాఁతివారికిఁ బడయరానియాగాండివంబు నక్షయతూణీరంబులను దివ్యశరంబుల నస్త్రముల వీర్యంబును రథమును ధ్వజమును సభనుం గోర్కు లీడేరఁ బడసితి. ఇవి యన్నియు సఫలములు గాఁగ శత్రుల గెలువవలయుఁగాదే? పెద్దలు సత్కులజననంబుఁ బ్రశంసింతురు గాని నేను బలవీర్యములు పెద్ద యనిభావింతు. అది యట్లుకాదే? మహాకులమునఁ బుట్టియు నిర్వీర్యుఁ డేమి చేయఁ గలఁడు. నిర్వీర్యకులమున జనించియు వీరుఁడు విఖ్యాతుఁ డగును. క్షత్రియుఁ డితరసకలగుణములు లేకున్న వీర్యవంతుఁ డయ్యేనా శత్రువుల గెలుచు. వీర్య మొక్కటి లేకున్న నితరంబు లన్నియు నుండియు నేమి చేయు? సర్వగుణములు పరాక్రమమున గుణీభూతంబులై యుండు. పౌరుషంబు గలిగి ప్రయత్నము చేసిన దైవబలంబు గలదేని యవశ్యముగ జయము లభించును. ప్రయత్నము వలసినంతఁ జేసియు జయముఁ బొందనియతఁడు దైవోపహతుఁడు గావలయు. బలవంతుఁడు దైన్యమోహములఁ జెందరాదు. అవి రాజునకుఁ గీడు చేయు. కాన వానిం ద్యజింపవలయు. పౌరుషంబు చూపకున్న మేలు కలుగదు. చూపిన నిక్కంబుగఁగలుగు. అట్లుండ నూరకుండుట మేలని తలంపఁ బోలునే? యజ్ఞార్థముగ జరాసంధుని వధియించి రాజులఁ జెఱ విడిపించితిమేని యంతకంటె నుత్తమంబు గలదే? కాన వానిం గెలిచి సామ్రాజ్యంబు సాధింపనవలయు ననిన వాసుదేవుఁ డిట్లనియె. ధర్మనందనా! భారతవంశవర్ధనుఁ డైనయర్జునుఁడుచెప్పినది యంతయు నుచితంబు. మనుజుఁడు పుట్టినంతన పొలియుట నిక్కంబు. అది యిపుడొండె. మఱియుఁ గొన్నిదినములకొండె యవశ్యం బనుభవింపకతీరదు. యుద్ధమున సమయుదు రనితలఁపవలదు. పోరుసేయనివారెల్ల బ్రతికియున్నవారె? శాస్త్రబోధితనీతిమార్గమున శత్రుల నెదిరించుటయె పౌరుషంబు. సంతోషావహంబు. నీతిమార్గప్రవృత్తుఁడ పాయములఁ గాంచనివాఁడుం గలసిన మేలు గలుగు. సంగతివశమున వారికి సామ్యంబగు సందురు గాని విచారింప వారు తుల్యులు గారు. నీతిపథప్రవృత్తుండే విశేషించును. నీతిఁ దెలియనివాఁడునుపాయములఁ బన్న నేరనివాఁడును యుద్ధము

నఁ జెడును. వారికి గెలుపు గలుగదు. మనము నీతిమార్గమున నుపాయములఁ బన్ని నిజచ్ఛిద్రములఁ గప్పి పరరంధ్రముల వెదకి శత్రుల డాసి నదీప్రవాహము లువృక్షోన్మూలనంబుఁ జేయుపగిది వారలయుక్కడంతుము. మహాబలసమన్వితు లగుశత్రులతోడిపోరు చాలించుట నీతి. కాన మేమాజరాసంధునిగృహంబు పరు లకుఁ దెలియక చొచ్చి వానిం జంపి రాజులఁజెఱ విడిపింతుము. అతండు భూత ములయం దంతరాత్మవిధమున నేకతంబుండి తా నొక్కరుండ సకలరాజ్యల క్ష్మి ననుభవింపుచుఁ దనయంతరం బెఱుంగకున్నవాఁడు. అదియ వానికి వినాశ మూలంబు. కాన వానిం జేరి జయించుట సులభం బనిన యుధిష్ఠిరుఁ డిట్లనియె.

(జరాసంధునివృత్తాంతము.)

మధుసూదనా! జరాసంధుఁ డన నెవ్వఁడు. వాని కట్టిబలపరాక్రమము లెట్లు గలిగె? నీప్రతాపాగ్నిం బడి మిడుతవోలె భస్మముగావలసియు నెట్లు బ్ర తికినవాఁ డనియడుగఁ గుంతీనందనునకు దేవకీనందనుఁ డిట్లనియె. ధర్మరాజా! వినుము. జరాసంధునివృత్తాంతము నతనియెడ మే ముపేక్షింపఁ గారణంబును వివరించెద. తొల్లి మగధదేశనాథుఁ డైనబృహద్రథుఁడు మూడక్షౌహిణులకు నాయకుఁడు రూపవీర్యతేజశ్శీలవిలసితుఁడు సకలగుణములఁ జెన్ను మీఱినవాఁడు. కాశిరాజుకూఁతుల నమడలం బెండ్లియై కామకృత్యముల వారల నతిక్రమింప కుండఁగను నిద్దఱియెడ భేదంబుఁ జేయకుండఁగను సంకేతంబుఁజేసి వారలతోఁ డఁ గరిణీమధ్యగతుం డైనగజరాజువిధంబునను గంగాయమునామధ్యవర్తి యగుసముద్రుని తెఱంగునను వెలసిల్లుచుఁ బెద్దకాలంబు కామసుఖంబు లనుభవిం చి యపత్యరహితుండై వివిధాభ్యుదయకర్మములఁ బుత్రకామేష్టుల నాచరించి యుఁ గులనిస్తారకుం డైనపుత్రుం బడయనేరక నిర్వేదించి భార్యలతోడ వనము నకుఁ జనియె. చని రసాలతరుమూలమునఁ దపోనిష్ఠుఁ డై యున్నగౌతమాన్వయ జాతుఁ గాక్షీవంతునితనయుఁ జండకౌశికుఁగాంచి రత్నాదుల సమర్పించి యు పాసింప నమ్మునివరుండు సంతుష్టుఁడై రాజేంద్రా! నీయెడఁ బ్రీతుఁడనైతి. వర ము లడుగు మనిన బృహద్రథుఁ డిట్లనియె. మునివరేణ్యా! సకలాభ్యుదయక్రియ ల నాచరించియుఁ బుత్రుఁ బడయనేరక నిర్వేదమున రాజ్యము విడిచి తపస్సుచే యఁగ నిటకు వచ్చితి. ఇట్టియల్పభాగ్యుఁ డగునాకు వరము లేల? రాజ్యమేల? యనిచెప్పఁగ నామునివరుండు వగచి ధ్యానింపుచుండె. అట్లు ధ్యానింపుచుండ శుకాస్వాదనంబునైనఁ బడయనియొకరసాలఫలంబు గాలి వీవకున్న నామ్రాని నుండి రాలి యమ్మునితొడపైఁ బడియె. దానిం గ్రహించి చండకౌశికుఁ డభిమం త్రించి బృహద్రథుఁ బిలిచి నృపాలా! యీపండు గ్రహింపుము. పుత్రుం బడ యుదువు. కృతార్థుఁడ వైతివి. మఱలి పురమునకుఁ బొమ్మనియె. బృహద్రథుఁ

డును జండకౌశికునకుఁ బ్రణమిల్లి యనుజ్ఞాతుఁడై నగరు సొచ్చి భార్యాద్వయ మునకుం దుల్యప్రణయత్వంబున నాపండు రెండుపాళ్లు చేసి భార్యల కిరువురకు నొసంగె. ఆదేవు లాఫలం బుపయోగించి తత్ప్రభావమున గర్భములు దాల్చి యుచితసమయమున నొక్కొ-కకన్నును జెవియుఁ గాలును జేయియు సగము మొగమును గడుపును గటిభాగంబునుం గలమనుష్యశకలములఁ గనిరి. పొడమినయా మనుష్యఖండములఁ బ్రాణసమేతములఁ జూచి బృహద్రథపత్నులు వెఱచి వగచి వందురి వెలవెలఁబాఱుచుండ వారిదాదు లాశకలముల నెత్తికొని కప్పి యంతిపురంబు వెడలి నాలుగుత్రోవలు గలయుచోటం బడవైచి పోయిరి. అంత నచటనుండురాక్షసి జరయనునది మనుష్యమాంసములఁ దినునది వచ్చి యాశిశుశకలంబులం గాంచి సుఖంబున రెంటిని మోచికొనిపోవఁగ నెంచి దైవచోదితయై యారెంటిని నొక్కటిగఁ జేర్చె. చేర్చుటయు నారాక్షసి కెత్తికొన బరువుగా వజ్రసారదృఢశరీరము గలిగి కుమారుఁడై తామ్రతలముష్టి మొగమునం జేర్చి మేఘగంభీరధ్వానమున నేడ్చుచుండె. ఆయేడ్పు విని నివ్వెఱగంది యంతఃపుర జనులుఁ బుత్రజన్మమున నాశ వీడినరాజభార్యలును రాజును దటాలున వచ్చి కుమారుం గనుంగొని సంతసించిరి. ఆసమయమున నారాక్షసి యాబాలుని రాజపుత్రుఁగ నెఱింగి యీదేశమున ధార్మికుఁ డగునీరాజుచేయుపూజలఁ గాంచుచున్న నే నీబాలుఁ జంపఁ దగదని నిశ్చయించి కామరూపగ్రహణసామర్థ్యమున మానుషరూపముఁ దాల్చి యాబాలు నెత్తికొని బృహద్రథు డాయ వచ్చి రాజేంద్రా! నీకుఁ బత్నీద్వయమునం దీకుమారుఁడు రెండువ్రయ్యలుగాఁ బుట్టె. దానంజేసి దాదు లాశకలములఁ బడవేయఁగ నేను రెంటి నొక్కటిగఁ జేర్చుటయు మునిప్రభావమునఁ గుమారుఁ డయ్యె. వీని రక్షించి నీ కిచ్చితిం గొను మనిన బృహద్రథుండు పుత్రుం గైకొని సంతసించి పత్నుల కొసంగె. వారు నాకుమారు నతిప్రీతి నెత్తికొని స్తనపయోధారల నానందబాష్పధారలం దడిపి సంతుష్టలైరి. అట బృహద్రథుఁ డారాక్షసిని బిలిచి నీ వెవ్వతెవు? దేవతవోలె నున్నదాన వనియడుగ నది యతని కిట్లనియె. రాజపుంగవా? నేను రాక్షసిని. జరయనఁ బరఁగుదాన. కామరూపముల గ్రహించుదాన. మనుష్యగృహములఁ బూజల గ్రహింపుచు గృహదేవి యననెగడుదాన. దానవవినాశార్థంబుగఁ దొల్లి బ్రహ్మ నన్ను సృజియించె. పుత్రసమన్విత నగునన్ను భక్తిచే గోడల వ్రాసి పూజించువారికి సకలసమృద్ధి, నట్లు చేయనివారికిఁ గీడునుగావింతు. నీవు పుత్రగణయుత నగున న్నట్ల పూజించుటంజేసి నీయెడఁ గడుఁ బ్రీతినై నీకుఁ బ్రత్యుపకారంబుగ దేనిం జేయుదు ననితలంచుచుంటిని. ఇపు డీపుత్రశకలముల నొక్కటిగఁ జేర్పఁగ దైవబలమును నీభాగ్యబలమును ముఖ్యకారణములుగాఁ బుత్రుఁ డ

య్యె. ఇందు నేనుం గారణంబైతిని. మేరుపర్వతమునైన భక్షింపఁగలనా కీకుమారుం గబళించుట యెంతటిపని? నీకుఁ బ్రత్యుపకారంబు సేయ నెంచి యీకుమారుని రక్షించి నీ కొసంగితి ననిచెప్పి యారాక్షసి యదృశ్య యయ్యె. బృహద్రథుఁడు దాని కేఁటేఁట మగధదేశమున మహోత్సవముఁ గావింప నాజ్ఞాపించి యట నగరు సేరి యాకుమారునకు జాతకర్మము సలిపి జరచేసంధింపఁబడుటం జేసి జరాసంధుఁ డనుపేరు పెట్టె. ఆకుమారుఁడు ఘృతాహుతులఁ బెరుగుహుతవహువిధమున శుక్లపక్షచంద్రునిచాడ్పున వృద్ధిఁ బొందుచుఁ దండ్రికిఁ దల్లులకు నానందంబుఁ బొందుపఱిచె.

అంతఁ గొంతకాలమునకుఁ జండకౌశికుఁడు మగధదేశమునకు విచ్చేయఁగ బృహద్రథుఁడు పుత్రామాత్యమిత్రకళత్రాదులతో నెదురేగి యమ్మునిఁ బురమునకుఁ దోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి మదీయరాజ్యంబును బుత్రుఁడును నీసొమ్మని నివేదించి సేవించియుండఁ జండకౌశికుఁ డాపూజలఁ గైకొని సంతుష్టుఁడై యిట్లనియె. నరేంద్రా! నీపుత్రునిజననాదిక్రమంబునెల్ల జ్ఞానదృష్టి నరసితి. అదియట్లుండె. ఈకుమారుఁడు మహితబలవీర్యరూపశ్రీసమన్వితుండగు. గరుడునిగతి నితరవిహంగములు పొందలేనిచందమున వీనివీర్య మితరులు పడయనేరరు. నదీప్రవాహములు పర్వతమును భేదింపనితెఱంగున దేవతలుఁ బ్రయోగించినయస్త్రములు నితనియవయవముల భేదింపఁజాలవు. సూర్యుఁ డితరతేజముల నడంచురీతి నితండు పెఱరాజులతేజముల నుడిగించు. మిడుత లగ్నింబడి మ్రగ్గడితీరున వీనిబలముఁ జొచ్చి శత్రురాజులు నశింతురు. వర్షకాలమున సకలనదీజలములఁ గొనుసముద్రంబుచాడ్పున నితఁడు సకలరాజసంపదల గ్రహించు. శుభాశుభపదార్థములనెల్ల భరించుభూమివడువున నితఁడు సకలవర్ణములవారల భరించు. దేహధారులు సర్వభూతాంతర్గతుఁ డగువాయువునకు వశులగుమాడ్కి సకలరాజులు నితనికి లోఁగుదురు. మఱియు నితండు త్రిపురాంతకు మహాదేవుం బ్రత్యక్షముగఁ గనుంగొను ననిచెప్పి చండకౌశికుఁ డరిగె. అంత నొక్కనాఁడు బృహద్రథుఁడు జరాసంధుని రాజ్యాభిషిక్తునిజేసి భార్యాద్వయసహితుండై వనమునకుఁ జని తపస్సుచేయుచుఁ బెద్దకాలము గడిపి భార్యలును దాను మేను దొఱంగుటయు జరాసంధుఁడు వారి కుదకక్రియలు నిర్వర్తించి మునివరప్రభావంబున ననేకరాజుల జయించి రాజ్య మేలుచుండె. పదంపడి కొంతకాలమునకు నేను గంసునివధింప నావిరోధమునఁ దొంబదితొమ్మిదిమాఱులు గదం ద్రిప్పి గిరివ్రజమునుండి మధురపైఁ బడ విసరి వైచె. అది యేకోనశతయోజనదూరంబున మధురచెంగటం బడియె. మఱియు నాయుధముల హతులుగానిహంసడిభకు లనువారు నీతిశాస్త్రవిదులు వానికి మంత్రులైరి. వారు ముగ్గురు ముజ్జగముల నో

ర్వాఁ గలరని చెప్పితిం గదా. వారల గెలువరాదని నీతి విచారించి బలవంతులయ్యు వృష్ణికుకురాంధకాదు లుపేక్షించిరి. ఇపుడు హంసడిభికులును బొలిసిరి. కాన వాని వధింప నిపుడు కాలంబు ప్రాప్తం బయ్యె. ఆయుధయుద్ధమున నాబార్హద్రథుని దేవదానవాదులైనం గెలువ నేరరు. మల్లయుద్ధముననె జయింపవలయు. నానీతియు భీముని బలము, నర్జునుజయంబునుం గలుగ విచారం బేల? మేము ముగ్గురము త్రేతాగ్నులిష్టిని సాధించుపథమున నద్దురాత్ముని సాధింతుము. విజనప్రదేశమున మాకుఁ జిక్కి యాతఁడు మాలో నొక్కనితోఁ బోరాడు. అవమానమునను, లోభమునను, భుజబలగర్వమున నాజరాసంధుఁ డవశ్యముగ భీముని తోడఁ బోటులాడు. మహాబలుఁ డగు భీమసేనుఁ డంతకునికరణి విజృంభించి వానిం జంపుట నిక్కంబు. ఇంతేల ? నామనంబు నెఱుంగుదువేని, నను నమ్ముదువేని భీమార్జునుల నావశమున నిల్లడపెట్టు మని చెప్పిన శ్రీకృష్ణునివచనముల విని భీమార్జునుల నానందవికసితవదనారవిందుల నుపలక్షించి ధర్మరాజు భగవంతున కిట్లనియె. వాసుదేవ! యిట్లు వచియింపఁ బోలునె? నీవ దిక్కు మాకు. నిన్నె యాశ్రయించి సౌఖ్య మెసఁగువారము. నీదు పూనిక కంటె వేఱు పొసఁగ నగునె? ఎవ్వరియెడ నీవు కరుణింపవో వారి కవశ్యము సంపదలు గలుగవు. నీకు విరుద్ధుఁడైన జరాసంధుఁడు హతుఁ డయ్యె. రాజులెల్లఁ జెఱఁ బాసిరి. భవదాజ్ఞావిధేయుఁడ నగు నేను రాజసూయం బాచరించితి ననితలంతు. కృష్ణార్జును లొండొరుల విడువరనియు, వారికి గెలువరానివాఁడు గలుగఁడనియు నమ్ముదు. ఆకృష్ణార్జునులె బాసటగాఁగ భీముఁ డెద్దానిం జేయనేరఁడు? నీతివిదుఁడు ప్రయోగించిన సేనావ్యూహము కార్యము సాధించు. అంధమైనను జడమైనను బలము నీతివిత్ప్రయుక్తంబై క్రమమున నడుచు. జలములు పల్లమునకుఁ బాఱు విధమున, జాలరులు తఱుఁగఁ బాఱిననీళులం జిఱుగాలువలఁ బాఱించు తెఱఁగున నీతివిదుఁడు జయమగు తెరువున సేనల నడిపించు. సర్వనీతివిచక్షణుఁడ వైన నీవు బోధించుమార్గమునం బ్రవర్తించుమాకుఁ గార్యసిద్ధి కరతలామలకంబు గాదె? మఱియు నెవ్వారేనియు నిన్నాశ్రయించిరేని వారికి కార్యములెల్లఁ జేకూఱును. కావున నిను నర్జునుఁ డతని భీముఁడు ననుగమింపవలయు. నీతిజయబలములుం గూడఁగఁ బరాక్రమింపఁ గార్యము సమకూఱకున్నె? రోగార్తుఁడు త్రివర్గంబు విడిచి సుఖింపనేరని పగిది మిమ్ము విడిచి నేను సుఖింపనేరను. అయినఁ గార్యార్థంబుగఁ బోయి జయంబు సాధించి కొని రండని వెట్టకేలకు సమ్మతించె.

(శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధుపురమునకు వెడలుట.)

శ్రీకృష్ణభీమార్జునులు తత్ప్రకారంబున ధర్మరాజుచే ననుజ్ఞాతులై వ్రతస్నాతకులైన బ్రాహ్మణుల వేషముల ధరించి సుహృదు లందఱుం గొనియాడఁ

దఱలి పద్మసరస్సును, గాలకూటంబును, గండకిని, మహాశోణంబును, సదానీరను, సరయువునుం దాఁటి, పూర్వకోసలముల, మిథిలాపురమునుం గడచి, మాలా చర్మణ్వతీనదుల లంఘించి, గంగను, శోణమును నతిక్రమించి ప్రాఙ్ముఖంబుగ నిరంతరప్రయాణము చేసి మాగధదేశముఁ జొచ్చి గోరథగిరి నారోహించి మగధరాజధానిం జూచుచుండఁ గృష్ణుఁ డర్జునున కిట్లనియె. ధనంజయా! చూడు మిదె మగధదేశము దివ్యభవనసమంచితంబు జలసంభృతంబు పశుసమృద్ధంబునై యొప్పారుచున్నది. వైహార, వరాహ, వృషభ, ఋషిగిరి, చైత్యకంబులను నీపర్వతంబు లైదు నీమగధరాజధాని నావరించి రక్షించుటం జేసి యిది గిరివ్రజంబు నాఁ బరఁగె. ఇందుఁ దొల్లి గౌతముఁ డౌశీనరి యనుశూద్రవనితయందుఁ గాక్షీవాదులఁ బుత్రులఁ బడసి యిచ్చోటున నుండె. అమ్మునియనుగ్రహమున నీపురంబు లాఁతివారు సొరనేరరు. ఇదె కనుంగొనుము. సొంపు పెంపారు నానాతరుకదంబములనయనానందంబుఁ గూర్చుచున్నది. ఈవనముల మున్ను నానాదేశాధీశులు విహరింపుచుండిరి. ఈగౌతమాధివాసంబున నర్బుద, శక్రవాపి, స్వస్తిక, మణినాగు లనుశత్రుభీకరు లగునాగరాజు లున్నవారు. ఇచ్చట మేఘములు కోరినపుడు వర్షించునట్లు మనువు ప్రిపాదించె. కౌశికమణిమంతులీమాగధుల ననుగ్రహింతురు. ఇట్లన్నివిధముల నితరుల కాక్రమింపరానియీపురముఁ జేరి జరాసంధుఁడు సర్వార్థముల సాధించి గర్వించినవాఁడు. మనము వీనిమదం బుడిపెదమని చెప్పి యుత్సాహంబుఁ గల్పించె. పదంపడి వారు ముగ్గురు నాగిరివ్రజపురముఁ జేరనెంచి యీచైత్యకపర్వతము నారోహించి తొల్లిటిమాగధులు మనుష్యభోజనుఁడైన ఋషభుఁ డనురాక్షసుని సంహరించి వానిచర్మమున నిర్మించిన మూఁడుభేరులఁ జూచిరి. అవి పెఱరాజులు సొచ్చిన మునిప్రభావమునఁ దమంతన మాసంబు మ్రోయుచుండు. ఆభేరులఁ బగులఁ గొట్టి ద్వారదేశమున నానాయుధపాణులై సకలపరిజను లుండఁగ వారు ద్వారమునఁ జొరనొల్లక చైత్యకశృంగంబుఁ బగుల నడచి ప్రాకారంబు లంఘించి పురముఁ జొచ్చిరి. అంతకుమున్న రాజపురోహితులు వేదపారగులు దుర్నిమిత్తముల నుపలక్షించి జరాసంధునొద్దకుఁ బోయి తత్ప్రతీకారంబుగా హోమాగ్నిప్రదక్షిణాదిశాంతుల ననుష్ఠింపవలయునని తెల్పిరి. అతండు నాక్రియల నెఱవేర్ప దీక్షఁ బూని నియమమున నుపవాసపరుం డయ్యె. అయ్యవసరంబున స్నాతకవేషధారు లగుకృష్ణభీమపార్థులు నగరసౌభాగ్యంబుఁ గనుంగొనుచు రాజమార్గమున మాలాకారగృహమునకుఁ బోయి పూదండలు గొని ధరించి చందనంబుఁ బూసి వర్ణనీయరూపవిభాసితులై పౌరజను లాశ్చర్య మొంద హైమవతసింహములు గోష్ఠంబుఁ జొచ్చుమాడ్కి బ్రాహ్మ

ణసుప్రవేశం బైనరాజభవనంబుఁ జేరి జనసంకులంబు లైనమూఁడుకక్ష్యాంతరం బు లతిక్రమించి జరాసంధుం గాంచిరి.

అతండు నెదురువచ్చి వారలఁ దోడ్కొని యరిగి యర్ఘ్యపాద్యమధుప ర్కాదివిధులఁ బూజించి స్వాగతం బడుగ వార లాపూజలఁ గైకొనక యూర కుండిరి. అంతఁ గొంతవడికి మహనీయమేధావిలసితుఁడు కృష్ణుఁ డపుడు జరా సంధుంజూచి నృపాలా! వీ రిపు డొకనియమమున నున్నవారు. అర్ధరాత్రం బగు నంతకుఁ బలుకరు. పిదప నీకు త్తరము లిత్తు రనిన జరాసంధుఁ డట్లగు నేని నియ మాంతమునఁ బూజింతు ననిచెప్పి వారల యజ్ఞాయతనమునఁ జేర్చె. అంత న ర్ధరాత్ర మగుటయు జరాసంధుఁడు స్నాతకులు వచ్చి రని నడురేయి విన్నను నపు డవారల నెదుర్కొని పూజించునట్లుగా వ్రతముఁ బూనినవాఁడు గావున యజ్ఞా యతనమునకుఁ బోయి వారిం గాంచి తదీయాపూర్వవేషమునకు విస్మయమొం దుచుండ వా రోరాజేంద్రా! శుభం బగుఁగాక యని పల్కిరి. మగధనాథుఁడం తట వారల నుచితాసనాసీనులం జేసి యిట్లనియె. అయ్యా! స్నాతకు లైనబ్రా హ్మణులు పుష్పమాలికలఁ దాల్ప రనియుఁ, జందనము న్నలంద రనియు విం దుము. అట్లుండ మీరు పుష్పచందనముల ధరించితిరి. మఱియు మీభుజము ల ల్లెత్రాటియొరపిడిచే గాయలుగాచియున్నవి. చైత్యకగిరిశిఖరంబు భేదించి వె అవక యద్వారంబునం బురంబు సొత్తెంచితిరి. మిమ్ముఁ జూడ వేషమున బ్రా హ్మణ్యమును, శరీరబలక్రియలచే క్షత్రియత్వంబునుం దెలియుచున్నది. మీ రె వ్వరు? సత్యంబుఁ జెప్పుఁడు. రాజులయెడ సత్యవచనంబకాదె యోగ్యము. వెం డియు విధియు క్తముగ నాచేయుపూజల నేలగ్రహింపరు? ఏకార్యముగలుగ నిచ్చ టికి వచ్చితిరి? వివరింపుఁడు. బ్రాహ్మణులకు వాక్యముల శౌర్యముండుఁ గదా య నియడుగఁగ గంభీరవచనములఁ గృష్ణుఁ డిట్లనియె. జరాసంధా! బ్రాహ్మణక్షత్రి యవైశ్యులు ముగ్గురును స్నాతకత్వంబుఁ బొందనర్హులు. ఇది సామాన్యధర్మంబు. వ్రతాచరణంబున విశేషంబులుం గలవు. విశేషధర్మముల నాచరించి క్షత్రియుఁ డఖిలసంపదలఁ గాంచును. మేముక్షత్రియస్నాతకులము. వ్రతప్రభావమున బ్రా హ్మణులవడువున నున్నవారము. గంధమాల్యముల లక్ష్మియుండుటంజేసి వాని ధ రించితిమి. అద్వారమున శత్రుగృహమును, ద్వారమున మిత్రగృహమును జొ చ్చుట ధర్మంబు గావున నీగృహము నద్వారమునఁ బ్రవేశించితిమి. వేఱొక్క కార్యము గలిగి నీగృహమునకు వచ్చుటంజేసి శత్రుఁడ వగునీచేయుపూజలఁ గ్ర హింపము. బ్రాహ్మణులు వచనశౌర్యులు. ఉత్తమక్షత్రియుల మగుమేము బా హువీర్యము గలవారము. క్షత్రియులకు భుజములందకాదె! బ్రహ్మవీర్యముఁ గ ల్పించె. మావిక్రమముఁ జూడఁగోరెదవేని యవశ్యముగఁ జూడు మనిన జరా

సంధుఁడు కృష్ణున కిట్లనియె. ఎంతచింతించినను మీతోడి వైరమునాకుఁ దోఁపకున్నది. అపరాధము గొంచెమైనం జేయని నన్ను శత్రుఁగాఁ దలంపఁజనునె? నిరపరాధునియెడ విరోధముఁ జూపిన ధర్మవిరోధంబు. దాన నరకానుభవంబునుం గలుగు. క్రమమున ననుష్ఠింప క్షత్రధర్మము రాజుల కుత్తమము సకలకార్యసాధనం బగుంగదా. అట్టియుత్తమక్షత్రియపథమునఁ బ్రవర్తించునను నిరపరాధుం బ్రమాదంబున శత్రుఁడనిపలుకఁబోల దనిచెప్పిన విని కృష్ణుఁ డిట్లనియె. కులోచితమహాకార్యము నిర్వర్తింపఁ బూనినయొకమహాత్మునియానతిమెయి మేము నిన్నెదిరించి వచ్చితిమి. తవాతమదేశముల నుండి నిరపరాధులయినరాజుల నిష్కారణంబుగఁ బట్టి తెచ్చి చెఱఁ బెట్టి క్రూరకర్మముఁ జేయుచున్న నీవును నిరపరాధుఁడవే? రాజమాత్రుఁ డెవ్వఁడైన సాధువు లగురాజుల బట్టి తెచ్చి రుద్రునకు బలి చేయునె? లోకమున నీవుదక్క మఱియొక్కమనుష్యుఁడు దనవంటి మనుష్యుని బశువుగా భావించి భూతనాథునకు బలి చేయ మదినైనం దలంచునే? ఇంతకంటె నధర్మంబు మఱియొకటి గన్నడదు. ధర్మరక్షణపరుల మగుమేము బంధుజనక్షేమంబుఁ గోరి పాపాత్ముఁడ వగునిన్ను వధింప వచ్చితిమి. నరుఁ డేయే కర్మముల నేయేయవస్థలం జేయునో దత్తత్ఫలంబులు దత్తద్వేళల ననుభవింపన వలయు. ఉత్తమక్షత్రియులు రణయజ్ఞమున దీక్షితులై వీరస్వర్గము గాంతురు. పరమార్థవిచారంబును, మహితయశస్సమార్జనంబును, బ్రబలతపోనుష్ఠానంబును, యుద్ధమరణంబును స్వర్గప్రాప్తికారణంబులు. ఉత్తమగుణములు గలమహాశూరుఁడు ధర్మమునఁ బోరాడి వీరమృతిం గాంచినయతం డింద్రుని సౌధమున నయ్యింద్రునితోడ నిష్టవినోదములు సలుపుచుండు. మఱియు క్షత్రియులలోనెల్ల నే నొక్కరుఁడ నే పురుషుఁడ ననిగర్వింపకుము. నీకుసమానులు నీకంటె నధికులు ననేకులు గలరు. కులవృత్తాదుల నెఱింగినయతఁడు నీపోలె మదింపఁడు. తొల్లియు నిట్లు గర్వించి దంభోద్భవుఁడు కార్తవీర్యుఁ డుత్తరబృహద్రథుఁడను వినాశంబుఁ బొందిరి. ఇట్లు గర్వించి నీవుంబుత్రమిత్రాదులతోడఁ జెడుదువు. నేను వసుదేవనందనుఁడ నగుకృష్ణుఁడను. వీరిరువురు పాండుపుత్రు లయినభీమార్జునులు. నిన్ను నిగ్రహింపన వచ్చితిమి. చెఱఁ బెట్టినరాజుల విడిపించి మేలు గాంచుము. కాదేని మాతోడఁ బోరు సేసి యమపురి కరుగు మనినఁ గ్రోధఘూర్ణమానమానసుండై జరాసంధుఁ డిట్లనియె. నే నీరాజుల నొకనినైనం జయింపక తెచ్చినవాఁడను గాను. విక్రమించి పట్టి తెచ్చినరాజుల నిచ్చవచ్చినరీతిం జేయుదు. ఇది క్షాత్రధర్మంబు. ఉత్తమక్షత్రియుఁడ నగునేను దేవతార్థముగఁ దెచ్చినరాజుల విడిచి విడువను. సేనఁ దెప్పించి మీరు పోరాడఁ దలంచిన నేను సేనాసమన్వితుఁడనై రణము సేయుదు. కావున మీమువ్వురతోనొండె నిద్దఱితోనొండె నేకకాలము

నఁగాని వేఱువేఱుసమయములఁగాని పోరాడెద నని చెప్పి జరాసంధుఁడు తనపుత్రుఁడగు సహదేవునకు రాజ్యాభిషేకముఁ జేసి తనముఖ్యామాత్యులగు హంసడిభికులు పాలియుటకు వగచి కొండొకవడికి వీర్యవిజృంభితుండై యుద్ధసన్నద్ధుఁడై నిల్చుటయు వాసుదేవుండు విచారించి యితఁడు భీమునిచే వధ్యుఁ డగునని బ్రహ్మయాజ్ఞకలిమిం జేసి తాను బోట్లాడనొల్లక యాజరాసంధుం జూచి మాలో నెవ్వనితోడఁ బోరు సేయ నిచ్చగింతు వనియడిగె. వాఁడును బలగర్వమున మహాబలుఁడగు భీమసేనుతోఁ బోరాడెద నని చెప్పి పురోహితకృతస్వస్తికృత్యుఁడై కిరీటము నపనయించి వెండ్రుకల గట్టిగ ముడిఁగట్టి యుద్ధసన్నద్ధుఁడై నిలుచుటయు భీముఁడు కృష్ణునిస్వస్త్యయనపురస్సరానుజ్ఞం బడసి పోరున కాయితపడి యతనికట్టెదుట నిలిచె.

(భీముఁడు జరాసంధుని మల్లయుద్ధమునఁ జంపుట.)

అంత నాభీమజరాసంధులు జయకాంక్షులై గాఢహర్షంబునం గడంగి ముందుగ నొండొరులచేతులఁ బట్టుకొని పాదవందనంబుగా మండలకు మొగ్గవాలి కచ్చలు విదిర్చి మొలనూళ్లు ద్రెంచి చఱచి హస్తముల నెగుబుజములఁ బట్టి త్రోచి యంగంబులు పెనంగొనఁ బెనంగి భుజాస్ఫాలనంబుఁ జేసి హస్తలాఘవంబు మెఱయఁగా సెలు బిగియించి మిణుఁగురులు రాలఁగఁ గుత్తుకలఁ బట్టి త్రోయుచుఁ జెంపలఁ జఱచుచు వ్రేటులు దూలంగ భుజములఁ బెనఁగాడుచు మర్మస్థానంబులం బాదఘట్టనంబుల నలుముసేయుచు నురమ్ముల నదుముచు మత్తశుండాలంబులభంగిఁ గరపీడనంబు పొనరించుచుఁ గన్నుల నిప్పు లురుల నొండొరుల వీక్షించుచు వివిధమల్లయుద్ధవైదగ్ధ్యంబుఁ బ్రకటించుచుఁ గ్రుద్ధకంఠీరవంబులవిధంబున నురువడించి పెక్కుమాఱు లొండొరుల నీడ్చుచుఁ ద్రోయుచుఁ బాషాణఘాతంబులం బోలుదృఢప్రహారముల నుక్కడంచుచుఁ బోరుచుండఁ బురజనులెల్ల వచ్చి చూచి నివ్వెఱఁ బొందుచుండిరి. అట్లు వృత్రవాసవులపోలె నత్యంతకోపాటోపంబున జరాసంధభీమసేనులు కార్తికమాసప్రథమదినమునం దొడంగి నిరాహారులై కయ్య మొనర్చుచుండఁ ద్రయోదశినాఁటివ్రేటులకు బడలి చతుర్దశినాఁటినిశాసమయంబున జరాసంధుఁ డంతకంతకు డయ్యుటం జూచి కృష్ణుఁడు భీము నిర్దేశించి బకాంతకా! బలవంతుండైన శత్రుండు గండడంగినవాఁడు. ఉరువడింప నిదె సమయంబు. చక్కన పోట్లాడు మనవుడు వృకోదరుఁడు వానిం జయింపఁగ సన్నద్ధుండయ్యె. కృష్ణుఁ డంత నిలువక భీమసేనున కత్యంతశౌర్యవిజృంభణంబు గలిగించువాఁడై ప్రభంజనాత్మజా! నీబలంబును నీతండ్రియగు వాయుదేవునిబలంబు ననుసంధించి శీఘ్రంబుగఁ బగతుని భంజింపు మనిచెప్పిన భీమసేనుండు రౌద్రంబు మెఱయ నగ్గలించి యాజరాసంధుని మోఁకాళ్లం

బట్టి పైకెత్తి నూఱుమాఱులు గిరగిరం ద్రిప్పి క్రిందఁ బడవైచి వీఁపుఁ దన్ని వాని కాలిని జేతఁ బట్టి ఫెళఫెళధ్వానంబు నిగుడ విఱిచి వైచి సింహనాదంబుఁ జేసె. ఆసినాదంబు విని పురజనులు భీతిల్లి భూమిపగిలెనో హిమవంతంబు వ్రయ్యలయ్యెనో యనితత్తరఁ జెందిరి. స్త్రీలగర్భములు స్రవించె. భీముఁడు విగతజీవం బయినయాజరాసంధుని కళేబరం బీడ్చి తెచ్చి రాజగృహద్వారంబునం బడవైచె. అంతట జనార్దనుండు చెఱలోనిరాజుల విడిపించి పతాకాదిభాసితం బయినజరాసంధరథంబుఁ దెప్పించి యందు భీమార్జునుల నెక్కించి దాను సారథియై నగరబాహ్యదేశంబుఁ జేరె. ఆరథంబు నధిరోహించి యింద్రోపేంద్రులు తొల్లి తారకాసురసంగ్రామంబున విక్రమించిరి. దాని నింద్రునివలన వసునృపాలుండు వడసె. అతఁడు బృహద్రథునకొసంగె. బృహద్రథునివలన జరాసంధుఁ డధిగమించె. నిజవిచిత్రప్రభాపటలంబున యోజనదూరంబు వెలింగించునట్టి యాదివ్యరథంబు నారోహించి కృష్ణుఁడు గరుత్మంతుం దలంచి తత్క్షణంబ భూతగణంబుతోడ సన్నిహితుం డైనయవ్విహంగనాయకుని ధ్వజమున నుండ నియమించుటయు నతండు మధ్యాహ్నమార్తండునివిధంబున వెలుంగుచు రథపతాక నధిరోహించె. బ్రాహ్మణాదిసకలజనులును కృష్ణభీమార్జునులం జేరవచ్చి విధియుతంబుగ సత్కరించిరి. బంధనవిముక్తులైనరాజులు కృష్ణుంగుఱించి జగన్నాథా! ధర్మరక్షణపరుఁడైననీ కిది సహజంబ. భీమార్జునసహితుఁడ వైననీ కసాధ్యంబు గలదే? నీవు కరుణింప దుఃఖకర్దమం బగుఘోరజరాసంధహ్రదంబు వెడలితిమి. భవదాజ్ఞావిధేయుల మైనమ మ్మభిమతకృత్యంబులం బంపుము. పనివిని దుష్కరం బైనం జేయుదు మనివిన్నవించిరి. ఆవిన్నపం బాకర్ణించి పుండరీకాక్షుండు వారల నూఱడించి ధర్మరాజు రాజసూయంబు సేయ నున్నవాఁడు. ఆధార్మికునకు సామ్రాజ్యంబు గలుగ సహాయంబు సేయవలయు ననిన వారందఱు నందుకు సంతోషించి యంగీకరించి యనేకరత్నములు సమర్పింపఁగ నెట్టకేలకు గ్రహించి వారలఁ గరుణించె. అంత జరాసంధపుత్త్రుఁ డగుసహదేవుఁడు నానావిధమహార్హరత్నాదులం గొని పురోహితపురస్కృతుండై వచ్చి వినయవినమితశిరస్కుఁడై నమస్కరింప వాసుదేవుఁ డాసహదేవున కభయ మిచ్చి మగధరాజ్యంబున నభిషిక్తుం జేసి యతండు సమర్పించినరత్నాదుల గ్రహించి కరుణాతరంగితాపాంగావలోకనంబున నాదరించి యనుజ్ఞ చేయుటయు నతండు భీమార్జునులసాదరానుజ్ఞం బడసి నగరు సొచ్చె. పదంపడి నారాయణుండు భీమసేనార్జునులతోడ రథారూఢుండై రాజులందఱు వెంటరాఁగఁ దఱలి యతిత్వరితగమనంబున నింద్రప్రస్థంబు సేరి ధర్మరాజుం గాంచి ప్రణమిల్లి భీమార్జునులం జూపి భాగ్యవశమున నీతమ్ములు సుఖులు. భీముఁడు జరాసంధుని వధించె. కారాగారమోచనంబు రాజు

లకుఁ గావించితిమని యారాజులం జూపఁగ యుధిష్ఠిరుఁడు శౌరిభీమధనంజయులం గౌఁగిలించుకొని పరమానందంబుఁ జెంది యారాజుల నుచితరీతి నూఱడించి సెలవొసంగ వారందఱుఁ దమతమ దేశములకుఁ జనిరి.

ఇవ్విధంబునఁ బురుషోత్తముఁడు పాండవులచే జరాసంధుఁ జంపించి జయంబు సాధించి ధర్మజధౌమ్యులయనుమతిం గొని మనోవేగం బయినయాజరాసంధరథం బారోహించి ద్వారవతికిం జనియె. అంత నొక్కనాఁడు ధర్మజుం జూచి యర్జునుండు మహారాజా! నాకుం గలయీగాండీవరథాదిలాభంబు సార్థకంబుగా దిగ్విజయంబు చేసి భాండాగారంబు ధనసమృద్ధంబుఁ జేయఁ దలంతుననిన ధర్మరాజు శుభదినంబున మంగళకృత్యంబులఁ జేయించి యుత్తరమునకు ధనంజయునిం దూర్పునకు భీమసేనుని దక్షిణమునకు సహదేవునిం బడమరకు నకులుం బంపఁగ వారు సకలదేశములం జయించి యనేకరత్నముల నపరిమితధనములం దెచ్చి రనిన జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా! దిగ్విజయవృత్తాంతము సవిస్తరముగ నానతిమ్ము. పూర్వులసచ్చరిత్రంబు తనివోవ వినవలతు ననియడుగ నతనికి వైశంపాయనుఁ డిట్లనియె.

(భీమార్జుననకులసహదేవులు దిగ్విజయంబు చేయుట.)

జనమేజయనృపాలా! పాండవు లేకకాలమున సకలదేశముల విక్రమంబున జయించిరి. ప్రథమం బర్జునువిజయంబుఁ దెల్పెద. ధర్మరాజుచే ననుజ్ఞాతుఁడై యర్జునుఁడు గాండీవాదిదివ్యసాధనసహితుఁడై యగ్నిదత్తం బైనయామహారథ మధిరోహించి యపారం బైనచతురంగసైన్యంబు గొలిచిరాఁగ నుత్తరదిక్కునకు జైత్రయాత్ర వెడలి ప్రథమంబ పుళిందరాజుం గెలిచి యానర్తకాలకూటాదిదేశముల వశీకరించుకొని శాకలద్వీపపతి యగుప్రతివింధ్యుఁ బరాజితుం జేసి యచ్చటివారందఱు సేవించిరాఁగఁ బ్రాగ్జోతిషంబు చేరుటయుఁ దత్పతి యైనభగదత్తుఁడు చీనకిరాతాదిపరివృతుఁడై యర్జునునితోడ నెనిమిదిదినంబులు రణంబుఁ జేసి యర్జునుపరాక్రమ మంతకంత కగ్గల మగుటకు విస్మయంబంది యర్జునా! యిట్టివిక్రమంబు నీకుఁ దక్క మఱియొక్కని కలవడదు. నాబోఁటివానికి నిన్నెదిరించి పోర నగునే? నే నింద్రునకుఁ జెలికాఁడఁ గాన నింద్రపుత్రుఁ డగునీకుఁ బ్రియుఁడ. నీవచించుదానిం జేసెద ననిన నర్జునుఁ డతని కిట్లనియె. కౌరవపుంగవుఁ డైనధర్మరాజు మహాదక్షిణం బయినరాజసూయంబుఁ జేయువాఁడు. అమ్మహాత్మునకు సామ్రాజ్యంబు సమకూఱఁ గరం బిమ్ము. నా తండ్రికిఁ బ్రియుఁడ వగుటం జేసి ప్రీతిమైఁ జెప్పెదఁ గాని యొండేమియుం గాదనిన భగదత్తుండు సంతసించి ధనంజయా! యుధిష్ఠిరుఁడును నీవంటివాఁడు గావున నతనియాజ్ఞమునకుఁ గా నీకోరినట్లు చేసెద. మఱియు నెద్ది చెప్పినం జేయుదునని

యపరిమితధనముల నిచ్చినం గైకొని యట నంతర్గిరిబహిర్గిర్యుపగిరుల నుండు రాజుల నోడించి ధనముల గ్రహించి వారందఱు గొలిచిరాఁగ నులూకదేశము లకుఁ జని తద్దేశనాథుఁ డైనబృహంతుని సమరంబున జయించి యతనివలనఁ గప్పము గొని మోదాపుర, వామదేవ, సునామో, త్తరోలూకరాజులఁ బరాజితు లం జేసి దేవప్రస్థమునకుఁ బోయి సేనాబిందుని గెలిచి విష్వగశ్వుఁడనుపౌరవునిప రాక్రమం బుడిగించి పార్వతీయుల నుత్సవసంకేతాదిసప్తగణంబుల జయించికా శ్మీరమున ననేకరాజులను దశమండలములతోడ లోహితుని నిర్జించి త్రిగర్త, దార్వ, కోకనదపతుల గండడంచి యభిసారి, నురగావాసి యగురోచమానుని గెలిచి చిత్రాయుధరక్షితంబైన సింహపురంబు సహ్యాపురంబును సాధించి సుహ్మా ులగెలిచి బాహ్లిక, దరద, కాంభోజపతులవలనఁ గప్పముఁ గొని యీశానదిగ్భా గంబున లోహ, పరమకాంభోజపతుల వశీకరించుకొని యుత్తరఋషికనాయకు రణంబున విక్రమించి పరాజితుం జేసి యతనివలన శుకోదరవర్ణంబు లయినను త్తమాశ్వముల నెనిమిదింటిని మయూరవర్ణంబు లయినయనేకాశ్వములఁ గ రంబుగా గ్రహించి హిమవత్పర్వతవాసుల నందఱ నోడించి శ్వేతపర్వతం బా క్రమించి కింపురుషదేశంబుఁ జొచ్చి కింపురుషపతి యగుద్రుమపుత్రువలన నప రిమితధనముల సంగ్రహించి హాటకదేశముఁ బ్రవేశించి గుహ్యకపతివలన నరిఁ గొని మానససరస్సును ఋషికుల్యలం గాంచి హాటకదేశంబు నిరుగెలంకులం గ లగంధర్వుల నిర్జించి వారివలనఁ దిత్తిరికల్మాషంబులు మండూకనామంబులు న గుదివ్యాశ్వములఁ బరిగ్రహించి యుత్తరకురుదేశముల హరివర్షంబుఁ గాంచి దానిం గెలువఁ బూనఁగ నచటిద్వారపాలకు లిట్లనిరి. అర్జునా ! యీపురము గె లువరాదు. నీజయంబు పర్యాప్తంబు. ఇవి యుత్తరకురుదేశములు. మనుష్యశరీ రమున నీదేశంబుఁ జొర నలవికాదు. చొచ్చిన మనుష్యున కొకటియేనియు ని చట దృగ్గోచరంబు కానేరదు. నీకోరినదానిం జేసెదము. ఇంతటన మఱలి పొ మ్మనిన నర్జునుఁడు నవ్వుచు వారిం గాంచి యట్లగునేని ధర్మరాజు రాజసూయ యాగంబుఁ జేయనున్నవాఁడు. కప్పమొసంగుఁడనిన వారు దివ్యవస్త్రాభరణాదు ల నిచ్చిరి.

అటభీమసేనుండు నగ్రజునమతిఁ గొని పూర్వదిగ్విజయార్థంబుగ మ హాసేనాపరివృతుండై ప్రయాణంబయి పాంచాలదేశముల కరిగి యప్పాంచాల పతికిఁ దనవచ్చినకార్యంబు నివేదించి విదేహపతిని జయించి దశార్ణదేశనాథుఁ డయినసుధన్వుతో నిరాయుధంబుగా మహాయుద్ధంబుఁ జేసి యతనివిక్రమంబు నకు మెచ్చి తనకు సేనానాయకుం జేసికొని యటఁ జని యశ్వమేధేశ్వరుఁ డగు రోచమానుని సమరంబున నోడించి తద్దక్షిణంబున నున్నపుళిందుల నాక్రమించి

సుకుమారసుమిత్రుల నిర్జించి చేదిదేశమున కరుగుటయు శిశుపాలుం డెదురు వచ్చి కుశలప్రశ్నంబు నడిపి భీముని రాకకుఁ గతం బడిగి తెలిసికొని యపరిమితధనముల నిచ్చి సత్కరింపఁగ భీముఁ డచ్చటఁ గొన్నినాళ్లు సుఖంబుండి యంతటఁ దఱలి కుమారవిషయంబున శ్రేణిమంతుని గోసలముల బృహద్బలు నయోధ్యాపతి యైనదీర్ఘప్రజ్ఞుని జయించి గోపాలకచ్ఛోత్తరకోసలంబుల నాక్రమించి మల్లనాథుం గెలిచి హిమవత్పార్శ్వమున భల్లాటపతిని జయించి శుక్తిమద్గిరివానుల నాక్రమించి కాశీరాజు సుబాహు సుపార్శ్వుని నోడించి క్రథునివిక్రమంబు డిపి మత్స్యమలదపతుల జయించి పఱలి మదధారగిరి వశీకరించి సోమధేయుల నిర్జించి యుత్తరాభిముఖుండై యరిగి వత్సభూమిని సాధించి భర్గాధిపతి నిషాదనాథుని మణిమత్ప్రముఖు లగురాజులఁ బెక్కండ్రను దక్షిణమల్లుల జయించి భోగవత్పర్వతం బధీనంబు చేసికొని శర్మక, వర్మక, శక, బర్బరపతులను నింద్రపర్వతవాసు లగుకిరాతరాజుల నేడ్గురను సుహ్మ, ప్రసుహ్మలనుం గెలిచి మగధదేశంబులకుఁ జని దండు దండధారు నోడించి గిరివ్రజంబు సొత్తెంచి జరాసంధసుతు సహదేవు నూఱడించి యతనివలనఁ గప్పముగా నపరిమితధనములఁ గైకొని వానితోడఁ జని కర్ణుని సమరమున నోడించి యతనివలన నరిఁ గొని పార్వతీయుల నిర్జించి మోదాగిరిపతిఁ బరాజితుం జేసి పుండ్రపతిని గౌశికీతీరవాసుని బౌండ్రకవాసుదేవుని జయించి వంగనాథుని సముద్రసేనుఁ జంద్రసేనుఁ గర్వటవిభుని దామ్రలిప్తుని గెలిచి సముద్రతీరవాసుల మ్లేచ్ఛులఁ బెక్కండ్ర జయించి వారివలన స్వర్ణరజతమౌక్తికప్రవాళచందనాగరుకంబళవస్త్రాదినానావస్తుజాతంబులఁ గప్పముఁ గొనియె.

అటసహదేవుఁడు ధర్మరాజుచే ననుజ్ఞాతుఁడై మహాసేన వెంటరాఁగ దక్షిణంబునకుఁ జని శూరసేనమత్స్యదేశముల నాక్రమించి దంతవక్త్ర, సుకుమార, సుమిత్రుల నోడించి కప్పములఁ గొని యపరమత్స్యములఁ బటచ్చరముల సాధించి గోశృంగపర్వతమున నిషాదుల గెలిచి శ్రేణిమంతుని నవరాష్ట్రుని నిర్జించి కుంతిభోజుని గాంచి ప్రీతిపూర్వకంబుగఁ దనరాక నెఱింగించి ధనములఁ గొని చర్మణ్వతీతీరంబున జంభకపుత్రుని వాసుదేవశత్రుని నమ్మహాత్మునిసమరంబునఁ దొలఁగినవాని రణమున విక్రమించి గెలిచి యట సేకాపరసేకుల నోడించి యరిఁ గొని నర్మదాతీరంబున నవంతినాయకుల విందానువిందుల నిర్జించి యనేకరత్నముల గ్రహించి భోజకటపురంబు సేరి భీష్మకునితోడ రెండుదినములు గయ్యముఁ జేసి యతనిఁ బరాజితుం జేసి కోసలతటాధిపులను గాంతారకులఁ బ్రాక్కోసలుల నాటకేయుల హేరంబకుల గెలిచి ముంజగ్రామంబున మారుధుని జయించి నాచీనార్బుక శూరుల నాటవికుల నందఱ విగతవిక్రములం జేసి వాతాధిపుని

పుళిందులను బౌండ్రరాజును నిర్జించి యటఁ దఱలి కిష్కింధ సొచ్చి వానరనా
యకు లగు మైందద్వివిదులతోడ నేడునాళ్లు పోరాడి తనపరాక్రమంబునకు మెప్పు
వడసినయావానరపతులవలన నపరిమితధనముల గ్రహించి యట మాహిష్మతీపు
రంబున కరిగి తత్పతి యగునీలునితోడ యుద్ధము చేయుచుండఁగ నీలునకు సా
హాయ్యంబుగాఁ దమసైన్యంబు నగ్నిదేవుఁడు గాల్పఁ దొడంగుటం జూచి సహ
దేవుఁ డెద్దియుం జేయనేరక వగచుచుండె ననిన విని జనమేజయుం డగ్ని యే
ల యజ్ఞార్థంబుగ యత్నించుచున్న సహదేవునిసైన్యము గాల్పఁ దొడంగె? నీ
లున కేల సహాయంబు చేసె? నని యడుగుటయు వైశంపాయనుఁ డతని కిట్లని
యె. తొల్లి మాహిష్మతీపతి యగునీలుఁడు తనకూఁతు నగ్నిపరిచర్యఁ జేయ ని
యమింపఁగ వీతిహోత్రుఁడు కామించి బ్రాహ్మణరూపంబున దానితోడ సంగ
మించె. నీలుఁ డతని నగ్నిగా నెఱుంగక బ్రాహ్మణుంగా వగచి వ్యభిచారంబు
చేసె నని దండించె. అంత నతఁడు కోపమునఁ బ్రజ్వలితుఁడై వెలుంగ నీలుఁ
డదరిపడి యమ్మహాత్మునకు సాష్టాంగదండప్రణామం బాచరించి మహానుభావా!
నాతప్పు సైఁచి రక్షింపు మని ప్రార్థించి కూఁతు నిచ్చుటయు నగ్నిదేవుఁడు సంతు
ష్టుఁడై వరంబులఁ గోరుకొను మనియె. నీలుఁడు దనకుఁ దనవంశము వారికిని శత్రు
భయము గలుగకుండునట్లుగ వరంబు వేఁడఁగ నందుకు వైశ్వానరుఁ డియ్యకొని
నాఁటఁగోలె నీలు నెదిరించివచ్చు రాజులసైన్యంబుఁ గాల్చుచుండె. మఱియు మా
హిష్మతీపురమున వనితలకుఁ బరపురుషసంగమంబు దుష్టంబుగా దనివచింప న
మ్మాహిష్మతీపురంబున స్వైరిణీవృత్తి తప్పుగాదయ్యె. అగ్నిహోత్రుఁడు నీలున
కు వరము నాప్రకారమున నిచ్చుటం జేసి రాజు లందఱు నాపురం బాక్రమింప
రని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె. అట్లు పాండవసైన్యంబు నగ్ని
గాల్చుచుండ సహదేవుఁడు వెఱచి శుచియై యాచమనంబు చేసి యగ్నిదేవుని
స్తుతింప నెంచి దేవా! నాప్రయత్నంబు భవత్ప్రీణనార్థంబ కాదె? మహాత్మా!
యిందుకు విఘ్నముఁ జేయఁ దగునే? ప్రసాదింపుము. నీవ సర్వదేవతలకు ముఖం
బవు. యజ్ఞస్వరూపుఁడవు. జగమెల్లఁ బవిత్రంబుఁ జేయుటం జేసి పావకుఁడ
నియు, హవ్యముల మోచి సురల కొసంగుటం జేసి హవ్యవాహుఁడనియు, నీతద
ర్థంబుగా వేదములు జనించుటం జేసి జాతవేదసుఁడనియుఁ బరఁగుచున్న వాఁడవు.
నీవే స్వర్గద్వారంబునకుఁ గారణంబవు. కుమారజనకుఁడవు. రుద్రగర్భుఁడవు.
హిరణ్యకర్తవు. నను బవిత్రుం జేసి రక్షింపు మని పెక్కువిధముల నగ్నిసూక్త
ముల స్తుతించె. ఇట్లగ్నిసూక్తములఁ బఠించి వేల్చువాఁడు నిఖిలపాపనిర్ముక్తుఁడై
యభీష్టములఁ బడయును. సహదేవుఁ డట్లు స్తుతియించి సేనాముఖమున దర్భలఁ
బఱచి యగ్నిం జొచ్చుటయు నయ్యగ్నిహోత్రుఁడు పాండునందనావరజు నతిక్రి

మించిరాక ప్రసన్నుఁడై సహదేవా! లెమ్ము. పరీక్షార్థముగ నిట్లు చేసితి. నీయభి
ప్రాయంబును, ధర్మరాజుపూన్కియుఁ దెలిసె. నీలునివంశమువారు రాజులై
యుండునంతకు నీపురంబుఁ బాలించునట్లుగా మున్నొక కారణంబున నోడంబడిన
వాఁడను. నీయిష్టంబునుం జేయుదు నని శాంతజ్వాలుఁడై ప్రసన్నుఁడుగాఁగ స
హదేవుఁ డగ్నిం బలుదెఱంగులఁ బూజించె. నీలుఁడు నట హవ్యవాహనానుజ్ఞా
తుండై సహదేవుని సత్కరించి యమితధనముల నిచ్చినం గైకొని సహదేవుఁ డ
టఁ దఱలి త్రైపురంబునఁ బౌరవపతిని నిగ్రహించి కౌశికాచార్యుఁ డయినయా
కృతిని నశవర్తిఁగాఁ జేసికొని సురాష్ట్రరాజగుసుబాహుని గెలిచి యచ్చటన
యుండి వాసుదేవునకుఁ బ్రీతిగా భీష్మకరుక్మలకుఁ దనరాకను దూతముఖమున
నెఱింగించి వారివలన బహుధనముల గ్రహించి పదంపడి శూర్పాకరుఁ, దా
లాకటు నోడించి దండకముల నాక్రమించి సాగరద్వీపవాసుల నిషాదుల మ్లే
చ్ఛులఁ గాలముఖు లనురాక్షసుల నోడించి కోలగిరిని, సురభీపట్టణంబునుసాధిం
చి తామ్రద్వీపంబు, రామకపర్వతంబు నాక్రమించి తిమింగిలుఁ డనురాజును వి
ధేయుం జేసికొని వనవాసులఁ గేరకు లనువారల నేకపాదుల జయించి సంజ
యంతీపురంబును, బాషండంబును, గరహాటకంబు నాక్రమించి పౌండ్రులఁ, గ
ళింగుల, నుష్ట్రకర్ణికుల, నోఢ్రుల, ద్రావిడుల, నాంధ్రులనుం దూతముఖం
బుననే విధేయులం జేసికొని యాటవీపురంబును, యవనపురంబును సాధించి
సముద్రతీరమున నుండి దూతలచేఁ దనరాకఁ జెప్పిపుచ్చఁగ నారాక్షసేంద్రుఁడిది
కాలకృతం బనితలంచి యనేకదివ్యాంబరాభరణ ధనరత్నాదులఁ బంపఁగ
గ్రహించె.

అట నకులుఁడును యుధిష్ఠిరానుజ్ఞాతుఁడై యమితచతురంగసేనాపరివృ
తుఁడై యింద్రప్రస్థము వెడలి కార్తికేయప్రియం బై నరోహితకదేశంబునకరి
గిమయూరు నోడించి శైరీషక, మహేత్థంబుల సాధించి యాక్రోశుఁడనురాజర్షి
నినిర్జించి దశార్ణ, శిబి, త్రిగ, ర్తాంబష్ఠ, మాళవదేశముల సాధించి కర్పటక
ముల నైదింటి నాక్రమించి మధ్యమకేయవాటధానుల గెలిచి యట మఱలి పు
ష్కరారణ్యమున నుత్సవసంకేతగణముల జయించి సముద్రతీరవాసు లగుగ్రా
మణీయులను, సరస్వతీతీరవాసు లగుశూద్రాభీరులను, బర్వతవర్తులగుమత్స్యజీ
వులను వశగతులం జేసికొని పంచనదంబు, నమరపర్వతంబు, నుత్తరజ్యోతిషం
బును, దివ్యకటంబును నాక్రమించి ద్వారపాలు విధేయుం గావించికొని ప్రతీ
చ్యు లయినరామఠ, హార, హూణులం గెలిచి భగవంతుఁ డగువాసుదేవున
కుఁ దనరాకఁ జెప్పిపుత్తెంచి మద్రదేశంబునకుఁ జని శాకలపురంబు సొచ్చి మే
నమామయగుశల్యుఁ గాంచి రాజసూయప్రకారంబు వివరించి యతనివలనఁ బ్రీ

తిపురస్సరం బయినధనరత్నాదివస్తుజాతంబుఁ గైకొని యట సముద్రమధ్యవాసులమ్లేచ్ఛ, పప్లవ, బర్బర,కిరాత, యవన,శకాదుల నోడించి యమితధనముల ననేకరత్నముల బహుగజతురంగాదుల వారివలనఁ గప్పముగా గ్రహించె.

ఇట్లు భీమార్జుననకులసహదేవులు కడిందిమగంటిమి మెఱయ విమలయశంబు నెఱయ దిగ్విజయంబు గావించి చతురంతమహీతలంబునం గలసకలవస్తువాహన, ధన, కనక, రత్న, భూష, ణాంబరాదుల వేనవేలుగఁ దెచ్చి ధర్మనందనునకు సమర్పింపఁగ నతండు తమ్ములపరాక్రమంబునకు మెచ్చి పరమానందసాంద్రుం డయ్యె. అంత నొక్కనాఁడు మంత్రులు మిత్రులును ధర్మరాజుం గాంచి మహారాజా! నీధర్మపాలనమున రాష్ట్రముల క్షేమము లొడఁగూడె. కీడు లన్నియు నడఁగె. భాండాగారంబులెల్ల ధనపూర్ణంబులయ్యె. నూతేఁడులు వ్యయముఁ జేసిన నీధనము తఱుఁగదు. రాజసూయాధ్వరానుష్ఠానంబున కిది ముఖ్యసమయంబనివిన్నవింపుచుండిరి. అయ్యవసరంబున వేదమయుఁడు జ్ఞానగమ్యుఁడు నిత్యుఁడు జగత్కారణభూతుఁడు నగువాసుదేవుఁడు బలాధికారంబున వసుదేవు నియమించి ధర్మరాజునకుఁ గానుక గానపరిమితధనముల ననేకరత్నములం గొని మిత్రమోదకరంబును శత్రుశోకకరంబు నగురథనేమిధ్వానంబు నిగుడ నింద్రప్రస్థమునకు విచ్చేసె. విచ్చేసినభగవంతుని సత్కరించి సుఖాసీనుం జేసి కుశలప్రశ్నంబు నడిపి ధర్మరాజు ధౌమ్యద్వైపాయనాదిమహర్షులను దమ్ములను వినుచుండ నాభగవంతున కిట్లనియె. మధుసూదనా! నీయనుగ్రహమున రాజులెల్ల నాకు వశులైరి. భవత్ప్రసాదసంపాదితమైనయీధనంబున భవత్సహాయుండనై యాగ మాచరించి దేవబ్రాహ్మణులకుఁ దృప్తిఁ జేయఁ దలంచెద. ఇందుల కనుజ్ఞఁ జేయుము. ఇటుగాకున్న నీవే దీక్షితుండవై యయ్యజ్ఞంబు నడుపుము. నీవుచేసిన నేనుఁ బాపనిర్ముక్తుఁడనై కృతార్థుఁడ నగుదుననినఁ గృష్ణుఁడు ధర్మరాజా! సామ్రాజ్యంబు వహింపఁదగిననీవే యయ్యజ్ఞ మనుష్ఠింపుము. దాన మేమందఱమును గృతకృత్యుల మగుదుము. నీనియమించినపనులెల్లఁ జేయుదు ననియె. అట యుధిష్ఠిరుండు కృష్ణుం జూచి మహాత్మా! నాయిష్టములనెల్ల నెఱవేర్పఁగ నీవు పూనియుండఁ గొఱత కలదే? సంకల్పము సఫల మయ్యె. కార్యసిద్ధి సమకూఱె ననిచెప్పి యాభగవంతునిచే ననుజ్ఞాతుండై రాజసూయంబుఁ జేయ నిశ్చయించి సహదేవుని మంత్రులనుం బిలిచి యజ్ఞాంగము లైనసకలసాధనముల ధౌమ్యుఁడానతిచ్చువానిం ద్వరితంబుగఁ జేర్చునది. ఇంద్రసేనవిశోకాదుల నన్నాది పదార్థంబులఁ జేయింప నియమించునది. రసగంధాదులఁ జక్కఁగ సమకూర్చునది. సకలదేశములఁ గలబ్రాహ్మణక్షత్రియవైశ్యుల నుత్తమశూద్రులను రావించునది యనిచెప్పి

నకులుని బిలిచి హస్తిపురంబునకుం బోయి భీష్మధృతరాష్ట్రద్రోణకృపవిదురాదివృద్ధజనులను దుర్యోధనాదులను బిలిచి వచ్చునది యనియాజ్ఞాపించె. సహదేవుం డిదె యన్నియుం జేసితి నని యన్నకుం దెలిపి నానాదేశజనులం బిలువంగం దగినవారలం బంపి ధౌమ్యద్వైపాయనోద్దిష్టక్రమంబున యజ్ఞశాలం గట్టించి యజ్ఞోపకరణంబులం జేర్చి వెండియు వచ్చువారికెల్ల విడిదలలుగా ననేకభవనంబుల ననేకవాపీనిష్కుటవిశోభితంబులం గట్టించె. సహదేవుని శాసనంబున దూతలు పోయి పిలువంగ నానాదేశములనుండి బ్రాహ్మణులును ధృష్టద్యుమ్నాదిసహితుం డైనద్రుపదుండు సాల్వుండు ప్రాగ్జ్యోతిషపతి యైనభగదత్తుండు బృహద్బలుండు పౌండ్రకవాసుదేవుండు శిశుపాలుండు కుంతిభోజుండు పుత్రసమన్వితుం డైనవిరాటుండు మావేల్లుండు మొదలగురాజులునుబలరామానిరుద్ధప్రద్యుమ్నసాంబసాగణాదియాదవులు నంగవంగకళింగకాశ్మీరబాహ్లికకుంతలమాళవాంధ్రద్రవిడసింహళాదినానాదేశరాజులునుబార్వతీయులునుసాగరద్వీపవాసులును వైశ్యశూద్రులు నాదిగాసకలదేశజనులును వచ్చి ధర్మరాజుశాసనంబున నింద్రప్రస్థముం జేరి రాజసూయంబునకు వలసినధనరత్నముల మేము మేము యిత్తు మని పరస్పరస్పర్థచే నమితధనరత్నములం గానుకగా సమర్పించి హిమవత్కైలాసశిఖరంబులం బురుడించును త్తమప్రాసాదంబులు విడిదలలుగాం జేసికొనిరి. అట నకులుండును హాస్తినపురంబునకుం జని భీష్మధృతరాష్ట్రద్రోణకృపాదులం గాంచి ధర్మరాజువచనంబుగాం బిలువంగ వారందఱు నత్యంతసంతుష్టులై రాజసూయంబుం జూడంగ నుత్సుకులై దుర్యోధనాదికుమారవర్గంబును శకునిసైంధవాదిబంధువర్గంబును గర్ణాదివీరవర్గంబునుం గూడ రాంగ నింద్రప్రస్థంబు సేరి ధర్మరాజునకు మనఃప్రీతిం గావించిరి. కృష్ణద్వైపాయనుండు ఋత్విజుల మూర్తిమంతంబు లయినవేదములం బోలుమహామునులం దోడుతెచ్చె. ఇట్లు వేదవేదాంగపారగు లయినమహీసురులును నానాదేశరాజులును భీష్మధృతరాష్ట్రాదికురువృద్ధులునుం జేరుటయుం దదనుమతంబున దీక్షితుం డై ధర్మనందనుండు భీష్మద్రోణకృపాశ్వత్థామవిదురదుర్యోధనాదులం గాంచి సంపాదితం బైనధనంబున యథోక్తంబుగ రాజసూయం బాచరింపం దలంతు. అందఱు ననుగ్రహింపవలయు ననిచెప్పి భక్ష్యభోజ్యాధికారంబున దుశ్శాసనుని, బ్రాహ్మణసత్కారంబున నశ్వత్థామను, రాజసత్కారంబున సంజయుని, సువర్ణరత్నాదిపరిశీలనంబునను, దక్షిణాదానంబుననుం, గృపాచార్యుని, సకలవస్తువ్యయంబున విదురుని, రాజులు సమర్పించుకానుకలం గ్రహించునెడ దుర్యోధనుని, సకలవిషయంబుల లోపంబు వాటిల్లకుండ విచారించునెడ భీష్మద్రోణులను నియమించె. జగన్నాథుం

డైన శ్రీకృష్ణుడు తానే బ్రాహ్మణులకుఁ బాదప్రక్షాళనంబుఁ గావింపఁ బ్రవర్తించె. ధృతరాష్ట్రబాహ్లీకసోమదత్తాదులు సకలంబుఁ జూచుచు సంతోషింపుచుండిరి.

(ధర్మరాజు రాజసూయము చేయుట.)

ఇట్లందఱు నాయాకార్యంబుల జాగరూకతమైఁ బ్రవర్తింపుచుండ ధర్మనందనుండు పరమానందసాంద్రుండై వేదవ్యాసుఁడు బ్రహ్మగా పైలధౌమ్యులు హోతలుగా యాజ్ఞవల్క్యుఁ డధ్వర్యుఁడుగా సుసామ యుద్గాతగా వారల పుత్రులును, శిష్యులును గ్రమంబున బ్రాహ్మణాచ్ఛంసియుఁ బ్రస్తోతయు మైత్రావరుణుఁడును బ్రతిప్రస్థాతయుఁ బోతయుఁ బ్రతిహర్తయు నచ్ఛావాకుఁడును నేష్టయు నాగ్నీధ్రుఁడును సుబ్రహ్మణ్యుఁడును గ్రావస్తుతుఁడు నున్నేతయు ననుఋత్విజులుగా నారదాదిమహామునులును భీష్మాదిరాజర్షులును సదస్యులుగా గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు త్రిణాచికేతములు ననుపఁడగ్నులచేఁ బవిత్రం బైన యారాజసూయమహాయజ్ఞంబు నాజ్యపురోడాశాదిహోమములును బహుళదక్షిణలు ననేకరత్నోపహారంబులు సతిసమృద్ధంబులుగాఁగ విధియుతంబుగ నొనరించె. అయ్యజ్ఞమున వ్రతహీనులును శూద్రులు నంతర్వేదిం జేరరైరి. నానాశాస్త్రములను సకలధర్మంబులను నిఖిలభాష్యములను నెఱింగినవారు పలువురు బ్రాహ్మణుల శాస్త్రార్థములు విచారింపుచు శాస్త్రనిశ్చితంబు లైన హేతువుల బుద్ధిసామర్థ్యంబున నిరూపింపుచుండఁ గొందఱు వితండావాదం బవలంబించి యిది యిట్లుగాని మీనిరూపించునట్లు కాదని వాదులాడుచుండుటయు మహానుభావు లగు పెద్దలు కొందఱు అన్నింటికిం బ్రత్యుత్తరంబుగా శాస్త్రనిశ్చితయుక్తుల నిరూపించి సిద్ధాంతంబుల సాధింపుచుండిరి. మఱియు నయ్యజ్ఞంబున నానాదేశాగతు లైన బ్రాహ్మణుల కెడఁబాటు లేక భక్ష్యభోజ్యాదిస్వాద్వన్నంబులఁగుడువఁ బెట్టుచుండ వడ్డింపుఁడు భుజించుఁడను పెద్దయెలుంగు లేవేళం జూచిన నాసన్నయ్యె. మఱియు ధర్మరాజ నేకధేనువుల నపరిమితశయనంబుల నపారధనంబులను విప్రులకెల్ల నిచ్చె. నారదుఁ డారాజలోకంబునెల్ల నాలోకించి తొల్లి బ్రహ్మలోకంబున వినిన దేవతలయంశావరణంబు యాదవవంశమున జనార్దనుండు భూభారంబుఁ దొలఁగింప నవతరించుటయుం దలపోసి యారాజలోకంబునెల్ల జనార్దనుఁడు హరించువాఁడుగా యనిచింతింపుచుండె. ధర్మనందనుండును జగన్నాథుఁ డైన శ్రీకృష్ణుని దివ్యానుగ్రహంబున యథోక్తంబుగ యజ్ఞము నాచరించి భక్తి చిగురొత్తఁగ భగవంతుదెసం జూచుచుండ భీష్ముఁడు ధర్మరాజుం జూచి పాండునందనా! యాచార్యుఁడు ఋత్విజుఁడు సంయుతేంద్రియుఁడు స్నాతకుఁడు ప్రియుఁడు నృపాలుఁడు ననునాలుగురు పూజార్హులు. అల్పయత్నంబున లభించనివారు. వీరిలోఁ గ్రమంబున నొక్కరునికి ముందుగ నర్ఘ్య మిమ్ము.

కాకున్న నందఱికంటె నన్నివిధముల నుత్తము నొక్కనిం బూజింపు మనిన ధర్మరాజు భీష్ము నుద్దేశించి పితామహా! నీవ యట్టివానిం జెప్పుము. నీనిర్దేశిం చినమహాత్మునకు ముందుగ నర్ఘ్య మిత్తు ననియె. భీష్ముం డంతటఁ బెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మనందనా! విచారింపనేల. భగవంతుఁ డైననారాయ ణుఁడు వసుదేవనందనుఁడుగా నవతరించియునికి యందఱకుం దెల్లంబుకదా. ఆ జగన్నాథుండే సర్వవిధములఁ బ్రథమం బర్ఘ్యంబు గ్రహింపఁదగినవాఁడు. తనతే జోబలపరాక్రమంబుల లోకమెల్ల వెలిఁగించుచున్నవాఁడు. ఇమ్మహాత్మునకు సమ ర్పింపక ప్రథమార్ఘ్యంబు మఱియొకని కియ్యఁ దగ దనిచెప్పుటయు ధర్మరా జానుజ్ఞాతుండై సహదేవుఁడు శాస్త్రబోధితవిధానమున వాసుదేవునకుఁ బ్రథ

(శిశుపాలుఁడు కృష్ణునధిక్షేపించుట.)

మార్ఘ్యము సమర్పింప నతఁడు పరిగ్రహించె. దాని సైరింపక శిశుపాలుఁడు శ్రీకృష్ణు నధిక్షేపించుచు ధర్మరాజున కిట్లనియె. యుధిష్ఠిరా! రాజులు పెక్కం డ్రు మహాత్ము లుండఁగ యాదవుఁ డైనయీకృష్ణుని ముందుగాఁ బూజించితివి. ఇది ధర్మవిరుద్ధంబు. ధర్మసూక్ష్మతను విచారింపక మోసపోయితివి. ఈభీష్ముఁడు చాల ముదుకఁడు. కావున యుక్తాయుక్తముల నెఱుఁగ నేరఁడు. కాకున్నఁ బ్రేమమాత్రమునఁ బూజానర్హునిఁ బూజింపు మనునే? ఏకారణంబు గలుగ వా సుదేవుఁడు ప్రథమపూజార్హుఁ డయ్యె? వృద్ధులఁ బూజింప నగునని తలంచిన వీనితండ్రి యైన వసుదేవుఁడు మఱియు ద్రుపదుఁడు మొదలగువారు నితనికం టె వృద్ధులుగారె? ఆచార్యుల ముందుగఁ బూజింపవలయునన్న ద్రోణకృపులు గారె మీ కాచార్యులు. ఋత్విజుఁడు ప్రథమపూజార్హుఁ డనిన వేదవ్యాసము నీంద్రుండు గదా యన్నివిధంబుల నందు కర్హుఁడు. మఱియు సకలధర్మజ్ఞుఁడు స్వచ్ఛందమరణంబుఁ గాంచఁ జాలినమహాత్ముఁడు నగుభీష్ముఁడు, వీరవర్యుఁ డై నయశ్వత్థామ, రారాజైనదుర్యోధనుఁడు, కింపురుషాచార్యుఁ డైనద్రుముఁడు, మఱియు భీష్మకరుక్మిశల్యాదులు పరశురామశిష్యుఁడు మహాబలపరాక్రమశాలి యు నగుకర్ణుఁడు వెండియు ననేకనృపతులు నుండఁగ నెల్లవారి ననాదరించి యీకృష్ణు నేల పూజించితివి? కృష్ణునే పూజించవలయునని నీకిష్టముండెనేని రాజుల నెవ్వరిం బిలువక నీయిచ్చవచ్చినట్లు చేయరాదె? ఇందఱకేల యవమా నము చేసినాఁడవు. నీకు వెఱచి మేము కరముల నిచ్చినవారము గాము. మఱి నీవు ధర్మమార్గప్రవృత్తుండ వనియెఱింగి సామ్రాజ్యముఁ బొందఁదగినవాఁడ వ నియొసంగితిమి. చిరకాలముగ సంపాదించిన యుధిష్ఠిరుఁడు ధర్మనిరతుఁ డను మంచిపే రొకనిమిషంబున నాకస్మికంబుగఁ బోయె. మహానుభావుఁ డైనజరా సంధు నధర్మంబునఁ జంపించినయీదురాత్ముఁడుం బూజార్హుఁ డగునే యని

నిందించి యంత నిలువక వాసుదేవుదెస మొగంబై శిశుపాలుండు మాధవా! వీరందఱు భయముననొండె ప్రేమముననొండె నర్ఘ్యమిచ్చుచుండ మునులందఱు దైన్యమున నూరకున్నను నీవైనం దనయంతరం బెఱుంగవలదే? విచారింప జనరహితదేశనిక్షిప్తం బైనపురోడాశంబును గ్రహించుకుక్కపగిదిఁ దగనిపూజను నీ వెట్లు గ్రహించితివి. ఇది రాజులకైనయవమానంబు గాదు. మఱి విచారింపఁగ నీయవమానంబు నిన్నె చెందును. నపుంసకునియెడ దారసంగమంబు గ్రుడ్డియెడ దర్పణదర్శనమును నిష్ఫలం బగురీతి రాజుగానినీకుఁ జేసినపూజ నిష్ఫలంబ. ధర్మరాజు ధర్మపరత్వంబును భీష్మునివివేకంబును నీబుద్ధియుం దెలిసె. ఇంక నిచ్చోట నుండరాదని చెప్పి మంత్రిపుత్రాదిసహితుండై దిగ్గన లేచి పోయె. పోవుటయు ధర్మరాజు వానివెంటం బోయి శిశుపాలా! పోవలదు. ఇట్లు పలుకరాదు. దీనఁ బెద్దయధర్మం బగు. భీష్ముఁ డఖిలధర్మజ్ఞుఁడు. ధర్మమెఱుఁగఁ డని యమ్మహాత్ము నవమానింపఁ జనదు. మఱియుఁ గృష్ణునిప్రభావంబుభీష్ముఁ డెఱింగినట్లు నీవు చక్కఁగ నెఱుంగవు. ఇంతియకాని వేఱుకాదు. నీకంటెఁబెద్దలగు పెక్కండ్రురాజు లూరకున్నవారు. చూడుము. కృష్ణుని ముందుగఁబూజించుట యధర్మంబైన నిందఱు మిన్నకుందురే! యని మధురవచనములననునయింపుచుండ భీష్ముఁడు ధర్మరాజుం బిలిచి యుధిష్ఠిరా! జగద్గురుండైనదామోదరునియెడఁ బ్రయుక్తం బైనపూజ నంగీకరింపనిదుష్టాత్ము శిశుపాలు ననునయింపవల దని చెప్పి ధర్మరాజును వారించి శిశుపాలుంజూచి క్షత్రియులలో రణముల ననేకరాజులజయించి వశీకరించికొనినయతఁడు పూజనీయుఁ డనఁబడు. ఈరాజమండలంబుననొక్కఁడేనియుఁ గృష్ణునివిక్రమంబునకు లోఁగనివాఁడు గలఁడే? జనార్దనుఁడుమనకుమాత్రమే పూజార్హుఁ డనితలంపవలదు. మఱి సకలలోకపూజనీయుఁడు. లోకములన్నియు నీమహానుభావునివశంబున నున్నయవి. నేను జ్ఞానవృద్ధులఁ బెక్కండ్ర మహర్షుల సేవించి వారివలనఁ గృష్ణునిజన్మమునాటంగోలె సర్వవృత్తాంతముల నెఱింగితిని. సకలలోకపూజనీయుఁడు గావునఁ బూజింపు మంటినిగాని బంధుత్వపురస్సరప్రేమమునఁ జెప్పినవాఁడనుగాను. మఱియు నిచ్చటనుండువారివిశేషములనెల్ల లెస్సగఁ బరిశీలించి యశశ్శౌర్యవిజయాదుల నందఱికంటె నుత్తముఁ డగునిమ్మహాత్ముం బూజించుట యుచితం బని చెప్పినాఁడ. బ్రాహ్మణులలో జ్ఞానవృద్ధులు క్షత్రియులలో విక్రమవంతులు వైశ్యులలో నధికధనధాన్యవంతులు బాలురైనం బూజనీయు లగుదురు. శూద్రులలోన వయోవృద్ధులే పూజనీయులు. వాసుదేవుఁడు వేదవేదాంగవిజ్ఞానంబునను బలవిక్రమంబులను నెల్లవారికంటెనధికుఁ డగుటంజేసి ప్రథమపూజార్హుఁ డయ్యె. లోకమున నారాయణునకంటె నధికులు గలరే? దాన, దాక్ష్య, శ్రుత, శౌర్య, హ్రీ, కీర్తి, మేధా,

సన్నతి, శ్రీ, ధృతి, తుష్టి, పుష్టి ప్రభృతిసకలగుణంబులు హృషీకేశునందే నిత్యం బులై యుండు. ఇతఁడే ఋత్విజుఁడు గురుఁడు సంయతుఁడు స్నాతకుఁడు నృపాలుఁడు ప్రియుడు. ఇన్నిగుణములు వేఱొకనియెడఁ గలవే? ఇంతేల. కృష్ణుఁడే సకలలోకముల సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడు. ప్రకృతిరూపుఁ డవ్యక్తుఁడు శాశ్వతుఁడు. సర్వభూతాతీతుఁడు, పంచభూతములు మహదహంకారాదులు జరాయుజాండజోద్భిజ్జస్వేదజంబు లనఁ జతుర్విధము లైనచరాచరవర్గంబులు చంద్రాదిత్యులు గ్రహనక్షత్రంబులు దిక్కులు విదిక్కులుం గృష్ణునివశమున నున్నయవి. వేదముల కగ్నిహోత్రుఁడును ఛందస్సులకు గాయత్రియు మనుష్యులకు రాజును నదులకు సముద్రుఁడును నక్షత్రములకుఁ జంద్రుఁడును తేజస్సులకు సూర్యుఁడును, బర్వతములకు మేరువును బక్షులకు గరుత్మంతుఁడును ముఖం బగువిధమున సకలలోకములకు నారాయణుండు ముఖంబు. జగత్పూజ్యుఁ డనిచెప్పి యెల్లవారి నుద్దేశించి యీశిశుపాలుఁడు బాలుఁడు మూర్ఖుఁడుం గావున శ్రీకృష్ణునిమహామహిమల నెఱుంగఁడు. జగద్రక్షకునకు మాచేసినపూజలు సహింపఁడేని యంతకుఁ బ్రీతిగాఁ దనయిచ్చవచ్చినట్లు చేయుఁగాక యని తెగఁబాఱి పలికె. ఆసమయమున సహదేవుఁడు రాజమధ్యంబున నిల్చి కాలెత్తి జగద్గురుం డైనకృష్ణునకు నాచేసినపూజ నోర్వనివానిపై దీని నుంచెద. కృష్ణునిఁ బూజింపఁ దగ దనుదురభిమాను లిందుకుఁ బ్రత్యుత్తరం బిచ్చునది యనిచెప్పఁగ నందఱు నేమియు ననఁ జాలక యూరకుండిరి. సహదేవునిపైఁ బుష్పవర్షంబు గురిసె. ఇతఁడుచేసినపని లెస్సయని యశరీరవాణులు పలికె. కృష్ణుం బూజింపనిదుర్బుద్ధులు బ్రతికియుండియు నిక్కంబుగ మృతులు. మఱియు నట్టి దురాత్ము లసంభాష్యు లనినారదుఁడు వివరించిచెప్పెను. పదంపడి సహదేవుఁడు సభాసదులందఱకు నుచితసత్కారము లొనరించె. పదపడి శిశుపాలునిసేనానాయకుఁడు సునీథుఁడనువాఁడు రోషతామ్రాక్షుండై రాజు లందఱు వినంగఁ బెద్దయెలుంగున నోరాజులారా! సేనాపతి నగునే నిదె యుద్ధసన్నద్ధుఁడ నైతి. మీరందఱును బోరున కాయిత్తపడుఁడు. యాదవపాండవులమదం బుడిపెద మని చెప్పి రాజులనెల్లం బురికొల్పఁగ వారెల్లఁ గ్రోధవివశులై చెలికాండ్రు వల దని వారింపుచుండిన నామాటలఁ జెడచెవిఁ బెట్టి యుద్ధసన్నద్ధు లగుటయు జనార్దనుండు వారియభిప్రాయం బరసియుండె. వేల దాఁటివచ్చుసముద్రంబుచందమున నంతటం గలఁగినరాజలోకమును గనుఁగొని ధర్మరాజు భీష్ము నుద్దేశించి పితామహా! రాజులెల్ల నిట్లు యుద్ధసన్నద్ధు లైరి. యజ్ఞమునకు విఘ్నమునుం బ్రజలకుఁ గీడునుం బొరయకుండ నుపాయంబుఁ జేయవలయు ననియడుగ భీష్ముఁ డతని కిట్లనియె. ధర్మనందనా! వెఱవ వలదు. నిద్రవోవుచున్న సింహమునుజూచి

హింసింతు మని మొఱుగుకుక్కలవిధంబున యాదవసింహం బైనకృష్ణునకుఁ గీడు చేయుదు మని యిచ్చవచ్చినట్లు ప్రేలుచున్నవారు. నిక్కంబ శిశుపాలుఁ డెల్లవారిని యమలోకంబునకుఁ బంపఁ దలఁచినాఁడు. వీనితేజంబు హరింప దామోదరుఁ డెంచియున్నవాఁడుగాఁబోలు, కాకున్న నితని కేల యిట్టిదుర్బుద్ధి వొడము ? భగవంతుఁ డెవరి తేజం బపహరింపఁ దలఁచునో వారెల్ల నీప్రకారంబున బుద్ధివ్యత్యయంబుఁ బొందుట సహజంబు. సకలభువనంబుల సృష్టిస్థితిలయంబులకుఁ గారణభూతుఁ డగుభగవంతుని చిత్రచరిత్రం బెఱుంగ రాదని పలుకుచుండ శిశుపాలుఁడు క్రోధఘూర్ణమానమానసుండై భీష్మున కిట్లనియె.

భీష్మా ! నీ విట్లు పేరుచు రాజుల నందఱ వెఱపింపఁ జూచెదవు. సిగ్గు లేదె. పెద్దవాఁడవయ్యుఁ గులపాంసనుండవై యున్నవాఁడవు చాల మూఢుకఁడ వగుటం జేసి బుద్ధిలోపంబున ధర్మవిరుద్ధంబుగఁ బల్కుట నీకుఁ దగును. ఓడతోఁ గట్టినయోడమాడ్కి గ్రుడ్డితోఁ జేరినగ్రుడ్డిపగిదినిం గౌరవులు ని న్ననుసరించి మేలు గాంచ నేరరు. పూతనాసంహారంబు మొదలగుకృష్ణచర్య లోకవిశేషముగ నీవు వాకుర్వఁగ మామనంబులయందు వ్యథ వొడముచున్నయది. దురభిమానుఁడు మూర్ఖుఁడు నగుకృష్ణుని స్తుతియింపఁగ నీనాలుక యేల నూఱువ్రయ్యలు గాకున్నది ? అక్కటా కేవలమూఢులు సైతము నిందించునట్టియీగోపాలుని జ్ఞానవృద్ధుఁడ వయ్యు నేల పొగడెదవు. ఇతని చర్యలు విచారింప దుష్కరము లే? బాల్యమున నొకకొంగను యుద్ధచాతుర్యము నెఱుంగనిగుఱ్ఱము నెద్దునుం జంపుట యేమివింత ? చైతన్యము లేనిబండినిఁ గాలిచే విఱుగఁ దన్నుటయు నొకయాశ్చర్యమే ? పుట్టయంతటి గోవర్ధనపర్వతము నేడునాళ్లు మోచికొనియునికియుం జిత్రమే ? కొండలఁ దిరుగుచుఁ బెనుదిండిఁ దినుటయు నద్భుతంబె ? ఇతఁడు కంసునియన్నముఁ దిని పెరిగి చిట్టచివరకు వానిం జంపె. మీకుఁ జూడ నిది ధర్మంబ కాఁబోలు. స్త్రీల, గోవుల, బ్రాహ్మణుల, నన్నదాతల, నమ్మినవారలనుం జంపరా దని పెద్దలు వచింతురు. ఇందు వీఁడు స్త్రీవధంబును, గోవధంబును, నన్నదాతృవధంబునుం జేసినవాఁడే. ఇట్టిదుర్వినీతుఁ డత్యుత్తముఁ డని నీవు నిరూపించుటయు, నీమాట నమ్మి పాండవు లితనిం బూజించుటయుఁ గృష్ణుఁడు తా నంతటివాఁ డని తలఁచుటయు నిశ్చయముగ నిరర్థకంబు. మఱి యసత్యంబు. ధర్మశాస్త్రముల నేర్చినవారు భూలింగపక్షివిధంబున లాఁతివారికి ధర్మముల బోధింతురుగాని యారీతిం దా మాచరింపరు. నీస్వభావంబు నీచము. నిను నమ్మి కృష్ణు నపూజ్యుఁ బూజించి నీచతం బొందిరి. మోహమున నందఱు నిను ధర్మజ్ఞుఁ డందురు. మఱియొకని వరించినకన్య నంబయనుదాని నపహరించిన నీవును ధర్మజ్ఞుడవే? బుద్ధిమాలి నీవు తెచ్చినను నీతమ్ముఁడు విచిత్రవీర్యుఁడు ధర్మపరుఁడు గావునఁ బెం

ళ్లిచేసికొనఁ డయ్యె. పడింతమ్మన్యుండ వైననీవుండఁగ వానిభార్యలయందుఁ బు
త్రుల నితరుఁడు పడసె. అది బ్రహ్మచర్య మనియెదవేమొ. మోహమున నొండెన
పుంసకత్వమున నొండె బ్రహ్మచర్యముఁ బూనితివిగాని ధర్మపరిజ్ఞానంబునఁ బూ
నినవాఁడవే? లెస్సగఁ బరిశీలింప నీవు పెద్దలవలన ధర్మములు నెఱింగినవాఁడ
వు కావనియ తోఁచెడి. మఱియు దానాధ్యయనయజ్ఞవ్రతోపవాసాదు లన్ని
యు సంతానమునకుఁ బదునాఱవపాలుగాఁ జాలవు. సంతతిహీనునకు సకలధర్మ
ములు నిరర్థకంబులు. వెండియు జ్ఞాతులు నీకపటవర్తనం బెఱింగి వధింతురు. తొ
ల్లి సముద్రతీరమున నొకహంస తా నధర్మనిరతంబయ్యుఁ దక్కటిపక్షుల కెల్లధ
ర్మంబు బోధింపుచుండె. ఆపక్షులు కపట మెఱుంగక నమ్మి దానిసమీపంబున
గుడ్డుల నెల్ల నుంచి సముద్రజలంబు సొచ్చి యాహారంబు తెచ్చి యాహంస
కుఁ గుడువఁ బెట్టుచుండె. పులుఁగులును గుడ్డులపోకకుఁ గతంబుఁ దెలియనేరక
చింతింపుచుండ బుద్ధిశాలి యగునొకవిహంగము హంసపై సందేహము వొడ
మఁ బరీక్షింపుచుండి యొక్కనాఁ డప్పాపమరాళము తమయండముల మెసవుటం
జూచి యన్నిటికిం దెలిపె. అంత నాపక్షు లన్నియు వచ్చి దానిదుశ్చర్య నవలో
కించి యోదుష్టహంసమా! సాధువుపోలె ధర్మవచనములఁ బలుకుచు నమ్ము న
మ్మించి మోసపుచ్చి గుడ్డుల నెల్లఁ గబళించితివి. చీ! నీచిత్తము దుర్వృత్తములం
జొచ్చె ననితూలనాడి యాహంసమును వధించె. అట్లపోలె నీదుశ్చరిత్రం బెఱుఁ
గక నమ్ముచున్న కౌరవు లెప్పుడైన నినుఁ జంపకమానరు. ఆహంసమువృత్తాంత
ము నిప్పుడుం బెద్ద లితిహాసముగఁ జెప్పుచున్నవారు. అది యట్లుండె. రాజులలో
నెల్ల జరాసంధుఁ డొక్కఁడే రాజనఁ దగినవాఁడు. ఈకృష్ణుఁడు దాసుఁ డని యి
తనితోడిపోరుఁ గోరఁడయ్యె. అట్టిమహాత్ముని జరాసంధుని వధింపఁగఁ గృష్ణభీ
మార్జునులు క్షత్రియవేషమునఁ బోవెఱచి బ్రాహ్మణవేషంబుఁ దాల్చి చని
బ్రాహ్మణప్రియుఁ డైనయతఁడుచేసినసత్కారంబు గ్రహింపక మోసమున నతని
వధించిరి. వీరిపనులును లెస్సయనువారుం గలరె? నీవు మూర్ఖత్వంబున నీయా
దవుఁడే జగత్కారణం బని వచింతువు. అట్లయిన నితఁడు బ్రాహ్మణోచితపూజ
ల నేల గ్రహింపఁడు? అన్నియు నట్లుండె. పాండవులును ధర్మమార్గంబు విడుచు
ట కాశ్చర్య మయ్యెడిని. లెస్సగ విచారింప నిదియు నాశ్చర్యము గాదు. స్త్రీస
ముఁడు ముదుకఁడు నగునీవుబోధించుధర్మముల నాచరించినంతన వీరు నధర్మ
పరు లైరని యధిక్షేపించి పలికె. శిశుపాలునిపరుషవచనముల విని భీమసేనుఁ డు
రోషభీషణశోణలోచనుండై లలాటతటమున మూఁడుకోపుల నేపుమీఱినబొమ
ముడి త్రికూటపర్వతంబునముత్త్రోవలఁ బాఱుగంగానది ననుకరింపఁ బండ్లుప
టపటం గొఱుకుచుఁ బ్రళయసమయరుద్రుఁ నిభంగి రౌద్రంబు మెఱయశిశుపాలుని

పై కుఱుకుచుండ భీష్ముఁడు పలుదెఱంగుల నతని శాంతచిత్తుం జేసి పట్టుకొనుటయు సాగరంబు వేలనుంబోలె నతండు కురుపితామహునాజ్ఞ నతిక్రమింపఁడయ్యె. అంత శిశుపాలుఁడు శౌర్యపరుండై భీమసేనుకోపాటోపంబుఁ జూచి సింహము క్షుద్రమృగంబునుంబోలె నాతని లెక్కింపక వెఱవక నవ్వుచు భీష్ము నుద్దేశించి భీష్మా! వీని విడువుము. అగ్నిం బడినమిడుతవ్రాలె మదీయ ప్రతాపాగ్నిం బడి వీఁడు ప్రగ్గుచుండ నందఱుసంభ్రమమునఁ జూతురు గాక యని చెప్పి భీముం బోరునకుఁ జీరుచుండ భీష్ముఁడు భీమున కిట్లనియె.

(భీష్ముఁడు భీమునకు శిశుపాలువృత్తాంతము చెప్పుట)

భీమసేనా! యీశిశుపాలుఁడు తొల్లి మూఁడుకన్నులు నాలుగుచేతులుం గలిగి పుట్టి గర్దభంబువిధంబున నఱచుచుండ వీనితల్లిదండ్రు లగుసాత్వతీదమఘోషులు వికృతరూపమునకు శంకించి వీనిం ద్యజింపఁ దలంచుటయు నశరీరవాణి మంత్రిపురోహితాదిసకలజనులు వినుచుండ దమఘోషు నుద్దేశించి యీకుమారుని విడువవలదు. వీఁడు మిగుల బలియుఁడు గాఁగలఁడు. వీని కిపుడు మరణకాలంబు గాదు. వీని వధింప నొకమహాత్ముఁ డాయుధముతోడ నవతరించియున్నవాఁ డనివినిపించె. ఆవచనము విని వీనితల్లి సాత్వతి పుత్రవాత్సల్యంబున నయ్యగపడనిభూతమును నిర్దేశించి నాపుత్త్రునిగుఱించి యిట్లు పలికినమహానుభావుని మ్రొక్కెద. ఈకుమారున కెవ్వఁడు మృత్యువై పుట్టె. వివరింపవే యనియడుగ నాభూత మిట్లనియె. ఏమహాపురుషుఁ డెత్తికొనినం దన వీనిమిగిలియున్న రెండుచేతులు లలాటనేత్రమునుం బోవునో యతండే వీనికి మృత్యు వని చెప్పి యాభూతం బంతర్హితం బయ్యె. అట సాత్వతి యాశ్చర్యంబున వీనిం జూడవచ్చువారి నెల్ల నితని నెత్తికొను మని యిచ్చుచుండె. అంత నొక్కనాఁడు రామకృష్ణులు వచ్చి సాత్వతికిం దమఘోషునకు నెఱఁగి కుశలప్రశ్నంబు నడిపియుండ వారలఁ గూర్చుండ నియమించి సాత్వతి వీనిం దెచ్చి యెత్తికొను మనియిచ్చె. పద్మనాభుఁ డెత్తికొనినయంతన యితనిమిగిలియున్న కన్నును రెండుచేతులును వీడిపోవఁగ సాత్వతి తొల్లింటి యశరీరవాణిం దలపోసి కృష్ణుఁ డితని వధించు నని నిశ్చయించి వ్యథితచిత్తయై వాసుదేవా! భయార్తుల కభయము నొసంగునట్టినీవు నాకు వరంబుగా వీనితప్పులు మన్నింపుమని ప్రార్థించె. ప్రార్థించుటయుఁ బుండరీకాక్షుండు మేనత్తకు వరంబుగా వీనియపరాధములు నూఱు సైఁచునట్లొడంబడియె. అది కారణంబుగ నితం డితరుల కవధ్యుండు గాన గర్వించి యిట్లు ప్రేలుచున్నవాఁడు. కాకున్న వీఁడు నను రణమునకుఁ బిలువఁ గలఁడె? భగవంతుఁడు వీనియెడఁ గలతనతేజముఁ గ్రమ్మఱ గ్రహింప నున్నవాఁడుగాఁబోలు. కాదేని యితం డిట్లు బుద్ధిమాలి

యిన్ని పలుకులు పలుకునే? వీనికి మృత్యుకాల మాసన్న మయ్యె నని తలంచెద. ననిన విని శిశుపాలుండు కోపాటోపదీపితుండై భీష్మున కిట్లనియె.

భీష్మా! కేశవునకుఁ గలప్రతాపంబు శత్రులకైన వలదు. ఇతనిం బొగడుటకంటె బాహ్లికుఁ డగుదరదుని స్తుతింపుము. అతండు పుట్టినపుడు భూమి పగిలె ననివిందుము. మఱియు సహజకవచకుండలమండితుం డైనకర్ణుం బొగడుము. దుర్జయుఁ డైనజరాసంధుని బాహుయుద్ధమున నాకర్ణుఁడు జయించి శరీరమున గాయముఁ జేసె. వెండియు మహాశూరుఁ డయిన ద్రోణుఁడు, కృపుఁ, డశ్వత్థామ, దుర్యోధనుఁడు, సైంధవుఁడు, కింపురుషాచార్యుఁ డైన ద్రుముఁడు, భీష్మకుఁడు, రుక్మి, దంతవక్త్రుఁడు, భగదత్తుండు, యూపకేతుఁడు, జయత్సేనుఁడు, విరాటుఁడు, ద్రుపదుఁడు, శకుని, బృహద్బలుఁడు, విందానువిందులు, పాండ్యుఁడు, శంఖుఁడు, వృషసేనుఁ, డేకలవ్యుఁడు, కాళింగుఁడు మున్నగుగాఁగలశూరు లున్నవారు. వీరలఁ బొగడరాదే? అది యట్లుండె. లెస్సగ విచారింప నాత్మస్తుతి, యాత్మనింద, పరస్తుతి, పరనిందయు నుత్తమవృత్తంబులు గావని పెద్దలు చెప్పుదురు, కాన యోగ్యవృత్తిఁ గానిస్తుతియందుఁ బ్రవర్తింపరాదు. ప్రవర్తించియు భోజపతికి లోఁగియున్న యొకదురాత్ముని జగన్నాథుఁ డని కేవలకామమునఁ బొగడరాదు. ఉచితజ్ఞుల కిది మెప్పుగాదు. ఎన్ని చెప్పిన నీబుద్ధి సత్పథంబుఁ జొరఁబాఱదు. భూలింగపక్షివిధమునఁ బెఱవారికి ధర్మముల బోధింతువుకాని నీవు ధర్మము నవలంబింపవని మున్న చెప్పితిఁ గదా. ఆపక్షివృత్తాంతము వినుము. మున్ను హిమవత్పర్వతపార్శ్వమున భూలింగశకుని యనునది యొక్కఁ డుండి సాహసంబుఁ జేయరా దని యందఱకును బోధింపుచుఁ దాను మాంసభక్షణలోలం బైనసింహము నోటఁ బండ్ల నిఱికికొనియున్న యామిషంబుఁ గొని తెచ్చుచు సింహ ముపేక్షించునంతకు సుఖముండు. అక్కరణి నీవు నీరాజు లందఱు నీయెడఁ గరుణించియుండునంతకు సుఖముందువు. కాకున్న లోకధర్మవిరుద్ధకార్యములు చేయునట్టినీవును బ్రదుక నేర్తువే యని యధిక్షేపించి ప్రల్లదంబు లాడె.

ఆపరుషవచనముల విని భీష్ముఁడు శిశుపాలా! వీరందఱు కరుణించియుండుటంగాదె నేను బ్రదుకుచున్నవాఁడ ననిపలికితివి. వీరిదయ వలదు. ఇందుఁ గలరాజులను నే నొకతృణంబుగనైన లెక్కింప నని తెంపును బీరమ్మును మెఱయఁ బల్కిన రాజులు కొందఱు మహావీరుఁ డగుభీష్మున కిది తగు నని సంతోషించిరి. మఱికొందఱు నిందించిరి. వెండియుంగొందఱు దుర్మదాంధులు నజ్ఞానోపహతులునై భీష్మునియెడ నోర్వ తగదు. వీఁడు పాపాత్ముఁడు పోతరించినవాఁడు. ముదిమిచే యుక్తాయుక్తంబులఁ బరికింప నేరఁడు. పశువుంబోలె వీని

వధించుటయొండె నందఱుం గూడి కటాగ్ని చేఁ గాల్చుటయొండె సలుపవలయు
ననిరి. భీష్ముఁడాదుర్భాషలవిని కడునలిగి యందఱఁ గలయఁజూచి రాజులారా!
మాటకు మాటగా వ్యర్థవచనములఁ బ్రయోజనంబు లేదు. మీపట్టినప్రతినలెల్ల
నవశ్యంబుగఁ బౌరుషంబు గలిగినఁ జేయఁ బూనుఁడు. గోవిందుఁ బూజించి
మీయందఱితలలపైఁ నిదె నేఁ బాద ముంచితిని. మరణంబుఁ గోరునతఁడు
చక్రగదాధరుఁ డైనకృష్ణునితోడఁ బోరాడి యాజగన్నాథునిశరీరంబుఁ జొచ్చుఁ
గాక యని వచించె. శిశుపాలుఁ డంతఁ గృష్ణుం జూచి వసుదేవనందనా! నా
తోడం బోరు సేయ రమ్ము. ముందుగ నిన్ను వధించి పదంపడి పాండుపుత్రు
లం గీటడంతు. వారు వధార్హులైన నవివేకంబున నొకనికి దాసుఁడ వైన
నినుఁ బూజించుటంజేసి వారును నీనిమిత్తంబున వధ్యులయి రని తెగఁబాఱి
పరుషంబులఁ బలికె.

(శిశుపాలుఁడు చక్రాయుధంబుచేఁ జచ్చుట)

ఆపలుకులు విని జనార్దనుండు రాజుల నందఱ నిర్దేశించి యందఱును
వినుఁడు. ఈశిశుపాలుఁడు నిష్కారణంబుగ మాకుఁ జేసినతప్పు లెన్నియేఁ
గలవు. మేము ప్రాగ్జ్యోతిషపురంబుపై దండెత్తిపోవఁగ నీదురాత్ముఁడు మాకు
మేనత్తకొడుకయ్యు శత్రుఁడై ద్వారకను గాల్చె. రైవతకమున విహరింపుచు
న్నయాదవులం బట్టి కొందఱం జంపి మఱికొందఱఁ జెఱఁ బెట్టె. మా తండ్రి
వసుదేవుఁ డశ్వమేధముఁ జేయఁబూని గుఱ్ఱముఁ బంపఁగ నీఖలుఁ డశ్వరక్షకు
లయినసౌవీరుల గెలిచి యాయశ్వము నపహరించె. బభ్రుఁ డనుయాదవుని
భార్యను నిష్కామను దపస్విని నధర్మంబున నపహరించె. మఱియు వీఁడు
గర్వమున రుక్మిణిపై నభిప్రాయఁబడియెఁగాని శూద్రుఁడు వేదసూక్తిఁబోలె
దానిఁ బొందఁ జాలఁడయ్యె. వెండియు నీపాపాత్ముఁ డొనరించినయెగ్గుల నెన్న
రాదు. ఎన్ని చేసినను నేను మేనత్తకుఁ బ్రీతిగా నన్నియు నోర్చి యుపేక్షింపు
చుంటి ననిన శిశుపాలుఁడు పకపకనగి కృష్ణా! మున్ను నేవరించినరుక్మిణిని బి
దప నీవు పెండ్లియై యిట్లు సిగ్గుమాలి పలుక నీకే తగును. యోగ్యుఁ డెవ్వఁ
డైన నిట్లు నీవిధంబునఁ జెప్పకొనునే? అది యట్లుండె. నీసహనమున నేను
బ్రదుకునట్లు ప్రేలుచున్నవాఁడవు. నీకోపమునకుఁ గొంచెమైన వెఱవను. నీ
యనుగ్రహమున కుబ్బను. శక్తుఁడవేని యిచ్చమైఁ జేసికొను మని తెంపునఁ
బలికె. అయ్యవసరంబున నధోక్షజుండు చక్రాయుధముఁ దలంచుటయు నది
తత్క్షణంబ హస్తగతం బయ్యె. చక్రపాణి రాజులనెల్లఁ జూచి యీ దురాత్ముని
యపరాధశతంబు మామేనత్త యగుసాత్వతికిఁ బ్రీతిగా సైఁచితి నిఁక సైఁపఁ
జన దని తెలియఁ జెప్పి నిఖిలదుర్జనచక్రనిష్పూదనప్రక్రమం బైనచక్రాయుధం

బుఁ బంపె. ఆదివ్యసాధనం బప్పుడ శిశుపాలుని తలఁ దునుముటయు వాఁడు వజ్రాహతం బైనకొండమాడ్కిం గూలె. కూలినంతన వానిమేనుఁ దొలఁగి మహనీయ తేజం బొకండు నారాయణుం జేరఁగ నందఱు నివ్వెఱఁ గందిరి. ఆకాశమున మేఘములు లేకున్నఁ బిడుగులతోడ వానగురిసె. పుడమివడఁకె. రాజులు కొంద ఱవాఙ్మనసగోచరం బయినయాకార్యమునకు విభ్రాంతిఁ జెంది యేమియు ననసేరక యూరకుండిరి. మఱికొందఱు కోపమునఁ జేతులఁ బిసికి కొనిరి. ఇంకఁ గొందఱవుడు గఱచిరి. వెండియుంగొంద ఱేకాంతంబునఁ బురుషోత్తముఁ గొనియాడిరి. మఱియుం గొందఱు మధ్యస్థులయియుండిరి. బ్రాహ్మణులు, మహర్షు, లుత్తమరాజులును సంతోషంబున హృషీకేశుం బ్రశంసించిరి. అట యుధిష్ఠిరుఁడు శిశుపాలుని సంస్కరింపం బంచి వానికొడుకుం జేదిరాజ్యమున నభిషిక్తుం జేసె.

ఇట్లు రాజసూయంబు సకలపదార్థసమగ్రంబును సర్వజన మనోమోదకరంబును శాంతవిఘ్నంబును సుఖారంభంబును బ్రభూత ధనధాన్యంబును భక్ష్యభోజ్యాదిస్వాద్వన్నసంభృతంబునై నారాయణరక్షితంబై సమాప్తప్రయోగం బగుటయు నవభృథస్నాతుం డైన ధర్మరాజుం జేర వచ్చి రాజు లందఱు మహారాజా! భాగ్యవశంబున సామ్రాజ్యంబు సాధించి భారతవంశంబు నెల్ల నిజమహిత తేజంబునఁ దేజరిల్లఁ జేసితివి. నీయందే ధర్మము సుస్థిరమైయుండును. నిజదేశములకుఁ బోయెదము. అనుజ్ఞ నొసంగు మని మనవిచేసిరి. ధర్మనందనుఁడు వారినెల్ల నుచితసత్కారంబుల నాదరించి తమ్ములంబిలిచి వీరినెల్ల మనదేశముమేర దాటువఱకు సాగనంపునది యని నియమించె. అంత భీష్మధృతరాష్ట్రుల భీమసేనుఁడును, ద్రుపదు నర్జునుఁడును, సుబలునిం దత్పుత్రులను నకులుఁడును, ద్రోణకృపాశ్వత్థామల సహదేవుఁడును, విరాటుని ధృష్టద్యుమ్నుఁడును, పార్వతీయుల నభిమన్యుఁడును, నితరక్షత్రియుల ద్రౌపదీ పుత్రులుం బంపిరి. ఇట్లు సకలరాజులు బ్రాహ్మణులును ధర్మనందనుచే సత్కృతులై తమతమదేశంబులకుఁ బోవఁగ నొక్కనాఁడు పుండరీకాక్షుఁడు యుధిష్ఠిరుఁ జూచి కౌరవపుంగవా! భాగ్యవిశేషమున రాజసూయ మాచరించి సామ్రాజ్యంబు సాధించితివి. నేనును ద్వారకకుఁ బోయి వత్తు ననిన ధర్మరాజు గోవిందా! నీయనుగ్రహమున రాజులెల్ల నాకువిధేయులై కప్పములసమర్పించిరి. నీప్రసాదంబున రాజసూయంబుఁ జేయఁ గంటిని. నిన్ను విడిచి నే నొకక్షణంబైన సుఖింప నేరను. ఐన నవశ్యముగ నీవు ద్వారకకుఁ బోవలసియునికిం జేసి సమ్మతించెద నని వక్కాణించె.

ఇట్లు ధర్మరాజునాజ్ఞఁ బొంది యతఁడు వెంటరాఁగ వాసుదేవుఁడు
కుంతియొద్ద కరిగి మేనత్తా! నీపుత్రులు సామ్రాజ్యము సాధించి ధనవంతులై
కృతార్థులై యున్నవారు. నీకు మనల్లప్రీతి యయ్యెఁగదా. ద్వారకకుఁ బోయి
వత్తు, ననుజ్ఞ యిమ్మని యడిగి తదనుమతుఁడై సుభద్రా ద్రౌపదులఁ బ్రేమబం
ధురంబుగ వీడ్కొని యంతిపురము వెడలి స్నానజపాదులనొనర్చి బ్రాహ్మణా
శీర్వాదములఁ బరిగ్రహించి సకలసాధనసంభృతంబు దారుకసారథికంబు గరు
డధ్వజంబు నగురథంబు వలగొని యారోహించి కొన్నియడుగులు గడచి
పాదచారులై వెంటన వచ్చుచున్న పాండవులం జూచి యట నరదంబు నిల్పి
ధర్మనందనుం బిలిచి మహారాజా! భూతములకుఁ బర్జన్యుఁడును, బక్షులకు వృ
క్షములును, నమరులకు సురపతియునుంబోలె జనులకెల్లఁ బ్రాపై ప్రమాదంబుఁ
బొరయక రాజ్య మేలు మని హిత ముపదేశించి తదనుమతుండై ప్రయాణంబు
చేసె. పాండవులు నధోక్షజునానుజ్ఞఁ గొని నగరు సేరిరి. ఇట్లు యజ్ఞార్థముగ
వచ్చినవా రందఱుఁ దమతమదేశములకుఁ బోవఁగ దుర్యోధనుఁడు శకునిసమే
తుఁడై ధర్మరాజసభాసౌభాగ్యముఁ గనుఁగొన నచ్చటన యుండె.

(ధర్మరాజు వ్యాసునివలన నుత్పాతము విని సమయము చేయుట)

అవ్విధంబున మధుసూదనుఁబంపి మగిడి వచ్చి తమ్ములతోడ ధర్మరాజు
సభాసీనుఁడై యుండఁగ వేదవ్యాసమునీంద్రుఁ డచ్చటికి విచ్చేసి యనుజ సమ
న్వితుఁ డగుధర్మసుతుఁడు భక్తిమై నాచరించిన ప్రత్యుత్థానాభివాదనార్ఘ్యపా
ద్యాదిపూజలం గ్రహించి యుత్తమకాంచనాసనంబున నుపవిష్టుఁడై యా రా
జేంద్రుఁ నుచితాసనమునఁ గూర్చుండ నియమించి ధర్మనందనా! సుకృత విశే
షమున నితరదుర్లభం బయినసామ్రాజ్యముఁ బడసితివి. కౌరవకులంబెల్ల నీవ
లన వెలింగె. నీచేసినపూజలకు మెచ్చితి. పోయి వత్తు ననిన ధర్మతనయుఁ
డమ్మునివరునడుగుల కెఱఁగి మహానుభావా! నా కొకసంశయము గలదు.
దానిం దీర్ప నీవ తక్కఁ దక్కటివారు వలఁతులుగారు. దివ్య,భౌమాం,తరిక్షం
బు లనను త్పాతంబులు మూడువిధంబులఁ గలవని నారదునివలన వినియుండు.
శిశుపాలుఁడు యజ్ఞమున సమయుట యుత్పాత మగునే? యని యడుగ వేద
వ్యాసుఁ డిట్లనియె. పాండునందనా! నీ డెందమున సందియం బేల? ఇది యు
త్పాతంబు. దీనిఫలంబిఁకఁ బదుమూఁడేఁడులు గడచినపిదప దుర్యోధను నపరా
ధంబున నీవు నిమిత్తముగా భీష్మార్జునబలంబున బహుక్షత్రియక్షయం బగునట్టి
మహాయుద్ధము గాఁగలదు. వెండియు వేఁకువను వృషభవాహనం బధిరో
హించి దక్షిణదిశను జూచుమహాదేవుఁ ద్రిపురాంతకునీలకంఠు నుమాపతి నీ
శ్వరుం గలలోనఁ జూడఁగలవు. క్షత్రియక్షయంబునకు వంతుర వలదు. ఎవరి

కేనియుఁ గాల మనుల్లంఘ్యమకాదే? ప్రమాదములేక శాంతిపరుఁడవై ప్రజలఁ బాలింపుచు శుభములఁ బడయు మని చెప్పి కృష్ణద్వైపాయనుఁడు శిష్యులతోడఁ గైలాసమునకుఁ జనియె. ధర్మరాజమ్మునీంద్రువచనంబు దలపోసి చింతాశోకములు గదురవేఁడినిట్టూర్పులు నిగుడింపుచుఁ గొంతవడికిఁ దైవవశమున నగుకార్యము పౌరుషమునఁ దప్పింపనలవిగాదు. అవశ్యముగఁ గాఁదగినది కాకతీఱ దని నిశ్చయించి తమ్ములం బిలిచి వింటిరే వ్యాస వచనంబు. అది వినినం తన మేనుఁ దొఱంగ నెంచితిని. నానిమిత్తమునఁ బలువురకు వినాశ మగుట కంటె నిదియ మేలు గదా యనిన నర్జునుఁడు రాజేంద్రా! నీయట్టిమహనీయుఁ డిట్లుమోహముఁ జెందఁ జనునే? ధైర్య మవలంబించి సకలజనక్షేమకరం బగు క్రమంబున నడుపు మని విన్నవించె. అంత నయ్యాజాతశత్రుఁ డర్జును వచనంబు విని వ్యాసవచనంబునుం దలపోసి నేఁడు మొదలుగఁ బదుమూఁడేఁడులు గడచునంతకుఁ దమ్ములతోడఁగాని లాఁతివారితోడఁగాని కఠినముగ భాషింపను. జ్ఞాతులయెడను నిట్లు వర్తింతు. ఎల్లవారియెడ నప్రియంబులేక వర్తింపుచుండ భేద మేల గలుగును? భేదము లేకున్న వైరము గలుగనేరదు. కావున నిట్లు ప్రతిజ్ఞఁ బూని లోకమున నింద వొడమకుండఁ గాలముఁ ద్రోయుదు నని సకలజనసమక్షమునఁ బ్రతిజ్ఞఁ జేసి పితృదేవపూజాతత్పరుండై స్వస్తికృత్యముల నాచరింపుచుండె.

అట నొక్కనాఁడు దుర్యోధనుఁడు శకునితోడ నాసభయందలి దివ్యాభిప్రాయములఁ గనుఁగొనఁ దిరుగుచు నొక్కచో స్ఫటికమణికుట్టిమంబుఁ గాంచి జల మనిశంకించి కట్టినవస్త్రం బెగఁద్రోచికొని పోయి మఱియొక్కచో స్ఫటికవిమలసలిలపుండరీకసంభృతంబు లగుడిగ్గియలఁ జూచి స్థల మనువిభ్రాంతిం బరిధానంబు దడియ నందుఁ జొచ్చుటయు భీమసేనాదిపాండవులు, పాంచాలి, కింకరులును నగిరి. దానిం దెలిసి ధర్మరాజు దివ్యదుకూలముల వానికి గట్టనిప్పించె. మఱియు నాదుర్యోధనుఁడు మూసియున్న స్ఫటికద్వార కవాటంబు మూఁతదీసినదిగా నెంచి చొరఁబోయి తత్కవాటస్ఫటికశిలాభిహతలలాటుండై మఱియొకచోఁ దెరచియున్నద్వారంబు సంవృతంబుగా భావించి చేతుల దానిం ద్రోయఁ బోయి క్రిందఁ బడి లజ్జావనతవదనుండై ధర్మరాజు రాజసూయంబున కసూయఁ జెందుచు నతనిసామ్రాజ్యలక్ష్మికిఁ గుందుచు ధర్మరాజానుమతుండై హాస్తినపురంబునకుఁ బోయి పలుమాఱు మాటలాడఁ దొడగుచున్న శకునికైనం బ్రత్యుత్తరములొసంగక యాసభనే చింతింపుచు వేఁడినిట్టూర్పుల నిగుడింపుచు వెలవెలనవ్వుచుండె. శకుని వానిం జేరి యిది యేమికారణంబు? వందుర నేల? యని యడుగ దుర్యోధనుఁ డతని కిట్లనియె. మామా! యేమి

చెప్పుదు? అర్జునపరాక్రమంబున భూమండలం బంతయు వశీకరించుకొని ధర్మ రాజు రాజసూయంబు చేసి సామ్రాజ్యంబు సాధించి యింద్రునిపోలె వెలుఁగుచున్నవాఁడు. శత్రువుల సంపదలఁ జూచి నేను సర్వకాలముల గ్రీష్మకాలమున నింకఁబాఱినయల్పజలంబురీతిఁ గృశించి మనోదాహమున వ్యథితుఁడనైతి. సకలరాజులును బాండవులకు వశు లైరి. కృష్ణుఁడు శిశుపాలుఁ జంపుచుండ నొక్కఁడేనియు నడ్డము గాఁడయ్యె. వాసుదేవప్రేరితం బైనపాండవప్రతాపానలంబున దహ్యమానులై రాజు లేమియుఁ జేయనేరక లోఁగి కోమటులపోలె వివిధరత్నాదులఁ గానుకలుగా సమర్పించిరి. లోకోత్తరం బైనవారివిభవంబు నీవును గనుఁగొంటివి కదా. వారికి దైవబలంబు మిక్కుటంబుగఁ గలుగుటం జేసి మన మెంతపౌరుషముఁ జూపినను నిష్ప్రయోజనంబు. వారి సంపద నసహాయుఁడ నగునే నపహరింప నుపాయంబుఁ గానను. మఱియు మన మా సభావిభవంబుఁ జూచుచుండ మనలఁ గాంచి వారందఱు నగుటయు నీ వెఱుంగుదువుకదా. ఈబ్రదుకుకంటెఁ జావు మేలు. కావున నగ్నిప్రవేశముననొండె విషభక్షణంబుననొండెఁ బ్రాణములఁ ద్యజింతు. ఇదియంతయు ధృతరాష్ట్రునకుఁ దెలుపుమనిన శకుని యతనికిట్లనియె. దుర్యోధనా! పాండునందనుల గుఱించి యసూయఁ జెందఁ దగదు. వారు న్యాయార్జితవిభవంబున సుఖింపుచున్నవారు. ధర్మమార్గప్రవృత్తు లగువారికి దైవబలం బతిశయితంబు. దానంగాదె మున్ను నీ వెన్నికీడులు చేసిన నవి వారిం జేరవయ్యె. మఱియు వారికి భాగ్యవశమున ద్రౌపది భార్యయగుటంజేసి సపుత్రకుఁ డైనద్రుపదుఁడు రాజ్యలాభమున సహాయుఁ డయ్యె. వాసుదేవుఁడు వారికిఁ బుట్టిననాఁటంగోలె సహాయుఁడై యునికి యందఱకుం దెల్లంబు. న్యాయమున వారు తండ్రిపాలు సాధించుకొనిరి. అర్జునుఁ డగ్నిహోత్రుఁ దన్పి గాండివంబు, నక్షయతూణీరంబుల; దివ్యాస్త్రములను సాధించి గండుమీఱి రాజులనెల్లఁజయించె. వెండియు నతండు మయు నగ్నిదాహమునఁ దప్పించి యతనిచే సభఁ జేయింపఁగ దాని మయప్రేరితు లయినకింకరు లనురాక్షసు లింద్రప్రస్థముఁ జేర్చిరి. ఇందు వారి యన్యాయం బేమి? వారిసంపదకు మన మేల శోకింపవలయు? మఱియు వారు సహాయసంపన్ను లనియు నీవు నిస్సహాయుఁడవనియుఁ జెప్పెదవు. విచారింప నది యట్టిదే? దుశ్శాసనాదు లగుతమ్ములు ధనుర్ధరశేఖరుఁ డైనద్రోణాచార్యు, డశ్వత్థామ, సపుత్రకుఁ డైనకర్ణుఁడు, కృపాచార్యుఁడు, సోదరసహితుఁడ నగు నేను, సౌమదత్తి మొదలగువారు పలువు రుండఁగ నీ వసహాయుఁడవే? మేమందఱముం బాసటగాఁగ భూవలయంబు జయింప నీకరిదియే? యనిన దుర్యోధనుఁ డట్లయేని మన మందఱముం గలిసి దిగ్విజయము చేసి పాండవులగెలిచి

యాసభఁ దెచ్చెద మనిన శకుని యిట్లనియె. పాండవుల గెల్వ నలవిగాదు.
వారందఱు మహారథులు యుద్ధవిశారదు లస్త్రవిదులు మహిత పరాక్రములు.
వారికి ద్రుపదవాసుదేవులు సహాయులు. దేవతలైనను వారల గెలువనేరరు.
ఇఁక మనము గెలువ నోపుదుమే! క్లేశములేకయే రాజ్యముసాధించునట్టి యు
పాయము వినుము. ఎట్లంటేని ధర్మరాజు ద్యూతప్రియుండ కాని యంపలి
కపట మెఱుంగఁడు. జూదమునకుఁ బిలువఁగ నవశ్యముగ వచ్చి యాడును.
నేను ద్యూతవిద్యావిశేషంబులనెల్ల లెస్సగ నెఱుంగుదుఁ గాన నతనితోడ
జూదమాడి తదీయైశ్వర్యంబంతయు నీకిచ్చెద. ధృతరాష్ట్రునకు విన్నవింపుము.
ఆనృపతియనుమతించిన మనకోరిక కొనసాగుననిన దుర్యోధనుఁడు మామా!
నీవే యుక్తప్రకారంబునఁ దండ్రి కెఱిఁగింపు మని వేఁడుకొనియె.

దుర్యోధనప్రార్థితుండై శకుని ధర్మజుయజ్ఞా చరణంబున కానందింపు
చున్న ధృతరాష్ట్రునొద్దకు దుర్యోధనసహితుండై యరిగి మహారాజా! నీపెద్దకొ
డుకు చింతాదైన్యంబులు గదుర వివర్ణుండై కృశించియున్నవాఁడు. శత్రునిమి
త్తం బైనజ్యేష్ఠపుత్రునిమనశ్శోక మేల పరీక్షింపకున్నవాఁడ వనిని వేదింప ధృత
రాష్ట్రుఁడు దుర్యోధనున కిట్లనియె. పుత్రా! నీవు దైన్యమున వివర్ణుఁడవై కృ
శించియునికి శకునివలనఁ దెలిసె. ఇట్లు గానేల? వినఁదగునేని వినిపింపుము.
ఎంతచింతించిన నీశోకమునకుఁ గారణం బెఱుంగనయ్యెద. సమస్తయిశ్వర్య
ములు నీయందు సుప్రతిష్ఠితంబులయ్యె. భ్రాతృసుహృద్బాంధవులు ప్రియంబు
ల యాచరింతురు. ఉత్తమవస్త్రములఁ గట్టెదవు. ఇంపైనమాంసాద్యాహారంబు
భుజింతువు. ఉత్తమవాహనముల నారోహింతువు. లలితశయనములఁ బవ్వళిం
తువు. సుందరీరత్నములతోడ దివ్యసౌధముల నిచ్చమైఁ గ్రీడింతువు. దేవతల
కుఁబోలె నీకును వచనంబప్రతిహతంబు. చింతింపనేల? యనిన దుర్యోధనుఁడు
తండ్రి కిట్లనియె.

(దుర్యోధనుఁడు తండ్రితోఁ దనమనోదుఃఖము చెప్పుట)

మహారాజా! నేనుం గుత్సితపురుషునివిధంబునఁ గాలము గడపఁగ నే
ర్చియేఁ గుడుతుఁ గట్టుదుఁ గాని యుగ్రం బగుమనోదుఃఖమునఁ బరితపింపు
చున్నవాఁడ. శత్రుభయముఁ దొలఁగించుకొనినరోషవంతుఁడే పురుషుఁ డనఁ
బడును. రాజు సంతోషపశ్చాత్తాపములఁ బడయరాదు. పడసిన సంపదయు
నభిమానంబునుం జెడును. దానంజేసి నే నెంతభోగింపుచుండినను యుధిష్ఠిరుని
లోకోత్తరరాజ్యలక్ష్మిఁ జూచి మనోదాహమునఁ దపించెద. శత్రువులు వృద్ధిఁ
బొందుచుండినఁ, దాఁ గొఱఁతఁ బొరయుచుండినను మానవంతుఁ డగుక్షత్రి
యుఁడు సుందకుండునే? ఇది కారణంబుగా నేను వివర్ణుఁడను దీనుఁడను. గృ

ఱోఁడను నైతిని. ధర్మనందనుసామ్రాజ్యము గణింప నోపను. అయ్యజ్ఞమున నాతని కందఱు ననేకవాహనరత్నాభరణాదుల సమర్పింప నతనిలక్ష్మి దిక్పాలురసంపదకంటె మిగిలియున్నయది. అట్టిశత్రుసంపదఁ జూచి నే నెట్లు శాంతిబొందుదు ననిన శకుని యిట్లనియె. ధర్మరాజు ద్యూతప్రియుఁడుగాని నేర్పునఁ గైతవం బెఱింగి యాడ నేరఁడు. నే నందలి కపటవ్యాపారము నెల్ల నెఱుంగుదు. ఎట్లయినం గపటంబుఁ జేసి యతనిసంపద నీకుఁ దెచ్చి యిత్తు. ద్యూతమునకుఁగాని యుద్ధమునకుఁగాని పిలిచిన యుధిష్ఠిరుఁ డవశ్యముగ వచ్చువాఁడు. ఇదియ యవశ్యకర్తవ్యం బనిన విని దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునడుగులపైఁ బడి తండ్రీ! శకునిమతం బనుష్ఠింప నానతి యొసంగవే? యనుటయు ధృతరాష్ట్రుఁ డిట్లనియె. ఇది యంతయు విదురునకుఁ దెల్పెదము. అతఁడు మంత్రవిదుఁడు. మహాప్రాజ్ఞుఁడు. ధర్మముఁ బరికించి దీర్ఘాలోచనముఁ జేసి యుభయపక్షములకు హితముఁ జెప్పువాఁడు. అతఁడు శాసించురీతిని నే ననుష్ఠింతు ననిన దుర్యోధనుఁడు రాజేంద్రా! విదురు నడిగిన నతం డిది వల దని యవశ్యంబు చెప్పను. ఈపనిఁ జాలించిన నేను బ్రదుకుట యరిది. నాపోయిన పదంపడి విదురుఁడు నీవును సుఖమున భూమండలం బెల్ల నేలుఁ డని చనువును దీనాలాపంబుల వినిపింపఁగ విని ధృతరాష్ట్రుఁడు పుత్రప్రేమంబున దుష్టం బైనను దుర్యోధనుమతము నతిక్రమింపఁజాలక శిల్పివరుల ననేకుల రావించి స్తంభసహస్రపరిశోభితంబును, శతద్వారంబును, వివిధచిత్రవిచిత్రితంబు నగుసభ నొక్కదాని దుర్యోధనునకుఁ జిత్తశాంతి గలుగ నతిరమణీయంబుగ నిర్మింపుఁ డనిపంచి విదురునకుఁ దెలుపకయ యెద్దానిం జేయ నొల్లక యమ్మేధావిం బిలిపించి ద్యూతదోషంబు లెఱింగియుఁ బుత్రస్నేహమున ద్యూత వృత్తాంతంబుఁ దెల్పె. తెల్పుటయు నవ్విదురుఁడు కలియుగ మాసన్నంబు గావునఁ బ్రజాక్షయముగాఁబోవు ననితలంచి ధృతరాష్ట్రునడుగుల కెఱఁగి రాజేంద్రా! నీపూనికి నా కభిమతంబుగాదు. ద్యూతకారణమునఁ బుత్రులలో భేద మవశ్యంబు గలుగు. అట్లుగాకుండఁ జేయు మనిన ధృతరాష్ట్రుఁడు విదురా! సురలు మనయెడఁ బ్రసాదింతురేని భేదము గలుగునే? అది యట్లుండె. ఇందువలన శుభాశుభహితాహితంబు లెవ్వి వాటిల్లినను సుహృద్ద్యూత మిపుడవశ్యకర్తవ్యంబు. నేను భీష్మద్రోణులు నీవు నుండఁ జేటు వాటిల్లదు. వేగవంతము లగు గుఱ్ఱములం బూన్చినయరద మెక్కి యింద్రప్రస్థమునకుఁ బోయి యుధిష్ఠిరుఁ దోడ్తెమ్ము. నానిశ్చయము నిందింపఁ జనదు. దైవ మనుల్లంఘ్యంబు గాన నవశ్యభావ్యములు కాక తీఱ వనిన విదురుఁడు భీష్మునొద్దకుఁ జని యమ్మహాత్ముతోడ నాలోచింపుచుండె ననిన విని జనమేజయుఁడు వైశంపాయనుఁ జూచి మునీంద్రా!

పాండవధార్తరాష్ట్రులకు ద్యూతవ్యసన మెట్లు ప్రవర్తిల్లె? అం దెవ్వరు సభా సదులైరి? ఎవ్వ రనుమోదించిరి? ఎవ్వరు నిషేధించిరి? అదియకదా ప్రజాక్ష యమునకు మూలము. సవిస్తరంబుగఁ దేటపఱుపు మనియడుగ వైశంపాయ నుఁ డానృపతి కిట్లనియె.

విదురుఁడు వోయినపిదప ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుఁబిలిచి యేకాం తంబునఁ బుత్రా! జూదము వలదు. విదురున కది యనభిమతము. అతఁ డతి బుద్ధిశాలి. మన కెన్నఁడేనియు నహితంబుఁ జెప్పఁడు. వానిమతం బనుష్ఠించుట మనకు లగ్గు. ఇంద్రునకు బృహస్పతి యుపదేశించిననీతిశాస్త్రం బంతయు సర హస్యముగ విదురుఁ డెఱిఁగినవాఁడు. మనలో విదురుఁడు, యాదవులలో నుద్ధవుఁడును మహాబుద్ధిశాలులని యందఱుంగొనియాడుదురు. మఱియు జూ దమున భేదము భేదమున రాజ్యనాశము గలుగుటంజేసి యది యవశ్యవర్జ్యం బు. తల్లిదండ్రులచేఁ బుత్రుఁడు పడయవలసినకార్యములనెల్ల బొందితివి. కుల క్రమాగతం బయినరాజ్యమెల్ల ననుభవింపుచున్నాఁడవు. శాస్త్రములఁ జదివి తివి. ఇంట లాలితుఁడ వైతివి. అన్నదమ్ములలో నందఱికంటెఁ బెద్దవాఁడ వై తివి. ఇతరదుర్లభం బగుభోజనాచ్ఛాదనసౌఖ్య మనుభవింపుచు నింద్రుని చం దమున వెలింగెదవు. ఇట్లుండియు నీకు వగవ నేల? యనిన దుర్యోధనుఁడు తండ్రి కిట్లనియె.

రాజచూడామణీ! భోజనాచ్ఛాదనానుభవమాత్రమున సంతుష్టుఁడై క్షా త్రముఁ జూపనిక్షత్రియుఁ డధముఁడని మున్న చెప్పితిఁగదా. ధర్మజుసంపదఁ జూడ మనసంపద యెంతయని తోఁచెడి. భూమండలంబెల్ల నతనివశమైయుండుటం జూచి యోర్చి జీవించియునికియ నామనస్థైర్యమునకు నిదర్శనము. యుధిష్ఠిరుఁడు రాజసూయంబున రత్నపరిగ్రహణార్థంబుగ జ్యేష్ఠత్వశ్రేష్ఠత్వములఁ బరికించి నను నియోగించె. ఏమిచెప్పుదు. అపుడు రాజులు తెచ్చిసమర్పించు నమూల్య రత్నపుంజములఁ బరిగ్రహింప నాచేయి చాలదయ్యె. క్షణమాత్రంబు డస్సి నే నూరకుండిన నపారరత్నరాసు లావలఁ బడియుండు. వానినెల్ల గణింప నె వ్వరికేనియు నశక్యంబు. ఆమణివిశేషములపేరులు మున్నెన్నఁడైనఁ వినియుం డము. మఱియు నతనిసభయపూర్వరామణీయకంబు. పెఱవారికిఁ జిత్తవిభ్రాం తిఁ గలిగించు. మయుఁడు బిందుసరస్సునఁ గలయుత్తమరత్నముల స్ఫటికముల సేర్చి కూర్చి లోకోత్తరవిలాసభాసురంబుగ దాని నిర్మించె. అందుఁ జొచ్చి నేను స్ఫటికవిమలం బైనయొకప్రదేశంబు జల మనిభావించి కట్టినపరిధానం బెగఁద్రోచికొని మఱియునొక్కచో విమలసలిలకాసారపూరితం బగుడిగ్గియం

గాంచి స్ఫటికమణికుట్టిమం బనిభావించి వస్త్రము దడియఁ బ్రవేశించుటయు భీమాదిపాండవులు కృష్ణుఁడు ద్రౌపది దానిసఖపరిచారికలును నగిరి. దాని నెఱింగి ధర్మనందనుఁడు కింకరులచే నాకు వస్త్రములఁ బంపె. వారిపరిహాసంబు నాకు మనోదాహంబుఁ జేయుచున్న నపుడుకలహించినశిశుపాలున కైనగతిం దలపోసి యేమియుం జేయనేరక యూరకుంటిని. వెండియు నాసభం గ్రుమ్మరు వాఁడనై ద్వారాకారం బైనయొకగోడఁ గాంచి దానం బోవఁ దలఁచి తదీయ స్ఫటికశిలాభిహతలలాటుఁడ నగుటయు నకుల సహదేవులు ననుఁ బట్టి తోడ్కొనిపోయిరి. అందు సహదేవుఁ డాశ్చర్యమున ననుఁ జూచి ద్వారం బిది యిటు పోవలయు ననిబోధించె. భీముఁడు ధృతరాష్ట్రపుత్రా! యనిసంబోధించి పరిహసించి యిదె వాకిలి యిటు చనవలయు నని పెక్కుమాఱులు దెలిపె. అది యట్లుండె. అయ్యాగంబున రాజులు పాండవులకు సమర్పించినధనాదులఁ జెప్పెద నాకర్ణింపుము. కాంభోజుఁ డనేకవిధకంబళంబుల, సువర్ణాలంకృతంబు లగు వివిధాజినంబులఁ, దిత్తిరికల్మాషము లగుపెక్కుగుఱ్ఱములను శుక నాసినా సవర్ణంబు లైనమున్నూరుహయంబులను, నన్నియుష్ట్రముల, బడబలను సమర్పించె. గోవాసనులు వాటధానులు నగుబ్రాహ్మణులు మూడుఖర్వములబలిని స్వర్ణకమండలువులనుం దెచ్చి ద్వారంబు గాచియుండిరి. మరుకచ్ఛదేశవాసు లగుశూద్రు లుత్తమాంబరాభరణభూషిత లగులక్షదాసులను మహాబ్రాహ్మణోచితము లగువివిధకృష్ణాజినంబులం బలి నొసంగిరి. సముద్రతీరమున దేవమాతృకభూపతులును, నదీమాతృకక్షేత్రపతులును గాంధారదేశసంభవంబు లగు గుఱ్ఱములను, నాభీరకిరాతాదులు వివిధరత్నాజావిగోహిరణ్యాఖరోష్ట్రమధు కంబళాదులను సమర్పించిరి. ప్రాగ్జ్యోతిషపతియు మ్లేచ్ఛనాయకుఁడు నగుభగదత్తుఁడు వేగవంతంబు లయిన యాజానేయహయంబుల రత్నభాండముల నుత్తమఖడ్గముల నొసంగె. మ్లేచ్ఛరాజులు నానావర్ణములు నానారూపములు ద్వ్యక్షత్ర్యక్షలలాటాక్షైకపాదాదిలక్షణలక్షితములు పరిమితరాగసంపన్నంబులు పంకూతీరజాతములు వేగవంతంబులు నగుపదివేలురాసభంబులను హిరణ్యరజతరాసులను సమర్పించి యతనినగరు సొచ్చిరి. ఏకపాద, చీన, శ, క్షౌద్ర, బర్బర, హార, హూణాదు లింద్రగోపవర్ణంబులు శ్వేతభాసంబు లింద్రాయుధద్యుతులుసంధ్యారాగసమంబులునగునుత్తమాశ్వములను,వివిధకంబళంబులను, గమలప్రభంబు లగుమృదువిమలపట్టాంబరంబులను, దీక్ష్ణము లగుఖడ్గశక్తిపరశ్వథాద్యాయుధంబులను, రసగంధరత్నాదిసముదయంబులనుం గొని వచ్చి కుంతీసుతుద్వారముఁ గాంచియుండిరి. పూర్వదేశవాసు లగు శకతుఖారకంకరోమశాదు లపరిమితగజముల, నర్బుదాశ్వముల, నొకపద్మముబంగారును,

మణికాంచనగజదంతమయములైనయాసనశయనవాహనకవచశస్త్రముల, వ్యాఘ్రచర్మపరివృతములు స్వర్ణభూషితము లుత్తమాశ్వయోజితములు నగువివిధ రథముల, నారాచార్ధనారాచాదిబాణముల, నపారధనమునుం గానుకగా నిచ్చిరి. మేరుమందరపర్వతమధ్యమున శైలోదానది కిరుగెలంకుల వేణుకీచకములనీడ నుండుపార్వతీయులు ఖసైకాసనప్రదరదీర్ఘవేణుపారదపుళిందతంగణపరతంగణు లనువారు పిపీలికోద్ధృతంబై పిపీలిక మనుపేరం బరంగిన సువర్ణంపుద్రోణంబును, జమరాదిమృగములను, హిమత్పుష్పసంభూతం బైన తేనెను, నుత్తరకురుదేశముల వాసి కెక్కినపుష్పమాలికలను, నుత్తరకైలాసంబునం గల దివ్యౌషధులనుం దెచ్చియిచ్చిరి. హిమవత్పర్వతమునకుం బరార్ధదూరంబున నూర్యోదయపర్వతమున నుండువారును, గారూషవాసులును, సముద్రాంతవస్తులు నగుఫలమూలాదులం దినుచుం జర్మములం దాల్చునట్టిక్రూరకర్ములు క్రూరశస్త్రులు నైనకిరాతులు చందనాగరుకాష్ఠాది గంధద్రవ్యంబులం, జర్మరత్నపుంజంబులం, బదివేవురుకిరాతపరిచారికలను, రమణీయము లయినదూరదేశమృగపక్షులను, బర్వతంపుగనులం గల్గుబంగారునుం గప్ప మిచ్చిరి. కైరాతదరదదర్వశూరవైయయమకౌదుంబరపారదబాహ్లికకాశ్మీరకుమారఘోరకహంసకాయనశిబిత్రిగర్తయౌధేయమద్రకేకయాంబష్ఠకౌకురతార్క్ష్యవస్త్రపపహ్లవవశాతిమాలేయక్షుద్రకమాళవపౌండ్రకుక్కురశకాంగవంగకళింగపుండ్రశాణపత్యగయమగధతామ్రలిప్తాదు లగునానాదేశరాజు లుత్తమశస్త్రపాణు లుత్తమవేషధారులునై రాంగ ద్వారపాలకులు రాజశాసనంబునం గానుకల సమర్పించి లోపలం జొరనగు ననుటయు వారు దివ్యాలంకారపలసితంబులం బర్వతోపమంబుల నిత్యమదంబులం గామ్యకసరస్తీరసంభూతముల శాంతములం గులీనముల నేనుఁగులం బ్రత్యేకంబ వేయింటిని నిచ్చిరి. చిత్రరథుండనుగంధర్వుండు మహావేగము లయిననేనూఱుగంధర్వహయముల నొసంగె. తుంబురుం డనుగంధర్వుండు చూతపత్రసవర్ణము లయిననూఱు గుఱ్ఱముల నిచ్చె. నూకరపతి యనేకగజంబుల సమర్పించె. విరాటుండు రెండువేలుమత్తగజంబులనిచ్చె. వసుదానుం డిరువదియా తేనుఁగులను రెండువేలగుఱ్ఱములను సమర్పించె. ద్రుపదుండు పదునాలుగువేవురుపరిచారికలను బదివేవురుదాసులను నుత్తమగజశతంబులను నిఱువదియాఱుగజరథంబులను నిచ్చి యజ్ఞార్థముగ రాజ్యము నివేదించె. నారాయణుండు నరునకుం బ్రీతిగాం బదునాలుగువేలేనుఁగుల ననేకవస్తువాహనాదుల నిచ్చె. అర్జునవాంఛితంబుం జేయుట కృష్ణునకు సహజంబై యుండు. విశేషం బేల? అర్జుననకుఁగాం గృష్ణుండు స్వర్గమునైనం ద్యజించు. అట్లే యర్జునుండుం గృష్ణునకుఁగాం బ్రాణములనైనవిడుచు. అది యట్లుండె,

చోళపాండ్యులు మలయదర్దురపర్వతసంభవంబులు హేమకుంభసంభృతంబులు నగుసురభిచందనరసంబులను, మణికాంచనవస్త్రాదులను సమర్పించిరి. సింహళదేశపతులు సముద్రసారము లగుమౌక్తికములను వైడూర్యములను గుథాస్తరణంబులను వివిధాలంకారభాసుర లగుజవరాండ్రం బెక్కండ్రఁ దెచ్చియిచ్చిరి. ఇంతయేల? చాతుర్వర్ణ్యంబువారును మ్లేచ్ఛులును సకలజనులునుం బ్రీతిబహుమానంబులు పెనంగొనంగఁ గప్పములఁ దెచ్చియిచ్చిరి. బంధుత్వసంబంధంబునఁ బాంచాలురు స్నేహసంబంధమున యాదవులుం దక్కఁ దక్కటివా రెల్లఁ గప్పముల సమర్పించిరి. ఆసమయంబున మూఁడుపద్మములమావటివాండ్రు నర్బుదరథికులుఁ బెక్కండ్రుకాలరులును ధర్మరాజునానతిమెయిఁ బక్వాపక్వముల విచారింపుచుండిరి. అప్పటిపుణ్యాహఘోషము నింగి ముట్టె. సకలవర్ణముల లో నొక్కఁడైన నొక్కతేనియు భోజనపానాలంకారసత్కారంబులఁ బడయని వారు గనఁబట్టరు. ఎనిమిదివేవురుస్నాతకగృహస్థుల నన్నిండ్ల నిలిపి వేలువేల ముప్పండ్రుదాసుల నిచ్చి యాధర్మరాజు రక్షింపుచుండు. వా రెల్లపు డతనికి శత్రుక్షయంబ కోరుచుండురు. నిత్యబ్రహ్మచర్యనిరతు లగుమహామునులు స్వర్ణపాత్రములఁ బ్రతిదినంబు నయ్యజాతశత్రునింటఁ గుడుచుచుండిరి. అందు భుజియించినవారల లెక్కింప నలవిగాదు. ఒకలక్షబ్రాహ్మణులు భుజించినపదంపడి సంకేతార్థంబుగ మ్రోయ నియమించినశంఖ మయ్యజ్ఞముదినముల నెప్పుడును మ్రోయుచుండె. వారందఱు భుజించునంతకు నోపికమై విచారింపుచుండి యందఱుం దనిసినపిదప ద్రౌపది భుజింపుచుండె. సత్యసంధులు మహావ్రతులు వివిధవిద్యావిశారదులు వేదాంతనిష్ఠులు ధీరులు ధర్మపరులు కీర్తినిరతులు మూర్ధాభిషిక్తులు నగురాజులు పలువురు దక్షిణార్థంబుగా ననేకగోవుల సమర్పించి యభిషేకార్థంబుగా ధనాదిభాండములఁ దెచ్చి ధర్మరాజు నుపాసించియుండిరి. బాహ్లికుఁడు స్వర్ణాలంకృతం బైనరథంబుఁ దెచ్చె. సుదక్షిణుఁ డారథమునకు శ్వేతవర్ణంబు లగుకాంభోజహయములఁ బూన్చె. సునీథుఁ * డనుకర్షము సవరించె. శిశుపాలపుత్రుఁడు ధ్వజముఁ జేర్చె. దాక్షిణాత్యుఁడు కవచంబును మాగధుఁడు పుష్పమాలికోష్ణీషంబులం దెచ్చిరి. వసుదానుఁ డఱువదేఁడుల మత్తగజంబుఁ దెచ్చె. మత్స్యుఁడు హేమపరిష్కృతంబు లయినయక్షములఁ దెచ్చె. ఏకలవ్యుఁడు పాదుకలం దొడిగె. అవంతినాథుఁ డభిషేకార్థముగఁ బుణ్యనదీసలిలములఁ గొనివచ్చె. చేకితానుఁడు తూణీరంబు కాశ్యుఁడు విల్లు శల్యుఁ డుత్తమఖడ్గమునుం దెచ్చిరి. ఇట్లు సర్వరాజసముపాస్యమానుఁ డైన ధర్మరాజు నుత్తమాసనమున నాసీనుఁ జేసి ధౌమ్యుఁడు వ్యాసనారదాసితదేవ

* అనుకర్ష మనఁగా నొంగల్లక్రింద నుండుదానికిఁ బేరు. ఇదియే కోడిపీట యందురు.

లజామదాగ్న్యాదిమునిగణపరివృతుండై మంత్రపూతంబు లగుదివ్యాపగాసలిలంబుల భూరిదక్షిణాపురస్కృతంబుగ నింద్రుని సప్తర్షులుంబలె నభిషేకించె. పూర్వకల్పంబున నింద్రునకుఁగా బ్రహ్మసృజించినవరుణశంఖమును క్షీరసాగరుఁడు దెచ్చియిచ్చుటయు నాశంఖముజలముల శ్రీకృష్ణుఁడు ధర్మజు నభిషేకించె. అయ్యవసరంబున సామ్రాజ్యలక్ష్మీవిభాసితుఁ డైనధర్మనందనునకు సాత్యకి శ్వేతచ్ఛత్రంబుఁ బట్టె. భీమార్జునులు వ్యజనంబుల నకులసహదేవులు చామరంబులను వీచిరి. రాజు లందఱు నపు డతనికి విధేయులై మ్రొక్కుచుండఁ బాండవులు ధృష్టద్యుమ్నుఁడు సాత్యకి జనార్దనుఁడు నను నెనమండ్రు పరస్పరంబుఁ బ్రీతిమైఁ జూచుచు సంతోషించిరి. అర్జునుఁడు సంతుష్టుఁడై కాంచన శృంగాలంకృతము లగు నేనూఱుధేనువుల బ్రాహ్మణుల కొసంగె. పక్షులుదక్క లాఁతివారు పూర్వదక్షిణపశ్చిమదేశంబుల సముద్రమువఱకుఁ బోదురు కాని యుత్తరమునకుఁ బోఁ జాలరు. పాండవుల కుత్తరదేశవాసులును విధేయులై కప్పముల సమర్పింప నారాజసూయము లోకోత్తరమై వెలింగె. రంతిదేవనాభాగమాంధాతృమనుపృథుభగీరథయయాతినహుషులును ధర్మరాజునకు సమానులుగారు. హరిశ్చంద్రునిచందమున మహిత శ్రీవిలసితుండై రాజసూయాధ్వరంబు యథాక్రమంబుగ నాచరించి లోకమందెల్లఁ దనవిపులకీర్తి నించె. ఇట్లు మనశత్రులు నానాఁటం బొంపిరివోవుచున్నవారు. పెద్ద లసదులు నసదులు పెద్దలు నైరి. ఈ విపర్యయంబుఁ జూచి యెట్లు బ్రదుకనేర్తు. ఈచింతానలంబు దహింపుచుండ వివర్ణుఁడనై కృశించి యెద్దియుం దోఁచక చింతింపుచుందు ననిన ధృతరాష్ట్రుఁడు దుర్యోధనున కిట్లనియె.

పుత్రా! నీవు పెద్దవాఁడవు. పాండవులతోడఁ గలహింపఁ దగదు. కలహము మరణముపోలె నసౌఖ్యముఁగావించు. సకలసుగుణసమన్వితుఁడై ద్వేషము నొల్లనియజాతశత్రునితోడఁ గలహింపరాదు. ఏకవంశజాతుఁడవై న్యాయలబ్ధమైనధర్మనందనుసంపద నపహరింతు ననితలఁపనైనఁ జనదు. అతనివిధమున నధ్వరమాచరింపఁ గోర్కెయేని దీక్ష వహింపుము. ఋత్విజులు నీకోరిన యజ్ఞము నడుపుదురు. రాజులెల్లఁ బ్రీతిబహుమానముల నమితధనకనకరత్నభూషణవాహనాదిద్రవ్యముల నీకు సమర్పింతురు. పరద్రవ్యాపహరణంబు శిష్టనిందితంబు. తనకలిమికి సంతసించి స్వధర్మంబు నడుపునతఁడు సుఖించు. పరద్రవ్యములయెడ నుపేక్షయు స్వకర్మంబుల నిత్యోద్యోగంబును నార్జితరక్షణంబున నప్రమాదంబు నను మూఁడు వైభవమునకుఁ బ్రధానలక్షణములు. ఆపదలకుఁ గుందక ధైర్య మవలంబించి స్వకార్యములఁ దగు జతనముఁ జేయుచు నేమఱక వినయంబునఁ గాలము గడపువాఁడు నిత్యంబు సుఖించును. పాండు

సుతులు నీకు బాహువులపోలె నుందురు. అట్టివారికిఁ గీడుసేఁత లోకగర్హితంబు. వారిధన మపహరించిన మిత్రద్రోహం బగు. దాన నెంతయుఁ జేటు మూఁడు. నీతాతలకారే వారికిం దాతలు. వారు పెఱవారె? కావున నీవు నిష్టమైనయజ్ఞ మాచరించి ప్రియంబుల ననుభవింపుచుఁ దరుణులతోడ విహరింపుచు సుఖింపుము. పాండుసుతులతోడఁ గలహ ముడుగుటయ యెల్ల దెఱంగుల లెస్సయనిన దుర్యోధనుఁడు తండ్రికిట్లనియె. రాజపుంగవా! నిజప్రజ్ఞ లేక యితరబోధమునఁ గార్యములఁ జేయునతఁడు దర్వి సూపరసములంబలె శాస్త్రార్థముల నెఱుంగఁ జాలఁడు. ఓడతోఁగట్టినయోడవోలె నతఁడు మేలు గాంచఁడు. తెలిసియు స్వార్థముల నేల పరిశీలింపవు? కాకున్న నీకు నాయెడ ద్వేషంబో? నీశాసనము వినినధార్తరాష్ట్రులు భూమిన్మనఁ జాలరు. ఇతరపక్షపాతి యగువానిబోధన వినినతఁడు సన్మార్గముఁ గాంచనేరఁడు. వాని త్రోవ ననుసరించువానికి సాధుగతి గలుగునె? రాజవర్యా! పరిణతప్రజ్ఞుఁడవయ్యు వృద్ధోపసేవివయ్యు జితేంద్రియుఁడవయ్యు స్వకార్యములఁ బ్రవర్తించిన మమ్ము సమ్మోహింపఁ జేయ దగునే? లోకవృత్తంబునకంటె రాజవృత్తంబు వేఱని తొల్లి బృహస్పతి వక్కాణించె. ఎల్లపుడును నృపాలుఁ డేమఱక స్వార్థములఁ జింతింపవలయు. క్షత్రియునకు శత్రుజయము ముఖ్యధర్మంబు. స్వవృత్తమెట్టిదియైన నాచరింపనవలయు. ఇందు ధర్మాధర్మము బరిశీలింపవలదు. శత్రుసంపద నాక్రమింపఁ దలఁచినరాజు సారథి మునికోలచే రథ్యముల వశీకరించుకొనుచందమునఁ దనపరాక్రమమున దిశలెల్ల లోఁజేసికొనవలయు. గూఢముగ నొండెఁ బ్రకాశంబుగనొండె శత్రుని బాధించునట్టి యుపాయంబుఁ బ్రయోగించుటయే శస్త్ర మనఁబడు. సంతాపముఁ జేయునదియ శత్రువుగాని జాతిమాత్రముననేదియు శత్రువుగాదు. సంతోషంబుఁ గల్పించునదియే మిత్రము. ఇంతియ కాక వేఱు శత్రుమిత్రలక్షణము గన్పట్టదు. రాజు తనకలిమికెప్పుడును సంతసింపరాదు. అసంతోషంబ రాజునకు లక్ష్మీమూలంబు. ఎంత సంపద గల్గినను వెండియుఁ బ్రయత్నములఁ జేయుచు నేయుపాయముననైన నైశ్వర్య మధికముగ సంపాదించి దానియందు మమతఁ ద్యజింపవలయు. తొల్లి దేవేంద్రుఁడు ద్రోహము సేయ నని సంకేతముఁ జేసి పిదప నముచిశిరశ్ఛేదంబుఁ జేసెఁ గాన శత్రులయెడ నద్రోహవృత్తి తగదు. విరోధించనిరాజును దేశాంతరములఁ గ్రుమ్మరనిబ్రాహ్మణుని భూమి తానే నశింపఁ జేయును. వృద్ధిఁ బొందుచున్న శత్రుపక్షము నవివేకమున నుపేక్షింపరాదు. ఉపేక్షించిన నాటుకొనినరోగంబుమాడ్కి మూలచ్ఛేదంబుఁ జేయును. శత్రుఁడల్పుఁడయ్యు నుపేక్షితుఁడై క్రమమున వృద్ధిఁ బొంది వృక్షమూలమునఁ బొడమిన పుట్ట యాశ్రయా

నుం జెఱుచుతెఱంగున రాజుం జెఱుచును. కావున శత్రువుల సంపదకు సంతసింపకుము. ఇదియే యుత్తమనీతిమార్గము. ధనవృద్ధిఁ గోరువాఁడు జ్ఞాతుల యెడఁ బరాక్రమించును. నేనుం బ్రయత్నముఁ జేసి పాండవుల సంపదఁ గొనియెద. లేకున్న వారిచే నిహతుఁడనై యుద్ధరంగమునఁ బడియెద. వారు నిత్యవృద్ధిఁ బొరసినవారు. మనవృద్ధి యస్థిరము. ఇట్టినాకుఁ బ్రాణధారణమునఁ బ్రయోజన మేమి! యనిన శకునియిట్లనియె. దుర్యోధనా! ధర్మజుసంపదకు వందురకుము. జూదమున దానినెల్ల నీ కిచ్చెద. నాచేయుద్యూతరణమునకుఁ బందెము చఱచుటలు విల్లు. సారె లమ్ములు అక్షహృదయం బల్లెత్రాడు. స్ఫూర్తివిశేషము రథము. ఇవి తోడ్పడఁగ జూద మాడి ధర్మపుత్రుం గెలుతు నతని రావింపుమనిన దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుఁజూచి రాజాగ్రణీ! ఈశకునిమతంబు నెఱవేఱ నాన తిమ్మనుటయు ధృతరాష్ట్రుఁడు విదురుఁడు దీని నియ్యకొనఁడేని నే ననుమతింపననియె. వెండియు దుర్యోధనుఁడు చీకుతేనిం గాంచి తండ్రీ! విదురుఁడు పాండవులకు హితుఁడకాని నాకు విరుద్ధుఁ డని పెక్కుమాఱులు నుడివితిఁగదా. అతఁడవశ్యముగ నాయత్నము నిషేధించును. అన్యబోధమునఁ దనకార్యములఁ జేయరాదు. పెఱవారికి వెఱచి తన్ను రక్షించుకొనఁ దలఁచి యెద్దియుంజేయక యూరకయుండునతఁడు వర్షసమయమునఁ దడిసినకటమువలె నంతటఁ దనకుఁ దాన నశించు. వ్యాధులలమకమున్న మృత్యువు సమీపింపకమున్న నరుఁడు శ్రేయస్సు నాచరింపవలయు ననిన ధృతరాష్ట్రుఁడు పుత్రా! యెన్నిమాఱులు చెప్పినను వినవు. జూదమున బలవద్విరోధం బగు. దాన నెంతయే ననర్థంబు పొసఁగు. అది మే లని వెఱ్ఱితనమునఁ దలఁచెదవు. అనిన దుర్యోధనుఁడు వెండియు నిట్లనియె. జూదము పురాణములను వినఁబడు దాన ననర్థము పొసఁగదు. శకుని వాక్యములకు సమ్మతించి వేగంబ సభను నిర్మింపఁ బంపుము. జూదమున స్వర్గము నగు నని పెద్దలు వచింతురు. పాండవులకును మాకు నవశ్యంబు ద్యూతక్రీడ విధింపుమనిన ధృతరాష్ట్రుఁడు పుత్రా! నీపలుకులు నాచెవులకింపుగావు. చెప్పినను వినవు. ఈయుద్యమము సర్వకాలముల ధర్మవిరుద్ధము. నీ యిచ్ఛయైనఁ జేసికొనుము. తత్ఫలంబుఁగుడిచెదవు. మహామేధావిలసితుఁడు గుణదోషవిచక్షణుఁడు నగువిదురున కిది యనభిమతము. ఇందువలన నిశ్చయముగ క్షత్రియక్షయంబునుం బ్రజానాశంబునుం గలుగు నని చెప్పి యెన్ని చెప్పిన దుర్యోధనుఁడు తనమతముఁ జాలింపమికి వగచి పెద్దయుం బ్రొద్దు చింతించి దైవవశమున నగుపనులఁ దప్పింప నలవిగా దనినిశ్చయించి దైవసమ్మూఢచిత్తుఁడై శిల్పులరావించి ధర్మజుసభకు దీటుగా నొక యుత్తమసభను వైళంబ నిర్మింపు మని వెండియు

నియమించె. వారు నాప్రకారం బతివేగమున బహువిచిత్రముగా ననేకరత్నా దిసమంచితంబుగాఁ గ్రోశమాత్రప్రమాణంబుగా సభ నిర్మించి ధృతరాష్ట్రునకు విన్నవించిరి. అట ధృతరాష్ట్రుఁడు విదురుఁ బిలిపించి యీసభ యతి విచిత్రితంబు. దర్శనీయంబు. ఇంద్రప్రస్థమున కరిగి పాండవాగ్రజుం దోడ్తెమ్ము. అతనికిం ధార్తరాష్ట్రులకును సుహృద్ద్యూతంబు నడుచుఁగాక యనిన ధృతరాష్ట్రుఁ మతం బెఱింగి విదురుఁ డందుకు మెచ్చక రాజపుంగవా! నీపంపు యుక్తము గాదు. ఈద్యూతమున నీకొడుకులకుఁ బాండవులకు నవశ్యముగ భేద మగు. భేదమునఁ గలహముగలుగు. దానఁ గులవినాశము నిశ్చితము. కావునఁ బిదపఁ బశ్చాత్తాపంబు వడయుకంటె నిప్పుడిది చాలించుటయ మే లనిన ధృతరాష్ట్రుఁడు విదురా! దీని నేల యింత నిషేధింతువు. మనకు దైవ మనుకూలమయ్యెనేని జూదమునఁ జెఱుపు గలుగదు. ఆదైవమే ప్రతికూలమైన మనము దేనిఁ జేసిన మే లొడఁగూడదు. దైవవశమున నగుపనులకు వగవవలదు. వేఱు తలంపక ధర్మనందనుఁ దోడ్తె మ్మని నియమించె.

(విదురుఁడుధర్మరాజునుజూదమునకుఁబిలిచికొనివచ్చుట.)

విదురుఁడును ధృతరాష్ట్రుమతము నివారింపనేరక యెట్టకేల కందుల కొడఁబడి వేగవంతంబు లయినగుఱ్ఱములం బూన్చినరథ మధిరోహించి యతి త్వరితప్రయాణమున నింద్రప్రస్థముసేరి కుబేరగృహసన్నిభం బైనధర్మనందనున గరుసొచ్చె. చొచ్చుటయు నజాతశత్రుఁ డతనినుచితపూజల నతిప్రీతిసత్కరించి యతనియాకారం బభిలక్షించి విదురా! విషాదగ్రస్తుఁడపోలె నుండె దేల? కుశలమున వచ్చితివె? ధార్తరాష్ట్రులు ప్రతికూలప్రకారంబు విడిచి సేమమున మెలఁగుదురె? ప్రజ లెల్ల నతనికి విధేయులె? యని యడుగ నతఁ డిట్లనియె. పాండవాగ్రజా! ధృతరాష్ట్రుఁ డతనిపుత్రాదులుం గుశలులు. ఆనృపాలుఁడు నినుం గాంచి కుశలప్రశ్నంబు నడిపి దీనిం జెప్పఁగ ననుఁ బుత్తెంచె. అది యెద్ది యం టేని. ఈనీసభపోలె వేఱొకసభ హాస్తినపురంబున నిర్మింపఁబడియె. నీ వచ్చటికి వచ్చి దుర్యోధనాదులతోడ సుహృద్ద్యూతక్రీడ సలిపి యిష్టవినోదముల సుఖింపఁ దగు. ఇదియే ధృతరాష్ట్రుసందేశంబు. దాన వా రందఱుం బ్రీతులయ్యెద రఁట. కాన నచ్చటికి వచ్చి యాదుష్టులతోడ జూద మాడు మనిన యుధిష్ఠిరుఁ డక్కటా ప్రాజ్ఞులుం జూద మాడుదురె? దానఁ గలహ మగుట నిక్కవము. ఇందుల కేమి తలంతువు. నీమాటమెయి నడుతు మనియె. అనిన విదురుఁడు పాండవాగ్రణీ! ద్యూత మనర్థమూలం బని యెఱిగిన నాయుద్యమము వారింప నెన్నియేఁ బ్రయత్నము లొనర్చిన వాని నెల్ల సరకుసేయక యా

చీకుఁ జేఁడు నీయొద్దకు నన్నని చె. విచారించి యుక్త మాచరింపుమనిన ధర్మ రాజు విదురున కభిముఖుఁడై హాస్తినపురమున జూదరు లెవ్వ రనియడుగ నేల? ఇట్టియుక్కివంబుల కన్నింటికి ధార్తరాష్ట్రులు మొనకాండ్రుగారె! వారిలో నెవ రిపుడు పూనియుందు రనియడుగ శకుని, వివింశతి, చిత్రసేన, సత్యవ్రత, పురుమిత్ర, జయ లందుకుఁ గడంగి రని విదురుఁడు వచించె. అనవుడు ధర్మ నందనుఁడు హా! కితవాగ్రణులెల్ల నిందుఁ జేరిన భయ మయ్యె నేమి యొనరించిన దైవవశంబ గెల్పు గావున మన మేమిచేయఁగ నవుం జెడుగుల్గడు మూఁఢు జూద మాడ నటకు రాక యొప్పదు. దృఢంబు. సుతప్రియుఁ డాతఁ డెప్పుడు, మఱి నీహితోపదేశంబు మెయిననుష్ఠింతు. జూదమునకుఁ బిలిచినఁ బోవకునికి నాకు వ్రతంబు గాదు. ఎట్టులైన నగుఁగాక వత్తు నని చెప్పి ప్రయాణ సన్నాహంబు సమకట్ట నాజ్ఞాపించి మఱునాఁడు తమ్ములును ద్రౌపదియు సకల పరివారంబును వెంటరాఁగ బాహ్లీకోపనీతం బయినరథము నెక్కి బ్రాహ్మణపురస్సరంబుగఁ గాలచోదితుఁడై తఱలి హాస్తినపురముఁజేరి ధృతరాష్ట్రుని భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణశకునిశల్యాదులను దుర్యోధనదుశ్శాసనాది కుమారవర్గంబును దారాగణపరివృత యగురోహిణిమాడ్కిఁ గోడండ్రతోడఁ గలిసియున్న గాంధారినిం గాంచి పెద్దలకెల్ల మ్రొక్కి ప్రేమపూర్వకంబు లగువారిదీవనలఁ బడసి యుత్తమగృహముల నెప్పటియట్ల తమ్ములతోడ నుండె. లోకోత్తర శ్రీవిభాసితవదనారవింద యగుపాంచాలరాజపుత్రిం గనుంగొని ధృతరాష్ట్రుని కోడండ్రు మనంబులఁ గింకిరిపోడమ దీనిసౌందర్యంబు లోకోత్తరంబు పెఱవాండ్ర కబ్బు నే యని వగచుచుండిరి. ధర్మరాజు తమ్ములును ద్రౌపదిం దోట్టియు విదులుం గొలిచియుండ నాఁడు నిత్యకృత్యములఁ దీర్చి బ్రాహ్మణులఁ బూజించి సంతుష్టుఁడై యందఱితోడ రసవదన్నంబుఁ గుడిచి చందనాదుల నలంకరించుకొని సుఖమున నారేయి గడపి వేఁబోకట నింపారులలితశీతలసురభిమారుత ప్రసరణంబునకు శుకపికాదికలస్వనంబులకు వందిమాగధగీతంబునకును ముదం బెనయుచు నిద్ర మేల్కాంచి ప్రాతరాహ్నికములఁ గావించి శకుని దుర్యోధన దుశ్శాసనాదికితవసంకులం బైనయాద్యూతరంగముఁ బ్రవేశించి పూజార్హులం బూజించె.

(ధర్మరాజు శకునితో జూద మాడుట.)

ప్రవేశించుటయు శకుని ధర్మరాజు నుద్దేశించి నరేంద్రా! సభలో నందఱుఁ జేరిరి. ఇవె యభిమతాక్షంబు లున్నవి. జూద మాడఁ గడఁగు మనిన ధర్మరాజు సౌబలా! జూదమునుం బ్రశంసించెదవు. క్షాత్రం బగుపరాక్రమంబును నీతియుం గాదు. మఱి పరికింప నిది వంచన. ఇట్టి పాపకృత్యంబునుం గో

నియాడుదురె! న్యాయమున నాట గెలువుము. వంచన వలవ దనిన శకుని
జూదమున నేర్పు గలిగి కపటమున నితరుల గెలుచుకితవుఁడు మహామతి య
నఁబడు. అతఁడే సకలకార్యములఁ జేయఁ గలఁడు, పందెము చఱచి యాడి
గెలిచిన దాన దోషము గన్పట్టదు. శంకింపకుము. వేగమ పణంబు లొడ్డు
మాడుదు మనిన యుధిష్ఠిరుఁడు వెండియు నిట్లనియె. మోసమున జూదమా
డుట దోసం బని ధర్మయుక్తి ద్యూతము ధర్మయుద్ధమునకు దీటనియు నసితుఁ
డగుదేవలుఁడు వక్కాణించె. ధర్మజ్ఞులు పెద్ద లసత్యములఁ బలుకరు. మాయ
లఁ జరింపరు, కపటమున నాడరు. ఇదియే సత్పురుషులకు ముఖ్యవ్రతము.
బ్రాహ్మణరక్షణదుష్టశిక్షణములకుఁగా న్యాయమున నార్జించినయాధనమును కై
తవమున గెలువరాదు. సుఖములనొండె ధనములనొండె మోసమునగ్రహింప.
నే నొల్లను. కితవుఁ డఖిలలోకగర్హితుం డనిన శకుని యిట్లనియె. లోకమున
శ్రోత్రియుఁడు కపటమున శ్రోత్రియుని గెలుచు జూదరియు నుక్కివంబున
జయించు. అశిక్షితుని శిక్షితుఁడును దుర్బలు బలవంతుఁడును నికృతిం జయిం
చుట సహజమై యుండు. ఈయాటను నీ వోడుదువేని వలవ దుడుగు మనిన
యుధిష్ఠిరుఁడు పిలువఁగ వచ్చి మఱలుట మాకు వ్రతంబు గాదు. విధికృతంబు
మార్ప వలనుగాదు. కాన నాడెద. నాతో నెదురాట కెవ్వరు దొడఁగుదు
రనియడిగిన దుర్యోధనుఁడు పాండవాగ్రజా! నాకుఁగా నామేనమామ యగు
శకుని యాడు, అం దతఁడు ధనరత్నాదుల దేనిం బందెముగ నొడ్డిన నవి
యెల్ల నే నిత్తు ననఁ బాండవజ్యేష్ఠుఁ డొకనికిఁగా మఱియొకఁ డాడుట లోక
మున నెచ్చటనుం జూచినదియు వినినదియుంగాదు. ఐన మీయిష్టముగ నగుఁ
గాక యని జూదమున కొడఁబడియె. ఆద్యూతక్రీడఁ జూడ ధృతరాష్ట్రు పుర
స్కృతులై యనేకరాజులు సభాస్థానంబు సేరిరి. భీష్మద్రోణకృపవిదురు లాట
పై నిష్టములేకున్న ధృతరాష్ట్రు ననువర్తించియుండిరి. ఇవ్విధంబున నఖిలవిప్ర
క్షత్రియసంకులం బైనయాద్యూతరంగమునఁ గాలచోదితుఁడై ధర్మజుఁడు జూద
మాడఁ దొడంగి శకుని కొకహారమధ్యరత్నముఁ జూపి యిది సముద్రసంభవం
బమూల్యంబు. దీని నొడ్డెద. మీ రెద్దానిం బణముగ నుంచెద రనుటయు దు
ర్యోధనుఁ డిట్లనియె. నాకు బహుధనంబును పెక్కు మణులుం గలవు. వాని
నెల్లఁ బణముగా నుంచెద. ఆట గెలిచి గ్రహింపుము. ఇందు నాకించుకయైన
మచ్చరంబు లే దనిపలికి వానినెల్ల నొడ్డుటయు శకుని యభిమతము లయినసా
రెల గ్రహించి వంచనాపాటవంబున ధర్మరాజును గెలిచి యిఁక దేని నొడ్డెద
వనిన నతఁ డిట్లనియె. శకునీ! కపటమునఁగాదె నను గెలిచితివి. ఈతూరి
మఱల నాడుము, నిష్కసహస్రపరిపూర్ణము లయినయనేకసువర్ణభాండముల

నొడ్డెద నని వెండియు నాడం దొడంగుటయు నికృతికౌశలంబున శకుని యతని
గెలిచి నే జయించితింగదా యని తెగంబాఱి పలికె. వెండియు యుధిష్ఠిరుండు
వ్యాఘ్రచర్మావృతంబు గింకిణీజాలమండితంబు మేఘగంభీరనినదంబు కైరవ సవ
ర్ణంబు లైన యెనిమిదియుత్తమాశ్వములం బూన్చినదియు నగుదివ్యరథంబును,
దివ్యమాల్యాభరణచందనాద్యలంకృతలు చతుష్షష్టికళావిశారదలు స్నాతకవ్ర
తులయు దేవతలయు సన్నిధానంబున నిజనిదేశమున నృత్తగీతాది వినోదములం
జూపునట్టి లక్షదాసికలను, మేధావులు ప్రాజ్ఞులు దాంతులు తరుణులు దివ్యాలం
కారవిలసితులు రేలుంబవళ్లు నతిథిభోజనముల నరసియుండువారు నగులక్ష దా
సులను, స్వర్ణాభరణభూషితంబులు దృఢదంతములు రాజయోగ్యములు పర్వత
సమములు నగు నెనిమిదివేలధేనుంగులను, నన్నిరథంబులను, నొక్కొకమాస
మునకు సహస్రమునకుం దక్కువగానిజీతముల ననుభవించు నుత్తమరథికులను,
గంధర్వముఖ్యుం డగుచిత్రరథుండు సవ్యసాచికిం బ్రీతిమై నిచ్చినతిత్తిరికల్మాషంబు
లయినయేనూఱుగంధర్వహయంబులను,వివిధానేకాయుతరథంబులను,నొక్కొ
కవర్ణంబుల నేర్చి యుంచినక్షీరశాలితండులభోజనము లయినయఱువదివేలయు
త్తమాశ్వంబులను, దామ్రలోహపరివృతంబు లగునన్నూఱునిధులను, నైదు
ద్రోణములబంగారు గలయొకయుత్తమనిధిని నొక్కొకమాటున నొక్కొకయె
డ్డుగా నొడ్డుచుండ శకుని ధర్మనందనుం గపటమున గెలిచి వాని నెల్లం గొనుచుండె.

ఇట్లు సర్వస్వాపహారియై యతిఘోరం బయినజూదంబు ప్రవర్తింపు
చుండ విదురుండు ధృతరాష్ట్రుం జూచి మహారాజా! మావచనము లన్నియు
నాసన్నమరణునకు మందువలె నీకు రుచింపవయ్యె. ఈదుర్యోధనుండు భారత
కులపాంసనుండు. ఈపాపాత్ముండు పుట్టినంతన విస్వరంబుగ నక్కవలె నఱచె.
దుర్యోధనరూపంబున సకలదుర్నిమిత్తమూలంబై యింట నున్న నక్క నెఱుం
గవు. వీనిపూనికి యున్నతదేశమున నున్న తేనియం గొని తెచ్చువానిరీతిం గన్ప
ట్టెడి. ఆమధులుబ్ధుండు తెంపుమై నున్నతస్థానముం జేరి తేనియం గొనినం గొ
నును. కాకున్నం గ్రిందంబడి పలుతునియలై రూపఱును. అవ్విధమునం జూదమున
బాండవులసంపద గ్రహింపం దలంచుంగాని యీఖలుండు దానం బొసంగుచేటుల
నెఱుంగండు. యాదవాంధకవృష్ణి భోజులలోనం గంసుండు కులమునకుం జేటుం
దెచ్చుచుండ వా రందఱుం గృష్ణున కెఱింగించి యాదుర్జను రూపుమాపిరి.
నీవును గులవృద్ధిం గోరి దుర్యోధను వధింప నర్జునున కనుజ్ఞ యిమ్ము. ఒకనిచే
నొకకులమునకుం గీడు మూడునేని వాని, నొకకులంబున నూరికెల్లం జేటువా
టిల్లునేడ నాకులంబును, నొకగ్రామమున దేశమునకెల్ల ననర్థ మగునేని యా
గ్రామంబును, నాత్మనిమిత్తంబునం బుడమికి దొసంగులు పొసంగునేడం దన్నుం

ద్యజించుట నీతి యని శుక్రుఁడు వివరించె. కులపాంసనుఁ డైనదుర్యోధను వధించి కులమెల్లఁ గాచికొనుము. కాకస్సృగాలప్రాయుఁ డైనవీని విడనాడి సింహశార్దూలసము లగుపాండవులఁ గొనుము. మున్నొకమూఢనృపాలుఁడు దనయింటఁ బ్రతిదినంబు మహిమాతిశయంబున బంగారు నుమియుచున్న పక్షులఁ గొన్నింటింగాంచి వానియుదరమున నుండుసువర్ణమంతయు నొక్కతూరిగ గ్రహింపఁ దలఁచి వానిం జావ నడిచి వానితోడం బ్రతిదినంబు నిష్ఠీవనమున వచ్చుధనమునుం గోల్పోయె. ఇక్కరణి నీవుం బాండవధన మపహరింపఁ గోరి వారి నలిగించుట మీ కెంతయేఁ గీడునకు మూలము? నామాటలు విని వారి కగ్గు చేయకుము. పిదపఁ బశ్చాత్తాపంబు నిరర్థకము. పూవులఁ దేనెగ్రహించు తేఁటి తెఱంగునఁ బాండవులసంపదగ్రహింప నిచ్చయేని వారి నడిగి మెల్లన యభిమతంబుల సంపాదించుకొనుము. మాలాకారుఁడు గ్రమాకులకుఁ జేటువాటిల్లఁ కుండఁ బూవులఁ గోఁతఁ దెలియమె? ఇదినీతిగాని యంగారకారుఁడు పుష్పితఫలితవృక్షముల దహించుమాడ్కిఁ బాండుసుతుల కత్యంతద్రోహంబుఁ దలఁపరాదు. దాన నీపుత్రమిత్రబాంధవాదులు గ్రమగ్గెదరు. పాండురాజపుత్రులు నిక్కమ యలిగి పోరికిఁ గట్టాయితం బయి నిలిచిరా సురగణసమేతుఁ డైన యింద్రుఁడును వారి నెదిరింపఁ జాలఁడు. జూదమున భేదమును, దానఁ గలహము నగు ననియు దుర్యోధనాపరాధంబునఁ బ్రశస్తిఁగాంచినప్రదీపశంతను బాహ్లికాదులకులంబు కృచ్ఛ్రము నొందు. మదించి దరికూరాడుచున్న యెద్దు కొమ్మునుంబలె దుర్యోధనుఁడు మదమున రాజ్యక్షేమమునకు భంగమునొనర్చు. ఈయుక్కివుఁడు జూదమునఁ బాండుతనయుల జయించి సంపద సాధించువాఁడని నమ్మికమైఁ బ్రీతి నొందెదవు. ధర్మరాజు కోపానలంబు భీమార్జునయమవిక్రమంబున దరికొనునంత కందఱకుం గుశలంబ. అతఁ డలిగెనేని దీన నిశ్చయంబుగ మూలధ్వంస మగు. పార్వతీయునివలన శకుని జూదమున నికృతినెల్ల నేర్చికొనియె. ఇట్టికపటద్యూతమున వీరలగెల్చుట మహానర్థమూలము. లోకనింద్యము. ధర్మవిరుద్ధము. ఎల్లవారి నొక్కుమ్మడిగ నగ్నిం ద్రోయక కుశలంబున మనుఁ డనిన ధృతరాష్ట్రుఁడు వినియు వినని వానివిధమున నూరకుండె.

దుర్యోధనుఁ డంతట విదురుఁ జూచి నీ వెపుడు మమ్ము మూర్ఖు లని నిందింపుచుఁ బాండవుల కెల్లపుడుం బ్రియుఁడవై వారలఁ గొనియాడెదవు. ఇందువలన నీమదిం గలపక్షపాతము వ్యక్త మయ్యె. తొడపై నిడికొనినపాము పోలె నీవు మాయెడఁ గ్రౌర్యముఁ జూపెదవు. పిల్లిపగిదిఁ బోషించినవాండ్రఁ జెఱుపన తలఁతువు. పాపమునకు వెఱవవు. శత్రుల గెలిచి సంపదల సంపాదింపుచుండ మావిభవంబుఁ జూడ నోర్వక యీసునఁ బ్రల్లదంబు లాడెదవు.

శత్రువులప్రస్తావంబున వారలనే పొగడునతఁడును శత్రుఁ డనఁబడు. ఇట్లు చేయుచుండునీకు సిగ్గు లేదె! ఇఁకనైన మమ్మవమానింప నీకుఁ జనదు. ఇంతటనైనం బెద్దల సేవించి బుద్ధి నేర్చికొనుము. కీర్తిఁ గాపాడుకొనుము. శత్రుకార్యముల వ్యాపింపకుము. నేనే సకలకార్యములఁ జేయుదునని పొంతరింపకుము. సభలో నోరికి వచ్చినట్లు ప్రేలక మిన్నకుండుము. నీ హితోపదేశము చాలు. ని న్నడుగలేదు. నీ వుపదేశింపకున్న మాకు మేలు కలిమి నిక్కము. ఓర్చినవా రనిపలుమాఱులు దిట్టకుము. నీయుపదేశము విన నొక్కఁడును లేకున్న మఱియొక్కఁడుం గానేరడు. సకలజనజననాదికారణభూతుఁ డైనయంతర్యామిపురుషునిశాసనమునఁ బ్రాణులు శుభాశుభఫలములఁ బొరయుదురు. బుద్ధిబలము గలయతఁడు తలచేఁ గొండనైనఁ బగులఁ గొట్టఁ గలఁడు. బలవిశేషమున శాసించువానికి శత్రువులును విధేయు లయ్యెదరు. మిత్రత్వంబుఁ జెందినపూర్వశత్రువు నుపేక్షింపఁదగుఁగాని సహజశత్రువుల నుపేక్షింపఁబోలదు. అగ్ని హోత్రముఁ బ్రజ్వరిల్లఁజేసి చెంగట మెలంగువాఁ డలమిఁ బడయఁగలఁడె. అట్లపోలె పరపక్షపాతి యగుశత్రు నుపేక్షింపఁ దగదు. నీకు మే మెంత మేలు చేయుచుండినను మా యెడనప్రియుఁడవు. ఇచట నుండఁదగవు. ఇచ్చవైఁ బొమ్ము. అతిలాలితయయ్యుఁ జెడిపె పురుషునిం ద్యజించు ననిన విదురుఁ డిట్లనియె. దుర్యోధనా! యిట్టివారి చెలిమి లెస్సగ నిరూపింపుము. రాజులచిత్తముల నమ్మరాదు. మంచిమాటల నూఱడించుచునె రోఁకళ్లఁ గొట్టింతురు. మఱియు నీవు పండితమ్మన్యుఁడవై నన్ను మూర్ఖుఁగాఁదలఁతువు. ముందుగఁ గపటసఖ్యము చేసి పిదప దూఱునతఁడే మూర్ఖుఁడు. అట్టి మూర్ఖునిబుద్ధి శ్రోత్రియగృహంబునఁ జెడిపెయుంబోలె లగ్గొడఁగూర్పదు. జవరాలి కఱువ దేఁడులముదుకనివిధంబున నీమూర్ఖబుద్ధి భరతపుంగవునకు నిక్కంబుగ రుచింపదు. ప్రియముఁ గోరెదవేని సర్వకార్యముల హితాహితంబులను స్త్రీజడాదివివేకశూన్యుల నడుగుము. అందఱుం బ్రియవచనముల బోధింత్రుకాని యప్రియంబయ్యు హితమగుదానిం జెప్పరు. అట్టివచనముల వినువారునుం దొరకొనుట యరిది. ధర్మపరుఁ డైన యుత్తముఁడు రాజునకుఁ బ్రియాప్రియంబులవిడిచి యప్రియంబులయ్యు హితములుగ నుండువానిన బోధించును. ఆహితబోధము తోడ్పాటు సూప నతఁడు శుభములఁ బడయును. వ్యాధులు లేకున్న మనోవికారంబునఁ బొడమి వేఁడిమి మెఱయవాఁడిమి నెఱయఁ గీర్తిపోఁడిమి యడఁగఁ బరుషమై దుర్గంధనిందితం బైనక్రోధరసంబుఁ బెద్దలు డిగ్గఁ ద్రావి శాంతులై యెలమి మిగుల వెలయుదురు. నీవును దుర్మార్గమునంబోవక క్రోధమడంచి యుక్తాయుక్తంబులఁ బరికింపుము. నేనెల్లపుడుం బుత్ర మిత్ర బాంధవాదిసకలజనసమేతుఁ డైనధృతరాష్ట్రునకు య

శోధనములఁ గోరుచుండు. నామనోనిర్ణయం బిది. ఇఁక నెట్టులైనం దలంచుము. నీకు నమస్కారము. బ్రాహ్మణులు ప్రసన్నులయి నాకు మేలుఁ గూర్తురు గాక. క్రోధవీక్షణంబుననే దహింప నోపు మహాత్ముల నలిగింవరా దని చెప్పితి నని విదురుఁ డూరకుండె.

అంత శకుని ధర్మరాజుఁ జూచి ధనమెల్ల నోడితి వింక దేని నొడ్డెదవని యడుగ ధర్మరా జయుతప్రయుత పరార్థాది మహాసంఖ్యాకం బయినధనసంచయంబును, గవాశ్వఖరోష్ట్రాదిసందోహంబును, బ్రాహ్మణజీవనంబులుదక్కఁ దక్కటిభూమండలం బంతయును, బ్రాహ్మణేతరు లయిన సకలజనులను, వివిధాభరణభూషితు లగురాజపుత్రులను నొక్కొకమాటున నొక్కొకయొడ్డుగా నొడ్డి యాడఁగ శకుని నికృతిచే నతని నోడించి వెండియు సారెలు ముందఱ వైచి యింక నేమి యొడ్డెద వనియె. అట యుధిష్ఠిరుఁడు ధర్మజ్ఞుఁ డనఁ బేరుఁ గాంచినసహదేవుని నతిసుందరమూర్తి యగునకులుని నొక్కొకయొడ్డుగానొడ్డి యాడె. శకునియుఁ గైతవంబున గెలిచి ధర్మజు నుద్దేశించి నీకుఁ బ్రియు లగు మాద్రీపుత్రుల గెలిచితి నింక నీ కధికు లగుభీమార్జును లున్నవారు. వారి నొడ్డు మనుటయుఁ బాండవజ్యేష్ఠుఁడు శకునీ! నీతిఁ దెలియక యధర్మమేల పలికెదవు? మాలో భేద మేల చేయఁ దలఁతు వనిన శకుని ధర్మపుత్రా! మదించినవాఁడు కన్ను దెలియక గర్తమునను బ్రమోదుననుం బడును. జూదరు లున్మాదంబున నొనరించుప్రలాపములు స్వప్నముననైన లేఁతివారు నుడువరు. నీవు జ్యేష్ఠుఁడవు. శ్రేష్ఠుఁడవు. నమస్కార మింక నాడు మనిన యుధిష్ఠిరుఁ డతని నిర్దేశించి నావపోలె మమ్మాపత్సాగరంబు దాటించినమహావీర్యు శత్రుజయు నర్జును నొడ్డెద నాడు మనియె. శకుని యాయాటనుం గెలిచి సారెలు ముందఱ వైవఁ గౌంతేయాగ్రజుఁడు మహాబలపరాక్రముఁడు సింహస్కంధుఁడు నగుభీమసేను నొడ్డిన శకుని యాతనిం గెలిచి ధర్మరాజా! ధనముం దమ్ములనుం గోల్పడితి వింక దేనినొడ్డుదు వని యడిగె. ధర్మరాజు మిగిలియున్న నన్ను నొడ్డి యాడి యోడిన మీకుఁ బనులఁ జేసెద నని యాత్మపణంబుగా నాడఁ దొరఁకొనియె. అట్టియెడ శకుని ధర్మపుత్రా! ధనము మిగిలియుండఁ ద న్నొడ్డికోలు పోలదు. భవద్ధనము ద్రుపదునిపుత్రి గలదు. దాని నొడ్డుగా నొడ్డి యాడు మనవుడు పాండురాజ నందనుఁడు కటకటా! సకలసుగుణరాశి సౌందర్యవైభవతులితలక్ష్మియు నగుద్రుపదపుత్రి నొడ్డుగాఁగ నిప్పు డొడ్డవలసె దాని నొడ్డువాఁడ ననుచు నోర్పుతోడ నొడ్డి యాడం దొడంగె. అట్టియెడ నచ్చటఁ బెద్ద లందఱు హా! లోకనిందితంబు లౌకార్యములఁ జేసి రనుచు ధార్తరాష్ట్రులను నెడంద దూరిరి. మఱి కృపుఁడు ద్రోణుఁడు భీష్ముఁడుం దొట్టి

వార లెద్ది దోఁపకున్న వనరుచుండిరి. విదురుఁడు నిశ్చేతనుఁడై పాముపోలె బుసవెట్టుచుఁ దలవాంచి యూరకుండె. ధృతరాష్ట్రుఁడు తమవారు గెలిచి రని సంతుష్టుండై జేనిం గెలిచితిరని పలుమాఱు లడుగుచుండె. కర్ణ దుశ్శాసనా దులెల్లఁ బరమానందసాంద్రులైరి. తక్కుంగలసభ్యులు గన్నీరు నించుచుండిరి. శకుని యాయాటను నుక్కివంబున గెలిచి సారెలు ముందఱ వైచి యింక నేమి యొడ్డెద వనియడిగె. అట దుర్యోధనుఁ డత్యంతసంతుష్టుఁడై విదురుం బిలిచి విదురా! పాండవప్రియపత్ని యగుపాంచాలిం దోడ్తెమ్ము. ఇట గృహ సమ్మా ర్జనంబుఁ జేయవలయును. ఇఁక నది యంతఃపురంబు వెడలి పరిచారికలతోడ నుండవలయు ననిన విదురుఁడు కోపాటోపదీపితుఁడై వాని కిట్లనియె. మూ ర్ఖా! పలుకరానిపలుకుల నోరికి వచ్చినట్లెల్లఁ బ్రేలెదవు. కాలపాశబద్ధుఁడవై యుచితము నెఱుంగవు. గర్తమునం బడియెదవు. తుచ్ఛమృగంబగునీవు క్రో ల్పులు లగు పాండవులం గనలింతువు. కోపపూర్ణములు దుస్సహవిషములు నగుపాముల నలిగించుటయ కాదె పాండవులం గనలించుట. ఎన్ని చెప్పిన మొ అకడము మానవుగదా. నిక్కంబ దీనం గీడొదవు. పాంచాలి నీకు దాసి గాఁ దగునె? అనీశ్వరుఁడై ధర్మరాజుపత్ని నొడ్డె నని తలఁచెద. జూదమున నీకు గలుగు ఫలము వేణుఫలంబునుం బోలె సహమూలంబుగ వినాశంబుఁ జేయు ననిపలికి యందఱిదెస మొగంబై యీదుర్యోధనునకుఁ జేటుకాలము వచ్చె. హితము వినఁడు. పరమర్మముల భేదించుఘోరవచనములఁ బలుకరాదు. దా నంజేసి నరకం బగు ననిపెద్దలు వచింతురు. పాండవులు వనచరు లైన గృహ స్థులైనఁ దపస్వులైనఁ బ్రల్లదము లాడుదురే? వీనివంటికుక్కలు యోగ్యులం గాంచి మొఱుఁగుదురు. వీఁడు ఘోరనరకప్రాప్తుఁ డగు దుశ్శాసనాదులు వీ నిగతిం బొందుదురు. దుర్యోధనుఁడు మూఢుఁ డవుట నామాట లాలింపఁడు. అధర్మబాహుళ్యమునఁ గౌరవులకు వినాశ మాసన్నమయ్యె. సారకాయలు నీట మునిఁగె. ఱాలు దేలె. ఓడలు నీరిలోనం దబ్బిబ్బులయ్యె. వీఁడు నిమి త్తంబుగా ధర్మవ్యత్యయము పెరిగె. వీనికి నానాఁట లోభ మధిక మయ్యె న నిన దుర్యోధనుఁడు విదురుం దూలనాడి ప్రాతికామి యనువానిం బిలిచి సూ తపుత్రా! విదురుఁ డెప్పుఁడు నాతోడ వాదులాడు. మావృద్ధిఁగోరఁడు. నీవు వేగమ చని ద్రౌపదిని దోడ్తెమ్ము. పాండవులకు వెఱవ వలదని నియోగించె.

(ప్రాతికామి ద్రౌపదిందోడ్తేరనరుగుట)

ప్రాతికామియు దుర్యోధనవచనప్రకారంబున సింహగుహ కరుగుకుక్క వలెఁ బాండవనివాసమునఁ జేరి ద్రౌపదింగాంచి పాంచాలీ! యుధిష్ఠిరుఁడు జూ దమున నిన్ను దుర్యోధనునకోటువడియె. కావున నిఁక వరవుడము సేఁతకుఁగా

దుర్యోధనుపంపు విని ధృతరాష్ట్రగృహమునకుఁజనియె. ద్రౌపది యాపరుషముల విని ప్రాతికామీ! రాజపుత్రుఁ డెవ్వఁడేనియు భార్యను బణముగ నొడ్డి జూద మాడునే? ద్యూతనష్టవివేకుఁ డయ్యెఁ గాఁబోలు. తెలియఁబలుకు మనినఁ బ్రాతికామి పాంచాలీ! పాండవజ్యేష్ఠుఁడు సకలధనమును దమ్ములను నోటువడి మఱి వేఱొక్కపణంబును లేకునికింజేసి తన్ను నిన్ను నోటువడె ననియె. అట ద్రౌపది ప్రాతికామిం బిలిచి సూతసుతా! సభకుఁ బోయి పాండవకితవుఁ జూచి మున్ను త న్నోటువడియెనో కాకున్న నన్నే యోటువడియెనో దీని నెఱిఁగిరమ్ము. అతనియభిప్రాయముఁ దెలిసి నే వత్తు ననినఁ బ్రాతికామి ద్యూతరంగమున కరిగి యుధిష్ఠిరుఁ జేరి నీవు మున్ను నిన్నే యోటువడితో ద్రౌపది నోటువడితో యీయర్థమున సందియము వాపు మనిన ధర్మరాజు చింతాశోకవ్యాకులమానసుఁడై యెద్దియుఁ దోఁచక యూరకయుండె. దుర్యోధనుఁడు ప్రాతికామిని బిలిచి ద్రౌపది యిటకు వచ్చి తనసందియ మడుగుఁగాక. ధర్మజుఁ డపుడు తనకుఁదోఁచినదాని నిరూపించు. వైళంబ దానిం దోడ్కొనిరమ్మని నియమింపఁగ వాఁడు పాండవధర్మపత్ని పాలికిఁ జని యాజ్ఞసేని! నీయడిగినసంశయము విచారించువారై సభాసదులు నిన్ను రాఁబంచిరి. రమ్ము. పాపబుద్ధి యగుదుర్యోధనునిమిత్తంబునఁ గురుకులక్షయం బయ్యెడి ననిన ద్రౌపది యిట్లనియె. ప్రాతికామీ! నే నటకు వచ్చుట ధర్మము గాదు. పెద్దలనాఁటఁగోలె లోకప్రసిద్ధం బైనకౌరవులధార్మికత్వముఁ జెఱుపఁ దగదు. సభ్యుల మదీయప్రశ్నము నడిగి రమ్ము. వారు విధించునట్ల చేయుదాన ననినఁ బ్రాతికామి సభకుఁ బోయి పాంచాలివచనముల వివరించిన నందఱు దుర్యోధను నిర్బంధమునకేమియుఁ జెప్పఁ జాలక తలలు వాంచిరి. ధర్మరాజు దుర్యోధను చెయ్వులనెఱింగి ద్రౌపదియొద్దకుఁ దగినదూతను బంపె. వాఁడుం బ్రాతికామితోడ నరిగి ద్రౌపదికి ధర్మరాజుమతముఁ దేటపఱిచె. పదపడి యేకవస్త్రయు రజస్వలయు మలినాంగియు నగుపాంచాలి ప్రాతికామివెంటన సభకు వచ్చి దవ్వు గలుగ ధృతరాష్ట్రునెదుట నిల్వఁగ సత్యధర్మనిరతు లగుపాండురాజసుతులు మహాత్ములయ్యు దైన్యవిషాదంబులు గదుర దేనిం జూడక యధోముఖులై యుండిరి. వారిదీనవృత్తి వగను దుర్యోధనుఁ డెఱిఁగి పెచ్చుపెరుగునెలమితోడఁ బ్రాతికామిఁ బిలిచి పాంచాలనరపతిదుహిత నిప్పు డిటకుఁ దోడితెమ్ము. కౌరవులు దానిప్రశ్నముల కుత్తరము లిత్తు రనిచెప్పె. ప్రాతికామి ద్రౌపదికోపమునకు వెఱచి సభ్యులారా! మానహీనుఁడనై ద్రౌపది కేమిచెప్పుదు ననుటయు దుర్యోధనుఁడు దుశ్శాసనుఁ బిలిచి ప్రాతికామి పిఱికితనంబున భీమునకు వెఱచెఁగాన నీవ యిటకు దాని నీడ్చుకొనిరమ్ము. మనకు లోఁగినపగవార లేమియుఁ

జేయ నేర రనియెను. దుస్ససేనుఁడు దుర్యోధనానుమతిం బోయి క్రోధరక్తాక్షుఁడై కొంకులేక పాంచాలి యిటరమ్ము. పాండునందనులు నిన్నోటువడిరి. సిగ్గు నొందనేల? కోరి దుర్యోధనుని జూడు. కౌరవులను బడయు మని నుడువుచు నాద్రుపదతనయను డాయఁ జన వానిదుర్వ్యవసాయమునకు వెఱచి వెలవెలనై చెన్నుదఱిగియున్న నెమ్మోము నఱచేతఁ గప్పుకొనుచు నప్పరమపతివ్రత గాంధారికడకుఁ బాఱిపోవుచుండె. కురుకులపాంసనుం డైన యాదుశ్శాసనుఁ డాసాధ్వి వెంటఁ దవిలి యింక నెటకుఁ బోయెద వని యదల్చి రాజసూయావభృథంబున మంత్రపూతంబు లగుదివ్యాపగాసలిలంబుల నభిషేకంబుఁ గాంచిన పెన్నెఱుల నొడిసి పట్టుకొని పాండవులఁ దిరస్కరింపుచు సభ కీడ్చె. ద్రుపదరాజతనయ దుశ్శాసనుం డీడ్వఁగఁ బెనుగాలిఁ దూలుకదళిరీతి గడగడవడఁకుచు జగద్రక్షకు లయిననాథులు గలిగియు ననాథపోలె వనటలపాలై యద్దురాత్ము నిర్దేశించి యోరీ మందమతీ! నే నిపుడు రజస్వల నేకవస్త్రను. సభకు నన్నిప్పుడు తోడ్కొని పోవం జన దని నతాంగియై మెల్లనం జెప్పికొనిన నప్పాపాత్ముం డామెమొఱ నాలింపక యాజ్ఞసేనీ! నీవు రజస్వలవైన నేమి? ఏకవస్త్ర వైన నేమి? వస్త్రహీనవైన నేమి? జూదమున నీమగఁడు నిన్నోటువడియె. మాకుదాసి వైతివి. నేఁడు మొదలుగఁ బరిచారికలతోడన నీవుండవలయు నని నిర్దయుండై సభామధ్యంబున కాకర్షించికొనివచ్చె. అపుడు వెండ్రుకలు ముడిపీడిజాఱఁ గట్టినపుట్టంబు సగముపీడ సిగ్గు గదురఁ గ్రోధానలసంతప్తయై యీసభ్యులు శాస్త్రములనెల్లఁ జదివి క్రియాకలాపముల ననుష్ఠించి యింద్రునివలె విరాజిల్లుచున్నారు. గురుతుల్యు లగువీరియెదుట నిలువఁ దగదు. క్రూరుఁడా! పాలుపతనమునన న్నవమానింపకుము. ఇంద్రాదులు బాసటయైన నీకొఱగాముల రాజపుత్రులు సహింపరు. ధర్మనిరతుఁ డైనధర్మనందనుగుణములనెల్ల నెఱిఁగినదాననగుటంజేసి యమ్మహాత్ముపైఁ బరమాణుమాత్రం బైనదోషముఁ దలఁపను. ధర్మసూక్ష్మము నెఱుంగరాదు. ఇట్లు నన్ను నీ వీడ్చుచుండఁగ నందఱు నీమతమునే యనుసరించిరిగాని యొక్కఁడైన నిది తగ దనఁడయ్యె. లోకవిశ్రుతం బైన భారతులధర్మము దీన నశించుటంజేసి యీవంశము నింద్య మయ్యె. క్షత్రధర్మంబు పాలిసె: కావున్న నీయన్యాయంబుఁ జూచి యందఱు నూరకుందు రే? ద్రోణభీష్మవిదురధృతరాష్ట్రాదులును దీని వారింపఁ జాలరు కాఁబోలు. కాదేని ధర్మలోపముఁ దెలియరొక్కొ యనుచు దైన్యంబు వెల్లివిరియఁ గోపపరీతు లగుపాండుపుత్రులఁ దీక్ష్ణకటాక్షవీక్షణంబులఁ జుఱచుఱం జూచుచుండె. పాండవులు సర్వస్వంబు పోయిననొక్కతీరున నుండిరిగాని లజ్జాకోప ప్రేరితం బైన ద్రౌపదిచూపున కెంతయుం గుందుచుండిరి. వారిదైన్యగతికి సంతసిల్లి దుశ్శా

సనుఁడు నవ్వుచు ద్రౌపదిని దాసీ! యనిపిలువఁగఁ గర్ణశకునిదుర్యోధనులు సంతోషింపుచు నాదుశ్శాసనుం బ్రశంసించిరి. తక్కుంగలసభికులు చాల వగచుచుండిరి. భీష్ముఁ డపుడు ద్రౌపదింజూచి యమ్మా! ధర్మసూక్ష్మము దురూహము. పాండవులకెల్ల సాధారణధనంబ వైననిన్ను ధర్మసుతుఁ డొడ్డరాదు. స్త్రీలకు భర్తృపరతంత్రత సహజము. ధర్మరాజు సర్వసంపత్సమృద్ధం బైనభూమండలం బెల్లనైన విడుచుఁగాని ధర్మమొకప్పుడైన విడువఁడు. అమ్మహాత్ముఁడు నిన్నొడ్డి యోటువడియె. కావున నిందలిగుణదోషముల విచారింపనేరను. జూదమున నేర్పరి యగుశకుని కోడియుధర్మజుఁడు నీయెడ వంచనఁ దలంచునే? యనిన ద్రౌపది యిట్లనియె. దుష్టులు శఠులు నగుజూదరులు పిలువ ధర్మరాజు ప్రీతి లేకున్నను గపటద్యూతంబునం బ్రవర్తించి యందఱ నోటువడుటంజేసి వేఱొక యొడ్డులేమి నన్నునొడ్డెఁగాఁబోలు. కొడుకులకుఁ గోడండ్రకు నియామకు లగు నీకురువృద్ధులు నాప్రశ్నమున కుత్తరం బిచ్చునది యనిచెప్పి యేడ్చుచున్నంత దుశ్శాసనుఁడు కొన్నిప్రల్లదము లాడుటయు వృకోదరుఁడు యుధిష్ఠిరున కిట్లనియె. జూదరులు తమవనితలు కులటలైనను వారలఁ బణముగా నొడ్డక దయఁ జూతురు. అట్లుండఁ బరమపతివ్రత యగుపాంచాలిం బణముగా నొడ్డుట యెంతయు నధర్మము. సకలధనకనకవాహనాదులకును మాకును నీ వధీశ్వరుఁడవు కావున సర్వస్వమ్ము మమ్ము నొడ్డుట తగుఁ గాని యీ దురాత్ములకు దాసిగాఁ బాంచాలి నొడ్డుట యెంతయు నింద్యము. నీబాహువుల నిపుడ కాల్చెద నని చెప్పి సహదేవుదెస మొగంబై వేగంబ యగ్నిం దెమ్మనుటయు నర్జునుఁ డతని కిట్లనియె. భీమసేనా! మున్నెన్నఁడైన నాడనిపరుషముల నిప్పు డేల యాడెదవు. ఈకితవులనిమిత్తంబున నీవుసుధర్మగౌరవంబుఁ గోల్పోయితివి కాఁబోలు. కామమున దేనిం జేయరాదు. ధర్మమునే యాచరింపుము. పరమధార్మికుఁ డైనయన్నను దూఱఁ దగునే! ద్యూతమునకుఁ బిలువఁగ క్షత్త్రవ్రతపరుఁ డైన ధర్మరాజు పెఱవారికోరిక నెఱవేఱ నాయాట నాడందొడంగె. ఇది కీర్తికరంబ. ఇందు ధర్మరాజు తప్పేమి? యనిబోధించి యతని శాంతచిత్తుం జేసె.

అట ధృతరాష్ట్రపుత్త్రుఁ డైనవికర్ణుఁడు పాండవుల విషాదంబును ద్రౌపదిక్లేశంబును సభ్యులయూరకునికిం జూచి యన్యాయంబునకు వెఱచి యిట్లనియె. సభాసదులారా! యాజ్ఞసేనిప్రశ్నములకు సదుత్తరము వివరింపుఁడు. గుణదోషముల విచారింపకున్న సభ్యులు నరకమునఁ బడుదురు. కురువృద్ధులగు భీష్మధృతరాష్ట్రులును మహామతి యగువిదురుడునుం గురుకులాచార్యులగుద్రోణకృపులునుం దక్కటిరాజులు నీపాంచాలీప్రశ్నమున కేల యుత్తరము నుడువరు? కామక్రోధముల విడనాడి పక్షపాతములేక న్యాయముఁ బలుకునది

యని పెద్దయెలుంగునఁ బలుమాఱులు పలికి యందఱు నూరకుండుటకుఁ జింతి ల్లి నిట్టూర్పులు నిగుడింపుచుఁ జేతులఁ బిసికికొనుచుఁ గొంతవడికి నర్థవఱిఁ గల యం జూచి యయ్యా! మీ రుత్తర మిచ్చిన నిండు. లేకున్న నూరకుండుఁడు. నాకుఁ దోఁచినన్యాయముఁ జెప్పెద. వినుఁడు: వేఁట, జూదము, పాన, మ త్యంతస్త్రీలోలత్వంబు ననునాలుగువ్యసనములు రాజులకుఁ గలుగు. వీనియం దాసక్తిగలయతఁడు ధర్మము విడుచు. అతఁ డొనరించినపనుల లోకులు మె చ్చరుగదా. యుధిష్ఠిరుఁడును ద్యూతవ్యసనాసక్తుండై తమ్ముల నోటువడి త న్నొడ్డి పిదప నిప్పాంచాలిం గూడ నొడ్డె. మఱియు నీసాధ్వి పాండవులకెల్ల సాధారణధనము. దీనిఁ నితఁ డొడ్డరాదు. ఇవి యన్నియుఁ బరిశీలించి ద్రౌ పది ద్యూతనిర్జితకా దనినిర్ణయించెద. వెండియు నీపతివ్రత నిటకుఁ దోడ్తెచ్చు ట యన్యాయం బనిచెప్పుటయు సభ్యులు వికర్ణుం గొనియాడిరి. శకునిని దూ రిరి. అంతఁ గొంతవడికి రాధేయుఁడు క్రోధమూర్ఛితుండై చేయి పట్టుకొని వికర్ణా! యిందు వైకృతంబులు పెక్కు గలవు. వానిం జెఱుప నరణియందు వహ్నిచాడ్పున జనించితివా. సభ్యులెల్ల ద్రౌపది ధర్మజిత యనితలఁచి యూ రకున్నవారు. ధర్మజుఁడు తనసర్వస్వము నోటువడినం ద్రౌపదియు నందుఁ జే రినదియకదా. పాండవులు నిందుల కంగీకరించియున్నవారు. పెద్దలెల్ల నూర కుండ నీవు నొకపెద్దవలె ధర్మము నిరూపింపఁబూని యిట్లు పల్కెదవు. పరిశీ లింప నిందుకు బాల్యదోషముదప్ప వేఱొకందు కారణము గన్పట్టదు. ఏక వస్త్ర యగుదీని సభకుదెచ్చుట యన్యాయం బంటివి. అందుకు జెప్పెద విను ము. లోకమున మగువకు దేవవిహితుఁ డైనమగఁ డొక్కఁడే. ఇది యనేకు లకు భార్య యగుటంజేసి కులటనాఁబడు. ఇట్టిదీని సభకుఁ దెచ్చుట చిత్రము గాదు. ఇది యేకవస్త్రయైన నేమి? వివస్త్రయైన నేమి! వీరందఱుం జూదమున జితు లైరని వికర్ణుని వారించి దుశ్శాసనున కభిముఖుఁడై దుశ్శాసనా! వికర్ణుఁ డు పండితమ్మన్యత్వమున నిచ్చకు వచ్చినట్లు ప్రేలుచున్నవాఁడు. నీవు పాండ వులయు ద్రౌపదియు వస్త్రముల నపనయింపు మనినం బాండుపుత్రులు తమత మయుత్తరీయములఁ దీసి యవలఁ బెట్టి కూర్చుండిరి.

(దుశ్శాసనుఁడు ద్రౌపదివస్త్రము లొల్చుట)

రాధేయునివచనంబు విని దుర్యోధనానుమతంబున దుశ్శాసనుండు ద్రౌపదికట్టినపుట్టంబు సభలోన నొలువఁ దొడంగ యాజ్ఞసేని గత్యంతరవిహీ నయై గోవిందా! ద్వారకావాసీ! గోపీవల్లభా! రమాపతీ! జగన్నాథా! భక్త వత్సలా! దీనత్రాణపరాయణా! యోగీశ్వరేశ్వరా! శ్రీకృష్ణా! యీసభామధ్య మున నిట్టిపరిభవము; జెందుచున్నన న్నేల యెఱుంగవు. ఆపత్సముద్రమున

మునిఁగిన నన్నుద్ధరించి రక్షింపుము. నీవుదక్క మఱియొక్క దిక్కు గాన నని నుడువుచు సర్వలోకేశ్వరుం డైనభగవంతుని ధ్యానించుచు మొగముఁ గప్పుచుఁ గన్నీరు నించుచుఁ బలవించుచుండె. భక్తవత్సలుఁ డైనభగవంతుఁడు యాజ్ఞసేనియేడ్పు నాకర్ణించి సంభ్రమంబున శయ్యాసనముల దిగవిడిచి రుక్మిణికైనం జెప్పక ద్రౌపదికడకు వచ్చి యంతర్హితుండై మానరక్షణంబుగా ననేకపరిధానంబు లద్దేవిగాత్రంబున నావరింపుచుండె. దుశ్శాసనుండు పాంచాలి వస్త్రమున నపనయింపఁగ నట్టివ యనేకవస్త్రము లగపడుచుండ వానినెల్ల నొలుచుచు నవి యప్పటప్పటికిఁ బెచ్చుపెరిగి పర్వతోపమానంబు లగుటయు నప్పటికిం బరిధానంబు ద్రౌపదికటితటంబున నగపడుటయుం గాంచి సిగ్గఱి యూరకుండె. సభాసదు లందఱు నందుల కాశ్చర్య మొంది పాంచాలిపాతివ్రత్యంబుఁ బ్రశంసింపుచు దుశ్శాసనుఁ దూలనాడిరి. అయ్యవసరంబున భీమసేనుఁడు క్రోధావేగంబున నవుడు గఱచి పాణితలంబులఁ జఱచి పేరెలుం గత్తి సభ్యులారా! ము న్నెన్నఁడు నెవ్వరుం జేయనిదియు నిఁకనుం జేయబోవనిదియు నగునాప్రతిజ్ఞ వినుఁడు. ఘోరరణంబున భారతకులపాంసనుఁ డగుదుశ్శాసనుని ఱొమ్ము వ్రచ్చి తద్రుధిరంబుఁ ద్రావెద. కాకున్న బితృపితామహాదులగతికిఁ దప్పినవాఁడ నగుదునని ఘోరప్రతిజ్ఞఁ బూనె. దానివిని యందఱు భీముం గొనియాడి దుశ్శాసనుం దిట్టి యక్కటా! కౌరవ్యులు ద్రౌపదీప్రశ్నముల కుత్తరము లియ్యరైరిగదా యనివగచుచుండిరి. అట్టియెడ విదురుఁడు బాహువుల మీఁది కెత్తి యందఱ వారించి యిట్లనియె. ద్రౌపదీప్రశ్నమునకు సదుత్తరం బొసఁగుఁడు. కాదేని ధర్మహాని యగు. దీనుఁడు మండుచున్న యగ్నివలె సంరంభదీపితుండై సభను జేరెనేని సత్యధర్మముల శాంతిఁ బొందించుట సభ్యులకు ధర్మంబు. కామక్రోధవశు లగువారు దీనులప్రశ్నముల విరుద్ధముగ భావింతురు. వికర్ణుఁ డొక్కరుఁడే తనమదికిఁ దోఁచినట్లు సదుత్తరంబు వచించె. దీనులప్రశ్నముల విచారింపకున్న సభ్యు లనృత దోషంబునం దగ్ధంబును, విరుద్ధముగఁ జెప్పిన నసత్యదోషం బంతయుం బొరయుదురు. ఇందు కొకయితిహాసంబు గలదు.

తొల్లి ప్రహ్లాదుఁ డనుదైత్యపతికొడుకు విరోచనుఁడు, నంగిరసుఁ డను మునికొడుకు సుధన్వుఁడునుం గన్యానిమిత్తంబుగ నేన పెద్ద నేన పెద్ద యని తమప్రాణములఁ బందెముగా నొడ్డి వాదు లాడుచుఁ బ్రహ్లాదుకడకుఁ జనిరి. అందు సుధన్వుఁడు వివాదంబును బణబంధమునుం జెప్పి ప్రజ్వలితం బైనబ్రహ్మదండమువిధంబునఁ గోపదీపితుండై ప్రహ్లాదా! మాప్రశ్నమున ధర్మముఁ జెప్పుము. కాకున్న నీదుశిరంబు నూఱువ్రయ్యలుగ నింద్రుఁడు వజ్రాయుధమున వ్ర

చ్చు ననుటయుఁ బ్రహ్లాదుఁడు గాలికిఁ దూలు రావియాకు చందమునఁ జలింపుచుఁ గశ్యపునొద్ద కరిగి మహాత్మా! నీవు సకలధర్మజ్ఞుఁడ వని నిన్నడిగెద. సభ్యులు వివాదము విచారింపకున్న, నసత్యంబుగఁ జెప్పిన నేయే లోకములఁ బడయఁ గల రనినఁ గశ్యపుఁడు ప్రహ్లాదున కిట్లనియె. తెలిసియుఁ గామక్రోధభయాదులచే వివాదముల విచారింపనిసభ్యునిఁ, దప్పఁ జెప్పినసాక్షిని, వరుణపాశసహస్రంబు గట్టి యేఁటేఁట నొక్కటొకటిగాఁ బాయుచుండు. కావునఁ దెలిసినం దసత్యము నిరూపింపవలయు. అధర్మపీడితం బయినధర్మము విచారింపకున్నఁ దత్పాపమున నర్ధమును సభానాయకుఁడు,నాలవపాలు సభాసదులుఁ, జతుర్థాంశముఁ గర్తయుం బొందుదురు. లెస్సగఁ బరికించి నిందార్హుని నిందించిన సభానాయకుఁడును సభ్యులుం బాపంబుఁ బొరయరు. కర్త యొక్కఁడే తత్పాపం బెల్ల ననుభవించు. ధర్మవిరుద్ధముగఁ బలికిరేని తమవంశమునఁ బూర్వుల యేడుగురయు వెనుకటివారలయేడ్గురయు నిష్టాపూర్తాదిసత్కర్మఫలములఁ జెఱుతురు. ధనమెల్లఁ గోల్పడినయతండు, పుత్రశోకపీడితుఁడు, ఋణవంతుఁడు, స్వార్థభ్రష్టుఁడు, భర్తృవిహీన యగుమగువ, రాజబాధితుఁడు, పుత్రహీనుఁడు, పులిబారిం బడినయతండు, సవతిపోరునఁ గుందువనిత, సాక్షులమిథ్యావచనములఁ గీడుఁ బొరసినయతఁడును సమదుఃఖు లందురు. తప్పఁ బలికిన సాక్షియీదుఃఖములనెల్ల ననుభవించును. ప్రత్యక్షంబుగఁ జూచి చక్కగ విని లెస్సగఁ దదర్థము మఱువక మనస్సున నిల్పుకొని సాక్షి సత్యమే పలికి ధర్మార్థములఁ గొఱంత వొరయఁ డనివిని ప్రహ్లాదుఁడు తనకొడుకు విరోచనుఁ బిలిచి పుత్రా! నీకంటె సుధన్వుఁడు, నాకంటె నంగిరసుఁడు, నీతల్లికంటె సుధన్వునితల్లియు నుత్తములు. సుధన్వుఁడే నీప్రాణముల కధీశ్వరుఁ డనిన నమ్మునిసంతోషించి ప్రహ్లాదుధార్మికత్వంబు మెచ్చి విరోచనునకు దీర్ఘాయుష్యంబుఁ బ్రసాదించి చనియె. కావున సభాసదులారా! ద్రౌపదీప్రశ్నంబు లెస్సగ విచారింపుఁ డనిన విదురువచనము వినియు నూరకయుండిరి.

అటఁ గర్ణుఁడు దుశ్శాసనుం బిలిచి దాసి యగుద్రౌపది నిటకుఁ బిలిచికొనిర మ్మనిన నాఖలుఁ డాసతిరత్నంబును సభామధ్యమున నీడ్చుచుండ వడఁకుచు ద్రౌపదిలజ్జితయై యేడ్చుచు నోదుర్మతీ! దుశ్శాసనా! కొంతవడి మిన్నకుండు మనిచెప్పి యెల్లవారలఁ గలయం జూచి కౌరవులకెల్ల మ్రొక్కెద. ఇప్పాపాత్ముఁ డీడ్చుటం జేసి విహ్వలనైతి. ఆనాఁటిస్వయంవరంబున రాజులఁ జూచిననాఁడు నేఁ డివ్విధంబున నీసభలోన రాజలోకంబు నాలోకింపవలసె. నాఁటంగోలె సూర్యుఁడైన ననుఁ జూచియుండఁడు. వాయువు స్పృశించిన నొర్వని మహాత్ములు పాండురాజనందనులు నేఁ డీదుర్జనుఁ డీడ్వఁగఁ జూచి సైఁచి యు

న్నవారు. కౌరవులెల్ల దుహితృతుల్యయగు గోడలు నగునే నిప్పాట భయ పాటుం బొంద నోర్చియున్నవారు. కాలవ్యతిక్రమంబు వాటిల్లె ననితలంతు. పతివ్రత నగునే నిట్టు లేడ్చుటకంటె వేఱొకవగ గలదే? ధర్మమున నడచుప డంతిని బెద్దలు సభకు రప్పింపరనివినియుందు. హా! కౌరవులక్షత్రధర్మం బంతయు నిపుడ పాడయ్యె. పాండవులకు భార్యనై ధృష్టద్యుమ్నునకుం జెలియలనై గో విందునకుం జెలినై ధర్మరాజునకుం బట్టంపుదేవినయ్యును నేను సభ కరుదేరవ లసె. వరవుడములం జేయవలయునో వలదో నాకు వివరింపుఁడు. క్షుద్రుండై నయీదుశ్శాసనుఁడు గాఱియపెట్టుచున్న వాఁడు. ఇఁకఁ బెద్దయుంబ్రొద్దు సైప నోపను. మీవిధించినవిధంబున నడుతు నని సభామధ్యమున నాక్రోశింపు చుండె. అయ్యాక్రోశంబు విని భీష్ముఁడు కళ్యాణీ! ధర్మసూక్ష్మము దురవగాహ ము. నీప్రశ్నంబు నేను నిర్ణయింపనోపను. నిన్ను భంగపఱుచుటంజేసి యిద్దు రాత్ములు శీఘ్రంబ కులక్షయంబుఁ గాంతురు. ఇన్నిపాట్లు పడియు ధర్మమునే విచారింపుచునికి నీక తగు. ధర్మవిదు లైనద్రోణాదివృద్ధజనులును జీవచ్ఛవం బులపోలె మిగుల వగలఁ బొగులుచున్నవారు. సర్వధర్మవేది యగుధర్మరాజే నీప్రశ్నంబున కుత్తర మొసంగవలయు ననివచించె. నిర్భరశోకానలకీలాకలా పదందహ్యమాన యైనపాంచాలపుత్రిప్రశ్నమునకు రాజులెల్ల దుర్యోధనునకు వెఱచి యుత్తరము లీకుండుటయు దుర్యోధనుఁ డించుక నగుచు ద్రౌపదీ! నీ ప్రశ్నము భీమార్జుననకులసహదేవులు విచారించి నీకుఁగా ధార్మికవరుఁ డయి నధర్మసుతుఁ డనీశుఁడనియొండె నన్వృతపరుఁ డనియొండెఁ జెప్పిరయేని నీ దా స్యంబు తొలఁగు. ధర్మరాజు తానైన నీయర్థముఁ జెప్పఁగాక. సభ్యులందరు దుఃఖార్ణవమగ్నులై నీమగల దౌర్భాగ్యమునకుఁ జింతింపుచు నూరకున్నవా రనిన నెల్లవారు ధర్మజాదు లేమి చెప్పెదురొకో యని వారిమొగములఁ జూ చుచుండిరి. అంత వృకోదరుఁడు చందనచర్చితం బైనధర్మరాజుచేయి పట్టుకొని యీతండు మాకు గురుఁడును బ్రభుఁడునుం గాఁడేని మే మీదుష్టుల దుశ్చేష్టి తంబుల నోర్చియుండము. మాప్రాణములకు నధీశ్వరుఁ డైనయిమ్మహాప్రభావుఁ డు మమ్మోటువడుటంజేసి మిన్నకుండవలసె. కాదేని పాంచాలి వెండ్రుకలఁ దాకినదురాత్ముఁడు నాచేఁ జావక భూమిం బ్రదుక నేర్చునే? ఇనుపగుదియలఁ బోలుమదీయభుజములకు లోఁగివచ్చినయింద్రుఁడైనం దప్పించుకొనిపోవఁ జా లఁడు. ధర్మపాశంబు నర్జుననిగ్రహంబును గౌరవంబును నుల్లంఘింప నేరకున్న వాఁడ. యుధిష్ఠిరుఁ డనుజ్ఞ నిచ్చిన సింహము క్షుద్రమృగంబులంబోలె దుష్టా త్మ లగుధార్తరాష్ట్రుల నఱచేతఁజాచి గీటడంతు ననిపలుకుచుఁ గోపానలజ్వా లల నంతట నిగుడింపుచుండ భీష్మద్రోణకృపవిదురు లిది కోపంబునకుఁ దఱిగా

దనిబోధించి శాంతచిత్తుం జేసిరి. పదపడి కర్ణుఁడు స్వామి నెల్లపుడు నిందింపుచు భీష్మద్రోణవిదురు లతనివృద్ధిఁ గోరువారిరీతిఁ బలుకుటంజేసి ధన్యులే. దాసుఁడు,పుత్రుఁ,డస్వతంత్ర యగుస్త్రీయు, ననుమువ్వు రధనులు. నిర్ధను లగు దాసులకుఁ బత్ని యైనపాంచాలి దాసధనంబువలె దుర్యోధనునిసొమ్ము. కావునఁ బాంచాలీ! రాజ పరివారంబునం జేరి నియమించినకార్యము సల్పుము. నేఁడుమొదలుగ నీ కధీశులు ధార్తరాష్ట్రులేకాని పాండవులు కారు. జూదమునఁ నోడనిమఱియొకశూరుఁ బతిఁగ వరియింపుము. నీపతు లెల్లరు నోడిరి. అర్జునుఁడు తనపౌరుషపరాక్రమంబులను జన్మప్రయోజనంబు నీక నేమిగ భావించునో యనిన విని భీమసేనుఁడు నిట్టూర్పుల నిగుడింపుచు ధర్మపాశంబుఁద్రెంపనేరక ధర్మరాజుం జూచి కర్ణునిపలుకులకుఁ గినుక వలదు. నీ వీకపట ద్యూతం బాడుటంగాదె మన కీదాస్యంబును శత్రుజనపరిహాసంబునుం బడయవలసె ననిన భీముబలుకులవిని దుర్యోధనుండు మిన్నకున్న ధర్మనందనుం గాంచి నీతమ్ములు భవదనుజ్ఞకు లోఁగియున్నవారు. ద్రౌపదీప్రశ్నమున కుత్తరం బిష్టని చెప్పి యయ్యుధిష్ఠిరుదెస మొగము నుత్తరీయమున మఱుఁగుఁజేసికొని యైశ్వర్యమదమోహితుండై నవ్వుచు రాధేయుండు మెచ్చఁగ భీముఁడు గినియఁగ ననఁటిమ్రాకు నేనుఁగుతొండమునుం బురుడించి సర్వలక్షణముల నొప్పియున్న తనతొడను ద్రౌపదికి సన్నఁ జేసి చూపెను.

భీమసేనుఁడు వానిదుశ్చేష్టం గనుంగొని యెఱ్ఱనికనుగ్రుడ్డుల గిరగిరత్రిప్పుచు సభ్యు లందఱు వినఁగ నిట్లనియె. వంశదూషకుఁ డైన యీపాపాత్ముని తొడను భీమసేనుఁడు ఘోరరణంబున గదచే విఱుగ నడచు. కాకున్నఁబితృపితామహాదులగతికిఁ దప్పు నని వీరప్రతిజ్ఞఁ బూనుచున్నంత దావానలదహ్యమానం బైనవృక్షంబుకోటరంబులనుండి వెడలువడువున నాప్రభంజనతనయు రోమకూపములనుండి మిడుఁగుఱులు వెడలె. అంత విదురుఁడు కౌరవులారా! భీమునివలన ధార్తరాష్ట్రులకుఁ జావు దైవవిహితంబు. ఏనాఁడుం గలుగని యధర్మము భరతవంశమున నీనాఁడు పుట్టె. జూదము, పరమపతివ్రత యగు యాజ్ఞసేని నిటకుఁ దోడ్తెచ్చి యవమానించుట, యను రెండునుం గౌరవులనాశమునకు ముఖ్యనిమిత్తంబులు. ఈయన్యాయం బందఱు సైఁచియున్నవారు. చేటుకాలంబున కధర్మంబును సభ్యులు మెత్తు రని పెద్దలు వచింతురు. శకుని నిర్బంధమునకుఁగా నధర్మద్యూతమునఁ బ్రవర్తించి ధర్మరాజు వీరల నోడుట కలలో నోడుటకంటె వేఱుగాదు. ఇతండు తన్నోటువడుటకుమున్న ద్రౌపది నొడ్డియుండెనేని నాయమ కీశుఁ డగు ననిన దుర్యోధనుఁడు పాంచాలి కిట్లనియె. నావలన దోషంబు లేదు. భీమార్జుననకులసహదేవులవచనమెయి నది

సెద. యుధిష్ఠిరుఁడు ప్రభుఁడుగాఁ డని వారు చెప్పిన నీదాస్యంబు వాయునని చెప్పితింగదా యనియె. అంత నర్జునుఁడు మాకెల్ల ముందు ధర్మరాజు ప్రభువే. త న్నోటువడినపదంపడి యెవరికిఁ బ్రభు వగును. కౌరవులు దీని వివరింపవలయు ననివాక్రుచ్చె. అయ్యవసరంబున ధృతరాష్ట్రు నగ్నిహోత్ర గృహమున నక్క లఱచె. అతనియెదుట గర్దభములు కూసె. పక్షులన్నియు రావ్రధ్వానంబుఁ జేసె. ఆదుర్నిమిత్తంబులఁ బరికించి భీష్మ ద్రోణ కృపవిదురులు గాంధారియుఁ బెద్దయెలుంగున స్వస్తివచనముల నుడివిరి. అట గాంధారియు విదురుండును ఘోరములగునయ్యుత్పాతంబుల ధృతరాష్ట్రునకు నివేదించుటయు నతం డదరిపడి యోరీదుర్బుద్ధీ! చేటుఁ దెచ్చికొంటివి. కులమునకుఁ జెఱుపనచేటగాఁ బుట్టితివి. దుర్నయంబునఁ బాండవధర్మపత్ని యగు పాంచాలిని సభ కీడ్చి తెప్పించి పలుకరానిప్రల్లదంబు లాడెద వని యతనిం దిట్టి పాండవహితంబు చేయఁ దలఁచి లెస్సగ నాలోచించి పాంచాలిం బిలిచి యోసాధ్వీ! నాకోడండ్రలోనెల్ల నీవ యుత్తమురాలవు. నీకోరినవరముల నిత్తు ననుటయు ద్రౌపది మామ కిట్లనియె.

(ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరము లిచ్చుట.)

భరతపుంగవా! వరము లొసంగఁ దలంతువేని సకలధర్మజ్ఞుఁ డైనధర్మరాజు దాస్యము పాయవలయు. దానఁ బ్రతివింధ్యునకు దాసపుత్రుండనునట్టు రాదు. అనేకరాజలాలితుం డైనసమ్రాట్పుత్రున కాఱవ్వ గలుగకునికియచాలు ననిన ధృతరాష్ట్రుఁడు కల్యాణీ! నీకోరినవరము నొసఁగితి. మఱియొకవరముఁ గోరుమనియె. ద్రౌపది యంతటభీమార్జుననకులసహదేవులు రథధనుస్తూణీరబాణాయుధాదిసహితులై దాస్యము వాయవలయు ననియడుగ ధృతరాష్ట్రుఁ డట్లయగుఁగాక. మఱియొకవరంబునుం గోరుము దీనఁ దనియ ననిన ద్రౌపది యిట్లనియె. మహారాజా! వైశ్యున కొక్కటియు, క్షత్త్రియవనితకు రెండును, రాజునకు మూఁడును, బ్రాహ్మణునకు నూఱును వరములు వేఁడఁ దగును. కాన నేను మూఁడవవరముఁ గోరరాదు. ధర్మముఁ జెఱుచునట్టి లోభంబు నాకు సమ్మతంబుగాదు. నాపతులు వరవుడమువాసిరి. పుణ్యకర్మముల శుభములఁ బడయఁ గలరని నుడివిన ధృతరాష్ట్రుఁడు కోడలియుత్తమగుణంబులు మెచ్చుచుండె. అటఁ గర్ణుఁడోహో మనుష్యస్త్రీలలో నిట్టికార్యము లెచ్చటను వినము, పాండవధార్తరాష్ట్రులు క్రోధావిష్టులై యుండఁగ ద్రౌపది శాంతిఁ గావించె. దుఃఖార్ణవమగ్ను లయినమగల నుద్ధరించె నని సాకూతంబుగాఁ బలికినం గినిసి భీమసేనుఁ డిట్లనియె. పాండుపుత్రులకు మగువ గతి యయ్యె నని ఖలుఁ డైనకర్ణుఁడు చెప్పె. ఇంతకంటెఁ గష్టమెద్ది? పురుషు

నకు విద్య, యపత్యంబు, కర్మంబు ననుమూఁడు తేజంబులు దేహోపాయం బైనపదంపడియు నుపయోగించునని దేవలుఁడు వక్కాణించె. దారావమాన నంబున మనతేజంబు తిరస్కృతిఁ బడసె. మనయపత్యంబులు నిందపా లగు నొకో యనిన నర్జునుఁడు భారతవరేణ్యా! సజ్జనులు నీచులప్రల్లదంబులకుఁ బ్రతి చెప్పరు. ఎగ్గులెన్ని చేసినంగణింపక యెన్నఁడైన నొక్కఁ మేలు గావించి యుండిన దానినేస్మరింపుచు సంతోషింతు రని మెల్లన నివేదించినను వినక వృకోదరుఁడు ధనంజయా! వాదులేల! ఇపుడే యిచటన సమూలంబుగఁ బగవారిం జెగటార్చెద. భూమండలంబెల్ల నేలు మని చెప్పి మృగమధ్యమున నున్న సింగము తెఱంగున నాసభలో శత్రుభీకరుండై ప్రతాపాటోపదీపిత వీక్షణంబున నంద అం జూచుచుండ నర్జునుఁ డతనివారింపుచుండె. అప్పటికి నతండు చలంబు డింపక నిటలతటఘటితభ్రుకుటీకరాళ ముఖుండై ప్రళయసమయదండధరుమాడ్కి దుర్నిరీక్షుండై రోమకూపద్వారంబుల మిడుగుఱులు గ్రక్కుచుండ ధర్మరాజు చేయియెత్తి భీమసేనా! కోపముతగదు. మిన్నకుండు మని బోధించిపలు దెఱంగుల నూఱడించి యతని శాంతచిత్తుఁ జేసి యట ధృతరాష్ట్రునొద్దకుఁ జని కేల్దోయి మోడ్చి మహారాజా! మే మేమి చేయవలయు నానతిమ్ము. నీ శాసనముమెయి నడుచువార మనిన ధృతరాష్ట్రుఁ డిట్లనియె. అజాతశత్రూ! మీ సకలధనాదులం గొని దమ్ములనుం ద్రౌపదినిం దోడ్కొని యరిగి నిజరాజ్యముఁ బాలించుకొనుము. పెద్దల సేవించు ధర్మాధర్మముల నెల్ల నెఱింగిననీకుఁ జెప్ప నేల? సద్బుద్ధియు శాంతియు నీయందే స్థిరములై యున్నవి. ఆయుధములు దారువులపైన నేకదా యవశ్యంబుగఁ బడును. అట్లె కష్టములన్నియు దేహికి కలుగు. శాంతిఁ బొందుము. ఉత్తమపురుషులు పగఁ దలఁపక పెఱవారియెగ్గు లెంచక గుణము లొకకొన్నియైన నుండెనా వానినే పాటించి చూతురు. మఱియు మూర్ఖులు తెలివిమాలి ప్రల్లదము లాడినం బ్రతిక్రియఁ జేయరు. మధ్యములు వివాదమునఁ బరుషములకు మాఱు పల్కుదురు. అధములు సంవాదంబులఁ గల్పించి దుర్భాష లాడుదురు. ఈసమయమున నర్థమర్యాదలకు వ్యత్యాసంబు గలుగకుండ నందఱకుం బ్రియుఁడవై సాధుచర్య నెఱపితివి. పుత్రులబలాబలంబులను మైత్రినిం జూడఁగోరి బుద్ధిలేక యుపేక్షాపరుండనై జూదము వారింపనైతిని. కన్నుగాననిముదుకని నన్నును మీతల్లిని గాంధారినిం దలఁపోసి దుర్యోధనాదులయెగ్గులెల్ల మఱచునది. ధర్మనిత్యుఁడ వగునీవు రాజుగా, సర్వశాస్త్రవిదుఁ డగువిదురుఁడు మంత్రిగాఁ ధీరశేఖరుఁ డైనధనంజయుఁడు, భీషణప్రతాపభూషణుం డగు భీమసేనుఁడు, గురుశుశ్రూషాపరు లగు నకుల సహదేవులును, బాసటగా నింద్రప్రస్థముఁ జేరి రాజ్య మేలుము, నేఁడు మొదలు

గ నీతోడఁ దమ్ములకెల్లఁ జెలిమి యగుఁగాక. నీమనము ధర్మమందు నిత్య మగుఁగాక. లగ్గయ్యెడి ననిదీవించి యానతిచ్చుటయు ధర్మరాజు తమ్ములను ద్రౌపదిం దోడ్కొని కాంచనరథంబుల నారోహించి యింద్రప్రస్థమునకుఁ దఱలె ననిన జనమేజయుండు వైశంపాయనమునినాథా! పాండునందను లట్లు ధృతరాష్ట్రానుజ్ఞాతులై యరిగినపిదప ధార్తరాష్ట్రు లేమి చేసి రనియడుగ నానరపాలచంద్రున కత్తాపసేంద్రుఁ డిట్లనియె.

అవ్విధంబున ధృతరాష్ట్రానుజ్ఞాతులై పాండునందను లింద్రప్రస్థమునకుఁ బోవఁగ దుశ్శాసనుఁడు దుర్యోధనునొద్దకుఁ బోయి మనము శ్రమంబున సాధించినదంతయు ముసలివాఁడు చెఱుచుచున్నవాఁడు. జూదమున వచ్చినధనము మఱల నతండు పాండవుల కిచ్చె. ననిన దుర్యోధనుండు కర్ణశకునులతోడ నాలోచించి ధృతరాష్ట్రునొద్దకుఁ బోయి యిట్లనియె. రాజేంద్రా! యెన్నియుపాయములనైన శత్రువుల నిగ్రహించుట నీతి యని సురగురుం డైనబృహస్పతి దివస్పతికిం దెలిపె. దాని వినినవాఁడవు కావా. అవకాశంబు లభించెనేని శత్రువు లహితంబు చేయకమానరు. ద్యూతలబ్ధం బైన ధనమున రాజులనెల్ల సంభావించి యందఱుం బాసటఁగా బాండవులతోడ సమరంబు చేసి విజయంబుఁ గొనిన మనకుఁ గొఱఁత గలుగునే? పాండవులఁ గనలించి విడిచిపుచ్చుట పాముల నలిఁగించి మెడసైన వీఁపుపైనం జేర్చుకొనినచంద మయ్యె. మాచేసిన యెగ్గులును ద్రౌపదీపరిభవంబును వా రొకనిముసంబైన సైరింతురే? అవశ్యంబుగ సేనలఁ గూర్చుకొని యుద్ధమునకు వత్తురు. అర్జునుఁడు గాండీవము నక్షయతూణీరంబులను, భీముఁడు ఘోరగదను, నకులసహదేవులు ఖడ్గచర్మాదులం బూని రథారూఢులై వచ్చిరేని వారితోడ నెవ్వరుం బోరఁ జాలరు. కావున ధర్మరాజును రావించి క్రమ్మఱ జూద మాడవలయు. ఆజూదమున నోడినవారు నారచీరలఁ గట్టుచుఁ గందమూఁలాదులఁ గుడుచుచు బ్రహ్మచర్యనిరతులై పండ్రెండేండ్లు వనవాసంబును, జనసహితదేశముల నితరు లెఱుంగకుండ నొక్కయేఁడజ్ఞాతవాసంబును, నెవ్వరైనం దెలిసికొనిరేని క్రమ్మఱ ద్వాదశవర్షంబులు వనవాసంబును, నొక్కయేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జేయవలయు. ఇదియ యీయాటకుఁ బణము. శకుని ద్యూతకపటములెల్లఁ దెలిసినవాఁ డగుటంజేసి వారె యోడి వనవాసంబు చేయుదురు. ఇది దక్క మఱియొక్క యుపాయంబున వారల నిగ్రహింపరాదు. నియమములు సలిపి పదుమూఁడేఁడులు గడిచినపిదప వారు వచ్చిరేనియు నంతకులోన మేము రాజ్యమున దృఢమూలులమై తగినమహాసేనలం గూర్చికొని పోరాడి వారల గెలుతుము. ఇందుల కనుజ్ఞ యిమ్మనిన ధృతరాష్ట్రుఁ డట్ల చేయుదు నని యియ్యకొనియె. భీష్మ

ద్రోణకృపాశ్వత్థామవిదురసోమదత్తబాహ్లీకభూరిశ్రవో యుయుత్సువికర్ణు లిది
తగదు. దీనం జేటు వాటిల్లు నని నొక్కి వక్కాణించిరి. పాండవుల నలిగించినఁ
బుత్రక్షయం బగునని శంకించి గాంధారి విషణ్ణయై ధృతరాష్ట్రునొద్దకుఁ బోయి
మహారాజా! యీదురుద్యోగంబు వలదు. దుర్యోధనుండు పుట్టినంతన నక్క
వలె నఱచుటంజేసి వీనినిమిత్తంబున గులక్షయం బగుఁ గావున వీనిం గులపాం
సకునిఁ బరలోకమున కనిచి కులంబు రక్షించుకొనుట లగ్గని యపుడే విదు
రుఁడు బోధించె. ఆత్మదోషంబున మహాజలంబున మునుఁగకుము. తెలివిలేని
బాలురమత మనుష్ఠింపకుము. ఉపేక్షించినఁ గులక్షయమునకు నీవ కారణం
బగుదువు. యెట్టివెడఁగైనఁ గట్టినసేతువును భేదింపఁడు. చల్లారినయగ్ని నూఁది
ప్రజ్వరిల్లఁజేయఁడు. శాంతులై యున్నపార్థుల నెవ్వఁడైన నలిగించునే? నీకుఁ
దెలిసియున్న నేను మరల స్మరింపఁ జేసెద. బుద్ధిమాలినవానికి శాస్త్రంబులు
శుభాశుభంబుల శాసింపవు. చిఱుతవాండ్రమాటలఁ బెద్ద లనుసరింపరాదు.
నీవలన నందఱు శుభములఁ బడయుదురుగాక. కావున నామాట విని కుల
పాంసనుం డయినవీనిం ద్యజింపుము. అట్లు చేయవేని తత్ఫలంబుగాఁ గులక్ష
యం బగుట నిక్కము. శమంబును, ధర్మంబును, యోగ్యులహితోపదేశంబు
ను గ్రహించి యేమఱకుము. క్రూరవ్యవస్థితం బయినసంపద మృదుప్రౌఢయ
య్యుఁ బుత్రపౌత్రవిధ్వంసంబు చేయు ననిన ధృతరాష్ట్రుఁడు కులక్షయంబున కి
య్యకొందుఁగాని ద్యూతంబు వారింపనోపను. కొడుకులిష్టంబుమెయి వర్తిల్లు
దురుగాక యనిచెప్పి గాంధారిని వారించి ప్రాతికామిం బిలిచి సూతసుతా!
వేగంబ చని పునర్ద్యూతంబు సలుపఁగ ధర్మరాజుం దోడ్కొనిర మ్మని నియ
మించె. వాఁడును దఱలి కొంతదూరంబుఁ గడచి నడుత్రోవలోన ధర్మరాజుం
గాంచి పాండునందనా! క్రమ్మఱ జూదం బాడఁగ మీతండ్రి ధృతరాష్ట్రుఁడు ని
న్నుఁ రాఁబనిచె ననినివేదించె. ధర్మరాజు వానివచనంబు విని జూదమున నెగ్గు
గలుగుటయు ధృతరాష్ట్రునియోగం బలంఘనీయం బగుటయుం దలపోసి దై
నం గానిమ్ము. దైవనియోగంబున నగుశుభాశుభఫలంబులఁ దప్పింప నేరికి నల
వికాదు. కాంచనమయం బైనమృగ ముండనేర దని తెలిసియున్న నాసపడి శ్రీ
రాముఁడు దానివెంటం బోవక నిల్చెనే? ఆపదలఁ గుందవలసియుండెనేని బుద్ధి
విపర్యాసంబుఁ జెందుట సహజము. ఏమి చేయవచ్చు నని కొండొక వగచి
తమ్ములు మొదలగువారిం దోడ్కొనిచని హస్తిపురంబు సొచ్చి నగరు సేరి స
భాస్థానంబుఁ బ్రవేశించి స్వాభిప్రాయంబు మిత్రులకుఁ దెలుపుచు నాసీనుఁడై
యుండ నప్పాండవాగ్రజునకు శకుని యిట్లనియె. ధర్మరాజా! ధృతరాష్ట్రుఁడు
మీధనము నెల్ల మీ కొసంగెఁ గావున నీక దాని నొద్దరాదు. నారచీరలు గట్టి

కందమూలాదులఁ దినుచు బ్రహ్మచర్యనిరతులై పండ్రెండేండ్లు వనమున వసించుటయుఁ, బదుమూఁడవయేఁట జనపదంబున నజ్ఞాతవాసంబు సల్పుటయు, నాయేఁట గూఢముగా నుండుతఱి నితరు లెఱింగిరేని క్రమ్మఱఁ బదుమూఁడేఁడులు పూర్వోక్తనియమం బొనరించుటయు నీయాటకుఁ బణంబుగా నియమింతము. మేమ యోడితిమేని యిట్లు చేయ నున్నవారము. మీరోడిన నీనియమము ద్రౌపదితోడ సల్పుఁడు. అది సమాప్తంబైనఁ దమతమ రాజ్యములఁ బడయనగు. ననిన సభ్యులు భీతచిత్తులై చేతులు మీఁది కెత్తి ధృతరాష్ట్రుఁడు బుద్ధిలేక మీఁదు పరికింపకున్నను బంధువులైనం దీనఁ జేటు వాటిల్లు నని బోధింపరాదో యని పేరెలుంగెత్తి పలుదెఱంగులఁ బల్కుచుండఁగా వానినెల్ల నాకర్ణించుచు సర్వజ్ఞుండయ్యు ధర్మనందనుండు కురుకులవినాశ మాసన్న మయ్యె ననితలంచుచు సౌబలున కభిముఖుండై క్షత్రధర్మపరుఁ డగునాభోఁటిరాజు నిర్బంధముగ జూదమునకుఁ బిలువగ వచ్చి యాడకుండునే యనివచించె.

(ధర్మరాజు శకునితో రెండవతూరి జూద మాడుట)

అంత శకుని యీయాట నోడినవారు ధనకనకవస్తువాహనధాన్యాదుల గెలిచినవారియధీనములుగఁ జేయవలయు. పండ్రెండేఁడులు వనవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబునుం గావింపవలయు నని తెలిపితింగదా. ఇఁక నాడుదమని చెప్పి సారెలఁ గొని పాండవజ్యేష్ఠుతోడ నాడి కైతవపాటవంబున నమ్మహాత్ము నోడించె. ఓడించుటయు వనవాసదీక్షితులై పాండవులు రాజ్యము విడిచి కృష్ణాజినోత్తరీయముల ధరించి వనమునకుఁ దఱలుచుండ దుశ్శాసనుం డిట్లనియె. నేటికిఁగదా పాండుపుత్రులు పరాజితులై యాపద నొందిరి. దుర్యోధనునిచక్రం బప్రతిహతం బయ్యె. దేవతలు మంచిమార్గంబునకు వచ్చిరి. మేము పెద్దవారము కాకున్నను గుణమునఁ బెద్దల మయితిమి. పార్థులకు రాజ్యము విడిచి సుఖములఁ దొఱంగి దీర్ఘకాలదుఃఖ మనుభవింపఁ గలిగె. ధనమదాంధులై మమ్ము మున్నుపహసించినవా రిపుడు పరాభూతు లైరి. ఇఁక వేగంబ చిత్రసన్నాహంబును దివ్యదుకూలంబులను నపనయించి కృష్ణాజినములను ధరించి శకునియభిమతంబున నడవి కేగవలయు. మా కెవ్వరుం దీటుగా రని పోతరించినపాండవు లిపుడు వ్యర్థులై తమస్వరూపం బెఱుంగుదురు. పండితమానియైనద్రుపదుఁడు పాండవులకుఁ గూఁతు నిచ్చి యెంతయేసుకృతముఁ జేసియుంటి నని తలఁచియుండె. ద్రౌపదీపతు లిపుడు నపుంసకు లైరనిచెప్పి యాజ్ఞసేనీ! నిర్ధనులై కృష్ణాజినముల ధరించి ప్రతిష్ఠలేక వనమ్ములఁ గ్రుమ్మరుపాండవులఁ బొంది యేమి ప్రీతిఁ జెందుదువు. ఈయున్న కౌరవులు సకలగుణ సంపన్నులు, ధనవంతులు, వీరిలో నిచ్చవచ్చినవాని మగనిఁగవరించి సుఖింపుము,

పౌరుషము చెడి వ్యర్థులై యున్న వీరి నేల యుపాసించెద వని బహువిధములఁ బరుషములఁ బలికె. ఆప్రల్లదములు విని భీమసేనుఁ డలిగి హైమవతసింహము నక్కనుఁబోలె దుశ్శాసను నదల్చి పాపాత్మా! నీయడిబీరంపుమాటలఁ జాలింపుము. శకునికైతవవిద్య గలుగఁగాదె నీకుఁ బొగడికొనఁ గలిగె. నీ విపుడు వాగ్బాణముల మర్మముల భేదించురీతి ఘోరసమరంబున నీమర్మములఁ దూఁటాడి నిన్నుఁ దలఁపింతు. మఱియు నిన్ననుసరించినక్రోధలోభపరీతుల సమూలముగ యమలోకమున కనిచెద ననియె. దుశ్శాసనుఁ డంతటఁ గౌరవమధ్యంబునఁ బాండవులఁ బసు లనియార్చుచు భీమునెదుట నర్తనంబుఁ జేసె. చేయఁగ భీమసేనుఁడు క్రోధసంరబ్ధుండై కురుకులాధమా! ప్రల్లదములాడుట యొక్కండె నీ వెఱుంగుదువు. మోసమున ధనము నాఁచికొని బుద్ధిగలవాఁ డెవ్వఁడైనఁ బొగడుకొనునే? ఇవి యన్నియు నేల? అందఱుఁ జూచుచుండఁగ సమరాంగణంబున నీఱొమ్ము వ్రచ్చి నెత్తురు ద్రావకున్న వృకోదరుఁడు పుణ్యగతికిఁ దప్పును. విలుకాండ్రందఱు గనుంగొన ధార్తరాష్ట్రులనెల్లవారల నే నొక్కరుండె శీఘ్రముగఁ జంపి శాంతిఁ బొందెద. ఇది సత్య మనితలంచు మని ప్రతినఁ బూనె. అట దుర్యోధనుఁడు సింహముచాడ్పున నడుచుచున్న భీమునిముందఱకు వచ్చి యతనివలె నడిచి పరిహసింపఁగ నావృకోదరుఁడు దుర్యోధను నిర్దేశించి మూర్ఖా! యింతమాత్రన నీచేసిన దేమియు లేదు. శీఘ్రముగ నిన్ను నీవారలం బోరిగొని యప్పు డిందుకు మాఱు పలుకుదు నని చెప్పి బలవంతుఁడు మానవంతుఁ డయ్యునతం డవమానంబు సైఁచి కోప మడంచి ద్యూతరంగము వెడలి వచ్చుచుఁ గొంతసేపున కందఱుఁ గలయం గనుంగొని నేను దుర్యోధనాదులం జంపుదు. ధనంజయుఁడు కర్ణునిం జంపువాఁడు. శకుని కితవుని సహదేవుఁడు దెగటార్చు. మఱియు నొక్కటి చెప్పెద. మాకు ధార్తరాష్ట్రులకును యుద్ధము దేవవిహితము. ఇద్దుర్యోధనుఁ బాపాత్ముని గదచే నడిచి పాదమునఁ దలఁ దన్నెద. ఈదుష్టచతుష్టయంబు భూతబలి యగుట నిశ్చయంబని పలుకుచున్నంత నర్జునుఁ డాభీమున కిట్లనియె. మన మిపుడు మాటలఁ బలుక నేల? ఇఁకఁ బదునాలవయేఁట నగుదాని నందఱుం జూడగలరు. అసూయాపరుఁడు కలహప్రియుఁ డాత్మస్తుతిరతుఁడు నగుకర్ణునిం దదీయులను భీమునకుఁ బ్రీతిగ నర్జునుఁడు వధించువాఁడు. వెండియు బుద్ధిమోహమున నాతోడఁ బోరాడువారినెల్ల యమసదనమున కనిచెద. పదునాలవయేఁట మనరాజ్యము నిద్దురాత్ముఁ డొసఁగఁడేని యిదియంతయు నిక్కువంబు. హిమవత్పర్వతంబు చలించినను సూర్యుఁడు తేజముఁ దఱిఁగినను జంద్రుఁడు చల్లదనముఁ దొఱఁగినను నా ప్రతిజ్ఞ తప్పనేర దనిన సహదేవుఁడు భుజాస్ఫాలనంబుఁ జేసి క్రోధ రక్తాక్షుఁడై

పాముపగిది బుసవెట్టుచు శకుని కిట్లనియె. గాంధారకులాధమా! దుర్ద్యూతంబున సారెలఁ గొనుచెపంబున రణమున వాఁడితూపులు పైఁబడుట కియ్యకొంటివి. క్షాత్రంబు పూని యుద్ధమున కొడఁబడితివేని భీముఁడు చెప్పినపగిది నేను నిన్ను నీవారలనుం జంపెద. పసులనెల్లఁ దీర్చికొనియుండు మనిన నకులుఁ డిట్లనియె. పాంచాలిని భంగపఱిచి ప్రల్లదము లాడినదురాత్ములను ధర్మరాజుని దేశమున మేము సంహరించిభూమికి ధార్తరాష్ట్రకంటకంబులఁ బాపెదమనియె.

(పాండవులు వనమునకుఁ బోవుట.)

ఇట్లందఱు ప్రతిజ్ఞలు పూని ధృతరాష్ట్రునొద్దకుఁ బోయి యతని, భీష్మ, సోమదత్త, బాహ్లీక, ద్రోణ, కృప, అశ్వత్థామ, విదుర, యుయుత్సు, సంజయులను, దక్కుఁగలసభాసదులను, దుర్యోధనాదులను నామంత్రణంబు చేసి పోయి వత్తుము. పునర్దర్శన మగుఁగాక యనిన నందఱు వారికి మనంబుల శుభములఁ గోరుచు లజ్జితులై యూరకుండుటయు విదురుఁడు ధర్మజునకిట్లనియె. అధర్మజితుఁడు పరాజయమున వ్యథ నొందఁడు. నీకుఁ దెలియనిధర్మువుగలదె! పగతుర భంజించు భీమసేనుఁడు యుద్ధవిజయుఁ డగుధనంజయుఁ డర్థసంగ్రహి యగునకులుఁడు సంయమవంతుఁ డగుసహదేవుఁడు ధర్మార్థకుశల యగుద్రౌపది బ్రహ్మవిద్వర్యుఁ డైనధౌమ్యుఁడును నీవారుగాఁగఁ గొఱఁత గలదే? అన్యోన్య ప్రియు లగుమి మ్మెవ్వరును భేదింపఁ జాలరు. ఇంద్రునివంటి శత్రుఁడైన మిమ్ము గెలువనేరఁడు. హిమవత్పర్వతంబున మేరుసావర్ణివచనమును, వారణావతమునఁ గృష్ణద్వైపాయనుహితోపదేశమును, భృగుతుంగమున రాముని బోధనంబును, దృషద్వతీతీరంబున శంభువాక్యంబు, నంజనాచలంబున నసితుపలుకులను, గల్మాషీతీరంబున భృగునిగదితంబును, విననివాఁడవకావే! మఱియు నెల్లపుడు నారదుఁడు నీకు హిత ముపదేశించువాఁడు. ధౌమ్యుఁడు పురోహితుఁడు. ఋషులు బోధించిన హితమును యుద్ధమున విడువవలదు. పురూరవుని బుద్ధిపాటవంబు, సకలరాజులశక్తి, మునులధర్మపరిజ్ఞానంబు, సురేంద్రునిజయంబు, యమునికోపధారణంబు, కుబేరునిసంపద, వరుణునిసంయమంబు, సోమునిరంజనంబు, జలములపరోపజీవనంబు, భూమియోర్పు, సూర్యునితేజంబు, వాయువుబలంబు, సకలభూతములయాత్మసంపదయు నీయందు నిత్యములై యుండు. ఆపద్ధర్మార్థసంకటంబులను సర్వకార్యంబులను సమయోచితము ననుష్ఠింపుము. సుకుమారి వృద్ధురాలు సుఖోచితురాలు నగుకుంతీదేవి వనముల వసింపనోపదు. మాయింట నిల్పుకొని సత్కరించెద. ఇందు కియ్యకొనవలయు. పోయి రండు. పునర్దర్శన మయ్యెడి. శుభములఁ బడయుఁ డనిన ధర్మరాజు విదురునకిట్లనియె. మహాత్మా! నీయానతిమెయి వర్తిల్లెద. నీవు మాకుఁ బితృవ్యుఁడవు. పితృసముఁ

డవు. గురుఁడవు. ఎద్ది చెప్పినం జేసెద నని చెప్పి తమ్ములతోడఁ దఱలె. ద్రౌపదియు నంతిపురంబునఁ గుంతి గాంధారి మొదలగువారికిఁ బ్రణమిల్లి చిఱుత వాండ్రం గౌఁగిలించుకొని కానల కేగి వత్తు నని దుర్గఖార్తయై యుండ శోకవిహ్వలయై కుంతి కోడలి కిట్లనియె. పాంచాల రాజపుత్రీ! స్త్రీధర్మములనెల్ల నెఱిఁగి శీలాచారములఁ బడసిననీకు నిట్టివ్యసనముల శోకింపఁ దగదు. ద్రుపదు వంశంబును మావంశంబును నీచే నలంకరింపఁబడియె. నీకోపదుర్నిరీక్ష్య వీక్షణంబున దహింపకునికిం జేసి కౌరవులు భాగ్యవంతు లైరి. సకలధర్మములఁ దెలిసిననీకు భర్తృవిషయంబున నొక్కటియు బోధింపవలదు. ఐన నొక్కటిఁ జెప్పెద. వనవాససమయమున నందఱం బోషించుటకంటె సహదేవు ననేకవిధముల నొచ్చియైనం బోషింపుము. వాఁడు వ్యసనముల నోర్వఁ జాలఁడు. ధర్మబలమున సకలశుభములఁ బడయఁగలవు. పోయి రమ్మని చెప్పి కన్నీరు దొరుగ పెన్నెఱులు ముడివీడిజాఱఁగ నాక్రోశింపుచుఁ బోవుచున్న యప్పాంచాలపుత్రి వెంటం జనుచుఁ గుంతీదేవి కృష్ణాజినపరిధానులు నపనీతసర్వాభరణులు లజ్జావనతవదనలు వనప్రస్థితులు నగుకొడుకులఁ గాంచి కౌఁగిలించుకొని పలవించుచు నిట్లనియె. అన్నలారా! సద్ధర్మముల నడుపుచు, సాధువులఁ బూజింపుచు, సురలం గొల్చుచున్న మీకును దైవవిపర్యయంబున నిట్టివ్యసనంబు వాటిల్లె. దౌర్భాగ్యంబులకు మూల మగునాకుఁ గొడుకు లగుటయే యందులకుఁగారణంబు గాఁబోలు. వీర్యసత్వబలోత్సాహవృద్ధులఁ దొఱఁగి శరీరములఁ గాఱియపెట్టుచు నెట్టులు మహారణ్యంబున వసింతురో. ఈవనవాసంబు మీ కగునని తెలిసియుండెనేని మీతండ్రి స్వర్గతుండైనపిదప శతశృంగపర్వతంబునుండి యిటకు రాకయే యుందుము. ఇట్టిఘోరదుఃఖములం జూడకుండ మీతండ్రి ముందుగ మేను దొఱఁగి ధన్యుఁ డయ్యె. అమ్మహాత్మునితోడన తనుత్యాగంబు సేసి యీ దుఃఖములనెల్లఁ గాంచకుండఁగ మాద్రి యేనోము నోఁచి యుండెనో. ప్రాణముల కాసపడి నేనిట్లు వనటలపాలైతి. ఎన్నియేఁ గష్టంబుల ననుభవించి పడసినమిమ్ము విడిచి మన నోపను. మీతోడన వచ్చెదాన. ద్రౌపదీ! నన్ను విడవకుము. దేహులకెల్ల దేహాపాయము నిత్యమైయున్నను దైవము ప్రమాదంబున నా కపాయముఁ జేయకున్నది కాఁబోలు. ఇంక నెన్నియేండ్లు బ్రదుకవలయునో. హా ద్వారకావాసీ! కృష్ణా! దుఃఖార్ణవమగ్నులైనవీరిని నన్నును రక్షింపక యేల యుపేక్షించెదవు. అనాదినిధనుండ వయిననిన్ను ధ్యానించువారిం బాలింతు వనులోకప్రవాదంబు వ్యర్థ మయ్యె. ధర్మమాహాత్మ్య యశోవిక్రమవంతు లగువీ రిట్టివ్యసనము లనుభవింపఁ దగునె. ఇంచుక దయఁ జూడుము. నీతివిదు లగుభీష్మద్రోణకృపాదులు ధర్మవ్యవస్థాపకులై యుండికొను నీ యాపద

యుత్పాదిల్లె. ఓపాండునరపతీ! కపటద్యూతంబున శత్రువుల కోడి కానల కే గుచున్న కొడుకులం గానక యేల యుపేక్షించెద వనివిలపించి సహదేవుదిక్కు మొగంబై వత్సా! సహదేవ! నీ వడవి కేగవలదు. నీవున్న నందఱు నున్నట్లు భావింతు. నీయన్నలు నలువురు నియమము నడుపుదురుగాక. ఇచటన యుండి నన్నుం గాపాడుచుండిన నీకుం దత్ఫలంబెల్లం గలుగు నని యెవ్వగలం బొగులు చు నేడ్చుచున్న కుంతికి మ్రొక్కి మెల్లన ననుజ్ఞాతులై పాండవులు వనమునకుం దఱలిరి. విదురుఁడు కుంతి ననేకవిధముల నూఱార్చి తనయింటం జేర్చికొని యె. ధార్తరాష్ట్రపత్నులును ద్రౌపదీపరిభవంబును బాండవ వనవాసంబును విని కౌరవుల నిందింపుచుం జెక్కిళులం జేతులం జేర్చి చింతింపుచుండిరి. ధృత రాష్ట్రుఁడు తనకొడుకులయనయంబుఁదలపోసి వెగడొంది శోకవ్యాకులచిత్తుం డై శీఘ్రంబుగ విదురుం బిలిపించి పాండవులును ద్రౌపదియుఁధౌమ్యుఁడు నెట్లు వనమున కరిగిరి వివరింపు మనిన విదురుం డిట్లనియె.

(విదురుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవులడవికిఁబోయినరీతిఁజెప్పట)

ఏమి చెప్పుదు ధర్మరాజు వస్త్రమున ముఖముం గప్పుకొని వెడలె. భీ ముఁడు విశాలభుజంబులఁజూచుచు నరిగె. సవ్యసాచి యిసుముం జల్లుచుం జనియె. నకులుఁడు పరాగరూషితశరీరుండై యేగె. సహదేవుఁడు పాంసులిప్త ముఖుండై పోయె. రజస్వల యైనద్రౌపది ముడివీడివెండ్రుకలుజాఱ నేడ్చుచు వారి ననుగమించె. రౌద్రయామ్యసామగానంబు సేయుచు దర్భలు తీసుకొని ధౌమ్యుఁడరిగె. అనిన ధృతరాష్ట్రుఁడు వారలేల యీరూపములు ధరియించి రనియడుగ విదురుం డతని కిట్లనియె. నీకొడుకులు మోసమున రాజ్యములు ధనమును నాఁచికొనినను ధర్మరాజు ధర్మంబు విడువఁడు గావున తన క్రోధవీ క్షణముబారిం బడినవారికిఁ గీడగు ననుచు ముఖంబుఁ గప్పుకొనియె. భీముం డు బాహుబలంబున నెవ్వఁడు నాకుసమానుఁడు గాఁడు. భుజబలంబు సఫలం బుగాఁగ శత్రువిధ్వంసంబుఁ జేయుదు నని విశాలబాహువులం జూపించుచుం బోయె. అర్జునుం డిసుముం జల్లినవిధంబున నెడతెగక బాణవర్షంబుఁ గురియిం చి పగతురఁబరిమార్తు ననిదెల్పుకరణి నిసుముం జల్లె. నాముఖం బిపు డితరు లకుం జూడరా దనుచు సహదేవుఁడు ముఖముం గప్పికొనియె. సుందరశరీరం బు గాంచి వనిత లేమేనియుం దలఁతు రట్లుగాకుండవలయునని నకులుఁడు రేణు రూషితశరీరుండయ్యె. ఏపాపాత్ములనిమిత్తంబుగ నేనిన్ని పాటులం బడితినోయా ధార్తరాష్ట్రులయు వారివారలయు భార్యలు బదునాలవయేఁట విధవలై పలవ రింతురని తెల్పుచుఁబాంచాలి యేకవస్త్రయు ముక్తకేశియు నయ్యె. భారతరణం బున మృతులైనవారి కుత్తరక్రియలఁ జేయింతు నని ధౌమ్యుఁడు దర్భల గ్రహి

౪౯

యించి రౌద్రయామ్యసామంబులఁ బఠింపుచుండె. ఇట్లు వారు కానల కేగు చుండఁ బౌరజనులు దుఃఖార్తులై హా! కౌరవు లెంతకు లేరు. ధర్మాత్ము లగు పాండుపుత్రులఁ గాననలకుఁ బంపిరి. వారు పోయినపదంపడి దుర్వినీతులు లుబ్ధులు నగుధార్తరాష్ట్రులయొద్ద నుండనోప మనుచు నాక్రోశింపుచుండిరి. అట్టి యెడ మొగులులేకయే మెఱుములు మెఱసె. పుడమి వడఁకె. అపర్వంబున సూర్యుని రాహువు గ్రసించె. నగరున కపసవ్యంబుగాఁ గొఱవులు వడియె. దేవాలయంబులను అచ్చపట్టులను బ్రాకారంబులను జదుకంబులను నగళులను గృధ్రకాకసృగాలాదులఱచె. నీదురుద్యోగంబునఁగౌరవవినాశంబునకు సూచకంబులుగా నిన్నియుత్పాతంబులు గలిగె ననివివరింపుచుండునంత నారదుండు మహర్షి పరివృతుండై సభామధ్యంబు సొచ్చి యిఁకఁ బదునాలవయేఁట దుర్యోధనాపరాధంబును, భీమార్జునబలంబును, గారణంబుగా ఘోరరణంబునఁగౌరవులు నశింతు రని రౌద్రంబుగఁ జెప్పి తత్క్షణంబ యంతర్హితుండై నాకలోకమునకుఁ జనియె. దుర్యోధనదుశ్శాసనకర్ణశకునులు శత్రుభయంబులేక రాజ్యపాలనము సేయ ద్రోణుఁ డర్హుఁడని యమ్మహాత్మునకు రాజ్యం బంతయు నివేదించుటయు నతండు వారల కిట్లనియె. దేవప్రసాదంబున జనించినపాండవు లెవ్వరికి నవధ్యులు. వారి నోర్వరాదు. భక్తిమెయి శరణాగతు లైనధార్తరాష్ట్రుల విడువనోపను. పాండుపుత్రులు కపట నిర్జితులయ్యుఁ గ్రమమున నియమముల నెల్ల నడిపి సమరంబునకు వత్తురు. తొల్లి నాచే నోటువడిన ద్రుపదుఁడు యాజోపయాజులతపోబలంబున నగ్నియందు ద్రౌపదిని నన్ను గెల్వజాలుఁ ధృష్టద్యుమ్ననిం బడసె. ఇపు డాధృష్టద్యుమ్నుఁడు పాంచాలినిమిత్తంబుగాఁ బాండవులకు సంబంధియై వారిపక్షంబువాఁ డయ్యె. లోకంబునఁ గలయతిరథమహారథాదుల కగ్రగణ్యుఁ డైనయర్జునుఁడు రణంబున నాతోడం బోరాడును. ధృష్టద్యుమ్నుండు ద్రోణమృత్యువనిలోకప్రసిద్ధంబు. ఇంతకంటె దుఃఖంబు వేఱొండు గలదె. అందుకుఁగాలంబు మీవలన నిప్పుడు కలిగె. మనుష్యుఁడ నగుటం జేసి దేహత్యాగంబునకు వెఱతు. అయిన నేమి ప్రయోజనము? దైవ్యము బలవత్తరము ఇఁకనైనను నెల్లవారికి మేలు చేయఁ దలఁతేని తగురీతి ననుష్ఠింపుము. ఈపదుమూఁడేఁడులు మీసుఖంబు తాటిమ్రాఁకునీడపోలె ముహూర్తసుఖదంబు. ఇంతకుమున్న యజ్ఞములనాచరింపుఁడు. ఇష్టభోగములఁ దీర్పుఁడు. వలసినదానములఁ జేయుఁడు. పదునాలవయేఁటఁగురుకులక్షయంబు తప్పనేర దనిన ద్రోణవచనంబు విని ధృతరాష్ట్రుండు విదురా! యాచార్యుండు లెస్సగఁ జెప్పె. పాండవులఁ దోడ్తెమ్ము. వారు రాకేని సత్కారంబు వడసి పోదగు నని చెప్పుచు చింతావ్యాకులుండయి యెద్దియుఁ దోఁచక నిశ్వసింపుచున్న

యాచించుకుఁజేనికి సంజయుం డిట్లనియె. రాజేంద్రా! ధనసంపూర్ణం బయినవసుధ నెల్ల సాధించి పాండవుల నడవులకుఁ బంపి యింక నీకుఁ గుంద నేల. యనిన ధృతరాష్ట్రుఁడు బలవంతులు మహారథులు యుద్ధవిశారదులు నగు పాండవుల తోడి పగ గలిగినఁ గుందకుందునే యనిన సంజయుండు వెండియు నిట్లనియె. భీష్మద్రోణవిదురులు వారింపుచుండినను వినక లోకక్షయంబునకు మూలం బైనపాండవవైరంబు నీవచేసుకొంటివి. మూర్ఖుఁడు మందబుద్ధియు నగు నీకొడుకు సిగ్గులేక ప్రాతికామిం బంపి పాండవధర్మపత్నియు నయోనిజయు నగ్ని సంభూతయు సర్వధర్మజ్ఞయు నగుపాంచాలి రజస్వలయు నేకవస్త్రయునై యుండ సభ కీడ్చి తెప్పించి కర్ణుఁడుం దానుం బ్రల్లదంబు లాడి జీర లొలిపించి భంగపఱిచె. అద్దేవిక్రోధవీక్షణంబున నీకులంబంతయు నశించు ననితలంచుము. చేటుకాలంబునకు బుద్ధిప్రమాదంబు దేవతలే కల్పింతురు. దైవోపహతుం డ న్యాయము న్యాయ మనియు, ననర్థం బర్థ మనియు, నర్థం బనర్థ మనియు భావించు. ఇంతయుఁగాలంబుగాని కాల మొక్కరునైనం దండ మెత్తి తలఁద్రెవ్వ నేయదు. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

సంజయా! ద్రౌపదిక్రోధవీక్షణంబులబారిం బడిన భూమియైనం దగ్ధం బగు. నాకొడుకుల నొక్కఁడైన బ్రతుకునె. ద్రౌపదీపరిభవంబునకు గాంధారి మొదలగుభరతకులస్త్రీలు సకలప్రజలు నాక్రోశించిరి. బ్రాహ్మణులును గుపితులై సాయాహ్నమున నగ్నిహోత్రంబుల వ్రేల్వరైరి. గగనంబునుండి పిడుగులు కొఱవులుం బడియె. అపర్వంబున రాహువు సూర్యుని గ్రసించె. నిర్నిమిత్తంబుగ రథశాలలోన నగ్ని ప్రజ్వరిల్లె. టెక్కములు విఱిగె. దుర్యోధను నగ్నిగృహంబున నక్క లఱచె. గర్దభంబు లెదుటఁ గూసె. భీష్మద్రోణకృప సోమదత్తబాహ్లికులు మొగంబులు గంటువెట్టుకొని పోయిరి. అంత నేను విదురప్రేరితుండనై పాంచాలిం బిలిచి వరంబులు గోరు మనిన నాసాధ్వి రథ ధనుస్తూణీరాదిసహితు లైనపాండవులకు దాస్యంబుఁ దొలఁగింప వేఁడఁగ నట్ల యని యియ్యకొంటిని. అట మహాప్రాజ్ఞుఁ డగు విదురుఁడు నన్ను నుద్దేశించి యింక నింతటితోనఁ జాలు కాకున్నఁ జేటగు. రూపాంతరంబుఁ దాల్చిన శ్రీ యనఁ దగినపాంచాలి దైవవిధానంబునఁ బాండవులఁ జేరియున్నది. దానిభంగపాటు పాండవులును, యదువృష్ణిభోజాంధకులును, బాంచాలురును నోర్వరు. వాసుదేవరక్షితులై పాంచాలీసమన్వితు లైనపాండవులు కౌరవులకంటె బల వంతు లనితలంపుము. భీమసేనుఁడు గదం బూని దండపాణి యైనయంతకుప గిదిఁ బోరున కాయిత్తపడెనేని వాని నెవ్వరైన నోర్వఁజాలరు. మహాబలుం డని ప్రసిద్ధుఁ డైనజరాసంధు నతండు బాహుయుద్ధమునసె పరిమార్చె. అర్జునుఁడు

గాండీవంబుఁ బూని సమరసన్నద్ధుండయ్యేనేని వాని నేరికైనఁ దలయెత్తి చూడ నలవి కాదు. కావున నింతటితోన శాంతిం బొంది పాండవులతోడ సంధి చేసుకొని యుభయపక్షంబులకు మేలు గావింపుము. ఇట్లు చేసిన లగ్గయ్యెడి నని ధర్మార్థసహితంబుగ విదురుఁడు బోధించె. సంజయా! బోధించినను దెలివిమాలి నేను వినక పుత్రులమాటమెయి నడిచితి. ఏమి చేయ వచ్చు దైవము రక్షించు నని చెప్పె నని,

క॥ జనమేజయవసుధాపా
లున కలఘుజ్ఞాననిర్మలుఁడు వైశంపా
యనుఁడు సభాపర్వముకథ
లను దెల్ప నతండు ప్రమదలహరిం దోఁగెన్ ॥

శా॥ నానారూపజిఘృక్షచేఁ ద్రిగుణసంధానంబుఁ గావించి వే
ధోనారాయణశంఖరాఖ్య లగుమూర్తుల్ దాల్చి సర్గాదులం
దానే పొందియు నిస్పృహుం డగుణుఁ డద్వైతుండు కూటస్థుఁడున్
సానందండు ననంచు వేదముల విఖ్యాతు న్మది న్నిల్పెదన్ ॥

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారముద్దువేంకటమహీపాల కరుణాపురస్సర బహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వ చమత్కార పరితోషిత బుధస్తోమ సీతారామకవిలలామపుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్యలక్ష్మీనృసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగ నామధేయప్రణీతంబైన శ్రీమదాంధ్రవచనభారతంబునందు సభాపర్వంబున ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ, గింకరదర్శనంబును, నారదుఁడు లోకపాలసభలవర్ణించుటయు, రాజసూయారంభంబును, జరాసంధ వధయును, గిరివ్రజనిరుద్ధులైన రాజులఁ గృష్ణుఁడు విడిపించుటయు, దిగ్విజయంబును, రాజసూయంబును, నర్ఘ్యాభిహరణంబును, శిశుపాలవధయును, సభాస్ఖలితుండైన దుర్యోధనుని భీమాదులహసించుటయు, రాజసూయవిభూతిసహింపక దుర్యోధనుండు జూదంబొనర్చుటయు, శకునికైతవంబున ధర్మనందనుఁ డోడుటయు, ధృతరాష్ట్రివరంబున ద్రౌపది పాండవుల నుద్ధరించుటయుఁ, బునర్ద్యూతంబున నోడి పాండవులు వనవాసగతులగుటయు నన్నది సర్వంబు

నే కా శ్వా స ము,



శ్రీ కాళహస్తీశ్వరాయనమః.

# అరణ్యపర్వము.

## ప్రథమాశ్వాసము.

క॥ శ్రీ విఖ్యాత విభావసు
జైవాతృక హవ్యవహ లసద్ద్యుతి విద్యో
తావహ మహాగ్ని ప్రసర నా
నావిపదుద్ధరణ నిపుణ నామ స్మరణా॥

దేవా నన్నానందసాంద్రుం జేయుము.



తదనంతరంబున జనమేజయుండు వైశంపాయనుం జూచి మహాత్మా పాండవు లట్లు ధార్తరాష్ట్రులచే వంచితులై పరుషవచనములఁ గోపితులై యైశ్వర్యభ్రష్టులై సుఖోచితులయ్యు నెట్లు వనవాసంబు సల్పిరి? అట్టియెడ నేమి యాచరింపుచుండిరి? ఎవ్వరు వారల ననుగమించిరి? ఏమి భుజియింపుచుండిరి? ఎచట వసింపుచుండిరి? అమ్మహాత్ముల కరణ్యమునఁ బండ్రెండేఁడు లెట్లు గడచె? పరమపతివ్రతయగు పాంచాలి తద్వ్యసనంబుల నెట్లు సైఁచె? అని యడుగ నమ్మనుజేంద్రునకుమునిచంద్రుఁ డిట్లనియె.

నరేంద్రా! పాండుపుత్రులు ద్యూతపరాజితులై ద్రౌపదీ సహితంబుగ గజపురంబు వెడలి వర్ధమానపురమార్గంబున నింద్రసేనాదు లయినభృత్యులు పదునలువు రుత్తమరథంబులతోడ వెంటరాఁగఁ బోవుచున్నంతఁ బురజనులు సంతప్తులై భయంబు విడిచి యక్కటా దుర్యోధనుఁడు కర్ణశకునిదుశ్శాసనుల మంతనమునం బ్రవర్తిల్లువాఁడు. పాపాత్ముఁడు పాపసహాయుఁడు గురుద్వేషిత్యక్తాచారసుహృజ్జనుఁడు ధనలుబ్ధుఁడు దురభిమానుఁడు నీచుఁడు నిర్భయుఁడునగు నీదుర్యోధనురాజ్యమున నుండెదమేని కులాచారవ్యవస్థయు ధర్మార్థసౌఖ్యములుం గలుగవు. సకలసుగుణసంపన్నులు మహానుభావులు నగుపాండురాజనందనులు పోయినయెడకుఁ బోయెద మనిపలుకుచు నప్పాండవుల ననుగమించి ప్రాంజలులై మహాత్ములారా! మమ్ము విడిచి యెటకుఁ బోయెదరు? ధార్తరాష్ట్రు లధర్మమున మిమ్ము నోడించి రని తెలిసి కానల కేగుచున్నమీవెంటన వచ్చితిమి. భక్తులు ననురక్తులు ప్రియులు హితులు నగుమమ్ము విడువఁ దగునే? దుర్యోధనాధిష్ఠితం బయినకురాజ్యమున నుండనోపము. జలములు వస్త్రములు తిలలు

భూమియు దివ్యపుష్పపరిమళసంసర్గమున సుగంధము వహించువిధమున సజ్జనసంసర్గంబున జను లుత్తమగుణంబులఁ బొరయుదురు. దుర్జనసహవాసము ప్రతిదినము నధర్మముఁ బెంచును. జన్మకర్మవిద్యలచేఁ బరిశుద్ధులు ప్రాజ్ఞులు పెద్దలు సుస్వభావులు శాంతులు నగునుత్తములసంసర్గంబుఁ జేయుచుండినఁ బ్రయత్నము లేకున్నఁ బుణ్యము తనకుఁ దాన గలుగు. మధ్యస్థులసహవాసంబున జనుఁడు మధ్యస్థుఁడే యగు. నీచులసహవాసమున నీచత్వంబుఁ బొరయు. దుర్జనులదర్శన స్పర్శనసంభాషణసహావస్థానాదులు ధర్మాచారములఁ జెఱుచు. కావున సర్వసద్గుణ సంపన్నుల రగుమీయొద్దన యుండి ధర్మ మనుష్ఠింతు మనిన వారికి ధర్మరాజిట్లనియె. బ్రాహ్మణప్రముఖులైనసకలజనులును మాయెడ నత్యంతప్రేమకారుణ్యంబుల వర్తించుటంజేసి లేనిగుణంబులనైన నుగ్గడింపఁ గలిగె. ధన్యుల మైతిమి. భ్రాతృసమన్వితుఁడ నగునావిన్నపంబు వినుఁడు. ఇందుకు మాఱు చెప్పవలదు. భీష్మధృతరాష్ట్రవిదురులు కుంతీదేవి సకలసుహృజ్జనులును హస్తిపురమున నున్నవారు. వారందఱు శోకసంతాపవిహ్వలులై యుందురు. మీరు మఱలి యరిగి వారి నతిప్రీతి నాదరింపుచుండునది. ఇట్లు చేసితిరేని నా కెంతయు సత్కారంబుఁ గావించినట్లు తలంతు. వారినెల్ల మీ కిల్లడపెట్టితిని. బహుదూరంబు గడచి వచ్చితి రిఁక మఱలుఁ డని యనునయపూర్వకంబుగఁ జెప్పుటయు వారు ధర్మరాజునాజ్ఞ నతిక్రమింపనేరక యెట్టకేలకు సమ్మతించి పార్థులగుణవిశేషంబుల నుగ్గడింపుచు హస్తిపురంబునకుఁ జనిరి.

అటఁ బాండవులు రథారూఢులై గంగాతీరమునఁ బ్రమాణాఖ్యమహావృక్షంబుఁ జేరి యారాత్రి జలప్రాశనులై యుండఁగ నాహితాగ్నులు మొదలగునకేకబ్రాహ్మణులు చనుదెంచి వివిధపుణ్యగాథల వినిపింపుచుండిరి. అంత నా రాత్రి వేగుటయు భాగీరథీజలమున స్నాన మాచరించి వనంబునకుఁ బోనుద్యమింపుచుండఁగ భిక్షాన్నభోజు లగుబ్రాహ్మణులు కొంద ఱనుగమనవ్యవసాయంబున నెదుట నిల్చుటయు ధర్మరాజు వారి కిట్లనియె. మేము రాజ్యమును సర్వస్వమునుం గోల్పోయి ఫలమూలంబులఁ గుడుచుచు నడవుల వసింప నుండెదము. కానల మీరు వసింప నోపరు. అందుఁ గ్రూరమృగంబులు బహుదోషంబులును నిత్యసిద్ధంబులు. అందలిక్లేశముల మీ రోర్వఁజాలరు. నానిమిత్తంబుగ మీరు డయ్యుట కొడంబడను. బ్రాహ్మణపరిక్లేశంబు సురలకైనం జేటుఁ దెచ్చు. ఇఁక నాబోఁటివానివిషయంబు చెప్పనేల? మఱలి చనుఁ డనిన బ్రాహ్మణు లిట్లనిరి. ధర్మజా! నీవే గతి యని నమ్మి భక్తులమైయున్న మమ్ము విడువ నీకుఁ దగునే? దేవతలును భక్తులయెడ దయఁజేయుదురు. విశేషంబుగ సదాచారపరు లగుబ్రాహ్మణులయెడ దయాళు రగుదు రనిన యుధిష్ఠిరుఁడు మఱియు వారి కిట్లనియె.

బ్రాహ్మణులయెడ నాకుం బరమభక్తి కలదు. ఐనఁ దగినసహాయంబు లేమిం జేసి యిట్లు పలికెద. నాతమ్ములు ద్రౌపదీపరిభవంబునను రాజ్యాపహరణంబునను గడు దుఃఖితులై యున్నవారు. విశేషంబుగ ఫలమూలాదులఁ గొనితేర వారలఁ గ్లేశపఱుప నుత్సహింప ననిన నాబ్రాహ్మణులు ధర్మతనయా! మాపోషణంబునకై వగవవలదు. ఫలమూలాదుల మేమ తెచ్చుకొని శరీరయాత్ర నడుపుచు జపతప ముల ననుష్ఠింపుచు మీకు శుభములఁ జేయుచు మీతోడన వనంబున నిష్టక థాసల్లాపంబుల సుఖింపఁ దలఁతు మనిన ధర్మరాజు విని కటకటా! మీరందఱు స్వయముగఁ దెచ్చుకొని ఫలాదులఁ గుడుచుచు నాకుఁగాఁ గ్లేశము లనుభవింపు చుండ నే నెట్లు చూడనేర్తు. ధార్తరాష్ట్రులదురుద్యోగంబ కదా యిందు కెల్ల మూలం బనిచింతింపుచున్నంత సాంఖ్యయోగకుశలుఁ డధ్యాత్మరతుఁడు నగుశౌ నకుఁ డనుబ్రహ్మర్షి ధర్మరాజున కిట్లనియె.

**శౌనకుఁడు ధర్మరాజునకుఁ దత్త్వముఁ జెప్పుట.**

ధర్మపుత్రా! శోకస్థానసహస్రంబులు భయస్థానశతంబులును మూఢు నకుఁ జింతాకరంబులుగాని యవి విద్వాంసుం జేరనేరవు. నీయట్టిబుద్ధిమంతులు జ్ఞానవిరుద్ధంబులు బహుదోషగ్రస్తంబులు శ్రేయోవిఘాతకంబులు నగుకర్మ ములఁ బ్రవర్తింతురే? శ్రుతిస్మృత్యర్థసమాయోగంబునఁ గీడులెల్లఁ బోద్రోలు నట్టియష్టాంగవిలసితబుద్ధి నీయందే వ్యవస్థితమై యున్నది. అర్థకృచ్ఛ్రంబులం దును సకలసంకటములందును స్వజనాపదలందును నీయట్టివారు శారీరమానస దుఃఖములఁ బొందరుగదా. ఆత్మవ్యవసాయార్థంబుగఁ దొల్లి జనకగీతంబు లైన సుశ్లోకములయర్థము నుపన్యసించెద. సావధానుఁడవై వినుము. దుఃఖములశాం త్యుపాయంబు దాననెఱుంగ నగు. వ్యాధి, శ్రమ, మనిష్టప్రాప్తి, యిష్టవివర్జనంబు నను నాలుగింటం బొడముశారీరదుఃఖము నుచితచికిత్సాప్రయోగంబుల నుపశమిం చు. స్నేహమూలం బగుమానసదుఃఖము సంతోషంబున నడంగు. మఱియు నది యు దకమున నగ్నివోలె విమలదివ్యవిజ్ఞానంబునఁ జల్లాఱు. మానసదుఃఖంబు శమిం పకున్న సంతప్తాయఃపిండసంక్రమంబునఁ గాఁగునందలినీరు కాఁగువిధమున శరీరము తపించు. మానసదుఃఖములకు మూలం బగుస్నేహమున సంగము, శోకము, రాగముం గలుగు. రాగదోషము కొంచెమైనను వృక్షము నెల్లఁ గోటరాగ్ని ద హించురీతి ధర్మార్థముల నశింపఁజేయు. సంగమున దోషములం బరికించి దానిం ద్యజించి నిర్వైరుఁడై వైరాగ్యంబు సాధింపవలయు. మిత్రధనాదులయెడ స్నే హముఁ గోరరాదు. జ్ఞాననిష్ఠు లగుపెద్దలు దారపుత్రమిత్రాదులయెడఁ గేవలస్నే హంబు చేయక పద్మపత్రంబులు జలబిందుసంసక్తంబులయ్యు నట్లుకాని తెఱంగున వర్తింపుచు విశేషసంగంబుఁ జేయరు. మఱియు రాగమునఁ గామము, కామ

మునఁ దృష్ణయుం బొడము. తృష్ణచే సర్వపాపంబులు నిత్యభయంబ ధర్మబాహ్యంబును దేహి నలము. అదియే ప్రాణాంతక మగురోగంబు. అది వివేకవికలుఁ డగు దేహి నాశ్రయించి యతఁడు ముదిమిఁ జెందుచుండినను దాఁ జెందక యప్పటప్పటికిఁ బెరుగు. పుల్లతలసంగతం బైనయగ్నికణంబు క్రమంబున నాపుల్ల నెల్లఁ గాల్చురీతి విషయలోభ మయ్యవివేకిం జెఱుచును. వెండియు నెంతయర్థ మార్జించినం దుది నర్థవంతులకు మృత్యువువలనఁ బ్రాణులకుం బోలె రాజజలాగ్నిచోరస్వజనులవలనిభయంబు నిత్యమై యుండు. ఆకాశమునఁ బక్షులు భూమిలోన శ్వాపదంబులు జలమున మత్స్యములు నామిషంబు భక్షించుభంగి ధనవంతు నెల్లవారు నెల్లపుడు భక్షింతురు. కొందఱ కర్థ మే యనర్థంబుఁ గావించు. అర్థాసక్తుఁడు నిత్యశ్రేయములఁ బొందఁ జాలఁడు. అర్థమున లోభమోహదర్పకార్పణ్యభయాదులు నిత్యసిద్ధములై యుండు. అర్థార్జనంబందు నార్జితరక్షణంబందు రక్షితవినాశంబందునుం గడుదుఃఖ మతిశయించు. అర్థాసక్తులు తత్ప్రయుక్తదుఃఖములనెల్ల నోర్చికొందురు. అర్థనిమిత్తంబున నెవ్వరినైనం జంపుదురు. శత్రువులం గూడఁ బాలించి యుపసర్పింతురు. ఇట్లు సర్వదుఃఖములకు మూలం బయినయర్థము నశించుటకుఁ జింతింపరాదు. ఆశ కెన్నండు నంతము గలుగ దనినిశ్చయించి దాని విడిచి సంతోషించువారే పండితులు. సంతోషముఁ బొందనివారే మూఢులు. రూపయౌవనజీవితైశ్వర్యప్రియసంవాసంబులయనిత్యత్వ మెఱింగి పండితుఁడు వానియెడఁ దృష్ణఁ ద్యజించు. ధనములేమిం గల్గుతత్కాలక్లేశముల సహించుకొని తృష్ణవిడుచుటయే లగ్గు. ధనసంగ్రహము గలయతం డొక్కఁడేనియు నుపద్రవములఁ బాసి సుఖించువాఁడుం గలఁడే! కావున ధార్మికుల నిచ్ఛయే పరమార్థం బని ప్రశంసింతురు. మఱియు ధర్మార్థంబుగ ధనార్జనమునకంటె నిరీహయే యుత్తమంబు. పంకములోఁ జొరఁబడి ప్రక్షాళనంబుఁ జేసికొనుటకంటె దానిం ద్రొక్కకునికియే మేలుగదా. కావున యుధిష్ఠిరా! ధర్మ మపేక్షింతువేని ధనతృష్ణం ద్యజింపు మనిన ధర్మరా జిట్లనియె.

మునీంద్రా! నా కెన్నఁడు నాత్మభోగార్థంబుగా నర్థవాంఛ లేదు. మఱి బ్రాహ్మణరక్షణార్థంబుగ దానిం గోరెద. మాయట్టిగృహస్థులకు బ్రాహ్మణాదులఁ బోషింపకుండఁగఁ దగునే? గృహస్థుఁడు పక్వాన్నాధికారు లగుబ్రహ్మచారులు మొదలగువారి కెల్లఁ దనయన్నంబు విభజించి యియ్యవలయు. తృణభూమ్యుదకసూనృతవచనముల నెల్లభూతముల నుపచరింపవలయు. ఆర్తునకు శయనంబు, బడలినవాని కాసనంబు, డప్పికొన్నవానికి జలం, బాఁకలిగొన్నవాని కన్నంబు నొసంగవలయు. అతిథులు వచ్చి రని వినినయంతన లేచి యెదురేగి వారిం దోడ్తెచ్చి యాసనాదివిధుల సత్కరింపవలయు. ఇది యుత్తమగృహస్థధర్మంబు. అగ్నిహోత్ర

బలీవర్ద బాంధవాతిథిజ్ఞాతిపుత్రదారభృత్యాదినివహంబు లపూజితంబులైన నెగ్గు సేయు. కాన గృహస్థుఁ డందఱఁ దనుపవలయు. ఆత్మార్థంబునకుఁగానే యన్నపాచనంబు వృథాపశుహింసయుఁ జేయరాదు. విధియుతంబుగఁ జేయనియన్నంబు భుజింపరాదు. సాయంప్రాతఃకాలములందుఁ బక్వాన్నంబు విభజించి శునకశ్వపచపక్ష్యాదులకుఁగా భూమియందు బలి యుంచవలయు. ఇదియే వైశ్వదేవంబునాఁబడు. విఘసం బనంబరఁగినయతిథిభుక్త శేషం బమృతంబునాఁబడుయజ్ఞశేషంబును భుజింపవలయు. అతిథులఁ బ్రీతిమైఁజూచుట, సౌమనస్యంబు నెఱపుట, ప్రియంబులు పలుకుట, వెంటన కొంతద వ్వరుగుట, కొలిచియుండుటయు ననుదక్షిణలైదుగలయతిథిసత్కారం బనుయజ్ఞమును నిత్యమాచరింపవలయు. ఆకస్మికముగా మార్గమున నగపడినవాఁడు బడలినవాఁడు మున్నెన్నఁడు నదృష్టుఁడు నగునభ్యాగతునకు రుచిరాన్నంబు భక్తిమెయిం బెట్టినమహాత్మునిపుణ్యఫలంబు గణింప నలవియగునే? ఈక్రమంబున వర్తించుగృహస్థున కుత్తమధర్మంబు చేకూఱు నని పెద్దలు వక్కాణింతురు. నీ వేమి తలంతువో యనిన ధర్మరాజునకు శౌనకుఁ డిట్లనియె. ధర్మజా! లోకమెల్ల విపరీతవర్తనంబై యున్నది. అక్కటా! సాధువు దేనిచే సిగ్గుపడునో యసాధుండు దాన సంతసిల్లు. మోహరాగవశుఁ డింద్రియార్థపరుఁడు నగువాఁడు శిశ్నోదరతృప్తికై యన్నాదుల నెక్కుడుగ సంపాదించి యతిథులకుం బెట్టు. యథేచ్ఛసంచారంబు లగుదుష్టాశ్వంబులచే దూరముగ నపహరింపఁబడుసారథివిధమున వివేకవికలుఁడు జ్ఞానవిధ్వంసముఁ జేయునింద్రియములచే నపహరింపఁబడు. ఇంద్రియములు విషయసంగముఁ బొందునెడఁ బూర్వసంకల్పజం బగుమనస్సును వానితోడం గలియు. మన స్సేయింద్రియంబునఁ గలియునో యది యత్యుత్సుకంబై స్వకార్యంబు నిర్వహించు. పిదప సంకల్పమూలం బైనకామంబుచే విషయబాణపీడితుండై దేహి జ్యోతిర్లోభమున నగ్నియందుఁ బడుమిడుతవోలె లోభానలంబునం బడు. పదపడి వివిధవిహారంబుల నాహారయోగంబుల యథేచ్ఛమోహితుండై సుఖాభాసం బగుమహామోహమున మునిఁగి తన్నెఱుంగనేరక యవిద్యాకర్మతృష్ణలకుఁ జిక్కి బ్రహ్మాదితృణపర్యంతంబు లయిన భూతలోకములందు నానాయోనులం జనింపుచు సంసారచక్రంబునఁ బరిభ్రమించు. ఇది యవివేకుల మార్గంబు. ధర్మశ్రేయోరతులై ముముక్షు లగుపెద్దలు కర్మాచరణంబును దత్పరిత్యాగంబును విధించువేదములముఖ్యాభిప్రాయం బెఱింగి ఫలాపేక్ష విడిచి సకలధర్మముల ననుష్ఠింతురు. యజ్ఞాధ్యయన దానతపంబులు, సత్యక్షమాదమతృష్ణాత్యాగంబులు నన నెనిమిది తెఱంగుల ధర్మంబు వర్తిల్లు. అందుఁ బ్రథమంబు లగునాలుగుం గలయతండు కర్మము లాచరించి పితృయానమార్గమునఁ గర్మఫలము లనుభవింపఁ దల్లోకముల కరుగు. ఫలా

పేక్షవిడిచి విధిచోదితంబు లయినకర్మముల ననుష్ఠింపుచు నష్టాంగం బగుయోగ మునఁ బరిశుద్ధుఁడై సత్యక్షమాదమాలోభంబు లనునాల్గింటిని సాధించి సంకల్ప సంబంధం, బింద్రియనిగ్రహంబు, వ్రతవిశేషంబు, గురుసేవనం, బాహారయోగం, బధ్యయ నాగమంబు, కర్మసన్న్యాసంబు, చిత్తనిరోధంబును సమ్యక్ప్రకారంబున నాచరించి రాగద్వేషాదివినిర్ముక్తుఁడై వివేకిసంసారంబు జయించి దేవయానమార్గం బున నుత్తమలోకంబు సాధించు. రుద్రాదిత్యాదు లివ్విధమున యోగ మాచరించి పరినిష్ఠితులైరి. కుంతీనందనా! నీవునుశాంతి నవలంబించి తపోయోగమహిమము న సిద్ధిం బడసి బ్రాహ్మణుల భరింపుము. యోగసిద్ధియే తల్లిదండ్రులకంటె నతిశ యితంబు. సిద్ధులు సర్వంబు సాధింపఁ గలరనిన విని ధర్మరాజు ధౌమ్యున కి ట్లనియె. మునివరేణ్యా! వేదపారగు లగుబ్రాహ్మణోత్తములు మాతోడ నడవికి రా నున్నవారు. వారించినను వినరు. నేనును వీరల విడువ నోపను. వీరల నర ణ్యమున నెట్లు పోషింతు నుపాయం బానతి మ్మనియడుగ ధౌమ్యుఁడు ముహూ ర్తమాత్రంబు చింతించి ధర్మమునఁ దదుపాయంబు నిశ్చయించి ధర్మజున కిట్లనియె. తొల్లి సకలభూతము లన్నముఁ గానక యాఁకలి కోర్వలేక పరితపింపుచుండఁ గ రుణించి సూర్యుఁ డుత్తరాయణగతుండై నిజకిరణముల సకలరసముల గ్రహించి దక్షిణాయనంబునఁ బర్జన్యరూపుఁడై యోషధులం బడసి రాత్రులందుఁ జంద్ర కిరణరసముల వానిం దడుపుచుఁ బెంచి యం దన్నంబుఁ గల్పించి ప్రజల రక్షించెఁ గావున నన్నం బాదిత్యమయం బననెగడు. సూర్యుఁడే సర్వభూతములకుఁ దండ్రి. భీమకార్తవీర్యపృథునహుషప్రభృతు లగుతొల్లింటి మహారాజులుం దపోనిష్ఠచే సూర్యు నుపాసించి యన్నంబు సాధించి యాపదలఁ దొలఁగించి ప్రజల రక్షించిరి. నీవును దపోమహిమంబున బ్రాహ్మణుల భరింపు మనిన విని జనమేజయుండు ధర్మ నందనుసూర్యారాధనప్రకారంబు వివరింపుమని వైశంపాయను నడుగ నత్తాపసవ రుండు జనమేజయమహీపాలా! శుచివై సమాధానంబున వినుము. తత్ప్రకారం బు వివరింతు నని యిట్లనియె.

### ధర్మరాజు సూర్యు నారాధించి యక్షయ్యాన్న పాత్రంబు సంపాదించుట.

తత్ప్రకారంబున ధౌమ్యుఁడు ధర్మరాజునకు సూర్యారాధనంబున నన్నంబు సాధింపు మనిబోధించి తదారాధనస్వరూపంబు నిరూపింపం దలంచి సూర్యుఁ, డ ర్యముఁడు, భగుఁడు నననివి మొదలయి సూక్ష్మాత్మ, మైత్రేయుండు, కరుణా న్వితుండనియెడునివి తుదగాఁ గలయష్టోత్తరశతనామముల నుపదేశించి ధర్మనం దనా! యిది సూర్యనామాష్టోత్తరశతకంబు. బ్రహ్మప్రోక్తంబు. ఈనామములఁ బ్రతిదినంబును సూర్యోదయసమయంబునఁ బఠించునతఁడు పుత్రదారధనరత్నా దిసర్వాభీష్టంబులను జాతిస్మరత్వంబును నిత్యధైర్యంబును ధీరమేధనుం బడయు.

శోకాగ్ని సాగరాదిభయములఁ బాయు. నీవు నీనామములు జపించి లోకబాంధవు నారాధింపుము.

క॥ సురసిద్ధసాధ్యమునికి
న్నరరాక్షసయక్షపితృగణ స్తుతుఁ జామీా
కరవహ్నిసమప్రభు భా
స్కరుఁ బ్రణమిల్లెద హితంబుఁ గావింపంగన్॥

అని ప్రార్థించి సూర్యస్తోత్రం బుపదేశింప ధర్మాత్మజుండు విశుద్ధాత్ముఁడై దివ్యకుసుమంబుల సూర్యాద్యష్టోత్తరశతనామజపపూర్వకంబుగ నావేదమూర్తి నర్చించి యట గంగాప్రవాహంబు సొచ్చి వాయుభక్షుఁడు జితేంద్రియుండునై యోగంబు సాధించి యాచమించి ప్రాణాయామంబుఁ గావించి యాకర్మసాక్షి కభిముఖుండై యద్దేవదేవు నిట్లని స్తుతించె.

దేవా! నీవే లోకంబులకు నేత్రంబవు. సర్వదేహుల కాత్మవు. జన్మకారణంబవు. క్రియావంతుల కాచారంబవు. సర్వసాంఖ్యులకు గతివి. యోగులకుఁ బరాయణంబవు. ముముక్షుల కుత్తమలోకగమనద్వారంబవు. నీవే జగంబుల ధరింతువు. వెలిఁగింతువు. పవిత్రంబులుగాఁ జేయుదువు. నిర్వ్యాజకారుణ్యంబునఁ బాలింతువు. నిత్యంబును వేదపారగు లగుబ్రాహ్మణులు ప్రాతర్మధ్యాహ్నసాయంకాలంబులందు స్వశాఖావిహితంబు లయినయుపస్థానమంత్రంబుల ని న్నుపాసింతురు. సిద్ధచారణగంధర్వయక్షగుహ్యకపన్నగులు ముప్పదిమూఁడుగణముల దేవతలు సప్తగణంబులపితృదేవత లింద్రోపేంద్రులు వసురుద్రసాధ్యవాలఖిల్యాదులును వరార్థులయి త్వరితగమనం బైనసీరథంబువెంట వచ్చుచు నిన్ను సేవించి సిద్ధులయిరి. విద్యాధరు లెల్లపుడు దివ్యమందారపుష్పములఁ బూజించి కోర్కెలం బొందిరి. సకలలోకములందును నీకంటె నధికము గన్పట్టదు. ఇతర సత్త్వంబు లొక్కొన్ని నీకంటె వీర్యవంతంబు లున్నను వానికెల్ల నీవెలుంగునుం బ్రభావంబునుం గలుగునే? సర్వజ్యోతిస్సులు నీయందే వర్తించు. జ్యోతిర్గణంబులకెల్ల నీవే ప్రభుఁడవు. సత్యంబు సత్త్వంబు సాత్త్వికభావంబులును నీయందే వ్యవస్థితంబులై యుండు. నీతేజంబుననే విశ్వకర్మ నిర్మించినసుదర్శనచక్రం బను దివ్యసాధనంబు గ్రహించి జనార్దనుఁడు రాక్షసులమదం బుడిపె. నీవు గ్రీష్మకాలమున నిజకిరణంబుల సకలరసముల నాకర్షించి వర్షకాలమునఁ బర్జన్యరూపుఁడవై వర్షించి సకలౌషధీరసాదుల వర్ధింతువు. శీతకాలమునఁ జలిచే నంగములెల్లఁ గొంకువోవఁ గ్లేశము లనుభవించు మనుజులకు నీకిరణంబులు సుఖంబుఁ గావించురీతిఁ గంబళాదు లొనరింపనేరవు. త్రయోదశద్వీపభరితం బైనభూమండలంబును సకలలోకంబులను స్వకిరణంబుల వెలిఁగించి లోకహితంబుఁ గావింతువు.

మహానుభావా! నీ వుదయింపకున్న లోకమునెల్లఁ గటికచీకటి గప్పు. దానఁ బెద్దలు ధర్మాదుల నాచరింపఁ జాలరు. ద్విజు లగ్న్యాధానపశుబంధమంత్రయజ్ఞ తపఃక్రియాదుల భవదనుగ్రహముననే యనుష్ఠింతురు. సహస్రయుగపరిమితం బయినబ్రహ్మదేవునహస్సునకు నీవే యాద్యంతంబు లని కాలజ్ఞులు వచింతురు. మనుమనుపుత్రమన్వంతరాదులకు నీవ యీశుఁడవు. ప్రళయకాలంబున భవత్క్రోధప్రేరితం బైనసంవర్తకానలంబు ముల్లోకములఁ గాల్చు. మఱియునపుడు నీకిరణంబులం బొడమినమహామేఘములు నానావర్ణంబులఁ జెలంగి పిడుగులు వడ వర్షించి జగముల నీరిలో ముంచును. అట్లేకార్ణవప్రాయం బైనజలపూరం బును నిజకిరణంబుల మగుడ శోషింపఁ జేయుదువు. నీవే పండ్రెండురూపముల ధరించి ద్వాదశాత్మనాఁ బరఁగుదువు. నీవ యింద్రుఁడవు విష్ణుఁడవు రుద్రుఁడవు ప్రజాపతి వగ్నివి మనస్సవు ప్రభుఁడవు శాశ్వతం బయినబ్రహ్మంబవు సవితృహం సాదిపదాభిధేయుఁడవు. సప్తమినాఁడొండె షష్ఠినాఁడొండెఁ బరమభక్తి నిను నా రాధించినపుణ్యవంతుని లక్ష్మి తనకుఁ దాన చేరును. మనస్సు నీయందె నిల్పి మ్రొక్కువా రాయుష్మంతులై సుఖింతురు. అమ్మహనీయుని శారీరమానసరోగంబులు సర్వపాపంబులుం జేరరావు. అన్నపతీ! సకలజనుల కాతిథ్యంబుఁ జేయఁగ న న్నముఁ బ్రార్థింపుచున్నాను కన్నంబు ప్రసాదింపుము. నీయనుచరు లగుమాఠ రారుణదండాదులను, శనైశ్చరుని, క్షుభామైత్రీప్రభృతు లగుభూతజననులను మ్రొక్కెద. శరణాగతుఁడ నగు నన్నందఱు రక్షింపవలయు నని ధౌమ్యోపదిష్టక్రమంబున సంస్తుతింప సూర్యుఁడు ప్రసన్నుఁడై జ్వలితాగ్నిహోత్రు నివిధ మున వెలుంగుచు ధర్మరాజునకుఁ బొడచూపి యిట్లనియె. పాండునందనా! నీకో ర్కెలఁ బడయుము. నీవనవాసంబునఁ బండ్రెండేండ్లును మృష్టాన్నంబు నే నిత్తు నని యొకతామ్రపాత్రంబుఁ జూపి దీనిం గ్రహింపుము. ద్రౌపది వంటయింట ఫల మూలాదుల వండి యీపాత్రమం దుంచెనేని యయ్యన్నం బీపాత్రంబుప్రభా వంబునఁ జతుర్విధముగ రసవంతమై యక్షయ్య మగు. ఇఁకఁ బదునాలవయేఁట మఱల రాజ్యభోగము లనుభవింతు వని పలికి యంతర్హితుం డయ్యె. పరిశుద్ధచిత్తుండై యీస్తోత్రంబుఁ బఠించినపుణ్యవంతునకు సూర్యుఁడు దుర్లభంబులైనను వరము లనుగ్రహించు. సంధ్యాకాలంబుల దీనిం బఠించి పుత్రార్థి పుత్రులం బొందు. విద్యార్థి విద్యను సంపాదించు. ధనార్థి ధనంబుఁ బడయు. ఆపన్నుఁ డాపదలం బాయు. బద్ధుఁడు ముక్తుం డగు. జయార్థి జయంబుఁ గొను. స్త్రీపురుషు లెవ్వారైన నీఫలములం బొందుదురు. ఈస్తోత్రంబును బ్రహ్మ యింద్రున కొసంగె. అతండు నారదున కిచ్చె. అతండు ధౌమ్యునకుఁ బ్రసాదించె. ధౌమ్యుఁడు ధర్మ రాజున కుపదేశించె. దీనిప్రభావంబు గణింపరాదు. విశేషంబేల! సూర్యసాలో

క్యంబు సిద్ధించు. అట్లు యుధిష్ఠిరుఁడు సూర్యానుగ్రహంబు వడసి జలంబు వెడలివచ్చి ధౌమ్యునడుగుల కెఱఁగి తమ్ములం గౌఁగిలించుకొని సూర్యప్రసాదప్రకారంబు వివరించి యాతామ్రపాత్రంబు ద్రౌపది కొసంగె. పాంచాలరాజపుత్రియు మహానసగృహంబున శాకాదుల వండి యయ్యక్షయ్యాన్నపాత్రంబున నిడి యందులబ్ధంబగు రసవంతంబయినచతుర్విధాన్నంబున బ్రాహ్మణసంతర్పణంబుఁ గావింపుచుండె. బ్రాహ్మణభోజనానంతరంబున ధర్మరాజు తమ్ములకుం బెట్టించి పిదపఁ దాను నయ్యతిథిశేషంబు భుజింపుచుండె. పదంపడి పాంచాలి యోగిరం బారగింపుచుండె. ద్రౌపది భుజించినయనంతరంబ యప్పాత్రంబున నన్నము గానరాదు. ఇట్లుధర్మరాజు సూర్యప్రసాదసమాసాదితం బయినయక్షయ్యాన్నపాత్రముప్రభావంబున నుపలబ్ధంబు లగునిష్టమృష్టాన్నంబుల నతిథిసంతర్పణంబుఁ జేయుచు బ్రాహ్మణశుభాశీర్వాదంబులఁ బడయుచు విధిమంత్రప్రమాణసహితంబుగా విశిష్టతిథినక్షత్రపర్వకాలంబులం దిష్ట్యాదుల నాచరింపుచు సుఖముండి యొక్కనాఁడు తమ్ములు ద్రౌపది బ్రాహ్మణులుం దోడరాఁగఁ బురోహితపురస్కృతుండై గంగాతీరంబుఁ దొఱంగి సరస్వతీదృషద్వతీయమునానదుల సేవింపుచు వనమార్గంబునఁ బశ్చిమంబుగఁ బోయి సరస్వతీతీరంబున విరాజిల్లుమునిజనప్రియంబై యతిరమణీయం బైనకామ్యకం బనువనము సొచ్చె.

ఇట ధృతరాష్ట్రుఁడు పాండవులవనవాసంబునకు వగచి ధీరమేధావిలసితుం డైనవిదురుం బిలిచి మేధావీ! నీవు శుక్రునిపోలె బుద్ధిమంతుఁడవు. ధర్మసూక్ష్మముల నెఱుంగుదువు. కౌరవులకుఁ బాండవులకు నాకును సమ్మతుఁడవు. ప్రజలెల్లఁ బాండవవనవాసనిమిత్తంబుగా మనలఁ జేరరైరి. మనకుఁ గీడు లోకవేశదలంతురేమో. వారెల్ల మనలఁ జేరఁగ నుపాయంబుఁ జెప్పు మనిన విదురుఁడిట్లనియె. నరేంద్రా! త్రివర్గము రాజ్యమును ధర్మమూలము గాన ధర్మప్రవృత్తుఁడవై పాండవులను నీకొడుకులను రక్షించుకొనుము. పాపాత్ముఁ డగుదుర్యోధనుఁడు శకునిమతంబున నధర్మంబుఁ బూని జూదమున సత్యసంధుఁ డగుధర్మజు నోడించి వారల నలిగించె. నీకొడుకులు సుఖింప నుపాయము చేసికొనుము; నీవు మెయ్యది యంటేని. పాండవుల నింతటనైన రావించి వారిరాజ్యంబుఁ ద్రిబునం నిచ్చునదియ. దీనంజేసి యశోహానియు జ్ఞాతిభేదంబునుం గలుగదు. ధర్మవనముఁ జ్చు పెరుగు. క్షేమము చేకూఱు. ఇట్లు చేసిన శకుని కవమానంబు, పాండుడియు సంతోషంబు నగు. రాజు స్వధనమున సంతోషింపుచుఁ బరధనములఁ జొయున్న మే పరమధర్మంబు. కొడుకులలో నొక్కనినైన మిగిలించుకొనఁ దలంచి విదుగంబ యిట్లు చేయుము. కాదేని కౌరవులకుఁ జేటు కరగతంబ. అమిత్రులంచుచుడై నభీముఁడు గదాపాణియై వచ్చునేని మేటివిలుకాఁ డగుసవ్యసాచి సహవాఁడు

బై నగాండీవంబుఁ బూని వచ్చెనేనియు నెవ్వాఁడు వారల నెదిరింపఁ జాలఁడు. వార లకు సాధింపరానిదియుం గలుగునే? దుర్యోధనుఁడు పుట్టినయపుడే నీకు హితము బోధించితి. ఐనను గులపాంసనుం డైనవానిం ద్యజింపవైతివి. మేలు చేసుకొనవై తివి. ఇందుకుఁ దుదిఁ బశ్చాత్తాప మనుభవింతువు. ఇష్టమేని యిప్పుడైన నట్లు చేసికొని సుఖింపుము. రాజ్యమును ధర్మనందనుఁడు పాలించునేని యెల్లవారికి సుఖము సిద్ధించు. దుర్యోధనశకునికర్ణాదులు పాండవులఁ గొలుతురుగాక. భీముని ద్రౌపదికి ననునయింప దుశ్శాసనుం బంపుము. నీవుహితమును నన్నడుగఁగ నింతకంటె వేఱద్ది చెప్పుదు? ఇట్లు చేసి కృతార్థుఁడ వగు మనిన ధృతరాష్ట్రుఁ డిట్లనియె. విదురా! నీవచనము పాండవులకే హితంబు. నాకొడుకులకు విరుద్ధంబు. దీని నంగీకరింపరాదు. నాకుఁ బాండుపుత్త్రులుం బుత్త్రులైనను స్వదేహజాతు లగు దుర్యోధనాదులకంటె నధికులే? ఇతరులకుఁగా నిజదేహమున జనించిన వానిం ద్యజింపు మని బోధించువారుం గలరే? నిన్నెపుడు బహువిధమానముల నాదరింపుచున్నను గుటిలంబుగనె పలుకుదువు. మంచిమాటల నాదరింపుచుండినను జెడిపె యతనిఁ ద్యజించుఁగదా. ఇచ్చవచ్చినట్లు పొమ్మునఁ బొమ్ము. ఉండిన నుండుము. అని నిరాకరింపఁగ విదురుఁడు పాండవు లున్నయెడకుఁ బోవువాఁడై యిఁక నిచట నుండరా దనిపలుకుచుఁ దటాలున లేచి వేగవంతము లైనగుఱ్ఱములఁ బూన్చినయరదము నెక్కి వేగంబ కామ్యకవనమునకుఁ జని యచ్చోట బ్రాహ్మణులుం దమ్ములుం ద్రౌపదియుం బరివేష్టింప నుపవిష్టుం డైయున్న ధర్మరాజుం గాంచె. అంతకుమున్న ధర్మరాజు వేగమున వచ్చుచున్న విదురుని దూరంబునఁ జూచి భీమున కిట్లనియె. భీమసేనా! చూచితే. విదురుఁడు వచ్చుచున్నవాఁడు. శకునికితవుఁడు జూదమున గాండీవాయుధుల నొడిచికొన మఱచి యెమ్మెలు జూదమునకుఁ బురికొల్పునెకో. అందులకై విదురుఁడు వచ్చెనేని పోవ ముడఁ జనునే? గాండీవముంగూడ వారొడిచికొందు రేని మనకు రాజ్యము వందుచునే? యనిపలుకుచున్నంత విదురుఁడు వారిఁ జేర నరుగుదెంచె. అంతన మఱి లేచి యతని సత్కరించి యందఱుం గూర్చుండి యాగమనకారణం బడుగుటయుఁ బైము విదురుఁడు ధర్మరాజున కిట్లనియె. మీవన ప్రయాణానంతరంబున ధృతరాష్ట్రుఁడు నన్ను బిలిచి యాదరించి యుభయపక్షములకును హితము గుదానిం జెప్పు మనియడిగె. నేనుం గౌరవులకెల్ల శ్రేయస్కరముగఁ బక్షపాతంబు లేక చెప్పితి. ఎల్లవారికిని హితంబయ్యు నన్నము రోగికింపుగానిమాడ్కి నాహితోపదేశం బందఱకు నభిమతంబయ్యు నాధృతరాష్ట్రునకు రుచింపదయ్యె. చెడ్డయిల్లాలు శ్రోత్రియునకుఁ బ్రియము నొడఁగూర్చునే? పసిబాల కఱువదేండ్లముదుసలి కుండింపు గూర్చునే? ధృతరాష్ట్రునిమిత్తమున నిక్కంబుగఁ గౌరవవినాశ

మగు. తామరాకుపై నీటివోలె నే నొకపక్షముననైన నంటక యుచితంబు చెప్పినను దాని వినఁడయ్యె. చెప్పినందుకుఁగా నాయెడఁ గోపించి యిఁక నీ విచట నుండఁదగవు. ఇచ్చవచ్చినయెడ కెచ్చటికేనియుం బొమ్ము. నీహితోపదేశంబు చాలు. నీసహాయంబు వలదనిపలికి నన్ను నిరాకరించె. కావున నీకు హితం బుపదేశించి ప్రీతిఁ గావింప నీయొద్దకు వచ్చితి. అచ్చట నేఁ జెప్పినదానిం గ్రమ్మఱ వినిపించెద. విని యట్లు చేయుము. బలవంతు లయినశత్రువులు పలుదెఱంగులఁ బీడింపుచుండినను సైరణమైఁ గాలముఁ బ్రతీక్షించునతఁడు జఠరాగ్నిమందతం జెందినయతం డుచితాహారములఁ దద్వృద్ధిం బొందించుమాడ్కిఁ గ్రమంబున భూమండలం బంతయు సాధింపఁగలఁడు. ఎవఁడు తనధనమును సహాయులకుఁ దగురీతి విభజించియిచ్చునో వానిదుఃఖమందును వారు భాగభాక్కు లగుదురు. ఇదియే సహాయుల నార్జింప ముఖ్యోపాయంబు. సహాయబలంబు లభించెనేని రాజ్యలాభంబు సుకరంబు. సహాయులయెడ విరుద్ధంబుగాని సత్యము శుభము. తనపోలె వారల నన్నాసుల నాదరింపవలయుఁగాని తన్నధికునిగ భావింపరాదు. ఇట్టిరాజవశ్యంబుగ వృద్ధిఁ గాంచు ననిన ధర్మరాజు నీయుపదేశించినట్లు చేసెద. మఱియు నేయేవేళల నెట్లు బోధింతువో యట్లు చేయువాఁడ నని యొడంబడి యవ్విదురుని డెందమునకు మెప్పుగాఁగ నాదరింపుచుండె.

విదురుఁడు మఱల ధృతరాష్ట్రు నొద్దకుఁ బోవుట.

అట ధృతరాష్ట్రుఁడు పాండవులయొద్దకు విదురునిపోక నెఱింగి నీతితంత్రవిశారదుఁ డైనయతనిబుద్ధికౌశలంబునఁ బాండవులకు నానాఁట మేలు గలుగు నని చింతించి సభాద్వారమున రాజులెల్లఁ జూచుచుండ మూర్ఛవోయి క్రిందఁ బడి కొంతసేపునకుఁ దెలివిఁ గాంచి లేచి చేరువనున్న సంజయుం బిలిచి యిట్లనియె. సంజయా! విదురుఁడు నాతమ్ముఁడు సఖుఁడు రెండవధర్మదేవత నాఁ దగువాఁడు మహాప్రాజ్ఞుఁడు ప్రభావంతుఁడు. బుద్ధిమాలి వాని నిరాకరించితి. ఇపుడు వాఁడు లేక యొక్కింతసేపైన మననోపను. నాచేసినయనాదరణంబు సైఁపలేక యెట్లయ్యెనో! అతం డెప్పుడును నాకుఁ గీడు దలంచినవాఁడుగాఁడు. వేగంబ నీవు వానియొద్దకుఁ బోయి యూఱడించి తోడ్కొని రమ్ము. అని పశ్చాత్తాపంబునం బల్కుచుఁ బ్రలపించె. సంజయుం డట్లయని యతివేగంబునఁ గామ్యకవనముఁ జేరి విదురుఁడుం బ్రాహ్మణులుం దమ్ములుం బరివేష్టింపఁగ వనమున నుండియు దేవగణపరివృతుం డైనయాఖండలువిధంబునఁ దేజరిల్లుచు సుఖాసీనుఁడై యున్న ధర్మరాజుం గాంచి యన్నరపాలునిచే సత్కృతుండై కుశలంబు నివేదించి విదురున కిట్లనియె. మహాత్మా! ధృతరాష్ట్రమహీపతి యెల్లపుడు నిన్నే దలంచుచు నొండెద్దియుం దోఁచక నీవు లేకున్నఁ బ్రాణము లేలయని వగచుచున్నవాఁడు

వేగంబ నిన్ను దోడ్కొనిరా నన్నుఁ బంపె. అతిత్వరితంబుగ నీవు హాస్తినపురంబునకు వచ్చి యారాజుం బ్రతికింపు మనియె. అనుటయు విదురుఁడు ధర్మరాజానుమతంబునఁ గరినగరంబు సేరి ధృతరాష్ట్రునొద్దకుఁ జనుటయు నతం డావిదురుని గౌఁగిలించుకొని శిరంబు మూర్కొని తొడ సేర్చి ధర్మజ్ఞా! నాభాగ్యవశంబున మగిడి వచ్చితివి. ననుఁ దలంతువే. నినుఁ జూడక నే నిన్నినాళ్లు రేలుంబవళ్లు మఱియొకండు దెలియక కృశించితి. నాతప్పులెల్ల మఱచునది యని యనునయించె. విదురుఁడును ధృతరాష్ట్రు నిర్దేశించి మహారాజా! నీవే నాకు గురుఁడవు. నినుం జూడఁగ నిదె నే వచ్చితి. నీచేసినమొగ్గులెల్ల సైఁచితి. నీకొడుకులుం బాండుపుత్రులును నా కొక్కరూప యయినను దీను లని వారియెడ నెక్కింతయెక్కువగఁ బ్రీతినుంచితి. ఇదియ కాదె ధర్మపరుల కుచితంబు. ఇందు విచారంబు వలవ దని వక్కాణించె.

ఇట్లు వారు పరస్పరప్రేమంబున వర్తిల్లుచున్నంత దుర్యోధనుఁడు దాని నంతయు నెఱింగి కర్ణశకునిదుశ్శాసనుల రావించి యిట్లనియె. రాజు మఱల విదురుని రప్పించె. వాఁ డెపుడుం బాండవులకు హితంబు చేయువాఁ డనుట తెల్లంబుగదా. వానిబుద్ధి విని రాజు పాండవుల రావింపఁ దలంపకయమున్న మన మెద్దియైన నాలోచించి నిర్ణయించుకొనవలయు. ఇఁక వారు వచ్చిరేని నిశ్చయముగ నేను ప్రాయోపవేశముననైన విషముననైన నురినైన నాయుధముననైన నగ్నినైనఁ బ్రాణములఁ ద్యజింతుఁగాని మఱల వారలు సంపత్సమృద్ధులయియుండ నిచటఁ జూడనేర ననిన శకుని యిట్లనియె. నరేంద్రా! నీ వేల యిట్లు మూఢునిపోలె వొంచెదవు. సత్యనిరతులయినపాండవులు సమయంబు దీఱకమున్న నీతండ్రి రప్పించినను రారు. ఒకవేళ వచ్చిరేనియు మఱల జూదమున వారల నిగ్రహించి మనము మధ్యస్థులమై రాజుచిత్తము ననుసరింత మనినఁ గర్ణదుశ్శాసను లిదియ చేయఁ దగు ననిరి. దుర్యోధనుఁ డందుకు మెచ్చక మొగముఁ ద్రిప్పికొనుటయుఁ గర్ణుఁడు రోషమున శకునిదుశ్శాసనాదుల కిట్లనియె. నామతంబు వినుఁడు. మన మందఱ మీదుర్యోధనునకుఁ బ్రియంబుఁ జేయవలయు. కవచాదుల ధరించి యాయుధముల గ్రహించి రథముల నారోహించి యిపుడే మన మందఱము యుద్ధసన్నద్ధులమై పోయి వనగతు లయినపాండవుల వధింతము. వారు సమసిరేని ధార్తరాష్ట్రులు మనమునెల్లను సుఖింప నగు. ఎంతకులోన వారు శోకగ్రస్తులై సహాయహీనులై యుందురో యంతకుమున్న వారల నిర్జింపవలయు. పిదప వారలం గెలుచుట యరిది యనిన నందఱు నిదియ తగు నిట్లు చేయుద మని రాధేయుం గొనియాడి పాండవుల మీఁది కెత్తిపోవ నిశ్చయించి యుండిరి.

——వ్యాసుఁడు ధృతరాష్ట్రునొద్దకు వచ్చుట.——

అయ్యవసరంబున సర్వజ్ఞుం డయినవ్యాసమునీంద్రుండు వారిదురుద్యోగంబు దివ్యదృష్టి నెఱింగి వేగంబ ధృతరాష్ట్రునొద్దకు వచ్చి యిట్లనియె. ధృతరాష్ట్రా! కురుకులహితంబుఁ జెప్పెద. వినుము. దుర్యోధనాదులు వంచనచేఁ బాండవుల వనమునకుఁ బంపుట నాకుఁ బ్రియంబుగాదు. క్లేశములం దలపోయుచు వారు పదుమూఁడేఁడులు గడిపి పదపడి క్రోధోద్రిక్తులై కౌరవులపై విషముఁ గ్రుమ్మరింతురు. అది యట్లుండె. మందబుద్ధి యగునీకొడుకు పాపనిశ్చితుండై రాజ్యార్థముగ నిపుడే వారలఁ జంపఁ దలఁచుచున్నవాఁడు. అడవిలో నున్నవారని వారిం జంపఁ బోయెనేని నీకొడుకు తానే చచ్చు. కావున నీదురుద్యోగంబు వారింపుము. వారికి శాంతిఁ గావింపుము. నేను భీష్మద్రోణకృపవిదురులు నీవు నీవిషయమున యుక్తంబు చింతింపనవలయు. స్వజనవిరోధం బెంతయు నింద్యము. దాన నధర్మంబు నయశస్సునుం జేకూఱు. ఈవిషయము నుపేక్షించెదవేని యెంతయే నన్యాయ మగు. సాధుసహవాసం బెట్టివానికైన సౌజన్యముఁ గావించుఁ గాన నీకొడుకును వనమునఁ బాండవులతోడ నుండఁ బంపుము. అట్లొక్కింతకాలము గడచెనేని యొకవేళ వారితోడఁ జెలిమి యైననగు. ఇంతయేల? మనుష్యునకుఁ బుట్టినపుడు గలిగినబుద్ధి చచ్చునంతకు మాఱ దనివిందుము. దీనం బ్రయోజనంబు లేదనియ తోఁచెడి. ఇందు భీష్మద్రోణవిదురు లేమి తలంతురో? నీయభిప్రాయ మెట్టిదియో? కార్యము చెడకమున్న తగుదానిం జేయునది యనిన ధృతరాష్ట్రుఁ డిట్లనియె. మునీంద్రా! నాకును, భీష్మద్రోణవిదురులకును, గాంధారికిని జూద మభిమతముగాదు. దైవబలంబును, మాయవివేకబలంబునుం గారణబులు గాఁగ నిట్లయ్యె. దుర్యోధననిమిత్తంబునఁ గీడులు పొడము నని తెలిసియుఁ బుత్రస్నేహంబున వాని విడువ నోప ననిన వ్యాసుఁ డిట్లనియె. ధృతరాష్ట్రా! నీచెప్పినది సత్యంబ. పుత్రునికంటె నధికము వేఱొక్కటి యుండదు. ఇదుకొకయితిహాసంబు సెప్పెద. తొల్లి సకలగోమాత యగుకామధేనువు దేవేంద్రుని పాలికిఁ బోయి యేడ్చుటయు నయ్యమరేంద్రుఁడు కరుణించి శోకకారణం బెయ్యది? దేవమనుష్యనాగులకెల్ల క్షేమంబె? నీయేడ్పునకెంతయేఁ గారణం బుండవలయు నని యడుగ నది యిట్లనియె. సురేంద్రా! నాకొడుకులు దక్కఁ దక్కటివా రెల్ల సుఖులే. కర్షకుఁ డొకఁడు బలవంత మయినయెద్దుతోడ నొక దుర్బల మయినయెద్దుం గాఁడికట్టి యందు దుర్బలంబు బరువు నీడ్వఁ జాలకున్న మునికోలచేఁ బొడుచుచున్నవాఁడు. చూడుము. దానియవస్థం జూచి యిట్లు శోకావిల నైతి ననిన నింద్రుఁడు సురభీ! వేవురు కొడుకులలో నొక్కరుఁడు కష్టపడుచుండిన వగవ నేల యనినఁ గామధేనువు సురేంద్రా! యిట్లనఁ దగు

వేవురుకొడుకు లుండిన నెక్కఁడైన దీనుఁ డయ్యెనా వానిదైన్యంబుఁ జూడ నోప ననివిన్నవించె. ఇంద్రుఁడు ప్రాణమునకంటెఁ గొడుకు లెక్కుడుగా యని నిశ్చయించి కరుణించి వర్షించె. దానఁ దత్కాలంబునఁ గృషిలేమియుఁ బదపడి తృణజలసమృద్ధిచేఁ గృశవృషంబును బలవంత మగుటయుం గారణంబుగా నా యెద్దును సుఖింపఁగఁ గామధేనువు శోకం బుడిగి సంతోషించె నని వ్యాసుఁ డింద్రసురభిసంవాదంబు వివరించి వెండియు నిట్లనియె. సురభివచనప్రకారంబునఁ బుత్రులలోన దీనులయెడ నత్యంతప్రేమము గలిమి సహజంబు. నీవుం బాండు రాజును విదురుఁడును నా కొక్కరూప. ఐన నీకుఁగొడుకులు నూఱుగురు. పాండు రాజున కేవురే? వారును దుఃఖార్ణవమగ్ను లగుటంజేసి యెట్లు జీవింతురో యెట్లు పెరుగుదురో యని యెల్లపుడుం బరితపింతు. విశేషం బేల? కౌరవులసుఖ జీవనంబుఁ గోరెదవేని దుర్యోధనుని బాండునందనులతోడం గలసికొని శాంతి నవలంబింప నియోగింపు మనిన ధృతరాష్ట్రుఁడు మహాత్మా! భవద్వచనం బుచి తంబు. భీష్మద్రోణవిదురు లిట్ల చెప్పిరి. నాపై ననుగ్రహంబును గౌరవులపై దయయుం గలదేని నీవ దురాత్ముం డగుదుర్యోధనుని శాసింపు మని మనివిచేసె. కృష్ణద్వైపాయనుం డావచనంబు విని యాంబికేయా! మైత్రేయుం డనుమహర్షి వనగతు లగుపాండవులం గాంచి యిచ్చటికి వచ్చుచున్నవాఁడు. అమ్మహాత్ముఁడు కురుకులహితముగా దుర్యోధనునకు శాంతి నుపదేశించి శాసించువాఁడు. తనబో ధించినదాని వినకున్న నమ్మునీంద్రుఁడు రోషమున నవశ్యంబు శపించు నని వివరించి వ్యాసమునీంద్రుఁ డరిగె.

## మైత్రేయుఁడు దుర్యోధనుని శపించుట.

అట్టియెడ మైత్రేయుండు విచ్చేయుటయు ధృతరాష్ట్రుఁ డమ్మునివరేణ్యు నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి మహాత్మా! సుఖాగమనం బే? పాండవులకుఁ గుశలం బే? వారికి సమయము విడువకుండఁగఁ దలఁపు గలదే? కౌరవుల కెడఁబా టునేక సౌభ్రాత్రంబు గలుగునే? యనియడుగ మైత్రేయుఁ డిట్లనియె. నరేంద్రా! తీర్థయాత్రావశంబున నేను దేశములం దిరుగుచు నాకస్మికముగఁ గామ్యకవన మునకుఁ బోయి జటావల్కలధారి యైనధర్మరాజుం జూచి యచ్చటిమునులవలన నీకొడుకులదౌర్జన్యంబున ద్యూతప్రవృత్తియు దాన నైనయన్యాయంబును నెఱింగి కురుకులక్షేమంబుఁ గోరి నీకడకు వచ్చితి. నాకు నీపై నెల్లపుడుం బ్రీతి యభ్య ధికంబు. నీవును భీష్ముఁడును జీవించియుండఁగనే కొడుకులలో నిట్లు పరస్పరవై రము యోగ్యమగునే? ఇట్లుండఁ బశువులబంతికట్టునకు మేధిస్తంభముపోలె నీవే యీవైరమునకు మూలకారణంబవై ఘోర మైనయన్యాయంబు పొడము చుండ నుపేక్షించితివి. సభయందు దస్యులపోలె [illegible]చేసినదుర్వృత్తంబు తాప

సులమోడఁ దగ దనిపలికి దుర్యోధనుదెస మొగంబై యిట్లనియె. దుర్యోధనా! నీకు హితంబుఁ జెప్పెద. వినుము. పాండుపుత్రులపై ద్రోహబుద్ధి నుడుగుము. నీకుం బాండవులకుం గౌరవులకెల్లరకుం బ్రియంబు సేయుము. పాండవు లందఱు మహాశూరులు. వజ్రదృఢకాయులు. సత్యవ్రతులు. అమితపౌరుషంబు గలరు. హిడింబబకాదు లయినరాక్షసులు వారిచే మడిసిరి. కిమ్మీరుఁడనురాక్షసుఁ డిప్పుడ కొన్నినాళ్లకుమున్న వనమందు రేయి వారు చరింపుచుండఁ ద్రోవ నావరించి నిల్వఁగ భీముఁ డలిగి వానిం గీటడంచె. పదివేలయేనుఁగులబలము గల జరాసంధుని దిగ్విజయమున నావృకోదరుఁడు క్రోల్పులి చిఱుమేకంబునుంబోలెఁ బరిమార్చుట యాదఱకుం దెల్లంబుగాదే?. మఱియు ధృష్టద్యుమ్నాదిపాంచాలురు బంధుత్వసంబంధమున వారికి సహాయులు. జగన్నాథుఁ డైనవాసుదేవుఁడును వారివాఁడే. మనుష్యమాత్రుం డెవ్వఁడైన వారిం బోర నెదిరింపఁగలఁడే? కావున వారితోడ శాంతిం బొందుటయ లగ్గు. కోపము వలదు. నామాట వినుమనుచున్నంత దుర్యోధనుఁ డించుక నవ్వుచుఁ దొడ సఱచి కాలిచే నేల గీఱింపుచు నఱమొగంబు వాంచుటయు మైత్రేయుం డలిగి శాపజలంబులం గ్రహించి యోరీదురాత్మా! నామాట నాదరింపమికి ఫలం బిపుడ యనుభవింతువు. నీద్రోహబుద్ధిచే మహాయుద్ధము కాఁబోయెడి. అందు భీముఁడు గదచే నీతొడ విఱుగ నడచువాఁ డనిశపించె. అంతుల కదరిపడి ధృతరాష్ట్రుఁడు పలుదెఱంగుల నమ్మునివరుం బ్రసన్నుం జేయఁగ నతండు ధృతరాష్ట్రా! నీకొడుకు పాండవులతోడివైరం బుచాలించి శాంతిఁ బొందెనేని శాపంబు గానేరదు. కాకున్న నవశ్యంబుగ నగుననుటయు ధృతరాష్ట్రుఁడు మునివరేణ్యా! కిమ్మీరవధవృత్తాంతము వివరింపవే యనిప్రార్థింపఁగ మైత్రేయుఁడు దాని నేఁ జెప్పను. నీకొడుకు నామాట వినెల్లఁడు. భవత్ప్రశ్నంబు విదురుఁడు వివరించు నని చెప్పి యమ్ముని యరిగె. భీమునిచేఁ గిమ్మీరుఁడు చచ్చుటకుఁ గుందుచు దుర్యోధనుండు నచ్చోటు వాసిచనియె.

భీముఁడు కిమ్మీరుఁ డనురాక్షసుని జంపుట.

అట ధృతరాష్ట్రుఁడు కిమ్మీరవధవృత్తాంతము వినవలతు. ఆరాక్షసునకు భీమునితోడిసమాగమం బెట్లు గలిగె? వివరింపుమని విదురు నడుగుటయు నతం డిట్లనియె. నరేంద్రా! వినుము భీమునియమానుషకృత్యంబు. జూదమున నోడి పాండవు లిటఁ దఱలి కామ్యకవనమునకుఁ బోఁ దలంచి నిరంతరప్రయాణంబుల మూఁ డహోరాత్రంబులు వోవుచుండ నొక్కనాఁడు నడురేయి నరసంచారశూన్యం బైనకిమ్మీరవనంబున నొకరాక్షసుఁడు చేతులు సాచి నోరు దెఱ భీకరముగాఁ ద్రోవ నడ్డగించె. స్పష్టము లైనయెనిమిదికోఱ, లెఱ్ఱసమిడిగ్రుం

మీఁది కెగఁ బ్రాఁకియున్న వెంద్రుకలుం గలిగి సూర్యప్రకాశంబు, మెఱుములు, కొంగలబారునుం గలిగినయంబుదంబు ననుకరించి ఘోరనాదంబులు సేయుచు మాయఁ గావింపుచున్న యారాక్షసునియఱపులకు వెఱచి సింహశార్దూలాది క్రూరజంతువులు పక్షులు నున్నచోటు విడిచి పాఱె. వానితొడలయొరపిడిఁ బొడమినగాలికి వడఁకి తీవలెల్ల జెట్టులం జుట్టుకొనియె. కఱకుదుమారమ్ము రేఁచుచు వెలుంగు నడంచుచు నతిదారుణంబుగ గాలి విసరె. అట్లు వాఁడు పంచేంద్రియార్థంబులకు శోకావేశంబునుం బోలెఁ బంచపాండవుల కెఱుకగాకుండ మైనాకపర్వతంబుచాడ్పున నవ్వనద్వారం బావరింపఁగ దుశ్శాసనకరాకర్షణప్రకీర్ణ కేశ యగుపాంచాలి పంచపర్వతమధ్యస్థ యగునదివోలెఁ బంచపతిమధ్యమున డాఁగి గడగడవడఁకుచు వికృతరూపుఁ డగునారక్కసుని జూడ వెఱచి కన్నులు మూసికొనుటయుఁ బాండవు లేవురు నాభీరువును విషయములందుఁ బ్రసక్తము లయిన యింద్రియములిచ్ఛా విశేషంబునుంబోలె గ్రహించి యూఱడింపుచుండిరి. ధౌమ్యుఁ డంతట రక్షోఘ్నమంత్రముల నామాయనెల్ల నశింపఁ జేయఁగ నాదుష్టరాక్షసుఁడు కామరూపముఁ దాల్చి క్రూరరూపుఁడై యగపడుటయు ధర్మరాజు వానిం జూచి నీ వెవ్వఁడ వెవ్వనివాడవు నీపనియేమి? చెప్పు మనియడుగ వాఁ డిట్లనియె. నేను బకాసురునితమ్ముఁడను. కిమ్మీరుఁ డనంబరఁగువాఁడను. యుద్ధమున మనుష్యులఁ జంపి వారలఁ దినుచు జనశూన్య మైనయీకామ్యకవనమున నిర్విచారుఁడనై యుండెదను. మీ రెవ్వరు? మి మ్మందఱం జంపి భక్షించెదననిన ధర్మరాజు విని మేము పాండవులము. అందు నేను యుధిష్ఠిరుఁడను. నీవు వెఱిఁగియుందువు. వీరే భీమార్జుననకులసహదేవులు. ఒక కారణమున రాజ్యము గోల్పడి వనవాసము చేయ వచ్చినవార మనినఁ గిమ్మీరుఁ డిట్లనియె. చిరకాలముగ భీముంజంపవలయు ననితలంచి యాయుధముఁ బూని సంచరింపుచుండిన వాఁడింతవఱకెలభింపఁడయ్యె. తనకుఁ దాన యిప్పుడు లభించె. యిపుడుగదా దైవము ప్రసన్నపయ్యె. బ్రాహ్మణవేషధారియై వీఁడు వేత్రకీయవనంబున నాకుఁ బ్రియభ్రాత యగబకాసురుని సంహరించె. వీనికి విద్యాబలంబకాని శరీరబలం బంతగ లేదు. వెండియు వీఁడు నానెచ్చెలి యగుహిడింబుని బరిమార్చి వానిచెలియ లగుహిడింబ నపహరించుకొనిపోయె. ఈదురాత్ముఁ డిపుడు బుద్ధిమాలి మనుష్య దుష్ప్రవేశం బయిన యీవనంబును నడురేయి సొచ్చె. నేఁడు వీనినెత్తుట బకహిడింబులకుఁ దర్పణంబు సేసి వారిఋణంబుఁ దీర్చికొనియెద. నేఁ డీరాక్షసకంటకుని బొరిగొని మీ రెదలుచూచుచుండ నంజుడు నమలి యగస్త్యుఁడు వాతాపినింబోలె నఱిగించుకొనెద ననిన ధర్మరాజు వాని నదలించె. భీముఁ డొకద్రుమంబుఁ బెఱికికొని వానిపైకఱుం దొడంగె. అర్జునుఁడును గాండీవంబుమోపెట్టి నిలునిలు మనియదల్చె

అంతలోన భీముఁడు చేతులఁ జఱచి యవుడుగఱచి కాలదండతుల్యం బైనయొక మహావృక్షంబుఁ జేత నుంచుకొని వాని నెదిరించి వేగంబ చని యింద్రుఁడు వజ్రమునుంబోలె నారాక్షసుపై వృక్షంబుఁ బడవైచె. వాఁడుం గోపించి తన చేతనున్నకొఱవిని భీముపై విసరివైచుటయు భీముఁడు దాని నెడమకాలిచేఁ దొలఁగఁ ద్రోచె. కిమ్మీరుఁ డంతట వృక్షంబుఁ బెఱికికొని వచ్చుటయు భీముఁడుం గుఱంగటం గలమ్రాఁకులఁ దెచ్చి విసరివైచుచుండె. ఇట్లు వారు వాలిసుగ్రీవుల విధంబునఁ బోరాడుచుండఁ జెంగటనుండువృక్షములెల్ల సమయుటయుఁ గిమ్మీరుఁడు ఱాల ఱువ్వఁగ వృకోదరుఁడు దాని సరకుగొనఁడయ్యె. అట నారాక్షసుఁడు రాహువు సూర్యునింబోలె భీము నాక్రమించి వచ్చుచుండ భీముఁడుం గనలి పోట్లాడుటయు నయ్యిద్దఱి పోరు దారుణం బయ్యె. అట్లు వారు కొండొకవడి నఖదంష్ట్రాయుధంబు లయినక్రోల్పులులవడువునఁ బోరాడుచుండఁ బాంచాలి భీముని సాకూతంబుగఁ జూచుచుండె. భీముఁడు దుర్యోధనావమానంబునను బాహుబలంబునను ద్రౌపదీసమాలోకంబునను విజృంభించి క్రోధసంరబ్ధుండై వన్యమత్తశుండాలంబు మదపుటేనుంగునుంబలె నారాక్షసుం బట్టుకొని ఘోరనాదంబు నిగుడ సందిట నిఱికించుకొని చండమారుతంబు మ్రాఁకునుంబోలె వేగమున విసరుచుండె. కిమ్మీరుఁడును భీమసేనవిధూతుం డయ్యు శక్తికొలఁది వృకోదరు నీడ్చుచుండె. భీముఁ డంతట రాక్షసుని బలక్షయం బెఱింగి త్రాటఁ బశువునుం బలెఁ దనభుజముల వానికాయంబు బిగియించి పట్టి మీఁది కెత్తి పగిలినదుందుభివిధంబున వాఁ డఱచుచుండఁ బెక్కుమాఱులు గిరగిరం ద్రిప్పి క్రింద వైచి సంధిబంధములు వీడ గ్రుడ్లు పైకి రాఁగఁ గటిప్రదేశమున మోఁకాలుంచి యదిమి చేతుల మెడఁ బట్టి యెత్తి వానికాయంబు భల్లన విఱిచి పశుమారణప్రకారంబున నాకిమ్మీరుని వధించి యోరీ రాక్షసాధమా! బకహిడింబులకుఁ గన్నీరు నైనఁ దుడువఁ జాలవైతివిగా. అయ్యో. యమపురంబునకుఁ బోయితి వని యుల్లసమాడి యప్పాపకళేబరంబుఁ బాఱఁ ద్రోచె. కిమ్మీరుఁ డిట్లు హతుఁ డగుటయు ధర్మజార్జుననకులసహదేవులు ద్రౌపది ధౌమ్యాదులును భీమసేనుం బ్రశంసించి ద్వైతవనంబునకుఁ జనిరి. ఈవృత్తాంత మచ్చటిమునులెల్లఁ బలుమాఱులు సెప్పుచు భీమసేనునికారుణ్యమున రాక్షసపీడ తొలంగె నని యావృకోదరుం బ్రశంసింపుచున్నవారు. ఇది కిమ్మీరవధవృత్తాంతం బని విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ దెలుపఁగ నతఁడు పెద్దనిట్టూర్పు నిగుడింపుచుఁ జింతింపుచుండె.

అటఁ బాండవులు ద్యూతపరాజితులై కానల కేగి రని విని పాంచాలకైకేయాదులు వాసుదేవుఁడు నప్పాండవులం గాంచఁగ నవ్వనంబు సొచ్చి ధార్తరాష్ట్రుల నిందింపుచు ధర్మరాజుం జేరి యుచితప్రకారంబునఁ బ్రణామాలింగ

నాశీర్వాదంబుల నడుపుచున్నంత జనార్దనుఁడు యుధిష్ఠిరునకు మ్రొక్కి శోకసంతప్తుండై యిట్లనియె. పాపాత్ము లగుదుర్యోధనదుశ్శాసనకర్ణశకునులరక్తమును భూమి యవశ్యంబుగ నచిరంబ త్రావఁగలదు. ఈదుర్జనులనెల్ల నొక్కపెట్టిన వధించి సర్వరాజ్యంబునందు ధర్మరాజున కభిషేకంబుఁ గావింతుము. అధర్మమున సాధుల కెగ్గు లొనరించువాఁ డెల్లవిధముల వధ్యుఁడే. ఇది సనాతనం బైనయుత్తమధర్మంబ యని పాండవపరాజయంబునఁ గ్రోధసంరంభుండై ప్రజలఁ గాల్పఁ బూనుచుండ నర్జునుండు కోపశమనంబుగా వాసుదేవున కిట్లనియె. శ్రీకృష్ణా! తొల్లి నీవు పదివేలేండ్లు గంధమాదనపర్వతంబునఁ దపంబు చేసి పుష్కరంబులఁ బదునొకండువేలయేండ్లు వాయుభక్షుండవై యుండి బదరీవనమున నూర్ధ్వబాహుండవై యొకపాదంబున నూఱేఁడు లుండి సరస్వతీతీరంబున ద్వాదశవార్షికసత్రయాగంబున నుత్తరీయవిరహితుండవై కృశుఁడవై వసించి ప్రభాసతీర్థమున దివ్యవర్షసహస్రంబు నియతుండవై యేకపాదంబున లోకప్రవృత్తినిమిత్తంబుగాఁ దప మాచరించితివి. కైలాసమునను బెక్కేఁడు లుంటి వని వేదవ్యాసుఁడు నాకుఁ దెలిపె. నీవు క్షేత్రజ్ఞుఁడవు సర్వభూతముల కాదివి యంతంబవు తపోనిధివి నిత్యుఁడవు. మఱియు నీవు నరకాసురుని సంహరించి మణికుండలములఁ దెచ్చి యిచ్చి యింద్రు నకింద్రపదవిఁ గావించితివి. నీవే విష్ణుఁడవు. బ్రహ్మవు. సోముఁడవు. సూర్యుఁడవు. ధర్ముఁడవు. ధాతవు. యముఁడవు. వహ్నివి. వాయుఁడవు. వైశ్రవణుఁడవు. రుద్రుఁడవు. కాలంబవు. గగనంబవు. భూమివి. దిక్స్వరూపుఁడవజుఁడవు చరాచరగురుఁడవు. వెండియుఁ జైత్రరథవనంబున లక్షసువర్ణంబులు దక్షిణగా ననేకయజ్ఞంబు లాచరించితివి. అదితికశ్యపులకుఁ గుమారుఁడవై యుపేంద్రుఁడనంబరఁగితివి. నిజతేజమున సూర్యునింగూడ వెలిఁగింతువు. నీ వనేకావతారముల గ్రహించి యధర్మపరు లగురాక్షసుల సంహరించితివి. ప్రాగ్జ్యోతిషపురంబు సాధించి క్షేమ మొడఁగూర్చితివి. శిశుపాలాదులఁ జంపితివి. రుక్మి నోడించి రుక్మిణిని సాధించితివి. ద్వారకను వశీకరించుకొంటివి. తుది దానిని సాగరంబునఁ గలిపెదవు. నీయందుఁ గ్రోధమాత్సర్యానృతకౌటిల్యములు గన్నట్టవు. ఋషు లందఱు ని న్నభయంబు వేఁడుదురు. యుగాంతమందు సర్వభూతముల సంక్షేపించుకొని యాత్మభూతుఁడ వయ్యెదవు. యుగాదియందు నీనాభికమలంబున బ్రహ్మదేవుఁడు పుట్టి చరాచరాత్మక మయినజగము సృజించె. మధుకైటభు లనురాక్షసులు బ్రహ్మను సంహరింప వచ్చుటయుఁ గ్రోధదీప్తుఁడైన నీలలాటమున శూలపాణియై నీలలోహితుఁడు జనించె. కాన వా రిరువురు నీశరీరమున జనించినవారలే. నీయానతిమెయి నడచువారలే యని నారదుఁడు వచించె ఈయవతారమున బలరామసహాయుఁడ వగునీవు బాలుఁడవయ్యు నొనరించినకా

ర్యములు మఱియే ప్రౌఢుండైనం జేయ నేర్చునే యని కీర్తించిన విని భగవంతుం డర్జునున కిట్లనియె. పార్థా! నీవు నావాఁడవు. నేను నీవాఁడను. నీవారెల్ల నావారలే. నావారెల్ల నీవారలే. నీకు శత్రుండు నాకును శత్రుండే. ని న్ననుసరించిన యతఁడు న న్ననుసరించినయతఁడే. మనము పూర్వజన్మమున నరనారాయణులనుమునులము. అందు నీవు నరుఁడవు. నేను నారాయణుఁడను. దేవకార్యార్థముగ మన మిపుడు మనుష్యులమై పుట్టితిమి. నాకంటె నీ వన్యుఁడవు కావు. నేను నీకంటె నన్యుఁడను గాను. మన కొకించుకయైన భేదము గానరా దనిచెప్పుచున్నంతఁ బాంచాలి ధృష్టద్యుమ్నాదిసమన్వితయై చేరవచ్చి సకలరాజపరివృతుండై పాండవమధ్యమున నాసీనుండై యున్న కేశవున కిట్లనియె.

ద్రౌపది కృష్ణునితోఁ దనపరిభవంబుఁ జెప్పికొనుట.

మాధవా! తొల్లింటిప్రజాసృష్టియందు నీవే ప్రజాపతి యనంబరఁగి సర్వలోకముల సృజించితి వని యసితుండైనదేవలుఁడు సెప్పె. నీవే యజ్ఞస్వరూపుఁడవు. యజ్ఞఫలదాయి వని జామదగ్న్యుండు వచించె. సత్యయజ్ఞాత్మకుఁడ వని కశ్యపుండు వాక్రుచ్చె. సర్వదేవతల కీశుఁడ వని నారదుఁడు బోధించె. శాంతమూర్తి యని సకలమునులు వక్కాణించిరి. క్రీడాసాధనముల బాలుఁడుంబోలె బ్రహ్మరుద్రేంద్రాదులతోడ జగత్క్రీడావినోదంబుఁ జేయుదువు. శిరస్సున నాకాశంబును బాదముల భూమిని గర్భమున సకలలోకముల నాక్రమించినవిరాట్స్వరూపుఁడవు. అధ్యాత్మవిద్యాపరు లగుమహామునులకు నీవే గతివి. రణమునఁ బరాఙ్ముఖులుగాక వీరస్వర్గము సాధించినపుణ్యవంతు లగురాజోత్తములకు నీవే ప్రాప్యుఁడవు. నీవే ప్రభుఁడవు. విభుఁడవు. భూతాత్మవు. లోకపాలసమన్వితలోకంబులు, నక్షత్రంబులు, దిక్కులు, విదిక్కులు, సూర్యచంద్రాదులు, సకలభూతంబులును నీయందె సుప్రతిష్ఠితంబులు. మర్త్యభూతములకు మరణంబును దేవతలకుఁ దదభావంబును నీవలనఁ గలుగు. అట్టిమహానుభావుఁ డగునీయొద్ద నే నేమి పలుకుదానను. ఐన నీకు నాయెడఁ బ్రేమాతిశయంబు గలిమిం జేసి విన్నవించెద. పాండవులకు ధర్మపత్నిని నీకుం జెలి ధృష్టద్యుమ్నునకుం జెలియలనయ్యుఁ గౌరవసభలోన సకలరాజసమక్షంబున రజస్వల నేకవస్త్రయునై యుండి పాపాత్ముఁడగు దుశ్శాసనునిచే నీడ్వఁబడితి. అపుడు నన్ను జూచి ధార్తరాష్ట్రులు నగి నన్ను దాసిగాఁ జేసికొనఁ దలంచిరి. పాండవులు పాంచాలురు యాదవులును జూచుచుండఁగ భీష్మధృతరాష్ట్రులకుఁ గోడలనయ్యు భంగపాటులపాలైతి. మహాబలులయ్యుఁ బాండవులు ధర్మపత్నిక్లేశములఁ జూచుచు నోర్చుచుండిరి. భీమసేను మహాబలంబు నర్జునుగాండీవంబు నుండియు నేమి ప్రయోజనము. ఆవిల్లు నీవు భీమార్జునులుం దక్కఁదక్కటివార లెత్తనైనఁ జాలరు. అట్టిగాండీవంబున నంపతుంపరఁ

గురియుంచు విజయునిపౌరుషం బేల? బలవంతులుగాకుండినను భర్తలు భార్యల రక్షించుట శాశ్వతం బయినధర్మంబు. భార్యను రక్షింప సంతతి రక్షితంబయగును. సంతతిరక్షణంబున నాత్మరక్షణంబు తనంతట నగలుగు. తానే భార్య యందు బుత్రరూపంబునం బుట్టుటం జేసి భార్య జాయ యనంబరగు. భార్యయుం దనగర్భమున నితండు జనించునాయని భర్త ననేకవిధముల రక్షింపవలయు. ఇట్టిధర్మముండంగ శరణాగతయు ధర్మపత్నియు ననువ్రతయు నగున న్నుపేక్షించిరి. ఎవ్వండేని శరణంబు వేడిన రక్షించు నట్టిధర్మపరులకు నాయెడ నుపేక్ష దగునే? వీరివలన నాయందుం బ్రతివింధ్యాదు లయినకుమారు లేవురు పుట్టిరి. పుత్రులం జూచియైన నన్ను రక్షింప వలయుంగాదే? పాపాత్ముం డగుదుర్యోధనుని వధింపకున్న వీరిపౌరుషం బేల? ఆదుర్యోధనుడు వీరికిం జేసినయెగ్గుల నెన్న రాదు. వీరును వారు నెక్కటిగా నధ్యయనముం జేయుతఱి నాదుర్యోధనుడు భీమునకు విషాన్నంబుం బెట్టించె. ఆయుశ్శేషంబు కలిమిం జేసి యవ్విషం బన్నంబుతోడన యఱిగె. ప్రమాణకోటియందు సుఖసుప్తుండై యుండం దీఁగెలు మొద లగువానిచే దృఢముగం గట్టించి గంగమడువునం ద్రోయించె. మహాబలుండుగాన నాబంధములం ద్రెంచిభీముఁడు క్రమ్మఱగట్టు చేరె. అతని సర్వాంగములం బాములు గఱపించె. వజ్రకాయుం డగునతని కాశీవిషవిషములేమియుం జేయం జాలవయ్యె. వంచనచే నతనిప్రియసారథినిజంపె. మఱియువీరి నేవురను గుంతీమహాదేవిని వారణావతంబున లక్కయింటం జొనిపె. అది తప్పించుకొని పాఱుచు నడవులం గ్రుమ్మరుచుండ భీముఁడు హిడింబాసురుం జంపి హిడింబను బరిగ్రహించె. దానియందే ఘటోత్కచుఁడు వాయుపుత్రునకుం బుట్టెంగదా. అట నేకచక్రాపురం బందఱు చేరి బ్రాహ్మణవేషమున నుండంగ భీముఁడు బకాసురుం జంపి యాపురంబువారల కాపదం దొలగించె. పదంపడి వారందఱు పాంచాలరాజధానిం జొచ్చిరి. అచట స్వయంవరంబున నర్జునుఁడు నన్ను సాధించుట యాతియు నందఱు నెఱింగినది యకాదే? ఇట్టిమహామహులకుం బత్నినయ్యుం, బాండురాజునకుం గోడలనయ్యు, మహాకులీననయ్యుం,గౌరవసభలోనం బడరానిపాట్లుపడితి. పరమదుష్టాత్ముం డగుదుశ్శాసనుఁడు వెండ్రుకలు పట్టియీడ్చిన నిపలుకుచుం గన్నుంగవం దొఱంగి పాఱు బాష్పసందోహంబు చన్గవపైం జిందుచుండం గన్నులు దుడిచికొనుచుం బైంటచెఱంగున నెమ్మొగంబు గప్పికొని మేడ్చుచు జగన్నాథా! యంద ఱుండియు నాకుమగలు కొడుకులు చుట్టలన్న దమ్ములు తల్లిదండ్రులును నీవును లేనట్లయ్యె. కురుని లవమానింపుచుండ నుపేక్షించితిరిగదా. అన్నింటికంటెం గర్ణుం డొనర్చినపరిహాసమునం బొడముశోకాగ్ని యెద్ది చేసినం జల్లాఱకుండు. సంబంధము గౌరవము చెలిమి ప్రభుత్వము నను నాలుగు కారణంబుల నీవు నను రక్షింపనవలయునని దీనాలాపంబులం బలుకుచుండ వాసుదేవుం డప్పరమపతివ్రత కిట్లనియె. సాధ్వీ!

నీక్రోధానలంబునకుఁ బాత్రంబు లైనవారు గాండీవిశర పరంపరాసారంబులము నీఁగి నెత్తుటం జొత్తిల్లి రణరంగమున నిహతులై పడియుండఁగఁ జూచి వారి భార్యలు నింతకంటె నెక్కు_వగ నచిరంబ యేడ్చువారు. వందుర వలదు. పాండవులకు హితంబుఁ జేసెద. నీపతులే రాజులకెల్ల రాజులు గాఁగ నీవే పట్టంపుదేవి వగుదువు. ఇంతయు నిక్కు_వంబు. ఆకసంబు పడినను హిమవంతంబు వ్రయ్యలైనను భూమిశకలంబులైనను సాగరంబు శోషించినను నావచనంబు తప్పనేరదనిన విని ద్రౌపదియపాంగమున నర్జునుఁజూచుటయు నయ్యేకవీరుండు పాంచాలి నుద్దేశించిశుభాంగీ! విలపింపకుము. మధుసూదనునివచనంబు తప్పదని యూఁడిపంపుచున్నంత ధృష్టద్యుమ్నుఁ డిట్లనియె. నేను ద్రోణాచార్యుని వధింతు. శిఖండి భీష్ముం బరిమార్చు. భీముఁడు దుర్యోధనాదుల భంజించు. గాండీవి కర్ణునిం బొరిగొను. రామకృష్ణులసహాయంబున రణంబున మే మింద్రునైనం గెలుతుము. ధార్తరాష్ట్రుల గెల్చు టెంతపని? యనిపల్కు_చుండ వీరు లందఱువాసుదేవుం జూచుటయు నమ్మహాత్ముండు. ధర్మాత్మజున కిట్లనియె. నరేంద్రా! ద్వారకలోన నే నుంటినేని యీకష్టంబు మీకుఁ గలుగనేరదు. ధృతరాష్ట్ర దుర్యోధనాదులు పిలువకున్నను నే నవశ్యంబుగ జూదమునకు వచ్చియుందు. వచ్చి యాసభామధ్యంబున సకలజనులు వినుచుండ నత్యంతస్త్రీలోలత్వంబు, జూదము, వేఁట, పానము, ననునాల్గుదుఃఖంబులు కేవలకామసముద్భవంబులు. వానికిఁ జిక్కి_ననరుండు సంపదలఁ దొలఁగు ననియు నందు జూదము మహావ్యసనంబు. తన్నిమిత్తంబున నొక్క_దినంబుననే త్యాగభోగంబులు లేకయే ద్రవ్య మంతయు నశించు. ప్రల్లదంబు లప్పటప్పటికిఁ బెచ్చు పెరుగు. తొల్లియు నిషధపతి యగునలుఁడు ద్యూతదోషంబున రాజ్యభ్రష్టుం డయ్యె ననియు సహేతుకంబుగ జూదంబున దోషంబుల నుపన్యసించియుందు. నాయుపన్యాసంబు వినిన మేలే యగుంగదా. వినఁడేని తత్క్షణంబ వానిం దదీయులఁ గితవుల నెల్లర నిగ్రహింతు. నే నపుడు ద్వారకలో నుండనైతి. దాన మీ కిన్నిపాట్లు పడవలసె. అటఁ గొన్నినాళ్లకు నేను ద్వారకకుఁ జనుదెంచి యుయుధానునివలనఁ గ్రమంబుగ భవదీయవృత్తాంత మంతయు నెఱింగి యదరిపడి మిమ్ముఁ గనుఁగొన నతిత్వరితగతి నిట కేతెంచితి. అక్కటా! ఇడుములఁ గుడుచుచుండ మిమ్ములఁ జూడవలసె ననిన ధర్మరాజు మధుసూదనా! నీ వపు డేమిపని గలిగి యెచ్చటికిఁ బోయియుంటి వనియడుగుటయు వాసుదేవుండు ధర్మనందనా! శిశుపాలవధకుపితుండై నతదనుజుం డగుసాల్వునిసంహారార్థంబుగా సౌభనగరంబుమీఁది కేత్తిపోయియుంటి ననిన వెండియు ధర్మరాజు సౌభవధప్రకారంబు వివరింపు మనిప్రశ్న సేయఁగ దేవకీనందనుండు కుంతీనందనున కిట్లనియె.

**కృష్ణుఁడు ధర్మరాజునకు సౌభవధోపాఖ్యానంబుఁ జెప్పుట.**

ధర్మనందనా! నీరాజసూయంబున నన్నుఁ బూజించుటకు మెచ్చక రోష
వివశుండై నశిశుపాలుండు మదీయచక్రనిహతుం డగుట విని వానితమ్ముఁడు
సాల్వుఁడు కోపాటోపదీపితుండై కామగమనం బైనసౌభ మనుపురం బధిష్ఠించి
నే నింద్రప్రస్థంబున నుండ ద్వారవతిపై నెత్తివిడిసె. విడియుటయు నుగ్ర
సేనుఁడు చక్రశతఘ్నీప్రభృతియంత్రంబుల శక్తితోమరాంకుశపరిఘపరశ్వథా
ద్యాయుధంబుల భేరీపణవాదివాద్యంబుల నశనిపాతనిరోధకసాధనంబులను
గ్రహించి యమ్మైగుల్మంబుల నేమఱకయుండఁగఁ దగువీరభటుల నియమించి
మధ్యమగుల్మంబున నుత్తమవీరుల గదసాంబోద్ధవాదిరథికుల నప్రమత్తులరై
యరసి యుండుఁ డనినియోగించి యంతటం ధ్వజము లెత్తించి తోరణంబులఁ
గట్టించి గోపురాట్టాలకప్రాకారాదుల సురక్షితంబులఁ గావించి యగడ్తల నాతట
నీఁటెల నాటించి పట్టణముచుట్టు క్రోశపర్యంతంబు భూమియంతయు నతివిషమ
ముగఁ జేయించి యగడ్తలుం ద్రొట్టిజలప్రవాహంబులపై సేతుబంధములఁ
బగులఁ గొట్టించి సర్వవిధముల సురక్షణంబు గావించి శత్రువులకుఁ జొర నలవి
గాకుండ నేర్పున నేర్పఱిచి ధనరక్షణార్థముగ నటనర్తకగాయకులఁ బురము వెలు
వరించి యోడలప్రచారంబు నిషేధించి వీట నెవ్వరు సురాపానంబుఁ జేయనల
దని చాటించి యేమఱక యరసి రక్షింపుచుండె. వెండియు నతండు సేనలో
నెల్లనారికిని సువర్ణరజతంబులే జీతముగఁ గాలాతిక్రమంబు గాకమున్న యిచ్చు
చుండె. విక్రమంబుఁ బరీక్షింపక నెక్కనినైనం గేవలానుగ్రహంబున సేనలోఁ
జేర్పఁడయ్యె. అప్పుడు సంకేతితం బైనగుఱుతు లేనివానికిఁ బురంబునఁ బ్రవే
నిర్గమంబులు గలుగ వయ్యె. ఇట్లు ఉగ్రసేనుఁడు ద్వారవతీపురంబు సురక్షితంబుఁ
జేసియుండ సాల్వుఁడు సౌభముతోడ వచ్చి పురబహిర్భాగంబున దేవాలయశ్మ
శ్మశానాదుల విడిచి జలసమృద్ధం బైనయొక్కసమప్రదేశంబున విడిసి వ్యూహ
విభాగప్రకారంబున విచిత్రధ్వజసన్నాహంబుగాఁ జతురంగబలంబు బాయిత్తపఱి
చి గరుడవేగంబున ద్వారకపై నురునడించుటయు సాల్వసంరంభం [illegible]
యాదవకుమారులు సాంబచారుదేష్ణప్రద్యుమ్నులు [illegible] దొడిగి వివి
ధసాధనంబుల గ్రహించి నిపుణయోధపుంగవసురక్షితం బైనమహాసేన వెంట
రాఁగ వీడు వెడలి సాల్వసేనపైఁ గవిసిరి. అందు సాంబుండు క్షేమవృద్ధి
దాఁకి శరవర్షంబుఁ గురియింప వాఁడుం బెదరక నిలిచి మాయఁ గావించి సాంబు
నిపై బాణజాలంబుఁ బఱపించె. జాంబవతీసుతుండును నామాయాబాణంబులఁ
బ్రతిమాయచే నడంచి వానియరదంబుపై వేనవేలుగ నమ్ములు గ్రుమ్మరిం
చుటయు వాఁడు సాంబబాణవిద్ధుండై తొలఁగి చనియె. ఇట్లు క్షేమవృద్ధి కాందిశీకు

డగుటయు వేగవంతుం డను రాక్షసుండు వేగంబునఁ దాఁకె. తాఁకుటయు సాంబుఁ డు వేగవతి యగు గదం బ్రయోగింప నతండు తద్గదాఘాతంబున బ్రుక్కి పెను గాలిం బడు పాదపంబు విధంబునఁ గ్రిందఁబడి మడియుటయు నా సాంబుఁడు సేనం జొచ్చి కలంచుచుండె. అట వివింధ్యుఁ డను దానవుఁడు మహారథుఁడు విక్రమించి వచ్చుటయుఁ జారుదేష్ణుఁ డా రాక్షసు నెదిరించి నిల్వఁగ వృత్రవాసవుల విధంబున వారు సింహనాదంబులు సేయుచు ననేకాస్త్రంబులఁ బ్రయోగింపుచుండ నా సంకుల సమరంబున రుక్మిణీపుత్రుఁడు సూర్యాగ్నిసమానతేజస్కం బైన మహాస్త్రం బభి మంత్రించి వివింధ్యునిపై నేయుటయు వాఁడు యమసదనంబున కరిగె. అంత సేన యంతయుఁ గలంగి తొలంగుచుండ సాళ్వుండు కామగమనం బైన సౌభం బధిష్ఠించి యందఱుం బెద్దయెలుఁగునఁ బోరునకుఁ బురికొల్పఁగ యాదవబలంబు సంక్షుబ్ధం బయ్యె. అట యదువీరశేఖరుం డైన ప్రద్యుమ్నుండు సైనికులం బిలిచి యంద ఱుం దొలంగవలవదు. నా బీరంబుఁ గనుంగొనుఁడు. మదీయకార్ముకవినిర్ముక్తంబు లైన యాశీవిషోపమవిశిఖంబుల సాళ్వుం గీటడంచి సౌభంబు నిదె రూపుమాపెద. వెఱవవలదు. ధైర్యంబుఁ గొనుఁడని యాఱడింపఁగ ధైర్యంబు మెఱయ శౌర్యం బు నెఱయఁ బోరం దొడంగిరి. పదంపడి ప్రద్యుమ్నుఁడు బద్ధగోధాంగుళిత్రాణుం డై ధనుర్బాణతూణీరఖడ్గాదిసాధనంబుల సంగ్రహించి యుత్తమతురంగయోజితం బును మకరకేతువిరాజితంబునగు కాంచనస్యందనం బధిష్ఠించి పగతుఱగుండియలు బెదరువడ నారి సారించుచు నుప్పరం బాక్రమించు మాడ్కి నుక్కచో నిలువక పఱ తెంచు తురంగంబుల జవమునఁ జూపఱు వెఱగంద నిమేషమాత్రంబున రణాంగణం బు సొచ్చి బాణజాలంబుఁ గురియించి సౌభవాసుల రాక్షసుల మోహింపం జేసి సా ళ్వుం దాఁకె. అట్టియెడ నవ్వీరవర్యుని శరసంధానమోక్షణంబులఁ గనుఁగొన ను క్కుఁడేనియు నలఁతి గాఁడయ్యె. అమ్మహాధనునకు ముఖవైవర్ణ్యంబును గాత్రకం పంబు నొకించుకైనం గానరావయ్యె. కేతనాధిష్ఠితం బైన మకరంబు నోరు దెఱచి సాళ్వసైనికుల వెఱపింపుచుండె. సాళ్వుఁడును గడు నలిగి సౌభంబు డిగి పతాకా దిసమంచితంబు, వివిధసాధనసంభృతంబు నగు నున్నతరథం బారోహించి ప్రద్యు మ్నునిపైఁ గవిసి యనేకబాణంబులం బ్రయోగించె. ప్రద్యుమ్నుఁడు వానిపై శరవ ర్షంబులు గురియింప వాఁడును గ్రోధదీప్తుండై దీప్తాగ్నిసంకాశంబు లగు శరంబులఁ బ్రయోగించె. రుక్మిణీపుత్రుండును వాని నడుమన తునియలు గావింప వెండియు నతఁ డనేకాస్త్రంబులఁ బఱపె. సాళ్వబాణవిద్ధుండును గడుం గ్రుద్ధుండునై ప్రద్యు మ్నుండు మర్మభేది యగు నొకదివ్యబాణం బతనిపై నేయుటయు నది వానిమై నెఱువు వ్రచ్చి యురంబుఁ దాఁకె. వాఁ డంతకు మూర్ఛవోయి వ్రాలఁగ దత్సైనికులు హాహాకారంబులు సేయుచుఁ బాఱుచుండఁగఁ గొండొకవడి కతంబు

మూర్ఛదేఱె సైనికులఁ బురికొల్పుకొని యురవడించి ప్రద్యుమ్నునిజత్రుదేశంబున ననేకబాణంబులు గాడ నేయఁగ వాఁడు తేరపై నొఱఁగఁ బడియె. వెండియు సాళ్వుండు బాణజాలంబు వానిపైఁ గురియించి సింహనాదంబుఁ జేయఁగ యదువృష్ణిభోజాంధకసైనికులు హాహాకారంబులు సల్పుచుండఁ బ్రద్యుమ్న సారథి దారుకపుత్త్రుండు తేరుఁ దొలంగఁ దోలుకొనిపోయె. అటఁ గొంతసేపునకు మూర్ఛదేఱె ప్రద్యుమ్నుఁడు విల్లుఁ బూని సారథిం జూచి దారుకసుతా! యిది యేమి నీవ్యాపారంబు. రణాంగణం బేల తొలఁగించితివి. యుద్ధమున యదువీరుల కిది ధర్మంబుగాదు. సాళ్వునిమహారణంబునకు వెఱచితివొకో? వాస్తవంబు దెల్పు మనిన సారథి ప్రద్యుమ్నున కిట్లనియె. జనార్దనాత్మజా! రణమున నేను భయమోహములఁ జెందినవాఁడనుగాను. మఱి నీవు సాళ్వబాణపరంపరలకు మూర్ఛవోవఁగఁ బలువురయెదుట నీ వొకఁడ వపు డుండగా దనితలంచి తేరుఁ దొలఁగించితి. యుద్ధమున రథికుఁడు సారథిని, సారథి రథికుని నన్యోన్యయుపాయంబుల రక్షించుట పరమధర్మం బనినఁ బ్రద్యుమ్నుఁడు సారథీ! తేరుఁ మఱల్పుము. నేను జీవించియుండునంతకు నిఁక నెన్నఁడైన నిట్లు చేయకుము. సంగరంబునఁ దొలంగుట, పడినవాని, శరణాగతుని, స్త్రీని, బాలుని, వృద్ధుని, విరథుని, భగ్నసాధనునిం జంపుటయు యాదవులకుఁ గులధర్మంబు గాదు. యదువంశచరిత్రంబును, యుద్ధధర్మంబును, సారథిధర్మంబునుం జక్కగ నెఱింగియు నిట్లు చేయ నీకుఁ దగునే? వాసుదేవబలరామసాత్యకిచారుదేష్ణగదసారణాక్రూరాదులు దీని వినిన నే మందురు? అడిబీరము లాడుప్రద్యుమ్నుని శౌర్యమెల్ల నేఁడు తెలిసెఁగా యని స్త్రీలెల్ల నగరే? నాబోఁటివానికిఁ బరిహాసవాక్యములు మరణమునకంటె నెక్కుడుగాకున్నె? మధుసూదనుఁడు నన్ను నమ్మి భారములెల్ల నాపై నునిచి ధర్మరాజు రాజసూయంబునకుఁ జనియె. వచ్చిన నేమి చెప్పుదు? మఱియు మన మిపుడు పోరునకు వచ్చుతఱిఁ గృతవర్మ తాను నరుదెంతు ననిన సాళ్వునిమీఁది కిందఱు వలయునే? నే నొక్కరుండ వాని నుక్కడంతు నని బీరమ్ము లాడి వచ్చితిం గదా. అమ్మహావీరున కేమి చెప్పుదు? అతండు నన్ను మెచ్చునే? ఇప్పటి కిది చాలుఁ జాలు. ఇఁక నెన్నఁడు నిట్లు చేయవలదు. వేగంబ తేరు మఱల్పు మనిపలికె. ప్రద్యుమ్నునిసాక్షేపవచనంబులు విని సారథి ప్రద్యుమ్నా! నే నెప్పుడు నీమేలు గోరియుందు. సారథికృత్యములనెల్ల దారుకువలన నెఱింగినవాఁడను. తెలియక యిట్లు చేసినవాఁడనుగాను. నే నపుడు తేరుఁ దొలఁగింపకున్న మనజయంబు నమ్మరాదు. అది యట్లుండె. ఇదె తేరుఁ దోలెద. రణంబున నస్త్రవిద్యాచాతుర్య మంతయుఁ జూపు మనిచెప్పి తేరు మఱల్చి పగ్గములు విడిచి మునికోలం గుఱ్ఱములనడుచుటయు నవి కశాఘాతంబు సైరింపక యంతి

రిథుం బాక్రమించువడువునఁ బుడమి నడుగుల మోపక చిత్రమండలాది గమన ప్రకారంబున సాళ్వసైన్యంబు వలపలించి పోవుచుండ నాసౌభరాజు ప్రద్యుమ్న రథప్రచారంబున కోర్వక సారథిపై మూఁడమ్ము లేసె. దారుకపుత్త్రుండు వాని సరకుగొనక యతిరయంబున నరదంబుఁ బఱపింపుచుండ సాళ్వుండు ప్రద్యుమ్ను పై ననేకమార్గణంబులఁ బ్రయోగింపఁగ రుక్మిణీసుతుం డించుక నగుచు హస్త లాఘవంబున మూఁడమ్ము లేసి యాబాణముల నడుమన తునియలు గావించె. సాళ్వుఁ డంతట రాక్షసమాయఁ గావించి యనేకదివ్యాస్త్రముల యదుసేనపైఁ బ్రయోగింపుచుండ దాని నెఱింగి ప్రద్యుమ్నుఁడు బ్రహ్మాస్త్ర మభిమంత్రించి ప్ర యోగించుటయు నప్పరమసాధనం బామాయనెల్ల రూపుమాపి తద్బాణజాలం బడంచి రాక్షసులఁ బలువురఁ బొరిగొనియె. అంతన సనక ప్రద్యుమ్నుఁడు సాళ్వ వధార్థంబుగ వేఱొక్కదివ్యాస్త్రంబు వింట సంధింపుచుండ నెల్లెడల హాహానినా దంబులు నిగుడె. అట్టియెడ నింద్రాదినిర్జరులు పంపఁగ నారదుఁడు, వాయు దేవుండును వచ్చి ప్రద్యుమ్నా! యీయస్త్రం బుపసంహరింపుము. ఇది ప్రయో గించిన నెవ్వఁడుం జావక నిలువఁజాలఁడు. వీఁడు వాసుదేవునిచేఁ జచ్చు నని బ్రహ్మ సంకల్పించినవాఁడు. అద్దేవునిసంకల్పం బమోఘంబు గావలయుఁగాదె? యని బోధింపఁగఁ బ్రద్యుమ్నుఁడు వారివచనం బంగీకరించి యయ్యస్త్రం బుపసంహ రించె. అంతఁ గొంతవడికి సాళ్వుఁడు మూర్ఛదేఱి ప్రద్యుమ్నుం గెలువరా దని తలంచి సౌభారూఢుండై తనసేనతోడ నాకాశంబునకు లంఘించిపోయె. ప్రద్యు మ్నాదు లంతటఁ బురంబు సొచ్చి యేమఱక మెల్లపుడు నరయుచుండిరి.

ధర్మనందనా! నేను నీరాజసూయమహాధ్వరంబు సమాప్తప్రయోగంబై నపదంపడి ద్వారకకుఁ బోయి యచ్చోట వేదంబులఁ జదువమి, యజ్ఞంబులనాచ రింపమిఁ, బడఁతులు తొడవులఁ దొడుగమి, నుపవనంబుల సొంపులేమి, నరసి శంకించి కృతవర్మం బిలిచి యిదియేమి కారణంబు? పురంబు సొంపుదఱిగె ననియడిగి యతనివలన సౌభపతి యగుసాళ్వునివలనియుపద్రవం బెఱింగి యిఁక నూరక యుండ రాదు. సాళ్వుం జంపనవలయు నని నిశ్చయించి వసుదేవోగ్రసేనాదివృద్ధజనులను, యదుప్రవీరులను, నప్రమాదంబునఁ బురంబుఁ బాలింపుచుండ నియోగించి వారియ నుమతిం బడసి సౌభంబుతోడన సాళ్వుంజంపి మఱివచ్చి మిమ్ముఁ గాంచెద నని ప్ర తిన వట్టి శత్రుభీషణభేరిని మ్రోయింప నాజ్ఞాపించి బ్రాహ్మణులకు మ్రొక్కి వార లయుఁ, బౌరులయు విజయప్రదంబు లైనశుభాశీర్వాదంబుల గ్రహించి సైన్య సుగ్రీవాదితురంగయోజితంబును, గరుడకేతనవిరాజితంబు నగురథవరం బారో హించి పాంచజన్యంబు పూరించి చతురంగసైన్యంబు వెంటరాఁగ జైత్రయాత్ర వెడలి బహుదేశంబుల, ననేకపర్వతంబులఁ, బెక్కునదుల నతిక్రమించి చని మార్తి

కావతదేశంబుఁ జేరి సముద్రసమీపంబున సౌభంబుతోడ సాళ్వుఁడు సనుచున్నవాఁ డనియెఱింగి వానివెంటం దవిలి యరుగుటయు నద్దురాత్ముండు సముద్రమధ్యస్థుండై దవ్వున నన్నుం గాంచి యించుక నవ్వుచుఁ బోరునకుఁ బిల్వఁగ నేను వానిసౌభంబుపై మర్మభేదనచణంబు లగుబాణంబులఁ బెక్కు లేసితి. మదీయశార్ఙ్గనిర్ముక్తంబు లగునాబాణంబులు వానియెడ వమ్మగుటయు నప్పాపాత్ముఁడు నన్ను, సారథిని, గుఱ్ఱములను, సైనికులను, బాణధారాసారంబున ముంచె. నేనుం గోపించి వానిపైఁ బెక్కుబాణంబు లేయఁగ నాసైనికులును మార్గణగణంబులఁ బ్రయోగించిరి. అంత శత్రువీరులు మాపై నమ్ముల వేనవేలుగఁ బఱపింప నారథంబును, దారుకుఁడును, హయంబులును, నేనును, నొకళ్లొకళ్ల కగపడకుండుటయు నేను దివ్యచాతుర్యంబునఁ బగవారిపైఁ బెక్కమ్ముల నేసితి. అంతరిక్షచరంబైనసౌభంబు దానఁ గ్రోశమాత్రదూరంబునం దృశ్యమగుడు నస్మత్సైనికులు రంగవాటస్థిత సామాజికులకరణి సౌభనాటకవాసులం గలయం గనుంగొని సింహనాదంబులను, గరతలాస్ఫాలనంబులను, నామనంబున ముదంబు పెంపొదవింప వెండియు నేను బహుశిలీముఖంబుల గాడ నేయఁగఁ దదభిఘాతంబునఁ గాలుసేతులు విఱుగ సౌభరాక్షసులు గొందఱు భీషణారావంబులఁ జేయుచు సముద్రంబునం బడఁగ నామొండెముల సముద్రజలజంతువులు కబళింపుచుండె. నేను నతిసంతోషంబునఁ బాంచజన్యంబు పూరించితి. సాళ్వుఁడు దనసైనికులదురవస్థం గనుంగొని మదీయసంరంభంబు సైరింపక మాయఁ గావింపఁ దత్ప్రభావంబున గదాశక్తిశూలఖడ్గప్రాసపరిఘపరశ్వధపట్టసాద్యాయుధంబులు నాసేనపైఁ గవిసి నుగ్గుసేయుచుండె. వెండియు నమ్మాయచేఁ బర్వతశిఖరంబులు, నంగారంబులు, దుమ్ము, శస్త్రంబులు నపరిమితంబులుగఁ గురియుచుండఁ జీఁకటిగను, వెలుంగుగను, జలిగను, వేఁడిమిగను, దుర్దినముగను, సుదినముగను గనఁబడుచుండె. నేను నమ్మాయ నెల్లఁ బ్రతిమాయచే నణఁగింప వెండియు వాఁడు మాయాకౌశలంబున నాకసంబు శతసూర్యంబుగను, శతచంద్రంబుగను, సహస్రాయుతనక్షత్రముగనుం గావింపఁ బగలిది రేయిది తూర్పిది పడమరయిది యనుభేదంబు దెలియకుండుటయు నేనుం దాని మాయాచాతుర్యం బనియెఱింగి ప్రజ్ఞాస్త్రంబుఁ బ్రయోగింపఁ బెనుగాలిం బాఱుదూదిరీతి నది యంతయు విధూత మయ్యె. దాన మేము గడిమి మెఱయఁ బోరునకుఁ గడంగ వాఁడు గగనంబునకు లఘించి గదాశతఘ్నిశూలముసలాద్యాయుధంబులు నాపై నేసె. నేనుం బ్రతిబాణంబుల వానినెల్ల నడుమన రెండుమూఁడుతునియలుగఁ జేయఁగ నద్దురాత్ముండు మదీయరథరథ్యసారథుల బాణముల ముంచి నాపై ననేకవిశిఖంబుల నేసె. దారుకుం డంతట వెల

వెలనగుచు నన్నుఁ గాంచి జనార్దనా! నొగలపై నుండవలయునని యుండెదఁగాని యిఁక యొక్కింతతడవైన సాళ్వబాణములసైరింపఁ జాలను. అంగములు గడు నొచ్చుచున్నయవి యనిన సారథిదీనవచనముల విని యతనిమేన శత్రుబాణములు సోఁకనియెడఁ గానక యతివృష్టిచేఁ బర్వతంబు గైరికధాతుసంభృతం బైనరీతి వానియొడలెల్ల నెత్తురు లొలుకుటకు వగచి మెల్లన యూఱడింపుచున్నంత నాహుకప్రేషితుం డైనదూత యొక్కండు ద్వారకనుండి వచ్చి నామ్రోల నిలిచి వాసుదేవా! భవత్పితృసఖుం డైన యుగ్రసేనుండు చెప్పి పుత్తెంచినదాని వినుము. నీ విట వచ్చినపిదప సాళ్వుఁడు నీతండ్రియగు వసుదేవుం జంపె. ఇఁకఁ బోరనేల? మఱలి ద్వారక రక్షించుకొనుము. అంతకంటె నిపుడు వేఱొక్కటి మేలుగా దని డగ్గుత్తికవడఁ జెప్పఁగ వానిదీనవచనంబు విని నే నేమియుం జేయఁ దోఁచక వగచి బలదేవసాత్యకి ప్రద్యుమ్నచారుధేష్ణసాంబాదుల మహావీరుల ద్వారకారక్షణంబున నియమించి వచ్చితి. వారందఱు గలుగ వసుదేవుని దేవేంద్రుఁ డైన నిగ్రహింప నేర్చునే? వసుదేవుఁడు విగతజీవుం డగుట నిక్కమేని బలదేవాదులును మేను దొఱంగినవారే యనియ యెన్నఁదగు. ఇట్లు సర్వవినాశం బగునే? యని వితర్కింపుచు వెండియు సాళ్వునితోడం బోరు సేయఁదొడంగితి. తొడంగునంతన పుణ్యక్షయంబుచే స్వర్గభ్రష్టుఁ డయినయయాతిమహీపతివిధంబునఁ జిందఱవందఱ లైనవెండ్రుకలు, వల్లెవాటు, తలచీరయుం గలిగి మాతండ్రిరూపంబు సౌభంబునుండి క్రిందఁ బడుచుండఁగఁ గాంచనయ్యె. కాంచినంతన నాచేతినుండి శార్ఙ్గంబు జాఱె. నేనుం దేరిపై నొఱగ వ్రాలితి. అస్మత్సేనలోన హాహాకారంబులు వొడమె. అంతఁ గొంతసేపునకుఁ దెలివిఁ జెంది యంతటం జూచి సౌభంబును, సాళ్వుని, నాతండ్రిం గానక దాని మాయఁగా నిశ్చయించి శార్ఙ్గంబు గ్రహించియతిరయమ్మున నమ్ముల సంధించి యాశీవిషసదృశంబు లయిన ఘోరనారాచంబులనంతటం బ్రయోగింప సౌభంబునుండి దానవులతలలు దునిసి క్రిందఁ బడియె. అంత సాళ్వప్రయుక్తమాయాబలంబున సౌభ మదృశ్యమగుడు నందలి రాక్షసులుదారుణంబుగా నఱచుటయు నేను శబ్దభేదు లగుబాణములఁ బ్రయోగింప నక్కడ నాశబ్దము డిగె. వెండియు నొక్కచో నాశబ్దము విననయ్యె. పదపడి దెసలెల్లఘోరనాదంబుఁ దెలియుచుండ శబ్దభేదులగు బాణములచే వారల నందఱం జంపితి. అట సాళ్వుఁడు దనసౌభమును మాయచేఁ బ్రాగ్జ్యోతిషంబుగఁ జేసి పర్వతవర్షంబుఁ గురియింప నేను రథరథ్యసారథులతోడ నందు మునిఁగి యగపడకుండుటయు, భూమ్యంతరిక్షభేదము గానరాకుండుటయు నస్మత్సేనలోన హాహాకారంబులు, దీనాలాపంబులును నింగి ముట్టె. ఆఘోరస్వనంబు విని వజ్రాస్త్రముఁ బ్రయోగింప నాకొండలెల్ల

రూపుమాయుటయు నస్మత్సైనికులు మేఘపటలంబు వెడలిన వేవెలుంగు తెఱంగున వెలుంగుచున్న నన్నుం గాంచి సంతసింపుచుండ దారుకుఁడు నా కిట్లనియె. మధుసూదనా! గుల్మములు పర్వతవర్షమున బడలియున్నవి. ఇఁక నుపేక్షింపరాదు. సాళ్వునియెడ మార్దవంబును, స్నేహంబునుం బరిహరింపుము. శత్రుఁడు దుర్బలుఁడయినను దనయింట నుదాసీనుఁడై యున్నను బలవంతుఁడైన రాజు సర్వవిధముల విక్రమించి వానిం జంపవలయు. ఇఁకఁ బలుదెఱంగులఁ గాఱింపుచుఁ బోర నెదిరింపుచున్న పగతునిపై విక్రమంబు సూపవలయు నని వేఱ చెప్పనేల? వీఁడు నీపరోక్షంబున ద్వారకపై నెత్తివిడిసి బహువిధంబుల బాధించెఁ గదా. వేగంబ వీనిం బరిమార్పు మనిన సారథివచనం బాకర్ణించి నేను సాళ్వు నవశ్యంబు వధింపవలయు నని నిశ్చయించి ఖాండవదహనసమయంబున నగ్నిదత్తంబు సర్వాయుధనిరసననిపుణంబు ప్రతికూలయక్షరాక్షసప్రమాపణచణంబు నగుచక్రాయుధం బభిమంత్రించి సౌభంబును, దన్నిలయులను లయంబుఁ గావింపఁగఁ బ్రయోగింప నమ్మహాసాధనంబు యుగాంతసమయప్రచండమార్తండునివడువున దుర్నిరీక్ష తేజఃపిచండిలంబై సౌభంబుపయిం బడి దాని రెండుతునియలుగ వ్రచ్చి పాశుపతాస్త్రంబు త్రిపురంబులంబోలె నాసౌభవిమానంబుఁ గాల్చి తద్వాసులం గీటడంచి మదీయకరతలసన్నిహితం బగుటయు వెండియు సాళ్వవధార్థంబుగ నద్దివ్యాయుధంబుఁ బ్రయోగించి యద్దురాత్ముం బొరివుచ్చితి. అంత హతశేషులైన రాక్షసులు మదీయమార్గణగణానువిద్ధులై హాహానినాదంబులు సేయుచుఁ జీకాకుపడి దెసలనెల్లం బాఱిరి. నేనుం బరమానందసాంద్రుఁడనై సుహృదులడెందంబుల ముదంబు నిండారఁ బాంచజన్యంబుఁ బూరించి మగిడి ద్వారకఁ జేరి సుఖంబుమై నుండి భవదీయద్యూతప్రకారంబు నాకర్ణించి యిట కరుదెంచితి. దీనం ద్యూతంబునకు నేనురామిం జేసి మీ కీయిడుమలఁ గుడవవలసె. ఇఁక నావిచారం బేల? అంతయు గతజలసేతుబంధనప్రాయంబు. సమయంబు దీఱినందగు రీతి నాలోచింత మనిచెప్పి ధర్మజభీములకు మ్రొక్కి యర్జునుం గౌఁగిలించుకొని ప్రణమ్రులైన నకులం గారవించి ధౌమ్యునడుగుల కెఱఁగి తదాశీర్వాదంబులఁ గొని బాష్పపూర్ణనయన యగుపాంచాలి నూఱార్చి సుభద్రాభిమన్యులం దోడ్కొని సైన్యసుగ్రీవాదులం బూన్చినయరదం బెక్కి నారాయణుండు ద్వారకకు విచ్చేసె. ధృష్టద్యుమ్నుఁడుం ద్రౌపదేయులఁ దోడుకొని పాంచాలపురమునకుఁ జనియె. కైకేయాదు లందఱు పాండవుల నామంత్రణంబు చేసి నిజపురంబులకుం బోయిరి.

## పాండవులు ద్వైతవనమునకుఁ బోవుట.

ఇటఁ బాండవులు వేఱొక్క వనమునకుఁ బోఁ దలంచి సాంగవేదవిదు

లగుబ్రాహ్మణోత్తములకు గోహిరణ్యాదిదానముల నొసంగి ద్రౌపదితోడ రథముల నారోహించి పురోహితపురస్సరులై ధనుర్బాణతూణీరాది వివిధసాధనపాణు లై నయింద్రసేనాదిభృత్యు లిరువదుగురును, ద్రౌపదీపరికరంబులఁ గొనివచ్చుదాదులుం బరిచారికలుం గొలిచిరాఁగఁ బ్రయాణ మొనరింపుచున్నంత నింద్రప్రస్థవాసు లగుజనులు ధర్మరాజునకుఁ బ్రదక్షిణముగ వచ్చి ముందట నిల్చుటయు ధర్మరాజు రథముల నిలుప నియమించి ప్రసాదావలోకనంబున వారల గారవించె. ప్రజలకెల్లఁ దండ్రి యగునీమహానుభావుఁడు పౌరజానపదులను, దేవేంద్రపురసదృశం బై నయింద్రప్రస్థంబును, మయనిర్మితం బై నయమ్మహాసభను విడిచి కానల కేగుచున్నవాఁడు. దుర్యోధనాదిదుష్టచతుష్టయంబువలన ధర్మనిరతుఁ డగునిమ్మహాత్మున కిట్టియిడుమ లెల్లఁ బడవలసె నని లజ్జావిషాదంబులు గదుర నాక్రోశింపుచుండ వారల నిర్దేశించి యర్జునుం డయ్యా! ధర్మరాజునకు విజయంబు చేకూఱ దీవింపుఁడు. పదుమూఁడేఁడులు సమయంబు గడపి యిమ్మహీవల్లభుండు శత్రువుల గెలిచి యవశ్యంబు రాజ్య మేలు. మఱలి చనుఁ డని చెప్పిన విని వారు పాండవులయు, ద్రౌపదియు ననుజ్ఞఁ గైకొని యథాగతంబుగఁ జనిరి. ధర్మనందనుండును ద్వైతవనంబు సేరి తమ్ములం గాంచి పండ్రెండేఁడులు మనము మనుష్యులులేనియడవుల నుండవలయుఁగదా. తగినరమణీయవనంబుఁ జూడుఁ డనిన నన్నకు ధనంజయుం డిట్లనియె. మహారాజా! నీవు నిత్యంబును బెద్దలం బ్రాహ్మణులం గొలిచినవాఁడవు. నిరంతరనిఖిలలోకసంచారశీలుఁ డగునారదుఁడు వేదవ్యాసుఁడు మొదలగుమహామునులప్రభావంబుల నెఱింగినవాఁడవు. వాసోచితదేశంబును, శ్రేయోవృద్ధిని నీవ యెఱుంగుదువు. నీకు నేఁ జెప్పువాఁడనే? నీనిర్దేశించుచోట నుండెదము. సర్వవిధంబుల రమణీయం బై నయీద్వైతవనమున నుండఁ దగు నని నేఁ దలంచెద. నీ కభిమతం బే? యనిన ధర్మరాజు వల్లెయని నిరంతరపల్లవితకుసుమితతమాలరసాలకర్ణికారాదిమహీరుహసంచితంబును, మత్తమధుపమయూరకోకిలారావమంజులంబును, విమలసలిలపరిపూరితసరోవరభాసురంబును, మదకలమతంగజయూథసంచారదారుణంబు, ననేకసిద్ధర్షిగణసేవితంబు నగునాద్వైతవనంబు సొచ్చి యరదంబు డిగ్గి తన్నుఁ గాంచ నరుదెంచిన మునీంద్రులకును, సిద్ధచారణాదులకుం బ్రణమిల్లి తదాశీర్వాదంబులఁ బడసి వారిసత్కారంబులఁ గైకొని తమ్ములుం, ద్రౌపదియు, ననుచరులుం బరివేష్టింప లలితచ్ఛాయాతితలంబు, పుష్పఫలసంభృతంబు నగునొకమహామహీరుహంబుమూలంబునఁ గూర్చుండి తపస్సిద్ధు లగుమహాత్ముల నుపాసింపుచుండె. అట్టియెడ నావీరు లేవురుం గూర్చుండ నమ్మహాద్రుమంబు మత్తసింధురాధిష్ఠితం బై నపర్వతంబు ననుకరించె. సుఖనివాసార్హం లగునప్పాండుతనయు లాద్వైతవనమున

నరస్వతీనదీతీరతరుతలంబుల విహరింపుచు వన్యమూలఫలాదిపదార్థంబుల బ్రాహ్మణసంతర్పణం బొనరింపుచు ధౌమ్యోపదిష్టక్రమంబున దేవపితృకార్యంబుల నాచరింపుచు సుఖంబుండునంత నొక్కనాఁడు మార్కండేయమునీంద్రుఁ డచ్చటి కేతెంచె. వచ్చినయమ్మునినాథుం గాంచి ధర్మనందనుం డెదురేగి యాసూర్యాగ్నిసమప్రభుం దోడ్తెచ్చి మునిమధ్యంబునఁ గూర్చుండఁ బెట్టి యుత్తమపూజల నర్చించి యుపాసించియుండ సర్వజ్ఞుం డయినయమ్మునివరుండు వారినెల్లం గనుంగొని మనమ్మున శ్రీరాముం దలంచి యించుక నగియె. నగుటయు ధర్మరాజు మహాత్మా! తాపసులెల్ల మాపడుపాట్లకు డెందమునం గుందుచు లజ్జితులై యుండ నిందఱిసమక్షమున నవ్వ నేల యనియడుగ మార్కండేయుం డిట్లనియె. ధర్మపుత్రా! హర్షస్మయదర్పములు నాకుఁ గలుగవు. నీయాపదం జూచి దశరథసుతుం డైన శ్రీరాముం దలంచెద. సత్యవ్రతుఁ డైనయతండునుం బితృవాక్యపరిపాలనంబుపొంటెఁ దమ్ముఁ డగులక్ష్మణుఁడు, భార్య యగుజానకియు వెంటరాఁగ వనవాసంబుఁ జేసె. ఇంద్రతుల్యుఁ డైనయయ్యనఘుని నేఁ దొల్లి ఋశ్యమూకపర్వతంబునఁ జూచితి. అమితవిక్రముఁ డైనయతఁడును విధివశంబున భోగముల విడిచి యడవులఁజరించె. నాభాగభగీరథాలర్కాదు లగుమహారాజులు ధర్మంబున భూమండలం బెల్లఁ గొంతకాలంబు పాలించి తుది రాజ్యాదులం ద్యజించిరి. సుఖదుఃఖముల దైవచోదనచే నయ్యైకాలంబులందు నరుఁ డనుభవించు. దైవబలంబున సప్తర్షులు మింట వెలుంగుచున్నవారు. కాన సుఖదుఃఖములు దైవాధీనము లనినిశ్చయించి యెల్లపుడు ధర్మ మాచరింపవలయుఁగాని సమర్థుఁడనని షోతరించి యధర్మంబు చేయరాదు. దిగ్గజంబులు మహాబలంబు లయ్యు దైవవశంబున నున్నయవి. కావున సత్యధర్మముల కపాయము వాటిల్లనీక యుచితవృత్తి నుండి క్రమంబున వనవాసనియమంబు నిస్తరింపుము. ధర్మబలంబున సూర్యునిపోలె మహితతేజోవిరాజితుండవై విమలయశంబు నంతట నెఱపి కౌరవరాజ్యలక్ష్మిం గ్రహింతు వనిబోధించి మార్కండేయుండు పాండవులను, ధౌమ్యుని నామంత్రణంబుఁ జేసి యుత్తరంబుగఁ జనియె. పాండవులు వసింపఁగ నమ్మహారణ్యమ్ము మునిజను లెల్లపుడుం బఠించుఋగ్యజుస్సామవేదములనినాదములను, బాండవులజ్యాఘోషములను నిండి బ్రహ్మక్షత్రసంసృష్టం బై యెంతయు నొప్పారె.

అంత నొక్కనాఁడు ఋషులెల్లం బరివేష్టింపఁ గూర్చుండి ధర్మరాజు సంధ్య నుపాసింపుచుండ బకదాల్భ్యుఁ డనుముని యతని కిట్లనియె. ధర్మరాజా! చూచితే. భవత్ప్రభావంబున సురక్షితులై భార్గవు, లాంగిరసులు, వాసిష్ఠులు, కాశ్యపు, లాగస్త్యు, లాత్రేయులు మొదలగు ననేకబ్రాహ్మణులు లోకోత్తరులగ్ని హోత్రములఁ బ్రజ్వరిల్లఁజేసి విధియుతమ్ముగ హోమము లాచరింపుచు

న్నవారు. బ్రహ్మక్షత్రియులు గలిసిరేని యగ్నివాయువులపగిది శత్రువులఁ గాల్తురు. బ్రాహ్మణసమన్వితుఁడుగానిక్షత్రియుఁడు చిరకాలం బీలోకమున సుఖింప నేరఁడు. పరలోకంబును సాధింపనేరఁడు. ఆక్షత్రియుని భూమియుం జేరరాదు. వినీతుఁడై, బ్రాహ్మణశిక్షితుఁడై, విగతమోహుఁడై నక్షత్రియుండు శత్రువుల జయించి సముద్రపర్యంతం బైనభూమండలంబెల్ల నవశ్యముగఁ బాలించు. బలి చక్రవర్తియుఁ దొల్లి యుత్తమధర్మంబు సంపాదింపఁ దలఁచి బ్రాహ్మణులకంటె నందు నుత్తమసహాయంబుఁ గానక వారలనే సేవించి భూమినెల్ల వారల కొసంగి పాపములఁ బాసి యక్షయశ్రీవిలసితుం డయ్యె. యుద్ధమున నంకుశనిగృహీతం బైనయేనుఁగునకుంబోలె బ్రాహ్మణహీనుం డైన క్షత్రియునకు బలము చెడు. బ్రాహ్మణుని విమలజ్ఞానంబును, క్షత్రియునప్రతిమబలంబు నొక్కటఁ గలిసి మెలంగునేని లోకమెల్లఁ బ్రసన్న మగు. అలబ్ధలాభంబును, లబ్ధవృద్ధిని, నుత్తమ తీర్థసంపత్తినిం గోరుక్షత్రియుఁడు బుద్ధిచే లెస్సగఁ జింతించి బ్రాహ్మణుని సేవింపవ లయు. నీ వెల్లపు డట్లువర్తించుటంజేసి లోకంబులనెల్ల నీకీర్తి నెగడె ననిన వ్యాస నారదాదిమహామునులు బకదాల్భ్యవచనంబుఁ గొనియాడి ధర్మరాజుసద్గుణం బులఁ బ్రశంసించిరి.

## ద్రౌపదీధర్మరాజుల సంవాదము.

అంత సాయాహ్నంబునఁ బాండుపుత్రులు దమలోన దుఃఖోపశమనంబు లయినకథలు చెప్పుచుఁ బ్రొద్దు పుచ్చుచున్నంతఁ బాంచాలి ప్రేమపాండిత్యము లుల్లసిల్ల ధర్మరాజున కిట్లనియె. మహారాజా! పాపాత్ముఁ డైనదుర్యోధనుఁడు క్రూరుఁడై పరమధార్మికుఁ డైననిన్ను నారచీరలతోడనడవులకుఁ బంపి కొంచె మైనఁ బశ్చాత్తాపంబుఁ బొందక సంతోషింపుచున్నవాఁడు. ఆదుర్మతి నిక్కంబ యయోమయహృదయుండు నిర్దయుండు. కాదేని యిట్టిదుఃఖము నీకుఁ గల్పించి పలుకరాని ప్రల్లదంబు లాడునే? అట్టియెడ నందఱుం గన్నీరొలుక నాక్రో శింపుచు విషణ్ణు లయిరి. ఆదుష్టచతుష్టయంబునకుఁ గంట నీరైనఁ గలుగదయ్యె. కటకటా! మహితసభామంటపమున లలితశయనములఁ బవ్వళించునీ విపు డీకఠిన భూతలంబునఁ బరుండవలసె. అచట నుత్తమమణిగణఖచితగజదంత సింహాసనం బునఁ గూర్చుండునీవు దర్భాసనంబునఁ గూర్చుండవలసె. సురభిచందన మలంది దివ్యదుకూలములఁ దాల్చి తేజరిల్లునీవు పరాగరూషితుండవై నారచీరలఁ గట్ట వలసె. ప్రతిదినంబునుం బలువురుబ్రాహ్మణులకు స్వర్ణపాత్రంబులందు రసవంతం బైనయోగిరం బారగింపఁ బెట్టుచుండియు నిపు డావృత్తాంతంబు మఱువవలసె. ఏమి చెప్పుదు? అన్నిఁ తెఱంగులం జెలంగి సకలరాజమండలంబు గొలువఁగ నిండోలగం బున్ననిన్నుఁ జూచినకన్నుల నిపుడీయవస్థలనెల్లఁ జూడవలసె. ఇందు

లకుఁ గుందకుండఁగ నే నెట్లు నేర్తు? నీతమ్ములు నుత్తమపరిచారకులు వివిధోపచారంబు లొనరించి స్వాదుతమం బయినయోదనంబుఁ గుడువఁబెట్టఁగఁగుడిచి సుఖించువా రిపుడు తత్కాలలబ్ధంబు లయినవన్యాహారంబుల భుజించి వనరుచున్నవారు. భీమసేనుఁ డెల్లపుడుం గౌరవులఁ జెండాడ నుత్సహించియు భవత్ప్రతిజ్ఞాపూర్తిం బ్రతీక్షింపుచు నూరకున్నవాఁడు. వివిధసుఖోపచారోచితుండైన యిమ్మహాబలుం డిపుడు తానే పనులఁ జేయుచుండఁ జూచుచుండినను నీ కాధార్తరాష్ట్రులపైఁ గోపంబు పొడమదేలొకో. ఈదుఃఖము నొకించుకైన నే నోర్వఁజాలను. సహస్రభుజుఁ డైనకార్తవీర్యార్జునున కెనయగుమనయర్జునుఁ డొకయమ్మేసినట్ల యైదమ్ములనేయువాఁడు. శరసంధానప్రయోగవేగంబునఁ గాలాంతకయముం బురడించు. అయ్యేకవీరుఁడు విల్లు చేతఁ బూనినంతన రాజులెల్లఁ బ్రణతు లగుదురు. దిగ్విజయంబున రాజులనెల్ల గెలిచి కప్పముఁ గొన్నవాఁడు. అమ్మహారథుఁ డొక్కరుఁడే దేవమనుష్యాదుల నెందఱనైనం గెలుచు. అతఁడు నిపుడు పడరానియిడుమలఁ బడుచుండ నీకు సైరణ పొడముటెట్లో? ఖడ్గయుద్ధమున లోకోత్తరుఁ డనవిఖ్యాతిఁ గాంచిననకులుఁడు నతిసుకుమారుఁ డైనసహదేవుఁడు నత్యంతవనవాసాయాసితులై యుండ నెట్లు నీకు శాంతి యబ్బెనో? ద్రుపదునకుఁ గూఁతురనై, పాండురాజునకుఁ గోడలనై, ధృష్టద్యుమ్ననకుఁ జెలియలనై మహావీరు లగుమీకుఁ బత్నినై సకలసుఖోచిత నగునే నిన్నిపాట్లు పడిన నీ వెట్లు క్షమియించితివొ? నీకుఁ గొంచెమైనఁ గోపము లేదనియ నిశ్చయించెద. కాదేని యిట్టిపట్టుల శాంతి యలవడునే? కోపము లేనిక్షత్రియుఁడుండఁడను లోకప్రవాదంబు నీయెడ విపరీతం బయ్యె. కాలమునఁ దేజముఁజూపనిక్షత్రియుని సకలభూతములుం దిరస్కరించు. ఇపుడు శత్రువధార్థంబుగఁ దేజంబ గ్రహింపవలయు. సర్వకాలములఁ దేజమునొండె క్షమనొండె గ్రహించువాఁడుభయలోకములఁ జెడు. ఇందుకు నొకయితిహాసంబు గలదు. తొల్లి బలి ప్రహ్లాదునొద్దకుఁ బోయి పితామహా! క్షమాతేజంబులలోన నేది యుత్తమంబు? నీశాసనంబుమెయి వర్తింతు. వివరించి సంశయంబు వాపవే యనియడుగఁ బ్రహ్లాదుఁ డిట్లనియె. క్షమాతేజముల నెల్లపుడుం గ్రహింపరాదు. నిత్యక్షమాన్వితు నందఱు నవమానింతురు. అవమానము మరణమునకంటె నింద్యము. భృత్యు లల్పమతులై యారాజుంగొలువరు. వానివస్త్రాలంకరణశయనాసనధనాది పదార్థంబుల గ్రహింపఁ గోరుదురు. అధికారనియుక్తు లగువారును యథేచ్ఛంబుగ నారాజునాజ్ఞ నతిక్రమించి తదాదిష్టద్రవ్యంబుల నుత్తముల కియ్యరు. రాజోపచారంబుల నతని సత్కరింపరు. ఇచ్చకువచ్చినట్లు ప్రల్లదంబులు పలుకుదురు. భృత్యాదు లారాజుకళత్రంబులనైనం గోరుదురు. వాండ్రు గోరినతీరునఁ బ్రవర్తింతురు. అట్టిదుర్వృత్తులు రాజదండనం బొకించు

క్తైన లేమింజేసి సకలదోషంబులం బొందుదురు. దుష్టులై యెగ్గుఁ జేయుదురు. నిత్యక్షమచే నిన్నిదోషంబులు గలిమింజేసి దాని నవశ్యంబు వర్జింపవలయు. నిత్యతేజస్సమన్వితుండు క్రోధోద్రేకంబున యుక్తాయుక్తంబులఁ బరిశీలింపక యందఱియెడ దండముఁ బ్రయోగించు. దాన మిత్రవిరోధంబు, సకలజనవిద్వేషంబు, ధనహాని, లోకనింద, సంతాపద్వేషమోహాదులుం గలుగు. మఱియుఁ గ్రుద్ధుఁడైనవాఁడు స్వజనులనైనం జంపును. అదండ్యుల దండించినరాజు శీఘ్రంబ యైశ్వర్యభ్రష్టుం డగు. ఇంట నున్నపామునుంబోలె నట్టివానిఁ జూచి లోకమెల్ల వెఱచు. వానికిఁ బరలోకసుఖంబు, నుత్తమజన్మంబునుం గలుగునే? కావున సత్యంతక్రోధంబు, నిత్యమృదుత్వముం బూనక తగురీతి నుచితకాలంబుల క్షమాతేజముల గ్రహించి క్షత్రియుఁడైహికాముష్మికసుఖంబుల ననుభవించు. సమయాదిభేదమున నోర్పునుం గొనవలయు నెట్లంటేని. ఉపకారియెడను బుద్ధిపూర్వకంబుగఁ జేయనివానియెడనుం దప్పుగలిగినను క్షమయే కర్తవ్యంబు. అందఱియెడనుం బ్రథమాపరాధంబున క్షమయే యుచితంబు మఱి రెండవమాఱు తప్పు చేసినవాఁడు దండనార్హుఁ డగు. బుద్ధిపూర్వకంబుగఁ దప్పు చేసియుఁ జేయలే దనిపల్కుపాపాత్ము నవశ్యంబు దండింపవలయు. కొన్నియెడల మృదుత్వంబె తీవ్రతరంబై దారుణాదారుణదండమునుం గూడఁ జేయు. దేశకాలముల బలాబలములం బరిశీలించి లోకమునకు వెఱచి యుచితరీతి క్షమాతేజములం బ్రయోగింపవలయు. పుట్టిననాఁటంగోలె తప్పులే చేయుపరమలుబ్ధు లగుధార్తరాష్ట్రులయెడ క్షమాకాలం బొకప్పుడైనం గన్పట్టదు. కావున వారియెడఁ దేజంబ ప్రయోగింపుమనిన విని ధర్మరాజు ద్రౌపది కిట్లనియె.

పాంచాలీ! క్రోధము మనుష్యుల నశింపఁజేయు. అదియే నిగృహీతమయ్యెనేని మేలు గావించు. క్రుద్ధుఁడు కార్యాకార్యముల వాచ్యావాచ్యముల మర్యాదను నెఱుంగక గురువునైన వధించు. ఆత్మహత్యనుం జేసికొనును. పరుషవచనము లాడి పెద్దల నవమానించును. పాపములఁ జేయును. ఉభయలోకములందు మేలు గోరుపెద్దలు సకలదోషాస్పదం బైనక్రోధమును వర్జించిరి. ఎవ్వఁడేనియుఁ దెలివిలేమింజేసి క్రోధంబుఁ జూపినను దా నందుకుఁ బ్రతిగఁ గ్రోధముఁ బూననిమహాత్ముఁడు తన్ను నెదిరిని మహాభయములఁ దప్పించి రోగార్తునకుఁ జికిత్సకునికరణి నుభయరక్షకుఁ డగు. అశక్తుఁడు బలవంతుల నెదిరింపనేరక తత్కృతంబు లయినక్లేశముల ననుభవింపుచు వారికిఁ గీడుఁ జేయఁ దలఁచి యట్లు చేయనేరక తుది నాత్మత్యాగంబుఁ జేసికొని యుభయలోకసుఖభ్రష్టుం డగు. విద్వాంసుఁడు పరు లొనర్చుక్లేశముల సైఁచి వానికిఁ బ్రత్యపకారంబుఁ జేయక పరలోకసౌఖ్య మనుభవించు. కావున దుర్బలునకు బలవంతునకు

నెట్టియాపదలనైనఁ గ్రోధవర్జనంబ లగ్గు; అసత్యంబుకంటె సత్యంబు, క్రూరత్వంబుకంటె నక్రూరత్వంబు నుత్తమం బని పెద్దలు వచింతురు. ధర్మప్రకారం బిట్లుండ నాయట్టివానికి సాధువర్జితం బయినక్రోధంబు పూనఁ దగునే? ప్రజ్ఞచేఁ గ్రోధంబు నడంచువాఁడే తేజస్వి యని పెద్దలమతంబు. అట్టితేజస్వి క్రోధమునుం గొనునే? ఉత్సాహదాక్ష్యశౌర్యశీఘ్రత్వము లనఁ దేజమునకు నాల్గు గుణంబులు. క్రోధాభిభూతుఁ డాగుణములఁ బొందనేరఁడు. తేజఃక్రోధములకు సామానాధికరణ్యము గలుగదు. అపండితులు క్రోధంబె తేజ మందురు. విచారింప నది తేజంబు గాదు. మఱి రజంబు. క్షమయే లోకోత్తరగుణంబు. భూదేవత కెనయైనపరమశాంతులు గలుగఁగఁగదా లోకయాత్ర నడుచుచున్నయది. క్రోధమే ప్రధానమైనం దానిం గొని జనులు క్రోధమూల మగుకలహమునందుఁ దవిలి తండ్రులు కొడుకులను, గొడుకులు తండ్రులను, మగలు భార్యలను, భార్యలు మగలను మఱి సకలజనులనుం జంపఁగఁ బ్రపంచం బొక్కనిముసంబైన నిలువం జాలునే? కావున సర్వంబు సంధిమూలం బని నిశ్చయించి క్షమను గ్రహించినయతఁడే యుత్తమపురుషుఁ డనఁ బొగడ్తఁ గాంచి యుత్తమలోకంబుల శాశ్వతసుఖం బనుభవించు. ధర్మములు, యజ్ఞములు, వేదములు, శాస్త్రములు, బ్రహ్మము, సత్యము, భూతంబు, భవిష్యత్తు, తపములు, శౌచంబు, జగంబంతయు క్షమయందు నిల్చె. యజ్ఞకర్తలయు, బ్రహ్మవిదులయు నుత్తమలోకముల క్షమావంతులు పడయఁ గలరు. కర్మాచరణంబునఁ గలుగులోకములకంటె క్షమావంతులలోకము లుత్తమములు. నిత్యంబులు. వారు బ్రహ్మలోకమునఁ బూజితులై పరమసుఖంబులం బడయుదురు. ఇంతయేల? క్షమావంతుఁడు బ్రహ్మైక్యానుసంధానంబుఁ గాంచు నని కాశ్యపగీత లయినగాథల వినంబడుచున్నయది. కావున శాంతిప్రభావంబు నెఱింగి సంతోషింపుము. క్రోధంబు వలదు. భీష్మద్రోణకృపాశ్వత్థామవిదురసంజయయుయుత్సుసోమదత్తులును, శ్రీవేదవ్యాసమునీంద్రుఁడును, జగన్నాథుఁడైన వాసుదేవుఁడును శమమే యుత్తమం బని నాశాంతి నెల్లప్పుడుం గొనియాడుదురు. వీ రందఱు హితము బోధింపఁగ విని దుర్యోధనుఁడు క్రమ్మఱ రాజ్య మిచ్చు నని తలంతు. కాదేని భరతవంశమున కంతయేఁ గీడు మూఁడె నని నిశ్చయింతు. క్షమానర్హుఁడైన దుర్యోధనుఁడు శాంతిం ద్యజించె నను దదర్హుఁడ నగునాకుం ద్యజింపఁ దగునే యనిన ద్రౌపది వెండియు నతని కిట్లనియె.

నీకు మోహముఁ గావించినధాతకు, విధాతకును నమస్కారములు. పితృపితామహపరంపరాప్రాప్తంబై సర్వవిధములఁ బాలనీయం బైనరాజ్యమున నీ

కన్యథాబుద్ధి గలిగెఁగదా. జనులు పురుషకర్మములనే భిన్నభిన్నము లగుఫలములఁ బొందుచున్నారు. కేవలలోభమున నీవు వాని విడువఁ దలంతువు. ధర్మానృశంస్య క్షాంత్యార్జవదయలచే సంపద రానేరదు. మఱి పౌరుషముననే యది గలుగు. వ్యసనముల కనర్హుండ వగునీ విట్లు వ్యసనముల గుందుటం జేసి నీతమ్ము లెల్లపుడును సుఖం బెఱుంగరైరి. ధర్మార్థం బె రాజ్యంబు, ప్రాణంబు నని నిశ్చయించి దానిన రక్షింతువు. అంతకంటె నీకుఁ బ్రియం బెద్దియుం గన్పట్టదు. తమ్ముల, నన్ను నొకవేళఁ ద్యజించినం ద్యజింతువు గాని ధర్మమును విడువ వని బ్రాహ్మణులకు, గురువులకు, దేవతలకుం దెల్లంబు. ధర్మరక్షకుం డయినరాజును ధర్మంబె రక్షించు నని పెద్దలు చెప్పుదురు. నీయం దది విపరీత మయ్యె. ధర్మమే రక్షక మనినమ్మి పౌరుషంబుఁ జూపకున్న నాధర్మంబును నిను రక్షింప దనితలంచెద. నీధర్మబుద్ధి నీడవోలె నిను నెప్పుడు విడువదు. నీకు సమానులు, నధికులు నగు మహారాజు లెందఱేని కులోచితరీతి ధర్మంబు పాలించి యుత్తమగతిం బడసిరి. సకలభూమండలంబు సాధించితి నని వారికంటె నధికునిగ భావింపకుము. ఇంత మాత్రన ప్రాధాన్యంబు లేదు. దేవతలం బితరులనుం జక్కఁగఁ దనిపి నేఁ బరిచర్య సేయుచుండ స్వర్ణపాత్రముల వివిధాశ్రము లగునెందఱేబ్రాహ్మణుల కిష్ట మృష్టాన్నంబుల సంతర్పణంబుఁ గావింపుచున్ననీ కిపుడు వనలబ్ధపదార్థంబుల వైశ్వదేవంబుఁ జేసి యాబ్రాహ్మణులకు లోహపాత్రములఁ గుడువం బెట్టి తచ్ఛేషంబుం గుడువవలసె. ఇష్టిపశుబంధాదుల దస్యుబహుళం బైనయిద్వైజనారణ్యంబునను జేయుచుండెదవు. రాజసూయాదిమహాయాగంబుల నుత్తమప్రయోగంబుగ నాచరించితివి. ఇట్టిపరమధార్మికుఁ డగునీవును దుర్వ్యాపారం బగుజూదమునఁ జొచ్చుట కెంతయేఁ గుందెద. అక్కటా? యేమి చేయ నగు. ఇందు కొక యితిహాసంబు గలదు. సర్వలోకంబు లీశ్వరవశంబులు. ఈశ్వరుఁడే కర్మారంభబోధకం బైనవేదముఁ బ్రకటించి భూతములకు సుఖదుఃఖములఁ బ్రియాప్రియములఁ జేయుచున్నవాఁడు. నేర్పరి యైనయాటకాఁ డాడింపఁగ నాడుబొమ్మలపగిది జను లీశ్వరప్రేరణంబునఁ గర్మముల నాచరింతురు. హారంబునఁ గూర్చినమణి విధంబునను, ముకుద్రాటంగట్టినబలీవర్దంబుభంగిని జనుఁడు తనకు నితరులకుఁ బ్రభువుగాక యీశ్వరాజ్ఞనే యనుసరించి కర్మములఁ జేయుచు గట్టుఁ దప్పి ప్రవాహమునం బడినవృక్షము మిఱ్ఱునుంబోలె సముపలబ్ధస్వర్గనరకములఁ బొందు. తృణాగ్రములు వాయువునకుంబోలె సర్వభూతములు తన కధీనములై యుండ నీశ్వరుండు వారలఁ బుణ్యపాపములఁ బ్రవర్తింపఁజేసి యాకాశంబురీతిఁ దానంతట వ్యాపించియుండియు నగమ్యుండై వెలుంగు. అందు క్షేత్రం బనఁ బరఁగుశరీరంబు హేతుమాత్రంబ. ఈశ్వరునిమాయాప్రభావం బూహింపరాదు. ఒక

విధముననుండునవి మఱియొకరీతిం బరివర్తనంబు నొందు. నరులు వానినెల్ల వేఱొక తెఱంగునం దలంతురు. ఈశ్వరుం డొండొకప్రకారంబునం గ్రియావిక్రియలం గావించు. కాష్ఠముచేఁ గాష్ఠమునుం, బాషాణంబుచేఁ బాషాణంబును భంజించు భంగి నీశ్వరుండు భూతంబులం బొరివుచ్చు. ఇట్లు స్వేచ్ఛాప్రకారంబున జీవులకు సంయోగవియోగములం గల్పించి బాలుఁడు క్రీడాసాధనంబులంబోలె నీశ్వరుఁడు క్రీడింపుచున్నవాఁడు. అతఁడు భూతములయెడఁ దల్లిదండ్రులవలె దయాళుండై యున్నట్లు గన్పట్టఁడు. మఱి శత్రువుపోలె రోషమునం బ్రవర్తించు ననితలంచెద. కాకున్న నార్యులు వ్యసనములం గుందుదురే? దుష్టులు సుఖింతురే? ఈవైపరీత్యంబునకు ధాతం దూఱెద. దుష్పథప్రవృత్తుఁడు, క్రూరుఁడు, లుబ్ధుఁడు, ధర్మత్యాగియు నగుదుర్యోధనునకు సంపదం గావించి యాదేవుఁ డేమి ఫలం బనుభవించు? చేసినకర్మంబు కర్తం బొందక లాఁతివానిం బొందునేని తత్పాపం బీశ్వరుఁడే నిక్కంబ యనుభవించు. ఇట్లగుటకు వేఱొక్కబలవంత మయినకారణం బుండవలయు. అట్టిదుర్బలులం జూచి శోకించెద ననిన విని ధర్మరాజు ద్రౌపది కిట్లనియె.

యాజ్ఞసేనీ! నీవిచిత్రవచనోపన్యాసంబు దెలిసితి. నాస్తిక్యంబున వచింతువు. దానములు, యజ్ఞములు విధిచోదితంబు లని వాని నాచరింతుఁగాని యందు ఫలం బపేక్షింపను. ఫలముండినను, లేకున్నను గృహస్థుఁడు విధినిషేధంబుల సాధుచర్యల నెఱింగి స్వకర్మముల నవశ్యంబు చేయనవలయు. నామనస్సు స్వభావమున ధర్మమందే సుస్థిరం బయ్యె. ఫలాపేక్షచే ధర్మముల నాచరించువాఁడు ధర్మవాదులలో నధముఁ డనంబరఁగు. మఱియు వాఁడు శూద్రతస్కరాదులకంటె నధముఁడే నాస్తిక్యంబున ధర్మమును శ్రుతిస్మృత్యాదులను శంకించువాఁడు తిర్యగ్యోనులం జనించు. శూద్రుఁడు వేదంబులంబోలె వాఁడుత్తమలోకంబుఁ గాంచనేరఁడు. ధర్మమును శంకించునతఁడు వేదములయందుఁ బ్రామాణ్యంబు లేమింజేసి తనకుఁ దోఁచినదియ ప్రమాణం బనిభాషించి యుద్వృత్తుండై పెద్దల నవమానింపుచు నింద్రియార్థంబుల సుఖింపుచు మహామోహమున మునుఁగు. వానికిఁ బ్రాయశ్చిత్తంబు లేదు. మఱి యమ్మూఢుఁడు నరకంబునం బడు. కావున ధర్మమును, దేవుని, మనస్సుననైన శంకింపకుము. నిందింపకుము. వేదాధ్యాయి, ధర్మపరుఁడు, కులీనుఁడు నగురాజర్షి తొల్లింటిపెద్దలకు సమానుఁ డని ధర్మవాదులు వక్కాణింతురు. ధర్మముననే దివ్యయోగము సాధించి శాపానుగ్రహసమర్థులై సురలకంటె నధికు లనఁ బేరుఁగాంచి పెద్దకాలంబు జీవింపుచున్నమార్కండేయవ్యాసవసిష్ఠమైత్రేయనారదలోమశశుకాదిమునీంద్రులఁ బ్రత్యక్షంబ చూచితిమికాదే? వారందఱు ధర్మంబ యవశ్యకర్తవ్యం బనివర్ణింతురు. మూఢుఁడు మహానుభావుల వెట్టివారని తలంచి యుభయలోకములం జెడు. కావున శిష్టాచరితంబు, విధిచోదితంబు నగుధర్మ

మును నిందింపరాదు. ద్వీపాంతరవాణిజ్యంబుఁ జేయువాని నోడవ్రాలె స్వర్గంబుఁ జేరువాని ధర్మంబె దుఃఖసాగరంబు దాటించు. ధర్మంబు కేవలనిష్ఫలం బని తలంపవలదు. అట్లగునేని జగంబెల్లఁ దమోమగ్నం బగు. జీవులు సుఖింపనేరక పశుజీవికచే జీవింతురు. విద్యలెల్ల నిష్ఫలంబు లగు. తపస్స్వాధ్యాయయజ్ఞబ్రహ్మచర్యదానార్జనంబులు విఫలంబులగునేని తొల్లింటిపెద్దలు ధర్మము నాచరింపకయే యుందురు. కావున నిది యెంతయు నసంబద్ధంబు. మఱియు నట్లే ధర్మంబు వ్యర్థంబేని దేవగంధర్వాదు లీశ్వరులయ్యు నాదరణంబుమై ధర్మము నేలయ నుష్ఠింతురు? ధర్మాచరణంబున శాశ్వతసుఖంబు గలుగుననియు, నీశ్వరుఁడు ఫలప్రదుఁ డనియు నెఱింగి వారందఱు ధర్మము నాచరించిరి. వేయేల? నీజన్మంబు, ధృష్టద్యుమ్నుజన్మంబును ధర్మతపంబులు సఫలంబు లనుటకు నిదర్శనంబులు. ధర్మంబు ఫలవంతంబైనను గాకున్న నాచరింపనవలయు. ఉత్తముఁ డల్పఫలము లభించినను సంతోషించు. అధముఁడు మహాఫలంబు గలిగినను దనివి సనఁడు. దానంజేసి వానికిఁ బరలోకసౌఖ్యంబు నశించు. పుణ్యపాపఫలంబులు తన్నాశంబులును దేవరహస్యంబు. ఆగుహ్య మొకానొకమహాత్మునకుఁగాక యందఱకు నెఱుంగ నలవికాదు. ఇందు సమ్మోహముఁ బొందినయతఁడు కల్పసహస్రంబుల నైన శ్రేయముఁ జెందఁ జాలఁడు. తపోవ్రతాదిప్రభావంబునఁ బాపంబులం బాసి ప్రసన్నచిత్తులైనయుత్తమబ్రాహ్మణులే తత్ప్రకారం బెఱుంగుదురు. ఫలముఁ దెలిసికొననేరకయే ధర్మమును, దేవతలను శంకింపరాదు. కర్మంబుల శాశ్వత ధర్మఫలంబులు గల వనినిశ్చయించి యసూయ విడిచి యజ్ఞదానాదిసత్క్రియలఁ జేయనవలయు. దీనినెల్లఁ దొల్లి సవిస్తరంబుగ బ్రహ్మ తనపుత్రులకుఁ జెప్పఁగఁ గశ్యపుఁడు గ్రహించి ప్రచారంబు చేసె. ఇఁక సంశయం బపనయింపుము. నాస్తిక్యంబు విడువుము. సర్వేశ్వరుఁ డైనధాతనుఁ బ్రమొక్కుము. ఉత్తమదేవతను దిరస్కరింపరాదు. ఇఁక నెన్నఁడైన నిట్లు భాషింపకు మనిన విని ద్రౌపది ధర్మరాజునకు వెండియు నిట్లనియె.

మహారాజా! ధర్మము నవమానింపను. ఇఁక నీశ్వరుం దిరస్కరింతునే? వనవాసాయాసంబున నలసి ప్రియంబు మాలి పలికితి. ఇంకనుం గొన్నిపలుకులు వినిపించెద. సౌమనస్యంబు నెఱపి యాకర్ణింపుము. తొల్లి మాతండ్రి యొకబ్రాహ్మణు నింట నుంచుకొని యతనివలన బృహస్పతిప్రోక్తంబైన నీతితత్వ మంతయుం దా నెఱింగి పదంపడి ధృష్టద్యుమ్నాదులకుం జెప్పించె. వారివలన నేనును వినియుంటి. తత్ప్రకారంబు వివరించెద. జ్ఞానవంతునకుం గర్మంబు గర్తవ్యంబు. స్థావరంబులు ప్రతిదినము కర్మము ననుష్ఠింపకున్నను జీవించు. తక్కటిభూతంబు లట్లు జీవింపనేరవు. జంతువులు తమంతటన వర్తింప శక్తిగలనాఁటఁగోలె జీవనం

బును గర్మచేఁ గాంచు. జంగమములందును విశేషముగ మనుష్యులు కర్మచే నుభయలోకసుఖంబుఁ బొందఁ గోరుదురు. సర్వభూతంబులును నిజకర్మఫలోదయంబు గుఱుతెఱింగి ప్రత్యక్షంబుగఁ దత్ఫలంబుఁ గుడుచు. నీరిపైనుండి క్రింద మెలంగుమీల నేర్పున నేర్పఱచి గ్రహించుకొంగ తెఱంగున నందఱుం గార్యముల మెల్లన జతనంబుఁ బన్ని తత్ఫలోదయంబుననే యుపజీవింతురు. క్రియలు సలుపనివారికి జీవిక కలుగనేరదు. దానంజేసి కార్యములఁ జేయుట లగ్గు. నీవు నలయక పౌరుషంబుఁ జూపి యుచితకార్యములఁ జేయుము. పూర్వకృతంబు గుఱుతెఱుంగువాఁడు వేవురిలో నొక్కఁడైనం గన్పడుట యరిది. అట్టివానికిం బూర్వకృతంబునకు వృద్ధిరక్షణంబులకుఁగా నప్పుడప్పుడు తగురీతిఁ గర్మంబు గర్తవ్యంబు. కాకున్నఁ బూర్వకృతం బెక్కుడయ్యు ఫలానుభవంబునంజేసి క్రమక్రమంబునఁ దఱుఁగు. ప్రతిదినంబునుం గొంచెమైన నపనయింపుచున్న హిమవంతంబైనఁ దఱుఁగకున్నె. కర్మంబు చేయకున్నను, మఱియు నది నిష్ఫలంబైననుం బ్రజలెల్ల నశింతురు. వెండియు నల్పఫలంబైనఁ గర్మంబుఁ జేయువారిం జూచెదము. అది చేయకున్న జనులు వేఱొక్కతెఱంగున జీవింపనేరరు. దైవమే రక్షించు ననిమిన్నకుండువాఁడును, హఠంబుగవాదించువాఁడును శఠుఁ డనం దగుదురు. దైవమును నమ్మిపౌరుషంబుఁ జూపనియతఁడు నీరిలోనిపచ్చికుండవ్రోలె నశించు. అట్లే కార్యములఁ జేయఁ గలిగియు హఠంబుగ వాదింపుచు నూరకుండువాఁడనాథదుర్బలునివడువునఁ బెద్దకాలంబు మన నేరడు. ఆకస్మికంబు, దైవవిశ్వాసలబ్ధంబు, పౌరుషసాధితంబు, స్వభావోపగతంబు నను నాల్గుఫలములు క్రమంబున హఠదైవపౌరుషస్వభావలబ్ధంబు లనఁ బరఁగు. అన్నియుఁ బూర్వకర్మపరిణామంబున ఫలించు. ధాతయు వారివారిపూర్వకర్మంబులనె యమ్మెయికారణంబుల విభజించి తత్ఫలంబుల నిచ్చు. పురుషుఁ డిపు డెద్దియేఁ గార్యంబుఁ జేసెనా యదియంతయుఁ బూర్వకర్మఫలోదయం బని నిర్ణయింపవలయు. ఈశ్వరప్రేరితుండై పురుషుండు కర్మముల ననుష్టించునెడ శరీరంబు హేతుమాత్రంబై యుండు. పురుషుఁడే ముఖ్యకారణంబు. పురుషప్రయత్నంబునం గాదె గృహనగరాదులెల్ల నలవడుచున్నయవి. కావున బుద్ధిమంతుఁడు పురుషప్రయత్నమునఁ గార్యములు సిద్ధించు నని మనంబున నిశ్చయించి తిలంబులందుఁ దైలంబును, గోవునందుఁ బాలును, గాష్ఠంబునం దగ్నియు నుండుటంజేసి వానిం బడయ నుపాయంబు నూహించి నేర్పున జతనంబుఁ బన్ని కార్యము నొనరించి ఫలంబు సాధించు. పురుషప్రయత్నంబునఁ గార్యఫలంబు సిద్ధించుట నిక్కువంబు. లోకమున నెవ్వఁడేని కార్యము నొనరింపనది ఫలవంతం బయ్యెనా యితఁడు సమర్థుఁడు. వీనిచేసిన పని ఫలించె నని యందఱుం గొనియాడుదురు. కాకున్న వీనియసామర్థ్యంబునఁ

బని చెడె నని దూఱుదురు. ఇట్లుండఁ బురుషుండు కర్త గాకున్నె? పౌరుషంబు ఫలింపకున్నె? పురుషుఁడు కర్త గాఁడేని యిష్టాపూర్తంబులు ఫలించునే? గురు శిష్యభేదం బేర్పడునే? కొందఱు సర్వంబు హఠసాధ్యం బందురు. మఱికొందఱు దైవలభ్యం బందురు. వెండియుంగొందఱు పురుషకారలభ్యం బందురు. అన్నింటికంటె నర్థసాధనోపాయంబు పౌరుషంబ. ఫలమున సంశయించి ప్రయత్నముఁ జేయనివాఁడు సంపదలఁ గాంచనేరఁడు. సంశయంబున సకలానర్థంబులు గలుగు. కావున ధీరులు సంశయంబులం బాసికర్మరతులై ఫలంబుఁ బొందుదురు. ఒక వేళఁ బ్రయత్నంబు విఫలంబైననుం దప్పు లేదు. చేయవలసినంతయుఁ జేసి ఫలంబు గలుగదేని దానం దనదోషంబు లేదని ధీరుఁడు సంతసిల్లు. ప్రయత్నంబు గుణవంతంబు గాకున్న ఫలం బల్ప మగు. దైవసహాయంబు లేదేని విఫలంబు నగు. కర్షకుఁడు లెస్సగా దున్ని మంచివిత్తులఁ జల్లఁగా వర్షంబు గురిసెనేని ఫలంబు గలుగు. వర్షము లేకున్నఁ గర్షకుఁ డేమి సేయు. తనపనియంతయుం దీర్చికొని దైవసహాయంబు లేదని యూరక స్వస్థచిత్తుఁ డగు. అట్లుపోలె బుద్ధిమంతుఁడు ఫలంబు దైవాధీనం బని నమ్మి దేశకాలముల నుపాయంబుల శుభలక్షణంబులం బరికించి పురుషప్రయత్నంబు లెస్సగఁ జేయనవలయు కావున నీవును శత్రువిజయార్థంబు పౌరుషంబుఁ జూపు మనుచున్నంత యాజ్ఞసేనివచనంబుల కనుగుణంబుగా భీమసేనుఁ డిట్లనియె.

### ధర్మరాజభీమసేనులసంవాదము.

రాజేంద్రా! ధర్మప్రాప్తం బైనరాజ్యమును విడిచి ధర్మకామార్థహీనులమై మన మీయడవుల నిడుమలఁ బడనేల? దుర్యోధనుఁడు మనరాజ్యము నార్జవమున నొండె విక్రమమున నొండెఁ గొనినవాఁడు గాఁడు. మఱి సింహరక్షితం బైనమాంసమును నక్కవొలె వంచనచే నస్దురాత్ముండు జూదమున నపహరించుకొనియె. గాండీవిరక్షితం బైనమనరాజ్యము నింద్రుఁడైన నపహరింపనేరఁడు. నీప్రమాదంబునంజేసి మే మందఱము జీవించి చూచుచుండ నప్పాపాత్ముఁ డపహరించుకొనఁ గలిగె. ధర్మలేశంబునకుఁగా ధర్మార్థములకు మూలం బగురాజ్యమును విడిచి మిత్రవిషాదంబు, శత్రుమోదంబునుం, బెంపార దుఃఖములఁ గుందుచుండెదవు. నీశక్కినప్రీతిగా మేమందఱు వ్యసనగ్రస్తుల మైతిమి. నీయాజ్ఞకుఁ జిక్కక యపుడే ధార్తరాష్ట్రుల గీటడంతుమేని యివ్వనమున దుర్బలులపగిది మృగచర్యం బూనవలసియుండదుగదా. నీచేసినకార్యంబును వాసుదేవుఁడు, నర్జునుఁడు, నకులసహదేవులు, నభిమన్యుఁడును, సంజయాదులును మెచ్చరు. ఇదియు నొకధర్మం బనిభావించి యెల్లపుడు వ్రతోపవాసాదినియమములఁ గృశించి యీయడవుల వసించి పౌరుషహీనునివిధంబున మందవృత్తి నవలంబించె

దవు. ఇదియు నుఱవే? సంపద సంపాదింప శక్తిలేనివారు స్వార్థఘాతుకం బయి నని ర్వేదంబుఁ జెందుదురుగాని యుక్తాయుక్తవివేకంబు, సామర్థ్యంబునుం గలిగి మాపరాక్రమంబు లెస్సగఁ దెలిసిననీకు నిర్వేదంబుఁ జెందఁ దగునే? క్రూరత్వంబుతగదని ధార్తరాష్ట్రులయెడ నోర్పుమై నుండుటంజేసి వారు మనల నశక్తలని యుల్లసంబాడుదురు. దీనం గలుగు ననర్థం బెఱుంగవైతివి క్షత్రియులకవమానంబె దుఃఖముగాని యుద్ధమరణంబు గాదు. న్యాయమార్గమున యుద్ధముఁ జేసి శత్రుల జయింపలేక యందు శరీరంబుఁ దొఱంగినను బరలోకసౌఖ్యంబు శాశ్వతంబు. జయించితిమేని భూమినెల్ల న్యాయమునఁ బాలించి విమలకీర్తి నంతట నెఱపి కులధర్మంబుఁ బాలింప నగు. తనకును, సుహృదులకుం గ్లేశంబుఁ గావించుధర్మమే ఘోరవ్యసనంబు. అదియే యోగ్య మనిభావించి దానినే యాచరించువాని ధర్మార్థంబులు చేరరావు. అంధుఁ డెండనుంబోలె వాఁడు ధర్మతత్త్వం బెఱుంగ నేరఁడు. ధర్మార్థకామములఁ బరస్పరవిరోధంబు లేకుండ దేశకాలములఁ బరిశీలించి యుచితరీతిని సేవింపవలయు. అడవిలోఁ గూలి కావుల మేఁపువానివిధంబున నాత్మార్థముగనే యర్థ మార్జించి ధర్మకామములకుఁ బంచి యియ్యనివాఁడు తత్ఫలంబుఁ బొందనేరఁడు. మఱియు నతఁడు బ్రహ్మఘాతకునిరీతి సర్వభూతవధ్యుఁ డగు. మీఁ దెఱుంగక కేవలకామాసక్తుండై ధర్మార్థంబుల సేవింపనివాఁడు మిత్రధర్మార్థభ్రష్టుఁడై స్వేచ్ఛమై మడువునఁ జరింపుచున్న మీనమ్మడువున నీ రింకినంతన క్షయించుపగిదిఁ గామాంతమున నిధన మొందు. పండితు లం దప్రమత్తులై యుందురు. మేఘసముద్రంబులచాడ్పున ధర్మార్థంబులు పరస్పరోపకారకంబులు, విషయసంయోగంబునఁ గలుగుప్రీతియే కామ మనంబడు. అట్టికామంబునకు లోఁగక మాంసమమ్మువానివృత్తియై యధర్మం బైన హింసం జేయక త్రివర్గంబునందు సమభావంబున వర్తించి ప్రతిదినంబును ముందు ధర్మంబును, బదంపడి యర్థంబును, బిదపఁ గామంబును సేవింపవలయు. వెండియుం బ్రథమవయస్సునఁ గామంబును, ద్వితీయవయస్సున నర్థంబును, తృతీయవయస్సున ధర్మంబును, జతుర్థవయస్సున మోక్షంబును సాధింపవలయు. నరుఁడు త్రివర్గమునొండె మోక్షంబునొండె సేవింపవలయుఁగాని రెంటికిం దప్పరాదు. అట్టివాఁడు రోగార్తునిరీతి నిరంతరదుఃఖంబున జీవించు. సర్వధర్మంబులు నీయెఱింగినవియకావే? నీసద్గుణంబుల నందఱుం బ్రశంసింతురు. దానయజ్ఞస్వాధ్యాయార్జవసాధుసత్కారంబులకంటె నుభయలోకసుఖదం బైన యుత్తమధర్మంబు గన్పట్టదు. ఎన్నిగుణము లుండిన నర్థము లేకున్న నివి యాచరింప నలవియగునే? అర్థంబె ధర్మమూలంబు. అయ్యర్థంబు నార్జింప బ్రాహ్మణ వృత్తియైన భైక్షంబును, వైశ్యశూద్రవృత్తులను క్షత్రియుండు గ్రహింపరాదు. క్షత్రియునకు

శరీరబలపురస్సరం బై నపరాక్రమంబె యర్థార్జనంబున నుత్తమధర్మంబు. సర్వధర్మజ్ఞుం డై ననీవంటివాఁ డుత్తమధర్మంబుఁ బరిత్యజించి యొండుధర్మంబుఁ గొనఁ దగునె? దాన లోకంబునఁ బరిహాసభాజనంబ వగుదువు. ఎవ్వారికేనియుఁ గులోచితధర్మపరిత్యాగంబు గర్హితంబు. కేవలధర్మంబున రాజమాత్రుఁ డొక్కఁడై నను నెన్నఁడును సంపద సంపాదింపనేరఁడు. శత్రువిజయంబునకుఁగా వంచనయుం జేయఁ దగు. పూర్వజాతులు, నన్నలు నగురాక్షసులను సురలు వంచనంగాదె చంపి సౌఖ్యంబు సాధించిరి. క్షత్రియులలోన బలపరాక్రమవంతుండై నికృతినై నఁ బగవారిం గెల్చువాఁడే యుత్తముఁడు. అర్జునుతోడివిలుకాఁడును, నాతోడిగదాధరుఁడును నెప్పుడు నెచ్చట నుండఁడు. మేము బాసటగాఁగ శత్రుజయం బెంతటిపని? కావున నుత్సాహవంతుండవై సమయధర్మరక్షణం బుడిగి శత్రులం గెలువఁ గడంగుము. ధాన్యరాసుల నార్జింపఁగఁ గర్షకుఁడు బీజముల వ్యయంబు సేయుమాడ్కిఁ గొన్నియెడల మహార్థంబు సేకూఱ నర్థంబునుం ద్యజింపవలయు. మిత్రబలసమన్వితుం డై నశత్రువును జయించువారు తంత్రంబున మిత్రభేదంబుఁ జేసి సహాయహీనుం డై నయరి నుత్సహించి వశీకరింతురు. తేనెఁ గొనవచ్చిన మనుజులఁ గుట్టి గెలుచుజుంటీఁగలపగిది దుర్బలులై నం బెక్కండ్రు చేరి రేని బలవంతు నొక్కనిం జంపుదురు. బలవంతులే పెక్కం డ్రొక్కటం జేరినఁ జెప్పనేల? విజయంబునకుఁగా రాజోకించుకపాపంబుఁ జేసినను బదంపడి రాజ్యంబు వశీకరించుకొని విపులదక్షిణంబు లై నయజ్ఞంబుల ననుష్ఠించి బ్రాహ్మణుల కగ్రహారంబులను, గోవులను వేనవేలుగ నిచ్చి సర్వపాపవినిర్ముక్తుండై తమోనిర్ముక్తుండై న చంద్రుని చాడ్పున వెలుంగు. నీయెడ నిప్పటికిఁ గొంచెమేనియుఁ బాపంబు గన్పట్టదు. లోభమోహకార్పణ్యభయాదులనై న నీ వనృతంబు నుడువవై తివి. నీసత్యసంధత నందఱుం గొనియాడుదురు, కుక్కతోలుతిత్తిలోనిపాలుపగిదిని, శూద్రునియందలివేదంబువిధంబునను, దుర్యోధనునందు రాజ్యంబు దూషితంబు. కావున నాలస్యం బుడిగి బ్రాహ్మణకృతస్వస్త్యయనుండవై సర్వసాధనసంభృతం బై నరథం బారోహించి సర్వశస్త్రాస్త్రవిదు లగుతమ్ములును, వాసుదేవుఁడును, సృంజయకై కేయపాంచాలు రాదిగాఁగలబంధుజనులుం దోడరాఁగ మరుద్గణపరివృతుండై వృత్రవధార్థంబరుగు దేవేంద్రునిచాడ్పున విజయప్రస్థానంబుఁ జేసి హాస్తినపురంబుపై విడిసి ధార్తరాష్ట్రుల నిర్జించి రాజ్యలక్ష్మిం గొను మనిన విని ధర్మనందనుండు భీమున కిట్లనియె. భీమసేనా! నీచెప్పినదంతయు సత్యంబు. మీకెల్లరకు నావలన వ్యసనంబు వాటిల్లుటం జేసి పరుషంబులు వలుకుచున్నను నిన్ను నిందింపను. నే జూదమునకుఁ దొడంగి దుర్యోధనునకుఁగా మహామాయుం డై నశకుని తానే యాడి వంచనచే నను నోడించె. శకునియే గెల్చుచుండినను విజిగీషచే నేనును రోషంబు నిలుపఁజాలక

ధైర్యంబుడిగి పలుమాఱు లాడియోడితి. అట మనము ధార్తరాష్ట్రులకు దాస్యము చేయవలసివచ్చుటయు ద్రౌపది యాయాపద నిస్తరించె. పెండియు ననుద్యూతంబునకు వారు పిలువఁగఁబోయి శకునివంచనంజేసి యోడి పండ్రెండేండ్లు వనవాసంబును, నొక్కయేఁడజ్ఞాతవాసంబును, నయ్యెఁట నెరులెఱింగిరేని క్రమ్మఱఁ బూర్వనియమంబుఁ జేయఁ బ్రతిజ్ఞఁ బూనితింగదా? ఆసమయంబును రాజ్యంబునకుఁగా విడువఁదగునే? ధర్మంబతిక్రమించి రాజ్యమేలుటకంటె మరణమే మేలని యార్యుఁడు దలంచు. రాజ్యముఁ, బుత్రులు, కీర్తియు, ధనమును, సత్యంబునకు సరిగావు. వాఁడిములుకులంబోనిపలుకుల నేల గాఱించెదవు? జూదంబున నాభుజముల దండింపఁగఁ బరిఘంబు గ్రహించిననీ వపుడే వీరకృత్యంబుఁ జేసితివేని యీపాట్లు మీకు లేకుండుఁగదా? అర్జునుమాట విని యూరకుంటివి. పౌరుషంబున నపుడు నీచెప్పనిమాటలుంగలవే? వ్యసనకాలంబిపుడు ప్రాప్తంబై యుండ నన్నేల యిపుడు రిత్త గాఱించెదవు. ద్రౌపదీపరిక్లేశంబునకు దుఃఖితస్వాంతుండనై యున్న నన్ను నీవచనంబులు విషంబువోలెఁ గాఱియలఁ బెట్టుచుండు. అది యట్లుండె. నీవచనంబుమెయి సమయంబుఁ దీఱకమున్న శౌర్యంబుఁ జూపరాదు. అపకారంబుఁ బొందినయతండు వైరంబు పుష్పితంబు ఫలితంబునై నపదంపడి దాని మూలధ్వంసముఁ జేయునతఁడే వీరుఁ డననెగడు. అష్టైశ్వర్యంబు లతనిం జేరవచ్చు, శత్రువులు విధేయులగుదురు. సుహృదులు సంతసింతురు. బీజంబులఁ జల్లినకృషీవలుఁడు ఫలంబునకుఁబోలె సుఖోదయకాలంబ ప్రతీక్షింపు మనిన ధర్మరాజునకు భీముఁ డిట్లనియె. మహారాజా! మర్త్యశరీరంబుల నమ్మి కాలము గడపఁ దగదు. జీవులకు శరీరంబు నీటిపై నురుఁగువోలె నతిచంచలంబు. మరణంబునకుమున్న శత్రువుల వధింపనియతనిజన్మంబు నిరర్థకంబు. శత్రుసంహారంబున వంచనంజేసి నరకంబుగలిగినను శూరుఁడు దాని స్వర్గంబుగ భావించు. పెద్దకాలంబు మనఁగలయతనికి, సర్వవిషయంబులఁ బ్రత్యక్షంబుగఁ గాంచినయతనికిఁ దక్కఁ దక్కటివారికిఁ గాలయాపనంబు దగునే? క్రోధమూలంబైనసంతాప మగ్నికంటెఁ బ్రజ్వలితంబై రేలుంబవళ్లు నన్నేర్చుచున్నయది. లోకమున నంతట మేటివిలుకాఁడై నబీభత్సుండు గుహాంతరంబున నాఁపినసింహంబువోలె నీయాజ్ఞకు లోఁగి యేమియుఁ జేయనేరక మత్తశుండాలంబువిధంబున వేఁడినిట్టూర్పులు నిగుడింపుచు వనరుచుండు. నకులసహదేవులును, గుంతీదేవియు, ద్రౌపదియు, బంధుజనులును వ్యసనంబులఁ గుందుచు యుద్ధంబు మేలనితలంపుచున్నవారు. వారికెల్ల మనఃప్రీతిఁ గావింపవలదే? అల్పబలులగు నీచులు రాజ్యంబు నెడిచికొనఁగ బీరంబుడిగి వనఁటపాలై యూరకుంటకంటె

వేఱొక్క విషాదంబు గలదే? ఏమి చెప్పుదు? స్వభావదోషంబున దయావిష్టుం
డవై దుఃఖములనెల్ల సైఁతువు. నీవర్తనంబు నెరు లెవ్వరు మెచ్చరు. కేవలాను
వాకపాఠజడంబై నయర్థానభిజ్ఞశ్రోత్రియబుద్ధివోలె నీబుద్ధియుఁ దత్త్వార్థం బెఱుం
గనేరదు. బ్రాహ్మణోచితంబైన కారుణ్యంబు గలిగి క్షత్రియులలో నెట్లు పుట్టి
తివి? క్షత్రియులకుఁ గ్రౌర్యవీర్యంబులు సహజంబులుగావే? మనుప్రోక్తంబైన
రాజధర్మంబునెల్ల లెస్సగ నెఱింగిననీవు పరమదుష్టాత్ము లగుధార్తరాష్ట్రులయెడ
క్షమ సేయఁ దగునే? మఱియు రాజసూర్యండైన నీవు మాతోడ నజ్ఞాతవాసంబు
సేయ నిశ్చయింతువు. లోకంబున మనల నందఱు నెఱింగినవారుకారే? తృణ
ముష్టిచే మేరుహిమవత్పర్వతంబులు డాఁపరానిపగిది మనయజ్ఞాతచర్య యెంత
యు నఘటమానంబు. నిసర్గదుష్టులైనధార్తరాష్ట్రులు మనయజ్ఞాతచర్యఁ జెఱు
పన తలంచి వేగువాండ్రం బెక్కండ్రఁ బంపకుందురే? గూఢప్రకారంబున సంచ
రింపుచు వారు మనలఁ గానకుందురే? కావున నావచనంబు విని యింతట వన
వాసంబు చాలించి విజయయాత్ర వెడలుము. ఇప్పటికి వనవాసమునఁ బదుమూఁడు
నెలలు గడపితిమి. యజ్ఞప్రయోగంబులందు సోమలతకు మాఱుగాఁ బూతీకతృ
ణంబుల గ్రహించువిధంబున సంవత్సరప్రతినిధిగా మాసము గ్రహించుట యెం
దునుం గలదు. అట్లు చేయుము. కాదేనియు సాధువైన యనడ్వాహంబునకుఁ దృప్తి
గా మేఁపు నిచ్చి యీపాపంబు నపనయింపఁ దగు. క్షత్రియునకు రణంబుకంటె నుత్త
మధర్మంబు వేఱొండు గన్పట్ట దనిన విని ధర్మరాజు తనమనంబున రాజధర్మములు,
వర్ణధర్మములునుం జక్కఁగఁ దెలిసిననేను బలాత్కారంబున నిప్పు డెట్లు సంకేత
భంగంబు సేయుదు నని పెద్దయుం బ్రొద్దు చింతించి నిట్టూర్పులు విడిచి భీమున
కిట్లనియె. నావచనంబు వినుము. అల్పకార్యములు సాహసంబునం బూనినను ఫలిం
చుఁగాని మహాకార్యములు కేవలసాహసారంభంబునఁ జెడు. కావున బలగర్వమున
నిట్టికార్యములు పూనరాదు. మఱి లెస్సగ నాలోచింపవలయు. ధార్తరాష్ట్రు
లందఱు బలవంతు, లస్త్రవిదు, లాతతాయులు. వారికిఁగాఁగఁ గర్ణశకునిసైంధవా
శ్వత్థామాదులు మహావీరులు ప్రాణములనైన విడుచువారు. మఱియు దిగ్విజయం
బున మనచే నోటువడినరాజు లందఱు వారిపక్షమున నుందురు. భీష్మద్రోణకృపా
చార్యులు ముప్పురు మనకు వారికిని సమాను లయ్యును వారియెడ నుండుటం
జేసి వారికే సహాయు లగుదురు. అభేద్యకవచావృతుండైనకర్ణుని గెలుచుట
యెంతయు దుష్కరంబు. వానివిక్రమంబు మనంబునకు వచ్చినప్పుడెల్ల నాకనుఁ
గవ కూరుకుం బొరయదు. సురలకైన నజేయులైనవీరులెల్లఁ దదీయులై యుం
డఁగ వారిం గెలుచు టెట్లో యని చింతిల్లెద ననిన విని భీముఁ డెద్దియుం జెప్ప
నేరక యూరకుండె.

### వ్యాసుఁడు ధర్మరాజునకుఁ బ్రతిస్మృతి యనువిద్య నుపదేశించుట.

అట వేదవ్యాసుఁ డటకు వచ్చి భక్తిమైఁ బాండవు లొనరించిన పూజలం గైకొని సుప్రీతుండై ధర్మరాజున కిట్లనియె. ధర్మనందనా! నీమనోభిప్రాయం బెఱింగి వేగంబ వచ్చితి. భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనాదుల పరాక్రమంబునకు వెఱవవలదు. ధీరుఁడ వగుమని చెప్పి యేకాంతస్థలంబునకుఁ దోడ్కొని యరిగి నాయుపదేశించు నీప్రతిస్మృతి యనువిద్యను గ్రహింపుము. అర్జునుఁ డివ్విద్యను నీవలనఁ దెలిసికొని దీనిప్రభావమున నింద్రయమవరుణకుబేరులను మహాదేవునిం బ్రత్యక్షంబుగఁ గాంచి తదస్త్రంబుల సాధించు. అద్దేవులం గనుంగొనంగ నర్జునుం బంపుము. అతండు తొల్లి నారాయణసహాయుండై తపము సల్పిన నరుఁ డనుఋషివర్యుఁడే యిప్పు డర్జునుఁ డన జనించె. తపోవిక్రమముల నాతండు దేవతలం గాంచును. మఱియు నిచట బహుబ్రాహ్మణులతోడ మీరు పెద్దకాలంబు వసించుటం జేసి ఫలసమిత్ప్రభృతిపదార్థంబులు తఱిగె. మృగముల యథేచ్ఛసంచారంబునకు పరోధం బయ్యె. ఒక్కచోటఁ జిరకాల మునికి తాపసుల కుద్వేజకంబు. మఱియు నది యేరికిం బ్రియంబుగాదుగదా? వేఱొకవనమునకుఁ బోవునది యని చెప్పి విధియుతంబుగ నాప్రతిస్మృతివిద్య నుపదేశించి కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజు నామంత్రణంబు చేసి తత్క్షణంబ యదృశ్యుం డయ్యె.

ధర్మనందనుఁ డావిద్యం గ్రహించి కాలమున లెస్సగ జపించి మనమున ధరించి వ్యాసవచనప్రకారంబున ద్వైతవనంబు విడిచి విప్రగణపరివృతుండై తమ్ములుఁ దగువారుం గొలిచి రాఁగఁ గామ్యకవనంబు సేరి మృగయాసంపాదితంబులైనమృగములచేఁ బితృదేవబ్రాహ్మణులం దన్పుచు సుఖముండి యొక్కనాఁడు వ్యాసవాక్యంబులఁ దలపోసి యర్జునుఁ జేతఁ బట్టుకొని యేకాంతమునకుఁ దోడ్కొని యరిగి సాంత్వపూర్వకమందహాసంబు సొంపార నిట్లనియె. అనుఁగుఁదమ్ముఁడా! భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణులయందుఁ జతుష్పాదంబై నధనుర్వేదమంతయు సుప్రతిష్ఠితంబు. వారు బ్రాహ్మదైవమానుషంబు లయినయస్త్రంబులనెల్లఁ బ్రయోగోపసంహారపూర్వకంబుగ నెఱుంగుదురు. సర్వకాలసేవం జేసి దుర్యోధనునెడఁ బ్రీతి గలరు. తక్కటియోధులుం దత్తత్కాలసత్కారంబులం జేసి యతనియెడ నతిప్రీతులు. అందఱు వానిశక్తి కొఱంతవడకుండఁ జూచికొందురు. భూమండలంబంతయు నిపుడు దుర్యోధనవశంబై యున్నయది. క్రమ్మఱ మనరాజ్యంబు సాధింప భారమంతయు నీయంద యున్నయది. మనమనోరథంబు సమకూఱం గోరి పారాశర్యమునీంద్రుఁడు ప్రతిస్మృతి యనువిద్యను నాకుఁ బ్రసాదించి నీ కుపదేశింపు మనియానతిచ్చె. ఆవిద్యను నీవు నావలనం గ్రహించి తత్ప్రభావంబున నపూర్వతేజోవిలసితుండవై యరిగి దేవతాప్రసాదంబు సిద్ధించునంతకుఁ దీవ్రముగఁ దపం

బనుష్ఠింపుము. తొల్లి వృత్రాసురునకు వెఱచి సురలెల్లఁ దమతమయస్త్రముల నింద్రునెద్ద నుంచిరి. నీతపమునకు మెచ్చి యతం డాయస్త్రములనెల్ల నీ కిచ్చు. కావున ధనుర్బాణతూణీరఖడ్గాదిసాధనంబుల గ్రహించి సాధువ్రతస్థితుండవై త్రోవఁ దొలంగక చక్కన నేఁడే యుత్తరంబునకుఁ బొమ్ము. ఇది వ్యాసవచనం బనిచెప్పి యథోక్తంబుగ నాప్రతిస్మృతివిద్య నుపదేశించె.

ధర్మరాజనియుక్తుండై యర్జునుండు దేవేంద్రసందర్శనంబుఁ గోరి యగ్నిలోన వ్రేల్చి నిష్కదక్షిణలచే బ్రాహ్మణుల నర్చించి తదీయస్వస్తివచనంబుల గ్రహించి కవచాదులం దొడిగి గాండీవంబు, నక్షయ్యతూణీరంబులం గొని ధార్తరాష్ట్రులవధంబుఁ దలంచి నిట్టూర్పు విడిచి యూర్ధ్వముగ నీక్షించి తఱలుచుండ బ్రాహ్మణులు, సిద్ధు, లదృశ్యభూతంబులు నర్జునా! నీమనోరథంబు చేకూఱు. విజయంబు సాధింతు వనిదీవింపుచుండ ద్రౌపది యిట్లనియె. నీవు జనించినంతన నీవలనఁ గుంతీదేవిగోరినఫలంబును, నీయభీప్సితంబునుం బొందుము. మనలో నెవ్వఁడు నిఁక క్షత్రియకులంబునఁ బుట్టకుండుఁగాక. భైక్షవిధిం జీవించు బ్రాహ్మణులే సుఖులు. వారికి మ్రొక్కెద. ద్యూతమున దుర్యోధనుఁడు సభలోఁ బలికినప్రల్లదంబులం దలంప నంతకంటె వేఱొక్కదుఃఖముగలదే? నీవిరహంబు మాకెల్లరకు నుల్లఱంబు. నీశౌర్యాదిగుణంబుల నుగ్గడింపుచు మే మందఱము నెల్లపుడు నీసమాగమంబ కోరుచుందుము. పెద్దకాలంబు దేశాంతరంబున నుండఁగ మాకు భోగంబులందు, ధనంబులందుఁ, బ్రాణంబులందును సంతోషంబు వొడమదు. మాసుఖదుఃఖములెల్ల నీయందే సుప్రతిష్ఠితంబులు. అయినఁ గార్యార్థంబుగ నరిగి యవిఘ్నముగ విజయము చేకొనిరమ్ము. బలవంతులతోడివైరంబు పరిహరింపుము. ధాత, విధాత, హ్రీశ్రీకీర్తిద్యుతిపుష్ట్యుమాసరస్వతులు, వసురుద్రాదిత్యులు, మరుద్గణంబులు, విశ్వదేవత, లశ్వినులు, సాధ్యులు సకలభూతంబులు నీకు శుభము లోడఁగూర్తు రనిదీవించి పాంచాలి తద్విరహవిహ్వలంబైనమనంబు నెట్టకేలకు నిల్పుకొనియుండె.

అర్జునుం డస్త్రగ్రహణార్థము తపంబున కరుగుట

అర్జునుఁడును ధౌమ్యునకు, నన్నదమ్ములకుం బ్రదక్షిణంబు లొనరించి యైంద్రయోగప్రభావంబున సర్వభూతములు తనకుఁ ద్రోవ నొసంగుచుండ మనోవేగంబున నొకదినంబుననే యనేకపర్వతంబులను, హిమవంతంబును, గంధమాదనంబు నతిక్రమించి యింద్రకీలపర్వతంబుఁ జేరి యచట "నిఁక నిలు" మని యొక్కవచనం బంతరిక్షంబున విననగుటయు ధనంజయుఁడు దెసలెల్లం గలయం గనుంగొని యొక్కచో వృక్షమూలంబునఁ దపోనియమకృశుఁడు, బ్రహ్మతేజోవిరాజమానుండు, పింగళవర్ణుఁడు నగు నొకమహాత్ముం గాంచె. అత్తపస్వియు నర్జును

జూచి యయ్యా! నీ వెవ్వఁడవు. ఏమిపని గలిగి క్షాత్రపరుండవై కవచంబుఁ దొడిగి ధనుర్బాణఖడ్గాదిసాధనంబులతోడ నిటకు వచ్చితివి? ఇచ్చోటు క్రోధహర్షములఁ బాసినశమైకరతు లగుబ్రాహ్మణోత్తముల కునికిపట్టు. యుద్ధసాధనము లయినయీయాయుధముల నిటకుఁ దేనేల? ఓజస్తేజోబలంబున నిటకు వచ్చుటం జేసి యుత్తమగతిం బడసితివి. కాన నాయుధముల నిట విడువు మని యెన్నిచెప్పినను ధనంజయుండు ధైర్యమునఁ దననిశ్చయంబుఁ దొలంగకుండె. అత్తాపసుం డతనిమనోనిశ్చయంబునకు మెచ్చి యర్జునా! నే నింద్రుఁడను. వరముల వేఁడు మనినవ్వుచుఁ జెప్పఁగఁ గుంతీనందనుండు పురందరుపదారవిందమ్ములకు వందనమ్ముఁ గావించి ప్రాంజలియై దేవా! నీవలన సకలాస్త్రంబులఁ దెలిసికొనఁ గోరెద. నా వరం బనుగ్రహింపు మనిన నింద్రుం డింకను నస్త్రము లేల? పుణ్యలోకములఁ గోరుకొని తత్సుఖ మనుభవింపు మనిన నర్జునుండు వెండియు నిట్లనియె. అన్నదమ్ముల నడవిలో విడిచి నేఁ బుణ్యలోకసుఖ మనుభవింతునే? కామలోభముచే దేవత్వంబును, సర్వదేవాధిపత్యంబునుం గోరను. మఱియు ధార్తరాష్ట్రులతోడి వైరంబు దెగఁదీర్పక మున్న నేఁ బుణ్యలోకములఁ గోరెదనేని లోకమున నపకీర్తి నెఱయకున్నె? యనిన నతనియుత్తమ తాత్పర్యంబునకు మెచ్చి సహస్రాక్షుం డర్జునా! మహాదేవుం బ్రత్యక్షుంబుగఁ బొడఁగనినపదపడి నీకోరినపగిది దివ్యాస్త్రముల నిత్తు. అప్పరమేశ్వరు నవలోకింపఁ బ్రయత్నంబుఁ గావింపు మనిబోధించి యదృశ్యుండయ్యె. అర్జునుండుంబరమేశ్వరారాధనపరుం డయ్యె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మహాత్మా! మత్ప్రపితామహుఁ డయిన యర్జునుఁ డస్త్రముల నెట్లు సాధించె? త్రిపురాంతకుఁ డయిన శంకరుం బోరున మెప్పించె ననివిందు. తద్వృత్తాంత మంతయు వివరింపు మనిన వైశంపాయనుఁ డిట్లనియె.

## ఈశ్వరుఁ డర్జును నెద్దుఁ గిరాత వేషంబున వచ్చుట.

అర్జునుం డట్లు నిర్జరేంద్రుననుజ్ఞం బడసి యంతరిక్షంబున దేవదుందుభులు మ్రోయఁ, బుష్పవర్షంబు గురియ, మేఘమండలంబు నీడఁ గావింప హిమవత్పర్వతశిఖరంబునకుఁ జని యందు వివిధపుష్పఫలభరితతరునికరబంధురంబును, హంసకారండవాదిప్రచారభాసురతటినీసరోవరసుందరంబును, శుకపికమధుపమయూరమంజులారావరమణీయంబు నగునొకవనంబుఁ గాంచి వల్కలపరిధానుండై కొన్నినాళ్లు రాలినయాకులం దినుచు, నొక్కమాసంబు దినత్రయంబున కొకపరి ఫలముల నుపయోగింపుచు, ద్వితీయమాసం బాఱుదినముల కొకసారి ఫలముల గ్రహింపుచుఁ, దృతీయమాసంబు పక్షంబున కొకతేప యాహారంబుఁ గొనుచుఁ, జతుర్థమాసంబున వాయుభక్షుండై, పాదాంగుష్ఠాగ్రమున నిల్చి నిరాలంబుఁడై పరమేశ్వ

రు నుద్దేశించి తీవ్రతప మనుష్ఠింపుచుండె. అతనిఘోరతపమునకు వెఱచి యచటిమునులు శూలపాణిపాలికిం జని పరమేశ్వరా! యర్జునునుగ్రతపంబునం జేసి దెసలెల్లఁ బొగ లెగయుచున్నవి. దాన మాకెంతయు సంతాపం బయ్యె. వాని ప్రార్థితంబుఁ బ్రసాదించి తపంబు వారింపు మనిన నద్దేవదేవుండు పార్థునిసంకల్పంబు నెఱుంగుదు. వాఁడు స్వర్గాదులఁ గోరఁడు. అభీప్సితంబు ననుగ్రహించి వానిం గృతార్థుం జేయుదు. వెఱవవలదు. ఆశ్రమములకుఁ జనుఁడని మునులఁ బంపి యీశ్వరుండు సువర్ణవర్ణశరీరం బైనకిరాతవేషంబుఁ దాల్చి సమానవస్త్రవేష యగుపార్వతియు, నానావేషములఁ దాల్చినభూతగణంబులును, స్త్రీగణంబులునుం దోడరాఁగ నటకుఁ జనుదెంచి నిశ్శబ్దం బయినయవ్వనంబున మృగయావిహారంబునఁ బ్రొద్దు పుచ్చుచు నర్జును డాయ వచ్చె. అట్టియెడ మూకనామధేయుఁ డగునొక్క రాక్షసుఁడు వరాహరూపంబున నర్జును వధింపవచ్చుటయు నవ్వీరుఁ డోరీపాపాత్మా! నిరపరాధుఁడ నగునన్నుఁ జంపవచ్చి తీవ యిదె చత్తువనిచెప్పి గాండీవంబుఁ గొని గొనయమ్ము సారించి క్రూరనారాచంబుల సంధింపుచుండఁ గిరాతరూపుఁ డైనయీశ్వరుఁ డయ్యా! యీవరాహమును మున్న నే నేయఁ బూనితి. నీ వేయవల దనిన నామాట నాదరింపక యర్జునుఁ డవ్వరాహంబుపై నమ్ములఁ బ్రయోగించె. ఎఱుకుతేఁడుం దక్షిణంబ యగ్నిజ్వాలాకరాళం బైనదివ్యాస్త్రంబు దానిపై నేయఁగ నారెండమ్ములు నొక్కతేప దానిపైఁ బడుటయు నయ్యస్త్రములసన్నిపాతం బతిఘోరం బయ్యె. మఱియు నక్కిరాతార్జునులు పెక్కమ్ముల నొక్కమ్మడిగ నక్కోలంబుపై నేయఁగ నది భీకరం బయినరాక్షసరూపంబుఁ బూని మడిసె.

పదంపడి యర్జునుం డక్కహనాకిరాతుం జూచి నీ వెవ్వఁడవు? జనరహితం బయినయీఘోరగహనంబున వెఱపులేక యింతులతోడఁ జరించెదవు. వరాహరూపధరుఁ డైనరాక్షసుఁడు నను వధింపవచ్చుటయు నే నతనిపై బాణ మేయఁగ నీవు నేల యేసితివి! ఇది మృగయాధర్మవిరుద్ధంబు. నీప్రాణంబులం గొనియెద ననిన నమ్మాయాకిరాతుండు నగి పాండుపుత్త్రున కిట్లనియె. ఈవనంబున నేనెట్లుండు నని నాకుఁగా వెఱవ వలదు. వనచరు లగుమా కిది సహజంబు. మఱి విచారింప విజనారణ్యవాసంబు నీకు దుష్కరంబు. నీరూపంబె సౌకుమార్యంబునకు నిదర్శనంబు. ఇందు నీవు నిస్సహాయుండవై యెట్లు చరింతు వనిన నర్జునుఁడు గాండీవంబునుం, గ్రూరనారాచంబులను నాశ్రయించి రెండవ వీతిహోత్రుఁడునాఁగ నిమ్మహారణ్యంబునఁ జరింతు. నను వధింపవచ్చిన యీవరాహంబును నేన చంపితి ననిన నాకపటకిరాతుఁ డిట్లనియె. ఈవరాహంబు మున్న నాకు లక్ష్యంబై మదీయబాణఘాతంబుననే విగతజీవం బయ్యె. బలగర్వమున నాత్మదోషముల

నితరులపై నేల యారోపింతువు? నాకుఁ జిక్కి ప్రాణములతోడఁ దప్పించుకొని పోవనేరవు. పిడుగులవంటియమ్ములం బఱపెద. చక్కనిలిచి శక్తికొలఁది బాణములఁ బ్రయోగింపు మనిన నర్జునుఁడు రోషరూషితుండై పెక్కుబాణమ్ముల నేయుచుండఁ గపటకిరాతుఁడు వానినెల్ల గ్రహించి మందమతీ! మర్మభేదననిపుణంబు లయిననీబాణములం బఱపింపుము. నీసామర్థ్యముఁ జూతమనిన నర్జునుం డలిగి శరవర్షంబుఁ గురియించె. ఎఱుకుఁడే డయ్యంపతుంపరనెల్ల మెల్లన గొని వాఁడితూపుల వేనవేలుగ వివ్వచ్చుపై నేయఁగ నతం డతనియెడఁ దనయమ్ములు వమ్ముగుటకు బమ్మరించి నివ్వెఱఁగంది యద్దిరా యితం డెవ్వఁడొక్కో? మదీయగాండీవనిర్ముక్తపటుశరాసారంబుల మ్రింగుచున్నవాఁడు. ఇతండు శంకరుఁడో? మఱి యేదేవుఁడో? కాకున్న నాబాణముల నితఁ డోర్చునే? ఈపర్వతంబు దేవనివాసంబు గాదే? యనివితర్కింపుచు నైనంగానిమ్ము. చండమార్తండుండు నిశితమయూఖములంబోలె వాఁడితూపులఁ బఱపించి వీనిగండడంతు ననితలంచి పెక్కమ్ములం బ్రయోగింప మహేశ్వరుం డాశిలీముఖములనెల్ల నడంచి యర్జునుతూణీరముల నమ్ముల క్షయింపఁజేసె. దాని నెఱింగి యర్జునుం డక్కటా? ఖాండవదహనముదితహుతవహప్రసాదసమాసాదితంబు లయినయక్షయతూణీరంబులును శరవిరహితంబు లయ్యె. ఏమి చేయనగు? ఇతం డెవ్వఁడో నాయమ్ములనెల్ల మ్రింగుచున్నవాఁడు. శూలాగ్రమున గజమునుంబోలె నితని వింటికొప్పున నడిచి విగతాసుం జేసెద నని నిశ్చయించి యక్కుహానాకిరాతుకుత్తుకం గాండీవాగ్రంబుఁ దగిల్చి యల్లెత్రాట నాకర్షించి దారుణముష్టులం బ్రహరించుటయు నయ్యెఱుకుఁ డాధనుర్వరంబు మాయించె. అంత నర్జునుఁడు ఖడ్గమున నతిరయంబున నతనిశిరంబు నేయుటయు నది యక్కిరాతుమస్తకంబు దగిలి పగిలె. అదియు నిరర్థకం బగుటయుఁ బార్థుండు వ్రాఁకులను, ఱాలను ఱువ్వి దాన నక్కిరాతుండు నొవ్వకునికిం గాంచి వేఱొక్కవెరవు గానక పోట్లాడం దలపడి మొగంబున మిడుఁగుఱు లెగయఁ బిడుగులంబోనిపిడికిళ్లం బొడుచుటయు నమ్మాయాపుళిందుండు చటచ్ఛటధ్వానంబు నిగుడ దారుణముష్టిప్రహారంబులు సేయం దొడంగుటయు వృత్రసుత్రామసంగరంబు తెఱంగున వారిపోరు ఘోరం బయ్యె. కిరాతరూపప్రచ్ఛన్నుండై నమహాదేవునిగాత్రసంఘర్షణంబున మూర్ఛవోయి యర్జునుండు కొండొకవడికి లబ్ధచేతనుండై మేనెల్ల నెత్తుటం జొత్తిల్లుటకు వగచి భక్తవత్సలుండై నమహాదేవుని మృణ్మయప్రతిమఁ గావించి దివ్యమాల్యమున నర్చించి యట నవ్విరిదండ నాకిరాతుశిరంబునఁ గనుంగొని యచ్చెరువున నినుమడించినసంతసంపుమున్నీటం దోఁగి యితండు కిరాతవేషప్రచ్ఛన్నుండై నపరమేశ్వరుండ యనినిశ్చయించి యద్దేవదేవునడుగులపయిం బడియె. అంత కాంతకుఁ డంత నత్యంతసంతోషసమాక్రాంత

స్వాంతుండై కౌంతేయుం గరుణమైఁ గనుంగొని యర్జునా! నీయసదృశకృత్యంబు నకు మెచ్చితి. భూలోకంబున క్షత్రియుండొండొక్కరుండు శౌర్యధైర్యముల నినుం బురుడింపనేరఁడు. తేజోవీర్యముల నీవు నాకు సమానుఁడవు. తొల్లి నీవు నరుఁ డనుపురాణమునీంద్రుఁడవు. నీకోర్కి నెఱవేఱ మదీయదివ్యాస్త్రంబు నిచ్చెద. దానింగ్రహింప నీవు తగుదువు. తత్ప్రభావంబున శత్రుల నుక్కడంతువు. దివ్యదృష్టి నొసంగెద. మదీయరూపంబుఁ జూడు మని మేఘగంభీరనిస్వనంబునఁ బల్కిన నర్జునుం డాదివ్యచక్షుర్గ్రహిమంబున నుమాసమేతుఁ డయినపరమేశ్వరుం గనుంగొని భయభక్తివినమితోత్తమాంగుండై సాష్టాంగప్రణామంబు లాచరించి కేలు మోడ్చి యిట్లని స్తుతించె. సర్వదేవేశ్వరా! నీవే కారణంబులకెల్లఁ గారణం బగుపరమేశ్వరుండవు. సురలకెల్ల గతివి. దేవాసురాదుల కేరికి నజేయుండవు. బ్రహ్మవిష్ణుశివాత్మకుఁడవు. ప్రధానపురుషాతీతుఁడవు. సూక్ష్మములకంటె సూక్ష్ముఁ డవు. గురువులకంటె గరిష్ఠుండవు. నీమహిమం బెన్న మాబోఁటుల కలవియె? సర్వదేవేశ! శితికంఠ! శర్వ! శూలపాణి! దక్షాధ్వరధ్వంసి! ఫాలనేత్ర! భూతగణనాథ! కైలాసభూభరాధివాస! శంకర! శివ! వృషధ్వజ! మహేశ! సాహసంబున నీతోడం బోరాడితి. అజ్ఞానమూలం బైననాయపరాధంబు క్షమియింపు మని స్తుతిపూర్వకంబుగఁ బ్రార్థింప మహేశ్వరుండు కుంతీనందనుం గౌఁగిలించుకొని చేయి పట్టుకొని నవ్వుచు క్షమించితి ననియూఱడించి వెండియు నిట్లనియె. తొల్లి నీవు బదరీవనంబున నారాయణుతోడ ననేకాయుతవర్షంబులు తపంబుఁ గావించినపుణ్యమూర్తివి. మీయిద్దఱతేజంబునంజేసి జగంబులు వెలుంగు. మీరిద్దఱు దుష్టరాక్షసుల వధించి యింద్రుం దైలోక్యరాజ్యంబున నభిషిక్తుం జేసితిరి. అప్పటిధనుర్వరంబే యిప్పుడును నీకు గాండీవం బనఁ బరమసాధనంబై యుండు. మదీయమాయాప్రభావంబున నాగాండీవంబును, నక్షయతూణీరంబులును నదృశ్యంబు లయ్యె. మదీయగాత్రసంఘర్షపీడితం బైననీయంగంబు వ్యథఁ బాయు. నీయెడఁ గడుం బ్రీతుండనైతి. ఇష్టమైనవరము వేఁడు మనుటయు నర్జునుఁ డిట్లనియె.

ఈశ్వరుఁ డర్జునునకుఁ బాశుపతాస్త్ర మిచ్చుట.

దేవా! నాయెడం బ్రసన్నుండవేని పాశుపతాస్త్రంబుఁ బ్రసాదింపుము. అదియు, బ్రహ్మశిరోనామకాస్త్రంబును యుగాంతకాలమున జగమెల్ల నశింపఁ జేయు. భీష్మద్రోణకృపులతోడను, నిత్యనిష్ఠురభాషణుఁ డయినకర్ణునితోడను నా కవశ్యంబు సంగ్రామంబు గాఁగలయది. వారల గెలువవలయు. మఱియు రాక్షసపిశాచగంధర్వాదులు సమరసన్నద్ధులై రేనియు వారినెల్ల జయింపనవలయు. నీయస్త్రమున శూలగదాదినానాయుధంబులు, నాశీవిషోపమంబు లయినఘోర నారాచంబులుం బుట్టు నని విందు. అద్దివ్యాస్త్రం బనుగ్రహింపు మిదియ మదీ

యమనోరథం బనివిన్నవించె. విన్నవించుటయు మృత్యుంజయుండు ధనంజయా! నీకోరినట్లు పాశుపతాస్త్రం బిచ్చెద. అయ్యస్త్రంబు ధరింప నుపసంహరింపను నీవ తగుదువు. ఇంద్రయమవరుణకుబేరాదు లెవ్వరును దీని నెఱుంగరు. ఇఁక మానవులు దెలియ రని వేఱ చెప్పనేల? దీనికిఁ జావనివాఁడు ముల్లోకముల నెక్కడఁ గన్పడఁడు. తెంపు చేసి యిచ్చకు వచ్చినయెడల దీనిం బ్రయోగింపవలదు. అల్పునిపైఁ బ్రయోగించిన నిది జగంబెల్లఁ గాల్చు. మనంబునఁ జింతించినను, గంటఁ జూచినను, నోటఁ జెప్పినను, వింట సంధించిన నిది కార్యంబుఁ జేయు. శుచివై యప్రమాదంబున దీనిం గ్రహింపు మనియానతిచ్చిన విని యర్జునుండు మహాప్రసాదం బని శౌచసమాహితచిత్తుండై యంతకోపమం బైనయద్దివ్యాస్త్రంబుఁ బ్రయోగోపసంహారపూర్వకంబుగాఁ బరమేశ్వరానుగ్రహంబున గ్రహించుటయు నమ్మహాస్త్రం బర్జునుపార్శ్వంబున మూర్తిమంతంబై నిలిచె. అట్టియెడఁ బుడమి గడగడవడఁకె. దేవశంఖదుందుభినిర్ఘోషంబులు నింగిముట్టె. అటఁ బరమేశ్వరుండు ధనంజయు స్వర్గమునకుఁ బొమ్మని యాజ్ఞాపించి క్రమ్మఱ గాండీవంబు, నక్షయతూణీరంబులు నతని కొసంగి ప్రణతుం డైనయతని సాదరానుగ్రహంబునం జూచి మహితతేజోవిలసితుం డై నయయ్యర్జునుండు చూచుచుండఁ బార్వతితోడ నాపర్వతశిఖరంబు విడిచి యంతరిక్షంబునకు లంఘించి యదృశ్యుం డయ్యె. అంత నర్జునుఁడు మహాదేవుం బ్రత్యక్షంబుగఁ గనుఁగొంటి. అద్దేవదేవుశరీరంబు నంటితి. పాశుపతాస్త్రంబు గ్రహించితి. ధన్యుఁడ నైతి. ఇఁకఁ బగవారిం గెలువఁ గలుగు. మనోరథంబు సఫలం బయ్యె నని డెందంబునం దలంచుచుఁ బరమానదంబునఁ బొదలుచుండె.

## ఇంద్రాదు లర్జునునకుఁ బ్రత్యక్ష మగుట

అయ్యవసరంబున మూర్తిమంతంబు లయిననదీనదంబులు, నాగదైత్యసాధ్యులుం దోడరాఁగ దివ్యవర్ణుఁ డైనవరుణుఁడును, యక్షగణానుగమ్యమానవిమానారూఢుం డైనకుబేరుఁడును, పితృగణసేవ్యమానవ్యోమయానాధిష్ఠితుం డై యుగాంతకాలమార్తండదుర్నిరీక్షుం డైనయముఁడు నచ్చటికి వచ్చి యర్జునుం జూచిరి. అంతఁ గొంతవడికి సురేంద్రుండు శచితోడ నైరావతం బారోహించి సంపూర్ణపూర్ణిమాచంద్రుం బురుడించుశ్వేతాతపత్రంబు ధరియించి నిరంతరస్తుతిపరాయణు లగుగంధర్వులును, సురలుం గొలిచిరాఁగ నుదయగిరిశిఖరాధిరూఢుం డైననరుణకిరణుకరణి నప్పర్వతశిఖరం బలంకరించె. అంతఁ బరమధర్మజ్ఞుం డయినయముఁ డర్జును నుద్దేశించి కౌంతేయా లోకపాలు రగుమ మ్మవలోకింపుము. దివ్యదృష్టి నొసంగెదము. తొల్లింటిజన్మమున నరుఁ డనుపురాణమునినాఁ బరఁగిననీ విపుడు బ్రహ్మనియోగంబునం జేసి మనుష్యుండ వైతివి.

వసువులయంశంబునఁ బ్రభవించినభీష్మని, భరద్వాజాంశంబున జనించి శరీరంబుఁ దాల్చినశౌర్యం బనఁ దగుద్రోణాచార్యుని, సర్వలోకతపనుం డగుమార్తండునంశంబునఁ బుట్టినకర్ణుని, నివాతకవచు లనురాక్షసులను, దేవదానవాంశంబులఁ బుడమిం బొడమినరాజులనుం గెలిచి యశంబు నెఱపవలయుఁగాదే? సమరంబున మహాదేవు మెప్పింప నీకుఁదక్క లాఁతివానికిఁ దరమే? కావున నమితవిక్రముఁడ వగునీకు మదీయదండం బొసంగెద. ఈయస్త్రంబున మహాకార్యంబు సాధింపఁగల వనిన ధనంజయుం డయ్యస్త్రంబుఁ బ్రయోగోపసంహారసహితంబుగా నద్దేవు వలనం బడసె. అట వరుణుండు పార్థుం గొనియాడి పాండునందనా! నేను నీకు జయార్థంబు మదీయపాశంబుల నిచ్చెద. తొల్లి తారకామయసంగ్రామంబున నీపాశంబుల బంధించి రక్కసుల నుక్కడంచితి ననిన నర్జునుం డావరుణపాశంబుల విధియుతంబుగ గ్రహించె. పదంపడి కుబేరుండు సవ్యసాచీ ధార్తరాష్ట్రసైన్యవిధ్వంసంబుఁ జేయ మదీయం బైనయంతర్ధానాస్త్రంబు నీ కిచ్చెద. తొల్లి యంతకాంతకుండు త్రిపురంబుల నీయస్త్రంబునఁ గాల్చె. దీనిం గ్రహింప నీవ యర్హుండ వనిన విజయుం డయ్యస్త్రంబు యథావిధి సంగ్రహించె. అటఁ బురందరుండు కుంతీనందను మధురవచనంబుల గారవించి దేవకార్యనిర్వహణార్థంబు పార్థుఁడునా జనించిననీ వవశ్యంబు సురలోకంబున కరుదేరవలయు. అచట నీకు దివ్యాస్త్రంబుల నిచ్చెద. మాతలిసారథికం బైనయరదంబుఁ బంపెద రమ్మని యానతిచ్చి నిజలోకంబునకు విచ్చేసె. యమవరుణకుబేరులు నర్జునసత్కృతులై తమతమలోకంబులకుం జనిరి.

## అర్జునుఁ డమరావతికిఁ బోవుట

లోకపాలు రందఱుఁ దమతమలోకంబులకు విచ్చేసినపదంపడి కవ్వడి దిక్పాలప్రసాదసమాసాదితాస్త్రుం డై తన్నుఁ గృతార్థునిగఁ దలంపుచు సంతుష్టస్వాంతుం డై పురందరస్యందనంబు రాక వార్చియుండునంత శక్తిగదాశనిచక్రఖడ్గాదిసాధనసంభృతంబు, దారుణోరగసురక్షితంబు, సమీరరయనిరసననిపుణతురంగాయుతయోజితంబు, కనకభూషణభూషితమేచకవైజయంతకేతనవిరాజితంబు నగుసురేంద్రరథంబు మేఘపటలంబుఁ బగిలించునోనాఁగ నేమినిస్వనంబున దిక్తటంబులఁ బూరింపుచు నిజనిరుపమప్రభాపూరంబున నాకసంబు నిరంధకారంబుఁ జేయుచు వచ్చుటయు బంగరురంగున వెలుంగుచు నందు నొగలపైఁ గూర్చున్నమాతలిం గాంచి యితండు దేవతామూర్తియొక్కో? యని వితర్కింపుచుండ నయ్యింద్రసారథి మాయామయం బైనయయ్యరదం బట నిల్పి డిగి వచ్చి వినయావనతుం డై యర్జునున కిట్లనియె. పురందరనందనా మహేంద్రుండు నాకలోకంబునకు నినుఁ దోడ్కొనిరాఁగ నీయరదంబుఁ బంపె. దేవర్షిగంధర్వాప్సరో

గణపరివృతుండై యింద్రుండు భవదాగమనంబు వేచియున్నవాఁడు. పాకశాసన శాసనంబున నాకలోకంబున కరుదెంచి యస్త్రంబుల సాధించి మగిడి నీలోకంబుఁ జేరుమని వాక్రుచ్చె. వాక్రువ్వఁగఁ గవ్వడి మాతలి నుద్దేశించి యింద్రసారథీ, విధియుతంబుగ రాజసూయాశ్వమేధాదిమహాధ్వరంబులు సల్పినమహారాజులకును దురారోహంబు, తపోబలవిహీనుల కదృశ్యం, బస్పృశ్యంబు నగునీరథమును మున్ను నే నారోహింప వలంతినే? నీ వారోహించినపదంపడి సురపతినిదేశంబున నేనునెక్కెద ననినమాతలి యట్లచేసి పగ్గములఁ బట్టి హయంబుల నిల్పె. అంతం గుంతీనందనుండు పరమానందలహరిం దొప్పదోఁగి గంగాజలంబులఁ దీర్థమాడి శుచియై జపించి దేవర్షిపితృతర్పణంబు లొనర్చి ప్రయాణోన్ముఖుండై మందరన గంబు నిర్దేశించి పర్వతవర్యా స్వర్గంబుఁ జూడ నిచ్చగించినపుణ్యశీలురకు, సాధువులకు నీ వాశ్రయంబవు. నీయందుఁ బొడమిన సెలయేఱుల మునింగి, తదీయవిమలశీతలమధురపావనసలిలంబులఁ గ్రోలి, నీయందుఁగలద్రుమాంకులపరిమళమిళితసురుచిరఫలంబుల నాస్వాదించి, లీలమై విహరింపుచున్నయచ్చరవిరిబోఁడులమృదుగీతములను, బ్రహ్మర్షులవేదపాఠనినాదంబులనువీనులువిందుగ నాకర్ణింపుచుఁ దండ్రి తొడపైఁ గూర్చుండుకుఱ్ఱనిచాడ్పున నీనెత్తమ్ములఁ, బొదరిండ్లను వసించి నే నింత కాలంబు సుఖంబుమైఁ గడపితి. ఇంద్రునానతి నమరావతికిఁ బోయెద నానతిమ్మని ప్రార్థించి యగ్గిరివరంబు నామంత్రణంబు చేసి యద్దివ్యరథం బారోహించుటయు నది యాకసంబున కెగరి మర్త్యుల కదృశ్యం బయ్యె. అటఁ జని వివ్వచ్చుఁడు సూర్యచంద్రాగ్నుల తేజంబు లేకున్నను నిజతేజంబుననె తేజరిల్లువాని, మహత్తరములయ్యు దవ్వున నునికిం జేసి దీపంబులవలె నతిసూక్ష్మంబులై నక్షత్రరూపంబుగ నిట కగపడువాని, రాజర్షులయు, రణనిహతు లగుశూరులయు, సిద్ధులయు దివ్యవిమానంబులను, గుహ్యగంధర్వాప్సరోగణంబులనుం గాంచి మాతలివలనఁ దత్ప్రభావం బెఱింగి నివ్వెఱఁగంది సిద్ధమార్గంబున నరుగువాఁడు గోపురంబుముందఱఁ గైలాసశిఖరి తెఱంగునఁ దుఱంగలించుచతుర్దంతదంతిరాజంబు లోచనగోచరంబుగాఁగ నచ్చరవిరిబోండ్లు విచ్చలవిడి విహరింప నుఱవగునందనవనంబునం బొల్పారుకమలకల్హారకువలయపారిజాతప్రసూనంబులక్రొత్తనెత్తావులం గొనివచ్చులేఁదెమ్మెర లల్లనల్లన వీవ నానందలహరిం దోఁగుచు నతాపసుల, కనాహితాగ్నుల, కతీర్థసేవకుల, కనాచరితసుకృతుల, కనియతవ్రతుల, కననుష్ఠితదానులకు, వేదపాఠరహితులకు, యజ్ఞవిఘాతకులకు, సురాపాయులకు, గురుతల్పగులకు, మాంసాశనులకు నగమ్యంబును, సిద్ధచారణాదిసేవితంబును, సర్వర్తుకుసుమవిలసితపాదపోపశోభితంబు నగుపురందరపురంబుఁ బ్రవేశించె. ప్రవేశించి యింద్రానుజ్ఞంగామగమనవిమానారూఢు లై ననిర్జరులు పెక్కండ్రెదుర్కోలు గావింప, దేవ

గంధర్వసిద్ధసాధ్యాప్సరోగణంబులు మంగళోపచారంబు లొనరింప, నారదాది దేవర్షులు శుభాశీర్వాదంబు లొసంగ దేవతావీథి నతిక్రమించి నగరుమొగసాల నరదంబు డిగ్గి కక్ష్యాంతరంబులు గడచి గంధర్వస్తుతిరవంబులను, బ్రాహ్మణోత్తముల వేదోపన్యాసములను నాలింపుచు సిద్ధచారణమరుద్గణంబులు, విశ్వదేవత, లశ్విను, లాదిత్యులు, వసువులు, రుద్రులు, బ్రహ్మర్షులు, రాజర్షులుం గొలువ శ్వేతచ్ఛత్రచామరాదివివిధోపచారవిలసితుండై నిండోలగంబున సుఖాసీనుండై యున్న దేవేంద్రుం జేరి యర్జునుండు సాష్టాంగదండప్రణామంబు లాచరించుటయు నవ్వేల్పులఱేఁడు కూర్మి మెఱయ నతనిఁ జేతులం గ్రుచ్చియెత్తి కౌఁగిలించుకొని చెంగటఁ జేర్చి శిరంబు మూర్కొని తొడపై నిడుకొని యటఁ దనతొడ సింహాసనంబునఁ గూర్చుండఁ బెట్టుకొనియె. అట్లు తనయర్ధాసనంబునఁ గూర్చుండి యాత్మప్రతిబింబ మనంగ వెలుంగుననుంగుకొమరునెమ్మొగంబును, జ్యాఘాతకర్కశంబు, లాయతంబులు, కాంచనస్తంభసదృశంబులు నగుబాహువులను వజ్రగ్రహణలాంఛనం బగుకరారవిందంబున స్పృశింపుచుఁజిఱునగవు సొంపార సహస్రాక్షుఁడనయమ్ము చూచుచుం దనియఁడయ్యె. శుక్లచతుర్దశినాఁడు సూర్యచంద్రు లుప్పరంబునుంబోలె నింద్రార్జును లర్ధాసనాసీనులై సభ నలంకరింపఁ దుంబురుప్రభృతిగంధర్వులు వీనులవిందుగా సంగీతకంబు సల్పిరి. ఊర్వశీమేనకారంభాదిదివ్యవారకాంతలు కుచంబులు దుందుడుకఁ జెందఁ గటాక్షహావమాధుర్యంబు రసికజనమనోహరంబుగాఁగ వేడుక మీఱనాడిరి. అట దేవగంధర్వాదులు సురేంద్రుననుజ్ఞచే నర్జును నర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి దివ్యమందిరంబునుం జేర్చిరి. కౌంతేయుండునుం గ్రమంబున సకలాస్త్రంబులఁ బ్రయోగోపసంహారసహితంబుగా నింద్రువలన గ్రహించి యన్నదమ్ముల మనమ్మునఁ దలంచియు నింద్రానుజ్ఞ మెయి సురలు సుఖోపచారంబు లొనరింప నైదేఁడు లచ్చట వసించియుండె. అట నొక్కనాఁడు మహేంద్రుఁడు గృహీతాస్త్రుం డైనయర్జునుం జూచి పుత్రా భూలోకంబున లేని దేవగానంబును, నృత్యంబును గఱపఁ జిత్రసేనుఁ డనుగంధర్వుని నియోగించెద. అతఁడు నీకుఁ గడుఁ బ్రేముడిమై వానిం గఱపువాఁడు. వానిం గడింప నీకుఁ బరమశ్రేయం బగు ననిచెప్పి యాచిత్రసేనుం జెలిఁగా నర్జుననుకర్పించె. ఇంద్రనియోగంబునఁ బార్థుఁడు చిత్రసేనునివలన నృత్తవాద్యగీతముల యథాశాస్త్రముగ నేర్చియు దుర్యోధనాదిదుష్టచతుష్టయంబుచేసినయెగ్గులు మనమ్మునకు వచ్చునపుడెల్లఁ దల్లి నన్నదమ్ములం దలపోయుచు నంతగ నంతసింపఁడయ్యె.

అంత నొక్కనాఁడు దేవేంద్రుఁడు చిత్రసేనుం జూచి గంధర్వవర్యా యూర్వశియందుఁ బార్థునిచూపు తగులువడినట్లు తోఁచెడి. శృంగారసుఖవారాశి

వాని నొలలార్ప నూర్వశిని నియోగింపుము. గృహీతాస్త్రుం డై నయతండు తరుణీ సంగవిశారదుం డగుటయు లగ్గనినం జిత్రసేనుం డూర్వశియొద్దకుఁ జని దాని చేసినయుపచారంబులఁ గైకొని సుఖాసీనుండై మందస్మితపురస్సరంబుగ నిట్లనియె. సురవారసుందరీ నిలింపపతిపంపున వచ్చితి. వినుము. కుంతీవందనుం డై నయర్జును నెఱుంగుదుగదే? అతండు సహజగుణంబుల దేవ లోకంబునను, మనుష్యలోకంబు నను గడుఁ బొగడ్తఁ గాంచినవాఁడు. గురువుల సేవించి యతులమేధాప్రభావం బున సాంగవేదంబుల, సకలశాస్త్రంబుల నేర్చినవాఁడు. సిరియు, శీలము, రూపము, వ్రతము, దమము, వీర్యము, తేజము, శాంతి, నైపుణ్యము, దీర్ఘసూత్రత, ప్రియోక్తి, సత్యవచనంబును వాని నెప్పుడుం జేరియుండు. మాత్సర్యం, బాత్మ స్తుతి, యహంకారము, వానికుఱంగటనైన మెలంగనేరవు. సుహృదులం, బెద్ద లను సర్వవిధములఁ బూజించువాఁడు. మహేంద్రునిపోలె ముల్లోకంబులఁ బాలిం పఁగలఁడు. తపోబలంబున లాఁతివానికిఁ జొరనలవికానియీలోకంబుఁ జొచ్చిన వాఁడు. జవరాంద్ర డెందముం గరంగించునిండుజవ్వనంబున నెగడువాఁడు. నేర్చిన కొలంది సుఖసాగరంబున వానినొలలార్చునది యనిన విని యయ్యచ్చరమచ్చె కంటి యిచ్చ మెచ్చుచు లేనగవు దొలుకఁగఁ జిత్రసేనున కిట్లనియె. గంధర్వరాజా నీనిరూపించినగుణంబులెల్ల నర్జునునం దునికి నేను నెఱుంగుదు. సకలసుగుణవా రాశి యగువాని వరింపక పెఱవారల వలంతునే? మహేంద్రునియోగంబునను, భవత్ప్రణయంబునను, బార్థుగుణసముదయంబునను మరునంపతుంపరకు గుఱి నైతి. ఇంద్రునానతిమెయి సుఖింతు ననిన విని చిత్రసేనుఁడు కృతకృత్యుండై చనియె.

ఊర్వశి యర్జును నెద్దకుఁ బోవుట.

పదంపడి కొండొకవడి కరుణకిరణుం డస్తగిరిశిఖరాంతేర్హితుం డగుటయు నయ్యచ్చరమెఱుంగుఁబోఁడి యర్జునుపొందు డెందంబునం గోరి.

చ॥ జలకములాడి, క్రొవ్విదళుకుచల్వను దాలిచి, బొట్టు దిద్ది తా
వులగలపూఁతఁ బూసి, తొడవు ల్దొడి, పూసరులం ధరించి, కో
మల మగుపాన్పు సేరి, సుమమార్గణుబారికిఁ జిక్కిఁ నెమ్మిగో
ర్కెల మదిఁ దోఁచునర్జునుని కేళి సుఖంపుచుఁ బ్రొద్దు వుచ్చుచున్.

నిస్తంద్రకాంతిసాంద్రుండై చంద్రుఁ డుదయాద్రిం బొడసూపి నిండువె న్నెలల నెల్లెడల నెఱపి తనకు బాసటగాఁగఁ జెఱకువిల్కాఁడు కఱకుటమ్ములఁ బఱపించి యెంతయుఁ గాఱింప నంతకంతకు నగ్గలం బగువిరాళి నూర్వశి లేక మెట్టి కేలకు మనమ్ము నొకతెఱంగున నిల్పుకొని వేల్పులతేనికొడుకువిడిదలకుఁ జనఁ దలంచి నిజసదనంబు వెడలి యానన చంద్రుదుచేఁ జందమామం జీరునోనాఁగఁ

గన్నెమలు విక్షేపించుచుఁ, దనంతన సరసవచనంబులఁ బల్కుచు, సింగారంపు లీలలఁ బచరింపుచు, నలఁతిగ నానినమధురమధురసంబుపరిమళంబు నల్గడలఁ గ్రుమ్మరింపుచు,

క॥ నునుమొగులుచాయగలపైఁ
టను గుల్కుచుఁ జిత్రమాయొడల్దీఁగనభం
బున మొయిళు లావరింపం
దనరా రెడిచంద్రరేఖనలు వెప్పారన్॥

సీ॥ కమ్మగందపుఁబూఁతఁ గ్రాలుచన్గవ రత్నహారాళితోడఁ బయ్యంటఁ గదలఁ,
గాంచీకలితమయ్యుఁ గాఁదీఁగ యడుగడుగునఁ జన్నుదోయి వ్రేఁగుననటింపఁ,
గ్రొత్తావులనుగుబుల్కొలుపుపూవులు దుఱిమినకీలుగంటు వీఁపునఁజలింపఁ,
బృథులపీవరములౌపిఱుఁదులు వడి నీఁగి నడకుఁదిన్నఁదనంబుఁ గడలుకొలుపఁ,

తే॥ గీ॥ జిగురుటాకులమాడ్కిఁ గెంజిగిఁ దనర్చు
తలములుం, బొడవైన వ్రేళులును, గింకి
ణీకిణములును గలపాదనీరజముల
యందెలరవంబు చెలువొంద నల్లనడిచి॥

కోర్కులు క్రేళ్లుదాఁటఁ గౌంతేయువిమలహర్మ్యంబు సేరి ద్వారపాల సుప్రవేశితయై శృంగారవిలాసంబులు చెలంగనాసుందరాంగునిం గనుంగొనుటయు నతండు శంకాకులహృదయుండై దిగ్గనలేచి సిగ్గు గదుర నెదురేగి యడుగుల కెఱఁగి గురుభావంబున నర్చించి దేవీ. యేమి చేయవలయు. నీదానుఁడ ననిన విని యదరిపడి యూర్వశి యతని కిట్లనియె.

చిత్రసేనుఁడు మహేంద్రనియోగమున నాకుఁదెల్పినయుదంతము నవధరింపుము. నీవు వచ్చుటంజేసి యింద్రసభలోన మహోత్సవం బగునవసరంబున సురలు, దేవర్షులు, బ్రహ్మర్షులు, రాజర్షులుంజేరియుండఁగ, గంధర్వులు వీణలు వాయింపుచుండ, నచ్చరలు నృత్య మాడుచుండ నీచూపు తెప్పపాటు గానక నాపైఁ దగులువడుటం జూచి సురపతి నిన్నుమనసిజకేళిం దేల్ప నను నియోగించెనఁట. నీగుణంబుల వినియు, నినుఁ గన్నులారఁ గనుంగొనియు నేనును డెందమున నీకూటమిం గోరియున్నదాన. మహేంద్రునకు, నాకు, నీకుం బ్రియంబుగా శృంగారసుఖ మనుభవింపు మనిన నర్జునుండు లజ్జితుండై చెవులు మూసికొని దాని కిట్లనియె. తల్లీ నీ కిట్లు పలుకఁ బాడియె? అసంశయముగ నీవు కుంతీశచీదేవులపోలె నాకుఁ బూజ్యురాలవు. పౌరవవంశకర్త యగుపురూరవునకు భార్యవగుటంజేసి మావంశమునకుఁ దల్లివని యయ్యుత్సవంబున నినుఁ బలుమాఱు లవలోకించితింగాని యొండెద్దియుం గాదు. ఇఁక నిట్టితలంపులు మనంబునకుఁ దేర

వల దనిన వెండియు నూర్వశి యిట్లనియె. మేము దేవవారకాంతలము. సుకృత విశేషంబున నీలోకము సాధించినవారల వివిధోపచారములచే నానందవారాశిం దేల్తుము. ఇచట వావివరుసలు విచారింపరాదు. ఇచ్చోటి కిది ధర్మంబు. పూరు వంశమున జనించినరాజు లెందఱేని తపోమహిమమున నీలోకము సేరి నాతోడఁ గ్రీడించిరి. ఇంక నాసందియములెల్ల మఱచి యిష్టకేళిని విహరింపుము. కుసుమశరపరితాపంబు సైఁపనేర ననిన విని యర్జునుండు జననీ నీచెప్పినది నిక్కంబు. పెద్దల కెద్ది చేసినం దోసంబు లేదు. నాబోఁటివానికిఁ దగదు. దిక్కులు, విదిక్కులు, సకలనిర్జరులును సాక్షులుగాఁగఁ బల్కెద. కుంతీమాద్రీశచీదేవుల యట్లు నిక్కంబ నీవును నాకుఁ దల్లివ. నీయడుగులకు మ్రొక్కెద. కరుణించి పుత్రవాత్సల్యంబున నన్నేలు మని నిర్వికారధైర్యంబున వివరించె.

## ఊర్వశి యర్జునుని నపుంసకుఁగా శపింప నింద్రుఁ డందుకు సమయంబు నిర్ణయించుట.

అంత నూర్వశి తనమనోరథంబు విఫలం బగుటయుఁ గ్రోధారుణనయనయై యర్జునుం జూచి “వలచి మదనవేదన కోర్వలేక పొందు వేఁడుచున్న నన్ను మహేంద్రునానతినైనం దలపోయక నిరాకరించితివికావున మానరహితుండవై తరుణీమధ్యంబునఁ గన్నియల కాట నేర్పుచు నపుంసకుండనఁ బరఁగుదు” వని పెదవు లదర, బొమలు ముడివడఁ బరుషముగ శపించి గిఱుక్కునం దిరిగి నిజగృహంబునకుఁ బోయె. అంత నారాత్రి వేగుటయు నర్జునుండు చిత్రసేనునకు రాత్రి వృత్తాంత మంతయుం దెలుపఁగ నతండు సవిస్తరంబుగ దానినెల్ల నింద్రునకు విన్నవించె. విని యింద్రుఁ డేకాంతమున నర్జును రావించి పుత్రా నిన్నుఁ గని కుంతి జన్మసాఫల్యంబుఁ జెందె. నీధైర్యము మునీంద్రులయెడనుం గానరాదు. ఊర్వశీశాపంబునకు వెఱవవలదు. అదియు నొకవరమై నీకుఁ గార్యసాధకం బగు. అజ్ఞాతవాసంబు మీ రొక్కయేఁట సలుపవలయుఁగదా? అప్పుడీశాపం బనుభవించి యాయేఁడు గడవ శాపంబుఁ బాయుదు వని యనుగ్రహింప నర్జునుం డత్యంత సంతుష్టుండై నెచ్చెలి యగుచిత్రసేనునితోడ నిష్టప్రకారముల నాకలోకసౌభాగ్యంబు నాలోకింపుచు సుఖముండె. ఈయుపాఖ్యానము వినినవారు కామకృత్యమ్ములఁ దవులక రాగద్వేషాదివినిర్ముక్తులై స్వర్గలోకంబుఁ గాంతు రనిచెప్పి వైశంపాయనుండు వెండియు జనమేజయున కిట్లనియె.

అంత నొక్కనాఁడు రోమశమునీంద్రుఁడు లోకములనెల్లఁ గ్రుమ్మరువాఁడు నాకలోకంబునకుఁజని దేవరాజునకు మ్రొక్కి సురగణపూజితుండై కూర్చుండి యింద్రుతోడ నేకాసనంబున నున్నయర్జునుం గాంచి యాశ్చర్య మొంది యద్దిరా! యితం డెంతటితపంబు చేసెనో? కాకున్న నిట్టిమహితపదంబు సాధింపఁ

గలుగునే? యని మనంబున వితర్కింపుచుండ నిర్జరేంద్రుం డతనితాత్పర్యంబు నెఱింగి నవ్వుచు నమ్మునికిట్లనియె.

మునీంద్రా, మనమ్మున వితర్కింపవలదు. ఇతనిం గేవలమనుజునిగా దలంపకుము. నరనారాయణు లనుమునిసత్తములు సుకృతమహిమైకలభ్యం బైనబదరీవనంబునం దపము చేయుచుండి రనుట యందఱకుం దెల్లంబుగదా. సగరపుత్రులం గోపానలంబున నీఱుచేసినకపిలాచార్యుండె నారాయణముని యనం బరంగె. ఆనరనారాయణు లిపుడు దేవహితార్థంబుగ భూభారంబు నపనయింప మనుష్యలోకమున నవతరించియున్న వారు. వారిలో నారాయణుం డిపుడు యాదవులలో వసుదేవనందనుఁడన జనించె. నరుఁడును గుంతియందు నాయంశమున నుదయించె. అతఁడే యితఁడు నాతోడ నేకాసనముననున్నవాఁడు. పాతాళవాసు లగునివాతకవచు లనుదానవులు వరప్రభావంబున గర్వించి సురల కజేయులై గండుమీఱియున్నవారు. నారాయణుండు చూచినంతన వారల గీటడంప వలంతియైనను నీయల్పకార్యమున కమ్మహాత్ముఁ డేల? యని యితని రావించితి. వీఁడు వారలనెల్ల నక్లేశంబ వధించువాఁడు. నీవుం గామ్యకవనమునకుం జని ధర్మనందనుం గాంచి యర్జును డిట దివ్యాస్త్రంబుల సాధించె. భీష్మద్రోణాదుల మహారథుల గెలువఁ గలఁడు. నృత్తగీతాదుల నేర్చుచు సుఖమున్నవాఁడు. వానియెడఁ జింతవలదనియూఱడించి తీర్థసేవనసుకృతంబున రాజ్యమునుసాధంబు గావున నతనిం దీర్థయాత్రఁ జేయఁగ నియమించి విషమప్రదేశములందు రక్షోఘ్నమంత్రములచే రాక్షసాదిభయము వారికిఁ దొలఁగింపుచు, నుచితరీతి దానములఁ జేయింపుచునతనితోడ నీవు నరుగుమనినియమింప నింద్రునానతిం గైకొని రోమశమునీంద్రుఁడుసనియె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా యత్యద్భుతం బయినయర్జును నస్త్రలాభంబు విని ధృతరాష్ట్రుం డేమి వచించె? అతండు వగవక నెమ్మది నుండునే? యని యడుగ నతండతని కిట్లనియె.

**అర్జునున స్త్రలాభము విని ధృతరాష్ట్రుఁడు దుఃఖించుట.**

ధృతరాష్ట్రుఁడు వేదవ్యాసునివలన నర్జునుఁ డింద్రలోకమునకుఁ జనుటయు, నస్త్రముల సాధించుటయు విని సంజయుం జూచి సూతసుతా, యర్జునుఁడు దివ్యాస్త్రములనెల్ల సాధించెనఁట. నీవును వినియుందువుగా? దుర్యోధనుఁడు బుద్ధిలేక పాపనిశ్చయుండై ప్రజలకెల్లఁ జేటుఁ దెచ్చు. పరిహాసముననైన బొంకులాడక ధర్మపరుఁ డయినధర్మరాజునకు ధనంజయుండు యోధుఁడుగాఁగ ముల్లోకములు వశములుగాకుండునే? ఆవివ్వచ్చుఁడురణంబున గాండీవంబుఁ గొని వాఁడితూపులఁ బఱపించునేని యెదిరింప నెవ్వరును నేరరు. భీష్మద్రోణకర్ణు లోకవేళ నెదిరింపఁగలరుకాఁబోలు. ఐనం గెలువఁజాలరు. ఇంద్రుఁడు వారించినను వాఁడు

ఖాండవముఁ గాల్పించె. రాజసూయమున నందఱం గెలిచి కప్పముఁ గొనియె. వజ్రాయుధప్రహారంబునఁ గొండలు ముక్కవ్రోయి యొకకొంతయేనియు మిగులుఁగాని వానియమ్ములబారిం బడి మడియనివారు గన్పడరు. తదీయరథఘోషంబె కౌరవసేనం జీకాకుపఱచు. నిదాఘకాలప్రచండమార్తండమయూఖంబులు సకలజంతువులంబోలె వానితూపులు నాకొడుకులఁ దపింపఁజేయు. బ్రహ్మదేవుఁడు వాని జగత్సంహారమునకుఁగా సృజించెఁగాఁబోలు. దురాత్ములగుదుర్యోధనాదులు మృత్యువాతఁ బడినవారే? ఏమి చేయవచ్చు ననిన సంజయుం డిట్లనియె. రాజేంద్రా నీవచనంబు సత్యంబ. ద్రౌపదిని సభ కీడ్చి తెచ్చి పలుకరానిప్రల్లదంబుల నాడుటంజేసి దుర్యోధనదుశ్శాసనరాధేయాదులపై వారు కోపించియున్నవారు. శౌర్య మరయఁ గోరి కిరాతవేషముఁ దాల్చి వచ్చిన శూలపాణితోడఁ దపోబలమున విక్రమించి యర్జునుఁడు పోరున నద్దేవదేవుని మెప్పించి దివ్యాస్త్రంబు సాధించె. ఇంద్రాదిలోకపాలు రందఱు ననేకదివ్యాస్త్రంబుల నతని కొసంగిరి. వానిం గెలువ నేరికి నలవిగాదు. మఱియు జూదమున దుర్యోధనుఁడు ద్రౌపదికి సన్న చేసి తొడ చూపినపుడు వృకోదరుఁడు పదుమూఁడేఁడులు గడచినపదంపడి గదచే దుర్యోధనుతొడల విఱుగ నడిచెద నని ప్రతిజ్ఞఁ బూనె. వారందఱు మహాశూరులు. నీకొడుకులయెడఁ గడు నలిగియున్నవారు. నీకొడుకులనెల్లఁ బొరిగొందు రనితలంతు ననిన ధృతరాష్ట్రుఁడు వెండియు నిట్లనియె. సంజయా ప్రల్లదము లాడు టది యటుండ నిమ్ము. ద్రౌపదిని సభ కీడ్చి తెచ్చినదియ వారికిఁ గోపంబుఁ గావింపఁ జాలు. ఇంతటనైనం బెద్దవాఁడు వినీతుఁ డయ్యెనా యందఱకుం బ్రతుకు గలదు. వృద్ధుఁడని, పుట్టుగ్రుడ్డియని, బుద్ధిహీనుఁడని నామాట వినక యాదురాత్ముఁడు కర్ణశకునిమతం బనుష్ఠింపుచుఁ జెడుచున్నవాఁడు. రణమునఁ బరమేశ్వరుని మెప్పించి దివ్యాస్త్రముల గ్రహించినయర్జునునకుఁ ద్రైలోక్యనాథుఁ డైనజనార్దనుఁడు మంత్రి, రక్షకుఁడు, చెలికాఁడు నయ్యె. వానికి గెలువరానిదియుం గలుగునే? నాకొడుకులయెడ నెల్లపుడుం గ్రుద్ధుఁ డగుభీముఁ డిన్నిసహాయంబులు గలుగ నూరకుండునే? దుర్యోధనాదులకుఁ జేటుకాల మాసన్న మయ్యె ననివగచుచుండె ననిన జనమేజయుండు వైశంపాయనమునీంద్రా పాండుపుత్రుల నడవులకుఁ బంపి యాచీఁకుఁడేఁ డెంతయేడ్చినం బ్రయోజనంబేమి? తాఁ దొలుత జూదము వారింపక యుపేక్ష చేసె. అదియుండె. వనవాససమయమునఁ బాండవులు వనమునఁ గలమృగాదులనె భుజింపుచుండిరా? కృషివలనఁ బండుపదార్థముల భుజింపుచుండిరా? యనియడుగ వైశంపాయనుఁ డిట్లనియె.

ధర్మరాజడవులకుఁ బోవుతఱిఁ బదివేవురు విప్రులు వెంటరాఁగ వారలఁ బోషింప నతండు దాఁ దూర్పునకు, భీముఁడు దక్షిణంబునకు, నకులసహదేవులు పశ్చిమోత్తరంబులకుం బోయి వేఁటాడి దుర్వర్ణములు, రోగార్తములు, కృశములు, దుర్బలములు, దీనములు, భీతములును, గాని కృష్ణమృగములఁ దెచ్చి బ్రాహ్మణులకు నివేదించి మిగిలినదానిని గృష్ణపచ్యములంగూడ భుజింపుచుండిరి. అట్లుండునంత నర్జునుఁ డమరావతికిఁ బోయియుండఁగ నిట భూలోకంబున *నైదేఁడులు గడచె. అదియట్లుండె. ధృతరాష్ట్రచింత నవధరింపు మని వైశంపాయనుండు వెండియు నిట్లనియె. మనుష్యవిలక్షణం బైనపార్థచరిత్రంబు విని ధృతరాష్ట్రుండు చింతాశోకవ్యాకులుండై పెద్దయుంబ్రొద్దు వేఁడినిట్టూర్పులు నిగిడించి సంజయునకు మఱియు నిట్లనియె. సంజయా, జూదంబునం గలిగినపుత్రులదారుణదుర్నయంబుఁ దలంచి రేలుంబవళ్లు నొక్కక్షణంబైనఁ జిత్తశాంతిఁ గానను. దుర్యోధనాదులెల్ల మే లెఱుంగరు. పాండవులా లోకోత్తరశౌర్యధైర్యా

*ఇచటఁ దెనుఁగుభారతమున నర్జునుండు స్వర్గలోకమున నేడేం డ్లుండినట్లు తెలియుచున్నది. సంస్కృతభారతమున "పంచైవవర్షాణితథావ్యతీయుః" అనియున్నది. మఱియు నరణ్యపర్వమున నర్జునుఁడింద్రలోకమునుండి వచ్చి ధర్మరాజాదులతోడఁ గలసి నివాతకవచవధోపాఖ్యానము చెప్పిన పదంపడి "శ్లో॥ సమేత్య పార్థేన యథైకరాత్ర మూషు స్సమా స్తత్ర తదాచతస్రః, పూర్వాశ్చ షట్ తా దశ పాండవానాం శివా బభూవు ర్వసతాం వనేషు" అనియున్నది. ఇంద్రలోకమునుండి యర్జునుఁడు వచ్చినపిమ్మట నొకదినముగా సుఖముగఁ గడచిన నాలుగేండ్లును, ముందుఁ గడచినయాఱేండ్లును జేరి పదియేం డ్లయ్యెనని యీశ్లోకమునఁ దెలియుచున్నది. అడవికిఁ బోయి యందఱుం గలసియుండినయేఁ డొక్కటి, యింద్రలోకమున నర్జునుఁ డుండినయేం డ్లయిదునుం జేర్పఁగా నాఱేండ్లు సరిపోవుచున్నవి. అర్జునుఁ డమరావతిలో నేడేం డ్లుండెనేని యాయాఱేండ్ల నెనిమిదిగా లెక్కించవలసియుండును. కావున నైదేండ్లే యర్జునుఁ డింద్రలోకమున నుండె నని నిశ్చయించవలయును. తెనుఁగుభారతమునందు నరణ్యపర్వమున నాలవయాశ్వాసము మొదట "మధ్యాక్కర॥ ఏ నేఁడు లయ్యె మనవిజయుం డేగి * యింతకు వచ్చు। బూని దివ్యాస్త్రము ల్వడసి యమ్మహా * భుజు భూరిసత్త్వు। నానతరిపువర్గుఁ జూడఁ గాంతు మిం * దంచు బ్రాహ్మణుల। తో నేగె నుత్తరమునకుఁ దమ్ముల * తో ధర్మసుతుఁడు." అనుపద్యమువలన నయిదేం డ్లనియే తెలియుచున్నది. ఈప్రకరణమున నుండు "అమరనాథు నొద్ద నర్జునుం డుంప నే।డేఁడు లరిగె నిట మహీతలమున." అనుసీసపద్యగీతిపాదమందు నేనేఁడు లనియే యుంపవచ్చును. ప్రమాదమున "ఏడేఁడు" లని యచ్చులోఁ బడియుండును. నాలవయాశ్వాసము నందలిమధ్యాక్కరపద్యములో "ఏనేఁడు" లని నకారప్రాసమున నుండుటవలనను, సంస్కృతానుసారి యగుటవలనను నదియే నిశ్చయ మనినమ్మి యిచ్చటను నైదేఁడు లనియే వ్రాయఁబడియె. మధ్యాక్కరపద్యమున "ఏనేఁడు లయ్యె మనయర్జునుఁ డేగి యింతకు నేతెంచు" అని యిప్పటిపుస్తకములలో నున్నది. అది లక్షణవిరుద్ధ మగుటవలనఁ బైరీతి దిద్దఁబడియె. మధ్యాక్కరకు రెండింద్రగణములు నొకసూర్యగణము మరల రెండింద్రగణములు నొకసూర్యగణముం గూర్చి మూఁటిపై యతి యుంచవలయు నని యప్పకవి చెప్పియున్నాఁడు. నన్నయభట్టుగారి మధ్యాక్కరలలో గణము లిట్లేయున్నను యతి నాలుగుగణములమీఁద నైదవగణము మొదటఁ గనఁబడుచున్నది. అప్పకవీయములో నట్లుండుటకుఁ గారణ మూహింపఁ దగియున్నది.

దుల నొప్పువారు. అన్నదమ్ము లందఱు నెప్పుడుం బరస్పరానురాగమున వర్తించువార కాని యొకప్పుడైన భేదంబు భావింపరు. భీమార్జునపురస్కృతు లైన నకులసహదేవులు పోరునకుఁ దలపడిరా యప్పటిరీతి చెప్పనలవికాదు. వెండియు బలరాముఁడు, వాసుదేవుఁడును, సర్వయాదవులును వారివారలే. రామకృష్ణుల సహాయమువలన భీమార్జునులు గదాగాండీవములఁ గొనివచ్చిరేని యెవ్వారైన వారల నెదిరింతురా? సుహృదులహితము వినక మోసపోయితి. అవి యన్నియు నిపుడు తలఁపునకు వచ్చెడి ననిన సంజయుఁ డిట్లనియె. మహారాజా, యప్పుడుపేక్షించి యిపుడు చింతించినఁ బ్రయోజనం బేమి? సమర్థుఁడవయ్యు మోహమునఁ గొడుకును వారింపవైతివి. జూదమున నోడి పాండవు లడవికిఁ బోయిరనివిని వాసుదేవుఁడు యాదవులు కొందఱు వెంటరాఁగ వారిం జూడఁ గామ్యకవనమునకుఁ బోయె. ధృష్టద్యుమ్నాదిపాంచాలురు, విరాటకైకేయశిశుపాలపుత్రాదులు నపు డచ్చటఁ జేరిరి. వాసుదేవుఁ డపుడు పాండవులవనవాసమునకు వగచి నీకొడుకులపై నలిగి “యిపుడ నే దుర్యోధనాదిదుష్టచతుష్టయంబును, మఱియు నెదిరించువారల నెల్లం బిలుకుమార్చి రాజసూయంబునాఁటి యైశ్వర్యంబు కంటె నెక్కువయైశ్వర్యంబు పొంపిరివోవ సకలదేశాధీశులుం గొలువ హస్తిపురంబున ధర్మరాజునకుఁ బట్టాభిషేకముఁ గావింతు” నని యందఱు వినుచుండఁ బుయిలోట దక్కి నెక్కి వక్కాణించెనఁట. వాసుదేవుని కోపావేశం బరసి ధర్మరాజు జనార్దనా, కోపం బుడిగి నా ప్రతిజ్ఞ సత్యంబుఁ జేయుము. పదుమూఁడేడులు గడచినపదపడి యట్లు చేయు మని మెల్లన సాంత్వపూర్వకముగఁ బ్రార్థించి యుద్ధమున నర్జునునకు సారథివగుమని వినయమునఁ జెప్పఁగ ధృష్టద్యుమ్నాదులు నిదియ తగు ననుటయు నారాయణుఁడును సారథిగా నొడంబడి శాంతుఁ డయ్యెనఁట. అంత నందఱు మధుసూదనుండు వినఁగ ద్రౌపదిం జూచి దేవీ నీకోపమున నిక్కంబ దుర్యోధనుండు చచ్చు నని మేమెల్లఁ బ్రతిజ్ఞఁ జేసెదము. ఆసభకు ని న్నీడ్చి తెచ్చినపాపాత్ముల కళేబరములఁ జీల్చి గ్రద్దలు, నక్కలు, తోఁడేండ్లు, నెత్తురు ద్రావి కండలు దినును. వనవాససమయంబు గడపనవలయు నని కినుకమై నుడివిరఁట. ప్రాణములపై నాసగలవాఁడు సర్వసహాయసంపన్నులగు వారలతోడఁ బోరునకుఁ దలపడఁడు. మఱి సింగములం గనుంగొనిన యేనుంగుల భంగిఁ బుయిలోడుదు రనిన విని ధృతరాష్ట్రుఁ డక్కటా? విదురునిమాట హితంబని తలంపమింజేసి యింతచేటు వాటిల్లె ననిన విని జనమేజయుండు వైశంపాయనమునీంద్రా సవ్యసాచి యస్త్రార్థంబుగ నింద్రలోకమున కరిగినపిదపఁ బాండవులేమి చేసి రనియడుగ నమ్మునినాథుఁ డమ్మనుజనాథున కిట్లనియె.

నరేంద్రా, విజయుఁ డస్త్రార్థముగఁ బోయినపదంపడి యొక్కనాఁడు పాండవులు పాంచాలితోడ నెక్కపచ్చికపట్టున నేకాంతమునం గూర్చుండి విప్పచ్చునెడఁబాటు నోర్వఁజాలక కేవలచింతాక్రాంతులై రాజ్యంబుకోల్పోకకు వనరుచుండ భీముఁడు యుధిష్ఠిరున కిట్లనియె. మహారాజా, నీయానతిమెయి మనయర్జునుఁ డస్త్రార్థంబు పోయి యింతకు రాక తడసె నేలొకో? మనప్రాణము లతనియందె సుప్రతిష్ఠితంబులు. వాఁడు బ్రదికిన మనకుం, బాంచాలురకుఁ, గృష్ణసాత్యకిప్రభృతులకుం బ్రదిమి కలదు. వానివిక్రమంబుననకాదె పగవారల గెలిచి మనము రాజ్యము క్రమ్మఱ సాధింతు మనిభావింతుము. వానిబీరమ్ముపై నమ్మికం గదా జూదమున నేదుర్యోధనాదులఁ బొరిగొననైతి. సకలదుఃఖములునా జూదమునన కలిగె. వాసుదేవునితోడ్పాటున మేము దుర్యోధనాదులం బరిమార్చి వత్తుము. బలవంతులమయ్యు దుర్బలులకు లోఁగియునికి తగునే? కావున నర్జునుని రావించి, జనార్దనుం బిలిపించి దండెత్తిపోయి యప్పాపాత్ముల వధింతుము. నీవు సమయసంవత్సరములు కడచనినపిదపనే పట్టాభిషిక్తుఁడవు గమ్ము. ఇందుదోషము లేదు. మఱి యిదియే క్షాత్రధర్మంబు. సమయంబు దీఱకమున్న వారల వధింపఁ దలంపు నికృతియంటేని నికృతిపరులను నికృతిచే గెలుచుట పాపంబు గాదు. దుర్యోధనాదులం జంపఁగ నిదియే సమయంబు. కృచ్ఛ్రమున నొకయహోరాత్రమే సంవత్సరసమాన మగునని వేదముల వినంబడు. వేదములు నీకుఁ బ్రమాణములు గాకున్నే? కాన నిప్పటికి ముం దెన్నఁడో సమయంబుఁ దీఱె నని భావింపుము. ఇది గౌణపక్షమంటేని యథోక్తక్రమంబున నజ్ఞాతచర్య నల్పుట యరిది యగుటంజేసి, గౌణపక్షావలంబనంబె యిప్పటికి శ్రేయంబు. అజ్ఞాతవాసమున గూఢచారులచే వారలు మనల నెల్లెన నరయుదురు. అరసినం గ్రమ్మఱ నీనియమంబు నల్పుచుండవలయు. కావున మన కెన్నఁడు నీవనవాసము దప్పనేరదు. ఒకవేళఁ గ్రమంబున సమయముఁ గడపితిమేనియు వారు మఱలజూదమునకుఁ బిలుతురు. పిలిచిన నీవు పోక యూరకుందువే? పోయి యాడి యోడుదువు. కావున వాయుసహాయంబున నగ్ని శుష్కతృణములఁ గాల్చుపగిది నర్జునసహాయమున నే నాధార్తరాష్ట్రులఁ బిలుకుమార్తు నని కింకిరి పాటు వ్రేఁడమనుడువఁగ ధర్మరా జతనిశిరంబు మూర్కొని యనుంగుఁదమ్ముఁడా, నీచెప్పినట్లు నీవును, సవ్యసాచియు విక్రమించిన ధార్తరాష్ట్రవధం బెంతటిపని? సమయాబ్దంబులు గడచనినపదంపడి యట్లు చేయుఁడు. కోపమున కిది సమయంబు గాదని యూరడింపుచున్నంత బృహదశ్వుఁడనుమహర్షి యచ్చటికి విచ్చేసె. వేంచేసిన యమ్మునీంద్రు నర్ఘ్యపాద్యమధుపర్కాదివిధుల నర్చించి ధర్మరాజు చెంగట నుపా

సింపుచుండి యమ్మునిసేద దేఱుగడ నెఱింగి యిట్లనియె. మునీంద్రా, మాయర్జునుఁ డస్త్రార్థముగ నరిగి యింతకు రాఁడు. వాఁడు రామింజేసి ప్రాణములు లేనికళేబరము లమాడ్కిఁ దేజు దఱిఁగియున్నవారము. ఎన్నఁడు వానింగనుంగొనఁ గలుగునో? మఱియు నొండొక్కటి వినుము. ఉక్కివు లయినజూదరులతోడ జూదమాడి ప్రాణములకంటె నెక్కుడగుభార్యను సభ కీడ్చితేరఁ జూచుచు నవమానమున కోర్చి రాజ్యమును, ధనమునుంగోల్పోయి నారలు గట్టి యార్తులై నమావారల కట్టిఁడినుడువుల వినుచు నిట్లడవుల నిడుమలఁ గుడుచుచున్నవాఁడ. మున్నెన్నఁ డైన నాయట్టిమందభాగ్యుఁ డగురాజు గలిగెనె? మీరు వానిం గంటిరే? వింటిరే? నాకంటెఁ గడు నిడుమలఁ బడువాఁడు పుడమి నుండఁ డనితలంతు ననిన ధర్మరాజునకు బృహదశ్వుఁ డిట్లనియె. ధర్మనందనా తొల్లి నిషధదేశపతి యగు వీరసేనునికొడుకు నళుఁ డనురాజు పుష్కరునితోడ జూదమాడి సర్వస్వమ్ము గోల్పడి భార్యతోడ నడవుల నొక్కఁడే యిడుమలఁ గుడిచె. అందు వానికిఁ జుట్టలు, నన్నదమ్ములు, భృత్యులు, రథములును దోడు లేవయ్యె. దేవతుల్యు లయినతమ్ములు, బ్రహ్మసము లైనబ్రాహ్మణోత్తములును సహాయులై యుండ నీవు వగవనేల? యనిన ధర్మరాజు మునీంద్రా, నళునిచరిత్రంబు సవిస్తరంబుగ వివరింపవే యనియడుగ నతనికి బృహదశ్వుఁ డిట్లనియె.

## నళోపాఖ్యానప్రారంభము.

నిషధదేశనాథుఁ డైన వీరసేనునికొడుకు నలుఁడనువాఁడు, రూపవంతుఁ, డశ్వరహస్యవిదుఁడు, సత్యవచనుఁ, డనేకాక్షౌహిణీపతి, ద్యూతప్రియుఁ, డుదారుఁడు, జితేంద్రియుఁడు, ధనుర్ధరశేఖరుఁడు, బ్రహ్మణ్యుఁడు, వేదశాస్త్రాభిజ్ఞుఁడు, ద్వాదశాదిత్యులలో విష్ణువుపోలె రాజులలోన నధికతేజమున వెలుంగువాఁడు మనుమార్గమునరాజ్య మేలుచుండె. అయ్యవసరమున నట విదర్భదేశమున నాదేశపు రాజు భీముఁ డనువాఁ డుత్తమగుణాలంకృతుఁడు పెద్దకాలంబు బిడ్డలం బడయక సమాహితచిత్తుండై పెద్దల నుపాసింపుచుండ నొక్కనాఁడు దమనుఁ డనుబ్రహ్మర్షి విచ్చేయుటయు నా భీముఁడు పత్నీసహితుండై యమ్మునిం బలుదెఱంగులఁ బరిచరింప నమ్మహాత్ముం డాపరిచర్యకు మెచ్చి ముప్పురుకొడుకులు, నొక్కకూఁతురుం బొడమునట్లుగా వరము ప్రసాదించె. తత్ప్రసాదమున దమయంతి యనుకూఁతురు దమ, దాంత, దమను లనుకుమారులు ముప్పురుం జనింప నాదంపతు లాబిడ్డలఁ గూర్మిమైఁ బెంచుచుండిరి. అందుఁ బుత్రికామణి యైనదమయంతి దేవగంధర్వాదిసుందరులకంటె శ్రీరూపతేజస్సౌభాగ్యంబుల వన్నెకెక్కి జవ్వనంబు నివ్వటిల్ల మవ్వంపువిలాసములఁ జెన్నుమీఱి నూఱుగురుచెలికత్తియలు గొలువ వేడ్కమై విహరించునది నలుగుణముల విని యతనిపై ననురక్త యయ్యె. నలుఁడును

దమయంతీగుణముల నాలించి దానిం గామించి పెఱచింతలెల్లఁ బాసి యాసుందరీరత్నంబు పొందెట్లు వాటిల్లునో యనుతలంపు గూర నెద్దియుం దోఁపమి నంతిపురంబుచెంగట నుండునుద్యానంబునకుఁ జని యేకతం బుండి యచట మెలంగుచున్న పశిండియంచలపిండుఁ గాంచి యొక్కదాని నొడిచిపట్టుకొనుటయు నది తన్నేమి యతండు చేయునో యని వెఱచి యిట్లనియె. రాజేంద్రా నను వధింపకుము. దమయంతియొద్ద కేగి నీగుణముల దానికి నేర్పునఁ దెలిపి తన్మనంబున నీపైఁ దగులము మిగులఁ జేయుదు ననిన నలుఁడు సంతసిల్లి దాని విడిచిపుచ్చెఁ. అంత నాహంస లుప్పరంబున కెగసి పోఁజూతీరి వేగంబ విదర్భమునకుఁ బోయి యంతఃపురకాంతలమెలదోఁటలోన వ్రాలి మెల్లమెల్లన నడయాడుచుండ దమయంతి చెలులతోడ నట విహరించునది యయ్యంచలం గాంచి తదీయరూపమున కచ్చెరువడి యాపశిండియంచలం గైకొనవలయు ననినఁ జెలులు వేఱువేఱుగ నొక్కొకదాని వెంటం బాఱిరి. దమయంతియు హంసగ్రహణకుతూహలంబునం బాఱుచు నలునొద్దనుండి యరుదెంచినదాని డాయంబోవఁగ నది మనుష్యవచనమ్ముల నమ్మగువ కిట్లనియె. దమయంతీ నిషధదేశపతి యగునళుఁడనురాజశ్వినులపోలె నతిసుందరుఁడు సర్వగుణముల నొప్పారువాఁడు. దేవగంధర్వయక్షరాక్షసాదులనెల్ల మే మెఱుంగుదుము. ఇట్టిసుందరు నెచ్చటం గానము. వానికి భార్యగావేని నీజన్మంబు నిరర్థకంబు. అతండు పురుషరత్నంబు. నీవు సుందరీరత్నంబవు. మీయిరువురకుం గలయిక యయ్యెనా యది గుణవంతం బగు ననిన విని దమయంతి యెంతయు సంతసిల్లి యాయంచను గారవించి మరాళవర్యా నలునిగుణముల నాకెఱింగించినతెఱంగున నాగుణముల నానృపాలునకు నెఱుంగింపు మనిన వల్లెయని యమ్మరాళమ్ము నిషధదేశమ్మునకుఁ బోయి యంతయు నలునకు నివేదించె.

### భీమరాజు దమయంతీస్వయంవరంబు చేయ నిశ్చయించుట.

అంత దమయంతి హంసవచనమున నలునిపై వలపు గూరఁ దత్సంగమంబ వేఁడుచు వెడవిల్తుండు వెగడుపఱుప వెట్టిమై వెలవెలపాటును, వెఱఁగుపాటును వెక్కసం బగుడు వేఁడినిట్టూర్పుల వెడలింపుచు నిదురఁ బొరయక యోగిరం బారగింపక వెతల వేసరుచుండె. చెలికత్తె లత్తెఱంగులనెల్ల నలునిపై మరులువలనం గలిగినచెయ్వులఁగా నిశ్చయించి యంతయు భీమునకు విన్నవింప నమ్మహీకాంతుఁడు దమయంతీస్వయంవరంబున కిదియ తఱి యనితలంచి స్వయంవరంబు చాటించె. చాటింప నానాదేశాధీశు లగురాజులు వివిధభూషణాలంకృతులై హస్త్యశ్వరథఘోషముల భూతలంబు గ్రక్కదల నాస్వయంవరంబునకు వచ్చుటయు భీమరాజు వారల నగరంబునఁ దగువిడిదలలఁ జేర్చి యుచితవిధానమున

సత్కరించె. అయ్యవసరంబున నారదపర్వతమునీంద్రులు నాకలోకమునకుఁ బోవఁగ నింద్రుఁడు వారిం బూజించి కుశలప్రశ్నంబు నడిపి భూలోకమున రాజు లెందఱేని రణపరాఙ్ముఖులుగాక కడిమి మెఱయఁ బోరాడి యటఁ దనువు విడిచి పుణ్యఫలంబు లనుభవింప నిటకు వచ్చువా రిపు డేల రాక తక్కి రని యడుగ నారదుఁ డిట్లనియె. సురేంద్రా మాకును బుడమినిగలరాజుల కెల్లరకుం గుశలంబ. ఇపుడు విదర్భ దేశపతి యగుభీమరాజుకూఁతు రగుదమయంతి యనుకన్యారత్నమునకు స్వయంవర మగుటం జేసి క్షత్రియులు యుద్ధంబు చాలించి యందఱు నాస్వయంవరమునకుఁ బోయినవా రనిచెప్పుచున్నంత నగ్నియమవరుణు లేతెంచి నారదవచనంబు విని దమయంతీస్వయంవరంబునకు మనముం బోయెద మనిన నింద్రుఁడు వల్లెయనుటయు నందఱు భూలోకమునకు రాఁ దలఁచిరి. అట్లు శక్రాగ్నియమవరుణులు వచ్చువారు స్వయంవరంబుపొంత విదర్భమున కరుగుచున్ననలుని మూర్తిమంతుం డయినమన్మథుఁడునాఁగ దివ్యసౌందర్యమున విరాజిల్లువాని నడుత్రోవలోనఁ గని వానిరూపరామణీయకంబునకు నివ్వెఱఁగంది యాసుందరి యీరూపసిని వరింపక మఱలవరించునే యని మనముల వితర్కింపుచు విగతసంకల్పులై యంతరిక్షమున విమానముల నిల్పి డిగ్గి నలుం జేరవచ్చి నిషధనాథా మాకు దూతవై కార్యసహాయంబు సేయు మనిన నలుం డట్లయని కృతాంజలియై యయ్యా మీ రెవ్వరు? నే నెవ్వరికి దూత గావలయు? నేమి కార్యం బనియడుగ నింద్రుఁ డిట్లనియె. మేము లోకపాలురము. నే నింద్రుఁడను. వీరు వహ్నియమవరుణులు. నీవు దమయంతియొద్దకుఁ బోయి స్వయంవరార్థము మేము వచ్చితి మనియు, మాలో నొక్కని వరింపు మనియుఁ దెల్పు మనిన నలుఁడు సురలారా న న్నిందులకుఁ బనిగొనఁ దగునే? నేనును దానినఁ గోరి యాస్వయంవరంబున కరుగుచున్నవాఁడ. ఏకార్థసంసక్తుఁడ నగునన్ను నియమింపవలదు. కరుణింపుఁడనిన వా రిట్లనిరి. నైషధా చేయుదు నని యొడంబడి క్రమ్మఱఁ జేయ ననుట తగదు. ఇది యసత్యంబుకాదే? కావున నెడ సేయక పొమ్మనుటయు నలుం డట్ల యగుంగాక. వీరభటసురక్షితం బైనదమయంతియాంతిపురంబు నే నెట్లు చొరనేర్తు నని యడుగ దేవతలు మాప్రభావమునఁ జొరఁ గల వనిరి.

## నలుఁడు దేవదూతయై దమయంతియొద్దకుఁ బోవుట.

దేవవచనం బాలించి నలుఁడు వేగంబ విదర్భపతినగరుఁ జొచ్చి యంతఃపురంబునకుఁ జని చెలులనడుమఁ గొలువై యున్నదమయంతి నతిసుకుమారాంగిని నిజదివ్యకాంతిచే జంద్రప్రభను నిరాకరించుదానిం గాంచి పంచబాణవశుఁడయ్యు సత్యంబు నడప నెట్టకేలకుఁ దాల్మిఁ బూని కామంబు నడంచుకొనియుండె. దమయంతియుఁ, జెలులును నలుం జూచి తొట్రుపాటు గదుర దిగ్గనలేచి వాని తేజంబునకు

వెగడొంది సిగ్గున మాటలాడనేరక యద్దిరా! వీనిరూపకాంతిధైర్యము లనిర్వచనీయంబులు. ఇతండు దేవుఁడో? మఱి యక్షుఁడో? కాకున్న గంధర్వుఁడో? యని వెఱఁగుపడి చూచుచుండిరి. అంతఁ గొంతవడికి దమయంతి మందస్మితసుందరవదనారవిందఁ డగునలు నుద్దేశించి యోసర్వాంగసుందరా, నీ వెవ్వఁడవు. సురక్షితం బయినరాజగృహం బెట్లు లాఁతివారికి నెఱుఁగఁబడక యరుదెంచితివి. నినుఁ గనుంగొనినంతన చిత్తంబు చిత్తజాయత్తం బయ్యె నని చెంగలువపైఁ గ్రాలు లేఁత వెన్నెల తెఱఁగున నగవు నునుజిగివాతెఱపై మెఱయ నడుగుటయు నలుం డిట్లనియె.

కల్యాణీ, నే నలుఁడను. దేవతలకు దూతనై నీయొద్దకు వచ్చితి. ఇంద్రాగ్నియమవరుణులు నిన్ను వలచినవారు. వారిలో నొక్కని భవదభిమతుని వరింపుము. వారిప్రభావముననే నా కిటకు రాఁగలిగె. వచ్చుతఱి నే నగపడమింజేసి యెవ్వరును వారింపరైరి. దేవవచనంబు విని యిచ్చమై నుచితంబు నడపు మనిన దమయంతి వేల్పులకు మ్రొక్కి నవ్వుచు నిట్లనియె. రాజేంద్రా, నేనును, మదీయసకలధనంబును నీ సొమ్మని నమ్ముము. ప్రణయంబున ననుగారవింపుము. హంసవచనంబు విని నాఁటంగోలె నామనంబు నీపై నత్యంతానురక్తం బయ్యె. నీనిమిత్తంబుగనే స్వయంవరమునెపమున రాజులనెల్ల రప్పింపవలసె. కోరిక లీరిక లెత్తఁ బొందు వేఁడుచున్న నన్ను నిరాకరింతువేని విషముననొండె, నగ్నినొండె, జలముననొండె, నురినొండె, నిక్కముగఁ బ్రాణములఁ ద్యజింతు నని తెగఁబాఱి పలికె. ఆపలుకులు విని నలుఁడు వైదర్భీ, మహానుభావు లగులోకపాలురు వేఁడుచుండ మనుష్యమాత్రుఁడ నగున న్నేల కోరెదవు? వారిపాదపరాగమునకైన నేఁ బోల్పఁ దగుదునే? మఱియు దేవతలకు విప్రియంబుఁ జేసిన నవశ్యంబు చేటు వచ్చు. కావున వారలలో నభిమతుని వరించి నన్ను రక్షింపుము. సురలనే వరించి దివ్యాంబరాభరణపుష్పమాలికాదుల ననుభవింపుచు సుఖింపుము. భూమినెల్ల నొక్కపెట్టుగ గ్రసింప సమర్థుఁ డగుహుతాశనుని, సర్వభూతముల ధర్మమునం బ్రవర్తింపఁగ శాసించు యముని, సర్వగుణవిలసితుం డైనవరుణుని, ముల్లోకంబులకు నాథుఁ డగుమహేంద్రుని వరింపక పతింవర లాఁతివాని వలచునే? కావున నాపలుకులు సుహృద్వచనములుగఁ దలంచి శంకదక్కి వారిలో నొక్కని వరింపు మనిన నాపలుకులు చెవులకు ములుకులై సోఁకుటయు దమయంతి యింతింతనరానివంతచేఁ గనుంగవ బాష్పకణంబు లురల, డగ్గుత్తిక వడ, మేను గంప మొందఁ గేలుమోడ్చి మహారాజా! సురలకెల్ల మ్రొక్కి నేను నిన్నే వరింతుఁగాని వేఱొక్కని వరింపను. ఇంతయు సత్యం బనినుడువుచుండ సాంత్వపూర్వకముగా నలుఁడు భైమి కిట్లనియె. శుభాంగీ, నాకును నీమెడం బ్రేముడి యగ్గలంబ. ఐన నేమి చేయ నగు? దూతకృ

త్యమున కొడంబడి పెఱవారిపనికిఁగా వచ్చి స్వార్థంబుసాధింప నెట్లుత్సహింతు? ధర్మవిరోధము లేక స్వార్థమునుం గలుగునేని యది నాకు సమ్మతంబు గాకున్నె? వెరవు గలదేని చింతింపు మనిన దమయంతికొంతవడి చింతించి బాష్పగద్గదస్వరంబు గదుర రాజచూడామణీ, ఇందుకునిరపాయం బైనయుపాయం బొక్కండు గలదు. ఎట్లంటేని. నీవు, నింద్రాగ్నియమ వరుణులును స్వయంవరమంటపమునకు వచ్చి యుండఁగ నెల్లవారిసమక్షమున నేను నిన్ను వరింతు. నీచే నైనంతదూతకృత్యంబుఁ జేసితివి. వలపులేమి నే వరింపకున్న నందు నీతప్పు గలదే? యనిన విని నలుఁడు మగిడి లోకపాలురపాలికి వచ్చి తనపోక మొదలుగా మగిడివచ్చునంతకు నడచినవృత్తాంత మంతయు సవిస్తరముగా నెచ్చుతక్కువలు లేకుండ విన్నవించె.




అంత శుభదినమునందు సుముహూర్తంబున భీమరాజు దమయంతీస్వయంవరంబు జరపఁగ రాజులు పెక్కండ్రు వివిధభూషణముల నలంకరించుకొని సురభిచందన ఘలంది వికచసుమమాల్యంబులఁ దాల్చి కనకస్తంభతోరణవిరాజితం బైనయాస్వయంవరరంగంబుఁ జేరుటయు నింద్రాదిలోకపాలురును దమ్ము నలానురక్తచిత్త యగుదమయంతి వరింపదనితలంచి నలరూపధారులై నరేంద్రగణసాంద్రం బైనయారంగంబుఁ జేరిరి. అంతఁ గొంతసేపునకు సర్వాలంకారవిలసితయై దమయంతి తనపైఁ దగిలినచూడ్కులను, డెందములనుం దిగిచికొననేరక రాజలోకంబుచేష్టలు దక్కియుండఁ బుష్పమాలికఁ గొని యాస్వయంవరరంగము సొత్తెంచె. చొత్తెరి రాజుల వేర్వేఱం జూపి నామవిక్రమంబులు వక్కాణింపుచుండ నందఱం గలయం గనుంగొనుచు వర్ణనీయసౌందర్యంబున సొంపు పెంపారి యందఱు కొంచెమైన నించుమించు లేక యొక్కరూపకా నగపడువారి నేవుర నళులం గాంచి తన చిత్తంబు నలునిపై ననురక్తం బగుటం జేసి లోకపాలురు నలరూపులై రనితలఁచి యందు నిషధేశు నేర్పఱుప నేరక పెద్దలవలన వినియున్న వేల్పులగుఱుతుల వారిలో నెవ్వనియెడనుం గానక పలుదెఱంగులఁ బలుమాఱులు చింతించి సురల శరణు సొచ్చుకంటె నిపు డొండొకండు వెరవు కాదనినిశ్చయించి వాఙ్మానసంబుల వారికి నమస్కారంబులు సమర్పించి కంపమానాంగియై కేలుమోడ్చి యమరులారా! హంసవచనంబు విని యనురాగంబున నలుని బతిఁగ వరించితి. మనోవచనముల నితరునిపైఁ దలంపు లేదు. అతఁడే నాకు దేవవిహితుఁ డైనపతి యనినమ్మియుండెద. అతని వరింపఁ గోరియే యీవ్రతం బారబ్ధం బయ్యె. ఇదియంతయు సత్యంబుగాఁగ నాకు వానినే పతిఁగఁ బ్రసాదింపుఁడు. కరుణించి నిజరూపములఁ గొనుఁ డని యతిదీనంబుగ వేఁడుకొనియె. అవ్వేఁడుకోలు నాలించి లోకపాలురు దమయంతికి నైషధునిపైఁ గలయనురాగంబును, భక్తిని, మనశ్శుద్ధిని నరసి

ప్రసన్నులై నిజరూపముల గ్రహించిరి. అట దమయంతి చెమర్పక రజము నొలయనిమేను, ఱెప్పపాటు నొరయనినయనంబులు, వాడనివిరిదండలుం గలిగి. పుడమి నంటక యాసన్నులయినవారి నలువుర లోకపాలురం జూచి తక్కటివాని నిషధపతిఁగఁ దెలిసి లలితలజ్జావిలాసమ్ము నెమ్మోమున నంకురింపఁ బయ్యెదచెఱంగున మేను మఱుంగుచేసికొని మెల్లమెల్లన వచ్చి యతనిబంధురస్కంధమున సుగంధసుందరం బైనసితకుసుమమాల్యమ్ము నుంచె. తోడన విస్మితులయినవిబుధులయు మహర్షులయుసాధువాదంబులు, పెఱరాజులహాహానినాదంబులును నింగి ముట్టె. నలుం డంత నత్యంతసంతోషసమాక్రాంతస్వాంతుండై దమయంతి నుద్దేశించి కల్యాణీ, దేవసన్నిధానమున నను నీయొడికపునుడులనమ్మినవాని వరించుటంజేసి నామేనఁ బ్రాణములు గలుగునంతకు నిక్కంబ నీవాఁడనై యుందు ననియూఱడింప నయ్యింతియుం గేల్దోయి మొగిచి యట్ల యొడంబడియె. అత్తెఱంగున నలదమయంతు లితరేతరప్రేమరసము వెల్లివిరియఁ జెలంగువారు డెందముల లోకపాలుర శరణుచొచ్చుటయు వారు దమయంతి నలుని వరించుట కెంతయు మెచ్చి వారి కెనిమిదివరముల నిచ్చిరి. అందు దేవేంద్రుఁడు యజ్ఞమునఁ బ్రత్యక్షదర్శనము, నుత్తమగతి ననుగ్రహించె. అగ్ని కోరినచోటఁ దన ప్రకాశంబును, దివ్యప్రభము లయినలోకములనుం బ్రసాదించె. యముఁ డన్నపుష్కలత్వంబును, ధర్మనిరతత్వంబునుం దయచేసె. వరుణుఁడు కోరినచోట నుదకంబును, దివ్యపుష్పమాల్యములనుం గరుణించె. ఇట్లు వారు వేఱువేఱ రెండు రెండుగా నెనిమిదివరముల నిచ్చి తమలోకములకుఁ జనిరి. రాజులును దమయంతి నలుని వరించుటకు విస్మితులై తమతమదేశములకుం బోయిరి. పదంపడి పరమానందసాంద్రుండై విదర్భరాజు యథోక్తముగ నళదమయంతులకు వివాహముఁ గావింప నలుఁ డచ్చటఁ గొన్నినాళ్లుండి, భీమునను జ్ఞఁ గొని, దమయంతిం దోడ్కొని, నిజనగరమునకుఁ జని, శచీసహితుం డైనయింద్రునిచాడ్పున వెలుంగుచు, ధర్మమున రాజ్య మేలుచు, భూరిదక్షిణంబు లయినయశ్వమేధాదియాగముల నాచరింపుచు, నాసుందరీరత్నంబుతోడ రమణీయప్రదేశంబులఁ గామసుఖంబులం దనియుచు నింద్రసేనుఁ డనుకుమారుని, నింద్రసేన యనుకూఁతుం బడసి సంతుష్టచిత్తుండై యుండె.

కలిసమావేశమున నలుఁడు రాజ్యభ్రష్టుఁ డగుట.

అట లోకపాలురు నిజలోకములకుఁ బోవుచుండ మార్గమున ద్వాపరునితోడ నెదురుగ వచ్చుచున్నకలిం గాంచి వారిలోనింద్రుఁడు కలీ, ద్వాపరునితోడ నెటకుఁ బోయెద వనియడిగి దమయంతీస్వయంవరంబునకుఁగాఁ బోవుటం దెలిసికొని యోహో యిఁక నేల పోయెదవు. ఆస్వయంవరమున నాకన్నియ

మానసమక్షమున నలుని వరించె ననినం గినిసి కలి యిట్లయ్యెనేని సురల కవమానంబుగా వాని వరించుటంజేసి దాని, వాని నవశ్యంబు దండింపవలయు ననిన సురలు కలి కిట్లనిరి. ఓయీ కలీ, యిట్లనవలదు. మాయనుమతంబుననే యాకన్నియ యతని వరించె. సర్వవేదశాస్త్రపురాణాదివిదుఁడు, ధర్మజ్ఞుఁడు, దేవపూజాపరాయణుఁ, డహింసానిరతుఁడు, సత్యవచనుఁడు, నియతవ్రతుఁడు, తపశ్శౌచజ్ఞానధైర్యాదిసకలసుగుణమహితుఁడు, లోకపాలసముఁడు నగునతని వరింపక దమయంతి వేఱొక్కని వరించునే? ఇందుఁ దప్పేమి? అట్టిమహనీయుని శపింపఁ దలఁచుకంటె నాత్మశాపం, బాత్మవధంబును వేఱుగావు. వివేకవైకల్యంబున శపించువాఁడు ఘోరనరకమునం బడు ననిచెప్పి నిజలోకములకుఁ జనిరి. పదపడి కలి ద్వాపరుం జూచి నే నీకఁ గోపంబుఁ జాలింపఁ జాలను. నలునందుఁ జేరి, వానికి రాజ్యభ్రంశంబుఁ గావించి, దమయంతితోడ విహరింపకుండఁగఁ, బాచికలం జొచ్చి జూదమాడించి వానికిఁ జేటు గావింతు. నీవుం దోడ్పడు మనిచెప్పి యట నిషధనగరంబునకుఁ జని నలమహీపతిం బ్రవేశింప సందు వెదకుచుండి నియతవ్రతపరుండయినయతనియెడ నించుకేనియు నవకాశంబు గానక యోర్పున నుండి పండ్రెండేండ్లు గడచినపదంపడి యొక్కనాఁ డానృపాలుండు మూత్రంబు విడిచి కాళ్లు గడిగికొనకయే యాచమించి సంధ్య నుపాసింపుచుండ నది సమయంబుగాఁ గొని నలునిపై నావేశించి యట విప్రవేషంబునఁ బుష్కరుఁ డనువానియొద్దకుఁ జని తన్నుఁ దెలిపి పుష్కరా, నాసహాయంబుచే జూదమున నలుం గెలువఁ గలవు. కాన నట్లచేసి నిషధదేశంబు సాధింపు మనిబోధించి జూదమున కతనిం బురికొల్పి యాపుష్కరుం దోడ్కొని నలునొద్ద కరుదెంచి మహారాజా, మారాజుతోడ జూదం బాడు మనినివేదించె. నలుఁడు జూద మనుచితం బనియెఱింగియుఁ బిలిచిన నాడకునికి పౌరుషంబుగా దనితలంచి దమయంతి చూచుచుండఁగనే యాడం దొడంగి హిరణ్యధనవస్త్రాదుల నొడ్డుచుఁ బలుమాఱు లాడుచుఁ గలిసమావేశంబునంజేసి యోడుచుండె. సుహృదులు జూదమునం దగులువడిననలమహీపతిమనంబుఁ ద్రిప్పనేరక వెలవెలనగుటం దెలిసి మంత్రులును, బురజనులును రాజునుద్యోగంబు వారించువారై వచ్చి సారథిచే దమయంతికిఁ జెప్పిపుత్తెంచుటయు నద్దేవి నలునొద్దకుఁ బోయి శోకాపలచిత్తయై బాష్పసంపాతంబున డగ్గుత్తికపడ మహారాజా! నినుఁ గాంచఁగ బురజనులును, మంత్రులును ధర్మార్థంబుఁ బరిశీలించి రాజభక్తిపురస్కృతులై వచ్చి నగరుమొగసాల వేచియున్నవారు. వారికి దర్శనం బిమ్ము. అని సారెసారెకు నివేదించె. విన్నవించినను నలుండు కలిసమావేశంబునఁ బ్రత్యుత్తర మొసంగమింజేసి పౌరులును, మంత్రులును నితం డుచితం బెఱుంగఁడు, మేలుఁ గాంచనేరఁ డని లజ్జావిషాదంబులు పెనంగొనంగఁ దమతమయిండ్లకుఁ

జనిరి. నలుఁడుం బుష్కరునితోడ ననేకమాసంబు లాడి యోడి యప్పటికిం జూద మునం దనియకునికిం దలపోసి దమయంతి భయశోకసమావిష్టయై దీననెంతయే నెగ్గగుననిశంకించి తత్ప్రియంబు సేయం దలంచి తనదాదిని బృహత్సేన యనుదాని సర్వార్థంబుల నేర్పున హితంబు నల్పుదానిం బిలిచి బృహత్సేనా, మంత్రులపా లికిం బోయి రాజాజ్ఞగా ధనవ్యయశేషంబులం దెలిసికొను మనవుడు నది యట్ల పోయి యమాత్యులకుఁ జెప్పె. మంత్రులును మనకు భాగ్యంబు కలదు కాఁబోలు. రాజు ధనవ్యయశేషంబుల నడిగించె. అని మనంబునం దలంచుచు రెండవతూరి ద్వారంబు సేరఁజనుదెర దమయంతి మంత్రులరాక మగని కెఱింగించి యామాట నతఁడు చెవియొగ్గి వినమికి లజ్జితయై నిజసదనంబుఁ జేరె. చేరి కొండొకవడికి నలుఁ డప్పటికిని జూదంబు చాలింపమిని, గెలువమిని, ధనమంతయుం గోల్పోకను నరసి కొని క్రమ్మఱ దాదిం బిలిచి బృహత్సేనా, నలశాసనంబున సారథి యైనవార్ష్ణేయుం దోడ్తెమ్మనినియమింప నది తగువారలం బనిచి వాని రప్పించె. వచ్చినవార్ష్ణే యుంజూచి దేశకాలాభిజ్ఞ యగుదమయంతి సారథీ! యిప్పటిరాజుచిత్తవృత్తి నెఱుం గుదు కదా. సదా నిను నతండు ప్రీతిమైఁ జూచుటకుఁ బ్రతిగా విషమస్థుం డైన యతనికి సహాయంబుఁ గావింప నిది యవసరం బయ్యె. ఎన్నిమాఱు లాడినను బుష్కరుఁడ గెలుచుచున్నవాఁడు. మనరాజు పరాజయంబుఁ జెందుచుండినను నామర్ద్యూతంబుపై ననురాగంబు మానఁడు. అక్షసాళ్లుం బుష్కరునకు వశంబులయి మనరాజునకు విపరీతంబు లగుచున్నయవి. సుహృదులయు, నమాత్యులయు, స్వజనులయుహితవచనంబుల వినమి యటుండనిమ్ము. నామొఱనైన నాలింపడు. ఇంత కెంతయేఁ గారణంబుండవలయు. కానున్న నాపలుకు వినక యుండునే? దీన నమ్మహీపతిపైఁ దప్పు లిప్పు డెన్నరాదు. మఱియు నామనంబు కలఁకంబాఱుచు న్నయది. దీనిం బరికింప రాజున కగ్గలంబుగ నెగ్గు వాటిల్లు ననితోఁచెడి. కావున నలున కభిమతంబు లైనయుత్తమాశ్వంబులం బూన్చినయరదంబున నీ కొండికల నెక్కించుకొని కుండిననగరంబునకుఁ జనిమాతల్లిదండ్రులయొద్ద వీరి, నీయరదంబును, గుఱ్ఱములనుం జేర్చి నీ కిచ్చవచ్చినయెడకుఁ బొమ్మని దైన్యంబు పెచ్చుపెరుగఁ జెప్పి యింద్రసేనుఁ డనుకుమారుని, నింద్రసేన యనుకూఁతు నతని కప్పగించె. సారథియు నావృత్తాంతము మంత్రులకుఁ దెల్పి రథంబున నాచిఱుత వాండ్ర నెక్కించుకొని విదర్భదేశమున కరిగి భీమరాజునకు దౌహిత్రులను, రథ రథ్యంబుల నొప్పగింత వెట్టి యారాజునానతిం గైకొని నలునిపాటున కుమ్మలింపుచు నయోధ్యకుఁ బోయి బుతుపర్ణుని సేవించి యతనికి సారథియై మనుచుండె. అట నలుండు కలధనంబంతయు జూదమునఁ బుష్కరున కోటువడుటయుఁ బుష్కరుండు

నవ్వుచు నలుం గుఱించి క్రమ్మఱ నాడవలయుఁగదా: సర్వస్వమ్ము నోటువడితివి. ఇంక దేని నొడ్డెదవు. దమయంతి యొక్కరిత మిగిలియున్నయది. ఇష్టమేని దాని నొడ్డియాడు మనిన నలుండు మనంబు తల్లడిల్ల, మొగంబు పల్లటిల్ల నెద్ది యుం జెప్పనేరక మేనం గలతొడవుల, నుత్తరీయంబులను నొలిచిపెట్టి సుహృద్గ ణంబునకు విషాదంబుగూర మహితరాజ్యసంపదఁ దొఱంగి నగరు వెలువడుటయు దమయంతియు నేకవస్త్రయై యతని వెంబడి చనియె.

నలుండు దమయంతితోడ నడవి కరుగుట.

అతం డట్లు వెడలి దమయంతితోడఁ బురంబువెలుపల మూఁడహో రాత్రంబులు జలపానంబున శరీరయాత్రఁ గడపుచుండె. పుష్కరుండును నలరా జ్యంబు నొడిచికొని యెవ్వరేనియు నలుని సత్కరించిరా వారిం జెఱఁ ద్రోయింతు నని వీటఁ జాటించె. అదియుఁ, గలికృతవిద్వేషంబునుం గారణంబుగా నెల్లరు సత్కారార్హుం డయిననలమహీపాలు నాదరింపమిం జేసి యతం డాహారమెద్దియుం గానక క్షుత్పీడితుండై దొరకినఫలమూలంబులం దినుచు దమయంతితోడ నడ వికిఁ జని పెద్దకాలంబుండి యొక్కనాఁ డాఁకట నకనకంబడువాఁడు పసిఁడిచాయ పులుఁగుల నొకకొన్నిటిం గాంచి యివి యిప్పటి కాహారం బగు ననితలంచి వానిం బట్టికొనఁ బూని తనకట్టినవలువ విసరివైచె. వైచుటయు నప్పులుఁగులు వానికట్టుఁగోకం గొని వినువీధిం బఱతెంచి దిగంబరుఁడు దైన్యంబున నధో ముఖుండునై యున్ననలుం గాంచి యోరీ దుర్మతీ, మేమే యక్షసాళులము. రాజ్య విభ్రంశముఁ గావించినంతన తనియక నీ వడవులకు వస్త్రముతోడన పోకయు మా కింపుగామిం జేసి దానిం గొనిపోవ వచ్చితిమి. కనుమొఱంగించి యిదె కొనిపోవు చున్నవార మనిన విని దైవదుర్విపాకంబునఁ దనకు మూఁడినకీడుం దలపోసి నలుఁడు దమయంతి కిట్లనియె. బిత్తరీ, కోపమున రాజ్యవిభ్రంశంబుఁ జేసినయ క్షంబులె పక్షులై నాకట్టినపుట్టంబుఁ గొనిపోవుచున్నయవి. ఏతన్నిమిత్తంబు ననే మనలఁ బౌరులును సత్కరింపరైరి. నా కిన్నిపాట్లుం బడవలసె. ఈ త్రోవ లవంతిని బుక్షవంతంబును నతిక్రమించి దక్షిణాపథంబునకుఁ బోయెడి. ఇది వింధ్యశైలము. ఇది పయోష్ణీనది. సముద్రగామిని యగుదీనియిరుదరుల బహు శఫలమూలవిలసితంబు లయినఋష్యాశ్రమంబులు పెక్కులు గలవు. ఈ తెరువు విదర్భంబులకుఁ జను. ఈమార్గంబు కోసలంబుల కరుగు. ఇట్లు పోవంబోవ దక్షి ణదేశంబునకుఁ బోవ నగు నని కొన్నిత్రోవలం బలుమాఱులు చూపఁగ దమయంతి కన్నీరు దొరుగ నతిదీనంబుగా నలున కిట్లనియె. నరేంద్రా! నాకుంజూడ నీసంకల్పంబు వేఱొండు తెఱంగుగఁ గానంబడియెడి. దీని వినినంతన గుండె బెండువడియె. అంగంబులు పొంగుతఱిఁగె. రాజ్యంబు సర్వంబునుం

గోల్పడి, కట్టినపుట్టంబునుం బోనాడికొని యాఁకలికిఁ దపించుచున్న నిను నిర్జనం బైనయీకాఱడవిలో విడనాడి యెట్లు పోవ నేర్తు? ఈఘోరవనంబున నేనుం గూడనుందునేని కొంచెమైన నీశ్రమం బపనయింతు ననితలంతు. సర్వదుఃఖంబుల భార్య కెనయైనమందు లేదని వైద్యు లందు రనిన నళుండు శుభాంగీ, నీచెప్పినట్లు భార్య కెనయైనమందు వేఱొకం డుండదు. గుణవతి యైనపత్నియే నెచ్చెలి యనంబడు. శంకింప నేల? శరీరంబునైన విడుతుంగాని నిన్ను విడుతునే? యనిన దమయంతి వెండియు నిట్లనియె. మహారాజా! నను విడువ నీకుఁ దలంపు లేదేని యిపుడు విదర్భంబులకుఁ ద్రోవఁ జూపనేల? మఱియు నెల్లపుడు నను నీవు విడువ వని తెలిసియు నిపుడు కలిసమావేశవివశమానసుండ వగుటం జేసి నన్ను నొకవేళ విడనాడుదువొకో? యని సంశయింతు. అందు కనుగుణముగఁ ద్రోవలఁ జూపుటంజేసి యొడంద నెంతయే నడరు వొడమెడి. నను విదర్భంబులకుఁ బంపఁ దలంపు గలదేని నీవును రమ్ము. ఇరువురుం బోయెదము. మాతండ్రి పలుదెఱంగుల నినుఁ బూజించువాఁడు. అచట సుఖముండఁ దగుననిపల్కిన నలుం డిట్లనియె. ప్రేయసీ, నీతండ్రిరాజ్యంబును నాయదియ. ఐనమున్ను మేలిపదంబున నున్ననాఁడు నీవు సంతసింప నటకుఁ బోయి సుఖంబుండి యిప్పుడు సర్వస్వంబుఁ బోగొట్టుకొని క్రమ్మఱ నక్కడకే పోవ మనంబు కొలుప దనిచెప్పి ప్రేయసి నూఱడింపుచు దానికట్టినపుట్టంబ తానుం జుట్టుకొని యాఁకలికి దప్పికి డయ్యుచు నాకాఱడవిలోన క్షుత్పిపాసాపరిశ్రాంత యగునాదమయంతితోడ నటునిటుం గ్రుమ్మరువాఁ డొకసభం గాంచి యందు నిద్రించె. అట దమయంతియు బడలిక కడుం దొడర నొడ లెఱుంగక నిదురపోవుచుండ నలుండు మేల్కాంచి కటకటా? నాకారణంబున నీసుకుమారి కిన్నిపాట్లు పడవలసె. ఇపు డెద్ది చేయ నగు. మదీయప్రాణత్యాగంబు శ్రేయం బగునొకో? కాదేని దీని నిట విడనాడి నే నొండుకడకుఁ బోయెద. అట్లయిన నిది యొక్కవేళ నను నెమకుచు నలసిసొలసియైనఁ బుట్టినింటికిఁ బోయి కొంతయైన నూఱటం జెందు. నాతోన యుండెనేని నిస్సంశయంబుగ నీయడరునకు విడుమరఁ గాంచనేరదు. తేజోమహిమదుర్ధర్ష యగుటంజేసి పతివ్రత యగుదీని నెవ్వరుం దెరువునఁ జెనకఁ జాలరు. కావున నిట దీని విడుచుటయ మేలని బహుప్రకారంబులఁ బలుమాఱులు విచారించి కలిసమావేశదోషమున నట్ల నిశ్చయించి తనకుఁ గట్టికొనఁ బుట్టములేమిని, నది యొంటిచీరం గట్టియునికినిం బరికించి దానివస్త్రమున నొక కొంతం జించికొనఁగ నూహించి యెట్లు సద్దు గాకుండఁ జించికొందు? కొంచెమైనం జప్పుడయ్యెనా చంచలాక్షి మేల్కాంచునే యనివితర్కింపుచు నాసభలో నంతటం గ్రుమ్మరి యందొక్కచో నొఱలేనికత్తిఁ గనుంగొని దానం దమయంతి

కట్టినపుట్టంబున సగముఁగోసికొని తాను దాల్చి నిద్రావివశచిత్త యగునాప్రేయసిని విడనాడి కొండొకయరిగె. అరిగి క్రమ్మఱ దమయంతిం దలంచుకొని యట్లు పోవఁజాలక మగిడి యాసభకు వచ్చి నిద్రింపుచున్నయప్పడఁతిం జూచి సూర్యమారుతులకైనఁ గానరానినాప్రియురా లిపు డీసభామధ్యమున ననాథపోలె నీకటికిఱాతిపట్టునఁ గూర్కుచున్నయది. మేలుకొని తనకట్టుఁగోక చినిగినందు కేమి చింతించునో? నన్నెడఁబాసి యిది కౄరమెకములకు మనికి యగునీకాఱడవిలో నెట్లు చరించునో యని కొంత చింతించి ధర్మనిరత యగుదీని నాదిత్యులు, వసువులు, రుద్రు, లశ్వినులు, మరుద్గణంబులు రక్షింతు రనిచెప్పి కలివినష్టవివేకుఁడై నలుఁడు ప్రాణపదం బయినపత్నిని విడిచి పోవఁ దలఁచె. తఱిఁ కలిబలమునఁ గలుగుమోహమును, బ్రియపత్నియెడం గలుగుస్నేహమునుం ద్రెంప వలఁతిగాక యాతాయాతంబుల నల్పునుయ్యాలచాడ్పున ద్వైధీభూతం బయినచిత్తంబు నిలువరింపనేరక యాసభకు వచ్చుచు మగిడిపోవుచుం గొంత తడవు గడపి యెట్టకేలకుఁ గట్టకడఁ గట్టెఁడయై యవ్విజనారణ్యమున నాదమయంతి నొంటిగ విడిచి యడలుచుఁ బాఱిపోయె.

అంత దమయంతి మేల్కని పతిం గానక భయశోకవ్యాకులచిత్తయై హామహారాజా! హాప్రాణనాథా! నన్నేల విడిచెదవు? ఈ విజనారణ్యమున భయం బయ్యెడి. హతనైతి. వినష్టనైతి. అత్యంతానురక్త యగుభార్య నడవిలో విడువఁగ సర్వధర్మజ్ఞుఁడ వయిననీకుం దగునే? లోకపాలుర సన్నిధానంబునఁ బలికినబాసలనెల్లఁ దప్పఁగ సత్యవ్రతుఁడ వగునీకుఁ బాడియే? అక్కటా! మనుష్యుల కకాలంబున మృత్యువు రాదు. కాకున్న నిన్నెడఁబాసి ముహూర్తంబైన నాకు జీవింపఁ గలుగునే? నిక్కంబ నే నిట్లూహింపరాదు. నవ్వుటాలకు డాఁగియుందువుకాని కరుణఁ బోనాడి నను విడనాడుదువే? ఇఁకఁ బరిహాసంబు వలదు. కడు వెఱచియున్నదాన. వేగంబ నయనానందమ్ముగా దర్శనమ్ము దయసేయుము. తీఁగగుబురుల డాఁగి నామాటల కేల మాఱుపల్కవు? దురంత చింతాక్రాంత నైన నన్ను డాయక, యూఱడింపక యునికి క్రూరకృత్యంబుగదా? నావగ యంతయు నాత్మార్థంబుగాదు, మఱి నీ వొంటరివై యెట్లు చరింతువో యని యెంతయుం గుందెద. సాయంకాలమున క్షుత్పిపాసల నోర్వలేక డస్సి వృక్షమూలములఁ జేరి ననుం గానక యెట్లు వర్తింతువో యనివగతు. ఎవ్వని పృథాకపట కృత్యమున నాప్రాణనాథున కిట్టివనట వాటిల్లెనో వాఁడు కడు నిడుమలఁ బడునని పలుమాఱు లాక్రోశించు. ముండ్లను, ఱాలును సోఁకఁగ నెగరిపడు. వెలవెలనై క్రిందఁబడు. బెదరిచూచు. నీ రంధ్రధారాసంపాతంబుగఁ గన్నీరు నించు. వేఁడి నిట్టూర్పులనిగిడించు. వెఱ్ఱిదానిపోలె నసంబద్ధంబులు వాక్రుచ్చు. హామహా

రాజా! యని యిటునటుం బరుగులెత్తు. ఇక్కరణి నక్కాంతారంబునఁ బలుదె అంగుల నేడ్చుచు మగని వెదకుచున్న యాదమయంతిని మహాకాయం బైన యొక్క కొండచిలువ మ్రింగవచ్చి పట్టుకొనియె. పట్టుకొనినం దమయంతి హానాథ! యివ్వనంబున నీపెనుఁబాము ననుఁ బట్టికొనియె. ఇంకనైన నేల యరు దేరవు? నను విడిచి యెటకుఁ బోయితివి? శాపముఁ బాసి క్రమ్మఱ వివేకమును, ధనములనుం బొరసినపదంపడి నాయెడఁబాటు నెట్లు సైరింతువొ? ఇపుడు నీబ డలిక నుడుపువా రెవ్వ రని తనవంత నంతగఁ జింతింపక పతియలయికనె దలం చుచు వందురుచుండె. ఆమొఱ నాలించి కిరాతుఁ డొక్కరుఁ డక్కానఁ జరించు వాఁడు వైళంబ చనుదెంచి తనచురకత్తిచే నాకొండచిల్వకుత్తుకఁ ద్రెవ్వ నఱికి దానిం దప్పించి దమయంతికిఁ బాదప్రక్షాళనంబుఁ జేసి యూరార్చి ఫలమూల ములఁ గుడువ నిచ్చికొండొకవడి యూరకుండి యోమృగేక్షణా, నీ వెవ్వతె వేల యివ్వనంబునఁ గ్రుమ్మరియెద వేకారణంబున నిట్లు శ్రమంపడియెద వనియడిగి యాసాధ్వివలనఁ దదీయవృత్తాంత మంతయుం దెలిసికొనియె.

దమయంతిశాపమునఁ గిరాతుఁడు చచ్చుట.

తెలిసికొని యాచంద్రముఖి సర్వాంగసౌందర్యమున కచ్చెరువడి మదనవి కారగోచరుండై మెల్లన నిజతాత్పర్యంబుఁ దేటపఱుప నాసతీమణి రాజ్యము గోల్పడి పతినెడఁబాసి కడు నడరునది వానిదురభిప్రాయంబునకుఁ గినిసి జ్వలితహు తవహశిఖవడువున దుర్నిరీక్ష్యయగుటయు నప్పాపాత్ముఁడుం గోపాటోపదీపితుండై చెనకం దలంచె. అంత నప్పరమపతివ్రత రోషరూషితస్వాంతయై నలుని దక్క మఱియొక్కమగవాని నేను మనంబుననైన దలంపనేని యిద్దురాత్ముండు చచ్చు నని శాపం బిచ్చినఁ దత్క్షణంబ యాకిరాతుఁ డగ్నిదగ్ధమహీరుహంబుపగిది మృతుఁడై నేలఁ గూలె. అట్లాదురాత్ముండు ఫాలియుటయు సింహవ్యాఘ్ర మహిషవరాహాదిక్రూరమృగనీరంధ్రంబును, మ్లేచ్ఛతస్కరసంకీర్ణంబును, దారుణ పిశాచోరగరాక్షసభీషణంబును, నానావిధతరునికరనిబిడంబును, సరోవాపీతటాక నదీనిర్ఝరభరితంబును, గుహాబహుళంబును, నానాపక్షిగణాకీర్ణంబును నగునా ఘోరకాంతారంబున నాదమయంతి శోకావేగవ్యాకులయై యంతటం బఱి నన్వే షించునది యొక్కశిలాతలంబుఁ బ్రాపించి హానిషధనాథ! నన్ను విడిచి యెట కరిగినవాఁడవు? అశ్వమేధాదియాగముల యథోక్తంబుగ నాచరించినపరమపుణ్య మూర్తి యగునీకు నాయెడ మిథ్యాప్రవర్తనంబు తగునే? "నీకంటె నాకు వేఱొ క్కర్తు ప్రియురాలు గాదు నిను విడువ" నని మున్ను నాకొసంగినబాసను, హంసల వచనంబునుం దలపోయవలదే? సాంగోపాంగంబు లయిననాల్గువేదములఁ జదువు టయు సత్యవచనం బొక్కటియు నొక్కరూపకాదె? ధర్మజ్ఞుఁడ వయినసీకు

సత్యము విడుచు టుచితంబె? దారుణాకృతి యైనయీసింహము నోరుదెఱచి నను మ్రింగఁ జూచుచున్నది. దయచేసి కావుము. నీవియోగమున వెఱ్ఱినై కృశించి దైన్యమున నిట్లడలుదాని, భవత్ప్రాణపదం బైనదాని, వస్త్రార్ధము గట్టినదాని, గుంపుచెదరి యొంటిగఁ జిక్కి బెదరు చూపులఁ జూచు లేడిమాడ్కిఁ జిత్త మొకతెఱంగునైన నిలువరింపనేరక బమ్మరించుదాని నూరార్ప వలదే? వీనులవిందుగా నాకు మాఱుమాట నొసంగరాదే? ఈదారుణారణ్యంబున సర్వాంగసుందరుఁడు కులశీలసంపన్నుఁడునగునిన్నుఁ గన్నులార నెన్నఁడు గనుంగొనుదు? ఏమహానుభావుఁడు నాకుయ్యాలించి "వీఁడె నీమగఁడు నలమహీపతి యిట నున్నవాఁ" డని ప్రత్యుత్తరం బొసంగునొ? ఆమధురవచనామృతంబు వీనుల నెన్నఁడు గ్రోలఁ గలనో? ఇదె క్రోల్పులి యెదు రయ్యెడి. దీని నడిగెద నని యూహించి మృగేంద్రా, నీ వీయరణ్యంబునం గలమెకములకు రాజవుకదా? నేను వైదర్భిని. నలపత్నిని. పతి నెడఁబాసి యతని నెమకుచున్నదాన. అమ్మహారాజుం జూచితివే? చూచినం జెప్పుము. కాదేని నను మ్రింగి యీయడలు వారింపు మనిపలికి యంతఁ గటకటా! యిది నన్నూరార్పదు. స్వాదుసలిలపూరిత యగునీనది దాఁటి, యున్నతశిఖరముల నొప్పారి యిమ్మహావనమ్మునకు ధ్వజంబువోలె వెలుంగుచు సకలతరునికరముల సాంద్ర మయినయీపర్వతముఁ జేరఁ జని దాని నడిగెద నని యెద నుత్సహించి యాగిరిని డాసి పర్వతవర్యా! శరణాగతరక్షణపరాయణా! నీకు మ్రొక్కెద. నేను సకలగుణవిలసితుం డైనవిదర్భరాజుకూఁతురను. నిషధపతి యగువీరసేనునికోడలను. పుణ్యశ్లోకుఁ డైననలమహీపతిభార్యను. త్యక్తధననై భర్త నెడఁబాసి యతని వెదకుచున్నదానను. ఈపరిసరారణ్యమున నామగఁడు నీకుఁ గన్పడెనే? అతఁడు దీర్ఘబాహుఁడు. ధీమంతుఁడు. గజేంద్రవిక్రముఁడు. మహావీరుఁడు. ఇట మెలంగిన నింగి నొరయునీ శృంగశతమున కగపడుంగదా యనియడిగి యందులకుఁ బ్రత్యుత్తరమురామికిఁ గడు వనరి గిరివరేణ్యా, విలాపమున విహ్వలించుదాని నన్నేల యాశ్వాసింపవు? నీబిడ్డనుగఁ దలంపరాదో? మేఘగంభీరనినదంబు పెంపార నింపుగాఁ బలుకు నాప్రాణనాథునివదనారవిందంబు వెడలి యమృతమధురతం దిరస్కరించునట్టి "యోవైదర్భీ" యనునొకపలుకు నెప్పుడు వినఁ గాంతునో? యని మొఱపెట్టుచు నాకొండ దాఁటి యుత్తరముగ మూఁడహోరాత్రము లరిగె. అరిగి యొకముని పల్లియఁ జేరి యందు వసిష్ఠభృగ్వత్రిసములు, నియతవ్రతులు, జితేంద్రియులు, శౌచపరులు, వాయుభక్షులు, సలిలభక్షులు, పర్ణభక్షులు, వల్కలాజినాచ్ఛాదనులు నగుమహామునులం గనుంగొని యిది ఋష్యాశ్రమంబు. ప్రసన్నవర్తనంబు. ఇట మునుల సేవించిన భర్తృవృత్తాంత మెఱుంగ నగు నని భావించి యాఱడిల్లి

యాశ్రమంబులోనికిం జొచ్చి తపోవృద్ధు లగుమహామునులకు మ్రొక్కి వినయమ్మున నుపాసించియుండ వారు స్వాగతం బడిగి యథాన్యాయముగ నాదమయంతిని సత్కరించి కూర్చుండం జెప్పి మే మేమి చేయవలయు ననియడిగిరి. అడుగుటయు వైదర్భి మహానుభావులారా, భగవంతులతపోగ్నిహోత్రధర్మాచరణంబులు క్రమంబునం బెంపారునే? ఆశ్రమమృగవిహంగమాదులకుం గుశలంబె? యని ప్రశ్న సేయ వా రన్నిటం గుశలంబ యనిచెప్పి నీ వెవ్వతె వేమి చేయం దలంతువు. నీరూపంబును, గాంతినిం జూచిన నెంతయు నాశ్చర్యం బయ్యెడి. ఇవ్వనము దేవతవొ? నదీదేవతవొ? ఎఱుంగం జెప్పుము. ఏల వాపోయెదు? నీయట్టివారికిని శోకంబు గలుగునే? ఊఱడిల్లు మనిన విదర్భరాజాత్మజ వారి కిట్లనియె.

మహర్షులారా, నేను వనగిరినదీదేవతలలో నెవ్వతెనుం గాను. మఱి మనుష్యవనితను. అంతయుం దపోధను లగుమీకు విదితంబుగాకున్నే? ఐనను సవిస్తరంబుగ విన్నవించెద. చిత్తగింపుఁడు. నేను విదర్భదేశాధిపతి యగుభీమరాజుకూఁతురను. నిషధదేశాధినాథుం డైననలమహీపాలునిభార్యను. దమయంతి యనుపేరంబరఁగుదానను. నాప్రాణనాథుం డతిసుందరుండు, మహాతేజుండు, మహాబలుం, డతిశూరుఁడు, శత్రుదమనుఁడు, ధర్మవిదుఁడు, సత్యవ్రతుఁడు, దేవబ్రాహ్మణపూజాపరాయణుండు, వేదవేదాంగపారగుం, డాచరితానేకమఖుఁడు, శతమఖతుల్యుఁడు. ఉక్కివులై నకితవులు పిల్వంగం బోకునికి పౌరుషంబుగా దని వెనుదీయక జూదం బాడి దాన రాజ్యంబును, సర్వస్వంబునుం గోల్పోయి యడవులకు నాతోడ నేతెంచి యొక్కచో బడలి యొడ లెఱుంగక నేం గూర్కుచుండ నెట కేనియుం బాఱిపోయె. నే నమ్మహాత్ముని నెమకుచు నడవులం గొండలం గోలంకుల నేఱులం ద్రిమ్మరుచున్నదాన. అతం డీతపోవనంబునకు వచ్చి భగవంతులసాదరానుగ్రహావలోకనంబులకుం బాత్రుం డయ్యెనే? ఇఁకం గొన్నినాళ్లకతనిం జూడనేని యవశ్యంబుగ నొడలు విడుతు. అప్పురుషవరేణ్యుం బాసిన నీజీవితంబు నిరర్థకంబుగాదె? అని యెంతయు. విలపించుచున్నదమయంతి కత్తాపసు లిట్లనిరి. కల్యాణీ, నీకుం గొన్నిదినములలోన మేలు చేకూఱెడు. యోగదృష్టిం జూచితిమి. కొన్నినాళ్లలో నలు నిడుమలం బాసి సకలశుభంబు లనుభవించువానిం గాంతువు. శోకం బుడుగు మనిచెప్పి వా రగ్నిహోత్రాశ్రమంబులతోడ నదృశ్యులగుటయు నలమహీపతిపత్ని యందుల కెంతయు నివ్వెఱగంది యిది కలయో? నిక్కంబో? నిక్కంబయేని యాతాపసులేరి? ఆయాశ్రమమేది? ఆనదియెయ్యది? అనిచింతింపుచు నొండొక్కయెడకుం జని యొక్కరమణీయాశోకమహీరుహంబుం గనుంగొనియె. కనుంగొని యక్కటా? యిక్కాననంబున

నీయశోకంబు పలుజొంపంబులఁ బర్వతంబువోలె శోభిల్లుచున్నయది. అని యద్దానిం గుఱించి యశోకమా! నాజీవితేశు నలుం జూచితే? అతండు వీతశోక భయుండు, శత్రునిబర్హణుండు, సుకుమారగాత్రుండు, వస్త్రార్ధంబుఁ గట్టికొని యివ్వనంబునఁ ద్రిమ్మరుచున్నవాఁడు. నీయశోకనామంబు సార్థకంబుగాఁగ నతని గతిం దెలిపి నను నశోకఁ జేయు మని డగ్గుత్తిక వడ వెడవెడనుడువులు నుడివి కన్నీరు జాలువాఱ నమ్మహీరుహంబుచుట్టుం దిరిగి యట ననేకపర్వతంబులను, నానామృగపక్షులను, బెక్కునెత్తమ్ములనుం జూచుచుఁ బ్రియగవేషణవాంఛమైఁ బెనుద వ్వరిగి ప్రసన్నసలిలంబు, హంసకారండవాదిపరివృతం, బత్యంతరమణీయంబు నగునొక్కనదిం దాటుచున్నదాని, హస్త్యశ్వరథసంకులంబైనదాని, నొక్కసాతుం గని దాని డాయఁ జనియె. శోకావేగంబునఁ గృశించి చెన్ను దఱిఁగి వెఱ్ఱిమై యున్నదానిఁ, బరాగరూపితకేశయగుదాని, వస్త్రార్ధసంవృతమై నదాని, దమయంతిం జూచి యావణిగ్జనసమూహంబునం గొందఱు వెఱచి పాఱిరి. కొంద ఱంతయుం జింతించిరి. కొంద ఱసూయపడిరి. కొందఱు కరుణించి యమ్మా, నీ వెవ్వతెవు? ఇవ్వనంబున నేల భ్రమ్మరియెదవు? నినుఁ జూడఁగనే మనముల వగ యయ్యెడి. వనదేవతవో? గిరిదేవతవో? దిగ్దేవతవో? రాక్షసివో? దివ్యాంగనవో కాని కేవలమనుష్యవనిత వనితలంపరాదు. నిక్క మెఱింగింపుము. నిను శరణుఁజొచ్చితిమి. మమ్ముఁ గావుము. ఈసార్థము వేగమ యిచ్చోటు వాసి క్షేమమున నిజదేశంబుఁ జేర ననుగ్రహింపు మనిన దమయంతి వారికిఁ దనవృత్తాంతం బంతయు వివరించి నలు నెచటనైనఁ గంటిరే? ఈచనుప మెటకుఁ బోవు ననియడుగ నందు బేహారులనాయకుఁడు శుచియనువాఁ డిట్లనియె. అవ్వ, యివ్వనంబున సింహశార్దూలాదులం జూచుచున్నవారమకాని నలుని విలోకింపము. ఇంతేల? నిన్నుఁదక్క వేఱొక్కమనుష్యవ్యక్తినే గాంచము. ఈచనుప చేదిదేశపతి యగుసుబాహునిపురంబునకు లాభార్థంబుగ నరిగెడి. యక్షనాథుఁ డగుమణిభద్రుఁడు మాకుఁ బ్రసన్నుఁ డవుత మనిన విని దమయంతి యాసాతుతోడం బోవుచుండె. సాతువారుం దారుణారణ్యమున నరుగుచు నొక్క నాఁడు కడు నెండ యెక్కునంతకు నడిచి బడలి పుష్పితఫలితతరునికరపరీత తీరవిరాజితంబు, శీతనిర్మలస్వాదుసలిలంబు, మధురవిహంగకూజితరమణీయంబు, తృణాదిపదార్థసమగ్రపరిసరప్రదేశంబు నగునొకచెఱువుం గనుంగొని నాఁడెల్ల నచ్చట నుండం దలంచి దానిపడమటిగట్టున విడిసిరి. ఆనాఁటినడురేయి వారం దఱుం గడుఁ బడలి కూర్కుచుండ వన్యమదగజంబులు కొన్ని నీరు ద్రావ నచ్చటికి వచ్చి సాతునం గలయేనుంగులం గనుంగొని వానిం గీలడంపం బూని పర్వతాగ్రంబులనుండి డొల్లుశిఖరంబులనుఁబోలె పాదఘట్టనధ్వానంబు నిగుడ వేగంబ

పఱతెంచి తెరువున నడ్డముగ నిద్రింపుచున్నచనుపవారలం గాంచి మదంబునఁ గొందఱఁ గొమ్ములఁ జిమ్ముచుఁ, గొందఱఁ దొండమ్ముల గండడంచుచుఁ, గొందఱఁ గాళ్లం జమలుచుండ వెఱచి కొందఱు చిందఱవందఱలై పాఱిరి. కొంద ఱీరమ్ముల డాఁగిరి. కొందఱు దిక్కుదోఁచక పరువు లిడువా రొండొళ్లం బిట్టు దాఁకి వికలాంగు లైరి. కొందఱు ఘోరముగ నఱచుచు నేలఁ గూలిరి. కొందఱు మ్రాఁకులఁ బ్రాఁకువారు తొట్రుపాటున విషమప్రదేశంబులంబడి మడిసిరి. కొందఱు గజయూథం బిది ప్రళయాగ్నివోలె నేఁచుచున్నది. ఎట్లయినం బాఱి ప్రాణముల డాఁచికొనుఁ డని యార్తనాదము లొనర్చిరి. కొందఱు రత్నరాశి యిది విశీర్ణ మయ్యె నేఱుఁడు. దీని విడిచి పోవలదు. ఇది యందఱకును సాధారణధనంబుగాదె? యని కేకలు వేసిరి. ఇవ్విధమున నాచనుపయంతయుఁ జెల్లాచెదరగుటయు వైదర్భి యేనుంగులబారి దప్పి నిద్రమేల్కాంచి లోకభయంకరంబైనగజయూథవిచేష్టితంబునకు వెఱచి వెలవెలవోయి నిట్టూర్పులు నిగిడించె. ఆసార్థమున హతశేషు లగుబేహారులు గుమిగూడి పుత్రమిత్ర పితృభ్రాతాది వినాశమునకు వగచి కొంద ఱిది యేల వాటిల్లె? ఏకర్మముఫలంబో? మనము యక్షనాయకుఁ డగుమణిభద్రుని, గుబేరునింబూజింపమైతిమి. శకునముల విచారింపమైతిమి. పరికింప నిది తత్ఫలంబ. గ్రహము లిపుడు ప్రతికూలములుగా నున్న నిట్లుకాఁ గతంబు వేఱొండు గలుగునే? యనివితర్కింపుచుండిరి. కొందఱు గజయూథమున స్వజనాపాయంబును, ధనవినాశంబునుం దలపోసి దీనులై యిందుకుఁ గారణం బూహించితిమి. ఎట్లనిన వెఱ్ఱిదానిపోలె వికృతాకార యైనయొక మగువ మనతోడ వచ్చుచున్నదిగదా. అది రాక్షసియో? యక్షియో? పిశాచియో? గావలయు. దానిచేసినమాయయే యిది. అప్పాపకారిణి యగపడెనేని లోష్టలగుడతృణపాంసుముష్ట్యాదుల నవశ్యంబు వధింత మని తెంపునఁ బల్కుచుండిరి. వారిదారుణవచనంబు విని నిషధరాజపత్ని లజ్జావిషాదభయంబులు పెనంగొనంగ నడవినడుమం జొచ్చి యాత్మగతంబునఁ గటకటా? విధి నాపైనింతదారుణముగ నేల కినిసెనో? తొల్లి యేకర్మంబుఁ జేసితినో? ఒకప్పుడైన నెక్కనికేనియు నొక్కింతయైన నెగ్గు నీజన్మమున మనోవాక్కాయకర్మంబులఁ జేసినదానఁగాను. తీఱరానియాపద యయ్యె. పతిరాజ్యంబుగోల్పాటు, ప్రాణనాథునియెడఁబాటు, స్వజనులలో నవమానంబు, బిడ్డలకు దవ్వగుట, యనాథనై యడవిలో నుండుటయనునివియే నన్నుఁగాఱింపఁజాలు. ఈయపవాదంబుగూడ రావలయునే? ఈసాతులో నిందఱు గజయూథమునఁ బొలివోవుటయు నాదౌర్భాగ్యంబుననె సంభవిల్లె. ఇంకను నాకు దుఃఖానుభవం బింతకంటె నెక్కుడుగఁ గలుగుఁగాఁబోలు. కాలము దీఱకున్న మనుష్యులకుఁ జావు రాదను పెద్దలమాట

తప్పదు. ఇందఱుఁ జంపినయేనుంగులు నన్నె యుంగలేవయ్యెఁగదా. మనుజులు సుఖ దుఃఖంబుల దైవచోదనచే ననుభవింతురు. చిన్ననాఁడేనియు నే నెక్కడేనియుఁ దప్పు చేసియుండను. స్వయంవరార్థంబు వచ్చినలోకపాలుర నిరాకరించి నలనృప లునివరించుటకుఁ గినిసి వారు నా కీయిడుమలనెల్లఁ గావించిరి కాఁబోలు ననివ నరుచుండె.

దమయంతి సుబాహుపురంబుఁ బ్రవేశించుట.

అట మఱునాఁడు హతశేషు లయినబేహారులును, గొందఱు వేదపారగు లగుబ్రాహ్మణులుం దఱల వారితోడం బ్రయాణమై విదర్భరాజపుత్రి యొక్క నాఁటిసాయాహ్నమునఁ జేదిపతి యగుసుబాహునిపురంబుఁ జేరి తనరూపవేష ములకు విస్మితు లయినపౌరబాలురు వెంబడించిరాఁగ రాజమార్గంబున నగరు దరియఁ బోవుచుండె. వెలవెలనై చెన్ను దఱిఁగియున్న నెమ్మొగంబు, వస్త్రార్థప్ర వృతం బగుచిక్కినయొడలు, ముడివీడినపెన్నెఱులుం గలిగి వెఱ్ఱిదానిపోలె నున్న యన్నిషధేశపత్నిం గనుంగొని మేడపై నున్నరాజమాత దాదిం బిలిచి చూచితే! ఈయంగన యెవ్వతెయో వేషంబుఁ బరికింప వనటలకుఁ బాత్రం బైనప్రకా రంబు, రూపంబు నరయ శ్రీమాడ్కి నగరెల్ల వెలింగించుటంజేసి దుఃఖానర్హ యగునుత్తమవనితవిధమునుం దోఁచెడి. జనంబు లయ్యంగనం జుట్టుకొని వేచు చున్నవారు. అందఱ వారించి యత్తన్విం దోడ్తెమ్మనుటయు నది తత్క్షణంబ దమయంతిందోడ్తెచ్చె. అట రాజమాత తదీయరూపంబునకు నివ్వెఱఁ గంది భైమిం జూచి సాధ్వీ, నీ వెవ్వరిదానవు. మొయిళులనడుమఁ గ్రొమ్మెఱుంగు తె అంగున నీజనబృందంబునం దుత్తమరూపంబున వెలింగెదవు. దుఃఖభాజనంబయ్యు భూషణరహితంబయ్యు నసదృశకాంతిసహితం బైననీరూపంబు మనుష్యవనితా సామాన్యంబు గాకున్నయది. వెండియు నెక్కర్తువయ్యు జనకదంబంబునకు వెఱ వవు. అన్నియుం బరిశీలింప సురసుందరివౌదో? యనుతలంపు గూరెడి ననిన దమయంతి యిట్లనియె. నేమనుష్యవనితను. సకలగుణసమృద్ధుండు, గడు నను రక్తుఁడు నగునామగఁడు దైవచోదనం జూద మాడి యోడి యేకవస్త్రుండై యడవికిఁ బోవఁగ నేనుం దోడినీడవోలె నమ్మహాత్ము నాశ్వాసింపుచు వెంబడించి యరిగితి. అట నెక్కనాఁ డతం డొకటి క్షోర్వలేనివాఁ డొకానొకకారణంబునఁ దనకట్టినపుట్టంబుసైతము నీఁగికొని వెడగువడువున నడవులం ద్రిమ్మరుచుండ నేను గంటికి ఱెప్పచాడ్పున నెల్లప్రొద్దు నతనిం జూపెట్టుకొనియుండి యొక్కనాఁడు కడుబడలి యొడ లెఱుంగక కూర్కుచుండ నతఁడు నాకట్టుఁగోకను సగముఁ జించికొని నిరపరాధ యగుననుఁ గనుఁబ్రామి యెటకేనియుం బాఱిపోయె. వర్ణ నీయసౌందర్యంబున సురల కెనయైనప్రాణనాథుని విరహానలంబునం గ్రాఁగుచుఁ

గాయలు గడ్డలు నశనంబుగాఁ, బ్రొద్దుగ్రుంకినచో టునికిపట్టుగాఁ గొని సైరంధ్రీవేషమునఁ ద్రిమ్మరుచున్నదాన నని కన్నీరు నించుచు విలపింపుచుండ రాజమాత వైదర్భి నూరార్చి కల్యాణీ, నీమెడఁ గడుం బ్రీతి యయ్యె. ఇట నుండుము. మాబంట్ల నీమగని నెమక నియోగింతు. నీపతియు నెల్లచోట్ల నిచ్చమైఁ ద్రిమ్మరువాఁ డొకవేళ నిటకు నరుదెంచు. ఇటన మగనితోఁ గలయ నగు ననిన వైదర్భి యిట్లనియె. అవ్వా, నన్నిట నుంచికొనియెదవేని కొన్ని సంకేతంబుల కొడంబడవలయు. ఎట్లనిన. నే నెంగిలి గుడువను, కాళులు గడుగను. లాఁతిమగవారితోడ మాటలాడను. ఎవ్వఁడేనియు నన్నుఁ గోరెనా యామూర్ఖు నవశ్యంబు దండింపవలయు. పతిని వెదకుటకుఁగా బ్రాహ్మణులఁ జూచి సంభాషింతు. ఇందుల కొడంబడియెదవేని నీయొద్ద నుండు ననిన రాజమాత సంతసిల్లి యట్ల చేయుదు నని యియ్యకొని తనకూఁతు సునందయనుదాని రావించి వైదర్భిం జూపి పుత్రీ, యీపతివ్రత నీకు సైరంధ్రి యయ్యెడి. ఇయ్యది నయస్సున నీయీడుది. దీనితోడిచెలిమి నెఱపుచు సుఖింపు మని యన్నలపత్ని నప్పగించుటయు భైమి యాసునందతోడం బోయి దానికావించుసత్కారంబులఁ గొనుచుఁ బతిదర్శనంబ యెల్లపుడుం గోరుచుఁ గన్యకాంతఃపురంబున వసించియుండె.

అంత నక్కడ నలుండు దమయంతి నెడఁబాసి ఘోరాటవిం ద్రిమ్మరుచు ముందటఁ గాననంబెల్ల నేర్చుచున్నకార్చిచ్చుం గాంచి "యోపుణ్యశ్లోకా! నలనృపాలా! వేగర" మ్మను దీనారవం బొకండు పలుమాఱులు విన నగుటయు సహజకారుణ్యం బైనయానృపాలవరేణ్యుం డిదె యరుదెంచితి వెఱపు వల దనిపల్కుచు నద్దవదహనంబునడుమఁ జొచ్చి మేనెల్లఁ జుట్టఁ జుట్టుకొని పరున్నవాని నొకనాగరాజుం గనుంగొనియె. అతండును నలునకుఁ గేలుమోడ్చి యేను గర్కోటకుఁ డనువాఁడ. మున్ను నారదమహర్షి నాచేసినయపరాధమునకుఁ గినిసి స్థావరముపోలెఁ గదలకుండు మనిశపించి క్రమ్మఱ మత్ప్రార్థనంబునఁ గృతప్రసాదుండై యేనాఁడు నలుఁ డిటకు వచ్చి నిన్నెండొకయెడకుఁ గొంపోవు నానాఁడు నీకు శాపమోక్షం బగు ననియె. ఆశాపంబునంజేసి యొక్కయడుగైనఁ గదలనేరకున్నవాఁడ. నన్నెత్తికొనిపోయి దావరహితస్థలంబుఁ జేర్పుము. ఎత్తికొనిపోవఁ జులక నయ్యెద. పన్నగులలో నే నుత్తముఁడను. నీకుఁ జెలినై శ్రేయస్సాధనంబు నుపదేశింతు ననిన వల్లెయని నలుం డంగుష్ఠమాత్రరూపంబుఁ దాల్చినయాకర్కోటకు నెత్తికొని దవదహనరహితం బైనయెడకుఁ బోయి యప్పాపజేని విడువం దలంపుచుండఁ గర్కోటకుండు నలనృపాలా, యడుగుల నెంచుచు నింకం గొన్ని యడుగు లరుగుము. నీకు శ్రేయ మొడఁగూర్తు ననియె.

### నలుండు కర్కోటకునిచే దష్టుం డగుట.

నలుఁ డందుల కొడంబడి యట్ల పోవుచుఁ బదియవయడుగు నెంచుచుండ వానిఁ గర్కోటకుండు కఱచె. కఱచుటయు నలుఁడు దనరూపము వికృత మగుటకు విస్మయంబంది చూచుచుండ స్వరూపంబుఁ దాల్చియున్న కర్కోటకుం డూరార్చి మహీపతీ, నిన్ను లాఁతివా రెఱుంగకుండఁగ నీరూపంబు డాఁచితి. నిక్కృతిచే నీ క్కెగ్గుచేసినవాఁడు మదీయవిషమున నుడుకుచు నీయంద యుండి కొంతకాలంబునకు విషవేగంబు సైరింపఁజాలక విడిచిపోవువాఁడు. నిరపరాధుఁడు, దుఃఖానర్హుఁడు నగుని న్నడలించుటం జేసి యీసున వాని కెగ్గుఁ గావింపఁ గోరి నిన్నుఁ గఱచితి. దీన నీకు రక్ష యగు. శార్దూలాదిక్రూరమృగ, శత్రు, విషాది భయంబులు మత్ప్రసాదంబున నీకుఁ గలుగవు. రణమున గెలుపు గలుగు. ఇఁక బాహుకుఁ డనుపేరు పెట్టుకొని యయోధ్యకుఁ జని యిక్ష్వాకుకులజుం డయిన ఋతుపర్ణమహీపాలుం గని యతనికి సారథివై యుండుము. అక్షవిద్యానిపుణుఁ డగునతండు నీయిచ్చునశ్వహృదయంబునకు మాఱుగా నక్షహృదయంబు నీ కుపదేశించి చెలిమి నెఱపువాఁడు. అవ్విద్యను నేర్చినపదంపడి దారపుత్రరాజ్యములఁ బడసి మేలు గాంతువు. మఱియు వస్త్రయుగం బొసంగెద. స్వరూపంబు గ్రహింపఁ దలంపు గూరునెడ నన్ను స్మరించి యీవస్త్రయుగము ధరింపుము. స్వరూపప్రాప్తి సంభవించు ననివచించి యావస్త్రముల నొసంగి కర్కోటకుం డదృశ్యుం డయ్యె.

### నలుం డయోధ్యకుఁ బోయి ఋతుపర్ణునియొద్ద నుండుట.

పదంపడి నలుఁడు కర్కోటకవచనప్రకారంబునఁ బ్రయాణముచేసి పదియవనాఁ డయోధ్యఁ జేరి ఋతుపర్ణునొద్దకుఁ బోయి మహీపాలా, నేను బాహుకుఁ డనువాఁడను. అశ్వశిక్షణంబున నాకు సమానుఁడు పుడమి నెవ్వఁడు నుండఁడు. పెఱవారికంటె నెక్కుడుగఁ జాతుర్యంబున నన్నంబు సంస్కరింతు. కార్యసంకటముల నాతోడ మంతనంబుండన నేర్పునం దగుదాని బోధింతు. లోకమునం గలశిల్పముల, మఱియు నితరదుష్కరకృత్యంబులను సాధింపఁ బూనుదు. నన్ను భరియింపు మనిన విని ఋతుపర్ణుండు బాహుకా, యిచ్చట నుండుము. మేలయ్యెడి. నీచెప్పినపనులం జేయుము. అన్నింటిలోన నాకు శీఘ్రయానంబునఁ బేరాశ గలదు. కావున మదీయాశ్వముల నతిశీఘ్రగమనంబులుగ నలవరింపుము. నూఱుసిగద్యాణంబులఁ బ్రతిమాసంబును నీకు జీతముగనిత్తు. వార్ష్ణేయజీవలు రెల్లపుడు నిన్ను సేవించువారు. వారితోడ వేడుకమై మెలంగుచు నాయొద్దన యుండుమని సత్కారపూర్వకంబుగఁ జెప్పఁజెప్పె. అంతట నలుఁడు బాహుకుఁ

డనంబరఁగి ఋతుపర్ణునిమది కించునట్లు హయశిక్షణంబు, నన్నసంస్కారంబునుం జేయుచు నచట వార్ష్ణేయజీవలసహితుండై యుండి దమయంతిం దలంచుచుఁ బ్రతిదినంబును సాయంకాలమునందు

“క॥ అది యాఁకలి డప్పియుఁ బె। ల్లొదవం గడు బడలి యెచట నుత్తలపడుచు। న్నదొ యిపు డానిర్భాగ్యు । న్మదిఁ దలఁచుచు నెవనిప్రాపున న్మెలఁగునొకో॥”

అనుపద్యంబుఁ బఠింపుచుండె. అంత నొక్కరేయి జీవలుం డాపద్యంబుఁ బఠించువాని, బాహుకవేషంబున డాఁగియున్నవాని, నలు నిర్దేశించి బాహుకా, నిత్యంబు నిట్లు చదివెదవు. ఆయువిద యెవ్వరియది? ఏల దానిం గుఱించి యుమ్మలించెద వనియడుగ నలుం డిట్లనియె. మందమతి యొక్కరుం డొకానొకనిమిత్తమునఁ గానలకుఁ బోయి కడు ననురాగమునఁ దోడ నరుదెంచినతన యనుఁగునిల్లాలి నొకకారణంబున నెడఁబాసి శోకవిహ్వలుండై దేశములనెల్లఁ ద్రిమ్మరువాఁ డొకచోటు చేరి యెల్లప్రొద్దును దానిన తలంపుచు నీపద్యంబుఁ జదువుచుండె. అక్కటా! యానిర్భాగ్యుండు విడువఁగ నది మేనఁ బ్రాణములఁ దాల్చియున్నదో? లేదో? క్రూరమృగప్రచారదారుణం బయినయాకాఱడవిం ద్రోవల నెఱుంగనేర్చునే? క్షుత్పిపాసల కోర్చి యచ్చట నొంటి దక్కి యొంటిగఁ జరింప నోపునే? ఇది తదీయవృత్తాంత మని జీవలునకు మఱుఁగుగాఁ జెప్పి నలుఁ డచ్చట నజ్ఞాతవాసంబు నడపుచుండె.

**సుదేవుఁ డనుబ్రాహ్మణుఁడు చేదిపురంబున దమయంతి నెఱుంగుట.**

అంత నట విదర్భరాజు తనయల్లుఁడుం, గూఁతురు నడవికిఁ బోకకుఁ గడు నడలి బ్రాహ్మణులఁ బలువుర రావించి తనివిదీఱఁగ ధనము నొసంగి విప్రులారా! నలదమయంతుల వెదకుఁడు. వెదకి వారలఁ దోడ్తెచ్చినవారికి గోసహస్రంబు, ననేకాగ్రహారంబులఁ, బురంబున కెనవచ్చుపెద్దగ్రామంబును నొసంగువాఁడ. మఱియు వారిం దోడ్తేరనేరక యెఱింగి వచ్చి తద్వృత్తాంతంబు చెప్పినను వారికి వేయిమొదవుల నిచ్చెద నని పెక్కండ్రం బుత్తెంచుటయు నందఱుం బురరాష్ట్రాదులం దిరిగి నైషధుం, దమయంతిం గానక మగిడి వచ్చిరి. అందు సుదేవుఁ డనువాఁడు దేశములనెల్లం గ్రుమ్మరుచుఁ జేదిరాజధాని కరిగి పుణ్యాహవాచన సమయంబున నచ్చటివిప్రులతోడ నగరు సొచ్చి ధూమజాలపరీతహుతవహప్రభ వోలె మందవిద్యోతం బై నరూపంబున నొప్పారుచు సునందచెంగటం గూర్చున్నదాని దమయంతిం గాంచె. కాంచి యావిప్రుం డాత్మగతంబున నిత్తన్విం జూడఁ దొల్లి చూచినతెఱఁగు దోఁచెడి. ఈవరవర్ణినీరత్నంబు రతిదేవిచాడ్పున లోకోత్తరసౌందర్యంబునకుఁ దావలంబయ్యు, శ్రీదేవికై వడి నిజవిమలకాంతిచే

దెసలనెల్లఁ జీఁకటుల విరియించుచుఁ దేజరిల్లునదియయ్యుఁ, బూర్ణచంద్రప్రభ మాడ్కి సకలలోకనయనానందకారిణియయ్యుఁ, బతివిరహవిషాదంబునంజేసి రాహుగ్రస్తనిశాకర యగుపూర్ణిమారాత్రిపగిది, శుష్కసలిలపూర యగునది వడువున, నేనుఁగుతొండమునం జిక్కి ఱేఁకులు రాలఁగఁ, నంచలుందొట్టిపులుఁగులుం బాఱఁగ వ్యాకులం బైనకమలినికరణిఁ, బెల్లగించి కొలను దప్పించి గట్టునం బడవైవ బీఁటెండవేఁడిమికి వాఁడినమృణాళివిధంబునఁ, గ్రొక్కాఱుమొయిళ్లుగప్పినయభినవచంద్రరేఖరీతినిం జెన్నుదఱఁగి, తొడవులఁ దొడుఁగుట మాని, భోగంబుల విడనాడి, తనకుం గూర్చుననుంగుఁజుట్టలతోడి మెలంకువలఁ దొఱంగి, దైవదుర్విపాకంబున విదర్భసరోవరంబు వెలువడి మలపంకానులిప్త యగుమృణాళినా నెన్నఁదగి పతిదర్శనకాంక్షంజేసి యెట్లో మేనఁ బ్రాణముల ధరించియున్నయది. లక్షణంబు లన్నియుం బరికింప నిక్కంబ యిది దమయంతియ. నేఁ డీసతిం గనుంగొని కృతార్థుండ నైతి. పడఁతులకు మగఁడకాదే మేలితొడవు. వాని నెడఁబాసి యిప్పతివ్రత పోడిమిచెడకయున్నె? ఆనిషధనాథుం డీసతీరత్నంబువియోగంబు సైరించి యడలున రూపుసెడక యెవ్విధంబున మనియున్నవాఁడో? ఎల్లకాలంబు సుఖోచిత యగునీసుకుమారియుత్తలంపాటుఁ గనుంగొన నాదుడెందంబుసైతము కొందలంబందెడి. ఎన్నఁ డీశుభాంగి దుఃఖార్ణవంబు నీఁది కలువలఱేనితోడి రోహిణియుంబోలె నిషధనాథుతోడం గలిసి సుఖించునో? నలుండును మగిడి రాజ్యము సాధించుకొని తన కనురూప యగు నియ్యింతితోడికలయిక నీక నెన్నండు ముదంబునం బొదలునో? యుక్తవచనంబుల నిత్తన్వి నూరార్తు నని నిశ్చయించి సుదేవుండు దమయంతిని డాయంబోయి వైదర్భీ, నేను సుదేవుఁ డనంబరఁగినబ్రాహ్మణుఁడ. నీసోదరునకుఁ జెలికాఁడను. భీమరాజుపంపున విదర్భములనుండి నిన్ను వెదకుచు నిటకుఁ జనుదెంచినవాఁడను. నీతల్లిదండ్రు, లన్నదమ్ములు, బిడ్డలు నెలమి నున్నవారు. బంధువులు నీపోబడి నెఱుంగక యుమ్మలింపుచున్నవారు. నీతండ్రి ని న్నన్వేషింపఁగఁ బలువుర విప్రుల నెల్లదేశంబులకుం బనిచె. నే నిటకు వచ్చితి ననిన దమయంతి సుదేవుని సాభిజ్ఞానముగ నెఱిఁగి వేఱువేఱ దమవారికుశలం బడిగి విషాదపారవశ్యంబునఁ గన్నీరునించుచుండె. అట సునంద తత్ప్రకారం బరసి తల్లిపాలికిఁ జని యమ్మా మనసైరంధ్రి యెవ్వఁడే నొక్కపాఱుండు రాఁగ వానితోడం గొన్నిపలుకులు పలికి యేలొకో యేడ్చుచున్నయది. నాకుంజూడఁగ దానివర్తనంబు బంధుజనుల నెడఁబాసి వచ్చినరాజకన్యక తెఱంగుగాఁ దోఁచెడి. తెలిసికొనఁ దలంపు గలదేని వేగ రమ్మనిన విని సుబాహునితల్లి తటాలున దమయంతియున్నచోటికిఁ బోయి సుదేవుం బిలిచి యయ్యా, యివ్వనిత యెవ్వతె? బంధువుల నెడఁబాయఁ గతం

దేమి? శోకావేగంబున నిట్లు నిరూపింపరానియవస్థం దాల్చినదీని నెట్లెఱింగితివి? సర్వంబు వివరింపు మనియడుగ నాసుదేవుఁడు సుఖోపవిష్టుండై రాజమాత కిట్లనియె. ఈసాధ్వి విదర్భదేశనాథుఁ డగుభీమరాజుకూఁతురు. నిషధేశుఁ డగు నలమహీపతిభార్య. దమయంతియనం బరఁగునది. ఆనలుఁడు భ్రాత యగు పుష్కరునితోడ జూద మాడి రాజ్యంబును సర్వస్వంబునుం గోల్పడి యడవులకుఁ జనుటయు నీసతియుం దోడన యరిగె. అరుగుటయు నెచ్చోటను బోబడి తెలి యమింజేసి వారి నన్వేషింప భీమరాజునానతిమెయి మేము గొందఱము సకలదే శములఁ దిరుగుచున్నవారము. భాగ్యవశమున మీనగరునందు నే నిప్పతివ్రతం గనుంగొంటి. ఈమె కెనయగురూపవతులు మనుష్యవనితలలో నేరుం గన్పడరు. ఈసతిభ్రూమధ్యంబున విభవార్థంబుగఁ బద్మసదృశం బైనపుట్టుమచ్చను బ్రహ్మ దేవుఁడు నిర్మించె. పతివియోగనిమిత్తంబున శరీరసంస్కారములు మానుటంబట్టి యిపు డాలాంఛనంబు నంబుదావృతంబగుచంద్రబింబంబుచందంబున మఱికిపెల్లు నమఱుఁ గుపడియుండినను బదింబదిగఁ బరికించి దానిం గుఱికొని మసిగప్పిననిప్పు చొప్పున నెప్పుచున్నయీతన్వి దమయంతియే యనినిర్ణయించితి ననిన సునంద మఱికినంతనుం జక్కఁగఁ గడిగె. కడుగఁగ మొగులుబాసినజాబిల్లి తెఱంగున లెస్సగ వెలుంగుచున్నయాగుఱుతుం గనుంగొని నిక్కంబ యీతన్వి భైమి యనినిశ్చయించి సునందయు, రాజమాతయు నావైదర్భిం గౌఁగిలించుకొని ముహూర్తంబు కన్నీరు నించుచుండిరి. అటఁ గొంతసేపునకు ధైర్య మవలం బించి బాష్పము నడంచుకొని రాజమాత దమయంతి నుద్దేశించి పుత్రీ, మీ తల్లియు, నేనునుం దశార్ణదేశపతి యగుసుదామునికూఁతులము. అది విదర్భ రాజునకు సతి యయ్యె. నేను వీరబాహునకుఁ బత్నినైతి. చిన్ననాఁడు నిన్ను జనించినవెంటనే నాపుట్టినింటఁ జూచితి. ఇదియు నీపుట్టినయిల్లె. నాయైశ్వర్యం బును నీయదియ యనిపల్కుచుండ దమయంతి సంతుష్టచిత్తయై మాతృష్వసకు మ్రొక్కి తల్లీ, తెలియఁబడకుండినను మీయింట నిన్నినాళ్లు సురక్షితనై సుఖ ముంటి. ఇదియు నాకుఁ బుట్టినయిల్లే కావున నెంతకాలంబైన నుండఁ దగు. ఐన బిడ్డలం జూచి పెద్దకాలం బగుటంజేసి యిపుడు వారలఁ జూడఁ దలంచెద. తల్లిదండ్రుల నెడఁబాసి వా రెట్లుందురో? కావున నాకుఁ గూర్తువేని వేగంబ విదర్భపురంబునకుఁ బంపు మనిప్రార్థించె. ప్రార్థించుటయు నల్లేయని రాజమాత పుత్రున కెఱుకపఱిచి వానియానతిమెయి నాయితపడినమహాసైన్యంబు ప్రయా ణోచితపదార్థంబు లోడఁగూర్చికొని రక్షణార్థంబు తోడుపోవ నాదమయంతిం బల్లకింగూర్చుండ నియమించి విదర్భాపురమునకుఁ బంపె.

దమయంతియు శీఘ్రింబ కుండినవగరంబు సేరి యెలమి నున్నబిడ్డలం, దల్లిదండ్రులం, జెలికత్తెల, బంధులంగాంచి సంతసించి దేవబ్రాహ్మణులం బూజించె. భీమభూపాలుండును గూఁతుం దెచ్చినందుకు మెచ్చి సుదేవునకు గోసహస్రంబును, గ్రామంబును, నపరిమితధనంబును నొసంగె. అంత నామఱునాఁడు దమయంతి తల్లికడ కరిగి తల్లీ! నాఁబ్రదుకుఁ గోరెదవేని నలుని వెదకితేర జతనంబు సేయుము. అతండు గానరాఁడేని నాజీవితంబు నమ్మకుము. ఇంతయు నిక్కువం బనిన భీమ పత్ని యెంతయు నడలి పైపైఁగ్రమ్ముకన్నీటివెల్లువ నడంపనేరక యూరకుండు టయు నంతఃపురంబున హాహానినాదంబు లెసఁగె. అంతఁ గొంతవడికి రాజపత్ని ధైర్యంబున శోక ముడిపికొని భీమనృపాలుపాలికిఁ బోయి నరేంద్రా! నీకూఁతురు దమయంతి పతింగూర్చి యడలుచున్నది. విశేషమేల? సిగ్గుఁదక్కి తానే చెప్పుచున్నది. ఆపుణ్యశ్లోకు నన్వేషింపఁ దగువారలఁ బుత్తెంచు మనిన విదర్భ రాజు పెక్కండ్రవిప్రుల దెసలనెల్ల నెమకఁ బనిచె. అట్లావిప్రులు రాజుపంపునఁ దఱలువారు దమయంతియొద్దకు వచ్చి రాజనియోగంబు దెలుపుటయు నయ్యింతి వారి కిట్లనియె. విప్రులారా! మీరు వెదకుతఱి నచ్చటచ్చటఁ బలుమాఱు నీమాటలఁ జెప్పుఁడు. "కితవా! నాకట్టినపుట్టంబున సగము చించికొని నిదుర వోవుచున్నన న్నడవిలో విడిచి యెచ్చటికిఁ బోయితివి? అనురక్త యగుప్రియురాలిని బ్రియుండు విడుచునే? నీరాకనే ప్రతీక్షించి యానాఁటిమలినవస్త్రార్థంబునే గట్టుకొనుచు నీయెడఁబాటునకుఁ బెల్లడలుచున్నదాన. ఎల్లకాలంబు పత్ని పతికి భర్తవ్యయు, రక్షితవ్యయుం గాదె? ధర్మమంతయు నీయెడ నిపుడు విపరీత మయ్యె. జగద్విఖ్యాతుఁడు, ప్రాజ్ఞుఁడు, కులీనుఁడు, ధర్మవిదుఁడు నగునీవును నాదౌర్భాగ్యంబుననే నిర్దయుఁడ వైతివి. దయయే యుత్తమధర్మం బని నీవల ననే వినియుంటి. కావున నాయెడఁ గరుణింపు" మనివచింపుఁడు. మఱియు నామీఁద నతండు కరుణించురీతి ననేకవిధంబులఁ జెప్పుఁడు. వాయుప్రేరణంబున నగ్ని దహించుభంగి సహజకారుణ్యుఁ డైనయతఁడు మీమాటలచే నాయెడ నెక్కింత దయ సేయు. మీవచనంబుల కెవ్వాఁడు ప్రత్యుత్తరము లొసంగునో యతం డెవ్వఁ డెచ్చట నుండువాఁ డేమిపని చేయువాఁ డని లెస్సగ నరయుఁడు. ధని, పేద, సమర్థుఁ, డసమర్థుఁ డనిగణింపక వానిచికీర్షితంబుఁ దెలిసికొనుఁడు. మఱియు మీరు నాపంచినవా రని కొంచెమైన నడి దెలియకుండ నేమఱక కార్యము నడపి క్రమ్మఱ వేగంబ వచ్చునది యని వారిఁ బుచ్చె. అంత వారందఱుం దఱలి యనేకపురరాష్ట్రగ్రామఘోషాశ్రమాదుల కరిగి దమయంతీవచనముల నెల్లెడం జెప్పి నలుఁ బొడఁగని వెదకి క్రమ్మఱి వచ్చిరి.

అంత గొంతకాలంబునకుఁ బర్ణాదుఁ డను బ్రాహ్మణుఁడు దమయంతి యొద్దకుఁ జనుదెంచి యిట్లనియె. నేను దేశములనెల్లం గ్రుమ్మరుచు నయోధ్యకుఁ జని ఋతుపర్ణనృపాలునిసభలో నీవచనముల వచించితి. అందుకు ఋతుపర్ణుఁడు, నాసభలోనుండువారలుం బ్రత్యుత్తరము లియ్యరైరి. అట నే నారాజునననుజ్ఞఁ గైకొని యతనికొలువుకూటము వెడలి వచ్చినపదంపడి యానృపాలు సారథి, యశ్వశిక్షణనిపుణుఁడు, పాకవిద్యం గడునేర్పరి, విరూపుఁడు, కుఱుచచేతులవాఁ డొక్కరుండు బాహుకుఁ డనంబరఁగువాఁడు న న్నేకాంతమునకుఁ బిల్చి నిశ్వసించి పలుమాఱులు పలవించి నాసేమం బడిగి యిట్లనియె. "వైషమ్యప్రాప్తలయ్యుఁ గులాంగనలు తమంత నాత్మసంరక్షణంబుఁ జేసికొండ్రు. మగలయెడఁబాటు వాటిల్లినను సద్ధర్మము నవలంబించి ప్రాణముల రక్షించికొందురు. మోహావేశంబున సంకటములఁ జెంది, సుఖములఁ దొఱంగి, పక్షులనిమిత్తమునఁ గట్టినపుట్టమునుంగూడఁ బోనాడికొని, వగలఁ బొగులుచుఁ బ్రాణయాత్రఁ గావింపుచున్న యతండు దన్నువిడిచె ననివానిపైఁ గోపంబు సేయఁగదానికిఁ దగదు. పతిచేత సత్కృతయైనం, గాకున్నను క్షుత్పిపాసార్తుండై యట్టివనటలకెల్లఁ బాలై నమగనియెడం గోపింప నిల్లాలి కుచితం బగునే" యని వక్కాణించె. వానివచనంబు విని వేగంబ నీయొద్దకుఁ జనుదెంచితి. ఇఁకఁ దగురీతిఁ జింతింపుము. రాజునకు విన్నవింపుము. అనిన విని దమయంతి బాష్పవారిపూరితనయనయై యేకాంతంబునఁ దల్లి కిట్లనియె. తల్లీ! నాచెప్పెడునర్థము మనంబుననే యుంచికొనుము. సుదేవుఁడు నను వెదకితెచ్చినయట్ల నిషధేశుని నవశ్యంబుగఁ దోడితెచ్చు. కావున నావల్లభుం దోడ్తేరఁగ నీసమక్షమున నిపుడే యాసుదేవు నయోధ్యకుఁ బంపెద. నాకుఁ గూర్తువేని యీయర్థమును మాతండ్రి కెఱుకపఱుపకు మని చెప్పి తల్లి నందుల కియ్యకొల్పి పర్ణాదున కపరిమితధనముల నొసంగి యోమహాబ్రాహ్మణుఁడా, పెఱవార లొనరింపఁ జాలనిమహోపకారంబు నాకుఁ జేసితివి. నిషధపతి వచ్చినపిదప నింకను నీకు ధనంబు లిత్తు. అచిరంబ పతివియోగసాగరంబు నీఁది సుఖించునట్లు దీవింపు మనిపల్కుటయుఁ బర్ణాదుఁడు భైమికావించినసత్కారంబునకు సంతసిల్లి మంగళాశీర్వాదముల ననుగ్రహించి నిజసదనంబున కరిగె. అంత దమయంతి సుదేవుని రావించి దుఃఖాకులచిత్తయై బ్రాహ్మణోత్తమా! వేగంబ యయోధ్యకుఁ బోయి ఋతుపర్ణుం గాంచి "నలునిజాడ తెలియమింజేసి రేపే దమయంతికి ద్వితీయస్వయంవరం బయ్యెడినఁట. పుడమిం గలరాజులెల్లఁ దదర్థంబుగఁ గుండినపురంబునకు బోవుచున్నారు. నీవుం గోర్కికలదేని వైళంబ యరుగు మనిని వేదించునది" యని తల్లిసమక్షమునఁ జెప్పుటయు నాసుదేవుఁ డట్లయని యయోధ్యకుఁ బోయి ఋతుపర్ణున కంతయుం దెలిపె.

### ఋతుపర్ణుఁడు విదర్భాపురంబున కరుగుట.

ఋతుపర్ణుండును సుదేవునివచనంబు విని మృదువచనంబుల బాహుకు ననునయించి యోయశ్వహృదయవేదీ, దమయంతికి రెండవస్వయంవరంబు ఱేపే జరగునఁట. ఒక్కదినంబుననే విదర్భరాజధానికిఁ బోవలయు. నాకోర్కి సమకూర్ప నీకుఁ దలంపు గలదే యనియడుగ బాహుకవేషప్రచ్ఛన్నుఁడైన నలుఁడు విషాదమునఁ బెద్దయుంబ్రొద్దు చింతించి యత్యంతానురక్తయు, శోకావిలచిత్తయు నగు నాదమయంతిని బాపంబునకు వెఱవక మందమతినై యడవిలో విడిచితి. ఇట్టి క్రూరకృత్యంబున నది నాయెడం బ్రేముడి నెడలి ద్వితీయస్వయంవరంబున కియ్యకొనియెఁగాఁబోలు. వనితలచిత్తంబు చంచలంబు గాకున్నే? ఒకవేళ నానిమిత్తంబుగనే యీయుపాయంబుఁ బన్నెనేమో? పరికించిచూడ నిదియ నిక్కంబై యుండు. ఇంద్రాదిలోకపాలురను నిరాకరించి నన్ను వరించి సంతతిం గాంచిన వైదర్భి యెన్నఁడైన నిట్లు తలంచునే? ఇంతయేల? విదర్భ నగరంబునకుఁ బోయి యిందలి సత్యాసత్యంబుల నరయుదు. ఆత్మార్థంబుగనే ఋతుపర్ణునభిప్రాయంబు మెయి నడతు నని మనంబున నిశ్చయించి ఋతుపర్ణునకుఁ గృతాంజలియై మహారాజా, నీకోరినయట్ల చేసెద. ఒకదినమునకే విదర్భనగరమునకుఁ బోఁ దగునని చెప్పి గుఱ్ఱాలపాగాకుఁ బోయి యశ్వములఁ జక్కఁగఁ బరీక్షించి సమర్థంబులు, వేగవంతంబులు, తేజోబలసమన్వితంబులు, కులశీలవిలసితంబులు, నింద్యలక్షణరహితంబులు, ప్రశస్తలక్షణసహితంబులు, దశావర్తసమంచితంబులు, నగునుత్తమాశ్వములం దెచ్చినఁ జూచి * ఋతుపర్ణుఁ డించుక కోపంబు గదుర బాహుకా, బహుదూరంబు పోవలయుం గదా? ఈదుర్బలాశ్వము లుపయోగించునే? నాయభీప్సితంబు నెఱవేర్తు నని చెప్పి యేల వంచించెద వనిన బాహుకుఁ డిట్లనియె. రాజేంద్రా, యీగుఱ్ఱములు సర్వలక్షణ విలసితంబులు, దశావర్త సమంచితంబులు. ఇవి నేఁడ విదర్భమునకుఁ బోవును. ఇందు సందియంబేని నీకోరినవానిఁ బూన్చెద ననిన ఋతుపర్ణుఁడు బాహుకా, హయతత్వంబు నీకంటె నేనెఱింగినవాఁడనా? నీకుఁ బోలినవానిన పూన్చుమన వుడు బాహుకుఁ డయ్యుత్తమాశ్వంబుల నాల్గింటిం బూన్చుటయు ఋతుపర్ణుఁడా రథవరంబు నతిరయంబున నారోహించె. అంతం దుఱంగంబులు మోఁకరిలఁబడుటయు బాహుకుఁడు వాని నూరార్చి లేవనెత్తి పగ్గముల బిగియించి వార్ష్ణేయుం దనతోడ నెగ లెక్కించుకొని యరదంబుఁ బఱపించుటయు నయ్యశ్వంబులు ఋతుపర్ణున కబ్బురంబు గూర వాయువేగంబునం బోవుచుండె. అప్పుడు

* ఇచ్చట సంస్కృతభారతమునకును, తెనుఁగుభారతమునకును భేదమగపడుచున్నది.

వార్ష్ణేయుఁడు రథఘోషవైలక్షణ్యంబును, హయసంగ్రహణనైపుణ్యంబు, నశ్వహృదయవేదిత్వంబునుం బరికించి యితం డింద్రసారథి యగుమాతలియో? మనుష్యరూపము ధరించినశాలిహోత్రమహర్షియో? నలమహీపాలుఁడో? కాకున్న నితరు లెవ్వరికేనియు నిట్టిసామర్థ్యంబు గలుగునే? బాహుకుఁడే యొకవేళ నలుని విద్యలెల్ల నెఱింగెఁ గాఁబోలు, అయిన నిది యొప్పదు. ఇతఁడు నలుఁడ కావలయు. వయోవిద్యాగుణముల నితఁడు నలుం బోలెడి. అంగవికారమునకుఁ గతంబేమియో? మహాత్ములప్రచ్ఛన్నప్రచారంబు నెఱుంగఁ బెఱవారి కలవియే? యని విచారింపుచుండె. ఋతుపర్ణుఁడును రథవేగంబునకు, బాహుకునిసారథ్యసామర్థ్యంబునకును మెచ్చుచుండె. అట్లు వాయువేగంబున రథంబు క్షణమాత్రమున ననేకనదులం, బహుపర్వతములఁ, బెక్కువనంబులను నతిక్రమించిపోవుచుండ నొక్కచో ఋతుపర్ణుఁడు తనయుత్తరీయము జాఱి క్రిందఁ బడుటయు దానిఁ దెప్పింపఁ దలంచి బాహుకా, క్రిందఁ బడిననాయుత్తరీయమును వార్ష్ణేయుఁ డరిగి తెచ్చునంతకు రథంబు నిలుపు మనిన నలుఁడు నృపాలా, మన మచ్చోటుఁ గడచి యిపుడు యోజనంబు వచ్చితిమి. దాని వార్ష్ణేయుం డెట్లు దెచ్చుననిన రథగమనవేగంబునకు విస్మయం బందుచు ఋతుపర్ణుఁడు కొంతదూరంబు చని యొక్కచో నాకులం బండుల నిండియున్న యొకతాండ్రచెట్టుఁ గనుంగొని యతివేగంబున బాహుకున కిట్లనియె. సారథీ, నాసామర్థ్యముఁ జూడుము. చూచినంతన సర్వమును లెక్కింతును. ఎవ్వఁడును సర్వజ్ఞుఁడు గానేరఁడుగదా. ఒక్కొక్కని కొక్కొకవిషయమున నేర్పు గలిగియుండు. ఇవ్విభీతకవృక్షంబునం గలఫలపర్ణముల సంఖ్యఁ జెప్పెదను. * అందు రాలినయాకులు నూఱునొక్కటి. రాలినపండ్లు నూఱు. చిఱుతకొమ్మల నెల్లం గూడినయీరెండు పెద్దకొమ్మలందు నాకు లయిదుకోట్లు. పండ్లు రెండువేలుందొంబదియైదుం గలవు. నమ్మవేని లెక్కించు మనిన నలుండు రథంబునిలిపి యయోధ్యాధిపతీ, యిట్లుగణింపఁ బోలునే? నీగణనంబు నమ్మనేరను. కావున నిపుడే యీవృక్షంబుఁ బడఁద్రోచి నీవు చూచుచుండఁగనే పండుల నెన్నికచేసెద. ముహూర్తమాత్రంబు వార్ష్ణేయుఁడు పగ్గముల బిగియించుఁగాక యనిన ఋతుపర్ణుఁడు మనప్రయాణమున కిపుడుతడవు సేయరా దనుటయు బాహుకుఁ డిట్లనియె. మహారాజా, యొక్కింతసేపు నారాకఁ బ్రతీక్షించియుండు మిదె వచ్చెద. ఇంతతడవు నైనం గడప నియ్యకొనవేని యిది మంచితెరువె. ఈమార్గమున వార్ష్ణేయుం డరదంబు గడప విదర్భకుఁ బొమ్మనిన ఋతుపర్ణుఁడు బాహుకా, నీబోటిసారథి

* ఇచ్చట సంస్కృతభారతమునకును, దెనుఁగుభారతమునకును భేదము దెలియుచున్నది.

మెచ్చటను నుండఁడు. నీవలన విదర్భంబులకుఁ బోవుదు ననితలంచి నిను శరణు సొచ్చితి. విఘ్నముఁ జేయవలదు. నేఁడు సూర్యాస్తమయంబునకుమున్న విదర్భాపురంబుఁ జేర్చితివేని నీకోరినదాని నొనరించువాఁడ. విభీతకంబునఁ గొంత గణించి నాచెప్పినలెక్క సరియగునేని ప్రేమమున నావచనంబు నమ్మి మఱివచ్చి యరదంబు నడపు మనిసాంత్వపురస్సరంబుగ వచించె. బాహుకుండును నృపాలా, నీకోరినప గిది నేఁడు సూర్యాస్తమయంబునకుమున్న విదర్భాపురంబుఁ జేర్చెద. విభీతకవృ క్షమునఁ బండులనే యెంచివత్తు నని వేగంబ నొగలు డిగి యరిగి యాతాండ్ర మ్రాను నురలం ద్రోచి ఫలములగణించి ఋతుపర్ణుండుచెప్పినన్నియే యుండుటకు విస్మితుండై ఋతుపర్ణమహీనాథా, నీసామర్థ్య మత్యద్భుతంబు. ఏవిద్యవలన నీ విట్లెఱింగి తనియడిగి యక్షహృదయవిద్యాప్రభావంబున నతండు సంఖ్యానవి శారదుండగుటఁ దెలిసికొని యీవిద్యను నాకుఁ బ్రసాదింపుము. నానేర్చినయశ్వ హృదయంబు నీ కుపదేశింతు ననిన ఋతుపర్ణుఁ డిట్లనియె. నీకోరినపగిది. నక్ష హృదయంబు నీకుపదేశించెద. అశ్వహృదయం బిపుడు నీయొద్దన యుండనిమ్ము. వలసినపుడు దెలిసికొందు ననిచెప్పి రయమున విదర్భకుఁ బోవఁగ నితనిమెప్పిం చుటయ యిపుడు మేలివెర వనినిశ్చయించి విధియుతంబుగ నలున కక్షహృద యంబు నుపదేశించె.

నలుఁడు కలివిముక్తుఁడై విదర్భపురంబుఁ జేరుట.

ఉపదేశించుటయు నయ్యక్షవిద్యాప్రభావంబునఁ దత్క్షణంబ కలి యతితీ క్ష్ణం బయినకర్కోటకవిషంబు నోటఁ గ్రక్కుచు నలనృపాలునొడలు విడిచి స్వరూ పంబుఁ దాల్చె. వానిం జూచి నలుఁడు పెద్దకాలం బతండు నన్నుఁ గాఱియపెట్టు టంజేసి కినిసి శపింపఁ దలంచుడు వాఁడు గడగడవడఁకుచుఁ గేల్దోయి మొగిచి మహారాజా! కోపం బుడిగి ప్రసన్నుఁడ వగుము. కర్కోటకువిషంబునను, భవద్వి యోగవిహ్వల యగుదమయంతిశాపంబునను నెల్లపుడుం గడుం బీడితుండనైతి. నిను శరణుసొచ్చితి. శరణాగతరక్షణంబు నీయట్టిమహనీయునకు సహజంబకాదే? నన్ను రక్షింతువేని నిన్ను గీర్తించువారల నెన్నఁడుం జెనకరాను. దీనంజేసి నీ కెంతయేఁ గీర్తి యగు ననిన నలుండు కోప ముడిగె. కలియు నితరుల కగపడ కుండు నట్లు నలునితోడ మాటలాడి యాతాండ్రచెట్టు చేరి క్రమమునఁ దనయిం టికిఁ బోయె. నాఁటంగోలెఁ గలిసంశ్రయంబున విభీతకవృక్షము లోకమున నప్ర శస్త మయ్యె. నలుఁడును గలివిముక్తుఁడై రూపవికారంబుదక్కఁ దక్కినకల్మష ములనెల్ల నీఁగికొని దివ్యతేజోవిలసితుండై పరమానందంబున రథంబు నెక్కి పగ్గ ములఁ గొని సారథ్యంబుఁ జేయుచు నతిరయంబున ఋతుపర్ణవార్ష్ణేయసహితుండై

సాయాహ్నంబున విదర్భకుఁ బోయె, ఋతుపర్ణనిరాక నెఱింగి భీముఁడు తగువారల నెదురుపుత్తెంచఁగ నాయయోధ్యాధీశ్వరుండు నిజరథనినాదంబునకు దిక్తటంబులు ప్రతిశబ్దంబు లొసంగ నగరు సొచ్చుచుండ మేఘస్తనితగంభీరం బైనయయ్యరదంబుమ్రోఁత నాలకించి నెమళులును, గజములుం, దొల్లింటినలరథ్యంబులుం గడు నుత్సుకంబులై ప్రతిస్వనంబు లొనరించె. దమయంతియు నాత్మగతంబున నీయరదంబుమ్రోఁత నరయఁగ నలుఁ డరుదెంచినవాఁడ యనితోఁచెడి. నామనంబున నాహ్లాదం బయ్యెడి. సింహగమనుఁడై ననిషధేశుఁడు నన్నుఁజేరరాఁడేని, యాచంద్రాననుం గాంచనేని, యమ్మహాబాహుకౌఁగిట సుఖస్పర్శంబుఁ బడయనేని ప్రజ్వలితాగ్నిం జొత్తు. అమ్మహాత్ముఁ డెన్నండును గొండొకయేనియు నెగ్గుఁ జేయఁడయ్యె. అనృతంబుఁ బలుకఁడయ్యె. మఱియు నతఁడు నిపుణుఁడు, శాంతిమంతుఁడు, శౌర్యమహితుం, డుదారుండు, సకలరాజశేఖరుండు. స్వైరవిహారంబులఁ జెప్పినవచనంబునుం దప్పక నడపించువాఁడు. రహస్యక్రీడలందుఁ దనమహనీయత్వంబు గణింపక యేకృత్యంబుననైన నా కింపుఁ బుట్టించు. ఆరాజేంద్రునిగుణంబులఁ దలంపనుదలంపను విరహవిషాదంబున శేలుంబవల్లుం గుండెలు బెండువడియెడి నని చింతింపుచు మోహంబుఁ జెంది కొండొకవడికిఁ దేఱి యాపుణ్యశ్లోకుం గనుంగొనఁ గోరికలు క్రేళ్లుదాఁట నొకమహాసౌధం బెక్కి నగరునందు మధ్యమకక్ష్యాంతరంబున రథస్థితుం డైనఋతుపర్ణుని వార్ష్ణేయబాహుకసహితుం గనుంగొని నలుం గానక వగచుచుండె. అట వార్ష్ణేయబాహుకులు రథంబు డిగ్గి గుఱ్ఱముల నిల్పుటయు ఋతుపర్ణుండు రథావతీర్ణుండై నగరు సొచ్చె. ఆకస్మికంబుగ నరుదెంచినఋతుపర్ణుం గాంచి విదర్భేశ్వరుండు సత్కారపూర్వకంబుగ స్వాగతం బడిగి స్త్రీమంత్రణం బెఱుంగమింజేసి యిపు డిచ్చటికి రాఁ గతం బేమి? యనియడుగ ఋతుపర్ణుం డచ్చట స్వయంవరప్రచారం బొక్కింతమైనఁ జూపట్టకునికికి మనంబున నరయుచు విదర్భేశ్వరా, నీకు మ్రొక్కఁగ వచ్చినాఁడ ననివచించె. ఋతుపర్ణునివచనంబు విని భీమనృపాలుం డాత్మగతంబున నితం డిపుడు శతయోజనంబుల నతిక్రమించి యిటకు రానేల? నాకు మ్రొక్కఁగనే వచ్చె నని తలంపరాదు. ఎందఱేరాజు లుండఁగ నితండు నా కేల మ్రొక్కఁగ వచ్చు. ఈకారణంబు పోలదు. మఱి యెద్దియే నుండు ననితలంచి యిపు డింత యేల? పర్యవసానంబునఁ జక్కఁగఁ దెలియవచ్చు నని నిశ్చయించి ఋతుపర్ణుం జూచి మహాప్రయాణంబున బడలిక యుండుఁగదా. కొంతవడి విశ్రమించుట లగ్గని పలుమాఱులు చెప్పి యుచితరీతి సత్కరించి విడిదలకుఁ బంపుటయు నయ్యా

యోధ్యాధిపతి వార్ష్ణేయుండు కొలిచిరాఁగ రాజపరిజనపరివృతుండై తనకు నియమించినయుత్తమసదనంబుఁ జేరె. అట బాహుకుఁడు తేరు రథశాలకుఁ గొంపోయి వారువంబుల విడిచి శాస్త్రోక్తప్రకారంబున వానికిఁ బరిచర్యఁ గావించి రథముసమీపమునఁ గూర్చుండె. అంత సౌధాంతరస్థ యగుదమయంతి బాహుకరూపప్రచ్ఛన్నుం డైననలుఁ జక్కఁగ నెఱుంగనేరక విషణ్ణయై కటా! నైషధరథనినాదోపమంబైనస్రోఁత విని వేడ్కమై వచ్చితి. అమ్మహీపాలుఁ డగపడఁడయ్యె. నలనృపాలుసామర్థ్యంబును వార్ష్ణేయుండును నేర్చుకొనియునికియుండె, ఋతుపర్ణుఁడు నలసమానుఁ డగుటయుండెఁ గావలయు. కాకున్న నీస్రోఁత లాఁతివారి తేరుల కలవడునే? అని చిత్తమున విచారింపుచు దూతిం బంపి నిక్కం బెఱుంగుదాన ననినిశ్చయించి కేశిని యనుదానిం బిలిచి కేశినీ, ఋతుపర్ణరథసమీపంబునఁ గూర్చున్నవాని, వికృతాంగుని, గుఱుచచేతులవానిం జూచితే? అతనిం జూచినంతన నామడెందమ్మున సుఖసంతోషములు పెంపారుటం జేసి యితండు నలుఁడ కావలయు ననితలంతు. కావున నీ వతనిపాలికిఁ బోయి మెల్లన సేమంబు విచారించి తదీయతత్త్వ మంతయు మృదువచనముల నడుగుము. అంతయు నడిగినపదంపడి పర్ణాదవచనంబు వివరించి యందులకుఁ బ్రతివచనంబును విచారింపు మనిపంపె.

దమయంతిపంపునఁ గేశినియనుచెలికత్తె నలు నెఱింగి వచ్చుట.

అటఁ గేశినియుఁ బ్రాసాదతలగత యగుదమయంతి చూచుచుండఁగనె బాహుకునొద్దకుఁ బోయి యోమనుష్యేంద్రా, స్వాగతం బె? దమయంతిపంపున వచ్చితి. నీకుఁ గుశలంబే? మీ రెపుడు తఱలితి రేల వచ్చితి రనియడుగ బాహుకుఁ డిట్లనియె. దమయంతీద్వితీయస్వయంవరం బెల్లి యగు నని యొకవిప్రునివలన నిన్న విని శతయోజనయాయిహయయోజితం బైనరథము నధిరోహించి ఋతుపర్ణుఁ డరుదెంచె. నే నానృపాలుని తేరు గడప వచ్చితి ననిన విని కేశిని యయ్యా, మీరిద్దఱకాక మఱియు నొక్కరుఁడు వచ్చినవాఁడుగదా అతఁ డెవ్వఁడు? ఏల వచ్చె? ఎవనివాఁడు? నీవు నెవనివాఁడవు? ఎట్లీపని నీకుఁ గలిగె ననిన వెండియు బాహుకుఁ డిట్లనియె. అతఁడు పుణ్యశ్లోకుఁ డైననలునిసారథి. వార్ష్ణేయుఁ డనం బరఁగువాఁడు. నలుఁ డడవులకుఁ బోయినపదపడి ఋతుపర్ణునకు సారథి యయ్యె. నేను నశ్వవిద్యానిపుణుఁడను. పాకవిద్యావిశారదుఁడను. ఋతుపర్ణుఁడు నను సారథ్యంబునందు, నన్నసంస్కారంబునందును నియమించె ననినఁ గేశిని యయ్యా, వార్ష్ణేయుఁడు నలునిపోక నెఱుంగునే? ఈవృత్తాంత మెల్ల నీ కెట్లితండు దెల్పె ననిన బాహుకుఁడు మఱియు నిట్లనియె. వార్ష్ణేయుఁడు నలుకొడుకుం గూఁతు నీవి

దర్భరాజునగరున నిల్పి యట యథేచ్ఛముగఁ జనియెఁ గాని నలు నెఱుఁగఁడు. మఱి యెవ్వఁడు నిపుడు నలు నెఱుంగఁడు. ఆతఁడు వికృతరూపమున గూఢముగఁ దిరుగుచున్నవాఁడు. ఆనలుని నతఁడొండె, వానిపత్నియొండె నెఱుంగుదురుకాని దక్కటివార లెఱుంగరు. తనగుఱుతుల నేరికిం జెప్పఁ డనినఁ గేశిని యట్లనియె. అయ్యా, తొలుత నయోధ్యకు వచ్చినబ్రాహ్మణుఁడు "కితవా? నాకట్టినపుట్టంబున సగము చించుకొని నిదురవోవుచున్నన న్నడవిలో విడిచి యెచ్చటికిఁ బోయితివి? అనురక్తయగుప్రియురాలిని బ్రియుండు విడుచునే? నీరాకఁ బ్రతీక్షించి యానాఁటిమలినవస్త్రార్ధంబునే గట్టుకొనుచు నీయెడఁబాటునకుఁ బెల్లడలుచున్నదాన. కరుణింపు" మనుమాటల వినిపింపఁగ నందులకుఁ బ్రత్యుత్తరము లొసంగితివికదా? ఆవచనముల నిపుడు దమయంతి విన వేఁడుచున్న దనిన విని బాహుకుఁడు దురంతచింతాక్రాంతస్వాంతుండై లోచనయుగంబు బాష్పవారిపూరితంబుగాఁగ డగ్గుత్తిక వెట్టి యిట్లనియె. "వైషమ్యప్రాప్తలయ్యుఁ గులాంగనలు తమంత నాత్మసంరక్షణంబుఁ జేసికొందురు. మగలయెడఁబాటు వాటిల్లినను సద్ధర్మము నవలంబించి ప్రాణముల రక్షించి కొందురు. మోహావేశమున సంకటములఁ జెంది, సుఖములఁ దొఱంగి, పక్షులనిమిత్తమునఁ గట్టినపుట్టమునుంగూడఁ బోనాడికొని, వగలఁ బొగలుచుఁ బ్రాణయాత్ర గావింపుచున్నయతండు దన్ను విడిచె నని వానిపైఁ గోపంబు సేయ దానికిఁ దగదు. పతిచేత సత్కృతయైనం, గాకున్నను క్షుత్పిపాసార్తుండై యట్టివనటలకెల్లఁ బాలైనమగనియెడం గోపింప నిల్లాలి కుచితంబగునే" యనిచెప్పితి ననిపలికి బాష్పము నిలుపఁజాలక విలపించుటయుఁ గేశిని యటఁ జని దమయంతి కంతయుం దేటపఱిచె. వైదర్భి యావచనములనెల్ల విని శోకాకులచిత్తయై బాహుకుని నలునిగ నూహించి కేశినీ, మఱియు నొకతూరి వానియొద్దకుఁ బోయి సకారణంబుగా వానిలక్షణంబులనెల్లఁ బరీక్షింపుము. ఆతండు పాకాదులు చేయుతఱి నెంత నిర్బంధించిన నగ్నిని, జలంబు నియ్యకుము. వానియెడం గలదైవమానుషనిమిత్తములఁ బరికించి వైళంబ వచ్చి నా కెఱింగింపు మనిపంచినఁ గేశిని యట్లపోయి వానిచరితల నెఱింగి వచ్చి దమయంతి కిట్లనియె. దమయంతీ, వానిచరిత్రంబు లోకోత్తరం బెచ్చటను జూచినదియు, వినినదియుం గాదు. ఆతండు వామనద్వారములఁ జనునెడ వినమ్రుఁడుగాకయే సుఖముగఁ జరించువాఁడు. మఱియుఁ బాకాద్యర్థంబుగ నగ్నిం, గాష్ఠములను, జలమును నపేక్షింపఁడు. వాఁడు చూచినంతన జలరహితకుంభంబులు సలిలపూర్ణంబు లగు. తజ్జలంబుచే ఋతుపర్ణుఁడుపంచిననంజుళ్లు గడగి తన్మాంసపూరితంబు లయినపాత్రములఁ బ్రొయ్యిమీఁద నుంచి తృణముష్టిం గ్రహించి సూర్యున కెదురుగఁ జూపు. చూపినం దగ్ని వొడమి తటాలునఁ బ్రజ్వరిల్లు. దానినతండు సకలపదార్థముల నితరసాధ

నముల నపేక్షింపకయే వండును. ఈరీతింజూడ నా కెంతయు నబ్బురం బయ్యె. మ ఱియు నొక్కయద్భుతంబుఁ గంటి. అగ్నిం దాఁకియు నతండు దగ్ధుండుగాఁడు. కుంభము వంచినను నందలిజలము వానికోరినంతయే స్రవించు. వెండియు నొకయాశ్చర్యంబు వినుము. కరతలములఁ బూవుల గ్రహించి యతఁడు నలిపిన నవి లెస్సగ విరిసి పరిమళించుఁగాని వాడవు. ఈచిత్రములనెల్లఁ గనుంగొని వేగంబ వచ్చితి ననిన విని కర్మచేష్టావిశేషముల నాపుణ్యశ్లోకుని నలునిగఁ దలంచియు మఱియు నింగితముల నెఱుంగఁ దలఁచి కన్నీరు నించుచుఁ గేశినిం బిలిచి చెలీ! యీతూరి యటకుఁ బోయి యాబాహుకుఁ డేమఱియుండఁగ వానివండినమాంసముం దెమ్మని నియమించె. నియమించుటయుఁ గేశిని యచ్చటికిఁ బోయి యపుడే వండియుంచుటం జేసి వేఁడిచల్లాఱనిమాంసముఁ దెచ్చి యియ్యఁగ దాని నాస్వాదించి యాహా! యింతరుచిమంతంబుగఁ బక్వంబు సేయ నలేతరులకుఁ దరమే? బాహుకుఁడు నలుఁడ కాని లాఁతి వాఁడు గాఁ డనినిశ్చయించి పెద్దయుంబ్రొద్దు విలపించి కొంతసేపున కెట్టకేలకు శోకముడిగి మొగముఁ గడిగికొని కొడుకుం గూఁతుం గేశినితోడ బాహుకునొద్దకుఁ బంపె. బాహుకుఁడుం గేశినితోడ వచ్చినబిడ్డలఁ గాంచి సంభ్రమంబునఁ గౌఁగిలించుకొని కుఱు వెక్కించి విషాదవివశుండై కొంతవడి పలవించి యట నాపుత్రుల విడిచి కేశినిం జూచి యీబిడ్డలు నాబిడ్డలపోలె నుండుటంజేసి వీరి నెత్తుకొని యింతసేపు శోకించితి. నీ వేల పలుమాఱు లిటకు వచ్చెదవు? చూపఱు శంకింతురు. మేము దేశాంతరమునుంచి వచ్చినయతిథులము. ఇచట నుండవలదు. పొమ్మనినఁ గేశిని దమయంతియొద్దకుఁ బోయి యావృత్తాంతమంతయుఁ దెలపఱిచె. అంత దమయంతి తల్లియొద్దకుఁ బోయి తల్లీ, చేష్టాదులఁ బరీక్షించిచూడ బాహుకుఁడే నలుఁడు. రూపమందు సంశయ మొకించుక యయ్యెడి. చూచిన నదియుం దీఱు. కావున వాని నిటకు రప్పించుటయొండె, నన్నిపు డచ్చటికిఁ బంపుటయొండె నవశ్యంబు చేయనవలయు నని చెప్పఁగ నాభీమదేవి యయ్యుదంతము రాజునకు విన్నవించి యతనియానతిఁ గొని నలుని దమయంతీగృహమునకుఁ బిలిపించె. అంతఃపురముఁ జొచ్చి నలుఁడు మాసినచీరఁ గట్టి జడలఁ దాల్చి శోకవివశయై యున్నదమయంతిం జూచి శోకవ్యాకులచిత్తుండై కన్నీరు నించుచుండె. తదవస్థుం డైననైషధుం జూచి వైదర్భి యెంతయు వనరి మహారాజా! కాఱడవిలోఁ గూర్కుచున్నయువిదను విడిచిపోయిన యొకానొకధర్మజ్ఞుం జూచితివే? నిరపరాధయు, శ్రమమోహితయుఁ, బుత్రవతియు నగుప్రియపత్నిని నలేతరుఁడు విడుచునే? అట్లుచేయ నే నేమి తప్పు చేసితినో? నాకుఁజూడఁ ద ప్పొక్కటియుఁ దోఁచదు, తొల్లి స్వయంవరసమయంబున నాకుఁగా సురలు వచ్చియుండినను నేను వారినెల్లఁ గాదని తన్నె వరించినదానంగదా. తానుం దవసమక్షమున నన్ను

విడువ నని బాస చెప్పి యగ్నిసాక్షికంబుగ మత్పాణిగ్రహణంబు చేసికొనినవాఁడుగదా. నాఁటిసత్యమెల్ల నెట్లు పోయెనో యని సాకూతంబుగఁ బలుకుచున్నంత బాష్పవారిపూరితలోచనుండై నలుం డిట్లనియె. వైదర్భీ, మదీయరాజ్యవినాశంబు, భవత్పరిత్యాగంబును నాకృత్యంబులు గావు. మఱి కలిచేతలు. నాయెడఁబాటు నోర్వక వనటలకుఁ బాత్రం బైననీవు శపింపఁగఁ దచ్ఛాపాగ్నిదగ్ధుండయ్యు నెట్లో యొకతీరున నింతకాలంబుండి కలి మదీయతపోవ్యవసాయంబులం జేసి యిపుడు నన్ను విడిచి చనియె. దానం జేసి యిపు డిచ్చటికి నీకొఱకు వచ్చితి. ఇట నాకు వేఱొండుపని లేదు. అది యట్లుండె. దమయంతికి ద్వితీయస్వయంవరంబయ్యెడి నని విదర్భరాజుపంపున దూతలు సకలదేశములఁ ద్రిమ్మరుచున్నవారు. దీని వినికాదె ఋతుపర్ణుండు నిటకు వచ్చె. ఇది తగునే? నీవుదక్క మఱియొక్క కులాంగన యెవ్వతెయేనియు ననురక్తుం, డనువ్రతుడు నగుపతిని విడిచి వేఱొక్కని వరించునే? అనిన విని దమయంతి భయకంపములు గదురఁ గృతాంజలియై యిట్లనియె. మహారాజా! నాయెడ నిట్లు శంకింపఁ దగదు. ఇంద్రాదినిర్జరులనుం గోరకయేను నిన్నె వరించినదానంగదా? నీవర్తనంబుఁ దెలియక చింతించి నిన్ను వెదకఁగ సకలదేశములకుం బెక్కండ్ర విప్రులను మాతండ్రి పంపె. అందుఁ బర్ణాదుఁ డను బ్రాహ్మణుఁ డయోధ్యఁ జేరి ఋతుపర్ణునినగరునఁ గొన్ని వచనములఁ జెప్పి యందుకుఁ బ్రత్యుత్తరముల నీవలన విని వచ్చి నీపోబడి చెప్పె. ఆవాక్యములకు మాఱు చెప్పినవాఁడవు నీవ యని నిశ్చయించి నిన్ను రప్పింప నుపాయం బెద్దియొక్కో యనివిచారించి నీవుదక్క మఱియొక్కరుం డొక్కదినమున గుఱ్ఱముల నూఱుయోజనములు నడపించువాఁ డీలోకమున లేఁ డనినమ్మి యిదిసదుపాయంబని నిశ్చయించి "రేపు దమయంతీ ద్వితీయస్వయంవరం" బని ఋతుపర్ణునకే తెలుపఁగ నుదేవుం బంచితి. నీపాదయుగంబు సాక్షిగా నింతియకాని వేఱొండు గాదు. మనస్సుననైన నేను బరపురుషుని గోరినదాననేని సర్వభూతసాక్షు లగువాయుసూర్యచంద్రులు ననుఁ బొరిగొనుదురుగాక. వీరు మువ్వురు సత్య మిపుడు నిరూపించి నన్ను రక్షింతురుగాక యనిపల్కుచుండ నంతరిక్షమునుండి వాయు విట్లనియె. నలనృపాలా! దమయంతియెడ శంకింపవలదు. ఈమూఁ డేఁడులు నీయెడఁబాటునకు వనరుచు శీలంబు రక్షించుకొనియె. మే మిందుకు సాక్షులము. ద్వితీయస్వయంవరప్రఖ్యాపనంబు నిన్నుఁ దెలియఁగోరి చేసినయుపాయంబకాని వేఱొండు గాదు. మీరిద్దఱు నొండొరులకుం దగినవారు. శంకింపక దమయంతిం గ్రహింపు మని నుడువుచున్నంతఁ బుష్పవర్షము గురిసె. దేవదుందుభులు మ్రోసె. శుభసమీరణము వీచె.

## నలుఁడు నిజరూపము గ్రహించి దమయంతితోఁ గలియుట.

అందులకు విస్మయం బంది నలుఁడు దమయంతియందు సంశయంబు విడిచి కర్కోటకదత్తం బైనదివ్యాంబరద్వయంబుఁ దాల్చి యానాగరాజుం దలంచి స్వరూపంబు గ్రహించుటయు వైదర్భి దివ్యతేజోవిలసితుండై యున్న పతిం గౌఁగిలించుకొని యాపుణ్యశ్లోకునియురస్థలంబున నెమ్మోముఁ జేర్చి విషాదవివశయై నిట్టూర్పులు నిగిడింపుచు నుచ్చైర్నినాదమున నాక్రోశింపుచుండె. నిషధేశుండును గొడుకుం, గూఁతుం గౌఁగిలించుకొని యప్పరమపతివ్రతను గాఢపరిష్వంగమున నాదరించి పెద్దయుం బ్రొద్దు శోకపరీతుఁడై యుండె. అట విదర్భరాజమహిషి భీమభూపాలునకు నళదమయంతులసమాగమాది వృత్తాంతమంతయుం దెలుపఁ నమ్మహీకాంతుఁ డత్యంతసంతుష్టుండై సుఖోషితు లగునల్లునిం, గూఁతు నెల్లి గనుంగొనియెద ననివచించె. అట్లు దుస్తరం బైనవియోగసాగరంబు దాఁటి దమయంతి యర్ధసంజాతసస్య యగువసుంధర సలిలంబునుంబోలెఁ దన్నుఁ బొందిి యాప్యాయితయై చంద్రుం గూడినరాత్రివోలె నెంతయుఁ దేజరిల్లుచుండ నలుఁడును బ్రియపత్నితోఁ గలిసి పరమానందసాంద్రుం డయ్యె. అక్కరణి నాలవయేఁటఁ గలిసినయాదంపతులు తొల్లింటివనవృత్తాంతములఁ జెప్పికొనుచు భీమరాజునగరున నారాత్రి నొక్కముహూర్తముగాఁగ సుఖమునఁ గడపిరి. అట మఱునాఁడు నలుఁ డలంకృతుండై దమయంతితోడ మామయొద్దకుఁ బోయి యభివాదనములఁ గావింప నావిదర్భరాజుదంపతులఁ బుత్రవాత్సల్యమున నాదరించి యథార్హముగ సత్కరించి యాఱడించె. నలుఁడు మామ కావించినసత్కారంబు గ్రహించి తాను భక్తిమై నుచితపరిచర్య లొనరించె. విదర్భేశ్వరుండును వారిసమాగమంబునకు ముదం బొంది పురంబు సకలశుభాలంకారవిలసితంబుఁ గావించె. సురార్చనలఁ జేయించె. ఋతుపర్ణుండు దానినెల్ల నెఱింగి యత్యంతసంతుష్టుఁడై నలుని రావించి స్వరూపవిలసితుం డైనయతని జూచి విస్మితుండై నలనృపాలా, భాగ్యమున నిడుమలనెల్లఁ బాసి ప్రియపత్నితోడఁ గూడినవాఁడవు. మాయింట నజ్ఞాతవాసంబు సల్పుతఱి నీ కేమి యపరాధమయ్యెనో? బుద్ధిపూర్వకముగ నొక్కటేనియుఁ దప్పు నావలనఁ గలిగియుండదు. ఇంతేల? బుద్ధిపూర్వకముగనొండె, నబుద్ధిపూర్వకంబుగనొండె నావలనఁ దప్పులు కొన్ని గలిగెనేని యవశ్యంబు క్షమియించునది యని ప్రార్థింప నలుఁడిట్లనియె. నరేంద్రా, నీవు నా కొకించుకేనియు నపరాధంబుఁ జేసినవాఁడవుకావు. ఒకవేళఁ జేసియుండినను నాకుఁ గోపంబు లేదు. అంతయు నాకు క్షంతవ్యంబుగాదె? నీవు తొల్లియుం జెలికాఁడవు. సంబంధివి. ఇపుడు చెప్పనేల? నీనగరున సుఖముంటి. నాయింటను నట్టిసుఖ ముండదు. నీవలన సుఖప్రాప్తుం డైననాకు నీపై నిక

మీఁదఁ బ్రేమ యగ్గలం బగుట యరిదియే? నాయశ్వహృదయవిద్య నుపదేశించి నేను నుపకారిఁగాఁ దలంచెద నని చెప్పి ఋతుపర్ణున కయ్యశ్వహృదయంబు విధియుతంబుగ నుపదేశింప నాకోసలేశ్వరుం డవ్విద్యం గ్రహించి మున్నొసంగినయక్షహృదయంబ యీవిద్యకుఁ బ్రతినిధి యనిభావించి మఱియొకసారథిని బిలిచికొని రథారూఢుండై యయోధ్యకుఁ జనియె.

నలుఁడు పునర్ద్యూతంబునఁ బుష్కరుని గెలిచి క్రమ్మఱ రాజ్యంబు సాధించుట.

ఋతుపర్ణుం డరిగినపదంపడి నలుఁడు కుండినపురమునఁ గొన్నిదినములుండి భీమునసుజ్ఞఁ గొని యొక్కరథంబు, పదునాఱేనుంగు, లేఁబదిగుఱ్ఱంబు, లాఱునూఱుగురుకాలరులుం గొలిచిరాఁగ నతిసంరంభంబున నిషధపురమునకుఁ బోయి పుష్కరుం జూచి నే నిపుడు బహుధనము నార్జించితి. క్రమ్మఱ జూదమాడుదము. నాధనమును, దమయంతిని, బ్రాణములను నొక్కయొడ్డుగా నొడ్డెద. నీవు రాజ్యమును, బ్రాణములు నొడ్డుము. పరధనమును, రాజ్యమునుం గెలిచితెచ్చి జూదమునఁ బ్రతిపణంబుగ నొడ్డుట ధర్మంబు. జూద మొల్లవేని యుద్ధద్యూతంబు నడపుము. ఇతరపరివారంబు వలదు. మన మిద్దఱమే రెండురథములనారోహించి దురంబు నొనరింతము. ఏవెరవుననైన వంశప్రాప్తం బైనరాజ్యంబు సాధింపవలయు నని పెద్దలశాసనంబు గలదు. పరికించి జూదమొండె, యుద్ధమొండె నడపు మనిన విని పుష్కరుఁ డాత్మగతంబునఁ దొల్లి తాను గెలుచుటం జేసి యిపుడును గెల్తు నని తలంచి నలున కిట్లనియె. నైషధా, మాఱొడ్డునకుఁగా భాగ్యవశమున ధనమును సంపాదించితివి. దమయంతిదుష్కృతంబు క్షయంబునొందె. నీకోరినపగిదిఁ బునర్ద్యూతం బాడుదము. అచ్చరవిరిబోఁడి సురపతిం బోలె నీధనమున నలంకృతయై దమయంతి నన్నుఁ జేరుఁగాక. శత్రులతోడ జూదమాడ మనసు గోలుపదు. నీతో నాడి ని న్నోడించి దమయంతిం గొని కృతకృత్యుండఁగాఁ బ్రతిదినంబునుం దలంతు. ఇది నేఁడు సమకూఱెనని బహువిధంబుగ నసంబద్ధప్రలాపంబులు సల్పుచుండ నలుండు గడుం గినిసి రోషభీషణశోణలోచనుండై ఖడ్గముచే నతనితలఁ ద్రెవ్వ నఱకఁ దలంచి క్రమ్మఱఁ దనయంతన యూఱడిల్లి యోరీ రాజకులాధమా! యేల యిట్లు ప్రేలెదవు. నీధనంబులం, బ్రాణంబుల నొడ్డి యాడుము. తెలియ నగు నని చెప్పి పునర్ద్యూతంబు నాడి పుష్కరు నోడించి నవ్వుచు వానికిట్లనియె. పుష్కరా, యీరాజ్యమంతయు నాయదియ. ఇపుడు నిష్కంటకం బయ్యె. నీకు దమయంతిం గన్నెత్తి చూడనైనం దగదు. మున్ను నే నోడుటకుఁ గారణంబు నీ సామర్థ్యంబు గాదు. మఱి యది కలికృత్యంబు. దాని నీ వెఱుంగవు. నే నెఱుంగుదుఁ గావునఁ బరదోషమును నీపై నారోపింపను. ఇపుడు నీకుఁ గలసకలధనంబునుం, బ్రాణములను నొడ్డి యోడితివి. అయినను బితృవ్యపు

త్రుండ వగుటంజేసి నీభాగంబు నిచ్చి ప్రాణములతోడ విడిచిపుచ్చెద. సుఖమున ననేకవర్షములు బ్రదుకుము. నీపై స్నేహ మెప్పటియట్ల నాకుఁ గల దనిబోధించి పలుమాఱులు గౌఁగిలించి యనునయించె. అటఁ బుష్కరుఁడు నలున కభివాదము లొనరించి కృతాంజలియై పుణ్యశ్లోకా, కరుణించి ప్రాణములను, రాజ్యమును నొసంగుటంజేసి ముదం బయ్యె. పదివేలయేఁడులు సుఖమున మనుము. నీకీర్తి యవిశ్రాంతంబు జగంబుల నెఱసెడి నని మనవి చేసి యచట నొకనెల యుండి నలనృపాలుననుజ్ఞఁ గొని మహాసేనతోడ నిజనగరంబునకుఁ జనియె

పదంపడి నలనృపాలుఁడు సకలాలంకారవిలసితం బైనపురముఁ బ్రవేశించుటయు మంత్రులుం, బౌరజానపదాదిసకలజనులు నరుదెంచి కేల్దోయి మొగిచి నేఁడుగదా పురంబునకును, దేశములకును నెలమి మిగిలె. అమరు లింద్రు నుపాసించు చాడ్పున మే మందఱము నీనృపాలుఁ గొలువవచ్చితిమి. ధన్యుల మైతి మనుచున్నంత నిషధేశుఁడు వారి నూరార్చి నెమ్మది నుండె. అయ్యవసరంబున భీమభూపాలుఁడు నలునివిజయం బెఱింగి దమయంతిని, దదపత్యంబులను మహాసేనతోడఁ బంపఁగ వారు వీటి మహోత్సవంబు సెలంగ నగరు చేరుటయు నలనృపాలుండు వారితోడఁ గూడి పరమానందసాంద్రుండై విధియుతముగ ననేకయజ్ఞముల నాచరించి యింద్రవైభవము మెఱయ రాజ్య మేలి జంబూద్వీపమునందెల్ల సుప్రసిద్ధుం డయ్యె.

ధర్మనందనా, నలుఁడు జూదమునఁ నే యోడి భార్యామాత్రసహాయుండై కానలకుఁ బోయి పడయరానియిడుమలనెల్లఁ బడసి తుది సకలసౌఖ్యముల ననుభవించె. నీవో వేదపారగు లయినబ్రాహ్మణు, లత్యంతవీరు లయినతమ్ములు, పాంచాలియు సహాయులై యుండ ధర్మమునే చింతింపుచు నియ్యరణ్యమున సుఖించుచున్నవాఁడవు. ఇందు నీకు శోకం బేల? పురుషార్థములయస్థిరత్వముఁ బరిశీలించి తదీయోదయవ్యయములకుఁ జింత సేయవలదు. పెద్దలు దైవవైషమ్యమునఁ బౌరుషంబు విఫలం బైన విషాదంబుఁ జెందరు. ఈయుపాఖ్యానంబు పఠించినవారు వినినవారును సర్వార్థములం బొరయుదురు. పుత్రపౌత్రులం బడయుదురు, మనుష్యులలో నుత్తమత్వంబుఁ గాంతురు.

క॥ అనఘుని గర్కోటకనా। గు, నలమహీపాలు, సర్వగుణయుత దమయంతిని, ఋతుపర్ణుని గీర్తిం। చినఁ గలికలుషములు రూపుచెడుఁ గురువర్యా॥

నీవు నెప్పుడు మనంబున జూదము కారణంబుగాఁ జెడితిఁగా యనివనరుచుందువు. నే నక్షహృదయం బెఱింగినవాఁడ. నీకు దాని నుపదేశింతు. నాభయంబు వాయుమని చెప్పి ధర్మరాజునకు బృహదశ్వుఁ డక్షహృదయం బుపదేశించి యశ్వశిరస్తీర్థంబునకుఁ జనియె. అట నర్జునుతీవ్రవ్రతానుష్ఠానంబు విని ధర్మరాజు వానిం

గుఱించి బ్రాహ్మణుల విచారింపుచుండె నని వైశంపాయనుండు వివరింప నాక ర్ణించి జనమేజయమహీకాంతుండు సంతుష్టస్వాంతుం డయ్యె.

మ॥ శ్రుతివాక్యంబుల కెందఱే విబుధవర్యు ల్వాదులాడంగ వి
ప్రతిపత్త్యుక్తుల వేఱువేఱుగ నభిప్రాయంబు లూహించి యు
ద్ధతయుక్తు ల్దగ నెన్నియే మతములం గల్పించినం దన్మతా
గ్రతతిం గమ్యుఁ డెవండొ వాని దలఁతుం ద్వైతవ్యపేతు న్మదిన్ ॥

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారముద్దువేంకటమహీపాల కరు ణాపురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషా కవిత్వచమత్కారపరి తోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండి తీధుర్యలక్ష్మీనృసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజన విధేయ, వేంక టరంగనామధేయ ప్రణీతం బైన శ్రీమదాంధ్ర వచనభారతంబునం దరణ్యపర్వమునఁ బాండవవనప్రవేశంబును, ధర్మరాజసూర్యా రాధనంబును, గిమ్మీరవధయుఁ, గృష్ణపాంచాలాభిగమనం బును, సౌంభకాఖ్యానంబును, వ్యాసోపదేశంబును, నర్జున తపోవనగమనంబును, గిరాతార్జునయుద్ధంబును, బా శుపతాస్త్రసంపాదనంబును, లోకపాలసందర్శనంబు ను, దివ్యాస్త్రలాభంబును, స్వర్గగమనంబును, యు ధిష్ఠిరపరిదేవనంబును, నలోపాఖ్యానంబును, నక్షహృదయ విద్యాగ్రహణంబునన్నది

ప్రథమాశ్వాసము.

శ్రీకాళహస్తీశ్వరాయనమః.

## ద్వితీయాశ్వాసప్రారంభము.

క॥ శ్రీమ న్నిరుపాధిక నిజ
ధామా విస్ఫురణ సమయ దర్శిత లోక
స్తోమ వివిధ ప్రచార ని
ష్కామామల నిత్య చిత్సుఖ ప్రచురాత్మా॥
దేవా నాయెడం బ్రసన్నుండ వగుము.

తదనంతరమున జనమేజయనరవరుండు వైశంపాయనమునివరుం జూచి మునివరేణ్యా, ద్వాదశాదిత్యులలో విష్ణువుచాడ్పునఁ దమలో నుత్తముఁడైన యర్జునుఁడు తపోనుష్ఠానార్థం బరిగినపదపడి పాండవు లవ్వనమునం దెవ్విధమున వర్తించి రనియడుగ నామునియానృపతి కిట్లనియె. నరేంద్రా, కుబేరవిరహితం బైనచైత్రరథంబుమాడ్కి నర్జునవిరహితంబై సొంపుదప్పియున్న యాకామ్యకవనమున ధర్మజభీమనకులసహదేవులు మేధ్యమృగముల వధించి తెచ్చి సుపాచితంబులయినతదామిషంబులను, వన్యాహారములనుం బ్రాహ్మణులకు నివేదించి తచ్ఛేషం బుపయోగించువా రర్జునుం జూడఁ గోరుచుఁ, దచ్చరిత్రంబులఁ జెప్పికొనుచుఁ, దద్గుణంబుల నుగ్గడింపుచుఁ, దదాగమనంబ ప్రతీక్షింపుచుండ నొక్కనాఁడు నారదుఁడు నిజమహిత తేజమున దెసలెల్ల వెలింగింపుచు సన్నిహితుఁడగుటయు ధర్మరాజు భ్రాతృసహితుండు పత్నీసహాయుండునై యథాన్యాయంబుగఁ బూజించె. అమ్మునీంద్రుం డాపూజలం గ్రహించి సావిత్రి వేదములంబోలె, సూర్యప్రభ మేరువునుంబోలె వారి నెపుడు నెడఁబాయనియాజ్ఞసేనినిం బ్రసన్నదృష్టి నాదరించి ధర్మరాజును నిర్దేశించి యోధార్మికవరేణ్యా, నీకావించినపూజలకు మెచ్చితి. ఏయర్థము చెప్పుము ననియడుగ నతండు మునీంద్రా, సర్వలోకాభిపూజితుఁడైననీవు సంతుష్టుండైనఁ గృతార్థుఁడనైతి. నాయెడ ననుగ్రహంబుగలదేని తీర్థయాత్రాఫలంబు వివరింపుము. అందు నా కెప్పుడును సందియంబుగల దనిన ధర్మరాజునకు నారదుఁ డిట్లనియె.

### నారదుఁడు ధర్మరాజునకుఁ దీర్థయాత్రాఫలంబు చెప్పుట.

ధర్మనందనా, తొల్లి భీష్ముఁడు దేవర్షిగంధర్వాదిసేవితం బైనగంగాద్వారంబునఁ బితృప్రీణనార్థంబు సుస్నాతుండై దేవర్షిపితృతర్పణంబులం జేయుచు నియతవ్రతుండై యుండునంత నొక్కనాఁ డచ్చోటికి బులస్త్యుఁ డరుదేర నతం

డమ్మునిని విధియుతంబుగ నర్చించి మునీంద్రా, భీష్ముఁడ, భవద్దాసుఁడ, మీదర్శ నంబున సర్వపాపములఁ బాసితి ననివిన్నవించి ప్రాంజలియై యుపాసించియుండఁ బులస్త్యుండు గాంగేయా, భవద్వినయశమాదిసద్గుణంబులకును, బితృభక్తికిని మెచ్చితి. భవదీయపితృభక్తిప్రభావంబున నే నీకు సన్నిహితుఁడ నైతి. నాదర్శ నము మోఘము గాదు. నీకోరినదానిం జేయుదు ననిన భీష్ముఁడును నీయట్ల తీర్థ యాత్రాఫలం బడుగ నతండ తని కిట్లనియె. జితేంద్రియు, లహంకారరహితులు, పరిత్యక్తప్రతిగ్రహులు, నిత్యసంతుష్టులు, లఘుభోజనులు, నిరారంభులు, సత్యర తులు, దృఢవ్రతులు, సర్వభూతముల నాత్మౌపమ్యమునఁ జూచువారు నగుమహా త్ములు యజ్ఞాచరణఫలంబును, దీర్ఘయాత్రానుకృతంబునుం బడయుదురు. అంద ఱకు నలవిగాదు. తీర్థయాత్రలఁ జేయనివారు, దానము లొనరింపనివారును దరిద్రు లగుదురు. బహుయజ్ఞాచరణంబును, దీర్ఘసేవనంబును సమఫలంబులు. అందు యజ్ఞము లనేకోపకరణసంభృతంబులు, బహుద్రవ్యసాధ్యంబులు, దరిద్ర దుర్లభంబులు. మఱియు నగ్నిష్టోమాదిఫలంబుకంటెఁ దీర్ఘసేవనఫలం బధికంబు, తత్ప్రకారంబు వినుము. * ఈలోకంబునఁద్రైలోక్యవిదితం బైనపుష్కరం బను తీర్థంబు గలదు. అందు దశకోటిసహస్రతీర్థంబులు సంధ్యాత్రయంబునందు సన్ని హితంబు లగు. బ్రహ్మదేవుఁ డెల్లపుడు నచ్చట వసించియుండు. వసురుద్రాదిత్య సాధ్యమరుద్గంధర్వాప్సరోగణంబు లచ్చట నుండు. మహర్షు లనేకు లాతీర్థంబు సేవించి యందు వసించి సిద్ధు లయిరి. అందు సుస్నాతుండై పితృదేవార్చనంబు సల్పినయతం డశ్వమేధఫలంబుకంటెఁ బదిమడుంగు లెక్కువగుఫలంబుఁ బడయు. తనకు లభించినయాకులు, గాయలు, గడ్డలైన నెక్కబ్రాహ్మణునకేనియు నసూ యలేక శ్రద్ధమైఁ గుడువఁ బెట్టినపుణ్యాత్ముఁ డుభయలోకముల సుఖించు. అశ్వమే ధఫలంబు నొందు. అందుఁ గార్తికపూర్ణిమయందు స్నాతుఁ డైనవానికి నూతేం డ్లగ్నియందు వ్రేల్చిన ఫలంబును, బునర్జననరాహిత్యంబునుం గలుగు. అందు స్నాన మాడినమాత్రన సర్వతీర్థావగాహనఫలంబు లభించు. సురలకెల్ల మధుసూ దనుఁ డాదియగురీతి సకలతీర్థంబులకుం బుష్కరం బాది యనం బరఁగు. అందుఁ గారణంబు దెలియరాదు. అట్టిపుష్కరంబులు మూఁడు గలవు. అన్నియుం దుల్య ఫలంబులు. పుష్కరయాత్రయందుఁ దపోదానవాసంబులు దుష్కరంబులు. సాయంప్రాతఃకాలములందుఁ గృతాంజలియై త్రిపుష్కరముల ధ్యానించునతఁడు పుణ్యలోకంబు సాధించు. అందుఁబండ్రెండేండ్లు శుచియై నియతవ్రతంబున వసిం చినపుణ్యాత్ముఁడు సర్వక్రతుఫలంబును, బ్రహ్మలోకంబునుం బడయు. కావున

* ఈతీర్థయాత్రా విషయమందు సంస్కృతభారతమునకును దెనుఁగుభారతమునకును భేదమ గపడుచున్నది. ఇందుకు బహుకాలపాఠభేదము కారణముగానుండును.

నందుఁ బంద్రెండుదినములయిన నియతాహారుండై యటఁ బ్రదక్షిణంబుగ జంబూమార్గమునకుఁ జని యేనునాళ్లు స్నానమాడిన నశ్వమేధఫలంబును, దుర్గతిరాహిత్యంబును, నుత్తమసిద్ధియుం గలుగు. బదరికాశ్రమంబు సేవించిన బ్రహ్మలోకప్రాప్తి యగు. అగస్త్యసరస్సునందుఁ బితృదేవతల నర్చించి త్రిరాత్రోపవాసం బొనరింప నగ్నిష్టోమఫలంబు చేకూఱు. కణ్వాశ్రమంబు, ధర్మారణ్యంబునుం బ్రవేశించి సర్వపాపవినిర్ముక్తుం డగు. నియతవ్రతుండై యందుఁ బితృదేవార్చనంబుఁ గావించిన యజ్ఞఫలంబంతయుం గలుగు. అట వలపలించి యయాతిపతనంబును, మహాకాళంబును, గోటితీర్థంబును సేవించిన నశ్వమేధఫలం బగు. రుద్రవటం బనుశివతీర్థంబున మహాదేవుని భజించిన గోసహస్రదానఫలం బగు. గణముల కధిపతి యగు. నర్మదను, దక్షిణసింధునుం, జర్మణ్వతినిని సేవించి జితేంద్రియుఁడు నియతాశనుండునై పితృదేవతర్పణంబుఁ గావించిన నగ్నిష్టోమఫలం బగు. పుడమిపైఁ దొలుదొల్త నగపడినవివరంబు వసిష్ఠాశ్రమంబు నైనయర్బుదంబు సేవించిన గోసహస్రదానఫలంబగు. పింగతీర్థం బాడినఁ గపిలగోశతదానఫలంబు లభించు. సకలామరులకు ముఖంబైన యగ్ని యెచ్చట నిత్యసన్నిహితుం డయ్యె నాప్రభాసతీర్థంబున స్నాతుండైన నగ్నిష్టోమాతిరాత్రఫలంబులు లభించు. సరస్వతీసాగరసంగమంబునఁ దీర్థమాడి పితృదేవతలఁ దన్పుచుఁ ద్రిరాత్రములు వసింప గోసహస్రదానఫలంబు, స్వర్గలోకసుఖంబు, నశ్వమేధసుకృతంబునుం జేకూఱు. దుర్వాసుఁడు విష్ణువునకు వర మొసంగుటం జేసి వరదానం బనం బరఁగినతీర్థం బాడిన గోసహస్రదానఫలం బగు. ద్వారవతియందుఁ బిండారకంబున స్నానమాడిన బహుసువర్ణలాభం బగు. ఇప్పటికి నాతీర్థమునఁ బద్మములంబోనిముద్రలుం, ద్రిశూలాంకము లగుకమలములుం గలవు. మహాదేవుఁడు సన్నిహితుండై యుండు. సింధుసాగరసంగమంబున స్నాతుండై దేవర్షిపితృతర్పణం బొనర్చిన వరుణలోకప్రాప్తి యగు. శంకుకర్ణమున శంకుకర్ణేశ్వరుం బూజింప నశ్వమేధఫలంబుకంటె దశగుణం బైన సుకృతంబు గలుగు. అటఁ బ్రదక్షిణంబుగ దమికిఁ జని యందు స్నాతుండై బ్రహ్మాదిసేవితుం డైనపరమేశ్వరు నర్చించినం బుట్టిననాఁటంగోలెఁ జేసినపాపంబులెల్ల నశించు. హయమేధపుణ్యంబు లభించు. తొల్లి విష్ణుండు దైత్యదానవుల సంహరించి యెందు శౌచం బాచరించెనో యావసుధారం బ్రవేశించిన నశ్వమేధఫలం బగు. స్నాతుండై దేవర్షిపితృదేవతలకుఁ దర్పణంబుఁ జేసిన విష్ణులోకప్రాప్తి యగు. వసుతీర్థంబున స్నానపానంబులు సల్పిన వసుసమ్మతుం డగు. సింధూత్తమతీర్థంబున స్నాన మాచరించిన బహుసువర్ణలాభం బగు. భద్రతుంగము సేవించిన బ్రహ్మలోకంబుఁ బడయ నగు. శక్రకుమారీతీర్థంబునను, రేణుకాతీర్థంబునను

మజ్జనం బాడిన స్వర్గంబు గలుగు. పంచనదంబు సేవింపఁ బంచయజ్ఞఫలంబు లభించు. భీమాస్థానమున స్నానంబుఁ జేసినఁ బునర్జననరాహిత్యం బగు. జన్మంబు గలుగునేనియుఁ బట్టంపుదేవికిఁ గొడుకుగాఁ బుట్టు. మఱియు గోలక్షదానఫలంబు సిద్ధించు. శ్రీకుండమున బ్రహ్మకు మ్రొక్కిన గోసహస్రదానఫలం బగు. సౌవర్ణరాజతమత్స్యవిరాజితం బయినవిమలతీర్థంబున స్నానమాడిన సర్వపాపవినిర్ముక్తుండై యుత్తమలోకంబుఁ బడయు. వితస్తానదిని, గాశ్మీరంబులందు వితస్తాఖ్యం బయినతక్షకభవనంబును సేవించి తత్తీర్థంబున స్నానమాచరించిన వాజపేయఫలంబు సిద్ధించు. బడబాతీర్థంబునందు సాయంకాలమున స్నాతుండై సంధ్య నుపాసించి యథాశక్తి చరునిర్వపణం బొనరించి యగ్నిహోత్రంబున హోమంబుఁ గావింప నదిపితృదేవతల కక్షయ్యదానం బగు. తొల్లి యందు దేవగంధర్వరాక్షస పితృసిద్ధవిద్యాధరాదులును, బ్రహ్మదేవుఁడును విష్ణుప్రీణనంబుపొంటె వర్షసహస్రంబు దీక్ష వహించి యేడేడుబుక్కల జపించి చరుహోమంబుఁ జేయఁగఁ బ్రసన్నుండై నారాయణుండు వారి కభీష్టంబు, లష్టగుణైశ్వర్యంబు నొసంగి యచ్చటన యంతర్హితుం డగుటం జేసి యీతీర్థంబు సప్తచరు వనం బరఁగె. అందుఁ జరుహోమంబు గోలక్షదానంబుకంటెను, రాజసూయశతంబుకంటె, నశ్వమేధసహస్రంబుకంటె నుత్తమంబు. రుద్రపదంబున మహాదేవు నారాధింప నశ్వమేధఫలం బగు. మణిమంతంబున సమాహితబ్రహ్మచర్యుండై యొకనాఁ డుండిన నగ్నిష్టోమఫలంబు లభించు. అర్ధయోజనవిస్తారంబు పంచయోజనాయతంబు నగుదేవికానదితీరంబునఁ ద్రిశూలపాణిస్థానంబును, గామాఖ్యంబును, యజనతీర్థంబును, యాజనతీర్థంబును, బ్రహ్మవాలుకంబును, బుష్పాంభస్తీర్థంబును సేవించి స్నానమాచరించి మహాదేవు నారాధించి, చరునివేదనంబుఁ జేసిన శీఘ్రప్రసిద్ధి యగు. బ్రహ్మాదినిర్జరులును, సిద్ధులు నెందు నియమంబున దీర్ఘసత్రంబులు సలిపిరో యాదీర్ఘసత్రతీర్థంబు మెట్టిన రాజసూయాశ్వమేధఫలం బగు. సరస్వతి యెచ్చోట నంతర్హిత యయ్యె నావినశనతీర్థంబునందు స్నాతుండు సత్ఫలంబు వడయు. ఆసరస్వతి యేయేచోటులఁ బ్రకాశ మొందె నాచమసోద్భేద, శివోద్భేద, నాగోద్భేదతీర్థంబులం గృతస్నానుండు క్రమంబున నగ్నిష్టోమఫలంబును, గోసహస్రదానసుకృతంబును, నాగలోకంబునుం బొందు. ఆసరస్వతియం దెచ్చోట శశరూపచ్ఛన్నంబు లయినపుష్కరంబులు ప్రతివత్సరమునందునుం గార్తికపూర్ణిమ యందుఁ గనఁబడునో యట్టిశశదానతీర్థంబునఁ గృతావగాహుండు శశివలె వెలుంగు. గోసహస్రదానపుణ్యంబుఁ గాంచు. కుమారకోటిం దీర్థమాడి పితృదేవార్చనరతుండు కులంబు నుద్ధరించు. కోటిసంఖ్యాకు లయినమును లహంపూర్వికమై శివదర్శనార్థంబు పోవఁగ నెచ్చోటఁ బ్రసన్నుండై యమ్మహేశ్వ

రుండు కోటిరూపంబుల గ్రహించి యందఱకు నొక్కతేప లోచనగోచరుం డై యున్న నేన యీశ్వరుం గనుంగొంటి నని సంతుష్టచిత్తు లయినమునుల పూజలకు మెచ్చి నానాఁట ధర్మంబు వృద్ధిఁ గాంచఁగ వరము లొసంగి వారల ననుగ్రహించెనో యారుద్రకోటి తీర్థంబున సుస్నాతుం డశ్వమేధఫలంబుఁ బొందు. కులంబు నుద్ధరించు. ఎందు బ్రహ్మాదినిర్జరులు, ఋషులును నారాయణు నారాధింపం జైత్రశుక్లచతుర్దశియందు సన్నిహితు లగుదురో యట్టిసరస్వతీసంగమంబునఁ గృతస్నానుండు బహుసువర్ణంబును, బ్రహ్మలోకంబును బడయు. ఋషు లెచ్చట సత్రముల సమాప్తిఁ జెందించిరో యట్టియవసానతీర్థంబు సేవించినయతండు గోసహస్రదానఫలంబుఁ బొందు. సరస్వతికి దక్షిణంబు, దృషద్వతికి నుత్తరంబు, రామహ్రదములకు మచక్రుకమునకును మధ్యస్థితంబు, తరంతుకారంతుపంబుల కంతర్గతంబు నగు దేశంబు కురుక్షేత్రంబు నాఁబడు. దానిం జూచినమాత్రన జంతువులెల్ల సకలపాపంబులం బాయు. విశేషమేల? “కురుక్షేత్రమునకుఁ బోయెద నచట నుండెద” నని తలంచువాఁడు సర్వపాపవినిర్ముక్తుఁ డగు. కురుక్షేత్రపరాగంబులు మేన సోఁకినను దుష్కృతము లడఁగు. అందు వసించువారు నాకలోకవాసు లే. ఆకురుక్షేత్రంబున శ్రద్ధతో నొక్కమాసంబు వసించునతఁడు రాజసూయాశ్వమేధఫలంబులఁ బడయు. ఆకురుక్షేత్రంబె బ్రహ్మాదిసన్నిధానంబునం జేసి బ్రహ్మక్షేత్రం బనియు, బ్రహ్మోత్తరవేదియనియు, శమంతపంచకంబనియుం బరఁగు. అందే మంకణకుం డనుద్వారపాలు నమస్కరింప గోసహస్రదానఫలం బగు. సంతతహరినివాసం బై నవిష్ణుస్థానంబునఁ గృతావగాహుండై హరి నర్చించినయతం డశ్వమేధఫలం బెనయు. విష్ణులోకంబునుం బడయు. పారిప్లవతీర్థం బాడిన నగ్నిష్టోమాతిరాత్రఫలం బగు. పృథివీతీర్థంబునందును, శాలూకినీతీర్థంబునందును, దశాశ్వమేధతీర్థంబునందునుం గృతమజ్జనుండు గోసహస్రదానఫలంబు సంపాదించు. సర్పదేవియందు నాగతీర్థ మాడిన నగ్నిష్టోమఫలం బగు. అందుఁ దరంతుకుఁ డనుద్వారపాలు నవలోకించి యొక్కరాత్రి వసించిన గోసహస్రదానఫలంబు సిద్ధించు. పంచనదగమనంబునను గోటితీర్థస్నానంబునను నశ్వమేధఫలం బగు. అశ్వతీర్థసేవనంబున సురూపం బగు. వరాహతీర్థస్నానంబున నగ్నిష్టోమఫలం బగు. జయంతియందు సోమతీర్థాభిషేకంబున రాజసూయఫలం బగు. ఏకహంసతీర్థావగాహనంబున గోసహస్రదానఫలంబుఁ బొరయు. కృతశౌచతీర్థంబునఁ గృతశౌచుఁడు పౌండరీకఫలంబుఁ బొందు. ముంజవటంబున శివసాంనంబునం దేకరాత్రోపవాసంబునఁ బెక్కండ్ర కాధిపత్యంబు గలుగు. యక్షిణీతీర్థస్నానంబున సర్వకామసిద్ధి యగు. తొల్లి పరశురాముఁడు సకలక్షత్రియక్షయంబుఁ గావించి తద్రుధిరంబున నేను మడుఁగులు నిర్మించి పితృతర్ప

ణంబుఁ జేయఁగ నాపితృదేవతలు మెచ్చి యాజామదగ్న్యునకుఁ బొడచూపి యతనికోరికమెయి క్షత్రియవధపాతకక్షయంబు, నామడుఁగులకుఁ బుణ్యతీర్థత్వంబునుం బ్రసాదించి యచ్చోటన వా రంతర్హితులై యుండుటంజేసి పవిత్ర తీర్థంబు లయినపంచహ్రదంబులం గృతస్నానుండై పితృతర్పణంబుఁ గావించి పరశురాము నర్చించినఁ బితృప్రీతియు, బహుసువర్ణప్రాప్తియుం గలుగు. వంశమూలతీర్థంబు సేవించినయతండు వంశంబు నుద్ధరించు. కాయశోధనతీర్థసేవనంబున శుద్ధదేహుండై యుత్తమలోకంబులం బడయు. మున్ను విష్ణుం డెచ్చట వసించి లోకముల నుద్ధరించెనో యట్టిలోకోద్ధారతీర్థం బున స్నానము చేసినవాఁడు పుణ్యలోకముల నుద్ధరించుకొనును. శ్రీతీర్థంబునఁ గృతస్నానుండై పితరులఁ బూజించిన శ్రీ లభించు. కపిలాతీర్థమందు స్నానమాడి పితృదేవతల నర్చించినఁ గపిలగోసహస్రదానఫలం బగు. సూర్యతీర్థంబునఁ గృతావగాహుండై పితృదేవతల నర్చించి నాఁ డుపవసించిన నగ్నిష్టోమఫలంబు సూర్యలోకప్రాప్తియు నగు. గోభవనతీర్థస్నానంబున గోసహస్రదానఫలం బగు. శంఖినీతీర్థస్నానంబున నుత్తమరూపం బగు. యక్షేంద్రతీర్థంబున స్నాతుండై తరండకుఁ డనుద్వారపాలు నవలోకించిన నగ్నిష్టోమఫలం బగు. బ్రహ్మావర్తస్నానంబున బ్రహ్మలోకప్రాప్తి యగు. పితృసన్నిధానస్థానం బైనసుతీర్థకంబున స్నానంబుఁ జేసి పితృదేవతల నర్చింప నశ్వమేధఫలంబును, బితృలోకప్రాప్తియుఁ గలుగు. అంబుమతియందును, సుతీర్థకంబునందును, గాశీశ్వరతీర్థంబునందునుం గృతావగాహుండు సర్వవ్యాధివినిర్ముక్తుండై బ్రహ్మలోకమున సుఖించు. మాతృతీర్థస్నానంబున సంతతిసంపదభివృద్ధి యగు. శీతవనంబును, శ్వావిల్లోమాపనయనంబును సేవించి యయ్యుదకంబు శిరస్సునఁ బ్రోక్షించికొనినం బవిత్రుండగు. దశాశ్వమేధకతీర్థస్నానంబునఁ బరమగతిం జెందు. వ్యాధశరపీడితంబు లయినకృష్ణమృగంబు లెందు స్నానమాడి మనుష్యరూపంబుఁ దాల్చెనో యట్టిమానుషతీర్థంబున బ్రహ్మచర్యసమాధానంబునం గృతమజ్జనుండు సర్వపాపవినిర్ముక్తుండై స్వర్గలోకంబుఁ బొందు. ఆమానుషతీర్థంబునకుఁ దూర్పునం గ్రోశమాత్రదూరంబున నుండునాపగాతీర్థంబునందు స్నానమాడి పితృదేవతల నుద్దేశించి శ్యామాకాన్నంబునైన బ్రాహ్మణులకుఁ బెట్టువాఁడు కోటిబ్రాహ్మణాన్నదానఫలంబును, నగ్నిష్టోమఫలంబునుం బొందును. బ్రహ్మోదుంబరంబును, సప్తర్షికుండంబులను, గపిలకేదారంబును సేవించినవా రంతర్ధానశక్తిం బడసి తుది బ్రహ్మలోకంబుఁ గాంతురు. కోటితీర్థసన్నిధానస్థానం బైనసరకతీర్థంబునం గృష్ణపక్షచతుర్దశియందు వృషధ్వజు నారాధించిన సర్వాభీష్టసిద్ధియు, స్వర్గలోకప్రాప్తియుం గలుగు. రుద్రకోటికూపప్రహదేలాస్పదతీర్థంబు లాడి పితృదేవతల నర్చించిన దుర్గతి దొలఁగు. వాజపేయఫలంబు గలుగు. కిందానతీర్థస్నాన

మున బహుదానఫలం బగు. కింజప్యతీర్థస్నానంబున బహుజపఫలం బగు. కల శతీర్థస్నానంబున నగ్నిష్టోమఫలం బగు. సరకతీర్థంబునకుఁ దూర్పున నుండునంబా జన్మంబు నాఁబడునారదతీర్థంబున స్నాన మాచరించి తనుత్యాగంబుఁ జేసినయ తండు నారదానుజ్ఞాతుండై యుత్తమలోకంబులం బడయు. శుక్లపక్షదశమినాఁడు పుండరీకతీర్థం బాడినఁ బౌండరీకఫలంబు లభించు. త్రివిష్టపతీర్థంబున వైతరణిం గృతావగాహుండై శూలపాణి నర్చించినఁ బాపంబులఁ బాసి పుణ్యగతిం బడయు. ఎందు బహువర్షంబు లమరులు తపంబు సల్పిరో యట్టిఫలకీవనతీర్థంబందును, దృషద్వతియందును, పాణిఖాతంబునందునుం గృతస్నాను లగ్నిష్టోమాతిరాత్రఫ లంబులఁ బడయుదురు. సర్వదేవతీర్థస్నానంబున గోసహస్రదానఫలం బగు. ద్విజా ర్థంబుగ వ్యాసుఁ డెందు సర్వతీర్థముల మిశ్రీకరించెనో యట్టిమిశ్రకతీర్థమున స్నాన మాచరించి నియతవ్రతంబు సల్పిన గోసహస్రదానఫలం బగు. మధువటియందు దేవీతీర్థమున స్నాన మాడి పితృదేవతల నర్చించినం దేవ్యనుగ్రహంబున గోసహ స్రదానఫలం బగు. కౌశికీదృషద్వతీసంగమస్నానంబున సర్వపాపవిముక్తుం డగు. శుకయోగీంద్రుఁ డద్వైతభావనచే సర్వభూతాంతరస్థితుఁ డగుటంబట్టి వేఁడుగ నగపడమింజేసి పుత్రవియోగవిషాదవ్యాకులుం డై నపరాశరాత్మజుం డెచ్చోట నొడలు విడువఁ బూని దేవప్రేరణంబునఁ గ్రమ్మఱ నయ్యుద్యమంబు మానెనో యట్టివ్యాసస్థలీతీర్థమున స్నానంబుఁ జేయఁగ గోసహస్రదానఫలం బగు. కిందత కూపమను తీర్థంబునఁ గృతావగాహుండై తిలప్రస్థదానంబుఁ జేసిన ఋణత్రయ విముక్తుండై పరమగతిం బడయు. దేవీతీర్థస్నానంబున గోసహస్రదానఫలం బగు. అహస్సు సుదినంబు ననురెండుతీర్థంబుల స్నానంబుఁ జేసిన సూర్యలోకప్రాప్తి యగు. మృగధూమంబున గంగయందుఁ గృతావగాహుండై మహాదేవు నారా ధింప నశ్వమేధఫలం బగు. వామనక్షేత్రంబున విష్ణుపదంబునస్నాతుండై వా మనుం బూజించిన సర్వపాపవిముక్తుండై విష్ణులోకం బెనయు. కులంపునంబునఁ దీర్థమాడినఁ గులంబు పావనంబగు. పవనహ్రదం బనఁ బరఁగుమరు త్తీర్థంబున స్నానముఁ జేసిన వాయులోకప్రాప్తి యగు. అమరతీర్థంబున నవగాఢుండై యమ రేంద్రు నర్చించిన నాకలోకపూజితుం డగు. శాలిహోత్ర, శాలిసూర్యతీర్థం బులం దవగాహనంబున గోసహస్రదానఫలం బగు. శ్రీకుంజం బనుసరస్వతీతీర్థం బునం గృతావగాహనుం డగ్నిష్టోమఫలంబు సాధించు. నైమిశారణ్యవాసు లగు మహర్షులు తొల్లి తీర్థయాత్రానిమిత్తముగఁ గురుక్షేత్రంబున కరిగినవారు సరస్వ తియందుఁ గుంజముఁ గావించుటంజేసి నైమిశకుంజంబు నాఁబరఁగినతీర్థరాజంబునం గృతమజ్జనుం డగ్నిష్టోమఫలంబుఁ జెందు. కన్యాతీర్థస్నానమున గోసహస్రదానఫలం బగు. బ్రహ్మతీర్థస్నానమున బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణ్యంబుఁ గాంచు. బ్రాహ్మణుఁ

డు త్తమగతిం జెందు. సోమతీర్థమ జ్జనంబున సోమలోకప్రాప్తి యగు. ఎందు మంక ణకుం డనుమహర్షి కుశాగ్రక్షతం బై నతనకరంబున శాకరసంబు స్రవించుటం జూచి సంతుష్టుండై న ర్తనంబుఁ జేయఁగ నమ్ముని తేజో మోహితంబై జగంబంతయు నృత్యం బొనరింపఁగ బ్రహ్మాదు లీశ్వరుసన్నిధికిఁ బోయి దేవా! మంకణకుని నృత్యము నివా రించి జగములకు మోహము వాపవే యని ప్రార్థించుటయు నమ్మహేశ్వరుఁడు దేవ హితార్థం బమ్మునికడకువచ్చి యేలనృత్యంబుఁ జేసెద వనియడిగి కరమున శాకర సము వెడలుటకుఁ గడుసంతుష్టుండై యతండు నృత్య మొనరించుట నెఱింగి యో హెూ! యింతమాత్రన సంతసం బేల యిది వింతయె యిదెచూడు మనిచెప్పి కొన వ్రేలందన బొటనవ్రేలు తాడించి భస్మక్షతం బయినయంగుష్ఠంబున స్వర్ణ ర సంబు వెలువరించి యంపుల కెంతయు నివ్వెఱఁ గందినయమ్ముని కావించినపరమ స్తోత్రంబునకు మెచ్చి పరమేశ్వరుం డతనికిఁ దపోవృద్ధి, నయ్యాశ్రమంబునఁ దన నివాసంబును, ద త్తీర్థస్నాతులై ద న్నర్చించినవారికి సర్వాభీష్టసిద్ధినిం బ్రసాదిం చెనో యట్టి స ప్తసారస్వతతీర్థంబునఁ గృతస్నానుండై త్రిపురాంతకు నర్చించిన దుర్లభార్థసిద్ధియు సారస్వతలోకప్రాప్తియు నగు. ఎందు బ్రహ్మాదిగీర్వాణులు, కా ర్తి కేయుండు, ఋషులను శుక్రునకుఁ బ్రియంబుగా సంధ్యాత్రితయంబునందు సన్ని హితులయిరో యట్టియౌశనసతీర్థంబునందును, గపాలమోచనతీర్థంబునందును స్నా నమాడినం బాపంబు లెల్ల నశించు. అగ్నితీర్థస్నాతుఁడు కులంబు నుద్ధరించి యగ్ని లోకంబుఁ బడయు. విశ్వామిత్రతీర్థస్నానంబున బ్రాహ్మణేతరుండు బ్రాహ్మణ్యం బెనయు. బ్రాహ్మణుఁడు తనవంశమున నేడుతరములవారి నుద్ధరించి బ్రహ్మలో కంబుఁ బొందు. పృథూదకంబనుకార్తికేయతీర్థంబున స్త్రీపురుషు లెవ్వరైనను స్నాన మాచరించి పితృదేవతల నర్చించిరా వారు జ్ఞానాజ్ఞానకృతంబు లయిన సర్వ పాపంబులు నీఁగి యశ్వమేధసుకృతంబు సాధించి స్వర్గలోకప్రాప్తు లగుదురు. లోకంబునఁ గురుక్షేత్రంబు పుణ్యంబు. అందును సరస్వతి. అందునుం బృథూ దకం బు త్తమంబు. అందు జపపరుండై శరీరంబు విడిచినఁ బునర్జననమరణంబులు గలుగ వని వేదవ్యాసుఁడు, సనత్కుమారుఁడును వచించిరి. అంతకంటెఁ బుణ్య తీర్థంబు వేఱొండు గన్పడదు. మధుస్రవతీర్థస్నానంబున గోసహస్రదానఫలం బగు. సరస్వతీరుణాసంగమతీర్థంబునందు స్నానముఁ జేసి త్రిరాత్రము లుపవసించినం బ్ర హ్మహత్య వాయు. అగ్నిష్టోమాతిరాత్రఫలం బగు. కులమున నేడుతరములవారి కుద్ధరణంబు గలుగు. దర్భి యనువాఁడు విప్రులమొడం గరుణించి యెందుఁ జతు స్సముద్రముల సన్నిహితంబులఁ గావించెనో యట్టియర్ధకీలతీర్థంబునందు వ్రతోప నయనోపవాసక్రియామంత్రసంయోగంబున బ్రాహ్మణుం డగు. స్నానమాత్రం బుననే విద్వాంసుఁడు బహువ్రతాచరణఫలంబుఁ గాంచు. శతసహస్రకంబు, సా

హస్రకంబు ననుతీర్థంబుల స్నాన మొనరించిన గోసహస్రదానఫలం బగు. మఱియు నందు దానోపవాసంబులు సహస్రగుణితంబు లగు. రేణుకాతీర్థంబున స్నాన మాడి పితృదేవతలం బూజింప సర్వపాపవిముక్తుండై యగ్నిష్టోమఫలంబుం గాంచు. విమోచనతీర్థస్నానంబునం బ్రతిగ్రహణదోషంబులెల్లం బాయు. పంచవటియందు వృషధ్వజుం బూజించిన సద్గతి గలుగు, ఎందు బ్రహ్మాదిసురులు కుమారస్వామిని నిర్జరసేనాపతింగ నభిషేకించిరో యట్టి తైజసాఖ్యం బయినవారుణతీర్థంబునందును, దత్పూర్వదేశస్థితం బయినకురుతీర్థంబునందును, స్వర్గద్వారతీర్థంబునందును స్నాన మాచరించినం బాపవిమోచనంబును, బ్రహ్మలోకప్రాప్తియు నగు. బ్రహ్మాదిసురులుం, బార్వతీపరమేశ్వరులు నెందు నిత్యసన్నిహితులయి యున్నవారో యట్టి యనరకతీర్థంబున స్నానముం గావించినం బాపంబులును, దుర్గతియుం బాయు. అందు నారాయణు నారాధించిన విష్ణులోకంబు గలుగు. అతండు సర్వదేవతీర్థం మజ్జన సుకృతంబుం గాంచి సర్వదుఃఖములం బాసి వెలుంగు. స్వస్తిపురప్రదక్షిణంబున గోసహస్రదానఫలం బగు. పావనతీర్థంబు సేవించి పితృదేవతర్పణముం జేసిన నగ్నిష్టోమఫలం బగు. గంగమడువున నొకకూపమున మూండుకోట్లతీర్థంబులు సన్నిహితంబులయి యుండు. అందుం గృతావగాహుండు స్వర్గలోకం బెనయు. స్థాణువటంబునం దాపగాస్నానంబునను, మహేశ్వరార్చనంబునను, నేకరాత్రవాసంబునను గులంబు నుద్ధరించి గణమున కాధిపత్యంబుం బడయు. బదరీపాచనం బనువసిష్ఠాశ్రమంబునం ద్రిరాత్రము లుపవసించి బదరీఫలముల భక్షించినం ద్వాదశవర్షంబులు బదరీమాత్రాహారంబునం గలుగుఫలంబు లభించు. ఏకరాత్రతీర్థమున నేకరాత్రోపవాసంబున బ్రహ్మలోకప్రాప్తి యగు. ఆదిత్యాశ్రమతీర్థమున మజ్జనంబు చేసి యాదిత్యుం బూజించినయతండు కులంబు నుద్ధరించి యాదిత్యలోకగతుం డగు. సోమతీర్థస్నాతుండు సోమలోకగతుం డగు. అంగిరసుం డెందు సారస్వతసిద్ధికై మునింగె నట్టిదధీచతీర్థంబున మజ్జన మొనరించిన సారస్వతసిద్ధియు, నశ్వమేధఫలంబునుం గలుగు. కన్యాశ్రమంబునం ద్రిరాత్రోపవాసంబునం గన్యాశతంబును, స్వర్గలోకంబును లభించు. ప్రతిమాసంబున నమావాస్యయందు బ్రహ్మాదిసురులును, భౌమాంతరిక్షంబు లయినసర్వతీర్థంబులును సన్నిధియగుటం జేసి సన్నిహతి నాంబడుతీర్థంబునందు సూర్యగ్రహణకాలంబున స్నాన మాచరించి శ్రాద్ధం బొనర్చినవారు సర్వయజ్ఞఫలంబుం గాంతురు. నిఖిలపాపవిముక్తు లగుదురు. పద్మవర్ణవిమాన మారోహించి బ్రహ్మలోకగతు లగుదురు. అందు మచక్రుకుండనుద్వారపాలుం బ్రణమిల్లి కోటితీర్థం బాడిన బహుసువర్ణలాభం బగు. గంగాహ్రదతీర్థస్నానంబున రాజసూయాశ్వమేధఫలం బగు. నైమిశతీర్థస్నానంబున సర్వపాపవిముక్తి యగు. పార్థివతీర్థంబులలో నైమిశం, బాంతరిక్షతీర్థంబులలోఁ బు

స్కారంబు, త్రైలోక్యతీర్థంబులలోఁ గురుక్షేత్రంబును బ్రశస్తంబు, తన్మహి మంబుఁ జెప్పితిఁగదా. ధర్మునకుఁ దపోవనం బగుటంజేసి ధర్మతీర్థంబు నాఁబడుపవి త్రతీర్థంబునందుఁ గృతమజ్జనుండు తనపూర్వుల నేడ్గుర నుద్ధరించు. జ్ఞానపావనతీర్థ మజ్జనంబున నగ్నిష్టోమఫలంబును, మునిలోకంబును సిద్ధించు. బ్రహ్మాదిసేవితం బైనసౌగంధికవనంబుఁ బ్రవేశింపఁ బాపంబులు వాయు. ప్లక్షానదియందు వల్మీ కనిస్సృతజలంబాడి పితృదేవతల నర్చించిన నశ్వమేధఫలం బగు. ఈశానాధ్యుషి తతీర్థసేవనంబునఁ గపిలగోసహస్రదానఫలం, బశ్వమేధఫలంబు నగు. సుగంధను, శతకుంభను, బంచయక్షను సేవించిన స్వర్గలోకంబు సిద్ధించు. త్రిశూలఖాత మనుతీర్థం బాడి పితృదేవతల నర్చించిన శరీరాంతరమున గాణపత్యంబు గలుగు. తొల్లి పార్వతి శాకాహారిణియై తపంబు సేయుచు నభ్యాగతు లయినమునులకు శాకముల నాతిథ్యంబుఁ జేయుటంజేసి శాకంభరి యనంబరఁగుదేవస్థానతీర్థంబునఁ ద్రిరాత్రము లుపవసించి శాకభక్షణంబుఁ జేసినఁ బండ్రెండేండ్లు శాకమాత్రాహా రంబునం గలుగుఫలంబు లభించు. ఎందు నారాయణుండు శివు నారాధించి సం తుష్టుం డైనయప్పరమేశ్వరునివలనఁ దా నద్దేవునకుఁ బ్రియుండుగాఁగ, లోకమెల్ల నాత్మముఖంబుగాఁగ, నితరదేవదుర్లభంబు లయినవరములఁ బడసెనో యట్టిసువ ర్ణతీర్థంబు సేవించి వ్యోమకేశుం బూజించిన నశ్వమేధఫలంబు, గాణపత్యం బునుం బొందు. ధూమావతిని సేవించి త్రిరాత్రము లుపవసించిన మనోభీష్టము లెల్ల ఫలించు. దేవీదక్షిణార్థంబునందు రథావర్తంబు నారోహించి ప్రదక్షిణంబుఁ జేసిన సద్గతి యగు. ధారాఖ్యతీర్థస్నానంబునను, మహాగిరినమస్కారంబునను దుఃఖంబుల నీఁగు. స్వర్గద్వారసమం బయిన గంగాద్వారంబునం గోటితీర్థంబున మజ్జనం బొనర్చినయతఁడు కులంబు నుద్ధరించి పౌండరీకఫలంబుఁ గాంచు. ఒక రాత్రి యచ్చట నుండిన గోసహస్రదానఫలం బగు. సప్తగంగ, త్రిగంగ, శక్రావర్తతీర్థంబులఁ బితృదేవతాతర్పణంబుఁ జేసినఁ బుణ్యలోకములు లభించు. కనఖ లంబున స్నానము చేసి త్రిరాత్రము లుపవసించిన నశ్వమేధఫలంబును, స్వర్గలో కప్రాప్తియు నగు. కపిలావటతీర్థము సేవించి యొకరాత్రి యుపవసించిన గోసహ స్రదానఫలం బగు. కపిలుఁ డనునాగరాజుతీర్థమునఁ గృతస్నానుఁడు కపిలగోసహ స్రదానఫలంబుఁ బొందు. లలితకం బనుశంతనుతీర్థంబున స్నాన మొనరించిన దుర్గతి పాయు. గంగాయమునాసంగమమునఁ గృతావగాహనుండు కులము నుద్ధ రించి దశాశ్వమేధఫలంబుఁ జెందు. సుగంధతీర్థగమనంబున సర్వపాపవిముక్తుండై బ్రహ్మలోకమునఁ బూజింతుఁ డగు. రుద్రావర్తతీర్థస్నానంబున స్వర్గంబు ప్రాపించు. గంగాసరస్వతీసంగమస్నానంబున నశ్వమేధఫలంబు, స్వర్గలోకప్రాప్తియుం గలుగు. భద్రకర్ణంబునందు భద్రకర్ణేశ్వరుసేవనంబున దుర్గతు లెడలు. స్వర్గలోకమునం

బూజ్యత లభించు. కుంజాశ్రమకతీర్థసేవనంబున గోసహస్రదానఫలంబును, స్వర్గలోకప్రాప్తియుం గలుగు. అరుంధతీవటంబున సాముద్రకతీర్థస్నానంబునను, త్రిరాత్రోపవాసంబునను గులంబు నుద్ధరించి యశ్వమేధఫలంబును, గోసహస్రదానసుకృతంబును బడయు. బ్రహ్మావర్తగమనంబున నశ్వమేధఫలంబు, సోమలోకప్రాప్తియుం గలుగు. యమునాప్రభవంబును, దర్వీసంక్రమణంబును, బరమపుర్గమవేదినిని సేవించిన నశ్వమేధఫలంబును, సర్గలోకప్రాప్తియుం గలుగు. సింధుప్రభవంబునఁ బంచరాత్రంబు లుపవసించిన బహుసువర్ణలాభం బగు. ఋషికుల్యను, వాసిష్ఠంబును సేవించి పితృదేవార్చనంబుఁ గావించి యొకమాసము శాకాహరుండైన ఋషిలోకంబుఁ గాంచు. వాసిష్ఠంబు నతిక్రమించిన నందఱుం ద్విజు లగుదురు. భృగుతుంగసేవనంబున వాజిమేధఫలం బగు. వీరప్రమోక్షతీర్థంబును గృత్తికామఘానక్షత్రంబులందు సేవించిన నగ్నిష్టోమాతిరాత్రఫలం బగు. విద్యాతీర్థంబు సేవించిన విద్యావంతుఁ డగు. మహాశ్రమంబున నేకకాలంబు నిరాహారుండైన నుత్తమలోకంబు లభించు, మహాలయంబునం దొక్కమాసము షష్ఠకాలోపవాసంబున సర్వపాపముక్తుండై తనపూర్వులఁ బదుగురను, వెనుకటివారలఁ బదుగురను నుద్ధరించి బహుసువర్ణంబుఁ బొందు. వేతసికాగమనంబున నశ్వమేధఫలంబును, శుక్రుగతినిం బొందు. సుందరికాతీర్థంబు సేవించిన సురూపం బగు. బ్రాహ్మణీతీర్థసేవనంబునఁ బద్మవర్ణవిమానారూఢుండై బ్రహ్మలోకమునకుఁ జను. బ్రహ్మాదిసురులకు వాసం బైననైమిశంబు స్మరించినం బాపమున సగము నశించు. చొచ్చిన సకలపాపము లడఁగు. సర్వతీర్థంబు లానైమిశతీర్థంబున సన్నిహితంబులై యుండు. అం దొక్కమాసము స్నాన మాచరించినఁ దనపూర్వుల నేడ్గుర నుద్ధరించు. గోమేధసుకృతంబుఁ బడయు. అం దనశనవ్రతంబుఁ బూని మేనుఁ దొఱంగిన సర్వలోకములఁ బూజితుండై సుఖించు. గంగోద్భేదంబునఁ ద్రిరాత్రంబు లుపవసించిన వాజపేయఫలప్రాప్తుఁడు, బ్రహ్మలోకగతుఁడు నగు. సరస్వతిని సేవించి పితృదేవతర్పణం బొనరించిన సారస్వతలోకముల సుఖించు. బాహుదను సేవింపుచు నొక్కరాత్రి వసించిన దేవసత్రఫలప్రాప్తుఁడు, సురలోకపూజితుఁడు నగు. క్షీరవతిం గృతాభిషేకుండై పితృదేవార్చనంబుఁ గావించిన వాజపేయఫలం బొనయు. విమలాశోకతీర్థంబున నొక్కరాత్రి వసించిన స్వర్గలోకమహితుఁ డగు. సరయూనదియం దెచ్చట శ్రీరాముఁడు భృత్యబలాదిసహితుండై శరీరంబుఁ ద్యజించెనో యట్టిగోప్రతారతీర్థంబునఁ గృతమజ్జనుండు శ్రీరామప్రసాదంబున సర్వపాపవిశుద్ధాత్ముండై స్వర్గలోకపూజితుం డగు. గోమతియందు రామతీర్థంబున నవగాహుఁడు కులంబు నుద్ధరించి యశ్వమేధఫలంబుఁ బడయు. శతసాహస్రకతీర్థావగాహనంబున గోసహస్రదానఫలం బగు. భర్తృస్థానతీర్థసేవనంబున నశ్వమేధ

ఫలం బగు. కోటితీర్థమున స్నాతుండై కుమారస్వామి నర్చించినఁ దేజస్వియై గోస హస్రఫలంబుఁ బొందు. వారాణసియందు విశ్వేశ్వరు నర్చించియుఁ, గపిలాహ్రదం బాడియు రాజసూయఫలప్రాప్తుఁ డగు. అవిముక్తతీర్థసేవనంబున బ్రహ్మహత్యా వాయు. అచ్చటనే శరీరత్యాగంబుఁ జేసిన మోక్షం బగు. మార్కండేయతీర్థం బయినగంగాగోమతీసంగమంబునఁ గృతస్నానుండు కులము నుద్ధరించు. అగ్నిష్టో మఫలప్రాప్తుఁ డగు. మహానదియందు స్నాన మాచరించి పితృదేవతర్పణం బొన రించినఁ గులం బుద్ధరించి యక్షయలోకములఁ బడయు. ధర్మారణ్యంబున బ్రహ్మ సరస్సును సేవించిన బ్రహ్మలోకము సిద్ధించు. అందు బ్రహ్మప్రతిష్ఠితం బయిన యూపస్తంభంబును వేఁకువఁ బ్రదక్షిణంబుఁ జేసిన వాజపేయఫలం బగు. ధేను కంబున నేకరాత్రంబు వసించి తిలధేనుదానంబు చేసిన సర్వపాపవిముక్తియు సోమలోకప్రాప్తియు నగు. అందలిపర్వతంబునందు సవత్సకపిలగోవు సంచరించు నది. అందుకు లాంఛనం బిప్పటికిని వానియడుగు లగపడుచున్నయవి. ఆయడుగుల స్పృశించినఁ బాపములు నశించు. గృధ్రవటంబున భస్మస్నానము గావించినం బ్రాహ్మణుండు ద్వాదశవార్షికవ్రతఫలం బెనయు. లాఁతివారు పాపముల నీఁగుదురు. ఉద్యత్పర్వతంబున సావిత్రియడుగు లిప్పటికి నగపడుచున్నయవి. అం దొకతేప సం ధ్యనుపాసించిన ద్వాదశవార్షికసంధ్యోపాసనఫలంబు లభించు. యోనిద్వారం బను తీర్థంబు సేవించిన జననరాహిత్యంబగు. ఒకఁడైనం గయకుఁబోవునా, యశ్వమేధ యాగంబుఁ జేయునా, నల్లయాఁబోతునైన విడుచునా యనిగృహస్థులు పలువురు కొడుకులం గోరుదురు. అట్టిగయకుఁ బోయిన నశ్వమేధఫలంబగు. అందొక్కమా సంబు వసించినయతండు తనపూర్వుల నేడ్గుర నుద్ధరించు. అందక్షయవటంబునఁ బిత రులకుఁ బిండమిడిన నక్షయ్యఫలం బగు. అందు ఫల్గుతీర్థంబు సేవించిన నశ్వమేధ ఫలంబగు. ధర్మసన్నిధానస్థానం బైన ధర్మప్రస్థంబునందుఁ గూపోదకంబునఁ గృతా భిషేకుండై పితృదేవతర్పణంబుఁ జేసినయతండు పాపముల నీఁగి స్వర్గముఁ గాంచు. మతంగాశ్రమప్రవేశంబున గవామయనయజ్ఞఫలంబు సిద్ధించు. ధర్మాభిసంస్పర్శం బున వాజిమేధఫలం బగు. బ్రహ్మస్థానసేవనంబున రాజసూయాశ్వమేధఫలంబు ల భించు. రాజగృహతీర్థస్నానంబునఁ గాక్షీవంతునిపోలె ముదితుం డగు. యక్షిణీసేవ నంబున బ్రహ్మహత్యలఁ బాయు. మణినాగతీర్థస్నానపానముల సర్పవిషబాధ గలు గదు. మఱియు నొక్కరాత్రి యుండిన గోసహస్రదానఫలంబు సిద్ధించు. గౌతమ వనంబున నహల్యాహ్రదంబున స్నాన మాడిన నుత్తమగతిప్రాప్తు లగుదురు. ఉదపానతీర్థం బాడిన నశ్వమేధఫలంబు సిద్ధించు. దేవపూజితం బయినజనకరాజ కూపంబున స్నాన మొనరించిన విష్ణులోకంబు బ్రాపించు. వినశనతీర్థసేవనంబున వాజపేయఫలంబును, సోమలోకంబునుం గలుగు. గండకీసేవనంబున వాజపేయ

ఫలంబును సూర్యలోకంబునుం గలుగు. విశల్యానదీసేవనంబున నగ్నిష్టోమఫలంబును, స్వర్గలోకంబునుం గలుగు. అధివంగం బనుతపోవనంబు సేవించిన గుహ్యకులలోఁ జేరి సుఖించు. కంపనానదీసేవనంబునఁ బౌండరీకఫలంబును, స్వర్గలోకమునుం గలుగు. మహేశ్వరధారాసేవనంబున నగ్నిష్టోమఫలంబు నెనయు. కులంబు నుద్ధరించు. దేవపుష్కరిణిని, సోమపదంబును సేవించిన దుర్గతి నెడలి యశ్వమేధఫలంబుఁ గాంచు. తొల్లి కూర్మరూపుఁ డైనయొకరాక్షసుఁడు తీర్థకోటుల నపహరించికొనిపోవఁగ విష్ణుఁ డెంముఁ గ్రమ్మఱ నాతీర్థములనెల్లఁ దెచ్చెనో యట్టిమహేశ్వరపదతీర్థమందు స్నానముచేసిన నశ్వమేధపౌండరీకఫలంబును, విష్ణులోకప్రాప్తియుం గలుగు. ఎందు బ్రహ్మాదిసేవ్యమానుం డై విష్ణుండు నిత్యసన్నిహితుఁ డయ్యె నట్టిసాలగ్రామతీర్థంబున నారాయణు నారాధించిన నశ్వమేధఫలంబును, విష్ణులోకప్రాప్తియుం గలుగు. సముద్రచతుష్టయసన్నిధానస్థానం బైనయందలి యుదపానం బనుకూపంబున స్నాన మాచరించి మహాదేవు నర్చించిన దుర్గతుల నెడలి వెలుంగు. జాతిస్మరతీర్థస్నానంబున జాతిస్మరత్వంబు లభించు. మాహేశ్వరపురంబున మహేశ్వరుఁ బూజించి యుపవసించిన సర్వాభీష్టంబులు ఫలించు. వామనంబున హరిని సేవించిన దుర్గతు లడంగు. కుశికాశ్రమమునందుఁ గౌశికిని సేవించిన రాజసూయఫలం బగు. చంపకారణ్యమున నేకరాత్ర ముండిన గోసహస్రదానఫలం బగు. జ్యేష్ఠిలతీర్థమున నొక్కరాత్రి వసించిన గోసహస్రదానఫలంబును, మిత్రావరుణలోకప్రాప్తియుం గలుగు. అందే త్రిరాత్రంబు లుపవసించిన నగ్నిష్టోమఫలం బగు. కన్యాసంవేద్యగమనంబున మనులోకంబులు లభించు. అందె కన్యాదానము లొనరించిన నది యక్షయఫలప్రదం బగు. నిర్వీరతీర్థసేవనంబున నశ్వమేధఫలంబును, విష్ణులోకప్రాప్తియుం గలుగు. అందు దాన మొనరించిన నధికఫలం బగు. అందలివసిష్ఠాశ్రమంబున స్నాన మాచరించిన వాజపేయఫలం బగు. దేవకూటంబు సేవించి కులంబు నుద్ధరించి యశ్వమేధఫలం బెనయు. విశ్వామిత్రుఁ డెచ్చట సిద్ధుఁ డయ్యె నట్టికౌశికహ్రదం బాడినను, గౌశికీతీరంబున నొక్కమాసము వసించిన నశ్వమేధఫలంబు సిద్ధించు. సర్వతీర్థవరం బైనమహాహ్రదంబున వసించిన సంకటము లెడలు. బహుసువర్ణలాభం బగు. వీరాశ్రమవాసి యగుకుమారుని సేవించిన నశ్వమేధఫలం బగు. అగ్నిధారయందుఁ గృతస్నానుఁడై భగవంతుని సేవించినను, బితామహసరస్స్నానంబునను నగ్నిష్టోమఫలం బగు. ఆపితామహసరస్సునుండి ప్రవహించునట్టికుమారధారఁ గృతస్నానుం డై నబ్రహ్మహత్యవాయు. గౌరీశిఖరం బధిరోహించి స్తనకుండతీర్థంబున స్నానముఁ జేసి పితృదేవతల నర్చించిన వాజపేయాశ్వమేధఫలంబును స్వర్గలోకప్రాప్తియు నగు. నందితామ్రారుణసేవనంబున నశ్వమేధఫలంబును, బ్రహ్మలోకప్రాప్తియు నగు.

నియందలికూపం బాడిన నరమేధఫలం బగు. కాలికాకౌశికాసంగమంబునఁ గృ
తస్నానుండై త్రిరాత్రము లుపవసించిన సర్వపాపవిముక్తుఁ డగు. ఊర్వశీతీర్థంబును,
సోమాశ్రమంబును, గుంభకర్ణాశ్రమంబును, గోకాముఖంబును సేవించిన జాతిస్మ
రత్వంబు గలుగు. నందాసేవనంబున సర్వపాపవిముక్తుండై శక్రలోకంబుఁ బొందు.
ఋషభద్వీపంబునందును, క్రౌంచనిషూదకంబునందును, సరస్వతియందును స్నాన
మొనర్చిన వైమానికుఁ డగు. ఔద్దాలకతీర్థం బాడిన సర్వపాపవిముక్తుం డగు.
ధర్మతీర్థసేవనంబున వాజపేయఫలప్రాప్తుఁడు వైమానికుఁడు నగు, లలితికాస్నా
నంబున రాజసూయఫలప్రాప్తుఁడు, వైమానికుఁడు నగు, సంధ్యం జేరి సంవేద్య
తీర్థంబున స్నాతుండైన విద్య లభించు. రామప్రభావకృతం బయినలౌహిత్య
తీర్థంబున స్నాన మొనరించిన బహుసువర్ణలాభం బగు. కరతోయను సేవించి
త్రిరాత్రంబు లుపవసించిన నశ్వమేధఫలంబు గలుగు. గంగాసాగరసంగమంబునఁ
గృతస్నానుఁ డశ్వమేధఫలంబుకంటెఁ బదిమడుఁగు లెక్కుఁడగుఫలంబుఁ జెందు.
గంగోత్తరతీర్థంబున స్నాతుండై త్రిరాత్రంబు లుపవసించిన సర్వపాపవిమోచనం
బగు. తతావతరణియందు విరజతీర్థం బాడినఁ జంద్రునిమాడ్కి నిర్మలుండై వె
లుంగు. మఱియుఁ గులము నుద్ధరించు. పాపముల నీఁగు. గోసహస్రదానఫలప్రాప్తుఁ
డగు. శోణజ్యోతిరథ్యాసంగమంబున స్నాన మాచరించి పితృదేవతర్పణంబుఁ
జేసిన నగ్నిష్టోమఫలం బగు. శోణప్రభవంబునందును, నర్మదాప్రభవంబునందును,
వంశగుల్మంబునందునుఁ గృతస్నానుండైన వాజిమేధఫలం బగు. కోసలయందు
ఋషభతీర్థం బాడి త్రిరాత్రంబు లుపవసించినఁ గులంబు నుద్ధరించి వాజపేయ
గోసహస్రదానఫలంబులఁ గాంచు. ఆకోసలయందే కాలతీర్థం బాడిన నేకాదశవృ
షభదానఫలం బగు. పుష్పవతీతీర్థంబునఁ గృతమజ్జనుండై త్రిరాత్రంబు లుపవసిం
చిన గోసహస్రదానఫలంబుఁ, గులపవిత్రతనుం గాంచు. బదరికాతీర్థస్నానంబున
నాయుర్వృద్ధిని, దుది స్వర్గలోకంబునుం గాంచు. చంపం బ్రాపించి భాగీరథి
యందుఁ గృతస్నానుండు దండార్త్రాభిగమనంబున గోసహస్రదానఫలం బుఁ జెందు.
లపేటికాగమనంబున వాజపేయఫలంబును, దేవపూజ్యతనుం బడయు. మహేం
ద్రపర్వతంబునఁ బరశురామతీర్థం బాడిన నశ్వమేధఫలం బగు. మతంగకేదార
స్నానంబున గోసహస్రదానఫలం బగు. శ్రీపర్వతంబున దేవీసహితుండైన మహా
దేవుని సేవించియు, దేవహ్రదం బాడియు నశ్వమేధఫలంబు, నుత్తమసిద్ధినిం
గాంచు. ఋషభపర్వతగమనంబున వాజపేయఫలంబును, స్వర్గలోకసౌఖ్యంబునుం
గలుగు. కావేరీస్నానంబున గోసహస్రదానఫలం బగు. సముద్రతీరమునఁ గన్యా
తీర్థం బాడినఁ బాపంబు లెల్ల నెడలు. సముద్రమధ్యమునందలి గోకర్ణక్షేత్రమున
బ్రహ్మాది దేవతాపససిద్ధచారణగంధర్వనరకిన్న రోరగభూతయక్షపిశాచ సరిత్సాగ

రశ్రైలోపాస్యమానుం డయినయీశాను నర్చించి త్రిరాత్రము లుపవసించి ద్వాదశరాత్రంబు లుండినఁ బావనత్వంబు, నశ్వమేధఫలంబును, గణమునకాధిపత్యంబునుం గలుగు. గాయత్రీస్థానంబునఁ ద్రిరాత్రంబు లుపవసించిన గోసహస్రదానఫలం బగు. మఱియు బ్రాహ్మణసమక్షమున యోనిసంకరజాతుం డెవ్వఁడేనియు గాయత్రిం బఠించెనా యతనిగీతంబు గాథ యయ్యెడి. అబ్రాహ్మణునెపుటనైన నశించు, సంవర్తుఁ డనుబుషివాపి నాడిన సురూపం బగు. వేణ నధిగమించి త్రిరాత్రము లుపవసించిన మయూరహంసయోజితం బైనవిమానంబుఁ బొందు. గోదావరీస్నానంబున గవామయనఫలంబును, నుత్తమలోకప్రాప్తియుం గలుగు. వేణాసంగమస్నానంబున నశ్వమేధఫలం బగు. వరదాసంగమస్నానమున గోసహస్రదానఫలం బగు. బ్రహ్మస్థానంబున ద్రిరాత్రము లుపవసించిన గోసహస్రదానఫలంబును, స్వర్గలోకప్రాప్తియుం గలుగు, కుశప్లవంబునఁ ద్రిరాత్రంబు లుపవసించిన నశ్వమేధఫలం బగు. ఇంద్రుఁ డెందునూఱుయజ్ఞములఁ జేసి యింద్రపదవిం గాంచెనో యట్టికృష్ణవేణాజలోద్భవంబయినజాతిస్మరాఖ్య దేవహ్రదంబునం గృతావగాహుండు జాతిస్మరత్వంబు, నగ్నిష్టోమఫలంబు నెనయు. సర్వహ్రదస్నానమున గోసహస్రదానఫలంబగు. పయోష్ణీనదిని, దండకారణ్యంబును సేవించిన గోసహస్రదానఫలం బగు. శరభంగాశ్రమంబును, శుకాశ్రమంబును మెట్టిన సంకటవిముక్తియుఁ, గులపావనత్వంబునుం గలుగు. జామదగ్న్యసేవితం బయినశూర్పారకతీర్థం బాడిన బహుసువర్ణలాభం బగు. సప్తగోదావరతీర్థస్నానంబున మహాపుణ్యాయుతుండై దేవలోకంబుఁ బొందు. దేవపథగమనంబున దేవసత్రపుణ్యంబగు. తొల్లి రాక్షసభయమున వేదము లడంగిన నెందు బృహస్పతి బుషులయుత్తరీయములందు సుఖాసీనుండై యోంకారం బుపదేశింప సమ్యక్ప్రకారంబున దానినుచ్చరించి యాబుషు లధీతపూర్వంబు లయినవేదముల నెల్లఁ జక్కఁగ నెఱింగిరో, యెందు భృగుమహర్షి బ్రహ్మనారాయణాదిదేవానుజ్ఞ చే బుషులకు యాజకుండై విధిచోదితక్రమంబున నాజ్యభాగంబుచే నగ్నిహోత్రుం దన్పెనో యట్టితుంగకారణ్యంబు మెట్టినఁ బాపవిముక్తి యగు. అందు మాసము వసించువాఁడు కులము నుద్ధరించి బ్రహ్మలోకంబుఁ బొందు. మేధావికతీర్థంబుఁ బ్రాపించి పితృదేవతర్పణంబుఁ జేసిన స్మృతిమేధాభివృద్ధియు, నగ్నిష్టోమఫలంబు నగు. కాలంజరపర్వతంబునందు దేవహ్రదం బాడిన గోసహస్రదానఫలం బగు. అందుఁ దపంబు సల్పినయతఁడు స్వర్గలోకపూజితుఁ డగు. చిత్రకూటపర్వతంబున మందాకినియందు స్నాన మొనర్చి పితృదేవతర్పణంబుఁ గావించిన నశ్వమేధఫలం, బుత్తమగతియుం గలుగు. భర్తృస్థానంబునఁ గుమారస్వామి నర్చించి కోటితీర్థంబునం గృతస్నానుండైన గోసహస్రదానఫలం బగు. జ్యేష్ఠస్థానంబు ప్రదక్షిణంబు సల్పినఁ జంద్రునిచందమునఁ

దేజస్వి యగు. అందు సన్నిహితచతుస్సముద్రం బయినకూపంబున స్నానమొన రించి పితృదేవార్చనంబుఁ గావించిన నుత్తమగతి యగు. ఎందు శ్రీరాముఁడు గంగను దాఁటెనో యాశృంగబేరపురం బధిగమించి గంగయందు స్నానము సల్పిన యతఁడు పాపవిముక్తుండై వాజపేయఫలంబుఁ బొందు. ముంజవటంబున మహాదే వునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించిన గణంబునకుఁ బతి యగు. అందే జాహ్నవియందుఁ గృతమజ్జనుండైన సర్వపాపవిశుద్ధుం డగు. సర్వతీర్థంబులకంటెఁ బ్రయాగ పావనంబు. అది ప్రజాపతియజ్ఞవేదియగుటం జేసి యందు మూఁడ గ్నికుండంబులు గలవు. తన్మధ్యంబుననే భాగీరథి ప్రవహింపుచున్నయది. అందే యమున గంగతోడఁ గలిసె. అది భూమికి జఘనస్థానం బనఁ దనరు. బ్రహ్మవి ష్ణ్వాదిసురులు, లోకపాలురు, పితృదేవతలు, సనత్కుమారప్రముఖు లగుపరమ ర్షులు, సిద్ధసాధ్యగంధర్వాప్సరోనాగసుపర్ణసరిత్సాగరాదు లందు నిత్యసన్నిహి తులై యుందురు. సురలకు నది యజ్ఞభూమియై యుండు. మఱియు నందు వేదం బులు, యజ్ఞంబులు మూర్తిమంతంబులై యుండు. అఱువదికోట్లపదివేలు తీర్థం బులును సన్నిహితంబులై యుండు. అందు మెట్టినను, దన్నామంబుఁ గీర్తించిన ను, దన్మృత్తికం గ్రహించినను బాపవిముక్తి యగు. అందు దత్తమల్పమైనను మహాఫలప్రదం బగు. అందు మేను దొఱంగినఁ బుణ్యలోకం బలవడు. వేదవచ నమున నెండె, లోకవచనమున నెండె నందు శరీరత్యాగబుద్ధిఁ జాలింప రాదు. అట్టిప్రయాగమున స్నానముఁ గావించినవాఁడు రాజసూయాశ్వమేధఫలంబును, జతుర్వేదాధ్యయనపుణ్యంబును, సత్యవచనసుకృతంబునుం బడయును. అందే భోగ వతి యనువాసుకితీర్థంబునఁ గృతస్నానుండైన నశ్వమేధఫలం బగు. గంగయందే హంసప్రపతనం బనుతీర్థం బాడిన దశాశ్వమేధఫలం బగు. అగ్ని యింధనములఁ బోలె గంగాజలంబు పాపముల దహించు. కృతయుగంబున సర్వతీర్థంబులు పుణ్యం బులు. త్రేతాయుగంబునఁ బుష్కరంబు పావనంబు. ద్వాపరయుగంబునఁ గురు క్షేత్రంబు పవిత్రంబు. కలియుగంబున గంగ పుణ్యంబు. మఱియుఁ బుష్కరం బునఁ దపస్సు, మహాలయంబునందు దానము, మలయంబున నగ్న్యారోహణంబు, భృగుతుంగమున ననశనంబును బుణ్యప్రదంబులు. పుష్కరాదిక్షేత్రంబులయంద లిగంగయందుఁ గృతస్నానుండు తనపూర్వుల నేడ్గురను, వెనుకటివారల నేడ్గు రనుం దరింపఁజేయును. గంగను గీర్తించినఁ బాపక్షయం బగు. చూచిన శుభంబు లొడఁగూడు. ఎవనియెమ్ములు గంగాజలంబున నెంతకాలముండునోయంతకు నతనికి స్వర్గలోకపూజ్యత గలుగు. గంగాతీరిక్తతీర్థంబును, గేశవేతరుం డైనదేవుం డును, బ్రాహ్మణేతరం బయినపూజ్యవస్తువును లే దని పితామహుఁడు వాక్రుచ్చె.

ఎచ్చట గంగ ప్రవహించునదియో యదియుత్తమదేశంబు. అదియే తపోవనంబు. అదియే సిద్ధక్షేత్రంబు.

ఈతీర్థమాహాత్మ్యంబు సాధువు లగుబ్రాహ్మణులకు, బుత్రునకు, సుహృదులకు, విధేయుఁడైనశిష్యునకును రహస్యముగ బోధింపవలయు. ఇది పుణ్యంబు, ధన్యంబు, పవిత్రంబు, స్వర్గసాధనంబు, ధర్మ్యంబు, మహర్షిగుహ్యంబు, సర్వపాపప్రమోచనంబు, శత్రుశమనంబు. దీనిం బ్రాహ్మణమధ్యమునఁ బఠించిన బ్రాహ్మణుఁడు విద్యాపారగుఁ డగు. క్షత్రియుఁడు విజయవంతుఁ డగు. వైశ్యుఁడు ధనవంతుఁ డగు. శూద్రుఁ డభీష్టములఁ బడయు. ఇమ్మాహాత్మ్యంబుఁ బ్రతిదినంబును వినినయతఁడు జాతిస్మరుండై స్వర్గలోకప్రాప్తుఁ డగు. ఈతీర్థంబులలోఁగొన్ని పోవ శక్యంబులు గావు. అన్నింటిని మనస్సుననైన నధిగమింప వలయు. సురలు, ఋషులునీతీర్థముల నెల్ల సేవించిరి. శాస్త్రవిదు లగుపెద్ద లాస్తిక్యమున వేదార్థముల నెఱింగి జితేంద్రియులై తీర్థయాత్రం జేయుదురు. అవ్రతు, లనియతచిత్తు, లశుచులు, తస్కరులు, వక్రమతులు తీర్థయాత్రలం జేయరు. శాంతనవా, నీవీతీర్థంబుల సేవించుము. పుణ్యవృద్ధి యగు. బ్రహ్మాదిసురులు, ఋషులును నీధర్మమున కెంతయు సంతోషింతురు. వసులోకంబుఁబొందుదువు. శాశ్వతకీర్తిం బడయుదు వని చెప్పి పులస్త్యుఁడు సంతుష్టుఁడై యచ్చటన యంతర్హితుఁ డయ్యె. ధర్మరాజా, శాస్త్రతత్త్వార్థవిదుఁడైనభీష్ముఁడు పులస్త్యవచనమునఁ దీర్థయాత్ర సలిపె. విశేష మేల ? ఈనియమమునఁ దీర్థయాత్రఁ గావించినవాఁడు శతాశ్వమేధఫలంబుఁ గాంచు. పెక్కండ్రు మహర్షులు నీకుఁగా వేచియున్నవారు. వారిం దోడ్కొని నీవు నవశ్యంబు తీర్థయాత్రఁ జేయుము. మహర్షులఁ బిలిచికొని పోవుటం జేసి భీష్మునికంటె నెనిమిదింత లెక్కువ యగుఫలంబు నీకుఁ గలుగు. రోమశము నీంద్రుఁడు నీయొద్దకు వచ్చువాఁడు. అమ్మునితోడం దీర్థములకుఁ జనుము. నీవు మహాభిష, యయాతి, పురూరవో, భగీరథ, శ్రీరామ, మ, న్విక్ష్వాకు, పూరు, పృథుప్రముఖమహారాజులకుఁ దుల్యుఁడవు. ఇంద్రుఁడు రాక్షసుల వధించి స్వర్గముఁ బాలించుప్రకారంబున నీవును శత్రువుల గెలిచి భూమండలంబుఁ బాలించి కీర్తిమంతుఁడ వగుదు వని చెప్పి నారదుఁ డంతర్హితుఁ డగుటయు ధర్మరా జమ్మునిని దలంపుచుఁ దీర్థయాత్రాపుణ్యంబు ఋషులకుఁ దెల్పి కొండొక వడికి ధౌమ్యున కిట్లనియె.

మునీంద్రా, మనయర్జును నస్త్రార్థంబు పంపితిమిగదా, వాఁడు వాసుదేవునివిధమున సమర్థుండు. కృష్ణార్జునులు మహాత్ములనియు, నరనారాయణఋషులే యనియు వేదవ్యాసుఁడును, నారదుఁడును వివరించినవారు. ఇంద్రపుత్రుఁడైన యర్జునుఁ డింద్రుం జూచి యస్త్రముల సాధింపఁ గలఁ డని తలంచి యతనిం బం

పితి. భీష్మద్రోణకృపాశ్వత్థామాదిమహారథుల దుర్యోధనుఁడు తనయోధులఁగాఁ జేసికొని యుండుటంజేసి వా రందఱు నర్జునుతోడిసంగరంబునకుఁ గట్టాయితంబై యున్నవారు. వారల నందఱ నర్జునుండు గెలుచు. మఱియుఁ గర్ణపావకుండు దుర్యోధనానిలోద్ధూతుండై శరములు వెలుఁగుగా మదీయసైన్యం బనుశుష్కతృణంబుఁ గాల్పం దొడంగిన వాసుదేవానిలోద్ధూతుండు, దివ్యాస్త్రవిద్యుల్లతావిద్యోతనుండు, శ్వేతతురంగబలాకాభాసి, గాండీవేంద్రాయుధోల్బణుండు నగునర్జునవారివాహుండు చల్లార్చు నని తలంచెద. అయ్యర్జునుండు దివ్యాస్త్రములతోడ నెన్నఁడు వచ్చునో. అతండు లేమింజేసి యిపు డిచట వసింప మా కెవ్వరికి నిచ్చ పుట్టదు. ఫలపుష్పాదిసంభృతం బైనయొండొక్కవనమునకుఁ జని యచటఁ గొంతకాలంబు వసింపఁ దలంచెద. అట్టివనం బొక్కటి చెప్పు మనిన వారల నూరార్చుచు ధౌమ్యుఁ డి ట్లనియె.

ధౌమ్యుఁడు ధర్మరాజునకుఁ దీర్థములఁ జెప్పుట.

యుధిష్ఠిరా, పుణ్యాశ్రమంబులను, దీర్థములనుం జెప్పెద. మీ రందఱు వినుఁడు. వినినం బుణ్యం బగు. కనిన నదిశతగుణం బగు. తూర్పునం గలతీర్థములఁ దొల్తఁ జెప్పెద. గోమతీతీరవిలసితం బైన నైమిశారణ్యంబు, గయపర్వతంబు, బ్రహ్మసర, స్నుషయవటవిశ్రుతంబు ఫల్గునదీవిరాజితంబు నయినగయాక్షేత్రంబు, కౌశికి, గంగ; పాంచాలంబునందు విశ్వామిత్రయజ్ఞాయతనంబు, జామదగ్న్యగీతంబు నగునుత్పలావనంబు, కౌశికుఁ డింద్రునితోడ సోమపానంబుఁ జేసి యెందు బ్రాహ్మణుఁ డయ్యెనో యట్టికన్యకుబ్జంబు, ప్రయాగం, బగస్త్యాశ్రమంబు, కాలంజరంబున హిరణ్యబిందువు, మహేంద్రంబు, బ్రహ్మశాల, మతంగకేదారంబు, పిపాసార్తుం డైననలుఁ డెందు జలమును, సుఖమును బొందెనో యట్టికుండోదపర్వతంబు, దేవవనంబు, బాహుద, నందయనునివి లోకవిశ్రుతంబులు. దక్షిణంబున గోదావరి, వేణ, భీమరథి, యెందు నృగమహీపతి సోమమున నింద్రుని, దక్షిణల బ్రాహ్మణులం దన్పె నని మార్కండేయుండు గాథ వచించెనో యట్టినృగయజ్ఞాయతనం బగుతీరమున నొప్పుపయోష్ణీనది, శివపురంబు, మాఠరవనంబు, వరుణస్రోతసపర్వతంబునందుఁ బ్రవేణ్యుత్తరమార్గమునఁ గణ్వాశ్రమంబున యామపంబు, వేదీశూర్పారకంబున జమదగ్న్యాశ్రమంబు, పాషాణతీర్థ, పునశ్చంద్ర, యశోకతీర్థం, బగస్త్యతీర్థంబు, పాండ్యదేశంబునందు వారుణతీర్థంబు, కుమారీతీర్థంబు, దేవతపస్థానం బైనతామ్రపర్ణి, గోకర్ణం, బగస్త్యశిష్యాశ్రమంబు, మణిమయశివమూర్తివిరాజితం బైనవైదూర్యపర్వతం, బగస్త్యాశ్రమంబు, సురాష్ట్రములఁ జమసోద్భేదంబు, ప్రభాసంబు, పిండారకంబు, నారదనుతం బైనయుజ్జయంతపర్వతంబు దేవదేవుఁడు, భగవంతుఁ, డనయుండు, క్షేత్రజ్ఞుం, డని

గ్వావృచరిత్రుండు నగుమధుసూదను నివాసం బైనద్వారవతి యనునివి సుప్రసిద్ధంబులు. పశ్చిమదిక్కునం దవంతి దేశములందుఁ బ్రత్యక్ప్రవాహ యగునర్మద, యందే కుబేరజననస్థానం బైనవిశ్రవసునియాశ్రమంబు, దివ్యసరోవిలసితం బైనవైదూర్య శిఖరపర్వతంబు, విశ్వామిత్రనది, తత్తీరంబున యయాతిపతనంబు, పుణ్యాహ్రదంబు, మైనాకగిరి, యసితపర్వతంబు, కక్షసేనాశ్రమంబు, చ్యవనాశ్రమంబు, జంబూమార్గంబు, కేతుమాల, గంగాద్వారంబు, సైంధవారణ్యంబు, పితామహసరస్సు, వైఖానసాశ్రమంబు, త్రిపుష్కరంబులుం బ్రశస్తంబులు. ఉత్తరంబున సరస్వతి, ప్లక్షావతరణతీర్థంబు, సహదేవుఁ డెందు యాగంబుఁ జేయ నిందుఁడు గాథఁ గావించెనో, యెందు భరతుఁ డిరువదియే డశ్వమేధముల నాచరించెనో యట్టియమునానదీతీరవిలసితాగ్నిశిరస్తీర్థంబు, వాలఖిల్యయజ్ఞాయతనం బయినశరభంగాశ్రమంబు, దృషద్వతి, దాల్భ్యదాశ్రమంబులు, విశాఖయూపంబు, నదులెల్ల నెచ్చటఁ గలిసె, జమదగ్నియాగమున నదు లెందుమధువుచే విప్రులఁ దనిపె ననివిశ్వావసుఁడు గాథఁ గావించె నట్టిజమదగ్నియజ్ఞాయతనం బైనపలాశకంబు, సనత్కుమారచింతితం బైనగంగాద్వారంబు, కనఖలంబు, పురూరవుయానస్థానంబు భృగుతపస్థానంబు నగుపురుపర్వతంబు, భృగుతుంగాశ్రమంబు, సర్వదేవర్షి సముపాస్యమానుం డాదియోగీంద్రుఁడు నగునారాయణునకుఁ దపస్థానం బగుటం జేసి సర్వతీర్థక్షేత్రరాజంబు నారాయణప్రభావంబునఁ దొల్లి యుష్ణజలయు సువర్ణ సికతయు నగుగంగానది తీరంబున విశ్రుతంబు నగుబదరీవనంబుననునివి లోకపావనంబులు. దేవర్షిప్రభృతు లీతీర్థముల సేవించిరి. నీవు నవశ్యంబు సేవించు మని చెప్పి ధర్మరాజునకుఁ దీర్థయాత్రయందుఁ బరమోత్కంఠఁ గావింపుచుండె.

## ధర్మరాజు నొద్దకు రోమశముని వచ్చుట.

అయ్యవసరంబున రోమశమునీంద్రుఁడు వచ్చేయుటయు ధర్మరాజు బ్రాహ్మణాదిపరివృతుండై యెదురేగి యమ్మునీంద్రుం దోడ్తెచ్చి యుచితవిధుల నర్చించి యాగమనకారణంబును, సంచారప్రయోజనంబు నడుగ నమ్ముని సుప్రీతుండై మృదువచనముల నిట్లనియె. ధర్మరాజా, నేను స్వేచ్ఛచే సర్వలోకములఁ దిరుగుచు నొక్కనాఁడు నాకలోకంబునకుఁ జని యందు శక్రభవనంబున సురేంద్రునితోడ నేకాసనగతుండై యున్న భవదనుజు సవ్యసాచిం గాంచి మనంబున విస్మయం బందుచుండ దేవేంద్రుఁ డర్జునుమహిమంబు నాకుఁ జెప్పి విస్మయంబు మాన్పి యతని వృత్తాంతము మీకుఁ దెలుపఁగ నన్నుఁ బనిచె. మీ రన్నదమ్ములు, ద్రౌపదియు నాచెప్పెడిదాని నవశ్యంబుగ నాకర్ణింప వలయు. అస్త్రార్థంబుగ నీచేననుజ్ఞాతుండై నయన్జునుండు పరమేశ్వరానుగ్రహంబునఁ బరదుర్లభం బైనపాశుపతాస్త్రంబు సంపాదించి, లోకపాలురవలనఁ దత్తదస్త్రముల గ్రహించి, మహేంద్రునివలన

వజ్రాదిసాధనంబుల సాధించి, విశ్వావసుపుత్త్రుఁడైన చిత్త్రసేనునివలన గీతవాద్య నృత్యముల నేర్చి సురలోకమున సుఖమున్నవాఁడు. సురలకు నశక్యం బైనయొక మహాకార్యంబుఁ జేసి శీఘ్రంబ నీతమ్ముఁ డస్త్రములతోడ నీయొద్దకు వచ్చువాఁడు. కర్ణుఁడు కృతాస్త్రుఁడైనయర్జునుని సామర్థ్యంబునఁ గళాంశమునైనఁ బొంద నేరఁడు. కర్ణునివలనిభయంబు వలదు. దానిం దేవేంద్రుఁ డపనయింతు ననినవాఁడు. నీమనంబు తీర్థయాత్త్రపై నాసక్తమయినదిగదా. అది యవశ్యం బనుష్ఠించునది. దానఁ బురుషార్థంబులు చేకూఱు. అందు నన్ను మీకు సహాయుఁగా నింద్రుండు పనిచె. అర్జునుఁడును నీవు తీర్థయాత్త్ర సల్పుతఱి రాక్షసాదిభయము మీకుఁ గలుగకుండ మీతోడన నుండఁగ నన్నుఁ బ్రార్థించె. కావున నింద్రునియోగంబున, నర్జునప్రార్థనంబునను వచ్చితి. ఇంతకుమున్న నేను రెండుమాఱులు తీర్థముల సేవించితి. ఇపుడు మూఁడవతేప నీతోడ సేవించెద. దురాత్ములు తీర్థయాత్త్రాఫలంబుఁ గాంచ నేరరు. భగీరథయయాతిప్రభృతిపూర్వరాజతుల్యుఁడ వగునీవు తీర్థముల సేవించి మహాసుకృతశాలి వగు మనిన ధర్మరాజు రోమశుం జూచి మునీంద్రా, సంతోషాతిశయమున వాక్యముల కుత్తరముం జెప్పఁ దోఁచదు. తీర్థయాత్త్రఁ జేయఁగ దేవేంద్రుఁడు నన్ను నియమించుటయు, నీ వందు సహాయుఁడ వగుటయు సంతోషకరంబులయ్యె. అర్జునుఁడు తమ్ముఁడగుటం గాదె యివి లభించె. ధౌమ్యనారదవచనంబునఁ దీర్థయాత్త్రోద్యోగంబు నామనంబున నింతకుమున్న యుదయించె. అవశ్యము తీర్థముల సేవింతు నని చెప్పి రోమశువచనంబున క్షుత్పిపాసామార్గశ్రమశీతాతపాదుల నోర్వలేనివారల, బ్రాహ్మణుల, భిక్షాభుజులను నివారించి మాంసాదులవండువారలఁ, బౌరులను గజపురమునను బాంచాలపురిని ధృతరాష్ట్రపాంచాలపోషితులై యుండుఁ డని చెప్పి క్రమ్మఱించె. ధృతరాష్ట్రుండును వారల నెల్ల ధర్మరాజునందలిప్రేమచేత నుచితధనప్రదానంబున నాదరింపుచుండె. అట్లు పౌరులం గ్రమ్మఱించి రోమశునితోడఁ గామ్యకంబునఁ ద్రిరాత్త్రంబు లుండి పాండవులు తీర్థయాత్త్రకుఁ బోవఁ దలంచుచుండ వనవాసు లగుబ్రాహ్మణులు కొందఱు ధర్మరాజున కిట్లనిరి. రాజేంద్రా, తీర్థయాత్త్రకు మమ్ముం దోడ్కొని పొమ్ము, క్రూరమృగపిశాచదారుణంబు లయినఘోరకాంతారంబులం గలతీర్థంబులు మాయట్టివారికిదుర్గమంబులు. ధనుర్ధరులు, శూరులు నగుమీరు సహాయులుగాఁగ సుఖముగఁ దీర్థసేవనసుకృతంబుఁ గాంతుము. విశేషంబు చెప్ప నేల? బ్రాహ్మణులయెడం బ్రీతి గలదేని వేగంబ మావచనంబు గ్రహింపుము. రోమశమునీంద్రునిసహాయమున మాతోడఁ దీర్థములఁ జరించి సర్వపాపవిముక్తుండ వగు మని చెప్పిన ధౌమ్యరోమశానుమతంబున వారిరాక నియ్యకొని ద్రౌపదితోడం బ్రయాణంబు సేయఁ దలంపుచున్నంత వ్యాసనారదపర్వతమునీంద్రులు వచ్చి ధర్మజుండు కావించినపూజలం

గై కొని పాండవుల నందఱ సంబోధించి "శరీరనియమంబు మానసవ్రతం బనంబడు. మనోనియమంబు దైవవ్రతంబు నాఁ బరగు. అట్టియుభయవ్రతంబుల శుద్ధులరై మీరు సర్వభూతములయందును మైత్రి నెఱపి ఋజుమార్గవర్తులరై తీర్థముల సేవించిఁ యథోక్తఫలంబులఁ గాంచుఁ" డని చెప్పి ప్రణతు లయినవారల దీవించి యమ్ముగ్గురు మును లరిగిరి.

ధర్మరాజు తీర్థయాత్ర వెడలుట.

అటఁ బాండవులు మునులకు మ్రొక్కి వల్కలాజినధారులు నభేద్యకవచఖడ్గాదిసాధనసమన్వితులునై యింద్రసేనాదిమూలభృత్యులు పదునలుగురుం, గొందఱు పరిచారికలుం గొలిచి రాఁగఁ బ్రయాణ మగుతఱి ధర్మరాజు రోమశుం జూచి మునీంద్రా, ధర్మమార్గవర్తినయ్యు నేను లాఁతివా రెవ్వరుం బడయనియిడుమలఁ బడుచున్నవాఁడ, ఎల్లపుడు నెడతెగక యధర్మంబ చేయువారు వృద్ధిఁ గాంచుచున్నవారు. ఇందు కేమి కారణం బని యడిగిన ధర్మరాజునకు రోమశుఁ డిట్లనియె. ధర్మనందనా, నీ విందు శోకింప వలదు. అధర్మమునఁ దత్కాలంబందు వృద్ధి కలుగునట్లు దోఁచునుగాని క్రమంబున నది నిర్మూలంబుగాక మానదు. రాక్షసులు దొలుత నెంతో వృద్ధివిజయంబులం గాంచి తుదిం బొలియరే? ఆదియందు ధర్మవర్తులు శ్రమంపడినం దుది మేలు గాంతురు. సురలు రాక్షసులు పెట్టుపలుబాధల నెల్ల నోర్చి తుది వృద్ధిఁ గాంచరే? అధర్మవృత్తులయందుఁ దొలుత దర్పంబు పుట్టు, దర్పమున మానము, మానమునఁ గ్రోధము, క్రోధమున లజ్జాత్యాగంబు, లజ్జాత్యాగంబున శీలనాశంబునుం బుట్టు. లజ్జాహీనులు, శీలహీనులు నగువారల లక్ష్మీక్షమాధర్మములు త్యజించె. అలక్ష్మి ప్రవేశించె. అలక్ష్మీసమావిష్టు లగువారియందుఁ గలి యావేశించె. అట్లు రాక్షసులు కలిసమావేశంబునంజేసి ధర్మముల విడిచి తీర్థసేవనంబుల మాని మానాభిభూతులు, క్రియాహీనులు, నిర్యశస్కులునై లయంబుఁ జెందిరి. సురలు పుణ్యతీర్థముల నభిగమించియు, యజ్ఞముల నాచరించియుఁ, బెద్దల సేవించియు, వారిదీవనల వడసియు ధర్మం బుత్తరోత్తరాభివృద్ధిఁ గాంచఁగ సర్వపాపవినిర్ముక్తులై యుత్తమపదవిం గాంచిరి. కావున నీవుం దీర్థయాత్రాదిసుకృతంబున శత్రువుల జయించి నృగశిబిభగీరథవసుమనోగయ పూరుపురూరవఇక్ష్వాకు ముచుకుందమాంధాతృమరుత్తాదిపూర్వరాజులవిధంబున సత్కీర్తి నంతట నెఱపి శుభంబుఁ గాంతువు. అధర్మప్రవర్తు లయినధార్తరాష్ట్రు లచిరంబ నశింతు రింతయు నిక్కం బనిన విని యజాతశత్రుఁ డూఱడిల్లి, యట నైమిశారణ్యముఁ జొచ్చి, యందు గోమతీనదియందునుం, దక్కటితీర్థంబులందును స్నానమాచరించి, గోవులను, ధనంబులను బ్రాహ్మణుల కొసంగి, దేవపితృతర్పణంబుఁ గావించి, యటఁ గన్యాతీర్థం

బును, గోతీర్థంబును సేవించి, కాలకోటియందును, విమపస్థపర్వతంబునందును గొన్నినాళ్లుండి, బాహుదయందు స్నానమాచరించి, ప్రయాగంబునం గంగాయమునాసంగమం బాడి, వన్యాహారంబుల బ్రాహ్మణులం దన్పుచుఁ గొంతకాలంబు తపోనిష్ఠులై యుండి, మహానదిని సేవించి, సర్వసరిత్సముద్భేదస్థానంబును, నిత్యసన్నిహితమహాదేవంబు నగుగయాక్షేత్రంబున బ్రహ్మసరస్సునాడి, యక్షయవటంబునం దార్షవిధానంబునఁ జాతుర్మాస్యక్రతువులు నడపి, నిశ్చితమానసంబున నుపవాసంబులు సలిపి, వేదపారగు లగుబ్రాహ్మణులవలనఁ బుణ్యకథల వినుచున్నంత శమఠుఁ డనుమహర్షి ధర్మరాజున కిట్లనియె.

అధూర్తరజసునికొడుకు గయుఁ డనురాజు తొల్లి వేనవేలుగ నన్నపర్వతంబులు, నేతికాల్వలు, దధినదులు, వ్యంజనప్రవాహంబులం బఱపించి బహుదక్షిణంబు, బహ్వన్నంబు సంతృప్తబ్రాహ్మణంబుగా ననేకయజ్ఞముల నాచరింపదక్షిణాకాలమున బ్రహ్మఘోషము నభోవ్యాప్తమయ్యె. సర్వప్రాణులు నతనియజ్ఞమునఁ దృప్తులయిరి. అతనియజ్ఞమున లెస్సగఁ దృప్తుల యినసుర లితరులయజ్ఞములందు హవిర్భాగముల నెట్లు గ్రహింతు రని తలఁచెద. ఇసుమును, నక్షత్రములను, వర్షధారలనునైన నెన్నవచ్చుఁ గాని గయయజ్ఞమున దక్షిణల నెన్నరాదు, సర్వప్రాణులుం దృప్తుల యినపదంపడి యిరువదియేనన్నపర్వతములు మిగిలె. అతని చేసినరీతి మున్నెవ్వరుం జేసి యుండరు. ఇంకను నెవ్వరుం జేయఁబోరు. ఆగయుని పేర నీగయాక్షేత్రంబు ప్రసిద్ధిం బొందె నని గయామాహాత్మ్యంబుఁ జెప్పిన నభినందించి ధర్మనందనుం డట నగస్త్యాశ్రమంబునకుఁ జని దుర్జయాతీరమున వసించి రోమశమునిం జూచి మునివరేణ్యా, వాతాపి నగస్త్యుఁడు జీర్ణింపఁ జేసె నని విందుము. ఆరాక్షసుఁ డేమిప్రభావమున మనుష్యాంతకుఁ డయ్యె? అమ్ముని యేల వానిపైఁ గినిసె నని యడుగుటయు రోమశుఁ డిట్లనియె.

## అగస్త్యుఁడు లోపాముద్రను వివాహం బగుట.

మణిమతీపురంబున నిల్వలవాతాపులనువారన్నదమ్ము లిద్ద ఱుండిరి. వారిలో నిల్వలుఁడు తపోధనుఁ డగునొక్కబ్రాహ్మణుని సేవించి మహాత్మా, యింద్రతుల్యుం డయినపుత్రుం బ్రసాదింపు మని ప్రార్థింప నాబ్రాహ్మణుఁ డోరా! రాక్షసాధమా! నీ కింద్రతుల్యుఁ డగుకొడుకు కావలెఁగా యని కసరుటయు నాయిల్వలుండు గడుం గనలి తనతమ్ముఁ గామరూపధరుని వాతాపియనువాని మేషరూపంబు ధరింపఁ జేసి యాకృత్రిమమేషంబు వధియించి దాని మాంసంబు వండి యాబ్రాహ్మణునకుఁ గుడువఁ బెట్టి పదంపడి వాతాపీ! యనిమహాస్వనంబునఁ బిల్వఁగ నయ్యతిమాయుం డైనవాతాపి యాబ్రాహ్మణుని డొక్కఁ జీల్చి నిజరూపంబున వెడలివచ్చె. అదిమొదలుగ నయ్యిల్వలవాతాపు లతిథు లయినవిప్రుల నీక్రమం

బున హింసింపుచుండిరి. అట్టియెడ నగస్త్యమునీంద్రుఁడు నియతబ్రహ్మచర్యమునఁ
దపంబుచేయుచు వనమునఁ దిరుగువాఁ డొకపల్లమునఁ దలక్రిందుగ వ్రేలుచున్న
తనపితరులం జూచి యేల మీ రీవిధమున వ్రేలెద రనియడుగ వారిట్లనిరి.
అయ్యా, మేము నీపితృదేవతలము. నీవు కేవలబ్రహ్మచర్యంబ పూని సంతానంబుఁ
బడయమింజేసి మా కూర్ధ్వగతి గలుగ దయ్యె. కాన నధోముఖులమై పడుచు
న్నవారము. నీవు సంతానంబుఁ గాంచితివేని మా కుత్తమగతి గలుగు. అట్లు
చేయు మనిన నగస్త్యుఁ డట్లయని వివాహంబుగాఁ దలంచి తనకుఁ దగినకన్యక
నెచ్చటనుం గానక తపోమహిమంబునఁ బుత్రార్థంబు తపంబు సల్పుచున్న విద
ర్భరాజునకుఁ గూఁతుఁగా నొక్కసుందరీరత్నంబుఁ బుట్టించె, క్రొమ్మెఱుంగుతె
ఱంగున వెలుంగునయ్యది లోపాముద్ర యనుపేరఁ బరఁగి జలంబులందుఁ గమలి
నియుంబోలెఁ దనుఁ గొలుచు సఖీపరిచారికలమధ్యమున వర్ణనీయప్రకారంబున
నెగడి యుచితయౌవనప్రాప్తయగుటయు నెవ్వరును రాజకుమారు లమ్మహాత్మునకు
వెఱచి దానివరింపరైరి. నానాఁట నాకన్నియ యచ్చరలం గేలిసేయు రూపసౌ
భాగ్యంబున నొంపారి తండ్రినిం దమవారలను శీలమున రక్షింపుచుండ విదర్భ
నాథుఁ డీకన్నియకు మగఁ డెవ్వఁ డగునొక్కొ యని చింతింపుచుండె. అయ్యవ
సరంబున నగస్త్యుండు మనంబున వివాహేచ్ఛగూర విదర్భరాజుపాలికిఁ బోయి
మహీపాల, వివాహేచ్ఛమై వచ్చితి. నీకూఁతు లోపాముద్ర నొసంగు మని య
డిగె. అడుగుటయు నప్పలుకులు చెవులకు ములుకులై శోకమూర్ఛవోయి కొం
తవడికిఁ దేఱి వైదర్భుఁ డాత్మగతంబునఁ గాయలు గడ్డలు గుడుచుచు నారలు
గట్టుచు సుఖలేశం బెఱుంగనియిమ్మునికెట్లు సుకుమారి యగుకూఁతు నిత్తు.
ఇయ్యకున్న నితండు శపించు. ఏమి చేయ నగు నని పలుమాఱులు వగచి యె
ద్దియు నిశ్చయింప నేరక భార్యయొద్దకుఁ జని చింతింపుచుండ లోపాముద్ర చిం
తాక్రాంతు లయినతల్లిదండ్రులఁ జూచి తండ్రీ! యిట్లేల మీరు చింతిల్లెదరు.
అమ్మునిం గొసంగుఁడు. దానమే లొడఁగూడు నని చెప్పిన విని వైదర్భుం డిది చేయ
నవలయు నని నిశ్చయించి తనకూఁతు లోపాముద్ర నమ్మునిం గొసంగె. అగస్త్యుఁడు
నారాజపుత్రికి సకలాభరణముల దివ్యవస్త్రముల నపనయింపఁజేసి నారలు గట్టించి
సమానవ్రతచర్య యగునాలోపాముద్రతోడ గంగాద్వారంబునకుఁ జనియా పరమ
పతివ్రతామతల్లి భయభక్తిసంభ్రమంబులు పెనంగొనఁగఁ బరిచరింపుచుండ నుగ్ర
తపంబు సల్పుచుండె. అంత నొక్కనాఁడు తపోవిశేషసముపలబ్ధవిభాద్విగుణితసహ
జతేజంబున వెలుంగుదాని ఋతుస్నాతయైనదాని నాలోపాముద్రం గనుంగొని
దానిశమదమశౌచశ్రీరూపంబులకు మెచ్చి మదనవికారగోచరుండై సంగమం
బపేక్షించిన నాలోపాముద్ర యించుక సిగ్గు గదురఁ బ్రాంజలియై మునీంద్రా,

సంతతినిమిత్తంబుగనె పతి భార్యం గ్రహించుటంజేసి నీవలన నపత్యోత్పాదనంబు నిషేధింపను. నాకోర్కి నెఱవేర్చి మఱి సంగమించుము. అది యెయ్యది యంటేని? నాతండ్రియింట నుత్తమప్రాసాదంబునం గలశయనంబుఁబోని పాన్పునందు వివిధభూషణాంబరచందనపుష్పమాల్యాద్యలంకృతుండవై చందన మలంది, విరులు ముడిచి, తొడవులం దొడిగి, మేలిచీరం గట్టి సొంపు పెంపారునాతోడ సంగమించు మిదియ నామదిం గలకోరిక యిందుకు ధనంబు వలయుఁగదా యది లే దని విచారింపకుము. తపోబలంబున నన్నియు నీకు సులభంబుల కావే యని వేఁడికొనియె. అవ్వేఁడికోలు నాలించి యగస్త్యుఁడు తపోబలంబున ధనంబు సుసాధంబైనను దపోవ్యయం బగుటంజేసి యట్లుచేయ మనసు గొలుప దనిన లోపాముద్ర మునివర్యా, భవదీయతపోలోపము నాకు ననమ్మతంబు. భూషణాదులయందుఁ బేరాసయుం గలదు. ఋతుకాల మల్పావశిష్టంబై యుండునది. నాకోరిక నెఱవేర్చి సంగమింప నెండొకవెరవు నూహింపు మనినఁ గల్యాణీ, నీకోర్కి నెఱవేఱఁగ ధనంబుఁ దేర రాజులకడకుఁ బోయెద నని లోపాముద్రకు మనఃప్రియంబుఁ గావచించి శ్రుతపర్వుఁడు రాజులలో ధనవంతుఁ డని భావించి యతనియొద్దకుఁ బోయె. అతఁడునగస్త్యుఁ దనదేశముఁ జొచ్చినవాని నెఱింగి యెదురేగి భక్తిమెఁ దోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి ప్రాంజలియై మునినాథా, భవదాగమనమున ధన్యుఁడ నైతి. ఏమి చేయుదు ననిన నగస్త్యుండు నృపాల, ధనార్థంబు నీయొద్దకుఁ జనుదెంచితి. నీపోష్యజనపోషణంబునకు విఘాతంబు గాకుండ నాకు ధనం బిమ్మని యడుగుటయు నతండు దనయాయవ్యయంబులు లెక్కించి సమానంబు లని తెల్పుటయు నక్కుంభజమునీంద్రుఁడు మన మిరువురు ధనార్థులమై యొండొక్కచోటి కరుగుద మని చెప్పి యాశ్రుతపర్వుని దోడ్కొని యతనికంటె ధనవంతుఁ డైన బ్రధ్నశ్వుఁ డనురాజునొద్దకుఁ జనియె. ఆబ్రధ్నశ్వుఁడును దేశాంతమున నెదురేతెంచి వారి నిరువురం దోడ్కొని చని విధ్యుక్తంబుగఁ బూజించి యాగమనకారణం బడుగ నగస్త్యుండు తమరాక నెఱింగించి యందును నాయవ్యయంబులు సమానంబులగుటఁ దెలిసికొని మనము ముగ్గురము ధనార్థం బొండొకయెడకుఁ బోయెద మని చెప్పి వారల నిరువురం దోడ్కొని త్రసదస్యునొద్దకుఁ బోయె. ఆపౌరుకుత్సుం డావృత్తాంతము విని దేశసీమయం దెదురుగా వచ్చి యక్కుంభజన్ము నారాజులం దోడ్కొని పోయి యథావిధిగ నర్చించి యాగమనకారణంబు నడుగ నగస్త్యుండు తమరాక ధనార్థం బని తొల్లింటియట్ల యెఱింగించి యందును నాయవ్యయంబులు సమానంబులగుట నరసి మీ రందఱును సమానాయవ్యయులు. మీధనంబు గ్రహించిన భవత్పోష్యజనులకు విఘాత మయ్యెడి. వేఱొక్కచోట నందఱముం బుష్కలధనం బార్జింపవలయు. అట్టిధనవంతుం డెల్లుఁ

డనిన వారు మునివరేణ్యా, యిల్వలుఁ డనుదానవుఁడు లోకమున నెల్ల మిగుల ధనవంతుఁడు. వానియొద్దకుఁ బోవలయు నని విన్నవించుటయు నగస్త్యుండు వారితోడ నతనియొద్దకుఁ బోయె.

అగస్త్యుఁడు వాతాపి యనుదానవుని జీర్ణింపఁ జేయుట.

ఇల్వలుండు నెదురేగి వారలఁ దనవీడు సేర్చి యందఱ నాతిథ్యంబునకుఁ బ్రార్థించి యెప్పటియట్ల మేషరూపధారి యయినవాతాపిని వధించి తన్మాంసంబు వండుచుండె. ఆనడి యెఱింగి యారాజులు సంభ్రమంబు గదుర నద్దానవాధముని దురుద్యోగంబుఁ దేటపఱుప నగస్త్యుఁ డిందుకు విషాదంబు వలదు వానిం గబళింతు ననిబోధించి యారాజుల నూరార్చె. ఇల్వలోపకల్పితం బయినయాసనంబునఁ గూర్చుండి వానివడ్డించినవాతాపినంజు డంతయు మెల్లన నమలి యొక్క త్రేఁపు త్రేఁచె. అట నిల్వలుం డెప్పటియట్ల వాతాపీ! వెడలిర మ్మని పలుమాఱులు పిల్వఁగ నగస్త్యుండు నవ్వుచు నోయిల్వలా! యింకను వాతాపిగలఁడే? వాఁడు నాజఠరంబున జీర్ణుఁడయ్యెననిన విషణ్ణుండై యిల్వలుండు కేల్దోయి మొగిచి మునిపుంగవా, యేల వీరితోడ వచ్చితి రనిన నగస్త్యుం డసురపతీ, నీ వెల్లవారికంటె ధనికుఁడ వని విని ధనార్థులమై వచ్చినవారము. నీపోష్యజనపోషణంబునకు విఘాతంబు గాదేని యీరాజులకుఁ బ్రత్యేకంబ పదివేలమొదవుల, నన్నిగద్యాణంబులను నా కిరువదివేలమొదవుల,నన్నిగద్యాణంబులను,మనోవేగంబులయిన యుత్తమాశ్వంబులం బూన్చినయొకసువర్ణరథంబును విచారించి యి మ్మని చెప్పిన నిల్వలుండు తత్క్షణంబ వాని నెల్లఁ దలంచి తెప్పించి మునిచెప్పినట్ల యారాజులకంతయు నొసంగి యతనికి విరావ సురావంబు లనుగుఱ్ఱములం బూన్చినకాంచనరథంబు, నిరువదివేలమొదవుల, నన్నిగద్యాణంబుల నొసంగె. వానిం గైకొని యగస్త్యుం డారథంబు నారాజులతోడ నారోహించి యతివేగంబున నాశ్రమంబు సేరి యారాజులఁ దత్తత్పురంబులకుఁ బోననుజ్ఞచేసి పత్నికోరినప్రకారంబు నన్నియుం గల్పింప నాలోపాముద్ర యెంతయు సంతోషించి యింక నపత్యోత్పాదనంబుగావింపు మనిన నగస్త్యుఁ డిట్లనియె. కల్యాణీ, నీవృత్తంబునం జేసి సంతుష్టుండ నైతి. వేవురఁ గొడుకులఁ గోరికొనియెదవొ. పదుగురఁ బోలెడువారల నూఱుగుర నపేక్షింతువొ. నూఱుగురఁ బోలెడువారలఁ బదుగుర వలతొ. వేవురం బోలెడు వాని నొక్కనిఁ గాంక్షింతువొ యని యడుగ లోపాముద్ర పెక్కండ్రకంటె వేవురఁ బోలెడివాని నొక్కనిఁ బ్రసాదింపుము. ఒక్కరుఁడైన సర్వగుణవిలసితుండు గావలయుఁ గాని యప్రయోజకులు పలువు రేల? యని చెప్పినం దదభిప్రాయం బెఱింగి యగస్త్యుండు శుభసమయంబునం జిత్తానువర్తి యగునాలోపాముద్రకు గర్భాధానంబుఁ గావించి తపోనుష్ఠానార్థంబు వనమునకుఁ జనియె. అట లోపాముద్ర

యేడేడులు గర్భంబుఁ దాల్చె. అంత నెనిమిదవయేఁట గర్భస్థుఁ డగుకుమారుఁడు సాంగవేదములఁ జదువుచు దృఢస్యుఁ డనఁ బరఁగె. అమ్మునికిఁ దేజస్వియను వాఁడు పుట్టి చిఱుతప్రాయమునందె యగ్నిపరిచర్యార్థంబుగ నిధ్మంబులఁ దెచ్చు టంజేసి యిధ్మవాహుండునాఁ బరఁగె. ఇవ్విధంబున నగస్త్యసంతానంబు పుత్త్రపౌత్త్రాభివృద్ధిఁ బొందుటయుఁ దత్పితృదేవత లుత్తమలోకంబులం గాంచిరి. నాఁటఁగోలె నియ్యాశ్రమం బగస్త్యాశ్రమం బన విశ్రుతం బయ్యె. ఇది భాగీరథి. తల్లివలె నీదక్షిణదిక్కు నెల్లఁ బవిత్రీకరించునది. ఇందు మునుఁగుము. ఇది భృగుతీర్థంబు. ఇందుఁ బరశురాముఁడు తొల్లి శ్రీరామాపహృతం బైనతనతేజంబుఁ గ్రమ్మఱ నధిగమించె. నీవు నిందుఁ దమ్ములతోడను, ద్రౌపదితోడను స్నానముఁ గావించి దుర్యోధనాపహృతం బైనరాజ్యంబుఁ గ్రమ్మఱ సాధింతు వని రోమశుండు నిరూపించిన ధర్మరా జందు సానుజుండు సభార్యుండుగా స్నాన మొనరించి దేవపితృతర్పణంబుఁ బొనరించి యప్రధృష్యతేజంబుఁ బడసి రోమశుం జూచి మునిపుంగవా, పరశురామునితేజంబును శ్రీరాముఁ డేల యపహరించె. క్రమ్మఱ నతఁ డెట్లు దానిఁ బొందె నని యడుగ నమ్ముని యతని కిట్లనియె.

* నారాయణుండు రావణవధార్థంబుగ దశరథపుత్త్రుఁడుగ నవతరించె ననుట సుప్రసిద్ధంబు గదా. ఆశ్రీరామునిపరాక్రమంబు నెఱుంగఁ బరశురాముఁడు తనవిల్లు గొని యయోధ్యకుఁబోవుటయు దశరథుఁడు జామదగ్న్యుని దమదేశముఁ జొచ్చిన వానిఁగ నెఱింగి రాముం బంపె. పరశురాముఁడును దాశరథిం జూచి నవ్వుచు రాజేంద్రా, నీబలంబు చూతము. ఈవిలు మోపెట్టు మని దర్పంబునం బలికిన దాశరథి యీమాటల నేమి ప్రయోజనంబు? ఇదె చూడు మని చెప్పి తత్క్షణంబ పరశురాముని చేతివిల్లు గొని యశ్రమంబున మోపెట్టి సకలభూతంబు లుద్విగ్నంబులుగాఁగ గొనయమ్ము సారింపుచు నీక నేమి చేయవలయు నని యడిగె. అడుగుటయుఁ బరశురాముఁడు రాముం జూచి యోహెూ! మోపెట్టినమాత్రన వీర్యవంతుఁడ వైతివొ? ఈయమ్ము నందు సంధింపుము. ఇందుఁ జూతము నీబలం బని చెప్పి యొకబాణ మిచ్చిన శ్రీరాముఁడు దాని వేగంబ సంధించి కోపదీపితుండై జామదగ్న్య, బ్రాహ్మణులు క్షమావంతు లని లోకవిశ్రుతంబు. నీయందు శాంతియన్న సున్న. తేజ మొక్కండు క్షత్త్రియులకంటె నెక్కుడుగఁ బూని యుండెదవు. బ్రహ్మప్రసాదంబున న న్నధిక్షేపించి పలికెదవు. వృథాగర్వం బుడుగుము. దివ్యదృష్టి

* ఈయుపాఖ్యానము తెనుఁగు భారతమునందు లేదు. రామాయణమం దుండినను రాముఁడు పరశురామునకు దివ్యరూపంబు చూపినట్లు లేదు. వివాహమయి మిథిలనుండి యయోధ్యకుఁ బోవునపుడు శివధనుర్భంగకుపితుండై పరశురాముఁడు మార్గమున సంధింపఁగా నపుడు శ్రీరాముఁ డతని తేజస్సు గ్రహించిన ట్లున్నది.

నొసంగెద నన్నుఁ జూడు మనియె. అనవుడు నాదివ్యదృష్టిప్రభావంబునఁ బరశు రాముఁడు శ్రీరామునిశరీరంబున వసురుద్రాదిత్యసిద్ధసాధ్యదైత్యదానవయక్షరాక్ష సగుహ్యకగంధర్వపితృమరుద్గణంబుల, గ్రహనక్షత్రముల, నగ్నుల, వాలఖిల్యాది ఋషుల, దేవర్షుల, సముద్రముల, సకలనదుల, నిఖిలపర్వతముల, సర్వతీర్థముల, మూర్తిమంతంబులయిన సర్వవేదవేదాంతయజ్ఞవషట్కారంబుల, మేఘబృందముల నుం గాంచి భయవిస్మయభ్రాంతస్వాంతుండై యుండ శ్రీరాముఁ డాబాణము నత నిపైఁ బ్రయోగించె. ప్రయోగింపఁగ నది పాంసువర్షంబును, ఝంఝూవాతంబును, గొఱవులను సంతతం బఱపించుచుఁ బుడమి వడఁక నాజామదగ్న్యుని తేజంబు గ్రహించి చనియె. జామదగ్న్యుఁడు నయ్యస్త్రంబు సోఁక మూర్ఛవోయి కొం తవడికి లబ్ధచేతనుండై లజ్జాభయంబులు పెనంగొనంగ శ్రీరామునకుఁ గృతప్రణా ముఁడై యనుజ్ఞఁ గొని మహేంద్రపర్వతంబుఁ జేరె. అంత నొక్కవర్షంబు చన నతనిపితరులు మదం బుడిగి దుఃఖింపుచున్నయాపరశురాముపాలికి వచ్చి పుత్రా! సర్వలోకేశ్వరుం డైనవిష్ణు నెదిరించుటంబట్టి యిట్లు నిస్తేజస్కుఁడ వైతివి. సర్వ లోకపూజ్యుం డైనయమ్మహానుభావుఁ జెనకవచ్చునే? వధూసర యనునదికిఁ జని యందు దీప్తోదం బనుతీర్థంబాడుము. అందే భవత్ప్రపితామహుఁ డైనభృగుమ హర్షి తీవ్రతపంబు సలిపె. తొల్లింటితేజంబుఁ బొందఁగల వని బోధించిరి. వారి వచనంబునఁ బరశురాముఁడుతొల్లి యాతీర్థంబునాడి నిజతేజం బధిగమించె ననిన విని ధర్మరాజు రోమశమునీంద్రా, యగస్త్యచరితంబు సవిస్తరంబుగఁ జెప్పవే యని యడుగుటయు నమ్ముని యతని కిట్లనియె.

ఇంద్రుఁడు వజ్రాయుధమున వృత్రాసురుం జంపుట.

ధర్మనందనా, యుద్ధదుర్మదులు, పరమదారుణులు నగుకాలకేయు లనురా క్షసులు వృత్రాసురు నాశ్రయించి నానాయుధంబులం బూని సురలకు వివిధబా ధలఁ గావింప నమరులు తత్పరాక్రమంబు నివారింప నేరక యింద్రపురస్కృతులై బ్రహ్మపాలికిఁ జని కృతాంజలు లగుటయుఁ బరమేష్ఠి వారిమనోభిప్రాయం బెఱింగి సురలారా, మీతలంపు నే నెఱుంగుదు. దధీచమునీంద్రు నొద్దకుఁ బోయి యతని నెమ్ములఁ బ్రార్థించుఁడు. అతండు భవత్ప్రార్థనంబు వృథ పుచ్చఁడు. ఆయస్థులఁ దీసికొని వజ్రాయుధంబుఁ జేయించుఁడు. అద్దివ్యసాధనంబున నింద్రుఁడు వృత్రా సురుం జంపు. ఈయుపాయంబు శీఘ్రంబ చేయుఁ డనియె. సురలును బ్రహ్మయా నతిం గొని నారాయణపురస్కృతులై సంతతక్రూరమృగప్రచారంబు, సామగా నానుకారిమధుకరమధురఝంకారసమంచితంబు, నానాద్రుమలతావితానంబునై భయానకమహనీయరమణీయంబై యున్నదధీచాశ్రమంబునకుఁ జని తపోమహి మంబున సరుణకిరణుకరణిఁ బ్రజరిల్లుచున్నయమ్మునిం గాంచి బ్రహ్మచెప్పినప్రకారం

బునఁ బ్రార్థించిరి. తత్ప్రార్థనంబు విని దధీచముని యతిప్రీతుండై సురలకు హితంబుచేయుకంటె నుత్తమంబు వేఱొండు గలదే. అవశ్యంబు నాదేహంబు నిత్తునని చెప్పి యోగవిద్యామహిమంబునఁ బ్రాణముల విడిచె. అంత సంతుష్టులై నిలింపు లమ్మునియెమ్ముల గ్రహించి విశ్వకర్మచే వజ్రాయుధంబుఁ గావించి కాలకేయగణపరివృతుండై నవృత్రాసురుని దాఁకుటయు దేవదానవులకుఁ బోరు ఘోరంబయ్యె. అట్టియెడ నప్పటప్పటికి వృత్రునకు బలంబధిక మగుటయు నింద్రుఁడు క్షీణబలుం డగుటయుఁ బరికించి నారాయణుండు తన తేజోమహిమంబున నింద్రునకుఁ దేజోవృద్ధిఁ గావించుటయు నమ్మహేంద్రుఁడు మహర్షులకు మహానందంబు గూరఁ బోరు సేయుచుండ వృత్రుఁడు ఘోరరూపంబుగా సింహనాదంబు లొనరించె. ఆఘోరనిస్వనంబునకుఁ బుడమి వడఁకె. దిక్కు లదరె. నభంబు చలించె. అంత నెంతయు సంత్రస్తుండై యాఖండలుండు వజ్రాయుధంబు వానిపై నేసె. ఏయుటయు వృత్రుఁడు పర్వతంబుమాడ్కిఁ బుడమి యద్రువఁ గ్రిందఁ గూలె. అమ్మహాసంభ్రమంబున నిది యిట్టి దని నిరూపింప నేరక దిక్కు దోఁచక యింద్రుఁ డెద్దియేనికొలను సొరఁగఁ గాందిశీకుఁడై కొంతవడికి వృత్రవధంబుఁ దెలిసి క్రమ్మఱివచ్చి సురలం బురికొల్పి కాలకేయులఁ జెండాడం దొడంగుటయు నాదానవులు విభ్రాంతులై పాఱి సముద్రంబుఁ జొచ్చిరి. చొచ్చి యాకాలకేయులంతనిలువక త్రైలోక్యవినాశార్థం బుద్యమించి తమలో మంతనంబు సేయువారు ముందుగ విద్యాతపోవిలసితు లగుబ్రాహ్మణుల వధింతము. వీరు పోయిన జగంబు నశించు. మనము పెఱవారికి దురాధర్షం బయినసముద్రంబు దుర్గంబుగా నాశ్రయించితి మనివిచారించి "వినాశకాలే విపరీతబుద్ధి" యనున్యాయమున బ్రాహ్మణుల వధింప నిశ్చయించిరి. అట్లు కృతనిశ్చయులై యాదానవులు పగలెల్ల సముద్రమున డాఁగి రాత్రులెల్ల మునిపల్లెలకుఁ బోవుచు బ్రాహ్మణుల వధింపు చుండిరి. ఆవిప్రప్రళయంబున వసిష్ఠాశ్రమమున నూటతొంబదియేడ్గురును, చ్యవనాశ్రమంబున నూఱుగురును, భరద్వాజాశ్రమంబున నిరువదుగురును, నింకను ననేకాశ్రమంబులందుఁ బెక్కండ్రును మహామును లాదుష్టరాక్షసులవలనఁ బొలియుటయు భూమియంతయు బ్రాహ్మణులకండలతండంబులను, నెత్తురుటేరులను, బ్రేవులప్రోవులను, భగ్నంబు లయినకమండలువులను, బగులఁ గొట్టినస్రుక్స్రువంబులను, విశీర్ణంబు లయినయగ్నిహోత్రంబులను నీరంధ్రంబయ్యె. వేదాధ్యయనంబు, యజ్ఞాచరణంబు, తపోనుష్ఠానంబును గథాశేషంబు లయ్యె. అందఱుప్రాణరక్షణపరాయణులై దోఁచినట్ల పాఱిరి. శూరులు కొందఱు తద్వధార్థం బాయుధపాణులై యంతటను నెమకి సముద్రదుర్గవాసు లగువారలఁ గాంచ నేరరయిరి.

## దేవతలు విష్ణుదేవుని స్తుతించుట.

అంత వేదాధ్యయనయజ్ఞాచరణాదిసత్క్రియాకలాపలోపంబున లోకము నకు వినాశ మాసన్న మగుడు వెఱచి వేల్పులు సేంద్రులై శరణత్రాణపరాయణుం డైననారాయణుపాలికిఁ జని నమస్కరించి దేవా! నీవలన జగంబులు పుట్టుఁ బెరుగు నడఁగు. నీవ సకలకారణంబవు. సర్వంబు నీయంద సుప్రతిష్ఠితంబు. నీవ తొల్లి వరాహరూపధరుండవై భూమి నుద్ధరించితివి. నరసింహరూపధరుండవై హిరణ్యకశిపుని సంహరించితివి. వామనరూపధరుండవై బలిని త్రైలోక్యరాజ్యవిభ్రష్టుం జేసితివి. యజ్ఞధ్వంసకుఁ డైనజంభుఁ డనుదానవు వధించితివి. నీకృత్యంబుల లెక్కింప మాబోంట్ల కలవియే? భయభ్రాంతుల మైనమాకు నీవే గతివి. వేఱొక్కదిక్కుఁ గానము. కాలకేయులవలనఁ గలిగినయుపద్రవము నివారించి లోకములను, మమ్మును రక్షింపుము. ఆదురాత్ములు పవలెల్ల నగపడరు. రేలెల్ల గండు మీఱి బ్రాహ్మణుల వధించుచున్నవారు. బ్రాహ్మణులు క్షయించిన భూలోకంబు నశించు. భూలోకంబు నశించిన స్వర్గము చెడు. బ్రాహ్మణక్షయంబ యిట్లు సర్వనాశంబునకు మూలంబయ్యెడి. కరుణింపుము. నీప్రసాదంబునం గాదే సర్వభూతంబులు పెరుగుచున్నయవి. సర్వభూతవృద్ధిచేతఁ గదా హవ్యకవ్యముల మేము దనియుదుము. అస్మదీయప్రత్యవేక్షణంబునంగాదె భూలోకమున మేలు గలుగు, కావున లోకంబు లన్యోన్యాశ్రయంబున వృద్ధిఁగాంచుచున్నవి. భయం బుడిపి కావు మని విన్నవించిన నారాయణుం డిట్లనియె. సురలారా, ప్రజాక్షయకారణంబు నాకు విదితంబు. మీకుం జెప్పెద వినుండు. వృత్రాసురు నాశ్రయించినకాలకేయు లావృత్రు నింద్రుఁడు వజ్రాయుధంబున వధింపఁగఁ బ్రాణరక్షణార్థంబు సముద్రంబుఁ జొచ్చి వెలుపుదక్కి లోకక్షయార్థంబుగ ఋషుల వధింపుచున్నవారు. సముద్రు నాశ్రయించి యుండునంతకు వారల వధించుట దుష్కరంబు. సముద్రము శోషించిన వారు నిరాశ్రయులై మీకుఁ జిక్కి పొలియుదురు. సముద్రంబును శోషింపఁజేయ నగస్త్యుఁడు దక్కఁ దక్కటివా రెవ్వరు వలఁతులు గారు. కావున వేగంబ మీరగస్త్యునిఁ బ్రార్థించి సముద్రశోషణంబుఁ జేయించి యాదుష్టరాక్షసుల సంహరింపుఁ డనిన విని యమరు లద్దేవదేవునానతిం గొని యగస్త్యాశ్రమంబునకుఁ బోయి ఋషిగణసముపాస్యమానుం డైనయామైత్రావరుణి మునీంద్రుఁ గాంచి మునీంద్రా! నీవు దురభిమానచిత్తుఁ డైననహుషునకు నాకలోకభ్రంశంబుఁ గావించితివి. క్రోధప్రవృద్ధం బయిన వింధ్యపర్వతంబు వృద్ధి మాన్పి సూర్యగమనంబున కప్రతివిఘాతంబుఁ గల్పించి లోకములతమం బడంచితివి. భయగ్రస్తుల మయినమాకు నీవే శరణంబ వని స్తుతించి రనుటయు ధర్మరాజు రోమశమునీంద్రా! వింధ్య మే క్రోధంబునఁ బెరిగె? అగస్త్యుఁడు దాని పెంపు నేల యడంచె నని యడుగఁగ రోమశుఁ డతని కిట్లనియె.

తొల్లి వింధ్యపర్వతంబు సూర్యుం గాంచి యేల నీవు నిత్యంబును మేరు పర్వతంబునకే ప్రదక్షిణంబుఁ జేసెదవు. ఇఁక మీఁద నాకుఁ బ్రదక్షిణంబు సేయు మనిన సూర్యుఁడు నే నాత్మేచ్ఛమై మేరువును వలగొనను. మఱి యిది లోకప్రచారార్థంబుగా నాకు విధినిర్మితం బయినమార్గం బని చెప్పిన వింధ్యంబు గినిసి యిట్లయ్యెనేని నే నిఁక సూర్యచంద్రులమార్గంబు నిరోధింతు నని పూని యథేచ్ఛంబుగఁ బెరుగసాగె. దాన సూర్యచంద్రాది ప్రచారంబు నిరుద్ధం బగుడు లోకముల నెల్లఁ గటికిచీఁకటి కప్పుకొనఁగ జగంబున సత్క్రియాలోపంబు వాటిల్లె. అంత నమరు లగస్త్యునిపాలికిఁ బోయి మునీంద్రా! వింధ్యపర్వతంబు సేత నెఱుం గుదు గదా. దీనిని వారింప నీవుదక్కఁ దక్కటివారలు నేరరు. కరుణించి దాని పెంపు నడఁగించి లోకములఁ గావు మనిన విని యక్కుంభసంభవముని లోపాము ద్రతోడ వింధ్యంబునొద్దకుఁ జనుదెంచి పర్వతోత్తమా, నే నొకకార్యంబున దక్షిణంబునకుఁ బోయెద. తెరువు విడు మని చెప్పి యత్యంతవినయంబున భాస మానం బయినయాపర్వతంబుఁ గాంచి క్రమ్మఱ నిది లేచునొక్కొ యని తలంచి నావచ్చునంతకుఁ దొలంగియె యుండు మని చెప్పి దానిం దొలఁగించి దక్షిణంబు నకుఁ జనియె. ఇప్పటికి నగస్త్యుఁడు దక్షిణదిక్కు విడిచి రాఁడు. ఇది వింధ్యంబు పెరుగమికిఁ గారణంబు. అది య ట్లుండె.

అగస్త్యుఁడు సముద్రోదకంబు పానంబు సేయుట.

ఆప్రకారంబున సురలు స్తుతింపఁగ నాకర్ణించి యగస్త్యుండు త్రిదశు లారా, యేల వచ్చితిరి? ఏమి చేయవలయు నని యడుగ వారు మహాత్మా, సముద్ర జలముఁ ద్రాగుము. దాన నాసముద్రంబు శోషించినఁ దద్దుర్గవాసు లగుకాల కేయు లనురాక్షసులను మేము వధింతు మనిన నామైత్రావరుణి యట్ల చేయుదు నని యొడంబడి దేవమునిమనుష్యోరగయక్షగంధర్వాదిపరివృతుండై యుత్తుంగ తరంగంబుల నర్తనంబుఁ జేయునదివోలె, వాయువిధూననంబునఁ జరించునది వోలె, నురుగుతెట్టల నవ్వునదివోలెనొప్పునదియుఁ దిమితిమింగిలనక్రమకరాది యాదోగణనీరంధ్రంబు నగుసముద్రంబుఁ జేర నరిగి దేవమునిముఖ్యులం గాంచి లోకహితార్థంబు నేను దీని ద్రావెద. మీపనికి సన్నద్ధులరయి యుండుఁ డనిచెప్పి యందఱుం జూచుచుండఁగ నప్పారావారనీరంబు నెల్ల నొక్కగ్రుక్కగాఁ ద్రావె. త్రావుటయు నమ్మునిమహాప్రభావంబున కచ్చెరువడియింద్రాదినిర్జరులు కుంభసం భవమునీంద్రా, నీవ మాకు రక్షకుఁడవు, లోకభావనుఁడవు, నీప్రసాదంబున లోకచ్ఛేదంబు దప్పె నని పెక్కువిధంబుల స్తుతించిరి. గంధర్వవిద్యాధరాదులు తౌర్యత్రికంబును, బుష్పవర్షంబునుం గావించిరి. అ ట్లగస్త్యపీతం బయి సము ద్రంబు శుష్కం బగుటయుఁ గాలకేయులు నిరాశ్రయులై బయలుపడఁగ నమరు

లువివిధాయుధంబులం బూని యాదుష్టరాక్షసులం దాఁకి యురువడించి యనేకుల గీటడంచుటయు హతశేషు లగువారు శోణితసిక్తాంగులై పూచినమోదుగులప గిది నెప్పి వేఱొక్కదిక్కు గానక భయసంభ్రాంతులై పుడమి భేదించి పాతాళంబుఁ జొచ్చిరి. అంత నమరులు మైత్రావరుణిమునిం బెక్కుదెఱంగుల స్తుతించి మునీంద్రా, నీవు ద్రాగినజలము నెల్లం గ్రమ్మఱ విడచి వారిధి నిండింపు మని యడిగిన నగస్త్యుఁ డాసలిలంబు మదీయోదరంబున జీర్ణం బయ్యె. వారిధి పూరణార్థంబుగ నుపాయాంతరంబుఁ జింతింపుఁ డని చెప్పుటయుఁ దదీయప్రభావమున కెంతయు విస్మితులై వా రమ్మునీంద్రుననుజ్ఞఁ గొని తమలో నెట్లు మగుడ సముద్రంబు నిండునొక్కో యని విచారించుచు నారాయణపురస్కృతులై బ్రహ్మ పాలికిఁ జని ప్రాంజలులై దేవా! యగస్త్యపీతంబై సముద్రము శుష్కం బయ్యె. క్రమ్మఱ నది నిండఁగ నుపాయంబుఁ జెప్పవే యని యడుగ బ్రహ్మ వారిం బ్రసన్నదృష్టి నాదరించి జ్ఞాతికారణంబున భగీరథుఁ డనురాజు పెద్దకాలంబునకు సముద్రంబు సలిలపూర్ణంబుగఁ జేయువాఁడు. మీరు చనుఁ డనిన విని గీర్వాణులు కాలయోగంబుఁ బ్రతీక్షింపుచు యథాగతంబుగ నరిగి రనిన విని ధర్మరాజు రోమశమునీంద్రా, జ్ఞాతినిమిత్తమున భగీరథుఁ డెట్లు సముద్రపూరణంబుఁ జేసె నని యడుగ రోమశుఁడు ధర్మరాజున కిట్లనియె.

పాండవాగ్రణీ, తొల్లి యిక్ష్వాకువంశమున సగరుఁ డనురాజు హైహయులఁ, దాలజంఘులను జయించి రాజ్యం బేలువాఁడు పెద్దకాలంబు సంతతిం గానక వగచుచు వైదర్భి శైబ్య యనుభార్యలతోడఁ గైలాసమునకుఁ జని మహాదేవుం, బినాకపాణి, శంకరు, నుమాపతి, నీశ్వరు నుద్దేశించి పుత్రార్థం బుగ్రతపంబు నేసి యందుకు మెచ్చి సన్నిహితుం డైనయీశ్వరునకుఁ బ్రణమిల్లి పుత్రులం బ్రసాదింపు మని వేఁడుటయు నద్దేవదేవుండు నృపాలా, నీకొక్కభార్యయం దఱువదివేవురుకొడుకు, లతిశూరులు, పరమదర్పులు జనింతురుకాని వారు శీఘ్రంబ క్షయింతురు. మఱియొకభార్యయం దొకకొడుకు పుట్టు. వాఁడే కులవర్ధనుం డగునని వరంబు నొసంగి యదృశ్యుండైన సగరుఁడు నాతిసంతుష్టుఁడై పురంబు నేరె. ఈశ్వరవరంబునఁ దత్పత్నులు కాలక్రమంబున గర్భిణులయిరి. అందు వైదర్భి కొకసొరకాయ పుట్టె. శైబ్య కొక్కకొడుకు జనించె. సగరుఁడును వైదర్భికిఁ గలిగినయలాబూఫలంబుఁ బరిహరింప నెంచుచుండ "నోరాజేంద్రా! తెంపునఁ దుంబీఫలంబుఁ బరిహరింపవలదు. అందు బీజములనెల్ల ఘృతపూర్ణపాత్రంబులనుంచి రక్షించుము. దాన నఱువదివేవురుకొడుకులు జనింతు" రని యశరీరవాణి వినిపించె. ఆవచనంబు విని సగరుఁడు శ్రద్ధావంతుఁడై యయ్యలాబూఫలంబునందలివిత్తుల గ్రహించి వేఱువేఱ ఘృతపూర్ణకుంభముల నునిచి తత్సంరక్షణార్థంబు

ప్రత్యేకంబ దాదుల నియమించి రక్షింపుచుండఁ బెద్దకాలంబున కీశ్వరవరంబున నఱువదివేవురుపుత్రులు జనించి కాలక్రమంబునఁ బెరిగి యత్యుద్ధతులై దేవగంధర్వాదు లగుసకలలోకవాసుల నేఁచుచుండిరి. అందులకు సహింపక నిలింపులు పంకజాసనుపాలికిం బోయి తదీయదుశ్చేష్టలఁ దేటపఱుప నప్పరమేష్ఠి శీఘ్రంబ సగరపుత్రులు నశింతురు పొం డని చెప్పినఁ దదాజ్ఞం గొని సురలు నిజస్థానంబులఁ జేరిరి.

—•••సగరపుత్రులు కపిలమునికోపాగ్నిదగ్ధు లగుట•••—

అంతఁ గొంతకాలంబున సగరుఁ డశ్వమేధదీక్షితుండై యశ్వంబును దేశంబులం బంచిన సగరపుత్రులు దాని రక్షించుచు నరుగువారు నిర్జలం బైన సముద్రంబునం దంతర్హితం బయినయత్తురంగంబుఁ గానక వగచి తండ్రియొద్దకుఁ బోయి యశ్వంబుపోక నెఱింగించి తదాజ్ఞం దాని నన్వేషింపం బూని సముద్రద్వీపనదీపర్వతకందరాదులయందు నెమకి యెచ్చటను నాగుఱ్ఱంబుఁ గానక మగిడి తండ్రికడకుఁ బోయి భూమండలం బెల్ల నన్వేషించితి మయ్యశ్వం బెచ్చటను నగపడ దయ్యె నని తెల్పిరి. తెల్పుటయు సగరుండు దైవవశంబునఁ గ్రోధవ్యాకులుండై కొడుకులఁ బిలిచి "క్రమ్మఱ నరిగి నెమకి గుఱ్ఱముఁ గొనిరండు. అది లేకుండ రావలవ" దని నియమించె. వారు తండ్రిపంపునఁ జని భూమండలంబున నెల్ల దానిం గానక నిర్జలం బైనసముద్రంబు సొచ్చి యందలిసత్త్వములు వేనవేలుగ నార్తనాదంబులు సేయుచు భిన్నమస్తకత్వగస్థిసంధులై మడియుచుండఁ, గఁ గరుణ మాని పెద్దకాలంబు త్రవ్వి త్రవ్వి సముద్రపూర్వోత్తరభాగంబునఁ బాతాళంబు సొచ్చి కపిలాశ్రమంబునందు సంచరింపుచున్నయా హయంబుఁ గాంచి సంతసిల్లితపఃప్రభావసముపలబ్ధదివ్యతేజంబున నగ్నివోలె వెలుంగువాని వాసుదేవాంశసంభూతుం డైనవానిఁ గపిలాచార్యునిం గాంచి కాలచోదితులై యుచితం బెఱుంగక యితండె యీగుఱ్ఱమును నాఁచికొని కపటమునివేషంబున నున్న వాఁ డని పలుదెఱుంగులం బ్రల్లదంబు లాడి యమ్మహాత్మునిం దిరస్కరించి యమ్మునీంద్రునితీక్ష్ణజ్వాలాభీలం బైనవీక్షణానలంబున దగ్ధులయిరి. సగరుఁడును నారదునివలనఁ బుత్రమరణంబుఁ దెలిసి చింతాశోకవ్యాకులుండై శివాజ్ఞం దలపోసి దైవకృతంబున కేమియుం జేయరా దని యించుక యూఱడిల్లి పౌత్రుఁ డైనయంశుమంతుం బిలిచి వత్సా! నానిమిత్తమున నఱువదివేవురుకొడుకులు కపిలమునికోపానలంబున దగ్ధులై రి. నీతండ్రి యగునసమంజసుని ధర్మంబుఁ బరిశీలించి పౌరజనహితార్థంబు దేశముల వెలువరించితి. దానం జేసి బహుపుత్రకుఁడనయ్యు నపుత్రకునిపోలె వనటలఁ గుందవలసె నని చెప్పె ననిన విని ధర్మరాజు సగరుఁ డేల కొడుకును విడిచె? పుత్రుల విడుచువారును జగంబులం గలరే? అని యడుగ రోమశుఁడిట్లనియె.

సగరునకు శైబ్యయందు జనించినకుమారుఁ డసమంజసుఁ డనువాఁ డసమంజసస్వభావుండు పురంబునఁ గొండికలం బట్టితెచ్చి నదిలోఁ ద్రోసి చంపుచుండె. పౌరులు భయవిషాదవిహ్వలురై సగరుం జేరనరిగి కేలుమొగిచి యసమంజసుచేతల విన్నవించి మహారాజా! నీవలన మేము శత్రుభయములఁ దొఱంగితిమి. ఇపు డీయసమంజసువలని వెఱపు వాపి గావవే యని మొఱపెట్టుకొనిరి. పౌరవచనంబు విని సగరుండు కొడుకుం ద్రోయ నేరక వగచి కొంతవడికి ధర్మంబు పరికించి మంత్రులఁ బిలిచి నిరపరాధు లగుపౌరబాలుర వధించునట్టిదుశ్శీలు నసమంజసుని నాకుఁ బ్రియంబుగాఁ బురంబు వెలువరించునది యనియాజ్ఞాపించుటయు వారట్ల చేసిరి. ఇది సగరుండు కొడుకుం బరిహరింపఁగఁ గారణంబు. అది యట్లుండె.

సగరుం డట్లు పౌత్రుఁ డైనయంశుమంతునకుఁ జెప్పి వత్సా! పుత్రమరణంబునకు నే నంతగఁ జింతింపను. విధికృతంబుఁ దప్పింప నలవి కాదు. యజ్ఞవిఘ్నమున కెంతయుఁ జింతిల్లుదు. కావున నాగుఱ్ఱంబుఁ గొని వచ్చి యజ్ఞము సంపూర్ణముఁ గావింపు మని పంచె. అంశుమంతుఁడుం బితామహుపంపున వెడలి సగరసుతులు త్రవ్వినత్రోవనే పాతాళంబున కరిగి గుఱ్ఱముఁ గనుంగొని పురాణఋషివర్యుం డైనకపిలాచార్యు నవలోకించి భక్తిమై సాష్టాంగదండప్రణామంబు లొనరించి యుపాసించి యుండె. అంత సుప్రీతుండై కపిలమునీంద్రుఁడు వరంబులు గోరికొను మనిన నంశుమంతుఁడు యజ్ఞనిర్వాహార్థంబుగా నాగుఱ్ఱమును, బ్రాహ్మణకోపదగ్ధు లయియున్నతండ్రులకుఁ బావనత్వంబునుం గోరికొనిన నమ్ముని యిట్లనిమె. అనఘా, నీకోరినవరంబు లిత్తు. శాంతిసత్యాదులు నీయందు సుప్రతిష్ఠితంబులు. నీవలన సగరుఁడు కృతార్థుఁ డయ్యె. నీప్రభావంబున సగరపుత్రులు స్వర్గంబుఁ గాంతురు. నీపౌత్రుఁడు గంగాదేవిం బ్రార్థించి మహేశ్వరుం దపమున మెప్పించి సగరసుతులఁ దరింప స్వర్గమునుండి యమ్మహానదిం దెచ్చువాఁడు. గుఱ్ఱముఁ గొనిపోయి నీతాత జన్నంబు పూర్ణంబుఁ గావింపు మనిన నంశుమంతుఁ డమ్మునియనుజ్ఞతోడ నశ్వంబు గ్రహించికొని వచ్చి పురంబు సేరి సగరునడుగుల కెఱఁగి యావృత్తాంతమంతయుం దెలుపఁగ నతండు పుత్రశోకం బుడిగి సురలు మెచ్చఁగ నశ్వమేధంబుఁ జేసి సముద్రుం దనకుఁ గొడుకుఁగా భావించుకొనిమె. అదిమొదలుగా సముద్రంబు సాగరం బనం బరఁగె. అట్లు సగరుండు నిర్వర్తితయజ్ఞుండై పెద్దకాలంబు రాజ్యంబుఁ బాలించి యంతం బౌత్రుఁ డగునంశుమంతునందు రాజ్యభారం బెల్ల నిల్పి త్రిదివగతుం డయ్యె. అట నంశుమంతుండును బహువర్షంబులు రాజ్య మేలి పుత్రుఁ డయినదిలీపునకు రాజ్య మర్పించి చనిమె. దిలీపుఁడు తనపితామహులగతికి వనరుచు గంగను దేదలంచి మహాయత్నంబుఁ

జేసియుఁ దేజాలక కొడుకయినభగీరథుని భూభారధురీణుం జేసి తపోవనంబున కరిగి కాలయోగమున స్వర్గతుఁ డయ్యె.

భగీరథుఁడు భూమికి గంగను దెచ్చుట.

భగీరథుండు దనపితామహులు కపిలమునికోపాగ్నిదగ్ధులై స్వర్గంబుఁ గాంచకున్నవారని విని సంతప్తచిత్తుండై మంత్రులయందు రాజ్యంబు నిల్పి వివిధధాతువిచిత్రితశిఖరభాసురంబును, గుహాగృహాంతరవిలీనసింహవ్యాఘ్రాదిక్రూరమృగభీకరంబును, హంసకారండవాదిప్రచారరాజితపద్మినీవికస్వరసరిత్సరోవరసమంచితంబును, శుకపికమధుపమయూరసారసాదిమధురస్వరభాస్వరంబును, గిన్నరాప్సరోగణాదిసలీలనిషేవితవిమలవిశాలశిలాతలంబును, నొక్కచోఁ గనకసంకాశంబును, మఱియొక్కచో రజతసన్నిభంబును, వేఱొక్కచో నంజననీలంబు నగుహిమవత్పర్వతంబునకుఁ జని ఫలమూలసలిలంబుల నాహారంబుగాఁ గొని గంగాదేవి నుద్దేశించి దివ్యవర్షసహస్రంబు తపంబు సల్పినం గంగ ప్రత్యక్షంబై నరేంద్రా, నీమనోరథం బెద్ది? చెప్పుము. దానిఁ జేయుదు నని వాక్రుచ్చె. వాక్రువ్వఁగ భగీరథుఁడు సంతుష్టుండై తల్లీ, మత్ప్రపితామహులు సగరపుత్రులు తండ్రి యశ్వమేధార్థంబుగ పంపినగుఱ్ఱము నన్వేషించువారు కపిలు ననాదరించి యమ్మహాత్మునికోపాగ్నిం గ్రాఁగి గతిరహితులై యున్నవారు. భవదీయపావనజలముల నభిషేకించితివేని స్వర్గముఁ గాంతురు. ఇది మదీయవరంబు. కరుణించి నామనోరథంబు నెఱవేఱ్ఱఁ బుడమికి విచ్చేయు మని విన్నవించిన నమ్మహానది సుప్రీతయై భగీరథా, నీకోరినయట్ల చేసెద. నేను నాకలోకంబునుండి భూమికి వచ్చునపుడు మదీయవేగంబు సహించి నన్ను భరింప మహాదేవుఁ డొక్కరుఁడు దక్కఁ దక్కటివారు వలంతులు కారు. అప్పరమేశ్వరుం దపమున మెప్పింపు మని చెప్పి యదృశ్య యయ్యె. అట భగీరథుండు కైలాసమునకుఁ జని తీవ్రతపంబు సలిపినం ద్రిపురాంతకుండు సన్నిహితుండై భగీరథా, నీప్రార్థనంబుమెయి నే గంగను ధరింతు నని చెప్పి పార్షదగణపరివృతుండై హిమవంతంబుఁ జేరి యిఁక గంగను బ్రార్థింపు మనిన భగీరథుండు సమాహితుండై గంగాదేవిని ధ్యానించె. అంత నప్పరమపుణ్యనది యుత్తుంగతరంగమాలికాప్రచారంబు తారాపథంబు నొరయుచుండ మహర్షులు, గంధర్వోరగయక్షాదులును విస్మయంబునఁ జూచుచుండ నాకలోకంబునుండి మహారయంబున మహానటజటాజూటంబు సొచ్చి ముత్తెపుదండయో నాఁగ నాశూలపాణిఫాలదేశమున ముత్తోవల నెనయుచుఁ బైపైనులయునురుఁగు నునునగవు ననుకరింప, నొక్కొక్కచోఁ గుటిలప్రచారంబు లలితలజ్జావిలాసంబు తెలుంగు సూపఁ, దోయనిస్వనంబు మధురవచనరచనరీతిఁ దెలుపఁ దరుణివోలె హరజటాజూటంబునుండి భూమికి డిగివచ్చి భగీరథుం గాంచి మహా

రాజా, నీకుఁ బ్రియముసేయఁగ నిటకు వచ్చితి. ఎటు పోవలయు. త్రోవచూపు మనిచెప్పి భగీరథోపదిష్టమార్గమున సగరసుతులకళేబరంబు లున్న నిర్జలసముద్రంబునకుఁ బోయి వారలఁ బవిత్రులఁ జేసె. ఈశ్వరుఁడును భగీరథప్రార్థనంబు నెఱవేర్చి కైలాసంబునకుఁ జనియె. ఇట్లు భగీరథుండు సగరపుత్రులకు సద్గతిగా సాగరంబు సలిలసంపూర్ణంబుగా గంగానదిని భూలోకంబునకుఁ దెచ్చి యమ్మహానదిం దనకుఁ గూఁతుఁగా భావించికొని పితరుల కుదకదానంబు నొనర్చి పూర్ణమనోరథుం డయ్యె. నాఁటంగోలె గంగానది భాగీరథి యనుపేరఁ బరఁగుచున్నయది యని రోమశుం డగస్త్యచరితంబును, గంగావతరణంబునుం జెప్పిన విని ధర్మనందనుం డటఁ జని నందయు, నపరనందయు ననునదుల నాడి హేమకూటంబు సేరి యచట నెల్లపుడుం గననగుశిలాపతనంబు, వాతావిధూననంబు, నిత్యవర్షంబు, పఠించువా రగపడకున్నను వేదాధ్యయనఘోషంబు వినవచ్చుట, సాయంప్రాతఃకాలములయం దగ్నిప్రజ్వరిల్లుట, యీఁగెలు కఱచుట మొదలుగా నిర్వేదజనకంబు లయినయద్భుతభావంబులం గని ధర్మసుతుం డిదియేమి యని యడుగ రోమశుఁ డిట్లనియె.

ఇందు ఋషభకూటంబున ననేకశతవర్షాయువు, పరమకోపనుండు నగు ఋషభుఁ డనుఋషి తపంబు సేయువాఁడు తనయొద్దకు వచ్చి లాఁతివారు మాటలాడింపుచుండఁ దపోవిఘ్నంబగు నని కినిసి యీపర్వతంబు నుద్దేశించి యెవరేనియు నిచట సంభాషించిరా తప్పక నీవు ఱాల ఱువ్వునది యని చెప్పె. వాయువుం బిలిచి సద్దుసేయక మిన్నకుండు మని నియమించె. ఒకవేళ నెవ్వరైన ను మాటలాడిన నవి తనకు వినరాకుండ నెప్పుడు వర్షింపఁగ మేఘముల నియోగించె. మఱియు నిచటఁ దొల్లి నందానదిని సేవించి సురలు యజ్ఞముల నాచరించి యీదేశము నితరదుర్గమంబుగాఁ జేసిరి. తన్నిమిత్తమున నిచట శిలాపతనాదులు సంభవింపుచుండు. కుశాకారంబు లయినదూర్వలు, యజ్ఞవేదిరూపంబయినయీప్రదేశంబు, యూపాకారంబు లయినవృక్షంబులు నిది దేవయజనభూమి యనుటకు నిదర్శనంబులు. అమరులు ఋషులు నిచ్చట నిప్పటికి నున్నవారు. వారలయగ్నిహోత్రంబులె ప్రతిదినంబును బ్రాతస్సాయంవేళలఁ గనఁబడుచున్నయవి. అనాచరితతపోవ్రతుల కిదిచూడను శక్యంబు గాదు. ఆరోహింప శక్యంబుగా దని వేఱ చెప్ప నేల? నియతవచనుండ వగుము. ఇందు నందానది నభిషిక్తుండు తత్క్షణంబ నిఖిలపాపవినిర్ముక్తుఁ డగు ననిన విని నియతవ్రతుండై యానదియందు స్నాన మొనర్చి యరుగుచున్నధర్మరాజునకు రోమశుఁడిట్లనియె. ఇది కౌశికీనది. ఏత త్తీరంబున నదె విశ్వామిత్రాశ్రమంబు. అల్లదె కాశ్యపుఁడై నవిభాండకునియాశ్రమంబు. మృగియందు జనించినయావిభాండకుని కుమా

రుఁడె ఋష్యశృంగుఁడను వాఁడు. ఆమునిని రోమపాదుఁ డనురాజు తనదేశమున ననావృష్టి వాటిల్లినఁ బిలిచికొనిపోయె.అతనికి వెఱచి యింద్రుఁ డాదేశంబున వర్షంబుఁ గురియించి జనులఁ గాచె. అమ్మునిప్రభావంబునకు సంతుష్టుండై యారాజు తనకూఁతు శాంత యనుదాని నమ్మునికొసంగె. అనిన విని ధర్మరాజు రోమశుం జూచి మునీంద్రా, విభాండకుఁ డెట్లు విరుద్ధజాతి యయినమృగియందుఁ గొడుకుం బడసె? ఆకొడు కెట్లు పురందరునకు వెఱపుఁ బుట్టింపఁ జాలునట్టితపోబలంబు సాధించె? మృగప్రాయుం డైనయమ్ముని కెవ్విధంబున నారాజసుత మనోహారిణి యయ్యె? వినవలతుం జెప్పవే యనియడుగ రోమశుఁ డిట్లనియె.

రోమశుఁడు ధర్మరాజునకు ఋష్యశృంగచరిత్రంబుఁ జెప్పుట.

ధర్మసుతా, తొల్లి కశ్యపపుత్రుం డగువిభాండకుండు దీర్ఘకాలతపశ్చరణపరిశ్రాంతుఁ డొక్కనాఁ డొక్కపెద్దమడుఁగున స్నానమాచరించువాఁ డూర్వశిం జూచి కామమోహితుం డగుటయు నతనికి రేతంబు స్ఖలితం బయ్యె. అయ్యవసరంబునఁ బిపాసార్త యైనయొకలేడి నీరుఁ ద్రావ నామడుఁగు నొద్దకుఁ జనుదెంచె. అది తొల్లి యొకానొకనిమిత్తమున మృగిగా జనింప బ్రహ్మచే శపింపఁబడి క్రమ్మఱఁ బ్రార్థనప్రసన్నుఁ డైనయప్పరమేష్ఠియనుగ్రహంబున మునిం బ్రసవించుట శాపాంతంబుగా వరంబు వడసినదేవకన్య గావున విధివశంబున నయ్యమోఘమునిరేతంబు జలముతోడఁ ద్రావి మునికుమారుం గని శాపవిముక్త యయ్యె. ఆకుమారుఁడు శిరస్సున శృంగముతోడ జనించి ఋష్యశృంగుఁ డనఁ బరఁగి. మృగంబులతోడ నుక్కటఁ బెరిగి బ్రహ్మచర్యనిష్ఠుండై తపస్సు చేయుచుండె. అయ్యవసరంబున దశరథసఖుఁ డయినరోమపాదుఁ డంగదేశనాథుఁడు పురోహితునియెడ మిథ్యాప్రవర్తనంబు చేసి బ్రాహ్మణపరిత్యక్తుఁ డయ్యె. అది కారణంబుగాఁబర్జన్యుఁ డంగదేశమున వర్షింపమికి వగచి యారాజు తపోమహితులగు బ్రాహ్మణుల నుపాసించి యస్మద్దేశంబున వర్షంబు గురియఁగ నుపాయంబు చెప్పుఁడని ప్రార్థించిన నందొక్కముని యతని కిట్లనియె. బ్రాహ్మణులు నీయెడఁ గింకిరివడుటం జేసి మీ దేశంబునఁ బర్జన్యుఁడు వర్షింపఁ డయ్యె. బ్రాహ్మణాపరాధంబునకుఁ బ్రాయశ్చిత్తంబుఁ జేసికొని ఋశ్యశృంగుఁ డనుమునిని నీదేశమునకు రప్పింపుము. బ్రహ్మచర్యనియతుఁడు విషయపరాఙ్ముఖుఁడు నయినయమ్ముని ప్రవేశించినంతన యవశ్యంబు పర్జన్యుఁడు వర్షించు ననిన విని రోమపాదుఁడు బ్రాహ్మణాపరాధంబునకుఁ బ్రాయశ్చిత్తంబుఁ జేసికొని పురంబుఁ బ్రవేశించుటయు బ్రాహ్మణులు ప్రసన్ను లయిరి. ప్రజ లెల్ల సంతసించిరి. అంతట రోమపాదుఁడు మంత్రులతోడఁ జింతించి నిపుణవేశ్యలం బిలిపించి నేర్పున ఋష్యశృంగముని నిటకుఁ దోడితెచ్చునది యని నియమించిన నవ్వేలయాం ద్రాత్మగతంబునఁ బోకున్న

రాజు దండించు, పోయిన మృగప్రాయుఁ డగునమ్ముని శపించు నని పెద్దయుం బ్రొద్దు చింతింపుచుండ నొక్కవృద్ధవారవనిత రాజున కిట్లనియె. మహారాజా, దేవరపంపునం బోయి యత్తపోధనుం దోడ్తెర జతనంబుఁ బన్నెద. నాకోరిన వానిం జేయఁగ ననుజ్ఞ యిమ్ము. అట్లయినం దేనేర్తు ననిన రోమపాదుఁడు దాని కోరినవానిం జేయఁగఁ దగువారల నియమించి రత్నధనాదుల దానిం గారవించె. అదియు నంతట రాజానుజ్ఞం గొని కతిపయవారకాంతలతోడ వెడలి యడవికిఁ జని యచట నావయం దతిమనోహరంబుగా నొక్కవనము నిర్మించి యామో డను విభాండకాశ్రమసమీపంబునకుఁ గొనిపోయి యచట నిలిపి వర్ణనీయసౌం దర్యచాతుర్యతారుణ్యముల నలరారుదానిఁ దనకూతుం దగినవారితోడ నమ్ము నియాశ్రమంబునకుఁ బంపె. అవ్వారతరుణి యట స్వాదుపదార్థసమన్వితయై చని విభాండకుండు ఫలాహరణార్థంబు వనంబునకుఁ బోయినసమయం బెఱింగి యప్పుడ యయ్యాశ్రమంబు సొచ్చి ఋష్యశృంగమునిం గాంచి మునీంద్రా, కుశలంబె? ఇవ్వనంబున ఫలమూలాదులు సమృద్ధంబులై నీమది కింపుఁ బుట్టించునే? తప స్స్వాధ్యాయంబులు కొఱంత వడకుండునే? భవత్తాతపాదుండు నీయెడ సుప్రీ తుండె? నినుఁ గనుంగొన వచ్చితి నని లలితవచనముల నడిగె.

అవిజ్ఞాతలోకవృత్తాంతుఁ డైనఋష్యశృంగుఁడు దాని మునికుమారుంగా వగచి యయ్యా, విలక్షణతేజంబునఁ బొల్పారునీకు నమస్కారంబుఁ జేసి పాద్యం బొసంగి ఫలమూలంబుల నాహారంబుగా నిచ్చెద. కృష్ణాజినావృతం బయినయీ కుశాసనంబున సుఖమునఁ గూర్చుండుము. మీయాశ్రమం బెచ్చట నున్నది? నీపే రెయ్యది? నీవు గీర్వాణులవలె వ్రతంబు సల్పువాఁడ వని నేఁ దలంతు ననిన వేశ్యవనిత యిట్లనియె. విభాండకనందనా, మాయాశ్రమం బీపర్వతంబున కవ్వల మూఁడుయోజనంబులు గలదు. ఇతరు లొనరించునమస్కారంబులను, పాద్యంబు లనుం గ్రహింపను. మఱి నీకుఁ బ్రణమిల్లుదు నిన్నాలింగనంబు జేయుదు. ఇదినాపూ నినవ్రతం బనిన ఋష్యశృంగుఁ డయ్యా, భవద్వ్రతం బట్టిదయేని వ్రతభంగంబుఁ జేయ నోపను. పండినభల్లాతకామలకాదిఫలముల నిచ్చెద. వానిం గ్రహింపు మని వచించె. అది యవియెల్ల నటుండ నిమ్ము, నా తెచ్చినవాని నిచ్చెద నీ వుపయో గింపు మని చెప్పి స్వాదుభక్ష్యంబుల, రసవంతంబు లయినపేయంబుల, సురభి మాల్యమ్ములఁ, గలపమ్ముల, దివ్యాంబరంబుల నొసంగిన ఋష్యశృంగుఁడు భక్ష్య పేయముల నాస్వాదించి, వానియత్యంతమాధుర్యమునకు సంతసిల్లి, దానికావిం పుచున్నకందుకక్రీడ కచ్చెరువడి, యేకతానమానసుండై చూచుచుండ, నతని యంగంబులు దనమేనం జక్కగ సోఁకఁగఁ గౌఁగిలించుచు, విలాసంబున నాచెం గటం గలమ్రాఁకులవిరులం గోయుచు, లలితలజ్జావిలాసంబుఁ జూపుచు, నతని

మోమున నెమ్మోము సేర్చి మోవి నొక్కుచు, జవ్వనంపుఠేవఁ జూపుచు, వానికి
మనోవికారంబుఁ గలిగించి, హోమవ్యాజంబున నతని వీడ్కొని, తదీయసా
కూతవిలోకనంబులకుఁ బాత్రం బగుచు, మెల్లన దదాశ్రమంబు వెడలి, తననా
శ్రమంబునకుఁ జనియె. చనుటయు ఋష్యశృంగుఁడు దానితగులంబునఁ జిక్కి
యద్దానిన తలంపుచు, నిశ్వసింపుచుఁ, జింతాతిరేకంబున శూన్యచిత్తుండై
యుండె. అంతఁ గొంతవడికి విభాండకుఁ డరుదెంచి చింతచే నిశ్వసింపుచు,
మీఁదఁ జూచుచున్న ఋష్యశృంగుం గాంచి పుత్రా! సమిత్తుల నేల కల్పింపవు?
హోమ మయ్యెనా? సుక్స్రువంబులఁ గడిగితివా? దూడను విడిచి హోమ
ధేనువుపాలు పితికితివా? ఏల తొల్లింటిరీతిఁ దప్పి చింతిల్లెదవు? ఇచ్చటి కెవ్వరేని
యు వచ్చిరా? అని యడుగ ఋష్యశృంగుఁడు తండ్రి కిట్లనియె. తండ్రీ, పండ్లు
గొనితేర నీవు వనమున కరిగినపదపడి యిచ్చటి కొకబ్రహ్మచారి వచ్చె. అతఁడు
కుఱుచదనము, పొడవు నెక్కుడుగాక సమంబుగనున్నవాఁడు. వానిమేనిచాయ
మేలిబంగారముఁ బోలు. వానికన్నులు తామరఱేకు లనఁ జాలు. వానినిద్దంపు
జడ లతినీలంబులు. వానిముఖ మత్యంతదర్శనీయంబు, వానివచనంబు కోకిలరుతం
బుననుకరించు. వానినడు మతిసూక్ష్మంబు. వానిజఘనంబు ఘనంబు. మఱియునతని
లలాటముననలకములు ద్విధావిభక్తంబులై వేడ్కఁ బుట్టించెడి. గళమునకుఁ గ్రింద
రెండుపిండములు రోమరహితంబులై యతిరమణీయములుగ నుండెడి. కటితటం
బునఁ గనకమేఖల యొక్కటి మిక్కిలి తేజరిల్లెడి. నడచుతఱి హంసరవానుకారిని
నదంబుఁ జేయుభూషణద్వయంబు గన్పడెడి. పాణులయందును జపమాలికపోలిక
నున్న రెండువలయంబు లుండెడి. నిశ్వాసంబున దివ్యపరిమళం బొలసెడి. అతఁడు
దాల్చినవస్త్రము లత్యద్భుతంబులు. వెండియు నతం డొక్కవిచిత్రఫలంబును దన
కుడిచేత నందంద పలు మాఱులు చఱచుచు నది నేలంబడ నెగయఁబోయిన
నవ్వాలనికివ్రాలుచు నునుగాడ్పునఁ జలించుబాలమహీరుహంబుభంగి దర్శనీయుండై
యుండెడి. మఱియు వేమాఱులు ననుఁ గౌఁగిలించి జడలఁ బట్టికొని నావదనంబు
నెత్తియందుఁ దనమోముఁ జేర్చి లలితరుతంబుఁ గావించె. తన్నిమిత్తమున
నేను సంతుష్టుఁడ నైతి. వానియందు నామనంబు తగిలె. నాయిచ్చినపాద్యము
ఫలములను దనకుఁ దద్గ్రహణంబున వ్రతభంగ మగు నని చెప్పి గ్రహింపక
నాకుఁగాను గొన్నిపండుల నొసంగ నేనుపయోగించితి. మనవనమునఁ గలపండులు
వానిరుచిలో లేశమాత్రంబయిన నెనయఁ జాలవు. వానియిచ్చినపానీయంబుస్వా
దుత్వం బెచ్చట నుండదు. ఈసుగంధిమాల్యముల నీదివ్యాంబరంబుల నిచ్చి తన
యాశ్రమంబునకుఁ బోయె. అత్తఱి వానినడకం జూచి నామనంబు నిరూపింప
రానివికారంబుఁ జెందె. నేనచ్చటికిఁ బోఁగోరుదు. వానిబ్రహ్మచర్యవ్రతం బట్లొప్పెనే?

తండ్రీ, నేనువానితోడ నుండఁ గోరుదు. వానింజూడకున్నఁ జిత్తతాపంబు శమింప దనిన విని విభాండకుండు ఋష్యశృంగునకిట్లనియె. పుత్రా, కామరూపు లయిన రాక్షసులు మునులతపస్సులకు విఘ్నముఁ జేయఁ గోరి యనేకరూపములఁ దాల్చి వంచింతురు. ఉత్తమలోకముల సాధింపఁ గోరువాఁడు వాని నమ్మి ప్రవర్తింపరాదు. అసజ్జనులకృత్యంబు లయినగంధమాల్యాదిధారణంబులు మునులు వర్జింపవలయు నని బోధించి మూఁడహోరాత్రములు కొడు కెప్పు డెటకుఁ బోవునో యనుతలంపున నెడఁబాయక ప్రత్యవేక్షణంబుఁ జేయుచుండి మఱునాఁడు ఫలములఁగొని తేర వనమునకుఁ జనియె.

## వేశ్య ఋష్యశృంగుని రోమపాదు నెద్దకుఁ దోడ్తెచ్చుట.

వేశ్యకాంతయు విభాండకుఁ డాశ్రమము వెడలుట నెఱింగి ఋష్యశృంగు నెద్దకుఁ బోయి లలితవిలాసముల నతని వంచించి తమనావయందలివనమునకు మెల్లన దోడితెచ్చి యోడ నడిపించి తనురాజధాని యగుచంపాపురిం జేర్చుటయు రోమపాదుఁడు నమ్మునినంతఃపురమునఁ జేర్చి నానావిధోపచారములఁ బూజించె. ఋష్యశృంగుఁడు ప్రవేశించినంతన యాదేశమునం దపరిమితవర్షంబు గురిసె. అందుకు సంతుష్టుఁడై యయ్యంగదేశరాజు తనకూఁతు శాంత యనుదాని నమ్మునికిచ్చి వివాహంబుచేసి వంచనచేఁ గొడుకును రావించుటకు విభాండకుఁ డంతటనెమకువాఁడు తనపైఁ గింకిరిపడునొక్కొ యని చింతించి యవ్విభాండకునకుఁ గోపప్రతీకారార్థంబుగా మార్గముల నెల్ల గోష్ఠములఁ గట్టించి యందు గోవులఁ జేర్పించి యంతటఁ గృషిఁ గల్పించి గోపాలకులను, గర్షకులనుం బిలిపించి యిట్లనియె. ఎన్నఁడైన విభాండకుఁడు కొడుకు నన్వేషింపుచు వచ్చి మిమ్ము నడిగెనా మీరు కేల్దోయి మొగిచి భయభక్తివినయము లొదవ "మునీంద్రా, యీమొదవులు, నీకర్షణంబులును భవత్తనయుం డైనఋష్యశృంగునియవి. మే మందఱము మీదాసులము. మీయానతిమెయి వర్తింతు" మని చెప్పునది యని నియమించె. అట విభాండకుండు ఫలములఁ గొని వనమునుండి యాశ్రమముఁ జేరి కొడుకుం గానక వగచి తనదివ్యదృష్టిప్రభావంబున రోమపాదునిచేఁతలనెల్ల నెఱింగి యంగదేశముల నెల్ల దహించువానిరీతి నత్యంతక్రోధదీప్తుండై చంపాపురంబునకు వచ్చుచు మార్గమధ్యమున గొల్లపల్లెలం జూచి క్షుత్పీడితుఁడై యాఘోషములఁ జొచ్చి యీగోష్ఠము లెవ్వరియవి యని యడుగుటయు వారు రోమపాదునాజ్ఞమెయి నతని భక్తివినయంబులఁ బూజించి యంతయు విన్నవించిరి. అందుకు సంతసిల్లి శాంతుఁడై యారాత్రి యచట నుండి మఱునాఁడు చంపాపురంబుఁ జేరి రోమపాదుఁ డొనరించినపూజలం గైకొని కొడుకుం గోడలినిం గాంచి యత్యంతసంతోషసమాక్రాంతస్వాంతుండై పుత్రజననం బగునంతకు నచ్చోటన యుండు మని కొడు

కును నియమించి చనియె. ఋష్యశృంగుఁడును బితృవచనప్రకారంబునఁ బుత్ర జననం బగునంతకు రోమపాదునకు మనఃప్రియంబుగాఁ గొంతకాలం బచ్చట నివసించి తపోవనంబునకుఁ జనుటయు శాంతయు వెంబడి చని యరుంధతి వసిష్ఠునింబోలె, లోపాముద్ర యగస్త్యునింబోలె, దమయంతి నలునింబోలె, శచి యింద్రునింబోలె, నాలాయిని మైనయింద్రసేన ముద్గలునింబోలె, నా ఋష్యశృంగమునిని బరిచరింపుచుండె. ఆఋష్యశృంగమునియాశ్రమం బిది. ఇందలిమడుఁగునఁ గృతస్నానుండవై యితరతీర్థములకుఁ జను మని రోమశుండు ఋష్యశృంగోపాఖ్యానంబుఁ జెప్పిన విని ధర్మరాజట్లచేసి యటఁ గౌశికీనది నాడి క్రమంబున నచటఁ గలతీర్థంబులం దెల్ల నవగాఢుండై యేనూఱునదులకు సంగమస్థానం బయినగంగాసాగరసంగమంబున మజ్జనంబు చేసి సముద్రతీరంబునఁ గళింగదేశములఁ జొచ్చుటయు రోమశుఁడు ధర్మరాజున కిట్లనియె.

ఇవి కళింగదేశములు. ఇదె వైతరణీనది. ఈనదియుత్తరతీరంబుననే తొల్లి ధర్ముఁడు, ఋషులనేకులును యాగములఁ జేసి యందు రుద్రుఁడు పశువును దాఁ గొనిపోయి యిది నాభాగం బనిన వారు బహువిధముల నాదేవుని స్తుతించి యన్నింటికంటె నుత్తమం బయినభాగంబు నాదేవునకుఁగల్పించిరి. ఈవృత్తాంతముఁ జెప్పుచు నిందు స్నాన మొనరించినవారు దేవయానగతు లగుదు రనిన ధర్మనందనుఁ డానదియందుభ్రాతృసహితుండై భార్యతోడ మజ్జనము సలిపి దేవర్షి పితృతర్పణంబుఁ జేసి రోమశుం జూచి మునివర్యా, యిందు స్నాన మొనరించుటం జేసిమనుజదుర్లభము లయినవిషయములఁ గాంచఁ గలిగె. నీయనుగ్రహమున సర్వలోకములఁ బ్రత్యక్షముగఁ జూచుచున్న వాఁడ, వైఖానసజపనినాదంబు వినుచున్న వాఁడ ననిన రోమశుఁ డతని కిట్లనియె. ధర్మసుతా, వైఖానసస్థానం బిచటికి ముప్పదివేలయోజనములు గలదు. వారలజపనినాదంబు విన నితరులకుఁ దరమె. దివ్యపురుషుఁడవు గావున వింటివి. అల్లదె స్వయంభూవనంబు. అందుఁ దొల్లి విశ్వకర్మ యజ్ఞము చేసి భూమినెల్లఁ గశ్యపునకు దక్షిణగా నిచ్చె. ఇచ్చుటయు భూమి నన్నొకమనుష్యున కిచ్చెదవా పాతాళమునకుఁ బోవుదు నని విషణ్ణయై యుండఁ గశ్యపుఁడనేకవిధములఁ బ్రసన్న వగు మని ప్రార్థించె. ప్రార్థించుటయుఁ బ్రసన్నయై భూదేవి నిజరూపధారిణియై సముద్రమధ్యమునం దేవేదికయందు దర్శన మిచ్చెనో యావేదిక యిదే చూడు. దాని నారోహించినవారు వీర్యవంతు లగుదురు. మనుష్యులు తాఁకిన నది నీట మునుఁగు. మఱియు సముద్రమును దలంచినపుడెల్ల స్పృశింపరాదు. కావున మత్కృతస్వస్త్యయనుండవై నాయుపదేశించు మంత్రములఁ జెప్పుచుఁ దన్మంత్రప్రభావమున నీవు వీరుండవై యావేది నెక్కు మనిచెప్పి కొన్ని మంత్రము లుపదేశించి స్వస్త్యయనంబు లొనరించిన ధర్మరాజు మ్మునిశాసనమ్మున

నట్లు చేసి మహేంద్రపర్వతమునకుఁ జని యొక్కరాత్రి వసించి యచ్చటిమునులను సత్కరింపుచుండ రోమశుఁ డమ్మునులనెల్లఁ జూపి వీరు భార్గవులు, వీ రాంగిరసులు, వీరు వాసిష్ఠులు, వీరు కాశ్యపు లని వేఱువేఱ వివరించిన విని భక్తిమై నందఱకు మ్రొక్కి కృతాంజలియై సేవించియుండి యటఁ బరశురామశిష్యుఁ డైనయకృతవ్రణుం జూచి మునివరేణ్యా, భగవంతుఁ డయినజామగ్న్యుఁడు తాపసుల కెల్ల నెప్పుడు దర్శన మిచ్చు? ఆసమయమున నేనుం దర్శనంబుఁ జేసికొనియెద ననిన నకృతవ్రణుఁ డిట్లనియె. పాండుసుతా, భవదాగమనంబును సర్వజ్ఞుఁ డయినపరశురాముఁ డెఱింగియేయుండు. నీయందుఁ గడుఁ బ్రీతుఁడు గావున నచిరంబ నీకు దర్శనమొసంగు. అష్టమియందుఁ, జతుర్దశియందు నమ్ముని తాపసుల కెల్ల దర్శనమిచ్చువాఁడు. రేపు చతుర్దశి గావున నవశ్యం బతనిదర్శనంబు చేసికొనఁ దగు ననిన ధర్మరాజు మునీంద్రా, పరశురాముచరిత్రమెల్ల నీకుఁ బ్రత్యక్షంబకదా? అతండు క్షత్రియుల నేనిమిత్తమున నెట్లు వధించె? సవిస్తరముగఁ జెప్పు మనియడుగఁగ ధర్మరాజున కకృతవ్రణుఁడిట్లనియె.

## అకృతవ్రణుఁడు ధర్మరాజునకుఁ బరశురామచరిత్రంబు చెప్పుట.

తొల్లి హైహయవంశంబునఁ గార్తవీర్యార్జునుఁ డనువాఁడు దత్తాత్రేయవరంబున సహస్రభుజంబులును, గాంచనవిమానంబును, సర్వభూతంబులయందు నైశ్వర్యంబునుం బడసి యావిమానంబు నారోహించి యప్రతిహతగమనుం డై సురలకు, ఋషులకు, యక్షగంధర్వాదులకు, సకలభూతంబులకు నుపద్రవము సేయుచుండ వానివలనఁ గలుగునేఁపు సైరింపనోపక దేవర్షులు విష్ణుపాలికిఁ బోయి జగన్నాథా! లోకోపప్లవకారి యగుకార్తవీర్యార్జునుం జంపు మని వేఁడిన నద్దేవదేవుం డందుల కొడంబడి తనయాశ్రమం బయినబదరీవనంబునకుఁ జనియె. అట్టియవసరంబున భూలోకంబునందుఁ గాన్యకుబ్జదేశమున గాధియనురా జనపత్యుం డై వనంబున వసింపుచుండ నతనికి సురసుందరిం బోలుకన్య యొకర్తు జనించె. భృగుమహర్షిపుత్రుఁ డైనఋచీకుఁడు దానిం గామించి యారాజు నడుగుటయు నతం డాత్మగతంబున నిమ్ముని కన్య నీకున్న శపించుఁ గావున నెక్కనెపంబుఁ జెప్పెద ననితలంచి మునీంద్రా, నీ వల్లుఁడుగా లభించుటకంటె నాకు సుకృతంబు గలదే? అయినం గులపరంపరాప్రాప్తం బైనయాచారంబు విడువరాదుగా యనిసంశయించెద. అది యెట్లంటేని. ఒక్కకర్ణంబు నల్లనై తక్కంగలయంగంబులెల్ల నతిధవళంబులుగా నొప్పునశ్వసహస్రంబు మేము కన్య కుంకువ గ్రహింతుము. ఇదినీ కెట్లు చెప్పుదుననిన నట్లు తెచ్చియిత్తు ననియొడంబడి యాఋచీకుడు వరుణుం బ్రార్థించి వరుణలోకంబునుండి యట్టిగుఱ్ఱముల నేర్చి కొనివచ్చె. వరుణలోకాగతంబు లయినయయ్యశ్వములు కాన్యకుబ్జపురంబునందు గంగను వెడలి వచ్చుటంజేసి యచ్చటితీ

ర్థంబు నాఁటంగోలె నశ్వత్థం బనంబరఁగె. అట్లు ఋచీకుఁ డయ్యశ్వములఁ దెచ్చి గాధిరాజున కిచ్చి యతనికూఁతు సత్యవతియనుదానిం బెండ్లియై సుఖమున నుండు నంత నొక్కనాఁడు భృగుమహర్షి కొడుకుం గోడలిం జూడఁ గోరి యచటి కరిగి యాదంపతులఁ గాంచుటయు వారు సాష్టాంగప్రణామం బాచరించి ప్రాంజలులై యుపాసించియుండ భృగుఁడు సంతుష్టుఁడై కోడలిం బిలిచి కల్యాణీ, వరములు గోరికొను మనిన నక్కోడలు దనకుఁ దనతల్లికిం బుత్రులు జనింపఁగ వరంబిమ్మని ప్రార్థించె. భృగుమహాముని యట్ల యని మీరిద్దఱు ఋతుస్నాతలై నీవు మేడి మ్రానును, నీతల్లి యశ్వత్థంబునుం గౌఁగిలించి యతిప్రయత్నంబున నేను సాధించినయీచరుద్వయంబు వేఱువేఱుగ నిరువురు నుపయోగించునది యనివచించి పాత్రంబులందు ద్వివిధంబు లయినపరమాన్నముల నిచ్చి తనయాశ్రమమునకుఁ జనియె. అంత నాసత్యవతి ప్రమాదంబునఁ దా నశ్వత్థంబు నాలింగనంబుఁ జేసికొని తల్లికిఁగా నిచ్చినపాయసంబు భుజించి తనకుఁగా నిచ్చినపరమాన్నంబుఁ దల్లికొసంగి మేడిమ్రాఁకుఁ గౌఁగిలించికొను మనుటయు నాగాధిపత్ని యట్ల చేసె. అట భృగుమునీంద్రుఁడు దివ్యవిజ్ఞానంబున నావిపరీతాచారం బెఱింగి వచ్చి కోడలిం బిలిచి సత్యవతీ, ప్రమాదంబునఁ దల్లికిఁ జెప్పిననియమంబు నీవు చేసి నీకుఁ జెప్పిననియమంబుఁ దల్లిచేఁ జేయించితివి. తన్నిమిత్తంబున నీకు క్షత్రియవృత్తి యగుబ్రాహ్మణుఁ డుదయించు. నీతల్లికి బ్రాహ్మణాచారుం డైనక్షత్రియుండు జనించు ననిన సత్యవతి మామను బలుమాఱులు ప్రార్థించి తనకు సాధువృత్తి యగుబ్రాహ్మణుఁడే పుత్రుఁడుగా, క్షత్రియవృత్తి యగుబ్రాహ్మణుఁడు పౌత్రుఁడుగాఁగను వరంబుఁ గొని కొన్నినాళ్లకుఁ దేజోబలసమన్వితుం డైనజమదగ్ని యనుపుత్రుం గనియె. అంతండును గ్రమక్రమంబునఁ బెరిగి తపోబలమున సాంగవేదజాలంబు నేర్చి ప్రసేనజితుఁ డనురాజుకూఁతు రేణుకయనుదానిం బెండ్లియై రుమణ్వ, త్సుషేణ, వసు, విశ్వావసు, రాము లనఁగా నేవురఁ గొడుకులఁ గనియె. అంతఁ బెద్దకాలంబు చన నొక్కనాఁ డందఱు పండులు దేర వనమునకుఁ బోయియుండ నాజమదగ్నిభార్య యగు రేణుక స్నానార్థంబు కొలని కరిగి యచట భార్యలతోడ నీరాడుచున్నవాని, నతిసుందరు, మార్తికావత దేశపతిం, జిత్రరథుని గాంచి, కామించి, వ్యభిచరించి, యట స్నాతయై యాశ్రమంబుఁ జేరుటయు జమదగ్ని ఫలములం గొనివచ్చి బ్రహ్మతేజంబు దప్పి ధైర్యంబు దూలి వెలవెలనై యున్నభార్యను జూచి దివ్యజ్ఞానమున దానిచేసినయనాచారంబుఁ దెలిసి బహుప్రకారంబుల నిందించి యప్పాపకారిణిం జంపుట లగ్గని నిశ్చయించి యప్పటి కాశ్రమంబున కేతెంచినకొడుకుల నలువుర రుమణ్వ, త్సుషేణ, వసు, విశ్వావసు లనువారలఁ గ్రమంబునఁ బిలిచి యనాచారదూషిత యగు మీతల్లిని వధించుఁ డనిపం

చిన వారు తల్లియందలి ప్రీతిం జేసి యెద్దియుం జెప్పకుండిరి. అందుకుం గినిసి యాజమదగ్ని నావచనం బాచరింపమిం జేసి మీా రడవిలో మృగపక్షులవిధమున నజ్ఞానులరై యుండుం డని వారల శపించి పిదప వచ్చిన పరశురాముం జూచి పుత్రా, దురాచార యగుమీాతల్లిని శంకింపక చంపుమని యనిన నతండు తనగండ్రగొడ్డంటం దల్లితల నఱకుటయు జమదగ్ని కోపం బుడిగి ప్రసన్నుండై పరశురాముం జూచి పుత్రా, నావచనంబునం దెంపుం బూని దుష్కరకార్యంబు సలుపుటం జేసి నీయెడం గడుం బ్రీతుండ నైతి. అభిమతవరములం గోరికొను మనియె. రాముం డంతటం దల్లికిం బునర్జీవనంబును, వ్యభిచారపాపరాహిత్యంబును, నన్నలకుం దొల్లింటిక్రమంబున జ్ఞానసాహిత్యంబును, దనకు దీర్ఘాయువును, యుద్ధములయం దప్రతిరథత్వంబునుం గోరికొనిన జమదగ్ని యన్నియుం బ్రసాదించి యథాపూర్వముగ నుండె.

పరశురాముఁడు కార్తవీర్యార్జునుం జంపుట.

అంత నొక్కనాఁడు జమదగ్ని కొడుకుల నందఱను ఫలాహారణార్థం బడవికిం బంపి తాను సభార్యుండై యాశ్రమమున నొక్కరుండ యుండంగం గార్తవీర్యార్జునుండువచ్చి యమ్ముని కావించినపూజను మదంబున మెచ్చక యాశ్రమవృక్షములవిఱిచియఱచుచున్న యాజమదగ్ని హోమధేనువును బట్టుకొనిపోయె. పోవుటయుంగొంతవడికి రాముఁడు ఫలములం గొని యాశ్రమంబు సేరి తండ్రివలనం గార్తవీర్యార్జును కొఱగాముల విని క్రోధదీప్తుండై వానిం దటిమి విక్రమించి వాఁడితూపుల నాదుర్మదాంధుని వేయిచేతుల నఱికె. అట్లు కార్తవీర్యార్జునుఁడు పరశురామునిచే నిహతుం డగుటయు వానికొడుకు లీసునం జేసి రాముఁడు లేనితఱిం దదాశ్రమంబు సొచ్చి తపోనిరతుండు, సాధుచరితుండు నగుజమదగ్నిమహామునిని హా! రామా! యని పలుమాఱు లతిదీనంబుగ నఱచువాని నుఱక పరిమార్చి యథాగతంబుగం జనిరి. రాముఁడు నాశ్రమంబునకు వచ్చి, మృతుం డైనతండ్రిని జూచి తల్లివలన నంతయు నెఱింగి హాతండ్రీ! నాయపరాధంబునం గార్తవీర్యార్జునపుత్రులచే నిహతుఁడ వయితివి. ధర్మజ్ఞుఁడు, సదాచారుఁడు, సర్వభూతసముఁడు. తపోనిరతుఁడు నగు నిన్ను వధించినయాదురాత్ములు ఘోరనరకంబులం బడుదురు. సిగ్గులేక చంపి యూర నెల్లవారితో నేమి చెప్పికొందురో యని బహువిధంబుల వారల దూఱుచు విలపించి తండ్రికిం బ్రేతకృత్యములనెల్లం దీర్చి క్షత్రియులనెల్ల వధింతు నని ప్రతిన వట్టి పరశుపాణియై యిరువదియొకమాఱులు భూమినెల్లం జరించి క్షత్రియక్షయంబుం గావించి వారినెత్తుట నేనుమడుగులం గల్పించి పితృతర్పణంబుం జేయంగ బుచీకాదు లగుతత్పితృదేవతలు నిజరూపములం బొడచూపి యతనికోరినవిధమున నామడుగులకుం బావనత్వంబు, నతనికి బహుక్షత్రియవధపాతకాభావంబును గలుగ

వరంబు లిచ్చి చనిరి. అట నప్పరశురాముఁడు విధియుతముగా యజ్ఞముల నాచరించి ఋత్విజులకెల్ల భూమండలంబును, గశ్యపునకుఁ బదిబారలనిడివి తొమ్మిది బారలతనర్పునుం గలకాంచనమయం బైనయజ్ఞవేదిని నిచ్చె. ఋత్విజులు నావేదిని ననురూపంబుగ నందఱుం గశ్యపానుమతిం బంచికొనిరి. అక్కారణిం బరశురాముఁడు భూమినెల్ల బ్రాహ్మణుల కొసంగి యీమహేంద్రాచలంబున నున్నవాఁడు. ఇది పరశురామచరిత్రం బనిన ధర్మరాజు తత్ప్రభావంబునకు విస్మయం బందుచు నారాత్రి యచటన యుండి మఱునాఁడు సన్నిహితుఁ డైనయాపరశురాముని దమ్ములు, ద్రౌపదియుం, దానును సేవించి ఋషుల నర్చించి తదాజ్ఞం బడసి యచ్చోటు వాసి సముద్రతీరతీర్థంబులందు మజ్జనం బొనర్చుచుఁ జని పుణ్యనది యైనగోదావరియందు స్నాన మాచరించి పితృతర్పణంబులు సలిపి విప్రుల కపరిమితధనముల సమర్పించి యగస్త్యతీర్థం బాడి * యర్జునావగాహనపవిత్రంబులయిననారీతీర్థంబులందు మజ్జనం బొనర్చి యచటి మునులవలన నర్జునుసచ్చరిత్రంబు విని యెంతయు మెచ్చి గోసహస్రంబు విప్రుల కొసంగి సురలకుఁ దపస్థానం, బనేకరాజులకు యజ్ఞాయతనంబు నగుజామదగ్న్యవేదిం గాంచి సముద్రతీరంబునం గలసర్వదేవతీర్థముల సేవింపుచు శూర్పారకంబునకుఁ జని యందు స్నాన మాచరించి ప్రభాసతీర్థంబునకుఁ జని తమ్ములు భార్యయుఁ దానును విధియుతంబుగ స్నాన మొనర్చి దేవపితృతర్పణంబు సలిపి ధర్మరాజు పండ్రెండుదినములు పంచాగ్నిమధ్యమున జలవాయుభక్షణంబు సేయుచుఁ దపంబు నొనర్చుచుండునంత దాని నెఱింగి రామకృష్ణులు ప్రద్యుమ్నానిరుద్ధసాంబసాత్యకిప్రభృతియదువీరపరివృతులై యచ్చోటికి వచ్చుటయు ధర్మరాజు వారల నుచితవిధిం బూజించి తమవనవాసాయాసంబు, నర్జునుఁ డస్త్రార్థము పోయి వాని సాధించి యింద్రలోకమున నుండుటనుం జెప్పిన విని వారు తదుదంతంబుల నరయుచుండి రనిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, పాండవులతోడ యాదవులు గలిసి నప్పటివృత్తాంతమునెల్ల సవిస్తరంబుగఁ జెప్పుమనియడుగఁగ నమ్ముని యానృపతి కిట్లనియె.

### పాండవ యాదవ సంభాషణము.

అట్లు వచ్చినయాదవులు ధర్మరాజువలన వనవాసాయాసాదివృత్తాంతముల వినుచున్నంత బలరాముఁడు దామోదరున కిట్లనియె. కృష్ణా, ధర్మముచే సుఖం, బధర్మముచే దుఃఖంబునుం గలుగవలయుఁ గదా? పరమధార్మికుఁ డయినధర్మరాజునకు రాజ్యభ్రంశంబు వనవాసంబు మొదలుగా ననేకదుఃఖములు వాటిల్లె. అధార్మికాగ్రణి యయినదుర్యోధనునకు సుఖములెల్లఁ

* ఈయుపాఖ్యానము ౨౦౭, ౨౦౮ పుటలలోనున్నది.

జేకూఱె. ఈ విపరీతంబుఁ గాంచి జను లధర్మమే సుఖప్రదం బనిభావింతు రని శంకింతు. భీష్మద్రోణకృపాదివృద్ధులహితోపదేశంబు వినక యాచీఁకురాజు పరమపుణ్యచరిత్రు లయినయీపాండుపుత్రుల రాజ్యభ్రష్టులం జేసి యడవులకుఁ బంపినవాఁడు. తనకొడుకులమతంబునే యనుసరించె. చేయరా దని తెలిసియు నేల యిట్టిదుష్కృతంబుఁ జేసెనో? పరలోకమున నిందుకు దుష్ఫలంబుఁ గుడువకున్నె? ఎవనిపేరు విననమాత్రన రాజులెల్ల విగతచేతను లగుదురో. తూర్పునఁ గలరాజులనెల్ల నెవఁడు గెలిచెనో యట్టిమహాబలుఁడు భీమసేనుఁ డీవనమున క్షుత్పిపాసార్తుండై వనరువాఁడు సమయాబ్దంబులు కడచనినపదపడి యాధృతరాష్ట్రసుతుల నిర్మూలంబుగ నశింపఁజేయక మిన్నకుండునే? అట్టియతిరథుఁ డిపుడు వనవాసాయాసకర్శితుఁ డయ్యె. పశ్చిమదిక్కునం గలరాజులనెల్ల నేసమరశౌండుఁడు జయించె నట్టినకులుఁ డిపు డడవుల నిడుమలఁ గుడుచున్నవాఁడు. దక్షిణంబునం గలభూపాలురనెల్ల నేశూరుఁడు గెలిచె నట్టిసహదేవుఁ డిప్పు డీవనంబునఁ బెక్కుపాట్లు పడుచున్నవాఁడు. ద్రుపదునియజ్ఞవేదిం జనించి యాగర్భేశ్వరి యనఁ బొగడ్తఁ గాంచినపాంచాలి యీకాననంబున బహువిధక్లేశములఁ గృశింపుచున్నయది. వీరిశ్రమంబును, దుర్యోధనాదులసుఖంబునుం జూడ మనంబునఁ గుందు వొడమెడి ననిన సాత్యకి బలరామున కిట్లనియె. కేవలపరిదేవనంబున నేమి ప్రయోజనంబు? తగినపని వేగంబ చేయుదము. యుధిష్ఠిరుఁ డెద్దియుఁ జెప్పఁడు. నాథవంతులగువారు తమంతన కార్యముల నడపరుగదా. మఱియెవరు నాథులో వారే తమకార్యములఁ జేయవలయు. స్వర్గపతితుఁడై నయయాతికి శైబ్యాష్టకాదులు తమంతన పునస్స్వర్గయానంబుఁ గల్పించుట వినమే? కావునఁ బాండవులకు నాథుల మైనమనమే యిపుడు వారిశత్రుల వధింపవలయు. నీచధార్తరాష్ట్రుల వధింప నెందఱో వలయునా? నీ వొక్కరుండవే వారల నిర్మూలనంబుఁ జేయుదువు. నీవు, ననిర్వాచ్యచిత్రచరిత్రుఁ డయినజనార్దనుండు, నిజాపదానంబులచే మహాశూరు లనఁ బొగడ్తఁ గాంచినప్రద్యుమ్నానిరుద్ధసాంబసారణచారుదేష్ణగదాదులు, నేనును నుండఁగ దుర్యోధనకులక్షయంబుఁ జేయు టది యెంతటిపని? అర్జునునకుఁ బ్రియశిష్యుఁడ నగునాకుఁ దత్ప్రియం బవశ్యకర్తవ్యంబు. కొడుకును దండ్రియు, శిష్యుని గురువును వృద్ధికిఁ దెచ్చినందుకుఁ బ్రతిఫలంబు వారు చేయనవలయుఁగాదే? కావున నిప్పుడు మనము దుర్యోధను సపుత్రమిత్రబాంధవుం దెగటార్చి ధర్మతనయుండు సమయాబ్దంబులఁ గడపునంతకు మహావీరుఁ డయినయభిమన్యుని భూభారధురంధరుం జేయుదము. సమయంబు తీఱినపిదప యుధిష్ఠిరుండు రాజ్యమేలు ననిన వాసుదేవుఁడు సాత్యకి కిట్లనియె. సత్యకసుతా, నీచెప్పినట్లు చేయ నగు. ఐనను గామలోభభయాదుల నెద్దాన

నైన ధర్మంబు విడువనిధర్మరాజు స్వభుజార్జితంబుగానిరాజ్యంబు నొల్లఁ డనిశం
కింతు. సమయంబు గడచనినపదంపడి భీమార్జుననకులసహదేవపురస్కృతుండై
ధర్మనందనుం డనికిఁ గడంగు. అపుడు పాంచాలకేకయాదులు మనముం దోడ్ప
డి పగవారలం గెలిచి ధర్మనందనుఁ బట్టాభిషిక్తుం జేయుద మనియె. అనవుడు
ధర్మరాజు మాధవా, నీకంటె వేఱొకం డుచితజ్ఞుఁడు గలఁడే? యని భగవంతు
నగ్గించి సాత్యకిదెస మొగంబై నాయభిప్రాయంబుఁ గృష్ణుఁ డెఱుంగు. అమ్మ
హాత్మునియభిప్రాయంబు నేఁ గొంత యెఱుంగుదు. వాసుదేవవచనం బనుష్ఠేయం
బనిచెప్పి యందఱం గలయం జూచి మీదర్శనంబున సంతసం బయ్యె. ధర్మము
నందుఁ బ్రమాదంబు వలదు. సుఖు లయినమిమ్మెల్లఁ గ్రమ్మఱఁ జూతు ననుటయు
వారు ధర్మరాజానుమతిం గొని రామకృష్ణపురస్కృతులై యథాగతంబుగ నరిగిరి.
అట ధర్మరాజు తమ్ములను ద్రౌపదినిం దోడ్కొని బ్రాహ్మణపురస్కృతుండై
యటఁ జని సోమలతావిమిశ్రజలపూరిత యగుపయోష్ణీనదిం జేరుటయు రోమ
శుఁ డతని కిట్లనియె. ధర్మనందనా, తొల్లి యీనదీతీరమున నమూర్తరజసుని
కొడుకు గయుఁ డనురాజు చషాలయూపచమసనుక్స్రువాదియజ్ఞసాధనంబులనెల్ల
హిరణ్మయములనుగా నమర్చి యుపరిస్థితసప్తచషాలంబు లయినయూపస్తంభ
ముల సురలే స్థాపింపఁగా నేడశ్వమేధముల నాచరించి సోమమున నింద్రాదినిర్జ
రులఁ దృప్తులం జేసి యపరిమితదక్షిణలను హిరణ్మయగోదానంబులను నానాదేశా
గతు లయినబ్రాహ్మణులం దన్పి పుణ్యలోకంబు వడసె. పుడమిం గలయిసుమును,
నాకాశంబునం గలరిక్కలను, వర్షధారలనైనను లెక్కింపవచ్చునుగాని వానియి
చ్చినదక్షిణల నెన్న రాదు. ఈపయోష్ణియందు స్నాన మాచరించినయతఁడు గయు
నిపోలె నుత్తమలోకంబులఁ గాంచు ననిన ధర్మరాజు తమ్ములు భార్యయుఁ, దాను
నందు మజ్జనంబుఁ గావించి యటఁ జని వైదూర్యపర్వతంబు సేవించి నర్మద
యందలిపుణ్యతీర్థముల నాడి విప్రుల కపరిమితధనము లొసంగి యుపాసింపుచుం
డ రోమశుండు ధర్మనందనా, యీదేశంబు త్రేతాద్వాపరసంధి యనంబడు.
ఇందుఁ దొల్లి చ్యవనమహర్షి శర్యాతి యనురాజుకూఁతు సుకన్యయనుదానిం
బెండ్లియయ్యె. మఱియు నతండతనియజ్ఞమునందు శక్రునెడఁ గినిసి యతని సంస్తం
భితుం జేసి యయ్యింద్రునితోడన యశ్వినులకును సోమభాగంబుఁ గల్పించి య
జ్ఞంబు సమాప్తప్రయోగంబుఁ జేసె ననిన ధర్మరాజు మునీంద్రా, చ్యవనునిచ
రిత్రంబు సవిస్తరంబుగ నిరూపింపు మనియడుగుటయు రోమశుఁ డతని కిట్లనియె.

## చ్యవనుఁడు శర్యాతికూఁతు రగుసుకన్యం బెండ్లియగుట.

ధర్మరాజా, భృగుమహర్షికొడుకు చ్యవనుఁ డిచ్చటికొలనిసమీపమునఁ
బెద్దకాలంబు నిశ్చలవృత్తిం దపంబు సేయుచుండ నమ్మునిశరీరము తీఁగెలు

గప్పఁగఁ జీమలు పుట్టలు పెట్టఁగఁ దదావృతం బగుటంజేసి యేర్పడరాకుండె. అంతఁ గొంతకాలమునకు శర్యాతి యనురాజు తననాలుగువేలభార్యలతోడ నీసరోవరంబునకు విహారార్థంబు వచ్చిన వానియేకపుత్రి యయినసుకన్య యనునది దివ్యాభరణభూషితయై చెలికత్తెలతోడఁ గ్రీడించునది యావల్మీకంబుచెంగట విహరింపుచు జవ్వనంపుఁటేపునఁ బూరెమ్మల విఱుచుచుండె. క్రొక్కాఱుమెఱుంగు తెఱంగునఁ దుఱంగలించుదాని, వివిధభూషణాలంకృతయైనదాని, నేకవస్త్రయైనదాని, లావణ్యతారుణ్యంబులఁ బొల్పెసలారుదాని, నారాజకుమారిని విజనదేశంబునం గాంచి పుట్టలో నున్నమునివర్యుఁడు కామించి తిన్ననిమెఱుంగునఁ గొన్నిమాటలఁ జెప్పిన నాకన్నియ వినమింజేసి ప్రత్యుత్తరం బియ్యక యదృచ్ఛచే నిటునటు గ్రుమ్మరునది యాపుట్టనందున మిడుఁగుఱులవలె నగపడుచున్నయమ్ముని కన్నులఁ గనుంగొని యరయక యిది యేమియొక్కొ యని వితర్కించి మోహముచే నతనినయనము ముల్లుచేఁ బొడిచె. పొడుచుటయు నతండు కుపితుండై తనతపోమహిమంబున నారాజుసైన్యంబున నెల్లవారికిని మూత్రపురీషంబుల బంధించె. దానంజేసి సేనలోనెల్లరుం గడు దుఃఖితు లగుటయు శర్యాతి మనంబున నెవ్వరేని యిచ్చటఁ దపము సేయుచున్నభార్గవున కపరాధంబుఁ జేసియుందురు. కాకున్న నిట్లు గలుగ దనినిశ్చయించి సైనికులను, మంత్రులను, సుహృదులనుం బిలిపించి మీ రెవ్వరేనియుఁ జ్యవనమునీంద్రున కపరాధంబుఁ జేసితిరే యని సర్వోపాయంబుల నడిగి యెవ్వరు నెఱుంగ మనిచెప్పిన విని చింతాక్రాంతుండై యుండె. అట సుకన్య తండ్రిపాలికిఁ బోయి తండ్రీ, నే నిచ్చటఁ గ్రుమ్మరుచు నొక్కవల్మీకంబునందు మిడుఁగుఱులవలె వెలుంగుచున్నయొక్కసత్వంబుఁ గాంచి యజ్ఞానంబునఁ గంటకంబుచేఁ బొడిచితి ననిన శర్యాతి తటాలున నాపుట్టయొద్దకుఁ బోయి మెల్లన దానిఁ ద్రవ్వించి యందుఁ దపోవయోవృద్ధుఁడైనభార్గవుం గాంచి మునీంద్రా, తెలియక నాకూఁతురుచేసినయపరాధంబు సైఁచి రక్షింపు మనినఁ జ్యవనుఁడు దాని నా కిత్తువేని యీతప్పు సైఁతు ననియె. అనవుడు శంకింపక శర్యాతి కూఁతు నమ్మునికిచ్చి యతనిఁ బ్రసన్నుఁ జేసికొని క్షేమమున సైన్యముతోడఁ బురమునకుఁ జనియె. సుకన్యయుఁ బతిమది కించువిధంబున ననసూయలేక యగ్నుల నతిథులఁ బూజింపుచుండె.

అంత నొక్కనాఁ డశ్వినులచ్చటికి వచ్చి కృతస్నానయైనయాసుకన్యం గనుంగొని తదీయసౌందర్యంబున కద్భుతం బంది సీమంతినీ, యెవ్వతె వెవ్వని భార్య వెవ్వనికూఁతుర విప్వనమున నేమి సేసెద వని యడుగ నాసుకన్య నేను శర్యాతి యనురాజుకూఁతురను, భార్గవుం డైనచ్యవనునిభార్య నని చెప్పిన నశ్వినులు నవ్వి వెండియు నిట్లనిరి. సుందరీ, యీముదుకని కెట్లు నిన్ను నీతండ్రి

యొనంగెనో ? సురసుందరులును నినుఁ బోలఁ జాలరు. ఆభరణములు దివ్యాం బరములు లేకున్నను నీవనమునెల్ల నిలుకడవడసినవిద్యుల్లతవోలె వెలింగించుచు న్నదానవు. అలంకారము లున్న నీక నెట్లు సొంపు పెంపారుదువో యూహింప నైనఁ దోఁచదు. జరాజర్జరితాంగుఁడు పోషింపఁజాలనివాఁడు నగునీమగని విడిచి మాలో నొక్కని వరింపుము. ఏల వేలవై నిండుజవ్వనమ్ము వమ్ము చేసికొందు వనిన సుకన్య యిట్టిమాటలు నాచెవి సోఁక వీకఁ జాలింపుఁ డనిన వెండియు నశ్వినులు సుకన్యనుద్దేశించి నీమగనిం దారుణ్యవిలసితుం జేయుదుము. అపుడు మాము గ్గురిలో నొక్కనిఁ గోరికొను మనిన విని సుకన్య యావృత్తాంత మంతయుం బతి కెఱింగించి తదనుజ్ఞాతయై యశ్వినులయొద్దకు వచ్చి యట్లచేయుదు ననియె. అను టయు వారు చ్యవను నాసరస్సునఁ జొరు మనిచెప్పి తామును వెనువెంటనఁ జొచ్చిరి. అట ముహూర్తంబునకు దాని వెడలి యమ్మువ్వురు నేకరూపులై వచ్చి సుకన్యం జూచి మాలో నీ కించువాని వరించు మనిరి. అనవుడు సుకన్యమనంబునఁ బతిని ధ్యా నించి వారిలోఁ జ్యవను నేర్పఱిచి యమ్మునినే వరించె. అంత సంతుష్టుండై చ్యవనుం డశ్వినులారా, మీరు నాకు వయోరూపములఁ గలిగించినందుల కెంతయు సం తుష్టుఁడ నైతి. ఇందుకుఁ బ్రతిగా నింద్రుఁడు చూచుచుండఁగనే మీకు సోమ మున భాగముఁ గల్పింతు ననిన విని యశ్వినులు సంతుష్టులై యరిగిరి. చ్యవనుఁ డును సుకన్యతోడ విహరింపుచుండె. దాని విని శర్యాతిమహీపాలుఁ డమ్మునియా శ్రమమునకు వచ్చి యల్లుని గూఁతుం జూచి భూమండలంబెల్ల సాధించినవాని పోలెఁ గడు సంతుష్టుఁడై యభిమతకథలఁ జెప్పుచుండె.

### చ్యవనుఁ డశ్వినుల సోమపీథులఁ జేయుట

అంతఁ జ్యవనుఁడు శర్యాతి నాదరించి రాజేంద్రా, నీకు సర్వార్థంబులు చేకూఱ యజ్ఞంబుఁ జేయించెద. సర్వసంభారములం జేర్చికొను మనిచెప్పి సంభృ తసకలసంభారుఁ డయినయారాజును యజ్ఞదీక్షితుం జేసి తత్ప్రయోగంబు నడపు చు నశ్వినులకు సోమం బీఁబోయిన నింద్రుఁడు వీరు సోమార్హులు గారని నిషే ధించె. నిషేధించుటయు నమ్ముని యింద్రా, యీమహాత్ములు నన్నతిశయిత రూపవంతుం జేసిరి. వీరు నితరదేవతలవలె సోమభాగార్హులే యనిన నింద్రుఁడు వెండియు వీరు వైద్యు లగుటంజేసి సోమభాగంబున కనర్హులు కావున సోమం బీవల దని నొక్కిచెప్పుచుండఁ జ్యవనుఁ డావచనంబు నాదరింపక యశ్వినులకు సోమభాగం బిచ్చె. ఇచ్చుటయు నింద్రుఁ డమ్మునిని జుఱచులం జూచి నామాట నాదరింపవా, ఇదె నీపై వజ్రాయుధం బేసెద ననిచెప్పి ఘోరరూపం బయిన యయ్యాయుధంబుఁ బూని చెయి మీఁది కెత్తుటయు నాభార్గవుఁ డతనిభుజము

నశ్వి స్తంభింపఁ జేసె. చేసి యంతట నిల్వక యింద్రుం జంపఁ దలంచి యభిచా రహోమముఁ జేయుటయు నొకరాక్షసుఁడు మదుఁ డనువాఁ డింద్రవధార్థం బగ్నినుండి వెడలివచ్చె. అట్లు వెడలి పదివేలయోజనంబుల నిడుపుగల బాహు దండంబులును, నూఱుయోజనంబుల నిడుపుగలనాలుగు పెద్దకోఱలును, దశ యోజనాయతంబు లయినతక్కుంగలదంతములును, సూర్యచంద్రమండలసదృ శంబు లైననేత్రంబులును, సురాసురులకును నిర్దేశింపరాక దిగ్భూనభోభాగం బెల్ల నిండినఘోరశరీరంబునుం గలిగి భూమియం దొక్కహనువును, నాకాశ మునం దొక్కహనువునుగా వక్త్రగహ్వరంబుఁ దెఱచి జగంబునెల్ల నొక్కపెట్ట మ్రింగునోనాఁగ దీర్ఘకరాళజిహ్వచేఁ బెదవులు నాకుచు నతిఘోరనాదంబున లోకంబులనెల్ల భేదించుచు వచ్చుచున్నయారాక్షసుం జూచి యింద్రుఁడు భయ పడి యోచ్యవనమునీంద్రా! భవద్వచనప్రకారంబున నశ్వినులు నేఁడుమొద లుగా సోమభాగార్హు లగుదురు. నీప్రయత్నంబు విఫలం బగునే? నీప్రభావం బును, సుకన్యామాహాత్మ్యంబు, నీశర్యాతినృపాలుకీర్తియు లోకమునఁ బెం పారు. నాయెడం బ్రసన్నుఁడ వగుమని ప్రార్థించినఁ జ్యవనుఁడు శాంతక్రోధుం డై యామదుఁ డనురాక్షసుని పానస్త్రీద్యూతమృగయలయందు వర్తింప నియమించి యింద్రున కశ్వినులకు నప్పుడు సోమము నిచ్చి శర్యాతియజ్ఞంబు నమాప్తప్ర యోగంబుఁ జేసి తనవిశదయశంబు నంతట నెఱపి సుకన్యతోడ విహరించె. ఇదె యాచ్యవనునిసరోవరంబు. ఇదియె త్రేతాద్వాపరసంధి యనంబడు. ఇందుఁ గృతస్నానులై పితృదేవతర్పణంబుఁ జేసినవారు సుకృతవంతు లగుదురు. నీవు నిందు స్నానమాడుము. ఇదె సికతాక్షంబు. ఇదె సైంధవారణ్యంబు. అందుఁ బుష్కరములయందు స్థాణుమంత్రముల జపించి స్నాన మొనర్చిన యతఁడు సిద్ధుఁ డగు. అల్లదె మునినివాసం బైనయార్చీకపర్వతంబు. అది మరుత్స్థానంబు నాఁబడు. అచ్చట నెల్లపుడు వఱదలు పాఱుచుండు. దేవాలయంబు లనేకంబులు గలవు. తత్సేవనంబు సదాఫలంబు. ఈపర్వతమునందే మూఁడుశిఖరములు, మూఁడుప్రస్రవణంబులుం గలవు. అందు వాలఖిల్యాదిమహర్షు లున్నవారు. నరనారాయణు లిందుఁ గొంతకాలంబు తపంబు చేసి పిదప బదరికాశ్రమంబుఁ జేరిరి. పితృదేవత, లమరులు, మహర్షులు, శంతనుప్రముఖు లగురాజర్షులు నందుఁ దపోయజ్ఞములఁ జేసిరి. అల్లదె యమున కాననయ్యెడి. అందు ధాతృవిధా తృవరుణాదులు తప మాచరించి సిద్ధు లయిరి. ఆయమునానదీతీరంబుననే మాంధా తయు, సోమకుఁడును యజ్ఞములఁ జేసి రనిన విని ధర్మరాజు మాంధాతృచరిత్రంబు, నతని కాపేరు గలుగ నిమిత్తంబును వివరింపు మనియడుగ రోమశుఁ డిట్లనియె.

## —మాంధాతృచరిత్రము.—

ఇక్ష్వాకువంశజాతుండైనయువనాశ్వుం డనురాజు భూరిదక్షిణంబులుగా ననేకాశ్వమేధాదియాగంబులం జేయుచు రాజ్య మేలువాఁడు సంతతింగానక వగచుచు రాజ్యభారమెల్ల మంత్రులయం దునిచి నియతచిత్తుండై యడవులకుం జనుచు భృగుమహర్షియాశ్రమంబునకుం బోయి ప్రార్థించిన నమ్ముని పుత్రకామేష్టిం జేయించి పుత్రోత్పత్తికై మంత్రపూతజలపూర్ణం బయినకలశంబు సంపాదించి యయ్యువనాశ్వుపత్ని కీఁదలంచి రక్షింపుచుండె. ఆరాత్రియువనాశ్వుం డుపవాసశ్రమమునం బిపాసార్తుండై శుష్కకంఠంబున మెల్లన జలము నడిగె. అతనిహీనస్వర మెవ్వరును వినమిం జేసి సలిల మియ్యరైరి. అంత నాయువనాశ్వుం డామంత్రపూత కలశజలములం ద్రావి సుఖించె. వేఁకువ నందఱు మేలుకని జలశూన్యం బైనకలశముం గనుంగొని యిది యెవనిపని యనియడుగుటయు యువనాశ్వుఁడు నడచినదంతయుం దెలిపె. అట భృగుమహర్షి యువనాశ్వుం జూచి నృపాలా! నీకుం బుత్రుఁడు జనింపంగ నేం దపోబలంబున నీకలశంబున జలంబు మంత్రపూతంబు గావించి నీపత్నికొసంగం దలంచియుంటి. నీవు ద్రావితివి. ఇది దైవకృతంబు. ఇందు కేమి చేయవచ్చు. ఈ యుదక మెవరు ద్రావినను మంత్రప్రభావమున నింద్రతుల్యుం డయినపుత్రుఁడు గలుగువాఁడు గావున నీగర్భమునం బుత్రోదయంబు నిశ్చితంబు. గర్భధారణాదులవలన నీ కపాయంబు గలుగకుండ మఱియొకయిష్టిం జేయింతు నని చెప్పి యాయిష్టిం జేయించె. అంత నూఱేండ్ల కయ్యువనాశ్వుగర్భమున వామభాగము భేదించి యొక్కకుమారుఁడు సూర్యుని తెఱంగునం దేజరిల్లుచు వెడలివచ్చె. మునికావించినయిష్టిప్రభావమున యువనాశ్వుం డపాయంబుం జెందఁడయ్యె. అపు డాకుమారుం జూడ నింద్రుం డమరులతోడ వచ్చి యీకుఱ్ఱం డేమి ద్రావు నని వా రడుగ నింద్రుఁడు * ననుం ద్రావు నని చెప్పి యమృతమయం బైనతన రెండవవ్రేలు వాని నోటం బెట్టె. సురలు దానం జేసి వానికి మాంధాతృం డనుపేరు పెట్టిరి. ఆమాంధాత యింద్రప్రదేశినియందలియమృతంబు నాస్వాదించి క్రమక్రమంబునం బదుమూఁడుజేనలు పొడవు పెరిగి ధ్యానమాత్రంబునన వేదములను, ధనుర్వేదములను, దివ్యాస్త్రములను, నేర్చి యజగవం బనువిల్లును, శృంగోద్భవంబు లయినబాణంబులను, నభేద్యకవచంబునుం బడసి యొక్కనాఁట సకలదేశముల గెలిచి యింద్రుం డభిషేకింపంగ సకలమహీమండలమునకు రాజయి దేశములనెల్ల నిజాజ్ఞావిధేయములంగాం జేసికొని చక్రవర్తి యన నెన్నికం గాంచి త్రైలోక్యపూజ్యుండై సం

* "మాంధాతా" అని యింద్రుఁడు చెప్పుటవలన నతని కా పేరు గలిగె. మాం, నను, ధాతా, త్రాఁగు నని యర్థము.

పూర్ణదక్షిణములుగా ననేకయజ్ఞముల నాచరించి సహస్రపద్మగోదానములం జేసి యింద్రునర్ధాసనం బధిగమించి లోకవిశ్రుతుం డయ్యె. మఱియు నమ్మాంధాత పండ్రెండేండ్లనావృష్టి సంభవించిన నింద్రుఁడు చూచుచుండఁగనె తీక్ష్ణబాణముల మేఘమండలంబు భేదించి వర్షంబుఁ గురియించి ప్రజల రక్షించె. ఆమాంధాత యీకురుక్షేత్రమధ్యంబుననే యజ్ఞము నాచరించె. సర్వలోకములు తనతపమునకుఁ దపించునట్లు తీవ్రతపంబు సలిపె. ఇదిమాంధాతృచరిత్రం బనిన విని ధర్మరాజు మునీంద్రా, యిఁక సోమకచరిత్రంబు వినవలతుం జెప్పు మనియడుగ రోమశుఁ డట్లనియె.

## సోమకచరిత్రము.

తొల్లి సోమకుఁ డనురాజు పరమధర్మశీలుఁడు నూఱుగురుభార్యలఁ బెండ్లియయ్యుఁ బెద్దకాలంబు సంతతిం గానక వగచుచుండి వయస్సు చెల్లినపదంపడి జంతుఁ డనువాని నొక్కకుమారుం బడసె. సోమకుభార్య లందఱు నాకుమారుం దమతమకొడుకుఁగా భావించి యత్యంతప్రీతిం బెంచుచుండిరి. అంత నొక్కనాఁ డాకొండికవానితొడ చీమ కుట్టిన వాఁ డేడ్చుటయు నంతఃపురంబున నార్తనాదంబు లెసంగె. సోమకుఁడును సారథి నంతిపురంబునకుఁ బంపి వానివలన దానినెల్ల నెఱింగి తా నంతిపురమునకుఁ జని కొడుకు నూరార్చి యట సభకు వచ్చి మంత్రులను, ఋత్విజునిం జూచి యేకపుత్రతకంటె నపుత్రతయ మేలు. శరీరానిత్యత్వంబుఁ బరికింప నేకపుత్రత్వంబు శోకకారణం బయ్యెడి. సంతానార్థంబుగఁ దగినభార్యాశతంబుఁ బెండ్లిఁ జేసికొంటి. అందఱును సంతతిహీనలే. ఎట్లో యొక్కతె కీకొడుకు పుట్టె. నాకును వయస్సు చెల్లె. మాప్రాణములెల్ల నీకుఱ్ఱవానిపై నున్నయవి. ఒక్కకొడుకుఁ గొడుకుఁగా నమ్మఁ దగునే? నూఱుగురుకొడుకులం బడయఁ దలఁతు. అందు కుపాయంబు దుష్కరంబైనం జేయుదు ననిన ఋత్విజుఁ డిట్లనియె. నృపాలా, నీకుఁ బుత్రశతంబు జనింపఁగ నుపాయం బనుష్ఠింతు వేని చెప్పెద. నీకొడుకును జంతుఁడనువానిఁ బశువుగఁ జేసి తదీయవపచే హుతవహునిసంతృప్తునిగఁ జేయవలయు. చేసిన నావపాహోమగంధ మాఘ్రాణించి నీభార్యలు నూఱుగురును గర్భవతులై పుత్రులఁ గాంతురు. ఈజంతుఁడు తనతల్లికే క్రమ్మఱ జనించు. అతనికి గుఱుతు నిపుడే చెప్పెద. వీనివామపార్శ్వంబున బంగారువంటిపుట్టుమచ్చ యొక్కండు గననయ్యెడి ననిన సోమకుఁడు పుత్రకామంబునం జేసి వల్లె యనియె. ఋత్విజుఁ డాకొండికవానిం దల్లు లడ్డుచుండినను బలాత్కారంబునఁ దెచ్చి విశసనంబుఁ జేసి తద్వప నగ్నిలోఁ బ్రేల్చె. అందులకుఁ గుందుచు సోమకపత్నులు నూఱుగురు నావపాగంధం బాఘ్రాణించి గర్భిణులై దశమమాసంబునఁ గొడుకులఁ గనిరి. జంతుఁడు ఋత్విగుద్దిష్టలక్షణంబుతోడఁ

దనతొల్లింటితల్లికే జనించిన నందఱు వానియెడఁ గడుఁ బ్రేముడి నెఱపుచుండిరి. ఆనూఱుగురిలో జంతుఁడు సకలగుణముల నుత్కృష్టుం డయ్యె. అంతఁ బెద్దకాలంబునకు ఋత్విజుఁడు కాలధర్మము నొంది నరకదుఃఖ మనుభవింపుచుండఁ గొంతకాలంబునకు సోమకుఁడుం బరలోకగతుఁడై స్వర్గలోకంబున కరుగువాఁడు ముందట నరకమునఁ గాఱియపడుచున్నతనఋత్విజుం గాంచి యేల నీవు నరకమునం బడితి వనియడుగ ఋత్విజుఁడు నరేంద్రా! నీకు యాజకుఁడ నగుటం జేసి నే నీనరకమునం బడితి ననిన సోమకుఁడు యమధర్మరాజుపాలికిఁ బోయి దేవా! నానిమిత్తంబుగ నాఋత్విజుఁడు నరకదుఃఖ మనుభవింపుచున్నవాఁడు. నన్నా నరకమునకుఁ బంపి యతని విడిపించు మనిన యముఁడు మహీశా, యొకరుఁడు చేసినదానిఫలంబు మఱియొక్కరుఁ డనుభవించునే? నీకుఁ బెక్కుపుణ్యఫలములు గల వనిన సోమకుఁడు వెండియు యమున కిట్లనియె. ఋత్విజుని విడిచి నేఁ బుణ్యఫలం బనుభవింపను. స్వర్గనరకముల నెక్కడనైన నాఋత్విజునితోడన యుందును. మా కిరువురకును బుణ్యఫలంబు సమంబుగా ననుగ్రహింపు మనిన యమధర్మరాజు వెండియు సోమకుం జూచి నీయభిప్రాయం బట్టిదయేని యితనితోడ నీవును నరక మనుభవించి పదంపడి యిద్దఱు స్వర్గ మనుభవించుఁ డనివచించె. ఆవచనంబున సోమకుఁడు ఋత్విజునినరకంబుఁ దానుం గొంతఁ బంచికొని యనుభవించి యది తీఱినపిదప నాతనితోడఁ బుణ్యలోకముల ననుభవించె. ఆసోమకునియజ్ఞాయతనం బిది. ఇం దాఱురాత్రులు వసించినవారు సుగతిఁ గాంతురు. నీవు నిం దాఱురాత్రు లుండు మనిచెప్పి తత్ప్రకారంబు నడపినపిదప నటఁ జని యొక్కచోటు చూపి రోమశుఁడు వెండియు నిట్లనియె.

ఇందుఁ దొల్లి ప్రజాపతి వర్షసహస్రం బిష్టాకృత మనుసత్ర మొనరించె. ఇందే యమునాతీరంబున నంబరీషుఁడు యజ్ఞముఁ జేసి సదస్యులకుఁ బదునెనిమిది పద్మముల నొసంగి యుత్తమసిద్ధిం బడసె. ఇందే యయాతి యజ్ఞముల ననేకముల నాచరించె. ఇవె యయాతియజ్ఞ మందలియగ్నికుండము లగపడుచున్నవి. చూడుము. ఇది యేకపత్రశమి. ఇది నరకంబు. ఇది రామహ్రదంబు. ఇది నారాయణాశ్రమంబు. ఇది ఋచీకపుత్రునిసంచారస్థానంబు. * ఇందు రోఁకళ్ల నాభరణములఁగా ధరించినయొకపిశాచి యొకానొకమగువనుగూర్చి యుగంధరమునఁ బెరుగు ద్రావి యచ్యుతస్థలంబున వసించి భూతిలయంబున స్నాన మొనర్చి పుత్రులతోడ నుండుము. మఱియు నిం దొక్కరాత్రి వసించి ద్వితీయంబు గూడ వసించునెడ నీపగలిటివృత్తికంటె రాత్రివృత్తము వేఱొక్కరీతి నగు నని చెప్పె నని గాథ వినంబడు. ఇది కురుక్షేత్రమునకు ద్వారంబు. ఇందు యయాతి

* ఇచట గ్రంథపాతము దోఁచెడి.

యజ్ఞములకు శక్రుఁడు ముదితుఁ డయ్యె. ఇది ప్లక్షావతరణం బనుయము నాతీర్థంబు. ఇందుఁ బెక్కండ్రు ఋషులు సారస్వతయజ్ఞముల నొనరించిరి. ఇందు భరతుఁ డనేకాశ్వమేధములఁ జేసె. ఇందే మరుత్తుఁడును సంవర్తముని రక్షితుండై కృష్ణమృగమును గని మేదినిం బడసి యుత్తమయాగంబు సలిపె. ఇందు స్నానముఁ గావించిన సర్వలోకములు నగపడు ననిన ధర్మరాజు తమ్ములు, భార్యయుం, దాను నందు స్నాన మొనర్చి మహర్షులమెప్పు వడసి రోమశున కిట్లనియె. మునివరేణ్యా, నే నిక్కడనుండినను లోకములెల్ల లోచనగోచరము లగుచున్నయవి. ఇంద్రలోకమున నున్నయర్జునుఁ జూచుచున్నాఁడ ననిన రోమశుఁ డిది యేతత్తీర్థస్నానమహిమంబున లభించె. ఇది సరస్వతీనది. ఇందు సురలు, ఋషులు, రాజులునుం బెక్కండ్రు యజ్ఞములఁ జేసిరి. ఇది పంచయోజనాయతం బైనప్రజాపతియజ్ఞవేది. ఇది నిరతయజ్ఞానుష్ఠానశీలుఁడై నకురునిక్షేత్రంబు. ఇందు సరస్వతి నాడి శరీరముఁ ద్యజించినవారు స్వర్గముఁ గాంతురు. తొల్లి దక్షుఁ డిం దొడలు విడుచువారు స్వర్గగతు లగుదు రనిదీవించె. దానంజేసి యిచట మేను దొఱంగ నెందఱే వత్తురు. ఇందే యోఘవతీనదియుం బ్రవహింపుచున్నది. ఇదియే నిషాదరాష్ట్రద్వారంబు. నిషాదులు దను నెఱుంగకుండఁగ సరస్వతి యిం దదృశ్యయగుటంజేసి యిచ్చోటు వినశనంబు నాఁబడు. ఇది చమసోద్భేదంబు. ఇందు సరస్వతి క్రమ్మఱ దృశ్యయయ్యె. ఇందే లోపాముద్ర నగస్త్యుం డిందు పెండిలియయ్యె. ఇదిప్రభాసంబు. ఇది విష్ణుపదంబు. ఇది విపాశానది. వసిష్ఠుఁడు పుత్రశోకాతురుండై శరీరంబుఁ బాశములఁ గట్టుకొని యీనదిం బడిన నీనది యమ్మునిపాశములం ద్రెంచి గట్టు సేర్చులంజేసి దీని కీపేరు గలిగె. ఇది కాశ్మీరమండలంబు. ఇందు మహర్షు లెందఱే నున్నవారు. ఇందు ఋషినాహుషుల, కగ్నికాశ్యపులకును సంవాదం బయ్యె. ఇది మానసద్వారంబు. ఇప్పర్వతంబుమధ్యంబున రాముఁడు వర్షముఁ గావించె, వాతికఖండుఁడు విదేహోత్తరంబుగ నేద్వారం బతిక్రమింపఁడయ్యెనో యాదేశం బియ్యది. ఇందు యుగాంతమున శంకరుఁ డుమాసమేతుఁడు పార్షదగణపరివృతుండునై దర్శనం బొసంగు. ఇందుఁ జైత్రమాసంబున నభీప్సితార్థులై యెందఱే జనులు పరమేశ్వరు నర్చింతురు. ఈసరస్సునఁ గృతమజ్జనుండు పాపనిర్ముక్తుఁడై పుణ్యలోకములఁ బడయు. ఇది యుజ్జానకంబు. ఇందరుంధతీసహితుండై వసిష్ఠుఁడు వసించె. ఇది కుశవర్ధదంబు. ఇందుఁ బద్మములు కుశములపై నెఱసియుండు. ఇది రుక్మిణ్యాశ్రమంబు. ఇది భృగుతుంగపర్వతంబు. ఇందు వితస్తయు జలోపజల లనునదులును యమునయుభయపార్శ్వములఁ బ్ర

వహింపుచున్నవి. ఇందే యాశీనరుఁ డైనశిబియనువాఁడు యజ్ఞముల నాచరించి యింద్రునికంటె నధికుఁ డయ్యె.

శిబి యనురాజు చరిత్రము.

ఆయజ్ఞమున నింద్రాగ్నులొక్కనాఁ డాశిబిచిత్తం బెఱుంగఁగోరి యచ్చటికి వచ్చి యింద్రుఁడు శ్యేనంబై కపోతం బైనయగ్నిం దఱుమ నాకపోతం బా డేగకు వెఱచి శిబిమఱువు సొచ్చిన దానివెంట వచ్చి శ్యేనము శిబి కిట్లనియె. నరేంద్రా, నీవు ధర్మాత్ముఁడ వని యందఱు నందురు. ఆఁకలి కోర్వనినా కీకపోతం బాహారంబు కావునఁ గరుణించి దీని విడువుము. ఇది ధర్మవిరుద్ధం బనిన శిబి యిట్లనియె. ఇది నీకు వెఱచి ప్రాణరక్షణార్థంబుగ నామఱుఁగు సొచ్చె. కాన దీనిం ద్యజింపరాదు. శరణాగతులఁ గావమి గోవధంబునకు బ్రహ్మహత్యకుం దుల్యం బనిన శ్యేనంబు వెండియు నిట్లనియె. ఆహారంబున సర్వభూతంబులు జీవించి వృద్ధిఁ గాంచు. దేని విడిచియైన మనవచ్చుఁ గాని యాహారంబు విడిచి జీవింప వచ్చునే? నీ వీకపోతంబును విడువవేని యాఁకలి కోర్వలేక నే నొడలు విడుతు. అట్లయిన నాకొడుకులు, భార్యయు జీవింపనేరరు. ఒక్కకపోతంబునకుఁగా నిన్ని ప్రాణంబుల రక్షింపవైతివి. శరణాగతరక్షణంబు ధర్మంబైనను బహ్వధర్మకారి యగుటంజేసి యిపుడు గ్రాహ్యంబుగాదు. ధర్మాధర్మములగౌరవలాఘవంబులను, బాధ్యబాధకత్వంబులనుం బరిశీలించి ధర్మంబు నడపవలయు ననిన శిబి మఱియు నిట్లనియె. విహంగోత్తమా, నీసంభాషణంబుఁ బరికింప ధర్మముల నెఱింగినతెఱంగు దోఁచెడి. నీకుఁ దెలియనిది యెక్కండు నుండ దనియూహించెద. శరణాగతపరిత్యాగంబు ధర్మం బనఁ దగునే? నీయత్నం బంతయు నాహారార్థంబ కాదే? వేఱొక్కమృగంబు నాహారంబుగా గ్రహించిన నీకుఁ బ్రాణరక్షణంబు, నాకు శరణాగత రక్షణసుకృతంబు నగు. రెండును సమకూఱునట్లుగా వేఱొక్క యాహారంబు గ్రహింపరాదే? నీకోరినయాహారం బిత్తు ననియడుగ డేగ వెండియు నిట్లనియె. ఏమృగంబులును నాకాహారంబులు గావు. శ్యేనములు కపోతములఁ దిను నని వేదవచనముల వినఁబడుఁ గదా. కావున దేవవిహితం బైనయాహారంబు నా కొసంగుము. సారము లేనివ్యర్థవచనముల నేమి ప్రయోజనంబు? కావునఁ గపోతంబును విడువు మనుటయు శిబి మఱియు నిట్లనియె. నీకోరినదాని దేనినైన నిత్తుఁగాని యీకపోతంబు నియ్యను. వలయునేని నారాజ్యమునెల్ల గ్రహింపుము. దేని నొసంగిన నీకపోతంబు నపేక్షింపవో దాని నిచ్చెద ననిన డేగ యారాజుం జూచి యట్లగునేని యీకపోతం బంతటినీమాంసముఁ గోసియిమ్ము. అట్లయిన దీని నపేక్షింప ననుటయు శిబి యిది మహాప్రసాదం బని భావించి నురియఁ గాని దనమాంసముఁ గోసి తులలో నెక్కవైపున నుంచి వేఱొక్క

నై పునఁ గపోతంబు నుంచి తూఁచి తనకోసియుంచినమాంసము కపోతమంతగా కుండుటయు మఱియుఁ గొంతఁ గోసియుంచి యప్పటికిని సరి గాకుండుటఁ జూచి దానే తుల నధిరోహించె. అంత నింద్రాగ్నులు శ్యేనకపోతరూపముల విడిచి యోరాజేంద్రా, మే మింద్రాగ్నులము. నీచిత్తవృత్తి నెఱుంగఁ గోరివచ్చితిమి. నీవు ధర్మంబ పరిశీలించి శరీరముం గూడ గోసియుంచుట కెంతయు సంతసించితిమి. నీకీర్తి సర్వలోకంబుల శాశ్వతంబుగ వ్యాపించెడి. కీర్తి వ్యాపించియుండు నంతకు నీకుఁ బుణ్యలోకంబులు గలుగు నని చెప్పి వా రిద్దఱు నిజరూపధారులై తమలోకంబులకుఁ జనిరి. శిబియు ననంతరంబు గొంతకాలంబు ధర్మమున రాజ్యమేలి నాకలోకమున కరిగె. ఇది యాశిబియజ్ఞవాటంబు. ఇందు మునులు, సురలుం బ్రాహ్మణులకు దర్శన మిత్తురు. ఇప్పుణ్యదేశంబు నాతోడఁ జూడుము. సర్వర్తుఫలభరితతరునికరపరీతం బయినయిది యుద్దాలకపుత్రుం డైన శ్వేతకేతుని యాశ్రమంబు. ఇందు సరస్వతి మనుష్యవనితారూపంబున శ్వేతకేతునకు సాక్షాత్కరించె. ఇందుఁ దొల్లి మాతులభాగినేయు లయినయష్టావక్ర శ్వేతకేతులు తపస్సిద్ధు లైరి. అష్టావక్రుఁడు మేనమామతోడ జనకుని యజ్ఞాయతనంబునకుఁ జని బాలుఁడయ్యు వాదమున వందియనువాని నోడించి నదిలో ముంచె ననుటయు ధర్మనందనుం డష్టావక్రచరిత్రంబు సవిస్తరంబుగ జెప్పు మనియడుగ రోమశుఁ డతని కిట్లనియె.

## అష్టావక్రమునిచరిత్రము.

ధర్మనందనా, తొల్లి * కహోళుఁ డనువాఁ డుద్దాలకుని సేవింపుచు నధ్యయనంబు సేయుచుండ నతనిశుశ్రూషకు మెచ్చి యుద్దాలకుండు సర్వవిద్యలం బ్రసాదించి తనకూఁతు సుజాత యనుదాని నిచ్చె. దానిం బెండ్లియై కహోళుఁడు గృహస్థధర్మముల నడపుచుండఁ బెద్దకాలంబున నాసుజాత గర్భిణి యయ్యె. దానిగర్భమున నున్నయగ్ని తేజుఁ డయినకుమారుఁడు తండ్రి యోరంతప్రొద్దును శిష్యులకు వేదములఁ జెప్పుచుండఁ దండ్రీ,యిట్లెల్లకాలంబు చదివింపవలయునే? నీప్రసాదంబున నేను గర్భమున నుండియే సాంగవేదముల, సర్వశాస్త్రముల నేర్చితి నని యుపాలంభించి పలికె. అందుకుఁ గుపితుండై కహోళుం డోరీ! యర్భకా! వక్రమతి నిట్లు నన్ను నిందించుటంజేసి నీశరీరం బష్టవిధముల వక్రమయ్యెడు మని శాపం బిచ్చె. అంత గర్భస్థుం డయినకుమారుఁడు పెరుగుచుండ నొక్కనాఁడు సుజాత యేకాంతమున భర్తను జూచి యిది పదియవనెల. పురిటికిఁ గావలసినపదార్థములు మనకుఁ గొంచెమేనియు లేవు. ఎట్లు ప్రసవకష్టంబుఁ బాయుదునో? ఏమిచేయుదు ననినఁ గహోళుఁడు ధన మార్జించికొనివత్తు నని

* వీని కేకపాదుఁడను పేరు తెనుఁగుభారతమునఁ జెప్పఁబడియున్నది.

చెప్పి జనకనృపాలుపాలికిఁ బోయి వాదమున వందిచేఁ బరాజితుండై యావంది నిగ్రహమున నీట మునిఁగియుండె. అంత నిట నుచితకాలమున సుజాత కుమారుం గనియె. వాఁడుం బితృశాపమున నష్టావక్రుఁ డనఁ బరఁగి పెరుగుచుండె. ఉద్దాలకుఁడుం గహోళుఁడు వందినిగృహీతుం డయ్యె నని విని సుజాతం బిలిచి యీరహస్యంబు కొడుకున కెఱింగింపవల దని నియమింపఁగ నది యట్ల చేయుటయు నష్టావక్రుఁడు మాతులుఁ డయిన శ్వేతకేతుతోడ నెక్కటఁ బెరుగుచు నుద్దాలకుఁ దండ్రిఁగా శ్వేతకేతు నన్నఁగా భావించియుండె. అట్లేకాదశవత్సరంబులు చనుటయుఁ బండ్రెండవయేట నెక్కనాఁ డుద్దాలకుతోడపైఁ గూర్చున్న యష్టావక్రుం జూచి శ్వేతకేతుఁ డోర్వక మాతండ్రితోడ నేల యెక్కితి వనియధిక్షేపించి క్రిందికిఁ ద్రోయుటయు నష్టావక్రుఁ డేడ్చుచు సుజాతయొద్దకుఁ బోయి తల్లీ, మాతండ్రి యెవ్వఁ డెక్కడ నున్నవాఁ డనియడుగ సుజాత రహస్యంబైన నిది చెప్పనవలయు. కాకున్న వీఁడు శపించునెక్కొ యనివెఱచి పూర్వవృత్తాంత మంతయు వివరించె. దానినెల్ల విని యష్టావక్రుఁడు శ్వేతకేతునొద్దకుఁ జని మామా, జనకరాజుయజ్ఞమున ననేకాశ్చర్యములు గలవఁట. బ్రాహ్మణులు వాదింతు రఁట. మన మచ్చటికిఁ బోయి వాదముల విని యచ్చటిస్వాదుపదార్థంబుల భుజించి వత్త మనిచెప్పి యాశ్వేతకేతుం దోడ్కొని జనకయజ్ఞాయతనంబున కరిగి యజ్ఞశాలముందర మార్గమున రాజున కెదురై త్రోవఁదొలఁగు మనిన యారాజున కిట్లనియె.

నరేంద్రా,యంధవృద్ధభారవాహులు రాజును బ్రాహ్మణునకుఁ ద్రోవఁదొలంగవలయు. ఇతరు లెవ్వరేనియు నెదురై రేని వారే రాజుమొదలగువారికిఁ దొలంగవలయు ననిన జనకుఁ డష్టావక్రుం జూచి యిదె మీకుఁ ద్రోవ నిచ్చితి. యథేచ్ఛంబుచనుఁడు. బ్రాహ్మణుల కింద్రుఁడుం బ్రణమిల్లువాఁడు. మీరు చిఱుతవా రని యనాదరింపను. బ్రాహ్మణుఁ డెంతవాఁడైనను మహానుభావుఁడే. అగ్ని యల్పమయినను దహింపకున్నె యనిచెప్పి త్రోవ విడిచి చనియె. అట వారు ప్రవేశింపుచుండ ద్వారపాలుఁడు వారించుటయు నష్టావక్రుఁ డంతర్గతుండైనరాజు నుద్దేశించి మేము నీ యజ్ఞముఁ గాంచఁ గుతూహలంబున వచ్చితిమి. ద్వారపాలకుఁడు నివారింపుచున్నవాఁ డనిన ద్వారపాలుఁ డిట్లనియె. అయ్యా, మేము వందియానతి మెయి వర్తించువారము. నామాట వినుము, ఈయజ్ఞాయతనంబు సమర్థులు వృద్ధులు నగుపండితులకకాక మీయట్టిబాలురకుఁ బ్రవేశింపరా దనిన నష్టావక్రుఁ డిట్లనియె. వృద్ధుల కిది సుప్రవేశం బగునేని మేమును జొరఁ దగుదుము. మేము విద్యావృద్ధులము. జితేంద్రియులము. వ్రతముల సల్పినవారము. బాలు రని యవమానింపకుము. బాలుఁడైన నగ్ని తాఁకినఁ గాల్పకుండునే? యనిన ద్వారపాలుఁడు వెం

డియు నిట్లనియె. వేదమూలం బేకాక్షరంబు బహురూపంబు నగుప్రణవాత్మక సరస్వతిని లెస్సగ నుపన్యసించువాఁడే వృద్ధుఁడు. తదుపన్యాసంబు నీకు దుష్కరంబు కావున నీవు బాలుఁడవే యనిన నష్టావక్రుఁడు వెండియు నిట్లనియె. మావిద్యను నీ వే మెఱుఁగిలివి. బలవచ్ఛరీరుఁడే వృద్ధుఁ డని భావించెదవు. బూరుగతీరున శరీరము పెరిగినమాత్ర నుపయోగంబు లేదు. జ్ఞానవృద్ధుఁడు హ్రస్వకాయుఁడైనను వృద్ధుఁడే యనిన ద్వారపాలుఁడు మఱియు నిట్లనియె. జ్ఞానవృద్ధులే పెద్దలని నేను నెఱుంగుదు. పెద్దలఁ బరిచరించి విద్య సాధించినవార కదా జ్ఞానవృద్ధులు. అందుకుఁ బెద్దకాలంబు గావలసియుండు. ఈచిఱుతప్రాయముననే నీవు జ్ఞానవృద్ధుఁ డ వని నమ్మవచ్చునే? యనిన నష్టావక్రుఁడు మఱియు నిట్లనియె. ద్వారపాలా, యేండ్లుచెల్లినను, దల నరసినను, ధనము మిక్కిలి గలిగినను, బంధువులు సహాయులై యుండినను వృద్ధుఁడు గాఁడు. మఱి జ్ఞానవంతుఁడు బాలుఁడైనను వృద్ధుఁ డని సురలు చెప్పిరి. సభఁ జొచ్చినపదంపడి మాజ్ఞానం బెఱుంగ నగు. వాదమున వంది నా కోడుటను రాజు పురోహితులు పండితులు నెఱుంగఁగలరు. అక్కడఁగదా మాజ్ఞానము దెలియు ననిన ద్వారపాలుఁ డయ్యా, విద్వాంసులకు నుప్రవేశం బైన యీయజ్ఞాయతనంబు మీరు సొరఁ బ్రయత్నంబు సేసెద. నీవు ను జతనంబుఁ జేయు మనియె.

అష్టావక్రుఁ డంతట రాజు నుద్దేశించి యోరాజేంద్రా, నీవు జనకవంశమున వరిష్ఠుఁడవు. సర్వసంపత్సమృద్ధుఁడ వైనసమ్రాట్టవు. యయాతిరీతి యజ్ఞములకెల్లఁ గర్తవు. విద్వాంసుఁడైనవంది వాదమునఁ బెక్కండ్ర విప్రుల నిగ్రహించి నీట ముంచె నని విని యీసభయందు వానియెదుట బ్రహ్మాద్వైతంబు నిరూపింప వచ్చితి. ఆవంది యెక్కడ నున్నాఁడు? సూర్యుఁడు నక్షత్రములం బోలె వాదమున గెలిచి వానిఁ నిస్తేజస్కుఁ జేయుదు ననిన రా జిట్లనియె. అయ్యా, నీవు వందిబలము దెలియక యతని నోడింతు ననితలంతువు. ఎందఱే విద్వాంసు లతనిచేఁ బరాజితులై సూర్యునెదుట నక్షత్రములమాడ్కిఁ దేజు దఱిగిరి. పరబలంబు చక్కగ నెఱుంగక యిట్లు చెప్పెద వనిన నష్టావక్రుఁడు జనకునకు మఱియు నిట్లనియె. నృపాలా, నాయట్టివారితోడ వాద మొనరింపక తన్నుఁదాన పొగడికొనుచుండ నందఱును వాని సింహముఁగాఁ దలంతురు. నాతోడ వాదము చేసినపుడుగదా వానిజ్ఞాన మంతయుఁ దెలియు. ఇంతేల? నిక్కంబ వాని నే నోడింతు ననిన జనకుఁడు ముప్పదియవాంతరాంశములు గలద్వాదశాంశము, లిరువదినాలుగుపర్వములు, మున్నూటయఱువదియరములుం గలచక్రంబుస్వరూపంబుఁ దెలిసినవాఁడే విద్వాంసుఁ డనిన నష్టావక్రుఁ డిట్లనియె. పక్షములనుచతుర్వింశతిపర్వములు, ఋతువు లనునాభులు, మాసము లనుద్వాద

శనేములు, దినము లనుషష్ట్యుత్తరశతారంబులుం గలసంవత్సరంబులఁ బరిచ్ఛిన్నంబై సదాగమనం బైనకాలచక్రంబు నిన్ను రక్షించుత మనిచెప్పిన జనకుఁడు వెండియు బడబలపగిది సంయుక్తంబులై యెవ్వి యెవనివలన గర్భము ధరించి యెవనిఁ గను ననియడుగ నష్టావక్రుఁడు పూర్వోత్తరారణులు వాయుసంయోగమున వెలువరించినయగ్నివలనిబాధ నీశత్రువులకైన వలవ దని నేర్పునఁ జెప్పుటయు జనకుఁడు వెండియు నిట్లని యడిగె. ఎయ్యది నిండ్రించియుఁ గన్నుమూయదు? ఎయ్యది పుట్టియుఁ జైతన్యంబుఁ బొరయదు? ఎయ్యది రూపంబు గల్గియు హృదయంబుఁ గాంచదు? ఎయ్యది వేగమున వృద్ధిఁ బొందు? అని యడుగ నష్టావక్రుఁడు చేప నిద్రించియుఁ గన్ను మూయదు. గ్రుడ్డు పుట్టియుఁ జైతన్యంబుఁ బొరయదు. ఱాయి రూపవంతమయ్యు హృదయంబుఁ గాంచదు. ఏఱు వేగమున వృద్ధిఁ బొందు నని చెప్పిన నాసదుత్తరములకు సంతుష్టుఁడై జనకుఁడయ్యె, నీవు కొండికవాఁడవయ్యు జ్ఞానవృద్ధుఁడవే. నీవచనోపన్యాసం బసదృశంబు. నీకు ద్వార మిచ్చితి. వీఁడె వంది యున్నవాఁ డనిన నష్టావక్రుఁడు సభాంతరము సొచ్చి జనసమూహమున వంది నేర్పుఱుపనేరక రాజుం జూచి సురలలో నింద్రునిచందమున, నదులలో గంగ తెఱంగున, రాజులలో నీవు వరిష్ఠుఁడవు. వంది నేర్పఱిచి చూపు మనిచెప్పి యోవందీ! యతివాదిమానీ! నామెదుట నిలిచి వాదము సేయుము. బడబానలంబు సాగరంబునుంబోలె నిన్నుడికించెద. వాదమునకు దొరఁకొనినఁ బాదాహతం బైనపాముపగిది రోషరూషితుండనై నీయేపు మాపుదు. నీ ప్రౌడుట నిక్కంబు. గర్వమున నీవు నాతో వాదునకుఁ గడంగుట పిడికిటం గొండఁ దాఁకుటయే. తాఁకినఁ గొండ కపాయంబు గలుగదు. మఱి తాఁకినవానిచేయి గాయపడు. అట్లే నీవు పరాజితుఁడవుదువుగాని నా కేమియుం గొఱంత గలుగదు. సమర్థుఁడవేని వాదము చేయుముత్తరము చెప్పెద నని యాసభాంతరమున నెలుంగు రాల్పడ వచించె.

అందుకుఁ గినిసి వంది వాదమునకుఁ దొడంగి వాదార్థంబుగా సర్వ మేకసంఖ్యాకం బని కొన్ని చెప్పి చూపిన నష్టావక్రుఁడు సర్వంబు ద్విసంఖ్యాకం బని మఱికొన్ని చెప్పిచూపె. ఇట్లు వా రొక్కొక రొక్కొక్కటిగా నేకాదిసంఖ్యాపరిచ్ఛిన్నపదార్థముల నిరూపింపుచుండ వంది త్రయోదశసంఖ్యాపరిచ్ఛిన్నపదార్థముల నిరూపించునెడ శ్లోకార్థంబు చెప్పి మీఁదఁ జెప్పలేకుండుటయు నష్టావక్రుఁడు దా నాసంఖ్యకుఁ బూరణంబుఁ గావింప వంది లజ్జచే నధోముఖుఁ డయ్యె. అయ్యవసరంబున బ్రాహ్మణు లందఱు వంది నోడించినమహాత్ముఁ డితఁ డని యష్టావక్రుం బూజింపుచుండ నాకహెూళతనయుఁడు రాజుం జూచి యీవంది యింతకుమున్ను బ్రాహ్మణుల నోడించి నీట ముంచెఁ గావున నిపుడు వీని ముంచు

నది యనిన వంది యిట్లనియె. అయ్యా, నేను వరుణపుత్త్రుఁడను. మా తండ్రి ద్వాదశవార్షికసత్త్రయాగంబుఁ జేయఁ బూనఁగ నేను బ్రాహ్మణుల నాయాగంబునకుఁ బంపితి. వా రందఱు నిపుడు వత్తురు. నీట ముంచినను నాకు వెఱపులేదు. తండ్రిం జూతు ననిన నష్టావక్రుఁడు వెండియు జనకరాజుం జూచి నృపాలా, యాలస్యం బేల చేసెదవు. స్తుతివచనంబులఁ బ్రమత్తుఁడవైతివో, నామాటల వినవో యనియడుగ జనకుఁడు మునీంద్రా, నీవచనంబుమెయి నిప్పుడే వందిని జలమగ్నుం జేయుదు ననియె. అంత నష్టావక్రుఁ డది యవశ్యకర్తవ్యం బనుచున్నంత వంది యిందుకు నే వెఱవను. అష్టావక్రునితండ్రి యగుకహోళుఁ డిపుడు వచ్చువాఁ డనుచున్నంత జలనిమగ్ను లయినమునులు వరుణపూజితులై జలము వెడలి వచ్చిరి. కహోళుఁడును జలము వెడలి వచ్చి సుతుం గాంచి పుత్త్రజననంబు నాకు సఫలం బయ్యె. నాచేఁ గానికార్యమును నాకొడుకు సాధించె నని కొడుకును గొనియాడి జనకరాజుం జూచి నరేంద్రా, నీయజ్ఞమున సామము సుగీత మయ్యె. సురలు సోమభాగముల సంతృప్తులై కడు సంతుష్టులయిరి. శుభంబు లయ్యెడు మనిదీవించి నిజాశ్రమమునకుఁ జనియె. వందియు జనకనృపాలుననుజ్ఞఁ గొని సముద్రమున మునిఁగి వరుణలోకమునకుఁ బోయె. అట్లష్టావక్రుఁడు వందిని గెలిచి తండ్రియు మామయుఁ దోడరాఁగ నిజాశ్రమముఁ జేరుటయుఁ దండ్రి వానియుత్తమసామర్థ్యంబునకు మెచ్చి సుజాత చూచుచుండఁగ నాకుమారుని సమంగయనునదిని మునుంగుమనినియమింపఁగ నతం డానదియందు మునిఁగి యంగముల వక్రత్వంబుఁ బాసి సమము లయినయంగములతోడ వెడలి వచ్చె. ధర్మనందనా, నీవు నీసమంగానదియందుఁ దమ్ములతోడను భార్యతోడను స్నాన మొనరింపుమని చెప్పి యట్ల చేసినయతనిం దోడ్కొని చనుచు రోమశుండు వెండియు నిట్లనియె. ఇది యీసమంగానదియందు మధుబిల నాఁబడుతీర్థంబు. ఇది కర్దమిలతీర్థంబు. ఇందు భరతుఁడు రాజ్యాభిషిక్తుఁ డయ్యె. ఇందు దేవేంద్రుఁడు స్నాన మొనరించి వృత్రవధపాతకంబుఁ బాసె. ఇది మైనాకకుక్షి. ఇందలివినశనతీర్థంబునందె తొల్లి యదితి పుత్త్రార్థంబు తపస్సు చేసె. దీని నారోహించి లక్ష్మీవంతుఁడ వగుము. ఇవి కనఖలపర్వతములు. ఇదె యిచ్చట గంగానది ప్రవహింపుచున్నయది. సనత్కుమారుఁ డిందలిపుణ్యహ్రదం బాడి సిద్ధుఁ డయ్యె. ఇది భృగుతుంగంబు. ఇందుఁ దూష్ణీసంగమునఁ గృతస్నానుఁడ వగుము. ఇది స్థూలశిరసునియాశ్రమంబు. ఇందు మానక్రోధముల వర్జింపవలయు. ఇది రైభ్యమునియాశ్రమంబు. ఇందు భరద్వాజపుత్త్రుఁ డైనయవక్రీతుఁడు విగతజీవుఁ

డై పునర్జీవితుఁడయ్యె ననిన ధర్మరాజు తచ్చరిత్రంబు సవిస్తరంబుగఁ జెప్పు మని యడుగ రోమశుఁ డిట్లనియె.

యవక్రీతునిచరిత్రము.

తొల్లి రైభ్యభరద్వాజు లనుమును లిద్ద అత్యంతస్నేహమున వర్తింపు చుండిరి. అందు రైభ్యుఁడు విద్వాంసు లయినయర్వావసుపరావసు లనునిద్దఱు కొడుకులతోడ విద్వద్గణపూజితుఁడై యుండ భరద్వాజునికొడుకు యవక్రీతుఁ డనువాఁడు తదుత్కర్షంబు నోర్వక తాను వారికంటె విద్యాధికుఁడుగాఁ దలఁచి ప్రజ్వలితాగ్నిముందఱ శరీరముఁ దపింపఁజేయుచుఁ దీవ్రతపము సల్పుచుండె. వానితపంబునఁ గలిగినతాపము సహింపనోపక యింద్రుఁడు యవక్రీతునొద్దకు వచ్చి యేల యిట్లు దుష్కరతపంబు చేసెద వనియడుగ వాఁ డిట్లనియె. వేద ములనెల్ల గురుముఖమునఁ బడయఁగా నంద తెంతేఁగాల మెన్నియేఁ గ్లేశముల ననుభవింతురు. అట్లు లేకుండ బ్రాహ్మణులకెల్లఁ దమంతన సకలవేదములును స్ఫురింపఁగాఁ దపము చేసెద ననిన నింద్రుఁ డయ్యా, యిది వేదముల గడింప మంచిమార్గము గాదు. తపము చాలించి గురుశుశ్రూషఁ గావించి తన్ముఖము ననే పడయు మనిచెప్పి త్రిదివంబునకుఁ జనియె. యవక్రీతుఁ డంత నూరకుండక వెండియు నతితీవ్రముగఁ దపస్సు చేయుటయు నాతాపంబు సహింపనోపక దేవేంద్రుఁడు వానియొద్ద కేతెంచి యాయుద్యమంబుఁ జాలింపు మనిబోధించిన నతండు మహేంద్రా, నామనోరథము సఫలముఁ జేయవేని యియ్యగ్నిలో శరీర మంతయు వేల్చెద నని తనపట్టినపట్టు వదలకుండె. అంత నింద్రుఁ డుపాయమున వీనిపూనికి మానుపవలయు నని మనంబున నిశ్చయించి దీర్ఘరోగకృశుఁ డైన వృద్ధవిప్రునివేషము ధరించి భాగీరథియం దయ్యవక్రీతుఁడు స్నానార్థముగ వచ్చురేవు సేరి యమ్మహానది కడ్డముగాఁ బిడికిళ్ల నిసుక చల్లుచుండె. అట్టి యెడ యవక్రీతుఁ డచ్చటికి స్నానాదివిధులఁ దీర్ప నరుగువాఁ డతనిం జూచి యిది యేమిపని యనియడుగ నాఖండలుఁ డయ్యా, జను లీనదిం ధాఁటఁ జాలక చాలఁ గ్లేశపడుచున్నవారు. వారికెల్ల సుఖార్థం బీనదిలో సేతువు గట్టఁద లఁచి యిట్లు చేయుచున్నవాఁడ ననియె. అనవుడు యవక్రీతుఁ డోముదుకఁడా, యీవెట్టిపని యేల చేసెదవు? ఇది దుష్కరంబు. దీని వదలి సాధ్యకృత్యమును వేఱొకదానిం జేయు మనుటయు నింద్రుఁడోహో! నీవు తపస్సుననే విద్య నెల్లవారికి సులభంబుగాఁ జేయుదువేని నే నీపని నెఱవేర్పలేనా యని చెప్పఁగ యవక్రీతుఁ డావృద్ధవిప్రు నింద్రునిగ నెఱింగి మహేంద్రా, తపమున నెల్లరకు వేదజ్ఞానంబు సాధింపలేనేని నాకు నాతండ్రికిని వేదజ్ఞానంబు గలుగ వరము నొ సంగు మనియడిగి యాఖండలునివలనఁ దనయభిమతంబులు వడసి తండ్రియొ

ద్దకుం బోయి మన కిరువురకును వేదజ్ఞానమును దపోబలమున సాధించితి. ఇంద్ర వరమున నే నెల్లవారికంటె నధికుఁడ నైతి ననిచెప్పఁగ భరద్వాజుఁ డిట్లనియె.

వత్సా! వరముఁ బడసితి నని గర్వింపవలదు. గర్వోపహతుఁ డచిరంబ నశించు. తొల్లి బాలధి యనుముని పుత్రశోకాతురుండై తపస్సు చేయఁగ సురలు సన్నిహితులయి యేమి కోరెద వనియడుగ నతండు నా కమర్త్యుఁ డగుపుత్రు ననుగ్రహింపుఁ డనిప్రార్థించిన వా రయ్యా, మర్త్యు లమర్త్యులు గానేరరు. మఱి వరప్రభావమునఁ జిరకాలంబు జీవింపఁ గలరు. నిమిత్తవిశేషమున మృతు లగుదు రనిరి. అనవుడు బాలధి యమరులారా, యీపర్వతము లక్షయములుగ నుండు నంతకు నాపుత్రుఁడు బ్రదుకునట్లుగా ననుగ్రహింపుఁ డనిప్రార్థించిన వారు వల్లే యని నిజలోకమునకుఁ జనిరి. అంత నమ్మునికి మేధావి యనువాఁ డొక్కకుమారుఁడు పుడమి క్రమమునఁ బెఱిగి దేవవరమునఁ దనకు మృతి గలుగ దని గర్వించి మునుల ననాదరింపుచుఁ దిరుగువాఁ డొక్కనాఁడు ధనుషాక్షుఁ డనుముని నవమానించె. అంత నమ్ముని కోపదీపితుండై వాని భస్మ మగుమని శపించి యాశాపమున నతఁ డట్లు గామికి వగచి జ్ఞానదృష్టిం దద్వధోపాయంబు నరసి మహిషములచే నాకొండల భేదింపఁజేసె. ఆకొండలు భిన్నము లగుడు నిమిత్తవినాశమున నామేధావి మృతుఁ డయ్యె నని వేదముల గాథ వినంబడు. కావున వరమున గర్వింపవలదు. రైభ్యుఁడు మహావీర్యుఁ డతికోపనుఁడు దేనినైనం జేయఁగలఁడు. తత్పుత్రులు నట్టివారలే. వారిదెసఁ బోవలవ దనిన యవక్రీతుఁడు భరద్వాజమునిం జూచి తండ్రీ, నీయానతిమెయి వర్తింతు. నీయట్లు రైభ్యుఁడును నాకు మాన్యుఁడే యనివిన్నవించి తండ్రికి మనఃప్రియంబుఁ గావించి రైభ్యు నొక్కని విడిచి తక్కటిమునులఁ దపోవిద్యాగర్వమున నవమానింపుచు మున్యాశ్రమములఁ దిరుగుచుండె. అట్లు తిరుగువాఁ డత్యంతమనోహరం బయినవసంత మాసంబున రైభ్యాశ్రమంబునకుఁ జని యటఁ జరింపుచున్నదాని, రైభ్యుకోడలిఁ, బరావసుభార్య, నతసుందరిం గాంచి కామించి సిగ్గు విడిచి నన్నుఁ బొందు మనుటయు నామె వానిచిత్తవృత్తి నెఱింగి శాపంబునకు వెఱచి రైభ్యుతేజమును దలపోసి యప్పటి కంగీకరించినట్లు పలికి యచ్చోటు వాసి యాశ్రమాభ్యంతరమునకుఁ జని యేకాంతంబునఁ జింత గదుర నేడ్చుచుండె. అంతఁ గొంతవడకు రైభ్యుఁ డాశ్రమంబుఁ జేరి యేడ్చుచున్నకోడలి నూరార్చి సాంత్వవచనముల శోకకారణం బడిగి దానివలన యవక్రీతుదుశ్చర్య నెఱిఁగి కోపావేశవివశమానసుండై తనజడ నొక్కదానిం బెఱికి యగ్నియందు వ్రేల్చె. వ్రేల్చుటయు నగ్నికుండమునుండి కోడలి కెనయగునొకసుందరి వెడలి వచ్చుటయు మఱియు నొకజడ వేల్చిన ఘోరాకారుఁ డైనరాక్షసుఁ డొకఁడు వెడలి వచ్చె. అట్లు వెడలి వచ్చి వా రిద్దఱు

మునీంద్రా, యేమి పని యని యడుగ యవక్రీతుని వధించి రం డని రైభ్యుఁడు పంచిన ముందుగ నాతరుణి యయ్యవక్రీతు నెద్దకుఁ జని మదనవికారంబున నుచితము నెఱుంగక బమ్మరింపుచున్న యాభరద్వాజముని తనయుకమండలువును మంత్రపూతజలపూరితంబయినదాని నపహరించె. అపహరింపఁగఁ గమండలురాహిత్యమున నశుచియైనవాని నారాక్షసుఁడు శూలహస్తుఁడై తాఁకె. వానికి వెఱచి యవక్రీతుఁడు కొలఁకులకు నేఱులకుం బాఱి యందు నీళు లింకిపోయినం గత్యంతరరహితుండై తండ్రియగ్నిహోత్రగృహంబుఁ జొరఁబడఁ బాఱుచుండె. అట్టియెడ నింటికావలివాఁ డగుగ్రుడ్డిశూద్రుఁ డడ్డపడుటయు నారాక్షసుఁ డెయిది వచ్చి యయ్యవక్రీతువీఁపు శూలమునఁ బొడిచి వధించి రైభ్యునొద్దకుఁ బోయి యవక్రీతవధంబుఁ జెప్పిన నమ్ముని యాతరుణి నారాక్షసునకు భార్యఁ గా నియ్యఁగ వారిచ్చమైఁ జనిరి.

అటఁ గొండొకవడికి భరద్వాజుఁ డాహ్నికవిధులఁ దీర్చి ఫలసమిత్కుశాది పదార్థముల గ్రహించి యాశ్రమము సేరి యగ్ను లెప్పటియట్ల దనకుఁ బ్రత్యుత్థానంబుఁ జేయమికి వగచి గృహపాలకుఁ డయినశూద్రు నడిగి యావృద్ధునివలనఁ బుత్రమరణప్రకారం బంతయుఁ దెలిసి యాశవము డాయఁ జని శోకాకులుండై హా! పుత్రా! చదువకున్నను బ్రాహ్మణులకు వేదజ్ఞానము సంపాదింపఁ గోరి తపస్సు చేసినలోకోపకారి యగునీకుఁ గీడు వాటిల్లె. ఏమి చెప్పుదు? రైభ్యు దెసఁ బోవల దని యెన్నిమాఱులో చెప్పితి. నామాట వినక కాలాంతకయమతుల్యుఁ డయినవానియెడకుఁ బోవనే పోయితివి. ఆరైభ్యుఁడో కోపవశుఁడుకాని యుచితమెఱుఁగడు. వృద్ధుఁడైననాకు నీ వొక్కరుఁడవే కుమారుఁడ వని తెలిసినతాను శాంతిఁ బూని యూరకుండరాదో. నిన్ను విడిచి యుండలేనినేను వానినిమిత్తమునఁ బ్రాణముల విడువవలసె. పుత్రశోకమున నే నెడలు విడుచురీతి నిరపరాధుఁడయ్యుఁ దాను దనపెద్దకొడుకుచేఁ జచ్చు నని శపించి యక్కటా! లోకమున మృతపుత్రులకంటె నజాతపుత్రులే సుఖులు. పుత్రశోకవ్యాకులచిత్తులు యుక్తాయుక్తములఁ బరికింపక చెలులచేతుఁగూడఁ గోరుదురు. నే నిపుడు నెచ్చెలి యైన రైభ్యుని శపించితిఁగదా. ఇంతకంటెఁ బాతక మొండొకండు గలదె యని బహుప్రకారంబుల విలపించి పుత్రకళేబరము దహించి తాను నయ్యగ్నిం బ్రవేశించె. అయ్యవసరమున బృహద్ద్యుమ్నుఁ డనురాజు సత్రయాగంబుఁ జేయఁ బూని రైభ్యుఁ బ్రార్థించి వానిపుత్రుల నర్వావసుపరావసు లనువారలఁ బిలిచికొని పోయి వారు యాజకులై నిర్వహింపఁగ సత్రయాగముఁ జేయుచుండె. అంత నొక్కనాటిరేయి పరావసుఁ డాశ్రమమునకు రాఁ దలఁచి వచ్చువాఁడు వేకువ నాశ్రమంబుపొంతఁ గృష్ణాజినము గప్పికొని యటఁ దిరుగుచున్నరైభ్యుం గనుంగొని మృగం బని

ప్రాణభయమున వధించి పిదపఁ దండ్రి యని తెలిసి శోకార్తుండై యతనికిఁ బ్రేత కార్యములనెల్లఁ జేసి మగిడి బృహద్ద్యుమ్ను సత్రమున కరిగి తమ్ముఁ డైనయర్వావసునకుఁ దాఁ దండ్రిని బ్రమాదంబునఁ జంపుటఁ జెప్పి పితృవధమునకుఁ జేయ వలసినప్రాయశ్చిత్తంబు నాకుఁగా నీవు చేయుము. నీ వొక్కరుఁడవు సత్రంబు నిర్వహింపనేరవు. నేనొ యొక్కఁడనైన నిర్వహింపఁగల నని చెప్పి యాయర్వావసుం బంపె. వాఁడు నన్న మాటమెయిఁ గ్రమంబునఁ బ్రాయశ్చిత్తంబు చేసి క్రమ్మఱ సత్రమునకు రాఁగఁ బరావసుఁడు బృహద్ద్యుమ్నుం జూచి యోరాజేంద్రా! యీయర్వావసుఁడు బ్రహ్మఘాతకుఁడు. వీని యజ్ఞశాలఁ జొరనీవలదు. బ్రహ్మఘాతకుఁడు చూచినను యజ్ఞము చెడు నని చెప్పిన బృహద్ద్యుమ్నుఁడు వాని యజ్ఞవాటంబు వెలువరింప భటుల నియోగించె. వారు వచ్చి త్రోయుచుండ నర్వావసుఁడయ్యా, బ్రహ్మఘాతకుఁడ నేఁ గాను. మఱి మాయన్న చేసినబ్రహ్మహత్యకుఁ బ్రాయశ్చిత్తంబు వానికిఁగాఁ జేసి వచ్చితి నని యెన్నిమాఱులు చెప్పినను నారాజభటు లామాటల నాదరింపక ప్రల్లదము లాడుచుఁ ద్రోసిన నయ్యర్వావసుఁ డెద్దియుం జేయనేరక వనమున కరిగి సూర్యాభిముఖుఁడై యుగ్రతపంబు సలిపె.

దేవత లర్వావసునకు వరము లిచ్చుట.

వానితపస్సునకు మెచ్చి యమరులు సన్నిహితులయి వరములఁ గోరికొను మనిన నతండు రైభ్యభరద్వాజయవక్రీతులకుఁ బునర్జీవనంబును బరావసునకు నిరపరాధత్వమును సారవేదప్రతిష్ఠనుం గోరికొనిన వా రట్ల యగుఁగాక యని రైభ్యభరద్వాజయవక్రీతుల సంజీవితులఁ జేయుటయు యవక్రీతుఁడు సురల కిట్లనియె. నేను వేదముల గడించితి. బ్రహ్మవ్రతముల నాచరించితి. తపము ననుష్ఠించితి. ఇట్టినన్ను రైభ్యుఁడు వధింపఁ గతం బేమి? అతఁడును నాయట్టివాఁడ కాఁడే యనియడుగ గీర్వాణు లయ్యా, నీవు గురుముఖమునఁ గాక కేవలవరముననే వేదజ్ఞానంబు గడించుటం జేసి యది ఫలవతంబు గాదయ్యె. రైభ్యుఁడు చిరకాలంబు గురువు నుపాసించి మెప్పించి ప్రసన్నుఁ డైనయతనివలన వేదాదుల నెఱింగెఁ గావున వానియధ్యయనంబు ఫలవంత మయ్యె నని చెప్పి దేవతలు నిజలోకములకుఁ జనిరి. ఇది యారైభ్యునాశ్రమంబు, ఇందు వసించినవారు సర్వపాపవినిర్ముక్తు లగుదు రని చెప్పుచుఁ గొంతద వ్వరిగి లోమశుఁడు యుధిష్ఠిరా, యుశీరబీజంబును, మైనాకంబును, శ్వేతగిరిని, గాలశైలంబునుం గడచి వచ్చితిమి. ఇది గంగ సప్తవిధం బయినదేశంబు. ఇదియే విరజసంబు నాఁబడు. ఇం దెల్లపుడు నగ్నిజ్వలింపుచుండు. ఈ దేశంబు మనుష్యులకు నగోచరంబు. అదె మందరపర్వతంబు. అందు వివిధాకారు లయినయెనుబదివేవురుగంధర్వులు యక్షేశ్వరుం డైనమాణిభద్రుం గొలుతురు. కైలాస మచ్చటి కాఱుయోజనములదూరమున నున్నయది. అందు

యక్షగుహ్యకరాక్షసాదిసేవ్యమానుఁడై కుబేరుఁ డుండు. తపోదమముల సమాహితచిత్తుఁడ వై భీమసేనుని బాహుబలమునను మదీయమంత్రబలమునను సురక్షితంబుగా నాతీర్థముల కరుగవలయు. ఇంద్రయమవరుణాదిసురులు గంగాయమునాదిమహానదులును నీకు శుభము లొడఁగూర్తురుగాత యని దీవించి "దేవీ! త్రైలోక్యపావనీ! భవద్గంభీరనినదంబు శ్రవణాభిరామం బయ్యెడి. ఈపర్వతములందు సంచరించునెడఁ బరమధార్మికుఁ డయినయీధర్మరాజును రక్షింపు" మని ప్రార్థించి ధర్మరాజుం బిలిచి నాచెప్పినచొప్పున నప్రమత్తుఁడవై యుండు మనినియమించిన యుధిష్ఠిరుఁ డాత్మగతంబున రోమశమునీంద్రుఁ డిపు డపూర్వసంరంభంబుఁ బూనియున్న వాఁ డేలొకో యని వితర్కించి తమ్ములనెల్లఁ గలయం గనుంగొని యందఱును ద్రౌపదియెడ నప్రమత్తులరై యుండుఁడు. ఉత్తమశౌచముల నాచరింపుఁ డనినియమించి భీమసేనున కిట్లనియె. భీమసేనా, కైలాసము గుఱిచి మునివరుఁడు వివరించినవిషయంబు వింటివిగదా. ద్రౌపది యట్టివిషమప్రదేశములకు రానేరదు. అర్జునుఁడును లేమింజేసి ద్రౌపదీరక్షణభార మంతయు నీయందనిలిచె. కావున నాపాంచాలిం దమ్ములనుం దోడికొని మఱలి చను మనిచెప్పి మాద్రేయులఁ గౌఁగిలించి మూర్కొని మఱలుఁ డనిపలికి వెండియు భీమసేనుం బిలిచి తమ్ముఁడా, యటుగాదేని నీవును, సహదేవుఁడును, ధౌమ్యులును, దక్కటివిప్రులును, నింద్రసేనాదు లగుసకలభృత్యులును మఱలి చనుఁడు. నేనును, నకులుఁడును, రోమశులును, లఘుభోజనులము నియతవ్రతులమునై పోయి వత్తుము. క్షుత్పిపాసల నడంచుకొని బలదార్ఢ్యంబులం బొంది యెల్లవారలను రక్షింపుచు మావచ్చునంతకు గంగాద్వారమున నుండు మనిన భీముఁ డిట్లనియె. మహారాజా, మే మెల్ల నెప్పు డెప్పు డర్జునుఁ జూతుమా యని యువ్విళ్లూరెడిమనంబుల నున్నవారము. అర్జునవిరహంబునకే వగలఁ బొగులుచున్న మే ము నిన్ను నెడఁబాసి యొక్కింతసేపైన నుండనేరము. మఱియు ఘోరరాక్షసాకీర్ణం బయినయీకాంతారంబున నిన్ను విడువఁ గొంచెమేనియు మనసు గొలుపదు. పరిచారకు లందఱును మఱలుదురుగాక. రథముల బోవఁగ వలనుగాదేని పాదచారులమై యరుగుదము. పాంచాలియుఁ దమ్ముఁగుఱ్ఱలును నడవలే రనిశంకింతువేమొ. దాని విడువుము. వారల నే మోచికొని వత్తు. వారును నిన్నుఁబాసి యుండనేర్తురే యనిన ధర్మరా జామాటలఁ ద్రోచిపుచ్చఁజాలక కానిమ్ము నీకు బలధర్మకీర్తు లుత్తరోత్తరాభివృద్ధిం బొరసెడు మనిదీవించుటయుఁ బాంచాలి ధర్మరాజుం గ్రేగంటఁ జూచి రాజేంద్రా, నాదెసఁ జింతిల్లవలదు. మీతోడ వత్తు నని నవ్వుచుఁ జెప్పుచున్నంత రోమశుఁడు తపోమహిమమున నందఱముం గంధమాదనగిరికరిగి యర్జునుం జూత మనిన నందులకు ధర్మనందనుఁ డియ్యకొ

నిచె. అంత నందఱు దమలో సంతసిల్లి చనువారు ముందరఁ గిరాతపుళిందతం గణాదిగణాకీర్ణంబును, ప్రభూతగజతురంగసంకులంబును, బహుచిత్రసమంచితంబును, సురగణనిషేవితంబు నగుసుబాహుఁ డనుకిరాతరాజుదేశముఁ జొచ్చి యాసుబాహునిచేఁ గడుం బూజితులై యచట నాదినముండి యింద్రసేనాదిభృత్యులను వంటలవారు లోనుగాఁ గలసకలపరిచారకులను నచ్చోటన నిలిపి మఱునాఁడు సూర్యోదయానంతరమున నర్జునదర్శనకుతూహలంబునఁ దఱలి పోవుచుండ ధర్మరాజు తమ్ములను ద్రౌపదినిం గలయం జూచి భీమసేనున కిట్లనియె. అసమయంబున భూతములు నశింపవు. మఱి యెట్టిసంకటములు పొసఁగిన నెద్దియేనొకయాశఁ గల్పించికొని జీవించు. బహువిధక్లేశముల నోర్చియైన నర్జునుజూడఁగోరి యీహిమవత్ప్రదేశములఁ దిరుగుచున్నమనమే యిందుకు నిదర్శనంబుగదా. ఇప్పటికిని వానిం జూడమైతిమి. ఆక్లేశం బట్లుండ యాజ్ఞసేనియవస్థఁ జూచినఁ జిత్తము పొగులుచున్నయది. అర్జునుఁ జూడ భాగ్యము మనకిఁక నెన్నఁ డొడఁగూడునో. వాని నెడఁబాసి యిప్పటి కయిదేడు లయ్యె. ఆమేటివిలుకాని నాసత్యసంధు నాసమరశౌండు నాయరికులాంతకు నాసింహవిక్రాంతగమను నాయింద్రసమాను నాశ్వేతవాహను నాక్షమాశీలు నాఋజుమార్గగామి నాశరణాగతరక్షకు నాభీతాభయప్రదానదీక్షితు నాకుటిలచిత్తవిధ్వంసకు నామహాబలు నెన్నఁడు చూతుమో. వాఁడేకదా మనకెల్ల నాశ్రయంబు. దిగ్విజయంబున నతండు తెచ్చినవివిధోత్తమరత్నంబులఁగదా జూదమున దుర్యోధనుఁడు నాఁచికొని పోతరించె. అతండకాదె లోకోత్తరంబయినయాదివ్యసభను సంపాదించె. మఱియు వాఁడు కార్తవీర్యార్జునుచాడ్పున యుద్ధదుర్మదుఁడు. వీర్యమున వాసుదేవునకు బలరామునకు నీకుం దుల్యుఁడు. వెండియు నతండు ప్రభావమున నింద్రుఁడు. వేగమున సమీరుఁడు, క్రోధమునఁ గాలాంతకయముఁడు. అతిసుందరాంగుఁడు. వానిగుణగణంబుల గణింప నలవియగునే? శీఘ్రంబ గంధమాదనంబు సేరి యందు నరనారాయణాశ్రమం బయిన బదరికావనంబును గుబేరనళినిం జూచుచు నటఁ బోయెదము. అందు వాహనములఁ బోవ వలనుగాదు. కావునఁ బాదచారులమై యచ్చోటులనెల్ల నర్జునదర్శనంబు ప్రతీక్షింపుచుఁ జరింతము. అనియతవ్రతుల నందుఁ గ్రూరమెకంబులు బాధించుఁ గావున నియతవ్రతులమై కవచఖడ్గాదిసాధనములతోడఁ జనవలయు ననిచెప్పుచున్నంత రోమశుఁ డిట్లనియె.

## పాండవులు గంధమాదనపర్వతమునకుఁ బోవుట.

ధర్మనందనా, యీమార్గమునఁ బోయిన సర్వపర్వతంబులను సకలవనలను సమస్తతీర్థంబులను సేవింప నగు. ఈత్రోవయే మందరగిరికిం జను. ఇటఁ

బోవునెడ నవశ్యంబు సమాహితచిత్తుల రగుఁడు. ఇది దేవర్షినివాసస్థానంబు. ఇదె శివజలంబైనగంగానది యిచటఁ బ్రవహింపుచున్నయది. సురలు, ఋషులు, వైఖానసులు, వాలఖిల్యులు, గంధర్వాదులు నిచ్చట నిమ్మహానదిని నిత్యంబు సేవింతురు. ఇందు మరీచిపులహభృగ్వంగిరఃప్రముఖమహర్షులు సామగానంబు సుస్వరంబుగాఁ జేయుదురు. దేవగణపరివృతుండై సురజ్యేష్ఠుఁ డిం దాహ్నికవిధుల నాచరించు. సిద్ధసాధ్యరాక్షసాదు లశ్వినులు గ్రహనక్షత్రంబులు నహోరాత్రశేషభాగంబున నీపుణ్యనదిని సేవింతురు. లోకభావనుండైన మహాదేవుఁ డిమ్మహానదిసలిలంబును జటాజూటంబున ధరించె. పరిశుద్ధచిత్తమున నీగంగానదికిఁ బ్రణమిల్లుఁ డనినఁ బాండుపుత్త్రులు పరమభక్తిమై భాగీరథికి మ్రొక్కి యటఁ జనువారు ముందర నంతట వికీర్ణంబై కైలాసగిరీంద్రంబుచందంబున నత్యున్నతధవళంబై దిశాపటలంబు వెలింగించుచున్న యొక్కపర్వతాకారం బయినరాశిం గాంచి యిది యేమి యని యడుగఁ జిత్తములం దలంపుచుండునంత రోమశుఁడు ధర్మరాజున కిట్లనియె.

* తొల్లి నరకాసురుఁడు తపస్స్వాధ్యాయవిక్రమముల నింద్రపదంబు సాధింతు ననిపూని పదివేలయేండ్లు తీవ్రతమంబుగాఁ దప మనుష్ఠింపుచు నగ్నితేజమును నిరాకరింపఁ జాలుతేజమున వఱలుటయు నింద్రుఁడు వెఱచి మునిగణంబులతో నారాయణుసన్నిధికిఁ బోయి నిజసంకటముల విన్నవించిన నాజగన్నాథుఁ డతనికి మనఃప్రియంబుగా ముహూర్తమాత్రన మాయచే నరకాసురునకు శరీరవియోగంబుఁ గావింతు నని చెప్పి వాఁడున్నచోటి కరిగి తపోనిష్ఠుఁడైన యయ్యసురశరీరంబు నిజపాణితలంబునఁ దడివి తదీయచైతన్యంబు నాకర్షింపఁగ వానికళేబరంబు వజ్రాహతంబైనపర్వతంబువిధంబున నేలఁ గూలె. మాయాహతుండైనయారాక్షసుని యస్థిసంఘాతం బిచ్చటికిఁ గొండవోలె నగపడుచున్నది. మఱియు విష్ణుఁడు నూఱుయోజనములలోఁతు గ్రుంగినభూమి నుద్ధరించె ననిన ధర్మరాజు మునీంద్రా, తత్ప్రకారంబు వివరింపవే యని ప్రార్థించినరోమశుఁ డతని కిట్లనియె.

### నారాయణుఁడు వరాహరూపంబున భూమి నుద్ధరించుట

‡ తొల్లి కృతయుగమునఁ గొంతకాలము నారాయణుండు యమత్వంబు సేయుచుండఁ బుట్టువులలోఁ సర్వప్రాణులును జావు గానక నానాఁట నత్యంతవృద్ధిఁ బొందుచుండె. ఆభారము నోర్వనేరక భూమి నూఱుయోజనములలోఁతు గ్రుంగి సకలలోకభావనుఁడు శరణత్రాణపరాయణుఁడు నగునారాయణు శరణుచొచ్చె

*, ‡, ఈయుపాఖ్యానములు తెనుఁగుభారతములలో లేవు. గ్రంథాంతరమునఁ జెప్పియున్న క్రమమునకు భేదింపుచున్నవి.

దేవా! నాభారము నపనయింపు మని ప్రార్థించె. ప్రార్థించుటయుఁ గరుణించి పుండరీకలోచనుండు భయజననంబుగాఁ బొగ లెగయింపుచున్న రక్తనయనంబులతో నేకశృంగం బయిన శ్వేతవరాహంబురూపంబు ధరించి కాయంబుఁ బెంచి తనయొంటికొమ్మున యోజనశతంబు లోఁతుగా గ్రుంగినభూమిని యథాపూర్వముగ నుద్ధరించె. అయ్యవసరంబున సకలలోకములు సంక్షుబ్ధము లగుడు సురలు మునులును సంభ్రాంతులై బ్రహ్మపాలికిఁ బోయి కృతాంజలులై దేవా! సకలలోకసంక్షోభంబునకుఁ గతం బెయ్యది? యని యడుగ బ్రహ్మ వారి కిట్లనియె. సురలారా, వెఱవవలదు. రాక్షసభయం బిప్పుడు లేదు. అతిభారమున శతయోజనములు గ్రుంగినభూమిని భగవంతుఁ డయిననారాయణుండు కరుణించి క్రమ్మఱ నుద్ధరించె. తన్నిమిత్తమున నీసంక్షోభ మయ్యె. నందనమునకుఁ జనుఁడు. వసుధోద్ధారణార్థంబు వరాహరూపంబు ధరించినభగవంతుఁడు శ్రీవత్సలాంఛనముతోడ లోచనగోచరుం డగు ననిన సురలు బ్రహ్మతోడ నారాయణుసన్నిధి కరిగి యాత్రైలోక్యరక్షకు నవలోకించి యటఁ దదనుజ్ఞఁ గొని పితామహపురస్కృతులై తమతమనివాసంబులకుఁ బోయి రని రోమశుండు వసుధోద్ధారప్రకారంబు వివరింపఁగ నాకర్ణించి గంధమాదనగమనకుతూహలంబున ధనుస్తూణీరఖడ్గాదిసాధనసంభృతులై పాంచాలరాజపుత్త్రిని బ్రాహ్మణులనుం దోడికొని తరలిరి.

అట్లు తరలి వారు బహుపర్వతంబుల ననేకనదులఁ బెక్కుకొలంకుల వివిధవృక్షముల నానామృగంబులనుం గాంచుచు వివిధవిషమసంకటదేశములఁ దిరుగుచు నాగంధమాదనంబుఁ బ్రవేశించునెడఁ బ్రచండవాతంబు వీచె. వీచినం బరాగం బెగసి రోదోంతరాళంబు గాఢధ్వాంతదంతురంబుగ నావరించె. పాషాణంబులు పెల్లుగఁ బడియె. మ్రాఁకులు విఱిగె. ఆఘోరనాదమునకు వెఱచి యందఱు మిన్ను పడునో పుడమి పగులునో కొండలు వ్రయ్య లయ్యెడినో యని శంకాకులచిత్తులై దుమ్ము పెల్లున మూసినకన్నులు దెఱవ నయితిగామిం జేసి యొండొరులం గానక చేతులఁ దడవి చూచుచు మెల్లమెల్లన నడచి దృఢతరతరుమూలముల నాశ్రయించి గదాధనుష్పాణి యైనభీమసేనుఁడు ద్రౌపదితోడ నొక్కచోట, ధౌమ్యధర్మజసహదేవు లగ్నిహోత్రములతోడ నొక్కచోట, రోమశుఁడు నకులుఁడు తక్కటివిప్రులు నొక్కచోటఁగా నందఱు వేఱు వేఱుగ నుండిరి. అంతఁ గొంతవడి కాధూళి నడంచుచు నుఱుములు మెఱుములు పెల్లుగాఁ జటచటాశబ్దంబు నిగుడ నపారధారాసంపాతంబుగా గాలివాన గురిసె. కురియుటయు సెలయేఱులు గట్టునం గలచెట్టులనెల్ల నురలఁ ద్రోయుచు నిరుదరుల నొరసి పెనుమ్రోఁత సెలఁగఁ బాఱె. రాత్రియెల్ల నట్లు గురిసి వేకువ నాగాలివాన వెలసిన సెలయేటివఱదలు తఱుఁగుటయుఁ బాండవులు బ్రా

హ్మణులు నెక్కుచోఁ గూడి సూర్యోదయానంతరమునఁ దఱలి క్రోశమాత్రంబు పోవుటయు నత్యంతసుకుమారి యగుపాంచాలి వాతవర్షమార్గగమనంబులం గడు డస్సినయది గాలుసేతులు వడఁకఁ గ్రిందఁ బడి మూర్ఛవోయె. పడునెడ నకు లుండు పట్టికొని మెల్లన పరుండఁబెట్టి ధర్మరాజుం బిలిచి మహారాజా! యిటు సుకుమారి నూరార్పవే యని పేరెలుంగునఁ జెప్పఁగ ధర్మాగ్రహిసహదేవులు తటా లునం దదవస్థ యైనయాద్రుపదరాజపుత్రికడ కేతెంచి పట్టలు దక్కి చూచు చుండిరి. అపుడు ధర్మరాజు శ్రమవిహ్వల యైనపాంచాలిం దనతొడపైఁ బరుం డఁబెట్టికొని హా! దైవమా! సురక్షితంబు లైనయంతిపురంబుమేడలపై మెత్తని పాన్పులం బవ్వళించి యెంతయే సుఖింపఁ దగినయీవరవర్ణిని యీకటికి తాలిప పట్టున నెట్లు నిద్రింపుచున్నదో. అరుణపల్లవంబులంబోనిదీనిమృదులచరణము లరవిందసుందరం బై నదీనినెమ్మోమును నామిత్తంబున వివర్ణతం బొరసె. బుద్ధి మాలి నేను జూదమాడుటంగదా యివ్వనవాసాయాసంబెల్ల నీతన్వికిఁ గలిగె. పాండవులకుఁ బత్నియై నాకూఁతురు సుఖించు నని భావించి ద్రుపదవిభుఁడు దీని [illegible] ఇది మాకు భార్యయై సుఖలేశంబైన నెఱుంగకున్నను బాపాత్ముఁ డగునాకొఱగాముల [illegible] విలపింపుచుండ ధౌమ్యప్రముఖు[illegible]మలన్నే కుడుచుచున్నయది యని బహుప్రకారముల మంత్రములఁ బఠించిరి. పాండునందనులును నీళని నూఱడింపుచు రక్షోఘ్న మొనర్చిరి. అటఁ గొండొకసేపున కాయుపచారంబులను మంత్ర[illegible]ముల ర్ఛ దెలిసినయాపాంచాలిని మెత్తనికృష్ణాజినంబుపైఁ బరుండఁబెట్టి నకులసహ[illegible] లాయుధాభ్యాసవశంబునఁ గాయలు గాచిననిజపాణితలంబులఁ ద్రోవ నడచుటం జేసి కందినయాద్రుపదిపుత్రిపాదతలముల నొత్తుచుండ ధర్మజుఁ డాసుకుమారిని మృదువచనముల నూరార్చి భీముం జూచి యత్యంతవిషమంబు లయినయీపర్వతం బులందుఁ గృష్ణ యెట్లు నడచు నని సాశంకంబుగా నడుగ నతం డతని కిట్[illegible] రాజేంద్రా, యిందుకుఁ జింతవలవ దని మున్న చెప్పి[illegible] ఈరాజపుత్రి, నీకవలను, నిన్ను నే మోచికొని[illegible]యుగా దని మహాబలసమన్వితుఁ డగుహిడిం బాపుత్రుఁడు మనల మోచికొనివచ్చు ననిన ధర్మరా జందుల కియ్యకొను టయు భీముఁ డాఘటోత్కచుని స్మరించె. స్మరించినమాత్రన వాఁడు తనరాక్షస బలంబుతోడ సన్నిహితుండై బ్రాహ్మణులకుఁ బాండవులకుం బ్రణమిల్లి తదభి నందనంబుఁ బడసి భీమసేనునకుఁ గేలుమొగిచి యేమిసేయుదు ననియడుగ నతం డు సంతుష్టుండై యాప్రథమపుత్రుం గౌగిలించికొని ధర్మరాజానుమతంబున నిట్లనియె. పుత్రా, మీతల్లి యైనపాంచాలి యీవిషమమార్గంబుల నడువ నో

వను. కామగమనుఁడు మహాబలుఁడు నగునీవు దీని బుజమెక్కించుకొని మెల్లన మాతోడ రమ్ము. వేగమున నడచిన నిది డయ్యు ననిన ఘటోత్కచుండు తండ్రీ, నే నెక్కరుఁడనై నను మిమ్ముందఱ మోచికొని పోఁగలను. పరివారంబుతోడ నిపుడు వచ్చుటం జేసి మీ రెవ్వరును నడువవలవ దని చెప్పి యాఘటోత్కచుండు ద్రౌపదిని బాండవులను ధౌమ్యుసిం దా నెత్తికొని బ్రాహ్మణుల వహింపఁ దనపరివారమును నియో[illegible]చె. రోమశుఁడు దనదివ్యతేజమునం జేసి రెండవసూర్యుఁ నవలదు. డునాఁ బెజరిల్లుచు సిద్ధమార్గమున నరిగె.

అవ్విధంబున నారాక్షసులు వహింప వార లతివేగంబున మ్లేచ్ఛజనాకీర్ణంబు లయిననానాదేశంబులను, సిద్ధవిద్యాధరకిన్నరకింపురుషాదిసేవితంబులు, వివిధమృగసంకులంబులు, బహువిధపాదపపరీతంబులు నగునానాప్రత్యంతపర్వతంబులను గడచి యుత్తరకురుదేశములం జొచ్చి కైలాసంబు చెంగటఁ గ్రూరమృగబాధావిరహితంబు, బహుమూలఫలోదకంబు, నీలశాద్వలసంఛన్నంబు, మృదుస్పర్శంబు, కంటకశూన్యంబు, సర్వర్తుకుసుమఫలభరితతరునికరవిలసితంబు నగు నొక్కసమప్రదేశంబునం గంగాతీరంబున ద్వంద్వదుఃఖవర్జితంబు, శోకనాశనంబు, ధర్మబహిష్కృతుల కగమ్యంబు, బ్రహ్మవాదులు ఫల[illegible]యులు [illegible]ంతులు నియతేంద్రిదాంతులు కృష్ణాజినపరిధానులు సూర్యాగ్నిసం[illegible]ంబు, మనోహరారంభకపవాదయులు మోక్షరతులు నసూర్యకిరణప్రచారరహితంబయ్యుఁ దమోవర్జితంబు, [illegible]ఖమంజులంబు, దేవచర్యోపశోభితంబు, కమండలుస్రుక్స్రువాదిమునిసాధనసంభృతంబు, నరనారాయణాశ్రమంబు నగుబదరీవనంబుఁ గాంచి రాక్షసస్కంధావతీర్ణులై తదభ్యంతరమునకుఁ జని సురమునిసిద్ధగణసేవితం బయినభాగీరథియందుఁ గృతస్నానులయి పితృదేవతర్పణంబు సలిపి యచ్చటిమహర్షులకు మ్రొక్కిన వారుధర్మనందనున కత్యంతప్రీతులై శుభాశీర్వాదముల నొనరించి ఫలమూలాదివన్యపదార్థముల నెల్లవారికి నాతిథ్యంబు సల్పిరి. అంత ధర్మరాజమ్మహర్షులఁ బ[illegible]మైనాకంబును, హిరణ్యశిఖరంబును, బిందుసరస్సును సేవింపుచు నచ్చటిరామణీయకంబుఁ గ[illegible]స్వర్లోకతుల్యం బయినయాదివ్యదేశంబున నెల్లవారితోడ నాఱురాత్రులు వసించె. మఱునాఁడు పూర్వోత్తరదిగ్భాగంబునుండి సురభిలలితశిశిరమారుతంబు మెల్లన వీవఁగ నందఱుం దమతమపట్టుల సుఖాసీనులై యుండ వేయిఱేకుల సొంపు పెంపారునపూర్వకమలం బొకండా తెమ్మెరతోడ వచ్చి వారిముందరఁ బడియె. ఆసౌగంధికకుసుమంబుఁ గాంచి పాంచాలి భీమసేనుం జూచి మనోరంజనం బయినయుత్తమసౌరభమున నత్యంతరుచిరం బయినయీకుసుమంబు చూడుము. దీని ధర్మరాజున కొసంగెద. ఇట్టివి

యింకనుం గొన్ని యుండుఁగదా. వాని మనకామ్యకాశ్రమంబునకుఁ గొనిపోఁ దలంచెద. నీకు నేఁగూర్తునేని వానిం దెచ్చి యిమ్మని విన్నవించి యాసౌగంధికకుసుమరాజంబును ధర్మరాజునొద్దకుఁ గొనిపోయె.

### భీముండు సౌగంధికంబుఁ దేఁ బోవుట.

అటఁ బాంచాలికి మనఃప్రియంబుఁ జేయం దలంచి భీమసేనుఁడు గదాకార్ముకంబుల నాశీవిషోపమంబు లయినబాణంబులను గ్రహించి క్రుద్ధమృగేంద్రంబుచాడ్పున సకలభూతములకు భయముఁ గావింపుచు, గ్లానినైక్లబ్యభయసంభ్రమమోహరహితుండై యాగాడ్పు వీచినదెస నుపలక్షించి వీనులకు విందు సేయుపికలలితపంచమారావంబుల మధుపమధురగీతంబుల నాలకింపుచు, గంగాతరంగశిశిరశీకరనికరంబులతోడ వికచపంకజపరాగపరిమళంబులుఁ గొని వచ్చుచేఁ దెమ్మెరలమందగమనంబున కిచ్చమెచ్చుచు, గైరికాదిధాతుపటలవ్యాపనంబునం జేసి మైపూఁతఁ బూసినయదివోలెఁ, గ్రేవలను మొయిళులరాకపోకలం జేసి చెక్కులతోడ నాడునదివోలె, సెలయేఱు లంతలంతలఁ బాఱుటం జేసి ముత్యాల పేరులఁ దాల్చినదివోలె నొప్పి వివిధరామణీయకంబులకుఁ దావలం బైనయాగంధమాదనగ[illegible]తపుల వితసులకదృశ్యులై ప్రియులపజ్జఁ గూర్చున్న యక్షగంధర్వకాంతలచూడ్కులకుఁ బ్రా[illegible] సేయ నింతదవ్వు వచ్చితి. దుర్యోధనాపరాధం[illegible] దనమనంబును ద్రౌపదికిఁ బ్రీతి వలసె. అప్పనుఁ డొక్కఁడే డగ్గఱ లేఁడని పెల్లడలుచున్నా[illegible]అడవులఁ ద్రిమ్మరనెఁ బాసి వచ్చిన నె[illegible]న్నవాఁడో. మా[illegible]యులబలము సంతే[illegible] కేన వారల నెచ్చటికిం బోనీక తనయొద్దనే యుంచుకొనియుండు. వేగంబ సౌగంధికముల సాధించినం గ్రమ్మఱి చనవచ్చు ననియూ[ఇంతు]ంచి యడ్డ మైనసింహశార్దూలాదిక్రూరమృగముల మర్దింపుచు, భ్రమరకుల [illegible]చుచుఁ, దీఁగెలఁద్రెంచుచుఁ బాదఘట్టనధ్వానంబునఁ బుడమి వడఁకఁగ నతిరయంబునఁ గొంతద వ్వరిగి సింహనాదము చేసె. ఆభీమనినదంబునకు బెదరి గుహాంతరంబులఁ గూర్కుచున[illegible] క్షుద్రశార్దూలవ్యాఘ్రవరాహాదులు దటాలున మేల్కని భీషణధ్వని[illegible]కమయూరహంసకారండవాదిపక్షిసంఘంబులతో వనాంతరములకుఁ [illegible] గంబులు విసంజ్ఞము లయ్యె. అవ్విధమున నాగంధమాదనంబు వ్యాకులంబుగాఁగఁ జని భీమసేనుఁడు బహుయోజనాయతం బైనయొకకదళీషండంబుఁ గనుంగొని మదపుటేనుఁగు తెఱంగునఁ దాలప్రమాణంబు లైనయయ్యరఁటిమ్రాఁకుల భంజింపుచు వెండియుఁ బెల్లార్చినఁ గదళీభంగరవంబును భీమసేనసింహనాదంబును నొక్కటియై యత్యంతభీషణం బగుడుఁ దడిసినజక్కలతోడఁ గొన్నిపులుఁగు లేతేరఁ జూచి యిచ్చోటికిఁ గుఱంగట నవశ్యంబుగ నొక్కకొల నుండు నని తలంచి

యక్కడకుఁ జని యాకొలనం గృతస్నానుండై తత్సరోవరాగతమందమారుతాం దోళనంబున కెడంద నానందించుచు నాకదళీషండమునఁ గొంతద వ్వరిగి శంఖంబు పూరించి సింహనాదంబు చేసి భుజాస్ఫాలనం బొనర్చె. అందుల కచ్చటిగుహ లును సింహవ్యాఘ్రాదిమృగంబులుం బ్రతినాదము లిచ్చె. ఆనినాదం బాకర్ణించి కదళీషండమధ్యముననున్న హనుమంతుఁ డీభీమనాదంబు చేసినయతండు వృకోద రుండ యని తెలిసి వానిం జూడఁ గోరి యామార్గం బవరోధించి పెల్లుగ నావు లించి యింద్రధ్వజసదృశం బయినతనదీర్ఘలాంగూలంబు మీఁది కెత్తి సకల భూతములు బెదర నాస్ఫోటనంబుఁ జేసె.

### భీముఁడు హనుమంతుని జూచుట.

ఆపుచ్ఛవిక్షేపనిస్వనంబు విని భీమసేనుఁ డాదెస నుపలక్షించి చని కదళీ షండమధ్యమున నొకవిశాలశిలాతలంబునఁ బరున్నవాని, నొరగ నొకబుజముపై హ్రస్వపీవరకంఠము నుంచికొనినవాని, మూఁపులు విశాలము లగుటం జేసి సూ క్ష్మము లగుమధ్యకటితటముల నొప్పువాని, గొంచెమేనియు వక్రముగానియూ ర్ధ్వభాగంబును దీర్ఘరోమములుం గలిగి ధ్వజదండంబువిధంబునఁ దగులాంగూ లంబుగలవానిఁ, గుఱుచపెదవులవానిఁ, గదలెడికన్నెమ్మల [illegible] తామ్రజిహ్వ [illegible] ల్పపింగళాక్షుని, స్వర్గమార్గం న్యుని, వివృతశుక్లాగ్రభాగదంష్ట్రా[illegible]మార్గము నావరించి పరున్నవాని హనుమం బావరించిన[illegible] జని భయరహితుండై సింహనాదం బొనరించె. దాని విని [illegible] ఁడు గన్నుఁగవ నించుక దెఱచి యనాదరంబున భీమసేనుం జూచి మందస్మితపురస్సరంబుగా నిట్లనియె. అయ్యా, రోగమున డస్సి సుఖముగఁ గూర్చున్ననన్ను వృద్ధనియైన నరయక యేల మేలుకొల్పితివి. తిర్యగ్జాతిసంభూ తు లయినమాయట్టివారు ధర్మముల నెఱుంగక యకృత్యంబులం బూనినను వివేకవిలసితం బయినమనుష్యజాతిం బుట్టిననీయట్టివారు సర్వభూతములయెడం [illegible]మె వ రింతురు. బుద్ధిమంతులు ధర్మవిఘాతకము లైనయిట్టికార్యములం బ్రవర్తిల్ల[illegible] నీవు పెద్దల సేవింపవైతి వని భావింతు. వృద్ధోపసేవన మున నుచిత మెఱింగినవాఁడ[illegible]ములకి ట్లుపద్రవంబుఁ జేయవు. నీ వె వ్వఁడవు? ఏల జనశూన్యం బయినయివ్వనమునకు వచ్చితివి. ఇఁకమీఁదు దేవ లోకమార్గంబు. సిద్ధులకుఁదక్క సామాన్యుల కగమ్యంబు. ఇఁకఁ బోవలవదు. నామాట వినుము. కరుణచేఁ జెప్పెదఁగాని యొండేమియుం గాదు. నీకు స్వాగ తంబే? అమృతకల్పము లయిననాయిచ్చుఫలముల భుజించి మఱలి పొమ్ము. నావ చనము హిత మనితలంతువేని యిట్లు చేయు మనుటయు భీమసేనుఁడు హను మంతున కిట్లనియె. అయ్యా, నేను క్షత్రియకులవిశ్రుతం బైనకురువంశంబునం

ప్రసిద్ధుఁ డై నపాండునృపాలుక్షేత్రం బై నకుంతీదేవియందు వాయుభట్టారకునకు జనించినవాఁడ. భీమసేనాభిధానుఁడ. నీ వెవ్వఁడ వేల యీవానరరూపంబు ధరించితివి. త్రోవ దొలఁగు మనియడుగ నాంజనేయుఁడు నవ్వుచు నే వానరుఁడను. నావృత్తాంత మట్లుండె. నే త్రోవఁ దొలఁగను. సాధురీతిని మఱలి పొమ్ము. క్రూరత్వంబు మాను మనిచెప్పిన భీముఁడు క్రూరత్వ మనుమాట యటుండ నిమ్ము. త్రోవ యిమ్ము. లెమ్ము. కాకున్నఁ గీడొందెద వనిపలికె. ఆ మాటలు విని హనుమంతుఁ డన్నా, నేను రోగపీడితుఁడ నగుటంజేసి లేవ నేరను. అవశ్యముగఁ బోవలయునేని నన్ను దాటి పొమ్మని చెప్పఁగ భీముఁ డయ్యా, నే నంతయెఱుక లేనివాఁడఁ గాను. జ్ఞానవిజ్ఞేయుం డై నపరమాత్మ జీవపదవాచ్యుం డై శరీరముల నధిష్ఠించియున్న వాఁడు. నిన్ను దాటిన నీలో నుండుపరమాత్మనుల్లంఘించినట్టు లగు. జ్ఞానహీనుఁడ నేని నిన్ను నీకొండను హనుమంతుఁడు సాగరంబునుంబోలె లంఘించి యరుగుదు ననిచెప్పుటయు నావానరవరుఁడు కుంతీనందనా, హనుమంతుఁ డనువాఁ డెవ్వఁడు? ఏల సముద్రంబు దాఁటె? తెలిసినం జెప్పు మని యడుగ భీముఁ డిట్లనియె. హనుమంతుఁ డనువాఁడు వాయుపుత్రుఁ డగుటంజేసి నాకు భ్రాత. శ్లాఘ్యగుణబుద్ధిబలవిరాజితుం డై నయావానరేంద్రునిచరిత్రంబు రామాయణంబున సుప్రసిద్ధంబు. అతండు శ్రీరామపత్ని నన్వేషింప సముద్రము దాఁటె. తేజోబలపరాక్రమముల నే నమ్మహాత్మునకుఁ దుల్యుఁడను. త్రోవ యిమ్ము. ఇయ్యవేని నిన్ను నిగ్రహింతుననిన విని హనుమంతుఁడు తనమనంబున నితఁడు బాహువీర్యమున గర్వించినవాఁ డనితలంచి పై పైఁ గ్రమ్ముచున్న నగవు నడంచుకొనుచు భీమున కిట్లనియె. వీరాగ్రణీ, ముదిమి పెల్లున లేవ నోపను. నాయెడం బ్రసన్నుఁడవై నాతోఁక నవలఁ బాయఁ ద్రోచి పొమ్మనిచెప్పిన భీమసేనుఁడు బలగర్వము ననీక్రోఁతిఁ దోఁకఁ బట్టియీడ్చి యీక్షణంబ యమపురికిఁ బంపుదు ననితలంచి యెడమచేత నాతోఁక నెత్తఁ బూని కొంచెమైనం గదలింపనేరక యంత నుత్క్షిప్తభ్రూయుగళుండు వివృత్తాక్షుండు సంహతభ్రుకుటీముఖుండునై మేను సెమర్పఁగ రెండుచేతుల నాలాంగూలంబు గట్టిగఁ బట్టి బలంబునం బూనియు నెత్తఁ జాలక సిగ్గతి యాకపివీరునకుఁ బ్రణతుండై కేలుమోడ్చి మహానుభావా! నాప్రల్లదముల సైరింపుము. నీవు సిద్ధుఁడవో దేవుఁడవో గంధర్వుఁడవో గుహ్యకుఁడవో కాని సాధారణవానరుండవు గావు. చెప్పఁ దగునేని నను శిష్యునిగ భావించి నీవృత్తాంత మేర్పడఁ జెప్పు మనియడుగ హనుమంతుఁడు భీమసేనున కిట్లనియె.

అన్నా, నేను గేసరిక్షేత్రంబున వాయుదేవునకు జనించినవాఁడ. హనుమంతుఁ డనం బరఁగువాఁడ. ఇంద్రతనయుఁ డై నవాలి యనువానరవరుండు నిజసోదరుఁడు సూర్యపుత్రుఁడు నగుసుగ్రీవు నొకకారణంబున నిరాకరింప నాసుగ్రీ

వుఁడు నెచ్చెలి యగునాతోడఁ దొల్లి ఋశ్యమూకపర్వతంబున వసించుచుండె. అట్టియెడ దేవకార్యార్థంబు దశరథపుత్రుఁడుగా నవతరించిన నారాయణుండు శ్రీరాముఁ డనుపేరఁ బరఁగుచు మనుష్యలీలలఁ బచరించుచుఁ దండ్రియానతిమెయిఁ దమ్ముఁ డైనలక్ష్మణునితోడఁ బత్ని యైనసీతాదేవితోడను దండకారణ్యమునఁ జరించుచుండ రావణాసురుఁడు వారల వంచింపఁగ మారీచుని సువర్ణరత్నచిత్ర మృగరూపంబుతోఁ వారియొద్దకుఁ బంచి తద్వంచితులై రామలక్ష్మణులు పర్ణశాల విడిచి చనుట నెఱింగి యది సమయంబుగాఁ గొని సీత నపహరించికొని చనుటయు శ్రీరాముఁడు సానుజుఁడై వైదేహిని వెదకఁగ నంతటం ద్రిమ్మరుచు ఋశ్యమూకంబు సేరి యచ్చట నున్నసుగ్రీవునితోఁ జెలిమి చేసి వాలిని సంహరించి యాసుగ్రీవుని వాలిరాజ్యమునఁ బట్టాభిషిక్తుం జేసె. రాజ్యప్రాప్తుఁ డైనసుగ్రీవుఁడు సీతాన్వేషణార్థం బనేకవానరుల నానాదిక్కులకుఁ బంపుచు నన్నునింకఁ గొందఱను దక్షిణంబునకుఁ బనిచె. నేనును సంపాతివచనంబున సీతాదేవి రావణాపహృతయై లంకలో నున్న దని తెలిసికొని శతయోజనవిస్తృతం బైనసాగరంబు నవలీలం దాఁటి లంకాపురంబు సొచ్చి యందు జానకిం గాంచి యాదేవి సేమం బరసి యుచితవచనంబుల విన్నవించి రావణునకు నారాక నెఱుకగాఁగ లంకఁ గాల్చి యెల్లవారికి మదీయనామకృత్యములఁ దెల్పి క్రమ్మఱి శ్రీరామసన్నిధికిఁ జని యంతయు విన్నవించితి. అమ్మహానుభావుం డంతట వానరులచే సముద్రమున సేతువు గట్టించి లంకం జొచ్చి పుత్రమిత్రబాంధవులతోడ నారావణాసురుని వధించి శరణాగతుం డైనవిభీషణుని లంకారాజ్యమున నభిషిక్తుం జేసి యగ్నిప్రవేశపరిశోధిత యైనయాసీతాదేవిని సురలెల్ల మెచ్చఁగఁ దోడ్కొని యయోధ్యఁ జేరి పట్టాభిషిక్తుఁడై పదునొకండు వేలేండ్లు రాజ్యమేలె. అమ్మహానుభావుండు ప్రసన్నుఁడై నిజచరిత్రంబు విఖ్యాతంబుగ నుండునంతకు నే జీవించి యుండఁగ వర మొసంగె. సీతాదేవి సకలభోగములు నా కుపస్థితంబులుగాఁ బ్రసాదించె. గంధర్వవిద్యాధరాదులు శ్రీరామచరిత్రంబు నిట గానంబు సేయుచు నాకుఁ బ్రీతిఁ గావించుచున్నారు. ఈమార్గంబు మర్త్యుల కగమ్యం బగుటం జేసి నీత్రోవ నడ్డముగ నున్నవాఁడ. నీ వేల యిచ్చటికి వచ్చితి వనియడుగ భీమసేనుఁ డమ్మహాత్ముని హనుమంతునిగఁ దెలిసి యత్యంతసంతుష్టమానసుండై సాష్టాంగ ప్రణామం బాచరించి మృదువచనముల నిట్లనియె. మహాత్మా, భవద్దర్శనంబునఁ గృతార్థుఁడనైతి. దర్శనంబొసంగుటయ నాయెడ ననుగ్రహంబుకలిమికి నిదర్శనంబు. సంతుష్టుండ నైతి. కరుణించి సముద్రంబు దాఁటిననాఁటి రూపంబుఁ జూపి మనఃప్రియంబుఁ గావింపవే యనవుడు నవ్వుచు హనుమంతుఁడు భీమసేనుం జూచి యన్నా, నాఁటిరూపంబు నేఁ డెట్లు జూప నగు. కృతత్రేతాద్వాపరకలి

యుగంబు లనుభేదంబునఁ గాలంబును భిన్నం బగు. కాలభేదంబున గిరినదీతరు ప్రముఖపదార్థంబులును వేఱువేఱుగఁ జూపట్టెడి ననిన భీమసేనుం డది యె ట్లని యడుగుటయు హనుమంతుండు వెండియు నతని కిట్లనియె.

హనుమంతుఁడు భీమసేనునకు యుగధర్మంబులఁ జెప్పుట.

కృతయుగంబు సర్వయుగంబుల నుత్తమంబు. అందు ధర్మంబు చతుష్పాదం బులం బ్రవర్తిల్లు. ప్రజలెల్లవృద్ధిఁ గాంతురు. వేదంబు ఋగ్యజుస్సామాదివిభా గంబుఁ గానక యేకంబై యుండు. దేవదానవగంధర్వాదిభేదంబును గ్రయవిక్రయ వ్యవహారంబును ఫలాభిసంధిపూర్వకధర్మాచరణసన్యాసంబులు వ్యాధు లింద్రియ క్షయంబు లసూయాదర్పవికారవిరోధ తంద్రీపైశున్యభయ సంతాపేర్ష్యా మత్సరం బులునుం గలుగవు. మఱి యందఱుం బరమగతిపరాయణులై యోగంబు సాధిం తురు. సర్వభూతాత్మ యగునారాయణుం డప్పుడు శుక్లవర్ణుండై యుండు. సర్వవర్ణం బులవారును నిజధర్మముల ననుష్ఠింతురు. ఫల మపేక్షింపక కర్మములఁ జేయుచుఁ గాలయోగంబున నుత్తమగతిఁ బడయుదురు. త్రేతాయుగంబున ధర్మంబు త్రిపా దంబై ప్రవర్తిల్లు. విష్ణుఁడు రక్తవర్ణంబున నెగడు. మర్త్యులు సత్యపరులు ధర్మాస క్తులు నగుదురు. యజ్ఞక్రియాదానసంకల్పంబు లెసంగు. ద్వాపరంబున ధర్మంబు ద్విపాదంబై ప్రవర్తిల్లు. విష్ణుఁడు పీతవర్ణుం డగు. జను లపుడు వేద మంతయునధ్య యనంబు సేయఁ జాలమింజేసి వేదవ్యాసుండు నాల్గుతెఱంగులవేదము విభజించు. అందుఁ గొందఱు వేదంబుల నాలుగింటినిఁ గొందఱు మూఁటినిఁ, గొందఱు రెం టిని, గొంద ఱొక్కదాని నభ్యసింతురు. మఱికొందఱు వేద మెఱుంగకయ యుం దురు. ఇవ్విధంబున శాస్త్రంబు పెక్కువిధంబు లగుచుండ జనులు పరిపరివిధంబు లగు నాచారంబులఁ బ్రవర్తింతురు. మఱియు రాజసగుణప్రధానులై తపోదానాదుల ననుష్ఠింతురు. సత్వగుణము క్షయించును. దానంజేసి మనుష్యుల కాధివ్యాధులు పలుమఱు గలుగుచుండు. దైవకృతంబులైనవివిధోపద్రవంబులచేఁ బీడితులై తపోదానంబులఁ జేయుదురుగాని భక్తిపురస్సరంబుగఁ జేయనిచ్చగింపరు. మఱి కొందఱు కర్మఫలంబులఁ గోరి యధ్వరంబులఁ గావింతురు. కలియుగంబున ధర్మం బేకపాదంబై ప్రవర్తిల్లు. కేశవుండు నల్లనిరూపంబుఁ గాంచు. వేదాచా రంబులు ధర్మంబులు యాగంబులు నుపశమిల్లు. ఈతిబాధలు వ్యాధులు క్రోధ లోభమదమాత్సర్యంబులు నాధులు కఱవులును గలిగియుండు. యుగములు మాఱుచుండ నాయాధర్మంబులును మాఱుచుండు. ఈవిధంబుననే లోకయా త్రయు మనుష్యులమనోభావంబులును విప్లుతిం బొరయు. కలియుగంబును సన్ని హితంబై యున్నయది. చిరకాలజీవనంబు గలమాబోంట్లు యుగధర్మంబుల ననుసరించియే ప్రవర్తింతురు. నీయడిగినంతయుం జెప్పితి. మఱలి పొమ్ము. శుభం

బయ్యెడు మనిపంచిన భీముండు మహానుభావా, నీతొల్లింటిరూపంబుఁ జూడక నేఁ బోవను. నాయెడ ననుగ్రహంబు గలదేని చూపు మనిప్రార్థించిన హనుమంతుండు నవ్వుచుఁ గామరూపగ్రహణకౌశలంబున వాఁడికోఱలు, లెఱ్ఱనికన్నులు, ముడివడినబొమలు, మిక్కుటం బైనపొడవు, వెడల్పు, సూర్యకిరణంబులం బోని నిజదేహప్రభాపటలంబును గలిగి రెండవమేరుపర్వతంబునాఁగఁ బెరిగి యాకదళీషండమెల్ల నాక్రమించి దీర్ఘలాంగూలంబు విక్షేపింపుచు భీమసేనుం జూచి వత్సా, నారూపంబుఁ జూచితే? ఇంతకంటె నెక్కుడుగనుం బెంచఁ గలనుగాని యారూపంబు నీవు చూడనేరవు. శత్రువులసమక్షమున నింతకంటె నెక్కుడుగను భీకరంబుగనుం దాల్తు ననిపలికె.

అమ్మహారూపంబుఁ జూచి భీముఁడు భయవిస్మయంబులు పెనంగొనంగఁ గన్నులు మూసికొని కేలుమోడ్చి యిట్టిరూపంబుఁ జూడ నోప నిఁక నుపసంహరింపవే. లంకనెల్ల విధ్వంసంబుఁ గావింప వలంతి వైననీ వుండఁగ రాముఁడు దా నేల యారావణు మార్కొనియెనో? ఇది చూడ నెంతేయు నద్భుతంబు. నీ వొక్కరుండవే రావణుం బుత్రమిత్రబాంధవసమన్వితుం బరిమార్పఁ జాలవే యనిన హనుమంతుండు గంభీరవచనంబుల నతని కిట్లనియె. అన్నా, నీచెప్పినదంతయు సత్యంబ. రావణుని నే నొక్కఁడనే చంపఁ గలను. ఐనను నేనే రావణుని వధించిన రాఘువున కపకీర్తి యగు నని యూరకుంటి. అది యట్లుండె. ఇది సౌగంధికవనమార్గంబు. వాయుదేవపరిరక్షితుండవై యిటు చనుము. చని యచట సాహసంబునఁ బూవులఁ గోయకుము. బలిహోమనమస్కారాదివిధానంబుల దేవతలు మాననీయులుగాని సాహససాధ్యులు గారు. బృహస్పతియంతటివారును బెద్దలఁ గొలువక స్వధర్మంబు మున్నెఱుంగక సకలధర్మముల నెఱుగనేరరు గావున నీవును వృద్ధుల సేవించి స్వధర్మస్థితుండవై సర్వధర్మంబులఁ దెలిసికొని తత్ప్రకారంబు నడుపుము. కొన్నియెడల నధర్మంబు ధర్మరీతిం గానంబడు. మఱికొన్నిచోట్ల ధర్మం బధర్మంబురీతి నగపడు. అట్టిధర్మసూక్ష్మంబు దురూహంబు. ఆచారంబున ధర్మం బగు. ధర్మమున వేదంబులు సుప్రతిష్ఠితంబులు. వేదంబులంజేసి యజ్ఞంబులు ప్రవర్తిల్లు. యజ్ఞముల సురలు దనియుదురు. శుక్రబృహస్పతిప్రోక్తం బయిననీతిశాస్త్ర మంతయు నేర్చి క్షత్రియుండు ప్రజలఁ బాలింపవలయు. పాలనంబు నీతికి వెలి యయ్యెనేని ప్రజలు ధర్మంబు విడుతురు. త్రయీవార్తాదండనీతు లనుమూఁడువిద్యల లెస్సగఁ దెలిసి తత్ప్రకారంబు నడిపిన లోకమెల్ల ధర్మప్రధానంబై వర్తిల్లు. ఎల్లవారికిని సత్యం బుత్తమధర్మంబు. యజ్ఞాధ్యయనదానంబులు ద్విజులకెల్ల సాధారణంబులు. అందు విప్రులకు యాజనాధ్యాపనప్రతిగ్రహంబులును, క్షత్రియులకుఁ

ప్రజాపాలనంబును, వైశ్యులకు గోపోషణాదులును ధర్మంబులు. శూద్రుల కుత్తమశుశ్రూష యుచితంబు. క్షత్రియుండు జ్ఞానవిద్యావయోవృద్ధులగుయోగ్యులతోడ నాలోచించి నిజధర్మంబుఁ బరికించి చారులవలన నిజపరరాష్ట్రంబులయందు వృద్ధిక్షయస్థానంబులఁ దెలిసి సమస్తవ్యస్తంబులుగా సామాద్యుపాయంబులం బ్రయోగించి నిగ్రహానుగ్రహంబుల దక్షుండై కార్యంబు సాధింపవలయు. నీతులెల్ల మంత్రమూలంబులు గావునఁ బెద్దలతోడ నాలోచించినమంత్రంబు సురక్షితంబుఁ జేయవలయు. స్త్రీలను, మూఢులను, మూర్ఖులను, బాలురను, లుబ్ధులను, లఘుచిత్తులను మంత్రములఁ జేర్పరాదు. నీతివిన్యాసంబులయందుఁ జెలికాండ్రను, ధర్మకార్యములయందు ధార్మికుల, నర్థకార్యములయందుఁ బండితుల, నంతఃపురరక్షణమందు నపుంసకులను, క్రూరకృత్యములందుఁ గ్రూరులను నియమింపవలయు. సర్వకార్యముల సమర్థుల నియమింపవలయుఁ గాని మూర్ఖుల నెచ్చటనుం జేర్పరాదు. తపోధర్మశమదమాదిసద్గుణంబుల బ్రాహ్మణులు, దానాతిథ్యక్రియాదుల వైశ్యులు నుత్తమగతిఁ గాంచుపగిది క్షత్రియులు కామద్వేషాదిదోషముల విడిచి ధర్మమునఁ బ్రజలఁ బాలించిన సద్గతిం గాంతురు. కావున నుత్తమక్షత్రియుండ వైననీవుం బెద్దల నుపసించి నిజధర్మంబుఁ దెలిసి కులోచితవృత్తి నడుపు మని బోధించి హనుమంతుం డమ్మహారూప ముపసంహరించి యాదరంబునఁ గౌఁగిలించికొనిన నతం డమ్మహానుభావుగాత్రసంస్పర్శనంబున బడలికలెల్లఁ బాసి తను నతిబలుఁగాఁ దలఁచియుండె. అంత హనుమంతుఁడు వెండియు భీముం జూచి యానందబాష్పవారిపూరితనయనుండై గద్గదస్వనంబు గదుర నన్నా, పోయి రమ్ము. ప్రస్తావంబుల ననుం దలంచుము. నే నిచ్చట నుండుట నెచ్చటం బ్రకటింపవలదు. కుబేరాలయంబునుండి దేవగంధర్వసుందరు లిటకు వచ్చుసమయం బయ్యె. నినుఁ గాంచుటం జేసిం నానేత్రంబులు సఫలంబు లయ్యె. రామచంద్రుచరిత్రంబు దలంపునకుఁ దెచ్చినను సంతుష్టుం జేసితివి. నాదర్శనంబు నీకు సఫలం బయ్యెడి. భ్రాతృత్వంబునం జేసి నీయెడఁ బ్రీతుండ నైతి. ఇష్ట మైనవరంబు వేఁడుము. ఇష్టమేని ధార్తరాష్ట్రులనెల్లం బరిమార్తు. హస్తిపురంబునఁ బాషాణంబులఁ బడవైచి దాని నుగ్గునూచముగఁ జేయుదు. పాపాత్ముం డైనయాదుర్యోధనుం గట్టి తెచ్చి నీముందఱఁ బెట్టుదు. ఏమి కోరెద వనియడుగఁ గౌంతేయుఁడు సంతుష్టస్వాంతుండై హనుమంతుం జూచి మహాత్మా, నీవు ప్రసన్నుఁడ వగుటం జేసి యంతయుఁ గృతంబకాఁ దలఁతు. నీచేత సనాథుల మైనమేము పగవారిం గెల్తు మని చెప్పిన విని యాంజనేయుఁడు వెండియు భీము నవలోకించి భ్రాతృత్వంబునను సౌహార్దంబునను నీకుఁ బ్రియంబుఁ గావింప నెంతుఁ గావున రణమున నీవు

సింహనాదంబుఁ జేసినపదంపడి యర్జునురథధ్వజంబున నుండి నీకు బలవృద్ధియు శత్రువులకు మూర్ఛయుం గలుగ మహాసింహనాదంబులఁ జేయుదు ననిచెప్పి భీమసేనునకు సౌగంధికసరోవరమార్గంబుఁ జూపి యంతర్హితుండయ్యె.

అట భీమసేనుండు హనుమంతునిమహానుభావంబును శ్రీరామునిమాహాత్మ్యంబునుం దలంచుచుఁ గ్రొక్కారుమొయిళ్లం బోనిమదసలిలసంసిక్తగజయూథంబులను, లేళ్లతోడం గలిసి బిత్తరిచూపులఁ జూచుచు లేఁబచ్చికల మేయు జింకలగుంపులను, సింహవ్యాఘ్రవరాహమహిషాది క్రూరజంతువులనుం జూచుచుఁ దన్నుఁ బిలుచునోనాఁగ నెత్తావులఁ గ్రుమ్మరించుపూరెమ్మల నెమ్మెదెమ్మెరల వీవన నించుక గదలించునానాతరునికరంబులం జేసి రమణీయం బైనయాగంధమాదనపర్వతంబునఁ గేలుమోడ్పులం బోనితమ్మిమొగడల సొంపారి తుమ్మెదకొదమల రంజిల్లఁ జేయుపద్మినుల నతిమనోహరంబు లయినకొలంకుల నాదరించుచుఁ బాంచాలీవచనపాథేయుం డై యతిరయంబునం జని మధ్యాహ్నానంతరంబున నాపర్వతరాజున కలంకారార్థంబు ధాత నిర్మించినకమలమాలికయోనాఁగ సొంపుపెంపారు నొక్కమహానదిని హంసకారండవచక్రవాకాదిపరీత యగుదాని, విమలకనకకమలవిలసిత యగుదాని, లఘువిమలశిశిరసలిలపూరిత యగుదానిం గాంచి యందు నాయకమణి యనంగ వర్ణనీయం బై బాలారుణసన్నిభవిభావిభాసితం బైనసౌగంధికవనంబు నవలోకించి వైడూర్యనాళంబులు దివ్యపరిమళవిలసితంబులు నగునాసౌగంధికంబులయపూర్వరామణీయకంబునకు విస్మయం బందుచు ద్రౌపదికోరికి కొనసాగె ననితలంచుచు నాకమలంబులఁ గొన నూహించుచున్నంతఁ దద్రక్షకు లయినక్రోధవశు లనురాక్షసులు పదివేవురు చిత్రాయుధపాణులై భీము డాయ వచ్చి యయ్యా, నీ వెవ్వఁడవు? కృష్ణాజినంబుల ధరించి యాయుధములఁ బూనియున్నవాఁడ వేల యిటకు వచ్చితి వనియడుగ నతండు వారి కిట్లనియె. నేఁ బాండుపుత్త్రుఁడను. ధర్మరాజుతమ్ముఁడను. రాక్షసులు మోచికొనిరాఁగ మే మందఱము బదరికారణ్యంబున నున్నంత వాయువశంబున నిచటిసౌగంధికకమలం బచ్చటికి వచ్చుటయుఁ బాంచాలి యీపూవులసొంపున కబ్బురపడి వీనిం బెక్కులం గోరిన దానికోర్కిఁ దీర్పఁగ వీనిం గొనిపోవ వచ్చితి ననిన నారాక్షసు లిట్లనిరి. ఇది కుబేరునుద్యానంబు. మర్త్యులకు దుర్గమంబు. ఇందు దేవగంధర్వయక్షాప్సరోఋష్యాదులు కుబేరునినుమతిని విహరింతురు. ఇం దెవ్వఁడేని యన్యాయంబున ధనేశ్వరున కవజ్ఞఁ జేసెనా యాదుర్వృత్తుండు చెడు. కావున నాకుబేరునునుజ్ఞఁ గొని సౌగంధికములఁ గోసికొనుము. ధర్మరాజునకుఁ దమ్ముఁడ నంటివి. ఆపరమధార్మికునకనుజుఁడ వగునీకుఁ గుబేరు ననాదరింపఁ బాడియే? యక్షనాయకుననుజ్ఞఁ గొనకున్న నీపూలం గన్నెత్తి

చూడనైన నీకుఁ దగ దనుటయు భీముఁ డోరాక్షసులారా, కుబేరుఁ డీచెంగట నగపడఁడు. అగపడినమాత్ర నేమి? వాని నీపూవుల యాచింప నెల్లను. ఉత్తమక్షత్రియుండు తనక్షాత్త్రధర్మంబున సర్వంబు సాధించుఁగాని యొకని యాచిం చునే? సెలయేఱులం బొడమినయీకొల్ల నెల్లవారికిని సాధారణంబకాని కుబేరు నింటఁ బొడమెనే? ఈ విషయమున నెవ్వఁ డెవ్వని యాచింపవలయు ననిచెప్పి యారాక్షసుల నిరాకరించి వాండ్రు వలదు వల దనివారించుచుండినం దద్వచ నంబుల సరకుగొనక యాకొలను సొచ్చె. చొచ్చుటయు నాక్రోధవశులు శస్త్రి పాణులై గ్రుస్సు ద్రిప్పు చీదురాత్మునిఁ బట్టుఁడు కట్టుఁడు కోయుఁడు వండుదము మ్రింగుద మని బహుప్రకారంబులఁ బ్రల్లదంబు లాడుచు వృకోదరుం దాఁకిన నవ్వీరశేఖరుఁడు నిలుఁడు నిలుఁ డని వారల నదల్చి యమదండతుల్యం బయిన తనకనకమహాగదం బూని వివిధగతిభేదముల నమ్మహాసాధనంబుఁ ద్రిప్పి వారిం జెండాడుటయు హతశేషు లగుకొందఱు వాని నెదిరింపనేరక తదీయవిద్యాబలసా హసంబులఁ దెలిసి కుబేరునొద్దకుఁ జని భీమాగమనాదివృత్తాంతము నివేదింప నాధనాధ్యక్షుండు భీమసేనుఁడు సౌగంధికంబులఁ గొనిపోవుఁగాక, వానిదెసం బోవలవదు. వానిపని నాకు నభిమతంబ. నే నంతయుం దెలియుదు ననిన నారా క్షసులు క్రోధ ముడిగి మగిడి సౌగంధికసరోవరంబుపొంతకు వచ్చి యట యథే చ్ఛంబుగ విహరించుచున్న భీమునుం జూచుచుండిరి. అవ్విధంబునఁ గ్రోధవశగణంబు నోడించి వాయునందనుండు సౌగంధికకమలంబులఁ బెక్కులం గోయుచుండె.

అంత నిట జాలతోడం గలసి సుడిగాలి వీచుట, కొఱవులు పడుట, సూర్యుఁడు తేజు దఱుగుట, పెల్లుగఁ బిడుగులు వడుట, పుడమి వడఁకుట, దుమ్ము గురియుట, దెసలఁ గావిరి నిండుట, మృగపక్షులతికఠోరంబుగ నఱచుట, యంతటం జీఁకటి గప్పుట మొదలుగా సమరసూచకంబు లయినదుర్నిమిత్తంబులు పెక్కులు గానవచ్చిన ధర్మరాజు తమ్ములం గాంచి సంగ్రామసూచకంబు లయిన యుత్పాదంబులు గానంబడియెడి. అందఱు నేమఱకుండుఁ డనిచెప్పుచు నట భీముం గానక డగ్గఱ నున్నపాంచాలిఁ గవలనుం జూచి ద్రౌపదిం బిలిచి భీముఁ డెటఁ బోయె? సాహసప్రియుం డై నయతం డెప్పుడు నెద్దియే సాహసంబు సేయం దలంచు. నీ వెటకేనియుం బంచితే? ఏలొక్కో యాకస్మికంబుగ నీయుత్పాతం బులు గానం బడియెడి ననిన ధర్మరాజునకు ద్రౌపది యిట్లనియె. రాజేంద్రా, వాయువశంబున వచ్చినసౌగంధికము నీ కిచ్చితిఁ గదా. ఆకమలంబులయెడం బ్రీతనై యిట్టివి యింకనుం గలవేని తెచ్చి యిమ్మని నీతమ్మునకుఁ జెప్పితి. అతం డు వానిం దెచ్చి నాకుఁ బ్రియంబు సేయువాఁడై యీశానుదెస నరిగె ననిన ధర్మజుం డందఱమును వానిపోయినయెడకుఁ బోవలయు నని చెప్పి ఘటోత్కచు

నగ్గించి వానియనుమతిం దొల్లింటియట్ల రాక్షసులు మోచికొనిపోవ బ్రాహ్మణులతోడ సౌగంధికసరోవరంబునకుఁ జని యాకొలనిగట్టున నంగములెల్ల విఱిగి విగతజీవులై పడియున్నయక్షులను, క్రోధారుణితనయనుండై యవుడుగఱచి గదఁ జేతం బూని యుగాంతకాలదండధరువిధంబున దుర్నిరీక్షుం డైనభీమసేనుని! జూచి వానిసాహసంబునకు విస్మితుండై పలుమాఱులు కౌఁగిలించుకొని యన్నాం యిట్లేలసాహసంబుఁ జేసితివి? అక్కటా! దేవతల కిది యప్రియంబు గాకున్నె? నాకుఁ బ్రియంబుఁ జేయం దలంతువేని యిఁక నెన్నఁడు నిట్టిచేతలఁ జేయకుమని హితంబు బోధించి వానికోసినసౌగంధికకమలంబుల ద్రౌపది కిచ్చి యందు విహరించుచుండె. అంతఁ దదుద్యానపాలకులు మహాకాయు లగురాక్షసులు వివిధశిలాయుధపాణులై వచ్చి పాండవులను రోమశధౌమ్యాదిమహర్షులనుం గాంచి కోపం బుడిగి వినయంబున మ్రొక్కి ధర్మరాజునాదరంబునఁ బ్రసన్నులై తమకుఁ దోడ్పడుచుండఁ గుబేరానుమతంబునం బాండవు లాగంధమాదనసానువులయందు విప్వచ్చురాక వార్చుచుఁ గొండొకకాలంబు విహరించుచుండిరి. అంత నొక్కనాఁడు ధర్మరాజుతమ్ములనుం బాంచాలినిం జూచి మనము దేవర్షిసేవితంబు లయినపుణ్యతీర్థంబుల సిద్ధక్షేత్రంబులను దేవర్షులయు, బ్రహ్మర్షులయు, రాజర్షులయుఁ జరిత్రంబుల వినుచు రోమశునను గ్రహంబున సేవించితిమి. దేవతలం బితృదేవతలం దత్తదుచితవిధానంబులం బూజించితిమి. గంగాద్వారం బతిక్రమించి హిమవంతంబున బహుపర్వతంబులం గడచి బదరీవనంబును దివ్యపుష్కరిణినిం గడచి వచ్చితిమి. ఇఁకఁ గుబేరనిలయంబున కరుగు టెట్లో యనుచున్నంత ధర్మరాజున కశరీరవాణి యిట్లనియె. నరేంద్రా, యిఁకమీఁదు మీకుఁ బోవ నలవిగాదు. మఱలి నరనారాయణాశ్రమం బయినబదరీవనంబునకుఁ జని యట వృషపర్వాశ్రమంబు గడచి యార్ష్టిషేణాశ్రమంబున వసింపుము. అటఁ గుబేరాలయంబుఁ గాంచ నగు నని పలుకుచున్నంత లలితశీతలసురభిసమీరణంబు వీచె. పుష్పవర్షంబు గురిసె. దాన బ్రాహ్మణు లందఱు విస్మితు లగుచుండ ధౌమ్యుఁ డిఁక నుత్తరంబు పోఁజన దనిచెప్పుటయు ధర్మరా జెల్లవారితోడ మఱలి నరనారాయణాశ్రమంబునకుఁ జనుదెంచి ఘటోత్కచుని రాక్షసగణంబునుం దమతమ నివాసంబులకుఁ బోవం బనిచి యర్జునాగమనంబుఁ బ్రతీక్షించుచు నట బ్రాహ్మణాదిపరివృతుండై సుఖంబుండె.

### భీమసేనుఁడు జటాసురుం జంపుట.

అవ్విధంబున నుండునంత జటాసురుం డనురాక్షసుండు ద్రౌపది నపహరించుకొనం దలంచి బ్రాహ్మణరూపధరుండై పాండవులపాలికి వచ్చి యేను సర్వ

శాస్త్రమంత్రవిశారదుండ నగుబ్రాహ్మణుండ. పరశురామశిష్యుండ. ధనుర్వేదంబు నేర్చినవాఁడ నని చెప్పినం బాండవాగ్రజుండు మసిగప్పినిప్పువోలెఁ దన రూపంబు వెలిగానీక ప్రచ్ఛన్నుం డై నయారాక్షసుని నిక్కంబ బ్రాహ్మణుంగా వగచి యాతిథ్యవిధుల నిత్యంబు నాదరించుచుండె. తదాదృతుండై వాఁడు ప్రేమకై తవంబున వారిశస్త్రాదిగ్రహణకౌశలంబుఁ బరీక్షించుచు సుఖం బుండి యొక్కనాఁడు భీముఁడు వేఁటకుఁ బోవఁగ రోమశాదిమహర్షులాహ్నికవిధులఁ దీర్పఁ జనఁగఁ దటి వేచియున్నవాఁడు గాన నది సమయంబుగాఁ గొని సర్వాయుధంబులం గ్రహించి ద్రౌపదిని ధర్మజనకులసహదేవులను నెత్తికొని పాఱి పోవం దలఁచె. సహదేవుఁడు జతనంబుఁ బూని వానిపట్టు దప్పించుకొని యద్దురాత్ముండు కొనిపోవునాయుధంబులలో నుండుఖడ్గంబు నెడిసి పట్టి పెఱికికొని భీము నఱచుచు నతండు వేఁటకుఁ జనినత్రోవం జనియె. అట ధర్మజుం డయ్యసురం బిలిచి యోరీ! వివేకవికలా! ధర్మం బెఱుంగవు. మనుష్యులుఁ దిర్యగ్జంతువులు రాక్షసులును ధర్మం బెఱుంగుదురు. ఇది యంతయుం బరీక్షించిన నీకుఁ బాఱి పోవందగదు. పశుపక్షిసరీసృపకీటకపిపీలికాదులును దేవర్షిసిద్ధపితృగంధర్వాదులును, మనుష్యులవలన జీవింతురు. నీవు నట్టివాఁడవే. ఈమనుష్యలోకంబు సమృద్ధంబైన మీలోకంబులకును సుఖంబు గలుగు. ఈలోకమునకు దుఃఖము ఘటించిన సురలును దుఃఖింతురు. హవ్యకవ్యముల సుప్రీతులై యమరు లీలోకంబునకు సుఖంబుఁ గల్పింతురు. ఇట్టియీమనుష్యలోకంబునకు మేము రక్షకులము. రాష్ట్రంబు రక్షితంబుగా దేని మనుజుల కైశ్వర్యంబు సుఖంబునుం గలుగనేర్చునే! కాన నరపాలకుం డయినరాజు నవమానింపరాదు. మఱియు నీకు మాచేసినయపచారం బొకండునుం గన్పడదు. మిత్రులకును నమ్మియున్నవారికి నన్నముఁబెట్టినవారికి, రక్షించినవారికిం ద్రోహంబుఁ జేయరాదు. మాయన్నంబుఁ గుడుచుచు మాయొద్ద సుఖంబుండి యేల మాకే యపకారంబు చేసెదవు. వృథావృద్ధిఁ గాంచినవృథాచారుఁడ వగునీవు వృథామరణంబుఁ బొందెదవు. నీకీపని తగదు. మమ్ము విడిచి పొమ్ము. కాదేని యోదుర్బుద్ధీ! మాయాయుధముల మాకిచ్చి మాతోడఁ బోరాడి శక్య మగునేని ద్రౌపదిం గొనిపొమ్ము. నామాట వినక యజ్ఞానంబునం బ్రవర్తింతువేని యధర్మంబున నపకీర్తిం బొందెదవు. ద్రౌపదిని స్పృశించుట సామాన్యం బని తలంపకుము. అది మహాకుంభమున విషంబుఁ ద్రాగుటయే యని చెప్పుచు వాని నడుమఁగ నారాక్షసుండు వేగంబునం బోలేక మెల్లన నడుచుటయు ధర్మరాజు ద్రౌపదీనకులులం జూచి మీ రీయసురకు వెఱవవలదు. వీని మందగమనుం జేసితి. భీమసేనుఁ డచిరంబ డాయ వచ్చువాఁ డని చెప్పుచుండె. అట్టియెడ సహదేవుఁ డరుదెంచి రాక్షసుం జూచి కౌంతే

యాగ్రజు నిర్దేశించి రాజేంద్రా, సమరమునఁ బగతుర గెలుచుటయొండె, వెను దీయక తాను వీరమృతిం జెందుటయొండె క్షత్రియునకుఁ గులధర్మంబు. కావున నపకారి యగు నీరాక్షసునిపై నిపుడు విక్రమంబు కర్తవ్యంబు. క్షత్రధర్మమున కిది మంచిసమయ మొదఁగూడె. నేఁడు సూర్యుఁడు గ్రుంకుటకుమున్న వీఁడుచావఁడేని నేను క్షత్రియుఁడనే యనిచెప్పి రక్కసుదెస మొగంబై యోరీరాక్షసాధమా, నిలుము, నేఁ బాండుపుత్త్రుఁ డనగుసహదేవుఁడ, నను వధించి యిప్పాంచాలిం గొని పొమ్ము, అంతవాఁడవు కావేని నాచేఁ జత్తు వనిచెప్పుచున్నంత భీమసేనుండు వజ్రపాణి యగువాసవువడువున గదాహస్తుండై వచ్చి యారక్కసు మూఁపుల నున్నధర్మజనకులులను, ద్రౌపదిని, గ్రింద నున్నసహదేవుని, వాని నధిక్షేపింపుచున్న రాక్షసునిం గాంచి క్రోధదీపితుండై యోరీరాక్షసాధమా! నీసామర్థ్యంబెల్ల శస్త్రపరీక్షణసమయంబున నాయెఱింగినదియ. అపుడు ని న్నొక పదార్థంబుగ నైనం దలంపనైతి. తలంచియుంటినేని యప్పుడే నినుఁ బొరిగొని యుందు. మఱియు నీవు బ్రాహ్మణరూపప్రచ్ఛన్నుండవై మాయెడఁ బ్రియంబులం బలుకుచుఁ దప్పు సేయక యతిథివై యుండుటం జేసి వధింపనైతి. ఇప్పుడు గదా నీరాక్షసమాయ లెల్లఁ దెలియ నయ్యె. ఇఁక నినుఁ జంపక యుపేక్షించిన నరకం బగు. నీకుం గాలపరిపాకంబునఁ జా విప్పుడు ఘటించె. గాలమునఁ జిక్కిన మీనువోలె ద్రౌపదిం గ్రహించికొనఁ దలంచుటం జేసి నీ విపుడు కాలపాశంబునం జిక్కితివి. శీఘ్రంబ బకహిడింబులు చనినత్రోవం జనియెద వనిన నాజటాసురుండు కాలచోదితుండై యయ్యాయుధంబుల నెల్ల నట పడిచి పోట్లాడ సమకట్టి భీముం జూచి రోషవిస్ఫురితాధరుండై నీవీర్యంబుఁ జూడఁ గోరియే యింతతడవు చేసితింగాని యొండేమియుం గాదు. నీచేఁ జచ్చినరాక్షసులకు నేఁడు నీనెత్తుట నుదకక్రియం జేసెద ననిన వృకోదరుండు సెలవుల నాకుచుఁ గాలాంతకువిధంబునఁ గ్రోధఘూర్ణమానలోచనుండై యారక్కసుం దాఁకిన వాఁడుం బలుమాఱులు సెలవుల నాకుచు నోరు దెఱచుచు వృకోదరుపైఁ గవియుటయు వారిరువురు బలివజ్రపాణులచందంబునఁ బోరాడుచున్నంత మాద్రీపుత్త్రులారాక్షసుపై నుఱువడించివచ్చినం బ్రభంజనాత్మజుండు నవ్వుచు నే నొక్కఁడ నీరక్కసునకుఁ జాలుదు. మీ రూరక చూచుచుండుఁడు. నేను వీనిం జంపనేని ధర్మంబునకు సుకృతంబునకు యజ్ఞములకు నన్నదమ్ములకు నాత్మకుం దప్పినవాఁడ నగుదు నని చెప్పి వారల వారించి వెండియు నారక్కసుం దాఁకుటయు వాఁడు నతిసంరంభంబునఁ గవియఁగ వారిపోరు ఘోరం బయ్యె. అట్లు పోరునకుఁ దొడంగి వారు సమీపవృక్షంబుల విఱిచి తెచ్చి యొండొరులఁ బ్రహరింపుచు సింహనాదంబులు సేయుచు వాలిసుగ్రీవులవిధంబునం గొండొకవడి పోరాడుచుండఁ జెంగటం గల

ప్రమాఁకులెల్ల సమయుటయు నుగ్రపాషాణంబుల నొకళ్లొకళ్లపైఁ గొంతసేపు ఱువ్వి యట మల్లయుద్ధమునకు సన్నద్ధులై చటచటాశబ్దంబు నిగుడఁ బిడికిళ్లం బొడుచుచు నుగ్రప్రకారంబునం బోట్లాడుచుండ వృకోదరుం డురువడించి రయంబునఁ బంచశీర్షోరగంబునుంబోనితనపిడికిట నారక్కసుతలను గ్రుద్ది వానిం బరిశ్రాంతునిగ నెఱింగి రెండుచేతులఁ బట్టి వాని మీఁది కెత్తి నేలం బడవైచి యంగములెల్లం బొడిచేసి పిడికిట వానికుత్తుకం ద్రెవ్వ నడుచుటయు నారక్కసునితల నెత్తురుఁ గ్రక్కుచుఁ బెదవులఁ గఱచుచుఁ గన్నులఁ దేలవేయుచుఁ గ్రిందఁ బడియె. అట్లు వృకోదరుం డాదుష్టరాక్షసుఁ బరిమార్చి మహర్షులయు నన్నదమ్ములయు మెప్పు వడసె.

అంతఁ గుంతీతనయాగ్రజుం డెల్లవారితోడ నరనారాయణాశ్రమంబునకుఁ జనుదెంచి యది నివాసంబుగాఁ జేసికొనియుండి తమ్ములను ద్రౌపదినిం జూచి మనయర్జును డస్త్రార్థంబు చని నాలుగేండ్లు చనియె. ఐదవయేఁడు నడచుచున్నది. వానిఁ జూడఁగోరి మనము శ్వేతపర్వతంబును జరించితిమి. అస్త్రార్థంబు నాకలోకంబున నేనేండ్లు వసియింతు నని యతండు తొల్లి బాస యిచ్చినవాఁడు. ఇఁక నవశ్యంబు వచ్చు. చూడఁగాంతు మనిచెప్పి బ్రాహ్మణులకుం దదర్థంబు నివేదించి తమ్ములుం దాను వారికిఁ బ్రదక్షిణనమస్కారము లాచరించిన వారు పరమప్రీతులై భరతపుంగవా, యచిరంబ యాపదలెల్ల నిస్తరించి క్షత్రధర్మంబున రాజ్య మేలుదు వనిదీవించినం బాండవాగ్రజుండు తదాశీర్వాదంబులం గ్రహించి వారుం దమవారుం దోడరాఁగ నుత్తరంబునఁ జని కైలాసంబును మైనాకంబును గంధమాదనప్రత్యంతపర్వతంబులను శ్వేతపర్వతంబును జూచుచు నరుగుచు ముందఱ హిమవత్పృష్ఠంబునం గంధమాదనప్రాంతంబునఁ బుష్పితఫలితనానాద్రుమలతావితతం బయినవృషపర్వునాశ్రమంబుఁ గాంచె. కాంచి యాశ్రమంబు చొచ్చి యుధిష్ఠిరుండు తమ్ములు భార్యయుం దాను రాజర్షివర్యుం డైనయావృషపర్వునకు మ్రొక్కిన నతండు వారలఁ గొనియాడి వారిని ధౌమ్యరోమశప్రముఖులగు బ్రాహ్మణులను నాతిథ్యంబున సత్కరించె. ఆయాశ్రమంబున నేడునాళ్లు వసియించి యష్టమదినంబునఁ దమతోడ వచ్చినవిప్రులనెల్ల నావృషపర్వున కప్పగించి యజ్ఞపాత్రాభరణాదులనంద యునిచి ధౌమ్యరోమశులం దమ్ములనుం బాంచాలినిం దోడ్కొని యుత్తరంబుగఁ దఱలుటయు వృషపర్వుండు వారల దీవించి కొంతవడి తోడన చని త్రోవ చూపి మఱలి నిజాశ్రమంబు చేరి బ్రాహ్మణాదిప్రత్యవేక్షణంబున జాగరూకుండై యుండె.

## పాండవులు గంధమాదన రామణీయకంబు చూచుట.

అటఁ బాండవులును వృషపర్వ చూపినత్రోవం బాదచారులై చని నాలవనాఁడు శ్వేతపర్వతంబు సేరి యందలివిశేషంబులం జూచుచు మాల్యవంతంబున కరిగి యట సిద్ధవిద్యాధరకిన్నర కింపురుషాదిసేవితం బయినగంధమాదనంబు సొచ్చి నందనవనంబుచందంబున నమందానంద సందోహదోహదం బయినయప్పర్వతంబు కాంతారంబున శ్రేణీభూతంబులై యాగిరి ధరించినవివిధమాలిక లనంగ సర్వర్తుఫల కుసుమవిసరభరితంబులై యెల్లవారికి నింపుఁ బుట్టింప జాలునానావిధమహీరుహనివహంబులను, నం దమృతంబున కెనవచ్చుమధురతం బొంపిరివ్రాయి కమియఁ బండినపండులను, నవనవారుణమృదులంబు లగుతలిరాకుజొంపమ్ములను, మారుతోపరంబులుంబోనిసిందువారకుసుమంబులను, నిపుణతరుణీజనకర్ణపూరంబులంబోనివికచకర్ణికారంబులను, కందర్పశరసదృశంబు లగు కురువకంబులను, వనపాలకుండు వనశ్రీలకుం గావించినతిలకంబు లనంగ నొప్పారుతిలకకుసుమంబులను, పంచశరు మహాశరంబులకరణిం బొల్పారుచూతమంజరులను, మకరధ్వజుండు విరహిగణంబుపైఁ బ్రయోగించు సధూమదవదహనంబువడువునం దనరునానావర్ణకుసుమవిసరంబులను, మేఘనినదంబొండె విద్యాధరాదుల వాదిత్రనాదంబొండె వినవచ్చిన నతిమధురంబుగఁ గేకారవంబు లొనరించి మదమత్తంబులై చిత్రకలాపంబుల విస్తరించి కిరీటంబులఁ దాల్చెనోనాఁగ నెన్నఁ దగి యొక్కచో నాట్య మాడునవియు వేఱొక్కచోఁ దీవెపొదరిండ్లం గుటజవిటపంబులం బ్రియలతోడ నిష్టవినోదంబుల నల్పునవియు నగుమయూరవారంబులను, నంచపిండు లెల్లెడల నావరించి యునికిం జేసి విమలస్ఫటికసన్నిభంబులు పంకజపరాగపరీతస్వాదుశీతలసలిలపూరితంబులు నగుకొలంకులనుం గాంచుచుఁ, దామరవిరితేనియల నాగళంబు గ్రోలి మదాలసంబులై వికచసరోజరేణురంజితంబులై తరుణీసహితం బెల్లెడలం గ్రుమ్మరుతుమ్మెద కూటువలనునుఁబాటలను, జంచువులం గెంజివుళ్లం జించి యాస్వాదించి చెలరేఁగుకోయిలపిండుల పంచమారవంబులను, బరిణతస్వాదుఫలరసాస్వాదముదితకీరశారికాదివిహంగమంబులమధురాలాపంబులను నాలకింపుచుఁ, గమలకువలయకల్హారపుండరీకపరిమళంబులఁ గొనివచ్చు మందమారుతకందళంబుల వీవనల సొగియుచు నబ్బురం బందుచుండ ధర్మనందనుండు భీమసేనున కిట్లనియె. భీమసేనా, చూచితే యీగంధమాదనకాననంబు. ఔరౌర ! దీనిరామణీయకంబింత యొప్పునే. ఇందలిమ్రాఁకులుం దీవెలును సొంపుపెంపారుతలిరాకులం బూవులం బండులను నిండారియున్నయవి. ఇం దొక్కటేనియుఁ గంటకితంబు గానరాదు. ఎచటఁ జూచినం గలకంఠకులకలకలారావంబును, మధుకరనికరమధుర సంగీతరవంబును, మయూరవారమంజులకేంకారంబును, గీరశారికాదిశకుంతసముదయ

లలితవచనోపన్యాసంబును, వీనులకు విందు గావించెడి. పాటలప్రభాభాసురంబు లయిన సెలయేటిపచ్చికపట్లం బెగ్గురులు మధురరుతంబు లొనరింపుచు మెల్లన సంచరించెడి. ఏనుంగులు కొలంకులం దమ్మితీవెలం గలంచెడి. వికచకుసుమం బయిన యీపద్మలత రూపాంతరంబు గ్రహించి పూదండఁ దాల్చినశ్రీదేవికైవడి నొప్పారెడి. ఇవె గిరిశిఖరంబులనుండి వారిధారలు నిరంతరంబు జాలువాఱెడి. ఒక్కచో మధ్యందినమార్తండప్రభావిభాసితంబులు, వేఱొక్కచో బాలాతపప్రకాశంబులు, మఱియొక్కచో శారదనీరదోపమంబు, లొండొక్కచో నంజననీకాశంబులు, వెండియు నొక్కచో సంధ్యాభ్రనికరసంకాశంబులు నగు గైరికాదిధాతుపుంజంబు లీయచలంబు నెల్లెడల వెలింగింపుచున్నయవి. వారె గంధర్వకింపురుషాదు లీగిరిశిఖరంబులం బ్రియురాండ్రతోడఁ గ్రీడింపుచున్నవారు. సకలభూతమనోహారం బయినవారిగీతనిస్వనంబును సామనినదంబును శ్రవణరసాయనం బయ్యెడి. అల్లదె పరమపావనం బైనగంగానది. దానియిరుదరుల నింపుపెంపారుతరునికరప్రాంతంబుల సిద్ధగంధర్వకిన్నరకింపురుషాదులు విహరింపుచున్నవారు. వివిధమృగపక్షులు శతశీర్షంబులై వివిధాకారంబు లయినవ్యాళంబులు నీగిరిం జరింపుచున్నయవి. ఈశుభదేశంబులెల్ల దేవవిహారస్థానంబులు. మనుష్యుల కగమ్యంబులు. ఇట్టిపావనస్థలంబులఁ బ్రాపించితిమి. సిద్ధుల మైతిమని చెప్పిన నందఱు నాపర్వతంబుసొంపుఁ గన్నులారం గనుంగొనియు నెప్పటికిం దనియరైరి.

## పాండవులార్ష్టిషేణాశ్రమంబునకుఁ బోవుట.

అక్కరణి నాగిరివరంబురామణీయకంబుఁ గనుంగొనుచు నరుగువారు వారు ముందఱ సతతకుసుమఫలపరీతతరునికరభరితం బైనయార్ష్టిషేణునాశ్రమంబుఁ గనుంగొని తదాశ్రమాభ్యంతరంబు సొచ్చి తీవ్రతరతపోనియమంబునఁ గృశించియొడలెల్ల నరాలం గప్పియున్నవాని సర్వధర్మపారగుఁడైనవాని రాజర్షివర్యుండైనవాని నార్ష్టిషేణుం గాంచి ధర్మతనయుండు తమ్ములు భార్యయుం దాను నామకీర్తనపూర్వకముగ నభివాదనంబు లాచరించిన నారాజర్షిపుంగవుండు వారలఁ గూర్చుండఁ జెప్పి యథాన్యాయంబుగఁ జేర వచ్చినధౌమ్యు నాదరించి ధర్మరాజున కిట్లనియె. ధర్మనందనా, ధర్మమున వర్తింతువే? అసత్యంబు విడుతువే? గురువులనెల్లఁ బూజింతువే? పాపకర్మంబులఁ బరిత్యజింతువే? సుకృతకరణంబునుం దుష్కృతత్యాగంబునుం జక్కగ నెఱుంగుదువే? తన్నుఁ దాన పొగడికొనవే? సాధువులెల్ల నీచేయుసమ్మానంబునకు మెత్తురె? వనంబుననైనను ధర్మంబ యనువర్తింతువే? నీయాచారంబులకు ధౌమ్యుండు సంతసిల్లునే? దానధ

క్షతపశ్శౌచార్జవతితిక్షలం బెంపారి పితృపితామహాదిపరంపరాప్రాప్తం బైనవృత్తంబనువర్తించి రాజర్షిచరిత్రంబు నడపుదువే? పితృలోకవాసు లైనపితరులు దమకులంబున జనించినవారలసుకృతంబులకు సంతసింతురు. వారిదుష్కృతంబులకు శోకింతురు. తల్లిదండ్రులు గురు వగ్ని యాత్మ యనునేగురు నిరతం బెవ్వనిచేఁ బూజితు లగుదురో యతం డుభయలోకసౌఖ్యం బెనయుఁ గానఁ దత్ప్రకారంబున వర్తింతువే? అనియడుగ ధర్మరాజు మహాత్మా, కరుణమై ధర్మనిశ్చయం బెఱింగించితివి. యథాశక్తి విధియుతంబుగ ధర్మ మనుష్ఠింతు ననిన నార్ష్టిషేణుండు వెండియు నజాతశత్రున కిట్లనియె. సిద్ధగంధర్వకిన్నరకింపురుషాదు లీగిరిశిఖరంబుల దివ్యవస్త్రాభరణాదుల నలంకరించుకొని కాంతాజనంబుతోడఁ గ్రీడింతురు. అబ్భక్షులు వాయుభక్షులు వైహాయసగమనులు నగుమహర్షులు పర్వసంధులయం దీపర్వతంబు సేవింతురు. అప్పు డిప్పర్వతంబుమీఁద భేరీపణవశంఖమృదంగాదివివిధవాద్యనిస్వనంబు విన నయ్యెడి. ఆనినదంబెల్ల నిచ్చట నుండియే వినవలయుంగాని యచటికిఁ బోఁజనదు. అమరవిహారస్థానం బైనయాదేశంబు మనుష్యుల కగమ్యంబు. ఇందుఁ జాపలంబునం బ్రవర్తించిన వానియెడ నెల్లభూతంబులుం గలహించురాక్షసులయశ్శూలంబులం బొడుతురు. ఈశిఖరం బతిక్రమించిన దేవర్షిగమ్యదేశంబు గోచరం బగు. పర్వసంధులం గుబేరుండు యక్షరాక్షసాదిసేవితుండై యప్సరోగణపరివృతుండై యీశిఖరమందలియుద్యానంబున నెల్లవారికి దర్శనం బొసంగు. అపుడు ధనదు నుపాసింప వచ్చినతుంబురుని గీతసామనిస్వనంబు శ్రవణాభిరామం బయ్యెడి. సర్వభూతంబు లిందలిచిత్రంబులం దలుచుగఁ బర్వసంధులఁ గనుంగొనుచునుండు. మీరుం జాపలంబుఁ దొఱంగి రసవంతంబు లైనఫలంబులఁ దినుచు నర్జునుండు వచ్చునంతకు నిచటన యుండుఁ డనిచెప్పె ననిన జనమేజయుండు వైశంపాయనమునీంద్రా, మదీయప్రపితామహు లగుపాండుపుత్రు లాయార్ష్టిషేణునాశ్రమంబున నెంతకాలము వసియించిరి? ఏమి చేసిరి? అపు డచట వారి కెయ్యవి యాహారంబు లయ్యె? భీమవిక్రముం డైనభీమసేనున కచటఁ గ్రమ్మఱ యక్షులతోడియుద్ధము గాకుండెనే? ధనదుఁ డచ్చటికి వచ్చు నని యార్ష్టిషేణుండు చెప్పెఁగదా వారి కది ఘటించెనా? అమ్మహాత్ముల చరిత్రం బెంత వినినను దనియనయ్యెద. వివరించి చెప్పవే యనియడుగ వైశంపాయనుం డానృపాలున కిట్లనియె.

పాండవు లయ్యార్ష్టిషేణువచనంబుమెయిఁ దదాశ్రమంబున మునిభోజ్యంబు లగుస్వాదుఫలంబులను శుద్ధబాణనిహతంబు లైనమేధ్యమృగంబులమాం

సంబులను వివిధమధురసంబులను నుపయోగించుచు నటకుఁ జనుదెంచినమహర్షులతోడ నిష్టకథలఁ గావించుచుఁ గొన్ని నెలలు గడప నొక్కనాఁ డచ్చట నొక్క పెద్దమడువున వసించుబుద్ధిమంతం బనుమహానాగంబును గరుత్మంతుడు సరభసంబుగ హరించిన నాపర్వతంబు వడఁకె. ద్రుమంబులు గూలె. సర్వభూతంబులు భయవిస్మయంబులఁ బొందె. అంత నొక్కమారుతంబు వీచిన దానితోడఁ బంచవర్ణంబు లైనసుగంధికుసుమంబులొకకొన్ని ముందటం బడినం జూచి పాంచాలి యొక్కవిజనరమణీయం బైనచోట సుఖాసీనుండై యున్నభీమసేనున కిట్లనియె. భరతర్షభా, మహామారుతానీతంబులై యీపంచవర్ణసురభికుసుమంబులు సర్వభూతసమక్షంబున నశ్వరథానదీప్రాంతంబునం బడియెఁ గదా. అచట నివి యింకనుం బెక్కు లుండు నని తలంతు. వానిం దెచ్చి యిమ్ము. నీతమ్ముఁడు గంధర్వోరగరాక్షసాదుల నింద్రుని నివారించి ఖాండవం బగ్నికి సమర్పించి గాండీవంబు నక్షయతూణీరంబులను సాధించి నిజపరాక్రమం బంతట నెఱపినవాఁడుకాఁడె? నీవిక్రమం బగణ్యం బవిషహ్యం బప్రధృష్యంబు. నీబాహుబలవేగంబునకు వెఱచి యిచటిరాక్షసులు దెసలెల్లం బాఱుదురుగాక. ఈయర్థంబు నామనంబున నెల్లపుడుం గలిగియుండు. నీబాహుబలంబున సురక్షితనై యీగిరిశిఖరంబుఁ గాంచం దలంతు నని యొత్తి చెప్పిన విని బలదర్పమానశౌర్యవిలసితుం డైనవృకోదరుండు తదీయవచనోపన్యాసంబు నిజనిరుపమవిక్రమంబున కుద్దీపనంబుఁ గావింప ధనుస్తూణీరగదాఖడ్గాదిసాధనంబులం గొని మత్తశుండాలంబుచందంబున భయమోహగ్లానివైక్లబ్యమాత్సర్యరహితుండై సర్వభూతంబులు సరభసంబుగఁ దన్నుఁ జూచుచుండ ద్రౌపదికి హర్షంబుఁ బొనరించువాఁడై యనేకతాళోన్నతం బైనయాగిరిశిఖరంబు నారోహించి యందుఁ గాంచనప్రాకారభాసురంబు, వివిధోద్యానవిలసితంబు, రమ్యద్వారతోరణగోపురాట్టాలకసమంచితంబు, వాతధూతాంచలపతాకాలంకృతంబు, నృత్యనిపుణవేశ్యాజనవిరాజితంబు, కాంచనస్ఫాటికసౌధరాజివిరాజితంబు, నగుకుబేరునిలయంబుఁ గనుంగొని లలితగంధవహకందళాందోళనానందితహృదయారవిందుఁడై శత్రుజనవిత్రాసంబు గూర శంఖంబుఁ బూరించి గొనయంబు సారించె.

భీమసేనుఁడు మణిమంతుఁ డనుయక్షునాయకు వధించుట.

అంత నఖిలభూతవిత్రాసకరం బయినయాఘోరనిస్వనంబు విని యక్షరాక్షసగంధర్వులు గదాపరిఘనిస్త్రింశశక్తిశూలపరశ్వథాదిసాధనంబులతోడం బఱతెంచి యుద్ధసన్నద్ధులై శూలాద్యాయుధంబులం బ్రయోగించిన భీమసేనుండు నిశితభల్లంబుల వానినెల్ల నడుమన తునియలు గావించి వారిమేనులు సించి తలలు డొల్లనేసి నెత్తురుటేరులఁ బఱపించె. అందుఁ గినిసి యక్షరాక్షసు లొక్కపెట్ట

వృకోదరుపైఁ గవిసి మేఘపటలంబులు భానుమంతుంబోలె నమ్మహావీరుం గప్పిన నతండు మోహంబుఁ జెందక యనేకాస్త్రంబులం బ్రయోగించి తదీయసేనం జెండాడుటయు వారు వెఱచి యాయుధంబుల విడిచి దక్షిణంబుగఁ బాఱిరి. దాని విని కుబేరసఖుం డైనమణిమంతుఁ డనువాఁడు దిక్కు దోఁచక పాఱుచున్నయక్షరాక్షసులనెల్లం బిలిచి నవ్వుచు నోహో! యిట్లు వెఱచి పాఱఁ బోలునే? మనుష్యమాత్రుం డైనయొక్కనికిఁ బలువు రోడితిరి. దీని ధనేశ్వరున కేమని విన్నవించెదరు. ఇది పోలదు. మఱలుఁ డనిచెప్పి వారల మఱలించి శక్తిశూలగదాపాణియై తాకిన భీమసేనుఁడు మూఁడింట వాని నేసె. అంత మణిమంతుడుం గినిసి వృకోదరుపైఁ దనమహాగదం బ్రయోగించిన నాకాశంబున వచ్చునమ్మహాసాధనంబుఁ జేతం బట్టికొని భీమసేనుండు ఱాల ఉవ్వి పెక్కమ్ములఁ బ్రయోగించె. బ్రయోగించిన గదాయుద్ధప్రకారం బెఱింగినవాఁడు గాన నామణిమంతుఁడు గదం ద్రిప్పుచు నాబాణమ్ములం దప్పించుకొనుచు ఘోరాకారం బైనశక్తిఁ బాండవుపైఁ బ్రయోగించిన నది యతనిదక్షిణభుజంబు భేదించి యగ్నిజ్వాలపోలె నతిరౌద్రంబుగఁ గ్రిందఁ బడియె. అంతం గ్రోధతామ్రేక్షణుండై పాండవవీరుండు శత్రువిత్రాసకారణం బైనగదం గొని పోట్లాడం దొడంగుటయు నాయక్షనాయకుండు శూలంబుఁ బ్రయోగించినం దానిఁ దునియలు గావించి సింహనాదంబు చేసి యురువడించి వైనతేయుండు కాద్రవేయుంబోలెఁ గౌంతేయుండు వాని నాక్రమించి మీఁది కెగిరి గదం ద్రిప్పి యారాక్షసనాయకుపై నేసిన నది వాని వధించి క్రిందఁ బడియె. సింహనిహతం బైనశుండాలంబువిధంబున వృకోదరనిహతుం డైనమణిమంతుం జూచి హతశేషు లగుయక్షరాక్షసు లార్తనాదంబులు సేయుచుఁ దూర్పునం బాఱిరి.

ఇట నానినాదంబులం గలిగినగుహాంతరప్రతినినాదంబుల నాకర్ణించి ధర్మజుండు నకులసహదేవులు ద్రౌపది ధౌమ్యులును సుహృదు లందఱు నెద్దియుం దోఁచక చింతింపుచుండిరి. అంతఁ గొంతవడికి ధర్మజుండు ద్రౌపది నార్ష్టిషేణు నొద్ద నుండ నియమించి మాద్రేయులుం దాను నాయుధపాణులై యాశైలశిఖరం బారోహించి భీమసేనుండు చంపఁగఁ బడియున్నయక్షరాక్షసులను వజ్రపాణికైవడి రాక్షసుల వధియించి విక్రమంబున వెలుఁగుచున్నభీమసేనునిం జూచి వానిసాహసంబున కచ్చెరువంది గాఢపరిష్వంగమున నాదరించి యందఱుం గూర్చుండుటయు నాశైలశిఖరంబు లోకపాలురు నలువు రధిష్ఠింపఁగఁ దనరుమేరుగిరిశృంగంబుకరణి నొప్పారె. అంతఁ గుంతీతనయాగ్రజుండు భీమసేనుం జూచి యన్నా, సాహసంబుననొండె మోహంబుననొండె నీపనిఁ జేసితివి. ముని కృతన

వచనంబువిధంబున నీ కిది తగదు. రాజవిరుద్ధం బైనకార్యంబు సేయరా దని ధర్మవిదులు పలుకుదురు. ఇదియో దేవవిద్విష్టంబు. దీని నెన్నఁడైనం జేయఁ దగునే? ధర్మార్థంబుల ననాదరించి పాపకృత్యంబు సలుపువాఁ డవశ్యంబు పాపఫ లంబుఁ గుడుచు. నాకుఁ గూర్తువేని యిఁకనైన నిట్టిచేతలు చేయకు మనిబో ధింపుచుండె. అంతకుమున్న హతశేషు లయినరాక్షసులు భయభ్రాంతులై యా యుధంబుల విడిచి వికీర్ణకేశులై యతివేగంబునం గుబేరునొద్ద కరిగి దేవా! ము న్నొకమనుష్యుండు సౌగంధికసరోవరసమీపంబునఁ గ్రోధవశగణంబులనెల్లఁ బిలు కుమార్చెఁగదా. అతండే యిపు డీగిరిశిఖరంబునకు వచ్చినవాఁడు. వానిం దాఁకి గదాపరిఘతోమరాద్యాయుధయోధు లగునీవీరభటులు పలువురు వ్రెలిసిరి. యక్షరాక్షసయోధప్రవరుండై నీకుఁ గూర్చుననుంగుఁజెలి యగుమణిమంతుండును వానిచేఁ జచ్చె. మే మెట్లో తప్పించుకొని వచ్చితిమి. ఒకమనుష్యుఁ డింత చేసె. ఇఁకఁ గర్తవ్యంబుఁ జింతింపు మనినం గుబేరుండు వారలవచనంబులు విని క్రోధ తామ్రాక్షుండై యోహో! వాఁడింత చేసెనా? ఇది వాని రెండవయపరాధం బు. ఇఁక నూరకుండఁ జనదు. దురంబు సేయనవలయు ననిన వారు రథవర ము త్తమాశ్వములం బూన్చి సకలసాధనంబుల నం దునిచి తెచ్చిరి. తెచ్చుటయుఁ గుబేరుండు విజయప్రదంబు లయినయశ్వహేషితంబుల నుపలక్షించి యారథం బధిరోహించి వివిధాయుధంబులతోడ యక్షసేన గొలిచిరాఁగ గంధర్వగణస్తూయ మానుండై యాకాశగమనంబున నతివేగంబున గంధమాదనంబునకుఁ జనుదెంచి యాయుధధారులై యున్నపాండునందనులం గాంచి వారిమహాసత్వంబునకు సు ప్రీతుం డయ్యె. పాండవులుం గుబేరుని దవ్వునఁ గాంచి యాయక్షనాయకున కేమి తప్పు చేసితిమో. అతం డేమి తలంచెనో యని వితర్కించుచు నతనికి మ్రొక్కి కృతాంజలులై యుండఁ గుబేరుండు పుష్పకంబు నిలిపి యక్షరాక్షసగం ధర్వాదిగణసముపాస్యమానుండై యుండి తనదెసఁ జూచువాని, నాపంచవర్ణకు సుమంబులదండఁ దాల్చినవాని, నాయుధములఁ బూనియున్నవాని, రాక్షసుల తోడం బోరాడియు డయ్యనివాని, నిశితబాణముల లెస్సగఁ బరీక్షింపుచున్నవాని, భీమసేనుని బోరున కాయితంబై యున్నవానిఁగ నుపలక్షించి యుధిష్ఠిరుదెస మొ గంబై ధర్మనందనా, సర్వభూతంబులును నీభూతహితప్రవృత్తిఁ దెలియు. తమ్ము లతోడ నీగిరిశిఖరంబున వసింపుము. సాహసంబున యక్షరాక్షసులఁ జంపె నని భీమునెడఁ గింకిరిపడవలదు. యక్షరాక్షసులు కాలవశంబునఁ బొలిసిరి. నీతమ్ముఁ డందు నిమిత్తమాత్రంబ. యక్షరాక్షసులు హతు లగుదు రని తొల్లియే సుర లకు విదితంబు. భీమునియెడ నేఁ గినియను. మఱి ప్రీతుఁడనైతి. మున్నే నేను వీనికార్యమునకు సంతసించినవాఁడ ననిచెప్పి యట భీమసేనుం జూచి వత్సా,

ద్రౌపదికిఁ బ్రియంబు సేయఁగ నీవు నినసాహసంబున కెంతయు సంతసం బయ్యెడి. దేవతల నన్ను యక్షరాక్షసులను నాదరింపక కేవలబాహుబలంబుననే యింత చేయ నీవు దక్క మఱియొక్కరుఁ డెవ్వఁడేనియు వలంతి యగునే! అగస్త్యశాపంబు నీవలనం బాసితి ననిన యుధిష్ఠిరుం డదియెట్లనియడుగఁ గుబేరుండు ధర్మజున కిట్లనియె.

కుబేరుఁడు మణిమంతునకుఁ గలిగినశాపంబు చెప్పుట.

తొల్లి సురలెల్లఁ గుశవతీనదీతీరంబున మంతనంబుండి నన్నుఁ బిలిపింప నేను మూఁడుమహాపద్మంబులయక్షులు ఘోరాకారులు వివిధాయుధపాణులై వెంటరాఁగఁ జనుచుండ నాచెలికాఁడీమణిమంతుఁడు యమునానదీతీరంబున నూర్ధ్వబాహుండై సూర్యున కెదురుగ నుగ్రతపం బాచరించుచు జ్వలితహుతవహువడువున దుర్నిరీక్షుం డైనయగస్త్యమునీంద్రుపైన జ్ఞానంబునం జేసి యుమిసె. అందుకుఁ గడుం గినిసి యమ్మునీంద్రుండు దెసలెల్ల నీఱుచేయువానిపోలె ననుఁ జూచుచుఁ జూచి యోధనేశ్వరా! నీవు చూచుచుండఁగనే నీచెలికాఁడు నన్నవమానించెఁ గావున నీసేనతోడ వీఁడొకమానవునిచేఁ జచ్చువాఁడు. నీవు నామానవుం గాంచి సైన్యవధంబునం గలుగుసంకటంబుఁ బాయుదు వనియె. ఆశాపంబుఁ దీర్చుటకు నీతమ్ముఁడు నిమిత్తమయ్యె నని చెప్పి వెండియు నిట్లనియె. ధృతిదాక్ష్యదేశకాలపరాక్రమంబు లనునైదును లోకతంత్రవిధానంబునకుఁ బరమసాధనంబులు. కృతయుగంబున నందఱు నవి తెలిసి కార్యముల ననుష్ఠించిరి. అయ్యేనింటినిం దెలిసినక్షత్రియుండు స్వకర్మనిరతుండై రాజ్యమేలి యుభయలోకంబుల నున్నతిఁ గాంచును. ఇంద్రుఁడును వానిం జక్కఁగఁ దెలిసియే నాకలోకరాజ్యం బధిగమించె. వానిం బరిశీలింపక కేవలసాహసంబునఁ గార్యంబులఁ బూనువాఁడు కార్యభేదం బెఱుంగక వ్యర్థాచారప్రయత్నుండై లోకద్వయంబునం జెడు. ఈభీమసేనుఁడు గుణదోషంబులఁ బరికింపక భయము విడిచి కేవలసాహసంబునం బ్రవర్తింపుచున్నవాఁడు. వీని నిఖలధర్మజ్ఞుఁగ శిక్షింపుము. ఆర్ష్టిషేణాశ్రమంబున కరిగి యీమొదటికృష్ణపక్షం బచ్చట వీతశోకభయుండవై వసింపుము. యక్షకిన్నరగంధర్వులు మన్నియోగంబున రసవంతంబు లయినయన్నపానీయంబులం దెచ్చి యిచ్చి మిమ్ముఁ గొలుచుచు రక్షించువారు. ధర్మునకు నీవు వాయువునకు భీముఁ డింద్రున కర్జునుం డశ్వినులకు మాద్రేయులుం బరిరక్ష్యు లగురీతి మీ రందఱు నాకుఁ బరిరక్ష్యులే. దమదానాదిసద్గుణంబులకెల్లఁ దావలం బైనధనంజయుం డస్త్రంబుల సాధించి యింద్రలోకమునఁ గుశలమున్నవాఁడు. యమునానదీతీరంబున సప్తాశ్వమేధంబుల నాచరించి పితృదేవర్షులం దనిపి స్వర్గలోకంబు సాధించినశంతనునృపాలుండు భవత్ప్రపితామహుండు యుష్మత్కుశలంబు నడుగుమనియెఁ. మీ

మెడం బ్రీతుండై మీ సేమం బడిగె ననిన విని యందఱు సంతుష్టులయిరి. అట భీమ సేనుండు ధనాధినాథుం బ్రార్థనాదులం దనయెడ ననుకూలుం జేసికొని మ్రొక్కినం గుబేరుండు శరణాగతుం డైనవాని నాదరించి వాయునందనా, శత్రువులమాన మడంతు వనిదీవించి ధర్మరాజుం బిలిచి యర్జునుం డింద్రునానతిం గొని యచి రంబ వచ్చువాఁడు. అంతకు గంధమాదనమున మీనిలయంబుల వసింపుఁడు. యక్షు లుపచరింతువా రనిచెప్పి వారి వీడ్కొలిపి యక్షగణంబుతోడం జనియె. యక్షులుం గుబేరానుజ్ఞచే గతచైతన్యంబు లయినమృతయక్షకళేబరంబుల నప్పుడే శైలశిఖరంబు నపనయించిరి. దాన వారికి శాపాంతం బయ్యె.

ఇట్లు ధర్మరాజు కుబేరునను జ్ఞంగొని యార్ష్టిషేణాశ్రమంబుం జేరి యక్షు లుపచరింప సుఖం బుండునంత నొక్కనాఁడు ధౌమ్యుండు ప్రాతరాహ్నికంబులం దీర్చి యార్ష్టిషేణుతోడం బాండవులయొద్ద కరుదేరుటయు వా రమ్మునులయడుగుల కెఱఁగి తక్కటివిప్రులం బూజించియుండ ధౌమ్యుండు ధర్మరాజుకుడిచేయి తన చేతం బట్టికొని తూర్పుదెసం జూపి యిట్లనియె. చూచితే. అది మందరపర్వతంబు. ఆపర్వతం బున్నదెస నింద్రకుబేరులు పాలింతురు. ఆప్రాంతంబులనే యింద్రకుబే రులపురంబు లుండెడి. అట నుదయించుసూర్యుని సిద్ధసాధ్యాదులు ఋషులు ధర్మజ్ఞులగుబ్రాహ్మణులు నుపస్థానమంత్రంబుల నుపాసింతురు. ప్రాణులకెల్ల నియా మకుం డై నయయముం డీవలనం దక్షిణదిగ్భాగంబున నున్నవాఁడు. ఇదె సంయమ నంబు నాఁబడుతదీయనగరంబు. పశ్చిమదిగ్భాగంబున నస్తపర్వతంబును సము ద్రంబు నాశ్రయించి వరుణుం డున్నవాఁడు. అల్లదె మేరుపర్వతం బుత్తరదిగ్భా గంబునెల్ల వెలింగింపుచున్నయది. అందె సకలచరాచరంబుల సృజియించునట్టి బ్రహ్మదేవుఁడున్నవాఁడు. బ్రహ్మమానసపుత్రు లగుమరీచిప్రముఖమహర్షు లచ్చ టనే యున్నవారు. సప్తర్షు లచ్చటన యుదయాస్తమయంబులం గాంతురు. ఆమే రుపర్వతశిఖరంబున బ్రహ్మసదనంబునకు మీఁదుగాఁ దూర్పున నారాయణస్థా నంబు గలదు. అది సర్వతేజోమయంబు. తనతేజంబుననే వెలుంగుచు సకలభూ తంబుల వెలిఁగించునది దేవదానవబ్రహ్మర్షులకైనం జూడనలవిగాదు. యోగ సిద్ధులు సర్వసంగవిముక్తులు నగుయతు లచ్చోటికిం జనియెదరు. అచ్చటి కరిగిన వారికిం బునర్జననమరణంబులు కలుగనేరవు. అదియక్షయంబు. సర్వకారణకార ణం బాద్యంతరహితుండు సర్వేశ్వరుండు నగు నారాయణునకు వాసస్థానంబు. భక్తిమై దానిం బ్రణమిల్లుము. సూర్యుం డెల్లప్పుడా మేరువునకుం బ్రదక్షిణంబు సేయుచు నుత్తరాయణంబున నిజకిరణంబులచే గ్రహించినసకలరసంబును దక్షి ణాయనంబునం బర్జన్యరూపుండై వర్షించి తనకిరణంబులవేఁడిమికిం దపించినజను

లకెల్లఁ బ్రమ్మఱ సుఖంబుఁ గావించుచుఁ గళాకాష్ఠాక్షణముహూర్తాహోరాత్రాదివిభాగపూర్వకంబుగఁ గాలపరిచ్ఛేదంబు సేయుచున్నవాఁడు. చంద్రుఁడుం బక్షమాసంబుల విభజించుచు నాగిరివరంబు వలగొనుచున్నవాఁడుఁ. గ్రహనక్షత్రంబులు నీపర్వతరాజంబునకుఁ బ్రదక్షిణంబుఁ గావించుచుండు నని మేరుపర్వతమాహాత్మ్యంబు వివరింప నాకర్ణించి పాండునందను లాగంధమాదనంబునం గలవిశేషంబులం గనుంగొనుచు యక్షు లొనరించునుపచారంబులం గ్రహించుచు సంతతనియమపరులై యర్జునురాకఁ బ్రతీక్షించుచు నొకమాసంబచట వసించి రని వైశంపాయనుండు వివరింపఁగ నాకర్ణించి జనమేజయుండు ముదితహృదయుం డయ్యె.

చ. అనిలుఁడు వీచు భానుఁ డుదయంబును గాంచును వహ్ని దేజరి
ల్లును బురుహూతుఁ డారయును లోకశుభస్థితు లెల్ల మృత్యువుం
దన కెడమైనచోటుల నుదారతఁ బర్వును లోకయాత్రకై
యనవరతంబు నెవ్వనిభయంబున నాతని సంస్మరించెదన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమార ముద్దు వేంకటమహీపాల కరుణాపురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ వేంకటరంగనామధేయ విరచితం బయిన శ్రీమదాంధ్రీవచనభారతంబునం దరణ్యపర్వంబున ధర్మజునొద్దకు నారదుఁడు వచ్చి తీర్థమహిమంబుఁ జెప్పుటయు, రోమశుఁ డర్జునుకుశలంబుఁ దెల్పుటయు, ధర్మజుతీర్థాభిగమనంబును, నగస్త్యమాహాత్మ్యంబును, భగీరథుండుగంగం దెచ్చుటయు, ఋష్యశృంగచరిత్రంబును, బరశురామచరిత్రంబును, ప్రభాసంబునం బాండవయాదవసమాగమంబును, సౌకన్యాఖ్యానంబును, మాంధాతృచరిత్రంబును, జంతూపాఖ్యానంబును, శ్యేనకపోతీయాఖ్యానంబును, నష్టావక్రుమాహాత్మ్యంబును, యవక్రీతాఖ్యానంబును, రైభ్యచరిత్రంబును, గంధమాదనయాత్రయు, నారాయణాశ్రమనివాసంబును, భీముఁడుసౌగంధికంబులఁ దేఁబోవుటయు, హనుమద్దర్శనంబును, భీముఁడుయక్షరాక్షసులనిర్జించుటయు, జటాసురవధయు, భీముఁడుద్రౌపదికోరినపూవులఁ దేఁబోయి మణిమత్ప్రముఖులైనయక్షులజయించుటయు నన్నది ద్వితీయాశ్వాసము.

శ్రీకాళహస్తీశ్వరాయనమః.

## తృ తీ యా శ్వా స ప్రా రం భ ము.

క॥ శ్రీ కైవల్య పద ప్రే
ప్సా కలిత స్వాంత యోగి సంచింతిత ని
త్యైకత్వ, యన్వయ వ్యతి
రేక దృఢీకృత జని ప్రభృతి హేతుత్వా॥

దేవా ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుండైన వైశంపాయనుం డనంతరకథాకర్ణనోదీర్ణకుతుకహృదయుండైన జనమేజయున కిట్లనియె అంత నొక్కనాఁడు గంధమాదనంబునఁ బాండునందను లందఱు నొక్కచోఁ జేరి యర్జునువృత్తాంతంబుఁ దలపోయువా రంతరిక్షంబున మాతలిసారథికంబు పొగలేనియగ్నిజ్వాలపోలె నిజప్రభాపటలవిభాసితనభోభాగంబు నగునొక్కవిమానంబు లోచనగోచరం బగుడు నందు దివ్యకిరీటంబు, నమరతరుకుసుమమాల్యంబుల, నుత్తమాభరణంబులం దాల్చి వెలుంగుచున్నయర్జునుం జూచి హర్షోత్కర్షంబుఁ బొందుచుండ నయ్యర్జునుండు నాగిరివరంబుఁ జేరం జనుదెంచి యరదంబు డిగ్గి ధౌమ్యధర్మజభీమసేనుల కభివాదనంబులు గావించి తన కెఱఁగినకవలఁ గౌఁగిట నాదరించి పాంచాలిం దగినభంగుల నూరార్చి యన్నచెంగట వినయవినమ్రుఁడై యుండె. అందఱు నంత నింద్రుం డధిష్ఠించి పలుమాఱులు విజయంబుఁ గాంచుటం జేసి యత్యంతపూజనీయం బైన యయ్యుత్తమరథంబు వలగొని మాతలిం దగినసపర్యల గారవించి దేవతలకుశలం బడుగ నతం డందఱు నెలమి నున్నవా రనియెఱింగించి తండ్రికైవడి వారి కుచితంబుఁ గఱపి వారల వీడ్కొని యరదంబుఁ దోలుకొని దివంబున కరిగె. పదంపడి యర్జునుం డింద్రదత్తంబు లగుమేలితొడవుల ద్రుపదరాజపుత్రి కొసంగి బ్రాహ్మణులతోడ సుఖోపవిష్టుండైన యన్నపాలికిం జని తాను నాసీనుండై సురల మెప్పించుటయు వారివలన నస్త్రంబులు వడయుటయు మున్నగుతనపోయినపనుల నెల్లఁ గ్రమంబున విన్నవించి మాద్రీనందనులతోడ నారాత్రి సుఖనిద్ర సలిపె.

### ఇంద్రుఁడు పాండవులయొద్దకు వచ్చుట.

అట మఱునాఁడు వఱువాత యుధిష్ఠిరుండు తమ్ములతో నిష్టగోష్ఠిం బ్రొద్దుపుచ్చుచు నాకాశంబునఁ దూర్యనిస్వనంబులు రథనేమిఘోషంబులు వివిధఘంటారవంబులును. వినవచ్చిన సావధానుండై యరయుచుండునంత నచ్చోటికిఁ గాంచన

రథారూఢుండై పురందరుండు గంధర్వాప్సరోగణంబులు వెంటరాఁగఁ జనుదెంచి తేరు డిగుటయు ధర్మజుండు తమ్ములుం దానుం దటాలున లేచి యెదురేగి తోడ్తెచ్చి యుత్తమాసనంబున నాసీనుం జేసి పాదాభివందనం బొనర్చి విధియుతంబుగఁ బూజించి యర్జునుమహిమంబునఁ జేసి సురేంద్రునకు నభిగమ్యుఁడనైతిగాయని మదిఁ దలంచుచు వినయవినమితోత్తమాంగుండై నయయ్యనుంగుఁదమ్ముని సాదరావలోకనంబున గారవించుచుండ నతనికి సురేంద్రుం డిట్లనియె. ధర్మజా నీ విఁకఁ గొన్నినాళ్లలో నిడుమలనెల్లఁ బాసి సామ్రాజ్యంబు వహింతువు. అర్జునుండును నియతచిత్తుండై నావలన ననేకాస్త్రంబులఁ బడసి నాకుఁ బ్రియంబుఁ గావించె. వీనిం గెలువ ముల్లోకముల నేరును నేరరు. శుభం బయ్యెడు. కామ్యకంబున కరుగుఁ డనిబోధించి మహర్షిగణస్తూయమానుండై నిజలోకంబునకుఁ జనియె. గంధమాదనంబునం బాండునందనుల కయినయింద్రసమాగమం బనునీయుపాఖ్యానంబు నెవ్వఁడు బ్రహ్మచర్యనియమంబుతోఁ జదువునతండు నూఱేండ్లు సుఖమునను నని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె.

పాకశాసనుం డరిగినపిదప ధనంజయుండు తమ్ములుం బాంచాలియు వెంటరా భీమసేనపురస్సరుండై చని ధర్మరాజుం గాంచి నమస్కరింప నయ్యజాతశత్రుం డతనిశిరస్సు మూర్కొని సంతోషగద్గదస్వరంబు గదుర నన్నా, యిన్నిదినంబు లన్నాకలోకంబున నెట్లు గడపితివి? మహాస్త్రంబు లెట్లు వశగతంబు లయ్యె? లెస్సగ వానిం గ్రహించితివే? పరమేశ్వరుండు నింద్రుఁడు నేరూపములతో నీకు దర్శనం బొసంగిరి? వారు నీయెడ సుప్రీతులై నిజాస్త్రములఁ బ్రసాదించిరే? వారిచిత్తముల నెవ్విధంబున నారాధించితివి? ఇంద్రుఁడు నీవలనం బ్రియంబుఁ గాంచితి ననిన వాఁడు. అమ్మహాత్ముఁడు నట్లుగ్గడించుసంత యేమి చేసితివి? అంతయుం దేటపఱుపు మనియడుగ నన్న కర్జునుఁ డిట్లనియె.

## అర్జునుఁడు ధర్మరాజునకుఁ దనయస్త్రలాభంబు చెప్పుట.

మహారాజా. నీయుపదేశించినవిద్యం బరిగ్రహించి నీయానతిం దపంబు సేయ నిశ్చయించి కామ్యకవనంబు దాఁటి తఱలి భృగుతుంగం బనుగిరివరంబుఁ జేరం జని యారాత్రి యచట వసించి మఱునాఁటివేఁకువాత నొకబ్రాహ్మణుం గనుంగొని తత్ప్రశ్నంబునకు సదుత్తరంబుగ నిజవృత్తాంతం బెఱింగించినం బ్రీతుండై యతం డయ్యా, తపం బనుష్ఠింపుము. మహేంద్రుఁ డచిరంబ దర్శన మొసంగు ననిపలికిన వల్లేయని నేను హిమవంతంబుఁ జేరి తొలినెలఁ గందమూలంబులు రెండవనెల జలంబులు నాహారంబుగాఁ దృతీయచతుర్థమాసంబుల నిరాహారుండ నూర్ధ్వబాహుండనై యుగ్రతపంబు సేయుచుంటి. అట్లతితీవ్రంబుగఁ దపంబు సల్పుచుండినను నామేనఁ జెవ తఱుఁగదయ్యె. అది నాకు నెంతయు వింత య

య్యెడి. అటఁ బంచమమాసంబునఁ బ్రథమదివసంబు గడచిన మఱునాఁ డుదయంబున నొకవరాహంబు కర్కశం బగుముట్టెచే ధరణితలంబు జర్జరితంబు సేయుచుఁ గాళ్ల దుమ్ము రేఁచుచుఁ గఠినజఠరంబునఁ బుడమి రాయుచు నిటునటు చూచుచు నచ్చోటికిఁ జేర వచ్చె. వచ్చినం దానివెంట నొక్కయెఱుక విల్లమ్ములు గొని స్త్రీగణంబుతో నచటి కేతెంచి యాపందిపై నేను బాణ మేయుతఱి దానుం గూడ నేసి యట నాదిక్కు మొగంబై మొదట నాబాణంబులకు గుఱియైనయీయేకలంబుపై నీ వేల బాణ మేసితి? ఇది మృగయాధర్మవిరుద్ధంబు. అయినం గానిమ్ము. వాఁడితూపుల నీగం డడంతు. వెఱవక చక్క నిలు మని పరుషంబులఁ బలుకుచు విల్లు మోపెట్టి జ్యాఘోషంబు భీషణంబుగాఁగ బాణజాలంబు నాపయిం గప్పె. కప్పిన నేనుం గినిసి వజ్రములఁ బర్వతంబునుంబోలె నంపతుంపరల నొప్పింప నతండు దనరూపంబుల వేతెఱంగుల నగపఱిచె. నేనును వానిపై వేఱువేఱుగఁ బెక్కమ్ములఁ బ్రయోగింప నవి క్రమ్మఱ నొక్కటిగ నగపడియె. ఆమాయకు వెఱవక నేను వెనుదీయక వెండియుం గాండజాలంబు గురియింప నమ్మాయాకిరాతుండొకపరి యల్పకాయుండు బృహచ్ఛీర్షుండుగా వేఱొకపరి బృహత్కాయుం డల్పశీర్షుండుగను మఱియొకపరి యేకీభూతుండుగనుం గన్పడుచు ఘోరసంగ్రామంబున నను నొప్పించుచుండె. అంత నే నతం డలంతుల కోఁడఁ డని యెంచి వాయవ్యాస్త్రంబుఁ బ్రయోగించిన నదియు విఫలంబయ్యె. అయినను ధైర్యంబు దప్పక వివిధబాణంబులను శలభాస్త్రంబును బాషాణవర్షంబునుం బ్రయోగింప నక్కిరాతుండు వాని నన్నింటి నొక్క పెట్ట గ్రసించె. గ్రసించినం గొండొక చింతించి బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించితి. అది మంట లెగయ రోదసీకుహరంబు వెలిఁగించుచు సన్నిహితం బగుడు దానింగూడ నతండు నిర్వీర్యంబుగాఁ జేసె. ఆమహాసాధనంబు నేమియుం జేయనోపక ప్రతిహతం బగుటయు నే నధికభయవ్యాకులితచిత్తుండనయ్యు నెట్టకేలకు వట్టిదిట్టతనంబు వట్టి విల్లమ్ములం బిట్టుగొట్టిన నతండు వానిం గూడ మ్రింగె. అవ్విధంబున సకలసాధనంబులు నిహతంబులుగాఁగ వేఱొకవెరవు గానక బాహుయుద్ధమునకు సన్నద్ధుఁడనై పిడికిళ్లం బొడిచియు నఱచేతులఁ జఱచియుఁ బెక్కుపోకలఁ బోయియు వానిం గెలువనేరక చెయ్వులు దక్కి నేల కొఱగితి. అంత నాకుహనాకిరాతుండు పకపకనగుచు నప్పు డచ్చట నేఁ జూచుచుండఁగ నయ్యింతులతోడ నంతర్హితుండై పదంపడి కొండొకవడికిఁ గిరాతరూపంబు విడిచి భుజంగభూషణుండు పినాకపాణి యుమాసహాయుండు వృషభధ్వజుండునై న న్నేలుపరమేశ్వరుండుగ నామోలిఁ బొడగట్టె. అట్లు సన్నిహితుం డైన నసర్వేశ్వరుండు సంగరాంగణంబు దొలంగక యెదురై యున్ననన్నుఁ జేర వచ్చి కౌంతేయా! సంతుష్టుండనైతి. అమరత్వంబుదక్కఁ దక్కటిదాని వేనిం గోరికొనిన

నిచ్చెద. నీకోరిక చెప్పు మని యానతి యొసంగి తా మున్ను మ్రింగినగాండీవంబు నక్షయతూణీరంబుల నిచ్చిన నేనును సభక్తికంబుగ సాష్టాంగప్రణామంబు లాచరించి ప్రాంజలినై దేవా! నాయెడఁ బ్రసన్నుండవేని దేవతలయెడం గలయస్త్రంబుల నాకుఁ బ్రసాదింపవే యని ప్రార్థించితి. మదీయప్రార్థనం బవధరించి భక్తవత్సలుం డైనపరమేశ్వరుండు సుప్రీతుండై ప్రయోగోపసంహారపూర్వకంబుగఁ బాశుపతాస్త్రంబుఁ బ్రసాదించి నను నిర్దేశించి వత్సా యిమ్మహనీయాస్త్రంబు మనుష్యమాత్రులపైఁ బ్రయోగింపరాదు. అల్పులపైఁ బ్రయోగించిన నిది జగమెల్లం గాల్చు. కావున సర్వాస్త్రంబులు ప్రతిహతంబు లగుడుఁ గీడుమూఁడుతఱి నెద్దియు శరణంబుగాదేని దీనిం బ్రయోగించునది యని యానతిచ్చి యదృశ్యుండయ్యె. పరమేశ్వరానుగ్రహంబునఁ బాశుపతాస్త్రంబును నాకు వశవర్తి యయ్యె.

అంత నారాత్రి గడపి నేను మఱునాఁడు ప్రాతఃకరణీయంబులఁ దీర్చి తొల్లి చూచినవిప్రవర్యుం జూచి యంతయు నెఱింగింప నతండు సంతసించుచు నీ వెంత పుణ్యంబుఁ గావించితివో. పరమేశ్వరు నందఱుం జూడఁ గలరే? వేగంబ యింద్రాదిలోకపాలురు సన్నిహితులై నీకుఁ దమతమయస్త్రంబుల నిత్తురు. శుభం బయ్యెడు మనిదీవించి యథేచ్ఛంబు చనియె. అట మధ్యాహ్నం బగుడు లలితమారుతంబు వీచుటయుఁ, గుసుమవర్షంబు గురియుటయు, వివిధవాద్యనిస్వనంబులు స్తుతిరవంబులు గంధర్వాప్సరోగణసంగీతకంబులును విననగుటయు నిది యేమియొక్కొ యనితలపోయుచున్నంత శచితోడ మాతలిసారథికం బైనరథం బెక్కి యింద్రుఁడుం దమతమవిమానంబుల నారోహించి తక్కటిలోకపాలురు నచ్చటికి వచ్చి సవ్యసాచీ, దేవకార్యార్థంబు పరమేశ్వరుం గనుఁగొని తదీయదివ్యాస్త్రంబు గ్రహించితివి. లోకపాలుర మగుమాయస్త్రములనుం గ్రహింపు మనిన మహాప్రసాదంబని నేను శుచినై వారికిఁ బ్రణామంబు లాచరించినం దమయస్త్రములం బ్రసాదించి వారు నిజలోకంబులకుఁ జనిరి. ఇంద్రుఁడు ననుఁ బిలిచి ఫాల్గునా. స్వర్గంబునకు రమ్ము. పుణ్యతీర్థంబులఁ గృతస్నానుండవై మహాతపంబు సల్పిననీకు స్వర్గంబునకురాక సులభంబ. మాతలి నినుఁ దోడ్కొనివచ్చువాఁడు. ని న్నే నెఱుంగుదు. దేవతలు మునులు నెఱుంగుదు రనిన నేను దేవా. నాయెడఁ బ్రసన్నుఁడవై యస్త్రంబు లుపదేశింప నాచార్యుండ వగు మనిప్రార్థించితి. దేవేంద్రుండు వత్సా, యస్త్రంబు లేల? వానిం గడించినఁ గౌర్యం బగు. దేనిం గోరి యస్త్రములఁ బడయ వేఁడుదువో దానిన యుపేక్షింపరాదో! నీకోర్కు లీడేరెడు మనిన నేను మహాత్మా, మహనీయాస్త్రంబుల మనుష్యమాత్రులపైఁ బ్రయోగింపను. మఱి లాఁతియస్త్రంబులఁ బని కానితఱి వీనిం బ్రయోగింతు. క్రూరత్వం బగు నని భావింపవల దని నివేదించినం జిత్తగించి నిర్జరేశ్వరుండు వెండియు ననుం గాంచి నీచిత్తం

బెఱుంగ ని ట్లడిగితి నెండేమియుం గాదు. ఇట్లు పలుక మదాత్మజుం డయినసీక తగు. స్వర్గలోకమునకు వచ్చినపదంపడి వాయవ్యాగ్నేయవాసవవారుణవైష్ణవాది సర్వాస్త్రంబుల నిత్తు ననివచించి యంతర్హితుం డయ్యె.

అంతం గొంతవడికి మాతలి యింద్రరథంబుతోడ వచ్చి నను గాంచి పాండునందనా! యాఖండలుండు నిను నమరావతికిం దోడ్కొనిర మ్మనినం బనివిని నే వచ్చితి. మాయామయంబు పుణ్యైకగమ్యంబు నగునీరథం బారోహించి నాక లోకంబున కరుదేర మనిన నేను నప్పర్వతంబు నామంత్రణంబుసేసి యారథంబు వలగొని యారోహించితి. ఆరోహించుటయు నశ్వతత్త్వవిదుండై నమాతలి మనో వేగంబు లయినయారథ్యంబులం దోలుచు నను గాంచి విస్మితుండై యిది యెం తయు నాకుఁజూడ నబ్బురం బయ్యెడి. నీవు తే రెక్కినతటి సురేంద్రుఁడును గన్న డిమె. తేరు గదలినపిదప నీవే గన్నడిమెదవు. నీమహిమం బింత యొప్పునే యని నను నగ్గించి యుప్పరంబున నరదంబుఁ బఱపించె. నేనును నారథంబున వియత్ప థంబునం జనుచుఁ బుణ్యవిమానంబులను, నందనాది దేవోపవనంబులనుం గనుచు సూర్యప్రభాప్రచారంబు లేకున్నను నిజతేజఃపుంజంబున వెలుంగుదాని, శీతో ష్ణాదిద్వంద్వదుఃఖవిరహితంబై నదానిం, బుణ్యమహిమైకలభ్యంబగుదాని, నిత్య పుష్పఫలంబులు శుకపికాదివిహగమధురస్వరభాస్వరంబులు నగుతోఁటల వెలయు దానిం, దమ్మికొలఁకులనలరారుదాని నమరావతిం జొత్తెంచి యచటిసురభిశీతల లలితమరుత్కందళాందోళనంబున కిచ్చమెచ్చుచు వసురుద్రాదిత్యసిద్ధసాధ్యాదులం గాంచి నమస్కరించి వారిదీవనలం బడసి నగరుమొగసాల నరదంబు డిగ్గి పురం దరుసన్నిధికిం జని కృతాంజలినై సాష్టాంగదండప్రణామంబు లాచరించితి. సురేం ద్రుండును సుప్రీతుండై నను గ్రుచ్చియెత్తి మేనెల్ల నిమిరి యర్ధాసనంబున నిడి కొని పలుదెఱంగుల గారవించి యెలమిఁ గాంచె. అనంతరంబ క్రమంబున దివ్యా స్త్రంబుల నుపదేశించి విశ్వావసుపుత్రుం డైనచిత్రసేను నాకుం జెలికానిఁగఁ జేసి వానివలన గాంధర్వంబు నేర్పించె. గృహీతాస్త్రుండ నభ్యస్తగాంధర్వుండనునై నే నింద్రభవనంబున గీతవాదిత్రమాధుర్యంబు నప్సరోగణనృత్యచాతుర్యంబు నర యుచు నస్త్రవిద్యాభ్యాసంబునంద కరంబు మది దవిలియుంటి.

### అర్జునుఁడు ధర్మరాజునకు నివాతకవచవధప్రకారంబుఁ జెప్పుట.

అక్కరణిం బెద్దకాలంబు చన నొక్కనాఁడు నిలింపనాయకుండు నన్నుఁ బిలిచి యాదరించి కురూద్వహా, సురలును నిను గెలువ నేరరు. ఇఁక మనుష్యులు గెలువనేర రని వేఱచెప్పనేల. సంగరాంగణంబున నీ వప్రధృష్యుండ వనదృ శుండవు. దివ్యంబులైనపదియేనస్త్రంబులనుం బ్రయోగోపసంహారావృత్తిప్రాయ శ్చిత్తప్రతిఘాతంబుఁ లనువిధు లేనింటితోడ నేర్చితివి. గుర్వర్థంబుఁ దీర్ప నిది

యవసరం బయ్యె నెడంబడవలయు ననిన నేను దేవా, నీయానతిచ్చుదానిం జేయ నోపుదునేని దానిం జేసితి ననియ తలంచు మనివిన్నవించిన నగుచు నముచి సూదనుండు వెండియు నా కిట్లనియె. కౌంతేయా, ముల్లోకంబుల నీ కసాధ్యంబు గల్గనేరదు. నివాతకవచు లనువారు మూఁడుకోట్లదానవులు తుల్యరూపబలులు సముద్రమధ్యంబు దుర్గంబుగఁ జేసికొని యెరిని సరకుగొనక పోతరించి నాకు శత్రుత్వంబుఁ జేయుచున్నవారు. వారిం బరిమార్పుము. అది గుర్వర్థం బయ్యెడి. మాతలి సారథికంబును, మయూరసమవర్ణ గోమహయాయుత యోజితంబును, విజయధ్వజసమంచితంబు నగునారథం బారోహించి చను మనిన నేను వల్లే యను టయు నియ్యుత్తమకిరీటంబుఁ దాన నాయుత్తమాంగంబునఁ బొందుపఱిచి యభే ద్యంబును స్పర్శరూపంబు నగునీకవచంబుఁ దొడిగి సదృశభూషణంబుల నలం కరించి శిథిలంబుగానియీగొనయంబు గాండివంబున సంయోజితంబుఁ జేసి యిఁకఁ జనుము. విజయంబుతోడ రమ్మని యానతిచ్చె. నేనునయ్యింద్రస్యందనం బెక్కి చను చుండ రథఘోషంబు విని సురలు రథంబున నున్ననన్ను సురేంద్రునిగఁ దలఁచి తటాలున నరుదెంచి ఫల్గునా, యేమి సేయుచు వనియడుగుటయు నేను నివాతకవచ వధార్థం బరిగెద విజయంబు సేకూఱ దీవింపుఁ డనినివేదించితి. వారు నాయెడం బ్రసన్నులై తొల్లి నిలింపనాయకుం డీరథం బారోహించి బలవృత్రనముచిశంబ రాసు లగుపెక్కండ్రదానవుల జయించె. నీవును నివాతకవచుల వధింతు వని చెప్పి యొకశంఖంబుఁ జూపి యింద్రవిజయంబునకుఁ దొల్లి యిదియుం గారణం బయ్యె. దీనిం గ్రహించు మని యాశంఖంబొసంగిరి. దానిం గైకొని నేను మహ ర్షులు మెచ్చుచుండఁ దఱలి తిమితిమింగిలాది యాదోగణసంకీర్ణంబు నుత్తుంగ తరంగమాలి కాభీలంబు నగుపారావారంబుఁ జేరం జని నివాతకవచపురంబుఁ గాంచితి. తత్క్షణంబ మాతలి యాపురంబున నరదంబు రయంబునం బఱపించు టయు నివాతకవచులు నను సురపతిఁగ నూహించి పురంబు సురక్షితంబు చేసి కొనుచుండ నేను రోదసీకుహరంబునఁ బ్రతినిస్వనం బెసంగ సకలభూతంబులు భయంబున నచ్చటచ్చట డాఁగ దేవదత్తంబుఁ బూరించితి. ఆభీషణధ్వా నంబు విని నివాతకవచులు కవచంబులం దొడిగి గదాశూలపట్టసముసలకరవా లాదిసకలసాధనంబులం బూని సమరసన్నాహంబున వచ్చుటయు మాతలి యత్య ద్భుతంబుగ సారథ్యంబు సల్పుచు రథంబొక్కసమప్రదేశంబునఁ బఱపింపఁగవారు తిమితిమింగిలాదియాదోగణంబులు విగతసత్వంబులుగాఁగ వికృతిస్వరంబు లగు వివిధవాద్యంబుల మ్రోయించుచు నాపైఁ గవియుటయుఁ బోరు ఘోరం బయ్యె. అట్టియెడ బ్రహ్మర్షులు, దేవర్షులు, సిద్ధసాధ్యాదులును సన్నిహితులై నాగెలుపుఁ గోరుచు ననురూపస్తుతివచనంబుల నను నగ్గించుచుండిరి. నివాతకవచులు నంతటఁ

జుట్టుముట్టి శూలపట్టసాద్యాయుధంబులను వివిధబాణంబులనుం గురియించు
టయు నేను వారిపైఁ బ్రత్యేకంబ పదేసి యమ్ము లేసిన వారు గొందఱు విముఖు
లగుడుఁ దెఱపిఁ గని మాతలి పదివేలరథ్యంబుల నతిరయంబున నయ్యసురసేనపైఁ
దోలఁగ నశ్వచరణపాతంబునను, రథనేమినిర్ఘాతంబునను, మదీయబాణప్రహా
రంబుననుం బెక్కండ్రు హతులైరి. హతశేషు లగునయ్యసురులు వెండియు
నంతట నావరించి నానాయుధంబులం బ్రయోగించిన మాతలి నేర్పునసారథ్యంబు
పరమాద్భుతంబుగఁ జేయుచుండె. నేను లఘుచిత్రంబు లయినయనేకాస్త్రంబుల
నేసి నొప్పించినం గొందఱు గతాసు లైరి. కొందఱు మఱలి చనిరి. కొందఱు
నాగెల్పు సైఁపక యందఱుం బురికొల్పికొని యొక్కయుమ్మడిగఁ గవిసి యంప
తుంపరం గురియించిన నేను బ్రహ్మాస్త్రమంత్రితంబు లయినలఘుచిత్రాస్త్రంబులఁ
గొదఱం గీటడంచితి. అంతకుఁ గడుం గినిసి హతశేషులు శక్తిశూలఖడ్గాది
సాధనంబులం బ్రయోగించిన నేను దేవరాజప్రియం బైనమాధవం బనునస్త్రం
బభిమంత్రించి యేసి తదస్త్రంబులనెల్ల సమయించి వేలువేలుగ వారిపైఁ బదేసి
బాణంబుల నేసి నొప్పించితి. నొచ్చియు వారు వెనుదీయకకోపావేశంబున వెండియుం
దొడరి కాండజాలంబుఁ బఱపింప నేను బ్రత్యస్త్రంబులఁ దదీయమార్గణంబుల
మగిడించి తీక్ష్ణనారాచంబుల వారల గాఢ నేయఁగ వర్షకాలంబున గైరికధాతు
పటలపాటలంబు లయినపర్వతశిఖరంబుల వెలువడువెల్లువలపగిదిఁ దదీయకా
యంబుల రుధిరధారలు వెడలె. అంత నిలువక యయ్యసురులు మాయచేఁ
బాషాణవర్షంబుఁ గురియింప నేను వజ్రాస్త్రంబున నాఱాలనెల్ల మిడుఁగుఱు
లెగయఁ బొడిచేసితి. అది విఫలం బగుడు వేఱొక్కమాయఁ బన్ని జలవర్షంబుఁ
గావించుటయుఁ దదీయధారాసంపాతంబునను గర్జితస్ఫూర్జితంబులను దిగ్భ్ర
మంబుతోడ సమ్మోహంబు నన్నలముటయుఁ గొంత చింతించి యింద్రోప
దిష్టం బైనవిశోషణాస్త్రం బేసి యాజలం బెల్ల వట్టిపోవఁగఁ జేసితి. పదంపడి వారు
మాయాబలంబున గాడ్పుతోడ ననలంబు గవియంజేసిన నేను సలిలాస్త్రంబున
నగ్నిం బర్వతాస్త్రంబున వాయువును నడంచితి. ఆమాయయుఁ బ్రతిహతం బగు
టయు నారక్కసు లుక్కుమిగిలి యొక్కపెట్టఁ బెక్కుమాయలఁ బన్ని ఘోరా
స్త్రంబుల నగ్నిం బాషాణంబులం బ్రచండమారుతంబుతోడం గురియించుటయు
నమ్మాయావర్షంబునం జేసి కటికిచీఁకటి పెల్లునఁ దెరువు దోఁపక మదీయరథ్యం
బులు విముఖంబు లగుడు నాకును వెఱపు గదురుచుండ మాతలినొగలపై
నొఱగి తత్తఱం బొంది యర్జునా, యేమి చేయుదము. తొల్లి సురాసురుల కమృ
తార్థం బయినసంగ్రామంబును, వృత్రశంబరాదులతోడిసంగరంబునుం గాంచితి.
అపుడు నేన యింద్రునకు సారథినై యుండి సమరప్రకారంబులనెల్లఁ గనుఁగొం

టినిగాని యిట్టిఘోరసమరంబు నెప్పుడుం గాననైతి. ఎంతయే భయం బయ్యెడి. పరికింప నిది పోరుకాదు. మఱి బ్రహ్మనిర్ణీతం బయినజగత్సంహారంబ యని వెలవెలనై పలికిన నేను ధైర్యం బవలంబించి యింద్రసారథీ, వెఱవకుము. మదీయ భుజబలంబును గాండీవప్రభావంబునుం గనుంగొనుచుండుము. ఈరాక్షసుల దారుణమాయలెల్ల మాయింతు ననిబోధించి సర్వశత్రుమోహిని యైనయస్త్రమాయం బ్రయోగించి యామాయల సమయించుటయు నారాక్షసులు క్రమ్మఱం బెక్కుమాయలు వన్నినం దద్బలంబున నొక్కపరి జగంబెల్ల గాఢాంధకారావృతంబుగ, నొక్కపరి ప్రకాశంబుగ, నొక్కపరి జలమగ్నంబుగ నగపడియె. అపుడు మాతలి ప్రకాశంబుతఱి సంగరాంగణంబున నేర్పున రథంబుఁ దోలఁగ నాసమయంబునఁ బైపై వచ్చునాదానవులనెల్ల నేనుఱుమాడుచుండఁ గొండొకవడికి వారు మాయాప్రభావంబున నదృశ్యులై పోరు సేయందొడంగిరి. తొడంగుటయు నేను నుత్తమాస్త్రంబుల సమ్యక్ప్రతీకారంబునం బ్రయోగించి యదృశ్యులగువారిం గూడఁ జంపుటయు హతశేషులు మాయఁజాలించి సంగరాంగణంబుఁ దొలంగి పురంబునకుఁ బాఱఁగ మాయ లేమింజేసి యంతయు నపుడు దృష్టిగోచరం బయ్యె నేమి చెప్పుదు. ఎచ్చటఁ జూచినం గ్రిందఁదుత్తునియలై పడినరక్కసులయంగంబులయు భూషణంబులయుఁ దెట్టలుకొండలవడువున నగపడియె. ఆపీనుఁగుపెంటలలో నడుగువెట్టుటకైన గుట్టములకుం దెఱపి దొరకదయ్యె. అంతం గొంతవడికి నా రాక్షసులు జయంబుఁ గోరి క్రమ్మఱ దురమున కాయితపడి యరుదెంచి మాయాబలంబున నదృశ్యులై కొంద ఱాకసంబున కెగసి యంతటం గొండలు పడవైచిరి. కొందఱు రథచక్రంబులను రథ్యచరణంబులనుం గట్టిగఁ బట్టి నిగ్రహించిరి. పర్వతావరణంబునను రాక్షసాక్రమణంబునను నేను గుహలో నున్నవానిపోలెఁ గదలనేరక చింతిల్లుచుండ మాతలి యర్జునా! వెఱవకుము. వజ్రాస్త్రముఁ బ్రయోగింపు మనిబోధించిన నేనుం దద్వచనంబు విని తత్క్షణంబ యమ్మహనీయాస్త్రంబుఁ బ్రయోగించుడు వారు తదస్త్రప్రహారంబునం జేసి యందఱుం గూలిరి. రథరథ్యసారథులకు నాకుం గొంచెమేని యపాయంబు గలుగ దయ్యె. అవ్విధంబున నా మూఁడుకోట్లరక్కసులు మడియుటయు మాతలి నగుచు ననుం గాంచి యర్జునా; వీర్యంబున దేవదానవు లెవ్వరేనియు నీకు సరిగా రని పలుదెఱంగుల నగ్గించె. అటనాదానవపురంబునం దదంగనలయాక్రందనధ్వనులు నింగిముట్టె. నేను నపుడు రథఘోషశ్రవణమాత్రఁ బౌరాంగనలు బెదరి గృహాంతరమునకుఁ జనుచుండ రథారూఢుండనై వారినగరంబు సొచ్చి యావీటిసొంపున కచ్చెరువంది మాతలిం జూచి యత్యంతరమణీయం బైనయీపురంబు నమరు లేల ప్రవేశింపరై రని యడుగ నయ్యింద్రసారథి నా కిట్లనియె. తొల్లి దేవేంద్రుం డీపురంబున దేవతల

తోడ వసింప నివాతకవచులు విక్రమించి వారినెల్ల వెడలఁగొట్టి యుగ్రతపంబున బ్రహ్మ నారాధించి సురలవలనివెఱపు గలుగకుండఁగ నీపురంబు తమ కునికిపట్టుగను వరంబుల సంపాదించి దీని నాక్రమించిరి. వృత్రశత్రుఁడు నంతట నివాతకవచవధోపాయం బానతిమ్మని బ్రహ్మదేవుం బ్రార్థింప నప్పితామహుండు ప్రసన్నుండై యియ్యసురుల సురేతరుండు వధించు. కాలంబు ప్రతీక్షించునది యని వక్కాణించె. ఏతద్వధార్థంబు దేవేంద్రుఁడు సర్వాస్త్రముల నీ కుపదేశించె. సురలకవధ్యులైనయీదుష్టాత్ములు నీచేఁ బొలిసి రని తత్ప్రకారంబు వివరించి రథంబుఁ ద్రిమ్మరించె.

## అర్జునుఁడుధర్మజునకుఁ బౌలోమకాలకేయవధ ప్రకారంబుఁజెప్పుట.

అట్లు నివాతకవచుల వధించి క్రమ్మఱి చనుచు నేను ముందట సూర్యాగ్నిసమప్రభంబు, కామగమనంబు,చతుర్ద్వారంబు, గోపురాట్టాలకప్రాకారభాసురంబు, వివిధాయుధధారిదనుజయోధసురక్షితంబు, దివ్యోపవనరుచిరంబు నగు నొకపురంబుఁ గాంచి యిది యేమి యని మాతలి నడిగిన నతండు నా కిట్లనియె. పులోమయుఁ గాలకయు ననువా రిద్దఱు దితికూఁతులు తొల్లి దివ్యవర్షసహస్రంబు తీవ్రతపంబున బ్రహ్మ నారాధించి యప్పరమేష్ఠివలనఁ దమకొడుకుల కల్పదుఃఖత్వంబును సురాసురులచే నవధ్యత్వంబును నిరామయం బైనయీపురంబును వరంబులఁగాఁ బడసిరి. ఇది హిరణ్యపురం బనంబరఁగు. బ్రహ్మవరంబునం జేసి దేవదానవు లెవ్వరికిం జెనకరానియీపురంబునఁ బౌలోమకాలకేయు లనువారున్నవారు. మనుష్యునివలన వీరికి మృత్యువు బ్రహ్మవిహితంబై యుండు. కావున నీవు వీరినిం బరిమార్పు మనిచెప్పిన నేనుం బ్రహృష్టుండనై యరదం బాప్రోలి దెసం బఱపింపు మంటి. మద్వచనంబున మాతలి యట్లచేయఁగఁ బౌలోమకాలకేయులఱువదివేవురు రథికులు సకలసాధనసమన్వితులై యెత్తివచ్చి నాపై ననేకాస్త్రంబులం బ్రయోగించిన నేను విద్యాబలంబున శరవర్షముఁ గురియించి తదస్త్రంబులనెల్ల మగిడించి వారికి మోహంబుఁ గావించితి. దానం జీకాకుపడి వారిటునటుం బాఱుచుండఁ గొందఱు పరస్పరప్రహారంబునం బొలియుటయుఁ గొంత వడికిఁ దెప్పిఱిల్లి కొని మాయలు పన్ని పురంబుతోడ త్రివ్వున నుప్పరంబునకెగయం బోయిన నేను బాణజాలంబున నాకసంబుఁ గప్పి గతినిరోధంబుఁ గావించితి. కావించినను బ్రహ్మవరప్రభావంబునఁ గామగమనంబు గావున నానగరం బంతర్భూమిపతితంబుగనూర్ధ్వప్రతిష్ఠితంబుగఁ దిర్యక్ప్రయాతంబుగ జలనిమగ్నంబుగనుం బెక్కు దెఱంగులం గానవచ్చుటయు నేను దివ్యాస్త్రంబులం బ్రయోగింప నదిభగ్నంబై నేలంగూలె. అట భగ్నంబైన యావీడు విడిచి యారక్కసు లీసునం గవిసి నాయేయును త్తమాస్త్రంబుల కన్నింటికి మాఱేయుచుఁ బెక్కుమాయలఁ జూపుచు నంత

కంత కగ్గలంబుగఁ జలంబు వాటించుచు బహుప్రకారంబుల నన్ను నొప్పించుచుండిన నే నమ్మహాసమరంబున నొండు శరణంబు గాదని తలంచి ప్రయత్నమానసుండనై త్రిపురాంతకుధ్యానించి "స్వస్తిభూతేభ్య" యనిపలికి పాశుపతాస్త్రంబుఁ దలంచుటయు నామ్రోలఁ ద్రిశీర్షుండు భుజంగభూషణుండు నగుపురుషుండు గానంబడియె. వెంటన గాండీవమున నమ్మహనీయాస్త్రసంయోగంబు దోఁచె. అటఁ బరమేశ్వరునకు సభక్తికంబుగఁ బ్రణామంబు లాచరించి పౌలోమకాలకేయవధార్థంబుగ నారౌద్రాస్త్రంబుఁ బ్రయోగించితి. ఆదివ్యాస్త్రప్రభావంబున సింహశార్దూలశరభగజఋక్షమహిషవరాహవానరసాలావృకపన్నగయక్షరాక్షసపిశాచగుహ్యకగంధర్వాదివర్గంబులు ఘోరరూపంబులతో నుద్భవిల్లి వారినెల్లఁ బరిమార్చినం జూచి మరల మహాదేవునకుం బ్రణతు లొనరించితి. అట్లు పౌలోమకాలకేయు లందఱు హతు లగుడుఁ దద్వనితలరోదనారవంబు రోదసీకుహరంబు నిండె. ఆదానవపురంబు శుష్కవృక్షం బైనకాననంబువిధంబున సొంపుదప్పె. మాతలి మదీయపరాక్రమంబున కత్యంతసంతుష్టుండై కుంతీనందనా, పురందరునకు నశక్యం బైనయీపని నొనరించిననీపరాక్రమంబు వాక్రువ్వ నలవియేయని ననుఁ బలుమాఱు లగ్గించి రథంబు మగిడించి త్రిదివంబునకుఁ దోడ్కొని చని నివాతకవచపౌలోమకాలకేయవధప్రకారం బంతయు సవిస్తరంబుగ సురేంద్రునకు విన్నవించిన నవధరించి యవ్విబుధనాథుండు సంతసిల్లి నా కిట్లనియె. ధనంజయా, సురాసురులకు నసాధ్యం బయినకార్యం బొనర్చితివి. గుర్వర్థంబుఁ దీర్చితివి. నీవిక్రమంబునకు మెచ్చితి. ఎల్లపుడు నిట్ల రణాంగణంబున సుస్థిరుండవయి యస్త్రప్రతిపాదనంబున జాగరూకుండ వగుము. భవద్భుజబలనిర్జితం బయిన భూమండలం బజాతశత్రుండు పాలించువాఁడు. దివ్యాస్త్రంబులకలిమిం జేసి నిన్నెవ్వరు మార్కొనఁనేరరు. భీష్మద్రోణకృపకర్ణశకునిప్రభృతులెల్ల నీలోనఁ బదునాఱవపాలిటివారుగారు. నీయన్నదమ్ము లెల్లపుడు నిన్నుఁ దలంచుచుందురు గావున భూలోకంబునకుఁ జను మనియానతిచ్చి యీకవచంబునుం, గనకమయం బయిన యీమాల్యమ్మును, దేవదత్తం బనునీశంఖంబు, నీకిరీటంబును, నీదివ్యాంబరాభరణంబులను నిచ్చిపంచిన సురగణసమన్వితుం డై ననునాసీరుననుజ్ఞం గొని మిముఁ గనుంగొన నువ్విళ్లూరుమనంబుతో నరుదెంచి యీగంధమాదనగిరిశిఖరంబున మీదర్శనంబుఁ జేసితి. ఇట్లే నింద్రలోకంబున జూదమువలనం గలిగినయనర్థంబుఁ దలపోయుచు నయిదేడులు వసించితి నని యర్జునుండు తనవృత్తాంతం బంతయు నివేదించినం బాండవాగ్రజుం డనుంగుఁదమ్ముని సాదరావలోకనంబునం గారవించి ధనంజయా, భాగ్యవశంబున నీవుదివ్యాస్త్రంబులఁ బడసితివి. సురేంద్రు నారాధించితివి. పార్వతీశ్వరుం బోరున మెప్పించితివి. లోకపాలురతోడం గలిసి

తివి. భూమండలం బెల్ల జయించితిననియు ధార్తరాష్ట్రుల వశీకరించికొంటిననియుం దలంచెద. నివాతకవచుల వధించిననీయస్త్రంబులఁ జూడఁ గోరెద ననియడుగ నర్జునుండు జేపు చూపెద ననుటయు నందఱు నర్జునువృత్తాంతంబ తలంచుచునారేయి గడపిరి.

అర్జునుఁడు ధర్మరాజునక స్త్రములఁజూపుట.

అంత మఱునాఁడు ధర్మనందనుండు కల్యకృత్యంబులఁ దీర్చి తమ్ములతోడం గొలువుండి యర్జునుం బిలిచి యస్త్రములఁ జూపు మనియడిగిన నక్కిరీటి శుచియై గాండీవ దేవదత్తాదిసకలసాధనసమగ్రుండై పార్థివరథం బధిరోహించి క్రమంబున దివ్యాస్త్రంబులనెల్లఁ జూపఁ దొడంగె. అప్పుడు పుడమి వడఁకె. సరిత్సముద్రంబులు గలంగె. కొండలు పగిలె. సూర్యాగ్నిప్రకాశంబు మాసె. మారుతవీజనం బడంగె. బ్రాహ్మణులకు వేదంబులు దోఁపవయ్యె. రసాతలగతంబులైనప్రాణివర్గంబులెల్ల నస్త్రపరితాపం బోర్వక గడగడవడఁకుచు నర్జునుం బరివేష్టించి యంజలిబంధంబులు ఘటియించి వదనవికారంబు గదుర నభయంబుఁ బ్రార్థించె. జంగమ భూతంబులెల్లఁ జెయ్వులుదక్కి నిలిచె. సిద్ధసాధ్యయక్షరాక్షస గంధర్వ సురమహర్షిప్రముఖులు, లోకపాలురు, బ్రహ్మరుద్రేంద్రాదులును దటాలున నేతెంచిరి. సురచోదనంబున సమీరణుండు దివ్యమాల్యంబుల నర్జునుచుట్లం బడవైచె. గంధర్వులు పాడిరి. అచ్చర లాడిరి. అట్టియెడ సురగణబోధితుండై నారదుండు వచ్చి యర్జునా! దివ్యాస్త్రముల నిపుడు ప్రయోగింపవలదు. ఇవి యెదురు లేకున్న దైన్యంబు గలుగకున్నం బ్రయోగించిన లోకక్షయం బాపాదించు. సురక్షితంబులైన సుఖంబుఁ గావించు. ఇఁక నెన్నఁడు నిరధిష్ఠానంబుగ వీనిం బ్రయోగింపకు మనిబోధించి ధర్మరాజుదెసమొగంబై ధనంజయుండు సమరరంగంబునం బ్రయోగించునెడ వీనిం జూడఁగల వనిచెప్పి వారించి చనియె. సురలుం దమతమనివాసంబుల కరిగి రనిన జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, సవ్యసాచి వచ్చినపదంపడి పాండునందను లేమి చేసి రనియడుగ నతం డతని కిట్లనియె.

అటఁ బాండవు లర్జునుతోడం గలిసి గంధమాదనంబునం గలవి శేషంబులం గనుంగొనుచుఁ గుబేరానుగ్రహంబునం జేసి సుఖంబున నావనంబులందు నాలుగేం డ్లేకరాత్రమాత్రంబై తోఁప వసించిరి. అట్లు వారికి వనంబులం దొల్లింటియాఱేండ్లు నర్జునాగమనానంతరంబున నాలుగేండ్లునుం గలిసి పదియేఁడులు గడవ నొక్కనాఁడు భీమసేనుం డేకాంతంబున ధర్మరాజుఁ జేరం జని తమ్ములు విన నిట్లనియె. మహారాజా, నీప్రతిజ్ఞ సత్యం బయ్యెడి. మనవనవాసంబునఁ బదియేఁడులు గడచె నిది పదునొకండవయేఁడు నడచుచున్నది. దుష్టాత్ముఁ డైనదుర్యో

ధను వంచించి యజ్ఞాతవాసంబు గూఢవృత్తిమై నడపి వైరంబు పుష్పితంబు ఫలితంబునుంగాఁగ నాధార్తరాష్ట్రుని సపరివారుం దెగటార్చి కీర్తి వెలయ రాజ్యంబు సేయుచు వేదచోదితక్రియాకలాపంబుల నాచరింపుము. పగఱఁ బరిమార్చుటది నీ కెంతపని. నిక్కంబ నీ వల్గిన వజ్రధరుండును మార్కొనం జాలఁడు. నీ యర్థంబు నెఱవేర్ప వాసుదేవుండును, సాత్యకియు, నర్జునుండు, నేనునుం గవలుం బూనియునికి నెఱుంగవే? ఇఁక నీవనంబులం గలవిశేషంబులం గాంచుచు మగిడి యరిగెద మనిన ధర్మతనయుండు తమ్ములమతం బెఱింగి యటఁ దఱలనెంచి యచటిసదనంబును, నదులను, సరస్సులను, గుబేరానుచరులను నామంత్రణంబు చేసి సుహృత్సహాయంబున వైరులం దెగటార్చి తపోనుష్ఠానార్థంబు మగుడ నిచ్చటికిఁ జనుదెంతు నని యూహింపుచుండె. గోమశుండునుం బాండవులకు ధర్మంబు లుపదేశించిదివంబున కరిగె. పాండవులునుం బ్రాహ్మణగణసమన్వితులై యథాపూర్వంబుగ ఘటోత్కచుఁడుం దదనుచరులును వహింపఁగ నచ్చోటువాసి తఱలి యార్ష్టిషేణునొద్దకుఁ జనుదెంచి యమ్మునికిఁ బ్రణతులై ధర్మానుశాసనపూర్వకం బయినతదనుజ్ఞం గ్రహించి యచటిరమ్యదేశంబుల విడువనేరక మెట్టకేలకు వానిం దొఱంగి వనమార్గంబునం గైలాసంబుఁ గడచి వృషపర్వాశ్రమంబుఁ జేరి యారాజర్షి చేసినపూజలం గైకొని యట నొక్కరేయి వసియించి తదనుజ్ఞాతులై బదరికారణ్యంబుఁ బ్రాపించి నందనోపమం బయినయచ్చోట నతిసుఖంబుగ నొక్కమాసంబు వసించి హిమవత్పర్వతపరిసరంబునం గిరాతదేశంబునఁ జీనతుషారదరదాదిదేశంబుల నతిక్రమించి సుబాహుపురంబుఁ బ్రవేశించి యతనిసపర్యలం గైకొనుచు నచట నేకరాత్రంబు వసించి యందుఁ దమపరిచారకులైన యింద్రసేనవిశోకాదులం గూడి ఘటోత్కచుఁ బోవఁ బనిచి నిజరథారూఢులై హిమవదుపత్యకావిపినంబుల విశాఖయూపంబు సేరి యచట వేటలాడుచు వేడుకమై నొక్కసంవత్సరంబు వసించి రంత నొక్కనాఁడు వృకోదరుండు వేటకై చని యొక్కపన్నగరాజుచేతఁ బట్టువడి చిక్కిన ధర్మరాజు విడిపించె. అటఁ బండ్రెండవయేఁడు డాయుటయు వా రచ్చోటు వాసి యమ్మరుభూమిపథంబున సరస్వతీతీరంబున వివిధతరునికరనీరంధ్రంబును మహర్షినివాసంబు నగుద్వైతవనంబు సేరి బ్రాహ్మణులతోడ విహరింపుచుండి రనిన జనమేజయుండు వైశంపాయనమునీంద్రా, మహాబలుఁడైనభీమసేనుఁ డెట్టు లొకపన్నగంబుచేఁ బట్టువడియె. అతండు యక్షరాక్షసగణంబులఁ బిలుకుమార్చి కుబేరునిం బోరునకుఁ జీరినవాఁడు కాఁడే? ధర్మనందనుఁ డతని నెట్లు విడిపించె నిది యెంతయు నద్భుతం బయ్యెడి వివరింపవే యనియడుగ నమ్ముని యానృపతి కిట్లనియె.

అజగరంబు భీమునిఁ బట్టుకొనుట.

అవ్విధంబునఁ గౌంతేయులు హిమవత్ప్రాంత కాంతారంబున విహరింపు చుండ నొక్కనాఁడు వృకోదరుండు వేఁటపై వేడ్క గదుర ధనుస్తూణీరబాణఖడ్గాదిసాధనంబుల గ్రహించి వివిధవిచిత్రవిలసితంబై యత్యంతరమణీయం బైనయవ్వనంబున సకలభూతంబులు భయభ్రాంతంబులుగాఁగ సింహనాదంబులు భుజాస్ఫాలనంబులుం జేయుచు మ్రాఁకులఁ బెఱికి వైచుచు వరాహమహిషాది మృగనివహంబుల వధించుచు పాదఘట్టనంబునం బుడమి యద్రువ నడచువాఁడు ముందర నొక్కచో గుహాంతరంబునెల్లఁ బర్వతోపమం బైననిజహరిద్రవర్ణ శరీరంబున నావరించియున్నదాని, విచిత్రరోమంబులదాని, గుహాకారంబు చతుర్దంష్ట్రంబు దీప్తాక్షం బతితామ్రంబు నగువక్త్రంబు దెఱచియున్నదాని, నిశ్వాసక్ష్వేళనంబున లోకభర్త్సనంబు సేయునోనాఁగ నొప్పుదానిఁ, గాలాంతకయమసమానం బయినదాని, సకలభూతభయంకరం బైనదానినొకమహాభుజంగంబుఁ గాంచె. అదియు డాసినభీమసేనుభుజయుగళంబు బంధించినఁ బదివేలయేనుఁగులబలిమిగలమేటిమగండయ్యు వృకోదరుండు తద్గాత్రసంస్పర్శంబున దుర్బలుండై కదలనేరక యిది లోకసాధారణసర్పంబు గాదు దీనిబలం బత్యద్భుతం బని మది విచారించి యాసర్పంబున కిట్లనియె. నేను బాండునృపాలతనయుఁడ. ధర్మరాజు తమ్ముఁడ. భీమసేనుఁ డనం బరఁగువాఁడ. సింహశార్దూల ఋక్షాదినివహంబుల సమయఁ జూచినవాఁడ. యక్షరాక్షసపిశాచపన్నగాదులం బోరునఁ బిలుకుమార్చినవాఁడ. నాగాయుతబలుం డన నెగడినవాఁడ. ఇట్టినేను నీకుఁ జిక్కి యెంతయేఁ బ్రయత్నంబుఁ జేసియుఁ దప్పించికొననేరనైతి. ఇంతటిబలిమి నీ కెట్లు గలిగె? నాచేతం బని యేమి? నీవె రెయ్యది యనియడుగుచుండ నయ్యజగరంబు భీమునిమేనెల్లం గట్టిగఁ జుట్టుకొని చేతుల విడిచి యిట్లనియె. వృకోదరా, నావృత్తాంతంబుఁ జెప్పెద వినుము. నేను నహుషుఁ డనువాఁడను. నీవును నను వినియుందువు. మీవంశమునం బూర్వజుండ. ఉత్తమకృత్యంబుల నింద్రపదంబు సాధించి గర్వితుండనై బ్రాహ్మణుల నవమానించుటం జేసి యగస్త్యుం డలిగి నను సర్పం బగు మనిశపించె. శపించుటయు విషాదవివశుండనై మునీంద్రా, బలవంతంబు లయినసత్వంబులు నాకుఁ జిక్కి దుర్బలంబులుగాఁగఁ బూర్వస్మృతి చెడకుండఁగ నుం గరుణించి శాపమోక్షంబుఁ బ్రసాదింపవే యనిప్రార్థించినం బ్రసన్నుండై యతండు నాకోరినవరంబు లిచ్చి యిఁకఁ బెద్దకాలంబు చన నెవ్వఁడేని నీప్రశ్నములకు సదుత్తరము లిచ్చునో యమ్మహాత్మునివలన శాపాంతం బయ్యెడి నని వచించె. మునివరప్రభావంబునం జేసి నాకుఁ జిక్కి ప్రాణివర్గంబులెల్లఁ గదలనేరవు. ఆఁకలిగొన్న నా కిపుడు నీ వాహారం బయ్యెదవు. ప్రాణులకుఁ బ్రాణంబులుకావె

యన్నింటికంటెం బ్రియంబులు. కులవర్ధనుండై ననిన్ను నిపుడు నమలవలసె. విధికృతంబున కేమి చెప్పుదు. దుష్కృతంబున నీసర్పభావం బధిగమించి గోఁతలకెల్ల నెడ గట్టికొంటి. శాపాంతం బెఱుక నెన్నం డయ్యెడు నో యని దైన్యంబు గదుర దుఃఖించుటయు నతనికి భీముం డిట్లనియె. ప్రాణుల సుఖదుఃఖంబులు దైవాధీనంబు లగుటం జేసి దుఃఖప్రాప్తి యగుతఱిం గోపంబు నాత్మనిందయుం జేయ రాదు. ఎల్లపుడును మనంబు నొక్క తెఱంగున నిల్పుకొనినవాఁడే ధీరుం డనంబడు. దైవవశంబునం గల్గువానిం బౌరుషంబున నిరసింపవచ్చునే? దైవోపఘాతంబునసు కాదె భుజబలంబు పేర్మి గలిగియు నే నీయవస్థం బొందితి. ఆత్మనాశంబునకు నే నంతగం జింతింపను. మఱి రాజ్యంబు గోల్పోయి యక్షరాక్షసప్రచారదారుణం బయినయీహిమవద్దుర్గకాంతారంబుల నిడుమలం గుడుచుచున్న యన్నదమ్ములు నాయవస్థ నెఱింగి రేని యెంతయేం గొందలం బందుదురుగా యని యందు కడలుదు. విలువిద్య నేర్పున వేల్పులతేనినైనం జలింపంజేయం జాలినయర్జునుండు ధార్తరాష్ట్రులం బీచమడంప వలంతి గావున నతం డొక్కవేళ నాకుంగా నంత విషాదంబుం జెందకున్నం దక్కటివారును మా కెప్పుడును లాఁతివారికంటె నాధిక్యంబుం గోరుతల్లియు నెంతయడలుదురో యని పలుతెఱంగులం బలవించుచుండె.

### ధర్మరాజు భీమసేనుని వెదకం బోవుట.

ఇట ధర్మరాజు ఘోరంబులయిన యుత్పాతంబులం గనుంగొని నివ్వెఱం జెంది యట దక్షిణభుజస్పందనంబు నుపలక్షించి ముందఱం గీడు దోఁచినను మీఁద మే లగునని భావించి భీముఁడు వేఁటకుం జనుటం ద్రౌపదివలనం దెలిసి యర్జుననకులసహదేవులను బ్రాహ్మణులనుం బాంచాలీరక్షణార్థం బాశ్రమంబున నిలిపి ధౌమ్యసమన్వితుండై తాను భీము నన్వేషింపం దూర్పునం దఱలి యాఖేటఖేలనంబున నతండు వధించిన మృగకళేబరంబులను నతండు బిఱబిఱం బాఱుతఱిం దదూరుసంజాతవాతావధూతంబులై త్రోవ కడ్డంబుగ నెఱగం బడినతరునికరంబులనుం గాంచుచు శుభలక్షణసమంచితంబు లగువానియడుగులజాడం బరికించుచుం గొంతద వ్వరిగి చండమారుతభూయిష్ఠంబు, నిష్పత్రకంటకిద్రుమసంకులంబు స్థాణుపాషాణసంకీర్ణంబు, నిర్జలం, బూషరప్రాయంబు నగునయ్యజగరస్థానంబు డాసి యమ్మహాపన్నగంబుచేం జిక్కి చెయ్వులం దక్కియున్న గాదిలితమ్మునిం గనుంగొని దుఃఖితుండై భీమసేనా! ఈపెన్బా మెయ్యది? ఎట్లు దీనిచేం జిక్కితి వనియడిగి యతండు చిక్కువడినవిధం బెల్ల నెఱింగి యజగరంబు నుపలక్షించి నీయాఁకలి దీఱ వేఱొద్దియేనియు నాహారం బిచ్చెద. నాతమ్ముని విడువుము. నీవు దేవుఁడవో? దానవుఁడవో? మఱి యెవ్వండవో? ఏమిచేసినం బ్రీతుండవై నాతమ్ముని విడుతువు? నీవృత్తాంత మంతయు వివరింపు మనియడుగ ధర్మజున కజగరం బిట్లనియె.

అయ్యా, నీతమ్ముఁడు నాకుఁ గాలప్రాప్తం బైనయాహారంబు గావున వీని విడువ నోపను. ఇచటన యుంటివేని నీవును రేపటి కాహారంబయ్యెదవు. ఇట నుండ వలదు. చనుము. నాదేశంబున నుండువారినెల్ల నే భక్షింతు. ఇది నాపూనిన వ్రతంబు. నే నెవ్వఁడనం టేని వినుము. మీవంశంబునం బూర్వజుండ. చంద్రున కేనవవాఁడ. ఆయునృపాలుకుమారుఁడ. నహుషుఁ డనం బరఁగినవాఁడ. తపస్స్వాధ్యాయశమదమయజ్ఞాచరణాదిసుకృతవిశేషంబున నింద్రపదం బధిగమించి మైశ్వర్యమత్తుండనై బ్రాహ్మణుల నవమానించి యగస్త్యమహామునిశాపంబున నీదుర్దశం జెందితి. అమ్మునీంద్రునియనుగ్రహంబుననే నాకుఁ బూర్వస్మృతి సెడకున్న యది నాయడిగెడిప్రశ్నంబులకు సదుత్తరంబు లిచ్చెదవేని నీతమ్ముని విడిచి పుచ్చెద ననిన యుధిష్ఠిరుండు మహాత్మా, భవత్ప్రశ్నంబులకు సదుత్తరంబు లియ్యఁగ బ్రాహ్మణులుదక్కఁ దక్కటివా రంతవలంతులే? ఐనం దెలిసినకొలంది చెప్పెద నడుగు మనుటయు నయ్యాజగరం బిట్లనియె.

ధర్మజుఁ డాజగరప్రశ్నముల కుత్తరము లిచ్చి భీముని విడిపించుట.

రాజపుంగవా, బ్రాహ్మణుఁ డన నెవ్వండు. అతనికి వేద్యం బెయ్యది యని యడుగ ధర్మజుం డోనాగేంద్రా, సత్యదానక్షమాశీల తపోదయానృశంస్యంబులు గలయతండు బ్రాహ్మణుండు. దేనిం దెలిసిన శోకం బెడలునో యట్టినిర్దుఃఖం బసుఖంబు నగుపరబ్రహ్మం బతనికి వేద్యంబు. నీ వేమి తలంతువో యనిన సర్పంబు వెండియు నిట్లనియె. చాతుర్వర్ణ్యంబు ప్రమాణం బని విందుము. సత్యాదిగుణంబులు గలయతండే బ్రాహ్మణుం డగునేని యవి శూద్రునియెడం గన్పడిన నతండు బ్రాహ్మణుండుగా నేర్చునే? నిర్దుఃఖం బసుఖంబు నగుపరబ్రహ్మం బతనికి వేద్యం బనియంటివి. సుఖదుఃఖంబుల రెంటినిం బాసి యొకటి లోకంబునఁ గాన వచ్చునే యనిన యుధిష్ఠిరుండు వెండియు నిట్లనియె. సత్యాదిగుణంబులు గలయతండే బ్రాహ్మణుండు. అవి శూద్రునందుఁ గల్గిన నతండు శూద్రుండు గాఁడు. బ్రాహ్మణునందు లేకున్న నాతండు బ్రాహ్మణుండు గాఁడు. వృత్తంబులే యుత్తమంబులు శీతోష్ణంబులకు నడుమ నొకటి గన్పడనివడువున సుఖదుఃఖరహితంబు లోకమునం గానరాకున్నను లోకాతీతం బనిర్వాచ్యంబు నగుపరబ్రహ్మంబు సుఖదుఃఖరహితంబ యని తలంతు ననిన నజగరంబు ధర్మనందనా, వృత్తంబుననే బ్రాహ్మణ్యం బగునేని జాతివ్యవస్థ వ్యర్థంబు గాకున్నే యనిన ధర్మరాజు మఱియు నిట్లనియె. వాగ్వ్యవహారమైథున జననమరణంబులు మనుష్యలకెల్ల సాధారణంబు లగుటం జేసి తొల్లి ప్రమాదంబున వర్ణసంకరంబై నయప్పుడు జాతిపరీక్షణం బశక్యంబు గావున వృత్తంబు లుత్తమంబు లనివేదపదులమతంబు. బ్రాహ్మణయోనిజాతుం డైనవానికి నాభిచ్ఛేదనంబునకు మున్నె

సావిత్రి తల్లిగ నాచార్యుండు తండ్రిగ నుండుటంజేసి వేదచోదితసంస్కారం బునఁ బునర్జననంబుఁ గాంచునంత కతండు శూద్రసముఁడ. కావున నుపనయనా దిసంస్కారంబులం బడసి సత్యాదిగుణంబులు గలయతండు బ్రాహ్మణుం డనంబ రఁగు. సంస్కారంబుఁ బొందియు గుణంబులు లేనియతండు బ్రాహ్మణబ్రువుం డనంబడు. సత్యాదిగుణంబులు గలశూద్రుండు సచ్ఛూద్రుండునాఁబడు నని స్వాయంభువుం డైనమనువు సెప్పె ననిన విని యజగరంబు యుధిష్ఠిరా, విదితవే ద్యుండ వైననీయుత్తరంబులకు మెచ్చితి. ఇఁక నీతమ్ముని మ్రింగ నోప ననిన ధర్మరాజు వానిం జూచి మహాత్మా, నీవు వేదవేదాంగపారగుఁడవు గావున నడిగెద. దేని నాచరించిన నుత్తమగతి గలుగు వివరింపవే యనిన నజగరం బతని కిట్లనియె. సత్పాత్రదానంబును, బ్రియాచరణంబును, సత్యవచనంబు, నహింసానిరతత్వంబును సద్గతిసాధనంబు లనిన విని వెండియు ధర్మరాజు దానసత్యాహింసాప్రియంబుల నెయ్యది పెద్ద యనియడుగ నతండు రాజేంద్రా, కార్యగౌరవంబున నొక్కొకవేళ నొక్కొక్కటి పెద్ద యగుంగాని పరికించి చూడవానిలో గౌరవలాఘవంబులు దోఁ పవు. అన్నియు సమానంబులే యనిన ధర్మజుండు వెండియు నిట్లనియె. స్వర్గం బెట్లు ప్రాపించనగు? కర్మఫలంబులు ధ్రువంబు లనివిందుము. శరీరాపాయం బై నపదంపడి భోగసాధనశరీరరహితుం డైనజీవుండు కర్మఫలంబుల నెట్లు గుడుచు? ఈయర్థంబులఁ దేటపఱుపవే యనిన నజగరం బిట్లనియె. దానాదుల నాచరించు చు నహింసాపరుం డైనవాఁడు స్వర్గంబుఁ బడయు. సత్కర్మంబుల లెస్సగ నాచ రింపనివాఁడు సుకృతశేషంబున మనుష్యుఁడ యగు. కామక్రోధలోభసమన్వితుం డై హింసాపరుం డైనవాఁడు మనుష్యత్వంబుఁ దప్పి తిర్యగ్యోనులం బొడము. దుఃఖానుభవంబున దుష్కృతంబెల్లఁ దీఱినపదంపడి క్రమంబున మనుష్యభావం బుఁ గాంచి సత్కర్మానుష్ఠానంబున దేవపదంబునుం బడయు. నిత్యుం డైనజీవుండు నిజతత్వం బెఱుంగక యవిద్యాబంధంబునకుఁ జిక్కి కర్మవశంబునఁ గలుగు దేహ ములఁ జొచ్చుచు విడుచుచుఁ దత్తత్ఫలంబులం గుడుచుచు సంసారచక్రంబునం బరిభ్రమించు. ఇది కర్మఫలధ్రువత్వప్రకారం బనిన ధర్మరాజు మఱియు నిట్లని యడిగె. శబ్దస్పర్శరూపరసగంధముల ననుభవించునెడ నాత్మకు సాధనం బెయ్యది? యౌగపద్యంబుగ నెల్లవిషయంబులం గ్రహింపనగునే? ఇంత యెఱింగింపు మని యడుగ నజగరంబు ధర్మనందనా, దేహాధిష్ఠితుం డైనయాత్మకు విషయంబులఁ గుడుచునెడ మనోబుద్ధులు జ్ఞానేంద్రియపంచకంబును సాధనంబులు. అది యె ట్లంటేని. భ్రూమధ్యస్థితుండై యాత్మండు వివిధవిషయములందును బరాపర స్వరూపం బయిన బుద్ధిని బ్రేరించు. తదుత్తరకాలంబున సర్వవిషయపరిజ్ఞానం బగు. అట మనస్సు విషయదేశంబులం బ్రవేశించు. అం దవిషయంబున

మనస్సు గలియునో యవ్విషయంబును గ్రహించునింద్రియంబు మూలంబుగా క్షేత్రజ్ఞుండు తత్తద్విషయంబుల ననుభవించు. కావున నేకకాలంబున సకలవిషయంబులనుం గ్రహియింప నయితి గాకుండెడి ననినమనోబుద్ధుల లక్షణం బెల్లని యడుగుటయు నతండిట్లనియె. బుద్ధియాత్మస్వరూపంబు నాశ్రయించి జ్ఞానాత్మకంబై గుణరహితంబై యుండు. మనస్సు సంకల్పవికల్పాత్మకంబై గుణవిధిసహితంబై యుండు. ఇది బుద్ధికిని మనస్సునకును గలయంతరం బనిన ధర్మరాజుమహానుభావా, భవద్వచనంబుల సంశయంబులఁ బాసితి. సర్వజ్ఞుండ వై ననిను మోహామేరీతినలమెనో యని శంకింతు ననినఁ బన్నగవర్యుండు వెండియుం బాండవాగ్రజున కిట్లనియె. ప్రజ్ఞావంతుండును సంపదలవలన సుఖమగ్నుండై సమ్మోహంబుఁ బడయు. అయ్యా! నేనైశ్వర్యమోహంబున మదావిష్టుండనై యింతపడితి. నాయున్నతి నెఱింగించుక వినుము. బ్రహ్మర్షి దేవగంధర్వయక్షరాక్షసపన్నగాదులగు త్రైలోక్యవాసులందఱును నాకుఁ గప్పముల నొసఁగువారై రి. చూచినంతన నెదిరితేజం బెల్ల నాఁచికొన నోపుదృష్టిబలంబు గలిగియుంటి. వేవురు బ్రహ్మర్షులు మోయుచుండ దివ్యవిమానంబున నాసీనుండనై దేవలోకంబునఁ జరించుచు నాకంటె నుత్తముఁ డొండొకండు ముల్లోకములం గలుగ నేర్చునే యని దురభిమానపడుచుండి యొక్కనాఁడు శిబికావహనవ్యగ్రుం డయినయగస్త్యమునీంద్రుం బాదతాడనంబునం బరిభవింపఁగ నమ్మునివరేణ్యుండు కడుం గినిసి సర్పంబవై పడు మనిశపించుటయు నీదుర్దశం జెందితి. మునిశాపప్రభావంబునఁ బడుచు నజగరాకారంబు గలుగుటకు విషణ్ణుండనై మునీంద్రా, నాయజ్ఞానంబు సైఁచి శాపాంతంబుఁ బ్రసాదింపవే యని ప్రార్థించిన నమ్మునినాథుఁడు కరుణించి దుష్కృతఫలం బెల్ల ననుభవించి నపదంపడి పాండునందనుండై నయుధిష్ఠిరుండు నీకు శాపమోక్షంబు సేయు నని యనుగ్రహించె. సాధుజనశేఖరుండ వై ననీతోడిసంభాషణంబున నాకు శాపాంతం బయ్యె. మహాత్మా, మహోపకారంబుఁ గావించితివి. ఎంతసంపద గలిగినను బ్రాహ్మణావమానంబు సేయరాదు. బ్రాహ్మణతపోమహిమం బెఱింగియుంటం జేసి తద్విషయంబు లయినప్రశ్నంబులే చేసితి. నీతమ్ముని భీమసేనుని దె విడిచిపుచ్చితి. శుభం బయ్యెడి. దివంబున కరిగెద నని చెప్పి నహుషుం డజగరరూపంబు విడిచి తొల్లింటితనదివ్యరూపంబు గ్రహించి యుత్తమవిమానారూఢుండై దివంబునకుఁ జనియె. యుధిష్ఠిరుండు భీముని దోడ్కొని ధౌమ్యసమన్వితుండై మఱలి చని యాశ్రమంబు సేరి తద్వృత్తాంతం బంతయు నందఱకు నివేదించిన వారు భీమసాహసంబు పోలునే ధర్మరాజుమహిమం బింతయొప్పునే యని వచించి ముదంబునం బొదలిరి.

అవ్విధంబున వారయ్యాశ్రమంబున వసింపుచున్నంత వర్షర్తువాసన్న మగుటయు జలధరంబు లత్యంతమేచకద్యుతిదర్శనీయంబులై సూర్యకిరణప్రచారం బాకించుకేనియుఁ దోఁపకుండఁగ నంతటం గ్రమ్ముకొని బిట్టుఱుముచు మిఱుమిట్లుగొను చీఁకట్లఁ గాఱుమెఱుంగులతళతళద్యుతుల నొక్కొక్కతఱిం గొంత గొంత పఱుచుచు రేలుంబవల్లు నెడతెగక యపారధారాసంపాతంబుగ వర్షించె. ఆజడివానవలనఁ బుడమి యెచ్చటఁ జూచిన జలమయంబ కాఁ దోఁచె. నదు లపారవారిపూరనీరంధ్రంబులై యిరుదరుల నొరసి పాఱె. మయూరవారనృత్యంబులు, మండూకకాండనిస్వనంబులు, సకలజంతుసంతోషంబునుం జెలంగె. వాననాళ్లెల్ల నామరుభూములం గడపి పాండునందను లట శరత్సమయమున విమలసలిలపూరితయుఁ, గుముదకువలయకల్హారపుండరీకపరిశోభితయు, వికచకాశవిసరోల్లసితయు నగుసరస్వతీనదిం జేరి తత్తీరంబున ద్వైతవనం బధిగమించి యచ్చట బ్రాహ్మణులతోడఁ గలసి సరస్వతీపుణ్యతీర్థంబునఁ గృతావగాహులై తత్కాలసంభావితవనసౌభాగ్యంబుఁ గనుంగొనుచుఁ బవలెల్లఁ జివురుజొంపంబులఁ బొంపిరివోయి తోరంపుఁజల్లనీడలఁ బచరించుకుంజసదనపుంజంబుల వెలియిసుకదిన్నెల మెలంగుచు రేలెల్లఁ దరణికిరణతాపంబునం జేసి శ్రమంపడియున్నప్రాణిజాలంబు సేదఁదేర్చి తనరాజనామంబు సార్థకంబుఁ జేయఁ బ్రబలిన వట్టినొనాఁగఁ దారాపథంబునం దోఁచి యిందీవరబాంధవుండు తనమండలంబున నిండారునమృతంబుఁ గరంబులం జల్లినచాడ్పున నిండువెన్నెలలు సాంద్రంబులై మెఱయఁ బరమానందలహరిం దోఁగుచుఁ గార్తికపౌర్ణమాసి నచటఁ గడపి యట ధౌమ్యాదిభూసురులును నింద్రసేనాదిమూలభృత్యులును వెంటరాఁ దఱలి కామ్యకవనంబు సేరి యచటిమునివరులయాతిథ్యంబులం గ్రహించి పాంచాలితోడ మునివరుల నుపాసింపుచుండిరి. అంత నొక్కబ్రాహ్మణుం డర్జునమిత్రుం డరుదెంచి పాండుసుతులారా, యెల్లవేళల మీశుభంబులఁ గోరువాను దేవుం డిటకు మీరాక నెఱింగి యిదె వచ్చుచున్నవాఁడు. తపస్స్వాధ్యాయసంపన్నుండును బహువత్సరజీవియు నగుమార్కండేయమహామునియు మీయొద్దకు వచ్చువాఁడని యెఱింగింపుచుండె.

### శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట.

అయ్యవసరంబున శైబ్యసుగ్రీవాదితురంగయోజితం బైనరథంబారోహించి దేవకీనందనుండు సత్యభామాసమేతుండై శచీసమన్వితుం డైనపురందరుచందంబున వెలుంగుచు నచటికిఁ జనుదెంచి రథావతరణంబు సేసి ధౌమ్యధర్మజభీమసేనులకు మ్రొక్కి పెద్దకాలం బెడఁబాసినయర్జునుం బలుమాఱులు కౌఁగిలించుకొని తన కెఱఁగినకవల గారవించి ద్రౌపదిం దగినభంగుల నూఱార్చె. సత్యభామయు ద్రౌపదితోడఁ బరిష్వంగప్రకారంబులఁ జక్కఁగ నడిపె. ధర్మనందనుండును వసు

దేవనందనునకు విధియుతంబుగ సత్కారంబులు గావించి తమ్ములుం దానును బ్రాహ్మణులు నతనిం బరివేష్టించియుండిరి. కృష్ణుండు నర్జునుం జేరం బిలిచి యతనితోడి సల్లాపంబు కొంత సేపు నడిపి యందఱం బేర్కొని ధర్మజున కిట్లనియె. రాజపుంగవా, రాజ్యలాభంబుకంటె ధర్మంబ యెక్కుడని తలంచి సత్యార్జవాదిసద్గుణసమగ్రుండవై ధర్మంబుఁ దపంబు నాచరించుచు క్షత్రధర్మంబు విడువక గ్రామ్యధర్మంబులం దవులక వర్తించుటం జేసి ధర్మరాజునాఁ బేరు వడసితివి. కౌరవసభలో నాఁడా పాపాత్ములు పాంచాలియెడం జూపినయనయంబు సైఁపఁగ నీకుఁ జెల్లెఁ గాని యొరుల కలవియే? నీపూనినప్రతిన నెఱవేఱినపదంపడి యాధార్తరాష్ట్రులఁ బరిమార్ప మే మందఱముం బూనియున్నవారము. యదువృష్ణిభోజకుకురాంధకాదు లెల్ల భవదాజ్ఞావిధేయులే. సర్వసమృద్ధులం బెంపారి ప్రజల నేలఁ గలవు. ఇంతయు నసంశయంబు. మీభాగ్యంబున నీయర్జునుండు నిర్జరులవలన నస్త్రములఁ బడసి కృతార్థుండై వచ్చినవాఁ డని చెప్పి పాంచాలిదెస మొగంబై యోపరమసాధ్వీ, నీకొడుకులు శీలాఢ్యులు గలిగి పెద్దలచరితం బనువర్తించుచు యదుకుమారులతోడఁ జెలిమి సేయుచుఁ గరిహయారోహణాదివినోదంబుల ముదం బెనయుచున్నవారు. వారికిఁ బాంచాలపురవాసంబుకంటె ద్వారకాపురవాసంబు గడుం బ్రీతిజనకం బయ్యె. నీకంటెను గుంతీదేవికంటెను సుభద్ర వారల గారవింపుచున్నయది. ప్రద్యుమ్నుఁడు వారి కెల్లరకు నస్త్రశస్త్రముల నేర్పుచున్నవాఁడు. అభిమన్యుండు వారి కనయంబు నయంబు బోధింపుచున్నవాఁడు. ధార్తరాష్ట్రులకుఁ జేటుకాలం బాసన్నం బయ్యె. వైశంబ మీకు మే లయ్యెడి ననిన విని ధర్మరాజు జనార్దనునకుఁ గేలుమోడ్చి తద్వచనంబులం బ్రశంసించి మహానుభావా, నీవ మాకు శరణంబవు. ఇఁకఁ గొఱంత యేల గలుగు? నాపట్టినప్రతిజ్ఞ చరితప్రాయం బయ్యె. వనవాసనియమంబు గడచనవచ్చె. నీకారుణ్యంబుకలిమిం జేసి యజ్ఞాతవాసనియమంబును నడపఁ గలము. అనంతరంబు తోఁచినభంగి నొనరింపుము. నీపూన్కికి వేఱు పొసఁగ నగునే? యని వివరించె.

## మార్కండేయుండు పాండవులయొద్దకు వచ్చుట.

అట్లు వాసుదేవపాండవు లభిమతసల్లాపంబుఁ జేయుచుండఁ దపోవిద్యావిలసితుఁడు బహువర్షజీవితుండయ్యు నిరువదేనేండ్లవానిపోలె వర్ణనీయరూపధేయుండునైన మార్కండేయుండు విచ్చేయుటయు బ్రాహ్మణులు కృష్ణుఁడు పాండవులును సంభ్రమంబుగ నెదురేగి యమ్మునిం దోడ్తెచ్చి యుచితప్రకారంబుల నర్చించిరి. సత్యాద్రౌపదులు నతనియడుగుల కెఱఁగిరి. అతండు సుఖాసీనుండైనపదంపడి కృష్ణుఁడు బ్రాహ్మణులయుఁ బాండవులయు ననుమతంబున నమ్మునినాథు నుద్దేశించి మహాత్మా, పాండవులును, సత్యాద్రౌపదులు, నీబ్రాహ్మణులును నీవలనఁ బురా

తనరాజర్షిచరిత్రంబు, బ్రాహ్మణమహిమంబును, పతివ్రతామహాత్మ్యంబు సకల ధర్మంబులును వినఁ గోరియున్నవారు. కరుణించి తేటపఱుపవే యని నివేదించె. అప్పుడు నారదుం డరుగుదెంచి పాండవు లొనరించినపూజలం గైకొని మార్కండేయుండు వారికి ధర్మముల బోధింప దొరఁకొనుట నెఱింగి యభినందించి యథేచ్ఛం జనియె. అట మార్కండేయుం డందఱం గనుంగొని యెంతయేఁ జెప్పవలసియుండు. సావధానుల రగుఁ డనవుడు నెల్లవారు మధ్యందినమార్తాండునివిధంబున నమితతేజోవిలసితుం డైనయమ్మునీంద్రుమదెసం జూడ్కులు నిలిపియుండిరి. పదంపడి ధర్మరాజు కథాప్రచారంబు సేయం దలంచి యమ్మునిం బ్రస్తుతించి మహానుభావా, తెలిసినంతవఱకు ధర్మములనే యాచరింపుచున్నమాకు దుఃఖములు, దుర్వృత్తులయినధార్తరాష్ట్రులకు సర్వప్రకారంబుల సుఖంబులు నెడఁగూడుటం జూడ దేహి శుభాశుభకర్మఫలంబుల నిచటన గుడుచునో? మఱి పరలోకమున ననుభవించునో? ఇచ్చట నచ్చటను ననుభవించునో? ఎచ్చటను ననుభవింపఁడో? యని వితర్కం బయ్యెడి. కర్మములకెల్లఁ బురుషుండు గర్తయగుంగాని యీశ్వరుఁడు గాఁ డట్లగుటంజేసి కర్మఫలంబుల ననుభవింపక దేహికిఁ దీఱునే? ఇంతయు వివరింపవలయు ననియడిగిన మార్కండేయుండు ధర్మజా, నీప్రశ్నంబు యోగ్యంబు. అంతయుఁ దెలిసియుండినం బ్రచారార్థం బడిగెదవు. అయినం జెప్పెద వినుమని యిట్లనియె. తొల్లి ప్రథమకల్పంబునం బ్రజాపతి ధర్మతంత్రంబులై పరిశుద్ధంబులైనశరీరంబుల సృజించె. అట్టిశరీరంబుల నాశ్రయించినమనుష్యు లమోఘఫలసంకల్పులు, సువ్రతులు, సత్యవాదులు, స్వచ్ఛందచారులు, స్వచ్ఛందజీవను, లల్పబాధులు, నిరుపద్రవులు, శమదమాదిగుణసంపన్నులు, రాగద్వేషాదిదోషనిర్ముక్తులు, పుత్రసహస్రవంతులు, వర్షసహస్రజీవులు, సిద్ధసర్వార్థులునై ముల్లోకంబులం దిరుగుచు దేవర్షులం గాంచుచు వారి కెనయై యుండిరి. అంతఁ గాలాంతరంబున నమ్మనుష్యులు కామక్రోధలోభమోహాభిభూతులై మాయావ్యాజజీవనతాత్పర్యంబునఁ బ్రవర్తించి వ్యర్థసంకల్పులు, మోఘప్రయత్నులు, వ్యాధిపీడితు, లల్పాయువులు, రౌద్రకర్మఫలోదయులు, దరిద్రులు, నాస్తికులునై యొండొరుల మెచ్చక దుష్కృతంబులఁ జేయుచుఁ దిర్యగ్యోనులం బుట్టుచు నరకంబులం బడుచు విచిత్రం బయినసంసారచక్రంబునఁ బరిభ్రమింపఁ దొడంగిరి. దేహులు దేహాంతరంబుల గ్రహించునెడ నిజకర్మంబు నీడయపోలె వెంటన చనుచుండు. అందుత్తములగువారు తపస్స్వాధ్యాయసంపన్నులు, గురుశుశ్రూషాపరాయణులు, సత్యవాదులు, స్థిరవ్రతులు, జితేంద్రియత్వంబునంజేసి యాత్మాధీనచిత్తులు, శౌచంబునంజేసి యల్పరోగులు నిరుపద్రవులునై విమలజ్ఞానసంపత్తి నాత్మతత్వం బెఱింగి యుత్తమగతింగాంతురు. మఱియు నొక్కవిశేషంబు వినుము. ఈలోకంబ కొంద

అకు మేలగు. పరలోకంబ కొందఱకు మేలగు. ఉభయలోకంబులుం గొందఱకు మేలగు. కొందఱ కేలోకంబును మేలు గాదు. ఎట్లంటేని. అధికధనసంపత్తి గలిగి యెడ తెగక పూయుచుఁ గట్టుచుఁ దొడుగుచు వనితాలోలత వర్తించువారి కీలోకంబ మే లగు. తపస్స్వాధ్యాయోపవాసవ్రతాదుల శరీరంబుఁ గృశింపఁజేసి యహింసయు జితేంద్రియత్వంబునుం గలిగి వర్తించువారికిఁ బరలోకంబు మే లగు. ధర్మమున ధనము నార్జించి విధియుతంబుగఁ బెండ్లియైనయిల్లాలియందు సంతతిం బడసి యజ్ఞదానాదిసత్క్రియాకలాపపరత్వమున వర్తించునుత్తమగృహస్థులకు రెండులోకంబులును మే లగు. విద్యాతపోదానాదులం గొంచెమైనందవులక దేహసౌఖ్యంబునుం గానక వ్యర్థహింసాదిదుర్గుణంబులం గూడివర్తించుదుర్జనులకు రెండు లోకములును మేలు గావు. ఇది మనుష్యులకర్మగతిప్రకారంబు. మీ రత్యంతబల పరాక్రమములు. సర్వవిద్యల నేర్చినవారలు. దేవకార్యంబు దీర్ప నీలోకంబునకు వచ్చినవారలు. ఉత్తమకృత్యంబుల దేవర్షిపితృప్రీణనంబుఁ గావించి యవాప్తపుణ్యులయి క్రమంబున నాకలోకం బధిగమింతురు. ఇంతయు నిక్కువంబు. ఇపుడింతపడుచున్నవారముగా యనిమనంబునఁ గొఱంతపడవల దనిబోధించిన విని ధర్మజుం డూఱడిల్లి మునీంద్రా, బ్రాహ్మణమాహాత్మ్యంబు వివరింపవే యనియడుగ మార్కండేయుం డతని కిట్లనియె.

మార్కండేయుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబుఁ జెప్పుట.

ధర్మజా, తొల్లి హైహయవంశజనితుం డైనయొక్కకుమారుండు వేటకై యడవి కరిగి కృష్ణాజినోత్తరీయుం డైనయొకమునిపై మృగభ్రాంతిం జేసి బాణ మేసి యట నేలఁ గూలినయతనిం గాంచి పశ్చాత్తాపంబున శోకవ్యాకులుండై తన కులవృద్ధులపాలికిఁ జని యంతయుం దెలిపిన వారును దీనమానసులై యమ్మునిశవంబును వెదకఁగ నాకుమారునితోడ నడవులం గ్రుమ్మరుచుఁ దార్క్ష్యమునియాశ్రమంబు సొచ్చి యతని కెఱఁగిన నమ్ముని వారల నతిథిపూజల సత్కరింపఁ బూనుటయు వా రాసత్కారంబు గ్రహింపనొల్లక యయ్యా! మాకుమారుండు బ్రాహ్మణుని వధించె. దానంజేసి మేము సత్కారార్హులము గా మనిరి. వారిమాట విని తార్క్ష్యుం డోహో! యిందుకు వగవనేల? నాతపోబలంబుఁ జూడుఁడు. మీచేఁ జచ్చినయాపాఱుఁ డెచ్చటఁ బడియె? అనియడిగి వారివలన నంతయు నెఱింగి తన కొడుకుం జూపి మీకుమారుండు వధించినబ్రాహ్మణుం డితండుగా నోపునే యనిన నాహైహయకుమారుండు సాభిజ్ఞానంబుగా నితండ యనిన హైహయుల బ్బురం బంది మునివరేణ్యా, యీకుమారుఁ డెట్లు జీవితుఁ డయ్యె. ఇందుల కెంతయు విస్మయం బయ్యెడి. ఇది తపోమహిమం బగునేని విననలతు మనినఁ దార్క్ష్యుండు వారి కిట్లనియె. అయ్యా, మేము సత్యంబ పల్కుదుము. స్వధర్మంబు

లెస్సగ ననుష్ఠింతుము. దుశ్చరితంబునం బోవము. అన్నదానంబున నతిథులను భృతిదానంబున భృత్యుల నుపచరించి శేషభోజనంబున శరీరయాత్ర నడుపుదుము. పుణ్యతీర్థక్షేత్రయాత్రఁ జేయుదుము. మాత్సర్యాదుల విడిచి శమాదిపరత్వంబున వర్తింతుము. దానంజేసి మృత్యువు మాదెస రానేరఁడు. మీవలనం బ్రహ్మహత్య గాదయ్యె. వెఱవవలదు. నిజనివాసంబులకుఁ జనుఁ డనిపంచిన వా రమ్మునికావించినయాతిథ్యంబు గ్రహించి తదనుమతిం బురంబునకుఁ జని ముదంబునఁ బొదలి రనిచెప్పి మార్కండేయుండు ధర్మజా, వెండియు విప్రమహిమంబు వివరించెద నాకర్ణింపు మని యిట్లనియె.

## అత్రిగౌతములసంవాదము.

అత్రి యనుబ్రాహ్మణుండు ధర్మంబుఁ బరికించి తపము సేయ వనమునకుఁ బోవం బూని పత్నిని బుత్రులను బిలిచి తనయభిప్రాయంబుఁ దెల్పిన భార్య యిట్లనియె. ధన మార్జించికొనివచ్చి పుత్రులకు భృత్యులకుం దగురీతి నొసంగి యటఁ బోఁదగు. ధనార్జనోపాయం బెట్లం డేని. వైన్యనృపాలుం డశ్వమేధయాగదీక్షితుం డయ్యెనఁట. అతనిం బ్రార్థించినఁ గోరినంతసొమ్మొసంగు ననియె. అనుటయు నత్రి భార్యను జూచి కల్యాణీ, వైన్యుఁ డశ్వమేధదీక్షితుండయియుండుట నేను నెఱుంగుదు. అయిన నచట నాపై ద్వేషించువారు గలరు. వారు నాకోరిక వమ్ము సేయ వేతురని యించుక శంకింతు. అయినం బోయివత్తు ననిచెప్పి వైన్యయజ్ఞాయతనంబునకుఁ జని యానృపాలు నుద్దేశించి యోమహారాజా, నీవు ధన్యుండ వీశ్వరుండవు. భువిలోనం బ్రథమరాజవు. మును లందఱు నినుఁ జేర్కొందురు. నీకంటె ధర్మవిదుఁ డొండొకండు గలుగఁ డని స్తుతివచనంబుల వాక్రుచ్చె. వాక్రువ్వఁగ గౌతముఁ డతనిపై నలిగి యత్రీ! యిట్లు పలుకరాదు. ప్రథమరాజు మహేంద్రుఁడుగాని యితరుఁడు గాఁడు. నీకుఁ బ్రజ్ఞ తఱిఁగెఁ గాఁబోలు ననిన నత్రి యింద్రునిపోలె నితండు విధాతయే యని ప్రజ్ఞాసమాధానంబునం బల్కెద. మోహం బలమెఁగ నీకె ప్రజ్ఞ తఱిఁగె నని మాఱుపలికె. ఆపలుకులు విని గౌతముఁడు నీవే మోహావిష్టుండవు. నేను సర్వంబు నెఱుంగుదు. రాజదర్శనంబు గోరి సభలో నిట్లు ప్రేలెదవు. పరమధర్మప్రయోజనంబుల నరయవైతివి వయోవృద్ధుఁడవు గాని జ్ఞానవృద్ధుఁడవు గా వని పల్కుచుండ నయ్యత్రిగౌతముల వివాదంబు విని సభాసదులు వీ రేల యిట్లు వాదులాడెదరు? ఏమికార్యం బనినఁ గాశ్యపుఁడు వారిం బిలిచి మీవివాదప్రకారం బెట్లని యడుగుటయు గౌతముఁ డిట్లనియె. ద్విజోత్తములారా, అందఱు వినుఁడు. వైన్యనృపాలుఁడే విధాత యని యత్రి పల్కుచున్నవాఁడు. నే నట్లు గా దనియెద. మీకుం బోలినభంగిఁ దేటపఱిచి మాసంశయంబుఁ దీర్పుఁ డనినఁ గాశ్యపుఁ డయ్యో,

దీని నిర్ణయింప సనత్కుమారుండ నేర్చు ననియె. అందఱు నిదియ పోలునని యాపురాణమునిపాలికిఁ జని వివాదప్రకారం బంతయు నెఱింగించిన నతం డిట్లనియె. బ్రహ్మక్షత్రియు లొండొరులం గూడిన నగ్నిమారుతములు వనములఁ గాల్చుపగిదిఁ బగఱ నడంతురు. రా జనంగ సామాన్యుఁడుగాఁడు. అతండే ధర్మమూర్తి, ప్రజాపతి, మహేంద్రుఁడు, విధాత, బృహస్పతి, శుక్రుఁడు. ప్రజాపతి, విరా, ట్సమ్రా, ట్సవర్ణేత్ర, సహజి, ధ్రువు, సత్యయోని, పురావి, త్సత్య ధర్మప్రవర్తకాదిదివ్యనామంబులఁ జెప్పఁబడు. అట్టివాని నర్చింపనివాఁడునుం గలఁడే? మును లధర్మమునకు వెఱచి బలమును క్షత్రంబున నిక్షేపించిరి. అది కారణంబుగ రాజు సురలలో సూర్యునిమాడ్కి మనుష్యులలోఁ దేజస్వియై తమం బడంచును. శాస్త్రప్రామాణ్యంబు పరిశీలింప రాజు ప్రధానుం డని సిద్ధాంతం బేర్పడు నని వివరించె. సనత్కుమారువచనం బాకర్ణించి వైన్యుఁడు సంతుష్టుండై యత్రిం బిలిచి మునీంద్రా, నను మనుష్యులలో నుత్తముఁ డనియు దేవతుల్యుఁ డనియుఁ గొనియాడుటం జేసి నీయెడఁ బరమప్రీతుఁడ నైతి నని చెప్పి వివిధ ధనంబు, నుత్తమదాసీసహస్రంబును, బదికోట్లగద్యాణంబులను, బదిబారువుల బంగారు నొసంగె. అత్రియు నవియెల్లం గ్రహించి వైన్యు వీడ్కొని గృహంబున కరుదెంచి ధనంబుఁ గొడుకులకుఁ బంచియిచ్చి తపోవనంబున కరిగె నని చెప్పి మార్కండేయుండు ధర్మజా, సరస్వతీతార్క్ష్యసంవాదం బనునితిహాసంబుఁ జెప్పెద. దానివలన ధర్మరహస్యం బెఱుంగనగు. విను మని యిట్లని చెప్పందొడంగె.

## సరస్వతీతార్క్ష్యసంవాదము.

తొల్లి తార్క్ష్యుం డనుమునివరుండు సరస్వతి నారాధించి సన్నిధి యైనయప్పరమేశ్వరిం గాంచి దేవీ, పురుషున కెయ్యది శ్రేయంబు? దేని నాచరించిన ధర్మంబు సెడకుండు? అగ్నిహోత్రమం బెవ్విధిం జేయవలయు? ఏకాలంబునఁ బూజింపవలయు? అగ్నిహోత్రవిషయకం బైనపురాణవ్రతం బెట్టిది? ఈతత్త్వం బంతయు నీవలనం దెలిసికొని స్వధర్మంబు దప్పకుండి యుత్తమలోకములఁ బడయఁ గోరెద వివరింపుమని వేఁడిన నవ్వేఁడికోలు నాలించి భారతి సుప్రీతయై యతని కిట్లనియె. వేదములఁ జదివి ప్రమాదంబు వొరయక శౌచపరత్వంబున బ్రహ్మవిచారతత్పరుం డై నయతండు దేవలోకముఁ జేరి యమరులతోడఁ జెలిమి సేయుచు హిరణ్మయకమలవిలసితంబులు విమలసలిలపూరితంబులు నగుకొలంకుల కెలంకుల నచ్చరవిరిబోండ్లపొందున ముదం బొందుచుండు. మేలయినదూడయుఁ జాలినంత పాలునుం గలిగి యోగ్యగుణముల వెలయుతొలిచూలియావు నుత్తమబ్రాహ్మణునకు దాన మొనరించినపుణ్యుండు దనకులంబున నేడ్గుర నుద్ధరించి యామొదవు మేన నెన్నిరోమంబులు గలవో యన్నియేండ్లు సుఖించు. కపిలగోవును దివ్యా

లంకరణంబున నలంకరించి దాన మొనరించినవాఁడు సర్వకామంబులం బడయు. బరు వెంతయైన మోవఁ జాలి హలయోగ్యం బై నయుత్తమానడ్వాహంబు నిచ్చి నయతఁడు దశధేనుదానసుకృతంబుఁ గాంచు. తిలధేనువుం గాంచనశృంగాదుల నలంకరించి దక్షిణతోడ దాన మిచ్చినసుకృతి వసులోకం బధిగమించు. గాఢాంధ కారనీరంధ్రం బయిననరకంబునం బడువాని మహార్ణవంబున నావపోలె గోదానం బుద్ధరించు. సువర్ణ దానముఁ జేసినమహనీయుండు మరణవర్జితుండై సూర్యలోకంబు ప్రాపించు. వస్త్రదానంబుఁ జేసినమహితుండు చంద్రలోకం బధిగమించు. పాత్రభూతుండై నబ్రాహ్మణునకుఁ గన్యాదానంబును భూదానంబును విధియుతంబుగ సలిపినమహాత్ముఁ డింద్రలోకంబు నేరు. విడువక యేడేండ్లు నియమంబుతో నగ్నిహోత్రంబున వేల్చినసాధుశీలుండు తనపూర్వుల నేడ్గురను వెనుకటివారల నేడ్గుర నుద్ధరించి సద్గతిం గాచు. అశుచి, యశోధితపాణిపాదుం, డబ్రహ్మవిదుఁ, డతత్త్వదర్శియు వేల్వ నధికారులుగారు. దేవహవ్యంబున నశ్రోత్రియు నియోగింప రాదు. అట్లు చేసిన నాకర్మంబు వమ్మగుఁ గావున లెస్సగఁ బరీక్షించి శ్రద్ధమై వేల్వవలయు. నిర్జరులు శ్రద్ధారహితుఁడిచ్చు హవిర్భాగంబులం గ్రహింప నెల్లరు మఱి యెల్లపుడును శౌచం బరయుచుందురు. శ్రద్ధావంతులు సత్యవ్రతులు హుతశేషభోజనులు నగుపుణ్యాత్ములు గోలోకంబు ప్రాపించి పుణ్యగంధంబున నుత్తమ పదంబుఁ గాంతు రనిన విని తార్క్ష్యుండు తల్లీ, నినుం జూడ సకలజనులఁ గర్మారంభంబులం బ్రేరించు ప్రజ్ఞాదేవి గావలయు నని యూహ పొడమెడి. శ్రీదేవివడువున నత్యంతకాంతివిలసితం బయినదివ్యరూపంబున నొప్పారియున్న దానవు. నీతత్త్వం బెట్టిదియో యెఱుంగవలతు ననినఁ దార్క్ష్యునకు సరస్వతి యిట్లనియె. యజ్ఞముల నుపపాదింపఁబడు శ్రేష్ఠవస్తువులపలనఁ బ్రవృద్ధయు నాప్యాయితయునై యగ్నిహోత్రంబ నెలవుగాఁ గొనియుందు. బ్రాహ్మణులకు సంశయములఁ దీర్ప వచ్చితి. ప్రస్తావంబున నీతో నింత చెప్పితి. యజ్ఞోపయోగిసకలద్రవ్యంబులు మదాత్మకంబు లని యెఱుంగు మనినఁ దార్క్ష్యుఁడు పరమేశ్వరీ, మును లందఱెయ్యది శ్రేయం బనితలంతురో? ఎయ్యది విశోకం బయినమోక్షమార్గంబో? సాంఖ్య యోగతత్త్వవిజ్ఞానంబున నెఱుంగనగుపురాణపురుషుఁ దెలియనయ్యెద. తత్ప్రకారంబు వివరింపవే యనిన భారతి యతనికిట్లనియె. తపస్స్వాధ్యాయవ్రతపుణ్యయోగంబునం జేసి విశోకు లయినముక్తులు పరములకుఁ బరముఁ డై నపురాణపురుషు నాత్మైక్యానుసంధానంబునం గాంతురు. ఆపరమపురుషుమధ్యంబున శాఖాసహస్రశోభితంబయి మహనీయంబయి ప్రమాణభూతం బయిన వేదపాదపంబు దనరు. దానిమూలంబున నైహలౌకికపుత్రపశ్వన్నాద్యభీష్టఫలంబు లనుమధూ

దకంబులు గలిగి యజ్ఞాదిక్రియావిశేషప్రవాహంబులు ప్రవర్తించు. తత్తరుశా
ఖల నాశ్రయించి ధానాపూపంబులు మాంసశాకంబులు పాయసకర్దమంబులుగా
యజ్ఞంబు లనుమహానదుల నెఱయంజేసి వేదవిదులు వహ్నిముఖమున నింద్రా
దిదేవప్రీణనంబుఁ గావింతురు. అది మదీయపరమపదం బనిబోధించినం దెలిసి
తార్క్ష్యుం డద్దేవికిం బ్రణతుండై ధన్యాత్ముం డయ్యె నని చెప్పినం బాండవాగ్రజుం
డు మునీంద్రా, వైవస్వతమనువృత్తాంతంబు వివరింపవే యనియడిగిన మార్కం
డేయుం డతని కిట్లనియె.

## వైవస్వతమనుచరిత్రము.

ధర్మనందనా, సూర్యసూనుం డై నవైవస్వతమను ప్రాజస్తేజస్తపోమహి
మంబులం బితృపితామహులకంటె నధికుఁడన వన్నెకెక్కి కొండొకకాలంబున
బదరీవనంబునకుఁ జని యూర్ధ్వబాహుఁ, డేకపాదస్థితుఁ, డవాక్ఛీర్షుఁడు, నిర్ని
మేషనయనుఁడు, జటాధరుండునై పెక్కువేలేండ్లు గంగాతీరంబునఁ దపంబు సేయు
చుండె. అంత నొక్కనాఁడు మత్స్య మొక్కటి యతని డాయవచ్చి తపోనిధీ,
బలవంతంబులు దుర్బలంబులం గబళించుట మత్స్యంబులకు సహజంబు గావున
నేను క్షుద్రం బగుటంజేసి బలవంతంబులకు వెఱతు. న న్నొండొకయెడకుఁ గొం
పోయి రక్షింపుము. తఱితోఁ బ్రత్యుపకారంబు సేయ నోపుదు నని చెప్పిన విని
వైవస్వతమనువు కరుణార్ద్రచిత్తుండై యమ్మీను నొక్కపెద్దకాఁగునం జేర్చి పుత్ర
వాత్సల్యంబున నప్పుడపుడు తద్వర్తన మరయుచుండె. అదియుం బెద్దకాలంబున
కాకాఁగునం దన కెడ లేకుండఁగ మిక్కిలి పెరిగి యొక్కనాఁ డమ్మనువుం జూచి
మహాత్మా, నా కిందు మెదలఁ జోటు చాలదు. అట్లగుటంజేసి నను మఱియొక
చోటుఁ జేర్పు మనిన నమ్మనువు, వల్లేయని దానిని ద్వియోజనాయతం బేకయో
జనవిస్తృతంబు నగునొకపెద్దబావిం జేర్చె. అందు బహువత్సరంబులు వసించి
యమ్మత్స్యం బంతకంతకుం బెరిగి యందును మెదలనేరక యొక్కనాఁడు వైవ
స్వతుం జూచి యోసాధుశేఖరా, నా కిందుఁ గదలనైనం జోటు చాలదయ్యె.
గంగానదిం జేర్పుము. నీయభిమతం బెట్టిదియో. నీవలనం బెరుగుటంబట్టి నే నీను
విడిచి నీమాట వినవలయుఁగదా యనిపల్కిన వైవస్వతుం డట్లయని యమ్మహా
మీనంబుఁ గొనిపోయి యమ్మహానదిం జేర్చిన నది కొంతకాలంబునకు మితిమీఱి
పెరిగి యందునుం జాలినంతయవకాశంబుఁ గానక యోకరుణాపయోనిధీ, నా
కిందు నవకాశం బపర్యాప్తం బయ్యె. సాగరంబుఁ జేర్పు మని యామనువుతోఁ
జెప్పిన నతండు దాని సముద్రంబున దిగవిడిచె. ఆమహామత్స్యం బత్యంతప్రవృ
ద్ధబలవత్కాయంబగుటంజేసి దుర్భరంబయ్యు నావైవస్వతున కపు డెంతయుఁ
జులకనై యుండె. అట్లమ్మహామీనంబు సాగరప్రక్షిప్తంబై నవ్వుచు వైవస్వతుం

బిలిచి యయ్యా, యిప్పటికిఁ గర్తవ్యం బయినదానిం జెప్పెద వినుము. వేగంబ స్థావరజంగమాత్మకం బయినప్రపంచం బంతయుఁ బ్రళయం బయ్యెడి. సముద్రంబులెల్ల నుప్పొంగెడి. కావున నత్యంతదృఢరజ్జుబంధసంయతం బైనయోడఁ గావించి యందు సర్వబీజంబులం జేర్చికొని సప్తర్షులతోడ దాని నారోహించి నన్నుఁ దలంపునకుఁ దెమ్ము. తలంచిన నే నపు డొకకొమ్ముతో నీకుఁ బొడచూపి మిమ్మాసాగరంబు దాఁటింతు, నేను లేకున్న నాసలిలంబు మీ కేరికిఁ దఱియ వలనుగా దనివచించిన వైవస్వతుం డట్లచేయుదు ననుటయు నమ్మహామత్స్యం బతని నామంత్రణంబు చేసి చనియె. వైవస్వతుండు నామీనవరు వీడ్కొని తన నెలవు సేరి వేగంబ మంచియోడఁ గావించి యందు సర్వబీజంబుల సంగ్రహించి సప్తర్షులతోడ నారోహించి యెంతయు నుప్పొంగి యంతట నెక్కటియైయున్న సముద్రంబు దాఁటం బూని యమ్మహామీనంబును దలంప నది శృంగంబుతోడ సన్నిహితం బగుడు నతండు పర్వతసన్నిభం బైనయమ్మీనుకొమ్మున రజ్జుపాశంబుఁ దగిల్చి యోడఁ బదిలంబుగ బంధించె. ఆమీనంబు భూమ్యంతరిక్షంబులెల్ల నేకార్ణవంబయి యభ్రంకషాభంగురతరంగమాలికాసంచారభీషణం బయినయా జలంబున నాయోడం బెక్కువేలయేఁడులు ద్రిప్పుచు హిమవదుత్తరపార్శ్వంబు నకుం గొంపోయి యమ్మహాసలిలపూరంబు తఱుఁగం దొడంగిన నమ్మత్స్యంబు వారిం బిలిచి యిఁక నీయోడ నీహిమవద్గిరిశృంగంబునం గట్టుఁ డనుటయు వా రట్లు చేసిరి. దానంజేసి యాశిఖరంబు నౌబంధనం బన నిప్పటికిం బ్రఖ్యాతమై యుండెడి. అట నమ్మహామీనంబు వారిం బిలిచి నేనే జగంబులకెల్లఁ బ్రథమకా రణంబను. నాకంటెఁ బరంబు గల్గదు. మత్స్యరూపధరుండనై మీకు భయం బుడిపితి. ఇఁక నీవైవస్వతుండు తొల్లింటిచొప్పున స్థావరజంగమాత్మకం బగు ప్రపంచంబెల్ల సృజియించువాఁడు. తపఃప్రభావంబునఁ బ్రతిభాతిశయం బయ్యెడి. మత్ప్రసాదంబునంజేసి యితనికి మోహంబు రానేర దనిబోధించి యదృశ్యం బయ్యె. మాయామత్స్యం బైనభగవంతునివచనోపన్యాసంబు విని వైవస్వతుండు తపోమహిమంబునం బ్రజాసర్గతత్త్వం బెఱింగి యథాపూర్వంబుగ సృష్టిఁ గావించె. ఇయ్యది వైవస్వతోపాఖ్యానంబు. దీని వినినవారు సర్వార్థసిద్ధులై తుది నాకలోకంబుఁ బ్రాపింతు రనిబోధించిన విని వెండియుం బాండవేయుండు మార్కండేయు నిట్లనియడిగె.

మార్కండేయుండు ధర్మరాజునకుఁ బ్రళయప్రకారంబుఁ జెప్పుట.

మహాత్మా, బ్రహ్మాదక్కఁ దక్కటివా రెవ్వరును నీతోడియాయుష్మంతులు గారుగా. ప్రళయకాలంబున సూర్యచంద్రాగ్నిమారుతాదిప్రచారంబు లడంగి యేకార్ణవంబై యుండునప్పుడు తపోవిశేషతోషితహృషీకేశకరుణాభరంబునం

దన్నాభినాళీకకర్ణికాంతరశయనుం డైనపరమేష్ఠిం బంగారుకన్నులం గాంచి తత్ప రసమాధియోగసమాధానంబున నద్దేవు నారాధించితివిగదా. అప్పరమేశ్వరు ప్రసాదంబునంగాదె జరామరణంబులు నినుఁ జేరవయ్యె. వివిధభూతసృష్టిస్థితిలయ క్రమంబెల్ల నెన్నియేమాఱులు నీకుఁ బ్రత్యక్షంబకదా. సర్వలోకంబుల నీమె ఱుంగనియది యుండనోపునే? కావున నడిగెద. ప్రళయంబుతఱి జగములవ ర్తనం బెట్లు? వివరింపు మనియడుగ మార్కండేయుండు ధర్మజా, పురాణపురు షుండు, శాశ్వతుం, డవ్యయుం, డవ్యక్తుండు, సూక్ష్ముండు, సగుణనిర్గుణుండు, సర్వకారణకారణాత్మకుండు, సర్వభూతమయుండు, వేదవేద్యుండు నగుపరమేశ్వ రుండె యీవసుదేవనందనుండై యవతరించినవాఁడు. ఇప్పురమపురుషునకుఁ బ్రణ మిల్లి నీయడిగినయర్థంబుఁ జెప్పెద నని యట్లచేసి యతని కిట్లని చెప్పందొడంగె. కృతత్రేతాద్వాపరకలినామకంబు లయినయుగంబులు దేవమానంబునఁ బన్రెండు వేలేండ్ల నిండియుండు. ఎట్లనినఁ గృతయుగంబునకు నాలుగువేలేండ్లు. దాని సంధ్య నన్నూఱేండ్లు. సంధ్యాంశంబునన్నియేండ్లు. త్రేతాయుగంబునకు మూఁ డువేలేండ్లు. దానిసంధ్య మున్నూఱేండ్లు. సంధ్యాంశంబు నన్నియేండ్లు. ద్వాప రంబునకు రెండువేలేండ్లు. దానిసంధ్య యిన్నూఱేండ్లు. సంధ్యాంశంబు నన్ని యేఁడ్లు. కలియుగంబునకు వేయేండ్లు. దానిసంధ్య నూఱేండ్లు. సంధ్యాంశంబు నన్నియేండ్లు. ఇట్లు ద్వాదశవర్షసహస్రాత్మకంబు లయినచతుర్యుగంబులు మహా యుగంబునాఁబడు. అట్టిమహాయుగంబులు వేయయినం బ్రహ్మకొక్కపగ లగు. అది ప్రళయసమయంబు. అందుకు వేయేండ్లు ముందుగనేయధర్మంబు పెచ్చుపె రుగు. జను లసత్యవాదు లగుదురు. స్వధర్మంబు విడుతురు. వ్రతయజ్ఞాదులకుఁ బ్రతినిధుల నాచరింతురు. వర్ణాశ్రమధర్మంబు విపరీతం బగు. ధర్మిష్ఠు లన్నివిధం బులఁ గొఱంతవడుదురు. అధర్మపరు లభివృద్ధిఁ గాంతురు. వర్షంబు దుర్లభం బగు. కఱవులు మెండగు. స్త్రీలు మగల మెచ్చక వ్యభిచరింతురు. వంచన లతిశ యించు. తదనంతరం బనేకవత్సరంబు లనావృష్టిదోషంబు గలుగు. దాన జంతువు లెల్ల నశించు. సూర్యుండు సప్తకిరణంబులు నెఱయంజేసి సకలసరిత్సముద్రజల ముల నింకించు. అటసంవర్తకానలంబు గాలితోడం బ్రబలి యిరువదిరెండువేల యోజనంబులు వ్యాపించి సకలరసంబులఁ బీల్చి ముల్లోకంబుల నీఱుసేయు. ప్రళ యమేఘంబులు నీలపీతరక్తపింగళధూమ్రపాటలవర్ణంబులై విద్యున్మాలాదురీక్షం బులై చీఁకట్లు మిఱుమిట్లుగొన నంతరిక్షంబెల్ల నావరించి రోదోంతరంబునం బ్రతిని స్వనం బెసంగఁ బెల్లుగనుఱుముచుఁ బన్రెండేండ్లపారధారాసంపాతనీరంధ్రంబుగ వర్షించి యాయగ్నిం జల్లార్చు. సముద్రంబులెల్ల నుప్పొంగు. పుడమియుఁ గొం డలు నందు మునిఁగి జలంబెల్ల నేకార్ణవం బగు. అంతఁ జండమారుతంబు పెల్లు

రేఁగి యామేఘపటలంబెల్ల విరియించు. పదంపడి పరమేష్ఠి యాఘోరమారు తంబుఁ ద్రావి కమలపత్రంబునం బవ్వళించు. ఇది ప్రళయకాలవర్తనంబు. అందు గతకల్పాంతంబున నే నయ్యేకార్ణవంబునఁ బ్రపంచపదార్థం బొక్కటియుం గానక బమ్మరించి యాసలిలంబు నీఁదుచు శరణంబులేమికి వగచుచున్నంత నాక్రమో లనేకమహావటమహీరుహంబు గన్పడియె. అటఁ బరికించి చూడ నాతరు శాఖపై నెక్కపర్ణంబునందు మేలిపాన్పునం జంద్రవదనుండు, పుండరీకా క్షుండు, శ్రీవత్సలాఛనుం, డతసీపుష్పనీలుండు నగు నొకకుమారుండు లోచన గోచరుం డయ్యె. కాలత్రయవృత్తాంతజ్ఞానశక్తి గలిగియున్న నునేనాబాలు నెఱుం గనేరక యీబాలుం డెవ్వఁడొక్కో? లోక మెల్ల నశించినపదంపడి యెట్లున్నవాఁ డొ? శ్రీదేవి కునికిపట్టుగఁ దోఁచెడి నని పెద్దయుంబ్రొద్దు చింతింపుచుంటి. అప్ప డాకుమారుండు నన్నుఁ బిలిచి మార్కండేయా, కడు బడలితివికాఁబోలు. విశ్ర మింపఁ గోర్కియేని నాశరీరాభ్యంతరంబునం బ్రవేశించి యిచ్చవచ్చినన్నినాళ్లు విశ్రమింపు మనిచెప్పి తననోఱు దెఱచుటయుఁ జిరజీవనంబునకును మనుష్యత్వం బునకును నిర్వేదించుచు నేనుదైవయోగంబున నాకుమారువదనంబు సొచ్చితి. ప్రవే శించి యాబాలునుదరంబున గంగాయమునాదినదులను, మేరుమందరకైలాసాదిప ర్వతంబులను, స్వస్వధర్మానుష్ఠానపరు లయినసకలజనులను, సింహవ్యాఘ్రాదిక్రూ రజంతుసంకులంబు లయినకాఱడవులను, సముద్రంబులను, భూమిం గలసకలజం తువులను, సోమసూర్యతారాగ్రహనక్షత్రనిబిడం బయినగగనంబును, శక్రయ మవరుణాదిలోకపాలకులను, దేవదానవగంధర్వయక్షరాక్షససిద్ధసాధ్యనాగసుపర్ణా ప్సరోఋషిగణంబులనుం గాంచి విస్మితుండనై యచట నూఱేండ్లు దిరిగి విచా రించియు నబ్బాలుశరీరంబున కంతంబుఁ దెలియనేరక యమ్మహాత్ముని శరణుసొ చ్చితి. అట నాకుమారుండు దననిశ్వాసవాయువేగంబున నన్ను వెడలించె. వెడ లివచ్చి నేను గ్రమ్మఱ వటతరువిటపపర్ణపర్యంకంబున సుఖాసీనుం డైనయాకు మారుం గనుంగొని యందులకుఁ గొలఁదియిడరానియబ్బురం బందుచుండ నబా లచరితుం డయినయాబాలుఁడు నన్నుఁ బిలిచి మృకండుతనయా, నాశరీరాంత రంబున సుఖముంటివే? బడలిక సడలెనే? యనియడుగ నేను దత్ప్రకారంబెల్ల భగవంతునిమాయావిలాసంబుగా నొపు నని భావించి మృదులారుణంబు లగు వ్రేళులం దనరారి కెంజాయ రంజిల్లియత్యంతసుకుమారంబు లై యున్నయక్కు మారునడుగులకు సాష్టాంగదండప్రణామం బాచరించి వినయంబున నంజలిపుటం బులు ఘటియించి దేవా, భవదనుగ్రహంబుననే పూర్వస్మృతి సెడకున్నయది. నీయుదరంబు సొచ్చిచూడ సకలలోకంబులు గానంబడియెడి. ఇటఁ జూచిన నీవు కుమారుండుగఁ గన్పడియెదవు. సకలలోకంబులం గుక్షియం దునిచికొని యిట

నిట్లుండ నేల? ఎంతకాలం బిట్లుందువో? భవన్మాయాప్రభావంబు దురూహంబు. కరుణించి దీనిఁ దెలియఁ జెప్పు మని నాకొలంది యెఱుంగక వేఁడిన నాభక్తవత్సలుండు నను దయార్ద్రదృష్టి నూఱడించి వత్సా, దేవతలును నామాయాప్రభావం బెఱుంగరు. నీశరణాగతికిఁ, బితృభక్తికి, బ్రహ్మచర్యవ్రతంబునకు మెచ్చితిఁ గావున వివరించెద విను మని యిట్లనియె.

## నారాయణుండు మార్కండేయునకుఁ దనప్రభావంబుఁ జెప్పుట.

నారములన నుదకంబులు. అవి నా కయనం బగుటం జేసి నేను నారాయణుం డనం బరఁగుదు. అట్టి నారాయణపదవాచ్యుండ నగు నేనే సర్వభూతంబులకు సృష్టిస్థితిలయంబులం గావించుచు బ్రహ్మవిష్ణుశివపదాభిధేయుండ నగుదు. ఇంద్రాదిలోకపాలురు మదంశసంభూతులే. సంవర్తకానలంబు సంవర్తకమారుతంబు సంవర్తకసూర్యుండును నేన. నాకు వహ్ని ముఖంబు. భూమి పాదంబులు. చంద్రసూర్యులు నేత్రంబులు. ఆకాశంబు శిరంబు. దిక్కులు చెవులు. ఉదకంబు స్వేదంబు. భూమ్యంతరిక్షంబులు శరీరంబు. కామక్రోధహర్షమోహాదులు రోమంబులు. సముద్రాదులు వసనశయననిలయంబులు. నేను బహుదక్షిణంబుగ ననేకయజ్ఞముల నొనరించితి. వేదవిదు లయిన బ్రాహ్మణులు స్వర్గకాంక్షు లగు క్షత్రియవైశ్యులు మత్ప్రీణనార్థం బధ్వరంబులఁ జేయుదురు. ఋగ్యజుస్సామాథర్వాఖ్యంబు లగు నాలుగు వేదంబులు నాయందుఁ బుట్టి తుది నన్నే చేరును. మదీయముఖభుజోరుపాదంబులం గ్రమంబున బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు వుట్టిరి. కామాదిదోషదూరులు నిస్సంగులు విగతకల్మషులు సత్త్వప్రధాను లధ్యాత్మకోవిదులు వేదవిదులునై ఫలాభిసంధి లేక యజ్ఞముల నాచరించుచు నహింసాతపస్సత్యదానపరు లగువారు నన్నే ధ్యానించి కైవల్యంబు వడయుదురు. కామక్రోధాదిపరాభూతులై దుష్కృతంబులఁ జేయువారు నాతత్త్వం బెఱుంగక సంసారచక్రంబునం బరిభ్రమింతురు. నేనే తొల్లి వరాహరూపధరుండనై భూమి నుద్ధరించితి. శేషుండనై దీని వహించెద. బడబాగ్నినై సముద్రోదకంబులఁ ద్రావి ప్రళయంబునం గ్రమ్మఱ వాని విడుతు. మదీయస్వరూపంబు మూఢులకు దుష్ప్రాపంబు. ధర్మహాని, యధర్మోదయంబు, రాక్షసాదులవలని బాధయుం గలిగినపుడు సుకృతవంతులకులంబుల మనుష్యుండనై యవతరించి యంతయు రూపఱఁ జేసి క్రమ్మఱ నిజమాయాప్రభావంబున భూతగణంబులను సృజింతు. కృతత్రేతాద్వాపరకలియుగంబులం గ్రమంబున శ్వేతపీతరక్తకృష్ణవర్ణుండనై యుండుదు. విచిత్రం బనిర్వాచ్యంబు నగు కాలచక్రంబు నడిపింతు. ఇది మదీయమాయావిలాసంబు. నీసచ్చరిత్రంబునకు మెచ్చి బ్రహ్మరూపంబున నేనే వరము నిచ్చితి. సర్వలోకపితామహుం డైనయతఁడు నాలో సగబాలు. యుగసహ

గ్రసంబు నిండునందాఁక శంఖచక్రగదాధరుండనై యోగనిద్రాపరాయణత్వంబున వర్తింతు. బ్రహ్మ మేల్కాంచునంతకు నిట్లుశిశురూపధరుండనై యుండుదు. చరాచరాత్మకం బయినప్రపంచంబంతయుఁ బొడవడంగి యేకార్ణవం బై యుండ నీవు బమ్మరించుటం జూచి నీకు విశ్రాంతిఁ గల్పించునెపంబున నాయుదరంబునం గ్రమ్మఱ లోకంబులనెల్లం జూపితి. చూచి యాశ్చర్యంబుఁ జెందుచుఁ దత్త్వం బెఱుంగకుండంజేసి తద్బోధనార్థంబ నిన్ను వెలువరించితి. నీశ్రేయంబుపొంటె నింత చేసితి. లాఁతి వారి కెవ్వరికి నెఱుంగరానిమత్ప్రభావంబు నీకు బోధించితి. బ్రహ్మ మేల్కాంచునందాఁక నీ వీచట సుఖంబునం జరించుము. అతండు ప్రబుద్ధుండై పంచభూతంబులను జరాచరవర్గంబును సృజించువాఁడు. సృష్టిప్రకారం బెల్ల సాకల్యంబుగఁ గనుంగొను మని యానతిచ్చి యద్దేవదేవుం డంతర్హితుం డయ్యె. అంతఁ గ్రమంబునఁ బ్రజాసృష్టి యయ్యె. అత్యంతవిచిత్రం బయినసృష్టిస్థితిలయప్రకారంబంతయుఁ బ్రత్యక్షంబుగఁ గనుంగొంటి. ఆప్రళయసమయంబున నాకు దర్శనం బొసంగినభగవంతుండే మీకుఁ జుట్టమై యీవసుదేవనందనుం డన నవతరించియున్నవాఁడు. మీభాగ్యోదయం బెట్టిదో. ఇతండె పురాణపురుషుం డచింత్యమహిమోల్లసితుండు. లోకజాలసృష్టిస్థితిలయహేతుభూతుండు. సర్వభూతంబుల కేడుగడ. ఇమ్మహానుభావుదర్శనంబుననే తద్వృత్తాంతంబు నా కిపుడు గోచరం బయ్యె. శరణాగతవత్సలుం డయినయీపురుషోత్తము శరణుఁ జొరుఁ డనిచెప్పినం బాండవులు ద్రౌపదియు గోవిందుచరణారవిందంబులకు వందనంబులు గావించుటయు భగవంతుఁడు వారల నందఱం గరుణాంతరంగితాపాంగావలోకనంబునం బ్రసాదించి తగినభంగుల నూరార్చె.

### మార్కండేయుండు ధర్మరాజునకుఁ గలిధర్మంబులం జెప్పుట.

పదంపడి పాండవాగ్రజుండు మార్కండేయుం జూచి మునీంద్రా, నీవు కరుణించి వివరింపఁగఁ బ్రళయకాలవర్తనంబెల్లఁ దెలిసితి. కలియుగంబున ధర్మక్షయంబైన లోకం బెవ్విధి వర్తించు? క్రమ్మఱఁ గృతయుగం బెట్లు ప్రవర్తిల్లు? సవిస్తరంబుగ వివరింపు మనియడుగ మార్కండేయుండు ధర్మజా, పెద్దలవలన విని యనుభవించినదానిం జెప్పెద వినుమని యిట్లనియె. ధర్మంబు కృతయుగంబున నాలుగుపాదములను, త్రేతాయుగంబున మూఁడుపాదములను, ద్వాపరయుగంబున రెండుపాదములను, గలియుగంబున నొక్కపాదమునను వర్తించు. కృతాదియుగంబులం గ్రమంబున మనుజుల కాయుర్వీర్యతేజోబుద్ధిబలంబులు తఱుఁగుచుండు. కలియుగంబున వ్యాజంబుననే ధర్మములఁ జేయుదురు గాని పరమార్థబుద్ధిం జేయరు. పండితమ్మన్యులై జనులు సత్యంబు విడుతురు. సత్యహాని వలన నాయువు క్షయించు. ఆయుఃక్షయంబున విద్య లల్పంబు లగు. అల్పవిద్య

లంజేసి యజ్ఞానం బలము. అజ్ఞానంబున లోభంబు మిగులు. లోభంబునఁ గ్రోధ మతిశయించు. క్రోధంబునఁ గామంబు పెరుఁగు. కామమున వైరంబు వృద్ధము. దానంజేసి యందఱు నొండొరుల మెచ్చక దుష్కృతంబులఁ గావించుచు వర్ణసంకరంబుఁ జేయుదురు. దేశములెల్లఁ బుళిందయవనాదిసంకీర్ణంబులై సింహవ్యాఘ్రాదిక్రూరమృగభూయిష్ఠంబులై శూన్యప్రాయంబు లగు. గంధద్రవ్యము లల్ప గంధము లగు. రసవస్తువుల స్వాదుత్వంబు తఱుఁగు. గోవులల్పక్షీరము లగు. మేకలపాఁడియు గొఱియలపాఁడియుఁ దఱుచగు. లతాపాదపంబులఁ బుష్పఫలంబు లల్పంబులగు. కాలమున వర్షంబులుగురియవు. సర్వబీజములు నోషధులుంజక్కఁగ ఫలింపవు. ఆఱికపంట లతిశయించు. జను లల్పాయువు, లల్పబలు, లల్పపరాక్రము, లల్పదేహు,లల్పసారులు,దరిద్రులు,నాస్తికులు,చోరులు నగుదురు. ఇదితగు నిది తగదని విచారింపక పాపాచారులై నమ్మికమై నుంచినయిల్లడసొమ్ముల, దీనబంధు విధవాదిధనంబుల నపహరింతురు. అన్నవిక్రయంబుఁ జేయుదురు. కన్యాదానగ్రహణ నియమంబు మాని తమంతట నిచ్చవచ్చినకన్నియలఁ బెండ్లి యగుదురు. ఒరుల కాతిథ్యంబుఁ జేయుట మాని పరాన్నముల మెచ్చుచుందురు. వానలు లేమిం జేసి బ్రతుకనేరక నదీతీరముల గుద్దండ్లఁ ద్రవ్వి త్రవ్వి బీజములఁ జల్లి యాపంటల నెట్లొ బ్రతుకఁ గోరుదురు. దైవపైతృకకార్యంబుల నొకళ్లొకళ్లకుఁ గుడువఁబెట్టుదురు. హేతువాదమోహితులై నిమ్నస్థలంబులఁ గృషిఁ జేయుదురు. ఆఁబనుల నొకయేఁటిదూడలనుం గాడికట్టుదురు. కరగతం బయినవస్తువును బశ్యతోహారత్వంబునఁ జేతనే నాఁచికొందురు. వృద్ధులు బాలబుద్ధు లగుదురు. బాలురు వృద్ధమతు లగుదురు. భీతచిత్తుఁడు శూరమాని యగు. శూరుఁడు భీరువులతో వాదులాడు. వఱపుల పెల్లున శాలిక్షేత్రంబులు ఫలింపమిం జేసి యట్టి దేశంబుల బ్రదుకనేరక యవగోధూమాదుల నాహారంబుగాఁ గొను దేశములం జేరుదురు. స్వభావంబున గ్రూరకృత్యులై యిష్టానుసారంబున వర్తించుచు హింసాప్రధానులై తోఁటలు మున్నగుచోట్లఁ జెఱుతురు. ఐహలౌకికఫలములనే గోరుచు నధర్మంబ చేయుదురు. పుత్రులు తండ్రుల వధింతురు. తండ్రులు కొడుకులం జంపుదురు, చంపియుఁ బశ్చాత్తాపంబుఁ జెందక వాదములు సేయుచు ననిందితులై యుండుదురు. మత్స్యభక్షణంబునఁ బ్రాణయాత్ర నడపుదురు. పురుషులకు భార్యలే మిత్రంబు లగుదురు. భార్యలును బతుల మెచ్చక ప్రల్లదంబు లాడుచు మాటకు ముందుగ నేడ్చుచుఁ బెడవాతురుగాని వారియాజ్ఞమెయి నడువరు. మఱియు నేదేనినెపంబునఁ బతులం బుత్రులం జంపుదురు. రాగంబుననొండె ధనాపేక్షనొండె నిచ్ఛానుసారంబుగ వ్యభిచరింతురు. బ్రాహ్మణులు హేతువాదమోహితులై జపతపస్స్వాధ్యాయయజ్ఞాచరణాదిస్వధర్మంబుల విడుతురు. భక్ష్యాభక్ష్య

విచారంబు మానుదురు. వేదముల నిందింతురు. ధనమున కాసపడి శూద్రులం గొలుతురు. వాణిజ్యంబు వృత్తిగాఁ గొందురు. వృథా నఖరోమములఁ బెంచికొని ధర్మధ్వజులై మునివేషములఁ దాల్చి ధన మార్జింతురు. వేదముల విక్రయింతురు. రాజులు లోభమోహాహంకారాది సమావిష్టులై న్యాయప్రాప్తం బయినధనమున సంతసింపక పరధనముల నెట్టులయిన నాఁచికొనఁ జూతురు. కప్పములు మిక్కిలి గ్రహించి ప్రజలఁబీడింతురు. సాధువులదారధనముల బలాత్కారమున నాక్రమింతురు. దండమాత్రాసక్తు లగుదురు. వైశ్యులు మాయావాదులై జనుల వంచించి కూటమానములఁ గ్రయవిక్రయ వ్యవహారంబు సల్పుదురు. శూద్రులు జపాదులఁ జేయుచు బండితమ్మన్యులై బ్రహ్మవాదులై బ్రాహ్మణుల నవమానించుచు ధర్మంబు బోధింతురు. బ్రాహ్మణులు వారలఁ గొలుచుచు వారియెడఁ బ్రామాణ్యం బునిచి తదుక్తధర్మముల వినుచు నవమానపూర్వకంబుగ వారిచ్చుధనములఁ బ్రతిగ్రహింతురు. శిష్యులు గురువులమాట వినరు. గురువులును శిష్యులయెడ వంచకు లగుదురు. ఆశ్రమధర్మములు చెడు. అధర్మపరులు వృద్ధిఁ గాంతురు. ధర్మిష్ఠు లెల్ల విధములం జెడుదురు. దేశంబులెల్ల మ్లేచ్ఛప్రాయంబు లగు. మఱియుఁ గలియుగాంతమున శూద్రులు క్రోధాభిభూతులై బ్రాహ్మణులం జంపఁ బూనుదురు. వారిచే వెట్టిసేయింతురు. వారిసొమ్ముల నాఁచికొందురు. అయ్యాతతాయులకు వెఱచి విప్రులు రక్షకుం గానక హాహాకారములఁ జేయుచుఁ గాకులపోలిక దిక్కుమాలి తేఁకువచెడి దేశముల నెల్లం ద్రిమ్మరుచు నేఱులయుఁ గొండలయుఁ బా లగుదురు. వర్ణాశ్రమవిభాగంబేర్పడక లోకంబెల్ల నేకవర్ణం బగు. జనుల కపుడు పదునాఱేండ్లుపరమాయు వయ్యెడి. అయిదాఱేడుల యీఁడుపడఁతులు సంతతిం బడయుదురు. పదెనిమి దేండ్లప్రాయంపు మగవారు బిడ్డలతండ్రు లగుదురు. స్త్రీపురుషు లొండొరుల మెచ్చక యిచ్చవైవిచ్చలవిడి చరింతురు. శ్రాద్ధకృత్యంబులు నడువవు. గృహస్థులు పథికుల కెడమియ్యరు. అన్నపానీయముల విచారింపరు. మిత్ర,సంబంధి,పరిజనులఁ ద్యజింపఁగ వా గోతండ్రీ! యో కొడుకా! యనుచు నతిదారుణంబుగ నాక్రోశించుచుఁ బుడమియెల్లఁ ద్రిమ్మరుదురు. మద్యపానాదిదుర్వృత్తంబు లతిశయించు. ఆశ్రమంబులందు, బ్రాహ్మణావాసంబులందు, దేవస్థానంబులందు నెముకలతోడం బాడుగోడలు గన్పడు. మనుష్యాశనంబు లయినమృగంబులు పక్షులు నేవేళల నూరూరను అచ్చపట్లం జేరియుండు. దిగ్దాహంబు గలుగు. నక్షత్రంబులు నిస్తేజస్కంబు లగు. సూర్యుఁడుదయాస్తమయంబులఁ గబంధాంతర్హితుండై గన్పడు. బీఱెండ గాయు. ఊఱుములు మెఱుములును మెండగు. కొఱవులు పడు. పర్వముగానితఱి రాహువు సూర్యుని గ్రసించు. అగ్ని మిక్కిలి జ్వలించు. పక్షు లతిపరుషముగ నఱచు. ఇట్లు లోకమెల్ల నిర్మర్యాదంబై విపరీతవర్తనంబై యథర్మభూయిష్ఠంబై యుండ శం

బలగ్రామంబున విష్ణుయశుం డను బ్రాహ్మణునకు విష్ణుదేవుండు కల్క్యాత్మకుండై జనించి స్మరణమాత్రంబున సన్నిహితంబు లయినవాహనాయుధశస్త్రకవచాదిసాధనములం బడసి బ్రాహ్మణసేనాసమన్వితుండై కడంగి యధర్మరతు లయినపాషండులను మ్లేచ్ఛులనుం జంపి ధర్మమున దిగ్విజయంబుఁ జేసి చక్రవర్తియై ధర్మంబు నిల్పి విధ్యుక్తప్రకారంబున నశ్వమేధయాగం బాచరించి భూమినెల్ల దక్షిణగా బ్రాహ్మణుల కొసంగి తపోవనంబునకుఁ జను. పదంపడి జనులెల్ల వర్ణాశ్రమవిభాగంబుఁ దప్పక తమతమధర్మముల ననుష్ఠింతురు. దానంజేసి కృతయుగంబు ప్రవర్తించు. సూర్యచంద్రబృహస్పతు లెపుడు పౌషమాసమున నేకరాశిగతు లగుదురో యది కృతయుగంబునకు నిదర్శనంబు. ఆయుగంబు ప్రాప్తంబయినం జనులు ధర్మంబ చేయుదురు. బ్రాహ్మణులు జపతపస్స్వాధ్యాయయజ్ఞాదుల వేదోక్తప్రకారంబున నాచరింతురు. క్షత్రియులు ధర్మమునఁ బ్రజల నేలుదురు. వైశ్యులు న్యాయమున వాణిజ్యాదులఁ జేయుదురు. శూద్రు లుత్తమపరిచర్యాపరాయణు లగుదురు. తటాకారామదేవాలయాదులు పెంపు గాంచు. వర్షములు తఱితోఁ గుఱియు. సర్వబీజౌషధులు ఫలించు. ధర్మంబ పెచ్చుపెరుగుచుండు. ఇది కృతయుగవర్తనంబు. త్రేతాద్వాపరంబులందును ధర్మంబు ప్రవర్తిల్లు. వాయుప్రోక్తం బయినపురాణము ననుసరించి యతీతానాగతయుగవర్తనంబెల్ల నీకెఱింగించితి. ఇదియెల్ల నాకుఁ బెక్కుమాఱులు ప్రత్యక్షంబై యుండు. ధర్మంబు విడువక నడువుము. మఱియొకహితం బుపదేశించెద నవహితుండవై వినుము. ఎన్నఁడైన బ్రాహ్మణునెడఁ దిరస్కారంబు సేయకుము. బ్రాహ్మణుం డలిగెనేని ప్రతిజ్ఞపూని లోకములనెల్లం గాల్చును. ఇది మనమునఁ బదిలపఱుచుకొను మని చెప్పిన మార్కండేయువచనం బాకర్ణించి ధర్మనందనుండు మునీంద్రా, ప్రజల రక్షించునెడ నెట్లు ధర్మంబు సలుపవలయు. ఎట్లు వర్తించిన ధర్మంబునకుఁ దప్పనివాఁడ నగుదు ననియడుగ మార్కండేయుం డతని కిట్లనియె. ధర్మనందనా, సర్వభూతములయెడ దయాళుండ వగుము. అసూయ దిగవిడువుము. సత్యంబ పల్కుము. శాంతి నవలంబింపుము. మార్దవంబుఁ జేకొనుము. ధర్మం బాచరింపుము. అధర్మంబుఁ దొలంగుము. పితరులను దేవతలనుం బూజింపుము. ప్రీతిమైఁ బ్రజల నేలుము. ప్రమాదంబున నెందేని లోపంబు వాటిల్లిన దానాదులఁ దద్దోషంబుఁ బోద్రోచికొనుము. పెద్దలకు విధేయుఁడ వగుము. ధర్మమున భూమండలంబెల్ల జయించి సుఖివి గమ్ము. భువనవిదితం బయినకురువంశమున జనించి ధర్మరాజనఁ బేరువడసిననీకుఁ దెలియనిధర్మువుం గలదే. ధర్మమున వర్తింపుచుండినం దొసఁగులు పొసఁగుచున్నవిగా యని మనమున నెడరుల కెడ యియ్యకుము. ప్రాజ్ఞులు కాలవశంబునఁ గలుగువానికి వగవరుగదా. నావచనంబు శంకింపక యాచరింపు మని

బోధించిన వీనులవిం దయినయమ్మునీంద్రువచనోపన్యాసంబు నాకర్ణించి పాండవా గ్రజుండు మునివరేణ్యా, యత్నమున నీశాసనంబు మెయి నడచెద. లోభమోహాదులు నను: జేరరా వనినివేదించె. వాసుదేవప్రముఖు లందఱు మునీంద్రుధర్మోపదేశంబునకు విస్మయం బందిరి. అట ధర్మరాజు మునీంద్రా, వెండియుం బ్రాహ్మణమాహాత్మ్యంబు వివరింపవే యనియడుగ మార్కండేయుం డిట్లనియె.

మార్కండేయుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబుఁ జెప్పుట.

ధర్మనందనా, యిక్ష్వాకుకులజనితుం డైనపరీక్షితుఁ డనువాఁ డయోధ్య నేలుచుండె. అతఁ డొక్కనాఁడు తురగారూఢుఁడై వేటకై వనమునకుఁ జని పెక్కుమృగముల వధించి యొక్కదానిపై బాణ మేసిన నది తప్పించుకొని పాఱిపోయె. పాఱిపోయిన నతండు దానివెంటఁ దవిలి బహుదూరం బరిగి డస్సి క్షుత్పిపాసార్తుండై చనువాఁ డొకమహావనంబు సొచ్చి యం దత్యంత రమణీయం బైనకొలనుఁ గాంచె. కాంచి యందుఁ దాను గృతస్నానుండై తదీయ మధుర జలములఁ ద్రావి గుఱ్ఱమునుం గడిగి తామరతూఁడుల దానికి మేఁత గావించియ క్కొలనిగట్టున సుఖంబుమైఁ బరుండె. పరుండి యచట మధురగానంబు వినవచ్చుటయు నిర్జనం బైనయిచ్చోట నీపాట వినరాఁ గతం బేదియో యని యరయుచుండె. అప్పు డొకసుందరాంగి పూవులఁ గోయుచుఁ బాట పాడుచు డాయవచ్చిన నాపరీక్షితుండు దానిం బిలిచి నీ వెవ్వతె వెవ్వరిదాన వనియడుగ నది నేఁ గన్య నెవ్వరిదానఁ గావలయు ననియుత్తరం బిచ్చె. ఆమాట విని యతండు నీవు కన్య వేని నన్నుఁ బెండ్లి యగు మనుటయు నా కన్నియ యోనృపాలా, జలవిహారంబునకుఁ బోనుపకుండునందాఁక నీయొద్ద నుండుదు. ఇందుల కొడంబడియెదవేని నినుఁ బెండ్లియగుదు ననుటయు నతం డట్లయగుంగాక యని యాసమయంబున దానిం గాంధర్వవిధానంబున వివాహంబై యభిమతక్రీడల సుఖంపుచుండె. అంత నయోధ్యనుండి సేన వచ్చుటయు నారా జాకన్నియం దోడ్కొని పురంబునకుఁజని యెల్లపుడు నేకాంతంబ దానితో నుండుటయుఁ దద్వృత్తాంతం బెవ్వరుం జక్కఁగఁ దెలియరైరి. అట నొకనాఁడు ప్రధానామాత్యుండు పరిచారికలం బిలిచి యిది యేమి వీరివర్తనం బనియడిగిన నాపరిచారిక లయ్యా,యిది యెంతయు నపూర్వంబయి తోఁచెడి. జలం బిటకుఁ దేజనదఁట ఏతత్ప్రకారం బెట్టిదియోయనుటయు నతండు సలిలరహితం, బుదారతరురమణీయంబు, బహుపుష్పఫలమూలంబు నగు తోఁటఁ గల్పించి దానిపార్శ్వంబున విమలసలిలపూరితం బయినవాపి నొక్కదానిఁ ద్రవ్వించి యొక్కనాఁ డయ్యుపవనంబుసొంపు రాజునకుఁ దెలిపె. తెల్పుటయు నాభూపాలుం డాతోఁటఁజేరి దానితోఁ బెద్దకాలం బభిమతలీలల వర్తింపుచుండ యొక్కనాఁడు పెద్దయు డప్పి నిటునటుం దిరుగువాఁ డొకబండిగురువిందలీవెల పొదరు

టిల్లు సొచ్చి యామండట నాబావిం గనుంగొనియె. కనుంగొని ప్రియురాలిం బిలిచి మెల్లన డిగి యాబావినీళ్లు దెమ్మనుటయు నది యందు డిగి నీట మునింగి మఱి గన్పడదయ్యె. పరీక్షితుం డట నాబావిలోడిగి యంతట వెదకి దానిం గానక యొక బొక్కలోఁ గప్పనొకదానింగాంచి తనప్రేయసి నాకప్ప మ్రింగె ననిభావించి క్రోధదీపితుండై కప్పలఁ జంపి నాకుఁ జూపినవానికిఁ గోరినధనం బిత్తు నని యెల్లచోట్లం జాటించె. దానంజేసి రాజునకుఁ బ్రీతిగాఁ బెక్కండ్రు కప్పలఁ జంపం దొడంగిరి. అందుకు నివ్వెఱఁ జెంది మండూకంబులు తమరాజున కెల్లయుం దెల్పిన నాభేకనాయకుండు మునివేషధరుండై పరీక్షితునొద్దకుఁ జనుదెంచి నృపాలా, క్రోధం బుడుగుము. తప్పు సేయనికప్పల వధింపఁ బంపఁరాదు. వీని వధించిన నేమి లాభం బగు ననినఁ బరీక్షితుండు మండూకరాజున కిట్లనియె. అయ్యా, మండూకములు నాప్రియురాలిని మ్రింగె. అట్టిదురాత్మంబులఁ జంపకుండుట తగునే? ఎల్ల విధంబుల వానిం జంపనవలయు. ఇఁక నాయుద్యమంబున కడ్డము చెప్పవల దనిన నామండూకనాయకుండు వ్యథితచిత్తుండై రాజపుంగవా, ప్రసన్నుండవై నా మాట వినుము. నేను మండూకనాయకుండ. ఆయు వనువాఁడ. ఆవనిత నాకూఁతురు. దానిచెడునడతంజేసి పలువురు రాజులు బేలువడి రనినఁ బరీక్షితుండు వానిం జూచి మండూకనాయకా, దానిపై వలపు నిలుపఁ జాలనయ్యెద. దానినా కిమ్మని వేఁడిన నతం డట్లయని తనకూఁతు రావించి యారాజున కొసంగి యితనికి శుశ్రూషఁ గావింపుచుండునది యని బుద్ధిఁ గఱపి దానిదుశ్శీలంబునకుఁ గినిసి కుమారీ, నీవు పెక్కురాజుల బేలువుచ్చినదానవు గావున నీకొడుకు లబ్రహ్మణ్యు లగుదు రనిశపించె. పరీక్షితుండు దానిం గైకొని త్రైలోక్యరాజ్యంబు లభించినంత సంతోషంబుఁ జెంది యాకప్పలతేని సత్కరించిన నతండు వారల వీడ్కొని యథాగతంబుగఁ జనియె. అట నాయిక్ష్వాకుకులుం డభిమతక్రీడాతత్పరుండై దానియందు శలుఁడు, దలుఁడు, బలుఁ డనువారల మువ్వురు కొడుకులం బడసి కొండొకకాలంబునఁ బెద్దవాఁ డగుశలుని రాజ్యాభిషిక్తుంజేసి తపోవనంబున కరిగె. ఆశలుం డొక్కనాఁడు రథారూఢుండై వేటవోయి పెక్కుమెకముల వధించిన నొకమృగంబు తప్పించుకొని పాఱుచుండ దాని వెన్ను దన్ని పోవుచు సారథిం జూచి మృగంబు మనకు మిగిలిపోకుండ రయంబున నరదంబుఁ దోలు మనవుడు నతం డిట్లనియె. రాజపుంగవా, యీగుఱ్ఱములు నీకోరునంత వేగమునఁ బఱవనోపవు. వామ్యాశ్వంబులైన నీకోరిక నీడేర్చు. అవి మనోజవంబు లనిన రాజు సారథీ, యవి యెయ్యవి? యెచ్చట నున్నవి? తెలియఁ బలుకుము. చెప్ప వేని నినుఁ బరిమార్తు ననుటయు వాఁడు చెప్పకున్న రాజు దండించు చెప్పినఁ దదశ్వస్వామి యగువామదేవముని శపించు నని మనంబున శంకించుచు నేమియుం

చెప్పక చింతిల్లుచుండె. అందుకుఁ గడుం గినిసి శలుండు సారథీ, వామ్యాశ్వముల వర్తనంబుఁ దెల్పకున్న నిదె నినుఁ బొరివుచ్చెద ననుటయు నతండు రాజునకు వెఱచి యాగుఱ్ఱములు వామదేవమునియెడం గల వని తెలిపె. తెలిపిన రాజు మనరథంబు నమ్మునియాశ్రమంబునకుఁ దోలు మనిన నతం డట్లచేయుటయు శలుం డాశ్రమసమీపంబున రథంబు డిగి చని వామదేవుం గాంచి మునీంద్రా, నా చేత నేటువడి యొకమృగంబు పాఱిపోయె. దాని నెయిది వధింపఁ దలంచెద. నాగుఱ్ఱము లతిత్వరితగతిం బఱవనేరవు. నీవామ్యాశ్వముల నొసంగు మనియడిగె. అడుగుటయు నావామదేవుండు నరేంద్రా, నీకోరికమెయి నాగుఱ్ఱముల నిచ్చెద. పనితీఱినపిదప వానిఁ గ్రమ్మఱ నా కప్పగించునది యనివక్కాణించె. అందుల కొడంబడి యతం డా తురంగంబుల గ్రహించి యరదమునఁ బూన్చించి యమ్మునిచే ననుజ్ఞాతుండై రథం బధిరోహించి యతిత్వరితగతి నరిగి ముహూర్తమాత్రంబున నామృగంబు నెయిది వధియించి యయ్యశ్వములవేగంబునకు మెచ్చి సారథిం బిలిచి యియ్యుత్తమాశ్వంబులు బ్రాహ్మణుల కేల? కావున వామదేవున కొసంగ వలదు. మనవీటికిఁ గొనిపోద మనిచెప్పి క్రమ్మఱి నిజపురంబు సేరి యంతఃపురంబున వానిఁ గట్టఁబంచి పదిలపఱిచె. అంత నవ్వామదేవుండు తనగుఱ్ఱముల శలుఁడు గ్రమ్మఱింపక యెడసేయుటకుఁ జింతిల్లి యొకమాసంబు నిండినపదంపడి యాత్రేయుం డనుశిష్యుని బిలిచి శలుఁడు మనహయములఁ గొనిపోయి యొకనెలయయ్యె. ఏలొకో మగిడింపకున్నవాఁడు. కావున నీ వయోధ్యకుఁ జని యానృపాలుం గాంచి మాయుపాధ్యాయువామ్యాశ్వములం బని యయ్యెనేని మగిడింపు మనియడుగు మనిపనిచె. మునిశిష్యుండు పనివిని శలునొద్దకుఁ బోయి గురువచనం బాతనికిఁ దెల్పిన నానృపాలుండు మునిశిష్యుం జూచి రాజయోగ్యంబు లయినయిట్టియుత్తమాశ్వంబులు బ్రాహ్మణుల కేల? నెమ్మదిం బొమ్మని యుత్తరంబుఁ జెప్పె.

శలుఁడు వామదేవమునిని దిరస్కరించుట.

అట నామునికుమారుం డరిగి యంతయుఁ జెప్పిన విని వామదేవుండు క్రోధావిష్టుండై తాన యయోధ్యకుఁ బోయి గుఱ్ఱముల నిమ్మని యడిగిన నానృపాలుఁ డీ ననుటయు నమ్ముని కడుం గనలి పార్థివా, పెఱవానిచేతఁ గానిపని నా గుఱ్ఱములచేఁ జేయించుకొని పనితీఱినపిదప నియ్యననుట తగదు. బ్రహ్మక్షత్రంబులకుం బోలనిరీతిఁ బూని యధర్మంబు సేయుదువేని వరుణుఁడు నిను ఘోరపాశముల బంధించు ననిపలికె. ఆమాట విని రాజు వామదేవా, సాధుదాంతంబు లయినయనడ్వాహంబులు బ్రాహ్మణులకు వాహనంబులుగాఁ జను. వాని నిచ్చెద. తద్యోజితశకటం బెక్కి యథేష్టంబుగఁ జనుము. మఱియుఁ జక్కఁగఁ బరికింప వేదములే మీబోంట్ల వహించుఁగదా యనవుడు వామదేవుఁడు నరేంద్రా, వేద

ములు పరలోకమున వహించుఁగాని యీలోకమున వహింపవు. ఇచట మాబోంట్లకు నితరులకు నితరంబులే వాహనంబు లనిచెప్పిన శలుఁడు మఱియు నిట్లనియె. మునివరేణ్యా, వాయువేగంబు లయినగుఱ్ఱంబులనెండె, మంచివేసడములనెండె నిచ్చెదఁ గొనిపొమ్ము. ఇఁక నీవామ్యాశ్వములు నాసొమ్ముగాని నీసొమ్ముగా దని యెఱుంగు మనిన వామదేవుం డెంతయు నలిగి యన్యాయాపహృతం బయినతన ధనంబుఁ గ్రమ్మఱ సాధించుట బ్రాహ్మణునకు వ్రతంబు. నాగుఱ్ఱము లియ్యవేని ఘోరాకారు లయినరాక్షసులు మద్వచనప్రేరితులై చుట్టుముట్టి నినుఁ బొరివుత్తురనియె. ఆమాటకు శలుండు నలిగి యారాక్షసులే మద్వచనప్రేరితులై నిను నీ శిష్యునిం జంపుదు రని మాఱుపలికె. ఆపలుకులు చెవులకు ములుకులై సోఁక వామదేవుఁడు శలుం జూచి మనోవాక్కర్మంబుల వేదోక్తధర్మంబుల నాచరించు బ్రాహ్మణుల నిట్లు పలుకరాదు. తత్ఫలంబుఁ గుడిచెద వనుచుండ ఘోరాకారు లయినరాక్షసులు శూలముతోడఁ బొడసూపి యాశలునిఁ జంపఁబూనుటయు నతం డామునిం జూచి యిక్ష్వాకుకులజులు నాతమ్ముఁ డగుదలుఁడును నాకు విధేయులేని నీకు వామ్యాశ్వంబుల నియ్య రని యెలుంగురాల్పడఁ జెప్పుచున్నంత నారాక్షసులు వానిఁ జంపిరి. వామదేవుఁడు నిజాశ్రమంబునకుఁ జనియె. అట వానితమ్ముఁడు దలుఁ డనువాఁడు రాజ్యాభిషిక్తుం డయ్యె. అంత నొక్కనాఁడు వామదేవుఁడు దలునిపాలికిఁ జని రాజేంద్రా, ధర్మంబు దప్పవేని యధర్మంబునకు వెఱతువేని నాగుఱ్ఱముల నిమ్మని యడిగె. అడిగిన నతం డోహోహో! యితండు గుఱ్ఱముల నడిగెడివాఁడుగా యని రోషావిష్టుండై చెంగట నున్నసారథిం బిలిచి విషదిగ్ధం బయినబాణంబును విల్లునుం దెమ్ము. ఈ వామదేవుం బరిమార్చి కుక్కలకు బలి చేయుదు ననిన నమ్మునివరుండు గిసిసి యాబాణంబ యంతఃపురంబున నాటలాడుచున్ననీకొడుకును బదియేండ్లప్రాయమువాని శ్యేనజితుం డనువానిఁ జంపుఁగాక యనుటయు నాబాణం బారాజుకుమారుని వధించె. దలుం డంత నిలువక సభయెల్లఁ గలయఁజూచి మఱియొకయమ్ముఁ గొని రండు. ఈవామదేవుం దెగటార్చెద. నావీర్యంబుఁ జూడుఁ డనిన నయ్యిక్ష్వాకులు వేఱొక్కబాణంబుఁ దెచ్చుటయు నాదలుండు బాణం బరివ్రేయఁబోయి యట్లు చేయను మీఁదికెత్తినచేయి దిగువను నేరఁ డయ్యె. దాన సిగ్గఱి యతం డందఱఁ గలయం జూచి యీబాణంబు సంధింపను విడువను నేరనైతి. వామదేవుం జంపనేరనైతి. బాహుస్తంభనం బెట్లు వాయుమనో యనిన వామదేవుఁడు కరుణించి యీబాణంబున నీదేవిం దాఁకిన నీపాపం బెడలు ననియనుగ్రహింపఁగ నతం డట్లుచేసి భుజస్తంభనంబు వాసె. అంత నాదలునిపట్టపుదేవి వామదేవుం జేరవచ్చి మునీంద్రా, పుణ్యలోకములఁ బడయఁ గోరి నే నెల్లపుడు బ్రాహ్మణులయెడ మిథ్యాప్రవర్త

నంబు తగ దని యారాజునకు బోధింపుచుండు నిప్పటికిఁ దత్ఫలంబుఁ దెలియనయ్యె నని తెల్పిన నమ్మునివరుండు దాని మెచ్చి యోరాజపుత్త్రీ, నీవలనం గులంబు సురక్షితంబయ్యె. అభిమతవరములఁ గోరుకొను మనివచించె. మునివచనంబు విని యాదేవి మునివరేణ్యా, నాప్రియునకుఁ శాపమోక్షణంబును నాకొడుకునకుఁ బునర్జీవనంబును బ్రసాదింపవే యనివేఁడిన నతండు వల్లే యనుటయు నారాజకుమారుండు జీవితుఁ డయ్యె. పదపడి దలుండు సంతుష్టుండై యమ్మునివరునకుఁ బ్రణమిల్లి వామ్యాశ్వంబుల సమర్పించిన నావామదేవుండు వానిం గొని నిజాశ్రమంబునకుఁ జనియె ననిన విని ధర్మరాజు మార్కండేయుం జూచి మునీంద్రా, బకదాల్భ్యు లనుమహామునులు దేవేంద్రునకు సఖులనియుఁ జిరకాలజీవులనియు వింటిమి. బకదేవేంద్రులకు సుఖదుఃఖవిచారప్రయుక్తంబుగ నయినసమాగమంబు వినవలతుం జెప్పు మనియడుగ నమ్మునీంద్రుం డానరేంద్రున కిట్లనియె.

## బకశక్రసంవాదము.

పాండవాగ్రజా, తొల్లి దేవదానవులకు ఘోరరణం బయిన నపుడు పురందరుండు విక్రమంబున వారల గెలిచి ముల్లోకంబుల నిష్కంటకంబుగ నేలుచుండె. అపుడు భూలోకమునఁ దఱితో వానలు గురియుచుండె. సస్యసమృద్ధి యగ్గలించె. జనులు ధర్మిష్ఠులయి నిరామయులై వృద్ధిఁ గాంచుచు నిత్యసంతుష్టులై యుండిరి. అంత నొక్కనాఁడా పురందరుండు లోకములఁ జూడ వేడుక వొడమ నైరావతంబు నెక్కి తిరుగువాఁడు పుడమికిఁ జనుదెంచి విచిత్రంబు లయినమునిపల్లియలను, నగరములను, గ్రామములను, జనపదంబులను, వాపీకూపతటాకసరిత్సరోవరంబులను, స్వస్వధర్మపరాయణు లయినసకలజనులనుం జూచుచుఁ బూర్వసాగరంబు పొంత నత్యంతరమణీయం బై నబకునియాశ్రమంబునకుఁజనుదేరుటయు నమ్మునీంద్రుండు సంతోషసాంద్రుండై సురేంద్రు నాసనార్ఘ్యపాద్యవిధుల నర్చించిన నాపూజలం గైకొని శునాసీరుండు సుఖాసీనుండై యాబకునిం బిలిచి యయ్యా, బహువర్షసహస్రజీవితుండవు గావున ని న్నడిగెద. చిరకాలజీవుల కెయ్యది దుఃఖంబు? తెల్పు మనుటయు నతండు పురందరున కిట్లనియె. అప్రియులతోడి వాసంబు, ప్రియులయెడఁబాటు, పుత్త్రదారజ్ఞాతిసుహృద్వినాశంబు, పరాధీనత్వంబును దుఃఖంబులు. మఱియుఁ జిరకాలజీవులు కాలవశంబునం గలుగుధర్మిష్ఠులకీడు నధర్మిష్ఠుల మేలునుం జూడవలసియుండు. ఇంతకంటె దుఃఖదం బొండొక్కటి యుండనేర్చునే? వెండియు నందఱకు నర్థంబులేమి యత్యంతదుఃఖప్రదం బగు. అర్థములేనివాని నెల్లవారుం బరిభవింతురు. మనుష్యజన్మంబ యత్యంతక్లేశావహం బనిన నింద్రుండు చిరకాలజీవులకు సుఖం బెయ్యది యనియడుగుటయు నతం డతని కిట్లనియె. కుజనుల నాశ్రయింపక యథాలబ్ధంబు లయినకాయగూ

రలనేనియు నెనిమిదవముహూర్తమునఁ బండ్రెండవముహూర్తమున నొండె దనయింట వండికొని భుజించుట సుఖంబు. రేపటికెట్లు జరుగునో యనువిచారంబున మృష్టాన్నంబు భుజించినను సుఖంబు గానేరదు. మఱియు నెల్లపుడు పరాన్నమున కాసపడి కుక్కవలె నన్నదాతలయిండ్లముందఱ వర్తించుట యెంతయు దుఃఖంబు. అతిథులకు, భూతములకుఁ, బితరులకు, దేవతలకు నన్నంబుఁ బంచిపెట్టి మిగిలినదానిని భుజించుటకంటె నుత్తమసుఖంబు వేఱొక్కటి గన్పడదు. అతిథుల కన్నముఁ బెట్టుటంగలుగుపుణ్యం బెన్న వచ్చునే? ఎవనియింట నతిథి సుపూజితుండై యెన్నికబళంబుల భుజియించునో యన్ని వేలగోదానములఫలం బన్నదాత వడయు. యావనదోషంబులనెల్ల నీఁగు. అతిథి భోజనాంతమునఁ గుడిచేయిఁ గడిగినయుదకం బన్నము వెట్టినవానిపాపములఁ బ్రక్షాళనంబు సేయు నని చెప్పిన విని సురనాథుఁ డమ్మునితో నభిమతకథావినోదములఁ గొంతతడవు గడపి యమ్ముని నామంత్రణంబు చేసి దివంబునకుఁ జనియె నని చెప్పిన విని పాండవేయాగ్రజుండు మార్కండేయుం జూచి మునివరేణ్యా, బ్రాహ్మణమహిమంబుఁ దెల్పితివి. ఇఁక రాజులమహిమంబు తేటపఱుపవే యనియడుగ నతండతని కిట్లనియె.

### మార్కండేయుండు ధర్మరాజునకు రాజులమహిమంబు చెప్పుట.

పాండవాగ్రజా, నహుషపుత్రుండై నయయాతి రాజ్యస్థుండై పురజనులెల్లఁ గొలువ సభాసీనుండై యున్నంత నొక్క బ్రాహ్మణుం డతనిపాలికి వచ్చి మహారాజా, గుర్వర్థంబు నీవలనం గొనిపో వచ్చితి. నాచెప్పినసమయంబున కొడఁబడియెదవేని చెప్పెద ననుటయు యయాతి యది యెట్లనియడిగిన నా బ్రాహ్మణుం డతని కిట్లనియె. యాచకుఁడు వచ్చి యాచించెనేని దాత వానిపై మనంబునఁ గలహించుట లోకసాధారణంబై యున్నది. అవ్విధంబులేక ప్రియంబగుదానినేనియు నిత్తువేని గోసహస్రంబు గుర్వర్థం బిమ్మని యడిగె. బ్రాహ్మణవచనంబు విని యయాతి విప్రోత్తమా, యాచింపఁ దగనిదాని నడిగినను నే నిత్తునని యొడంబడను. ఒడంబడితినేని యియ్యకమానను. ఇచ్చి పొమ్మిపోయెఁగా యనివగవను. మఱి యెంతయుసంతోషంబున సుఖంతు. మఱియు యాచకులకిచ్చి నే నిచ్చితి నని చెప్పికొనను యాచకుం డలిగినం గినియను. బ్రాహ్మణుండ నాకన్నిభంగులం బ్రియుం డని చెప్పి వేయి మొదవుల నతని కిచ్చె. బ్రాహ్మణుండును సంతోషంబుతో నాయయాతియిచ్చినగోసహస్రంబుఁ గొని చనియె నని యయాతిమహిమంబు చెప్పి మార్కండేయుండుమఱియు నిట్లనియె.

సేదుకవృషదర్భు లనురాజు లిద్దఱు శస్త్రాస్త్రముల నేర్చి నీతిశాస్త్రమెల్లఁ జదివి రాజ్య మేలుచుండిరి. అందు వృషదర్భుడు చిన్ననాఁటంగోలె బ్రాహ్మణులకు సువర్ణరజతంబులుదక్క మఱి దేని నియ్య నని రహస్యంబుగ నియమంబు పూని

యుండె. ఆనియమం బెఱుంగక నేదుకుం డొక్కనాఁడు వేదాధ్యయనసంపన్నుం డైనబ్రాహ్మణుం డొకండు వచ్చి దీవించి గుర్వర్థంబుగ నశ్వసహస్రంబు యాచించిన నాయొద్ద నలనుగా దనిచెప్పి వృషదర్భుని యాచింపు మనిపనిచె. నేదుకవచనంబున నాబ్రాహ్మణుండు వృషదర్భునిపాలికిఁ జని రాజేంద్రా, గుర్వర్థంబుగ నాకు వేయిగుఱ్ఱముల నిమ్మని యడిగె. అడుగుటయు వృషదర్భుఁడు కశఁ గొనియా విప్రు నడిచె. దాని కలిగి యతండు తప్పు సేయనినన్నేల యడిచెద వనియాక్షేపించి శపింపఁ బూనుటయు వృషదర్భుఁడు బ్రాహ్మణా, నీకోరినవాని నెవ్వఁడు నియ్యఁడయ్యెనా? కాకున్న నిది బ్రాహ్మణధర్మంబొ? యని యడుగ సహజక్షమాన్వితుం డైనయావిప్రుఁడు దా ముందు నేదుకుని యాచించిన నతండు వృషదర్భుని యాచింపు మనిచెప్పిన వచ్చి నిన్నడిగితి ననుటయు వృషదర్భుఁ డయ్యా, నేటిపూర్వాహ్ణంబున నాభాండాగారంబునకు వచ్చుకప్పము నిచ్చెద. కశాఘాతంబు సైరింపు మనిప్రార్థించి నాఁటివచ్చుబడి నతని కశ్వసహస్రంబునకు మూల్యముగ నొసంగె నని మార్కండేయుండు వెండియు నిట్లనియె.

కురువంశజనితుం డయినసుహోత్రుం డనురాజు మహర్షుల సేవింపఁ బోయి మగిడ వచ్చుచుండ నొక్కనాఁ డౌశీనరుం డైనశిబినృపాలుండు రథస్థుండై యతని కెదురయ్యె. అంత వా రిరువురు వయోనుగుణంబుగ నన్యోన్యపూజలఁ గావించి గుణముల నిద్దఱు సమాను లనుభావంబునఁ ద్రోవఁ దొలంగకుండిరి. అపుడు నారదుండు వారికిఁ బొడసూపి యేల యిట్లు మీ రిరువురు త్రోవఁ దొలంగకుండెద రనిన వారు మునీంద్రా, విశిష్టున కవిశిష్టుఁడు, సమర్థున కసమర్థుఁడుం ద్రోవఁ దొలంగుట యెచ్చటనుం గలదు. నే మిరువురము పరస్పరసఖ్యమునఁ దుల్యుల మగుటం జేసి యిట్లున్నవారము. ఎట్లుచేయవలయు ననియడుగ నారదుం డిట్లనియె. నిమిత్తవిశేషంబున మృదుక్రూరులు క్రూరమృదులకుఁ దెరు విత్తురు. సాధుఁడసాధునియెడను సాధువై యుండుఁ గావున సాధునియెడ నుచితవర్తనుం డగుట యతనికి సహజంబు. కృతమునకు నూఱింతలుచేయు టుచితంబు. మహాత్ములయెడ నూఱింత లనునిర్ణయంబును గానరాదు. మఱియది లెక్క లేకుండు. మీయిరువురిలో శిబి సాధుశీలుఁ డని నామతంబు. దానంబునఁ గృపణుని, సత్యమున ననృతవాదిని, శమంబునఁ గ్రూరుని, సాధుత్వంబున నసాధునిం జయించుట నీతి. సాధులయెడ నెట్లుండవలయో యది వేఱ చెప్పనేల? ఇఁక మీకుం బోలినభంగి సేయుఁడనిచెప్పి నారదుం డరిగిన సుహోత్రుండు శిబిం బెక్కువిధములఁ బ్రశంసించి యతనికిఁ బ్రదక్షిణంబుగఁ దాఁ దొలఁగిచనియె. శిబిమహిమంబు చెప్ప నలవిగాదు.

మఱియు నితని చరిత్రంబు వినుము. తొల్లి దేవత లీశిబిచిత్తవృత్తి నెఱుంగ వేఁడిన నింద్రాగ్ను లట్లయని యొడంబడి యింద్రుఁడు శ్యేనంబై కపోతం బైన యగ్నిం దఱుమఁగ నాకపోతంబు శిబిమఱువు సొచ్చి మహారాజా, తఱుముచు వచ్చు డేగకు వెఱచి ప్రాణరక్షణార్థంబు నీమఱుఁగుఁ జొచ్చితి. నేను బ్రహ్మచర్యనియమం బునఁ దపోదమాదిగుణయుక్తుఁడనై యాచార్యుం గొలిచి వేదములనెల్ల నేర్చితి. నాకుఁ బ్రాణదానం బిమ్ము. దానంబు లన్నింటికంటెఁ బ్రాణదానం బుత్తమంబు గాదె? యని మొఱపెట్టికొనినఁ బురోహితప్రేరితుండై శిబి యట్లయని యొడం బడియె. అంత నాడేగయు నానృపాలుపాలికిం జనుదెంచి రాజేంద్రా, నాయా హారమునకు భంగంబుగా నీకపోతంబుఁ దాఁపఁ దగదు. ఒకరునినోటికూటి కడ్డ ము చేసిన వానికి మాటిమాటికిఁ జావుపుట్టుకల యగుంగాని యుత్తమగతి గలుగ నేర దనిన విని శిబినృపాలుండు సంస్కారవిలసితవచనోపన్యాసంబు పక్షులయెడ నెన్నఁడుం జూచినయదిగాదు. ఈశ్యేనకపోతంబులమాటలపొందుఁ జూడ నెంత యుం దెలిసినయవియకాఁ దోఁచెడి. ఎట్లు చేసిన లెస్స యగునో యని కొంతవడి తనమనంబునఁ దలపోసి డేగ కిట్లనియె. భీతి గదుర మఱుఁగు సొచ్చినప్రాణిని రక్షింపనివాని నింద్రుఁడు వజ్రమునఁ బ్రహరించు. వానియిల్లు పితృదేవతలు మెట్టరు. వానిహవ్యముల దేవతలు గ్రహింపరు. వానిసంతానంబు వృద్ధిఁ గాం చదు. వానిరాజ్యమునఁ బర్జన్యుఁడు వర్షింపఁడు. పైరులు పండవు. అతండు పుణ్య లోకభ్రష్టుఁడగు. కావున శరణాగతులఁ గావమి ధర్మంబు గాదు. నీయాఁకలి దీఱ నుపాయంబుఁ జేసెద. వలసినంత యన్నంబును, మాంసంబునునీకోరినదేశంబునఁ జేర్చెద. దీని విడువు మనుటయు డేగ నృపాలా, వేదవిహితాహారం బయినకపో తంబును నేను విడువనేల? వేఱొక్కదానిం గొననేల? దీనినే యిమ్ము. అడ్డంబు చెప్పకు మనినిర్బంధించిన నతండు వెండియు డేగ కిట్లనియె. పెక్కుమాట లేల? నాశరీరంబైన నిత్తుఁగాని నీకపోతంబు నియ్యను. నీసమ్మతంబుఁ జెప్పు మనిన డేగ శిబిం జూచి నీకుడితొడ నుండుమాంసముఁ గపోతమంతఁ దూఁచి యిమ్ము. ఇది నాకుఁ బ్రియం బనివచించె. ఆమాట విని యెంతయు సంతసంబునఁ దనకుడితొడఁ గోసి మాంసంబుఁ దీసి తులలో నొకవైపున నుంచి వేఱొక్కవైపున నాకపోతం బు నునిచి తూఁచినఁ గపోతంబు భారవంతం బయ్యె. అట నాశిబి మఱియొక తొడఁ గోసి యందలిమాంసంబు నునిచి తూఁచిచూచి యప్పటికి నామాంసము కపోతసమంబు గాకుండుటయు సంకోచింపక తాన తుల నధిరోహించె. అంత నా డేగ నృపాలా, కపోతంబు రక్షించితి వని యదృశ్యం బగుడు శిబి కపోతముంబి లిచి మహాత్మా, మే మందఱము నిను విహంగం బని తలంచుచుంటిమి. పరికించి చూడ నిది పోలదు. ఇటకు వచ్చిన శ్యేనం బెయ్యది? నాకుం జూడ నిది దేవమా

యగాఁ దోఁచెడి. వివరింపు మనియడుగఁ గపోతం బిట్లనియె. సారథకులవరేణ్యా, నే నగ్ని హోత్రుఁడ. శ్యేనంబు దేవేంద్రుఁడు. మే మిరువురము నీచిత్త మెఱుంగఁ గోరి యిట్లు ప్రచ్ఛన్న వేషంబున వచ్చినవారము. నీసాధువృత్తమున కెంతయు మెచ్చితిమి. తెంపుఁ జేసి నీవు మాంసముఁ గోసి యిచ్చుటకు శుభచిహ్నంబుఁ గావించెద. నీపార్శ్వభాగంబునఁ గపోతరోముఁ డనుకుమారుఁడు జనించి భువనవిఖ్యాతుఁడై రాజ్యమేలు నని చెప్పి యద్దేవుఁ డదృశ్యుఁ డయ్యె.

వెండియు నీశిబిసచ్చరిత్రం బాకర్ణింపుము. విశ్వామిత్రకులజనితుం డైన యష్టకుఁ డనేకరాజసేవితుండై యశ్వమేధయాగంబుఁ జేసి భ్రాతృ లగుప్రతర్దన వసుమనశ్శిబు లనువారితోడఁ దే రెక్కి చనుచుండ నారదుం డెదు రగుటయు నందఱు నమ్మునీంద్రునకుఁ బ్రణమిల్లి రథం బారోహింపు మని ప్రార్థించిన నాదేవముని వల్లెయని వారితోడ నారథం బధిరోహించె. అం దొకరుఁ డపుడు నారదుం జూచి మహాత్మా, ని న్నొకయర్థం బడిగి తెలిసికొన నున్నవాఁడ. ప్రసన్నుఁడవై యానతిచ్చెదవేని యడిగెద నని విన్నవించి యమ్మునియనుగ్రహంబు వడసి మునీంద్రా, సర్వగుణసముదితుల మగుమే మందఱము నిమిత్తవిశేషమున స్వర్గలోకమునకుఁ జనునెడ నెవ్వఁడు నడుమన డిగిపోవు ననియడుగుటయు నారదుఁ డష్టకుఁడు డిగు నని యుత్తరం బిచ్చిన నది యె ట్లని వెండియు నడుగ నమ్ముని యతని కిట్లనియె. మున్ను నేఁ గొన్నిదినంబు లష్టకునింట నుండఁగ నతండు నను రథం బెక్కించి తాను సారథ్యంబుఁ జేయుచున్నంత నేను వన్నె కొకగుంపుగా వేఱువేఱుగ నేర్పఱిచియున్న యనేకగోసహస్రంబులం జూచి యీమొదవు లెవ్వరియవి యనియడిగితి. అడుగుటయు నతం డవియెల్ల నాయిచ్చినయవియ యని తనయీవిం దాన పొగడికొనియె. దానం జేసి యష్టకుఁడు ముందు డిగవలయు నని యంటి నని నారదుండు చెప్పినం దక్కటివారిలో నెవ్వఁడు ముందుగ డిగు నని పునఃప్రశ్నంబు సేయఁగ నారదుం డిట్లనియె. ఇఁకఁ బ్రతర్దనుండు దిగవలయు. ఎట్లం టేని. ప్రతర్దనునింటను నేను గొన్నినా ళ్లుండ నతండును నను రథాసీనుం జేసి తాను సారథికృత్యంబు సల్పుచుండె. అప్పుడు బ్రాహ్మణుఁ డొక్కరుఁ డరుదెంచి యశ్వమును యాచించినఁ బ్రతర్దనుండు నగరు సేరినపదంపడి యిచ్చెద నని చెప్పిన నవ్విప్రుఁ డిప్పుడే కావలయు ననియడుగుటయుఁ దేరునఁ బూన్చినవానిలోఁ గుడిప్రక్క నుండుదాని నిచ్చి యతని ననిచె. కొండొకవడికి మఱియొక పాఱుఁ డేతెంచి గుఱ్ఱము నీక్షణంబ యిమ్మని యడిగిన మఱియొకదాని నిచ్చి వానిం బ్రీతచిత్తుం జేసి పనిచె. అటఁ గొంతసేపునకు వేఱొకవిప్రుండు వచ్చి తురంగం బతిరయంబున నొసంగు మనియడుగ రథయోజితం బయినవేఱొకదాని నొసంగి యాతనిం బనిచె. అంతఁ గొంతవడికి వెండియు నొకబ్రాహ్మణుండు సను

దెంచి యాలస్యంబు సేయక గుఱ్ఱము నిమ్మని యడిగినం బ్రతర్దనుండు తేరునకుఁ
బూన్చినవానిలో మిగిలియున్నయొకదాని నిచ్చి వాని ననిచి తేరు దాన యీ
డ్చుచు నసూయావిలమానసుండై యింక నెవ్వఁడైన వచ్చి నాయొద్ద నేగుఱ్ఱముఁ
గొనిపోవునో యనినుడివె. ఇచ్చి యసూయపడుటంజేసి ప్రతర్దనుండు డిగవలయు
ననియంటి ననుటయుఁ బృచ్ఛకుండు నీక నెవ్వఁడు డిగు ననియడిగె. అడుగుటయు
నారదుం డింక వసుమనసుఁడు డిగును. తత్కారణంబు వినుమని యిట్లనియె. వసు
మనసునియింటఁ బుష్పరథప్రయోజనం బగుడు స్వస్తివాచనార్థంబు బ్రాహ్మణులు
పెక్కండ్రు వచ్చియుండ నేనుం బోయియుంటి. అపు డతండు మా కందఱకు
నారథంబుఁ జూపిన నేను దానిం బ్రశంసించుటయు నాప్రశంస నెఱింగి యతండు
నీకొనియాడినరథము నీవ గ్రహింపు మని నాకొసంగె. మఱియొకయవసరంబున
నట్లు ఘటించిన నే నపుడుం బోయి ప్రశంసించితి. అంత వేఱొక్కసమయంబున
నాప్రకారం బొడఁగూడిన నే నత్తఱిం బోవుటయు స్వస్తివాచనార్థం బరుదెంచిన
విప్రులకు సన్న జేసి నన్నుఁ జూచి మునీంద్రా, మాయింటఁ బుష్పరథనిమిత్తంబు
లయినస్వస్తివాచనంబులు లెస్సగ సంభావింపఁబడియెడి ననివచించె. బ్రాహ్మణుల
యెడ నుల్లసమాడుటంజేసి వసుమనసుఁడు డిగవలయు ననిచెప్పితి ననుటయుఁ
బ్రష్ట యింక నెవ్వఁడు దిగ నర్హుం డనియడిగిన నీక డిగిన నేన డిగవలయుఁ గాని
శిబి యందులకుఁ దగఁడు. అతండు నాకు సమానుఁడు. తప్పక పుణ్యలోకంబునకుఁ
జను నని నారదుండు పలికిన నాప్రశ్నకారుఁ డది యేమి యని యడుగ నద్దేవ
ముని యిట్లనియె. బ్రాహ్మణుఁ డొకండు శిబియొద్దకుఁ జనుదెంచి రాజపుంగవా,
యన్నంబుపొంటె వచ్చితి ననిచెప్పిన విని యానృపాలుండు బ్రాహ్మణోత్తమా, సెల
విమ్ము పనివిని నడచెద ననుటయు నతండు బృహద్గర్భుఁ డనునీకొడుకు మాంసంబు
పక్వంబుఁ గావించి యన్నముతోడ నాయితపఱిచి ననుఁ బిలువు మనివాక్రుచ్చె.
అందుకుఁ గొంకక శిబి కొడుకును హింసించి తన్మాంసంబుఁ బక్వంబుఁ గావించి పా
త్రంబున నునిచి యాపాత్రంబుఁ దనతల నిడుకొని యావిప్రు నెమకుచుండె. అప్పు
డు దూత యొక్కఁడు నచ్చి నృపాలా, నీవు వెదకెడిబ్రాహ్మణుండు కుపితుండై నీ
భాండాగారంబు, నాయుధగృహంబు, నశ్వమందిరంబు, గజశాలనుం గాల్చుచు
న్నవాఁ డనినివేదించె. అందుకును మొగంబున విన్నఁదనంబుఁ బొరయక శిబిమ
హీపాలుం డవ్విప్రుపాలి కరిగి యయ్యా, నీయానతిచ్చినట్ల యన్నంబుఁ దెచ్చితి నని
న నతండు విస్మయంబునఁ దలవాంచి యేమియుం జెప్పక మిన్నకుండె. బ్రాహ్మ
ణుం డూరకునికికి వగచి యేమినిమిత్తంబొ యితండు పల్కఁడనితలపోసి బహు
ప్రకారంబుల నతనిం బ్రార్థించి యన్నంబు భుజింపు మనివిన్నవించె. అంత నొ
క్కముహూర్తమున కాబ్రాహ్మణుండు తలయెత్తి శిబిం జూచి యీయన్నంబు నీవ

కుడువు మనిచెప్పుటయు నంపుడు నోలమాసగొనక శిబి కొడుకుకపాలంబున నా మాంసంబు నునిచికొని భుజింపఁ దొడంగె. తొడంగుటయు నాపాఱుఁడు శిబిచేయిఁ బట్టుకొని మహారాజా, కామక్రోధాదుల గెలిచితివి. బ్రాహ్మణనిమిత్తంబున దేనికైనం బూనికొని యెద వని యతనిఁగొనియాడె. శిబియు నాబ్రాహ్మణుని వివిధముల సంతుష్టచిత్తుం జేసి తలయెత్తి చూచుటయుఁ దనకుమారుఁ డైనబృహద్గర్భుఁడు దేవకుమారుచాడ్పున వివిధాలంకరణవిలసితుఁడై మ్రోలఁ గన్పడియె. అట నాబ్రాహ్మణుండు నదృశ్యుండయ్యె. అతఁ డెవ్వాఁ డంటేని. ఆశిబిమహీపాలుచిత్తంబెఱుంగఁ గోరి బ్రాహ్మణవేషప్రచ్ఛన్నుండై చనుదెంచినపరమేష్ఠి గాని మఱియొక్కరుండు గాఁడు. అవ్విధంబున విప్రుం డంతర్హితుండయినపదంపడి మంత్రులా నృపాలుఁ జేరవచ్చి మహారాజా, యేమి పడయం గోరి నీవు తెలిసి యిట్లు చేసితివనియడుగ శిబి మంత్రుల కిట్లనియె. నే నిదియెల్ల సాధుజనసమ్మతమార్గం బని చేసితింగాని మఱి యశోధనభోగాదుల దేనినైనం గోరి చేసినవాఁడఁగా ననివక్కాణించె. చిత్తశుద్ధితో సన్మార్గమున వర్తించుశిబినృపాలుండు నాకలోకంబునకుఁ జనవలసినవాఁడే యనిచెప్పితి నని నారదుఁడు వారలకుఁ దెల్పె. శిబిమహామహిమం బుగ్గడింప నలవిగా దని మార్కండేయుండు చెప్పిన విని యుధిష్ఠిరుండు మునీంద్రా, చిరకాలజీవితుం డయిన నీ కంతయుఁ బ్రత్యక్షంబు. నీకంటె బహుకాలజీవి వేఱొక్కరుఁడు గలఁడే యనియడుగ మార్కండేయుండు పాండవేయున కిట్లనియె.

## ఇంద్రద్యుమ్నోపాఖ్యానము

ధర్మజా, తొల్లి యింద్రద్యుమ్నుఁ డనురాజర్షి పుణ్యమహిమంబున స్వర్గంబునం బెక్కువేలేండ్లు వసించుచుండ భూలోకంబున నతనికీర్తి వినరాకుండుటయు నమరు లతనిం బిలిచి నీకీర్తి మాసె, క్షీణపుణ్యుండవైతివి, భూలోకమునకుఁ జను మని త్రోచిన నాయింద్రద్యుమ్నుండు నాకడకు వచ్చి నన్నెఱుంగుదువే యనియడిగిన నే నిట్లంటి. అయ్యా, మే మున్నచోట నుండి శరీరశోషణాదినియమంబుల స్వధర్మం బనుష్ఠించువారము గావున ని న్నెఱుంగను. హిమవత్పర్వతంబునఁ బ్రావారకర్ణం బనుగూబ కలదు. అది నాకంటెఁ బెద్దది. దాని నడుగు మనిచెప్పిన నతఁడు నన్నుం గూడ రమ్మని వేఁడి తా నశ్వంబై నన్ను మోచుకొని యయ్యులూకంబుకడకుఁ జని తనపేరు సెప్పి న న్నెఱుంగుదువే యనియడిగె. అడిగిన నాఘూకంబు ముహూర్తమాత్రంబు చింతించి నిన్ను నే నెఱుంగ ననుటయు నింద్రద్యుమ్నుండు నీకంటెఁ జిరజాతం బొండెద్దియైనం గలదేని చెప్పు మని యడిగిన నాకౌశికంబు కొంత చింతించి యయ్యా, యింద్రద్యుమ్నం బనుకొల నొక్కండు గలదు. అందు నాడీజంఘం బనుకొంగ యున్నది. అది నాకంటెఁ బెద్దది

యనివచించె. అంత నయ్యింద్రద్యుమ్నుండు నన్ను, నులూకంబును మోచికొని యాసరస్సునకుఁ జనుటయు మేము నాడీజంఘుముం బిలిచి యింద్రద్యుమ్న నృపాలు నెఱుంగుదే యనియడుగ నాబకంబు కొంతవడి యాలోచించి నే నింద్రద్యుమ్ను నెఱుంగ ననుటయు మేము నీకంటెఁ బెద్దది యెుండొకండు గలదేని వివరింపుమని యడుగ నాకొంగ యిట్లనియె. అయ్యా, యీసరస్సునన యకూపారంబను తాఁబేలు గలదు. అది నాకంటెఁ బెద్దది గావున నెఱింగియుండు నడుగుదమని యాబకం బెలుంగెత్తి యోయకూపార, ని న్నొకయర్థం బడిగి తెలిసికొనవేడి పెద్దలు చనుదెంచియున్నవారు. మెల్లన వెడలి యిటకు ర మ్మనియెఱింగించుటయుఁ దద్వచనంబు విని యాకచ్ఛపంబు కొలను వెడలి మాయొద్దకుఁ జనుదెంచె. చనుదేరుటయు మే మింద్రద్యుమ్నమహారాజును నీవెఱుంగుదువే యని యడుగ నాకచ్ఛపంబు ముహూర్తమాత్రంబు తనమనంబునఁ దలఁచుకొని కన్నుఁగవ న్రశు లురుల మనంబున విన్నఁదనంబు గదుర వేపమానాంగంబై కేల్దోయి మొగిడ్చి నేనా యమ్మహారాజు నెఱుఁగనివాఁడను. అమ్మహారాజు గాదె నన్నీ సరస్సుఁ జేర్చి భయంబుఁ బాపి రక్షించె. ఇక్కొలనిగట్టున నమ్మహారాజు బహుయజ్ఞముల నాచరించి యూప స్తంభముల నాటె. అమ్మహానుభావుండు యజ్ఞదక్షిణగా బ్రాహ్మణులకు సమర్పించినగోవులగొరిజలం బరాగ మంటుకొనిపోవుటంజేసి క్రమక్రమంబున నిమ్మడు వేర్పడి యతనిపేరఁ బరఁగె. అమ్మహారాజును నేటికిఁ గనుఁగొంటిఁ బుణ్యంబుఁ జేసియుంటి నని యెలుంగురాల్పడం జెప్పుచున్నంత దేవలోకంబు నుండి యయ్యింద్రద్యుమ్నునకు యానంబు వచ్చె. ఇంద్రద్యుమ్నమహారాజా! నీకీర్తి లోకంబున శాశ్వతంబుగ నెగడె. విమానం బారోహించి రమ్ము. స్వర్గమున నుచితస్థాన మధిగమింపు మనుమాటలు విననయ్యె. కీర్తి లోకముల నెగడునందాఁక సుకృతవంతుఁడు పుణ్యఫలంబుఁ గుడుచు. దుష్కృతవంతుఁ డపకీర్తి లోకముల నెఱయుటంజేసి యధమలోకంబులం బడు. కావున మనసును బాపముల పొంతఁబోనీక పుణ్యంబ యాచరించుచుండవలయు. విమానంబు వచ్చినం జూచి యింద్రద్యుమ్నుఁడు నన్ను, నులూకంబును మాయునికిపట్లం జేర్చివచ్చునంతకుఁ బ్రతీక్షించునది యని దేవదూతలతోఁ జెప్పి తదాదిష్టుండై మమ్ము నెప్పటిచోట్లఁ జేర్చి విమానము నెక్కి స్వర్గలోకంబున కరిగి యుచితస్థానంబు సేరె నని యింద్రద్యుమ్నోపాఖ్యానంబును వివరింపఁగ నాకర్ణించి పాండవాగ్రజుండు మార్కండేయుం జూచి మహాత్మా, స్వర్గలోకచ్యుతుం డై నయారాజునకుఁ గ్రమ్మఱ సద్గతిం గల్పించినమహితుఁడవు నీవకావే యనిప్రశంసించె. తద్వచనంబు విని మార్కండేయుం డయ్యా, నరకమునఁ బడియున్న నృగనృపాలు నుద్ధరించినయావాసుదేవునెదుట మాబోంట్లం బ్రశంసింపఁ జనునే యసిన నందఱు నాజగన్నాథుం బేర్కొనిరి.

### మార్కండేయుండు ధర్మరాజునకు దానాదిధర్మములఁ జెప్పుట.

పదంపడి ధర్మనందనుండు మార్కండేయుం జూచి మునీంద్రా, దానము లేసమయమునఁ జేయవలయు? దానమునకు సత్పాత్రంబు లెవ్వరు? దానరహస్యం బెట్లనియడుగ నతం డతని కిట్లనియె. అపుత్రకులు, పుట్టిననాఁడు మొదలుగ బహిష్కృతులు, పరాన్నభోజులు, ఆత్మార్థంబుగనె పాకంబు సేయువారును వ్యర్థజన్ములు. వీరు దానపాత్రంబులు గారు. మఱియుఁ బరాన్నభోజి, యారూఢపతితుఁ, డన్యారోపహితుఁడు, పతితుఁడు, తస్కరుఁ, డనృతవాది, పాపశీలుఁడు, కృతఘ్నుఁడు, గ్రామపురోహితుఁడు, వేదవిక్రయి, శూద్రపాచకుఁడు, వ్రాత్యుఁడు, వృషలీపతి, స్త్రీపరతంత్రుఁడు, వ్యాళగ్రాహుఁడు, పరిచారకుఁ డనుపదునాలుగురకును జేసినదానంబులు నిష్ఫలంబు లగు. జపమంత్రహోమాధ్యయనపరులై వేదమయం బైననావచే సంసారసాగరంబుఁ దాము తరించుచు నితరులనుం దరింపఁ జేయఁ జాలు బ్రాహ్మణులకు వృద్ధత్వమున సర్వదానములం జేసినయతఁడు సద్గతిం బడయు. బ్రాహ్మణోత్తముల సంతుష్టులం జేసినవానియెడ నమరులుం బ్రీతు లగుదురు. ఉత్తమబ్రాహ్మణవచనమున నెవ్వఁడైన నఖిలపాపంబులం బాసి స్వర్గలోకం బధిగమించుఁ గావునఁ బితృదైవతబ్రాహ్మణాభ్యర్చనపరుండ వైననీ వుత్తమలోకంబునకుఁ జనుదువు. శ్లేష్మాదివికారంబులఁ బీడితుండై చావనున్నవాఁడు బ్రాహ్మణపూజనంబున నుత్తమలోకపూజితుం డగు. శ్రాద్ధంబునఁ బ్రయత్నమున నుత్తమబ్రాహ్మణుల నియమింపవలయు. దుర్వర్ణ, కుష్ఠి, కునఖి, మాయావి, కుండ, గోళ, శాయుధజీవిప్రభృతులఁ బ్రయత్నంబునఁ బరిహరింపవలయు. పఙ్క్తిబాహ్యులు గలిసిన నాశ్రాద్ధంబు విఫలం బగు. వేదవిదుఁ డొకరుండు లభించెనేని యతనితోడఁ గూడుటం జేసి మూకాంధబధిరులును నిమంత్రణీయు లగుదురు. శ్రోత్రియుఁడు, దరిద్రుఁడు, గృహస్థుఁ, డగ్నిహోత్రపరుఁడు, కుటుంబి, యంతకుమున్న దన కనుపకారి, మోఁకాళులకులోనుగఁ జేతు లుంచికొని జుఱ్ఱుజుఱ్ఱనక నిశ్శబ్దంబుగ న్యాయలబ్ధాన్నంబు భుజించువాఁడు నగునుత్తమబ్రాహ్మణునకుఁ గపిలగోవు నిచ్చినయతండు సర్వపాపవినిర్ముక్తుం డగు. ఒకరున కొకదాని నియ్యవలయుఁ గాని పలువుర కొక్కదాని నియ్యరాదు. పెక్కండ్ర కిచ్చిన వారాధనంబు విభాగించుకొనఁగ నాగోవును విక్రయింతురు. దత్తం బైనగోవు విక్రయంబుఁ జెందెనేని దాతృప్రతిగ్రహీతలు కులమున ముువ్వురుపురుషులతోడ నధోగతు లగుదురు. సమృద్ధుల కిచ్చినం బ్రయోజనంబు లేమిం జేసి యేర్పఱిచి దరిద్రునకు సకలదానములఁ జేసినయతండు జన్మాంతరమున వేయిపసిండిగద్యాణములఁ బడయు. బలవంతం బయినయనడ్వాహంబు నిచ్చినయతం డిడుమలఁ బాసి స్వర్గలోకముఁ గాంచు. ప్రసవించుతఱిఁ గ్రేఁపు ముందఱికాళ్లు శిరంబును వెడలి తక్కం

గలయది మేను గర్భమున నుండునందాఁక గోవు పృథివి యన నెన్నఁబడు. అయ్యు భయతోముఖధేనువు నుత్తమబ్రాహ్మణునకు విధియుతంబుగ దానముఁ జేసినయతం డాగోవుమేన దూడమేనను నెన్నిరోమంబులు గలవా యన్నివేలయుగంబులు స్వర్గలోకపూజితుం డగు. సువర్ణమయంబు లయిననాసాఖురంబులను రత్నశృంగంబులను నలంకరించి కృష్ణధేనువుం దిలాచ్ఛాదితంబై నదాని నిచ్చినవాఁడు భూదానఫలంబుఁ బొరయు. ప్రతిగ్రహీత తా నొక్కసాధువునకు దాని నొసంగి యుత్తమఫలములఁ బడయు. భూదానంబుఁ జేసినవానిసుగతి గణింపరాదు. విశేష మేల? గోభూసువర్ణముల మూఁటిని దానముఁ జేసినయతఁడు త్రైలోక్యమును దానముఁ జేసినవాఁడే. అన్నదానమహిమంబుఁ జెప్పఁగ వేనోళ్లు గావలసియుండు. తెరువు నడుచుటం జేసి పరాగపరీతపాదుండై కడు బడలి యన్నదాత యెవ్వఁ డని యరయుచు సమయంబున నతిథియై వచ్చినయుత్తమబ్రాహ్మణుం బ్రసాదదృష్టి నాదరించి మార్గాయాసంబు దీఱఁగఁ గాళులకు నేయి చమరి సుఖంబుగాఁ గడిగి మృష్టాన్నంబుఁ గడుపునిండఁ గుడువఁ బెట్టి తచ్ఛేషాన్నంబుఁ దాను భుజియించి సేదఁదీర్చికొనఁగ నతనికిఁ దగిన విడిదలఁజూపి శయనింపఁజేసి సుఖంబుగాఁ బాదముల నొత్తుచుఁ బ్రియహితవచనముల నాడుచు శుశ్రూషఁ గావించి సత్కరించినమహాత్ముఁడు యమలోకంబుపొంతఁ బోవక బ్రహ్మలోకంబుఁ జేరు. జ్యేష్ఠపుష్కరంబునం గపిలగోదానంబుఁ జేసినం గలుగుఫలంబు బ్రాహ్మణపాదప్రక్షాళనంబున లభించు. భూమి విప్రపాదోదకమునఁ దడిసియుండునంతకుఁ బితరులు కమలపత్రముల నాజలంబుఁ ద్రావి తృప్తు లగుదురు. స్వాగతం బడిగిన నగ్నులు దృప్తు లగుదురు. ఆసనం బిచ్చిన నింద్రుఁడు సుప్రీతుఁ డగు. అన్నముఁ బెట్టిన బ్రహ్మదేవుఁడు తనియు. అతిథికిఁ జేసినశుశ్రూష యొక్కొకటి గోదానంబుకంటె నతిశయించు. అతిథి ననువర్తించి యమరులెల్ల వత్తురు. వానిం బూజించిన సంతుష్టు లగుదురు. లేకున్న నిరాశులై యతిథినిరాకరణంబుఁ జేసినవానికిఁ గీడుఁ దలఁతురు. అన్నంబు ప్రజాపతి. అతండు సంవత్సరాదిలక్షణం బైనకాలంబు. అది యజ్ఞంబు. సర్వము యజ్ఞమున సుప్రతిష్ఠితమైయుండు. దానం జేసి యన్నదానంబు దానంబు లన్నింటికంటె నత్యుత్తమంబు. అన్నముఁ బెట్టఁగ శక్తిలేనివాఁ డన్నదాతం జూపిన నన్నదానఫలంబుఁ గాంచు. కావున సర్వప్రయత్నంబుల నతిథుల కన్నముఁ బెట్టుము. అతిథిభోజనంబునఁ దృప్తులై నయ ట్లగ్నులు హవ్యాదులం దృప్తి నొందరు. పుణ్యలోకంబునకుఁ జనునెడ నన్నదాతలు ముందుగను బిమ్మట సత్యవచనులు నయాచితప్రదాతలుం గ్రమంబుగఁ జనుదురు. న్యాయార్జితధనలబ్ధం బయినధాన్యమును సాధుశీలుఁ డైనబ్రాహ్మణున కొసంగినవానికి వసుంధరాదేవి పరమప్రీతయై యపరిమితధనంబు నొసంగు. దానంబునకుఁ గాలవిశేషంబు గలదు. ఎట్లంటేని. గజ

చ్ఛాయాపుణ్యకాలంబున విధియుతంబుగ శ్రాద్ధంబుఁ జేసి శాస్త్రచోదితదానముల నాచరించినయతండు తత్ఫలంబు పదివేలకల్పము లనుభవించు. ఆపత్కాలంబున బ్రాహ్మణునకుఁ దగినపదార్థముల దానముచేసినఁ దత్సుకృతంబు నావయై సంసారసాగరంబున దాత నుద్ధరించు. ఇతరసమయములకంటె దానఁబు పర్వదినంబుల ద్విగుణంబు. ఋతుసంధియందు దశగుణంబు. అబ్దసంధియందు శతగుణంబు. హరిపదసంజ్ఞకంబు లయినవృషభసింహవృశ్చికకుంభసంక్రమణంబులందును, షడశీతిముఖంబులు నాఁబడుమిథునకన్యాధనుర్మీనసంక్రమణంబులందును, విషువనామకంబు లయినమేషతులాసంక్రమణంబులందును,దక్షిణోత్తరాయణము లనంబడుకర్కాటకమకరసంక్రాంతులందును, జంద్రసూర్యగ్రహణంబులందును జేసినదానం బుత్తరోత్తరవిశేషంబుగ నక్షయఫలప్రదం బగు. విశేష మేల? ఒక నిదర్శనంబుఁ జెప్పెద. జన్మాంతరమున భూదానంబు జేయని వాఁడు భూమి నను భవింపనేరఁడు. వాహనదానంబు సేయనివాఁడు వాహన మారోహింపఁజాలఁడు. ఏయేకోరికల బ్రాహ్మణుల కేయేవస్తువుల నిత్తురో వారు తత్తత్కామంబులఁ బడయుదురు. దానంబుకంటెఁ దారకంబు వేఱొక్కటి గన్పడదని దానమహిమంబును, దానపాత్రస్వరూపంబును, దానయోగ్యకాలంబును వివరించిన విని పాండవేయుండు మార్కండేయుం జూచి మునీంద్రా, యమలోకంబునకు మనుష్యలోకంబున కెంతదవ్వు గలదు? ఏయుపాయంబున యమలోకక్లేశంబులఁ దప్పించుకొనఁ దగు ననియడుగ నమ్ముని యిట్లనియె.

యమలోక మీలోకమునకుఁ బదియాఱువేలయోజనములదూరమున నున్నది. ఆమార్గంబునఁ ద్రావ నుదకంబును, సేదదీర్చికొన మ్రాఁకులనీడయు,నిండ్లు నుండవు. మఱి ఘోరకాంతారప్రాయంబై యత్యంతదుర్గమంబై యుండు. యమదూతలు సకలజంతువుల నాదుర్గమార్గంబున నడిపించికొనిపోవుదురు. ఆ తెరువు నడుచునప్పటిశ్రమంబు చెప్పనలవిగాదు. ఉత్తమబ్రాహ్మణులకు నానావిధదానములఁ జేసినవారు సుఖమునఁ జనుదురు. అది యెట్లంటేని. అశ్వదాత లశ్వారూఢులై, ఛత్రదాతలు ఛత్రధరులై, యన్నదాత లెల్లవిధములఁ దృప్తులై, వస్త్రదాతలు వస్త్రవంతులై, సువర్ణదాతలు వివిధాభరణాలంకృతులై, భూమిదాతలు సకలాభీష్టసంతృప్తులై, సస్యదాతలు క్లేశరహితులై, గృహదాతలు విమానారూఢులై, పానీయదాతలు పిపాసారహితులై, దీపదాతలు దీప్తిమంతులై, గోదాతలు సర్వపాపవినిర్ముక్తులై సుఖమునఁ జనుదురు. మఱియు మాసోపవాసులు హంసయోజితవిమానారూఢులై షడ్రాత్రోపవాసులు మయూరయోజితరథాధిరూఢులై యరుగుదురు. ఏకభక్తనియమంబునఁ ద్రిరాత్రవ్రతము సల్పినవారు సుఖమునఁ బోవుదురు. దానవ్రతాదిసత్కార్యముల నాచరించిన యుత్తములకు యమ

లోకమునం బుష్పోదక యనునదీతీరమున విడిదలఁ జూపుదురు. అమృతసన్నిభం బయినయామేటిశీతలసలిలంబుఁ ద్రావుచు నచట వారు సుఖముండుదురు. దుష్కృతకారులకు దుర్గంధనిందితంబయినజలంబుఁ ద్రావ నిత్తురు. మఱియు నెన్నియేఁ గష్టములు వారి కనుభవింపవలసియుండు. యథావిధి సద్బ్రాహ్మణులం బూజించి దానముల సల్పినవా రెచ్చటనైనను సుఖింతురు. కావున హవ్యకవ్యములం బరీక్షించి యుత్తమబ్రాహ్మణుల నియమింపుము. జ్వలితాగ్నిహుతంబునుంబోలె సాధుశ్రోత్రియదత్తం బనంతఫలం బగు. శౌచశుద్ధు లయినయుత్తమశ్రోత్రియు లలిగిరేని దేనినైనం జేయఁగలరు. వారికిఁ గోపంబ యాయుధంబై యుండు. కావునఁ బ్రయత్నమున వారల మెప్పించు టెంతయులగ్గు. ఈయాఖ్యానంబు విని నైమిశారణ్యవాసు లగుమును లతిప్రీతు లయిరి. దీని వినినమానవు లపగతశోకభయక్రోధులై దురితదూరు లగుదు రనిన విని ధర్మరాజు మార్కండేయుం జూచి మునీంద్రా, శౌచం బన నెయ్యది వివరింపు మనియడుగ నంతం డతని కిట్లనియె.

శౌచంబు వాక్శౌచంబు, కర్మశౌచంబు, జలశౌచం బన మూఁడుదెఱంగులం గలదు. అవి మూఁడునుం గలిగిసాయంప్రాతఃకాలంబులం దప్పక సంధ్యోపాసనపరుండై వేదమాత యగుగాయత్రిని జపించుద్విజుండు సర్వపాపవిరహితుండై యవశ్య ముత్తమలోకంబుఁ బడయు. అఖిలమహీమండలం బెల్లఁ బ్రతిగ్రహించిన నతండు పావనుండ. సూర్యాదిగ్రహములు క్రూరములై యున్నను వానికి సౌమ్యంబులై శుభము లొడఁగూర్చు. ఘోరరూపు లయినరాక్షసులు వానిం జెనకనేరరు. యాజనాధ్యాపనప్రతిగ్రహంబులవలనిదోషము వానిఁ జేరరాదు. అతఁడు జ్వలితాగ్నిఁబోలె నిత్యపరిశుద్ధుఁడై యుండు. దుర్వేదుఁడైనం బ్రాకృతుఁడైనం బ్రాహ్మణుండు శ్మశానాగ్నియె ట్లట్ల దూష్యుఁడు గాఁడు. ఇఁక సువేదులు సంస్కృతులు నగువారిం జెప్పనేల? బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడైన నవిద్వాంసుఁడైనను మహనీయం బైనదైవతంబ కాఁడే? విచిత్రద్వారతోరణప్రాసాదప్రాకారభాసురంబులయ్యుఁ బురంబులు బ్రాహ్మణులు లేకున్నఁ బ్రకాశంబుఁ బొరయనేరవు. వేదవిదులు వృత్తసంపన్నులు జ్ఞానవంతులు తపోనిరతులు నగుబ్రాహ్మణు లున్నచోటు పల్లియయైన నడవియైనను నగరంబునాఁ బొగడ్తకెక్కు. అదియె పుణ్యతీర్థం బనంబడు. ధర్మమునఁ బ్రజల నేలునుత్తమక్షత్రియునిఁ దపస్వియైన బ్రాహ్మణుని నెదుర్కొని పూజించినం బాపంబు లెడలు. పుణ్యతీర్థస్నానంబు, పవిత్రచరిత్రకీర్తనంబు, సాధుసంభాషణం బనుమూఁడింటిం బెద్ద లెంతేఁ బ్రశంసించుచు సాధుజనసంగమపూరితం బయినవాక్సుభాషితతీర్థంబున నాత్మం బవిత్రీకరించికొందురు. చిత్తశుద్ధియె జితేంద్రియత్వంబునఁ దపస్సు చేసినం బాపంబు లడఁగు. చిత్తంబు నిర్మలంబుగాకున్నఁ ద్రిదండధారణంబు, మౌనంబు, జటా

ధారణంబు, ముండనంబు, వల్కలాజినవేష్టనంబు, వ్రతాచరణంబు, తీర్థస్నానం, బగ్నిహోత్రపరత్వంబు, వనవాసంబు, శరీరశోషణం బయినయనశనంబును వమ్మగు. చిత్తశుద్ధి యొక్కండు దుష్కరంబుగాని యనశనాదులు దుష్కరంబులు గావు. మనోవాక్కర్మబుద్ధుల నెవ్వరియెడనుం ద్రోహంబు తలంపక సర్వభూత దయాళుం డైనయతండు గృహమున నుండియుఁ దపస్వి యననెగడు. ఆధివ్యాధు లతనిం జేరరా వెఱచు. అగ్నిదగ్ధంబు లయినబీజములు మొలువని చందంబున జ్ఞానాగ్నిదగ్ధంబులై సంసారక్లేశంబు లాత్మంబొందనేరవు. సర్వభూతాంతర్యామి యగుపరమాత్మనైక్యానుసంధానంబునఁ దెలిసినయతండు శోకాదులం బొరయఁడు. దేనిం గోరఁడు. గురువు నుపాసించితదనుగ్రహంబున బహుప్రమాణనిర్ణీతం బయినతత్త్వంబు నెఱింగి యందలినమ్మికచే నితరంబులు మిథ్యయని భావంబునఁ బదిలంబుగ భావించుటయే మోక్షం బనంబరఁగు. నమ్మిక లేకుండ నెల్లప్పుడుం గేవలసంశయాత్మకుం డైనయతం డుభయలోకములఁ జెడు. వాఁడు దావానలము నకుంబోలె వేదములకు వెఱచునని జ్ఞానవృద్ధులు వచింతురు. వేదార్థంబు లెస్సగ నెఱింగినవాఁడు దీని నెఱుంగు. ప్రణవగమ్యం బైనపరతత్త్వంబును హేతువాదములఁ బరీక్షించువాఁడు సాధనవిపర్యయంబునం జేసి బుద్ధివికలుండై మేలుఁ గాంచ నేరఁడు. కావునం బ్రయత్నంబున వేదప్రమాణం బైనయర్థంబుఁ దెలిసికొన వలయు. ఇది వేదపరమార్థంబు. అయ్యెఱుకగలమహితుఁడు వేదమూర్తి యన వినుతిఁ గాంచు. వేదతత్త్వంబు సాకల్యంబుగ నెఱింగిన నాత్మతత్త్వంబు వేఱుగఁ గానరాదు. అతండు విదితవేద్యుండు. కావున శుష్కతర్కంబులఁ బరిత్యజించి శ్రుతిస్మృతులఁ బ్రమాణంబుగాఁ గొనుము. అట్టివారికి వేదోక్తం బయినయాయువు, కర్మఫలంబు, ప్రభావంబు నగ్గలం బగుచుండు. అన్నింటికిం జిత్తశుద్ధి ముఖ్యంబై యుండు. చిత్తశుద్ధితోఁ దపంబుఁ జేసిన స్వర్గంబు గలుగు. దానములు సల్పిన భోగము లగు. తీర్థస్నానంబునఁ బాపక్షయం బగు. జ్ఞానంబున మోక్షంబు చేకూఱు నని చెప్పిన విని పాండవేయుండు మార్కండేయుం జూచి మునీంద్రా, తత్త్వరహస్యం బింత దురూహం బగునే? నీవలన నించుక తెలిసితి. తపోవృద్ధుఁడు దీర్ఘాయువు నగునీకుఁ దెలియనియదియుం గలుగునే? రాజర్షిచరిత్రంబుల నెక్కింత వినవలతు. ఇక్ష్వాకుకులజనితుం డైనకువలాశ్వునకు దుంధుమారుఁ డనుపే రెట్లు గలిగె? వివరింపవే యనియడుగ నమ్మునీంద్రుఁ డన్నరేంద్రున కిట్లనియె.

## మార్కండేయుండు ధర్మరాజునకుఁ గువలాశ్వచరిత్రము చెప్పుట.

ఉదంకుఁ డనుమహర్షి మరుభూముల నాశ్రమంబుఁ గావించుకొని నారాయణు నుద్దేశించి యనేకవర్షంబు లతితీవ్రముగఁ దపస్సు చేసిన నందుకు మెచ్చి

భగవంతుఁ డొకనాఁ డమ్మునికిఁ బ్రత్యక్షం బగుటయు నతం డద్దేవు నిట్లని స్తు
తించె. దేవా, చరాచరాత్మకం బయినప్రపంచమెల్ల నీవ సృజించితివి. సర్వంబు
విరాట్స్వరూపుఁ డైననీశరీరంబ, ఇంద్రాదినిర్జరులు మహర్షులు నిన్ను బహువిధ
ములఁ బ్రస్తుతించుచు నుపాసింతురు. నీవు సంతుష్టుండవైన జగము స్వస్థం బగు.
నీ వలిగిన భయభ్రాంతం బగు. నీవ సాధులకు భయం బపనయింతువు. త్రివి
క్రమమూర్తి యగునీమూఁడడుగుల జగంబెల్ల వ్యాప్తం బయ్యె. దానవుల గీట
డంచి యమరులకు సుఖము గావింతువు. నీవే సర్వభూతములఁ బుట్టింతువు రక్షిం
తువు సంహరింతువు. నిన్నారాధించికాదె యమరులు సుఖమున్నవా రనివిను
తించినఁ బ్రీతుండై పుండరీకాక్షుం డుదంకా, నీతపంబునకు మెచ్చితి. వరము
వేఁడు మనియానతిచ్చె. భగవద్వచనంబు విని దేవా, భవద్దర్శనంబు చేసితి. కృతా
ర్థుండనైతి. ఇంక వరంబేల యనినివేదించిన భగవంతుఁ డతనిభక్తి కెంతయు
మెచ్చి యుదంకా, నీకు వరం బియ్యఁగఁ బూనియుండెద. వలదనవలదు. అవ
శ్యంబు గోరికొను మని వెండియుం జెప్పిన నుదంకుఁడు భగవంతునకుఁ గేలుమోడ్చి
దేవా, చిత్తం బెల్లపుడును సత్యధర్మదమముల నిత్యంబై యుండఁగను నీపైభక్తి
యచంచలంబై యుండఁగను వరంబు ప్రసాదింపు మనివేఁడికొనిన నాథ క్తవత్స
లుం డావరముల నిచ్చి మఱియు నతని కిట్లనియె. మత్ప్రసాదంబునం జేసి ప్రతి
భాన్వితుండవై లోకమహితం బయినయొకకార్యంబుఁ జేయుము. ఎట్లం టేని. దుం
ధుఁ డనుదానవుఁ డిపుడు ఘోరతపము సేయుచున్నవాఁడు. తపంబు ఫలవంతం
బగుడు వాఁడు లోకములకుఁ బీడఁ గావించు. వాఁడు పొలియకున్న లోకములకుఁ
గీడు దప్పదు. ఆదురాత్ముఁడు పొలియ నుపాయంబు సెప్పెద వినుము. ఇక్ష్వాకు
వంశమున బృహదశ్వుఁ డనువాఁడు ప్రసిద్ధుఁడై యథాన్యాయంబుగ రాజ్యమేలఁ
గలఁడు. వానికిఁ గువలాశ్వుఁ డనువాఁడు జనింపఁ గలవాఁడు. ఆరాక్షసుం బరి
మార్పఁ గువలాశ్వుం బ్రేరింపుము. అత్తఱి యోగమహిమంబున మదీయబలంబుల
నాకువలాశ్వునందుఁ జొనిపెద. ఈకార్యంబు నేసిన నీవు కీర్తిమంతుండ వగుదు
వనివక్కాణించి విష్ణుదేవుం డంతర్హితుఁ డయ్యె. అట నిక్ష్వాకుఁడు బహువర్ష
ములు ధర్మమునఁ బ్రజల నేలి తనపుత్రుం డయినశశాదుని రాజ్యభారధురం
ధరుం జేసి దేవలోకంబునకుఁ జనియె. వానికిఁ గకుత్థ్సుఁడు జనించె. వానికనేన
సుఁడు వొడమె. అతనికిఁ బృథు వుదయించె. వానికి విష్వగశ్వుఁ డుద్భవిల్లె. వాని
కద్రి యనువాఁడు పుట్టె. వానికి యువనాశ్వుఁడు కుమారుఁ డయ్యె. వానికి
శ్రావుఁడు సుతుఁ డయ్యె. వానికి శ్రావస్తి యనువాఁ డాత్మజుండై తనపేర శ్రా
వస్తి యనుపురంబు నిర్మించి ప్రసిద్ధుఁ డయ్యె. వానికి బృహదశ్వుఁడు పుత్రుఁ
డయ్యె. ఆబృహదశ్వునకుఁ గువలాశ్వుఁడు జన్మించె. వాని కేకవింశతిసహస్రపు

త్రులు పుట్టి సర్వవిద్యల నేర్చి సర్వగుణములం బొగడికం గాంచిరి. అంత బృహదశ్వుండు కుమారునుత్తమగుణములం బరికించి రాజ్యార్హుం డనిభావించి వాని సకలమహీభారధౌరేయుం గావించి తపోవనమునకుం జనం దలంచియుండె. దాని నెఱింగి యుదంకుం డయోధ్య కరిగి తపోవనప్రస్థానోన్ముఖుం డైనబృహదశ్వుం గాంచి నరేంద్రా, రాజ్యపాలనంబు విడిచి వనమున కేలపోయెదవు? నీవు ధర్మమునంబాలించుటంజేసి మే మందఱము నిర్భయులమై సుఖమున్నవారము. ధర్మమునం బ్రజలం బాలింపం గలుగుపుణ్యంబుకంటె వనమునం దపము సేయం గలుగుపుణ్యం బంతయెక్కువగునే? తొల్లింటిమహారాజులు ధర్మంబు దప్పక పాలించుటయ యుత్తమధర్మం బనినిశ్చయించినవారు. మాయాశ్రమంబుచెంగట సముద్రతీరంబున సైకతతలసాంద్రం బయినయుజ్జాలకం బనుప్రదేశంబు గలదు. అది బహుయోజనవిస్తారాయామంబులు గలయది. అందు దుంధుండనుదానవుండావాలుకాతలంబున మహావివరంబుం గావించుకొని దేవవినాశార్థంబు దారుణతపోనిష్ఠుండై శయనించియున్నవాండు. వాండు దేవదానవుల కవధ్యుండు. వాలుకాంతర్హితుండై వాండుసంవత్సరంబున కొకపరి నిట్టూర్పు నిగిడించు. ఏడుదినములా నిట్టూర్పుతోం బొగ లెగయ మిణుంగుఱులు నెఱయ మహాజ్వాలాదారుణంబై యగ్ని వెడలి వచ్చు. మఱియు నానిశ్వాసపవనవేగంబున దుమ్ము రేంగి సూర్యమండలం బాక్రమించు. కొండలతోడం బుడమి వడంకు. దానంజేసి యేము నిజాశ్రమంబుల నుండనోపము. వానిం బరిమార్చి లోకములకు మేలు గావింపుము. తద్వధంబు సేయం బూనిన వానిపై నారాయణుండు తన తేజంబుం జొనుపునట్లు మున్న నాతో నానతిచ్చినవాండు. కావున విష్ణుతేజోవిలసితుండవై రౌద్రవిక్రముండైనయాదైత్యుం జక్కాడు మనిన బృహదశ్వుండు ప్రాంజలియై యుదంకున కిట్లనియె. మునీంద్రా, నావిన్నపం బాకర్ణింపుము. నేను దపోవనమునకుం జననిశ్చయించి యస్త్రసన్యాసంబుం జేసితి. ఇంక నస్త్రములం గొని దురంబు సలుపం జనదు. నాపుత్రుండైనకువలాశ్వుండు శూరులగుపుత్రులు బాసటగాంగ నీయానతిమెయి నారాక్షసుని వధించువాండు. వానిధైర్యశౌర్యంబు లవార్యంబులు. నీకుం బ్రియంబు సేయువాండనిచెప్పి దుంధువధార్థంబు కువలాశ్వునియోగించి యమ్మునియనుజ్ఞంగొని బృహదశ్వుండు తపోవనమున కరిగె ననిన విని ధర్మనందనుండుమార్కండేయుం జూచి మునివరేణ్యా, దుంధుం డెవ్వనికొడుకు. వానితోడిబలవంతుల నెవ్వరినిం గానను. తత్ప్రకారంబుం దెలియం జెప్పు మనియడుగ నతండతని కిట్లనియె.

### నారాయణుండు మధుకైటభులం జంపుట.

అతీతకల్పాంతంబునం జరాచరాత్మకంబు లయినభూతంబులెల్లం బొడవడంగి ప్రపంచం బంతయు నేకార్ణవంబై యుండ మధుకైటభు లనుదైత్యులు

బహుయోజనవిస్తారాయామంబై దివ్యశ్రీవిలసితం బయినశేషశయ్యపై యోగ నిద్రం బవ్వళించినవానిఁ బీతాంబరముఁ దాల్చినవాని శ్రీవత్సలాంఛనుండైనవానిఁ గిరీటకౌస్తుభాదుల నలరువాని శ్రీమన్నారాయణు సర్వకారణకారణాత్మకు సర్వ లోకమహేశ్వరుం గాంచి యట నద్దేవదేవు నాభికమలంబున సుఖనిద్రఁ జెందిన వాని వేదమూర్తిఁ జతుర్ముఖుం గనుంగొని విస్మితులై భయజనకంబుగా గ్రా ర్యంబుఁ జూపినఁ గ్రబ్రహ్మ మేల్కని వారికి వెఱచి తనయునికి పట్టగుపద్మనాళంబుఁ గదలించుటయు గోవిందుఁడు మేల్కాంచి యెదుట నున్నమధుకైటభులఁ జూచి స్వాగతం బడిగి మీయెడం బ్రీతుండనైతి వరములు వేఁడుఁ డనివచించె. ఆరా క్షసు లందుకు నవ్వి యోహోహా! నీవా మాకు వరము లిచ్చువాఁడవు. నీవరం బు లటుండ నిమ్ము. వలతేని నీవు గోరికొమ్ము. మేమ యిత్తుమని దర్పోద్ధతింబల్కిన వినిభగవంతుఁ డట్లయిన నేన వేఁడెద. సత్యంబు దప్పక యొసంగుఁడు. లోకహి తార్థంబు మీ రిరువురు నాకు వధ్యులు గావలయు. ఇదియ నాకోరినవరం బనిన వా రిట్లనిరి. అయ్యా, మేము నవ్వటాలకైన ననృతంబుఁ జెప్పనివారము. సత్య ధర్మరతులము. కావున నీకోరినట్ల వరము నిచ్చితిమి. కాలవశంబునఁ గలుగు వానిం దప్పింప నేరికి నలవిగాదు. అయిన నొక్కనియమంబు వినుము. జలములేని చోట మమ్ముఁ జంపవలయు. నీకుఁ బుత్రత్వంబుఁ గాంతుము. ఇది మాకోరిన వరం బనిన నట్లయని నారాయణుండు వారల వధింపఁగ నయ్యేకార్ణవంబున జల రహితస్థలంబు గానక విచారించి తనతొడల వారి నిడికొని చక్రాయుధంబునఁ దలలు దఱిగె. ఈదుంధుఁడు వారికొడుకు. వీఁడు తనతండ్రుల విష్ణుఁడు వంచనమై జంపె నని యీసు మనంబునఁ బెచ్చుపెరుగ నాహారంబు మాని నరాలు బయ లుపడఁ గృశుండై యేకపాదస్థితుండై పెద్దకాలంబు తపస్సు చేసి బ్రహ్మ నారా ధించి ప్రీతుం డై నయప్పరమేష్ఠివలనఁ దనకు దేవదానవగంధర్వోరగులచే నవధ్య త్వంబు వరంబుగాఁ బడసి యప్పితామహుచే ననుజ్ఞాతుండై మగిడి వచ్చి హృషీ కేశుండు తనతండ్రులఁ బరిమార్చుటఁ దలంచుచు దేవగంధర్వాదుల నేఁచుచు సముద్రతీరంబున వాలుకానిబిడం బయినయుజ్జాలకం బనుప్రదేశంబు నెలవుగాఁ గొని లోకవినాశంబు సేయుచుండె నని మార్కండేయుండు మధుకైటభులవృ త్తాంతంబు చెప్పి వెండియు నిట్లనియె.

ఉదంకవచనచోదితుండై కువలాశ్వుం డిరువదియొక్కవేగురుకొడుకుల తోడ సమరసన్నాహంబున లోకహితార్థంబు వెడలె. అపుడు దేవదుందుభులు మ్రోసె. పుష్పవర్షంబు గురిసె. చల్లగాలి వీచె. అమరులు విమానారూఢులై వారిసమరముఁ జూడ నంతరిక్షముఁ జేరిరి. అటఁ గువలాశ్వుఁడు విష్ణుతేజఃపూరి తుండై వెడలి దుంధునివాసం బయినయవ్వాలుకాతలంబు సేరి యాదైత్యుఁ

డగపడునందాఁక సైకతంబుఁ ద్రవ్వుఁ డని కొడుకుల నియమింప వా రేడునాళ్లు త్రవ్వి వాలుకాంతర్హితం బయినయాదైత్యునిఘోరాకారంబుఁ గాంచి నిద్రిం పుచున్న వానిం బరిఘపట్టసప్రాసముసలాద్యాయుధంబులం బిట్టడిచిరి. అడుచుట యు వాఁడు నిద్రలేచి క్రుద్ధుండై యయ్యాయుధములనెల్ల నుక్కడెట్ట మ్రింగి క ల్పాంతదహనోపమం బైనయగ్నిని నోటఁ గ్రక్కుటయుఁ గపిలునికోపానలంబున సగరపుత్రులుంబోలె నయ్యగ్నిం బడి కువలాశ్వపుత్రులు దృఢాశ్వ, కపిలాశ్వ, చంద్రాశ్వులనువారు మువ్వురుదక్క నందఱును దగ్ధులయిరి. రెండవకుంభకర్ణుండు నా నిద్రలేచి పైపై వచ్చునయ్యసురఁ జూచి కువలాశ్వుఁడు భయంబుఁ జెందక యోగమహిమంబున నయ్యగ్నిం జల్లార్చి యద్దానవుదేహంబున జలరూపముగ వెడలివచ్చుచున్న తేజస్సారం బంతయుం బీల్చి బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించి తద స్త్రానలంబున వాని నీఱుసేసె. నాఁటంగోలె నాకువలాశ్వుండు దుంధుం జంపుటం జేసి దుంధుమారుఁ డనఁబరఁగె. అపు డింద్రాదినిర్జరులు మహర్షులుం బ్రసన్నులై యచ్చటికి వచ్చి కువలాశ్వుం బిలిచి వరముల వేఁడు మనిన నారాజు కృతాంజ లియై బ్రాహ్మణులకు దానము సేయునెడ నత్యాసక్తి, శత్రులకు గెలువరామి, విష్ణునితోడిసఖ్యంబు, సర్వభూతంబులయెడ నద్రోహవృత్తి, ధర్మనిరతత్వంబు, సార్వకాలికస్వర్గలోకవాసంబు ననువరంబులఁ గోరికొనిన వా రందఱు నట్లయని యతనికోరినవరము లొసంగిరి. అంత నాకువలాశ్వుఁ డుదంకాదిమహర్షులయాశీ ర్వాదంబులఁ గొని యందఱ నామంత్రణంబుచేసి యయోధ్యకరిగె. సురలు మహ ర్షులు స్వస్థానంబులకుఁ జనిరి. కువలాశ్వుకొడుకులలోమిగిలినయామువ్వురివలన నిక్ష్వాకుకులంబు వృద్ధిఁగాంచె. ఇది కువలాశ్వునకు దుంధుమారుఁ డనుపేరు గలుగఁ గారణంబు. విష్ణుమహిమోపబృంహితం బయినయీయాఖ్యానంబు వినినవా రాయురారోగ్యైశ్వర్యసంతతులం గాంచి సుఖింతు రని మార్కండేయుండు దుంధు మారోపాఖ్యానంబు వివరించిన నాకర్ణించి పాండవాగ్రజుండు మఱియు నిట్లని యడిగె.

మునీంద్రా, సూర్యచంద్రులు, వాయువు, పృథివి, యగ్ని హోత్రుఁడు, తల్లిదండ్రులు, గురువులు, పతివ్రత లగుస్త్రీలును మాననీయులుగదా. మనస్సునిగ్ర హించి యింద్రియముల గెలిచి మనోవాక్కర్మముల నన్యచింత మాని పతియె దైవ మనుభావంబున నతనికిఁ బరిచర్యలు గావించుచుఁ, దదుచ్ఛిష్టంబుఁ గుడుచుచు, నత్తమామలను దేవతాతిథివరులను సేవించుచు, భృత్యుల భరించుచుఁ, గుటుంబ హితంబుఁ గోరుచు, నుత్తమాచారంబున నడచుట యెంతయు దుష్కరంబుగాదె. కావున నవ్విధం బాచరించుపతివ్రతలపుణ్యచరిత్రంబు విన వేడుక వొడమెడి. మఱి యుఁ బుత్రవిషయం బైనయాయాసంబు దల్లిదండ్రులలో నెవ్వారి కెక్కుడై యుండుఁ?

వారియెడఁ బుత్రుఁ డెబ్భంగి వర్తింపవలయు. వెండియు హీనకులజనితుం డైనవాఁ డేనడవడి ధర్మంబుఁ గాంచనేర్చు? ఈయర్థములనెల్ల నీవలన వినఁ గోరియున్న వాఁడ. తెలియఁ జెప్పవే యనియడుగ మార్కండేయుండు ధర్మజా, పదినెలలు గర్భము నతిశ్రమంబుమై మోచి ప్రసవసమయమునఁ బ్రాణసంశయదశ నొంది పుత్రులఁ గని వివిధప్రకారంబులఁ బోషించుటం జేసి తల్లియ యెక్కువ యని కొందఱు తలంతురు. తపస్సులను, దేవతాపూజలనుం జేసి పుత్రుఁ బడసి వాని వృద్ధిపొందు నెన్నియేఁ బాట్లుపడుటం జేసి తండ్రియే యెక్కువయని మఱికొందఱు తలంతురు. పరికించిచూడ నిద్దఱు నొక్కరూప యని నామతంబు. తల్లిదండ్రులు పుత్త్రుం గని యీనినుఁగు పెరుగునా. పెరిగి విద్యల నేర్చునా. నేర్చి కీర్తి నై శ్వర్యంబునుం బడసి ధర్మంబు దప్పకుండునా యని పెక్కుభంగుల వానిమేలు సర్వకాలంబులం గోరుచుండుదురు. అందు కనురూపంబుగఁ బుత్రుఁడు సర్వవిధ ముల శ్రేయోవంతుండై యత్యంతభక్తిమై మాతాపితరులకు శుశ్రూషఁ గావిం చుచు వారికోరిక నీడేర్పవలయు. ఎవ్వనియోగ్యవర్తనంబునకుఁ దల్లిదండ్రులు మెత్తురో వాఁడే పుత్రుఁ డనంబొగడ్త కెక్కు. అతం డుభయలోకముల మేలు గాంచు. మఱియు భర్తృశుశ్రూషయందు నిత్యాసక్త యయినసతికి యజ్ఞక్రి యాదిసకలఫలంబులు సులభంబు లగు. నీయడిగినయర్థంబెల్లఁ దేటపడ నొక్క యితిహాసంబుఁ జెప్పెద వినుమని మార్కండేయుఁ డిట్లనియె.

### మార్కండేయుండు ధర్మరాజునకుఁ బతివ్రతామహిమంబుఁ జెప్పుట.

ధర్మనందనా, సాంగవేదాధ్యయనశీలుం డైనకౌశికుఁ డనుబ్రాహ్మణుఁ డొకశిష్టాగ్రహారంబున నుండువాఁ డొక్కనాఁడు గ్రామసమీపంబున నొకమ్రాని నీడం గూర్చుండి వేదముఁ జెప్పుచుండె. అపు డామ్రానిపై నాకులనడుమ నుండి నకొక్కర యొక్కటి రెట్టవైచె. అది తనతలపైఁ బడుటయు నాకౌశికుఁ డల్గితల మెత్తి యాకొక్కరఁ జూఱచుఁజూచిన నది యతనికోపాగ్నిం గ్రాఁగి నిశ్చేత నంబయి నేలం బడియె. అందుకుఁ బశ్చాత్తాపంబున నాభూసురుఁడు హా! రో షంబు నిలుపలేనైతి. తప్పు చేసితి నని వగచుచు నూరికి వచ్చి శుచితోల్లసి తంబు లయినబ్రాహ్మణగృహంబులకుఁ జని భిక్షఁ దెచ్చుచు నొక్కవిప్రగృహ మున కరిగి వాకిట నిల్చి "భిక్షాం దేహి" యనుటయు నాయింటిసతి యతని నుండు మనిచెప్పి భిక్ష యిడఁగఁ బాత్రంబుఁ గడుగుచుండె. అట్టియెడఁ దనపతి యాఁకటం దూలుచు నింటికి వచ్చుటయు నప్పరమపతివ్రత బ్రాహ్మణునకు భిక్షంబు పెట్టుట మాని భక్తిమై భర్తకుఁ బాద్యంబు నాచమనీయంబును సమర్పించి పీఁట వేసి యతని నాసీనుంజేసి రసవంతంబు లైనభక్ష్యభోజ్యాదిపదార్థములఁ గుడువఁ బెట్టె యతండు భుజించినపదంపడి మెత్తనిపాన్పు పఱచి యం దతనిఁ బవ్వళింపఁజేసి

తాంబూల మొసంగి వినయవినమ్రయై పాదసంవాహనాదిపరిచర్యలు గావింపు చుండి మనంబున భిక్షార్థంబు వచ్చియున్న బ్రాహ్మణుం దలంచి వ్రీడితయై భిక్షా న్నంబుఁ గొనివచ్చుటయు వాకిట నుండుకౌశికుండు కోపారుణితనయనుండై యో సతీ, నన్నుండు మనిచెప్పి యరిగి భిక్ష మిడక యింతతడ వేల చేసితివి? అప్పుడ పొమ్మనినం బోయియుందు. నిట్లు చేయుట యుచితవు గా దనిన నాబ్రాహ్మణి కౌశికుఁ గుపితుఁగా నెఱింగి సాంత్వపూర్వముగ నిట్లనియె. భూసురోత్తమా, నీకు భిక్ష మిడఁ బాత్రశోధనంబు సేయుచున్నంత నాపతి యాఁకటం దూలుచు వచ్చిన నతనికి భోజనాద్యుపచారంబు లొనరింపుచుంటి. భర్తయే యుత్తమదైవం బని నామతంబు. దానంజేసి యింతతడ వయ్యె. విద్వాంసులకుఁ జెప్పనేల? నాయపరా ధంబు సైరింపు మని మెల్లన వాక్రుచ్చిన నాకౌశికుండు కడుం గినిసి యోహో! నీకు మగఁ డంతయెక్కు వయ్యె. బ్రాహ్మణు లింతతక్కువైరో? గృహస్థధర్మమున నుండియు బ్రాహ్మణుల ననాదరించెదవు. పరికించి చూడ బ్రాహ్మణు లగ్నిసదృశులు. అలుక వొడమిన లోకమెల్లం గాల్తురు. ఇంద్రుఁడును వారికి విధేయుండు. ఇంక మనుజమాత్రులం జెప్పనేల? పెద్దలవలన ధర్మము నెఱుఁగమింజేసి మదంబున ని ట్లకృత్యంబుఁ జేసితి వని యధిక్షేపించి పలికిన నప్పరమసాధ్వి యతని కిట్లనియె. అయ్యా, కోపంబు విడువుము. నన్నేల చుఱచుఱం జూచెదవు? నీకోపమునఁ బొలిసిపోవ నేఁ గొక్కెరఁ గాను. బ్రాహ్మణమహిమంబు నే నెఱుంగుదు. ఒకబ్రా హ్మణుఁడు సముద్రోదక మపేయంబుగ శపింపఁడే. మఱియొకవిప్రుఁడు దండక దేశం బరణ్యంబుగాఁ జేయఁడే. వేఱొకభూసురోత్తముండు వాతాపి యనురా క్షసు నఱిగించికొనఁడే. బ్రాహ్మణులు దేవసములు. నిగ్రహానుగ్రహసమర్థులు. బ్రాహ్మణుల కవజ్ఞ సేయను. మఱి వారల నెల్లపుడుం గొలుతు. సహేతుకం బయిననాతప్పు సైరింపుము. "పతి యంత యెక్కువయ్యెనో" యనియంటివిగదా. పతియే యుత్తమదైవంబు. పతిశుశ్రూషయ యుత్తమధర్మం బని నామతంబు గావునఁ బెఱపనులనెల్ల విడిచి యేను భక్తిమైఁ బతిశుశ్రూషఁ జేయుదు. పతి శుశ్రూషాప్రభావంబుననే నేను నీకోపాగ్నిం గొక్కెర క్రాఁగి నేలం బడుట నెఱిం గితి. అంతశ్శత్రువు లయినకామక్రోధమోహాదుల దూరమునం బరిత్యజించి యింద్రియముల గెలిచి యపకారియెడం గీడుఁ దలంపక సర్వభూతంబులందును దయ గలిగి సత్యంబ పల్కుచు గురువుల సేవించుచు షట్కర్మములం గ్రమమున నాచరించుచు ధర్మనిరతుండై స్వాధ్యాయంబున నప్రమత్తుండై సకలభూతముల నాత్మసమంబులఁగా మది విచారించునతండే బ్రాహ్మణుండు. శాంతిసత్యార్జవేంద్రి యనిగ్రహంబులు బ్రాహ్మణులకు శ్రుతిప్రమాణనిర్ణీతం బయినధర్మం బని పెద్దలు చెప్పుదురు. ధర్మసూక్ష్మంబు దురూహంబు. కావునఁ బరికించి బ్రాహ్మణోచిత

ధర్మం బనుష్ఠింపఁ దగు. నీవు కేవలవేదాధ్యయనపరుండవుగాని ధర్మతత్త్వం బె ఱుంగ వనియూహింతు. ధర్మతత్త్వంబుఁ దెలిసికొనఁ గోరెదవేని మిథిల కరిగి ధర్మవ్యాధు నడుగుము. అతండు మాతాపితృపరిచర్యాపరాయణుండు. సత్యవచ నుండు. జితేంద్రియుండు. సకలధర్మవిదుండు. నీకు ధర్మములనెల్ల బోధించు. నే నింతచెప్పఁ దగకున్నం బ్రస్తావవశంబునం జెప్పితి. సైరింపవలయు. వనితలు వివేక వికలలు గావున వా రెన్నితప్పులు చేసినను ధార్మికులు సైఁతురుగదా యనిచె ప్పిన విని కౌశికుండు పతివ్రతాశిరోమణీ, నీవివేకంబునకు మెచ్చితి. నీయాడిన మాటలెల్ల నాకు శ్రేయస్సాధనంబు లయ్యె. క్రోధంబు విడిచితి. మిథిలకుఁ జని ధర్మవ్యాధుం గాంచి ధర్మసూక్ష్మంబు నెఱింగెద. నీకు శుభం బయ్యెడి. పోయి వత్తు నని చెప్పి యాసతీరత్నంబు వీడ్కొని మఱలి నిజగృహంబుఁ జేరి తనమనం బున నప్పరమపతివ్రతావచనంబులం దలపోసి బ్రాహ్మణధర్మంబు లెస్సగ నెఱుం గనైతిఁగా యనిచింతించి యవశ్యంబు మిథిలకుఁ జని ధర్మవ్యాధుం గనుంగొని ధర్మరహస్యమెల్లఁ దెలియుదు నని నిశ్చయించి తఱలె.

**కౌశికుఁడు తత్త్వజ్ఞానార్థంబుగా ధర్మవ్యాధు నొద్దకుఁ బోవుట.**

అట్లు తఱలి యాకౌశికుఁ డనేకగ్రామనగరజనపదంబులం గడచి సతత యజ్ఞప్రయోగసమంచితంబు, నిజధర్మపరాయణసకలజనసమాకీర్ణంబు, గోపురా ట్టాలకప్రాకారాదిసముల్లసితంబు, జనకరాజపాలితంబు నగుమిథిలాపురంబు సొచ్చి బ్రాహ్మణుల నడిగి ధర్మవ్యాధుఁ డున్నచో టెఱింగి యయ్యెడకుఁ జని వివిధమృగ మాంసఖండంబుల నంగడిం బఱచి విలుచుచున్నయాతనిం గాంచి విక్రయాగత జనసంకులంబై యతిజుగుప్సితంబైన యామాంసపుటంగడిం జొరనొల్లక యెడ గలుగ నొక్కచోఁ గూర్చుండె. ధర్మవ్యాధుఁడు నాతని రాక నెఱింగి ససంభ్రమం బుగ నతనియొద్దకుఁ జనుదెంచి యభివాదనంబుఁ గావించి స్వాగతం బడిగి మహా బ్రాహ్మణా, పతివ్రతావచనంబునం గాదె నీ విటకు విచ్చేసితివి. నీరాకకుం గతం బే నెఱుంగుదు. ఇచట నుండ నేల? ఇంటికిఁ బోవుద మనిచెప్పి యాకౌశికుం దోడ్కొని తనయింటికిఁ జనియె. కౌశికుఁడును ధర్మవ్యాధునియప్రత్యక్షవిజ్ఞానంబునకు మెచ్చి పతివ్రతావిజ్ఞానంబునుం దలపోసి యిది రెండవయాశ్చర్యం బయ్యె ననితలంచుచు నయ్యెఱుకు వినయవినమ్రుండై పిఱుందరాఁగఁ దద్గృహంబున కరిగి యతం డతి భక్తిమై నొనరించినయర్ఘ్యపాద్యాదిపూజలం గ్రహించి యుచితాసనంబున సుఖాసీనుండై యతనిం బిలిచి జీవహింస యత్యంతనిందితంబుగాదే? ధర్మవిదుం డవయ్యు నీ వీఘోరకర్మంబున కెట్లొడఁబడితివి. నాకుంజూడ నీ కిది పోల దని తోఁచెడు నని న నతనికి ధర్మవ్యాధుం డిట్లనియె. బ్రాహ్మణులకు సత్యతపస్స్వా ధ్యాయబ్రహ్మచర్యంబులు, క్షత్రియులకు దండనీతి, వైశ్యులకుఁ గృషిగోరక్షా

వాణిజ్యంబులు, శూద్రుల కుత్తమపరిచర్యయు నిజధర్మం బయినట్లు మాకు నిది కులధర్మంబు. దీని విడువరాదు. ఇదియునుంగాక యీ దేశమునకు రా జయినజనకభూపాలుండు రాజధర్మపరాయణుండై యుక్తచారులవలన నంతయు నెఱింగి సకలజనులను స్వధర్మంబున నియమించు. దుర్వృత్తులు పుత్రులైన నవశ్యంబు దండించు. రాజులు ధర్మమునఁ బాలించినంగాదె జనులు క్రమంబున వర్తింతురు. లేకున్నఁ బాపనిరతులై జనులు ధర్మంబుఁ బరిత్యజించి దుర్వర్తనంబులం గాంతురు. ఈజనకరాజు పాలించు దేశంబున నెక్కఁడేనియు నిజధర్మంబు విడుచువాఁడు గన్పడఁడు. కావున నేనుం గులధర్మంబు విడువ నోడుదు. కులపరంపరాప్రాప్తం బయిన ధర్మం బనుష్ఠించునాయెడం గినియవలదు. ఇయ్యది మాకు విధిచోదితం బైన ధర్మం బనిభావించుచుందు. ఇట్లుండియు నేను జీవహింసఁ జేయను. మఱి యితరులు చంపి తెచ్చినమృగములమాంసమును దగినవెల కమ్ముచుఁ దద్ధనంబున జీవింతు. మాంసంబు భుజియింపను. వృద్ధు లయినతల్లిదండ్రులకుఁ బ్రయత్నమున శుశ్రూషఁ గావింతు. సత్యంబ పల్కుదు. పరులకలిమి కసూయపడను. శక్తి కీడుగ దానము సేయుదు. దేవతాతిథిసపర్యయు భృత్యభరణంబునుం గావించి తచ్ఛేషంబు భుజియింతు. ఋతుకాలమున భార్యతోడ సంగమింతు. ఉపవాసనక్తభోజనాదివ్రతంబుల నాచరింతు. ప్రశంసించువారియెడను నిందించువారియెడను భేదంబు లేక యందఱకు సంతోషంబుగ వర్తింతు. ఇట్లుండుటం జేసి హీనయోనిజాతుండనయ్యు శీలవంతుండ నైతి. ప్రసంగవశంబున నీతో నింత చెప్పితి. ధర్మంబు వినఁగోరి నాయొద్దకు వచ్చితివి గావునఁ దత్స్వరూపంబుఁ జెప్పెద వినుము.

## ధర్మవ్యాధుఁడు కౌశికునకు ధర్మంబు బోధించుట.

సర్వభూతములయెడం గరుణ సేయవలయు. శక్తికొలఁది నన్నము పెట్టవలయు. అన్నింటియెడ నోర్పుమై నుండవలయు. కృత మెఱింగి యుపకారులకుఁ బ్రత్యుపకార మొనరింపవలయు. విషయభోగములయెడఁ బరిత్యాగబుద్ధి సేయవలయు. కామక్రోధాదుల జయింపవలయు. ధర్మమందే బుద్ధి నిలుపవలయు. అనృతవచనంబుఁ ద్యజింపవలయు. యాచింపకున్న నెరులకుఁ బ్రియంబు సలుపవలయు. ప్రియంబులు పలికిన సంతోషంబు నప్రియంబులు పలికినఁ గోపంబునుం జేయరాదు. అర్థకృచ్ఛ్రములఁ మోహంబుఁ జెందరాదు. ధర్మంబుఁ దప్పక యుచితకర్మంబుఁ జేయవలయు. దానం దనకు మేలు గలుగకుండినను ధర్మవిరుద్ధంబుఁ జేయరాదు. మఱి మేలుగావింపనోపుదానిం బరిశీలించి చేయవలయు. అపకృతిఁ జేసినవానికి నపకృతి సేయరాదు. అట్లు సేయఁబూనుటయు నసాధుకృత్యంబ. ఒరులకుఁ గీడు సేయఁబూనినవాఁడు దురీహం జేసి తానే చెడు. ధర్మంబునెడ శ్రద్ధ విడిచి ధార్మికులధర్మాచరణంబునుం బరిహసించువా రవశ్యంబు చెడుదురు. అట్టి

దుర్మదాంధులపాపశరీరంబులు గాలిచే నిండినతోలుతిత్తులుంబోలె నిస్సారంబులే. మఱియు మూఢుఁడు తనచేసినపనుల సూర్యుఁడు రూపంబులంబోలె నెల్లెడలఁ బ్రకటీకరించుచు నాత్మప్రశంసఁ జేసికొను. అయిన నతండు లోకములం బ్రకాశింపనేరఁడు. సంపద లేకున్న గుణసంపద గలిగినసత్కృతవిద్యుం డవశ్యంబు ప్రకాశించు. కావున నితరుల నిందింపరాదు. ఆత్మస్తుతియుం జేయరాదు. ప్రమాదంబున నెన్నఁడేని పాపంబుఁ జేసినం దత్పాపంబు పశ్చాత్తాపంబున నగు, మిఁక నిట్టివి చేయ ననుభావనం బుణ్యంబులె యాచరింపుచుండినం బెఱసగంబును నశించు నని వేదవిదు లయినపెద్దలు చెప్పుదురు. సర్వపాపములకు మూలంబు లోభంబు గావున దానిం బ్రయత్నపూర్వకంబుగఁ ద్యజింపనవలయు. తృణప్రచ్ఛన్నంబు లయినకూపములమాడ్కి నధర్మంబులు కొన్ని ధర్మంబులవోలె నగపడు. అవియెల్ల శిష్టాచారమున నెఱుంగవలయు ననినఁ గౌశికుండు శిష్టాచారలక్షణం బెయ్యది యనియడుగ నతనికి ధర్మవ్యాధుఁ డిట్లనియె. వేదచోదితంబు, శాస్త్రబోధితంబు, సాధుజనసేవితంబు నన శిష్టాచారంబు మూఁడువిధంబులం బ్రవర్తిల్లు. యజ్ఞము, దానము, తపస్సు, వేదాధ్యయనంబు, సత్యవచనంబు, కామక్రోధదంభలోభాదివర్జనంబు, ఋజుత్వం, బాచారపాలనంబు, గురుశుశ్రూషణంబు, జితేంద్రియత్వంబు, సర్వభూతహితవర్తనం, బహింస, తీర్థస్నానంబు, సర్వవిద్యాధిగమంబు, శాంతి, శౌచంబు, దీనానుగ్రహంబు, కులోచితధర్మానుష్ఠానం, బనసూయ, లబ్ధసంతోషంబు, ప్రియవాదిత్వం బనునివి శిష్టాచారంబులు. అహింసాసత్యదానశమంబు లన్నింటికంటె నుత్తమంబులు. ఇవి గలిగి, బుద్ధిమోహమునఁ జేసి ధర్మమునెడ నసూయపెల్లున మర్యాద విడిచి కూరకర్మంబుల నొనరించునాస్తికుల దూరమునం బరిత్యజించి, గురువుల నుపాసించి, జ్ఞానము సాధించి, ధార్మికుల సేవించి, ధైర్యము నుతెప్పం జేసి కామలోభాహంకారమత్సరాదిగ్రహసంకులయు విషయసలిలపరిపూర్ణయు నగుమోహమహానదిం దాఁటి జన్మదుర్గంబులం గడచి యుత్తమపదం బధిగమింపుము. పాపాత్ముండు క్రోధాదులకుఁ జిక్కి యుభయలోకములం జెడు. సర్వవిద్యల నేర్చి గుణవంతులయి స్వకర్మనిరతు లయినవృద్ధులయాచారం బనుష్ఠించుచుఁ బరుషంబు విడిచి సత్యంబులు ప్రియంబులు నగువచనములఁ బల్కుచు ధర్మముదప్పక కార్యముల నొనరించుచుఁ బరిపాకంబున ఫలంబు నెఱుంగుచు శుభాశుభఫలంబులకు సుఖదుఃఖంబులం బొరయక సర్వంబు విధ్యధీనం బనిభావించుచు యథాశక్తి దానాదుల నల్పుచుఁ బరమార్థచింతమై వర్తించువారు ప్రజ్ఞాప్రాసాదం బారోహించి వివిధము లయినలోకవృత్తములం జూచుచుఁ బుణ్యపదం బధిగమించి సుఖంతురు. ఇది శిష్టాచారస్వరూపంబును, తత్ఫలంబునఁ జనువారివర్తనంబును. నీవు తొల్లి నా

వృత్తిం జూచి యిది జీవహింస ఘోరకృత్యంబుగాదె యనియడిగితివి. అందుకు నేను దగురీతిఁ జెప్పితింగదా. అది యట్లుండె. హింస యిట్టి దనివివరింప నెవ్వరు నేరరు. తత్ప్రకారంబు వినుమని వ్యాధుండు మఱియు నిట్లనియె.

ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ హింసాస్వరూపంబుజెప్పుట.

జంతుజాలంబెల్లఁ బురాకృతకర్మవశంబునఁ బొలియుచుండు. అందు ఘాతకుండు నిమిత్తమాత్రంబ. ఓషధులు, లతలు, ఫలశాకంబులు, పశువులు, మృగపక్షులు లోకమునకు భక్ష్యంబు లని వేదవచనంబుల వినంబడు. వెండియు నౌశీనరుం డయినశిబినృపాలుఁడు తనమాంసముఁ గోసి యిచ్చి యింద్రాగ్నులకుఁ దృప్తిఁగావింపఁడే? అది హింసగాదో? దాన నతం డుత్తమగతిఁ బడయఁడో? రంతిదేవమహీపాలుఁడు ప్రతిదినమును రెండువేలగోవుల వధియించి తన్మాంసముతోడ నతిథుల కన్నదానంబుసేయఁడే? తత్ప్రభావంబున నతండు కీర్తిమంతుడై సద్గతిం గాంచఁడే? వేదవిదు లయినబ్రాహ్మణోత్తములు యజ్ఞములంబశువుల హింసింపరే? అది వారి కుత్తమగతిసాధకంబు గాకుండెనే? మఱియు నాపశువులు మంత్రసంస్కారంబుఁ జెందుటంజేసి స్వర్గ మధిగమించు. అగ్నులకు మాంసంబునం గోరిక పెల్లుగ నుండు నని శ్రుతి విశ్రుతంబు. అగ్నులు మాంసార్థులుగారేని మాంసాశనంబు విధిచోదితంబుగాకయే యుండు. దేవపితృకార్యంబుల మాంసంబుఁ గుడువఁ బెట్టుట విహితంబ. మఱియు ఋతుకాలంబునఁ బత్నితోడ సంగమించుచుఁ బరస్త్రీపరాఙ్ముఖుం డైనవిప్రుఁడు నిత్యబ్రహ్మచారినాఁ బరఁగు తెఱఁగున దేవపితృశేషం బయినయామిషం బుపయోగించునతం డమాంసాశనుండునాఁబడునని శ్రుతులు మ్రోఁగుచుండు. అదియునుంగాక కృషియుత్తమం బనియందఱుం దలంతురు. అందును దున్ను నెడ నాఁగేటికోపునం జిక్కి యెన్నియే జంతువర్గంబులు సచ్చు. విశేషం బేల? నడుచునెడఁ, గూర్చుండునెడఁ, బరుండునెడను శరీరసమ్మర్దంబునంజేసి జీవకోటులు సచ్చు. జ్ఞానవంతులును దీనిం దప్పించుకొననేరరు. భూమిఁ యాకాశము, జలంబు జీవకోటినిబిడంబై యుండుటంజేసి జ్ఞానాజ్ఞానంబుల నందఱును జీవహింస చేయుదురు. పరికించిచూడ హింస చేయనివాఁ డొక్కఁడుం గన్పడఁడు. అహింస వ్రతంబుగఁ బూనినమునులు నాహారార్థంబు ఫలశాకపర్ణాదిచ్ఛేదనంబుఁ జేయుటంజేసి జీవహింసఁ జేయువారలే. అందు జీవకళ లేదో? ప్రాణుల కన్యోన్యభక్షణంబు దైవవిహితం బయినజీవనం బగుటంజేసి యందఱకును జీవహింసనం బనివార్యంబై యుండు. హింస యత్యంతాల్పంబుగాఁగ నోపినంతయత్నంబుఁ జేయుటయ యహింసనాఁబడు. కావున నంతయుం బరిశీలించిచూడఁ గులధర్మం బెట్టిదియైన నాచరించుట ధర్మం బనితోఁచెడి. పురాకృతకర్మవశంబునం బ్రాప్తం బయినకులోచితజీవనంబు క్రూరంబ

యినం బరిత్యాజ్యంబుగాదు. సత్కర్మం బెట్లలవడునో దుష్కర్మం బెట్లు వాయునో యనుతలంపు గూర దానిన చేయుచుండవలయు. అది వానికిఁ బాపకారణంబు గాదు. తొల్లి బ్రాహ్మణశాపంబున రాక్షసుం డైనకల్మాషపాదుం డను రాజు రాక్షసోచితం బయినమనుష్యభక్షణంబు సేయఁడే? దాన నతనికిఁ బాపంబు పొసఁగెనే? ఎవ్వరి కెయ్యది యుచితధర్మంబో యయ్యది వారికిఁ బాపావహంబు గాదు. కావున నేనుం గులోచితజీవిక విడువకున్న వాఁడ. ఇట్లుండియు సత్యదానగురుశుశ్రూషాదిధర్మములఁ గ్రమంబున ననుష్ఠింతు నని మున్న చెప్పితింగదా. లోకమునం గొందఱు మహాకులీనులయ్యు గుణవంతులయ్యు ఘోరకర్మములఁ జేయుదురు. చేసియు లజ్జింపరు. శత్రుమిత్రులు సమీచీనపథప్రవృత్తులయ్యు నొండొరులఁ జక్కచూడరు. బంధువులు నొండొరులకలిమి కసూయపడుదురు. కొందఱు పండితమ్మన్యులై గురువుల నిందింతురు. ఇట్లు విపర్యాసంబు గానంబడుచుండు. లెస్సగఁ బరిశీలించి దుర్గుణంబులపొంతఁ బోక కుల ధర్మంబు నడుపవలయు. ధర్మాధర్మవివేచనంబు దురూహంబు. అది శ్రుతిప్రమాణంబువలనను వృద్ధాచారంబువలనను లెస్సగ నెఱుంగవలయు. సత్య ముత్తమం బనృతంబు పాపం బని యెల్లరకుం దెల్లంబుగదా. అందును విశేషంబు గలదు. ప్రాణాపాయమునను వివాహవిషయమునను బల్కినయసత్యంబు సత్యతుల్యంబు. ఇం తేల? భూతహితంబు కొఱకుఁ బలుకుబొంకు సత్యంబ. భూతద్రోహంబుగాఁ బలికినసత్యంబు నసత్యంబ. ధర్మసూక్ష్మం బిట్లు బహుప్రకారంబుల బ్రవర్తించు. పురుషుండు పూర్వకర్మానుగుణంబుగ నవశ్యంబు శుభాశుభఫలంబులఁ బడయు నింతియకాని కేవలపౌరుషంబున దేనిం బడయనేరఁడు. అది తెలియక కొందఱు శుభఫలంబు లెల్లఁ దమయత్నంబున నొడఁగూడె ననిభావించుచు నాపదలు పొసఁగిన దైవమును నిందింతురు. విచారింప నది యెంతయు ననుపపన్నంబు. ప్రజ్ఞాపౌరుషంబులనె సర్వంబు సమకూఱునేని తమకోరిక లెల్ల సఫలంబులుగాఁ జేసికొనరాదో? చావుపుట్టుకలం బాసి సుఖముండరాదో? నీతిమంతులు నిపుణులు నగుసుకృతాచారులు కొందఱు నిష్ఫలారంభు లగుదురు. ఎల్లకాలము వంచనమై భూతద్రోహమే చేయుపాపాత్ములు కొందఱు సుఖముండుదురు. ఏప్రయత్నంబునుం జేయక యూరకుండువారు కొందఱు సంపత్సమృద్ధు లగుదురు. సర్వప్రయత్నంబులను గొందఱు ఫలంబుఁ గానక వనటలపా లగుదురు. పుత్రార్థంబు తపస్సులను దేవపూజలనుం జేసియుఁ గొందఱు పుత్రులం గాంచనేరరు. కాంచియుఁ గొందఱు కులపాంసనులం గాంతురు. కొందఱు ప్రయత్నంబు లేకయే యుత్తమపుత్రులం బడయుదురు. లెస్సగ భుజింప నన్నము గలవారు కొందఱు వివిధవ్యాధిపీడితులయి ప్రాప్తం బయినదానిం భుజింపనేరరు. చికిత్సచేఁ గొందఱు రోగములం బాయుదురు. నిపుణవైద్యులు దివ్యౌ

షధంబుల నిచ్చి ప్రతీకారంబు చేసినం గొందఱు దీర్ఘరోగులయి యుమ్మలింపుచుందురు. కొంద ఱెన్నియేఁ బాట్లుపడి యింతయన్నంబు భుజింతురు. ఒకనక్షత్రమున నొకరాశిం జనించియుఁ బెక్కండ్రు భిన్నభిన్నఫలములం బడయుచున్నవారు. ఈవిపర్యాసం బంతయుఁ జూచిన మనుజులకు శుభాశుభఫలానుభవంబునం బ్రధానకారణంబు తొల్లింటికర్మంబ యనినిర్ణయింపవలసియుండు. నిత్యుండైన జీవుఁడు కర్మబంధనిబంధనంబునం బ్రాప్తంబు లయినయనిత్యశరీరంబులఁ జొచ్చుచు విడుచుచుఁ దత్తత్ఫలంబులం గుడుచుచు సంసారసాగరంబునం బరిభ్రమించు ననిన విని కౌశికుండు జీవునినిత్యంబుఁ దెలియఁ జెప్పు మనియడుగ ధర్మవ్యాధుఁ డతని కిట్లనియె.

## ధర్మవ్యాధుఁడు కౌశికునకు జీవలక్షణంబుఁ జెప్పుట.

జీవుఁడు నిత్యుఁడు. అతని కెన్నఁడును నాశము గల్గదు. శరీరనాశంబె మరణం బనంబడు. అది దెలియక మూఢులు జీవుఁడు మృతుఁడయ్యె నని వ్యవహరింతురు. అదియెల్ల మిథ్యావిలసితంబు. ప్రారబ్ధంబు భోగంబునందక్క నితరంబున నశింపమింజేసి యతండు తద్వశంబునఁ బుణ్యపాపయోనులం బొడముచుండు ననినఁ గౌశికుండు పుణ్యపాపజన్మసంబంధము జీవున కెట్లు గలుగు ననియడుగ ధర్మవ్యాధుఁ డయ్యా యిది గర్భాధానాదిశ్మశానాంతంబు చేయుకర్మంబుల వలనం గలుగు. సంక్షేపంబుగ నేతత్ప్రకారంబుఁ జెప్పెద విను మనియిట్లనియె. ఎల్లపుడు సత్కర్మంబులనె యాచరింపుచుండిన దేవత్వంబు గలుగు. సుకృతదుష్కృతంబులు సమంబులుగఁ జేసిన మనుష్యత్వం బగు. దుష్కృతంబులే యెల్లపుడుం జేయుచుండినఁ దిర్యగ్యోనిసంభవంబును నరకగమనంబునుం గలుగు. పూర్వదుష్కృతవశంబున దుర్జన్మంబుఁ గాంచియు నంత నిలువక రోగపీడితుం డైన యంతం డపథ్యమును భుజించుచందంబునఁ గ్రొత్తగ దుష్కృతంబులఁ జేసిన నెల్లకాలంబు దుఃఖంబులఁ గుందుచు నదియే సుఖం బనిభావించుచు జననమరణజరావ్యాధిబాహుళ్యంబున సుఖంబుఁ గాంచ నేరక సంసారసాగరంబున మునుంగుచుండు. పాపము లాచరించుచుండిన వాని కెన్నఁడు నంతము గలుగ దనినిశ్చయించి యాదుష్కృతంబుల పొంతఁ బోక యసూయాదిదుర్గుణదూరుండై స్వధర్మాచరణపరుండై న్యాయలబ్ధం బయినవిత్తమున బంధుమిత్రాదులకు సంతోషంబుఁ గావించుచు నాస్థమైఁ గామ్యకర్మము లొనరించినయతండు స్వర్గాదిపుణ్యలోకముల నధిగమించు. కామ్యకర్మాచరణంబునం గలుగుఫలము లనిత్యము లని జ్ఞానదృష్టి నెఱింగి నిశ్శ్రేయసంబే నిత్యం బనిభావించి ఫలములయెడ బ్రహ్మార్పణం బనుభావంబుతోఁ గర్మముల నాచరించుచు సంసారబంధములం బాసి వైరాగ్యఘనుండై మోక్షమూలం బైనయింద్రియనిగ్రహంబు గలిగి సత్త్వాదిగుణసమగ్రుం డయిన

యతండు బ్రహ్మలోకంబుఁ బ్రాపించు ననిన విని కౌశికుం డయ్యా, యింద్రియ ములన నెయ్యవి? వానివలనం గలుగుఫలం బెయ్యది? తన్నిగ్రహప్రకారం బెట్టిది? నిగ్రహంబునకు ఫలం బెయ్యది? తెలియఁ జెప్పు మనియడుగ ధర్మవ్యాధుఁ డిట్ల నియె. విషయజ్ఞానంబునం దొలుత మనస్సు ప్రవర్తించు. అది కామక్రోధవశం బయ్యె నేని పురుషుఁ డింద్రియవిషయంబులకుఁ జిక్కి. ఇంద్రియార్థవశుం డై నవాఁ డత్యంతరాగబద్ధుండై ద్వేషలోభమోహాభిభూతుండై ధర్మబుద్ధి మాని వ్యాజ మున ధర్మార్థముల సాధించుచు సుహృదులుం బండితులును వారించినను వినక పాపములఁ జింతించుచుఁ జేయుచు నదియ యుత్తమంబు శ్రుతిసమ్మతం బునని దురు క్తులం జెప్పుచుఁ దనమతంబ సాధింపఁ బూనుచుండును. ఇట్లు పాపములఁ జింతిం చుటయుఁ జేయుటయుఁ జెప్పుటయు ననురాగమూలంబు లయినత్రివిధాధర్మం బులం దగులువడిన వాఁడు గుణదూరుండై తనకుఁ దగినదుర్వృత్తులతోడం జెలిమి సేయుచు నుచితం బెఱుంగమింజేసి యుభయలోకంబులం జెడు. ప్రజ్ఞావంతుఁ డీ దోషములనెల్లఁ బరిశీలించి నేర్పున సుఖదుఃఖములతత్త్వ మెఱింగి సజ్జనుల సేవించి సాధుసాంగత్యనిర్మలం బయినబుద్ధింజేసి ధర్మ మార్జించి సుఖించు. మఱియు నీ వింద్రియస్వరూపంబుఁ, దజ్జయక్రమంబుఁ, దత్ఫలనిర్ణయంబును నన్నడిగితివిగదా. అది బ్రహ్మవిద్యావిషయంబు. మాబోంట్లకవాచ్యంబై యుండు. అయిన నీ వుత్త మబ్రాహ్మణుండవు. వివేకవంతుఁడు సర్వవిధంబులం బూజ్యు లయినబ్రాహ్మణులకుఁ బ్రియంబు సేయవలయు. కావునబ్రాహ్మణులకుఁ బ్రణమిల్లి తత్ప్రియం బైన బ్రహ్మవిద్యాప్రకారంబు సంక్షేపంబుగఁ జెప్పెద విను మని యతండు వెండియు నిట్లనియె.

ఈప్రపంచం బంతయు మహాభూతాత్మకంబు. మహాభూతంబులు బ్రహ్మ మయంబులే. ఆకాశము, వాయువు, తేజము, జలము, పృథివియు ననునైదును మహాభూతంబు లనంబడు. ఇవి యీచెప్పినక్రమంబునం బుట్టి ప్రతిలోమగతి లయంబుఁగాంచు. శబ్దస్పర్శరూపరసగంధంబు లనునైదును వీనిగుణంబులు. నిర్దిష్టక్రమంబున నుత్తరోత్తరంబు లయినభూతంబులకు శబ్దాదులం బూర్వాపూర్వం బులు గుణంబులయియుండు నెట్లనిన. ఆకాశంబునకు శబ్దమొక్కటియు, వాయు వునకు శబ్దస్పర్శంబు లనురెండును, తేజంబునకు శబ్దస్పర్శరూపంబు లనుమూఁడును, జలమునకు శబ్దస్పర్శరూపరసంబు లనునాల్గును, భూమికి శబ్దస్పర్శరూపరసగంధంబు లనునైదును గుణంబులై వర్తిల్లు. భూతంబు లన్నియు సమానంబులే. ఏతద్భూత కల్పితం బైనస్థూలశరీరంబు కర్మవశంబున జీవుఁడు దేహాంతరంబుఁ గొనునెడ నశించు. శ్రోత్రంబు, త్వక్కు, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణంబు నను నైదు నింద్రి యంబులు. క్రమంబున వీనికి శబ్దస్పర్శరూపరసగంధంబులు విషయంబులై యుండు.

ఇంద్రియపంచకంబునకు షష్ఠంబై మనస్సును, సప్తమాష్టమంబులై బుద్ధియు నహంకారంబును వర్తిల్లు. భూతంబు లైదు, గుణంబు లైదు, నింద్రియసమవాయం బొక్కటి, మనోబుద్ధ్యహంకారంబులు మూఁడు, సత్వరజస్తమోగుణంబులు మూఁడుం గూడినరాశి సప్తదశకం బనియు నవ్యక్తం బనియుం బరఁగు. పంచభూతంబులు, పంచతన్మాత్రలు, దశేంద్రియంబులు, త్రిగుణంబు, లంతఃకరణంబునుం గూడినరాశి చతుర్వింశకం బనంబడు. సమష్టివ్యష్టిభేదంబున నిట్లనేకప్రకారం బయినయిదియంతయు నవ్యక్తం బయినతత్త్వంబున నావిర్భావతిరోభావంబులం బొరయుచుండు. ఇంద్రియార్థసన్నికర్షజన్యజ్ఞానవిషయం బైనయది వ్యక్తంబు. ఇంద్రియగోచరంబుగాక యనుమానప్రమాణగమ్యం బయినతత్త్వం బవ్యక్తంబు. ఎల్లప్పుడును శబ్దాదివిషయంబులం గ్రహించుట యింద్రియంబులకు సహజధర్మంబు. ఇంద్రియవశుం డైనవాఁడు సంసారతాపంబులపాలగు. కావునఁ బ్రజ్ఞావంతుఁడు లోకంబునం గలసుఖదుఃఖములం బరికించి యింద్రియసుఖంబు పరిణామంబునఁ గ్లేశంబ యనినిశ్చయించి సద్గురుసేవాసమాసాదితజ్ఞానవైభవునుండై సర్వకారణకారణంబు, శాశ్వతంబు, నిరుపమానం, బనిర్వాచ్యంబు, రూపనామక్రియాదిశూన్యంబు నగుబ్రహ్మంబునకుఁ, గార్యాత్మకం బనిత్యంబు నగుచరాచరస్వరూపప్రపంచంబునకుం గలయంతరం బరసి సకలభూతంబులందు నాత్మస్వరూపంబు నిండియుండుటయుఁ, దనయందు నయ్యాత్మస్వరూపంబు సన్నిహితంబై యునికియు నెఱింగి క్లేశములనెల్లఁ బాసి సర్వావస్థలయందును సర్వదేశంబులందును సర్వభూతముల నద్వైతభావనం గనుంగొనుచు బ్రహ్మభూతుండై యానందించు. ఇంతకుం దపంబు మూలంబు. ఇంద్రియజయపూర్వకం బయినయోగంబ తపం బనం బరఁగు. ఇంద్రియంబులె జితంబులైన స్వర్గంబునకు, నజితంబు లయిన నరకంబులకుం గారణంబులు. పరికించిచూడ నింద్రియజయంబుకంటె నుత్తమమార్గంబు గన్పడదు. పాపంబులు ననర్థంబులును జితేంద్రియుం జేరరావు. పురుషునకు శరీరంబు రథంబు. బుద్ధి సారథి. ఇంద్రియంబు లశ్వంబులు. వీని ధైర్యంబనుపగ్గముల బిగియించి యుత్తమపురుషుండు సత్పథప్రవృత్తుండై నిపుణసారథిసారథ్యంబున నిచ్ఛాగతి సంతసించురథికునిచందంబున నుత్తమగతిం బడయు. ఇంద్రియంబులు పోవుత్రోవను మనస్సు ననుగమించునేని సముద్రోదకంబునందు మహావాయువశంబున నావ పగులునట్లు బుద్ధియు వికలం బగు. అట్టివాఁడుసుఖమెన్నఁడుం గాంచనేరఁడు. కావున నింద్రియఫలంబులందలిమోహంబుఁ బాసి తద్వశుండుగాక సమాధిధ్యాననిష్ఠుం డైనవాఁడు పరమసుఖంబుఁ బ్రాపించు నని ధర్మవ్యాధుఁడు సెప్పిన విని కౌశికుండు సత్వరజస్తమోగుణంబులతత్త్వంబుఁ దెలియఁ జెప్పు మనిన నతం డతని కిట్లనియె. తమోగుణంబు మోహాత్మకంబు, సత్వంబు

ప్రకాశబహుళంబు, రజోగుణం బుభయాత్మకంబై ప్రవర్తకంబై యుండు. అవిద్య, మోహము, జడత, యింద్రియవశత్వం, బాలస్యంబు, క్రోధంబు నను నివి తామసలక్షణంబులు. రాగము, లోభ, మనసూయ, జడత, మానంబు నను నివి రాజసలక్షణంబులు. జ్ఞానంబు, ధైర్యంబు, వైరాగ్యం, బనసూయ, యార్జవంబు, ప్రసన్నత, క్రోధరాహిత్యంబు, శాంతియు నను నివి సాత్త్వికలక్షణంబులు. సాత్త్వికుండు వేద్యతత్త్వం బెఱింగి లోకవృత్తంబుపై జుగుప్స గదుర నహంకారమమకారంబులం బాసి సుఖదుఃఖంబులు, లాభాలాభంబులు, ప్రియాప్రియంబులు లోనుగా నగుసర్వద్వంద్వంబు లెడలి సంశయవిరహితుండై శాశ్వతపదం బధిగమించు. శూద్రయోనిజాతుండేనియుసాత్త్వికుం డగునేని క్రమంబున వైశ్యక్షత్రియబ్రాహ్మణజన్మంబు లెత్తి యుత్తమపదంబుఁ బ్రాపించు ననిన విని కౌశికుండు ధర్మవ్యాధుం జూచి యయ్యా, పార్థివశరీరంబున నగ్ని యెట్లుండు. వాయువు లెట్లు వర్తించు. తేటపడఁ జెప్పవే యనియడుగఁ గౌశికునకు ధర్మవ్యాధుఁ డిట్లనియె.

## ధర్మవ్యాధుఁడు కౌశికునకు శారీరలక్షణంబుఁ జెప్పుట.

శారీరాగ్ని నాభిస్థానంబు నెలవుగాఁ గొని వాయువులతోడఁ గలిసి మూర్ధపర్యంతంబు శరీరం బంతయు వ్యాపించియుండు. ప్రాణవాయువు మూర్ధస్థానంబున నగ్నికుండం బయిననాభినిం బర్వుచుండు. సర్వంబు ప్రాణంబున సుప్రతిష్ఠితంబు. ప్రాణంబ సర్వభూతాత్మకం బుపాసితవ్యంబు శారీరాగ్నిపరిపాలకంబు. అపానంబు వస్తిమూలగుదంబులు నెలవులుఁగాఁ గొని యగ్ని నాశ్రయించి మూత్రపురీషరేతోవిసర్జనంబునకుఁ గారణంబై యుండు. వ్యానంబు శరీరంబునం గలసకలసంధుల నాశ్రయించియుండు. ఉదానంబు కంఠదేశస్థితంబై సంభాషణభారవహనాదిసర్వకర్మకారణంబై యుండు. సమానంబు ప్రాణాపానాగ్నుల నాశ్రయించి నాభిస్థితంబై యన్నంబు నఱిగించు. ఎట్లంటేని. ప్రాణవాయువు భుక్తం బయినయన్నంబును నాభికిమీఁద నున్నయామకోశంబుఁ జేర్చునంతటఁ దక్కంగలవాయువులు యాగపద్యంబున నచ్చోటుఁ జేరుటయుఁ బంచవాయుసంఘర్షంబున శారీరాగ్ని ప్రజ్వలితంబై సమానవాయుసహకారంబున నన్నంబు పచనంబుఁ గావించు. అన్నంబుపక్వం బగుడు నపానంబు నాభికిఁ గ్రిందుగ నుండుపక్వాశయంబునం గిట్టంబుఁ జేర్చి యధోద్వారంబులఁ దద్విసర్జనంబుఁ గావించు. శరీరంబునం బ్రధానంబులైన దశనాడులు ప్రాణవాయుప్రేరితంబులై యయ్యన్నరసంబు నాకర్షించి తిర్యగూర్ధ్వాధోభాగంబులం బర్వినఁ దక్కంగలనాడులు నుచితక్రమంబునం జరించి ధాతుపోషణంబు నొనరించు. ఇది పరమయోగులవలన నెఱిఁగినమార్గంబు. శారీరలక్షణం బంతయుం దెలిసి యోగులు యోగంబు సాధించి ద్వంద్వదుఃఖముల కలజడివడక ధీరులై వాయువుల వశీకరించికొని మూర్ధస్థానంబున నాత్మం జేర్చి

యాత్మను బరమాత్మలోనం జేర్చి కైవల్యమును లగుదురు. కాలచేష్టావశంబై యేకాదశేంద్రియాత్మకం బయినశరీరంబునందుఁ బాత్రమునందుఁబోలె నిత్యసన్నిహితుం డై నయయ్యగ్నియే జీవాత్ముండు. కమలపత్రంబున సంసక్తంబయ్యు జలబిందు వట్లుకాని తెఱంగున నతండు శరీరమున సంసక్తుఁడయ్యు నిర్లేపస్వరూపుండై యుండు. భూమి బీజముల కంకురత్వజననంబుఁ గావించుచందంబున శరీరం బనాదిపుణ్యపాపకర్మంబులకుఁ బ్రకాశంబుఁ గావించుటంజేసి క్షేత్రం బనంబడు. దాని నెఱింగి నిర్లేపుఁడై యుండుఁ గావున జీవుఁడు క్షేత్రజ్ఞుఁడు నాఁబడు. ఆజీవాత్ముఁడే నిజలీలావినోదార్థంబు సకలభువనంబులఁ బ్రవర్తింపఁ జేయుపరమాత్ముఁడు. ఇంతయు నుత్తమజ్ఞాననిష్ఠు లయినపెద్ద లద్వైతభావనం గనుఁగొందురు. తత్త్వస్వరూపం బిట్లు ప్రస్ఫుటంబయ్యు దురూహంబై యుండు కావున నుత్తమపదంబుఁ బ్రాపింపఁ గోరువానికిఁ గర్తవ్యంబుఁ జెప్పెద వినుము. క్రోధములఁ బాసి, మానావమానంబు లెడలి, గర్వంబు విడిచి, చిత్తముఁ బ్రసన్నంబుఁ గావించికొని, యుచితలఘుభోజనుండై పూర్వరాత్రంబున నపరాత్రంబునను సమాధియోగంబునంజేసి జ్ఞానదీపంబున నాత్మతత్త్వం బాత్మయం దనుసంధానంబుఁ జేయుట లగ్గు. అదియే పరమసుఖంబు. ప్రసన్నచిత్తుండు వాయురహితస్థలంబున దీపంబు తేజరిల్లుచందంబున గాఢసుషుప్తిసమయసౌఖ్యసదృశం బయినయుత్తమానందంబుఁ గాంచుచు నిర్వాణపదవిం బ్రాపించు. ఫలాపేక్ష విడిచి కర్మములఁ జేయుచుండినం దనంతన చిత్తంబు ప్రసన్నం బగు. ఆనృశంస్యంబె పరమధర్మంబు, శాంతియే పరమబలం, బాత్మజ్ఞానంబె పరమజ్ఞానంబు, సత్యవచనంబే పరమవ్రతంబు, భూతహితంబె సత్యం బనునిర్ణయంబునఁ గ్రోధంబువలనఁ దపంబును, మత్సరంబువలన ధర్మంబును, మానావమానంబులవలన విద్యను రక్షించుకొనుచు నాత్మప్రసాదంబు వడసి గురునకైన నిర్దేశించి చెప్పనలవిగానివియోగరూపం బయినయుత్తమబ్రహ్మయోగంబు నెఱుంగవలయు. సర్వభూతంబులయెడ నద్రోహచింతనంబు స్నేహభావనంబు నింతకు నిదానంబులు. అకించనత్వంబె పరమసంతోషంబు. నిరాశత్వంబ యచాపలంబు ఇదియ యుత్తమవిజ్ఞానంబు. సంగవర్జనం బన్నింటికిని మూలంబు. నిస్సంగుఁడు సుఖదుఃఖవిరహితం బయినబ్రహ్మతత్త్వం బనుసంధించు. బ్రాహ్మణోత్తమా, నీవడుగ బ్రహ్మవిద్యాప్రకారంబు సంక్షేపంబుగఁ జెప్పితి నింక నెయ్యది వినవలతు వనిన విని కౌశికుండు సుప్రీతుండై ధర్మవ్యాధుంజూచి యయ్యా, నీవిమలజ్ఞానం బింతయొప్పునే? నిను సామాన్యమనుజుం డనరాదు. మఱి మహర్షి వనియ నామతంబు. నీకుం దెలియనిది యొక్కటేనియుఁ గలుగనేర్చునేయని ప్రస్తుతించె.

### ధర్మవ్యాధుఁడు కౌశికునిఁ దనతల్లిదండ్రులయొద్దకుఁ దోడ్కొని పోవుట.

పదంపడి ధర్మవ్యాధుఁడు కౌశికుం జూచి బ్రాహ్మణోత్తమా, నాకిట్టిసిద్ధి గలుగ ముఖ్యకారణం బయినధర్మం బొక్కటి గలదు. దాని నీకుఁ బ్రత్యక్షంబుఁ గావించెద. మాగృహాభ్యంతరంబునకు వచ్చి నాతల్లిదండ్రులం గాంచు మనిచెప్పి యాకౌశికుం దోడ్కొని చతుశ్శాలంబు, మనోరమంబు, దేవతాగృహంబుచందంబున నత్యంతపూజితంబు, దివ్యగంధమాల్యతోరణాలంకృతంబు, నుత్తమశయనాసనాదిసాంద్రంబు నగుదివ్యసౌధంబునకుఁ జని యుత్తమాసనంబున సుఖాసీనులయినవారల, నిర్మలాంబరధారులఁ, గృతాహారుల, సుసంతుష్టులఁ దనతల్లిదండ్రులం జూపి తాను భక్తిమై వారియడుగులకుఁ బ్రణామంబు లొనరించిన వారతని కిట్లనిరి. పుత్రా, లేలెమ్ము. ధర్మజ్ఞుఁ డయిననిన్ను నీధర్మంబు రక్షించు. దీర్ఘాయుష్మంతుండవు గమ్ము. నీజ్ఞానంబునకు శౌచాచారాదిసద్గుణంబులకును మెచ్చితిమి. సత్పుత్రుఁడయిననీవలన నస్మత్పితృపితామహాదు లెల్లఁ దనిసిరి. మనోవాక్కాయకర్మంబుల దేనినైన మాయెడ శుశ్రూషకుఁ గొఱఁత గానఁ బడదు. పితృశుశ్రూషయందుఁ బరశురాముఁడుదక్క లాఁతివా రెవ్వరును నీకు సమానులు గారు. చక్కఁగఁ జూచిన నతనికంటె నీవే విశిష్టుఁడ వనియుం దోఁచెడి నని పలికిరి. అతండును లేచి వినయవినమ్రుఁడై తనతల్లిదండ్రులకుఁ గౌశికుం జూపి యీ మహాత్ముఁడు మనభాగ్యంబున నిచ్చటికి విచ్చేసె నని చెప్పిన వారును నాబ్రాహ్మణోత్తమున కుత్తమవిధిఁ బూజలు గావించిన నతండు తదీయపూజలంగైకొని సంతుష్టుండై వారల ననామయం బడిగి తెలిసికొని తదీయప్రశ్నంబున కుత్తరంబుగఁ దనకుశలంబు వారి కెఱింగించియుండునంత ధర్మవ్యాధుఁడు కౌశికున కిట్లనియె. వీరలు నాతల్లిదండ్రులు, వీరలే నాపాలిటిదైవతం, బింద్రాది నిర్జరు, లగ్నులు, యజ్ఞములు, వేదంబులు ననుభావంబున దేవోపచారంబుల వీరి నర్చింతు. మదీయపుత్రమిత్రకళత్రజనంబులు ప్రాణంబులు నేతత్పరిచర్యార్థంబ యనిభావింతు. ప్రతిదినంబును నేన వీరికిఁ బాదంబులఁ గడుగుదు. స్నానముఁ జేయింతు. భక్ష్యభోజ్యాదివివిధపదార్థంబుల నాహారంబుఁ బెట్టుదు. ప్రియవచనములఁ జెప్పుదు. వీరికిఁ బ్రియంబుగానిపని దెసం బోవను. వీరి కభిమతం బగునదియ నాకుఁ బరమధర్మం బనిభావించి ధర్మవిరుద్ధంబైనను దత్ప్రియంబగునేని యవశ్యంబు సేయుదు. తల్లి, తండ్రి, యగ్ని, యాత్మ, గురుఁడు నను నేవురు పురుషునకుఁ బరమపూజ్యులు. వీరల భక్తిమైఁ బూజించినగృహస్థుఁడు సర్వవ్రతంబులఁ జేసినవాఁడే. తల్లిదండ్రులఁ బూజించుటకతంబుననే నాకీసిద్ధి గలిగె. పతిశుశ్రూషాపరాయణ యగునాపతివ్రత మిథిలకుఁ జని నావలన ధర్మం బెఱుంగు మనిచెప్పుటంగాదె నీ విటకు వచ్చితివి. తత్ప్రియార్థంబుగ నీ కింత చెప్పితి. వెండియు

నొకహితంబుఁ జెప్పెద వినుము. వేదాధ్యయనాసక్తుండవై నీవు తల్లిదండ్రులకు శుశ్రూషఁ జేయవైతివి. వారియనుజ్ఞఁ బొందకయే యిల్లు వెడలివచ్చితివి. నీవే దిక్కని భావించి యున్నయాముదుసళ్లు నీవలనిశోకమున నంధులై యున్నవారు. ఈపని యెంతయు నొప్పదు మాతాపితృశుశ్రూష విడుచుటం జేసి నీతపస్స్వాధ్యాయాదినియమంబులు నిష్ఫలంబులే. వేగంబ యింటికిఁ జని నామాటపై శ్రద్ధ గలిగి యావృద్ధులచిత్తంబు ప్రసన్నంబుగాఁగఁ బరిచర్యలఁ జేయుము. ఇదియె యుత్తమశ్రేయోమార్గం బనిబోధించిన విని కౌశికుండు ధర్మవ్యాధున కిట్లనియె. ధార్మికవరేణ్యా, నీబోధించిన దంతయు సత్యంబ. భవదీయధర్మాచారాముల కెంతయు సంతసించితి. నీదివ్యబోధనంబునం దెలిసితి. ఇంటికిఁ జని వృద్ధులయియున్న తల్లిదండ్రులకు భక్తిమైఁ బరిచర్యఁ గావించెద. నాభాగ్యవశంబున నీతోడిసమాగమంబు గలిగె. నీయట్టిధర్మజ్ఞులు లోకమున దుర్లభులు. ఒకవేళ నుండిరేనియు వేవుర నొక్కఁ డుండు. అదియు నంతగ నిశ్చితంబు గాదు. స్వర్గభ్రష్టుఁ డైన యయాతిని సాధుచిత్తులై నదౌహిత్రులుంబోలె గురుశుశ్రూషాపరాఙ్ముఖత్వపాతకంబునం జేసి నరకంబునం బడనున్నన న్నుద్ధరించితివి. నీధర్మవిజ్ఞానంబుఁ బరికించి చూడ నెంతయు నబ్బురం బయ్యెడి. ఊహించియుం దెలియరానిధర్మసూక్ష్మంబు నెల్ల శూద్రయోనిజాతుం డైననీ వెఱింగియుండెదవు. ఇంతయు నాలోచింప నిన్ను సాధారణశూద్రుంగాఁ దలంపరాదు. ఏనిమిత్తంబున నీహీనజన్మంబుఁ గాంచితివో? ధర్మతత్త్వంబు నెట్లెఱింగితివో? అంతయు నా కెఱింగింపు మనిన ధర్మవ్యాధుఁ డయ్యా, బ్రాహ్మణానుశాసనం బనతిక్రమణీయంబు గావున నావృత్తాంతంబుఁ జెప్పెద విను మని కౌశికున కిట్లనియె.

ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ దనపూర్వజన్మవృత్తాంతముఁ జెప్పుట.

పూర్వజన్మంబున నే నొకయుత్తమబ్రాహ్మణునకుఁ గుమారుండనై వేదవేదాంగముల నేర్చియుంటిని. అపు డొకరాజు ధనుర్విద్యాపారగుండు నాకు నెచ్చెలి యయ్యె. వానిసహవాసంబున నేనును విలువిద్య నేర్చి ప్రవీణుండనై యుంటి. అంత నొక్కనాఁ డారాజు మంత్రియోధపరివారంబుతోడ వేటపోయిన నేనుం గూడఁ బోయి పెక్కుమృగంబుల వధించి యొక్కమునిం గాంచి మృగంబని బుద్ధిం జేసి బాణం బరివ్రాసి యేసిన నతండు తీవ్రబాణప్రహారంబునఁ గ్రిందఁ బడియె. అంత నేనుం దెలిసి యకార్యకరణంబునకు వ్యథితచిత్తుండనై నేలం బడి పొరలుచున్నయ త్తపస్విని డాయం జని మునీంద్రా, తెలియక తప్పు చేసితి. సైరింపు మనిపలికిన నతండు కటకటంబడి నన్నుఁ జూచి యోరీ! దయమాలి నీ విట్లు చేసితివి గావున వ్యాధుండవై పుట్టుదు వనిశపించె. ఆశాపంబునకుఁ దలఁకి నేను మునివరేణ్యా, క్షమచేసి రక్షింపవే యని యెలుం గేర్పడఁ బ్రార్థించిన నమ్మునినాథుండు నన్ను

దయార్ద్రదృష్టిం జూచి నాశాపంబు దప్పనేరదు. బుద్ధిపూర్వకంబుగ నెగ్గుఁ జేయమిం జేసి నీయెడ ననుగ్రహంబుఁ గావించెద. శూద్రయోనిం జనించియు నీవు ధర్మజ్ఞుండవై భక్తిమైఁ దల్లిదండ్రులకు శుశ్రూషఁ గావించి తన్మహిమంబునఁ బరమసిద్ధి వడయుదువు. అపుడు నీకు నాయనుగ్రహంబునఁ బూర్వజన్మస్మరణంబు గల్గెడి. వ్యాధుఁడవై కొంతకాలం బుండి పదంపడి బ్రాహ్మణజన్మం బెత్తి యుత్తమపదవిం బొందెద వని వక్కాణించె. నేనును విధికృతంబునకు వగవం బని లేదని నిశ్చయించి యామునిమేన నాటియున్నతూపును మెల్లన నపనయించి యతని నాశ్రమంబుఁ జేర్చితి. నాభాగ్యవశమున నతఁడు ప్రాణవియోగంబుఁ బొందఁడయ్యె. అమ్మునిశాపంబున నా కీజన్మ మెత్తవలసె. ఈదేహంబువాసిన బ్రాహ్మణుండనై సద్గతిం గాంతు నిది మదీయపూర్వవృత్తాంతం బనిచెప్పినం గౌశికుండు ధర్మవ్యాధుం జూచి యయ్యా, పురుషు లీతెఱంగున సుఖదుఃఖముల ననుభవింతురు. అందుఁ జింత సేయఁ దగదు. నీకుఁ జెప్ప నేల? లోకవృత్తాంతమును ధర్మతత్త్వమునుం దెలిసి యొరుల కెవ్వరికిం జేయరానిధర్మంబుఁ జేసెదవు. కొంతకాలం బిట్లు గడపి పదంపడి బ్రాహ్మణుండ వగుదువు. సత్యక్షమాదిగుణంబులు గలుగుటం జేసి నీ విప్పుడే బ్రాహ్మణుండ వని నామతంబు. బ్రాహ్మణకులజాతుండై నను దాంభికుండై పాపనిమిత్తంబు లగుదుష్కృతంబులు చేయుచుండిన శూద్రసముఁ డనియు సత్యాదిసద్గుణంబులు గలశూద్రుఁడుం బ్రాహ్మణసముఁ డనియుం బెద్దలు చెప్పుదురు. కర్మదోషంబుననే యందఱు దుర్గతిం బొందుదురు. నీకో దుష్కర్మంబు లెల్ల క్షయం బయ్యె. కర్మదోషమున నిట్టులైతిఁగా యని వగవవలవ దనిన విని కౌశికునకు వ్యాధుఁ డిట్లనియె. ఇష్టసంయోగానిష్టవియోగంబులవలన మానసదుఃఖంబులు, శరీరప్రతికూలాచరణంబులవలన శారీరదుఃఖంబులుం బొడము. ప్రజ్ఞచే మానసదుఃఖంబుల, నౌషధంబులచే శారీరదుఃఖంబులను నిరసించికొనవలయు. ఇదియే జ్ఞానులసామర్థ్యంబు. అల్పబుద్ధులు ప్రతీకారం బెఱుంగక మనోదుఃఖములపాలగుదురు. పూర్వకృతంబునఁ గలిగినయిష్టవియోగానిష్టసంయోగంబులకు వగచినం బరితాపంబుదక్క వేఱొక్కప్రయోజనంబు లేమిం దెలిసి జ్ఞానవంతులు విరక్తులగుదురు. సుఖదుఃఖంబులకు మోదఖేదంబులఁ బొరయనివారే జ్ఞానవంతులు సుఖులు సంతోషులు పండితులు. అసంతోషులే మూఢులు. అసంతోషంబున కెన్నఁడు నంతము గలుగ దనిభావించి గతంబునకు శోకింపక నిత్యసంతోషంబునం బొదలువారే పండితులు. విషాదంబునకు మనమున నెన్నఁడు నెడ మియ్యరాదు. విషాదంబే విషంబు. అది క్రుద్ధం బయిపాముమాడ్కి వివేకవికలునకుఁ గీడుఁ దెచ్చు. విషాదమునఁ గర్తవ్యచింత మాసి తేజోహీనుండై నవానికిఁ బురుషార్థంబు గలుగనేరదు. కావున గతంబునకు వగవక దుఃఖశాంత్యుపాయంబుఁ జేసి

కొనుట లగ్గు. జగం బనిత్యం బనిభావించి పరతత్త్వం బనుసంధించు కృతప్రజ్ఞులు శోకం బెడలి పరమగతిం గాంతురు. ఇదియంతయును మనంబున నరసి నేను శోకంబు మాని కాలంబుఁ బ్రతీక్షింపుచున్నవాఁడ ననిచెప్పినఁ గౌశికుండు ధర్మవ్యాధుం జూచి యయ్యా, నీయట్టివానికిని శోకంబు గలుగునే? నీవు కృతప్రజ్ఞుఁడవు ధర్మవిదుఁడవు జ్ఞానతృప్తుఁడవు. నీకుఁ దెలిసియున్నం జెప్పెద. ధర్మంబు నెడ నేమఱుపాటు వలదు. నీధర్మంబు నిన్ను రక్షించు. నీకు లగ్గయ్యెడు మని దీవించి యేఁ బోయివత్తు ననుజ్ఞ సేయు మనిన నాధర్మవ్యాధుఁడు ముకుళితకరకమలుండై వల్లెయనుటయు నతనికిఁ బ్రదక్షిణంబుఁ జేసి తఱలి కౌశికుండు నిజగృహంబు సేరి న్యాయయుక్తంబుగాఁ దల్లిదండ్రులకు శుశ్రూషఁ గావించి కృతార్థుం డయ్యె.

ధర్మనందనా, నీయడిగినవిధంబునఁ బతివ్రతామాహాత్మ్యంబును, మాతాపితృశుశ్రూషాక్రమంబును, హీనయోనిజాతుండు ధర్మంబు సలుపునుపాయంబునుం జెప్పితి నని మార్కండేయుండు వివరించిన విని ధర్మరాజు మునీంద్రా, యత్యద్భుతంబు ధర్మోపేతంబు నగునీయుపాఖ్యానంబు వినుటంజేసి యీసమయంబెల్ల నెక్కమహూర్తంబకాఁ గడచె. నీవు ధర్మముల వినిపింపుచుండిన నింకను వినవలయు ననుకోరిక గలుగుఁగాని తనివి గలుగదు. అగ్ని వనంబునకుఁ జనఁగ నంగిరసుండు హవ్యముల మోచె ననివిందు. అందుకుఁ గారణంబెయ్యది? మఱియు నగ్ని యొక్కఁడయ్యుండఁ గర్మముల నతనికి బహుత్వంబు దృష్టంబయియుండెడి. అందుకుం గతం బెయ్యదియో? వెండియుఁ గుమారస్వామి యగ్నితనయుండనియు, రుద్రపుత్రుండనియు, గంగాసూనుండనియుఁ, గృత్తికాసుతుం డనియు వ్యవహారంబు గలదు. అందులకుం గారణం బెయ్యదియో? అంతయుం దేటపడ నెఱింగింపవే యనియడుగ మార్కండేయుండు ధర్మరాజున కిట్లనియె.

## మార్కండేయుఁడు ధర్మరాజున కంగిరసుఁ డగ్నియైనవిధముఁ జెప్పుట.

ధర్మనందనా, పురాతనేతిహాసంబు వినుము. తొల్లి యగ్నిదేవుఁడు దేవతలవలనిక్రోధంబున నలిగి వనంబునకుఁ జని తపస్సు చేయుచుండె. అపుడు లోకకార్యంబులు నెఱవేఱఁగ బ్రహ్మదేవుఁడు తీవ్రతపోమహిమంబున నగ్నిపోలె లోకములనెల్ల వెలింగించుచున్నతనపుత్రు నంగిరసు నగ్నిపదమున నియమించె. అటఁ దపంబు సేయుచుండినయగ్నిదేవుఁ డంగిరసునితేజోమహిమంబు నెఱింగి చింతాక్రాంతుఁడై యక్కటా! నే నలిగివచ్చిన బ్రహ్మ నాపదమున వేఱొక్కని నియమించె. నాయగ్నిత్వంబు లోకమున వినష్టం బగు. కావున నే నిట నుండఁ జనదు. తొల్లింటిపదమునకుఁ బోయెద ననియూహించి యగ్నియై ముల్లోకముల వెలింగించుచు హుతముల వహించుచున్నయంగిరసునొద్ద కరిగి యమ్మునిం గనుంగొని

త త్తేజంబునకు వెఱఁగంది మగిడి పోవుచుండె. అపుడంగిరసుఁ డగ్నిదేవు డాయం జని దేవా, త్రైలోక్యంబున సుప్రసిద్ధుఁడ వై ననీవే యీయగ్నిత్వంబుఁ బూనుము. నీవు లేకున్నఁ గొన్నినాళులు బ్రహ్మదేవుఁడు న న్నీపదంబున నియమించె. నీవు స్వస్థానంబు గ్రహింపకునికి నాకుఁజూడఁ బోల దనిన నగ్ని యంగిరసున కిట్లనియె. అయ్యా, నాకీర్తి లోకమున నడఁగె. అందఱు నిన్నే యగ్నిఁగాఁ దలంతురు. కావున నా కీక నాపదంబుఁ బ్రాపింపఁ దగదు. నేను నగ్నిత్వంబుఁ బూనఁగ నీ కంతతాత్పర్యంబు గలదేని ద్వితీయం బై నప్రాజాపత్యాగ్నిగా నుండెద ననిచెప్పిన నంగిరసుండు వెండియు నగ్ని దేవు నుద్దేశించి మహాత్మా, యిట్లు పలుకవలదు. నీవే ప్రథమాగ్నివై నన్నుం బుత్రుఁగా నాదరించి ద్వితీయం బై నప్రాజాపత్యాగ్ని పదంబున నిల్పుమని విన్నవించిన నగ్నిహోత్రుఁ డట్లయని తాను బ్రథమా గ్నియై యంగిరసుం బ్రాజాపత్యాగ్నిపదంబున నియమించె. అంగిరసునిప్రథమ పుత్రుఁ డగుబృహస్పతి తృతీయాగ్ని యయ్యె. అమరు లందులకుం గారణంబు బ్రహ్మ నడిగి తెలుసుకొని యందుల కియ్యకొనిరి.

అగ్నులనానావిధత్వంబుఁ జెప్పెద వినుము. అంగిరసునకు శివ యనుభార్య యందు బృహస్పతి, బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనసుఁడు, బృహన్మంత్రుఁడు, బృహద్భానుఁడు ననువా రేడ్గురుకొడుకులు ననుమతి, రాక, సినీవాలి, యర్చిష్మతి, హవిష్మతి, మహామతి, కుహువు ననువా రేడ్గురుకూఁ తులుం బుట్టిరి. అందు బృహస్పతికిఁ జాంద్రమసి యనుభార్యయందు శంయుఁడు, విశ్వజితుఁడు, విశ్వభుజుఁ, డూర్ధ్వభాక్కు, స్విష్టకృత్తు, మన్యువు ననువా రాఱు గురుకొడుకులు నొకకూఁతురుం బుట్టిరి. అందు శంయుఁడు చాతుర్మాస్యంబులందు నశ్వమేధంబునందు నాజ్యభాగంబుతోడఁ బ్రథమహవిర్భాగంబుఁ గొనుచుఁ బ్రసి ద్ధుఁ డయ్యె. ఆశంయునకు ధర్మపుత్రి యైనసత్యయనుపేరిటిభార్యయందు భరద్వా జుండు భరతుండు ననునిద్దఱుకొడుకులు పుట్టిరి. అందు భరద్వాజుండు పౌర్ణమాస యాగంబులందు సుగ్రుద్యతంబు లయినహవిర్భాగంబులం గ్రహించుచు విశ్రుతుం డయ్యె. వానికి వీర యనుదానియందు వీరుం డనుకొడుకు పుట్టె రథప్రభువు, రథాధ్వ, కుంభరేతసుఁడు ననుపేరులం బరఁగి సోమముతోడ నాజ్యభాగము గ్రహించుచుఁ బ్రసిద్ధుఁ డయ్యె. వానికి సరయు వనుదానియం దధికతేజోవిలసితుం డై నభానుఁ డనువాఁడు జనించి యాగ్నేయహవిర్భాగమునం దాహ్వనపాత్రుఁ డయ్యె. వానికి శ్రీతేజోయశంబుల కెన్నఁడుం జ్యుతిఁ బొరయనినిశ్చ్యవనుం డనువాఁ డుద్భవిల్లె. వానికి సర్వపాపహరుం డై ననిష్కృతి యనువాఁడు పుట్టి సకలభూతములపాప ముల నిరసించుచుండె. వానికి రుజస్కరుఁ డనుకొడుకు జనించి శరణత్రాణత త్పరుఁ డగుటం జేసి వ్యథితచిత్తు లయినజనులసంతతప్రార్థనాదీనస్వనంబులకు విష

యుండై స్వనుం డనఁ బ్రసిద్ధుఁ డయ్యె. శంయుని రెండవకొడు కయినభరతునకు భారతుఁ డనుకుమారుఁడును భారతి యనుకూఁతురుం బుట్టిరి. బృహస్పతిద్వితీయ పుత్త్రుఁ డైనవిశ్వజితుఁడు సకలభూతములను నిజబుద్ధి నాక్రమించి యాపేరునం బరఁగె. తదనుజుఁడు సర్వప్రాణులయాహారం బఱిగించుటంజేసి విశ్వభుజుం డనం బడి నియమవ్రతు లయినవిప్రులకెల్లఁ బూజనీయుఁ డయ్యె. వానికి గోమతి యను నది భార్యయయ్యె. దానంజేసి తత్తీరంబున సలుపుకార్యంబులు ఫలవంతము లగు. వానితమ్ముఁ డూర్ధ్వముఖుండై సముద్రజలములఁ ద్రావుటంజేసి యూర్ధ్వభాక్కనం బరఁగె. ఆతండే బడబాగ్ని. వానితమ్ముఁడు ప్రతిదినంబును యజమాను లుదగ్ద్వారంబునం జేయుహవిర్దానంబు గ్రహించి దాని స్విష్టంబుఁ గావించుటంజేసి స్విష్టకృత్తు నాఁబడియె. వానితమ్ముఁడు సర్వభూతములు ప్రశాంతము లయినపిదపఁ గ్రోధమయుండై వ్రేడముటంజేసి మన్యుఁడు నాఁ బరఁగె. వానికి స్వాహ యను కూఁతురు కాముఁ డనుకుమారుఁడుం బుట్టిరి. ఆకుమారుఁడు రూపమున నఖిల దేవతలకంటె నధికుఁడగుటంజేసి యాపేరు వడసె. వానికి శత్రునాశకుఁ డయిన మోఘుఁ డనువాఁడు, నుక్థత్రయస్తోత్రపాత్రుం డైనయుక్థుఁ డనువాఁడుం బుట్టిరి. వానికి మహావాక్కనువాఁడు కుమారుఁ డయ్యె. మఱియుఁ గాశ్యపుఁడు, వాసిష్ఠుండు, ప్రాణుఁ, డాంగిరసుఁడు, చ్యవనుఁడు ననువా రేవురు బ్రహ్మ కెనవచ్చు కుమారుం బడయుదు మని యనేకవర్షంబులు మహావ్యాహృతిస్మరణంబుఁ జేయుచు నుగ్రతపంబు సేయుటయు నగ్నివర్ణ మగుశిరస్సు, సూర్యసన్నిభంబు లగుబాహువులు, సువర్ణవర్ణంబు లగుత్వఙ్నేత్రంబులు, నల్లనిజంఘలు, లోకోత్తరం బయినదివ్యకాంతియుం గలిగి యొక్కకుమారుండు పుట్టె. పంచవర్ణుం డైన యాకుమారుఁ డేవురుజనులకుఁ బుత్త్రుఁడై పాంచజన్యుఁ డనం బరఁగి పదివేలయేఁడులు తపస్సు చేసి శిరస్సున బృహద్రథంతరంబులను, వక్త్రమున హరిని, నాభి యందు శివుని, బలమున నింద్రునిఁ, బ్రాణమున వాయ్వగ్నులను, బాహుయుగంబున సకలభూతంబులను సృజించె. వెండియు బృహద్రథునకుఁ బ్రణిధి, కశ్యపునకు మహత్తరుఁ, డాంగిరసునకు భానుఁడు, చ్యవనునకు సౌభరుండు, ప్రాణున కుదాత్తుఁడుం బుట్టిరి. వారిపరంపరవార లిరువదియేగు రైరి. మఱియుఁ దపుఁ డనువాఁడు పదునేగురు కొడుకులం బడసె. ఆపదునేగురుం గ్రమంబున సుభీముఁ, డతిభీముఁడు, భీముఁడు, భీమబలుఁ, డతిబలుఁడు ననువా రేవు రొకమొగియును, సుమిత్రుఁడు, మిత్రవంతుఁడు, మిత్రజ్ఞుఁడు, మిత్రవర్ధనుఁడు, మిత్రధర్మయు ననువా రేగు రొక్కమొగియును, సురప్రవీరుఁడు, వీరుఁడు, సువేషుఁడు, సురవర్చసుఁడు, సురహంతయు ననువా రైదుగు రొక్కమొగియునుగా నిట్లు మూఁడుమొత్తంబులై యగ్నులలో నన్యోన్యకలహంబు నిమిత్తంబుగ యజమా

నులయజ్ఞములకు విఘ్నములఁ జేయుచుఁ దత్ఫలము లపహరింతురు. తత్ప్రశాంత్యర్థముగా యాగములం దగ్నిచయనంబుఁ జేయుదురు. దానంజేసి మంత్రప్రభావ నిరస్తులై వారు యజ్ఞవేదిం జొరనేరమింజేసి విఘ్నము సేయనోపరు. మఱియుం దపుఁడు యజ్ఞప్రవర్తకు లగుపుత్రుల నేవురం బడసె. అందు బృహదుక్థనామధేయుం డైనయగ్రజుఁడు పెక్కుమకాలంబున గణ్యుఁ డయ్యె. రథంతరనామఁడైనరెండవవాఁడు మిత్రవిందుఁ డనంబరఁగి యధ్వర్యులవలనిహవిర్భాగంబులనుం గ్రహించుచుఁ బుత్రపౌత్రపరివృతుండై ప్రసిద్ధుఁ డయ్యె. మూఁడవవాఁడు బహునియమములం జనించి భరతుఁ డన విఖ్యాతుఁ డయ్యె. నాలవవాఁడు తన్నారాధించువారికిఁ దుష్టుఁడై పుష్టిఁ గావించుటంజేసి పుష్టిమతి యన విశ్రుతుం డయ్యె. ఏనవవాఁడు శక్తిపూజాపరుండై దీనులదుఃఖములఁ బోఁద్రోచి శుభముల నొడఁగూర్చుచు శివుఁ డన విదితుఁ డయ్యె. మఱియుఁ దపునకు నానావిధరాక్షసులు మనుష్యులుం బుట్టిరి. వెండియుఁ బురందరుఁడు సకలతపఃఫలముల నిర్వహించుటకై మను వనునగ్నిం గుమారుఁగాఁ బడసె. అతండు భూతములలో లక్షితుండై బ్రాహ్మణపూజితుండై ప్రాజాపత్యకృత్యము నిర్వహించుచుండె. అతని పరంపరలో శంభుఁ డావసథ్యుఁడు మున్నుగా ననేకులు విఖ్యాతు లైరి. మఱియు భానునకు సూర్యపుత్రి యగుబృహద్భాసయు నిశయు ననువా రిద్దఱు భార్యలై యాఱుగురుకొడుకులం గాంచిరి. అందు బృహద్భాసకు నలువురుకొడుకులు పుట్టిరి. అందుఁ బెద్దవాఁడు దుర్బలంబు లయినభూతంబులకు బలముం గల్పించి బలదుఁడునాఁ బడియె. రెండవవాఁ డగ్నులెల్ల శాంతి నొందినపిదప దారుణుండై జనించుటంజేసి మన్యుమంతుం డనఁబరఁగె. మూఁడవవాఁడు దర్శపూర్ణమాసముల హవిర్భాగంబుల గణ్యుఁడై విష్ణుఁడనియు ధృతిమంతుఁడనియుఁ బరఁగె. నాలవవాఁడు చాతుర్మాస్యయాగముల నింద్రునితోడ నాగ్రయణహవిస్సు గ్రహించి యాగ్రయణుండునాఁ బడియె. నిశ కగ్నీషోము లనువా రిద్దఱుకొడుకులు నొక్కకూఁతురుం బుట్టిరి. భానుఁడు మఱియొకభార్యయం దేవుర నగ్నులఁ బడసె. అందుఁ బ్రథముఁ డైనవైశ్వానరుండు చాతుర్మాస్యంబులందుఁ బర్జన్యసహితుండై బ్రాహ్మణపూజలం గ్రహించు. ద్వితీయుఁడు విశ్వమునకెల్లఁ బ్రభువై విశ్వపతియనం బరఁగి యిష్టమెల్ల సుఫలంబుఁ జేయుచు స్విష్టకృత్తనియు విదితుఁ డయ్యె. తృతీయుఁడు సకలప్రాణులశరీరంబుల నాశ్రయించి శబ్దరూపసాధనుండై ప్రజాపతి యననెగడి హిరణ్యకశిపుపుత్రియగురోహిణి యనుకన్యకం బెండ్లియై పుత్రులం గాంచి ప్రసిద్ధుండై కర్మతులకు ధూమాద్యర్చిరాదిగతులకుఁ గారణంబై సకలహుతముల మోచి హుతాశనుఁ డనఁబరఁగె. కపిలనామధేయుఁ డైనతురీయాగ్ని సాంఖ్యయోగప్రవర్తకాచార్యుండై జగద్విఖ్యాతుం డయ్యె. ఏనవవాఁడు సర్వ

కర్మములందు సర్వభూతముల కగ్రమున నుండుటం జేసి యగ్రణి యనం బ్రసిద్ధుం డయ్యె. మఱియు ననేకవిధముల ననేకాగ్నులు సకలధర్మక్రియానిర్వర్తకులై వెలింగిరి.

అగ్నిహోత్రంబులు దోషములం బొరసెనేని ప్రాయశ్చిత్తంబులు గలవు. ఎట్లంటేని. త్రేతాగ్నులు వాయువశమున నొండొంటిం గలిసెనేనియు దావాగ్నిస్పర్శంబుం బొరసెనేనియు శుచి యగునగ్నికి, దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయములతో సంసృష్టం బయ్యెనేని వీతి యగునగ్నికిని, రజస్వల యగ్నులను స్పృశించెనేని దస్యుమంతుం డయినయగ్నికిని, జాతకమృతకసంకరంబు వాటిల్లెనేని సురమంతుం డగునగ్నికిని, నార్తుండై మూండునాళ్లు హోమము సేయండేని యుత్తరాగ్నికిని, దర్శపూర్ణమాసంబులు నిలిచెనేని పథికృతుం డగునగ్నికిని, సూతికాస్పర్శంబు గలిగెనేని యగ్నిమంతుం డయిన యగ్నికిని నష్టాకపాలం బయినపురోడాశము నిర్వపణంబుం జేసి యిష్టి సేయవలయు నని చెప్పి మార్కండేయుండు వెండియు నిట్లనియె.

ఆపుం డనువహ్ని ముదిత యనుదానిం బెండ్లియై యద్భుతుం డనుకుమారుం గనియె. అతండు సకలభూతముల కధిపతియై లోకకృత్యములనెల్ల నిర్వహించుచు గృహపతి యనం బరంగి సురలకు హవ్యముల మోచియిచ్చుచుండి యొక్కనాం డథర్వుండనువానిం బిలిచి నేను గడు దుర్బలుండనైతి. హుతముల వహింపంజాలను. నీవు మోచియిచ్చునది యనిచెప్పి సముద్రముం జొచ్చె. దేవత లతని నెమకంగ నెల్లెడలం ద్రిమ్మరుచుండ సముద్రచరము లయినమత్స్యము లగ్ని సముద్రమున డాంగియున్నవాండని చెప్పిన వా రతని వెదకి కనుంగొని బహువిధములం బ్రార్థించిరి. ప్రార్థించిన నతండు వినక మత్స్యములు తనపోంబడి చెప్పుటకుం గినిసి జనులు నిర్దయులై యెల్లవిధముల మిమ్ము భక్షింతురని మీలకు శాపమిచ్చి శరీరము విడిచి భూతలముం జొచ్చె. అపు డతనిశరీరమునం బూయమున గంధకము, మస్తుల దేవదారువు, శ్లేష్మమున స్ఫటికము, పిత్తమున మరకతము, పురీషమునం గృష్ణాయసము, నఖముల నభ్రకము, నరాలం బగడము, మఱియు ననేకధాతువులుం బొడమె. అవ్విధమున నగ్నిహోత్రుండు సంత్యక్తశరీరుండై తపస్సు చేయుచుండ భృగ్వంగిరఃప్రముఖు లయినమహర్షులు తమతపమున నతని కాప్యాయనముం గావించిన నతండు వెడలివచ్చి యమ్మునులతేజమునకు భయంపడి యంబుధిం జొచ్చె. పదంపడి జనులెల్ల భీతులై యథర్వు నాశ్రయించిరి. సురలు నతనిం బలుదెఱంగులం బూజించిరి. అథర్వుండు విమలదృష్టి నారసి సర్వభూతములు చూచుచుండ నర్ణవంబుం ద్రచ్చుటయు నగ్నిహోత్రుండు వెడలివచ్చి యథర్వుచేతం బ్రార్థితుండై లోకహితార్థంబు యథాపూర్వంబుగ హుతముల

మోచుచుండె. అగ్ని హవ్యముల మోవనొల్లక వివిధదేశములఁ బరిభ్రమించు నెడ సింధు, దేవికా, సరస్వతీ, గంగా, శతకుంభా, సరయూ, గండకీ, చర్మణ్వతీ, తామ్రావతీ, వేత్రవతీ, కౌశికీ, తమసా, నర్మదా, గోదావరీ, వేణా, కావేరీ, కృష్ణవేణీ, కపిలా, శోణాదిమహానదులఁ గొంతకాలము వసించుటం జేసి యవి మిగులఁ బ్రశస్తంబు లయ్యె. అయ్యద్భుతునకుఁ బ్రియ యనుభార్యయందు విభూరసి యనువాఁడు కుమారుఁడయ్యె. సోములు నగ్నిసమసంఖ్యాకులైరి. అత్రి వంశమున మానసపుత్రు లనేకులు పుట్టిరి. అత్రి తనపుత్రుల సృష్టిఁ గావింపఁ బూనినవారల నిరోధించుటయుఁ దత్కాయమునఁ బెక్కండ్రు వహ్నులు పుట్టిరి. అగ్ను లెందఱైనం దదీయతేజ మొక్కటియ. జ్యోతిష్టోమమున ననేకయాగము లేర్పడువడువున నొకతేజముననే యనేకాగ్ను లుద్భవిల్లిరి. ధర్మనందనా, యగ్ని వంశముల వివరించితింగదా. ఇఁక నద్భుతునకు బ్రహ్మర్షిభార్యలు నిమిత్తంబుగ జనించినకుమారస్వామివృత్తాంతముఁ జెప్పెద. సావధానుఁడవై యాకర్ణింపు మని మార్కండేయుఁ డిట్లనిచెప్పం దొడంగె.

మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గుమారస్వామిచరిత్రంబుఁ జెప్ప నారభించుట.

తొల్లి దేవాసురసంగరంబున రాక్షసు లుక్కుమిగిలి సురసేనను వధియించుటయు దేవేంద్రుఁ డత్యంతచింతాక్రాంతుండై దేవసేనకుఁ దగిననాయకుఁడు లేమింజేసి యోటమి యయ్యెఁడి. సేనం జక్కనడిపించువీరుఁ డెవ్వఁడొక్కో యని విచారించుచు మానసం బనుపర్వతమున కరిగి యదియ చింతించుచుండె. అపు డో పుణ్యాత్ములారా! వేగంబ చనుదెంచి నన్ను రక్షింపరే, తగినమగని నియమింపరే యనునాడుకూయి యతిదీనముగ వినవచ్చినఁ బురందరుఁడు తిరిగిచూచి కిరీటధారియు గదాపాణియునై కొండవ్రాలె భీకరుం డైనయసుర యొకఁడు కేశియను వాఁడు చేయిపట్టి యీడ్చుచుండ నేడ్చుచున్నయొకదివ్యకన్యకం గనుంగొని దాని కభయ మిచ్చి రాక్షసుదెస మొగంబై యోరీపాపాత్మా! దుర్బుద్ధివై యీకన్య నేల పట్టియీడ్చెదవు. నేను వజ్రధరుఁడ. నన్నెఱుంగుదుగదా. బుద్ధి గలిగి దీని విడిచిపొమ్మనిపలికె. ఆమాట విని వాఁడు కోపదీపితుండై శక్రా, యీకన్యను నే వరించితి. దీని కడ్డము రావలవదు. ప్రాణములతోడఁ దొలఁగిపొమ్మనిచెప్పి యింద్రునిపైఁ దనగదను విసరివైచె. ఇంద్రుఁడు వజ్రమేసి దాని నడుమన తునియలు చేయుటయు వాఁడు గినిసి గిరిశిఖర మెత్తి వైచె. పురందరుఁడు క్రమ్మఱ వజ్రముఁ బ్రయోగించినం దత్ప్రహారమున నాశిఖరము పగిలి నేలఁగూలె. అపు డాభగ్నశృంగము తాఁకిన దాని నోర్వలేక యారాక్షసుఁ డాకన్నియను విడిచి పాఱిపోయె. అట దేవేంద్రుఁ డాకన్నియం బిలిచి యమ్మా, నీ వెవ్వరిదాన వేమి సేయ నుండెద వనియడుగ సురపతి కయ్యతివ యిట్లనియె. నే నరిష్టనేమి యనుప్ర

జాపతికూఁతురను. దేవసేన యనునది నాచెలియలు. అదియు నేను మాతండ్రి యనుమతి వడసి చెలులతోడఁ గూడి వేడుకమై నీమానసశైలమున విహరించుచుండ నీరక్కసుఁడు కేశియనువాఁడు మమ్మెపుడుం గోరుచుండు. నాచెలియలు వాని వరించె. నాకు వానిచెయ్వు లింపుగామింజేసి యొల్లకుండుటయు నాదురాత్మఁడు నన్ను బలాత్కారంబునఁ బట్టుకొని యేఁచుచుండ దయాళుండవై నీవు విడిపించితివి. నీనిర్దేశించువానిఁ బతిఁగ వరించెదననిన విని దేవేంద్రుఁ డమ్మా, నీతల్లియు నాతల్లియు దక్షప్రజాపతికూఁతులు. కావున నీవు నాకుఁ జెలియలవే. భవత్ప్రియం బవశ్యకర్తవ్యంబ. నీబలం బెట్టిది? వివరింపు మనిన దేవపతికి దేవసేన వెండియు నిట్లనియె. నే నబలను. అయిన నాకుఁ బతియగువాఁడు మహాబలుఁడు. మున్నొకనాఁడు మాతండ్రి నన్నుపలాలించుచు దేవదానవాదుల కజేయుఁడు బ్రహ్మణ్యుఁడు కీర్తివర్ధనుఁడు నీకుఁ దోడై దేవతలకుఁ బ్రియము సేయువాఁడు నగుమహాత్ముఁడు నాకుఁ బతియగునటుల వరము నొసఁగె. అట్టివాని నరయుమనిచెప్పిన విని దేవేంద్రుఁడు తనమనమున నట్టివాఁ డెవ్వఁడొక్కొ యని కొంతవడి చింతించి తత్కాలం బమావాస్యాప్రాతఃకాల మగుటంజేసి చంద్రుఁడు సూర్యుం బ్రవేశించుటయు, సాగరంబు పూర్వసంధ్యారాగమున లోహితోదకంబయియుండుటయు, భృగ్వంగిరఃప్రముఖు లయినమహర్షులు వేల్చినహవ్యముల మోచికొనిపోయి హుతాశనుండు సూర్యమండలంబుఁ జొచ్చుటయుం బరికించి యిది సోమసూర్యాగ్నిసంగమం బయినరౌద్రముహూర్తంబు. మఱియు నిపుడు పరివేషము ఘోరముగఁ గన్పడుచున్నది. ఈసింధునదియుఁ బ్రతికూలముగ శోణితవాహినియైయున్నది. మిణుఁగుఱులు బయలువడ నక్క సూర్యునెదుట నఱచుచున్నది. శీఘ్రంబ దేవాసురసంగ్రామం బగునకాఁదోఁచెడి. అంతయుఁ బరిశీలించిన సోమసూర్యాగ్నిసంభవుం డైనవాఁడు దీనికిఁ బతి యగు. అతండు దేవాసురసమరమున రాక్షసుల జయించు ననియూహించి యాకన్నియం దోడ్కొని బ్రహ్మాపాలికిఁ జని దేవా, యీకన్నియకుఁ దగినమగని నిరూపింపు మనియడుగ బ్రహ్మ యిట్లనియె. నముచిసూదనా, నీచింతించినట్ల సోమసూర్యాగ్నిసంభవుం డైన వీరుఁడే యీకన్నియకు మగఁ డగు. అతఁడ నీకు సేనానాయకుఁడై దానవుల జయించు ననిచెప్పిన విని సురేంద్రుండు సురజ్యేష్ఠునకు మ్రొక్కి యతనియానతిం గొని యాకన్నియతోడ మఱలి వసిష్ఠాదు లగుసప్తర్షు లమావాస్యాహోమము సేయుచుండ నాహవిర్భాగముల గ్రహింపఁగఁ దదాశ్రమమునకుఁ జనియె. అపు డమ్మహర్షులు పిలువఁగ నద్భుతుఁ డనునగ్ని సూర్యమండలము వెడలిచనుదెంచి హవిర్భాగములం గ్రహించి తత్తద్దేవతల కిచ్చి మఱలిపోవువాఁ డయ్యాశ్రమమున మెలంగుచున్న యమ్మహర్షిపత్నుల లోకోత్తరసౌందర్యభాసితలం గాంచి

కామవశుండై యకామ లయినయీమునిపత్నులనే నే మడుగుదు నని తనమ నంబునం గొండొకసేపు తలపోసి యట గార్హపత్యాగ్నికుండముఁ బ్రవేశించి వా రలసౌందర్యమెల్లఁ గన్నులారం గనుంగొని కామంబు నిలుపలేక యొడలు విడువం దలంచి యడవికిఁ జనియె. అపు డతనిచెయ్వుల నెఱింగి దాక్షాయణి యయినస్వా హాదేవి యగ్ని దేవుసంగమముఁ గోరుచుండినయది యది సమయంబుగాఁ గొని యిప్పుడు నేను సప్తర్షిపత్నులరూపుఁ దాల్చి యగ్నితో నభిమతక్రీడ లనుభవింతు నని నిశ్చయించి తొలుత నంగిరసునిభార్య యగుశివయనుదానిరూపుఁ దాల్చి యగ్ని పాలికిఁ జని దేవా, నే నంగిరసుభార్యను. శివ యనుదానను. సప్తర్షిపత్నులము మే మందఱము నిన్నుఁ గామించితిమి. అందఱు పంపఁగ నేను వచ్చితి. నాకోరిక నీడే ర్పుము. నీవు కరుణింపవేని నాబ్రదుకు నమ్మరా దని మెల్లన నిజతాత్పర్యంబుఁ దేటపఱిచిన నగ్ని దానిం జూచి నేఁ గామవశుఁడనై యుండుట మీ రెట్లెఱింగితి రనియడుగ నగ్నికది యిట్లనియె. మా కెప్పుడు నీపై వలపు గలదు. అయిన నీచిత్త మెట్లున్నదో యనిశంకించి యిందాఁక నూరకుంటిమి. ఇపుడు నీయింగి తములం బరికించి నీవు మమ్ము వలచియున్నవాఁడ వనినిశ్చయించి నీయొద్దకు నేను మున్న వచ్చితి. కామసుఖములఁ దేల్పుమని తెల్పిన నగ్ని సంతుష్టుఁడై దానిం బరిగ్ర హించె. అదియు నతని రతిసుఖములఁ దనిపి తదీయరేతస్సుగ్రహించి యీరూ పముననే నేను బోయెద నేని చూప అందఱు మునిపత్నులయెడ దోష మూహిం తురు. కావున గరుడినై పోయెద నని తనమనమున నాలోచించి వినతారూ పంబుఁ దాల్చి రక్షఃపిశాచపన్నగరౌద్రభూతగణసంకులంబు వివిధమృగసంకీర్ణంబు నగు శ్వేతపర్వతంబున కరిగి గంగాతీరమున శరస్తంబసంవృతం బయినయొకకాంచ నకుండమున నారేతస్సు నిక్షేపించె. పరమపతివ్రతాశిరోమణి యైనయరుంధతి యొక్కరూపు దక్కఁ దక్కటివార లేవురరూపముల ధరించి యగ్నితోడ సంగ మించి తదీయరేతము నాకుండమున నిక్షేపించె.

కుమారస్వామియవతారము.

అవ్విధంబున స్వాహాదేవి మునిపత్నులయాఱ్వురరూపముల ధరించి యగ్ని సంగమంబున స్కన్నం బయినతదీయరేతంబు సంగ్రహించి యుంచుటయు నా కాంచనకుండమునందుఁ గుమారుఁ డుదయించి స్కందుఁ డనఁ బరఁగె. శుక్లపక్ష పుఁబాడ్యమినాఁడు రేతస్సేచనంబు, విదియనాఁడు పిండముగ నభివ్యక్తియుఁ, దదియనాఁ డాఱుతలలతోడఁ బన్రెండుభుజనేత్రశ్రోత్రములతోడ లెస్సగ శరీరాభి వ్యక్తియుం బడసి యాకుమారుఁడు చవితినాఁ డంగప్రత్యంగసౌష్ఠవంబు లోహి తతేజంబునుం బొంపిరివోవ సూర్యునిచాడ్పున వెలుంగుచు నెక్కుడేలఁ ద్రిపు రాంతకుఁడు దానవులఁ జెండాడునెడ గ్రహించుధనుర్వరంబును బూని వేఱొక

కేల గొనయంబు సారించి సింహనాదముచేసె. అందుకు బెదరి చిత్ర మైరావతము ననుమహానాగములు మీఁదికి వచ్చుటయు నారెంటిని రెండుచేతులఁ బట్టుకొని, వేఱొకచేత శక్తిని మఱియొకహస్తమున లీలార్థంబుగఁ గుక్కుటమునుం గ్రహించి, కొంతవడి బిట్టఱచి, యెగరి, పిదప రెండుచేతుల శంఖము గ్రహించి రోదోంతరం బవియఁగఁ బెలుచఁ బూరించి, ముల్లోకములం గబళించుచాడ్పునఁ దనమహావదనగహ్వరములఁ దెఱచి, రెండుచేతుల మీఁది కెత్తి మిన్ను దన్నుచు బాల్యోచితం బయినకరద్వయాంగుళిచర్వణ మొనరించుచు వెండియు నతిభయంకరముగ నార్చిపేర్చి క్రూరనారాచంబు లేసి, క్రౌంచపర్వతము భేదించి, హంసలకుఁ ద్రోవఁ గల్పించి, శక్తిపాతమున శ్వేతపర్వతశిఖరంబు నేలం బడఁద్రోచె. అందుకుఁ బుడమి యదిరె. కొండలు నుగ్గయ్యె. అంతఁ బంచమినాఁడు జనులందఱు వెఱచి యొండు శరణంబు గానక యాకుమారు శరణుసొచ్చుటయు నతండు వారల నూరార్చె. పుడమియుఁ గొండలు నతని సేవించి తొల్లింటిక్రమమున నిలిచె. అట్లమ్మహాసేనుఁడు జనించిన నతిఘోరముగ వివిధోత్పాతంబులు దోఁచుటయుఁ జైత్రరథవనవాసు లయినజను లందఱుం గుమిగూడి మునిపత్నులసంగమమున నగ్ని కుదయించినకుమారునివలన లోకమున కెంతయేఁ జేటు వాటిల్లుచున్న దనిపలికిరి. మఱికొందఱు గరుడీరూపధారిణియై స్వాహాదేవి రేతస్సుఁ గొనివచ్చునపుడు చూచినవారు వినతవలన నింతయనర్థము పొసఁగె ననిరి గాని కొందఱేనియు స్వాహచేసినవిధ మెఱుంగనేర రైరి. ఆవచనము విని సప్తర్షు లరుంధతిదక్కఁ దక్కటివారల నాలుగురఁ ద్యజించిరి. అపుడు స్వాహ వారిపాలి కరిగి యయ్యా, మీపత్నులయెడ దోష మించుకయేనియుఁ గన్పడదు. అంతయు నే నెఱుంగుదు. ఆకుమారుఁడు నాకు జనించినవాఁ డనిచెప్పినను వారు పత్నుల నెల్లరైరి. విశ్వామిత్రుఁడు నాఁ డిష్టిఁ గావించి కామవశుఁ డై నయగ్ని వెన్నుఁ దగిలి యదృశ్యుఁడై పోయి యంతయు నెఱింగియుండినవాఁడు గావున వాస్తవం బెఱింగించినను వారు జనాపవాదమునకు వెఱచి పత్నుల గ్రహింపరైరి. అట నావిశ్వామిత్రుఁ డాకుమారుపాలికిఁ బోయివివిధస్తోత్రములఁ దత్ప్రసాదంబు వడసి తదాదేశమున నతనికి జాతకర్మాదిసంస్కారము లొనరించె. దానంజేసి స్కందుండు విశ్వామిత్రునియెడ నతిప్రీతి నెఱపుచుండె. ఆవృత్తాంతమంతయుం దెలిసి దేవతలు సురపతిపాలికిఁ జని దేవా, వహ్నిసంభవుఁ డై నకుమారుఁ డవిషహ్యబలుఁడై యున్నాఁడునఁట. ఆలసింపక వాని వధింపవలయు. కాకున్న వాఁడు మమ్ము ముల్లోకములను నిగ్రహించి యింద్రపదం బాక్రమించు ననిన నింద్రుఁడు భీతుఁడై వాని వధించు టెక్కుడుపని? వాఁడు నిక్కం బలిగనేని బ్రహ్మదేవునైన వధింపఁజాలు. కావున వానిం జెనకరా దనిచెప్పుటయు సురలు సురపతికి మఱియు నిట్లనిరి.

ఆకుమారు వధించుట దుష్కరం బనితలంతువేని లోకమాతలఁ దద్వధార్థం బను పుము. వారు వాని వధింపఁ జాలుదు రనిచెప్పి యింద్రునానతిం గొని యామాతృగణంబు ననిచిన వారుం గుమారుకడ కరిగి యతని లోకోత్తరబలవీర్యతేజములఁ బరిశీలించి యీతని మనము నిగ్రహింపనేర మని తమలో నిశ్చయించి యతనిన శరణుసొచ్చి కుమారా, మేము లోకమాతలము. నీవు మాకుఁ గుమారుఁడుగా గోరియున్నవారము. మాకోరిక లీడేర్పు మనిప్రార్థించిరి. తత్ప్రార్థనము విని కుమారుఁడు తదీయ స్తన్యముఁ ద్రావి వారల మాతృభావమున భజింపుచుండునంత నగ్ని దేవుఁడును స్కందునిపాలికిఁ జనుదెంచుటయు నతండు మాతృగణంబుతోడ నెమ్మరేగి పితృభావమునఁ బూజించుటయు నగ్ని తీద్రక్షణపరుండై యుండె. మాతృగణముక్రోధమువలనఁ బుట్టినలోహితాస్య యనునది దాదియై శూలముఁ జేతఁ బూని రక్షించుచుండె. సకలభూతంబులు పార్షదులు బాలక్రీడలు సూపుచు నతనిం బరివేష్టించియుండిరి.

## ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట.

అదియెల్ల నెఱింగి దేవేంద్రుఁడు గినిసి విజయకాంక్షియై సురసేన వెంటఁ గొలిచిరాఁగ నైరావతంబు నెక్కి వజ్రాయుధముఁ గేల నమర్చికొని పోరునకుఁ గట్టాయితంబయి కుమారుపాలికిఁ జనుదెంచి సింహనాదంబుఁ జేసిన నాధ్వని విని సహింపక కుమారుఁడును దేవతలు చైతన్యం బెడలఁ బ్రతిసింహనాదము చేసి వక్త్రకుహరంబుఁ దెఱచి నిప్పులు గ్రుమ్మరించుటయు సురలు తదీయకరాళజ్వాలాజాలదహ్యమానులై వేఱొండు శరణంబు గానక యాకుమారు శరణుఁ జొచ్చి తత్ప్రసాదమున విగతభయు లైరి. ఇంద్రుఁడుం గోపాటోపదీపితుండై వజ్రాయుధం బేసిన నమ్మహనీయసాధనం బతనిదక్షిణపార్శ్వము భేదించె. అందు శక్తికుండలధరుఁడు కనకవర్ణుఁడు ఛాగవక్త్రుఁడు నగుకుమారుఁ డొకరుఁడు వెడలివచ్చి వజ్రాయుధవిశనమున జనించుటంజేసి విశాఖుఁ డనఁబరఁగి కాలానలంబుపోలిక వెలుంగుచుండె. మఱియుఁ బెక్కండ్రు కుమారులు కన్యలుం బుట్టిరి. వారలఁ జూచి నముచివైరి భీతిల్లి ముకుళితకరయుగుళుండై శరణుఁజొచ్చినం గుమారుఁడు ససైన్యుఁ డయినయింద్రున కభయం బొసంగి యాదరించె. అమరులును సంతుష్టులై వివిధవాద్యముల వాయించిరి. ఆకుమారులు కన్యకలును విశాఖుఁ దండ్రిగా భావించుకొని గర్భములను శిశువులను వధించుచుండుదురు. తత్ప్రీత్యర్థంబుగఁ బుత్రార్థు లయినజనులు కన్యాకుమారగణంబులను, గుమారుని, రుద్రరూపుఁడై నయగ్నినిఁ, బార్వతీరూప యగుస్వాహనుం గొల్తురు. తపుఁడనువహ్నివల్లనం జనించినకన్యలు కుమారునొద్దకుఁ జనుదెంచి మేము భవత్ప్రసాదంబున లోకమాతలమై పూజ్యులుగానుండఁ గోరియుండెదము. మాకుఁ బ్రియంబుగ నీవరం

బిమ్మనిన నతండు వల్లెయనుటయు వారు కాకి, హలిమ, మాలిని, బృంహిళ, యార్య, పలాల, మిత్ర యనువారేడ్గురు స్కందుని బుత్రునిఁగ భావించిరి వారును వారికొడుకులు లోహితాక్షుఁడు భాగవకర్షుఁడుం జేరి తొమ్మండ్రుగురు గుమిపై లోకమునం జరింతురు. అదియట్లుండె. పదంపడి యాకుమారుండు కనక కవచుండు, లోహితాంబరుండు, తీక్ష్ణదంష్ట్రుఁడు సర్వలక్షణసంపన్నుండు, తరుణుండు, దివ్యకుండలధరుండునై లోకప్రియంకరుండై యుండఁ బద్మాలయ యగు లక్ష్మి తనంతన వచ్చిచేరిన నతండు రాకానిశాకరుచందంబునఁ దేజరిల్లుటయు బ్రాహ్మణులు బ్రహ్మర్షులుం జనుదెంచి యతనిఁ బూజించి దేవా, పుట్టినయాఱు నాళ్లలోన లోకములనెల్ల వశీకరించికొనినవీరుఁడవు నీవు. దయాళుండవై యందఱకభయంబొసంగితివి. నీవే యింద్రపదముఁ జేకొని లోకములకుఁ గుశల మొడఁగూర్పు మనిప్రార్థించినం గుమారుఁ డయ్యా, యింద్రపదమున నుండువాఁ డెయ్యది చేయవలయు ననియడుగ మును లిట్లనిరి. ఇంద్రపదముననుండువాఁడు ప్రజలకు బలతేజస్సౌఖ్యములు గల్పింపవలయు. తన్నారాధించినవారి కెల్లఁ గోర్కె లొడఁగూర్పవలయు· దుష్టనిగ్రహమును శిష్టానుగ్రహంబును జేయవలయు. సూర్య చంద్రాగ్ని వాయ్వాకాశపృథివీజలములకు లెస్సగ శక్తి సమకూర్పవలయు. ఇది యెల్ల నిరుపమానబలవిలసితుండ వగునీవు నేయఁగలవు. కావున నీవే యింద్రుఁడవై లోకము లేలు మనిచెప్పుచుండునంత నింద్రుఁడు కుమారస్వామి కిట్లనియె. వీరశేఖరా, నీవ యింద్రుఁడవై మాకెల్లరకు నెలమిఁ గావింపు మనిచెప్పినం గుమారుఁ డింద్రుదెసమొగంబై పురందరా, యిట్లనవలదు. నీవ యింద్రపదస్థుఁడవై ముల్లోకముల నేలుము. నేను నీపంచినదానిం జేయనున్నవాఁడ ననిచెప్పిన నింద్రుఁడు కుమారస్వామికి వెండియు నిట్లనియె. అయ్యా, నీబల మత్యద్భుతంబు. సురవైరుల గెలువఁ జాలుదువు. నీవీర్యమునకు విస్మితులై జనులు నీకంటె బలహీనుఁ డగుట న్ననాదరించి మన కిరువురకుం బరస్పరభేదంబు వొసఁగఁజూతురు. భేదము గలిగెనేని వైర మవశ్య మగు. నీతోడిపగయ గలిగెనేని పదంపడి నాకు గెలుపు గలుగనేర్చునే? నన్ను గెలుచుట నీ కెంతటిపని? కావునఁ బరికించిచూచిన నీవే యాపదవి కర్హుఁడ వనినాయితంబు. ఒండు విచారింపక పట్టాభిషిక్తుఁడ వగు మనినం గుమారస్వామి పురందరుం జూచి దేవా, నీవే ముల్లోకములకు నాకును రాజవు. నే నెల్లప్పుడు నీయానతిమెయి నడఁచువాఁడఁగాని నీపదంబు నొల్లను. ఇంతయు నిక్కం బనివచించె. ఆవచనంబు విని యింద్రుఁడు కుమారా, నీమత మిట్టిదయేని నేన యింద్రుఁడనై యుండెద. నాశాసనమున వర్తింతునని యొడం బడుటం జేసి యొక్కటి సెప్పెద వినుము. నీవు సురలకు సేనాపతివై నాకార్యములఁ దీర్పు మనిచెప్పుటయుఁ స్కందుఁ డట్లయగుంగాక. నన్ను నీసేనాపతిఁగఁ జేసికొ

నుము. దానవవినాశమును, దేవకార్యార్థసిద్ధిని, గోబ్రాహ్మణహితంబునుం జేయు దునని నివేదించె.

ఇంద్రుఁడు కుమారస్వామిని దేవసేనాధిపత్యమున నభిషేకించుట.

అందుకు ముదం బొది పురందరుండు దేవగణసమన్వితుండై యాకుమారు భద్రసింహాసనాధిరూఢుం జేసి భద్రచామరాదిరాజోపచారంబులు సెలంగ మంత్రపూతదివ్యకలశసలిలముల దేవసేనాధిపత్యమున నభిషేకించుటయు మహర్షులు పలుదెఱంగుల నతనిం బూజించిరి. అపు డతనిపయిం బట్టినకాంచనాతపత్రంబు సుప్రజ్వలితుం డైనయగ్ని హోత్రునిమండలంబుచాడ్పున వెలింగె. అట్టి యెడ వృషభారూఢుం డై మహాదేవుఁడు దేవితోడ నచ్చటికి విచ్చేసి విశ్వకర్మనిర్మిత మైనకనకకుసుమమాల్యము నాకుమారుకుత్తుకం దానే గట్టె. అట్లు దేవసేనాధిపత్యమున నభిషిక్తుఁ డై నయతండు రక్తాంబరధరుఁడు సహజకవచవిలసితుఁడునై సురలకు జయముఁ గావించుశక్తి యనుదివ్యసాధనము ముందటఁ జెలంగ నగ్నిదత్తం బయినకుక్కుటము కేతనమునందుఁ గ్రాల నిజపార్షదగణపరివృతుండై వెలుంగుచుండ దేవసేనలు వచ్చి దేవా, నీవ మాకు నాయకుఁడవు. నిన్నుఁ గొలిచియుందు మనిచెప్పుచు నాకుమారుఁ గొలచియుండె. అప్పు డాకొలువున గంధర్వులు పాడిరి. అచ్చర లాడిరి. మఱియు నొక్కటి సెప్పెద వినుము. వేదవిదులై నవిప్రు లగ్ని రుద్రుఁ డనిచెప్పుదురు. తొల్లి రుద్రుఁడు వీర్యము విడిచిన నావీర్యపుజంబు శ్వేతపర్వత మనఁ బరఁగె. అందుఁ గృత్తికలు నాఁబడు మునిపత్నులాఱుగ్వురరూపము ధరించి స్వాహాదేవి యగ్నిసంగమంబున స్కన్నం బయినతదీయవీర్యంబు సంగ్రహించి యాశ్వేతపర్వతంబున గంగాతీరమునశరస్తంబమందునిక్షేపించుటంజేసి యాకుమారుం డగ్నితనయుఁడనియు, రుద్రసూనుఁడనియుఁ, గార్తికేయుఁడనియు, గాంగేయుఁడనియు, శరవణోద్భవుండనియు, స్కందుఁడనియుం బరఁగె. అంత నామఱునాఁడు దేవేంద్రుఁడు మున్ను దాను బ్రహ్మయానతింజేసి సురక్షితముగ నునిచిన దేవసేన యనుకన్యకను రావించి దివ్యాలంకారముల నలంకరింపఁజేసి కుమారస్వామికిఁ జూపి కుమారా, నీజననమునకు ముందుగనే బ్రహ్మదేవుఁ డీకన్యను నీకు భార్యగా నియమించె. విధియుతముగ దీనిం బెండ్లియగు మనిపలికిన ననూనమోదమానమానసుండై మహాసేనుండు దేవసేనను సురాచార్యుం డై నబృహస్పతి మంత్రకృత్యంబు దీర్పఁగ నగ్నిసాక్షికంబుగఁ బెండ్లి యయ్యె. ఆనాఁడు షష్ఠియగుటంజేసి షష్ఠీతిథి కుమారస్వామికి సమ్మత మై పూజనీయ మయ్యె.

అట మహర్షిపత్నులాఱుగురు కుమారస్వామిపాలికి వచ్చి కుమారా, నీవు మాకుఁ గలిగినవాఁడవని యెవ్వఁడో చెప్పఁగ విని సత్య మరయక మాభ

ర్తలు నిష్కారణముగ మమ్ము విడిచిరి. దానంజేసి పుణ్యహీనల మైతిమి. నీ వా వచనంబు సత్యముగనే భావించి మాయెడం దయచేసి మమ్ముఁ దల్లులుగ భావించి పుణ్యలోకమున నెలవు గావింపుము. ఇది చేసిన నీవు పుత్రకృత్యము నిర్వహించి యనృణుండ వగుదువని ప్రార్థించినం గుమారస్వామి యట్లయని యింద్రుం జూచి వీరి కెయ్యది నెలవుగాఁ దగు? విచారింపు మనిన నింద్రుఁ డిట్లనియె. చంద్రుభార్యలు దక్షుకూఁతులు నగునశ్విన్యాదులలో నభిజిత్తనునది రోహిణితోడం గలహించి నే నెల్లవారికంటెఁ బెద్దదాన నగుదు నని తపము సేయ వనమునకుఁ జనియె. రోహిణిపొరుగున దానిచోటిపుడు రిక్తమై యున్నది. వీరల నందుఁ జేర్పఁ దగు ననినఁ గృత్తిక లాఱుగురు గగనమున కరిగి యచ్చోటఁ జేరి యగ్నిదైవత్యం బయిననక్షత్రంబయి వెలింగిరి. అంత వినతయు నమ్మహాసేనుకడకుఁ జనుదెంచి కుమారా, నీవు నాకుఁ బుత్రుఁడవు. నీతోడ నుండఁగోరుదు ననిన దేవసేనాధినాథుఁ డాగరుడిం జూచి యమ్మా, కోడలు పరిచర్యలు సేయ నాయొద్దనుండు మని తదభిమతంబుగాఁ బలికి యాదరించె.

### కుమారస్వామి సప్తమాతృకలను బాలగ్రహములుగఁ జేయుట.

పదంపడి సప్తమాతృకలు కార్తికేయునొద్దకు వచ్చి కుమారా, మేము సర్వలోకమాతలము. నీకుఁ దల్లులుగాఁ గోరియున్నవారము. మమ్ముఁ బూజింపు మనిన విని గుహుం డట్లయగుంగాక. మీకోరికి నీడేర్తు. ఏమి సేయవలయు నని యడుగ వా రిట్లనిరి. ఈలోకమున మున్ను మాతృకలుగా నియమింపఁబడినవారి నిరసించి తదీయస్థానముల మా కొసఁగవలయు. ఎల్లవారును వారల విడిచి మమ్మే పూజించునట్లు వర మియ్యవలయు. నీకొఱకుఁగా వారు మా ప్రజల హరించిరి. వారల నిచ్చునది యనియడుగఁ గుమారస్వామి వారి కిట్లనియె. ఇదె మీకు లాఁతిప్రజల నిచ్చెద. వారుహరించినవారల నియ్యఁ దగదు. మఱియు మీ కెద్దియేనియుం గోరిక గలదేని దాని నెఱవేర్తు ననిన వారు పుత్రా, నీవు బాసటగాఁ గఁ దొల్లింటిమాతలయు లాఁతివారలయుఁ బ్రజలఁ గబళించునట్లుగా వరము నొసంగు మనియడిగిరి. అడుగుటయు షణ్ముఖుఁడు వారలం జూచి యక్కటా! లోకమునకుఁ గీడుఁ దలంచితిరి. అయినను మీకోరినవిధంబు సేయుదు. శిశుభక్షణాసక్తలయ్యు మీరు మిమ్ముఁ గొలుచువారిప్రజల రక్షించునది యనిన వా రట్ల చేయుదు మనియొడంబడి నీతోడఁ జిరకాలవాసముఁ జేయఁ దలఁచియున్నవార మనినఁ గార్తికేయుండు వెండియు వారి కిట్లనియె. నానావిధరూపముల ధరించి మీరు పదునాఱేఁడులందాఁక శిశువుల బాధించుఁడు. మీకు సహాయార్థంబు నామేన నొక్కనిఁ బుట్టించియిత్తు నతనితోడం గలిసి సుఖముండుఁ డనిచెప్పుచున్నంత నాకృత్తికాసుతుశరీరంబునుండి యగ్నికల్పుం డయినపురుషుఁ డొక్కఁడు

వెడలివచ్చి యాఁకటం దూలుచు మూర్ఛవోయి నేలఁ బడినం గుమారుండు వానికిఁ జైతన్యం బొసంగి మాతృగణంబునకు బాసటయై శిశుకబళనంబు సేయు మనిపనిచె. ఆపురుషుఁడు రౌద్రగ్రహంబై స్కందాపస్మారం బనఁబరఁగి మాతృకా గణరక్షణపరుం డయ్యె. మఱియు గరుడమాతయై శకునిగ్రహంబునాఁ బడువినత యు, దేవమాతయై రేవతి యనుపేరుగాంచి రైవతగ్రహం బనఁబడునదితియు, దైత్యమాతయై ముఖమండితనాఁ బరఁగుదితియు, గోమాత యైనసురభియు, శున కమాత యైనసరమయు, వృక్షమాత యైనకరంజయు, సర్పమాత యైనకద్రువ యు, నప్సరోమాతయు, గంధర్వమాతయు, స్కందుదాది యైనలోహితాస్య యుఁ, బూతనయు ననువారు సప్తమాతృకలతోడం గలిసి పదునెనమండ్రుగా గుమిగూడి శిశువులం బీడింతురు. అందుఁ గద్రువ సూక్ష్మరూపముగ గర్భిణుల యుదరములు సొచ్చి గర్భములఁ గబళించు. పిదప నాస్త్రీలు పాములఁ గనుదురు. గంధర్వమాతయు నప్సరోమాతయు గర్భముల నపహరించికొనిపోవుదురు. అది యెఱుంగక జనులు గర్భము లీన మయ్యె ననితలంతురు. లోహితాస్య యను నది కదంబపూజనప్రియయై యుండు. వృక్షమాత యగుకరంజ యొక్కర్తు భూత దయాపరయై సౌమ్యభావమున శిశువులఁ బ్రోచు. వీరును స్కందునిమేనం జనిం చినకుమారులు కుమారికలును బురిటింట నేడునాళ్లు వాసము చేయుదురు. వీ రందఱును స్కందగ్రహంబు లనఁబరఁగి పదునాఱేండ్లప్రాయమందాఁక శిశువులఁ బీడింపుచుండుదురు. తత్పరిశాంత్యర్థముగఁ గుమారస్వామికిని, గుమారజనకు లయినపార్వతీపరమేశ్వరులకును, దత్తద్గ్రహములకును బలిపూజోపహారములఁ గావింపవలయు. దానం బ్రియ మంది వారెల్లరు బాలుర కాయుర్వీర్యశుభము లొడఁగూర్తురు. వెండియుఁ బదునాఱేండ్లమీఁదనుం గొన్నిగ్రహములు బాధిం పుచుండు. మహేశ్వరునకు మ్రొక్కి వారలవివరించెద. వినుము. ఎవ్వఁడేనియు నిద్రపోవుచునుండె మేల్కనియుండె దేవతలఁ గాంచి వెఱ్ఱిపలుకులు పలుకునేని యది దేవగ్రహం బని యెఱుంగవలయు. కూర్చుండియుండె శయనించియుండెఁ బితృదేవతలం జూచి భ్రమసెనేని యది పితృగ్రహమని తెలియవలయు. సిద్ధుల నవమానించియు శపించియు బమ్మరించెనేని యది సిద్ధగ్రహం బనియూహింపవ లయు. రసగంధముల నాస్వాదించి యున్మత్తుండయ్యెనేని యదిరాక్షసగ్రహ మని భావింపవలయు. పిశాచము లావేశించిన నున్మాదంబుఁ జెందెనేని యది పైశాచ గ్రహం బనినిర్ణయింపవలయు. కాలవిపర్యయమున నున్మత్తుం డయ్యెనేని యది యక్షగ్రహ మనియరయవలయు. వాతపిత్తశ్లేష్మములప్రకోపమునఁ జిత్తము మో హముఁ జెందెనేని యదియు నొకగ్రహవికారం బనంబడు. అందుకు శాస్త్రచోది తం బైనప్రతివిధానముఁ జేయవలయు. ఘోరవస్తువులఁ జూచుటనుండె, భయ

మునసెండె, విహ్వాలత్వమునసెండె నున్మాదంబుఁ బొందెనేని యందుకుసాంత్వనం బె ప్రతివిధానంబు. క్రీడించునపుడును భుజించునపుడును స్వేచ్ఛమై వర్తించునపుడుం గ్రహంబులు మూఁడుదెఱంగులై డెబ్బదియేండ్లు నిండునందాఁక నరులకు సోఁకు చుండు. ఇవి మనుష్యగ్రహంబులు. డెబ్బదియేండ్లకుమీఁద ముదిమి యలమియ న్నిగ్రహములకంటె నెక్కుడుగాఁ బీడింపుచుండు. శుచి, జితేంద్రియు, డనలసుఁ, డాస్తికుఁడు, శ్రద్ధావంతుఁడు, మహేశ్వరభక్తుఁడు నగుమహాత్ము నేగ్రహములుం జేరరా వనిచెప్పి మార్కండేయుండు వెండియు నిట్లనియె.

కుమారస్వామి మాతృగణంబును శిశుపీడనంబున నియోగించునెడ నగ్ని భార్య యైనస్వాహాదేవి యతనిపాలికి వచ్చి కుమారా, నీవు నా కౌరసపుత్రుఁ డవు కావునఁ బ్రియంబు సేయు మనిన నతండు తల్లీ, నీ కెయ్యది ప్రియంబో? తెలియఁ జెప్పుము. చేయ నున్నవాఁడ ననుటయు స్వాహాదేవి స్కందున కిట్ల నియె. పుత్రా, మాతండ్రి యగుదక్షుఁడు నన్ను బాల్యమున నగ్నికొసంగె. అ తండు కామించియున్నన న్నెల్లకున్నవాఁడు. కావున నతనితోడ నెడలేనిపొందు గా ననుగ్రహింపు మనినఁ గుమారుఁడిట్లనియె. నేఁడుమొదలుగ బ్రాహ్మణులు హవ్యకవ్యములందు స్వాహాశబ్దకలితము లయినమంత్రముల నుచ్చరించియగ్ని యందు హోమము సేయుదురు. దాన నీ కతనితోడ నెడలేనిపొందు వాటిల్లెడి న నితెల్పి యాదరించిన నాదాక్షాయణి సంతుష్టయై యతనిఁ గొనియాడె. అయ్య వసరమున బ్రహ్మదేవుఁ డచ్చటికి వచ్చికుమారస్వామిం బిలిచి యయ్యా, వహ్ని యందు రుద్రుఁడు స్వాహయందుఁ బార్వతియు నిజయోగబలమున నావేశించి సంగమింపఁగ నీవు లోకహితార్థంబు జనించితివి. కావునఁ బార్వతీపరమేశ్వరులు తల్లిదండ్రు లనిభావించి పూజింపుము. మఱియుఁ దొల్లి మహాదేవుఁడు గౌరితోడ సంగమించునెడ స్ఖలితం బయినయద్దేవునిరేతంబునం గొంత యిచ్చటఁ బడి మింజి కామింజికం బనంబరఁగె. మఱికొంత లోహితోదధిం బడియె. ఇఁకఁగొంత సూర్య కిరణములం జేరె. వెండియుంగొంతపుడమిం బడియె. తచ్ఛేషంబు వృక్షములం జేరె. ఇట్లు పంచవిధం బయినతదీయ వీర్యమున జనించినఘోరరూపు లయిన రాక్షసు లైదుగణములవా రైరి. వారెల్ల నీకుఁ బార్షదులై గొలిచియుండుదు రనిచెప్పి పితామహుఁడు సనినం గుమారస్వామి మహాదేవుని దేవినిం బరమభక్తి నర్చించె. ఆపంచగణంబులవారల నర్కపుష్పములఁ బూజించినవారికి ధనసంపత్తి యు నారోగ్యమునుం గలుగు. మింజికామింజికంబుఁ బూజించినశిశువులకుమేలు గలుగు. వృక్షములం జేరినరుద్రవీర్యమందు వృద్ధిక లనుస్త్రీలు పుట్టెదమి మనుష్య మాంసాశనలై యెల్లచోట్లం దిరుగుచుందురు. ప్రజాకాములు వారలఁబూజించి యభీష్టములఁ బడయుదురు. బ్రహ్మచనినపిదప నింద్రుఁడు కుమారున కైరావతం

బుఘంటల రెంటిని వైజయంతు లనువాని నిచ్చిన నతం డొక్కటి విశాఖున కొసఁగి యొక్కటి దా గ్రహించి తనలోహితపతాక ముందు నడుచుచుండ దేవత లిచ్చినక్రీడోపకరణముల గ్రహించి నిజపార్షదగణపరివృతుండై యాశ్వేతపర్వతమున దివ్యతరువిలసితంబు లయినవనంబుల వేడ్కమై విహరించుచుండె. అతని విహారమునకు సురలు మునులును మెచ్చిరి. గంధర్వులు పాడిరి. అచ్చర లాడిరి.

### ఈశ్వరుఁడు కుమారస్వామితోడ భద్రవటముఁ జేరఁ బోవుట.

కుమారులీలలం జూచి యత్యంతసంతోషసమాక్రాంతస్వాంతుండై త్రిపురాంతకుండు తనయుం గారవించి సటాచ్ఛటలు నిగుడ మొగముల మీఁది కెత్తి గగనంబు మ్రింగునో యను వెఱపు పుట్టింప నొప్పుసింహసహస్రంబుఁ బూన్చిన రథవరమును దేవితోడ నారోహించి యింద్రచాపసహిత మగుమేఘమండలమునఁ దటిల్లతావిభాసితుఁ డైనసూర్యుని విడంబించుచు దేవసేనాసమన్వితుఁ డైనకుమారుం దోడ్కొని భద్రవటముఁ జేరనరిగె. అపుడు ముందట గుహ్యకాదిసేవ్యమానుండై పుష్పకవిమాన మారోహించి కుబేరుఁడును, వెనుక సురగణసముపాస్యమానుండై యైరావతము నారోహించి దేవేంద్రుఁడును, వలపట జృంభకయక్షరక్షోగణపరివృతుం డై నమహాయక్షుఁడును, వానివలపట వసురుద్రాదులును, డాపట మూర్తిమంతంబు లయినయనేకరోగములు గొలిచి రాఁగ మృత్యుసహితుఁ డై నయముఁడును, వాని వెనుకదెస మూర్తిమంతం బయినత్రిశూలంబును, దాని ననుసరించి యాదోగణపరివృతుండై పాశహస్తుఁ డై నవరుణుఁడును, వాని వెనుకఁ బరిఘపట్టసగదాముసలశక్త్యాది వివిధాయుధంబులును, వాని వెంబడి మహర్షిసేవ్యమానం బై నకమండలువును, దానికివలపట దివ్యదండమును, దాని వెనుకదెస మూర్తిమంతంబు లయిననదీసముద్రములును, బ్రహ్మన్యుఁడును, గ్రహములును, దేవతలును, ఋషులును నడిచిరి. శ్మశాననిత్యవ్యాపృతుండై రుద్రప్రియుండై రాక్షసగ్రహంబునాఁబడుపింగళుం డనుయక్షోత్తముఁడు పతాకఁ గొని పురోభాగమునఁ జనియె. అపు డుత్తమాంగనలు పుష్పవర్షముఁ గురిసిరి. చంద్రుఁ డా దేవదేవునకు శ్వేతాతపత్రంబు వట్టె. వాయ్వగ్నులు చామరములు వీచిరి. అట్లు దేవగణసముపాస్యమానుండై భద్రవటముఁ జేరఁ జని మహేశ్వరుఁడు షణ్ముఖుం బిలిచి కుమారా, సప్తమం బయినమారుతస్కంధము రక్షించుచు సురలకు దెప్పరముఁ దీర్చుచుండుము. పని గలయపుడు నన్నుఁ జూడుము. నాదర్శనమునఁ బరమశ్రేయ మయ్యెడు మనిదీవన లిచ్చి యతనిఁ గౌఁగిటం జేర్చి శిరంబు మూర్కొని నీనెలవునకుఁ బొమ్మని యానతి యొసంగె.

### కుమారస్వామి మహిషాసురుం జంపుట.

అయ్యవసరమున నాకాశము నక్షత్రములతోడఁ బ్రజ్వరిల్లుటయుఁ, బుడమి వడఁకుటయు, రోదసీకుహరంబునం దంతటఁ జీఁకట్లు గ్రమ్ముటయు మున్నుగా నుత్పాతములు పెక్కులు గానవచ్చిన నందఱు నిది యేమియొక్కో యని బమ్మరింపుచున్నంతఁ బర్వతోపమాన మైనరాక్షససైన్యము మహిషాసురరక్షితంబై మేఘములు వ్రాలె గర్జిల్లుచు నెక్కసెట్టి శంకరుం దాఁకి దేవసైన్యంబునఁ బ్రాసపరిఘశతఘ్నీముసలాదివివిధప్రహరణంబులను గిరిశిఖరంబులనుం బడవైచుటయు సురసైన్యమునం బెక్కండ్రు తెగిరి. హతశేషులు వెగడుపడి పాఱిరి. కార్చిచ్చు పొదివినశుష్కకాననంబుమాడ్కి దానవార్దితంబై దేవానీకంబు నాథుం గానక పాఱుటం జూచి దేవేంద్రుఁ డందఱ నూరార్చి పేరెలుంగెత్తి యోశూరులారా, వెఱపు విడువుఁడు. శస్త్రములఁ గొనుఁడు. దానవుల నేట్లాడుఁడు నే నుండఁగ మీకు వెతలేల? యనిబోధించిన నందఱు మరలి ధైర్యంబు మెఱయ శౌర్యంబు నెఱయం గడంగి యంపతుంపరం గురియించిన నాబాణములు దైత్యుల మేనులు సించి పర్వతకందరముల వెలువడుపాములట్లు నెత్తురుటేఱులు పఱవ వెడలివచ్చుటయు వారు నేలంగూలిరి. అంత నమరు లార్చిపేర్చి వివిధవాద్యముల మ్రోయించినం దానవులు గినిసి తాము ను నానావిధవాదిత్రముల మ్రోయించి సింహనాదములు సేసి వివిధాయుధపాణులై తాఁకుటయు నపు డాయిరువాగుల వారిపోరు ఘోరం బయ్యె. అంత మహిషాసురుఁ డొక మహాగిరిశిఖరముఁ గేల నమర్చికొని యతిత్వరితగతిం బఱతెంచి దేవసైన్యంబుమీఁదం బడవైచుటయు నాకొండతాఁకునం జేసి యాసైన్యంబునం బదివేవురు పొడియైరి. తక్కటివారు క్షుద్రమృగములు సింహమునకుంబోలె వానికి వెఱచి తమతమయాయుధములం బడవైచి కాందిశీకు లైరి. అంత నిలువక యామహిషాసురుఁడు కోపాటోపదీపితుండై వారలం దఱిమి రుద్రురథమునెగఁ బట్టినం దైత్యులు హరుఁ డదె చిక్కె. మనము గెలిచితి మని సింహనాదములఁ జేసిరి. దేవతలు మహర్షులును భయం బందిరి. అపుడు త్రిపురాంతకుఁ డాదుష్టరాక్షసుం బరిమార్పఁగ షణ్ముఖుం దలంచిన నతండు లోహితాంబరమాల్యభూషణధరుండై పసిండిమెయిమఱువు దొడిగి లోహితాశ్వంబులం బూన్చినకాంచనస్యందనం బెక్కి క్రోధఘూర్ణమానుండై యురువడించి యమ్మహిషాసురుం దలపడి శక్తిం బ్రయోగించుటయు నాదివ్యసాధనప్రహారంబునఁ బగిలి వానితల నేలం బడి యుత్తరకురుదేశమార్గమున షోడశయోజనప్రమాణం బావరించె. దానంజేసి యాదేశంబు జనుల కగమ్యం బై యుండు. మఱియు రుద్రసూనుండు పలుమాఱులు శక్తిం బ్రయోగించి తదీయసైన్యంబుఁ బొరివుచ్చె. అందుఁ గొంద ఱనికిఁ దొలంగి పాఱిపోవుచుండినం

జూచి షణ్ముఖపార్షదు లెయిది పట్టి చించిచెండాడి తదీయమాంసములఁ దిని రుధిరంబుఁ ద్రావి సంతృప్తులైరి. అవ్విధమున ముహూర్తమాత్రంబుననే సూర్యుఁడు చీఁకట్లనుంబోలె, వహ్ని శుష్కవృక్షములనుంబోలె, వాయువు మేఘములనుంబోలె స్కందుఁడు దానవులనెల్ల సమయించి మహేశ్వరుచరణంబుల కెఱఁగి యతనిమెప్పు వడసి దేవతల ప్రశంసావచనముల నాలింపుచుండునంతఁ బురందరుండు గాఢాదరమునఁ బునఃపునరాలింగనంబుఁ జేసి మహాసేనా,నీశౌర్యముగ్గడింపఁ గొలఁదియే? బ్రహ్మవరప్రభావమున మదించి దేవతలఁ దృణముగనైనను భావింపనియీలోకకంటకుఁడు నీచేతం బొలిసె. మఱియు నీసంగరమునఁనిపుడు వానివంటివారు పెక్కండ్రు హతులైరి. నీపార్షదులుం గొందఱఁ జంపిరి. త్రిపురాంతకుం డెట్లట్ల నీవును సంగరాంగణంబున శత్రువుల కజేయుఁడవు. ఈనీప్రథమకృత్యంబు దేవత లెల్లపుడుం గొనియాడుదురు. ముల్లోకముల నీకీర్తి యక్షయ్యంబయ్యెడి. సురలెల్ల నీకు వశవర్తు లగుదు రనిచెప్పియతని వీడ్కొని మహాదేవు నానతిఁ గొని యింద్రుఁడు నిజలోకమునకుఁ జనియె. రుద్రుఁడు దేవతలఁ బిలిచి నన్నుఁ జూచువిధమున నీకుమారుం జూచునది యనిబోధించి భద్రవటముఁ జేర నరిగె. సురలుం దమతమనెలవుల కరిగిరి. ఇట్లొక్కపగలున స్కందుఁడు దానవులనెల్లఁ బరిమార్చి మహర్షులయు సురలయుఁ బొగడికలఁ బడసె. ఈకుమారచరిత్రము పఠించినవారు తుష్టిపుష్టిసమన్వితులై స్కందసాలోక్యముఁ గాంతు రనిచెప్పినం బాండవాగ్రజుండు మునీంద్రా, త్రైలోక్యవిశ్రుతంబు లయిన స్కందునినామంబుల వినవలతు ననియడుగ నాగ్నేయుఁడు, స్కందుఁడు, దీప్తకీర్తి యనునివి మొదలుగా వాసుదేవప్రియుఁడు, ప్రియుఁడు, ప్రియకృత్తనునివి తుదగాఁ గలనామంబుల నుపన్యసించి మార్కండేయుండుపాండవేయా, యీనామములఁ బఠించిన స్వర్గకీర్తిధనములు సేకూఱు. మఱియు నాచెప్పెడి తదీయస్తోత్రంబుఁ బఠించినను వినినను ధనాయుర్యశఃపుత్రజయతుష్టిపుష్టి స్కందసాలోక్యములు లభించు ననియాస్తోత్రమును మార్కండేయుండు పాండవేయునకు వివరించినం దదీయవచనోపన్యాసము నందఱుం బ్రశంసించిరి.

## సత్యాద్రౌపదీసంవాదము.

ఇవ్విధమునఁ బాండవులు వాసుదేవసమన్వితులై బ్రాహ్మణులతో నభిమతకథాసల్లాపంబు సేయుచుండ ద్రౌపదియు సత్యభామయు నాశ్రమాభ్యంతరమున నిష్టగోష్ఠిం బ్రవర్తించుచుండిరి. అట్టియెడ సత్యభామ ద్రౌపది నేకాంతమునం జీరి యాజ్ఞసేనీ, లోకపాలసన్నిభు లత్యంతబలవిక్రములు నగుపాండునందనులేవురు నెల్లపుడు నీకు వశ్యులై కోప మించుకేనియు లేక పరమాదరంబున నీమొగంబ చూచుచుండుదురు. ఇందులకుఁ గతం బేమియో? తెలియకున్నదాన,

అది వ్రతప్రభావంబో? మంత్రౌషధమూలికాప్రయోగమహిమంబో? విద్యాజప హోమాదిచాతుర్యంబో? తెలియఁ బలికితివేని నేను నట్లు చేసి కృష్ణుని వశీకరించికొందు ననినఁ బరమపతివ్రతాశిరోరత్నం బైనపాంచాలి సాత్రాజితి కిట్లనియె. సత్యభామా, నన్నిట్లడుగ నీకుఁ దగునే? అది యసతులసమాచారం బుగాదే? భువనవంద్యుఁ డయినవాసుదేవున కిల్లాలవయ్యు నీ విట్టివి దలంచుట యెంతయు నొప్పదు. మగవారల వశీకరించికొనఁ గోరి మందులు వెట్టి మంత్రములఁ బ్రయోగించిన వారు తత్సేవనమున వివిధరోగపీడితులై యంగవైకల్యంబు నింద్రియవైకల్యంబునుం బొందుదురు. కావునఁ బతులయెడ నట్టిదుర్వ్యాపారములఁ జేయుభార్యలు వారలఁ జంపఁ దలఁచినవారలే. మఱియు నాచెడునడతలు మగవా రెఱింగిరేని యింట నున్నపాముంబోలె నాచెడ్డయిల్లాండ్రం జూచి యెల్లపుడు వెఱచియుండుదురు. వెఱపు నిత్యం బైయుండునేని శాంతి యలవడమిం జేసి సుఖము సున్న యగు. కావునఁ గులాంగనలు మగవారికి విప్రియం బగుపని సేయరాదు. మహాత్ము లయినపాండుపుత్రుల కేను బ్రీతిపాత్రం బయినవిధంబుఁ జెప్పెద నాకర్ణింపుము. కామక్రోధాదుల కెడ ఖియ్యక మగలమది కెక్కినదానఁగా యనిగర్వింపక నియమముతో నెల్లవేళలం బతులచిత్తములకు మెప్పుగాఁ బరిచర్యలు సేయుదు. చెడునడతల కన్నింటికి దవ్వుగలుగ మెలఁగుదు. పరపురుషుఁడు రూపవంతుఁడై నను, ధనవంతుఁడై నను, దేవుఁడై నను, గంధర్వుఁడై నను, మనుష్యుఁడై ననుం గన్నెత్తి చూడను. పతులకంటె ముందు స్నానాసనశయన భోజనములం జేయను. ఎచ్చటనుండియేనియు వా రిలు సొచ్చిరేని ముందుగ లేచి పరిచారికలు సేయుదు రని యేమఱక నేన యర్ఘ్యపాద్యాసనాదులఁ బరిచరింతు. పాకమునను, గృహపాత్రశోధనమునను, ధాన్యవీక్షణాదిగృహకార్యమునను జాగరూకనై వారి కింపుగా సమయమున మృష్టాన్నంబుఁ గుడువఁ బెట్టుదు. వారి మాటల కెదురు చెప్పను. చెడిపెలతోడం జెలిమి సేయను. ఆలస్య మించుకయు లేక యనుకూలప్రవర్తనై యుండుదు. పరిహాసాదికారణంబులు లేకయే యసమయముల నవ్వను. యుక్తకారణము గలిగినను మిక్కిలి నవ్వను. తలవాకిట నిలువను. విణ్మూత్రవిసర్జనస్థానమునఁ బెద్దయుంబ్రొద్దు తడవుసేయను. ఇంటితోఁటలనైన నొంటిమై విహరింపను. పతు లెద్ది చెప్పినం గోప మొక్కింతయుం బూనను. కార్యార్థంబు మగవారు దేశాంతరమున కరిగిరేని గంధమాల్యాద్యలంకారముల విడిచి వారు వచ్చునందాఁక వ్రతము సల్పుదు. పతుల కింపుగాని పానభోజనశయనాసనాదుల విడిచియుందు. పతులు సవతులతోడిగోష్ఠి నుండుదురేని యందు కసూయపడను. పాండవులు మృదు లనినిరాకరింపక సత్యధర్మనిరతు లయిన యామహానుభావులు గినిసిరేని యాశీవిషంబులం బోలుదు రనుభ

యంబుతో నడఁకువ మెఱయ వారియానతిచొప్పున నలంకారాదులం గ్రహించి చిత్తానువర్తనంబు సేయుచుండుదు. వారిమాట మీఱి శయనాసనభోజనాలంకారముల నొనరింపను. స్త్రీలకుఁ బతిశుశ్రూషయే పరమధర్మంబు గావునఁ బతులే పరమదైవ మనుభావముతో వారలఁ గొలిచియుందు. పతికి విరుద్ధముగ నడిచిన యతివ కెన్నఁడైనం గతి గలుగనేర్చునే? అత్త బోధించినట్లు భిక్ష మిడుట, బలి సేయుట, శ్రాద్ధమునం దోడ్పడుట, పర్వస్థాలీపాకంబులు నడుపుట, మాన్యులఁ బూజించుట మున్నుగాఁ గలుగుకుటుంబధర్మములఁ దెలిసినంతకు నేమఱక యేలుంబవళ్లు నడుపుచుండుదు. మాయత్త యగుకుంతీదేవికి స్నానపాన భోజనాచ్ఛాదనాద్యుపచారములఁ బరిచారికల నియోగింపక నేన సల్పుదు. అత్త మాటకు మాఱు సెప్పను. ఆమె యాన తియ్యకముందు భోజనము సేయను. దివ్యవస్త్రముల ధరింపను. తొడవులఁ దొడుగను. మఱియు ధర్మనందనుఁ డింద్రప్రస్థపురమున రాజ్య మేలుచుండినయపు డతనికిముందుగ నిత్యంబు నెనిమిదివేవురుబ్రాహ్మణులును, వేల్వేఱ ముప్పదుంద్రుదాసులు గలయెనుబదివేవురుస్నాతకవ్రతులును, బదివేవురుయతులును బసిండిపళ్లెరముల భుజించువారు. వారికెల్ల భోజనాద్యుపచారములు లెస్సగ నేన విచారింపుచుండుదు. దివ్యమాల్యభూషణాలంకృత లయినలక్షదాసులు పాత్రహస్తలై దివారాత్రము లతిథులకుభోజనము పెట్టుదురు. తత్ప్రకారంబు, నాదాసికలనామరూపంబులను, దదీయభోజనాచ్ఛాదనాదులనుం బ్రతిదినంబు నరయుచుండుదు. లక్షయేనుంగు లన్నిగుఱ్ఱంబులు నింద్రప్రస్థమున యుధిష్ఠిరునగరుమొగసాల నుండు. నిత్యంబు వానిమేఁతలఁ దెలిసికొనుచుండుదు. వెండియుఁ బాండవులలాఁతియంతిపురంబుపడఁతులయుఁ దదీయభృత్యులయు నిత్యభోజనాదుల నెఱుంగుచుండుదు. ఇంతయేల? యుధిష్ఠిరునిపోష్యవర్గములోని గోపాలురుతుదిఁగాఁగల సకలజనులయోగక్షేమములఁ బ్రతిదినము విచారింపుచుండుదు. పాండవులభాండాగారమున నాయవ్యయముల నిత్యము విచారించి లెక్కించుచుండుదు. కుటుంబభార మంతయు నామీఁద నునిచి పాండుపుత్రులు సుఖమున వర్తింతురు. నిద్రాహారములు విడిచి యిట్లు రేలుంబవళ్లు నన్నియు విచారించి వేగ జాము గలుగఁ బరుండి పతులకుమున్న మేల్కాంచి యథోక్తక్రమమున వారలకుఁ బరిచర్యలు సేయుదు. నాపరిచర్యకు మెచ్చి వారు నాయెడఁ బ్రీతిమై నున్నవారు. ఇంతియకాని నేను మందుల మంత్రముల నెఱుంగను. ఇది నావృత్తాంత మని చెప్పిన విని సత్యభామ పాండవధర్మపత్నిం గొనియాడి దేవీ, నీపాతివ్రత్యం బింత యొప్పునే! నీచిత్తం బెఱుంగ కడిగితి. క్షమింపుము. చెలులతప్పు నీయట్టివారు గణింపక మేలముగఁ దలంతురుగదా యనివక్కాణించిన విని యాజ్ఞసేనినగుచు సత్యభామకు వెండియునిట్లనియె. సఖీ,

సర్వలోకములందు స్త్రీలకుఁ బతికి మిగిలినదైవము లేదు. అతండు సంతుష్టుఁ డయ్యెనా సర్వకామములు, సంతతి, వివిధభోగములు, స్వర్గము, విపులకీర్తియుం గలుగు. అతండ యలిగెనా యతివ లన్నివిధములం జెడుదురు. నీవుం బతిచిత్తము లోఁజేసికొను నుత్తమమార్గముఁ జెప్పెద. వినుము. ఎన్నియేఁ గష్టము లనుభవించినఁగాని సుఖము చేకూఱదు. కావున సర్వవిధముల శ్రీకృష్ణుఁడు మెచ్చి నీయెడ నెంతయుంగూరిమి సేయునట్లు ప్రేమసౌహార్దములు నెఱయ సకలోపచారముల నుపచరింపుము. వాసుదేవుఁడు నీయింటికి వచ్చుట విందువేని యతండు వాకిటఁ జేరినంతన లేచియుండి లోఁగిలి సొచ్చినంతన పరిచారికలం బంపక నీవే కాళ్ళులు గడిగి యుత్తమాసనమునఁ గూర్చుండఁజేసి పరిచరింపుము. మఱియు నతం డెద్దియేని పనినెపమున దూతిం బంపెనేని యాపని తత్క్షణంబ నీవే చేయుము. దాని నెఱింగిన నతండు నీయెడ నెంతయుం బ్రీతి నెఱపు. వెండియు నతండు సల్లాపసమయమున నెద్దిచెప్పిన నది రహస్యముగాకున్నం బెఱవారితోడం జెప్పవలదు. సవతి యెవ్వతె యేనియు మధుసూదనుం బ్రత్యాఖ్యానంబుఁ జేసిన నీవుం దానివిధమున వర్తింపవలదు. పతికి హితు, లనురక్తులు, బంధులు నగువారలనెల్ల భోజనాదుల నాదరింపుము. అతనికిఁ గానివారలఁ జేర్పవలదు. ప్రమాదంబు లేక పరపురుషుల వృత్తాంతముల మానంబుఁ బూనుము. ప్రద్యుమ్నసాంబాదికుమారవర్గముతో నైనను రహస్యమున సంభాషింపవలదు. దుర్వృత్తుల డగ్గఱఁ జేర్పవలదు. ఉత్తమవనితలతోడఁ జెలిమి సేయుము. ఇట్లువర్తించినం గృష్ణుండు నీయెడ నతిప్రీతుండగు. ఇదికులాంగనలకుత్తమధర్మం బైహికాముష్మికభోగసాధనంబు యశస్కరం బనిచెప్పిన విని సత్యభామ యోపతివ్రతాశిరోమణీ, నీవలన నుత్తమధర్మం బెఱింగితి, నీకఱపిన తెఱఁగున నిఁక నడుతు ననిపలికి పాంచాలిం బలుదెఱంగులఁ బ్రశంసించె.

అట్లుపాండవులయు మార్కండేయాదిమహామునులయు సల్లాపంబుల వినుచుండి పుండరీకాక్షుం డిఁక నేఁ బోయివత్తు నని యందఱకుం దెల్పి తదనుమతుండై రథారోహణంబు సేసె. అపుడు సత్యభామ ద్రౌపదిం బిలిచి మాధవుఁడు యదుపురికిఁ బ్రయాణముసేయ రథారోహణంబు సేయ నున్నవాఁడు. నేనుఁ బోయివత్తు. వనవాసాయాసమునకు మనమున వగవకుము. దేవతుల్యు లయిననీపతులు ప్రతిజ్ఞ తీఱినపిదప ధార్తరాష్ట్రుల వధించి రాజ్య మేలుదురు. నీవు సుఖముల ననుభవింతువు. మీరు వనమునకుఁ దఱలునపుడు నిన్నుఁ జూచినవ్వినకురుస్త్రీ లచిరంబ దుఃఖముల గుడుతురు. మీకుఁ గీడుచేసినవారు యమపురి కరిగినవార యనితలంపుము. నీకొడుకులు ప్రతివింధ్యాదు లిపుడు ద్వారకలో నభిమన్యుతోడఁ గూడి శస్త్రాస్త్రములఁ బ్రవీణులై సుఖమున్నవారు. సుభద్రయు రుక్మి

ణియు నీమాడ్కి వారలఁ బెంచుచున్నవారు. కృష్ణుఁడు ప్రద్యుమ్నాదు లగుతన కొడుకులకంటె నెక్కుడుగా వారల గారవించుచున్నాఁడు. బలరామునిందొట్టియాదవు లందఱు వారలయోగక్షేమము లరయుచుండుదురు. ప్రతిదినమును మామామగారు వారలస్నానపానభోజనాదుల విచారింపుచుండుదురు. ఇఁక నానతి యొసంగు మనిచెప్పి యాసాధ్విని వీడ్కొని కృష్ణరథారోహణంబుసేసె. సర్వజ్ఞుఁ డయినవాసుదేవుఁడుం దదర్థమెల్ల నెఱింగినవాఁడు గావున నగుచు ద్రౌపదిం దగినభంగి నూరార్చి, యెల్లవారిచే ననుమతుండై ద్వారక కరిగె. మార్కండేయుఁడుం బాండవుల వీడ్కొని నిజాశ్రమమునకుఁ జనియె నని వైశంపాయనుఁడు సెప్పిన విని జనమేజయభూకాంతుండు సంతుష్టస్వాంతుం డయ్యె.

చ॥ స్ఫటికము శుద్ధమయ్యును జపాసుమసన్నిధి శోణవర్ణమౌ
నటుల యెవండు దా నగుణుఁడయ్యు నుపాధ్యనుషంగగాఢసం
ఘటితగుణత్రయాశ్రయవికారభిదాగ్రహభావనాపరి
స్ఫుటబహులీలలం బరఁగు బోధమయు న్మది నెంతు నవ్విభున్॥

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమార ముద్దువేంకటమహీపాల కరుణాపురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ వేంకటరంగనామధేయ విరచితం బయినశ్రీమదాంధ్రవచనభారతమునం దరణ్యపర్వంబున నర్జునాగమనంబు, నర్జునుఁడు ధర్మజునకు నివాతకవచపౌలోమకాలకేయవధప్రకారం బెఱింగించుటయు, నస్త్రంబులఁ జూపుటయు, నారదవచనముననదిచాలించుటయు, పాండవులు గంధమాదనమునుండిమగిడివచ్చుటయు, నాజగరంబును, వాసుదేవాగమనంబును, మార్కండేయాగమనంబును, సరస్వతీతార్క్ష్యసంవాదంబును, వైవస్వతమనుచరిత్రంబును, మార్కండేయుఁడు వివిధధర్మముల నెఱింగించుటయు, నింద్రద్యుమ్నోపాఖ్యానంబును, దుంధుమారచరిత్రంబును, పతివ్రతాఖ్యానంబును, ధర్మవ్యాధుఁడు కౌశికునకు ధర్మముల బోధించుటయు, నాంగిరసంబును, గుమారస్వామిచరిత్రంబును, సత్యాద్రౌపదీసంవాదంబునన్నది

తృతీయాశ్వాసము.

శ్రీకాళహస్తీశ్వరాయనమః.

## చతుర్థాశ్వాసప్రారంభము.



క॥ శ్రీ కమలజాండ నామ
వ్యాకోచ పయోజ కర్ణికాభ్యంతర లీ
లాకలిత రాజహంసా
నైకవిధామ్నాయవాక్య కృత మీమాంసా॥
దేవా ననుఁ గృతార్థుం జేయుము.

తదనంతరంబున జనమేజయమహీనాథుండు వైశంపాయనమునినాథుం జూచి మహాత్మా, యివ్విధంబున వనవాసాయాసకర్శితులైనపాండవు లామీఁద నెట్లు వర్తించిరి? తత్ప్రకారం బెఱింగింపవే యనియడుగ నాతాపసేంద్రుఁ డారాజచంద్రున కిట్లనియె.

### ధృతరాష్ట్రుఁడు పాండవులవనవాసక్లేశమునకుఁ జింతించుట.

వాసుదేవుఁడును మార్కండేయుఁడు నరిగినపిదపఁ బాండునందనులు కామ్యకవనవాసము విడిచి యనేకనదీవనపర్వంబులఁ గ్రుమ్మరుచు ద్వైతవనముఁ జేరి యచటిసరోవరముతీరమునఁ బర్ణశాలలు గావించికొని నివసించి తపస్స్వాధ్యాయనిరతులైన బ్రాహ్మణోత్తము లనేకులు తమ్ముఁ జూడ వచ్చిన నందఱం బరమభక్తిమైఁ బూజించుచుండిరి. అం దొక్కబ్రాహ్మణుండు యాదృచ్ఛికంబుగాఁ గరిపురి కరిగి ధృతరాష్ట్రునెద్దకుఁ జనుటయు నాకురునృపాలవర్యుఁ డతని సత్కరించి యుచితాసనమునం గూర్చుండఁ జెప్పి యయ్యా, యెచ్చటినుండి రాక? ఏమి విశేషం బనియడుగ నతండు నృపాలా, ద్వైతవనమునుండి వచ్చుచున్నవాఁడ. అచ్చటఁ బాండుపుత్రులు శీతవాతాతపకర్శితులై కడు నిడుమలు గుడుచుచున్నవారు. వీరనాథయయ్యుఁ బాంచాలి యనాథపోలె వనటలపాలై యున్న దని చెప్పిన విని ధృతరాష్ట్రుఁడు తనమనంబున వారియిడుమ లెల్లఁ దనయుపేక్షవలనఁ గలిగినవియకాఁ దలంచి శోకావిలమానసుండై కొంతవడి నిట్టూర్పులు నిగుడించుచుఁ బలుకకుండి యెట్టకేలకు డెంద మొకతెఱంగున నిల్పుకొని యిట్లనియె. అక్కటా! సత్యధర్మనిరతుఁ, డార్యచరితుఁ, డజాతశత్రుఁడు, కొడుకులలోనెల్లం బెద్దవాఁ డగుధర్మరాజు దేవేంద్రవిభవంబు మెఱయ రాజ్య మేలుచు మెత్తనిపాన్పుపైఁ బవ్వళించి వేఁబోకట వీనుల కింపగువందిమాగధమంగళస్తుతిరవముల మేల్కాంచువాఁ డిపు డడవులం గటికిఱాతిపట్టులం గూర్కుచు విహంగమకోలాహలముల మేల్కనుచుండు. సుఖముగ నుండవలసినవాఁ డయ్యు భీముఁ డెండకు వానకుఁ జలికి

నోర్వలేక కృశించి నేలం బరుండి నాకొడుకులచెనఁటిచేఁతలఁ దలంచి పాంచాలినిం గాంచి యుగ్రమూర్తియై యాశీషమువడువున రోఁజుచు రేలెల్ల నిదుర పోవక యేయుండు. అన్నలు దమ్ములు ప్రియాంగనయుం గుడుచునిడుమలఁ జూచుచు నర్జునుండు నానుతులయెడం గోపవివశుఁడయ్యు ధర్మనందనునాజ్ఞఁ మీఱ నేరక రేలెల్లఁ జింతించుచుండు. అతిసుకుమారులైన నకులసహదేవులు సత్యధర్మములకుఁ జిక్కి యిపు డేమియుం జేయనేరక యిడుమలఁ గుడుచుచుండుదురు. ధర్మరాజుడెందమున నంతగఁ గోప ముండదు. అర్జునుఁడు నతనిచిత్తము మెయి నడచుఁగాని వాయుబలుఁడైనవాయుసుతునిమనమునఁ గోప మాఱునే? అతండు సత్యప్రతిజ్ఞ నెఱవేర్పఁబూనినయన్నమాట మీఱలేక యెట్లోయిన్నినాళ్లు మిన్నకున్నవాఁడు. రాత్రులశయనించియు మనంబునఁ గోపానలంబు దరికొనఁగ రోఁజుచు నేల నిటునటంబొరలుచు నాకొడుకులచావు గోరుచుఁ గాలముఁ బ్రతీక్షించియుండు. ఆనాఁడు దుర్ద్యూతమున నజాతశత్రుఁ డోటువడి చింతాక్రాంతుండై యుండ దుశ్శాసనుఁ డాడినప్రల్లదములుపేర్చినకార్చిచ్చు శుష్కతృణంబుల నెట్లట్లవానిమేను నెరియింపకుండునే? మఱియు నిపు డాకోపానలము వనవాసాయాసమునం జేసి గాడ్పుతోడ్పడినట్లు మఱింత మండకుండునే? ఆక్రోధాగ్నిం గ్రాఁగి వాఁడు చేతులఁ జఱచి మదీయపుత్రపౌత్రులనెల్లఁ గాల్చురీతి వేఁడినిట్టూర్పుల నిగిడింపకుండునే? కాలాంతకసదృశుఁడైనవానికట్టివాఁడ యగుసవ్యసాచి సహాయుండైన వారిరువురు పిడుగులంబోనివాఁడితూపులఁ గురియించి శత్రుసైన్యము నిర్మూలంబుఁ జేయుదురుగాని కొంచెమైన మిగిలింతురే? అయ్యర్జునుఁడు నిపుడు మునుపటి వాఁడు గాఁడు. ఇంద్రలోకమున కరిగి దేవతలవలన దివ్యాస్త్రముల సాధించికొని వచ్చినవాఁడఁట. ఈమేన నీలోకమునుండి యాలోకమునకుఁ జని మగిడి వచ్చువాఁడుం గలఁడే? ఏమి చెప్పుదు. విల్లు గాండీవమఁట. విలుకాఁడు సవ్యసాచియఁట. అస్త్రములు దివ్యములఁట. ఇఁక వానిం బోర మార్కొని బ్రదికివచ్చువాఁడుం గలుగనేర్చునే? తప్పినం బ్రాణహాని యగునని విచారింపక యప్పటికొదవినబుద్ధితోఁ దేనెను గొనఁ బూనుమధుహారులచందమున దుర్యోధనదుశ్శాసనకర్ణసౌబలులు మందమతులై మీఁదఁ గలుగుకీడు నెఱుంగక పాపపుజూదమాడి ధర్మనిరతు లయినపాండవులరాజ్య మొడిచికొని వారితోడఁ బగఁ జేసికొనిరి. ధర్మపుత్రుఁడైన నాజూద మాడకుండఁడయ్యె. నేనుం జెడ్డకొడుకులమతంబ యనువర్తించితిఁగాని యిది తగదని యాపాపకృత్యంబు వారింపనైతి. మోసపోయితి. అంతయుం బరికించిచూచినం గౌరవులకుఁ జేటుకాల మాసన్నమయ్యెననియతోఁచెడి. ఇఁకఁ గడచినపనికి వగచినం బ్రయోజనంబు గలుగునే? కానున్నది కాక నిలుచునే? శుభాశుభకర్మములఁ జేసి పురుషుఁడు తత్ఫలముఁ గుడు

వనవలయుఁగాని యది తప్పనేరదు. సుక్షేత్రంబు లెస్సగ దున్ని మంచివిత్తులఁ జల్లిన నుచితకాలమున వర్షమునుం గురిసెనేని యది పండకమానునే? దైవవశమున నగువానిఁ దప్పింప నేరికి నలవిగాదు. ఎవ్వఁడుం బ్రేరింపకున్నను వాయువు తనంతన వీచు. గర్భిణి యుచితకాలమునఁ దనంతన ప్రసవించు. పగలు రానుండఁగ రాత్రి నశించువిధమునను, రాత్రి రానుండఁగఁ బగలు నశించుతెఱంగునను సుఖసమయమునన్ని హితంబయ్యెనేని దుఃఖమును, దుఃఖసమయ మాసన్నమయ్యెనేని సుఖమును నడంగు. దుర్యోధనుదురుద్యోగమున నిట్లు వాటిల్లె. దుర్నయపరుఁ డైనవాఁ డది యేల చేయకుండు. వానినిమిత్తమునఁ బలుదెఱంగుల నిడుమలఁ గుడిచినపాండవు లిఁక నూరకుండుదురే? ఇఁకనైన యుక్త మరసి దుర్యోధనుఁడు వారిసొమ్ము వారి కిచ్చిన మే లగు. వాఁ డట్లు చేయునే? ఇదియెల్ల నెట్లు పొసఁగునొ? వారికి వీరికి భేదము లేకుండ సంధి చేసి తదీయరాజ్యము వారి కిచ్చుటయ లగ్గు. సంధి పొసఁగదేని యెన్నియేఁ గీడులు మూడుట నిక్కంబు. కర్మగతి ప్రకారం బె ట్లున్నదో యని పలువిధములఁ జింతించుచుండ శకుని యతనిపరివేదనం బాలించి కర్ణున కంతయుం దెల్పి తదాకర్ణనవ్యథితచిత్తుఁ డైనయారాధేయుం దోడ్కొని దుర్యోధనునొద్ద కరిగి యేకాంతమున నంతయుం దెల్పిన నతండు నందుకు వగచుచుండఁ గర్ణుఁడు దుర్యోధనున కిట్లనియె.

**కర్ణశకునిదుర్యోధనులు మంతనంబు చేయుట.**

రాజేంద్రా, వీరశేఖరు లైనపాండుపుత్రుల నిజబుద్ధిబలమున వనగతులఁ జేసితివి. ఇంద్రప్రస్థపురమున యుధిష్ఠిరుఁడు రాజ్య మేలుచుండ నతనిఁ జేరినలక్ష్మి యంతయు నిపుడు నిన్నుఁ జేరియున్నది. ప్రాచ్యులు, దాక్షిణాత్యులు, ప్రతీచ్య, లుదీచ్యులు నగురాజులెల్ల నీకుఁ గప్పములఁ గట్టుచు నీశాసనమున నున్నవారు. సముద్రవలయితమహీమండలంబు నీవశంబై యున్నది. బ్రాహ్మణప్రశంసావచనంబులను రాజులపూజలనుం గొనుచుఁ బ్రతాపమున సురలలో సూర్యునిమాడ్కి రాజులలో నీవు దేజరిల్లుచున్నవాఁడవు. రుద్రపరివృతుం డైనయమునిచాడ్పునను, మరుద్గణసేవితుం డైనవాసవునికై వడిని, నక్షత్రగణపరివేష్టితుం డైనచంద్రుని కరణిని నీవు కౌరవపరివృతుండవై వెలింగెదువు. తమ్ములతోడ నభిమతసుఖములనుభవించుచు దేవేంద్రవిభవంబు మెఱయ భూమండలం బెల్ల నేలుము. నీయాజ్ఞ నాదరింపనిపాండవులు సంపదలఁ బాసి యడవులపా లైరి. వార లిపుడు వనవాసనిరతు లయినబ్రాహ్మణులతోడ ద్వైతవనమున నున్నవారఁట. రాజ్యస్థితుఁడు సంపత్సమృద్ధుఁడు నగునీ విపు డాద్వైతవనమునకు సకలపరివారముతోడ నరిగి రాజ్యభ్రష్టులు సంపద్విరహితులు నగునాపాండవులకు నీదగుసకలవిభవంబులం జూపి నిదాఘసమయమధ్యందినమార్తండుని విధంబున వారికన్నులకు సంతా

పంబుఁ గావింపుము. నహుషపుత్రుఁడై నయయాతివిధమున మహితలక్ష్మీవిలసితుండవై భద్రగజము నారోహించిననిన్నుఁ గనుఁగొని వార లడలవలయు. మిత్రుల నలరించుట శత్రులఁ గుందించుట యనురెండు విభవంబుకలిమికి ముఖ్యఫలములు. కొండ యెక్కినవాఁడు నేల నున్నవారలఁ జూచువిధమున సకలవిభవోన్నతపదమున నుండి కడు విషమములఁ గుడుచుచుండుశత్రులఁ జూచుకంటె సుఖము మఱియొకటి గలుగనేర్చునే? పుత్రలాభము, ధనలాభము, రాజ్యలాభము నిందుకు సరిగావు. నారలు గట్టి పర్ణశాలలు నెలవుగా నున్నయర్జునుం గనుంగొనుకంటె నెండొకసుఖము గలుగనేరదని నామతంబు. దివ్యదుకూలములఁ దాల్చి మేలితొడవులఁ దొడిగి వివిధభోగముల సుఖంపుచున్న నీయంతఃపురాంగనలు నారచీరలు గట్టి కడు నిడుమలఁ గుందుచున్న పాంచాలిం గనుంగొందురుగాక. అదియు నీవారలఁ జూచి తనబ్రదుకు నిందించుకొనుఁగాక. ఆసభలో నాఁడు కట్టుచీర లొల్చునప్పటిదుఃఖముకంటె దాని కిది యెక్కుడై డెంద ములఁచు. ఈపని యవశ్యంబు చేయనవలయు ననిచెప్పుటయు శకుని యిది యిప్పటి కెంతయుం బోలినపని యని యతనిమాట నియ్యకొనియె. వారలయభిప్రాయంబుఁ దెలిసి దుర్యోధనుఁడు సంతుష్టుఁడయ్యు నిది కొనసాగదొకో యనుసందియంబునం జేసి యించుక దైన్యంబు దోఁపఁ గర్ణున కిట్లనియె. రాధేయా, నీచెప్పినయభిప్రాయము నామదిం గలదుగాని యది సాగు నని నాకుఁ దోఁపదు. ద్వైతవనమునకుఁ బోవలయునన్న మాతండ్రి యచటఁ బాండవు లుండుటంజేసి యనుజ్ఞఁ జేయఁడు. అతండు వారలఁగూర్చి పలవించినవిధంబు మీరు నింతకుమున్న వింటిరిగదా. తపోబలయోగముల వారు మనకంటె నధికు లని యతఁ డెప్పుడుం దలంచు. ఎన్నియే నుపాయములు వన్ని మన మియ్యకొలుపఁ బూనిన నతండు మీఁదువిచారించుఁగాని యనుమతి సేయఁడు. వారలఁ గనలించుటతక్కఁ దక్కటిదెద్దియు మన కావనమునఁ గార్య మున్నదె? ద్యూతసమయమున విదురుఁడు నిన్ను, నన్ను, శకునినిం గూర్చి పలికినపలుకులు నీకుం దెల్లంబగదా. అంతయుం బరికించిచూచిన మనతలంపు కొనసాగ దనియతోఁచుచున్నయది. అడవుల నిడుమలఁ గుడుచుచున్నవారలఁ జూచుటకంటె నా కీరాజ్యలాభంబునుం బ్రియంబుగాదు. నారలు గట్టినపాంచాలిం జూచుకంటె నెండొక్కటి యెక్కుడగునే? దుఃఖసాగరమగ్నులయినపాండవుల వివిధవిభవవిలసితుండనై చూచితినేని నాబ్రదుకు సఫలం బగు. రాజు నియ్యకొలుపఁగ నుపాయం బెద్దియో? యెఱుఁగకుండెద. నీవును, శకునియు, దుశ్శాసనుఁడు నాలోచించి రేపకడ నిర్ణయించి చెప్పుఁడు. నిపుణముగఁ గురుపితామహుం డైనభీష్ముని మాతండ్రిని నియ్యకొల్పి యట నవ్వనమునకుఁ బోవుదమనిచెప్పి వారల వీడ్కొలిపె. వారుం దమతమయిండ్లకుఁ జనిరి. దుర్యోధనుఁడు

నారాత్రి సముచితప్రకారంబునఁ గడపె. అట మఱునాఁడు వఱువాఁతన రాధే యుఁడు దుర్యోధనుపాలికి వచ్చి శకునిదుశ్శాసనులు వినుచుండ నవ్వుచు మహా రాజా నే నొకయుపాయ మూహించితి విన్నవించెదఁ జిత్తగింపు మని యిట్లని యెె. ఆవులమంద లన్నియు నిపుడు ద్వైతవనమున నున్నయవి. వానిం జూచి వానికిఁ గ్రూళమెకములవలని వెఱపు గలుగకుండ రక్షణంబుఁ గావించుట నీకు ముఖ్యంబు. కావున ఘోషయాత్రావ్యాజమున మన మవ్వనమునకుఁ బోఁదగు. ధృతరాష్ట్రమహీపాలుఁ డిందు కవశ్య మనుజ్ఞ సేయు ననిన విని శకుని నగుచు నేనుం దీనిన యాలోచించితి. ఇదియ నిరపాయం బైనయుపాయంబు. కురువర్యున కీయర్థంబు విన్నవించి యానతిం బడయుద మనిపలుకుటయు వా రందఱు నవ్వుచు నొండొరులచేతులఁ జఱచుచు నావులు ద్వైతవనమున నున్నయవియని ధృతరా ష్ట్రునకుఁ దెల్పఁగ సమంగుఁ డనుగొల్లవాని నేర్పఱిచి వానిం దోడ్కొని యాకురు నృపాలుపాలికిఁ జని పరస్పరకుశలప్రశ్నంబు నడపి యుచితాసనములఁ గూర్చుండిరి.

## కర్ణశకునులు ఘోషయాత్రకు ధృతరాష్ట్రునసుజ్ఞఁ గొనుట.

అపుడు తొలుత వా రేర్పఱిచి తోడ్కొని పోయినసమంగుఁ డనుగొల్ల వాఁడు ధృతరాష్ట్రునకు మ్రొక్కి మహారాజా, గోగణము లన్నియు నిపు డీచెం గట ద్వైతవనమున నున్నయవి. ఆవనము పసులకు మిగులసుఖనివాసమై యుండు. దుష్టమృగభయము లేకుండ రక్షింపవలయు. ఇది మనవి చేయ వచ్చితి ననివిన్న వించినం గర్ణశకునులు ధృతరాష్ట్రున కిట్లనిరి. రాజేంద్రా, గోగణము లన్నియు నిపు డుచితరమ్యదేశములందు సుఖముండుటం జేసి భవత్పుత్రుఁ డైనదుర్యోధనుఁ డచ్చటి కరిగి క్రేపులు మొదవులు మొదలగువానికి గుఱుతు లేర్పఱిచి వానినెల్ల లెస్సగఁ గావఁగఁ దగువారల నియమించి క్రూరమృగభయము వాయ వేఁటలాడ నియ్యది యవసరంబు. అనుజ్ఞ సేయవలయు నని నివేదించిన విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె. గోవులఁ బరిశీలించుట లెస్స. తదర్థము వేఁటపోవుట యుచితంబు. ఐనను గొల్లవాండ్రమాటల విని నమ్మికమై నటకుఁ బోఁదగదు. మీరు కావించినకపట ద్యూతమున నోడి వనవాసాయాసకర్శితు లై సపాండురాజపుత్రు లిపు డచ్చో టికిఁ గుఱిఁగటన యున్నవా రని తెలియవచ్చినది. వారలు సమర్థులు. తపోధనులు. కావున మీ రచ్చోటికిఁ బోవుటకు నే నియ్యకొనను. ధర్మనందనుఁ డంతగఁ గినుకఁ బూనఁడు. అర్జునాదులు నతనిమతం బనువర్తింతురుగాని భీమసేనుఁ డేవేళలను మీయెడ నుగ్రమూర్తియె. ద్రౌపది యనఁ జెనకరాని తేజంబె. గర్వమోహా క్రాంతు లగుమీ రచటికిఁ బోయితి రేని వారల కెగ్గుఁ జేయకమానరు. అందుకుఁ గినిసి వారు తపోమహిమమున నొండె శస్త్రాస్త్రతేజమున నొండె మిమ్ము దహింపఁ జూతురు. మీరు నటమీఁద నూరకుండక పెక్కండ్రము గల మనుగర్వమున

నెల్లయిన వారి నాక్షేపింతురు. అట ననర్థము పుట్టక తప్పదు. ఇంతకు మున్న సవ్యసాచి యింద్రలోకమున కరిగి దివ్యాస్త్రముల సాధించికొని వచ్చినవాఁడు. వాఁడు వాని సాధింపకమున్న భూమండలమునం గలమేటివిలుకాండ్ర నెల్ల నేలకుఁ గోలకుఁ దెచ్చినవాఁడు. కృతాస్త్రుఁ డైనయతని కిపుడు మిమ్ము వధించుటయు నొక పెద్దపనియే? మీ రందఱును నామాట విని యొకవేళ వారి కెగ్గుఁ జేయ రేనియుఁ బెక్కండ్రు సైనికులలో నెవ్వఁడేనియుఁ దప్పొకయింతయేనియుం జేయకుండునే? మీరు బుద్ధిపూర్వకముగఁ జేయకున్న నాదోషమెల్ల మీవలనఁ గలిగినయదియకా వారు దలంతురు. కావున గోగణప్రత్యవేక్షణార్థంబు లాంటివారి నెవ్వరినేనియుం బంపుట లగ్గు. మీరే పోవుట నా కెంతయు నొప్పనిపని యనిన శకుని యతని కిట్లనియె. మేము వారల కెగ్గుఁ జేయము. ఒకవేళ మేము సేసితిమేనియు ధార్మిక వరేణ్యుఁ డైనధర్మరాజు ధర్మముమెయి నడచుఁగాని యొకప్పుడైన నధర్మముఁ దలంచునే? అతం డాసభలోఁ బెద్ద లనేకులు వినుచుండ వనవాసప్రతిజ్ఞ చేసిన వాఁడుగదా. తమ్ములునతనిచిత్తము ననువర్తించియే యుండుదురుగాని మాయెడఁ గినియరు. మేము నచటికిఁ బోయి గోగణము లారసి వేటలాడుచుఁ గొన్నినాళ్లు వేడుకమై వసించివత్తుము. ఇదియే మాకోరిక. పరిజనులలో నెవ్వరును వారి కప రాధము సేయకుండఁ జూచికొందుము. విశేషమేల? మేము వారున్నచోటికైనం జనము. వారలఁ జూడము. అనుజ్ఞ సేయు మని సవినయముగ విన్నవించిన నవ్వ చనము నాకర్ణించి ధృతరాష్ట్రుఁ డట్టకేలకు సమ్మతించె.

### దుర్యోధనుఁడు ఘోషయాత్రపోవుట.

అట్లు ధృతరాష్ట్రునినుజ్ఞఁ గొని దుర్యోధనుఁ డత్యంతసంతుష్టహృద యుండై ఘోషయాత్రపోవుటఁ బురమున నెల్లచోట్లం జాటించి యెనిమిదివేల రథములు, ముప్పదివేలయేనుఁగులు, తొంబదివేలగుఱ్ఱములు, బహుసహస్రసం ఖ్యాకు లగుకాలరు, పెక్కండ్రు వేటకాఱు, వందిమాగధబృందములు, వివిధ వస్తుసంభారసంభృతాపణగణములు, శకటనికరములుం దోడ నరుదేరఁ జిత్తతి తతి జంఝానిలస్వనంబుమాడ్కిఁ బరిజనకోలాహలంబునింగిముట్టఁగఁ దఱలె. తఱలి నాఁడు క్రోశద్వయమాత్రమరిగి యచట విడిదలఁ గావించి మఱునాఁడు ప్రస్థాన మొనరించి క్రమమున ద్వైతవనము సేరం జని యొక్కచో శిబిరము నియమించి యట ఘోషములకుఁ బోయి గోగణములఁ గాంచి వేఱువేఱ మొద వులఁ గ్రేపుల బలీవర్దముల మహోక్షములఁ దర్శకములవివిధవర్ణములవాని నేర్ప ఱిచి ప్రత్యేకంబ యన్నింటికి నడియాలములు గావించి తత్పోషణవ్యగ్రు లయినగో పాలురకభిమతము లొసఁగి యాదరించి తదీయనృత్తగీతములకు మెచ్చుచుఁ బుత్ర మిత్ర కళత్రబంధుజనులతోడ గోరసాస్వాదనపరుండై యభిమతవిహారముల సల్పు

చుండిమృగయాసక్తుండై గొన్నినాళ్లు వేటకాండ్రం గూర్చికొని వివిధమృగనివహ ముల వధియించి పదపడి మత్తమధుకరనికరమధురగీతమంజులంబులు, కలకంఠ కులకలకలారావరమణీయంబులు, ప్రౌఢమయూరవారకేంకారభాసురంబులు, వకుళపున్నాగసప్తపర్ణప్రముఖమహీరుహనివహవిలసితంబులు, రమ్యరాజీవసరో వరవిరాజితంబులు నగునావనప్రదేశముల విహరించుచుండి క్రమంబున ద్వైత వనసరోవరముం జేరం జనియె. అప్పు డాసరోవరముతీరమున ధర్మరాజు వన్యము లగుఫలమూలములు పదార్థములుగా సమకట్టి సద్యస్కం బనురాజర్షియజ్ఞము సేయంగ ధర్మపత్నియైనద్రౌపదితోడ దీక్షితుండై యుండె. దుర్యోధనుం డాస రోవరముతీరమునన దమకు విడిదలలు గావింపం బరిచారకుల నియమించుటయు వారు తత్క్షణంబ యాకొలను డాయంబోయినం గంధర్వభటులు లడ్డమువచ్చి యయ్యా, మీా రిటకు రావలదు. ఇచ్చటం జిత్రసేనుం డనుగంధర్వరాజు క్రీడా ర్థంబుగ నప్సరోగణపరివృతుండై వచ్చియున్నవాఁడు. తొలంగి పొండని నివారిం చిరి. కౌరవభటులు లటం గురునృపాలుపాలికిం జనుదెంచి గంధర్వవచన మెఱింగిం చిన విని దుర్మదాంధుం డైనదుర్యోధనుండు యుద్ధదుర్మదు లైనతనసైనికులం బిలిచి యాగంధర్వులనెల్ల వెడలం గొట్టునది యనిపనిచె. పనివిని వార లాచెం గటికొలనుం జేరం జని గంధర్వులారా, ధృతరాష్ట్రపుత్రుండు బలవంతుండు నగు దుర్యోధనుం డిచట విహరింప వచ్చినవాఁడు. మీార లిచ్చోటు వాసి చనుఁడు. ఇది యారాజుపం పనవుడు గంధర్వులు పకపకనగి యిట్లనిరి. మీారాజు తనకుం బెఱవారికిం గలయంతరం మెఱుంగఁడుగాం బోలు. ఎఱింగియుండునేని కోమటు లంబోలె మమ్ము నియమించునే? మీారుం బ్రాణముల కాసపడరో? యుక్త మె ఱుంగరో? కాకున్న నయ్యవివేకిమాట విని తెగించి యిట్లు వత్తురే? వలదువలదు. మరలి యాదుర్యోధనునొద్దకొండె ధర్మరాజునివేశనమునకొండెం జనుం డనిచెప్పిన వారు వెఱచి ధృతరాష్ట్రసుతుపాలి కరిగి గంధర్వవచనముం దేటపడ విన్నవించిరి. విన్నవించుటయుం గడుం గినిసి దుర్యోధనుం డోహో! వారలు నామాట కె దురు పలుకునంతవారలుగా! ఆమదాంధుల నవశ్యము వేగమ శిక్షింపుఁడు. వారల నెప్పరికించి చూడరాదు. దేవేంద్రుండు దేవసైన్యముతోడ వారికి బాస టమై వచ్చినను గెల్తుము. అందఱును బోరునకుం గట్టాయితంబై నడువుం డని యెలుంగెత్తి చెప్పిన పని ధార్తరాష్ట్రయోధులు పెక్కండ్రు నానావిధాయుధ ములతోడ సన్నద్ధులై దిగంతరము లవియ నార్చి పేర్చి యవ్వనంబు సొచ్చిరి.

## కౌరవగంధర్వయుద్ధము.

అప్పటికిం బిఱుసునకుం గడంగక గంధర్వులు మెత్తనిమాటల వారించి నను గౌరవయోధులు గర్వోద్ధతులై మెత్తివచ్చుటయు నాఖేచరు లంతయుం

జిత్రసేనున కెఱింగించిరి. కౌరవులగర్వోద్ధతికిఁ గటకటంబడి చిత్రసేనుడు వారల నవశ్యము విక్రమించి శాసించునది యనియాజ్ఞాపించుటయు గంధర్వయోధులు వివిధాయుధపాణులై యొక్కుమ్మడిగఁ గవిసి వారలఁ దఱిమిరి. తఱుముటయుఁ గౌరవభటులు చీకాకుపడి దుర్యోధనుండు చూచుచుండఁ జెదరి పాఱినం గర్ణుండు దా నోహటింపక కురురాజుచూడ్కికి వేడ్కగా వారల నెదిరించి తాఁకి లాఘవము మెఱయ భల్లార్ధచంద్రాదివివిధసాధనములం బ్రయోగించి పెక్కండ్రతలల డొల్ల నేసి క్షణమాత్రమున నాసేనం జిందఱవందఱచేసె. అంతఁ గోపోద్దీపితులై గంధర్వులు వెండియు వేనవేలుగ నేతెంచి రణాంగణంబు గంధర్వమయముగ ముట్టినం గర్ణునకు బాసటగా దుర్యోధనదుశ్శాసనసౌబలవికర్ణాదులైనచేయంగలదొరలు వెంట నడిచి యురువడించి దారుణముగ రణము సల్పినం గంధర్వులు నొచ్చి మెత్తవడుటయుఁ గురుసైన్యమున బొబ్బ లెసఁగె. అయ్యార్వులనాలించిచిత్రసేనుఁడు రోషభీషణమూర్తియై దిగ్గన లేచికురుసేనం గలిసి వివిధచిత్రమార్గములు మెఱయ నడిచి మాయాస్త్రంబుఁ బ్రయోగించె. కౌరవు లయ్యస్త్రమాయచే మోహితు లగుటయు గంధర్వు లొక్కొక్కనికిఁ బదుగురు పదుగురుగ వారలఁ జుట్టుముట్టి పట్టికొనినం గొందఱు ప్రాణభీతులై యనికిఁ దొలఁగి పాఱిరి. అపుడు రాధేయుఁడొక్కరుఁడు సంచలింపక మోహరమున నిల్చిన దుర్యోధనదుశ్శాసనశకునులు వానికిఁ దోడ్పడిపాఱి పోవుచున్నసైనికులఁ బురికొల్పుకొని తమతమశక్తికొలఁదిఁ బెనఁగుచుండిరి. అట్లు కురుసైన్యము చిక్కువడుటయు గంధర్వులు బహుసహస్రసంఖ్యాకు లొక్కపెట్ట రాధాసుతుం దలపడి గదాశక్తిశూలపట్టసపరిఘాద్యాయుధజాలంబుఁగురియించి కొంద ఱతని తేరి కాఁడిని, గొందఱు టెక్కెమును, గొందఱుగోడుగును, గొందఱు నొగను, గొందఱు రథావరణమును, గొందఱు గుఱ్ఱములను, గొందఱు సారథినిం గూర్చి తేరు నువ్వెత్తుగఁ బొడిపొడిచేసి యాసూతసుతు విరథుం జేయుటయు వాఁడు వికర్ణుతేరెక్కి తొలఁగిచనియె. అవ్విధమునఁ గర్ణుఁడు విరథుఁడై యనికిఁ దొలఁగిఁ పోవుటయుఁ గురుసైనికులందఱుం జెదరిపాఱిరి. అపుడు దుర్యోధనుఁడు వెనుదీయక పైపైవచ్చు గంధర్వసేన నెదిరించి నిలిచి శరవర్షముఁ గురియించినం గినిసి చిత్రసేనసైనికు లందఱు నొక్కుమ్మడిగఁ జుట్టుముట్టి కర్ణు నెట్లట్ల దుర్యోధను విరథుంగావించినం జిత్రసేనుఁ డాకురురాజును జంపక పెడకేలు గట్టి పట్టుకొనియె. దుర్యోధనుఁడు పట్టువడుటంజూచి గంధర్వయోధులు దుశ్శాసనవివింశతివిందానువిందాదు లగుకురుకుమారులను, వారిభార్యలనుం బట్టి బంధించిరి.

**{ కురుసైనికులు ధర్మరాజునొద్దకుఁ జని దుర్యోధనాదులకు గంధర్వులవలనిచెఱఁ దొలఁగింపఁ బ్రార్థించుట. }**

అట్లు గంధర్వులు వారలనెల్ల నిగ్రహించికొని పోవుచుండఁగ ముందే
యనికిఁ దొలఁగియుండినసైనికులు నమాత్యులుం దిక్కు దోఁపక కాందిశీకులై
పాండవు లున్నచోటి కరిగి యుధిష్ఠిరుం గనుంగొని యోమహాత్మా! ధార్మికవరేణ్యా!
ధర్మనందనా దుర్యోధన దుశ్శాసనదుర్విషహదుర్ముఖ దుర్జయవిందానువిందాదు
లగుకురుకుమారులను దద్భార్యలనుం గంధర్వులు పట్టుకొని యదె గంధమాదన
మునకుఁ బోవుచున్నవారు. కరుణించి వారివెంటఁ దవిలి వారల గెలిచి మీభ్రా
తృవర్గమును దత్కాంతాజనంబునుం జెఱఁదొలఁగించి రక్షించి పుణ్యమునం బోవ
వే! యని యతిదీనముగ మొఱ పెట్టుకొనుటయు భీమసేనుఁడు ధర్మరాజున కిట్ల
నియె. గజతురగాదిబలములనెల్లఁ గూర్చుకొని మహాప్రయత్నముతో మనము
చేయవసినపని గంధర్వులే చేసిరి. మనకుఁ జులకనయ్యె. ఏశ్రమమును లేక సుఖా
సీనులై యుండఁగన మనకు గెలుపు చేకూఱె. మనకుం బ్రియముసేయువాఁడు
భాగ్యవశమున నిప్పటికి లభించె. వ్యసనములపాలై పగతుర గెలువనేరక యుమ్మ
లించువారి శత్రువుల లాఁతివారు నిగ్రహింతురని వినియుంటి. అది యిపుడు
మనకుఁ బ్రత్యక్షమయ్యె. పాపపుజూదమాడి యన్యాయమున మనల వె
లువరించి యస్మదీయభుజ బలార్జితంబైన సామ్రాజ్యముఁ దాన వహించి
క్రొవ్వి విషమస్థులై యున్నమనల నపహసింపఁగ వచ్చినయాదురాత్మునిదుర్మంత్ర
మిట్లువిపరీతఫలం బవశ్యము గావలయు. ఆదుర్బుద్ధి తా నొకటితలఁపఁగ దైవవశ
మున మఱియొకటి యయ్యె. మనమొకప్పుడుం దెగువకుఁ జొరకుఁడిన నాపాపా
త్ముఁడు చేయనియధర్మముం గలదే? వానిమతం బనువర్తించువారును నేఁటికిఁగదా
చేటుఁజెంది రనిపలుకుచుండ ధర్మరాజు భీమున కిట్లనియె. అన్నా కఠినవచన
ముల కిదిసమయముగాదు. కౌరవులు సంకటములపాలై వెఱచిమనల శరణువేఁ
డిన నిట్లుపొడిచియాడ నీకుఁదగునే? జ్ఞాతులకు నిమిత్తవిశేషమునఁ దమలోఁ బగ
గలిగినను గులధర్మమంతన నశించునే? ఇతరు లెవ్వరేనియుఁ గులమునకుఁ జేటుఁ
జేయఁబూనినచో నుత్తములగుజ్ఞాతులు పరస్పరవిరోధమప్పుడు పాటింపక యెత్తి
వచ్చి వారల నిగ్రహింతురు. దుర్యోధనుఁడు మనల నపహసింపవచ్చివిప్రియము
చేయుటయు నిక్కంబ. ఐననుమనమిపుడావిరోధముఁ బాటింపఁదగదు. మన మొ
ప్పరికించితిమేని బాహ్యజనులు కురుస్త్రీల నభిమర్శింతురు. దానంజేసి పెద్దలనాఁ
టంగోలె సుప్రసిద్ధంబైన కురుకులముపేరు నేఁటితోఁ బాడవడంగు. దీనివలన ధా
ర్తరాష్ట్రుల కవమానము వచ్చెనేని యేకకులజనితుల మగుమనకు నదివచ్చినదియ
కాదో? పరికించిచూడుము. మాఱుసెప్పక నీవును నీతమ్ములును సమరసన్నాహ

ముతో రథముల నారోహించి యింద్రసేనాదులు గొలిచిరాఁగ వేగమునఁజని
గంధర్వుల గెలిచి ధార్తరాష్ట్రులకుఁ జెఱఁదప్పించిరండు. రాజమాత్రుఁ డెవ్వఁడే
నియు శరణనివచ్చిన వాని శత్రునైనం బాలించు. ఇఁక నీకుఁ జెప్పనేల? వరదా
నంబును, రాజ్యలాభంబును, బుత్రజననంబును, గ్లేశముననైనను శరణాగతుని
శత్రునేనియు రక్షించుటయు నను నివితుల్యములు. శత్రువులకుఁజిక్కి తప్పించికొ
ననేరక యున్మలింపుచున్న దుర్యోధనుని రక్షించుట యెంతయశస్కరంబో నీవే
చింతింపుము. మఱియు నాధార్తరాష్ట్రుఁడు దమ్ము నెట్లయిన మీరువిడిపింతురని
పెద్దయునమ్మియుండు. నేనే పోయి యోపినంత పెనంగి వారలఁ జెఱఁదొలఁగింతు
గాని యిపుడు యజ్ఞదీక్షితుండనై యుండుటంజేసి పోవకున్నవాఁడ. ఈయసందర్భ
మునాకుఁ బొసఁగకుండునేని మిమ్మింత నిర్బంధింపను. కావున మీరవశ్యము పోయి
వారికి బంధమోక్షణంబుఁ గావింపుఁడు. పోయియు మీరు ముందుగఁ బరాక్రమ
ముఁజూపవలదు. మఱి మంచిమాటల వారికి నీతి బోధించి కార్యము నొనరింపుఁడు.
సామమునఁ గార్యముపుట్టదేని పెద్దయుఁ దెగువచూపక మృదువుగ విక్రమంబుఁ
జూపుఁడు. అందుకునులోఁబడరేని చేయఁగలయంతయుంజేసి యెట్లయినఁగౌరవుల
బంధముక్తులఁగావింపుఁడు. ఇపుడిదియే కర్తవ్యంబుగాని పరస్పరవైరంబు దలంపు
నకుఁ దేఁజనదు. ఇతరులతోడిపగ గలిగెనేని మనము నూటయేగురము. మనలో
నొండొరులకు వైరముపొసఁగెనేని మన మేవురము. వారు నూఱుగురు. ఈయర్థము
మనమున నెల్లపుడు నుంచికొనుఁడు. నాచెప్పవలసినంతయుం జెప్పితి. ఎట్లయిన నీపని
చేసి నాయజ్ఞము సఫలముఁ జేయుఁడని యుధిష్ఠిరుఁడు ధర్మయుతముగఁ దనయ
భిప్రాయముఁ దెలపడఁ జెప్పిన విని ధనంజయుఁ డన్నకుఁ గేలుమోడ్చి నే నవశ్య
ము కౌరవులకు బంధమోక్షణ మొనరింతు. మీయానతిచొప్పునఁ దొలుత సా
మముతే పలికి వా రందుకు సాధ్యులు గారేని తెగువకుఁ దొడంగి వారల నేల
కుఁ దెచ్చి తద్రుధిరమున భూదేవికిఁ దర్పణముచేసెద నని పలుకుటయు భీముఁడు
గవలు నందుల కియ్యకొనిరి. అవ్విధమున నర్జునుఁడు కౌరవుల బంధముక్తులఁ
గావింతు నని ప్రతిజ్ఞ చేయుటయు శరణాగతులయినకౌరవులు నెమ్మదింబొదలిరి.

### అర్జునాదులు చిత్రసేనాదిగంధర్వులతో యుద్ధముచేయుట.

అట ధర్మనందనునునుజ్ఞఁ గొని భీమార్జుననకులసహదేవులు కనకకవచ
ములఁ దొడిగి వివిధదివ్యాయుధముల గ్రహించి మేలిగుజ్జములం బూన్చినయు
త్తమస్యందనముల నారోహించి కురుసైన్యమున సంతోషకోలాహలము పొంపి
రివోవ గంధర్వులమీఁద నెత్తిచనిరి. గంధర్వులును దమ్ముఁ దఱుముచున్న పాం
డుపుత్రుల నగ్నితేజుల లోకపాలతుల్యుల నలుగురం దిరిగి చూచి నిలుచుట
యుఁ జేరఁ జని యర్జునుఁడు ధర్మరాజుమాటఁ దలపోసి ముందుగఁ దెగువకుఁ జొరఁ

దగ దనియూహించి గంధర్వులారా, మాభాసిత యగునీదుర్యోధనుని విడిపింపుఁ డని సాంత్వనముగఁ బలికిన వారు పకపకనగుచు నర్జునున కిట్లనిరి. అయ్యా, మాకు దేవేంద్రుఁడే ప్రభువు. అతఁడుదక్క మఱియెవ్వరును మాకు నియామకులు గారు. కావున నతనిశాసనముమెయి నడుతుముగాని వేఱు చేయ మనిచెప్పిన విని యర్జునుఁడు వెండియు వారి కిట్లనియె. అయ్యా, యిట్లు పలుకరాదు. ఈపనివలనఁ బరదారాభిమర్శనంబును మనుష్యులతోడిసమాగమంబు నను నివి గలుగు. ఇది గంధర్వరాజునకుఁ దగదు. కావున నామాట విని ధర్మరాజుశాసనము నుపేక్షింపక ధార్తరాష్ట్రులను దద్భార్యలనుం జెఱ విడిపించునది. ముందుగ మీరు నకుఁ దొడఁగరా దని యింత చెప్పితి. నామాట వినరేని పరాక్రమమున మిమ్ము నొడించి వీరికి బంధమోక్షణంబుఁ గావింతు నని యంతయుం దెలియఁ జెప్పి యప్పటికిం గంధర్వు లామాటల నాదరింపమిం బరికించి వీ రెట్లును సామసాధ్యులు గారు. విక్రమింపఁగనవసరము ప్రాప్తమయ్యె. ఇఁక నూరకుండరా దని తన లో నిశ్చయించి యర్జునుఁడు తీవ్రాశుగముల గంధర్వులపై నేయుటయు వారలును బలవిక్రమములు నెఱయఁ బోరాడం దొడంగిన నప్పు డప్పాండురాజనందనులు నల్వురకును బహుసహస్రసంఖ్యాకు లైనగంధర్వులకుం బోరు ఘోరంబయ్యె. ఆసంకులసమరమున గంధర్వు లుక్కుమిగిలి కర్ణదుర్యోధనుల నె ట్టట్ల పాండవులను విరథులం జేయఁగఁ బూని పెక్కుం డ్రొక్కుమొగిమై యమ్మహారథుల నల్వురం దలపడి వచ్చుచుండ వా రత్యద్భుతంబుగ శరవర్షము గురియించిన ఖేచరులుచెంగట నైన మెలఁగనేరక తొలంగియే యోపినంత విక్రమముఁజూపుచుండిరి. అర్జునుఁ డపుడు వీర లలంతులఁ బోవ రనినిశ్చయించి యాగ్నేయాస్త్రం బేసి యనేకశతసహస్రగంధర్వభటుల యమపురమున కనుచుటయు భీముఁడు గవలు నావీరశేఖరునకుఁ దోడ్పడి నిశితశరజాలము గురియించి వారల నొంచిరి. అంత గంధర్వులు పాండవులతోడఁ బెద్దపెనఁగరా దనియూహించి దుర్యోధనాదుల నెత్తికొని యాకసమున కెగరిపోవ నుంకించినం దాని నెఱిఁగి గాండీవి రయమున నభోమండలము శరజాలమున నావరించె. దానం జేసి పంజరమునం జిక్కిన పులుఁగులవొలెఁ గదలనేరక గంధర్వులు క్రోధోద్ధతులై గదాశక్తిముసలపరిఘాదివివిధసాధనముల నేయుటయుఁ బాండవమధ్యముండు వెండియుఁ బెక్కుబాణము లేసి వానినెల్లనడుమన పొడిపొడిచేసి పలువురు గంధర్వులకాళ్లు, చేతులు, తలలుం డొల్లఁ జేసె. హతశేషు లగుఖేచరసైనికులు తాలవానంబోనియర్జును శరవర్షమునకుఁ దలఁకియు నంత నిలువక యందఱం బరికొల్పికొని మఱియు ననేకాస్త్రములఁ బ్రయోగించుటయు సవ్యసాచి తదస్త్రములకుమాఱుగ జేసి స్థూలాకర్ణేంద్రజాలసౌరాద్యస్త్రముల నాసేనపైఁ బ్రయోగించె. తదస్త్రానలదాహము సైఁప

నేరక ఖేచర సైనికులు ధనంజయుశరపంజరమునం జిక్కి కను వెఱచి పెల్లడలు చుండుటం జూచి చిత్రసేనుఁడు గదఁజేతం బూని యర్జునుపై కుఱికిన నమ్మహార థుఁడు వాఁడితూపుల నేసి యాగద నేడుతునియలు గావించె. అట గంధర్వమా యాప్రభావమునఁ దా నంతర్హితుండై యర్జునుమీఁదఁ బెక్కు లస్త్రముల నేసిన నమ్మేటివిలుకాఁడు కినుక గదుర గండడరి వానిం బ్రత్యస్త్రములఁ బొలియించి శబ్దవేధు లగుదివ్యాస్త్రములఁ బెలుచ నేసినం జిత్రసేనుండు నొచ్చి విచ్చు నెట్ట యెదుటఁ గన్పడి యోప్రియవయస్యా, యనుంగుసంగాతి యగున న్నెఱుంగుదు గదా యని తన్నుఁ దెల్పినం బురందరనందనుండు తత్క్షణంబ తా నేయఁ బూని నయస్త్ర ముపసంహరించె. భీముఁడు కవలును సమరము చాలించిరి. అటఁ జిత్ర సేనుఁడు పాండవులుం బరస్పరకుశలప్రశ్నము నడిపిరి. పదంపడి ధనంజయుఁడు నవ్వుచుఁ జిత్రసేనుం బిలిచి గంధర్వరాజా, నీపూనికి యెయ్యది? ఏల కౌరవుల నిగ్రహించితివి? ఏమి తప్పు చేసి రనియడుగఁ జిత్రసేనుఁ డర్జునున కిట్లనియె. ప్రియసఖా, పాపాత్ముఁ డై నయీదుర్యోధనుఁడు రాజ్యస్థుండై సకలసుఖముల నను భవింపుచున్న తాను రాజ్యచ్యుతులై యడవుల నిడుమలఁ బడుచున్న మిమ్మును బర మపతివ్రతాశిరోమణి యైనపాంచాలినింబరిహసింపఁగఁ గర్ణసౌబలమతమున విభ వము మెఱయ సభార్యుండై యిచ్చటికి వచ్చినవాఁడు. దీని నెఱింగి దేవేంద్రుఁ డీదురాత్ముని సకలపరివారముతోడఁ గట్టి తెమ్మని నన్నుఁ బనిచె. మఱియు ధార్త రాష్ట్రులఁ బట్టి తెచ్చునెడ సహజకరుణానిరతుఁడైన యర్జునుతోడఁ బోరాట గలి గెనేని యవశ్యము వానిని వానియన్నదమ్ములను రక్షించునది. అతఁడు నీకు నెచ్చె లికాఁడును శిష్యుఁడునుం గదా యనియానతిచ్చె. నేనును నిలింపపతిపంపున వచ్చి యీదురాత్ముఁ జెఱఁబెట్టితి. ఇఁక నింద్రలోకమునకుఁ గొనిపోయెద ననినవిని యర్జు నుఁడు చిత్రసేనున కిట్లనియె. నెచ్చెలీ, నాపన్నపము వినుము. ఈసుయోధనుఁడు మాకు భ్రాతయవుట మీకుం దెల్లంబ గదా. వీనినిఁ జెఱఁదప్పింపఁగ ధర్మరాజు నన్ననిచినవాఁడు. నాకుఁ గూర్తువేని వీనివిడిపింపుము. ఇంతేల? మనమందఱము నిపు డాయుధిష్ఠిరుపాలికిఁ బోదము. అట నతండు సెప్పినయట్లు చేయుదు వనివ చించినం జిత్రసేనుఁ డర్జునుంజూచి యన్నా వీని విడిచిపుచ్చరాదు. ధర్మనందనుఁ డీదురాత్ముల దురుద్యోగము నెఱుఁగఁడు. ఎఱిఁగియుండునేని యిట్లు చెప్పఁడు. అయినను నీచెప్పినపగిది మనమందఱ మతనియొద్దకుఁ బోయి యంతయు నెఱిం గింత మనియియ్యకొనియె.

చిత్రసేనుఁడుధర్మజు నొద్దకువచ్చి దుర్యోధనాదులవిడిపించుట.

అంతఁ జిత్రసేనుఁ డెల్లవారితోడ ధర్మరాజు నొద్ద కరిగి నడిచినదంతయుం దెలిపిన నయ్యజాతశత్రుఁడు చిత్రసేనువచనము విని గంధర్వులం బేర్కొని యి

ట్లనియె. మహాత్మా, మాభాగ్యవశమున బలవంతులయ్యు మీరు వీని వధింపరై తిరి. కులమునకుఁ గీడు పొసఁగదయ్యె. నాకుఁ బెద్దయు నుపకారము చేసితిరి. మిమ్ముఁజూడఁగ సంతోషమయ్యె. మీయభిమతముల నానతిండు. చేయనున్న వాఁడ. సకలపరివారసమన్వితుఁడైన దుర్యోధనునకుఁ జెఱఁదొలఁగింపుఁడు. నాప్రార్థనము నంగీకరింపుఁడని సవినయముగ నివేదించిన విని చిత్రసేనుఁ డజాతశత్రుం బ్రస్తుతించి వారికి బంధమోక్షణముఁ గావించి ధర్మనందను నామంత్రణము చేసి గంధర్వాప్సరోగణపరివృతుండై దివంబున కరిగి యావృత్తాంత మంతయు సురపతికి విన్నవించె. అతండు ధర్మరాజు ధర్మపరత్వము నభినందించి యాసమరమునఁ జచ్చిన గంధర్వులపై నమృతవర్షముఁ గురియించి వారలఁ బునర్జీవితులఁ జేసె. పాండవులును ధార్తరాష్ట్రులకుఁ జెఱఁదొలఁగించి కౌరవామాత్యులస్తుతివచనముల నాలకించుచు యజ్ఞమధ్యమున నగ్నులువోలె వెలుంగుచుండిరి. అపుడు ధర్మరాజు ప్రేముడి గడలుకొన దుర్యోధనుఁ జేరంబిలిచి యన్నా, యిఁక నెన్నఁడు నెచ్చటనైనం దెగువచేసి యిట్టిపనులు చేయకుము. సాహసకారులకు సుఖము గలుగనేర్చునే? ఇట్లయ్యెఁగా యని మనస్సున నెకకొఱఁత వెట్టికొనవలదు. తమ్ముల నంతఃపురాంగనలను సకలపరివారమునుం దోడ్కొని పురమునకుఁ బొమ్మని యూఱడించిపలికె. దుర్యోధనుఁడును ధర్మరాజునకుఁ బ్రణమిల్లి యనుజ్ఞఁగొని లజ్జావిహ్వలమానసుండై మగిడిచనియె. ద్వైతవాసులగు మునులందఱును ధర్మరాజు ధార్మికత్వంబును ధనంజయు విక్రమంబునుం బొగడి రనిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, గంధర్వులచేఁ బట్టువడ మహాత్ములగుపాండవులయనుకంపపెంపున బంధనం బెడలి దుర్యోధనుఁ డామీఁద నెట్లు సిగ్గు లేక నగరమునకుఁ జనియె? అతఁ డెల్లప్పుడుం బౌరుషౌదార్యములఁ బాండవుల నవమానించుచు దురభిమానావేశమునఁ దన్నుఁ దాన పొగడికొనువాఁడు గదా. ఆసిగ్గుమాలినవాని పిమ్మటిచెయ్వుల సవిస్తరముగ వివరింపవే యనియడుగ నమ్మునివరుఁ డన్నరవరున కిట్లనియె.

### దుర్యోధనుఁడు కర్ణునితోఁ దనపరిభవము చెప్పుకొనుట.

దుర్యోధనుఁ డట్లు ధర్మరాజుననుజ్ఞఁ గొని యవమానమునఁ జిత్తము పొగుల లజ్జచే నధోముఖుఁడై మఱలి చతురంగబలము గొలువ హాస్తినపురమార్గమునం గొంతవడి యరిగి తృణజలభూయిష్ఠం బైనయొకరమణీయప్రదేశమున నాఁడు విడిసి తగుచోట్ల సేనలు విడియ నియమించి చింతాశోకవ్యాకులమానసుండై నిశాంతమున రాహుగ్రస్తనిశాకరుచందమున నిస్తేజస్కుండై శయ్యాతలమునం గూర్చుండి యెద్దియుం దోఁచక చింతించుచుండె. అపుడు కర్ణుఁ డతని పాలికిఁ జని గాంధారీనందనా, భాగ్యవశమున గంధర్వవీరుల గెలిచి తమ్ములతోడ

సుఖమున వచ్చితివి. పురాతనసుకృతమునఁ బ్రమ్మఱ నాకు నీతోడిసమాగమము గలిగె. నీవు చూచుచుండఁగ గంధర్వులు నన్ను విరథుం జేసి నొంచి తఱిమిన నేను వారికోర్తుల కోర్వఁ జాలక మనసైన్యము నిలువరింపనేరక వికర్ణురథ మెక్కి యనికిఁ దొలఁగిపోయితి. మీ రందఱు నాగంధర్వులబారిం బడి తప్పుట యెంతయు నద్భుతం బయ్యెడి. నీవుదక్క వేఱొక్కమగవాఁడు గంధర్వుల గెలువనేర్చునే యని ప్రస్తుతించి పలికిన విని దుర్యోధనుఁడు తలవాంచి బాష్పగద్గదకంఠముతో నతని కిట్లనియె. రాధేయా, నీ వంతయు నెఱుంగవు. నేనే గెలిచినవాఁడ నని తలఁచి యున్నవాఁడవు. తెలియక నన్నుఁ బొగడుటం జేసి నీమాటపై నసూయ లేదు. ఇఁక నావృత్తాంతము వినుము. అపు డాగంధర్వులతోడఁ బోరాట గలిగిన నేనును నాతమ్ములు నోహటింపక యోపినంత పెనంగుచుండ నిరువాఁగులం బెక్కండ్రు వ్రులిసిరి. అట ఖేచరులు మాయ పన్ని సమరము చేయుటయు మే ముక్కసెడి యోటువడుటయు వారు మమ్ము భృత్యామాత్యపుత్రమిత్రకళత్రవాహనముల తోడం గట్టి యుప్పరవీథిం గొనిపోవఁ దొడఁగిరి. అపు డొండు శరణము గానక మనసైనికులు నమాత్యులుం గొందఱు పాండవులపాలికిఁ బోయి మాపడుపాట్లం జెప్పికొనినం జిత్తగించి యజాతశత్రుఁడు తమ్ముల మంచిమాటలఁ దేల్చి మమ్ము విడిపింపం బంపె. ధర్మరాజానుజ్ఞాతులై భీమార్జుననకులసహదేవులు మ మ్మెత్తుకొని పాఱిపోవుచున్నగంధర్వులవెంటఁ దవిలి వచ్చి తాము వారల వారింపఁ జాలిన మహారథులయ్యు ముందుగ బిఱుసునకుఁ గడఁగ నేల యని గంధర్వులఁ బిలిచి మాయన్నదమ్ము లగుధార్తరాష్ట్రుల సపరివారుల విడిచి పుచ్చుఁ డని సామవచనములఁ జెప్పిరి. ఆమాటలు సరకుసేయక గంధర్వులు మ మ్మెత్తికొని పోవుచుండుటయు నప్పాండుపుత్రులు విలువిద్యనేర్పున వారల నొప్పించిరి. అట గంధర్వులు మమ్ముఁ గొనిపోవ మీఁది కుంకించినం గాండీవి రయమున బాణ జాలముచే నభోమండలము నావరించి వారికి గతినిరోధము గావించి దివ్యాస్త్రముల వారిపై నేసె. ఏమి చెప్పుదు. అపు డేచటఁ జూచిన నర్జునుబాణములె లోచనగోచరము లగుచుండె. అట్లు గొంతవడి సమర మగుడుఁ జిత్రసేనుఁడు పిదపనర్జుసునకుఁ గన్పడితనతొల్లింటిచెలిమి తేటపఱిచి కౌఁగిలించికొనుటయు గంధర్వులుఁ బాండవులుం బరస్పరకుశలప్రశ్నంబు నడిపి యొక్కటి యైరి. పదంపడి ధనంజయుండు చిత్రసేనుం బ్రశంసించి నవ్వుచు నెచ్చెలీ, మాయన్నదమ్ము లగునీ ధార్తరాష్ట్రుల నేల గొనిపోవఁ దలఁచితిరి? మేము బ్రదికియుండఁగ మీకు వీరలఁ జెనకవచ్చునే? ఇందుకుఁ గారణం బెయ్యది యనియడుగుటయు నాగంధర్వరాజు మనమంత్రణం బెల్లఁ జెప్పి యీదురాత్ములఁ జెఱఁ బెట్టఁగ నింద్రుననుజ్ఞ మెయి నిట్లు చేసితి నని మనదురుద్యోగము నంతయుం దెలియఁ బలికి మమ్ము నాకట్లతో

డన యుధిష్ఠిరునెద్దకుఁ గొనిపోయిరి. కర్ణా, యేమి చెప్పుదు? అపుడు వారిమెదుట నిల్వఁగను నాకు మనసు గొలుపదయ్యె. భూమిలోఁ బ్రవేశింపఁగ వివరమైనను దొరకదయ్యె. శత్రులకుఁ జిక్కినమమ్ముఁ బాండవులు విడిచిపుచ్చఁగ వచ్చుట, మనయుద్యమము వార లెఱుఁగుట, స్త్రీసమక్షమునఁ బౌరుషహీనుఁడనై పగవారికిఁ జిక్కుట, యెల్లకాలము నాచే నిరాకృతుఁ డయినయుధిష్ఠిరునెద్దకు నన్ను బంధనములతోడఁ గొనిపోవుట, యతఁడు కరుణించి విడిచి పుచ్చి మమ్ము బ్రదికించుట యనునివి యెల్లనామనము నెరియించుచున్నయవి. ఈబ్రదుకుకంటె నాయుద్ధమున గంధర్వులచేఁ జచ్చినను మేలుగా నుండు. సుయోధనుఁడు గంధర్వులతోడఁ బోరాడి మేనుఁ దొఱఁగె నని యీలోకమునఁ గీర్తియుఁ బరలోకమున నుత్తమసుఖమునుం గలుగు. ఇపు డిక్కడ కక్కడకుం గాకచెడితి. ఇఁక నిప్పటినాయభిప్రాయము వినుఁడు. హాస్తినపురమునకు రాఁగ నాకు మనసు గొలుపదు. మీరందఱు దుశ్శాసను మున్నిడికొని చనుఁడు. నే నిచటఁ బ్రాయోపవేశముఁ జేసెద. గడచిననా ళ్లెల్ల నేను శత్రులకు మానమోదముల నడంచి మిత్రులకు మిగులఁ గలుగఁజేసి యితండు మేటిమగఁ డని యెల్లెడలం బొగడుపడి యీనాఁ డింతయవమానమునకుఁ బాత్రంబై యెవ్విధమున నూరు సొత్తేర నేర్తు? ధృతరాష్ట్రున కేమని చెప్పుదు? భీష్మద్రోణకృపాశ్వత్థామవిదురసంజయబాహ్లికసోమదత్తాదు లగువృద్ధజనుల కేమి పలుకుదు? బ్రాహ్మణులకు శ్రేణిముఖ్యులకుఁ దక్కటివారికి నేమి వచింతు? వారెల్ల నన్నేమనియెదరు? పగవారితలపై నుండి వారలమనస్సులం బరాక్రమంబుఁ జూపి నేఁ డాత్మదోషమున భ్రష్టుఁడనైతి. అదృష్టవశమున విద్యైశ్వర్యములఁ బొందియు దుర్వినీతులు పెద్దకాలము దక్కించుకొన నేరరుగదా. ఇందులకెల్ల దురభిమానావిష్టుఁడ నగునేన నిదర్శనంబు. దుష్బుద్ధినై మోహావేశమున దుశ్చారిత్రము నడిపి యిన్నిదురవస్థలపా లయితి. ఇంకను నేనుం బ్రదుకఁ గోరవచ్చునే? ప్రాయోపవేశంబు సేయుటయ యిఁక లగ్గు. గంధర్వులచేత నన్ను విడిపించునపుడు విక్రమవంతులైనపాండవు లెంతయే నవమానమున నన్నుఁ జూచిరి. మానవంతుఁ డెవ్వఁడేనియుఁ బగవారిపరిహాసములకు భాజనంబై పౌరుషము దిగపడిచి ప్రాణముల నాశించునే యనిచెప్పి యట దుశ్శాసనునుం బిలిచి యన్న, దుశ్శాసనా, నామాట విని నీవు పట్టాభిషిక్తుఁడవై కర్ణశకునిబలమున రాజ్య మేలుచు సురపతి సురగణంబునుంబోలె భ్రాతృబంధుగణముల నలరింపుము. బ్రాహ్మణులయెడ నప్రమత్తుఁడ వగుము. చుట్టలకుఁ జెలులకు నీవే గతి వైతివి. విష్ణుదేవుఁడు సురలంబోలె జ్ఞాతుల నాదరింపుము. పరమభక్తి పెంపార గురువుల నారాధింపుము. మిత్రమండలమునకు మోదము శత్రుమండలమునకు ఖేదము నెడఁగూర్పుము. పురమునకుఁ బొమ్మనిచెప్పి గాఢాలిం

గనముఁ గావించి యిఁకఁ బొ మ్మనుటయు దుశ్శాసనుఁడు కృతాంజలియై దుర్యోధనునడుగులపయిం బడి కన్నీరు జాలువాఱ నేడ్చుచు దూయమానమానసుండై డగ్గుత్తిక వెట్టి యిట్లనియె. మహారాజా, యిట్లు పలుకవలదు. నాయెడఁ బ్రసన్నుఁడ వగుము, నీయానతి యొసంగినయట్లు చేయుట యెంతయు నాకొప్పదు. భూమ్యంతరిక్షములు వ్రయ్య లయినను, సూర్యుఁడు తేజము దఱిఁగినను, చంద్రుఁడు వెచ్చనైనను, వహ్ని చల్లనైనను, వాయువు శీఘ్రధావనవికలుఁడైనను, హిమవత్పర్వతంబు పాఱిపోయినను, సముద్రముల నీళులు వట్టిపోయినను నీవు లేకున్న నేనీపుడమి నేలను. ప్రసాదింపుము ననుగ్రహింపుమని పలుమాఱులు విన్నవించుచు పాదములఁ బడి లేవకున్నంత దుర్యోధనుఁడును దుఃఖతుండయ్యె. వా రిరువు రవ్విధమున దుఃఖాక్రాంతచేతస్కులయియుండ రాధేయుఁడు గాంధారేయున కిట్లనియె. ఏల మీ రిద్ద ఱివ్విధమునఁ బ్రాకృతజనుల మాడ్కి శోకించెదరు? శోకించుచుండ నప్పటప్పటికి శోకంబ పెచ్చుపెరుఁగుఁగాని యొక్కింతయేనియుఁ గొఱంతవడదు. ధీరుల కది సామర్థ్యము గాదు. శోకసమయములందు ధైర్యము నవలంబింపవలయు. అది మాని మీర లిట్లు శోకాక్రాంతులరైతిరేని పగవారు సంతసింతురు. గంధర్వులచేఁ బట్టువడి పాండవులచే విడిపించికొనవలసివచ్చెఁగా. యని యది యొకటి పెద్దగాఁ దలఁచి వగవవలదు. ఇందుఁ దప్పేమి? పాండవులు తమచేయవలసినపనిచేసినవారకాని యొండేమియుం గాదు. దేశమేలురాజునకుఁ దద్దేశవాసు లగుజను లాదఱును దత్పోషితు లగుసైనికులును దెలిసియుండెఁ, దెలియకయుండెఁ దమతమకొలఁదిఁ దఱితోఁ బ్రియముఁ జేయనవలయు. పగవారు ప్రాయికముగ శత్రుసేనను నొప్పించునెడ నవశ్యము ప్రధానపురుషుల నిగ్రహింపఁ జూచుటయు సైనికులు మొదలుగాఁగలవారలు వారలఁ దప్పించుటయు లోకమున సహజములై యుండు. పాండురాజసుతులు నీదేశమునందు నీపాలనమునం జేసి సుఖమున్నవారు గావున వారల కీపని యవశ్యకర్తవ్యంబు. పోటుమానుసుల మని మదించి నిన్నుఁ గొలిచిరాకున్నమాత్రనే వారు నీయాజ్ఞకు లోఁగనివా రగుదురే? నీప్రేష్యులే కావున నీకుఁ దోడ్పడిరి. ఇందు వగ పేల? మఱియుఁ బరిభవంబు వచ్చెఁగా యని ప్రాయోపవేశముఁ జేయుదు నంటివి. పరికింప నదియుం దగదు. ఈయుద్యమము నీసామంతరాజు లెఱిఁగిరేని యిఁక నిన్నుఁ జులకన చూతురుగాని కొలువవత్తురే? పాండవులకుఁ గలరత్నసువర్ణరాజ్యాదుల నొడిచికొని నీవు పలుదెఱంగులఁ బరిభవించినను వారలు ప్రాయోపవేశముఁ జేసిరే? వారలనే దృష్టాంతముగఁ జూడరాదో? ఇఁక నిట్టితలంపులు తలంపకు. లేలెమ్ము. ఆలస్యంబు వలదు. తమ్ముల నూఱడింపుము. నామాట వినక నీపట్టినపట్టువదలకుండెదవేని నేనుం బురమునకుఁ బోవను. నీపాదములకుఁ బరిచ

ర్యం జేయుచు నిచటన యుండుదు. నిన్ను విడిచి జీవింప నోప నని యెంతయుూ రార్చిచెప్పినను దుర్యోధనుఁడు తనమతము మాననొల్లక లేవఁ డయ్యె.

అట శకుని దుర్యోధనుఁ జేర నరిగి మహారాజా, కర్ణుఁడు లెస్స చెప్పె. బుద్ధిబలమున నేను సాధించి యిచ్చినసంపదనెల్ల నొల్లక ప్రాణముల నేల విడువఁ బూనెదవు. ఇది నీబుద్ధిమోహంబ కా నోపు. ఇంకను లెస్సగఁ బెద్దల సేవింప వైతివి. కాలవశమునఁ బొసఁగినఖేదమోదముల నిలిపికొనఁ జాలనివాఁడు నీరి లోనిపచ్చికుండవోలెఁ దక్షణంబ నశించు. అతిభీరు, నతిక్లీబు, దీర్ఘసూత్రుఁ, బ్రమత్తు, సంతతవిషయవ్యాసక్తచిత్తునిం జనులు సేరరారు. పాండవులచే సత్కృతిం బడసిననీ కిపుడు శోక మెవ్విధిఁ గలిగెనో? ఇది లెస్సగాదు. పార్థులతోడ నెక్క టియై గలిసి శోకము నడఁచికొనుము. సంతోషముతోఁ బాండురాజసుతుల సత్క రింపుము. ఈసమయమున శోక మేల పూనెదవు? నీవర్తనంబెల్ల నరయఁగ విప రీతమై యున్నది. ప్రసన్నుఁడ వగుము. ధైర్యము నవలంబింపుము. చేసినమేలు సంతోషముమైఁ దలపోయుము. పాండవులకు వారిరాజ్యము నొసంగుము. ధర్మ మును గీర్తినిం బొందుము. నాచెప్పినట్లు చేసితివేని కృతజ్ఞుఁడ వయ్యెదవు. పాండ వులతోడఁ జెలిమి చేసి తదీయరాజ్యమున వారల నిలిపి నీవును సుఖమున మను మని నీతి చెప్పిన విని దుర్యోధనుఁడు పాదములపయిం బడి లేవకున్న దుశ్శాసనుం గ్రుచ్చియెత్తి కౌఁగిలించి గాఢాదరమున మూర్ధాఘ్రాణము నొనరించి కొండొక వడియూరకుండి యట నిర్వేదంబు గదుర బ్రీడావిహ్వలచిత్తుండై ధర్మధనసౌఖ్యై శ్వర్యాజ్ఞాభోగాదులం బనిలేదు. మీ రెవ్వరును నాపూనికి కడ్డము సెప్పవలదు. నానిశ్చయం బిది. మీ రందఱుం గరిపురమునకుఁ జనుఁడు. గురువులకు నామా టగాఁ బూజలఁ జెప్పుఁ డనిపల్కుటయు వారు రాజేంద్రా, నీ కెయ్యది గతియో యయ్యదియ మాకుం గతిగాఁ గలయది. నిన్ను విడిచి మేము పోవ మని మాఱు పలికిరి. అట్లు తమ్ములు మంత్రులు మిత్రులు బంధులు మొదలగువా రెంద ఱెన్ని చెప్పినఁ దనపూనికి విడువక దుర్యోధనుఁడు దర్భలఁ బఱచి కుశచీరాంబరములఁ దాల్చి శుచియై కూర్చుండి యాచమించి మౌనవ్రతంబుఁ బూని యింద్రియముల గుదియించి మనస్సు నేకాగ్రముగ నిలిపి నియమపరుండై యుండె.

ప్రాయోపవిష్టుఁడైనదుర్యోధనునిఁ గృత్యపాతాళమునకుఁ గొనిపోవుట.

అంతఁ దొల్లి దేవతలచే నోటువడి పాతాళమున వసింపుచున్న దానవులు దుర్యోధనునిశ్చయముఁ దెలిసి యతండు ప్రాయోపవేశమునఁ బ్రాణత్యాగముఁ జేసినం దమపక్షమునకుఁ గీడు పొసఁగు ననియూహించి యాథార్వణరాష్ట్రం దమ యొద్దకు రావించి యయ్యుద్యమము వారింపఁ దలఁచి సుప్రజ్వలిత మైనయగ్ని హోత్రమున నథర్వవేదప్రోక్తము లగుబృహస్పతిభార్గవోపదిష్టమంత్రముల నభి

మంత్రించి వేదవేదాంగపారగులు నియతవ్రతులునగు బ్రాహ్మణులసహాయమునఁ బయగిపురోడాశముల వేల్చి నియతచిత్తములతో జప్యమంత్రములు జపించినం దత్క్రియాంతమునఁ * గృత్య యొక్కర్తు పెలుచ నావులించుచు నయ్యగ్ని వెడలి వచ్చి యేమి చేయుదు ననియడుగుటయు వారు ప్రాయోపవిష్టుఁడై యున్న దుర్యోధను నిటకుఁ దోడితె మ్మనినియోగించిరి. కృత్యయుఁ దక్షణంబ దుర్యోధనుప్రాయోపవేశస్థానమునకుఁ జని వానిఁ బాతాళమునకుఁ దోడితెచ్చుటయుఁ బాతాళవాసు లైనదానవు లారాత్రి వానితోడఁ గలిసి సంతుష్టచిత్తులై దుర్యోధనున కిట్లనిరి. సుయోధనా, శూరరాజసేవితుండవై భరతకులదీపకుఁ డనఁ బేరు వడసిననీవు క్షాత్రము విడిచి తెంపు చేసి ప్రాయోపవేశ మేల చేయఁ గడఁగితివి. దాన నాత్మ త్యాగముదక్క నెండొకఫలము గలుగ నోపునే? ఆత్మత్యాగమునఁ జేసి జనుఁడు నిందపాలై యధోగతిం బడయు. కార్యవిరుద్ధము, లతిపాపములు, మూలహానికరములు నగునిట్టికర్మములఁ జేయ నీయట్టిబుద్ధిమంతులకుఁ దగునే? ధర్మార్థసుఖయశఃప్రతాపనాశనంబు శత్రుసంతోషకరంబు నగునీతలంపు విడువుము. నిక్కంబనీవు నీతత్త్వ మెఱుంగవు. మేము చెప్పెదము. వినుము. తొల్లి మేము తపోబలమున మహేశ్వరు నారాధించి తత్ప్రసాదమున వజ్రపుంజనిర్మితంబై శస్త్రాస్త్రముల కభేద్య మైనపూర్వకాయమును దేవీప్రసాదంబునఁ బుష్పమయంబై తరుణీజనమనోహరం బైనయధఃకాయమునుం బడసి యారెండింట నీమేను నిర్మించితిమి. కావున నీవు దివ్యపురుషుఁడవుగాని సాధారణుఁడవు గావు. మఱియు నీకు సహాయార్థంబు మాయంశముల భగదత్తప్రముఖు లైనయుత్తమక్షత్రియులు మహావీర్యులు జనించినవారు. దివ్యాస్త్రవిదు లగువా రవశ్యము నీశత్రులఁ బొరివుత్తురు. భయశోకము లేల? భీష్మద్రోణకృపాదు లగుమధ్యస్థులను దానవు లావేశింతురు. దానం జేసి వారును దయ మాలి విధివశమున మోహావృతులై యొండొరులం బ్రల్లదము లాడుచుఁ బౌరుషప్రధానులై నీకుఁ దోడ్పడి తండ్రులు, కొడుకు, లన్నదమ్ములు, జ్ఞాతులు, బంధువులు, శిష్యులు, బాలురు, వృద్ధు లనివిచారింపక తెంపు చేసి నీవైరులతోడఁ బోరు సేయుదురు. పాండవు లేవురును దేవాంశసంభూతు లగురాజులు బాసటగాఁగ వీరలతోడ సమరముఁ జేయుదురు. వెండియు దైత్యదానవు లనేకులు క్షత్రియకులముల జనించినవారు వివిధాయుధధారులై రణమున నీకుఁ దోడ్పడుదురు. వీరశేఖరుఁ డైనయర్జునువలని భయ మొక్కటి నీమనస్సున నెప్పుడు నెడఁబాయకుండుఁ గదా. వాని వధింపఁగ నుపాయము మేము గంటిమి. ఎట్లంటేని. వాసు దేవనిహతుఁ డైననరకాసురుఁ

* కృత్య యనఁగా, హోమము మొదలగువానిఁ జేయువారియిష్టము నెఱవేర్చుటకు వచ్చునట్టియొకానొక దేవత.

డాచలమునఁ గర్ణు నావేశించె. దానంజేసి కర్ణుఁడు కృష్ణార్జునులతోడఁ బోరాడి
యనేకుల మహారథులను సవ్యసాచినిం గెలువ నోపు. ఈయర్థము నెఱిఁగి దే
వేంద్రుఁ డర్జునరక్షణార్థంబుగాఁ గపటమునఁ గర్ణునిసహజకవచకుండలముల నప
హరింపఁ గలవాఁడు. అది కారణముగా రాధేయుపరాక్రమ మించుక ప్రతిహ
తంబైనను ధనంజయవధార్థము మేము సంశప్తకు లనువారల సమరమునఁ జత్తుము
గెలుతు మనిప్రతిన వట్టి పోరాడువారల ననేకసహస్రసంఖ్యల నస్మదంశమునఁ
బుట్టించియున్నవారము. వా రవశ్యము గాండీవిని వధింతురు. నీవు నిష్కంటక
ముగ రాజ్య మేలఁ గలవు. శోక ముడుగుము. శోకమునకు మనస్సున నెడ మిచ్చినం
జేటు రాక మానదు. దేవతలకుఁ బాండవు లెట్లట్ల నీవు మాకు గతివి. నీవు
శరీరము విడిచితివేని మాపక్షము క్షీణబలం బగు. కావున వేఱుబుద్ధి సేయక
మామాట నియ్యకొను మనిచెప్పి దైత్యులు గాఢాదరమునఁ గౌఁగిలించి యా
రార్చి ప్రియంబులు పలికి యిఁకఁ బొ మ్మని వీడ్కొల్పిరి. అటఁ గృత్య తదను
జ్ఞంజేసి దుర్యోధనుఁ దొల్లింటిచోటు సేర్చి ప్రశంసించి వాని వీడ్కొని యచటన
యదృశ్య యయ్యె. కృత్య సనినపిదప దుర్యోధనుఁ డదియంతయు స్వప్నదృష్ట
ముగ భావించి కర్ణసంశప్తకులు గాండీవిని వధింపఁ జాలుదు రనినిశ్చయించి
యింకఁ బాండవుల గెలువ వచ్చు సనినమ్మియుండె. సంశప్తకులును రజస్తమో
గుణాక్రాంతులై యర్జునువధముఁ గోరుచుండిరి. భీష్మద్రోణకృపాదులును దానవా
విష్టమానసులై పాండవులయెడ నంతగ స్నేహవంతులు గా రైరి. దుర్యోధ
నుఁడు దానవసమాగమంబు మొదలగునుదంతముల నెరికిం జెప్పక పూర్వప్రకా
రమునఁ బ్రాయోపవిష్టుఁడై యుండుటయు వేఁబోకట రాధేయుఁడు చేర వచ్చి
కేలుమొగిడ్చి హేతుసహితంబుగ నించుక నవ్వుచు నోకురువంశమణీ, యింక
నైనం బ్రాయోపవేశముఁ జాలింపుము. బ్రదికియుండినం గాలక్రమమున శుభ
ములఁ గాంచవచ్చుఁగాని మృతిఁ జెందినమీఁద నెద్దియైనం బడయ వచ్చునే ? ఏల
యి ట్లుండెదవు. భయశోకమరణములలో దేనికైన నిది సమయము గా దని
నివేదించి యప్పటికి నతం డయ్యుద్యమ ముడుగకుండుటయుఁ గర్ణుఁడు గాఢాదర
మునఁ గౌరవునిఁ గౌఁగిటఁ జేర్చి వెండియు నిట్లనియె. రాజేంద్రా, లేలెమ్ము. ఇ
క్లేశల పట్టినపట్టు మానక పరుండెదవు? పరాక్రమమునఁ బగతుర నడఁగించిన నీ
విపుడు మృతి నేల గోరెదవు? ఒకవేళ నీకు సవ్యసాచివిక్రమమువలని వెఱపు
గలదేని యిదె నేను వాని వధింపఁగ సత్యప్రతిజ్ఞ సలిపితి. పాండవులు వనవా
సాజ్ఞాతవాసనియమములు గడపినపిదప నేను నిక్కముగ నాయుధము గొని వారల
నీకు వశగతులం జేయుదు నని తేటపడం జెప్పె.

### దుర్యోధనుఁడు ప్రాయోపవేశము మాని హస్తిపురమునకుఁ బోవుట.

రాధేయుఁ డట్లు ప్రార్థింపఁగ దుర్యోధనుఁడు తనవారల ప్రార్థనంబును బాతాళవాసు లైన దైత్యదానవులవచనంబునుం దలపోసి ప్రాయోపవేశము మాని లేచి యుత్తమరథారూఢుండై భూసురాశీర్వాదముల గ్రహించుచు వందిమాగధస్తుతిపాఠరవముల నాలోకించుచు సామంతరాజుల కేలుమోడ్పులఁ జిత్తగించుచుఁ గర్ణశకునిదుశ్శాసనాదు లయినదొరలు తమతమయరదముల నారోహించి తోడ నరుదేర మందాకినీప్రవాహంబుచాడ్పున నవ్యాహతప్రచారం బయినచతురంగసైన్యంబు శ్వేతచ్ఛత్రచామరపతాకానీరంధ్రితంజేసి యచ్చటచ్చట నలంతితునియలై చెదరియున్న శ్వేతాంబుదశకలపటలంబుల సొంపు పెంపారుశారదనభోమండలంబు ననుకరించి వెంటఁ గొలిచిరాఁగఁ దఱలి యల్పకాలమున హస్తిపురముఁ జేరె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, ధార్తరాష్ట్రులు సనినయనంతరంబు పాండుపుత్రు లేమి చేసిరి. ధార్తరాష్ట్రులు హస్తిపురము సేరినపదపడి భీష్మద్రోణకృపాదు లగు పెద్దలు వారల నే మనిరి? ఆమీఁద నేమి నడిచె? అంతయుఁ దెలియఁ జెప్పు మనియడుగ నాతాపసేంద్రుఁ డారాజచంద్రున కిట్లనియె.

ధార్తరాష్ట్రులు పాండవులయనుకంప పెంపున గంధర్వులచెఱఁ దప్పి యూరఁ జేరి నగరుఁ జొచ్చుటయు గాంగేయుఁడు గాంధారేయాగ్రజుం బిలిచి యిట్లనియె. వత్సా, నేను ముందే నీవు ద్వైతవనమునకుఁ బోవలయు ననిన నది నా కెంతయు నొప్పనిపని యనిచెప్పితి. అది వినక పోయి నీవు గంధర్వులచే బట్టువడితివి. పాండవులు ధర్మజ్ఞులు గావున నపుడు పగ పాటింపక కరుణించి నిను విడచివుచ్చిరి. ఇప్పటికైనను నీకు సిగ్గురాదయ్యెఁగా. గంధర్వులతోడఁ బోరాడ నోపక నీవును నీసేనవారలు నఱచుచుండఁగ నీసూతపుత్రుఁడు వెఱచి యనికిఁ దొలఁగి పోయెఁ గదా. వీని నొకశూరుఁగా నెప్పుడుం దలఁచి యుండెదవు. ఈ తులువ ధనుర్వేదమునను, శౌర్యమునను, ధర్మమునను బాండవులలో నొక పాలివాఁడేనియుం గానోపునే? ఇప్పటికైనను బుద్ధిమంతుఁడవై మహాత్ము లగు పాండవులతో సంధి సేసి కులము రక్షింపు మనిబోధించుటయు దుర్యోధనుఁడు పకపక నగి తటాలున లేచి పోయె. కర్ణశకునిదుశ్శాసనాదు లగుతదీయులు నప్పుడ వానితోడం జనిరి. అందులకుఁ గినిసి కురుపితామహుఁడు లజ్జితుఁడై మొగంబు గట్టువెట్టుకొని నిజభవనమున కరిగె. భీష్ముఁడు సనినయనంతరంబ దుర్యోధనుఁడు కర్ణశకునిదుశ్శాసనాదు లగుతనమంత్రులతోడం గ్రమ్మఱ యచ్చోటికి వచ్చి యందఱుఁ గలయం గనుంగొని కురుపితామహునిమాట మీ రందఱు వింటిరి గదా. ఇఁకఁ జేయఁ దగుపని యెయ్యది? ఏమి చేసిన మేలగు? ఆలోచించి నాకు

హితముఁ దెల్పుఁ డనియడుగఁ గర్ణుఁ డిట్లనియె. రాజేంద్రా, భీష్ముఁ డెల్లపుడు మనల నిందించుచుఁ బాండవులఁ బొగడుచుండు. నీయందలివైరమున నే నన్న తఁడు దూలనాడు. నీయెదుట నతం డట్లు ప్రల్లదము లాడిన నే నెట్లు సైఁతు. తగినసైన్య మిచ్చి నన్నుఁ బంపుము. బలశాలు లగుపాండుపుత్రులు నలువురు గెలిచినభూమండలంబెల్ల నే నొక్కండన గెలిచి వత్తు. బుద్ధిలేనిభీష్ముఁ డపు డేమి చెప్పునో చూతము. అనింద్యుల నిందించుట, నింద్యులఁ బ్రశంసించుటయనునీ రెండు నాకురుకులాధమున కెత్తినపనులు. నేనీమహీవలయము గెలిచి వచ్చితినేని యతఁడు నాబలముఁ గనుఁగొని తన్నుఁ దాన నిందించికొను. ఇది మన కవశ్య కర్తవ్యంబు. నీకు విజయంబు ధ్రువంబుగా సత్యప్రతిజ్ఞఁ బూని యాయుధము గ్రహించెద ననుజ్ఞ సేయు మనిన రాధేయువచనము విని గాంధారేయుఁడు పర మప్రీతుఁడై యతని కిట్లనియె. వీరవర్యా, మహాబలుఁ డగునీవు నాహితములఁ బ్రవర్తించుటంజేసి నేను ధన్యుఁడ నైతి. ఇది నాపై ననుగ్రహంబకదా. శత్రువులనెల్ల గెలువఁగ నెప్పు డెవ్విధమున వెడలవలయునో యట్లు జైత్రయాత్ర వెడలుము. నేను నీశాసనముమెయి నడచువాఁడ ననియెడంబడి వచించె.



కర్ణుఁడు దిగ్విజయముఁ జేయుట.

పదంపడి దుర్యోధనానుజ్ఞాతుండై కర్ణుఁడు వలసినచతురంగబలము నమర్చికొని పంచాంగవిశుద్ధదినమున శుభముహూర్తమునందు మంగళస్నాతుండై పరమభక్తిం బ్రాహ్మణులఁ బూజించి తదాశీర్వాదములఁ బడసి రథనేమిఘోషమున ముల్లోకములం బ్రతిస్వన మెసంగఁ జేయుచు మహాసైన్యపరివృతుండై జైత్రయాత్ర వెడలి, తొలుతఁ బాంచాలదేశమున కరిగి, ద్రుపదపురము ముట్టడించి, ఘోరసమరమున నాపాంచాలపతిని వశీకరించికొని, వానివలన ననంతరత్నసువర్ణరజతములఁ గప్పముగాఁ గొని, తదీయసామంతుల నరిగాపులం జేసి, యట నుత్తరంబునకుఁ జని, భగదత్తుని జయించి, తదనంతరంబ హిమవత్పర్వతంబున కరిగి, తద్గిరిచరు లయినరాజులవలనఁ గప్పముల గ్రహించి, యటఁ దూర్పుగా నంగవంగకళింగమగధవత్సకోసలాదిదేశనాథుల నోడించి, యట దక్షిణమునకుఁ జని, దాక్షిణాత్యరాజుల గెలిచి, వారివలన నపరిమితరత్నసువర్ణాదుల గ్రహించి, యటఁ గుండనపురము ముట్టడించి, రుక్మితోడఁ బోరు సేయఁగ నతఁడు కర్ణున కిట్లనియె. శూరశేఖరా, నీవిక్రమంబు మెచ్చితి. నీతలంపునకు నే నంతరాయముఁ జేయను. నీకోరినంత సువర్ణము నిచ్చెద ననిచెప్పుటయు రాధేయుఁడు వానితోఁ జెలిమి సేసి తదుపహృతంబు లయినయనేకమణికనకరాసులం గ్రహించి యటఁ బాండ్యకేరళనాథులను, మాహిష్మతీపురపతి యగునీలునిఁ దక్కటిరాజులను గప్పము గట్టువారిఁగాఁ జేసికొని, యటఁ జేదివిషయముల కరిగి, శిశుపా

లపుత్రుఁడై నసహదేవు నోడించి, యవంతిదేశపతుల నిర్జించి, యటఁ బశ్చి
మంబున సాంత్వవచనంబుల యాదవులతోడఁ గలిసి, శకయవనబర్బరాదులను,
బార్వతీయగణములనుం జయించి, రాధాసుతుండు భూమండలంబెల్ల నిజవ
శంబుగఁ జేసికొని హాస్తినపురంబుఁ జేరఁ జనియె. అతనిరాక విని దుర్యోధనుఁడు
భ్రాతృబంధుగణపరివృతుండై వాని నెదుర్కొని యత్యంతసంతుష్టుండై కర్ణా,
భీష్మద్రోణకృపబాహ్లికాదు లెవ్వరుం జేయనిమేలు నీవ నాకుఁ జేసితివి. విశేష
మేల? నీవు నాథుఁడు గాఁగ నేను నాథవంతుఁడ నైతి. పాండవులుఁ దక్కటిరా
జులును నీలోఁ బదునాఱవపాలివారు గారు. ధృతరాష్ట్రుని గాంధారినిం జూడు
మనిపలికె. అప్పు డప్పురమున హాహారవము లెసఁగె. రాజులు కొందఱు వానిం
బ్రశంసించిరి. కొందఱు నిందించిరి. కొందఱేమియుం జెప్పక యూరకుండిరి. దుర్యో
ధనువచనప్రకారమునఁ గర్ణుఁడు దిగ్విజయమున నార్జించినధనముల గ్రహించి
కొని గాంధారీధృతరాష్ట్రులసన్నిధికిఁ జని వారియడుగులకు మ్రొక్కి వినయవిన
మ్రుఁడై యుండ వారు వానిఁ గౌఁగిలించి పుత్రవాత్సల్యమున నాదరించి యని
చిరి. కర్ణుఁ డల్పకాలముననే సకలరాజుల నోడించి వచ్చుటం జూచి నాఁడుమొ
దలుగ దుర్యోధనదుశ్శాసనసౌబలులు పాండవుల జయించినవారమ యని తలం
చుచుండిరి. అంతఁ గర్ణుఁడు దుర్యోధనునొద్దకుఁ జని కౌరవవరేణ్యా, యిప్పుడీభూ
మండలము నిష్కంటకంబై నీవశమున నున్నయది. ఇంద్రుఁడు స్వర్గమునుంబోలె
నీ విమ్మహీమండలంబెల్లఁ బాలింపు మనిచెప్పిన దుర్యోధనుఁడు కర్ణుఁ బిలిచి నీవు
హితుఁడు సహాయుఁడునై యుండ నాకొక్కటియు దుర్లభంబు గాదు. నామన
స్సున నొకయభిప్రాయంబు గలదు. వినిపించెద. వినుము. ధర్మరాజు రాజసూ
యముఁ జేసి లోకోత్తరశ్రీ నలరిననాఁటంగోలె నాకు నయ్యాగమునఁ బేరాశ
గలదు. దాని నెఱవేర్ప నీవ వలంతి వనినఁ గర్ణుఁ డిట్లనియె. రాజపుంగవా, రాజు
లెల్ల నిపుడు నీకు వశులై యున్నవారు. యోగ్యఋత్విజులఁ బిలువఁ బంపుము.
యజ్ఞసంభారముల సమకట్టఁగఁ దగువారల నియమింపుము. అన్నపానబహుళం
బుగను సుసమృద్ధగుణంబుగను నీయజ్ఞమును నడపు మనిన విని దుర్యోధనుఁడు
పురోహితుని రావించి యయ్యా, నేను రాజసూయముఁ జేయఁ బూనితి. సకల
సంభారముల యథాన్యాయముగ నాయితపఱుపఁ దగువారల నియోగించి కొ
ఱంత రాకుండఁ జూచికొను మనినఁ బురోహితుఁడు దుర్యోధనున కిట్లనియె. గాం
ధారీనందనా, నీశత్రు లగుపాండవులు బ్రదికియుండునందాఁక నీకు రాజసూయ
ము సేయఁ దగదు. మఱియు నీతండ్రి ధృతరాష్ట్రుఁడు జీవించియున్నవాఁడు
గావున నయ్యాగము సేయ నిది యవసరంబు గాదు. కావునఁ దత్తుల్యమైనయజ్ఞ
ము మఱియొకటి వైష్ణవ మనునది గలదు. రాజులు గట్టినకప్పముల గ్రహించి

యత్యున్నతవిభవంబు మెఱయ దానిఁ జేయుము. విష్ణుదేవుఁడు దక్కఁ దక్కటివార లెవ్వరు నీయజ్ఞము నింతకు మున్ను నరింపరైరి. దానియజ్ఞశాల బంగారునాఁగలిచే దున్నింపవలయు నట్లు చేయఁ బంపుము. ఇప్పటి కియ్యధ్వరము యోగ్యమైనది. నిర్విఘ్నముగఁ గొనసాగు. నీకోరిక నెఱవేఱు నని పురోహితుఁడు తేటపడం జెప్పిన విని దుర్యోధనుఁడు తమ్ములను గర్ణశకునులం బిలిచి పురోహితువచనము వింటిరిగదా. మీయభిప్రాయ మెట్లనియడుగ వారెల్లరు నిదియ పోలు లని యియ్యకొనుటయు దుర్యోధనుఁడు తత్తధికారులఁ బిలిపించి శీఘ్రంబ యజ్ఞసంభారముల నెల్లఁ గొఱంతవడకుండ సమకట్టఁగ నాజ్ఞాపించె.

## దుర్యోధనుఁడు వైష్ణవ మనుయజ్ఞముఁ జేయుట.

అంత విదురప్రముఖు లయినముఖ్యామాత్యులు శిల్పివరుల రావించి పురము వెలుపల నొకరమ్యప్రదేశమున బంగారునాఁగలిచే దున్నించి యథోక్తముగ యజ్ఞవాటముఁ గావించి వలసినంతయజ్ఞసంభారంబు సమకట్టి యంతయు నెఱింగించుటయు దుర్యోధనుఁడు శాస్త్రోక్తప్రకారమున దీక్షితుండై సుముహూర్తమున యజ్ఞశాలఁ బ్రవేశించె. అంతఁ బరమసంతుష్టులై గాంధారీధృతరాష్ట్రులు భీష్మద్రోణకృపవిదురాదులును గర్ణదుశ్శాసనాదులును నానాదేశములం గలబ్రాహ్మణులను రాజులను దక్కఁగలవారలనుం బిలువఁగ దూతలం బంపిరి. అపుడు దుశ్శాసనుఁ డొకదూతను బిలిచి నీవు ద్వైతవనమున కరిగి పాపాత్ములగు పాండవులనుం బిలిచి రమ్మని పనుచుటయు వాఁ డమ్మహాత్ములపాలికిఁ జని ప్రణతుండై ధర్మరాజునకుఁ గేలుమోడ్చి మహారాజా, దుర్యోధనుఁడు నిజవీర్యార్జిత మగుధనమున వైష్ణవ మనుయాగముఁ జేయ దీక్షఁ బూనినవాఁడు. నానాదేశములఁ గలబ్రాహ్మణులు రాజులు నచ్చటికి వచ్చువారు. మిమ్ముఁ బిలువఁగ నన్నుఁ బంచిన నేఁ బనివిని మీసన్నిధికిఁ జనుదెంచితి. మీరు నానృపాలుకోరిక నెఱవేఱఁగ నచ్చటికి విచ్చేసి యయ్యజ్ఞముఁ గనుఁగొనుఁ డనివిన్నవించిన వానికి ధర్మరాజిట్లనియె. భాగ్యమున సుయోధనుఁడు పూర్వరాజులపేరు దేర నీయజ్ఞమునకు దీక్షఁ బూనె. చూడ మాకుం గోరిక గలదుగాని సమయసంవత్సరములు గడచనకమున్న మాకు రాఁ దగ దనిచెప్పుచుండునంత భీమసేనుఁ డాదూత కిట్లనియె. నియమమునఁ బదుమూఁడేండ్లు గడపి యట ధర్మరాజు శస్త్రాస్త్రతేజోహుతవహంబు ధార్తరాష్ట్రపశుకంబు క్రోధహవిష్కంబు నగురణాధ్వరంబుఁ జేయువాఁడు. అప్పుడు నేను వత్తు నని యాదుర్యోధనునకుఁ దెల్పుమనిపలికె. తక్కటివార లేమియుం జెప్పరైరి. ధర్మరాజునసుజ్ఞఁ గొని యాదూత దుర్యోధనుపాలికిఁ జని యంతయు నివేదించె. అట యజ్ఞదీక్షితుండైనదుర్యోధనుఁడు నానాదేశాగతులైన బ్రాహ్మణక్షత్రియాదులఁ బరమాదరమున గారవించి విదురుం బిలిచి యావచ్చి

నవారికెల్ల నుచితప్రకారమున భోజనాద్యుపచారముల నీ వరయుచుండు మనిని యమించుటయు సకలధర్మవిదుఁడైనవిదురుఁడు వారికెల్లఁ దగురీతి విడిదలలు నిరూపించి పానభోజనాద్యుపచారములఁ దగువిధమునఁ బొనరింప యోగ్యపరిచారకుల నేర్పఱిచి యంతయుఁ దా నరయుచుండె. అట్లు సుయోధనుఁడు రసవదన్నసంతర్పితసకలప్రాణిజాలంబు, బహుళదక్షిణామహితంబు, సంతతసత్కృతబ్రాహ్మణగణంబు, సమ్మానితరాజమండలంబు, సంతోషితసమస్తజనంబు, విధివదనుష్ఠానసంతర్పితదేవతానివహంబునుంగా నావైష్ణవయాగము సమాప్తప్రయోగముఁ గావించె. అంత సంతుష్టుండై తత్తద్దేశాగతులఁ దమతమచోట్ల కనిచి దుశ్శాసనాదిభ్రాతృవర్గంబు కర్ణసౌబలాదిమంత్రివర్గంబునుం గొలువ, వందిమాగధబృందములు పొగడఁ, బౌరవృద్ధులు లాజాక్షతాదిశుభపదార్థములమీఁదఁ జల్లఁగ, జనులు కొందఱది యుధిష్ఠిరురాజసూయమునకు దీటగు ననువారై, మఱి కొందఱాయాగ మిందుఁ బదియాఱవపాలిది యైనం గానోపునే యనువారై, వెండియుఁగొందఱు యయాతిప్రముఖు లగుతొల్లింటిరాజులయాగములు నీయధ్వరముతోడఁ బురుడింపఁ దగవు. ఈనృపాలుఁ డీయాగము నొనరించి వారికెల్ల స్వర్గలోకమున నిత్యవాసముఁ గల్పించె. కులమునకు వన్నెఁ దెచ్చె ననువారునై తోడం జనుదేర, సుహృజ్జనసరసాలాపములఁ జిత్తగించుచుఁ బురము సేరి నగరు సొచ్చి తల్లిదండ్రులకు భీష్మద్రోణకృపాదు లగుపెద్దలకుం బ్రణామంబు లాచరించి తనకెఱఁగినచిఱుతవారల గారవించి భ్రాతృగణపరివృతుఁడై ధృతరాష్ట్రుసమీపమున నుత్తమాసనమునఁ గూర్చుండె. అపుడు కర్ణుఁడు లేచి యోభారతకులవతంసా, నీభాగ్యమున నీయాగము నిర్విఘ్నముగ సమాప్తమయ్యె. యుద్ధమునఁ బాండవుల వధించి రాజసూయముఁ జేయవలయు. అపుడుగదా మాచూడ్కులకుఁ బండు వగు ననవుడు దుర్యోధనుఁడు కర్ణుఁ గౌఁగిలించి నీచెప్పినయది సత్యంబ. నీవే కదా దాని నెఱవేర్చువాఁడ వని యాతని నభినందించిచుట్లనున్నకౌరవులం జూచి పాండవుల నెన్నఁడు వధింతునో యయ్యజ్ఞ మెన్నఁడు చేయుదునో యనిపలికిన విని రాధేయుండు రాజేంద్రా, దీని కింత వగవ నేల? అర్జునుఁ జంపునందాఁక నేను బాదములఁ గడుగను. మాంసముఁ గుడువను. ఎవ్వఁడెద్ది యాచించినను లే దనను ఇవ్విధమున నాసురవ్రతముఁ బూనెద ననుటయుఁ గర్ణునిప్రతిజ్ఞావచనము విని ధార్తరాష్ట్రులు పాండవులు జితులకాఁ దలఁచియుండిరి. అట దుర్యోధనుఁడు కొలువు లేచి యభ్యంతరమందిరమునకుఁ జనియె. సభాసదులు నతని వీడ్కొని తమతమ యిండ్ల కరిగిరి. అంతనట ధర్మరాజు చారులవలనఁ గర్ణుని ప్రతిజ్ఞ నెఱింగి యభేద్యసహజకవచకుండలుండైనవానిఁ దలపోసి వెఱపు గదురఁ దమపడినపాట్లనెల్ల నెన్నుచుఁ జింతాక్రాంతుండై బహుళవ్యాళమృగాకీర్ణం బగు

ద్వైతవనము విడువఁ దలఁచియుండె. ఇట దుర్యోధనుఁడు భ్రాతృగణపరివృతుండై కర్ణునిమతమున భీష్మద్రోణకృపాదు లగుపెద్దలకుఁ దక్కటిదొరలకుఁ జిత్తరంజనముఁ జేయుచు ధనమునకు దానభోగములెకదా ఫలము లనిభావించి బ్రాహ్మణులకునుబంధువులకును యథేష్టముగ వాంఛితార్థముల నొసంగియాదరించుచుండె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునివరేణ్యా, పాండవు లావనముల నామీఁద నేమి చేసి రనియడుగ నమ్ముని యానృపతి కిట్లనియె.

—: ద్వైతవనమందలిమృగములుధర్మరాజుకలలోనగపడితమదుఃఖముఁ జెప్పుకొనుట. :—

అంతనొక్కనాఁడు ధర్మరాజు నిద్రవోవుచుండఁ బ్రభాతసమయమున ద్వైతవనమునందలిమృగములు బాష్పసంపూర్ణనయనములై గడగడవడకుచు నంజలిబంధము లొనరించి యతనికలం గనుపట్టుటయు నయ్యజాతశత్రుఁడు మీరెవ్వరు? కోరిక యెయ్యది? చెప్పుఁ డనియడుగ నతనికి మృగము లిట్లనియె. మహారాజా, మేముద్వైతవనమృగములము. సర్వాస్త్రవిదు లయిననీతమ్ములు మాకులమునఁ బెక్కండ్రఁ జంపఁగ మే మెట్లో యిప్పటికిఁ దప్పించికొని కులము పేరిటిబీజములుగ నిలిచి యుండెదము. మీ రీవనము విడిచి మఱియొకచోటికిఁ బోయెదరేని భవత్ప్రసాదమున మాకుఁ గులక్షయము గాకుండు. అనుగ్రహింపవే యనివేఁడికొనిన నవ్వేఁడికోలు నాలించి సర్వభూతహితుండైనధర్మరాజు మృగములఁ జూచి వగచి దయార్ద్రచిత్తుఁడై మీచెప్పినట్లచేయుదు ననియొండంబడి యామృగముల వీడ్కొలిపె. అట మేలుకాంచి యతఁడు తమ్ములఁ బిలిచి మృగస్వప్నవృత్తాంతము వివరించి మన మీవనమున నొక్కయేఁడు నెనిమిదినెలలును వసించితిమి ఇఁకఁ గామ్యకవనమునకుఁ జనుట లెస్స యనిచెప్పినం దమ్ములునందుల కియ్యకొనిరి. అంతఁ బాండవు లింద్రసేనాదిపరిచారకులు కొలిచిరాఁగ విప్రగణసమన్వితులై లలితమార్గమునసుకృతవంతులుస్వర్గమునకుంబోలె నవ్వనమున కరిగిరి. అట్లు వారుకామ్యకవనము సేరి ఫలమూలాశనులై తమపడినపాట్లందలపోయుచుండ నేకాదశవత్సరములు గడచె. యుధిష్ఠిరుఁడు వనవాసశ్రమంబు మనస్సునకు వచ్చినపుడెల్ల రాధేయునిపరుషవాక్యములఁ దలపోసి దైన్య మెసఁగ నిట్టూర్పులు నిగిడించుచు రేలెల్ల నిదుర గానక క్రోధవిషానలమునఁ బొగులుచుఁ దాను జూద మాడఁగ నిందఱ కిన్నిపాట్లు పడవలసె నని పెద్దయు వగచుచుండె. భీమాదులు తమసమయవత్సరములు కడచనవచ్చె నని భావించుచుఁ గ్రోధోత్సాహచేష్టితముల నొడళ్లువ్రెంగ నుల్లసిల్లుచుండిరి.

అంతనొక్కనాఁడు కృష్ణద్వైపాయనుండు పాండవులఁ జూచువేడుక నచ్చటికి విచ్చేయుటయుధర్మరాజు తమ్ములుం దాను నమ్ముని నెదుర్కొని తోడితెచ్చి యుత్తమాసనమున నాసీనుంజేసి పరమభక్తిమై నతనియడుగుల కెఱఁగి యథా

విధి సపర్యలఁ గావించి చేరువ వినయవినమ్రుఁడై కొలిచియుండె. వేదవ్యాస మునీంద్రుఁడును వనవాసాయాసకర్శితులైనమనుమలం గాంచి దయాళుండై బాష్పగద్గదస్వరమున ధర్మరాజున కిట్లనియె. ధర్మనందనా, వినుము. పురుషుఁడు పర్యాయమున సుఖదుఃఖములఁ బడయుఁ గాని యనంతసుఖముఁ బడయనేరఁడు. ప్రాజ్ఞుఁడు దీని నెఱింగి సుఖదుఃఖములకు మోదఖేదములం బొరయక కర్షకుఁడు సమయప్రాప్తసస్యమునుంబోలె సమయప్రాప్తం బయినదాని ననుభవించు. ఒక్క విశేషంబు గలదు. సావధానుఁడవై యాకర్ణింపుము. తపస్సు లొనరింపనివా రుత్తమసుఖములఁ బడయనేరరు. తపస్సునకుఁ గడచినమేలు గన్పట్టదు. తపస్సున సాధింపరానియది గలుగదు. సత్య, మార్జవ, మక్రోధము, దేవతాతిథిప్రభులకుఁ బంచియిచ్చుట, శాంతి, యనసూయ, యహింస, శౌచ, మింద్రియనిగ్రహ మనునివి పావనంబులు. వీనినాచరింపక యధర్మపరులైనమూఢులు నీచజన్మముల నెత్తుచు నెల్లకాల ముమ్మలింతురుగాని యొకప్పుడైనను సుఖింపనేరరు. ఈలోకమున నాచరించినశుభకర్మము పరలోకమున భోగసాధన మగు. కావునఁ దపోనియమముల శరీరము నలంచుచు యథాశక్తి దానదేవతాతిథిపూజనాదులం జేయుచు మాత్సర్యాదిదోషదూరుండై నయతండు మిగుల సంతోషించు. సత్యాదులవలనఁ గలుగుధన మీ మని చెప్పెద. సత్యవాది యాయుర్వృద్ధిం బడయు. ఆర్జవవంతుఁ డాయాసము వాయు. క్రోధాసూయల విడిచినవాఁడు నివృత్తిమార్గపరుఁ డగు. శాంతుఁడు క్లేశముల నెడలు. దేవతాతిథ్యాదులకుఁ బంచి పెట్టినవాఁడు భోగములఁ బడయు. హింసఁ జేయనివాఁ డారోగ్యవంతుఁ డగు. మాన్యుల మన్నించువాఁ డుత్తమకులమున జనించు. జితేంద్రియుఁడు వ్యసనములఁ బొరయఁడు. కావున శుభములనే యాచరించువాఁడు కాలధర్మము నొందియు సుకృతమునం జేసి యుత్తమజన్మ మెత్తు ననిన యుధిష్ఠిరుఁడు దానధర్మములలో నెయ్యది దుష్కర్మంబు గుణవంతంబు ననియడుగ వేదవ్యాసుఁ డతనికి మఱియు నిట్లనియె. వత్సా, జనులు తృష్ణావిశేషమునం జేసి ప్రాణములకైన నాసపడక పోరునకుఁ దొడఁగుటయు, సముద్రముల దాఁటుటయు, నడవులఁ ద్రిమ్మరుటయుఁ, గృషిగోరక్షాదివృత్తుల గ్రహించుటయుఁ, గూలిపనులు సేయఁ బూనుటయు ననునివి మొదలగుకార్యములఁ బ్రవర్తించుట చూడఁగ సర్వప్రయత్నములు ధనార్థంబులే యని నిర్ణయింపవలయుఁగదా? ఎన్నిపాట్లైనం బడి సంపాదించినధనము నొరుల కిచ్చుట యెంతయు దుష్కరం బని వేఱ చెప్పనేల? కావున దానముకంటె నొండొక్కటి దుష్కరంబు గాదని నామతంబు. న్యాయార్జితంబైనధనమును దేశకాలముల నెఱింగి విశుద్ధచిత్తుండై పాత్రభూతులైనసాధువుల కిచ్చిన ననంతఫలము సమ

కూఁడదు. అన్యాయార్జిత మైనవిత్తమున నెన్ని దానములు చేసిన నించుకయేని ఫలము పుట్టనేరదు. తొల్లి ముద్గలుం డనుముని న్యాయార్జిత మైన*వ్రీహిద్రోణము నుత్తమపాత్రమున సమర్పించి యుత్తమగతిం బడసె నని పెద్ద లితిహాసంబు చెప్పుదు రనిన ధర్మరాజు వేదవ్యాసుం జూచి మునీంద్రా, ముద్గలుఁడు వ్రీహిద్రోణము నెవ్వని కెవ్విధి నిచ్చి యేపదవిం బ్రాపించె? తనకృత్యముల భగవంతుని సంతుష్టుం జేసినయాధార్మికవరేణ్యునిజన్మంబ కాదె సఫలంబు. తత్ప్రకారంబు వినవలతుం జెప్పవే యనియడుగఁ బరాశరనందనుండు ధర్మనందనున కిట్లనియె.

వ్యాసులు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానము చెప్పుట.

తొల్లి సత్యవచనుఁ డనసూయుఁడు జితేంద్రియుఁడు ధర్మాత్ముఁడు నగుముద్గలుఁ డనుముని కురుక్షేత్రమున వసించి కపోతముల విధమున నుంఛవృత్తిపరాయణుఁడై యిష్టీకృత మనుసత్రము నాచరించువాఁడు పాడ్యమి మొదలుగఁ బదునాలుగుదినములు నేల రాలినగింజల నేఱి తూమెడువడ్లు సంపాదించి విగతమత్సరుండై పూర్ణిమామావాస్యలయందుఁ బాకముఁ జేయించి దర్శపౌర్ణమాసముల సలిపి దేవతాతిథుల కన్నముఁ బెట్టి మిగిలినయన్నమునఁ దాను బుత్రులు కళత్రంబును శరీరయాత్ర నడపుచుఁ బక్షోపవాసవ్రతము సలుపుచుండె. అతఁడు కావించినపర్వేష్టులయందు హవిర్భాగముల నింద్రాదిదేవతలు తామే వచ్చి కొనిపోవుచుండుదురు. మఱియు నతండు సంతుష్టమానసుండై పర్వదినముల నతిథుల కన్నముఁ బెట్టునెడ నావ్రీహిద్రోణపాచితం బైనయన్నము మనశ్శుద్ధి సత్పాత్రదానంబు ననునివి కారణంబులుగాఁ బదివేవురతిథులు వచ్చిన నందఱకుం జాలునట్లు పెరుగుచుండు. ఆముద్గలుచరిత్రము విని దుర్వాసుఁ డొకపర్వమున దిగంబరుండై వెఱ్ఱివానిపోలె ననియతవేషముఁ దాల్చి పలుదెఱంగులఁ బ్రల్లదము లాడుచు నమ్ముద్గలు నాశ్రమమునకుఁ జనుదెంచి ముద్గలుఁ బిలిచి ద్విజోత్తమా, నే నన్నార్థినై వచ్చితి ననిచెప్పె. అట్లు డబ్బాటు వచ్చినయమ్మునిం గనుంగొని ముద్గలుండు భక్తిమై నెదురేగి స్వాగతం బడిగి యాశ్రమాభ్యంతరమునకుఁ దోడితెచ్చి యున్మత్తుఁ డని యనాదరంబు సేయక యతిశ్రద్ధతో నర్ఘ్యపాద్యాచమనీయముల నిచ్చి క్షుత్పీడితుం డైనయతని కన్నముఁ బెట్టె. దుర్వాసుఁడు నావ్రీహిద్రోణాన్న మంతయుఁ దాన భుజించి మిగిలినదానిఁ దనమేనెల్లఁ బూసికొని వచ్చినత్రోవం జనియె. అంత నమ్ముద్గలుఁడు నిరాహారుఁడయ్యుఁ గసటుఁ జెందక యప్పటియట్ల దారపుత్రులతోడ నుంఛవృత్తిచే వ్రీహిద్రోణ మార్జించి యామఱుసటిపర్వమున నిష్టిఁ జేసి యతిథివిచారణోత్సుకుండై యుండఁ గ్రమ్మఱ దుర్వాసుఁడు వచ్చి యాముద్గలుమనస్సునఁ గ్రోధమాత్సర్యావమానసంభ్రమాదివికారములలో

* వ్రీహి యనఁగా ధ్యానము. ద్రోణ మనఁగా తూము. తూమెడువడ్లనిభావము.

నొక్కటియుం గానరామి కద్భుత మంది ముందటివిధమునఁ దా నయ్యన్న మం తయుఁ గుడిచి పోయె. అట్లు దుర్వాసుఁ డాఱుపర్వములు వచ్చి యమ్ముద్గలుకు టుంబయాత్రకైన మిగిలింపక వ్రీహిద్రోణాన్న మంతయుం దాన భుజియించి యప్పటికి నతనిచిత్తమున నించుకేనియు వికారము దోషమి కెంతయు. విస్మి తుండై యత్యంతప్రేమమున నిట్లనియె. మునివరేణ్యా, నీవంటిమత్సరరహితుం డైనదాత యొక్కఁడుం గన్పట్టఁడు. ఆఁకలి జనులకు ధర్మబుద్ధిని ధైర్యమును నడఁచు. జిహ్వ రసముల ననుసరించి ప్రవర్తించుచుండు. ప్రాణము లాహారప్ర భవంబులే. కావున నాహారము మానియునికి దుష్కరంబు. మన స్సనఁగ నిగ్ర హింప నశక్యము చంచలము. మఱియుఁ గష్టార్జితం బైనదాని నియ్యఁగ నంద ఱకు మనసు గొలుపదు. ఇతరదుష్కరంబు లైనయివియన్నియు నీకు సుకరంబు లయ్యె. ఇంద్రియనిగ్రహంబునకుఁ గడచినయుత్తమంబు గలుగదు. అదియేతప మనఁబడు. నీతోడిసమాగమునఁ బ్రీతుఁడ నైతి. అనుగృహీతుఁడ నైతి ఇంద్రియ నిగ్రహము, ధైర్యము, దేవతాతిథులకుఁ బంచియిచ్చుట, శాంతి, దయ, సత్యము, ధర్మమును నీయందే సుప్రతిష్ఠితంబులై యున్నయవి. నిజకర్మయోగమునఁ బుణ్య లోకము సాధించితివి. ఉత్తమగతిం బడసితివి. స్వర్గవాసు లందఱు దానముకంటె నుత్తమము లే దని యుగ్గడింతురు. అది నీ కత్యంతసులభ మయ్యె. ఈమేనితో డన స్వర్గమునకుఁ బోయెద వనిచెప్పుచున్నంత దేవదూత యొక్కండు హంససా రసయోజితంబు కింకిణీజాలవిలసితంబు దివ్యగంధభాసురంబు కామగమనంబు నగు నొక్కవిమానముతోడ నాముద్గలుపాలికి వచ్చి మునీంద్రా, పుణ్యవిశేషమున సిద్ధుఁడ వైతివి. ఈవిమాన మెక్కి నాకలోకమున కరుదేరు మనిన విని ముద్గ లుండు దేవదూతం జూచి స్వర్గమునఁగలగుణదోషముల నిరూపింపుము. మీయ ట్టిసత్పురుషులతోడిసఖ్యము సప్తపదములనే సిద్ధించుఁగదా. కావున మైత్రిం బుర స్కరించి యడిగితి. ఆలోకవృత్తాంత మంతయుం దెలియఁజెప్పితివేని నే నొక్కరీ తిని మనస్సున నిశ్చయించుకొనియెద ననినముద్గలునకు దేవదూత యిట్లనియె.

### దేవదూత ముద్గలునకు స్వర్గలోకము తెఱం గెఱింగించుట.

మునీంద్రా, బుద్ధిమంతుఁడవయ్యు నీవు ప్రాప్తం బయినస్వర్గలోకసుఖము ననుభవింపక యేల గుణదోషముల విచారించెదవు. స్వర్గలోక మీలోకమునకు మీఁద నున్నయది. తపస్సులఁ జేయనివారు యజ్ఞముల నాచరింపనివా రసత్య వాదులు నాస్తికులు నాకలోకముఁ బ్రాపింప నేరరు. శాంతులు దాంతులు జితేంద్రియులు మాత్సర్యాదిదోషదూరులు ధర్మాత్ములు యుద్ధమున వెనుదీయక యురువడించి పోట్లాడి నిహతులైనవారు నాలోకముఁ బొందుదురు. దేవతలు సాధ్యులు విశ్వదేవు లశ్వినులు మహర్షులు గంధర్వు లప్సరసలు నాలోకమున

వసింతురు. త్రయస్త్రింశద్యోజనాయితం బయిన మేరుపర్వతశిఖరమున నందనాద్యు పవనరమణీయంబై యాలోకము పుణ్యవంతులకు విహారస్థానంబై యుండు. అచ్చట నుండువారికి క్షుత్పిపాసలు శీతోష్ణములు జరాశోకములు మొదలగుసకలదుఃఖములు గలుగవు. సుఖస్పర్శములు రమ్యగంధములు నగుపుణ్యవాయువులు వీచుచుండు. శ్రుతిమనోరమణీయము లయినదివ్యశబ్దములు వినవచ్చు. అచ్చటివారిశరీరములు శుక్లశోణితభవములు గావు. మఱి తేజోమయములై యుండు. స్వేదదుర్గంధమూత్రపురీషములు వారలకు లేవు. వారివస్త్రము లెప్పుడును రజోదూషితములు గావు. వారు దాల్చినకల్పతరుకుసుమమాల్యములు వాడవు. ఇట్లు సర్వగుణసముల్లసితం బై నయాలోకమున వసించువా రీర్ష్యాశోకశ్రమమోహమాత్సర్యరహితులై దివ్యవిమానములఁ జరించుచుండుదురు. ఆలోకముమీఁద బ్రహ్మలోకపర్యంతము తేజోమయము లయినకొన్నిలోకములు గలవు. అవి స్వప్రకాశములు కామదాయకములు. పుణ్యకర్ములఁ బవిత్రు లయినమహర్షులును దేవతలకుం దేవత లగుఋభువు లనువారు త్రయస్త్రింశత్సంఖ్యాకు లాలోకములందు వసింతురు. స్త్రీకృతతాపము లైశ్వర్యమదమాత్సర్యాదులును వారిం జేరరావు. మఱియు వార లాహుతిగ్రహంబు నమృతపానంబును లేకున్నను దివ్యశరీరముల నుల్లసిల్లుదురు. సుఖాదులనుం గోరరు. కల్పాంతములందును వారికిఁ బరివర్తనంబు గలుగదు. ఇఁక ద్వంద్వదుఃఖములు గలుగ వని వేఱ చెప్పనేల? ఆలోకములందఱకుం బ్రాపింప నలవిగావు. విధిపూర్వముగ నాచరించినదానాదిధర్మములచే నాలోకములు లభించు. సుకృతవిశేషమున లభించినతల్లోకసుఖముల ననుభవింపుము. స్వర్గమునఁ గొన్నిదోషములుం గలవు. వానిం జెప్పెద. వినుము. ఇచటఁ జేసినకర్మములఫల మచట ననుభవించుటయగాని యచటఁ గర్మాచరణము లేదు. పుణ్యక్షయంబైనపిదప దేవదూతలు వారల నీలోకమునఁ బడఁ ద్రోయుదురు. అట్టియెడఁ బడువారికి సంజ్ఞామోహము రాజసవికారంబులు పూదండలువాడుట భయాతిశయముం గలిగియుండు. సుఖవ్యాపృతచిత్తులై పెద్దకాల ముండి యటనది దొలఁగుట యెంతయేని ఖేదకరము గాకుండునే? ఇది యందుఁ బెద్దదోషంబు. మఱియు బ్రహ్మలోకముదక్కఁ దక్కటిలోకముల నుండువారికిఁ దమసుఖములయెడ నసంతోషంబును దమకంటె నధికులకలిమిం జూచి పరితాపముం గలిగియుండు. ఇవి స్వర్గలోకమునం గలదోషములు. గుణములు పదివేలు గలవు. అవియన్నియుం జెప్ప నలవిగావు. స్వర్గభ్రష్టుల కుచితపురాతనపుణ్యకర్మసంచయము గలిగియుండెనేని మనుష్యత్వంబును సౌఖ్యమునుం గలుగు. అది లేకున్న నరకగమనం బగు. ఈలోకము కర్మభూమి. ఆలోకము ఫలదేశము. నీయెడఁ గరుణం జేసి యింత సెప్పితి. ఇఁక రమ్ము పోవుద మని దేవదూత చెప్పిన విని ముద్గలుఁడు

తనమనమునఁ గొంతవడి చింతించి దేవదూత కిట్లనియె. అయ్యా, నీకు నమస్కారము నీవు వచ్చినట్లు పొమ్ము. స్వర్గవాసులకుఁ బుణ్యక్షయానంతరము మహాదుఃఖముతోఁ బునరావృత్తి తప్పకుండుఁ గావున మహాదోషావహం బైనస్వర్గలోకసుఖము నే నొల్లను. దేనిఁ బ్రాపించిన శోకవ్యథాచలనములు గలుగకుండునో యట్టిచోటు సేరఁగ యత్నముఁ జేసెద. నీచెప్పినలోకము లన్నియుఁ బునరావృత్తింజేసి దోషవంతంబులు. ఇఁక దోషలేశరహితం బయినలోక మెయ్యదియో యెఱుంగఁ జెప్పుము. దాని నధిగమింప యత్నవంతుఁడ నగుదు ననిన దేవదూత మఱియు నతని కిట్లనియె. బ్రహ్మసదనమునకు మీఁద విష్ణుపదము గలదు. అది శుద్ధంబు, సనాతనంబు, జ్యోతీరూపం బనిర్వాచ్యంబు, పరబ్రహ్మపదాభిధేయంబు. విషయవ్యసను లైన దంభలోభక్రోధమోహద్రోహాదిదోషవశచేతస్కుల కది యగమ్యంబు. నిర్మలములు, నిరహంకారులు, నిర్ద్వంద్వులు, నిగృహీతేంద్రియులు, నిరంతరధ్యానయోగపరులు నగుమహాత్ములకు గమ్యం బనిచెప్పిన విని ముద్గలుఁడు దేవదూతం బ్రశంసించి వీడ్కొలిపి శిలోంఛవృత్తిచే దేహయాత్ర నడపుచుఁ బరమశాంతుఁడు, తుల్యనిందాస్తుతి, సమలోష్టకాంచనుఁడునై విశుద్ధజ్ఞానయోగపరినిష్ఠితధ్యాననిత్యతంజేసి నిర్వాణలక్షణం బయినశాశ్వతసిద్ధిం బడసె. కావున ధర్మనందనా, తపోమహిమమున లభ్యముగానియది యొక్కటియుం గన్పట్టదు. రాజ్యచ్యుతుఁడ నైతిఁగా యని వగవకుము. సుఖానంతరము దుఃఖము, దుఃఖానంతరము సుఖమునుం బర్యాయమున బండిగంటియాకులట్ల పరిభ్రమించుచుండు. ఈపదుమూఁడేడులు గడచినపదపడి నీవుం బితృపితామహాదిపరంపరాప్రాప్తం బయినరాజ్యముఁ బొందెదవు. మనస్సునఁ జింత విడవు మనిబోధించి పారాశర్యుఁడు ధర్మనందను నామంత్రణంబు చేసి నిజాశ్రమమునకుఁ జనియె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునివరేణ్యా పాండవు లాయడవులందు బ్రాహ్మణులతోడ సత్కథాగోష్ఠి నుండి ద్రౌపది భుజియించుపఱకుఁ బెరుగుసూర్యదత్తాక్షయ్యాన్నపాత్రమందలియన్నమునను వివిధమృగమాంసలను సమయప్రాప్తు లయినయతిథివిప్రులకు సంతర్పణముఁ గావించుచుండిరిగదా. అపు డెవ్వరు వారికతిథులై వచ్చిరి? కర్ణశకునులమతంబ యనువర్తించి యెగ్గులు సేయుదుర్యోధనాదులు వారియెడ నేతెఱంగునవర్తించిరి? అంతయుఁ దేటపడం జెప్పు మనియడుగ నమ్మునివరేణ్యుఁ డానరవరేణ్యున కిట్లనియె.

### దుర్యోధనుఁడు దుర్వాసునిఁ బాండవులయొద్ద కతిథిఁగాఁ బంపుట.

పాండవులు వనగతులయ్యు నగరున నున్నయట్లు బ్రాహ్మణులతోడ నిష్టగోష్ఠిని సుఖమునికి నెఱింగి దుర్యోధనుఁడు చూపోపక వారి కపాయముఁ గావింపనోపునుపాయం బెయ్యదియో యని కర్ణశకునిదుశ్శాసనాదు లయినయుక్కివుల

తోడఁ జింతించుచుండునంతఁ బరమతపోధర్మనిరతుఁ డై నదుర్వాసుఁడు పదివే వురుశిష్యులతోడ యదృచ్ఛ నచ్చటికి విచ్చేసె. పరమకోపనుం డై నయమ్మునీంద్రుం గనుంగొని దుర్యోధనుఁడు తమ్ములుఁ దాను నత్యంతవినయమున యథావిధి పూజలఁ గావించి యాతిథ్యమున సత్కరించుటయు సుప్రీతుం డై యమ్ముని యచ్చోటఁ గొన్ని నాళ్ళు లుండె. ఏమి తప్పిన నతఁ డెప్పు డేమి శపించునో యని తలఁకుచు దుర్యోధనుఁ డేమఱక రేలుంబవల్లు నమ్మునిం బరిచరించుచుండె. అమ్మునియు ధార్తరాష్ట్రచిత్తము నెఱుంగఁ గోరి యొక్కొకవేళ నోకౌరవా, నే నిపు డాఁకొనిన వాఁడ, శీఘ్రంబ యన్నంబు పెట్టు మని చెప్పి స్నానార్థము చని రాక తడయు. అటఁ బెద్దయుం బ్రొద్దునకు వచ్చి నాకిపు డాఁకలి లేదు భుజియింప నని యదృశ్యుఁ డగు. మఱియొకవేళ డబ్బాటువచ్చి నాకును నాశిష్యులకు నీక్షణంబ భోజనము పెట్టు మని తొందఱవెట్టు. వెండియు నొక్కొకనాఁడు నడురేయి లేచియన్నము వలయు నని వండించి యయ్యన్నమున లేని దోషము లారోపించి నిందించుఁగాని భుజియింపఁడు. అటు లెన్నియే మాఱులెన్నియే దెఱఁగులఁ బరీక్షించి యాదుర్వాసుఁడు ధార్తరాష్ట్రచిత్తమునఁ గ్రోధవికారములు దోఁపమికిఁ బరమప్రీతుం డై యొక్క నాఁడు దుర్యోధనుఁ బిలిచి కురుకులోత్తమా. నీకావించినశుశ్రూషకు మెచ్చితి. ఇష్టమైనవరముఁ గోరుము. నిక్కంబ నేఁ బ్రీతుఁడనైన నీ కలభ్యము గలుగ నేర దనిన విని సుయోధనుఁడు దుర్వాసునిక్రోధానలమునఁ బడక బ్రదికితి ననిభావించి యమ్ముని వచ్చినప్పుడ తొలుతఁ గర్ణశకునిదుశ్శాసనాదులతోడ నాలోచించి నిర్ణయించికొనినమునిప్రార్థనాప్రకారంబుఁ దలపోసి యత్యంతసంతుష్టుఁ డై యిట్లనియె. మునీంద్రా, శిష్యగణముతోడ నతిథి వై వచ్చి న న్నాదరించుటం జేసి భవత్ప్రసాదపాత్రం బైతిఁ గాన ని న్నొకవర మడిగెద. సకలసుగుణగరిష్ఠుఁ డస్మత్కుల శ్రేష్ఠుఁడు నై నయుధిష్ఠిరుఁడు తమ్ములు భార్యయుఁ దాను నడవుల నిపు డున్నవాఁడు. బ్రాహ్మణులకుఁ బతులకు భోజనముఁ బెట్టి పాంచాలి తానును భుజియించి విశ్రమించియుండుతఱి నాకస్మికముగ నాధర్మరాజున్నయెడకు నీశిష్యగణముతోడ నతిథి వై విచ్చేయవలయు. నాపై ననుగ్రహము గల దేని యిట్లు చేయు మని ప్రార్థించిన దుర్వాసుఁ డట్ల చేయుదు నని యొడంబడి సుయోధను వీడ్కొని యథాగతముగ నరిగె. అట దుర్యోధనుఁడు దన్నుఁ గృతార్థుఁగా భావించికొని తనచేతం గర్ణుని చేయి చఱచుచు సంతోషపరవశుఁ డై యుండఁ గర్ణుఁడు దుశ్శాసనాదిభ్రాతృవర్గము వినుచుండ దుర్యోధనున కిట్లనియె. కౌరవవంశవర్ధనా, భాగ్యవశంబున నీకోరిక యీడేఱె. వృద్ధి సేకూఱె. మనశత్రు లయినపాండుపుత్రులు మనభాగ్యమున దుర్వాసునిక్రోధాగ్నిం బడి ప్రుగ్గిరి. దాఁటరానివనటమున్నీట మునిఁగిరి. తమపాపములనే చెడి రనిన నయ్యుక్కివులు తమలో నగుచు సంతు

ష్టులై తమతమయిండ్ల కరిగిరి. అంత నొక్కనాఁడు దుర్వాసుఁడు దుర్యోధను ప్రార్థనాప్రకారమునఁ బాంచాలి యందఱకు భోజనము వెట్టి తానును భుజియించి విశ్రాంతయై యున్నతఱి నెఱింగి పాండవాశ్రమమునకుఁ దనపదివేవురు శిష్యులతోడ నతిథియై చనియె. అమ్మునిని దవ్వుదవ్వులఁ గనుఁగొని యుధిష్ఠిరుఁడు తమ్ములుఁ దాను నమ్ముని నెదుర్కొని తోడ్తెచ్చి యుత్తమాసనమున నాసీనుం జేసి విధియుతముగఁ బూజించి కేల్దోయి మొగిచి మునీంద్రా, శిష్యులతోడ నీవు మాయింట నాతిథ్యము గ్రహించి నన్నాదరింపుము. ఆహ్నికముఁ దీర్చి వేగ విచ్చేయు మని మెల్లన నివేదించె. నివేదించుటయు దుర్వాసుఁడు శిష్యులకుఁ దనకు నతఁ డపు డెట్లు భోజనము వెట్టునో యని యించుకేనియు నరవాయి గొనక యట్ల యని శిష్యులతోడ గంగానదికిఁ జని స్నానము సేయుచుండె.

—: శ్రీకృష్ణుఁడు ద్రౌపదికిఁ బ్రత్యక్షమై దుర్వాసునివలనిభయముఁ దొలఁగించుట :—

అత్తఱిఁ బరమపతివ్రత యైనపాంచాలి మునిగణమున కెట్టు లిపుడు భోజనము పెట్టుదు నని మిక్కిలి చింతించి తా నంతకుమున్న భుజించుటం జేసి యన్నము సాధింప నుపాయంబుఁ గానక శరణత్రాణపరాయణుం డైన నారాయణుఁ జిత్తమునం దలంచి యిట్లని ప్రార్థించె.

సీ. కృష్ణ, యవ్యయ, దేవకీనందనా, వాసుదేవ, జగన్నాయకా, వరేణ్య,
ప్రణతార్తినాశనా, పరమ, విశ్వాత్మక, విశ్వసృష్టిస్థితివిలయకారి,
పరమేశ్వర,పురాణపురుష,సర్వాధ్యక్ష,వరద,హృద్వృత్తి,గోచర, శరణ్య,
కౌస్తుభభూషణా, కమలాక్ష, యిందీవరశ్యామ, పీతాంబరపరిధాన॥
భూతములకెల్లనాద్యంతములుపరాయణంబుసర్వసంపన్నిధానంబుపరములకుఁ
బరము నగుజ్యోతి నీవకృపఁ బ్రోవు మగతికి గతి నీ వుండ భయంబు గలదె.

క. ఆసభలోఁ బూర్వము దు శ్శాసనుఁ డవినీతి నన్ను సంకటపఱుపం
గా సన్నిధియై ప్రోచితి వీసారియుఁ గరుణఁ జేయవే కంసారీ.

అని ప్రస్తుతించిన నాలకించి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛనుండు పాన్పున నొక్కప్రక్కం దోడన పరున్న రుక్మిణిం దొఱంగి తటాలున లేచి యతిశీఘ్రగమనమునఁ దత్క్షణంబ ద్రౌపదికి సన్నిహితుం డయ్యె. అట్లు సన్నిహితుం డైన సర్వేశ్వరుం గనుంగొని పాండవధర్మపత్ని యెంతయు ముదంబున నంబుజోదరు పదంబులకుఁ బ్రణామంబులు గావించి దుర్వాసునిరాక మొదలుగాఁ గలవృత్తాంతమంతయు విన్నవించినం జిత్తగించి యయ్యాపన్నరక్షకుండు పాంచాలిం బిలిచి యవ్వా నే నిపు డాఁకటఁ దూలియుండెదఁ గావున ముందుగ నాకు భోజనము పెట్టి పిదప నంతయుం జేసికొను మనివాక్రుచ్చె. భగవంతునివచనము విని లజ్జితయై యాజ్ఞసేని దేవా, నేను భుజించునందాఁక నే పూఁటపూఁట సూర్యదత్తపా

త్రమున నన్నము గలిగియుండు. ఇపుడు నేఁ గుడుచుటంజేసి యం దన్నము లే దని క్రొంకుచు మనవి చేసిన విని వాసుదేవుండు వెండియుం బాండవధర్మపత్నిం బిలిచి యమ్మా, యిది మేల మాడఁ దఁటె గాదు. ఆఁకటఁ గడుసోలితిఁ గావున నన్నంతమైనం బెట్టుము. మీయన్నపాత్రము నాకుఁ జూపు మని నిర్బంధించి య ప్పాత్రముఁ దెప్పించి దానియంచుత నంటుకొనియున్న శాకాన్నకణంబుఁ దా నుపయోగించి యీశాకాన్నమున విశ్వాత్మకుఁడు, యజ్ఞభోక్త, సర్వేశ్వరుఁడు నగు హరి తనివిఁ జెంది సంతుష్టుఁ డగుఁగాక యనిపలికి యట భీమసేనుం బిలిచి స్నానార్థము గంగకుఁ బోయినమునులను శీఘ్రింబ భోజనార్థము రం డని పిలిచి ర మ్మనియానతిచ్చె. వాయుసుతుఁ డట్లయని వారలఁ బిలువఁ బోయె. అట నామును లఘమర్షణసూక్తజపపూర్వకముగ గంగలో స్నానముఁ జేయువారు కడుపు నిండ మృష్టాన్నమప్పుడు భుజించినతెఱంగుగాఁ త్రేఁపులు దమకుఁ బెలుచవచ్చుటం బరికించి నీరు వెడలి యందఱుం దుర్వాసున కభిముఖులై మునివరేణ్యా, మనము భుజింప వత్తు మని ధర్మరాజునకుఁ దెల్పి స్నానార్థ మిటకు వచ్చితిమిగదా. ఇపు డాకంఠము భుజించినట్లు త్రేఁపులు వచ్చుచున్నయవి. ఇఁక మన మేమిభోజనముఁ జేయఁ గలము. వృథా పాకముఁ జేయించితిమి. ఇఁక నేమి సేయవచ్చు ననిన దుర్వాసుఁడు వారి కిట్లనియె. వృథా పాకముఁ జేయించుటంజేసి రాజర్షి యగు ధర్మరాజునకు మన మపరాధ మొనరించినవార మైతిమి. ఇఁకఁ బాండవులు మనలఁ గ్రూరవిలోకనములఁ జూఱువుచ్చకుండుదురే? ఎట్లు తప్పించికొనవచ్చునో? అంబరీషనృపాలుమహిమంబు దలంపునకు వచ్చినపుడెల్ల హరిభక్తులవలని వెఱపు నాకుఁ బెద్దగఁ దోఁచుచుండు. పాండవులును సామాన్యులు గారు వా రందఱు ధర్మపరాయణులు శూరులు విద్వాంసులు నియతవ్రతులు తపోనిరతులు సదాచారతత్పరులు వాసుదేవభక్తులు. వారు నిక్కం బలిగిరేని యగ్నితూలరాశింబోలె మనల నీఱుసేయుదురు. కావున వారి నడుగకయే యందఱుం దోఁచినట్లుపాఱిపోవుటయిప్పటికి లగ్గనిచెప్పితా నదృశ్యుఁ డగుటయు నతనిశిష్యులుం బాండవులకు వెఱచి పదిదెసలం బాఱిరి. భీమసేనుఁడు మునులఁ బిలువఁ బోయి గంగరేవుల వారలఁ గానక యిటునటు వెదకుచు నచ్చటితాపసులవలన వా రెల్ల రుం బాఱిపోవుట నెఱింగి యుధిష్ఠిరుసన్నిధికి వచ్చి యావృత్తాంత మంతయు నివేదించె. అంత వారు గొంతవడి యమ్మునులరాక వార్చి యిఁక నెప్పుడు వత్తురో? నడురేయి డబ్బాటువచ్చిమనల వంచింతురుగాఁబోలు. దైవప్రాప్తం బయినయీసంకట మెట్లు తొలంగునో యని చింతించుచు నిట్టూర్పులు నిగిడించుచుండఁ బుండరీకాక్షుం డందఱకు నపుడు ప్రత్యక్షంబై యిట్లనియె. ధర్మనందనా, మీకుఁ బరమకోపనుఁ డైనదుర్వాసుని వలన రానుండినసంకటమునకు వెఱచి ద్రౌపది నన్నుఁ దలంచిన నేనుఁ దత్క్షణంబ

నన్ని హితుఁడనై యాభయము నుడిపితి. ఇఁక నమ్ముని కించుకేనియు వెఱవవలదు. అతఁడు మీ తేజమునకు వెఱచి పాఱిపోయినవాఁడు. ధర్మనిరతుల కెన్నఁడైనఁ జేటు పొసఁగునే? మీకుఁ గ్రమంబ మే లయ్యెడి. నేఁ బోయివత్తు నని వివరిం పఁగ భగవద్వచనం బాకర్ణించి పాండవులు ద్రౌపదియుఁ దాము పరమసంతుష్టులై గోవిందా, యుత్తమప్లవంబుఁ బడసినవారు మహార్ణవమునుంబోలె నీయనుకంపఁబడసి మేము దాఁటరానియీయాపదఁ గడచితిమి. మీకు ల గ్గయ్యెడి. విచ్చేయు మనిపీడ్కొల్పినఁ బుండరీకాక్షుఁడు ద్వారవతికి విచ్చేసె. అటఁ బాండవులును మధుసూదనుపరమకారుణికత్వంబుఁ దలపోయుచు సంతుష్టచిత్తులై యా వనముల విహరించుచుండిరి. ధార్తరాష్ట్రులు దురాత్మతం జేసి వనగతులైనపాండవుల కెన్ని ద్రోహములు చేసినను భగవదాశ్రయు లయినవారియెడ నవియన్నియు విఫలము లగుచుండె.

సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట.

పాండవు లట్లు కామ్యకవనరామణీయకముఁ గనుంగొనుచు వేల్పులచాడ్పున విహరించుచుండి యొక్కనాఁడు తృణబిందుఁ డనుమునియనుజ్ఞఁ గొని తదాశ్రమమున ద్రౌపది నునిచి తద్రక్షణార్థంబు పరమతపోనిధి యైనధౌమ్యుని నియమించి యందఱు నొకపరి వేఁటపోయిరి. అట్టియెడ సైంధవుఁడు సాళ్వరాజకూఁతుఁ బెండ్లిగాఁగ రాజయోగ్యపరివారము గొలిచిరాఁగఁ బెక్కండ్రునరపతులతోడ నా దేశమునకుఁ జనువాఁడు మార్గవశమునఁ గామ్యకవనము సొచ్చి నిర్జనం బైన యవ్వనమునం దాశ్రమద్వారమునఁ గదంబశాఖ నవలంబించియున్నదాని, నీలజలధరమండలంబు వెలిఁగించుక్రొమ్మెఱుంగు తెఱంగున నవ్వనంబెల్ల సజలావణ్యప్రభాపటలంబున వెలిఁగించుదాని, బాండవధర్మపత్నిని బాంచాలిం గాంచి తదీయరూపసౌభాగ్యమునకు విస్మయం బంది యరదము నిలుపం బంచి దురాత్మతం జేసి కామవికారగోచరుండై యచటివారెల్ల నీదేవి యచ్చరయో దేవకన్యయో దేవమాయయో యని పలుదెఱంగుల వితర్కించుచుఁ గృతాంజలులై చూచుచుండఁ దా నది తిలంపక కోటికాస్యుఁ డనురాజుం బిలిచి రాజపుత్రా, యీసుందరాంగిం జూచితే. ఇది యెవ్వరియదియో? దీనిం గనుంగొనినంతననాకుఁ బెఱపూవుఁబోండ్లఁ బెండ్లిగాఁ గోరిక నడలె. దీని నింటికిఁ గొనిపోవఁ దమకించెద. ఈయుగ్మలి యెవ్వనికూఁతురో? దీనికిఁ బతియై సుఖించుభాగ్యవంతుఁ డెవ్వఁడో? దీనికి మనికియై యిచ్చోటు ప్రశస్తం బయ్యెనో? ఏల యీకంటకాకీర్ణం బయినగహనమున నున్నయదియో? నన్ను వలచునో! నీవు పోయి యంతయు నడిగి రమ్ము. ఈయెమ్మెలాఁడితోడికూడిక యొడఁగూడిన నేఁ గృతార్థుఁడ నగుదు నని పలికి వాని ననిచె. అనుచుటయుఁ గోటికాస్యుఁడు వల్లే యని రథము డిగి

క్రోల్పులిపోలెఁతిం జేరఁ బోఁవునక్కమాడ్కిఁ బాండవధర్మపత్నిని డాయం బోయి యిట్లనియె. సుందరీ, నీవెవ్వతెవు? రాత్రివేళ గాడ్పునకుఁ గదలువహ్నిశిఖవోలె వెలుంగుచున్నయీమైదీఁగఁ జెన్నారుచున్ననీ వీకడిమికొమ్మఁ బట్టికొని యొంటిమై నీయాశ్రమమున నేల యుండెదవు? అత్యంతరూపవతి యగునీ వీయడవుల వెఱవకుండుటం జూడ నెంతయు విస్మయంబయ్యె. దేవసుందరివో? యక్షవనితవో? దానవభామినివో? అచ్చరమచ్చెకంటివో? వేఱురూపు గొనిననాగకన్యవో? ఇవ్వనము దేవతవో? లీలార్థంబు నిజనివాసము వాసి వచ్చినయింద్రయమవరుణకుబేరధాతృవిధాతృసూర్యకామినులలో నెక్కర్తవో యని పలువిధముల సందియం బయ్యెడి. నీపతి యెవ్వఁడు? బంధువు లెవ్వరు? కుల మెయ్యది? పే రెయ్యది? ఇచట నేమిపనిగ నుండెదవు? అంతయుఁ దేటపడం జెప్పుము. మమ్ము నీ వడుగకున్నం జెప్పెద వినుము. నేను సురథుఁ డనురాజు కుమారుఁడను. కోటికాస్యుఁ డని నన్నంద అందురు. యథావిధి చయనమున హుతములఁ బడసి ప్రజ్వరిల్లువీతిహోత్రునిచందమున వెలుఁగుచు నాకాంచనరథమున నున్నవాఁడు త్రిగర్తదేశనాథుఁ డైనక్షేమంకరాభిధానుఁడు. అల్లమేటివిలుకాఁడు కుళిందదేశనాయకుఁడు. పరువముగఁ బూచినపూవునుంబోలె నిన్నుఁ జూచుచుఁ దామరకొలనిచెంగట నున్నయాప్రాయపువాఁ డిక్ష్వాకురా జగుసుబలునిపుత్రుఁడు. ఎఱ్ఱనిగుఱ్ఱములం బూన్చినయాపండ్రెండురథములలో జ్వలితహుతవహులవడువున వెలుఁగుచున్నయాపన్నిద్ద అంగారక, కుంజర, గుప్తక, శత్రుంజయ, సృంజయ, సుప్రవృద్ధ, భయంకర, భ్రమర, రవి, శూర, ప్రతాప, కుహను లనుపేరిటిసౌవీరకుమారులును, వెండియు నాఱువేలరథికులు, మఱియు నానావిధసైనికులుం గొలువ నయ్యుత్తమస్యందనమున నున్నవాఁడు సింధుసౌవీరదేశాధినాథుఁ డైనవృద్ధక్షత్రునికుమారుఁడు, జయద్రథుఁ డనఁ బరఁగువాఁడు. అల్లవారు బలాహ, కానీక, విదారణాదు లగునతనితమ్ములు. ఇందఱుం దోడ నరుదేర నాజయద్రథుఁడు దేవేంద్రవిభవంబు మెఱయ వచ్చి నీవృత్తాంత మెఱిఁగిరాఁ గనన్ననిచినవాఁడు కాన నంతయు సవిస్తరంబుగఁ దేటపఱుపు మనియడుగుటయుఁ బాండవధర్మపత్ని కదంబశాఖ ను విడిచి యుత్తరీయము సవరించికొని వానిదెసం జక్కచూడక యాశిబికులున కిట్లనియె. అయ్యా, నీవు శిబికులజనితుఁ డైనసురథపుత్రుఁ డగుకోటికాస్యుఁడ వని నే నెఱుఁగుదు. ఇపు డిచటనితరు లెవ్వరును లేమిం జేసి కులధర్మవర్తిని యగునే నీయడవిలో నీతోడఁ బెక్కుమాటలాడఁ దగదు. ఐనను నీ వడుగుటం జేసి నాకులమును బంధువులనుం దెల్పెద వినుము. నేను ద్రుపదరాజుకూఁతురను. కృష్ణయనఁ బరఁగుదానను. ఇంద్రప్రస్థపురము రాజధానిగాఁగ రాజ్య మేలుచుండినపాండవుల నేవురను నీవును విని

యుండుదువుగదా. వారు నాపతులు. వారలిపుడు ధర్మరాజు తూర్పు, భీమసేనుఁడు దక్షిణము, సవ్యసాచి పడమర, నకులసహదేవు లుత్తరంబునుంగా నలుదెసల వేటపోయిరి. ఇంకఁ గొంతసేపునకు వారును వత్తురు. అందాఁక నుండి వారిచే నాతిథ్యసత్కారంబుఁ గొని పొండు. అతిథిప్రియుం డైనధర్మరాజు మిమ్ముఁ గని యెంతయుఁ బ్రీతుఁ డగు. సైన్యమెల్లఁ దగుచోట విడియ నియమింపఁ దగు నని చెప్పి వారల కాతిథ్యముఁ జేయఁ దలఁచి ద్రౌపది పర్ణశాలాభ్యంతరమునకుఁ జనియె. అటఁ జని కోటికాస్యుఁ డావృత్తాంత మంతయు సైంధవునకుఁ దెల్పిన నతండు వానిం బిలిచి యోరాజనందనా, నీవెట్లు మఱలివచ్చితివోకదా. అయ్యుత్తమసీమంతిని మాట లాడుచుండఁగా నే నాపైఁదలిపైఁ దగులువడినమనంబుఁ దిగువఁ జాలకున్నవాఁడ. దానిం గన్నులారఁ గనుఁగొనినంతన లాఁతినాతులు క్రోఁతినాతులకా నాకుఁ దోఁచెడి. ఆమచ్చెకంటి చూడ్కులనె నాడెందము నాఁచికొనియె. అది మనుష్యవనితయకదా. అందు నాకు సందియం బయ్యెడి. తేటపడం జెప్పు మనియడుగుటయు నతండు సౌవీరపతీ, నీకింతసందియం బేల? ఆసుదతి ద్రుపదుకూఁతురు, పాండవుల కేవురకుం గూర్చుధర్మపత్ని. దానిఁ దోడ్కొని యిచ్చమై నిజదేశమునకుఁ జను మనిపలికె. కోటికాస్యువచనంబు విని సైంధవుఁ డట్లగునేని యమ్మగువం జూత మని వానికిఁ జెప్పి సింహగుహఁ జొచ్చు తోఁడేలుచాడ్పునఁ బెఱవారికిఁ జెనకరానిపాండవులపుణ్యాశ్రమంబును దనవా రాఱుగురు దోడరాఁగఁ జొచ్చి కృష్ణను గనుఁగొని యోవరవర్ణినీ, నీకును నీపతులకును నీచుట్టలకుం గుశలంబె? యనియడుగ ద్రౌపది వాని కిట్లనియె. అయ్యా, నీరాజ్యమున సప్తాంగములకుఁ గుశలంబకదా? సింధుసౌవీరాది దేశముల ధర్మము దప్పకుండ నేలుచున్నవాఁడవే? నాపతు లగుపాండవులకు నాకు నావారికిం గుశలంబు గలదు. నాయిచ్చుపాద్యముఁ గొని కాళులు గడిగికొని యీయాసనమునం గూర్చుండుము. సపరివారుఁ డైననీకుఁ బ్రాతరాశార్థం బైణేయవృషతన్యంకుహరిణశరభశశఋశ్యశంబరగవయాదు లయినమృగముల నూటయేనింటి నిచ్చెద. పిదప ధర్మరాజు వచ్చి తగినయాతిథ్యమున మిమ్మెల్ల సత్కరించు ననినం బాంచాలికి జయద్రథుఁ డిట్లనియె. సుదతీ, మాకుఁ బ్రాతరాశార్థం బియ్యఁ దలఁచుటయ చాలు. తడయక యరుదెంచి మదీయస్యందనము నారోహించి మావీడు సేరి నాతోడ నభిమతక్రీడల సుఖింపుము. రాజ్యభ్రష్టులై సంపదలఁ బాసి యడవులఁ గడు నిడుమలఁ బడుచున్నపాండుపుత్రుల ననువర్తింప నీకుఁ దగదు. ప్రాజ్ఞురా లెవ్వతెయేనియు సంపద్విరహితుఁ డైనమగని ననువర్తించునే? మఱి మగండు సంపన్నుండై యుండునంత కతనియొద్ద నుండి సంపద పోయినఁ దానుంబోవు. లోకక్రమం బిట్లున్నను నీవు రాజ్యచ్యుతులై గతశ్రీకు

లైనపాండవులఁ బెద్దకాల ముపాసించితివి. ఇది యెంతయు నద్భుతంబు. ఇఁక వారిపై భక్తి చాలు. వీరిఁ దొఱఁగి నాకుఁ బ్రేయసివై సుఖింపుము. సింధుసౌవీరాదిమదీయదేశములనెల్ల నీ వేలికొను మని మెల్లన నిజతాత్పర్యంబుఁ దేటపఱిచె.

### ద్రౌపది సైంధవునితోఁ బరుషములు పలుకుట.

పరమపతివ్రతాశిరోమణి యైనపాంచాలి హృదయదారణం బైనసైంధవుదారుణవచనము నాకర్ణించి యుదీర్ణకోపఘూర్ణమానమానసయై బొమలు ముడివెట్టి వానిఁ జుఱచుఱం జూచి ఛీ! నీ కిట్టిమాట లాడఁ దగదు. ఇంచుకేనియు సిగ్గు లేదే యని యమ్మనుజాధముం దిరస్కరించుచు నచ్చోటు వాసి యెడగలుగ నిలిచి పతులు వచ్చునందాఁక మాటలనెపమునఁ బ్రొద్దు పుత్తు నని యూహించి కటము లదరవాని కిట్లనియె. మూఢా! దేవేంద్రతుల్యులు, స్వధర్మనిరతులు, కీర్తిమంతులు, తీక్ష్ణకోపులు, యక్షరాక్షసాదులనైనం బోరులఁ జీరికిఁ గొననిమేటిబిరుదులు నగునమ్మహారథుల దూఱుచున్ననీకు సిగ్గేల లేదయ్యెనో? ఎల్లవిద్యల నేర్చి తపోనిరతుండై పొగడ్త కెక్కినవాని గృహస్థునైనను వనస్థునైనను యోగ్యజనులు నిందింపరు. మఱి కుక్కలఁ బోలిననీయట్టినీచులే నోరికి వచ్చినట్లు మొఱుఁగుదురు. అమ్మహాత్ముల కెగ్గు సేసి యధోలోకమునం బడనున్న ని న్నుద్ధరింప నీరాజులలో నొక్కరుఁడైనను వలంతి గాఁ డని నే నిక్కంబ దలంతు. వీర్యవంతుఁడ నని క్రొవ్వి నీవు ధర్మరాజుం గెలువఁ గోరుట హిమవద్గిరిచేరువం దిరుగుమత్తశుండాలంబు నొకదండముచే నెదిరింపఁ దొడరుటయే. భీమసేనుం జెనకవచ్చుట గవిలో నిదురవోవుచున్నసింహముతెప్పవెండ్రుకలఁ గోయఁ బూనుటయే. అమ్మహాబలుఁ డలిగి కాలిచే నెగరి తన్నఁగఁ బాఱునప్పుడుగదా తద్వీర్యంబు నెఱుంగుదువు. ఉగ్రవిక్రముం డగుగాండీవితోడఁ బోరాడం దొడంగుట గిరికందరాంతరప్రసుప్తం బయినఘోరపంచాననంబును మీఁగాలిచేఁ దన్నఁ బూనుటయే. నకులసహదేవులతోడఁ బోరు సేయం దలంచుట క్రూరవిషము లయినకృష్ణసర్పములఁ బాదమునఁ దన్నుటయే. వెదురుపండువిధంబున, నరంటిమ్రాను గెల వేయురీతిఁ, గర్కటి చూలుఁ దాల్చుతెఱంగునను వినాశకాల మాసన్నంబైనఁ బాండవరక్షిత యగునన్ను గ్రహింపఁ దలంచినాఁడ వని తూలనాడిన విని సైంధవుఁడు పాండవపత్ని కిట్లనియె. పాంచాలీ, పాండవులతెఱం గంతయు నాయెఱింగినదియ. ఈవెఱపించుట లిఁకఁ జాలు. ఇందులకు మేము వెఱవము. లోకవిశ్రుతము లైనసప్తదశక్షత్త్రియకులములలోపల నుత్తమం బయినకులమున మేము జనించినవారము. సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయము లనుషడ్గుణంబుల నధికులము. పాండవులే

తద్విహీనులు. కావున నీవెడమాటలఁ జాలించి వేగంబ యేనుంగునుండె గుఱ్ఱము నుండె నారోహించి నాతోడ రమ్ము. అటుగాదేని మాకుఁ జిత్తప్రసాదముగా మొఱ వినిపింపుము. ఊరక వట్టిమాట లాడిన మే మందులకు సాధ్యులము గా మని చెప్పినం గినిసి ద్రౌపది వానికిమఱియు నిట్లనియె. ఓరీ క్షత్రియాధమా! మహాబలు లగుపాండవులకుఁ బత్ని యగునేను దుర్బల యని నీకుఁ దోఁచుచున్న దిగాఁబోలు. ప్రమాదముననైన నను మొఱపెట్టికొందునే? కృష్ణార్జును లిద్దఱు నేక రథారూఢులై నా తెరువువెంట నడచువారు. అట్టిలోకోత్తరులు సహాయులుగాఁ గలుగుననన్ను మహేంద్రుఁడైన నపహరించికొనిపోవనేరఁడు. మనుష్యమాత్రుఁడైన నీయట్టివాని మాట యిఁకఁ జెప్ప నేల? శత్రువీరతర్జనుం డైన యర్జునుండు పగవారిగుండెలు బెండువడ దేవదత్తంబుఁ బూరించి వేసవిం బేర్చినకార్చిచ్చు శుష్కతృణముల నెట్లట్ల నీసైన్యముఁ బొదివి జీమూతనిర్ఘోషసన్నిభం బైన టంకారనినాదంబు రోదసీకుహరంబు నవియింప గొనయమ్ము సారించి హస్తలాఘవంబు మెఱయ శౌర్యంబు నెఱయ నతిరయమున వాఁడినారసముల గుప్పించు నప్పుడు గదా నీ వవ్వీరశేఖరుం గనుంగొని యాత్మబుద్ధిని నిందించుకొందువు. అమ్మేటివిలుకానితూపులు మేనెల్లఁ దూటువడం జేయునప్పుడు నీమనం బెట్లగునో? దండధరునిచందమున ఘోరగదం జేత నమర్చికొని భీషణమూర్తియై రణాంగణంబున నిటునటు నప్రతిహతగతిం దిరుగువృకోదరుని, క్రోధవిషముఁ గ్రక్కుచునే దెసఁ జూచినం దామకా నెల్లచోట్లం జుట్టుముట్టి యురవడించుకవలనుం గనుంగొనినప్పుడు నీకుఁ బశ్చాత్తాపం బవశ్యంబు గల్గెడి. మఱియు నరిబలమర్దనుం డయినజనార్దనుండును యదువృష్ణికేకయాదులును నాత్రోవ నంటి నడుచువారు. వా రందఱుం బొదివిన నీ వెంతవాఁడవు? మహానుభావు లగుపాండవులు దక్కఁ దక్కటివారల నేను మనముననైనం దలంపను. మదీయపాతివ్రత్యసత్యంబుననే పార్థులీడ్చుచుండ వివశుం డగునిన్నుఁజూడఁ గలదానను. కావున నీకుఁ గా నేను సంభ్రమింప నేల? నీ వపహరించుకొనిపోయినను గురువీరులు నిను నిగ్రహించి న న్నీకామ్యకవనమునకు మగుడఁ దోడితేఁ గల రని చెప్పుచున్నంత సైంధవునితోడ వచ్చినవారు దన్నుఁ బట్టుకొనఁ బూనుటయుఁ బాంచాలి వెఱచి దురాత్ములారా! నను ముట్టకుఁడు ముట్టకుఁ డని పలుకుచుఁ బెరెలుం గెత్తి తమపురోహితుం డైన ధౌమ్యు నఱచె.

## సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగ నెత్తికొనిపోవుట.

అమ్మునీంద్రుఁడు డాయవచ్చునంతలోన దురాత్ముండైన సైంధవుఁడు మీఁదు పరికింపక పాంచాలిపైఁటఁ బట్టి యీడ్చిన నప్పరమపతివ్రత యుదగ్రక్రోధమున నదల్చి వానిం ద్రోచుటయు వాఁడు మొదలుతెగినమ్రానిమాడ్కి నేలఁ

బడి యతిరయమున లేచి యాపాండవధర్మపత్ని నెత్తికొని చనియె. అపుడు చేయునది లేక యాసతీరత్నంబు ధౌమ్యునడుగులకు మ్రొక్కి వానియరద మెక్కె. ధౌమ్యుఁడును వానిఁ జేరఁ జని జయద్రథా, మహారథు లయినపాండవుల గెలువక నీకుఁ బాంచాలి నెత్తికొనిపోవఁ జనదు. పురాతనక్షత్రధర్మంబు నాలోచింపుము. ధర్మజప్రముఖు లయినపాండవులు గదిసిరేని యసంశయముగ నీ వీపాపకృత్యమునకు ఫలముఁ గుడిచెద వని చెప్పుచు ద్రౌపది వెంట నంటి పదాతిగణమధ్యమున నరిగె. ఇట వేఁటపోయినపాండవు లనేకమృగముల వధియించి వేఁటఁ జాలించి మగిడి యందఱు నొక్కచోఁ గూడి యాశ్రమమునకు వచ్చునెడ ధర్మరాజు కొన్ని శకునముల నుపలక్షించి తమ్ముల కిట్లనియె. మృగములుఁ బక్షులును సూర్యుఁ డున్నదెస కెదురై యుగ్రవ్యసనముఁ దెల్పుచు నతిపరుషముగ నఱచుచున్నయవి. శత్రువులు మన కునికియైనవనము నుపద్రవించునట్లు తోఁచుచున్నది. ఇఁక మఱలుఁడు. కారణమెద్దియోగాని మనస్సు మిగులఁ దపించుచున్నది. బుద్ధియుఁ గలఁతఁ జెందుచున్నది. మేనఁ బ్రాణములు మన్యువశత నొకతెఱంగునఁ జెదరునట్లు తోఁచుచున్నది. గరుడాపహృతపన్నగం బైనసరస్సువిధమునను, రాజవిరహితం బైనరాష్ట్రముచందమునను, బీతరసం బైనకుంభముతెఱంగునను గామ్యకవనంబు ముఖ్యవస్తువిహీనం బయినయట్లు తోఁచుచున్నదని చెప్పుచుఁ జింతించుచుండ వాయువేగము లయినరథ్యములశీఘ్రధావనంబునం జేసి ముహూర్తమాత్రంబున నాశ్రమద్వారముఁ జేర నరిగిరి. అట్టియెడ వారికిఁ డాఁపటం జేరి వఱదు మిక్కిలి యఱచుటయు ధర్మరాజు తమ్ములం జూచి యీదుర్నిమిత్తముఁ బరికింపఁగఁ బాపాత్ము లైనధార్తరాష్ట్రు లెద్దియే నెగ్గుఁ జేసియుండుదు రనియూహించెద ననిపలుకుచు నాశ్రమంబు సొచ్చుటయు నచ్చట ద్రౌపదిదాదికూఁతురు నేలఁబడి పొరలుచుఁ బెలుచ నేడ్చుచుండె. అంత నింద్రసేనుఁడు తటాలున రథము డిగ్గి దాని డాయఁ జని యమ్మా, నీ వేల యిట్లు నేలం బడి పొరలుచు నేడ్చెదవు? నీమొగం బేల దైన్యము గదుర వాడియున్నది? లోకోత్తరసౌందర్యవిలసితయై పాండవులకు రెండవశరీరంబునాఁ బరఁగుపాంచాలిం బాపాత్ము లెవ్వరు చెనకరారుగదా? ధర్మరాజుడెందమునం బొడమినపరితాపంబుఁ బరికించినఁ బాంచాలరాజపుత్రి పృథివిలోఁ జొచ్చినను దివంబునకుఁ జనినను సముద్రములఁ బ్రవేశించినను బార్థులు జాడ నరసి మగుడఁ దేనేర్తు రని నాకు నిక్కంబ తోఁచెడి. అరిమర్దను, లపరాజితులు, క్లేశక్షములు నగుపాండవులకు వెలుపలిప్రాణం బైనదాని నిరుపమానరత్నోపమానయగుదాని ద్రుపదరాజనందన నెవ్వఁ డపహరించికొనిపోవం గడంగు? ఈయర్థము నేమూఢుఁ డెఱుఁగఁడయ్యెనో? పార్థులవాఁడితూపు లెవని మేను సించి మహీతలముఁ జొరనున్నవియో?

క్రమ్మఱ ద్రౌపది యెట్లు వచ్చునో యని శోకింపవలదు. పార్థులు పగఱ గెలిచి యాసతి నవశ్యంబు దెత్తురు. నడచినవృత్తాంత మంతయుం దెలియఁ జెప్పు మని యడుగ ధాత్రేయిక వాని కిట్లనియె. అయ్యా, జయద్రథుఁ డింద్రతుల్యులయిన పాండవుల నేవురం దిరస్కరించి పాంచాలి నెత్తికొనిపోయె. ఇవె వారియడుగుల జాడ లింతకు మాయకున్నవి వానిదాడికి వెఱిగినద్రుమాంకు లిప్పటికిని వాడకున్న యవి. ఇప్పటికిఁ బాంచాలి యతిదూరము పోయియుండదు. అందఱును మేలిమై మెఱుపుల్లఁ దొడిగి విండుల నమ్ములం బూని పోరునకు సమకట్టి యాతఁనంబ వెంట నంటి చనవలయు. సైంధవునితర్జనభర్త్సనదండములం జిక్కి పాంచాలి చేయునది లేక వెల్లఁబోయి యురియాడుచిత్తంబుతో మేను నాథురాత్మున కప్పగింపక మున్న పాండవులు గదియవలయు. ఆలసించినం బాంచాలివర్తనంబు బూదిలో వ్రేల్చినహవిస్సుమాడ్కిని, శ్మశానంబునం బడినమాల్యముకై వడిని, విప్రు లేమఱియుండఁ గుక్క తాఁకినయజ్ఞపురోడాశముపగిదినిఁ, గాఱడవిలో వేట పోయి నక్క తమ్మికొలను గలంచుచందమునను వ్యర్థము నపవిత్రముఁ దిరస్కృతముం గాకుండునే? కావున నెడ సేయక యీయడుగులజాడల లెస్స పరిశీలించి యాతఁనమ చని వారల నెయిదవలయు ననిచెప్పిన విని యుధిష్ఠిరుఁడు దానిఁ బిలిచి యిఁక నిట్టిమాటలు మాయెదుటఁ జెప్పవలదు. రాజులైనను రాజపుత్రులైన నెక్కొకవేళ మోసవ్రోవుదురు. ఇంతుల కింత వగవం బనియేమి? సైంధవుని నిగ్రహించి ద్రౌపదిం దెచ్చుట యొకపెద్దపని గాను. ఊఱడిల్లు మని దానికిఁ దగినభంగిఁ జెప్పి తమ్ములఁజూచి యిఁక మన మాలసింపక యాదురాత్ముపై నెత్తి చనవలయు నని వచించె.

## పాండవులు సైంధవునిపై నెత్తిపోవుట.

అటఁ బాండవు లేవురు నాశీవిషములపోలిక రోఁజుచు గొనయమ్ములు సారించుచు వారుపోయినత్రోవం గొంతపోయి గజతురగాదిచరణఘట్టనసముత్థితం బై నపాంసుపటలంబు నుపలక్షించి యతిరయంబునం బఱచి పదాతిమధ్యగతుండై భీమసేను నఱచుచున్నధౌమ్యుం గనుంగొని విూర లింక నెమ్మది రండని యమ్మునీంద్రునకుఁ దెల్పి యెఱచి చూచి పఱచుదేగలచాడ్పునఁ దదీయసైన్యము డాసి రథమునఁ బాంచాలితోడఁ గూర్చున్నసింధురాజుం గాంచి క్రోధఘూర్ణమానమానసులై మహేంద్రవిక్రము లయినపాండురాజపుత్రులు శత్రులచెవులు బీటలువాఱఁ బేరెలుం గెత్తి యాజయద్రథు నా క్రోశించిరి. అయ్యఱపు విని సైంధవుడుముదారుదొరలు భీమార్జునులం జూచి యదరిపడి ఘోరముగ నఱచిరి. జయద్రథుఁడు దానుం బాండవులపెక్కెములఁ జూచి వెల్లఁబోయి ద్రౌపదిం బిలిచి యాజ్ఞసేనీ, యీవచ్చుచున్నమహారథు లేవురు నీపతుల

కాఁ దోఁచుచున్నది. అడియాలములతోడ వారల వేఱువేఱ వివరించి చెప్పు మని యడుగ వానికి ద్రౌపది యిట్లనియె. ఓరిమూఢా! నాపతు లేవురుం గదిసి వచ్చిరి. వారితోడఁ బోరయ్యెనా నీవారిలో నొక్కఁడైనను మిగిలి బ్రదుకనేరఁడు. ఆయుస్సును గుంగింపఁ జాలినదుష్కర్మంబుఁ జేసిననీ కమ్మేటివిలుకాండ్ర నెఱింగినంతన ప్రయోజనం బెయ్యది? అయినం జావనున్నవాఁ డడిగినఁ జెప్పట ధర్మంబు గావునఁజెప్పెద వినుము. అనుజసమన్వితుఁ డైనధర్మరాజును జూచినప్పుడే నాకు నీవలనిభయ మంతయుఁ బాసె. సువర్ణగౌరుఁ డున్నతనాసికుఁడు విశాలలోచనుఁడు నగునమ్మహాత్ముఁడే ధర్మరాజు. అతనిధ్వజాగ్రమునందు నందోపనందము లనుమృదంగములు మధురముగ మ్రోయుచున్నయవి. స్వధర్మార్థవినిశ్చయజ్ఞుం డైనయాకురుశ్రేష్ఠుని యోగ్యు లెల్లపు డనువర్తింతురు. ఆధార్మికవరేణ్యుఁడు శత్రుఁడైనను శరణాగతుఁడైనం గరుణించి రక్షించు. ఇంతటనైన నోమందమతీ! వేగంబ నీవు శస్త్రాస్త్రము లవలఁ బెట్టి ప్రాంజలివై యమ్మహాత్మునాశ్రయించి బ్రదుకుము. బొమలు ముడివడ నవుడుగఱచి యుగ్రమూర్తియై వెలుంగుచున్నయల్లమహాభుజుఁడే వృకోదరుఁడు. అమ్మహారథు నాజానేయంబులైనయుత్తమరథ్యములు వహించుచున్నయవి. వానికావించినపను లతిమానుషంబులు. శత్రుభీకరుఁ డగుటంజేసి వానికి భీముఁ డనుపేరు లోకవిశ్రుతం బయ్యె. ఆశూరున కెగ్గుఁ జేసినవారు ప్రాణములతో మిగులనేరరు. అతఁ డెన్నఁడైనం బగ మఱువఁడు. పగకుఁ దగినప్రతీకారముఁ జేసియుఁ బిమ్మటనైన నంతగశాంతిఁ బొందఁడు. ధనుర్వరం బైనగాండివముఁ దాల్చియున్నయల్లతఁడే యర్జునుఁడు. అతఁడు ధృతిమంతుఁడు, కీర్తిమంతుఁడు, జితేంద్రియుఁడు, పెద్దల సేవించినవాఁడు, యుధిష్ఠిరునకుఁ గూరిమితమ్ముఁడు, ప్రియశిష్యుఁడు, సకలధర్మార్థముల నిశ్చయ మెఱింగినవాఁడు, భయార్తుల కభయ మిచ్చి ప్రోచుబిరుదువాఁడు, శత్రుమర్దనుఁడు, వైశ్వానరతుల్యతేజస్కుఁడు, కామముననుండై లోభముననుండై భయముననుండై ధర్మము దప్పనివాఁడు, దుష్కర్మముల మనస్సుననైనం దలంపనివాఁడు. అల్లయుత్తమరూపవంతుఁడే నకులుఁడు. అతఁడు ఖడ్గముఁ జేతఁ బూనెనేని లాఘవవైచిత్ర్యములు మెఱయఁ బగఱఁ జెండాడు. అమ్మేధావిని బాండవులు ప్రాణములకంటె నెక్కువగఁ జూతురు. చంద్రాదిత్యసమతేజస్కుఁ డైనయల్లతండే సహదేవుఁడు. అతఁడు పాండవులకు నలువుర కెంతయుఁ గూర్చుతమ్ముఁగుఱ్ఱఁడు, కృతాస్త్రుఁడు, శూరుఁడు, మేధావంతుఁడు, శత్రులయెడ నెల్లపుడు నతికోపనుఁడు, పెద్దలసన్నిధినైనను ధర్మార్థముల నేర్పెఱిచి చెప్పఁగలనేర్పరి, క్షత్రధర్మనిరతుఁడు, కుంతీదేవి తనప్రాణములకంటె నెక్కువగ నాతని రక్షించు. ఆధార్మికుఁడు ప్రాణత్యాగము నగ్నిప్రవేశమునైనం జేయుఁగాని యొకప్పుడై

నను ధర్మవిరుద్ధముఁ బలుకఁడు. దైత్యసేనను ఱుమాడునప్పటి దేవేంద్రుపరాక్ర మముఁ బురుడించువానివిక్రమము నీకుఁగదా నీవు చూతువు. నాపతు లగుపాం డునరపాలపుత్రుల నందఱుఁ దెలియఁ జెప్పితి. తెలివి లేక వారలఁ దిరస్కరించి ప్రవర్తించితివి. అమ్మహారథులు గదిసిరేని నీసైన్యంబు నిహతవీరయోధంబై సము ద్రమధ్యమున మొసలివాతం బడినరత్నపూర్ణం బైనయోడమాడ్కి గతి దప్పి వికలంబగు. కడతేర్చికొన వెరవుఁ జూచికొనుము. వారిబారిం బడి ప్రాణములఁ దప్పించికొంటివేని పునర్జననంబుఁ గాంచినవాఁడవే యనిచెప్పుచున్నంతఁ బాండ వులును సైంధవసైన్యంబుఁ గవిసిరి.


పాండవులు సైంధవసేనం దలపడి పోరాడుట.

పంచేంద్రతుల్యు లయినయాపంచపాండవులం జూచి సైంధవసైన్యము నఁ గాలరులు వెఱచి కృతాంజలులై నిలుచుటయు నయ్యుత్తమరథికులు వా రలఁ గరుణించి యతిక్రమించి చని తక్కటిసేనం జొచ్చి యంతటం గ్రచ్చు కొని చీఁకట్లు గ్రమ్ముకొన నంపతుంపరం గురియించినం గినిసి సైంధవుఁడు పాఱుచున్నతనసైనికులం బిలిచి నిలువుఁడు కొట్టుఁడు తొలఁగక పొదువుఁ డని యెలుంగు రాల్పడం జెప్పి యందఱం బురికొల్పికొని పోరు సేయం దొడంగుట యు నిరువాగుల భీషణధ్వానంబు నింగి ముట్టె. వ్యాఘ్రబలు లయినయాపు రుషవ్యాఘ్రులకోలల కోహటించి సైంధవసైనికులు విషణ్ణు లగుటయు వృకోద రుండు కనకగదం జేత నమర్చికొని జయద్రథుం దలపడి వచ్చినం గోటికాస్యుఁడు పెక్కండ్రురథికులతోడ నడ్డపడి శక్తితోమరాద్యాయుధముల గుప్పించిన నవ్వీ రశేఖరుండు సంచలింపక సేనాముఖమున నిల్చి యొకయేనుఁగును దానిమావటి వానిం బదునలువురుపదాతులనుం జంపె. అర్జునుఁడు సైంధవు వెదకుచుఁ బంచ శతపార్వతీయమహారథుల వధియించె. ధర్మరాజు సౌవీరప్రవరుల నూఱుగుర సమ యించె. నకులుఁడు రథావతరణముఁ జేసి ఖడ్గముఁ జేతఁ బూని విత్తులఁ జల్లు భంగి దోఁపఁ బదాతివర్గము నఱికి నేలఁ బడంద్రోచె. సహదేవుఁడు గజయో ధులఁ దలపడి వాఁడినారసము లేసి మావఁటులనుండి నెమళులంబోలె గజారోహు ల డొల్లఁ జేసె. అపుడు త్రిగర్తేశ్వరుఁడు తేరు డిగి గదఁ గొని యుధిష్ఠిరురథ్యముల నుగ్గుచేయుటయు ధర్మరాజు కోపోద్దీపితుండై డాయ వచ్చినయాత్రిగర్తపతియురమ్ము నఁ గత్తివాతియమ్ముఁ గ్రుచ్చి వచ్చిన నతండు నోట నెత్తురు గ్రక్కుచు మొదలు తెగినవ్రానుకైవడి నేలంగూలె. ధర్మసూనుఁ డింద్రసేనుతోడం దేరు డిగి సహదేవురథము నెక్కె. అంత క్షేమంకరమహాముఖు లనువారిరువు రిరుప్రక్కల నకులుం దాఁకి వానకాలంబు మొయిళ్లవడువున నపారనిశితశరజాలంబు గురియిం చినం జలింపక మాద్రేయుండు వారి నిద్దఱ నొక్కొక్కయెత్తుగా మడియించినం

గినిసి త్రిగర్తపతి యగుసురథుఁ డమ్మహారథురథముముందఱ గజారూఢుండై డాసి గజశిక్షాచాతుర్యమున నేనుఁగుఁ బురికొల్పి యతనియరదము డొల్లిపడం ద్రోయించె. అందులకుఁ బదరక నకులుఁడు తటాలున ఖడ్గము డాలుం గొని యరదము డిగ్గి కొండవోలె నచలుండై నిలిచి వెండియు సురథుపంపునఁ బైపైవచ్చునయ్యేనుంగుతొండము నఱికిన నది పెలుచ నఱచి తలక్రిందుగ మాఁటివానితోడ నేలం గూలె. నకులుఁ డట భీమసేనురథము నధిరోహించె. భీముఁడుం దన కడ్డపడినకోటికాస్యుం దాఁకి వానిసారథితలఁ ద్రెవ్వ నఱుకుటయునా శైబ్యుఁడు సారథివధంబుఁ దెలియకమున్న రథ్యములు రథము నీడ్చికొని పాఱిపోయె. అర్జునుఁడు తన్ను మొగకొనివచ్చినయంగారకాదు లగుసౌవీరకుమారులఁ బన్నిద్దఱం దాఁకి నిశితభల్లముల వారివిండులఁ ద్రునిసి తలలఁ దఱిగి యెక్కడఁ జూచినం దానకా సేనఁ గలయఁ దిరిగి సవ్యాపసవ్యప్రకారంబులఁ గడిమి మెఱయ నిక్ష్వాకుశిబిత్రిగర్తసైంధవయోధులఁ బెక్కండ్రఁ బొరివుచ్చి వీరవిక్రమవిహారంబు సల్పుటయు నెచ్చటఁ జూచినం గూలినయేనుంగులును జదిసిన గుఱ్ఱములును విఱిగినతేరులును దునిసినబెక్కెములును ద్రెళ్లినకాలఁబుల మొండెములును దెగినతలలుంగా సంగరాంగణంబు బీభత్సభీషణంబై రుధిరపానమాంసఖాదనలోలుపంబులై నశునకగృధ్రవాయసగోమాయువర్గములకుఁ దృప్తిప్రదంబయ్యె.

## సైంధవుఁడు ద్రౌపదిం దిగవిడిచి పాఱిపోవుట.

అవ్విధంబున సింధుసౌవీరసైన్యంబునఁ జేయుంగలవీరు లనేకులు వొలివోయినం బెదరి సైంధవుఁడు ద్రౌపదిని దిగ విడిచి ప్రాణరక్షణపరత్వమునఁ దేరు దోలుకొని పొలకలనికిఁ దొలఁగి పాఱిపోయె. అట ధర్మరాజు ధౌమ్యపురస్కృతయైనద్రౌపదిం దనతోడ సహదేవు తేరెక్కించుకొనియె. సైంధవుఁడు తొలఁగిపాఱుటం జూచి యర్జునుఁడు తత్సైనికుల ననేకుల నేలఁ గలుపుచున్న భీమసేనుం బిలిచి యెవ్వనియెగ్గుచేతల కుత్తలంపడి మన మీభండనంబునకుఁ దొడంగితిమో యప్పాపాత్ముఁ డిందుఁ గానరాఁడు. ఏల మన మీమూఁకల నూరక చంపవలయు! ఇఁక మనము వీరల వధించుట నిరర్థకంబు. నీమతం బెట్టిదియో యనిచెప్పిన విని వృకోదరుఁడు సమరముఁ జాలించి ధర్మరాజుమొగంబునఁ జూడ్కి నిలిపి రాజేంద్రా, మనశత్రువీరులు వొలిసిరి. నీవుద్రౌపదిం దోడ్కొని నకులసహదేవసమన్వితుండవై ధౌమ్యులఁ బురస్కరించుకొని యాశ్రమమునకుఁ జని పాంచాలి నూరార్పుము. నేను నర్జునుఁడును సైంధవు వెన్నుముట్టి పఱచి యాదురాత్ముఁడు రసాతలంబు సొచ్చినను దేవేంద్రుని సారథిఁగాఁ గొనివచ్చినను దప్పక వధించి వత్తుము. మాబారిం బడి వాఁడు బ్రదికి పోవనేర్చునే యని తెల్పిన విని ధర్మరాజు కరుణాయత్తచిత్తుండై భీముం బిలిచి యాదురాత్ముఁ డెట్టివాఁడైనను

వధింపవలదు. దుశ్శలను గాంధారీదేవినిం దలంపవలయుఁగదా యనిపలికె. అపుడు ద్రౌపది కుపితయై భీమార్జునులం బిలిచి యాదురాత్మునెడ దయ సేయరాదు. నాకుఁ బ్రియముఁ జేయఁ దలఁపు గలదేని యప్పురుషాధము వధించి రండు. భార్య నపహరించినవానిని. రాజ్య మొడిచికొనినవానిని సంగరంబునఁ బ్రార్థించినను విడువఁ దగదుగదా యనివచించె. అంత ధర్మరాజు ద్రౌపదినిమాద్రేయులను ధౌమ్యులనుం దోడ్కొని నిజాశ్రమము సేరి యంతకుమున్న వచ్చియున్న మార్కండేయాదిమహా మునులకుఁ దమయిడుమ లెల్లఁ జెప్పుచుండె. ద్రౌపది మాద్రేయులతోడ నాశ్రమాభ్యంతరమునకుఁ జని కార్యవిచారతత్పరయై యుండె. అట భీమార్జును లేకరథారూఢులై తామే సారథ్యము సల్పుచు సైంధవునరదముజాడఁ బరికించి యతిరయమునఁ జని క్రోశమాత్రదూరమునఁ జనుచున్నసైంధవుం గనుంగొనిరి. అపుడు గాండీవి యత్యద్భుతంబుగా దివ్యాస్త్రాభిమంత్రితము లయినశరములఁ బ్రయోగించి క్రోశగతము లయినసైంధవుతేరిగుఱ్ఱములఁ జదిపి వెన్ను దన్ని నచ్చుటయు హతరథ్యుఁడై నయాజయద్రథుఁ డితరదుష్కరం బైనసవ్యసాచివిక్రమంబు మదిం దలపోసి భయశోకవ్యాకులచిత్తుండై వేఱొక్క వెరవు గానక తేరు డిగ్గి కాల్నిలువక కాఱడవిం బడి పలాయనముఁ జేసె.

భీమార్జునులు సైంధవుఁ బరిభవించుట.

అర్జునుఁడు పలాయనపరుం డైనవాని నెలుంగు రాల్పడం బిలిచి యోరీ, రాజపుత్రా; యీశౌర్యమున నీ వెట్లు లంగనం గోరితివి? అనుచరులనెల్ల విడిచి శత్రుమధ్యమునఁ బాఱిపోవ సిగ్గు కొంచెమేనియు లేదో? ఇది తగదు మరలుమని చెప్పినను వాఁడు వినక యాయుధములతో డాయవచ్చినవారిం జూచి మఱింత వెఱపుతో నెంతయుఁ బఱచుచుండె. అంత భీముఁడు నిలునిలు మని వానినదల్చి రథము డిగ్గ నుఱికి పఱచి వాని నెయిది సిగఁ బట్టుకొని మీఁది కెత్తి నేలంబడఁ ద్రోచి యడిచి కా లెత్తి లేవ నున్నవానితలఁ దన్ని మోఁజేతులు మోఁకాళ్లుఁ బిక్కలునొక్కటిగ ముడియఁ గట్టి పెలుచఁ దన్నుటయు వాఁడు మూర్ఛితుండయ్యె. అపు డర్జునుఁడు భీముం జూచి దుశ్శలాగాంధారులకుఁగా వీనిఁ జంపవల దని ధర్మరాజు సెప్పినవాఁడుగదా? కావున వీనిం జంపవల దనిచెప్పిన భీముఁ డర్జునా, పరమసాధ్వి యైనపాంచాలిం బరిభవించినయీపాపాత్ముం జంపక విడువరాదు. ఎల్లపుడును ధర్మరాజు కరుణయ పూనియుండు. నీవును మూఢమతివై తన్మతం బనువర్తించి మమ్ము బాధించెద వనిచెప్పి యెట్టకేలకుఁ జంపుట మాని యర్ధచంద్రబాణముచే వానితల నయిదుడొంకలుగఁ గొరిగి వికృతరూపంబుఁ గాపించి వానిం బిలిచి యోమూఢా, బ్రతుకఁ గోరెదవేని యికమీఁద నెల్ల సభలలోఁ బాండవదాసుఁడ ననిచెప్పికొనుము. ఇందుల కొడంబడితివేని. నిన్నుఁ

ప్రాణములతోడ విడిచిపుత్తు. యుద్ధజితుల కిది విధి యనుటయు వాఁడు ప్రాణభీతుఁడై యట్లయని యంగీకరింపఁ గొడంబడియె. ఒడంబడుటయు భీముఁడు పరాగరూషితశరీరుం డైనవానిం దేరిపై నిడి కొని యర్జునుతోడ నాశ్రమము సొత్తెంచి తదవస్థుం డైనజయద్రథుని ధర్మరాజునకుఁ జూపించిన నజాతశత్రుండు నకఁ జాలు విడువు మనిపలికినను వృకోదరుఁడు వెండియు ధర్మరాజుం జూచి యీపాపాచారుఁడు పాండవదాసుఁ డయ్యె నని పాంచాలికిఁ జెప్పు మనివచించినం గరుణించి ధర్మరాజు తమ్ముని బిలిచి నామాట నీకుఁ బ్రమాణం బగునేనియిఁక వీని విడిచిపుచ్చు మనివాక్రుచ్చె. ద్రౌపదియు వికృతరూపుం డైనవానిం జూచి పాండవదాసుఁడు గావున విడిచిపుచ్చు మనుటయు భీముఁడు విడిచె. అంతనా సైంధవుండు విహ్వలుండై ధర్మరాజునకు నచ్చటిమునులకు మ్రొక్కి నిశ్చియుండై బరమకారుణికుం డైనయజాతశత్రుఁడు వానిఁ జేరఁ బిలిచి యిఁక నైన నిట్టిచెనఁటిపనులు చేయకుము. నీయుద్యోగంబు లోకనింద్యంబు. ఇట్టిదుష్కృతంబులు చేయ నీవు దక్కఁ దక్కటివాఁ డెట్టిపురుషాధముఁ డైన నుడంబడునే? ఇఁక నైనం దెలివి గలిగి ధర్మముపైఁ జిత్తము నిలుపుము. అధర్మంబు పొంతఁ బోవకుము. నీకు దాస్యంబుఁ దొలఁగించితి. చతురంగబలముతోడ నీపురికిఁ బొమ్మని వీడుకొలిపిన వాఁ డేమియు ననక సిగ్గునఁ దల వాంచి చనియె.

## సైంధవుఁ డీశ్వరుని గుఱించి తపస్సు చేయుట.

అట్లు చని సైంధవుండు గంగాద్వారంబు సేరి యందు దేవదేవు, మహాదేవు, నుమాపతిం గుఱించి తీవ్రతపంబు సల్పిన వానితపంబునకు మెచ్చి వృషధ్వజుండు సన్నిహితుండై వరముఁ గోరు మనుటయు వాఁడు పాండవుల నేవురను సమరమునం దాను గెలువఁగ వరము వేఁడిన వానికి మహేశ్వరుండిట్లనియె. పాండవు లవధ్యులు. వారల గెలువరాదు. అయిన నీకుఁ బ్రీతిగా నర్జునుఁడు దక్కఁ దక్కటి వారల నల్వుర నొక్కనాఁడు రణాంగణంబున నడ్డగింపఁగ వరమునిచ్చితి. అర్జును వారింపనైనను నీవు నేరవు. వానిం గెలువ దేవతలుం జాలరు. నే నతనికి నిరుపమానం బయినమదీయపాశుపతాస్త్రము నొసంగితి. లోకపాలురు మున్నుగా నగు దేవతలుం దమతమదివ్యాస్త్రముల నిచ్చిరి. మఱియు నతండు పూర్వజన్మంబున బదరీవనంబునందు నారాయణుతోడఁ దపము సేసిననరుం డనుమునివరుండు. నారాయణుమహింబనిర్వాచ్యంబు. అతండే నిఖిలలోకకారణంబు, ప్రధానపురుషుఁ, డవ్యక్తుఁడు, విశ్వాత్మకుఁడు, విశ్వమూర్తి. అతండే తొల్లి యుగవిగమసమయంబునఁ గాలానలదగ్ధంబై జగం బంతయుఁ బొడవడంగి పదంపడి సంవర్తమేఘపటలంబు లపారధారాసంపాతనీరంధ్రముగ వర్షించిన నెక్కడఁ జూచిన నేకార్ణవంబై యుండ ఫణాసహస్రశోభితం బైన శేషపర్యంకంబునఁ బవ్వళించి సర్వంబు

నిశ్చేష్టితంబుగా యోగనిద్రఁ బూనువాఁడు. నారము లన జలములు. వాని నెల కొనియునికిం జేసి నారాయణుఁ డనఁ బేరు విశ్రుతంబయ్యె. అతండు సత్వోద్రేక మున మేలుకని శూన్యజగముఁ గనుఁగొని బ్రహ్మఁ సృష్టిఁ గావింపవలయు నని తలఁచునంత నయ్యాదిదేవునాభినాళీకంబునఁ జతుర్ముఖుండు వొడమి తదాజ్ఞం బున సృష్టిఁ జేయం బూని మరీచ్యాదు లగుమానసపుత్రుల సృజించె. వారీజగ మెల్లం గ్రమంబున సృజించిరి. త్రిమూర్తులం దాల్చి యతండు సృష్టిస్థితిలయ ములఁ గావించు. మఱియు విష్ణుదేవునిచిత్రచరిత్రంబు లెన్నియేఁ గలవు. వేద పారగు లగువిప్రులవలన వినినవాఁడవు కావె? కొన్ని వివరించెద వినుము. అయ్యే కార్ణవంబున వానకాలంబు రాత్రి మిడుఁగుఱువులె దా నెక్కరుండు దిరుగుచు జలనిమగ్నం బయినభూమిం గనుంగొని దీని నుద్ధరింప నుపాయం బెద్దియో యని మనంబునం జింతించి వేదసమ్మితం బయినయజ్ఞవరాహరూపమును దశయో జనవిస్తీర్ణంబైనదాని, శతయోజనాయతంబైనదానిఁ, గులపర్వతోపమానంబై నదాని, నేకదంష్ట్రావిలసితంబైనదాని, మేఘగర్జాసమనిర్ఘోషంబైనదానిఁ గ్ర హించి తనయొంటికొమ్మునఁ బుడమి నెత్తి స్వస్థానంబునం జేర్చె. మఱియునద్దే వుఁడు హిరణ్యకశిపుఁ డనుదానవుఁడు స్తంభమును వ్రేయుటయు వ్రేటుతోడన లోకభీకరం బైననరసింహరూపంబుతో సన్నిహితుండై యాదానవుతోడం బోరా డి వానిఁ గొమ్ముగోళ్లఁ వ్రచ్చి లోకములరక్షించె. వెండియు నాజనార్దనుఁడు లోక హితార్థంబుగాఁ గశ్యపునకుఁ బుత్రుఁడై యదితిగర్భము సొచ్చి యందు వర్షస హస్రంబు వసియించి యట జనించి వామనుఁ డనఁ బరఁగి దండకమండలుధా రియు, జటిలుఁడు, యజ్ఞోపవీతియునై బ్రహ్మచారివేషమున నింద్రారి యగుబలి యనుదానవుయజ్ఞవాటమునకు బృహస్పతితోడం జని తనయెడ సుప్రీతుఁ డైన యాబలిప్రార్థనంబున మూఁడడుగులంతియచోటు నడిగి యాబలి "యిచ్చితిం గొను" మనినం దాను మేను పెంచి తనవిక్రమంబుల భూమ్యంతరంబుల నావ రించి యంతయు సంగ్రమన కొసంగె. ఆదేవదేవుఁడే యిపుడు దుష్టనిగ్రహంబును, శిష్టానుగ్రహంబును, ధర్మసంస్థాపనంబునుం జేయఁ గోరి యదుకులమున వసుదే వునకుఁ బుత్రుఁడుగ జనించి కృష్ణుఁ డనఁ బరఁగుచున్నవాఁడు. అతనిచరిత్రంబు నందఱుం గొనియాడుదురు. ఆకృష్ణునితోడ నర్జునుఁడు రథారూఢుఁడై వచ్చినఁ బోర వాసి మార్కొని బ్రదుకువారుం గలరే? కావున వాఁడుదక్కఁ దక్కటిపాం డవుల నలువురను దదీయసైన్యమును సమరమున నొకదినము నివారింతువు. ఈవ రము నిచ్చితి నని యానతి యొసంగి గంగాధరుఁడు నిజపార్షదగణముతోడ నదృ శ్యుఁ డయ్యె. జయద్రథుఁడుం దపము సాలించి నిజపురమునకుఁ జనియె. పాండ వులుం బ్రాహ్మణులతోడఁ గామ్యకవనంబున వసించుచుండి రనిన విని జనమేజ

యుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, పాండవు లామీఁద నేమి చేసిరని యడుగుటయు నతం డతని కిట్లనియె.

## మార్కండేయుఁడు ధర్మరాజునకు రామాయణకథఁజెప్ప నారంభించుట.

అవ్విధమున సైంధవుని జయించి ద్రౌపదిం దోడితెచ్చి ధర్మరాజు బ్రాహ్మణగోష్ఠి నుండి యంతకుమున్న నిచ్చేసియున్నమార్కండేయుం జూచి మునీంద్రా, నీవు దేవర్షిసత్తముండవు భూతభవిష్యద్వేదివి గావున మనోగతం బైనసంశయం బడిగెద. తెలియ నానతిమ్ము. ద్రుపదునియజ్ఞవేదిం బొడమి యయోనిజ యనం బరఁగి మహాత్ముఁ డగుపాండురాజునకుఁ గోడ లనఁ బేరు గాంచి మాకు ధర్మపత్ని యైనయీద్రౌపదిని దురాత్ముఁ డైనసైంధవుఁ డపహరించికొనిపోయెఁ గదా. పరిశుద్ధచిత్తుని స్తేయానృతములు స్పృశింపరానిచందంబున నిప్పరమసాధ్వి నామూఢుఁడు చెనకవచ్చునే? ఒకప్పు డైనను బాంచాలి పాపకర్మంబుఁ జేసియుండదు. మఱి ధర్మమున బ్రాహ్మణుల సేవించినయది. ఇది యెంతయుఁ బరికించిచూచినం బ్రాణులకు శుభాశుభఫలానుభవంబున దైవమే ప్రధాన మనుట నిక్కం బయ్యె. కాఁగలవానిం దప్పించికొన నేరును నేరరు. పత్ని నపహరించికొనిపోవుటంజేసి మే మాదురాత్మునిం బరిభవింపవలసె. ఏమి సెప్పుదు. రాజ్యము గోల్పోవుట, బంధుల నెడఁబాయుట, యడవుల వసించుట, వనమృగముల హింసించి జీవించుట యనునివియే యెల్లపుడు మనస్సు నెరియించుచుండ నిపు డవితర్కితం బయినభార్యాపహరణవ్యసనమునకుం బాత్ర మైతి. లోకమున నెప్పు డైన నెచ్చట నైనను నాకంటె నల్పభాగ్యుఁ డొండొకపురుషుఁ డుండునే? అట్టివాని మీరు గంటిరే? వింటిరే? యని విషాదవివశచిత్తుం డై యడుగ మార్కండేయుం డతని కిట్లనియె. ధర్మనందనా, దైవవశమున నందఱు సుఖదుఃఖములఁ గుడుతురు వినుము. తొల్లి యయోధ్యవిడిచి ప్రియానుజులతోడ దండకారణ్యమున వసించిన శ్రీరాము పత్ని యైనజానకిని రావణాసురుఁడు మాయచే నపహరించికొని యాశ్రమసమీపమున నడ్డమువచ్చినజటాయువును సంహరించి లంకకుఁ గొనిపోయె. అట శ్రీరాముఁడు సుగ్రీవుసహాయమున సముద్రమందు సేతువు గట్టి రావణాసురు సంహరించి మగుడ జానకిం దెచ్చె ననిన విని ధర్మరాజు మునివరేణ్యా, రాముఁ డేకులమున జనించినవాఁడు. అతనివిక్రమం బెట్టిది? రావణుఁ డెవనికులమున జనించె. అతనికి రామునితోటిపగకుఁ గారణం బెయ్యది? శ్రీరామచరిత్రంబు తేటపడం జెప్పవే యనియడుగ మార్కండేయుండు ధర్మరాజున కిట్లనియె. ఇక్ష్వాకులజనితుం డై నయజుఁ డనురాజునకు దశరథుఁ డనువాఁడు కుమారుఁ డై యన్నితెఱంగుల వన్నెకెక్కె. అతనికిఁ గౌసల్య, కైకేయి, సుమిత్ర యనువారు మువ్వురు భార్య లైరి. అందుఁ గౌసల్యకు శ్రీరాముఁడు, కైకేయికి

భరతుఁడు, సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్ను లనువారు పుత్రులై క్రమమునఁ బెరిగి ధర్మార్థవిదు లనం బ్రసిద్ధి వడసిరి. ఆశ్రీరామునకు జనకరాజుకూఁతు రగుసీతాదేవి ధర్మపత్ని యయ్యె. ఇఁక రావణుజన్మంబు చెప్పెద నాకర్ణింపుము. బ్రహ్మదేవునకు మానసపుత్త్రుఁడై నపులస్త్యునకు గోవునందు వైశ్రవణుఁ డనుకుమారుఁడు పుట్టె. వాఁడు తండ్రిని విడిచి తాత యగుబ్రహ్మదేవుం గుఱించి తపం బొనరించి ప్రీతచిత్తుఁడై నయద్దేవదేవునివరమున నమరత్వంబును, ధనేశ్వరత్వంబును, లోకపాలత్వంబును, మహాదేవుసఖ్యంబును, లంకారాజ్యంబును, గామగమనం బైనపుష్పకవిమానంబును, యక్షాధిపత్యంబును, రాజరాజనామంబును, నలకూబరుఁ డనుకుమారునిం బడసె. పులస్త్యుఁడుం గొడుకు తన్ను విడిచె నను కోపంబున నిజశరీరమునం దర్ధమున విశ్రవసుఁ డనువాని సృజించి యావైశ్రవణునకుఁ గీడు సేయం బనిచె. వైశ్రవణుండును వానికోపము నెఱింగి తత్ప్రసాదంబు వడయంగోరి యావిశ్రవసునకుఁ బుష్పోత్కట, రాక, మాలిని యనువారల ముగ్వురు రాక్షసాంగనలఁ బరిచారికల నొసంగె, ఆపరిచారికలుం దమలోఁ దాము నొకరికంటె నొక రెక్కువగాఁ దలంచి నృత్యగీతచాతుర్యంబున నావిశ్రవసుచిత్తము మెప్పించుటయు నమ్ముని వారికిఁ బ్రీతుండై లోకపాలసన్నిభు లయిన పుత్రుల ననుగ్రహించినం బుష్పోత్కటకు రావణకుంభకర్ణు లనువారును, రాకకు ఖరుఁ డనుకొడుకు శూర్పణఖ యనుకూఁతురును, మాలినికి విభీషణుఁ డనుకుమారుఁడుం బొడమిరి. అందు రావణుఁడు మహోత్సాహుఁడు, మహావీర్యుఁడు, మహాసత్త్వుఁడు ననంబరఁగి రాక్షసులలోనెల్ల నధికుఁ డయ్యె, కుంభకర్ణుఁడు మాయావి, రణశూరుఁడు, రౌద్రుఁడు, లోకోత్తరబలుఁడు ననం బేరువడసె. విభీషణుఁడు రూపవంతుఁ డనియు ధర్మనిరతుఁ డనియుఁ బొగడ్త కెక్కె. ఖరుఁడు విలువిద్యయందు నేర్పరియై బ్రహ్మద్వేషము సేయుచుండె. శూర్పణఖ యత్యంతరౌద్రమున సిద్ధులు చేయుసత్కార్యములకు విఘ్నము లొనరించుచుండె.

## బ్రహ్మ రావణకుంభకర్ణవిభీషణులకు వరంబు లిచ్చుట.

అంత వా రందఱు వేదములఁ జదివి వ్రతముల నాచరించి గంధమాదనమునఁ దండ్రితోడ వసించుచుండి యొక్కనాఁడు యక్షరాక్షససేనలు దన్నుఁ గొలువఁగఁ దండ్రితోడఁ గూర్చున్నవైశ్రవణుం గనుంగొని చూపోపక జాతరోషులై బ్రహ్మదేవుం గుఱించి తీవ్రతపంబు సలిపిరి. అది యెట్లం టేని? రావణుఁడు పంచాగ్నిమధ్యమునం దేకపాదమున నిలిచి వాయుభక్షుండై వేయేండ్లు సమాహితచిత్తముతోఁ దపస్సుచేసె. కుంభకర్ణుఁడు నియతాహారుండు నియతవ్రతుఁ డధశ్శయనుఁడునై తపోనిరతుఁ డయ్యె. విభీషణుఁడును రాలిన యాకొక్కటి దినుచు నుపవాసనిరతుండై సదాజపపరాయణుండై యుగ్రముగఁ దపము

సలిపె. ఖరుఁడు శూర్పణఖయు వారికిఁ దగువిధమున రక్షణంబును బరిచర్యయుం జేయుచుండిరి. అట్లుండఁ ఘోరతపోనిరతులై యుండ రావణాసురుఁడు వర్షసహస్రంబు పూర్ణంబయినం దనతలలు తఱిగి యగ్నిముఖమున వ్రేల్చుటయుఁ బ్రీతుండై పరమేష్ఠి వారికి సన్నిహితుండై మీతపస్సులకు మెచ్చితి. అమరత్వముదక్క మీ కోరినవరముల నిచ్చెద నడుగుఁడని వేఱువేఱ చెప్పి రావణుం జూచి నీతలలు తొల్లింటిక్రమంబున రాఁగలయవి. తలఁచినపుడు వైరూప్యము లేక కామరూపముఁ దాల్తువు. శత్రువుల గెల్తువు. వెండియు నీ కెద్ది యభిమతంబో యడుగుమనిన రావణుఁ డిట్లనియె. దేవా, దేవదానవయక్షరాక్షసకిన్నరపన్నగాదులలో నెవ్వరివలనను నాకుఁ బరాభవము గలుగకుండఁగఁ బ్రసాదింపుమని ప్రార్థించినఁ బితామహుఁడు వానికి మనుష్యేతరులవలనిభయము లేకుండఁగ వరము నొసఁగె. వాఁ డందులకు సంతుష్టుండై మదంబునంజేసి మనుజుల సరకుగొనఁ డయ్యె. కుంభకర్ణుఁడు తమోగుణగ్రస్తచిత్తుఁడై నిద్రఁ గోరికొనుటయుఁ జతుర్ముఖుఁడు వానికి దాని నిచ్చె. విభీషణుఁడుం బ్రహ్మదేవునిపునఃపునఃప్రేరణంబునంజేసి యడుగఁ దలంచి దేవా, నాబుద్ధి యత్యంతాపత్కాలమందు నధర్మముపొంతఁ బోవకుండఁగను బ్రహ్మాస్త్ర మశిక్షితమైనం దోఁచునట్లుగను వరమనుగ్రహింపు మని ప్రార్థించినం బితామహుఁడు పరమప్రీతుండై వానికోరిన వరము లిచ్చి గారవించి వెండియు వానిం బిలిచి వత్సా, రాక్షసయోనిజాతుఁడవయ్యు నీ వధర్మమున బుద్ధి సొరకుండఁగ వరము వేఁడుటంజేసి నీధార్మికత్వంబు మెచ్చితి. అమరత్వంబు నిచ్చితి నని చెప్పి యంతర్హితుం డయ్యె. అటు రావణుఁడు బ్రహ్మప్రభావగర్వితుండై కుబేరునిపై నెత్తిచని వాని నోడించి లంకవెడలఁ గొట్టి పుష్పకవిమాన మాక్రమించుటయుఁ గుబేరుఁడు విషణ్ణుఁడై యోరీ! గురుఁడగు నన్నవమానించుటంజేసి యచిరంబ గీడు పొందెదవు. మఱియు నీ పుష్పకవిమానము నీకు వాహనము గాదు మఱి నిన్ను సంహరించువానికి వాహనమగుత మని శపించి గంధర్వయక్షరక్షఃకిన్నరకింపురుషానుగతుండై గంధమాదనమునకుఁ జనియె. ధర్మాత్ముఁడై నవిభీషణుఁడు సన్మార్గముఁ దలంచి వైశ్రవణుం గొలిచి పోవుటయు నతండు సంతుష్టుండై విభీషణునకు యక్షరాక్షససేనాధిపత్యము నొసఁగె. అంత రావణాసురుఁడు సకలరాక్షసులు గొలువ లంకారాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడై దేవదానవుల నుపద్రవించి తదీయరత్నాదుల నొడిచికొనియె. సకలలోకములను*రావింపఁ జేయుటం జేసి దశముఖుఁడు రావణుఁ డనం బేరు గాంచి దేవతలకు భయము గావించె. వాని చేసినబాధల కోర్వలేక బ్రహ్మర్షులు దేవర్షులు సిద్ధులు నగ్నిం బురస్కరించికొని బ్రహ్మపాలికిఁ జని శరణుసొచ్చు

* రావించుట యనఁగా నఱపించుట.

టయు నపుడు బ్రహ్మ కగ్ని యిట్లనియె. దేవరవరంబున నవధ్యుం డై నదశగ్రీవుండు క్రొవ్వి బహుప్రకారంబు లయినవిప్రకారంబుల లోకములఁ బీడింపుచున్నవాఁడు. రక్షకుఁడు లేక సంకటములపాలై యున్నప్రజల రక్షింపవే యని ప్రార్థించినం బ్రహ్మ యిట్లనియె. వాని దేవాసురులును జంపనేరరు. తన్నిగ్రహార్థంబ నారాయణుండు మత్ప్రార్థనంబున మనుష్యుఁడై యవతరించినవాఁడు. అతండు వానిం బొరివుచ్చు నని చెప్పి యింద్రుం బిలిచి మనుష్యులలో నవతరించినవిష్ణుదేవునకుఁ సహాయార్థంబుగ మీ రందఱు మీయంశముల ఋక్షవానరాదులయందుఁ గొడుకులఁ బడయుఁ డని యానతిచ్చె. దుందుభి యనుగంధర్వాంగనం బిలిచి నీవు దేవకార్యార్థంబు మనుష్యలోకంబునం బుట్టు మని పనిచిన నది కుబ్జాకారంబుతోఁ బుట్టి మంథర యనంబరఁగె. ఇంద్రాది దేవతలునుం దమతమ యంశముల వానరాదులం బుట్టించిన వారు జనకానుగుణబలులై నిఖిలయుద్ధవిశారదులై యథేచ్ఛము దిరుగుచుండిరి. మంథరయు దైవప్రేరణంబునంజేసి రామునియెడఁ గైకేయికి వైరము గలుగునట్లు సంవిధానముఁ జేయుచుండె నని విని ధర్మరాజు మునీంద్రా, శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నడవికిఁ బోవఁ గారణం బెయ్యది యనియడుగ నతండతని కిట్లనియె.

### కైకేయి దశరథుని వరముల నడుగుట.

దశరథుఁడు కుమారు లధీతవిద్యులై తగినకన్యలం బెండ్లియై సుఖముండఁగ నందుల కెంతయు సంతస మొందుచు సకలగుణశ్రేష్ఠుఁడు జ్యేష్ఠుఁడు నగు శ్రీరామునిప్రజానురాగంబును దనకు వయస్సుచెల్లుటయుం బరికించి ధర్మవిదు లయినమంత్రిపురోహితులతోడఁ జింతించి సకలసుగుణాభిరాముఁ డైన శ్రీరాముని యౌవరాజ్యాభిషిక్తుం జేయఁ దలంచి నేఁటిరేయి శుభం బైనపుష్యయోగ మగుఁ గావున నాసుముహూర్తమున యౌవరాజ్యాభిషేకముఁ గావింతము. సకలసంభారములం జేర్పుఁడు. ఈశుభవృత్తాంతము రామునకుఁ దెల్పుఁడని యానతిచ్చె. అది విని మంథర కైకేయియొద్దకుఁ జని యో కేకయరాజపుత్రీ, రాజు నేఁడు నీదౌర్భాగ్యముఁ బ్రకటించె. పాముపగిది లోపలఁ గ్రుద్ధుఁడయ్యునతఁడు వెలుపలఁ బ్రీతిమంతునిపోలె నటింపుచున్నవాఁడు. కౌసల్యకొడుకైన రాముని యౌవరాజ్యమున నభిషేకింతు రఁట. కౌసల్యకదా భాగ్యవంతురాలు. నీకొడుకునకు రాజ్యము లేదయ్యె. ఇంతకంటె నీదౌర్భాగ్యము వేఱొక్కటి గలుగునే యనిచెప్పిన విని కైకేయి సర్వాభరణభూషితయై సౌందర్యంబు సొంపారఁ బతిసన్నిధికిఁ జని ప్రణయపురస్సరసుందరమందహాసంబు సెలఁగ రాజేంద్రా, నాకోరినవరము నిత్తు నని నాకొడఁబడినబాసఁ దలపోసి నాసంకటముఁ [illegible] సత్యప్రతిజ్ఞ నీడేర్పవే యనివిన్నవించె. విన్నవించుటయు దశర

థుఁడు కైకేయిం జూచి కల్యాణీ, నీకోరిక యెయ్యది? అవధ్యు నెవని వధింప వలయు? వధ్యు నెవ్వని వధింపక విడిపింపవలయు? ధన మెవని కియ్యవలయు? ఎవని ధన మపహరింపవలయు? బ్రాహ్మణస్వంబుదక్కఁ దక్కటిధన మంతయు నీయదియె. చాతుర్వర్ణ్యముఁ బ్రోచుచు నీభూలోకమున రాజరా జనఁ బేరు వడసిననేను నీకోర్కి నీడేర్తుఁ గాని సత్యప్రతిజ్ఞఁ దప్పుదునే యనిచెప్పినం గైకేయి తనకోరిక కొనసాగు నని నిశ్చయించి రాజేంద్రా, రాముని యువరాజుఁగా నభిషేకింపఁగఁ జేర్చిన సంభారములచే నాయౌవరాజ్యమున భరతుని నభిషేకించి రాముం బదునాలుగేండ్లు వనమున వసింపఁ బంపుము. ఇది నాకోరికి యనివచించె. ఆపలుకులు చెవులకు ములుకులై సోఁకఁగఁ బరమదుఃఖార్తుండై దశరథుఁ డెద్దియుం జెప్పనేరక ప్రాన్పడియుండె.

రాముఁడు సీతాలక్ష్మణులతోడ నడవికిఁ బోవుట.

ఆవృత్తాంతముఁ దెలిసి శ్రీరాముఁడు తండ్రిప్రతిజ్ఞ సత్యముగఁ జేయఁ బూని యడవికిఁ జనుటయు సీతాలక్ష్మణులు నతనితోడంబోయిరి. ఇట దశరథుఁడు రామునివియోగమునంజేసి విషాదం బోర్వలేక కాలధర్మము నొందె. అటఁ గైకేయి మేనమామవీట నున్నభరతుం బిలిపించి యంతయుం జెప్పి నిష్కంటకం బయినరాజ్యము గ్రహింపు మనిచెప్పినం గటకటంబడి యతండు తల్లిని జూచుచుఁ జూచి యోకులపాంసనీ! ఘోరకృత్యంబుఁ జేసితివి. ధనలోభమునఁ బతిని జంపుటయ యొక్కండు గాక కులమునకెల్ల నపకీర్తిం దెచ్చితివి. నీకోరిక నెఱవేఱెనకో యని పెద్దయుంబ్రొద్దు పలవించి యెల్లవారియెదుటఁ దనసుచరిత్రంబు నెఱపి రాముని మగిడింతు నని చెప్పి యతండు పోయినత్రోవన శత్రుఘ్నుఁడుం దాను నడవికిఁ జనియె. అతని వెంటన తగినయానముల నారోహించి కౌసల్యయుఁ గైకేయియు, సుమిత్రయు, వసిష్ఠవామదేవాదిమునులుం, బౌరజానపదజనులుం బెక్కండ్రు నడిచిరి. అట్లు చని భరతుఁడు చిత్రకూటము సేరి యాపర్వతంబునఁ దాపసవేషంబును విల్లమ్ములనుం దాల్చియున్నశ్రీరాముని సీతాలక్ష్మణసమేతుం గనుంగొని ప్రణామంబుఁ గావించి పితృవియోగంబు నివేదించి మగిడి పురమునకు విచ్చేయు మని ప్రార్థించుటయు రాముఁడు పితృవాక్యపరిపాలనంబు సేయవలయుఁ గాని తప్పరాదని చెప్పి యతనివీట నుండు మని యాన తిచ్చుటయునా భరతుఁ డన్నపాదుకలం గొని నందిగ్రామంబు సేరి రాజ్యభార మంతయు నాపాదుకలపై నిడి ప్రజల నేలుచుండె.

అట రాముఁడు మఱలఁ బురజనులు తన్ను మగిడింప వత్తు రని యాశంకించి చిత్రకూటంబు వాసి దండకారణ్యము సొచ్చి శరభంగునాశ్రమమున కరిగి యమ్మునీంద్రుని సత్కరించి యట గోదావరీతీరమునఁ బర్ణశాలఁ గావించుకొని

వసించియుండె. అపుడు శూర్పణఖ యనురక్కసి వచ్చి లోకోత్తరసౌందర్యాభిరాముఁడైన శ్రీరాముం గామించుటయు నారామచంద్రు నానతిం జేసి లక్ష్మణుఁడుదానిముక్కులు చెవులుం గోసె. కోయుటయు వికృతరూపయై యది యాకోపంబున ఖరదూషణాదు లగుచతుర్దశసహస్రరాక్షసుల జనస్థాననివాసులం బురికొల్పిన వారు రాఘవుతోడఁ బోరు సేసి మ్రగ్గిరి. అంత నాశూర్పణఖ యమర్షాతిరేకంబున లంకకుఁ జని రావణాసురునడుగులపయిం బడి యేడ్చుచుండ నతండు దానివికృతరూపంబుఁ జూచి కోపావేశంబునఁ బండ్లు పటపటగొఱుకుచుఁ దటాలున లేచి మంత్రులు మున్నుగానగు నెల్లవారిం బోవం బనిచి యేకాంతంబున దానిం బిలిచి యిట్లనియె. శూర్పణఖా, నన్నుఁ దలంప కెవ్వరు నీ కీవికారంబుఁ జేసిరి? ఎవ్వఁడు తెలివి లేక శూలముల నెడ లెల్లం గ్రుచ్చికొనుచున్నాఁడు? ఎవ్వఁడు దలపై నగ్గి వెట్టికొని సుఖముగ నిద్రింపుచున్నాఁడు? ఎవ్వఁడు పాదమునఁ గ్రూరసర్పముఁ దన్నుచున్నవాఁడు? ఎవ్వఁడు సింహమునోటిలోపలికోఱఁ దాఁకుచున్నాఁడు? అని యడుగుచున్నంత వానిరోమకూపముల రాత్రివేళఁ గాలుచున్న వృక్షముకోటరంబులం బోలెఁ గోపానలకణములు వెడలుచుండె. అంత శూర్పణఖ ఖరదూషణాదివధంబు మున్నగు రామునిచరిత్రంబుఁ జెప్పిన విని యారాక్షసేశ్వరుఁడు దాని నూఱార్చి పురరక్షణంబునం దగువారల నేర్పఱచి తా నాకసంబున కెగిరి త్రికూటమును గాలపర్వతమునుం గడచి సముద్రము దాఁటి మహాదేవునివాసం బయినగోకర్ణక్షేత్రము సొచ్చి యచ్చట రామునకు వెఱచి తాపసవేషముఁ దాల్చియున్న తనతొల్లింటి మంత్రిని మారీచుం గనుంగొనియె. మారీచుఁడు నాకస్మికంబుగ వచ్చిన రావణుం జూచి ససంభ్రమముగ ఫలమూలాదుల సత్కరించి యతనివిశ్రాంతి నరసి వినయంబున నిట్లనియె. రాక్షసేశ్వరా, నీవన్నె చూడఁ దొల్లింటి తెఱంగు దప్పియున్నది. కారణం బెయ్యది? పురమున నెల్లరకుం గుశలంబే? తొల్లింటియట్ల ప్రజలు నిన్నుఁ గొల్చుచున్న వారకదా? నీరాకకుం గతం బెయ్యది? నీవచ్చినకార్యంబు దుష్కరంబైనం జేసితి ననియ తలంపు మనియడుగ రావణుండు రాము చెయ్వులనెల్ల సంక్షేపంబుగ వచించి యతని కపకారంబు సేయఁ దోడ్పడు మనుటయు మారీచుఁడు రావణునకు వెండియు నిట్లనియె. రామునెడ విక్రమంబుఁ జూపుదు ననుతలంపు చాలింపుము. అతనివీర్యము నే నెఱుంగుదు. అమ్మహాత్ము బాణవేగ మెవ్వఁ డోర్వఁ గలఁడు? అతని కోడి నేను బ్రాణరక్షణపరత్వమున నీతాపసవృత్తిం బూనితి. వినాశకారణం బయినయీయుద్యమము నేదురాత్ముఁడు నీకు బోధించె నని నీతియుతంబుగఁ బలికిన వాఁడు సక్రోధుఁడై మారీచుఁ జుఱచుఱం జూచి యోరీ, నామాట వినవేని యవశ్యం బిపుడు నినుఁ జంపుదు నని మాఱుపల్కుటయు మారీచుండు వీనిచేఁ జచ్చుకంటె నామహాత్ముచేఁ జచ్చు

టయు నాముష్మికసుఖప్రదంబని తనలోఁ జింతించి యవశ్యము మరణము ప్రాప్తంబై యుండ నిప్పటి కిదియె యుచితం బని నిశ్చయించి యట రావణుమొగంబునం జూచి నిలిపి యెట్లయిన నీయానతిమెయి నడతు, నేమి సేయుదు ననియడుగ రావణుఁడు మారీచున కిట్లనియె. నీవు మాయాప్రభావంబున రత్నశృంగరోమముల తోడ బంగారుమృగంబై రామునాశ్రమమున కరిగి సీతచిత్తమునకు మెప్పుగాఁ గపటమున వినోదములఁ జూపుము. నీవినోదములకు మోసపోయి జానకి యామృగముఁ దెచ్చి యిమ్మని రాముని బంపును. అట లక్ష్మణుఁడు నాశ్రమముఁ దొలఁగిపోవ నుపాయము పన్నుము. పిదప సీత చేయునది లేక నాకు వశ్య యగు. నే నట దాని లంకకుఁ గొనిపోవుదు. అంత రాముఁ డాశ్రమముఁ జొచ్చి ప్రియపత్నిం గానక తద్విరహానలమునం గ్రాఁగి నశించు. ఇందు నీవు సాహాయ్యముఁ జేయు మనివచించె.

## మారీచుఁడు మాయామృగమై చనుదెంచుట.

విని మారీచుండు తనచావు నిశ్చయించికొని దుఃఖితుండై రావణువెంటఁ దదాశ్రమప్రాంతమునకుఁ జని యట నెడంబడినట్లు రత్నశృంగరోమములతోడం గాంచనమృగంబై కాకుత్థ్సపర్ణశాలముందటి కరిగి కృతకవిలాసంబున నెగురుచుఁ గసవు మేయుచు బిక్కరించి చూచుచు వినోదములఁ జేయుచుండ జానకి దాని రూపచేష్టితముల కాశ్చర్యముఁ జెంది యామృగముఁ దనకుఁ దెచ్చియిమ్మని రాఘవుం బ్రార్థించె. రాఘవుఁడును సీతకుఁ బ్రియము సేయంబూని తద్రక్షణార్థము లక్ష్మణు నాశ్రమంబున నిల్పి ధనుర్బాణతూణీరఖడ్గాదిసాధనముల గ్రహించి రుద్రుఁడు యజ్ఞమృగంబునుంబోలె నమ్మాయామృగముఁ దఱుముచుఁ జనియె. ఆమృగము కొంతవడి సన్నిహితంబు, వ్యవహితంబు, తిరోహితంబు, దృశ్యంబునుంగాఁ బెక్కుమాయలు వన్ని పెద్దయు దవ్వు చనుటయు దానివెంటన చని రాముఁడు కొంతవడి తనలో నాలోచించి యది రాక్షసమాయకా నూహించి యమోఘంబైనబాణం బరివ్రేసి యేసిన నాదుష్టరాక్షసుఁడు తద్బాణాభిహతుండై హా! సీతా! లక్ష్మణా! యని రామునివలెఁ బెలుచ నఱచి నీల్గె. ఆదీనధ్వని విని జానకి యాదెసం బఱచుచుండ లక్ష్మణుఁ డాదేవిం బిలిచి యేల నీవు శంకించెదవు? రాము నెవ్వఁడు ప్రహరించు? ముహూర్తమాత్ర మూఱడిల్లుము. రాముఁడు వచ్చువాఁడు. అమ్మహాత్మునిం జూడఁ గలవని చెప్పిన లక్ష్మణువచనము విని వైదేహి శుద్ధచారిత్రభూషణయయ్యు స్త్రీస్వభావమునం జేసి యాశంకించి యేడ్చుచు నతిపరుషముగ లక్ష్మణున కిట్లనియె. మూఢా, నీకోరినకోరిక నెఱవేఱనేరదు. శస్త్రమునఁ బొడిచికొందుఁ గొండమీదనుండి నేలం బడ దూఁకుదు నగ్నిం జొత్తుఁగాని శ్రీరాముని విడిచి నిన్నుఁ గామింపను. పులిపాలఁతి యెన్నఁడైనను

నక్కను గామించునే యని సరభసంబుగఁ బలికిన విని శ్రీరామచరణసేవాపరాయణుం డైనలక్ష్మణుఁ డామాటల విననొల్లక చెవులు గట్టిగ మూసికొని ధనుర్బాణాదులం గ్రహించి సీతదెసం జూడక రాముసడుగులజాడఁ బరికించుచు నతని పోయినత్రోవం బోయె. అయ్యవసరంబున రావణాసురుఁడు భస్మచ్ఛన్నహుతవహుఁవడువున నభవ్యుఁడయ్యు భవ్యరూపము సెలంగ యతివేషచ్ఛన్నుండై యద్దేవి నపహరించికొనిపోవం దలంచి పర్ణశాలయొద్దకు వచ్చినం జూచి జనకాత్మజ కేవలధర్మజ్ఞ గావున వానింబిలిచి యయ్యా, మాయింటి కతిథివై వచ్చితివి. నాయొసంగుఫలమూలాదుల గ్రహింపు మని యాతిథ్యనిమంత్రణంబుఁ జేసె. సీతావచనముల నిరాకరించి రావణుఁడు మునిరూపము విడిచి తనతొల్లింటిరూపము గ్రహించి వైదేహీ, నేను రాక్షసేశ్వరుండను. రావణనామధేయుండను. మహోదధిదక్షిణతీరమున మారాజధాని లంకయనునది వెలయుచున్నది. నాకు భార్యవై యచట నాతోడ నభిమతవిహారముల సుఖింపుము. రాజ్యముఁ బాసి మునివేషముఁ దాల్చి యడవుల నున్నరాఘవుని విడువు మని చెప్పినం జానకి యాపలుకుల విననొల్లక చెవులు మూసికొని వాని కిట్లనియె. రాక్షసాధమా, మిన్ను చుక్కలతోడఁ బడినఁ, బుడమి పలుద్రవ్యయ్యలైన, నగ్ని చల్లనైన నేను రఘునందను విడువను. వన్యమదగజముపొందున సుఖించుకరేణు వెన్నఁడైన సూకరమును దాఁకునే? మధురమకరందరసముఁ గ్రోలు తేఁటిబోఁటి రేఁగుఁబువ్వులరసము గ్రోలునే? యని క్రోధావేశమునఁ బెదవు లదర మాఱుపలికి చేతుల విదిర్చుచుఁ బర్ణశాలాభ్యంతరమునకుఁ జనియె.

## రావణుఁడు సీతను నెత్తికొనిపోవుట.

రావణుఁ డాసతివెంట నంటి చని రాక్షసస్వరమున బెదరించి యందులకు విగతచేతన యైనజానకి వెంద్రుకలఁ బట్టి యెత్తికొని యుప్పరమున కెగరిపోవుచుండె. అపుడు రాఘవధర్మపత్ని హా! రామ! రామా! యనుచు నెలుంగురాల్పడ నేడ్చుచుండ దశరథసఖు, డరుణాత్మజుఁడు, సంపాతి సోదరుఁడు నగుగృధ్రరాజ య్యార్తరవ మాలించి రావణుఁ డెత్తికొనిపోవ నేడ్చుచున్నసీతం గనుంగొని సక్రోధుండై వాని నదల్చి యోరాక్షసాధమా, మైథిలిని విడువుము. నేను బ్రదికియుండఁగ నీ కీసతి నపహరించికొనిపోవచ్చునే? ఈసతిని విడువకున్నఁ బ్రాణములతోడఁ జననేర వనిచెప్పి యతండు ముక్కునఁ బొడిచియు ఱెక్కలఁ దన్నియు గోళ్లఁ జించియు వానిమేను జర్జరితంబుఁ జేసె. రాఘవప్రియంకరుం డయినపక్షిరాజు పక్షతుండనఖప్రహారములం జేసి యారాక్షసుండు మేన నెత్తురు జొటజొటవడియెఁగ వర్షావసరంబునం గైరికాదిధాతుపటలశోణనిర్ఝరీపరీతదరీవిరాజితకులపర్వతంబుచాడ్పున నొప్పి క్రోధఘూర్ణమానమానసుండై ఖడ్గము గొని

జటాయుని తెక్కల నఱికిన నతండు వజ్రాయుధప్రహారంబునం గూలుకుల శైలశిఖరముపగిది నేలం బడియె. అట్లు జటాయుని వధించి రావణుఁడు సీత నెత్తికొని పోవుచుండ నద్దేవి యాశ్రమంబులు కొలంకులు నదులుం జూపట్టినం దనతొడవుల దిగవిడుచుచుండి యొకకొండనెత్తమున నేఁపురువాననరరాజులం గాంచి మిగతయున్న భూషణముల నుత్తరీయాంచలంబునఁ గట్టి దాని నచటఁ బడవైచుటయు నయ్యది వాతావఘాతంబయి యంబుదమండలమునఁ గ్రొమ్మెఱుంగు తెఱంగున నయ్యేవురువాన రేశ్వరులముందటం బడియె. అట రావణుఁ డతిరయమునఁ దారాపథమునఁ జని సముద్రము దాఁటి యనేకద్వారగోపురప్రాసాదభాసురంబు, పరిఖాప్రాకారవలయితంబు, విశ్వకర్మనిర్మితంబు నగులంకానగరంబు సేరి యశోకవనమున సీతం జేర్చి తద్రక్షణార్థంబు రాక్షసస్త్రీల నియమించె.

ఇట రాఘవుఁడు మాయామృగం బైనమారీచుని వధించి మఱలి యాశ్రమమునకు వచ్చువాఁడు తెరువునఁ దమ్మునిం గనుంగొని మృగరూపధారి యగు రాక్షసునిమాయచేఁ దా నాశ్రమముఁ బాసివచ్చుటయుఁ దన వెంటన తమ్ముఁడు నేతేరుటయుం దలపోసి చింతావివశమానసుండై లక్ష్మణా! రాక్షససంకీర్ణం బయిన యివ్వనమున జానకి నొక్కదాని విడిచి యేల యిట్లు వచ్చితి? వైదేహి బ్రదికి యున్నదియే? నాకుం జూడ దాని బ్రదుకు నమ్మరా దనిపలికి యతిత్వరితగతి నరుగుదేరఁగ లక్ష్మణుఁడు దన్ను నధిక్షేపించి సీతపలుకులెల్లఁ దేటపడ విన్నవించె. సౌమిత్రివచనము విని రఘువరేణ్యుఁ డేఁక స్త్రీతవర్తన మెట్టిదియో యనువగపు గదుర శోకానలదహ్యమానమానసుండై యాశ్రమప్రాంతమునకుఁ జని కొండవోలెఁ గూలియున్నగృధ్రరాజుం గాంచి డాయంబోయి రాక్షసుం డనుశంకం జేసి బాణ మరివోయం దొడంగిన నాగృధ్రరాజు రామలక్ష్మణులారా! నేను మీతండ్రి యగుదశరథునకు నెచ్చెలికాఁడ నని తెలియఁజెప్పె. జటాయువచనం బాకర్ణించి రామలక్ష్మణు లితఁ డెవ్వఁడొక్కొ విచారింతముగాక యని తమలో నూహించి బాణ ముపసంహరించి తెక్కలు దెగి నేలఁ గూలి తలవడఁకుతోఁ బరమవేదనం బడుచున్నయప్పక్షివరుం జేర నరుగుటయు నతండు రావణాసురుఁడు సీత నెత్తికొని లంకకుఁ బోవుటయుఁ దా నడ్డపడి వారించినం దనతెక్కలతండు నఱుకుటయు మెల్లనం జెప్పి వానిపోయిన దెస దక్షిణం బని శిరఃకంపంబున సూచించి ప్రాణముల విడిచె. విగతాసుఁ డైనయాగృధ్రరాజుఁ దనతండ్రికిఁ జెలికాఁ డనుభావముతోఁ బితృమేధవిధానమున సంస్కరించి యటఁ జని యపవిద్ధబృసీకటంబు, విధ్వస్తకలశంబు, గోమాయుశతసంకులంబు, శూన్యంబు నగు నాశ్రమంబుఁ జూచి సీతాపహరణశోకవివశమానసులై రామలక్ష్మణు లాదండకారణ్యమునం దక్షిణంబుగఁ జనువారు ముందట దావానలంబు చుట్టుదరికొన్న

యట్లు మృగయాధములకు భీతిజనకుఁడై నవాని, ఘోరాకారుని, మేఘనీలుని, బర్వతసంకాశుని, సాలస్కంధుని, మహాభుజుని, వక్షస్థ్సలగతవిశాలాక్షుని మహోదరుని, మహాముఖుని, గబంధుఁ డనురాక్షసుం గనుంగొనిరి.

## రాముఁడు కబంధుని సంహరించుట.

ఆకబంధుఁడు డాయవచ్చి లక్ష్మణుచేయిఁ గట్టిగఁ బట్టికొనిన విషణ్ణుండై సౌమిత్రి యన్నమొగమునం జూడ్కి నిలిపి చూచి తెయ్యాయవస్థను. నీకు రాజ్యభ్రంశంబును, జానకీహరణంబును, దండ్రిచావు నను నివియే మనస్సు నెరియించుచుండ నిపు డీరాక్షసునకు నేఁ జిక్కితి. నీవు సీతాదేవితోడ నయోధ్యకుఁ జని కులపరంపరాప్రాప్తం బయినరాజ్యంబున నభిషిక్తుండవై యుండఁ గన్నులారఁ గనుఁగొనుభాగ్యము నాకు లేదుగాఁబోలు. పట్టాభిషేకసమయంబునఁ గుశలాజశమీదళమిశ్రము లగుదివ్యసలిలముల నభిషేకించునెడ నంబుదావరణంబుఁ బాసినచంద్రబింబంబు విడంబించునీమొగంబును ధన్యాత్ములు చూడఁగల రని పలు దెఱంగులఁ బలవించుచుండ రాఘవుండు సంభ్రమావసరంబులందును సంభ్రమింపనిధీరోదాత్తుండు గావునఁ దాఁ జలింపక యనుజుం జూచి వత్సా, నే నుండఁగ నీకు వ్యసన మేల? ఈదుష్టరాక్షసునిదక్షిణభుజము నీవు నఱుకు మిదె నేను వామభుజము నఱికెద నని చెప్పుచు ఖడ్గ మెత్తి రయమున వానివామభుజము నఱికె. అన్నమాటమెయి సౌమిత్రి యారాక్షసుదక్షిణభుజముఁ ద్రెవ్వ నఱికె యంత నిలువక పార్శ్వమునం దన్నుటయు నాకబంధుఁడు విగతప్రాణుండై నేలం బడియె. పడుటయుం దోడనవానిశరీరమునుండి యొక్కదివ్యపురుషుండు సూర్యతేజుఁడు వెడలివచ్చి దివంబునకుఁ జనుచుండ రాఘవుఁ డతనిం బిలిచి యయ్యా, నీ వెవ్వండవు? నాకుంజూడ నీచర్య యెంతయు నద్భుతం బయ్యెడి. ఇది మాయకానోపునే యనియడుగ నతండు రామున కిట్లనియె. రఘునందనా, నేను విశ్వావసుఁ డను గంధర్వుఁడను. బ్రాహ్మణశాపంబునం జేసి రాక్షసయోనిం జనించి నీవలన శాపంబుఁ బాసి కృతార్థుండ నైతి. నీదేవి యగుసీతను లంకేశ్వరుఁ డగురావణాసురుఁ డపహరించికొనిపోయె. ఈచెంగట ఋష్యమూకగిరిచేరువఁ బంపానామకంబ యినసరోవరంబు హంసకారండవాదిసంచారసంచలద్వికచజలజపరాగపాళీపరీత మధురతరసలిలపరిపూరితభాసురంబై నయది యున్నది. తత్తీరమున వాలితమ్ముఁ డగుసుగ్రీవుఁ డనువానరేశ్వరుండు తనభార్యను వాలి యపహరించికొనిపోవఁగ నతని నిగ్రహింపనేరక నీయట్లు వనటలపాలై నలువురుప్రెగ్గడలతోడ నున్నవాఁడు. వానిం జూచి దుఃఖమూల మంతయు నివేదించిన నతండు నీతోఁ జెలిమి చేసి సహాయముఁ జేయు. జానకిం జూడఁగలవు. ఆసుగ్రీవుఁడు రావణుఁడున్నగువారినెల్ల నెఱుంగు. నాచెప్పినట్లు చేయుము. తెలిసినంతయుఁ జెప్పితి ననివచిం

చి విశ్వావసుఁ డదృశ్యుఁ డయ్యె. అంత రామలక్ష్మణు లందుల కెంతయు నబ్బురం బందుచు నచ్చోటు వాసి కొంత నడిచి ముందటఁ గమలకల్హారకువలయకుసుమ కోరకవిలసితంబై నదాని, సర్వజనమనోరమంబై నదానిఁ, బంపాసరోవరంబుఁ జేర నరిగిరి. అపు డాసరోవరశిశిరశీకరములఁ దమ్మిపుప్పొడులతోడం దెచ్చుచు మెల్లమెల్లన మలయుమలయపవమానబాలునునుపీవనల మిగుల సొగిసి రామచంద్రుండు డెందమునఁ బ్రియసుందరిం దలంచి మదనశరవేదనావివశహృదయుండై యుండ సౌమిత్రి యిట్లనియె:-అన్నా, వృద్ధసేవి యగునాత్మవంతుఁ డాధులకుంబోలె నీయట్టిమహాత్ముఁడు నిట్టివికారములకు గోచరుఁడుగాఁ దగునే? రావణుఁడు నై దేహి నెత్తికొనిపోయె నని వార్త తెలియవచ్చెఁ గదా. ఇఁకఁ బౌరుషమును బుద్ధిబలమునుం జూపి దేవిని సాధింపఁగ నుపాయంబుఁ జూడవలయుఁగాని యిట్లు విషాదంబుఁ జెందవచ్చునే? ఋష్యమూకమునకుఁ జని సుగ్రీవుం జూతము. నీకు శిష్యుఁడు, భృత్యుఁడు, సహాయుఁడు నగునే నుండఁగ నూఱడిల్లు మనినివేదించిన నాకర్ణించి రామభద్రుండు ధైర్యముఁ బూని ప్రకృతిస్థుండై కర్తవ్యచింతాపరత్వమున మనస్సు నొకతెఱంగున నిల్పికొనియె. పదంపడి వా రిరువురు నాసరోవరమునఁ గృతస్నానులై దేవఋషిపితృతర్పణంబు లొనరించి తజ్జలములఁ ద్రావి యట నవిరళకుసుమఫలభరనమ్రకమ్రామ్రప్రముఖమహీరుహనివహపరీతం బై నఋష్యమూకపర్వతంబుఁ జేరంజని యాగిరిశిఖరమునఁ గూర్చున్నయేవురువానరులం గనుంగొని విశ్వావసుఁడు చెప్పినవారు వీరు కాఁబోలు నని తమలో నరయుచున్నంత సుగ్రీవుఁడు వారివృత్తాంత మెఱింగిరాఁగ హిమవతునిచందమున ధృతిమంతుఁడు బుద్ధిమంతుఁడు నీతిమంతుఁడు నగుహనుమంతుం బనిచె.

## రాముఁడు సుగ్రీవునితో సఖ్యముఁ జేయుట.

హనుమంతుఁడును రామలక్ష్మణులయొద్ద కేతెంచి తద్వృత్తాంత మంతయు నడిగి తెలిసికొని తమయుదంతంబుఁ దెలియఁ జెప్పి వారల సుగ్రీవునొద్దకుఁ దోడ్కొని చనియె సుగ్రీవుఁడును రామునితోడఁ జెలిమిఁ జేసి సీత రావణాపహృతయైపోవునపుడు పైఁటచెఱఁగునఁ గట్టి తమముందటఁ బడనేసినతొడవులముడియఁ దెప్పించి విప్పి చూపుటయు రాఘవుఁ డయ్యాభరణంబులఁ జూచి సుగ్రీవునిపై మఱింతయెక్కువనమ్మిక నునిచి యతని వానరరాజ్యమునఁ బట్టాభిక్తుం జేసి వాలిం జంపుదు నని ప్రతిజ్ఞ చేసె. సుగ్రీవుఁడును జానకిపోఁబడిఁ దెలిసి మగుడఁ దెత్తు నని ప్రతినఁ బూనె. అవ్విధమున వారిరువురు పరస్పరప్రతిజ్ఞ లొనరించి యుద్ధకాంక్షఁ గదురఁ గిష్కింధ కరిగిరి. అంత సుగ్రీవుఁడు పురద్వారమున నిల్చి రోదసీకుహరం బవియఁగఁ బెలుచ నార్చిన వాలి యయ్యార్పు విని సైఁపక పోరు సేయం దొడంగి వచ్చుచుండఁ దార మెల్లన వాలిం జేర వచ్చి

వానరేశ్వరా, సుగ్రీవుఁ డిపుడు మునుపటివాఁడుగా నాకుఁ దోఁపదు. మఱి బలవత్సహాయుఁడై మార్కొనవచ్చినవాఁడు. కాదేని యిన్నినాళ్లు నీ కోడి కొండలో నున్నవాఁడు నేఁ డేల పోరాడ వచ్చు? కావున నీవు చనవల దని నిషేధించె. నిషేధించుటయు వాలి తారం బిలిచి నీవు సర్వభూతరుతవేదినివి గావున నడిగెద. సుగ్రీవుఁ డిపు డేబలవంతుని దోడుచేసికొని వచ్చె? వివరించి చెప్పు మని యడుగఁ దార ముహూర్తమాత్రంబు చింతించి వాని కిట్లనియె. వానరేశ్వరా, విన్నవించెద నవహితుండవై యాకర్ణింపుము. దశరథరాజనందనుఁడై నరాముఁడు రావణాపహృతకళత్రుండై యద్దేవిని వెదకుచుఁ దిరుగువాఁ డాకస్మికంబుగఁ దన యట్టివాఁ డగుసుగ్రీవునకుఁ జెలికాఁ డయ్యె. అతఁడు లోకమునం గలవిలుకాండ్రలోనెల్ల మేటిమగండు. అతనితమ్ముఁ డగులక్ష్మణుఁడును మహావీరుఁడు మేధావి. కార్యార్థముల సాధించునెడ మిగుల నేర్పరి. మఱియు మైందద్వివిదులును, హనుమంతుఁడును, జాంబవంతుఁడును సుగ్రీవునకుఁ గూర్పుఁ బెగడలనియు, మహాత్ములనియు, మహాబలులనియు, బుద్ధిమంతులనియు నీవు నెఱుంగుదువుగదా. అంతయుం బరికించిచూచిన నీ విపుడు పోరితమునకుఁ దొడరకునికియే లగ్గని నాకుఁ దోఁచెడి నని విన్నవించినఁ దారమాటలెల్ల సుగ్రీవునందలికామచేష్టితంబు లని భావించి దాని శంకించి కొన్నిప్రల్లదంబులు పలికి గుహాముఖము వెడలివచ్చి మాల్యవత్పర్వతంబుచేరువ నున్నసుగ్రీవుం గనుంగొని యిట్లనియె. తొల్లి నీ వెన్నియేమాఱులు నాతోడం బెనంగి ప్రాణముల కాసపడి యోడి పాఱినవాఁడవుగదా. ఇపు డెట్లు సిగ్గుమాలి మఱలవచ్చితి. చావఁగ నిపు డేలయింత త్వరగలిగె ననియడుగ సుగ్రీవుండు రామునివిక్రమంబు గూఢముగఁ దెలుపురీతి దోఁప నయ్యా, భార్యను రాజ్యమునుంగోల్పడిననే నింకనుం బ్రదుక నేల యని జీవితాశ విడిచి వచ్చితి నని సాభిప్రాయంబుగాఁ గాలోచితంబు చెడకుండఁగ మాఱుచెప్పె.

## వాలిసుగ్రీవులయుద్ధము.

వాలిసుగ్రీవు లావిధమున నొండొరుల నాక్షేపించిపలికి మల్లయుద్ధచాతుర్యము మెఱయఁ బోరాడం దొడంగి యొండొరులఁ జేతులఁ జఱచుచు, నొకళ్లొకళ్లఁ గ్రిందఁ ద్రోయుచుఁ,బరస్పరంబు పిడికిళ్లం బొడుచుచుఁ, జిత్రప్రకారములఁ జరించుచు, గోళ్లం గీఱుచుఁ,బండ్లఁ గొఱుకుచుఁ బెద్దయుం బ్రొద్దు పోరాడి రక్తసంసిక్తగాత్రులై పూచినమోదుగులచందమున నొప్పుచుండ రాఘవుండు వారిలో నించుకేనియుఁ బరస్పరభేదము నెఱుంగనేరక బాణ మేయక యూరకుండె. దాని నెఱింగి హనుమంతుఁడు పూదండ నొక్కదాని సుగ్రీవునఱుతం దగిలించి సన్నఁ జేసిన మేఘమాలావిలసితం బైనమలయంబురీతిఁ గుసుమమాలావిలసితుం

డయినవాని సుగ్రీవుఁగా నెఱింగి వజ్రఘోషంబుమాడ్కి ఁ డంకారనినదంబు క్రొం డలఁబలిధ్వనుల నీనఁగ గొనయమ్ము సారించి బాణం బరివ్రాసి వాలిపై నేసె. రాఘవబాణప్రహారంబున భిన్నహృదయుండై వాలి నోట నెత్తురు గ్రక్కి కన్నె దుట నున్నరాముని సౌమిత్రిసమేతుం గనుంగొని యితరునితోడఁ బోరాడు వాని మఱుఁగునఁ జంపితివిగదా యని తూలనాడి మూర్ఛితుండై విగతజీవితుం డయ్యె. తారయు రాముం దూఱి యట వివేకంబుఁ దెచ్చికొని యుపశమిల్లె. అట్లు వాలి రామబాణహతుం డగుటయు సుగ్రీవుఁడు కిష్కింధారాజ్యమును దార నుం దొల్లింటియ ట్లధిగమించె. గ్రీష్మవర్షావసరములు నాలుగునెలలు గడచనిన పిదప సీతాన్వేషణము సేయవచ్చు నని సుగ్రీవుఁడు వచింపఁగ రాముఁడు వల్లె యని లక్ష్మణునితోడ మాల్యవంతమ్మున నామాసచతుష్టయంబు వసించియుండె.

అక్కడ రావణాసురుఁడు నందనోపమం బైనయశోకవనమున సీతాదేవి నునిచి తద్రక్షణార్థంబు ప్రాసఖడ్గశూలపరశుపరిఘాద్యాయుధధారిణు లయినరాక్ష సస్త్రీలనియమించె. వారు నేకాక్షి, ద్వ్యక్షి, త్ర్యక్షి, లలాటాక్షి, దీర్ఘజిహ్వ, యజి హ్విక, త్రిస్తని, యేకపాద, యేకలోచన మున్నగువారు రేలుంబవల్లు నెడఁబా యక యద్దేవిచుట్టుం గూర్చుండి “ఓజానకీ, రాక్షసేంద్రుఁ డగురావణునకు భార్యవుగావేని నినుఁ దిలప్రమాణముగ ఖండింతుము. నీమాంసముఁ గబళిం తుము. నీరక్తముఁ ద్రావుదుము. మారాజు నవమానించిననీకు బ్రదు కెక్కడిది” యని పలుదెఱంగుల బెదరించుచుండఁ బతివియోగశోకావేగవిహ్వల యగు జానకి పెద్దయుంబ్రొద్దు నిట్టూర్పు విడిచి వారల నందఱం గలయం గనుంగొని యోయమ్మలారా, మీరు మీయిచ్చవచ్చినట్లు నన్నుఁ దినుఁడు. నాకుఁ బ్రాణ ములపై నాస లేదు. సకలసుగుణసాంద్రుఁ డైనరామచంద్రుఁడుదక్కఁ దక్కటి వాని నెవ్వనేనియు నేను మనస్సుననైనం దలంపను. మఱి యమ్మహాత్మునితోడి సమాగమము గలుగదేని యాహారము వర్జించి శరీరము శోషింపఁ జేయుదానను. ఇదియ నానిశ్చయంబు. మీకుఁ బోలినభంగిఁ జేయుఁ డనిచెప్పిన విని యారా క్షసస్త్రీలు తత్ప్రకారంబు రావణున కెఱింగింప నరిగిరి.

## త్రిజట తనస్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట.

అంతఁ బ్రియవాదిని ధర్మజ్ఞయు నగుత్రిజట యనురాక్షసి జనకరాజతన యం జేర వచ్చి వైదేహీ, భయము విడిచి యించుక నమ్మికమై నామాట వినుము. వృద్ధుఁడు మేధావియు నగునవింధ్యుఁ డనురాక్షసవర్యుఁ డెల్లపుడు రాము నిహితంబుఁ గోరువాఁడు తనమాటగా ని న్నూరార్చి యిట్లని చెప్పఁగ నన్నుఁ బనిచె. నీపతి యగు శ్రీరాముఁడు లక్ష్మణునితోడఁ గుశల మున్నవాఁడు. ఇంద్ర తుల్యుఁ డయినసుగ్రీవుఁ డనువానరరాజుతోడ నతండు నిన్ను వెదకి తేరఁ జెలిమి

చేసి యుత్సహించినవాఁడు. తొల్లి యీరావణుఁడు నలకూబరునకుఁ బ్రేయసి యైనరంభను గ్రహింపఁ బోయి యతనిశాపంబుఁ బొందె. దానంజేసి యీదు రాత్ముఁ డకామ యగుతరుణిం బొందఁ జాలఁడు. కావున లోకగర్హితుం డైన రావణునివలనివెఱపు విడువుము. సౌమిత్రిసహితుం డైనశ్రీరాముఁడు శీఘ్రంబ కపిసేనాపరివృతసుగ్రీవరక్షితుండై వచ్చియీదుష్టులఁ బరిమార్చి నిన్నుఁ దోడ్కొ నిపోవువాఁడు. మఱియు నే నీదురాత్ములకుఁ జేటు వాటిల్లునట్టి కలఁ గంటి. అకా రణంబ యందఱకుం గీడు రోయుచు నెల్లపుడుం దేవతలతోడ స్పర్ధ సేయునీపా పాత్ముఁడు కాలోపహతచేతనుండై గాడిదలఁ బూన్చినతే రెక్కి నృత్యము సేయు చు దక్షిణాభిముఖుండై చనుచుండె. కుంభకర్ణాదులగుతదీయులును రక్తగంధ మాల్యధారులై వెంట్రుకలముడి జాఱ విడిచి విరియఁ బోసికొని యతనితోడన యామ్యదిశ కరుగుచుండిరి. విభీషణుఁ డొక్కరుఁడు దెల్లపాగఁ గట్టి తెల్లగం ధముఁ బూసి తెల్లనిదండలఁ దాలిచి శ్వేతపర్వతారూఢుండై శ్వేతాతపత్రంబు మీఁద వెలయ వెలుంగుచుండె. అతనిమంత్రులు నలువురు నతినియట్లె శ్వేతప ర్వతశిఖరారూఢులై యుండిరి. శ్రీరామునిశస్త్రాస్త్రనికరంబు భూమండలంబున నెచ్చటం జూచిన నిబిడంబై యుండె. లక్ష్మణుఁడు సంగరాంగణంబునం బొలిసిన రాక్షసులయస్థిసంచయముపై నెక్కి పాయసం బాస్వాదించుచుండె. నీవును రుధి రసిక్తాంగివయ్యు నప్పురుషశార్దూలుచే సురక్షితవై లక్ష్మణసమన్వితుం డైనయమ్మ హాత్మునితోడ విమాన మారోహించి యుత్తరమునకుఁ బోవుచుంటివి. ఇట్లు నేఁ గలలో నంతయుం జూచితి. కావున నీవు వేగంబ లక్ష్మణానుగతుఁ డైనరామభ ద్రునితోడం గలిసి ముదంబునం బొదలుదు వనిచెప్పిన నమృతసేచనంబు లైన త్రిజటవచనముల నాకర్ణించి జానకి పతిసమాగమంబున నాశావతియై యుండె.

## సీ తా రా వ ణ సం వా ద ము.

అట రాక్షసాంగనలు సీతావృత్తాంతముఁ జెప్పఁగ విని రావణుఁ డద్దేవిం దలంచుకొని దేవదానవగంధర్వయక్షాదివీరుల గెలిచియు మనసిజుం గెలువనేరక తదీయశరపీడితుండై దివ్యాంబరములఁ గట్టి వివిధభూషణముల నలంకరించికొని కల్పవృక్షముచందంబున నొప్పియుం దనయలంకారంబెల్ల శ్మశానవృక్షాలంకారం బుమాడ్కి భీకరంబుగాఁగ రోహిణిం జేరవచ్చుశనైశ్చరునికరణిఁ బతివియోగవి షాదంబునంజేసి మాసినచీరఁ గట్టి శిరోరత్నమాత్రంబుఁ దాల్చి యత్యంతదై న్యంబు గదుర నయ్యశోకవ్యనాంతరమందు శిలాతలమున రాక్షసాంగనలనడుమఁ గూర్చుండి గుంపుఁ బాసినలేడికైవడి భయభ్రాంతయై యున్నసీతాదేవిం జేరవ చ్చి యిట్లనియె. జానకీ, పతిపై ననుగ్రహ మింత చాలు. ఇఁక నాపయిం బ్రసా దంబుఁ జూపి యిచ్చకు వచ్చినమేలితోడవులఁ దొడిగి నన్నుఁ బొందుము. సుర

సుందరులు, గంధర్వ సీమంతినులు, దానవభామినులు, దైత్యవనితలును నన్నుఁ గొల్తురు. మఱియుఁ బదునాలుగుకోట్లపిశాచులు, నిరువదియెనిమిదికోట్లరాక్షసులు, నేనుబదినాలుగుకోట్లయక్షులును నాయానతిమెయి నడతురు. కొందఱే ధనాధినాథుం గొలుతురు. గంధర్వాప్సరోగణంబులు కుబేరునట్లు నన్ను నెల్లపుడుం గొల్తురు. బ్రహ్మసమానుఁ డైనవిశ్రవసుఁ డనుమునికుమారుఁడను. పంచమలోకపాలుఁ డని నన్నందఱుం బేర్కొందురు. దివ్యము లగుభక్ష్యభోజ్యపేయాది ద్రవ్యంబులు సురేంద్రసదనమున నున్నయట్లస్మదీయసదనంబునందు నవిచ్ఛిన్నంబులై యుండు. కావున నీవు వనవాసకృతం బైనదుష్కృతంబుఁ దొఱంగి మందోదరిచందమున నాకుఁ బ్రియాంగనవై యీలోకములను నాజీవితంబును నేలికొని సుఖింపు మని చెప్పిన నారాక్షసాధము నురాలాపముల విని జానకి క్రోధసంరక్తలోచనయై మొగంబు ద్రిప్పికొని వానిదెసం జూడక యొకతృణ మడ్డము గ నుంచికొని లోకోత్తరసౌందర్యవిశేషంబునం జేసి సంయుతాపతితంబు లైన కుచములం గన్నీరు జాలువాఱుచుండఁగ నిట్లనియె. రాక్షసేశ్వరా, నాదౌర్భాగ్యమునం జేసి నీవు పలుకరానిపలుకులు పలుమాఱులు పలుకుచుండ వినవలసె. నామనంబు రామచంద్రుం దక్క నొరులఁ దలంపదు. నీచిత్తంబు మఱలించికొనుము. అలభ్యయుఁ బతివ్రతయు నగుపరభార్యం గోరవచ్చునే? మనుష్యాంగనయైనయేను భార్యయయిన నీకుఁ బ్రయోజనం బెయ్యది? మఱియుఁ గామింపని భామినిం గామించిన నది యెంతసుఖంబో నీవే పరికింపుము. వెండియు నీవు బ్రహ్మసమానుఁ డైనవిశ్రవసునికుమారుఁడ ననియుఁ, బంచమలోకపాలుఁడ ననియు, మహేశ్వరసఖుం డై రాజరాజనం బేరుఁ గాంచినధనాధిపతికిఁ దమ్ముఁడ ననియుం జెప్పికొంటివిగదా. అంతటినీకు నన్నుఁ గామింపఁ దగునే? ధర్మ మెక్కింతయేనియుం బరికింపవలదే? సిగ్గొకించుకయేనియు లేదే యని పలుకుచు భయాతిశయకంపితపయోధరయై దీర్ఘవేణి వ్యాళిచాడ్పున వ్రేలుచుండ వివశయై పైఁటచెఱఁగున మొగముఁ గప్పికొని పెలుచ నేడ్చె. రావణుఁ డానిష్ఠురవచనముల విని ప్రత్యాఖ్యాతుండయ్యు నంత నిలువక దుర్బుద్ధిం జేసి యోసీతా, యేమి చేయుదు. మదనుఁ డదయుఁడై మేనెల్ల నేఁచుచున్నవాఁడు. నీవు కామింపకున్న నిన్నుఁ బొందరాదు. కామము నిలుపరాదు. మాకాహారభూతుం డగుమనుష్యమాత్రుం డైనరామునిపైఁ గూరిమి విడువ నీకు మనసు రాదని కొన్నిపలుకులు పలికి యదృశ్యుం డయ్యె. వైదేహియు రాక్షసీగణపరివృతయై శోకకర్శితయై త్రిజటాసేవితయై యవ్వనమున వసించియుండె.

ఇక్కడ రాఘవుఁడు సౌమిత్రితోడ మాల్యవత్పర్వతంబున సుగ్రీవుననుమతిని వాననాళ్లెల్ల వసించి యట శరదాగమంబున వెన్నెలనాళుల నిశాసమ

యంబున విరహిజనదుస్సహం బైనసాంద్రచంద్రాతపంబును కుముదకువలయ పరిమళభరభరితపరాగపరివాహిప్రభాతపవనవీజనంబును జానకీవియోగవిషాదం బున కుద్దీపకంబు లగుటయుఁ దమ్ముని బిలిచి లక్ష్మణా, సుగ్రీవుఁడు జానకిం దెత్తు నని మనకు బాస యిచ్చి తనపని దీఱినపిదప గ్రామ్యధర్మపరత్వంబునఁ బ్రమ త్తుఁడై యున్నవాఁడు. స్వార్థపరుం డైనయాతని నే నెఱుంగక కపిరాజ్యమునఁ బట్టాభిషిక్తుం జేసితి. వానికొఱకుఁగదా నేను వాలిం జపితి. వాలి సచ్చుటంగాదె వాఁడు వానరనాయకుఁ డయ్యె. అవియన్నియు మఱచినవానికంటె వేఱొక్క కృ తఘ్నుఁ డుండునే? కావున నీవు కిష్కింధకుఁ జని యావానరుఁడు సీతాన్వేషణప్ర యత్న మింతకుఁ బూనకుండెనేని సంకోచింపక వాని వాలితెరువునం బంపునది. మనపనిం బూనియుండెనేని తోడన యిటకుఁ దోడితెచ్చునది. ఆలసింప వల దని పనిచె పనుచుటయు లక్ష్మణుఁ డన్నమాటం దలఁ దాలిచి విల్లమ్ములం గొని కిష్కింధాద్వారమున కరిగి లోకభీకరముగ ధనుష్టంకారముఁ గావించినం గపివ రుండు సౌమిత్రికోపం బెఱింగి సదారుండై యతనియొద్ద కేతెంచి సవినయ ముగఁ బూజ లొనరించినం గ్రహించి లక్ష్మణుండు రామువచనంబుఁ దేటపడం జెప్పిన విని సుగ్రీవుండు కృతాంజలియై యిట్లనియె. లక్ష్మణా, రఘువర్యుఁ డట్లు దలంపనేల? నేను గృతఘ్నుఁడఁ గాను నిర్దయుఁడనుం గాను. సీతను వెదకిరాఁగ వానరవీరుల నలుదెసల నింతకుమున్న పనిచినవాఁడ. వారు భూమండలంబెల్లఁ గలయఁ దిరిగి వెదకి వచ్చుటకుఁగా నొకనెల యవధి యిచ్చితి. అందిపు డిరువ దేనునాళ్లు గడచె. ఇఁక నైదునాళ్లు గలవు. వా రందఱు సనుదెంచినంతన సీతా వృత్తాంతమెల్ల వివరింప రాఘవుసన్నిధానమునకు రానున్నవాఁడ. ఇయ్యది నానిశ్చయం బనివచించిన విని లక్ష్మణుండు సుప్రీతుండై యతనిం గారవించి రాము సన్నిధికిం దోడ్కొనియరిగి యంతయు నివేదించుటయు రఘూద్వహుండు సంతు ష్టుండై సీతావృత్తాంత మెఱుంగ వేచియుండె. అంత దక్షిణేతరదిక్కులకుఁ బో యినవానరు లందఱు వచ్చి మేము గలచోట్లెల్ల వెదకివచ్చితిమి. జానకి యెయ్యె డనుం గానరా దని విన్నవించిరి. దక్షిణదిక్కునకుఁ జనినవారు సీతావృత్తాంత మెఱిఁగి వత్తు రనునమ్మికం జేసి రాఘవుఁ డొకతెఱంగున మేనఁ బ్రాణముల నిల్పి కొనియుండె. అంత మఱియొకనెల గడచుటయు నుద్యానపాలకుఁడు సుగ్రీవు నొద్దకు వచ్చి దేవా, వాలినాఁటఁగోలె సురక్షితంబై యత్యంతరమణీయంబని పేరు గాంచినమధువనం బనునీయుద్యానవనమును హనుమదంగదాదు లగువాన రులు సొచ్చి భయ మింతయేనియు విడిచి యమ్మెల్ల నుల్లంఘించి ఫలములఁ దేనెల నాస్వాదించుచున్నవారు. ఎంతవారించినను వినరు. తగినదండము విధింపు మని నివేదించిన విని సుగ్రీవుఁడు తనమనంబునం గొంతవడి చింతించి దక్షిణదిశకుఁ

జనిన హనుమదాదులు సీతావృత్తాంత మెఱిఁగి వచ్చినవారు. ఇదికృతకృత్యుల చేష్టితంబ యని తలంచి యయ్యుదంతము శ్రీరామునకు విన్నవించె. రాముఁడు నాయర్థము భావించియుండె.

### హనుమంతుఁడు సీతను జూచినవృత్తాంతము రామునితోఁ జెప్పుట.

అంతఁ గొంతవడికి హనుమదాదులు లక్ష్మణసుగ్రీవసమేతుం డైనశ్రీరామునన్నిధికిఁ జనుదెంచిరి. వారిముఖవికాసం బుపలక్షించి రాఘవుండు నిక్కంబ వీరు సీతం గాంచి వచ్చినవారే యని తలంచి యువ్విళ్లూరుమనముతోడ నడుగఁ దమకించునెడ వా రందఱును రాఘవునకు మ్రొక్కిరి. అపుడు రాముఁ డన్నలారా, నన్ను బ్రదికింతురే? మీరు కృతకృత్యులరై వచ్చితిరే? మఱల నాచే నయోధ్యయందు రాజ్యంబుఁ జేయింతురే? సమరమున శత్రుల జయించి సీతను దేకున్న నే బ్రదుకనేర నని పలికిన విని హనుమంతుఁడు రాఘవు మొగమునం జూడ్కి నిలిపి దేవా, చూచితిని జానకిని నే నని ప్రియముగఁ బ్రత్యుత్తర మొసంగి సవిస్తరముగ వెండియు నిట్లనియె. దేవా, మేము దక్షిణదిక్కునం గలకొండ లడవులు మున్నగునెల్లచోట్ల వెదకి బడలి యొక్కనాఁ డొక్కమహాగుహను బహుయోజనాయతంబైనదాని, నిరంతరాంధకారనీరంధ్రంబైనదాని, వివిధకీటనిబిడంబైనదానిం జొచ్చి పెద్దయుద వ్వరిగి యచట సూర్యప్రభాప్రచారంబు కలిమిం జేసియొకదివ్యభవనంబుఁ గనుంగొంటిమి. విచారింప నాభవనంబు మయుఁ డనుదానవునిమనికియఁట. అందుఁ బ్రభావతి యనం బరఁగునొకతాపసి దివ్యభోజ్యపేయాదుల నిచ్చి యాతిథ్య మొనరించుటయు మే మవియెల్ల భుజియించి సేద దేఱి లబ్ధబలులమై యాతాపసి చెప్పినత్రోవన దాని వెడలి సముద్రసమీపమున సహ్యమలయదర్దురపర్వతంబులం గాంచి మలయగిరి నెక్కి యనేకశతయోజనవిస్తీర్ణంబు, తిమితిమింగిలమకరాదిసంచారభీషణంబు, సముత్తుంగాభంగురతరాభ్రంకషతరంగమాలికాసంపాతసాంద్రంబు నగుసముద్రంబుఁ గనుంగొని దీని దాఁటు టెట్లు? సీతం గాంచు టెట్లు? కాంచక మగిడి పోవు టెట్లు? కావున ననశనవ్రతంబున శరీరముల విడుచుటయ యిప్పటికిఁ గర్తవ్యం బనినిశ్చయించి చింతాక్రాంతచిత్తులమై ప్రాయోపవేశంబుఁ జేసి శ్రీరాముకార్యమునకుఁ గా మేను దొఱంగినజటాయువు కృతార్థుఁ డయ్యె నని యాగృధ్రరాజుకథం జెప్పుచుంటిమి. అయ్యవసరంబునఁ బర్వతశిఖరాకారం బైనఘోరరూపము గలిగి సకలభీకరుండై యపరగరుడుఁడునాఁ దనరుపక్షి యొక్కండు మమ్ముఁ దినఁ దలంచి డాయ వచ్చి యెవ్వరు మీరు? జటాయువుకథం జెప్పుచున్నారు. నేను వానికి జ్యేష్ఠభ్రాతను. సంపాతినాముఁడను. తొల్లి నేను నతండును బరస్పరస్పర్ధం జేసి సూర్యసన్నిధి కరుగుచుండ ఱెక్కలు గమరి నే నీకొండపైఁ బడితి. వానిఱెక్కలు గమరవయ్యె. వానిపు

త్తాంత మెల్ల మీ రెఱుంగుదు రేని చెప్పుఁ డనియడిగిన మేము భవద్వనవాసంబును, సీతను రావణుఁ డపహరించికొనిపోవుటయు, వాని నడ్డగింపఁ బోయి జటాయువు వానిచే మడియుటయు, మేము సీతాన్వేషణార్థంబు వెడలి వచ్చి యద్దేవిం గానక ప్రాయోపవేశంబుఁ జేయ నిశ్చయించుటయుం దేటపడం జెప్పిన నతండు జటాయువుచావునకుఁ బెద్దయుఁబ్రొద్దు వనరి మాప్రాయోపవేశ నిశ్చయం బపనయించువాఁడై మమ్మూరార్చి యిట్లనియె. అయ్యా, రావణు నే నెఱుంగుదు. లంక యనుపురము వానికి రాజధాని. అయ్యది సముద్రంబావలి గట్టునఁ ద్రికూటపర్వతంబునం దున్నయది. అందు నిక్కంబ జానకి యుండునది. మీ రచటికిఁ జని యద్దేవి నరయుఁ డనిచెప్పిన మేము సాగరంబు దాఁటఁగ మంతనముఁ జేయుచుండ నెక్కండు నందుల కొడంబడ డయ్యె. అంత నేను సాహసించి తండ్రి యగువాయుదేవు నావేశించి జలరాక్షసి మొదలగువిఘ్నముల నీఁగి శతయోజనవిస్తీర్ణం బయినసముద్రంబు దాఁటి లంకాపురిం జొచ్చి యందు రావణాంతఃపురంబున నుపవాసకృశయు, జటాధారిణియు, మలపంకదూషితశరీరయు, భవద్దర్శనకుతూహలాయత్తచిత్తయు నగుసీతం గనుంగొని నిమిత్తవిశేషముల నద్దేవిని సాభిజ్ఞానంబుగా నెఱింగి యేకాంతమున డాయం బోయి యిట్లంటి. దేవీ, నేను శ్రీరామదూతను మారుతాత్మజుఁడను హనుమంతుఁ డనఁ బరఁగువాఁడను. రామునానతి నిన్ను వెదకఁగ సాగరంబు దాఁటివచ్చితి. రామలక్ష్మణులు కుశలమున్నవారు. సర్వవానరనాయకుం డై నసుగ్రీవుఁడు వారికిఁ జెలిమై నిన్ను వెదకఁగ మమ్ము నియమించె. రామలక్ష్మణసుగ్రీవులు నీకుశలం బడిగిరి. శ్రీరాముఁడు కపిసేనతోడ నచిరంబ యేతెంచి నిన్నుఁదోడ్కొని పోవ నున్నవాఁడు. నాయెడ సందియంబు వలదు. నేను రాక్షసుఁడఁ గా నని చెప్పిన విని జానకి ముహూర్తమాత్రంబు చింతించి నా కిట్లనియె అయ్యా, వృద్ధసమ్మతుఁ డై నయవింధ్యుఁ డను రాక్షసుఁడు మున్న నాకు రామసుగ్రీవసఖ్యముఁ దెల్పినవాఁడు కావున నిన్ను హనుమంతుఁగా నమ్మెద. శ్రీరామసన్నిధికిఁ జని నావృత్తాంతమెల్ల వివరింపు మని చెప్పి నే నద్దేవిం జూచినందుల కభిజ్ఞానార్థంబుగాఁ దనశిరోరత్నము నొసంగె. మఱియుఁ జిత్రకూటపర్వతమునఁ గృత్రిమకాకం బై నదేవేంద్రసుతుపై నలిగి నీవు తృణ మభిమంత్రించి యేసితి వనికథం జెప్పె. నేను నట నద్దేవియనుజ్ఞఁ గొని తఱలి లంకఁ గాల్చి రాక్షసులకుఁ జిక్కినట్లుగ భావించి రావణునొద్దకుఁ బోయి భవత్పరాక్రమం బుగ్గడించి వచ్చితి నని విన్నవించి సీతాదేవి యిచ్చిన శిరోరత్నంబు రామముందటం బెట్టిన నారఘూద్వహుఁ డమ్మణిం జూచి ప్రాణవల్లభం గాంచినంత సంతసంబునం బొదలె.

నానాదేశములనుండి వానరులు సుగ్రీవునొద్దకు వచ్చుట.

అట్లు రాఘవుండు సీతావృత్తాంతము విని సుగ్రీవుం జూచి యిఁక సేన నాయితపఱుపు మనిన సుగ్రీవుఁ డందఱకు రామాజ్ఞం దెలిపె. అంత వాలిశ్వశురుం డైన సుషేణుఁడు కోటిసహస్రకపిపరివృతుండై వచ్చె. గయగవయులు ప్రత్యేకంబ కోటిశతపరివృతులై వచ్చిరి. గవాక్షుఁ డఱువదివేలకోట్లసైన్యముతోడఁ జనుదెంచె. పనసుఁ డేఁబదిరెండుకోట్లసేనతోడ వచ్చె. దధిముఖుం డనువృద్ధవానరుఁడు బహుసహస్రసైన్యముతోడ నేతెంచె. జాంబవంతుఁడు నీలగాత్రంబులు పాండురవదనంబులు నగునేకకోటి శతసహస్రభల్లూకసైన్యములతోడ వచ్చె. ఇట్లు వచ్చి నానారూపవర్ణయుతవానరగోలాంగూలసైన్యము మహాదధిచందమునఁ బిచ్చలించి యచ్చట విచ్చలవిడి నెగురుచు దుముకుచుఁ బొంసుపటలంబు రేఁచుచు నవ్వనమున విహరించుచుండిరి. అంతం బ్రశస్తనక్షత్రాదిసమంచితం బైనశుభదినంబునందు సుముహూర్తమున శ్రీరామలక్ష్మణులు సకలసాధనముల గ్రహించి కపివీరపరివృతులై గ్రహపరివృతు లైనసూర్యచంద్రులచాడ్పున వెలుంగుచుఁ గపిసైన్యంబు లోకములనెల్లఁ ద్రిప్పుకరణి వీర్యఘూర్ణమానంబై కొలువఁగ రావణునిపై దండయాత్ర వెడలె. ఆసేనకు హనుమంతుఁడు ముఖంబునం బొలిచె. నళనీలాంగదమైందద్వివిదాదులు చుట్లం గావలియై నడచిరి. అట్లు తఱలి యావానరసైన్యంబు ప్రభూతఫలజలబహుళంబు లైనరమణీయప్రదేశంబుల విడియుచు దక్షిణసముద్రతీరంబు సేరి రెండవసముద్రంబునాఁగ ఘూర్ణిల్లుచుండె. అట రాఘవుఁడు వానరవీరు లందఱు వినుచుండ సుగ్రీవుం బిలిచి వానరాధిపా, మనసైన్యంబు చూడ నత్యంతబహుళంబు. సాగరం బతిదుస్తరంబు. సేన దీని దాఁటఁగ నుపాయ మెయ్యదియో యనియడుగఁ గొందఱు సముద్రంబు దాఁటి పోవచ్చు ననిరి. మఱికొందఱు తెప్పల దాఁటవచ్చు ననిరి. వెండియుం గొందఱు పదిలము లైననోడలం దాఁట నగు ననిరి. వారిమాటలెల్ల విని రాఘవుఁ డివియన్నియుం గానిపనులే. శతయోజనవిస్తార మైనయీసాగరము దాఁటుట గొందఱకు సుకరం బైనం బెక్కండ్రకు దుష్కరంబు. ఇంతసైన్యముం దాఁటింపఁ దెప్పలు నోడలుం జాలవు. మఱియుం గలయోడ లన్నియు మన మాక్రమించిన వణిగ్జనంబులకుఁ గార్యవిరోధంబు ఘటిల్లు. అది మనకుఁ దగనిపని. వెండియు మనమెల్ల నోడ లెక్కి పోవుచుండినం బగవా రుపాయమున నయ్యోడలఁ బగులఁ గొట్టఁ జూతురు. కావున మీచెప్పినయుపాయము లన్నియు నాకొప్పనియవి. నే నొక్కటి చెప్పెద వినుండు. నేను నియమముతో నుపవసించి సముద్రుం బ్రార్థింతు. అతఁడు నాకుఁ బ్రసన్నుండై త్రోవ యిచ్చు. ఇయ్యక యొప్పరి

కించిచూచెనేని దివ్యాస్త్రములఁ బ్రయోగించి సాగరజలంబెల్ల వట్టిపోవం జేయుదు. ఇదియ యిప్పటికిఁ దగినయుపాయం బనివచించిన నందఱు నట్ల యనిరి.

రాముఁడు దర్భశయనముఁ జేయుట.

అట్లు కృతనిశ్చయుండై రాఘవుం డాచమించి దర్భాస్తరణంబున సౌమిత్రితోడ శయనించినం గొంతవడికి సముద్రుఁడు కలలో సాక్షాత్కరించి కౌసల్యానందనా, యని పిలిచి నీ కెయ్యది సహాయము చేయవలయు? వివరింపు మనియడుగ రాముఁడు సముద్రుం జూచి యయ్యా, యిక్ష్వాకుకులజనితుం డైననేను నీకు జ్ఞాతిని. నిన్నతిక్రమించి లంకం జొచ్చి పౌలస్త్యకులపాంసనుం డైనదశముఖుం జంపఁ దలంచితి. అచ్చటికిఁ బోవఁ ద్రోవ యిమ్ము. ఇయ్యకనాప్రార్థనమ్మువమ్ము చేసెద వేని దివ్యాస్త్రాభిమంత్రితము లైనశరజాలముల నేసి నీజలంబెల్ల వట్టిపోవం జేయుదు ననిపలికిన విని సాగరుండు రాఘవుకోపమున కదరపడి కృతాంజలియై యిట్లనియె. రఘువరేణ్యా, నేను నీపూనికి కడ్డము సెప్పను. నీకార్యమునకు విఘ్నముసేయను. నావిన్నపం బాలించి కర్తవ్యంబు నడపుము. నీయానతిమెయి సేనకుఁ ద్రోవ యిచ్చితినేని లాఁతివారుం గొందఱు నన్నాజ్ఞాపింతురు. వారికెల్ల నేను ద్రోవ యీవలసివచ్చు. కావున నొక్కయుపాయంబు సెప్పెద. భవత్సైన్యమున నళుఁ డనుకపి యున్నవాఁడు గదా? వాఁడు విశ్వకర్మకుమారుఁడు. శిల్పతత్త్వమెల్ల లెస్సగ నెఱింగినవాఁడు. ఆనళుఁడు తృణకాష్ఠపాషాణాదులం దేనినైన నిక్షేపించెనేని వాని దృఢముగ ధరింతు. అది నన్నతిక్రమింపఁగ మీకు సేతు వయ్యెడి ననిచెప్పి యంతర్హితుం డయ్యె. పదంపడి రాముఁడు దర్భశయనము మాని నళుం బిలిచి సముద్రమున సేతువుఁ గట్టుము. అందులకు నీవు సమర్థుఁడ వని నామతం బని పంచిన నళుఁడు బహుళగిరిశిఖరశిలావృక్షాదుల వానరులచేఁ దెప్పించి సముద్రమునందుఁ బదియోజనముల వెడల్పును నూఱుయోజనములునిడుపునుం గలుగునట్లుగా సేతువు గట్టె. అదియే యిప్పటికిని నళసేతు వని ప్రసిద్ధంబై యుండెడి. అట్టియెడ రావణానుజుం డైనవిభీషణుఁడు నలుగురుమంత్రులతోడ నేతెంచినం గాకుత్థ్సుం డతని స్వాగతం బడిగి సత్కరించె. సుగ్రీవుఁడితండు రాక్షసుండు. వీని నమ్మరాదు. రావణుచారుఁడుగా నుండనోపు నని సంశయించుచుండె. రాఘవుఁడు క్రమమున విభీషణునింగితచేష్టితచరితంబుల నరసి నిక్కంబ యతండు దన్నాశ్రయింప వచ్చె నని యూహించి వానిసర్వరాక్షసరాజ్యమునఁ బట్టాభిషిక్తుం జేసి తనకు ముఖ్యామాత్యుఁగ భావించి లక్ష్మణునితోడిసఖ్యంబుఁ గావించి తన్మతంబున నళసేతుమార్గమున సకలసైన్యసమేతుండై సాగరంబు దాఁటి దక్షిణతటంబు సేరి ప్రభూతమూలఫలసలిలబహుళంబులైనలంకోద్యానముల విడిసి సేనాపరిరక్షణంబున జాగరూకుండై యుండె. అట్టి

యెడ రావణమంత్రులు శుకసారణు లనువారు వానరరూపముఁ దాల్చి రామసై
న్యంబునం ద్రిమ్మరుచుండ విభీషణుండు వారలం బట్టికొని రామున కప్పగించె.
వారుం దమ రాక్షసరూపముల గ్రహించిరి. రాముఁడు వారికిఁ దమసైన్యమంత
యుఁ జూపఁ బనిచి విడిచిపుచ్చిన వారు రావణునొద్దకుఁ జని రామలక్ష్మణులవిక్ర
మంబును సైన్యస్వరూపంబును వివరించిరి. అట రావణుఁడు లంకాపురరక్షణపరుం
డై యగాధతోయములు మీనన క్రాదిప్రచారభీషణంబు లయినసప్తపరిఖలలో
నం జంద్రగూటాలు నాటించి కోటవాకిళ్లం దగుజోదుల వివిధసాధనసంభృతుల
నియమించి సర్వగుల్మంబులందునుం బ్రాసపరిఘపరశ్వథపరశుముసలతోమరాసి
శక్తిశతఘ్నీప్రభృతినానాయుధపాణు లయినవీరభటులను గజవాజినికరంబులను
నియమించి యంతటం గవాటయంత్రాదులఁ బదిలపఱుపఁ దగువారల నియో
గించి సర్వవిధముల జాగరూకుఁడై యుండె.

అంగదరాయభారము.

ఇట రాముఁడు ముందుగఁ దెగువకుఁ జొర నెల్లక యంగదుం బిలిచి
నీవు పోయి రావణునితోడ సంధిమాట లాడి రమ్మని పనిచిన నవ్వాలిపుత్రుఁడు
లంకాపురంబుఁ జొత్తెంచి తనరాక రాక్షసేంద్రున కెఱింగించి తదనుమతి నాస్థా
నంబు సేరి మేఘమాలాపరివృతుం డైనసూర్యునిచాడ్పున రాక్షసగణపరివృతుం
డై కొలువున్నరావణాసురుం గాంచి రాక్షసేశ్వరా, నేను శ్రీరాముపంపున వచ్చి
నదూతను. అమ్మహాత్మునిసందేశంబు విని తత్ప్రకారంబు నడపి మేలు గాంచుము.
తనహితం బెఱుంగక రా జనయపరుండైనం దద్దోషమునంజేసి తద్రాజ్యమెల్లఁ
దప్పక చెడు. నీ వొకరుఁడవు సీత నపహరించి తెచ్చి యెగ్గుఁ జేయుటంజేసి యన
పరాధు లయిననీవారెల్ల నీయట్లు వధార్హు లైరి. తొల్లి నీవు బలగర్వముల ఋ
షులను, దేవతలను, రాజులను, స్త్రీలను హింసించినందులకు ఫల మనుభవింపఁగ
నిపుడు కాలంబు ప్రాప్తం బయ్యె. ఇంతటనైనం దెలివి గలిగి సీతను విడిపింపు
ము. కాకున్న నిన్ను నీవారలను నిక్కంబ సంహరింతు. మగవాఁడవైతివేని నా
తోడం బోరాటకు వచ్చి మదీయధనుర్విద్యావిలాసము చూడుము. జానకిని విడి
పింపకున్న నీవు ప్రాణములఁ దప్పించికొనఁ జాలవు. నిశితశరజాలములఁ బ్రయో
గించి లోకమెల్ల నరాక్షసంబుగఁ జేయుదు నని రఘూద్వహుండు తనమాటగా
నీతోఁ జెప్పఁగ నన్ననిచినవాఁ డని తెలియఁ బలికె. ఆపరుషవచనముల విని రా
వణుఁడు క్రోధమూర్ఛితుండై చుఱచుఱఁ జూచుచుండ నతనియింగితం బరసి
రాక్షసభటులు నలువురు పక్షులు క్రోల్పులింబోలె నంగదుం బట్టికొనిరి. అది
సరకుసేయక వాలితనయుం డారాక్షసభటులతోడన రయమున మీఁది కెగరి
ప్రాసాదతలం బారోహించుటయు నారాక్షసు లుత్పతనవేగమునంజేసి జాఱి నేలం

బడి భిన్నహృదయులై పడిసిరి. అంగదుఁడుం దదాస్థానమంటపశిఖరంబు రాక్షసవినాశసూచకోత్పాతంబుగాఁ బడఁ దన్ని యాసౌధమునుండి యెగరి లంక నతిక్రమించి నిజశిబిరంబు సొచ్చి కోసలేంద్రుం గనుంగొని యావృత్తాంతమంతయు నివేదించి యతని మెప్పువడసె.

అంత శ్రీరామునసుజ్ఞచే యుద్ధకోవిదు లైనఋక్షవానరసైనికు లందఱు నొక్కయుమ్మడిగ లంకాపురంబు ముట్టడించి యెగరి కోటపై నెక్కి కూర్చుండి పురవృద్ధులు నువిదలు వెఱఁగుపడి చూచుచుండ వివిధవర్ణనిజదేహప్రభాపటలంబునఁ దద్దేశంబెల్లఁ గపిలంబుగఁ జేయుచు సూర్యాతపప్రచారంబున కెడ గలుగకుండ నంతట నావరించి ప్రాకారశిఖరంబుల, ద్వారతోరణస్తంభంబుల,యంత్రాయుధాదుల విఱిచి కొన్ని క్రిందఁ బడం ద్రోచి మఱికొన్ని పురమధ్యమునఁ బడఁగ విసరివైచి ప్రాకారవాసు లయిననిశాచరులనెల్లం దఱిమిరి. దానిం దెలిసి రావణుఁడు కామరూపు లైనరాక్షసులఁ బెక్కండ్రం బంపుటయు మాషరాశిసదృశు లైనవారు వివిధాయుధపాణులై వచ్చి కోట ముట్టడించినక్రోతులపై విక్రమించి శూలాద్యాయుధములం బ్రయోగించి యవానరంబుగఁ జేయం దొడంగిన వానరులునుం దోరణస్తంభాదులం బ్రయోగించి యరాక్షసంబుగఁ జేయం దొడంగుటయు నయ్యుభయసైనికులకుఁ గేశాకేశియుద్ధంబును నఖదంతప్రహారంబును బరస్పరాస్ఫాలనపురస్సరంబుగఁ బెల్లుగఁ జెల్లుచుండిన నయ్యిరువాగులం బెక్కండ్రు పొలియుచుండిరి. అపుడు రామలక్ష్మణులు విక్రమించి ప్రావృట్పయోధరంబులతెఱంగున నిశితశరవర్షంబు గురియించి దుర్గరక్షకుల నొక్కొక్కనిం బ్రత్యేకంబు గూల నేయుటయు వానరసైనికులు లంక నాక్రమింపం గడంగిరి. కడంగుటయుఁ బర్వత, పతన, జంభ, ఖర, క్రోధవశ, హారి, ప్రరు, జారుజ, ప్రఘసాదు లయిననిశాచరవీరులు మాయాబలమున నదృశ్యులై కపిసైన్యంబుఁ జంపం దొడంగిన సకలమాయావేది యైనవిభీషణుఁడు దివ్యాస్త్రం బేసి యంతర్ధానశక్తి మాయించినం దృశ్యు లైనయన్నిశాచరవీరులం బొదివి వానరవీరులు నుగ్గునూచముగఁ జేసిరి. అంత రావణుఁడు నిజసైనికవధంబు విని కోపాటోపదీపితుండై యనేకరక్షఃపిశాచదానవసైన్యంబు వెంట నడిచిరాఁగ వెడలి యౌశనసవ్యూహంబుఁ బన్ని కపిసేనపైఁ గవిసినం జూచి రాఘవుండు బార్హస్పత్యవ్యూహమునం బ్రతిఘటించి నిలుచుటయు రామరావణులకు, లక్ష్మణేంద్రజిత్తులకుఁ,బ్రహస్తవిభీషణులకు,సుగ్రీవవిరూపాక్షులకుఁ, దారనిఖర్వటులకు, నలతుండులకుఁ,బనసపటుశులకు, సమబలు లయినతక్కటివారికిం ద్వంద్వయుద్ధంబు ప్రవర్తిల్లి దేవాసురసమరంబుతెఱంగున భీమం బయ్యె. రావణుఁడు రాముం దలపడి శక్తిశూలాద్యాయుధముల నేసిన రాముఁడు దివ్యాస్త్రముల నేసి వానినెల్లఁ

ప్రతిహతములఁ గావించి నొంచిన నారాక్షసేశ్వరుఁడు వెఱచి పాఱిపోయె. ఇంద్రజితుఁడును లక్ష్మణుం దాఁకి మర్మభేదనచణంబు లయినదివ్యమార్గణముల గుప్పించిన సౌమిత్రి యాయమ్ముల సమయించి వానిమేను దూటుపడ నేయుటయు వాఁడును సంగరాంగణంబుఁ దొలంగి చనియె. విభీషణప్రహస్తులకుం దివ్యాస్త్రప్రయోగనిబిడంబుగాఁ ద్రైలోక్యభీకరం బయినసమరంబు చెల్లుచుండినం బ్రథనకర్కశుం డైనప్రహస్తుఁడు గదఁ గొని యవ్విభీషణు నడిచె. తత్ప్రహారంబు సరకు సేయక యవ్వీరవర్యుఁడు హిమవంతునిపోలె సుస్థిరుం డై పొలిచి శతఘంటావిభూషితం బయినతనమహాశక్తిం గొని యాప్రహస్తుతలఁ ద్రెవ్వ నేసిన నతండు వజ్రోపమం బయినయాగదప్రహారంబున విభిన్నశిరస్కుం డై పెనుగాలిం గూలు మ్రానిమాడ్కి నేలం గూలె.

## హనుమంతుఁడు ధూమ్రాక్షుం జంపుట.

అట్లు ప్రహస్తుండు గూలుటయు ధూమ్రాక్షుండు మహారయంబునం గపిసేనం దలపడి వచ్చిన ఘోరాకారుం డైనవానిం గాంచి వానరులు వెఱచి తొలఁగి పోవుచుండఁగ హనుమంతుఁ డతిరయమున నన్నిశాచరుం దాఁకి విక్రమంబు చూపుచుండఁగఁ బాఱినవానరులెల్ల మగిడి రాక్షససేనం బొదివి పోరాడుటయు నారాక్షసవానరవీరులపరస్పరప్రహారభీషణధ్వానంబు నింగి ముట్టె. ఆదారుణరణంబున ధూమ్రాక్షుండు క్రోధతామ్రాక్షుం డై కపిసైన్యంబుఁ గనుపుకొట్టినం దద్విక్రమంబు సైపఁక ప్రభంజనాత్మజుండు వీరవిక్రమవిహారంబు మెఱయఁ బటుశిలావృక్షపాతంబును ముష్టిఘాతంబునుం గావించిన నారాక్షసవీరుఁడు నోహటింపక గదాపరిఘశతఘ్నీప్రముఖనానావిధాయుధముల నతనిపై నేసె. అట్లయ్యిద్దఱు పరస్పరవిజిగీషం జేసి యింద్రప్రహ్లాదులచాడ్పునం గడిమి మెఱసి రణాంగణంబు రుధిరకర్దమంబుగాఁ బోరాడుచుండ నుక్కు మిగిలి యక్కపివీరుం డక్కజంబు మిక్కుటంబుగాఁగ విక్రమించి యత్యంతరోషభీషణుం డై పటుతరగిరిశృంగంబుఁ బడవైచి యాధూమ్రాక్షుని రథరథ్యసారథిసహితంబుగాఁ బొడిపొడిచేసినం గపివీరులు సంజాతసంతోషులై దానవులఁ జెండాడం దొడంగిరి. అంత హతశేషు లయినరాక్షసులు హనుమంతునికొత్తలకు వెఱచి దిక్కు దోఁపక భగ్నసంకల్పులై పాఱి రావణాసురున కంతయు నివేదించిరి. అతండు పెద్దయుం బ్రొద్దు దీర్ఘోష్ణంబుగ నిశ్వసించి యక్కటా! ప్రహస్తధూమ్రాక్షులును హతులైరి. కుంభకర్ణుఁడు విక్రమంబుఁ జూపఁగ నవసరంబు ప్రాప్తం బయ్యె. నిద్రావశుం డైనయతని నిపుడు మేల్కొలుపవలయు నని తనలో నిశ్చయించి ఘోరధ్వానంబు లయినవాద్యసహస్రంబుల వాయింపఁ బంచిన నాకుంభకర్ణుండు తన్నినాదవిదీర్ణకర్ణుం డై యల్లన మేలుకాంచె. అట్లు మేల్కొని కుంభకర్ణుండు లేచి కూర్చుండి

విగతనిద్రావికారచేష్టితుండై యుండ రావణుండు వానిం జేరం జని యిట్లనియె. కుంభకర్ణా, నిద్రావశుఁడవై నీవు ధన్యుఁడ వైతివి. ఇచ్చటిఘోరప్రకారం బించుకయు నెఱుంగవైతివి. తత్ప్రకారంబు వినుము. నేను శ్రీరామునిభార్యను సీత యనుదాని వంచనమై నపహరించి తెచ్చితిఁగదా. ఆరాముఁడు తనభార్యను దోడ్కొనిపోవం దలంచి బహుళకపిసేనానాయకుం డైనసుగ్రీవునితోడఁ జెలిమి చేసి తత్సహాయంబున సముద్రమునందు సేతువు గట్టి యసంఖ్యాకవానరసైన్యంబుతోడ సముద్రము దాఁటి మన కవమానంబుగా నీపురంబు ముట్టడించి యిపుడు ఘోరసంగ్రామంబు సేయుచున్నవాఁడు. ప్రహస్తధూమ్రాక్షప్రముఖు లయినమనవీరులు పెక్కండ్రాసమరంబునం బొలిసిరి. ఇఁక వారలం గెలువ నీవు దక్కఁ దక్కటివా రోపరు. కావున నీవు దృఢకవచంబు దొడిగి వలసినయాయుధములం గ్రహించి పోరికిఁ గట్టాయితంబై నడిచి పగవారినెల్ల నిశ్శేషంబుగఁ బొరిపుచ్చుము. నీకు బాసటగా దూషణుననుజు లయినవజ్రవేగప్రమాథులను బహుళసైన్యము నిత్తుం దోడ్కొని పొమ్మని పనిచిన నతండు యథోక్తప్రకారంబునఁ బోరాడ వెడలె.

## కుంభకర్ణుఁడు యుద్ధముచేసి చచ్చుట.

అట్లు తఱలి కుంభకర్ణుండు రామలక్ష్మణరక్షితం బైనకపిసైన్యముఁ గవిసినం గపివీరు లారాక్షసునిం జుట్టుముట్టి పటుశిలావృక్షవిక్షేపంబులను నఖదంతప్రహారంబులను వివిధాయుధప్రపాతంబులనుం గావించి పలుదెఱంగులఁ బోరితము సేయం దొడంగిన నక్కుంభకర్ణుం డుదీర్ణక్రోధఘూర్ణమానమానసుండై వానరులపై నురవడించి బల, చండబల, వజ్రబాహుప్రభృతు లగుకొందఱం బొదివిపట్టి మ్రింగుటయుఁ దారప్రభృతు లయినవానరులు వానికి వెఱచి పెలుచ నఱచిరి. అయ్యఱపు విని సుగ్రీవుఁ డుదగ్రక్రోధుండై యారాక్షసుందాఁకి తన బలం బడర మహావృక్షంబు వానిమస్తకంబున విక్షేపించిన నావృక్షంబు నుగ్గయ్యె. ఆరాక్షసుఁ డందుల కించుకేనియుఁ జలింపక రోష మడరఁ బెలుచ నార్చి పేర్చి చేతులఁ జాఁచి సుగ్రీవుం బట్టికొనుటయు దవ్వునం గని లక్ష్మణుండు దానడ్డపడి రుక్మపుంఖంబు మహావేగంబు నగుతీక్ష్ణనారాచంబు నారాక్షసునిపై నేసినం దద్బాణంబు వానిమైమఱవు సించి బొమ్ము వ్రచ్చి రుధిరసముక్షితంబై వెడలి నేలం బడియె. అందుల కలిగి కుంభకర్ణుండు సుగ్రీవుని విడిచి మహాశిల నెక్కొని దానిం జేత నమర్చికొని లక్ష్మణుదెసం బాఱుతెంచిన నవ్వీరశేఖరుండు రెండువాఁడితూపు లేసి వానిచేతుల నఱికె. నఱుకుటయు వాఁడు మాయాబలంబునఁ బ్రగృహీతపాషాణచతుర్భుజుఁడుగా నగపడినం జూచి సౌమిత్రి లాఘవంబు మెఱయ నైపుణంబు నెఱయఁ బెక్కమ్ములేసి యాభుజములనఱికిన వాఁ డంత

కంతకు మాయ వన్ని బహుపాదశిరోభుజుఁడు నతికాయుఁడుగా నగపడియె. అంత సౌమిత్రి వీఁ డలంతులఁ బోవఁ డనితలంచి బ్రహ్మాస్త్రం బభిమంత్రించి యేసినం దత్ప్రహారమున వాఁడు పిడుగు పడఁ గాలుద్రమానుకై వడి మాయాకృతరూపంబులెల్లఁ జెడ నేలం గూలె. అట్లు కుంభకర్ణుండు కూలినం జూచి నిశాచరభటులు వెఱచి పాఱుచుండ దూషణానుజు లయినవజ్రవేగప్రమాథులు తమ యోధులనెల్ల మగిడించి లక్ష్మణు నదల్చి తాఁకుటయు సౌమిత్రియుం బెలుచ నార్చి యంపతుంపరం గురియించుటయు ముహూర్తమాత్రంబు వారిపోరు రోమహర్షణం బయ్యె. ఆసంగరంబున మారుతాత్మజుండు గిరిశిఖరం బెత్తికొని యతిరయంబున నేతెంచి వజ్రవేగుపై నేసిన వాఁడు పొడిపొడి యయ్యె. నీలుఁడును హనుమంతునివిధమున గండోపలం బెత్తికొని వచ్చి ప్రమాథిపై నేసిన వాఁడును నుగ్గునూచ మయ్యె. అట్లు వజ్రవేగప్రమాథులుం జచ్చుటయు రాక్షసయోధులు క్రోధోద్దీపితులై కపివీరుల నేట్లాడం దొడంగిన నయ్యుభయసైనికులకుం బరస్పరస్పర్ధం జేసి సంగ్రామంబు భీమంబై ప్రవర్తిల్లె. అందు రక్కసులే మిక్కిలి యుక్కుచెడి మడియుచుండిరి.

### ఇంద్రజిత్తు లక్ష్మణునిచే జచ్చుట.

అంత రావణుండు కుంభకర్ణాదివధంబు విని పరమ శోకార్తుండై పుత్రవర్యుండైన యింద్రజిత్తుం బిలిచి యోశత్రుమర్దనా, నీవకదా కదనంబున వజ్రపాణిం గెలిచి లోకముల నాకీర్తి నెఱపినసత్పుత్రుండవు. దివ్యాస్త్రవిదుండవు. వివిధమాయాప్రకారవిశారదుండవు. రామలక్ష్మణసుగ్రీవు లిపు డుగ్రులై మనసైనికవర్యులఁ గుంభకర్ణాదుల సంహరించిరి. వారిం బోర మార్కొన నీవుదక్కఁ దక్కటివా రోపరు. నీబారిం బడి వారు బ్రదుకనేరరు. కావున నీ విపుడ సకల సాధనములతోడఁ బోరితమునకుఁ గట్టాయితంబై నడిచి పగవారలఁ జంపి సమరనిహతు లయినమనవారలఋణంబుఁ దీర్చి నామనం బలరింపఁ జేయు మనిపంచిన విని యింద్రజిత్తు వల్లేయని మేలిమైమఱువు దొడిగి వలసినదివ్యసాధనములం గ్రహించి రథారూఢుండై పురంబు వెడలి సంగరాంగణంబుఁ జేరవచ్చినం గపివీరు లందఱు నతనిం దలపడి నడచిరి. ఇంద్రజితుఁడు వారి నేరిని సరకుగొనక వేరెలుం గెత్తి తనపేరు సెప్పి లక్ష్మణుం బిల్చిన నవ్వీరుండును ధనుష్టంకారంబు నిగిడించుచు క్షుద్రమృగముఁ గవియుసింగము తెఱంగున వానిం గవిసిన నయ్యిద్దఱుదివ్యాస్త్రవిదులసమరంబు సమంబై చెల్లె. అంత నింద్రజిత్తు శరప్రహారంబుల సౌమిత్రి తనకు నేమిటం గీడు గాఁ డనితలంచి కడఁకమై మహావేగములగుతోమరముల గుప్పించినం గకుత్స్థకులతిలకుండు విలువిద్య నేర్పు నెఱయఁ గడిమి మెఱయ వాఁడితూపులం బఱపి యాతోమరంబులనెల్లఁ బలుతునియలఁ

గావించె. అట్టియెడ నంగదుఁడు మహాపాదపంబుఁ బెఱికికొని తలకడచి వచ్చి
యింద్రజిత్తుతలపైఁ బడవైచిన నారావణాత్మజుం డందుల కించుకేనియుం జలిం
పక ప్రాసమున వాలిసుతునురము గాడ నేయఁ బూని మీఁది కెత్తుటయు రాఘ
వానుజుండు నడుమన దానిం బలుతునియలుఁ గావించె. అట్లు ప్రాసంబు శకలం
బైనం గినిసి మేఘనాదుఁ డంగదువామభాగంబు గదచేఁ బెల్లడిచినం గ్రోధోద్దీ
పితుండై వాలిసుతుం డాప్రహారంబు సరకుగొనక సాలస్కంధము నయ్యింద్ర
జితుపై నేసినం దత్ప్రహారంబునం జేసి వానితేరు నుగ్గయ్యె. గుఱ్ఱములు చదిసె.
అట్లు భగ్నరథుండై రావణపుత్రుండు మాయాబలంబున నంతర్ధానంబుఁ జెంది
గగనంబునకు లంఘించి వరప్రభావసముపలబ్ధబలవీర్యవిశేషంబునం జేసి పెక్కమ్ము
లేసి రామలక్ష్మణులను వానరయూథపతులను నొప్పించుచుండె. రాఘవులును
శబ్దవేధు లయినయమ్ముల వానిపైఁ బ్రయోగించుచుండిరి. సుగ్రీవాదు లగువానర
శ్రేష్ఠులు గరిష్ఠగండోపలములం జేతుల నమర్చికొని యాకసంబున కెగరి వాని
వెదకుచుండ మాయాబలమున నదృశ్యుండై వాఁ డంతకంతకు నగ్గలంబుగఁ
గోల్తలు చేసి వారినెల్ల శరవర్షమున ముంచి నొంచి యంతనిలువక రామలక్ష్మ
ణులపైఁ బెక్కమ్ము లేసిన నయ్యన్నదమ్ములు నొచ్చి ధరణీతలమున నొఱగి లయసమ
యపతితు లయినసూర్యచంద్రులచందమున నున్నంత నార్చి పేర్చి యతం డయ్యు
ద్ధఱను వరప్రభావమునం జేసి నాగపాశముల బంధించి పంజరమునం జిక్కినపులుఁ
గుల తెఱంగునఁ గదలనేరకున్న యప్పురుషవ్యాఘ్రులం జూచి యుబ్బి తద్వృత్తాంతం
బుఁ దండ్రికిఁ జెప్పఁగఁ జనియె. అట్లు బహుళశరవిద్ధులు నాగపాశబద్ధులునై
నమిద్ధర నొఱగఁ బడియున్న దాశరథులం జూచి సుగ్రీవాంజనేయమైందద్వివిదాం
గదకుముదనీలతారనలప్రముఖు లగుకపీశ్వరులు వేదనం బడుచుండ విభీషణుఁడు
ప్రజ్ఞాస్త్రమున వారలఁ బ్రబోధితులం జేయుటయు సుగ్రీవుఁడు దివ్యమంత్రప్ర
యుక్తం బైనవిశల్యకరణిచే నారాజనందనుల నపగతశల్యులం జేసి న వారు
తత్క్షణంబ విగతశ్రమ లగుడు విభీషణుఁడు శ్రీరామునకుఁ గేలుమోడ్చి యిట్ల
నియె. రాజేంద్రా, రాజరా జగుకుబేరుశాసనంబున గుహ్యకుఁడు దివ్యసలిలముఁ
గొని శ్వేతపర్వతమునుండి వచ్చినవాఁడు. అయ్యుదకమున నయనప్రక్షాళనంబుఁ
జేసికొనిన నదృశ్యభూతము లెల్ల నగపడు. కావున నీవును లక్ష్మణుండును సుగ్రీ
వాదులుం దజ్జలమున నేత్రములఁ గడిగికొని మాయాప్రభావమున నంతర్హితుం
డైనరావణాత్మజుం గాంచి హరితంబు సేయఁ దగు ననిన వా రందఱు నట్ల చేసి
యదృశ్యములనెల్లఁ గనుంగొనిరి. అంతకుమున్న మేఘనాదుఁడు తనవిక్రమంబుఁ
దండ్రి కెఱింగించి రణాంగణంబుఁ జొచ్చి తొల్లింటియట్ల మాయచే నదృశ్యుండై
పోరాడం గడంగిన సౌమిత్రి దివ్యసలిలప్రక్షాళితనేత్రుండు గావున వానిం గట్టె

దుటం గాంచి విక్రమాటోపంబు సూపం దొడంగె. అపుడు రావణాత్మజుండు జయావహం బైన హోమంబు సేసి మఱి వత్తు నని తలంచి మగిడి చనుచుండ విభీషణుండు సుమిత్రానందనుం బిలిచియయ్యా, యీదురాత్ముఁడు హోమార్థంబు చనుచున్నవాఁడు. హోమము యథావిధి నిర్వర్తితం బయ్యెనా వానిం గెలువరాదు. కావున నిపుడ వాని వెంబడించి విక్రమము సూపవలయు నని తెల్పిన విని లక్ష్మణుం డట్లయని యామేఘనాదుం దఱిమి వాఁడినారసముల గుప్పించినం గినిసి వాఁడు మగిడి సంగరము సేయం దొడంగుటయు నప్పటివారిపోరు శక్రప్రహ్లాదసమరంబుచందంబున నతివిచిత్రం బయ్యె. రావణాత్మజుండు మర్మభేదనచణంబు లయినమార్గణంబుల నేసినం గినిసి రామానుజుండు పావకసన్నిభంబు లయినదివ్యశరముల వానిపై నేసె. సౌమిత్రిశరప్రహారమున నొచ్చి క్రోధమూర్ఛితుండై రాక్షసేశ్వరతనూజుం డాశీవిషములంబోనియెనిమిదివాఁడితూపుల లక్ష్మణుం గాఢ నేయుటయు నవ్వీరశేఖరుండు కోపాటోపదీపితుండై రెండమ్ముల నేసి ధనుర్బాణసమన్వితము లైనవానిభుజముల నఱికి నిశితధారం బైనవేఱొక దివ్యబాణమున రత్నకుండలవిరాజితం బైనయారావణాత్మజుతలఁ దఱిగె. అవ్విధమున నింద్రజిత్తును మిత్తికిం బలిఁజేసి లక్ష్మణుండు తదీయసారథిం జంపుటయు రథ్యములు రథము నీడ్చికొని పురికిఁ జనినం దశకంధరుండు నందనవిరహితం బైనతదీయస్యందనంబుఁ గాంచి కొడుకు చచ్చె ననియూహించి శోకమోహసంభ్రాంతచిత్తుండై చేటులకెల్ల మూలం బైనజానకిం జంపుదు నని నిశ్చయించి ఖడ్గముఁ గొని యశోకవనమునకుఁ బఱచినం బరమధర్మవిదుం డైనయవింధ్యుఁ డను రాక్షసుఁడు వాని కిట్లనియె. రాక్షసేశ్వరా, వినుము. సీతను జంపఁగ నేల దలంచెదవు? సకలలోకపూజ్యం బైనసామ్రాజ్యంబుఁ బూనిననీకు స్త్రీవధంబు సేయం దగునే? నీచెఱఁ జిక్కినపుడే జానకి హత యయ్యె నని నామతంబు. ఇఁక నీయువిదం జంపనేల? వీర్యంబు గలదేని దీనిమగనిం జంపుము. అతఁడు హతుఁడైన నీయతివ హతయకాదో? ఇంద్రుఁడును నీవిక్రమమున కోడును. సకలదేవతలనుం బలుమాఱులు గెలిచిననీకు రాముం జంపుటెంతపని? పొమ్ము రణమ్ము సేయుము పగఱ గెలువుము. ఇది తగుఁగాని జానకిం జంపరా దని బహువిధములఁ దెల్పినం దద్వచనముల నాదరించి రావణుండు జానకీవధోద్యమంబు మాని యనుచరులం బిలిచి యుద్ధయాత్ర వెడలవలయు. తే రాయితపఱచి తెం డని పనిచిన వారు తత్క్షణంబ యట్ల చేసిరి.

### రావణుఁడు రామునితో యుద్ధము చేసి చచ్చుట.

అంత రావణుఁ డాబద్ధకవచుఁ డాముక్తతూణీరుఁ డాకలితసకలసాధనుఁడునై యుత్తుంగకేతనాంచితం బైనయుత్తమస్యందనం బారోహించివివిధాయు

ధపాణు లయినరాక్షసవీరులు ఘోరాకారులు పెక్కండ్రు వెంట రాఁగ నాయో ధనక్షోణిం జేరి రామచంద్రుం దాఁకుటయు హనుమజ్జాంబవదంగదాదు లయిన వానరయోధు లనేకులు చుట్టుముట్టి గిరిశిఖరప్రపాతంబునను మహావృక్షవిక్షేపం బునను రాక్షససైన్యంబు విధ్వంసంబుఁ జేసినం గ్రోధదీపితుండై రావణుండు మా యఁ గావించుటయు వానిమేనం బెక్కండ్రు రక్కసులు శక్తిశూలతోమరపట్ట సపరిఘాదిపాణులై వెడలివచ్చినం గకుత్స్థకులదీపకుండు దివ్యాస్త్రముల వార లనెల్ల సమయించె. రావణుఁ డామాయ వమ్మగుటయుం గినిసి రామలక్ష్మణ రూపధారుల ననేకరాక్షసులఁ బుట్టించి వారితోడం దాను బోరాడు తెఱంగుగా మాయఁ గావించినం జూచి లక్ష్మణుం డిది రాక్షసమాయ యని యూహించి యసంభ్రాంతచిత్తుండై యన్నమొగమునం జూచ్చి నిలిపి మహాత్మా, యాత్మ ప్రతిరూపులయిన యీపాపాత్ముల వేగంబ వధియింపు మని తెలిపె. తెల్పుట యు రాముఁడు దివ్యాస్త్రముల నతిరయమున నేసి వారినెల్ల యమపురికిం బంపి రావణునిపై విక్రమాటోపంబుఁ జూపనున్నంత నింద్రసారథి యైనమాతలి సూ ర్యతేజం బైనయింద్రరథముఁ దోలుకొని వచ్చి రాముని కిట్లనియె. రఘుకుల వరేణ్యా, నిలింపపతిపంపున హరిహయయోజితం బైనయీయుత్తమస్యందనముఁ దోలుకొని వచ్చితి. తొల్లి దేవేంద్రుఁ డీరథము నారోహించి దైత్యదానవుల ననేకుల సమయించె. ఈరథము జయప్రదంబు. కావున నీవు దీని నారోహించి లోకకంటకుం డైనరావణుని సంహరింపు మనివిన్నవించె. విన్నవించిన విని రామభద్రుఁ డిది రాక్షసమాయగా నోపు నొకో యని యించుక సంశ యించుచుండ విభీషణుండు చేరం జని మహాత్మా, యిది రాక్షసమాయ కాదు. సందేహింపవలదు.ఇంద్రునానతిమెయి నారథము నారోహించి విక్రమంబుఁ జూపు మని మనవిచేసినం జిత్తగించి రాఘవుఁ డారథోత్తమము నారోహించి సమరస న్నాహంబునం బొల్చి రావణుం దాఁకుటయు సర్వభూతములు హాహాకారముఖ రంబు లయ్యె. వానరసైన్యమున సింహనాదములు నిండిముట్టె. దివంబున దేవ దుందుభిపటహాదినాదిత్రనినాదంబు లెసంగె. అవ్విధంబున సమరసన్నాహదీపి తులై రామరావణులు నిరుపమానంబుగ మహాఘోరప్రకారంబునం బోరా డుచుండ దశగ్రీవుఁ డుదగ్రక్రోధసమగ్రుండై వజ్రాయుధసంకాశంబు బ్రహ్మదం డప్రతీకాశంబు నగు శూలము నేసినం దత్క్షణంబ దశరథాత్మజుండు నిశితశరజా లముల నేసి దాని నడుమన పొడిపొడిచేసినం గినిసి యీసున నిశాచరేశ్వరుండు పదివాఁడినారసముల రాముమేనం గాడ నేసి యంత నిలువక వేనవేలుగ వివిధ శస్త్రములను శూలపట్టసపరిఘముసలశతఘ్నీప్రముఖనానాసాధనములనెల్ల నొక్క యుమ్మడిగఁ బ్రయోగించి కోల్తలు చేసిన నవ్వికృతమాయకు వెఱచి వానరులు

నలుదెసలం బాఱిరి. అందుల కించుకేనియుం జలింపక రామభద్రుఁడు సుపత్త్రంబు సుముఖంబు సువర్ణపుంఖంబు నగుదివ్యబాణం బరివోసి బ్రహ్మాస్త్రమున నభిమంత్రించి యేసె. అపుడు దేవగంధర్వాదులు సంతసించిరి. రాక్షసులు రావణునాయు వల్పావశేషం బయ్యె నని తలంచిరి. ఏసినంతన తదస్త్రానలజ్వాలలం బడి యాలోకకంటకుండు రథరథ్యసారథిసహితంబుగా భస్మం బయ్యె. బ్రహ్మాస్త్రదాహమునంజేసి తదీయమేదోమాంసరుధిరాదులుం గన్పట్ట వయ్యె.

అవ్విధంబున రామభద్రుండు రావణాసురుం దెగటార్చి యత్యంతసంతోషసమాక్రాంతస్వాంతుండై తమ్ముఁడుం దాను దేవర్షులజయశబ్దపురస్సరంబు లయినయాశీర్వచనములం గ్రహించుచున్నంత దేవగంధర్వసిద్ధచారణకిన్నరకింపురుషాదు లెల్ల నత్యంతసంతోషంబున నేతెంచి బహువిధంబులఁ బ్రస్తుతించిరి. అపుడు దేవదుందుభులు మ్రోసె. పుష్పవర్షము గురిసె. ఆకాశం బెల్ల మహోత్సవసంకాశం బయ్యె. పదంపడి రామచంద్రుండు దివ్యసలిలములఁ దెప్పించి సుగుణభూషణుం డైనవిభీషణుని లంకారాజ్యమునఁ బట్టాభిషిక్తుం జేసె. అట విభీషణుం డవింధ్యసమన్వితుండై సీతాదేవిం దోడ్కొనివచ్చి శ్రీరాముమొగమునం జూడ్కి నిలిపి దైన్యంబు గదుర మహాత్మా, పరమపతివ్రతాశిరోరత్నం బైనసీతాదేవిం గ్రహింపు మనివిన్నవించె. విభీషణువచనము విని రాఘవుండు రథంబు డిగి మలదూషితసర్వాంగియు, జటాధారిణియు, మలినాంబరయు, బాష్పధారాపరిక్లిన్నశరీరయు నగుజానకిం గాంచి లోకాపవాదశంకావిలమానసుండై యద్దేవిం బిలిచి వైదేహీ, చెఱఁ బడిననిన్ను విడిపించితి. భార్య నెత్తికొనిపోయినవానిని రాముఁడు నిగ్రహింపనేరఁ డయ్యెననులోకాపవాదంబు నిరసించి కొనఁగ రావణుం జంపితి. ఇఁక నీయిచ్ఛవచ్చినయెడకుఁ బొమ్ము. పరగృహమునఁ బెద్దకాలము వసించిననిన్ను సకలధర్మజ్ఞుఁడ ననిపేరు గాంచిన నేను మగుడ గ్రహింపగాదు. నీవు సువృత్తవైనం దుర్వృత్తవైనం బరిత్యాగంబె లగ్గు. కుక్కనాకినపురోడాశం బెవ్వఁడైనం గ్రహింప నుత్సహించునే? ఇఁకఁ బెక్కుమాటలేల? నీయిచ్ఛయె నడుపు మనిచెప్పినం గర్ణకఠోరంబు లయినయావచనముల విని యద్దేవి వ్యథితచిత్తయై రావణసంహారసంజాతముఖవికాసం బెల్ల రూపుమాయఁ బెద్దయుం బ్రొద్దు నిశ్వసించి మొదలు తెగినయనఁటిక్రమానికై వడి నేల వ్రాలె. సౌమిత్రిసుగ్రీవహనుమదాదులును విషాదవివశులై చెయ్వులఁ దక్కి బమ్మరించుచుండిరి. అపుడు విమానారూఢులై యంతరిక్షంబున బ్రహ్మదేవుఁడు, నింద్రాగ్నియమవరుణవాయుకుబేరేశానప్రముఖు లయినదిక్పాలకులును, సప్తర్షులును, హంసయోజితవిమానారూఢుండై దివ్యమూర్తిని వెలుంగుచు దశరథభూపాలుండును రాఘవుకట్టెదుటం గన్పట్టిరి. ఆకాశం బెల్ల దేవగంధర్వవిమానశతసంకులం బై

శారదనిశాసమయంబునఁ దారకారాజివిచిత్రం బై నభస్థలంబు విడంబించె. అంత వై దేహి లేచి వా రందఱు వినఁగ రామున కిట్లనియె. రాజపుంగవా, నేను గల లోనైన నిన్నుఁ దక్క వేఱొక్కనిఁ దలంచినదానఁ గాను. ఒక్కింతయేనియుఁ బాపంబుఁ జేసియుండుదునేని సర్వసాక్షు లగుపంచభూతదేవతలు నన్నుఁ జంపుదురు. నాకు దేవవిహితుండ వై నపతివి నీవ. అగ్నిప్రవేశంబు జేసి వత్తు ననుజ్ఞ యిమ్ము. అనాదరంబు సేయక నన్ను గ్రహింపు మని చెప్పుచున్నంత నంతరిక్షగతంబులై పంచభూతంబు లెలుంగు లేర్పడం దమతమనామములం జెప్పి రఘునందనా, మేము సర్వప్రాణులమనోవృత్తుల లెస్సగ నెఱుంగుదుము. జానకి నిన్నుఁ దక్క మఱియొక్కనిఁ గలలోనైనం దలంపకునికి సత్యంబ. ఇంచుకేనియు నప్పరమపతివ్రతయెడ దోషంబు గానరాదు. ఆసాధ్విం బరిగ్రహింపు మని తెలియఁ బలికె. అపుడు బ్రహ్మదేవుఁడు రాఘవుం బేర్కొని యిట్లనియె. వత్సా, దేవగంధర్వమహర్షిప్రముఖులకుఁ గీడు సేయుచుండినరావణాసురుం దెగటార్చి యశముఁ గొంటివి. రాజర్షిధర్మప్రవృత్తుండై సాధుశేఖరుం డనం బ్రశస్తివడసిననీ కియ్యది సహజంబకాని యాశ్చర్యంబు కాదు. ఈలోకకంటకుండు నావచనమునంజేసి సర్వభూతముల కవధ్యుం డయ్యె. నేనుం గారణవిశేషమున నింతకాల ముపేక్షించితి. ఈదురాత్ముఁ డాత్మవధార్థంబ సీత నపహరించె. నలకూబరుండు తొల్లి కామింపనిభామినిం బలాత్కారమున గ్రహించెనేని తల నూఱువ్రక్కలగునట్లుగ నీపాపాచారునకు శాపమిచ్చినవాఁడు. దానంజేసి యీదురాత్ముఁడు సీత నభిమర్శింపఁడు. నే నంతయు నెఱుంగుదు. శంకింపక యప్పరమపతివ్రతం గ్రహింపు మని యానతిచ్చె. పదంపడి దశరథుండు సనుదెంచి పుత్రా, యేను దశరథుఁడను. నీయెడ సుప్రీతుండ నైతి. నీవు వనములఁ బదునాలుగేండ్లు వసించి నియమంబు దీర్చితివి. అనుజ్ఞ యిచ్చితి రాజ్య మేలు మనివచించిన విని రాఘవుం డానృపాలున కభివాదనంబుఁ గావించి మహారాజా, నీశాసనంబుమెయి నీక నయోధ్యకుఁ జని రాజ్య మేలుదు నని విన్నవించి దేవతలకు మ్రొక్కి తదాజ్ఞం గొని సీతాదేవిం బరిగ్రహించి శచీసమేతుం డై నపురందరుచందంబునఁ దేజరిల్లి యవింధ్యుఁ డను వృద్ధరాక్షసునకుఁ ద్రిజటకును గోరినవరము లిచ్చి బ్రహ్మయనుజ్ఞ గ్రహించువాఁడై కేలుమొగిడ్చి నిలిచిన నద్దేవదేవుండు రాఘవుం బిలిచి యభిమతంబులఁ గోరికొను మిచ్చెద ననుటయు నతండు ధర్మనిరతత్వంబును, శత్రులవలనిపరాజయముగలుగమియు, రాక్షసులుచంపినవానరుల పునర్జననంబును బ్రార్థించిన నావరము లిచ్చి బ్రహ్మదేవుఁడు నిజలోకమునకుఁ జనియె. బ్రహ్మవరప్రభావమునంజేసి రణమృతు లయినవానరులెల్లఁ బునర్జీవితు లైరి. సీతాదేవియు హనుమంతునకు రామునికీర్తి యెందాఁక నుందాఁకఁ గీర్తిమంతుఁడవై యభిమతభోగ

విలసితుండవై వెలయు మని వరం బిచ్చె. ఇంద్రాదిదేవతలును రాము నాసుం త్రణంబు చేసి నిజలోకములకుఁ జనిరి. అపుడు జానకీసమేతుండైన రామచంద్రుం జేర వచ్చి యింద్రసారథి యైనమాతలి రామభద్రా, లోకకంటకుండైన రావణుం బరిమార్చి దేవగంధర్వాదుల కెలిమి గావించితివి. భూలోకముం డునందాఁక నెల్లవారు నీకీర్తిం గొనియాడుదు రని ప్రస్తుతించి యతనియానతిం గొని తనరథముఁ దోలుకొని నాకలోకమున కరిగె.

## శ్రీరాముఁ డయోధ్యఁ జేరి పట్టాభిషిక్తుఁ డగుట.

అంత శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణసమన్వితుండై పుష్పకవిమానం బారోహించి విభీషణసుగ్రీవహనుమదంగదజాంబవత్ప్రముఖు లయినముఖ్యామాత్యులు వెంట రాఁగ వెడలి సేతుమార్గమున సముద్రము దాఁటి యచ్చట విడిసి యనుపఁ దగినవారల సత్కరించి యనిచి ముఖ్యామాత్యసమన్వితుండై కిష్కింధఁ జేరి యంగదు యావరాజ్యమున నభిషేకించి యటఁ గ్రమమున నయోధ్యఁ బ్రవేశించి భరతుం దోడ్కొనిరాఁగ హనుమంతుం బనిచె. అతండును నందిగ్రామమునకుఁ జని మలదిగ్ధశరీరుండైనవానిఁ, జీరవసనుండైనవాని, రామచంద్రుపాదుకల నాసనమున నునిచి కొలుచుచున్నవాని భరతుం గాంచి రామభద్రుచరిత్రం బంతయు వివరించి చెప్పిన నక్కైకేయీనందనుండు శత్రుఘ్నసమన్వితుండై వెడలి యయోధ్య కేతెంచి సీతాలక్ష్మణసమన్వితుండైన రామభద్రుం గాంచి పాదాభివందనం బొనర్చి రాజ్యమెల్ల నతని కప్పగించి పరమసమ్మదంబునం బొదలె. రామచంద్రుండును భరతశత్రుఘ్నుల సుప్రసాదదృష్టి నాదరించి యత్యంతసంతుష్టాంతరంగుఁ డయ్యె. అంత సర్వలక్షణసమంచితం బైనసుముహూర్తంబున వసిష్ఠవామదేవాదిమహర్షులు దివ్యజలములఁ దెప్పించి శ్రీరామచంద్రుఁ బట్టాభిషిక్తుం జేసిరి. అవ్విధంబునం గృతపట్టాభిషేకశోభనుండై రామభద్రుండు సుగ్రీవవిభీషణప్రముఖు లగుముఖ్యామాత్యులనెల్ల నత్యంతాదరంబున యోగ్యవస్తువుల నొసంగి సత్కరించి యెట్టకేలకు వానరుల నిజనివాసములకుఁ బోవఁగ ననుజ్ఞ యొసంగి పుష్పకవిమానంబుఁ గుబేరునొద్దకుఁ బనిచె. అట నారామచంద్రుండు పెక్కువేలేండ్లు రాజ్య మేలి గోమతీసరయూతీరంబుల ననేకాశ్వమేధాదియాగముల నాచరించి కీర్తిమంతుండై వెలసె. ఇది రామునిచరిత్రంబు.

ధర్మనందనా, నీవును రామునిమాడ్కి నాపదలెల్లఁ దొలంగి సౌఖ్యము లనుభవింతువు. సాధుసమ్మతం బయినమార్గమున వర్తించునీకు మే లొదఁగూడకున్నే? మఱియు నిస్సహాయుం డైనరాముఁడు క్రోఁతులు కొండముచ్చులు బాసటగాఁగ ద్వీపాంతరస్థితుం డైనశత్రుని సంహరించె. దేవతలనైనం బోరులఁ జీరికిం గొనని పేటిబిరుదు లైనభీమార్జుననకులసహదేవులు సహాయులుగాఁ గలనీ

కసాధ్యంబు గలుగునే? ఇపుడు సైంధవుఁడు కృష్ణ నపహరించికొనిపోయినను వెంట నంటి భీమార్జునులు వాని నిగ్రహించి మగిడి తోడితెచ్చిరిగదా. వారల విక్రమం బుగ్గడింప నలవియే? పుడమియెల్ల నీసొమ్ము. అంతయుం బరికించి శోకం బుడుగుము. నీయట్టిమహాత్ములకుం దులకెల్ల శోకింపఁ దగునే యని యూఱడించిన మార్కండేయువచనంబు విని ధర్మరాజు విగతశోకుండై వెండియు మార్కండే యుం జూచి మునీంద్రా, యేను వనవాసమునకును రాజ్యభ్రంశమునకు నంతగ శోకింపను. మఱి పరమపతివ్రతయయ్యుఁ బాంచాలి యిన్నిబన్నములఁ బడుచున్నది. దీనిం బోలినపతివ్రతను మీరు గంటిరే? వింటిరే? పతివ్రతామహాత్మ్యం బు వినవలతుం జెప్పవే యనియడుగ మార్కండేయుండు పాండవేయుం జూచి ధర్మనందనా, సావిత్రీచరిత్రంబను నితిహాసంబు గలదు. దాని వినినం బతివ్రతల మహాభాగ్యము తేటపడు. అవహితుండవై యాకర్ణింపు మని యిట్లని చెప్పం దొడంగె.

మార్కండేయుండు ధర్మజునకు సావిత్రీచరిత్రంబుఁ జెప్ప నారంభించుట.

మద్రదేశనాథుఁడై నయశ్వపతి యనురాజొకండు గలఁడు. అతఁడు పరమధార్మికుఁడు, బ్రాహ్మణప్రియుఁడు, సత్యసంధుఁడు, జితేంద్రియుఁడు, నిరంతర యాగతత్పరుఁడు, దాత, దక్షుఁడు, పౌరజానపదాదిసకలజనప్రియుఁడు, సర్వ భూతహితరతుఁడు, శాంతుఁడు ననం బ్రశస్తిఁ గాంచి ధర్మమున రాజ్యమేలుచుండి పెద్దకాలంబు సంతతిం గానక సంతప్తచిత్తుండై యపత్యలాభార్థంబు పదునెనిమిదియేఁడులు సావిత్రీశతసహస్రహోమముఁ జేయుచుఁ బ్రతిదినంబును షష్ఠభాగంబున మితాహారం బొనర్చుచు బ్రహ్మచారియు జితేంద్రియుండునై మహానియమములతోఁ దీవ్రవ్రతము సలిపె. అందులకు సుప్రీతయై సావిత్రి హోమవేది నుండి వెడలివచ్చి యారాజునకుఁ బ్రత్యక్షంబై యశ్వపతీ, నీనియమములకు భక్తికి మెచ్చితి. ఎన్నఁడైనను ధర్మము నేమఱవలదు. ఇష్ట మయినవర మడుగు మిచ్చెద ననినం బరమసంతుష్టుండై యశ్వపతి దేవీ, నాయెడం బ్రసన్నవేని కులకర్తలయినపుత్రులఁ బెక్కండ్ర ననుగ్రహింపుము. సంతానంబు పరమధర్మసాధనంబు. అది లేకున్న సుగతి లే దని బ్రాహ్మణులు వచింపఁగ విని నే నింతయత్నము చేసితి నని విన్నవించె. విన్నవించుటయు సావిత్రి యారాజుం బిలిచి యయ్యా, నీయభిప్రాయంబు నే నింతకుమున్న యెఱింగి బ్రహ్మపాలికిఁ జని నీకుఁ బుత్రులఁ బ్రసాదింపు మనియడుగ నద్దేవుండు శీఘ్రంబ నీ కొకకూఁతురు పుట్టు నని ప్రసాదించె. ఇందుకు మాఱు సెప్పవలదు. బ్రహ్మవచనం బమోఘంబుగావున నాకూఁతురే నీకు సర్వవిధశ్రేయస్సాధనం బయ్యెడు మని యానతిచ్చి సావిత్రి యంతర్ధానంబు నొందుటయు నశ్వపతి వీడు సేరి రాజ్యస్థుండై ప్రజలనేలు

చుండె. అంతఁ గొంతకాలమున కారాజుపట్టంపుదేవి యగుమాళవి యతనివలనం గర్భంబుఁ దాల్చె. ఆగర్భము శుక్లపక్షచంద్రునిమాడ్కి దినదినప్రవర్ధమానంబై పరమమోదావహం బయ్యె. అంత నొక్కనాఁ డామాళవి శుభముహూర్తమునఁ గూఁతుం గనుటయు నశ్వపతి యాపుత్రికి జాతకర్మాదిసంస్కారము లొనరించి సావిత్రీవరప్రభావమున జనించుటం జేసి సావిత్రి యనుపేరు పెట్టె. ఆకన్యయుఁ దల్లిదండ్రు లెంతయు గారామునఁ బెంపఁగఁ బెరిగి రూపాంతరముఁ దాల్చిన శ్రీదేవి యనఁ జెన్నారి మేన జవ్వనంబు నివ్వటిల్ల మవ్వంపువిలాసముల కాటపట్టుగా వెలయుచున్నం జూచి జను లందఱుఁ యిందువదన బృందారకసుందరి కాఁ బోలు ననియూహించుచుండిరి. దివ్యతేజోవిరాజిత యైనయాకన్నియ తేజంబునకు వెఱచి యేరును వరింపరైరి. అంత నొక్కపర్వమున నాసావిత్రి శిరస్స్నానముఁ గావించి యుపవసించి సావిత్రీదేవికిఁ బ్రీతిగా సుప్రజ్వలితం బయినయగ్నిహోత్రమునందు విధియుతముగ హోమము నొనర్చి బ్రాహ్మణులచే స్వస్తివాచనంబుఁ జేయించి పూజించి పూజాశేషపుష్పములం గ్రహించి తండ్రిపాలి కేతెంచి యతనియడుగుల కెఱఁగి పూజాశిష్టముల నివేదించి కృతాంజలియై యొకప్రక్కన నొదిగి కొలిచియుండె. నవనవయౌవనోన్మేషవిలాసవిలసితయై సురతరుణినాఁగ నొప్పారుచున్న తనపుత్రిని వరు లెవ్వరును వరింపమి కెంతయుఁ జింతాక్రాంతుండై యశ్వపతి కూఁతుం బిలిచి యమ్మా, నీకు వివాహకాలంబు ప్రాప్తంబైనది. నిన్నెవ్వరు నింతకు వరింపరైరి. భవద్గుణానురూపుఁ డైనభర్తను నీవైన వరించి నాకుఁ దెలుపుము. ఏను యుక్తాయుక్తముల నరసి యిచ్చెద. ఉచితకాలమునఁ గన్యాదానముఁ జేయనితండ్రియు, ఋతుకాలమున ధర్మపత్నితోడ సంగమింపనిభర్తయుఁ, దండ్రిపిమ్మటఁ దల్లిని రక్షింపనికొడుకును నిందార్హు లని ధర్మశాస్త్రవచనముల బ్రాహ్మణులు చదువుదురు. నా కానింద రాకుండఁగఁ జూడు మని వచించి మంత్రులను బెద్దలను రావించి మనసావిత్రి పతివరణార్థంబు తఱలుచున్నది. ప్రయాణసన్నాహంబు సమకట్టుఁ డనివచించిన వారు నట్ల చేసిరి. పదంపడి సావిత్రి తండ్రియడుగులకుఁ బ్రణామముఁ గావించి తదాజ్ఞం దలఁ దాల్చి నెమ్మొగమ్మున లలితలజ్జావిలాసము లంకురింపఁ గాంచన రథం బెక్కి మంత్రులుం బెద్దలుం దోడరాఁగ వెడలి రాజర్షులతపోవనముల కరిగి యచ్చటచ్చట మాన్యవృద్ధుల సేవించుచుఁ బుణ్యతీర్థముల నాడుచు విప్రులకు దానము లిచ్చుచుం దిరుగుచు రాజర్షిపుత్రులఁ గాంచుచుండె.

## నారదుఁ డశ్వపతియొద్దకు వచ్చుట.

అంత నొక్కనాఁడు నారదుండు సనుదెంచిన నశ్వపతి సభక్తితాత్పర్యంబుగ నమ్మునిం బూజించి సత్కథాగోష్ఠి నుండునంత సావిత్రి సర్వతీర్థముల సేవిం

చి సకలాశ్రమములం జూచి మగిడి మంత్రివృద్ధసమన్వితయై మద్రరాజధానిం జేర వచ్చి నగరు సొచ్చి నారదమునీంద్రుతోడ గోష్ఠినున్నతండ్రిం గాంచి యయ్యిద్దఱకుం దండప్రణామము లొనరించి వినయవినమ్రయై యుపాసించియుండె. నారదుఁ డపుడు మద్రేశ్వరుం జూచి నృపాలా, నీకూఁతు రెచ్చోటనుండి వచ్చినది. యౌవనమున నున్నదీని నింతకుఁ దగినవరున కేల యొసంగవైతి వనియడుగ నశ్వపతి మునివరేణ్యా, పతివరణంబుపొంటె దీనిం బంపితి. ఎవ్వని వరించివచ్చెనో వినవలయు నని చెప్పి కూఁతుం బిలిచి యమ్మా, సవిస్తరంబుగ నీపోయివచ్చినకార్యంబు సెప్పు మనుటయు సావిత్రి యిట్లనియె. సాళ్వదేశనాథుఁడై నద్యుమత్సేనుం డను రాజు పరమధార్మికుఁ డనఁ బేరు వడసి పెద్దకాలంబు రాజ్యమేలుచుండి వృద్ధత్వమున నొక్కకుమారుం గాంచి దైవయోగమున నంధుఁ డయ్యె. బాలపుత్రుఁడై నయాచీఁకుఱేని రాజ్యము నత్తఱిం దొల్లి యతని కోడినపగవా రొడిచికొనిన నాద్యుమత్సేనుండు భార్య నాబాలపుత్రుం దోడ్కొని మహారణ్యమునకరిగి తపస్సు చేయుచున్నవాఁడు. వానికుమారుఁడు తపోవనమున మునికుమారులతో నొక్కటఁ బెరిగి సత్యవచననిరతుండై సత్యవంతుఁ డనం బేరు వడసె. అతఁడు నాకుఁ దగినపతి యని మనస్సున వరించివచ్చితి ననిన విని నారదుండక్కటా! సావిత్రి యెఱుంగక వాని వరించి వచ్చె ననుటయు మద్రేశ్వరుండు నారదుం జూచి మునీంద్రా, సర్వలోకముల నీయెఱుంగనివారు లేరుగదా. వానిగుణంబులెట్టివి? వివరింపు మనియడుగ దేవముని యతని కిట్లనియె. నృపాలా, వినుము. ద్యుమత్సేనుపుత్రుండు సత్యము దప్పనిమహాత్ముఁ డగుటం జేసి బ్రాహ్మణులు వానికి సత్యవంతుఁ డనుపేరు పెట్టిరి. వానితల్లిదండ్రులు నొకప్పుడైన సత్యము విడువరు. మఱియు నారాజపుత్రుం డశ్వప్రియుండై మృణ్మయాశ్వప్రతిమలఁ జేయుచుఁ జిత్రముల గుడ్యముల వ్రాయుటం జేసి చిత్రాశ్వుఁ డనురెండవపేరఁ బరఁగు. వానిగుణము లేమి చెప్పుదు. తేజమున సూర్యుఁ బురడించు. బుద్ధిని బృహస్పతి ననుకరించు. వీర్యమున మహేంద్రుం బోలు. శాంతిని భూదేవిని విడంబించు. దానమున రంతిదేవున కెన యగు. సత్యవచనమున శిబిచక్రవర్తికి సాటివచ్చు. ఔదార్యమున యయాతినృపాలున కీ డగు. రూపసౌందర్యమున నశ్వినులలో నితం డొకరుఁడు గావలయు ననుతలంపుఁ బుట్టించు. వెండియు నతండు జితేంద్రియుఁడు, మిత్రవత్సలుఁ, డనసూయుఁడు, బలవంతుఁడు, శౌర్యవంతుఁడు, హ్రీమంతుఁడు, ధృతిమంతుఁడు, కీర్తిమంతుఁ, డార్జవవంతుఁడు. తద్గుణంబులు గణింప నలవిగావు. శీలవృద్ధులు తపోవృద్ధులు నగు పెద్దలు వానిఁ బెద్దయుఁ బేర్కొందు రనిన విని యశ్వపతి యమ్మునిం జూచి మునీంద్రా, యిట్లు సకలసుగుణసమన్వితుం డైనవాని వరించినను నీవు తొలుత "నక్కటా! సావిత్రి యెఱుంగక వరిం

చి వచ్చె" నని యేల పలికితివి. దోషములుం గలవేని తేటపఱుపవే యనియడుగ నమ్ముని వెండియు నిట్లనియె. సత్యవంతుఁడు సకలసుగుణసంపన్నుండై నను నేఁడు మొదలుగ నొక్కయేఁట వాఁడు పరిక్షీణాయువై మేను దొఱంగు. ఇది యొక్కండు వానియెడం గలదోషం బనిచెప్పిన విని యశ్వపతి విషణ్ణుండై కూఁతుం బిలిచి సావిత్రీ, మునిమాట వింటివిగదా. వీని విడిచి మఱియొకని వరింపు మనిపల్కిన సావిత్రి యిట్లనియె. భాగవ్యవస్థయుఁ, గన్యాదానంబును, యాచకుల కడిగినదాని నిత్తుననునొడంబడికయు నొక్కసారి చెప్పినం దప్పరాదు. మఱియు మనోవాక్కర్మంబులఁ బూర్వాపూర్వంబు ప్రమాణంబుగావున నేను మనస్సున వరించినపతిని విడిచి వేఱొక్కని వరించుట యధర్మంబు. నావరించినయతండు దీర్ఘాయువైన నల్పాయువైన సగుణుఁడైన నిర్గుణుఁడైన లాఁతివాని వరింపను. ఇది నాదృఢనిశ్చయం బనివచించిన విని నారదుఁడు మద్రేశ్వరుం జూచి నృపాలా, సావిత్రిమనోనిశ్చయంబు మార్పరాదు. సత్యవంతునికంటె నుత్తమగుణవంతుఁ డొకం డుండనేరఁడు. కావున వానికే యిమ్ము. దీనిపుణ్యముననైన నతండు చిరాయుష్మంతుం డగు మీకుమే లయ్యెడు మనిపలికి యారాజు నామంత్రణంబు చేసి నాకలోకమునకుఁ జనియె.

### సావిత్రి సత్యవంతుని వివాహం బగుట.

అంత నశ్వపతి నారదువచనంబునఁ దనకూఁతుం ద్యుమత్సేనపుత్రుండైనసత్యవంతున కొసంగ నిశ్చయించి మంత్రులఁ బెద్దలఁ బురోహితులను రావించి యయ్యర్థ మందఱకుం జెప్పి వివాహసముచితశోభనపదార్థముల నాయితపఱుప దగువారల నియమించి యొక్క పుణ్యదినంబునందు శుభముహూర్తంబున సావిత్రిం దోడ్కొని సకలరాజపరివారపరివృతుండై యయ్యరణ్యంబున కరిగి ద్యుమత్సేనునాశ్రమంబుఁ గాంచి యాశ్రమద్వారమునఁ దేరు డిగి పాదచారియై యాశ్రమాభ్యంతరమునకుఁ జని సాలతరుమూలమునం గుశాసనమునఁ గూర్చున్న ద్యుమత్సేనుం గనుంగొని నయనరహితుం డైన యారాజర్షికిఁ దన్నెఱింగించి యథార్హంబుగఁ బూజ లొనరించి మౌనమున నుండె. సాళ్వపతియు నతని మునియోగ్యం బయినయాసనమునం గూర్చుండఁ జెప్పి స్వాగతం బడిగి యాతిథ్యమున సత్కరించి యాగమనకారణం బెద్దియో యనియడుగ మద్రపతి సాళ్వపతి కిట్లనియె. భవత్పుత్రుఁ డైనసత్యవంతునకు నాకూఁతు రగుసావిత్రి నొసంగి పెండ్లి చేయ వచ్చితి. నాకూఁతుం గోడలిఁగా గ్రహింపు మనిచెప్పిన విని ద్యుమత్సేనుం డయ్యా, మేము రాజ్యముఁ బాసి యడవుల నుండెదము. గారామునఁ బెరిగిన నీకూఁతు రెట్లు మాయట్లు పాట్లుపడు ననియడుగ నశ్వపతి మఱియు నతని కిట్లనియె. సుఖదుఃఖములు దైవయోగమునం జేసి సంయోగవియోగములఁ బొరయుఁ

గాని యవి యొకనివశములు గా వని నాకును నాపుత్రికిని లెస్సగ విదితంబు.అది యెల్ల నెఱింగియే యేను వచ్చితి. ఇఁక నప్పలుకులు పలుకవలదు. నాకోర్కి కడ్డము సెప్పకుము. మన మిరువురము పరస్పరము వియ్య మందఁ దగినవారము. నా కూఁతురు నీకుమారునకుఁ దగినపత్ని యనిపలికిన విని ద్యుమత్సేనుండు మద్రేశ్వరుం జూచి యయ్యా, నాకు నీతోడ వియ్య మందఁగఁ గోర్కి కలదు గాని యది రాజ్యముగోల్పడుటం జేసి యెట్టు లొడఁగూడు నని చింతించుచుంటి. దైవయోగమునఁ గొనసాగె. సంతుష్టుఁడ నైతి ననివచించె. అంత నశ్వపతి తదాశ్రమవాసు లయినబ్రాహ్మణులఁ బిలిపించి విధియుతంబుగ సత్యవంతునకు సావిత్రి నొసంగి వివాహముఁ జేయించి కూఁతునకు నల్లునకుం దగినవస్త్రాభరణాదుల నరణమిచ్చి సంతుష్టచిత్తుండై వారల నామంత్రణంబుఁ జేసి మగిడి నిజపురమునకుఁ జనియె. ద్యుమత్సేనుఁడు ననుయూపబాంధవంబున కలరె. సత్యవంతుఁడునుసర్వగుణసమన్విత యైనభార్యంబడసి పరమానందంబునం బొదలె. సావిత్రియుం దండ్రి యరిగినపదంపడి యుత్తమవస్త్రాభరణాదుల నపనయించి పతియట్లు కాషాయవల్కములఁ గట్టి వాఙ్నియమనంబునను దేవోచితపరిచర్యలను మామకును, శరీరసత్కారంబుల సమయోచితంబుగవస్త్రాదిశమర్పణంబులను నత్తకును, నైపుణ్యంబునఁ బ్రియవచనంబున నేకాంతంబునఁ గామతంత్రకలాపంబుననుం బతికిని, వినయమున నెల్లవారికిం బ్రీతిఁ గావించుచుండె.

### సావిత్రి సత్యవంతునితోడ వనమునకుఁ బోవుట.

అవ్విధమున సావిత్రి యెల్లవారికి మెప్పుగా మెలఁగుచు నారదువచనముఁ దలపోసి రేలుం బవళ్లు చింతాక్రాంతచిత్తయై పతియాయుఃప్రమాణ మొక్కొక్క దినముగా గణించుచుండి నాలుగుదినములు కొఱఁతగా నాసంవత్సరము గడచనవచ్చుటయు నిఁక నాలవనాఁడు పతిమరణం బగు నని చింతించి త్రిరాత్రోపవాసవ్రతంబుఁ బూని పరమనిష్ఠమై సల్పుచుండె. అది విని ద్యుమత్సేనుఁడు కోడలిం బిలిచి యమ్మా, పరమదుష్కరంబై నవ్రతముఁబూనితివి. ఇట్టివ్రతము లాచరింప నీ వోపుదువే? పూనినవ్రతమువిడువు మనుటకుఁ గ్రమంబున నెఱవేర్పు మనుటకు నోరాడ కున్నవాఁడ ననిన సావిత్రి మామ కిట్లనియె. మహాత్మా, మీ రిందుల కింత వగవం బని లేదు. మనోనిశ్చయంబకాదె యన్నింటికిం గారణంబు. దృఢమనోనిశ్చయమునఁ బూనినయీవ్రతమునేను నెఱవేర్ప నోపుదు ననివిన్నవించి మామ నొడంబఱిచి యుపవాసనియమమునఁ గృశయై పతిమరణచింతావిషాదమునం ద్రిరాత్రంబుఁ గడపె. అంత మఱునాఁడు రేపకడన మేలుకని సావిత్రి నారదుండు చెప్పినట్లు పతిమరణదినంబు నేఁడుగదా యని తలంచుచు నత్యంతనియమమునఁ బూర్వాహ్ణకృత్యములఁ దీర్చి సూర్యోదయానంతరము

నం గొంత సేపునకు సుప్రజ్వలితం బైనయగ్ని హోత్రమున యథావిధి హోమము లాచరించి యత్తమామలకుఁ దదాశ్రమవాసు లయిన ద్విజవృద్ధులకుం దండప్రణామము లొనరించి వారివలన దీర్ఘసౌమంగల్యప్రదము లయినయాశీర్వాదములం బడసి ప్రాంజలియై వినయమున నత్తమామలం గొలిచి ధ్యానయోగపరాయణయై నారదువచనముఁ దలపోసి యాకాలము నాముహూర్తముం బ్రతీక్షించుచుఁ జింతించుచుండె. అత్తఱి నత్తమామలు సావిత్రి నేకాంతమునం బిలిచి యమ్మా, కడు దుష్కరం బైనవ్రతము యథావిధి నీ వాచరించితి. ఇఁక నిది పరిసమాప్తంబు గాఁగఁ బారణఁ జేయుము. పారణ కియ్యది ముఖ్యకాలం బనిచెప్పిన విని సావిత్రి నావ్రతమునకు సూర్యాస్తమయానంతరకాలంబు పారణావసరంబు. అప్పటికిఁ జేయుదు ననిచెప్పుచున్నంత సత్యవంతుఁడు దేవతార్థంబు ఫలసమిత్కుసుమాదులఁ దేరఁ బరశువు గొని యడవికిఁ దఱలె. తఱలుటయు సావిత్రి యతనియొద్ద కరిగి నేనుం గూడ వత్తు. నన్ను విడిచి యొకఁడుగఁ జనవల దనిచెప్పిన విని యతండు ప్రియాంగనం జూచి యోయత్యంతసుకుమారీ, వనమార్గంబులు దుర్గమంబులు, వాని నెప్పుడైనను నీవు చూచినదానవు గావు. మఱియు నిపుడు నియమమునఁ ద్రిరాత్రోపవాసవ్రతము సలిపి కడు బడలినదానవు. ఎట్లు లీమెత్తనియడుగులం గఠినభూభాగముల నడిచి రానోపుదు వని పలికిన సావిత్రిప్రియున కిట్లనియె. ఉపవాసమునం బడలిక నాకుఁ గొంచెమేనియుఁ గన్పట్టదు. రమణీయం బైనకాంతారదేశంబు నీతోడం జూడ వేడుక వొడమియడిగెదం గాన నిరాకరింపక చను విచ్చి తోడ్కొని పొమ్మనిచెప్పిన నాకర్ణించి సత్యవంతుఁడు ప్రాణదయితం జూచి నీతలం పట్టిదయేని కానిమ్ము. నాతల్లిదండ్రులయాజ్ఞఁ గొని రమ్ము. వా రాన తిచ్చిరేని నాపై దోషము గలుగ దనిపలుకఁగ సావిత్రి యత్తమామలపాలికిఁ బోయి వినయమునం బ్రణమిల్లి మీకుమారుఁడు ఫలాదులం గొనితేర వనమునకుఁ బోవుచున్నవాఁడు. ఆనతి యొసంగిన నేను నతనివెంటం బోయి వచ్చెద. ఇప్పు డతని నెడఁబాయం దగదు. గుర్వగ్నిహోత్రపరిచర్యార్థంబు చనుటం జేసి తద్గమనంబు నిరాకరింపరాదు. మఱియుఁ గుసుమితం బైనవనముం జూడ నాకుఁ గుతూహలం బెక్కుడు గలదు. నే నియ్యాశ్రమము సేరి కొంత తక్కువగ నొకవత్సరంబైన నింతకు నయ్యది నెఱవేఱదయ్యె. కావున నాప్రార్థనం బంగీకరింపుఁ డని తెలియఁబలికిన విని ద్యుమత్సేనుఁడు సావిత్రి వచ్చిననాఁటంగోలె నన్నెద్దియు నడుగక నేఁ డొక్కటి యడుగఁగా దనరా దనితలంచి యమ్మా, పోయి రమ్ము. ఏమఱక తెరువునం బతింజూచికొనుము. సర్వాభీష్టములం బడయు మనిపలికిన నత్తయు నట్లవచించె. అత్తెఱంగున నత్తమామలయనుజ్ఞం గొని సావిత్రి పతిమరణస్మరణశోకదూయమాన

మానసయయ్యు నది వెలిగాకుండఁగ లేనినవ్వులఁ దెచ్చికొని సత్యవంతునితోడ వనప్రదేశములం గ్రుమ్మరునెడ నతండు పుణ్యసలిలపూరితసరిత్ప్రవాహములను, బుష్పితఫలిత నానాతరునికరంబులను, రుచిరఫలకిసలయమకరందాస్వాదలోలుపశుకపికమధుకరమయూరాదివిహంగమమధురగీతంబులను వేఱువేఱ తెలియం జెప్పి వనరామణీయకంబుఁ జూపిన సావిత్రి యవియెల్లఁ గనుచు వినుచు నవ్వానాంతరంబునఁ బ్రియునితోడ మెల్లమెల్లన నడుచుచుఁ బతిపైఁ జూడ్కి నిలిపి విషాదవారిరాశినిర్మగ్నచిత్తంబుతోడఁ దద్వర్తనం బరయుచుండె.

తదనంతరంబ సత్యవంతుఁడు పుష్పఫలముల సంగ్రహించి గరిడియ నిండించి యొక్కచో గొడ్డంటం గట్టియలఁ జీల్చి తదాయాసంబునం బడలిస్విన్నగాత్రుండై గొడ్డలిఁ బుడమిం బడవైచి ప్రియాంగనం జూచి యింతీ, శూలములఁ బొడిచినట్లు తల నొచ్చుచున్నది. శరీరంబు వశంబుగాదు. మనస్సు మిక్కిలి పరితపించుచున్నది. బుద్ధి స్వస్థవృత్తిం బాసినది. ఒక్కింతసేపై నను నిలువనోపను. ఇచ్చటఁ బరుండఁగఁ దలంతు నని చెప్పిన విని సావిత్రి తన తొడ ప్రియునకుఁ దలగడగావించి యతని శయింపఁజేసి నారదువచనంబు విమర్శించుచుండె. అంతఁ గొండొకవడికి నీలగాత్రుఁడు, రక్తనేత్రుఁడు, రక్తాంబరధరుఁడు, బద్ధశిఖాకలాపుఁడు, సూర్యతేజుఁడు, పాశహస్తుఁడునై భయావహుం డైనయొక పురుషుని దనమగనిపార్శ్వమున నిలిచి యతనిన చూచుచున్నవానిం గనుంగొని మెల్లన మగనిశిరంబు దిగువఁ బెట్టి తటాలున లేచి వేపమానహృదయయై యాపురుషునకుఁ గేలుమోడ్చి యయ్యా, నీ వెవ్వఁడ వేమి చేయఁ బూనియుండెదవు ? అమానుషం బయిననీశరీరముఁ జూడఁగ దేవత యనుతలంపు వొడమె. నీవర్తనంబు వివరింపు మనియడుగ నతం డిట్లనియె. కల్యాణీ, నేను యముఁడను. పాతివ్రత్యమహిమమున నీవు నన్నుఁ జూచితివి. లాఁతివారి కేను దృశ్యుఁడఁ గాను. తత్కారణముననే నీతోసంభాషించెద. నీభర్త యగుసత్యవంతుఁడు క్షీణాయు వయ్యె వీనిం గట్టికొని పోయెద. ఇది నాచేయఁబూనినపని యనిన సావిత్రి దేవా, క్షీణాయువు లగుమానవులను నీదూతలు కొనిపోవుదు రని వినియుండుదు. అట్లుండ నీ వేల వచ్చితి వని యమునడుగ నద్దేవుఁడు పొలఁతీ, పరమధర్మాత్ముఁ డైనయితని నాదూతలు కొనిరా నోపరు కావున నేనే వచ్చితి నని ప్రత్యుత్తరం బొసంగి సత్యవంతునిశరీరమున నంగుష్ఠమాత్రుం డైనపురుషుని బాశబద్ధుం జేసి యాకర్షించి దక్షిణాభిముఖముగఁ బోవం దొడంగె. అంతర్యామిపురుషు నాకర్షించుటయు సత్యవంతునిశరీరము విగతప్రాణంబు, గతనిశ్వాసంబు, హతప్రభంబు, నిర్విచేష్టంబునై చూడ వికృతం బయ్యె. అవ్విధమునఁ బ్రేతపతి యప్పురుషు నాకర్షించి కొనిపోవుటయు నియతవ్రతసిద్ధయుఁ బరమపతివ్రతయు

నయినసావిత్రి యతనివెంటఁ జనుచుండ యముఁ డప్పతివ్రతం జూచి సావిత్రీ, నీ విఁక మఱలిపొమ్ము. ఓపినంత నడిచి పతిఋణముఁ దీర్చికొంటి వనిన సావిత్రి యమున కిట్లనియె. పతి యెచ్చోటికిఁ బోయిన నతనివెంటఁ బోవుట పతివ్రతకు సనాతనంబయినధర్మంబు. తపస్సు, గురుభక్తి, భర్తృస్నేహము, వ్రతము, భవత్ప్రసాదముం గారణంబులుగాఁగ నే నప్రతిహతగతి నైతి. తత్త్వార్థవిదు లగు పెద్దలు సప్తపదసంఘటనమాత్రంబున మైత్రి వాటిల్లు ననిచెప్పుదురు. కావున మిత్రతం బురస్కరించి కొంతవిన్నవించెదఁ జిత్తగింపుము. యోగ్యజనులు ధర్మార్థంబు వనవాసాదులాఁ జేయుదురు. ధర్మంబ యుత్తమం బనిపేర్కొందురు. సాధుసమ్మతం బయిన ధర్మమార్గంబు నవలంబించిద్వితీయతృతీయ పురుషార్థములఁ గోరరు. అట్టిధర్మమునకుఁ బ్రవర్తకుఁ డైనని న్నాశ్రయించిననేను మగని విడిచి మగిడి పోవం జనునే యని తనయభిప్రాయంబు మెల్లన విన్నవించె.

సావిత్రి యమునివలన నభిమతవరముల గ్రహించుట.

సావిత్రిప్రౌఢవచనముల విని యముండు సంతుష్టుండై దానిం బిలిచి నీప్రగల్భవచనమ్ములకు మెచ్చితి. భర్తృజీవితంబుదక్క నేనిం గోరిన నిచ్చెద నభిమతం బైనవరం బడుగు మనుటయు నారాజపుత్రి దేవా, రాజ్యము గోల్పడి యంధుఁడై యడవుల నున్ననామామగారికి మగుడ నేత్రములు వచ్చునట్లు ప్రసాదింపు మనియడిగె. ధర్మరాజును దానికోరినవరము నొసంగి పెద్దయు దవ్వు చనుదెంచి కడు బడలితివి. ఇఁక మఱలి చను మనిచెప్పిన విని సావిత్రి యముని దెస మొగంబై దేవా, పతిసమీపమున నున్ననాకు శ్రమ మెక్కడిది? పతి కెయ్యది గతియో యదియే నాకుం గతిగాఁ గలయది. నాపతిం దోడ్కొనిపోవు నెడకునన్నుం దోడ్కొనిపొమ్ము. మఱియు నావిన్నపం బాలింపుము. సాధుజనుల తోడిసంగమంబును జెలిమియు వ్యర్థములు గా వని పెద్దలవలన వినియుండుదు. సాధుజనశేఖరుం డైననీతోడిసమాగమస్నేహములఁ బడసిననామనోరథంబు సఫలంబు గాకున్నే యని వచించినం బరేతనాయకుండు దానిం జూచి బుద్ధివర్ధనంబును, మనోనుకూలంబును, హితాశ్రయంబు నైననీవచనంబు విని సంతుష్టుండ నైతి. సత్యవంతునిప్రాణముదక్క నితర మెద్ది గోరిన నిత్తు మఱియొక వరము నడుగు మనియె. అనవుడు సావిత్రి దేవా, నాశ్వశురుఁ డైనద్యుమత్సేనుఁడు రాజ్యముఁ గోల్పోయె నని విన్నవించితింగదా, క్రమ్మఱ నతనిరాజ్యమతనిం బ్రాపింపఁగ వరం బొసంగవే యనిప్రార్థించినం దత్ప్రార్థనం బంగీకరించి ధర్మరాజు రాజపుత్రీ, నీకోరినట్లు నీమామ లబ్ధరాజ్యుండై ధర్మమునఁ బ్రజల నేలు. కడు దూరము వచ్చితివి. మార్గాయాసంబు పెల్లుగ నగుఁ గాన నిఁక మఱలు మనుటయు సావిత్రి మఱియు నిట్లనియె. దేవా, లోకమునఁ బ్రజలనెల్ల నియ

మించి ధర్మమార్గమున శాసించుటంజేసి నీకు యముఁ డనుపేరు విశ్రుతం బయ్యె. భవన్నియమంబుననే జనులు సర్వభూతములయెడ నద్రోహవర్తనమును దానాదిధర్మములనుం జేయుచు శత్రువులైనను శరణాగతులైన సర్వవిధముల రక్షింతురు. నీకుఁ దెలియనిధర్మ్మంబుం గలుగునే యనిపలికిన నవధరించి కాలుఁడు దానిం గనుంగొని కల్యాణీ, పిపాసార్తునకుఁ బానీయదానంబుమాడ్కి నీమధుర వచనోపన్యాసము నామనం బలరించె. పతిజీవితేతరం బైనవర మడుగు మిత్తునను టయు నాసాధ్వి దేవా, సంతతిం గానక చింతిల్లుచున్న నాతండ్రికిఁ గులవర్ధనులైనకొడుకుల నూఱుగురఁ బ్రసాదింపవే యనిప్రార్థించె. తత్ప్రార్థనాప్రకారంబున యముండు దానికోరినవరము నొసంగి యమ్మా, యతిదూరము వచ్చితి వింక మఱలు మనిచెప్పిన సావిత్రియు వెండియు నద్దేవున కిట్లనియె. దేవా, భర్తృసన్నిధానమున నెంత నడిచినను నాకు దూరము దోఁపదుగాని మనస్సు బహుదూరము పాఱుచున్నది. కరుణించి నామనవి నాలింపుము. నీవు వివస్వంతునకుఁ గుమారుఁడవై యతనికంటెఁ బ్రతాపవంతుఁ డగుటంజేసి వైవస్వతుఁ డనఁ బరఁగితివి. ధర్మమునఁ బ్రజల శాసించుటంజేసి ధర్మరాజనా నెగడితివి. సాధువుల నమ్మినట్లు నేను నామనస్సును నమ్మను. కావున నెప్పుడును సజ్జనుల యెడఁబ్రణయంబు సేయుచుండుదు. సర్వభూతములయెడ స్నేహవిశ్వాసముల నెఱపుసాధువుల విశ్వసించుట యుచితంబుకాదే? నిన్ను నమ్మిననే నూరక యెట్లు మగిడిపోవుదు ననినం దానివచనంబు లాకర్ణించి వైవస్వతుం డోశుభాంగీ యిట్టిపలుకులు లౌకికవారివలన నింతకు విననైతి. నీయెడంబ్రీతుండనైతి. పతిప్రాణములుదక్క నితరము లెవ్వియైనం గోరికొనుము. నాలవవరము నొసఁగుదుననిన సావిత్రి దేవా, బలవీర్యశాలులు కులోద్వహులు నగునూఱుగురుకొడుకులను నాయందు సత్యవంతుఁడువడయఁగ ననుగ్రహింపు మని వేఁడికొనియె. అవ్వేఁడికోలు నాలించి దండధరుఁ డట్లయని రాజపుత్రీ, పెద్దయుదవ్వు చనుదెంచితివి. ఇఁకనైన మఱలి పొమ్మనుటయు నప్పతివ్రత యతని కిట్లనియె దేవా, సత్పురుషులయెడ ధర్మంబు నిత్యంబై యుండు. వారు తాము నెడక యితరులకుం జేటువాటిల్లకుండ రక్షింతురు. సజ్జనులసత్యంబునంగదా సూర్యచంద్రాదులకు స్వస్వకార్యపాటవంబు సెల్లుచున్నయది. వారేకదా యన్నింటికిం గతి. తమప్రయోజనము విచారింపక యార్యసమ్మతపథం బనుభావముతో వారుపరార్థముల సాధింతురు. కావున సజ్జనాశ్రయణం బెన్నఁడును విఫలంబుగానేరదు. మఱియు సజ్జనుల సేవించినవారికే భయంబునుం గలుగదు. సర్వార్థములు సేకూఱు. అనర్థములు తొలంగు. కావున సజ్జనులే సర్వవిధముల రక్షకు లని నిన్నాశ్రయించితి. నాకోరిక నెఱవేర్పక న న్నూరక పంపఁదగునే యని సవినయంబుగ విన్నవించె. విన్నవించినం

జిత్తగించి యముఁడు సావిత్రిం జూచి యోపతివ్రతాశిరోమణీ, మహార్థవిలసితంబు, సాధుపదంబు, ధర్మోపబృంహితంబు, మనోనుకూలంబునగు భవద్వచనోపన్యాసంబు వినఁగ వినఁగఁ బరమసంతోషం బయ్యె. నాయెడ నీకుఁ గలభక్తి తాత్పర్యంబు తేటపడె. అభిమతం బయినవరముఁ గోరికొను మనుటయు సావిత్రి యిట్లనియె. దేవా, యింతకుమున్ను చెప్పినట్లుగాక యభిమతం బైనవర మడుగు మని యానతిచ్చుటంజేసి నాపతి యగుసత్యవంతుఁడు జీవింపఁ గోరెద. ఇవ్వర మనుగ్రహింపుము. పతివియోగంబు గలిగెనేని స్వర్గలోకసుఖమైనను నా కింపుగాదు. ఇంకఁ బెఱసుఖములఁ జెప్పనేల? పతి మృతుఁడైన నేనుం బ్రాణముల విడువనున్నదాన. మఱియు నాపతి జీవింపఁగఁ బ్రసాదించిన నీ వింతకుమున్న నాకొసంగినశతపుత్రతావరంబు నెఱవేఱు. కావున నావేఁడికోలు నాలించి పతిజీవితం బొసంగి నీవచనంబు సత్యంబుఁ జేసికొను మని ప్రౌఢమధురంబుగ మనవిసేయుటయు వైవస్వతుండు సంతుష్టచిత్తుండై సత్యవంతుఁ బాశవిముక్తుం జేసి యోకులనందినీ, నీ పతి నిదె విడిపించితి. ఇతండు సర్వార్థసిద్ధుండై యారోగ్యవిలసితుండై నన్నూఱేండ్లు నీతోడ నభిమతసుఖముల ననుభవించుచు నీయందు నూఱుగురు కొడుకులం బడసి బహుయజ్ఞముల నాచరించి ధార్మికవరేణ్యుఁ డనం గీర్తిఁ బడయు. నీకొడుకులుం గ్రమమునఁ బుత్రపౌత్రులం బడసి రాజ్యముల నేలుదురు. నీవంశము నీపేర శాశ్వతంబై పరఁగు. మున్నొసంగినవరములెల్లఁ జెప్పినట్లు నడుచు. ఇంక మఱలిపొమ్మని సావిత్రిని వీడ్కొలిపి సవితృనందనుండు నిజలోకమునకుఁ జనియె.

సావిత్రియు భర్తతోడ మగిడి తొల్లింటిచోటికి వచ్చి పతికళేబరము డాసి దానిం దనతొడపై నిడికొని కూర్చుండునంత సత్యవంతుండు లబ్ధచేతనుండై దేశాంతరమున కరిగివచ్చినవానియట్లు ప్రియాంగనం బలుమాఱులు చూచిచూచి కల్యాణీ, యేను బెద్దయుంబ్రొద్దు నిద్దురవోయితింగదా. ఏల నన్నింతతడవు మేల్కొలుపవైతివి. నన్నాకర్షించినయానీలగాత్రపురుషుఁ డెల్లొకో యగపడఁ డనియడుగ. సావిత్రి పతిం జూచి మీరు నాతొడపై నిద్రవోయి యిపుడె మేల్కాంచితిరి. ఆనీలపురుషుఁడు యముఁడు. నిజలోకమునకుఁ జనినవాఁడు. లేవనోపుదు రేని లెండు. గాఢరాత్రియయ్యె. ఇంక నాలసింపక యాశ్రమమున కరుగుట లగ్గనిచెప్పినం బ్రాణవల్లభవచనం బాకర్ణించి సత్యవంతుఁడు నిదురవోయి లేచినవానిచందమున మెల్లన లేచి యంతటఁ గలయం జూచి సావిత్రి కిట్లనియె. సుదతీ, దేవతార్థంబు ఫలకుసుమాదులం గొనిపోవఁగ నీతోడ నే నిచ్చటికి వచ్చి గొడ్డంటం గట్టియల జీల్చి శిరోవేదనావ్యథితుండనై నిలువనోపక నీతొడపై నిద్రపోయితింగదా. ఇంతయు నే నెఱుంగుదు. అట్లు నిద్రవోవుచుండి నీలగా

త్రుండు, రక్తనేత్రుండు, మహాతేజుఁడు, ఘోరాకారుఁడు నైనయొకపురుషుం గనుంగొంటి. అది కలయో నిక్కంబో నిర్ణయింపనేరను. నీ వెఱుంగుదువేని వివరింపు మనియడుగ సావిత్రి యతని కిట్లనియె. ప్రాణవల్లభా, రేపు నే నంతయు సవిస్తరముగఁ జెప్పెద. ఇపుడు గాఢరాత్రి యయ్యె. ఇఁక నిచ్చటఁ దడయరాదు. నిశాచరులు క్రూరముగ నఱచుచు నంతటం దిమ్మరుచున్న వారు. రాలినాకుల చప్పుళ్లు పరికింపఁగఁ గ్రూరమృగములు తిరుగందొడంగిన తెఱంగు దోఁచుచున్నది. ఇటకు దక్షిణపశ్చిమదిశల నక్కలు ఘోరనాదములఁ జేయుచున్నవి. ఇందులకు నాడెందము వెతఁ జెందుచున్నది. లేలెమ్ము. ఆశ్రమంబునకుఁ జని తల్లిదండ్రులఁ జూడుమనిన సత్యవంతుఁడు కల్యాణీ, బహుళతరునికరసాంద్రతం జేసి గాఢధ్వాంతదంతురంబై భయంకరంబైనయీవనమునఁ ద్రోవ నేరీతి నెఱుంగుదువు. నాకుం జూడ దుష్కరంబనితోఁచెడి నని చెప్పఁగ నారాజపుత్రి యతనికిట్లనియె. ఈయడవిం గాలినద్రుమో డొక్కటి వెలుంగుచున్నది. తదగ్ని వాతవిధూతంబై యిటునటుం జెదిరి యిచ్చటచ్చటఁ జూపట్టుచున్నది. అయ్యగ్నిం దెచ్చి నీవుచీల్చినకట్టియలఁ దవిలించెద. ఆ వెలుంగునఁ బోవచ్చు. నడువ నోపిక లేకుండునేని యీరేయి యిచ్చటన యుండి రేపకడన పోవుద మనిన సత్యవంతుఁడు సావిత్రి కిట్లనియె. ఇపుడు నాకుఁ దలయే రుపశమిల్లె. శరీరము స్వస్థవృత్తిం బొరసె. నీతోడ్పాటున నిపు డాశ్రమమునకుఁ బోయి తల్లిదండ్రుల జూడఁ దలంచెద. నే నింతకుము న్నెన్నఁడు నింతవేళ నాశ్రమము విడచినవాఁడనుగాను. ప్రొద్దు గ్రుంకకమున్న మాతల్లి న న్నాశ్రమంబు విడువనీదు. పగలైన నే నెక్కింతతడవు నేసిన నెంతయు సంతపింతురు. ఇపుడు మాతండ్రి యాశ్రమవాసుల నాదఱఁబిలిచి నావర్తనం బరయుచు నను వెదకుచుండు. వెడలునపుడే తల్లిదండ్రులు నీవు పోయిన నాలసించి వత్తువుగాని వేగంబ రా వని నిందించిరి. ఇంతరేయిదాఁక నన్నుఁ గానక యాముమున శ్లింతయవస్థఁ బడిరో. ము న్నొకతఱి వా రిద్దఱు నన్నుఁ జెంగటఁ గూర్చుండఁ బెట్టికొని నాశిరంబు మూర్కొని పుత్రా, నిన్ను విడిచి బ్రదుకనేరము. నీవు బ్రదికియుండినందాఁక మేముం బ్రదుకుదుము. నీవే మా కూఁతకఱ్ఱి. నీయందె యస్మదీయవంశపిండకీర్తులు సుప్రతిష్ఠితంబు లని యత్యంతప్రేమమునఁ జెప్పిరి. అట్లు నన్నే నమ్మియుండినవా రిద్దఱు నింతకాలంబు నాయెడఁ బాటు సైఁపనేర్తురే? వారు ప్రాణముల విడిచిరేని నాప్రాణములు నేల? నాజీవితంబు తత్పరిచర్యార్థంబ యని భావించియున్న నావలన వారి కపచారంబు వాటిల్లె. కన్నుగానని యావృద్ధుఁ డెంత పరితపించునో? అతిదుర్బల యైనయాపతివ్రతాశిరోమణి యెంత పలవించునో? ఎల్లపుడుం బ్రియంబుఁ జేయవలసిననానిమిత్తంబున వా రెంతపడిరో? యనిపలువిధంబులం బనివి గురుభక్తివిశేషంబునం

జేసి మనస్సు నిలుపనేరక పరమదుఃఖార్తుండై బాహువుల మీఁది కెత్తి యెలుఁ గేర్పడ నేడ్చెఁ. అట్లు శోకాక్రాంతచిత్తుం డయినసత్యవంతుం జేరం జని సావిత్రి కన్నీరు దుడిచి యేను దపస్సు లొనరించితినేని దానములఁ జేసితినేని హోమముల సల్పితినేని మేలమునకైన నన్నృతంబు పలుకనేని యాసత్యమున నీరాత్రి నాయత్తమామలకు నీకుం గీడు వొసఁగకుండెడి నని యూరార్చిన నారాజపుత్రుండు వెండియుం బ్రియాంగనం బిలిచి నే నిపుడే తల్లిదండ్రులం జూడఁ దలఁచినాఁడ. ఆలసించినం దజ్జీవితంబు నమ్మరాదు. అందు వైపరీత్యంబు వొసంగెనేని నిక్కంబ యేను జీవింపను. నీకు ధర్మబుద్ధియు నన్ను బ్రదికింపఁ దలంపును నాకుఁ బ్రియము కర్తవ్యం బనుతాత్పర్యంబునుం గలుగునేని యీక్షణంబ నన్నాశ్రమమునకుఁ దోడికొని పొమ్మని తెగఁబాఱి పలికె.

## సావిత్రీ సత్యవంతులు మగిడి యాశ్రమమునకు వచ్చుట.

అంత సావిత్రి లేచి సిగఁ గట్టికొని రెండుచేతులం బట్టి పతిని లేవనెత్తిన నతండు లేచి కరతలమున మేనెల్లం దడవికొని యంతటఁ గలయం గనుంగొని పువ్వులగరిడియదెసం జూచుటయు సావిత్రి యీగరిడియ యెల్లి గొనిపోవచ్చు. నేఁడు యోగక్షేమార్థంబు పరశువుం గొనిపోవుద మని పతి కెఱింగించి పుష్పఫలభరితం బయినయాపుట్టిక నొకకొమ్మం దగిలించి పరశువుఁ జేతం గొని పతిపాలి కేతెంచి యతనివామభుజంబు తనదాఁపటిమూఁపునం బెట్టికొని కుడిచేత నతనిం గౌఁగిలించికొని మందగమనంబునం జనుచుండ సత్యవంతుఁ డారాజపుత్రి కిట్లనియె. ప్రతిదినమును రాకపోకలం జేసి యలవాటున నిపు డీత్రోవలనెల్ల నెఱుంగుచున్నాఁడ. బహుళపాదపసాంద్రం బయిన యీవనంబున నాకులు గాలికిఁ గదలునపు డాసందులఁ దెలియవచ్చువెన్నెలచేతం గొంత గుఱుతు తెలియుచున్నది. ఇదియేతొలుత మనము పూవులం బండులం గోయుచు నరుదెంచినతెరువు. విచారింపక నడువుము. ఇంక ముందటఁ బలాశఖండము నొద్ద రెండుత్రోవలు గానవచ్చు. అందుత్తరం బయినమార్గమునం బోవలయు. ఇప్పటికి నేను దొల్లింటియట్ల స్వస్థుఁడనై బలవంతుఁడ నైతి. అతిరయమున రానోపుదు. త్వరసేయు మని చెప్పుచున్నంత నయ్యాశ్రమము వారి కత్యంతసన్నిహితం బయ్యె. అంత నక్కడ ద్యుమత్సేనుండు లబ్ధనేత్రుండై యంతయుం గనుంగొని యిందులకుఁ గతం బెయ్యదియో యని యరయుచుండి సాయాహ్నముదాఁకం గొడుకు రామికి వగచి భార్య యగుశైబ్యయుం దాను నాశ్రమంబుల, నేఱుల, వనములఁ, గొలంకుల, వాఁగుల వెదకి వెదకి యెచ్చటనైనను శబ్ద మొక్కటి వినవచ్చెనా మనసత్యవంతుఁడు సావిత్రితోడ ముచ్చటలాడుచు వచ్చుచున్నాఁ డని పలుకుచు ఱాలు ముండ్లుం దాఁకఁగ రక్తసంసిక్తపాదములతో నంతటం గ్రుమ్మరుచుం

డ నాశ్రమవాసు లయినవిప్రులు వారలం బొదివి తెచ్చి యాశ్రమంబుఁ జేర్చి యూరార్చి పురాతనరాజచరిత్రములఁ జెప్పుచు బ్రొద్దు పుచ్చుచుండిరి. ఎంద ఱెంత యూఱడించిన నాముదుసళ్లు కొడుకుచిన్ననాఁటిచేతలఁ గోడలిసద్గుణంబులనుం దలంచి శోకతప్తచిత్తులై హాపుత్రా! సత్యవంతా!! హాస్నుషా! సావిత్రీ!! యెచ్చట నున్నవారు? పిలిచిన నేలొకో పలుక రని పేరెలుం గెత్తి యేడ్చుచుండ సువర్ణసుం డనుమునీంద్రుఁడు వారిం జూచి మీ కింత వగవ నేల? తపోదమాచారసంపన్న యగుసావిత్రి పత్నియగుటం జేసి నీకొడుకు బ్రదికియున్నవాఁ డని వచించె. అంత గౌతముఁడు వారలఁ జేరవచ్చి యేను సాంగవేదముల నభ్యసించితి. మహాతపము నాచరించితి. యథావిధి బ్రహ్మచర్యవ్రతము సల్పితి. గురువుల సేవించితి. అగ్నుల నుపాసించితి. సమాహితచిత్తముతో ననేకవ్రతము లనుష్ఠించితి. మఱియు వాయుభక్షుఁడను. నిత్యోపవాసనిరతుఁడనై తీవ్రతపం బొనర్చితి. ఏతన్మహిమమునం జేసి నాకు లోకవృత్తాంతమెల్లఁ గరతలామలకంబై యుండు. సత్యవంతుఁడు జీవించియున్నవాఁడు. నామాట నమ్మఁదగు ననిపలికె. అట నా గౌతముశిష్యుఁడు మాయుపాధ్యాయువచన మెన్నఁడును మిథ్యగాదు. కావున సత్యవంతుఁడు జీవించియున్నవాఁడే యనిచెప్పె. పదంపడి భరద్వాజుఁడు తపోదమాచారవిలసితయైనసావిత్రి ధర్మపత్ని యగుటం జేసి సత్యవంతుఁడు జీవించియున్నవాఁ డని వాక్రుచ్చె. పిదప దాల్భ్యుఁ డెన్నఁడో పోయినయీద్యుమత్సేనునికన్నులు నేఁడు వచ్చె. సావిత్రియు నాహారముఁ జేయకయే పతితోడఁ బోయినది. ఇది యంతయుం జూచిన సత్యవంతుఁడు జీవించియున్నవాఁ డని నాకుఁ దోఁచెడి ననివక్కాణించె. పిమ్మట నాపస్తంబుఁడు మృగపక్షులయులివును, దిశలప్రశాంతిని బృథివిం గలశకునములనుం బరికించిచూచిన సత్యవంతుఁడు జీవించినవాఁడె యని తోఁచెడి నని నుడివె. పదంపడి ధౌమ్యుఁడు సర్వగుణయుతుండైనసత్యవంతుఁడు దీర్ఘాయుర్లక్షణోపేతుండు గావున జీవించియున్నవాఁ డనిభాషించె. తదనంతరంబ ఋషు లందఱు దీర్ఘసుమంగలీత్వసూచకంబులైనశుభలక్షణముల నొప్పారినసావిత్రి ధర్మపత్ని గావున సత్యవంతుఁడు దీర్ఘాయుష్మంతుఁ డని యొక్కుమొగి వివరించిరి. అవ్విధమునఁ దపోధనులు వచించినవారిసత్యవచనమ్ము నమ్మి యావృద్ధదంపతు లించుక యూఱడిల్లి యున్నంత సావిత్రీసత్యవంతు లాశ్రమముఁ జేరిరి. అపుడు బ్రాహ్మణు లందఱు ద్యుమత్సేనుం జూచి నృపాలా నీభాగ్యమే మనిచెప్పుదుము. మాచెప్పినట్లు కొడుకుఁ గోడలును వచ్చిరి. ఎన్నఁడో పోయినకన్నులును వచ్చె. శీఘ్రంబ సర్వసంపదలం బొందుదు వనిచెప్పి యగ్నిహోత్రము బ్రజ్వలితంబుఁ గావించి ద్యుమత్సేనుచుట్టుం గూర్చుండుటయు శైబ్యయు సావిత్రీసత్యవంతులును వారియనుజ్ఞఁ బడసి కూర్చుండిరి.

అంత ఋషు లందఱు జాతకౌతూహలులై సత్యవంతుం బిలిచి యయ్యా
నీవు భార్యతోడఁ బవలే రావలసియు నట్లు చేయక యేల యీనడురేయి వచ్చి
తివి ? ఆలసింపఁ గతం బెయ్యది ? నీరాకకు విఘాతం బెద్దియేనియుఁ బొసఁగెనా?
భవదాగమనవిళంబమునం జేసి నీతల్లిదండ్రులు మేము నిందాఁకఁ బెల్లదలుచుంటిమి
కారణంబు వివరింపు మనియడుగ సత్యవంతుఁడు మునులారా యేను దండ్రి
యానతిం గొని సావిత్రితోఁడ నడవికిఁ బోయి పుష్పఫలముల సంగ్రహించి పరశు
ఘాతంబునఁ గాష్ఠదళనంబుఁ జేసి తదాయాసమునఁ బెద్దయుం బ్రొద్దు నిద్రించితి.
ఇంతకుము న్నెన్నఁడు నంతసేపు నిద్రించియుండను. అంత మేల్కాంచిచూచి
నడురేయి యగుట నెఱింగి యింకను విళంబంబు సేసిన మీరందఱు చింతాశోక
సంతప్తు లగుదు రనుతలంపుతో నీయర్ధరాత్రంబున వచ్చితి. ఇది నాయెఱింగిన
కారణం బనిచెప్పె. అది విని గౌతముఁ డిది తగినకారణంబు గాదు. ద్యుమత్సే
నునకుఁ గన్నులు రాఁ గారణ మొక్కఁ డవశ్య ముండవలయుఁగదా. తత్కార
ణంబెల్ల సావిత్రి యెఱింగియుండనోపు ననివచించి సావిత్రిదెస మొగంబై రాజ
పుత్రీ, నీవు తేజోమహిమమున సావిత్రీదేవిని బోలినదానవు గావున నన్నింటికిం
గారణంబు నీ వెఱింగియుండుదు వనినే నూహింతు. రహస్యంబుగాక చెప్పఁదగు
నేని తెలపఱుపు మనియడుగ సావిత్రి యిట్లనియె. మునీంద్రా, మీరెఱుంగని
యర్థంబునుం గలుగునే? మీయెడ రహస్యం బెయ్యది? తెలిసినంతయు వివరింతు
వినుఁడు. తొల్లి నేను నారదునివలన నీసత్యవంతునకు నేఁడు మరణము గలుగు
నని విని యున్నదాన. దానంజేసి శోకసంతప్తచిత్తనై నాలుగునాళ్లుగ ననశన
వ్రతంబుఁ బూని నేఁడు పతి యడవికిఁ బోవుచుండిన నతని విడిచి యుండరా
దనుతలంపుతో నేనుం గూడఁ బోయితి. పోయి యతండు బడలి నాతొడపైఁ
దల నిడికొని నిద్రించుచుండిన యముఁడు వచ్చి యతని నాకర్షించి పితృదిశకుఁ
జనుచుండె. అంత నే నతనివెంటం బోయి పలుదెఱంగులఁ బ్రస్తుతించి తత్ప్రసా
దమున నైదువరములఁ బడసితి. అందుఁ బ్రథమవరమున నీవృద్ధరాజునకుఁ గన్ను
లు వచ్చె. ద్వితీయవరమున నీరాజు మఱలఁ దొల్లింటియట్ల రాజ్యస్థుఁడై ప్రజల
నేలఁగలఁడు. తృతీయవరమున నాతండ్రి యగునశ్వపతికిఁ గులోద్ధారకులైనకొ
డుకులు నూఱుగురు పుట్టువారు. నాలవవరమున నాయందు సత్యవంతుఁ డుత్తమ
పుత్రుల నూఱుగురఁ బడయువాఁడు. పంచమవరప్రభావమున సత్యవంతుఁడు
నన్నూఱేండ్లు సుఖమున జీవించి యనేక యజ్ఞము లాచరించి కీర్తిమంతుఁ డగు.
భర్తృజీవితార్థంబు నాపూనినవ్రతంబు లెస్సగఁ బరిసమాప్తం బయ్యె సుఖో
త్తరం బయినదుఃఖము నెట్లో నే ననుభవించితి. నాయెఱింగినకారణం బంతయు
సవిస్తరముగఁ దెలపఱిచితి ననిన విని ఋషు లోపతివ్రతాశిరోమణీ, తమోమ

యహ్రదమున మునుఁగుచున్న యీ రాజకులముం బరమసాధ్వివైననీ వుద్ధరించితి వని సావిత్రిం బలుదెఱంగుల నభినందించి ద్యుమత్సేనుని సత్యవంతుని నామంత్రణంబు చేసి సంతుష్టచిత్తులై నిజాశ్రమములకుఁ జనిరి.

## ద్యుమత్సేనుఁడు మఱల రాజ్యముఁ బొందుట.

అంత నారాత్రి గడచుటయు మఱునాఁడు సూర్యోదయానంతరమునఁ గృతాహ్నికులై మునులు ద్యుమత్సేనునొద్దకు వచ్చి సావిత్రిపుణ్యచరిత్రంబుఁ జెప్పుచుండ సాళ్వదేశమునుండి ప్రకృతిజను లరుదెంచి ద్యుమత్సేనుం గాంచి నరేంద్రా, మీశత్రురాజును మంత్రిబాంధవసహాయసహితంబుగా భవన్మంత్రి వధించె. శత్రుబలం బెల్ల నలుదెసలం బాఱె. సకలజనులు నంధుఁడైనను దృష్టిమంతుఁడైనను నీవే మాకు రాజు గావలయు నని యొక్కమాటగాఁ జెప్పి మమ్మనుపఁగ వచ్చితిమి. చతురంగబలంబులు తగినవాహనము లివె వచ్చినవి. భవద్విజయంబుఁ బురంబున నంతటం జాటించితిమి. పెద్దకాలము పాసినకులపరంపరాప్రాప్తరాజ్యం బధిష్ఠింపు మనివిన్నవించి తమరాజు లబ్ధనేత్రుండై యుండుటకుఁ గరంబు ముదంబునం బొదలిరి. అంత ద్యుమత్సేనుఁడు నామహర్షులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి వారిచే ననుజ్ఞాతుండై భార్యను, గొడుకును, గోడలినిం దోడ్కొని యుత్తమవాహనారూఢుండై మహాసేన వెంటఁగొలిచిరాఁగ సాళ్వరాజధానిం జేరుటయుఁ బురోహితు లతని సకలరాజ్యమున నభిషిక్తుం జేసి సత్యవంతునకు యావరాజ్యాభిషేకముఁ గావించిరి. అంతం గొంతకాలము నకుఁ గ్రమంబున సావిత్రి యుత్తమపుత్రశతంబుఁ గాంచె. మద్రేశ్వరుం డైన యశ్వపతి మాళవియందుఁ బుత్రశతంబుఁ బడసె. అవ్విధమున సావిత్రి తన్నుఁ, దల్లిదండ్రుల, నత్తమామల, భర్తను, గులద్వయంబు నుద్ధరించె. ధర్మనందనా, సావిత్రిచందమున నుత్తమశీలగుణసంపన్న యగుపాంచాలియు మి మ్ముద్ధరించు నని సావిత్రిచరిత్రం బుపన్యసించి మార్కండేయుండు నిజాశ్రమంబున కరిగె. ధర్మరాజు తచ్చరిత్రం బాకర్ణించి యాఁటిల్లి కామ్యకవనమునందు విప్రగోష్ఠి నుండె. సావిత్రీచరిత్రంబు భక్తిమై విరినవారు సర్వార్థసిద్ధులై సుఖములఁ గాంతు రనిచెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుంజూచి మునీంద్రా, రోమశుండు వచ్చి యర్జునుఁడు భూలోకము సేరినపిదప నింద్రుఁడు కర్ణునికవచకుండలము లపహరించు నని తత్సందేశముగాఁ జెప్పినవాఁడుగదా. అది యెట్లయ్యె? వివరింపవే యని యడుగ నతం డతని కిట్లనియె.

## సూర్యుఁడు బ్రాహ్మణవేషముతో వచ్చి కర్ణునకు హితముఁ దెల్పుట.

పాండవులు వనమున నుండఁగఁ బండ్రెండేండ్లు గడచి పదుమూఁడవ యేఁడు వచ్చుతఱి దేవేంద్రుఁడు పాండవహితార్థియై కర్ణునిసహజకవచకుండలముల

యాచింప నుద్యమించిన నతనియభిప్రాయం బెఱింగి సూర్యుఁ డొక్కనాఁడు విప్ర వేషధారియై ప్రభాతమునఁ గర్ణునకుఁ గలలో నగపడి పుత్రస్నేహంబు నెఱయ నిట్లనియె. కర్ణా నాబోధించెడిహితవచనంబు వినుము. బ్రాహ్మణు లెద్ది యాచించినను నీవు లే దనక యిచ్చువాఁడ వని తెలిసినవాఁడు గావున నింద్రుఁడు పాండవహితార్థంబు బ్రాహ్మణవేషధరుండై నీసహజకవచకుండలముల యాచింప వచ్చువాఁడు. అతండు యాచించిన వివిధోపాయములఁ బన్ని నారీరత్నధనాదుల నిత్తు నని చెప్పి యనునయించి యతని ననుపవలయుఁగాని కవచకుండలముల నియ్యరాదు. వాని నిచ్చితివేని క్షీణాయుఁడవై మృత్యువశగతుండగుదువు. అవియుండెనేని శత్రులకు నీ వవధ్యుండవు. అమృతసంభవంబు లయినయీకవచకుండలంబులప్రభావం బిట్టిది. విశేషం బేల? ప్రాణములపైఁ బ్రీతి గలదేని వాని నీవలవ దని చెప్పిన విని కర్ణుఁ డతనిం జూచి యయ్యా, నీ వెవ్వండవు? నాకుఁ జూడ బ్రాహ్మణవేషము ధరించి వచ్చినదేవుఁడ వనితోఁచెడి ననియడుగ నతండు కర్ణా, నేను సూర్యుఁడను. నీకు హితము బోధింపవచ్చితి. నామాటమెయి నడువుము. నీకుఁ బరమశ్రేయం బయ్యెడు మనిన సూర్యునకుఁ బ్రణమిల్లి కర్ణుఁ డిట్లనియె. దేవా, నీవు హితం బుపదేశింప వచ్చినంతన నాకు శ్రేయములెల్లఁ జేకూఱె. భవత్ప్రసాదంబు వడయం గోరి ప్రణయమున విన్నవించెదఁ జిత్తగింపుము. నాయెడం బ్రీతి గలదేని నావ్రతంబు వారింపవలదు. బ్రాహ్మణు లడిగినం బ్రాణములనైన నే నిత్తు నని లోకమెల్ల నెఱుంగు. ఇపుడు పాండవహితార్థంబు శక్రుండు విప్రుండై కవచకుండలముల నడిగిన నే నెట్లు లియ్య ననిపలుకుదు? ఇచ్చుటయే యుత్తమంబు. ఒసఁగకున్నం దైలోక్యవిశ్రుతంబైననాకీర్తి యింతటితోఁ బాడవడంగు. కీర్తిహానికరం బయినప్రాణరక్షణంబు నాయట్టివానికిఁ దగినపనియే? మరణంబైనం గీర్తికరం బగునేని నాకు సమ్మతంబు. పాండవహితార్థంబు మహేంద్రుఁడు నన్నుఁ గవచకుండలముల యాచింపవచ్చిన నే నిచ్చితినేని దాన నాకుఁ బరమకీర్తియు వారి కపకీర్తియు గలుగు. ఎంత చింతించిన నిచ్చుటయే యుత్తమం బని తోఁచుచున్నది. ప్రాణ మిచ్చియైనం గీర్తి సంపాదింతు. ఇది నానిశ్చయంబు. కీర్తిమంతుఁడు స్వర్గలోకమున సుఖించు. కీర్తియే పురుషుం దల్లిచాడ్పున రక్షించు. కీర్తియె యీలోకమున నాయుర్వృద్ధి నూర్ధ్వలోకమున సద్గతిం గావించు. కావునఁ బురుషునకుఁ గీర్తియే పరాయణంబు. కీర్తిహీనుఁడు సర్వవిధములఁ జెడు. బ్రదికియు జీవచ్ఛవం బనం దూఱువడు. కీర్తియే సకలశ్రేయస్సాధనం బని తొల్లి బ్రహ్మదేవుఁడు సెప్పె నని విందుము. అడిగినదానిం బ్రాహ్మణుల కిచ్చి శత్రువుల గెలిచి రణమున శరణుసొచ్చినవారలఁగాచి బాల, వృద్ధ, బ్రాహ్మణులసంకటములఁ బాపి సంగ్రామమున వెనుదీయక పోరాడి సమరవేదిలో శరీరము వ్రేల్చి

యుత్తమకీర్తి సాధించి. పుణ్యలోకంబుఁ బ్రాపింప నున్నవాఁడ. కీర్తిరక్షణంబ నాకుఁ బరమవ్రతంబు. కావున బ్రాహ్మణవేషధరుం డైనయింద్రునకుఁ గవచకుండలముల నిచ్చి యుత్తమగతిం బొందుదు ననిన వినిన సూర్యుఁడు కర్ణునకిట్లనియె. కర్ణా, నీకును, దల్లిదండ్రులకును, భార్యలకును, బుత్రులకును, మిత్రులకును, నహితంబుఁ జేయకుము. కవచకుండలము లిచ్చిన శరీరహాని యగు. శరీరమునకుఁ జేటు పొసఁగకుండఁగఁ జూచి కీర్తి సంపాదింపవలయుఁగాని దానికి హాని గలుగునేని యాపని దెసం బోవరాదు. అట్టిపని చేసి కీర్తి సంపాదించినం బ్రయోజనం బెయ్యది? కీర్తియు బ్రదికియుండువానికే సంతోషజనకం బైనయలంకారంబు. చచ్చి భస్మీభూతుఁడై నవాఁడు కీర్తివలన నేమి సుఖించు. వానికీర్తి శవాలంకారంబురీతి నిరుపయోగంబు. కావున శరీరావిరోధముగనే సర్వకార్యములం జేయవలయు. నీవు మద్భక్తుఁడవు గావున భక్తరక్షణంబను కర్తవ్యం బనుతలంపుతో నీతో నింత చెప్పితి. మఱియు నీవిషయమున దేవరహస్యం బొక్కటి గలదు. అదియు నీకుఁ గ్రమమునఁ దెలియ నగుఁ గావున నిపుడు వివరింపను. ఎన్నియుపాయంబులనైన నియ్యక పంపుట తగుఁగాని యియ్యవలదు. రుచిరకుండలమండితుండవై నీవు విశాఖామధ్యగతుం డైనచంద్రునిచందమున నిపుడు వెలుఁగుచున్నవాఁడవు. ఇంద్రుఁడు వానిం గొనిపోయిన నీసొంపు దఱుగకుండునేని వెండియు నీ వెల్లపుడు నర్జునుతోడ స్పర్ధ చేయుచుండుదువుగదా. వానికి నీకుం బోరాట యవశ్యముగలుగు. కవచకుండలము లుండునందాఁక నతండు నిన్ను జయింప నేరఁడు. దేవేంద్రసహాయుండై వచ్చినను నీవు వానిం గెల్తువు. ఇంతేల? అర్జునుం గెలువఁ గోరిక గలదేని కవచకుండలముల నింద్రున కీవల దనిబోధించినం గర్ణుఁ డాదిత్యున కిట్లనియె. దేవా, భక్తజనవాత్సల్యంబునం జేసి యింత బోధించితివి. నాకును నీపై భక్తికంటె దారపుత్రాదులపైఁ బ్రేమంబు నధికంబుగాదు. భవద్వచనంబు హితంబ. అయినం బలుమాఱులు నీకు సాష్టాంగదండప్రణామములు గావించి ప్రార్థించెద. ప్రసాదము సేసి క్షమింపవలయు. అనృతమునకు వెఱచినట్లు నేను మృత్యువునకును వెఱవను. బ్రాహ్మణులు యాచించినం బ్రాణములనైన నిత్తు ననునాపూనినవ్రతమునకు భంగ మగు నని యెంతయు వెఱతు. కవచకుండలములు లేకున్న నర్జునుం గెలువరా దని యొక్కటి చెప్పితివిగదా. ఆవిచారంబు విడువుము. పరశురామునియొద్దను ద్రోణాచార్యునియొద్దను నేర్చినయస్త్రములు పెక్కులు గలవు. నీవు నిది యెఱుంగుదువు. వానిం గెలువ నోపుదు. ఇంద్రుండు బ్రాహ్మణుండై వచ్చి ప్రాణముల నడిగినను వ్రతలోపంబు వాటిల్లకుండఁగ నవశ్య మిత్తు. అనుమతింపు మనినివేదించినం గర్ణునవచనము లాకర్ణించి భాస్కరుండు వెండియు నాతని కిట్లనియె. వత్సా, కవచకుండలములఁ గాదనక

యిచ్చువాఁడవేని యింక నొక్కటి సెప్పెద నట్లయినం జేయుము. ఇంద్రునొద్ద నమోఘం బైనశక్తి యొక్కటి యున్నది. అది సంగరమున నెన్నిమాఱులు ప్రయోగించినను శత్రులఁ జెండాడిచెండాడి క్రమ్మఱ నింద్రుం జేరుచుండు. దాని నడిగితీసికొని పిదప నీకవచకుండలముల నిమ్ము నిన్నర్జునుచేఁ జంపింపఁ దలఁచి యింద్రుఁడు వంచనమై నిన్నుఁ గవచకుండలముల యాచింప వచ్చుఁ గాని యొం డేమియుం గాదు. శక్తినైనం గ్రహించికొంటివేని యాతనిం గెలువవచ్చు. కావునఁ బ్రియవచనముల నతని నారాధించి శక్తిం గొనునది యనిచెప్పి యాదిత్యుఁ డంతర్హితుం డయ్యె. అంతఁ బ్రభాతం బగుటయు మఱునాఁ డాహ్నికవిధులం దీర్చి కర్ణుఁడు సూర్యోపస్థానఁబుగావించి యుపస్థానాంతంబునఁ దనస్వప్నవృత్తాంతమంతయు నప్ప్రభావసునకు విన్నవించిన నద్దేవుఁ డంతయు నిక్కవంబ యట్లు చేయుమనియానతిచ్చె. అటఁ గర్ణుఁడు శక్తిసంగ్రహకుతూహలాయత్తచిత్తుండై వాసవురాక వార్చియుండె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, సూర్యుఁడు కర్ణునకు హితము బోధించునెడ "నీవిషయము దేవరహస్యం బొక్కటి గలదు. అదియు నీకుఁ గ్రమమునఁ దెలియఁ దగు గావున నిపుడు వివరింప" ననివచించెనని పలికితివిగదా. ఆరహస్యం బెద్దియో? అతని కాకవచకుండలము లెబ్భంగిలభించె. తెలియఁ జెప్పు మనియడుగ నమ్ముని యానృపతి కిట్లనియె.

తొల్లి పరమతేజోవిలసితుం డయినదుర్వాసుఁడు కుంతిభోజునొద్దకుఁ జని నృపాలా, మీయింటఁ గొంతకాలము వసింపఁ దలంచితి. నీవును నీపరిజనంబులును వంచన లేక పరిచర్యఁ జేయుదురే? నాయునికి నీకు సమ్మతంబే? నే నుండు దునేని నాయిచ్చవచ్చినట్లు వచ్చుచుఁ బోవుచునుండుదు. శయనాసనాదుల నెక్కింతయేనియు నపచారంబు పుట్టకుండఁగఁ జూచికొందువే యనియడుగఁ గుంతి భోజుఁడు మునీంద్రా, నీయానతిమెయి నడిచెద. నాకూఁతుఁ బృథయనుదాని, శీలవృత్తాచారముల వన్నెకెక్కినదాని భవత్పరిచర్యఁ జేయుచుండఁగ నియమించెద. దానిశీలవృత్తములఁ జూచిన నీకే సంతసం బయ్యెడి ననిపలికి యమ్మునికి యథావిధి సపర్య లొనరించి యటఁ గుంతియొద్దకుఁ జని యిట్లనియె. అమ్మా, దుర్వాసుఁడు మనయింటఁ గొంతకాలము వసింపఁ గోరిన నే నియ్యకొంటి. చిత్తమునకు మెప్పుగా నతని నారాధించుట నీపని. నీవు లెస్సగ నరసి పరిచర్యలు గావింతు వని యతనికిం జెప్పితి. నామాట మిథ్యగాకుండఁ జూచికొనవలయు. బ్రాహ్మణమహిమం బొక్కింత వినుము. బ్రాహ్మణుండే పరమం బైనతేజంబు. బ్రాహ్మణుండే పరమం బైనతపంబు. బ్రాహ్మణనమస్కారప్రభావంబుననే యాదిత్యుండు మింట వెలుంగుచున్నవాఁడు. బ్రాహ్మణావమానంబునంగాదె వాతాపి

తాలజంఘప్రభృతులు సెడిరి. అందును దుర్వాసుఁడు సాధారణుఁడు గాఁడు. మఱి తపోనిరతుఁడు, పరమకోపనుఁడు, నిరంతరస్వాధ్యాయపరుఁడు. అతఁ డెప్పు డెద్ది గోరినను మాత్సర్యంబును నేమఱుపాటును లేక భయభక్తులతో నిచ్చునది. చిన్న నాఁటంగోలె నీకు బ్రాహ్మణులయెడను గురువులయెడను దేవతలయెడను భక్తియు, బంధువులయెడ నాదరంబును, భృత్యజనులయెడ ననుగ్రహంబును, మిత్రసంబంధులయెడఁ బ్రణయంబును, దీర్ఘాలోచనంబునుం గలిమి నే నెఱుంగుదు. నీసమీచీనవృత్తంబుఁ జూచి పురమున నంతఃపురమునను సంతసింపనివారు గలరే? వెండియు నీవు వృష్ణికులమునం బ్రసిద్ధుఁడై నశూరునకుఁ బుట్టి వసుదేవునకుఁ దోఁడఁబుట్టు వనం బేసు గాంచి యాశూరుఁడు ప్రేమ గడలుకొనఁగ నాకుఁ గూఁతుఁగా నొసంగిన హ్రదముఁ బాసి హ్రదాంతరము సేరుపద్మినికైవడి మాయిల్లు చేరి పెరిగి సాధుశీలాచారముల నుభయకులముల వెలిఁగించుచున్న దానవు. దుష్కులజాతలకు ధర్మములు చెప్పవలసియుండుఁగాసి మహాకులీనులకుఁ జెప్పనేల? సర్వగుణంబులు నీయందు నెలకొనియుండుటం జేసి దుర్వాసునియారాధనంబు నీపయిం బెట్టితి. దంభము, నహంకారము, మానమును విడిచి యత్యంతభక్తిమై నమ్మునీంద్రు నారాధించి తత్ప్రసాదమున శ్రేయస్సులు వడయుము. కొంచెము దప్పిన నతండు కులముఁ గాల్చు నిది యెల్లపుడును మనమున నిల్పికొను మనిచెప్పినం గుంతి యిట్లనియె. రాజేంద్రా, భవద్వచనప్రకారమున నమ్మునికిం దగుపరిచర్యఁ జేసెద. ఇంతయు నిక్కువంబు. బ్రాహ్మణపూజనము నాకు సహజంబై యున్నది. అది నీకుఁ బ్రియమును నాకు శ్రేయస్సాధనంబునగు నేని తప్పక చేయ నున్నదాన. అందుల కింత చెప్పవలదు. బ్రాహ్మణులం బూజించుచు నీయాజ్ఞ మెయి నడచుట నాకుఁ బరమలాభంబు. అమ్మునీంద్రుఁడు సాయాహ్నమున వచ్చినను, మధ్యాహ్నమున నేతెంచినను, వఱువాతఁ జనుదెంచినను, నడురేయి నరుదెంచిననుం జిత్తమునకు మెప్పుగా సకలపరిచర్యలం జేయుదు. నీయింట నతని కోకించుకయేనియు నపచారంబు గలుగకుండఁగఁ జూచికొందు. ఇందు నను నమ్మి చింత మాని రాజకార్యములఁ దీర్పుము. బ్రాహ్మణులే సమ్యక్ప్రకారమునఁ బూజితులైనం దరింపఁజేయుదురు. ఎగ్గుచేసినం జంపుదురు. ఈయర్థ మంతయు నే నెఱుంగుదు. సుకన్యానిమిత్తమునం జ్యవనుఁ డలుగుట పెద్దలవలన వింటిమిగదా కావున భయభక్తివినయసంభ్రమములతో నమ్మునిం బరిచరింతు నని చెప్పినం గుంతిభోజుఁడు కూఁతుం బలుమాఱులు గౌఁగిలించి యభినందించి యిట్టు లిట్టులు చేయవలయు నని పరిచర్యాప్రకారంబు కొంత యెఱింగించి నాకును, నీకును గులమునకును హితం బాచరింపుమనిపల్కి యక్కన్నియం దోడ్కొని దుర్వాసునొద్దకు వచ్చి మునివరేణ్యా, యీకన్యక నాకూఁతురు, చిన్ననాఁటంగోలె నెంతయు గారా

మునఁ బెరిగినది. పరిచర్యలో నెప్పుడైన నించుక ప్రమాదంబు పొసఁగిన నది చిత్తమునకుఁ దేవలదు. మీయట్టిమహానుభావులు బాలవృద్ధతపస్వు లపరాధము చేసినను మన్నింతురుగదా. కావున మాయింటం దప్పు లొకవేళఁ గలిగిన నవి గోయక పూజలఁగొనవలయు నని ప్రార్థించుటయు దుర్వాసుఁ డట్లయగుంగాక యనియె.

కుంతి దుర్వాసునకుఁ బరిచర్యఁ జేయుట.

అంతఁ గుంతిభోజుఁడు చంద్రికావదాతం బైనయొక దివ్యసౌధమున దుర్వాసుం జేర్చి యం దతని కాహ్నికాదివిధులం దీర్పఁ దగురీతిం బ్రదేశము లేర్పఱిచి యం దమ్మునిం బ్రవిష్టుం జేయుటయుఁ గుంతి యత్యంతశౌచసమన్వితయై దంభాహంకారమానాదుల విడిచి భక్తి చిగురొత్తఁగ దేవోపచారముల నతనిం బరిచరించుచుండె. దుర్వాసుఁ డా రాజపుత్రిచిత్తం బెఱుంగఁ గోరి యొక్కొకనాఁడు వఱువాతన వత్తు ననిచెప్పి సాయంకాలమున వచ్చు. సాయంకాలము వత్తునని చెప్పి నడురేయి వచ్చు. ఏమియుం జెప్పక పోయి యర్ధరాత్రమున వచ్చి యిపుడు మృష్టాన్నంబు పెట్టు మనినుడువు. ఒక్కొకనాఁ డవేళల భోజనంబుఁ గోరు. ఎప్పు డెట్లు చెప్పిననుం దప్పక పృథ మెలఁకువతో నతనిచిత్తమునకు మెప్పు గలుగ నొక్కొక్కనాఁటికంటె మఱియొక్కనాఁడు మఱింత యెక్కు వగ నుపచారము లొనర్చుచుఁ బ్రియము పలుకుచు శిష్యునిచాడ్పునఁ, బుత్రునిమాడ్కిని, జెల్లెలిభంగిని సర్వవిధముల నత్యంతభక్తిమెయినుపాసించియుండె. కుంతిభోజుఁడుం బ్రతిదినము ప్రాతస్సాయంకాలముల వచ్చి దుర్వాసుం బరిచరించు ప్రకారమెల్లఁ గూతు నడిగిన నది యెల్లవెంట నెక్కింతయుఁ గొఱంత లే దని నివేదించిన నతండు సుప్రీతుం డయ్యె. అవ్విధమున నొక్కవత్సరము పూర్ణం బగుటయు దుర్వాసుఁ డయ్యుపచారముల కెంతయు సంతుష్టమానసుండై కుంతిం బిలిచి రాజపుత్రీ, నీకావించినయుపచారముల కెంతయుం బ్రీతి యయ్యె. మనుష్యులకు లభంబులు గానివరములఁ గోరికొను మిచ్చెద. అస్మదీయవరప్రభావమున నీవు సకలసీమంతినులకు మిన్న గాఁగల వనియడుగఁ గుంతి యమ్మునికిఁ గేలుమోడ్చి మునీంద్రా, నాచేసినయుపచారములకుఁ బ్రసన్నుఁ డగుటయ చాలు. నీవు ప్రసన్నుఁడవైన మాతండ్రి నాయెడఁ బరమప్రీతుం డగు. ఇంతకంటె నాకు వరం బేలయనిన దుర్వాసుఁడు కుంతికి వెండియు నిట్లనియె. కల్యాణీ, నీవు వరములు గోరకున్నను నే నొక్కమంత్రం బుపదేశించెద గ్రహింపుము. ఏదేవునైనం దలంచి యామంత్రముఁ బఠించితివేని యతండు నీకుఁ దక్షిణంబ సన్నిహితుండై భృత్యునిచందమున నీవశమున నిలిచి తా నకాముఁడైనను సకాముఁడైనను నీకు గర్భాధానముఁ గావించు ననిపలికినం గుంతి యిది నిషేధించిన ముని శపించునొకో యనువెఱ

పున నేమియు నననేరక యంగీకరించుటయు నమ్మునివరుం డథర్వశిరోవిశ్రుతంబైన యామంత్రరాజంబును విధియుతంబుగ నాకుంతిభోజాత్మజ కుపదేశించియటఁ గుంతి భోజునెద్ద కరిగి రాజేంద్రా, మీయింట నిన్నినాళ్లు నీకూఁతురు సర్వవిధముల లెస్సగ నుపచరింప సుఖముంటి నిఁకఁ బోయివత్తు ననిపలికి యచట నంతర్హితుం డయ్యె. దుర్వాసుఁ డచ్చటన యదృశ్యుఁ డగుటకుఁ గుంతిభోజుఁడు మనమున విస్మయం బంది యత్యంతసంతోషమునఁ గుంతి నభినందించె.

### కుంతి సూర్యునివలన గర్భముఁ దాల్చి గర్ణుం గనుట.

అంత నొక్కనాఁడు కుంతి ఋతుస్నానము చేసి ప్రాసాదాగ్రమునం గుకులచిక్కు వాపుచుండి యచిరోదితుం డై నభానుమంతుం గవచకుండలవిభూషితుం గర్మసాక్షిం గనుంగొని ముని యుపదేశించినమంత్రముమహిమ మెట్టిదో యెఱుంగుద నని యూహించి సంజాతకుతూహలయై లలితలజ్జావిలాసంబు సొంపు సంపాదింప నాచమించి ప్రాణాయామంబు గావించి యామంత్రము నుచ్చరించి భాస్కరు నాహ్వానము చేయుటయుఁ దత్క్షణంబ ద్వాదశాత్మ నిజయోగప్రభావమున రూపాంతరముఁ దాల్చి కవచకుండలాదిభూషితుండై నిజనిరుపమానప్రభాపటలమున దెసలెల్ల వెలింగించుచుఁ గుంతిని డాయవచ్చి రాజనందినీ, మంత్రోచ్చారణపూర్వకముగ నీవు పిలుచుటం జేసి వచ్చితి నీకు వశ్యుఁడనైతి నేమి సేయవలయుఁ జెప్పు మని మధురసుందరముగఁ బల్కినం గుంతి దేవా, మంత్రతత్త్వంబుఁ బరీక్షింపఁ బిలిచితి. ప్రసన్నుఁడవై వచ్చినట్లు విచ్చేయు మనిచెప్పినం దానికిఁ దపనుండు వెండియు నిట్లనియె. సుదతీ, నేఁ బోవుట యుండ నిమ్ము. పిలిచి వృథా పొమ్మనుట నీకుఁ దగదు. నిరుపమానవీర్యుఁడు సహజకవచకుండలమండితుఁడు నగుసత్పుత్రుఁడు నావలనఁ బడయం గోరికదా నీవు నన్నుఁ బిలిచితివి. భవత్సంకల్పంబు నెఱవేఱ నట్టిపుత్త్రు నిచ్చెద. నాతోడ సంగమింపుము. నామాట వినవేని నాకుఁ బ్రియముఁ జేయవేని నిన్ను శపించుటయగాక నీకుఁగా నీయనయం బెఱుంగనినీతండ్రిని పాత్రాపాత్రములనరయక నీకు మంత్ర ముపదేశించినమునిని శపించి నీఱుసేయుదు. నీవు పిలువఁగ మోసపోయి వచ్చిననన్నుఁ జూచి యింద్రాదులు వారె నవ్వుచున్నారలు. దివ్యదృష్టి నొసంగెద వారలం జూడుము. మున్నె యొక్కింత దివ్యదృష్టి నొసంగితి. తత్ప్రభావమునంగాదె నీవు రూపము లెస్సగఁ జూచితి వనిపలికి దివ్యదృష్టి నిచ్చుటయుఁ గుంతిభోజతనూజ గగనంబున రథారూఢుండై యున్న సూర్యుని నిజవిమానముల నారోహించియున్నయింద్రాదినిర్జరులనుం గాంచి లజ్జాభయములు పెనంగొనంగ దివాకరునకు మఱియు నిట్లనియె. దేవా, బాల్యదోషమున నెఱుంగక తప్పు చేసితి. మన్నించి నిజవిమాన మారోహించి విచ్చేయుము. నాదేహమునకుఁ దల్లిదండ్రులు గురు

వులుఁ బ్రభువులుగాని నేను గాను. వారలఁ గాదని నీతోడ నే నెట్లు సంగమింతు. అట్లు చేసినఁ గులధర్మహాని యగుఁగదా? ధర్మరక్షణంబు ముఖ్యంబుగాదే? మీ రెఱుంగనిధర్మువుం గలుగునే? యని సవినయంబుగ విన్నవించిన వెండియు సూర్యుఁ డిట్లనియె. బిత్తరీ, నీవు బాలవనియే యేను నింతకు నేమియు ననకున్న వాఁడ. మాయెడ మిథ్యాప్రవర్తనంబు చెల్లదు. మఱియు నేను వృథా పోయిన నపహాసభాజనం బగుదు. కావున మాఱు సెప్పక సంగమించి సత్పుత్రుఁ బడయు మనివచించినం గుంతి యెన్నియేనుపాయములఁ బన్నియు విభావసు వారింపనేరక పెద్దయుంబ్రొద్దు చింతించి యన్నిమిత్తంబు నిరపరాధులైనతండ్రికిం దుర్వాసునకు శాపము గలుగనేల యని తనలో నూహించి చేసినపని యనుభవింపక తీఱ దనినిశ్చయించి గురువులు తగినవరున కియ్యకుండిన నెట్లు స్వాతంత్ర్యము వహించి యకార్యం బయినయాత్మప్రదానంబుఁ జేయుదు నని యించుక సంశయించి యెవ్విధమునఁ బోవఁ దోఁపక యురియాడుచిత్తముతో లజ్జామోహభయవిహ్వలయై సహస్రాంశున కిట్లనియె. దేవా, నీయానతిమెయి నడువ నున్నదాన. అయినను నావిన్నపం బించుక చిత్తగింపుము. గురువులు తగినవరున కియ్యకమున్న కన్యకలు తమంతట విధివిరహితంబుగా గర్భాధానంబుఁ గాంచుట నింద్యం బని విని యుండుదు. కావున నిపుడు నీతో సంగమించిన నాకన్యాత్వంబు సెడు. మన్నిమిత్తంబున నస్మత్కులంబునకెల్ల నపకీర్తి గలుగు. ఇట్లు చేసిన ధర్మలోపము వాటిల్ల దని నీకుఁ దోఁచునేని భవదభిమతంబు సేయుదు. నాకుఁ గన్యాత్వభంగంబును ధర్మలోపంబును లేకుండఁగఁ బ్రసాదింపుము. దేహులయాయుర్ధర్మకీర్తులు నీయందే ప్రతిష్ఠితంబు లనివచించిన నాకర్ణించి కర్మసాక్షి దాని కిట్లనియె. వరవర్ణినీ సర్వకామములు కామించుటయే కన్యాశబ్దమునకుఁ బ్రవృత్తినిమిత్తంబు. కావున నన్నియుం గోరఁ గన్య యగునీవే స్వతంత్రురాలవు. ఇందు గురువులయనుజ్ఞ యనావశ్యకంబు. ఇందు ధర్మలోపంబు లేదు. మఱియు నాసంగమమున నీకు ధర్మలోపంబు వాటిల్లకుండఁగను గన్యాత్వంబు దూషితంబు గాకుండఁగను వరము నిచ్చితి. నావలనం బుత్రుం బడయు మనినఁ గుంతి దేవా, నాకుఁ గవచకుండలమండితుం డైనపుత్రుం బ్రసాదింపు మనియడుగ సూర్యుఁ డిట్లనియె. మత్తకాశినీశిరోమణీ, తొల్లి యమృతసంభవంబు లయినయీకుండలముల నదితి నా కొసంగె. వాని నీయుత్తమకవచంబును నీకొడుకున కిచ్చెద ననిచెప్పి యాకన్నియ నొడంబఱిచి నిజయోగప్రభావమున నక్కుంతిభోజరాజతనూజతోడ సంగమించి గర్భాధానముఁ గావించిన నారాజపుత్రి మిత్రతేజమునకు విహ్వలయై పాన్పుపయిం బడి యొక్కింతసేపునకు లేచుటయు భానుమంతుఁ డోసుశ్రోణీ, నీగర్భమున సత్పుత్రుఁడు జనించువాఁడు. మద్వరప్రభావమునం జేసి నీకన్యాత్వంబు

సెడదు. ఇఁకఁ బోయివత్తు ననినం బృథాదేవి లలితలజ్జావిలాసంబు నెమ్మొగమ్మున దళుకొత్తఁగ నట్లయని పల్కుటయుఁ దిగ్మాంశుఁడు తారాపథమునకుఁ జనియె.

ఇటఁ గుంతి సూర్యసంగమంబునఁ గలిగినగర్భము శుక్లపక్షచంద్రునిచందంబున నానాఁటం బెరుగుచుండఁ దనదాదికూఁతునకుఁ దక్కఁ దక్కటివారికెరికి నెఱుక గాకుండ డాఁచికొనియుండి యుచితకాలమున సహజకవచకుండలవిభూషితుండైనవాని, వృషభస్కంధుఁడైనవాని, దివ్యతేజోవిరాజితుండైనవాని, దేవసన్నిభుండైనవానిఁ, దండ్రి కెనయైనవాని నొకసుపుత్రుం గనియె. కని తత్క్షణంబ కుంతి దాదికూఁతుతోడ నాలోచించి యొకపెట్టియం దెచ్చి యందు మృదులముగఁ బొత్తిగుడ్డలు పఱచి జాతమాత్రుం డైనయాకుమారు నం దునిచి పురసమీపమునఁ బాఱుచున్నయశ్వనదికిఁ గొనిపోయి తత్ప్రవాహమున నామంజూషను విడుచుచుఁ గన్యాత్వంబున గర్భముఁ దాల్చినందుల కియ్యది ఫలం బయ్యె ననిపలికి కన్నీరు దొరుగఁ బుత్రస్నేహమున నిట్లని విలపించె. పుత్రా, నాకు నిన్నుఁ గనునంతటిభాగ్యంబకాని నీబాల్యాదిచేష్టితంబులం జూడఁగ భాగ్యంబులే దయ్యె. ఏధన్యురాలు నిన్నుఁ బుత్రుఁగా భావించి యుల్లసిల్లనున్నదియో. ఏభాగ్యవతిచన్నులు గుడిచి యాఁకలి దీర్చికొనియెదవొ. ఏపుణ్యవతి సూర్యతేజుఁడు, దివ్యకవచకుండలమండితుఁడు, తామరసవిశాలలోచనుఁడు, పద్మోదరప్రకాశుఁడు, సుకేశుఁడు, సులలాటుఁడు, సుందరవదనుఁడు నగునిన్నుఁ బుత్రుఁగాఁ బడసినట్లు కలఁ గనినదో. ఏపుణ్యాత్ములు బాల్యమున నవ్యక్తమధురవచనములఁ బలుకుచుఁ బరాగపరీతము లయినమృదుపదములు దొట్రిల నిటునటుం దిరుగునిన్నుఁ జూతురో. ఏమహాత్ములు హిమవద్గిరికందరగోచరం బైనసింహంబుచాడ్పున యౌవనస్థుండై యమితవిక్రమముల మెఱయుచున్ననిన్నుఁ గనుంగొందురో. దయమాలి నే నీనదిలో విడువవలసె. నదీగతుం డైన నిన్ను దివ్యదృష్టిం గాంచునీతండ్రి ధన్యుఁడే. భౌమాంతరిక్షజలచరంబు లయిన సకలభూతములు నీకు భద్రము లిత్తురుగాక. సలిలస్థుం డైననిన్ను సలిలేశ్వరుం డైనవరుణుండు ప్రోచు. అంతరిక్షగతుం డైనని న్నంతరిక్షచారి యగువాయువు రక్షించు. సర్వదేశకాలములందును భవజ్జనకుం డైనసహస్రకరుండు పాలించు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సిద్ధులు, సాధ్యులు, విశ్వదేవు, లశ్వినులు, మహేంద్రాదిదిక్పాలకులు నీకు శుభం బొడఁగూర్తురు. నీమార్గములు శివంబు లయ్యెడు. శత్రువులు నిన్నుఁ జేరకుండుదురు. చేరినను గీడు రోయకుండుదురు. నేను విదేశమున నుండినను నిన్ను సహజకవచకుండలమండనం బభిజ్ఞానముగా నెఱుంగుదు నని బహువిధముల నతిదీనముగఁ బలవించి యర్ధరాత్రమున నామంజూష నయ్యేట విసర్జించి యింతకుఁ దండ్రి మేల్కాంచి తన్ను విచారించునో

యనితలఁచి యెట్టకేలకు మగిడి నగరు సేరె. ఆపెట్టియ యు దైవయోగమున నశ్వనదీప్రవాహవేగమునఁ జర్మణ్వతిం జొచ్చి తత్ప్రవాహమున యమునాగతమై గంగాప్రవాహంబుఁ బ్రవేశించి సూతవిషయమునం జంపాపురముచెంగటఁ దరంగమాలికాస్ఫాలనంబున నిటునటుం గదలుచుండె.

### కర్ణుఁడు సూతకులముఁ జేరుట.

ఆసమయమున ధృతరాష్ట్రసఖుం డైనయతిరథుఁ డనుసూతుఁడు భార్యాసమేతుఁడై జలక్రీడార్థంబు గంగకు వచ్చి తరంగప్రచారవశమునఁ దీరము చేరిన యామంజూషను రక్షాబంధవిలసితంబై నదానిం గాంచి సంజాతకుతూహలుఁడై గ్రహించి మెల్లన మృదుయంత్రములఁ దద్ద్వారం బపనయించి యందు బాలసూర్యప్రభుఁడు, సహజకవచకుండలవిభూషితుఁడు, దివ్యసుందరముఖారవిందుఁడు నగునాకుమారుం గనుంగొని యత్యంతవిస్మయావిష్టచిత్తుండై తొడపై నిడికొని తా నపత్యార్థంబు పెద్దకాలంబునుండి పరమప్రయత్నంబుఁ జేయుచున్నవాఁడుగావునఁ బరమానందలహరిం దొప్పదోఁగి భార్య యగురాధం బిలిచి యిట్లనియె. ఇంతీ యీవింతం జూచితే యీకుమారుఁ డెక్కడివాఁడో యీపెట్టెం గన్పట్టె. సంతతిహీను లగుమనకు దేవజనితుం డైనవీని దేవుఁడు ప్రసాదించె ననిపలికి యాకుమారుం బ్రియాంగన కొసంగె. రాధయు వానిం గ్రహించి పుత్రుఁగా భావించి వాత్సల్యమునఁ బెనిచె. కుంతీదేవి యావృత్తాంతము గూఢచారులవలన నెఱింగి నెమ్మది నుండె. కనకకవచకుండలం బనువసువుతోడ జనించుటం జేసి వానికి వసుషేణుం డనుపేరు పెట్టిరి. ధర్మపరత్వమున వర్తించుటం జేసి యతండు వృషుఁ డనంబరఁగె. అంత నయ్యతిరథునకు రాధయం దౌరసపుత్రులు పెక్కండ్రు కాలక్రమమునం బుట్టిరి. ఆవసుషేణుఁడు నానాఁటం బెరిగి విద్యాగ్రహణయోగ్యవయోవిలసితుం డగుటయు నయ్యతిరథుఁడు గజపురమునకుఁ గొనిపోయి వాని ద్రోణాచార్యునకు శిష్యుఁగా నర్పించె. వాఁడు ద్రోణాచార్యులయొద్దను, కృపాచార్యులయొద్దను, జామదగ్న్యమునియొద్దనుం జతుర్విధం బయినయస్త్రగ్రామం బభ్యసించి దుర్యోధనుతోడఁ జెలిమి చేసి పాండవులకుఁ గీడు రోయుచు నెల్లకాలం బర్జునుతోడఁ బెద్దయుస్పర్ధఁ జేయుచుండె. అర్జునుఁడుం గర్ణుఁ జూచిననాఁటఁగోలె నతనిపై స్పర్థ పెంచుచుండె. ఇదియే కర్ణవిషయకం బైనదేవరహస్యంబు. ఆకర్ణుఁడుం బ్రతిదినంబును మధ్యాహ్నమునఁ బ్రాంజలియై సూర్యుం బ్రస్తుతించు. ఆసమయమునం బ్రాహ్మణులెద్ది యాచించినను లే దనక వ్రతముఁ బూని యొసగుచుండు. సహజకవచకుండలసమన్వితుం డైనయతండు సమరమున నేరికిని వధ్యుఁడు గాఁ డని యుధిష్ఠిరుఁడు తనమనమున నెల్లపుడు నెంతయుఁ జింతించుచుండు.

### ఇంద్రుఁడు కర్ణునికవచకుండలము లపహరించుట.

ధర్మరాజు మనోభిప్రాయం బెఱింగి దేవేంద్రుఁడు బ్రాహ్మణవేషధరుండయి సూర్యోపాసనసమయమునఁ గర్ణునొద్దకుఁ జని యతండు విప్రులకు యాచితార్థముల నిచ్చునెడ "భిక్షాం దేహి" యనిపలుకుటయు రాధేయుండు కపటబ్రాహ్మణుం డైనయతని స్వాగతం బడిగి పూజించి తదీయమనోగతతాత్పర్యం బెఱుంగక బ్రాహ్మణోత్తమా, నీ వేమి కోరెదవు? కాంచనాలంకరణాలంకృతలయినయుత్తమప్రమదలనొండె, వివిధసౌఖ్యప్రదంబు లైనగ్రామములనొండె, ననేకగోగణములనొండె నిచ్చెద నడుగు మనుటయు నాకృత్రిమవిప్రుఁడు రాధేయా, నా కవియెల్ల ననపేక్షితంబులు. ఇతరయాచకుల కిమ్ము. సత్యవ్రతుండ వగుదేని నీసహజకవచకుండలంబులఁ గోసి యిమ్ము. అదియే నాకుఁ బరమలాభం బనియడిగె. అడుగుటయుఁ గర్ణుఁ డతనిం జూచి యయ్యా, యితరము లెవ్వియైనం గోరిన నవశ్య మిచ్చెదఁ గోరికొను మని బహువిధముల విన్నవించి యనునయించి ప్రస్తుతించి పూజించిన నతండు తనమతంబు మానక కవచకుండలములే యిమ్మనుటయు సూతపుత్రుండు నవ్వుచు బ్రాహ్మణోత్తమా, నాకవచకుండలము లమృతసంభవములు. అవి గలుగుటంజేసి యేను శత్రువుల కవధ్యుఁడ నైతి. వాని నిచ్చితి నేని శత్రులు నన్ను జయింప నోపుదురు. కావున నారాజ్యమెల్ల నిచ్చెద. గ్రహించి సంతసించి విచ్చేయుము. వాని నడుగవల దనిన విని యక్కుహనాద్విజుండయ్యా, యింత యేల. సత్యవ్రతంబుఁ బాలింతువేని వాని నిమ్మనుటయు రాధేయుం డతని నింద్రుఁగా నూహించి యిట్లనియె. దేవేంద్రా, యితర మిచ్చెదనని నం గాదని కవచకుండలములే గోరినపుడే నిన్ను మహేంద్రుఁగా నెఱింగితి. సర్వభూతములకు నీశ్వరుఁ డైననీకు మాయట్టివారలకుఁ గోరిన వరము లిచ్చుట తగుఁగాని మమ్ము యాచింపఁ దగునే? ఏనుఁ గవచకుండలముల నిచ్చితి నేని శత్రువులకు వధ్యుండనై పరిహాసపాత్రం బగుదు. కావున నాకొక్క వరం బిచ్చి కవచకుండలముల గ్రహింపు మనిన నింద్రుఁ డతని కిట్లనియె. అయ్యా, సూర్యుఁడు నారాక నీ కెఱింగించియుండు. మదీయవజ్రాయుధంబుదక్క దేని నడిగిన నిచ్చెద నడుగుమనవుడుఁ గర్ణుఁడు సంతుష్టమానసుండై డాయ వచ్చి దేవా, సంగరాంగణంబున శత్రుసేనం జెండాడునట్టి నీయమోఘశక్తిం బ్రసాదింపవే యనియడుగ దేవేంద్రుఁడు ముహూర్తమాత్రంబు చిత్తంబునఁ జింతించి కర్ణా, నీకోరినట్ల మదీయామోఘశక్తి నిత్తుఁ గాని యొక్కసంకేతంబు చేయుము. ఎట్లంటేని. నాశక్తి నే నెన్నిమాఱులు ప్రయోగించినను శత్రుల సంహరించి క్రమ్మఱ నాయొద్దకు వచ్చుచుండు. అట్లుగాక యత్యూర్జితుండై పైపై వచ్చుచు నూర్వ రానికొల్లలు సేయుచున్నయొక్కమహావీరుని భవత్పేరిణమున సంహరించి యూ

శక్తి క్రమ్మఱ నాయొద్ద కేతెంచునది. అన్నివిధముల దెప్పరంబు వాటిల్లినచో దానిం బ్రయోగింపవలయు. కావున నితరాస్త్రములం గార్యము దీఱక ప్రాణ సంశయదశ పొసంగినప్పుడు దాని వినియోగించునది. ప్రమాదమున నల్పసారులపైం బ్రయోగించిన ననవసరమున వినియోగించిన నది నిన్ను వధించు ననిన నప్పురందరువచనం బాకర్ణించి కర్ణుండు దేవా, నా కింత చాలు. నే నొక్కనికె యెప్పుడును వెఱతు. వాని నీశక్తి వధించుం గావున నీకుం గవచకుండలముల నిత్తు ననియెడంబడియె. అంత నింద్రుండు కర్ణా, నీ వెప్పు డెవ్వనిం జంపం దలంతువొ వాని వేదవేద్యమహిముండై ననారాయణుండు రక్షించు. ఇంక శక్తిం గ్రహించి కవచకుండలముల నిమ్మనిన నతండు సురేంద్రా, మదీయదేహసంభవంబు లయినవానిం గోసి యిచ్చిన వికారంబు గలుగకుండ వర మొసంగు మనినం బురందరుండు సూతనందనా, కవచకుండలకర్తనంబునం గాత్రమున వికారమును, వ్రణమును గలుగకుండంగను, శరీరతేజంబు యథాస్థితి వెలసియుండంగను సత్యప్రతిజ్ఞాపరుండై ననీకు వరములుగం జెప్పితి. నాచెప్పినసమయమున శక్తిం గ్రహింపు మనివాక్రుచ్చె. అంత రాధేయుండు సంకేతమున దేవేంద్రునివలన నమోఘశక్తిం గ్రహించి యతనికిం గవచకుండలము లిచ్చువాండై ముఖవికార మించుకేనియు లేక సర్వాంగములం గోయం దొడంగుటయు దేవదుందుభులు మ్రోసె. పుష్పవర్షము గురిసె. అట్లు సత్యవ్రతపరుండై నయతండు తనసహజకవచకుండలముల నవ్విధముం గోసి యింద్రున కొసంగి సత్యవ్రతంబుం బాలించె. కవచకుండలకర్తనంబునంచేసి యతండు కర్ణుం డనం బ్రసిద్ధుం డయ్యె. అత్తెఱంగున మహేంద్రుండు కర్ణువంచించి కవచకుండముల గ్రహించి తదీయసత్కీర్తి నంతట నెఱయంజేసి పార్థులు కృతార్థులయి రనితలంచి దివంబున కరిగె. ఆవృత్తాంతంబు విని ధార్తరాష్ట్రులు భగ్నదర్పులై చింతిల్లిరి. పాండుసుతులు సంతసిల్లి రనిచెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, పాండుపుత్రు లామీఁద నెచ్చట వర్తించిరి. కర్ణుకవచకుండలముల నింద్రుం డపహరించికొనిపోవుట నెపు డెఱింగిరి. వివరింపు మనియడుగ నమ్మునివరుం డానరవరున కిట్లనియె.

పాండవు లట్లు సైంధవుని నిగ్రహించి ద్రౌపదిం దెచ్చి మార్కండేయునివలన సత్కథల విని యమ్మునీంద్రుం డరిగినపదంపడి కామ్యకవనవాసముం బరిత్యజించి పాంచాలీసమేతులై ద్వైతవనమున కరిగి ఫలమూలాశనులై యందు వసించి తమలో నిష్టకథాగోష్ఠి నున్నంత నొక్కబ్రాహ్మణుం డతిరయమునం బాఱుతెంచి ధర్మనందనుం గాంచి రాజేంద్రా, నాయరణి తరుశాఖం దగిల్చియుండ నొక్కమృగం బాపాదపంబు రాయుచు నిజశృంగలగ్నం బయినయయ్యరణిం గొని యదె పఱచుచున్నది. వేగంబ దాని వెంటం దవిలి మదీయాగ్నిహోత్రవిధికి లోపంబు

రాకుండఁగ దానిం దెచ్చి యిచ్చి పుణ్యమునం బోవవే యని యతిదైన్యము గదురఁ బలికె. ఆబ్రాహ్మణువచనం బాకర్ణించి యుదీర్ణసంతాపుండై ధర్మరాజు తమ్ములుం దాను ధనుర్బాణతూణీరంబులం గ్రహించి యామృగము నెయిది చనుచుఁ బెక్కమ్ము లేసిన నొక్కబాణమేనియు నామృగముఁ దాఁకవయ్యె. అంతఁ గొంతవడి కామృగం బెటు వోయెనోగాని వారికిఁ జూపట్టదయ్యె. అటఁ బరమచింతాక్రాంతులై వారు తదన్వేషణకుతూహలంబున నమ్మహాగహనమెల్లఁ ద్రిమ్మరియు దానిం గానక బమ్మరించుచు క్షుత్పిపాసాపరిశ్రాంతులై నడువనోపక శీతలచ్ఛాయం బైనయొకభూరుహంబునీడ నందఱుం గూర్చుండి వగచుచుండిరి. అప్పుడు నకులుఁడు ధర్మనందనుం జూచి రాజచూడామణీ, ధర్మహానియు నర్థలోపంబు నొకప్పుడు నెఱుంగనిసత్కులంబునం బుట్టి మనము సర్వభూతకరుణానిరతు లనం బేరు గాంచియు నిన్నియిడుమల నేల పడయవలసెనో యని విషణ్ణుండై యడుగ యుధిష్ఠిరుఁడు వత్సా, ప్రాక్తనకర్మంబె యాపత్సంపదలకు బీజంబు. తత్పరికారంబునం బ్రాణులు పుణ్యపాపఫలములఁ గుడువవలసియుండు నని ప్రత్యుత్తరము సెప్పుచుండ భీముఁ డిట్లనియె. ఆసభలో నాఁడు ప్రాతికామి ద్రౌపదిం దెచ్చునపుడే యాపాపాత్ములం జంపక యుపేక్షించుటయే మనయాపదలకెల్ల నిమిత్తంబనియె. అంత నర్జునుఁ డాదుర్ద్యూతసమయంబున రాధేయుండు మర్మభేదనంబులైనప్రల్లదంబులు పలికిన నేను శాంతిఁ గొని సైఁచుటయే మనకష్టములకెల్ల హేతు వని నుడివె. అట సహదేవుఁ డాపాపపుజూద మాడి శకునికితవుఁ డీరాజుం గెలిచినపుడేను వంచనలకెల్ల మూలం బైనయప్పాపాత్ముఁ బరిమార్పక యొప్పరికించిచూచుటయే మనపాట్లకెల్ల నిదానం బనిపలికె.

### నకులాదులు యక్షప్రశ్నముల కుత్తరము లీక మూర్ఛితు లగుట

అత్తెఱంగున వారెల్లఁ దమలోఁ బలుకుచుండ ధర్మరాజు నకులుం బిలిచి యన్నా, నీయన్నదమ్ము లందఱుం బిపాసార్తులై కడు డస్సినవారు. ఈవ్రామ్రానెక్కి దెసలెల్లఁ గలయం జూచి సలిల మున్నయెడ నరయు మనిన నతం డట్లయని తత్క్షణం బావటభూరుహం బారోహించి జల ముపలక్షించి డిగి వచ్చి ధర్మనందనున కిట్లనియె. ఇచ్చోటికిఁ జేరువన హంససారసకారండవాదిజలవిహంగస్వరంబు విననయ్యెడి. అచ్చటిభ్రమాఁకులు సలిలపరిసరప్రవృద్ధంబులైనచందమునఁ దోఁచెడి. పానీయం బచ్చట నవశ్యముండు ననితలంచెద ననవుడు ధర్మరాజు వానిం బిలిచి యట్లగునేని నీవు వేగంబయచ్చోటి కరిగి నీరువట్టు దీర్చికొని బాణాసనంబులం బానీయంబు సంగ్రహించికొని రమ్మని పనిచె. పనివిని నకులుండు సని రయమున హంససారసాదిపరివృతంబై విమలతోయపూరితం బైనసరోవరముఁ జేరి తత్పానీయంబుఁ ద్రావఁ దలంచునెడ నొకయశరీ

రభూతం బంతరిక్షగతంబై "యోయన్నా యీకొలను నాయది. నాప్రశ్నములకుత్తరము చెప్పి యీజలము ద్రావుము కొనిపోవుము సాహసము చేయకు" మనిపలికె. ఆమాటపై ననాదరము చేసి మాద్రేయుండుశీతలంబై నయాజలంబు ద్రావి పడియె. అట ధర్మరాజు సహదేవుం బిలిచి యన్నసహదేవా, సలిలాహరణార్థంబు నకులుఁడు పోయి పెద్దయుం బ్రొద్దయ్యె. ఏలొకో యింతకు రాక తడసె. నీ వరిగి వానివర్తనం బరసితోయము సంగ్రహించికొని వానిం దోడ్కొని రమ్మని పంచిన నతండట్లయని యాసరస్సునకుఁ జని క్షితితలమునం బడియున్నయన్నం గనుంగొని శోకసంతప్తుండై నీరువట్టు నాఁగనోపక తజ్జలముఁ ద్రావంబోయిన నయ్యశరీరభూతం బంతరిక్షగతంబై నకులునకుఁ జెప్పినట్లు చెప్పినను సహదేవుఁడుందద్వచనం బనాదరించి యాకొలసనీరు ద్రావి పడియె. అంత నలధర్మనందనుఁ డర్జునుం బిలిచి యోశత్రుమర్దనా, జలాహరణార్థంబు పోయిననీకూరిమితమ్ము లిద్దఱు నింతకు రాక యాలసించిరి. ఊహించినం గారణంబు తెలియరాదు. నీ వరిగి వారలం దోడ్కొని వారి సంగ్రహించికొని రమ్ము. నీవకదా మాదుఃఖములఁ దొలఁగించువాఁడవు. నీకు మేలగుతమనిపలికినం గుడాకేశుండు వల్లెయని విల్లమ్ములను ఖడ్గమునుం గ్రహించి రయమున నాసరోవరము డాయం జని తెలివి దప్పి పడియున్నతమ్ముఁగుఱ్ఱలం గాంచి యెంతయు దుఃఖితుండై వీరిం బడఁ ద్రోచినవాఁ డెవ్వఁడొకో యని యంతటం జూచి యమ్మహావనమునం దొక్కభూతంబు నేసియుఁ గానక పిపాసాపరీతుండై యాకొలనినీరు ద్రావఁ బోయిన నయ్యశరీరభూతం బంతరిక్షగతంబై కౌంతేయా, యేల యీజలము డాయ వచ్చెదవు? ఇది బలాత్కారమునం గ్రహింప శక్యంబు గాదు. నాప్రశ్నములకుత్తరము లిచ్చితి వేని యిచ్చవచ్చినట్లు ద్రావనుం గొనిపోవనుం దగు ననివారించె. ఆపలుకులు విని పార్థుఁ డాభూతము నుద్దేశించి యగపడకుండి వారింపనేల? ఓపుదేని నామ్రోలం జూపట్టి వారింపుము. వాఁడినారసముల మేను దూటువడం జేసి యిఁక నిట్టివి పలుకకుండఁగ శాసింతు ననివాక్రుచ్చి యాశబ్దము వినవచ్చినదెస నుపలక్షించి దివ్యాస్త్రాభిమంత్రితంబు లయిననిశితశరములఁ బుడమియు నాకసమును నిండఁగఁ గురియించి యట నీరుద్రావం బోవుటయు వెండియు నయ్యశరీరభూతంబు పార్థుం బిలిచి యయ్యా, యేల యిట్లుకార్యవిఘాతంబుఁ జేసికొనియెదవు? ప్రశ్నములకుత్తరము లిచ్చి జలపానముఁ జేయుము. అటుగాక సాహసించి త్రాగినం బడుదువనివచించె. తద్వనంబు దెసనాదరంబు సేయక యర్జునుండు నాజలముఁ ద్రాగిపడియె. అంత నక్కడ ధర్మరాజుభీమసేనుంబిలచి యోపరంతపా, నకులసహదేవులు నర్జునుండునుం దోయంబుఁ దేరఁ బోయి పెద్దయుం దడ వయ్యె. ఏలొకో యింతకు రారైరి. నీవు పోయి వారిం దోడ్కొ

ని వారి సంగ్రహించికొని యరుదెమ్ము. నీకు శుభం బవుత మనివీడ్కొల్పిన వృకోదరుండు వల్లెయని యతిరయమున నాసరస్సున కేతెంచి పడియున్న తమ్ములం గనుంగొని యత్యంతదుఃఖితుండై యిది యక్షరాక్షసకృత్యం బనియూహించి ధ్రువంబుగఁ బెద్దపోరాట కవసరంబు ప్రాప్తం బయ్యె. డప్పి దీఱ వారిఁ ద్రావి యటఁ బోరాడుద నని నిశ్చయించి యయ్యుదకంబుఁ గ్రోలం బోయిన నయ్యశరీరభూతంబు తొల్లింటియట్ల యంతరిక్షగతంబై కౌంతేయా యీకొలను నాయది. నాప్రశ్నముల కుత్తరములిచ్చి మఱియీజలముఁ ద్రావుము కొనిపోవుము. అట్లు చేయక సాహసింపరా దనిపలికినం దద్వచనంబు గణింపక వాయుసుతుం డాసలిలంబుఁ ద్రావి పడియె. పదంపడి ధర్మరాజు తమ్ములెవ్వరును మగిడి రాక పెద్దయుం బ్రొద్దు తడయుటకుఁ జింతానలదహ్యమానహృదయుండై తానే లేచి జననిర్ఘోషరహితంబు, రురువరాహశార్దూలాదిక్రూరమృగసేవితంబు, వివిధపక్షిజాలసమన్వితంబు, నానావిధతరునికరనిబిడంబు నగునమ్మహావనంబునం జనిచని వివిధరమ్యతరునికరపరీతతీరబంధురంబు, విశిష్టపథికజనపరిశ్రమాపనోదననిపుణలలితశీతలపవనప్రచారసౌభాగ్యధురంధరంబు, వికచకమలమధురమకరందరసాస్వాదలోలుపమిళిందబృందరుచిరసంగీతకసమంచితంబు, విమలసలిలపరిపూరితంబునై విలసిల్లునాసరోవరముఁ గాంచి విస్మితుండై డాసి యట నిర్విచేష్టితులయి పుడమిపయి బడియున్నవారల, యుగాంతసమయపతితలోకపాలసదృశులఁ దనయనుఁగుఁదమ్ముల, భీమార్జుననకులసహదేవులం గనుంగొని దీర్ఘోష్ణంబుగ నిశ్వసించి కన్నీరు జాలువాఱ నిట్లని విలపించె. అన్నా! వృకోదరా! రణమున గదచే దుర్యోధనుతొడల విఱుగఁ దన్నుదు ననిచేసినప్రతిజ్ఞ కురుకులకీర్తివర్ధనుండై ననీవు పడుటంజేసి చెల్లక వ్యర్థ మయ్యె. మనుష్యమాత్రుల ప్రతిజ్ఞావచనములట్ల దివ్యాంశసంభూతులై నమీప్రతిజ్ఞలును మిథ్యాభూతంబు లయ్యె. మీవచనములఁ జెప్ప నేల! దేవవచనములును విఫలము లయ్యె. అర్జునుఁడు పుట్టినప్పుడు పురిటిలోఁ గుంతీదేవి కమరులు పొడసూపి యవ్వా, యీకుమారుఁడింద్రసన్నిభుఁ డనివచించిరి. మఱియు నుత్తరపారియాత్రపర్వతమున నున్నయప్పుడు సర్వభూతములు నాకు గోచరంబులై యర్జునుండు శత్రుజనాక్రాంతం బయినరాజ్యము సాధించి యిచ్చు ననియు, నాశూరు నెవ్వరుం గెలువ నేర రనియు, మఱి యతం డిందఱను జయించు ననియుం జెప్పె. ఆవచనము లన్నియు నసత్యంబు లయ్యె. నాయాశాలతం గోసి యీయర్జునుండు పుడమిం బడెను. ఇతం డెట్లు మృత్యుగోచరుం డయ్యెనో యెఱుంగరాదు. భీమార్జునులు నాథులుగాఁగ సుఖము పడయ నగు నని నమ్మికతో దుఃఖములనెల్ల నోర్చియుండఁగ శత్రుమర్దను లగువీరే మృత్యుగోచరులైరి. సర్వాస్త్రములం బ్రతిహతిఁ జెందనిభీ

మార్జునులు రిపునిబర్హణులయ్యు నతిసుకుమారాంగు లయిననకులసహదేవులును బడినను నేను బ్రదికియున్నవాఁడ. బ్రహ్మదేవుఁడు నాగుండె ఱాలఁ జేసెఁ గాఁబోలు. తమ్ములారా, శాస్త్రవిదులు దేశకాలతత్త్వజ్ఞులు తపోవంతులు క్రియాన్వితులయ్యు మీర లిట్లీల యనుచితంబుగ శయనించినారు. మీమేనులం బాణఘాత మొక్కటేనియుం గానరాదు. ఏల పడితిరో నిద్రించుతెఱంగునఁ జెయ్యులఁ దక్కి కొండనెత్తములమాడ్కి నుండెద రని పలుదెఱంగులం బలవించి పలవించి యత్యంతస్విన్నగాత్రుండై మనంబు నొకతెఱంగున ధైర్యమున నిలిపికొని యితికర్తవ్యతానిర్ణయం బెఱుంగక పెద్దయుంబ్రొద్దు చింతించి వీరిపాటునకుఁ గారణం బెద్దియోఁగాని వీరిశరీరములందు శస్త్రప్రహారంబు గానరాదు. ముఖవికారము దోఁపదు. ఏభూతమునుం జూపట్టదు. పరికించిచూచిన నెద్దియో యొకమహాభూతంబు నాతమ్ములం బడఁద్రోచె ననితోఁచెడి. కాకున్న దుర్యోధనుండు శకునిమతంబున వంచనమై నెద్దియే నొకగూఢప్రకారంబుఁ జేసియుండ నోపు. కార్యాకార్యవిచారం బెఱుంగనియాదురాత్ముల నెన్నఁడైనను నమ్మరాదు. ఈసరస్సు నీరు విషదూషితం బనితలంపనుం దోఁపదు. అట్లగునేని వీరిమొగంబుల వికారంబు దోఁపకుండునే? ముఖవర్ణం బెప్పటియట్ల ప్రసన్నంబై యున్నది. లెస్సగ నారసి చూడఁగ దుర్యోధనాదులును వీరలఁ జెనక నేరరు. వారు కావించునుపాంశుకృత్యంబులు వీరియెడ విఫలంబు లగుఁగాని ఫలవంతములు గానేరవు. కాలాంతకయముండు దక్కఁ దక్కటివా రెవ్వరు నిగ్రహింపనేరరు. నీరు ద్రావి డప్పి దీర్చికొని యటఁ దత్కారణంబు లెస్స యాలోచింతు ననితలంచి యాజలము దరియం బోవుటయు నశరీరభూతం బిట్లనియె. కుంతీనందనా, యేను బ్రాఁచితీఁగెలుఁ జేపలు నాహారంబుగాఁ గొనుబకంబ. నామాఁట యనాదరించి ననీతమ్ముల నలువురను నేనే మృత్యుగోచరులం జేసితి. నీవు వారియట్లు నాప్రశ్నముల కుత్తరము లీక జలపానంబుఁ జేయుదువేని వారితోడనైదవవాఁడుగా నుండెదవు. ఈసరస్సు నాయది. ప్రశ్నముల కుత్తరంబు చెప్పి యథేచ్ఛంబు సలిలపానంబుఁ జేయుము. మఱియు వలసినంత గొనిపొమ్ము. కేవలసాహసంబు వల దని చెప్పిన విని యుధిష్ఠిరుం డిట్లనియె. అయ్యా, నీవు రుద్రాదిత్యవసుమరుద్గణములలో నొక్కండ వని నాకుఁ దోఁచుచున్నది. నీకృత్యం బరసినం గేవలబకంబవని తోఁపదు. దేవదానవగంధర్వాదులును నాతమ్ములం బోర మార్కొనఁ జాలరు. హిమవత్పారియాత్రవింధ్యమలయతుల్యు లయిననాతమ్ములం బట్టి పడఁద్రోయ నోపదు. వారిం బడఁద్రోయుట యెంతయు నాశ్చర్యం బయ్యె. నీపని యెయ్యది? నీ వెవ్వఁడవు? అంతయుం దేటపడం జెప్పుము. భయకుతూహలంబు లయ్యెడి ననియడిగె. అడుగుటయు నాభూతంబు ధర్మనందనా, నేను బకంబు గాను. మ

ఱి యక్షప్రవరుండను. నా కెగ్గు చేసి నీతమ్ములు పడి రని యతిపరుషముగఁ బలికి తాలవృక్షప్రమాణశరీరంబును విరూపనేత్రంబులును సూర్యాగ్నితేజంబునుం గలిగి పెన్గొండవోలెఁ దత్సరస్తీరమున నొక్కవృక్షం బాశ్రయించి ధర్మరాజు కట్టెదుటం గనుపట్టి మేఘగంభీరనిర్ఘోషంబునం గర్జిల్లుచు నామాట వినక తెగించి నీరు ద్రావి నీతమ్ములు పడిరి నీకైనం బ్రాణములపై నాస గలదేని నాకొలని నీళ్లు ద్రావవలదు ప్రశ్నముల కుత్తరము లిచ్చి మఱి ద్రావు మనిన ధర్మరాజు యక్షప్రవరా, నీసొమ్ము నాకు వలదు. సాధువులు పరస్వంబుఁ గోరుటం బ్రశంసింపరు. నీవడిగిన నే నుత్తరముఁ జెప్ప నోపుదునే? అయిన నానేర్చు తెఱంగునఁ జెప్పెద నడుగు మనుటయు నయ్యక్షుఁడు ధర్మరాజు నిట్లని యడుగం దొడంగె.

## ధర్మరాజు యక్షప్రశ్నముల కుత్తరము లిచ్చి తమ్ముల బ్రదికించుట.

ధర్మనందనా, సూర్యు నెయ్యది నడుపును? అతనియిరుప్రక్కల నెవ్వరు నడతురు? అతని నెయ్యది యస్తముఁ బొందించు? అతం డెందు బ్రతిష్ఠితుం డగు ననియడుగ ధర్మరాజు సూర్యుని బ్రహ్మము నడుపు. అతనియిరుప్రక్కల దేవతలు నడుతురు. ధర్మ మతని నస్తముఁ బొందించు. అతఁడు సత్యమునఁ బ్రతిష్ఠితుం డనిచెప్పిన యక్షుం డిట్లనియె. ఏమిట శ్రోత్రియుం డగు? ఏమిట మహత్త్వంబుఁ బడయు? ఏమిట సహాయవంతుఁ డగు? ఏమిట బుద్ధిమంతుఁ డగు నని యడుగఁ గౌంతేయాగ్రజుండు శ్రుతమున శ్రోత్రియుం డగు. తపమున మహత్త్వంబుఁ బడయు. ధైర్యమున సహాయవంతుఁ డగు. వృద్ధసేవం బుద్ధిమంతుఁ డగు ననిపలికిన యక్షుం డిట్లనియె. బ్రాహ్మణుల కేమిట దేవత్వంబు గలుగు? వారికి సద్ధర్మం బెయ్యది? వారిమానుషభావం బెయ్యది? వారి కసద్ధర్మం బెయ్యది యనియడుగం బాండవాగ్రజుండు స్వాధ్యాయమున బ్రాహ్మణులకు దేవత్వంబు గలుగు. తపంబు వారికి సద్ధర్మంబు. మరణంబు వారికి మానుషభావంబు. ఆచారనియతిలేమి వారి కసద్ధర్మం బనిన యక్షుం డిట్లనియె. క్షత్రియులకు దేవత్వం బేమిటఁ గలుగు? వారికి సద్ధర్మం బెయ్యది? వారిమానుషభావం బెయ్యది? వారి కసద్ధర్మం బెయ్యది యనియడుగఁ బాండునందనుండు క్షత్రియులకు శస్త్రవిద్యావైపుణ్యప్రచారంబున దేవత్వంబు గలుగు. యజ్ఞాచరణంబు వారికి సద్ధర్మంబు. భయము వారికి మానుషభావంబు. శరణాగతపరిత్యాగంబు వారి కసద్ధర్మం బనిన యక్షుం డిట్లనియె. యజ్ఞియం బైనసామం బెయ్యది? యజ్ఞియం బైనయజు స్సెయ్యది? ఎయ్యది యొక్కటి యజ్ఞమును వరించు? యజ్ఞము దేని నతిక్రమింప దనియడుగఁ గౌంతేయుండు ప్రాణంబు యజ్ఞియం బైనసామంబు. మనస్సు యజ్ఞియం బైనయజుస్సు. ఋ క్కొక్కటి యజ్ఞమునువరించు. యజ్ఞము దాని నతిక్రమింప దనిన యక్షుఁ డిట్లనియె. ఆవాపముఁ జేయువారి కెయ్యది

శ్రేష్ఠంబు? నివాపముఁ జేయువారి కెయ్యది వరంబు? ప్రతిష్ఠం గాంచువారి కె
య్యది యుత్తమంబు? ప్రసవించువారి కెయ్యది ప్రధానం బనియడుగఁ గుంతీనం
దనుం డావాపముఁ జేయువారికి వర్షంబు శ్రేష్ఠంబు. నివాపము జేయువారికి
బీజము వరంబు. ప్రతిష్ఠం గాంచువారికి రక్షణదానాదులంజేసి గోవు లుత్తమం
బులు. ప్రసవించువారికిఁ బుత్రుఁడు ప్రధానుఁ డనిన యక్షుఁ డిట్లనియె. బుద్ధిమం
తుండై యింద్రియార్థముల లెస్స యనుభవించుచు సర్వభూతములకుఁ ద్రోహము
సేయక లోకపూజితుండై జీవించుచుండియు నెవ్వఁడు మృతుఁ డనంబడు ననియ
డుగఁ గుంతీతనయుండు దేవతలకుఁ బితరుల కతిథులకు భృత్యులకుం దగురీతి
విభాగించి పెట్టక కేవలం బాత్మోపయోగంబ చేయునతండు జీవన్మృతుం డనంబ
డు ననిన యక్షుఁ డిట్లనియె. భూమికంటెఁ గురుతరం బెయ్యది? ఆకాశముకంటె
నున్నతం బెయ్యది? వాయువుకంటె శీఘ్రతరం బెయ్యది? అన్నింటికంటె నెయ్య
ది తఱుచైన దనియడుగఁ బాండురాజనందనుండు భూమికంటెఁ దల్లి గురుతరురా
లు. ఆకాశంబుకంటెఁ దండ్రి యున్నతతరుండు. వాయువుకంటె మనస్సు శీఘ్ర
తరంబు. అన్నింటికంటె మనుష్యులకుఁ జింత తఱుచైనయది యనిన యక్షుఁ డి
ట్లనియె. ఎయ్యది నిదురవోయియుఁ గన్ను మూయదు? ఎయ్యది జనించియు
నిశ్చేష్టితంబై యుండు? దేనికి హృదయంబు లేదు? ఎయ్యది వేగమున వృద్ధిఁ
గాంచు నని యడుగ యుధిష్ఠిరుఁడు మీను నిదురవోయియుఁ గన్ను మూయ
దు. గ్రుడ్డు జనించియు నిశ్చేష్టితంబై యుండు. ఱాతికి హృదయంబు లేదు.
ఏఱు వేగమున వృద్ధిఁ గాంచు ననిన యక్షుఁ డిట్లనియె. దేశాంతరములకుఁ బోవు
వాని కెయ్యది మిత్రంబు? ఇంట నుండువాని కెయ్యది మిత్రంబు? రోగపీడి
తున కెయ్యది మిత్రంబు? చావనున్నవాని కెయ్యది మిత్రం బనియడుగ ధర్మ
సూనుఁడు దేశాంతరములకుఁ బోవువానికి సాతు మిత్రంబు. ఇంట నుండువానికి
భార్య మిత్రంబు. రోగపీడితునకు వైద్యుఁడు మిత్రంబు. చావనున్నవానికి దాన
ము మిత్రం బనిన యక్షుఁ డిట్లనియె. సర్వభూతముల కెవ్వఁడతిథి? సనాతనధర్మం
బెయ్యది? అమృతం బెయ్యది? జగంబెల్ల నెట్టిది యనియడుగఁ బాండుసుతుఁడు
సర్వభూతములకు నగ్ని యతిథి. సోముఁ డమృతంబు. అమృతపదవాచ్యం బైన
కైవల్యంబు సనాతనధర్మంబు. జగంబెల్ల వాయుమయం బనిన యక్షుఁ డిట్లనియె.
ఎవ్వఁ డొక్కఁడుగ నెప్పుడుం దిరుగు? ఎవ్వఁడు జాతుఁ డయ్యుఁ బునఃపునర్జననం
బుఁ గాంచు? ఎయ్యది హిమమున కౌషధంబు? నిఖిలోత్పత్తియోగ్యమహాక్షే
త్రం బెయ్యది యనియడుగ ధర్మజుఁడు సూర్యుఁ డొక్కఁడుగ నెల్లపుడుం దిరు
గుచుండు. చంద్రుఁడు జాతుఁడయ్యుఁ బునఃపునర్జననంబుఁ గాంచు. అగ్ని హిమ
మున కౌషధంబు. భూమి నిఖిలోత్పత్తియోగ్యమహాక్షేత్రం బనిన యక్షుఁ డిట్ల

నిమె. ఎయ్యది ధర్మసాధనములం బ్రధానంబు? ఎయ్యది యశస్కరముల నుత్తమంబు? ఎయ్యది స్వర్గసాధనముల ముఖ్యంబు? ఎయ్యది సుఖకరముల వరంబని యడుగఁ గురుకులతిలకుండు దాక్ష్యము ధర్మసాధనములందుఁ బ్రధానంబు. దానము యశస్కరముల నుత్తమంబు. సత్యము స్వర్గసాధనముల ముఖ్యంబు. శీలము సుఖకరముల వర మనిన యక్షుఁ డిట్లనిమె. మనుష్యున కాత్మ యెయ్యది? అతనికి దైవవిహితమిత్రం బెయ్యది? అతని కెయ్యది జీవనం బొసంగు? అతని కెయ్యది పరాయణం బనియడిగినం గురువర్యుండు మనుష్యునకుఁ బుత్రుఁ డాత్మ. అతనికి దైవవిహితమిత్రంబు కళత్రంబు. అతనికిఁ బర్జన్యుఁడు జీవనం బొసంగు. దాన మతనికిఁ బరాయణం బనిన యక్షుఁ డిట్లనియె. ధనార్జనసాధనములలో నెయ్యది యుత్తమంబు? ధనములలో నెయ్యది యుత్తమంబు? లాభములలో నెయ్యది యుత్తమంబు? సుఖములలో నెయ్యది యుత్తమం బనియడుగం బాండుతనూజుండు ధనార్జనసాధనములలో శరీరపటుత్వం బుత్తమంబు. ధనములలో విద్యాధనం బుత్తమంబు. లాభములలో నారోగ్యలాభం బుత్తమంబు. సుఖములలో సంతోష ముత్తమం బనిన యక్షుఁ డిట్లనియె. లోకమున నెయ్యది పరమధర్మంబు? ఏధర్మంబు సర్వకాలఫలప్రదంబు? దేని నియమించిన శోకములుడుగు? ఎవ్వరితోడి సంధి సెడ దనియడుగ ధర్మతనయుండు లోకమున నద్రోహాచింత పరమధర్మంబు. వేదచోదితధర్మంబు సర్వకాలఫలప్రదంబు. మనస్సును నియమించిన శోకము లుడుగు. సాధుజనులతోడిసంధి సెడ దనిన యక్షుఁడిట్లనియె. దేని విడిచినం బ్రియుం డగు? దేని విడిచిన శోకింపకుండు? దేని విడిచిన నర్థవంతుఁ డగు? దేని విడిచిన సుఖి యగు ననియడుగఁ బాండవజ్యేష్ఠుండు మానము విడిచినం బ్రియుం డగు. క్రోధము విడిచిన శోకింపకుండు. కామము విడిచిన నర్థవంతుఁ డగు. లోభము విడిచిన సుఖి యగు ననిన యక్షుఁ డిట్లనియె. బ్రాహ్మణుల కేల దానము సేయఁబడు? నటనర్తకాదుల కేల యియ్యఁబడు? భృత్యుల కేల యొసఁగఁబడు? రాజుల కేల యర్పింపఁబడు ననియడుగఁ గుంతీసుతజ్యేష్ఠుండు ధర్మార్థంబు బ్రాహ్మణులకు దానము సేయఁబడు. యశోర్థము నటనర్తకాదుల కియ్యఁబడు. పోషణార్థంబు భృత్యుల కొసఁగఁబడు. భయార్థంబు రాజుల కర్పింపఁబడు ననిన యక్షుఁడిట్లనియె. ఏమిట లోకం బావృతం బగు? ఏమిటం బ్రకాశింపదు? దేనివలన మిత్రులనుం ద్యజించు? దేనివలన స్వర్గగమనంబు ప్రతిహతం బగు ననియడుగ ధర్మపుత్రుఁడు లోకం బజ్ఞానముననావృతంబగు. తమస్సునం బ్రకాశింపదు. లోభమున మిత్రులనుం ద్యజించు. సంగమున స్వర్గగమనంబు ప్రతిహతం బగు ననిన యక్షుఁ డిట్లనియె. పురుషుఁ డెట్టివాఁడైన మృతుఁ డనం బరఁగు? రాష్ట్రి మెట్టిదియైన మృతం బనంబడు? శ్రాద్ధ మెట్టిదియైన మృతంబు నాఁబడు?

యజ్ఞ మెట్టిదియైన మృతం బనఁగ నగు ననియడిగినం గుంతీపుత్రుఁడు పురుషుఁడు దరిద్రుఁడైన మృతుఁడు నాఁబరఁగు. రాష్ట్ర మరాజకంబైన మృతం బనం బడు. శ్రాద్ధము శ్రోత్రియవిరహితంబైన మృతంబు నాఁబడు. యజ్ఞ మదక్షిణంబైన మృతం బననగు ననిన యక్షుఁడిట్లనియె. దిక్కెయ్యది? జల మెయ్యది? అన్న మెయ్యది విష మెయ్యది? శ్రాద్ధకాల మెయ్యది యనియడుగఁ బార్థుండుసజ్జనులు దిక్కు. ఆకాశము జలము. గో వన్నము. యాచనవిషము. శ్రోత్రియబ్రాహ్మణాగమనసమయంబు శ్రాద్ధకాలం బనిన యక్షుఁ డిట్లనియె. తప మెట్టిది? దమ మెట్టిది? క్షమ మెట్టిది? హ్రీ యెట్టిది? జ్ఞాన మెట్టిది? శమ మెట్టిది? దయయెట్టిది?ఆర్జవం బెట్టిది యనియడుగఁ బృథాసూనుండు స్వధర్మవృత్తిత్వంబు తపంబు. మనోనియమనంబు దమంబు. ద్వంద్వదుఃఖసహిష్ణుత్వంబు క్షమ. అకార్యనివర్తనంబు హ్రీ. తత్త్వార్థబోధనంబు జ్ఞానంబు. చిత్తప్రశాంతి శమంబు. సర్వభూతసుఖాభిలాషిత్వంబు దయ. సర్వసమచిత్తత యార్జవం బనిన యక్షుఁ డిట్లనియె. గెలువరాని శత్రుఁడెవ్వఁడుగీ. నశింపనివ్యాధి యెయ్యది? సాధు వెట్టివాఁడు? అసాధు వెట్టివాఁడనియడుగఁ బృథాపుత్రుఁడు క్రోధము గెలువరానిశత్రువు. లోభము నశింపరానివ్యాధి. సర్వభూతహితవర్తనుండు సాధువు. నిర్దయుఁ డసాధు వనిన యక్షుఁడు మోహ, మా, నాలస్య, శోక, స్థైర్య, ధైర్య, స్నాన, దానము లెట్టివి యనియడుగ విచిత్రవీర్యపౌత్రుండు ధర్మమూఢత్వంబు మోహంబు. ఆత్మాభిమానిత మానంబు. ధర్మనిష్క్రియత్వం బాలస్యంబు. అజ్ఞానంబు శోకంబు. నిజధర్మస్థిరవృత్తి స్థైర్యంబు. ఇంద్రియనిగ్రహంబు ధైర్యంబు. మనోమలక్షాళనంబు స్నానంబు. భూతరక్షణంబు దానం బనిన యక్షుఁడు మఱియు నిట్లనియె. పండితుఁ డెట్టివాఁడు? నాస్తికుఁ డెట్టివాఁడు? మూర్ఖుఁ డెట్టివాఁడు? కామమత్సరాహంకారదంభపైశున్యము లెట్టివి? దైవం బనునది యెయ్యది యనియడుగఁ బాండురాజాగ్రనందనుండు ధర్మజ్ఞుఁడు పండితుఁడు. మూర్ఖుఁడు నాస్తికుఁడు. సంసారహేతువైనయది కామంబు. మనస్తాపంబు మత్సరంబు. మహాఽజ్ఞానం బహంకారంబు. ధర్మధ్వజంబుఁ బూనుట దంభంబు. పరదూషణంబు పైశున్యంబు. పురాకృతదానాదులం గలుగుఫలంబు దైవం బనిన యక్షుం డిట్లనియె. పరస్పరవిరుద్ధంబులైనధర్మార్థకామంబు లెవ్విధమున నెక్కచోఁ గూడు ననియడుగం గురువంశభూషణుండు భార్యయు ధర్మంబునుం బరస్పరవశగతంబు లగునేని పురుషార్థత్రయంబునకు నెక్కచో మేళనం బగు ననిన యక్షుఁ డక్షయ్యనరకం బెవ్వఁడు పొందు ననియడుగ ధర్మాత్మజుం డిట్లనియె. యాచింప వచ్చినదరిద్రబ్రాహ్మణున కాశ చెప్పి యిత్తురమ్మని పిలిచి పిదప లే

దనువాఁడును, వేదములయందును ధర్మశాస్త్రములయందును దేవతలయందును పితరులయందును బ్రాహ్మణులయందును ద్వేషంబుఁ బూనునతండును, ధనము గలిగినను లోభవశమునఁ దాఁ గుడువక సత్పాత్రదానంబునుం జేయక లేదని పల్కువాఁడు నక్షయ్యనరకంబుఁ బొందుదు రనిన యక్షుండు మఱియు నిట్లనియె. బ్రాహ్మణ్యంబు కులవృత్తస్వాధ్యాయశ్రుతంబులలో నేమిటం గలుగు నని యడుగ నంతకసుతుండు కులస్వాధ్యాయశ్రుతంబులు బ్రాహ్మణ్యంబునకు ముఖ్యకారణంబులు గావు. వృత్తంబే ప్రధానకారణంబు. కావునఁ బ్రయత్నవంతుండై బ్రాహ్మణుండు వృత్తంబు విశేషముగ రక్షించికొనవలయు. వృత్తలోపంబు గలుగకున్న బ్రాహ్మణహాని గలుగదు. మఱి యది గలిగినం గలుగు. పాఠప్రవచనశాస్త్రచింతనాదివ్యగ్రులయ్యును వృత్తవంతులు గారేని వారు పండితులు గారు. మఱి మూర్ఖు లనంబడుదురు. బ్రాహ్మణకులజనితుఁడు నాల్గువేదముల నేర్చియు దుర్వృత్తుం డయ్యెనా యతండు శూద్రునికంటె నీచుఁ డనంబడు. అగ్నిహోత్రాదిపరుండై సద్వృత్తుండై నయతండే బ్రాహ్మణుం డనిన యక్షుం డిట్లనియె. ప్రియవచనములఁ బలుకువాఁ డేమి పడయు? లెస్సగ విచారించి పనులుచేయు వాఁడేమిపడయు? పెక్కండ్రతోడఁ జెలిమి చేసినవాఁ డేమి పడయు? ధర్మనిరతుఁ డేమి పడయు ననియడుగ యమతనూజుండు ప్రియవాది ప్రీతిం బడయు. లెస్సగ నాలోచించి పనులు సేయునతం డన్నింట నుత్కర్షంబుఁ బడయు. పెక్కండ్రతోడఁ జెలిమి చేసినవాఁడు మిక్కిలి సుఖించు. ధర్మనిరతుఁడు సుగతిం బడయు ననిన యక్షుఁ డిట్లనియె. ఎవ్వఁడు సంతోషించు? ఆశ్చర్యం బెయ్యది? మార్గ మెయ్యది? వార్త యెయ్యది? ఈనాలుగు ప్రశ్నములకుత్తరముఁ జెప్పు మనియడుగఁ బార్థాగ్రజుండు ఋణము పరప్రేష్యత దేశాంతరభ్రమణంబును లేక తనయింటన యుండి నిశ్చింతుఁడై కూరలు గాయలునైన వండించి పగటిమూఁడవజాముకడపట నేనియు భుజించువాఁడు సంతోషించు. ప్రతిదినము భూతములు మృతిఁ బొంది యమపట్టణమునకుఁ బోవుటం జూచుచుండియుఁ దక్కటివా రెంతయేఁ గాలంబు తిరముగ నుండఁ గోరుదు రిది పరమాశ్చర్యంబు. తర్కంబులు బహువిధంబులై నిలుకడలేకయుండు. వేదములు బహుధావిభిన్నములై దురవగాహంబులై యుండు. ధర్మము వచించుమునులుం బెక్కండ్రు గలరు. అన్నియుఁ బ్రమాణభూతంబులుగాని యొక్కటియైనం గాదనరాదు. ధర్మతత్త్వంబు సూక్ష్మబుద్ధి నెంతయుఁ బరిశీలించి యెఱుంగవలసియుండు. కావున ధర్మనిర్ణయమునం బెద్దలు నడిచ్చినదియే మార్గంబు. మహామోహమయంబైనయీజగత్కటాహమునందుఁ గాలపురుషుఁడు రాత్రిదినేంధనంబు మాసర్తుదర్వీకంబు పరిఘాద్యాయుధతృణంబు నగుసూర్యానలంబున భూతముల వండు

చున్నవాఁ డియ్యది వార్త యనిచెప్పిన విని యక్షుండ య్యా, నాప్రశ్నముల కెల్ల సదుత్తరములఁ జెప్పితివి. ఇఁక రెండుప్రశ్నముల నడిగెదఁ జెప్పుము. పురుషుఁ డన నెట్టివాఁడు ? సర్వధని యనఁగ నే తెఱంగువాఁడు? సదుత్తరముఁ జెప్పు మనినం గౌరవకులశేఖరుం డిట్లనియె. పుణ్యకర్మప్రభావమున నెవ్వనిపే రుభయలోకము లందు నెగడునో యతండు పురుషుండు. ప్రియాప్రియములు లాభాలాభములు సుఖదుఃఖము లతీతానాగతము లెవ్వనికిఁ దుల్యంబులై యుండునో యతండు సర్వ ధని యని ధర్మరాజు యక్షప్రశ్నములకు సదుత్తరములఁ జెప్పి వ్యాఖ్యానంబుఁ గావించిన నతండు మెచ్చి నీతమ్ములలో నొక్కని బ్రదికించెద. నీకుఁ గూర్చువానిఁ గోరికొను మనవుడు యుధిష్ఠిరుఁడు యక్షప్రవరా, శ్యామగాత్రుఁడు రక్తనేత్రుఁడు విశాలవక్షుఁడు మహాబాహుఁడు సాలప్రాంశుఁడు నగునీనకులుం బ్రదికింపు మని వేఁడికొనియె. అంతనయ్యక్షుఁడు ధర్మరాజుం బిలిచి రాజేంద్రా, నాగాయుత సమబలుండై యత్యంతప్రియుం డైనభీమసేనుని, లోకముననెల్ల మేటివిలుకాఁ డనం బొగడ్త కెక్కి మీ కెల్లపుకుం బ్రాపై నయర్జునుని విడిచి చవితితల్లికొడు కగునకులు నేతాత్పర్యంబునం బ్రదికింపఁ గోరితి వనియడుగ యుధిష్ఠిరుఁ డతని కిట్లనియె. అయ్యా, ధర్మంబు సురక్షితంబైన రక్షించు. హతంబైనం జంపుఁ గావున నే నెన్నఁడును ధర్మము దప్పను. ఆనృశంస్యంబే పరమధర్మంబు పరమా ర్థంబు నని నామతంబు. మఱియు ధర్మరాజు ధార్మికుం డని లోకమున నెల్లరు నన్నుఁ గొనియాడుదురు. అట్టి నాకు ధర్మద్రోహంబుఁ జేయంబోలునే? మా తండ్రియగుపాండురాజునకుఁ గుంతీమాద్రు లనువా రిద్దఱు భార్యలు. కుంతీపు త్రుఁ డైననేనొక్కడఁ బ్రదికియుండి మాద్రీపుత్రు నొక్కనినైనం బ్రదికింపక నాసోదరులనే బ్రదికించికొనుట ధర్మం బగునే? కుంతి యెట్లట్ల మాద్రియు నా కత్యంతపూజ్యురాలు. మాతల్లు లిద్దఱు జీవత్పుత్రలై యుండఁగ నకులుం బ్రది కింపు మనివేఁడితి ననివిన్నవించిన ధర్మనందను ధర్మసమన్వితవచనోపన్యాసం బవధరించి యక్షుండు ధర్మరాజుం జూచి యయ్యా, నీకన్నింటికంటె నానృశం స్యంబు పరమంబై యునికి కెంతయు సంతసం బయ్యె. నీతమ్ములు నలువురును జీవింతురు గావుత మనివక్కాణించె.

అంతఁ దత్క్షణంబ భీమార్జుననకులసహదేవులు నలువురు లబ్ధచేతనులై ని ద్రమేల్కాంచిన తెఱంగున లేచి క్షుత్పిపాసాపరిశ్రాంతియు నొక్కింత లేక వదన వికాసంబు దోఁపఁగ విలసిల్లుచుండిరి. అందుల కెంతయు సంతసం బంది ధర్మనం దనుం డాసరస్సున నేకపాదంబున నిలిచియున్నయయ్యక్షుం గనుంగొని యయ్యా, నీవు నిక్కంబ యక్షుండవు గా వని నాకుఁ దోఁచుచున్నది. వసురుద్రాదిత్యమ రుద్గణములలో నొక్కఁడు గావలయు. కాకున్న దేవేంద్రుఁడవో? మజ్జనకుఁ డ

యినధర్ముఁడవో యనియూహించెద. ఏ దేవుఁడవో తెలియఁ జెప్పు మనిన నతం డిట్లనియె. పుత్రా, యేను భవజ్జనకుం డైనధర్ముఁడను, నీతత్త్వ మెఱుంగ వచ్చితి. యశ, స్సత్య, దమ, శౌ, చార్జ, వాచాపల, హ్రీ, దాన, తపో, బ్రహ్మచ, ర్యాహింసా, సమతా, శాం, త్యమత్సరంబులుమదీయమూర్తివిశేషంబులు. నన్నెఱుంగ మార్గంబులు. అవియెల్లఁ గల్మిం జేసి నీవు నా కత్యంతప్రియుండవైతివి. భాగ్యవశమునఁ బితృమాతృగుర్వగ్నిహోత్రాత్మపూజనంబు లనునేనింటియందు ననురక్తుండవైతివి. దుర్జయంబు లయినయంతశ్శత్రుల నాఱింటిం గెల్చితివి. మద్భక్తులు దుర్గతిం బడయరు వరం బిచ్చెద నడుగు మనియె. అనవుడు ధర్మరాజు సంతుష్టమానసుండై దేవా, యస్మదాశ్రమంబున నొక్కబ్రాహ్మణుని యరణి తరుశాఖం దగిల్చియుండ మృగ మొక్కండు చనుదెంచి యాపాదపంబు రాయుచు నిజశృంగలగ్నం బైనయయ్యరణిం గొనిపోయె. అవ్విపునిక గ్నిహోత్రవిధిలోపంబు వాటిల్లకుండఁగ దానిం బ్రసాదింపుము. ఇది మదీయప్రథమ వరం బని ప్రార్థించిన యముఁడు వత్సా, నీచిత్తం బెఱుంగఁ గోరి యేన తొలుత మృగవేషమున నయ్యరణి నపహరించికొనివచ్చితి దాని నిచ్చెద. ఇష్టమైనవరము వేఱొక్కదానిం గోరకొను మని యానతిచ్చుటయుఁ గౌంతేయాగ్రజుండు దేవా, వనమునఁ బండ్రెండేండ్లు గడపితిమి. ఇంక నజ్ఞాతవాసనియమం బొక్కయేఁడు సలుపవలయు. అపుడు మమ్మితరు లెఱుంగకుండఁగ ననుగ్రహింపు మని రెండవవరం బడిగె. అడుగుటయు ధర్ముఁడు పుత్రుం జూచి నీకోరినట్ల వరము నిచ్చితి. మీర లిట్లు నిజరూపములఁ దిరుగుచున్నను నాసమయవత్సరమున మత్ప్రసాదమునం జేసి ముల్లోకముల నెవ్వరు మిమ్మెఱుంగఁ జాలరు. విరాటనగరంబున నిగూఢచర్యమై నావత్సరంబు గడపుఁడు. మీలో నెవ్వ రేరూపముఁ బడయఁ గోరినను బొంద నగు. నియమాంతమున దాని మాని నిజరూపంబుఁ గాంచ నగు. ఇంకను వరముఁ గోరుము. నీవు నాపుత్రుఁడవు. విదురుఁడు మదంశజాతుఁడు. నీ కెన్నివరము లిచ్చినను నేను దనియ ననుటయు యుధిష్ఠిరుఁడు దేవా భవద్దర్శనంబునం జేసి కృతార్థుండ నైతి. ఇంతకంటె వరం బేల? అయిన నీయానతి మెయి నడిగెద. లోభమోహక్రోధాదిజయంబును సత్యదానతపోనిరతత్వంబునుం బ్రసాదింపు మని ప్రార్థించె. తత్ప్రార్థనం బాకర్ణించి ధర్మదేవుఁడు ధర్మరాజుం బిలిచి ధర్మమూర్తియయిననీధార్మికత్వంబున కనురూపంబుగనే వర మడిగితివి. సంతుష్టుఁడనై యిచ్చితి. ఆబ్రాహ్మణు నరణి యిది యొగ్రహింపు మని చెప్పి దాని నిచ్చి యంతర్హితుం డయ్యె. అంతం బాండురాజనందనులు పరమానందకందళితహృదయారవిందులై నుగిడి యాశ్రమంబునకుఁ జనుదెంచి యయ్యరణి నావిప్రున కొసంగి తదాశ్రమవాసుల యభినందనములం బడసిరి. ఈయాఖ్యానంబుఁ

బఱించువారు దురితదూరహృదయులై ధర్మతత్పరులై పుత్రపౌత్రులం గాంచి దీర్ఘాయుష్మంతులై సుఖింతు రనిచెప్పి వైశంపాయనుండు జనమేజయునకు వెండియు నిట్లనియె.

*పాండవు లట్లు వనవాసనియమంబు నడపి ధర్మదేవతవలన వరములు గ్రహించి యజ్ఞాతవాసనియమంబు సలుపం దలంచియుండ ధర్మనందనుండు తమతోడ వనవాసంబు సల్పినబ్రాహ్మణులయనుజ్ఞఁ గొనువాడై వారికిఁ గేలుమోడ్చి మహాత్ములారా, దుర్యోధనాదులు వంచనచే మారాజ్య మొడిచికొని యనయంబున మమ్ము వనగతులం జేయుట మీ కందఱకుం దెల్లంబకదా. ఒడంబడినతెఱంగున మేము పండ్రెండేండ్లు వనవాసనియమంబు నిస్తరించితిమి. ఈకాలమంతయు నొకతెఱంగునఁ గడచె. ఇఁకఁ బదుమూఁడవయేఁడు నిగూఢముగ నజ్ఞాతవాసము సలుపవలయు. కర్ణశకునిగాంధారేయులు మానియమంబుఁ జెఱుపనయెల్లపుడును వేచియుండుదురు. సమయభంగము గాకుండఁ బ్రచ్ఛన్నవృత్తిమైనియమముఁ దీర్పుఁ డని యాశీర్వాదపురస్సరంబుగ ననుజ్ఞ సేయుఁడు. బ్రాహ్మణులం దగువారలనుం జేర్చికొని రాజ్యస్థులమై తొల్లింటియట్ల సుఖముండఁగ భాగ్యము మాకు మఱలఁ గలుగునొకో యని డగ్గుత్తిక వెట్టి కన్నీరు దొరుగ విలపించుటయు బ్రాహ్మణులుఁ దమ్ములు నతనినూరార్చుచున్నంత ధౌమ్యుఁ డిట్లనియె. రాజేంద్రా, నీవు సర్వధర్మవిదుఁడవు. దాంతుఁడవు సత్యసంధుఁడవు. జితేంద్రియుఁడవు. నీయట్టివారు నాపత్కాలంబులందు శోకింపఁ దగునే? పేరుపుట్టువుల విడిచి గూఢవృత్తి నుండవలసివచ్చెఁగా యని యంతఁగఁ జింతింపవలదు. శత్రునిగ్రహార్థంబు దేవతలునితరమహాత్ములుం గొందఱు గూఢవృత్తిం జరించిరి. ఎట్లంటేని ఇంద్రుఁడు నిషధాద్రియందు గిరిప్రస్థాశ్రమమున డాగియుండె. విష్ణుదేవుఁడును శత్రుజయార్థం బశ్వశిరస్సునందు నదితిగర్భమునందును గూఢముగ నుండె. మఱియు నద్దేవుండు తనరూపనామముల విడిచి వామనబ్రహ్మచారియై యుండె. ఇంద్రకార్యార్థంబు వజ్రాయుధమున డాఁగియుండె. వెండియు దశరథునకుఁ గుమారుఁడై ప్రచ్ఛన్నవృత్తి నెన్నియేఁ బాట్లు పడియె.

* ఈకథ తిక్కనసోమయాజిగారు తెనుఁగుభారతమునందు విరాటపర్వములోఁ జేర్చినారు. ఎఱ్ఱప్రగడగారు రరణ్యపర్వమున విడిచినారు. అప్పటి పుస్తకములలో నీయధ్యాయము విరాటపర్వములో నుండెఁ గాఁబోలు. ఇప్పటిమూలపుస్తకములలో నీయధ్యాయ మరణ్యపర్వమున నుండుటంజేసియు నుత్తరపర్వార్థం బించుక పూర్వపర్వాంతమున సూచించుట సంప్రదాయంబై యుండుటంజేసియు నాదిపర్వమున విషయసూచికాధ్యాయమందు "జగ్మురజ్ఞాత రాజ్యత్ర పాండవాః పశ్చిమాందిశ" మ్మనియరణ్యపర్వ విషయములలో నీయధ్యాయకథఁ జేర్చి యుండుటంజేసియు నిందును మూలము ననుసరించి యీకథ యీపర్వమునఁ జేర్పఁబడియె.

హుతాశనుండు సముద్రమునందుఁ బ్రచ్ఛన్నుండయ్యె. శౌర్వుఁ డనుబ్రహ్మర్షియుఁ దల్లితొడలోఁ బెద్దకాల మితరులకుఁ దెలియకుండఁగ నసించె. వా రందఱుం దొలుత వచ్చినయాపదల నోర్చి యట విక్రమించి శత్రువులం జెండాడి పరమ సుఖముఁ గాంచిరి. ఇదియెల్ల నీకు విదితంబకదా. నీవును వారియట్ల యీయా పదల నోర్చి యటఁ బగఱం గెలిచి సామ్రాజ్యంబుఁ బూనుదు వని యూఱడిం చినం గౌంతేయాగ్రజుండు ధౌమ్యువచనములఁ బ్రసన్నచిత్తుండై శాస్త్రసమ్మతం బయిననిజబుద్ధిం గొంత పర్యాలోచించి యూఱడిల్లె. అపుడు భీమసేనుఁ డత నికి సమ్మదంబుఁ గావించువాఁడై డాయం జని రాజేంద్రా, మనగాండీవి ధర్మాను గతం బైనబుద్ధిం దలపోసి యుపశమిల్లెఁగాని నిక్కంబ వాఁడలిగి తెగించెనేని ధార్తరాష్ట్రు లిన్నినాళ్లు పుడమి నుందురె? కవలుం బ్రతిదినంబు నేను వా రించుచుండిన నేమియు ననఁ జాలక యూరకున్నవారు. కాకున్న వారు మన శత్రుల నింతకుమున్న విధ్వంసంబుఁ జేయకుందురె? మే మందఱము నీనియ మించుపనులఁ జేయఁ బూనినవారము. ఆనతి యొసంగితివేనియొక్కపేల్మిడి శత్రువులనెల్లఁ దెగటార్చి జయలక్ష్మిని నీకు సమర్పింతు మనివిన్నవించుటయు ధర్మరాజు వగ దొఱంగి ముదంబునం బొదలె. అంత నాబ్రాహ్మణులందఱు పర మాశీర్వచనములఁ బ్రయోగించి యాభరతాన్వయదీపకులవీడ్కొని పునర్దర్శనం బయ్యెడు మనిపలికి నిజనివాసంబులకుఁ జనిరి. పదంపడిసర్వశాస్త్రవిశారదులు మంత్రవిచక్షణులు సంధివిగ్రహాదితత్వజ్ఞులు మహాప్రాజ్ఞులు నగుపాండుపుత్రులు పాంచాలీసమేతులై ధౌమ్యుం బురస్కరించికొని యచ్చోటు వాసి క్రోశమాత్రం బరిగి మఱునాఁడు మొదలుగా నజ్ఞాతవాసనియమంబు సలుపువారై సర్వజ్ఞుం డైనధౌమ్యునితోడ మంతనం బుండిరి.

క. అని యిట్లు వైశంపాయన, మునివర్యుఁ డరణ్యపర్వమును వివరింపన్
విని జనమేజయనరపతి, ఘనసమ్మోదాబ్ధివీచికాతతిఁ దోఁగెన్.

మ. శ్రుతిసీమంతవిభూషణం బనఁ గవిస్తోమస్తుతం బేజగ
త్పతిపాదాంబుజయుగ్మమర్చ జనుప లబ్ధంబై నఁ గ్లేశావహం
బతిదుర్గాపదరణ్యముం గడచి సౌఖ్యంబుం బుధుల్ గాంతురో
యతనిం గొల్తు దయాసముద్రు మునివేద్యానందచిన్ముద్రునిన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమార ముద్దువేంకటమహీపాల కరుణాపురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వ చమత్కారపరితోషితబుధస్తోమ సీతారామకవిలలామపుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్యలక్ష్మీనృసింహసుధీవర్యసచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామధేయప్రణీతంబైన శ్రీమదాంధ్రవచనభారతమునం దరణ్యపర్వమునఁ
బాండవులు ద్వైతవనమున కరుగుటయు, దుర్యోధనుఘోషయాత్రయు, మృగస్వప్నదర్శనంబును, గామ్యకాగమనంబును, వ్రీహిద్రోణికాఖ్యానంబును, దుర్వాసుఁడుపాండవులయొద్దకేతెంచుటయు, ద్రౌపదీహరణంబును, జయద్రథవిమోక్షణంబును, రామాయణోపాఖ్యానంబును, సావిత్రీచరిత్రంబును, గర్ణునికవచకుండలముల నింద్రుఁడపహరించి యతనికిశక్తినిచ్చుటయు, ద్వైతవనగమనంబును, నారణేయోపాఖ్యానంబును, ధర్మరాజుయక్షప్రశ్నముల కుత్తరములిచ్చుటయును, బాండవులు ధర్మదేవత వరంబువడసి పశ్చిమమునకుఁ బోవుటయు నన్నది చతుర్థాశ్వాసము.

అరణ్యపర్వము సమాప్తము.

శ్రీకాళహస్తీశ్వరాయనమః.

# విరాటపర్వము

## ప్రథమాశ్వాసము.

క॥ శ్రీరుచిర ధర్మ నియమో
దారామల చరిత సజ్జనావన దుష్ట
స్ఫారవిమర్దన కారణ
కారోపితమూర్తి శ్రుతిశిఖాంచలవర్తీ.

C. M. V. Sharma Nalgonda

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

తదనంతరంబు జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, మత్పూర్వపితామహు లైనపాండవులు దుర్యోధనభయార్దితులై యామీఁద విరాటనగరంబున నెవ్విధమున నజ్ఞాతవాసము సల్పిరి? పరమపతివ్రత యైన పాంచాలి యాసంకటముల నెట్లు సైఁచియుండె? తత్ప్రకారం బంతయు వివరింపవే యనియడుగ నామునివరేణ్యుఁ డానరవరేణ్యున కిట్లనియె.

పాండుపుత్రు లత్తెఱంగున ధర్మదేవతవలన వరముల గ్రహించి యవ్విపుని కరణి నొసంగి బ్రాహ్మణాశీర్వాదములం గొని యటఁ జని యందఱు నజ్ఞాతవాసచర్యానిర్ణయార్థంబు మంతనంబుండ ధర్మనందనుం డందఱం గలయం గనుంగొని యీపండ్రెండేం డ్లొకతెఱంగునఁ గడచె. పదమూఁడవయేఁడు సంప్రాప్తంబయ్యె. నిగూఢప్రకారమున దీని నెట్లు నిస్తరింతుమో యనిన నర్జునుఁ డిట్లనియె. రాజేంద్రా, ధర్మదేవతావరప్రభావమున మనము పరుల కెఱుక గాకుండ గూఢప్రకారమున నీయేఁడు గడపఁగలము. ఏదేశమున వసించుట లెస్స యని యొక్కటి విచారింపవలయు. కురు, పాంచాల, చేది, మత్స్య, శూరసేన, పటచ్చర, దశార్ణ, నవరాష్ట్ర, మల్ల, సాల్వ, యుగంధర, కుంతి, సురాష్ట్రావంతి దేశములు రమ్యవిపులసుభిక్షంబు లవుటం జేసి నివాసయోగ్యంబులు. వీనియందు మీకుఁ బోలిన దేశమునందు వసింత మనిన యుధిష్ఠిరుఁ డిట్లనియె. నీచెప్పినట్లు ధర్మదేవత వచనంబు దప్పనేరదు గావున మనయజ్ఞాతచర్య క్రమమునం గొనసాఁగఁగలదు. నీనిరూపించిన దేశములలో నెయ్యది యుచితం బని యందఱు నాలోచించి నిర్ణయింపవలయు. నాయభిప్రాయంబుఁ జెప్పెద. మత్స్యదేశపతి యగువిరాటుఁడు బలవంతుఁడు, ధర్మశీలుఁడు, వదాన్యుఁడు, వృద్ధుడు, సుజనప్రియుఁడు, మనపై

ననురాగము గలవాఁడు కావున నతనిం గొలిచి యీయేఁడు గడపనగు. ఆరాజు నెవ్వ రెవ్వ రేయేపనులం గొలువఁ దగునో తద్విధం బందఱు చెప్పుఁ డనిన నర్జునుం డిట్లనియె. నీయభిప్రాయముచొప్పున నావీట నుండుదముగాని నీ వేకార్యమున నానృపాలుం గొల్తువు? మృదుఁడు, వదాన్యుఁడు, హ్రీమంతుఁడు, ధార్మికుఁడు, సత్యసమయుఁడు నగునీవు నాపదలకుఁ బాత్ర మైతివి. సేవాశ్రమం బెఱుంగనినీ వీయాపద నేపగిదిం దరింతువొ యనిన యుధిష్ఠిరుఁడు మఱియు నిట్లనియె. ఏను విప్రవేషధరుండనై కంకుం డను పేరు పెట్టికొని వైడూర్యమయంబులు, కాంచనరచితంబులు, గజదంతనిర్మితంబులు, కృష్ణలోహితంబులు నగునానావిధంబు లయినయడ్డసాళ్లం గొనిపోయి విరాటరాజునకు సభాసదుండనై ద్యూతక్రీడాచమత్కారము నెఱపి యతనిం దన్మంత్రిబాంధవులను మెప్పింతు. మఱియు శ్రౌతస్మార్తకర్మనిమిత్తంబు లైనజ్యోతిరాదివిద్యలందలిసామర్థ్యంబుఁ బ్రకటించి మాన్యతం గాంతు. అతండు నీ వెవ్వరివాఁడ వనియడిగెనేని నేను ధర్మరాజునకుఁ బ్రాణభూతుఁ డగుసఖుఁడ నని చెప్పి నిగూఢముగ వర్తింతు ననిపలికి భీమసేనుం బిలిచి యన్నాలోకోత్తరబలశాలి యనం బొగడ్త కెక్కిన నీ వొకనికిఁ బరిచర్యసేయుచు నెవ్విధముననీయాపదం గడఁద్రోతువొయనిన వృకోదరుఁ డిట్లనియె. ఏను వల్లవుఁ డనుపే రిడికొని వంటలవాఁడనై యానృపాలుఁ గొలుతు. పాకవిద్య లెస్స నేర్చినలాఁతివారికంటె నేర్పున స్వాదుతమంబులుగా సూపాదిసకలపదార్థముల వండి యతని మెప్పింతు. మఱియుఁగట్టియలు ప్రొయ్యికిఁ దగునట్లు విఱువఁగ సాధనముల నపేక్షింపక బలిమిమై విఱుతు. వంటలవారెల్ల నన్నె నృపతిఁగాఁ దలంచు తెఱంగునఁ బ్రాభవంబు నెఱపుదు. ఆనృపతి యానతిచ్చునేని మహాబలము లయినవృషభముల నేనుఁగులను నిగ్రహించి బలిమిఁ బ్రకటింతు. బహుయుద్ధవిశారదు లయినజెట్లతోడఁ బోట్లాడి వారిం గెలిచి కడిమి మెఱయుదు. పోట్లాడునెడ వారిం బడఁద్రోయుదుఁ గాని చంపను. ఇవ్విధమున నమానుషకృత్యము లొనరించి వింతఁ జూపి యానృపతిచిత్తము వడయుదు. అతండు నీ వెవ్వరివాఁడ వనియడిగెనేని యేను ధర్మరాజునగరఁ బానసీఁడను. బాహుయుద్ధమునం బాండవాగ్రజుమెప్పు వడసినవాఁడ ననంగలవాఁడ. సంకేతభంగము గాకుండ నాత్మరక్షణముఁ జేయం గలవాఁడ ననుటయుధర్మరాజిది పోలు నని యర్జునుం దలంచి యిట్లనియె. అగ్నిదేవుఁడు బ్రాహ్మణరూపధరుండై ప్రార్థింపఁగ వాసుదేవద్వితీయుండై నమనయర్జునుఁ డొకరథికుండె వారింప వచ్చిన దేవేంద్రుని జయించి పన్నగరాక్షసాదుల వధించి ఖాండవవనముఁ గాల్పించి యయ్యగ్నిదేవుని సంతృప్తుం జేసె. నిరుపమానసౌందర్యమున నాగకన్యకమనంబుఁ గరఁగించె. మహాదేవుఁ బ్రత్యక్షముగఁ గనుంగొని పాశుపతాస్త్రంబు వడసె. నాకలోకమున నైదేఁడు లుండి యింద్రా

దులవలన దివ్యాస్త్రముల సాధించె. దీప్తిమంతులలో సూర్యుఁడు, మనుష్యులలో బ్రాహ్మణుండు, తేజస్వులలో నగ్నిహోత్రుఁడు, సర్పములలో శేషుఁ, డాయుధములలో వజ్రాయుధము, గోగణంబులలో మహోక్షంబు, జలాశయములలో సముద్రంబు, వర్షకర్తలలోఁ బర్జన్యుఁడు, నాగములలో ధృతరాష్ట్రుఁడు, గజములలో నైరావతంబు, ప్రీతిపాత్రంబులలోఁ బుత్రుఁడు, మిత్రములలో భార్య, పర్వతములలో హిమవంతంబు, నిర్జరులలో నింద్రుఁడు, వసువులలో హవ్యవాహుఁడు, మృగములలో శార్దూలంబు, పక్షులలో గరుత్మంతుఁడు నెట్లట్ల ధనుర్ధరులలో నర్జునుఁడు ప్రథమగణ్యుండు. అతండు పండ్రెండవరుద్రుండు, పదుమూఁడవయాదిత్యుండు, నవమవసువు, దశమగ్రహంబని యెన్నం దగు. జ్యాఘాతకర్కశంబులై నయాజానులంబమానబాహువుల నెట్లు డాఁచి యజ్ఞాతచర్యనడపునో. అమ్మహావీరుఁ డెట్టు లవ్విరాటుం గొలుచునో యని చింతించుచుండ నర్జునుఁడు ధర్మజున కిట్లనియె. రాజపుంగవా, వినుము. నేను స్వర్గమున నుండఁగ నన్నుఁ గామించి యూర్వశి విఫలమనోరథయై నపుంసకుంగా శపించుటయు నింద్రుఁడు కరుణించి యాశాప మజ్ఞాతవాసవత్సరమున ననుభవించి యటఁదన్మోక్షణంబు వడయఁగఁ బ్రసాదించెఁ గావున నే నిపుడు షండరూపధరుండనై శంఖవలయములం జ్యాఘాతకిణముల మఱుఁగుపఱిచి కొని దివ్యకుండలముల నపనయించి శంఖశకలముల వీనులం దాల్చి కేశభారము జడగా నలవరించి బృహన్నల యనుపేరు పెట్టికొని విరాటుకూఁతునకు నృత్తగీతవాద్యవిద్యల నేర్పుచు నంతఃపురాంగనల మెప్పించుచు నారాజుప్రసాదంబు వడయుదు. నీ వెవ్వరిదాన వని వా రడిగిరేని యుధిష్ఠిరునగర ద్రౌపదికిఁ దగినపరిచర్యలఁ జేయుచుండినదానననిపల్కెదు. సంకేతము సెడకుండఁగఁ బ్రచ్ఛన్నరూపంబుతో నీవత్సరముఁ గడపుదు. తొల్లి నలచక్రవర్తి తనపుట్టువు పేరును దొఱంగి ఋతుపర్ణునింటఁ బ్రచ్ఛన్నుఁడై యుండుట వినమె. ఆపదలు పొసఁగినపు డొకతెఱంగునఁ గాలముఁ గడఁద్రోయవలయుఁగాని చింతించినం బ్రయోజనం బెయ్యది? యనిచెప్పినం గౌంతేయాగ్రజుండు కాలోచితంబు కర్తవ్యంబ యని మనంబునం దలంచి యట నకులుం బిలిచి వత్సా, నీ వేకార్యమున విరాటుం గొల్తువు? సుకుమారుఁడు శూరుఁడు సుఖోచితుండు నగునీవు పనులు సేయ నోపుదువే యనియడుగ నకులుఁ డిట్లనియె. కురువంశవర్ధనా, నాకెప్పుడును నీయట్ల యశ్వములు ప్రియంబులు. ఏ నశ్వశిక్షలఁ దచ్చికిత్సను దద్రక్షణంబునుం గడు నేర్తు. కావున* గ్రంథికుఁ డనునామధేయంబు పెట్టికొని విరాటున కశ్వశిక్షకుఁడనై యతని మెప్పింతు. అచ్చటి వా రెవ్వరేనియు నీ వెవ్వరివాఁడ వనియడిగిరేని యుధిష్ఠిరునగర

* ఇతనికి దామగ్రంథియుఁ బేరుగలదు.

నశ్వములపై నధికృతుండనై యుంటి నని చెప్పఁగలాఁడ. ఇవ్విధమున నేనుం గూఢచర్య నడపుదు ననిపల్కిన విని ధర్మరాజు సహదేవుంబిలిచి యన్న సహదేవా, నీ వేపని చేసి యారాజు నుపసర్పింతు వనియడుగ నమ్మాద్రేయుం డిట్లనియె. ఏను నీపంపున గోగణముల నరయుచుండి తల్లక్షణరహస్యమెల్ల లెస్సగ నెఱింగినవాఁడను. నే నాఁబోతుల నేర్పఱిచి వానిపంచితంబు మూర్కొల్పి గొడ్డావులును జూలు గాంచునట్లు చేయ నోపుదు. ఆవృత్తిం గొని తంత్రీపాలుం డను నామం బిడికొని విరాటుగోష్ఠంబున కధ్యక్షుండనై గోగణంబుల నుచితానుచితపూర్వకంబుగాఁ బాఁడి పిదికించి తేవు లెద్దియుఁ జేరకుండఁగ వాని నరయుచు నానృపాలునకుఁ బ్రీతిపాత్రం బగుదు. నీ వెక్కడివాఁడ వని యతం డడిగెనేని ధర్మరాజు నన్ను గోగణాధ్యక్షపదవి నునిచి పెనిచె ననిచెప్పి గూఢప్రకారమున నేర్పుమై మెలఁగుదు. నీచిత్తంబునఁ జింత మాను మనివిన్నవించినం బాండవాగ్రజుండు తమ్ముల నందఱం గనుంగొని సుకుమారి, పిన్నది, రాజపుత్రి, యశస్విని, పతివ్రత, మహాభాగయు నగుపాంచాలి యెట్టు లీయేఁడు గడపునో? ఇయ్యది మన కెంతయుఁ గూర్చుపత్ని. తల్లిరీతిఁ బరిరక్షణీయ. జ్యేష్ఠభగినిమాడ్కిఁ బూజనీయ. మన మిందాఁక దీనిం బ్రాణములకంటె మిక్కిలిగఁ జూచుచుంటిమి. ఇఁక నెంతపడునో. ఏమి పని చేయుచు నారాజునగళుల మెలంగ నోపు. ఇది యెన్నఁడుం బరిచారికలఁ బనిఁబంపుఁ గాని దాఁ జేసినదికాదు. నాకుఁ జూడ మాల్యగంధాలంకారాదిప్రసాధనచమత్కారంబుదక్క దేని నెఱుంగ దని తోఁచు. దీనిచర్య యెట్టు లగునో యనివగచుచున్నంత ద్రౌపది యతని కిట్లనియె. రాజేంద్రా, లోకముల సైరంధ్రులు కులశీలముల రక్షించికొన రాజాంతఃపురములం దుచితపరిచర్యలఁ జేయుచునికి సంప్రదాయంబై యున్నది. కావున నేను సైరంధ్రివేషముఁ దాల్చి మాలిని యనునామధేయంబు వెట్టికొని విరాటుని పట్టంపుదేవి యగుసుధేష్ణపాలికిఁ జని యద్దేవి మెచ్చునట్లుగాఁ గేశబంధమాల్యబంధనాద్యలంకారచమత్కారముఁ జూపుచు నిగూఢచర్యమై వర్తింతు. అవ్విరాటుపత్ని నీవు ము న్నెచ్చట నుండినదాన వనియడిగెనేని యుధిష్ఠిరుధర్మపత్నియై నద్రౌపదికిఁ బరిచర్యలు చేయుచుంటి ననంగలదాన నసిపలికిన నాకర్ణించి పాండవజ్యేష్ఠుండు కల్యాణీ, పాపాత్ముల కెడ వీక కులశీలములరక్షించికొనుచు సాధువృత్తి నుండునది యనినియమించి వెండియుఁ దమ్ములం బిలిచి యీకార్యములు తగినవి. అందఱు నవ్విధమునఁ జేయవలదుసి. ఈయేఁడు గడచునందాక ధౌమ్యులగ్నిహోత్రముల రక్షించుచు ద్రుపదపురమున నుండఁగలవారు. ఇంద్రసేనాదులు రథములఁ దోలుకొని ద్వారక కరుగువారు. ద్రౌపదీపరిచారికలుఁ దక్కటివారుం బాంచాలపురికిఁ జనువారు. ఎవ్వరేనియు మన తెఱం గడిగిరేని ద్వైత

వనము విడిచి పాండవు లెట్లు పోయిరో యెఱుంగ మని యందఱుం జెప్పఁగలవారనిపలుకుచున్నంత ధౌమ్యుఁ డిది లెస్స. ద్రౌపదీరక్షణమున జాగరూకులై యుండుడని చెప్పి వెండియు నిట్లనియె.

### ధౌమ్యుఁడు పాండవులకు రాజసేవాధర్మంబుఁ జెప్పుట.

లోకవృత్తమెల్ల లెస్స యెఱింగినమీకు రాజసేవాప్రకారంబును సువిదితంబై యుండు. సౌహార్దము గలవారికి ధర్మార్థకామానుబంధముగఁ దమయెఱింగినంతయుఁ గఱపుట కర్తవ్యంబు. రాజసేవనమున నించుక దప్పినం గీడులు పొసఁగుటం జేసి యది దుష్కరం బనిభావించి నిరపాయం బైనయుపాయంబున మీరు మానావమానములగణింపక యత్యంతగూఢప్రకారమున నీయేఁడు గడబుచ్చినం బదునాలవయేఁట సుఖింపఁ గలరు. కావున రాజసేవాధర్మంబు సంక్షేపంబుగఁ జెప్పెద నాకర్ణింపుఁడు. రాజున కెఱింగించి యానతిం బడసి దర్శనార్థంబు చనవలయు. ఏకాంతసమయములందు నమ్మియుండరాదు. ఇతరులవలనం బరాభవంబు రానియాసనముఁ గోరవలయు. భూపతికి సమ్మతుఁడ నని యతనివాహనమును, శయనంబును, పీఠమును, గజమును, రథమును, నారోహింపరాదు. దుష్టచారులు శంకించుచోటులఁ గూర్చుండరాదు. అడుగకుండినం దానేపైఁబూసికొని యనుశాసింపఁ బోవరాదు. ఊరకయుండి సమయమున నుచితముగఁ బ్రస్తుతింపవలయుఁగాని యతిస్తుతిం జేయరాదు. అటుగాదేని రాజువ్యర్థస్తుతులఁ బలుకువాని మంత్రినైనను మిథ్యావాది యనుతలంపున నసూయగదుర నవమానించు. అంతఃపురాంగనలతోడఁ జెలిమి సేయరాదు. అంతఃపురమునఁ దిరుగువారితోడను దనకుఁ గీడుగోయువారితోడనుం జెలిమి యకృత్యంబు. అల్పకార్యములనేనియు స్వతంత్రతం బూనక రాజునకు విన్నవించి చేయవలయు. ఎంత యుత్తమపదవి లభించినను దన్నడుగకుండినను నియమింపకుండినను మర్యాదం దలంచి జాత్యంధుఁగా భావించికొని యాకార్యమునం బ్రవర్తింపరాదు. రాజులు మర్యాద దప్పి నడచువాఁడు పుత్రుఁడైనను మనుమఁడైనను భ్రాతయైనను దండింతురుగాని మన్నింపరు. భూమిపాలుఁడు కృతాపరాధుల నగ్నివిధమున దహించు ననియు నుచితరీతిం గొలుచువారల దేవునిచందమునఁ బ్రసాదించి ప్రోచు ననియుం దలంచి ప్రయత్నమున నుపచరింపవలయుఁగాని యాజ్ఞ మీఱి యసత్యసరణిం బ్రవర్తింపరాదు. అట్టివాని రాజు వధించు. కావున నతని చిత్తం బనువర్తించి ప్రమాదంబును గర్వంబును గోపంబును [illegible]చి తన్నియుక్తకార్యముఁ జేయవలయు. ప్రసంగము పొసంగినఁ బ్రియము హితము నగుదానిం జెప్పవలయు. మఱియు మదప్రమాదవిరహితుండై యనుకూలతమై వర్తించుచు నప్రియం బైనను హితంబు వాక్రువ్వవలయు. రాజున కింపుగానిపనులఁ జేయరాదు. అతనియహితు

లతోడ సహవాసంబుఁ జేయరాదు. ఉత్తమస్థానంబు వచ్చు నని తనచోటు వద లరాదు. నృపతికట్టెదుటఁ గూర్చుండరాదు. పిఱుందు దెస శస్త్రధారు లయినరాజ రక్షకులనెలవు గావున నచ్చటనుం గూర్చుండరాదు. మఱి యతనివామదక్షిణపా ర్శ్వములఁ గూర్చుండవలయు. ప్రసక్తి వచ్చినను దరిద్రులకుఁ బలువురకు సంకట ముగాఁ బలుకరాదు. భూపాలుఁ డెవనిపై నెట్లు పలికినను దానిం బ్రకటింపరా దు. నగళులలోనిమాటల వెలిపుచ్చువాని రాజన్యుఁ డసూయతోఁ బరిభవించు. శూరుఁడ బుద్ధిమంతుఁడ నిపుణుఁడ నని మదింపక ప్రియములఁ జేయవలయు. అట్లైన నతండు రాజునకుఁ బ్రియుండై వివిధభోగములఁ బడయు. పొందరాని యైశ్వర్యంబును బ్రియంబును రాజువలనఁ బడసితి నిఁక నాకేమి యనక యెల్ల పుడుం దత్ప్రియహితంబులనే చింతింపవలయు. భూపాలునకోపంబునఁ జేటు వా టిల్లు ననియు ననుగ్రహమున మేలు సేకూఱు ననియు నెఱింగి మనస్సునైన నేలి నాతనికి ద్రోహము దలంపరాదు. రాజసభలో మేను ద్రిప్పఁగఁ జేతుల నెత్తి పెదవులు దెఱచి పెలుచ నావులింపరాదు. మోఁకాళులు మీఁదికి నిక్కునట్లు కూర్చుండరాదు. అపానోత్సర్జనంబుతగదు. ఉమియరాదు. తుమ్మరాదు. తద్వచనం బధిక్షేపింపరాదు. హాస్యవస్తువు లెన్నియే నుండినను మిక్కిలి నవ్వరాదు. మఱియే మఱుపాటు లేక మృదువుగఁ జిఱుతనగవు సమయములం జూపవలయు. లాభము న కుబ్బక యవమానమునకుఁ గుందక యసమ్మోహుఁడునై నేర్పున మెలఁగవలయు. రాజునైన రాజపుత్రునైనం బ్రియహితోక్తుల ననువర్తించు పండితుఁడు తత్ప్రీ తిపాత్రభూతుండై మంత్రిపదంబునేనియుఁ బ్రాపించి పెద్దకాలంబు సుఖిం చు. రాజు మంత్రిపదస్థుండైనవానిఁ గారణవిశేషంబున నిగ్రహించనేనియు నతండురాజుతోడ వివాదంబు సేయకయనుసరించి ప్రియహితచింతాతత్పరుం డైయుండినం గ్రమ్మఱ సంపదం బ్రాపింపఁ జాలు. ప్రత్యక్షపరోక్షములందొ క్కరూపకా రాజుసద్గుణముల నుగ్గడింపవలయు. మంత్రియైనను రాజద్ర వ్యము నపహరించెనేని నిజపదభ్రష్టుండై కారాగృహబంధనంబునొండె వధ మునొండెం బొందుఁ గావున నేకార్యమున నియోగించినను రాజధనం బించుకేని యుఁ దాఁకరాదు. హితమేనియు నేర్పున నెఱింగింపవలయుఁగాని రాజుతోఁ బెద్ద యు వివాదంబు సేయరాదు. యోగ్యప్రదేశములం దవశ్యము రాజుం గొలిచి యుండవలయుఁగాని తొలఁగియుండరాదు. తా నెంతబలవంతుఁడు శూరుఁడు నైనం గార్యభరములు పొసఁగనేని బడలితి ననక శ్రమముల నోర్చి సత్యము పలు కుచు నడఁకువమై సీడయపోలె రాజు ననువర్తింపవలయు. పని పంపఁగ రాజు లాఁతివారి దెసంజూచుచుండినను నేమి సేయుదు నని మ్రోలఁ జూపట్టవలయు. ఎద్ది

యేనియుఁ బని చెప్పినం బాహ్యాభ్యంతరచర్య లొక్కరూప కా శ్రద్ధమైఁ జేయవలయు. దేశాంతరమునకుఁ బంపినను మాఱు సెప్పక తనవార లెట్టు లగుదురొక్కో యనితలంపక నిజకుటుంబమెల్ల రాజాధీన మనుభావముతో దుఃఖముల కోర్చి చనవలయు. రాజగృహమునకుఁ దుల్యముగానిల్లు గట్టరాదు. రాజరహస్యంబు పలువురతోఁ జెప్పరాదు. ఉత్తమవస్త్రవాహనభూషణాద్యలంకారముల భూమిపాలుం డొసంగకుండినందనంతన గ్రహింపరాదు. కరుణించి యతం డొసంగనేని వానిన కట్టవలయు నెక్కవలయుఁ దాల్పవలయు. ఇవ్విధమున నేర్పుమై నడకువ మెఱయ మెలఁగునతఁడు పుడమితేనికూరిమిపేరిమికిఁ బాత్రభూతుఁ డగు. కావున మీర లేతత్ప్రకారమునఁ జిత్తమున నిల్పికొని నేర్పుతో నీవత్సరంబుఁ గడపితిరేని యటరాజ్యస్థులై సుఖింపఁగలరని పురోహితుఁడు రాజసేవాధర్మంబు బోధించిన వినియుధిష్ఠిరుం డమ్మునింగనుంగొని మహాత్మా, యిట్లు మమ్ముఁ గఱపఁ గుంతీదేవియు విదురుఁడునుమీరును దక్క లేఁతివారు పూనరు. కరుణించి మీరు బోధించుటం జేసియీధర్మము గొంత విదితం బయ్యె. ఎఱింగినకొలఁది నడపుదుము. ఈయాపదలఁ గడచివిజయముఁ గాంచు తెఱంగు గాఁ బ్రస్థానశోభనముఁ గావింపవే యనవుడు నప్పురోహితుం డగ్నిహోత్రము సుప్రజ్వలితంబుఁ గావించి ప్రస్థానమంగళంబు సెలంగయథావిధి హోమము లొనరించి దీవించుటయుఁ బాండవులు యాజ్ఞసేనీసమన్వితంబుగ బ్రాహ్మణాగ్నిహోత్రులకుఁ బ్రదక్షిణనమస్కారము లొనరించి యాయుధపాణులై యరిగిరి. ధౌమ్యుఁడు నగ్నిహోత్రములం గ్రహించి పాంచాలపురమునకుఁ జనియె. ఇంద్రసేనాదులు రథములం దోలుకొని ద్వారవతికిఁ బోయిరి.

### పాండవు లాయుధముల శమీవృక్షంబున నిక్షేపించుట.

అట్లు పాండవులు పాంచాలీసమేతంబు ప్రస్థానం బొనర్చి దశార్ణదేశములకుత్తరంబు పంచాలదేశములకు దక్షిణంబు శూరసేనదేశంబులకు మధ్యంబునుంగా యమునానదీదక్షిణతీరంబొరసి పురగ్రామములు విడిచి వనమార్గములం గిరిదుర్గముల వసించుచు వన్యంబు లయినఫలమూలముల శరీరయాత్ర నడపుచు వేఁట లాడుచుఁ జనిచని మత్స్యదేశము సొచ్చి తత్కాంతారమార్గంబున నడచుచుండ ద్రుపదరాజపుత్రి ధర్మపుత్రుం గాంచి పలుదెఱంగు లగుత్రోవలు చేలుం జూపట్టుచున్నవి. విరాటరాజధాని యతిదూరమున నుండు నే నడవుల నింతదవ్వు నడచినడచి కడు డస్సితి. ఇం కొక్కయడుగైన నడువం జాలను. నేఁ డిచ్చటన యుండి మెల్లి యప్పురికిఁ బోవరాదె యనిన ధర్మరాజు పార్థుం బిలిచి యీపడఁతుక నడిచినడిచి కడు బడలినయది. నీ వీ యడవి దాటునందాఁక మోఁచికొనిర మ్మనిన నర్జునుం డట్లయని తత్క్షణంబ ద్రౌపది నెత్తికొని వారితోడ నరిగి

విరాటపురి చేరువను డించె. అచ్చట నిలిచి యుధిష్ఠిరుఁ డర్జునుం బిలిచి మన మీ యాయుధములతోడఁ బురమునకుఁ బోయిన నందఱు వెఱపుతో శంకింతురు. అన్నియు నట్లుండ లోకవిదితం బైనయీగాండీవముఁ గొని యీవు సొచ్చితివేని జనులు తత్క్షణంబ యూహించి మనల నెఱుంగుదురు. మఱియు నొకతూరి వనవాసంబు నజ్ఞాతవాసంబునుం జేయవలసివచ్చు. మనప్రతిజ్ఞ యట్టిదికదా. కావునఁ గైదువుల నొక్కచోఁ బెట్టి పదిలపఱిచి పోవుట లగ్గు. అందులకుఁ దగినచోటు నరయు మనిన నర్జునుం డిట్లనియె. కూళమెకములమనికిప ట్టగునీకాఱడవిలో శ్మశాన ప్రాంతమునందు నింగి నొరసి చుట్లనత్యాయతశాఖాకదంబంబు గలిగి దురారోహంబు భీకరంబు నైనశమీవృక్ష మల్లదె చూపట్టుచున్నది. అది యనుపయుక్తం బగుటం జేసి దాని నెవ్వరును జేరరు. కైదువులనెల్ల దానిపై నునిచి పోఁ దగు. మనుష్యుఁ డొక్కఁడేనియు నిచటనగపడఁడు. ఎవ్వరు నెఱుంగకుండ నిప్పుడే యాజమ్మిపై నునిచిబోవుద మనిచెప్పి యతండు తనకు దేవదానవాదుల నైనం గెలువఁగ ముఖ్యసాధనంబు శత్రుజనకర్ణవిదారణచణఘోరనిర్ఘోషంబు లోకవిశ్రుతంబు నగుగాండీవం బెక్కుడించె. అంత ధర్మరాజు కురుక్షేత్ర మేలు నెడఁ దనకుఁ బరమసాధనం బయినవిల్లు మోపెడలించె. భీమసేనుండును దిగ్విజయంబునాఁడు దశార్ణపాంచాలాదిదేశముల గెలువ దనకుఁ బ్రధానసాధనంబు వజ్రనిర్ఘోషసమశత్రుభీకరజ్యానినాదంబు సైంధవపరాభవసహాయంబు నగుతనధనుర్వరం బవజ్యంబుఁ గావించె. మాద్రేయులు పశ్చిమదక్షిణదిగ్విజయంబునం బరమసాధకంబు లైనతమవిండుల గొనయమ్ము లపనయించిరి. అట నావిండులను, దొనలను, బాణమ్ములను, ఖడ్గములను, గదలను, దక్కటికైదువులనుం బదిలంబుగఁ గట్టకట్టి ధర్మరాజు నకులుం బిలిచి దీని జమ్మిపైఁ బెట్టు మనుటయు నమ్మాద్రేయుండు దాని నెత్తికొని యాశమీవృక్షము డాయం జని యారోహించి యొక్కవిపులస్కంధమున నయ్యాయుధసంచయంబు నుంచి సందు లగపడకుండ నతిదృఢముగ బంధించి యెండకు వానకు మంచునకుం జెడకుండునట్లుగాఁ జర్మంబుఁ గప్పి శ్మశానంబునం బీనుం గొక్కటి యగపడినం దాని నయ్యాయుధములకట్టపైఁ బెట్టి యతండు వచ్చిన నందఱు శవదుర్గంధనిందితం బయినయావృక్షంబు నెవ్వరును జేరరా రని తమలో నిర్ణయించి యట మగిడి యిది శతవృద్ధు మాతల్లి మృతిం బొందె. మృతుల నిట్టు లుంచుట యస్మత్కులసంప్రదాయంబు గావునఁ బెద్దలయాచారం బనువర్తించి యిట్లు చేసితి మని యచ్చట నగపడినగోపాలాదిక్షుద్రజనంబులకుఁ దమకృత్యంబు మఱుఁగుపడం జెప్పి తమ కందఱకును గ్రమంబున జయుఁడు, జయంతుఁడు, విజయుఁడు, జయత్సేనుఁడు, జయద్బలుఁడు ననుమాఱుపేళ్లు తమలో సంకేతంబుగాఁ బెట్టికొని గూఢచర్యాప్రకారంబునకుఁ

దగుమాట లాడుచు విరాటపురంబుఁ జేరం జనిరి. అంత ధర్మరాజు కృతస్నానుండై యాహ్నికములఁ దీర్చి సర్వభువనేశ్వరియు, సకలదుర్గసంకటహారిణియు, ఖడ్గఖేటకదివ్యాంబరాది ధారిణియు, భక్తవత్సలయు నగుదుర్గాదేవి నేకతానచిత్తముతో ధ్యానించి స్తుతించి మహాదేవీ, నిన్నుఁ దలంచువారు వ్యాధిమృత్యుభయంబులనుం బాసి యభిమతంబులం బడసి సుఖింతురు. ఆపన్నులకు నీవే గతివి నేను రాజ్యభ్రష్టుఁడనై సకలసంకటములపాలై నిన్ను శరణు సొచ్చితి. ఆపదలఁ దొలఁగించి రక్షింపు మనిప్రార్థించిన నమ్మహాదేవి తత్ప్రార్థనం బాకర్ణించి కరుణాయత్తచిత్తయై యతనికిఁ బొడసూపి యిట్లనియె. ధర్మనందనా, నీవు మత్ప్రసాదమునఁ బ్రియానుజులతోడ గూఢప్రకారమున నజ్ఞాతవాసనియమంబు సల్పి సంగ్రామంబున శత్రువుల జయించి నిష్కంటకంబుగ రాజ్య మేలుచు సుఖముఁ గాంతువు. మఱియు నీపఠించినస్తోత్రము పఠించినవారికి వినువారికిని సంకటకాలమునందు సంగరారణ్యగిరిసాగరాదులయం దెచ్చటనైనను నీయట్ల పరమభక్తితాత్పర్యంబున నన్ను స్మరించినవారికిం బ్రసన్నరై నే నభిమతార్థముల నిత్తు. మద్భక్తులకు దుర్లభం బొక్కండు నుండ దనివాక్రుచ్చి వారికి రక్షఁ గావించి యంతర్హిత యయ్యె.

## ధర్మరాజు విప్రవేషముతో విరాటునొద్దకు వచ్చుట.

అంత ధర్మరాజు ధర్మదేవతాప్రభావమున నలవడిన విప్రవేషంబును గాంచెనాక్షంబులనుం గ్రహించి యయ్యక్షంబుల నుత్తరీయంబునం గట్టి కక్షఁబున నిక్షేపించికొని వెలుపలికొలువు కూటమున మంత్రి విప్రప్రముఖులతోడం గొలువున్న విరాటుపాలికిఁ జనుచుండ నమ్మత్స్యమహీశ్వరుం డతనిం గాంచి సభాసదుల నుపలక్షించి యీవచ్చుబ్రాహ్మణుం జూచితిరె. నాకుం జూడ నితండు బ్రాహ్మణుఁడుగాఁ దోఁపదు. మఱి పృథివీపతి యని తోఁచుచున్నది. లెస్సగ శరీరచిహ్నములం బరిశీలించిన రాజమాత్రుఁ డనియుం దోఁపదు. మఱి సామ్రాజ్యాభిషిక్తుం డైనసార్వభౌముఁ డని తలంపు వొడముచున్నది. ఏనుంగులు గుఱ్ఱములు రథములు భటులు మున్నగురాజపరివారం బేలొకో యితనిం గొలిచిరాకుండె. మదగజంబు తామరలకొలనికి వచ్చుచందమున నాసభకుఁ జనుదెంచుచున్నవాఁ డనిచెప్పుచున్నంత ధర్మరాజునృపాలుఁ జేరఁ జని రాజేంద్రా, యేను ద్విజుండను. కారణవిశేషమున సర్వస్వమునుం బోఁగొట్టుకొని జీవనార్థము నీయొద్దఁ గొంతకాలము స్వేచ్ఛమై నుండఁగ వచ్చితి ననియె. అనవుడు విరాటుఁడు సంతుష్టమానసుండై యతని స్వాగతం బడిగి సత్కరించి యయ్యా నీ పే రెయ్యది? గోత్ర మెయ్యది? ఏరాజునొద్ద నుండినవాఁడవు? నీవృత్తి యెయ్యది? ఏవిద్య నేర్తు వనియడుగ ధర్మరాజునృపాలుం జూచి యేను

గంకనామధేయుఁడను. వైయాఘ్రపద్యగోత్రుఁడను. యుధిష్ఠిరునకుఁ బ్రాణభూతుఁడనై యతనిమన్నన గాంచినవాఁడను. అతఁడు ద్యూతంబు లెస్స నేర్తు ననుటయు విరాటుండు ప్రహృష్టాంతరంగుండై కంకభట్టా, దేవసముఁడై ననిన్నుఁ జూడఁగ నెంతయు సంతసం బయ్యె. అతఁడు ద్యూతంబు నా కత్యంతప్రియంబు. నారాజ్యమెల్ల నీవ యేలుము. నీశాసనముమెయి వర్తింతు ననియె. అనుటయు ధర్మనందనుండు వెండియు విరాటుం జూచి యేను ధనహీనుఁడఁ గావున జూదమునం బణము నొడ్డఁగఁ జాలను. నే నోడితినేని గెలిచినవారు నావలన ధనము నపేక్షింపకుండఁగ వర మియ్యవలయు. ఇది చాలు. నీరాజ్యము నాకు వలదు. ఇందులకు సమ్మతింతువేని నీయొద్ద నుండుదు ననిపలికిన విని విరాటుండు కంకుం జూచి యయ్యా, నీచిత్తమునకు వచ్చినరీతి నుండుము. నీకు విరుద్ధముగ నడుచువారల నుగ్రముగ దండింతు. మానగళులలో నెచ్చటనైనను నీ వడ్డము లేక చరింపవచ్చు. మఱియు ని న్నెవ్వరైనను యాచించిరేని తోఁచినభంగి వారి కిత్తు నని చెప్పుము. అదియెల్ల నేనిత్తు. ఎవ్విధమున నాయొద్దఁ గొఱఁత యుండ దని చెప్పి నిజపరిజనులఁ బిలిచి యస్మదీయదేశమున కీకంకభట్టుఁడు ప్రభువు. ఇతనికిఁ దగురీతిం బానభోజనవస్త్రాదుల నిచ్చి నేఁ జెలిమిఁ జేయుచుండుదు. ఈద్విజునకు విరుద్ధముగ నడుచువారల దండింతు నందఱు నెఱింగియుండుఁ డని తేటపడం జెప్పి కృత్రిమబ్రాహ్మణుం డైనయుధిష్ఠిరుం దనయొద్ద నిల్పికొనియె. తదీయకృత్రిమచరిత్రం బెవ్వరు నెఱుంగరైరి.

## భీముఁడు వంటలవాఁడై విరాటునొద్దకు వచ్చుట.

అటఁ గొండొకవడికి భీమసేనుఁ డొకచేతఁ జట్టువంబును గరిటెయుం బూని వేఱొకచేత నొఱలేనిఖడ్గము గ్రహించి ముఱికిపెల్లునం జేసి మాసినవస్త్రములఁ గట్టి బానసివానివేషము ధరించి యలసూర్యునిచాడ్పున వెలుంగుచు ధర్మరాజు సనినదెసగాక వేఱొక్కమార్గంబుగా విరాటుకొలువుకూటంబునకు వచ్చె. వచ్చుటయు నాభూపాలుండు పరిజనులం జూచి యీనరోత్తముఁ డెవ్వఁడొక్కొ సింహగమనవిలాసంబు మెఱయ రెండవమార్తండుండునాఁగ నిజతేజఃపటలంబునఁ బ్రాంతదేశమెల్ల వెలింగించుచు వచ్చినవాఁడు. ఇట్టివాని నింతకుము న్నెన్నఁడునుం గానను. ఎంతవితర్కించినను వీనితత్వంబు దెలియకుండెడి. ఇతండు గంధర్వనాయకుండో సురేంద్రుండో యని సంశయించెద. అడిగి తెలిసికొనుఁడు. వానికోరినదానినిచ్చెద ననుటయు రాజపరిజనులు వృకోదరుని డాసి రాజు నీవృత్తాంతముఁ దెలియఁ గోరినవాఁడు గావున వివరింపు మనుటయు నతండు మత్స్యభూపతిమొగంబునం జూడ్కి నిలిపి యేను వంటలవాఁడను. నాపేరు వల్లవుండు నీకుఁబరిచర్యఁ జేయఁగ వచ్చితి గ్రహింపు మనిన నవ్విరాటుఁ డతనికిట్లనియె. నీరూపము దేజమువిక్రమము

నుం జూడఁగ నీవు వంటలవాఁడ వని నమ్మరాదు. ఇంద్రునకు సాటివచ్చునరేంద్రుఁడ వనితలంచెద. కలరూపు తేటపఱుపు మనిన వృకోదరుండు రాజేంద్రా నావృత్తాంత ముఁడాఁచికొన నేల ? పుట్టిననాఁటంగోలెఁ బాండవాగ్రజుం డైనయుధిష్ఠిరునకుఁబరి చర్యలు చేయుచు నతండు మెచ్చుతెఱంగున వివిధసూపశాకముల వండి తచ్చి త్తంబు వడసినవాఁడను. మఱియు నతిబలశాలు లయినజెట్లతోడను సింహవ్యా ఘ్రగజాదులతోడం బోట్లాడి గెలుపు గొని యితండు లోకో త్తరబలశాలి యని యు బాహుయుద్ధనిపుణుఁ డనియు నానృపాలశేఖరుండు పేర్కొన నెగడితి. నాయునికి యభిమతం బగునేని యుండెద ననివచించె. వృకోదరువచనంబు విని విరాటుఁడు భూమండలంబెల్ల నేలఁ జాలిననీ వీ పనిఁ జేయఁ బూను టనుచితం బనిచెప్పితింగాని యొండేమియుం గాదు. మదీయరాష్ట్రమంతయు భవదధీనంబు. నీయునికియ చాలు. ఇచ్చకు వచ్చినట్లు వ ర్తింపుము. మహానసంబున కధికారివై యిచ్చటివారివలనఁ బనులం గొను మనిచెప్పి భీమసేనుం గ్రహించె. వానిత త్త్వ మెవ్వరు నెఱుంగరైరి.

### ద్రౌపది సైరంధ్రియై సుధేష్ణయొద్దకు వచ్చుట.

అయ్యవసరంబునఁ బాంచాలిజడవిప్పివేల్లితాగ్రంబులు మృదువులు దీర్ఘ ములు నీలములు నగుసుకేశములఁ దుఱుముగఁ గట్టి కుడిప్రక్కకు మీఱునట్లు దోఁపి మాసినయొంటిచీరఁ గట్టి సైరంధ్రీవేషముఁ దాల్చి రాజవీధి నేతెంచుచుండ జను లద్దేవియొద్ద గుంపులుగూడి యమ్మానీ వెవ్వతెవు? ఏమిపనిగ వచ్చినదాన వనియడుగ ద్రుపదరాజనందన వారిం జూచి యేను సైరంధ్రిని ప్రోచువారికిఁ బరిచర్యఁ జేయుదు ననుటయు జను లందఱు తదీయరూపసౌభాగ్యంబునకు విస్మి తులై యానాతి సైరంధ్రి యఁట. ప్రోచువారికిఁ బరిచర్యఁ జేయు నఁట. ఇట్టి వింతలుం గలవే యని తమలోఁ బలుకుచుఁ దద్వచనంబు విశ్వసింపరైరి. అట్టి యెడ విరాటుదేవి యగుసుధేష్ణ ప్రాసాదగతయై సోరణగండ్ల న త్తన్విం గాంచి యొండొంటం బొసఁగనితదీయరూపవేషములకు విస్మితయై యప్పరమపతివ్రతం బిలిపించి నీ వెవ్వతె వేమి చేయుదు వనియడుగ నేను సైరంధ్రిని ప్రోచువారికిఁ బరిచర్యఁ జేయుదు ననిన విని యబ్బురం బంది సుధేష్ణ యిట్లనియె. భామినీ, నీ యట్టివారలు పరిచారికలఁ బనులఁ బంపుదురకాని యొకరు పని పంపఁగఁ జేయు వారు కారు. శా స్త్రచోదితసులక్షణముల నొప్పి శారదేందీవరమందిర మైనయిం దిరచందంబునం దనరారునీవు యక్షపక్ష్మలాక్షివో, గంధర్వపర్వేందువదనవో, విద్యాధరవరవర్ణినివో, కిన్నరతరుణివో, భుజంగకోమలాంగివో, నిలింపనితం బినివో, దానవభామినివో, యప్సరస్సుందరివో, తుహినాంశుం బాసి వచ్చి నరోహిణివో, బిడౌజు విడిచి యరుదెంచినశచీదేవివో వరుణుఁ దొఱఁగి చను

దెంచినవరుణానివో, త్వష్టృధాతృప్రముఖ నిర్జరులమహిషివో యనియూహవొడమెడి. నీకలరూ పేర్పడం జెప్పు మనియడుగ ద్రౌపది విరాటరాజమహిషి కిట్లనియె. దేవీ, యేను నీవివరించినవారిలో నెక్కంబ యొక్కర్తనుం గాను. మఱి సైరంధ్రినే. కేశపాశము నెంతయు సొంపుగ ముడువనేర్తు. చందనము నలుగు మున్నగువిలేపన ద్రవ్యములఁ బరువముగ నూఱఁ జాలుదు. కమలకువలయమల్లికాచంపకాదికుసుమములసరుల వింతగాఁ గట్టనోపుదు. ఈపనులఁ జేసి శ్రీకృష్ణుదేవియగుసత్యభామం గొలిచి యద్దేవిమన్ననం బడసి పాండవధర్మపత్నియైనపాంచాలితో నభేదముగనుంటి. ఈవిధమున నుత్తమరాజాంతఃపురాంగనలం గొలిచి శరీరయాత్ర నడపుదు. ద్రుపదరాజపుత్రి తాన మాలిని యనుపేరు పెట్టె. ఇపుడు మీనగరికి వచ్చితి ననిన విరాటరాజమహిషి యిట్లనియె. అమ్మా, నిన్నుఁ దలపై నిడికొని ప్రోచుదు. అందు సంశయింపవలదుగాని మనోగతంబైనయర్థము చెప్పవలయు గదా. వినుము. ఇంతులును నీరూపున కబ్బురం బంది ఱెప్ప లార్పక చూచుచుఁ జెయ్వులు దక్కియున్నవారు. ఇచటిద్రుమాఁకులు నీసౌందర్యమునకు విస్మయంబందియేమొ నీదెస నెఱఁగ్రాలి విలసిల్లుచున్నవి. ఇట్టినిన్నుఁ జూచినపురుషుఁడెవ్వఁడైనను నీపైఁ దగులంబుఁ గానకుండునే? నీ వించుక కటాక్షించిన నతండు కామతంత్రగోచరుండు గాకున్నె? మవ్వపులీలల నివ్వటిల్లఁజేయునీజవ్వనం బెవ్వని వెఱ్ఱిఁ జేయదు? మాన్నృపాలుండును నినుం గాంచినంతన నీపైఁ దగులువడిన యెడందఁ దిగువనేఱక నన్ను మఱచుట నిశ్చయంబు. కావున నిన్నుఁ జేర్చికొనుట తాన యాత్మవధార్థంబు పాదపారోహణంబుఁ జేయువిధంబును గర్కటి చూలు దాల్చుతెఱంగు నయ్యెడి ననిపల్కినం బాంచాలరాజపుత్రి యిట్లనియె. నీకభిమతముగాకున్న నెచ్చోటికైనం బోయెదఁగాని నీ వీసందియంబు విడువుము. ఏను లాఁతిమగవారలఁ గన్నెత్తియైనం జూడక పాతివ్రత్యచర్య నడపుదానను. మఱియు మహాసత్వుఁడైనయొక గంధర్వరాజుపుత్రు లగుగంధర్వు లేవురు మహాబలులు నాకుఁ బతులు. వా రెల్లపుడు ప్రచ్ఛన్నవేషధారులై నన్నరయుచుండుదురు. లాఁతినాఁతులఁబోలె నన్నుఁ గామించినవాని మఱురాత్రి యామేనితోడ నుండకుండఁగ దండింతురు. కావున నన్నెవ్వరుం గామింప వెఱతురు. నీయొద్ద నుండ నియ్యకొందువేని కొన్నిసంకేతములఁ జేయుము. కాళులఁ గడుగను. ఎంగిలి గుడువను. నీచకృత్యములఁ జేయను. ఇందులకుఁ బంపక యోగ్యకార్యముల నియమింతువేని నీయొద్దఁ గొంతకాల ముండుదు. ఇట్లయిన నాపతులు మెచ్చి సమయములందు మీకు మేలు సేయుదు రనిన విని మత్స్యరాజమహిషి యాసంకేతముల కొడంబడి ద్రౌపదిం దనయొద్ద నిల్పికొనియె. ఆసాధ్వీపూర్వచరిత్రం బచ్చట నెవ్వరు నెఱుంగరైరి.

## సహదేవుఁడు గోపాలుఁడై విరాటునొద్ద కేతెంచుట.

అంత సహదేవుఁడు గోపాలవేషధరుండై గోష్ఠం బరయుచున్న మత్స్యమేదినీశ్వరునొద్ద కేతేరుచుండ నానృపాలుం డతనిదివ్యతేజమునకు విస్మితుండై తత్క్షణంబ రావించి నీ వెవ్వఁడవు? ఎచ్చోటునుండి వచ్చుచున్నవాఁడవు? ఎవ్వరివాఁడవు? ఏమిపని చేయం దలంచెదవు? కుల మెయ్యది? పే రెయ్యది? వృత్తి యెయ్యది? నీయట్టివాని ము న్నెన్నఁడుం జూడనయితిఁ గావున నీతత్త్వం బెఱుంగ మనం బువ్విళ్లూరెడు. వివరింపు మనియడుగ నతం డిట్లనియె. నరేంద్రా, యేనుఁ గురుదేశంబునుండి వచ్చుచున్నవాఁడను. యుధిష్ఠిరుగోష్ఠమున కధిష్ఠాతనై యుండి యతనిమన్ననం బడసితి. పాండవులు నెలవుల విడిచి యజ్ఞాతచర్య సలుపుటంజేసి యిపుడు నినుఁ గొలువవచ్చితి. నియమించితివేని భవద్గోగణంబులఁ బాలింతు. వైశ్యకులజాతుండను. అరిష్టనేమియనియుఁ దంత్రీపాలుఁడనియు నాకు రెండుపేళ్లు గలవు. గోపాలనంబున నే నిపుణుండను. యుధిష్ఠిరుగోష్ఠంబు నందు నూఱుమందలు గలవు. ఒక్కొకమందకు నెనుబదివేలమొదవు లుండు. వెండియు ముప్పదివేలగోవులు ప్రత్యేకంబుగ నుండు. వాని కన్నింటికిం బెద్దకాల మధ్యక్షుండనై యరయుచునికింజేసి గోలక్షణంబు లెస్సగ విదితంబయ్యె. చుట్టం బదియోజనములదూరమున నుండుగోవుల భూతభవిష్యద్వర్తమానచర్యల నేను సంఖ్యగా నెఱుంగఁజాలుదు. బడుగులుం గండవెట్టి లెస్స పాడి పిదుకునట్లుగను రోగము లెవ్వియు వానిం జేరకుండునట్లుగనుం దగునుపాయంబులను శిల్పములనుం బెక్కులు నేర్తు. నాయేర్పఱిచిన యాఁబోతుపంచితంబు మూర్కొనెనేని వంజలుం జూలు దాల్చు. ఇయ్యకొనితివేని నీయొద్దఁ గొంతకాలముండి భవద్గోగణముల నరయుదుననిన విని విరాటుం డయ్యా, నీరూపతేజంబులం జూడఁగ రాజలక్షణంబు సొంపారెడి. వేషభావలం బరికింపఁగ గోపాలురరీతి దోఁచెడి. మదీయరాజ్యంబుఁ బాలింప నిక్కంబ యర్హుండవు. అయినను నీయభిమతంబు మెయి నడతు. ఎయ్యది వేతనం బిచ్చిన నుండుదు వనియడుగ వెండియు మాద్రిపిన్నకొడు కిట్లనియె. ధర్మరాజు నాపని యరసి తనచిత్తమునకుఁ దోఁచినట్లు వివిధప్రకారముల మన్నించుచుండె. నీవు నట్లుండినం జాలు. శరీరయాత్రయే నాకు వేతనంబు. వే ఱొక్కండును వలదు. నావృత్తి నే నుండుట తగుఁగాని నీరాజ్యమేలఁ బూనుట యుఱవు గాదు. కావున సమ్మతం బగునేని భవద్గోష్ఠంబున కధిష్ఠాతం జేయు మని తెల్పిన నమ్మత్స్యభూపాలుండు వల్లేయని సాదరంబుగ నతనిం దనగోష్ఠంబుల కధ్యక్షుం గావించి గోపాలురనెల్లఁ దదధీనులఁ జేసి యథేప్సితవేతనంబు నిర్ణయించుటయు సహదేవుఁడు తదాదేశమునం దదీయగోష్ఠాధ్యక్షతం బడసె. వానిరహస్య మచ్చటివా రెవ్వరు నెఱుంగరైరి.

## అర్జునుఁడు బృహన్నలయై మత్స్యపతిం గొల్వవచ్చుట.

పదంపడి యర్జునుఁడు కుండలము లపనయించి వీనుల సంకులఁ దాల్చి కేశపాశంబు వ్రేలఁ గట్టి తరుణీవేషధరుండై పుడమి యదరుచుండ గజగమన విలాసంబు మెఱయ మత్స్యరాజుఁగొల్వునకు వచ్చుచుండ నతండు వ్యాజప్రచ్ఛన్నుం డైనయమ్మహేంద్రనందనుఁ బరమతేజోవిలసితుం గాంచి విస్మితుండై సభాసదులం బిలిచి యిట్టివాని నే నింతకుము న్నెన్నఁడుం జూడనైతి విననైతి. మీ రెవ్వరేనియు నెఱుంగుదురే యనియడుగ వా రెవ్వరు నెఱుంగ మనుటయు నమ్మత్స్యమహీవల్లభుండు ఫాల్గునుం బిలిచి యయ్యా, దేవసన్నిభుండైననీ వెవ్వండవు? ఉత్తమపురుషయోగ్యం బగునీరూపంబును నీ గ్రహించినవేషంబునుం జూడఁ బరస్పరవిరోధంబు దోఁచుచున్నది. లెస్సగ సిగ నలవరించి యుత్తమపురుషయోగ్యంబుగా దివ్యాంబరముల వేఁకొక్క తెఱంగునఁ గట్టి మేలి మైమఱువు దొడిగి విల్లమ్ములం బూని యుత్తమవాహనం బారోహించి నాకొడుకుల యట్లొండె నాయట్లొండె నుండుము. వయస్సు చెల్లుటం జేసి యే నింక రాజ్యపాలనంబున కోపను. నీవు పాలింపుము. ఇట్టివారి కెట్లు క్లీబత్వంబు గలిగెనో? కలిగినదాని నెట్లు కాదనఁ దగునో యని నామనంబు రెండుదెఱంగులం దిరుగుడువడుచున్నది. కలరూపు తెలియఁ జెప్పు మనియడుగ విరాటునకుఁ గిరీటియిట్లనియె. నరోత్తమా, నారూపంబుఁ జెప్ప నేల? తత్ప్రకారంబుఁ దలంచిన నెంతయు వంత గపురు. నిక్కంబ నే నాఁడుదానను గాను. పౌరుషంబునుం జెడియున్నది. ఇఁక యొకకారణమునఁ గుడువవలసియునికిం జేసి తల్లిదండ్రుల నెడఁబాసి యిట్లు ద్రిమ్మరుదు. నాపేరు బృహన్నల యండ్రు నృత్తగీతవాద్యముల నెంతయు నేర్తు. నీ కనుమతం బగునేని భవత్ప్రియపుత్రియైనయుత్తరకు గీతవాదిత్రనృత్యముల నేర్పుదు ననివచించె. అనవుడు విరాటుఁ డయ్యా, మహీమండలం బెల్ల బాలింపఁ జాలిననీ కిట్టికుత్సితంపుఁబను లేల యని చెప్పితింగాని యొండేమియుం గాదు. ఎట్లైన నీ వుండుటయే నాకుఁ బ్రియంబు. నీ యిచ్చకు వచ్చినట్లు చేయు మనిచెప్పి మంత్రులతో నాలోచించి స్త్రీజనంబులవలన నతనినపుంసకత్వంబు పరీక్షాపూర్వకంబుగ నెఱింగి కృత్రిమక్లీబుం డైనయర్జును నంతిపురమునకుఁ దోడ్కొనిచని యుత్తరం బిలిపించి దానికి బృహన్నలం జూపి యమ్మా, నీ వీబృహన్నలయొద్ద నృత్తగీతవాద్యంబుల నేర్చికొనుము. భయభక్తుల మెలంగు మనిపలికి యట నతని దెస మొగంబై నయభయముల నీముగుదకు విద్య నలవరింపుము. నీకుఁ దోఁచినవారల సహాధ్యాయినులఁగాఁ జేర్చికొను మనిచెప్పి కూరిమికూఁతు నతని కప్పగించుటయు నతండు బృహన్నల యనుపేరుతో నంతిపురంబు నెలవుగా నుండి యుత్తరకు నృత్తగీతాదులం గఱపుచుండె.

వానిగూఢప్రకారం బచ్చట నభ్యంతరపరిజనులును బాహ్యపరిజనులును దెలి యరైరి.

నకులుఁ డశ్వశిక్షకుఁడై విరాటుం గొలువ వచ్చుట.

అంత మత్స్యమేదినీశ్వరుం డశ్వముల నరయుచున్నంత నకులుం డశ్వశిక్షకవేషధారియై యత్తురంగములదెసం జక్కఁజూచుచు నన్నరేంద్రునొద్దకు వచ్చుచుండ నవ్విరాటుండు వియత్పథంబు విడిచివచ్చువిభావసుం డనంగ నిజతేజంబునదెసలెల్ల వెలింగింపుచున్నయప్పాండుపుత్రుం గాంచి విస్మయావిష్టహృదయుండై యనుచరులం బిలిచి యీవచ్చువాఁ డెవ్వఁడో? మీ రెఱుంగుదురో? మదీయాశ్వములఁ బరికింపుచున్నవాఁడు. అశ్వలక్షణవిచక్షణుండు గాఁబోలు. అమరసమానుం డై నయతనిం దోడితెం డనిపనిచె. అట్లు నకులుండు తత్ప్రవేశితుండై జయశబ్దపూర్వకంబుగా రాజసన్నిధిం జేరి నరేశ్వరా, యశ్వశాస్త్రవిదుఁడ నయి ననేను నీయశ్వముల శిక్షింప వచ్చితి ననిపలుకఁగ విరాటుఁడు సంతుష్టుండై యయ్యా, నిన్నుఁ జూడఁగ రాజపుత్రుఁ డనుభావంబు వ్రేడమె. నీయట్టివాఁ డిట్టికార్యముఁ బూనవచ్చునే? నీ వెవ్వరివాఁడవు? ఎచ్చోటునుండి వచ్చుచున్నవాఁడవు? నీపే రెయ్యది? నీవిద్య యెయ్యది? తెలియఁ బల్కుము. నీకోరినధనవాహననివేశనముల నిచ్చెద ననుటయు నకులుం డిట్లనియె. ఏను గురుదేశములనుండి వచ్చినవాఁడను. పాండవజ్యేష్ఠుం డై నయుధిష్ఠిరు నశ్వశాల కధ్యక్షుండనైనే ప్వేర్పడ నశ్వములఁ బాలించి యాసార్వభౌమునన్ననం గాంచినవాఁడను. ధర్మరాజు నాకు*గ్రంథికుఁ డనునామంబుఁ గల్పించె. అశ్వముల ప్రకృతి, లక్షణంబును, బంచధారాగమనప్రకారంబును, గళ్లెమునకు లోఁగక యడఁగనివానికి సాధుత్వం బలవరించుటయు, హయరోగస్వరూపంబును, దచ్చికిత్సాక్రమంబును, జాతివిభాగంబును, దదుచితాహారప్రయోగంబును, మఱియు నశ్వములకు వలసిన సర్వవిషయములను నే నెఱుంగుదు. నాశిక్ష వడసిన గుఱ్ఱ మెట్టిదెప్పరంబుననైనం బెదరదు. గోడిగలును నాచే నెక్కింతశిక్ష వడిసినం జెప్పినట్లు విను. ఏను నీరాజ్య మెల్లను దైవప్రాప్తం బయినయీవృత్తి నుండుదు ననిపలికిన విని విరాటుం డయ్యా, నీకోరినంత ధన మిచ్చెద. అభిమతం బయినవిధమున నుండుము. నీయట్టివాని కిట్టికృత్యంబు తగునే యనియంటేఁగాని యొండేమియుం గాదు. ఎట్లయిన నీవుండుటయే యభిమతంబు. నిన్నుఁ జూడఁగ ధర్మనందనుం జూచినంత సంతసంబయ్యె. అమ్మహాత్ముం డరణ్యముల నెట్లున్నవాఁడో? అది తలంపునకు వచ్చిన నడరు వ్రేడమెడి. నాయశ్వములను దత్పాలకులను సారథులను నీవశమున నుండఁగ నియమింతు ననివచించి వారలనెల్లఁ బిలిపించి యతనియధీనులం జేసె.

* ఇతనికిదామగ్రంథియను పేరునుంగలదు.

చేయుటయు నకులుండు నచ్చటివారు ద న్నెఱుంగకుండునట్లు గూఢప్రకారమున నుండె. అట్లు వారందఱు సమాహితచిత్తములతో నజ్ఞాతవాసంబు నడపు చుండి రనిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మహాత్మా, పాండవు లట్లు గూఢముగ నుండి యామీఁద నేమి జేసి రనియడుగ నతం డతని కిట్లనియె.

అవ్విధమున బాండవులు ధర్మదేవతావరంబునను దృణబిందుప్రముఖ మునిజనాశీర్వాదంబునను గోరినరూపవేషభాషలం బడసి విరాటునివీట నజ్ఞాత వాసంబు సలుపుచుండ ధర్మరాజు ద్యూతవిద్యాచమత్కారంబునఁ ద్రాటఁ గట్టిన పులుఁగులంబోలె నమ్మత్స్యమహీపతిం దదీయులను దనకు వశ్యులం జేసికొని యాడుచు విజయలబ్ధం బయినధనమును రహస్యముగఁ దమ్ములకుఁ బ్రియాంగనకు నిచ్చుచుండె. భీముఁడును బాకసౌష్ఠవంబునకు మెచ్చి విరటుండు దన కొసంగిన మాంసంబులను గూరలను విక్రయించునెపముగా నన్నదమ్ములకుఁ బ్రాణవల్లభకు నొసంగుచుండె. అర్జునుఁడు నంతిపురాంగనలు దనవిద్యావైదగ్ధికి మెచ్చి యిచ్చిన వస్త్రాదుల నమ్ముతెఱంగుగా భ్రాతృవర్గమునకు దయితకు నర్పించుచుండె. నకులుఁ డశ్వారోహణసమయమున రాజు తనయశ్వశిక్షకు మెచ్చి యిచ్చినధనము నేకాంత మున నన్నదమ్ములకుఁ బ్రేయసికి నిచ్చుచుండె. సహదేవుఁడును గోవుల నరయు నపుడు రాజు తనకొసంగినధనమును దధిక్షీరఘృతాదులను గూఢముగ నన్నలకుఁ బ్రియపత్నికి నిచ్చుచుండె. ద్రౌపది వారల నరయుచు సంకేతభంగము గాకుండ నేర్పుమై మెలంగుచుండె. అట్లు వా రందఱు ధార్తరాష్ట్రు లెన్నఁ డేచిన్నె నన్న చేయుదురో యని శంకించుచు ద్రౌపదీపరిరక్షణంబొక్కదెస మనంబునఁజింతిం చుచు మూఁడునెలలు గడపిరి.

## భీముఁడు మల్లునితో యుద్ధము చేయుట.

అంత నాలవనెల వచ్చిన నాపురమునం బ్రహ్మోత్సవంబు నానాదేశా గతబహుళజననిబిడంబు నతివిచిత్రంబునుగా నడచుటయుఁ గాలఖంజాసురుల యట్లు మహాకాయులు మహావీర్యులు మహాబలులు నగుమల్లులు వేనవేలుగ వచ్చి రి. విరాటుండు సింహవిక్రము లయినవారల రావించి సత్కరించి పోట్లాడుఁ డని నం జీమూతనామధేయుఁ డైనయొక్కమల్లవర్యుఁడు యుద్ధరంగంబు సొచ్చి క్రో ల్పులివీక మెఱయుచు భుజం బప్పళించి ప్రేంకణంబు గలయం దిరిగి నన్నుమా ర్కొని పోట్లాడుమగవా రెవ్వరో రం డని పేరెలుంగునంబిలిచిన మల్లు లందఱు వెల్లఁ బోయి రంగముఁ జొరరైరి. అపుడు మత్స్యపతి మనవల్లవుండైన వీనితోఁ బోటు లాడ నోపునో తెలిసికొంద మనియూహించిమహానసగతుండైన వృకోదరుం బిలి పించి రంగమధ్యగతుం డైనజీమూతుం జూపి యీజెట్టితోడఁ బోట్లాడ నోపుదువే యనియడుగ భీమసేనుం డిప్పనివలన రహస్యభంగం బగునో యని కొంతచింతించి

యటరాజు పోట్లాడుదు వేయనియడిగినం బ్రత్యాఖ్యానంబు సేయరాదనితలంచి మెట్ట కేలకు సమ్మతించె. అంత నా నృపతియనుమతిఁ గొని వృకోదరుండు సింహవిక్రమంబు మెఱయ రణరంగంబు సొచ్చి క్రచ్చఱమీఱఁ గచ్చ బిగియించి భుజాస్ఫాలనంబుఁ జేసి యాజీమూతుం బిలిచిన నామల్లుఁడును భూవల్లభునానతిం గొని మల్ల చఱచి పోరం దొడంగె. వృత్రవాసవులవిధంబున నాయోధనరంగంబు సొచ్చి సాంప్రదాటుకశోభన కృత్యంబు లొనరించి యామల్లవృకోదరులు మహోత్సాహంబు మెఱయ భీమ విక్రమంబు నెరయ మప్పిపోయ నమత్తమహాశుండాలంబుల తెఱంగునఁ బరస్పరవిజిగీషమైఁ దలపడి తొలుదొలుత బిఱుసునకుఁ గడఁగక చిత్రముగ మొగ్గవాలుచుఁ బట్టిన పట్లం దప్పించికొనుచు మాఱుపట్టుచుఁ జిక్కకుండ బాహువులఁ బెనఁగాడుచుం గొండొకవడి గడపి పదపడి పెలుచఁ బెటిగి తొడరి ముట్టుచుఁ దొలఁగి పఱచుచు నఱిముఱిపాటుతో నఱు గ్రుమ్ముచుఁ దెఱపి గని తెఱకువ వఱల అంపిల్లి ఉప్పచుఁ దడఁబడక పిడుగులంబోని పిడికిళ్లం గ్రుద్దుచుఁ బోతరించిన యేకలంబుల చాడ్పున ఘుర్ఘురించుచు నుడివ్రొనిచలంబున నఱచేతులఁ బెలుచఁ జఱచుచు వాఁడిసలాకులంబోని కొనగోళ్ల నెడళ్లఁ గ్రుచ్చుచుఁ గాళ్లఁ జిఱుముచు మోఁకాళ్లఁ బొడుచుచు డాఁక మెఱయఁ దలలు డీకొనుచు బలిమికలిమి వెలయఁ బలుమాఱు లీడ్చుచుఁ ద్రోయుచు మత్స్యమేదినీశ్వరునకు వినోదముఁ జూపుచుండఁ జూపఱు వెఱఁగంది ఱెప్పలార్పక చూచుచుండిరి. అత్తెఱంగున మరుత్సూనుఁడు డెత్తెఱ నెఱయ మల్లయుద్ధచాతుర్యంబు మెఱయఁ బోట్లాడుచుండి కొండొకవడి కతండు చీఱువాఱుట నెఱింగి కరతలంబులఁ గచ్చఁ బట్టి పెల్లఱచుచున్న యమ్మల్లు నెత్తి యార్చి పేర్చి క్రొల్వులి యేనుంగునుంబోలె నూఱుమాఱులు గిరగిర ద్రిప్పి తొల్లింటి చొప్పు దప్పి ఱిచ్చవడిన యాజెట్టిం గట్టిఁడితనంబున నేలం బడవైచి ప్రేంకణంబు మన్ను వెన్నంటికొన ఱాచి వాని విడిచి పుడమిఱేని ముందట నిలుచుటయు నవ్విరాటుండు వానిబలవిక్రమంబులకు సంతుష్టుండై యమితధనము నొసంగె. అట్లతండు వచ్చిన మల్లుల నెల్లం గెల్చి యారాజునకుఁ బ్రీతిఁ గావించుచుండె. అంత నవ్వీట నతనితోడఁ బోరాడఁగ నందఱు వెఱచి వెనుదీయుటయు విరాటుఁ డంతిపురంబు బోఁటులకు వినోదార్థంబుగా సింహవ్యాఘ్రగజాదులతో నమ్మహాబలనందనునకుం బోట్లాటఁ గావించి వానివిక్రమంబు మెచ్చుచుండె. ఇట్లు వారందఱుం దమతమపనులఁ జనపతికిఁ జిత్తవినోదంబు సేయం గాఱియపడుచుండం బాంచాలి పతుల పాట్లం జూచుచు పగలం బొగలుచిత్తంబుతో రోఁజుచుఁ నెట్లయినఁ గాలముఁ గడపవలయు ననుతలంపుతో సుధేష్ణచిత్తమునకుఁ దక్కటియంతఃపురాంగనల డెందములకును మెప్పుగా మెలంగుచుండ వారినియమవత్సరంబునఁ బదినెలలు గడచి పదునొకండవ నెలయుఁ గించిదవశేషంబై యుండె.

## కీచకుఁడు ద్రౌపదిం జూచి మోహించుట.

అక్కరణి నజ్ఞాతవాసవత్సరంబు గతప్రాయం బగుటయు నొక్కనాఁడు విరాటరాజుమఱఁదియు, సేనానాయకుండును, మహాబలుండును, రూపయౌవన గర్వితుండును, దుర్వినీతుండు నగుకీచకుఁడు తనయప్ప యగుసుధేష్ణం గొలువ నంతిపురమునకు వచ్చి యచ్చటఁ బనులవెంటఁ దిరుగుచున్నద్రుపదరాజనందనం గనుంగొని సురసుందరులంబోనియాసీమంతినిసౌందర్యంబున కబ్బురం బంది కంద ర్పవికారగోచరుండై నగుచు సుధేష్ణమొగమునం జూడ్కి నిలిపి దేవీ, యీజవ్వని యెవ్వతె? మున్నెన్నఁడు నీనగళులం దీయంగనం గనుంగొననైతి. ఈపొలఁతు కరూపుసొంపును మేనినెత్తావియు నన్ను వెఱ్ఱిం జేయుచున్నది. డెంద మాయిం దువదనపయిం దవిలె. తివియరాదు. పొందుదక్క నొక్కటి యిందులకు మందు దోఁపదు. ఈకోమలి పరిచారికయై యుండు టెంతయుం బోలనిపని. నన్నుఁ బొం దినం దానిశాసనముమెయి నడతు. రథతురగదంతావళదంతురంబు భోజ్యపానీ యాదిపదార్థసమంచితంబు కనకచిత్రభూషణభూషితంబు సకలసంపద్విలసితంబు మనోభిరామంబు నగుమదీయమందిరంబు నలంకరించుఁగాక. దీనివృత్తాంతము జెప్పు మనియడుగ సుధేష్ణ యామాట గీటునంబుచ్చి వాని వీడ్కొలిపె. అట నాదుర్విదగ్ధుండు మనోభవాగ్నిదగ్ధుండై మగిడి నిజసదనమునకుఁ జనువాఁడు సింహతరుణిం జేరఁ బోవుసృగాలంబుచందంబున ద్రుపదనందన దరియ నరిగి యిందీవరాక్షీ, నీ వెవ్వతెవు? ఎవ్వరిదానవు? ఎచ్చోటునుండి యిచ్చటికి వచ్చి తివి? నీరూపము సౌకుమార్యము కాంతియు నేయింతులయెడం గానను. నీనె మ్మొగమ్ము నిండుచందురు నేలు. వాలుగన్నులు పరువముగ విరిసిన తమ్మిఱేకులం బోలు. తేనియ లొలుకుపలుకు కోయిలయులివున కెనయగు చిఱునగవువెన్నెల క్రేఁగంటిచూడ్కులతోడఁ గలిసి వింత యగుకాంతిసంపదసొంపు పెంపు సంపా దించు ముత్యాలపేరుల నెల్లపుడు నలంకరింపఁదగునీవలుదగుబ్బలు తమ్మిమొగడ లకు సరివచ్చు. చన్నుఁగవవ్రేఁగునవ్రాలి వళిత్రయవిభంగరుచిరం బై నయసదుకౌ నింత యని చేతం గొలువవచ్చు. ఘనజఘనంబు పులినతలమునకు సాటివచ్చు నీయట్టిరూపరి మహీతలమునం గానను. కమలాలయవొ, రతివొ, చంద్రరేఖ వొ, హ్రీశ్రీకీర్తిభూతులలో నొక్కర్తువొ, యనిపెనుసందియం బయ్యె. నీదు సర్వావయవసౌందర్యంబుఁ గన్నులార గనుంగొని యీజగమున నెవ్వఁడు కామ గోచరుండు గాకుండు? దవదహనుపగిది మదనుఁ డదయుండై యేఁచుచున్న వాఁడు. ఆత్మప్రదానవర్షం బయినసంభోగాంభోధరంబునం బ్రజ్వలితమన్మథానలం బుఁ జల్లార్పవే విమమశరుం డేయువాఁడనారసములు మద్యము భేదించి యెడం దఁదూఱి వెడంగుపఱచుచున్నవి. ఆలసించిన నె ట్లగునొ. దివ్యాంబరం

బులఁ గట్టి నెత్తావులు గుబుల్కొనుకమ్మగందం బలంది మేలితొడవులఁ దొడిగి వికచకుసుమమాల్యమ్ములఁ దాల్చి నాతోడ రమింపుము. సుఖముఁ బాసి యీ యల్పజడిపాటునకు నీ వొడ్డుదువే? అమృతమున కెనయగునానాపేయములను, వివిధోపచారములఁ జేయఁ బరిచారికలను, దివ్యభవనంబును నొసంగెద. నాభార్యలనెల్ల నీకు వరవుడము సేయఁ బనిచెద. ఏనును దాసుండనై యుండుదు. నన్నుఁ బొంది సుఖింపుము. ఈలోకోత్తరం బైనరూపంబును నవనవోన్మేషభాసురం బయినయావనంబును నిరర్థకం బగుటంజేసి తలఁ దాల్పనియుత్తమమాల్యమువిధమున శోభింపదయ్యె నని తనతాత్పర్యంబుఁ దేటపఱిచినం బాంచాలి క్రోధశోకసంతప్తచిత్తయయ్యు నావికారంబు వెలిగాకుండ నడంచుకొని వీఁడు దుర్విదగ్ధుండు గావుననుపాయంబునఁ దప్పించికొనుట లగ్గని భావించి వాని కిట్లనియె. విహీనవర్ణయు బీభత్సవేషయునై సైరంధ్రీవృత్తిం గడుపుఁ బ్రోచికొనుచున్న నన్నుఁ గామింప నేల? నావేషముఁ జూచిన నేవ పుట్టుఁగాని తగులంబు ప్రోఁచునే? మఱియు నేను బతివ్రతను. ఎల్లవారుం దమతమభార్యలఁ బ్రేమమున రక్షించుకొందురుగదా. పరదారాభిమర్శనం బెంతయు నయుక్తంబు. అకార్యనివర్తనంబ కాదె యుత్తమపురుషులకు వ్రతంబు. నీయట్టివాఁ డిట్టికుత్సితకృత్యముల మనస్సునన్నైనం దలంపవచ్చునే? అకార్యకరణంబున నపకీర్తియు మహాభయంబును రాక తక్కదు అని ధర్మంబు బోధించిన విని కీచకుండు పరదారసంగమంబునం బ్రాణమానహరంబు లయిననానాదోషము లావహిల్లు నని యెఱింగియు నింద్రియవికారంబు సైరింపనోపక ద్రౌపదికి వెండియు నిట్లనియె. చారుహాసినీ, నీనిమిత్తమునం జిత్తజుశరములకు గుఱియై యుత్తలంపడుచున్ననన్ను నిరాకరింపఁ జనునే? వశగతుండనై ప్రియములఁ బల్కుచున్నన న్నిపుడు నిరాకరించినం బశ్చాత్తాపంబుఁ బొందెదవు. ఈరాజ్యమునకెల్ల నేనే యధీశ్వరుండను. కరుణించి విరాటుని రాజ్యమున నిల్పితి. రూపయావనసౌభాగ్యభోగాదులం బుడమిలో నొక్కరుఁడేనియు నాకు సమానుఁడు గాఁడు. నేన సర్వోత్కృష్టుండను. కావున రాజ్యంబునన్ను నేలుచు నాతోడ నభిమతక్రీడల సుఖింపుము. వరవుడము విడువు మనినం బాంచాలి యీదురాత్ముండు మంచిమాటలఁ బోవఁ డని తనలో నిశ్చయించి కోపదీపితచిత్తయై వానికి మఱియు నిట్లనియె. కీచకా, నాచరిత్రంబుఁ దెలియక నోరికి వచ్చినట్లెల్లఁ బల్కెదవు. నిరుపమానబలవీర్యశాలు లగుగంధర్వు లేవురు నాపతులు. వా రెల్లవేళల నన్నుఁ గాచుచుండుదురు. నాయెడ దుశ్చారిత్రంబు నడపం దలంచితివేని వారు నిన్నుఁ బరిమార్ప కుడుగరు. పాతాళంబు సొచ్చినను మింటికెగసిపోయినను సముద్రములం దూఱినను నిన్నుఁ బట్టి గట్టి తెగటార్తురు. మోహావివశుండవై ప్రాణములఁ బోఁగొట్టుకొనవలదు. గంధర్వరక్షిత యగు

నన్నుఁ బొందనేరవు. ఏల నడవరాని తెఱువున నడవం బూనెదవు? ఈవలిగట్టు మీఁదఁ గూర్చుండి బాలుఁడు నఱద లంఘించి యావలిగట్టు సేరందలంచు తెఱంగునను దల్లికుఱు వెక్కి కుఱ్ఱఁడు వేడుక గడలుకొనఁ జందమామం గ్రహింపఁ బూనుచందంబునను నన్నుఁ బొందఁ దలంతువు. ఏను నీపాలిటికాళరాత్రి యని నిశ్చయింపుము. జీవితంబు ప్రియం బగునేని యిఁక నీతలంపు చాలింపుము. నాపతుల కెగ్గు చేసినవాఁ డుభయలోకములందును శరణంబుఁ గాంచ నేరఁ డని ప్రత్యాఖ్యానంబుఁ జేసినం గీచకుండు విఫలమనోరథుండై చనియె. అటఁ జని వాఁడు ద్రౌపదిపైఁ దగులంబు మరల్పనేరక తదేకతానమానసంబునం జింతించుచుండి యొక్కనాఁడు సుధేష్ణపాలి కేతెంచి దేవీ, సైరంధ్రిపైఁ దవిలి నాదు చిత్తంబు చిత్తజాయత్తం బయ్యె. ఇఁక దానిం బొందకుండినం బ్రదుకరాదు. వెరవున నాప్రాణములఁ గావు మని పలికి పలవించినం గరుణించి మత్స్యరాజమహిషి యితండు కామవశుఁ డయ్యె. సైరంధ్రికి గంధర్వు లేవురు పతు లఁట. ఇది యెట్లయ్యెడునో తెలియరాదు. వీనిమనంబు మరల్పరాదు. దైవంబ యన్నింటికిం గారణం బని తనలో నూహించి వానిం జూచి సైరంధ్రీవృత్తాంతంబుఁ జెప్పి యీవచ్చుపర్వమునాఁడు నీయింట సురను దివ్యాన్నంబునుం జేయింపుము. సైరంధ్రిని నాఁడు సురఁ దేర నీయింటికిఁ బంపెద. ఏకాంతంబున ననునయించికొను మని యుపాయంబు చెప్పిన విని యతం డట్లయని నిజభవనంబున కరిగె.

సుధేష్ణ ద్రౌపదిని గీచకునింటికిఁ గల్లుఁ దేరఁ బంపుట.

అరిగి యాకీచకుం డప్పలుకులచొప్పున నప్పర్వంబున రాజయోగ్యంబుగా సురను వివిధభక్ష్యభోజ్యాదిపదార్థములను జేయించి యావృత్తాంతము సుధేష్ణకుఁ జెప్పిపుత్తెంచె. అట సుధేష్ణ ద్రుపదపుత్రిం బిలిచి సైరంధ్రీ, కీచకునివేశనంబునకుఁ జని సురఁ దెమ్ము. డప్పిచే బడలియున్నదాన నాలసింపవల దనిన ద్రౌపది సుధేష్ణం జూచి రాజ్ఞీ, యేను వానియింటికిఁ బోవను. వాఁడు సిగ్గు విడిచి నోరికి వచ్చినట్లెల్ల నాఁడు నాతోఁ బలికిన తెఱం గంతయు నీ వెఱుంగుదువు గావున వేఱ చెప్పనేల? నాపతులుదక్క లాఁతివారిం గోరక పాతివ్రత్యంబు సలుపునేను నేఁడు కామవృత్తంబు సల్పను. నీయొద్దకు వచ్చునపుడు నాచేసినసమయంబుఁ దలపోయుము. కందర్పదర్పగోచరుం డై నకీచకుండు దప్పక నన్నుఁ బరిభవించు. కావున వేఱొక్కతె నందులకుఁ బంపు మని పలికిన వినక యాకేకయరాజపుత్రి ద్రుపదరాజపుత్రిం బిలిచి యమ్మా, నేఁ బంపిన నతండు నీకుఁ గీడు సేయఁడు. అనుమానింపక పొమ్మని నిర్బంధించిచెప్పి కల్లుఁ దేరఁ బసిండి గోరను మూఁతతోడం జేతి కిచ్చి యనిచె. అనుచుటయు ద్రౌపది మాఱు పలుకనేరక

దైవంబే శరణం బనినిశ్చయించి యేడ్చుచుఁ దఱలి యేను బాండవేతరులం గా
మింపనేని యాసత్యంబునఁ గీచకుఁడు నన్ను వశీకరించికొనఁ జాలఁ డని తనమ
నంబునం దలంచి ముహూర్తమాత్రం బాదిత్యుని ధ్యానించిన నప్పతివ్రతయెడ
రెల్ల నెఱింగి కర్మసాక్షి తద్రక్షణార్థంబు రాక్షసు నొక్కని నియమించుటయువాఁ
డంతర్హితుండై యప్పాండవపత్ని వెంటన మెలంగుచుండె. అట్లు చని ద్రౌపది
కీచకుసదనంబుఁ జేరుటయు నప్పురుషాధముఁడు గుంపుబాసినలేడికైవడి బెదరి
చూచుచున్నపాంచాలిం గనుంగొని నావఁగాంచినసముద్రమధ్యగతుని తెఱంగున
నఱిముఱి లేచి యప్పతివ్రతను డాయంబోయి స్వాగతం బడిగి పడఁతీ, నిన్నుఁ
బొందుదు నని తలంపునం జేసి యొక్కరీతిఁ జక్కఁగఁ గడచె. న న్నేలికొను దేవివి
వచ్చితివి. ప్రియము సేయుము. మణిరచితకటకకుండలహారాది భూషణంబుల
ను, దివ్యాంబరంబులను, హంసతూలికాతల్పంబును, భక్ష్యభోజ్యపేయాదినా
నాపదార్థంబులను నీకుఁగా నేర్పఱిచి యునిచినాఁడ. క్రీడామందిరమునకరుదెం
చి వానిం గ్రహించి రమింపు మనిన ద్రౌపది వానిమాట గీటునంబుచ్చుఁ
గఁ దలంచి మీయప్పపెద్దయు నీరువట్టుగొని కల్లు గొనిపోవ నన్నుఁబనిచె.
ఆలసింపక యిచ్చి పంపు మనిచెప్పినం గీచకుండు దేవికిఁ గల్లు గొనిపోవ లాఁ
తివారలం బంపెద నని పాంచాలిదక్షిణకరంబు వట్టికొనియె. పట్టికొనినం
బాంచాలి క్రోధశోకఘూర్ణమానమానసయై యోరీ పాపమతీ, యేను బతులు
దక్కఁ దక్కటివారల మనంబుననైనం దలంపనేని యాసత్యమున నిన్ను నాప
తులు చంపి యీడ్వఁగఁ జూడఁగలదాన ననిపలికి కటము లదర బొమలు ముడి
వడ నిశ్వసించుచుఁ జేయి విదిర్చుచున్నంత నాదురాత్ముఁడు చిడిముడిపడుచు
నాపరమపతివ్రతపైఁటచెఱంగుఁ బట్టి యీడ్చె. ఈడ్చినం గడగడవడఁకుచుఁ బాం
డవమహిషి రోషావేశమున వాని నదల్చి తోఁచిన నప్పాపాత్ముండు మొదలు తె
గినమ్రానిమాడ్కి నేలం గూలె. అంత నతిరయంబునం బాంచాలరాజపుత్రి పఱ
చుచు ధర్మనందనుతోడ నెత్తమాడుచున్నవిరాటుకొల్వుకూటంబునకు వచ్చి
తనపడినపాట్లు చెప్పం దమకించునెడఁ గీచకుండు వెన్ను ముట్టి వచ్చి మత్స్యమే
దినీశ్వరుండు చూచుచుండఁగ నాపడఁతిం గొప్పుఁ బట్టి యీడ్చి యాకొలువునం
బడఁద్రోచి కాలఁ దన్నె. తన్నుటయు ద్రౌపదీరక్షణార్థంబు సూర్యనియుక్తుం
డైనరాక్షసుండు వాయువేగంబునం బఱచి కీచకుం బడఁద్రోచి తన్నిన నాదు
రాత్ముండు నిశ్చేతనుండై భిన్నమూలం బైనపాదపంబువిధంబునం గూలి కొం
డొకవడికి లేచి నిజగృహంబునకుఁ బోయె. ఆకొలువున నున్నభీమసేనుఁడు ద్రౌప
దిం బరిభవించినకీచకుం జంపఁ బూని రోషధూసరలోచనుండై భ్రుకుటీవికట
లలాటతటఘటితం బైనఘర్మవారిపూరంబుఁ గరతలంబునం దుడిచికొనుచుఁ బం

ఁడ్లు పటపటఁ గొఱుకుచు నచ్చట నున్నయున్నతపాదపంబుదెసం జూచుచు లేవ నున్నంత సహజక్షమాన్వితుం డైనధర్మరాజు భీమసేనుకోపావేశమున సమయ భంగ మగునొకో యనితలంచి బొటనవ్రేల నంగుష్ఠముం గీటించి సన్నఁ జేసి ప్రకాశంబుగ నోభానసీఁడ, వంటకట్టియలకుఁగాఁబుష్పితఫలితంబైన యీశాఖో లువులోనిద్రుమాఁకు విఱువఁ బూనెదవు. వెలుపల నుండుద్రుమాఁకుల నొక్కదాని విఱువరాదోయనిసూచించి యతని వారించె. అంత ద్రౌపది మెల్లన లేచి పతులదీనవృత్తిం జూచి శోకవివశయయ్యు సమయభంగమునకుఁ దలఁకి వెలి పుచ్చనొల్లక కొలువెల్లఁ జూచుచుఁ జూచుచు నిట్లనియె. ఏశూరులవై రులు దూరగతులయ్యు నిదురవోవక యెల్లపుడు తల్లడిల్లుచుందురో, యే యుదారులు సంతతదానశీలురో, యేసంపన్నులు యాచకులకుఁ గోరినధన మిత్తురో, యేసమరశౌండులధనుష్టంకారంబు భేరీభాంకారంబును బగఱగుండె లవి యించునో, యేధార్మికులు శరణాగతులఁ బ్రోతురో, యేబలవంతులు ధర్మ పాశములఁ జిక్కకుండినముల్లోకములనైన నిగ్రహింపఁ జాలుదురో యట్టిమహాత్మ లకుఁ బత్ని యగునన్ను నీచుఁడగుకీచకుండు గాల దాఁచె. తేజస్వులు మానవం తులు నగునమ్మహారథులు ప్రచ్ఛన్నులై నాభంగపాటు సైఁచియున్నవారు. కోపము వీర్యము తేజము నడంచి నన్నుఁ బ్రోవక యెచ్చట నున్నవారో. ధర్మముఁ బరి శీలింపనియీరాజునొద్ద నే నేమిచేయుదాన. ఈమత్స్యభూపతియు నీసభాసదులును ధర్మము విచారింపరైరి. ఇచ్చట నెవ్వఁ డేమి చేసినను సాగుచున్నది. లేకున్న నధర్మశీలుఁ డైనకీచకుఁడు చేసిననీచకృత్యము నితరు లెవ్వరైనను సైఁతురే? యని పలుదెఱంగుల విరాటుం దూలనాడి యేడ్చుచుండ నవ్విరాటుండు సైరంధ్రీ, నీకుఁ గీచకునకుం గలపూర్వవిరోధము నెఱుంగక నే నేమి చేయవచ్చు? కావున నూరకుంటి. ఊరడిల్లు మని యనునయించె. సభాసదులును ద్రౌపదిం బిలిచి నీయట్టియుత్తమసీమంతినీరత్నంబును మనుష్యులలో నెచ్చటనుం గానము. నీవు దేవభామిని యనియే మాతలంపు. వీరపత్ని వైననీకు వగ పేల? దురాత్ముం డైన కీచకుండు తత్ఫలంబుఁ గుడుచు నని యాసింహబలుం గొంతనిందించి ద్రౌపది నభినందించి యూరార్చిరి. అట్టియెడ యుధిష్ఠిరుఁడు కోపావేశమునం జేసి ఫాలభాగ మునం జెమట వొడమ ద్రౌపదిం జూచి సైరంధ్రీ, యీక నిచట నుండవలదు. సుధేష్ణమందిరమున కరుగుము. పతివ్రతలు వీరపత్నులైనం గర్వవైపరీత్యమునం జేసి యొక్కొకవేళల నిడుమలఁ బడుదురు. అలజడి కోర్చి కులశీలముల రక్షించు కొనుచు శుశ్రూషఁ గావించినం బతిలోకంబుఁ గాంతురు. నీపతు లగుగంధర్వు లెఱుఁగనివారు గారు. మఱి కోపమున కిది యవసరము గా దని మిన్నకున్నవారు. కావున నీపాట్లు చూచియుఁ బ్రతి సేయక వనరుచున్నవారు. కాలము ప్రతీక్షించి

నీ కెగ్గుచేసినవానిం జక్కఁజేయుదురు. న ర్తకిచాడ్పునఁ బెద్దయుంబ్రొద్దు కొలువు కూటమున నేల నిలిచెదవు? అక్షద్యూతమునకంతరాయము సేయవలదు. పొమ్మనినం బాంచాలి ధర్మరాజుం జూచి కంకభట్టా, నామగఁడు నటుఁడు. ఏను న ర్తకినని వేఱ చెప్పనేల? మఱియు నామగండు జూదరి. జూదిరియాలికి ధర్మచింత యెక్కడిది? కరుణానిరతు లయిననాపతులనిమి త్తమున ధర్మచారిణి యగునేను లాఁతివారిదండనమునకుఁ బాత్రంబుగావలసె ననిపలుకుచు నచ్చోటు వాసి క్రోధారుణితనయనయు వికీర్ణకేశపాశయునై సుధేష్ణయొద్దకుఁ జనియె. సుధేష్ణయు దివంబున మేఘపటలవినిర్ముక్తం బైనచంద్రబింబంబు విడంబించునెమ్మోము బాష్పధారార్ద్రింబై సొంపుదప్పియుండ నేడ్చుచువచ్చుచున్నపాంచాలిం గనుంగొని సైరంధ్రీ, యేల యేడ్చెదవు? ఎవఁడు నిన్నుఁదన్నె? ఎవని దండింతు ననియడుగ ద్రోవది దేవీ, యేను నీపంపునఁ గల్లుఁ దేరఁగీచకునింటికిఁ బోయిన నాదురాత్ముండు నన్నుఁ బట్టుకొని పాఱిపోవుచున్ననన్ను వెంబడించి కొలువుకూటంబున నాయాపద రాజుతో విన్నవింపఁ దలంచియుండఁబాపం బనక నాకొప్పుఁ బట్టి యీడ్చి క్రిందఁ ద్రోచి నృపాలుండు చూచుచుండనాసభలోఁ గాలఁ దాఁచె నని తెల్పిన సుధేష్ణ ద్రౌపది నూరార్ప నెంచి సైరంధ్రీ, కామవికారగోచరుండై యుక్తాయుక్తముల నరయక నిన్నుఁ దన్నినకీచకుఁజంపింతు నూఱడు మనియనునయించె. పాంచాలియు విరాటుదేవిదెస మొగంబై నీవు చంపింప నేల? నాపతులు గంధర్వులు గ లరు. వారే సక్కంబ యాదురాత్ముం దెగటార్తు రని చెప్పి నిజనివాసంబున కరిగి మేను గడిగికొని ప్రక్షాళితవస్త్రయై కీచకవధోపాయంబుఁ జింతించుచు శయనతలంబుఁ బ్రాపించి యేమి చేయుదు నెచ్చటికిఁ బోవుదు నెయ్యది కర్తవ్యం బని యాలోచించి యిట్టిదొసఁగులు పొసఁగిన వృకోదరుఁడు నాకు మనఃప్రియంబు సేయువాఁడు. అతండే యీదురాత్ముం బరిమార్ప లావుగలవాఁ డనియూహించి యుండె.

ద్రౌపది భీమునితోఁ దనపరిభవంబుఁ జెప్పికొనుట.

అంత నారాత్రి యందఱు నిద్రవోవుతఱిఁ బాంచాలి శయనతలంబు విడిచి భీమసేనుఁడు శయనించియున్నమహానసగృహంబునకుఁ జని నన్నుఁ బరిభవించినయాపాపాత్ముఁడు బ్రదికియుండ నీ కెట్లు నిద్దురవచ్చెనో యనిపలుకుచుఁ దద్గృహాభ్యంతరము సొచ్చి సింహముచాడ్పున రోఁజుచు నిద్దురవోవుచున్నమహాబలనందను గరేణువు వనగజంబునుంబోలె డాయంజనిపూఁదీఁగ కుసుమితగోమతీతీరజనితం బయినతరుణరసాలసాలంబునుంబోలె నాకురుకులప్రవరుఁ గౌఁగిలించికొని గాంధారస్వరంబు మూర్ఛనకు రాఁగ మధురవీణాలాపంబునుంబోని కోమలరవం బెసంగఁ బ్రభంజనాత్మజా, లేలెమ్ము. శౌర్యమానముల విడిచి యేల

మృతునిరీతిఁ బడియుండెదవు? ఏను బ్రదికినవాని భార్యనైన నాపాపాత్ముండు జీవించునే యనివచించి మేల్కొల్పిననతండు డబ్బాటు లేచి శయనంబున నున్న ప్రియాంగనం జూచి యిపు డేల యిచ్చటికి వచ్చితివి? నీవదనకాంతి తొల్లింటి చొప్పు దప్పి కృశపాండురంబై యున్నయది• కారణం బంతయు వివరింపుము. విని తగురీతిం జేయుదు. సర్వకార్యముల నేనకదా నీనమ్మినమానిసిని. నీకుఁ బొసఁగిన దొసఁగులనెల్ల నేనకదా తొలంగించితి• వేగంబ వచ్చినకార్యంబుఁ జెప్పి యందఱు మేలుకనుటకుమున్నగా శయనతలమునకుఁ బొమ్మనిన విని ద్రౌపదియిట్లనియె. యుధిష్ఠిరునకుఁ బత్నినై శోకములఁ బడకుండుదునే? నాదుఃఖముల నెఱిఁగి యెఱిఁగియు న న్నడుగనేల? ఐనం జెప్పెద వినుము. నాపడనిపాట్లుం గలుగునే? దుర్ద్యూతసమయమున నాసభలోఁదలవట్టి యీడ్వఁబడితి. వనవాసమున జయద్రథుఁ డపహరించికొనిపోయె. ఇన్నింటికి నోర్చి యెట్లో మనసు ఱాయిగఁ జేసికొని బ్రదికి యున్నదాన. రాజుకూఁతురెవ్వతెయేనియు నీదుఃఖముల సైచుఁచు జీవించునే? అది యట్లుండ నేఁడు విరాటునెదుట జూదరి చూచుచుండఁ గీచకుండు నేలఁ ద్రోచి కాలఁ దాఁచె. ఇప్పటికిని జీవించి యున్నదాన. ఇన్నిపాట్లు పడుచు నే బ్రదుకనేల? బ్రదుకకుండినం గొఱంత యేమి? పరమదుర్మతి యైనకీచకుండు నన్నుఁ జూచినపుడెల్ల నాకు భార్య వగుమని చెప్పుచున్నవాఁడు. కాలవశమునఁ దత్ఫలము పరిపక్వ మయ్యె. మీయన్న పాపపుజూద మాడుటంగదా మన మిన్నిపాట్లు పడవలసె. అతని దూఱుము. ఆతండు దక్కఁ దక్కఁగలవాఁ డెవ్వఁడేనియు రాజ్యము సర్వస్వము నొడ్డి యడవులకుఁ దఱలఁగ జూద మాడునే? నిష్కసహస్రమొండె, సారవంతం బయినయితరధనమొండె లెక్కించి యొడ్డుచు నేండ్లుపూండ్లు రేలుంబవళ్లు నాడినను మణికనకాంబరవాహనాదులు తఱుఁగకయే యుండు. అల్లఘునుఁడు జూదమునెపమున సంపదలఁ బాసి తనకర్మములఁ జింతించుచు మిన్నకున్నవాఁడు. పదివేలయేనుంగు లన్నిగుఱ్ఱంబులు లక్షరథములుం దోడరాఁగఁ బురవీధులనుత్సవంబు మెఱయ నేతెంచు సంపన్నుఁ డిపు డొక్కరుండె లాఁతివారి కెఱుఁగకుండ గూఢముగఁ దిరుగుచున్న వాఁడు. ప్రతిదినంబు రేలుంబవళ్లు లక్షదానులుపాత్రహస్తులై మహానసగృహంబునం దతిథిభోజనముఁ జేయింప నదియెల్ల నరయుచు స్నాతకవ్రతు లగుగృహస్థుల కెనుబదివేవురకుఁ బ్రత్యేకంబు వరవుడముకొఱకు ముప్పండ్రుపరిచారికల నొసంగి.వారిభోజనము విచారించుచుఁ బ్రతిగ్రహరహితు లూర్ధ్వరేతస్కులు నగు పదివేవురుయతులకు భోజనము వెట్టించుచుదీనానాథులప్రోపు విచారించుచుఁ దా భుజించునాతిథేయుం డిపు డొరునియింట యాచించి కడుపుఁ బ్రోచికొనుచున్నవాఁడు సూతమాగధు లనేకులు సుస్వరముగా వివిధస్తుతులఁ బఠింప

మేల్కాంచురాజేంద్రుఁ డిపుడు ప్రభాతప్రబుద్ధవిహంగకులకలకలారావంబున మేలుకనుచున్నవాఁడు. తపస్స్వాధ్యాయసంపన్ను లయినమును లనేకులు ప్రతిదినంబును సభాసదులై ధర్మము బోధింప నాకర్ణించుధార్మికవరేణ్యుఁ డిపుడు విరాటునకు సభాసదుఁడై కంకు డనం బరఁగి వానికి మెప్పుగా జూద మాడుచు నడిగినదానిం జెప్పుచున్నవాఁడు. అద్రోహచింతనంబు, కారుణ్యంబు, సంవిభాగంబునుం దొట్టినుగుణంబులకెల్ల నాశ్రయుం డైనసాధుశేఖరుఁడు దైన్యము గదుర బ్రదుకుచున్నవాఁడు. రెండవసూర్యుండునాఁగ సకలదేశములం దనప్రతాపమయూఖములఁ బఱపించి యెల్లరాజుల నరిగాపులఁ జేసికొని పేరోలగం బుండు భూపాలశేఖరుం డిపు డీమత్స్యనరపతిం గొలుచుచున్నవాఁడు. సుఖోచితుం డైన యమ్మహాత్ముఁడు పడుపాట్లుం జూచిన నాకుఁ గ్రోధశోకంబులు పెరుగుచుండు విశేష మేల? నాక కాదు. ఎవ్వరికైనం దోఁచు.

మఱియు నమానుషకృత్యంబు లెన్నియేఁ జేసినమహాబలుండ వగునీవు వంటలవాఁడవై విరాటుం గొలుచుచుండ నీదుఃఖముఁ గనుఁగొనుచు నే నెట్లు శోకింపకుండుదానను? మఱియు విరాటుఁ డంతిపురమువారికి వినోదార్థంబుగా గజమహిషవ్యాఘ్రసింహాదులతో నిన్నుఁ బోరాడించునెడ నామనం బెంతయుఁ దల్లడిల్లుచుండు. అప్పటినాముఖవికారం బుపలక్షించి సుధేష్ణయుఁ దత్పరిచారికలు నాత్మగతంబున మనసైరంధ్రి వల్లవుఁడు డస్సినం దల్లడిల్లుచున్నది. ఇందులకుఁ గతం బెద్దియో యూహింపరాదు. సైరంధ్రిలావణ్యంబును వల్లవుసౌందర్యంబునుం జూడఁ బెద్దయు విచారం బయ్యెడి. స్త్రీలచిత్త మిట్టి దని నిర్ణయింపరాదు. వీరు వచ్చినసమయంబు నొక్కటియే. తత్త్వ మెట్టిదియో యని గుజగుజలువోవుచుండుదురు. ఆయనుమానంబునం జేసి సుధేష్ణ నన్నుఁ జుఱచుఱఁ జూచుచుండు. భీమవిక్రముండవై భీముఁ డనఁ బేరు గాంచిననీ వనుచితం బయినపాచకకృత్యమున కొడఁబడి నీచకృత్యములఁ జేయుచుండ నామనంబు శోకసాగరనిర్మగ్నంబు గాకుండునే? అపుడెల్ల ధర్మజుదుర్ద్యూతంబునంగదా యీ పాట్లెల్లఁ బడవలసివచ్చె నని యామహాత్ముం దూఱఁగఁ దలంపు వొడము. ఇవియెల్లఁ జూచుచెట్లు బ్రదుకనేర్తు?

మఱియు నర్జునుం దలంచిన నేదియుం దోఁపకుండు. దేవదానవాదుల గెల్చి ఖాండవంబుఁ గాల్చి యగ్నికిఁ దృప్తిఁ గావించినయమ్మహారథుఁడు బావిలో డాఁగినయగ్నివిధమున నంతఃపురమున డాఁగియున్నవాఁడు. దేవతలకు నజేయులైనపౌలోమకాలకేయ నివాతకవచుల వధించినయాధానుష్కశేఖరుండు పడుచుల కాట నేర్పుచున్నవాఁడు. జ్యాఘాతకర్కశంబులు పరిఘతుల్యంబులు నగు నాయతబాహువుల నలరునాశత్రుభీకరుఁడు శంఖవలయములఁ గప్పికొనియున్న

వాఁడు. ధనుష్టంకారనిస్వనంబున శత్రువుల గుండియ లవియించునయ్యేకవీరుఁ డు కన్నియలకాటల నేర్పుచున్నవాఁడు. సూర్యమండలసన్నిభం బయినదివ్యకిరీటంబు ధరించునామేటిమగండు జడఁ దాల్చియున్నవాఁడు. దేవదత్తంబు లైన దివ్యాస్త్రముల ధరించునమ్మహానుభావుఁడు శంఖకుండలముల ధరించియున్నవాఁడు. తనయప్రధృష్యతేజంబున వెలుంగుచు వేల సముద్రమునుం బోలె శత్రువుల మీఱరానిక యాఁగునావీరవర్యుఁడు రూపనామముల మాఱి కన్యాజనపరిచారకుఁడై యున్నవాఁడు. తనజననంబునఁ గుంతీదేవిశోకం బపనయించినయామహాత్ముఁడు లోకనిందితం బయినవికృతరూపవేషముఁ దాల్చి నా మనం బెరియించుచున్నవాఁడు. తనరథనేమిఘోషమున లోకములనెల్ల వడఁకించునాశూరశిఖామణి విరాటుం గొల్చుచుఁ గడుపుఁ బ్రోచికొనుచున్నవాఁడు. తనకు సాటి యగువిలుకాఁడు లేఁ డని లోకములనెల్లఁ బ్రసిద్ధిఁ గాంచినమన యర్జునుఁ డిట్లు పడరానిపాట్లు పడుచుండ నే నెట్లు శోకం బుడిగి యూఱడిల్లుదు? కన్నియల కాట నేర్పుచు నతండు లోపలికొలువున విరాటునకుఁ జిత్తవినోదముఁ జేయుచుండ నాకు శోకావేశమున దిక్కు లేదోఁపకుండు. శౌర్యధర్మసత్యనిరతుం డై నయతనిపాట్లను దుర్ద్యూతం బాడి యందఱ నిన్నియిడుమలపాలు చేసినయుధిష్ఠిరునీచజీవనంబును గుంతి యెఱుఁగదు. ఎఱిఁగినఁ బురపురఁ బొక్కఁగాని యొక్కింతతడవైన నోర్చి బ్రదుకునే? క్షణక్షణము నామనంబున శోకానలంబు దరికొనుచుండు.

మఱియు నస్త్రవిద్య, రూపము, మేధయు ననునీమూఁడింటం గడుఁ బొగడ్త కెక్కిననకులుఁడు గ్రాంథికుఁడు దామగ్రంథియు ననుకుత్సితనామములఁ బెట్టికొని విరాటున కశ్వపాలకుఁడయ్యెఁ. ఏమి చెప్పుదు. కాలవిపర్యయమున నిట్లు గావలసియుండెఁ గాఁబోలు. అతండు విరటునెదుట నశ్వముల శిక్షించుచు నతని మెప్పు వడయుచుండ నాదీనవృత్తిం జూచి నామనస్సు శోకాగ్నిం గ్రాఁగుచుండు.

మఱియు మీయనుంగుఁదమ్ముఁ డై నసహదేవుఁడు గోపాలకవేషముఁ దాల్చి గోపపరివృతుండై యుండి గోగణప్రత్యవేక్షణార్థంబు వచ్చినవిరాటుని మెప్పింపఁగ దదుచితభాష లాడుచుండు. వానివృత్తములఁ దలంచిన నిద్దుర రాదు. ఈ పాట్లుపడఁగ నతం డేదుష్కృతంబుఁ దొల్లి చేసెనో? కుంతీదేవి యెల్లపుడును సహదేవుఁడు శీలవృత్తిసంపన్నుఁ డనియు, వృత్తవంతుఁడనియు ధార్మికుఁడనియు మధురవచనుఁ డనియు, హ్రీమంతుఁడనియు, నాకెంతయుఁ గూర్చుకొడుకుగుజ్జిఁ డనియుం గొనియాడుచుండు. మన మడవులకు వచ్చునపు డద్దేవి నన్నుఁ బిలిచి యమ్మా, సహదేవుఁడు సుకుమారుఁడు. శ్రమముల నోర్వఁజాలఁడు ధర్మజు నెప్పుడు ననువర్తించియుండు. వాని నేమఱక సంకటపడియైన నీవే భోజనము

పెట్టుచు రక్షింపుము. నిన్ను నమ్మి వీఁడు నడవులకుఁ బోకకు సమ్మతించితి నని పెద్దయుం బ్రొద్దు విలపించివిలపించి యతని నా కిల్లడవెట్టి యక్కుమారుం బలు మాఱులు కౌఁగిలించుకొని యెట్టకేలకువీడ్కొలిపె. అడవులలో నున్ననాళ్లొక తెఱంగున వాని నరయుచుంటి. అతం డిపుడు గోష్ఠము నెలవుగా నుండుటంజేసి యరసికొన వలను గాకున్నది. అతం డెట్లున్నవాఁడో? ఈదుఃఖములనెల్లఁ జూచుచున్ననాకు మనశ్శాంతి యెట్లు గలుగు? నేను సుఖింపుచున్నదాన నని తలంచి యుండుదేమో?

ఇఁక నావృత్తాంతంబుఁ జెప్పెద వినుము. ద్రుపదరాజునకుఁ గూరిమికూఁతురనై గారామునం బెరిగి మీకుఁ బట్టంపుదేవి యన నెగడి కుంతీదేవిమన్ననకుఁ బాత్రంబనై లోకోత్తరులయి నపుత్రులం గని యన్నదమ్ములు, మామలు, బంధువులు సకలజనులుం గొనియాడఁగ నొప్పి మీరు బ్రదికియుండఁగ నేఁ బడరానిపాట్లు పడితి. ఆజూదరినిమిత్తమున సైరంధ్రినై విరాటుమహిషికిఁ బరిచర్యలు చేయుచున్నదాన. జయాపజయము లస్థిరంబులు. అర్థసిద్ధి యనిత్యంబు. అర్థానర్థములు కాలవశమునంజేసి చక్రంబుచందంబునఁ బరిభ్రమించుచుండు. లోకమునఁ బురుషునకు జయమునకెయ్యది హేతువో యయ్యదియే కాలభేదమునఁ బరాజయమునకును హేతు వగు. దానము లొనర్చినవారే కొందఱు యాచింతురు. చంపినవారే కొందఱు హతు లగుదురు. పడఁద్రోచినవారే కొందఱు త్రోవఁబడుదురు గావున శుభాశుభములు దైవాధీనంబు లనియెఱింగియు జలమున్నచోటికే క్రమ్మఱఁ బర్యాయమునఁ బోవు ననులోకప్రవాదముఁ దలంచి దైవాయత్తము లయినఫలమునభావాభావంబులు తత్తత్కాలముల నెఱుంగ నగుఁగాని ముందుగ నెఱుంగరా దనునిశ్చయమున దైవ మనుకూలంబుగాఁగ జతనంబు లెన్న చేయుట లగ్గని నిర్ణయించి యిఁక మంచికాలము రాకుండునే? సమయాబ్దంబులు గడచినం బ్రయత్నంబు సేసిన మేలు సేకూఱకుండునే యనుతలంపుతో మీయభ్యుదయంబుఁ జూడఁ గోరి బ్రదికియుండెద. నాదుఃఖములు దలంచిన నొక్కముహూర్తం బయిన నోర్చి బ్రదుకవచ్చునే? మనక్లేశంబు కురుపంచాల పరిభవంబునకు నిమిత్తంబు గాకుండునే? నిక్కంబ నేను గొఱనోములు నోఁచి యుండినదాన. కాకున్న నా కిట్టిదుఃఖము లేల గలుగు? మున్ను నాయున్నరీతి యెల్ల నీవెఱింగినదియకదా? అదియెల్లఁ జెప్పనేల. దైవగతి నేరును నెఱుంగనేరదు. మహారథు లయినమీ కిట్లు నామరూపంబుల డాఁచికొని యీకుత్సితవృత్తిం జీవింపవలసివచ్చెఁగదా. సకలజనులు నాకు వెఱవఁగఁ గొలువుండు నేను సుధేష్ణకు వెఱచి కనుసన్నల మెలఁగుచుఁ బనులఁ జేయుచున్నదాన. ముందఱం గొందఱు వెనుకం గొందఱు నడవ నిచ్చాగతిం జరించునే నిపుడు సుధేష్ణకు

ముందఱను వెనుకను నడచుచున్నదాన, ఎన్నఁడైనను నామేనికైన నలుఁగు దాచికొననినే నిపుడు విరాటమహిమికిఁ గుంతీదేవి కెట్లట్ల దాచుచున్నదాన. సుధేష్ణకు వెఱచునట్లు కుంతీదేవికి మీఱు నంతవెఱవను. విరాటుండు నతనిదేవు లును నాదాచినచందనంబుఁ గాని పెఱవారు దాచినవానిని మెచ్చరు. దానంజే సి నున్నఁదనంబుగా నూఱకుండిన నేమి వచ్చునో యని వెఱచి వెఱచి యలసి యలసి ప్రతిదినంబును నలుఁగు నూఱి చందనము దాచి కొనిపోయి సుధేష్ణయొ ద్ద నిలిచి యుండుదు. నాచేతులు మున్నున్న తెఱం గెఱుంగుదువుకదా. ఇపుడు చూడు మని కాయలుగాచినపాణితలములఁ జూపి భీమసేను నెగాదిగఁ జూచి పలుమఱుదీర్ఘోష్ణముగనిశ్శ్వసించి కన్నీరుజాలువాఱగనేడ్చుచు డగ్గుత్తికవెట్టితో లుబామున. నెంతపాపంబుఁ జేసియున్నదాననో లేకున్న నిట్లభాగ్యనై జీవిం తునే? యనిచెప్పిన విని భీమసేనుండు కాయలు గాచినద్రౌపదిచేతులం జూచి పరమశోకార్తుండై యాపాణితలముల మొగమునం జేర్చి కొండొకవడికి ధైర్య మున శోకం బెట్టకేల కడంచికొని పాంచాలి కిట్లనియె.

## భీముఁడు ద్రౌపదినూఱడించుట.

మృదులకిసలయారుణము లయిననీకరతలములు గాయలుగాచినప్పుడే నాభుజబలంబును ధనంజయుగాండీవంబును నిరర్థకములై నింద్యము లయ్యె. నీ చుఁడైనకీచకుఁడు నిన్నుఁ దన్నినపుడే మైశ్వర్యమదనుత్తుండైనయాదురాత్ము నితలఁ గాలఁ దన్ని చంపి మత్స్యపతిం గెలువఁ బూనితింగాని యపుడు మాయ న్న కనుసన్నఁ జేసి నన్ను వారించిన నతని మీఱనేరక యూరకయుంటి. రాజ్య ము గోల్పడుట దుర్యోధనదుశ్శాసనకర్ణశకునులను దత్సహాయులనుం జంపకుండు టయు హృదయశల్యంబు తెఱంగున నన్నెరియించుచున్నవి. ఎన్నిసంకటములు పైపై వచ్చినను ధర్మము విడువకుము. క్రోధము విడువుము. ధార్మికవరేణ్యుఁ డైనధర్మనందనుండు నీకావించిననిందకుఁ దగడు. అతఁడొండె, నర్జునుఁడొండెఁ, గవలొండె నయ్యుపాలంభము వినినం బ్రాణములఁ విడుతురు. వారులోకాంత రగతులైన నాబ్రదు కేల? తాల్మిఁ గొనుము. తొల్లిసుకన్య సంకటములఁ బడియు వల్మీకభూతుండైనపతిని జ్యవననామధేయుని గొలిచి యట సుఖించె. నాళాయని యైనయింద్రసేన దుఃఖముల నోర్చి యనేకవర్షసహస్రవృద్ధుండైన పతిం బరిచరించి ప్రీతుండైనయతనివలనఁ గామంబు వడసె. జానకి యరణ్యగతుఁడైనశ్రీరాము నివెంబడ నడవుల నలజడికి సైఁచి యాపతి నుపాసించియుండి రావణుఁ డపహ రించికొనిపోవఁగ లంకలోనుండి యెన్నియే నిడుమలఁ గుడిచి యట రాముం జేరి సౌఖ్యము లనుభవించె. లోపాముద్ర సర్వకామములఁ ద్యజించి యగస్త్యుని భ జించి యభీప్సితంబుఁ బడసె. సావిత్రి సత్యవంతుఁ గొలిచి తొడరినయడరుల న

హించి యట సుఖము ననుభవించె. వీరలచరిత్రంబు నీవు నెఱింగినదానవుగదా.
వార లందఱు సంకటముల కోర్చి పిదప సుఖించిరి. నీవు నిపుడ యాపదల సైఁచి
పిదప సౌఖ్య మనుభవింపుము. ఈపదుమూఁడవయేఁడు గడచినపిదప భూమం
డలములకెల్ల రాణి నగుము. ఇఁకఁ గొన్నినాళ్లు లోర్చియుండు మనిన ద్రౌపది
యతని కిట్లనియె. పరమదుఃఖార్తనై యింత చెప్పితి. దుఃఖముల కోర్వలేక ధర్మ
రాజును నిందించితిని. ఇంతియకాని పరమధర్మాత్ముఁడైనయామహానుభావునిపై
నించుకేనియు దోషము గలదే? ఇఁకఁ గడచినదానిం జింతింప నేల? ప్రకృత
కార్యమునఁ గడంగుము. ఆలసింపవలదు. సుధేష్ణ నారూపముఁ జూచి విరాటుఁడు
నన్నుఁ గామించి తన్నువిడుచునో యని యెప్పుడుం జింతించుచుండు. దానిత
లంపు నెఱింగి కీచకుఁడు నన్నుఁ గోరుచున్నవాఁడు. వాఁడు కొన్నిమాటలాడిననే
నుఁ గోపవివశనయ్యు నిది తఱి గాదని యూహించి కోప మడంచికొనియోరీమూ
ఢా, యాత్మరక్షణంబుఁ జేసికొనుము. నాపతు లేవురు గంధర్వులు గలరు. మహా
సాహసకారు లతిశూరులు నగువా రలిగిరేని నిన్ను వధింతు రనిచెప్పిన వాఁడు
సైరంధ్రీ, గంధర్వులం జూచిన నే వెఱవను. శతసహస్రగంధర్వుల నే వధించిన
వాఁడను. ఆమాటల నాతోఁ జెప్పకు మనియె. అంత నేను దుష్టాత్మా, తెలియ
క పలికెదవు. నాచెప్పినగంధర్వుల నీవు మార్కొనఁ జాలవు. మఱియు నేను పతి
వ్రతను. నన్నుఁ గామింపరాదు. నాయుపేక్షం జేసి బ్రదికియుండెద వని చెప్పితి.
వాఁడు నందులకుఁ బెలుచ నగి యటఁ జనియె. అంత నొక్కనాఁడు సుధేష్ణ
నన్నుఁ బిలిచి కీచకునింటికిఁ జని సురఁ దెమ్మనియె. అది యాకీచకుప్రేరణంబకా
నోపు. నే నెంతపో ననినను వేమాఱునిర్బంధించినం జేయునది లేక పోయితి.
నన్నుఁ జూచి వాఁడు కొంతవడి సామవచనములఁ బలికి యందులకు నేను లోబ
డకుండిన వాఁడు నిగ్రహింపఁ దొడంగె. అంత నేను రాజునకుఁ దెల్పఁగఁ గొలు
వుకూటమునకుఁ బాఱుతెంచిన నద్దురాత్ముఁడుం గూడముట్టి వచ్చి విరాటుఁడు,
ధర్మరాజు, నీవును, సభాసదులును జూచుచుండ నన్నుఁ ద్రోచి కాలఁ దాఁచె.
అందుల కాకొలువులో నొక్కఁడైన నిది తగ దని నివారింపకుండినం గినిసి యే
ను విరాటుని యుధిష్ఠిరుని సభాసదులనుం దూఱితి. విరాటునకు మఱఁది సేనా
నాయకుఁడు సారథియు నగునాకీచకుఁడు త్యక్తధర్ముఁడు. ఆక్రోశించుచుండినం గరు
ణ యెంతైనను లేక పరధనముల నపహరించు. సన్మార్గం బెఱుఁగఁడు. ధర్మంబు
పొంతఁ బోవఁడు. ఆపాపాచారుఁ డీకోపమున నిఁక నెప్పు డగపడినను దన్ను
చుండు. ఏను బ్రదుకనోపను. ధర్మరక్షణపరులైనమీకుఁ బెద్ద యధర్మంబు
మూఁడు. సమయరక్షణంబు చూచిన భార్యారక్షణంబు లే దనినిర్ణయింపుఁడు.
భార్యను రక్షింపకుండిన సంతతి రక్షితంబు గాదు. సంతతిని రక్షింపకుండిన నా

త్మరక్షణంబు గలుగనేరదు. తానేకదా భార్యయం దపత్యరూపమున జనించు. దానంగాదె భార్యకు జాయ యనుపేరు గలిగె నని పెద్దలు చెప్పుదురు. భార్య యు నాగర్భంబున నీతండు జనింపవలయుఁగదా యని భర్తను రక్షింపవలయు. ఇట్లు భార్యయు భర్తయుఁ బరస్పరరక్షణముఁ జేయవలయు నని ధర్మవిదు లయి న బ్రాహ్మణులు సెప్పఁగ వినియుంటి. క్షత్రియునకు శత్రునిబర్హణంబుకంటె ము ఖ్యధర్మంబు మఱియొక్కటి లేదు. నీయెదుట నన్నుఁ గాలఁ దన్నినవానిపై నీ కె ట్టు లోర్పు గలిగెనో. జటాసురుఁ డెత్తికొనిపోవుచున్నపుడు నన్ను రక్షించితివి. సైంధవుఁ డపహరించికొనిపోవునపుడును భ్రాతృసహాయుండవై నన్నుఁ దెచ్చితివి. ఆపత్సమయముల నీవకదా నాకు రక్షకుండవు. నన్ను భంగపెట్టినయాపాపాత్ముని ఱాతిపైఁ గుండఁ బగులఁ గొట్టువిధమున భంజింపుము. వాఁడే యనర్థముల కెల్ల నిమిత్తము. సూర్యోదయమునకుమున్న వానిం జంపవేని నీయెదుట విషముఁ ద్రావి చత్తు నని తెగఁబాఱి పలికి భీమునురమ్మునంబడి యేడ్చుచుండ నావృకోద రుఁడు మెల్లన ద్రౌపదిని లేవనెత్తి కన్నీరుదుడిచి హేతుతత్త్వార్థసంగతము ల యినమృదువచనముల నూరార్చి కీచకవధతాత్పర్యము మనమ్మున నుదయింపఁగ సెలవులు ద్రిప్పుచు ద్రౌపది కిట్లనియె.

భీముఁడు ద్రౌపదితోఁ గీచకుం జంపుదు ననిచెప్పుట.

కల్యాణీ, నీచెప్పినట్లు కీచకు నవశ్యంబు చంపుదు. సమయభంగము గాకుం డఁగ నుపాయంబుఁ జెప్పెద వినుము. ఱేపు నీవు దుఃఖపరిభవములఁ దలంపక వానితో మాటలాడి సంగమంబునకు నర్తనశాల సంకేతస్థలముగా నిర్ణయించి వాఁ డొక్కరుఁడే చీఁకటివేళ వచ్చునట్లు సంకేతంబుఁ జేసి రమ్ము. నర్తనాగార మునఁ బవలెల్లఁ గన్నియలునృత్యము చేసి మాపు తమతమనెలవులకుఁ బోవు టంజేసి యది నిర్జనంబై యుండు. నాచెప్పినట్లానీచుఁడు వచ్చెనేని యెన్నఁడో చచ్చినపెద్దలను వానికిఁ జూపింతు. వానితో నీవు సంకేతము నిర్ణయించికొనుట యేరికిం దెలియకుండ రహస్యప్రకారమున నుండవలయు నని ద్రౌపదికి మనః ప్రియంబుగాఁ బలికి భీమసేనుఁ డిఁకఁ బొమ్ము. అందఱు మేల్కాంచుతఱి యయ్యె. మేలుకనిరేని సమయభంగ మగు ననిచెప్పి యాపతివ్రతం బనిచి శయనంబుఁ బ్రాపించె. ద్రౌపదియుఁ గలఁకదేఱినచిత్తంబుతో శయనగృహమునకు వచ్చి యారాత్రి యుచితప్రకారంబున నడపె. అంత మఱునాఁడు కీచకుఁడు ద్రౌప దిపైఁ దగులంబున నెద్దియుం దోఁపక మదనవేదనావశుఁడై యిటునటుఁ ద్రిమ్మ రువాఁ డంతిపురమునకుఁ జనుదెంచి యేకతంబ యున్నద్రౌపదిం గాంచి మించుఁ బోఁడీ, నిన్న నేను రాజునెదుటఁ గాలఁ దాఁచినం నందఱు చూచుచుండిరిగాని యొక్కఁడైన వారించెనా? నాబలవిక్రమంబులఁ జూచితివిగదా? నేనే యీదేశ

ములకెల్ల నధినాథుఁడను. సేనానాయకుఁడను. కరుణించి విరాటునకు రాజను పేరు పెట్టితి. అందుఁను నాకు వెఱతురు. నన్నుఁ బొంది సర్వసుఖము లనుభవింపుము. దాసీశతంబును దాసశతంబును నిష్కశతంబును నొసంగుదు. దివ్యరథముల నారోహించి యిచ్ఛకు వచ్చినచోట్ల కరిగి యభిమతక్రీడల సుఖింత మని చెప్పిన విని ద్రౌపది మెత్తఁబాటు గదుర నందుల కొడంబడినట్లు భావించి యిట్లనియె. ఒక్క సంకేతంబుఁ జేసితివేని యేనునీయభిమతంబు నడుపుదు. నీకు నాకుఁ దక్కఁ దక్కటివారి కెరికి నేను నిన్నుఁ బొందుట తెలియకుండఁగ నతినిగూఢముగా విజనంబై తమోనిబిడం బయినచోటికి రావలయు. ఇంచుక బాహిరంబైన నాపతు లగుగంధర్వులు నన్ను నిగ్రహింతురు. అందులకు వెఱతు. విజనస్థలం బెయ్యదియంటేని? నర్తనశాలం బవలెల్లఁ గన్యలు నృత్య మాడి ప్రొద్దు గ్రుంకుడుఁ దమతమనెలవులకుఁ బోవుటంజేసి యది రేయి నిర్జనంబై యుండు. చీఁకటివేళ నచ్చటికి రమ్ము. అపుడచ్చటనైనం గంధర్వులకుం దెలియకుండు ననిన విని కీచకుం డత్యంతసంతుష్టుండై సుశ్రోణీ, నీమాటమెయి నతినిగూఢముగా నితరుల కెరికిం దెలియకుండఁగ నొక్కరుండనే యంధకారబంధురంబైన నర్తనాగారమునకు వత్తు నని యొడంబడి తనయింటికిఁ జనియె. ద్రౌపది యట భీమునొద్దకుఁ జనుదెంచి మహాభుజా, నీచెప్పినచొప్పునఁ గీచకునకు నర్తనశాల సంకేతస్థలముగాఁ జెప్పివచ్చితి. కందర్పదర్పగోచరుండు గావున వాఁడు శంకింపక యారేయి గాఢధ్వాంతదంతురంబైనసమయంబున నవశ్యంబు వచ్చు. నాపతు లగు గంధర్వులు గల రని చెప్పినను వాఁడొప్పరికించి యనాదరించె. మధురసలిలాశయస్థితంబై తజ్జలంబు దూషించుపన్నగంబుపగిది నీపేట సాధుజనులకుఁ గీడు సేయు నాపాపాత్ముం జంపి నాదుఃఖం బపనయించి యాత్మరక్షణంబును గులరక్షణంబును జేయు మని నివేదించిన విని భీముఁడు ద్రౌపదినూరార్చి స్వాగతం బడిగి నిస్సహాయుండనై రహస్యంబుగనైనను బ్రకాశంబుగనైనను దేవేంద్రుఁడు వృత్రాసురుంబోలె హిడింబుం జంపినట్లు కీచకుం జంపి నీకు మనఃప్రియంబుఁ గావింతు. వానికి బాసటమై విరాటసైనికులు వచ్చిరేనియు వారలనుం జంపుదు. అటఁ జంపి దుర్యోధను వధించి కౌరవరాజ్యం బాక్రమింతు. యుధిష్ఠిరునకిది యనభిమతంబేని యతండు విరాటుం గొల్చుచుండుఁగాక యనిన ద్రౌపది యిట్లనియె. కీచకుం జంపుదు నని పూనుటకు సంతోషం బయ్యె. రహస్యభంగము గాకుండఁ గార్యముఁ దీర్పుము. కాకున్న సంకేతంబు చొప్పునఁ గ్రమ్మఱ వనవాసాజ్ఞాతవాసంబులు జరుపవలసివచ్చు. అట్లయిన నయ్యనర్థంబు నీవును నేనుం జేసినదియకా నందఱు మనల నిందింతురు. కావున రహస్యభంగము గాకుండ నరిభంగముఁ జేయు మనిన నావృకోదరుం డట్లయని యొడంబడి యెప్పుడాదు

రాత్రిం జంపుదునో యని కీచకవధోద్యుక్తచిత్తుండై యుండె. అటఁ గీచకుఁడును నిజమందిరమున కరిగి ద్రౌపది తన్నుఁ బొందు నని నిశ్చయించి కామవశుండై యొండు దలంపక యెల్లపుడు తత్సంగమంబ కోరుచు స్నానభోజనపానాదుల నొకతెఱంగున నడపి యెప్పుడు ప్రొద్దు గ్రుంకునో యెపుడు మనోరథంబు నెఱవేఱునో యని తలపోయుచు నాదినంబు యుగంబుగాఁ ద్రోఁప మనసిజుఁడు పట్టి యాడించుయంత్రంబురీతిఁ జేసినది చేయుచుఁ జూచినది చూచుచుఁ బలికినది పలుకుచుఁ బలుదెఱంగు లగుమదనవికారములకు గోచరుండై వినోదజనకంబు లన్నియు నుద్వేగజనకంబులుగాఁగఁ గొంతప్రొద్దు గడపి యరుణకిరణుఁడ స్తగిరిశిఖరాంతర్హితుం డై నపదంపడి నిర్వాణసమయదీపశిఖవడువున నధికశ్రీవిలసితుండై కప్పురంపుఁదావి గుబుల్కొలుపుకమ్మగందము నలంది వికచకుసుమమాల్యములఁ దాల్చి యుత్తమాభరణంబుల నలంకరించికొని సమయంబు వేచి యుండె. ఆరాత్రి భీమసేనుఁడును ద్రౌపదీవచనంబున మహానసగృహంబు వెడలి యంధకారనీరంధ్రం బైన నర్తనాగారంబున కరుదెంచి సంకేతితశయనంబుపైఁ బరుండి సింగము మృగంబునుంబోలెఁ గీచకుం బ్రతీక్షించియుండె.

## భీముఁడు కీచకుం జంపుట.

అంతఁ గీచకుఁడు జను లందఱు నిదురవోయినపదంపడి పాంచాలీసంగమాశఁ జేసి సంకేతించినవిధంబున నొక్కరుండ యెదిరిం దన్ను నెఱుంగరానిచీఁకటి గడలుకొనియున్న నర్తనశాలకుఁ బరిచయవశంబున నేతెంచి శయనంబుఁ బ్రాపించి శయ్యాతలగతుండై పాంచాలీపరిభవోద్భూత ప్రభూతకోపానలజాజ్వల్యమానమానసుం డై నభీమసేనుం దడవి చూచి కామమోహితుండు గావున సైరంధ్రి యనుబుద్ధిం జేసి యత్యంతసంతుష్టస్వాంతుండై మఱింత చేరం జని మందహాసంబు దళుకొత్తఁగ సుందరీ, నీకొఱకు రూపలావణ్యసంపన్న లగునూఱుగురుదాసులను వివిధరతియోగ్యం బయినదివ్యాంతఃపురమందిరంబును బహువిధధనంబు నేర్పఱిచి వచ్చితి. ఇంతులు నాపొందుఁ గోరి వచ్చి నీ వెంతయు రూపవంతుఁడవు. దర్శనీయుఁడవు. నీయట్టిరసికశేఖరు నెవ్వనిం గాన" మని కొనియాడుదురు. అట్టి నేను నీకుఁ లోఁబడితి. నిన్నుఁ గలిసి వేఱొకదానితోఁ గలియ ననిన భీముఁడు వాని కిట్లనియె. దైవవశమున నీవు దర్శనీయుఁడవైతివి. దైవవశమున నాత్మ ప్రశంసఁ జేసికొనియెదవు. నిక్కంబ నీవు నాకు లోఁబడితివి. నన్నుఁ గలసి పిమ్మట వేఱొక్కదానితోఁ గలియవు. నాయట్టియింతులకుఁ బ్రీతికరుఁడు నీయట్టివాఁ డొండొకం డుండఁడు. కామధర్మవిచక్షణుఁడు విదగ్ధుఁడు నగునీవు నాకలయికం గలవిశేషం బెఱుంగుదు వని ప్రగాఢంబుగఁ బలికి తటాలున లేచి నవ్వుచు నోరీ, పాపాత్మా, నేఁడు నేను సింహము గజమునుంబోలెఁ గొండవంటినిన్ను

గ్రిందఁ ద్రోచి యీడ్చుచుండ నీయప్ప గనుంగొనం గలవు నీవు సచ్చినపిదప సైరంధ్రి నిరాబాధముగఁ జరింపఁ గలదు. సైరంధ్రీపతులును సుఖముగనే చరింపఁగల రనివా(వ్రచ్చి వెంద్రుకలఁ బట్టి యీడ్చె. ఈడ్చుటయుఁ గీచకుఁడు గంధర్వుఁ డనుతలంపున వేగమున వెంద్రుకల విదిర్చి భీముభుజములఁ బట్టికొనుటయు నియ్యిరువురకు వసంతసమయమునఁ గరిణీనిమిత్తంబు మదగజంబులకుంబోలె బాహుయుద్ధంబు భీకరం బయ్యె. అట్లు కీచకవృకోదరులు వాలిసుగ్రీవులవిధంబునఁ దాకి పరస్పరవిజిగీషంజేసి పంచశీర్షోరగంబులంబోనిభుజము లెత్తి నఖప్రహారము లొనరించుచుఁ దత్ప్రహారంబులు సరకుగొనక యొండొరులం బట్టి యీడ్చుచు నఖదంష్ట్రాయుధంబులైనశార్దూలంబులచందంబునఁ గడిమి మెఱసి వేణుస్ఫోటసమం బయినఘోరనిస్వనంబు నిగుడఁ గరము లప్పళించుచుఁ బోరాడుచుండ వృకోదరుండుగీచకుం బట్టియెత్తి చండప్రభంజనుండు పాదపంబునుంబోలె నతివేగంబునం ద్రిప్పినం దప్పించికొని సూతుండు భీముం బలంబున నీడ్చి క్రోధావేగంబున నడుగులు తడఁబడఁ బైపైఁ దూఁకుచున్నపాండుపుత్రుని మోఁకాళ్లం బట్టి నేలం ద్రోచె. త్రోచుటయు భీముఁ డలిగి తటాలున లేచి గండడరి యంతకువిధమున వానిం గదిసిన విరాటుమఱఁదియుఁ గ్రోధ మగ్గలంబుగా నురవడించి తాఁకిన వా రిద్దఱు పరస్పరాకర్షణంబుఁ జేయుచుండియుఁ దదాకర్షణంబునంజేసి యాన ర్తనాగారంబు వడఁకుచుండె. అట్లు మల్లచఱచుచు వక్షఃప్రహారములఁ జేయుచుఁ జలింపక పోరాడుచుండఁ గొండొకవడికిఁ గీచకుఁడు క్షీణబలుఁ డగుటయు భీముఁడు వానిఁబొమ్మ గ్రుద్ది మాంసలోలుపం బైనక్రోల్పులి మృగంబునుంబోలె వానిం బట్టి విక్రమించి త్రాటఁ బశువునుంబోలెఁ బెడకేలు గట్టి పగిలిన భేరిమాడ్కి వాఁ డఱచుచుండ రెండుచేతుల మీఁది కెత్తి పెద్దయుంబ్రొద్దు గిరగిర ద్రిప్పి యట నేలం బడ విసరి వైచి ద్రౌపది కోపశాంత్యర్థంబు గొంతుపిసికి భగ్నసర్వాంగుఁడై కన్నులు దేల వేసినయాకీచకాధమునికటిప్రదేశము మోఁకాల దన్ని పశువును జంపినట్లు చంపి భూమిపైఁ ద్రిప్పి కీచకా, భార్యాపహారి యైననిన్ను వధించి నేను నేఁడు మాయన్నఋణముఁ దీర్చుకొంటి సైరంధ్రికంటకుం డైననిన్నుఁ జంపి శాంతిఁ బొందితి నని పగ దీఱఁ బొడిచి యాడి చచ్చినవానికాళ్లు చేతులు తలను విఱిచి డొక్కలోఁ జొనిపి ముద్దచేసి కృష్ణను బిలిచి దీపము ముట్టించి పాంచాలీ, నిన్నుఁ గామించినకీచకుం జూడుము. రహస్యభంగము గాకుండ నరిభంగముఁ జేసితి. పతివ్రత వగునిన్నుఁ గామించువారల ని ట్లే. జంపుదు నని చెప్పి ముద్దయై యున్న కీచకుపీనుఁగుఁ గాలఁ దన్నిపాంచాలరాజపుత్రికి మనఃప్రియంబుఁ గావించి భీమసేనుఁడు ప్రియపత్ని నామంత్రణంబు చేసి తనశయనగృహమునకుఁ జనియె. అంత ద్రౌపది కావలివారలఁ బిలిచి యయ్యా,

వచ్చిచూడుడు. వల దనిన వినక నన్నుఁగామించి వచ్చి కీచకుఁడు నాపతు లయి నగంధర్వులతోఁ బోరాడి చచ్చి పడియున్నాఁ డని చెప్పటయు వారు కొఱవులు గొని న ర్తనాగారమునకు వచ్చి ముద్దయై పడియున్న కీచకుం గాంచి యయ్యమా నుషకృత్యమునకు విస్మితులై వీనితల యెక్కడ? కాళు లెక్కడ? చేతు లెక్కడ? గంధర్వులు చంపువిధం బిట్టిది యొక్కో యని సవితర్కంబుగఁ జూచుచుండిరి.

భీముఁ డుపకీచకులఁ జంపి ద్రౌపదిని విడిపించుట.

అయ్యవసరంబునఁ గీచకునితమ్ములు నూటయేగు రుపకీచకు లనువారు వచ్చి భీమసేననిహతుండై మెట్ట నీడ్చివేసినకూర్మంబురీతి సంభిన్నసర్వాంగుఁడై నతమ యన్నం గనుంగొని కొంతవడి విలపించి యట నాకళేబరమునకు సంస్కారంబుఁ జేయఁగ బయట నెత్తికొనిపోవం దలంచుచుండి యాన ర్తనాగారమున నొక్కచో స్తంభము మఱుఁగున నున్నద్రౌపదిం జూచి యీయసతినిమి త్తంబకదా మనకీ చకుఁడు సచ్చె. దీనిం జంపుదము. కాకున్న దీనిం గామించినవానికళేబరముతో డఁ గాల్చెదము. చచ్చినపిమ్మటనైన వానికిఁ బ్రియము క ర్తవ్యంబు గావున నిది య యు త్తమం బని తమలో నిశ్చయించి విరాటు నొద్దకుఁ జని సైరంధ్రిం గా మించి మనోరథము దీఱకమున్న చచ్చినకీచకునకుఁ బ్రీతిగా దాని వానిశవము తోడఁ గాల్పఁగఁ దలంచితి మనుజ్ఞఁ యిమ్మనియడుగ నామత్స్యపతి వారివిక్ర మంబునకు వెఱచి యనుమతించుటయు నాసూతులు మోహవివ్హలమై యున్న ద్రౌపదిం బట్టి తెచ్చి కీచకుపీనుఁగుపైఁ గట్టి యె త్తికొని శ్మశానాభిముఖులై చనుచుండిరి. అట్టియెడఁ బాంచాలి పరమశోకా ర్తయై యోజయా! జయంతా! విజయా! జయత్సేనా! జయద్బలా! రథఘోషధనుష్టంకారనిస్వనంబుననే శత్రు లగుండె లవియింపఁ జాలినయోమహారథులారా! గంధర్వవర్యులారా! పాపాత్ము లైనయుపకీచకులు నన్నుఁ గీచకుపీనుఁగుపైఁ గట్టి కాటికిఁ గొనిపోవుచున్న వారు. నామొఱ యాలించి యాసూతపుత్రులనెల్లఁ బరిమార్చి నన్ను రక్షింపరే యని విలాపంబు చేసె. ఆయేడ్పువిని భీమసేనుఁడు తటాలున శయనము విడిచి లేచి యిదే నేను వచ్చితి. సూతపుత్రులవలన వెఱ పుడుగు మని గంధర్వవచన ముగాఁ బాంచాలరాజపుత్రి నూరార్చి యుపకీచకులఁ జంపుదు ననుసంతసమున మేను పెంచి తొల్లింటివేషము మార్చి ప్రాకారము లంఘించి పురంబు గడచి పరేతనిలయంబునకుఁ జనుచున్నయుపకీచకులఁ గాంచి వీనుఁగును సొదఁ జేర్చునం దాఁక వెంటఁ జని శుష్కాగ్రంబు మహాస్కంధంబు తాలప్రమాణంబు నగునొ కమహావృక్షంబునుఁ బదిబారలనిడివిగలదాని మత్తగజంబులీలం బెఱికి మూఁపు న నిడికొని దండపాణి యైనయంతకుతెఱంగున భీకరుండై యతిరయమున నయ్యు పకీచకులపై నుఱికె. వానిపాదఘట్టనంబున నచ్చటిక్రమ్మాఁకు లెల్ల గూలె. స్కంధ

నిశీ_ప్రవృత్తుండై క్రుద్ధసింహముచాడ్పున విక్రమఘనుండై వచ్చుచున్నభీముం జూచి యుపకీచకులు గంధర్వుఁ డని యూహించి భయాతిశయకంపితగాత్రులై గంధర్వుఁ డదె మహావృక్షంబు మూఁపున నమర్చికొని మనపై వచ్చుచున్నవాఁడు. శీఘ్రింబ సైరంధ్రిబంధనము లెడలించి పోవుద మని తమలో నూహించి పాంచాలిబంధనము లెడలించి పాఱుచుండిరి. భీముఁడు దనుజసంహారోద్యతుండై నవ్రజపాణికైనడి నురవడించి వారివెంటఁ బఱచి యొక్కఁడైనం దప్పిపోవకుండ నాసూతపుత్రుల నూటయేగురనుం బొదివి చంపి ద్రౌపదిం బిలిచి నీకుఁ గీడు రోసినవారిచావు చూచితే. ఎవ్వఁడైనను నీకుఁ గీడు దలంచెనేని యే నిట్లు చేయుదు. ఇంక నీకు భయము లేదు. పురమునకుఁ బొమ్ము. నేను వేఱొక తెరువున నగరు సేరెద నని చెప్పి ప్రక్షాళితగాత్రుండై మార్గాంతరమున వచ్చి ప్రాకారంబు లంఘించి మహానసగృహంబు సేరి యెప్పటియట్ల శయ్యాతలంబుఁ బ్రాపించి యుండె. పౌరజనులుం బ్రేతనిలయంబునఁ బడియున్నకీచకులం జూచి విస్మితులై విరాటునొద్దకు వచ్చి నృపాలా, సూతపుత్రుఁ డైనకీచకుఁడును వానితమ్ము లుపకీచకు లనువారు నూటయేగురును సైరంధ్రీపతు లైనగంధర్వులచేఁ జచ్చి పరేతనిలయంబునఁ బడియున్నవారు. సైరంధ్రియు నిపు డిచ్చటకు వచ్చుచున్నది. సైరంధ్రి యత్యంతసౌందర్యవతి గావునఁ బురుషులచిత్త మొకప్పు డున్నయట్లుండదు. ఎవ్వఁడే నించుక కామించినట్లాయెనా దానిపతు లగుగంధర్వులు వానిఁ జంపక మానరు. సైరంధ్రినిమిత్తంబుగాఁ బురమునకుఁ జేటు వాటిల్లకుండఁ జూచికొనుట నీతి యని విన్నవించిరి. అంత విరాటుండు నూటయాఱుగురుకీచకులకు నుసమిద్ధం బైనయొకయగ్నిలో గంధద్రవ్యములతోడ దహనంబుఁ గావింప నాజ్ఞాపించి యట నంతఃపురంబున కరిగి సంజాతభయుండై సుధేష్ణం బిలిచి యిఁక సైరంధ్రి వచ్చెనేని యమ్మా గంధర్వులవిక్రమంబునకు మారాజు వెఱచియున్నవాఁడు. గంధర్వరక్షిత వైననీతో నెద్ది చెప్పుటకు వెఱపు గల్గెడి. అయిన నాఁడుదాన నగుటంజేసి చెప్పఁ దగు ననిచెప్పెద. వేఱొక్కచోటికిఁ బొమ్మని నామాటగాఁ జెప్పు మనిపలికి మగిడి యాస్థానంబునకు వచ్చె. అంతఁ బాంచాలి భీమసేనమోక్షితవై స్నాన మొనరించి ప్రక్షాళితాంబరములఁ గట్టి సూర్యుఁ డుదయించినపదంపడి పురవీధుల నరుదేరుచుండఁ బౌరులు గంధర్వభీతులై యాయమఁ జూడ నోడి పాఱిరి. కొందఱు కన్నులు మూసికొనిరి. అట్లు పురవీధులఁ గడచి నగరు సొచ్చి మహానసగృహద్వారంబున మత్తశుండాలలీల నున్నభీమసేనుం గాంచి నెమ్మొగమునఁ జిఱునగవు సొంపార నన్ను రక్షించిన గంధర్వరాజునకు మ్రొక్కెద నని సంకేతంబుగాఁ బలికిన విని భీముఁడు నీవశవర్తు లగునయ్యుత్తమపురుషులు దుఃఖనిర్ముక్త వైననీవచనము విని యనృణులై సుఖ ముండుదు

రని ప్రత్యుత్తర మొసంగె. అట ద్రౌపది నర్తనశాల కరిగి కన్నియల కాటఁ గఱపుచున్న యర్జునుం గాంచుటయు నాకన్నియ లాటఁ జాలించి యర్జునుతోడ లేచి వచ్చి యత్యంతసంతోషము సెలంగ సైరంధ్రీ భాగ్యవశమునఁ దప్పించికొని మఱలి వచ్చితివి. నీభాగ్యముననే నీ కెగ్గుఁ జేయఁ బూనినకీచకులు మడిసి రనివచించిరి. అపు డర్జునుఁడుం బాంచాలిం బిలిచి సైరంధ్రీ, యెట్లాపాపాత్ములు హతులైరి? నీ కెట్లు మోక్షణం బయ్యె నంతయుఁ దెలియఁ జెప్పు మనియడుగం బాంచాలి పార్థుం జూచి బృహన్నళా, కన్యాగృహమునఁ గన్నియల కాట నేర్పుచుసుఖమున్ననీ కిపుడు సైరంధ్రితోఁ బని యేమి? సైరంధ్రిదుఃఖములకు నీకు విచారం బెయ్యది? కాకున్న దుఃఖాక్రాంత యైనన న్నిట్లు నవ్వుచునడుగుదువే యనియడుగ నర్జునుం డిట్లనియె. సైరంధ్రీ బృహన్నళ సుఖ మున్నదని తలంచి యిట్లు పలికితివి. నీదుఃఖమెల్ల నాయదిగాఁ దలంచి వనరుచుండుదు. అయిన నీయేవపుజన్మ మెత్తుటం జేసి చేయునది లేక యూరకుండుదు. నీతో నింతకాలము సహవాసముఁ జేసిననేను నీదుఃఖముల కుమ్మలింపకుండుదునే? నాచిత్తవృత్తి నెఱుంగక యిట్లు పలికితి వని మాఱుపలికె. అంతఁ బాంచాలరాజపుత్రి యాకన్నియలతోడ సుధేష్ణయొద్ద కరుగుటయు నవ్విరాటమహిషి సైరంధ్రీ, యిఁక నీకుఁ దోఁచినయెడకుఁ బొమ్ము. రాజు నీపతు లగు గంధర్వులకు వెఱచి నీతోఁ జెప్పు మనినవాఁడు. నీసౌందర్యంబు లోకోత్తరంబు. పురుషులు విషయాసక్తచిత్తులు. గంధర్వులో పరమకోపనులు. ఎపు డెట్లు ఫొసఁగునో? కావున నీ వొండొకయెడకుఁ బోవుట లగ్గని చెప్పిన విని పాంచాలి సుధేష్ణం జూచి దేవీ, యిఁకఁ బదుమూఁడునాళ్లు నీయొద్ద నుండెద. రాజు దీని నంగీకరించునట్లు చేయుము. పిదపఁ గృతకృత్యులయి నన్నుఁ దోడికొనిపోవుదురు. మీకుఁ దఱితోఁ బ్రత్యుపకార మొనరింతు రనిన సుధేష్ణ యట్లగుఁగాక. మాయింట నీనిమిత్తమున నెకకీడు వొడమకుండఁగఁ జూచికొ మ్మనిచెప్పి యప్పదుమూఁడు నాళ్లుండుట కియ్యకొనిన ద్రుపదరాజపుత్రి యెప్పటియట్ల యుండె. అట్లు కీచకులందఱుం జచ్చుటయుఁ బాపాచారుఁ డైనకీచకుఁడు సానుజుం డై గంధర్వులచేఁ జచ్చె నని మత్స్యదేశమునం దంతట జనప్రవాదం బెసంగిన సమస్తదేశములందు నాప్రవాదంబు చెల్లుచుండె.

దుర్యోధనువేగువాండ్రు పాండవుల వెదకి కానక వచ్చుట.

అట్టియెడ దుర్యోధనువేగువాండ్రు పాండవుల వెదకుచు ననేకగ్రామనగర జనపదంబులం దిరిగితిరిగి యెచ్చటనుం బాండవులపోఁబడి యెఱుంగక మగిడి హస్తిపురమున కరిగి భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణశకునిసుశర్మాదివీరులును భాతృవర్గంబునుం గొలువఁగ సభాసీనుం డైనదుర్యోధనుం గాంచి మ్రొక్కి యిట్లని

విన్నవించిరి. నరేంద్రా, దేవరయానతిమెయి మేము పాండవుల వెదకువారమై నానావనంబులను, బొదలను, గిరికూటములను, దుర్గములను, జనపదములను, రాజధానులను దిరిగితిమి. వా రెచ్చటనుం జూపట్టరు. ఒక్కచో రథములజాడ యగపడినం దానివెంబడి ద్వారకకుఁ బోయి యతిగూఢముగా విచారించిన నచ్చట వారిరథములు సారథులునుండునట్లు తెలిసెంగాని పాండవులు ద్రౌపదియు నచ్చటనుం గన్పట్టరు. మాకుంజూడ వారు నశించి రనియే తోఁచుచున్నది. ఉన్నవారేని యొక్కచోటనైన నగపడకుండుదురేఁ? ఇఁక నేమి చెప్పినం జేయ నున్నవారము. క్రమ్మఱ వారల నెమకఁగఁ బోవుదుమో. దేవరయానతిమెయి నడతుము. పాండవాన్వేషణార్థంబు తిరుగుచుండ భవత్ప్రియం బైనవార్త యొక్కటి విననయ్యె. మత్స్యదేశపతి యగువిరాటునిమఱఁది కీచకుఁ డనువాఁడు త్రిగర్తయోధుల గెలిచినశూరుఁ డొకసతినిమిత్తమున రాత్రివేళ గంధర్వులచే హతుఁ డయ్యె. వాని తమ్ము లుపకీచకు లనునూటయేగురు నారాత్రియే యాగంధర్వులు చంపిరి. ఆగంధర్వు లెవ్వరోగాని యగపడరు. చంపునెడ నాయుధవ్యవహార మించుకేనియు లేదు. మత్స్యరాజు శత్రుఁడు గావున వానికిఁ దొడరినయడరు విన్నవించితిమి. అనంతరకృత్యం బానతిమ్మనివిన్నవించిన వేగువారలమాటల విని దుర్యోధనుఁడు పెద్దయుంబ్రొద్దు పలుకకుండి సభాసదులఁ గలయం గనుంగొని యిట్లనియె. పాండవు లెచ్చట గూఢప్రకారమున నున్నవారో యెరికి నెఱుంగరాదు. అందఱు మీమీబుద్ధులం బోలినభంగి వారివర్తనం బూహించి చెప్పుఁడు. వారిసంకేతవర్షములెల్ల గతప్రాయము లయ్యె. సత్యవ్రతపరాయణు లైనవా రజ్ఞాతవాసశేషంబును గడపిరేని మత్తశుండాలములవిధమునఁ గౌరవుల మార్కొన వత్తురు. సమయ మంతయుఁ గడపకమున్న మనము వారల నెఱింగితిమేని సత్యవ్రతపరత్వంబునం జేసి వారు మఱల వనములకుఁ బోవుదురు. కావున నతివేగమున వారి నెఱుంగ నుపాయంబుల నాలోచింపుఁడు. రాజ్యము మాకు నిష్కంటకం బైయుండుట కదియకదా ముఖ్యకారణం బనినఁ గర్ణుఁ డిట్లనియె. సాధుకారులు సమర్థులు నగువేగువాండ్ర పెక్కండ్రఁ బనిచి తూరి సర్వదేశముల గొలువుకూటములందును, మఠములందును, తీర్థములందును, గనులందును, దేవాయతనములందును, నదులయందును, రేవులందును, గ్రామములందును, నగరములందు, నాశ్రమములందుఁ, బర్వతములందును, గుహలందును గూఢవేషధారు లయినపాండవులను నేర్పున వెదకఁ బంపుము. అట్లు లెస్స వెదకిన నగపడకపోవ రనిన దుశ్శాసనుఁ డిట్లనియె. కర్ణుఁడు చెప్పినది తగు. మనకెంతయు విశ్వాస్యు లగుచారులకు వలసినధనం బిచ్చి నానాదేశములం బంపి వెదకింతము. అట్లు వెదకఁగ వారలె ట్లగపడకుండుదురు. మహారణ్యమునందు సింహశార్దూలాదిక్రూరమృగముల

వాతం బడిగాని వనవాసాజ్ఞాతవాసక్లేశంబుల కోర్వలేక విసికిగాని చచ్చియుండి నం జెప్పఁ జాల. బ్రదికియుండుదురేని నిపుణముగ వెదకించిన నగపడుదురు. ఉత్సాహంబుతోఁ గార్యంబు నడుపు మనివచించె.

### ద్రోణభీష్మకృపులు పాండవులగుణములఁ జెప్పుట.

అయ్యిరువురు చెప్పి చాలించినపదంపడి తత్త్వజ్ఞుఁ డైనద్రోణాచార్యుండు దుర్యోధనుం జూచి నృపాలా, శూరులు, పండితులు, బుద్ధిమంతులు, జితేంద్రియులు, ధర్మజ్ఞులు, కృతజ్ఞులు, నగుపాండవులు పొడవడంగియుండరు. వారికిఁ బరాభవంబునుం గలిగియుండదు. నీతిధర్మార్థతత్త్వజ్ఞుం డైనధర్మరాజును దండ్రిగ భావించి పూజించువారి నతండు నిరపాయం బైనధర్మమార్గమునం బ్రోచుచుండు. అజాతశత్రు నుపాసించి నీతితత్త్వం బెఱింగినయర్జునుఁడు వారిశ్రేయం బొడఁగూర్చుచుండు. వా రొకరొకరుం బరస్పరవిధేయత మైఁ బరస్పరరక్షణంబున జాగరూకు లైయుండుదురు. కావున నెచ్చటనో గూఢప్రకారమున నుండి కాలప్రతీక్షణం బొనర్చుచున్నవారకాని పొడవడంగినవారుకా రని నాకుఁ దోఁచుచున్నది. ప్రచ్ఛన్ను లై యున్నయాతపోనిరతులఁ గాంచుట దుష్కరంబు. శుద్ధాత్ముఁడు, గుణవంతుఁడు, సత్యవంతుఁడు, నీతిమంతుఁడు, తేజోరాశియు నగుపార్థుఁడు కన్నెత్తి చూచినం జాలు. వేగువాండ్రు సంభ్రాంతు లగుదురు. కావున వారల లెస్సగ నెఱుంగఁ జాలినబ్రాహ్మణులఁగాని సిద్ధులంగాని మఱియెవ్వరినైనంగాని పంపి వెదకించుట కర్తవ్యం బనిచెప్పి యాచార్యుఁడు చాలించుటయు దేశకాలతత్త్వజ్ఞుఁడు సర్వధర్మవిదుఁడు కురుపితామహుఁడు నగుభీష్ముఁడు సాధుజనసమ్మతంబు లసాధుజనాసమ్మతంబులు ధర్మరాజగుణాశ్రయంబులు నగువాక్యముల దుర్యోధనహితార్థం బిట్లనియె. సర్వతత్త్వార్థవేది యగుద్రోణాచార్యునివచనం బుచితంబు. సర్వలక్షణసంపన్నులు, సాధువ్రతసమన్వితులు, తపస్స్వాధ్యాయనిరతులు, వృద్ధోపసేవులు, సత్యవ్రతపరాయణులు, సమయజ్ఞులు, క్షాత్రపరులు, వాసుదేవాశ్రయులు, శూరవర్యులు, మహాబలులు, మహాత్ములు నగుపాండవులు ధర్మగుప్తులై సమయము ప్రతీక్షించియుండుదురుగాని నశించియుండ రని నాకు దృఢముగఁ దోఁచుచున్నది. పాండవధార్తరాష్ట్రులం దఱు నా కొక్కరూప మైన నడిగినప్పుడు రాజునకుశ్రేయస్కరం బయిననీతి తెలిసినంత చెప్పకుండుట యధర్మం బని తోఁచినదానిం జెప్పెదఁగాని పాండవులయెడ ద్రోహచింతనంబునఁ గాదు. పాండవాగ్రజుం డెచ్చట నుండునో యాదేశము నందలిజనులు గీ డెఱుంగక యుత్తరోత్తరాభివృద్ధిగా మేలు గాంతురు. మఱియు ధర్మరా జున్నచోట జనులకు దానశీలత్వం, బకార్యనివర్తనంబు, ప్రియవాదిత్వంబు, శాంతి, సత్యవచనము, తుష్టి, పుష్టి, శౌచము, దాక్ష్య, మనసూయ,

యసీర్ష్య, యమత్సరం, బనభిమానంబు, ధార్మికత్వంబు, దేవతాతిథిపూజాసక్తి కరుణయునుం గలిగియుండు. మఱియు నా దేశమున బ్రహ్మఘోషములు పూర్ణాహుతులు భూరిదక్షిణము లయినయజ్ఞములు నెసఁగుచుండు. వానలు లెస్సగఁ గురియుచుండు. సస్యసమృద్ధియు ధాన్యసమృద్ధియు నతిశయించుచుండు. రసగంధద్రవ్యములు పసగలిగియుండు. శుభశబ్దములు విననగు. మంచిగాడ్పు వీచు. భయము గలుగదు. గోవు లత్యంతపుష్టంబులై పాఁడి దఱుగక యిచ్చుచుండు. భోజ్యపేయాదిపదార్థములు రసవంతంబులై యుండు. ఆదేశం బెద్ది యని యరసి యచ్చోట సత్యదానశాంతిధైర్యప్రముఖంబు లయిననుగుణంబులకు నెల వగుధర్మరాజుండు ననియూహించి నైపుణ్యంబు మెఱయఁ బ్రయత్నంబుతో వారల నెఱుంగవలయు. ధర్మగుప్తు లగువారల బ్రాహ్మణులును వెదక నేరరు. ఇఁకఁ బ్రాకృతులమాట చెప్ప నేల? అయిన లెస్సగ నాలోచించి నామాట హితం బనితోచు నేని శీఘ్రంబ తత్ప్రయత్నంబుఁ జేయు మని చెప్పి యూరకుండినం గృపాచార్యుం డిట్లనియె. కురుపితామహునివచనంబు ధర్మార్థసహితంబు సహేతుకంబు సముచితంబు. వారు ప్రచ్ఛన్నవృత్తి నున్నవా రని దృఢ మగుతలంపుతోఁ దగువారల నెల్లచోట్లకుం బంపి తద్వృత్తాంతం బరసి నీతి నడపుము. శత్రుఁడు ప్రాకృతుఁ డయిన నుపేక్షింపరాదు. మహావీరు లగుపాండుపుత్రులం జెప్పనేల? సమయము దీఱినం బాండవులు వచ్చి సంధిఁ గోరుదు రేని యదియ చేయఁ దగు. వారికి మనకుం గలబలాబలములఁ బరిశీలించిచూచిన సంధియే కర్తవ్యం బనితోఁచెడి. బలాబలములఁ బరికింపక సామదానభేదదండము లనునాలుగుపాయములుఁ దోఁచినయెడలఁ బ్రయోగింపరాదు. అట్లుగాక వారు పోరాడ వత్తురేని యప్పటికిఁ దగునట్లుగా బలకోశముల నీతిప్రకారంబులనువిహితంబులఁ గావింపవలయు. కాలదేశము లెఱింగి నీతిమెయి నడచుభూపాలుఁ డెల్లపుడు సుఖించు నని కృపాచార్యుఁడు చెప్పె.

అంతఁ ద్రిగర్తేశ్వరుం డైనసుశర్మ కర్ణునకు సన్నఁ జేసి దుర్యోధనున కిట్లనియె. పితామహుండు సెప్పినలక్షణంబు లిపుడు మత్స్యదేశంబుల నున్నయవి. పాండవు లచ్చట నిగూఢముగ నుండుదురు. మఱియు విరాటుఁడు కీచకసహాయుఁడై మమ్మెన్నియేమాఱులు బాధించినవాఁడు గావున నా కతనిపై నెప్పుడుం బగ తీఱకయుండు. ఇప్పుడు కీచకుఁడు గంధర్వనిహతుఁ డగుటం జేసి విరాటుఁడు నిస్సహాయుండు గావున నిరుత్సాహుఁడుగా నుండు ననితలంతు. కావున మనము సేనావ్యూహములఁ బన్ని వానిగోగణముల నాక్రమింతము. పాండవు లచట నుండి రేని వానికిఁ దోడ్పడి వత్తురు. లేకున్న నారాజ్య మాక్రమించి వత్తము. ఇదియు మనకు లాభంబుగా దే యనిపలికినం గర్ణుఁడు సుశర్మవచనంబు

సమీచీనంబు. విరాటగోగ్రహణంబు కర్తవ్యంబు. పితామహుఁ డాచార్యుఁడు శారద్వతుఁడునెట్లు తలంతురో వారితో నాలోచించి యనంతరకర్తవ్యం బొనరింతము. ప్రణష్టు లయినపాండవులఁ దలంపనేల. మత్స్యరాజుగోగణంబుల గ్రహింత మనిన దుర్యోధనుఁడు దుశ్శాసనుం బిలిచి దుశ్శాసనా, పెద్దలతోడ నాలోచించి సేనావ్యూహంబుఁ బన్నుము. సుశర్మ తాఁ జెప్పినచొప్పునఁ ద్రిగర్తసైన్యంబుతోడ విరాటపురికి దక్షిణంబుగ గోవులఁ బట్టువాఁడు. మన మాముఱునాఁడు మనమహారథులతోడ నవ్విరటుప్రోలి కుత్తరంబుగఁ బశులంబట్టుద మని యాన తిచ్చె. అట విరాటుఁడును గీచకుఁడు చచ్చిననాఁటఁగోలెఁ బాండవుల నెఱుంగకుండినను గూఢవేషు లయినవారల సంభావించుచుండె. పాండవులును సమయాబ్దంబులు గడచనె నని యంకిలిదేఱినచిత్తములతో నుల్లసిల్లుచుండిరి.

### సుశర్మ దక్షిణగోగ్రహణంబుఁ జేయుట.

దుర్యోధనువచనప్రకారంబున సుశర్మ బహుళత్రిగర్తసేనాపరివృతుండై బహుళాష్టమినాఁడు విరాటుప్రోలి కాగ్నేయముగ వచ్చి గోగణం బాక్రమించి గ్రహించి గోపాలకుల నిగ్రహించె. నిగ్రహించుటయు వారు వెఱచి పఱచినం గోపాధ్యక్షుండు తత్క్షణంబ రథారూఢుండై రాజధానికిఁ జనుదెంచి రాజద్వారమునఁ దేరు డిగ్గి మంత్రులుఁ గంకభట్టాదులుం గొలువఁ గొలువున్న విరాటరాజుం గాంచి డాయ వచ్చి ప్రణామంబుఁ జేసి దేవా, త్రిగర్తేశ్వరుం డైనసుశర్మ బహుళసేనాసమన్వితుండై వచ్చి మమ్ము జయించి గోగణముల గ్రహించినవాఁడు. వేగంబ సమరసన్నాహంబుతోడ వెడలి వాని నిగ్రహించి గోవుల మఱల్చు మనిన విని విరాటుండు కోపాటోపదీపితుండై మంత్రులం జూచి రథహయకుంజరపదాతిసంకులం బైనమహాసేన నాయితపఱుపుఁగ సైనికుల నియోగించునది యని చెప్పి సారథిం బిలిచి యస్మదీయరథంబు సమరసన్నాహోచితంబుగాఁ బూన్చి తెమ్మని యాజ్ఞాపించి తాను సౌగంధికకమలశతచిత్రాలంకృతం బైనకనకకవచంబుఁ దొడిగి రణోచితసన్నాహంబు మెఱయ వెడలి యుత్తమతురంగయోజితం బున్నతకేతనాంచితంబు సకలసాధనసంభృతంబు నగురథోత్తమంబు సారథి తెచ్చుటయు దాని నధిరోహించె. విరాటుతమ్ముండగుశతానీకుఁడు వజ్రసమ్మితం బయినపసిండిమైమఱువు దొడిగి సారథిసముపనీతం బైనతనయరద మెక్కె. అతనితమ్ముఁ డగు మదిరాక్షుఁడు శతసూర్యశతావర్తశతబిందుశతనేత్రచిత్రవిలసితం బయినదృఢకాంచనకవచంబు ధరించి నిజరథము నధిరోహించె. వానితమ్ముఁ డగుసూర్యదత్తుఁడు సూర్యప్రభం బయినవర్మంబుఁ దొడిగి రథారూఢుం డయ్యె. విరాటసుతజ్యేష్ఠుం డైనశంఖుఁడు శతనేత్రచిత్రసముల్లసితం బాయసగర్భంబు శ్వేతవర్ణంబు నగువర్మంబుఁ దాల్చి నిజస్యందనారోహణంబుఁ జేసె. తక్కటియోధులును

మేలిమైమఱుపుల్లు దొడిగి వివిధాయుధపాణులై రథగజహయముల నారోహించిరి. కాలరులుం దగినకైదువులం గొని యుద్ధసన్నద్ధులైరి. అట్లు సేనయెల్లం గూడినం బోరికి వెడలుచు మత్స్యపతి శతానీకుం బిలిచి వీరలక్షణసమన్వితులు మహాబలులు వల్ల తంత్రీపాలదామగ్రంథులును సమరశౌండులని నేం దలంతు. కావున వారికిం దగినకవచముల నాయుధముల నుత్తమహయకేతనసమన్వితంబులైనరథముల నిచ్చునది యనిచెప్పటయు శతానీకుండు వారికిం దగినతెఱంగునం గవచాయుధముల నొసంగె. అంత ధర్మజభీమనకులసహదేవులు కవచములం దొడిగి వివిధాయుధపాణులై సారథిసముపనీతంబులయినరథముల నారోహించి చలద్గిరులకరణి వఱలుచు మత్తగజములచందంబున విలసిల్లుచు నెనిమిదివేలరథంబులు పదివేలయేనుంగు లఱువదివేలగుఱ్ఱంబుల ననేకవీరయోధులుం బలసి పరివేష్టింప నమ్మహాసేనమధ్యమున నరుగుచున్నవిరాటు వెంబడింజనిరి.

అట్లు చని విరాటుసైన్యంబు సాయాహ్నమునం ద్రిగర్తసేనం గూడ ముట్టి రథికులు రథికులను గజములు గజములను గుఱ్ఱములు గుఱ్ఱములను బదాతివర్గంబు పదాతివర్గంబునుం దాఁకి కోల్తలుసేసిన నత్తోలితాఁకు దేవాసురసమరంబురీతిం దుములంబై రోమహర్షణం బయ్యె. సైనికచరణసముత్థితంబైనపాంసుపటలంబున నంతరిక్షంబు సంతమససాంద్రం బగుటయు విహంగమంబులు నేలం గూలుచుండె. ఆసైనికులు నిజకిరణప్రచారం బొక్కింతయుం గలుగకుండ శరజాలమున నాకాశం బావరించినం దాను నింగిని వెలుంగుటకంటె నంతర్ధానంబుఁ గాంచుట సమీచీనం బనుతలంపునవోనాఁగ భానుమంతుం డస్తగిరిశిఖరాంతర్హితుం డయ్యె. అపు డిరువాగులం జేయంగలదొరలు విజృంభించి ప్రాసపట్టసశక్తితోమరాద్యాయుధంబుల గుప్పించి కడిమి మెఱయం జలంబునెఱయం జెండాడుటయుం దెగినకుండలోల్లసితమస్తకంబులు, పడినసాలస్కంధోపమకబంధములు, ద్రెస్సినఫణిఫణాయతభుజంబులు, విఱిగినతేరులు, దునిసినకెక్కెములు, ద్రుళ్లినగుఱ్ఱములు, గూలినయేనుంగులుంగా సంగరరంగంబు రౌద్రభీభత్సంబై శరప్రహారపతితతిమిరవినష్టవిలోకనగగనచరవిహగకులసంకులంబై కృత్తగాత్రసస్రుద్రుధిరపూరప్రశాంతధూళిపటలంబై ఘోరప్రకారం బయ్యె. అప్పటికి నుభయసైన్యంబులందు శూరు లేరును జలంబు డింపక యేట్లాడుచుండ శతానీకుండు రథికశతంబును, విశాలాక్షుండు రథికశతచతుష్టయంబునుం జంపి త్రిగర్తసేనం జొచ్చి కేశాకేశిరణము సేయుచుండ సూర్యదత్తమదిరాక్షులును వారికి బాసటయై నడచిరి. అంత మత్స్యేశ్వరుం డేనూఱురథముల నెనమన్నూఱుగుఱ్ఱములనుం జంపి మేపున మహారథులనుం జెండాడి భీమవిక్రమంబు మెఱయ వివిధచిత్రగతుల నరదంబుఁ బోనిచ్చుచుం ద్రిగర్తేశ్వరుండైన సుశర్మం దలపడి శరవర్షంబుఁ గురియిం

చిన నతండును శరవర్షంబుఁ బఱపించె. విరటుఁ డందులకుఁ గినిసి పదియమ్ములు వానిమేన నాటి వైదేసిబాణముల వానిగుఱ్ఱములఁ జదిపె. అట సుశర్మ విరటుపై నేఁబదిబాణము లేసి వేఱొక్క రథము నధిరోహించె. అంత గాఢాంధకారంబునను జరణసముత్థితరేణుపటలంబునను దను నెదిరింగానరానిచిమ్మచీకటిం జేసి చేయునది లేక యుభయసైనికులును సమరంబుఁ జాలించి కొంతసే పూరకుండిరి. అంతఁ గొంతవడికి సమరసన్నద్ధులై నరాజులయుత్సాహంబు కొలంతవడకుండఁ బ్రకాశంబుఁ గావింప దలంపుననోనాఁగఁ జంద్రుఁ డుదయించె. చీకట్లు పటాపంచలయ్యె. గగనంబు నిర్మలం బయ్యె. వెన్నెల నెఱసె. అటసంగరోత్సాహదోహలులై యుభయసైనికులు ఘోరంబుగఁ దాఁకి విక్రమంబుసూపుచుండ సుశర్మ తమ్ముఁడుం దాను రథసమూహంబుతో విరాటుం దలపడికొండొకవడికి గదాపాణులై రథావతరణంబుఁ జేసి గదఁ ద్రిప్పి వీరులఁ బెక్కండ్రం బొరివుచ్చి విరాటసైన్యంబుఁ జిందఱవందఱ గావించి యమ్మత్స్యపతిరథముఁగూల్చి విరథుం డైనవానిం బట్టి తనరథం బెక్కించికొని రయమునం బాఱుటయు విరాటసైనికులు త్రిగర్తపీడితులై నలుదెసలం బఱచిరి.

## పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట.

అట్టియెడ ధర్మరాజు భీమసేనుం బిలిచి మహాభుజా యిపు డూరకుండ రాదు. సుశర్మ నోడించి విరాటుని విడిపింపుము. మన మిన్నినాళు లీతనియింట సుఖముండినందులకు నియ్యది ప్రత్యుపకారం బగు. ఆలసింపక వారల వెంబడింజను మనిన విని భీముఁ డన్నమొగమునం జూడ్కి నిలిపి రాజేంద్రా, నీశాసనముమెయిఁ జేసెద. మదీయభుజబలంబును విక్రమంబునుంజూచుచు నీవు కవలున టుండుఁడు. ఈయెదుట నున్నమహావృక్షంబు గదవోలె నున్నది. దానిం బెకలించికొని శత్రుసేనం గవిసి వారల భంజించి తటిమి మత్స్యపతిం దెత్తు ననిపలికి యావృక్షముదెసఁ జూచుచు మత్తమాతంగలీల నెప్పుచున్న భీమసేనునకు ధర్మరాజు మఱియు నిట్లనియె. వృకోదరా, వృక్షములఁ బెకలించి తేని యందఱు నిన్ను భీముఁగా నెఱుంగుదురు. రహస్యభంగం బగుఁ గావున నయ్యమానుషకృత్యముల మాని లోకసాధారణంబులై నధనుర్బాణశక్తిఖడ్గాద్యాయుధములఁ బూని నకులసహదేవులు చక్రరక్షకులుగా రథారూఢుండై యుద్ధముఁ జేసి పగఱ గెలిచి విరాటు విడిపించికొనిర మ్మనిచెప్పిన విని భీముఁ డట్లయని యథోక్తప్రకారంబున రథస్థితుండై రయమునఁ జని త్రిగర్తసేనం గూడముట్టి ప్రావృట్పయోధరంబుకరణి శరజాలంబుఁ గురియించుచు సుశర్మం దాఁకి నిలునిలు మనియదల్చె. అయ్యదల్పు విని త్రిగర్తేశ్వరుండు కోపాటోపము పెలుచ నడరభాతృవర్గంబుతోడ మాఱువిల్లు గొని యమ్ము లేయం దొడంగుటయు భీమసే

నుండు విక్రమాటోపంబుఁ జూపుచు గదాపాణియై యనేకరథగజవాజిసహస్రంబులను బెక్కండ్రువీరభటులను గూల్చినం జూచి సుశర్మ నివ్వెఱపడి తనలోఁ బెక్కండ్రు సచ్చుటకుఁ జింతించి రోషాతిరేకంబునఁ గర్ణాంతాకృష్టం బయినధనుస్సున వాఁడినారసముల సంధించి యతివేగమున నేయుచుండె. అంత ధర్మజనకులసహదేవులును భీమునకు బాసటయై వచ్చుచుండ విరాటపుత్త్రుఁడైనశంఖుండు సేనకుఁ జేయి వీచి యందఱం బురికొల్పికొని త్రిగర్తసేనం గవిసిన నాసమరం బొక్కింతసేపు పరమాద్భుతం బయ్యె. అపుడు ధర్మరాజు యోధసహస్రంబును, భీముఁడు సప్తసహస్రవీరులను, నకులుఁడు సప్తశతశూరులను, సహదేవుఁడు త్రిశతభటులను జంపిరి. అంత ధర్మరాజు సుశర్మం దాఁకి బాణజాలంబుఁ బఱపించిన నతండు తొమ్మిదింట యుధిష్ఠిరు నేసి నాలుగేసితూపుల గుఱ్ఱములపై నేయుటయు శీఘ్రకారి యగువృకోదరుండు వానిగుఱ్ఱములఁ జదిపి పార్ష్ణిగ్రాహుల సమయించి సారథిం గూల్చుటయు విరాటచక్రరక్షకుఁడైనమదిరాక్షుఁడు విరథుఁడైనవానిపై శరజాలంబును బ్రయోగించి నొంచె. అట సుశర్మ తేరు డిగ్గనుఱికి పాఱుటయు విరాటుండు గదాపాణియై వృద్ధుఁ డయ్యుఁ దరుణునితెఱంగునఁ దఱుముచుండ భీమసేనుండు పేరెలుంగెత్తి సుశర్మం బిలిచి రాజపుత్త్రా, మఱలుము. పాఱరాదు. ఈశౌర్యము నమ్మి గోగణముల గ్రహింప నెట్లు వచ్చితివి? అనుచరుల విడిచి శత్త్రుమధ్యంబున విషణ్ణుండై పాఱుట రాజునకుఁ దగునే యని యధిక్షేపించిన నాత్రిగర్తేశ్వరుండు మఱలి నిలునిలు మని భీము నదల్చె. అదల్చుటయు భీముఁడు రథావతరణంబు చేసి వెండియుఁ బఱచుచున్నవాని సింహము క్షుద్రమృగము నెట్లట్లయొయిది సిగఁ బట్టి యీడ్చి నేలం బడఁ ద్రోచి కాలం దలఁ దన్ని పెడకేలు గట్టిన వాఁడు మూర్ఛితుం డయ్యె. అట్లు సుశర్మ నిగృహీతుం డగుటయుఁ దత్సైనికులు భయార్తులై నలుదెసలకుఁ బాఱిరి. ధర్మజాదులుం గోగణంబుల మఱలించిరి. అపుడు వాయుతనూజుఁ డందఱకు సుశర్మం జూపి యీపాపాత్ముఁడు జీవించిపోవుట నా కనభిమతం బేమి చేయుదు నని చెప్పి యాసుశర్మను దనతేరిపై నిడికొని రణాంగణమధ్యమున విరాటునితోడ నున్నధర్మరాజునకుఁ జూపిన నతండు నగుచు నీనరాధముని విడిపింపు మనవుడు భీమసేనుఁడు సుశర్మం బిలిచి మూఢా, జీవితేచ్ఛ గలదేని యెల్లచోట్ల దాసుఁడ నని చెప్పికొనుము. యుద్ధజితులకిది విధి యనిన యుధిష్ఠిరుండు తమ్మునిఁ జూచి వల్లవా, వీఁడు విరాటునకు దాసుఁ డయ్యె. మావచనంబు ప్రమాణమగునేని యీత్రిగర్తపతిని విడిపింపు మని చెప్పి సుశర్మం జూచి దాస్యముక్తుఁడవైతివి పొమ్ము. ఇఁక నెన్నఁడు నిట్టి పనులు చేయకు మనిబుద్ధి గఱపి యాతని విడిచిపుచ్చిన నతండు విరాటునకు మ్రొ

క్కి తల వాంచి చనియె. అప్పోరంబునం బాండవులు సుశర్మ నోడించి విరాటుని
విడిపించిన నమ్మత్స్యేశ్వరుండు సంతుష్టుండై యారాత్రి యచట వసించి యమా
నుషవిక్రము లయినపాండవులబహుమానముల సత్కరించి శూరశేఖరులారా,
మీపరాక్రమంబునం జేసి నేఁడు త్రిగర్తేశ్వరునకుఁ జిక్కక తప్పించికొంటి. నాకుఁ
గలరత్నధనాదులు రాజ్యమును మీయధీనంబులు. మీరే మత్స్యదేశముల కీశ్వరు
లరు. వలసినధనంబును మణులును నుత్తమకన్యకలనుం గ్రహింపుఁ డనిన ధర్మరా
జాదులు కృతాంజలులై యిట్లనిరి. రాజేంద్రా, నీవు శత్రువిముక్తుండవగుటయ
మాకుఁ జాలు. ప్రేమపూర్వకం బయిననీవచనమునకు సంతసం బయ్యె నని చెప్పిన
నంత నిలువక విరాటుఁడు ధర్మరాజుం జూచి యోకంకభట్టా, నానమస్కారములు
గ్రహింపుము. నిన్ను మత్స్యరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుం జేసి నాకుఁ గలయం
తయు నీ కొసంగి నీశాసనమున నడతు. రక్షించిననీ కింతకంటె నే నెయ్యది ప్రత్యు
పకారంబు సేయుదు ననివచించె. ఆమాటలు విని ధర్మరాజు మత్స్యపతీ, నీరా
జ్యంబు నాకు వలదు. ప్రేముడి గడలుకొనఁగ నంతమాట చెప్పుటయే నా కెంతయుఁ
బ్రీతికరం బయ్యె. ఆనృశంస్యపరుండవై యెల్లకాలము సుఖింపుము. వేగ దూతలఁ
బంపి వీట భవద్విజయంబుఁ జాటింపను, దివ్యవాద్యముల మ్రోయింపను, గణి
కాజనంబు లెదుర్కోలు గావింపను గన్యాజనంబులు శోభనాచారములం బ్రయో
గింపను నియోగింపు మనిన విరాటుఁ డట్ల చేయఁ దగుదూతలం బంపిన వారు
నామఱునాఁ డట్లచేయింపఁ బ్రోలు సొచ్చిరి.

కౌరవు లుత్తరగోగ్రహణంబుఁ జేయుట.

అంత మఱునాఁడు సూర్యోదయసమయంబున దుర్యోధనుండు భీష్మద్రో
ణకృపాశ్వత్థామకర్ణసౌబలదుశ్శాసనవివింశతివికర్ణచిత్రసేనదుర్ముఖదుస్సహాదులయి
నమహారథులతోడ బహుళసేనాపరివృతుండై యెత్తి వచ్చి విరాటనగరంబున
కుత్తరముగ ఘోషముల నాక్రమించి యఱువదివేలగోవులఁ బట్టి గోపాలురఁ
దన్నిన వారు వెఱచి యఱచిరి. అందులకు భయం బంది గోపాధ్యక్షుండు సత్వ
రంబుగ రథారూఢుండై మత్స్యరాజధాని కేతెంచి యారాజు త్రిగర్తేశ్వరుపై
నెత్తిచనుట నెఱింగి రాజద్వారమున రథము డిగి యంతఃపురమున నున్న భూమిం
జయుని విరాటుపుత్త్రు నుత్తరకుమారుం గాంచి కృతాంజలియై రాజపుత్త్రా,
కౌరవులు భీష్మద్రోణకృపాదు లగుమహారథులతోడ వచ్చి మనఘోషముల నాక్ర
మించి గోపాలుర నిగ్రహించి యఱువదివేలగోవుల గ్రహించికొని పోవ నున్న
వారు. మత్స్యేశ్వరుండు పేరోలగం బుండి సభాసదులు వినంగ నస్మత్పుత్త్రుం
డై నభూమింజయుండు శూరుఁడు కులోద్వహుఁడు ధనుర్విద్యావిశారదుఁడు నాకు
సమానుఁ డని ని న్నెల్లపుడుం బొగడుచుండు. రాజువచనంబు కనుగుణంబుగా

వార లెవ్వరును లేనియిట్టిసమయమున నీవు విక్రమించి సూర్యకిరణప్రచారంబు గలుగకుండ బాణముల నంతటఁ గప్పి భీకరం బై నతేజంబునఁ గౌరవసేన నేర్చి గోగణములు మఱల్పుము. శ్వేతతురంగయోజితంబు సింహకేతనవిలసితంబు నగు రథోత్తమం బారోహించి రాక్షససంహారోద్యతుం డై నసురేంద్రునిరీతిం బొలిచి పగఱ గెలిచి యశముఁ గొనిరమ్ము. పాండవులలో నర్జునుం డెట్లట్ల నీవు మత్స్య వీరులలో నగ్రగణ్యుండవు. దేశవాసు లందఱు నీవలనం గతిమంతు లగుతెఱం గుగా నేఁడు వాఁడిమి మెఱయ వలయు నని గోపాధ్యక్షుం డంతఃపురంబునం జెప్పిన నుత్తరుఁ డుబ్బి యాత్మప్రశంసాపరుండై యిట్లనియె. ఏ నీక్షణమ కౌరవు లపై నెత్తివచ్చెద నాకుఁ దగినయుత్తమసారథి నశ్వతత్త్వవేది నొక్కనిఁ జూడుఁ డు. తొల్లి మాసమాత్రంబు మహాయుద్ధం బైనప్పుడు నాసారథి హతుండయ్యె. తగినసారథి లభించెనేని యుత్తమరథంబున సింహధ్వజం బెత్తించి యతిత్వరితగతిం బఱచి కౌరవులం గూడముట్టి దేవేంద్రుఁడు దానవులఁబోలె భీష్మద్రోణకృపాశ్వ త్థామకర్ణాదు లగుమహారథులను దుర్యోధను నోడించి గోవులమఱల్చి ముహూ ర్తమాత్రమున మగిడి వచ్చువాఁడ. శూరుఁ డెవ్వఁడును లేమింజేసి వారు గోధ నం బాక్రమించిరి. ఏమి చేయవచ్చు. అపుడు నే నుంటినేనివారు గోగ్రహణంబు సేయ నోపుదురే? ఇంకఁ గడచినది విచారింప నేల? ఇపుడు వెంబడిం జని యితం డర్జునుఁ డొక్కొ యని సంభ్రమించి చూచునట్లుగాఁ గడిందిమగంటిమి నెఱపుదు నని యిట్లు పలుదెఱంగుల నుత్తరకుమారుఁ డాత్మప్రశంసఁ జేసికొనుచుండ నర్జు నుండు సమయాబ్దంబులు నిన్నటితోఁ గడచనియె. నింక బయల్పడవచ్చు నని తనలో నూహించి సత్యార్జవాదిగుణసమన్వితయుఁ బతిప్రియహితరతయు నయో నిజయు నగ్ని వేదీసముద్భూతయు నగుపాంచాలరాజపుత్రి నేకాంతంబునం బిలిచి యిట్లనియె. ఉత్తరుఁడు సారథిని వెదకుచున్నవాఁడుగదా. బృహన్నళ లెస్సగ సారథ్యంబు సేయ నోపు ననియు, ఖాండవదహనమున నర్జునునకు సారథియై యతనికి విజయం బాపాదించె ననియుఁ జెప్పి నన్ను సారథిగాఁ గొనిపోవునట్లు సంవిధానంబుఁ జేయు మనిచెప్పఁగ ద్రౌపది నారీమధ్యమునఁ దన్నుఁ బొగడి కొన్నవానికి విజయుండు సారథి యగుటకుమనసు గొలుపకుండిన నుపాయంబునఁ గార్యము నెఱవేర్చుట ప్రధానం బనినిశ్చయించి లజ్జితయుంబోలె మెల్లన వానిఁ జేరం జని యిట్లనియె. రాజనందనా, మత్తశుండాలంబుచాడ్పునఁ బ్రియదర్శ నుండై తారుణ్యంబున నుల్లసిల్లుమనబృహన్నళ సారథ్యం బెంతయు నేర్చు. అస్త్రవిద్యాచాతుర్యంబున నర్జునుండే యనఁ బరఁగి యమ్మేటివిలుకాని కెన్నియే మాఱులు సారథ్యంబుఁ జేయుచుండఁగ నేఁ జూచితి. ఫాల్గునుండు ఖాండవం బేర్చునపు డీబృహన్నళయే సారథియై యవ్వీరునకు విజయం బాపాదించె. అట్టి

సారథిని నే నెచ్చోటనుం గానను. తత్సారథ్యమున నీవును విజయంబుఁ గొను మనిపలికిన విని యుత్తరుండు సైరంధ్రి పేడి సారథ్యము సేయు ననుట యొప్పునే? ఐనను నీవు చెప్పుటం జేసి బృహన్నళను సారథిగా గ్రహింతు. నాకు సారథి వగు మని నేన యాపేడితో నెట్లు చెప్పుదు నని మాఱుపలికినం బాంచాలి వెండియు నతని కిట్లనియె. కుమారా, నీవు తచ్చాతుర్యం బెఱుంగమిం జేసి యిట్లు పల్కుదువు. బృహన్నళ సారథి యైన నీవు కౌరవుల గెలిచి యవశ్యము గోగణంబు మఱలించి వచ్చుట నిక్కంబు. బృహన్నళతో నీయర్థముఁ జెప్పఁగ నీచెలియ లగునుత్తరం బంపుము. తద్వచనంబు దెస నాదరంబు కలిమిం జేసి బృహన్నళ భవత్సారథ్యం బియ్యకొను ననిన నట్ల యని యుత్తరుం డుత్తరం బిలిచి యమ్మా, బృహన్నళ సారథ్యం బెంతయు నేర్చు ననియు నర్జునునకు ఖాండవదాహమున సారథియై జయం బాపాదించె ననియు సైరంధ్రి చెప్పె. కావున నీవు బృహన్నళ యొద్దకుఁ బోయి యిపుడు నాకు సారథిగా నొడంబఱిచి తోడికొని రమ్మని పనిచె.

ఉత్తరుఁడు బృహన్నలను సారథిఁగాఁ జేసికొని కౌరవులపై నెత్తిచనుట.

పనిచిన నత్తన్వి మయూరపింఛమౌక్తికహారాద్యలంకారకాంతులఁ గపిలం బైన నెమ్మేని మెఱుఁగు తెరువున కొకవింత కాంతిఁ బచరింపఁ జన్నుఁగవ వ్రేఁగున నసదుకౌను వడఁకఁ బృథునితంబోరుభారము గమనమాంద్యముఁ బొందుపఱుప మణిమేఖలాకింకిణీమృదురవంబు సొంపుపెంపార నంబుదమండలంబుఁ దఱియం జొచ్చు క్రొక్కాఱుమెఱుంగు తెఱంగున నర్తనాగారంబున కరిగి మదగజేంద్రంబుఁ జేర నరుగు కరేణువుచాడ్పున నర్జును డాయం జని తామరఱేకులంబోని కన్నులఁ గటాక్షించి యతనిఁ గనుంగొనుచున్నంత నతండు నగుచు విరాటరాజపుత్త్రీ, యేల యిపుడు వేగంబ వచ్చితివి? నీమొగంబుఁ గనుంగొనఁ గార్యవిశేషంబునం జేసి కాఁబోలు నెప్పటియట్ల ప్రసన్నంబుగాకున్నది. ఎయ్యది కర్తవ్యంబు చెప్పు మనియడుగఁ బ్రేముడి గడలుకొనఁగ సఖీమధ్యమున నాసుదతి యిట్లనియె. మా గోగణంబులఁ గౌరవులు నిగ్రహించి పట్టికొని రని కూయి వచ్చిన విని మాయన్న యగునుత్తరుం డెత్తిచని వారల గెలిచి గోగణంబుల మఱల్చిరాఁ దలంచి తనసారథి మున్నొకసంగరంబున హతుఁడగుటం జేసి తగినసారథి నరయుచుండ సైరంధ్రి వచ్చి నీవు హయతత్త్వంబు లెస్స యెఱింగి సారథ్యంబుఁ జేయ నోపుదు వనియు, బాండవవీరుం డైనయర్జునునకుఁ దొల్లి సారథివై దెప్పరంబుల విజయం బాపాదించితి వనియు, నీవుసారథి వైనం గౌరవుల గెలుచుట చులుకన యనియుం జెప్పె. సైరంధ్రివచనము విని మాయన్న నన్నుఁ బిలిచి నిన్ను సారథ్యమున కియ్యకొల్పు మనివచించిన నేను నీయెడ నొకించుకచనువు కలిమిం జేసి యట్లు యనివచ్చితి. కౌరవు లింతకుఁ బసుల నెంతయు దవ్వు గొనిపోయి యుండుదురు.

ఆలసింపక మాయన్నకు సారథివై యరుగుము. నామాట వినక యొప్పరికించి చూచెదవేని జీవితముఁ ద్యజింతు ననిచెప్పిన నుత్తరావచనంబు విని యర్జునుండు దానిమాట త్రోచిపుచ్చనివానిపోలె నియ్యకొనినయట్లు భావించి యారాజపుత్రి తోడరాఁగ నుత్తరునెద్దకుఁ జనియె. అతం డర్జును దవ్వనం గాంచి బృహన్నళా, ధనంజయుండు తొల్లి నీవు సారథి గాఁగ ఖాండవదహనంబును దిగ్విజయంబునుం జేసి జయంబుఁ గొనియె నని సైరంధ్రి వచించె. పాండవులనెల్ల లెస్సగ నెఱింగిన సైరంధ్రిమాట యసత్యంబు గాదు. గోధనము మఱల్పఁగఁ గౌరవులతోడఁ బోరాడఁ జనునాకు సారథి వగు మనిపలికిన విని యర్జునుఁడు గీతవాద్రిత్రనృత్యం బులచాతుర్యంబు నేర్చినకొలంది చూపుదునుగాని నే నెక్కడ? సంగ్రామం బెక్కడ? సారథ్యం బెక్కడ? న న్నిట్టిపనుల నియోగించిన నే మనవచ్చు నని మాఱు చెప్పె. ఉత్తరుఁ డామాటల నాదరింపక బృహన్నళా, నీవే నాకు సార థ్యంబుఁ జేయవలయు. నీచాతుర్యంబు గీతవాద్రిత్రాదులనెక్కుడుగ నున్నయట్లు సారథ్యంబునందు నుండు నని తలంచెద. ఇఁక నడ్డముచెప్పవల దని నిర్బంధించి శీఘ్రింబు తే రాయితపఱిచి తె మ్మనిచెప్పి కవచం బొక్కటి తెప్పించి యిచ్చు టయు నర్జునుం డుత్తరుం జూచి రాజనందనా, మీప్రాపున నునికిం జేసి మీయా నతిమెయి నడవవలయుం గావునఁ బూనితి ననిచెప్పి యేమియుం దెలియని వాని పోలె నాకవచంబు మీఁది కెత్తి యఱుతం దగిలించికొని యచటియబలాజనంబుల నగిపించి యట సింహధ్వజం బెత్తి తేరు సవరించివివిధాయుధముల నం దమర్చి తెచ్చె. అంతలో నుత్తరుండు దృఢతనుత్రాణంబుధరించి యుద్ధసన్నద్ధుండై రథా రోహణంబు సేయ నున్నంత నుత్తర మున్నుగాఁగల కన్యాజనంబు లర్జును జేర వచ్చి బృహన్నళా, భీష్మద్రోణాదు లగుకౌరవవీరుల జయించి వారితలచీరల బొమ్మపొత్తికలకుఁగాఁ దెచ్చి యిచ్చి మాకు మనఃప్రియంబుఁ గావింపు మనియడి గిన నవ్వుచు నర్జునుండు మేఘగంభీరనినాదం బేర్పడ నుత్తరకుమారుఁడు పోరఁ గౌరవుల జయించినం దెత్తు నని యొడంబడి వారికి మనఃప్రియంబు నొనరించి యుత్తరుననుమతిఁ గొని రథంబుఁ దోలుటయు నంతఃపురకన్యకాజనంబులు పౌర పురంధ్రులుం బ్రదక్షిణంబుగా నెదురువచ్చి యర్జునునకు ఖాండవదహనాదిసమ యంబుల నాపాదించినవిజయంబు నేఁడు కౌరవులతోడికయ్యంబున నుత్తరునకు బృహన్నళ కావించుత మని దీవించిరి. అట్లు తఱలిపురంబు వెడలి యుత్తరుండు సారథిం బిలిచి బృహన్నళా, రయమున మనరథముఁబఱపు మనిన వల్లెయని యర్జు నుండు గోపాధ్యక్షునివలనఁ గౌరవసేన యున్నచో టెఱింగి గుఱ్ఱములఁ దోలుటయు నయ్యవి యర్జునచోదితంబులై యంతరిక్షంబు నొరయురీతిం బలుమాఱులు పూర్వ కాయంబు లెగయించుచు నతిరయంబునం బఱచి పరేతనిలయపరిసరప్రదేశం

బునం బాండవు లాయుధములు నిక్షేపించినశమీవృక్షంబు డాయం జనుటయు ను త్తరుండు గగనంబునం జరించునానాపాదపసంకీర్ణారణ్యంబుచాడ్పున సైనికచరణ ఘట్టన సముత్థితధూళీపటలం బెగసి తారాపథంబున నతిసాంద్రంబయి యెసంగ సర్వభూతములకు దృష్టిప్రతిఘాతంబుఁ గావించుచున్న కౌరవసైన్యంబును బహుళ గజరథహయపదాతిసంకులంబై నదాని భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణ దుర్యోధన ప్రముఖ ధనుర్ధరశేఖరసురక్షితంబై నదాని, సాగరంబువోలె ఘూర్ణిల్లుచున్న దానిం గనుంగొని భయాతిశయపులకితశరీరుండై పార్థున కిట్లనియె.

### ఉత్తరుఁడు కురుసేనం జూచి భయభ్రాంతుఁ డగుట.

బృహన్నలా, కౌరవసేనం జూడఁగ మేను భయమున గరుపాఱె. కురువీరులతోడఁ బోరాట నాకు వలదు. దేవతలకైనం జెనకరాని చతురంగబలసమన్వితం బయినభారతసైన్యంబు మార్కొన నే నెంతవాఁడను? భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణవికర్ణబాహ్లీకసోమదత్తదుర్యోధనదుశ్శాసనాదు లగుమేటిమగలం జూచినప్పుడే నామనంబు కలగుండువడియె. మాతండ్రి త్రిగర్తయోధులతోడఁ బోరాడఁగ సైన్య మంతయుం గొని నన్నొకని వీట నునిచిపోయె. అసహాయుఁడ, బాలుఁడ, నకృతాస్త్రుఁడ, నకృతపరిశ్రముఁడ నగు నే నెక్కడ? అనేకు, లబాలురు, శస్త్రాస్త్రవిద్యావిశారదులు, సంగరంబుల మేటిబిరుదుల గెలిచి యశము గొనినశూరులు నగుకౌరవవీరు లెక్కడ? రథంబు మఱలింపు మనిన నర్జునుండు వాని కిట్లనియె. రాజపుత్రా, శత్రుజనులు సంతసించునట్లుగా నీ విట్లు వెఱువ నేల? ఇప్పటికి శత్రువు లేమియుం జేయరైరి. ఇప్పుడేయిట్లు భయపడిన నీక నెట్లు వారల నోర్తువు? స్త్రీమధ్యమున నట్లు పౌరుషంబు నెఱయఁ బలికి నన్ను సారథిగా రమ్మని పిలిచికొనివచ్చి శత్రువులం జూచినంతన వెఱచి పాఱిన నాడువారును నవ్వుదురు. ఇఁక వీరులం జెప్పనేల? కావున గోవుల మఱలింపక యూరక పురంబునకుఁ బోవుట నా కెంతయు నొప్పదు. ఆమిషలోలుపంబు లయినగృధ్రములవిధమున గోధనలోలుపులై నకురువీరులమధ్యమున నీరథముఁ బఱపించెద. వారిధ్వజములకు వెఱవక శూరుండవై పోరాడుము. నీవు పోరాడకున్న సైరంధ్రీస్తోత్రంబుననుభవద్వచనంబునను వచ్చిననేనైనం గడిందిమగంటిమిఁ దెచ్చికొని కౌరవులతోడఁ బోరాడుదు. ధైర్యమున స్థైర్యం బవలంబింపు మనిపలికిన నుత్తరుండు కౌరవులు గోవుల నితరధనము నాక్రమించికొనిపోయినం బోవుదురుగాక. ఆఁడువారలు సైతము నన్నుఁ జూచినగిన నగుదురుగాక. నే నీసంగరంబున నిలువ నోపను. ఊరికిఁ బోయి ప్రాణముల రక్షించికొనియెద నని చెప్పి పరిత్యక్తమానదర్పుండై విల్లమ్ముల విడిచి తేరు డిగ్గ నుఱికిపాఱె. పాఱుటయు నర్జునుండు కుమారా, క్షత్రియులకియ్యది యనుచితంబు. యుద్ధమునఁ బలాయనము సేయుటకంటెఁ జావై

నను మేలు. మఱలు మని చెప్పుచుఁ దానును రథావతరణంబు చేసి దీర్ఘవేణి వీఁపున వ్రేలుచుండఁగ శుక్లపరిధానంబులు చలించుచుండఁగఁ బలాయనపరుం డైన యుత్తరకుమారుం గూడముట్టి నూఱడుగులంత దవ్వు పఱచి వాని నెయిది యాయత బాహువులఁ జాఁచి శిఖాకలాపంబుఁ బట్టి నిలిపె. అర్జునుఁ డుత్తరు వెంబడిం బాఱునపుడు కురుసైనికులు కొంద ఱతని వికృతరూపంబుఁ జూచి తత్త్వం బెఱుంగక నగుచుండఁ దత్త్వవిదులైన కొందఱు వాని లెస్స చూచి యెవ్వఁడో యితఁడు నివుఱు గప్పిన నిప్పుచాడ్పున నిజస్వరూపంబు డాఁచికొని యున్నవాఁడు. స్త్రీపుంసలక్షణంబులు రెండును వీని యెడం గన్పట్టుచున్నవి. ఉత్తమాంగంబుఁ గంఠంబుఁ బరిఘప్రాంశువులయిన బాహువులను నడకనుం జూచిన నర్జునుఁడుగా నోపు నని యూహ వొడము. అతండు షండరూపంబుఁ దాల్పఁ గతం బెద్దియో యెఱుంగరాదు. మఱియు లెస్స పరిశీలించిన నితండు ధనంజయుండని తోఁచు. అతఁ డొక్కఁడ కదా సురరలో నింద్రుని మాడ్కి మనుజులలో నుత్తముఁడు. అవ్వీరుఁడు గాక మఱి యొక్కరుండగునేని యోట దక్కి యసహాయుండై మనల మార్కొని రాఁ జాలునె? సుశర్మ దక్షిణగోగ్రహణముఁ జేయఁగ విరాటుఁడు తన సకలసైన్యముతోడ నాత్రిగర్తపతిని మార్కొనఁ జనియుండు. మనము నేఁడిచ్చటఁ బసులం బట్టిన నుత్తరుండు బాలభావంబునం జేసి యెఱుంగక వేషప్రచ్ఛన్నుండైన పార్థుని సారథిఁగాఁ గొని యిచ్చటికి వచ్చినవాఁడు. మత్స్యదేశసుగుణంబుల నరసి పాండవులు విరాటుని ప్రోల నున్నవా రని యూహించితిమి కదా. వార లచ్చటనే గూఢముగ నుండుదురు. ఇపుడు పెద్దయు దెప్పరంబు పొసంగుటం జేసి యర్జునుండు వచ్చినవాఁడు. ఉత్తరుఁడును మనలఁ జూచి వెఱచి పఱచినం గిరీటి వానిం బట్టికొనుచున్నవాఁడు. ఇది యిట్లకా నోపు నని తమలో నిశ్చయించుచుండిరి. అట్లుత్తరుం డర్జునుచేఁ బట్టువడి యార్తుండై బృహన్నళా, నామాట విని తేరు మగిడింపుము. బ్రదికియుండినం గాలక్రమంబున శుభములఁ బడయవచ్చుఁ గావునఁ బ్రాణరక్షణం బన్నింటికంటె నుత్తమంబు. తేరు మగిడించి నన్ను వీటికిఁ దోడ్కొనిపోయితివేని నీకు నూఱు పసిండి గద్యాణంబులను, స్వర్ణఖచితంబులయిన యెనిమిది వైడూర్యములను, గాంచనస్తంభపరిష్కృతం బయిన రథమును, బదిమదపుటేనుంగులను సమ్మానంబుగా నిచ్చెద నని వెఱపునం దాఱుమాఱు పలుకుచుఁ బలవించుచున్న యుత్తరకుమారుని నవ్వుచు మెల్లన రథసమీపమునకుఁ దోడి తెచ్చి యుపలాలించి రాజపుత్త్రా, వెఱపు విడువుము. నీవు కౌరవుల మార్కొనఁ జాలవేని యేను గడిమి మెఱయ వారలతోడఁ బోరాడెద. మద్బాహుబలరక్షితుండవై నాకు సారథ్యంబుఁ జేయుము. క్షత్రియకులప్రసూతుం డైనవాఁడోట దక్కి యోపినంత పెనంగవలయుఁ గాని నీయట్లు శత్రులు చూచుచుండ

వెఱచి పాఱిపోవం దగునే? యని పలుదెఱంగుల నాశ్వాసించి క్రమ్మఱ రథము నెక్కించి తానును రథారోహణంబుఁ జేసె.

అంత నక్కడ కురుసైన్యంబున నున్నమహారథు లుత్తరకుమారుఁ దేర క్కించి రథస్థుండై యున్నయవ్వికృతరూపుని ధనంజయుఁగా నూహించి సంభ్రాంతచిత్తులై యుండఁగ నాచార్యుఁడు వారలయుత్సాహప్రతిఘాతంబు నుత్పాతంబులనుం బరికించి యిట్లనియె. ప్రచండవాయువులు పలుగుఱాల ఱువ్వుచున్నవి. భస్మవర్ణం బయినచీఁకటి యాకసంబుఁ గప్పె. జలదంబులు రూక్షవర్ణంబులై యద్భుతముగ నగపడుచున్నవి. ఖడ్గాద్యాయుధము లప్రయత్నముగ నొఱలనుండి జాఱుచున్నవి. వఱడులు సూర్యుఁ డున్నదెస నుపలక్షించి పెలుచ నఱచుచున్నవి. గుఱ్ఱములు కన్నీరు నించుచున్నవి. కేతనంబులు కదలింపకున్నం గదలుచున్నవి. ఈయుత్పాతంబులం జూచిన నవశ్యంబు భయ మాసన్నం బైన తెఱంగు దోఁచెడి. అందఱు ప్రయత్నపరులై సంగరోత్సాహంబు దోహలంబుగాఁగ వాహినుల నిభృతవ్యూహముల నిలుపవలయు. గోధనము లితరు లాక్రమింపకుండఁగ రక్షింపవలయు నని చెప్పి కురుపితామహుదెస మొగంబై యావచ్చుచున్నక్లీబవేషధరుఁ డయినమేటివిలుకాఁడు నిక్కంబ యర్జునుండే. కపికేతనుం డైనయాకిరీటి ధుర్యోధనుం గెలిచిగోగణముల మగిడించిపోవుఁ గాన రాజుం జిక్కకుండఁగరక్షింపుము. ఆవిక్రమఘనుండు సురాసురు లడ్డపడివచ్చినను దురంబు సలుపక పోవఁడు. ఇన్నియేండ్లడవుల నిడుమలఁ బడి యమర్షవశుం డైనయతండు కౌరవుల నేలకుఁగోలకుందే కయూరక పోవునే? మనసేనలో వానిం జక్కమార్కొనిపోరువాఁ డొక్కరుఁడుం గన్పట్టఁడు. హిమవత్పర్వతంబునం గిరాతరూపప్రచ్ఛన్నుం డైనమహాదేవుని రణమున నొప్పించినయాతనితోడం బోరాట యెంతబలవంతునకైనను డెప్పరంబు గాకుండునే? మఱియు నిప్పు డతండు దేవతలవలన దివ్యాస్త్రముల సాధించినవాఁడఁట. ఇఁకఁ జెప్పనేల? తగురీతి నాలోచింపవలయు ననుచున్నంతఁ గర్ణుఁ డాచార్యుం జూచి మీర లెప్పు డిట్లే యర్జునుగుణంబుల నుగ్గడించుచు మమ్ము వారికంటె నసదులఁగాఁ జూతురు. ఆరయఁగా నతండు నాకును మనరాజునకుం బదునాఱవపాలివాఁ డగునే? యనిపలికె. అపుడు దుర్యోధనుఁడు కర్ణుం జూచి రాధేయా, యింతేల? వచ్చినవాఁడు పార్థుండ యగునేని మనకార్యంబు నెఱవేఱె. అజ్ఞాతవాసనియమమున నున్నపుడు విజ్ఞాతులైనం గ్రమ్మఱఁ బండ్రెండేండ్లు వనవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబును సల్పునట్లు వారు సంకేతించిరి గదా. అర్జునుండుగాఁ గొండొకం డగునేని నిశితశరజాలంబుల గుప్పించి కూల్చెద నని చెప్పిన నందఱు నగుఁగాక జూత మని యామాట నాదరించిరి.

## అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తంబు లైనయాయుధముల గ్రహించుట.

ఇట నర్జునుండు మున్ను దాముకైదువు లుంచినజమ్మిం జేరం జని యుత్తరుం బిలిచి కుమారా, నీయాయుధములు శత్రుసంహారోద్యతుం డైననాలావునకుం జాలవు. ఈశమీవృక్షంబునందుం బాండవులుతమవిండులు, తూపులు, మైమఱువుల్లు, ఒక్కెములు మున్నగాంగలసాధనము లునిచినవారు. అందుం గిరీటిగాండీవం బున్నయది. అది శతసహస్రధనుర్వరముల కైన యగునది. ఉపమర్దక్షమంబు, శత్రుసంహారకారకంబు, సువర్ణచిత్రితం, బత్యంతాయతంబు, క్షతివిరహితంబు, దారుణంబయ్యుం జారుదర్శనంబు నగునాధనుర్వరంబునాచేతిలావునకోర్చు. దానిం దెచ్చి యిమ్ము. అందే యుధిష్ఠిరభీమనకులసహదేవులయాయుధములునున్నయవి యనిన నుత్తరుం డర్జునుం జూచి బృహన్నళా, యిందు మృతకళేబరంబు నిక్షిప్తం బయ్యె నని వినియుందు. దాని నెట్లు తాంకుదు. రాజపుత్రుండు మంత్రవ్రతవిదుండు నగున న్నీచకృత్యంబునకుం బనుపం దగునే? శవస్పర్శము నాయట్టివాండు చేయం జనునే? యనిపలికె. అంతం బాండవమధ్యముండు వాని నాశ్వాసించి కుమారా, నీకు నీచకృత్యంబుం జెప్పుదునే? శవాకారం బైనయయ్యది కైదువులముడియగాని నిక్కంబ పీనుంగు గాదు. వెఱవక జమ్మి నెక్కి యాయుధసంచయంబు క్రిందికిం దెచ్చి బంధనముల విప్పి పరివేష్టనంబు లెడలించి గాండివం బెత్తియి మ్మని యెత్తిచెప్పినం గిరీటిమాటం ద్రోచిపుచ్చంజాలక వైరాటి యట్లయని రథము డిగ్గి శమీవృక్షం బారోహించియాయుధసంచయబంధనంబులు విప్పి పరివేష్టనంబు లెడలించి పెనుబాములపోలిక నున్న గాండివాదు లగువిండుల నైదింటిం గాంచి యుదయమానభానుప్రముఖగ్రహతేజముం బోలినతత్తేజంబునకు వెఱంగుపడి భయాతిశయజనితరోమాంచనిబిడగాత్రుండై యర్జునున కిట్లనియె. బృహన్నళా, సహస్రకోటిసువర్ణచిత్రిచిత్రితంబు లైన నూఱుకాంచనబిందుచిత్రంబులు గలయీవిల్లు పాండవులలో నెవ్వండు దాల్చు? వెనుకటిదెసం గనకకవచచిత్రంబుల సొంపారుచు సుపార్శ్వంబు సులస్తకంబు నగునీధనుస్సు నెవ్వనియది? కాంచనఖచితం బైనపృష్ఠభాగమున నింద్రగోపచిత్రంబులం జెన్నారుచున్నయీకార్ముకం బెవ్వనియది? సౌవర్ణసూర్యత్రయచిత్రవిచిత్రితం బైనయీచాపం బెవ్వనియది? తపనీయశలభవిచిత్రంబై మణిప్రస్ఫురితం బైనయీశరాసనం బెవ్వనియది? కడానికొనల వెలసి యీంకల నంతటం బెంపారి హిరణ్మయతూణీరముల నున్నయీసహస్రబాణము లెవ్వనియవి? అత్యంతదీర్ఘము లర్ధచంద్రాగ్రములు నగునీయేడునూఱుబాణము లెవ్వనియవి? గృధ్రపత్రపరివృతంబులు శిలానిశితంబులు సర్వాయసములయ్యు హారిద్రవర్ణములు విషమంబులు పంచవ్యాఘ్రచిత్రలక్షితంబులు వరాహకర్ణవ్యామిశ్రములు నగునీ

మార్గణములగణం బెవ్వనియది? చిలుకతెక్కలవన్నె కెనవచ్చువన్నె నలరుపూర్వార్ధంబులు నాయసంబులయ్యుఁ బీతంబు లయినయుత్తరార్ధంబులు హేమపుంఖము లుం గలయీశరము లెవ్వనియవి? నిశితములు పీతవర్ణములు హేమపుంఖములు త్రిపర్వములు నగునీవిశిఖము లెవ్వనియవి? శత్రుభయంకరమును గురుభారసహంబును మొనను వెనుకను శిలీవిలసితంబును దీర్ఘము నగునీసాయకం బెవ్వనియది? కడానిపిడియుఁ గింకిణులుం గలిగి వ్యాఘ్రచర్మనిర్మితం బైనయొఱలో నున్నయీ ఖడ్గ మెవ్వనియది? నిశితాగ్రంబు చిత్రహేమకోశంబు కనకముష్టియుం గలయీ నిస్త్రింశం బెవ్వనియది? ప్రమాణరూపసంపన్నంబు హిరణ్మయంబు పీతంబు నిర్మలంబు గోధాచర్మనిర్మితకోశనిక్షిప్తంబు నగునీఖడ్గ మెవ్వనియది? సువర్ణమయముష్టివిలసితంబు నిషధదేశప్రసిద్ధం బప్రధృష్యంబు గవాజినకోశనిక్షిప్తంబు నగునీకృపాణం బెవ్వనియది? నీలవర్ణంబు హేమబిందుచిత్రనిచితం బాశీవిషసమస్పర్శంబు పరకాయప్రభేదనచణంబు గురుభారసహంబు శత్రుభీకరంబు నగునీఖడ్గ మెవ్వనియది? యని మఱియు ననేకాయుధములలక్షణంబుల వేఱువేఱ నిరూపించి యడుగ భూమింజయునకు ధనంజయుం డిట్లనియె. రాజపుత్రా, నీవు తొలుత నడిగినకార్ముకంబే గాండివంబు. దానిచే నర్జునుండు దేవాసురమనుష్యాదులం జయించు. తొల్లి యీశరాసనంబు బ్రహ్మదేవుఁడు వర్షసహస్రంబును బ్రజాపతి త్ర్యుత్తరపంచశతాబ్దంబులు శక్రుఁడు పంచాశీతివత్సరంబులు సోముఁడు పంచశతసంవత్సరంబులు వరుణుఁడు శతహాయనంబులును ధరించె. వరుణునివలన నగ్ని గ్రహించి ఖాండవం బేర్చినపుడు సంతృప్తుండై యర్జునున కిచ్చె. అతండు నఱువదేనేండ్లు ధరింపఁగలవాఁడు. సుపార్శ్వం బైనయాధనుస్సు భీమసేనుఁడు ధరించు. దానిచే నతండు తూర్పుదిక్కు జయించె. ఇంద్రగోపికచిత్రం బైనయాశరాసనంబు ధర్మజునియది. సౌవర్ణసూర్యచిత్రవిలసితం బయినయావిల్లు నకులునియది. కాంచనశలభవిలసితం బైనయాచాపంబు సహదేవునియది. కడానికొనల నలరి యీఁకల నంతటఁ బెంపారి హిరణ్మయతూణీరముల నున్నయాసహస్రబాణము లర్జునునియవి. ఆదొనలలో బాణము లెప్పుడు వరప్రభావంబునంజేసి యక్షయ్యంబులై పెరుగుచుండు. ఆయర్ధచంద్రాకారాగ్రంబు లైననారసములు భీమునియవి. హారిద్రవర్ణములు పంచశార్దూలలక్షణలక్షితంబులు నగునామార్గణంబులు నకులునియవి. ఆమార్గణగణమున నతండు ప్రతీచిం గెలిచె. పూర్వార్ధంబున శుక్లవర్ణంబును త్తరార్ధమున హారిద్రవర్ణంబునుం గలిగి చిత్రాకారంబు లైనయావిశిఖంబులు సహదేవునియవి. హేమపుంఖంబులు త్రిపర్వంబులు నగునాతూపులు ధర్మజునియవి. శిలీపృష్ఠం బైనయాదీర్ఘసాయకంబు నర్జునుఁడు ధరించు. వైయాఘ్రకోశనిక్షిప్తం బయినయాఖడ్గము భీమునియది. చిత్రకోశంబు హేమత్సరునిర్మితంబు

నగునాకృపాణంబు ధర్మజునియది. గోధాచర్మనిర్మితకోశనిక్షిప్తం బయినయాని స్త్రింశంబు నకులునియది. గవాజినకోశగుప్తం బైనయాయసివరంబు సహదేవుని యది. హేమబిందువిలసితం బయినయాకృపాణం బర్జునునియది యని యిట్లుతం డడిగినవాని కన్నింటికి వేఱువేఱుగా నడియాలములతో వివరించి చెప్పిన విని యుత్తరుండు పాండవు లీయాయుధములనెల్ల నిచట నిక్షేపించి యెచ్చట నిడుమలఁ బడుచున్నవారో? శత్రుమర్దనులయ్యు వారు దుర్ద్యూత మాడుటంజేసి యిన్ని చేటులపాలైరి. పరమపతివ్రత యైనపాంచాలియు వారి ననుగమించి యడవులకుఁ జనియె. ఆక్లేశం బెట్టు లోర్చెనో? ఇపుడు వా రెచ్చట నజ్ఞాతచర్య నడపుచున్నవారో? యని పాండవులం దలంచుకొని పరివేదనం బడుచున్న వైరాటికిఁ గిరీటి యిట్లనియె.

అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱింగించుట.

కుమారా, పాండవులుపాంచాలీసహితంబుగా వనములఁబండ్రెండేండ్లుగడపి యజ్ఞాతవాసనియమము నడప మీరాజధానిం గూఢవృత్తి నున్నవారు. ఇఁక డాఁపనేల? నే నర్జునుఁడను, కంకుఁడు ధర్మరాజు, వల్లవుఁడు భీమసేనుఁడు, దామగ్రంథి నకులుఁడు, తంత్రీపాలుఁడు సహదేవుఁడు, సైరంధ్రి ద్రౌపది, దానినిమిత్తంబ కాదె భీముఁడు గంధర్వులను నెపమునఁ గీచకులఁ జంపె ననిన విని యుత్తరుండు విస్మితచిత్తుండై సారథీనీవు నిక్కంబ యర్జునుండవేని యతనికిఁ బదిపేళ్లు గలవు వానిం జెప్పిన నీమాట నమ్ముదు ననుటయుఁ గిరీటి వైరాటిం జూచి కుమారా, యర్జునుఁడు, ఫాల్గునుఁడు, జిష్ణుఁడు, కిరీటి, శ్వేతవాహనుఁడు, బీభత్సుఁడు, విజయుఁడు, కృష్ణుఁడు, సవ్యసాచి, ధనంజయుఁడు నన నాకుఁ బదిపేళ్లు గల వనిస నుత్తరుఁ డయ్యా, యమ్మహాత్మున కీనామంబులు గలుగఁ గారణంబుఁ జెప్పిన నిన్ను నమ్ముదు ననియడుగుటయు నర్జునుఁ డతని కిట్లనియె. ఏను సకలదేశముల జయించి ధనముఁ దెచ్చి ధనమధ్యమున నుండుటంజేసి ధనంజయాహ్వయుఁడనైతి. సమరమున దుర్మదు లగురాజులనెల్ల జయించుటంజేసి విజయనాముఁడనైతి. నారథమున కుత్తమశ్వేతాశ్వములు పూన్చుటంజేసి శ్వేతవాహనుఁ డనఁ బరఁగితి. ఉత్తరఫల్గునీనక్షత్ర విశిష్టకాలమున జనించుటంజేసి ఫాల్గునాభిధానుండనైతి! సురలకు నజేయులైనరాక్షసుల నేను గెలుచుటకు మెచ్చి యింద్రుఁడు సూర్యసన్నిభం బయినకిరీటం బొసంగుటంజేసి కిరీటినాఁ బరఁగితి. యుద్ధమున శత్రులు బీభత్సంబుఁ జెందునట్లు విక్రమించుటంజేసి బీభత్సునామధేయుండనైతి. సవ్యదక్షిణహస్తముల గాండీవమునందు బాణముల సంధించి యేయఁజాలుటం జేసి సవ్యసాచి యనంబడితి. భూమండలమున నెచ్చట నెవ్వరికిని దుర్లభం బయిన యవదాతకాంతియుఁ బరిశుద్ధకర్మాచరణంబునుం గలిగియుండుటంజేసి యర్జునా

ఖ్యుఁడ నైతి. దేవేంద్రునకుఁ బుత్రుఁడనై యపారవిక్రమాటోపంబున వైరుల జయించుటంజేసి జిష్ణునామమున నెగడితి. మాతండ్రి కృష్ణుఁ డనుపేరు పెట్టుటంజేసి కృష్ణాహ్వయమున నెసఁగితినని తెలియఁ జెప్పిన విని విరాటపుత్రుండు సంతోషహాశ్చర్యనిర్మగ్నచిత్తుండై పార్థునకుఁ గేలు మోడ్చి యేను భూమింజయాభిధానుఁడను. ఉత్తరుఁ డనియు నన్నుఁ బిలుతు రని నిజనామంబులఁ జెప్పి యభివాదనంబుఁ గావించి మహాత్మా, భాగ్యవిశేషమున భవద్దర్శన మయ్యె. అజ్ఞానమునఁ జెప్పిననాపలుకుల మన్నింపుము. అనేకచిత్రకృత్యము లొనరించిననీప్రాపున నుండుటంజేసి నాకు వెఱపు పాసె. అత్యంతభక్తిమై నీరథము నడిపెద. ఎటు పోవఁగ నాజ్ఞాపింతువో యట్ల చేయ నున్నవాఁడ నేమి చేయుదు ననియడుగ నర్జునుఁ డతని కిట్లనియె. విరాటనందనా, నీయెడఁ బ్రీతుండ నైతి. వెఱవకుము. శత్రులనెల్ల నే నుక్కడంచెద. నాపోరాటఁజూచుచు నెమ్మది నుండు మని యాశ్వాసించి గాండీవము నక్షయ్యతూణీరములం గ్రహించి యాశమీవృక్షము డిగివచ్చి నిన్నుఁ దెలిసినప్పుడే నాకు భయము వాసె. వాసుదేవునితోనైనను సురేంద్రునితోనైనను సంగరంబు పొసంగిన నీక నే వెఱవను. లోకోత్తరరూపబలవీర్యవిలసితుండైననీ కీపేడిరూప మెట్లు గలిగెనో యని యూహించియూహించియుం గారణము నెఱుఁగ నేరకున్నవాఁడను. నిన్నుఁ జూచినం గ్లీబరూపప్రచ్ఛన్నుండైన మహాదేవుఁడనియు గంధర్వోత్తముఁడనియు దేవేంద్రుఁడనియుఁదలం పుదయించు. సందియంబువాయఁదత్కారణంబుఁ దెలపఁబుపవే యనియడుఁగ నర్జునుఁ డిట్లనియె. జ్యేష్ఠభ్రాతృనియోగంబునంజేసి యొక్కసంవత్సరంబు సత్యవ్రతంబుఁ బాలించువాఁడనై యీరూపు వడసితిఁగాని యేను నిక్కంబ నపుంసకుండఁ గాను. ఆ వ్రతంబు నిన్నటితోఁ బరిసమాప్తం బయ్యె నని చెప్పిన విని భూమింజయుండు ధనంజయుంజూచి మహాత్మా, నిన్నుఁ జూచినప్పుడెల్ల నితం డేలొకో క్లీబరూపుఁడై యున్నవాఁడు? ఇట్టివారుం గ్లీబు లగుదురే? కారణమెద్దియే నుండు నని యూహింపుచుంటి. అది యిపుడు సంగతం బయ్యె. ఇఁక నీరూపంబు నీకు లేమికి సంతసం బయ్యె. భయ మించుకేనియు లేదు. దేవతలతోడనైనం బోరాడఁ జాలుదు. నీకు సారథ్యం బొనర్చి కృతార్థుఁడ నగుదు. ఏనును సారథ్యతత్త్వవిదులవలన లెస్సగ సారథ్యంబు నేర్చితి. శక్రవాసుదేవులకు మాతలిదారకు లెట్లట్లనీ కేను రథచోదకుఁడనై నిన్ను మెప్పింతు. ఈరథ్యములు వాసుదేవరథ్యసమంబులు. తమపదవిన్యాసంబుఁ జూచి యితరరథ్యములు గమనచాతుర్యంబు నేర్చికొనవలయునట్లుగాఁ జిత్రగతుల నడచు. ఈవలపటిగుఱ్ఱము సుగ్రీవముఁ బోలు. ఈడాఁపటిగుఱ్ఱము మేఘపుష్పమున కెనవచ్చు. అందుఁ బార్శ్వమున నున్నతురంగము శైబ్యమునకు సాటి యగు. వలపటిప్రక్క నున్నహయము బలాహామునకీడగు.

ఇట్టిమేలిగుఱ్ఱములం బూన్చిన యీరథము నేను గడపంగ నీవు రథికుండవై కురుసేనం జెండాడుము. అన్నియు ననురూపంబులై యున్నయవి యనిపలికె. అంతనర్జునుండు శంఖవలయముల నపనయించి తొల్లింటియట్ల కనకవలయముల ధరించినీలకేశముల మలంచి యెత్తి కట్టి శ్వేతోష్ణీషంబుం జుట్టి ప్రాఙ్ముఖుండై శౌచసమాహితచిత్తంబుతో సర్వాస్త్రములను ధ్యానించిన నయ్యస్త్రములు తమతమరూపములతో నమ్మహారథునకుం బొడసూపి కేలుమొగిచి యిదె మేమెల్ల నీపనిచినపనిం జేయ నాయతపడియుండెద మనిచెప్పుటయు విభ్వచ్చుఁడు ప్రణతుండై వానిం గ్రహించి నామనస్సున నిల్చి తలంచినపుడు నాకార్యములం దీర్పుం డనిపలికి ప్రహర్షోత్కర్షవికసితవదనారవిందుండై గాండీవముం జేతం గొని యెక్కుపెట్టి గొనయమ్ము సారించుటయుం గొండ లొండొంటిం దాఁకినట్లు ఘోరస్వనం బెసంగె. ఆఘోరస్వనంబునకుం బుడమి వడంకె. గాలి ప్రచండముగ వీచె. కొఱవులు పడియె. దిక్కు లదిరె. కురుబలములు బెదరె. ధ్వజములు చలించె. మ్రాఁకు లూఁగాడె. అప్పు డుత్తరుం డయ్యతిరథోత్తమునకుం గేలుమోడ్చి యోశూరాగ్రణీ, సహాయరహితుండ వగునీవు సహాయవంతు లగునిందఱుమహారథులతోడం బోరాడి యెట్లు గెలుతువో యని వెఱచి నీముందట నిల్చియున్నవాఁడ ననిన విని యర్జునుం డతని వెఱపుం దీర్చువాఁడై యిట్లనియె. దుర్యోధనాదులు ఘోషయాత్రకు వచ్చి గంధర్వులచేఁ బట్టువడినప్పుడు నే నొక్కరుండఁగానే విక్రమించి యాగంధర్వుల గెలిచి దుర్యోధనాదుల విడిపించితి. ఒక్కండం గానే ఖాండవం బేర్చి యగ్నికిం దృప్తిం గావించితి. దేవరాజార్థంబుగా నివాతకవచపౌలోమకాలకేయులనురాక్షసుల నొక్కఁడంగాదె యుక్కడంచితి. ద్రౌపదీస్వయంవరమున సకలరాజుల నొక్కరుండగదా గెలిచితి. ఇప్పుడు నీమహారథులనెల్ల గెలిచి పసుల మఱలింతు. చింతాభయములు విడువుము. కృపద్రోణమహాదేవమాధవసురేంద్రవహ్నియమాదులవలన దివ్యాస్త్రముల ననేకముల సాధించితి. నావిక్రమంబుం జూడు మూఱడిల్లు మని యుత్తరునకు భయంబు వాపి శమీవృక్షమునకుం బ్రదక్షిణముగా రథముం బోనిచ్చి యట నిలిపి సింహధ్వజం బపనయించి విశ్వకర్మనిర్మితంబై దేవమాయామయం బైనకపిధ్వజంబు సన్నిహితంబు గాఁగ నగ్నిదేవుం దలంచుటయు నద్దేవుం డతనితలం పెఱింగి భూతగణపరివృతకపిధ్వజం బెత్తించి తదీయరథోత్తమం బనిచిన నారథము గగనమునుండి విభ్వచ్చుమ్రోల భూతలమున కవతరించె. వచ్చినయారథమునకుం బ్రదక్షిణంబుగావించితత్కాలసన్నిహితం బైననిజకవచంబుం దొడిగి యింద్రదత్తం బైనకిరీటరాజంబు ధరించి బద్ధగోధాంగుళిత్రాణుండై గాండీవంబుం జేతం గొని యుత్తరముగ రథముం దోలు మని యుత్తరునకుం జెప్పి తత్సమయసన్నిహితం బైన దేవదత్తం బనుతనశంఖంబు పూ

రించె. ఆశంఖధ్వానంబు విని రథ్యములు మ్రొగ్గతిలం బడియె. ఉత్తరుఁడు వెఱచి చదికిలఁ బడియె. అంత నర్జునుండుపగ్గముల బిగియించి గుఱ్ఱముల లేవ నెత్తి యుత్తరుం గౌఁగిలించియూరార్చి రాజపుత్రా, వెఱవనేల? క్షత్రియునకు శత్రు మధ్యమున విషాదముఁ బొందఁ జనునే. శంఖధ్వానంబుల, భేరీభాంకారంబులఁ, గుంజరఘీంకారంబుల నింతకుమున్న విన్నవాఁడవుకావా? ప్రాకృతునిమాడ్కి నేల యిట్లు వెఱచెద వనియడుగ నుత్తరుఁ డిట్లనియె. శంఖధ్వానంబులు, భేరీభాంకారంబులు, కుంజరఘీంకారంబులు, ధనుష్టంకారంబులుం బలుమాఱు లువినియుండుఁగాని యిట్టిచిందపుమ్రోఁతయు, నిట్టిధనుష్టంకారంబు నింతకు మున్నెన్నఁడు నెచ్చటను వినను. ఇట్టిధ్వజమును రథమునుం జూడను. అమానుషంబయిన యీధనుష్టంకారంబును, శంఖధ్వానంబును, రథనేమిఘోషమును, ధ్వజముననున్న భూతములయార్పును వినినంతన చెవులు దూటువడి బధిరములయ్యె. మనస్సు కలగుండువడియె. దిగ్భ్రమంబు వొడమె. ధ్వజకాంతులఁ జూడ్కి ప్రతిహతం బయ్యె ననిన విని యర్జునుండువానివెఱపు దీర్పం దలంచి భూమింజయా, నొగలపైఁ బదిలముగఁ గూర్చుండి పగ్గముల బిగియించి దిట్టతనమున నుండుము. ఈతూరి చిందము మ్రోయింతుననిచెప్పి పెలుచ దేవదత్తం బొత్తె. ఒత్తుటయు గుహలఁ బ్రతిధ్వను లెసంగె. గిరు లదరె. పుడమి వడఁకె. దిశలు బీటలువాఱె. సముద్రములు సంక్షోభించె. ఉత్తరుఁ డించుక వెఱపుతోన రథమున నెఱఁగె. అర్జునుఁ డతనికి వీర్యావహంబులయినసాంత్వవచనముల బోధించి వెఱపు దీర్చె. అంత నక్కడ ద్రోణాచార్యుఁడానిస్వనముల నుపలక్షించిదుర్యోధనుంజూచి కుమారా మేఘగర్జితంబుంబోనిరథనేమిఘోషమును జ్యాఘాతనిస్వనంబును శంఖారవంబును ధ్వజనిలయభూతగణారవంబును భూకంపంబునుం బరికించిన నారథమున వచ్చువీరుఁ డర్జునుఁడకాని యొండొకండు గాఁ డని నిక్కంబుగఁ దోఁచుచున్నది. మనసైన్యంబున శస్త్రములు ప్రకాశింపవు. గుఱ్ఱములు ప్రహృష్టములు కావు. సుప్రజ్వలితంబులయ్యు నగ్నులు లెస్సగ వెలుంగవు. మృగములు సూర్యున కెదురై ఘోరముగ నఱచుచున్నవి. ధ్వజాగ్రములందు వాయసములు వ్రాలుచున్నవి. నక్క సేనామధ్యమునకు వచ్చి పెలుచ నఱచి పాఱుచున్నది. అందఱిమేనులనురోమాంచము గలుగుచున్నది. కొఱవులు పడుచున్నవి. కంకగృధ్రాదులును సేనలో నంతటం దిరుగుచున్నవి. ఈయుత్పాతంబులు చూడఁగ ఘోరసంగ్రామంబును బహుక్షత్రియవినాశంబు నగు నని తోఁచుచున్నది. ఇట్లుండినం బార్థబాణపీడితం బైనసైన్యంబుఁ జూచి దైన్యంబు నొందుదువు. మనసేనలో నందఱుసమరోత్సాహవిరహితులై వివర్ణముఖులై యున్నవారు. కావున గోగణములఁబనిచి దొడ్డవ్యూ

హంబుఁ బన్ని యుద్ధసన్నద్ధులమైయుండు టుచితం బని చెప్పినవిని దుర్యోధనుండు భీష్మద్రోణకృపులం జూచి యిట్లనియె.

## దుర్యోధనుఁడు ద్రోణాచార్యు నధిక్షేపించుట.

ఆచార్యు లిట్లు చెప్పచున్నవారు. నేనుం గర్ణుఁడు నిందుల కుత్తరంబు మున్న చెప్పితిమి. ఐనం జెప్పెద. పాండవులు వనమునఁ బండ్రెండేండ్లు జనపదమున నజ్ఞాతవృత్తిమై నొక్కయేఁడు నుండునట్లు ప్రతినఁ బూని పోయిరిగదా. అందు వనవాస నియమంబు గడచెఁగాని యజ్ఞాతవాసనియమం బింతకుఁ బరిసమాప్తంబు గాదు. నియమము దీఱకమున్న యర్జునుండు వచ్చెనేని సంకేతించినవిధమునఁ గ్రమ్మఱనా నియమంబు వారు నడుపువారు. లోభమున వారు వచ్చుటయొండె, మోహమున మన మెఱుంగమియొండెఁ గావలయు. ఇం దెక్కువతక్కువలు భీష్ములు నిరూపింపఁ జాలుదురు. అర్థములందు ద్వైవిధ్యము పొసంగిన నెంతవారికైనను సమ్మోహంబు గలుగు. అందును స్వార్థములయందైన నందఱును మోహవశులే యగుదురు. వారి నియమంబు దీఱకమున్న యుత్తరు రక్షింపఁగ నర్జునుండు వచ్చెనేని యది యెవ్వరియపరాధంబు? విరాటుపురంబునఁ బాండవు లుండుదు రనిశంకించి కాదె మనము నిన్న దక్షిణగోగ్రహణార్థంబు సుశర్మం బంపి నేఁ డిటకు వచ్చితిమి. నిర్ణయించి వచ్చినకార్యంబున విచారం బేల? సుశర్మ విరాటుం గెలిచి గోవులఁ బట్టికొని పోవుటయొండె నోడి మనయొద్దకుఁ బాఱుతెంచుటయొండె నొండు గావలయు. విరాటుఁడు సర్వసేనాపరివృతుండై త్రిగర్తయోధులతోడఁ బోరాడఁ బోయిన నూర నున్నవాఁ డుత్తరుఁ డొక్కరుండు మనల మార్కొనవచ్చుచున్నవాఁడు. కాకున్న విరాటుఁడే వచ్చుచున్నవాఁడు గాఁబోలు. అట్లుంగాక బీభత్సుఁడే వచ్చెనేనియు మనము పోరితంబు సేయనవలయు. వచ్చి పసులం బట్టించినపదంపడి యింద్రయమవరుణాదు లెవ్వరు వచ్చినను మార్కొనవలయుఁగాని యొదుఁగఁ దగునే? సంగ్రామంబు సేయక యొక్కఁడైనం బాఱిపోయెనేని యట బ్రదుకఁ జాలునే? భీష్మద్రోణకృపాశ్వత్థామవికర్ణాదు లగుచేయంగలవీరు లేలొకో యనవసరమున సంభ్రాంతచిత్తులై యూరక రథములపైఁ గూర్చున్నవారు. ఆచార్యుఁడు సైనికులయుత్సాహము సెడఁగ నర్జునుం బ్రశంసింపుచున్నవాఁడు. ఆచార్యుని సమరమునకుఁ బిలువక వెనుక నిలిపిన నిప్పటికి నీతియగు. అర్జునునందుఁ బ్రీతి యెక్కుడు గావున నతనిఁ బొగడి కురుసైనికులకు వెఱపు పుట్టించుచున్నవాఁడు. కావున సేనలోఁ జెఱుపు గలుగకుండ నేర్పున నీతి చేయవలయు. ఏల యితం డర్జును నంతపొగడవలయునో యూహించియుం దెలియరాదు. మనసైన్యంబు భగ్నంబుఁ జేయఁగఁ దలంపు లేదేని తదీయరథశంఖధనుర్ఘోషముల నంతవింతగఁ బొగడ నేల? అశ్వములకు హేషితంబులు, గాడ్పులకు వీజనంబును, బర్జన్యునకు

వర్షించుటయు, మేఘములకు గర్జనంబును సహజంబులే. ఇట్లు వారల వావిడిచి పొగడఁగ వారిపై నత్యంతప్రీతియు మనపై ద్వేషరోషములుం గారణంబులు. కావున నాచార్యు లయినవారల యుద్ధవిషయములఁ బిలిచి యడుగరాదు. మఱి వారు ప్రాసాదములఁ గూర్చున్నపుడు, నుద్యానముల విహరించునపుడును జిత్ర కథాగోష్ఠి నున్నపుడును, యాగములఁ జేయునపుడును, శస్త్రాస్త్రచమత్కారములఁ జూపునపుడును, మంత్రవిచారంబుల నున్నపుడును, హస్త్యశ్వాదివినోదంబులనర యునపుడును, గోధనములఁ బరిశీలించునపుడును, భోజనావసరములందును, నిత రవినోదసమయంబులందునుం, బిలిచినవచ్చి తత్తదుచితంబుగా మాట లాడఁ దగువారు. కావున శత్రుగుణముల గొప్పచేసియుగ్గడించుపండితుల వెనుకఁ జేసి గోవులం బనిచి పరాజయంబు లేక శత్రుల జయించునట్లుగా నీతిమార్గప్ర కారంబున విచిత్రవ్యూహంబుఁ బన్ని తగినతెఱంగున నందులకు రక్ష గావించి పోరికి సమకట్టియుండవలయు నని దుర్యోధనుఁడు పలికినం గర్ణుఁ డిట్లనియె.

**కర్ణుఁడు బింకములు పలుకుట.**

మహారథు లందఱు వెఱచి యుద్ధముఁ జేయ మనసుగొలుపనియ ట్లున్న వారు. వచ్చుచున్నరథికుఁడు విరాటుఁడైనను బీభత్సుఁడైనను సాగరంబును వేల యట్లట్ల యే నొపి నిలువరించెద. చేతులలావు మెఱయ నేను వింట సంధించి ప్రయోగించినబాణములు పన్నగంబులవిధంబున నప్రతిహతిం బోవుఁగాని మఱ లవు. రుక్మపుంఖము లగుమదీయబాణములు మిడుతలు పాదపంబునుంబోలె నర్జు నుం గప్పు. మదీయతలప్రహారనినాదంబును జ్యాఘోషంబును భేరీరవంబుచందం బుననరిభీకరంబై యెసంగు. పదుమూఁడేఁడులు పూచివెట్టికొని యర్జునుఁడు సమర కుతూహలమున నన్నుఁ దాఁకిన నేను సత్పాత్రభూతుం డైనబ్రాహ్మణున కమిత ధనంబు నిచ్చుతెఱంగుగా వానికి శరజాలముల నిత్తు. అర్జునుఁడు ముల్లోకములఁ బొగడ్త కెక్కినమేటివిలుకాఁడు. నేనును వానికిఁ దక్కువగాను. మాయిరువుర యస్త్రచాతుర్యంబు నందఱుం జూతురుగాక. దుర్యోధనుమన్ననం గని బ్రదికి ననేను నేఁడు తత్ప్రియం బైనయర్జునవధంబు నేసి యప్పు దీర్చికొందు. మా యిరువురయస్త్రము లొండొంటిం గలసి శలభములట్ల యాకసంబున నిబిడం బులై యుండ నావేడుక నందఱుం గనుంగొనుఁడు. కొఱవుల నేనుఁగుంబో లె నశనిసమస్పర్శుఁడు మహేంద్రతుల్యవిక్రముఁ డగుపార్థుని బాణముల నొ ప్పింతు. శక్తిశరాద్యాయుధంబు లింధనంబులు గాఁగ మండి శత్రుల నేర్చు విప్పచ్చుం డనుకార్చిచ్చు నశ్వవేగము పూర్వవాయువుగా రథనేమినిర్ఘోషము గర్జితంబుగాఁ మేఘరీతి నవలంబించునేను శరవర్షము గురియించి చల్లార్చెద. నాయరివ్రొసియేసినబాణములు పన్నగములు వల్మీకంబునుంబోలె నర్జునుం జేరు.

మదీయదివ్యబాణావృతగాత్రుండై కర్ణికారకుసుమసంవృత పర్వతంబుచాడ్పున నొప్పుకిరీటి నిపుడు చూడుఁడు. జామదగ్న్యమునీంద్రకరుణాసముపలబ్ధం బైన యస్త్రజాలంబు గలిగి యుడివోనిబీరమునం బొంపిరివోవునేను దేవతలతోనైనం బోరికిఁ గడంగుదు. అర్జునుఁ డెంతవాఁడు? కిరీటిధ్వజంబున నున్నవానరుండు మదీయభల్లనిహతుండై భైరవారావముల నొనరించుచు నేలఁ బడి తన్నుకొను. ధ్వజనిలయంబు లయినభూతగణములు మదీయశరప్రహారపీడితంబులై పెలుచ నఱచుచుఁ బఱచు. ఇపుడు విరథుండై చేయునది లేక క్రూరపన్నగంబుచాడ్పునఁ జలంబుడింపక రోజునట్టిగాండీవిం జూతురు. నేఁడు బీభత్సుం బిలుకుమార్చి దుర్యోధనుచిత్తమునం బెద్దకాలముగ నున్నశల్యం బపనయింతు. వేడుక గలదేని యందఱుఁ దేరులపై నుండి చూడుఁడు. లేదేని గోధనముఁ గొని పురికిఁ జనుఁ డని బింకములు వలుకుచుండఁ గృపాచార్యుండు వాని కిట్లనియె. రాధేయా, నీబుద్ధి యెన్నఁడుం గ్రూరతరంబై యుండు. అర్థముల నాలోచింతువుగాని తద్గుణదోషముల హానివృద్ధుల నెఱుంగవు. అర్థార్జనోపాయములలో యుద్ధ మధమం బని శాస్త్రవిదు లైనపెద్దలు సెప్పుదురు. దేశకాలముల బలాబలముల నెఱిఁగినేర్పున నడిపినయుద్ధము జయప్రదంబగుఁగాని విపరీతంబయినఁదప్పకవిపరీతఫలంబగు. పరికించి చూచిన నిప్పుడు కిరీటితోడఁ బోరాట యనుచితంబ. అతం డొక్కరుండేయని తలంతవేని యదియు నొప్పదు. అవీరు డొక్కరుఁడగాఁడె ఖాండవం బేర్చె. యాదవులనెల్ల నోర్చి సుభద్రం దెచ్చె. కురుకులంబునకెల్లఁ గీర్తి కలుగ దిగ్విజయంబు సేసి యమితధనరాసులం దెచ్చె. కిరాతరూపప్రచ్ఛన్నుం డైనయుమాపతితోడం బెనంగి గెలిచె. బ్రహ్మచర్యనియతుండై స్వర్గమున నుండి దేవతలవలన దివ్యాస్త్రముల సాధించి వారికిం దుర్జయు లైన నివాతకవచపౌలోమకాలకేయులఁ బరిమార్చె. మీ రందఱు ఘోషయాత్ర పోయినపుడు చిత్రసేనుం గెలిచి దుర్యోధనాదుల విడిపించి కులంబు రక్షించె. ఇంద్రుఁడును వానితోడిపోరికి వెఱచు. వాని మార్కొనువానికిఁ జికిత్స యవశ్యకర్తవ్యంబు. క్రూరాశీవిషముసోటఁ బ్రదేశినిం బుచ్చికోటఁ బెఱుకఁ దలంచుమార్కని, వన్యమదగజంబు నొంటిమై నంకుశంబు లేక యారోహించి పురమునకుఁ బోవుచాడ్పునను, ఘృతార్ద్రవస్త్రము గట్టి యాజ్యమేదోవసావిశేషసమిద్ధం బయినయగ్నిం జొచ్చుకరణిని, బృహత్పాషాణంబుఁ గుత్తుకం గట్టికొని సముద్రం బీఁదుచందంబునను దుర్బలుఁ డకృతాస్త్రుఁడు నగునీవు బల్లిదుఁడు కృతాస్త్రుఁడు నగుసవ్యసాచిం బోర మార్కొనం దలంచుట యపాయ కరంబు. కౌరవు లొనర్చినపరిభవములు హృదయశల్యములయి యెరియించుచుండఁగ నెట్లో యీపదుమూఁడేఁడులు నియమంబు గడపి బంధనము లెడలించినసింహము క్షుద్రమృగ

ములపై దూఁకుచందంబున నేతెంచుచున్న యీఫాల్గునుండు మనలో నొకనినైనను మిగిలింపఁడు. బావిలో నున్ననిప్పువోలెఁ బ్రచ్ఛన్నుం డై నయర్జునుం దెలియక యెదిరించుటంజేసి పెద్దయు డెప్పరం బయ్యె. కావున సేననెల్ల నొకతెఱంగున వ్యూహము పన్ని భీష్మద్రోణాశ్వత్థామ దుర్యోధనులు నీవు నేనుం గూడి మనమాఱుగురము దానవులు వాసవుంబోలె వానిం దాఁకుదముగాని యొంటిమై వాని మార్కొనుట దుష్కరం బనినం గర్ణుండు కృపాచార్యుం జూచి మీరందఱు జేలోకో యిట్లు వెఱచెదరు? మీ గోపరేని యూరకుండుఁడు. నేను వానిం గెలిచెద. ఒకరథికున కొక్కరుఁడు సాలక యొందఱు వలయు? కిరీటివిక్రమంబు పెద్దచేసి యెపుడును మీరుమమ్మెల్లిదంబు సేయుచు సమయంబున నిట్లసంబద్ధంబులుపల్కెద రని యధిక్షేపించుటయు నశ్వత్థామ కటకటం బడి యిట్లనియె.

## —అశ్వత్థామ కర్ణుని నిందించుట.—

కర్ణా, యిప్పటికిఁ బసులఁ బట్టికొంటివి గాని యింతకు మత్స్యదేశంబునుం గడచనవు. వచ్చుచున్నవీరు నింతకు మార్కొనలేదు. ఇంతలో నిన్ని యడిబీరపుపలుకు లేల? సంగ్రామంబులు పెక్కులు చేసి పగర గెలిచి ధనము గొనినవాఁడు బింకములు పలుకఁడు. మఱి యగ్ని మాట లాడక గాల్చుచందంబునను, సూర్యుఁ డవచనుండై వెలుంగుతెఱంగునను, భూమి యభాషితయై లోకములధరించుమాడ్కిని నెద్దియుం జెప్పక తనపౌరుషమునఁ గార్యముసాధించు. బ్రాహ్మణులు యజనయాజనాదులు వైశ్యులు బ్రాహ్మణోపకారకృషివాణిజ్యగోరక్షశూద్రులు త్తమపరిచర్యలుం గులధర్మంబులుగాఁ జేసినయట్లు క్షత్రియుండుతనకులధర్మం బనుసరించి యజనాధ్యయనదానములఁ జేయుచు దేశకాలము లెఱింగి నీతి దప్పక విక్రమంబున శత్రువిజయంబుఁ జేసి రాజ్యంబు సాధించి సత్కారార్హులై నగురువుల నారాధించుఁగాని తూలనాడఁడు. జూదమాడి వంచనచే నితరులరాజ్య మొడిచికొని తన్నుఁ దాన పొగడికొనఁగ దుర్ణయపరుం డై నయీదుర్యోధనుఁ డొక్కరుఁడు మొనగాఁ డయ్యెఁగాని క్షత్రియకులజనితుం డై నలాఁతివాఁ డెవ్వఁడేనియు నిట్టినీచకృత్యమున కొడంబడునే? వంచన విడిచి సన్మార్గమునం బ్రవర్తించినం బాండవుల గెలువ నలవియే? ఏయుద్ధమునఁ బాండవుల గెలిచి యింద్రప్రస్థంబు సాధించిరి? ఏసంగరమున నవ్వీరుల జయించి పాంచాలి నాసభకు రప్పించిరి? ఏకవస్త్రయు రజస్వలయు నగునప్పరమపతివ్రతను నిశ్శంకమతిం దెప్పించినపుడు విదురుఁడు సెప్పినది వింటిరే? వినిన నివియెల్ల నెట్లు వచ్చు. గంధముఁ గోరి చందనవృక్షంబు నఱికినచాడ్పున సంపదఁ గోరి వంచనమై నాపాపపుజూద మాడి యంత నిలువక తగు నిది తగదని యరయక యాసభ కప్పతివ్రతాశిరోరత్నంబును దెప్పించుటయే మీకుఁ జేటుల కెల్ల

మూలం బయ్యె. క్షమకును మేర గలదు. ఎంతశాంతులకైనను గారణవిశేషం బున క్షమ సెడి కోపంబు గలుగు. నాఁడు ద్రౌపదిని మీఁపఱచినపాట్లు పాండవులు క్షమియింపరు. విశేషం బేల? ధార్తరాష్ట్రజయార్థంబె ధనంజయుండు జనియించినవాఁడు. వాఁడు దేవదానవగంధర్వాదుల నేరినైన నొకచీరికిఁ గొనఁడు. ఇఁక మనసైన్యంబున నొక్కనినేనియు మిగిలింపఁ డని చెప్ప నేల? వాఁడు తన పగదీర్చికొను. నీ విచట దుర్యోధనుండు వినఁగఁ బాండిత్యంబు మెఱయమాటలనే వానిం గెలుతువు. పన్నగంబుల నిగ్రహించి తననెల వయినప్రమాణకుఁ జేరు గరుత్మంతునిచందంబున వాఁ డెవ్వని మార్కొనినను దప్పక జయించి మఱి మఱలు. వీర్యమున నీకంటె నధికుఁడు ధనుర్విద్యావిలాసమున నింద్రతుల్యుఁడు యుద్ధమున వాసుదేవసన్నిభుఁడు నగువాని నెవఁడుగొనియాడఁడు. దైవమానుషాస్త్రములతెఱం గెఱింగి తత్తదస్త్రముల నేసి జయముఁ గొన నేర్చినయాసవ్యసాచి కెవ్వరును సాటిగారు. అట్టివీరు నందఱు నగ్గింపవలయు. ద్రోణాచార్యుండు తనకుఁ బ్రియశిష్యుండై పుత్రునకుఁ దక్కువగానియయ్యర్జునుం బ్రశంసించు. ఇందుఁ దప్పేమి? పాపపుజూద మాడి శకుని పాండవరాజ్యము సాధించి యిచ్చినపు డీదుర్యోధనుఁ డేబీరమునఁ బాంచాలి నాసభకుఁ దెప్పించెనో యాబీరముఁ దలంచి యిపుడు చక్క నిలిచి పోరాడవలయు. దుర్ద్యూతదేవి క్షాత్రధర్మకోవిదుఁ డనియీదుర్యోధనుమెచ్చుమాసిసియు నతనికిమేనమామయు నగుశకుని యే యిపుడు వచ్చినపార్థునితోఁ గయ్యముఁ జేయుఁగాక. పార్థుఁ డిపు డడ్డసాల్లవైవఁడు. నికృతి సేయఁడు. మఱి గాండీవనిర్ముక్తము లైనవాఁడినారసములం గుప్పించు. గాండీవనిర్ముక్తంబు లైనక్రూరనారాచంబులు కొండలనైనం దూఁటుచేసికొని పోవుఁగాని మగుడవు. కాలాంతకుఁడు ప్రళయప్రభంజనుఁడు మృత్యుదేవతయు బడబానలంబు నొక్కవేళ మిగిలించిన మిగిలింతురుగాని ధనంజయుఁడు శత్రుశేషము నిలుపఁడు. మీదుర్ణయంబుల కొప్పి సమరంబు సేసినను వచ్చువాఁడు సవ్యసాచి యగునేని నేను బోరాడను. విరాటుఁ డగునేని పోరితంబునకుఁ గడంగుదు నని యాచార్యపుత్రుండు క్రోధావమానఘూర్ణమానచిత్తుండై పలికినం దుర్యోధనునకు గాంగేయుఁ డిట్లనియె.

**భీష్ముఁడు ద్రోణాదుల ననునయించుట.**

ఆచార్యవచనం బుచితంబు. ఆచార్యపుత్రువచనంబు లెస్స. కృపాచార్యవచనంబు సంగతంబు. కర్ణుఁడు కేవలక్షాత్రధర్మంబునఁ బోరాడం దలంచు. ఆచార్యు లయినవార లెట్టిసమయంబులనైనను సత్కారార్హులుగాని నిందార్హులు గారు. దేశకాలము లెఱింగి యుద్ధమునకుఁ దొడరుట నామతంబు. యుక్తాయుక్తవిచారంబు సేయువారు తమవారికిఁ గార్యసంకటంబులు వొసంగినం జింతిల్ల

కుండుమరే? సూర్యసమతేజస్కు లయినపాండవు లేవురు నీకు శత్రువులై యుండ నీకు దెప్పరం బగుపట్టున నాచార్యులు వగవకుండుదురే? ధర్మవిదు లయినపెద్దలును స్వార్థంబున విమోహంబుఁ జెందుదురు. ఇందులకుఁగా నాచార్యుం దూఱ వచ్చునే? నామాట నీ కింపగునేని వారి నారాధించి ప్రసన్నులం జేసికొను మని చెప్పి యట ద్రోణాచార్యపుత్రుదెస మొగంబై భూసురోత్తమా, కర్ణుడు మీకు విక్రమాటోపంబు మఱింత యెక్కువ గాఁగఁ బలికినవాఁడుగాని యొండు గాదు. క్షమియింపుఁడు. పార్థుండు డగ్గఱినవాఁడు. పెద్దయు డెప్పరం బగు. ఇట్టిసమయమున మనము పరస్పరభేదముఁ బాటించి యొప్పరికించి చూడఁ జనునే? ఆదిత్యునియెడ వెలుఁగును జంద్రునియెడ శీతలకాంతియుఁ దఱుఁగనియట్లు మీయెడ నస్త్రవిద్యాచాతుర్యం బొకనాఁడై నందఱుఁగదు. నాలుగు వేదములొక్కతలగా ధనుర్వేదం బొక్కటి యొక్కతలగాఁదలంచి బ్రహ్మాస్త్రంబు మున్నగుదివ్యాస్త్రములనెల్ల సాధించి యున్నవారు. వేదవేదాంతధనుర్వేద పురాణేతిహాసాదిపరిజ్ఞానంబున జామదగ్న్యుఁడొక్కరుఁడు దక్కఁ దక్కటివాఁ డెవ్వఁడు ద్రోణాచార్యునకు సమానుఁడు గాఁ డని యందఱకుం దెల్లంబు. కృపాచార్యుఁడు ధనుర్వేదవిదులలో నుత్తముఁడు. నీవును దండ్రికి సమానుఁడ వనియే యందఱుం దలంతురు. ఇట్టిమహారథు లగుమీరుండియు దుర్యోధనున కొకటి గలిగెనేని యది మీకుం గలిగినదియకాదే? కావున నీసమయమునఁ బరస్పరభేదముఁ దలపోయక యుద్ధసన్నద్ధులమై మన మందఱముం గూడి యర్జునుం దాఁకవలయు. క్షమియింపుఁ డనిచెప్పిన విని యశ్వత్థామ గాంగేయుం జూచి యయ్యా, మీ రింత చెప్పఁ గలరు. దుర్యోధనుదురాచారమునకుఁ బొడమినక్రోధమునం జేసి పుత్రనిర్విశేషుం డైనప్రియశిష్యుని గుణముల నాచార్యుఁడు పేర్కొనియె. అది యొక్క పెద్దతప్పొకో? శత్రుఁడైనం గుణవంతుఁ డయ్యెనా తద్గుణముల నుగ్గడింపవలయు. గురువైనను దోషవంతుఁ డయ్యెనా తద్దోషములఁ జూపి చెప్పవలయుఁగదా? ఇదియొక్క తప్పుగ భావించి ప్రల్లదములాడిన నెట్లు సైఁపవచ్చు నని చెప్పటయు శాంతనవుండు వెండియు శాంతివచనంబులఁ జెప్పి యతని ననునయించె. అంత దుర్యోధనుఁడు ద్రోణుం జేర వచ్చి యాచార్యా, క్షమియింపవలయు. ఇపుడు మీరు భేదముఁ దలంచి యొప్పరికించినం గార్యము సెడకుండునే? మీరు ప్రశాంతులరై ప్రకృతకార్యముఁ జూతు రేని నాకు మేలు సేకూఱు నని భీష్మకృపకర్ణసహితుండై ప్రార్థించిన నయ్యాచార్యుఁడిట్లనియె. కురుపితామహుఁడు సెప్పినప్పుడే యేనుశాంతిం బొందితి. అది యట్లుండె. పదుమూఁడేఁడు లిడుమలఁ బడి యాకోపముఁ దీర్చికొనఁగ గాండీవి యిదె వచ్చుచున్నవాఁడు. వాఁడు తప్పక దుర్యోధను నిగ్రహింపఁ బ్రయత్నంబు సేయు. సాహసమున నొండె మోహమున నొండెఁ గురురాజు వానిబారిం బడి బమ్మరింపకుండఁ

గను. సేనకు సేఁగి రాకుండఁగను నీతిప్రకారమునవ్యూహముఁ బన్ని యుండవలయు. అర్జునుఁ డిపు డించుకేనియు శాంతిఁ బూనఁడు. కావున నెంతేఁ గడంకమై నుండవలయు. పాండవులయజ్ఞాతవాసం బింకను దీఱలేదని తొలుతఁ గురునృపాలుండు సెప్పె. ఆసంశయంబు దీర్పఁగ గాంగేయుండునేర్చు ననుటయు భీష్ముఁ డిట్లనియె.

భీష్ముఁడు పాండవులయజ్ఞాతవాసనియమపరిపూర్తి నిష్కర్షించుట.

కాలచక్రంబు కళాకాష్ఠాముహూర్తదినపక్షమాసర్తుసంవత్సరాదిభేదము నం బ్రవర్తిల్లు. అందు గ్రహనక్షత్రచారభేదమునంజేసి యైదేసియేండ్లకొక్కతూరి రెం డధికమాసంబులు వచ్చుచుండు. ఇట్లీపదుమూడేఁడులకు వచ్చినయధికమాసంబులు గణింపఁగా నిప్పటి కైదునెలలుఁ బండ్రెండునాళ్లు నధికము లగుచున్నవి. దానంజేసి పాండవులని[illegible]సంవత్సరములు నిన్నటితోఁ గడచె. తమపూనినప్రతిజ్ఞ యథాశాస్త్రంబుగ న[illegible]యే యర్జునుఁ డిట నగపడుచున్నవాఁడు. ధర్మార్థకోవిదులు మహాత్ములు ధర్మ[illegible]జోపదిష్టమార్గప్రవర్తులు నగువార లొక్కనాఁడేనియు ధర్మంబు దప్పి నడతురే? లోభము మాని దుష్కరవ్రతంబు సలిపి వచ్చినవారు లోభవశులై ధర్మంబు దప్పుదురేనినాడేఁ యడవులకుఁ బోవక యుద్ధకాంక్షులై నిలిచిరేని దేవేంద్రుఁ డడ్డపడినను జయించి తమరాజ్యముఁ గొనియుండుదురు. వారిపరాక్రమంబు క్రొత్తయే? ధర్మపాశనిబద్ధు లయినయామహాత్ము లనృతంబుకంటెఁ జావు మే లని తలంచి సంకేతప్రకారంబు నడపిరి. ఇంక నిపు డాలసింపరాదు. అర్జునుఁ డిదె వచ్చినవాఁడు. సంగ్రామంబున జయాపజయంబులు నమ్మరాదు. లెస్సగఁ జింతించి యుద్ధసన్నాహ మొండె ధర్మసంయుతం బయినసంధికార్యంబొండె శీఘ్రింబ చేయవలయు ననిన దుర్యోధనుండు పితామహా, పాండవులకు నేను రాజ్య మియ్యను. సంధి పొసఁగదు. యుద్ధసన్నాహంబు శీఘ్రింబ సమకట్టుఁ డని పలికె. ఆమాట విని భీష్ముఁడు దుర్యోధనుం జూచి య ట్లగునేని పోరికై నం దగురీతి సమకట్టవలయు. సర్వప్రకారంబుల నేను శ్రేయస్సు చెప్పవలసినవాఁడ నగుటంజేసి చెప్పెద. నావచనంబు హితం బనితోఁచిన నట్ల చేయుఁడు. సేనలో నాలవపాలు గొని నీవు పురమునకుఁ బొమ్ము. తక్కటిచతుర్థాంశము గోగణరక్షణార్థంబు నిలుపవలయు. శిష్టంబు లయినరెండుభాగములఁ గొని యేనుద్రోణకృపాశ్వత్థామకర్ణులుం గట్టిమోహరంబు సేసి బీభత్సు నెదిరింతుము. అతండు గాక విరాటుండు వచ్చెనేనియు దేవేంద్రుఁడు వచ్చెనేనియు నేను సముద్రమును వేలయుంబోలె నిలువరింతు ననిచెప్పుటయు దుర్యోధనుం డిది లెస్సయని తత్ప్రకారంబు చేసె. అంత శంతనుపుత్త్రుండు సేన నొక్కవ్యూహంబుగాఁ బన్ని నడుమ నాచార్యుని డాఁపట నాచార్యపుత్త్రుని వలపటఁ గృపాచార్యునినగ్రభాగంబునఁ గర్ణు నిలిపి తాను సర్వసేనారక్షణపరుండై వెనుకటిదెస నిలిచియుండె.

### అర్జునుఁడు గోగణంబు మఱలించుట.

అంత నర్జునుఁడు రథఘోషమున రోదోంతరంబునం బ్రతిస్వనంబు లెసంగఁ జేయుచుఁ గురుసేనం దరియ వచ్చి భీష్మద్రోణకృపాచార్యులచరణసమీపస్థలంబులం బడ రెండును గర్ణాభ్యర్ణప్రదేశంబునం బడ రెండును గా నాలుగేసి బాణంబు లేసి చనుచుండ ద్రోణుఁడు తనచెంగట నున్నవారలం జూచి యర్జునుఁడిదె వచ్చినవాఁడు. రథనేమిఘోషంబును గేతనకపిభైరవాకారంబును గాండీవజ్యానినాదంబును భీకరంబై యెసఁగుచున్నది. చిరకాలం బడవుల నుండి యమానుషకృత్యములఁ జేసి మమ్మెడఁబాసి వచ్చినవాఁడుగావున నాకు నమస్కారంబుగాఁ బాదసమీపంబునం బడ రెండమ్ములను గుశలసంప్రశ్నంబుగాఁ గర్ణాభ్యర్ణప్రదేశంబునం బడ రెండమ్ముల నేసె. అత వద్ద గుణంబు లింత యొప్పునే యని యగ్గించుచుండె. అట్టియెడఁ బార్థుఁడు సం ము: త్రి: ంగణమున నున్నకురువీరులనెల్లఁ గలయం జూడఁ దలంచి యుత్తరుం బిలిచి మనరథము సైన్యమునకు బాణపాతదూరమున నిల్పుము. కురుకులాధముఁడైనదుర్యోధనుఁ డెచ్చట నున్నవాఁడో చూతము. వీరితో నేమి పని? అత్యంతదురభిమానమదాస్పదుం డైనయాధార్తరాష్ట్రాగ్రజుపయిం బడియెద నని చెప్పి తేరు సేనాసమీపమున నిలువం బంచి యందఱఁ గలయం జూచి వెండియు భూమింజయున కిట్లనియె. వీరె భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణు లున్నవారు. దుర్యోధనుఁడు ప్రాణముల కాసపడి గోవులఁ దోలించికొని దక్షిణంబునకుఁ బోవుచున్న వాఁ డని తోఁచుచున్నది. కావున నీవీరులతోడి సమరంబు నిరామిషంబు; వీరినెల్లఁ గడచి దుర్యోధనుఁడు పోవుచున్న చోటికి మనయరదం బతిత్వరితగతిం బఱపింపుము. ఆదురాత్ముం గెలిచి పసుల మఱలింతు నని చెప్పుటయు నుత్తరుఁ డారథికులఁ గడచి సుయోధనుఁడు చనుచున్న దెసకుఁ దేరు దోలుచుండఁ గృపాచార్యుఁడు తనయొద్ద నున్న వారితో నిట్లనియె. అర్జునుఁడు మనలనెల్ల నతిక్రమించిపోవుట చూడఁగఁ గురురాజుం దలపడఁ బోవు నట్లున్నది. మన మందఱ మతిరయమున రాజునకుఁ దోడ్పడవలయు. ఆలసించినం గురురాజు క్రోధోద్దీపితచిత్తుం డైనయర్జునునకుఁ జిక్కి తప్పించికొనుట యరిది. దేవేంద్రుఁడు వాసుదేవుఁడాచార్యుఁ డాచార్యపుత్రుఁడు దక్కఁ దక్కటివారు వానినొంటి మార్కొనఁజాలుదురే? కావున నందఱ మీక్షణమునఁ గురురాజునకు బాసట గాఁ గదియవలయు. పార్థుఁ డనుసాగరంబున దుర్యోధనుఁ డనునావ మునింగినపదంపడియీగోవులు నీధనమంతయు నేల యని చెప్పి యందఱుం బురికొల్పికొని దుర్యోధనునకు బాసటయై చనిరి. అంతలో నర్జునుండు గోగణముఁ దఱియం జేరితనపేరు సెప్పి గోగణరక్షణార్థంబు నియమించినసేనపై శరవర్షంబుగురి

సిన నాసైనికులు మంటలోఁ బడినమిడుతలట్లు పార్థబాణజాలమున మునింగి భూమ్యంతరిక్షముల గుఱుతెఱుంగనేరక చీకాకువడి యమ్మేటివిలుకాని నేర్పుఁ బొగడుచుఁ దొలఁగి పాఱుటయు నర్జునుఁడు దేవదత్తంబుఁ బూరించి ధనుష్టంకారంబు నిగిడించినం గేతనభూతము లార్చె. ఆధ్వనికిఁ బుడమి వడఁకుచుండ నర్జునప్రేరితంబులై గోగణంబులు మఱలి తోఁకలు మీఁది కెత్తి దక్షిణముగఁ బాఱె.



అర్జునుఁడు కురుసేనంగవియుట.

అవ్విధమునఁ బసుల మఱలించి పాండవమధ్యముండు దుర్యోధనుం దలపడి నడచుచుండఁ గురువీరు లనేకు లాగాంధారీనందనుఁ దలకడచివచ్చుటయు ధనంజయుండు భూమింజయుం బిలిచి రాధేయుం జూపి చూచితే వీని నితండె దుర్యోధనుమన్ననకుఁ బాత్రంబై క్రొవ్వి వానిప్రధానపురుషుఁ డనఁ బేరు వడసినకర్ణుఁడు. వీఁడెప్పుడును నేనుఁగుతెఱంగున నాతో నెక్కటెక్కటిపోరితంబు సేయఁ దలఁచియుండు. వానిచక్కటికి మనయరదంబుఁ బోనిమ్మనిన వైరాటి యతిరయంబునఁ గర్ణున కెదురుగా రథముఁ బఱపించుచుండఁ జిత్రసేన; సంగ్రామజి, జ్జయ, శత్రుసహ, వికర్ణప్రముఖు లయినకుమారవీరులు కర్ణుఁ దలకడచి యర్జునుం దాఁకుటయు నవ్వీరుండు గినిసి కార్చిచ్చు శుష్కకాననంబుఁ బొదివినచందంబున బాణానలజ్వాలల నాకుమారుల నీఱుసేయురీతి నురువడించిన నాసమరంబు తుములం బయ్యె. అపుడు వికర్ణుఁ డుక్కుమిగిలి యక్కిరీటిపైఁ బెనుగోలలఁ బెలుచ గుప్పించిన నమ్మేటిమగండు గండడరి వానివిల్లు ద్రుంచి యెక్కెముఁ దునియ నేయుటయు వాఁడు తొలఁగి చనియె. అంత నవ్విధమున నమానుషకృత్యములం జేయుచుఁ బగతుర గీఁటడంచుచున్న వివ్వచ్చువిక్రమంబు సైఁపక శత్రుంతపుఁడు విపులవిక్రమంబు మెఱయఁ బార్థుపై శరజాలముఁ గురియించిన నవ్వీరశేఖరుండు తదీయసారథిం బదియమ్ములఁ జదిపి వానిపై నయిదుతూపు లడరించిన నం దొక్కబాణంబు మైమఱువు సించి ఱొమ్మువ్రచ్చినం బర్వతాగ్రమునుండి మహావాయువిధూననమున డొల్లిపడుమహీరుహంబుచందంబున నాశత్రుంతపుఁడు రథమునుండి నేలం బడి గతాసుఁ డయ్యె. మఱియుఁ బెక్కండ్రుకుమారులు పార్థుం దాఁకి వానియలుగులమంటలోఁ బడి మిడుతలవడువున ద్రుగ్గిపడుచుండ నగ్గాండీవి వేసవిం బేర్చినకార్చిచ్చుపగిది వెలుంగుచు మహావాయువు మేఘపటలింబోలె శత్రులఁ జిందఱవందఱచేయుచు వికర్ణునిగుఱ్ఱములఁ జదిపి సంగ్రామజిత్తుతలఁ దఱిగి సేనంగలయం దిరుగుచుండఁ గర్ణుఁడు భ్రాతృవధశోకపీడితుండై కోపాటోపంబునఁ బర్వతశిఖరములం గోరాడవచ్చునేనుంగుభంగి భూమింజయధనంజయుల నెదిరించి బలీవర్దంబులపైఁ గవియుక్రోల్పులిరీతిఁ గడిమి మెఱయఁ బార్థుం గవిసి వానిమేనఁ బండ్రెండమ్ము లేసి గుఱ్ఱములపైఁ బెక్కుబాణముల నాటి విరాటపు

త్రుకరతలంబున నొక్కబాణంబుఁ గీలించుటయుఁ గిరీటి గరుత్మంతుఁడు పన్న గంబునుంబోలె వానిం దాఁకి యనేకనారాచంబులఁ గురియించిన సైనికు లంద ఱు నమ్మహారథులపోరాట వెఱఁగుపడి చూచుచుండిరి. అంతఁ గుంతీనందనుండు రోషపరీతుండై ఘోరనారాచవర్షమునఁ గర్ణుని రథరథ్యసారథిసహితముగాఁ గప్పిన నతండు ప్రతిబాణము లేసి వాని నడంచి ధనుర్బాణసహితుండై విస్ఫులింగాగ్ని భంగి వెలుంగుచు గొనయమ్ము సారించుచుండం గురుసైన్యంబునం గరతలాస్ఫాల నరవంబును శంఖభేరీపణవాదివాదిత్రనాదంబునుం జెలంగె. ధ్వజాగ్రవానర ఘోరారవంబును గాండీవజ్యావినిర్ఘోషణంబును శత్రుభీషణంబు గాఁగ శత్రువ ధోద్యోగంబునం బేర్చి భీష్మద్రోణకృపులదెసం జూచుచుఁ గర్ణునిపై శరజాలం బుఁ గురియించువివ్వచ్చుం జూచి కర్ణుండును బాణజాలమున రథరథ్యసారథిసహి తంబుగానర్జును నాచ్ఛాదించినం జూపఱువా రలం జూచి మేఘమండలావృతు లయినసూర్యచంద్రులనితలంచుచుండిరి. అట్టియెడఁ గర్ణుఁడువిజృంభించి పార్థుర థ్యముల నాలిగింటను సారథిని మూఁడింటను గేతుదండము మూఁడింటను నేసి నం గాండీవి కుంజరప్రహారంబున మేల్కనుపర్వతగుహాంతరప్రసుప్తసింహముచా డ్పున నత్యమర్షణుండై తోఁచిబాణజాలమున నతనిం గప్పి గాండీవంబుఁ గర్ణాం తాకృష్టంబుఁ గావించి పిడుగులంబోని వాఁడితూపుల రాధేయుశిరోలలాటకంఠ ముల గాడ నేసి నొంచిన నతండు సంగ్రామరంగంబుఁ దొలంగి పాఱిపోయె.

రాధేయుఁ డవ్విధమునఁ దొలంగిపోవుటయు దుర్యోధనాదులగుకుమారు లు వీఁక నెదిర్చి పెక్కుబాణము లేసినం బార్థుఁడు వేల సాగరంబు నట్టు లట్టు లా యోధుల నిలువరించి నవ్వుచు దివ్యాస్త్రచాతుర్యంబుఁ జూపుచు సూర్యుఁడు కిర ణజాలమున భూమి నావరించుపగిది బాణజాలముననానేనంగప్పి నొంచుచుండఁగ రథాశ్వగజకవచములలో నంగుళద్వయమాత్రంబేనియుఁ బాండవబాణవిద్ధంబు గానిది గానరాకుండె. ధనంజయుదివ్యాస్త్రప్రయోగచాతుర్యంబును భూమింజ యుసారథ్యనైపుణ్యంబును నందఱుం బ్రస్తుతించిరి. కాలాగ్నిచందమునఁ బ్రతాపా గ్నిం గాల్చుచున్నయర్జునుమొగంబుఁ జూడఁ గురుసైనికులు వెఱచిరి. అర్జునశర విద్ధంబు లయినసైన్యంబులు సూర్యకిరణవ్యాప్తంబు లయినమేఘశకలంబులచం దంబునఁ జూడ నొప్పె. పార్థబాణప్రహారంబునంజేసి మేనులు నెత్తుటం జొత్తిల్ల గ సైనికనికాయకాయంబులు పూచినమోదుగులపగిదిఁ దనరె. కిరీటిశరపాతం బునం దొరిగి బాణసంఘట్టనవశంబున మీఁది కెగరినపూదండలు ఛత్రములు ఱెక్కములు వాయుదేవుఁడు ధరించినమాల్యాతపత్రకేతనంబులవిధమునఁ జెలంగె. పార్థబాణప్రహారమున నొగలు విఱుగుటయు గుఱ్ఱములు చక్రము లీడ్చికొని పాఱు చుండె. గాండీవముక్తకాండంబులు కర్ణకటువిషాణాదు లగునెఱికలు నొంచినం

బడినగజములు మేఘములు నభస్తలంబునుంబోలె భూతలంబెల్ల నావరించె. అట్లర్జునుండు ప్రళయకాలానలంబు చరాచరాత్మకం బయినప్రపంచంబు నెట్లట్ల శత్రుసేనం దహించుచుండ సైనికులు తదీయాస్త్రతేజమునకును, గాండీవజ్యాని నాదంబునకును, గేతనకపిరవంబునకును, ధ్వజనిలయభూతగణభైరవారావంబునకును, దేవదత్తధ్వానంబునకును వెఱచి బల ముడిగి పడుచుండిరి. పక్షులంతట భార్గులు దీటినట్లువియత్తలంబు సూర్యకిరణజాలనిబిడితం బయినపాత్రంబురీతి విజయబాణమాలానీరంధ్రంబై యుండె. అవ్విధమున మహాభోగం బైనసర్పంబు సముద్రంబునంబోలె మెఱపు మెఱసినట్లొక్కచో నొక్కక్షణంబయిన నిలువకుండ సవ్యాపసవ్యమండలప్రకారంబుల నిజరథముఁ గురుసేనామధ్యంబున నుత్తరుండు పఱచుచుండ గాండీవి కాండజాలంబులఁ గురియించి సముద్దండభండనంబొనర్చుచుండ లక్ష్యవేధనిపుణంబులగునతనిశరములు తాఁకినం బడుచు సైనికులితండు కాలాంతకుండోకో యనియు, నర్జునజయార్థంబు దేవేంద్రుఁ డిట్లు చంపుచున్నాఁడుగాఁబోలు ననియుంబలుదెఱంగుల వితర్కించుచు నేలం గూలుటయుఁ దదీయశరీరస్రవద్రుధిరపూరమున ధూళీపటలం బడంగి యాయోధనరంగంబు నెత్తుటం జొత్తిల్లుచుండ నందుఁ బ్రతిబింబితంబై యంబరంబు సంధ్యారాగశోణితం బొరసినతెఱంగున నొప్పుచుండె. సూర్యుఁ డస్తముఁ బొందియు నొకవేళ మఱలినను సవ్యసాచి కురుసైనికుల జయింపక మఱలఁడని యందఱు వెఱచుచుండిరి. అంత విభ్వచ్చుఁడు గడిమి మెఱసి చేయంగలదొరలపై నడరి యాచార్యు డెబ్బదిమూడుతూపులను, దుస్సహుఁ బదియలుఁగులను, గురుపుత్త్రు నెనిమిదినారసములను, దుశ్శాసనుం బండ్రెండుకాండంబులను, గృపాచార్యుని మూఁడువాఁడికోలలను, బితామహు నఱువదియమ్ములను, రాధేయు నొకతీక్ష్ణబాణమునను నేసినం గర్ణుండు విరథుండయి పాఱుటయుఁ గురుసైన్యంబు చిందఱవందఱ యయ్యె. అపుడు వైరాటి కిరీటిం జూచి యీయున్నవార లెవ్వరు? ఎచ్చోటికిఁ దేరు దోలుదు ననియడుగ నర్జునుం డిట్లనియె.

అర్జునుఁ డుత్తరునకు గౌరవవీరుల వేఱువేఱ చూపుట.

లోహితాశ్వయోజితంబు వ్యాఘ్రచర్మావృతంబు నీలకేతనసమంచితంబు నగునారథము కృపాచార్యునియది. అతనికిఁ జక్కటిగా మనతేరు దోలుము. అమ్మేటివిలుకానికి శీఘ్రాస్త్రచాతురిం జూపుదు. కనకకమండలుకేతనోల్లసితుం డైనయల్లతండె ద్రోణాచార్యుఁడు. అతండు విలుకాండ్ర కందఱకు మాన్యుఁడు. నా కాచార్యుఁడు. అతనికిఁ బ్రదక్షిణముగ మనరథముఁ బఱపింపుము. అతండు తొలుత నాపై మార్గణంబులఁ బఱపించెనేని యూరకుండిన నవమానించె నని కోపము వచ్చునో యని తలఁకి యేనును మా జేయుదు. అతనికుఱంగట ధను

ర్వరవిలసిత కేతనంబువాఁ డశ్వత్థామ. ఆచార్యపుత్రుఁ డై నయతండును నాకును శస్త్రధారుల కందఱకును మాన్యుఁడు. మనరథ మతని కెదురు గాకుండఁ బఱపింపుము. సువర్ణకవచవిలసితనాగవరవిరాజితకేతనంబు గ్రాలఁగ నున్నయతండే దుర్యోధనుండు. అతండు తానే ద్రోణశిష్యులలో మొదటివాఁ డని దుర్మదమునఁ దలఁచుచుండు. మదీయాస్త్రవిద్యాచాతుర్యంబు వానికిఁ జూపవలయు. వానికట్టెదురుగా మనతేరు దోలుము. నాగకక్ష్యారుచిరకేతనంబుగలయల్లయతండే రాధేయుండు. వాని నీ వింతకుమున్న యెఱుంగుదువుకదా. వాఁడునాతో నెపుడును స్పర్ధ చేయుచుండును. వానితోడిసంగ్రామంబునం బ్రయత్నపరత్వమున నుండవలయు. దివ్యకవచంబునుగనకోష్ణీషంబును ధరించి తాళధ్వజవిలసితంబు వివిధచిత్రభాసురంబు నగునల్లరథంబునఁ గూర్చున్నయతండే కురుపితామహుం డై నభీష్ముఁడు. మేఘములముందట సూర్యునిచాడ్పున నతండు సేనాగ్రమున వెలుంగుచున్నవాఁడు. అతండు మాకును ధార్తరాష్ట్రులకుం దుల్యుఁడ యైనను వారియొద్ద నుండుటం జేసి వారికి బాసటయై వచ్చె. అమ్మహారథు నెదిరించి పోవలదు. పోయిన నతండు పెద్దయుంబ్రొద్దు పోరాఁడుఁగాని విడువఁడు. ఆలస్యం బగునం గార్యంబు దప్పు. అతండే మనల నెదిరించి వచ్చునేని వెఱవక యోలమాసగొనక మనతేరతనితేరికిఁ జక్కటిగ నిల్పు మనిచెప్పి యోధవీరుల వేఱువేఱ విరాటపుత్రునకుఁ జూపి చెప్పుచుండె. అట్టియెడఁ వారలయుద్ధము చూడఁగ నింద్రుఁడు కనకరత్నమయస్తంభసహస్రవిలసితం బై నసుదర్శన మనువిమాన మారోహించి వచ్చి యంతరిక్షమున నిలిచె. అతనితోడ విమానారూఢు లై వసువులు, రుద్రు, లాదిత్యులు, దిక్పాలకులు, మరుత్తులు, విశ్వదేవు, లశ్వినులు, సిద్ధులు, సాధ్యులు, యక్షగంధర్వరాక్షసమహోరగాదులు, పితృదేవతలును మహోరయమున వచ్చిరి. వసుమనో, బలాక్ష, ప్రతర్ద, నాష్టక, శిబి, యయాతి, నహుష, గయ, పూరు, రఘు, భాను, కృశాశ్వ, సగర, నళ, పాండుప్రభృతులగురాజులుం దమతమవిమానముల నారోహించి వచ్చుట నాకాశంబు విమానగణసాంద్రం బై చూడఁ జిత్రం బై యుండె. వారిసంతతవికచకుసుమపరిమళంబులఁ గొని తెచ్చుచామరవ్యజనవీజనమారుతంబులు వీరభటులయలయికలందీర్చె. తదీయకాంతిపుంజంబులు రేణుపటలము నణంచె. వివిధవర్ణవిమానమాలాపరీతుం డై పాకశాసనుండు పద్మోత్పలమాలికాపరీతుం డై న చాడ్పున నొప్పి నందనుసమరచాతుర్యంబుఁ జూచుచుండె. అంత నర్జునుండు విరాటపుత్రుం బిలిచి యాచార్యరథంబుఁ జూపి యల్లజాంబూనదవేదీపరిష్కృతరథంబునకు వలపటఁ గృపాచార్యుఁ డున్నవాఁడు. అతని కెదురుగా నిపుడు మనయరదముఁ బఱపు మనిన నతం డట్ల యని కురుసేనం దఱియ నరిగి యటగార

వులు చెయ్వులు దక్కి చూచుచుండ నతిరయమున నతనికిఁ బ్రదక్షిణముగాఁ నరదముఁ దోలి శారద్వతునెదుట నిల్పుటయు విపశ్చిద్వరుఁడు తనపేరు సెప్పి దేవదత్తంబు నొత్తె. కొండ లవియుతెఱంగున నెంతయు వెఱపుఁ గావింప నాపు నాశంఖధ్వానంబు విని కురుసైనిక లద్దిరా యర్జునుఁ డిట్లు పెల్లొత్తిన నేలొకో నూఱు వ్రయ్యలుగఁ బగుల కున్నయది. కొండలపై వజ్రంబు పడినట్లు దీనిధ్వని యాకాశంబు నిండి మఱలి పుడమిం బ్రబలుచున్న దని తమలో శంకించుచుండిరి.

### కృపుఁ డర్జునుతో యుద్ధము చేసి తొలఁగి పోవుట.

అంతఁ గృపాచార్యుఁ డానినాదంబు సైరింపక నిజశంఖముఁ బూరించి తన్నినదమున ముల్లోకముల నిండించి విల్లు చేతఁ గొని గొనయమ్ము సారించుటయు నయ్యిద్దఱువీరులు శారదనీరదంబులచందంబున నొప్పి యిరువురు సూర్యులోనాఁగఁ దేజు నెఱపి పోరాడందలంచినిల్చినం గౌతముఁడు మర్మభేదనచణములయిన మార్గణములఁ బదింట నర్జును నేసె. ఏయుటయు నతండుగాండీవమునసంధించి యనేకబాణములఁ బ్రయోగించినం గృపాచార్యుఁడు ప్రతిబాణము లేసివానినడుమన తుత్తునియలు గావించుచుండె. అంతఁ బార్థుండు గన్నుఁగవఁ గెంపుగదురఁ జిత్రమార్గములఁ జూపుచు వాఁడితూపులఁ బెక్కు లేసి దిక్కులెల్లఁ గప్పి యంతరిక్షంబెల్ల నేకచ్ఛాయంబు గావించి శరవర్షమున శారద్వతుని ముంచిన నతండు మెల్లనదెప్పఱిల్లుకొని పదితూపుల నాపార్థుపై నేసె. ఏసిన నమ్మేటివిలుకాఁడు ప్రతిశరంబుల వాని మాయించి శీఘ్రలాఘవంబు మెఱయఁ బావకోపమము లయినబాణముల నాలుగేసి యతనిగుఱ్ఱములం గాడ నేసినం గుఱ్ఱములు తటాలున నెగరుటయుఁ గృపాచార్యుఁడు తేరిలోఁ జదికిలఁ బడియె. స్థానచ్యుతుం డైనయయ్యాచార్యుపైఁ బార్థుం డేమియు నేయక గౌరవంబుఁ బరికించి యూరకుండె. అంతఁ గొంతవడి కతండు లేచి లెస్స కూర్చుండి కంకపత్రవిలసితంబు లయినపదిబాణంబులఁ బార్థుపై నేసిన నమ్మేటి విలుకాఁడు నిశితభల్లమున నాగౌతమునివిల్లు దునిమి వేఱొక్కబాణమునఁ దలత్రాణంబు ద్రెవ్వ నేసి పదియమ్ముల మైమఱువు సించిన నతం డాకంకటంబు పుచ్చివైచె. అపు డతనిమేను నిర్మోకముక్తం బైనభుజంగకాయంబుచాడ్పున దర్శనీయం బై యుండె. అంతఁ గృపుఁడు మఱియొకవిల్లు గొని యద్భుతంబుగా నతివేగంబున మోపెట్టుచుండ గాండీవి వేఱొకశరము నేసి దానిం ద్రుంచె. అంత నతండు మఱియొకశరాసనంబుఁ గొనుటయు నర్జునుండు దాని నఱికె. అట్లు బహుకార్ముకముల భంజించినం గౌతముండు ప్రదీప్తాశనిసన్నిభం బైనశక్తిం బ్రయోగించినం గ్రీడి పదితూపులఁ బఱపించి దాని నడుమన నఱుకుటయు నది పదితునియలై నేలం బడియె. అత్తెఱంగునశక్తి వమ్మగుటయు

శారద్వతుండు వేఱొకకోదండంబుఁ గొని యగ్నికల్పంబు లయినశరంబులఁ బదిం టఁ బార్థుపైఁ బ్రయోగించిన నతండు క్రోధారుణితలోచనుండై పదుమూఁడు తూపుల నతనిపైఁ బఱగించి యొక్కటఁగాఁడిని విఱిచి నాలుగింట నాలుగుగుఱ్ఱము లను బదిపి యేకబాణమునసారథితలఁ ద్రెవ్వ నఱికిమూఁటఁ ద్రివేణుభంగముఁ గా వించి రెంట నక్షముఁ ద్రుంచి యొకభల్లమునఁ గేతనదండముఁ గూల్చి నవ్వుచు వజ్రసన్నిభం బైనయొక్కబాణమున సారథికునురమ్ము గాడ నేయుటయు నాకృ పాచార్యుఁడు విరథుండై తేరు డిగ నుఱికి గదం బ్రయోగించినం బార్థుఁడు దాని నడుమన తునియలు గావించె. అంతఁ గురువీరులు కొందఱు కృపాచార్యునకు బా సటమై యర్జునుం దాఁకి వానిశరవర్షము సైరింపక యాఘాతము గొనిపోయిరి.

## ద్రోణుం డర్జునునితో యుద్ధము చేసి తొలఁగిపోవుట.

అవ్విధమునం గురువీరులు కృపాచార్యుం దొలఁగించికొనిపోయిన నాచా ర్యుండు తన్ను మార్కొనవచ్చుటం జూచి సవ్యసాచి యుత్తరున కిట్లనియె. శోణతురంగమయోజితంబు కాంచనవేదికోల్లసితకేతనసమంచితంబు నగునల్లతే రెక్కి యాచార్యుండు సమరసన్నాహముతో న న్నెదిరించి వచ్చుచున్నాఁడు. అయ్యాచార్యునిమహిమంబు చెప్ప నలవిగాదు. అతండు మహాతేజుఁడు మహాబ లుఁడు సర్వలోకవిశ్రుతవిక్రమవిలసితుండు. బుద్ధిం దైత్యాచార్యున కెనవచ్చు. నీతిపరిజ్ఞానమున సురాచార్యునకు సాటి యగు. నాలుగువేదంబులు ప్రయోగ సంహారపూర్వకసర్వాస్త్రతత్త్వంబు నతనిసొమ్ము. క్షమాదమసత్యానృశంస్యార్జవ బ్రహ్మచర్యంబు లతనికి నిత్యంబులై యుండు. తామ్రాస్యంబులు ప్రియదర్శ నంబులు నగునతనిరథ్యములు సర్వశిక్షావిశారదములు. ఇపుడు నా కతనితోడఁ బోరాట గా నున్నది. కావున నేర్పుమై నతిరయంబున నతనిచక్కటికి మనయర దంబుఁ దోలుమనుటయు నవ్విరాటపుత్రుఁడు పాండుపుత్రురథంబు భారద్వాజర థమున కెదురుగఁ బఱపె. భారద్వాజుండును దన్ను మార్కొన వచ్చుచున్నప్రియ శిష్యుం గనుంగొని మదగజంబుచందంబు దోఁప నెదిరించి శంఖంబు పూరించె. భేరీశతనినాదసన్నిభం బయినదానిధ్వనికి బలంబెల్లఁ గలంగె. సాగరంబులు సం క్షుబ్ధంబు లయ్యె. హంసవర్ణమిశ్రితంబు లైనయతనిశోణాశ్వములం గాంచి చూ పఱు వెఱఁగందిరి. సంగ్రామరంగంబునం గలిసినయయ్యాచార్యశిష్యులం జూచి వీ రిఁక నెంత చేయుదురో యని సైనికులు భయమున వడఁకుచుండిరి. అంత నర్జునుఁడు సంతోషంబుతో నవ్వుచుఁ దనయరదము నాచార్యునరదముఁ గదియం బఱపించి యయ్యాచార్యున కభివాదనంబుఁ గావించి సామపూర్వకంబుగా నిట్ల నియె. పెద్దకాలం బడవుల నిడుమలఁ బడినయందులకుఁ బ్రతిక్రియం జేయఁ దలంచి వచ్చితిం గావునఁ గినియవలదు. మీరుమున్ను బాణమేసినఁ బదంపడి నే నేయుదు

నని యున్నవాఁడ నని విన్నవించుటయు ద్రోణాచార్యుఁ డ ట్లందుల కియ్యకొని యతనిపై నిరువదియమ్ముల నేసినం గిరీటి వానినెల్లఁ దునియలు గావించె. భారద్వాజుం డంతటఁ దనయస్త్రవిద్యాచాతుర్యంబు నెఱయ శరసహస్రం బేసి పార్థరథము నావరించిన నతండును వానికిఁ బ్రతిబాణంబు లేయుచుఁ జాతుర్యంబుఁ జూపుచుండఁ దుల్యవిక్రము లయినయాగురుశిష్యులసంగ్రామంబు మెచ్చుచు సకలజనులు ద్రోణుని మార్కొని చేవ చెడకుండఁ బోరాడఁగ నర్జునుండ నేర్చు నని ప్రశంసించుచుండిరి. అటఁ గుంభసంభవుండు కడిమి మెఱసి గొనయము సారించి తరణికిరణప్రచారం బించుకేనియుఁ గలుగకుండ గాండీవిరథము బాణవర్షమునం గప్పి యమ్మహారథుపై వాఁడితూపులఁ బెలుచ నేసిన నాభండనశౌండుండు గండడరి గాండీవజ్యాఘోషంబు భీషణంబుగా నాచార్యుం డేసినశరములఁ బ్రతిశరముల ముహూర్తమాత్రంబున మాయించి యేదిక్కు చూచినం దననారాచంబులకాఁ జీఁకటి గప్పికొన రోదసీకుహరం బావరించి యాకాశంబున నేకచ్ఛాయం బఱపించినం జాపాచార్యుండు ప్రజ్వలితార్జునశరప్రచ్ఛన్నస్యందనుండై జాజ్వల్యమానకులపర్వతంబుచాడ్పున వాయుసంచారమునకేని యెడలేకుండ నొప్పి కార్ముకమౌర్వి సారించి యగ్నిచక్రోపమం బైనఘోరనారాచజాలంబు గుప్పించినం గినిసి పాండుపుత్రుండు వెండియుం గాండప్రకాండంబులం బ్రయోగించిన నయ్యిద్దఱు మేటివిలుకాండ్రశరంబులు దవదహనదహ్యమానవేణుపుంజంబులట్లు కతిల్లుపెతిల్లు మన నొండొంటిం దాఁకి యెక్కడఁ జూచిన శరాసారంబుగా శరదాగమసమయంబునం గూడుహంసజాలంబుల తెఱంగున నొప్పి వియచ్చరుల కచ్చెరువాపాదించుచుండె. అక్కరణిం గురుశిష్యులు కొఱవులు మెఱసిన తెఱంగున సంగరాంగణంబు గలయం దిరుగుచు విలువిద్య నేర్పుఁ జూపుచుఁ జలము నెఱయఁ గడిమి మెఱయ వృత్రవాసవులవిధమునఁ బోరాడుచు నైంద్రవాయవ్యాగ్నేయాదు లగుదివ్యాస్త్రంబుల నేయుచుఁ బ్రత్యస్త్రముల మాయించుచు వీరవిక్రమవిహారంబు సల్పుచుండినం బార్థబాణప్రహారనిస్సరద్రుధిరపూరంబునం జేసి సైనికనికాయకాయంబులు పూచిన మోదుగులచందంబున నొప్పుచుండె. మఱియుఁ గొండలపైఁ బిడుగులు పడినవడువున వివ్వచ్ఛునారసము లంతటం బడుచుండినం దత్ప్రహారంబునం జేసి యెచ్చటఁ జూచినం గూలినయేనుంగులు జదిసినగుఱ్ఱములు విఱిగినరథంబులు దునిసినచెక్కంబులు ద్రెళ్లినయోధుల వివిధాలంకరణోల్లసితకబంధములు దెగినతలలుంగా సంగరాంగణంబు బీభత్సం బయ్యె. అర్జును బాణసంధానప్రయోగవిభ్రమ శిక్షాలాఘవదూరపాతదృఢముష్టిగ్రహణప్రభృతిచాతుర్యంబుల కయ్యాచార్యుండు విస్మయంబుఁ జెందుచుండె. వియచ్చరులెల్ల నద్దిరా! సురాసురాదుల గెలిచినయర్జునుం గుంభసంభవుండు మార్కొని పోరాడుచున్న

వాఁ డని ద్రోణాచార్యుం బ్రశంసించిరి. అంత నర్జునుండు గాండీవంబున సంధిం చియతిరయమ్మున నెక్కుడుమ్మడిగ శతసహస్రబాణము లేసి ద్రోణాచార్యునరద మావంతయేనియుం గానరాకుండ నావరించినం గురుసైన్యంబున హాహాకారం బెసంగె. గాండీవిచాతుర్యంబు నింద్రాదినిర్జరులును మెచ్చిరి. అట్టియెడ నశ్వత్థా మ పార్థునస్త్రవిలాసంబు మెచ్చుచు ననేకరథపరివృతుండై కన్నుఁగవఁ గెంపు గ దురఁ గిరీటిఁ దాఁకి ప్రావృట్పయోధరంబుచాడ్పున నంపతుంపరం గురియించు టయు నమ్మహారథుండు కోపారుణితలోచనుండై యాచార్యుపెక్కెముఁ గూల్చి మైమఱువు సించి నొంచిన నశ్వత్థామపైఁ నడరి తదీయబాణములఁ బ్రతిశరంబు లఁ దుత్తునియలు గావించుచుఁ గడిందిమగంటిమిఁ జూపుచుండ నది సమయం బుగాఁ గొని యాచార్యుండు తొలఁగి చనియె.

## అశ్వత్థామ యర్జునునితో యుద్ధము చేయుట.

అ ట్లశ్వత్థామార్జును లొండొరులం దాఁకి వృత్రవాసవులచాడ్పునఁ గడిమి మెఱసి యంపతుంపరం గురియించుటయు వారిపోరు ఘోరం బయ్యె. అపుడు సూర్యుఁడు లెస్సగఁ బ్రకాశింపఁ డయ్యె. వాయువు వీవఁ డయ్యె. ఆకసంబున నీడలుగప్పె. తదీయపరస్పరశరప్రహారంబున వేణుగుల్మములు దహించు తెఱంగునఁ జటచ్చటాశబ్దంబు నిగిడె. అటఁ గిరీటి విక్రమించి యాచార్యపుత్రుగర్యములగాడ నేసిన నవి నొచ్చి దిగ్భ్రమంబుఁ జెంది యిటునటుం బోవుచుండ నతనివిల్లు ద్రుంచు టయు నశ్వత్థామ కోపాటోపదీపితుండై వేఱొకవిల్లు గొని వాఁడినారసంబున గాం డీవిమార్విం ద్రెంచుటయు నతిమానుషం బయినయాకార్యమును దేవతలు భీష్మ ద్రోణకృపకర్ణులుం బ్రశంసించిరి. అంతలో నశ్వత్థామ గుఱ్ఱములననునయించి రథముఁ జక్కగ నిలిపి కంకపత్రవిచిత్రంబు లయినదివ్యమార్గణంబులం గ్రీడి ఱొమ్ము గాడ నేయుటయు నమ్మేటివిలుకాఁడు నగుచు గాండీవంబునం గ్రొత్తగొన యంబు సంధించి యశ్వత్థామపై నర్ధచంద్రబాణం బేసి విక్రమాటోపంబుఁ జూ పుచు వాఁడితూపులం బఱఁగించుటయు మదగజసమానులై నవారలసంగ్రామంబు భీమంబై చూపఱకు విస్మయావహం బయ్యె. అట్లు పోరాడుచుండి గాండీవి యు ద్దండుండయి యక్షయ్యతూణీరంబులం బాణములు క్షణక్షణంబునకుఁ బెరుగు చుండ నప్పటప్పటికి విక్రమించి కొండవోలె నచలుండై నిలిచి శరజాలంబు గుప్పిం చిన నశ్వత్థామ దొనల నలుగుఁలు తఱుఁగుటయుఁ బ్రతిశరము లేయఁ జాలక సందడిం బడుచుండఁ గర్ణుం డతనిఁ దలకడచి క్రీడిం దాఁకి కార్ముకమౌర్వి సారించి యొక్కుమ్మడిగఁ బెక్కమ్ము లేసిన హాహాకారం బెసంగె.

## కర్ణుఁ డర్జునుతో యుద్ధముఁ జేసి పాఱుట.

అంత రాజపురుషు లశ్వత్థామకు బాణములు దెచ్చి యిచ్చునంతలో

నతని విడిచి కిరీటి కోపారుణితవివృత్తనేత్రుండై గొనయమ్ము సారించుచున్న రాధేయుం జూచి వానికట్టెనుట మెఱసి యిట్లనియె. కర్ణా, దుర్యోధనసభామధ్యమున నందఱు వినంగ సమరమున నాకంటె నెవ్వఁడు నధికుఁడు గాఁ డని పలుకుచుంటివిగదా. ఆయడిబీరపుఁబలుకులకెల్ల సమయంబు వచ్చె. ఇపుడు నాతోఁ బోరాడి నీబలం బింత యనిమెఱింగిం గొని యిఁక నెన్నఁడైనను శూరుల నవమానింపకుము. ధర్మము విడిచి నోరికి వచ్చినట్లు దుర్యోధనుఁడు మెచ్చఁగఁ బ్రల్లదము లాడినట్లు గాదు. చేయరానినాతోడిపోరాటఁ జేయవలయు. నాపరోక్షమునం బలికినపలుకులెల్ల నిపుడు దలపోసి యప్పటిపౌరుషం బంతయుఁ జూపుము. నాఁ డాసభలోఁ బాంచాలిం గుఱించి పలికిన దురాలాపములకు ఫలం బిపుడు గుడువుము. నాఁడు నేను ధర్మపాశమునకుఁ జిక్కి నీదురాలాపములు సైఁచితి. అందులకుఁ బ్రతిఫలం బిప్పు డనుభవింతువు. నీసైనికు లందఱు నావిక్రమంబును నీపాటునుం జూతురుగాక యనినం గర్ణుఁ డిట్లనియె. పార్థా, మాటల నేమి ప్రయోజనము? కార్యమున నీబీర మంతయుఁ జూపుము. తొల్లి శక్తిలేమిం జేసి నాపలుకులు సైఁచితివిగాని యొండేమియుం గాదు. నిక్కంబ నీవు ధర్మపాశబద్ధుండవై యోర్చినవాఁడవయేని యిపుడు చూతముగదా. ధర్మపాశముననుండె, భయముననుండెా, గారణాంతరముననుండె బద్ధుఁడవయ్యె నట్లు గానియట్లు భావించెదవు.అదియెల్ల నిపు డేల? వనవాసవ్రతంబు యథోక్తంబు నడపి నీచెప్పినట్లే ధర్మపాశనిబద్ధుఁడవేని యలజడికోర్చి నాతోఁ బోరాడుము. ఇంద్రుఁడు నీకు బాసటగా వచ్చినను నేనెతఁ జెందక నిన్ను మార్కొని గీటడంతు. చిరకాలాభిలషితంబు నేఁ డొడఁగూడె. నాబలంబు నేఁడుగదా చూతు వనిన నర్జునుఁ డతనికి వెండియు నిట్లనియె. రాధేయా, సిగ్గు లేక యిట్లు పలుక నేల? ఇంతకు మున్న కాదె నీవు నన్ను మార్కొని కొంతొకపడి పోరాడుచుండి యట నాయెదుట నిలువ నోపక తమ్ముఁడు చచ్చినను బాఱితివి. తమ్ముఁడు శత్రుచేఁ జచ్చినం దనప్రాణముల కాసపడి పాఱునట్టిమగవాఁడు నీవుదక్క నొండొకఁ డుండఁడు. అట్లు బీరము గోల్పోయి పాఱియుఁ బెద్దలు వినుచుండ నిట్టు లీయడిబీరపుఁదులువతనంబునఁ బ్రల్లదములఁ బలుకనీవ నేర్తువు. ఇవియెల్ల నీకుఁ జెప్ప నేల? రమ్మని పలుకుచు వానిందలపడి కవచభేదనచణంబు లయినఘోరనారాచజాలంబులఁ గురియించి యతనిరథ్యములు బాహువులు తలత్రాణంబులు గాడ నేసి తూణీరం బొకండు దెగనేసినం గినిసి యంగరాజు వేఱొకతూణీరంబునం గలబాణములం గొని వింట సంధించి లాఘవము మెఱయఁ బ్రయోగించి యర్జునుముష్టిబంధము శిథిలము గావించె. పాండవమధ్యముం డందులకుఁ గడుం గినిసి గాండీవనిర్ముక్తం బయినతీక్ష్ణమార్గణంబునఁ గర్ణునివిల్లు దునుముటయు రాధేయుండు క్రోధవిధేయుండై శక్తిం బ్రయోగించినం

గాండీవి నిశితశరములదాని నడుమన తునియలు గావించి యతనికి బాసటమై వచ్చినవీరయోధులం బెక్కండ్ర యమపురికిఁ బంపి యంత నిలువక కడిమి మెఱయ నతనిరథ్యములఁ గూల్చి యొక్కతీక్ష్ణనారాచంబున నురస్తలముఁ బ్రహరించిన నవ్విశిఖంబు మైమఱువు సించి బొమ్ము వచ్చుటయు నవ్వీరుఁడు మోహావిష్టుండై సమరముఁ జాలించి యుత్తరముగఁ బాఱిపోయె. ధనంజయభూమింజయు లార్చిరి.

అంతనర్జునుం డుత్తరుం బిలిచి యదె భీష్ముఁడు నాతో నని సేయ నున్న వాఁడు. తాళధ్వజవిరాజితం బయినయతనియరదమున కెదురుగ మనయరదముఁ బోని మ్మనిన నుత్తరుండు గజవాజిరథభటసంకులం బైనయాసైన్యముఁ గనుఁగొని యంతకుమున్న వివిధబాణప్రపీడితుండు గావున నెంతయు విహ్వలుండై కుంతీపుత్రున కిట్లనియె. మహారథా, నీకు సారథ్యము సేయ నే నోపను. దివ్యాస్త్రముల నీవు కౌరవవీరులుం బ్రయోగింపఁగ నవి నలుదెసలం బఱచుచుండఁ దదీయతేజంబునకు నాప్రాణములు విమణ్ణతం బొరయు. మనంబు విన్నఁబోవు. భవద్బాణనికృత్తసైనికశరీరవసారుధిరమేదోగంధముల నీవు చూచుచుండఁగ మనస్సునిలువరింపనేరక మూర్ఛితుఁడనయితి. మీయట్టిశూరశిఖామణులు పోరు సేయ నే నెన్నఁడుం జూచినవాఁడనుగాను. గదాఘాతనిస్స్వనంబును, శంఖారవంబును, శూరజనసింహనాదంబును, గజబృంహితంబును, హయహేషితంబును, వజ్రసమగాండీవజ్యాఘోషంబును వినఁగఁ జెవులు బీటలువాఱు. స్మృతి దప్పెం. కొఱవి ద్రిప్పిన చొప్పున నీవుగాండీవంబుఁ ద్రిప్పుచుండ నాచూడ్కి సంచలించు. హృదయంబు బెండువడు. క్రుద్ధుఁడై నపినాకపాణిచాడ్పునఁ గయ్యంబునఁ గ్రోధోద్దీపితుండవై యున్ననీమూర్తిఁ జూడ వెఱపు గలుగు. నీవు గాండీవం బెప్పు డాకర్షింతువో యెప్పుడు బాణంబు సంధింతువో యెపు డేయుదువోగాని పరికించి చూచియు నెఱుంగఁ జాలనయ్యెద. నే నెంతయు విహ్వలుఁడనైతి. పుడమి యంతయుం జలించునట్లు తోఁచుచున్నది. పగ్గముల బిగియింప నశక్తుఁడ నైతి ననిన విని యర్జునుఁ డతని కిట్లనియె. ఉత్తరా, వెఱవ వలదు. శత్రుదనునం బనఁ బ్రసిద్ధం బైనరాజకులంబునం బుట్టిననీ కిట్టివి యద్భుతంబులే? ధైర్యముఁ బూని సారథ్యముఁ జేయుము. మనయరదము భీష్మున కెదురఁ బఱపింపుము. అతనిధనుర్జ్యావిచ్ఛేదనంబుఁ జేయుదు. మెఱుపు మెఱసినతెఱంగున నేను సేనాముఖంబునఁ జిత్రముగ మెఱసి దివ్యాస్త్రములఁ బ్రయోగించుచున్నఁ జూచి కురువీరు లితండు సవ్యహస్తమున బాణప్రయోగముఁ జేయుచున్న వాఁడో వామకరమున శరములఁ బఱపుచున్న వాఁడో యనివితర్కించుచుండ విక్రమాటోపదీపితుండనై శోణితసలిలంబు చక్రావర్తంబు నాగనక్రంబు నగుపరలోకనదిం బఱగింతు. పాణిపాదశిరఃపృష్ఠబాహుశాఖానిరంతరంబు నరసింహాభిరక్షితంబు నగుకురుసైన్యవనంబు విఱిచి కార్చిచ్చుపో

గిరిం బేర్చి నూఱుతెరువులం దిరుగుచుఁ జిత్రంబుఁజూపుము. సమవిషమదేశములం దత్తఱపడక రథంబున నిలుము. నిన్నొరసికొనియున్న కొండనైనం బాణజాలముల భేదింతు. ఇంద్రనిదేశమున దేవదానవాదుల కజేయు లగు పౌలోమకాలకేయనివాతకవచు లనురాక్షసుల వధించితి. రుద్రాదిదేవతలవలనఁ దత్తదస్త్రముల సాధించితి. నే నుండఁగ నీకు వెల్లఁబోవ నేల? భయము విడువుమని యతనిం దగినభంగి నూఱడించి యిఁక నాలసింపవలదు. భీష్మునకుఁ జక్కటిగా మనయరదముఁ బఱపు మనుటయు విరాటతనయుండు విగతభయుండై శాంతనవసురక్షితం బైనకురుసేనావ్యూహంబున నరదంబుఁ బఱపించుటయు వివ్వచ్చుఁడు గడిమి మెఱసి యప్పితామహుటెక్కముఁ గూల్చి నిశితశరముల నతనిగాఢ నేసిన నయ్యాపగానందనుఁడు రథమున నొఱఁగె.

### అర్జునుఁడు కురుకుమారులం గెలుచుట.

అంత దుశ్శాసనవికర్ణదుస్సహవివింశతిప్రముఖు లయినకురుకుమారవీరులు శాంతనవుఁ దలకడచి బీభత్సుం దాఁకినం దుశ్శాసనుండు నిశితభల్లంబున వైరాటి నేసి వేఱొకవాఁడినారసంబునఁ గిరీటివక్షోభాగంబు నేయుటయుం గాండీవి క్రోధోద్ధతుండై వానికోదండంబు నఱికి యురమ్మున నైదమ్ములం గాఢనేసిన నతండు పార్థబాణప్రపీడితుండై పాఱె. అట వికర్ణుఁడర్జునుం దలపడి గృధ్రపత్రవిలసితంబు లయిననిశితశరంబులం గుప్పించినం గౌంతేయుం డొకనారాచంబు వానిఫాలభాగంబున నాటుటయువాఁడు రథచ్యుతుండై పడియె. పదంపడి దుస్సహవివింశతులు భ్రాతృరక్షణపరత్వంబునంజేసి పార్థుం గవిసి యలుగులవానఁ గురియించినం గాండీవి రెండమ్ముల వారలనొంచి రథ్యములఁ జదుపుటయు వారు విరథులు విభిన్నాంగులునై తొలంగిరి. అట్లు వివ్వచ్చుండు విచ్చలవిడిం జేయుచుండఁ గురుసేనం గలమహారథులు పెక్కం డొక్కపెట్ట గజబృంహితంబులు వాజిహేషితంబులు భేరీశంఖకాహళాదినిస్వనంబులు నెసంగఁ దుములంబుగ నగ్గాండీవిం గవిసి యంపతుంపరం బరఁగించుటయు నమ్మేటిమగం డందఱ కన్నిరూపులుగఁ దోఁచి నీహారంబునఁ గొండలంబోలె సాయకజాలముల నమ్మహారథులనెల్ల నావరించి శరత్సమయమధ్యందిన మార్తండునివిధమున వెలుంగుచు నొక్కయుమ్మడిగఁ బెక్కమ్ముల నేసినం బార్థశరప్రహారంబునంజేసి వైకల్యంబుఁ జెంది రథికులు రథములనుండి డొల్లిరి. అశ్వారోహులు గుఱ్ఱములనుండి పడిరి. కాలరులు నిశ్చేతనులై వ్రాలిరి. తామ్రరాజతాదు లయినకవచంబులు మహాస్వనంబుతోఁ గుప్పలుగఁ గూలె. సంగరాంగణంబు పీనుంగుపెంట యయ్యె. మఱియు యుద్ధరంగంబు తెగినతలలయుష్ణీషంబుల బాహువులయంగదాదిభూషణంబుల నావృతంబై యభిరామం బయ్యె. అయ్యాభీలసంగ్రామరంగమున లీలానృత్తంబు

సల్పు తెఱంగున వీరవిక్రమవిహారం బొనరించు విన్వచ్చునిగాండీవఘోషమునకుఁ దలఁకి సైనికులు వెనుక కొదుగుచుండిరిగాని యొక్కఁడైనను మోహరించి నిలువఁ డయ్యె. పార్థశరపాతంబునం బడుయోధవీరులతల లొండొంటిం దాఁకి పాషాణవర్షంబుగతిఁ గళిల్లుపెళిల్లు మనుచుండె. అ ట్లతండు పదుమూఁడేండ్లు డాఁచి యుండినక్రోధానలంబు ధార్తరాష్ట్రులపై గ్రుక్కుచుఁ బ్రళయకాలరుద్రునిమాడ్కి రౌద్రంబు నెఱపుచుండ నమ్మేటివిలుకాని ఘోరవిక్రమంబునకు వెఱచి దుర్యోధనుండు చూచుచుండఁ జేయునది లేక యందఱు శాంతిఁ బూని యూరకుండుటయు నతండు వారల నందఱం దఱుముచుండె. అత్తెఱంగున నాశక్రపుత్రుండు నిర్వక్రవిక్రమంబుఁ జూపి శోణితజలంబు, కేశశైవలంబు, శరచాపప్లవంబు, నాగకూర్మంబు, రథద్వీపంబు, తీక్ష్ణశస్త్రమహాగ్రాహంబు, ముక్తాహారతరంగమాలికాకలిలంబు, చిత్రాలంకార ఫేనబుద్బుదంబు, శరసంఘమహావర్తంబు, శంఖదుందుభిసంకీర్ణంబు, ఘోరరూపంబు నగుమేదోవసామాంసప్రవాహంబు దుస్తరంబుగాఁ బరఁగించుటయు ద్రోణకృపాశ్వత్థామకర్ణ దుర్యోధనదుశ్శాసన వివింశతిప్రముఖు లయినచేయంగలదొర లందువానియస్త్రగ్రహణశీఘ్రప్రయోగ లాఘవంబుల మనంబుల మెచ్చుచు నత్యంతసంరంభంబుతో సేనలకుఁ జేయివీచి యందఱం బురికొల్పుకొని యొక్కపెట్ట గవిసిన నతండు సంచలింపక వారలఁ దాఁకె. తాఁకులయు నమ్మహారథు లందఱు గాండీవిని డాసి యొక్కుమ్మడిగ శర వర్షముఁ గురియించి ద్వ్యంగుళమాత్రంబేనియు నవకాశము గానరాకుండ నవ్వవ్వచ్చునరదంబుఁ గప్పినం గౌంతేయుండు నవ్వుచు గాండీవంబున నైంద్రాస్త్రంబు సంధించినం దదస్త్రప్రభాపటల పరీతంబై యాకోదండంబు మేఘజాలంబున వెలుంగుమెఱుంగుతెఱంగునను గిరిశిఖరంబునం బ్రజ్వరిల్లు కార్చిచ్చుచాడ్పునం దేదీప్యమానంబై యింద్రాయుధంబురీతి వివిధవిచిత్రవిద్యోతంబు లంతట నెఱపుచుండినం దానిఁ జూడనేరక కురువీరులు నివ్వెఱఁ జెంది చెయ్వులు దక్కి విన్నఁబోయి సమరవిముఖులై ప్రాణరక్షణతాత్పర్యంబున నలుదెసలం బఱచిరి.

### భీష్ముఁ డర్జునుతో యుద్ధము చేసి తొలంగిపోవుట.

అంత గురుపితామహుం డైనశాంతనవుండు కురుయోధులవధంబునకుఁ గినిసి కనకకార్ముకంబును స్వర్ణపుంఖవిచిత్రంబు లయిననిశితశరంబులనుం గ్రహించి శ్వేతాతపత్రంబు స్యందనశిఖరంబునం గ్రాలఁగ సూర్యోదయసమయోదయగిరిశిఖరంబుకరణి ధార్తరాష్ట్రులు హర్షోత్కర్ష మొందఁగ నిజశంఖంబుఁ బూరించి బీభత్సునకు వలపటఁగాఁ దిరిగి కక్షైపుటం బొడగట్టె సంతోషంబుతోఁ దన కెదురై పోరికి నమకట్టియున్న సవ్యసాచిం జూచి రోఁజుచున్న పాములంబోలు నిశితశరముల నెనిమిదింట నతనిసెక్కెము నేసిన నాబాణములు కేతనకపిని

భూత గణములను నెంచె. అందుల కలిగి బీభత్సుండు నిశితభల్లంబునం గురుపితా మహునాతపత్రంబుఁ ద్రుంచి మఱియు ననేకశరముల నేసి కేతనంబుఁ గూల్చి రథ్యములను జక్రరక్షకసారథులను నొప్పించుటయు నతనివిక్రమంబు సైరింపక భీష్ముఁడు శరప్రయోగపాటవం బెఱింగినవాఁడయ్యు దివ్యాస్త్రముల సవ్యసాచిపయి నేసిన నమ్మహారథుఁడుం బ్రత్యస్త్రమున దానిమాయించుటయు వారిపోరు బలిశ క్రసమరంబుచందంబునఁ దుములం బగుటయుఁ జూపఱు వెఱఁ గందుచుండిరి. అట్టియెడ భీష్మార్జునశరము లొండొంటిం దాఁకి మింటి కెగసి ప్రావృట్కాలంబు మిడుంగుఱులట్లు చూడ నొప్పె. అటఁ బార్థుఁడు కడిందిమగంటిమి నెఱయఁ గరలాఘవంబు మెఱయఁ గొఱవి ద్రిప్పినచొప్పున సవ్యాపసవ్యప్రకారంబులం గాండీవంబుఁ ద్రిప్పుచు వార్షికవారిదంబు వారిధారలం బర్వతంబుపయి నెట్లట్ల శరవర్షంబుఁ గురియించినం గురుపితామహుండు సముద్రమునకు వేలయట్లు పార్థ బాణజాలంబు నాఁగి ప్రతిబాణంబుల వానిం దుత్తునియలు గావించిన నవి యొం డొంటిం దాఁకి యెగయుచుండె. పదంపడి ఫాల్గునుం డతిరయంబున ననేకశర ములఁ బరఁగించుడు నయ్యవి మిడుతలబారుతీరున భీష్మరథము నావరించుటయు నప్పితామహుఁడు వానినెల్లఁ బ్రత్యస్త్రముల నడఁచుటయుఁ గురువీరు లద్దిరా, భీష్ముఁడు లెస్స చేసె. బలవంతుఁడు దక్షుఁడు క్షిప్రకారియు నగునర్జునుం బోర మార్కొనఁగ భీష్ముఁడు వాసుదేవుఁడు ద్రోణాచార్యుఁడుం దక్కఁ దక్కటివారు వలంతులే? యని ప్రశంసించుచుండిరి. అట్లు వా రిద్దఱు పోరాడుచుండి కొం తవడి యైంద్ర, ప్రాజాప, త్యాగ్నేయ, రౌద్ర, కౌబేర, వారుణ, యామ్య, వాయవ్యాదు లయినదివ్యాస్త్రములం బ్రయోగించుచు సమరక్రీడ సల్పుచుం డ సకలభూతంబులు పార్థభీష్ములం బేర్కొని యయ్యా, మీరు లెస్స చేసితిరి. మనుష్యులపై నూరక దివ్యాస్త్రంబులం బ్రయోగింపరా దని పేరెలుం గెత్తి చెప్పె. ఆమాట విని వారు దివ్యాస్త్రప్రయోగములఁ జాలించి శరయుద్ధంబుఁ జేయం దొడంగియుండ గాండీవి నిశితభల్లంబున శాంతనవువిల్లు దునిమె. తును ముటయు నతండు తెప్పపాటులోన వేఱొక్కశరాసనంబు సజ్యంబు గావించి పె క్కుబాణముల నేసినం గిరీటియు క్షణమాత్ర నాబాణములనెల్లం బ్రతిబాణముల నడంచి వెండియుఁ గాండజాలంబుఁ బరఁగించె. అట్లు వా రొండొరులపై నతిర యంబున నంపతుంపరం గురియించుచు దెసలెల్ల బాణమయంబులకా నొనర్చుచుఁ బరస్పరజయేచ్ఛంజేసి విక్రమాటోపం బద్భుతంబుగా నెఱపుచుండఁ జూపఱు వారి లో నించుకేనియుఁ భేదంబుఁ గానరైరి. పాండవకాండప్రకాండంబులు భీష్మునితోడ వచ్చినరథికుల ననేకులం గూల్చె. పార్థభీష్ములశరంబు లొండొంటిం దాఁకి మిం టి కెగసి బారులుతీఱినయంచపిండువులయట్లు లొప్పియుండుటయుఁ జిత్రసేనుం

డనుగంధర్వనాయకుండు సురనాయకునకుఁ గేలుమోడ్చి దేవా, చూచితే పార్థభీష్మబాణంబు లుప్పరంబున నంచలబారుతీరునంగన్పట్టుచున్నవి. సవ్యసాచియస్త్రవిద్యాచాతుర్యం బెవ్వనియెడనుం గానము. శరగ్రహణసంధానమోక్షణధనురాకర్షణాదుల నతం డెప్పుడు చేయునోగాని పరికించి చూడ నించుకేనియుఁ దెలిపి గలుగ దయ్యె. మధ్యాహ్నమార్తండునివిధంబున నిండుతేజున వెలుంగుచున్నకిరీటిం గౌరవులు గన్నెత్తి చూడను వెఱచివెల్లపోయిరి. అట్లే గాంగేయుం గనుంగొననేరకున్నవారు. పార్థభీష్ము లిరువురువిశ్రుతతీవ్రతుల్యవిక్రములు. దుర్జయులు. వీరికి లాఁతివా రెవ్వరు సరిపోల్పఁ దగరని చెప్పినం బాకశాసనుండు వారిపైఁ బుష్పవర్షంబుఁ గురియించె. అంత శంతననందనుండు పాండునందనువామపార్శ్వంబు నిశితశరమున నొ నేసినం గిరీటి నవ్వుచు గృధ్రపత్రవిచిత్రంబయిన వాఁడినారసమున నతనివిల్లు దునిమి పదిబాణంబుల వక్షోభాగంబు గాడ నేయుటయు నప్పితామహుండు తత్ప్రహారంబున మూర్ఛితుండై రథకూబరముపై నొఱగి పెద్దయుంబ్రొద్దు చెయ్వులు దక్కియుండ రథికుండు మూర్ఛితుండైనఁ దేరు దొలఁగించుట కర్తవ్యం బనుసారథిధర్మంబుఁ దలంచి తదీయసారథి తేరు దొలఁగించి తోలుకొనిపోయె.

దుర్యోధనుఁ డర్జునుతో యుద్ధముఁ జేసి పాఱుట.

అంత దుర్యోధనుం డార్చుచు శత్రుగణమధ్యమున వీరవిక్రమవిహారంబు సల్పుచున్నయర్జునుం దాఁకి మౌర్విఁ గర్ణాంతాకృష్టంబుఁ గావించి శితభల్లంబు సంధించి లలాటభాగంబు గాడ నేసె. ఆబాణంబు ఫాలంబునఁ గీలితంబై కాంచనశృంగంబుచాడ్పున నొప్పుచుండఁగ నిస్సరన్నవోష్ణరుధిరధారాపరీతనిటలతటుండై పార్థుండు క్రోధావేశంబున విషాగ్నిసదృశంబు లయినతీవ్రాశుగంబుల దుర్యోధనుపై నేసె. అతండు నర్జునుపై బెక్కమ్ములం బ్రయోగించి విక్రమాటోపంబుఁ జూపుచుండ దాని సైఁపక బీభత్సుండు శరజాలంబు గుప్పించుటయు వికర్ణుండు పర్వతోపమం బయిన యేనుంగునెక్కి నలుగురురథికులతోడ నేతెంచి యర్జునుం దాఁకె. అర్జునుం డాకర్ణకృష్టవిసృష్టం బయినతీవ్రాశుగంబున నయ్యేనుంగు కుంభస్థలంబు వ్రయ్య నేసిన నది వజ్రాహతం బైనపర్వతంబువిధంబున నేలం గూలుటయుఁ దటాలున వికర్ణుం డేనుఁగు డిగ్గనుఱికి యెమన్నూఱడుగులు పఱచి వివింశతితే రెక్కె. అట్లు వికర్ణుండు పాఱినం బార్థుండు నిశితనారాచంబున దుర్యోధనునురమ్ము నొనేసినం దక్కటియోధులు గాండీవముక్తవిశిఖపీడితులై గతి దప్పిపాఱిరి. అవ్విధంబున యోధు లందఱుం బాఱినం దుర్యోధనుండు పార్థునకు వెఱచి పఱచె. అట్లర్జునబాణవిద్ధుండై నోట నెత్తురు గ్రక్కుచుఁ బఱచుచున్నదుర్యోధనుం బేగెలుం గత్తి పిలిచి యతండు భుజాస్ఫాలనంబు చేసి థా

ర్తరాష్ట్రా, కీర్తిం దొఱంగి యేల పాఱెదవు? ఇట్లు పఱచునపుడు తూర్యఘోషంబులు నుత్సవంబు లెక్కడఁ బోయెనోగాని యెఱుంగఁబడవు. నే నొక్కండను. పాండవులలో మూఁడనవాఁడను. పిన్నవాఁడనయ్యు సమరంబునంజలింపక నిలిచి యున్నవాఁడ. ఇందఱు బాసటమైయున్నం బాఱుచున్ననీకు సిగ్గు లేదో? యుధిష్ఠిరునానతిం జేయువాఁడ. మగవాఁడవేని నాచక్కటిం దిరిగి మొగముఁ జూపుము. రాజధర్మంబుఁ దలపోయుము. పెద్దలు పెట్టినదుర్యోధనుఁ డనుపేరు నేఁడు వ్యర్థ మయ్యె. ఇంతసైన్యంబున ముందటఁ గాని వెనుకఁగాని నిన్ను రక్షించువా రెవ్వరుం గన్పట్టరు. పిఱికితనంబునం బాఱెదవు. పొమ్ము. ప్రాణముల రక్షించికొను మని యుల్లసం బాడిన నామాటల విననోపక గాంధారేయుం డంకుశప్రహారపీడితం బయినమత్తగజంబుచందంబునను, బాదాహతం బైనపాముపగిదినిం దటాలున గ్రమ్మఱియె. అతండు గ్రమ్మఱి యర్జునుండాఁకుటం జూచి కర్ణుం డుత్తరంబుగ వచ్చి యతనికిం దోడ్పడియె. అంతలో శాంతనవుండు మూర్ఛదేఱి యధిజ్యకార్ముకుండై కురురాజునకుఁ బశ్చిమంబుగ నేతెంచి బాసటయయ్యె. ద్రోణకృపాశ్వత్థామ దుశ్శాసనవివింశతి ప్రముఖు లగుదొరలందఱు దుర్యోధనునకు ముందట నిలిచి తద్రక్షణపరత్వంబుననుండిరి. ఫాల్గునుండును మఱలివచ్చుచున్న యాయోధవీరులం జూచి తానువారలకెల్ల నెదురై సంగరోత్సాహంబునం బొలిచియుండె. అపుడు కురువీరులందఱు నొక్కయుమ్మడిగనంపతుంపరం గురియించుచుఁ జుట్టు ముట్టినం గాండీవి వారిబాణములఁ బ్రతిబాణముల మాయించి వారలఁ జంపనొల్లక యింద్రదేవతాకం బప్రతిహతంబు నగుసమ్మోహనాస్త్రం బరిపూసి యేసి గాండీవజ్యాఘోషంబు శంఖధ్వానంబును నిగిడించినం గురువీరులు ధనుర్బాణాదుల విడిచి సమ్మోహితులై నేల కొఱఁగి నిద్ర గూరినచందంబునఁ జెయ్వులు దక్కియుండిరి.

అట్లు సర్వసైన్యంబు సమ్మోహితంబై యుండఁ బార్థుఁ డుత్తరమాటలఁ దలంచి యుత్తరుం బిలిచి మనము వచ్చునపు డుత్తర బొమ్మపొత్తికలుగాఁ జిత్రములగుకురువీరులవస్త్రములఁ దె మ్మనియెఁగదా. అవ్వీరులు చొక్కి దక్కకమున్న నీవు చని వారితలచీరలఁ దెమ్ము. ఆచార్యశారద్వతులయుష్ణీషంబులు తెల్లనియవి. కర్ణుశిరోవేష్టనంబు పచ్చనిది. దుర్యోధనాశ్వత్థామలపాగాలు నల్లనియవి. కురుపితామహుఁ డొక్కరుఁ డియ్యస్త్రమునకు మా తెఱంగినవాఁడు గావున నతనిపొంతఁ బోవల దనిచెప్పిన విని యుత్తరుండు పగ్గముల నొగల బిగియించి తేరుడిగి శాంతనవునకు దాపటఁ జని ద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనులతలచీరలం గ్రహించి వేగంబ మఱలి రథము నధిరోహించి విన్నవచ్చు నానతిమెయి రథము లయిఱికటము లేనిచోట నరదంబు నిల్పినం గురుపితామహుండు కోపించి యర్జు

నుపై ననేక నిశితనారాచముల గుప్పించుటయు గుడాకేశుండు కోపదీపితుండై పదితూపుల నతనిగుఱ్ఱములం గూల్చి సేన నతిక్రమించి యిఱకటము లేనిచోట నిల్చి మేఘపటలంబు విరియించినతరణికిరణి వెలుంగుచుండె. అంతఁ గొంతవడికిఁ గురువీరు లందఱు సమ్మోహంబుఁ బాసి లబ్ధచేతను లగుటయు దుర్యోధనుఁడు రథములయిఱకటము దప్పి యొంటి వెలుంగుచున్న గాండీవిం గనుంగొని వీని నెట్లు విడిచి పోనిచ్చితిరి? పొదువుఁ డని చెప్పుచున్నంతఁ గురుపితామహుండు నవ్వుచు నతని కిట్లనియె. ధనుర్బాణతూణీరాదులనెల్ల దిగవిడిచి సమ్మోహంబునఁ జేష్టలు దక్కియున్నపు డీబుద్ధియు నీపరాక్రమంబు నెక్కడఁ బోయె? ధర్మరాజుతమ్ముఁడు ధర్మాత్ముఁడు గావున ఘోరకృత్యమున కొడఁబడమింజేసి నేడందఱుం బ్రదికిరి. స్వధర్మనిరతు లయినపాండుపుత్రులు త్రైలోక్యసామ్రాజ్యము వచ్చినను ధర్మముఁ దప్పరు. ఇఁక నేమియు ననక కురురాజధానికిఁ బోవుట లగ్గు. పార్థుఁడు పసులఁ దోలుకొని పోవుఁగాక. మోహమునఁ గార్యముఁ జెఱుపకు మని తెలియఁ బలికె.

## దుర్యోధనుఁ డోడి తనపురమునకుఁ బోవుట.

దుర్యోధనుఁడు పితామహుహితవచనంబు లాకర్ణించి యేమియు ననఁజాలక పెద్దయుంబ్రొద్దు దీర్ఘోష్ణంబుగ నిశ్శ్వసించి యూరకుండి మగిడె. యోధు లందఱు శాంతనవుహితవచనంబు లాకర్ణించి యప్పటప్పటికిం బెచ్చు పెరుగు వివ్వచ్చుపరాక్రమానలంబుఁ దలపోసి రాజరక్షణతాత్పర్యంబుతో సమరంబుఁ జాలించి మగిడిరి. పదపడి యర్జునుండు వారలఁ దఱుముచుఁ గొంతనేల యరిగి పేరెలుం గెత్తి పోయివత్తు ననిచెప్పి భీష్మద్రోణకృపాదిమాన్యజనులకుఁ బ్రణామబాణంబు లేసి రత్నఖచితం బైనదుర్యోధనుకిరీటంబు డొల్ల నేసి గాండీవజ్యాఘోషంబునను దేవదత్తనిర్హ్రాదంబునను శత్రుహృదయంబులఁ బగిలించి యట నుత్తరుం జూచి కురువీరులెల్లం బరాజితు లైరి. గోగణంబు మఱలి మనప్రోలికిఁ బోయె. ఇఁక మనతేరు మఱల్పు మనుటయు నతండు రథము మఱల్చె. యుద్ధముఁ జూడ వచ్చిన దేవతలుం గాంగేయువిక్రమంబుఁ గొనియాడుచు నిజనివాసంబులకుఁ జనిరి. అవ్విధమున ధనంజయుండు మగిడి పోవుచుండఁ గురుసైనికులు కొందఱు ముక్తకేశులై భయభ్రాంతచిత్తంబులతో నయ్యతిరథోత్తము ముందరఁ గన్పడి చేతులు మొగిచి ఫాలభాగములం గదియించి దండప్రణామంబు లొనరించి మహాత్మా? నీపంచినవిధంబు సేయ నున్నవారము. కరుణించి రక్షింపవే యని ప్రార్థించినం జిత్తగించి యర్జునుఁడు వారల నాశ్వాసించి యే నార్తులఁ దెగ రాను. మీరు వెఱువ వలదు. పొం డని యభయం బిచ్చుటయు వా రందఱు నిట్టికరుణాపరుఁడు గలఁడే? ఇతఁ డాయుష్కీర్తులఁ బడసి చెలంగుత మని దీవన

లిచ్చి చనిరి. అంత ధనంజయుండు భూమింజయుం జూచి కుమారా? పాండవు లందఱు మీనగరనున్నవా రని నీకుఁ దెల్లంబుగదా ఈవృత్తాంతంబుఁ బురము సొచ్చినవెంటన మీతండ్రికి కెఱుఁగింపవలదు. అట్లయిన నతండు వెఱచి సమ్మోహంబుఁ గాంచు. మఱి "నేనే కురుసేనం గెలిచి పసుల మఱలించితి" నని యంతయు నీచేసినదియకాఁ బల్కు మనిన విని వైరాటి కిరీటిం జూచి మహాత్మా, యితరదుష్కరం బైననీచేసినపని నేఁ జేసితి నని యెట్లు చెప్పుదు? అయినను నీవాన తిచ్చునందాఁక ని న్నతనికిఁ దెలియఁ బలుకను. ఏన గోవుల మఱలించితి ననియుం జెప్పను. మఱి యుపాయమునం జెప్పెద ననిపలికె. అది విని సవ్యసాచి యట్ల యగుంగాక యని వానిమాట నియ్యకొని శ్మశానప్రాంతమున నున్నశమీవృక్షముఁ జేర నరిగి తద్దేవతలం బ్రార్థించిన రథధ్వజవానరభూతగణశంఖకిరీటాదు లంతర్హితంబు లగుటయు గాండీవాదిసాధనంబుల జమ్మిపై నున్నకైదువులకట్టం బెట్టి కట్టించి తొల్లింటిరథమునఁ బూర్వప్రకారంబున సింహధ్వజంబుఁ బెట్టించి శిఖాబంధనంబు విప్పి కేశముల జడగా నల్లికొని బృహన్నళారూపంబుఁ గైకొని విరాటసుతుని రథికుఁగాఁ గూర్చుండఁ జేసి తాను నొగలపై నాసీనుడై మఱలి చనుచున్నగోగణంబులం జూపి యయ్యుత్తరకుమారున కిట్లనియె. ఇవె మనగోగణంబులు చనుచున్నవి. మన మింకఁ గొంతదడ విట నెచ్చటనైన నిలిచి గుఱ్ఱములు సేద దేఱినపిదపఁ బోవచ్చు. భవద్విజయంబుఁ జాటింపఁగ ముందుగా గోపాలురం బురంబునకుఁబంపు మనుటయు నతం డట్ల యని గోపాలుర నవ్విధం బాజ్ఞాపించుటయు వారు నత్తెఱంగు నడపం జనిరి.

విరాటుం డుత్తరుఁడు కురుసేనం గెలువఁ బోవుట విని చింతించుట.

అయ్యవసరంబున విరాటుఁడు త్రిగర్తయోధులం గెలిచి పసులఁ దోలించికొని పాండవులతోడం బురంబు సేరి నిండోలగంబుండి చూడ వచ్చినబ్రాహ్మణాదిసకలజనుల ప్రశంసావచనంబులం గ్రహించి యుత్తరుం డెక్కడ యనియడిగి యంతఃపురజనులవలన భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనాదు లైనకురువీరు లుత్తరగోగ్రహణంబుఁ జేసిన వారలం గెలిచి పసుల మఱలించువాఁడై యుత్తరుండు బృహన్నళ సారథి గాఁగ రథారూఢుండై యెత్తి చనినవాఁ డని విని చింతాసంతప్తచిత్తుండై మంత్రులం జూచి యిట్లనియె. లోకవిశ్రుతవిక్రమోల్లసితు లయినభీష్మద్రోణాదులు పసులఁ బట్టిరఁట. వారల గెలిచి గోగణంబు మఱలింప మనయుత్తరకుమారుఁ డరిగెనఁట. వానికిఁ బేడి సారథియఁట. ఇది తగునే? ఇందాఁకనైన నాకుమారుఁడు బ్రదికియుండునే యని సంశయం బయ్యెడి. త్రిగర్తవీరులు మనగోవులఁ బట్టుట విని వారికిఁ బ్రీతిగాఁ గురుయోధులెల్లఁ దప్పక వచ్చియుండుదురు. త్రిగర్తయుద్ధమున నెవ్వనిసైన్యం బేర్పఱిచి యుత్తరునకుఁ

దోడ్పడఁగ నీక్షణంబ యనుపవలయు ననుచున్నంత ధర్మరాజు నవ్వుచు విరాటున కిట్లనియె. నృపాలా, నీకింత వగవ నేల? బృహన్నల సారథి యగుటం జేసి తత్ప్రభావంబున నుత్తరుండు కురువీరులను దేవాసురు లడ్డము వచ్చిననుం గెలిచి పసుల మఱలించికొని విజయంబుతో వచ్చు. సందియంబు వల దని చెప్పుచుండె. అట్టియెడ నుత్తరప్రేషితు లైనదూతలు వచ్చి యుత్తరవిజయంబుఁ జెప్పుటయు మంత్రి రాజునొద్దకుఁ జని మనయుత్తరుండు కౌరవులం గెలిచి పసుల మఱలించికొని సారథితోడఁ గుశలమున వచ్చుచున్నవాఁ డని నివేదించుచుండ యుధిష్ఠిరుండు మత్స్యపతిం జూచి బృహన్నళాసారథ్యమునం జేసి యుత్తరుండు కౌరవులను దేవదానవులనైనం గెలిచి గోధనంబు మగిడించికొని వచ్చు నని యేను మున్న చెప్పితింగదా. నామాట తప్ప దయ్యె. భాగ్యమునఁ గౌరవు లోడిరి. గోగణములు వచ్చె. బృహన్నళ సారథియైయుండ నుత్తరుండు కౌరవులం గెలుచుట యద్భుతంబే యనిపలికె. అట విరాటుండు కొడుకుగెలుపు చెప్పవచ్చిన దూతల కుత్తమవస్త్రములఁ గట్ట నిచ్చి మంత్రులం జూచి రాజవీథులఁ గేతనంబులఁ గట్టింపుఁడు. దేవతల కర్చనలఁ జేయింపుఁడు. యోధముఖ్యులు, కుమారులు, గణికలు నుచితాలంకారముల నలంకరించికొని యెదురుపోవఁ బంపుఁడు. వివిధ వాద్యములు నెదురువోవ నియమింపుఁడు. మదగజం బారోహించి మహాఘంట మ్రోయించుచు ''నుత్తరుఁడు కురువీరుల గెలిచి గోవుల మఱలించె'' నని యెల్లచోట్లం జాటింపఁగఁ దగువాని నొక్కనిఁ బంపుఁడు. ఉత్తర చెలులతోడ నుత్తమాంబరాభరణంబులఁ దాల్చి యక్కుమారు నెదుర్కొలు గావింపఁగఁ జెప్పుఁడనిన వా రట్ల యాజ్ఞాపించుటయు నందఱుఁ దదుక్తప్రకారం బొనర్చిరి. అంతఁ గొంతవడికి మత్స్యమేదినీకాంతుఁ డత్యంతసంతోషముతో సైరంధ్రిం బిలిచి యక్షసాళ్లం దెమ్మని యట ధర్మరాజుం జూచి కంకభట్టా, జూద మాడుదమే యనిన నతండు విరాటున కిట్లనియె. రాజేంద్రా, నీ విపు డెంతయే సంతసంబున నుప్పొంగియున్నవాఁడవు. ఇత్తఱి నీతోడ నాడినం గెలువ వచ్చునే? మఱి యెద్దియేనియుఁ బ్రియం బగుదానిం జెప్పుము చేయుదు ననిన ద్యూతంబుకంటె నొండొక్కటియు నా కిప్పుడింపు గాదనుటయు ధర్మరాజు వెండియు నతని కిట్లనియె. నృపాలా, జూదమున ననేకదోషములు వచ్చు. మున్ను ధర్మరాజు జూద మాడి దేవతుల్యు లయినతమ్ములను రాజ్యమునుం గోల్పడె నని నీవును వినియుందువుగదా. కావునం జూద మాడుట నా కొప్పనియది. అయినను నీ వాడవలయు ననిన నీకుఁ బ్రీతిగా నాడుదు ననుటయుఁ గాని మ్మాతూరి యొకయాట యాడుద మనిపలికి విరాటుండు ద్యూతం బాడుచు ధర్మరాజుం జూచి కంకభట్టా, నాకొడుకునకు లోకోత్తరవిక్రమశాలు లగు భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనాదు లగుమేటిదొరలు నోడిరి. విం

టివే యనిన ధర్మరాజు నృపాలా, బృహన్నళ సారథ్యంబు సేయం బూనిన నుత్తరుండు జయింపకుండునే యనినం గోపదీపితుండై విరాటుండు పాండవాగ్రజున కిట్లనియె. బ్రహ్మబంధూ! నీవు నాపుత్రునితోడం బేడిని సరిపోల్చి కొనియాడెదవు గాని యెంత చెప్పినను వినవు. ఇది చెప్పఁ దగుఁ దగ దని యెఱుంగక నా కవమానంబుగాఁ బల్కెదవు. మనయుత్తరుం డేల భీష్మద్రోణాదుల జయింపఁడు. వానిగెలుపు నీ కసమ్మతంబే? నీపైఁ జెలిమిం జేసి యీతప్పు మన్నించితి. ఇఁక నిట్టిమాట లాడకు మనిచెప్పిన ధర్మరాజు మఱియు నిట్లనియె. భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనాదు లగులోకవిశ్రుతమహారథు లెక్కడ? నీకొడు కెక్కడ? వారల నితండు గెల్చు ననిన నమ్మవచ్చునే? అవ్వీరులను దేవగణపరివృతుం డైనయింద్రుడైననుం బోర నెంటి మార్కొనఁగ బృహన్నళయే నేర్చు. బృహన్నళకు సరివచ్చుభుజబలవిక్రమశాలి యొండొకఁ డుండఁడు. సమరంబున నతండు సంతోషమున నుప్పొంగి పగవారియుక్కడంచు. బృహన్నళ సారథి గాకుండిన మనయుత్తరకుమారుండు వారల గెలువ నేర్చునే? యని మొగమోడక పలికె.

### విరాటుఁడు కంకుని సారెగొని వ్రేయుట.

ఆపలుకులు విని విరాటుండు కోపాటోపదీపితుండై విరచితబృహన్నళాభినందనుం డైనధర్మనందనుం గనుంగొని యయ్యా, యెన్నిమాఱు లెంత చెప్పి వారించినను నామాటలం బెడచెవిఁ బెట్టుదువుగాని యామాట లుడుగవు. తగినవిధమున నియమింపకుండిన నెవ్వరుం జెప్పినక్రమంబున ధర్మము నడపరనిపలికి సారె గొని యుధిష్ఠిరుమొగము దాఁక వ్రేసి యిఁకనైన నిట్టివి పలుకకుండు మనియె. వ్రేసినవ్రేటుతోడనే యుధిష్ఠిరుముక్కున నెత్తురు స్రవించుటయు నప్పాండవాగ్రజుం డారక్తబిందువుల నేలం బడకుండఁ జేతులం బట్టుచుఁ బాంచాలిదెసం గన్నుగిడించిన నప్పతివ్రత యాచెంగట నున్నజలపూర్ణకనకకలశంబుఁ దెచ్చి క్షతజబిందువులఁ గడుగుచుండె. అయ్యవసరంబున నుత్తరుండు బృహన్నళాసారథియై పురపురంధ్రీజనంబులు చల్లులాజాక్షతకుసుమంబులఁ గొనుచు భూసురాశీర్వాదంబుల గ్రహించుచు వందిమాగధస్తుతిరవంబుల వివిధవాద్యమంగళనిస్వనంబుల నాకర్ణించుచుఁ బురంబు సేరి రాజమందిరద్వారంబుఁ దఱియం జొచ్చి కక్ష్యాంతరంబులు గడచి రథము డిగి మత్స్యమేదినీశ్వరుకొలువుకూటము నకుఁ జనుచుండ ద్వారపాలకుం డతిరయమున విరాటునొద్దకుఁ జని మ్రొక్కి కరపుటంబులు ఘటియించి దేవా, యుత్తరుఁడు బృహన్నలతోడ భవదవలోకనార్థంబు వచ్చుచున్నవాఁ డని విన్నవించె. ద్వారపాలకవచనంబు విని విరాటుఁ డుప్పొంగి వారలం గనుంగొని సువ్విళ్లూరుచిత్తంబుతో నున్న నాయొద్ద కీక్షణంబ యయ్యిద్దఱుం దోడ్కొని రమ్మని యానతిచ్చుచున్నంత ధర్మ

రాజు వానిం బిలిచి రహస్యంబుగనిట్లనియె. ఇప్పు డుత్తరు నొక్కనిం బ్రవేశింపం జేయుము. నాముక్కున నెత్తురు లెస్సగం గడుగునందాంక బృహన్నళాప్రవేశం బాంగుము. నామేనం గాయముం జేసినవానిం జంపుమనని బృహన్నళ ప్రతిజ్ఞం బూనియుండుం గావున నాయెడ నెల్లపుడుం బ్రేమ నెఱపుబృహన్నల నిక్కం బలిగనేని యీవిరాటుని మంత్రిబాంధవాదిసహితంబుగాం బొరిపుచ్చు. అట్లగుటంజేసి యిపుడు తత్ప్రవేశంబు తగ దనివచించిన విని ద్వారపాలకుం డపు డుత్తరు నొక్కనిం బ్రవేశింపం జేసె. వచ్చి యుత్తరుండు విరాటునకును ధర్మరాజునకుం బాదాభివందనం బొనరించి పాంచాలి నెత్తురు దుడువంగం గూర్చున్నధర్మరాజుంజూచి యట విరాటుదెస మొగంబై రాజవర్యా యెవ్వండీమహాత్ము నడిచి పాపంబు సేసె నని యడుగ విరాటుం డుత్తరున కిట్లనియె. పుత్రా, నీవు కురువీరుల జయించితి వని దూతలు వచ్చి చెప్పిన నుప్పొంగి నేను నిన్నుం బ్రస్తుతించుచుండ నీతండు నిన్నుం బొగడుట మాని పేడిని బొగడ సాగి యెంత చెప్పిన నామాట వినక తనమతంబే యనువర్తించి యుండినం గినిసి నేను సారె గొని వేసితి ననిన భయకంపితచిత్తుండై యుత్తరుండు తండ్రిమొగమునం జూడ్కి నిలిపి రాజేంద్రా, చేయరానిపని చేసితివి. శీఘ్రంబ యిమ్మహాత్ముం బ్రార్థించి ప్రసాదంబు వడయుము. ఉత్తమద్విజకోపానలంబు విషముభంగి సమూలంబుగం గాల్చు ననిచెప్పినం గొడుకుమాట విని విరాటుండు నివురు గప్పిననిప్పుచొప్పునం బ్రచ్ఛన్నుండై యున్న ధర్మరాజును వేఁడికొనుచుండంగ నతండు విరాటున కిట్లనియె. భూపాలా, నే నప్పుడే సైచితి. నీయెడం గోప మించు కేనియు లేదు. మదీయ రుధిరంబు నేలం బడిన నీకునీరాజ్యంబునకుం దప్పక చేటు వచ్చుం గావున నీ మేలుగోరి యది భూపతితంబుగాకుండం జేతులం బట్టి కనకకలశసలిలంబులం గడిగితి. నీవు మేలుం గాంచుటయేనా కభిమతం బనివచించి యతని నూరార్చి యింక బృహన్నళను బ్రవేశింపం జేయం దగు ననుటయు ద్వారపాలకుం డట్ల చేసె. బృహన్నళయు వచ్చి విరాటునకు ధర్మరాజునకును మ్రొక్కి నిలచియుండె.

విరాటుం డుత్తరుని యుద్ధప్రకారం బడుగుట.

అంత ధర్మరాజార్జునాదులు వినుచుండ విరాటుం డుత్తరుం బిలిచి పుత్రా, నీచేత నేను బుత్రవంతుండ నైతి. నీయట్టికొడు కింతకుం బుట్టం డింకనుం బుట్టండు. కురుపితామహుం డయినభీష్ముఁడు భూలోకమున నెల్లవారికంటె మేటివిలుకాం డనుపేరు గాంచి పరశురాముం గెల్చినవాఁడు. ద్రోణాచార్యుఁడు లోకమునంగలరాజుల కెల్ల నాచార్యుండై ధనుర్ధరశేఖరుం డనం బొగడ్త కెక్కినవాఁడు. ఆచార్యపుత్రుఁడు నంతటివాఁడే. కృపాచార్యుఁడు శత్రువులు సంగరాంగణంబునం దన్నుం జూచి హృతధను లయినవణిగ్జనులట్లు పాఱిపోవువిధంబుగం గడిమి

మెఱయు ననఁ బ్రస్తుతిఁ గాంచినవాఁడు. రాధేయుఁడు వేవురుజోదులు మార్కొ ని వచ్చినను దాఁ జలింపక యొక్కనినైనం దప్పిపోనీక పొదివి జయించువాఁడు. దుర్యోధనుండు కొండనైనమార్కొని పోరాడఁ గల లావు గలవాఁడు. వారల మార్కొని మొత్తు దప్పించికొని జయించి శార్దూలంబు మృగమాంసంబునుం బోలెఁ బసులఁ దెచ్చితివి. నీవిక్రమం బద్భుతంబు. మనశత్రులెల్ల నీ కోడిరి. శుభసూచకంబుగా మందమారుతంబు నాపయి వీచుచున్నది. నీసమరప్రకారం బంతయుఁ దేటపడం జెప్పు మనియడుగ నుత్తరుండు తండ్రి కిట్లనియె. రాజపుంగవా, యేను శత్రుల గెలిచి పసుల మఱలించినవాఁడఁ గాను. దుష్కరం బయినయాకార్య మంతయు దేవాంశసంభూతుం డైనయొకమహానుభావుం డొనరించె. నేను గురుసైన్యంబుఁ జూచి కలంగినచిత్తంబుతోఁ బాఱుచుండ నమ్మహాత్ముఁడు నన్నెయిది పట్టికొని పోయి నాకు వెఱపు దీర్చి నన్ను సారథిఁగాఁ జేసికొని తాను రథికుండై కడిందిమగంటిమి నెఱియఁ జలంబు మెఱయ భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణదుర్యోధనదుశ్శాసనప్రభృతు లగుకురుయోధులం గెలిచి సంగరాంగణంబు పీనుంగుపెంట గావించె. అంత దుర్యోధనుండు సమరవిముఖుండై పాఱిపోవుచుండ నాచెప్పినదేవాంశసంభూతుం డించుకైన మోమోట లేక యోధార్తరాష్ట్రా క్షత్రియకులజనితుం డైననీకు రణంబునం బలాయనంబు సేయం దగునే? హస్తినపురంబున నిన్ను రక్షించువా రెవ్వరు లే రని తలంతు. రమ్ము. పోరాడుము. గెలిచినం బుడమి యేలుము. ఓడి నాచేఁ జచ్చిన వీరస్వర్గంబువడయు మని తూలనాడినం గాంధారేయుండు భీష్మద్రోణాదు లగుచేయంగలదొరలం గూర్చికొని మగిడి సమరసన్నాహంబుతో వచ్చుటయు నమ్మహారథు లందఱు నాచెప్పినమహాత్ముపై నెక్కయుమ్మడిగ శరవర్షంబుఁ గురియించిరి. ఏమి చెప్పుదు నప్పటిసమరప్రకారంబు. నాకు భయకంపరోమాంచములుం బొడమె. అట్టితుములసమరమున నాచెప్పినదేవాంశసంభూతుఁడు నన్నూఱడించి వారలం దలపడి యందఱు కన్నిరూపులై విక్రమించి యందఱును సమ్మోహితులం జేసి వారితలచీరల నాచేఁ దెప్పించె. క్రోల్పులి మృగంబులంబోలె నమ్మహారథుల నందఱ నతం డొక్కండె నిగ్రహించె నని చెప్పిన విని విరాటుండు పుత్రా, యమ్మహాత్ముఁ డెక్కడ నున్నవాఁడు? నామనంబు నిన్ను రక్షించి జయం బిచ్చినవానిం జూడను బూజింపను నువ్విళ్లూరెడి ననిన నుత్తరుం డతం డంతర్ధానంబు నొందె. ఎల్లియొండె మఱునా డొండె నంత డగపడు నని విన్నవించిన నాకర్ణించి మత్స్యమేదినీశ్వరుండు ప్రీతచిత్తుండై యతనిం జూడఁ గోరియుండెఁగాని రూపాంతరంబునం బ్రచ్ఛన్నులై యున్న వారల నెఱుంగఁ డయ్యె. అంత నర్జునుండు విరాటునను జ్ఞఁగొని కురువీరుల తలచీరల నుత్తర కొసంగిన నక్కన్యకామణి ప్రీతి నొందుచు గ్రహించె.

## పాండవులు విరాటునకుం దమ్మెఱింగించుట.

అంతఁ బాండవులు తమయజ్ఞాతవాసనియమంబు గడచుటంజేసి ప్రకాశవృత్తిం బొరయవచ్చు నని తమలో నూహించి యుత్తరునితోడ నాలోచించి యట్లు చేయంగలవారై నిశ్చయించి సంతుష్టచిత్తులై మూఁడవనాఁడు ప్రభాతంబున లేచి కల్యకృత్యములఁ దీర్చి కృతస్నానులై శుక్లవస్త్రముల ధరించి సంధ్యాద్యనుష్ఠానము లొనరించి సర్వాభరణభూషితులై విరాటుపేరోలగంబున కరిగి తదీయసింహాసనమున ధర్మరాజును నతనియిరుప్రక్కల భీమార్జుననకులసహదేవులుంగాఁ గూర్చుండిరి. అటఁ గొండొకవడికి రాజకార్యనిర్వహణతాత్పర్యంబునఁ గొలువుకూటంబునకు వచ్చి జ్వలితాగ్నిహోత్రంబులవడువున వెలుంగుచున్న తమ్ములు నలువురు గొలిచియుండ సురగణపరివృతుండైన దేవేంద్రునిచందమున సింహాసనమున సుఖాసీనుండై యున్నధర్మరాజుం గాంచి కంకభట్టుఁ డను తలంపుతోఁ గోపావిష్టుండై యోద్విజా, నేను మన్నించి సభ్యుంగాఁ జేర్చినం గొవ్వి నాగద్దియం గూర్చుండుటయ చాలు. నన్నుఁ జూచియు లేవకున్నవాఁడవిది యేమనియడుగఁ బురందరనందనుండు వదనారవిందంబున సుందరమందహాసంబు సెలంగ నతని కిట్లనియె. ఇతఁడు బ్రహ్మణ్యుఁడు, శ్రుతవంతుఁడు, దానరతుఁడు, యజ్ఞశీలుఁడు, దృఢవ్రతుఁడు, ధర్మమూర్తి, వీర్యవద్వరుఁడు, దీర్ఘదర్శి, మహాతేజుఁడు, పౌరజానపదప్రియుఁడు, ధర్మపరుఁడు, జితేంద్రియుఁడు, మహర్షికల్పుఁడు, రాజర్షివర్యుఁడు, సర్వలోకవిశ్రుతుఁడు, బలవంతుఁడు, ధృతిమంతుఁడు, దక్షుఁడు, సత్యవచనుఁడు, బుద్ధిమంతుఁడు, తపోనిధి. మఱియు నితండు త్రివిధాస్త్రముల నెఱుంగు. ఇతం డెఱింగినయస్త్రంబుల దేవదానవాదులు నెఱుంగరు. విభవధనముల నింద్రకుబేరులకుఁ దుల్యుఁడు. మనువుచాడ్పునఁ బ్రజలధర్మమునఁ గరుణతో నేలువాఁడు. ఇతండే పాండవోత్తముండైనయుధిష్ఠిరుండు సూర్యకిరణంబులట్లు లితనికీర్తి యంతట నప్రతిహతంబుగ నెఱయుచుండు. ఇమ్మహాత్ముఁ డింద్రప్రస్థమున రాజ్య మేలుచున్నయపుడు పదివేలేనుంగు లుత్తమతురంగయోజితంబు లయిన ముప్పదివేలరథములు వెంట వచ్చుచుండు. ఎనమన్నూఱుగురువందిమాగధులు దేవేంద్రునట్టు లీసార్వభౌముం బ్రస్తుతించుచు వత్తురు. రాజలోకంబు దేవగణంబు ధనపతింబోలె నితనిం గొల్చి కప్పములఁ గట్టుచుండు. ఎనుబదివేవురుస్నాతకవ్రతులఁ బ్రతిదినము నాతిథ్యమున సత్కరించు. అంధబధిరపంగువృద్ధాద్యనాథులపై నెంతయుఁ గరుణఁ బూనియుండు. దుర్యోధనదుశ్శాసనకర్ణశకును లెప్పుడు నిమ్మహాత్మునిప్రతాపంబునకు వెఱచియుండుదురు. ఇతనిగుణములు లెక్కింప నలవిగావు. అట్టియితండు దేవేంద్రుసింహాసనంబైన నారోహింప నర్హుఁడు. నీచిన్నగద్దియం గూర్చుండఁ దగఁడే? యని యర్జునుండు దేట

పడం జెప్పిన వినివిరాటుండు సవిస్మయంబు ససంశయంబు ససంభ్రమంబునుంగా నతనిం జూచియితండు యుధిష్ఠిరుండయేని భీమార్జుననకులసహదేవులును, ద్రౌపది యు నేరి? వారు ద్యూతజితులై యడవులఁ బడి యెచ్చట నున్నవారోగాని యేరికిం దెలియఁబడరు. నీ వెఱుంగుదేని చెప్పు మనుటయు మత్స్యపతికి గాండీవి వెండియు నిట్లనియె. నీయింట వల్లవుఁ డనుపేరుతో మహాసాధ్యుఁడై యున్న వాఁడు భీమసేనుఁడు. ఇతఁడే గంధమాదనంబునఁ గ్రోధవశు లనురాక్షసులఁ బెక్కండ్రం జంపి ద్రౌపదికి సౌగంధికకమలములఁ దెచ్చియిచ్చినవాఁడు. భవదీయహయముల కధ్యక్షుఁడై దామగ్రంథి యనుపేరఁ బరఁగుచున్నయతండే నకులుండు. గోష్ఠాధ్యక్షుండై తంత్రీపాలనామధేయంబు పెట్టికొని మెలఁగుచున్నవాఁడే సహదేవుఁడు. మాలిని యనుపేరు వహించి సైరంధ్రీవేషమున మీయంతిపురమునఁ దిరుగుచున్నసతియే పాంచాలి. దానినిమిత్తంబ కీచకుల నందఱను భీమసేనుఁడు గూఢప్రకారమున గంధర్వు లనువ్యాజంబు పెట్టి వధించె. అందఱం జెప్పితింగదా. ఇఁక దాఁప నేల? నేనే యర్జునుండను. ఈయేఁడు మీయింట గర్భవాసమున నున్నయట్లు సుఖముంటి మని ధనంజయుండు తమవృత్తాంత మంతయు వివరించి చెప్పుటయు భూమింజయుండు విరాటున కిట్లనియె. ఇమ్మహాత్ముఁడే కౌరవులు పసులఁ బట్టికొనినప్పుడు వారల గెలిచి నన్ను రక్షించి గోగణముఁ దెచ్చినవాఁడు. ఏమి చెప్పుదు నితనివిక్రమంబు. నాఁడు వికర్ణుఁ డేనుఁగు నెక్కి కోల్తలు చేసినం దానోహటింపక యొకయమ్మున నాయేనుఁగును నేలఁ గూల్చె. ఈవీరశేఖరుఁడు గాండీవంబు గొనయంబు సారించినను శంఖ మొత్తినను నాచెవులు బధిరంబులై బీఁటలువాఱుచుండు. వీరు పాండవు లని నే నెఱుఁగుదు. అయినను నీసవ్యసాచి తామే తమవృత్తాంతముఁ బ్రకటించునందాఁక బాహిరంబు సేయవలవదని యానతిచ్చుటంజేసి మీకెఱుంగింపనైతి నని యుత్తరుండు సెప్పిన నాకర్ణించి యానందకందళితాంతరంగుఁడై విరాటుండు పుత్రుం జూచి మనమున నిమ్మహాత్ముల కెన్నియపచారంబులు వాటిల్లెనో గావున నేతత్ప్రసాదంబు వడయుట కర్తవ్యంబు. గాండీవికి మనయుత్తర నీఁ దలంచెద. నీ వెట్లు దలంతు వనియడుగ నతండు పూజార్హు లగునీమహాత్ములం బ్రసన్నులం జేసికొనుటయే నాయభిమతం బనిపలికె. అట విరాటుఁడు వెండియుం బుత్రుం బిలిచి నన్ను భీమసేనుఁడు రక్షించె. నిన్ను గాండీవి రక్షించె. వీరునాఁడు లేకున్న మనము శత్రులకుఁ జిక్కకుండఁగలమె. మనయభ్యుదయం బంతయు నిమ్మహాత్ములయనుగ్రహం బని తలంతు. ఉత్తర నర్జునున కొసంగవలయు నని చెప్పి యట ధర్మరాజుదెస మొగంబై మహాత్మా, తెలియమింజేసి మాయింట నెన్నియే నపచారంబులు పొసఁగియుండు. అవి యెల్ల సైఁచి మదీయరాజ్యమెల్ల నేలు మని [illegible] వారి నందఱం బెద్దయుం బ్రొ

ద్దు కౌఁగిలించికొని మూర్ధాఘ్రాణంబు చేసి భాగ్యవశమున సంకేతితప్రకారం బున సమయాబ్దంబులు గడపితిరి. నాసామ్రాజ్యంతయు భవదీయంబ. సవ్యసాచికి నా కూఁతు రగునుత్తర నీదలంచితి. అతండు గ్రహింపఁగాక యనివచించిన విని ధర్మరాజు కిరీటి దెసం జూచిన నతండు మత్స్యపతి కిట్లనియె. నరేంద్రా, యేనొ క్కవత్సరం బంతిపురంబున నుండుటం జేసి యుత్తరం బెండ్లియైనం జనులు శంకిం తురు. మఱియు నృత్తగీతాదుల నేర్పుటం జేసి నే నాకన్యకు గురుండ నైతి. కా వున నది తగదు. ఉత్తర శుద్ధచారిత్ర యగుట నే లెస్సగ నెఱుంగుదు. ఆకన్ని యం గోడలిఁగా గ్రహింతు. వాసుదేవునను గుమేనల్లుఁడు సర్వాస్త్రకోవిదుండు దేవకుమారసన్నిభుఁడు సుభద్రకుఁ గూర్చుకొమారుఁడు న గునభిమన్యుఁడు నీ కల్లు డుగాఁ దగినవాఁ డనిన విని విరాటుం డిది లెస్స. అర్జునుతోడి వియ్యంబునకుఁ బాత్రుఁడ నవుటం జేసి కృతార్థుండనైతి. నాకోరికలెల్ల నీడేఱె. దీని నుచితప్రకా రంబున ధర్మరాజు నడపువాఁ డని పలుకుటయు నాధార్మికవరేణ్యుఁ డిది యెం తయు నుచితంబు కర్తవ్యంబ యని యంగీకరించె.

శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోడఁ బాండవులఁ జూడ వచ్చుట.

పదంపడి విరాటుం డుత్తమమౌహూర్తికుల రావించి యుత్తరాభిమన్యు లవివాహంబునకు శుభముహూర్తంబు నిర్ణయించి వాసుదేవప్రముఖు లయిన బంధుమిత్రులకెల్ల శుభలేఖంబులు వ్రాయించి దూతలం బనిచె. పాండవులు శమీవృక్షనిక్షిప్తాయుధంబుల గ్రహించి మత్స్యదేశంబునం బ్రసిద్ధం బైనయుప ప్లావ్యం బనుపురంబు సేరిరి. అట ధర్మనందనుండును వాసుదేవద్రుపదాదులకు శుభలేఖలం బంచె. అంత నొక్కనాఁడు వాసుదేవుఁడు బలరామసాత్యకికృతవర్మా క్రూరసాంబప్రముఖయదువీరపరివృతుండై సుభద్రాభిమన్యులం దోడ్కొని యిం ద్రసేనాదు లయినపాండవాను చరులు తదీయరథాదులం గొని కొలిచి రాఁగ ను పప్లావ్యంబునకు వచ్చి పాండవులను బాంచాలినిం గాంచి పరస్పరకుశలప్రశ్నంబు న డిపిసుభద్రాభిమన్యుల నప్పగించిపదివేలయేనుంగులను లక్షగుఱ్ఱంబులను నద్భుదర థంబులను నఖర్వసంఖ్యాకు లగుకాలరులనువివిధాంబరాభరణధనాదులను నుత్తమ నీరాజనంబులనునొసంగె. అంత ద్రుపదుఁడు ధృష్టద్యుమ్న శిఖండిప్రభృతిపాంచాల కుమారవర్గపరివృతుండై ద్రౌపదీపుత్రులం దోడ్కొని యక్షౌహిణీమాత్రసైన్యం బుగొలిచిరాఁగ నుపప్లావ్యంబునకు వచ్చి పాండవులం గాంచి వాసుదేవునట్లు కుశల ప్రశ్నంబు నడిపి యచట నుండె. అటఁ గాశిరాజు శైబ్యుఁడునుం బ్రత్యేకంబ యొ క్కొక్కయక్షౌహిణితోడ వచ్చి పాండవులశుభవర్తనంబు విచారించిరి. విరాటుండు వచ్చినబంధుమిత్రవర్గంబు నెల్ల నాదరంబుమై సత్కరించుచుండె.

### అభిమన్యు వివాహ మహోత్సవము.

అవ్విధంబున యదువృష్ణిభోజాంధకపాంచాలాదు లయినబంధువులును మిత్రులునుం జేరుటయు శుభదినంబున విరాటుండు చెప్పఁగ ధర్మనందనుండు తమ్ములుం దాను నలంకరించికొని సౌభద్రునకు మంగళస్నానాద్యుపచారంబులఁ గావించి వివిధవర్ణనీయాంబరాభరణ చందనమాల్యములనలంకృతుంజేసి భద్రగజారూఢుం జేసి వాసుదేవబలభద్ర సాత్యకికృతవర్మాక్రూరాదు లయినయదువృష్ణివర్యులు ధృష్టద్యుమ్నప్రముఖకుమారవర్గసమన్వితుం డైనద్రుపదభూవిభుండు కాశిరాజాదిబంధుజనంబులుం బరివేష్టింప భూసురాశీర్వాదంబులు వందిమాగధస్తుతినినాదంబులు భవ్యవాదిత్రసంగీతనిస్స్వనంబులు నుత్సవావలోకనాగతజనకోలాహలంబులు నెసంగ నుత్తమాలంకారముల నుల్లసిల్లినపాంచాలీ సుభద్రాదు లైనపురంధ్రీమణులు మంగళద్రవ్యములతోడం గూడరాఁగ విరాటునగరి కరిగి కల్యాణమంటపంబు సేరుటయు నవ్విరాటునానతింజేసి సుధేష్ణాదు లైనయుత్తమసీమంతిను లుత్తరకు మంగళస్నానాద్యుపచారంబు లొనరించి లెస్సగ నలంకరించి మహేంద్రతనయంబోలె నందఱుం బొదివి తోడ్తెచ్చి పెండ్లిపీఁటం గూర్చుండఁ బెట్టిరి. అంత విరాటుండు పరమానందకందళిత హృదయారవిందుం డై విధియుతంబుగఁ గూఁతు నభిమన్యున కొసంగి యేడువేలయుత్తమాశ్వంబులు రెండువేలయేనుంగులు బహుధనంబులు నరణంబుగా నిచ్చె. మదీయరాజ్య మంతయుఁ బాండవాధీనంబ యనినివేదించె. ఇచ్చినంగ్రహించిధర్మరాజు సుప్రజ్వలితం బైనయగ్నిహోత్రంబున ధౌమ్యోపదిష్టవిధానంబున వివాహంబుఁ జేయించి వాసుదేవుఁడు తనకుఁదెచ్చియిచ్చిన గోసహస్రంబులను ధనంబును వివిధవస్త్రంబులను త్తమభూషణంబుల యానశయనవాహనముల నుత్తమబ్రాహ్మణుల కొసంగి తదాశీర్వాదంబులం బడసె. అత్తెఱంగున నవ్వివాహంబు వివిధవాద్యఘోషసమంచితంబు, మృష్టాన్నసంతర్పితవిప్రజనంబు, వివిధమృగమాంసరుధిరాస్వాదనముదితతత్జ్జనంబు, గాయకాఖ్యానశీలనటవైతాళికస్తుతిరవసముల్లసితంబు, వివిధభూషణాలంకృతపురంధ్రీజనమంగళారవశోభితంబు, వాసుదేవాదిబంధుజనసాంద్రంబు, ధర్మనందనమహిమోల్లసితంబు, సదాసంతుష్టపుష్టజనావృతంబుగా నప్పురంబున మహోత్సవంబు తెఱంగున నుల్లసిల్లుచుండె.

క. అని యిటు వైశంపాయన, మునివరుఁడు విరాటపర్వమును వినిపింపఁ
జనమేజయనరపాలుఁడు, వినియానందాంబురాశివీచులఁ దోఁగెఁ.

ఉ. అంతట నిండియుం దనదురాపమహత్త్వ మెఱుంగలేనివి
భ్రాంతుల కెంతయుం దెలియరాక సమాహితచిత్తవృత్తి న
త్యంతము గొల్చువారి కుచితావసరంబుల సుప్రసన్నుఁడై
వంతలనెల్ల మానుచు నెవం డతని న్మదిలోఁ దలంచెదన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారముద్దువేంకట మహీపాల
కరుణాపురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కా
రపరితోషితబుధస్తోమ సీతారామకవిలలామపుత్ర, సకలశాస్త్రనిరంకు
శపాండితీధుర్యలక్ష్మీనృసింహసుధీవర్యసచ్ఛాత్ర, విబుధజనవిధేయ
వేంకటరంగనామధేయప్రణీతంబైన శ్రీమదాంధ్రవచనభారత
మునందు విరాటపర్వంబునఁ బాండవులు విరాటపురిచేరు
వ శమీవృక్షంబున నాయుధములనిక్షేపించి ద్రౌప
దీసహితంబు ప్రచ్ఛన్నవేషములతో విరాటునగరు
సొచ్చి సమయపాలనంబుఁ జేయుటయు, ద్రౌ
పదిం గామించినకీచకుని వానితమ్ములను భీముఁ
డు వధించుటయుఁ ద్రిగర్తయోధులు దక్షి
ణగోగ్రహణంబుఁ జేయుటయు, భీముఁ
డు వారలనిగ్రహించి వారిచేఁబట్టువ
డినవిరాటుం దప్పించి పశువులఁ దెచ్చు
టయుఁ, గౌరవు లుత్తరగోగ్రహ
ణంబొనరించుటయు, నర్జునుండు
వారలనెల్లం గెలిచి గోవుల మ
ఱలించుటయు నభిమన్యువి
వాహంబు నన్నది సర్వం
బు నేకాశ్వాసము.
విరాటపర్వము
సమాప్తము.



శ్రీకాళహస్తీశ్వరాయనమః.

# ఉద్యోగపర్వము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీ విలసిత తత్త్వం పద
భావ స్ఫుటబోధ నానుభావ వశీ సము
ద్భావిత కేవలతా మహి
తా వాఙ్మన సాతిదూర తత్త్వ స్ఫురితా

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతరకథాకర్ణనోదీర్ణకుతుకహృదయుం డైనజనమేజయున కిట్లనియె.

అవ్విధంబున నభిమన్యువివాహంబు సమ్మోదావహంబై నెఱవేఱుటయు మఱునాఁడు వఱువాతన కల్యకృత్యంబులఁ దీర్చి పాండుపుత్రులు కృష్ణబలదేవాదిపరివృతులై చిరత్నరత్న చిత్రచిత్రితంత,బుత్తమాస్తరణాస్తీర్ణంబు, దివ్యచందనమాల్య సమంచితంబునై సొంపు పెంపారుచున్నవిరాటుకొలువుకూటంబున కరిగి విరాటద్రుపదులు కూర్చున్నపదంపడి విరాటుచేరువం గృష్ణుండును, బాండవులును, బాంచాలురును, బ్రద్యుమ్నసాంబాదు లగుయదుకుమారులును, విరాటపుత్రులును, సౌభద్రుండును, ద్రౌపదేయులును, ద్రుపదరాజుచేరువ వసుదేవబలరామసాత్యకిప్రముఖులుం గూర్చుండఁగఁ దక్కటిరాజులును మాన్యవృద్ధులునుచితప్రకారంబునం గూర్చుండిరి. అత్తెఱంగున నాకొలువు సకలరాజలోకసమంచితంబై గ్రహనక్షత్రవిరాజితం బైననభోమండలంబు ననుకరించి కన్నులపండువై యుండుటయు సభాసదు లైనరాజులు గోవిందుమొగంబునం జూడ్కులు నిలిపి వేడ్క నెఱయ నభిమతసల్లాపంబులు సల్పుచుండఁ బాండవకార్యార్థి యైనకృష్ణుండు వారల వారించి యందఱుం గలయం గనుంగొని మహార్థవిలసితంబుగా నిట్లనియె. శకుని కైతవపాటవమున జూద మాడి ధర్మరాజు నోడించుటయు, సత్యధర్మనిరతు లయినపాండవులు ప్రతిజ్ఞచొప్పున వనవాసాజ్ఞాతములఁ జేయఁ బూనుటయు, నుక్కివు లగువారినెల్ల నొక్కపెట్ట యుక్కడంప వలంతులయ్యుఁ గౌంతేయులు కేవలసత్యపరత్వంబునం జేసి పూనినసమయంబు మెయిఁ బండ్రెండేండ్లువనవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబును వచ్చినయాపదలనెల్ల నోర్చుచు

యథాక్రమంబు నడపుటయును సభాసదులకెల్లఁ దెల్లంబకదా. లాఁతివారలఁ బని పంచమహారాజులయ్యు వీరు పడరానియిడుమలఁ బడి యెట్లో గడచి వచ్చుట యెంతయు నద్భుతంబకాదె? కావున నీకుఁ బాండవులకును ధార్తరాష్ట్రులకును హితంబుగాఁ గీర్తిధర్మంబులు సేకూఱుతెఱం గున నెక్కటి యాలోచింపుఁడు. ధర్మరాజు ధర్మమునకు విరోధము లేకుండ నెక్క గ్రామమున కాధిపత్యంబు వచ్చినను మేల యనుంగాని యధర్మంబున నింద్రపదంబులభించిన నొల్లఁడు. పాండురాజు దిగ్విజయంబు చేసి సాధించుటకతన నీరాజ్యము పాండవులకుఁ బితృధనం బగుటయుఁ, బాండవులును దిగ్విజయంబు చేసి రాజ్యంబు పెంపు సంపాదించుటయు నన్యాయంబున ధార్తరాష్ట్రు లపహరించుటయుం గారణంబులుగా వీరుతమరాజ్యంబు క్రమ్మఱంబడయఁ గోరుచున్నవారు. వారు పుట్టిననాఁటంగోలె వీరలఁ జంపఁగ నెన్నియే నుపాయములు పన్నుటయు, వీరిరాజ్య మపహరింపఁ దలంచుటయు సువ్యక్తంబు గావున నదియెల్లఁ జెప్పనేల? వారిలోభమును, ధర్మరాజుధార్మికత్వంబును, బంధుత్వంబునుం దలపోసి యుచితక్రమంబున సంధి సేయుట లెస్స. సంధి పొసఁగదేని వీరు వారిపైఁబోరికి సమకట్టుదురు. యుద్ధమున జయపరాజయములు నమ్మఁ దగవు. వీరు సహాయబలవిరహితు లగుటం జేసి బలవంతు లయినవారల గెలువఁ జాల రని కొందఱు తలంతురేమొ. వీరుం దగినసహాయసన్నాహంబు సమకట్టి వారలఁ జంప జతనంబు చేయుదురు. ఇది వీరలతలంపునకుఁ దగినపని. దుర్యోధనుఁ డేమి చేయ నున్నవాఁడో యింతకు దెలియరాదు. ఎదిరిమతం బెఱుంగక యెక్కటినిశ్చయింపరాదు. కావున ధర్మశీలుఁడు, శుచి, కులీనుఁ, డప్రమత్తుఁడు, సమర్థుఁడు నగునెక్కదూతను వారికడ కంపి శాంతివచనములఁ బలికి పాండవులకు రాజ్యార్ధంబు నొసంగునట్లుగాఁ దగినమాటల నాడి రమ్మనవలయు నని జనార్దనుండు పలుకఁగ ధర్మార్థసహితము మధురము నగుతదీయవచనంబు నాకర్ణించి ప్రశంసించి బలరాముఁడు రాజులనెల్లఁ గలయం గనుంగొని యిట్లనియె. వింటిరే జనార్దనువచనంబు. అది యర్థవంతంబు. ధర్మసమన్వితంబు ధర్మరాజునకును దుర్యోధనునకును హితంబు. దుర్యోధనుండు పాండవుల కర్ధరాజ్యం బిచ్చి తనసగముఁ దా నేలుచుండిన నయ్యది వారికి వీరికిని మేలు. లోకమునకును హితంబు. కావున దుర్యోధనుమతం బెఱుంగ నిపుణుఁడైన దూత నెక్కనిఁ గరిపురికిఁ బంపుటయే నాకుం బ్రియంబు. పోయినవాఁడు పౌరవవృద్ధాదిపరివృతం బయినకురుసభం జొచ్చి రెండుపక్షములవారికిని శాంతిఁ గావింపఁ దలంపుతోఁ గురుపితామహుం డైనభీష్మని, మహానుభావుఁ డైనధృతరాష్ట్రుని, ధర్మవిదు లయినద్రోణకృపాశ్వత్థామవిదురులను, గర్ణశకునులను, బుద్ధిబలప్రధానులు స్వధర్మనిరతులు నగుదుర్యోధనాదిధార్తరాష్ట్రులను వినయంబు పొంపిరివోవ

వారలచిత్తముల నింపు పెంపు సంపాదించుచందంబునం గొలిచి కౌంతేయులకార్యంబు నెఱవేఱునట్లుగాఁ దగినమాట లాడవలయుఁగాని బలిమిని సాధితార్థులై నవారలయెదుట సర్వావస్థలందును వేఁడిమాట పలుకరాదు. కోపము సూచింపరాదు. సామ్రాజ్యవిలసితుండై యుండియు ధర్మరాజు జూదమున నేమఱి నిజరాజ్యంబుఁ గోల్పడియె. అందుఁ ద ప్పెవ్వరియది? దుర్యోధనుండు పెద్దలును మిత్రులును వారించుటం జేసియుఁ దనకు జూదమున నేర్పు లేమిం జేసియుఁ దా నాడుట మాని తనకుఁగా శకునిని నియమించె. ఆద్యూతరంగంబున జూదరులు పెక్కండ్రు గలిగియున్నను దెలిసితెలిసి ధర్మరాజు గాంధారరాజుతోడన యాడం దొడంగి ద్యూతవిద్యానిపుణుం డైనయతని కోడి యంత నిలువక సంరంభవశుండై మాటిమాటి కొడ్డు లొడ్డుచుఁ గలధనంబెల్లఁ గోల్పోయె. ఇందు శకునితప్పెయ్యదియో యెఱుంగరాదు. ఇవన్నియుఁ గారణంబులుగా వార లధర్మపరు లని పలుకరాదు. కావున వీరలుపుచ్చుమానిసి వినయప్రణామపూర్వకంబుగ సామవచనముల నాడి కార్యము తెలుంగుపఱిచికొని వచ్చుటయే కర్తవ్యంబు. కాదేని కార్యము చక్కంబడ దని తోఁచెడి. కార్యసాధనంబున సామంబుకంటె యుద్ధముత్తమసాధనంబు గాదు. వారితోడిపోరు గోరవలవ దనిన విని సాత్యకి క్రోధవిధేయుండై తటాలున లేచి బలదేవుమాట నిరాకరించుచు నిట్లనియె.

### సాత్యకి బలరామునవచనముల నిరాకరించుట.

లాంగలధ్వజా, లోకమునఁ బురుషులకుఁ దమతమయంతరాత్మ ప్రవర్తనంబునకుఁ దగునట్లు పలుకుట సహజంబు. కావున నీవును నీయంతరాత్మప్రవృత్తికి బోలినవిధమునఁ బలికెదవు. ఒక్కవృక్షమునందు ఫలితనిష్ఫలంబు లగుకొమ్మ లుండు తెలంగున నొక్కకొలమునందుఁ గ్లీబమహాబలులు జనింతురు. ఇంధు ని న్నన నేల? నీమాటపై ననూయపడ నేల? మఱి నీమాటలకుఁ జెవ్విచ్చి వినువారల ననవలయు. వెదకి చూచినం బాండవాగ్రజునెడ దోష మించుకయుం గానఁబడదు. వెఱపోకించుకయైన లేక యట్టిధార్మికవరేణ్యుపై దోషములఁ జెప్పనీ కీనిండుకొలువునం దవకాశము గలిగెఁగా. అంతయు ధర్మరాజుదోషంబకాని వారలత ప్పెద్దియును లేదనికాదె పలికితివి. అదెట్లు పొసఁగు? అక్షవిద్యానైపుణ్యంబు లేని ధర్మరాజుం బలాత్కారంబుగాఁ బిలిచి యాడు మని నిర్బంధించి వంచనం గెలుచుటది ధర్మజయం బని యెవ్వరైనం జెప్పఁగలరే? భ్రాతృవర్గముతోడ నింటవేడుకమై నాడుచుండ వచ్చియాడి గెలిచిరేని యప్పుడు ధర్మజయం బని చెప్పవచ్చు. అట్లుగాక క్షత్రధర్మనిరతుఁ డగుధర్మరాజును బ్రయత్నముతోఁ బిలిచి వంచనమై నాడి రాజ్యము నాచికొనిరి. అన్యాయమున వారు రాజ్య మపహరించికొన్నను వీరు పాడి దప్పక సంకేతితప్రకారంబున వనవాసాజ్ఞాతవాసంబులఁ గడపి వచ్చిరి. సమ

యంబుఁ దీర్చినపుడే వీరు తమరాజ్యముఁ బొంద నర్హులు. ఇప్పట్టున వీరలువుచ్చు మానిసి వారల కేల మ్రొక్కవలయును? ధర్మరాజు పరధనముఁ గోరునేని దూత వారి ననుసరింపవలయు. పితృధనం బయిననిజరాజ్యంబు న్యాయమునఁ బొందవ లయునెడ నెరుల నేల ప్రార్థింపవలయు? వార లధర్మపరు లని పలుకరా దనియుం టివిగదా? వారు ధర్మపరులై యొరులరాజ్యము నపహరింపఁ దలంపు లేనివార యగుదు రేని నివృత్తసమయుండై సవ్యసాచి గోగ్రహణంబున నగపడినపుడు భీష్మద్రోణులు వారించినను వినక యజ్ఞాతవాసంబు దీఱకమున్న యప్పునుఁ డగ పడియె నని ప్రేలుదు రే? పరధనలోలుపు లయినయాపలువలు పాండవులకుఁ బితృ ధనం బయినరాజ్యము నొసంగఁ దలంపరు. కావున నేను రణమున నిశితశరము ల వారల ననునయించి ధర్మరాజుపాదములపయిం బడునట్లుచేయుదు. అపుడం దులకొడంబడ రేని పుత్రమిత్రామాత్యసహితంబుగా నందఱు యమసదనంబున కుఁ బోవుదురు. ఇంతయు నిక్కువంబు. సంరంభవశుండై పోరు సేయం దొడం గిన సాత్యకి బాహువేగంబును వజ్రవేగంబును బర్వతంబులుం బోలె వా రోర్వఁ జాలరు. గాండీవపాణి యైన సవ్యసాచిని, జక్రధరుం డైనజనార్దనుని, శత్రులకుఁ జెనకరానిభీమసేనుని, గాలానలతుల్యులయిననకులసహదేవులను, శూరశేఖరుఁ డైనధృష్టద్యుమ్నుని, బాండవులయట్లు వీర్యమదోత్కటు లయినద్రౌపదేయు లను సురలకేనియునోర్వరానియభిమన్యుని, గాలవజ్రానలోపము లయినప్రద్యు మ్నసాంబగదాదు లగుయాదవకుమారులను జీవితాశ గలవాఁ డెవ్వఁడుం బోర మార్కొని వచ్చునే? కావున మేము కర్ణశకునిదుర్యోధనులఁ దెగటార్చి ధర్మరా జునకుఁ బట్టాభిషేక మొనరింతుము. ఆతతాయు లయినపగతురఁ బరిమార్చుట ధర్మంబు. శాత్రవులం బ్రార్థించుట యధర్మం బయశస్కరంబు. ధర్మరాజుమనం బునం గలకోర్కి యీడేఱ నందఱుం బ్రమాదంబు లేకప్రవర్తిల్లవలయు. పాం డవులకు రాజ్యలాభంబొండె నాచే నిహతులై దుర్యోధనాదులు రణాంగణంబు నఁ బడుటయొండె నిప్పుడు కాఁగలయది యని పలికిన విని ద్రుపదుఁడు సాత్యకి కిట్లనియె.

ఇది యిట్టిద నిస్సంశయంబు. దుర్యోధనుఁడు మంచిమాటల రాజ్య మియ్యఁడు. పుత్రప్రియుండై ధృతరాష్ట్రుఁడు తన్మతంబ యనువర్తించు. కార్ప ణ్యంబునం జేసి భీష్మద్రోణులును వాని ననువర్తింతురు. మొఱకడమునం జేసి కర్ణ శకునులు వానిన యనుసరింతురు. బలరామవచనంబు పరికించి చూచిన లెస్స గాదు. కార్యసాధనంబుపొంటె సముచితప్రకారంబునఁ దగినమానిసిం బంపి యు క్తముగ నడుగు మనవలయుఁగాని దుర్యోధను నెదుట మృదువచనంబులు పలుకఁ బోలదు. పాపాత్ముఁడై నదుర్యోధనుఁడు మృదువచనముల సాధ్యుం డగునే. గర్ద

భంబులయెడ మార్దవంబును గోవులయెడఁ దైక్ష్ణ్యంబునుంబోలె వానియెడ మార్దవం బనర్థకారణం బప్రయోజకంబు పాపాత్ముఁ డగువాఁడు మృదువుగ భాషించువాని నసమర్థుఁగాభావించి తాను గెలిచినట్లు నిశ్చయించు. కావున వానియెడ మార్దవం బెంతయు నొప్పదు. మనమును సుహృద్బంధుజనుల కిప్పుడే యెఱింగించి సమరసన్నాహంబు సమకట్టుటయ యిప్పటికిఁ బోలినకార్యంబు. దూతలఁ బంపునెడ మన మీఁక నించుకేనియు నాలసింపరాదు. వారు ముందుగ దూతలఁ బంపిరేని రాజు లందఱు ముందు పిల్చినవారికిఁ దోడ్పడుట సాధుధర్మంబు గావున వారిక బాసట యగుదురు: మహాకార్యంబు పొసంగె. కావునఁ ద్రుపదపడి శల్య, ధృష్టకేతు, జయత్సేన, కేకయ, భగదత్త, కృతవ, ర్మాహు, కామితౌజ, ఉగ్ర, దీర్ఘప్రజ్ఞ, శూర, రోచమాన, బృహంత, సేనాబిందు, సేనజి, త్ప్రతివింధ్య, చిత్రవర్మ, సువాస్తుక, బాహ్లిక, ముంజకేశ, చైద్య, సుపార్శ్వ సుబాహు, పౌరవమహారథ, శక, పహ్లవ, దరదాదు లయినరాజులకడకు వేగం బ తగినదూతలం బుచ్చవలయు. ఇది నాకుఁ దోఁచినపని. మఱియు నాపురోహితుఁ డైనవృద్ధబ్రాహ్మణుఁడు విద్వాంసుఁడు. అతనిఁ గరినగరంబునకుఁ బుత్తము. అతం డచ్చటి కరిగి భీష్మద్రోణాదులకు, ధృతరాష్ట్రునకు, దుర్యోధనునకు నెట్టులెట్టులు చెప్పవలయునో తత్ప్రకారం బంతయుఁ జెప్పఁ డని తనతాత్పర్యంబుఁ దెలియం జెప్పిన విని వాసుదేవుఁ డప్పాంచాలరాజున కిట్లనియె. సోమకకులధురంధరుం డైనసీయెడఁ బాండవార్థసిద్ధికరం బయినయిట్టివచనం బుపపన్నంబు. సునీతిం గోరుమన కియ్యది ప్రథమకార్యంబు. వేఱొక్క తెఱంగున నాచరించిన బాలిశత్వంబు సిద్ధంబు. కౌరవపాండవులు తమతమమర్యాదలచొప్పున నుండిరేని బంధుత్వసంబంధంబు రెండుపక్షములఁ దుల్య మగుటం జేసి యొక్కరీతిన చూడవలసియుండు. అయిన నదియెల్ల నిపు డేల? ఇపుడు మే మందఱము నభిమన్యువివాహార్థంబు పిలిచిన వచ్చి పెండిలి కన్నులారఁ జూచి సంతసించితిమి. ఇఁక నూరికిఁ బోవలయు. మీరు వయోవిద్యల నిచ్చటఁ గూడినరాజులలో నందఱికంటె నధికులు. మే మందఱము శిష్యులరీతి మీవచనంబు గ్రహింతుము. ధృతరాష్ట్రుఁడును మిమ్మెల్లపుడును బహుమానంబునం జూచు. ద్రోణకృపాచార్యులు మీయెడఁ జెలిమిఁ బ్రకటింతురు. కావున మీరే యాలోచించి పాండవకార్యసిద్ధి యగుతెఱంగుగా నుచితవచనంబులఁ జెప్పి పంపుటుచితంబు. అదియే మా కందఱకుం బ్రియంబు. మీరు చెప్పిపుచ్చుమాటల విని దుర్యోధనుఁడు సంధి చేసెనేని కౌరవపాండవులు సౌభ్రాత్రంబునఁ జెలిమి వాటించి మెలమిఁ గాంతురు. దర్పమోహావిష్టుం డై యాదురాత్ముఁ డామాటల నాదరింపఁడేని రణరంగమునఁ గోపాటోపదీపితుం డైనగాండీవినిశితమ్ముంబునఁ బుత్రమిత్రామాత్యస

హితంబుగాఁ జెడును. అట్టిచందను యగునేని రాజులకెల్ల సమరసన్నాహసాహాయ్యకంబు సేయ దూతలం బంపి యట మాకుం దెల్పుఁ డని పలికి యందఱ నామంత్రణంబు చేసి ప్రయాణోన్ముఖుం డగుటయు మత్స్యమేదినీశ్వరుం డమ్మహానుభావునకును వసుదేవబలదేవాదులకుఁ దక్కటివారల కందఱకు నుచితప్రకారంబుల సత్కారంబు లొనరించి పనిచె. పాండవులు ద్రుపదాదులు వాసుదేవునితోడం గొంత చని యట మఱలి యాస్థానమంటపంబు సేరి సకలరాజులకును సమరంబునఁ దోడ్పడుఁ డని తెలుపఁగఁ దగిన దూతలం బనిచిరి. దుర్యోధనుండు నేతత్ప్రకారం బెఱింగి తనకుఁ దోడ్పాటు సూపఁగ రాజులయొద్దకు దూతలం బనిచె. ద్రుపద, విరాటపాండవవచనంబునం జేసి తత్తద్దేశరాజులు తమతమవివిధబలంబులతోడ భూతలంబద్రువ వచ్చుటయు నచ్చోటు చతురంగబలసాంద్రంబై యుండె.

## ద్రుపదుఁడు ధృతరాష్ట్రునొద్దకుఁ దనపురోహితుని సంధికిఁగాఁ బంపుట.

అంత ద్రుపదుఁడు విద్యావయోవృద్ధుం డైనతనపురోహితుం బిలిచి యిట్లనియె. అయ్యా, భూతములలోఁ బ్రాణులు, ప్రాణులలో బుద్ధిజీవులు, బుద్ధిజీవులలో మనుష్యులు, మనుష్యులలో బ్రాహ్మణులు, కృతబోధులలో ననుష్ఠాత, లనుష్ఠాతలలో బ్రహ్మవేదులు శ్రేష్ఠులుగదా. నీవు కృతబోధులలోఁ బ్రధానుఁడ వని నేఁ దలంతు. వయోవిద్యాకులముల విశిష్టుఁడవు. శుక్రబృహస్పతులయట్లుమహితప్రజ్ఞావిలసితుఁడవు.దుర్యోధనుదుశ్చరిత్రంబును ధర్మరాజుసచ్చరిత్రంబును సమగ్రంబుగా నీకు విదితంబకదా. ధృతరాష్ట్రుఁడును దనకొడుకులు పాండవులను వంచించి రనుట యెఱుంగు. అధృతరాష్ట్రుఁడును విదురుఁ డెంత యనునయించి చెప్పినను వినక కొడుకుమతంబె యనువర్తించు. ద్యూతనిపుణుఁడుగాని ధర్మరాజును క్షత్త్రధర్మనిరతుఁడయినవాని బుద్ధిపూర్వకంబుగ నిర్బంధించి పిలిచి ద్యూతకైతవపాటవవిదుఁ డైనశకుని వంచించె. అపుడు వంచించెబో. వీ రందులకు నేమనక శాంతిపరులై యీసమయంబు గడపి వచ్చినపదంపడి వీరిరాజ్యము మఱల వీరికిఁ దమంతన యొసఁగఁ దలంపు గలిగినవిధంబు గన్పడ దయ్యె. కావున నీ వరిగి ధర్మయుతంబుగా ధృతరాష్ట్రున కంతయుఁ దెలియఁ జెప్పుము. నీమాటలనేర్పున నచటివారలమనస్సు లట మఱలి యిటు వ్రాలునట్లు చేయవలయు. అచ్చట నీవాక్యమును సాధింప విదురుఁడు గలఁడు. భీష్మద్రోణకృపాదుల మనస్సులందు భేదము గావింపవలయు. అమాత్యులు యోధులును విముఖు లయిరేని మఱలవారు వారితోడ నేకత్వంబు గావించికొనవలయు. అది వారికిఁ బెద్దపని యగు. అంతలోఁ బాండవు లేకాగ్రబుద్ధులై సేనాసన్నాహంబును బలసంచయంబునుం జేసికొనఁ గలరు. ఇదియ యీకార్యమునఁ

ప్రధానప్రయోజనంబు. కృపాళులయొద్దఁ బాండవులు పడినపాట్లును వృద్ధుల యొద్దఁ బూర్వాచరితం బైనకులధర్మంబును నిరూపించుచుధర్మసమన్వితంబుగా నందఱు విన సభలో ధృతరాష్ట్రునకుఁ దెలుపవలయుము. ఒకవేళ ధృతరాష్ట్రుఁడు ధర్మ్యం బయినభవద్వచనం బాచరించి కార్యంబు తెలిఁగుపఱిచినం బఱచు. నీవు నిపుణవచనముల నచ్చటివారిమనస్సుల నిస్సంశయముగ భేదింపఁ జాలుదు వని నాకుఁ దోఁచెడి. సంధికార్యము సంభాషించుతఱి నాతులువ లేమి చేయుదురో యని వెఱవం బని లేదు. నీవు వేదవిదుఁ డయినబ్రాహ్మణుఁడవు. వృద్ధుఁడవు. దూతకర్మంబు చేయఁ బూనినవాఁడవు గావున వారు నిన్నే మనరు. పుష్యయుక్త మయినజయముహూర్తమునఁ దఱలి కరిపురి కరిగి కార్యంబు సాధింపు మని చెప్పి ద్రుపదుఁడు వీడ్కొలుపుటయు వృత్తసంపన్నుఁడు నీతిశాస్త్రార్థకోవిదుఁడు నగునాపురోహితుఁడు శిష్యపరివృతుండై పాండవహితార్థంబు హస్తినగరమునకుఁ జనియె. అటఁ దక్కటిరాజుల కెల్లరకును సమరసాహాయ్యాచరణార్థంబు తగినదూతలం బనిచిరి.

## దుర్యోధనుఁడు కృష్ణుని సహాయుఁగాఁ గోరుట.

అంత నక్కడ దుర్యోధనుఁడు వేగువారివలనఁ బాండవులవృత్తాంతమును వాసుదేవుఁడు పాండవులకుఁ దెగువచెప్పి ద్వారకకుఁ బోవుటయు నెఱింగి యమ్మహాత్మునొద్దకు దూతలం బంపుట తగ దనియూహించి కొంతసైన్యంబుతోడఁ దానే ద్వారకకుఁ జని శ్రీకృష్ణునగరు సొచ్చి యాజగన్నాథుఁడు నిద్రించుచుండ దలచేరువ నెక్కయుత్తమాసనమునఁ గూర్చుండె. అర్జునుఁడు దానును శ్రీకృష్ణసహాయంబుఁ గోరువాఁడై నాఁడే ద్వారకకుఁ జని యాసమయమున వాసుదేవునగరు సొచ్చి యప్పుండరీకాక్షుండు నిద్రించుచుండఁ బాదములచేరువ వినయమున నంజలిపుటంబులు నిటలతటమున ఘటియించి కొలుచుచు నిలిచియుండె. అంతఁ గొంతవడికి మాధవుఁడు మేల్కాంచి యెదుటఁ జరణసన్నిధి నున్నయర్జునుం గనుంగొని యట లేచి తిరిగి చూచి దుర్యోధనునిం గాంచి యిరువుర స్వాగతం బడిగి యుచితరీతిని సత్కరించి మీరాకకుఁ గారణం బెయ్యది యనియడుగుటయు దుర్యోధనుఁడు నవ్వుచు గోవిందున కిట్లనియె. మాకుం బాండవులకుం గాఁ బోవుసమరమున నీవు మాకుఁ దోడ్పడవలయు నని ప్రార్థింపఁగ వచ్చితి. సఖ్యసంబంధములు నాయెడ నెట్లట్ల యర్జునునెడ నుండినను నేను ముందుగఁ వచ్చుటం జేసి మాకుఁ దోడ్పడవలయు. పూర్వవృత్తాంతముల నెఱింగినపెద్దలు ముందు వచ్చినవారికే సహాయత్వంబుఁ జేయుదురుగదా. అవియెల్ల నీకుఁ జెప్ప నేల. సాధుసమ్మతుండ వైననీవు సద్వృత్తాంతము నడపకుండిన నింక నీపృథివిని దాని నడపువా రెవ్వ రనిన విని కృష్ణుఁ డతని కిట్లనియె. [illegible] నీవు మున్న వచ్చినవాఁ

డవు. నే నర్జును ముందు చూచితి. ప్రథమాగమనప్రథమావలోకన కారణంబులం జేసి నీకు నర్జునునకును నేను దోడ్పడవలయు. అందుల కొక్కయుపాయంబు సెప్పెద వినుము. నాయట్టివారు మహాబలులు సమరకళావిశారదులు దురాధర్షులు నగునారాయణగోపాలు రనువారలర్బుదసంఖ్యాకు లగుయోధవీరు లనెక్కపక్షమునకుఁ బంపి నిరాయుధవ్యాపారుఁడనై పరమాప్తుఁడనై నే నొకపక్షమునకు రానున్నవాఁడ. ఈరెంటిలో నెవ్వరి కెయ్యది యభిమతంబో దానిం గోరికొనుఁడు. చిఱుతవాండ్రు మున్నుగోరికొనఁ దగుట శాస్త్రసమ్మతంబు గావున నర్జునుండు ముందు గోరికొన నర్హుఁ డనుటయు నప్పార్థుండు నిరాయుధవ్యాపారుండై పరమాప్తకృత్యంబున మెలంగునారాయణుం గోరికొనియె. దుర్యోధనుఁడు నారాయణగోపాలబలముల ధనంజయుఁడు కోరికొనమి కెంతయు సంతసం బంది యాబలములనెల్లఁ దాఁ గోరికొని కృష్ణుఁడు యుద్ధము చేయకునికిఁ బరమానందంబు నొందుచు నమ్మహాత్ము నామంత్రణంబు చేసి బలరామునొద్దకుఁ జని నిజాగమనకారణంబుఁ దెలియఁ జెప్పుటయు నతనికి బలదేవుఁ డిట్లనియె. అభిమన్యువివాహార్థంబుఁ మేము విరాటనగరంబునకు వచ్చియున్నపు డమ్మత్స్యపతికొలువులో నీప్రచారంబు వచ్చె. అపుడు నేను బంధుత్వసంబంధముఁ బురస్కరించి నిగ్రహపూర్వకంబుగ నెంతయేఁ జెప్పితి. అది యచ్చటఁగొందఱు గ్రహింపరైరి. దామోదరుఁడును వారిమాటల నియ్యకొనినవాఁడు. ఇది యంతయు నీవును వేగులవారివలన వినియుండుదువు. అతని విడిచి నే నొక్కింతసేపైన నిలువనోపను. దానం జేసి యేను కౌరవపాండవులలో నేరికిం దోడ్పడ నని నాఁడే నిశ్చయించికొంటి. సర్వరాజపూజితం బయినభారతవంశమున జనించితివి కావునఁ జెప్పెద. క్షాత్రధర్మంబు లెస్సతలపోసి యుద్ధము సేయుము పొమ్మని వీడ్కొలుపుటయు ధార్తరాష్ట్రుఁడు గాఢపరిరంభపూర్వకంబుగా హలాయుధునానతిం గొని యటఁ గృతవర్మయొద్దకుఁ బోయి పోరికిఁ దోడ్పడు మని యతనిం బ్రార్థించిన నాహార్దిక్యుఁ డొక్కయక్షౌహిణితోడఁ దాను సహాయుఁడై వచ్చున ట్లొడంబడియె. అంత దుర్యోధనుం డాసైన్యమెల్లఁ గొని పరమసంతుష్టుఁడై హస్తినపురికిఁ జనియె.

### శ్రీకృష్ణుఁ డర్జునునకు సారథిగా నొడంబడుట.

అవ్విధంబున దుర్యోధనుం డరిగినపదంపడి వాసుదేవుఁ డర్జునుం బిలిచి యేతలంపుతో నీవు యుద్ధముఁ జేయనినన్నుఁ గోరికొంటి వనియడుగ ధనంజయుఁ డద్దేవున కిట్లనియె. యుద్ధమునఁ గూడినవారినెల్లఁ బరిమార్ప నీవుసమర్థుఁడవు. నేనును సమర్థుఁడనే. నీ వాయుధముఁ బూని రణము చేసి శత్రుల వధించితివేని యింతకుమున్న క్ష్మాప్తకీర్తి యగునిన్నే కీర్తి యంతయుఁ జేరు. ని న్నెదిరించి గెల్తు ననరాదు. కావున నీవు నిరాయుధవ్యాపారుండవై నాకుఁ బరమాప్తుఁడవై

యుండుటయే నా కభిమతంబు. మఱియు నీవు సారథిగా నుండిన నేను సంగరం బుఁ జేయుదు నని యెన్ని యేనాళ్లనుండి నామనంబునఁ గోర్కి పెల్లుగ నున్నది. ఇదియంతయు నాలోచించి నిన్నుఁ గోరికొంటి. నాప్రార్థనంబు నీడేర్పవే యని ప్రార్థించుటయుఁ బార్థునకుఁ బుండరీకాక్షుండట్లనియె. ధనంజయా, యీవచనోప న్యాసంబు నీక తగు. నీకోరినవిధంబున నేను సారథినై నీరథంబుఁ గడపుదు నని పలుకుటయు నర్జునుఁడు శ్రీకృష్ణుం దోడ్కొని యుపప్లావ్యంబునకు వచ్చి ధర్మనం దనుం గాంచె.

అంత నక్కడ శల్యుండు దూతలవలన నంతయు నెఱింగి ధర్మరాజునకుఁ దోడ్పడువాఁడై విచిత్రకవచులు, విచిత్రధ్వజకార్ముకులు, విచిత్రాభరణులు, విచిత్రరథవాహనులు. విచిత్రమాల్యాంబరభూషణధారులు నగుశతసహస్రయో ధవీరులు దండనాథులుగాఁ గలయొక్కయక్షౌహిణితోడఁ బుడమి వడఁక భూత ములు వెతఁజెంద నార్భటి యెసంగఁ బాండవులయొద్దకు వచ్చుచుండె. వచ్చునెడ నతనిసేనానివేశము సార్ధయోజనమితంబై యుండె. అది యెఱింగి దుర్యోధనుఁడు బహుళసేనాపరివృతుఁడు మహాబలవిక్రముఁడు నగుశల్యునిఁ దనకు సహా యుఁగాఁ జేసికొనువాఁడై యమ్మద్రేశ్వరుండు వచ్చుమార్గంబున రమ్య దేశ ములందు విచిత్రవిహారసాధనవిలసితంబు లయినచప్పరంబులు, సభలు, పంది ళ్లు, వాపీకూపములు లోకోత్తరముగ నెన్నియే నేర్పఱిచి యందు వేఱు వేఱుగ నొక్కొక్కచోట దివ్యచందనమాల్యముల భక్ష్యభోజ్యాదిరూపంబుల యినయత్యంతస్వాదునానాపదార్థముల నాయితంబుచేసి యాతండు వచ్చినప్పు డాతనికి మెప్పుగా నన్ని తెఱంగుల నుపచరింపఁ దగినవారల నియమించితానును మాఱువేషముఁ దాల్చి యాపరిచారకులలోన డాఁగి యతండు విడిసినచోట్లనెల్లఁ దానుం బరమాదరంబునఁ బరిచరించుచుండె. అట్టులావిడిదలలోఁ దనకుఁ జేయు నతిమానుషము లయినయుపచారంబుల కెంతయు మెచ్చి శల్యుఁ డయ్యుపచా రంబులంజేసి తాన యింద్రునికంటె నధికుఁ డని భావించి పరమసంతుష్టాంతరం గుండై యాపరిచారకులఁ బిలిచి యుధిష్ఠిరుపురుషులలో నెవ్వ రీచప్పరంబు, లీ డిగ్గియ, లీపందిళ్లు, లీసభలుం గావించి యిన్నియుపచారములఁ జేయుచున్నవా రు. వారియభిమతముల నియ్య నున్నవాఁడ. వారలను నాయొద్దకుఁ దోడ్కొని రం డు. ధర్మరాజు దాని ననుమతించుఁగాక యనిపలుకుటయు నాప్రేష్యజనులు విస్మి తులై యంతయు దుర్యోధనున కెఱింగించిరి. దుర్యోధనుఁ డది సమయంబుగాఁ గొని మాఱువేషము విడిచి నిజవేషము ధరించిశల్యునెద్దకుఁ జనుటయు నమ్మ ద్రేశ్వరుఁడు వానిం గాంచి యూహించి తదభిప్రాయంబుఁ దెలిసికొని యటఁ గౌఁగిలించి నీయెడ [illegible] భవదభిమతంబొసంగెదఁ గోరికొను మ

నుటయు దుర్యోధనుఁడు రాజేంద్రా, సత్యవచనుండవై నాకోరినవరం బిమ్ము. నాకోర్కి యెద్ది యంటేనిమాకుం బాండవులకుం గాఁగలసంగ్రామంబున నీవు మదీయసర్వసేనానాయకుండవై యుండుటయే యని విన్నవించిన విని శల్యుఁ డట్లయగుంగాక నీకోరిక చేసితి ననియే తలంపు మనివచించె. దుర్యోధనుఁడు నీవు నామాట నియ్యకొనినపుడే నేను గృతార్థుఁడ నైతి నని మాఱుపలికె. అట శల్యుఁడు ధార్తరాష్ట్రుం జూచి నే నుపప్లావ్యంబున కరిగి పాండవులం జూచి తదీయయోగక్షేమముల నారసి వచ్చెద. నే నవశ్యంబు వారలఁ జూచిరావలయు. నీవు హస్తినపురంబునకుఁ బొమ్మనినం గాంధారీనందనుండు పార్థివేంద్రా, పాండవులం జూచి నా కొసంగినవరముఁ దలంచి శీఘ్రమ రమ్ము. మే మందఱము భవదధీనులమై యున్నవార మని నివేదించుటయు శల్యుఁ డట్లు చేయుదు నని యొడంబడి యతని నాలింగనంబుఁ జేసికొని వీడ్కొనియె. దుర్యోధనుఁడు నమ్మద్రపతిం గౌఁగిలించి యామంత్రణంబు చేసి నిజనగరమున కరిగె.

## శల్యుఁడు పాండవుల జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట.

అంత నాశల్యుఁ డుపప్లావ్యంబునకుఁ జని స్కంధావారంబు సొచ్చి పాండుపుత్రులం గాంచుటయు ధర్మరాజు తమ్ములుం దాను నతనికిఁ బ్రత్యుత్థానాభివాదనములఁ గావించి పాద్యార్ఘ్యాదివిధులం బూజించి తోడ్తెచ్చె. అంత నమ్మాతులభాగి నేయులుపరస్పరకుశలప్రశ్నంబు నడపి సముచితాసనములం గూర్చుండిరి. అట శల్యుఁడు ధర్మరాజుం జూచి రాజేంద్రా, తమ్ములు ద్రౌపది నీవును వనవాసాజ్ఞాతవాసముల దుష్కరవ్రతంబు సలిపి దైవవశమున నెట్లో యిప్పటికి కాయాపదల నిస్తరించితిరి. దుర్యోధననిమిత్తమున రాజ్యముఁ గోల్పోయి యున్నియేండ్లీడుములఁ బడితివి. ఇఁక శత్రుల వధించి సామ్రాజ్యసుఖ మనుభవింపఁగలవు. లోకతంత్రమెల్ల నీయెఱింగినదియ కావున నీకు విశేషించి చెప్ప నేల? లోభకృత్యము నీయొద్ద నొకటియుం గానరాదు. ఇట్లే పురాతనరాజర్షిమార్గంబునం బ్రవర్తించి దానతపస్సత్యములందు సుస్థిరుండ వగుము. క్షమాదమాదిగుణములన్నియు నీయందె సుప్రతిష్ఠితంబులయి యున్నవి. అవియెల్ల సకలలోకవిదితంబులు. ఆపదలఁ గడచి వచ్చినమిమ్ముఁ జూచి నేఁడు సంతుష్టుఁడ నైతి నని చెప్పితనకుఁ దెరువున దుర్యోధనుఁడుగూఢప్రకారంబున నుపచారంబులు చేయుటయుఁ దానతనికిఁ దోడ్పడునట్లువర మొసంగుటయుం దెలియఁ బలికిన విని యుధిష్ఠిరుఁ డిట్లనియె. దుర్యోధనుఁడు కావించినయుపచారములకు మెచ్చి నీ వతనికి వర మిచ్చుటకు నేనును సంతుష్టుఁడనైతి. నేను నొకవరముఁ గోరుకొనియెద. అది యెట్టిదైనను నావిన్నపం బాలించి చేయనవలయు. కర్ణార్జునులకు సంగ్రామం బగునెడ నర్జునునకుఁ గృష్ణుఁడు సారథియై యుండఁ గర్ణునకుఁ దెరు గడప నీవు దక్క

నింకెవ్వరు నచ్చట సమర్థులు లేకునికి నిక్కంబు గావున నిన్నతనికి సారథిఁగాఁ గోరికొందురు. అట్టియెడ నీవు మాకు జయము కలుగునట్లుగా రాధేయునకుఁ దేజోహాని యగునట్లు భాషింపవలయు ననిన శల్యుఁ డిట్లనియె. నీచెప్పినట్లు వాసుదేవుఁ డర్జునునకు సారథియైయుండఁ గర్ణునకు సారథిఁగాఁగ నచ్చట నాకంటె నెరులు సమర్థులు లే రనుట నిక్కంబు. కావున వార లందులకు నన్నే నియమింతురు. అట్టియెడ నే నవశ్యంబు మీకు జయమగునట్లుగా నారాధేయునకుఁ దేజోహాని యగుచందముగ భాషించెద. పిదప నర్జునుఁడు వాని సుఖమున జయించు. మఱియు నీ వెద్ది వేఁడినం జేయుదు. ఆనాఁడు జూదమున వారు ద్రౌపదిం బఱిచి నపాట్లను జటాసురకీచకాదులవలన నీపతివ్రతకుఁ గలిగినసంకటములను నేను విన్నవాఁడ. వచ్చినయాపదలనెల్ల నీసాధ్వి దమయంతియట్లు సైఁచియుండె. ఈదుఃఖమంతయు సుఖోదర్కంబు గాఁగలదు. ఇందులకు వగవం బని లేదు. విధికృతంబుఁ దప్పింప నేరును నేరరు. దేవతలంతటివారును వచ్చినవ్యసనముల ననుభవించి గడచిరిగాని యొం డెద్దియుంగాము. ఇంద్రుఁడును భార్యతోడ మహాదుఃఖ మనుభవించినవాఁ డనిచెప్పిన విని ధర్మరాజు శల్యుం జూచి యింద్రుఁ డేల సభార్యుండై దుఃఖములపా లయ్యె? తెలియ జెప్పు మనియడుగుటయు ధర్మనందనా, యిందుఁ బురాతనేతిహాసంబు గలదు. దానిం జెప్పెద విను మని శల్యుఁ డతని కిట్లనియె.

తొల్లి దేవశ్రేష్ఠుం డైనత్వష్ట యనుప్రజాపతి యింద్రునెడ ద్రోహబుద్ధిఁ జేసి త్రిశీర్షుం డైనకుమారు నొక్కని సృజించె. వాఁడును విశ్వరూపుఁ డనం బరఁగి వేదాధ్యయనశీలం బైనసోమపానం బనునదియు, సురాపానశీలం బయినసురాపానం బనునదియు, దెసలనెల్లం గబళించుచందంబునం జూచునన్నాదనం బనునదియుంగా సూర్యచంద్రానలతుల్యములయి యతిఘోరము లయినమూఁడు శీర్షముల నెగడి యింద్రపదవిని సాధించువాఁడై ధర్మతపోనిరతత్వంబునఁ దీవ్రతపంబు సల్పుచుండె. అయ్యమితతేజస్కునితపోవీర్యమునకుఁ దలఁకి పురందరుం డితఁడు పూనినతపస్సు నిర్విఘ్నముగ సమాప్తిఁ బొందించెనేని లోకములనెల్ల నొక్కపెట్ట మ్రింగ నోపు. ఇంద్రపదం బధిగమింపఁ జాలు ననిచింతించి యతనితపస్సునకు విఘ్నముఁ గావించువాఁడై నిరుపమానసౌందర్యవిలసితలు, మనోహారహారాదివివిధభూషణశోభితలు, హావభావాదిశృంగారచేష్టారుచిరలునగునచ్చరల రావించి మీరు మీశక్తికొలఁది విశ్వరూపునకుఁ గామమోహంబుఁ గావించి తదీయతపస్సున కంతరాయ మొనరింపుఁడు. అటు గాకున్న నాచిత్తము స్వస్థస్వస్థిం బొరయ దని చెప్పిన విని వారు వల్లెయని పరమతపోనుష్ఠాననిష్ఠాగరిష్ఠుం డైనయవ్విశ్వరూపునెదుటఁ జని వివిధశృంగారచేష్టితంబులఁ బ్రబ్రిదినము నమ్మునిం

ముందటఁ జూపిచూపి యంగుల కతం డించుకేనియుఁ జలింపకునికి కచ్చెరువడి లజ్జితలై క్రమ్మఱ మఘవత్పతిం జేర వచ్చి కరపుటములు ఘటియించి దేవా, యమ్ముని పూర్ణసాగరముచందమున నించుకేనియుం జలింపక తపోనిష్ఠుండై యింద్రియముల గెలిచియున్నవాఁడు. అమ్మునిముందట మావిలాసమ్ములెల్ల వ్యర్థమయ్యె. ఇఁక నెద్ది కర్తవ్యంబో యాలోచింపు మని నివేదించిరి. అంత నింద్రుఁ డచ్చరలం బొం డని యానతి యొసంగి యెద్దియుం దోఁపమి నూరక చింతించుచుఁ గొంతవడికి విశ్వరూపవధంబు కర్తవ్యంబు. దుర్బలుఁడైనను శత్రు నుపేక్షింపరాదు. ఇదియే శాస్త్రసమ్మతనీతి. వాని వధింపఁగ వజ్రాయుధమును బంపుదు నని తనలో దృఢనిశ్చయము గావించి తా నతనితపోవనమునకుఁ జని ఘోరరూపం, బగ్నిసన్నిభంబు, భయావహంబు నగునావజ్రాయుధము వానిపైఁ బ్రయోగించె. ఆవిశ్వరూపుఁడు వజ్రప్రహారమునంజేసి పర్వతశిఖరంబుచాడ్పున నేలం బడియె. పడియుఁ దేజంబు దఱుఁగక బ్రతికియున్నట్లు వాఁడు దీప్తతేజస్కుండై యగపడుచుండ నింద్రుఁ డందులకెంతయు వెఱచుచుండె. అట్టియెడ మూపునం బరశువుఁ బెట్టికొని తక్షకుఁ డొక్కఁ డయ్యరణ్యంబునఁ బోవుచుండ నింద్రుఁడు వానిం బిలిచి పడియున్నరూపుఁ ద్రిశీర్షుం జూపి వీనితలలు నఱుకు మనుటయు వాఁ డయ్యా, యితండు చూడ మహాస్కంధుఁడు. మదీయసాధనంబు వీని నఱుకనోపదు. మఱియు సాధునిందితం బయినయీకార్యంబు నే నెట్లు చేయుదు ననవుడు నింద్రుఁడు వానికిట్లనియె. వెఱవవలదు. నామాట విని నీవు వీనితలల నఱుకుము. నాయనుగ్రహంబునంజేసి నీపరశువు వజ్రాయుధతుల్యం బగు ననిన విని యాతక్షు డయ్యా, యీఘోరకార్యమున నన్ను నియమించుచున్ననీ వెవ్వఁడవు? నీవృత్తాంత మంతయు లెస్సగ వివరింపు మని యడుగ నింద్రుఁడు వానిం జూచి నేను దేవేంద్రుఁడను. వెఱవక నాపంపు చేయు మనిన వాఁడు వెండియు నిట్లనియె. లోకముల ధర్మమునఁ బ్రవర్తింపఁ జేయవలసిననీవే యెట్లీఘోరకృత్యమున కొడంబడితివి? ఇట్టివిషయములందు సిగ్గులేదో? ఋషిపుత్రుఁడైనయితని వధింపఁ బూనితివి. బ్రహ్మహత్యకైన వెఱవవలదే? యనియడుగ నింద్రుఁడు వాని కిట్లనియె. నీచెప్పినదంతయు నిక్కువంబు. ఇతండు నాకు శత్రు వగుటంజేసి వేఱొక్కవెఱవు గానక వజ్రాయుధమున వీనిం బడఁగూల్చితి. కూల్చియు వీని తేజమునకు వెఱచెద. శీఘ్రంబ నీవు నామాట విని వీనితలలు నఱుకుము. నీయెడం బ్రసన్నుఁడనై నీకు యజ్ఞములందు మనుష్యులు పశుశిరస్సున భాగమిచ్చునట్లుగా వ్యవస్థం జేసెద. బ్రహ్మహత్యాభయంబు నాకుం గలదు. ఇతండు హతుండైన పదంపడి తత్ప్రతిఘాతార్థంబు వ్రతము నాచరించెద నిఁక నీవు శంకింపకు మని యొత్తిచెప్పుటయుఁ దక్షు కుఠారమున వానితలలు నఱికె. అట్లు నఱుకుటయు

వేదాధ్యయనశీలంబై సోమపాననామధేయంబైనశిరస్సునుండి కపింజలపక్షులు వెడలె. సురాపానాభిధాన శిరస్సునుండి కలవింకపక్షులు వెడలె. అన్నాదననామకశిరస్సునుండి తిత్తిరిపక్షులు వెడలె. అవ్విధమున నావిశ్వరూపుఁడు ఛిన్నశీర్షుఁడగుటయు నింద్రుఁడు సంతసించి దివంబున కరిగి తన్నుఁగృతార్థుగా భావించియుండె.

ఇంద్రుఁడు వృత్రాసురుం జంపుట.

విశ్వరూపవధం బెఱింగి త్వష్ట క్రోధావేశవివశుండై శమదమపరుఁడు జితేంద్రియుఁడు తపోనిష్ఠుఁడు నిరపరాధుఁడు నగునాకొడుకును జంపినయింద్రుని జంపుటకుఁగా వేఱొక్క కుమారుని సృజింతు. నాతపోవీర్యమును బలమును లోకులు నయ్యింద్రుఁడుం జూతురుగాక యనిపలికి శుచియై యాచమించి యగ్నిముఖంబుఁ గావించి "యింద్రశత్రోర్వర్ధస్వ" యనిపలుకుచుఁ బూర్ణాహుతిఁ గావించుటయు నయ్యగ్నినుండి యొక్కండు సూర్యాగ్నిసమతేజస్కుండైనవాఁడు మిన్నుముట్టుచు వెడలి వచ్చి యేమి పని యని యడుగఁ ద్వష్ట యింద్రుం జంపు మనిపనిచె. వృత్రనామధేయుఁ డయినయాత్వష్ట్రపుత్రుఁడును దేవేంద్రునితోడి యుద్ధకాంక్షతోఁ ద్రిదివంబునకుఁ బోవుటయుఁ గ్రోధసంరబ్ధు లయినయయ్యిద్దఱకుం బోరుఘోరంబయ్యె. ఆసంగరంబున నుక్కుమిగిలి వృత్రుఁడు శక్రుని మ్రింగుటయు నమరులు సంభ్రాంతులై పెలుచ నావులించునట్లుగా వాని కాలస్యంబుఁ గావించిన వాఁడు మిగుల నీల్గి యావులించె. అపుడు పురందరుండు తనమేను మిగుల సంకుచితంబుఁ గావించి తదీయవక్త్రకుహరమునుండి మెల్లన వెడలివచ్చె. నాఁటఁగోలె నావులింత యలసుల యినజనుల నవలంబించె. అత్తెఱంగున నాకేశ్వరుండు వెడలివచ్చినం ద్రిదశులు పరమహర్షంబు నొందిరి. పదంపడి వృత్రుఁడు శక్రునితోడఁ బోరం దొడంగి తనవిక్రమాటోపంబుఁ జూపినఁ ద్వష్ట్రతేజోబలావిష్టుఁడైనవృత్రునికిఁ గొల్లలకు వెఱచి నిలింపపతి యనికిఁ దొలంగుటయు సురలు త్వష్ట్రతేజోవిమోహితులై యేమియుం జేయనోపక వగచుచుండిరి. అట నింద్రుఁడు దేవతలు, మునులు వృత్రవధోపాయచింతనతాత్పర్యంబున మందరపర్వతంబున కరిగి మంతనంబుండఁగ దేవేంద్రుఁ డందఱం గలయం జూచి వృత్రుఁడు లోకమెల్ల నాక్రమించె. వాని వధింపఁగ నుపాయ మొక్కటియు నాకిపుడు దోఁపదు. మున్నెంతయేఁ జేయజాలిననే నిపు డెద్దియుం జేయనేరకున్నవాఁడ. ఇపు డెయ్యది కర్తవ్యంబో? నాకుం జూడ వాని మార్కొనరా దనితోఁచుచున్నది. అతండు తేజస్వి మహాత్ముఁడు మహాబలవిక్రముఁడు. దేవాసురమనుష్యు లందఱు వాని గోడుదురు. కావున నిపు డాపన్నరక్షకుండైనవిష్ణుదేవుసన్నిధికిఁ జని యంతయు నద్దేవదేవునకు విన్నవించి వృత్రవధోపాయంబు నిశ్చయింత మనిన నంద ఱిదియే యిపుడు కార్యం బనిపలికిరి. అంత నందఱు వృత్రభయార్దితులై శర

ణ్యుం డైననారాయణుసన్నిధి కరిగి దేవా, నీప్రాపున లోకములెల్లఁ గుశలంబున నుండు. అమృతంబు దేవతల కొసంగి రాక్షసుల వధించితివి. త్రివిక్రమమూర్తిం బరిగ్రహించి బలిని నిగ్రహించి దేవాధిపత్యంబుఁ బురందరునకుఁ బ్రసాదించితివి. నీవే దేవతలకెల్లఁ బ్రభుఁడవు. నీచేత సర్వంబు వ్యాప్తంబై యుండెడి. అందఱు నిన్నే మ్రొక్కుదురు. జగమెల్ల నాక్రమించి తనవశముఁ జేసికొని మాకుఁ గీడు రోయుచున్న వృత్రుం జంపఁగ నుపాయము నాలోచింపుము. నీవే మాకు గతి వని పలుతెఱంగులం బ్రార్థించిన దత్ప్రార్థనంబుఁ జిత్తగించి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంచనుండు వారి కిట్లనియె. మీ రందఱు నిపుడు చని వృత్రునితోడ సంధి చేసికొనుఁడు. కాలాంతరంబున నింద్రుఁడు వానిం జంపఁగలఁడు. నే నపు డింద్రునివజ్రాయుధమున నదృశ్యుఁడనై యావేశించి వానిం జంపుదు. ఇదియే యిప్పటికిఁ బోలినయుపాయంబు చనుఁ డని వీడ్కొల్పిన నారాయణుననుజ్ఞఁ బడసి యందఱును మగిడి వచ్చుచు నింద్రాదినిర్జరులు ఋషులును దశదిశలఁ బరితపించుచందమున దురాధర్ష తేజమున సూర్యచంద్రులయట్లు లప్రతిహతంబుగా వెలుంగుచున్నవాని, ముల్లోకములఁ గబళించుచాడ్పున భీకరోగ్రమూర్తియైన వాని, వృత్రుని గాంచిరి. అపుడు ఋషులు వానిం జేర నరిగి యోవృత్రా, నీ తేజస్సున జగమెల్ల వ్యాప్తమైయుండినను వాసవుం గెలువ నోపనైతివి. మీ రిరువురుం బెద్దకాలంబు పోరుటంజేసి దేవాసురమనుష్యు లెంతయుఁ బీడితు లైరి. కావున మాకుం జూడ నీవు నింద్రుఁడుం జెలిమి వాటించియుండుట మాకును లోకములకును మే లని తోఁచెడి నని ప్రియము నెఱయఁ దేటపఱిచిన మునివాక్యము విని వృత్రుఁడు వారికిఁ బ్రణమిల్లి యయ్యా, మీమాటల వింటిని. నా మాటయు నొక్కింత వినుఁడు. నాకు నింద్రునకు నెట్లు సంధి పొసఁగు. తేజస్సులు రెం డొక్కటిగఁ గలిసియుండుట యెప్పనే యనిన ఋషులు వృత్రునకు మఱియు నిట్లనిరి. సత్పురుషులతోడ సంధి యపేక్షింపవలయు. అటమీఁదఁ గాను న్నది యగును. అందు విచారం బేల? అందులకుఁగా సత్పురుషులు సంధి సేయుద మనిన వల దనరాదు. సాధువులతోడిసంధి నిత్యంబై యుండు. కార్యసంకటములందు ధీరుఁడు కార్యార్థంబుఁ జెప్పవలయుఁ గావున నీతో నింత చెప్పవలసె. సాధుసాంగత్యంబు మహాఫలప్రద మవుటంజేసి యట్టివారల హింసింపం దలంపరాదు. ఇంద్రుఁడు సాధుసమ్మతుఁడు, మహాత్ములకు నివాసభూతుఁడు, సత్యవచనుఁ,డనింద్యుఁడు, ధర్మవిదుఁడు, సూక్ష్మనిశ్చయుఁడు. కావున నమ్మి వానితోడ సంధి సేయుము. వేఱు తలంపవల దనిన విని వృత్రుఁడు వారల కిట్లనియె. భగవంతు లయినమీ రందఱు నా కవశ్యంబు మాననీయులు. దేవమహర్షులవచనముమెయి నొనరింపనున్నవాఁడ. సంధి సేయునెడ నాకు నింద్రునకు

నొక్కసంకేతంబు వలయు. ఎట్లంటేని. శుష్కముచేతను, నార్ద్రిముచేతను, పాషాణముచేతను, దారువుచేతను, శస్త్రముచేతను, నస్త్రముచేతను, రాత్రి యందును, బగటియందును న న్నతఁడు వధింపకుండవలయు. ఇందుల కతం డియ్యకొనునేని నేనును వానితోడిసంధి కియ్యకొందు ననివచించుటయు సుర లును మునులు నట్ల యగుంగాక యని యతని నియ్యకొల్పి వృత్రవాసవుల కు సంధిఁ గావించిరి. వృత్రుఁడందులకు సంతసించియుండె. ఇంద్రుఁడును సంతు ష్టుండై యావృత్రుని వధింపఁగ రంధ్రము వెదకుచుండి యొక్కనాఁడు సంధ్యా కాలమున సముద్రతీరమునందు వానిం గాంచి హరివరదానంబుఁ దలంచి యి ది సంధ్యాసమయము. రాత్రి గాదు. మఱి పగలుం గాదు. ఇపుడు వీని వధింప వలయు. శత్రుని వధింపకున్న శ్రేయ మెక్కడిది? తగినసాధన మెయ్యదియో యని కొంతవడి చింతించి యటఁ బర్వతోపమం బయినసముద్రఫేనముఁ గాంచి యిది యార్ద్రము గాదు. శుష్కము గాదు పాషాణము గాదు దారువు గాదు శస్త్రము గాదస్త్రమునుం గా దని దాని గ్రహించి యందు వజ్రము నభిమం త్రించి ప్రయోగించుటయు హరియు నం దావేశించి యావృత్రాసురుని సంహ రించె. వృత్రుఁడు హతుఁ డైనం దెసలు ప్రసాదముఁ బొందె. లలితమారుతము వీచె. ప్రజలు సంతసిల్లిరి. గంధర్వయక్షరక్షోమహోరగులును ఋషులును దే వేంద్రుం బలుదెఱంగులఁ బ్రస్తుతించిరి. సర్వభూతములనమస్కారంబులం గ్ర హించి యాఖండలుండు సంతుష్టాంతరంగుండై త్రిభువనశ్రేష్ఠుం డై ననారాయ ణుం బూజించె. అట్లు పురందరుండు వృత్రుం జంపి యసత్యభయంబునను, బ్ర హ్మహత్యాభయంబునను, బూర్వబ్రహ్మహత్యాస్మరణంబునను నభిభూతచిత్తుండై తెలివి దప్పి సర్వముపగిదిఁ జేష్టమానుండై జలములందు డాఁగె. దేవేంద్రుఁడు బ్రహ్మహత్యాభయార్దితుండై వినష్టుఁ డగుటయు భూతలము విగతవృక్షము శుష్కకాననమునై నష్టప్రాయమయ్యె. నదులును విగతప్రవాహము లయ్యె. సరస్సులందు నీళు లింకిపోయె. అనావృష్టి యొనఁగుటంజేసి ప్రజలకు సంక్షోభం బు దొడరె.

## దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తుం జేయుట.

అవ్విధమునఁ ద్రైలోక్య మరాజక మయినం దేవతలు మునులును వె ఱచి యెవ్వఁ డీక నింద్రత్వంబుఁ బడయఁ దగునో యని చింతాక్రాంతులై యుండి కొండొకవడికి నహుషుఁ డనునరవరుండు తేజస్వియు యశస్వియు ధార్మి కుఁడును గావున నతండే యిపుడు దేవరాజ్యమున కధిపతిగ నభిషేకింప నర్హుఁ డని తమలో నిశ్చయించి యతనియొద్దకుఁ జని పార్థివేశ్వరా, నీవు మాకు రాజ వై యుండు మనియడుగుటయు నహుషుఁ డాత్మహితంబుఁ గోరి వారి కిట్లనియె.

ఏను దుర్బలుఁడను. మీకు రా జగువాఁ డెంతయే బలవంతుఁడు గావలయు.
కావున నేను మిమ్ముఁ బాలింప నోపను. మిమ్ముఁ బాలించుటకుఁ జాలినబలము
శక్రునంద గలుగు ననిన విని దేవర్షులయ్యా, యస్మదీయతపోబలముల నీయం
దావేశింతుము. దాన బలవంతుఁడవై యింద్రత్వంబుఁ జేకొని మమ్ముఁ బాలిం
పుము. తపోబలమునం జేసి మాకుఁ బరస్పరభయంబు ఘోరంబై యుండు. నీవు
ధర్మంబు దప్పక పాలించుచుండిన మాకును ముల్లోకములకును మేలు గలుగు
ననిచెప్పి నహుషుని సురరాజ్యమునం దభిషేకించిరి. ఆనహుషుఁడు నాప్రకార
మునఁ ద్రివిష్టపరాజ్యాభిషిక్తుండై ధర్మపరుండై యుండి యటఁ గామలోలుపుఁ
డై నందనాదిదేవోద్యానములందును, హిమవత్కైలాసమందరాది పర్వతం
బులందును, సరిత్సముద్రంబులందును నప్సరోగణపరివృతుండై విహరించుచు
శ్రుతిమనోహరంబు లయినగంధర్వగీతవాదిత్రమధురస్వనంబుల నాలించుచు న
చ్చరలనృత్యంబుఁ గనుచు సుఖముండె. మూర్తిమంతంబులై వసంతాదిఋతువు
లతని సేవించుచుండె. సుఖశీతలసురభిమారుతంబు వానికి మెలపున వీవన గావిం
చుచుండె. అత్తెఱంగున నతండు వివిధక్రీడాపరాయణుండై యుండి యొక్కనాఁడు
పురందరుమహిషి యైనశచీదేవిం గాంచి కామవికార దూషితచిత్తుండై సభాస
దులం బిలిచి యింద్రునిదేవి యగుశచి నన్నేల చేర రాకున్నది? నేనకదా దేవ
తలకు ముల్లోకములకు నీశ్వరుఁడను. నాయొద్ద కిపుడు దానిం దోడ్కొని రండని
యాజ్ఞాపించె. నహుషువచనంబు విని శచీదేవి చింతాక్రాంతయై బృహస్పతియొద్ద
కరిగి. యాచార్యా, నన్ను రక్షింపుము. నహుషునకు వెఱచి నిన్ను శరణుసొచ్చితి.
తొల్లినీవు నన్ను జూచి యత్యంతసుఖభాగిని వనియు, దేవరాజదయిత వనియు,
వైధవ్యరహిత వనియు, నేకపత్ని వనియుం జెప్పియున్నవాఁడవుగదా? ఆపలుకు
సత్యము గావింపుము. నీవచన మెన్నఁడును నసత్యము గా దని నమ్మియున్నదాన
నని నివేదించిన నాకర్ణించి బృహస్పతి దివస్పతి సతి కిట్లనియె. నావచనం బె
న్నఁడు నసత్యము గానేరదు. శీఘ్రంబ పురందరుఁ డిటకు వచ్చువాఁడు. నీవుం
గనుఁగొనఁగలవు. నహుషునివలని వెఱపు విడువుము. ఇంద్రునితోడ నిన్ను శీఘ్రం
బ చేర్చెద. మదీయసత్యవచనంబు నమ్ము మని యూరార్చె. నహుషుఁ డావృత్తాం
తమువిని సురాచార్యునెడం గినియుటయు దేవర్షు లతనియొద్ద కరిగి దేవరాజా,
క్రోధము విడువుము. నీ వలిగిన జగంబులు వెఱచు. నీయట్టిసాధుజనులు క్రోధ
ముఁ గొనం దగుదురే? ప్రసన్నుఁడ వగుము. పరపత్ని యైనశచీదేవిం గోరరాదు
దేవతలకు రాజై యెల్లవారల ధర్మమున శాసింప వలసిననీవు పరదారాభిమర్శ
నంబుఁ జేయం జనునే? యని వచించిన విని నహుషుఁడు వారి కిట్లనియె. తొల్లి
పురందరుఁడు గౌతముఁడు జీవించియుండఁగనే వంచించి తత్పత్ని యగునహల్యను

గామించి పొందినపుడును మఱియు నెన్నియేదుష్కర్మముల నొనరించినపుడును మీరతని నేల వారింపరైతిరి? ఇపుడు నన్నేల వారింపఁ బూనితిరి? ఇది తగదు. శచి నన్నుఁ బొందుఁగాక. అదియే నాకు దానికిని మీకును శ్రేయస్కరంబు. దానిం దోడితెం డని తెగఁబాఱి పలుకుటయు సురలు ఋషులును వానిం జూచి సురేశ్వరా, నీకుఁ గోప మేల? నీయానతిమెయి నింద్రాణిం దెచ్చెదమని యొడంబడి బృహస్పతిభవనమున కరిగి యాచార్యా, నీయింట నింద్రాణి నిన్ను శరణుఁజొచ్చి నీచే నభయముఁ గొనియున్న దని యెఱింగి వచ్చి భవత్ప్రసాదంబుఁ గోరుచున్నారము. ఇంద్రాణిని నహుషున కొసంగుము. నహుషుఁడు పురందరునికంటె విశిష్టుఁడు గావున నీదేవి వానిం బతిఁగా వరించుఁగాక యని చెప్పుచున్నంత శచీదేవి కన్నీరు జాలువాఱఁగ నేడ్చుచు బృహస్పతిం జూచి యోదేవర్షిసత్తమా, నేను నహుషుం బొందను. నిన్ను శరణుసొచ్చితి. నాకభయం బొసంగి రక్షింపు మని మొఱ పెట్టుకొనుటయు దేవర్షులకు సురాచార్యుఁ డిట్లనియె. ధర్మజ్ఞయు సత్యశీలయు నగుశచీదేవి వెఱచి శరణాగత యైనం దాని నే నెట్లు విడుతు? ఎట్టులైన నగుంగాని నిక్కంబ నే నద్దేవిని విడువను. బ్రాహ్మణకులజనితుండనై విదితసకలశాస్త్రుండనై ధర్మశీలుఁడనై ధర్మానుశాసనపరుండనై యున్న నే నకార్యం బెట్లు చేయుదు? ఈయర్థమునఁ దొల్లి బ్రహ్మదేవుఁడు చెప్పిన దానిం జెప్పెద వినుఁడు. భయార్తుండై శరణాగతుండైనవాని రక్షింపనివానిబీజములు బీజకాలమున మొలువవు. తదీయక్షేత్రమున వర్షకాలమునందు వర్షము గురియదు. వానియన్నము విఫల మగు. వానికి స్వర్గలోకభ్రంశ మగు. దేవతలు వానియిచ్చుహవ్యముల గ్రహింపరు. అకాలమున వానిసంతతి నశించు. పితరులు వానితో నెప్పుడును వివాదముఁ జేయుదురు. ఇంద్రాదినిర్జరులు వానికిఁ గీడు రోసి వజ్రాద్యాయుధములఁ బ్రయోగింతురు. ఇవియెల్లఁ దెలిసి నేను శక్రుదేవిని నహుషున కెట్టు లొసంగుదు? ఈదేవికిని నాకును హితం బెయ్యదియో దాని నాలోచించి చేయుఁడు. ఈదేవి నియ్య నని తెగువ చెప్పిన విని దేవర్షిగంధర్వాదు లాంగిరసుం జూచి యెద్ది చేసిన మేలు గలుగునో యద్ది నీవ యాలోచించి చెప్పు మని యడుగుటయు వానికి వాచస్పతి యిట్లనియె. ఇపుడు శచీదేవి నహుషునెద్దకుఁ జని సంగమమునకుఁ గొంతకాలవ్యవధానం బపేక్షించి రావలయు. ఇయ్యది యింద్రాణికిని మనకును హితంబు. కాలవ్యవధానంబు నిర్ణయించికొనిన నీలో నెన్నియే నంతరాయములు కాలవశమునం బొసంగు. వరప్రభావమున నహుషుఁడు గర్వితుఁడై యునికి యందఱకుం దెల్లంబ కావున నింతలో నెద్దియైనం జేటు వానికి మూఁడు. పిదప విచారంబు వల దనిన విని యందఱు నియ్యదియే తగినవెర వని తమలో నిశ్చయించి సురగురుం బ్రశంసించి శచీదేవిం

జేర నరిగి లోకహితార్థం బద్దేవితో నిట్లనిరి. దేవీ, స్థావరజంగమాత్మకం బయిన జగం బంతయు నీవు ధరించినదానవు. నీకుఁ జెప్పవలసిన దేమి యున్నది. ఆచార్యవచనంబు వింటివిగదా! లోకహితార్థంబ వానియొద్ద కేతెంచి తదీయసమాగమంబునకుఁ గాలవ్యవధానముఁ జెప్పిరమ్ము. భవదీయపాతివ్రత్యసత్యముననే నిన్నుఁ గోరుచున్న యాసురాచారుఁడచిరంబ నశించువాఁడు. పురందరుండు శీఘ్రంబవచ్చి యింద్రత్వంబు గ్రహించువాఁడూఁ అడిల్లు మని చెప్పి యద్దేవి నొడంబఱిచిన నయ్యింద్రపత్ని లజ్జితచిత్తయై కార్యార్థంబు వారితోడ నానహుషునొద్దకుఁ బోయె. నహుషుఁడును రూపవయస్సమన్విత యైనయాయింద్రాణిం గన్గొనినంతన కామవికారగోచరుండై యోవరవర్ణినీ, నేను ముల్లోకముల కింద్రుఁడను. నన్నుఁ బతిఁగా వరించి సుఖంపు మనినం దదీయదురాలాపంబుల విని యప్పతివ్రత పెనుగాలికిఁ దూలుకదలిచాడ్పున వడఁకుచు మనమున బ్రహ్మకు మ్రొక్కి మనం బూకతెఱంగున నిల్చికొని యట నహుషుం జూచి సురేశ్వరా, నీసమాగమమునకుఁ గొంతకాలవ్యవధానంబుఁ గోరెద. శక్రుఁ డెటు పోయెనోగాని వానిజాడ యిప్పటికి నెఱుంగనైతి. ఇంకం గొంతకాలం బతనిఁ బోఁబడి విచారించి యెచ్చటనుం దెలియఁబడ దేని యట నిన్నుఁ బొందెద. అందాఁక నాకు వ్యవధానం బియ్యవలయు ననిన నాకర్ణించి నహుషుఁడు పరమహర్షమునఁ బొదలి యట్ల యగుంగాక నీ చెప్పిన పగిది సత్యంబు నడపు మనిపలికి వీడుకొల్పుటయుఁ నయ్యింద్రాణి మగిడి బృహస్పతినికేతనమునకుఁ చనుదెంచి యయ్యాచార్యున కంతయు విన్నవించె. అంత నగ్నిప్రముఖు లయినయమరులు కొంతవడి చింతించి విష్ణుదేవుపాలికిఁ బోయి దేవా, మాకు నీవే గతివి. అనాదినిధనుఁడ వయిననీవు సర్వభూతరక్షాపరత్వంబునం జేసి విష్ణుత్వంబుఁ బడసితివి. వృత్రుఁడు భవద్వీర్యనిహతుఁడయినం బాకశాసనుఁడు బ్రహ్మహత్యామహాపాతక పరిభూతుఁడై యున్నవాఁడు. అతనికాపాతకము వాయఁ బ్రసాదింపవే యని నివేదించిన విని నారాయణుఁ డిట్లనియె. పాకశాసనుఁడు నన్ను ద్దేశించి యశ్వమేధముఁ జేయుఁగాక. దాన నతం డాపాతకముఁ బాసి క్రమ్మఱ దేవరాజ్యం బధిగమించు. నహుషుఁడుం దన దుష్కర్మములం జేసి శీఘ్రంబ నశించు. కొంతకాలము సైఁచియుండుఁ డని వచించిన నమృతోపమం బయినగోవిందునిశుభవచనము విని సురలు ఋషుల నుపాధ్యాయునిం దోడ్కొని శక్రుఁడు భయావిష్టుఁడై డాఁగియున్నచోటికి నరిగి విష్ణుదేవువచనప్రకారంబునం బురందర బ్రహ్మహత్యానివృత్త్యర్థంబు విధియుతంబుగ నశ్వమేధయాగ మొనరించిరి. అటఁ బాకశాసనుఁడుం దనబ్రహ్మహత్యాపాతకమును వృక్షములయం దొక్కపాలును, జలములయం దొక్కపాలును,

భూమియం దొక్కపాలును, స్త్రీలయందు నొక్కపాలునుంగా నంతయు విభాగించి పెట్టి ప్రక్షాళితతత్పాపుఁడై స్వస్థచిత్తుఁడై యమరావతి కరిగె.

ఇంద్రుఁడు నహుషు తేజోవిశేషముం జూచి మఱుఁగుపడుట.

అవ్విధమున నమరావతి కరిగి యమరేంద్రుఁడు వరదానప్రభావంబున నితరదుస్సహతేజోవిలసితుండయినవాని, లాఁతివారల తేజము హరింపఁ జాలినవాని, స్థానచ్యుతిం బొరయనివాని నహుషుం జూచి వాని తేజోవిశేషమునకు వెఱచి కాలప్రతీక్షణతాత్పర్యంబున నదృశ్యుఁ డయ్యె. అతం డదృశ్యుఁ డగుటయు శచీదేవి హా! శక్రా! యని పలుమాఱులు విలపించి దానహోమ గురుపూజాసత్యముల నేను యథావిధి నడపితినేని నాకేక భర్తృత్వంబు సిద్ధించు. ఉత్తరాయణప్రవృత్తం బయినయీపుణ్యరాత్రిం బ్రణమిల్లి కొల్చెద. మదీయమనోరథంబు నెఱవేఱుఁగాక యని తనలో నూఱడిల్లి యానిశాదేవిం బూజించి యుపశ్రుతి నారాధించి నాపతిని నాకుఁ జూపవే యని ప్రార్థించినం దదధిదేవత భవదీయసత్యవ్రతంబున నీమగనిం జూడఁగల వనిచెప్పుచు నిజరూపముతోడఁ బ్రత్యక్ష మగుటయు శచీదేవి సంతుష్టచిత్తయై యద్దేవిం బూజించి నీ వెవ్వతె వని యడుగ నుపశ్రుతి శచి కిట్లనియె. అమ్మా, నే నుపశ్రుతిని. నీదుపాతివ్రత్యసత్యమున నే నేను నీకు దృగ్గోచర నైతి. నాతోడన రమ్ము. నీపతిం జూపెద ననిపలికి యింద్రాణిం దోడ్కొని చని యుపశ్రుతి యనేకపర్వతంబులు గడచి హిమవదుత్తరపార్శ్వమునం బోయి బహుయోజనవిస్తీర్ణం బయిన సముద్రముఁ గాంచి యందు నానాద్రుమలతావృతం బయినయొకద్వీపముఁ గనుంగొని యందు శతయోజనవిస్తీర్ణం బయినయొకసరోవరముఁ గనియాసరస్సునఁ బంచవర్ణపద్మవనంబు సొచ్చి యందొక్కపద్మనాళంబుఁ ద్రుంచి తన్మధ్యమున సూక్ష్మరూపముఁ దాల్చి బిసతంతుమధ్యమునఁ బ్రవిష్టుఁ డైనపురందరుం జూపి యదృశ్య యయ్యె. శచీదేవియు నప్పాకశాసనుం గాంచి తదీయపూర్వకృత్యములఁ బేర్కొని ప్రశంసించిన విని బలసూదనుం డెట్లు నాయున్నయునికి నెఱింగితి వేల వచ్చితి వనియడుగఁ బౌలోమి పురందరున కిట్లనియె. నీవు పోఁడిమి దప్పి మఱుఁగుపడినపదంపడి నహుషుఁడు సురలచేత సురరాజ్యాభిషిక్తుండై వీర్యదర్పంబునం జేసి నన్నుఁ గామించిన నేను వానికిఁ గొంత కాలవ్యవధానంబుఁ జెప్పితి. నీ వికఁ బ్రకాశుండవై యాపాపాత్ముని నిగ్రహింపుము. కాకున్న మీఁద నాపద వచ్చు. ఉపశ్రుతి నారాధించి నే నద్దేవియనుగ్రహమున నిన్నుఁ బొడగంటి. ఇఁక నాలసింపక నిజతేజంబు గ్రహించి వెడలివచ్చి దేవరాజ్యము నేలు మనిన విని యింద్రుఁ డింద్రాణి కిట్లనియె. విక్రమమున కిది యవసరము గాదు. ఋషులతపోబలమున నతండు బలవంతుఁడై యున్నవాఁడు. పగవాఁడు బలవత్తరుండై

యుండునంతకు విక్రమాటోపంబుఁ జూపకుండుటయే నీతి. వానికి బలము దఱుఁగ నుపాయంబు సెప్పెద. బాహిరంబు సేయక దాని నీమదినునిచికొని తత్ప్రికారంబు నడుపుము. ఎట్లంటేని, యేకాంతసమయమున నీ వానహుషునొద్దకుఁజని త్రైలోక్యనాయకా, మునివాహనమున నరుదెంచితివేని యేను సుప్రీతనై నిన్నుఁ బొందుదు నని సంకేతము పల్కుము. వీర్యమదాంధుఁడవుటంజేసి వాఁడు మీఁదు రోయక యట్లు చేసి క్షీణబలుఁ డగు. ఇదియే యిప్పటికిఁ గర్తవ్యం బని చెప్పిన విని శచీదేవి వృత్రారి నామంత్రణంబు చేసి తోడన నహుషునొద్దకుఁ బోవుటయు వాఁడు చిఱునగవు సొంపార స్వాగతం బడిగి యోసుశ్రోణీ, యింకనైన నన్నుఁ బొందరాదో ? నీకోర్కి యెయ్యది? చెప్పుము. తప్పక చేయువాఁడ. సిగ్గువల దనియడుగ శచీదేవి నహుషున కిట్లనియె. జగత్పతీ, నీతోఁ జేసికొనినసంకేతావసరంబు వేచియున్నదాన. పదంపడి నీవె నాకుఁ బతివి గాఁగలవు. నామనంబున నొక్కటి గలదు. మత్ప్రియము సేయఁ దలంపు గలదేని చెప్పెద. తత్ప్రికారం బొనరించితివేని యేను నీవశంబున నుండుదు. ఇంద్రునకు గజవాజిరథాది వాహనములు గలవుగాని వానినెల్ల నే నొల్ల. అపూర్వ మయినమునివాహనమున వత్తువేని యేను నిన్నుఁ బొందుదు. ఆవాహనము విష్ణురుద్రాదుల కేరికేని లేదు. దర్శనమాత్రమున లాఁతివారలతేజము హరింపఁ జాలిననీ వట్టియుత్తమవాహనము నారోహించి వచ్చిన నాకెంతయుఁ బ్రీతి పొడము నని చెప్పిన విని నహుషుఁడు ప్రహృష్టచిత్తుండై యింద్రాణిం గాంచి యోవరవర్ణినీ, నీవచనము సముచితము. నాకుం బ్రియము. యేను దపోవంతుఁడను. బలవంతుఁడను. భూతభవ్యభవత్ప్రభుఁడను. నే నలిగిన జగములెల్లఁ గలంగు. ముల్లోకములు నాయందే సుప్రతిష్ఠితంబులు. దేవదానవగంధర్వకిన్నరాదులును నాకోపమునకు వెఱతురు. ఏను దర్శనమాత్రంబున లాఁతివారితేజము హరింతు ననుట నిక్కంబ. కావున నీవచనము చేయుదు. సప్తర్షులు బ్రహ్మర్షులు నావాహనము మోవఁగ వచ్చువాఁడ. మదీయమాహాత్మ్యంబును సంపత్సమృద్ధిని నీవ చూడఁగల వనిపలికి యద్దేవిం బోవం బనిచి వీర్యమదాంధుండై యట సప్తర్షులను బ్రహ్మర్షులను రావించి వారు మోవఁగఁ దా నందల మెక్కి తిరుగుచుండె. ఇంద్రాణియు నహుషవిసృష్టయై బృహస్పతియొద్ద కరిగి నహుషునితోడ నేను జేసినసంకేతకాల మల్పావశిష్టమయి యున్నయది. వేగంబ పాకశాసను నన్వేషించి తెచ్చి నాభయంబు వాపి శరణాగతమైననన్ను రక్షింపవే యనిప్రార్థించిన విని వాచస్పతి దేవీ, నీవు నహుషునకు వెఱవం బని లేదు. అధర్మజ్ఞుఁ డయినయానరాధముఁడు మహర్షివాహనమునం జేసి భ్రష్టుఁ డయ్యెడు నని తలంపుము. వెండియు నేనాదురాచారునకు వినాశము శక్రునకుఁ దేజోవృద్ధియుం గలుగ నిష్టి చేసెద నని చెప్పి యగ్నిం బ్రజ్వరిల్లఁజేసి

విధియుతముగ హోమము లొనరించి యగ్నిం బిలిచి పురందరుని వెదకి ర
మ్మనివచించె.

—అగ్ని యింద్రుని వెదకి వచ్చి బృహస్పతికిఁ దెల్పుట.—

అగ్నియుఁ దత్క్షణంబ స్త్రీరూపము ధరించి సకలపర్వతవనపుర గ్రామము
లను భూమ్యంతరిక్షములను దిరిగితిరిగి బలవైరి నెచ్చటనుం గానక క్షణమాత్ర
మున మగిడి బృహస్పతిపాలికి వచ్చి జలములుదక్కఁ దక్కటిచోట్లెల్ల వెదకి వచ్చి
తి. పురందరుఁ డెచ్చటను నగపడఁ డయ్యె. జలములు నాకుఁ జొర నశక్యము
లగుటంజేసి యందు నెఱుకనైతి. జలములవలన నగ్నియు, బ్రాహ్మణులవలన
క్షత్రియజాతియుఁ, బాషాణములవలన లోహములుం బుట్టినవి. వానితేజ మెల్ల
చోట్లఁ జెల్లుఁగాని తమజన్మస్థానంబులందుఁ జెల్లదు. కావున జలములునాకుఁ జొ
రరా వనుట సుప్రసిద్ధంబుగాదె. ఇఁక నేమి పనిచినం జేయుదు ననుటయు న
య్యగ్ని దేవునకు సురాచార్యుఁ డిట్లనియె. హవ్యవాహనా, నీవే సురలకెల్ల సుఖ
కరుఁడవు. సర్వభూతముల కంతకరుఁడవు. సాక్షిభూతుఁడవై యెల్లెడల గూఢము
గఁ దిరుగుచున్నవాఁడవు. నీ వేకరూపుఁడవయ్యు గార్హపత్యాహవనీయ దక్షి
ణాగ్ను లన మూఁడువిధములఁ బడయుదువు. నీవు విడిచితివేని యీజగ మంత
యుఁ దత్క్షణంబ నశించు. నీకుం బ్రణామారాధనంబు లొనరించి యుత్తమబ్రాహ్మ
ణులు సద్ధర్మప్రభావమునఁ బుత్రకళత్రసమన్వితులై సద్గతిం గాంతురు. నీవకదా
హవ్యముల మోచితెచ్చి దేవతల కుచితక్రమమున నిచ్చుచుండుదువు. నీవే పర
మహావిష్ణువు. సత్రములయందు మునులు నిన్నే యారాధింతురు. నీవే లోకముల
సృష్టిస్థితివినాశములకుఁ గారణంబవు. నిన్నే మేఘము లనియు మెఱుపు లని
యుం బెద్దలు చెప్పెదరు. నిన్ను వెడలినభవత్ప్రకాశములే సర్వభూతముల వ
హించుచున్నవి. జలములు నీయందే యున్నవి. జగం బంతయు నీయందే ప్రతిష్ఠి
తంబై నది. ముల్లోకములందు నీమెఱుంగనిది యొక్కటేనియుఁ గానంబడదు.
కావున శంక మాని భవదుత్పత్తిస్థానం బయినజలములఁ బొందుము. ఏను బ్రా
హ్మమంత్రముల నీకుఁ దేజోవృద్ధిఁ గావింతు ననిప్రార్థించి చెప్పి తన్మంత్రముల
నతనికిఁ దేజోవృద్ధిఁ గావించినం బ్రీతుండై యగ్నిదేవుఁ డింద్రుం గాంచి యత్తె
నని యొడంబడి తత్క్షణంబ సకలసముద్రనదీనదహ్రద సరోవరములనెల్ల వెదకుచు
నింద్రుఁడు మఱుఁగుపడియున్న యాసరోవరముఁ జొచ్చి పద్మనాళమధ్యమున
బిసతంతువుల నాశ్రయించి సూక్ష్మరూపముతో నున్నశతమఖుం గనుంగొని తత్క్ష
ణంబ మగిడి యావృత్తాంతము వాచస్పతికిఁ దెలిపె. అట బృహస్పతి దేవర్షి
గంధర్వసమన్వితుండై యచ్చోటి కరిగి తనవస్తుండై నపాకశాసనుం గనుంగొని
యో త్రైలోక్యనాయకా, బలనముచిశంబరాదు లయినక్రూరదానవులం బరి

మార్చి సురలఁ బ్రోచి లోకములఁ గడు బాగ డ్తఁ గాంచిననీ కిట్లు డాఁగియుం డ నేల? దేవర్షు లందఱు వచ్చియున్నవారు. లెమ్ము. వీరలఁ జూడుము. విష్ణు తేజోబలోపబృంహితం బయినసముద్రఫేనమున వృత్రాసురుం బరిమార్చితివి. ముల్లోకమున నీకుఁ దుల్యులు లేరు. నీవే సర్వభూతశరణ్యుఁడవు. సర్వభూతము ల ధరించుచున్నవాఁడవు. దేవతలకు మహిమంబుఁ గావించినవాఁడవు. లేచి వచ్చి బలవంతుఁడవై ముల్లోకముల నేలు మని పలువిధంబులఁ బ్రస్తుతించిన నాకర్ణిం చి వృత్రదమనుండు మెల్లమెల్లన బలవంతుండై నిజరూపము ధరించి యాచా ర్యుం జూచి లోకకంటకుం డైనవృత్రుఁడు హతుఁ డయ్యె. ఇంక నెయ్యది యి పుడు మిగిలియున్నది యనియడుగ బృహస్పతి దివస్పతిం జూచి నహుషుం డను నరేంద్రుఁడు దేవర్షిగణతేజోబలమున నింద్రపదప్రాప్తుఁడై యిపుడు మమ్మెల్ల బాధించుచున్నవాఁ డనుటయుఁ బురందరుం డాచార్యుదెసమొగంబై నహుషుఁ డనువాఁ డెవ్వఁడు? అతం డెట్లు సురరాజ్యముఁ బ్రాపించె. అంతటితప మెట్టిది యనియడుగ సురగురుఁడు సురపతి కిట్లనియె. పాకశాసనా, నీవు మఱుఁగుపడిన పదంపడి సురరాజ్యం బరాజకంబై యున్నం బరస్పరభయంబునకుఁ దలఁకి దేవ తలు ఋషులు నెవ్వనినైన నొక్కనిఁ దగినవాని సురరాజ్యమున నభిషిక్తుం జేయ వలయు నని నిశ్చయించి దేవతలలో నొక్కఁడు నందులకుఁ దగఁ డనియూహించి మనుజేశ్వరుం డైననహుషునొద్దకుఁ బోయి యింద్రుఁడ వగుమని ప్రార్థించిన నతండు నేను దుర్బలుఁడను దేవరాజ్యాధిపత్యంబుఁ జేయఁ జాల నని నిషేధించు టయు నట దేవర్షులు నిజతపోవీర్యముల నతని బలవీర్యవంతుం గావించి యింద్ర పదమున నిలిపిరి. వాఁడును దేవర్షితపోబలమున నధికతేజోయుతుండై గర్వించి యకృత్యములఁ జేయుచున్నవాఁడు. ఏమి చెప్పుదు. సప్తర్షులను మహర్షుల ను దనవాహనము మోవం బనిచినవాఁడు. వానిదుష్కార్యము లెన్నియేఁ గలవు. తపోవీర్యబలమునంజేసి యాతఁడు చూచినమాత్రన నెదిరితేజంబు హరింపఁ జాలు. కావున నెవ్వరును వానియెదుటఁ గన్పడ నోడుదురు. నీవును వానికట్టెదుటం గన్పట్టవలదు. దేవత లందఱును వానికి వెఱచి గూఢరూప మునఁ జరించుచున్నవారు. వాని నిగ్రహింప నుపాయంబుఁ జూడవలయు ననిచె ప్పుచున్నంత యమవరుణకుబేరాదు లరుదెంచి మహేంద్రుం గాంచి మాభాగ్య మున నేడు కుశలివైయున్ననిన్నుఁ గాంచితిమి. భాగ్యవశమున వృత్రుఁడు హతుఁ డయ్యె ననిచెప్పిరి. అంత నింద్రుఁడు వారలం జూచి మీరు నహుషుం గెలుచునెడ నాకుఁ దోడ్పడవలయు ననియడుగ వారు నముచిమర్దనా, మేము ఘోరరూపుఁడు విషదృష్టియు నగునానహుషునకు వెఱతుము. నీవు వాని గెల్చిన మేమును యజ్ఞములందలిపురోడాశములందు భాగముల గ్రహింప నర్హుల మనిన

నింద్రుఁడు మీకెల్ల నే నభిషేక మొనరించెద. మన మందఱముం గూడి యా దురాచారుం జయింత మనుచున్నంత నగ్ని నాకును హవిర్భాగము మున్నటికంటె మఱింత యెక్కువ యిమ్ము. నేనుం దజ్జయమునం దోడ్పడుదు ననియె. ఆఖండలుం డందుల కియ్యకొని యిఁకమీఁద మహాయజ్ఞముల నింద్రాగ్నుల కిరువురకుం జేరి యొక్కభాగంబుగా నైంద్రాగ్నం బనుపేర నొసంగునట్లుగా వ్యవస్థ నేర్పఱిచెద. నీవు నొడంబడినచందమునం దోడ్పడవలయు ననిచెప్పి నహుషనిర్జయోపాయంబు జింతించుచుండె.

అగస్త్యుఁడింద్రునకు నహుషుపదభ్రంశముఁ దెల్పుట.

అయ్యవసరమున నగస్త్యుఁ డచ్చటికి వచ్చి దేవేంద్రుం గాంచి భాగ్యవశమున విశ్వరూపుని వధించితివి. వృత్రాసురుని సంహరించితివి. నహుషుఁడును స్వర్గభ్రష్టుఁడయ్యె ననిన విని పరమప్రీతుండై పురందరుం డమ్మునీంద్రుని స్వాగతం బడిగి పాద్యార్ఘ్యాచమనీయమధుపర్కాదివిధులం బూజించి యుత్తమాసనమున నాసీనుం జేసి మునీంద్రా, పాపనిశ్చయుం డైనయానహుషుఁ డేమికతమున స్వర్గభ్రష్టుఁ డయ్యె ? వివరించి చెప్పవే యనియడుగ నగస్త్యుఁ డతని కిట్లనియె. ఆనహుషుఁడు బలదర్పితుండై సప్తర్షులను బ్రహ్మర్షులను దనయందలము మోవం బనిచి తా నందుఁ గూర్చుండి తిరుగుచుండె. అప్పుడు మోచుచున్న మునులు గోసంప్రోక్షణమునందుఁ బ్రోక్తము లయిన బ్రహ్మణ్యమంత్రములు నీకుఁ బ్రమాణంబో కాదో ? యని యానహుషు నడుగ నతఁడు తమోగుణావేశంబునం జేసి మూఢచేతనుఁడు గావునఁ బ్రమాణము గా దనిపలుకుటయు మునులు పూర్వమహర్షులు ప్రమాణం బని నిశ్చయించినవాని నప్రమాణం బని చెప్పరాదు. ధర్మము మాని యధర్మమునందుఁ బ్రవర్తింపఁ దగ దని మాఱు సెప్పుచుండ నేను మఱింతయెక్కువగా వానిమతము ఖండించుచు వివాదముఁ జేసితి. అట నయ్యధర్మపరుఁడు తనకాలిచే నాతలఁ దన్నె. అంత నేనుం గోపించి నిజాపరాధమునం జేసి భయపీడితుం డైనయతనిం బిలిచి యోరీపాపాచారా, బ్రహ్మసము లయినమహర్షులను వాహనము మోవం బనిచితివి. పూర్వమహర్షులెల్లఁ బ్రమాణం బని పరిగ్రహించినవేదముల నప్రమాణం బనిపల్కుచు వేదముల నిందించితివి. అది తగ దని వారించిన నన్నుఁ బాదమునఁ దన్నితివి. కావున సురరాజ్యభ్రష్టుఁడవై క్షీణపుణ్యుండవై మహీతలంబునం బడి దశవర్షసహస్రములు సర్పంబవై యుండు మనిశపించి యటఁ బ్రార్థించిన వానికి భవత్కులమున జనింపఁ బోవుధర్మరాజువలన శాపాంతముఁ బడయుదు వనిచెప్పితి. ఇట్లు బ్రాహ్మణకంటకుం డైనయానహుషుఁడు సురరాజ్యభ్రష్టుఁ డయ్యె. ఇఁక నీవు మహర్షిగణస్తూయమానుండవై జితేంద్రియుఁడు జితశత్రుఁడవునై యమరావతికి వచ్చి

ముల్లోకములం బాలింపు మనిని వేదించుటయు దేవగంధర్వాదులు పాపాచారుం డై ననహుషుండు స్వర్గభ్రష్టుండై సర్పమై పడియె. ఇఁక దేవరాజ్యం బేలు మని యొక్కుమొగిం జెప్పిరి.

ఇంద్రుఁడు మరల నింద్రపదంబుఁ బొందుట.

అంతఁ బురందరుండు దేవర్షిగంధర్వాదిగణస్తూయమానుండై లోకపాలు రెల్లరుం దోడరాఁగ నైరావతం బెక్కి గంధర్వగానంబు నప్సరోనర్తనంబునుం జిత్తగించుచు నమరావతికిఁ జని శచీదేవితోడం బరమానందమునం బొదలుచుండె. అట్టియెడ నంగిరసుఁ డనుమునివరుం డరుదెంచి యథర్వవేదప్రోక్తంబు లయిన మంత్రముల నతనిం బూజించుటయు నమ్మహేంద్రుఁడు సంతుష్టస్వాంతుండై యమ్మునిం బిలిచి మునీంద్రా, యిఁకమీఁద నీ వథర్వాంగిరసుఁ డనుపేర నెగడెదవు. ఈవేర యజ్ఞభాగముఁ బొందుదు వనిపలికి యమ్మునిని సత్కరించి వీడుకొల్పె. అట్లు పురందరుండు పునస్సంప్రాప్తసురరాజ్యుండై సురలను మునులనుం బూజించి ముదమునం బొదలుచు ధర్మమున ముల్లోకముల నేలుచుండె. ధర్మనందనా, దేవేంద్రుఁడు సభార్యుండై పడినపాట్లును దత్సమయానంతరమున సుఖించుటయును వింటివిగదా. ఎంతటివారికైనను గాలప్రాప్తంబు లనుభవింపక తీఱవు. కావున ననుజభార్యాసమన్వితుండవై వనవాసాజ్ఞాతవాసముల నిడుమలఁ బడితింగదా యని మనంబలజడిఁ బెట్టకుము. ఆపదల నిస్తరించితివి. ఇఁక సంపదలఁ బొందఁగలవు. ఇంద్రుఁడు వృత్రాసురుం జయించినట్లు నీవును దుర్యోధనుని సపరివారుం దెగటార్చి నిఖిలమహీమండలం బేలఁగలవు. దుర్యోధనాపచారంబునను భీమార్జున బలంబునను బహుక్షత్రియక్షయంబు గానున్నది. కాక తప్పునే? ఈయింద్రవిజయాఖ్యానంబుఁ బఠించినవారు వినినవారును నిర్ధూతకల్మషులై యీలోకముల నాపద లెఱుంగక దీర్ఘాయువును, బుత్రులనుసంపదలను, శత్రువిజయంబునుం బడసి స్వర్గలోకమున సద్గతిం గాంతురు. సేనలు మోహరించి యున్నసమయంబున జయముఁ గోరునృపాలుఁ డవశ్యము దీని వినవలయుఁ గావున నీకు వివరించితి నని శల్యుఁ డూఱడించి చెప్పిన విని ధర్మరాజమ్మద్రేశ్వరుం బూజించి కర్ణునకు సారథి యగుతఱి నామాట నవశ్యము తలంపునకుఁ దేవలయు ననిని వేదించె. శల్యుఁడు నట్ల చేయుదు ననియొడంబడి యతనికి మనఃప్రీతిఁ గావించి నాఁడు వారియొద్ద మజ్జనభోజనాదు లొనరించి యట వారల వీడ్కొని నిజసేనాపరివృతుండై దుర్యోధనుం జూడ హస్తినగరమున కరిగె.

అయ్యవసరంబున సాత్యకి శూలతోమరముద్గరపరశుఖడ్గకరవాలకార్ముకప్రముఖనిఖిలసాధనసంభృతు లయినవీరయోధులను గజవాజిరథములనుం గూర్చికొని యొక్కయక్షౌహిణితోడ ధర్మరాజుం జేర వచ్చె. చేదిరాజై నధృష్టకేతుఁ

డేకాక్షౌహిణీసమేతుఁడై చనుదెంచె. మగధదేశనాథుఁడైనజరాసంధపుత్రుఁడొకయక్షౌహిణితోడ నేతెంచె. సోదరు లగుకేకయపతు లేవు రేకాక్షౌహిణీపరివృతులై వచ్చిరి. ద్రుపదుఁడు బహుళసేనాపరివృతుండై యరుదెంచినఁ దత్సైన్యంబు నొక్కయక్షౌహిణికిం గలిగియుండె. విరాటుండును బార్వతీయప్రముఖులం గూర్చికొని పాండవులకుఁ దోడ్పడి వచ్చె. ఆసైన్యంబు నేకాక్షౌహిణికిఁ జాలియుండె. సాగరానూపవాసులైనపాండ్యప్రముఖులసేనలెల్ల నొక్కయక్షౌహిణికిఁ బర్యాప్తంబులై యుండె. ఇట్లు పాండవుల కే డక్షౌహిణులు తోడ్పాటు సూపఁ గూడియుండె. అంత నక్కడ భగదత్తుఁడు కిరాతకాంచనచీనసేనాపరివృతుండై యొక్కయక్షౌహిణిం గూర్చికొని దుర్యోధనుం జేరె. భూరిశ్రవసుఁడును శల్యుఁడును బ్రత్యేకంబ యొక్కొక్కయక్షౌహిణిం గూర్చికొని యేతెంచిరి. వనమాలికాధరులై వన్యమదగజంబుల చాడ్పున నొప్పుయాదవవీరభటులం దోడ్కొని వివిధచతురంగబలసమేతుండై కృతవర్మ యొకయక్షౌహిణితోడ నేతెంచె. సింధుసౌవీరవాసులం గూర్చికొని జయద్రథుఁ డేకాక్షౌహిణితోడఁ జనుదెంచె. కాంభోజదేశపతి యగుసుదక్షిణుండు శకయవనపరివృతుండై యొక్కయక్షౌహిణితోడ నరుగుదెంచె. అవంతిదేశపతులు సహోదరులు నగువిందానువిందులు ప్రత్యేకంబ యొక్కొకయక్షౌహిణిం దోడ్కొని వచ్చిరి. మాహిష్మతీపతి యగునీలుఁడు మున్నుగా వచ్చిననానాదేశరాజులసేనలు మూఁడక్షౌహిణులకుఁ జాలియుండె. ఇట్లు ధార్తరాష్ట్రులకుఁ దోడ్పడ వచ్చినసైన్యంబు లేకాదశాక్షౌహిణు లయ్యె. ఇత్తెఱంగునఁ గూడినయాసేనలు సేనానాయకులకైనను గరిపురమున నవకాశము లేమిఁ జేసి కురుజాంగలంబునను, రోహితకారణ్యంబునను, మరుదేశమునందు, నహిచ్ఛత్రంబునను, గాలకూటంబునను, గంగాకూలంబునను, వారణావతంబునను, వాటధానంబునను, యామునపర్వతంబునను విచ్చలవిడి విడిసి ప్రభూతధనధాన్యసమృద్ధిం జేసి యిచ్చమెయి సుఖముమై నుండె.

### ద్రుపదపురోహితుఁడు ధృతరాష్ట్రునొద్దకు వచ్చుట.

అయ్యవసరంబున ద్రుపదపురోహితుఁడు కరినగరంబు సొత్తెంచి భీష్మవిదురాదిసత్కృతుండై సుసమయంబున ధృతరాష్ట్రమహీపాలు పేరోలగమునకుఁ జని యానృపాలుసత్కారంబు వడసి కౌరవులకుశలం బడిగి పాండవపాంచాలాదులకుశలం బెఱింగించి భీష్మద్రోణాదివృద్ధజనులును సమరమునకు సహాయులై వచ్చినరాజు లందఱును వినుచుండ నందఱుఁ గలయం గనుంగొని యిట్లనియె. సనాతనంబై నరాజధర్మంబు మీకెల్ల సువిదితంబై యున్నను వాక్యప్రచారార్థంబునేఁ గొంత చెప్పెద నవధరింపుఁడు. ధృతరాష్ట్రభూపతియుఁ బాండునరపాలుఁడును సోదరు లగుటయుఁ బితృధనంబు వారిరువురకు సమానం బగుటయు లోక

విశ్రుతంబు గదా. అందు ధృతరాష్ట్రపుత్త్రులు తమపితృధనంబుఁ బొందినయట్లు పాండుపుత్త్రులును నిజపితృధనముఁ బొందవలసినవా రగుట ధర్మంబై యున్నను ధార్తరాష్ట్రులచెడు నడవడికతంబున వారు దొలుత నిజధనంబుఁ బొందరైరి. మఱియు నీధృతరాష్ట్రసుతులు తులువతనంబున వారల రూపుమాపఁగ నెన్నియే నుపాయంబులఁ బన్నినను దైవబలంబుకలిమిం జేసి వా రవియెల్లఁ దప్పించికొనిరి. పదంపడి యావృద్ధనృపాలుకృపాతిరేకంబున వారు నిజాంశంబుఁ బడసి భుజబలమున దిగ్విజయ మొనరించి రాజ్యము పెంపు సంపాదించి యెలమి నుండిరి. అంతఁ జూపోపక పాపాత్ముండై నదుర్యోధనుండు శకునిమతంబున జూద మాడి సభార్యులయినవారలం బరిభవించి రాజ్య మొడిచికొని యడవులకుఁ బంపె. ఏమి చెప్పుదు. ఈదుశ్చేష్టితంబులనెల్ల నీధృతరాష్ట్రమహీపాలుఁ డంగీకరించె. పాండుపుత్త్రులు సత్యవ్రతులు గావున మహాత్ములయ్యు ననాథులయట్ల వనమునఁ బండ్రెండేండ్లు కొలఁదియిడరానియిడుమలఁ గుడుచుచుఁ గడపి యటఁ బదుమూఁడవయేఁడు విరాటనగరంబున గర్భవాసంబుచాడ్పున గూఢవాసంబు నడపి యెట్లో యాపదలనెల్ల నిస్తరించినవారు. అన్నిపాట్లుపడియు వారు పూర్వోపచారములనెల్లఁ దలంపునకుఁ దేక కౌరవులతోడిసంధిగోరుచున్నవారు. వారల వృత్తంబును వీరలవర్తనంబును నెఱింగి సుహృజ్జను లీదుర్యోధను ననునయింప నర్హులు. లోకమునకు వినాశము గలుగకుండునట్లుగా బాండవులు నిజధనముఁ బడయుదు మని యున్నవారు. ఇంతయు నిక్కువంబు. మఱియు దుర్యోధనునకు వారితోడిపగ తగదు. వా రెంతయు బలవంతులు. అక్కడఁ గూడిన వే డక్షౌహిణులేయనియు నిక్కడఁ గూడినవి పదునొకం డక్షౌహిణులనియు బహుళసేనాసమన్వితు లయినకౌరవులు జయింతు రనియుం దలంపరాదు. భీమసేనుఁడును, సాత్యకియుఁ, గవలునుం బ్రత్యేకం బొక్కొక్కరే సహస్రాక్షౌహిణులకుఁ జాలియుండుదురు. గాండీవిభండనపాండిత్యంబు సర్వజనవిదితంబు గావునఁ జెప్ప నేల? అమ్మేటివిలుకాఁ డొక్కరుండే సకలసేనలకుఁ జాలియుండు. మఱియు మహానుభావుండై నవాసుదేవుఁడు వారివాఁ డఁట. కిరీటివిక్రమంబును వాసుదేవునిబుద్ధిచాతుర్యంబును నెఱింగినవాఁ డెవ్వఁడేనియు వారల మార్కొందు నని మొనసియనిమొనకు వచ్చునే? కావునఁ గౌరవులకుఁ గాలమెఱిగి ధర్మము దప్పక వారిపాలు వారి కిచ్చుట కర్తవ్యంబు శ్రేయస్కరం బని చెప్పిన విని ప్రజ్ఞావృద్ధుండై నశాంతనవుఁడు తత్కాలసముచితంబుగ నప్పాంచాలపతిపురోహితుం బూజించి యిట్లనియె. పాండురాజనందను లందఱు గోవిందుతోడఁ గుశలముండుటయు, సహాయసంపన్నులగుటయు, ధర్మనిరతు లగుటయు, యుద్ధము మాని సంధియకాఁ గోరుటయును భాగ్యముగదా. ధర్మమునఁ

బిత్రృధనముఁ బడసినపాండవులు దుర్యోధనునపచారములంజేసి యడవుల నిచ్చ టను గ్లేశప్రాప్తు లయిరి. నీచెప్పిన దంతయు నిక్కువంబ యయినను బ్రాహ్మణ స్వభావమునంజేసి యతితీక్ష్ణ మని నామతంబు. అర్జునుఁడు మహారథుఁడు కృతా స్త్రుఁడు బలవంతుఁడు; దేవేంద్రుఁడైనను వానిఁ బోర మార్కొనఁ జాలఁడు. ఇఁకఁ బెఱవారలఁ జెప్ప నేల? ముల్లోకముల నతండు గెలువఁ జాలు నని నాని శ్చయ మని చెప్పుచున్నంతఁ గర్ణుఁడు దీర్ఘకోపుఁడై దుర్యోధనుమొగంబునం జూచ్చి నిలిపి శాంతనవు నధిక్షేపించుచు నిట్లనియె. అయ్యా, లోకమె ల్ల లెస్స యెఱింగినదానిఁ బలుమాఱులు చెప్ప నేల? దుర్యోధనార్థంబు శకుని జూదమున ధర్మరాజుం గెలిచినవాఁడు. అతండును బండ్రెండేండ్లు వనవాసము నొక్కయేఁడజ్ఞాతవాసముం జేయుదు నని సమయము పూని యడవుల కేగిన వాఁడగుట యందఱకుం దెల్లంబు. తనపూనినసమయముఁ దాను లెస్సగ నడపి గదా యతండు పిత్రృధనంబుఁ గోరవలయు అట్లు లేకయే మాత్స్యపాంచాలురం జేర్చికొని మొఱకుతెఱంగున నెత్తి రానున్నవాఁడు. ఇందులకెల్ల దుర్యోధనుండు వెఱచునే? పుడమిలో నించుకేనియు నిచ్చునే? నుతి ధర్మ వగునేని శత్రువున కైనను సకలభూమండలము నిచ్చు. ఇంతటఁ బాండవులకుఁ బిత్రృధనముఁ బడ యఁ దలంపు గలదేని యజ్ఞాతవాసము యథాక్రమము నడుపమికిఁ బోలినతె ఱంగుగా వనవాసాజ్ఞాతవాసములఁ గ్రమ్మఱ నడిపి యట దుర్యోధనుసన్నిధానముఁ జేరి తదనుగ్రహము వడసి నిర్భయులై యుండుదురుగాక. ధర్మవిరుద్ధం బయిన యిప్పటిబుద్ధి విడువవలయు. అటుగాక యుద్ధకాంక్షమై నెత్తివచ్చిరేని కౌరవవీ రులం బోర మార్కొని నామాటఁ దలంపునకుఁ దెత్తు రనిన విని భీష్ముఁడు కట కటంబడి కర్ణుదెస మొగంబై యోరీ, రాధేయా, యీబింకము లేల? మొన్న గోగ్రహణంబునందు గాండీవి మనల నందఱం గెలిచిపోవుట కొంచెము దలంపు నకుఁ దెమ్ము. ఈద్రుపదపురోహితుండు చెప్పినచొప్పున మనము సంధిఁ గావింప మేని నిక్కంబ మనమందఱముం బోర గాండీవిబారిం బడి దుమ్ముఁ దిందు మని పలుకుచున్నంత ధృతరాష్ట్రుండు గాంగేయుకోపవచనముల విని యదరిపడి య క్కురుపితామహునకుఁ గోపశాంతిగా మృదువచనముల విన్నవించి యతనిం బ్రస న్నచిత్తుం జేసి రాధేయుం గినిసి ద్రుపదపురోహితున కిట్లనియె. మాకుం, బాండ వులకు, జగమునకెల్లను హితమైనవిధంబు భీష్ముఁడు తెలియఁ జెప్పినవాఁడు. తగు వారితోడ నాలోచించి పాండవులపాలికి సంజయుం బుత్తెంచెద. మీరు వేగంబ వారికడకుఁ జనుఁ డనిపలికి యుచితవిధమున సత్కరించి వీడుకో లిచ్చిపుచ్చుట యు నప్పాంచాలరాజపురోహితుఁడు వారల నామంత్రణంబు చేసి పాండవులపా లికిఁ జనియె.

## ధృతరాష్ట్రుఁడు పాండవులయొద్దకు సంజయుఁ బంపుట.

అంత ధృతరాష్ట్రుఁడు సంజయుని రావించి సభలో నందఱు వినఁగ నిట్లనియె. సంజయా, పాండవు లుపప్లావ్యం బునకు వచ్చిరఁట. నీ వచ్చటికిఁ బోయి యజాతశత్రుం గాంచి వారు వనవాసక్లేశముల నోర్వఁ జాలనిసుకుమారు లగుట నిరూపించి నామాటగా భాగ్యమున మీర లయ్యాయాసములెల్లఁ గడచి వచ్చితిరనిపలికి యతనిచిత్తము ప్రసన్న మగువిధముగాఁ గొలిచి శాంతివచనములఁ దేటపఱిచి కార్యము తెఱంగుపఱిచికొని రమ్ము. మనము వంచనచే నిరాకరించినను వారు పరోపకారనిరతు లయినసత్పురుషులు గావున మనయెడ శాంతిన్నే తలంతురు. ఒక్కనాఁడైనను నేను వారియెడ మిథ్యావృత్తిం గనుంగొనను. ఎంత వెదకి చూచినను వారిపై దోష మించుకేనియుఁ గానరాదు. నిరుపమాననిజవీర్యమున సామ్రాజ్యముఁ బడసి దాన నాకే పెంపుఁగావించిరి. ధర్మార్థనిరతులే కాని వారు కేవలకామాసక్తులు గారు. ధర్మార్థములపొంటె ధైర్యముతో క్షుత్పిపాసలు మొదలగువాని నడంచి కడంగుదురు. సంపాదించినధనమును దేశకాలోచితముగా మిత్రులు మొదలగువారి కొసంగుదురు. వారితోడిచెలిమి నానాఁటం బెచ్చుపెరుగుఁగాని యొకనాఁడుం జెడదు. తగవు తప్పకుండ సమ్మానంబుఁ జేయు నయ్యార్యవర్యుల కొక్కఁడైనం బగవాఁ డుండఁడు. పాపాత్ముఁడు విషమచిత్తుఁడు మందబుద్ధియు నగుదుర్యోధనుఁడు క్షుద్రతరుం డైనకర్ణుఁడునుం దక్కఁ దక్కటివారెవ్వరును వారితోడిపగఁ గోరరు. ఈతులువ లిద్దఱువారలకు సుఖక్రియలు కొఱఁత పఱిచి కోపముతోడ శౌర్యము మఱింత పెరుగునట్లు చేయుదురు. చిన్ననాఁటం గోలె దుఃఖ మెఱుఁగక సుఖముననే పెరిగినవాఁడు గావున దుర్యోధనుఁడు కర్ణుఁడు బోధించిన యుత్సాహమే శౌర్య మనిభావించి పాండవులకుఁ దాఁ జేయునపచారములెల్ల యుక్తము లనియే తలంచి వారు బ్రదికియుండఁగనే వారిపాలు తనకు హరింప నగునని యూహించు. అది బాల్యచేష్టితంబకాని విచారింపఁగఁ బొసఁగుపని కాదు. భీమార్జుననకులసహదేవులు సాత్యకిసృంజయకేకయాదులు వాసుదేవుఁడుం దోడ నడువ యుధిష్ఠిరుఁడు పోరికి సమకట్టి రాకమున్న వారిపాలు వారి కిచ్చుట మేలు. సవ్యసాచివిక్రమంబుఁ జెప్పఁ గొలఁదియే. అతం డొక్కరథికుండెగదా యింద్రాదులనెల్ల జయించి ఖాండవ మగ్నికి సమర్పించి పాండవులకు యశోమానముల పెంపుఁ గావించినవాఁడు. ఉత్తరకురుదేశములదాఁక నుత్తరదిశం జయించి యపరిమితధనముఁ దెచ్చె.. సర్వలోకవరేణ్యుం డైనయయ్యతిరథవర్యుఁడు బాణజాలంబుఁ గురియింపఁ దొడంగెనేని వానియెదుట నెవ్వఁడైనను నిలువనోపునే? గదాయుద్ధమున భీమసేనుఁ డెల్లవారికంటె నధికుఁడు. గజారోహణమున వాని కెవ్వరు సాటి గారు. మఱియు నతండు గాండీవి కెనరాఁ

దగుమహారథుఁడు నాగాయుతబలుండు శస్త్రాస్త్రవిద్య నేర్చినవాఁడు. చిన్ననాఁ
టంగోలె మనవారితోడఁ బెద్దయుఁ బగఁ బూనినవాఁడు. వాఁడు నిక్కంబ
యలిగెనేని నాకొడుకులనెల్ల నొక్కమాత్రన యుక్కడంపక మానఁడు. ఎట్లో
యింతకు నోర్చినవాఁడు. ఇంద్రుఁడైననువాని గెలువనోపఁడు. నకులసహ
దేవులు ధనంజయుశిక్షం జేసి శస్త్రాస్త్రవిద్య లెస్సగ నెఱింగినవారు. ధీరచిత్తులు
బలవంతులు. డేగలు పెఱపులుగులగములంబోలె వా రిరువురు పగవారల
నెల్లఁ బొదివి గీఁటడంతురుగాని సంగరాంగణంబున నొక్కనినైనను మిగిలిం
పరు. సోమకకులశేఖరుం డైనద్రుపదుఁడు ధృష్టద్యుమ్నుఁడు మున్నగుకుమా
రులుం బాండవులకుఁగాఁ బ్రాణములనైన విడుతు మనియున్నవారఁట. ఆధృష్ట
ద్యుమ్నునివిక్రమంబునకుఁ గొలఁది గలదే? మత్స్యపతి యగువిరాటుండుపుత్ర
మిత్రామాత్యసహితంబుగాఁ బ్రాణముల డాఁపక పాండవకార్యముఁ జేయనున్న
వాఁడఁట. అతండు యుధిష్ఠిరునియెడ నెంతయు భక్తుఁ డని యింతకుమున్న
విన్నదియే? కేకయరాజు లేవురుం బార్థుల ననువర్తించి యున్నవారఁట. వారెల్ల
మేటివిలుకాండ్రు. అప్రతిమప్రతాపుఁ డైనపాండ్యుఁడు బహుళసేనాసమన్వితుం
డై పాండురాజనందనులకుఁ దోడ్పాటు సూప నరుదెంచినవాఁడఁట. మఱియు గిరి
దుర్గనివాసు లగుమ్లేచ్ఛులు మున్నగువారు పెక్కండ్రు వీరులుధర్మరాజునెడ
భక్తితోడ వారికి బాసటయైవచ్చినవారఁట. వెండియు ద్రోణార్జున వాసుదేవకృ
పభీష్ములవలన దివ్యాస్త్రముల నెఱింగి ప్రద్యుమ్నతుల్యుఁ డనం బేరువడసినసా
త్యకి పాండవకార్యంబు నెట్టులైనం జేయుదు నని పూనియున్నవాఁడఁట. మఱి
యు నభిమన్యుఁడు ద్రౌపదేయులు మున్నుగాఁ బెక్కండ్రు గలరు. వెండియుఁ
ద్రైలోక్యనాథుం డైనవాసుదేవుఁడు వారిదిక్కఁట. అమ్మహానుభావుఁడు పాండ
వులకుఁగానేకదా చేదికరూశసేవితుం డైనశిశుపాలుం దెగటార్చె. అప్పరమపురు
షువిక్రమంబునకు వెఱచి సింహమునుజూచినక్షుద్రమృగములట్ల సకలరాజులుం
బాఱిరి. ఇపుడుం బాండవకార్యార్థంబు జనార్దనుండు తా నెంతయైనం జేయుదు
ననియున్నవాఁడఁట. అతనితొల్లింటియమానుషకృత్యములు దలంపనుదలంపను
జిత్తము శాంతిఁ బొరయదు. గోవిందుఁ డెవ్వరికిఁ దోడ్పడునో వారలఁ బోర
నెదిరింప నెట్టిమగలైనను వలంతులు గా రనుట నిక్కువంబు. మఱియుఁ గృ
ష్ణుండు గాండీవికి సారథ్యముఁ జేయుదు నని నవాఁడఁట. అవ్వీరవరేణ్యు లిరు
వురు నొక్కతే రెక్కి వత్తురుగా యని తలఁచినంతన నామనంబు చింతావేగ
వేపమానం బయ్యె. మందబుద్ధి యగునాకొడుకు వారితోడిపోరు మానెనేని
మెలమిఁ గాంచు. అటుగాక తులువలమత మనువర్తించి పోరికి సమకట్టి నడిచె
నా యింద్రోపేంద్రులు దైత్యసైన్యంబునుంబోలె నాకృష్ణులిద్దఱు కురుసైన్యం

బు నిర్ధహింతురు. అర్జునుఁ డింద్రసముఁ డనుటకును వాసుదేవుఁడు నారాయణుఁ డనుటకును సందియంబు లేదు. అది యంతయు నట్లుండె. ఏను గాండీవికి నంత వెఱవను. వాసుదేవునకు నంత వెఱవను. వృకోదరునకు నంత వెఱవను. కవలకు నంత వెఱవను. మఱి ధర్మరాజుకోపమునకే మిక్కిలి వెఱతు. అతండజాతశత్రుడు, చేయరానిపనుల దెసఁబోవనివాఁడు, మహాతపోనిరతుండు, బ్రహ్మచర్యపరుండు, కేవలధర్మనిరతుఁడు. అమ్మహానుభావుఁడు మనస్సున నెయ్యది సంకల్పించిన నయ్యది సిద్ధించు. దుర్యోధనుఁ డెన్నితప్పులు చేసిన నమ్మహాత్ముఁడు పరిపూర్ణచిత్తుఁడు గావున నెల్లయు నోర్చినవాఁడు. ఇంతటనైనను మిన్నకుండక యెత్తిపోయెదరేని యయ్యజాతశత్రునలుకకే మనతులువలెల్ల నెక్కుడుమ్మడిగనే నీ అగుదురు. ఇంతయు నిక్కువంబు. కావున సంజయా, నీ వాలసింపక యుపప్లావ్యంబునకుఁ జని పాండవులను, జనార్దనుం, బాంచాలాదులనుం గాంచి మనమునం బ్రేమరసము వెల్లివిరిసి పొంపిరివోవు తెఱంగుగాఁ బలుమాఱులు కుశలం బరయుము. మఱియు ముందుగ నారాయణుమందిరమున కరిగి యమ్మహాత్మునిం గాంచి నామాటగా "ధృతరాష్ట్రుఁడు పాండవులతోడ శాంతిఁ గోరుచున్నవాఁ" డనిచెప్పి యతనిసేమం బరయుము. అతఁ డియ్యకొనినం బాండవులు నియ్యకొనినవారే. అతం డెయ్యది చెప్పినను యుధిష్ఠిరుండు తప్పక చేయు. వారి కతండు ప్రియుఁ, డాత్మసముఁడు, యుక్తాయుక్తప్రతిబోధకుఁడు, సర్వకార్యకరుఁడు. కావున నప్పుండరీకాక్షుండు మెచ్చుతెఱంగుగా నీవు పలుకవలయు. మఱియు ద్రౌపదేయులను, సౌభద్రుని, సమరమునకుఁ దోడ్పడ వచ్చినమాత్స్యపాంచాలాదిసకలరాజలోకమునుం గనుంగొని నే నడుగుమంటి నని యందఱకుశలము నడుగుము. పెక్కు మాటలేల? భారతకులమునకు హిత మగువిధము నాలోచించి యవ్యైసమయముల కుచితముగా యుద్ధమునకు హేతువుపొడమకుండఁగఁ దగురీతి నైపుణంబుతో మాట లాడి కార్యము తెఱంగుపఱిచికొని ర మ్మని ధృతరాష్ట్రుఁ డానతి యొసంగి వీడ్కొల్పుటయు సంజయుండు వల్లే యని తనకుఁగా నాయతపఱిచియున్న తేరెక్కి యుపప్లావ్యంబునకుఁ జనియె.

### సంజయుఁ డుపప్లావ్యంబున నున్న పాండవుల యొద్దకు వచ్చుట.

అట సంజయుఁ డుపప్లావ్యంబుఁ జొచ్చి వాసుదేవునివాసంబున కరిగి తన రాక నెఱింగించి తదనుజ్ఞ నుచితప్రకారంబున నభ్యంతరంబుఁ బ్రవేశించి నరసహితుం డైనయన్నారాయణుం గనుంగొని వారితోడిసంభాషణంబుఁ గావించి వారిమన్ననం బ్రీతచిత్తుండై మఱునాఁడు పాండవాగ్రజుండు రాజలోకము గొలువఁ బేరోలగం బున్నయవసరంబున వచ్చి యయ్యజాతశత్రుం గని సాష్టాంగదండప్రణామం బాచరించి తదనుమతి నుచితముగఁ గూర్చుండి యడఁకువతో నిట్ల

నియె. మహారాజా, తోడరినయిడుములఁ బాసి సహాయసంపన్నుఁడై యున్న నిన్ను భాగ్యమునం గంటి. కురువృద్ధుం డై నధృతరాష్ట్రమహీపాలుఁడు మీకు శలం బరయఁగఁ బ్రీతి నెఱియ నన్ను మీయొద్దకుఁ బుత్తెంచె. నీవును, నీకూరి మితమ్ములును, సత్యవ్రతయు వీరమాతయు నీకు సర్వాభీష్టంబులం బడయ నను వగుననుంగుధర్మపత్నియు నగుపాంచాలరాజపుత్రియు, బుత్రులు, మిత్రులు, నాప్తులుం గుశల మున్నవారలే యని యడుగ యుధిష్ఠిరుఁ డతని కిట్లనియె. సంజయా, నిన్నుఁ జూచుటంజేసి నేడు నామనంబు ప్రేమబంధురం బయ్యె. నీ కనామయంబకదా. నేనును నాతమ్ములును మావా రందఱునుం గుశల మున్న వారము. మాతండ్రికుశలము విని పెద్దకాలం బయ్యె. నేడు నిన్నుఁ జూచి యమ్మహీపాలుఁ బొడగాంచినంత సంతసించితి. ఆరాజవరేణ్యునకుఁ గుశలంబె? దుర్యోధనదుశ్శాసనాదు లగుకుమారులకును మనుమలకు నల్లురకును సేమము గలదే? మహాప్రాజ్ఞుఁడు సర్వధర్మోపపన్నుఁడు కురువృద్ధుఁ డస్మత్పితామహుఁడు నగుభీష్ముఁడు కుశలియే? కౌరవులు తొల్లింటిచందమున నమ్మహాత్మునిఁ గొలిచియుందురే? బాహ్లికసోమదత్తభూరిశ్రవస్సత్యసంధశలులుం గుశలులే? ధనుర్విద్యాచార్యుఁ డై నద్రోణుఁడు, కృపుఁ, డశ్వత్థామయుం గుశల మున్నవారే? సర్వశాస్త్రముల సెఱింగి మహాప్రాజ్ఞులనియు లోకముననెల్ల మేటివిలుకాండ్రనియుం బేరువడసిన యమ్మహాత్ములు కౌరవులయెడఁ బ్రీతి నెఱపుదురే? కౌరవులు వారల సమ్మానింతురే? వైశ్యాపుత్రుఁ డైనయుయుత్సున కనామయంబే? దుర్యోధనునకు ముఖ్యమంత్రియై యున్నింట నమ్మందబుద్ధిం దనకు వశుం జేసికొని తులువతనముఁ జేయుచున్నయాకర్ణునకు భద్రమే? గాంధారి మున్నగుభారతకులవృద్ధపురంధ్రులు గోడండ్రు మనుమరాండ్రు మొదలుగాఁ గలవారికెల్లను క్షేమంబు గలదే? దాసులు దాసభార్యలు వంటలవారు మున్నగుపరిచారకులెల్ల లెస్సయున్నవారే? బ్రాహ్మణులకుఁ దొల్లింటియట్ల మన్నన చెల్లుచున్నదే? మేము వారల కిచ్చినవృత్తులను ధార్తరాష్ట్రులు నాఁచికొనరుగదా. ఆవృద్ధభూపతియు నతనికొడుకులును బ్రాహ్మణులవలన నెన్నఁడేనిం దమ కెగ్గు వాటిల్లినను మన్నింతురే? స్వర్గమునకుఁ దెరువయినతదీయవృత్తి నెప్పరికించి చూడరుగదా? మనుష్యలోకమునందుఁ దమస్సున కెడ గలుగకుండఁగ బ్రహ్మదేవుఁడు సృజియించి యుంచినపరిశుద్ధం బైనవెలుంగే బ్రాహ్మణులు. అట్టిబ్రాహ్మణులయెడ నించుకేనియు నపచారముఁ జేసిరా కౌరవులందఱు నొక్కమాత్రలోనఁ జెడుట నిక్కంబు. ఆవృద్ధమహీపతియు నతనికొడుకులును హితవాదు లగువిదురాదిమంత్రులయెడ నుచితవృత్తి నుండుదురే? వారితోడ నుచితావసరంబుల మంతన ముండి తగినతెఱంగు నడపుదురే? వారెల్ల నొక్కతలంపుగా భేదము లేకుండ వర్తింతురే? మిత్రభేదముఁ జేసి కడుపుఁ బ్రో

చికొనుతులువల కెడ గలుగదుగదా? కౌరవులు మాపైఁ దప్పు చెప్పరుగదా? వారెల్ల న ట్లుండ ద్రోణకృపాశ్వత్థామాదు లగుపెద్దలు మాయెడ నించుకేని యుం దప్పు చెప్పరుగదా? పగవారు తొడరి డెప్పరంబు వాటిల్లినప్పుడు కౌర వులు సవ్యసాచి గాండీవంబున సంధించి శరజాలంబుఁ గురియించుటందలంపు నకుఁ దెత్తురే? భూమండలంబునందు సవ్యసాచికి సాటిరాఁ దగువిలుకాని నొక్కనిం జూడను. ఇఁక నధికు లుండ గని వేఱ చెప్పవలయునే? నడ్వలప్రదేశ ములందుఁ దిరుగుమదపుటేనుఁగు తెఱంగున భీమసేనుఁడు గదాపాణియై శత్రుసం ఘములఁ జెండాడుటం దలపోయుదురే? తొల్లి నీవు చూచుచుండఁగ శిబిత్రిగర్తు లం గెలువ నకులుని నేను బంప నతండు పడమటిదిక్కు నెల్ల నేలకుంగోలకుఁ దెచ్చుట యుగ్గడింతురే? దంతకూరమునం గూడినకళింగులం గెలువఁగ సహదే వుఁడు సవ్యాపసవ్యప్రకారముల విలువిద్య నేర్పు చూపి వారల నిర్జించిన తెఱంగు వర్ణింతురే? ద్వైతవనమునకు ఘోషయాత్రనెపమున వచ్చి గంధర్వులచేఁ జిక్కి నయాదురాత్ముల నాతమ్ములు చెఱఁ దప్పించుటఁ గొనియాడుదురే? మేము ధార్త రాష్ట్రుల జయింపఁ జాలనివార మగుదుమేని సర్వవిధములను సాధుకృత్యమున సుఖము పడయరాదని చెప్పవలయు ననిచెప్పిన విని సంజయుండు ధర్మరాజున కిట్లనియె.

## సంజయ ధర్మరాజ సంవాదము.

ధర్మనందనా, నీయడిగినవారెల్ల నెంతయు నెలమి మిగిలియున్న వారు. ధార్తరాష్ట్రునొద్ద యోగ్యులు నయోగ్యులు నున్నవారు. వారలనెల్ల నేల యుగ్గడింపవలయు. దుర్యోధనుఁడు పగవారికైనం బ్రార్థించిననిచ్చువాఁడు. బ్రాహ్మణులకు మీ రొసంగినవృత్తుల నేల నాఁచికొను? అతండునుదనమేలు దాను గోరికొనఁడే? ద్రోహముఁ జేయనివారలను నీ వేల ద్రోహులనితలం తువు. నాకుంజూడ నిది పోలదు. ధృతరాష్ట్రుఁ డతనికొడుకులును సాధువృత్తు లైనమీయెడ ద్రోహముఁ దలంతురేని వారు మిత్రద్రోహులే యనవల యు. మీకుఁ దండ్రి యైనయావృద్ధభూపతి యవ్విధం బేల చేయు. సకలపాత కములకంటె మిత్రద్రోహ మెక్కుడని బ్రాహ్మణులవలన వినడే? అతండు కొడు కులు మీకుఁ జేసినయెగ్గులకుఁ దా ననుమతింపఁడు. మఱి వృద్ధత్వమునంజేసి చిత్తస్థైర్యము లేదు గావునఁ గొడుకులచెడునడవడి నుడుపనేరక తనలో నెంతయు శోకించుచుఁ బరితపించు. సంగరంబులందు డెప్పరంబులు వొసంగినప్పుడు కౌరవు లందఱు నిప్పుడు మనగాండీవియైనను వృకోదరుఁడైనను గవలలో నొక్కఁడైనను నుండిరేని యింత పడవలసియుండదుగా యని మిక్కిలి నీతమ్ములం దలంతురు.

వారిపైఁ జెట్ట పెట్టనేల? పురుషున కిఁక మీఁద నెయ్యది వచ్చునో యని యూహింప నలవిగాదు గాని యవితర్కితసంభవంబులుగఁ బూర్వకర్మవశమునఁ బైపై వచ్చువాని ననుభవింపక తప్పించికొన నెంతవారికి నలవిగాదు. అటు గాదేని సర్వధర్మోపపన్నుఁడై ననీ వెక్కడ? వనవాసాయాసంబు లెక్కడ? నీకుఁ జెప్ప నే నెంతవాఁడను. భవదీయదివ్యప్రజ్ఞాబలముననే నీ వన్నియు సరిపఱిచికొనవలయు. ఇంద్రతుల్యులయినపాండుపుత్రులు కామార్థంబు ధర్మముఁ ద్యజింప రని లోకవిశ్రుతంబుగదా. కావునఁ బూర్వాపచారములు కాలకృతము లని భావించి కౌరవులుం బాండవులు నెక్కటియై కూడి బ్రదుకునట్టితెఱంగు చింతింపుము. మీ తండ్రి యగుధృతరాష్ట్రనరేంద్రుఁడు మీకుఁ జెప్పఁ బంచినవచనములు గలవు. పుత్రమిత్రామాత్యసహితుండవై సావధానముగ నాకర్ణింపవలయు ననిన విని ధర్మరాజు సంజయా, వీరే నాయాప్తబంధువు లయినవిరాటపాంచాలకేకయాదులు జనార్దనుండు సాత్యకియు నున్నవారు. ఆనృపాలుఁ డెయ్యది వచింపఁగ నిన్నుఁ బుత్తెంచెనో యద్దానిం దెలియఁ జెప్పుము. సావధానంబుగ నాకర్ణింతు ననుటయు సూతపుత్రుఁడు సవినయముగ నిట్లనియె.

అజాతశత్రుని, వృకోదరుని, ధనంజయుని, నకులసహదేవులను, వాసుదేవుని, సాత్యకిని, జేకితానుని, విరాటుని, ద్రుపదుని ధృష్టద్యుమ్నునిఁ దక్కటి రాజులనెల్లను నామంత్రణంబు చేసి కౌరవకులంబునకు మేలు చేకూఱుతెఱంగుఁ దేటపఱిచెద సావధానచిత్తులరై యాకర్ణింపుఁడు. ధృతరాష్ట్రనరేంద్రుఁడు కౌరవపాండవులకు శాంతిఁ గావింపఁదలంచి తనుచితవచనముల వచింపఁగ నన్నిచ్చటికిఁ బంపునపు డెంతయు సంభ్రమముతో నాకుఁ దేరుఁ బూన్పఁ దాన నియమించె. కావునఁ బాండవులకీమెడ శాంతి యుచితంబు. సర్వధర్మసముపేతులు, సకలగుణవిలసితులు, సత్కులప్రసూతులు, క్రౌర్యరహితు, లుదారు, లకార్యనివర్తనపరులు, కార్యవినిశ్చయజ్ఞులు నగుపాండునందనుల కియ్యెడఁ గ్రౌర్యంబుఁ బూని శాంతిం గొనక పోరికిఁ దొడరుట మడుఁగుఁజీరయందు మసిదాకినట్లు కిల్బిషంబ యగు. విచారించిచూచిన మం జెక్కుదోషము లగపడు. సర్వజనక్షయముతోడఁ బాపంబు వచ్చుటయ గాక యందలిజయపరాజయములు నమ్మరాదు. తెలిసితెలిసి యట్టికృత్యంబున కొడఁబడఁ దగునే? జ్ఞాతులతోడిపోరు మాని లోకమున కెల్లఁ జేటునకు మూలమయినవృత్తిం బరిత్యజించి మెలఁగువారే ధన్యులువారే సుపుత్రులు మిత్రులు బాంధవులు. యుద్ధతాత్పర్యము మాని శాంతిఁ గొని సంధిఁ గావించినంగదా కురుకులవిభవంబు నిరపాయంబై చెల్లును. అటుగాక కయ్యమునకుఁ దొడరి సకలరాజలోకమును వధించి కులక్షయం బాపాదించి భూమండలంబెల్ల నేలిన నానుఖంబు సుఖం బగునే. మఱి మరణసమం బగు. దేవగణపరివృతుండై యెత్తివచ్చిన దేవేం

ద్రుఁడును వాసుదేవసాత్యకిచేకితానవిరాట్ద్రుపద ధృష్టద్యుమ్నాదిమహారథపుర స్సరులైనపాండవులను గెలువ నోపఁడు. ఇఁకఁ బెఱవారు గెలుతురనితలం పనైనం గొలఁదియే? భీష్మద్రోణకృపాశ్వత్థామశల్యకర్ణాదివీరలోకరక్షితులైన ధార్తరాష్ట్రుల నెవ్వఁడు గెలుతునని మార్కొను. దుర్యోధనునకుఁ దోడ్పడఁ గూడి న యీసైన్యముల నెవ్వఁడైనఁ దాఁ జెడక చెఱుప నోపునే? జయపరాజయం బులం దెయ్యదియు సుఖకరంబుగాఁ దనియే యూహింపవలయు. సర్వధర్మజ్ఞు లయినపాండుకుమారులకు దుష్కులజాతు లగునీచులవిధమున ధర్మార్థవిరహితం బైనకర్మంబు నెట్లు చేయం దగునే? కావున నేను బ్రణామపూర్వకంబుగఁ గేలు మోడ్చి పాండవులు శాంతిఁ బొందుటకుఁగా వాసుదేవద్రుపదుల శరణుసొచ్చెద. వాసుదేవార్జునులు నామాట నిరాకరింపరని నమ్మెద. ప్రార్థించినం బ్రాణములిచ్చి నయమ్మహాత్ము లిది వినకుందురే? ఇప్పట్టునం గౌరవపాండవులు శాంతిఁబొందుట యే యుచిత మని భీష్మాదివృద్ధజనమతానువర్తి యగుధృతరాష్ట్రమహీపతిమత మ నిన వినిధర్మరాజు సంజయుదిక్కు మొగంబై యిట్లనియె. సంజయా నాచెప్పినమాట లలో యుద్ధతాత్పర్యము నీకుఁ దెలియవచ్చెనే? ఏల యిట్లు వెఱచెదవు. యుద్ధముకం టె శాంతియే మే లని నే నెఱుఁగనే? ఎవ్వఁడేనియు యుద్ధము లేకయే కార్యము చేకూఱునెడ యుద్ధ మేల కోరును? యత్నము లేకున్నను మనస్సంకల్పములు నెఱవేఱునేని కార్యములఁ జేయకయే యుండుఁగాని క్లేశావహం బైనయుద్ధముఁ జేయ నెవఁడైనం దలంపఁడు. పాండవులు సుఖముఁ బడయు దలఁపుతో లో కహితకృత్యము ధర్మమునకు విరోధము లేకుండఁ జేయుదురుగాని వేఱొండు గాదు. కృచ్ఛ్రమున సాధించినసుఖము దుఃఖప్రాయమే. ఇంద్రియప్రీతివశమున మెలంగువాఁడు దుఃఖము లెడలి సుఖముఁ బొందఁగఁ దలంచి దుఃఖముల కెల్ల మూలమయినకామము సమిత్సముదాయమున దరికొని మండి పెరుగునగ్నిచంద మున నానాఁటం బెచ్చుపెరుగ నిజశరీరమునకుఁ దాపముఁ గల్పించికొను. కామా ర్థములు లభించిననంతఁ దనివి సనక నేయి వోయఁగ భగ్గని మండువహ్నికైవడిఁ గామము మఱింత మెండుగాఁగ నెల్లకాలము తద్వశుండై క్లేశములఁ గుడుచు. నీవే పరికించి చూడుము. ధార్తరాష్ట్రులు కామవశతం జేసియకదా నిరంతరభోగవం తులయ్యు నంతం దనియక పరధనంబుల నెడిచికొనుతలంపుతో నిన్ని వెతలం జెందుచున్నవారు. మేము మాధనము మాకుఁ జాలు. దాని నిం డని పలుకుదు ముగాని పరధనముల కాసపడితిమె. ఆరాజునకు మే మ కొడుకులలో శ్రేష్ఠులుగా మింజేసి గీతమాల్యచందనానులేపనదివ్యవస్త్రాదిభోగముల మమ్ముఁ జేర్పఁడు. అబు ధకామ్యంబులయ్యు నియ్యవి తలంచిన మనమునం బరితాపంబు వొడమఁజేయు. ఇత్తెఱంగునఁ దామే విషమవృత్తిం గొని యెదిరిపై నది యారోపించిన నంతట

నది మే లగునే? తమయట్ల యెదిరిం జూడవలదే? కాకున్నఁ గార్యము తెలియంగుప డునే? మాకుఁ గలధనములనెల్ల నన్యాయమున నొడిచికొని యిప్పుడు మమ్ము శాంతిఁ బొందుఁ డనుట చూడఁగా వేసవితఱి శుష్కతృణభూయిష్ఠం బయినగ హనారణ్యమందుఁ జిచ్చువెట్టి యది రాజి రగుల్కొని పెనుగాలిం జెరిగి యక్కా ననంబెల్ల నొక్కటియై పెలుచ మండం దొడరినప్పుడు దానిం జల్లార్పఁగ నెయ్యది యుపాయంబగునొకో యని వగచుచందం బయ్యె. అది యట్లుండె. ఆవృద్ధరా జిపు డేమికారణముగాఁ జింతింపవలయునో యూహింపరాదు. భూమండలం బెల్లఁ దనకొడుకు కేలుచుండఁ దా నధిగతైశ్వర్యుండు గాఁడె? ఆరాజుతలంపులు క్రొత్తవే? దుర్బుద్ధి కుటిలుఁడు మూఢుఁ డల్పచిత్తుఁడు దుర్మంత్రులమతంబ చెల్లించువాఁడు నగుతన పెద్దకొడుకుం గొనియాడుచుం దత్ప్రియంబు సేయువాఁడై యాప్తవరేణ్యుండై నవిదురునివచనములెల్ల ననాప్తవచనములుగ భావించి యుక్తా యుక్తము లరయక యధర్మంబుఁ జేయుట యందఱకుం దెల్లంబకదా. కొడుకు వాఁడై కదా యాముసలిరాజు మేధావిలసితుఁడు బహుశ్రుతుఁడు వాగ్మి శీల వంతుఁడు కురుకులశ్రేయముఁగోరువాఁడు నగువిదురునిమాటలం బెడచెవిఁ బెట్టె. మానహరుఁడు, మానకాముఁ, డీర్ష్యాసంరంభకామక్రోధాదికలుషచిత్తుఁ, డర్థ ధర్మమర్యాదాతీతుఁడు, దుర్భాషణుఁ, డవినీతుఁడు, తుచ్ఛుఁడు, దీర్ఘవైరుఁడు, మిత్రద్రోహి, పాపాత్ముఁడు నగుతనకొడుకుమతమున నడచుచు నతండు ధర్మ కామముల విడిచె. ఆనాఁడు జూద మాడునెడ విదురుఁడు జూదపుసంపదఁ గోర రా దని యెంత యొత్తి చెప్పినను నాజరఠరాజు మాటల నాదరింపక యొప్పరి కించినప్పుడే కురుకులంబునకుఁ జేటు వాటిల్లెఁ గాఁబోలు నని నే నూహించితి. ప్రజ్ఞావిభవవిలసితుఁడై నవిదురునిమత మనువర్తించిననాళ్లెల్ల వారికి రాజ్యవృద్ధి గలుగుచుండె. అది విడిచిననాఁడే యెల్లయాపదలు వారల నాక్రమించె. అర్థ లుబ్ధుండై నదుర్యోధనునకుఁ గర్ణశకునిదుశ్శాసనులు కార్యములఁ దీర్చువారఁట. ఏమి చెప్పుదు? నీవ చూడుము వానిబుద్ధిసమ్మోహంబు. వారు దీర్పరులైనం గార్యములు నెఱవేఱునే? దీర్ఘాలోచనపరుఁడై నవిదురుని నవమానించి వెడలఁ గొట్టి యాధృతరాష్ట్రుఁ డాదుష్టచతుష్టయముపైఁ గార్యభారము వెట్టినం గౌర వపాండవులకు శాంతిచందము సమకూఱునే? ధృతరాష్ట్రుఁడు భూమండలమెల్ల నిష్కంటకముగఁ దనకొడుకు కేలుచుండఁగఁ జూతు నని తనలోఁ గోరుచు మే మూరక శాంతిఁ బొందిన మే లని యూహించుచు శాంతికృత్యము ధర్మజు నధీన మని మాటమాత్రము నాపైఁ జెప్పుచుండు. ఇది యెట్లు పొసంగునో నీవే కొంత చింతింపుము. మఱియుఁ గర్ణుఁ డర్జునునకుఁ జాలినవాఁ డని తామే తలం చికొని యుద్ధముఁ జేయఁ జూతురు. అది యడియాసయెగాని నెఱవేఱునది గాదు.

నెఱవేఱునేని విరాటుపనులం బట్టినప్పుడు మఱియు నితరసమయములందు నాకర్ణుం డేల తమ్ముఁ దప్పింపఁడయ్యెనో. భీష్మద్రోణాదు లగుపెద్దలును రాధేయసుయోధనాదు లగుతులువలును గౌరవు లెల్లరును బోరికి బాసటయై వచ్చిన తక్కటిరాజులు నర్జునునికంటె నేవిలుకాఁడు నధికుఁడు గాఁ డనియు నతండు బ్రదికియుండునందాఁక దుర్యోధనునకు సకలరాజ్యాధిపత్య మొడఁగూడనేర దనియు నెఱుంగుదురు. తాడియంతటివిల్లు గొని యతండు పోరికి నడిచినం బాండవులధనము ధార్తరాష్ట్రులకు హరింప నలవియే? గాండీవమౌర్వీనినాదము చెవుల సోఁకమింజేసి యిందాఁక ధార్తరాష్ట్రులు జీవించియున్నవారు. క్రోధావేశవివశుఁడైన భీమసేనుం జూచునందాఁక సుయోధనుఁడు తనకార్యము సిద్ధించు నని తలంచు. భీమార్జుననకులసహదేవులు ప్రాణములతో నున్నంతకు నింద్రుఁడైనను మాయైశ్వర్యము నపహరింపఁ జాలఁడు. తొల్లింటియట్ల యిప్పుడు నాధృతరాష్ట్రుఁడు కొడుకులమతము ననుమతించి నడచునేని దుర్యోధనాదు లందఱు సంగ్రామమునఁ బాండవకోపానలదగ్ధులై చెడుదు రింతయు నిక్కువంబు. సంజయా, నీతోఁ బెద్దయుఁ జెప్పనేల? వారు మమ్ముఁ బఱిచినపాట్లను మే మవియెల్ల నోర్చియునికియు నీమనస్సునకే తెల్లంబుకదా? అవియెల్లం దలంపునకుఁ దేర శాంతి యొడఁగూడ నెడ గలుగునే? ఐనను సంధి సేయుదు ననుతలంపుతో నీవు వచ్చితివి గావున నిన్నుఁ జూచి నీమాటమెయి శాంతిఁ బొందెద. ఏనును నింద్రప్రస్థమునఁ దొల్లింటియట్ల రాజ్యముఁ జేయుదు. అప్పరవరంబు మా కిమ్మని చెప్పు మని యజాతశత్రుండు కార్యము పొందువడం జెప్పిన విని సంజయుండు వెండియు ధర్మరాజున కిట్లనియె.

అజాతవైరీ, నీకుఁ దెలియనిది లేదు. అయినను జను విచ్చి నామాట వినుటంజేసి కొంతచెప్పెద నాయాసము మాని యాకర్ణింపుము. భవదీయచరిత్రంబు ధర్మనిత్యం బని లోకముననెల్ల సుప్రసిద్ధము. మా కందఱకునుం జూడఁగ నట్లే యగపడుచున్నది. కౌరవులు యుద్ధము దక్క నొం డుపాయమున మీపాలు మీ కిచ్చువారు గారు. కావున యదువృష్ణిభోజాంధకదేశములందు భిక్షాన్నమున శరీరయాత్ర నడపుటయే మీప్రశస్తచరిత్రమునకుఁ దగుఁగాని యుద్ధమున నందఱ వధించి రాజ్యముఁ గొనుట తగదు. పురుషునకుఁ జూడ జీవితకాలమత్యల్పము. అందుఁ బెక్కులు విఘ్నములు దుఃఖములుం దొడరుచుండు. అయ్యల్పసుఖముకొఱకు నీవిమలయశస్సునకుఁ దగనియుద్ధము నొనర్చి బంధువృద్ధులఁ జంపఁ దగునే? ధర్మవిఘ్నమునకు మూల మైనకామము మనుష్యులం జేరుట సహజంబు. మతిమంతుఁడైనవాఁడు కామము నడంచి లోకమునందు నిర్దోష మగు ప్రశంసం గాంచు. మనుజులం దనకు లోఁ జేసికొనుటయే యర్థతృష్ణకు ము

ఖ్యధర్మంబు. దానికిఁ జిక్కినవారలకు ధర్మబాధ తనంతన వచ్చు. కామము నానాఁటం బెరుగునేని యర్థానుసారంబుగఁ జెడుట నిశ్చయంబు గావున నట్టితెరువునం బోవక ధర్మముఁ గోరునతండే బుద్ధిమంతుఁడు. సకలకర్మములం బ్రధానం బైనధర్మం బాచరించి మనుజుండు ధర్మప్రభావసముపలబ్ధదివ్యతేజోవిలసితుండై సూర్యునిచాడ్పునఁ దేజరిల్లు. ధర్మమునకు విరోధముగ నీభూమండలమెల్ల నేలునంతటిమైశ్వర్యము గల్గినను బాపబుద్ధిం జేసి నానాఁటం జెడును. కేవలసుఖప్రియములనే సేవించుచుఁ బరమార్థముఁ జింతింపనిమూఢుఁడు కామవేగమున విత్తక్షయం బగుఁడు హీనసుఖప్రియుండై పదంపడి పడయరానియెల్లయడుమలం బడయు. తొలుత బ్రహ్మచర్యాదిధర్మప్రసక్తుఁడయ్యునుం బిదపఁ బరమార్థచింతపై నశ్రద్ధ తొడర నధర్మముఁ జేయునేని యతండు నీమేను దొఱంగి పరలోకమున నెంతయు వనటలపాలగు. చేసినపుణ్యపాపకర్మము లంతట నశింపవు. మఱి కర్తను ముందేయవి పోయి కర్తం దత్ఫలముల ననుభవింపజేయుచుండు. సర్వకర్మములుం గర్మక్షేత్రం బైనయీలోకమున నీమేనఁ జేయుటయగాని పరలోకమునఁ జేయు టనునది లేదు. పుణ్యకర్మముఁ జేసినయతండు పుణ్యలోకమునకుఁ జని జరామరణాదిదుఃఖదూరుండై యింద్రియార్థసుఖముల ననుభవించు. కర్మఫలప్రకారం బిట్టిది. నీవుం బారలౌకికసుఖముఁ గోరి పెద్దలు మెచ్చునట్లుగా వేదములఁ జదివితివి. బ్రహ్మచర్యవ్రతము నడిపితివి. లోకోత్తరవిభవము మెఱయ రాజసూయాదిమహాధ్వరంబుల నొనర్చి దేవతలఁ దనిపితివి. కోరినట్లుగా శ్రద్ధాపూతముగా వివిధదక్షిణలను మృష్టాన్నంబులను మఱియుఁ గోరినపదార్థముల నెల్లను బ్రాహ్మణులకు దానములఁ గావించితివి. అంతియకాక యీలోకమునందును సకలరాజులుం గొలువ సామ్రాజ్యము నెఱపి పెక్కేండ్లు వివిధభోగముల సుఖించితివి. సత్యము, శాంతి, యార్జవ, మద్రోహ మనుగుణములు ధర్మరాజు సొమ్మనం బొగడ్తఁ గంటివి. కావున నిపుడు క్రోధము డిగ్గఁద్రావి శాంతిం బొంది పాపకృత్యం బయినబంధువధమునకుఁ దొడరక యిడుమల కోర్చి యడవుల నుండుట యైనను నీవృత్తికిఁ దగినధర్మంబ యగు. శాంతియే నీకుఁ బరమధనంబుగదా. అట్లు గాదేని దుర్యోధనాధు లుక్కివంబున జూద మాడి రాజ్యము నాఁచికొనినప్పు డప్పరిభవక్లేశముల నైఁచి యేల యడవుల కేగవలయు? ఇప్పుడు సహాయులై యున్నజనార్దనసాత్యకి పాంచాలవిరాటాదు లప్పుడును నీకుఁ దోడ్పడక పోవుదు రే? వాసుదేవార్జునపురస్కృతుండవై ధార్తరాష్ట్రులఁ దెగటార్పక నీకుఁ గానివారికి బలవృద్ధియు నీ కయినవారికి దుఃఖము నగునట్లుగా నేల యిన్నియేండ్లు వనములఁ గ్లేశములఁ బడితివి. ప్రాజ్ఞుఁడై ననుం గెలుచు ధర్మజ్ఞుఁడై ననుం గెలుచుఁ గావున యుద్ధమున జయాజయము లనిర్ణీతములు. ప్రజ్ఞావంతుఁడును ధర్మ

మెఱిఁగిమెఱిఁగియుఁ గాలకృత మయిన సమ్మోహమునంజేసి మంచినడతలకుఁ దప్పు. నీ వట్లుగాక యింతకు నెన్నఁడును ధర్మముఁ దప్పవు. సంరంభముననైనం బాపముఁ జేయవు. ఇట్టిలోకోత్తరధార్మికుండవైననీ విపు డేల ప్రజ్ఞావిరుద్ధం బయినయుద్ధ మనుపాపకర్మమునకుఁ గడఁగుదువు? వ్యాధి లేకున్నం బొడమునదియుఁ, గటువైనదియుఁ, దలయేఱుఁ గావించునదియుఁ, గీర్తిని హరించునదియుఁ, బాపఫలములకు మూలమైనదియు, సాధువులకు మ్రింగఁ గొలఁదియైనదియు నగు క్రోధవిషము డిగ్గఁ ద్రావుము. అసజ్జనులు దానిని మ్రింగనేరకున్నను నీయట్టి సాధుశేఖరున కయ్యది సాధ్యము గాకుండునే? శాంతిం బొందుము. విద్వాంసుఁ డెవ్వఁడైనం బాపానుబంధమైనదానిం గోరునే? సకలభోగములకంటె నీకు శాంతియకదా యుత్తమంబు. భీష్మద్రోణకృపాశ్వత్థామశల్యసోమదత్తిబాహ్లికాదులగుమాన్యవృద్ధులను,దుర్యోధనదుశ్శాసనవికర్ణవివింశతిప్రముఖకుమారవర్గమును, రాధేయాదివీరగణంబునుం జంపి రాజ్యము సంపాదించికొనిన నది యెంత సుఖంబగునో నీవ యాలోచింపుము. చతుస్సముద్రముద్రితం బయినయీమహీవలయంబెల్ల సంపాదించినను దుది జరామరణములు, ప్రియాప్రియములు, లాభాలాభములు, సుఖదుఃఖములు మున్నగుద్వంద్వములం దప్పించికొనఁ బోవునది లేదుగదా. ఇదియెల్లం బరికించి చూచి యుద్ధతాత్పర్యంబు విడువుము. అమాత్యులకుఁగా నీమది నీకోర్కి గలిగెనేనియు నప్పనులెల్ల వారిపైఁ బెట్టి నీవు కేవలశాంతిపరుండవై యీతాత్పర్యంబు మానుట లెస్స. ఇట్లు చేసినం బరమార్థంబు నీకుఁ దప్ప దని సంజయుఁడు చెప్పిన విని ధర్మరాజు వెడవెడయులుక వుడమ నాగావల్లణి కిట్లనియె.

సంజయా, నీచెప్పినట్లు సర్వకర్మములలోపల ధర్మమే యుత్తమము. నన్నుఁ దూఱఁ దలంచితివేని నాచేయునది ధర్మమో కాదో యది విచారించి యధర్మంబని నిరూపించి మఱి నిందించుము. కొన్నిచోట్ల ధర్మమధర్మముగఁ దోఁచు. కొన్నియెడల నధర్మము ధర్మముగ నగపడు. విద్వాంసులు బుద్ధివైభమున ధర్మాధర్మతత్త్వముఁ బరిశీలింతురు. మఱియు నిత్యప్రవర్తమానము లగుధర్మాధర్మము లాపత్సమయమున భిన్నలింగము లగు. అం దధర్మమును ధర్మమై కర్తవ్యతం బరఁగు. అదియే యాపద్ధర్మ మనంబడు. ఆపద లేనితఱి నిజోచితధర్మముఁ జేయక విరుద్ధధర్మము నొనర్చువాఁడు నింద్యుఁ డగుంగాని పెఱవారు నింద్యు లగుదురే? ఆపద మూఁడినపుడతం డెద్దానఁ గర్మ మాచరించు నని యాపద్విహీనుఁడు పరీక్షించి యెఱుంగవలయు. నీ కాపన్ను ననాపన్నుని నేకరూపముగా దూఱెద విది తగదు. నిజోచితకర్మానుష్ఠానపరు లయినబ్రాహ్మణాదుల కాపద్ధర్మము బ్రహ్మదేవుఁడు విధించియున్నవాఁడు. ఉచితకర్మమునుం బ్రవర్తించుచుమమ్మును విరుద్ధకర్మముల

నొనరించుధార్తరాష్ట్రులను నీవ చూచుచున్నవాఁడవుగదా. ఆపద్ధర్మమునఁ బ్రవర్తించుమ మ్మేల నిందించెదవు? ఉచితకర్మానుష్ఠానవిరుద్ధకర్మనివర్తనములకొఱకుఁ గదా సాధుసంసర్గము కర్తవ్య మని పెద్దలు సెప్పుదురు. మఱియు నుచితం బెఱుంగక యసత్పథమునం బ్రవర్తించునట్టిపాపాత్ముల సర్వవిధముల నిర్మూలనంబుఁ జేయుట ధర్మంబు. ప్రజ్ఞావిభవమున నుచితానుచితముల నరసి కార్యము లొనర్చునట్టియస్మత్పితృపితామహాదు లగుకులవృద్ధు లెల్ల నీమార్గమునే యవలంబించినవారు. వారెల్ల నడచినతెరువునఁ బోవుచున్ననేను నాస్తికుఁడ నగుదునే? ఈ భూలోకమున మాకు ధర్మమునఁ రాఁదగినపా లెంత గలదో యదియ చాలు నంటిఁ గాని మిక్కిలి గోరనైతి. పెక్కుమాట లేల? అధర్మమున నింద్రలోకము బ్రహ్మలోకము వచ్చుచుండినను నే నొల్లను. వెండియు రాజులకు యుద్ధము కుల ధర్మ మగును గా దని నీవ చెప్పుము. నే నింత చెప్ప నేల? ఈసంశయము వాపి యుచితపథ మిది యని నిరూపింప వాసుదేవుండు గలఁడు. ఇతఁడు నిర్ణయించు గాక. ఇమ్మహాత్ముఁడు మాకుం గౌరవులకు మేలు గోరినవాఁడు. ధర్మవ్యవస్థాపకుఁడు, సమర్థుఁడు, నీతిమంతుఁడు, బ్రాహ్మణోపసేవి, మహాయశుఁడు, సకలరాజుల శాసింప నర్హుఁడు. ఇతనిపంపునంగదా యదువృష్ణిభోజాంధకచేదికేకయసృంజయప్రభృతిరాజులెల్ల నుత్తమపథమునం బ్రవర్తిల్లుచున్నవారు. కేశవునిమహిమ యింతయని గణుతింపఁ గొలఁదియే? మఱియుఁ గృష్ణుఁడు మా కత్యంతప్రియుఁడు. తదీయవచన మనుల్లంఘనీయ మని చెప్పిన విని జనార్దనుఁడు సంజయున కిట్లనియె.

## శ్రీకృష్ణుండు సంజయునితో సంధివిషయముఁ జెప్పుట.

సంజయా, నేను బాండవులక్షేమము నైశ్వర్యమును బ్రియమునుం గోరినట్లు బహుపుత్రుఁ డైనధృతరాష్ట్రునభ్యుదయమునుం గోరుదు. ఈరెండుపక్షములవారు శాంతి బొందుటయే నాకుం గలకోర్కి కావున నేను నదియే చెప్పుదు. ధృతరాష్ట్రునకుఁ బ్రియమగుదానినే పాండవులయెదుటం బల్కెద. అయినను ధర్మరాజు వచనముఁ బరికింపఁగ శాంతి దుష్కర మని తోఁచుచున్నది. సర్వము తనకే కావలయు ననుతలం పాదుర్యోధనుమనస్సునం గలిగనేని వీ రెట్లు వట్టిమాటల శాంతి బొందుదురు? కలహం బెట్లు గాకమాను? తనకుఁ గులధర్మం బయినదానిం జేయ నుత్సాహిమై యున్నపాండవాగ్రజుధర్మంబును సంధికి వచ్చిననీకుఁ దద్వచనములను నామాటలనుం దేటపడుచున్నదిగదా? నీవు దొలుత ధర్మజునెడ నధర్మంబు కొంత గల దంటివి. అ దెట్లు నిరూపింపుము. గృహస్థవృత్తినుండువారి కనేకమార్గములు పెద్దలు చెప్పియున్నారు. ఎట్లంటేని? కొందఱు కర్మమే పరలోకసాధన మందురు. కొందఱు జ్ఞానమే వైరాగ్యమునం బయ్యోనేని సర్వసిద్ధిప్రదం బందురు. విరక్తి యనఁ గేవలవచనములఁ గలుగదు. మఱి పెద్ద

కాలం బనుభవించి తృప్తిఁ గాంచినపదంపడి దానిపై నిస్సారతాత్పర్యంబు పొడ
ము. అది యట్లుకాదె భుజింపకయేయుండువానికి భక్ష్యభోజ్యాదులపైఁ దృప్తి
యెట్లు గలుగు? ఇది యంతయుఁ బెద్దలకు విదితంబె. కర్మసాధనములు గానివి
ద్యలం దైహికఫలము గన్పట్టదు. మఱి కర్మసాధకము లగువిద్యలందే తత్ఫలంబు
గన్పడు. కర్మముచేత ఫలము గూరుట లోకవిదితంబు. దప్పిగొన్నవానికి నీరు
ద్రావకున్న నాడప్పి దీఱదుగదా. కావున నిహలోకఫలము కర్మముననే సిద్ధించు.
కర్మేతరంబు ఫలప్రదం బనిచెప్పుట దుర్బలాలాపంబుగాని వేఱొండు గాదు. కర్మ
ప్రభావముననే దేవతలు దేవత్వంబుఁ బడసిరి. వాయువు వీచుచున్నాఁడు సూ
ర్యుఁ డుదయాస్తమయముల నహోరాత్రవిభాగముఁ గావించుచున్నాఁడు. చం
ద్రుఁడు మాసపక్షతిథివ్యవస్థ నేర్పఱచుచున్నవాఁడు. అగ్ని ప్రజ్వలితుండై కర్మ
గావించుప్రజలకుఁ గార్యకరుం డగు. భూమి బలమున సర్వము మోచుచున్నది.
నదులు సర్వభూతతృప్తిపొంటె జలము ప్రవహించుచున్నవి. పర్జన్యుఁడు వర్షించుచు
న్నవాఁడు. ఇంద్రుఁడు సుఖప్రియములపై నాస్థదొఱఁగి సత్యధర్మశమాదిపరుండై
బ్రహ్మచర్యవ్రతకర్మం బాచరించి యింద్రత్వంబుఁబడసె. బృహస్పతి బ్రహ్మచర్యవ్ర
తకర్మప్రభావముననే సురాచార్యుఁ డయ్యె. వసురుద్రాదిత్యవిశ్వదేవాదులును నిజ
శుద్ధకర్మబలముననే స్వస్వపదముల నధిగమించిరి. కుబేరాదిదిక్పాలకులును దిక్పా
లపదముఁ బొందిరి. ఋషులును నిజతపఃకర్మమహిమముననే లోకవంద్యులైరి.
మనుష్యులందును బ్రాహ్మణాదివర్ణవిభాగం బేర్పఱిచి తత్తదుచితప్రకారమున
నందఱకుం గులధర్మముల వేఱువేఱుగ ధర్మశాస్త్రాచార్యులు విధించిరి. అందు బ్రా
హ్మణులకు యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహంబులును, క్షత్రియు
లకు యజనాధ్యయనదానములును శస్త్రాస్త్రవిద్యానైపుణ్యమును దుష్టశిక్షణశిష్ట
రక్షణపూర్వకముగాఁ బ్రజాపాలనంబును వైశ్యులకుఁ గృషిగోరక్షవాణిజ్యాదు
లును శూద్రుల కుత్తమపరిచర్యయును విధిచోదితంబులుగదా. కావున రాజులకు
బ్రజాపాలనంబు ముఖ్యధర్మ మగుటంబట్టి తదర్థముగా దుష్టనిగ్రహంబుఁ జేయు
ట ముఖ్యంబై యుండు. మఱియు రాజులకు యుద్ధము కులధర్మమగుం గా దని
ధర్మరాజు ని న్నడిగెఁగదా. ప్రజాపాలనార్థంబు దుష్టనిగ్రహంబు రాజులకు ధర్మ
మైయుండఁ గాదని యెట్లు చెప్పవచ్చు? పాండవులు భీము నెడంబఱిచి సంగ్రామ
ము లేకయే తమపాలు తాము గోరుచున్నవారు. కౌరవు లిచ్చిరేని మేలయగు.
ఇయ్యక యొప్పరికించి చూతురేని యప్పుడు పాండవులు యుద్ధము తప్ప మఱేమి
చేయుదురు? యుద్ధజయపరాజయముల నమ్మఁ దగ దంటివి. కులపరంపరాప్రాప్తం
బైనరాజ్యంబుఁ గోరి కులధర్మ మయినయుద్ధమును శక్తికొలఁదిగఁ జేసి పిదప
గెలువ లేక చచ్చిన నదియుం బ్రశస్తమే. ఊరక శాంతిఁ బొందుట లెస్స యని

నం గార్యము నెఱవేఱదు. ఇవియెల్లఁ బరిశీలించి పాండవులు చేయునది ధర్మం బవుం గా దనినిరూపించి నీమదికి నిందయే యుచితం బనితోఁచిన నిందింపుము. పొగడఁ దగు ననితోఁచినం బొగడుము. నాచెప్పునది లేదు. అంతయుం దెలిసియు నీవు కౌరవులకుఁగా నిన్నిమాట లాడినందుల కింత చెప్పవలసెఁగాని యొండేమియు లేదు. మఱియుఁ గామవశుఁడు గాక ప్రజలయెడ సమవర్తనుండై యుండి ధర్మమున రాజ్య మేలుచుండఁగ నధర్మపరులై శత్రువు లెత్తి వచ్చినప్పు డుపయోగింపనుగదా యింద్రాదిదేవతలు శస్త్రాస్త్రముల సృజించిరి. శత్రువధమున రాజులకు మహాపుణ్యంబ కలుగు. ధర్మ మెఱుంగక పాపబుద్ధిం జేసి కౌరవులు తీవ్ర మయినయధర్మముఁ గావించిరి. అది లెస్స గాదు. పురాణ మైనరాజధర్మ మగయక దుర్యోధనుఁ డన్యాయమునఁ బాండవులధన మపహరించె. కౌరవు లందఱును వానిమతంబ యనువర్తించిరి. అగపడకుండి ముచ్చిలించికొనిపోవువాఁడు నగపడుచుండి యన్యాయమున బలాత్కారముతో నపహరించికొనిపోవువాఁడును నిందార్హు లగుదురు గాన ధృతరాష్ట్రసుతుఁ డట్టివాఁడ యని వేఱ చెప్ప నేల? క్రోధలోభవశుండై యతండు పాండవులపాలు నపహరించుట ధర్మ మని తలంచు. ఇది తగ వగునే? ఇందు యుద్ధముఁ జేయునెడ వధ మయినను బ్రశంసార్హంబ. పిత్ర్యం బయినరాజ్యంబు పరరాజ్యముకంటె విశిష్టంబు. వీరికి ధర్మవచనములు చెప్ప వచ్చినట్లు సకలరాజసమక్షమున వారికి నాచెప్పినధర్మములనెల్లం జెప్పుము. వారలుకి దా మొఱకడమునం జేసి యిది తగునిది తగ దని విచారింపక చెడునడతల నడచి మృత్యుముఖము సొర నున్నవారు. వారలతులువతనముఁ జెప్పఁ దరమే? ఆపాపపుజూద మాడునపుడు శీలవృత్తకీర్తిసంపన్న యైనపాండవప్రియపత్నిని దుర్యోధనుననుమతంబున నాదుశ్శాసనుఁడు రచ్చకుఁ దెచ్చె. పక్షపాతము విడిచి నీవ చూడుము. ఇది కౌరవులదుర్వృత్తము గాదె? ఇంతకంటె నొం డెద్దియైనం బాపకర్మంబు గలుగునే? అపుడు భీష్మాదులుం దాని నుపేక్షించిరకాని యిది చేయరా దనిపలుకరైరి. సభాసదు లందఱును దుర్యోధనునకు వెఱచి నో రెత్తనేరక యూరకుండిరి. అప్పు డప్పని వారు వారించియుండిరేని ధృతరాష్ట్రుఁడు నాకుం బాండవులకుఁ బ్రియము చేసినవాఁడే యగు. ఆకొలువులోనెల్ల విదురవికర్ణులుదక్కఁ దక్కటివా రెవ్వరునుం బాంచాలివచనం బాదరింపరైరి. వారలమాటల నాతులువలు పెడచెవిఁ బెట్టిరిగాని యించుకైన నరయరైరి. లోకులు లెవ్వరైన నిట్టిపాపకర్మమున కొడంబడుదురే? లోకమున నితరు లెవ్వరైన జూద మాడరే? వారెల్ల నిట్లు చేయుదురే? ఈధర్మములనెల్ల నాదురాత్ముల కుపదేశింపవలదే? వారలకుఁ దెల్పక వీరల కేల బుద్ధులు చెప్ప వచ్చితివి? అపుడు పాంచాలి యెట్లో తన్నుఁ దాన రక్షించికొని పాండవుల

మానముఁ గాచె. కాకున్న నప్పుడు పాండవు లయ్యాపత్సముద్రమున మునిఁగి యడఁగి పోవుదురుగాని నిస్తరింపనేర్తురే? ఏమి చెప్పుదు? మామ లందఱు చూచుచుండఁగఁ గులాంగన యైనపాంచాలిం బిలిచి కర్ణుఁ డోయాజ్ఞసేనీ, నీకు గతి గన్పట్టదు. ధార్తరాష్ట్రునింట దాసివై బ్రదుకుము. నీపతు లందఱు నోటువడిరి వేఱొకనిఁ బతిఁగా రింపు మనిపలుకఁడే? అది యర్జునునకు వాఙ్మయశరంబై హృదయమున నాటి యతితీక్ష్ణంబై మర్మభేదనము సేయుచున్నది. అందుల కిందాఁకఁ బ్రతీకారముఁ జేయకునికి శాంతియగాక వేఱొక్కటి యగునే? మఱియుఁ గృష్ణాజినపరిధానులై వీ రడవులకుఁ దఱలునపుడు దుశ్శాసనుఁ డెదురువచ్చి పరిహాసంబు చేసి వీ రందఱు గొడ్డువోయిరి. పెద్దకాలంబు దుఃఖమనుభవించి పొలియుదు రనఁడే! వీరు విక్రమంబు వారిపైఁ బ్రకటంబుగాఁ జూపమిం జేసి యట్టిమాటలాడవానికి నోరు గలిగె. వెండియు శకుని జూద మాడునపుడు ధర్మరాజుం జూచి నీతమ్ము లందఱ నొడ్డి యోడితివి. ఇఁక నీధన మగు ద్రౌపది గలదు. దాని నొడ్డి యాడు మని తెగఁబాఱి పలుకఁడే? అప్పుడు పుట్టినమాటలెల్ల నుగ్గడించునట్టివియే? అంతయు నీవు సమక్షమునఁ జూచినవాఁడవు గావున నీకుఁ జెప్పనేల? ఇవి యన్నియుం బరికించిన సంధికార్యంబు కానేర దని నాకుఁ దోఁచుచున్నది. అయినను నేనైన నచ్చటికి వచ్చి వారికిఁ దగినబుద్ధులు సెప్పి సంధి పొసఁగునట్లు యత్నము చేయుదు. పాండవులపాలు పాండవుల కిచ్చుట కియ్యకొందురేని సంధి పొసఁగు. దానం బుణ్యమును శ్రేయమునుం గాంతురు. మృత్యుముఖమునం బడక బ్రదుకుదురు. ధర్మార్థసహితంబు లయిననామాటల నాదరించి తత్ప్రకారమున నడపుదురేని మేల యగు. కాదేని భీమార్జునులబలమునం జేసి పొలియుదురు. అంతకంటె మున్ను నిజపాపకర్మానలంబున దగ్ధు లగుదు రింతయు నిక్కవంబు. పాండవులు పరాజితులయి యడవుల కేగునపుడు తులువతనమునఁ దాఁ బలికినపలుకులనెల్ల భీమసేనుఁడు సంగరాంగణమున గదాపాణియై వీరవిక్రమవిహారంబు సల్పుచుఁ దలంపునకుఁ దెప్పించు. దుర్యోధనుఁడు క్రోధమయవృక్షము. కర్ణుఁడు స్కంధము. శకుని శాఖలు. దుశ్శాసనుఁడు పుష్పఫలములు. ధృతరాష్ట్రుఁడు మూలము. యుధిష్ఠిరుఁడు ధర్మమయవృక్షము. అర్జునుఁడు స్కంధము. భీమసేనుఁడు శాఖలు. కవలు పుష్పఫలములు. నేనును వేదములును బ్రాహ్మణులును మూలము. ధృతరాష్ట్రుఁడు నతనికొడుకులును వనము. పాండవులు పులులు. పులులు లేకున్న వనము సకలజనసుప్రవేశంబై నఱుకంబడు. వనముల వసింపనిపులులకు రక్షణంబు గలుగదు. కావున వనవ్యాఘ్రములు రెండునుం బరస్పరాశ్రయమున నెలమిఁ గాంచు. అట్లే కౌరవులుం బాండవులుంగూడి యొక్కటియైన నెలమి గలుగు. మఱియు ధార్తరాష్ట్రులు తీఁగెలవంటివారు. పాండవులు మాఁకులవంటి

వారు. మాఁకులఁ బ్రాఁకక తీఁగలు పెరుగనేరవు. కావున ధార్తరాష్ట్రులు పాండవుల నాశ్రయింపక యెసఁగఁ జాలరు. అంతయు వింటివిగదా. పాండవులముఖ్యతాత్పర్యముఁ జెప్పెద వినుము. ఆధృతరాష్ట్రుఁడు వీరల బిడ్డ లని పిలువం బనిచి పాలిచ్చిన నతనిం గొలుచుచుండుదము. కాకున్న విక్రమమున రాజ్యముఁ గొందు మనియున్నవారు. ఇందు దారాజున కెయ్యది యుచితం బని తోఁచునో దానిం జేయుఁగాక. ధర్మచారులు గావునఁ బాండవు లపుడు శాంతిమై నున్నవారని నిర్భయవృత్తి నుండవలదు. అలిగిరేని నేర్పరు లయినగట్టిమగలు గావున విక్రమముఁ జూపుదురు. అపుడు మాన్ప నేరికి నలవి గాదు. నాకుఁ దోఁచినంత చెప్పితి. ఇఁక నీకుఁ బోలినభంగిఁ జూచికొను మని వాసుదేవుఁడు వక్కాణించిన విని సంజయుండు దేవా, నీవు దీని నింత పట్టి యాడిన నగునే? అయినను సంధికొఱకు నీవు వచ్చిన ట్లానతిచ్చుటం జేసి నావచ్చినకార్యము సఫలం బయ్యె నని తలంతు నని తద్వచనంబుఁ బ్రశంసించి ధర్మరాజుమొగమునం జూడ్కి నిలిపి యిట్లనియె.

సంజయుఁడు హస్తిపురమునకుఁ బోవఁ బాండవులయనుజ్ఞఁ గొనుట.

మహీపాలప్రవరా, యనుజ్ఞ యిమ్ము. కరిపురికిఁ బోయెద. నీకు శుభంబగుఁగాక. నామాటలలో ననుచితంబు గలిగెనేని మన్నించి సైరణ సేయవలయు. సకలలోకనాథుం డైన జనార్దనుని, భీమార్జుననకులసహదేవులను, సాత్యకివిరాటద్రుపదచేకితానాదులను నామంత్రణంబు చేసి పోయెద. మీ కెల్లరకును శుభసుఖము లగుఁగాక. నామాటలలోఁ దప్పొప్పు లేవియైన నుండినను జల్లనిచూడ్కిం జూచి మన్నింపవలయుననిన విని యుధిష్ఠిరుఁ డాసూతపుత్రునకిట్లనియె. సంజయా, స్వస్తిమంతుఁడవై పొమ్ము. అనుజ్ఞాతుఁడ వైతివి. మదీయవచనములలోఁ బ్రియమ్ముగానియది యెద్దియేనియు నుండిన నది తలంపునకుఁ దేవలదు. పరిశుద్ధచేతస్కుండవై నీవు సభామధ్యమున లెస్స చెప్పితివి. నీమాటలందు ధర్మార్థవిరోధంబును ననౌచిత్యంబును జెవికి వెగటును గార్యమునకుఁ జేటునుం దెలియరాదు. ఇట్టియెడల దూతకృత్యము నడుప నీవొండె విదురుఁడొండెఁ బూనవలయుఁగాని లాఁతు లింతనేర్పునఁ బక్షపాతము మాని మోమోడక మాట లాడఁ జాలుదురే? నీవు మా కెప్పు డంతయుఁ గూర్చువాఁడవు. ధనంజయున కాత్మసముఁ డైనచెలికాఁడ వగుట నే నెన్నియే విషయముల నెఱుంగుదు. ఇటఁ దఱలి యరిగి కరిపురిం జేరి త్రోలుతఁ బరిశుద్ధచరిత్రులు వేదాధ్యయనసంపన్నులు సద్వంశప్రసూతులు సర్వాగమంగెఱ్ఱులు తపోనిరతులు వనవాసపరులు శిలోంఛజీవులు నగు నుత్తమబ్రాహ్మణులం గాంచి నామాటుగా వారిచరణములకు సాష్టాంగప్రణామము లొనరించి కుశల మడుగుము. తక్కటిపెద్దలకు నట్ల యభివాదనకుశలప్ర

శ్నముల నడపుము. అట ధృతరాష్ట్రపురోహితుఁడు ఋత్విజు లాచార్యులు మున్నగువారలం గాంచి వారియట్ల నడపుము. పదంపడ శ్రోత్రియవృత్తులు గాక వ్యవహారవృత్తిం జీవించుచు శీలబలమునకుఁ గొఱఁత రాకుండఁ జిత్తశుద్ధిచే ధర్మము ననుష్ఠించుచున్న వృద్ధజనుల కస్మత్కుశలముఁ గోరువారలకు మా యనామయవృత్తిం జెప్పి తత్కుశల మడుగుము. మా కాచార్యుఁడు ప్రియంకరుఁడు నయప్రవర్తనుఁడు నయవిధేయుఁడు బ్రహ్మచర్యనియమమునఁ జతుర్వేదముల నేర్చి యంత నిలువక ధనుర్వేదము సాంగోపాంగముగ నభ్యసించి లోకము నన్నెల్ల ధనుర్విద్యాచార్యుఁ డనం బేరు గాంచినద్రోణుని, మహారథుఁ డాత్మవిద్వరేణ్యుఁడునగు కృపాచార్యునిం గాంచి నామాఱుగాఁ బాదప్రణామముఁ గావించి కుశలం బడిగి మాకుశలము విన్నవింపుము. రెండవద్రోణాచార్యుఁ డనం బొగడ్త కెక్కినయశ్వత్థామను సాదరముగాఁ గుశలం బడుగుము. ప్రజ్ఞాశీలశ్రుతిసత్త్వధృతితపశ్శౌర్యానృశంస్యములు తనకు నిత్యములై యుండ లోకవినుతిం గాంచినయస్మత్పితామహుఁ డగు భీష్మునకు నన్ను నివేదించి పాదాభివందనముఁ గావింపుము. కురుకులప్రణేత బహుశ్రుతుఁడు వృద్ధోపసేవి ప్రజ్ఞాచక్షుండు మా తండ్రియు నగునాధృతరాష్ట్రమహీపాలునడుగులపయిం బడి మే మందఱము కుశల మున్నవార మని మనవి సేయుము. మూర్ఖతం జేసి భూవలయం బెల్లఁ దాన యేలుదు ననుతలంపుతోఁ బాపకృత్యముల కొడంబడుచున్నవాని నాధృతరాష్ట్రు పెద్దకొడుకును దుర్యోధనుని వానియట్ల యన్నింటం దగి వానితమ్ముఁ డన నొప్పి నదుశ్శాసనుని ననామయం బడుగుము. కౌరవులుం బాండవులును శాంతిఁ బొందుటయ మే లని యెల్లపుడుం దలంచుచు సాధుశీలుఁ డైనబాహ్లీకుని, బహుగుణవిలసితుఁడై నైష్ఠుర్యము మాని స్నేహమున వారలతప్పుల మన్నించుచున్న సోమదత్తుని, మహారథుఁడు కురుకులవరేణ్యుఁడు ననం బొగడ్త కెక్కి మామేలు గోరుచున్న సౌమదత్తినిం బ్రణామపురస్సరముగ సేమ మడుగుము. మఱియుఁ గురుకుమారుల నందఱం గాంచి తత్తదుచితప్రకారమునం బ్రణామాశీర్వచనములనడపి యనామయ మరయుము. వెండియుఁ బోరికిఁ దోడ్పడ వచ్చినప్రాచ్యదాక్షిణాత్యప్రతీచ్యోదీచ్యపార్వతీయాదు లైననానాదేశరాజులనెల్లం గనుంగొని తదీయానామయ మరసి మాకుశల మెఱిఁగింపుము. మఱియు హస్త్యారోహులు, రథికులు, గుఱ్ఱపురావుతులు, సారథులు, పదాతులు, ప్రెగడలు, దౌవారికులు, సేనానాయకులు, ప్రతిదినం బాయవ్యయముల లెక్క వ్రాయువాగు.-మున్నగు వారలం గాంచి నే నడిగితి నని తదీయక్షేమ మడుగుము. బరస్పరాజ్ఞుఁడు సర్వధర్మోపపన్నుఁడు యుద్ధముఁ గోరక శాంతియ గోరువాడు నగుటై[illegible]తుఁ డైన యుయుత్సునిసేమ మడుగుము. అభిమతార్థములఁ గొని కైతవసాహజమున



మహా ప్రా[illegible]

జూద మాడ నేర్చినచిత్రసేనుని, ద్యూతవిద్యయం దద్వితీయుండునా నెగడి మిథ్యాబుద్ధి యైనధార్తరాష్ట్రునకు మానముఁ బెంచునట్టిగాంధారరా జగుశకునినిం గుశల మడుగుము. పోర మార్కొనరానిపాండవుల నేవుర నే నొక్కఁడనే గెలుతు నని బింకములు పలుకుచుఁ దెలివి లేనివారల మోహింపఁ జేయుచున్నయాకర్ణుని నేమ మడుగుము. మాకు భక్తుఁడు, గురుఁడు, నాథుఁడు, తల్లి, తండ్రి, చెలి కాఁడు, ప్రెగ్గడయునై గంభీరప్రజ్ఞచే దీర్ఘాలోచనముఁ జేయుచున్నవిదురు నత్యాదరముతోఁ గుశల మడుగుము. మాకుఁ దల్లు లయినకురుకులంపుపెద్దముత్తైదువల గాంధారీదేవి మున్నగువారలం గని ప్రణామంబు చెప్పి మీకొడుకులెల్లఁ గుశలులై మీచిత్త మనువర్తించుచు భయభక్తులమెలంగుదు గే యని యడిగి పదపడి యజాతశత్రుండు పుత్రమిత్రభాతృబంధుగణముతోఁ గుశల మున్నవాఁ డని నివేదింపుము. దుర్యోధనాదులభార్యలం గాంచి తొలుతఁ గుశల మరసి కులాంగనాచరిత్ర దప్పకుండఁగ నేమఱక యత్తమామలం గొల్చుచుఁ బతులమతికిఁ గూర్చియుందు రే యనియడుగుము. కోడండ్రం జూచి మేలిగుణముల నొప్పుదు రే? ఉత్తమసంతతిం గనుఁ డని యుధిష్ఠిరుఁడు ప్రసన్నుఁడై మీతోఁ జెప్పు మని నవాఁ డనుము. కన్నియలం జూచి నే నడుగు యంటి నని వారియనామయం బడిగి కౌఁగిలించికొని యనుకూలురగునుత్తమపతులం బెండ్లియై వస్త్రచందనమాల్యాదిభోగముల ననుభవించి కులచరిత్ర నడపుఁ డనిచెప్పు మంటి ననుము. దాసులు దాసభార్యలు కుబ్జఖంజాదులు మున్నగునంతఃపురపరిజనులకు మదీయకుశలం బెఱింగించి తదనామయ మడుగుము. అంధబధిరపంగువామనాద్యనాథులనెల్ల ధార్తరాష్ట్రుఁడు దయతోఁ జూచుచున్నవాఁడే? వారలనెల్ల నామాటగా నేమ మడిగి మీపూర్వదుష్కృతమున నే నడవులకుఁ బోవుటంజేసి మీయిష్టముల లెస్సగ నెఱవేర్ప వలను కాదయ్యె. ఇదె మీచెడ్డకాల మంతయుఁ గడచనవచ్చె. అచిరంబ శత్రువులఁ దెగటార్చి మిమ్మెల్లఁ బోషింతు నంటి ననుము. ఏను బ్రాహ్మణుల కుపకారములఁ గొంత చేసితి. ఇఁకనుం జేయఁ దలంచియుండెద. అదియెల్ల నెన్నఁడు నెఱవేర్పఁ గలనో యనియెన్నుచున్నవాఁడ నని యారాజునకు వినిపింపుము. మఱియు వీరు వా రని విచారింపక యెల్లవారలను నామాటగాఁ గుశలము విచారింపుము. నానాదేశాగతయోధులనుం జక్కగఁ గుశల మడుగు మంటినిగదా. దుర్యోధనునకుఁ దోడ్పడ వచ్చినశూరులం బోలినవారు లోఁతు లుండుట యరిది. అయినను మాకు ధర్మంబు తోడు గలదు గావునఁ బగఱం గెల్తు మని ధార్తరాష్ట్రాగ్రజుం డైనయాదుర్యోధనునితో నేఁ జెప్పు మంటి నని యామాట ముఖ్యముగఁ జెప్పుము. శత్రువుల శాసించి నిష్కంటకంబుగాఁ గురురాజ్య మేలుదు నని నీమనస్సునందుఁ గోర్కె పెద్దయుఁ గలదు.

ఆకోర్కి నెఱవేఱనేరదు. మఱి దానివలన నే చెడుదువు. ఇందులకు యుక్తి యొక్కటియుం గన్పట్టదు. నీకుఁ బ్రియ మగునాచందముననే మేము వర్తించువారము గాము. పాలు మా కియ్య నీకు సమ్మతంబు గాదేని పోరికి సమకట్టి రమ్ము. పోట్లాడుదము. జయించి రాజ్యము గ్రహించుటయొండె, నోడి వీరస్వర్గ మధిగమించుటయొండెఁ గాఁగలదు. ఇంతయుం దప్ప దని యొప్పరికింపక చెప్పుము. వెండియు సాధుఁడసాధుఁడు, బాలుఁడు, వృద్ధుఁడు, బలవంతుఁడు, దుర్బలుఁడునుం దైవవశత్వమున వర్తింతురు. అందు బలాబలంబు లుపయోగింపవు. పూర్వకర్మానుగుణముగనే యీశ్వరుఁడు బాలునకుఁ బాండిత్యముఁ బండితునకు బాలత్వము నొసంగుచుండుఁ గావున నా కింతబల మున్నది యిఁక నా కేమి నేన గెలుతు నని నమ్మరా దని యాధృతరాష్ట్రాత్మజుఁడు బలజిజ్ఞాసార్థము మంతన ముండు సమయమున మోమోడక సంతోషముతోఁ దెలుపవలయు. కరిపురంబుఁ జేరిన వెంటన గావింపవలసినకుశలప్రశ్నాదిభంగి నెల్లఁ జెప్పితిఁగదా. ఇఁకఁ గార్యము తెఱంగు వినుము. మాతండ్రి యగుధృతరాష్ట్రమహీపాలుఁడు సకలరాజలోకముతోడ నిండోలగ మున్నతఱి నతనిసన్నిధికిఁ జని నామాఱుగాఁ బాదప్రణామముఁ గావించి రాజేంద్రా, భవదీయకరుణాభరమునఁ బాండవులు సుఖ మున్నవారు. తండ్రీ, నీయనుగ్రహమున మేము బాల్యమునందే రాజ్యప్రాప్తుల మయితిమి. చిన్ననాఁ డట్లు రాజ్యమునందు నిల్పి మన్నించి యాదరించి యి ట్లుపేక్షింప నీకుఁ దగునే? ఈకూడియున్న సైన్యమంతయు మాలో నొక్కఁడే తెగటార్పఁ జాలును. అయినను ద్వేషము మాని యందఱముం గూడి మనియెద మని యజాతశత్రుఁ డన్నవాఁ డని విన్నవింపుము. అట భీష్మునొద్ద కరిగి నాపేరు చెప్పి యాతాతయడుగుల కెఱఁగి మహాత్మా, నీవు కరుణ పూని శంతనువంశ ముద్ధరించితివి. నీకుఁ దెలియనిది లేదు. నీమనుమ లందఱు నొక్కటియై కూడి మనునట్టి తెఱంగు నడపు మని నే విన్నవింప మంటి ననుము. అటఁ గురుకులమంత్రివర్యుడైనవిదురుం గాంచి ధర్మరాజుహితంబుఁ గోరువాఁడవు గావున బహుప్రజాక్షయ మొల్లనియాధర్మరాజుమతము నెఱవేఱునట్లుగా యుద్ధము లేకయే కార్యము తెఱంగుపడువిధం బాలోచింపు మని నేఁ దెలుపు మనినవాఁడ నని వచింపుము. వెండియుదుర్యోధనుఁ గురుసభలోఁ బలుమాఱు లనునయించి యిది చెప్పుము. కుంతీదేవినుల్లంఘించి పుణ్యశీల యగుపాంచాలిని సభకు రప్పించినతప్పును, దుశ్శాసనుఁడు భవదనుమతంబున నప్పరమపతివ్రతముందలఁ బట్టి యీడ్చినయెగ్గును, కృష్ణాజినపరిధానులఁగా మమ్మడవులకుఁ బంపినయపచారములను, మఱియుఁ జిన్ననాఁటనుండి చేసినసర్వాపచారములను గురుకులక్షయమునకు వెఱచి యోర్చితి. మా పాలు మా కొసంగుము. పరధనమందలియాశ విడువుము. అట్లయిన మన మంద

ఱముం గలిసి ప్రీతిమై నుండుదము. చక్కనగపాలు మా కొసంగ మనస్సురాదే ని మా కేవురకుం గుశస్థలంబు, వృకస్థలంబు, మాకంది, వారణావతం, బింద్రప్రస్థమునుంగా నైదూళ్లైన నిమ్ము. దాన మేము శాంతిఁ బొందుదుము. దీనఁ గులమెల్ల సంతోషముఁ బొరయు. యుద్ధార్థము వచ్చినవా రందఱు సంతుష్టులై తమతమతండ్రుల నన్నదమ్ములఁ గొడుకులం దోడ్కొని యెంతయుసంతసంబునఁ దమతమయూళ్లకుఁ బోవుదురు. పాంచాలురుం గౌరవులుం గలిసియుండిన నెంత యొప్పునో యని నే నెన్నఁడుం జూచుచుండుదు. ఇట్టితలంపు నాక కాదు. లోకమునకెల్లఁ బ్రియ మగు. నీ కిష్టమేని యిట్లు చేయుట లెస్స. ఏను ముందు శాంతిఁ బొందుటయే యుచిత మనియున్నవాఁడ. మీ రందులకు రాక యుద్ధమునకు వత్తురేని మే మందులకును వెనుదీయము. మృదుదారుణముల నెద్దియైనం జేయఁగలము. బాల్యమునఁ దొందఱపడవలదు. లెస్స యాలోచింపు మని యిన్నిమాటలు నేఁ జెప్పితి నని లెస్స చెప్పుము. సంజయా, పోయి రమ్మని యుచితప్రకారమున వీడ్కోలిచ్చి యనిచె.

### సంజయుఁడు హస్తిపురమునకు వచ్చుట.

అవ్విధమున ధర్మరాజునునుజ్ఞఁ గొని సంజయుఁడు తెలిలి ప్రొద్దు గ్రుంకునంతకుఁ గరిపురముఁ జేరి నగరు సొత్తెంచి ధృతరాష్ట్రుఁ డంతఃపురమున నున్నవాఁ డని తెలిసి ద్వారపాలకుం బిలిచి యే నుపప్లావ్యమునకుఁ జని పాండవులఁ గాంచి వచ్చినవాఁడను. నృపాలుండు మేల్కాంచియుండునేని విన్నవింపు మనుటయు ద్వారపాలుఁడు మహీపాలునొద్దకుఁ జని సంజయురాక నివేదించిన విని ధృతరాష్ట్రుఁడు వానిం బిలిచి శీఘ్రంబ సంజయుని ర మ్మనుము. అతండు రానడ్డ మేమి? ఎప్పుడైనను రా నతఁడు తగినవాఁ డని యాన తిచ్చినం ద్వారపాలకుఁడు రాజాజ్ఞం దెల్పిన విని సంజయుఁడు తగ నంతఃపురమునకుఁ జని సింహాసనస్థుఁడై యున్న ధృతరాష్ట్రుఁ గాంచి కేలుమోడ్చి యిట్లనియె. దేవా, సంజయుఁడ నేను వచ్చితి. ప్రణమిల్లెద. దేవరయానతిం గొని పాండురాజనందనులపాలి కరిగి వచ్చితి. అజాతశత్రుఁడు ప్రేమపురస్సరంబుగ భవత్కుశలమును నీకొడుకులనేమమును బంధువులయు హితులయు మంత్రులయుఁబరిజనులయు ననామయం బడిగె ననుటయు ధృతరాష్ట్రుఁడు సంజయా, యయ్యజాతశత్రుఁడు తమ్ములును సకలపరిజనులుం దానుం గుశల మున్నవాఁడే? అతం డెయ్యది వచించె ననియడుగ సంజయుఁ డతని కిట్లనియె. ధర్మరాజు తమ్ములుసకలపరిజనులుం దానుం గుశల మున్నవాఁడు. నీ వెద్దానిం దలంతువో దానిం జేయ నున్నవాఁడు. అతండు పరిశుద్ధధర్మార్థకరుఁడు పరిపూర్ణచిత్తుఁడు బహుశ్రుతుఁడు యుక్తాయుక్తవివేచనపరుఁ

డు శీలవంతుఁడు ననుట యందఱకుం దెల్లంబకదా. సమస్తధనముకంటె నతని కద్రోహమే ప్రధానము. అతనిబుద్ధి ధర్మహీనములై ననుఖప్రియములం గోరదు. అతండు మనుష్యశక్తియెల్లక దైవబలమునేనమ్మిపాపమెల్ల నీపైఁ బెట్టి ధీరచిత్తుఁడై యున్నవాఁడు. నీకొడుకులు బొమ్మనుంబోలె నాడింప నీవాడుచుఁ బాపఫలమయినఘోరకర్మముఁజేయుచుండుదువు. నీవు ధర్మార్థయుక్త మయినయార్యవృత్తంబుఁ దప్పి కామకుఁడై నడిచెదవు. ఎవ్వఁడేనియు నెందాఁక నత్యంతకామవశుఁడు గాకుండునో యందాఁకఁ బ్రశంసఁ బడయు. నీవు సద్వృత్తంబుఁ దప్పి కొడుకులమాటలే వినుచుఁ బాండుపుత్రుల విడిచి సంశయాస్పదం బయినసర్వార్థమునుం గోరుచుండెదవు. దీన నెంతయు నధర్మం బపకీర్తియుఁ గాక పరలోకమునకు జేటునుం గలుగు. ఈపని భరతకులభూషణుం డైననీకుఁ దగినది కాదు. ప్రజ్ఞాహీనుని, దుష్కులజాతుని, ద్రోహిని, దీర్ఘవైరుని, క్షత్రవిద్యయందు ధైర్యము లేనివానిని, శౌర్యహీనుని, దుష్కర్మప్రవృత్తుని నాపదలుచేరుచుండు సత్కులమునఁ బొడమినవాఁడు సకలశాస్త్రముల నేర్చి జితేంద్రియుండై యశోబలముల సాధించి సుఖమున మనుచు ధర్మాధర్మముల నేర్పడ నెఱింగి మేలినడవడి నడుచువాఁడు దైవమున మేలు గాంచు. మేలు కీడు నెఱింగి ధర్మార్థములు వినియోగించుయోగ్యచింతనపరుం డైనవిద్వాంసుఁ డేల ద్రోహకృత్యముఁ జేయును? నీమేలు గోరుమంత్రు లందఱు ప్రతిదినము నాలోచించి యాలోచించి పాండవులకుఁ బాలియ్యకుండినం గురుకులక్షయం బగు నని నిశ్చయించి యున్నవారు. ధర్మరాజు మీయెడ ద్రోహముఁ జింతించియుండెనేని యింతకుమున్న గౌరవులు క్షయమొందియేయుండుదురు. అతం డట్లుగాక పాపమెల్ల నీపయిఁ బెట్టి తాను ధర్మము నమ్మియుండుటంజేసి నీవు తిట్టులం బడియెదవు. నిక్కంబ వా రలిగి యెత్తివచ్చిరేని వారి కసాధ్యముం గలుగునే? అర్జునుఁ డీమేన నింద్రలోకమున కరిగి శస్త్రాస్త్రముల సాధించి కృతార్థుఁడై వచ్చినవాఁడఁట. ఇఁక మనుష్యయత్నమున వారలే జయింతు రనుటకు సందియము గలదే? మీ రది యెఱుంగమికిఁ గాలమే కారణము గాఁబోలు. తొల్లి బలియనుదానవేంద్రుఁడు కర్మకృతము లగుగుణములను ననిత్యములై ప్రవర్తిల్లుచున్నభావాభావములనుం జూచి యందులకుఁ బారముఁ దెలియనేరక ప్రాణులకు శుభాశుభఫలానుభవమునఁ గారణము కాలమే యనివచించె. నేత్రశ్రోత్రాదీంద్రియములు తృష్ణాక్షయం బైనంగాని తనియవు గావున వ్యథ విడిచి దుఃఖముల నెడలి యయ్యింద్రియముల జయింపవలయు. తొలుతఁ జేసినకర్మమే సర్వకాలసుఖములకుఁ గారణ మగు ననితలంపరాదు. మాతృపితృకర్మమునఁ బుట్టి మనుజుఁ డాహారమునఁ బెరిగి యటఁ బ్రియాప్రియములు సుఖాసుఖములు నిందాప్రశంసలుం బడయు. అందు నింద్యము లగుప

నులం జేయగ నింద వచ్చుటయు సాధుకృత్యములు చేసినం బ్రశంస వచ్చుటయు సహజమైయుండు. నీవు భారతకులమునకుఁ జేటు వచ్చుచందమున వర్తించుటం జేసి నిన్ను దూఱం దలం పయ్యెడి. నిక్కంబ నీవలనఁ బ్రజాక్షయముఁ గాను న్నది. నాచె ప్పెడిచొప్పు నీ కొప్పదేని నీయపరాధకర్మము కార్చిచ్చు శుష్కతృణ పుంజమునుంబోలెఁ గులముఁ గాల్చు. నీవుదక్క మఱి యెవ్వఁడు నిట్టికర్మమున కొడఁబడఁడు. నీ వెక్కుడవే కామాత్ముఁడై నకొడుకుమాటకు లోఁబడి జూదమునఁ దన్మతముఁ గొనియాడుచుఁ బాండవులకుఁ గోపము మఱింత పెరుగునట్లు చేసి తివిగాని యప్పుడు దాని వారింపవైతివి. శాంతిఁ బొందవైతివి. నీచేసినపనికి ఫల మిపుడు తెలియవచ్చె. నీవ చూడుము. అనాప్తు లయినకర్ణదుర్యోధనాదులఁ జేర్చికొని యాప్తు లయినపాండవుల నిగ్రహించుటంజేసి దుర్బలుండవైతివి గా వున ననయుతం బైనభూమండలంబుఁ బాలింపఁ జాలవు. పెద్దందవ్వు దఱిమికొని వచ్చుటంజేసి నే నిపు డెంతయు బడలియున్నవాఁడ. ఆనతి యొసంగిన నింటి కరిగి నిదురవోయి రేపకడన వచ్చి కొలువులో నజాతశత్రుఁడు చెప్పినమాటలం జెప్పెద ననుటయు ధృతరాష్ట్రుఁ డట్ల యగుంగాక యని సంజయుని వీడ్కొల్పి ద్వారపా లకుం బిలిచి వేగ విదురుం దోడికొని రమ్మని పనిచె. వాఁడును విదురునొద్దకుఁ బోయి యోప్రాజ్ఞవర్యా, రాజేంద్రుఁడు నిన్ను వేగమ తోడ్కొని రమ్మని యాన తిచ్చె నని తెల్పిన నవ్విదురుఁడు వానితోడన వచ్చి ద్వారదేశమున నిలుచుటయు ద్వారపాలకుఁడు రాజునొద్ద కరిగి దేవా, విదురుఁ డరుదెంచి నీయడుగులఁ జూడఁ గోరియున్నవాఁ డీక నెయ్యది చేయవలయునో దాని నాజ్ఞాపింపు మనిన విని ధృతరాష్ట్రుఁడు వాని కిట్లనియె. అతండు ద్వారదేశమున నిలువ నేల? ఎట్టిసమ యమునకైనను విదురుం జూడఁగ నాకుఁ గుతూహలం బెక్కుడు గలదు. సమయ విచార మతఁ డేల చేయవలయు. వెంటన తోడికొని రమ్మనుటయు ద్వారపాలకుఁ డయ్యర్థము నెఱింగించిన విని విదురుఁ డభ్యంతరము సొచ్చి చింతాక్రాంత చిత్తుండై యున్న ధృతరాష్ట్రుం గనుంగొని యంజలిపుటంబులు ఘటియించి దేవా, యేను విదురుండను నీశాసనమున వచ్చితి. నాయొనర్పఁ దగినపని గలదేని యానతి మ్మనినివేదించె. నివేదించుటయు ధృతరాష్ట్రుఁడు విదురా, సంజయుఁ డుపప్లావ్యమునుండి వచ్చి న న్నెంతయుఁ దూలనాడి యజాతశత్రునివచనములు సభామధ్యమునందు రేపు చెప్పెద నిప్పుడు ప్రయాణశ్రమమున బడలితి నని చెప్పి యింటికిఁ బోయె. ఆధర్మరా జెయ్యది వచించెనో సంజయుఁ డెయ్యది తెలియఁ జెప్పునో యని యతండు పోయినది మొదలుగఁ జింత పెల్లున నాకు నిద్దుర వట్టదయ్యె. ఇంద్రియములు స్వస్థవృత్తిఁ దప్పియున్నవి. మనస్సు శాంతిం బొర యదు. సర్వాంగంబులుం జిచ్చు వెట్టి కాల్చిన చందముగఁ దపించుచున్నవి.

ఇట్టియెడ నా కెయ్యది శ్రేయ మగునో యద్దానిం జెప్పుము. నీవు ధర్మార్థకుశ లుఁడవు గాన నీకుఁ దెలియనిది లేదుగదా యనిన విని విదురుఁడు ధృతరాష్ట్రుఁ జూచి రాజేంద్రా, బలవంతుఁ డెత్తివచ్చిన దుర్బలుఁడైన వాఁడును, హీనసాధ నుఁడును, సొమ్ము పోఁగొట్టుకొనినవాఁడును, గామాతురుఁడును, జోరుఁడును నిద్దుర లేక పరితపింతురు. ఈమహాదోషము లెవ్వియు నిన్నుఁ జేరవుగదా? పర ధనములపై నాశచేఁ దదర్థము పరితపింపవుగదా యనియడుగ ధృతరాష్ట్రుఁడు నాకెద్దియు నిపుడు దోఁపదు. నీవే చింతించి నాకుఁ జిత్తశాంతి గలుగు తెఱం గుగా హితవచనముల బోధింపు మనిన విదురుఁ డాధృతరాష్ట్రున కిట్లనియె.

విదురుఁడు ధృతరాష్ట్రునకు నీతివచనములఁ జెప్పుట.

రాజేంద్రా! రాజు యోగ్యలక్షణముల నొప్పెనేని త్రైలోక్యాధిపత్య మునైనం జేయఁ జాలును. నీ వందులకు విపరీతముగ నడిచెద వెట్లంటేని? సకల ధర్మకోవిదుఁడు ధర్మాత్ముఁడు నీయెడ నెంతయు భక్తుఁడు విధేయుఁడు నగుయుధి ష్ఠిరు నడవులకుఁ బంపితివి. నీయందలిగురుత్వమునం జేసియుఁ దనకు సహజము లయిన యద్రోహకారుణ్యధర్మసత్యపరాక్రమములం జేసియు నతం డలజడిపా టులనెల్ల నోర్చియున్నవాఁడు. నీవు కర్ణశకునిదుశ్శాసనదుర్యోధనులయందె రా జ్యభారంబుఁ బెట్టి యైశ్వర్యము రావలయు నని కోరెద వ దెల సిద్ధించు? తన్నుఁ దా నెఱిఁగి శాంతిధర్మనిత్యతలు గలిగి క్రోధహర్షదర్పాది దోషముల కెడ యీా క యుచిత మరసి కార్యములఁ బూనవలయు. ప్రశస్తసేవనము, నింద్యపరిత్యా గ, మాస్తికత్వబుద్ధి, ధర్మశ్రద్ధ యనువీని గ్రహింపవలయు. కార్య మయినపిద పనే యందఱు నెఱుంగునట్లుగా మంత్రము బాహిరము గాకుండ గోపనముఁ జేయవలయు. లెస్స యాలోచించి కార్యములఁ బూనవలయు. పూనినపిదపడి శీతోష్ణములు భయరతులు సమృద్ధ్యసమృద్ధులు మొదలగువానికిఁ దలఁకి విడు వరాదు. ధర్మార్థకామము లొండొంటికి విరోధము లేకుండఁ దనశక్తినాలోచించి తగురీతిం గార్యము పూని చేయవలయు. ఒరుల కవమాన మగు తెఱఁగున నడు వరాదు. ఎద్దియైనం బెద్దయుం బ్రొద్దు విని వేగ తెలిసికొని తత్ప్రతికారము సేయ వలయుఁగాని కేవలకామమున సాహసించి చేయరాదు. అడుగకుండినం బరార్థ మునకుఁ బ్రవర్తింపరాదు. అదియే ప్రథమవిజ్ఞానంబు నాఁబడు. పడయరానిదానిఁ గోరరాదు. కడచినదానికి వగవరాదు. ఆపదలు వచ్చినపు డిఁక నెట్లోయని స మ్మోహముఁ జెందగాదు. ఆరంభించినకార్యమును నడుమ నిలుపకుండ నుచితకా లమునందు సఫలముఁ జేసికొనవలయు. ఆర్యసమ్మతపథము దప్పక నడువవలయు. సంపదఁ గావించుకృత్యములఁ జేయవలయు. హితము దెల్పిన నసూయపడరాదు. సమ్మానమున కుబ్బక యవమానమునకు గ్రుక్కక గంగమడువుచందమున నక్షో

భ్యతమై వర్తింపవలయు. సర్వభూతముల తత్త్వమును సర్వకార్యములయోగము నుపాయము నెఱుంగవలయు. మాటలవలన ననేకములు పుట్టుఁ గావున సమయస్ఫూర్తి గలిగి ప్రతిభాచమత్కారము నెఱయ సమయోచితముగ నీతికి విరోధము పొసఁగకుండ మాట లాడవలయు. ప్రజ్ఞయు శాస్త్రము నెండొంటి నెడఁబాయని తెఱంగున వర్తింప నార్యమర్యాద నతిక్రమింపక ప్రవర్తింపవలయు. అపారవిద్యాధనములు గలిగియుండినను మదింపరాదు. ఇన్నిలక్షణములు గల యతండు పండితుఁ డనంబడు. శాస్త్రజ్ఞానము లేకయే యెఱుఁగుదు ననిగర్వించువాఁడును, దరిద్రుఁడయ్యు నుదారతం బ్రకటించువాఁడును, యత్నముఁ జేయకయే కార్యములఁ బొందఁ గోరువాఁడును, స్వార్థముఁ ద్యజించి పరార్థ మనుష్ఠించువాఁడును, మిత్రులయెడ మిథ్యాచారుఁడును, గామించువారలఁ ద్యజించి కామింపనివారలఁ గామించువాఁడును, బలవంతులతోడఁ బగఁ గావించుకొనువాఁడును, శత్రులయెడ మైత్రిని మిత్రులయెడ శత్రుత్వమునుం జూపుచు దుష్కృత్యములఁ జేయువాఁడును, సంసారప్రతీకారముల నన్నింట సందేహించువాఁడును, శీఘ్రకర్తవ్యములం నాలస్యమునఁ జేయువాఁడును, దేవపితృకర్మములుడుగువాఁడును, మిత్రసంగ్రహము సలుపనివాఁడును, బిలువక చొచ్చువాఁడును, దన్నడుగకుండినం బెక్కులు ప్రేలువాఁడును, నమ్మఁ దగనివానిపై నమ్మిక యుంచువాఁడును, దాను దుష్పథమునం బోవుచు లాఁతులపై దోషముల నారోపించువాఁడును, నిగ్రహింపఁ దనకు సామర్థ్యము లేకున్నను గోపగించికొనువాఁడును, దనబల మెఱుఁగక యలభ్య మగుదానిం గోరువాఁడును, ధర్మార్థవిరుద్ధ మగుదానిం బూనువాఁడును, శిక్షింపఁ దగనివాని శాసించువాఁడును, నిష్ప్రయోజనపురుషుని సేవించువాఁడును, క్షుద్రుం గొల్చువాఁడును మూఢుఁ డనంబడు. సంపన్నాన్నమును భృత్యులకు విభాగించి పెట్టక తా నొక్కఁడే భుజించుచు దివ్యవస్త్రములఁ గట్టుచుఁ దనసుఖముఁ జూచుకొనువానికంటెఁ గ్రూరచిత్తుఁ డెవ్వఁడు నుండఁడు. ఒక్కనియపచారమునఁ బలువురకుఁ జేటు వచ్చు. తదపచారఫలభాక్కులపాప మంతయుఁ బదంపడి కర్తయే యనుభవించు. మేటివిలుకాఁడు నేర్పున బాణంబరివ్రాసి యేసిన నది యొక్కనిఁ జంపినం జంపు. తప్పిపోయినం బోవుఁ గాని బుద్ధిమంతుఁడు లెస్సగ నీతిం బ్రయోగించెనేని యది రాజును రాజ్యమునుం జెఱుచు. కావున నవశ్యము రాజులు నీతిమెయి నడవవలయు. * ఒకటిచే రెంటి

* ఒకటి, బుద్ధి. రెండు, పుణ్యపాపములు. మూడు శత్రుమిత్రబాంధవులు. నాలుగు, సామదానభేదదండములు. అయిదు, జ్ఞానేంద్రియములు. ఆఱు, సంధివిగ్రహయానాసన ద్వైధీభావసమాశ్రయములను గుణంబులు. ఏడు, వెలఁది, పానము, జూదము, వేఁట, వాక్పారుష్యము, దండపారుష్యము, ధనము వ్యర్థముగాఁ గొల్లవెట్టుట, యనువ్యసనములు.

ని నిశ్చయించి నాలుగింటిచే మూటిని వశీకరించికొని యైదింటిని గెలిచి యా ఱంటి నెఱిఁగి యేడింటిని విడిచి సుఖముఁ గనుము. మఱియు రాజులకు మంత్ర గోపనము ముఖ్యంబనిమున్న చెప్పితిఁగదా. విషశస్త్రములొక్కనిం జంపు. బాహిరం బయినమంత్రము రాజ్యమునకెల్లం జేటుదెచ్చు. మధురాహారమును, గార్యాలోచనంబును, దెరువునడుచుటను, బలువురు నిద్రగప్పూవుతఱి మేల్కనియుండుటయు నొక్కఁడు చేయరాదు. సముద్రము దాటువానికి నావ యెట్లట్ల సత్యమే స్వర్గమార్గము గావున దానిం జక్కఁగ నడుపఁ దలయు. క్షమావంతుం జూచి తెలియనివార లితండు సమర్థుఁడు గాఁడని వచింతురు. అది తగనిమాట. అసమర్థులకు క్షమ గుణము కాదుగాని సమర్థులకు క్షమయే యుత్తమభూషణము. క్షమావంతునకు లోకమెల్ల వశంబై యుండు. క్షమ కసాధ్యముం గలుగునే? శాంతి యనుఖడ్గము చేత నుండెనేని వాని దుర్జనుఁ డేమి చేయఁగలఁడు. పుల్లలు లేనివట్టిమంటిలోఁ బడి యగ్ని తనకుఁ దాన చల్లాఱుచందమునఁ బ్రత్యుత్తర మియ్యనివానియెడ దుర్జనుఁడు తనకుఁ దాన యడఁగు. క్షమలేనివాఁడు లాఁతులపై దోషముల నారోపించియటఁ దానుం దద్దోషములఁ బడయు. ధర్మ మొక్కటియే పరమశ్రేయస్సు. క్షమ యొక్కటియే యుత్తమంబు. విద్య యొక్కటియే పరమతృప్తి. అహింసయొక్కటియే సుఖావహంబు. యుద్ధముఁ జేయ వెఱచురాజు యాత్రలు చేయనోపనిబ్రాహ్మణుఁ డనునీయిరువురను భూమియే గ్రసించు. పరుషములు పలుకకుండుట దుష్టులఁ బూజింపకుండుట యనునీరెండు గలవాఁడు లోకమునఁ బ్రశంసఁ గాంచు. లాఁతులు కామించినవారలఁ గామించునాతులు లాఁతులు పూజించినవారలనే పూజించువారు ననునీరెండుతెగలవారలు పరులయెడ నమ్మిక గొనిపనులఁ జేయుదురు. అందనిమ్రానిపండ్ల కట్టు సాచెడికైవడి ధనము లేక పెల్లుగఁ గోరువాఁడు, నిగ్రహింప శక్తి లేక కోపపడువాఁడు ననుసిద్దఱు శరీరశోషణముఁ జేయుతీక్ష్ణకంటకప్రాయులు. యత్నముఁ జేయనిగృహస్థుఁడు యత్నపరుఁడై నయతియు ననుసిరువురుం దమకుఁ దగనిపనులఁ జేయుటం జేసి యొప్పఁజాలరు. నిగ్రహింపఁ జెల్లుబడి గలిగియున్నను సైరించునతఁడు పేదయయ్యు దానములఁ జేయునతడు ననునిద్దఱు స్వర్గలోకముమీఁద నుత్తమలోకములం బ్రాపింతురు. న్యాయార్జిత మగుధనమునకు నపాత్రదానము పాత్రమం దర్పింపకుండుటయు ననురెం డక్రమములుగలవు. అవి పొసఁగకుండఁ జూచికొనవలయు. ఈగి యొల్లనిధనవంతుఁడు తపస్సు సల్పనిదరిద్రుఁడు ననునిరువురను మెడలోఁ బెనుగుండు కట్టి నీటఁ ద్రోసినం దప్పు లేదు. యోగనిష్ఠుఁడైనయతి రణమున వెనుదీయక కడిమి మెఱయఁ బోటులాడి మేను దొఱఁగునతఁడు ననునిద్ద

అను సూర్యమండలము భేదించి బ్రహ్మలోకముఁ జేరుదురు. మనుజులుత్తమమధ్యమాధమభేదమున మూఁడుతెఱంగులవర్తింతురు. వారలలెస్సగ నెఱింగి తగురీతి నుత్తమమధ్యమాధమకార్యములందు నియోగింపవలయు. భార్య, దాసుఁడు, సుతుఁడు ననుమువ్వు రెవ్వాని నొందియుందురో వానిధనము యగుదురు. పరస్వాపహరణము, పరదారాభిమర్శనము, మిత్రత్యాగముననుమూఁడును మహాదోషములనఁబడుఁ గావున వానిం దవులక మెలఁగవలయు. కామక్రోధలోభము లనుమూఁడు నాత్మనాశకములు. మఱియు నరకమునకు ద్వారములు కావునఁ బనిపూని యమ్మూఁటిం ద్యజింపవలయు. చిరకాలము దన్నాశ్రయించినవాఁడు, నమ్మికమై నాశ్రయించుచున్నవాఁడు, వెఱచి శరణుసొచ్చినవాఁడు ననునిమ్మువ్వుర నెట్టిసంకటములందైనం బరిత్యజింపరాదు. వరప్రదానము, రాజ్యలాభము, పుత్త్రోదయము ననునీమూఁడు శరణాగతశత్రురక్షణమునకొక్కదానికి సమానములగు. అల్పబుద్ధులతోడను, దీర్ఘసూత్రత మెద్దియేఁ జేయుచుఁ గాలముఁ గడపువారితోడను, నలసులతోడను, జారణులతోడనుం గార్యాలోచనంబు రాజు చేయరాదు. జ్ఞాతివృద్ధుఁడు, నెచ్చినకులీనుఁడు, దరిద్రుఁడైనసుఖుఁ డనపత్యయగుభగిని యనునీనలుగు రింట నుండినం గృహస్థధర్మవృత్తియగువానికి మేలగు. దేవతలసంకల్పము, బుద్ధిమంతులప్రభావము, విద్వాంసులవినయము, పాపకారులచేటు ననునీనాలుగు సద్యోదృష్టంబు లగు నని తొల్లి యొకప్రశ్నమున బృహస్పతి దివస్పతికిఁ దెలిపెఁ గావున నవియెల్ల నెఱుఁగవలయు. అగ్నిహోత్రమౌ, నాధ్యయన, యజ్ఞము లనునాలుఁగు యథావిధి మానపూర్వకముగ నాచరించిన మేలు గావించు. కాకున్న భయము గలిగించు. తల్లి, తండ్రి, యాత్మ, యగ్ని, గురు వనునేవురు పంచాగ్ను లనంబడుదురు. వారలఁ బ్రతిదినముం బ్రయత్నముతో సేవింపవలయు. దేవ, పితృ, మను, ష్యాతిథి, భిక్షుకు లనునేవురం బూజించువాఁడు త్తమకీర్తింబడయు. మిత్రు, లమిత్రులు, మధ్యస్థు, లుపజీవ్యు, లుపజీవు లనునేవురు నీవు నడుచుతెరువున నడుచునట్లు చూచికొనుము. పంచేంద్రియములు తనకు వశములై యుండునట్లు మెలఁగవలయు. అట్లుగాక యొక్కటియైనం దనంతన ప్రవర్తింపసాగెనా తోలుతిత్తిబిలమునుండి జలముమాడ్కి వానిబుద్ధి యెడలిపోవు. నిద్ర, సోమరితనము, భయము, క్రోధ, మాలస్యము, దీర్ఘసూత్రత యనునివి షడ్దోషము లనఁబడు. సంపదఁ గోరుపురుషుఁడు వాని నవశ్యము విడునవలయు. బోధింపనియాచార్యుఁడు, వేదాధ్యయనముఁ గావింపనిఋత్విజుఁడు, రక్షింపనిరాజు, ప్రియముఁ బలుకనిభార్య, గ్రామముఁ గోరుగోపాలుఁడు, వనముఁ గోరుమంగలి యనునీయాఱుగురను సముద్రమధ్యమందుఁ బగిలినయోడనుంబోలె వర్జింపవలయు. సత్యము, దాన, మనాలస్య, మన

ని నిశ్చయించి నాలుగింటిచే మూఁటిని వశీకరించికొని యైదింటిని గెలిచి యాఱింటి నెఱిఁగి యేడింటిని విడిచి సుఖముఁ గనుము. మఱియు రాజులకు మంత్రగోపనము ముఖ్యంబనిమున్న చెప్పితిఁగదా. విషశస్త్రములొక్కనిం జంపు. బాహిరం బయినమంత్రము రాజ్యమునకెల్లం జేటుదెచ్చు. మధురాహారమును, గార్యాలోచనంబును, దెరువునడుచుటను, బలువురు నిద్రవోవుతఱి మేల్కనియుండుటయు నొక్కఁడు చేయరాదు. సముద్రము దాఁటువానికి నావ యెట్లట్ల సత్యమే స్వర్గమార్గము గావున దానిం జక్కఁగ నడుపవలయు. క్షమావంతుం జూచి తెలియనివారలితండు సమర్థుఁడు గాఁడని వచింతురు. అది తగనిమాట. అసమర్థులకు క్షమ గుణము కాదుగాని సమర్థులకు క్షమయే యుత్తమభూషణము. క్షమావంతునకు లోకమెల్ల వశంబై యుండు. క్షమ కసాధ్యము గలుగునే? శాంతి యనుఖడ్గము చేతనుండెనేని వాని దుర్జనుఁ డేమి చేయఁ గలఁడు. పుల్లలు లేనివట్టిమంటిలోఁ బడి యగ్ని తనకుఁ దాన చల్లాఱుచందమునఁ బ్రత్యుత్తర మియ్యనివానియెడ దుర్జనుఁడు తనకుఁ దాన యడఁగు. క్షమలేనివాఁడు లాఁతులపై దోషముల నారోపించియటఁ దానుం దద్దోషములఁ బడయు. ధర్మ మొక్కటియే పరమశ్రేయస్సు. క్షమ యొక్కటియే యుత్తమంబు. విద్య యొక్కటియే పరమతృప్తి. అహింసయొక్కటియే సుఖావహంబు. యుద్ధముఁ జేయ వెఱచురాజు యాత్రలు చేయనోపనిబ్రాహ్మణుఁడనునీయిరువురను భూమియే గ్రసించు. పరుషములు పలుకకుండుట దుష్టులఁ బూజింపకుండుట యనునీరెండు గలవాఁడు లోకమునఁ బ్రశంసఁ గాంచు. లాఁతులు కామించినవారలఁ గామించునాతులు లాఁతులు పూజించినవారలనే పూజించువారు ననునీరెండుతెగలవారలు పరులయెడ నమ్మిక గొనిపనులఁ జేయుదురు. అందనిమ్రానిపండ్ల కట్టు సాచెడికైవడి ధనము లేక పెల్లుగఁ గోరువాఁడు, నిగ్రహింప శక్తి లేక కోపపడువాఁడు ననుసిద్దఱు శరీరశోషణముఁ జేయుతీక్ష్ణకంటకప్రాయులు. యత్నముఁ జేయనిగృహస్థుఁడు యత్నపరుఁడైనయతియు ననుసిరువురుం దమకుఁ దగనిపనులఁ జేయుటం జేసి యొప్పఁ జాలరు. నిగ్రహింపఁ జెల్లుబడి గలిగియున్నను సైరించునతఁడు పేదయయ్యు దానములఁ జేయునతడు ననునిద్దఱు స్వర్గలోకముమీఁద నుత్తమలోకములం బ్రాపింతురు. న్యాయార్జిత మగుధనమునకు నపాత్రదానము పాత్రమం దర్పింపకుండుటయు ననురెం డపక్రమములుగలవు. అవి పొసఁగకుండఁ జూచికొనవలయు. ఈగి యొల్లనిధనవంతుఁడు తపస్సు సల్పనిదరిద్రుఁడు ననుసిరువురను మెడలోఁ బెనుగుండు కట్టి నీటఁ దోసినం దప్పు లేదు. యోగనిష్ఠుఁడైనయతి రణమున వెనుదీయక కడిమి మెఱయఁ బోటులాడి మేను దొఱఁగునతఁడు ననునిద్ద

అను సూర్యమండలము భేదించి బ్రహ్మలోకముఁ జేరుదురు. మనుజు లుత్తమమధ్యమాధమభేదమున మూఁడుతెఱంగుల వర్తింతురు. వారల నెఱింగి తగు రీతి నుత్తమమధ్యమాధమకార్యములందు నియోగింపవలయు. భార్య, దాసుఁడు, సుతుఁడు ననుముగ్గు రెవ్వానిఁ బొందియుందురో వానిధనమ యగుదురు. పరస్వాపహరణము, పరదారాభిమర్శనము, మిత్రత్యాగముననుమూఁడును మహాదోషము లనఁబడుఁ గావున వానిం దవులక మెలఁగవలయు. కామక్రోధలోభము లను మూఁడు నాత్మనాశకములు. మఱియు నరకమునకు ద్వారములు కావునఁ బని పూని యమ్మూఁటిం ద్యజింపవలయు. చిరకాలము దన్నాశ్రయించినవాఁడు, నమ్మికమై నాశ్రయించుచున్నవాఁడు, వెఱచి శరణుసొచ్చినవాఁడు ననునిమ్మువ్వుర నెట్టి సంకటములందైనం బరిత్యజింపరాదు. వరప్రదానము, రాజ్యలాభము, పుత్రోదయము ననునీమూఁడు శరణాగతశత్రురక్షణమున కొక్కదానికి సమానములగు. అల్పబుద్ధులతోడను, దీర్ఘసూత్రణ మెద్దియేఁ జేయుచుఁ గాలముఁ గడపు వారితోడను, నలసులతోడను, జారణులతోడనుం గార్యాలోచనంబు రాజు చేయరాదు. జ్ఞాతివృద్ధుఁడు, నొచ్చినకులీనుఁడు, దరిద్రుఁ డైనసఖుఁ డనపత్యయగుభగిని యనునీనలుగు రింట నుండినం గృహస్థధర్మవృత్తియగువానికి మేలగు. దేవతలసంకల్పము, బుద్ధిమంతులప్రభావము, విద్వాంసులవినయము, పాపకారులచేటు ననునీనాలుగు సద్యోదృష్టంబు లగు నని తొల్లి యొకప్రశ్నమున బృహస్పతి దివస్పతికిఁ దెలిపెఁ గావున నవియెల్ల నెఱుంగవలయు. అగ్నిహోత్ర మౌ, నాధ్యయన, యజ్ఞము లనునాలుఁగు యథావిధి మానపూర్వకముగ నాచరించిన మేలు గావించు. కాకున్న భయము గలిగించు. తల్లి, తండ్రి, యాత్మ, యగ్ని, గురు వనునేవురు పంచాగ్ను లనఁబడుదురు. వారలఁ బ్రతిదినముం బ్రయత్నముతో సేవింపవలయు. దేవ, పితృ, మను, ష్యాతిథి, భిక్షుకు లనునేవురం బూజించువాఁడుత్తమకీర్తిం బడయు. మిత్రు, లమిత్రులు, మధ్యస్థు, లుపజీవ్యు, లుపజీవు లనునేవురు నీవు నడుచు తెరువున నడుచునట్లు చూచికొనుము. పంచేంద్రియములు తనకు వశములై యుండునట్లు మెలఁగవలయు. అట్లుగాక యొక్కటియైనం దనంతన ప్రవర్తింపసాగెనా తోలుతిత్తిబిలమునుండి జలముమాడ్కి వానిబుద్ధి యెడలిపోవు. నిద్ర, సోమరితనము, భయము, క్రోధ, మాలస్యము, దీర్ఘసూత్రత యనునివి షడ్దోషము లనఁబడు. సంపదఁ గోరుపురుషుఁడు వాని నవశ్యము విడువవలయు. బోధింపనియాచార్యుఁడు, వేదాధ్యయనముఁ గావింపనిఋత్విజుఁడు, రక్షింపనిరాజు, ప్రియముఁ బలుకనిభార్య, గ్రామముఁ గోరుగోపాలుఁడు, వనముఁ గోరుమంగలి యనునీయాఱుగురను సముద్రమధ్యమందుఁ బగిలినయోడనుంబోలె వర్జింపవలయు. సత్యము, దాన, మనాలస్య, మన

సూయ, క్షమ, ధైర్య మనునాఱు గుణము లత్యుత్తమంబులు. వాని నవశ్యము సాధింపవలయు. గోవులు, సేవ, కృషి, భార్య, విద్య, వృషలసహవాసము నను నాఱు ముహూర్తమాత్రమైనం బ్రత్యవేక్షణము దప్పినం జెడుం గావున నం దే మఱకుండవలయు. చదివినశిష్యు లాచార్యునిం, బెండ్లియైనవారు తల్లిని, గామము దీఱినవారు యువతిని, గృతార్థు లుపకారిని, నడవి దాటినవారు తోడువచ్చినసా తును, రోగము మాని స్వస్థవృత్తిం బొరసినవారు వైద్యునిం ద్యజించుట లోక మునం దఱుచుగం గానంబడుచున్నది. కావున నీయాఱువిషయములం బరిశీలించి పూర్వప్రయోజకుల నవమానింపకునికి యుత్తమలక్షణంబు. అప్పులేమి, యారో గ్యము, దేశములం ద్రిమ్మరకుండుట, సజ్జనసహవాసము, యోగ్యులయెడ నమ్మి క, భయములేమి యనునాఱు సుఖకరములు. ఈర్ష్య, జుగుప్స, యసంతోషము, క్రోధము, జంకు, పరభాగ్యోపజీవన మనునాఱు నిత్యదుఃఖము లనంబడు. అర్థా గమము, నిత్యారోగ్యము, ప్రియురాలగుభార్య, ప్రియవాదులు, విధేయుండైన పుత్రుండు, డర్థకరి యగువిద్య యనునాఱు సుఖహేతువులు. జ్ఞానేంద్రియములు మనస్సు ననునాఱుం దనకువశములై యుండెనేని యతండు పాపముల ననర్థము లనుం బడయనేరండు. ఏమఱినవానియొద్దం జోరులు, రోగియొద్ద వైద్యులు, కా మవశులయొద్ద నుగ్మలులు, యజమానులయొద్ద ఋత్విజులు, వివాదపడువారి యొద్ద రాజు, మూర్ఖులయొద్దం బండితు లున్నతిం గాంతురు. వెలంది, జూదము, పానము, వేట, వాక్పారుష్యము, దండపారుష్యము, వ్యర్థముగ ధనవ్యయముం జేయుట యనునివి సప్తవ్యసనంబు లనంబడు. వానిపైం జిత్తము దవిలెనేని యెం తనేర్పరియైనం జెడును గావున నాదోషముల నేడింటిం బ్రయత్నముతో రాజు వర్జింపవలయు. బ్రాహ్మణులతోం గలహించుట, వారు విరోధించునట్లు చేసికొను ట, వారిధన మపహరించుట, వారలకుం గీడు రోయుట, లాఁతివారు వారల నిం దించిన సంతోషించుట, పెఱవారు వారలం గొనియాడిన మెచ్చకుండుట, కార్య సమయములందు వారలం దలంపకుండుట, వారలు యాచించిన నసూయపడుట యనునెనిమిది యెవ్వనియెడం జూపట్టునో వాఁడు శీఘ్రంబ చెడు నని నిర్ణయిం పవలయు. రాఁబోవుచేటున కివి పూర్వనిమిత్తము లని యెన్నవలయు. కావున నెఱుకగలవారు బుద్ధిపూర్వకముగ నాదోషములు విసర్జింపవలయు. చెలికాండ్ర తోడిసంగతి, యమితధనాగమము, పుత్రాలింగనము, కులాంగనారతి, యుచిత సమయమునం బ్రియాలాపము, సమానులలో నుత్తమత్వము, కోరినకోర్కి యీ డేఱుట, బహుజనపూజనీయత్వ మనునెనిమిది సంతోషదాయకములు. ప్రజ్ఞ, కులీనత్వము, శాంతి, శాస్త్రజ్ఞాన, ముచిత మగుతఱిం బరాక్రమము, మితభాష ణము, శక్తికొలంది దానము, కృతజ్ఞత యనునెనిమిది గుణములు పురుషుం బ్రకా

శింపఁజేయు. * నవద్వారము పంచసాక్షికము త్రిస్థూణము క్షేత్రజ్ఞాధిష్ఠితము నగునీ గృహము లెస్సగ నెఱుంగవలయు. అతఁడే విద్వాంసుఁ డనంబడు. మదించినవాఁ, డేమఱువాఁడు, వెట్టివాఁడు, బడలినవాఁడు, క్రోధముగలవాఁ, డాఁకొన్నవాఁడు, తొందఱపడువాఁడు, లుబ్ధుఁడు, భీతుఁడు, కాముకుఁడనుపదుగురు ధర్మ మెఱుంగ లేరు. కావున వారితోడఁ గార్యచింతనముఁ జేయరాదు. నీతివిషయముగాఁ బ్రహ్లాదసుధన్వులు విరోచనునికొఱకుఁగాఁ జెప్పినసుభాషితములు కొన్ని గలవు. అవి యితిహాసరూపమున లోకమునం బ్రవర్తిల్లె. వానిం జెప్పెద వినుము. శాస్త్రములఁ జదివి ధర్మవిశేషముల నెఱింగి రాజు సమయోచితముగ నాలసింపక కార్యములఁ జేయుచుఁ గామక్రోధములు విడిచి పాత్రభూతునకు దాన మొనరించుచు మేలి నడవడిం బ్రవర్తించెనా యారాజును సకలజనులుం బ్రమాణభూతుఁగా గ్రహింతురు. జనుల నమ్మింప వెరవులనెల్ల నేర్చి కొలఁది నెఱింగి దోషకారుల దండించుచు శాంతిఁ బూని యున్న రాజును శ్రీదేవి తనంతన చేరును. అత్యంతదుర్బలుండైనవాని శత్రునైనను బుద్ధిపూర్వకముగ నవమానింపక బలవంతులతోడ విరోధముఁ బెట్టికొనక యడఁగియుండి సమయము వచ్చినపుడు విక్రమముఁ జూపుచు ధైర్యముఁ బూని యాపదలు దొడరినప్పుడు వెతఁ జెందక యలజడిపాటులకెల్ల నోర్చియుండి ప్రమాదము లేక యుద్యోగియై యుండుమహాత్ముఁడు శత్రువుల గెల్చి భూమండలం బెల్ల నేలఁ గలఁడు. వ్యర్థముగ నిల్లు విడిచి దేశములఁ ద్రిమ్మరక యయోగ్యులతోడిసంధి, పరదారాభిమర్శనము, చౌర్యము, కొండెము చెప్పుట, కల్లుద్రాగుట యనుదోషములం దవులక సత్పథమునఁ బ్రవర్తించునతఁడు నిత్యసుఖి యన నెగడు. సంరంభమునఁ ద్రివర్గము సేవింపని వాఁడును, బిలిచి యడిగిన నున్నంత పలుకువాఁడును, మిత్రార్థము వివాదముఁ గోరనివాఁడును, దన్నుఁ బూజింపకుండినం గోపింపనివాఁడును, నసూయపడనివాఁడును, దయగలవాఁడును, దనకు శక్తిలేకుండిన నితరులకుఁ బూఁటపడనివాఁడును, బెలుచఁ బ్రేలనివాఁడును, వివాదము వచ్చినను శాంతిఁ గొనువాఁడును లోకమున మిక్కిలి ప్రశంసఁ గాంచు. ఒకప్పుడైనను జనులకు వెగటు గావించు వేషముఁ దాల్పనివాఁడును, బౌరుషమున నితరులకంటెఁ దన్నుఁ బొగడికొననివాఁడును, గ్రోధమూర్ఛితుఁడయ్యుఁ బరుషములు పలుకనివాఁడును లోకమునకెల్లఁ బ్రియుం డగు. అడఁగినవైరమును గ్రమ్మఱఁ గావించికొననివాఁడును, మదింపనివాఁడును, జేటుల కెడ యీక తప్పించుకొనువాఁడును, బేదవడియు నకార్యము

* నవద్వారములు. శరీరమునందుఁ గలనవరంధ్రములు. పంచసాక్షు లనఁగా జ్ఞానేంద్రియములయిదు. త్రిస్థూణ లనఁగా మూఁడు స్తంభములు. ఇళా, పింగళా, సుషుమ్న లనుమూఁడునాడులనిభావము. క్షేత్రజ్ఞుఁ డనఁగా జీవుఁడు. ఇక్కడ గృహ మనఁగా శరీరమని గ్రహింపవలయు.

ల నలుపనివాఁడును, దనకు సుఖము గలిగిన నుబ్బనివాఁడును, లాఁతులకు నేఁగి పోసఁగినం దాను సంతసింపనివాఁడును, దానము చేసి పిదప సొమ్ము పోయెఁగా యని వగవనివాఁడును నార్యశీలుఁ డని పెద్దలు వచింతురు. దేశాచారములను, సమయభేదములను, జాతిధర్మములనుఁ దెలిసి తగవగునడవడిం బ్రవర్తిల్లువాఁ డెచ్చోటికిఁ బోయిననుం బ్రశంసఁ గాంచును. దంభము, మోహము, మత్సరము, పాపకృత్యము, రాజద్వేషము, కొండెముచెప్పుట, పెక్కండ్రతోడిపగ, మత్తోన్మత్తదుర్జనులతోడివివాద మనునీదోషములఁ ద్యజించినవాఁడు ప్రజ్ఞావంతుఁ డనఁ బొగడికఁ గాంచు. శాంతిదాంతిశౌచములు గలిగి శోభనకృత్యముల నాచరించుచు నందులకు లోపము వాటిల్లినప్పుడు శాస్త్రచోదితప్రాయశ్చిత్తముల నొనరించుచు దేవతలపై భక్తితో మెలంగునతనికి సకలదేవతలుం బ్రసాదింతురు. వివాహము, సఖ్యము, వ్యవహారము, సల్లాపమునుం దనకుఁ దగినవారితో జేయవలయుఁగాని హీనులతోడం జేయరాదు. చేసినం బెక్కుదోషములు గలుగుచుండు. గుణశ్రేష్ఠు లగువారలఁ బురోహితులఁగా నేర్పఱిచికొనవలయు. అట్లయిన నారాజునకు నీతిమార్గములు సెడవు. ఆశ్రితులకు విభాగించిపెట్టి మితముగ భుజించుచు నమితకార్యము గావించి మితముగ నిద్దురవోవుచు శత్రువులైనను యాచించిన నిచ్చునట్టియుదారు నేయనర్థములుం జేరరావు. తాను జేయఁదలఁచినయుపకారాపకారములు పరిణామమునందక్కఁ దెలియనియట్లుగా మంత్రగోపనముఁ జేయువాని కించుకేనియుఁ జేటురాదు. సర్వభూతశాంతిఁ గోరుచుఁ బరిశుద్ధచిత్తముతో మానసమునకుఁ గొఱతఁ రాకుండ మృదువుగ సత్యవచనముఁ బలుకువాఁడు రత్నపుంజములలో నాయకమణికరణి జ్ఞాతులలోఁ బెంపుఁ గాంచు. తనకుఁ దాన చింతించి లోకాపవాదమునకు వెఱచి యకార్యములఁ జేయనొల్లనియతండు తనమేలిసడవడి నందఱుం గొనియాడ లోకగురుఁ డనఁ బొగడువడుచు నిజదివ్యతేజమునం జేసి సూర్యునిచాడ్పున వెలుంగు. ఇన్నిగుణములుం బాండవులయొద్దఁ గానఁబడుచున్నవి. పాండురాజు మునిశాపమునఁ దనకుఁ బుత్రోత్పాదన సామర్థ్యములేమిం జేసి యెంతయుఁ జింతిల్లుచుండ దేవతావరప్రసాదమున నింద్రతుల్యు లయినపాండవు లేవురు వనములందుఁ బుట్టిరి. అట వారి తండ్రి లోకాంతరగతుఁ డగుటయు మునులు వారల నీ కప్పగించిరి. నీవు నాని సుఁగులఁ జిన్ననాఁటనుండి పెంచి విద్య నేర్పి పెద్దవారలం జేసితివి. వారును నీవె తమ్ముఁ గన్నతండ్రి యనుభావముతో నీదెసనెంతయు భక్తితో మెలఁగుచు నీయానతిమెయి నడుచుచున్నవారు. ఇట్లుండ నీకొడుకు తులువలమాట విని వారి రాజ్యము నాచికొనియె. ఇఁకనైన వారిరాజ్యము వారి కిచ్చి కొడుకులతోడ సుఖముండుము. వారు మీవారునుం గూడి బ్రదుకుదురేని దేవతలకైనం దేటి

చూడరా దనిన విని ధృతరాష్ట్రుఁడు విదురుదెస మొగంబై వత్సా, నీవు ధర్మా ర్థకుశలుఁడవు గావున ని న్నడిగెద. అయ్యజాతశత్రుఁ డెయ్యది చేయ నున్న వాఁడో నే నెఱుఁగను. నీవు నీప్రజ్ఞాబలమున దానినెల్ల నాలోచించి కుశలు మున కెయ్యది శ్రేయస్కరంబో చింతసెల్లున నిదురపట్టక పరితపింపుచున్న నా కెయ్యది కర్తవ్యంబో దానిం జెప్పుము. ఎట్లు చేసిన నేమి వచ్చునో యని శం కించుచున్న నామనంబుకలత వాపవే యనియడుగ విదురుఁడు వెండియు నతని కిట్లనియె.

రాజేంద్రా, త న్నడుగకుండినను మేలు గోరినవాఁడు రాజునకుఁ బ్రియ మైన నప్రియమైనను హితమగుదానిం జెప్పవలయుఁ గావున నేను నీహితముఁ గోరి కౌరవులకు శ్రేయస్కరము ధర్మసంయుతము నగుదానిం దెలియఁ జెప్పెద నాకర్ణింపుము. తగవుమాలిననడవడిచేఁ గొన్ని కార్యములు సిద్ధించినను వాని యందుఁ జిత్త ముంచరాదు. ఎన్నఁడైనను నాపనులవలనఁ జేటు రాకమానదు. మంచినడవడిఁ బూని నడచినను గొన్ని కార్యములు సిద్ధింపవు. అట్లయినను ధర్మ ము దప్పక వర్తించినం గార్యము గొనసాగదయ్యెఁగా యని దానిపై వగపు గదుర ధర్మమార్గము దప్పరాదు ఇది మేధావంతుని లక్షణంబు. కార్యములకుఁ గలప్రతిబంధములఁ బరిశీలించి యవి తొలఁగ నుపాయ మాలోచించి వేగమున నాకార్యములఁ జేయవలయుఁగాని విడువరాదు. ఉపాయాపాయములఁ బరిశీలించి సిద్ధ్యసిద్ధుల నెఱిఁగి యాకార్యము సాధ్యమగునేనిఁ జేయవలయు. కాకున్న దాని దెసం బోవ కూరకునికి మేలు. క్షయ, స్థాన, వృద్ధి, కోశ, జనపద, దండముల తత్త్వము నెఱుఁగని రాజు చిరకాలము రాజ్య మేలఁ జాలఁడు. మఱి యథోక్తల క్షణముగ వాని నెఱిఁగి ధర్మార్థపరిశీలనపరుం డైనరాజు రాజ్యప్రతిష్ఠితుండై పరమసుఖముఁ బ్రాపించు. రాజ్యము దక్కె నని నీతి దప్పరాదు. ముదిమిరూప సౌభాగ్యమునుంబోలె నీతిత్యాగము సంపదం జెఱుచు. నీవును రాజ్యము దక్కె నని పాండురాజుపాలు తత్పుత్రుల కియ్యక యనయంబుఁ బూనెదవు. మాంస ముపై నాశచే గాలమునం జిక్కుమీనునకైవడిఁ బాండవరాజ్యముపైని లోభ మునఁ దుదిఁ జేటుఁ జెందుదువు. తన కెంత మ్రింగి యఱిగించికొనం దగునో యంతయే కోరవలయుఁగాని మిక్కిలి కోరరాదు. కావున నీకు మ్రింగి యఱిగించి కొనరానిపాండవరాజ్యముఁ గోరుట తగదు. ఎందులకుం బరిణామం బెఱింగియే కార్యము చేయవలయు. కమియఁ బండనికసరుగాయలు గోసినఁ జవి చెడుటయ గాక విత్తునుం జెడు. మదురఁ బండినపదంపడి గోసినం జవి మెసంగు. విత్తు సెడదు. ఈతెఱంగునఁ గార్యస్వరూపము నిర్ణయింపవలయు. తేఁటి పూవులకుఁ జేటు వాటిల్లకుండఁ దేనియఁ గొనుచందమున జనులకు నొప్పి గలుగకుండ నర్థము

గ్రహింపవలయు. పూవు లమ్మువాఁడు పువ్వులఁ గోయుకైవడి వెదకి వెదకి ప్రధానము గొనవలయుఁగాని బొగ్గులు గాల్చువానిరీతి మొదలంట నఱుకరాదు. ఈపని చేసిన నెట్లగునో చేయకున్న నెట్లగునో యని విచారించి విచారించి తగునేని కార్యముఁ బూనవలయు. తగదేని మాననలయు. పురుషప్రయత్నముఁ జేసినను నిరర్థకము లగు నని తోఁచినకార్యములఁ బూనరాదు. ఎవ్వనికోపము నిగ్రహింపఁ జాలదో యెవ్వనిప్రసాద మనుగ్రహింపఁ జాలదో యట్టిరాజును నాతులు నపుంసకుఁ బోలెఁ జులకనఁ జూతురు. ప్రాజ్ఞుఁ డల్పయత్నమున మహాఫలము సేకూఱునట్టితెఱంగు నాలోచించి యట్టికార్యముల విఘ్ననిరాసపూర్వకముగ నారంభించు. సర్వజనులం జల్లనిచూడ్కిం జూచుచు ఋజుస్వభావమున మెలఁగువాఁ డెయ్యదియుం జేయకున్నను జనులు వానిపై ననురక్తి గలిగియుందురు. వృక్షములుకొన్ని పుష్పితంబులయ్యు ఫలితంబులుగాకయుండు. ఫలితములయ్యుఁ గొన్ని యారోహింప వలనుగాకుండు. మఱియుఁ దత్ఫలము లపక్వములయినం బక్వము లట్లగపడుఁ గావున సర్వలక్షణముల నెఱింగి యోపికతోఁ బనులఁ బూనవలయు. మనోవాక్కర్మదర్శనంబులఁ బ్రసాదంబుఁ బ్రకటించువానికి లోకమెల్లఁ బ్రసన్న మగు. రాజునకుఁ బ్రజానురాగంబు ప్రధానంబు గావునఁ బూనికతోఁ బ్రజలు దనపై ననురాగంబు గలిగియుండుతెఱఁగుగా వారల నాదరింపవలయు. అట్లుగాక బోయను జూచినమృగములట్లు ప్రజలు వెఱతురేని యారాజు కులపరంపరాప్రాప్తం బయినసకలభూమండలంబు నిజపరాక్రమమున వశీకరించికొని యేకచ్ఛత్రాధిపత్యముగ నేలుచుండియు సుఖముఁ గాంచనేరఁడు. చండమారుతంబు మేఘబృందంబునుంబోలె నన్యాయము రాజునకు రాజ్యభ్రంశముఁ గావించుఁ గావున ధర్మ మాచరింపవలయు. పెద్ద లాచరించినధర్మము నాచరించువానికి భూమి సమస్తార్థముల నిచ్చు. ధర్మమున వర్తించువానికి భూమి యగ్నిలో నుంచినచర్మముమాడ్కిఁ దిరుగఁబడుచుండుఁ గావున ధర్మతాత్పర్యంబు మానరాదు. మఱి ధర్మమున రాజ్యము సాధింపవలయు. ధర్మమునఁ బాలింపవలయు. ధర్మమూల మయినసంపదం బడసినవాఁ డెన్నఁడుం గొఱఁతఁ బొరయఁడు. పరరాష్ట్రవిమర్దనమునం దెంతపూనికి వేయుదుమో యంతపూనికి స్వరాష్ట్రపరిపాలనంబుననుం జేయవలయు. అన్నిటిలోనుం గొంతసార ముండుఁ గావున వెఱ్ఱివానిమాటలును గొండికవానిపలుకులును విని పాషాణములందుఁ గాంచనమునుం బోలె నందునుఁ గలసారాంశము గ్రహింపవలయు. శిలోంఛజీవనుఁడు పొలమంతయు వెదకి యొక్కటొక్కటిగా రాలినగింజ లేఱి గ్రహించుచందమున నన్నిటం గలమంచిమాటలను మంచిపనులను గ్రహింపవలయు. గోవులు గంధమునఁ దమవచ్చినతెరువు నెఱుఁగు. బ్రాహ్మణులు వేదమునఁ దమకర్తవ్యముల

నెఱుఁగుదురు. రాజులు గూఢచారులవలన లోకవృత్తాంతముల నెఱుఁగుదురు. తక్కటివారలే కన్నులఁ జూచి యెఱుంగుదురు గావున రాజు యోగ్యు లగువే గువాండ్ర నెల్లచోట్లం బనిపి సర్వవృత్తాంతముల నెఱుంగవలయు. తనంతన పాఁడి యియ్యనియావును జనులు బాధించుటయుఁ దనంతన వంగనికట్టెలను గాల్చి వంచుటయు లోకమునం గన్పట్టుచున్నది గావునఁ దదుపమానమున నే బల వంతులు తమమాట విననివారల నెట్లయిన బాధించి లోఁజేసికొందు రనియూ హించి వివేకి యగురాజు బలవంతునకుఁ దాను లోఁగి కాలముఁ గడఁద్రోయవ లయు. పశువులకుఁ బర్జన్యుఁడు బంధువు. రాజులకు మంత్రులు బంధువులు. స్త్రీలకుఁ బతులు బంధువులు. బ్రాహ్మణులకు వేదములు బంధువులు గావున మంత్రులఁ దగువారల నియమించి కొనవలయు. సత్యము ధర్మమును రక్షించు. అభ్యాసము విద్యను రక్షించు. శౌచము రూపమును రక్షించు. మానము ధనధా న్యాదుల రక్షించు. అనుక్రమణ మశ్వముల రక్షించు. పలుమాఱులు పరిశీల నము గోవుల రక్షించు. కులీనత్వము స్త్రీల రక్షించు. వృత్తము కులమును రక్షిం చు. వృత్తము చెడినం గులము చెడును. అధమకులులును వృత్తవంతులైరేని ప్రశంసం గాంతురు. కావున వృత్తము నవశ్యము రక్షించికొనవలయు. పరధన రూపకులశౌర్యసౌఖ్యములపై నీసు గలవాఁడు తీఱనిరోగముల నలందురుచుండు. కావున వానిపై నీసు మాని యకార్యములదెసం బోవక కార్యములఁ జేయవ లయు. విద్య, ధనము, కుల మనుమూఁడును దుర్జనులకు మదముఁ గావించు. అవియే సజ్జనులకు శాంతివినయముల నొనరించు. సజ్జను లెద్దియేని కార్యము వొసఁగిన పుడు తమ్ముఁ బిలిచినం దుర్జనులు తాము లేకున్న నాకార్యము నెఱవేఱ దనిభా వించి యెంతయే నిక్కుదురు. అదివారలకొలఁదిమీఱినతలంపు. సజ్జనులకు నస జ్జనులకును సజ్జనులే నిక్కంబ గతి యగుదురుగాని యసజ్జనులు సజ్జనులకు గతి గారు. వస్త్రాలంకారవంతుఁడు సభఁ జొరఁజాలు. గోధనము గలయతఁ డాశఁ దీర్చికొను. వాహనవంతుఁ డెంత తెరువైనం బోవఁజాలు. ధనవంతుఁడు సకలముం బడయఁజాలు. అన్నింటికంటె మనుజునకు శీలమే ప్రధానము. అది లేకున్నఁ బ్రాణములు, ధనము, బంధువులుం గలిగియుండినం బ్రయోజనము లేదు. కా వున శీలరక్షణ మవశ్యకర్తవ్యంబు. ధనవంతులకు మాంసాహారము, మధ్యునకు గోరససంపన్నాహారము, దరిద్రులకుఁ దైలమిశ్రాన్నమే లభించు. అయినను దరి ద్రులే సంపన్నతరముగ భుజింతురు. ఎట్టియన్నమైన నాఁకటిపెల్లున స్వాదువై యుండు. ధనవంతుల కాఁకలి మిక్కిలి గానరాదు. ధనవంతులు మిక్కిలి భుజింపఁ జాలకుండుటయు, దరిద్రులు కట్టియలనైన నఱిగించికొనుటయు లోకమునఁ దఱచుగఁ గానఁబడుచున్నదిగదా. అధములు జీవనోపాయ మెట్లగునో యని

వెఱచుచుండుదురు. మధ్యులు మరణమునకు భయపడుచుండుదురు. ఉత్తము లవమానమునకుఁ దలఁకుచుండుదురు. ఐశ్వర్యమదమునఁ బెక్కుదోషములు గలవు. ఐశ్వర్యమదమత్తుఁ డొకసారియైనం గ్రిందఁ బడక తెలియనేరఁడు. యథేచ్ఛముగ నింద్రియార్థములం దింద్రియములు ప్రవర్తించుచుండ వాని నిలుపలేనియతనికి నానాఁట నాపదలు పెలుచఁ దొడఁకుచుండు. తన్ను గెలువనేరక పగఱఁ గెలువఁ బూనువాఁడు వారల గెలువఁజాలక యుడుగుఁ గావునఁ దొలుతఁ దన్నుఁ దనకు ద్వేష్యునిగ భావించి గెలువవలయు. అట నందఱం గెలువఁ జాలు. మనస్సును నిగ్రహించి యింద్రియముల గెలిచి తప్పుఁ జేసినవారలఁ దగువిధమున దండించుచుఁ బరీక్షించి సకలకార్యములఁ జేయునతనికి సంపద తనంతనే చేరు. పురుషునకు శరీరము రథము, మనస్సు సారథి, యింద్రియములు గుఱ్ఱములు. వానిం జక్కగ నిగ్రహించిన నుత్తమరథికునిచాడ్పున నేలిగతిం బడయు. ఇంద్రియములు నిగృహీతములు కావేని యెంతటి చేటునైనం దెచ్చు. ఇంద్రియములకుఁ జిక్కినవాఁ డర్థము ననర్థముఁగను ననర్థము నర్థముఁగను భావించి దుఃఖము సుఖ మనుతలంపుతో ధర్మార్థములఁ బరిత్యజించి తుదిఁ బ్రాణధనదారహానిం బొందు. ఇంద్రియముల నియమింపనిధనవంతుఁ డైశ్వర్యభ్రంశంబునుం బొందును. కావున మనోబుద్ధీంద్రియములను లెస్స గుదియించి తనతత్త్వముఁ దా నెఱుఁగవలయు. తన్ను గెల్చువానికిఁ దాను బంధు వగు. తన్ను గెలువనివానికిఁ దానే శత్రు వగు. కామక్రోధము లనురెండు ప్రజ్ఞాలోపముఁ జేయఁ జాలును గావున వానిం దవులక ధర్మార్థములఁ బరిశీలించి సాధనసామగ్రిని సంపాదించినవాఁడు సర్వకాలము సుఖించు. ఇంద్రియముల గెలువని రాజు లెందఱేని శత్రుల గెలువఁ బోయి తామే యోడి స్వకర్మమున హతు లయి రని పెద్దలు చెప్ప వినియుందుము గావున నింద్రియజయ మవశ్యకర్తవ్యంబు. అనసూయ, యార్జవము, శౌచము, సంతోషము, ప్రియవచనము, సత్య, మనాయాస, మాత్మజ్ఞానము, శాంతి, దాంతి, ధర్మనిత్యత, గుప్తదాన మనుగుణము లధములకుఁ బట్టువడవు. మఱియు నధము లుత్తములపై నపవాదము లారోపించి యాక్రోశింతురు. ఉత్తములు క్షమఁ గొనియుందురు. అపవాదము లారోపించుటం జేసి యధములు పాపములఁ బడుదురు. ఓర్చుటం జేసి యుత్తములు పాపవిముక్తు లగుదురు. అసాధుజనులకు లాఁతుల హింసించుటయే బలము. రాజుల కుచితదండప్రయోగము బలము. స్త్రీలకు శుశ్రూష బలము. గుణవంతులకు శాంతి బలము. ఇతరులు నిందించునపుడు శాంతిఁ గొనియుండుట యత్యంతదుష్కరంబు. అర్థవంతముగ విచిత్రముగ భాషించుట యశక్యంబు. మంచిమాటలవలన మిక్కిలిమేలును దుర్భాషణంబున మిక్కిలి చేటునుం బొసఁగు. కత్తి గొడ్డలి మొదలగునాయుధముల నఱికిన వ్రా

నైనను మఱలఁ జిగురు వెట్టుఁ గాని దుర్భాషణములఁ జెడఁ దిట్టులువడిననరుఁడు క్రమ్మఱఁ బూర్వస్థితిఁ బడయఁడు. మేనఁ గ్రుచ్చినయలుఁగుల నెట్లో వెడలింపవచ్చుఁగాని మనస్సున నాటినదుర్భాషణము లనుశల్యముల నపనయింపనలవిగాదు. వాగ్బాణవిద్ధుఁడైనవాఁడు రేలుంబవల్లు శోకించుచుండుఁ గావున నెఱుక గలవాఁడు లాఁతివారిచిత్తమునకు నొప్పి గలుగఁజేయుపలుకులఁ బలుకరాదు. దైవోపహతుఁడు చేటుకాల మాసన్న మగుడు బుద్ధికలుషతం జెంది యన్యాయము న్యాయ మనిభావించి తగవుగానినడవడి నడచు. నీవును జేటుకాల మాసన్నమగుటంజేసి పాండవులతోడిపగఁ జేసి కొని దానం గలుగుకీడు విచారింపవైతివి. రాజు యోగ్యలక్షణముల నొప్పునేని ముల్లోకములనుం బాలింపఁగలఁడు. నీ వందులకుఁ దప్పి నడిచెదవు. ఏమి చేయవచ్చు? ఇంతటనైనం గొడుకులమాట వినక పాండవులపాలు వారి కిమ్ము. అజాతశత్రుఁడు నీపయి భక్తి నునిచియున్నవాఁడు. నీకొడుకులకు నీపై నతని కున్నంత భక్తి లేదు. కేవలధర్మపరుఁడు గావున నతఁడు తనకు సహజము లయినయద్రోహాదిసద్గుణములఁ జేసి యన్నియు నోర్చియున్నవాఁ డనిచెప్పిన విని ధృతరాష్ట్రుఁడు విదురుం బిలిచి యోమహామతీ, నీవచించెడిచిత్రవచనముల నెంత వినినను దనివి దీఱదు. ఇఁకను ధర్మార్థసహితము లగు వచనముల వినిపింపు మనుటయు నతం డతనికిమఱియు నిట్లనియె.

సర్వతీర్థస్నాన మొక్కవలనను సర్వభూతములయెడ నకుటిలవృత్తి యొక్కవలననుం బెట్టి చూచిన నకుటిలవృత్తియే కొంతయెక్కువగఁ దోఁచెడిఁ గావున నీకొడుకులు పాండురాజుకొడుకు లనుభేదముఁ దలంపక సమభావముతో నందఱు నొక్కటియై కూడి మనునట్టితెఱంగు చేయుము. అట్లు చేసితివేని యీలోకమున సత్కీర్తినిఁ బరలోకమున సద్గతినిం గాంతువు. ఈలోకమునఁ గీర్తి నెఱసియుండునందాఁక నాకీ ర్తిమంతునకుఁ బుణ్యలోకవాసము గలిగియుండు. తొల్లి విరోచనునకు సుధన్వునకుఁ గేశినీనిమిత్తము నడిచినసంవాదం బితిహాసంబై ప్రవర్తిల్లె. అది యీయర్థమున కుదాహరణం బగు. దానిం జెప్పెద నాకర్ణింపుము. అత్యంతరూప లావణ్యవతి యగు కేశిని యనుకన్యక యుత్తమపతివాంఛంజేసి స్వయంవరస్థితయై యుండె. అపుడు విరోచనుఁ డనుదానవేంద్రుఁడు స్వయంవరార్థము వచ్చుటయుఁ గేశిని వానిం బిలిచి బ్రాహ్మణులు శ్రేష్ఠులా? దానవులు శ్రేష్ఠులా? సుధన్వుఁ డనుబ్రాహ్మణోత్తముఁ డేల యీస్వయంవరమంటపమున కింతకు రాఁడో యనిన విరోచనుఁడు కేశినిం జూచి ప్రజాపతివంశసంభవమునంజేసి మేమే యుత్తములము. ఈలోకముల కెల్ల మేము యధీశులము. మాకంటె దేవతలు బ్రాహ్మణులు నెవ్వరు నధికులు గా రని వచించె. ఆమాట విని కేశిని విరోచనా, యింతేల? రేపు సుధన్వుఁడును వచ్చు మీ రిద్దఱుం

గూడినవు డది విచారింత మనుటయు విరోచనుఁడు నట్ల యని నాఁడూరకుండె. అట మఱునాఁడు సూర్యోదయా నంతరము సుధన్వుఁ డాస్వయంవరస్థానము నకు వచ్చె. వచ్చుటయుఁ గేశిని ప్రత్యుత్థానాభివాదనాదివిధుల నతనిం బూజించి యిరువురం గూర్చుండఁ జెప్పుటయు సుధన్వుఁడు తనతోఁ గూర్చుండ వచ్చినవిరోచనుం జూచి యోప్రహ్లాదపుత్రా, యేను హిరణ్మయము దాంతము మణిమయము నగునాసనమునం గూర్చుండ నర్హుఁడను. నీవు నాతోడం గూర్చుండ వల దనివచించె. అందులకుఁ గినిసి విరోచనుఁడు నీ వొకపలకమీఁదనైనను దర్భాస్తరణముమీఁదనైనను గూర్చుండ నర్హుఁడవు. ఉత్తమాసనముల నుపవేశింప నధికారి యగునాతోడ నీవు కూర్చుండ నెట్లు చాలు దని యుల్లసం బాడినవిధముగఁ జెప్పిన విని సుధన్వుఁడు విరోచనా, పితాపుత్రు, లిద్దఱుబ్రాహ్మణు, లిద్దఱు క్షత్రియు, లిద్దఱువైశ్యు, లిద్దఱుశూద్రులు నేకాసనమునం గూడఁ గూర్చుండుట తగుఁగాని వార లందఱు నొకళ్లొకళ్లతోఁ గలిసికూర్చుండఁ దగదు. నేనుత్తమాసనమునం గూర్చుండఁగ మీతండ్రి నన్నుఁ గొల్చియుండు. నీవు గారామున నింటఁ బెరిగినవాఁడవు గావున ధర్మ మెఱుంగ వనుటయు విరోచనుఁ డలుక గదురనిట్లనియె. అయ్యా, నీమతం బట్లగునేని మనసందియము దీర్చికొనఁగ నేరినైనం దెలిసినవారల నడుగుదము. ఇందులకు మాకుఁ గల సువర్ణము, గోవులు, గుఱ్ఱములు, మొదలగుసకలధనముం బణముఁగా నొడ్డెద ననిన సుధన్వుఁ డవియెవ్వియు నొడ్డవలదు. ప్రాణములఁ బందెము చఱిచెద మనిన విని విరోచనుఁ డట్ల యని యెవ్వారి నడుగుదము. దేవబ్రాహ్మణుల నడుగుటకు నే నొల్ల ననిన సుధన్వుఁడు విరోచనా, వారల నెవ్వారి నడుగవలదు. మీతండ్రి యగుప్రహ్లాదునే యడుగుదము. అతండు పుత్త్రార్థంబైన నసత్యము పలుకఁ డనియె. అట్లు వా రిరువురు పందెము చఱచి ప్రహ్లాదునొద్దకుఁ బోవుచుండ వారలఁ గాంచి యాప్రహ్లాదుఁడు కొడుకుం బిలిచి నిత్యవైరు లగుమీ రివుడిద్దఱుం గలసివచ్చుచున్నవారు. చెలిమిఁ జేసికొంటిరే యనియడుగ విరోచనుఁడు తమవివాదముఁ దమచఱచినపందెమునుం జెప్పి సత్యంబు పల్కు మనివివరించె. అంతఁ బ్రహ్లాదుఁడు పరిజనులం బిలిచి కాళులు గడుగ జలమును మధుపర్కార్థము గోవునుం దెం డనినియమించి యట సుధన్వుం జూచి పూజనీయుఁడైనబ్రాహ్మణోత్తముఁడవు నీవు మాయింటికి వచ్చితి వనుటయు సుధన్వుఁడు ప్రహ్లాదుం జూచి పాద్యార్ఘ్యమధుపర్కాదులు నాకుఁ దెరువునం బెక్కం ద్రోసంగిరి. బ్రాహ్మణులు శ్రేష్ఠులా? దానవుఁ డైననీకొడుకు శ్రేష్ఠుఁడాయనువివాదమున వచ్చితి. అస్మత్ప్రశ్నమున కుత్తరముఁ జెప్పు మనినం బ్రహ్లాదుఁ డిట్లనియె. బ్రాహ్మణోత్తమా, నీవు ప్రశ్నమున కుత్తరముఁ జెప్పు మనివచించెదవు. నాకుఁ

గొడు కొక్కఁడే. ఈవివాదముఁ దీర్పనే నెట్టు లోపుదు ననిన సుధన్వుఁడు మఱియు నిట్లనియె. పుత్రునిపైఁ బ్రేమగలిగినందులకుం ధనవాహనాదుల నియ్యవచ్చుఁగాని వివాదముఁ దీర్పు మని నిన్నడుగవచ్చినం దథ్యముఁ జెప్ప కూరకుండుట తగునే యనినఁ బ్రహ్లాదుఁడు సాక్ష్యమునఁ దెలిసినంత చెప్పనివాని కెట్టిచేటు గలుగుఁ జెప్పు మనియడుగ సుధన్వుఁ డతని కిట్లనియె. సవతిగలపెద్దపెండ్లాము, జూదమున నోడినవాఁడు, బరువు మోచి బడలినవాఁడు నెట్లు రేలు బెనువగంగుందుదురో యత్తెఱంగున సాక్ష్యమునఁ దప్పఁ బలికినవాఁ డధికృతులచే దండితుఁడయి కోటవాఁకిట నాఁకట సోలుచు వగలఁ బొగులుచుండు. మఱియు వానికందఱు పగవా రగుదురు. పశువిషయమునఁ జెప్పినయనృతముకులమున నేవురఁజెఱుచు. గోవిషయక మైనయనృతము పదుగురం జంపు. అశ్వవిషయక మైనయనృతము నూఱుగురం జంపు. మనుష్యవిషయక మైనయనృతమువేవురం జంపు. హిరణ్యార్థము చెప్పినయనృతము పలువురం జంపు. భూమ్యర్థముచెప్పినయనృతము సర్వమునకు హానిఁ గావించు ననిన విని ప్రహ్లాదుఁ డనృతమునకు వెఱచి కొడుకుం బిలిచి విరోచనా, నాకంటె నంగిరసుఁ డధికుఁడు, నీతల్లి కంటె సుధన్వునితల్లి యధికురాలు, నీకంటె సుధన్వుఁ డధికుఁడు. నీవు సుధన్వున కోడితివి. నీప్రాణముల కతండే ప్రభుఁ డనిచెప్పి సుధన్వుదెస మొగంబై బ్రాహ్మణోత్తమా, నీకరుణవలనఁ గ్రమ్మఱఁ గొడుకుఁ బొందఁ దలంచెద. వీనికిఁ బ్రాణదానముఁ గావింపవే యనిప్రార్థించె. అందుల కెంతయు సంతోషించి సుధన్వుఁడు ప్రహ్లాదుం జూచి యోధార్మికవరేణ్యా, నీవు కామము మాని ధర్మముఁ బూని సత్యమే పల్కుటంజేసి మిక్కిలి సంతోషం బయ్యె. నీకుఁ బుత్రు నిచ్చితి. ఇతఁడు బ్రదుకుఁగాక. వీనిబ్రదుకునకుఁ గేశినియెదుట నితండు నాకాళ్లుఁ గడుగవలయు నియ్యదిసంకేతం బనినఁ బ్రహ్లాదుఁ డట్ల యని యొడంబడియె. సుధన్వుఁడు విరోచనునకుఁ బ్రాణదానము చేసి యథేచ్ఛము చనియె. రాజేంద్రా, వింటివిగదా యితిహాసంబు. భూమ్యర్థం బనృతంబుఁ జెప్పిన నెంతయేఁ జేటు వాటిల్లుఁ గావున నీవు ననృతంబు మాని పాండవులకు వారిపాలొసంగుము. కాకున్నఁ బుత్రమిత్రామాత్యులతోడఁ జెడుదువు. దేవతలు తమరక్షింపఁ దలఁచినవారల దండముఁ జేతఁ గొని పశుపాలునిచాడ్పున రక్షింపరు. మఱి వానికి మంచిబుద్ధి నొసంగుదురు. సద్వృత్తమునందు బుద్ధి ప్రవర్తించునేని సర్వార్థములు సేకూఱు నింతయు నిక్కువంబు. సన్మార్గముఁ దప్పి మాయచే వర్తించువానిని వేదములు ఱెక్కలువచ్చినపులుఁగులు గూఁటినింబోలె నల్పకాలముననే విడుచు. మద్యపానము, పెక్కండ్రతోడిపగ, దంపతుల నెడఁబాపుట, జ్ఞాతులలో నొకళ్లొకళ్లకు విరోధముఁ గావించుట, రాజద్వేషము, స్త్రీలతోడఁ గలహామును వర్జనీయములు.

సముద్రమునం దోడబేహారము చేయువాఁడు, చోరుఁడు, జూదరి, వైద్యుఁడు, శత్రువు, మిత్రుఁడు, గాయకుఁ డను నేడుగురను సాక్ష్యమున నపకరింపరాదు. ఇల్లు గాల్చినవాఁడు, విషముఁ బెట్టినవాఁడు, కుండునియన్నముఁ దినినవాఁడు, సోమము విక్రయించినవాఁడు, కొండెముచెప్పువాఁడు, మిత్రద్రోహి, భ్రూణహత్యఁ జేసినవాఁడు, గురుతల్పగుఁడు, మద్యపానముఁ జేసినవాఁ, డతితీక్ష్ణుఁ, డతినీచుఁడు, నాస్తికుఁడు, వేదనిందకుఁ, డాత్మఘాతకుఁడు, శరణుసొచ్చినవారల రక్షింపనివాఁడును బ్రహ్మఘాతకులతోడఁ దుల్యులు. పుటమునఁ గాంచనము, వృత్తమున యోగ్యుఁడు, వ్యవహారమున సాధువు నెఱుంగఁబడుదురు. భయము పొసఁగినపుడు శూరుఁ, డర్థకృచ్ఛ్రములు మూఁడినపుడు ధీరుఁ, డాపదలలమినపుడు మిత్రులుం దెలియఁబడుదురు. ముదిమి రూపమును, దృష్ణ ధైర్యమును, మృత్యువు ప్రాణముల, నసూయ ధర్మచర్యను, క్రోధము సంపదను, దుర్జనసాంగత్యము శీలమును, గామము లజ్జను, మదము సమస్తమును హరించు. సత్కర్మాచరణమున శ్రీ యుదయించి ప్రాగల్భ్యమునఁ బెరిగి దాక్ష్యమున మూలదార్ఢ్యముఁ బొంది సంయమమున స్థిరత్వముఁ గాంచు. యజ్ఞదానాధ్యయనతపోదమసత్యార్జవానృశంస్యము లనునెనిమిది స్వర్గలోకమునకు నిదర్శనములు. మొదలిటినాలుగుం జేసినవారికిఁ గడపటినాలుగుం గలుగుచుండు. మొదలిటినాలుగును దంభార్థము పెఱవారుం జేయుదురుగాని కడపటినాలుగింటి నందఱుం బడయనేరరు. పెద్దలు లేనిసభ సభ గాదు. ధర్మముఁ జెప్పని పెద్దలు పెద్దలు గారు. సత్యము లేనిధర్మము ధర్మము గాదు. స్వభావమునఁగాక యొకనెపమునఁ బలుకుసత్యము సత్యము గాదు. సత్య, రూప, శ్రుత, విద్యా, కుల, శీల, బల, ధన, శౌర్య, చిత్రభాషణము లను పదియు స్వర్గమూలములు. పాపము చేయువాఁడు పాపాసక్తుఁడై ప్రజ్ఞావినాశమునం జేసి యెల్లపుడును బాపమే చేయుచుఁ బాపఫలములఁ గుడుచు. పుణ్యము చేయువాఁడు పుణ్యాసక్తుఁడై ప్రజ్ఞాప్రకాశమునం జేసి యెల్లపుడుం బుణ్యమే చేయుచుఁ బుణ్యఫలముఁ గుడుచు. కావునఁ బాపకృత్యముల మాని పుణ్యకృత్యముల నాచరింపవలయు. అసూయ గలవాఁ డెల్లవారలఁ జులుచులుంజూచుచు నిష్ఠురములఁ బలుకుటం జేసి యందఱికిఁ బగవాఁడై యనేకసంకటములఁ బడయు. అసూయ లేనివాఁ డందఱికలిమికి సంతోషించుచు సత్కార్యములఁ జేయుటం జేసి యందఱి కనుకూలుఁడై యనేకసుఖములఁ బడయు. ప్రాజ్ఞులఁ జేరి ప్రజ్ఞకు వృద్ధి యగు తెఱంగుగా వర్తించువాఁడే పండితుఁడు. అతండు ధర్మార్థముల సాధించి సుఖముండఁ గలఁడు. రాత్రి సుఖింపఁగఁ బగలు యత్నము చేయవలయు వర్షకాలము నాలుగునెలలు సుఖముండఁగఁ దక్కటియెనిమిదినెలలు ప్రయత్నము సలుపవలయు. ముదిమి వచ్చినపుడు సుఖింపఁగఁ బూర్వవయస్సునం దే తగుజత

నము గావింపవలయు. పరలోకమునందు సుఖించుటకై యీలోకమునందుఁ బ్రదికియుండునందాఁక సుప్రయత్నము నొనరింపవలయు. అతిగినపిదప నన్నము ను, వయస్సు చెల్లినపదపడి భార్యను, బోసులం గెలిచినపదంపడి శూరుని, దుది ముట్ట నెఱవేర్చినపిమ్మటఁ దపస్విని బ్రశంసింపఁ దగు. అధర్మమున నార్జించిన ధనమునం దనఛిద్రముఁ గప్పినను నది యావృతంబుగాకుండుటయ కాక మఱి యుం బెక్కులు ఛిద్రములు గలుగుచుండు. కావున నధర్మార్జితవిత్తమునం గార్య ము సిద్ధింప దని నమ్మవలయు. ఎఱుక గలధీరులను గురువు శాసించు. తెలివిలేని మూఢులను రాజు దండించు. ప్రకాశము గాకుండఁ దమలో డాఁచికొని రహస్య ముగఁ బాపము చేయువారల యముఁడు శిక్షించుఁ గావున మనము రహస్యము గఁ జేసినపాప మెవ్వ రెఱుంగఁగల రనుతలంపుతోఁ బాపములఁ జేయరాదు. ఋషిమూలము, నదీమూలము, మహాత్ములకులముమూలము, స్త్రీలదుశ్చారిత్రము మూలమును విచారించుట తగదు. బ్రాహ్మణపూజాతత్పరుఁ డుదారుఁడు జ్ఞాతుల యెడ మిథ్యాప్రవర్తనములేనివాఁడు సాధుశీలుఁడు నగుక్షత్రియుండు పెద్దకాల ము రాజ్య మేలఁజాలును. శూరుఁడు, పండితుఁడు, సేవింపనేర్చినవాఁడు నను మువ్వురు పుడమిం గాంచనము సాధింపఁ గలరు. బుద్ధికౌశలమున నీతిస్ఫురణము నెఱింగి చేయుకార్యములు త్తమములు. శౌర్యమున యుద్ధముచే సాధింతుమని పూనికితోఁ జేయుకార్యములు మధ్యమములు. బరువులు మోచుట నడుచుట మొదలగుశరీరశ్రమముల సాధించుకార్యము లధమములు. ఉత్తమమయిన నీతిమార్గము విడిచి మధ్యమ మగుయుద్ధపద్ధతిం గార్యము సాధింతుమని నీకువానిం బూనరాదు. మఱియు నీవు మూఢు లయిన దుర్యోధనదుశ్శాసనశ కునికర్ణులయందు రాజ్యభారంబు వెట్టియుండెదవు. దాన నీకు మేలు గలుగునే? సర్వసుగుణవిలసితు లయినపాండవులు నీయెడఁ బితృభక్తి నుంచియున్నవారు. ఇంకనైన నీవును వారిపైఁ బుత్రవాత్సల్య ముంచి యందఱు నెక్కటియై సుఖ మున మనునట్టితెఱంగుఁ గావింపుము. తొల్లి యాత్రేయుండనుమునికిని సాధ్యు లకు నెక్కనిమిత్తమున సంవాదం బయ్యె. ఆయితిహాస మిందుల కుదాహరణం బయ్యెడి. దానిం జెప్పెద నాకర్ణింపుము. తొల్లి యొక్కనాఁ డాత్రేయుఁ డను ముని హంసరూపముతోఁ జరించుచుండ సాధ్యు లతని డాయం జని యోమహా త్మా, నీ వెవ్వఁడవొగాని నిర్దేశింపరాదు. భవదీయతేజమును జూడ సమస్తశా స్త్రముల నేర్చినమహామతిగా నోపుదు వని యూహ వొడమెడి. ధర్మసంయు తం బయినప్రౌఢవచనముల నెఱింగింపు మనియడుగ నమ్ముని సాధ్యుల కిట్లనియె. ధైర్యముతో హృదయగ్రంథి నవనయించి శాంతియు దాంతియు సత్యధర్మము లును గొని ప్రియాప్రియములు మున్నగుద్వంద్వములం బరిత్యజించి లోకమం

తయు నాత్మసమంబ యని భావింపవలయు. తన్నెవ్వరైనందిట్టిరేనియు బదులు తిట్టక సైరణఁ గొనవలయు. అట్లయిన శాంతునికోప మాక్రోశించువానిం జెఱిచి వానిసుకృతము శాంతిఁ గొన్నవాని కొసఁగు. మనుజులమనస్సులు నొచ్చునట్లు చెడఁ దిట్టువాఁడు వేగమ ధనవంతుఁడైనను దరిద్రుఁడయగు. అన్నిచేటులు వానికిఁ గలుగుచుండు. ఆక్రోశవచనములు వాఁడితూపులట్ల హృదయమునందు నాటుకొని మర్మములు భేదించుచుండుఁ గావున నెవ్వరినైనందిట్టకుండుట లగ్గు. లాఁతుల నవమానింపరాదు. మిత్రద్రోహముఁ జేయరాదు. నీచులఁ గొలువరాదు. మదింపరాదు. తనకుఁ దగనినీచవృత్తిని గ్రహింపరాదు. రంజకద్రవ్యసంయోగమున నూతనవస్త్రమునకుఁ జాయ గలుగుచందమునఁ దమపూనికి మెయి సాధుసహవాసము చేసిన సద్గుణములు దుర్జనసహవాసము చేసినదుర్గుణములును జనులకుఁ బట్టువడుఁ గావున దుర్జనసాంగత్యముఁ బరిహరించి సాధుసాంగత్యంబ చేయవలయు. పెక్కుమాటలు ప్రేలక తన కెంతయపకారముఁజేసినను బ్రత్యపకారముఁ జేయక యోర్చినవానికి దేవతలు మేలు గావింతురు. వట్టిమాటలు పలుకుటకంటె నూరకుండుట మేలు. మాటలాడునేని సత్యము పలుకవలయు. సత్యమును బ్రియ మగునేని యుదాహరింపవలయు. ప్రియమునుధర్మవిరుద్ధము గాదేని నిరూపింపవలయు. ఏయేవిషయముల నివృత్తి పొడమునో తత్తద్విషయముల విముక్తుండగు. విముక్తుడు దుఃఖము లెఱుంగక సుఖముఁ బడయఁదగుఁగావున విముక్తికై యత్నమునొనరింపవలయు. అట్టివాఁడు లాఁతుల గెలువఁబూనఁడు. తా నోడఁడు. పగఁ జేసికొనఁడు. ప్రతిఘాత మొనరింపఁడు. నిందకుఁ గ్రుక్కఁడు. పొగడిక కుబ్బఁడు. లోకమెల్ల లెస్స యుండవలయు ననియే తలఁచియొకనిచేటు నైనంగోరక సత్యమృదువచనములఁ బలుకుచు శాంతియే యుత్తమం బని భావించువాఁ డుత్తముఁడు నాఁబడు. వ్యర్థసాంత్వనముఁ జేయక యిత్తు నని నదాని నిచ్చుచుఁ బరరంధ్రముల వెదకువాఁడు మధ్యము డనంబడు. ఒకశాసనమునకు నిలువక యుపకారులకు నపకారముఁ జేయుచు లోకాపవాదభాజనంబై యెవ్వనితోడను జెలిమినమ్మికతోడఁ జేయక తనకుఁ గూర్చుచెలికాండ్రను నిరాకరించుచు నితరులకలిమి కసూయపడుచు దుష్పథమునం బ్రవర్తించువాఁ డధముఁ డనంబడు. ఎల్లపుడు నుత్తములనే సేవింపవలయు. కారణ మెద్దియైనం బొసఁగనేని మధ్యములను సేవింపవలయు. అధముల నెట్టిసంకటసమయములందైనను సేవింపరాదు. అధముల సేవించినఁ జేటు గలుగుఁగాని మేలు గలుగనేరదు. అధముఁడొకవేళ బలమున నెట్లో యించుకప్రజ్ఞాపౌరుషము లొడఁగూడివచ్చెనేని ధనముఁ బడయుఁగాని ప్రశంసను మహాకులవృత్తమునుం బొందనేరఁ డని యాత్రేయుఁడు సాధ్యులకుఁ దెలిపె ననిన విని ధృతరాష్ట్రుఁడు విదురుం బిలిచి దేవతలు ధర్మార్థ

నిరతులు బహుశ్రుతులు నగుపెద్దలును మహాకులములం బ్రశంసింతురుగదా. అవి యెట్టివి తెలియం జెప్పు మనియడుగుటయు నతం డతని కిట్లనియె.

తపస్సు, దమము, బ్రహ్మచర్యము, న్యాయార్జితధనము సత్పాత్రంబులం దర్పించుట, యజ్ఞముల నాచరించుట, విధ్యుక్తక్రమంబునం బెండ్లియగుట, నిరతాన్నదాన మనునేడుగుణములు గలిగి యనృతము మాని ప్రసన్నచిత్తముతోం బూర్వాచారమునకు విరోధము గాకుండ ధర్మము నడుపుచుం గీర్తి సంపాదించువా రుత్తములు. వారికులములు మహాకులము లనం బొగడ్తం గాంచు. యజ్ఞముల నాచరింపమి, విధివిరుద్ధముగం బెండ్లియగుట, వేదనింద, ధర్మపరిత్యాగము, దేవద్రవ్యముం జెఱుచుట, బ్రహ్మస్వాపహరణము, బ్రాహ్మణాపచారము, లోకమునం దూఱువడుట, యిల్లడవెట్టినసొమ్ముల నాంచికొనుట మున్నగుదుర్గుణములచేం గులభ్రష్టు లగుదురు. గోవులు పశువులు ధనము ధాన్యముమొదలగునవి యెన్ని యున్నను గులోచితసాధువృత్తము లేదేని వారికులములు కులము లనం బడవు. వృత్తము సురక్షితంబై యుండునేని ధనము లేకుండినను దత్కులములుత్తమకులములునాం బేరు గాంచు. విత్తరక్షణముకంటె వృత్తరక్షణం బవశ్యకర్తవ్యంబు. మనకులమునందు వైరముం గావించుమంత్రియుం, బరస్వాపహారియు, మిత్రద్రోహియు, వంచకుండు, నసత్యవాదియుం, బితృదేవతాతిథులకు భాగించిపెట్టక భుజించువాండును, బ్రహ్మఘాతకుండును, బ్రాహ్మణద్వేషియును లేకుండవలయు నని నేం గోరుచుండెద. వారితోడం జేరిననుం జేటు వచ్చు. సత్పురుషులు తమయిండ్లకు వచ్చినవారలం బాద్యాదివిధులం బూజించి యుచితాసనమునం గూర్చుండంబెట్టి సూనృతవచనములం బలుకుదురు. అట్లు వర్తించినవానికి సర్వజనులును సుప్రీతులై యుండుదు రని వేఱ చెప్ప నేల? సూక్ష్మంబై యుండియు వంజుళవృక్షం బత్యంతభారము మోచుమాడ్కి సత్కులప్రసూతు లగునుత్తము లెంత పనులనైనం జేయంగలరు. ప్రియముం బలుకకుండినం గోపము వచ్చునని వెఱవక హితము బోధించువాండే మిత్రుండు. అట్టివానిం దండ్రి కినవచ్చువానింగ భావించి నమ్మవలయు. తక్కటివారు కేవలపరిచితు లగుదురుగాని మిత్రు లనంబడరు. ఉపకారాదిసంబంధ మెద్దియు లేకుండినను హితమే బోధించుచు మైత్రి నెఱపునజ్ఞుండే బంధువు. అతండే గతి. పరాయణం బని యెన్నవలయు. చిత్త మొకతెఱంగునం దిరముగాక పైపైం బర్వుచుండ నవశుండై పెద్దల సేవింపనివాండు మిత్రసంగ్రహముం జేసికొనం జాలండు. హంసలు నీళు లింకినసరస్సునుంబోలెం జంచలచిత్తుండై యింద్రియార్థవశుండైనవాని సమస్తార్థములు విడిచిపోవు. కారణములేకయే కోపము ననుగ్రహమునుం జేయుట యసాధుజనులకుసహజంబు. కావున వారి నెవ్వరుం గణింపరు. తన కుపకారముం జేసి సత్కరించినవానికిం

గీడు చేయుపాపాత్ముని బీనుఁగునైనం గుక్కలును ముట్టక తొలఁగిపోవుచుండుఁ
గావునఁ బూర్వోపకార మెఱిఁగియుండి తదనుగుణముగ వర్తింపవలయు. కాకున్న
నతండు రెండులోకములందుఁ జెడుట నిక్కంబు. ధన మున్నను బేదఱికము వచ్చి
నను మిత్రుల గారవింపవలయుఁగాని యుపేక్షింపరాదు. నీకు మిత్రులు విధేయు
లునైనపాండురాజపుత్రులకు నీవు కీడు సేయఁ దలంపరాదు. ఉచితవిధము నాలో
చించి సంధి పొసఁగునట్లు చూడవలయుఁగాని యూరక చింతించినం బ్రయోజనం
బొక్కటియుం గన్పట్టదు. చింతచే రూపము సెడు. బల ముడుగు. జ్ఞానము తఱుఁ
గు. తెవులు వొడము. శరీరము తల్లడిల్లు. పగవారు సంతసింతురు. కావునఁ జింత
మాని యుచితం బాలోచింపుము. జననమరణములు, వృద్ధిక్షయములు, దాన
యాచనములు, నిందాస్తుతులు, సుఖదుఃఖములు, ఖేదమోదములు, లాభాలాభ
ములు, ప్రియాప్రియములుం గాలవశమున దేహికిఁ గలుగుచుండు. ధీరుఁ డందు
లకు ఖేదమోదములం బొరయక నిర్వికారుఁడై యుండుఁ గావున నీవు నిపుడా
చింతల మాని యుచితంబు నడపి సుఖించుట లెస్సగాని యెద్దియుంజేయక కేవల
చింతాతత్పరుండై యుండుట నాకుంజూడ నెంతయుఁ బోలనిపని. సుఖదుఃఖములు
పొసఁగినప్పుడు జితేంద్రియుఁడుగాక తత్తదింద్రియవశుఁడై యుండెనేని వానిబుద్ధి
బొక్కవడినకుండనుండి జలము స్రవించుచందంబున నెడలిపోవు ననిన విని ధృత
రాష్ట్రుఁడు విదురుం జూచి యోమహామతీ, కేవలశాంతిపరుఁడైనధర్మరాజునకు
నే నెన్నియేని మిథ్యోపచారములఁ గావించితి. అవి యన్నియుం దలంచిన నిక్కం
బవారిచే నాకొడుకులు హతు లగుదు రనితోఁచెడి. నామనం బెప్పుడు నెద్దియుం
దోఁపమి నుద్వేగంబునఁ దల్లడిల్లుచున్నది. ఈయుద్వేగంబుఁ దొలఁగి సుఖమున
మనునట్టితెఱం గెద్దియేనియుం గలదేని దానిఁ దేటపఱుపు మనిన విదురుఁడు వెం
డియు నతని కిట్లనియె.

మహారాజా, విద్య, తప, మింద్రియనిగ్రహము, లోభత్యాగ మనునా
ల్గింటికంటె నొండొక్కదానివలనం జిత్తశాంతి గలుగు నని నాకుఁ దోఁపదు.
బుద్ధిచే భయ మడంచికొనవలయు. తపస్సున మహత్త్వముఁ బొందనగు. గురు
శుశ్రూషచే జ్ఞానము వొడము. యోగముచే శాంతిగలుగు. అన్నింటికంటె
శాంతియే యుత్తమంబు. దానములు చేయనివారును వేదములఁ జదువనివారును
రాగద్వేషములు విడిచి శాంతిఁ గొనియుండుదు రేని కైవల్యప్రాప్తు లగుదురు.
వేదాధ్యయనమును, సంగ్రామమును, సుకృతమును, దపస్సును జేసినక్షత్రి
యుఁడు తుది శాంతిఁ బొందియే సుఖింపవలయు. శాంతిఁ బొందక చిత్తభేదము
నఁ దల్లడిల్లువారు మృదుశయనములఁ బరుండియు నుత్తమస్త్రీలతోడఁ గూడియు
వందిమాగధస్తుతిరవముల వినుచుండియు గౌరవమును సుఖమును గాంచలేరు.

ధర్మమును సాధింపలేరు· శాంతిఁ బడయనేరరు. అట్టివారల కెన్నిహితములు బోధించినను రుచింపవు. వారు తుదిఁ జెడుదురుగాని మేలు గాంచఁ జాలరు. గోవులయందు సంపదయు, బ్రాహ్మణులయందుఁ దపస్సును, స్త్రీలయందుఁ జాంచల్యంబు, జ్ఞాతులవలన భయమును సంభావించిచూడవలయు. అయతసూక్ష్మతంతువులునుం బెక్కు లొక్కటిగఁగూడెనేని యేండ్లుపూండ్లు మిక్కిలి ఘర్షణమునోర్వఁ జాలుచందమున సాధువులు పెక్కండ్రు గూడిరేని యెంతటిపనులనైన నోర్చి చేయఁగలరు. కొఱవులు కలియక వేఱువేఱుగ నుండినం బొగరాఁజువిధమునను గలిసియుండిన మండుతెఱంగునను జ్ఞాతులు నొకళ్లొకళ్లతోఁ గలియకుండినం బ్రకాశింపనేరరు. కలిసిన మిక్కిలి ప్రకాశింతురు. బ్రాహ్మణస్త్రీజ్ఞాతిగోవులలో శౌర్యముగలవారు వృంతమునుండి పక్వఫలంబుచాడ్పునఁ బతన మొందుదురు. ఒంటి నున్నద్రుమ మెంతబలవంతమైనను బెనుగాలికిఁ దూలి విఱిగిపడు. అవియే బహుళములై యుండునేని యన్యోన్యసంశ్రయమునం జేసి చలన మొందవు. అట్లే అంగుననే జ్ఞాతు లందఱుం దమలో భేదముఁ దలంపక కలసియుండుదు రేని కొలనం గలువలచందమునఁ బరస్పరాశ్రయమున నానాఁటం గీడు వొరయక పెరుగుచుండుదురు. మఱియు బ్రాహ్మణులను, గోవులను, జ్ఞాతులను, శిశువులను, స్త్రీలను, దన కన్నముఁ బెట్టి పెంచినవారలను, శరణాగతులనుం జంపరా దని పెద్దలు చెప్పుదురు. ధనవంతు నందఱు సత్కరింతురు. ధనమునకుఁ గడచినమేలిగుణము మఱియెద్దియును మనుష్యులయెడం గన్పట్టదు. కావునధనములేనివారలని పాండవుల నిరాకరింపరాదు. లోభరోగమునం దవులక క్రోధము డిగ్గఁద్రావుము. రోగపీడితులు మృతకల్పు లనంబడుదురు. రోగపీడితులు ఫలముల నాదరింపరు. విషయతత్త్వము నెఱుంగనేరరు. సౌఖ్యముఁ గాంచజాలరు. నామాట విని నీ వపుడే జూదము వారించిన నింత రాదుగదా. పెద్దలు జూదము తగ దండ్రు. మృదుచిత్తులతో విరోధించుట బలముగాదు. పాండవులు మృదుచిత్తులని నేఁ జెప్పనేల? నీవ యెఱుంగుదువు. అట్లు సంపదను సంపాదించిన నది తుది మేలు చేయదు. ధర్మసూక్ష్మము లెస్స యెఱింగి యుచితపునడవడి నడువవలయు. అంతయుఁ బరిశీలించి పాండవులుధార్తరాష్ట్రులు నొక్కటియై కూడి సుఖముండునట్లుగాఁ దగినతెఱఁగు చింతింపుము. కురుకులక్షేమము భవదధీనమై యున్నది. మేధిస్తంభమట్లు నీవు కురుకులమునకు మూలం బవు. వీరు వారు నొక్కటియై శత్రువుల కెడ గలుగకుండ విలసిల్లుచుండిన నెంత యొప్పునోగదా. కావున వనవాసాయాసకర్శితులైనపాండవులం గరుణ పెంపార నాదరించి కులమును యశమును రక్షింపుము. సంధిఁ గావించునెడఁ బాండవుల కంత చెప్పవలసియుండదు. వారు సత్యధర్మనిరతులు గావునఁ దామె యెఱుంగుదురు. దుర్యోధను

నకు లెస్సగ బుద్ధి సెప్పుము. తనకొంఁదిరి తా నెఱుఁగక యేకార్యమైనం బూన రాదు. అశిష్యుని శాసించువాఁడు, దాని కుబ్బువాఁడు, పగవాని మిక్కిలి గొలుచువాఁడు, స్త్రీరక్షణమే ముఖ్యకృత్య మనిభావించువాఁ, డదియే మే లని యెంచి తత్సుఖమునం దేలువాఁడు, యాచింపఁ దగనివానిని యాచించువాఁ, డాఘన కార్యమున కాత్మశ్లాఘఁ గావించికొనువాఁడు, మహాకులమునఁ బుట్టియు నకార్యములఁ జేయువాఁడు, బలము దనకు లేకున్నను బలవంతులతోడ నిత్యవైర మొనరించువాఁడు, శ్రద్ధలేనివానికిఁ జెప్పువాఁడు, కామింపఁ దగనిదానిం గామించువాఁడు, భయమానముల విడిచి కోడలితో మేలమాడుమామ, పరక్షేత్రమునందు బీజావాపము సలుపువాఁడు, స్త్రీల మిక్కిలి పరివదించువాఁడు, లాఁతివారు చేసినమేలు తలఁపనివాఁడు, యాచించిన నిచ్చి పొగడికొనువాఁ, డసజ్జనునకు సద్గుణములఁ గలుపఁ బూనువాఁడు ననుపదునేడుగురు నెగసి పిడికిట నాకాశముఁ దన్నువారనియుఁ బట్టరానిసూర్యకిరణములఁ జేతఁ బట్టువారనియు స్వాయంభువుం డైనమనువు వంపరానివిల్లు వంపఁ బూనినదానవేంద్రునకుఁ దెలిపె నని వినంబడు. వీ రందఱు నధోగతు లగుదురుగాని మేలు వడయనేరరు. ఏమనుజు లెట్టులెట్టులు నడతురో వారివారినడతలకుఁ దగినరీతిని నడువవలయు. మాయాచారుని మాయచే వశీకరించుకొనవలయు. సాధుచర్యుని సత్కృత్యములఁ గొలువవలయుఁ గావున నేరీతినైన దుర్యోధను నెడంబఱిచి మేలగురీతి నాలోచింపుము. ముదిమి రూపమును, దృష్ణ ధైర్యమును, మృత్యువు ప్రాణముల, నసూయ ధర్మచర్యను, గామము సిగ్గును, దుష్టసాంగత్యము శీలమును, క్రోధము సంపదను, దురభిమానము సమస్తమును హరించు నని యింతకుమున్న చెప్పితిం గదా. ఇఁకఁ బెక్కుమాటలఁ జెప్ప నేల యని విదురుండు చెప్పిన విని ధృతరాష్ట్రుఁ డతనిం జూచి యోసుధీవర్యా, పురుషుఁడు శతసంవత్సరాయు వని వేదములం జెప్పఁబడు. జనులు కొందఱు దానిం బొందలేరు. అందులకుఁ గతం బెయ్యది యనియడుగ విదురుఁ డతని కిట్లనియె. అతిమాన, మతివాదము, సత్పాత్రదానముఁ జేయమి, క్రోధము, హితులతోడ నాలోచింపక తనకుఁ దానకార్యములఁ జేయఁ బూనుట, మిత్రద్రోహ మనునాఱును నిశితఖడ్గములై మనుజులయాయువు హరించు. మృత్యు వనునది వేఱుకాదు. నీవు వీనిం దవులకు. మేలయ్యెడుమని చెప్పి మఱియు నిట్లనియె.

నమ్మినవానిభార్యను బొందువాఁడు, గురుతల్పగుఁడు, వృషలీపతి యగు ద్విజుఁడు, మద్యపానముఁ జేయువాఁడు, బ్రాహ్మణులవృత్తుల హరించువాఁడు, బ్రాహ్మణుల ననుచితకృత్యములందు నియోగించువాఁడు, శరణాగతులఁ బ్రోవనివాఁడునుం బ్రహ్మహత్యఁ జేసినవానికి సమానులు. వీ రందఱకుఁ బ్రాయశ్చిత్త

విధానము తుల్యమైయుండు. హితులగు పెద్దలవాక్యముల నాదరణతో గ్రహించి నీతి యెఱింగి యుక్తాయుక్తములఁ బరికించి న్యాయార్జితంబైనవిత్తమున దేవతాతిథిభృత్యులకుఁ దృప్తిఁ గావించి తచ్ఛేష ముపయోగించుచు సత్యము పలుకుచుఁ గృతజ్ఞుఁడై పొసఁగినకీడుల నేర్పునఁ దొలఁగించుకొనుచు మృదుచిత్తుఁడై యుండువాఁడు స్వర్గలోకసౌఖ్యముఁ గాంచు. నీ వది పరికింపవైతివి. లోకమున నిచ్చకములు పలుకువారు పెక్కండ్రు గలరుగాని యప్రియంబైనను హితమగు దానిం జెప్పువారు దుర్లభులు. దాని వినువారుం గడుదుర్లభులే. చెవికిఁ జేదగుదానిం బలికిన రాజు కినియు నని వెఱవక ధర్మబుద్ధితో హితములే తెలుపువాఁడు గలిగెనేని యారాజు వానిసహాయమున సుఖించు. ఏను దొలుతనే జూద మాడునపుడు జూద మత్యంతనిందితంబు దానం జేటు వాటిల్లకమానదు. పూర్వకల్పంబునందును దానం బెక్కండ్రు సెడిరి. పరిహాసార్థమైనను జూదమాడరాదు. అవశ్యము దాని నివారింపవలయు నని యెంత యొత్తిచెప్పినను నావచనమెల్ల రోగికిఁ బథ్యౌషధముమాడ్కి నీకు రుచింపదయ్యె. అది యపుడు వినియుండిన నిపు డింత చింతింపవలసియుండదుగదా. మఱియుఁ గులమున కొకనివలనఁ జేటు వాటిల్లునెడ వానిని, గ్రామమున కొకకులమువలనఁ గీడు మూఁడునెడ నాకులమును, దేశమున కొకగ్రామమువలన ననర్థము వచ్చునెడ నాగ్రామమును, బుడమికిఁ దనవలన దోసఁగులు పొసఁగునెడఁ దాను భూమిని బరిత్యజింపవలయు నని యుం బెద్దలు సెప్పుదురు. కావున నీవును వేఱు దలంపక కులకంటకుఁడై నదుర్యోధనుం ద్యజించి కులము రక్షించికొనుము. కాకములఁ గొని మయూరముల ద్యజించుచందమునను, నక్కల గ్రహించి సింహముల విడుచు తెఱంగునను, దుర్యోధనాదుల గ్రహించి పాండవులఁ ద్యజించితివి. ఇపుడు చేటుకాల మాసన్నమైనం జింతించెదవు. హితముఁ గోరుచు భక్తిమై నుండుభృత్యునియెడం గినుక తగదు. మఱి ప్రీతి నెఱపవలయు. అట్లు వర్తించిన నాభృత్యు లారాజులను నమ్మి యాపత్సమయములందునుం ద్యజింపరు. అట్టిభృత్యులవృత్తుల హరింపరాదు. హితభృత్యవృత్తినిరోధమున రాజ్యధనములు లభించు ననితలంపరాదు. న్యాయము దప్పక వర్తించువారలు వృథావంచితులైనం బగ పాటింతురు. హితమంత్రులచిత్తములకు మెప్పుచేయవలయు నని చెప్పనేల? కావునఁ బూర్వకృతోపకారములఁ బరిశీలించి యాయవ్యయముల నెఱింగి యాయముకంటె వ్యయ మధికము గానివిధముగా నయ్యైవారికిఁ దగురీతి వృత్తులఁ గల్పించి యోగ్యు లగుసహాయజనులను సంగ్రహింపవలయు. దుష్కరకార్యములును సహాయబలమున సులభములే యగు. ఏలినాతనియభిప్రాయ మెఱిఁగి యేమఱిక యెల్లపనులం జేయుచుఁ దఱితో హితము బోధించుచు ననురక్తుండై యుండునార్యుని రాజు వా

నిశక్తిఁగొలంది యెఱింగి కరుణ పొంపిరివోవ నాదరింపవలయు. రాజు నియోగించి చెప్పినను దద్వచనం బాదరింపక ప్రజ్ఞాభిమానమున నన్నింటికిం బెడవాయునట్టి భృత్యుం దత్క్షణంబ పరిహరింపవలయు. అస్తబ్ధత్వ, మక్లీబత్వ, మదీర్ఘసూత్రత్వ ము, కారుణ్యము, స్నిగ్ధత్వము, పరులకు లోఁబడమి, యారోగ్యబహుళత్వ ముదారవచనము ననుగుణము లెనిమిది గలవాని భృత్యుఁగా గ్రహింపవలయు. ఎఱుకగలవాఁ డెవ్వఁడేనియుఁ దటాలున నమ్మికచే నకాలమునఁ బరగృహముఁ జొరరాదు. రచ్చపట్టులందు శేలోక్కుఁడుగా మఱుఁగుపడియుండరాదు. రాజకా ర్య యగునాతిం గామింపరాదు. మంతనముండునెడ నతని కపలాపముఁ జేయ రాదు. వంచనచే మంతనపుఁదఱిఁ గలిసినవానికి నమ్మికమాటల బలుకరాదు. మఱి సకారణంబుగా నెద్దియే నొకవ్యపదేశము చేయవలయు. జుగుప్సాకరుణా వంతుఁ డగురాజును, స్వైరవృత్తి వర్తించుభృత్యుఁడును, భ్రాతృరహితుఁ డైన పుత్రుఁడును, బాలపుత్ర యగువిధవయు, నుద్ధతైశ్వర్యుఁ డైనసేనాజీవియు వ్య వహారమునందు వర్జనీయులు. కుల, ప్రజ్ఞా, శ్రుత, దమ, సముచితసమయప రాక్రమ, మితభాషణ, యథాశక్తిదాన, కృతజ్ఞత్వము లనునెనిమిదిగుణములు పురుషునకుఁ దేజముఁ గావించు నని మున్న చెప్పితిం గదా. సకలజనులం జల్లని చూడ్కిఁ జూచి సత్కరించి చూచువాని కివియన్నియుఁ జేకూఱును. చిత్తశుద్ధి గలవానికి బల, రూప, స్వర, వర్ణశుద్ధి, స్పర్శ, గంధ, శుద్ధి, శ్రీ, సౌకుమార్య, నారీవరణము లనుపదిగుణములుం గలిగియుండు. మితభోజి యగువాని కారో, గ్యాయుర్వృద్ధి బల సుఖావ్యాకులత్వ సంతానలాభము లనునాఱు నొప్పుచుం డు. కార్యాంతరము లేక కడుపుఁ బ్రోచికొనువాఁ డనుపేరు వానికిఁ గలుగదు. పనిఁ జేయనివానిని, దిండిపోతును, లోకద్వేషిని, బహుమాయలఁ బన్నువానిని, క్రూరుని, దేశకాలము లెఱుంగనివాని, ననిష్టవేషుని నింట నుంచరాదు. ఆక్రో శకుని, కృపణుని, శాస్త్రములఁ జదువనివానిని, వనవాసనిరతుని, ధూర్తుని, నమాన్యమానిని, నిష్ఠురుని, దృఢవైరునిఁ, గృతఘ్నుని నొకప్పుడైన నెంతయా పద గలిగినను యాచింపరాదు. అత్యంతక్లేశమున నల్పకార్యము లొనర్పఁ దొడ రువాఁ, డతిప్రమాదశీలుఁడు, బొంకులనే పలుకువాఁడు, దృఢ మగుభక్తిలేని వాఁడు, త్యక్తానురాగుఁడు, ప్రభుమాని యనునీయాఱుగురు నరాధము లనంబ డుదురు. వారల సేవింపరాదు. సహాయమున నర్థము నర్థమున సహాయముం గ లుగుఁ గావున నర్థసహాయములు పరస్పరాశ్రయమునం గాని సిద్ధింప నేరవు. కాన నవి చేకూఱువిధ మాలోచించి వర్తింపవలయు. ధర్మశీలుఁ డైనపురుషుఁడు శా స్త్రోక్తవిధిం బెండ్లియై కొడుకులఁ గని వారి కప్పు లేకుండ నుచితజీవికం గావించి కూఁతులఁ దగినయల్లురకొసంగి యట వైరాగ్యఘనుండై వనముల వసించుచు

మునివృత్తిని గ్రహించి యీశ్వరార్పణబుద్ధితో సర్వభూతములకు నాత్మకు హిత మగుదానిం జేయవలయు. బుద్ధి, ప్రభావము, తేజస్సు, సత్వము, పౌరుషము, వ్యవసాయము గలుగువానికి జీవనభయము గలుగనేరదు. పాండవులతోడిపగ వలనం గలుగుదోషముల నీవ కొంత యాలోచింపుము. అత్యంతవిధేయభక్తులయినవారితోడిపగ యనునది యొక్కటియే చాలు. ఎల్లకాలము మీఁద నెట్లగునో యనువెఱపు, కీర్తిహాని, శత్రువులకు సంతోషముమున్నగా నగుదోషములు గలిగె. ఇంద్రాదులును వారితోడిపగ యన వెఱతురు. భీష్మద్రోణయుధిష్ఠిరులకోపము నీకోపమును ధూమకేతువుమాడ్కి లోకమునకుఁ జేటుఁ దెచ్చు. కావున మీ కెవ్వరికిని గోపము పొడమకుండునట్లుగా నీకొడుకులు నూఱుగురు పాండవు లేవురు కర్ణుఁడుం గూడి మనునట్లుగాఁ దెఱంగు చేయుట లగ్గు. ధార్తరాష్ట్రులు వనము. పాండవులు సింహవ్యాఘ్రములు. వనమును విడిచినసింహవ్యాఘ్రములు సింహవ్యాఘ్రములు లేనివనమును సుఖవృత్తి నుండఁజాలమి సిద్ధము. మఱి పరస్పరాశ్రయముననే మేలు గాంచు. మఱియు ధార్తరాష్ట్రులు తీఁగలవంటివారు. పాండవులు మ్రాఁకులఁబోలినవారు. మ్రాఁకులఁ బ్రాఁకక తీవె లెసఁగని చాడ్పునఁ బాండవులప్రాపు లేకున్న ధార్తరాష్ట్రులు పెంపు వడయనేరరు. గుణముల విడిచి దోషములనే యారోపించుట దుర్జనులకు సహజంబు గావున నీకొడుకులు పాండవులగుణములు గణింపక లేనిదోషములఁ గల్పింతురు. అర్థసిద్ధిం గోరునతఁడు ధర్మమునే యాచరింపవలయు అమృతము స్వర్గలోకము నెడఁబాయనివిధమున నర్థము ధర్మము నెడఁబాయదు. పాపములపొంతఁ బోవక పుణ్యమునందే మనస్సు నిలిపి ధర్మార్థకామములు మూఁడింటికిఁ బరస్పరవిరోధము పొసఁగకుండ సేవించువానికిఁ త్రివర్గము సిద్ధించు. అతండు సర్వ మెఱిఁగినవాఁడే. క్రోధహర్షములవేగ మడంచినవాఁడు సంపదలకుఁ బాత్రంబై యాపదలు పొసఁగినను మోహముఁ జెందఁడు. పురుషులకు బల మయిదుతెఱంగులం గలదు. అందు సర్వార్థముల నెఱవేర్ప ముఖ్యసాధన మగుప్రజ్ఞఁ ప్రథమబల మనఁబడు. అమాత్యలాభము ద్వితీయబలము. ధనలాభము తృతీయబలము. పితృపితామహాదిపరంపరాప్రాప్తం బయిన బలము చతుర్థంబు. అదియే యభిజాతబలము నాఁబడు. బాహుబలము పంచబలము నాఁబడు. ఇది సర్వకనిష్ఠంబు. బలస్వరూపంబెల్ల లెస్స యెఱింగి ప్రజ్ఞాబలమున సర్వకార్యములు సాధింప నుద్యోగింపవలయు. ప్రజ్ఞాశరాభిహతునకుఁ జికిత్సఁ గావింప వైద్యులకు, నౌషధములకును, హోమజపాదులకును సామర్థ్యము చాలదు. తన కపకారముఁ జేయువానితోఁ బగఁ గావించికొని దూరమున నుండియు నిఁక నా కే మని నమ్మి యుండరాదు. స్త్రీలయందును, రాజులయందును, సర్పములయందును, జదువునందును, ధనవంతులయందును, శత్రులయం

దును, భోగములయందును, నాయున్నునందును నమ్మిక చేయరాదు. సర్పము, నగ్నిని, సింహమును, గులపుత్రునిం బరిభవింపరాదు. దారువులయం దగ్ని గూఢముగ నుండియుఁ బరప్రయత్నము లేకున్న మండక త్రచ్చినం బెటిగి వనము నెల్లఁ గాల్చుచెలంగున సత్కులప్రసూతు లయినశాంతులచిత్తమున నత్యంత గూఢముగఁ దేజస్సు వెలుంగుచుండు. ఎవ్వరైనం బరిభవించిరేని యప్పు డది యుద్దీపితంబై వారల నుస్మాలంబుఁ జేయు. కావున సాధుజనుల నాదరింపవల యుఁగాని యవమానింపరాదు. మఱియు సాధువృద్ధులువచ్చునెడఁ జిఱుతవాం డ్రప్రాణములు మీఁదికి రాఁ దొడరుచుండు. ప్రత్యుత్థానాభివాదనము లొనరిం చిన నవిస్వస్థానస్థితిం బడయు. అభ్యాగతుఁ డైనసాధువునకాసన మొసఁగి కాళు లుగడిగి స్వాగత మడిగి త న్నతనికి నివేదించి యన్నముఁ బ్రీతితో నియ్యవలయు. లోభకార్పణ్యాభిభూతుఁ డైనయెవ్వనియింట నాతిథ్యమును సాధు వగునతిథి గ్ర హింపఁడో వానిజన్మము నిరర్థక మని పెద్దలు సెప్పుదురు. వైద్యుఁడు, నిరతము పరులకు నొప్పిగలిగించువాఁడు, వ్రతత్యాగి, చోరుఁడు, క్రూరుఁడు, కల్లుద్రా గువాఁడు, భ్రూణహత్యఁ జేసినవాఁడు, సేవాజీవి, వేదవిక్రయి యనువీ రతిథులై వచ్చినను బాద్యాదివిధుల సత్కరింపఁ జనదు. మఱియు లవణము, పక్వాన్నము, పెరుగు, పాలు, తేనె, నూనె, నెయ్యి, నూవులు, మాంసము, ఫలమూలములు, కూరలు, రక్తవస్త్రములు, గంధద్రవ్యములు, బెల్లమును విక్రయింపరాదు. అవి విక్రయించువాని కాతిథ్యసత్కారంబు సేయరాదు. క్రోధలోభమాత్సర్యా దుల విడిచి సమలోష్టకాంచనుఁడు తుల్యనిందాస్తుతియునై ద్వంద్వముల మాని సర్వసమచిత్తముతో నుదాసీనవృత్తి నుండునతండు భిక్షుఁ డనఁబడు. అతండు నీవారేంగుదకందమూలాదుల శరీరయాత్ర నడపుచు నతిథుల సత్కరించుచు నియ తచిత్తుండై యగ్నికార్యములందుఁ బ్రమాదము లేక పుణ్యతత్పరుండై వనముల వసించు. అట్టిమహాత్మునకుఁ జేసినయాతిథ్య మెంతయు ఫలవంత మగు. కావున సాధుజనులఁ బరికించి యప్రమాదముతో సత్కరింపవలయు. బుద్ధిమంతున కపకా రముఁ గావించి దూరమున నున్నవాఁడఁగదా యని యూఱడిల్లరాదు. బుద్ధిమం తుని బాహువు లెంతదవ్వైనను వ్యాపించు. వ్యాపించి చేటుఁ గావించు. తన్ను నమ్మనివాని నమ్మరాదు. నమ్మినవానినైనను దనరహస్యమెల్ల నతనికిఁ దెలియున ట్లుగా మిక్కిలి నమ్మరాదు. నమ్మి వర్తించిన నెంతయేఁ గీడువచ్చు. ధనముఁ దగిన వారి కుచితరీతి నిచ్చి ప్రియమధురవచనములఁ బలుకుచు నీసు మాని వర్తింపవ లయు. స్త్రీలకు విధేయుఁడై మెలఁగరాదుగాని భార్యలవర్తనము గుప్త మగురీ తిం జేయవలయు. యోగ్యవృత్తినుండునిల్లాండ్రు గృహసంపదలు గావున నేర్పుమై వారల రక్షింపవలయు. అంతఃపురవిచారణమునం దండ్రిని, వంటలవిచారణమునఁ

దల్లిని, గోవిచారణమునఁ దనకు సమానుని నియమించికృషివిచారణముఁ దాన చే యవలయు. వాణిజ్యవిచారణమున యోగ్యభృత్యుల నియోగింపవలయు. ద్విజస త్కారమునందుఁ బుత్రుల నియమింప వలయు. ద్విజోపసేవనంబు రాజుల కవ శ్యకర్తవ్యంబు. నీళులవలన నగ్నియు, బ్రాహ్మణులవలన క్షత్రియులుంబుట్టి ని జతేజంబును జగమునసెల్ల నెఱపుచుండియునిజజన్మస్థానమునందు వెలుంగఁ జేయఁ జాలరు. మఱియు మంత్రరక్షణము రాజునకు ముఖ్యము. పర్వతశిఖర మొండె, నున్నతప్రాసాదమొండెఁ, బుల్లయైనంగదలనియరణ్యమొండె మంత్ర ణమునకుఁ దగినసెలవులు. మిత్రుఁడై నను బండితుఁడు గాఁడేనియుఁ బండి తుండైనను మిత్రుఁడు గాఁడేనియు వారల మంత్రములఁ జేర్చికొనరాదు. మఱి పండితుఁడు మిత్రుఁడు నగువానితోడనే మంతన ముండఁ దగు. నిగూఢ మంత్రుఁడై నరాజునకు సర్వార్థములు సేకూఱు. అర్థలాభము మంత్రరక్షణ మును మంత్రియధీనములు గావున యోగ్యజనుని మంత్రిపదమునందు నిలు పవలయు. అప్రశస్తము లగుకార్యముల మోహమునఁ జేయువాఁడు దానఁ బ్రాణభ్రంశమునైనం బడయు. ప్రశస్తకార్యానుష్ఠానం బత్యంతసుఖావహం బు. తఱితో వాని ననుష్ఠింపకుండినం బిదపఁ బశ్చాత్తాపముఁ బొంది నవయ వలసియుండు. కావునఁ బూర్వమే యాలోచించి చేయుట లగ్గు. వేదాధ్యయన ముఁ జేయనిబ్రాహ్మణుఁడు శ్రాద్ధమునందు నిమంత్రణీయుఁడుగాని మాడ్కి * సం ధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులను షడ్గుణముల నెఱుంగనిరాజు కార్యమంత్రణమునకుఁ దగఁడు. ఆషడ్గుణముల నెఱిఁగి † స్థానవృద్ధిక్షయములఁ దెలిసి సౌశీల్యముతోవర్తించుచు సకారణముగఁ గలిగిన క్రోధహర్షములకు ఫల ముఁ జూపుచు సర్వకార్యములఁ దాన యరయుచు సెరుల నమ్మక భాండాగార ముం దాన పరిశీలించు నట్టిరాజునకుఁ భూమి స్వాధీనయైయుండు. రాజు రాజ్యల బ్ధ మంతయుఁ దానొక్కరుఁడే యనుభవింపఁ దలంపక భృత్యాదులకుం దగినరీతి నిచ్చుచుఁ దనరాజనామమునకు ఛత్రచామరాదిరాజోపచారములకు నుల్లమున నుల్లసిల్లవలయు. బ్రాహ్మణుని బ్రాహ్మణుఁడే యెఱుఁగు. భార్యను భర్త యెఱుం గు. మంత్రిని రా జెఱుంగు. రాజును రాజే యెఱుంగు. ఇతరులు తెలియఁ జాల రు. వధార్హుఁడై నశత్రుఁడు వశగతుఁ డయ్యెనేని విడిపింపరాదు. విడిపించిన

* సంధి, శత్రువులతో సంధిసేయుట. విగ్రహము, కలహించుట. యానము, దండెత్తుట. ఆ సనము, యుద్ధమునకు సమయము వేచియుండుట. ద్వైధీభావము, భేదము పుట్టించుట. సమాశ్రయ ము, బలవంతునిఁ జేపట్టుట.

† స్థానము, శత్రువుఁ దాను సామ్యముగా నుండుట. వృద్ధి, శత్రువుకంటెఁ దానెక్కుడైయుం డుట. క్షయము, శత్రువుకంటెఁ దాను దక్కువైయుండుట.

నచిరంబ చేటువచ్చు. దేవ, బ్రాహ్మణ, రాజ, వృద్ధ, బా, లాతురులయందుఁ గ్రోధ ముడుగవలయు. నిరర్థకంబుగఁ గలహముఁ బెంచికొనరాదు. అది మూఢ కృత్యంబు. దాని వర్జించినఁ గీర్తి గలుగు. అనర్థములు దొలఁగు. ఎవనిమె డనైనం గోపము ననుగ్రహముం జేయఁ దలంపు గలదేనియు నది ఫలవంత మగు నని దృఢముగఁ దోఁచునందాఁక వెలిపుచ్చరాదు. బాహిరంబై వమ్మయిన నారాజును నాతులు నపుంసకుంబోలె జనులు పరిహరింతురు. లాభాలాభంబులు దైవసహాయమునఁ గలుగుఁగాని కేవలపౌరుషమునఁ గలుగనేరవు. లోకవృత్తాంతమెల్లఁ బ్రాజ్ఞుఁ డెఱుంగుఁగాని లాఁతివా రెఱుంగనేరరు. మూఢుఁ డది యెఱుంగనేరక విద్యాశీలవయోబుద్ధిధనకులవృద్ధుల నవమానించు. అసూయాంధుఁడై యధర్మపరత్వమున దుర్వృత్తములఁ జేయునవివేకికిఁ జేటులు పైపై వచ్చుచుండు. ఉచితభాషణుఁడు, దక్షుఁడు, సమయ మెఱిఁగి దానము చేయువాఁడు, కృతజ్ఞుఁడు, మతిమంతుఁడు, ఋజుస్వభావుఁడు నగురాజును భాండాగారసమృద్ధి లేకున్నను జనులు చేరుదురు. ధైర్యము, శాంతి, దాంతి, శౌచము, కారుణ్యము, మృదువచనము, మిత్రద్రోహములేమి యనునేడు సంపదకుఁ బెంపుఁ గావించుఁ గాన వాని నవశ్యము గొనవలయు. సంపాదించినదంతయుఁ దనకడుపునకే పెట్టుకొనవలయు ననుతలంపుతోఁ బూర్వోపకారములఁ దలంపక సిగ్గు మాలి చెడున డవడి నడుచునరాధముని బరిహరింపవలయు. నిర్దోషు లగునభ్యంతరజనుల నలిగింపరాదు. అలిగించిన వాఁడు పా మున్నయింటఁ గాపుర ముండుమాడ్కి సర్వకాలము పెన్నగలచేఁ బొగులుచు రేలు కూరుకుం జెందఁ జాలఁడు. కావున నెవ్వరు గినిసినం దనయోగక్షేమములకుఁ జేటుఁ బొసఁగునో వారల దేవతలంబోలెఁ బ్రసన్నులం జేసికొనుచు మెలఁగవలయు. స్త్రీ, ప్రమత్త, పతిత, కితవ, బాల, దుర్జనులు కార్యములకుఁ దీర్పరు లగుదురేని యవి తుది ముట్టనేర వని పెద్దలు సెప్పుదురు. బాలురు కితవులు దుర్జనులు నగుదుర్యోధనదుశ్శాసనశకునికర్ణులు శాసించువారైనం గార్య మెట్లు నెఱవేఱు? అయ్యుక్తిపులమతం బనువర్తించి కార్యములఁ జేయఁ జూచువారలు పాషాణములం గట్టినతేపలు నదింబోలె నట్టనడుమ మునుఁగుదురు. విశేషములకుఁ బోక తగినప్రయోజనముల లెస్సగ నెఱవేఱు నుపాయములఁ బన్నువారే పండితులు. విశేషములకుఁ బోవువారు ప్రసంగు లనంబడుదురు. కితవులు, జారస్త్రీలు, స్తోత్రపాఠకులుం బొగడిన నామాటల నుబ్బువారు పెద్దకాలము సుఖముఁ బడయనేరరు. నీకొడుకు కితవులు త న్నుబ్బించినం దన కొలంది యెఱుంగక కొఱత నుఱుకుచుండుదురు. ధనుర్ధరశిఖామణు లయినపాండవులఁ బరిత్యజించి రాజ్యభారమంతయు దుర్యోధనునిపై నునిచితివి. ఐశ్వర్యమదమూఢుఁడై నయయ్యుక్తిపుఁడు బలి త్రివిక్రమకోపంబునంబోలెఁ బాండవకోపము

ననచిరంబ చే టొందు. నీవుం జూచెద వనిన విని ధృతరాష్ట్రుఁడు నిట్టూర్పు నిగిడించి విదురా, పురుషులు బొమ్మలమాడ్కి దైవవశతం గార్యములఁ జేయుదురు గావునఁ గానున్నది కాకమానదు. అయినను నీహితవచనమునం జిత్తశాంతిఁ బొందుదు నింకనుం జెప్పు మనుటయు విదురుఁడు ధృతరాష్ట్రునకు మఱియు నిట్లనియె.

అనుభవకాలము రాక ముందు బృహస్పతి వచ్చి చెప్పిన నది హితముగ గ్రహింపరు. మఱి యవమానింతురు. ఇచ్చుచు నిచ్చకములఁ బలుకువారలే తమకుఁ బ్రియు లని భావించుట తగదు. మంత్రమూలబలమునఁ బ్రియుఁ డెవ్వఁడో యతండే ప్రియుం డని తలంపవలయు. సాధువులకును మేధావులకును బండితులకును ద్వేషముఁ జేయరాదు. వారు ద్వేష్యులు గారు. హితవాదిత్వమునం జేసి వారలే ప్రియులు. ప్రియులయెడ శుభములను ద్వేష్యులయెడఁ బాపకృత్యములనుం జేయఁ దగు. దుర్యోధనుఁడు పుట్టినపుడే నే నప్పుడుతోఁచిన దుర్నిమిత్తములఁ బరిశీలించి వీని నొక్కనిఁ బరిత్యజించి తక్కఁగలవారల రక్షింపు మనిచెప్పితిఁ గదా. అపు డామాట విని వాని విడిచినం దక్కినవారలందఱు బ్రదుకుదురు. వాని విడువమిం జేసి యందఱు నిపుడు చెడవలసివచ్చె. బహుక్షయమూల మగువృద్ధి వృద్ధి గాదు. అత్యంతవృద్ధిమూల మగుక్షయమును క్షయము గాదు. ఇంత పరికింపవైతివి. లోకమునఁ గొందఱు గుణవృద్ధులు మఱికొందఱు ధనవృద్ధులు. అందు గుణవృద్ధులే యధికులుగాని ధనవృద్ధులు గారు. గుణహీనులైన దుర్యోధనాదులఁ బరిత్యజించుటయే లగ్గు. నీమతం బెట్టిదియో యనిన ధృతరాష్ట్రుఁ డయ్యా, నీవుత్తరకాలహానివృద్ధులం బరిశీలించి ప్రాజ్ఞులు మెచ్చునట్లు చెప్పితివి. అయినను నేను గొడుకును విడువనోపను. ధర్మ మెవ్వరిదెసం గలదో వారు జయింతు రని యుండువాఁడ ననిపలికిన విని విదురుఁడు వెండియు నిట్లనియె.

మిగుల గుణసంపన్నుఁడైనవనీతుఁ డొకప్పుడైనను భూతములకుఁ గీడు పొసఁగునేని యుపేక్షింపఁడు. పాపాత్ములు నిరతము పరులపై నపవాదములఁ గల్పించుచుఁ బరులకలిమి కసూయపడుచుఁ బరులచేటున కుబ్బుచుఁ బరస్పరభేదముఁ గావించుచుఁ గామోపహతిం జేసి సిగ్గు మాలి దుష్కర్మములం జేయుదురు. ఏమి చెప్పుదు. వారలం గన్నెత్తి చూచినంతనే యాపదలు దొడరు. ఇఁక వారిసహవాసంబునను ధనదానగ్రహణాదిసంబంధంబుననుం జేటు వచ్చు నని చెప్ప నేల? ప్రయత్నముతో వారల దూరమునఁ బరిత్యజింపవలయు. అట్టిదురాత్ములతోడఁ జెలిమి చేసిన నది చిరకాలము నిలువనేరదు. మఱి యత్యంతాల్పకాలముననే యాప్రీతియంతయుం బొలివోవు. స్నేహఫలసుఖములు పుట్టవు. చెలిమి చేసినవారికిఁ జెఱుపు చేయుచు నపవాదముల మోపఁ గడంగుట దుర్జనులకు సహజంబై

యుండు. ప్రమాదమున నుంతేనియు నపకారము గలిగెనా యట వారినడవడి చెప్పం గొలఁదిగాదు. శాంతియనుమాట యెట్టిదో వా రెఱుంగరు. లెస్సగ నాలోచించి యట్టినీచుల తోడి సంసర్గ మతిప్రయత్నమునైనం బరిత్యజింపవలయు. కావున నీచు లగుదుర్యోధనాదులం జేర్పకుము. మఱియు నాతురుఁడు దరిద్రుఁడు దీనుఁడు నగుజ్ఞాతి ననుగ్రహించినఁ బుత్రపౌత్రాద్యభివృద్ధి గలుగు నని పెద్దలు వచింతురు. తనమేలును గులవృద్ధినిం గోరువానికి జ్ఞాతిరక్షణంబు కర్తవ్యంబు. జ్ఞాతులు గుణవంతులు గాకున్నను రక్షణీయులు. ఇఁక గుణవంతులై నీయనుగ్రహంబుఁ గోరినపాండురాజపుత్రుల రక్షింపవలయు నని చెప్పవలయునే? కావున వారిజీవనంబుకొఱకుఁ గొన్నియల్పగ్రామములనైన నిమ్ము. అందఱకుం బెద్ద యగునీవు వారలు వీరలుం గూడి బ్రదుకునట్లుగాఁ గార్యముఁ దీర్పుము. సంధి చేసితివేని లోకమున నీకీర్తి యెంతయుం బెంపెసఁగు. నాచెప్పునది హితమనియు నేను నీకు హితముఁ దెల్పువాఁడననియు నమ్ముము. జ్ఞాతిస్నేహమున మేలు గలుగుఁగాని వైరమునఁ గలుగదు. జ్ఞాతులు సువృత్తులైనం దరింపఁజేయుదురు. దుర్వృత్తులైన ముంతురు. పాండవులయెడ నీవు న్యాయము నడిపితివేని శత్రుభయము గలుగదు. ధనవంతుఁడైనజ్ఞాతిం బొంది లాఁతిజ్ఞాతి బాణహస్తుం డైనవేటకానిం జూచిన మృగముచందమున వగచునేని తత్పాపం బాధనవంతుం జెందును. కావునఁ బాండవులు నీసిరికి వెలిగా నుండుట తగదు. ఇప్పుడు నాహితోపదేశమును విన వేని సంగ్రామమున ధార్తరాష్ట్రులొండెఁ, బాండవులొండె హతులైనపుడు మిక్కిలి వగపుతోఁ బశ్చాత్తాపము నొంది మంచానఁ బడి బ్రదికిననాళ్లెల్ల వనటలపాలగుదువు. జీవితం బనిత్య మని భావించి చేటు వాటిల్లకముందుగనే యందులకు మూలం బగుపనిం జేయకుండుట మేలు. శుక్రనీతి మొదలగునీతిం దెలియనివాఁడట్లు చేయనోపఁడు. మఱి యట్టివివేకము బుద్ధిమంతులకడన నిలుచు. కావున నీవు నిండుమనంబునం జింతించి పాండవులయెడ దుర్యోధనుఁడు చేసినయనయమును సంధిచే నపనయింపుము. వారలను నిజరాజ్యమున నిల్పి విగతకల్మషుండవై సజ్జనపూజనీయుండ వగుము. ధీరులసుభాషితములను ఫలపర్యవసానపూర్వకముగ నాలోచించి కార్యములం గడంగువాఁడు పెద్దకాలంబు కీర్తిమంతుఁడై వెలయు. నిపుణులును దమకుఁ గలజ్ఞానమును లెస్సగ నుపయోగింపరేని కర్తవ్యం బెఱుంగఁజాలరు. ఎఱింగియుఁ దత్ప్రకారం బనుష్ఠింపనేరరు. కావున నేమఱక కలవివేకము చక్కగ నుపయోగింపవలయు నను తాత్పర్యముతో నాలోచించి పాపానుబంధము లగుకార్యములం గడంగనియతండు పెంపు గాంచు. పూర్వకృతదుష్కర్మమును విమర్శింపక దానిన యనువర్తించువాఁ డగాధపంక మగునొఱుకటపులోయం బడు. మదము, నిద్ర, యవివేకము, ఖేదమోదములఁ బ్రకటిం

చుట, దుర్మంత్రులమీఁదినమ్మిక, నేర్పులేనిదూతలఁ బంపుట యనునాఱు మంత్రము బాహిరమగుటకు ద్వారములు. అర్థసంగతిఁ గోరినప్రాజ్ఞుఁడు వానిం బరిత్యజించి మంత్రగోపనముఁ గావించి త్రివర్గము నాచరించి శత్రువులం గెలుచు. బృహస్పతియంతటివారలును శాస్త్రములఁ జదువక పెద్దల సేవింపక ధర్మార్థములఁ దెలియఁజాలరు గావున శాస్త్రవిజ్ఞానంబు వృద్ధోపసేవనంబును రాజున కవశ్యకర్తవ్యములు. సముద్రమునం బడినవస్తువును జిత్తస్థైర్యములేనివానికిఁ జెప్పినచదువును బూదిలో వ్రేల్చినపురోడాశము నెట్లట్ల వినని వినమెల్లనివానికి బోధించినసుభాషితము నిరర్థకంబై రూపఱు. హితబోధకు లెందఱుండిన నుపయోగ మించుకయుం గానంబడదు. కావున మేధావి యగుజనుఁడు బుద్ధిని సద్విషయమునందు లెస్సగ వినియోగించి హానివృద్ధులం బరికించి పెద్దలమాటల విని తత్ఫలములం బరిశీలించి ప్రాజ్ఞులతోడ నెల్లప్పుడు చెలిమిచేయవలయు. వినయ మపకీర్తిని హరించు. పరాక్రమ మనర్థమును జెఱుచు. శాంతి క్రోధము నడంచు. ఆచారము నింద్యలక్షణములఁ బోఁగొట్టు. పరివారక్షేత్రవేశ్మపరిచర్యాభోజనాచ్ఛాదనములఁ గులముఁ బరీక్షింపవలయు. కామ ముపస్థితంబయ్యెనా శరీరాభిమానము విడిచినవాఁడు నపుడు తన్నిషేధముఁ దలఁపఁడు. ఇఁకఁ గామరక్షణం జెప్ప నేల? రాజోపసేవిని, వైద్యుని, ధార్మికుని, ప్రియదర్శనుని, బెక్కండ్రు చెలికాండ్రు గలవానిని, సుభాషితములఁ బలుకువానిని, మిత్రునిం బాలింపవలయు. దుష్కులజాతుఁడైనను సత్కులజాతుఁడైనను మృదుచిత్తుండై ధర్మ మపేక్షించి యకార్యములఁ జేయనివాఁడు నూఱుగురు కులీనులకంటె నుత్తముఁడు. మనస్సు, విశ్వాసము, ప్రజ్ఞ యను మూఁటిలో నొక్కటియేనియుఁ దుల్యముగనుండువారికి మైత్రి సెడదు. తృణప్రచ్ఛన్నకూపముచందమునఁ గపటముతో బుద్ధిమాలినపనులఁ జేయువాని నవశ్యము వర్జింపవలయు. వానితోడ మైత్రి పొసఁగదు. దురభిమానులు, మూర్ఖులు, రౌద్రకృత్యులు, సాహసప్రధానులు, ధర్మత్యాగులు నగువారితోడఁ జెలిమిఁ జేయరాదు. కృతజ్ఞుఁడు, ధార్మికుఁడు, సత్యవాది, యనీచుఁడు, దృఢానురాగుఁడు, జితేంద్రియుఁడు, తగిననడవడి నడచువాఁడు నగుమిత్రు నెన్నఁడుం ద్యజింపరాదు. ఇంద్రియముల యత్యంతనిరోధము ననిరోధము నను రెండును గృహస్థున కనర్థమూలములు గావున ననింద్యసరణి నుచితముగఁ దద్విషయములం గ్రహింపఁజను. సర్వభూతములయెడ మార్దవ, మనసూయ, శాంతి, ధైర్యము, మిత్రసమ్మాననమనునివి యాయుష్యము లని పెద్దలు చెప్పిరి. చెడినకార్యమును దృఢమతితో నీతి సెడకుండ సవరించుట మహాపురుషులకు వ్రతము. కావునఁ జెడినకార్యము నీతిప్రకారమునఁ దెఱఁగుపఱుపుము. ఉత్తరకాలమున వచ్చుదానికిఁ బ్రతిక్రియ నెఱింగి తత్కాలకృత్యములందు నిశ్చయవంతుఁడై

గతకార్యశేషములఁ గ్రమమునఁ దుదిముట్టుచందమున మెలఁగునతఁ డెన్నఁడుం జెడఁడు. మనోవాక్కర్మములఁ జెడునడవడిఁ బరిత్యజించి మంచిరీతిని వర్తింపవలయు. యుక్తకార్యాచరణ, ముపాయపరిచింతనము, శాస్త్రపరిశీలన, ముద్యోగము, ఋజుత్వము, సాధుసంసర్గము, ధైర్య, మప్రమాదము, పూర్వోత్తరపర్యాలోచనము, ఫలాఫలవిచారముం గలయతండు సంపదలకుఁ బ్రాఁపగు. మఱియు రా జెల్లపుడుత్సాహి గావలయు. ఉత్సాహమే శుభసంపల్లాభములకు మూలము. ఉత్సాహవంతుఁ డత్యంతసుఖముఁ బడయు. వనదుర్గసమరసంకటములందు నతండు వెలవఁడు. మఱియు నుత్తమపదంబుఁ గోరువానికి శాంతి ప్రధానము. శాంతికిఁ గడచినశ్రీకరము హితము నెండొక్కటి గన్పట్టదు. తాపసులకుఁ దపము, బ్రహ్మవేదులకు వేద, మసాధులకు హింసయు నెట్లట్లు గుణవంతులకు శాంతి బలము. శక్తి గలిగియు కార్యము ధర్మవిరుద్ధం బగునేని యశక్తునియట్లోర్చియుండవలయు. అర్థానర్థము లెవ్వి వచ్చినను ధర్మము నతిక్రమింపరా దనువానికే క్షమాగుణము లభించు. ధర్మార్థములకు బాధ లేకుండఁ గామసుఖ మొడఁగూడు నెడ దానిం గ్రహింపవలయుఁ గాని మూఢత్వముతోఁ దోఁచినపనులఁ జేయరాదు. దుఃఖార్తులయందు, నశాంతులయందును, నాస్తికులయందును, నలసులయందు, నదాంతులయందు, ననుత్సాహులయందును సంపద నిలువదు కావున రాజు దేశకాలముల నెఱిఁగి శమోత్సాహములం బ్రయోగింపవలయు. ఆర్జవమునం జేసి యకార్యముల నొనరింపనియోగ్యుని దుర్బుద్ధు లశక్తుఁ డందురు. అయిన నాదుర్బుద్ధులమాట గ్రాహ్యము గాదు. ఎందును మిక్కటము దగదు. అతిసాధు, నతిదాత, నతిశూరు, నతివ్రతుం జేర శ్రీ వెఱచు. తనకుఁ దెలియకున్నను లాఁతివారు సెప్పిన వినక తా నెంతయుఁ దెలిసినవాఁ డనుదురభిమానమున నంతయుఁ బైఁబూసికొనువాఁడు సంపదం బొందఁజాలఁడు. అత్యంతగుణవంతులయందు నత్యంతనిర్గుణులయందును సంపద నిలువదు. మఱి వెట్టియావుకైవడి నెందైన నుండును. కావున నెందును మిక్కుటములేక యుచితరీతిని మెలంగుచు సంపదం బొరయవలయు. వేదాధ్యయనమున కగ్నిహోత్రాచరణంబును, శాస్త్రపరిశీలమునకు శీలవృత్తసంపాదనమును, వనితం బెండ్లియగుటకు రతిపుత్రసౌఖ్యమును ఫలము లగురీతి సంపన్న మగుధనమునకు దానభోగములు ఫలములు కావున ధర్మార్జిత మగుధనమున దానభోగములుగావింపవలయు. అధర్మార్జిత మగుధనమునఁ బరలోకసుఖార్థ మెన్నిసత్కార్యములఁ జేసినను వానికివి యధర్మార్జనమునం జేసి తత్ఫలము నొసఁగవు. ఉదకము, మూలము, ఫలము, పయస్సు, హవిస్సు, బ్రాహ్మణకామము నెఱవేర్చుట, గురువచన, మౌషధము ననునెనిమిదియు నెట్టివ్రతంబులయందు సేవించినను వ్రతహాని గలుగదు. ఆత్మ

కఁ బ్రతికూల మగుదానిం బరునకు సంధింపఁ జేయరాదు. ఆపత్సమయము లందు ధర్మము లన్యవిధమునం బ్రవర్తిల్లు. అక్రోధమునఁ గ్రోధమును, సాధువుచే నసాధువును, దానమునఁ గృపణుని, సత్యమున ననృతమునుం జయింపవలయు. స్త్రీలయందును, ధూర్తులయందును, సోమరిపోతులయందును, భీతచిత్తులయందును, నతికోపనులయందును, బరుషమానులయందును, జోరులయందును, గృతఘ్నులయందును, నాస్తికులయందును నమ్మిక యుంచరాదు. నిత్యముం బెద్దల సేవించుచుఁ దద్బోధితప్రకారమున నడుచువాని కాయుశ్శ్రీకీర్తిబలములు పెంపెసఁగు. అత్యంతక్లేశమునను, ధర్మవిరోధమునను, శత్రువిధేయతవలననుం గలుగుకార్యములం జేయఁ బూనవలదు. విద్యలేనిపురుషుఁడు, సంతతిలేనిసంభోగ, మాధారములేనిప్రజలు, రాజులేనిరాష్ట్రమును శోకభాజనం బగు. మార్గగమనము దేహములకు ముదిమి. నీళ్లుపాఱుట కొండలకు ముదిమి. పురుషసంగమములేమి స్త్రీలకు ముదిమి. వాక్ఛల్యము మనస్సునకు ముదిమి. అభ్యాసములేమి వేదములకు మలము. వ్రతమువిడుపు బ్రాహ్మణునకు మలము. బాహ్లీకదేశములు భూమికి మలము. అనృతము పురుషునకు మలము. పెల్లగుకోర్కి పతివ్రతకు మలము. దేశాంతరగమనము స్త్రీలకు మలము. రజతము సువర్ణమునకు మలము. తగరము వెండికి మలము. సీసము తగరమునకు మలము. తగరముమలము మలమ యనంబడు. విడుపు గానక యెంతికాల మనుభవించిననుం దానఁ దనివి దీఱదు. నిద్రపోవుచుండిన నెప్పుడు నిద్దురపోవలయు ననియే తోఁచు. స్త్రీలఁబొందుచుండిన నింకనుం బొందవలయు ననియే తోఁచుఁగాని యిఁకఁ గామము చాలు ననితోఁపదు. కట్టియలు దవిలించుచుండిన నగ్ని మండుచునే యుండు. త్రాగుచుండిన మఱియు మఱింత సురఁ ద్రావవలయు ననియేతోఁచుచుండు. మిత్రులకుఁ గోర్కి దీఱ నిచ్చి శత్రువులం గెలిచి యన్నపానముల భార్యలకు సంతోషముఁ గావించుచు సుఖించువానిజన్మమే సఫలము. వేలకోలఁది యేండ్లుపూండ్లు బ్రదికినవారుం దుదిఁ జచ్చిరిగాని బ్రదుకరైరి. ఎప్పటికైన విషయములపై విడుపు గలుగకున్న సుఖము గలుగనేరదు. పుడమియందుఁ గలధనధాన్యగోపశుహిరణ్యవనితాగణములుం దనకుఁ గలిగినను జాలునను బుద్ధి పుట్టదని లెస్సపరిశీలించి చూచినవానికి మోహము గలుగదు. కావున నాచెప్పినదం తయు సకారణముగఁ బరిశీలించి కామక్రోధాదివిరహితుఁడవై పాండవులను నీకొడుకులను నెక్కటిగఁ జూడుము. వారిపై నీకు సమభావము గలదేని యెన్నిమాఱులైనను నాచెప్పునది యిదియే. అత్యంతాసంగము మాని శక్తిలోపము లేకుండఁ బెద్దలు మెచ్చుతెఱంగుగాఁ గార్యములఁ జేయుచు ధర్మవిరుద్ధ మగునది యెంతటిలాభకారణంబైననుం బరిత్యజించు నతఁడచిరంబ యెంతయుఁ గీర్తి

మంతుఁడై నిర్మోకము విడుచుపాముపగిది దుఃఖములఁ దొలంగి సుఖించు. అనృతముమీఁదియాస్థ, రాజునొద్దఁ గొండెముచెప్పుట, యలీకమున గురువును నిర్బంధించుట యనుమూఁడును బ్రహ్మహత్యకుఁ దుల్యములు. అసూయయే ప్రధానమగుమృత్యువు. అతివాదమే సంపద చెడుటకుఁ గారణము. అశుశ్రూష, త్వర, శ్లాఘ యనుమూఁడును విద్యకు శత్రువులు. ఆలస్య, మద, మోహ, చాపల, గోష్ఠీ, స్తబ్ధతా, త్యాగము లనునేడు విద్యార్థులకు దోషములు. సుఖార్థికి విద్య, విద్యార్థికి సుఖముం గలుగనేరదు గావున సుఖార్థి విద్యను, విద్యార్థి సుఖమునుం ద్యజించుట మేలు. అగ్ని యింధనములకును, సముద్రుఁడు నదులకును, గాలాంతకుఁడు సర్వభూతములకును, స్త్రీలు పురుషులకునుం దృప్తిఁబొందరు. ఆశ ధైర్యము, నంతకుఁడు సమృద్ధిని, క్రోధము సంపదను, కృపణత్వము కీర్తి, నపరిశీలనము పశువులను, గోపించినబ్రాహ్మణుఁడు రాష్ట్రమునుం జెఱుచుట సిద్ధము. దేవబ్రాహ్మణాతిథిపూజార్థంబు వీణాచందనదర్పణాదిశోభనద్రవ్యముల నింట నుంచవలయు ననిస్వాయంభువుం డైనమనువు సెప్పె. నాచెప్పినగుణములెల్లఁ బాండవులయెడఁ గలవు. అన్నింటికంటెఁ బ్రధాన మొక్కటి చెప్పెద నవహితుండవై వినుము. కామలోభభయాదులం దెద్దానివలననైనను బ్రాణసంకటము గలిగినప్పుడైనను ధర్మము దప్పరాదు. సుఖదుఃఖము లనిత్యములు. ధర్మము నిత్యము. ప్రవృత్తిప్రకారము లనిత్యములు. జీవుఁడు నిత్యుఁడు. కావున ననిత్యము లగుసుఖదుఃఖములపై నాశఁ దొలంగి నిత్యము నవలంబింపుము. నిత్యమునకు సంతోషింపుము. సంతోషమే లాభము. లబ్ధమునకు సంతోషముఁ బొందక యనిత్యసుఖములం గోరి యలజడిఁ బడినం బ్రయోజనం బెయ్యది? ధనధాన్యసంపూర్ణం బగునీమహీమండలం బేండ్లుపూండ్లు పాలించి యధికభోగములం గాంచి సుఖించినమహారాజు లెందఱేని కాలవశమున నంతయు విడిచి చనిరి గాని యొండు గాదుగదా. లోకమునందుఁ బుట్టినబిడ్డ నెన్నియేనిపాట్లుపడి పెంచి వాఁడు సచ్చిన నేడ్చుచుఁ గాటికిఁ గొనిపోయి కాష్ఠముంబోలెఁ జితాగ్నిలో వైచివత్తురు. మేనఁ బ్రాణము లున్నంతదాఁకనే యంతయుం గలిగియుండు. అవి పోయినపదపడి యొక్కటియు లేదు. ఒకండు ధనమార్జించి కాలధర్మము నొందినం దద్ధనమును లాఁతివారు భుజింతురు. వానిశరీరము నగ్నియొండెఁ, గుక్కలు గ్రద్దలు మొదలగునవియొండెఁ గబళించు. విచారించిచూచినం జన్నవానితోడ నెండొక్కటియుం జనదు. పూవులుఁ బండ్లు లేని వ్రాఁకులఁ బక్షులు విడుచుచందమునఁ బ్రాణములేనికళేబరములను బుత్రమిత్రబాంధవాదులు పాఱవైచినపిదపఁ బుణ్యపాపకర్మ మొక్కటి కూడఁ జను. కావునఁ బరలోకసుఖార్థంబు ప్రయత్నపూర్వకముగ ధర్మమునే మెల్లన యార్జింపవ

లయు. ఈలోకమునకు మీఁద నాలోకమునకుఁ గ్రింద మహాంధకార మొక్క టి గలదు. అదియే యింద్రియములకు మోహముఁ గావించు. నీవు వానిం దవు లక తప్పించికొనుము. నాచెప్పినదంతయు లెస్స విని యట్లు నడిపింతువేని యీ లోకమున శాశ్వతకీర్తినిఁ బరలోకమున సౌఖ్యమునుం బొందఁ గలవు. ఆత్మయ ననది నది. పుణ్యము దానికి రేవు. సత్య ముదకము. ధైర్యము గట్టు. దయ యలలు. అందుఁ గృతస్నానుండు పవిత్రుండై నెగడు. అలోభముకంటెఁ బుణ్యము వేఱు గాదు. ఆనదియందే కామక్రోధాదు లనుమొసళ్లు పంచేంద్రియము లనుజ లాశయములందు వసించు. వానికిఁ జిక్కక ధైర్య మనునావచే దాని దాఁట వలయు. ప్రజ్ఞాధర్మవిద్యావయోవృద్ధుఁడు దనకుఁ గూర్చుబాంధవుఁడు నగు యోగ్యు నాదరించి కార్యసందేహము లడిగి యితికర్తవ్యతానిశ్చయజ్ఞుఁడై పనులఁ బూనువాఁ డెన్నఁడుం జెడఁడు. కావున నీవుం దులువలమాటలు వినక యోగ్యు లగుహితులమాటల నాదరించి విని తత్ప్రకారమునఁ గార్యము నను ష్ఠింపుము. ధైర్యమున శిశ్నోదరములను, నేత్రమునఁ బాణిపాదములను, మన స్సున నేత్రశ్రోత్రములను, గార్యమున మనోవాక్కులను రక్షింపవలయు. బ్రా హ్మణుఁడు స్నానసంధ్యాజపాదులనాచరించుచుఁ బతితాదినిందితాన్నము వర్జిం చుచు సత్యము పలుకుచు గురుశుశ్రూషఁ గావించుచు షట్కర్మనిరతుండై యుండునేని బ్రహ్మలోకమునందు శాశ్వతసుఖము ననుభవించు. క్షత్రియుఁడు వేదములఁ జదివి యజ్ఞముల నొనరించి ధర్మమునఁ బ్రజాపాలనముఁ గావించుచు గోబ్రాహ్మణార్థంబు శస్త్రపూతుండై సంగ్రామమున వీరమృతిం గాంచునేని స్వర్గ ముఁ బడయు. వైశ్యుఁడు బ్రహ్మక్షత్రియులఁ బూజించుచుఁ గలధనముఁ గాల మందాశ్రితాదులకుఁ బంచిపెట్టి త్రేతాపూతం బైనపుణ్యగంధ మాఘ్రాణించు నేని స్వర్గలోకసుఖములం గాంచు. శూద్రుఁడు న్యాయమున బ్రహ్మక్షత్రియ వైశ్యులఁ బూజించి యలరించుచుఁ దత్ప్రభావమున దగ్ధకల్మషుఁడై మేనుఁ దొఱంగి స్వర్గసౌఖ్యముఁ బొందు. సంక్షేపముగ నిది చాతుర్వర్ణ్యధర్మము. ధర్మ రాజు సర్వగుణవిశిష్టుఁడయ్యు క్షత్రధర్మ మగుప్రజాపాలనముఁ జేయకుండుట ధర్మంబు గాదు. కావునఁ గొడుకుల నొడంబఱిచి వారికిఁ గొంతరాజ్య మిచ్చి యతండును రాజ్యస్థుండై యుండునట్లు తెఱంగు చేసి శాశ్వతకీర్తిసౌఖ్యములం బడయు మని నీతిమార్గముఁ దేటపడ నెఱింగించె.

అట ధృతరాష్ట్రుఁడు విదురుం జూచి యోసౌమ్యస్వభావా, నీచెప్పినదం తయు నిక్కంబు. పాండవులం దలంచినపుడెల్లనాకు నిదియే తోఁచు. ఐనం గ్రమ్మఱ దుర్యోధనుం గాంచినపుడిది మాఱుచున్నది. ఏమి చేయవచ్చును? దై వము దలంచినదానిం దప్పింప నేరు నేర్తురు? పౌరుషముకంటె దైవంబ బలవ

త్తరం బనితోఁచెడి. నీవచనము లెంత వినినను నామనంబు తనివోవదు. నీపలుకు లతివిచిత్రములు. ఇంకనుం జెప్పఁగలయది గలదేని వివరింపుము. వినవేడుక వొడమెడి ననిన విని విదురుఁడు మహారాజా, పురాణుండయ్యుఁ గుమారుండయినసనత్సుజాతుండు మృత్యువు లేఁడని నుడివినవాఁడు. సర్వబుద్ధిమద్వరుండై నయమ్మునీంద్రుఁడు రహస్యప్రకాశము లగుభవదీయసంశయములనెల్లఁ దీర్పనేర్పరియనుటయు నవ్విచిత్రవీర్యపుత్రుండు విదురా, యమ్మునివరేణ్యుఁడు గఱపుదాని నీ వెఱుంగవే? నీకుఁ దెలియునేని చెప్పు మతం డేలయనుటయు విదురుఁడు మఱియు నిట్లనియె. ఏను శూద్రయోనిజాతుండను. ఇంతకంటెఁ బరమార్థం బగుపదార్థంబుఁ జెప్ప నాకుఁ దగదు. అమ్మహానుభావునిబుద్ధి నే నెఱుంగుదు. బ్రాహ్మణజాతిసంభవుం డైనవాఁ డెంతరహస్యపదార్థం బైనం జెప్ప నధికారియై యుండు. దానినే దేవతలు మెత్తు రనవుడుఁ గురునృపాలుఁ డయ్యా, యమ్మునీంద్రుని నీమేన నేను గాంచు టెట్లగు నని యడుగ విదురుఁ డమ్మహామునీంద్రుని నిజచిత్తమునం దలంచె. తలంచుటయు దివ్యబోధమహనీయుం డైనయాసనత్సుజాతుఁ డాశ్రితవాత్సల్యమునం జేసి తత్క్షణంబ మ్రోలం గన్పట్టె. కన్పట్టుటయు విదురుఁడు పరమానందభరితుండై సంభ్రమమున లేచి విధియుతంబుగ నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యతండు సుఖోపవిష్టుం డైనపదంపడి సవినయముగఁ గొలుచుచుఁ జేరువ నిలిచి ధృతరాష్ట్రుం జూపి దేవా, యీనరేంద్రుఁడు భవదీయదివ్యబోధనమునఁ జిత్తప్రసాదంబుఁ బడయఁ గోరుటయు మిమ్ముఁ దలంచితి. మీరు కరుణాభరమున విజయంబుచేసితిరి. ఏను జెప్పఁ దగనిపరమార్థము నుపదేశించి లాభాలాభములు ప్రియాప్రియములు జరామరణములు మున్నగుద్వంద్వదుఃఖములం బడక కడతేఱు తెఱంగు బోధింపవలయు నని విన్నవించె.

## సనత్సుజాతీయము.

అంత ధృతరాష్ట్రుఁడు విదురువచనం బభినందించి సనత్సుజాతునిచరణముల కెఱఁగి తత్ప్రసాదంబు వడసి తనమనంబునం గలసంశయముల నపనయించికొనువాఁడై ప్రాకృతజనరహితం బైనవివిక్తదేశమున నతనిం గొలిచి మునీంద్రా, మృత్యువు లేఁ డని నీవు చెప్పితి వని విదురుఁడు నాకుఁ జెప్పినవాఁడు. మృత్యువు గలఁ డనుతలంపుతోఁ దన్నిరసనార్థంబు దేవాసురులు బ్రహ్మచర్యవ్రతం బాచరించి రని విని యుండుదు. ఇం దెయ్యది సత్యంబు తెలియఁ జెప్పు మనియడుగుటయు నరేంద్రా, కర్మచే మృత్యునిరసనం బగునని కొంద ఱందురు. మఱికొందఱు మృత్యువు లేఁ డని పలుకుదురు. ఇందలిరహస్యం బెఱిఁగించెద విను మని సనత్సుజాతుఁ డతని కిట్లనియె. సృష్టినాఁటంగోలె మృత్యుభావాభావంబులు రెండునుం బ్రవర్తిల్లుచున్నయవి. అనాత్మయందాత్మాభిమా

నము మృత్యు వని కొందఱు పలుకుదురు. అదియే మోహంబునాఁబడు స్వాభావికబ్రహ్మభావచ్యుతియే మృత్యు వని నామతంబు. అదియే ప్రమాదం బనంబడు. అప్రమాదంబే యమృతత్వంబు. ప్రమాదమున నసురులు పరాభవ మును నప్రమాదమున సురలు బ్రహ్మభావమునుం గాంచిరి. విచారించిచూచిన నిదియే మృత్యువుగాని మఱియొక్కటి గన్పట్టదు. వ్యాఘ్రము మృగముల నుంబోలె మృత్యువు ప్రాణులం జంపు ననుట మిథ్యావిలసితంబు, మృత్యు వునకు రూపము గానరాదు. ఇదియెఱుంగక విషయవిషాంధు లగుకొందఱు ప్రమాదంబుకంటె నితరుఁడు మృత్యువు పితృలోక మేలుచు సత్కర్మకారు లకు సుఖమును దుష్కర్మకారులకు దుఃఖమునుం గావించుచుండు నని చెప్పు దురు. ప్రమాదమే క్రమమునఁ గామక్రోధాహంకారాది రూపమునఁ బరిణ మించిన నయ్యహంకారవశతంజేసి జనులుబ్రాహ్మణత్వక్షత్రియత్వ స్థూలత్వ కృశత్వాదిధర్మములఁ దమయం దారోపించికొనుచు శ్రౌతస్మార్తవిపరీతమా ర్గముల నాచరించుచుండుదురుగాని సమాధిలక్షణం బైనపరమాత్మయోగంబుఁ గాంచ నేరరు. అట్టివార లీలోకము విడుచుచుఁ బరలోకంబుఁ బ్రాపిం చుచు సంచితకర్మక్షయం బగుడుఁ గ్రమ్మఱ నిటకువచ్చుచు నవిద్యావశులై జననమరణప్రవాహపరంపరారూపం బైనసంసారసాగరంబునం బరిభ్రమించు చుండుదురు. కర్మచే మృత్యునిరసనం బగునని తలంచుమఱికొందఱును జి దానందరూపం బయినవేద్యతత్త్వము నెఱుంగనేరక భోగములమీఁదియా శచేఁ గర్మఫలానురాగసంపన్నులై కర్మములనే యాచరించుచు సంసారము ననే మునుంగుచుండుదురుగాని మృత్యునిరసనంబుఁ గాంచనేరరు. రాగాభి భూతతంజేసి యింద్రియవిషయములం బ్రవర్తించుటయే మహామోహనంబు. తత్ప్రవర్తనంబు జనులకు సహజంబై యుండు. చిత్తం బింద్రియార్థవశం బయ్యె నేని స్వాభావిక బ్రహ్మభావంబు మఱచి యవిద్యాకల్పితము లగువిషయములనే సేవించుచుండుదురు. అట్టివారలు కామక్రోధాదివశతంజేసి మృత్యువశు లగు దురు. ధీరులు విషయము లనిత్యములనియు దుఃఖావిష్టము లనియుం దలంచి యనాదరంబుతో వానిం దొఱంగి మృత్యువుం దరింతురు. కామానుసారి యగు వాఁడు కామములు నశించినం దానును నశించు. దాని ననుసరింపనివాఁడు జ్ఞానమునఁ బుణ్యపాపముల నిరసించి సద్గతిం బడయు. అవిద్యాప్రారబ్ధం బయిన మానుష దేహము శ్లేష్మరక్తవిణ్మూత్రాది పరిపూర్ణంబగుటంజేసి నరకంబె. అట్టి యత్యంతజుగుప్సితం బైనస్త్రీదేహము రమణీయం బనుతలంపుతోఁ బావిలోఁ బడు నంధులమాడ్కి నత్యంతకాంక్షతోఁ బడయుదురు. అట్టివిషయవిషాంధు లధ్యా త్మశాస్త్రముఁ జదువక యాత్మతత్త్వ మెఱుంగక వనటలపా లగుదురు. వారి

దేహంబు తృణనిర్మితవ్యాఘ్రముచందమున నిరర్థకంబు. క్రోధలోభాదిసమన్వితుండై విషయములం బ్రవర్తించుచున్నయాత్మయే తనకు మృత్యువుగాని మఱియొక్కండు గాఁడు. ఇవ్విధమునం బ్రమాదంబే మృత్యు వగు నని యెఱింగినధీమంతుఁడు జ్ఞానయోగమున మృత్యువశుఁడు గాక స్వరూపసిద్ధిఁ బడయుఁ గావునఁ గర్మము బంధకారణంబు జ్ఞానంబే మోక్షసాధనం బనిన విని ధృతరాష్ట్రుఁడు మునివరేణ్యా, యజ్ఞాచరణంబునఁ బుణ్యలోకములు గలుగు ననియుఁ బుణ్యలోకప్రాప్తి పురుషార్థంబనియు వేదముల వినంబడుచున్నదిగదా. అది యెఱింగినవాఁ డేల కర్మ చేయకుండు ననియడుగ నతం డతని కిట్లనియె. యజ్ఞాచరణమునఁ బుణ్యలోకప్రాప్తి పురుషార్థం బనువేదవచనం బవిద్యాదోషదర్శనంబునంజేసి యధికారిభేదమున నవిద్వద్విషయకంబు. వేదాంతపరిజ్ఞానమున వైరాగ్యఘనుం డైనవాఁడు బ్రహ్మలోకాదిసౌఖ్యము లనిత్యము లనిభావించి తత్సాధనకామ్యకర్మములం దవులక యీశ్వరార్పణబుద్ధితో నుచితకర్మముల నాచరించుచు సంసారహేతుభూతంబు లయినవిరుద్ధమార్గముల నిరసించి యాత్మం బరమాత్మఁగా భావించి కైవల్యఘనుం డగు ననిన విని ధృతరాష్ట్రుఁడు మునీంద్రా, యాత్మపరమాత్మలకు భేదము లేకుండునేని జననమరణాదిశూన్యుఁడై పురాణపురుషుం డైనయాత్మ నెవ్వఁడు సంసృతిమార్గమునం బ్రేరించు? తనకుఁ దాన ప్రవర్తించు నందువేని నానాయోనులం బ్రవర్తింప నతని కెయ్యది కార్యంబు? ప్రవర్తింపకుండిననసుఖం బెయ్యది? తేటపడం జెప్పవే యనియడుగ సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. కూటస్థుఁ డొక్కఁడకాని యతనియెడ భేదము గానరాదు. నియోజ్యనియోజకత్వాది ధర్మభేదమున భేదము గల దనరాదు. భేదవాదమున మహాదోషము పొసంగు. అనాద్యవిద్యాయోగమునంజేసి యద్వితీయుఁడయ్యుఁ బరమాత్మ బహురూపములఁ గానవచ్చు. మాయానిమిత్తముననే యాత్మపరమాత్మలకు లోకమున భేదవ్యవహారంబు గన్పట్టుచున్నది. నియోజ్యనియోజకత్వాది ధర్మభేదంబును దత్ప్రయుక్తంబై తోఁచుచున్నది. భేదము మాయాకల్పితం బగుటంజేసి యభేదంబే పారమార్థికంబై యుండు. మాయావేశవశముననే పరమాత్మకు జగత్కారణత్వంబు సిద్ధించుచున్నది. ఈయర్థమున వేదములు ప్రమాణంబై యుండెడి ననిన ధృతరాష్ట్రుఁడు మునివరేణ్యా, లోకమునఁ గొందఱు ధర్మమును మఱికొంద ఱధర్మము నాచరింతురుగదా. అందు ధర్మ మధర్మమును బాధించునా? అధర్మము ధర్మమును బాధించునా? తుల్యబలము లగుటంజేసి రెండు ననుభావ్యములే యగునా? యనియడుగ ధృతరాష్ట్రునకు సనత్సుజాతుఁ డిట్లనియె. వేద్యతత్త్వం బెఱింగినవిద్వాంసునిపుణ్యపాపంబులు రెండును జ్ఞానాగ్నిదగ్ధంబు లగు. జ్ఞానహీనుఁడు పరలోకమునఁ బుణ్య

పాపఫలముల రెంటినిం గుడుచు. ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మముల ననుష్ఠించువిద్వాంసుఁడు ధర్మమున నధర్మమును హరించు. బలవంతుఁడైనరాజుం జూచిన లాఁతిరాజు వానికంటెఁ దా నధికబలసంపన్నుఁడై యధికరాజ్యముఁ బడయుదునని కోరుచందమునఁ గర్మాచరణశీలురం గాంచి వారికంటె నుత్తమకర్మంబులం గావించి యుత్తమసుఖములం బడయుదు మనితలంచి పరస్పరస్పర్ధం జేసి కర్మములసలిపి ధూమాదిమార్గమున స్వర్గలోకముఁ బ్రాపించి నక్షత్రాదిరూపమునం బ్రకాశముఁ గాంతురు. అవ్విధమునఁ బరస్పరస్పర్ధ మాని ఫలాభిసంధిరహితంబుగాఁ గర్తవ్యకర్మముల నాచరించువారు తన్మహిమంబున శుద్ధచిత్తులై కార్యకారణాత్మకం బయినదీని విడిచి యాధ్యాత్మికాదితాపత్రయంబునకును, సత్త్వాదిగుణత్రయంబునకును, జాగ్రదాద్యవస్థాత్రయంబునకును గోచరంబుగాని పరమాత్మస్వరూపంబు నాత్మానుసంధానంబునం బడయుదురు. అట్టిమహాత్ములు బాహ్యాభ్యంతర జనుల కగోచరులై వర్తింతురు. అన్నపానాదిబహుళంబై యుచితాతిరిక్తంబైన సమ్మానంబుఁ గావింపనిజనులకు నివాసంబైనచోటు వారి కావాసంబై యుండు. పూజించువారికంటె నిందించువారే తమకు శ్రేష్ఠు లని వారు తలంతురు. బ్రహ్మనిష్ఠాసాధనంబులకుఁ జేటు గావింపనివారియన్నము వారికి భోజ్యంబు. సర్వసంగవినిర్ముక్తులై నిజమాహాత్మ్యంబు ప్రచ్ఛాదించికొనియుండునమ్మహానుభావు లాత్మతాపంబుఁ గాంచరు. పుత్రకళత్రాదిసన్నిధానంబున నుండియుఁ జక్షురాద్యగోచరం బయినపరమాత్మతత్త్వంబునందు సమాధియోగంబె కర్తవ్యం బనుతాత్పర్యంబుతో గూఢచర్య మెలంగునతండే బ్రహ్మవిదుం డనంబడు. స్థూలసూక్ష్మవివర్జితంబు, క్రియాకర్తృత్వాదిశూన్యం, బవిద్యాదోషరహితంబు, సర్వద్వంద్వవిరహితంబు, క్షుత్పిపాసాదిధర్మవర్జితంబు, సర్వాంతరసాక్షిభూతంబు నగుపరమాత్మతత్త్వంబు దేహద్వయతద్ధర్మతం దలంచి కర్తృత్వభోక్తృత్వాదిధర్మముల నారోపించికొనరాదు. వానికి బ్రాహ్మణ్యంబే కొఱంతవడు. ఆత్మాపహారియైనయాచోరుఁడు చేయనిపాపములుం గలుగునే? అనాత్మభూతంబులగు దేహేంద్రియతద్ధర్మములం దాత్మభావంబుఁ దలంపనివాఁడు సంసృతిశ్రమంబుఁ బాయు. క్రోధహర్షాద్యుపద్రవంబుల నెడలు. అతండే శిష్టుఁ డనంబడు. తాను శిష్టుఁడయ్యు శిష్టుఁడఁగా యనితలఁచికొనరాదు. బ్రహ్మవిద్య నేర్చి సుగుణంబులం బొందియు బ్రహ్మవిదుఁడనైతిఁగా యనితలఁచికొని నిజమహిమంబుఁ బ్రఖ్యాతంబుగావించువారు లోకపూజలం గొనుచుఁ బూర్వపరిత్యక్తంబు లగువిషయములనే వాంతం బయినయన్నముఁ దినుశునకములభంగిఁ గుడుతురు. అది వారి కనర్థకారణంబు. జాయాపుత్రవిత్తాదులపై నభిమానమును విడిచి వేదప్రతిపాద్యంబు లయినయహింసాసత్యాదులం గ్రహించి నిజోచితవృత్తి నుండు

వారు బ్రహ్మభూతులని తలంపవలయు. ఇంద్రాది దేవతల నందఱ నుద్దేశించి సర్వయాగముల నాచరించిన యజమానుఁడు నా దేవతలునుం బ్రహ్మవిదునకుఁ దుల్యులుగారు. బ్రహ్మవిదునిమహిమంబుఁ జెప్పఁగొలఁదియే? మాన్యుల విద్వాంసులు మానించుట యవిద్వాంసు లవమానించుట యను రెండును నిమేషోన్మేషములట్లు లోకస్వభావకృత్యము లనిభావించి మానావమానములుఘటించినపుడు మానమున కుబ్బక యవమానమునకు గ్రుక్కక మానముననుండవలయు. మానమానములు రెండు నెక్కచోవర్తింపవు. ఈలోకము మానమునకు విషయము. ఆలోకము మానమునకు విషయము. మానగోచరప్రపంచమున వర్తించుచు స్వర్గాదిసాధనం బయిన కర్మమునను ష్ఠించువారికిఁ బరమశ్రేయోమార్గనిరోధకం బయినశ్రీ యలవడు. దానింగాంచి విషయములం దవిలినవానికి బ్రహ్మానంద మనుశ్రీ దుర్లభంబై యుండు. సత్యార్జవహ్రీదమశౌచవిద్య లనునాఱు మానమోహముల కెడగలుగకుండ బ్రహ్మానందశ్రీవిభవంబుఁ బడయ మార్గములు. అవి బహుప్రకారంబులు పొందనశక్యంబు లనిన విని ధృతరాష్ట్రుఁడు మునీంద్రా, మానం బెట్టివాని కలవడు? మాన మనఁగ నెయ్యది? తూష్ణీంభావంబే మానం బగునేని దానం బ్రహ్మము ప్రాప్య మగునే? కాకున్న బ్రహ్మప్రాప్త్యుపాయం బెయ్యది? యనియడుగ సనత్సుజాతుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

వేదములును మనస్సునుం దన్నుఁ బొందనేరక మరలియుండుటంజేసి బ్రహ్మము మాన మనంబడు. వేదములు బ్రహ్మమునకు వాచకములై యుండు. బ్రహ్మస్వరూపంబు నిమిత్తంబై యుండుటంజేసి వేదములు సముత్థితంబు లయ్యె. బ్రహ్మము జ్యోతిర్మయముగఁ దోఁచు ననవుడు విచిత్రవీర్యసూనుండు మునివరేణ్యా, ఋగ్యజుస్సామాథర్వవేదములఁ జదివినవానికిఁ బాపకర్మాచరణమునఁ బాపఫలము గలుగునా? కాకున్న వేదాధ్యయనపుణ్యమునఁ దత్పాపము వానిం జేరరాకుండునా? దీనిం దెలియఁ జెప్పు మనుటయు నతండతని కిట్లనియె. ఋగాదివేదములు పాపాచారునిపాపంబుఁ దొలఁగించి రక్షింపవు. మఱి ఱెక్కలువచ్చినపక్షులు గూళ్లనుంబోలెఁ బాపశీలుఁ డైనయమ్మాయావి నంతకాలమునం ద్యజించిపోవు ననుటయు ధృతరాష్ట్రుఁడు వేదములు వేదవిదుం బరిరక్షింపఁ జాలవేని వేదాధ్యయనమును, దదర్థవిచారమును, దదర్థానుష్ఠానముం గర్తవ్యంబు లనుప్రలాపం బెట్లు చెల్లు? ననియడుగ నమ్ముని యానృపతి కిట్లనియె. స్వర్గాదిసాధనం బయినయాగాద్యాచరణంబె వేదమునకుఁ బరమార్థంబుగాదు. మఱి కర్మోపాసనాదులకంటె నతిరిక్తం బయినబ్రహ్మప్రాప్త్యుపాయంబు వేదపరమార్థంబు. అయ్యర్థమెఱింగినవారల వేదములు రక్షించు. మాయాకల్పితము లైననామాదివిశేషరూపములచే నీజగ మొప్పియున్నదిగాని వేఱుగా దని

వేదములవలనను వేదవిదు లయినమునులవలనను స్పష్టం బయ్యెడి. కృచ్ఛ్రచాంద్రాయణాదిరూపం బయినతపస్సు జ్యోతిష్టోమాదియజ్ఞాచరణంబు నీశ్వరప్రీణనార్థం బనియే వేదమతంబు. అట్లు కర్మముల నాచరించునతండు తన్మహిమమునం బ్రాప్తపుణ్యుండై పాపముఁ బోఁగొట్టి జ్ఞానప్రకాశితచిత్సదానందాద్వితీయబ్రహ్మస్వరూపుఁ డగు. అట్లు గాక స్వర్గాదిఫలాపేక్షాబుద్ధితోఁ గర్మముల నాచరించువాఁడు పరమాత్మస్వరూపసాక్షాత్కారంబుఁ గాంచనేరక పుణ్యపాపఫలానుభవనిరతుండై సంసారచక్రంబునం బరిభ్రమించుచుండు. ఈలోకమున నాచరించినఫలసాపేక్షతపఃఫలంబు పరలోకమున ననుభవమునకు వచ్చు. బ్రహ్మవిచారతత్పరులతపం బత్యంతఫలవంతం బగు. తక్కటివారు గావించినతపంబు యథోక్తఫలదమాత్రంబ యగు ననిన ధృతరాష్ట్రుఁడు బ్రహ్మవిచారపరులతపం బేల యత్యంతఫలదం బగు ననియడుగ నిష్కల్మషం బైనతపంబు కేవలం బనం బరఁగు. అదియే యత్యంతఫలవంతం బగు. సర్వంబు తపోమూలంబు. తపస్సుననే విద్వాంసు లమృతత్వంబుఁ గాంచి రని సనత్సుజాతుండు చెప్పిన విని కౌరవేశ్వరుండు మునీంద్రా, తపస్సున కెయ్యది కల్మషంబు. ఎద్ది లేకుండినం దపంబు నిష్కల్మషం బనంబడు ననియడుగ నప్పురాణముని వరుం డానరవరున కిట్లనియె. *క్రోధము, కామము, లోభము, మోహము, వివిత్స, యకృప, యసూయ, మానము, శోకము, స్పృహ, యీర్ష్య, జుగుప్స యనునివి ద్వాదశదోషము లనంబడు. సంభోగబుద్ధి, పరులకుపద్రవముఁ గావించి యుబ్బుట, యిచ్చి వగచుట, కొంచెములాభముకొఱకు సర్వావమానముల సైఁచుట, జ్ఞానబలరాహిత్య, మింద్రియవర్గప్రశంసనము, గుణవతి యనన్యశరణయు నగుభార్యపైఁ గలహించుట యనునివి సప్తనృశంసము లనం బరఁగు. వీనిలో నొక్కటి గల్గిననర్థము సిద్ధము. ఆత్మశ్లాఘాదిదుర్గుణములు గలవారు వీనిం బడయుదురు. ¶జ్ఞాన సత్య దమ శ్రుతామాత్సర్య హ్రీ తితిక్షానసూయా యజ్ఞ దాన ధృతి శమము లను

---

* కామప్రతిఘాతమునఁ గలుగుచిత్తవిక్షేపము క్రోధము. స్రక్చందనవనితాదులమీఁదియభిలాష కామము. పరధనముమీఁదియాశయు, న్యాయార్జిత మగుధనము నుత్తమపాత్రమునం దర్పింపకుండుటయు లోభము. కార్యాకార్యవివేకములేమి మోహము. విషయరసముల నెఱుంగఁ గోరుట వివిత్స. కఠినత్వమకృప. గుణములపై దోషముల నారోపించుటయుఁ బరగుణముల సైరింపఁ జాలమియు ననూయ. ఆత్మబహుమానంబు మానంబు. ఇష్టము లెడఁబాసినం గలుగుచిత్తక్షోభము శోకము. విషయభోగకాంక్ష స్పృహ. పరులమే లోర్వమి యీర్ష్య. పరగుణములఁ గప్పిపుచ్చఁగఁ దలంపు జుగుప్స.

¶ తత్త్వార్థసంవేదనము జ్ఞానము. భూతహితయథార్థభాషణము సత్యము. మనోనిగ్రహము దమము. అధ్యాత్మశాస్త్రశ్రవణము శ్రుతము. పరులమే లోర్చుట యమాత్సర్యము. అకార్యకరణంబునందలిసిగ్గు హ్రీ. ద్వంద్వదుఃఖముల నోర్చియుండుట తితిక్ష. పరదోషములఁ బ్రకటింపకుండుట

పంద్రెండును బ్రాహ్మణునకు మహావ్రతములు నాఁబడు. వీనిలోఁ గొన్ని యున్నను క్రమమున జ్ఞానులయి బ్రహ్మభూతులగుదురు. దమమత్యంతదుష్కరంబు. ‡ అనృతపైశునతృష్ణా ప్రాతికూల్యతమోఽరతి లోకద్వేషాభిమాన వివాద ప్రాణిపీడనపరివాదాతివాద పరితాపాక్షమాధృత్యసిద్ధి పాపకృత్యహింస లనుపదునెనిమిదియు దమదోషములు. ఇందొక్కటి యున్నను దమముసిద్ధింపదు. ఇవియే మదసాధనములు గావున మదదోషములు నాఁబడు. త్యాగగుణ ముత్తమంబు. అది యాఱువిధంబులం బరఁగు. శ్రీ వచ్చిన నుబ్బకునికి మొదటిది. విరాగతాత్పర్యంబున నిష్టాపూర్తముల నాచరించుట రెండవది. కామత్యాగంబు మూఁడవది. ఇది మహాగుణంబు. దీని నందఱుం బొందఁ జాలరు. కర్మప్రాప్తంబులందు ధనత్యాగమునను గామమూలంబైనయుపయోగమునను బిదప దుఃఖముగలుగునేని దాన నలజడిపడకుండుట నాలవది. గుణధనము లున్నపుడప్రియములు పొసంగుడు వ్యథఁ జెందకునికి యేనవది. పాత్రభూతుండైనయాచకునకుఁ బుత్రాదులనేనియు నొసంగుటయాఱవది. ఇవ్విధమునం ద్యాగము షడ్విధంబై యుండు. మఱియు సౌహార్దమునందు నాఱుగుణము లెఱుంగవలయు. సుహృదులకుఁ బ్రియము గలిగనేని హర్ష,మప్రియము గలిగనేని వ్యథ,యయాచ్యము యాచించిన నియ్యఁ దలంపు, మేలు చేసియు నాతాత్పర్యము గణింపకుండుట, స్వార్జితధనమునే యనుభవించుట, తనపనికి భంగము వచ్చినను మిత్రకార్యము నెఱవేర్చుట యనునాఱుగుణము లుండవలయు. ఇవి యుండునేని సౌహార్దము పెంపు గాంచు. సత్య, జ్ఞాన సమాధాన, చోద్య, వైరా, గ్యాస్తేయ, బ్రహ్మచర్య, పంగ్రహము లన నప్రమాదమున కెనిమిదిగుణములు. సత్యంబు సర్వోత్తమంబు. సర్వలోకములు సత్యమునందు సుప్రతిష్ఠితములై యున్నవి. అమృతంబు సత్యమునందే సమాహితంబై యుండెడి. గృహస్థుఁడు నాచెప్పినగు

యననూయ. అగ్నిష్టోమాదులు బ్రహ్మయజ్ఞాదులును యజ్ఞములు. సత్పాత్రమునందు సమర్పించుట దానము. విషయసాన్నిధ్యమున నింద్రియనిగ్రహంబు ధృతి. బహిరింద్రియోపరతి శమము. ౪ ౪

‡ అయథార్థభాషణ మనృతము. కొండెములఁ జెప్పుట పైశునము. విషయములఁ బొందఁ గోరుట తృష్ణ. సర్వప్రతికూలవర్తనము ప్రాతికూల్యము. అజ్ఞానము తమస్సు. లభించినదానికి సంతోషింపకుండుట యరతి. లోకముల కుద్వేగముఁ గావించుట లోకద్వేషము. ఎచ్చటనైనను వినయము లేమి యభిమానము. జనులతోఁ గలహముఁ బెట్టికొనుట వివాదము. తనదేహము రక్షించుకొనుటకుఁగా నితరప్రాణుల హింసించుట ప్రాణిపీడనము. పరుల దూషించుట పరివాదము. నిరర్థకప్రలాపం బతివాదము. వృథాదుఃఖచింతనంబు పరితాపంబు. ద్వంద్వదుఃఖముల నోర్వఁజాలమి యక్షమ. ఇంద్రియార్థంబులపైఁ జాపల్య మధృతి. ప్రతిషిద్ధాచరణంబు పాపకృత్యంబు. శాస్త్రవిహితంబుకాని హింస హింస.

ణదోషములఁ బరిశీలించి దోషములఁ ద్యజించి గుణముల గ్రహించి యాచరిం
చెనేని యాతపము వానికి నిష్కల్మషం బనంబరఁగు. ఇంద్రియనిగ్రహంబు పాప
హరంబు పరిశుద్ధంబు జన్మమృత్యుజరావ్యాధిశమనం బని దృఢముగ నమ్ముము.
నిగృహీతేంద్రియుండు సుఖించు ననిచెప్పిన విని ధృతరాష్ట్రుఁడు మునీంద్రా,
పురాణేతిహాసంబులు పంచమవేదము నా నెన్నిక గలదుగదా. అవియుఁ జతు
ర్వేదములును నేర్చి పంచవేను లనం బరఁగువారును, జతుర్వేదాధ్యయన మొన
రించువారును, వేదత్రయముఁ జదివినవారును, రెండువేదములనధ్యయనముఁ
గావించినవారు, నేకవేదాధ్యాయులు, వేదాధ్యయనశూన్యులు నన బ్రాహ్మణు
లులోకమునఁ బలుదెఱంగుల వర్తింతురుగదా? వారిలో నెవ్వ రధికులు?
తేటపడం జెప్పు మనియడుగ సనత్సుజాతుఁ డతని కిట్లనియె. సంవిద్రూపం
బయినవేద్యతత్త్వము నొక్కదాని నెఱుంగమింజేసి వేదములు బహుధాభిన్న
ము లయ్యె. ఈ పరమార్థమును దెలియక ఋగాదివేదములఁ జదివి యల్ప
జ్ఞుఁడు దాను బ్రాజ్ఞుఁ డనిభావించు. సత్యజ్ఞానానందరూపం బైనబ్రహ్మము
నుండి విచ్యుతిం బొందినవానికి స్వాభావికసత్యసంకల్పాదులు వ్యర్థము లగు.
దానంజేసి యజ్ఞాదికర్మాచరణంబు విస్తృతం బగు. వేద్యతత్త్వంబుఁ దెలిసికొనక
ఋగ్వేదాది వేదములను బురాణేతిహాసములను జదువునతండు బహువాక్యుఁడ
కాని ముఖ్యబ్రాహ్మణుఁడు గాఁడు. మఱి సత్యాదిలక్షణం బయినపరమాత్మస్వ
రూపంబుఁ దెలిసినయతండే ముఖ్యబ్రాహ్మణుండు. వేదములు స్వచ్ఛందయోగ
మునంజేసి సర్వార్థములను బోధించు. అయిన నందెయ్యది పరమార్థంబనియు
నెయ్యది పరమార్థసాధనోపాయంబనియు లెస్స విచారించి పరమపురుషార్థం
బయినబ్రహ్మవిద్యను, దత్సాధనచిత్తశుద్ధిసాధన యజ్ఞాదివిధానంబునుం బరిశీలిం
చి వేదపరమార్థంబు బ్రహ్మవిద్యయనియుఁ దత్ప్రతిపాదనంబునంజేసి వేదములు
ప్రమాణంబనియు నిర్ణయింపవలయు. మఱియు వాగాద్యగోచరం బయినబ్రహ్మ
తత్త్వమును బ్రతిపాదింప వేదములకును సామర్థ్యము చాలదు. అత్యంతసూ
క్ష్మం బైనప్రతిపచ్చంద్రకళం జూపునెడ వృక్షశాఖ నిమిత్త మగువిధమున నిత్య
పూర్ణానందస్వరూపం బయినపరమాత్మతత్త్వముఁ బ్రతిపాదించునెడ వేదములు
హేతుభూతంబు లగు నని యామ్నాయవిదు లయినపెద్దలు వచింతురు. ఇవ్విధ
మున నాత్మప్రతిపాదనప్రకారం బెఱింగినవాఁడు బ్రాహ్మణుండు గావున నతండు
విషయంబులం దవులక దేహేంద్రియములందుఁ దద్ధర్మములందు నాత్మభావంబు
భావింపక సర్వసంగవివర్జితుండై యాత్మం బరమాత్మయం దనుసంధింపవలయు.
ఇదియే మౌనంబు. ఇవ్విధము నెఱింగినతండే ముని యనంబడుఁగాని యడవుల
నుండినంతన కానేరఁడు. తనకుం బరమాత్మకును భేదముఁ దలంపక కైవల్యము

నొందినయతండు మునిశ్రేష్ఠుండు నాఁబడు. అనిర్వాచ్యం బయినపరమాత్మతత్త్వంబే ప్రకృతియోగమున నాత్మరూపముతోఁ గల్పితం బయినప్రపంచంబునందుఁ జొచ్చి సర్వార్థవ్యాకరణముఁ గావించుటం జేసి వైయాకరణపదవాచ్యం బయ్యె. అట్టిపరమాత్మతత్త్వం బెఱింగినవాఁడును వైయాకరణుండ నంబడు. అమ్మహానుభావుం డాత్మజ్ఞానఘనుండు గావున సర్వజ్ఞుం డన నెగడు నని బోధించిన విని యాంబికేయుండు మునివర్యా, భవద్వచనోపన్యాసంబు పరమార్థబ్రహ్మవిద్యాప్రతిపాదకంబు ప్రాపంచికదుర్లభంబు. దాని లెస్సగ నెఱుంగఁ జెప్పవే యని యడుగ సనత్సుజాతుండు నృపాలా, బ్రహ్మంబు త్వరపడి తెలియ నశక్యంబు. సంకల్పవికల్పాత్మకం బయినమనస్సు సర్వవిషయపరావృత్తం బై యధ్యవసాయాత్మకం బగుబుద్ధియందు లీనం బయినపదంపడి విచారింప శక్యంబు. గురుప్రసాదంబు వడసి వృద్ధిఁ గాంచినవారి కిది సులభం బై యుండు. అందులకు బ్రహ్మచర్యంబు ముఖ్యసాధనంబు. అట్లు బ్రహ్మవిద్య సాధించినవా రమృతత్వంబుఁ గాంతు రని చెప్పుటయు ధృతరాష్ట్రుఁడు మునివరేణ్యా, బ్రహ్మవిద్యాజ్ఞానసాధనం బయినబ్రహ్మచర్యంబు నిరూపింపు మని యడుగ దివ్యబోధమహనీయుం డైనయమ్మునివల్లభుండా భూవల్లభున కిట్లనియె. ఆచార్యుం జేరి భక్తితోడ శిష్యత్వమున శుశ్రూషాదిరూపం బయినబ్రహ్మచర్యనియమము సలిపి తదనుగ్రహమున విదితవేద్యు లైన పెద్దలు కామములం దవులక శాంతిఁ గొని ప్రారబ్ధప్రాప్తం బైనదేహంబుపై నభిమానంబు మాని సత్యాదిలక్షణుం డైనపరమాత్మం బొందుదురు. తల్లిదండ్రులవలనం గలిగిన జన్మంబు జన్మంబు గాదు. ఆచార్యునివలన విద్యామూలముగఁ గలిగినజన్మమే జన్మాంతరనిరాసకారణంబు గావున శ్రేష్ఠజన్మంబు. అట్టిజన్మమునకు హేతుభూతుం డైనయాచార్యుండు తనకుఁ జేసినయితరదుష్కర శ్రేయముఁ దలపోసి యతని కెగ్గు సేయరాదు. నిత్యం బప్రమాదముతో నభివాదనముఁ జేయవలయు. శిష్యవృత్తిక్రమమున విద్యాగ్రహణంబు, గురువుపయింబోలెఁ దత్పుత్రకళత్రంబులపై భక్తి గలిగియుండుట, గురువు దనకుఁ జేసినమేలు నెల్లపుడుం దలపోయుచు నిమ్మహానుభావుని యనుగ్రహంబునం గదా వేద్యపరతత్త్వం బెఱుంగఁ జాలితిఁ గృతార్థుండ నైతి నని భావించి యతనియెడ నెడఁబాయని భక్తితాత్పర్యంబు గలిగియుండుట, మనోవాక్కర్మంబు లొక్కరూపకాఁ బ్రాణధనములనైనం గురువునకుఁ బ్రియముఁ జేయుట యను నాలుగు బ్రహ్మచర్యమునకు నాలుగుపాదములు. అట్టిబ్రహ్మచర్యవ్రతం బప్రమాదంబున నడుపుచు నాచార్యువలనఁ గొంతయు నిజమేధచేఁ గొంతయుఁ గాలవశమునఁ గొంతయు సహాధ్యాయులవలనం గొంతయుం గాఁ జతుష్పదసముల్లసితం బగు తెఱంగున విద్యను గ్రహింపవలయు. మున్ను చెప్పినజ్ఞానాదు లగుద్వాదశమహావ్రతంబులు, షడ్విధం

బయినత్యాగం, బహువిధం బయినయప్రమాదంబు, తద్ధర్మపరిపాలనసామర్థ్యం బు నాచార్యయోగంబుననే ఫలించు. బ్రహ్మచర్యంబును బ్రహ్మాత్మభావనంబున సఫలం బగు. బ్రహ్మచర్యంబున సిద్ధింపనియది గలుగదు. ఎవ్వరి కెయ్యది యభీప్సితంబో యయ్యది వారికి సిద్ధించు. బ్రహ్మచర్యముననే దేవతలు దేవత్వంబు గాంచిరి. ఋషులు లోకపూజ్యులయిరి. గంధర్వాప్సరసలు రూపాదులం బడసిరి. సూర్యుఁడు వెలుంగు. సర్వార్థసాధనంబయిన బ్రహ్మచర్యమునశ్వరఫలములందు వినియోగింపక శాశ్వతపరమార్థసాధనంబందు వినియోగించిజ్ఞానమున జ్యోతిర్మయంబయినపరతత్త్వంబుఁ బొందుట లెస్స. దానిఁబొందఁగ జ్ఞానంబు దక్క నితరం భేద్దియు మార్గంబు గా దనిన విని ప్రజ్ఞాచక్షుండు మునీంద్రా, పరమాత్మస్వరూపంబునకుఁగృష్ణపీతరక్తశ్వేతాదివర్ణంబులలో నెయ్యదియైనం గలదా? తదీయరూపం బెయ్యది యని యడుగ నప్పురాణముని యతని కిట్లనియె. పరమాత్మస్వరూపమునకుఁ గృష్ణపీతరక్తశ్వేతాదివర్ణములలో నెక్కటియుం గలుగదు. మఱియు ననిర్వాచ్యం బయినబ్రహ్మంబు పృథివ్యంతరిక్షాదులలో నెచ్చటనుం గానంబడదు. శరీరమునం జూపట్టదు. ఋగ్వేదాదివేదములందు నగపడదు. మఱి జ్ఞానాదు లగుద్వాదశమహావ్రతములం గూడినబ్రహ్మవిదున కాత్మయం దే యద్వైతముగఁ దోఁచుచుండు. అది సర్వవ్యాపకం బజ్ఞానావరణశూన్యులకు గమ్యంబు మహత్త్వాణుత్వస్థూలత్వాదిలక్షణపరిమాణవిరహితంబు. సర్వప్రపంచంబునకుఁ బ్రళయం బైనపదంపడి యాబ్రహ్మ మొక్కటియే నిత్యంబై యుండు. సృష్టికి ముందు నదియే యుండె. దాని నెఱింగినవారు ముక్తు లగుదురు. దేశకాలాదిపరిచ్ఛేదశూన్యుండయి నిత్యపరిపూర్ణుం డయిన పరమాత్మకంటె భిన్నుఁడు గామింజేసి జీవుఁడు నిత్యపరిపూర్ణుఁడు నపరిచ్ఛేద్యుండునై వెలుంగు. ఉపాధివశమునంజేసి మహాకాశఘటాకాశములకుంబోలె జీవాత్మపరమాత్మలకు భేదవ్యవహారము గలుగుచున్నదిగాని యది పారమార్థికంబు గాదు. సమాధియోగసమయమునం దపానంబుఁ బ్రాణమందును బ్రాణమును మనస్సునందును మనస్సును బుద్ధియందును బుద్ధిని బరమాత్మయందు నుపసంహరించి యోగులు నిర్వాణఘను లగుదు రనియిట్లు బహుప్రకారంబుల సనత్సుజాతుండు జీవేశ్వరతత్త్వంబు యుక్తిహేతుసహితంబుగా నుపన్యసించి నిజానుభవమునందు నట్లే తోఁచుచున్న దనిబోధించి తన్నిరూపణపరుండై యేన నీకుఁ దల్లియుఁ, దండ్రియుఁ, బితామహుఁడును, బుత్రుఁడు, నతీతానాగతవర్తమానంబులును, సర్వాత్మయు నయితి నని సర్వారోపంబుఁ బ్రతిపాదించి యట నాయందు మీరు నహంపదార్థవిషయంబును లే దని యధ్యస్తాపవాదంబు నిరూపించి నాకు నేన యధిష్ఠానంబు నేన జననకారణంబు నేన సర్వభూతాంతరాత్మ యని యివ్విధంబున బ్రహ్మాపరోక్షసాక్షాత్కారం బుపన్యసించి యద్వైతతత్త్వంబుఁ బ్రతిపా

దించుచుఁ బ్రజ్ఞాచక్షుండై నయాంబికేయునకుఁ గలసంశయములఁ బాపుచున్నం త నెట్టకేలకుఁ బ్రభాతంబయ్యె. అట దివ్యజ్ఞానమానసీయుండై నయమ్మునీంద్రుఁడు ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు చేసి యథేచ్ఛంబు చనియె. ధృతరాష్ట్రుఁ డమ్మునిహితోపదేశంబుఁ దలపోయుచు నిర్విణ్ణచిత్తుండై యుండె. అట వేఁబోఁకట నరవిరిసినతమ్మిపూమొత్తములక్రొత్తనెత్తావులం గొనుచుఁ బుప్పొడులమ్రేఁసనంబోలె మెల్లమెల్లన లేఁదెమ్మెరలు వీతెంచె. పాండునందనులసదాచారంబు ధార్తరాష్ట్రుల కింకనుం దెలుపకుండుట యుఱవు గా దనిబోధించుతెఱంగున శకుంతరవంబు లెసంగె. సంజయుండు రాయభార మొనరించునెడ నాక్రోలువుఁ గాంచువేడుక గడలుకొనినరీతి లోకబాంధవుం డుదయపర్వతశిఖరంబునం బొలిచె.

అట్లు సకలలోకమనఃపుండరీకసముల్లాసంబుగా సూర్యోదయం బగుటయుఁ గల్యకృత్యములం దీర్చి ధృతరాష్ట్రుఁడు భీష్మద్రోణకృపాశ్వత్థామసోమదత్తబాహ్లికభూరిశ్రవోవిదురశల్యకృతవర్మయుయుత్సుప్రభృతులును, దుర్యోధనదుశ్శాసనాదికుమారులును, శకునిజయద్రథాదిబంధువులును, కర్ణాదివీరులును, నానాదేశరాజులుం గొలువ నిండోలగంబున్నసమయమున సంజయుండు వచ్చి ఘణిహారువలనం దనరాక నెఱింగించిపుచ్చి యుచితవిధిం గొలువు సొచ్చి ధృతరాష్ట్రునకుఁ బ్రణామం బాచరించి రాజలోకంబుఁ గలయం గనుంగొని యే నీమహీపాలునానుజ్ఞచే నుపప్లావ్యమున కరిగివచ్చితి. అట నీరాజు పంచినపలుకులెల్ల నయ్యజాతశత్రునకు నివేదించి కార్యము తెఱంగుపడుచందముగాఁ గొన్నిమాటలాడితి నతం డిచ్చటివారలనెల్ల వయోగుణవిద్యాగౌరవంబుల కనురూపంబుగఁ బ్రణామంబునను, సత్కారంబునను, బ్రణయంబునను, వాత్సల్యంబునను, స్నేహంబునను సముచితరీతి నాదరించి యెల్లవారియనామయక్రమం బడిగి తనకుశలముం దగినవిధమునఁ జెప్పు మనివచించి కార్యవిషయంబునం బెక్కులు వలికి తుది నైదూళ్లయినను మా కిచ్చిన శాంతిఁ బొందుదు మనినవాఁ డని తత్ప్రకారం బెల్ల నిరూపించుచుండ ధృతరాష్ట్రుఁడు వానిం బిలిచి సంజయా, కార్యప్రసంగసమయమున ధనంజయుం డేమనినవాఁ డనియడుగ నతం డతని కిట్లనియె.

### సంజయుఁడు ధృతరాష్ట్రున కర్జునుఁడు చెప్పినమాటల నెఱింగించుట.

అర్జునుఁడు వాసుదేవునితోడ నేకాంతవినోదమున నుండి నన్నుఁ బిలిచి క్రోధరక్తాక్షుఁడై సంజయా, కురువృద్ధులు యుద్ధార్థంబు వచ్చినరాజు లందఱును నోరికి వచ్చినట్లెల్లఁ బ్రేలునట్టికర్ణుఁడును వినుచుండ దుర్యోధనునితో నిట్లనుము. అమ్మూఢుఁడు కాలపరిపాకమునం జేసి నన్నుఁ బోరికిఁ బిలువం దొడంగె. ఏమిచేయవచ్చు? ఆదురాత్ముఁ డజాతశత్రునకు రాజ్యముపాలియ్యనొల్లఁడేని వారు చేసి

నతొల్లింటిపాపకర్మంబు ఫలవంతం బగు. భీమార్జుననకులసహదేవవాసుదేవసాత్యకిధృష్టద్యుమ్నశిఖండిప్రముఖశూరవర్యులను దేవేంద్రతుల్యుఁ డైనయుధిష్ఠిరునిం బోర మార్కొ నవచ్చునే? అంతయు నట్లుండె. అజాతశత్రునియెడఁ గావించినమిథ్యాచారంబు రోదోంతరంబు దహించు. యుద్ధమే కర్తవ్యంబనుతలంపు ధార్తరాష్ట్రునకుఁ గలదేని పాండవులకార్యము నెఱవేఱినదియ కావున నాయుత్సాహముఁ జాలింపు మనుము. అట్లుగాక సమరమునకు సమకట్టి వత్తురేని ధర్మప్రవర్తనుం డైనకౌంతేయాగ్రజు నడవులం గఠినభూముల నలజడిపఱిచినందులకు ఫలముగా నాదుర్యోధనుఁ డాయోధనరంగంబునఁ బ్రాణంబులం గోల్పోయి దుఃఖశయనంబుఁ బొందుట నిక్కంబు. వా రెన్నియన్యాయములు చేసినను ధర్మరాజు తనకు సహజము లయినతపోదమార్జవాదిసుగుణసంపత్తిం జేసి యింతకు శాంతిమై నున్నవాఁడు. ఇట్లుండియుండి తనతోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వుచు వచ్చినకురుసైన్యముఁ జుఱచుఱం జూచెనేని తదీయక్రోధానలంబు మండి వేసవిం బేర్చినకార్చిచ్చు శుష్కతృణపుంజముల నెట్లట్ల యామూఁకలం గాల్పందొడంగినపు డాధార్తరాష్ట్రుఁడు పరితపించు. భీమసేనుండు రథారూఢుండై మోహరంబుసొచ్చి యోహటింపక కురుసైన్యమునం బెక్కండ్రుమహారథులం జంపునప్పుడు, నమ్మేటిమగఁడు రథము డిగి యుద్దండం బయినగదాదండంబు భుజాస్తంభంబున నమర్చికొని కాలాంతకుచందమున నురువడించి రౌద్రంబు మెఱయ గొడ్డంట నడవి నఱుకుతెఱంగున నేనుఁగులఁ గూల్చుచు గుఱ్ఱములఁ జదుపుచుఁ దేరుల నుగ్గుసేయుచుఁ బదాతులఁ జెండాడుచు నమ్మూఁకలనెల్ల నేలకుం గోలకుఁ దెచ్చునపుడునుం బశ్చాత్తాపవేపమానచిత్తుండై యాదుర్వృత్తుండు నామాటలం దలంచు. నకులసహదేవులు దాము పెద్దకాలం బడవులఁ బడిన పాట్లం దలంచి యాశీవిషములచాడ్పున రోఁజుచు సేనాగ్రమునం దతివిచిత్రగతుల మెఱసి యనేకరథికులతలలఁ దఱుగునపు డాదుర్యోధనుఁడు వగచు. రథయుద్ధకోవిదులు కృతాస్త్రులు నగుద్రౌపదేయు లేవురు ప్రాణములపై నాసపెట్టక కడిమి మెఱయఁ గౌరవులం దఱిమితఱిమి చంపునపు డాగాంధారేయాగ్రజుండు చింతించు. ఇంద్రోపేంద్రసదృశపరాక్రముం డైనయభిమన్యుండు మన్యువశుండై బలంబు చలంబునుం బొంపిరివోవ మొగ్గరంబు సొచ్చి ప్రావృట్పయోధరంబుచందంబున శరవర్షంబుఁ గురియించుచు నేట్లాడందొడంగెనేని యబాలవీర్యుం డైనయబ్బాలుం గనుంగొని యాధృతరాష్ట్రపుత్రుం డటుఁ జేయునది లేక పెన్వగలం బొగులు. మహారథులగు విరాటద్రుపదులు మాత్స్యపాంచాలసైన్యములు గొలువఁ బోరికి సమకట్టి నడచి వీరవిక్రమవిహారము సలుపుచు మామూఁకల విరియించునపుడు గదా యాదురాత్ముఁడు దురపిల్లు. శిఖండి యఖండవిక్రమాటో

పంబు దీపింప రథికులఁ బెక్కండ్రం జక్కాడుచు భీష్ముం గవిసి యలుగులసోనం బరఁగించునపుడును సంరంభావష్టంభవిలసితుం డైనధృష్టద్యుమ్నుఁడుత్సాహదోహళుండై సాహసంబున మోహారంబునం బొలిచి మీమూఁకలం జీకాకుపఱిచి ద్రోణాచార్యుం దలపడి యంపతుంపరం గురియించునపుడు నాకురుకులాధముండు గొందలం బందు. వానిమేలు గోరి నీవు యుద్ధము వల దని వారించి చెప్పుము. మహారథుఁడు మహాబలుఁడు భయరహితుఁడు ధనుర్విద్యాపారగుఁడు పరమాస్త్రవేది శినిమనుమఁడు నగుసాత్యకి మాకుఁగాఁ బ్రాణములనైన విడువనున్నవాఁడు. అతఁడు సమరంబున నద్వితీయుండు. వానివిల్లు తాళప్రమాణంబు అతండు నిక్కం బలిగెనేని కొండలనైనం బగులనడుచు. ముల్లోకములనైనను సంహరించు. వానిం జూచి పగవారు సింహగంధ మాఘ్రాణించినగోగణంబులట్టుల వెఱపు గదురఁ బాఱుట నిక్కువంబు. సమరయోగములెల్ల వానికి సువిదితంబులు. అమ్మేటివిలుకాఁడు ధవళతురంగమవిలసితం బయినమాధవస్యందనం బారోహించి సేనాముఖంబు సొచ్చి మధ్యందినమార్తండువడువున వెలుంగుచు సంతతం గలయఁ దిరుగుచుఁ గార్మొగులుచందంబున శరవర్షమునం గప్పునప్పు డప్పాపాచారుండు తాపంబుఁ జెందు. శ్వేతరథ్యయోజితంబు కపిధ్వజవిరాజితంబు వాసుదేవసారథికంబు నగుదివ్యరథమునం దాసీనుండనై నేను సంగ్రామరంగంబు సొచ్చి లయకాలరుద్రుమాడ్కి రౌద్రంబున మెఱసి వజ్రనిర్ఘాతసన్నిభం బయినగాండివజ్యాఘోషంబు భీషణంబై శ్రోత్రపుటంబులు సొచ్చి గుండియ లవియించుచుండ నాధనుర్వరంబున సంధించి యెక్కుపెట్ట పెక్కునారసంబులఁ బఱపుచు మ్రాఁకులనుండి పండ్లు రాల్చురీతి మీసైన్యమునం జేయంగలమేటిదొరలతలలఁ దఱుగుచు రథగజహయపదాతివర్గంబు ననర్గళమార్గణాసారంబున ముంచుచుసమంచితవిక్రమాటోపంబుఁ జూపుచుండ నాసంగ్రామరంగంబు కేశాస్థికపాలసంఘభూయిష్ఠంబై రౌద్రబీభత్సంబై యుండఁ బాంచజన్య దేవదత్తనిస్వనంబులు సింహనాదంబులతోడం గలసి రోదసీకుహరంబు నిండించునప్పుడుగదా నన్నును, వాసుదేవుని, దివ్యరథంబును, శ్వేతాశ్వంబులను, గాండీవంబు, నక్షయతూణీరంబులను, బాంచజన్యదేవదత్తంబులనుం గాంచి దుర్మతియు దుస్సహాయుండునై నమీరాజు తమ్ములు మంత్రులు భృత్యులుం దాను భ్రష్టైశ్వర్యతం జేసి యుక్కడిగి పశ్చాత్తాపంబుతోఁ జింతాసాగరంబున మునుంగు. ముందొక్కనాఁడు నదీతీరంబునఁ బూర్వాహ్ణంబున జపవిధిఁ దీర్చియున్నతఱి బ్రాహ్మణుఁ డొక్కరుఁడు నాయొద్ద కేతెంచి యోసవ్యసాచీ, శత్రువులతోడఁ బెద్దయుఁబోరాట నీకుఁ గాగలయది. ఇతరదుష్కరం బయినకార్యము నీచే నగు. శత్రుసంహారమున నీకు వజ్రహస్తుం డైనయింద్రుఁడు పూర్వభాగంబుననుండె

సుగ్రీవాదితురంగయోజితరథారూఢుఁడై నజనార్దనుండు వెనుకనుండె రక్షకుండై తోడుసూపుఁగాక యనివచించినవాఁడు. ఏనును వాసుదేవుఁ డీసమరమున నాకు సహాయుఁడై యుండఁగ నింద్రుఁ బ్రార్థించితి. దైవయోగంబున నా కదియు లభించె. గోవిందుఁ డేరికి నజేయుఁడు. సముద్రము నీఁదఁ బూనుటయు, వేసవిం బేర్చినకార్చిచ్చుం జల్లార్పఁ దలంచుటయు, సూర్యచంద్రులఁ జేతుల నడ్డగింప నుద్యమించుటయు, సురలు సూచుచుండ నమృతంబుఁ దేరం గడంగుటయు నెట్లట్ల జనార్దనుం గెల్తు ననితొడరుట కానిపని. మహాపర్వతంబును జేతం బగులఁ గొట్టుదు నని యెవఁడైనం బూని యడిచెనేనియు దాన నాకొండ కించుకేనియుఁ గొఱఁత గానంబడదు. మఱి యడుచువానిచేయి గోళ్లతోడ నొచ్చు. అవ్విధము ననే గోవిందుని మార్కొందు ననివచ్చినవాఁ డమ్మహాత్మునెదుట నిలువలేక తాను బలమఱి బమ్మరించు. అమ్మహానుభావునిచరిత్రంబులు రుక్మిణీహరణకంసనంహార సౌభభంజనమురనరకశిశుపాలవధాదికృత్యంబులు క్రొత్తలె? నరకాసురుని సంహరించి యదితికుండలములం గొంపోయి యిచ్చినపుడు దేవత లందుల కెంతయు మెచ్చి పోర డప్పి పుట్టకుండఁగను, జలంబునం దాకసమునందునుం బ్రచారం బప్రతిహతంబై యుండఁగను, మేన శస్త్రాస్త్రములు సొరకుండఁగను మూఁడువరముల నొసంగిరి. మఱియు మనకుఁ గొలఁదియిడరానిచిత్రచరిత్రంబులు జనార్దనునెడ నెన్నియేఁ గలవు. ఇట్టిమహాపురుషునిస్వరూపం బెఱుంగక ధార్తరాష్ట్రులతని మార్కొందు మందురు. ఇతఁడు మాకుఁ గా వారియపచారములనెల్ల సైఁచియున్నవాఁడు. మే మిరువురము యుద్ధార్థులమై వచ్చుచుండఁ బాండవాగ్రజుధనము హరింపఁగ వాని కలవియే. అది యిప్పుడేల యింత చెప్పవలయు? సంగ్రామసమయమున నంతయుఁ దాన యెఱుంగు. మేము పితామహునకునాచార్యులకును మ్రొక్కి మారాజ్యముఁ బడయం గోరియుద్ధముఁ జేయునెడ మమ్ము మార్కొనివచ్చువారితోనెల్లఁ బెనంగుదుము. కపటద్యూతంబున మమ్ము నోడించి మారాజ్య మొడిచికొనినను మే మందుల కేమియు ననక తత్ప్రకారంబె పండ్రెండేండ్లు వనవాసంబు పదుమూఁడవయేఁడు జనపదమున నజ్ఞాతవాసంబును సలిపి యిపుడు మారాజ్యముఁ గోరితిమి. మంచిమాటల నియ్యరేని పోరాటకుఁ గడఁగుదుము. ఇందు మాతప్పు నుంతేనియుఁ గానరాదు. మాకు రాజ్యముపాలీక కౌరవు లెట్లు రాజ్యస్థులై యుండఁగలరు? ఇంద్రాదిదేవతలు వారికిఁ దోడ్పడివచ్చినను వారల మేము గెలుచుట తప్పదు. మమ్ము వారు గెలుతురేని ధర్మము కంటె నధర్మమే బలవత్తరం బనియూహింపవలయు. దుర్యోధనుఁడు దనచేసిన పని యధర్మం బనియు మేము దమవారికంటెబలవంతులమనియుం దలంపక యొప్పరికించి రాజ్యముపాలియ్యఁడేని పుత్రమిత్రామాత్యభృత్యసైన్యగణము

తోడఁ దానుజచ్చుట సిద్ధంబు. ఇంతకుమున్న సర్వభోగంబు లననుభవింపుమనుము. నక్షత్రయోగాదిజ్యోతి స్సిద్ధాంతనిశ్చయజ్ఞు లగుపెద్దలు మేము గెల్తు మని చెప్పి యున్నవారు. వారలమాట తప్పదు. మఱియు దివ్యప్రశ్నములు మృగప్రశ్న ములు మున్నగునవియెల్లఁ గౌరవులక్షయంబును మాజయంబునుం దెల్పుచున్న యవి. వెండియు సిద్ధసంకల్పుఁ డయినయజాతశత్రుఁడు శత్రునిగ్రహార్థము సమ రముఁ జేయఁ బూనియున్నవాఁడు. అతనిసంకల్పంబు సఫలంబు గాకమానదు. మఱియుఁ బ్రత్యక్షసర్వార్థుం డైనజనార్దనుండు నిస్సంశయముగ రణమునఁ గౌ రవు లోడుదురనియు మేము గెల్తుమనియుం దలంచినవాఁడు. ఇమ్మహాత్మునితలం పెన్నఁడైనం దప్పునే? నామనంబుననుం బరికించిచూచినఁ గౌరవపరాజయంబు నస్మజ్జయంబును దోఁచుచున్నది. మఱియు గాండీవంబు దనకుఁ దానసజ్యంబ య్యెడి. గొనయంబప్రయత్నంబున సంచలించెడి. బాణంబులు తమకుఁ దామ తూణీరంబుల వెడలివచ్చెడి. పొర విడుచుపాముచందమున ఖడ్గ మొఱఁ బాసివ చ్చెడి. ధ్వజమునం దోకిరీటీ! యెన్నఁడు రథముఁ బూన్తు వనుమాట లతిరౌద్ర రూపములై విననయ్యెడి. రేలు కాకగృధ్రబకసృగాలాదు లఱచెడి. రక్షోగణము లంతరిక్షమునుండి నారథమునకు వెనుకఁ బడెడి. అంతయు నాలోచించిన మహా రణం బగుననియు నేను గౌరవుల నందఱం గెలుతుననియుం దోఁచు. బ్రాహ్మ పాశుపతైంద్ర స్థూణాకర్ణాదిదివ్యాస్త్రములం బ్రయోగించి నేన యందఱం జం పి యట శాంతిఁ బొందుదు. సంజయా, యీయర్థంబు నామది సుస్థిరంబై యున్న ది. దేవతలకైనం గెలువరానిమాతోడఁ బోరాట పెట్టికొను దుర్యోధనుదుర్బుద్ధి నేమని చెప్పుదు? పెక్కుమాట లేల? మేము భీష్మద్రోణ కృపాశ్వత్థామవిదురు లెయ్యది చెప్పుదురో దానిం జేయ నున్నవారము. కౌరవు లందఱు నాయుష్మం తు లగుదురుగాక. మోమోడక నామాటలెల్ల మీరాజునకుఁ దెల్పు మని యర్జు నుఁడు నాతోఁ జెప్పె నని సంజయుండు చెప్పిన విని భీష్ముఁ డారాజలోకంబు విను చుండ దుర్యోధనున కిట్లనియె.

భీష్ముఁడు దుర్యోధనునకుఁ గృష్ణార్జునులమహిమంబు చెప్పుట.

తొల్లి దేవేంద్రుఁడు వసురుద్రాదిత్యసాధ్యులు సప్తర్షులు గంధర్వాప్సర సలు బ్రహ్మయొద్దకుఁ జని యతనిం బరివేష్టించి కొలువున్నయెడ నచ్చటికి రాక వారల నెరసికొని పోవుచున్నవారల సర్వాతిశాయితేజోవిరాజితుల నిద్దఱము నులం గాంచి బృహస్పతి పితామహా, వీ రేల నీకొలువునకు రాక యటు చనుచు న్నవారు? వా రెవ్వ రని బ్రహ్మ నడుగ నతం డతని కిట్లనియె. తమదివ్యతేజ మున లోకములనెల్ల వెలిఁగించుచున్న యిమ్మహామునులు నరనారాయణులు. నిజ తపోబలమున లోకోత్తరులై యుండుదురు. సురరక్షణము నసురశిక్షణమునుం

జేయుదురు. వీ రిరువు రొక తేజంబె. అయినను రెండురూపములుగ వెలుంగుచుం డుదురు. వీరిమహిమం బనిర్వచనీయం బనివచించె. అంత దేవదానవసమరము పొసంగిన దేవేంద్రుఁడు బృహస్పతిప్రముఖదేవగణములతోడ నానరనారాయణు లతపోవనమున కరిగి సమరమునందుఁ దోడ్పడ వారలఁ బ్రార్థించుటయుఁ బరమ కారుణికు లయినయమ్మును లందుల కియ్యకొని వచ్చి దానవుల సంహరించి దేవ తలం గెలిపించిరి. ఆనరనారాయణులె యిప్పు డర్జునుఁడువాసుదేవుఁడు నన నవ తరించియున్నవారు. అధర్మయుద్ధములు పొసంగునెడ వార లవతరించి ధర్మపక్ష మునం జేరి ధర్మపరుల గెలిపింతు రని నారదుఁడు తొల్లి చెప్పినవాఁడు. అర్జునుఁ డింద్రప్రేరితుండై సముద్రగర్భమున హిరణ్యపురవాసులయిననివాతకవచుల నఱు వదివేవురఁ బౌలోమకాలకేయులను దేవతలకైన నజేయు లయినవారల సంహ రించె. ఖాండవముఁ గాల్చి యగ్నిదేవుం దృప్తుంజేసె. అప్పుడు నారాయణుఁడు పెక్కండ్రం జంపె. మఱియు నారాయణచరిత్రంబుఁ జెప్పఁ గొలఁదియె? వా రిరువురు దేవదానవాదుల కేరికి నజేయు లనుట సిద్ధంబు. ఇఁక మనుష్యులు గెలువఁ జాల రని చెప్పవలయునే? దుర్యోధనా, యిప్పుడు నామాట వినవేని సమరమున వాసుదేవార్జును లేకరథారూఢులై నీవారలఁ జించిచెండాడునప్పుడును భీముఁడు ప్రళయకాలరుద్రుచందమున నాభీలమూర్తియై గదావిహారము సల్పు నప్పుడును బశ్చాత్తాపంబుతో నామాటలం దలంతువు. కురుకులంబునకుఁ జేటు కాల మాసన్న మయ్యెఁ గాఁబోలు. కాకున్న హితంబు విననొల్లమి నీ కింత పు ట్టునే? మామాటలు విన నొల్లవేని చాటి చెప్పెద. అప్పుడు వారు నచ్చిరి వీరు పడి రనుమాటలే సర్వకాలంబు నీచెవులు సోఁకు. ఎంత చెప్పినను వినవు. అంద ఱు నీమేలు గోరుచున్నవారు. అందఱిమాటల నిరాకరించి కర్ణశకునిదుశ్శాసను లమాటలే మాటలుగా గ్రహింతువు. కర్ణుఁడు దుర్జాతుఁడు పరశురామశాపగ్ర స్తుఁడు. శకుని పాపాత్ముఁడు దుర్మతి. దుశ్శాసనుఁ డతిక్షుద్రుఁడు నీకుఁ దమ్ముఁ డనఁ దగినవాఁడు. ఆదుష్టాత్ములమాటలు నీవు వినక మానవు. ఏమి చేయుదు నను చున్నంతఁ గర్ణుఁడు సముదీర్ణకోపోద్దీపితుండై భీష్మున కిట్లనియె. పితామహా, యిట్లు చెప్పఁగ నీకుఁ దగదు. నేను స్వధర్మంబు దప్పక క్షత్రధర్మనిరతుండనై యున్నవాఁడను. నాయొద్దఁ బాపం బొక్కటియుఁ గానంబడదు. ఈధృతరాష్ట్రు డొండె, ధార్తరాష్ట్రులొండె నావలనం ద ప్పొకయింతేనియుం గనిరే? ఏను బాండవుల నందఱను రణమున గెలుతు ననియున్నవాఁడ. రాజునకుఁ బ్రియాచ రణంబు కాదె నాకుఁ గర్తవ్యంబు. కడచిననాళ్లెల్ల వైరంబు వాటించి యున్నవా రితో నేఁడే మని సంధిచేయఁ దగు? నన్నేల నీవు తూలనాడెదవు? నేను దుర్యో

ధనునకు రాజ్యము సుస్థిరంబై యుండవలయు నని యెప్పుడుం గోరియుండుదు నని చెప్పినం గటకటంబడి భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె.

## భీష్ముఁడు కర్ణునిదుర్ణయము ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

ఈరాధేయుఁ డెల్లపుడు నేను బాండవుల నందఱం జంపుదు నని తన కలవిగానిపని చేయుదు నని ప్రేలుచుండు. ఈనీచుఁడు పాండవులలోఁ గళామాత్రంబునుం గాఁడు. నీకొడుకులకుఁ గలిగినయనయమెల్ల నీదురాత్మునికృత్యంబ యని తలంచుము. వీని నమ్మి మందాత్ముఁడై నదుర్యోధనుఁడు దేవవరజనితులు శత్రునిర్మూలనపటిష్ఠులు నగుపాండుపుత్రుల నవమానించె. వారిలో నొక్కఁడొకఁడు చేసినపనులం దలంచి చూచిన నట్టిపని మనవా రందఱు నొక్కటియైనను జేయఁ జాలరు. విరాటపురికి వచ్చి యందఱం గెలుచుట వీఁ డెఱుంగడే? అప్పు డమ్మేటిమగండు వీనితమ్మునిం జంపినప్పుడు వీఁ డేమి చేసె? అతం డందఱితలచుట్లం గొనిపోవునపు డీతులువ యేయూరికిఁ బోయె. ఘోషయాత్రకుఁ బోయినపుడు గంధర్వులు చుట్టుముట్టి నీకొడుకుం జెఱ పెట్టికొని పోవునెడ నీబిరుదుమగఁడు నిద్దురవోవుచుండెనే? అప్పుడు భీమార్జుననకులసహదేవులుగారె విక్రమించి గంధర్వుల గెలిచి చెఱ దప్పించిరి. వారిపరాక్రమంబు క్రొత్తయే? పాపాత్ముఁడై నయీరాధేయుఁ డంతయు నెఱింగియు నీకొలువున నంతకుఁ దాను జాలుదు ననిపలికి యడియాసం గల్పించు. వీనికూఁతల నమ్మరాదు. నమ్మినం జేటు దప్ప దనుచున్నంత ద్రోణాచార్యుం డిట్లనియె. భరతకులశ్రేష్ఠుఁడై నభీష్మునివచనం బుచితంబు. ఇతఁడు మీ కెంతయుం గూర్చువాఁడు. ఏతద్వచనం బనుష్ఠేయంబు. కర్ణాదు లగునీచులమాట వినవలదు. పాండవు లెత్తిరాకమున్న సంధి చేయుట యొప్పు. అర్జునుఁడు చెప్పె నని సంజయుఁ డెయ్యది చెప్పెఁ దత్ప్రకారంబెల్ల నాసవ్యసాచి చేయక మానఁడు. వాని కెనవచ్చువిలుకాఁడు ముల్లోకములందునుం గానంబడఁ డని తెలియఁ బలికిన వారిమాటల ననాదరించి ధృతరాష్ట్రుఁడు సంజయుదిక్కు మొగంబై సూతపుత్త్రా, పాండవులవర్తనం బరసివచ్చితివిగదా. మనకుఁ బదునొకండక్షౌహిణులు చేరిన వని విని యజాతశత్రుఁ డేమనినవాఁడు? ఏమిపని చేయుచున్నవాఁడు? తమ్ములు కొడుకులు మున్నగువారిలో నెవ్వ రతనియాజ్ఞ ననువర్తించియున్నవారు? మనదురాత్ములకపటవర్తనంబునఁ గోపితుం డయినయతని కెవ్వరు శాంతి బోధింపుచున్నవారు. తత్ప్రకారంబు తేటపడం జెప్పు మనియడుగుచున్నంతఁ గొలువునం గూర్చున్న కౌరవు లందఱు ధృతరాష్ట్రుఁడు భీష్మద్రోణులపలుకుల ననాదరించుటం జేసి తమతమప్రాణంబులయెడ నిరాశులైరి. సంజయుండు ధృతరాష్ట్రుం జూచి నృపాలా, మత్స్యపాంచాలకేకయాదు లగుసకలరాజులును భీమార్జునాదులును ధర్మరాజునానతిం దలఁ దాల్చి నడుచుచు

నతం డెప్పు డెయ్యది యెవ్వరితోడం జెప్పునో యని యతని మొగంబునం జూడ్కులు నిల్పి కొల్చుచున్నవారు. వారు వీ రననేల? గోపాలురు మొదలుగా సకలజనులును సూర్యతేజస్కుం డై నయప్పాండవాగ్రజుం గొల్చుచు యుద్ధసన్నద్ధుం డై నపార్థుం జూడ వేడుకపడి యున్నవా రనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, వా రెవ్వరిం గొని మనపై నెత్తి విడియ నున్నవారు వివరింపు మనియడిగె.

## సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవపక్షవీరులఁ దెల్పుట.

అడుగుటయు సంజయుండు పెద్దయుం బ్రొద్దు నిశ్వసించి యక్కటా! యీ నృపాలుఁ డిక్లేల తెలిసితెలిసి యడుగుచున్నవాఁ డనిచింతించుచుఁ జేష్టలు దక్కి యూనిండుకొలువున నేల కొఱగినంజూచి విదురుఁడు ధృతరాష్ట్రున కభిముఖుండై మహారాజా, సంజయుం డొక్కమాటనైనం జెప్పనేరక మూర్ఛితుం డయ్యె నని తెల్పిన విని యాంబికేయుండు తనమనంబున నితండు మహారథు లగు కౌంతేయులవిక్రమంబు నెత్తికోలుం జూచి వెఱచినవాఁడుగాఁబోలు నని వగచుచుండె. అంత లోనం దెలిసి సంజయుండు లేచి కురురాజునకుఁ గేలుమోడ్పు ఘటియించి రాజేంద్రా, యేను నీయానతిచొప్పున నజ్ఞాతవాసాయాసకర్శితు లైనపాండుసుతులం జూచి వచ్చితిఁగదా. ధర్మనందనుండు రోషమునఁగాని, భయమునఁగాని, లోభమునఁగాని, హేతువాదమునఁగాని యొకనాఁడైనను ధర్మంబు దప్పఁడు. సకలజనులు ధర్మనిర్ణయంబున నతనిం బ్రమాణభూతుఁగా గ్రహింతురు. అమ్మహాత్ముండు తనరాజ్యమును నీతిమార్గమునఁ బడయఁ గోరి యయ్యుపాయంబునఁ గార్యంబు గొనసాగకుండినం బిదపఁ బోరికి నడుచు. నడిచెనేని ధర్మంబ యతనిం గెల్పించు. అతఁ డెవ్వరిఁ గొని మనపై నెత్తిరాఁగలవాఁ డనియడిగితివికదా. అందు నీయెఱుంగనివారు గలరే? అయిన నడిగిన నుత్తరంబుఁ జెప్పెద. ఏధనుర్ధరుఁడు సకలరాజులఁ దనకు వశవర్తులఁ జేసికొనియెనో, ఏమబలియుండు లాక్షాగృహదహనసమయంబునఁ దల్లి నన్నదమ్ముల నలువురను మోచికొనివచ్చి యయ్యాపద వారికిఁ దప్పించెనో, యేవీరుఁడు బకహిడింబకిమ్మీరప్రభృతుల వధించి మహాబలుఁ డనఁ బొగడికఁ గాంచెనో, యేమేటిమగండు పాంచాలీప్రియంకరుండై గంధమాదనంబున కరిగి యచటఁ దనతోడఁ బోరాటకుఁ దొడరివచ్చిన క్రోధవశాదిరక్షోగణంబులఁ బిలుకుమార్చి సౌగంధికంబుఁ దెచ్చి యిచ్చి ప్రియపత్నికి మనఃప్రియంబు బొనరించెనో, యేశూరుఁడు విరాటనగరంబున గూఢచర్యనుండునెడ ద్రౌపదిం గామించిన పాపాచారుఁ గీచకుఁ బీచమడంచి యశంబుఁ గనెనో యట్టియనిర్వాచ్యబలవిక్రమాటోపదీపితుం డైనభీమసేనుం గొనివచ్చువాఁడు. ఖాండవదహనాదు లయినగాండీవిపరాక్రమచరిత్రము లెన్నియేఁ గలవు. అవియెల్లనుగ్గడింపనైన మాబోంట్ల కలవి గాదు. అవియెల్లనట్లుండె. అతండు దే

వదేవుం డైనమహాదేవుం బోర మార్కొని తనయవక్రవిక్రమంబుఁ జూపి యతనికి మెప్పు గావించెనఁట. వానిబీరం బింత యని కొలఁది పెట్టఁ దగునే? ఆధనంజయుండు గలుగ ధర్మనందనుఁడు పోరికి సమకట్టిరాక యూరకుండునే? పశ్చిమదిశం గెలిచి యత్యంతవిచిత్రయోధి యనఁ బొగడ్తఁ గాంచిననకులుఁడును దక్షిణదిశం జయించి యశ్వత్థామధృష్టకేతురుక్మిప్రద్యుమ్నుల కెనవచ్చుశూరుఁడనం బేరు వడసినసహదేవుఁడునుం దోడ నడుతురు. భీష్మవధార్థంబు తపస్సుచేయుచుండి కాశీకన్యక యామేను దొఱంగి యటఁ బాంచాలరాజునకుఁ గూఁతురై పుట్టి యట యక్షునిమహిమమునఁ బురుషుఁడై శిఖండి యనఁ బేరు వడసి శస్త్రాస్త్రవిద్యలెన్న నేర్చి కళింగులం గెలిచి యుద్ధదుర్మదుం డనం బ్రఖ్యాతుండై నయప్పాంచాలరాజపుత్త్రుండు బాసట యగు. ద్రోణవధార్థం బగ్నికుండమున జనించి ధనుర్ధరశేఖరుం డనం బ్రశస్తిఁ గాంచిన ధృష్టద్యుమ్నుఁడు వారికి సహాయుండై వచ్చు. అర్జునున కెనవచ్చువిలుకాఁ డనం బొగడ్త కెక్కినసాత్యకి గలుగ వారికి లాఁతివారితోడ్పాటు వలయునే? బాలురయ్యు నబాలవిక్రములైన ద్రౌపదేయు లేవురు నహామహమికమైఁ గయ్యమునకుఁ దొడరుచున్నవారు. వీర్యమున రెండవవాసుదేవుఁడు శాంతి నపరధర్మనందనుండు నన నెల్లవారుం బొగడ నుతి కెక్కినసౌభద్రుండు చిచ్చుఱపిడుగువడువునఁ గురుసైన్యముఁ దొడరి పొడుతు నని పూసియున్నవాఁడు. మహాపరాక్రముం డైన ద్రుపదుండు, నజ్ఞాతవాసంబున వారికి శరణం బయినవిరాటుండును, వివిధాస్త్రవిదులయిన కేకయు లేవురు, నప్రతిమవీర్యుఁ డైనధృష్టకేతుఁడును, సమరదుర్మదుం డైనశిశుపాలపుత్త్రుండు, నుదగ్రశౌర్యుం డైనశరభుఁడును, సహజప్రతాపుఁ డయినజరాసంధతనయుఁడు, నప్రతిరథుఁ డైనజయత్సేనుఁడును, నానాదేశరాజులు ననేకులును వారికై ప్రాణములనైన విడుతు మని తెంపు చేసి వెంటనడిచి రా నున్నవారు. విశేషం బేల? సురలకు సురేంద్రుఁ డెట్లట్ల పాండుపుత్త్రులకు దనుజశత్రుండు పెనుఁబ్రాపై వారికి జయ మొసఁగుదు నని కడఁగియున్నవాఁడు. ఇఁక వారికి సాధింపరానియదియుం గలుగునే? ఎవ్వారిం గొని ధర్మరాజు మనపై నెత్తిరాఁ గలవాఁ డని యడుగుచున్న నీ కే మని చెప్పుదు. ఇది యంతయు నీ యెఱింగినదియకదా యని సంజయుండు పాండవపక్షంబునం గలవీరులం జెప్పిన విని ధృతరాష్ట్రుండు చింతాశోకవేపమానమానసుండై యతని కిట్లనియె.

### ధృతరాష్ట్రుండు భీమసేనుపరాక్రమంబుఁ దలంచి దుఃఖించుట.

నీచెప్పినమహోత్సాహు లందఱు నొక్కతల. భీమసేనుఁ డొక్కఁడ యొక్కతల. క్రోల్పులిం జూచినమృగంబుచందంబున నేను నిరంతరక్రోధశీలుండైనయావృకోదరున కెపుడు వెఱతు. రేలెల్ల దీర్ఘోష్ణనిశ్వాసంబులు నిగిడించుచుఁ

గన్నులం గూర్కుం జెందక పెన్వగలం బొగులుచు మేల్కనియుండుదు. ఇంద్ర తుల్యతేజస్కుం డైనయాభీముని మార్కొనుమగవాఁడు మనసైన్యంబున నొ క్కండును లేమి నిక్కంబు. వాఁడు చిన్ననాఁటంగోలె నాకొడుకులతోడఁ బగఁ బట్టినవాఁడు. ఎల్లపుడు మావారలఁ జఱచుచుంజూచుఁగాని పరిహాసంబుననైన నవ్వఁడు. వానిమెలుంగు గుండియ లవియించు. వానివేగోత్సాహబలములకుఁ గొలఁది యిడరాదు. కాంచనాలంకారభూషితంబు ఘోరాకారంబు నగునెనిమి దంచులయినుపగదం బూని యతండు సంగరాంగణంబున దండపాణి యగునంత కువిధంబున విహరించు. వానిగద బ్రహ్మదండంబు భంగి నప్రతిహతప్రచారంబై యుండుఁగాని యొకప్పుడైనను మఱలదు. వానిభోజనం బపరిమితంబు. బాల్య మునందును వాఁడు నామాట వినఁడు. మఱి తనకుఁ దోచినట్లెల్ల రభసుండై ప్రతికూలముగ వర్తించె. శైశవక్రీడలందును మాదుర్యోధనాదులు వానికిఁ జి క్కిన నేనుఁగుచేఁ బడినయలంతిమెకములచందమున నొచ్చి వెఱచి పాఱుదురు. ఆభీముఁడకదా నాకొడుకులకును బాండురాజుకొడుకులను భేదమురాఁ గారణం బయ్యె. వానిక్రోధావేగంబుఁ దలంచిన నిపుడే గజరథాదిసైన్యంబును మ్రింగు నట్లు నాక్రమోలం బొడగట్టెడి. వాఁ డస్త్రచాతుర్యంబున ద్రోణార్జునుల కెన యగు. వేగమున వాయువునకు దీటగు. క్రోధమున మహేశ్వరున కీడగు. సంజ యా, యంతటిశూరునిం బోర మార్కొని యోర్చుమగం డొకండు గలుగునే? ఇందాఁక వాఁడు మావారలం బిలుకుమార్పకునికియే మహాలాభం బని తలం చెద. ఈయడిబీరంపుతులువలం జంపుట వాని కొకపెద్దపనియె? భీమబలు లయి నయక్షరాక్షసులం బలువుర వధియించె నన వినమే? ఇఁక మనుష్యమాత్రుండు వానిందలపడి బ్రదికి వచ్చు ననియూహింపఁ బోలునే? పుట్టిననాఁడు మొదలుగా నేఁటిదాఁక నెక్కనాఁడైనను వాఁడు నాశిక్షం బెరుగఁడు. నాకొడుకులతోడ సహజవైరముఁ బాటించియున్నయతండు బోరికిఁ దొడరి దైవవశమున నోడిన నోడుఁగాని నేఁడు శాంతిఁ బొందునే? వాఁ డోడు ననుట యెక్కడిమాట? చి న్ననాఁటనే మాతులువలఁ బొడుచుచుండు. ఈదురాత్ములయపచారంబునఁ గ్రో ధవిషంబు గక్కుచుఁ ద్రొక్కవడ్డపాముపగిది మీఁదఁ గవియునిప్పటిభీమసేనుం డు తనకార్యంబు సఫలంబుఁ జేసికొనకుండునే? అడ్డముగ మొగముఁ ద్రిప్పి రో షావేశమున బొమలు ముడివెట్టి వాఁ డొక్కచూపు చూచెనా మనవారిమనం బులు తల్లడిల్లు. మొగంబులు పల్లటిల్లు. పాండవులమనంబులు సంతసిల్లు. ముఖంబు లుల్లసిల్లు. వేదవ్యాసమునీంద్రుండు చిన్ననాఁడే వానిం జూచి యీకుమారుం డ ప్రతిహతవిక్రముండని నాకుఁ జెప్పినవాఁడు. క్రూరపరాక్రముం డైనయావృకో దరుం డుద్దండగదాదండమున నేనుంగులు గుఱ్ఱములు తేరులు మున్నగునెల్లసైన్య

మునుం బొడిచేయక విడువఁడు. వానిమతమునకు విరుద్ధముగఁ జేసి నే నిన్నినాళ్లు వాని నలిగించితి. అదియెల్ల వాఁడు మఱచునే? వానియుద్దండగదాదండంబుశ్రే టును నాకొడుకు లెట్లు సైరింతురో? అపారంబు నగాధంబు నౌప్రచారశూ న్యంబు నగుభీమసేనుఁ డనుజలదుర్గమును మందాత్ము లగుమావారలు గడవ నీఁదఁ దలఁచినవారు. నే నెంత యెఱచి వారించినను బండితమ్మన్యు లగుటం జేసి యొక్కించుకేనియు వినరు. ఆరోహింప నలవిగానియున్నతప్రదేశమున నుండుతే నియఁ గొనువారిచాడ్పునఁ దమ కాక్రమింప నలవిగానిపాండవసంపదఁ గొనఁ బూని మావారు మీఁద వచ్చుచేటుఁ బరికింపక తమపాలిటిమృత్యు వైన భీమ సేనుతోడం బోరాడఁ గడఁగుచున్నవారు. సింహమునకు మృగంబు లెట్లట్ల వృకోదరునకు వీరు బలి యగుదు రని దైవతంత్రము గలదుకాఁబోలు. అవ్వాఁ డిమగండు వేఁడిమి మెఱయ మనమొన సొచ్చి సెలవుల నాకుచు వీఁక నెదిర్చి యార్చి పేర్చి ఘోరం బయినతనగదాదండంబు గిరంగిరం ద్రిప్పి మత్తశుండాలం బు పుష్పితపాదపంబులంబోలె నెదురునడ్డమేనుంగులఁ బీనుంగులం గావించియు, గుఱ్ఱముల రావుతులతోడం ద్రెళ్లించియుఁ, బదాతిసంఘాతంబులఁ జెండా డియు,యుగవిగమసమయరుద్రుచందంబున రౌద్రంబు నెఱపి మనసైన్యంబు గల గుండువడ వీథులం దీర్చి వీరవిక్రమనృత్యంబుఁ గావించు. మండుచున్నదావానలం బుఁ జొచ్చియైనను నాకొడుకులు తప్పించికొన నేర్తురుగాని వానిబారిం బడిబ్రదు కనేరరు. మఱి భయార్దితులై దిక్కు దోఁపక పాఱిపోవుదురు. భీమసేనునిబలపరా క్రమముల నే మని వచియింతు? మగధదేశనాథుఁడై నజరాసంధుఁడునిరుపమానం బయిననిజవిక్రమంబున రాజులనెల్లం గెలిచి భూమండలంబెల్లఁదాన యేలుచుండెఁ గదా. అప్పుడు భీష్మునిప్రభావంబునఁ గౌరవులును నయమున యదువృష్ణిభోజాంధ కులును వానికి వశులుగాక యెట్లో కాలంబు గడపి రది దైవబలంబు. అట్టిలో కోత్తరబలవీర్యగర్వితుం డయినజరాసంధుం దెగటార్పఁగ నావృకోదరుండు పుం డరీకాక్షసహాయుండై తదీయాంతఃపురంబు సొచ్చి యాయుధప్రచారం బొకించు కేనియు లేక మల్లయుద్ధంబునం బెనంగి వానిం జంపె. ఇంతకంటె నెండొక్కటి వలయునే? వాఁడు తనదీర్ఘవైరంబు సఫలంబుఁ జేయు. ఇంద్రునివజ్రాయుధము నకు దానవు లెట్టు లట్టుల భీమునిగదకు నాకొడుకు లెర యగుదురు. ఇపుడు తలం చికొనినఁ గ్రోధతామ్రాక్షుండు తీవ్రవేగవిక్రముండునై యతండు మావారిపైఁ బడ వచ్చుచందమున నామనంబునం దోఁచెడి. గదాధనుఃఖడ్గాదిసాధనము లెవ్వి యు లేక బాహుయుద్ధముఁ జేయునెడనైన వానిమెదుట నెవండు నిలువ నోపు? భీష్మద్రోణకృపులును వానిబలమును లెస్స యెఱుంగుదురు. భీష్మునకుఁ బౌత్రు లగుటం జేసియు ద్రోణకృపులకు శిష్యు లగుటం జేసియు పాండుపుత్రులు నాపు

త్రులు నెక్కురూప యయినను మాయొద్దనుండునందులకుఁగా క్షాత్రధర్మం బవలంబించి వారితోడం బోరాడుదు మనియున్నవారు. వారలే జయింతు రని తెలిసి తెలిసియుఁ గొడుకుల వారింపనైతి. ఏమిచేయవచ్చు? దైవవశమునఁ గానున్నది కాక మానదు. యుద్ధమరణము క్షత్రియుల కుచిత మయినను బెక్కండ్రు పాలియుదురుగా యని నామనంబు చింతాదంతురం బయ్యె. విదురుఁడు తొలుతనే పాండవులతోడిపగవలనఁ గులక్షయం బగు నని తల నోరు పెట్టుకొని యఱచి చెప్పె. విన నైతి. దుఃఖములు పొసఁగునెడ నున్నజ్ఞానంబునుం బ్రయోజకంబు గానేరదు. లోకవృత్తాంతములనెల్ల లెస్స దెలిసినమునులును సుఖదుఃఖములు వచ్చునెడఁ గుడిచిరకాని తప్పించికొన నేర్చిరే? సర్వవిషయంబులనుం బెక్కు దెఱంగుల మోహముఁ బొందినన్నుఁ జెప్పికొన నేల? పుత్రులఁ, బౌత్రుల, బంధుల, రాజ్యంబునుం గోల్పడవలసివచ్చె. జూదంబునాఁటనుండి కౌరవులకుఁ బెద్దయుఁ జేటు వాటిల్లె. మందమతి యైనదుర్యోధనుఁ డింతచేసె. రథచక్రంబుచాడ్పున సుఖదుఃఖములు రెండునుం బర్యాయమునఁ దిరుగుచుండు. ఎప్పు డెయ్యది వచ్చిన నప్పు డద్దానిం దప్పించికొన నగునే? ఎయ్యది చేయుదు? ఎయ్యది విడుతు? ఎట్లు వర్తింతు? ఎక్కడ కేగుదు? ఎయ్యది గతి? కౌరవు లందఱును నాకొడుకులు నూఱుగురును హతు లయినపదంపడి విధవ లగుతద్భార్యలశోకస్వనంబు వినఁగ బ్రదికియున్నవాఁడ. ఇందఱకు వచ్చుచావు నా కేల రాదొకో! మఱియు వేసవిం బేర్చినకార్చిచ్చునకు గాడ్పు తోడ్పడుచాడ్పున నావృకోదరునకు ధనంజయుండు బాసటయై నడిచి తనచెప్పినమాటనెల్ల సత్యములుగాఁ గావించు. వానిమాట లెన్నఁడుం దప్పవు. వానితోడ్పాటు గలిగిన ముల్లోకములయినను సాధింపవచ్చు. సంగ్రామరంగంబున బహుళశరాసారంబుఁ గురియించు నాగాండీవిఁ బోర మార్కొని చక్క నిలుచు మగవాఁ డొక్కఁడు నెంత చింతించినను నాకుం జూడఁ దోఁపకుండెడి. అస్త్రవేదు లపరాజితులు నగుద్రోణకర్ణులు వాని మార్కొందురు గాని కర్ణుఁడు జుగుప్సాప్రమాదములకలిమిం జేసియు నాచార్యుఁడు వృద్ధుఁ డవుటంజేసియు గెలువ నోపరు. పార్థుఁడు సమర్థుఁడు, బలవంతుఁడు, ధనుర్ధరవరేణ్యుఁడు, జితశ్రముఁడు నగుటంజేసి యందఱం గెలుచు. వాని నెవ్వరుం గెలువఁ జాలమి నిక్కువంబు. లోకమునం బెక్కండ్రు మేటివిలుకాండ్రు బహుళాస్త్రముల నెఱింగినవారు సమరములందు జయాపజయములఁ బొందుచున్నవారుగదా. అర్జునుఁడొక్కరుఁ డెక్కడనుం బరాజయంబు గానక విజయమునే గాంచుచు విజయుడనం బేరు వడసినవాఁడు. ఖాండవదహనాదు లగువానిచరిత్రములు నందఱకుం దెల్లంబు. వాఁడు నాకొడుకులయెడ నెట్లు శాంతిఁ గొను? అయ్యర్జునుఁడు నిస్సహాయుఁడై యుండియే చేసినపనులు లాఁతులకుఁ దలఁచి చూడ వెఱఁగుఁ గావిం

చెడి. అవ్వీరునకు గృష్ణుఁడు సారథియఁట. గాండీవము ధనుస్సఁట. ఇఁకఁ జెప్ప నేల? అర్జునునఁ గెనవచ్చురథికుఁడు కృష్ణునకు సరి యగుసారథి గాండీవమునకుఁ బోల్పఁ దగువిల్లునుం జగంబున నెచ్చటను లేమి నిక్కంబు. మందమతు లగుమనవా రది యెఱుంగరు. తలపైఁ బడినపిడుగైన నొక్కవేళ నొక్కింత మిగిలించినను మిగిలించుఁగాని యర్జునశరములు మిగిలింపవు. వానివిక్రమము డెందమునం దలంచికొనిన నతండు సంగ్రామరంగంబుఁ గలయంజొచ్చి బాణజాలంబు గురియించి పెక్కండ్రతలలు డొల్లిపడం జేయుటయుఁదదీయమార్గణ తేజంబునకు వెఱచి మనసేన దిక్కుఁ గానక తోఁచినకెల్లఁ బాఱెడిచందంబు దోఁచుచున్నది. గాడ్పుతోడ్పాటునం జేర్చినకార్చిచ్చు శుష్కతృణపుంజంబునుంబోలె కృష్ణసారథ్యచోదితుం డైనసవ్యసాచి మనవారల నీఱుసేయకుడుగునే? అర్జునునిచే బహుప్రజాక్షయ మగు నని విధియేర్పాటు గలదుగాఁబోలు. దైవకృతంబుఁ దప్పింప నేరు నేర్తురు? ఇంటఁ గూర్చుండి యిఁక వారుపడిరి వీరు పడిరి రనుమాటలు వినవలసియుండునొకో? సంజయా, యేమి చేయుదు? పాండవులకుఁ దోడ్పడ వచ్చినమత్స్యపాంచాలకేకయమగధాది దేశనాథులును వారికిఁగాఁ బ్రాణముల విడుతు మనిదృఢనిశ్చయముతో నున్నవా రని నీవ చెప్పితివిగదా. వెండియు ముల్లోకములం దనవశమున నునిచికొనఁ జాలునట్టి మహానుభావుఁ డగుకృష్ణుఁడు పాండవుల గెలిపింతు ననిపట్టినవాఁడు. ఇఁక గెలుపు వారిసొమ్ము గాని లాఁతుల దగునే? అర్జునునొద్దనే సర్వాస్త్రముల నేర్చి యతని కెనవచ్చు సాత్యకియు, బాంధవస్నేహమునఁ దన బ్రదుకు వారలతోడిదే యని భావించు ధృష్టద్యుమ్నుఁడుం గలుగ వారు గెలువకుండుదురే? వారిబారిం బడి మనవారు బ్రదుకనేరరుగా యని నేఁజింతించెద. ధర్మరాజుకోపముఁ దలంచికొనిన నేమియుం దోఁపదు. భీమార్జున పరాక్రమముకంటె వానికోపమే నాకు భయజనకం బయ్యెడి. అయ్యజాతశత్రుఁడు దృఢచిత్తుఁడు లక్ష్మీవంతుఁడు తపోనిష్ఠుఁడు ధర్మాత్ముఁడు క్రౌర్యరహితుఁ డుదారుఁడు సత్యపరాక్రముఁడు బహుశ్రుతుఁడు వృద్ధోపసేవి జితేంద్రియుఁ డకార్యములదెసం బోవనివాఁడు. ఎల్లవారుం దనయెడ భయభక్తివినయవిశ్వాసంబులు నెఱపుచందమునఁ జూచికొన మిగుల నేర్పరి. అతనిమిత్రామాత్యులు తమ్ములు బంధువులుం దత్కార్యార్థం బెంతకైనం దెగింతురు. సర్వగుణవిలసితుం డైన యాధర్మరాజును మార్కొనఁ బోవువాఁ డెవ్వఁడైనను జిచ్చుపయిం బడుమిడుతలట్లు చెడుట సిద్ధంబు. అగ్నికల్పుం డైనధర్మరాజునకు నే నెన్నియేని రిత్తయుపచారముల నొనరించితి. దానం గోపించినయతండు భండనమున నాకొడుకులఁ జంప కుడుగునే? యుద్ధమునందు నిక్కంబుగఁ గులక్షయం బగు. కావున వారితోడిపోరు మానుటయే శ్రేయస్కరం బిది నామతంబు. ఎల్లవారిమతం బిట్టిద

యగునేని యిఁక శాంతికై యత్నముఁ గావింతము. ఇప్పుడు యత్నించినను సహజశమదమమార్దవాది సుగుణవిలసితుం డగుటంజేసి ధర్మజుండు తమ్ముల నెట్టులైన నియ్యకొల్పి శాంతిం బూని మత్ప్రియంబు కర్తవ్యం బనుతాత్పర్యంబుతోనైనం గార్యము తెలియంగుపఱుచు నని ధృతరాష్ట్రుఁడు పలికిన విని సంజయుండు వెండియు నతని కిట్లనియె.

రాజేంద్రా! నీవచించినదంతయు నిక్కువంబ. యుద్ధమందు గాండీవంబుచే క్షత్రియక్షయం బగుట తప్పదు. సవ్యసాచి బలవిక్రమముల నెఱింగి నీవు పుత్రవశుండవై పాండవులం జేకొనమి యెంతయు నిప్పటి కొప్పనిపని. చిన్ననాఁటనుండియు నీవు వారికి రిత్తయుపచారములే యొనరించితివిగదా. తండ్రియు నత్యంతమిత్రుండు ప్రియహితములనే సల్పుదు రని లోకమునం బ్రసిద్ధంబు. వారికి నీవు తండ్రివయ్యుఁ దగనిపనులఁ జేసితివి. ద్రోహముఁ జేయువాఁడు తండ్రి యగునే? ఆపాపపు జూదమాడునప్పుడు పాండవు లధర్మమున నోడుటకు వగపుమాని నీకొడుకులగెలుపున కుబ్బుచు నేమియుం దెలియనికొండికలచందంబున నీమణులు మనకు లభించె నీధనము మనకు వచ్చె నీవాహనముల మనము గెల్చితి మని నోరికి వచ్చినట్లు పల్కుచు నవ్వుచుంటివి. నీకొడుకులు వారలతోఁ బ్రల్లదములు పలుకుచు నుల్లసమాడుచుండిన నమ్మాటలం జెవుల దోయిలించికొని వినుచుంటివిగాని యిది తగదని వారింపవైతివి. మఱి రాజ్యమెల్ల మనకే వచ్చె నని సంతోషముతో మీఁద వచ్చుచేటుం గానవైతివి. కురుజాంగలములు మీకుఁ బిత్ర్యం బయినరాజ్యంబు. అటఁ బాండురాజపుత్రులు పరాక్రమమున దిగ్విజయంబుఁ గావించి భూమండలంబెల్లఁ దమవశమునం బెట్టికొనిరి. మాయచే వారిసంపద నొడిచికొని యీరాజ్య మంతయు మేమ సాధించితి మనితలంచెదవు. ఇది యొప్పదు. పాండవులు రాజ్యమును గలధనమునుం గోల్పోయి యడవులకుఁ జనునపుడు నీవును మీవారును సంతసంబున నవ్వుచుండినను నీకొడుకులు ఘోషయాత్రకుఁ బోయి గంధర్వులచేఁ జిక్కి గడవరానియాపత్సముద్రమున మునిఁగినపుడు వారు ధర్మపరులు గావున మీచేసినయెగ్గుల నప్పుడు తలంపక వచ్చి గంధర్వులం గెలిచి మీవారలం బ్రదికించిరి. అప్పు డర్జునుండు రక్షింపఁడేని యిందాఁకనైన నీకొడుకులు బ్రదికియుండుదురే? అవ్వాఁడిమగండు కడిమి మెఱయ శరవర్షంబుఁ గురియింపం దొడంగినం దదీయబాణానలమున సముద్రము లింకు. ఇఁక మనుష్యమాత్రులం జెప్ప నేల? ధనుర్ధరులలో నర్జునుఁడు శ్రేష్ఠుఁడు. ధనుస్సులలో గాండీవం బుత్తమంబు. సర్వభూతములలోఁ గేశవుం డధికుండు. చక్రములలో సుదర్శనము వరము. కేతనములలోఁ గపికేతనము ప్రశస్తం బని సుప్రసిద్ధంబుగదా. అవియన్నియు నొక్కచోఁ గూడిన మార్కొందు

మనందగునే? ఎవ్వనిగెలుపు గోరి భీమార్జునులు పోరాడుదురో సర్వభూమండలంబును వానిసొమ్ము. ఆపత్సముద్రమున మునుఁగుచున్న నిజసైన్యంబుఁ జూచి దుర్యోధనాదులు క్షయముఁ బొందుదురుగాని గెలువనేరరు. పార్థపరాక్రమమును లెస్స యెఱుంగుటంగాదె మత్స్యపాంచాలకేకయసాళ్వేయ శూరసేనాదులు నిన్ను గణింపక వారిదెసం బోయి వారిపైఁ గలప్రేమంబున నీకొడుకులతోడఁ బగఁ జేసిరి. నిస్సహాయుండై యున్నను ధనంజయుం గెలువరాదనఁగబహుళసేనాసమన్వితుం డైనయవ్వీరుం బోర మార్కొని బ్రదుకవచ్చునే? కావున నింకఁ గర్తవ్యంబుఁ జెప్పెద నీసు మాని వినుము. పాపాచారుం డైనదుర్యోధనుండు పరమధర్మాత్ము లగుపాండవులకు నిష్కారణంబ యెన్నియే నెగ్గులు సేసి వారల నలిగించినవాఁడు. పుత్రుం డని తలంపక సర్వోపాయంబుల నప్పాపాత్ముని నిగ్రహింపనవలయు. వాని నొక్కని నిగ్రహించినం గులంబు సురక్షితం బగు. శోకంబు విడిచి యీపని సేయుము. మే లయ్యెడి. ద్యూతసమయముననే యీయర్థమును నేనును విదురుఁడునుం జెప్పితిమిగదా. అప్పు డసమర్థత నాగోపించికొని యొప్పరికించుటంజేసి యిప్పు డింత పడవలసివచ్చె నని చెప్పుచున్నంత సంజయుని నిరాకరించి దుర్యోధనుండు తండ్రి కిట్లనియె.

దుర్యోధనుండు తండ్రితో స్వపక్షవీరులసామర్థ్యముఁ జెప్పుట.

మహారాజా, భయపడవలదు. మమ్ము గుఱించి చింతింపను వలదు. మేము శత్రువుల జయింప సమర్థులము. అడవుల నాకులు మున్నగువానిం దినుచుఁ గడు నిడుమలఁ బడినపాండవులకుఁ గృష్ణుఁడు కొందఱు రాజుల సహాయులఁ గూర్చి నిన్నుఁ దిట్టుచు రాజ్యమున సగ మీకున్న యుద్ధమునకు వత్తు మన్నమాత్రనే యేల వెఱవవలయు? నీవారికిఁ జేటును బాండవులకు రాజ్యలాభంబునుం గావింపవలయు ననుటయే వారికి ముఖ్యతాత్పర్యంబు. మత్స్యపాంచాలకేకయాదులం గూర్చి వారు తాము నొకగట్టిమొన గట్టియున్నవా రని విని తొలుతనే నేను భీష్మద్రోణకృపులం బ్రార్థించి మనకుఁ దోడ్పడున ట్లొడంబఱిచికొంటి. విదురుఁడు నీవుం దక్కఁ దక్కటివారల మమ్మెల్ల వధియించి రాజ్యమెల్ల యుధిష్ఠిరున కియ్యవలయు నని వాసుదేవుండు పట్టియున్నవాఁడఁట. అందులకు వెఱచి మే మింక వారికి మ్రొక్కను బాఱిపోవనుం దెగింతుమే? ఏల మే మట్లు చేయవలయు? క్షాత్రధర్మమున నిల్చి ప్రాణములనైన నాసింపక పోట్లాడెదము. మనకుఁ గలసహాయము వారికిఁ గానరాదు. సమరమునకుఁ దోడ్పడ వచ్చినరాజులెల్ల మాయెడ విరక్తిఁ బొందియు సఖులు సఖ్యంబు మానియు సకలజనులు మమ్ము ధిక్కరించియుఁ బాండవులయొద్దఁ జేరి వారికి గెలు పిచ్చి మ మ్మోడింతురేని యంత పుట్టినప్పటి కయ్యది కాలప్రాప్త మని భావింతుము. పగవారల గెల్చు

ట యంత పెద్దపని గాదు. మే మోడుదు మనియు వారు గెలుతు రనియు నెల్ల ప్పుడు వగచుచున్న నీవగపు వారించుట దుష్కరకృత్యంబ యి నిలిచె. నీకొడుకు లు సామాన్యులే? శత్రువిజయంబు వీరికి దుష్కరంబె? ఇంతకుము న్నెన్నిమా ఱులు వీరు పగవారల నిగ్రహించుట నీకును విదితంబకదా. మనకుఁ బెనుప్రా పయినభీష్మద్రోణకృపాశ్వత్థామలు ము న్నొకనాఁడు చింతాకులచిత్తుం డైనన న్నుఁ బిలిచి కుమారా, నీకు వగపు వలదు పగవారలకు వెఱవవలదు. ఎంతటి శూరులనైనను మాలో నొక్కఁడైనం జంపఁ జాలును. మేము నలువురము గలు గ శత్రుభయము నీ కేల యని చెప్పినవార లిప్పుడామాటలఁ దప్పుదురే? వారి పరాక్రమము మనమును వినియుందుముగదా. శంతనుఁడు లోకాంతరగతుం డైనపదంపడి యీభీష్ముఁడు గ్రీష్మాదిత్యుచందమున వాఁడిమి మెఱసి యుద్ధమున కు సన్నద్ధుండై వెడలినం జూచి రాజు లందఱు వెఱచి వేఱొండుగతిఁ గానక యీతని శరణుసొచ్చి కాదె బ్రదికిరి. మఱియు నీమహానుభావుండు తండ్రిచిత్తం బారాధించి తనకుఁ గోరిక లేకున్న మరణము గలుగకుండునట్లు వరముఁ బడసి నవాఁడు. బ్రహ్మర్షితుల్యుం డైనయీమహాత్ముని దేవతలైనం జెనకనేరరు. భర ద్వాజగౌతములవలన ద్రోణశరస్తంబములం బుట్టినద్రోణకృపాచార్యు లయోనిజు లు సకలశస్త్రాస్త్రవేదులు. వీరికిం జావు గలుగదు. అశ్వత్థామ యీశ్వరవరము న నయోనిజు లగుతల్లిదండ్రులకుఁ బొడమినవాఁడు. ఇతఁ డత్యంతశూరుం డవ ధ్యుండు. ఈనలువు రొక్కనాఁటిలోఁ బ్రయుతరథికులఁ జంపఁ జాలుదురు. వీరి లో నొక్కండైన నర్జునుం గెలువకపోఁడు. అందఱు నొక్కటియై మార్కొనిన వాఁ డెట్లు బ్రదుకు. అతండు సంగరాంగణంబున వీరిచేఁ బడుట నిక్కంబు. వెండియు వీరికిఁ దుల్యుం డయినకర్ణుండు నాకుఁ గలఁడు. జామదగ్న్యుఁ డైనరాముఁడు తన కీరాధేయుండు సమానుఁ డని యానతిచ్చె. దేవేంద్రుఁ డితనికవచకుండల ములు శచీనిమిత్తంబు గొనిపోవునప్పు డమోఘం బయినఘోరశక్తి నితనికిఁ బ్రసాదించి యిచ్చె. ఆశక్తి గలుగ ధనంజయుండు బ్రదికిపోవ నేర్చునే? మఱి యు నర్జునుతోడం బగఁ బట్టినవారు సంశప్తకు లనేకులు నాకుఁ దోడు గలరు. వా రర్జునుం జంపుదు మొండె వానిచేఁ జత్తుమొండె నని దృఢనిశ్చయముతో నున్నవారు. మఱియు సోమదత్తబాహ్లికభూరిశ్రవోభగదత్తశకునిజయద్రథశల శల్యప్రభృతు లగురాజవర్యులును దుశ్శాసనదుర్మహశ్రుతాయుచిత్రసేనపురుమి త్రవికర్ణాదు లగుకుమారులు నర్జునునకుఁ దుల్యు లధికులు నగువారు పెక్కండ్రు గలరు. పాండవు లేవురు వారికిఁ దోడ్పడువారిలో నుత్తములు ధృష్టద్యుమ్న సాత్యకులు మున్నగువారు కొందఱే కావున వారల వీరు జయింపక మోడుదు రే? మఱియు మాబలంబు సారవంతంబు. వారిబలంబు నిస్సారంబు. మాకుఁ

గూడినసేన పదునొకండక్షౌహిణులు. వారికిఁ గూడినవి యేడక్షౌహిణులు. మూ డింట నొక్కపాలు తక్కువగుసైన్యంబుతోడ యుద్ధంబు కర్తవ్యం బని బృహస్పతి వచించె. వారిబలముకంటె సారవంత మధికము నగుబలంబుఁ జేర్చికొనిన మే మేల వెఱచి యూరకుండవలయు నిది నానిశ్చయంబు. మఱియు భూమండ మెల్ల నిపుడు నావశమున నున్నది. పాండవులు ఱెక్కలు దెగినపులుఁగులచందమున రాజ్యహీను లగుటం జేసి దుర్బలులై యున్నవారు. నాకు సహాయులై వచ్చినరాజు లందఱు నాతోడ నగ్నిం జొరనైనను సముద్రమునం బడనైనను దృఢనిశ్చయులై తెంపు చేసి యున్నవారు. నీవగపుఁ జూచి యీకురువృద్ధుం డేలొకో వెఱ్ఱిచందమున వెఱచి వేవిధముల విలపించుచున్నవాఁడని నవ్వుచున్నవారు. అందఱుం బాండవులం జంపుదుమని యొక్కతలంపుతో నున్నవారు. వెఱపుడుగుము. బ్రహ్మేంద్రాదులును మదీయసైన్యంబు గెలువ నోపరు. మనుష్యమాత్రు లగుపాండుపుత్రులం జెప్ప నేల? మదీయసైన్యప్రభావములకు భీతిఁ జెంది మమ్ము గెలువరా దనితలంచి య కాదె ధర్మపుత్రుండు రాజ్యంబుఁ గోరక యైదూళ్లొసంగినం జాలు నని చెప్పి పుత్తెంచె. మమ్ము గెలువ వచ్చు ననుతలఁపు తనకిఁ గలదేని యట్లు చెప్పిపంపఁగ నతం డంతబేలయే? వృకోదరుఁడు మిగుల సమర్థుఁ డనిభావించి వానికి వెఱచెదవు. వాఁడు నాకంటె నధికుఁ డనుట కల్ల. నిక్కంబు నీవు నాప్రభావం బెఱుంగవు. గదాయుద్ధమున నాకు సమానుఁ డగువాఁడు భూలోకముననెల్ల నిప్పు డింతకు మున్నును లేఁడు. ఇఁకనుం బుట్టఁబోవఁడు. గదాయుద్ధమునందును బలమునందును బలభద్రునకు సరివచ్చువాఁ డెవ్వఁడును లేఁ డనుట సుప్రసిద్ధంబుగదా. నే నతని బహుప్రకారముల నారాధించి పెక్కేండ్లు తద్విద్య నేర్చి గదాయుద్ధమున దుర్యోధనుఁడు నిరుపమానుఁ డనఁ బేరుఁ గాంచితి. కావున భీమునకు నితరులకు నే నించుకైనను వెఱవను. ఏను గద యెత్తి యొక్కవ్రేటు వ్రేసితి నేని మీయంద ఱికొనియాటలకుఁ బాత్రం బైనయావృకోదరుండు సైరింప నోపఁడు. అతండు పోరికి వచ్చె నేని చిరప్రార్థితం బయినవానితోడి గదాయుద్ధంబు నా కయ్యెడి. భీముఁ డు నాకంటె గదాయుద్ధమునం దక్కువవాఁ డని యతండును వాసుదేవార్జునులు నెఱుంగుదురు. వానివలన భయ ముడుగుము. మదీయఘోరగదాప్రహారపీడితుండై వృకోదరుండు వజ్రాయుధప్రహారంబునం బెనుగొండమాడ్కి భండనాంగణంబునం గూలుట సిద్ధంబు. భీముఁడు హతుండైనపదంపడి విషాదవివశచిత్తుండై నయర్జునుఁ డెయ్యదియుం జేయఁ జాలఁడు. భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణశల్య భగదత్తప్రముఖు లయిననమేటి మగలెల్ల నొక్కపెట్ట వానిం బాదివి క్షణమాత్రమునఁ జంపుదురు. మన కింత బలము గలుగ వారు గెల్తురే? తప్పక పరాజితు లగుదురు. విజయంబు మాకుఁ గరతలామలకంబై యున్నది. నీవు మోహము

మాని యనుమానము విడిచి దృఢచిత్తుఁడ వగు మని దుర్యోధనుండు తండ్రికి స్వపక్షసామర్థ్యంబు వివరించి యట సంజయుం జూచి సూతసుతా, యేడక్షౌహిణుల సహాయము వడసినయుధిష్ఠిరుఁడు యుద్ధము సేయనున్న వాఁడుగదా. నీమదికెయ్యది తోఁచుచున్న దనియడుగ నతం డతని కిట్లనియె. యుధిష్ఠిరుఁ డత్యంతసంతోషము తోఁ బోరికి రానున్న వాఁడు. భీమార్జుననకులసహదేవులును వెఱపింతయు లేక సంగరోత్సాహదీపితులై యున్న వారు. నే నుపప్లావ్యమునకుఁ బోయినపుడు సవ్యసాచి తనతేరుసమరసన్నాహసముచితంబుగాఁ బూన్పించి తెప్పించి యధిరోహించి సంతుష్టస్వాంతుండై నన్నుఁ బిలిచి సంజయా, యుద్ధమున కియ్యది పూర్వరూపంబు. మేము గెలుతుము. ఇంతయు నిక్కువం బనివచించె. నేనును దెసలెల్ల వెలిగించుచున్నయయ్యుత్తమరథమున నాసీనుండై లలితసౌదామినీసముల్లసితజలధరంబుచందంబున దివ్యతేజోవిరాజితుండై యక్కిరీటిం గాంచి పాండుపుత్రులే జయింతు రని తలంచితి ననినం గటకటంబడి దుర్యోధనుఁడు సంజయా, నీ వెప్పుడుం ద్యూతపరాజితులైనపాండుసుతులం బొగడెదవు. అది యట్లుండె. అర్జునరథంబునం బూన్చినగుఱ్ఱము లెట్టివి? ధ్వజం బెట్టిది? చెప్పుము చూత మనియడుగ సంజయుం డతని కిట్లనియె. ఇంద్రసహాయమున విశ్వకర్మ బహువిచిత్రరూపవిలసితంబుగా వానితేరు నిర్మించె. అవ్విశ్వకర్మమాయాజాలమునం జేసి తద్రథధ్వజము తిర్యగూర్ధ్వభాగములందు యోజనంబుదాఁకఁ దనవెలుంగుఁ బచరించు. అత్యున్నతం బగునాకేతనంబు ప్రమాఁకులసందులం దవిలియుఁ దప్పించికొనివచ్చు. భీమసేనునిప్రార్థనం జేసి హనుమంతుఁడు నిజరూపము నాధ్వజమునం దనుసంధించు. దానిరూపం బిట్టి దనినిరూపింప వలను గాకుండు. ఇంద్రధనుస్సుచందమున దురూహబహువర్ణములఁ బొల్పారు. అగ్నిధూమము చిత్రరూపము లగు సకలతైజసముల వారించి మీఁదికిఁ బోవుకై వడిఁ దత్కేతనతేజఃప్రచారం బప్రతిహతంబై యుండు. మహారూపంబయ్యు నది మిగుల భారవంతము గాదఁట. ఎద్దియుం దాని నడ్డగింపదఁట. చిత్రరథుఁడు మెచ్చి యిచ్చినవాయువేగము లగు నుత్తమాశ్వముల నాతేరికిఁ బూన్చుదురు. భూమ్యంతరిక్షంబులం దెచ్చటనైన నయ్యశ్వములప్రచారంబునకుఁ బ్రతిఘాతంబు గలుగదు. చిత్రరథుఁ డిచ్చిననూటింటిలో నెద్దియేనియు నిహతంబైనను వరప్రభావంబునం జేసి శతసంఖ్యకుఁ గొఱత గాకుండఁ బూర్తి యగుచుండు. తత్సమానవీర్యములు దంతవర్ణములు నగు నుత్తమాశ్వములు ధర్మరాజురథము వహించు. అర్జునుండు సుప్రీతుండై యిచ్చినకల్మాషాంగతిత్తిరిచిత్రపృష్ఠము లగుమహాశ్వముల ఋక్షప్రఖ్యముల వాయువేగముల భీమసేనుఁడు తనతేరికిఁ బూన్చు. ఇంద్రదత్తంబు లయినతత్తుల్యహయములు మాద్రీపుత్రులరథముల వహించు. సౌభద్రద్రౌపదేయులరథ్యంబులును

దత్తుల్యంబులే యని సంజయుండుపాండవులరథరథ్యస్వరూపంబు నిరూపించుచుండ ధృతరాష్ట్రుఁడు వానిం బిలిచి సంజయా, మనవారితోడఁ బోరు సేయఁగఁ బ్రీతితోఁ బాండవులకు బాసటయైవచ్చినవారల నెవ్వరెవ్వరిం జూచితివి. తెల్పు మనియడుగ నవ్వైచిత్రవీర్యునకు నాసూతపుత్రుఁ డిట్లనియె.

నరేంద్రా, పాండవులకుఁ బ్రీతిమైఁ దోడు వచ్చినవారల వివరించెద. యదువృష్ణిభోజాంధకనాథుఁ డైనవాసుదేవుఁడు వారికిఁ బెనుబ్రాపై వచ్చియున్నవాఁడు. మహారథుఁ డన బ్రసిద్ధుఁ డైనసాత్యకి యేకాక్షౌహిణీసమేతుండై సనుదెంచె. పాంచాలనాథుం డైనద్రుపదుఁడు ధృష్టద్యుమ్నశిఖండిప్రభృతికుమారవర్గసహితుండై యొకయక్షౌహిణితోడం బాండవులకై బాసటయై వచ్చె. మత్స్యేశ్వరుం డైనవిరాటుఁ డనుజతనుజసమన్వితుండై యొక్కయక్షౌహిణితోడఁ బాండుపుత్రులం గలిసె. జరాసంధతనయుం డైనసహదేవుఁడు చేదినాథుం డైనధృష్టకేతుఁడుం బ్రత్యేకం బొక్కొకయక్షౌహిణితోడఁ గలిసిరి. కేకయు లేవురు నొక్కయక్షౌహిణితోడ వచ్చిరి. మఱియుఁ బాండ్యచేకితానప్రముఖు లగువీరులనేకులు వారికి సహాయులై వచ్చిరి. వారిబలం బెల్ల నొక్కయక్షౌహిణికిఁ జాలియుండె. దైవమానుషగాంధర్వాసురప్రముఖము లగువివిధసేనావ్యూహములనెల్ల లెస్స నేర్చి సంరంభావష్టంభవిలసితుం డైనధృష్టద్యుమ్నుండు సేనాముఖమునం బోలుచునఁట. ఆచార్యుఁడు పాంచాలబలమును ద్రౌపదేయపంచకంబునుం దనకు బాసటగాఁగ నడుచునాధృష్టద్యుమ్నుపాలఁట. భీష్ముఁడు మత్స్యబలసహాయంబునం గవియుశిఖండిపాలఁట. మద్రేశ్వరుం డైనశల్యుండు ధర్మనందనుపాలఁట. దుర్యోధనదుశ్శాసనాదు లగునీకొడుకులు నూఱుగురు ప్రాచ్యదాక్షిణాత్యరాజులుం గొందఱును భీమసేనునిపాలఁట. కర్ణాశ్వత్థామసైంధవవికర్ణసంశప్తకాదులు మఱియుం గలశూరమాను లందఱుం గాండీవిపాలఁట మనవారికి బాసటయై వచ్చినకైకేయులునుసాళ్వమాళవాదులునచ్చటఁ జేరినకైకేయపంచకముపాలఁట. దుర్యోధనదుశ్శాసనాదిపుత్రు లగునీమనుమ లందఱును బృహద్బలుం డగునభిమన్యునిపాలఁట. సోమదత్తుఁడు చేకితానునిపాలఁట. కృతవర్మ సాత్యకిపాలఁట. శకుని సహదేవునిపాలఁట. ఉలూకుఁడు నకులునిపాలఁట. మఱియు నెవం డెవనికెదు రగు వానితో వాఁడు పోరాడునఁట. ఇట్లు వా రిచ్చటివారలం దమలో నందఱకుం బాళ్లు పెట్టికొని పోరాడ నున్నవారు. వారియుద్యోగమెల్లఁ దెలియఁ జెప్పితిఁగదా. నీకును నీకొడుకునకును నెయ్యది సమ్మతంబో దానిం జేయు మనియె. అపు డాకొలువులోనం గొందఱు ధర్మజుండు శల్యుం గెలువఁజాలునే యనిపలికిరి.

అట ధృతరాష్ట్రుఁడు సంజయుం బిలిచి గావల్గణపుత్రా, యేమి చెప్పెదు. పాండునందనులసమరోత్సాహము వినినం బెద్దయు వెఱ పయ్యెడి. బలవంతుఁ

డగుభీమునితోడం బోరు పొసఁగినప్పుడే దుర్ధ్యాతదేవనశీలు రగునాకొడుకులు
లేరనితలంచెద. రాజులందఱు కాలవశమున నగ్గిం బడినమిడుతలట్లు గాండీవాగ్నిం
జొచ్చి ప్రమ్గుదు రింతియకాని యొండు గాదు. మహానుభావులగుపాండుపుత్రులు
పగ పట్టి తఱిమిన నోహటించి పాఱిపోయినసేన నెవ్వరును మరల్పనేరమి సిద్ధంబు.
వా రందఱు నత్యంతశూరులు కీర్తిమంతులు ప్రతాపవంతులు సూర్యాగ్నిసమ
తేజస్కులు యుద్ధదుర్మదులు. యుధిష్ఠిరుఁడు నాథుఁడఁట. వాసుదేవుఁడు రక్షకుఁ
డఁట. భీమార్జునులు యోధులఁట. నకులసహదేవసాత్యకిద్రుపదధృష్టద్యుమ్న
శిఖండియుధామన్యూత్తమౌజోవిరాటవైరాటికాశచేదిప్రముఖవీరలోకంబు సహా
యంబఁట. కొండలనైనం బగిలింపఁ జాలినవారిరాజ్యమును దేవేంద్రుఁడైన నప
హరింప నోపునే? దేవవిక్రములు సర్వగుణసంపన్నులు నగువారితోడిపోరు వల
దనినే నెంతవారించిన నీదురాత్ముండు వినఁడని ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నంత దు
ర్యోధనుండు సంజయున కిట్లనియె. సంజయా, పాండవులు మేమును సమానజా
తిసంభవంబును భూలోకవర్తనంబునుం గారణంబులుగా సమానులమయియుండ
వారలే గెల్తు రని యెట్లు లూహింపవచ్చు. బలవిక్రమసహాయంబు మాకే యెక్కు
డై యుండు. భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణసైంధవసోమదత్తాదుల వీర్యం బందఱ
కు సువిదితంబుకదా. దేవగణపరివృతుండై దేవేంద్రుం డెత్తివచ్చినను నీవీరులం
గెలువ నోపఁడు. ఇఁకఁ బాండవులం జెప్ప నేల? మఱియు నాకు సహాయులై
వచ్చిననానాదేశరాజులు గలరు. వార లవశ్యంబు పాండవుల బాధింతురు. పాం
డవులకు మావారలం జేఱిచూడనైన శక్యంబు గాదు. నే నొక్కండనే నిక్కం
బలిగి పరాక్రమించిన వారలం జీకాకుపఱుపఁ జాలుదు. మత్ప్రియంకరు లైన
రాజు లింద ఱుండియు నేమువారల నిర్జింప మను టది యెట్లో యెఱుంగరాదు.
వేఁటకాఁడురుల మృగములనుంబోలె మావారలు శరవర్షమున వారలఁ బట్టి బం
ధింతురు. వారికిఁ దోడ్పాటు చూపఁగ వచ్చినమత్స్యపాంచాలాదులు మదీయర
థికులు పరగించుశరజాలంబులఁ దెప్పిఱిల్లుకొనలేక విఱిగి పాఱుదు రనిపల్కుచు
న్నంత ధృతరాష్ట్రుండు సంజయుం బిలిచి వింటివిగదా నాకొడుకువచనంబు. వెం
గలితెఱంగున నోరికి వచ్చినట్లు ప్రేలుచున్నవాఁడు. వీఁ డెక్కడ? ధర్మజుం గెలు
చు టెక్కడ? భీష్మద్రోణాదులు తన్ను గెలిపింతు రనిచెప్పెఁగదా. వారలే ధర్మ
జ్ఞులు మహాత్ములు నగుపాండవులబలోత్సాహముల విచారించి వారలం గెలువరా
దనినిర్ణయించి కలహముమాని సంధి సేయుట మే లని యెన్ని యేమాఱులు
చెప్పిరి. అది యట్లుండె. మండుచున్నయగ్గికి నేయివ్రోయుకైవడి నత్యంతశూరు
లయినపాండవుల కెవ్వరు సంగరోత్సాహంబు మఱింత యగునట్లు బోధింతు రని
యడుగ సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె. ధృష్టద్యుమ్నుఁడు వారికి సమరము

నం దుత్సాహము మఱింత యెక్కువగాఁ గలిగించువాఁడై ప్రతిదినంబునుం జేరువఁ జేరి భరతపుంగవులారా, వెఱపు వలదు. సంగ్రామము సేయుఁడు. ధార్తరాష్ట్రునకుఁ దోడువచ్చినరాజలోకంబునెల్ల నల్పమత్స్యగణంబుఁ దినుతిమిచందమున నే నొక్కఁడనే పిలుకుమార్చి మీకు విజయంబొసంగెద. భీష్మద్రోణకృపాదు లగుమహారథులనెల్లను సముద్రమును వేలయెట్టు లట్టుల నేన యాఁగుదు నని నేను వినఁగ బోధించె. అందులకు సంతుష్టుండై యుధిష్ఠిరుండు పాంచాలవరేణ్యా, మాకుఁ బాంచాలురకును భవదీయధైర్యవీర్యముల పయి నమ్మిక పెద్దయుఁ గలదు. నీవు క్షత్రధర్మవ్యవస్థితుండవనియుఁ గౌరవులనెల్ల నిగ్రహింపఁ జాలుదువనియు నే నెఱుంగుదు. కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచు వచ్చినవారలను వెఱచి విఱిగి పాఱుచు శరణుసొచ్చినవారలనుం బరికించి శ్రేయస్కరంబయినవిధము నడుపుము. పౌరుషప్రధానుం డైనశూరుఁ డొక్కరుం డుండినం జాలు. వేవురు లాఁతివారల నిచ్చియైన నట్టివాని నొక్కనిం గొనవలయు నని నీతివిదులమతంబు. శూరుఁడు వీరుఁడు శరణాగతరక్షకుఁడు నగునీవు గలుగ మాకు శత్రుజయం బెంతపని యని యతని నగ్గించె. అయ్యవసరంబున నప్పాంచాలరాజపుత్రుండు నన్నుఁ బిలిచి సంజయా, భీష్మధృతరాష్ట్రబాహ్లికాదు లగుకురువృద్ధులు నాచార్యు లయిన ద్రోణకృపాశ్వత్థామలు కర్ణసైంధవాదు లగుశూరులును దుశ్శాసనవికర్ణాదు లగుకుమారులును యుద్ధార్థంబు వచ్చిననానాదేశరాజులును వినుచుండ వెఱపు దక్కి యాదుర్యోధనునితో నిట్లనుము. యుధిష్ఠిరుని సాధుమార్గమున బ్రసన్నుం జేసికొనుట మీకు మొదటిపని. అందులకుఁగా మీ దొర వేగంబ వచ్చి రాజ్యార్థమిత్తు నని విన్నవించి యాయజాతశత్రుం బ్రార్థించికొనవలయు. నాచెప్పినట్లు చేయక యొప్పరికించెనేని మీరాజుపడుపాట్లకుం గొలఁది యిడవచ్చునే? తప్పక యప్పొలువ పుత్రమిత్రాదుల తోడఁ జెటాండు. దేవసంరక్షితుం డైన యర్జునునకు సాటివచ్చువిలుకాఁ డీభూలోకమునం దెల్ల నొక్కఁడైనను వెదకినం గలఁడే? సవ్యసాచిసత్యపరాక్రమం బుపెద్దకాలంబుగోలె నందఱకుం దెల్లంబకాని నేఁడుక్రొత్తయే? దివ్యరథారూఢుం డైనగాండీవికి దేవతలు నోడుదురు. ఇఁక మీవారు గెలుతురే? ప్రాణములపై నాశ గలదేని యుద్ధము మాని నాచెప్పినట్లు చేసి శాంతిఁ బొందుట మేలు. ఇది బ్రదుకుదెరువు. తడవు సేయక నీ వరిగి యీయర్థము మీరాజునకుఁ దెల్పు మనిచెప్పె నని సంజయుండు ధృష్టద్యుమ్నుని వచనోపన్యాసంబుచందంబుఁ దెల్పిన ధృతరాష్ట్రుండు సంజయా, గాండీవిపరాక్రమంబున కొక్కనాఁడైనం గొఱఁత గలదే? అతండు చిన్ననాఁటనుండియు బ్రహ్మచర్యనియమపరుండై క్షత్రతేజము సాధించినవాఁడు. నేను వలదువల దని యెంత యొత్తిచెప్పి వారించి విలపించినను నామాటఁ జెడచెవులఁ బెట్టి మందాత్ము

లగునాకొడుకులు వానితోడఁ బోరాడఁ దొడరుచున్నవా రేమి సేయుదు నని చెప్పి యట దుర్యోధనుదెస మొగంబై యన్నదుర్యోధనా, యుద్ధ ముడుగుము. కార్యసాధనములందు యుద్ధ మధమ మని పెద్ద లంద్రు. నీకును నిన్నాశ్రయించినవారికిని సుఖజీవనంబునకై రాజ్యమున సగము చాలు. ఉచితముగఁ బాండవులకు నిమ్ము. ఇది యెల్లతెఱంగుల మేలు. కౌరవులకెల్ల నిదియే సమ్మతంబు. ధర్మసంహితంబు. పాండవులతోడికయ్యమున ననేకానర్థంబులు పుట్టు. మోహమున నీ వెఱుంగవు. యుద్ధము నే నియ్యకొనను. బాహ్లికుఁ డొప్పఁడు. భీష్ముఁడు సమ్మతింపఁడు. ద్రోణుఁడొల్లఁడు. కృపుఁడు తగదను. అశ్వత్థామ వలదను. సంజయుఁ డిచ్ఛగింపఁడు. సోమదత్తుఁడు నిషేధించు. శలుఁడు నివారించు. కురుజాతికి రక్షకు లయినసత్యవ్రతపురుమిత్రజయభూరిశ్రవఃప్రభృతు లందఱును యుద్ధము నభినందింపరు. ఎవ్వరికిని సమ్మతంబుగానిపని నీ వేల చేసి చెడెదవు. నిన్నన నేల? యుద్ధతాత్పర్యంబు నీమనంబునఁ దనయంతన పొడమినది కాదు. మఱి దుష్టకష్టాత్ములయినకర్ణశకునిదుశ్శాసనులు నీమది నది దృఢ మగురీతిం దెల్పుదురు. అది వినవల దని ధృతరాష్ట్రుఁడు హితము బోధించినం గటకటంబడి దుర్యోధనుండు తండ్రి కిట్లనియె. ఏను నీయందును, భీష్మునందును, ద్రోణునందును, గృపునందు, నశ్వత్థామయందును, సంజయునందును, బాహ్లికునందును, సత్యవ్రతునందును, బురుమిత్రునందును, భూరిశ్రవసునందును, దక్కటినీవారియందును భారము వెట్టి పాండవులతోటిపోరికిఁ దొడరినవాడనుగాను. మఱి నేనును గర్ణుఁడును రణయజ్ఞముసేయ దీక్షితుల మైతిమి. ఈయజ్ఞమునకు యుధిష్ఠిరుఁడు పశువు. రథము వేది. ఖడ్గము స్రువము. గద స్రుక్కు. కవచము సదస్సు. యానముఖము చాతుర్హోత్రము. బాణములు దర్భలు. యశస్సు హవిస్సు. ఈసాధనములతో రణయజ్ఞమొనర్చి వైవస్వతునకుఁ దృప్తిఁ గావించి రాజ్యశ్రీవిభవమున వెలుంగుదుము. మాకు లాఁతివారిసహాయము వలదు. నేను గర్ణదుశ్శాసనులు ననునీమువ్వురమే పాండవులం జంపుదుము. అట్లుగాక వారే విక్రమించి మమ్ముఁ జంపుదు రేని రాజ్యమెల్ల వారే యేలికొందురుగాక. రాజ్యమును సర్వస్వమును, బ్రాణములను, విడిచితి. ఈ రెంటిలో నెక్కటి యగుంగాని వారితోడఁ గూడియుండు టనుట కానిపని. నే నొప్పి పాండవులకు వాఁడిసూదిమొన మోపునంతయైనం బుడమి నియ్యను. కానున్నది యగుంగాక చూత మనిచెప్పిన విని ధృతరాష్ట్రుఁ డందఱం గలయం జూచి యీదుర్యోధనుని నేను విడిచితి. ఈమందమతి ననువర్తించువారందఱు యమపురికిఁ జనుదుర యనిశోకించెద. క్రోల్పులి క్షుద్రమృగయూథము లంబోలెఁ బాండవులు కౌరవపక్షపాతులలో నుత్తముల నేఱియేఱి చంపుదురు అర్జునునకు బలము మఱింత యెక్కువ గావించువాఁడై సాత్యకి దీర్ఘభుజుఁ డై

పురుషుఁడు ప్రతికూలాచార యగునాతి నొడిచిపట్టి నిగ్రహించుచందంబున భారతసేనం బలువిధములఁ జీకాకుపఱిచి నిగ్రహించు. వాఁడు విత్తులం జల్లుపగిది శరజాలం బవిచ్ఛిన్నంబుగఁ గురియించుట యందఱకుం దెల్లంబకదా. మఱియు భీమసేనుండు పాండవయోధులకుఁ బెట్టనికోటగఁ బెనుబ్రాపై నిలిచి నడగొండ లంబోలిన యేనుఁగులనెల్లంగూల్చు. దుర్యోధనా, నీ విపుడు వినకున్నను వాని శాసనపరాక్రముం డైనవృకోదరుండు నీమూఁకలఁ జీకాకుపఱచునపుడు నామాటలం దలంతువు. మీకుఁ బాండవులవలనిభయము రాకమానదు. భీమునిగదా ప్రహారమున నేల కొఱఁగి పడినపుడు శాంతిఁ బొందుదువుగాని నీ విపుడు వట్టి మాటలఁ దేలుదువే? యని కినిసి యట నందఱం గలయం జూచి నామాట లందఱు వింటిరి. అందఱకుఁ జేటుకాల మాసన్న మయ్యెఁగాఁబోలు నే నేమి చేయుదు ననిచెప్పి యట సంజయుం బిలిచి గావల్గణీ, నీ వేయవసరమున వాసుదేవార్జునులం గాంచితివి? వా రేమి పలికిరి? లెస్సగఁ దేటపడ నెఱింగింపు మనుటయు సంజయుం డతనికి మఱియు నిట్లనియె.

—సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ గృష్ణునివచనములం జెప్పుట.—

ఏ నుపప్లావ్యమున కరిగినతోడనే మాధవుమందిరంబున కరిగి యమ్మహాత్ముఁడు సవ్యసాచితోడ వినోదగోష్ఠి నున్నవాఁ డనియెఱింగి ప్రతీహారిచే నిజాగమనం బెఱింగించి పుచ్చి తదాజ్ఞం బడసి యుచితవిధి నభ్యంతరము సొచ్చి యభిమన్యుప్రభృతికుమారులైనం జేరనియేకాంతదేశమున సత్యాద్రౌపదులు గోలుఁ గమలనాభుండు పాన్పునం బవ్వళించి చాచినయడుగుల నరుండు తొడలపై నిడికొని మెల్లన యొత్తుచుండ సరససల్లాపగోష్ఠీవినోదమున నున్నయన్నరనారాయణులం గాంచి వారిచరణములకు సాష్టాంగదండప్రణామం బాచరించి నిటలతటమునఁ గేలుమోడ్పు ఘటియించి కొల్చియుండఁ గృష్ణునికనుసన్న నర్జునుం డూర్ధ్వరేఖావిలసితంబులు శుభలక్షణసమంచితంబులు నగునిజచరణంబు లునిచికొనినపీఠమును నా కునుప నియమింపఁగ సత్యాద్రౌపదు లిద్ద ఱప్పీఠంబుఁ దెచ్చియుంచిన నేనును దానింగరతలంబుననంటుచు భూమిపయిం గూర్చుంటి. ఏకాసనగతు లయినయమ్మహానుభావుల నిద్దఱం జూచునప్పుడు దౌలుత విస్మయంబును బిదప మందాత్ముఁడైన దుర్యోధనుఁడు భీష్మద్రోణకర్ణులబలము నమ్మి యింద్రోపేంద్రతుల్యు లయినయీయుత్తమపూరుషులతత్త్వం బెఱుంగక మోసపోవుచున్నవాఁడు. ఇమ్మహాత్ము లిరువురుఁ దనపంచినపని సేయ నుండఁగ ధర్మరాజుమనస్సంకల్పంబు నెఱవేఱకుండునే? వీనిగతి యెట్లుగా నున్నదియో యనువెఱపు దోఁచె. అంత వార లిచ్చటివారికుశలముఁ బ్రత్యేకంబ విచారించి తమనిమిత్తము సంస్కృతం బయినరసవదన్నంబు నాకుఁ బెట్టించి యాత్మోపభోగ్యంబు లయిన

వస్త్రములఁ గట్ట నిచ్చి తొడవుల నొసంగి న న్నాదరార్ద్రదృష్టిం జూచిన నేనును గార్యభాగంబుఁ బ్రసంగించి కురురాజున కెయ్యది చెప్పిపుత్తెంచెద రని యంజలిబంధఘటితఫాలభాగుండనై యడుగుటయు సవ్యసాచి గాండీవగుణకిణశోభితంబైన నిజపాణితలంబున జలజనాభపాదములఁ దడివి నన్నుఁ జేసినం దెలిసి యాజగన్నాథుండు లేచి కూర్చుండి నన్నుఁ బిలిచి తొలుత విన్న నత్యంతమార్దవోపేతంబు, గంభీరభావంబుఁ బరిశీలించిన నత్యంతదారుణంబు, సర్వలక్షణసమన్వితంబు నగుదివ్యవచనం బిట్లని యానతిచ్చె. సంజయా, కరిపురిం జేరినతోడన పెద్దలకు మా ప్రణామంబులను జిఱుతవారల కస్మదీయసాదరవిచారణంబునుం దెల్పి యటఁ గురుపితామహుం డైన శాంతనవుండును గురుకులాచార్యుం డైన భారద్వాజుండును వినుచుండ ధృతరాష్ట్రమహీపాలుతో మామాటగా నిట్లనుము. కౌరవులు వివిధయాగములను దానములను దారపుత్రాదులతోడి వినోదసంతోషములను సర్వవిధప్రియాచరణంబులను నిపుడే కొఱంత లేకుండఁ దీర్చికొనియుండవలయు. ధర్మరాజు విజయమునెడ నతిత్వరతో నున్నవాఁడు. మీవారికి మహాభయ మిదె నేఁ డెల్లి రానున్నది. ఆపాపపు జూదమతఱి నేలోకంబున నేకాలంబున నెవ్వరుం బడయనిపాట్లు పాంచాలి పడునపు డత్యంతదూరవర్తి యగునన్నుఁ దలంచి గోవిందా! కావవే! యని మొఱ పెట్టికొనియెఁగదా. అప్పతివ్రతాశిరోమణియప్పు నిందాఁకఁ దీర్పమింజేసి యదినామది నానాఁటం బెరుగుచున్నది. అది దీర్చినంగదా నామది సుఖించు. లాఁతులకుఁ జెనకరానితేజంబు మూర్తీభవించినట్లు వెలుంగుచున్నగాండీవంబు విల్లుగాఁగ నేను సారథిగాఁగ సవ్యసాచి సంగ్రామమునకు నడుచువాఁడు. వాని మార్కొని బ్రదికిపోవ సురేంద్రుఁడైన నోపఁడు. బాహువులచే భూమి నెత్తువాఁడును దలంచినమాత్రన బ్రజల దహించువాఁడును దేవతలకు నాకలోకచ్యుతిం గావించువాఁడునుం గలిగినను గలుగుఁగాని సమరమునఁ గిరీటిం గెలుచునంతటిమగవాఁడు గలుగఁడు. దేవదానవగంధర్వ యక్షకిన్నరాదులలో నెవ్వఁడునుం గవ్వడిని బోర మార్కొన నేరఁడని నాకుఁ జూడఁ దోఁచెడి. కాలము దీఱకున్న నెవ్వరును వానితోడఁ బోరాడుదు మనికడంగరు. వాని విక్రమంబు మీకందఱకుం దెల్లంబకాదె? పెక్కులేల? ఒక్కటి చెప్పి చూపెద. మీవారు భీష్మద్రోణాదిమహారథుల సహాయంబునఁ గట్టిమొనఁ గావించికొని విరాటుపసులం బట్టినప్పు డవ్వీరుఁ డొక్కరుండ కాఁడే వారలనెల్ల నోడించి తఱిమె. ఈనిదర్శనమొక్కటి మీకుఁ జాలదే? అవ్వీరు నాఁగఁ జాలినమగవాని మీవారిలో నొక్కనిఁ జూపుము. బలము, వీర్యము, తేజము, శీఘ్రత్వము, హస్తలాఘవ, మవిషాదము, ధైర్యమనునీగుణంబు లన్నియుఁ బార్థుండు దక్క దక్కటివానియెడఁ గూడియున్నవే? నాచెప్పవలసినంత

యుం జెప్పితి. ఇఁక మీరాజున కెయ్యది యుచితం బనితోఁచునో దానిం జే యుమను మని హృషీకేశుండు గుడాకేశుమానసం బుల్లాసంబునం బొంపిరివోవ మేఘగంభీరనిస్వనంబునం బలుకుటయు ననంతరంబు కిరీటియుం దదనురూపంబు లయినకొన్ని వచనముల వాక్రుచ్చె నని సంజయుండు వాసుదేవవచనోపన్యాసం బుఁ దెలియం బల్కిన నాకర్ణించి ప్రజ్ఞాచక్షుం డైనధృతరాష్ట్రుఁడు తనలోనం దనవారికిం బాండవులకుం గలబలశక్తుల నిశ్చయించువాఁడై కొండొక చింతించి యటఁ బాండవులకు దైవబలంబధికమని నిర్ణయించి కొడుకున కిట్లనియె. పుత్రా! నామనమున నీచింత యెప్పుడుంబాయదయ్యె, నానిర్ణయం బానుమానికము కాదు. మఱి ప్రత్యక్షంబు. సర్వభూతములును బిడ్డలయెడఁ బ్రేముడించి శక్తికొలఁది వారికిఁ బ్రియహితము లొడఁగూర్చుటయు నుపకారికిఁ బ్రత్యుపకార మొనర్చుటయు లోకమునం దెల్లఁ దెల్లంబై యున్నదిగదా. ధర్మవాయుశక్రాశ్వినులు పాండవులకుఁదండ్రు లగుటంజేసి వారికి డెప్పరంబులు వాటిల్లినప్పుడు తోడ్పడుదురు. ఖాండవదాహమునఁ దన కుపకారి యైనయర్జును నగ్నిపూర్వోపకారస్మరణముతో బాసట యగు. కావున భీష్మద్రోణకృపాదులవలనిభయము వారికి సుంతేనియుం గలుగదు. దివ్యమానుషాస్త్రవేదు లత్యంతశూరులు నగువారికి సురలుం గూడఁ దోడ్పడుదు రేని యింకను మనము గెల్తు మని యడియాసలం బడ వచ్చునే? ఎంతచింతించిన నర్జునున కెదురై చక్క నిల్చి పోరాడువాఁ డొక్కఁడును నాకుఁ జూడఁ గన్పట్టఁడు. వానివిల్లు లాఁతుల కెత్తనైనం గొలఁదిగాదు. వానియమ్ములపొదు లక్షయ్యములు. వానికేతనంబున నప్రతిహతప్రచారుం డైన కపివరుండు వసించు. వానిరథమునకు సాటివచ్చుతే రొక్కటియు నీచతుస్సముద్రముద్రితం బైనభూమండలంబునం దెల్లఁ గానంబడదు. తదీయరథనేమినిర్ఘోషంబు మేఘగర్జాసన్నిభంబై వేర్చి పగవారిగుండియ లవియించు. మఱియు నవ్విలుకాఁ డొక్కపెట్టన నిమేషమాత్రమున నేనూఱమ్ముల నతిదూరమునఁ బడునట్లుగా నేయ నేర్చు. సహస్రబాహుఁ డైనకార్తవీర్యార్జునుఁ డొక్కఁ డొక్కపరి యేనూఱుబాణముల నేయుచుండెనఁటగాని రెండుచేతులవిలుకాఁ డెవ్వఁడు నింతకుమున్నిట్టియమానుషకృత్యముఁ జేయఁడయ్యె. ఎవ్వరిదెసనుం బక్షపాతంబు లేక మధ్యస్థు లయినభీష్మద్రోణకృపాశ్వత్థామ శల్యులు నేకవాక్యముగ నర్జునుం గెలువరా దనిచెప్పుచున్నవారు. అంతయుం దలపోసియ యేను మనవా రందఱు వానిచేఁ జత్తురుగాయని పెన్వగలం బొగులుచు రేయింబవళ్లుఁ గన్నులఁ గూరుకుం గానక పరితపించుచున్నవాఁడను. కురుజాతికిఁ జేటుకాలంబు నీకారణంబున నేఁడు మూఁడెఁగాఁబోలు. అందఱు సుఖమున మనుటకు శాంతి దక్క నొండుపాయంబు గానరాదు. మీకంటెఁ బాండవులే శక్తిమంతులు. నామాట విని

శాంతిఁ బొంది సంధి చేసి మను మని చెప్పిన నత్యంతక్రోధఘూర్ణమాన మాన సుండై దుర్యోధనుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

### దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమములఁ దెల్పుట.

రాజసత్తమా, ధర్మాదిదేవతలు సహాయు లగుటంజేసి పాండవులం గెలువరా దనుట యొప్పదు. అభయము మానుము. కామద్వేషలోభద్రోహముల మాని సకలభావంబులందు నుదాసీనులై యుండుటవలననే దేవతలు దేవత్వంబుఁ బడసి రని వ్యాసనారదజామదగ్న్యులు నాకుఁ జెప్పిరి. దేవతలు మానవులట్లు కామద్వేషలోభద్రోహములచే నొకపనిఁ జేయరు. వార లట్లు ప్రవర్తించువారలయేని పాండవు లిన్నినాళు లిన్ని యిడుమలఁ బడియుండరు. కావున ధర్మాదిదేవతలు పాండవులకుఁ దోడ్పడుదు రని చింతింపవలదు. అట్లు గాక యొకవేళ దేవతలును గామక్రోధలోభమోహావశులై ప్రవర్తింతురేనియుఁ దద్విషయమునం దదీయదేవత్వంబు నిరుపయోగం బగు. మఱియు నగ్ని దేవుఁడు ఖాండవదాహము కారణముగా నర్జునపక్షపాతి యగు ననరాదు. నే నభిమంత్రణము గావించితినేని లోకములనెల్లం గాల్పం దొడంగినయగ్నియుం జల్లాఱు. పగులుచున్న పుడమియు డుల్లుచున్న గిరిశిఖరములును నాఁగు. సకలప్రపంచవినాశహేతువగు పాషాణవర్షమును జంఝామారుతమును నడంగు. దేవతలకుఁ గలతేజము నాకుం గలదు. ఏను స్తంభనముఁ గావించినజలములందు రథహయగజపదాతివర్గంబు స్థలమునంబోలె సుఖమున నడుచు. ఏ నొక్కకార్యమునిమిత్తమున నక్షౌహిణీసమేతుండనై యెచ్చటికిఁ బోయిన నచ్చటనెల్ల నశ్వములు ప్రవర్తించు. మంత్రసంరక్షణమునం జేసి నాపాలించుదేశమునందుఁ గ్రూరమెకములవలని వెఱపు గలుగదు. పర్జన్యుఁడు కాలవర్షముఁ గురియు. ప్రజ లీతిబాధలం బొరయక ధర్మపరత్వమున వర్తింతురు. దేవాసురుల కందఱకును నేనే ప్రవర్తకుఁడను. ధర్మవాయ్వగ్నిమరుదశ్విప్రభృతిదేవగణంబు యక్షరక్షోగంధర్వులును నింద్రుఁడును నాతోఁ గలహించినవారల రక్షింపఁ జాలరు. అట్లు రక్షింతురేని నాశత్రు లగు పాండవులు పదుమూఁడేఁడులు పడరానియిడుమలం బడువారలే? నే నెవ్వరియెడ నెయ్యది తలంతునో యయ్యది కాకమానదు. మదీయమాహాత్మ్యంబునకు లోకమెల్ల సాక్షియై యుండు. ఏ నింత దీనిం గుఱించి చెప్పరాదు. అయినను నీ వూఱడిల్లుటకై యింత చెప్పవలసివచ్చె నింతియకాని యాత్మప్రశంస గాదు. ఆత్మప్రశంసనము సజ్జనగర్హితము. దానిం జేయ నాకు మనసు గొలుపదు మున్నెన్నఁడైన నిట్టు లాత్మస్తుతిం జేసికొంటినే? నాసామర్థ్యము నెఱింగి యిఁకనైన నూఱడిల్లుము. పాండవులను వారికి సహాయులై వచ్చినమత్స్యపాంచాలకేకయాదులను సాత్యకివాసుదేవులను నేను జయింతు. వా రందఱు సాగరంబు సొచ్చు

నదులచందమున నన్నుఁ జొచ్చి యడంగిపోవుదురు. నీవును వినఁగలవు. నే నెల్ల వారికంటె బుద్ధితేజోవీర్యవిద్యాయోగముల విశిష్టుఁడను. భీష్మద్రోణకృపాశ్వత్థామ శలశల్యులు నేర్చినయస్త్రములనెల్ల నేనును నేర్తు నని చెప్పిన విని ధృతరాష్ట్రుఁడు సంజయుం బిలిచి పాండవులభండనోద్యోగప్రకారము సవిస్తరముగ మఱియుం దెల్పు మనియడుగుచున్నంతఁ గర్ణుండు దుర్యోధనుమానసమునం దుల్లాసముఁ గల్పించువాఁడై యందఱు వినంగ నిట్లనియె. ఏను నిజరూపము డాఁచి పరశురామునొద్ద బ్రహ్మాస్త్రము నేర్చినందుల కమ్ముని గినిసి అయ్యస్త్ర మంతకాలమునఁ దోఁపకుండెడుమని శాపం బిచ్చె. అమ్మహాముని యలిగెనేని సర్వభూమండలముఁ గాల్పఁ జాలు. నేను బదంపడి గురుశాపమునకు భయం బంది పౌరుషముఁ జూపియు శుశ్రూషఁ గావించియు నమ్మునీంద్రుచిత్తం బారాధించి తత్ప్రసాదంబు వడసితి. కావున నా కయ్యస్త్రము సావశేషమైయుండెడి. భీష్మద్రోణాదు లగువీరవర్యు లెవ్వరును వలదు. అందఱును నీయొద్దన యుండుదురు గాక. నే నొక్కండనే ప్రధానబల మంతయుం గొనిపోయి పాండవులను, దత్సహాయులైనమత్స్యపాంచాలకేకయాదులను, దదీయపుత్రమిత్రామాత్య బంధుగణంబులనుం జంపి విజయంబు నీ కొసంగి పుణ్యముఁ బడసెద. పాండవులఁ జంపు టొక పెద్దపని గాదు. అది నాభారము. అందులకై వగవం బని లే దని చెప్పుటయు భీష్ముండు వాని నదల్చి యిట్లనియె. కర్ణా, నీ వేల యిట్టు లాత్మస్తుతిం జేసికొనియెదవు. కాలవశమున నీబుద్ధి విపరీతం బయ్యెఁగాఁబోలు. ప్రధానబలముం గొనిపోయి పాండవులం గెల్తు నంటివి కదా. నీ వెక్కడ? పాండవుల గెల్చు టెక్కడ? అది పొసఁగునే? ప్రధానబల మంతయుం గోల్పడివత్తువు. అది పోయిన నీధార్తరాష్ట్రులకు రక్షణం బెట్లు? ఇంత యేల చింతింపవైతివి? నీ వర్జునుని గెలువఁ జాలవు. ఇతరదుష్కరంబు లగుఖాండవదహనాదుల నతం డొనరించినవాఁ డని తెలిసితెలిసియు నింకనైన నాయడియాసల మాని యూరకుండరాదో. ఇంద్రుఁ డిచ్చినయమోఘశక్తి గలదని దానం బార్థుం జయింతు నని తలంతువేమొగదా. అదియు జనార్దనుచక్రాయుధప్రహారమునఁ బొడిపొడి యగు. అయ్యవస్థను నీవుం జూతువు. మఱియు సర్పముఖశరము సవ్యసాచిం జంపఁ జాలు నను పెనునమ్మికతో నాశరము నతిప్రయత్నమునఁ బుష్పమాల్యగంధములఁ బూజించుచున్నవాఁడవుగదా. అదియుం బార్థబాణప్రహారమునఁ బలుతునియ లగుడు నీవుం జెడుదువు. జగద్రక్షకుండైన పుండరీకాక్షుండు వానిరక్షింపఁ బూనియున్నవాఁడు గావున నీయత్నము లేవియు నిష్ఫలములే యగు. బాణనరకాదిసంహారప్రముఖము లగువాసుదేవుపరాక్రమములు వింతలే? నీయట్టివారలం గెలుచుట వారి కొక్క పెద్దపనియే? యనినం గర్ణుండు కటకటంబడియిట్లనియె.

కర్ణుఁడు భీష్మునిపై రోషమున నస్త్రసన్న్యాసముఁ జేయుట.

వాసుదేవునిమహిమం బట్టిదియే. అయినను నాకొలంది యెఱుంగక యీ కురుపితామహుండు నన్నుఁ దూలనాడినందులకు ఫలముఁ గుడుచుఁగాక. ఇతండు కయ్యము సేయునందాఁక నేను బోరికి రాను. శస్త్రాస్త్రములఁ దాఁకను. ఇతండు తెగినపదంపడి నేను బోరికి వచ్చి సకలరాజలోకసమక్షమున నఖర్వభుజాగర్వముఁ జూపి యందఱ నొప్పింతు ననిపలికి దిగ్గన లేచి కొలువు విడిచి యింటికిఁ జనియె. అట శాంతనవుండు నవ్వుచు దుర్యోధనుంగాంచి. కుమారా, రాధేయుండుగదా సత్యప్రతిజ్ఞుండు. వైరము నానాఁటం బెంచి మోహారములు పన్నించి భీమార్జునులు కురుకులక్షయముఁ గావింతు రని తెలిసి యిప్పుడు కయ్యమునకు నడువక తొలఁగినవాఁడు. ఇట్టివార లెందఱు లేకున్నను నా కించుకేనియుం గొఱంత లేదు. గురువును మోసపుచ్చి శస్త్రాస్త్రముల నేర్చినప్పుడే యయ్యధమునితపోవీర్యము లడంగె. ఏను రాజలోకంబెల్ల నాలోకించుచుండ గండుమిగిలి పెక్కండ్ర యోధవరులం జంపుదు ననిచెప్పుచున్నగాంగేయున కల్పబుద్ధి యగుగాంధారేయుఁ డిట్లనియె. పితామహా, మేమును బాండవులును వయోవీర్యప్రజ్ఞాశ్రుతశస్త్రాస్త్రకౌశలవిక్రమాదుల నన్నింటనుం దుల్యులైయున్నను వారే జయింతు రని పలుకనేల? అది వారియెడ నీకుఁ గలపక్షపాతంబకదా. నేను నిన్నును ద్రోణకృపబాహ్లికాదులను నమ్మి వారితోడఁ బగఁ బెట్టికొనినవాఁడఁగాను. మఱి వీరవర్యులయినకర్ణదుశ్శాసనులు గలుగఁ బాండవుల భండనంబునం గెల్తు ననియున్నవాఁడ. మీ రెవ్వరు తోడ్పడకున్నను నేము వారలం గెలిచి బహుళయజ్ఞదానములం దేవబ్రాహ్మణులకుఁ దృప్తి గావింతు మింతయు నిక్కంబు. కేశవసహాయులయినపాండవులు వలలోఁ జిక్కినమృగములట్లు మాకుఁ జిక్కి తమకుఁ గలసేనయంతయుం బోకార్చికొని యుక్కడిగి వెల్లఁబోవుదురు. నీవుం జూతు వనిపల్కుచున్నంత విదురుండు వాని వారించి ధృతరాష్ట్రున కిట్లనియె.

విదురుఁడు పాండవులతోడిపగ వల దని ధృతరాష్ట్రునకుఁ జెప్పుట.

రాజేంద్రా, సర్వనిశ్చయము లెఱింగినపెద్ద లిట్టివిషయములందు శ్రేయోదాయకం బని చెప్పినదాని నీకుఁ జెప్పెద. బ్రాహ్మణునకు దమము సనాతనధర్మము. తక్కటివారికి నది యుచితసమయములందు ముఖ్యధర్మంబ యగు. అది తేజోవృద్ధిఁ గావించు. పావనత్వం బొడఁగూర్చు. విగతకల్మషుండై పావనుండైనవాఁ డుత్తమగతిం బడయు. సకలభూతములు నదాంతులం జూచినఁ గ్రవ్యాదిగణములఁ జూచినట్లు వెఱతురు. దమరహితు లగుపాపాత్ముల శాసింపఁగదా బ్రహ్మదేవుఁడు క్షత్రజాతిని సృజించె. దానజ్ఞానాధ్యయనములు దమము ననువర్తించియుండు. క్షమ, ధృతి, యహింస, సమత, సత్య, మార్దవ, మింద్రియజ

యము, మార్దవము, హ్రీ, యచాపల, మకార్పణ్య, మసంరంభము, సంతో షము, శ్రద్ధయుం గలిగినయెడ దమము నిలుచు. కామలోభదర్పమన్యునిద్రావి కత్థనమానేర్ష్యాశోకములు వానికిఁ గలుగవు. అకౌటిల్య, మశౌర్యము, పరిశుద్ధి యనుమూఁడు దాంతునికి ముఖ్యలక్షణములు. అతితృష్ణమాని కామములం దవులక సముద్రముచందమున గంభీరుండై సువృత్తము సుశీలముం గలిగి ప్రస న్నచిత్తుండై వేద్యతత్త్వవిచారపరాయణుఁడైనబుధుఁడు దాంతుఁడనంబడు. అతండు లాఁతులవలనఁ దనకును దనవలన లాఁతులకును వెఱవు వొడమనిచంద మున మెలంగుచు సర్వభూతహితవర్తనుఁడును బరిణతప్రజ్ఞావిభవమున నిత్యతృ ప్తుఁడునై తొల్లింటిపెద్ద లాచరించిన సత్కర్మంబు కర్తవ్యం బనుతలంపుతో నిత్యకర్మముల నాచరించుచు నైష్కర్మ్యంబు కైవల్యసాధన మనుభావమునం ద త్ఫలంబులం దవులక కాలముఁ గడపుచ్చుచు నుభయలోకములందు మేలుఁ గనుచుఁ దుది నిర్వాణపదవిం బ్రాపించు. దమ మెంతటిమేలునైనం గావించు. నీకొడుకులు తమరాజ్యము తమకుఁ జాలు నని తృప్తిఁ బొందక పాండవరాజ్యము పైఁ దృష్ణచే ననయంబు జేయరాదు. వారిరాజ్యము మీ రీయకున్నం జేటు ద ప్పదు. జ్ఞాతులు పరస్పరవిరోధమునఁ జెడుదురు. ఇందుల కొక్క కథఁ జెప్పెద విను ము. ము న్నొకబోయవాఁడు పక్షులఁ బట్టికొనిరా నడవికిఁ బోయి వల నేల నొడ్డి తొలంగియుండ దాని నెఱింగి రెండుపులుఁగులు మెలఁకువమై నచ్చటికి వచ్చి యాయురి నెత్తికొని యుప్పరంబున కెగసి పాఱుచుండినం జూచి యాబోయ యా ఖగంబులవెంటం బొఱుచు నొక్కమునిపల్లె సొచ్చుటయు నయ్యాశ్రమమునఁ గృతాహ్నికుం డైనయొకముని యీపద్యమున వాని నిట్లడిగె. ఆ॥ వె॥ గగనచ రము లైనఖగముల వెంబడిఁ బాదచారి వగుచుఁ బఱవఁ జనునె? ఇదియు నాకుఁ జూడ నెంతయు నబ్బురం బయ్యె నేల బేల వైతి బోయ? ॥ అనియడిగినమునికి బోయ యిట్లనియె. నాయొడ్డినవల నెత్తికొని పాఱుచున్నయీపులుఁగులు తమ లోఁ గలహించునందాఁక వెంబడింబోయెద. అట నాకుఁ జిక్కు నని యామునికిఁ బ్రత్యుత్తరముఁ జెప్పి యాలుబ్ధకుండు వానివెంటన పఱచుచుండ నవి కొండొకవ డికిఁ గలహించి యురిఁ బాఱవైచి నేలకు డిగి పోట్లాడుచున్నంత నాబోయ యది సమయముగాఁ గొని యగపడకుండ నరిగి డాసి యారెంటినిం జంపి యురి తోడం గొనిపోయె. అత్తెఱంగుననే జ్ఞాతులుం దమలోఁగలహింతురేని శత్రువు లకుఁ జిక్కి చేటొందుదురు. కావున సహభోజనసల్లాపాదులే జ్ఞాతులతోడం గర్త వ్యముగాని వైరముగాదు. పెద్దల నుపాసించి తరేతరవైరము మాని కాలోచిత ముగ నుండువారు సింహరక్షితవనమువిధమున నితరేతరాశ్రయమున సుఖింతురు. ధనముఁ బడసియు దానం దనివిసనక దీనులట్లు వగచువారు శత్రువులచే సంప

దం గోల్పడుదురు. జ్ఞాతులు తమలో నందఱు గలిసియుండినం గూడినకొఱవుల మాడ్కిఁ దేజరిల్లుదురు, లేకున్నఁ బొగయుదురు. కావున జ్ఞాతులతోడిపొందు మేలు. మఱియు నొక్కటి వినుము. మున్నొకతఱి నే నొక్కపనికై బ్రాహ్మణులుం గిరాతులుం దోడురాఁగ సిద్ధగంధర్వసేవితంబు వివిధౌషధీసంభృతంబు నగుగంధమాదనమున కరిగి యచ్చట నొకవిషమప్రదేశమునందుఁ బెద్దకడవం బోలినతేనెపెరను సర్పరక్షితంబై యున్నదానిఁ గుబేరప్రియంబై నదానిం గాంచితిమి? దానినుపయోగించిన మర్త్యుల కమర్త్యత్వంబు, నంధులకు నేత్రంబులును, వృద్ధులకు యౌవనంబునుం గలుగు నని తత్ప్రభావము బ్రాహ్మణులునాకుఁ జెప్పుచుండ నక్కిరాతులు దానిఁ గొన నుఱికి యయ్యొఱకటవుచోటం బడి మ్రందిరి. అవ్విధమున నే నీకొడుకు పాండుపుత్రులరాజ్యము నపహరింపఁ దలఁచుఁగాని మీఁద వచ్చుకీ డెఱుంగఁడు. లోకోత్తరబలపరాక్రమశాలి యైనసవ్యసాచి యెక్కడ? మనదుర్యోధనుఁ డెక్కడ? ఈతులువ వానివిక్రమంబుఁ దా నెఱుంగఁడే? చేయం గలమహారథు లందఱుం దన్ను గెలిపించువారై తొడరినను వాఁ డందఱం గెలిచి విరాటుపసులం దోలికొని పోవు టొక్కటి వానివిక్రమమునకు నిదర్శనము గాదె? మీ రిప్పు డది మఱచితిరిగాఁబోలు. వారు నిస్సహాయులై యున్న నందఱం గెలుతురు. చిచ్చునకు గాడ్పు తోడ్పడుచాడ్పున నమ్మహావీరులకు మాత్స్యపాంచాలాదులు సహాయులైనం జెప్ప నేల? వారితోడిపోరు గలిగినా మీవారు బ్రదుకుదు రని నమ్మవలదు. ఒకవేళ జయపరాజయము లస్థిరములు గావునఁ బాండవులే జయింతు రని నమ్మరా దనుతలంపు గలుగునేనియు మీవారు గెలుతు రనునమ్మికయు లేమిం జేసియైనఁ గూడి బ్రదుకుట మేలు. ఎన్నితెఱంగులం జూచినను సంధియే కర్తవ్యం బని తోఁచుచున్న దని విదురుండు దెల్పిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె.

### ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునకు హితముఁ జెప్పుట.

పుత్రా, నామాట విని మేలు గనుము. ఏల యనభిజ్ఞునిచందమున నుత్పథమునం బోయెదవు. పాండవులతేజము హరింపం దలంచెదవు. వారు పంచభూతములవిధమున లోకవ్యాపకులు. ధర్మరాజు పరమధర్మాత్ముండు. అతనిం గెలువ రాదు? భీమునకుఁ దుల్యుఁ డగుబలవంతుఁ డొక్కఁడును గానంబడఁడు. మ్రాను మహామారుతముంబోలె నంతకతుల్యుం డైనయావృకోదరుని నీ వెదిరించెదవు. అర్జునుపరాక్రమంబు చెప్పఁగొలఁదియె. పర్వతములలో మేరు వెట్టు లట్టుల వాఁడు విలుకాండ్రలో నుత్తముఁడు. బుద్ధిగలవాఁ డెవ్వఁడేనియు వానిం గెలుతు నని మాఱ్కొనునే? కవలును మహాబలవిక్రమములు. పాంచాలవర్యుఁ డైనధృష్టద్యుమ్నుఁడు సంగరమునకు వచ్చినా యింద్రుఁడు వజ్రముంబోలె వాఁడితూ

పులం బరఁగించి యందఱం జంచి చెండాడుంగాని యొక్కనినైన మిగిలించునే? పాండవహితరతుం డయినసాత్యకి నీవారల ధ్వంసముఁ జేయ నొక్కమాత్రన యుడుగునే? మఱియుఁ ద్రైలోక్యనాథుం డైనజనార్దనుండు వారివాఁడై యున్నవాఁడు. అమ్మహాత్మున కెనవచ్చువాఁ డొక్కఁడైనం గలుగునే? అప్పరమేశ్వరుం డురంబున మార్కొన నెవ్వఁడయినం దొడరునే? అతనికి దారపుత్రమిత్రజ్ఞాతిబాంధవులాత్మయు భూమండలము నొక్కవలను. సవ్యసాచి యొక్కఁడే యొక్కవలను. అట్లన్నివిధముల నతం డర్జునునకుఁ గడుం గూర్చుప్రెగ్గడయైయుండ వారి కెయ్యదియేనియుం గొఱఁత గలుగునే? కేశవసహాయముఁ బడసినవారు ముల్లోకములనయినం గెలిచి నిజార్థము సాధింతురు. కావునఁ గార్యార్థములఁ బరిశీలించి మేలు గోరి హితము బోధించుపెద్దల మాటం గ్రహింపుము. కురుపితామహుం డైనభీష్ముని, గురువృద్ధుం డైనబాహ్లికుని, సర్వకాలంబులును గౌరవకార్యములఁ జింతించుచు హితము బోధించుచున్ననన్ను, నాచార్యు లయినద్రోణకృపులను, హితవాదు లగువిదురవికర్ణాదులను నాదరించి మాకుఁగానైన సంధిం గావింపుము. సంధివలన మేలు గాదేని యీపెద్దలెల్ల నేల యిట్టు లొక్కమాటగఁ జెప్పుదురు? వీర లందఱు ధర్మవిదులు నీకుఁ గూర్చువారు గావున మాన్యులుగాని యొండుగాదు. నన్నుఁబోలె వీరి నాదరించి తద్వచనం బనుష్ఠించి కులమును సకలజనులను రక్షింపుము. అర్జును మార్కొందు ననుమాట మానుము. వానిశౌర్యము విరాటగోగ్రహణాద్యవసరములందు నీవే కన్నులారఁ గనుఁగొనినదియకదా. ఇఁక నేఁ జెప్ప నేల? పాండవులతోడిపొం దొనర్చి సుఖింపు మని యిట్లు ధృతరాష్ట్రుఁడు కొడుకునకు హితము బోధించి యట సంజయుం బిలిచి సూతపుత్రా, వాసుదేవుఁడు చెప్పినపదంపడి కట్టకడపట సవ్యసాచి పలికినదాని వినవలతుం జెప్పు మనియడుగ నతం డతని కిట్లనియె. రాజేంద్రా, వాసుదేవుఁడు ధర్మరాజునుం జెప్పినపదంపడి గాండీవి నన్నుం బిలిచి సంజయా, నీ వరిగినపదంపడి యాస్థానంబునందు ధృతరాష్ట్రనరపతియు, భీష్మద్రోణకృపాశ్వత్థామబాహ్లికసోమదత్తాదు లగుపెద్దలును దుశ్శాసనదుర్మర్షణదుస్సహాదు లగుకుమారులును, శకునిసైంధవాదు లగుబాంధవులును, రాధేయాదు లగుయోధులును, విందానువిందభగదత్తజలసంధప్రభృతు లగునానాదేశరాజులును వినుచుండఁ బాపాత్ముఁ డతికోపనుఁ డతిలుబ్ధుఁడు నగునాదుర్యోధనునితో నామాటగా నిట్టులను మనిపలికి క్రోధారుణితలోచనుండై వాసుదేవుం జూచుచు ధర్మార్థసహితముగ నాతో నిట్లనియె. సంజయా, వింటివిగదా మహానుభావుం డైనమధుసూదనువచనంబుచందంబు. నే నింక వేఱచెప్ప నేల? నావచనంబు నదియే. స్వధర్మప్రవర్తనుం డైనయజాతశత్రునకు రాజ్యభాగ మియ్యరేని రథవాయునసము

ద్ధతం బగుతీవ్రబాణానలమునందు నేను ధనుస్స్రువముచే సకలసహాయసమన్వితు లయినమీవారలనెల్ల హోమము మొనరింతు నిది తప్పదు. దీని లెస్సగ నెఱింగింపు మనివచించి తగినవస్త్రాభరణముల నన్నాదరించి వీడ్కొల్పుటయు నేనును వారియందఱయానతిం గొని తద్వచనంబు దేవరకు విన్నవింపఁగ నతిరయమున నిచ్చటికి వచ్చితి. తదుక్తప్రకారం బంతయుం జెప్పితింగదా మీకెల్లఁ బోలిన తెఱంగుఁ జేయుఁ డనిచెప్పినం దుర్యోధనుఁ డామాటలఁ బెడచెవిఁ బెట్టి య నాదరించె. అందఱు నేమియుం బలుకనేరక యూరకుండి కొండొకవడికిఁ గొలువు లేచి తమతమయిండ్ల కరిగిరి. అత్తెఱంగున నందఱు నిజనివాసంబులకుఁ జనినపదంపడి ధృతరాష్ట్రుఁడు తనకొడుకులగెలుపుఁ గోరుచుఁ బాండుపుత్రులబలమునకుఁ దనకొడుకుబలగమునకుం గలతారతమ్యము నెఱుంగువాఁడై యేకాంతమున సంజయుంబిలిచి గావల్గణపుత్రా, నీవు మనవారిబలము నుపప్లావ్యమునం బాండవులకుఁ దోడ్పడవచ్చినసైన్యమునుం జూచినవాఁడవుకదా. ఇం దెయ్యది యధికముగను సారవంతంబుగను నీమదికిఁ దోఁచె. ఎవ్వరు గెలుతురని నీ వూహించితివి. తెలియఁ జెప్పుమనియడుగుటయు సంజయుండు నరేంద్రా, నీతో నేకాంతమున నెయ్యదియుం జెప్పనెల్లను. చెప్పిన నందలిగుణదోషము లరయక యసూయపడుదువు. ఇది నీకు సహజం బని యే నెఱుంగుదు. కావున భవజ్జనకుం డైనవేదవ్యాసుని, బట్టంపుదేవి యగుగాంధారిని రావింపుము. వారలయెదుట వాసుదేవార్జునులమతమును నామదికిఁ దోఁచినదానిం జెప్పెద. అప్పుడు నీ వసూయపడినను వా రిద్దఱు ధర్మనిశ్చయము నెఱుంగుటంజేసి వారింతురనవుడు ధృతరాష్ట్రుండు పారాశర్యుం దలంచి గాంధారిని రావించె.

వ్యాసులు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట.

అట్లు తలంచినంతన ధృతరాష్ట్రసంజయులమత మెఱింగి యమ్మునీంద్రుఁడు తత్క్షణంబ యచ్చటికి విచ్చేయుటయు ధృతరాష్ట్రునినుమతి నమ్మునిం బరమభక్తి నారాధించె. కురునృపాలుఁడుం బ్రణామంబుఁ జేసి సంజయు నడిగినట్లడుగుటయు నాసాత్యవతేయుండు సంజయుం బిలిచి యితం డడిగినదాని కుత్తరము సెప్పుము వాసుదేవార్జునులమహిమము నీ వెఱుంగుదువుకదా యనుటయు నాసూతపుత్రుఁ డిట్లనియె. మహారాజా, వాసుదేవార్జునులమహిమము చెప్పఁ గొలఁదియే. నిఖిలలోకపూజితు లయిననరనారాయణులు దుష్టనిగ్రహశిష్టపాలనపూర్వకంబుగా ధర్మసంస్థాపనార్థంబు భూలోకమున నీరూపములతో నవతరించినవారు. అన్నారాయణునిచక్రము పాండవులయాయుధంబులందు మాయచే నంతర్భూతంబై యుండు. వారి కెదురుగ నడుచుమీవారలు గెలువనోపరు. వాసుదేవుఁడు పాండవుల గెలిపింతు ననియుండఁగ మీవారు తాముం గెలుతు మనుట కొనసా

గునే? అమ్మహానుభావునిమహిమములు నీవును వినియున్నవాఁడవుకదా. కంసన రకశిశుపాలాదుల నశ్రమమున వధించుట లోకవిదితంబుగాదె. నీవారికిం బాం డవులకుం గలబలతారతమ్యముల నింక విచారింప నేల? వారలే గెల్తురు. ఇందు సంక్షేపముగఁ జెప్పెద నాకర్ణింపుము. మూఁడుజగములొక్కటియై దేవకీనందను నెదిరించినను గెలువనేరవు. అద్దేవదేవుఁ డలిగెనా లోకమెల్ల భస్మముఁ గావించు. సత్యధర్మార్జవము లేవలనం గలుగు నావలనం గృష్ణుండు నిలుచు. కృష్ణుఁడు నిలిచినచోట జయంబు సిద్ధంబు. సర్వలోకములకు సృష్టిస్థితిలయకారణభూతుం డైనయయ్యాదిదేవున కశక్యంబు గలుగునే? అతండు పాండవులచే రణసత్రముఁ జేయించి యందు మూఢు లధర్మపరులు నగునీకొడుకులఁ బుత్రమిత్రామాత్య సహితంబుగా హోమముఁ జేయ నున్నవాఁడు. ఆభగవంతుఁ డాత్మయోగమహిమమునఁ గాలచక్రమును యుగచక్రమును జగచ్చక్రమునుం బరివర్తనంబుఁ గావించు. చరాచరాత్మకం బయినసకలప్రపంచమునకు మృత్యువునకుం గాలమునకు నతండే యీశ్వరుండు. సర్వేశ్వరుండయ్యునద్దేవదేవుండు లీలావినోదార్థంబు కర్మములం గడంగు. అప్పరమేశ్వరుచిత్రచరిత్రంబు లెఱుంగ నెంతవారలుం జాలరు. పెక్కు లేల? తదీయమాయకుఁ జిక్కినవారు క్లేశప్రాప్తు లగుదురు. ఇతర స్మరణంబు మాని యాభగవంతునే యాశ్రయించినవారు మాయామోహంబునం దవులక శాశ్వతసిద్ధిం బడయుదు రనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, సర్వలోకమహేశ్వరుం డైనయప్పరమపురుషుని నీ వెట్లెఱింగితివి. నే నేల తెలియనైతి. దీనిం జెప్పుమనియడుగ సంజయుం డతనికి మఱియు నిట్లనియె. విద్యయు నవిద్యయు నన రెండు గలవు. విద్యావంతులు భగవంతు నెఱుంగఁ జాలుదురు. నీ వవిద్యాగ్రస్తుండవై తమోవ్యాప్తుండ వగుటంజేసి కేశవు నెఱుంగవైతివి. ఏను విద్యామహిమలబ్ధ మగుభక్తియోగమున సర్వకారణకారణాత్మకుఁడు జనార్దనాన్యుఁడు నగునమ్మధుసూదను నెఱుంగుదు నని వచించిన విని వైచిత్రవీర్యుండు గావల్గణీ, భక్తియోగమునం గదా నీవు జనార్దను నెఱుంగుదువు. దానిం దెలుపుమనియడుగ సంజయుండు మాయకుఁ దవులక వృథా ధర్మముల నాచరింపక కేవలభక్తియోగమున శుద్ధచేతస్కుండనై యేను శాస్త్రప్రమాణమున నధోక్షజు నెఱుంగుదుననిపలుకుటయు ధృతరాష్ట్రుఁడు కొడుకుం బిలిచి దుర్యోధనా, సంజయుఁడు మన కెంతయు నాప్తుఁడు. వీనిమాట గ్రాహ్యంబు. సర్వలోకశరణ్యుం డైనకృష్ణు నాశ్రయించి బ్రదుకు మనియె. అనవుడు దుర్యోధనుండు తండ్రిం జూచి కృష్ణుఁ డాశ్రయణీయుఁడైనను సవ్యసాచిమీఁదఁ గలసఖ్యముతో మాకుఁ గీడు రోయుటంజేసి యతని నాశ్రయింపను. ఏతన్నిమిత్తమున ముల్లోకములకుఁ జేటు వచ్చిననువచ్చుఁగాక యని మాఱుపలికిన నదరిపడి ధృతరాష్ట్రుఁడు గాంధారిం బిలిచి

యీర్ష్యామానకలుషచిత్తుం డగుటంజేసి నీకొడుకు మంచిమాటలు వినఁడు శ్రే యోమార్గ మవలంబింపఁడు. నీవైనను వీనికి సుబుద్ధిని బోధింపు మనుటయు నద్దేవి కొడుకున కిట్లనియె. అన్న దుర్యోధనా లాఁతులమైశ్వర్యమున కాసపడి పెద్ద లమాటల నిరాకరించెదవు. నీతండ్రిని, నన్ను, నైశ్వర్యమును, బ్రాణములను విడిచి శత్రువులకు సంతోషమును నాకు శోకమునుం గావించుచు భీమసేనవిహ తుండవై రవిక్షోణీతలంబునం బడినపుడు నామాటలం దలపోయుదువు. ఇంతియ కాని యొండు గాదు. మేమెల్లఁ జెప్పుహితము విని పాండవులతోడఁ బొం దొన ర్చి సుఖింపు మని బోధింపుచున్నంత వేదవ్యాసుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. నా మాట విని కృష్ణునకుఁ బ్రియుండవై సంధిఁ జేసి బ్రదుకుము. సంజయుఁడు నీ కుఁ బరమాప్తుఁ డగుదూత కావునఁ గీడు చెప్పఁడు. ఈతండు పురాణపురుషుం డైనహృషీకేశు నెఱుంగు. వీనిమతం బనువర్తించిన నీకు భయ ముడుగు. కామ మోహితచేతస్కు లగువారు నిజధనములఁ దనియక పరులధన మాసించుచుఁ గ్రోధాదు లను ఘోరపాశములం గట్టుపడి యంధులవిధమునఁ గన్ను గానక నిజకర్మవశమున జననమరణాదిరూపము లగుసంసృతిక్లేశములం బొరయుదురు. ఈక్లేశములం బడయక సుఖించుటకు వాసుదేవాశ్రయణంబే ముఖ్యమార్గంబు. పెద్దలామార్గము నవలంబించి ముక్తులయి రని సాత్యవతేయుండు వివరించిన విని యాంబికేయుండు సంజయుదిక్కు మొగంబై హృషీకేశప్రాప్తిమార్గము బోధిం పు మనియడుగ నతం డతని కిట్లనియె. అపరిశుద్ధాత్ముం డైననరుఁడు నిత్యశుద్ధుం డైనపరమపురుషు నెఱుంగనేరఁడు. ఇంద్రియనిగ్రహముకంటెఁ జిత్తశుద్ధ్యుపా యము వేఱొకండు గన్పట్టదు. కామత్యాగ మప్రమాద మహింస యనునివి జ్ఞానసాధనములు. వీనిం బడసి యింద్రియనిగ్రహమునందు జాగరూకుండైన వాఁడు వాసుదేవుం దెలియు. ఇంద్రియనిగ్రహముననే పెద్దలుత్తమగతిం బడ సిరి. వానిం గెలువనివారికిఁ గేశవుఁ డప్రాప్యుఁడు. కావున శాస్త్రవిజ్ఞానసమధి గతం బైనయింద్రియనిగ్రహయోగంబునం బరినిష్ఠితుండు ప్రసన్నచిత్తుండై విది తవేద్యుండై నెగడుఁగావున నీవు నింద్రియముల జయించి పరధనముపైఁ దృ ష్ణ మాని బ్రదుకు మనిన విని యంబికానందనుండు సూతనందనుంజూచి సంజ యా, వాసుదేవదివ్యనామనిర్వచనము నాకుఁ దెలియఁ జెప్పుమనియడుగ నతం డతని కిట్లనియె. * సర్వభూతముల కాధారభూతుండై స్వప్రకాశమున వెలుంగు టంజేసి భగవంతుఁడు వాసుదేవుఁ డనఁ బరఁగె. సర్వవ్యాపకుఁడు గావున విష్ణు పదవాచ్యుం డయ్యె. మౌనధ్యానయోగముల లభ్యుఁ డగుటంబట్టి మాధవుండ నంబడియె. భూమివాచకం బైనకృషిపదమునకును నిర్వృతివాచకం బగుణకారం

* ఈవ్యుత్పత్తులు పౌరాణికసంప్రదాయమున నేర్పడుచున్నవి.

బునకును సంయోగంబునంజేసి భూనిర్వృతి సంయుక్తుండుగావునఁ గృష్ణపదాభిధేయుం డయ్యె. పుండరీక మనం బరధామము. అది యక్షయ్యమై యునికింజేసి పుండరీకాక్షుండు నాఁ బడియె. దుర్జనులఁ బీడించుటంజేసి జనార్దనాభిధేయుఁ డయ్యె. సత్త్వగుణనిష్ఠుండు గావున సాత్వతుఁ డనంబరఁగె. సర్వశ్రేష్ఠుండు గావున ఋషభుఁడు నాఁబడియె. జననరాహిత్యమునంజేసి యజుండు నాఁబరఁగె. దమస్వప్రకాశవిశిష్టతంజేసి దామోదరనాముఁ డయ్యె. హర్షసుఖైశ్వరుండుగావున హృషీకేశుఁ డనంబడియె. నిజభుజముల భూమ్యంతరిక్షముల భరించుటంజేసి మహాబాహుండు నాఁబరఁగె. ఒకప్పుడైన నధఃక్షయముఁ గానమింజేసి యధోక్షజుం డయ్యె. నారము లయనముగఁ గలుగుటవలన నారాయణుఁ డయ్యె. జగమెల్ల నిండి యంతకుఁ దాన సదన మగుటంబట్టి పురుషోత్తముఁ డయ్యె. సర్వమునకుం గారణమై సర్వముం దాన యవుటంజేసి సర్వపదవాచ్యుం డయ్యె. సత్యమందు నిత్యప్రతిష్ఠితుండై సకలసత్యములకంటె సత్యస్వరూపుఁడుగావున సత్యపదాభిధేయుం డయ్యె. జయశీలుఁడుగావున జిష్ణుఁ డయ్యె. శాశ్వతుఁడై యంతము లేనివాఁడుగావున ననంతుఁ డయ్యె. గోవేదనముకలిమింజేసి గోవిందుఁ డయ్యె. భగవంతుని మహామహిమముఁ జెప్పఁ గొలఁదియే? ధర్మనిత్యుఁడైన యామధుసూదనుఁడు కౌరవపాండవులకు సంధిఁ గావించువాఁడై యిచ్చటికి వచ్చునఁట. అమ్మహాత్మునిహితోపదేశ మాకర్ణించి యాదరముతోఁ దత్ప్రకారము నడిపి సుఖంపు మనిచెప్పిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, వాసుదేవుం గాంచఁ గలిగిననేత్రవంతు లెంతపుణ్యంబుఁ జేసిరో భారతకులము సుఖముఁ గోరి యమ్మహానుభావుండు చెప్పఁగలదివ్యవచనముల నాకర్ణించెద. లోకానుగ్రహార్థము యదుకులమున నవతరించిన యమ్మహానుభావుమహిమం బెఱుంగ నెవ్వరు నేర్తురు? అద్దేవదేవుండు వాక్రుచ్చుసంధివాక్యములఁ గౌరవులెల్ల విని తత్ప్రకారమున నడిచి సుఖింతురుగాక. స్వప్రకాశుఁడు సర్వకారణకారణాత్మకుఁ డాదిమధ్యాంతరహితుండు పురాణపురుషుఁడు నగుహరి నాశ్రయించెద ననిపలికి భగవద్ధ్యానపరాయణుం డయ్యె. వేదవ్యాసమునీంద్రుఁ డిదియ పోలు నని యవ్విచిత్రవీర్యపుత్రు నామంత్రణము చేసి యరిగె. ధృతరాష్ట్రుఁడును దుర్యోధనసంజయులను నిజనివాసములకుఁ బోవఁ బనిచి గాంధారియుఁ దాను నభ్యంతరమందిరమున కరిగి మధ్యాహ్నోచితకృత్యముల నిర్వర్తింపఁ బ్రవర్తిల్లుచుండె ననిన విని జనమేజయుండు సంతుష్టస్వాంతుం డయ్యె.

శా. ధన్యాత్ముల్ సకలప్రపంచమును మిథ్యాభూతమున్ రజ్జుస
ర్పన్యాయంబునఁ దోఁచుదాని విమలప్రజ్ఞన్ని షేధించి త

న్మాన్యాధారుని నేని సత్యునిఁగ సంభావింతురో పండిత
మ్మన్యుల్గానఁగలేరొ యట్టిపరమాత్మం జిత్తమం దెన్నెదన్॥

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్క మహీపాల కరుణాపూర స్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వ చమత్కార పరితోషిత బుధస్తోమ సీతారామకవిలలామపుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్యుల క్ష్మీనృసింహసుధీవర్యసచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామధే య విరచితంబైన శ్రీమదాంధ్రవచనభారతమునం దుద్యోగపర్వమునం దు సేనోద్యోగంబును, నర్జునదుర్యోధనులు కయ్యమునకుఁ దోడ్ప డ వాసుదేవుం బ్రార్థింప ద్వారకకరుగుటయు, భగవంతుఁ డర్జు నునకు సారథిగా నొడంబడుటయు, దుర్యోధనుఁడు నారాయ ణగోపాలురం గ్రహించుటయుఁ, బాండవులకడకు వచ్చు చున్నశల్యుని దుర్యోధనుఁడువచించి తాను గ్రహించు టయు, శల్యుఁడుపప్లావ్యమునకు వచ్చి ధర్మరాజునకుఁ గోరినవరంబిచ్చి యింద్రవిజయోపాఖ్యానంబుఁ జె ప్పుటయుఁ, గౌరవులపాలికిఁ బాంచాలపురో హితుం బంపుటయు, సంజయునిఁ బాం డవులయొద్దకుఁ బుత్తెంచుటయు, ధృత రాష్ట్రప్రజాగరంబును, విదురహితో పదేశంబును, సనత్సుజాతీయంబు ను, నుపప్లావ్యంబునుండి వచ్చిన సంజయుండు సంధివాక్యముల వివరించుటయు నన్నది ప్రథమాశ్వాసము.



శ్రీకాళహస్తీశ్వరాయనమః.

## ద్వితీయాశ్వాస ప్రారంభము.

క. శ్రీ కలిత బ్రహ్మార్పణ
ధీ కృత నిత్యక్రియా ప్రతిష్ఠిత సుమనో
లోక మనోంతర కరుణా
స్వీకృత వాసా, దురూహ వివిధ విలాసా.
దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతరక థాకర్ణనోదీర్ణకుతుకహృదయుం డైన జనమేజయున కిట్లనియె. అంత నక్కడ సంజయుండు మరలి వచ్చినపదంపడి పాండవాగ్రజుండు గదాగ్రజుం బిలిచి యో మిత్రవత్సలా, నీనెయ్యురకు మేలు సేయఁగ నియ్యది కాలంబు ప్రాప్తంబయ్యె. మ మ్మాపదలం గడతేర్పఁగ నీకంటె నితరుఁ డొక్కఁడుం గన్పట్టఁడు. ఈజన్మము నకు మా కేడుగడ నీవ. మాధవా, నిన్నాశ్రయించి నిర్భయుఁ డమోఘదర్పి తుండు నగుదుర్యోధనుని మాపా లడుగఁ దలఁచితి. యాదవులట్లు పాండవులును నీకు రక్షణీయులు గావున నేను బెక్కులు విన్నవింప నేల? మాయాపదం దొలఁ గించి ప్రోవు మనిన విని భక్తవత్సలుం డైనభగవంతుఁ డిట్లనియె. రాజేంద్రా, యేను నీపనిచినపని సేయ నిదె యాయితపడియున్నవాఁడ. చెప్పఁ దలంచినదా నిం జెప్పు పంతయుఁ జేయుదు ననుటయు ధర్మరా జిట్లనియె.

ధర్మరాజు కృష్ణునితోఁ గార్యవిషయముఁ జెప్పుట.

మహాత్మా, ధృతరాష్ట్రునిమతంబుఁ దత్పుత్రులయభిప్రాయంబును సంజ యునివచనముల నీకుఁ దేటపడియెఁగదా. మోమోడక యట్లు పరుషములఁ బ లికినందులకు వాఁడు దూత గాఁడేని దండనకుఁ బాత్రుం డగు. రాజ్యమునం బాలీక వట్టిమాటలచే మమ్ము శాంతిఁ బొందుఁ డనుటయే లుబ్ధచిత్తు లయినవా రికిఁ బరమాభిప్రాయము. ఆవృద్ధభూపతిశాసనం బతిక్రమింపక యేము వనము లఁ బండ్రెండేండ్లును జనపదమున నిగూఢచర్యమై నొక్కయేఁడుం గడపితిమి. అ ప్పటిమాపాట్లు బ్రాహ్మణు లెఱుంగుదురు. మాసమయము మేము గడపి వచ్చిన పదంపడి మారాజ్యము మా కియ్యవలయుఁగదా. ఏమి చేయవచ్చు? ఆధృతరా ష్ట్రుఁడు స్వధర్మముఁ బరికింపక కొడుకులకు వశ్యుండై తన్మతంబ నడుపుచున్న వాఁడు దుర్యోధనుదురాచారము సర్వజనవిదితంబకదా. తల్లిని, జుట్టాలను, జె లులనుం బోషింపలేనై తీఁగా యని పెన్వగ నైడమ్ము. ఇంతకంటె దుఃఖము వే

ఒక్కటి వలయునే? ఎట్లయిన నగుఁగాక. స్వజనపోషణార్థం బైదూ ల్లిచ్చినం జాలు. కులక్షయమున కొల్ల నని నీమెదుటం బలికితి. ఆపాపాత్ముఁ డంతమాత్రయుం జేయఁడయ్యె. ఇఁక నే నేమి చేయుదు? సత్కులప్రసూతుఁడై నవృద్ధునకుఁ బరధనములపైఁ గాంక్ష గలిగెనేని యాలోభము ప్రజ్ఞానముం జెఱుచు. ప్రజ్ఞానంబు చెడిన హ్రీ యడఁగు. హ్రీ యడఁగిన ధర్మబాధ దొడరు. ధర్మబాధ దొడరిన సంపద నశించు. సంపద్వినాశంబే పురుషునకు మరణము. పండ్లు పువ్వులును లేనిమ్రాఁకుం బక్షులు విడుచువడువునను విగతప్రాణం బయినకళేబరంబు నింద్రియములు పరిహరించుచందమునను నిర్ధనుం డైనపురుషుని బంధువులు మిత్రులు బ్రాహ్మణులుం ద్యజింతురు. దారిద్ర్యముకంటె నధికదుఃఖ మెద్దియుం గాదు. లేమిడి మూఁడినం గడుపు నిండఁ గుడునఁ గూడు సాయం ప్రాతఃకాలములం దొక్కపూఁటనైన నను దొరకుట యరిది. నిప్పచ్చరముమున్నీట మునిఁగి కడతేర నేరక కొందఱు చావు మే లనితలంతురు. బ్రదుకు గానక కొందఱు కడుపుకూటికై దేశములం ద్రిమ్మరుదురు. కొంద ఱడవులకుఁ జని కాయ లాకులు పండ్లునుం దినుచు శరీరయాత్ర నడుపుదురు. కొందఱుపిచ్చిపట్టి బమ్మరింతురు. కొందఱు పగవారికేనియు దాస్యంబుఁ జేయం గడంగుదురు. ఇట్లుసర్వావస్థలకు సర్వావమానంబులకును మూలం బయినపేదఱికముకంటెఁ జావు పెక్కుమడుంగులు మేలు. లోకసాధారణం బయినమరణంబు నెవ్వరు నతిక్రమింపలేరు గావున నందులకుఁ గొందలం బందవలసియుండదు. మఱి ధర్మకామములకు హేతుభూతం బయినధన మింతయు లేక యెద్దడి శద్దయుం దనకు వచ్చినం బెనువగలఁ బొగులక తప్పదు. అందును బుట్టిననాఁటంగోలె నిర్ధనుండై యిడుమలఁ బడువాఁ డది యంతగ నెఱుంగఁ జాలఁడు. చిన్ననాఁటం బలుదెఱంగుల విభవములు మెఱయఁ గొన్నినాళ్లు బ్రదికి చెడినవాని కాకష్టం బెంతయు దుస్సహం బై యుండు. పెక్కు లేల? అది యిట్టి దని నిరూపించి చెప్పి చూపఁగ నలవి గాదు. అవ్విధమున దైవదుర్విపాకమున మహావ్యసనములఁ బడినవాఁడు సుఖజీవనంబుఁ గానక యింద్రాదిదేవతలనుం దన్నును నిందించుకొను. భృత్యులతోఁ జివ్వ పెట్టికొను. సుహృదులయెడ నసూయపడు. అప్రయోజకం బైనవానికోపము నాఁపఁగ సకలశాస్త్రములుం జాలవు. కావునవాఁ డప్పటప్పటికిఁ గోపంబు మఱింత యెక్కువగాఁగ మోహవశుండై క్రూరత్వమున కొడఁబడి పాపముల నొనర్చు. పాపాచరణంబు నరకమునకుఁ గారణంబు. ఇట్లు గాక యించుక ప్రబోధము గలిగెనేని ప్రజ్ఞాలాభమున శాస్త్రములఁ బరిశీలించు. శాస్త్రనిష్ఠ గలిగెనేని ధర్మ మాచరించు. దానికి హ్రీ ముఖ్య మగునంగము. హ్రీమంతుఁడు పాపము నొనరింపఁడు. పాపములపై ద్వేషము గలవానికిశ్రీ పెంపెసంగు. ఎందాఁక శ్రీమం

తుఁడై యుండునో యందాఁకనే యతఁడు పురుషుఁ డనంబడు. ధర్మనిరతుఁడు శాంతాత్ముఁడునై కార్యయోగములఁ బూనునతం డధర్మంబుఁ బొంతఁ బోవఁడు. పాపమునం బ్రవర్తింపఁడు. హ్రీరహితుఁడైనమూఢుఁడు స్త్రీలలోనను బురుషులలోనను గణనకు రాఁడు. శూద్రునట్లు వాఁడు ధర్మబాహ్యుఁడై యుండు. హ్రీమంతుఁ డకార్యనివర్తనంబునం జేసి దేవపితృసమారాధనాదిరూపం బయిన యుత్తమకార్యముఁ జేయుచు దాన నమృతత్వప్రాప్తుఁ డగు. అమృతత్వంబే సర్వపుణ్యకర్మసంఘాతసమగ్రఫలంబు. అంతయు లెస్సపరిశీలించి చూచినం దారిద్ర్యంబుకంటె గర్హితంబొండు గాదని తోఁచెడి. మావృత్తాంతం బంతయు నీకుఁ బ్రత్యక్షంబ కదా. ఇప్పుడు రాజ్యభ్రష్టుఁడనై యెద్దియుం దోఁపక కుందుచుండెద. మారాజ్యము మా కిమ్మని యడిగినం దప్పెయ్యది? ఏన్యాయము గలుగ మేము మారాజ్యముఁ గోరకుండుదుము? మారాజ్యముఁ గోరి పోరునెడ గెలుపు గాక వధం బయినను మేలు. అయిననందు మేమును ధార్తరాష్ట్రులును సంధిచే నెక్కటిమై కూడి నిజరాజ్యముఁ బడయుట ప్రథమపక్షము. అందులకు వారియ్యకొనరేని యప్పుడు యుద్ధము దక్క నొండెద్ది మాకుఁ గర్తవ్యంబు? యుద్ధమత్యంతరౌద్రంబైనను నంతకంటె నొండెద్దియు రాజ్యప్రాప్త్యుపాయంబు లభింపమిం జేసి దానిం జేయక తీఱదు. ఏమి చేయవచ్చు? తమ కెయ్యది యేని యించుకేనియు సంబంధము లేనిధూర్తులనైనం జంపవలయు నన్న వలదనుబుద్ధి వొడము. జ్ఞాతులు బంధులు గురువులు మున్నగువారలం జంపవలయునన్న నింక నేమని చెప్పుదు? తద్వధం బత్యంతపాతకంబు గాకుండునే? అక్కటా! క్షత్రియకులధర్మం బింతకష్టంబై యుండునే? మే ముత్తమక్షత్రియకులంబున జనించితిమి గావున ధర్మమైన నధర్మమైన యుద్ధమే మాకు ధర్మంబ యనియెన్నవలయు. బ్రాహ్మణులకు భిక్షాశనంబు వైశ్యులకు వాణిజ్యంబు శూద్రుల కుత్తమశుశ్రూషయునెట్లట్ల క్షత్రియులకు సంగ్రామంబు ధర్మంబని ధర్మశాస్త్రాచార్యులు విధించిరి. కావున మాకన్యవృత్తి గర్హితంబై యుండు. మత్స్యశునకములవిధమున క్షత్రియులుం దమలోబలవంతులు దుర్బలులం జంపుదురు. ఘోరంబైననియ్యది దైవవిహితంబవుటం జేసి యనుష్ఠేయంబ. యుద్ధస్వరూపంబు విచారింతుమన్ననో చెప్ప నోరాడదు. ఎంతనెచ్చెలులకైనం దమలోనం గలహంబు పెల్లగు. అయ్యవస్థలం బడినను గెలుపు నిక్కంబు గాదు. పరాజయంబు గలిగినం గలుగు. భూతములకు జీవనంబును మరణంబును సుఖదుఃఖములునుం దమ తలంచినపుడు రావు. మఱి దైవనిర్ణీతకాలమందవశ్యము వచ్చు. మఱియు యుద్ధమునందు బలవంతులు దుర్బలులఁ జంపుదురనియుం జెప్ప వలనుగాదు. ఒకరుఁడు పలువురం జంపుటయుఁ, బలువు రొక్కని వధించుటయుఁ, గాపురుషుఁడు శూరుం జెండాడుటయు, నయశస్వి యశస్విని

గెలుచుటయుం దైవవశంబునఁ గలుగు. కయ్యమునకుఁ గాలుద్రవ్వుచు నిరువాగులు పోట్లాడునెడ రెండు తెగలవారుం గెల్తురనియొండె, నోడుదురనియొండెనుం గలుగు. ఉత్కర్షాపకర్షములు నట్లేయుండు. సర్వవిధములం జింతించిన యుద్ధంబు దుఃఖ కారణం బనియే తోఁచు. ఒకని నడిచిన నతం డేల మాఱుగొట్టక యూరకుండు? ఒక్క తూరి గొట్టఁబడినవాని కావల జయపరాజయములు రెండును సమానము లైయుండు. మానవంతునకుఁ బరాజయము మరణముకంటె వేఱు గాదు. యుద్ధ మునం బలుపురఁ జంపి జయముఁ గొన్నను దనకుఁ గూర్చునట్టి పుత్రభ్రాతృప్రభృ తులు పోరఁ బొలియుటం జేసి తనసిరికి సంతసిల్లువా రుండరు గావునఁ దనజీవితమునం దును నిర్వేదంబు వొడముకతన నావిజయంబు నపచయమూలంబ యగు. మఱియు దైవకారణంబున ధైర్యాదిగుణవిశిష్టులకే పరాజయమును నవిలేనివారికే గెలుపు నొకప్పుడు గలుగు. శత్రుల వధించి జయంబుఁ గొన్న పదంపడియును యోగ్యుఁ డందులకుఁ బశ్చాత్తాపంబుఁ బొందుచు నేవగించుచుండు. ఆపశ్చాత్తాపంబునం జేసి శత్రులలో నొక్కనినేనియు మిగిలింపఁగఁ దలంపు వొడమ. అట్లు మిగిలింపఁగ శేషించినయతండు పరాజయదుఃఖమునం గుందుచుఁ బగఁ దీర్చికొనం బూని బల వంతుల నాశ్రయించి తాను బలవంతుఁడై యెత్తివచ్చి తనవారలం గెలిచినవా రల నున్మూలనంబుఁ జేయం గడంగు. జాతవైరుఁడైనపురుషుఁడు పగ నెట్లు తీర్చికొనవలె నగునో యని యుమ్మలించుచుఁ బాముండుయింటఁ గాపుర మున్న వానిచందమున నుద్విగ్నచిత్తుండై యుండుట నిక్కంబు. ఇంట మగవాఁ డొక్కఁ డుండెనేని యతఁడు బాలుఁడైనను దక్కటివారు వానికిఁ బూర్వవైర మంతయుఁ జెప్పి క్రమ్మఱఁ బగ నానాఁటం బెచ్చుపెరుగుచందముఁ జేయఁ జూతురు. ఒక్క రుఁడు పగఁ బూనినం దానును వాని కీడుగాఁ బగఁ బూనినంతన యాపగ యెన్నఁ డుం దీఱదు. మఱి నేయి వోయ భగ్గని మండునగ్గిపగిది మఱింత పెరుగు. మఱియు మనంబునం బగ యుండెనా యొప్పులు గణింపక తప్పులే యెన్నఁగఁ దలంపు వొడ ముచుండు. అట నది యెడ తెగని తెవులై మనంబు నలంచుచుండు. అట్లు లెస్స పాదుకొనినపగ దీఱ సౌమనస్యంబు పెంపార శాంతిఁ గొనుట, పగవారల వేరు తోడఁ బెకలించి పాఱవైచుట, యీరెండు నశక్యంబు లగునేని తనప్రాణములఁ ద్యజించుట యనుమూఁడు దక్క నొండొక్కవెరవు గానరాదు. అందు శత్రుమూ లఘాతోద్యమంబు కౌరవులయెడఁ జేయఁగ నాకు మనస్సుగొలుపదు. అందుల కొడంబడి డిగితినేని కులక్షయంబు గాక తక్కనే? కావున నయ్యది నా కనభి మతంబు. ఎంత చింతించినను శాంతియే యుత్తమంబు. దాన నెవ్వరికిని నొప్పిలే కుండఁ గార్యంబు నెఱవేఱును. శాంతిఁ బూని పగఁ దలంపనివానికీర్తి కలకాలంబు నెగడు. మనము శాంతిపొంటె సర్వవిధముల జతనంబుఁ జేసితిమేని యాదుర్వృత్తు

లందుల కొడంబడక పోరుదెస నాస చేసిరేనియు మనవలనం దప్పొకింతయు నప్పుడు గానరాదు. వారు బిరుదు మగలై కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచు వచ్చిరేని మనము నప్పు డందులకుఁ దగినతెఱంగుగాఁ బోరికి నడుచుట సిద్ధ మింతియ కాని బీర ముడిపోవ నూరకుండు టనుమాట యెన్నఁడుం బొడమదు. సామము సాగదేని యేకార్థభాగులకుఁ గుక్కలకుంబోలెఁ దమలోనం గాట్లాట గలిగిన బలవంతులు దుర్బలులం జయించి తద్భోగ్యంబుఁ గుడుతురు. అట్లు మాలోనం బొసఁగునొక్కొ యని యే నెల్లపుడుం గుందుచుందు. ధృతరాష్ట్రుఁడు తండ్రియవుటం జేసి మాకు మాననీయుండు. అతం డుండఁగనే మే మొకళ్ళొకళ్లలోనం బోరుట నాక కా దెవ్వరికైనం జూడఁ బోలునే? ఆవృద్ధభూపతియుఁ దానైన నుచిత మరసి కొడుకు నెడంబఱిచి మాకుం గొంతయేనియు నిప్పింపఁ దలంపఁడయ్యె. మేముం గట్టుచుఁ గుడుచుచు స్వజనంబులం బ్రోచుచు సరివారిలోఁ దల యెత్తికొని తిరుగవలసినవారమకదా. మాయెడ రింక నేమని చెప్పుదు. అంతయు నీ వెఱింగినదియకాని యొండు గాదు. ఇట్టికష్టంపుఁబాటు వాటిల్లినప్పుడు నిన్నుఁ దక్క లాఁతి నిం కెవ్వని నే నడుగుదు. ఇక్కాలంబున కెయ్యది కర్తవ్యంబో యెద్ది చేసిన ధర్మార్థంబులకుఁ గొఱఁత రాకుండునో దానిం దెలియఁ జెప్పుము. నీవు సర్వభూతతత్త్వజ్ఞుండవు సర్వకార్యవినిశ్చయజ్ఞుండవు విశేషించి మాకుఁ బ్రియుఁడవు గావున నస్మత్కార్యంబు భవదధీనం బని పలికిన విని జనార్దనుండు ధర్మరాజునకిట్లనియె.

రాజేంద్రా, మీకును వారికిని సంధిఁ గావింపఁగ నేను హాస్తినపురమునకుఁ బోయెద మీకార్యమునకు భంగము వొసంగనితెఱంగుగా శాంతివచనముల వారికిఁ దేటపఱిచెద, వారు సాదరంబుగ నామాటలు విని యుచితరీతిం బ్రవర్తింతురేని మృత్యువాతం బడక తప్పుదురు, లోకమెల్ల నెలమిఁ గాంచు, దాన నా కత్యంతసుకృతంబు సేకుఱు, నిప్పటికి కిదియే కర్తవ్యం బనిన నప్పలుకులు విని కుంతీనందనుండు దేవకీనందనునకు వెండియు నిట్లనియె. నీవు కౌరవులకడకుఁ బోవుట నా కభిమతంబు గాదు. దురాత్ముఁడైనదుర్యోధనుఁడు నీమాట మెయి నడుచు వాఁడుగామి తెల్లంబకదా. మఱియు నిప్పు డప్పాపాచారుండు దనకుఁ బెక్కండ్రు దోడ్పడ నున్నవా రింక నెవ్వరు ద న్నేమి చేయ నోపుదు రని మదించినవాఁడు. పెక్కు లేల? ఆపలువలనడుమం గూర్చుండుటయు నీకుఁ దగదు. నీ కెగ్గు వాటిల్లు నెడ సర్వదేవాధిపత్యంబైనను నే నొల్లను. పెఱసుఖములఁ జెప్పనేల? ఇట్లుండ నాకార్యంబునకుఁగా నీ వావెంగలులతోడం గూర్చుండి వారిపెడమాటలకు మాఱుసెప్పుట నాకెంతయు నొప్పనిపని. కావుననేది యె ట్లయిన నగుంగాని నీవు వారియొద్దకుఁ బోవం దలంపకుము. ఆపాలసుల చెడుతలంపులకుఁ గొలఁది

గలుగునే? యనిన విని భగవంతుఁ డిట్లనియె. పాండవాగ్రజా, నీచెప్పినదంతయు నిక్కువంబు. దుర్యోధనునితూఁటరితనంబు నేను నెఱుంగుదు. వాఁడు నామాటమె యినడుచుననునమ్మిక నాకుం గలుగదు. అయినను మద్గమనంబు నిష్ప్రయోజనం బునుగా దెట్లంటేని, వారు సుఖింప భాగ్యము గలరేని మదీయహితోపదేశంబు సాదరంబుగ నాకర్ణించి తత్ప్రకారంబు నడుపుదురు. అది యందఱకును శ్రేయోదాయకంబు. అది యట్లుండె. ఇపుడు నేను సంధికార్యార్థం బచ్చటికిఁ బోకుండుదునేని కార్యవిషయంబు మీఁద నెట్లయినను బాండవులు ధర్మజ్ఞులయ్యుఁ దమకును ధార్తరాష్ట్రులకును గలహ మగుడుఁ దగినవారలఁ బంపి సంధి చేసినం బోఁగదయ్యెనా వార లట్లు చేయరై రని మీఁకును గృష్ణుఁడు సర్వ మెఱింగినవాఁడయ్యుఁ దానైనం బనివడి రెండు తెగలవారికిఁ దెలుంగఁ గావించినం గార్యంబు నెఱవేఱ దయ్యెనా యతండు నట్లు చేయఁడయ్యె నని నాకును లోకమున నింద రాకమానదు. నేనుం బోయి మనవలన లోపము లేకుండ సంధికార్యము ప్రసంగించితినేని మనకుఁ గీర్తి దక్కు. వారికి నామాట మే లనితోఁచునేని బ్రదుకుదురు. ధిక్కరింతురేని పొలియుదురు. అంతన నిలువక నా కెగ్గుఁ జేయఁ దలంతురేని క్రోధమూర్ఛితుండనైననాముందఱ వార లందఱుం గుమిగూడి గట్టి మొన గట్టి వచ్చియు నిలువఁ జాలుదురే? మఱి సింహమునెదుటం బడినక్షుద్రమృగములట్లు దిక్కు దోఁపక పాఱిపోవుదురు. కౌరవుల నందఱ నొక్కమాత్రలోన నేను నీఱుసేయం జాలుదు ననితలంతు. కావున నెన్నివిధములం జింతించినను మద్గమనంబున మేల యగు ననిన విని ధర్మరాజు శౌరికి వెండియు నిట్లనియె. మహాత్మా, నీకుఁ జెప్పఁగ నే నెంతవాఁడను. నీమది కెయ్యది యుచితం బనితోఁచునో దానిం జేయుము. భవదభిప్రాయంబుమెయిఁ గరిపురి కరిగి భారతకులంబు శాంతిం బొంది కుశలమున నెగడునట్లుగాఁ దెలుంగుపఱుపుము. ఇఁక నీ వెన్నఁడు కృతార్థుండవై కుశలమున మఱలివత్తువో యని యెదురుచూచుచుండుదు. బీభత్సునకు భాతృతుల్యుఁ డయినచెలికాఁడవు. నాకుం బ్రియుఁడవు. మాయెడ నీకుఁ గలసౌహార్ద మెవ్వరి కెవ్వరియెడను లేమి సుప్రసిద్ధంబు. కావునఁ బోయిరమ్ము. మేలు గైకొమ్ము. మమ్ము, నెదిరిని, గార్యస్వరూపంబును, మాటలపొందును నీవు లెస్స యెఱుంగుదువుకదా. నీమది కెయ్యది హితం బనియు నెయ్యది ధర్మసంయుతంబనియుం దోఁచునో తత్తత్ప్రకారంబెల్ల నడుపు మనివాక్రుచ్చిన నాకర్ణించి భగవంతుఁ డజాతశత్రునకు మఱియు నిట్లనియె.

కృష్ణుఁడు ధర్మరాజునకు ధార్తరాష్ట్రులదుర్ణయంబుఁ జెప్పుట.

నరేంద్రా, సంజయునివచనంబును భవద్వాక్యంబును వినఁగ రెండు తెగల వారియభిప్రాయములు నాకుఁ దేటపడియె. నీబుద్ధి ధర్మనిత్యంబు గావున శాంతిమై

నుభయపక్షములవారుం గూడిమనుట పొసఁగునేని మేలని తలంతువు. అయ్యౌ క్కవులు నెఱి దక్కి పగయే పాటించియున్నవారు. వా రట్లు పోటరులై మైత్త్రి వచ్చిరేని యపుడు మీ కూరకునికి యుఱవు గాదు. అప్పు డొప్పరికించి మిన్న కున్నం బదంపడి మీకు భిక్షాన్నంబు దక్క నొండొక్క వృత్తి యలవడంజాలదు. భిక్షాశనంబు క్షత్త్రియకులజాతులకు గర్హితం బని యందఱు నెఱుంగుదురుగదా! సంగ్రామంబు సంప్రాప్తంబయినం జయపరాజయంబులకుఁ దలంకక కడంగుటయే క్షత్త్రియునకు బ్రహ్మవిహితం బయినసనాతనధర్మంబు. కావున వా రనికి వత్తురేని మానంబు డింపనితలంపు పొంపిరివోవం బరాక్రమంబు సూపి పగఱఁ జెండాడుము. మఱియు సామమున వారు నీకుఁ బాలియ్యరు. అత్యంతలుబ్ధు లగునాధార్తరాష్ట్రులు. పెద్దకాలంబు మిత్త్రబలంబులం జేర్చికొనియు భీష్మద్రోణకృపాదుల ప్రాపుఁ గాంచియుఁ దాము బలవంతులనియు మిమ్ము గెలువఁ జాలదుమనియుఁ దమలో నిశ్చయించికొన్నవారు. ఇంక మి మ్మెట్లయినం బిలుకుమార్పఁ గడంగుదురుగాని రాజ్యమునఁ గొంత యియ్యఁగ మనసు పెట్టుదురే! నీవు పరుసఁదనము మాని మెత్తఁబాటు వాటించియుండునందాఁక నాకుటిలచిత్తులు నీరాజ్యము నాఁచికొననే చూతురుగాని యొండు గాదు. భూతదయాపశ్చాత్తాపధర్మంబులనునవి యెట్టివో వా రెఱుంగ రనుట నీకుం దెల్లంబకదా. కురువరేణ్యుం డైనధృతరాష్ట్రుఁడును, గురుపితామహుం డైనగాంగేయుండును, గురుకులాచార్యుం డైనకుంభసంభవుండును, గురుకులహితచింతాతత్పరుం డైనవిదురుండును, మఱియుం గురుముఖ్యులనేకులును, సాధువర్యులయినబ్రాహ్మణులుం బెక్కండ్రును జూచుచుండఁగనే దానధర్మశీలుఁడు శాంతిదాంతిమార్దవాదిసుగుణగణవిలసితుఁడు ననలోకముననెల్లం బొగడికఁ గన్ననిన్ను దుర్ద్యూతవ్యాజంబున నాదుర్యోధనుఁ డోడించి భవద్విభవంబునెల్ల నాఁచికొనియె. ఉగ్గడింపరానియట్టినెఱిమాలిన పని చేసియు నానీచుఁడించుకేనియు లజ్జింపఁడు. ఆపాపాత్ముఁడు లోకమునకెల్లను వధ్యుఁ డేయన నిఁక నీకు దయాపాత్త్రం బేగతి నగునో యెఱుంగరాదు. వెండియు నాపాపపుజూదమాడి మి మ్మోడించినపదంపడి యానీచుఁడు దనచేసినపనిం దాన మెచ్చికొనుచుఁగొండంతయుబ్బి "యిఁకఁ బాండవులసా మ్మనునది యించుకేనియు లేదు. నామగోత్త్రమాత్త్రములతోడనే మిగిలిరి. ఇఁకఁ గొంతకాలమున కింకనుం బరాభవంబుఁ జెంది నష్టప్రకృతులై నన్నుఁ గొలుతు" రనిపలుకుచు నీయెదుటన యుల్లసంబాడఁడె? మఱియు నయ్యనయసమయంబునఁ బాపాత్ముం డైనదుశ్శాసనుండా నిండుకొలువునం గాంగేయకుంభసంభవప్రముఖు లగుపెద్దలు సూచుచుండఁగఁ బరమపతివ్రతాశిరోరత్నం బైనపాంచాలరాజపుత్త్రిముందల వట్టియీడ్చి పశు వనియూర్చుట మఱచితివే? అప్పుడు నీతమ్ములు నల్వురు భవదాజ్ఞకు ధర్మ

పాశమునకుం జిక్కి మిన్నకుండుటం జేసి వారల కిన్నినాళ్లు బ్రదుకు గలిగె. మఱియు నప్పు డప్పాపాచారులు పలికినపలుకు లుగ్గడించునవియె? ఆకొలువునం గూర్చున్న రాజులు బ్రాహ్మణులును మీకు నిష్కారణంబ తొడరినయెడరుం జూడ నోర్వక కన్నీరు జాలువాఱ నేడ్చుచు నస్నీచుం దూలనాడిరి. సత్కులసంజాతునకు లోక మునం దూఱువడుటకంటెఁ జావు మేలకదా. ఆదురాత్ములు తమదుశ్చారిత్రంబు ననే సగము నిహతు లైరి. ఇంకఁ దద్వధం బత్యంతసుకరంబు. క్రూరసర్పం బెట్టు లట్టుల యప్పాపాత్ముండు సర్వలోకంబునకు వధ్యుం డగుట నిశ్చితంబు. ఇప్పుడే నిర్మూలనంబుఁ జేసిన నతండు మొదలు తెగినద్రుమానిమాడ్కిఁ జెడు. ఇం దించుకే నియు సందేహింపక వానిం దెగటార్పుము. కాకున్నం బగ దీఱదు. కావున నెంత చింతించినను వారితోడిసంధి పొసఁగదనియే నాకుఁ దోఁచుచున్నది. అయినను నేను భవన్మతంబు మెయి వారికడ కరిగి మీసుగుణంబులను వారిదురాచారంబు లనుం బ్రత్యేకంబ సకలజనులుం గూడిన నిండుకొలువున మోమోట దక్కి యం తయుం దేటపడం జెప్పెద. నావచనంబు విని వారిపైఁ బక్షపాతంబుగలమాను సులును మీయెడ దోషంబు లేకునికియు సర్వదోషంబులును వారియెడనే పుట్టు టయుం గానిశ్చయించి వారలఁ దూలనాడి విడుతురు. మనకదియుం బ్రధానకా ర్యంబె. మఱియు నే నచ్చటికిఁ బోయిన వారియుద్ధోద్యోగప్రకారంబెల్ల లెస్సగ నెఱుంగ వల నగు. అదియు ముఖ్యంబ కావున నేను వారికడకుఁ బోవుట కార్య మూలంబ యగు. నీకు జయంబు నేకుఱు తెఱంగుగా నంతయుం జేసి వచ్చెద. సర్వవిధముల యుద్ధ మగుననియే నాకుఁ దోఁచుచున్నది. మృగపక్షివిరావంబును హస్త్యశ్వసంఘాతఘోరనిస్వనంబును సమరమునే సూచింపుచున్నవి. సమరస న్నాహంబు సర్వవిధములం గొఱంత లేకుండునట్లు సమకట్టి యుండవలయు. యోధులకెల్ల ననికి నడుచుట నిప్పుడే యెఱింగించియుండవలయు. సంగ్రామంబ కాఁగలయది. అత్యంతలుబ్ధుం డైనదుర్యోధనుం డీపదుమూఁడేడులు మీరా జ్యమెల్లనేలుచుఁ జవి గొన్నవాఁడు మిన్నక తనముక్కునవావి యుండఁగ మీ పాలు మీకొసంగునంతటి తెగువఁ బూనునే? నావలనం గొఱంత లేకుండఁ జేసి వత్తు ననిమాధవుండు పలికిన విని భీమసేనుం డతని కిట్లనియె.

భీముఁడు కృష్ణునితోఁ దనయభిప్రాయముఁ జెప్పుట.

మధుసూదనా, యుద్ధోద్యోగంబుఁ దెల్పి యేల వెఱపించెదవు? సంధిఁ గావింపఁ గౌరవులపాలికిఁ బోయినప్పుడు శాంతి యగుచందముననే సామమున మాటలాడుము. దుర్యోధనుఁడు క్రోధసంరంభపరుఁడనియు జన్మసిద్ధపాపాచా రుఁడనియుఁ జోరప్రాయుఁడనియు నైశ్వర్యమదమత్తుఁడనియు నిష్ఠురక్రూరపరా క్రముఁడనియు నికృతిప్రధానుఁడనియు లోకముకెల్లఁ దెల్లంబకదా. వాఁడు కతి

నవచనముల కలికి మనకు లోఁగివచ్చునే? కావున సామంబే కర్తవ్యం బనితలం చెద. మఱియుం బర్యాలోచించిన నవ్వంచనాపరుండు చెలికాండ్రపనులనై నంజె ఱుచుచు ధర్మము విడిచి యనృతప్రియుండై సుహృదులడెందములను గలంచుచుఁ దృణచ్ఛన్న పన్నగంబుచందంబున దుస్స్వభావుండు గావున నత్యంతలోభవశతం జేసి ప్రాణములనయిన విడువఁ దెగించుఁగాని తనమతంబు మానునే? వానిశీల బలవిక్రమాదులెల్ల నీకు సువిదితంబులు కావున నేఁ జెప్ప నేల? పెద్దకాలంబు నుండియుఁ బేరెన్నికఁ గన్నకురుకులంబునకు మానిమిత్తంబున నేఁటికిఁ జేటు వాటి ల్లునెకో యని కొందలం బయ్యెడి. ఇంద్రజ్యేష్ఠు లగుసురలచాడ్పున నేము వా రుం గూడిమనిన నెంతయొప్పునో యనియూహించెద. దుర్యోధనుక్రోధమున భారతకులము నిదాఘసమయమునందు దవదహనంబున వనంబులుంబోలెఁ బొను పడునెక్కో యనిచింతిల్లెద. లోకవిఖ్యాతంబులయినయష్టాదశక్షత్రియ కులంబు లందును హైహయులలో నుదావర్తుఁడు,నీపులలో జనమేజయుఁడు, తాలజంఘుల లో బహుళుఁడు, క్రములలో నుద్ధతవసువు, సువీరులలో నజబిందువు, సురాష్ట్రు లలో రుషర్ధికుఁడు, బలీహులలో నర్కజుఁడు, చీనులలో ధౌతమూలుఁడు, విదేహులలో హయగ్రీవుఁడు, మహౌజసులలో వరయుఁడు. సుందరవంశుల లో బాహుఁడు, దీప్తాక్షులలోఁ బురూరవుఁడు,చేదిమత్స్యులలో సహజుఁడు,ప్ర వీరులలో వృషధ్వజుఁడు, చంద్రవత్సులలో ధారణుఁడు, ముకుటులలో విగాహ నుఁడు, నందివేగులలోసముఁడుంగాఁ బదునేడుకులములందుఁ బ్రత్యేకంబ యొ క్కొకఁడు కులపాంసనులై పుట్టిరిగదా. ఇందాఁకనేకొఱఁతనుం బొరయని పదునె నిమిదవదియగు మాభారతకులమునకుఁ జెఱుపనచేటగా దుర్యోధనుఁడు పుట్టెఁ గాఁబోలు. కులమునకుఁ గొఱవి యైనయానీచు నిమిత్తమునఁగులక్షయ మగు నొకో యనితలఁకితలఁకి మాకార్య మెట్లయిన నగుంగాక సర్వలోకసుప్రసిద్ధం బయినమాకులము చెడకుండవలయు నని యెల్లప్పుడుంగోరుచుండుదు. భారతకుల క్షేమార్థంబు వానిం గొలిచియుండుటయు మేల యనితోఁచెడి. కావున యుద్ధతా త్పర్యంబు వుడమని తెలుఁగుగా సామంబుననే వారితోడ సంభాషించి రమ్ము. "అన్నదమ్ములమయ్యు మన మొకళ్లొకళ్లలోనం బోరాడుట నాకుంజూడ నొప్పు" దని నామాటగా వానితోడం జెప్పుము. పెక్కు లేల? మేమును వారును శాంతిఁ బొందుటయే నాకు ముఖ్యాభిప్రాయంబు. అజాతశత్రుఁడు నియ్యదియే తలం చుచున్నాఁడు. అర్జునునభిప్రాయంబు నియ్యదియ. ఇఁక నీకుఁ బోలినభంగిఁ గావిం పుమనిన వృకోదరువచనంబు విని వనజోదరుండు దరహాసభాసుర ముఖవిలాసుం డై యద్దిరా! భీమునివచనంబు లెంతయు వింతలు. వీనిమాటల నిట్టిమెత్తఁబా టువాటిలుట చూడఁజూడఁ గొండ చులకనగుటయు నగ్గి చల్లనగుటయు నెట్టు ల

ల మిగులఁ గ్రొత్త యయ్యెడి. ఇట్టిసమ్మర్దసమయంబున నీమార్దవంబు తగదు. కావున శామ్యదనలంబు దరికొల్పుగాడ్పుచాడ్పున మదీయ వచనచాతుర్యమున నితనివిక్రమమున కుత్తేజనంబుఁ గావింతు ననితలంచి యతని కిట్లనియె.

కృష్ణుఁడు భీముని సమరమునకుఁ బురికొల్పుట.

భీమసేనా, కడచిననాళ్లెల్ల నీవు క్రూరు లగుధార్తరాష్ట్రులపైఁ గోపంబున యుద్ధమునే కొనియాడుచు రేలెల్లఁ గూర్కుఁ బొరయక శాంతి మాని క్రోధసంతాపమునంజేసి వేఁడినిట్టూర్పులు నిగిడించుచుఁ బరుషవచనంబులఁ బలుకుచు నుత్తలంపడినచిత్తంబుతోఁ బరుండి యుమ్మలించుచుండుదుగదా. అప్పుడు నిన్నుఁ జూచినవారు గొందఱు నీడెందమునందలితలంపు నెఱుంగక యితం డింతవెంగలియే యని యుల్లసమాడుచుండిరి. మఱియు ఫెళఫెళారవంబు నిండార వ్రేఁకుల విఱిచి పఱచు నేనుంగుతెఱంగునఁ గాలిచప్పుడు లోకభీకరంబై యెసంగ నెక్కడచో నిలువక యమర్షవశుండవై తిరుగుచుంటివి. రేలుంబగళ్లు నేకతంబ మోఁకాళులపైఁ దల నిడికొని కూర్చుండి డబ్బాటు కొంచెము నగుచుఁ బలవించుచు వ్రేఁగన్నువెట్టి వగచుచుంటివి. వెండియుఁ గ్రోధం బుద్ధతంబ యినయప్పుడు బొమలు ముడివెట్టి యవుడు గఱచి యరుణకిరణుఁ డుదయాస్తమయములం దప్పనియ ట్లేను గదఁ గొని కురుకులపాంసనుం డైనదుర్యోధనునితొడలు విఱుగ నడిచెద నని యన్నదమ్ములనడుమ సకలజనసమక్షమునం బ్రతిన వట్టితివి. అవియెల్ల మాని యిపుడు శాంతిపై మనసు పెట్టితివి. వానిపై మఱపు నీ కెట్లు గలిగెనొగాని యూహించి తెలియరాదు. కయ్యముఁ జేయుదు మని బీరములు పలుకువారి కయ్యది ఘటించినపుడు చిత్తములు తిరుగంబడుఁగాఁబోలు. కాదేని నీయట్టిక్రోధవిక్రమఘనునకు నిత్తఱిఁ బిఱికితనం బలవడునే? స్వప్నజాగరాంతములందు విపరీతోత్పాతంబులం జూచి వెఱచితివో? కశ్మలాభిపన్నుఁడవై మనోవికారములు పెల్లెసంగ నీమహనీయపౌరుషంబు మఱచి పేడితనముఁ బూనితివో? ఎప్పాటనైనం దురంబున డెప్పరంబు దప్పదని యూఱటఁ జెందితికాఁబోలు. నిన్నేమనఁ జాలుదు. పెనుగాలికి వినువీధిం బఱచుబూరుగుదూదిచందమున మర్త్యులచిత్తంబు లత్యంతచంచలంబులు. వార లొకప్పుడు చెప్పినమాటల నమ్మి యెద్దియుం జేయఁగఁ బూనరాదు. ధిక్కారభాజనం బైననీబుద్ధి పాండవచిత్తంబులఁ గ్లేశసాగరంబున ముంచె. నీయడిబీరంపుఁబలుకులు నమ్మిగదా ధార్తరాష్ట్రులతోడం బగఁ బెట్టికొనిరి. ఈ మాటలు నీనోట నేఁటికి వింటి నింకఁ జాలు. నీ విట్టిపలుకులు పలుకుట కొండ నడిచినట్లు నాకుం జూడ నెంతయు నబ్బురం బయ్యెడి. ఇఁకనైన నామాటలం దేఱి పిఱికితనము మాని విషాదంబు విడిచి తొల్లింటిప్రతినలం దలపోసి నిజభుజాపదానంబులఁ బరిశీలించి యుత్తమకులసంభవంబును ద

ప్రయోజనంబు విమలయశస్సంపాదనంబయనియుం బరికించి యనికి లెమ్ము. దిట్టవు గమ్ము. గెలుపు గైకొమ్ము. ఇది నీకుఁ దగుంగాని యని నెట్లగునో యని పిఱుదీయుట యుఱ వగునే? నిజభుజార్జితంబే యుత్తమక్షత్రియునకుఁ గుడువనర్హంబనఁగ వినమె యని వనజనాభుండు పాండుతనూజునకుఁ దేజస్సంతేజనంబుగాఁ బలికిన విని యప్పవమానసూనుం డనూనక్రోధవిధేయుఁడై యాజానేయఘోటకంబు వడిం బఱచుతెఱంగున నతిశయితసంరంభావేగముహుర్ముహుఃప్రస్ఖలచ్చటులపదుండై యజ్జగదారాధ్యపదున కిట్లనియె.

జనార్దనా, కులక్షేమముఁ గోరి పలికినపలుకులు విన్నంతన నన్నుఁ దూలనాడెదవు. భీమసేనుఁడు పిఱికి ప్రతినం దప్పువాఁ డనుపలుకులు పలుకఁ బాడియె. నన్నుఁ బెద్దకాలంబుగోలె లెస్స యెఱింగియు నెఱుంగనివాని తెఱంగున నీ విట్లు పలుకం దొడంగిన ని న్నేమనం జాలుదు. ఆత్మప్రశంసనం బార్యకృత్యంబు గాకుండినను నీపలుకులు ములుకులై సోఁకి మనంబవియించుచు నించుకైనను నిజబలంబు పెంపు వివరింపం దలంపు వొడమె. సకలచరాచరముల కాధారభూతము లగుభూమ్యంతరిక్షములను నాచేతులబలిమిం బట్టి చేర్పను బైపైబడవచ్చిన నెడ్డియవలఁ బడం ద్రోవను జేరనున్నవాని విడదీయనుం గడు నేర్తు. మదీయభుజమధ్యమున నిఱికికొన్నవాఁ డెవ్వఁడేనియుఁ దప్పించికొనిపోవ నేరఁడు. ఏను జెఱుపం దలంచినవాని హిమవంతుఁడును సముద్రుఁడును వజ్రపాణి యగుసురేంద్రుఁనుం దప్పింపనేరఁ డింతయు నిక్కువంబు. పాండవుల కెదురై దురంబు చేయుదుమని వచ్చియున్న రాజులతలలపైఁ గాలు మోపి సమరక్రీడావిలాసంబుఁ జేసెద. ము న్నెందఱేనిరాజులు నా కోడి వశవర్తు లగుట యెఱుంగవే? నాలావు బీరము ను నీకుఁ గ్రొత్తలే? పొడుపుగట్టుమీఁదం బొడగట్టువేవెలుంగు తెఱంగునఁ గ్రమక్రమప్రవర్ధమానమాననీయనిర్వక్రవిక్రమోల్లాసభాసురుం డైననన్ను మున్నెఱుంగకున్నను నింక సంగరాంగణంబునం గలమాతంగతురంగశతాంగసంఘములను మేటిరావుతులను సాటిలేనివిలుకాండ్రనుం జెండాడునపు డెఱుంగుదువు. లోకమెల్ల నప్పుడు చూచు. ఏ నించుకేనియు భీతిల్ల నింతయుఁ దెల్లంబు. లోకమెల్ల నొక్కటియై కోపాటోపం బడరఁ బైఁ బడినను నేఁ గొంచమేనియు వెఱవను. ఇఁక నీయలంతు లగుధార్తరాష్ట్రులకు వెఱతునే? నన్నుఁ జూచినం బిఱికితనంబు నాయెదుర నిలువనోపక పాఱిపోవు. ఇట్టి నన్నుం బిఱికి యనఁగ నీవెట్లు తెగించితివొ? భరతకులక్షేమంబుఁ గోరి సంధి సేయుమంటినిగాని యొండుగాదు. కులక్షయంబు వాటిల్లునెడ సౌహార్దంబుతలంపు తలంప మేలుగాదె. ఇందుఁ దప్పేమి? ఇందుల కింత యిట్టు లనవలయునే యనిన విని దేవకీనందనుండు మందహాససుందర ముఖవిలాసుండై భీమసేనున కిట్లనియె.

వీరశేఖరా, నీమనంబునం గలయభిప్రాయముఁ దెలియఁ గోరి ప్రణయమున నిన్నిట్టు లాడితిఁగాని నీయెడం గ్రోధాధిక్షేపములనుండె మదీయపాండిత్యావేశమున నుండెనుం గాదు. ఇదియునుంగాక నీమహిమంబును బీరంబును లావును నీచేసినతొల్లింటియమానుషకృత్యంబులును లెస్స యెఱింగినయేను నిన్నుఁ బరిభవింతునే? భవదీయబలవిక్రమంబులు నీతలంచునంతకంటె వేయిమడుంగు లెక్కువగ నేను నీయెడ భావించియున్నవాఁడ. సకలరాజపూజితంబై సుహృద్బంధుగణముల కాశ్రయంబై లోకవిఖ్యాతం బయినభరతవంశంబున జననంబుఁ గాంచిన నీ కెట్టు లునికి యుచితం బగు నద్దానినే సలుపుచున్నవాఁడవు గావునఁ బెక్కులు సెప్ప నేల? ఎంతటిమహాత్ములకైనను గార్యసిద్ధి పురుషప్రయత్నంబు సమ్యగావిష్కృతంబుగాకుండెనేని యీడేఱదు. కొన్నియెడలం బ్రయత్నమేదురం బైన కార్యంబును నెఱవేఱనేరదు. అందులకు దైవోపహతియే కారణం బనితలంపవలసియుండు. దైవంబుతోడ్పాటు గలుగునెడఁ జేసినకార్యంబులు ఫలవంతంబులగు. కావున ఫలపరిణామంబు దైవాధీనంబై యుండు. ఐనను దైవానుకూల్యప్రాతికూల్యంబులు దుర్విభావ్యంబులగుటం జేసి యూరకుండఁ జనదు. కావునం గార్యంబులయెడ నోపినంతజతనంబు సేయనవలయు. అది సఫలంబయిన నుబ్బకుండుటయు విఫలంబయిన సుక్కకుండుటయు మహాపురుషలక్షణంబులు. ఏతత్ప్రకారంబెల్ల నెఱింగి నేర్పునం గార్యములఁ బ్రవర్తించుట మేలు. కావున శత్రువులతోడ సంధికిఁ బోయిన నది యవు ననియొండెఁ గాదనియొండె నిపుడు నిర్ణయింప వలను గాదు. కావున సందులకుఁ జింత సేయరాదు. ఏనును మీయన్నమాటమెయి రేపిటఁ దఱలి కరిపురి కరిగి ధృతరాష్ట్రుని దత్పుత్రులనుం గాంచి మీకార్యంబు సెడని తెఱంగుగా శాంతియొదవువిధంబుగా సంధిమాటల వినిపించెద. నామాట విని వారు తత్ప్రకారంబు నడుతురేని నా కత్యంతయశోలాభంబు, మీకు నిష్టార్థలాభంబు, వారికి సకలశ్రేయోలాభంబునుం గలుగు. అటుగాక నాపలుకులఁ బెడచెవిఁ బెట్టుదురేని దారుణం బగురణంబు తప్పదు. సంగరంబే పొసంగునెడ నీవు నర్జునుఁడు నాభారమెల్ల మోవవలసినవారు. సకలకార్యంబులు మీయిద్దఱితలలపై నిలుచు. మీకుఁ దోడ్పడుచుఁ బోరికి సమకట్టి నడువ నాకుం బెద్దయుఁ గోర్కి కలదుగాని గాండీవి నన్నుఁ దనతేరు గడపఁ గోరుటయు నేనం దుల కొడంబడుటం జేసి నా కయ్యదియె కర్తవ్యంబై యుండు. కావున సంగ్రామభార మంతయు నీమీఁద నునికిం జేసి శౌర్యసంధుక్షణార్థం బిన్నిమాట లాడితి. ఇపుడు సైరణ చేసి పోరఁ దలపడునపుడు బీర మంతయుఁ జూపవలయు నని పలికి భీమసేనునకు మనఃప్రియంబుఁ గావించియున్నంత నమ్మురాంతకునకుఁ గిరీటి యిట్లనియె.

### అర్జునుఁడు కృష్ణునితోఁ దనయభిప్రాయముఁ జెప్పుట.

పురుషోత్తమా, మే మందఱముం జెప్పఁగలయంతయు ధర్మజుండు చెప్పిన వాఁడు. నీపలుకులు వినఁగవినఁగ శమము దుష్కరం బనితోఁచెడి. సపుత్రుఁడైనధృతరాష్ట్రునిలోభదైన్యాదులం జూడఁగ శాంతి పొసఁగదనియే నీకుఁ దోఁచుచున్నదిగాఁబోలు. అయినను శమప్రయత్నంబు సేయకునికి తగునే? ఎద్దియేనియుఁ బురుషకారంబు లేకుండిన నెఱవేఱునే? నీవచనంబులఁ బరికించి చూచినం బౌరుషంబు కర్తవ్యం బనియు ఫలంబు విధ్యధీనంబనియుఁ దోఁచుచున్నది. ఇవ్విధంబు లాఁతులయెడ నగుఁగాని నీయెడ నగునే? నీమనంబునఁ దలంచినకార్యంబులు సఫలములుగాక మానునే? మాకుం గౌరవులకును శాంతియే కర్తవ్యం బనుతలంపు నీమనంబున నుండునేని యది నెఱవేఱు టెంతపని? పాండవులు ధార్తరాష్ట్రులు ననునీరెండు తెగలవారికిని నీవు గడుం గూర్చునేస్తకాఁడవు గావున నీకు నేను జెప్ప నేల? ఎయ్యది యుచితం బనితోఁచు దానిం జేయుము. మాప్రార్థించుదానికంటె నితరాభిప్రాయము నీమనంబున నుండునేని యదియ నెఱవేఱుఁగాని మాకోరిక లెట్లు కొనసాగు? ధార్తరాష్ట్రులపై నీకుఁ గ్రోధ మగ్గలమై యుండునేని యదియే ఫలవంతం బగు. నీకుఁ జెప్ప నే నెంతవాఁడను. వారితోడఁ గయ్యమొండె నెయ్యమొండె మాకు మే లని నీకుఁ దోఁచినదానిం జేయుము. భవదీయదివ్యచిత్తంబునం గలకోర్కియే మాకోర్కి. దురాత్ముఁడైనయాధార్తరాష్ట్రుఁడు పుత్రమిత్రామాత్యబంధుగణముతోడ వధార్హుండగాక రక్షణీయుం డని యేనుం జెప్పను. ధర్మనిరతుఁడైనధర్మరాజు సామ్రాజ్యంబు చూచి మాత్సర్యంబునం గన్నులు మండుటయు నొండొక్క యుపాయంబుగానక యాపాపపుజూదమున నాసిరినెల్ల నాఁచికొనియె. ఆనిండుకొలువునఁ బతివ్రతాశిరోమణి యైనపాంచాలిం బరిభవించె. అవియెల్లం దలంపునకుఁ దేర నీక్షణంబ వారలం దెగటార్పవలయునను తెంపు పొంపిరివోవు. అయినను దద్విధంబునకుఁ దొడరినం బెక్కండ్రు తెగుదు రనువగ గదుర శాంతిఁ గోరుదుము. శాంతిచింతనంబు మాకుఁ గలిమిం జేసి వారు చేసినయపరాధసహస్రంబు చౌటఁబెట్టినవిత్తుచందంబున ఫలవంతంబు గాకున్నయది. పెక్కు లేల? నీయెఱుంగని మాకార్యం బొక్కటియును లేమి నిక్కువంబు. నీకుఁ బోలినభంగి వేగంబ గావింపు మనుటయుఁ జక్రపాణి గాండీవపాణి కిట్లనియె.

ధనంజయా, నీచెప్పినదెల్ల నిక్కువంబ. ఏనుం గౌరవపాండవులకు సంధిఁ గావింపఁ బ్రయత్న మొనరించెద. కార్యమగుం గా దని నిర్ణయింపనేరను. నా నేర్చినంతప్రయత్నముఁ జేసెదనందులకు దైవంబు తోడయ్యెనేని కార్యము నెఱవేఱు. మనయత్నమునఁ గార్యసిద్ధి [illegible]దు. సుక్షేత్రమును

లెస్స దున్ని యుచితసమయమున సారవంతంబు లగుబీజములఁ జల్లినం బిదప వాన గురిసెనేని యది ఫలించు. అది దైవతంత్రంబు. దాని నెఱుంగక మూఢులు దైవముతోడ్పాటునఁ బండినపుడు మాప్రయత్నమున ఫలించె ననియు నెండినపుడు మాచేయఁదగినంత చేసితిమి వానలేమిం జేసి పండదయ్యె ననియుఁ బలుకుదురు. సిద్ధ్య సిద్ధులు రెండును దైవాయత్తంబులకాని పౌరుషసాధ్యములు గావు. కావునఁ బౌరుషంబు కర్తవ్యంబు ఫలంబు విధ్యధీనం బనిభావించి పురుషకారంబు లెస్స చేయనవలయుఁగాని ఫల మెట్లగునో యనిశంకించి జతనంబు సేయక మిన్నకుండరాదు. నేనును భారతకులహితార్థంబు నేర్చినంతప్రయత్నంబుఁ జేసెద నింతియకాని దైవానుకూల్యంబుఁ గావించుట నాకు శక్యంబె? పరికించిచూచిన నవ్వెంబరవిత్తులు నామాటలం జెవు లొగ్గి విని యుక్తాయుక్తముల నరయునంతటివారలే? దురాత్ముఁ డైనయాదుర్యోధనుఁడు లోకమును ధర్మమునుం ద్యజించి యిచ్చమెయి విచ్చలవిడి వర్తించువాఁ డనుట యందఱకుం దెల్లంబు. లోకనింద్యకృత్యముఁ జేసియు వాఁడు పిదపఁ బశ్చాత్తాపంబుఁ బొందఁడు. ఒకవేళ వాఁడు మిన్నకున్న నతనిమెచ్చుమంత్రు లగుకర్ణశకునిదుశ్శాసనులు దుర్బోధనలు సేయుచుఁ బాపబుద్ధి వానికిఁ గావింతురు. మఱియు నాదుష్టాత్ముఁడు వధంబుదక్క నొండుపాయంబున శాంతిఁ బొందువాఁడు గాఁడు. ఇఁక రాజ్యమునంబా లిచ్చు నని యెట్లు లూహింపవచ్చు? ధర్మజుండును రాజ్యమునం బా లియ్యకుండిన శాంతిఁ బొందెడివాఁ డగునే? పరస్పరవిరుద్ధం బయిన యీకార్యంబున సంధి యగు ననునమ్మిక నాకుఁ దోఁపదు. దానంజేసి వారిపాలికిం జని ధర్మజువచనంబున సంధికార్యము నడుపుటయు నిరుపయోగం బనియే తోఁచెడి. అయినను నేను వారిమేలు గోరి వారికడ కేగి నేర్చినకొలఁది వెరవులఁ బన్నిహితంబుఁ దెల్పెద. మదీయహితవచనంబు నిరాకరించెనా వాఁడు మీక కాదు నాకును లోకమునకెల్లను వధ్యుండు. వానికొఱగాములు వలదన్నను నొక్కొకతేప తలంపునకు వచ్చు. చిఱుతనాఁడు వాఁడు మీకుఁ జేసినయెగ్గులు మఱచునంతటివే? మీరు భుజబలవిభవంబున దిగ్విజయంబు చేసి రాజ్యంబు పెంపు సంపాదించి నెగడుచుండ నప్పాపాత్ముండు చూపోపక పాపపుజూదమున దాని నాచికొనియె. మీకును నాకును భేదముఁ గావింప నెన్నియేనుపాయంబుల నాతఁడు పన్నుటయు నే నందులకు లోఁగకుండుటయు నీకు విదితంబకదా. ఏను మీవాఁడనకాని లాతివాఁడనే? న న్నింతశంకింప నేల? ఆదురాత్మునిపాపపుఁదలంపును ధర్మజునకుఁ బ్రియంబ యవశ్యకర్తవ్యం బనునాతలంపును నీకుఁ దెల్లంబయెయుండ నన్నుఁ బెఱవానిఁగ భావించి యిట్లు పలుకఁ బాడియే? దుర్ఘటకార్యంబుఁ జూపి యిది నెఱవేఱిన [illegible] గలదేని యగుఁ గాకున్నఁ గానేర దని

పలికితివిగదా. ఏ నేమి చేయుదు? నేర్చినంతకుం గొఱంత లేకుండం దగినభంగి నందఱు వినంగం గౌరవసభామధ్యంబున మాటలాడెద. ఉచితకార్యములనుం జేసెద నింతియకాని సంధినే చేయుదు నని నమ్మిక చెప్పం జాలను. గోగ్రహణంబున నిన్నుం జూచి యప్పాపాత్ములు సంకేతసమయము దీఱకమున్న పార్థుం డగపడెం గ్రమ్మఱ సంకేతసమయము నడుపవలయు నని బహుప్రకారముల నెగ్గులు పలుకుచున్నంత శాంతనవుండు సంకేతసమయవర్షంబులు లెక్కించి చెప్పి యవి గడచె నిఁక వారిరాజ్యము వారి కిమ్ము సుఖకీర్తులం బడయు మని పలుదెఱంగుల నయభయములం జెప్పెంగదా. అంతుల కాదురాచారుం డించుకైన నంగీకరించెనే? అట్టియుక్కివులతోడ సంధిం జేయుదు నని నిర్ణయించి యేనెట్లు చెప్పుదు? ధర్మరాజుశాసనం బనుల్లంఘనీయంబు గావున వారియొద్దకుం బోయి రెండుతెగలవారిమేలు గోరి నాయెఱింగినంతహితము చెప్పెద నని శౌరి కిరీటికిం జెప్పుచున్నంత నకులుం డిట్లనియె.

## నకులసహదేవులు కృష్ణునితోం దమయభిప్రాయముం జెప్పుట.

మాధవా, సకలధర్మజ్ఞుం డైనధర్మరాజు బహువిధములం జెప్పంగలయంతయుం జెప్పినవాండు. అనంతరంబు వృకోదరుండు రాజుమతం బనువర్తించి శాంతిం గావింపు మనిపలికి యట నిజభుజవీర్యప్రఖ్యాపనంబుం జేసె. పదంపడి యర్జునుండు దనమతమెల్లం దేటపఱిచె. వీ రందఱు దమకుం దమకుం దోంచినభంగిం బలుదెఱంగులం జెప్పిన నవియెల్ల నీవు గొనవలదు. నీచిత్తంబున కెయ్యది యుక్తం బనితోంచు దానిం గావింపుము. మనుజులబుద్ధు లొక్కసమయంబున నుండినట్లే సర్వసమయంబులందును సుస్థిరంబులై యుండవు. కావున మనవారు నొకపరి శాంతిని వేఱొకతూరి యుద్ధమునుం గోరుచుండుదురు. అడవులలో నుండినపుడు మాకు రాజ్యకాంక్ష యిప్పటియట్లుండ దయ్యె. సంకేతసమయంబు గడపి యిచ్చట నుండంగ నీయనుగ్రహమునం జేసి యేడక్షౌహిణులు మాకుం దోడయ్యె. వీ రందఱు మాకు బాసటలై నడుచుచుండ నెవ్వండు కలగుండువడకుండు? కావున నీవు కురుసభం జొచ్చి సాంత్వపూర్వంబు భయోత్తరంబుగా నుచితవచనంబులం బలుకుము. వా రందులకుం దేఱరేని యది యిప్పుడు చెప్ప నేల? యుధిష్ఠిరభీమార్జునులను నన్ను సహదేవుని నిన్ను బలభద్రుని సాత్యకిని విరాటద్రుపదధృష్టద్యుమ్న ధృష్టకేతుప్రముఖ నిఖిలాస్మదీయ వీరలోకంబు నాలోకించె నేని యింకైనం జీవితాశ గలవాం డెవ్వండేనియు నని మార్కొందు నని చక్క నిలువం జాలునే? కావున సంశయింప నేల? భవద్గమనంబుననే ధర్మజునిష్టంబు నెఱవేఱు. ప్రాజ్ఞు లగుభీష్మద్రోణబాహ్లికవిదురులు భవద్వచనచమత్కారంబును యుక్తాయుక్తములనుం బరికించి యాధృతరాష్ట్రునిం బాధమాచార్యుం డై నయతనికొడుకు

నయ్యుక్తి వుండు మెచ్చుమంత్రులనుం దేర్పఁ జాలుదురు. సభామధ్యమున నీవు హితముపన్యసింతువఁట. విదురుఁడు చెవియొగ్గి వినువాఁడఁట. అక్కార్యంబును నెఱవేఱకున్నే? ఎట్టితూఁటరినై నను మీరు సన్మార్గమున నిలుపనేర్తురని నకులుఁడు నుడువుచున్నంత సహదేవుండు వాసుదేవున కిట్లనియె. వీరందఱుఁ దమతమ యభిప్రాయములఁ జెప్పిరిగదా. ఇఁక నేఁ జెప్పెద వినుము. కౌరవులు పాండవులతోడి పొత్తున మనియెద మని తామ చెప్పినను మాయన్నలు ధర్మంబుగాదనియాధార్తరాష్ట్రులతోడిపోరు మాని శాంతిఁ బొందినను నేను గయ్యమునకుఁ గట్టాయితంబై నడిచిపోరాడుదు. సహదేవుఁడు ధార్మికుఁడుగాఁడని నింద వచ్చిన వచ్చుఁగాక. ఆసభలో నాపాపాత్ములుపాంచాలిం బరిభవించినందులకుఁ బ్రతిగా వారలం దెగటార్పకుండిన నామనంబునం గోప మాఱదు. కావున నెట్లయిన శాంతి పొసఁగకుండఁగను యుద్ధమే యగునట్లుగనుం గార్యంబుఁ జేసికొనిరమ్మని సహదేవుఁడు పలుకుచున్నంత సాత్యకి పురుషోత్తముం జూచి సహదేవుఁడు పిన్నవాఁడైనను లెస్స చెప్పె. అప్పాపాత్ములయెడఁ గరుణ సేయఁ దగదు. వానినిమిత్తంబున నిమ్మహాత్ములడవులం బడి నారలు గట్టుచుఁ గూరలు దినుచు నెన్నియేనిడుమలం బడుచుండఁగ నీవుం జూచినాఁడవకదా. కావున లోకవధ్యు లయినయాధార్తరాష్ట్రుల వధింపక విడిచిన నాకుఁ జిత్తశాంతి గలుగదు. మనయోధులమతంబు నియ్యదియే యనివచించె. అట్టియెడ యోధవీరు లందఱు నొక్కటియై సహదేవునివచనంబు సముచితంబు సాత్యకిపలుకులు సమీచీనంబులు యుద్ధము కర్తవ్యం బాదురాత్ములతోడిపొత్తున మనఁ గూడునే యని పలుదెఱంగుల నెలుంగెత్తి పల్కుచు(?) బలుకుచుఁ బ్రమోదమానమానసులై సింహనాదంబులు గావించిరి.

## ద్రౌపది కృష్ణునితోఁ దనయభిప్రాయముఁ జెప్పుట.

అయ్యవసరంబునఁ బాంచాలి సహదేవసాత్యకివచనముల నభినందించుచు ధర్మజభీమార్జునులచిత్తంబులఁ గలమెత్తఁబాటున కుత్తలంపాటు మనంబునం గడలుకొన శోకవారిపూరంబు గన్నులఁ గ్రమ్ముదేర నారాయణున కిట్లనియె. మహానుభావా, సర్వజ్ఞుఁడగునీకు నేఁ జెప్పవలయునే? ఆదుర్యోధనుఁడు నతండుమెచ్చుమంత్రులును దుర్మంత్రముఁ గావించి కైతవపాటవమునఁ బాండవులకు రాజ్యభ్రంశముఁ గావించుట లోకమునకెల్లఁ దెల్లంబు గావున నివు డాయెడ లెల్లఁ జెప్పనేల? వనవాసము మున్నగునాయాసములఁ బడి ఘోట్లో సంకేతసమయము నిస్తరించి వచ్చినపదంపడి యాధృతరాష్ట్రుఁడు సంధిఁ గావించు చందముగా సంజయుం బంపుటయు నతం డట కరుదెంచి యాడినమాటలు నందులకుఁ గినియక ధర్మజుండు కులక్షయంబున కోడఁబడనిమహాత్ముఁడు గావునం దుదినైదూళ్లయిన మాకిచ్చిన శాంతిఁ బొందుదు మని సుప్రసన్నచిత్తంబుతో నుత్తరంబిచ్చుటయును

నీవు విన్నవాఁడవుగదా. ఆపాపాత్ముఁ డంతమాత్రమైనం జేయఁడయ్యె. రాజ్యమునం బాలడుగక పాండవులు శాంతిఁ బొందుదురేని వాఁడు మేలని యున్నవాఁడు. కావున నీవు సంధివచనములు ప్రసంగించునెడ రాజ్యభాగం బొసంగుటకు వారొల్లరేని సంధి పొసఁగనేర దని మొగమోడక పల్కుము. వారు బలవంతు లని వెఱవం బని లేదు. పాంచాలమాత్స్యకేకయాదులు బాసటగాఁగఁ బాండవు లాదురాత్ములనెల్లఁ బిలుకుమార్తురు. మార్తు రెవ్వరేనియు సామదానంబులకు లోఁగిరారేని దయ మాలి దండంబు ప్రయోగించుట నీతి గావున ధార్తరాష్ట్రులు నీయుపన్యసించు తెఱంగున నడువరేని సంగ్రామం బవశ్యకర్తవ్యంబు. అదియే శూరశేఖరు లగుపాండవులకు సముచితంబు. నీకు యశస్కరంబు. కులధర్మపరిపాలనంబునం జేసి క్షత్రియజాతికి సుఖావహంబు. లోభపరుఁడైనవాని నెవ్వనినైనను దండించుటయగదా క్షత్రియునకు స్వధర్మంబు. అపచారములు సేయుచుండినను సహించియే యుండఁగఁ బాండవులు బ్రాహ్మణులే? బ్రాహ్మణుఁడు సర్వవర్ణములకు గురుఁడు గావునఁ దదపచారముల మన్నించుట ధర్మంబై యుండు. అవధ్యవధం బెట్టు లట్టుల వధ్యుని వధింపమియు దోషం బని ధర్మవిదులు పలుకుదురు. ధార్తరాష్ట్రులు వధ్యులని నేఁ జెప్పవలయునే? వారలయపచారంబుల నొప్పరికించిన నప్పాపంబు నిన్నుఁ జెందకమానదు. కావున నది పొసఁగని తెఱంగు చూడుము. నాభంగపాటు నీయెఱింగినదియ కావున నీకఁ జెప్పినం బునరుక్తంబ యగు. చెప్పక మిన్నకుండఁగ మనసు నిలువదు. సర్వవిధముల నాకు నీవు దిక్కగుటంజేసి క్రమ్మఱ విన్నవించెద నాకర్ణింపుము. నన్నుఁ బోలిన నిర్భాగ్యురాలు పుడమిలో నెండొకర్తు గానంబడదు. ద్రుపదరాజు తపోబలమునను మునివరప్రభావంబునను వహ్నికుండమునం జనించి యయోనిజనై, ధృష్టద్యుమ్నునకుఁ గూర్చుచెలియలనై, నీమన్నించునెచ్చెలినై, పంచేంద్రసదృశు లగుపంచపాండవులకుఁ బట్టంపుదేవినై, ప్రతివింధ్యాదు లగువీరవర్యులకుఁ దల్లినై లోకమునసెల్లం బేరెన్నిక గన్న నేను యాదవపాంచాలాదు లగునావారల ముక్కన నావియుండఁగనే పాండవులు చూచుచుండఁగనే నీవు బ్రదికియుండఁగనే కౌరవులనిండుకొలువునం గురుకులాధముం డైనదుశ్శాసనుండు ముందలవట్టి యీడ్వఁగను నాపాపాత్ము "లోసి దాసీ" యనిపిలువఁగనుం గష్టంపుఁబాటువడితి. కృష్ణా! యేమిచెప్పుదు? అప్పాపుఁడు గట్టినపుట్టము లొలువం దొడంగినపుడీ పాండవులు చూచుచునోరెత్తకుండుటయు వేఱొక్కదిక్కు దోఁపక నిన్ను డెందమునం దలంచి "యోయార్తశరణ్యా! కావవే" యనిప్రార్థించితి. నీవొక్కరుండవు నామొఱ యాలించి నన్నుఁ బ్రోవఁగరుణించి కాచితివి. దానం జేసినాకుమానంబు ప్రాణంబును దక్కె. పాండవులు నాదురాత్ములకు దాసులగుటయు ధృతరాష్ట్రుఁడు నాపైఁ

కరుణించి వారిదాస్యంబుఁ దొలఁగించె. మాదుఃఖములలో నీచిత్తంబు సోఁకనిది యొక్కటియైనం గలదే? జగద్రక్షకుఁడగు నీవే మమ్మందఱను రక్షింపుము. భీష్మధృతరాష్ట్రులయెట్టయెదుటన కురువర్యులకోడలనయ్యు నే నప్పాట్లం బడితి. ఇఁక నామొఱ నాలించువా రేరు గలరు? అర్జునునివింటినేర్పును భీమసేనునిబలంబు వెంపునుం గాల్పనే? ఎగ్గులకెల్ల మూలంబై నదుర్యోధనుఁడు ముహూర్తమాత్ర మేనియు నింక బ్రదికియుండఁదగునే? మనవారియుపేక్షవలననగాదే వాని కిన్నాళ్లు బ్రదిమి గలిగె. కావున నాప్రార్థనం బెయ్యదియంటేని. నాపైఁ గరుణయు ననుగ్రహంబును గలదేని సర్వవిధముల ధార్తరాష్ట్రులపైఁ గోప మొనరింపుమనుటయే యనిపలికి యటఁ బైపైఁ బ్రగమ్ముపరిభవశోకం బప్పటప్పటి కగ్గలం బగుటయు నప్పరమపతివ్రత సర్వలక్షణసమంచితంబు సర్వధూపాదిగంధాధివాసితంబు మృదులాయతంబు కృష్ణసర్పసన్నిభంబు నగుక్రొమ్ముడి విప్పి వామకరమునఁ బెన్నెఱులం గ్రహించి కన్నీరు జాలువాఱ వారిజాక్షుముందటం బెట్టి యోదీనవత్సలా! యీ వెండ్రుకలు దుశ్శాసనుచేతులం దగిలి సగము ద్రెవ్వఁగ మిగిలినయవి. పగఱతోడిసంధివచనంబులు ప్రసంగించునెడ వీని నీదివ్యచిత్తంబునఁ దలంపునకుఁ దేవలయు. భీమార్జునులు సంధియకాఁ గోరి పోరు మానినను నీవు యుద్ధోద్యోగంబుఁ జాలింపవలదు. నాతండ్రి ద్రుపదభూవిభుండును, నాయన్నదమ్ములు ధృష్టద్యుమ్నాదులును, నాపుత్రులు నభిమన్యుప్రతివింధ్యాదులును మహావీర్యులు గలరు. మార్తురఁబరిమార్ప నేర్తురు. నాముందఱ పట్టియీడ్చినదుశ్శాసనుచేయి యనిం దెగి నేలం బడి ధూళిధూసరితంబై యుండఁ గనుంగొన నున్నదాన. కాకున్న డెంద మాఱదు. వగ దీఱదు. మండుచున్నచిచ్చు నెడిఁగట్టుకొన్నచందంబునఁ బరిభవానలంబు నెడఁదం బెట్టికొని యిట్లో సమయాబ్దంబులు పదుమూఁడుం గడపితి. ఇంక నిముసంబైనం బగవారు బ్రదికియుండినం జూడఁజాలను. భీమసేనుఁడు ధార్తరాష్ట్రులపాలిటిమిత్తి యని యిందాఁకఁ బెద్దయు నమ్మియుంటి. అతండు నన్నుమతం బనువర్తించి ధర్మప్రకారం బుపన్యసించుచుండ నాపలుకులు ములుకులై సోఁకి డెంద మవియింపం దొడంగె. ఏమి చెప్పుదు ననిపలుకుచు శోకావేగవేపమానగాత్రయై వేఁడికన్నీటివెల్లువ కుచగిరుల నతిక్రమించి పీనాయతశ్రోణీతటంబునం బాఱుచుండ డగ్గుత్తిక వెట్టి నెట్టన వెట్టనిట్టూర్పుల నిగుడించుచు నెలుంగురాల్పడఁ బలవించె. పలవించుటయు నచ్యుతుం డప్పరమపతివ్రతకుఁ గన్నీరు దుడువను బెన్నెఱుల నవరింపనుం దగినమగువల నియోగించి యట నద్దేవిం బిలిచి పాంచాలీ, శోకం బుడుగుము. నీయలుకకు భాజనం బైనయప్పాపాత్ములభార్యలు నిహతపతిపుత్రజ్ఞాతిబాంధవలై యేడ్చుచుండ నచిరంబ చూతువు. దైవకారణంబునను యుధిష్ఠిరనియోగంబునను నేనుభీమార్జునయమసహాయమున

నది నెఱవేఱునట్లు చేసెద. మదీయహితోపదేశంబు వినరేని యాధార్తరాష్ట్రు లు కాలపక్వులై రణాంగణంబునం గూలి కుక్కలు నక్కలు మున్నగుదుర్జంతువుల కెర యగుదురు. హిమవంతంబు చలించినను బుడమి నూఱువ్రయ్యలైనను మన్ను చుక్కలతోడం బడినను నామాట దప్పదు. ఇది నమ్ముము. నీపతులచిరంబ పగఱం గెలిచి రాజ్యశ్రీసముల్లసితులై యెసంగుదురు. నీవుం జూడఁగల వనియూరార్చియున్నంత జిష్ణుండు కృష్ణున కిట్లనియె. మహాత్మా, నీవు కురుకులంబున నీరెండుపక్షములకుఁ గూర్చుసుహృదుఁడవు ప్రియుండవు బాంధవుండవు కావున మాకు నాధార్తరాష్ట్రులకు సంధిఁ గావించుట నీకుఁ బ్రధానంబు. మఱియు దాని నెఱవేర్ప నీవ నేర్తువు. కౌరవులపాలి కరిగి పొందువడు తెఱంగుగా నెయ్యది వక్తవ్యం బెయ్యది కర్తవ్యం బెయ్యది ధర్మార్థసంయుతం బెయ్యది క్షేమంకరం బద్దాని నీవు దేటపఱిచిన నబ్బాలిశుఁడది హితం బనితలంపక కొఱతనుఱుకునేని మీఁద వానిపాటు దైవంబ యెఱుంగు నని గుడాకేశుండు విన్నవించిన నాకర్ణించి హృషీకేశుండిది యేను గురుసభ కరిగి భవన్మతంబుమెయి ధర్మవిరోధంబు గాకుండ హితంబు తేటపడం జెప్పుదు. రేపు రేవతి గావున నాకుఁ జంద్రతారాబలంబులు గలవు. ఈకార్తికమాసంబును సమశీతోష్ణంబై సకల కార్యకరణంబున కనుకూలంబు గావున నెల్లి ప్రస్థానం బొనర్తు ననివాక్రుచ్చె.

## శ్రీకృష్ణుఁడు హస్తిపురమునకుఁ బ్రయాణము చేయుట.

అంత మఱునాఁడు నారాయణుం డరుణోదయంబున లేచి కల్యకృత్యములం దీర్చి విధియుతంబుగ స్నానం బొనర్చి ధౌతపరిధానంబులఁ గట్టి యలంకృతాంగుఁడై సంధ్యోపాసనంబును సూర్యోపస్థానంబు నగ్నిసమారాధనంబునుం గావించి ప్రదక్షిణనమస్కారపూర్వకంబుగాఁ బ్రయాణదానప్రముఖసంభావనంబుల నమరేంద్రుఁడు మహర్షుల నెట్టులట్టుల బ్రాహ్మణుల సంభావించి వారిశుభాశీర్వాదంబులం బడసి * మైత్రముహూర్తమునఁ బ్రస్థానముఁ గావించువాఁడై సాత్యకిం బిలిచి పాండవకార్యార్థం బిపుడు హస్తిపురమునకుఁ జనునట్లు నిశ్చయించితి. దుర్యోధనుండు నతనికిఁ గూర్చుదుర్మంత్రు లగుకర్ణసౌబలాదులును దుష్టనికృష్టాత్ములు గావున మనరథమునఁ జక్రగదాద్యాయుధంబుల నునుపం బంపుము. నీవుం దోడ రమ్ము. అల్పులని వారల నెప్పరికించిచూడరాదు. చతురంగసైన్యంబునుం గొంత మనవెంట రమ్మను మని యానతి యొసంగుటయు నతండు దారుకుం బిలిచి మాధవస్యందనంబు సకలసాధనసంభృతంబుగాఁ గట్టాయితంబు చేసి వేగంబ తెమ్మని చెప్పి సేనానాయకుం బిలిచి పుండరీకాక్షుతోడం

* సూర్యోదయానంతరము నాలుగుగడియలకుమీఁద నాలుగడియల దనుకనుండు ముహూర్తము మైత్రము.

గొంతసైన్యంబుఁ బంపు మనినియోగించె. నియోగించుటయు దారుకుఁడు చంద్రసూర్యప్రతీకాశచక్రవిరాజితంబై మణిమయచంద్రార్ధచంద్రమత్స్యమృగపక్షివివిధపుష్పాది చిత్రవిచిత్రితంబై వ్యాఘ్రచర్మనిర్మితపరివారణంబై తరణిసన్నిభతేజోదుర్నిరీక్షంబై గగనచారివిమానంబునా నొప్పుచున్నదివ్యరథంబున శైబ్యసుగ్రీవమేఘపుష్పబలాహకము లనుతురంగంబులఁ బ్రయాణోచితంబుగాఁ గడిగి ఖాణం బొసంగి మేపి కట్టాయితంబు గావించి యుచితరీతిం బూన్చి గరుడధ్వజం బెత్తి చక్రగదాదివివిధసాధనసంభృతంబుఁ గావించి తెచ్చె. శస్త్రాస్త్రపాణు లయినపదుగురురథికులును సాదిపదాతిసహస్రంబును బెక్కండ్రుపరిచారికలుం బ్రయాణంబునకు సమకట్టి వచ్చి తేరివెంట నంటియుండిరి. అవ్విధంబునఁ బ్రస్థానసన్నాహం బాయితం బగుటయు జనార్దనుండు శిశిరమారుస్పర్శంబు, మృగపక్షిగణంబు వలగొనుచు శ్రుతిసుభగంబు లగుపలుకులు పలుకుట, హుతవహునిప్రదక్షిణశిఖిత్వంబు, వసిష్ఠవామదేవాది మునిగణస్వస్తివచనంబు, మంగళవాదిత్రనిస్వనంబు మున్నగుశుభశకునంబులం గొనుచు మేరుశిఖరసన్నిభం బయినయమ్మహారథంబు నధిరోహించి సాత్యకిం దనవెంటఁ గూర్చుండఁ బెట్టికొని తలరె. ధర్మనందనుండును భీమార్జుననకులసహదేవులును ద్రుపదవిరాటధృష్టద్యుమ్నశిఖండి ధృష్టకేతుచేకితానకేకయకాశిరాజప్రముఖరాజలోకంబును గోవిందుం గొ-తద వ్వనిచి వచ్చువారై తోడన యరిగిరి. అప్పుడు ధర్మరాజు తనరథంబు మాధవస్యందనంబుఁ గదియం బోనిచ్చి కామక్రోధభయార్థాదులం దెద్దానివలననేనియు న్యాయంబుఁ దప్పనిపరమధార్మికుండు సర్వజ్ఞుండు సర్వేశ్వరుండు సర్వలక్షణసమంచితుఁడు నగునవ్విరించిజనకుం గౌఁగిలించికొని యిట్లనియె. జనార్దనా, కరిపురిం జొచ్చి వెంటన మాతల్లియు నీ మేనత్తయు నగుకుంతీదేవియొద్దకరిగి మామాఁటుగా నద్దేవికిఁ బాదప్రణామం బాచరించి యస్మత్కుశలంబు విన్నవింపుము. ఆయమ దేవతాతిథిపూజయు గురుశుశ్రూషయు నుపవాసతపోవ్రతాదులు నత్యంతభక్తియుక్తిం గావించుచునే యింతకాలంబుఁ గడఁద్రోచె. తాను లెక్కయిడరానియలజడిపాట్లకెల్ల నోర్చి చిన్ననాఁటనుండి మమ్ముఁ బెంచి పెద్దవారలం జేసె. అన్నిటికంటె నెక్కువగా దుర్యోధనువలనిభయమునఁ దప్పించుట యద్దేవికి మృత్యువాతంబడినవానిఁ దప్పించురీతి నత్యంతదుష్కరంబై యుండె. ఎట్టులో దనయోపినంత నేర్పునఁ దప్పించుచు న మ్మాపత్సముద్రము దాఁటించుచుండె. పుట్టినిల్లు విడిచి మాయింటికి వచ్చిననాఁటంగోలె యాయమవర్తనంబు దుఃఖప్రాయంబకాని యొండు గాదు. మావలనఁ గలిగినశోకంబు చెప్పఁ దరము గాదు. ఆసాధ్వికి సుఖకాల మీజన్మమున లేదుగాఁబోలు. ద్యూతపరాజితులమై మే మడవి కేగునపుడు పెద్దయుదవ్వు మావెంట నంటి వచ్చుచుండిన మీ మేన్ని

యేఁదెఱంగుల నూఱార్చియు నంతనాసాధ్వి యూఱడిల్లక డిల్లఁబోయినమొగంబుతో నేడ్చుచు నేతెంచుటయుఁ జేయునది లేక మే మాపుత్రవత్సలం బరిత్యజించి యడవి కేగితిమి. మాయెడఁబాటునం గలిగినయుత్తలంపాటున నేపాటుపడెనోగాని యిప్పటిదాఁక బ్రదికియుండు ననియు నమ్మరాదు. జీవముతో నుండునేని మేము దుఃఖములం గడచితిమనియు నిఁక నచిరంబ సుఖింపఁగలమనియు బహువిధములఁ జిత్తతాపశమముగా నూఱార్చి రమ్ము. మఱియు ధృతరాష్ట్రునిఁ గురువృద్ధు లయినభీష్మబాహ్లికసోమదత్తులను గురువులగుద్రోణకృపాచార్యులను గురుపుత్త్రుఁ డైనయశ్వత్థామనుం గాంచి మాప్రణామంబుల నివేదింపుము. కురుకులహితకాంక్షియు ముఖ్యమంత్రియు సకలధర్మజ్ఞుఁడు నిరుపమానమేధాశాలియు నగువిదురుం గనుంగొని నాపేరు చెప్పి గాఢపరిరంభముఁ గావింపుము. తక్కటివారి నెల్లరం జూచి వయోగుణవిద్యాగౌరవబంధుత్వానుగుణంబుగాఁ బ్రణామపరిష్వంగస్నేహవాత్సల్యప్రణయప్రకారంబు నుచితవిధానంబున నడుపు మనిపలికి శౌరిని వీడ్కొలిపి యతనివలగొని మఱలె. అట నర్జునుం డచ్యుతునరదంబు డాయం జని వనజనాభా, కార్యతత్త్వంబెల్ల నీకుఁ దెల్లంబుగదా. పెక్కు లేల? ధార్తరాష్ట్రులు రాజ్యమున సగం బిచ్చుట కియ్యకొందు రేని మృత్యువాతం బడక తప్పదురు. అదినాకుం బ్రియంబు. అట్లుగాక యనుపాయజ్ఞుఁ డైనయక్కురుకులాధముం డందులకొల్లఁడేని యప్పటిమాట యిప్పుడు చెప్ప నేల? నిఖిలక్షత్రియక్షయంబ కాఁగలయది యనుచున్నంత వృకోదరుండు వివ్వచ్చువచనంబుల విని రోమాంచకంటకితగాత్రంబు కోపావేశవేపమానం బగుచుండ డెందమునకుఁ బండు వగుభండనంబునకుఁ బొంగుచుఁ గొదమసింగంబు తెఱంగునఁ బ్రస్ఫీతరవంబుఁ గావించి పంకజాక్షుం గౌఁగిలించికొని తదనుమతిం బడసి మఱలె. ప్రభంజనాత్మజునార్పులుమనంబులనివ్వాఱం గూర్ప గజతురంగమాదులు విసృష్టశకృన్మూత్రంబు లయ్యె. జిష్ణుఁడుం గృష్ణుని వీడుకొని ప్రతినివృత్తుం డయ్యె. సకలరాజలోకంబు నాలోకేశునసుజ్ఞఁ గొని క్రమ్మఱియె.

### శ్రీకృష్ణుఁడు మార్గమున మునులం గని సంభాషించుట.

అవ్విధంబున నందఱుం గ్రమ్మఱినపదంపడి దారుకునిసారథ్యచాతుర్యంబునను, రథ్యములపాటవంబునను, దెరువు నాచమించువిధమునను, మిన్ను మ్రింగుభంగిని నతిరయంబునం జనిచని మురవైరి మహితతేజోవిరాజమానులగు మహామునులఁ దెరువున నిరుగెలంకులం గాంచి ససంభ్రమముగా రథావతరణంబు సేసి ప్రణతు లాచరించి యోమహాత్ములారా, లోకములం గుశలంబు గలదే? ధర్మంబు విధివదనుష్ఠానగరిష్ఠం బగునే! బ్రాహ్మణశాసనమునఁ దక్కటివారు వర్తింతురే! మీర లెచ్చటి కేగుచు నీత్రోవం బొడకట్టినారలు? ఎయ్యది కా

ర్యంబు? ఏమి సేయఁగ నన్నుఁ బనిచెదరు? పుడమికి రాకకుం గతంబు లేకుండునే యనియడుగ నమరేంద్రసఖుం డైనజామదగ్న్యుండు గోవిందుని గాఢపరిరంభమున నాదరించి యిట్లనియె. మురాంతకా, దేవర్షులు బ్రహ్మర్షులు రాజర్షులు మున్నగువారు మున్ను సురాసురసమరంబుఁ జూచినవారలు పృథివీతలంబునం బార్థివగణం బొక్కచోఁ గూడియుండఁ జూడఁగను, గౌరవపాండవులకు సంధిఁ గావింపఁ దలంపుతో నీవు కురుసభామధ్యంబున ధర్మార్థసమన్వితంబుగా నుపన్యసించు తెఱంగును భవదుపన్యాసంబు విని భీష్మద్రోణవిదురాదు లగుమాన్యజను లుపవాదించుచందంబును వినఁగనుం గౌతుకంబు పొడమి యిమ్మును లేతెంచినవారు. మే మందఱము నీ వక్కౌరవసభం జేరి హితసత్యదివ్యవాక్యంబుల నిరూపించునెడ నచ్చటం బొడగట్టుదుము. వేగంబ యచటికిఁ జను మనిపలికి తత్క్షణంబ వార లంతర్హితు లైరి. యదువర్యుండు ప్రస్థానం బొనర్చినయవసరంబున నమ్మహాత్మునకు సన్నిహితం బైనదేశమునందక్క లాఁతి దేశములందు బహుళజనక్షయంబుఁ దెల్పెడువిధంబున మింట మబ్బు లేకున్న నుఱుములు మెఱుములు వానతోడం బలసె. ప్రాఙ్ముఖము లగుమహానదులు ప్రత్యఙ్ముఖముగాఁ బ్రవహించె. దెసలెల్ల విపరీతంబు లై గుఱుతిడ వలనుగానిచందముం బొందె. అగ్నులు ప్రజ్వరిల్లె. పుడమి వడఁకె. ఎచ్చటఁ జూచినం జీఁకట్లు మిఱుమిట్లుగొనె. ఆకసంబున నశరీరవాక్యస్వనంబు పెల్లుగ నెసంగె. దక్షిణపశ్చిమం బయినగాడ్పు విశేషించి హస్తిపురంబు నాక్రమించి ప్రాఁకులగుముల విఱుచుచుఁ బిడుగులమాడ్కి భీకరం బై కరంబు గాఱించె. మఱియు నానావిధంబు లయినయుత్పాతంబులుందోఁచె. వాసుదేవుండు సనుచున్నమార్గంబున సుఖశీతమారుతంబు ప్రదక్షిణంబయి వీచె. పుష్పవర్షంబు గురిసె. తెరు వపేతకుశకంటకం బై సమం బై యత్యంతసుఖదం బయ్యె. అట్లత్యంతసుఖమార్గంబునం జనుచు గోవిందుఁ డనేకగ్రామఖర్వటనగరజనపదంబులం జూచుచు నచ్చటచ్చటివారలు గావించుపూజలం గైకొనుచు నతిత్వరితప్రయాణమున సూర్యుం డస్తగిరిచేరువకుఁ జనునంతకు వృకస్థలంబు సేరి తారావధమండలంబు సంధ్యారాగలోహితం బగుటయు జరఠారుణకిరణకిరణంబులు కొండలనెత్తమ్ములం బ్రాఁకుటయుఁ బులుఁగులు తమతమగూళ్లు సేర వచ్చుటయుం బరికించి యిచ్చట నీరేయి విడిసి మఱి రేపకడన తఱలుటయుఱు వనితలంచి దారుకా, తేరు నిలుపు మనుటయు నతం డట్లు చేయఁగ రథాంగపాణి రథావతరణంబు సేసి రథమోచనం బాజ్ఞాపించి నదీతీరంబున సంధ్యోపాసనాపరుం డై కూర్చుండె. దారకుఁడును వారిజాక్షునానతిచొప్పున రథమోచనంబుఁ గావించి శాస్త్రోక్తప్రకారమునఁ దురంగములకుఁ బరిచర్య నొనర్చి యరయుచుండె. అట్టియెడ సంధ్యోపాసనముఁ దీర్చి దైత్యాంతకుండు సాత్యకిం బిలిచి

యుధిష్ఠిరకార్యార్థం బిచట నీరేయి విడిసి రేపకడన తఱలిపోయెదము. సకలపరిజనములకు విడియఁగ విడిదలల నిరూపించి సకలసంభారముల సమకట్టఁగఁ దగినవారల నియమింపు మనియానతిచ్చె. సాత్యకియు నంత నెల్లవారికి సుఖముమై విడియఁగఁ బటకుటీర ప్రకరం బెత్తించి క్షణమాత్రమున రసవదన్నపానాదుల నాయిత్తపఱిపించె. వృకస్థలప్రాంతమున మురాంతకుడు విడిసె నని విని యాగ్రామంబునం బ్రధానులు మహాకులీనులు శ్రీమంతు లార్యశీలురు నియతబ్రాహ్మణవృత్త్యనుష్ఠాననిష్ఠాగరిష్ఠులు నగుబ్రాహ్మణోత్తములు తత్క్షణంబ ససంభ్రమంబుగా నేతెంచి మాధవుం గాంచి మంగళాశీర్వచనసముల్లసితంబుగా నుచితవిధిం బూజ లాచరించి దేవా, మాయిండ్లకు విచ్చేసి యాతిథ్యగ్రహణంబున మమ్మనుగ్రహింపవలయు నని ప్రార్థించిన వల్లేయని వనజేక్షణుఁ డగ్రహారంబున కరిగి బ్రాహ్మణగృహంబులఁ జొచ్చి వారుకావించినయాశీర్మంగళంబులం గ్రహించి మేమందఱ మిచ్చోట విడిసిన నగ్రహారమునకు సమ్మర్ద మగుఁ గాన నటు గాకుండ నివసింతు మనిచెప్పి వారలం దోడ్కొని పటకుటీరంబుల కరుదెంచి వారలకు ముందు మృష్టాన్నంబు సాదరంబుగఁ గుడువం బెట్టి తానుం దనవారును బదంపడి యారగించి యావిప్రులితో నిష్టగోష్ఠి నారాత్రి గడపె.

### ధృతరాష్ట్రుఁడు భీష్మాదులతోఁ గృష్ణునిరాకఁ జెప్పి సంతోషించుట.

అంత నక్కడ ధృతరాష్ట్రుఁడు వేగులవాండ్రవలనఁ గృష్ణురాక నెఱింగి భీష్మద్రోణవిదురసంజయులను గాంధారిని దుర్యోధనుసిం దన్మంత్రు లగుకర్ణసౌబలాదులం బిలిచి వింటిరే మీరెల్ల నిమ్మహాద్భుతంబు. ఇండ్లిండ్లను జప్పరములను జావిళ్లను జదుకంబులను నాఁడువాండ్రుసైఁతముం గుమిగూడి పలుదెఱంగు లగుసత్కారంబులు దైవాఱఁ బాండవకార్యార్థంబు సర్వలోకమాన్యుం డైన మధుసూదనుండు కురుసభకు వచ్చు ననిపలుకుచుందురఁట. సర్వలోకాభిగమ్యుఁ డైనసర్వేశ్వరునకు మన మభిగమ్యుల మైతిమి. ఇంతకంటె నీపుట్టువునకుఁ బ్రయోజనం బెయ్యది ? ధైర్యవీర్యప్రజ్ఞాబలంబు లాసాధువంద్యునిమీఁదన నిలిచె. మేను బూనినధర్మంబకాని యజ్జగన్నాథుఁడు వేఱు కాఁడు. అమ్మహాత్ము నారాధించువారికి సకలసుఖములు తదీయకోపమునకు భాజన మగువారి కెల్ల చేటులును బాటిల్లుచుండుఁ గావున నావనజోదరు బహుప్రకారంబు లగునుపచారంబుల నారాధించి యతని నాశ్రయించి బ్రదుకుదము. తదీయదివ్యచిత్తప్రసాదంబు వడయఁగ నతండు విచ్చేయుతెరువున నచ్చటచ్చటఁ జప్పరంబులు పందిళ్లుం గావింపను దగినవారల నియోగింపవలయు నిందు మీయందఱియభిప్రాయం బెయ్యది యని వారల వేఱువేఱుగ నడుగ నందఱునుగోవిందునిఁడెందము ప్రసాదంబుఁ బొందు చందంబునం దగినయుపచారముల నొనరించు[illegible]యుని యొక్కమాట

గాఁ జెప్పిరి. అట దుర్యోధనుండు వారియందఱిమతం బెఱింగి మార్గంబున రమణీయప్రదేశంబులందు సర్వకామసమన్వితంబులు దివ్యాస్తరణాస్తీర్ణంబులు వివిధమణిమయపరికరవిలసితంబులుంగాఁ జప్పరంబులు గట్టను నందు సుందరీరత్నంబులను వివిధాలంకరణంబులను సుగంధిమాల్యాదులను దివ్యాంబరంబులను రసవదన్నపానంబులనుం గొఱంత లేకుండఁ జేర్పఁగను దగువారల నియోగించి యంతయుఁ దండ్రికి ఱెఁగించిన మనంబున నుప్పొంగుచు ధృతరాష్ట్రుఁడు విదురున కిట్లనియె. జనార్దనుఁ డుపప్లావ్యంబు వెడలి వచ్చి నేడు వృకస్థలంబున విడిసిన వాఁడఁట. ఎల్లి యిచ్చటికి విచ్చేయునఁట. అమ్మహానుభావుఁడు యదుకులమునకకాదు సకలరాజలోకంబునకును ముల్లోకములకు నధీశ్వరుండు. బృహస్పతిమతంబనువర్తించి వసురుద్రాదిత్యు లెట్టు లట్టుల యదువృష్ణిభోజాంధకు లందఱు గోవిందుమతంబనువర్తించి సుఖమున్నవారలు. కావున నేను నమ్మహాత్మునిచిత్తప్రసాదంబువడసి సుఖముండఁ గోరెద. అతండు మననగరికి విచ్చేసినపు డేకవర్ణంబులయిన బాహ్లికహయోత్తమంబులు నాలుగేసి పూన్చినకాంచనరథంబులఁ బదునాఱింటిని; నిరంతరనిర్యన్మదోదకధారాపూరితకటితటంబులై యేఁడికోలలుం బోనిదంతములం దగివేఱువేఱ యనుచరాష్టకంబు గలయేనుంగుల నెనిమిదింటిని, నిరుపమసౌందర్యంబునకుఁ దావలంబైన దాసికల నూఱుపురను, దాసశతంబును, పార్వతీయులు దెచ్చియుపాయనంబుగ సమర్పించినయత్యంతమృదులంబు లగు వానిఁ బదునెనిమిదివేలయావికరోమకంబళంబులను జీనదేశోద్భవంబు లయిన వాజిసహస్రంబుల నతఁడు గోరినన్నింటిని, నొక్కపగలిటఁ బదునాలుగుయోజనంబులు నడువ నోపినయశ్వతరులం బూన్చినతేరును రేలుంబవల్లు నొక్కతీరుగ నవిచ్ఛిన్నప్రకాశంబై వెలుంగుదివ్యరత్నంబును నొసంగెద. త్రైలోక్యనాథుండైనయతం డిందులకుఁ దగఁడే. మఱియు నతనివెంట వచ్చుసకలపరివారమునకుఁ జాలి యెనిమిదిమడుంగు లెక్కువగా నగునంతటిభోజ్యపదార్థములనిచ్చి సంతృప్తిఁ గావింపవలయు. వెండియు నప్పుండరీకాక్షుండు మనవీడు సొత్తెరునప్పుడు దుర్యోధనుఁడు దక్కఁ దక్కటిరాజకుమారు లస్మత్పుత్రపౌత్రాదు లందఱును సమ్యగలంకృతగాత్రులై దివ్యరథముల నారోహించి యెదుర్కోలు గావింపవలయు. మఱియు వారాంగనలు నుత్తమకన్యాజనంబులును లెస్సగ నలంకరించుకొని కమలనాభు నెదుర్కొనవలయు. పౌరజను లందఱునుం దమకుఁ దమకుఁ బోలినభంగి రాజమార్గంబులందును, నగరబహిరుపవనములందును, గోపురములందును, జదుకంబులందును, గృహబహిర్వితర్దికాతలంబు లందును, నున్నతప్రాసాదంబులందు నుచితరీతి వసించి కన్నుల పండువుగా మార్తాండకోటిప్రకాశుం డైన హృషీకేశుం గాంతురుగాక. పురమున నెల్లచోట్ల నున్నత

కేతనంబు లెత్తింపవలయు. రాజమార్గంబులందుఁ బరాంగకణంబు లెగయకుం డఁగ శీతలజలసేచనంబు నొనరింపవలయు. దుశ్శాసనుగృహంబు దుర్యోధను గృహంబుకంటె మనోహరంబుగా నలంకరించియుంచి యది యజ్ఞగన్నాథునకు విడిదలగా నిరూపింపవలయు. అమ్మందిరంబు రుచిరప్రాసాదోపశోభితంబు శోభ నంబు సర్వకాలసుఖదంబునయి యొప్పెడి. ఉత్తమవస్తుజాలమంతయు నచ్చట నునుపవలయు ననిపలికిన విని విదురుం డతని కిట్లనియె.

రాజేంద్రా, నీవె సర్వవిధములం దైరిలోక్యసమ్మతుండవు. సూర్యుని యందుఁ దేజ మెట్టు లట్టుల నీయందు ధర్మము నిత్య మని ప్రజ లందఱు నిశ్చ యించియున్నవారు. లోకోత్తరసుగుణగణవిలసితుండ వైననీ కింక గుణరక్షణం బునం బ్రయత్నంబు సేయుట ముఖ్యంబుగాదే? మఱియు శాస్త్రితర్కాదుల వలన సుస్థిరుండ వని లోకమునకెల్ల విదితంబు. ఇంతటివాఁడవయ్యు నిప్పు డీక డపటిప్రాయంబునఁ బాడిదప్పట యొప్పదు. అభ్యాగతుం డైనయచ్యుతునకు నీకావింపఁ దలఁచిన సమ్మానంబులఁ జేయం దగు. అతం డంతకంటె నధికంబుగా భవదీయసకలరాజ్యమునీఁగికిం బాత్రుండకాని యొండు గాదు. అయినను నీవు ధర్మతాత్పర్యముననెండె, నతనికిఁ బ్రియము కర్తవ్య మనుతలంపుననెండె నివి యన్నియు నీదలఁచిన వాఁడవుగా వనుట నామనంబునకుఁ దెల్లంబు. ఇందు శపథంబైనం జేయుదు. మఱి బాహ్యకర్మమునఁ గృష్ణుని వశీకరించికొని పాండ వుల బలహీనులం జేయుదు నను తలంపుతో నిట్లు మాయలు పన్నుదువు. మం చితలంపే నీమదిం గలదేని యింత యేల? వారయిదూళ్లంగదా యడిగిరి. అవి యిచ్చిన సంధి కాదొకో? అంతమాత్రయు నిచ్చుటకు మనసొప్పనినీవు రెండు తెగ లవారికిని శాంతిఁ గావింతు వని నే నెట్లు నమ్ముదు? ధన మిచ్చి వాసుదేవుని లోఁజేసికొని పాండవులతోడ భేదముఁ గావింతు ననియుండెద వది నెఱవేఱనేరదు. నీ వెన్నిమాయలు పన్నినను జగదీశ్వరుం డైనజనార్దనుం డది యెఱుంగనేరఁ డొకో వాసుదేవుఁ డర్జునునికంటె నితరుఁడు గాఁడనియుఁ బ్రాణతుల్యుఁ డయిన మిత్రుఁడనియు నెఱుంగుదుముకదా. కృష్ణునిమాహాత్మ్యంబును, నరుని కతనిపై గలభక్తిదార్ఢ్యంబును నే నెఱుంగుదు. కావున నీమాయ కొంచెమేనియు సాగమి సిద్ధంబు. కుశలసంప్రశ్నాదిసత్కారంబులకంటె నితరంబు మాధవుఁ డంగీకరిం పఁడు. సర్వలోకనాథుండును సర్వవిధమానార్హుండు నైనమధుసూదనుం డెయ్యది చేయఁగోరి యిచ్చటికి విచ్చేయునో యద్దానిం జేసిన నతండు ప్రీతుఁ డగుఁగాని లాఁతియుపచారము లెన్నిచేసినను మెచ్చునే? మీకును బాండవులకును సంధి చేయుదు నని నిండుమనంబుతో నంబుజనాభుఁ డేతేర నది చేయకునికి యుఱవు గాదని నేఁ జెప్పవలయునే? పరికించిచూచిన వారు నీవును లాఁతులు గారు. నీవు

ని శాంతిఁ గావింతు వని నే నెట్లు నమ్ముదు? ధన మిచ్చి వాసుదేవుని లోఁజేసి కొని పాండవులతోడ భేదముఁ గావింతు ననియుండెద వది నెఱవేఱనేరదు. నీ వెన్నిమాయలు పన్నినను జగదీశ్వరుం డైనజనార్దనుం డది యెఱుంగనేరఁ డా? వాసుదేవుఁ డర్జునునికంటె నితరుఁడు గాఁడనియుఁ బ్రాణతుల్యుఁ డయి నమిత్రుఁడనియు నెఱుంగుదుముకదా. కృష్ణునిమాహాత్మ్యంబును, నరుని కత నిపైఁ గలభక్తిదార్ఢ్యంబును నే నెఱుంగుదు. కావున నీమాయ కొంచెమేనియు సాగమి సిద్ధంబు. కుశలసంప్రశ్నాదిసత్కారంబులకంటె నితరంబు మాధవుఁ డంగీకరింపడు. సర్వలోకనాథుండును సర్వవిధమానార్హుండు నైనమధుసూదనుం డెయ్యది చేయఁ గోరి యిచ్చటికి విచ్చేయునో యద్దానిం జేసిన నతండు ప్రీతుఁ డగుఁగాని లాఁతియుపచారము లెన్ని చేసినను మెచ్చునే? మీకును బాండవుల కును సంధి చేయుదు నని నిండుమనంబుతో నంబుజనాభుఁ డేతేర నది చేయుట నికి యుఱవు గాదని నేఁ జెప్పవలయునే? పరికించిచూచిన వారు నీవును లాఁతు లు గాము. నీవు తండ్రివి వారు కొడుకులు. నీవు వృద్ధుఁడవు వారు చిఱుతవారు. వారియెడ నీవు తండ్రిమాడ్కి వర్తింపుము. వారు నీయెడఁ బితృభక్తి నున్నవా రు. కుటిలత్వంబు విడిచి ఋజుత్వ మవలంబింపుము. అవివేచనదోషమునఁ బుత్ర పౌత్రమిత్రాదులకుఁ జేటు గావించికొనక యందఱకుం గుశల మెసఁగువిధమున సంధిఁ జేయు మని విదురుఁడు చెప్పుచున్నంత దుర్యోధనుండు తండ్రి కిట్లనియె.

విదురుఁడు చెప్పినదెల్ల నిక్కవంబు. అచ్యుతుఁడు పాండవులకంటె నిత రుఁడు గాఁడు. అతనికి వారికిని భేదముఁ గావించుట దుష్కరంబు. జనార్దనుండు మనయింటికి వచ్చినపు డెన్నియైన నతని కియ్యవచ్చు. ముల్లోకములందును సర్వ విధసమ్మానంబులకు నతండు పాత్రుండగాని యొండు గాదు. అయిన నిప్పుడు మన మేమియు నియ్యఁ దగదు. ఇత్తుమేని "సంగ్రామంబు సంప్రాప్తంబయిన తటిఁ గౌరవులు కృష్ణునకు లంచ మిచ్చి" రని లోకులు పలుదెఱంగుల గుజగుజలు వోవుదు రింతియ కాక యతండును మనము వెఱచి తన్నారాధించుచున్నవార మనితలంచును. అంతకంటె నవమానం బొం డెద్దియైనం గలుగునే? అవమానం బుఁ గావించుకార్యంబు సేఁత వివేకి యగునుత్తమక్షత్రియునకుఁ దగునే? కావున దేశకాలములం బరిశీలించిన నిపుడు కృష్ణున కేమియు నియ్యకుండుటయే యు క్తము. తొడరినపగ వగ మిగుల మిన్నకున్నం దెగునే? యనిపలుకుచున్నంత శాంతనవుండు ధృతరాష్ట్రున కిట్లనియె. జనార్దనుండు మీరు సత్కరించి పెక్కు లిచ్చిన సంతసించువాఁడు నియ్యకున్న నలుగువాఁడునుం గాఁడు. మఱి యమ్మ హాత్ముండు బోధించుదాని నియ్యకొనిన సంతసిల్లు. లేకున్నఁ గినియు. మనమా జగన్నాథువచనంబు ప్రత్యాఖ్యానంబు సేయం దగదు. దాన మన మతని నవ

మానించుటం జేసి యపచారము సేతయకాని కార్యం బతండు పూనినవిధంబు నన నడుచు. ఎన్నియుపాయములనైన నానలినోదరునుద్యమంబు మాన్ప నేరను నేరమి సిద్ధంబు. పరమధర్మాత్ముండైన నారాయణుఁడు ధర్మార్థములకు విరోధము రానిచందమున నుచితములఁ బలుకు. అవి విని నీవును వారలును దత్ప్రకారం బనుష్ఠించిన మేలు. వాసుదేవుం డనుతీర్థంబున మీకుం బాండవులకుం గల వైరాగ్నిం జల్లార్పు మని చెప్పుచున్నంత దుర్యోధనుం డామాటల కడ్డము సొచ్చి పితామహా, యేముం బాండవులుం గూడి రాజ్యమేలుదు మనుట కానిపని. ఏను బ్రదికియుండునందాఁక వారికిఁ బా లియ్యను. ఎన్నివిధములనైన వారల నిగ్రహింపన వెరవులు వెదకుచుండుదు. పాండవులకుఁ బెనుప్రాపు జనార్దనుండు కాన నతనిం బట్టి చెఱఁ బెట్టితిమేని మనకుఁ బాండవులు యాదవులును విధేయులై నడుతురు. అతం డెల్లి యిటకు వచ్చినపుడు పట్టి బంధింపఁగఁ దగినయుపాయముల నపాయము రాని తెఱంగుగా నతం డెఱుంగనివిధంబుగా నేర్పఱుపవలయు నందులకు నీవ నేర్తువు. నాకుఁ దెలియఁ జెప్పు మని యడుగుటయు ధృతరాష్ట్రుఁడు కర్ణకఠోరం బయిన యప్పాపవచనంబు విని వ్యథితచిత్తుండై కొడుకుం బిలిచి యోరీ పాపాత్మా యిట్టు లేల యసంబద్ధంబులు పల్కెదవు? నీతలంపు ధర్మవిరుద్ధంబు. జగన్నాథుం డైన జనార్దనుని బంధింతు నని తలంపనైనం దగునే? మన కతండు చుట్టము ప్రియుండు సంధికార్యమున దూతయుం గదా. ఈకారణములం బరిశీలించిన నతని కెగ్గు సేయఁ జనునే? మఱియు నమ్మహాత్ముఁడు నీకుఁ జేసినకీ డెయ్యది? కలదేని చెప్పుము. అట్టిమహానుభావుని బంధింప వచ్చునే? యని యధిక్షేపించుచుండ భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. అయ్యా, నీకొడుకు మిగుల మూఢుఁడు. కాలంబు దీఱెఁ గాఁబోలు. సుహృదులెంత బుజ్జగించి చెప్పినను గొంచెమైన నర్థానర్థములఁ దలపోయఁడు. తనమతంబే మతంబుగా నుత్పథంబునం బోవుచుఁ బాపములఁ జేయుచున్న యీదురాచారుని మతంబే నీవు ననువర్తింతువు. హితవాదులమాటలు మీచెవుల కింపు గావు. పెక్కు లేల? కుటిలబుద్ధి యగునీకొడుకు కృష్ణు నెదిరించెనేని పుత్రమిత్రామాత్యసహితంబుగా క్షణమాత్రంబునఁ జెడుట సిద్ధంబు. ఇఁక నీకొలువునం గూర్చుండి యత్యంతదుష్టాత్ముం డైన వీనిపెడమాటల వినఁ జాల నని పలికి క్షణక్షణప్రవర్ధమానక్రోధరూక్షచిత్తుండై మొగంబుగంటు వెట్టుకొని దిగ్గన లేచి పోయె. అట్లు కురుపితామహుండు లేచిపోవుటయు దక్కటివారెల్ల నెద్దియుఁ దోఁపమిఁ దల్లడిల్లినయుల్లములతో లేచి తమతమనెలవులకుఁ జనిరి.

### శ్రీకృష్ణుఁడు కరిపురముఁ జొచ్చి ధృతరాష్ట్రమందిరంబున కరుగుట.

అంత నక్కడఁ గృష్ణుండు [illegible] లేచి ప్రాతరాహ్నికములఁ దీర్చి పు

కస్థలవాసు లయినవిప్రులయనుజ్ఞఁ బడసి యచ్చోటు వాసి తఱలుటయు నచ్చటివారలు పెద్దయుదవ్వు తోడనవచ్చి యచ్యుతుండు వీడ్కొలుప నిలిచి యతని యరదంబు దృగ్గోచరం బగునంతకు నద్దెసం జూచుచుఁ దద్గతమనంబులఁ గ్రమ్మఱి యరిగిరి. నారాయణుఁడుం దఱచి వచ్చుచుఁ దెరువున దుర్యోధనుండు దనకుఁగా నాయిత్తపఱపించినపందిళ్లు చప్పరంబులుం జొచ్చినయట్లును, దివ్యాసనంబులం గూర్చుండినయట్లును, సుగంధికుసుమమాల్యములం దాల్చినయట్లును, గమ్మగందం బలఁదినయట్లును, వివిధాన్నపానంబుల నానినయట్లును భావించి యొక్కటియుం గ్రహింపక త్వరితగమనంబున నేతెంచుచుండ దాని నెఱింగి ధృతరాష్ట్రుపనుపున దుర్యోధనుండుదక్కఁ దక్కటికురుకుమారు లందఱును భీష్మద్రోణకృపాదు లగు మాన్యజనులును వివిధవాహనారూఢులై పాదచారు లగుపౌరజనులు పెక్కండ్రు తోడం బలసిరాఁగ నెదురువోయి పురంబు వెలుపలఁ దెరువులోనఁ బురుషోత్తముం గనుంగొని శ్వాగతాద్యుపచారంబులు నడిపి కొంతవడి సముచితాలాపంబుల నిర్వర్తించి యట ముకుందునరదంబు ముందు వోనిచ్చి దానిం గదిసికొని యందఱుం దమతమస్యందనంబులపై వచ్చుచుండఁ బుండరీకాక్షుండు తనరాకకై యలంకృతంబయిననగరంబుఁ జొచ్చి దర్శనాయాతపౌరజనసాంద్రంబై యించుకేనియు నెడలేని రాజమార్గంబునఁ దురంగమగమనవేగం బలంతి యగుటయు వీటిసౌభాగ్యముఁ గనుంగొనుచు మందమందగమనంబున నేతెంచుచుండె. అట్టియెడ సకలజనులును జనార్దనుం జూడ వేడుక గడలుకొనఁ బ్రాసాదంబులను గృహబహిర్వితర్దికాతటంబులనుం జేరి కన్నులారం గనుంగొనుచుండిరిగాని యేరునుం గార్యాంతరవ్యాసంగవశమున నేనియు నది దప్పింపరైరి. అట్లు కన్నులపండువుగాఁ బుండరీకాక్షుదర్శనంబుఁ జేయుచు నందు వృద్ధు లిమ్మహానుభావుఁడుఁ గదా గజేంద్రుం గాచె నితనింగదా నారదాదులు పలుదెఱంగులఁ బేర్కొందురనియుఁ, దరుణీమణు లీసుందరాంగునింగదా షోడశసహస్రాంతఃపురతరుణీజనంబులు వరించి కోర్కు లం బడసిరనియుఁ, బాలు రితండుగదా బృందావనంబున వేణుగానాదిలీలలఁ బచరించెననియు బహుప్రకారంబులఁ బ్రస్తుతింప నాలించుచుఁ బురంధ్రీరత్నంబులు మీఁదఁ జల్లులాజాక్షతాదిశోభనద్రవ్యంబులఁ గొనుచు మెల్లమెల్లన రాజమందిరద్వారంబు సొచ్చి కక్ష్యాంతరంబులు మూఁడు గడచి యరదము డిగ్గి పాండురప్రాసాదభాసితంబై యున్నధృతరాష్ట్రుమందిరమున కరుగుచున్నంత నంతకు మున్న త్వరితగమనంబునఁ బోయినభీష్మద్రోణాదు లెఱింగిపఁ బ్రజ్ఞాచక్షుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు సేయ నరిగి యరవిందనాభుండు కురుకులధుర్యుం డైనధృతరాష్ట్రుని గురుపితామహుం డైనశాంతనవునిం గాంచి సముచితసల్లాపముల సత్కరించి బాహ్లికసోమదత్తాదు లగుకురువృద్ధుల సగౌ

రవసంభాషణముల నాదరించి కౌరవాచార్యు లయినద్రోణకృపాచార్యులం బ్రణామపురస్సరకుశలసంప్రశ్నములం బ్రస్తుతించి కురుకుమారులకును దక్కటిరాజలోకంబునకును వయోగుణానుగుణముగా నాలింగనాశీర్వాదాదిప్రకారముల నడిపి తక్కటిసభాసదులనెల్ల సాదరావలోకనంబున మన్నించి ధృతరాష్ట్రపనుపున సమున్నతకాంచనపీఠమునం గూర్చుండె. సాత్యకియు నాగద్దియపిఱుందఁ జిఱుతగద్దియం గూర్చుండె. కూర్చుండుటయు రాజశాసనంబున రాజపురోహితు లచ్యుతునకు మధుపర్కాదిపురస్సరంబుగ యథావిధిపూజనం బొనరించిరి. తత్పూజలం గ్రహించి గోవిందుండు మందహాససుందరవదనారవిందుండై తమకు వియ్యంపువారైనకౌరవులతోడం బ్రణయబంధురంబుగా మేల మాడుచుఁ దనరాక కలరుచున్నవారలయుల్లంబుల నుల్లాసంబు గైసేయుచుఁ గొండొకవడి యుండి యట ధృతరాష్ట్రమొగమునం జూడ్కి నిలిపి యిఁకఁ బోవలయునెడలకుఁ బోవలయు ననుజ్ఞ యియ్యం దగు నని యతని వీడ్కొని విదురునింటికిఁ జనియె. అంతకు మున్న విదురుఁ డింటి కరిగి సర్వకల్యాణపదార్థంబులతో సభక్తికంబు ససంభ్రమంబు సప్రశ్రయంబు సప్రణయంబునుంగా నెదుర్కొని వనజనాభుం గృహాభ్యంతరంబునకుఁ దోడ్కొనిపోయి యున్నతాసనంబున నాసీనుం జేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి దేవా భవదీయదివ్యమూర్తిసందర్శనంబున నామనంబునం బొడమినప్రీతి నే మని చెప్పుదు. దేహులకెల్ల నంతరాత్మ యగునీకు సకలప్రాణిమనోగతం బయినయభిప్రాయమెల్లఁ దెల్లంబుగదా యని నివేదించి పాండుపుత్రులు పాంచాలీసహితంబుగాఁ గుశల మున్నవారలే? యనియడుగ దాశార్హుండు సవిస్తరమధురంబుగాఁ బాండురాజతనూజులకుశలాది వృత్తాంతములనెల్ల వివరించి చెప్పిన విని విదురుఁ డోగిరము గావింతు నిచటన యారగింపవలయు నని ప్రార్థించిన నందుల కియ్యకొని మంధరధరుండు తనమేనత్త యగుకుంతీదేవిం గనుంగొనఁ దదీయమందిరంబున కరిగె.

### శ్రీకృష్ణుఁడు కుంతీదేవియొద్దకుఁ బోవుట.

కుంతీదేవియుఁ దన్నుఁ గాంచ వచ్చినయచ్యుతుం గనుంగొని తటాలున లేచి చిరకాలదృష్టుం డైనయమ్మధుసూదనుం గౌఁగిలించికొని యుచితాసనమున నాసీనుం జేసి యాతిథ్యంబు నడిపి బాష్పపూర్ణలోచనయై కొడుకులఁ దలఁచుకొని డగ్గుత్తిక వెట్టి యిట్లనియె. కృష్ణా, యేమి చెప్పుదు? బాల్యము మొదలుగ గురుశుశ్రూష మున్నగుసత్కార్యములనే యొనరించుచు విగతక్రోధహర్షులు బ్రహ్మణ్యులు సత్యవాదులు ననం బేరు వడసి పరస్పరసౌహార్దంబు మెఱయ సువృత్తులు సమచిత్తులు నగుపాండుపుత్రులు కైతవమున రాజ్యభ్రష్టులై సుఖప్రియములను శోకావిలచిత్తయగుననన్నుం బాసి విజనారణ్యముల కేగిరి. వార లట్టి

వనటలకుఁ దగినవారలే? వారితోడన నామనంబునుం జనియె. మే నెక్కటి యిక్కడ నున్నది. చిన్ననాఁడే పితృవియోగంబుఁ బొంది తద్వ్యసనగ్రస్తులైన వారిపుడు నన్నునుం బాయుట కెంత యుమ్మలించిరో? ప్రాసాదాగ్రంబులందు మెత్తనిపాన్పులం బరుండి వేఁబోకట వీణావేణుమృదంగాదిమధురనిస్వనంబునను గజహయరథనేమినినాదంబునను వందిమాగధమంగళస్తుతిపాఠరవంబునను మేల్కాంచి దివ్యవస్త్రాలంకారధారులై బ్రాహ్మణులం బూజించి పుణ్యాహఘోషపురస్సరము లగుతదాశీర్వాదములఁ గొనుచు నెంతోసుఖ ముండినవార లత్యంతకఠినారణ్యభూములం బరుండి క్రూరమృగనినదముల మేల్కనుచుఁ గొలఁదిపెట్టరానియెల్లయిడుమలఁ బడిరిగదా? అమ్మహాత్ముల కవియెల్ల నేల కుడువవలసివచ్చెనో యెఱుంగరాదు. ధర్మరాజుసద్గుణంబులఁ జెప్పి తీఱునే? అతనికి సత్యంబు నిత్యవ్రతంబు. దాంతి యతనిసొమ్ము. భూతదయాపశ్చాత్తాపంబులయెడ నాతనిఁ జెప్పి మఱి లాఁతిం జెప్పవలయు. అకార్యనివర్తనం బతనియెడఁ బుట్టినయది. కామద్వేషము లెల్లపుడు నతనికి లోఁగియేయుండు. అంబరీషమాంధాతృయయాతినహుషభరతదిలీపశిబిప్రముఖు లగుపూర్వరాజర్షులచరిత్ర లెల్ల నాతనికొప్పియున్నయవి? అతం డెఱిఁగినధర్మముల నందఱు నెఱుంగరు. ఇఁక నతనిశీలవృత్తంబుల వేఱ చెప్పవలయునే? అతనికిఁ గలగుణములఁ బరికించిన ముల్లోకములను నితం డేలఁ జాలు ననితోఁచు. కురుకులంబున కెల్ల నతండు మేటి. అతఁ డిపు డెట్లున్నవాఁడు? భీమునిభుజవీర్యములు లోకవిశ్రుతములుగదా? వాఁడు నాగాయుతబలుఁ డనియు వాయువేగుఁడనియు రాజులెల్ల నెఱతురు. హిడింబుని బకునిఁ గ్రోధవశాదులనుఁ గీచకుని వానితమ్ములను నతఁడకదా పిలుకుమార్చినవాఁడు. వాఁడు పరాక్రమమున శక్రున కెనవచ్చు. బలమునఁ బవమానునకు సమానుఁడు. క్రోధమున రుద్రునకు సాటి. ధార్తరాష్ట్రులపై నాతని కెల్లపుడుం గోప మగ్గలంబై యున్న నన్నమాట మీఱరా దనుతలంపుతోఁ దమకుఁ దొడరినపాట్లెల్ల నోర్చుచు నెట్టులో మిన్నకున్నవాఁడుగాఁబోలు. అతనివర్తనం బిపు డెవ్విధమున నున్నయది? అర్జునపరాక్రమమునకుం గొలఁది గలదే? తాను ద్విబాహుఁడయ్యు సహస్రబాహుఁ డగుకార్తవీర్యార్జునితో నిరంతరస్పర్ధఁ దనమనంబునం జేయుచు నొక్కపెట్ట క్షణమాత్రంబునఁ బంచశతశరములఁ బ్రయోగించునంతటిహస్తలాఘవచాతుర్యముల నాతండు పొగడిక గన్నవాఁడు. తేజమున నాదిత్యుండే వానికిఁ దుల్యుఁడు. దమమున మహర్షులే సమానులు. క్షమాగుణమునఁ బుడమియే సరివచ్చు. విక్రమమున శక్రుఁడే యీడురాఁ దగినవాఁడు. అతండేకదా సకలరాజులనుం జయించి యపరిమితధనరత్నరాసులం దెచ్చి కురుకులంబునకు వన్నె పెట్టె. అవ్వీరశేఖరుండకదా సురలకు సురేంద్రుఁ డెట్టు లట్టుల పాండవు

లకుఁ బెనుఁబ్రాపై యున్నవాఁడు. రణమున జీవితాశ గలవాఁ డెవ్వఁడేనియు నని వాని మార్కొందు నని తెగువమై నడచునే? నీనెచ్చెలికాఁ డగువాఁ డిపు డెబ్బంగి నున్నవాఁడు? సుకుమారుఁడు తరుణుఁడు రూపవంతుఁడు శూరుఁడు చిత్రయుద్ధ విశారదుఁడు మహాధానుష్కుఁడు మహాబలుఁడు నగునకులుఁడు కుశలమున్న వాఁడె? వాఁడు తనయన్నదమ్ముల కందఱకును వెలుపలిప్రాణంబు. ఆకుమారుం గ్రమ్మఱ నొకతూరియైనం జూచునంతటిభాగ్యము నాకుఁ గలదె? చెప్ప మూయు నప్పుడెల్ల నతఁడు ప్రోలఁ బొడగట్టినట్లు మనమునఁ దోఁచుటయు వానిమెడఁ బాటునంజేసి యెద్దియుఁ దోఁపదు. హ్రీదయాదాక్షిణ్యతారుణ్యమార్దవసౌకుమార్యచాతుర్యగాంభీర్యశౌర్యధైర్యధార్మికత్వాదిసకలగుణంబులకు నెల వగు సహదేవుఁడు కుశలమున్నవాఁడె? వానిధర్మగుణ మితరదుర్లభంబు. అన్న లందఱుం దద్విషయంబున నాతనిం బ్రశంసింతురు. కొడుకుల నెవ్వరిం జూడక యెట్లో కాలముఁ గడపుచు బ్రదికియున్నదానను. నాకంటెఁ గఠినచిత్తురా లొండొకతె భూమండలంబున నుండునే? మఱియుఁ గొడుకులకంటెఁ బెక్కుమడుంగు లెక్కుడుగ నాకుఁ గోడలు కూర్మి చేయు. ఆసాధ్వి సత్కులసంజాతురాలు. రూపసంపన్నురాలు. తదీయసుగుణగణంబుల గణుతింప నలవి గాదు. పుత్రులకంటెఁ బతులే తన కెక్కువనుతలంపుతోఁ గొడుకులనైనం బాసి పతులతోడ నడవులకుఁ జనియె. ఆసర్వకల్యాణి యెట్లు లున్నయది? అగ్నితేజోవిరాజితు లయిన పతు లేవురు గలిగియుఁ గొఱఁదిలేనిపాట్లు పడియె. ఇన్నిపాట్లు పడియు నీవచు నాలవయేఁటనేనియు నిందాఁక భోగములకు భాజనంబు గాదయ్యె. ఇంకను నట్టులే యగునేని సత్కర్మానుష్ఠానంబు సుఖకారణం బనువార్త కల్ల యనినిశ్చయింపవలయు. ధర్మజాదులపాట్లన్నియు నట్లుండె. ఆనాఁ డాసభలో భీష్మధృతరాష్ట్రబాహ్లికసోమదత్తాదు లగుకురువృద్ధులును గుంభసంభవప్రముఖు లగు మాన్యజనులుం గన్నులారఁ గనుంగొనుచుండఁగనే క్రోధలోభవశుఁ డగ్రాహ్యనాముఁ డత్యంతదురాత్ముఁడు నగునక్కురుకులాధముండు కొంచెమేనియుఁ గొంకక రజస్వలయు నేకవస్త్రయు నగునప్పరమపతివ్రతాశిరోమణిని రచ్చకుఁ దెచ్చి చీర లొలువం దొడంగి పరిభవింపఁ బూనుట నామనంబునఁ జిచ్చు వెట్టి కాల్చినట్లున్నది. ఇట్టిసంకటపాటెన్నఁడేనియు నెవ్వరేనియుఁ బొందిరే? సభలో నున్న పెద్ద లందఱు నత్తఱి నోరెత్తక మిన్నకున్నవారకాని యేమైనం బలికిరే? విదురుఁ డొక్కరుండ తెంపు చేసి వల దనివారించె. దానం గార్యము లేకున్న నయ్యోడరు చూడ నోర్వనిచిత్తంబుతోఁ దనచే నయినంత యాడినయమ్మహాబుద్ధి యొక్కఁడే సకలలోకపూజ్యుఁ డైనయార్యుఁ డని నామతంబు. ఆర్యత్వంబు వృత్తమున నొక్కటఁ గాక ధనవిద్యాదులఁ గలుగదు. తెల్లంబుగదా. అమ్మహాత్మునిశీలం

బలంకారంబై ముల్లోకముల వన్నె కెక్కెఁ గావున నేను వాని నెక్కనిఁ బ్రేమ గౌరవపురస్సరంబుగఁ బూజింతు. తొల్లింటిరాజు లెందఱేని వేట జూదము మున్నగువ్యసనములఁ దగిలి రనివిందుముగాని వారెల్ల నీతులువలట్లు క్రూరకృత్యముల కొడంబడిరే? నా బ్రదు కెల్లకాలము దుఃఖప్రాయంబ యయ్యె. కొడుకులు కుఱ్ఱలుగా నుండినపుడే యీమాత్సర్యఘనులు మ మ్మూరు వెడలఁగొట్టుటయు లక్కయింటఁ గాపురముంచుటయు దానిం గాల్చుటయు మున్నగునెగ్గు లెన్నియేఁ జేసిన నెట్లో దైవవశమున నవియెల్లఁ దప్పించికొని యేకచక్రాపురమునఁ గొంతకాల మజ్ఞాతచర్య నడిపి యటఁ గొడుకులకు భుజవీర్యప్రభావమునఁ బెండ్లి యగుటయు నాపదంపడి యధిగతార్ధరాజ్యులై యింద్రప్రస్థమున సుఖముండిరి. అపుడు నామనం బించుక యూఱడిల్లి సంతుష్టంబై యుండఁగ నందఱు నన నేల యందుల కోర్వనిప్రతికూలవిధిపాతకచేష్టితంబునం జేసి చెప్ప నలవిగాని పాట్లెల్ల మాపాలయ్యె. ఏమి చెప్పుదు? ఇన్నిదుఃఖముల నేను గుడువవలసివచ్చె. నిరతంబు సభక్తికంబుగాఁ గొలుచుచుఁ బ్రోచుకొడుకులుఁ గోడలుం గానలకుఁ బోవుటయు నిట బావకొడుకునికారమునకు భాజనంబనై యొల్లనికూడు గుడుచుచుఁ గడుపు ప్రోచికొనుచుంటి నింతకంటె నెద్దియు నా కిపుడు దుఃఖముగాఁ దోఁపదు. లోకమునఁ బ్రాణులకుఁ దఱుచుగా దుఃఖానంతరము సుఖము సుఖానంతరము దుఃఖమునుం గలుగుచుండుఁగదా. తత్ప్రకారంబున మా కింక సుఖంబ యనుభావ్యంబై యున్న నిప్పటికి నయ్యది ఘటింపమిం జూడఁ బుణ్యఫలంబెల్ల క్షీణంబయ్యెఁగాఁబోలు నని యొక్కొకతేప తలంపువొడమెడి. ఇఁక నెట్లు కానున్నదో యెఱుంగరాదు. పాండవులు ధార్తరాష్ట్రులు నెక్కరూప యనుభావము నామనమున నిత్యంబై యున్నది. ఇయ్యది ప్రమాణంబు. మదీయమనోవర్తనం బిట్టిద యగునేని పెక్కు లేల భండనంబునఁ బాండవులే గెల్తురు. విజయలాభానంతరంబు నిన్నుం గొడుకులనుం జూడఁ గలదానను. ఇక్కరణి నాకు భేదతాత్పర్యము లేకున్ననుం బ్రకృతిదుష్టుఁ డైనదుర్యోధనుఁడు నాకు నికృతిఁ జేయుచున్నవాఁడు. వీనిని ధృతరాష్ట్రప్రభృతులను నన నేల? నన్ను ననుకొన నేల? ఇట్టివారికి నన్నిచ్చినతండ్రి ననవలయు. చిఱుతనాఁడే నన్ను నాతండ్రి వాత్సల్యముఁ దొఱంగి కుంతిభోజున కొసంగె. అతండు వీరియింట నిచ్చె. ఇట్లు పుట్టినపిదపఁ గొన్నినాళ్లకె పుట్టినింటివారినిరాకరణముఁ బొంది పదంపడి వీరినికారంబునుం బడసితి. ఇంతకంటె దుఃఖజీవనంబు వేఱొండు గలదే? పరికించి చూచిన నా బ్రదిమికి వగపు దక్క మఱియొక్కఫలంబు గన్పట్టదు. నాగతి యట్లుండె. కొడుకులు లెస్స యున్నారన్నఁజాలు నన్ననొ వారియవస్థలఁ జెప్పఁ జాలముగదా. అర్జునుఁడు జనించినపు "డీకుమారుఁడు లోకోత్తరవిక్రమశాలియై దిగ్విజయంబు చేసి సకలలోక

ములందును నిజనిర్మలయశంబు నెఱపి ఘోరసంగ్రామంబునఁ గౌరవుల నిర్జించి యన్నదమ్ములతోడ సామ్రాజ్యంబు సేయుచు మూఁడశ్వమేధముల నొనరించు" నని యశరీరవాణి వినిపించె. అప్పలుకులెల్ల నిప్పటికి మిథ్యగాఁ దోఁచెడి. ధర్మమున కిదె ప్రణామంబు. ధర్మము లోకసంరక్షణసమర్థం బగునేని యామాట తప్పదు. నీవు నయ్యది నెఱవేఱు తెఱంగు సేయుదువు. మాధవా! యెన్నిమాఱులు సెప్పినం దీఱదు. వైధవ్యంబును దారిద్ర్యంబును వైరంబును నా కంతచింతాకరంబులు గావుగాని పెద్దకాలంబు కొడుకుల నెడఁబాసియుండు టొక్కండు మిక్కిలి మనం బెరియించుచున్నది. కొడుకులఁ జూడఁ బడయనినాకుఁ జిత్తశాంతి యెక్కడిది? గతజీవులకు శ్రాద్ధాదిక్రియలు గావించుట లోకకృత్యంబుగదా. పెద్దకాలంబు చూడమింజేసి యెచ్చటనో యున్ననుం గార్యవిషయంబున వారు నాకు లేనివారనియు వారికి నేను లేనిదాననియుం దలంపవలయుఁ గావున లేనినా కిపుడే వారు లోకసంప్రదాయాగతకృత్యములఁ జేయవలసినవా రగుదురు. విక్రమించి శత్రువులఁ జంపిరేని సంతోషమున నందఱుం గూడియుండుదుము. కావున నీవు ధర్మరాజుం జూచినవెంటన నామాటగా "క్షత్రియునకు యుద్ధము కులధర్మము. పగులప్రాపున బ్రదుకఁ గోరుటనింద్యము. కావున వేగంబ పోరికి సమకట్టి నడిచి పగతురఁ బరిమార్చి రాజ్యమేలు" మనిపలుకుము. భీమార్జునులం గాంచి "క్షత్రియాంగన యెందులకై సుతులఁ గనునో యద్దాని కియ్యదియే ప్రాప్తకాలంబు. ఇప్పుడు నిజధర్మముఁ బరిత్యజింపరాదు. ప్రాణములనైనం ద్యజింపవచ్చుఁ గాని కులధర్మము విడుచుట శ్రేయంబుగా" దని నేఁ జెప్పుమంటినని చెప్పుము. అయ్యిరువురకును ద్రౌపదిం బరిభవించినయప్పాలసులపై నెట్లు దయ పుట్టెనోగాని యెఱుఁగరాదు. వారు నిక్కం బలిగిరేని దేవతలనైన నేలకుఁగోలకుం దెత్తురు. మఱియుఁ గర్ణదుశ్శాసనాదు లప్పుడు పలికినపలుకు లుగ్గడించునట్టివియే? అవి తలంచికొనినం జిత్తము త్తలంపడు. భీముఁడు పగ పట్టెనేని తెగఁ దీర్పక యూఱటఁ జెందువాఁడు గాఁడుగదా. అతండు నేలొకో యింతకును మిన్నకున్నవాఁడు. నీ వెట్లైనం బనిపూని వారికిఁ దేజస్సముత్తేజనంబుఁ గావింపుము. "సర్వవిధజీవనములకంటె క్షత్రియకులజాతునకు విక్రమార్జితజీవనంబే వరంబు గావున నందులకుఁ దగురీతి సలుపుఁ"డని పలుమాఱులు పలికితి ననుము. మఱియు నర్జునునితోఁ బాంచాలికిఁ జిత్తసంతోష మవశ్యకర్తవ్య మని తెల్పుము. బిడ్డలు తమపుడమి గోల్పడి యడవుల కేగి కడు నిడుమలఁ బడుటయు నంతచింతాకరంబుగాని యప్పాపాత్ములు పాంచాలిం బఱిచినపాట్లు తలంపునకు వచ్చినం బురపురఁబొక్కుదు. పెక్కండ్రకు నాథురాలగునా సరమపతివ్రత యనాథయట్లు వందురవలసివచ్చెఁగదా. నాకును నాకొడుకులకును నీవును రాముఁడును బ్రద్యుమ్నుఁడును నాథులని నమ్మినదానను.

మీ రంద ఱుండఁగనే భీముఁడు బ్రదికియుండఁగనే యర్జునుఁడు పాఱిపోవకుండఁగనే యే నిన్ని దుఃఖముల పాలయితి. ఎట్టు లోర్తు నేమి యొనర్తునని పలుదెఱంగుల దుఃఖములఁ జెప్పిచెప్పి యేడ్చుచున్న మేనత్తకుఁ గృష్ణుఁ డిట్లనియె.

దేవీ, నీ కెనవచ్చుసీమంతిని లోకమున నెవ్వతెయుఁ గానంబడదు. యదువర్యుఁ డగుశూరునికూఁతురవు. ఆజమీఢకులపుంగవుం డగుపాండు నృపాలు పట్టపుదేవివి. లోకవిశ్రుతవిక్రము లగుపాండవులతల్లివి. ధర్మతత్త్వమెల్ల లెస్స యెఱింగినదానవు. ఇట్టినీ కివ్విధమున వగవఁ దగునె? ఎఱుకగలనీయట్టివారల కదా సుఖదుఃఖముల నోర్వవలసినవారు. మహాప్రాజ్ఞురా లగునీకు నేఁ జెప్పవలయునే? మఱియు దుఃఖకాలమెల్ల నిప్పటికిఁ గడచనియె. ఇఁక నచిరంబ భవత్పుత్రులు శత్రువులం దెగటార్చి యభిమతరాజ్యాదిభోగముల ననుభవింపఁగలరు. నీవుం జూతువుగదా. వారు లోకసాధారణసుఖములపై నాశ విడిచి వీరసుఖకాంక్షులై యున్నవారు. ఐహలౌకికగ్రామ్య సుఖభోగముల సరకుగొనక పారలౌకికసుఖములనే కోరుచుండుటయకదా యుత్తమపురుషలక్షణంబు. వారు తమ సాష్టాంగప్రణామంబుల నీకు మున్నువిన్నవించియట నందఱము కుశలమున్నార మనియెఱింగింపు మనిరి. వారి కిఁకఁ గుశలంబ పెంపెసంగు నని బహుప్రకారముల సాంత్వవచనములఁ దెల్పి శేషతల్పుఁ డూఱార్చుటయు నప్పాండురాజమహిషి యంకిలి దేఱినచిత్తంబుతో నతని కిట్లనియె. మధుసూదనా, నీకు నేఁ జెప్పవలయునా? ఎయ్యది చేసిన వారికి మే లగు నయ్యది చేయుము. ధర్మబాధ తోఁడరనివడువునం బ్రవర్తించుటయే నాకుం గలకోర్కి. నీప్రభావమెల్ల నే నెఱుంగుదు. మాకులమునకు నీవే ధర్మంబు సత్యంబు తపంబు భ్రాత. పెక్కు లేల? బ్రహ్మంబు నీవ నీయందు సర్వంబు సుప్రతిష్ఠితంబై యున్నది. నీచెప్పినయది తప్పదు గావున నూఱడిల్లుదు నని పలికిన విని జనార్దనుం డద్దేవికిఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి వీడ్కొని దుర్యోధనుమందిరమునకుఁ జనుతలంపున వెడలె.

### శ్రీకృష్ణుఁడు దుర్యోధనునింటికిఁ బోవుట.

అవ్విధంబున వెడలి పురుషోత్తముండు దుర్యోధననగరు సొచ్చుటయు నంతకుమున్న వచ్చి సమయప్రతిపాలనంబు సేయుచున్న ఫణిహారు లెడనెడం గలిసికొని బరాబరులు సేయుచుండ మూఁడుకక్ష్యాంతరములఁ గడచి రథావతరణంబు సేసి మందగమనంబునఁ గైలాసశిఖరంబుచాడ్పున నత్యున్నతంబు వైజయంతంబుమాడ్కిఁ బరమశ్రీవిలసితంబు నగునుత్తమప్రాసాదం బారోహించుటయు నచట నానాదేశసమాగతరాజలోకంబు భీష్మబాహ్లికాదు లగుకురువృద్ధులు ద్రోణకృపాదు లగుమాన్యజనులు తక్కటివారుం గొందఱు పరివేష్టింపఁ గర్ణశకునిదుశ్శాసనులతోఁడ నిండోలగంబున్న దుర్యోధనుండు మాధవుం జూచినం

తన తటాలున సపరివారంబుగఁ బ్రత్యుత్థానంబు సేసి యమ్మహానుభావుం దో
డ్కొని చని కనకమయోన్నతపర్యంకమున సుఖాసీనుం జేసి యర్ఘ్యపాద్యమధు
పర్కాదివిధులఁ బూజించి నాగృహంబును రాజ్యంబును నీసొమ్మని నివేదించుట
యు గోవిందుఁ డాపూజల గ్రహించి కొలువున సకలజనులఁ గలయం గనుంగొని
వయోగుణవిద్యానురూపంబుగా నెల్లవారియుల్లంబులు పల్లవింప సల్లాపంబు
సేయుచుండె. అట్టియెడ గాంధారేయాగ్రజుండు గదాగ్రజుతోఁ బ్రసంగవశమున
శాకపాకరుచుల వర్ణించుచుఁ దనయింట భోజన మొనరింపవలయునని వేడుక
గడలుకొన వేఁడుటయు దానవాంతకుఁ డద్దానిఁ దా నొల్లని తెఱంగుసూచించె. సూ
చించుటయు నగ్గాంధారీనందనుండు రాధానందనునితో సంకేతప్రకారమున హరి
పలికినపలుకులం గలగూఢార్థం బెఱింగించి యాలోచించి యటఁ గమ్మఱ మురాంతకు
దిక్కు మొగంబై జనార్దనా, నీవు సర్వధర్మవిదుండవు మాకుబాంధవుండవు ప్రియుం
డవు. పాండవులు నేమును నీకొక్కరూపకావున నిరువురకును సాహాయ్యంబు చేసితివి.
ఇట్టినీవు మాయింటికి మచ్చికతో విచ్చేసిన మేము పరమానందమున రుచిమంత
ము లగునన్నపానముల నాయితపఱిచి తెలిపినం గుడువ నొల్ల నన నీకుఁ బాడి
యే? అందులకుఁ గారణంబు మే మెఱింగినది లేదు. కలదేని తెలుపుము వినఁ గో
రెద ననియడుగ మధుసూదనుండు దుర్యోధనుకరంబుఁ దనకేలఁ జఱచుచు మే
ఘగంభీరనిస్వనంబు సెలంగ నోభరతకులవరేణ్యా, దూత లెచ్చటను వచ్చినపని
దీఱకమున్న భోజనాదులఁ జేయరు గావున నేను నావచ్చినకార్యంబు గాకమున్న
మీయింటఁ గుడుపు నీతి గాదు. కార్యము తెఱఁగువడినపదంపడి మీకావించు
పూజలనెల్లం గ్రహింతు నని యుత్తరం బిచ్చిన వాసుదేవునకు ధార్తరాష్ట్రుండు
వెండియు నిట్లనియె. నీనిరూపించినకారణంబు నుం గారణంబుగా నేర్చునే? కా
ర్య మగుఁ గాకుండు నది యట్లుండె. సర్వవిధసమ్మానార్హ బాంధవుం డై ననీ విం
టికి వచ్చితి వని యత్యంతసంతోషమునఁ బూజింపఁ దలంచిన నది నే నొల్లనను
ట నీ కెట్టు లుచితం బనితోఁచెనోగాని మాకుఁజూడ నందులకుఁ దగిననిమిత్తం
బు దోఁపదయ్యె. నీవువచ్చినవాఁడవు మాయింటఁ బ్రియముగ మాతోఁడఁ గుడిచి
కూర్చుండికదా యన్నిమాట లాడవలయు. మఱియు నీకు మాతో నొండె మాకు
నీతో నొండెఁ బగ లేమి యందఱకుఁ దెల్లంబు. ఆలోచింపక మిగిలి చెప్పితివిగాని
యొండుగా దనిన విని నారాయణుండు నెమ్మోమునఁ జిఱునగవు సొంపు సంపాదిం
ప దుర్యోధనుని దదీయమంత్రులనుం గలయంగనుంగొని నేన చెప్పవలయునేని
చెప్పెద వినఁ దగు నని మఱియు నిట్లనియె. ఏను ధర్మమును విడుతు ననుమాట
యెప్పుడు నొప్పుదు. కామద్వేషసంరంభహేతువాదాదు లెయ్యవి పొసంగినను ధ
ర్మము దప్ప నింతయు నిక్కువంబు. సంపూర్ణప్రేమపూర్వకంబుగాఁ బిలిచి పెట్టి

నపుడొండె నాపదలు మూఁడి కడుపు ప్రోచికొనఁ జాలనిదశ దొడరినపుడొండెఁ బరాన్నంబు భోక్తవ్యం బగు. మా కిపు డాపద యెయ్యదియు లేమిం జేసి రెం డవది కారణంబుగా మీయన్నము భుజింప నక్కఱ లేదు. ప్రథమకారణం బగు సంపూర్ణప్రీతి యన్ననో యది నీకు మాపై నించుకేనియు లేమి లోకవిశ్రు తంబు. ప్రీతిలేమియకాక ద్వేషంబునుం గలదు. ఎట్లంటేని. ప్రియు లనురక్తులు సర్వగుణసంపన్నులు నగుపాండుపుత్రులతో నీవు పుట్టిననాఁటఁగోలె నిష్కారణం బుగాఁ బగయేపాటించి యెగ్గులు మీఁదుమిక్కిలి చేసినవాఁడవు. వారితోటిపగ కు నీదార్జన్యంబుదక్క నెండొక్క కారణంబు వెదకిచూచినం గానరాదు. వారు ధర్మనిత్యులు గావున నెవ్వరును వారల ననరు. మఱి సర్వానర్థములకును నీవే నిమిత్త మనిపలుకుదురు. వారు నాకుఁ బ్రాణములు. నాప్రాణములతోఁ బగ సాధించువారు నాకుఁ బగవారకాక చెలికాం డ్రగుదురె? వారి కెవ్వఁడు శత్రుఁ డతండు నాకును శత్రుండు. వారి కెవ్వఁడు చెలికాఁ డతండ నాకుం జెలికాఁడు. ఏను ధర్మచారు లగుపాండవులలో నంతర్భూతుఁడఁగాని లాఁతివాఁడను గాను. ఇది దృఢముగ నెఱుంగుము. ఇవ్విధమున నీవు మాకుఁ బగవాఁడ వనుట నిస్సం శయంబుగదా. పగవారియింటఁ గుడుచుటయు వారికిఁ దనయింటఁ గుడుపు వెట్టుటయు ననురెండునుం దగవు. కాలదేశదేహధర్మము లొక్కరీతి నుండునవి గావు గావున నెప్పు డెట్టు లెయ్యది పొసఁగునో యని యూరకుండుటయ మేలు. గుణవంతుఁడై నవానిం జూచి యసూయతోఁ గామక్రోధాదివశత్వమునఁ గల హించునతండుపురుషాధముం డని పెద్దలు పలుకుదురు. తనకు మనఃప్రియులు గాకున్నను గుణవంతు లయినసజ్జనులకుఁ గూర్మి చేయునతండు కీర్తిమంతుఁడై నెగడు. కల్యాణగుణవిశిష్టు లయినసజ్జనులఁ జెఱుపఁ దలఁచినపాపాత్ముఁడు పెద్ద కాలంబు సుఖింపనేరఁడు. మీరాయెడ నాదోషములు గన్పట్టుటకతన మీరు దుష్టు లు. మీయన్నంబు దుష్టాన్నంబు. నాకు భోజ్యంబు గాదు. విదురునన్నంబు భోక్తవ్యం బనినిశ్చయించితి నని తెగఁబాఱిపలికి దేవకీనందనుండు గాంధారీనం దను వీడ్కొని యట విదురునింటికిఁ జనియె.

చనుటయు భీష్మద్రోణకృపబాహ్లికాదు లగుమాన్యవృద్ధు లందఱు నయ్యె రవిందనాభువెంట నంటి యరిగి దేవా, మాయిండ్ల భవద్భోజనార్థంబు శక్తికొ లఁది సభక్తికంబుగా వివిధాన్నం బాయితపఱిచి వేఁడుచున్నవారము. మావేఁడి కో లాలించి విచ్చేయవలయు ననివిన్నవింపఁగ వెన్నుండు వారినెల్లఁ గలయం గనుఁగొని నే నందఱిపూజలం గ్రహించితి నిఁక మీరెల్ల నిజసదనములకుఁ జనుఁ డనిపచరించి వీడుకో లిచ్చుటయు వార లజ్జగన్నాథునామంత్రణంబు చేసి నిజభవనముల కరిగిరి. అవ్విధమున వార లందఱుం గ్రమ్మఱినపదంపడి విదురుఁడు

నానావిధపూజార్హుం డైనదాశార్హునకు వివిధప్రకారముల మజ్జనాద్యుపచార ములు నాచరించి యిఁక నారగింపఁ దగు నని తిన్ననిమెలుంగున విన్నపంబు సేయుటయుఁ దోయజాక్షుండు వేదవిదు లగువిప్రోత్తములకు మునుదలఁ భోజన ములు పెట్టించి యామీఁదఁ దానుం దమ్ముఁడుఁ దగినబాంధవులు నొక్కబంతినై మరుద్గణపరివృతుం డైనపురందరుచందమునఁ గూర్చుండి శుచితోల్లసితంబు స్వాదుత్వసమంచితంబు సంప్రీతిసమర్పితంబు నగుచతుర్విధాన్నంబు భుజియించి కృతకరప్రక్షాళనుండై యుత్తమాసనాసీనుం డయ్యె. అట్టియెడ విదురుఁడు తన పురాతనసుకృతపరిపాకమునకుఁ దాన యచ్చెరుపడుచు గోవిందునకు దివ్యచంద నచర్చాద్యర్చనముల నొనరించి సుప్రసన్నుం డైనయద్దేవదేవుని నిశాసమయం బగుటయు మృదులశయ్యాతలంబునఁ బవ్వళింపఁజేసి చేరువ నొకయలంతిపీఁట మీఁదఁ గూర్చుండి వినయవినమ్రుండై యిట్లనియె.

### శ్రీకృష్ణవిదురుల సంవాదము.

దేవా, విదితసర్వార్థుఁ డగునీకు నేను జెప్పనంతటివాఁడఁగాను. ఐనం దోఁచినంత చెప్పకుండఁగ మనసు నిలువమింజేసి విన్నవించెద నాకర్ణింపుము. నా కుఁ జూడ నీరాక యనుచితం బనితోఁచెడి నీచేయఁబూనినకార్యము నెఱవేఱనే రదు. దుర్యోధనుఁడు నీమాట విని తత్ప్రకారంబున నడుచువాఁడు గాఁడు. తా నత్యంతప్రాజ్ఞుఁ డని దురభిమానం బారోపించికొని ప్రాజ్ఞు లగుహితవాదుల నధి క్షేపించు. కామములవెంటఁ బఱచుట వానికి నైజంబు. శ్రేయోమార్గముల నరయమి వానిసొమ్ము. మిత్రద్రోహంబు వానికిఁ బుట్టువుతోడఁ బుట్టినది. అస త్యవచనంబు వానికి వెన్నతోడఁ బెట్టినది. కృతఘ్నత్వంబు వానికిఁ బ్రధానవిద్య. సర్వార్థములయెడ ననిశ్చియమున కతఁ డాచార్యుఁడు. ఇంద్రియవశత్వంబున వా నిం జెప్పిగాని మఱి లాఁతిం జెప్పఁగూడదు. మఱియు ననేకదోషములు వాని నెన్నఁడు నెడఁబాయవు. అంతియకాక యిప్పుడు భీష్మద్రోణకృపాశ్వత్థామసైం ధవాదు లగుమేటివిలుకాండ్రు దనకుఁ దోడ్పడినవా రని మదించినవాఁడు. మఱి యుఁ గర్ణుఁ డొక్కఁడే పాండవులఁ జంపి తన్ను గెలిపించుననియు ననేకరాజలో కంబు దనకు బాసటమై వచ్చుటంజేసి విజయంబు కరగతంబనియుఁ బెద్దయు నమ్మి యున్నవాఁడు. వెండియు నీవు సంధికి వత్తు వని విన్నంతన తానుఁ దనకుఁ దగి నతులువ లగుకర్ణాదులుం గూడి మంతనంబుండి యెల్లవిధములం బాండవులకుఁ బాలిక యసంబద్ధములు చేయుదుమనియుఁ దారే నిష్కంటకంబుగా నీపుడమి యెల్ల నేలుదుమనియుఁ దనలో నిశ్చయించుకొనియున్నవాఁడు. కావున నమ్మూ ఢుఁడు నీమాటమెయి నడువమి సిద్ధ మింతియకాక చెవి యొగ్గియైన నాలకింపఁడు మఱి చెవిటివానికి వినిపించుపాటచాడ్పున నీమాటలన్నియును నన్నీచునకు వినిపిం

చియు నిరర్థకంబులే యగు. హితాహితములను సూక్తదురుక్తములను వివేకపూర్వకంబుగ నరయనినీచునెద్ద నూరెత్తకుండుటయే ప్రాజ్ఞునకు మానకరంబు. నిర్మర్యాదులయినయామూఢులనడుమ నీవు కార్యముఁ బ్రసంగింతువేని యది మాలలనడుమ బ్రాహ్మణసూక్తి యెట్టులట్టుల జుగుప్సావమానకరం బగు. అది నా కొప్పదు. ఆదుర్బుద్ధులసంబద్ధముగాఁ బల్కుచుండ నందుల కెల్ల వంక లొత్తి ప్రతివచనం బులిచ్చుట యంతకంటె నొప్పదు. పెద్దలఁ గొలువమియు రాజ్యగర్వంబును వయోమదంబును సహజక్రోధంబునుం గారణంబులుగా వాఁడు భవదీయహితవచనం బాదరింపఁడు. మఱి పలు దెఱంగుల శంకించు. కామక్రోధాదిసకలదోషదూషితచిత్తులయెడఁ గావించినహితోపదేశంబు విఫలంబుగాక యెన్నఁడైనను ఫలవంతంబు గానేర్చునే? దుర్యోధనుఁడుఁ దన్మంత్రులు నవివేకులు గావున శాంతి యొల్లరు. దురభిమానగ్రస్తులుగావున నాత్మపరబలవివేచనంబుఁ జేయరు. పండితమ్మన్యులు గావునఁ బెద్దలు గఱపుహితముఁ బరిశీలింపరు. మఱియు దిగ్విజయసమయంబునఁ బెక్కండ్రు పృథివీపతులు పాండవులకును నీకును వెఱచి యరిగాపు లయిన కతన వారెల్ల నిపు డాకోపమునం జేసి ధార్తరాష్ట్రులకుఁ దోడై కర్ణునితో నెక్కటిగ నుండి యతనితోడఁ జత్తుము గెలుతు మింతియకాని యొండు లేదని కృతనిశ్చయులై యున్నవారు. ఈకూడినరాజలోకంబునకెల్లఁ గాలంబు దీఱెంగా బోలు. ఏమి చేయవచ్చు? శత్రువులందఱు గూర్చుండ నీవు వారినట్టనడుమ నెట్లు గూర్చుండుదువొ యెట్లు మెలఁగుదువొగాని నాకుఁజూడ నది పోలదు. నేర్పెల్ల నేర్పడఁ జూపవలయు. భవదీయబుద్ధిప్రభావపౌరుషముల సాకల్యముగా నే నెఱుంగుదు. దేవతలైనను నిను నిగ్రహింపఁజాలరు. అయినను నీపయిం గలభక్తిసౌహార్దబహుమానములఁబట్టియుఁ బాండవులపైఁ బ్రేమమునం జేసియు నింత చెప్పితి. నాకు నీయెడఁ గలప్రేమతాత్పర్యంబు ప్రాణిజాలమునకెల్ల నంతరాత్మ యగునీకు సువిదితంబ కావున నేఁ జెప్పవలయునే యని విదురుఁడు నిజాభిప్రాయంబుఁ దేటపడం జెప్పిన విని భగవంతుఁ డిట్లనియె.

సుహృద్వరేణ్యా, నీవు ప్రజ్ఞానఘనుఁడవు గావున యుక్తియుక్తముగఁ జెప్పితివి. నీయట్టిసుహృదుఁడు నాయట్టివానికిఁ జెప్పఁ దగినవిధం బిదియకదా. తల్లిదండ్రులయట్లు హితము బోధించితివి. నీచెప్పినదెల్ల నిక్కువంబు. ఐనను నా రాకకుఁ గారణంబు గలదు. దానిం జెప్పెద నవహితుండవై వినుము. దుర్యోధనుదౌర్జన్యంబును బెక్కండ్రు పృథివీపతులు మాపై ద్వేషమున నతనికిఁ దోడగుటయు ను నే నెఱుంగుదు. ఎఱింగియే యిటకు వచ్చితి. ఎందుల కంటేని భూమియెల్ల గజవాజిరథపదాతిభటవర్గసహితంబుగా నొక్కతేప ఘోరమృత్యుముఖమునఁ బడుచున్నపు డది తప్పఁగఁ బ్రయత్నంబు కర్తవ్యంబు. కార్యమయినం

గాకున్నను బ్రయత్నాచరణంబు మహాపుణ్యప్రదం బని ధర్మవిదులు పలుకుదురు. కావున నేను ననేకులకుఁ గర్ణదుర్యోధననిమిత్తమున మూడినచావు దప్పింపఁ దలఁచి వంచన విడిచి వీరికి వారికిని సంధి యగుతెఱంగుగా ధర్మార్థసహితంబుగఁ జాలినంతయత్నము చేయుదు. సంధి కానేర దండువేని యది యగుం గా దది యట్లుండె. మనయత్నమున నించుకేనియు లోపము గూడ దని నామతంబు. చుట్టములలో నొకళ్లొకళ్లకుఁ బగ పొసఁగినపుడు సర్వవిధముల వారికి హితముఁ దెల్పి యంతఁ గార్యము దీఱదేని తల తల పట్టికొని పోరాడియైన నకార్యంబు మాను తెఱంగుగా శాంతి గావించుటయే యయ్యిరుదెఱంగులవారికిం గూర్చుబంధువులకుఁ బ్రధానధర్మంబు. దానంజేసి పాండవులు ధార్తరాష్ట్రులును నాకొక్క రూప కాన వారిలోఁ బరస్పరవైరము పొసంగి నానాఁటం బెంపెసంగి తుది మొదలు తెగు నంతటిదశ యవ్వైరంబునఁ గానున్నయీసమయంబున నడ్డపడి శక్తికొలఁది వారించియు వాదించియు హితంబుఁ దెల్పెద. నా తెల్పెడుచందమునఁ బ్రవర్తింతురేని యాధార్తరాష్ట్రులు తమఁకు బాండవులకును సకలక్షత్రియులకును లోకమునకెల్లను మే లొనర్చినవా రగుదురు. దాన నాకుం బుణ్యం బగణ్యంబుగా సమకూఱు. అవ్విధంబు గాక వంచన విడిచి నిష్కలంకబుద్ధితో హితము బోధించుచున్ననన్నుఁ బాండవులవాఁ డనిశంకించి నామాటల నొల్లక దురుక్తు లాడునేని పిదప వానిగతి దైవంబ యెఱుంగు. అప్పటికిఁ జేయఁ గలయంతయుం జేసి యుపరమించుటంజేసి నాకు మనఃప్రీతి యగు. ఆనృణ్యంబునుం బొందుదు. ఇట్టిసమయంబున మధ్యస్థత్వంబుఁ బూనకుండుట నాకు ధర్మంబు గాదు. మఱియు నజ్ఞు లగుజను లందఱు పాండవధార్తరాష్ట్రులు పెద్దపోరాట పెట్టికొనినప్పుడు కృష్ణుఁడు వచ్చి వారింపక యుపేక్షించె నతండు సంధి చేసినం బొసఁగదయ్యెనా యని పలుదెఱంగులఁ బలుకుచు నన్ను నిందింతురు. ధార్తరాష్ట్రులు నామాట వినరేని మఱి యేది లేకుండినను లోకాపవాదంబు నాకుఁ దప్పఁగదా. ఇది కారణంబుగ నే నిటకు వచ్చితి. ఇఁకనీవచించువిధమునఁ జేయుదు. దుష్టకష్టాత్ము లయిన వారినట్టనడుమఁ గూర్చుండి తన్మతమునకుఁ బ్రతికూలముగా వాక్రుచ్చిన నా కేమి గీడు మూఁడునో యనువెఱపుడుగుము. ఏను నిక్కం బలిగితినేని వారెల్ల సింహముఁ జూచినక్షుద్రమృగములట్టుల పాఱుదురుగాని నా ముందఱ నిలువ నోపుదురే యని వనజనాభుండు వివరించిన విని విదురుఁడు మహానుభావా, యిది లెస్స యిట్టుల చేయఁ దగు ననిపలికి యారాత్రి కించిదవశేషంబై గతప్రాయంబుగ నుండుట యరసి సరసిజోదరా, యిఁకసుఖనిద్ర సేయఁ దగు. ఇంకను నాయునికి దేవరకూర్కు నడ్డ మగు వీడ్కొనియెద నని వి

న్నవించి తదనుజ్ఞాతుండై నిజశయనమందిరమున కరిగె. దామోదరుఁడు నప్పా న్పుపైఁ బవ్వళించి సుఖనిద్ర సేసె.

అవ్విధమున నారాత్రి గతప్రాయ మగుటయుఁ బ్రభాతంబున శంఖదుందుభిప్రముఖమంగళవాద్య నిర్ఘోషంబునను వందిమాగధసందోహస్తుతి పాఠరవమునను గృష్ణుండు మేల్కాంచి కల్యకరణీయములం దీర్చి జపహోమసూర్యోపస్థానములఁ గావించి బ్రాహ్మణోత్తములకు గోహిరణ్యవస్త్రాదుల నొసంగి పూజించుచుండె. అట్టియెడ దుర్యోధనుఁడు గాంధారరాజసమన్వితుండై వచ్చి గోవిందా, కురువర్యుండు భీష్మద్రోణప్రముఖులతోడఁ గొలువుదీఱియున్నవాఁడు. వారందఱు సురలు సురేంద్రుంబోలె ని న్నెదురుచూచుచున్నవార లని తెల్పిన విని వారల మధురవచనముల నాదరించి యిదె నేను వచ్చెద ననుచుండ సమయజ్ఞుండై నదారుకుండు రథోత్తమముతోడ మ్రోలఁ బొడగట్టి మ్రొక్కుటయుఁ గమలనాభుండు కౌస్తుభాద్యలంకారముల ధరియించి పరమశ్రీసముల్లసితుండై యగ్నిహోత్రునకును బ్రాహ్మణులకుం బ్రదక్షిణనమస్కారము లాచరించి యదుకురువీరు లనేకులు పరివేష్టించిరాఁగ గరుడధ్వజవిరాజితంబు సర్వరత్నవిభూషితంబు కింకిణీగుణసమంచితంబు మేఘగంభీరనేమినిస్వనంబు నగు నయ్యుత్తమస్యందనం బారోహించె. సర్వధర్మవిదుం డైనవిదురుం డద్దేవదేవు పిఱుందిదెస నత్తమిల్లి యత్తేరిపైఁ గూర్చుండె. శకుని దుర్యోధను లిద్దఱు నొక్క తేరును సాత్యకికృతవర్మ లిద్దఱు నొక్కతేఱును నెక్కి యక్కమలోదరు తేరు వెంబడించిరి. తక్కటియాదవులు పెక్కండ్రు దమకుఁదమకుఁ బోలినభంగి గజవాజిరథముల నారోహించి దాశార్హుతోడం జనిరి. విచిత్రవేషు లగుభటులు బహుసహస్రసంఖ్యాకులు ప్రాసకుంతఖడ్గాది వివిధాయుధధారులై నారాయణుతేరిముందఱ నడిచిరి. ఏనూఱురథము లన్ని యేనుంగులు పెక్కుగుఱ్ఱములును దామోదరు నరదముఁ బరివేష్టించె. అట్టిసందడి నెగసినపరాగంబు గజమదజలార్ద్రంబై రాజమార్గంబునకు సొంపు సంపాదించె. మఱియు శంఖదుందుభిమృదంగాదిశుభ వాద్యములు మ్రోల మ్రోసె. ఛత్రచామరాదిరాజోపచారంబులు సెలంగె. ఇవ్విధమున నుత్సవోత్తరంబుగ నంబుజోదరుండు తఱలుటయు బాలవృద్ధతరుణీసమన్వితంబుగాఁ బౌరజానపదు లందఱుం జంద్రశాలాంతరంబులను సౌధవాతాయనంబులను గృహబహిర్వితర్దికాతలంబులను రాజమార్గంబులనుం జేరి కన్నులార నమ్మహానుభావుం గనుంగొనుచు నొకళ్లొకళ్లతోఁ దదీయభవ్యచరిత్రంబులఁ జెప్పుచుఁ దోఁచినకైల్లఁ బ్రస్తుతింప నమ్మధురాలాపంబుల నాలించుచు వారినెల్ల సాదరార్ద్రంబుగఁ గటాక్షించుచుఁ బుండరీకాక్షుండు మందగమనంబున నగరు సొత్తేరి కక్ష్యాంతరములఁ గడచి యాస్థానంబుఁ దరియ నరిగి వేణుపణవభేరీప్రము

ఖనిఖిలవాదిత్రనినదంబు దిగంతరదంతురంబై కురునృపాలసభాసదులకు నిజాగమనాభిజ్ఞానం బగుటంజేసి పరమానందసందాయకంబై యెసంగఁ గైలాసశిఖరసన్నిభం బైనరథోత్తమంబవతరించె. అవ్విధమున నారాయణుండు సభాద్వారంబునఁ దేరు డిగ్గి విదురసాత్యకు లిరువుఁగు నిరుగెలంకులఁ గైదండ లొసంగఁ గర్ణదుర్యోధనులు సందడిఁ దొలంగఁ జేయుచు ముందఱ నడువఁ గృతవర్మాదియాదవులు పిఱుందు దెసఁ బరివేష్టించిరాఁగ నమిత తేజోవిలసితంబై మహేంద్రునాస్థానంబునుంబోలె నొప్పుచున్న యాస్థానమంటపంబుఁ జేరె. అప్పు డక్కొలువువారలెల్ల రవిముందటినక్షత్రంబులట్ల పరఁగిరి. అంతకుమున్న ధృతరాష్ట్రుండు సపరివారంబుగఁ బ్రత్యుత్థితుండై భీష్మద్రోణులు పాదివిపట్టిరాఁగఁ గొన్నియడుగు లెదురువచ్చి యచ్యుతుం దోడ్కొనిచని కనకమయసింహాసనమునం గూర్చుండఁ బెట్టి వివిధపూజార్హుం డైనయద్దాశార్హుం బూజించె. దామోదరుండును దరహాసంబు నెమ్మొగంబునం దళుకొత్త ధృతరాష్ట్రభీష్మబాహ్లికాదు లగుకురువృద్ధులను ద్రోణకృపాదు లగుమాన్యజనులను దక్కటిరాజలోకంబునుం గలయం గనుంగొని సముచితప్రకారంబుగ సరససల్లాపంబున నెల్లవారియుల్లంబులు పల్లవింపఁ జేయుచుండ నచ్చట నంతరిక్షంబున నారదాదిమునీంద్రులు పొడగట్టిరి. పొడగట్టుటయుఁ దటాలున లేచి వాసుదేవుండు శాంతనవుం బిలిచి చూచితే యిమ్మహామునుల. వీర లీరాజలోకంబుఁ గనుంగొన విచ్చేసినవారు. వేగంబ యాసనార్ఘ్యపాద్యాదివివిధోపచారముల సత్కరింపం బంపుము. వీరలు కూర్చుండకయమున్న యొక్కరికిం గూర్చుండఁ దగ దనిన విని యయ్యన్దీనందనుండు ససంభ్రమంబుగ ననేకమణిమయాసనంబులఁ దెప్పించి యమ్మునీంద్రుల నందు సుఖాసీనులం గావించి యర్ఘ్యపాద్యాదినానావిధానంబులఁ బూజించుటయుఁ గృష్ణుండు నిజాసనంబున నాసీనుం డయ్యె. అందఱుం దమతమపీఠంబులం గూర్చుండిరి. దుశ్శాసనుఁడు వివింశతియుఁ దెచ్చి యుంచినమణిమయాసనంబుల సాత్యకికృతవర్మ లుపవిష్టు లైరి. కృష్ణునిచెంగట నేకాసనంబునఁ గర్ణదుర్యోధను లుపవేశించిరి. గాంధారరాజు నిజపుత్రమిత్రగణంబులతో నొక్కవలనం గూర్చుండె. విదురుఁడు కృష్ణునిమణిమయాసనంబు వెనుకటిదెస నద్దానిం జేత నంటుచు నలంతిపీఁటమీఁదం గూర్చుండె. ఇవ్విధంబున నయ్యాస్థానమంటపంబున నతసీపుష్పసన్నిభం బయినదివ్యమూర్తిపయిం బీతాంబరంబుఁ దాల్చినపుండరీకాక్షుండు కుందనంబునం బొదివినయింద్రనీలంబుచందంబునం దేజరిల్లుచుండ నక్కొలువువార లమృతాస్వాదనంబునుంబోనియద్దేవదేవుభవ్యమూర్తిసందర్శనంబుఁ దనుపారఁగావించుచు నేమియుంబలుకక తద్గతచేతస్కు లై యుండిరి.

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట.

అయ్యవసరంబున సరసిజోదరుండు దరహాసనముల్లసితదంతకాంతు లంత టంబర్వఁగ వేసవితుదిం బొదలునంబుదంబుచందంబున గంభీరనిస్వనంబు సెలంగ ధృతరాష్ట్రున కిట్లనియె. మహారాజా, కౌరవులు పాండవులును నెక్కటియై శాంతి బొంది మను తెఱంగు నెఱవేర్ప నిన్నుం బ్రార్థింప వచ్చితి. సర్వ మెఱింగిననీకు నింతకంటె మే లొండు గల దనివచింపం బని లేదు. సర్వక్షత్రియకులంబులందు నీభరతకులం బుత్తమంబు. భారతులకు దయ, యద్రోహము, పశ్చాత్తాపము, ఋజుత్వము, సత్యము, శీలము, నిఖిలశాస్త్రార్థజ్ఞానమును సహజంబు లని యెల్ల వారికిం దెల్లంబు. విశేషించి యిట్టియుత్తమకులంబునం బొడమి కడుఁ బొగడికెఁ గన్ననీవలనఁ గులంబునకుఁ జేటు వాటిల్లు ననుమాట నాకుం జూడఁ బోలదు. బాహ్యాభ్యంతరముల మిథ్యాప్రచారు లైనకౌరవులనెల్ల నీవు శాసింతువఁట. దుర్యోధనాదు లగునీకొడుకులు ధర్మార్థంబుల వెనుకం ద్రోచి క్రూరకృత్యంబు లకుఁ బాల్పడి శిష్టచరిత్రం బనుమాట యింతయు లేక మర్యాదలను దిగవిడిచి లోభాపహృతచేతస్కు లై తమకుం గూర్చుబాంధవులయెడఁ జెడు దలంచుచున్న వారు. దీన నెంత మే లగునో నీవ పరికింపుము. నీకొడుకులదుర్నయం బిపుడు కౌరవులకుఁ ద్రోవరానికీడుగ మూఁడియున్నయది. ఇఁక నించుక యొప్పరికింతు వేని దీనఁ బుడమికెల్లఁ జేటు వాటిల్లు. ఈయిరుదెఱంగులవారికిఁ దెఱంగునేత యిపుడు నీతలన నిలిచె. నీవించుక కోరుదువేని యది నెఱవేఱు. నీ వందులకుఁ బూనెదవేని నేనుం జేయుదు. నాపయిం గొంత నిలిచియున్నయది. మన కిద్ద ఱికి నిపు డూరకుండఁ జనదు. నీవు కొడుకుల నెడంబఱుపుము. నేనుం బాండ వుల నియ్యకొల్పెద. ఏను నిమిత్తమాత్రంబకాని యంతయు నీవలనన తీఱు. నీకొడుకులందఱును వారివారును నీయానతిం దలఁ దాల్పవలసినవారలకదా. నీశా సనముమెయి హితంబు గ్రహింతురేని నీకొడుకులక కాదు పాండవులకును, నీకును, నాకును, లోకమునకును మేల యగు. పొం దొనర్చితివేని యందఱు విధే యులై నీకుఁ దోడ్పడుదురు. ధర్మార్థంబులందుఁ జక్కనిలువుము. పాండవులట్టిమహా త్ములు ప్రయత్నంబుననై ననుం దొరకుట యరిది. పాండవులప్రోపుఁ బడసిననిన్ను దేవగణపరివృతుం డై నదేవేంద్రుఁడుం జెనకనేరఁడు. పెఱరాజులం జెప్ప నేల? భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణవికర్ణబాహ్లీకసోమదత్తసైంధవప్రముఖు లైనయిచ టిశూరులను యుధిష్ఠిరభీమసేనసవ్యసాచి నకులసహదేవసాత్యకిధృష్టద్యుమ్నధృష్ట కేతుప్రముఖు లగునచటివీరులనుం బోర మార్కొని యెవ్వఁడైనం దప్పించికొని పోనేర్చునే? వీరు వారుం గలసి నీవారై నీయైశ్వర్యంబునకుఁ బెంపు సంపాదించు చుండ నెంత యొప్పునో? మఱియు ననికిఁ దోడ్పడ వచ్చినసకలరాజులు నాలంబు

చాలించి పుత్రపౌత్రపితృభ్రాతృసమన్వితులై పరమానందలహరిం దేలుచుఁ దమతమవీళ్ల కరిగి సుఖమున్న నదియు నెంత యొప్పునో? అదియునుంగాక పాండవులు నీవారలగుదురేని యింకను శత్రురాజుల జయించి తదీయరాజ్యముల నీ కొనంగుదురు. సంధియు నీ కధికరాజ్యలాభకారణంబ యగు. సంగ్రామంబున నిరువాగులం బెక్కండ్రు మడియుదురు. దాన నీ కొడఁగూడుధర్మం బెయ్యది? మఱియు నీవారొండెఁ బాండవులొండె నిహతులైనం గలుగుసుఖం బెయ్యది? దానిం జెప్పుము. ఈయాపదవలన నిరుదెగలవారికిని రక్షణం బవశ్యకర్తవ్యంబు. దానిం జేయుము. శూరులు కృతాస్త్రులు సమరకాంక్షులు నగు రెండుపక్షంబుల వారు సుఖముండిన మేలని నామతంబు. ఇచ్చటఁ గూడినరాజలోకంబు చివ్వకు సమకట్టి నడిచెనేని బహుప్రజాక్షయంబు తప్పదు. అందులకెల్ల గారణంబు నీవ యగుదువు. నీవు మేలుతలంపు తలంచి కోపంబు దిగవిడిచి శాంతచిత్తుండవై వచ్చినరాజులనెల్లఁ బిలిపించి దివ్యాంబరాభరణాదుల సత్కరించి యందఱుం గూడి వైరంబుఁ బరిహరించి సహభోజనపానాదుల సంతుష్టు లగునట్లుగు సేసి వీడుకోలిచ్చిపుచ్చుము. పాండవులగుణంబులు నీకు నేఁ జెప్పవలయునే? వారు శుద్ధచిత్తు, లుదారులు, హ్రీమంతు, లార్యులు, పుణ్యజన్ములు, పరస్పరసచివులు. వారి కీభయంబుఁ దప్పించుట నీకు ముఖ్యకృత్యంబు. చిన్ననాఁడే వారికిఁ బితృవియోగం బగుటయు నీవే పెంచి పెద్దవారలఁ జేసి ప్రోచితివిగదా. ఆప్రీతియెల్ల నీముదిమి తఱి నెట్లు పోయె? దానిందలపోసి పొందొనర్పుము. వారు నీయెడఁ బితృభక్తి నున్న వార కావున నీవును వారియెడఁ బుత్రవాత్సల్యంబు నెఱపి ప్రోవుము. ఇట్టిసంకటసమయంబులంగదా విశేషించి రక్షణంబు కర్తవ్యంబు? ఇవు డొక్కించుక యొప్పరికించినం గార్యంబునకుఁ జేటు వాటిల్లుటయకాక ధర్మంబునుం దప్పు. పాండుపుత్రులు నీ కభివాదనముల నివేదించి భవచ్చిత్తప్రసాదం బెఱింగి తెలుపుమని నాలోఁ జెప్పినమాటలు గలవు. సంప్రీతిమెయి నాకర్ణింపుము. నీశాసనమున సమయప్రకారంబున సర్వము నడుపఁగ నీవుగలవనునిశ్చయముతో నెన్ని యేఁబాట్లుపడుచుఁ బండ్రెండేండ్లు వనవాసంబు నొక్కయేఁడజ్ఞాతవాసంబునుం గడపితిమి. మాచేసినసమయానుష్ఠానంబునకు బ్రాహ్మణులు సాక్షులు. సమయస్థితు లగుమాకు మారాజ్య మిచ్చి నీవు నిజసమయంబుఁ దప్పక నడువుము. ధర్మార్థములఁ బరికించి మమ్ముఁ బ్రోవఁగ నీవ యర్హుండవు. నీమీఁదిగౌరవమునంజేసి యలజడిపాట్లెన్ని వచ్చినను సైరణ చేసితిమి. నీవ మాకుఁ దల్లివి తండ్రివి గురువు ననుభావమున నున్నవారము. మావలనం దప్పెయ్యదియేనిం గల్గెనేని యిది తగ దిది తగు నిట్లు నడవుఁ డనిబోధించిన నవ్విధంబున నడువ నున్నవారము. మమ్ము మంచితెరువునం బొమ్మని కఱపి నీవును సత్పథంబునం బ్రవర్తింపు

మని నీకుఁ దెల్పు మనిరి. మఱియు ధర్మాధర్మప్రసంగంబునం దధర్మము ధర్మమును నసత్యము సత్యమునుం బాధించునట్టితెఱంగు పొసంగెనేని యప్పుడు సభ్యులు మోమోటదక్కి ధర్మసత్యముల స్థాపింపవలయు. అట్లుగాక మిన్నకుందురేని గట్టునెరసికొని పెరిగినప్రవాహంబె ట్లట్లు ధర్మము వారలఁ గూల్చుట తప్పదు. కావున సభ్యులకు ధర్మప్రతిష్ఠాపనం బవశ్యకర్తవ్యం బని యీ సభాసదులకెల్లఁ దెల్పు మనిరి. ఇందుల కెవ్వరి కెయ్యది దోఁచు దానిం జెప్పుఁడని యందఱఁ గలయం గనుంగొని పలికి యట ధృతరాష్ట్రుదెస మొగంబై యోజనేశ్వరా, ధర్మార్థనిశ్చయపురస్సరంబుగా నానిరూపించినది సత్యం బనితోఁచునేని మృత్యువాతఁ బడకమున్న యీపృథివీపతులఁ దప్పింపుము. శాంతిఁ బొందుము. కోపంబు మానుము. పాండవులకు వారితండ్రిపాలు సముచితప్రకారంబున నిచ్చి నీవు కొడుకులతోడ నెల్లభోగముల ననుభవింపుము. అజాతశత్రుండు నీయెడను నీకొడుకులయెడను నేతాత్పర్యమున నుండునదియు నీవ యెఱుంగుదు కదా. నీ వతనియెడ నందులకు విరుద్ధముగనే వర్తింతువు. లక్కయింటఁ జొనిపి కాల్పఁ బంచితివి. దేశముల వెడల నడిచితివి. అవియెల్ల నతండు మనస్సునఁ బెట్టక నీయెడ భక్తిభావంబుతో నింద్రప్రస్థమున రాజ్య మేలుచు దిగ్విజయమున సకలరాజులను వశవర్తులం జేసి నీకే పెంపుఁ గావించి నీమాటమెయి నడుచుచుండె. నిజరాజ్య మేలుచున్నయతనివిభవముఁ జూచి యోర్వలేక నీకొడుకు దుర్మంత్రపరుండై శకునికైతవమున ధనధాన్యరత్నరాసులనుఁ బుడమిని నాఁచికొనుచుండ నందుల కియ్యకొంటివి. అదియునుంగాక పాంచాలిని రచ్చకుఁ దెచ్చి నీకొడుకులు భంగపఱిచిన నదియును నీముందఱన సాగె. ఇంక నే మనవచ్చును? ఎన్ని వచ్చి మీఁదఁ బడినను యుధిష్ఠిరుఁ డప్రమేయమహిముఁడు గావున నిజధర్మ మించుకేనియుఁ దప్పఁడయ్యె. అదియెల్ల నట్లుండె. ఇపుడు నీకును నీకొడుకులకును వారికిని మేలు గోరి యేను వచ్చితి. ఇంతటనైనం దెలిసి యర్థానర్థముల నరసి ధర్మార్థసౌఖ్యములకుఁ గొఱఁత లేకుండఁగను ప్రజాక్షయంబు గాకుండఁగనుం దెఱంగుఁ జేయుము. అత్యంతలోభప్రవర్తను లగుపుత్రుల నిగ్రహింపుము. పెక్కు లేల? పాండవులు నీవు శాంతిఁ గావింతువేని తొల్లింటిచందమున నిన్నుఁ గొలుచుచు నిజధనమున సుఖింతుమనియు నట్లుగాక నీవారు కయ్యము నకే కాలుద్రవ్వుచు వచ్చిరేని దానిం జేయుదుమనియు నున్నవారు. ఇందు నీ కెయ్యది పథ్యం బనితోఁచు దాని నాచరింపు మని వాసుదేవుఁడు ధృతరాష్ట్రునకుఁ గార్యనిర్ణయంబు లెస్స నిరూపించి చెప్పిన విని సభాసదు లందఱు నౌరా నారాయణువచనోపన్యాసచమత్కారం బింత యొప్పునే యని తమలో మెచ్చుచు నెద్దియుం బలుక నేరక పులకలెత్తినమేనులు గ్రాల మిన్నకుండిరి.

## జామదగ్న్యముని దుర్యోధనునకు హితముఁ జెప్పుట.

అవ్విధమున నాకొలువువారెల్ల నూరకుండుటయు జామదగ్న్యమునీంద్రుఁడు దుర్యోధనుం జూచి యయ్యా, నే నిందుల కొకదృష్టాంతంబుఁ జెప్పెద. విని లెస్స యనితోఁచునేని గ్రహించి శ్రేయము గను మనియిట్లనియె. తొల్లి దంభోద్భవుఁ డనురాజు సార్వభౌముఁడై పుడమి నేలుచుండి ప్రతిదినంబును బ్రాతఃకాలంబున బ్రాహ్మణక్షత్రియులం బిలిచి యుద్ధమున నాకంటె నధికుఁడుగాని సమానుఁడుగాని చాతుర్వర్ణ్యమున నెవ్వఁడేని శస్త్రధరుండు గలఁడేని చెప్పుఁ డని యడుగుచుఁ బెక్కుదేశములఁ దిరిగి మెచ్చుటనుం దనకు సమానునిఁ గానక మదించి మఱియుం బలుమాఱు లందఱ నడుగుచుండ నొకనాఁడు తపోనిష్ఠాగరిష్ఠులు భయరహితులు నగుబ్రాహ్మణు లయ్యా, యిట్లు మదింపరా దని పలుదెఱంగుల వారించి చెప్పియు నప్పటికి నతండు వదలక మఱియు నడుగుటయుం గోపించి వారోరీ క్షత్రియా, నరనారాయణు లనుమునులు గంధమాదనపర్వతమునందు ఘోరతపంబు సేయుచున్న వారు. వారికి నీవు సమానుఁడుగావు. వారితోఁడఁ బోరాడిన నీ వోడుట నిక్కం బనివచించిరి. ఆమాట విని యారాజు తనకంటే నధికులు గలిమి కలుగుచు వివిధసైన్యసమేతుండై యాగంధమాదనమున కరిగి శీతవాతాతపకర్శితులై బీదనరాలఁగప్పినమేనుల నొప్పినయమ్మునీంద్రుల నిత్యతపోనిరతులంగాంచి డాయం జని నమస్కరించి కుశలప్రశ్నంబు నడపుటయు వారలతిథియైవచ్చినయారాజు నాసనోదకఫలమూలాదివిధుల సత్కరించి యయ్యా, నీవచ్చినపని యెయ్యది యనియడుగ నతండు దనవచ్చినప్రయోజనంబు నివేదించె. నివేదించుటయు నన్నరనారాయణు లోరాజసత్తమా, క్రోధలోభాదిరహితంబయినయీయాశ్రమమునఁ బోరు సేయఁ దగదు. శస్త్రసంగ్రహంబే యిట ననుచితంబు కుటిలప్రచారం బిచట సాగదు. కావున నీవు పుడమిం గలవీరక్షత్రియులయొద్దకుఁ బోయి యుద్ధముఁ గోరి నీకోర్కి నీడేర్చికొమ్మని సాంత్వవచనముల నెంత చెప్పి వారించినను నయ్యుద్ధకాముకుఁడు వారిమాటల గీటునంబుచ్చుచుఁ బలుమాఱులు గయ్యమునకుఁ గాలుద్రవ్వుచున్నం జూచి నవ్వుచు నరుండు దర్భముష్టిఁ జేతఁ గొని యాదంభోద్భవుం బిలిచి మాతోడ యుద్ధము కర్తవ్యంబయ నుదృఢనిశ్చయంబు గలదేని రమ్ము. సైన్యంబు సమకట్టి సకలాస్త్రములం గొని నడుపుము. ఇదె నేను నీమదం బడఁగించి యీకమీఁద బవరంబుపయిఁ గోర్కి మాన్పెద ననిపలుకుటయు వాఁడు పోరికిఁ గట్టాయితంబై వచ్చి యమ్మునిపై శరవర్షంబుఁ గురియించె. నరుఁడు తనచేతిపూరిని దివ్యాస్త్రసమ్మంత్రణపూర్వకంబుగఁ బ్రయోగించిన నయ్యస్త్రము తదీయశరజాలంబు మాయించి సైనికులకన్నులఁ బొడిచియు ముక్కులఁ గోసియుఁ జెవులఁ దఱిగియు బహుప్రకారంబులఁ జీకాకు

పఱచి మెచ్చుటఁ జూచిన నిషీకాపుంజముగా గగనమండలం బావరించె. అంత నాదంభోద్భవుం డెద్దియుం దోఁపక విభ్రాంతచిత్తుఁడై నరునిచరణంబులపయిం బడి మునీంద్రా, నీశరణు సొచ్చితి నన్ను రక్షింపవే యనిప్రార్థించె. తత్ప్రార్థనం బాలించి శరణత్రాణతత్పరుం డై నయమ్మునివరుండు వానిపయిం గరుణించి యయ్యా, యిఁకనైనను లోభమదాహంకారాదుల మాని యెవ్వరినేనియు నధిక్షేపింపక శాంతిదాంతిమార్దవసౌమ్యతావిశిష్టుండవై ప్రజల నేలుము. శుభం బయ్యెడి. బలాబలముల నెఱుంగక యింకెప్పడైన నేరినేనియు మార్కొనకుము. పురమునకుఁ బొమ్ము. మావచనంబుగా నచ్చటిబ్రాహ్మణులకుశలం బడుగు మనివచించుటయు నతం డమ్మహాత్ములకుఁ బాదప్రణామంబుఁ గావించి యనుజ్ఞాతుండై నిజపురముఁ జేరి ధర్మము దప్పక రాజ్య మేలుచుండె. నరునిసామర్థ్య మెఱిఁగితివిగదా. అంతకంటె నారాయణుశక్తి పెక్కుమడుంగు లెక్కుడు. ఆనరుఁడే యిపుడర్జునుఁడు. అన్నారాయణుఁడే యీవాసుదేవుఁడు. నిమిత్తవశమున నిట్లవతరించిరి. సర్వసాధనంబులుం గాండివమున కనదు లనినిశ్చయింపుము. అర్జునుండు దుర్జయుండు. అవ్వీరవర్యునకు నారాయణుఁడుం దోడై వచ్చునేని యిఁకఁ జెప్ప నేల? పాండవులపాలు వారి కిచ్చి సుఖమున మనుము. కామక్రోధాదులం దవులవలదు. కామక్రోధలోభమోహమదమానమత్సరాహంకారము లనునెనిమిదియుం గాకుదీకశుకనాకాక్షిసంతర్జనసంతానన ర్తకఘోరాస్యమోరకనామకంబులయిననిశితసాధనంబులై తమ్ముఁ దవిలినవారికి మృతిఁ గావింప నోపు. మఱియు నయ్యెనిమిదింటిచేఁ గుడువడసినవా రున్మాద, చేతనాభ్రంశ, స్వాప, ప్లవన, వమన, మూత్రణ, రోదన, హాసము లనునెనిమిదింటిం బొందుదురు. కావున నీవు కామక్రోధాద్యష్టకంబు విడచి నరనారాయణుల నాశ్రయించి బ్రదుకుము. శంకలు మాని నామాట గ్రహింతువేని యార్యవృత్తము నవలంబించి శాంతిఁ గొని పాండవులతోడఁ గలిసి సుఖమున మనుము. యుద్ధతాత్పర్యంబు మానుము. క్షత్రియులలోనెల్ల విఖ్యాతం బయినమీకులమునకు నీవలనఁ జేటు వొసంగని తెఱంగు చూచికొను మని పరశురాముఁడు చెప్పినపదంపడి కణ్వముని దుర్యోధనుం జూచి కుమారా, జామదగ్న్యవచనంబు సముచితంబు. సర్వలోకపితామహుం డైన బ్రహ్మ యెట్టు లట్టుల నరనారాయణు లవ్యయులు. ఆదిత్యులలోనెల్ల విష్ణుదేవుఁడొక్కరుఁడే యజయ్యుండు శాశ్వతుం డీశ్వరుండు. పృథివ్యాదు లగుభూతములు సూర్యచంద్రతారాగ్రహగణంబులు నిమిత్తవశమున క్షయోదయములఁ బొందుచుండు. మనుష్యమృగపక్షితిర్యగ్జంతుజాలంబులెల్ల ముహూర్తమాత్రలోన జననమరణములు గాంచుచుండు. రాజు లందఱుం దాముగలయల్పకాలము రాజ్యము లేలి యాయుఃక్షయం బగుడు సుకృతదుష్కృతంబులఁ గుడువ జన్మాంతరము

లెత్తుదురు. ఈయల్పకాలభోగములపొంటె నధర్మంబు సేయరాదు. కావున నీవు నధర్మంబుపొంతఁ బోవక ధర్మశీలుఁడై నధర్మరాజునకు రాజ్యమునం బాలిచ్చి నిజరాజ్య మేలుచు సుఖముండుము. ఏను మిగుల బలవంతుఁడగాయని మదింప వలదు. ఒకరికంటె నొకరు బలియులుగా లోకమున నెందఱో గలరు. ఒకవేళఁ దాను మిగుల బలియుండైనను బలవంతులు పెక్కండ్రు గూడినచోటఁ దనబలము బలముగాఁ దలంపరాదు. పరికించిచూచిన దేవవిక్రము లయినపాండురాజపుత్రులు నీకంటె బలవంతులు. కావున వారితోడిపోరు వలదు. కూడి మనుము. ఇది లెస్స యిందుల కొక్కపురాతనేతిహాసంబు గలదు. దానిం జెప్పెద నాకర్ణింపు మనియిట్లనియె.

### కణ్వముని దుర్యోధనునకు మాతలీయోపాఖ్యానంబుఁ జెప్పుట.

ఇంద్రసారథి యైనమాతలి తనకూఁతునకు గుణకేశియనుదానికి లోకోత్తరగుణరూపసౌభాగ్యయగుదానికిఁ దగినవరుని దేవదానవగంధర్వమనుజములలో నెక్కనిం గానక చింతాక్రాంతుండై కూఁతురుపుట్టినందానిపితృమాతృపతికులంబులకు మూఁటికిని వన్నె గలుగుచోట నీకున్నం బ్రయోజనంబు లే దని విచారించి భార్యయగుసుధర్మతోడ నాలోచించి నాగలోకమున నల్లుని వెదకువాఁడై పోవుచుండ నాకస్మికముగ నారదుఁడు వరుణుఁ గనఁ జను చెదురుపడి మాతలికార్యస్వరూపం బడిగి తెలిసికొని యింద్రసారథీ, మన మిరువురముం బోయి తగినవాని విచారింత మనిచెప్పి యతనిం దోడ్కొని వరుణలోకమున కరిగి యద్దేవుం గనుంగొనుటయు నజ్జలేశ్వరుండు దేవర్షిపూజల నారదుం బూజించి యింద్రునకుఁ దగినపూజల మాతలిని సత్కరించిన నయ్యిరువు రాపూజలం గ్రహించి యతని వీడ్కొని యరుగుచుండ సర్వభూతతత్త్వజ్ఞుండైననారదుఁడు మాతలి కిట్లనియె. చూచితే వరుణస్థానంబు. ఇది యంతయుం గనకమయంబు. ఇందు వరుణపుత్రుండు పుష్కరుఁ డనువాఁడును, సోమపుత్రియు నత్యంతరూపవతియు నగువానిభార్య జ్యోత్స్నాకాళీనామధేయయుఁ, దత్పుత్రులు నున్నవారు. ఇచ్చోటు ప్రాపించి సురలు సురత్వంబుఁ బడసిరి. ఇవి యమరనిర్జితు లగుదైతేయులసర్వాయుధంబు లత్యంతదీప్తిమంతంబులై పరఁగుచున్నవి. ఎల్లప్పుడు నియ్యవి యక్షయంబులై యుండు. ఇందు వివిధప్రహరణపాణు లయినరాక్షసులు పెక్కండ్రు నిలింపనిర్జితులై యున్నవారు. ఇందు వారుణహ్రదంబున నగ్ని వెలుంగుచున్నవాఁడు. ఇయ్యగ్నికుండమునందే విష్ణుచక్రంబు తిరోహితంబై యుండు. ఇందు గాండీవం బనుధనుర్వరంబు గలదు. బ్రహ్మనిర్మితం బైనయీవిల్లు సమయము పొసఁగినపు డెంతటివారినైనను శాసించు. ఇది యొక్కండు శతసహస్రాయుధములకు సరివచ్చు. దీనిని వరుణపుత్రు లొక్కొక్కతఱి ధరింతురు. ఇందు

ఛత్రభవనంబున వరుణఛత్ర మున్నది. ఇది పర్జన్యునట్లు శీతలసలిలముఁ గురియు. ఈయుదకంబు తమోవ్యాప్తంబై యగపడకుండెడి. మఱియు నిందు దర్శనీయంబులు పెక్కులు గలవు. తడవుసేసిన మనకుఁ గార్యోపరోధం బగునని యటఁ దఱలి పాతాళంబునకుఁ జని మాతలీ, యీలోకము నాగలోకమునకు నాభిస్థానము. సకలసలిలపాతమునకుఁ జాలుటం జేసి పాతాళంబనుపేరు గలిగె. జలము సొచ్చి దానితోడ నిచ్చోటఁ జేరినచరాచరజంతువులు భయమునఁ బెల్లఱచుచున్నవి. ఇం దాసురంబను నగ్ని యీనీరు ద్రావుచుండు. ఇందు దేవతలు తాము ద్రావ మిగిలినయమృతముఁ దాఁచి యున్నవారు. ఏతన్నిమిత్తముననే చంద్రునకు వృద్ధిక్షయములు దోఁచుచున్నవి. ఇందుఁ బ్రతిపర్వంబునను హయశిరసుఁ డనునాదిత్యుఁడు నిజవాక్కుల జగంబుఁ బూరించుచు నుత్థితుండగు. ఇందలినీరు గ్రహించి యైరావతము మేఘముల విడువఁగ నది పుడమిపయిం బర్జన్యుఁడువర్షించు. ఇం దనేకతిమితిమింగిలాదులు సోమప్రభ నాస్వాదించి సుఖమున్నవి. ఇచటి జంతుగణంబులు కొన్ని సూర్యకిరణభిన్నంబులై పగలు ప్రమంది రేయగుడుఁ గ్రమ్మఱ బ్రదుకు. ఇందలియమృతంబుఁ జంద్రుఁ డుదయించుచుఁ గొని లోకముననెల్లం జల్లు. ఇం దధర్మనిరతు లయినదానవులు పలువురు నురగపతినిగృహీతులై చెఱ నున్నవారు. ఇందు భూతపతి సర్వలోకవిభూతిపొంటెఁ దపము సేయుచున్నవారు. ఇందు గోవ్రతవంతు లయినవిప్రులు వేదాధ్యయనకర్శితులై యున్నవారు. శయనభోజనాచ్ఛాదనంబులకు స్థలాదినిర్ణయంబుఁ గోరక తత్తత్కాలసముపలబ్ధంబుగాఁ గొనుచుఁ గాలముఁ ద్రోచుట గోవ్రతంబు నాఁబడు. ఇందు సుప్రతీకకులజాతంబు లయిన దిగ్గజము లున్నయవి. ఇం దీజలమున విన్యస్తం బయినయీయండ మధికతేజోవిలసితంబై యున్నయదియకాని సృష్టిమొదలు నేటిదాఁక నించుకేనియుఁ జలింపదు. మఱియు నవియదు. దీనిజననప్రకారం బెవ్వరు చెప్పఁగను నేను విననైతి. ప్రళయంబున నిం దగ్ని వెడలి ముల్లోకముల నీఱు సేయునఁట. అది యట్లుండె. ఈలోకమున నీకూఁతునకుఁ దగినవరుని వెదకఁ దలంతువే యని యడుగ మాతలి వేఱొక్కయెడకుఁ బోవుద మనుటయు నద్దేవముని యటఁ జని మఱియు నిట్లనియె. చూచితే యీపురమును. ఇది హిరణ్యపురము నాఁబరఁగు. దీని విశ్వకర్మయు మయుఁడును నతివిచిత్రముగ నిర్మించిరి. ఇందు బహుళమాయాప్రకారు లగుదైత్యదానవులు పెక్కండ్రున్నవారు. వీరలదిక్పాలురుం గెలువఁ జాలరు. ఇందే కాలఖంజులును నివాతకవచులును సురపతికి నజేయులుగ నున్నవారు. వీరల నిర్జింప వచ్చి నిర్జరేంద్రుఁడు పుత్రసహితంబుగా నోడుట నీ వెఱుంగుదువుగదా. వీరిమణిభవనంబులను రుచిరోపవనంబులనుం గనుంగొనుము. వీరిలో నొక్కని నల్లునింగా వరింపఁ దలంతువే యనిన మాతలి తపోధనాగ్రణీ,

నిర్జరులకుఁ బ్రత్యర్థు లయినవీరితోడివియ్యమునకు నేనొల్ల ననుటయు నారదుం డటఁజని మఱియు నిట్లనియె. ఇయ్యది సుపర్ణలోకంబు. ఇందు గరుత్మంతుని పుత్త్రులు సుముఖుఁడు, సునాముఁడు, సునేత్రుఁడు, సువర్చసుఁడు, సురుచుఁడు, సుబలుఁడు ననునార్వురుం గులకర్తలై వినతావంశమునకుఁ బెంపుఁ జేసిరి. వీరి పుత్త్రపౌత్త్రులు సువర్ణచూడ, నాగాశి, విశాలాక్ష, వామన, వాతవేగ, వాల్మీకి, సారస, చిత్రకేతు, కుముద, కపోత, హరి, సుస్వర, మలయప్రముఖు లనేకులు గలరు. వీరు నిర్దయులై క్షత్త్రియులట్లు క్రౌర్యమున కొడంబడి సర్పములఁ జంపు దురు. జ్ఞాతిద్రోహమునంజేసి వీరికి బ్రాహ్మణ్యం బలవడదు. విష్ణుధ్యానంబే వీరికిఁ బరాయణంబు. వీరిలో నొక్కని జామాతంగా వరింతువే యనియడిగి యతం డం దుల కొల్లమినెఱింగి నారదుఁ డటఁ బోయి మఱియు నతని కిట్లనియె. ఇది సప్తమ లోకం బగురసాతలంబు. అమృతపానమునఁ దనివి సారంబు వెడలఁగ్రక్కుపితా మహువక్త్రమునం బొడమినసురభి యనుగోమాత యిచట షడ్రససారముఁ బిదు కుచుండు. దీనిక్షీరంబుననే క్షీరనిధి యనుమడు వేర్పడి. పరమపవిత్రంబై పరఁగె. ఇప్పాఁడిమీఁదినురుగు ద్రావి ఫేనపు లనంబరఁగుమును లనేకు లుగ్రతపంబు సల్పుచున్నవారు. వారికి సురలును వెఱతురు. దీనికిఁ బొడమినధేనువులు నాలుగు సురూపయు హంసికయు సుభద్రయు సర్వకామదుఘయు ననునవి క్రమంబున నాలుగుదెసలకుం బ్రాపై యుండు. అందు సర్వకామదుఘ యనుదానిపాఁడిఁ బాలకడలిం గలిపి సురాసురులు మందరముచే మథించిన నమృతంబు శ్రీదేవి మున్నగునవియెల్ల నుద్భవించె. ఇచ్చటఁ గలసుఖ మేలోకమందును గానరా దని పురాతనం బయినగాథ గల దనిపలుకుచు నించుక చని సురర్షి వర్యుండు వెండియు నిట్లనియె. ఇది వాసుకిపాలితం బైనభోగవతీపురంబు. ఇది యమరావతింబోలిన యది. ఇందుఁ గైలాసశైలసన్నిభదివ్యాకారుఁడు వివిధాభరణభూషితుండు నగు శేషనాగేంద్రుండు నిజసముజ్జ్వలఫణాసహస్రంబున ధరాతలంబు ధరించుమహాను భావుండు వసించు. ఇందు వాసుకితక్షకకర్కోటకధనంజయకౌరవ్యకాళియైరావ తార్క్ష్యకసుముఖప్రముఖు లయిననాగవర్యులు మణిస్వస్తికచక్రకమండలులక్షణోప లక్షితులు ద్విత్రిపంచసప్తశతపంచశతసహస్రశీర్షులు పెక్కండ్రున్నవారు. వీరిలో నెవ్వనినేనియుఁ గూఁతునకు వరుఁగా వరింతువే యనియడుగ మాతలి మునివ రేణ్యా, కౌరవ్యార్యకులముందఱఁ గూర్చున్నయితం డెవ్వఁడు? వీనితల్లిదండ్రు లెవ్వరు? ఇతం డెవ్వనికులము నుద్ధరించునో? వీనిరూపమును వయస్సును ధై ర్యాదిసద్గుణములనుం జూచిన నితండే గుణకేశినికిఁ దగినవరుఁ డనితోఁచెడి నితని వృత్తాంతంబుఁ జెప్పు మనుటయు నారదుఁడు వీఁడైరావతుఁ డనునాగరాజుకుల మున జనించినవాఁడు. ఆర్యకునిపౌత్త్రుఁడు. చికురునిపుత్త్రుఁడు. వామనునిదౌహి

త్రుఁడు. సుముఖుఁ డనుపేరఁ బరఁగు ననిన విని మాతలి వీనిసంబంధమునకు సంధిఁ గావింపు మనిన నారదుఁ డార్యకున కిట్లనియె. నాగేంద్రా, యితండు దేవేంద్రసారథి మాతలినామధేయుఁడు. మీరు నెఱుంగుదురుగదా. తురంగ సహస్రయోజితం బయినరథోత్తమం బీతండు నడుప నింద్రుఁడు దైత్యదానవుల జయించు. ఇతండు గుణకేశి యనుతనకూఁతు నధికగుణరూపవిలసితయగుదానిని భవత్పౌత్రుఁ డైనసుముఖున కొసఁగఁ దలఁచినవాఁడు. ఈకుమారునకుఁ దండ్రి లేకున్నను నీపయింగలగౌరవమున, నైరావతు మీఁదిబహుమానంబునను, శీలశౌచదమాదిసుగుణవిశిష్టత్వంబునను గన్యాదాన మొనరింపఁ బూనినవాఁడు. నీవు నితనికోర్కి నెఱవేర్ప నర్హుండ వనిన విని యార్యకుఁడు హర్షదైన్యములు పెనంగొనంగ నారదుం జూచి మునీంద్రా, గరుడుఁడు వీనితండ్రిం గబళించి యింకొకనెలకుఁ గ్రమ్మఱ వచ్చి వీనిం గూడ భక్షింతు ననినవాఁడు. అతనిప్ర తిన దప్పనేరదు గావున నందులకు వెఱచి పెండ్లి సేయ సంకోచింతు ననుచున్నంత మాతలి యయ్యార్యకుం జూచి యయ్యా, నీ విందులకు వెఱవం బని లేదు. ఈకుమారుని నాతోడఁ బంపుము. నే నింద్రుఁ బ్రార్థించి యితనిఁ జిరాయురు పేతుం జేయుదు ననిచెప్పి యక్కుమారుం దోడ్కొని ప్రసంగవశమున నింద్రో పేంద్రు లొక్కచోఁ గూర్చుండి యిష్టకథాగోష్ఠి నున్నంత నచ్చటికి వచ్చి యా వృత్తాంతమంతయు నివేదించె. నివేదించుటయు సర్వలోకేశ్వరుండయ్యు విష్ణుం డు జిష్ణునిచే నతని కాయుర్ప్రదానంబుఁ జేయించువాఁడై త్రిలోకనాయకుం డైననీవ వీనిం జిరాయురుపేతుం జేయ నర్హుండ వనిపలుకుటయుఁ బురందరుండు వాని కమృతప్రాశంబు నిషేధించి పరమాయుషంబుఁ బ్రసాదించె. మాతలియుఁ గూఁతు నాసుముఖున కిచ్చి పెండ్లి చేసె. నారదుఁడును నార్యకుఁడును సంతుష్టులై యథేచ్ఛంబు చనిరి. తద్వృత్తాంతమెల్లఁ దెలిసి గరుత్మంతుఁడు కోపించి వాసు దేవునితోడిగోష్ఠి నున్నవాసవునొద్దకు వచ్చి దేవా, బ్రహ్మదేవుఁడు నాకు భోజ నంబుగా నియమించినసర్పముల రక్షింప నీ వేల పూనితివి. ఎఱుంగకి ట్లేల చేసి తివి? దాన నాకును నావారికిని వృత్తినిరోధం బయ్యె. ఇఁకఁ బరుల నాశ్రయిం చికదా బ్రదుకు సంపాదించికొనవలయు. ఇంతకాలంబు త్రైలోక్యనాయకుఁడ నైయున్న నే నిపు డిట్లు పరులకు భృత్యుఁడ నగుదు? ఆదిత్యులలోఁ బెద్దవాఁ డగునీ వుండ విష్ణు నడుగఁ బని లేదు గావున నిన్నే యడిగెద. మనము దాక్షాయణీకశ్యపులకుఁ బుత్రులము. నీవు కొందఱరాక్షసులఁ జంపిన నేనుం గొందఱఁ జంపితి. మఱియుఁ బరికించిచూచిన నాబల మెవ్వరికిని లేమి సిద్ధంబు. నే నీముల్లోకములనైనను మోవ నోపుదు. అదితిపుత్రులలో నందఱికంటె నీవ కదా బలవత్తముండవు. ఇట్టినిన్నొకయీఁకచే వహింపఁజాలుదు. ఇఁక నాకు నీకుఁ

గలబలతారతమ్యంబులు నీవ యెఱుంగుదు వనుచున్నంత దామోదరుఁడు గరుడున కిట్లనియె. నీవికత్థనంబులన్నియు నట్లుండె. ఇదె నాదాఁపటిచెయి మీఁద నుంచెద. దాని మోచినంగదా నీబలం బెఱుంగనగు ననిపలికి యతనిపైఁ దన వామకరంబు పెట్టుటయు గరుడుఁడు దన కది బ్రహ్మాండభాండమట్లు భారవంతంబై తోఁచుటయు నించుకేనియుఁ గదలింపఁజాలక నోట నెత్తురు గ్రక్కుచుఁ జెయ్యలు దక్కిన మేసితోఁ గనుంగవ నశ్రుధార లొలుక విహ్వలచిత్తుండై సవినయంబుగ మధుసూదనునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి దేవ దేవా, యల్పబుద్ధి యగునాయపచారంబు సైఁచి రక్షింపవే యనిప్రార్థించిన నాలకించి భక్తవత్సలుం డైనభగవంతుఁడు వత్సా, యిఁకనెన్నండేనియు నివ్విధంబుగ నాత్మపరబలంబుల నరయక గర్వించి పలుకకు మనిబుద్ధి చెప్పి పదాంగుష్ఠంబునఁ భూమిం జిమ్మి యతనిఁబొమ్ముపయిం బడనేసి వీడ్కొలిపె. నాఁటఁగోలె గరుడుఁడు సర్పసహితుఁడై యున్నవాఁడు. దుర్యోధనా, దుర్మానంబు నాటింపరాదు. దుర్మానంబున గరుత్మంతునకుఁ గలిగినసంకటపాటు వింటివిగదా. కావున నీవును దుర్మానంబు మాని పాండవులతోడిపొత్తున బ్రదుకుము. దేవపుత్రు లయినపాండవుల కెగ్గు సేయవలదు. ఈయర్థమెల్ల నీనారదుఁడు ప్రత్యక్షముగ నెఱింగినవాఁడు. ఈవాసుదేవుఁడ యంతయుం జేసినవాఁడు. ఇమ్మహాత్మునివచనంబు మెయి నడచుట మే లని కణ్వముని చెప్పినపదంపడి నారదుండుదుర్యోధనుం జూచి రాజపుత్రా, పెద్దలమాట విని ధర్మార్థములకు విరోధము లేకుండఁగ సంధి చేయుము. పెద్ద లొక్కరీతిం జెప్పిన నందులకుఁ బెడవాయుచునిర్బంధింపరాదు. నిర్బంధమున సంకటము పొసఁగు. గాలవుఁడు నిర్బంధంబునగాసిం బడసె నతని చరిత్రం బితిహాసంబై ప్రవర్తిల్లె. దానిం జెప్పెద విను మనియిట్లనియె.

### నారదుఁడు దుర్యోధనునకు గాలవోపాఖ్యానంబుఁ జెప్పుట.

విశ్వామిత్రుఁడు బ్రాహ్మణత్వంబుఁ బడయఁ దపంబు సేయుచుండ నయ్యాశ్రమమునకు ధర్మదేవత తచ్చిత్త మెఱుంగ వసిష్ఠవేషముతో వచ్చియాఁకొన్న నా కన్నము పెట్టు మనియడుగం గౌశికుండు సప్రయత్నంబుగఁ బరమాన్నంబు వండించి దానిం దల నిడికొని యతనియొద్దకుఁ బోవుటయు నంతకుమున్న ధర్మదేవత యితరులయన్నము భుజించియుండెఁ గావున విశ్వామిత్రుం జూచి యిపుడు నే లాఁతివానియన్నము భుజించితి. క్రమ్మఱ వచ్చి యారగించెద నంతదనుక నీ విట్ల యుండు మని యంతర్ధానంబు నొందె. కౌశికుఁడు నప్పరమాన్నంబుఁ దలపై నిడికొని తదాగమనంబు వార్చి స్థాణువుచందమున నిరాహారుండై యుండె. అపుడు గాలవుఁ డనుమునికుమారుఁ డగ్గాధినందనున కత్యంతబహుమానమునఁ బరిచర్యఁ గావించుచుండె. అంత నూఱేండ్లకు ధర్మదేవుఁడు క్రమ్మఱనవ్వసిష్ఠవేష

ముతో వచ్చి మస్తకన్యస్తపరమాన్నపాత్రుండై యాహారంబుమాని నిలిచియు
న్నవిశ్వామిత్రునిఁ దొల్లింటియట్లుఁ ఉష్ణం బైనయయ్యభినవపరమాన్నమునుం గాం
చి మెచ్చి యక్కౌశికాత్మజుం బిలిచి యయ్యా, నీవు క్షత్రియత్వంబుఁ బాసి
బ్రాహ్మణుండవైతి వని ప్రసాదించి యంతర్ధానంబు నొందె. పదంపడి విశ్వా
మిత్రుండు బ్రాహ్మణ్యలాభమునకుఁ బరమసంతుష్టుండై తన కత్యంతభక్తిశ్ర
ద్ధాగౌరవంబులతోఁ బరిచర్య చేసినగాలవునకు విజ్ఞానంబుఁ బ్రసాదించి వత్సా,
యథేచ్ఛము చను మనిన నమ్మునికుమారుఁడు గురుదక్షిణ యేమి యిత్తు
ననియడుగ నయ్యాచార్యుఁడు శిష్యునిమీఁది ప్రేమభరమునం జేసి యేమియు
నీ నక్కఱ లే దనివచించె. అందుల కియ్యకొనకగాలవుఁడు గురుదక్షిణ లే
నివిజ్ఞానంబు ఫలింపదు గావున నిత్తు నయని పలుమాఱులు దెల్పి గురుఁ డెన్ని
మాఱులు వలదని వారించిన నన్నింటి కన్నిమాఱులు సెప్పుచుండ నయ్యా
చార్యుం డలిగి యల్లేని మేనెల్ల ధవళం బొక్కకర్ణంబు నీలంబుగాఁ గల
యెనమన్నూఱుగుఱ్ఱములఁ దెచ్చి యిమ్మని చెప్పి శిష్యుని వీడ్కొలిపె. ఆచా
ర్యానుజ్ఞాతుండై గాలవుం డాగుఱ్ఱములనెట్లు పడయుదు నాచార్యు నప్పు
నెట్లు నీఁగుదు నీఁగకున్న ననృతకృతఘ్నత్వంబులు నన్నుఁ జేరు. ఆదోషంబులు
మూఁడెనేని సుకృతఫలమెల్ల నంతటితో నశించు. గుఱ్ఱములు సాధింప నుపాయ
మెద్దియుం దోఁపదు. ఏమి సేయుదు? ఎయ్యది గతి? ఎయ్యది దిక్కని వగచుచు
శయనాసనభోజనములం గానక యస్థిచర్మమాత్రశేషుండై యిఁక నాకు జీవనం
బున ప్రయోజనం బెయ్యది? సముద్రము సొచ్చియైనఁ బ్రాణముల విడుతునని
యొక్కొకమాఱు చింతించుచు వేఱొక్కమాఱు త్తీర్ణఋణుండుగానివాని నప్పా
పం బెప్పుడుం జెఱుచుఁ గావున నెట్టులైన గురుఋణంబుఁ దీర్చికొనవలయు నం
దులకు ధనంబు లేదని విచారించి యట సురలు యజ్ఞప్రకరణంబులందు నన్ను
సమ్మానముతోఁ జూతురు. ఇంతకుమున్నెన్నఁడును నేను వారల నెద్దానినేనియు
యాచింపనివాఁడఁ గావున నిప్పుడు వీని నడిగితినేని యొక్కవేళ నిత్తురు. వార
లం బ్రార్థించెద. వార లియ్యరేని సర్వయోగీశ్వరేశ్వరుం డైనవిష్ణుం బ్రార్థించి
వానిం దెచ్చి గురునకు సమర్పింతు నని నిశ్చయంబుతో నున్నంత గరుత్మంతుఁ
డాకస్మికముగా నతనియొద్ద కేతెంచి యోగాలవా, సుహృదుఁ డగునీకు సహా
యము సేయ సర్వాంతర్యామి యగుదేవదేవునానతి మెయి వచ్చితి. విభవము
కలిగినపుడు సుహృదభిలాషము నెఱవేర్చుటయకదా దానికిఁ బ్రధానప్రయో
జనంబు. కావున నీకోరెడిచోట్ల కెల్లఁ గొంపోయెద. నలుదెసలం గలవిశేషముల
వినిపించెద. విని యెందుఁ బోయిన మే లని తోఁచు నచ్చటికిఁ బోవుదమని మ
ఱియు నిట్లనియె. తూర్పుదిక్కునం గలవిశేషంబుల ముందు వచించెద. అందు

మతి పూర్వ ముదయించె. అందు ధర్మచక్షుస్సులు ప్రతిష్ఠితంబులై యున్నవి. అందు హుతం బైనహవ్యంబు సర్వదిక్కులం గలదేవతలకు వీతిహోత్రుండొసఁగు. అందు దాక్షాయణులందుఁ గశ్యపుఁడు వివిధప్రజాసృష్టిఁ గావించె. అందుఁ బురందరుని సురరాజ్యమున నభిషేకించిరి. అది దేవతలకుఁ దపస్స్థానంబు. పూర్వము సురలెల్ల వరించుటం జేసి యాదిక్కు పూర్వదిక్కనాఁబడియె. అందు సవితృఁడు సావిత్రిం బ్రహ్మవాదుల కుపదేశించె. అందు సూర్యుఁడు యజుశ్శాఖల విప్రులకుఁ బ్రసాదించె. అందుఁ గ్రతువులందు సురలు సోమపానముఁ జేయుదురు. అందు హుతవహులు తృప్తు లగుదురు. అం దభిషిక్తుండై వరుణుఁడు పాతాళశ్రీవిభుఁ డయ్యె. అందు వసిష్ఠుఁడు ప్రతిష్ఠాదిమంతుం డయ్యె. అందుఁ బ్రణవంబున వేదసహస్రశాఖ లుద్ధితంబు లయ్యె. అం దుదయించుచు సహస్రభానుఁడు కృతఘ్నాదిహనన మొనరించు. అది స్వర్గమునకు సుఖమునకుఁ త్రైలోక్యములకును ద్వారంబు. ఇఁక దక్షిణదిగ్విశేషంబు వినుము. తొల్లి వివస్వంతుండు యజ్ఞమున నాచార్యునకు దక్షిణగా నొసంగినకతమున నది దక్షిణదిక్కనం బరఁగె. అందు లోకత్రయపితృపక్షము ప్రతిష్ఠితంబు. ఊష్మపాభిధానులగుసురలకు, విశ్వదేవపితృగణములకు, ననేకదేవర్షి రాజర్షి సంఘములకు, నైరృతసహస్రములకును నది యావాసంబు. అది ద్వితీయధర్మద్వారమునాఁగ నెగడు. త్రుటిలవాదిగణనంబుతోఁ గాలనిశ్చయం బచటఁ జేయంబడు. ధర్మసత్యకర్మముల కది ప్రతిష్ఠానంబు. కర్మకారులకు గతి యయ్యది. అందు మందరాదికందరంబులందు గంధర్వగానంబు మనోహరంబై వినంబడు. అందలిసామగానంబాకర్ణించి రైవతుండు నిర్వేదంబుఁ జెంది దారాపత్యరాజ్యములం బాసి తపోవనంబున కరిగె. అచట సావర్ణియావక్రీతులు ప్రతిష్ఠించినమర్యాద నిప్పటికి నాదిత్యుఁ డతిక్రమింపఁడు. రావణుఁ డచటఁ దపంబు సల్పి దీర్ఘాయురుపేతుం డయ్యె. అచట నాచరించినయనుష్ఠానప్రభావంబుననే వృత్రుండు శక్రశత్రుం డయ్యె. అచటఁ జేరినసర్వప్రాణములుం గ్రమ్మఱఁ బంచవిధములఁ జను. దుష్కృతకారు లచటఁ గ్లేశములఁ బడుదురు. అందే వైతరణి యనునది యున్నది. పరేతు లచ్చటఁ జని సుఖదుఃఖములు సాంతముగాఁ బడయుదురు. దానిం బొంది సూర్యుఁడు వర్షించి క్రమ్మఱ నుదగ్దిశం బొందునపుడు సర్వరసములఁ బీల్చుఁ. ఏనుం దొల్లి యిచటన యాఁకట నకనకం బడుచుండి పరస్పరస్పర్థమైఁ బోరాడుచున్న గజకచ్ఛపముల రెంటి నాహారముగాఁ బడసితి. అందే సూర్యునకుఁ జక్రధనుఁ డనుముని యుదయించె. అతండే సగరపుత్రుల నీఱుగావించినకపిలాచార్యుఁడు. అందే సిద్ధ యనుబ్రాహ్మణి సర్వవేదములఁ జదివి సిద్ధిం బొందె. అందే సూర్యాగ్నులకు నవార్యంబైనపెంజీఁకటికి నెల వగుభోగవతీపురంబు వాసుకిపాలితంబు

న్నయది. ఇఁకఁ బశ్చిమదిగ్విశేషంబు వినుము. దివసపశ్చిమభాగమున సూర్యుఁడు నిజకిరణముల నందువిడుచుటంజేసి దానికిఁ బశ్చిమ యనిపేరు గలిగె. జలరక్షణార్థంబు కశ్యపునిచే నభిషిక్తుం డై నవరుణుండు నిచట యాదోగణరాజ్యమును బాలించుచుండు. అందు షడ్రసములఁ ద్రావి చంద్రుఁడు శుక్లపక్షమునఁ గ్రమమున వృద్ధిఁ గాంచు. అందు దైత్యు లనేకులు వాయుసంయుతులై కదలనేరకున్నవారు. అం దస్తపర్వతమునఁ బ్రణయితుండై సూర్యుం డట నెల్లచోట్లం బ్రతిగ్రాహ్యుం డగు. అచటఁ బశ్చిమసంధ్య ప్రసరించు. దివసావసానంబున నిశానిద్ర లచ్చోటునుండి వెడలివచ్చి యెల్లచోట్ల ను వ్యాపించి జీవలోకమునకుఁ గలయాయువున సర్ధము హరించు. అందు నిద్దురవోవుచున్న దితిగర్భము నింద్రుడు భేదించె. దానంగదా మరుద్గణము జాత మయ్యె. అందుఁ బర్విసహిమవన్మూలంబు మందరముదనుక వ్యాపించు. అందుఁ గనకకమలసంభృతంబయి కనకగిరిగణసాంద్రం బయినసముద్రముతీరమున సురభి పాఁడి పిదుకు. అందు సముద్రమధ్యమున రాహువుకబంధము గానవచ్చెడి. అందు హరిరోమునిగానధ్వని విననయ్యెడి. అందు హరిమేధసునికూఁతురు ధ్వజవతి యనునది సూర్యశాసనమునం జేసి మింట నిల్చియున్నది. అందు వాయువహ్నిజలగగనంబులు నక్తందివదుఃఖవిమోచనం బొనర్చు. అయ్యది మొదలుగ సూర్యగమనంబు తిర్యక్ప్రచారం బగు. అం దిరువదియెనిమిదిరాత్రులు నక్షత్రములు సూర్యునితోఁడం జరించి సోమసంయోగమునఁ గ్రమ్మఱఁ బాయు. అది సర్వనదీసాగరంబులకుఁ బ్రభవస్థానంబు. అందుఁ బన్నగరా జగుననంతునివేశనంబును, సర్వేశ్వరుఁ డగువిష్ణునిస్థానంబును, మారుతాయతనంబును, మరీచిపుత్రుం డయిన కశ్యపమహర్షి యాశ్రమంబును నున్నయది. ఇంక నుత్తరదిగ్విశేషంబు వినుము. సకలజనులకుఁ బాపోత్తరణంబుఁ గావించి నిశ్శ్రేయసం బొసంగుటంజేసి యయ్యది యుత్తరదిశ యనం బరఁగె. పూర్వపశ్చిమదిక్కులు కారణంబులుగా నచట నుత్తరహిరణ్యాదిమార్గంబు మధ్యమమునాఁబరఁగు. అం దవిధేయుఁ డధార్మికుఁ డసౌమ్యుఁడు నుండఁడు. అందు బదరీవనంబున నరనారాయణులను పురాణమును లున్నవారు. అందు హిమవత్పృష్ఠంబునఁ బ్రకృతిసమహితుం డై నమహేశ్వరుండు యుగాంతాగ్నిచందమున వెలుంగుచుండు. అద్దేవదేవుని నరనారాయణులుదక్కఁ దక్కటిమును లెవ్వరు నెఱుంగరు. సహస్రశీర్షపాదనేత్రుం డై ననారాయణుఁడందు మాయచే సర్వముం జూచుచున్నవాఁడు. అందుఁ జంద్రుఁడు ద్విజరాజ్యమున నభిషిక్తుం డయ్యె. అందు గగనచ్యుత యగుగంగను శివుఁడు దాల్చి యటఁ బుడమికిఁ బంపె. మహేశ్వరప్రాప్తినిమిత్తముగా మహాదేవి తప మొనరించె. అందుఁ బార్వతి యవతరించె. అందుఁ గామక్రోధాదులుం బుట్టె. అందుఁ గైలా

సంబునందు యక్షగంధర్వరాక్షసాధిపత్యమునఁ గుబేరుఁ డభిషిక్తుఁ డయ్యె. అందు వైఖానసాశ్రమగణభరితం బైనచైత్రరథం బనుకుబేరోద్యానంబును, మందాకినీనదియు, నైరృతగణరక్ష్యమాణం బయినసౌగంధికవనంబును, గదళీవనంబును, సంతానకనగంబులును, గామభోగ్యంబు లయినసిద్ధవిమానంబులు నున్నయవి. అం దరుంధతీసహితు లయినసప్తర్షులు నున్నవారు. స్వాతీనక్షత్ర మం దుదయించు. అందుఁ బితామహుఁడు యాగము నొనర్చె. అందుఁ జంద్రసూర్యాదిగ్రహంబులు నిత్యంబు పరివర్తనంబుఁ గావింతురు. అందు బ్రహ్మవాదులు నిత్యధావనశీలురు నగుమహామునులు గాయంతికాద్వారంబు రక్షింతురు. నారిజాత్యాకృతితపములు నెవ్వరు నెఱుంగరు. అందు విస్వత్రభాభిధాన లగునప్సరస్త్రీలు జనించిరి. అందు హరి త్రివిక్రమావతారంబున మేదినీక్రమణార్థం బునిచినవిష్ణుపదంబు గలదు. అం దుశీరబీజస్థానంబునం జాంబూనదసరస్తీరంబున మరుత్తుఁ డనురాజు యజ్ఞము నొనర్చె. అందు జీమూతుఁ డనుబ్రహ్మర్షి తనకు దొరకిన పసిండిగనిం బ్రాహ్మణనిమిత్తముగ వరించుటయు నది జైమూతధనం బనంబరఁగె. అందు దిక్పాలురు ప్రతిదినంబును సాయంప్రాతఃకాలములందుఁ బరస్పరకార్యముల నరయుచుండుదు రని యిట్లు గరుత్మంతుఁడు నాలుగుదెసలం గల విశేషములఁ దెలియఁ జెప్పి గాలవా, యెందుఁ బోవుద మనుటయు నతండు ధర్మచక్షున్సులకు నెల వగుతూర్పునకుఁ దోలుత నరుగుద మనియె. అంత గరుత్మంతుఁ డట్ల యగుఁగాక యని యతనిం దనవీపుపయి నెక్కించికొని యాకసంబునకు లంఘించి యతిరయమునఁ బఱచుచుండ నగ్గమనవేగంబునకు మిగుల విభ్రాంతుఁడై గాలవుండు వినతానందనా, భవదీయరయము నే నోర్వఁజాలను. పూర్వాహ్ణంబున నీడ సూర్యుంబోలె బ్రమాకులచాలు నిన్ను వెంటనంటి వచ్చుచున్నది. మనతోడఁ బుడమియుఁ గొండలును వచ్చునట్లు తోఁచుచున్నది. సముద్రోదకమెల్ల భవత్పక్షవిక్షేపవాతవిధూతంబై మీనసక్రాదిగణంబులతోడ మింటి కెక్కుచంద మగపడుచున్నది. ఱెక్కలమ్రోఁతచేఁ జెవులకుఁ జెవుడు పట్టెడి. సూర్యుఁ డాకాశము దిక్కులును మనమేనులును నా కగపడవు. మఱి యుత్తమజాతిసంభూతంబు లయినమణులంబోని నీకన్నులు రెండే దృగ్గోచరము లగుచున్నవి. వేగ ముపసంహారింపుము. ఇంకఁ గొంతప్రొద్దిట్టుల యయ్యెనా నేను బ్రదుకఁ జాలను. దాన నీకు బ్రహ్మహత్యాపాతకంబు వచ్చు. గుర్వర్థంబు సాధింపఁ బూనిన నాకునడుమ మరణ మనభిమత మని యత్యంతదైన్యంబు గదుర మొఱ పెట్టికొనుచున్నంత వైనతేయుండు నవ్వుచు మునికుమారా, యేల యిట్లు వెఱచెదవు? మరణాదులు కాలవశంబులకాని మనవశంబులు కావు. నీకంత వెఱపు తోఁచునేని యాచెంగట

సముద్రమధ్యమున ఋషభపర్వతము గలదు. అందుఁ గొంతసేపు విశ్రమింపుము
శ్రమ్మఱి చని కార్యసిద్ధి కుపాయాంతర మరయుద మనిచెప్పుచు క్షణమాత్రలోన
నాఋషభగిరిపై వ్రాలి గాలవుని డించె. అంత నచ్చటఁ దపోనిష్ఠ యగుశాం
డిలి యనుబ్రాహ్మణిం గాంచి యయ్యిరువు ర త్తపస్వినికిఁ బ్రణామంబు లాచరించి
తత్కృతాతిథ్యంబు గ్రహించి నిద్రవోవుచు ముహూర్తమాత్రన లేచి గరు
డుఁడు దనయీఁకలన్ని రాలి మేను మాంసపిండమాత్రావశేషంబై యుండ
నప్పుడు గాలవుండును మేల్కని తదవస్థుం డైనగరుడుం జూచి యిది యేమి సు
కృతమునకు నెల వగునీ కిట్లగుట నాచేసినదుష్కృతంబు ఫలంబ యని తన్నుఁ
దాను నిందించుకొనుచున్నంతఁ బన్నగాశనుం డయ్యా, యిది నీతప్పు గాదు.
నే నీతపస్వినిం బ్రహ్మవిష్ణుధర్మదేవత లున్నచోటికిఁ గొంపోవఁగ మనంబునఁ
దలంచితి. అది యీసిద్ధురాలి కసమ్మతంబుగాఁబోలు. దాన నిట్లయ్యె. వగవం
బని లేదు. నేన యీభగవతిం బ్రస్తుతింతు నని పలుదెఱంగులం బ్రార్థించినం
గురుణించి శాండిలి యతనికి యథాపూర్వముగఁ బ్రసాదించి యిఁక నెన్నఁడు
నా కెగ్గు సేయవల దనిబోధించి దీవించుటయు గరుడుఁడు జాతపక్షుండై గాల
వుని వీ పెక్కించుకొని వచ్చుచుండె. అపుడు విశ్వామిత్రుఁ డాతెరువున నెదుర
యి గాలవుం బిలిచి నీతెచ్చెడిదక్షిణం బ్రతీక్షించియుండెద ననిపలికి యిచ్చ
మై నరుగుటయునాపదంపడి గరుత్మంతుఁ డాలోచించి గాలవుం జూచి య
య్యా, ధనము లేకున్న గుఱ్ఱములఁ బడయు టరిది. ధనార్జనంబు సే
యవలయుఁ గావున సోమవంశసంజాతుఁ డైనయయాతినృపతియొద్దకరిగి
యతనిఁ బ్రార్థింత మతండు నాకు నెచ్చెలి యనిచెప్పి గాలవుం దోడ్కొని
ప్రతిష్ఠానపురంబున కరిగి తత్పురనాథుఁ డైనయానృపాలుంగాంచి తమవచ్చిన
కార్యముఁ దెల్పియీవచ్చినమునికుమారునికోర్కి నెఱవేర్చితేని యితండు నిజత
పంబున నీకుఁ దపగీపూర్తిఁ గావించు. నీవు దానపతి యనం బొగడిక గన్నవాఁ
డవు. ఇతండు సత్పాత్రం బనిచెప్పిన విని యయాతి యిట్లనియె. లోకమున
రాజు లెందఱే నుండఁగ వారినెల్లఁ గాదని నాయొద్దకు వచ్చి నన్నుఁ బెద్దఁ జేసి
తిరి. భవన్మనోరథపూరణంబు నాకవశ్యకర్తవ్యంబు. అయినను మీకోరినగుఱ్ఱము
లు నాయొద్ద లేవు. ఏమి సేయుదు. అయిన నొక్కయుపాయంబుఁ జేసెద. నా
కూఁతురు మాధవియనునది యత్యంతగుణరూపసౌభాగ్య విలసితురాలున్నది.
దానిం గొనిపోయి నీకోరినగుఱ్ఱములు గలరాజుల కిచ్చి యాగుఱ్ఱముల గ్రహిం
పుము. దానిరూపసౌభాగ్యమున కెయ్యదియేనియు శుల్క మిత్తురు. నీ కెనమ
న్నూఱుగుఱ్ఱములసేఁగి యొక పెద్ద గాదు. నేనును దానియందు దౌహిత్రులఁ బడ
యుదు ననిపలికి కూఁతు నొసంగిన సుపర్ణుండు గాలవుని వీడ్కొని చనియె. గాల

వుడును నమ్మాధవిం దోడ్కొని యయోధ్య కరిగి యిక్ష్వాకుకులవర్యుం డై నహ
ర్యశ్వుం గాంచి నృపాలా, శ్వేతసకలాంగములు శ్యామైకకర్ణంబులు నగునెనమ
న్నూఱుగుఱ్ఱముల శుల్క మిచ్చి యీకన్యం బరిగ్రహించి పుత్రులం బడయు
మని తెల్పిన నతండు తదీయరూపశ్రీమోహితుండై పరిగ్రహింప నువ్విళ్లూరుచుఁ
దనయొద్ద నాగుఱ్ఱములిన్నూఱేయుండుటంజేసి శుల్కంబు చాలదని ముని యొసం
గఁజాలో యనుచింత మనంబునం బెనంగొనంగ మునీంద్రా, నీకోరినగుఱ్ఱము
లిన్నూఱే నాయొద్దఁ గలవు. వానిం దక్కటిగుఱ్ఱముల నెన్నియైనను నిత్తుఁ గన్య
నిమ్మని యడుగనాగాలవుండు దనగుర్వర్థంబు దానం దీఱమికి వగచుచున్నంత
నక్కన్య యమ్మునిం గిట్లనియె. మునివరేణ్యా, నాకుఁ బుత్రులు గలుగుచున్నను
గన్యాత్వంబు సెడకుండ నొక్కమహాముని ప్రసాదించెఁ గావునఁ బుత్రజననావ
ధిసంకేతంబు చేసి యీహర్యశ్వునకు నన్నిచ్చి యీయిన్నూఱుగుఱ్ఱములం
బడసి యితండు నాయందు దొక్కకొడుకుం గనినపదంపడి మఱివచ్చి నన్నుఁ గొం
పోయి క్రమ్మఱ మఱియు నీసంకేతముననే వలసినయశ్వము లన్నియు లభించు
నందాఁక నయ్యైరాజుల కొసంగుము. నలుగురురాజులవలన నీకోర్కి పడయ నగు
ననిన విని సంతసంబునం బొదలి గాలవుండాసంకేతంబున నాయయాతిపుత్రిని
హర్యశ్వున కొసంగి గుఱ్ఱములు నీయొద్దన యుండుఁగాక, పని గలయపుడు గొని
పోయెద నని యొడంబడి యరిగె. హర్యశ్వుండు దాని తోడ నభిమతక్రీడల
రమించుచుఁ గులదీపకుం డై నకుమారుం బడసె. ఆకుమారుఁడు వసువులకం
టె వసుమత్తరుఁడగుటంజేసి వసుమనసుఁ డనఁబరఁగె. అంత గాలవుండు గ్ర
మ్మఱ వచ్చి యయాతిపుత్రి నడుగుడు హర్యశ్వుఁడు సత్యప్రతిజ్ఞ దప్పక యిచ్చు
టయు మునివరసంప్రాప్త కన్యాలక్షణోపలక్షిత యగునద్దానిం గొనిపోయి కాశీ
శ్వరుఁ డై నదివోదాసునకుఁ బూర్వసంకేతమున నిచ్చి తనకోరిన యిన్నూఱు
హయముల శుల్కముగా గ్రహించి వానియొద్దన వాని నునిచి పుత్రజననానంత
రంబు వత్తు ననిచెప్పి నిజాశ్రమంబునకుఁ జనియె. దివోదాసుఁడును దానియందు
వివిధసురతక్రీడాపరుఁడై పరమానందమునం దేలుచుఁ బ్రతర్దనుఁ డనుపుత్రుం
గాంచె. అట గాలవుండు వచ్చి సంకేతప్రకారంబున నాకన్యకను గొని భోజదేశ
నాథుఁ డై నయౌశీనరునొద్ద కరిగి సర్వాంగావదాతంబు లేకకర్ణశ్యామంబులు
నగునన్నూఱుగుఱ్ఱము లుంకువ యిచ్చి యీకన్యయందుఁ గుమారుల నిద్దఱం
బడయు మనిన నతండు దన కాగుఱ్ఱము లిన్నూఱే యునికిం దెల్పి వాని నొసంగి
యేకపుత్రజన్మంబు సంకేతంబుగా నాకన్యకం బరిగ్రహించి విచిత్రోద్యానాది
రమ్యస్థానంబులయందు దానితోడ విహరించి శిబి యనుకుమారుం బడసె. అవ్వి
ధంబున నాఱునూఱుగుఱ్ఱములు లభించుటయుఁ దక్కటి వెల్లు లభింప నగునో

యని మిగుల వగచుచున్న గాలవునొద్దకు గరుడుఁడు వచ్చి యయ్యా, యింక నా గుఱ్ఱములు నీకు లభింపవు, తొల్లి కాన్యకుబ్జేశ్వరుం డైనగాధిరాజు తనకూఁతును ఋచీకుఁ డడిగిన నతం డతనికి సర్వాంగావదాతంబు, లేకశ్రోత్రశ్యామంబులు నగువేయిగుఱ్ఱములు నాకూఁతున కుంకువ. వానిం దెచ్చువానికిఁ గూఁతు నిత్తు ననుటయు నాఋచీకమునీంద్రుఁడు వరుణుం బ్రార్థించి యశ్వతీర్థమునం దాహయసహస్రంబుఁ బడసి గాధిరాజున కిచ్చి కన్యకం గ్రహించె. ఆగాధిరాజు పౌండరీకయాగంబునం దాగుఱ్ఱములను ఋత్విజులకు దక్షిణగా నిచ్చుటయు నందు నన్నూఱు నచ్చిన మిగిలినయాఱునూఱింటిని రాజులకు విక్రయించిరి. అవియే యిపుడు నీకు సముపలబ్ధంబు లయ్యె. ఇఁక దొరకవు గావున నొక్కయుపాయంబు సెప్పెద. ఆయాఱునూఱుగుఱ్ఱములను గొని గురువున కిచ్చి తక్కటియిన్నూఱింటికిఁ బూర్తికై యీకన్యక నేకపుత్రజనన సంకేతంబున నిచ్చినం గుర్వర్థంబు దీఱు. ఇఁక నెద్దియు వెరవుగా దనిపలికి యాగుఱ్ఱములను నాకన్యను దోడ్కొని వైనతేయుండు గాలవునితోడ విశ్వామిత్రునొద్ద కరిగి మునీంద్రా, యీముని కుమారుఁడు గుర్వర్థంబుఁ దీర్పఁ బలుదెఱంగుల గాసిం బడియె. నీవు దయాళుండవు గావునఁ గరుణించి యితండు దెచ్చినయాఱునూఱుగుఱ్ఱములం గ్రహించి తక్కటియిన్నూఱింటికిఁగా నీకన్యకయం దొక్కకుమారుం గను మనిప్రార్థించిన నతం డందుల కియ్యకొని గుర్వర్థంబు దీఱెఁ గృతార్థుఁడ వయితి వనిపలికి గాలవునకు మనఃప్రియంబుఁ గావించి యాకన్యకయం దష్టకనామధేయుం డైనపుత్రుం బడసె. అవ్విధంబున నయ్యయాతిపుత్రికి దానపతి యయినహర్యశ్వుని వలన వసుమనసుఁడును, శూరశేఖరుఁ డైనదివోదాసునివలనఁ బ్రతర్దనుఁడును, సత్యధర్మనిరతుఁ డైన యౌశీనరునివలన శిబియును, నిరంతరయాగతత్పరుం డైన విశ్వామిత్రునివలన నష్టకుండును నన నలువురుపుత్రులు పుట్టి మాతృపితృకులముల నుద్ధరించిరి. గాలవుండును సంప్రాప్తమనోరథుం డై యక్కన్యం గొనియాడితపంబునకుఁ జనియె. అక్కన్యయుఁ దనకుఁ దండ్రి గంగాయమునాసంగమంబున స్వయంవరంబుఁ జాటించినం దాని నొల్లక యుపవాసదీక్షాది వివిధవ్రతపరాయణయై తపోవనముఁ జేరె. దుర్యోధనా, నిర్బంధమున గాలవుఁడు పడిన సంకటపాట్లెల్ల నెఱుకయయ్యెఁగదా. కావునఁ బెద్దలు గఱపుదానికి విరుద్ధముగ నెప్పుడును నిర్బంధము సేయరాదు. మఱియు దుర్మానంబు వాటింపరాదు. దుర్మానంబునం జేసి స్వర్గచ్యుతుం డైనయయాతి దేవదూతం బ్రార్థించి సత్పురుషమధ్యమునం బడునట్లు వరముఁ బడసి నైమిశారణ్యంబున యజ్ఞాచరణపరాయణులయినవసుమనఃప్రతర్దనశిబ్యష్టక నామధేయులఁ దనదౌహిత్రులం గాంచి వారి నడుమం బడి యచ్చటి కాకస్మికముగా వచ్చినతనకూఁతును మాధవినిం గనుం

గాని పరస్పరబంధుత్వం బెఱింగి సంతుష్టుండై యున్నంత నతనికి మనుమలు నిజసుకృతమునసుకృతపూర్తిఁ గావించుటయుఁ గూఁతురు దన తపఃపుణ్యం బొసంగె. అపుడు గాలవుండు నచ్చటఁ గానిపించి తనతపమున నష్టమాంశం బొసంగె. అట్లు వా రందఱు నతనికి సుకృతపూర్తిఁ గావించిన నతండు దివ్యమాల్యాంబరభూషణచందనధరుండై పుష్పవర్షంబు గురియ దేవదుందుభులు మ్రోయఁ బుణ్యమారుతం బొలయ గంధర్వాప్సరోగణనృత్తగీతంబులు సెలంగ దివం బధిరోహించి పితామహునకు మ్రొక్కి దేవా, నాచేసినసుకృతమెల్ల నొక్కదుర్మానకారణంబున నశించునే యనియడుగ నతం డట్ల యనుటయు యయాతి నాఁటం గోలె దుర్మానంబుఁ బరిహరించి సురలోకపూజ్యుం డయ్యె. యయాతిస్వర్గచ్యుతిపునరారోహణంబులఁ బఠించువారును వినువారును వివిధదుఃఖములం బాసి సుఖింతు రనివివరించి నారదుండు క్రమ్మఱ దుర్యోధనుం బిలిచి కుమారా, దుర్మానంబు వలదు. పాండవులు నీకంటె నెందునుం దక్కువగారు. వారితోడిపొత్తున మనుట నీకు మే లని పలుమాఱులు సెప్పినపదంపడి దుర్యోధనుండు బొమలు ముడివెట్టి రోఁజుచుఁ దొడ దట్టుచు నచటిమునుల నందఱం గాంచి యేల యిట్లు మీరు నామతంబునకు విరుద్ధములు పల్కెదరు. ఏ నెయ్యది యెట్లయినను నిజమతంబు విడువను. కానున్నయది యగు నీక నేమియుం జెప్పవల దని నిరాకరించుటయు ధృతరాష్ట్రుఁ డదరిపడి యక్కటా! యిక్కుటిలాత్ముఁడు మునులమాటల నిట్లు నిరాకరించునే! నే నేమి సేయుదు ననివగచుచు గోవిందుదెస మొగంబై మహాత్మా, యీదురాత్ముండు నామాట వినఁడు. వీనినడవడి నాకును, గాంధారికి, నస్మదీయహితార్థు లగుభీష్మద్రోణవిదురాదుల కేరికిని సమ్మతంబు గాదు. నీవయిన నిష్పాపాత్ము నను నయించి బోధించి కార్యంబు తెలుఁగుపఱిచి మమ్ము రక్షింపవే యని ప్రార్థించినం జిత్తగించి దేవకీనందనుండు గాంధారీనందనుదెస మొగంబై ధర్మార్థసహితముగా మధురవచనముల నిట్లనియె.

### శ్రీకృష్ణుఁడు దుర్యోధనునకు హితముఁ జెప్పుట.

దుర్యోధనా, మీ కందఱకును మేలు గోరి పలికెడినామాటల వినుము. దుష్కులజాతు లయినదురాత్ములు సేయఁదగినయీపని సత్కులమున జనించి సుగుణగణమున నొప్పి శ్రుతవృత్తసంపత్తిం బేరు వడసిననీకుఁ దగదు. ఇప్పటినీతలంపు ధర్మార్థవిరుద్ధం బశక్యం బనర్థకారణంబు. నీవలన నీవారికెల్లనుం జేటు వచ్చుఁ బ్రాజ్ఞులు శూరులు మహోత్సాహులు బహుశ్రుతులు సుచిత్తులు నగుపాండవులతోడ సంధి చేయుము. దాన మీకెల్ల మేలు గలుగు. అధర్మాపకీర్తులు దప్పు. మీరును బాండవులునుం గూడి మనుటయే నీతల్లిదండ్రులకును, బితామహుఁ డగుభీష్మునకును, కులవృద్ధు లగుబాహ్లికాదులకును, గురువు లగుభార

ద్వాజప్రముఖులకును, మీమేలు గోరువిదురసంజయవికర్ణులకును, సకలజనుల కును సమ్మతంబు. విద్యల నేర్చి గుణవంతుఁడ వైననీకుఁ దల్లితండ్రులమాట నతిక్రమింపఁ దగునే? లోకమున నందఱు నాపదలు మూఁడినపుడు తండ్రిగఱవు హితంబుమెయి నడిచి సుఖముఁ గాంత్రు. సుహృదులు బోధించినహితము వినియుఁ దత్ప్రకారంబు నడుపక మోహమున నిచ్ఛానుసారమునఁ బ్రవర్తించు వాఁడు సంకటములపాలై తుదిఁ బశ్చాత్తాపంబునఁ గుందును. సుహృద్వచ నంబు నిరాకరించి దుర్వాదులప్రతికూలాలాపంబుల నాదరించి తత్ప్రకారంబు నడుచువాఁడు శత్రువులకు వశుండై తనవారికెల్లఁ గీడు దెచ్చి తానుం గ్రూరా పదలఁ బొంది మఱి యుత్తారంబుఁ గాంచనేరఁడు. అట్టిదురాచారుఁ డుభయలోక ములం జెడు. మఱియు నీవు శిష్టులు సమర్థులు ప్రాజ్ఞులు నగుపాండవులు నీతోడి పొత్తున మనియెద మన్న వలదని యశిష్టు లసమర్థులు మూఢులు నగువారలం గ్రహించి యమ్మహాత్ముల కెగ్గులే చేయుదువు. అప్పటికిని వారలు ధర్మాత్ములు గావున నందులకుఁ గోపింపక సంధియ కోరుచున్నవారు. వారిసౌజన్యంబున కిదియే నిదర్శనంబు. ముఖ్యులైనయాత్మబంధువులతోడిపగ కొఱ గాదు. ప్రాజ్ఞుఁ డెప్పుడును ధర్మార్థకామములకుఁ బరస్పరవిరోధము రానిచందమున వర్తించుచు సుఖించు. వివేకవికలుఁడు లోభవశుండై ధర్మము దిగవిడిచి యర్థకామముల కాసపడి చెడు. అర్థకామసాధనంబునకు ధర్మాచరణంబే నిరపాయంబైనయుపా యంబు గావున ధర్మమునే తొలుత నాచరింపవలయు. ధర్మాచరణపూర్వకంబుగా నర్థకామముల సాధింపఁబూనినవాని కయ్యవి నానాఁట శుష్కతృణపుంజమునఁ జేర్చినకార్చిచ్చు చందమునఁ బెంపుఁ గాంచు. అట్లుగాక ధర్మముపొంతఁ బోక యోగ్యులపైఁ జెడుతలంపుతోఁ గేవలార్థకామములనే సాధింపఁ బూనువాని కయ్యవి గొడ్డంట నఱికినయడవిచందమునఁ దఱుఁగు. కల్యాణనివిష్టచిత్తున కెవ్వ రినిం బరిభవింపరాదు. ఇఁక సర్వవిధపూజార్హులయినపాండవులఁ జెప్ప నేల? క్రోధవశుఁడు దేనినిం దెలియక యకృత్యములు సేయుఁ గావునఁ బని పూని దానిం దిగవిడిచి పాండుపుత్రులతోడ సంధి సేయుము. దాన నీకు సర్వార్థంబులు సేకూ ఱును. అట్టిసర్వసుగుణశాలు లగువా రుండఁగ నీ వసదు లగుకర్ణశకునిదుశ్శాస నులప్రాపు గోరి రాజ్యభారమెల్లఁ దదధీనముఁ గావించు టెంతయు నెప్పదు. వీరును నీకుఁ దోడ్పడినరాజు లందఱును జ్ఞానవిక్రమాదులలో నెక్కటనైనం బాండవులకు సాటి రానేరరు. వీ రెవ్వరును రణాంగణంబునఁ గ్రోధమూర్ఛితుం డైనభీమసేనుమొగమైనం జూడనేరరు. వాని మార్కొననేర రని వేఱ చెప్పవల యునే? అదియునుంగాక యింకొక్కటి వినుము. అందఱు వినఁగఁ జెప్పెద. ఈకొలువునందు భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణబాహ్లికసోమదత్తభూరిశ్రవోజయ

ద్రథప్రముఖు లగుమహారథు లెందఱే గలరుగదా. వీరిలో నెవ్వరైన నర్జునుం గెలువఁ జాలుదురే? అతండు దేవదానవాదులకు నజేయుండు. వానిం గెలువఁ జాలినమగవాఁడు మీలో నెక్కఁడు గలఁడేని చూపుము. వానివిక్రమ మందఱకుం బెక్కుమాఱులు విదితంబకదా. దేవగంధర్వాదిగణంబులతో నింద్రుఁడు దా నడ్డ పడినను జయించి ఖాండవముఁ గాల్చె. మహాదేవుం బోర మెప్పించె. పెక్కు లేల? ఏరాటుపసులం బట్టఁబోయి మీ రందఱు గట్టిమొన గట్టియున్నపు డతం డొక్కరుండే మి మ్మందఱం గెల్చి పసుల మరల్చెఁగదా. ఇది యొక్కనిదర్శనంబు చాలదే? చేతులఁ బుడమి నెత్తెడివాఁడు, నించుకకోపంబు గదిరిన నఖిలప్ర జలం గాల్చువాఁడును దేవతల స్వర్గమునుండి త్రోఁచువాఁడునుం గలిగినపు డొక వేళ ధనంజయుని గెల్చువాఁడు గలుగునేమొ. అట్టివీరశేఖరుం డొక్కరుండే య మానుషకృత్యములఁ బెక్కులు సేసె. ఇఁక నేనుం దోడయి వచ్చినపుడు గెలువ మీకు కా దింద్రాదులకు నశక్యంబు. కావున యుద్ధతాత్పర్యంబుమాని సంధి చేయుము. పాండవులు నీకు మేలు చేయఁ బూనిన నీ వేల వల దనియెదవు. తన కుఁ దాన సంపద వచ్చుచున్న వారింపవచ్చునే? వారును ధృతరాష్ట్రునిమహారా జత్వంబును నీయౌవరాజ్యంబును నడిపింతురు. సంధియొల్లవేని కులహాని తప్పదు. కులఘ్నుం డనుపేరు నీయట్టివానికిఁ దగదు. ఎన్నివిధంబులనైనను సంధియే నీకు మే లనిచెప్పినపదంపడి శంతనుపుత్త్రుఁ డాధృతరాష్ట్రపుత్త్రున కిట్లనియె.

భీష్మద్రోణాదులు దుర్యోధనునకు హితముఁ జెప్పుట.

రాజపుత్త్రా, కేశవుఁడు లెస్స చెప్పె. తద్వచనంబు వినకున్న మేలు గలుగనేరదు. క్రోధంబు మానుము. ఈకృష్ణుఁడు సారథ్యంబు సేయ రథికుఁ డై యాకృష్ణుఁడు గాండీవంబున నమ్ములఁ జేర్పకమున్న ధర్మజుక్రోధవీక్షణంబు నీసేనలపైఁ బర్వకమున్న భీముఁడు గదాపాణియై వీథులఁ దీర్చుచు నేనుంగులం గూల్చుచు వీరవిక్రమవిహారంబు సల్పకమున్న నకులసహదేవధృష్టద్యుమ్నశిఖండి ప్రముఖచిత్రయోధులు మహార్ణవంబు ద్రిప్పుఘోరనక్రములచందమున నీమూఁ కలం గలంపకమున్న సంధి సేయుము. దురహంకారావిష్టుఁడవై ధృతరాష్ట్రుఁడు బ్రదికియుండగనే యేల కులనాశము, రాజ్యనాశము, బంధునాశముం జేయఁ జూచెదవు. కేశవధృతరాష్ట్రవిదురవచనముల వినకున్న మేలుగలుగమి సిద్ధ మనిచెప్పుచున్నంత ద్రోణాచార్యుఁడు క్రోధమూర్ఛంజేసి నిశ్వసింపుచున్న దుర్యోధనున కిట్లనియె. కుమారా, వాసుదేవశాంతనవవచనంబులు సముచి తంబులు ధర్మార్థసమంచితంబులు. వా రిరువురు ప్రాజ్ఞులు మేధావంతులు శాం తులు దాంతులు శ్రుతవంతులు. బుద్ధిమోహమున వారిమాటల నిరాక రింపక సాదరంబుగ గ్రహింపుము. నీ కుత్సాహముఁ గావించువారలు కల

హాములు పెట్టి వేడుక చూచువారలకాని కార్యసాధకులు గారు. సర్వవిధములం బాండవులతోడిసంధి మేలు. వాసుదేవార్జును లేదిక్కునఁ గలరాదిక్కునం గెలుపు సిద్ధము. ఊరక పోరాడి రిత్త జనక్షయం బేల చేయఁ జూతువు. పరశురాముఁడు సెప్పినంతకంటెఁ గిరీటివిక్రమంబు పెక్కుమడుంగు లెక్కుడు. ప్రభవిష్ణుం డైన యాకృష్ణునిమహిమంబుఁ జెప్ప నెవ్వరుం జాలరు. మాచెప్పఁగలయంతయుం జెప్పితిమి. ఇఁక నీకుఁ బోలినభంగిఁ జేయు మనుచున్నంత విదురుఁ డిట్లనియె. దుర్యోధనా, నిన్ను గుఱించి నే నంతవగవంగాని ముదుసళ్లగునీగాంధారీధృతరాష్ట్రులం గుఱించి నెవ్వగం బొగులుదు. కుపుత్రుఁ డైననిన్నుఁ గని వీరు కులహానిం జేసికొని ఱక్కలు తెగినపులుగులతెఱంగున భిక్షుకులై యేడ్చుచు నింక మీఁదఁ ద్రిమ్మరవలయుఁగా యని తలంచికొనిన నామనంబు నీఱగు నేమి సేయ వచ్చు ననుచుండ ధృతరాష్ట్రుఁడు సకలరాజసమక్షమునఁ గొడుకున కిట్లనియె. అన్నదుర్యోధనా, సర్వలోకేశ్వరుం డైనవాసుదేవునివచనంబు పట్టుము. ఇతండు తోడయ్యెనా సర్వార్థంబులును మనకుఁ గరగతంబులు. పాండుపుత్రులతోడ సంధి చేసి కులంబు రక్షింపుము. వాసుదేవుఁ డనుదివ్యతీర్థమునఁ గ్రోధానలంబుఁ జల్లార్చి శాంతిఁ బొందుము. ఇప్పటి కిదియె కాలప్రాప్తంబు. ఇమ్మహాత్ముని వచనంబు నిరాకరించిన మేలు గలుగదు. కావున నితనితోడ నుపప్లావ్యమున కరిగి యజాతశత్రునకుఁ బాదప్రణామం బాచరించి సాదరంబుగ నతండు చేదోయిఁ గ్రుచ్చి యెత్తి కౌఁగిటం జేర్చి మేనెల్ల నిమిరిన నయ్యానంద మనుభవించి భీమసేనునితోఁ బరస్పరాలింగనంబు నిర్వర్తించి నీకు మ్రొక్కినయర్జున నకుల సహదేవులం గాఢపరిరంభమున నాదరించి మూర్ధాఘ్రాణంబుఁ గావించి మీరు వారునుం గలసి యొక్కటియై యుండిన సకలరాజులు నానందబాష్పపరిపూర్ణ నయనులై నిన్నుఁ జూతురుగదా. అయ్యది యెంత యొప్పునో. ధార్తరాష్ట్రులు పాండవులుం గూడియున్నా రన్న జనులెల్ల నెంతయుల్లసిల్లుదురో గదా. కావున సర్వజనక్షేమంబును నాత్మశ్రేయంబునుం గోరి పాండుపుత్రులతోడ సంధిఁ గావింపు మనిచెప్పిన నప్పలుకులు దనకు వాఁడిములుకులై సోఁకుటయు నత్యంత క్రోధఘూర్ణమానమానసుండై దుర్యోధనుండు జనార్దనున కిట్లనియె.

దుర్యోధనుఁడు శ్రీకృష్ణునకుఁ బ్రత్యుత్తరిచ్చుట.

వాసుదేవా, నీ వెల్లపుడును బాండవులమీఁది పక్షపాతంబునంజేసి గుణదోషబలాబలములఁ బరికింపక నన్నే నిందింతువు. మాతండ్రియుఁ, దాతయు, నాచార్యుఁడును, విదురుఁడును నన్నే తూలనాడుదురుగాని పరులనేమియు ననరు. అందులకు నాచేసినతప్పు కొంచెమేనియు నెంత వెదకినను దోఁపదు. అకారణంబ మీ రందఱు నాతోఁ బగ పాటింతురు. ధర్మరాజు ద్యూతప్రియుండై శకు

నితోడ నాడి రాజ్యమంతయు నోటువడియె. ఓటువడినధన మంతయుఁ గ్రమ్మఱఁ దానే గొనియె. క్రమ్మఱవనవాసాజ్ఞాతవాససమయమున ననుద్యూతం బాడియందునుం బరాజితుండై తమ్ములు భార్యయుందాను నప్పాట్లఁ బడియె. అందునాత ప్పెయ్యది? మఱియు నిపుడును వారలే మాత్స్యపాంచాలాదులను గూర్చుకొని పోరికి సమకట్టి రనిన విని మేము నందులకుఁ దగిన తెఱంగుగా యుద్ధసన్నద్ధులమైతి మింతియకాని యుగ్రకర్మమునకుఁ దొలుత మేము దొడరుటయును లేదు. ఇట్లుమాపై నెత్తివచ్చినవారికి వెఱచి యిఁక మ్రొక్కుదుమే? ఇంద్రుండైనను యుద్ధార్థియై వచ్చెనేని చక్క నిల్చి యోపినంత పెనంగుదుముకాని బీరము డిప్పోవ లోఁగము. శత్రువు లెత్తివచ్చినపుడు లోఁగుట క్షత్రధర్మంబుగాదు గదా? మఱియు వారు బలవంతులనియు మేము దుర్బలులమనియుం దలంపనక్కఱ లేదు. భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణులు మావారు. వారల దేవతలుం గెలువనోపరు. ఇఁక బాండవులు గెలువఁ జాలుదు రని యెట్టు లూహింపవచ్చు? ధర్మమునకును బ్రాహ్మణులకును మ్రొక్కుదుముగాని మేము లాఁతులకుఁ జేమొత్తము. ఎట్లయినను గులధర్మంబు మానము. చలంబు డింపక కడిమి మెఱయఁ బోరాడి గెల్తుమేనియు నిస్సపత్నముగ రాజ్య మేలుదుము. కాదేని శరతల్పములందు వీరశయనంబుఁ బ్రాపింతుము. యుద్ధమున నెవ్వరేనియు రాజ్యమేలుటయకాని యింక వారునుమేమునుం గలిసి పంచికొని యేలుటనుమాట లేదు. ఇంతయు నిక్కువంబు. మున్ను వారు మాతండ్రి కరుణించి యిచ్చిన రాజ్యముఁ బడసి చవి గన్న వారు గావున నిపుడునుం బా లడుగుదురు. అపుడు నేను బాల్యమున నెఱుంగకుండినం జెల్లె. ఇఁక వాఁడిసూదిమొన మోపినంత యేనియుం బుడమి నే నియ్యను. వారిచేనయినది వారు చేయుదురుగాక మా చేనయినది మేముం జేయుదు మని తెగఁబాఱి పలికిన విని యించుక నగి యధోక్షజుండు క్రోధతామ్రేక్షణుండై సభ్యు లందఱు వినంగ ధార్తరాష్ట్రున కిట్లనియె. దుర్యోధన, వినుము. నీకోరినట్లు వీరశయనంబుఁ బ్రాపింతువు. యుద్ధము మాన నని మమ్ము వెఱపింపఁ బని లేదు. అచిరంబ సంగ్రామంబుగాఁగలయది. నీవు నీవారితోడఁ జక్క నిలుము. కొలఁది వెట్టరానియెగ్గులు సేసియు నావలనం దప్పొకింతయు లేదనియుఁ బాండవులవలనన సకలదోషంబునుం బుట్టె ననియుం బల్కితివిగదా. నీచేసినచెయ్వుల రాజు లందఱు నెఱుంగుదురు. పుట్టిననాఁడుమొదలుగాఁ బాండవులకు నీ వెగ్గుసేయని దినము గలదే? పాములఁ గఱపించియు విషముఁ బెట్టించియు నూరు వెడలఁగొట్టియు లక్క యిల్లు గాల్పించియు బహువిధముల వారికిఁ గీడే చేసితివి. ఎన్ని చేసినను దైవబలసంపన్నులు గావున వారు సెడరైరి. నీ పెట్టినబాధలకు వా రోర్చుచు బ్రదుకుచు నేకచక్రాపురమున

గూఢముగ భిక్షాజీవనులయి కొంతకాలముఁ గడిపిరి గదా. అంత వారు నిజభుజబలమున దిగ్విజయము చేసి రాజ్యమునకుఁ బెంపు సంపాదించి సుఖముండఁగ నీవు చూపోపకపాపమతివై కర్ణశకునిదుశ్శాసనులదుర్మంత్రమున దుర్ద్యూతవ్యాజమున వారిసంపదనెల్ల నాఁచికొంటివి. ధర్మరాజు ప్రియంపడి జూదమాడెనా మీనిర్బంధమున నాడెనా! నీవ చెప్పుము. జూదము సజ్జనగర్హితంబనియు దానివలన ననేకవ్యసనములు మూఁడుననియు నప్పుడు పెద్దలు చెప్పినబుద్ధి వినియైన నాదురుద్యమంబు మానవైతివి. అది యట్లుండె. జూద మాడి కులాంగనలను రచ్చకుఁ దెచ్చి భంగపెట్టువాఁడు నీవుదక్క మఱియెవ్వఁడైనం గలఁడే? కులశీలసంపన్నయుఁ బాండవులకుఁ బ్రాణము నగుపాంచాలిం బరిభవించినపాపంబు మిమ్ముఁ జెఱుపకమానదు. ఆకొలువులోఁ గర్ణాదు లగుతులువలు పలికినపలుకు లుగ్గడించునట్టివే? మఱియు వా రడవులకుఁ దఱలునపుడు నీవును దుశ్శాసనుఁడును నేమేమంటిరి వానినెల్ల నీయున్నవా రందఱు నెఱుంగరే? అందఱియెట్టయెదుట వారి కపచారములు లెక్క లేకుండఁ జేసియు నీవు డీనిండుకొలువున నాచేసినతప్పు కొంచెమేనియు లే దని పలుకుట కేవలసాహసంబకదా. నీకంటె ననార్యుఁడు లోకమున నెవ్వఁడును గానఁబడఁడు. నీ విన్ని చేసినను మహాత్ములయినపాండవులు కులక్షయంబునకొల్లక సంధిఁ గోరినను నీవు నే నొల్ల ననుట నీదౌర్భాగ్యంబ. హితార్థు లందఱుం జెప్పఁగలయంతయుం జెప్పినను నీవు శాంతిఁ బొందవైతివి. ఇంతకంటె బుద్ధిలాఘవంబు లేదు. నీమేలుఁ నీ వెఱుంగక చెడియెద వధర్మమున కపకీర్తికిం బాత్రంబ వగుద వనుచున్నంత దుశ్శాసనుఁడన్నం బిలిచి నీవు పాండవులతోడ సంధి యొల్లవేని నీతండ్రియు భీష్మద్రోణులును నిన్ను నన్నుఁ గర్ణశకునులను బట్టి బంధించి యప్పాండుపుత్రుల కప్పగింతు రింతయు నిక్కువం బనుటయు దుర్యోధనుండు కోపదీపితుండై మహానాగంబుచందంబున నిశ్వసించుచుఁ దండ్రిని భీష్మద్రోణకృపబాహ్లికసోమదత్తవిదురులను సర్వేశ్వరుం డైనజనార్దనుని ననాదరించి దిగ్గన లేచిపోయె. అంత నతనితమ్ములును శకునిరాధేయాదు లగుకొందఱురాజులుం దోడ నరిగిరి. కొలువెల్ల సంచలించె. అట్టియెడ భీష్ముఁ డేల యీదుర్యోధనుఁడు సిగ్గుమాలి మర్యాద విడిచి యిట్లు లేచిపోయె. రాజ్యగర్వంబునఁ గన్నుగానఁడు కాఁబోలు. వానితోడన తాము నురాజులమనుకొను దురాత్ములుం గొందఱు చనిరి. వీ రందఱకుం గాలంబు దీఱెఁగాఁబోలు ననుచుండఁ బుండరీకాక్షుండు భీష్మద్రోణాదు లగుపెద్దలం జూచి యిట్లనియె. ఈదురాత్ముఁడిట్లు వెడలుట యందఱకు నవమానకరంబు, ఇంక నిప్పటికిఁ గర్తవ్యంబు సెప్పెద. మీకుఁ బోలు ననితోఁచునేని చేయుఁడు. ఉగ్రసేనసుతుం డైనకంసుఁడు వీనియట్ల దురాచారుండై కులమునకుఁ జేటు గావించుచుండ

నేను వానిం బరిమార్చి యుగ్రసేనునకుఁ బట్టాభిషేకము నొనర్చి కులము
రక్షించితి. మఱియు దైత్యదానవులు సురలతోడఁ గలహించుచు లోకమునకుఁ
బీడఁ గావించుచుండ బ్రహ్మదేవుఁడు వారల దృఢపాశముల బంధించి వరుణలోక
మునం ద్రోఁచె. ఇప్పటికిని వార లాబంధనములతో వరుణప్రత్యవేక్షితులై యు
న్నవారు. ఒకనివలనఁ గులమునకుఁ గీడు మూఁడునెడ వానిని, నొక్కకులమునం
గ్రామమునకుఁ జేటు వాటిల్లునెడ నాకులమును, నొకగ్రామమువలన జనపదము
నకు సేఁగి పొసఁగునెడ నాగ్రామమును, దనవలనఁ బుడమి సెడునెడఁ దాను
భూమినిం బరిత్యజింపవలయు నని పెద్దలు సెప్పుదురు. కావునఁ గులమునకుఁ
గీడు సేయుదుర్యోధనదుశ్శాసనకర్ణశకును లనుదుష్టచతుష్టయంబును నిగ్రహించి
చెఱఁ బెట్టి యాధృతరాష్ట్రుండు పాండవులకు రాజ్యమునం బా లిచ్చి శాంతిఁ
బొందుట మేలు. ఇట్లు చేసినఁ గులమునకును బంధువులకును లోకములకును మే
లు గలుగు ననిన విని ధృతరాష్ట్రుఁ డదరిపడి విదురుం బిలిచి నీవు పోయి
వేగంబ గాంధారిం దోడ్తెమ్ము. అది మహాప్రాజ్ఞురాలు. తానైన నీదురాత్మునకుఁ
దగినబుద్ధులు సెప్పి మంచితెరువు చూపి యిమ్మహావ్యసనంబు దప్పించి శాంతిఁ
బొందించు ననుటయు నతం డతిరయమునఁ జని యద్దేవిం దోడితెచ్చె. వచ్చిన
గాంధారిం బిలిచి ధృతరాష్ట్రుండు వింటివే నీకొడుకుకొఱగాములు. దురాత్ముండై
యైశ్వర్యలోభమునఁ బెద్దలమాటలు వినఁడు. ఐశ్వర్యంబును బ్రాణంబునుం దుదిఁ
గోల్పడు. ఇక్కడ నిందఱు పెద్దలును బెద్దలకుం బెద్ద యగుజనార్దనుండునుం గూర్చుం
డి హితము బోధించుచుండ నందఱ నుల్లంఘించి లేచిపోయె. నీవైనను వాని మం
చిమాటలఁ దేర్పవే యనిన నద్దేవి యతనికిట్లనియె. ఇందు వాని ననం బని యేమి?
ఆదుర్వినీతు నియ్యకొల్ప నేల? కామక్రోధలోభదోషదూషితచిత్తుం డైనవాని
నెవ్వరు దేర్ప నేర్పరులు గారు. పాండవులకు రాజ్యమునం బాలు నీ విచ్చిన ని
న్నడుగువా రెవ్వరు? అట్లు చేయక కొడుకు నెడంబఱుపవలయు ననువెఱ్ఱితలంపు
పెట్టికొన్నని న్ననవలయు. నీయుపేక్షవలనం గాదే యిన్ని చేటులు వాటిల్లె. సామ
దానసాధ్యు లగుపాండుపుత్రులపైఁ గొడుకు దండప్రయోగంబు సేయవలయునన్న
నిప్పటికైనను నీవు నీతొల్లింటిచందము మానవైతివి. ఇందులకు ఫలం బనుభవిం
పక తీఱునే? పాపచిత్తుం డైనవాని రప్పింపుము. నేనుం జెప్పిచూచెద ననుటయు
ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుం దోడ్తేర విదురుం బంపె. విదురుండును బోయి
యనునయించి నీతల్లిదండ్రులు నిన్ను రావించుచున్నవా రని తెల్పిన విని వాఁడును
బొమలుముడిపెట్టిన మొగంబున దీర్ఘోష్ణనిశ్వాసపవనంబు లొలయుచుండ సభకు
వచ్చుటయు నుత్పథప్రవిష్టుం డైనకొడుకుం జూచి తన్నుఁ దాన దూఱుచు నిట్ల
నియె.

## గాంధారి దుర్యోధనునకు హితంబుఁ జెప్పుట.

అన్న దుర్యోధనా, వినుము. మీతండ్రియుఁ బితామహుఁడై నభీష్ముఁడును నాచార్యుండై నభారద్వాజుఁడును హితార్థి యైనవిదురుఁడునుం జెప్పినమాటల గ్రహింపుము. అది నీకు హితము సుఖకరము. వింటివేని మమ్మెల్లఁ బూజించినట్లు తలంతుము. కేవలకామమున నంతయు మనకే కలుగవలయునన్న నొడఁగూడదు. ఒడఁగూడిననుం బాలించుట దుష్కరంబు. కామమునకును మేర వలయు. దాని దాఁటి విచ్చలవిడి ప్రవర్తించినం జేటు తప్పదు. కామక్రోధముల నడఁచికొనవలయుఁగాని వానికి లోఁగరాదు. లోఁగిన సూక్ష్మరంధ్రనిబిడం బయినవలలోఁ జిక్కిన మీలచందమున నవిశరీరమున దాఁగి జ్ఞానముఁ జెఱుచు. దాన నైహికాముష్మికములకు హాని దొడరు. వానిఁ గెలిచినరాజు విజయంబుఁ గాంచు. కామక్రోధవిజయంబే లోకేశ్వరులకుఁ బ్రభుత్వంబు. దురాత్ము లది యెఱుంగక యత్యంత కామావిష్టులై తమకున్న రాజ్యమునుంగూడఁ జెఱిచికొందురు. మహత్త్వంబుఁ బడయఁ గోరువాఁడు దొలుత నింద్రియంబుల జయింపవలయు. నిగృహీతంబులయినయింద్రియములు శుష్కేంధనములు వహ్ని నెట్టు లట్టుల బుద్ధిని మీఁదు మిక్కిలి పెంచు. అవి నిగృహీతంబులు గాక స్వైరచరములయ్యెనా మత్తతురంగంబులు నేర్పులేనిసారథింబోలెఁ గుమార్గమున నీడ్చు. కావునఁ దొలుతఁ గామక్రోధముల నడంచి తన్ను గెల్చి యటఁ బెఱవారల గెలువఁ బూనవలయు. అట్టి మహనీయుని శ్రీ తాన వలచు. కామక్రోధాభిభూతుండై తనవారియెడఁ గాని లాఁతులయెడఁ గాని మిథ్యాప్రచారంబు సేయువాని కెంతసహాయసంపద యున్నను దుది లేనియట్ల యగు. నీ వట్టులు గాక కామక్రోధములఁ బరిత్యజించి పెద్దలమాట విని శూరులు ప్రాజ్ఞులు నగుపాండవులతో సంధి చేసి పెద్దకాలంబు సుఖింపుము. మీకు మేలు సేయఁగ నీజనార్దనుఁ డిచ్చటికి విచ్చేసె. ఇమ్మహాత్మునిఁ జూచియైన శాంతిఁ బొందుము. ఇద్దేవదేవునిమతమునకు విరుద్ధముగ నడువరాదు. అతనిచిత్తప్రసాదంబు వడసితివేని మేలు గనుట నిక్కంబు. పాండవులకును మీకును భేదము దగ దనుభావంబుననే మీతండ్రి తొలుత వారికి రాజ్యమునం బా లిచ్చె. ఇప్పు డియ్యకుండుట యుఱవు గాదు. నీకుఁ గలయర్ధరాజ్యము నీకును నీవారికిని సుఖజీవనమునకుఁ జాలు. వారికిని యథోచితం బిచ్చుటయ లగ్గు. వారితోడికలహంబునఁ జేటు తప్పదు. పదుమూఁడేండ్లు వారిపై సాధించినకోపము చాలు. యుద్ధమున ధర్మార్థసౌఖ్యము లెవ్వియుం గలుగవు. బుద్ధిమంతులు జితేంద్రియులు ధార్మికులుం గావున వారే జయింతురు. కర్ణశకునిదుశ్శాసను లశక్తులు గావున నీకు విజయం బాపాదింతు రని నమ్మవలదు. భీష్మద్రోణాదులు నిన్ను గెలిపింతు రనుటయు నాకుఁజూడఁ దోఁపదు. వారు మీ

కును వారికిని నెక్కురూపయయినను మీపిండముఁ దినిమెద మనుతలంపుతో సమరమునకు వచ్చి వట్టిశౌర్యము పట్టి పోరాడుదు రింతియకాని యొండు గాదు. ఎందఱు బలవంతులు నీకుఁ దోడయినను వారికి ధర్మంబు దోడు గలదు గావున వారే గెల్తురు. ఎంతటివారును క్రోధోద్దీపితుం డయినధర్మజునెదుట నిలువనోపరు. లోభమున నెవ్వరికి నర్థసంపత్తి గలుగనేరదు. భీష్మద్రోణకృపకర్ణాదులగునీదిక్కువారును భీమార్జునయమధృష్టద్యుమ్నాదు లగునాదిక్కువారలునుం గూడి పోరాడి రిత్తజనక్షయము చేయుటకంటె నిపుడే శాంతిఁ బొంది వారిపాలు వారి కిచ్చి సంధి చేసి సుఖంపుమయ్యా, యని గాంధారి బుజ్జగించి బోధించిన నవ్వచనంబుల నాదరింపక క్రోధసంరంభవశుండై దుర్యోధనుండు మొగంబుఁ ద్రిప్పికొని కొలువు వెడలి చనియె.

## దుర్యోధనాదులు శ్రీకృష్ణునిఁ జెఱఁ బెట్టఁ దలఁచుట.

అట్లు చని యక్కురుకులాధముండు తనవెంటనంటి వచ్చినకర్ణశకునిదుశ్శాసనులతోడ మంతనంబుండి యీజనార్దనుఁడు ధృతరాష్ట్రభీష్మద్రోణాదులయనుమతంబున మనలఁ బట్టి బంధించుచందంబు దోఁచెడి. మన మంతకుమున్న యతనినే పట్టి చెఱఁ బెట్టితిమేని పదంపడి పాండవులు మాత్స్యపాంచాలాదిసహితంబుగా వాసుదేవహీనులై కోఱలు పెఱికినపాములట్లు నిరుత్సాహులై మనకు విధేయు లగుదురు. కావున నాలసింపక ధృతరాష్ట్రుఁడు లఱచి వారింపుచున్న నమ్మాటలం జెడచెవులఁ బెట్టుచు బలారి బలింబోలె మన మీకృష్ణుని బట్టుద మని తమలో గుజగుజలువోవుచుండిరి. ఇంగితజ్ఞుండైనసాత్యకి వారల బుడిబుడిపలుకులుఁ దత్తరపాటు నుపలక్షించి తదీయపాపాభిప్రాయం బూహించి తెలిసికొని తమవాఁడైనకృతవర్మ నేకాంతమునం జీరి దుర్యోధనాదిదుష్టచతుష్టయంబున కన్నను బంధింపవలయు ననుతలంపు వొడమెఁ గావున నీవు మైమఱువు దొడిగి నీసేనతోడ సభాద్వారమునఁ గాచియుండుము. ఏను లోపలి కరిగి యంతయు నన్నకు నివేదింతు నని చెప్పి సభ కేతెంచి చక్రాయుధునకు విన్నవించి యట ధృతరాష్ట్రుని భీష్మద్రోణవిదురాదులనుం జూచి యించుక నగుచు వింటిరే దుర్యోధనాదు లగుదురాత్ములదురుద్యమంబు. కామక్రోధలోభములు తమ్ముఁ ద్రిప్పఁగఁ దమకోలంది యెఱుంగక దుర్లభదుష్కృత్యంబుఁ జేయఁ జూచుచున్నవారు. ఈపుండరీకాక్షుం బట్టి చెఱఁ బెట్టుదురఁట. ఈయుద్యమంబు చీరకొంగున నగ్నిం గట్టిన ట్లగుఁగాని యొండు గా దనిన విదురుఁ డదరిపడి ధృతరాష్ట్రున కిట్లనియె. అయ్యా, నీకొడుకులందఱికిని వినాశకాలంబు సంప్రాప్తంబయ్యె. అవిజ్ఞేయమహాప్రభావుం డైనయిప్పుండరీకాక్షుని నిగ్రహింపఁగదా యాదురాత్ములు తలంచినవారు. అద్దిరా! యిది యెక్కడిమాట! అందఱిమేలు

గోరి వచ్చినయీభగవంతునిపైఁ జెఱుతలంపు తలంచిరి. ఇమ్మహాత్మునెదుటం బడి యగ్నిలోఁ బడినమిడుతలట్లు రూపఱుదురు. ధర్మ మరసి యూరకుండుటం జేసి యిన్నాళ్లు నీకొడుకులకు బ్రదుకు కలిగెఁగాని యించుక కోపించినయేని కొదమసింగ మేనుంగులంబోలెఁ బరిమార్చుట నిక్కం బనిచెప్పుచున్నంత వెన్నుఁడందఱు వినంగ ధృతరాష్ట్రుం జూచి రాజేంద్రా, మీవార లుక్కు మిగిలి నన్నుఁ బట్టి బంధింపఁ దలంచి రని వెఱవం బని లేదు. నీ వనుజ్ఞ యిచ్చితివేని యందులకుఁ దగిన తెఱంగున నేనుం బ్రవర్తించెద. వారి కలవి యగునేని వారు నన్నుఁ బట్టుదురు. నేన యోపుదునేని వారలఁ దెగటార్చెద. పాండవులఁ జెఱుపఁ బూనిననీకొడుకులు తామే చెడుదురు. వా రిట్లు చేయఁ బూనుటం జూడ ధర్మరాజుకార్యము నెఱవేఱినదియ యనితోఁచెడి.. వీరిం బట్టి యయ్యజాతశత్రునకు సమర్పించెద. దుర్యోధనుండు పూనినపూనిక కొనసాగని మ్మనిపల్కిన విని ధృతరాష్ట్రుఁడు భయవిహ్వలమానసుండై విదురుం బిలిచి రాజ్యలోభమున మీఁ దెఱుంగక విచ్చలవిడి బ్రవర్తించుచున్న యీదుర్యోధనుని మిత్రమంత్రిసోదరవర్గముతోడ వేగంబ యిటకుఁ దోడ్తెమ్ము. అలవి యగునేని మంచిత్రోవకు దించెద ననుటయు విదురుఁడు సని రానెల్లనియాదురాత్మునిఁ బ్రార్థనాలాపముల ననునయించి మంత్రిమిత్రసోదరసహితంబుగాఁ దోడ్కొనివచ్చె. వచ్చిన దుర్యోధనుం బిలిచి ధృతరాష్ట్రుఁ డోరీపాపాత్మా, పాపబుద్ధులతోడఁ గలిసి సాధునింద్యం బయశస్కరంబు నగుదుష్కృత్యం బేల చేయఁ బూనెదవు? కులపాంసనా! యిట్టితలంపు నీ కెట్లు పుట్టెరా? దేవగణపరివృతుండైనదేవేంద్రుఁడు నిమ్మహాప్రభావుని నిగ్రహింపఁ జాలఁడు. "చందమామ రావే" యనిపిలిచి చేయి సాఁచి జాబిల్లిఁ గొనఁ దమకించుబాలునిచందమున నీ వప్రమేయమహిముఁడైన యీజగన్నాథుం బట్టఁ బూనుట కరతలమున వాయువు నొడిచిపట్టుకొన నుద్యమించుకైవడిని, మండుచున్నచిచ్చుం జేత గ్రహింపఁ దలంచువిధమునను, భూమండలముఁ దలఁ దాల్ప నుద్యమించు తెఱంగునను శక్యంబు గాదు. మఱి యనర్థకారణం బనుచున్నంత విదురుఁ డాధార్తరాష్ట్రున కిట్లనియె. దుర్యోధన, యింకనైనను నామాట వినుము. అనర్థకారణం బగుతలంపు మానుము. ఈమాధవుఁ గేవలమానవుఁగా నెన్నరాదు; ఇతనియమానుషకృత్యంబు లెన్నియే విందుముగదా. మున్ను సౌభద్వారంబున ద్వివిదుఁ డనువానరుఁ డీమహనీయుం బట్టఁ బూని విక్రమించి శిలావర్షంబుఁ గురియించియుఁ జేయఁగలజతనంబు లన్నియుఁ జేసియుఁ దుది నశక్తుఁడై పఱచె. నిర్మోచనస్థానంబున నూఱువేలమహాసురులు నిమ్మహాత్మునిం బట్టఁ జాలరైరి. ప్రాగ్జ్యోతిషాధిపతి యగునరకాసురుఁడు బహుసహస్రదనుజగణపరివృతుండై యురువడించియు నిగ్రహింపనేరక తుదిఁ దాన పొలి

వ్రాయె. వారికంటె నీ వధికుఁడవే? ఇవ్విచిత్రచరిత్రుండు చిన్ననాఁడే పూతనం బరిమార్చె. బకరూపధారి యగుబకాసురుం దెగటార్చె. వృషభరూపంబుతోఁ బొడువ వచ్చినయరిష్టనామకదానవుం జంపె. గర్దభాకారుఁ డైనధేనుకాసురుం బొరివుచ్చె. అశ్వరూపధారి యగుకేశినామకదనుజుం జదిపె. చాణూరమల్లుం బీఁచమడంచె. కంసుని వధించె. శిశుపాలదంతవక్త్రులఁ ద్రుంచె. బాణాసురుం బొలియించె. మఱియు నెందఱేని రాజులం జక్కాడె. గోరక్షణపరుండై గోవర్ధనపర్వతం బుద్ధరించె. ఏకాదశినాఁ డుపవసించి ద్వాదశినాఁడు వేగకమున్న యమునాహ్రదంబునఁ గ్రుంకిడుచున్న నందగోపకుని వరుణదూత వరుణలోకమునకుఁ గొనిపోవుటయు నది యెఱింగి యీవాసుదేవుండు దా నచటి కరిగి తనరాకకు వెఱచి వరుణుఁ డర్పించిననందునిం దెచ్చె. నందవ్రజంబుఁ జుట్టుకొనినకార్చిచ్చుం ద్రావి గోపాలురఁ గాచె. ఇంద్రుని జయించి సత్యాప్రియకరుండై పారిజాతంబుఁ బుడమికిఁ దెచ్చె. ఇద్దేవదేవుఁ డవతారాంతరమునఁ జేసినమధుకైటభసంహారాదికృత్యంబులు వేనవేలు గలవు. తెలియక యితనికిఁ గీడు రోసితివి. కోపాటోపదీపితుం డైనయీపంకజాక్షునెదుటం బడితి వేని యగ్నిలోఁ బడినమిడుతవడువున మిత్రమంత్రిజనసహితంబు చెడియెద వని యక్కుటిలబుద్ధికి బుద్ధి సెప్పుచుండె.

**శ్రీకృష్ణుఁడు విశ్వరూపంబుఁ జూపుట.**

అయ్యవసరంబున దనుజాంతకుం డగునారాయణుండు ధార్తరాష్ట్రుం బిలిచి దుర్యోధనా, మూఢుఁడవై నే నొక్కరుండన యనితలంచికదా నన్ను బంధింపఁ గడంగితివి. ఇచ్చటన పంచపాండవులు, యదువృష్ణిభోజాంధకవీరులు, వసురుద్రాదిత్యులు, ఋషివర్యులుం గల రనిపలుకుచుఁ బెలుచ నగియె. నవ్వుటయు నప్పరమేశ్వరునిఫాలభాగమున బ్రహ్మయు, వక్షస్థలంబున రుద్రుండును, భుజచతుష్టయంబున లోకపాలురును, వక్త్రమున వైశ్వానరుండును, సర్వాంగంబులం దాదిత్యులు, సాధ్యులు, మరుద్గణంబులు, విశ్వదేవు, లశ్వినులు, యక్షగంధర్వరాక్షసాదులుం బుట్టిరి. దక్షిణభుజంబున గాండీవపాణి యైనయర్జునుండును, వామభుజంబున హలధరుఁ డైనబలభద్రుండును, వీఁపున నిజాయుధధారు లయినయుధిష్ఠిరభీమసేననకులసహదేవప్రద్యుమ్నులును యదువృష్ణిభోజాంధకవీరులు నుద్భవిల్లిరి. శంఖచక్రశార్ఙ్గనందకకౌమోదకీప్రముఖంబు లయిననర్వప్రహరణంబులును నానాభుజంబులందు దీప్యమానంబు లయ్యె. నేత్రశ్రోత్రనాసికావివరంబులందును రోమకూపరంధ్రంబులందును ధూమసహితంబు లయినవిస్ఫులింగంబు లత్యంతరౌద్రంబులై ప్రాదుర్భవిల్లె. ఆసంక్షోభమునకుఁ బుడమి వడంకె. సాగరంబులు గలఁగె. అత్యంతఘోరం బయినయప్పరమేశ్వరునాకారంబు వీక్షింపఁ జాలక సకలరాజులును సాధ్వసావేగసంక్షుభితచిత్తులై కన్నులు మూసికొనిరి. భీష్మద్రోణ

విదురసంజయులును నారదాదిమహామునులును నయ్యుప్రమేయునిప్రసాదంబున దివ్యదృష్టిం బడసి యత్యంతాశ్చర్యం బగునావిశ్వరూపంబుఁ గనుంగొనుచు భక్తిరసంబు పొంపిరివోవఁ దమనెమ్మనంబులం దనుసంధించుచుఁ బరమానందంబునం బొదలుచుండిరి. అప్పుడు దివి దేవదుందుభులు మ్రోసె. పుష్పవర్షంబు గురిసె. ప్రజ్ఞాచక్షుం డైన యాధృతరాష్ట్రుం డాకోలాహలంబు విని యిదిపురుషోత్తమువిశ్వరూపవిజృంభణంబుగానోపు నని యూహించి భక్తిసాంద్రుం డై భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛనుం బ్రార్థించి తత్ప్రసాదంబున లబ్ధనేత్రుం డై యద్దివ్యాకారదర్శనంబుఁ గావించి కృతార్థుం డయ్యె. అతనికిఁ గన్నులు వచ్చుట కచ్చటిమునులెల్ల నద్భుతం బంది గోవిందునిఁ బలుదెఱంగులఁ బ్రస్తుతించిరి. అంత నాధృతరాష్ట్రుఁడు దేవా, నిన్నుఁ జూచినకన్నులం దొరులఁ గన నొల్లను గ్రమ్మఱ లోచనము లుపసంహరింపవే యని వేఁడిన నవ్వేఁడికోలాలించి జగన్నాథుఁ డతనికోర్కి మెయిఁ గన్నులెప్పటియట్లకావించి నిజవిశ్వరూపప్రపంచం బుపసంహరించి లేచి నారదాదిమహామునులయానతిం గొని యారాజలోకమును సరకుసేయక సాత్యకికృతవర్మ లుభయపార్శ్వంబులఁ గై దండ లొసంగ నాస్థానంబు వెడలె. మునులు నంతర్హితు లైరి. పౌరరాజుచున్నచిచ్చుచందమున వెడలిన కమలనాభువెంట నాకొలువువార లందఱు నరిగిరి. అట్లు వెడలి నారాయణుండు సమయజ్ఞుం డై దారుకుండు రథముతోడ నెదుటఁ గానిపించి పాలభాగంబునఁ జేదోయి ఘటియించి మ్రొక్కుట యుఁ దే రెక్కుచుండె. అట్టియెడ ధృతరాష్ట్రుఁడు దేవా, నాకొడుకులు నామాటమెయి నడుచువారుగామియు సంధి సేయ నేఁ బలువిధములఁ బ్రయత్నము సేయుటయు నిచట నీకే ప్రత్యక్ష మయ్యెఁగదా. పాండవులపై నాకు దురభిప్రాయ మించుకేనియు లేదు. నావలనఁ గార్యమెద్దియు సాగదు. ఈయర్థంబుఁ గౌరవులును సకలరాజులు నెఱుంగుదురు. నీదివ్యచిత్తమునకు నావలనఁ దప్పు లేదని తేటపడెనేని యంతియ నాకుఁ జాలు ననిన విని వాసుదేవుఁడు భీష్మద్రోణకృపబాహ్లికవిదురులఁ గలయం గనుంగొని నేఁడు కౌరవసభం బుట్టినవిశేషంబులెల్ల మీ రెఱుంగుదురుగదా. మూఢుఁ డై నదుర్యోధనుఁ డెన్ని దెఱంగులఁ దెలియపడం జెప్పినను వినక తుది శిష్టచరిత్రంబునకుఁ దప్పి మర్యాద విడిచి కొలువు వెడలిపోయె. ఈధృతరాష్ట్రుఁడు దనవలనఁ గార్యము సాగ దని చెప్పివిడిచె, ఇంక నిందుఁ దడయం బనిలేదు. దీనినెల్ల ధర్మనందనునకు నెఱింగింపవలయుఁ గావునఁ బోయివచ్చెద ననిపలికి రథారోహణంబు సేసి కుంతీసదనంబునకుఁ జనియె. ధృతరాష్ట్రుఁడు భీష్మద్రోణకృపవిదురబాహ్లికాశ్వత్థామవికర్ణయుయుత్సుసహితంబుగా శౌరిరథము వెంబడిం జనియె.

## శ్రీకృష్ణుఁడు కుంతియనుజ్ఞఁ గొనఁ బోవుట.

అవ్విధమునఁ గుంతీసదనమున కరిగి పుండరీకాక్షుం డప్పాండురాజమహిషికిఁ బాదప్రణామం బాచరించి కురుసభలో నడచినవృత్తాంత మెల్ల సంక్షేపముగఁ జెప్పి దుర్యోధనుండు సంధికి రాఁడు. వానికిని దదీయులకును గాలముదీఱె. దీని నెఱింగింపఁ బాండవులకడ కిదె పోవుచున్నవాఁడనై నీయనుజ్ఞఁ గొన వచ్చితి. కొడుకుల కేమి చెప్పెద ననియడుగఁ గుంతీదేవి జనార్దనున కిట్లనియె. ధర్మరాజున కిట్లు చెప్పుము. అర్థజ్ఞానవికలుం డైనశ్రోత్రియునట్లు నీ వనువాకపాఠహతమతివై నీపట్టినదే ధర్మ మనితలంతువు. అది తగదు. శత్రునిగ్రహపూర్వకంబుగాఁ బ్రజలఁ బాలింపఁగ బ్రహ్మదేవుఁడు క్షత్రియుల సృజించెఁ గావున క్షత్రియకులధర్మము పట్టుము. తొల్లి ముచుకుందుఁ డనురాజునకుఁ గుబేరుఁడు ప్రీతుండై పుడమి నొసంగవచ్చిన నతండు క్షత్రియునకుఁ బ్రతిగ్రహం బనుచితంబు. బాహువీర్యార్జితధనమునఁ బ్రజాపాలనపూర్వకం బైనజీవనంబు విహితం బనిపలికి గ్రహింపక యాధనేశ్వరుఁ డందుల కబ్బురం బందుచుండఁ బెక్కండ్ర రాజులం గెలిచి రాజ్య మేలె నని పెద్దలు సెప్పుదురు. అట్టివారిచరిత్రంబులెల్ల నీవును వినియుండుదువుగదా. రాజు సమ్యక్పరిపాలనపరుం డయ్యెనేని ప్రజ లాచరించుధర్మమున నాలవపాలు దాను బడయు. వే యేల? కులోచితధర్మప్రవర్తనపరుం డైనరాజునకు స్వర్గంబు కరగతంబు. అది తప్పినవానికి నరకంబు దప్పదు. రాజు సముచితం బెఱింగి దండనీతిం బ్రయోగించినం గృతయుగంబు ప్రవర్తించు. కాలభేదమున ధర్మాధర్మములు ప్రవర్తిల్లు నని సంశయింపవలదు. రాజే ధర్మాధర్మములకుఁ బ్రధానకారణంబు. రాజువలననే కృతత్రేతాద్వాపరకలియుగములు నడుచు. కృతయుగధర్మముల నడిపించెనేని రాజు శాశ్వతస్వర్గలోకవాసంబుఁ గాంచు. త్రేతాయుగధర్మముల నడిపించెనేని కొంతకాలము స్వర్గసౌఖ్య మనుభవించు. ద్వాపరధర్మప్రవర్తనంబున నందులకుఁ దక్కువగా సుఖంబు గుడుచు. కలిప్రవర్తనమున నధిగతపాపుఁడై పెద్దకాలము నరకమునం బడు. రాజదోషములు లోకమునకును లోకదోషములు రాజునకును గలుగుట నిక్కంబు గావున రాజు దానుదనధర్మముఁ దప్పక నడుచుచుఁ బ్రజలెల్లఁ దమతమధర్మముల నాచరించు తెఱంగు సేయవలయు. అహింస పరమధర్మం బనుతలంపున యుద్ధ మొల్లకునికి రాజధర్మంబు గాదు. శత్రువులఁ జంపవలయు. ప్రజలఁ బాలింపవలయు. ధర్మము దప్పక ప్రజల నేలినం గలుగుసుకృతము వేఱొక్కట లభించునే? ఇపుడు నీవు నిజమేధావిభవమునఁ దెలిసి నడుచునీనడువడి మాతండ్రియుఁ దాతలును నడువరైరి. వారెల్లఁ బెద్దల సేవించి ధర్మాధర్మంబుల నెఱింగినవారలే కాని యెఱుంగనివారు గారు. యుష్మదాద్యనుపమైశ్వర్యప్రజ్ఞాబలతేజో

మాహాత్మ్యదీర్ఘాయుర్ధనపుత్రసంపత్తి మీకుఁ గలుగ దేవతలఁ బ్రార్థించితి. క్షత్రియులు తమబిడ్డలకు వీనింగదా ప్రార్థింతురు. నాచెప్పినది ధర్మ మనితోఁచుచుండ దోఁపకుండు నది యట్లుండె. క్షత్రియకులజన్మంబు కారణంబుగా నీ కిదియే పితృపితామహాదిపరంపరాప్రాప్తం బైనధర్మంబు. నిజభుజవిక్రమంబున రాజ్యము నకుఁ బెంపు సంపాదించి దానమునఁ గొందఱను బలమునఁ గొందఱను సూనృతవచనమునఁ గొందఱనుంగా సకలజనుల వశీకరించికొని కోశవృద్ధిఁ గావించి యాఁకొన్నయాచకులకు మీఁదు మిక్కిలి సంతసించునట్లు పుష్కలంబుగ నొసంగిన సంతకంటె నధికధర్మం బెయ్యది? నీవ చెప్పుము. బ్రాహ్మణులకు భిక్షాశనంబును, క్షత్రియులకుఁ బ్రజాపాలనంబును, వైశ్యులకుఁ గృషివాణిజ్యాదిమూలకధనార్జనంబును, శూద్రులకుఁ దత్పరిచర్యయుం గులధర్మం బని ధర్మశాస్త్రాచార్యులు విధించిరి కావున నాపత్సమయమునందుఁ గృష్యాదులు సెల్లినను భిక్షాశనంబు నీ కత్యంతనిషిద్ధంబు. క్షతమువలనఁ ద్రాణముఁ గావించుటయే క్షత్రియశబ్దనకుఁ బ్రవృత్తినిమిత్తంబు. దుష్టు లగుశత్రుల సంహరించుట నీకు ధర్మం బని వేఱ చెప్పవలయునే? కావునఁ గులీను లగుపూర్వులచరిత్రలఁ దలపోసి బలమును మానమునుం దెచ్చికొని పౌరుషంబు నెఱింగి మునిఁగిపోయినతండ్రిపాలు మఱల నుద్ధరింపుము సామదానభేదములఁ గార్యమగు నేని దండము తగదుగాని వానిలో నెక్కటనుం దీఱనియాతఱి దండముఁ బ్రయోగింపకున్నఁ గార్య మెట్టు లొడఁగూడు? లోకోత్తరుం డైనకొడుకును నిన్నుఁ గనియు నేను బాంధవులం బాసి పరపిండమునఁ గడుపు ప్రోచికొనుచుండెద. ఇంతకంటె దుఃఖము నాకెయ్యది వలయు? తండ్రితాతలచరిత్రలఁ దలపోసి రాజధర్మము దప్పక యుద్ధము సేయుము. కులధర్మము దప్పి క్షీణపుణ్యుండవయి తమ్ములతోడ నీవు పాపగతిం బొందకుము. ఇందుల కొక్కయితిహాసంబు గలదు. దానిం జెప్పెద నాకర్ణించి యుచితం బనితోఁచు ధానిం జేయుము.

కుంతి విదులాపుత్రసంవాదం బనునితిహాసంబుఁ జెప్పుట.

బహుశ్రుతయుఁ గోపవతియుఁ గులీనయు దీర్ఘదర్శినియు నగువిదుల యనుక్షత్రియాంగన దనకొడుకు సంజయుం డనువాఁడు సింధురాజున కోడి దీనుఁడైయింటికి వచ్చి పరుండఁగ వాని కిట్లనియె. ఓపౌరుషహీనుఁడా, నీ వెట్లు నాకడుపునఁ బుట్టితివి. నాకును నీతండ్రికినిం జనింప ననర్హుండవు. పౌరుషము దిగవిడిచి క్రోధము మాని నపుంసకునియట్టుల యాయుశ్శేషంబు గలదనుక మేలుగాంచ నాశ లేక బ్రదుకవలసినవాఁడవై తివి. ఇది నీకుఁ దగదు. అవమానంబు వచ్చు. దృఢచిత్తుండవై వెఱ పుడిగి లెమ్ము. పగవారి కోడి వారికిఁ బ్రమోదం బును బంధుసుహృజ్జనులకు విషాదంబునుం గావించుచు నిట్లు పరుండరాదు. పి

ల్లకాలువ క్రొంచెపునీట నిండుచందమునఁ గాపురుషుం డల్పముననే సంతోషిం. చు. అది యుత్తమక్షత్రియలక్షణంబు గాదు. ఎంత యున్న నింకను రాజ్యము సాధింపనవలయు ననుతలంపే క్షత్రియునిచిత్తమున నుండు. పాముకోఱఁ బెఱుకఁ బోయికుక్క యది గఱచినం దుదిఁ దాను జచ్చువిధంబుగా శత్రుల గెలువఁ బోయి వారి క్రోడి పఱచితివి. అది యెంతయు నొప్పదు. ప్రాణసంశయదశ వచ్చినప్పటికిం బరాక్రమింపనవలయుఁగాని వెఱవరాదు. డేగ పులుఁగులపై దూఁకు చాడ్పున సందు వెదకి శత్రువులపయిం దుముకవలయు. ఏల యిట్లు వజ్రాభిహతం బయినపర్వతంబుమాడ్కిఁ జచ్చినట్లు పడియుండెదవు. లేచి శత్రుసైన్యంబుపై నదరి తుమికి క్రొఱవి బగబగనమండుతెఱంగున ముహూర్తమాత్రంబేనియు శత్రువులపైఁ బ్రతాపంబుఁ జూపుము. ఉముకనిప్పు మండక పొగయే రాఁజుచందమునఁ గడిమి యుడిగి ప్రాణములఁ బెట్టికొనుట పౌరుషంబు గాదు. తీక్ష్ణత్వమృదుత్వంబులు రెండు నుండిన రాజజన్మంబు ఫలవంతం బగుఁగాని కేవలమార్దవంబు గొఱగాదు. మోహరించి యనికిఁ జొచ్చి మనుష్యదుర్లభముగాఁ బరాక్రమముఁ జూపినం గెలుపు గలిగినను గలుగకున్ననుం గొఱఁత లేదు. అప్పటికిఁ గులధర్మముఁ దప్పక యనుష్ఠించినట్ల యగు. కులోచితధర్మప్రవర్తనంబున నున్నదైవదుర్విపాకమున విజయంబు సేకూఱదేనియుఁబండితుఁ డందులకు వగవఁడు. అట్లు గాక కులధర్మము దిగవిడిచి ప్రాణములఁ బెట్టికొన్నమాత్రన ప్రయోజనం బెయ్యది? ఇష్టాపూర్తాదిధర్మములు నేఁటితో సమసె. కీర్తి పొడవడంగె. భోగమూలంబు దెగియె. జుగుప్సితం బైనబ్రదిమికంటెఁ జావు మేలు. శత్రువు బలియుండై కాలఁ ద్రొక్కిపట్టినప్పుడును వానిం బడఁ ద్రోచి చంపఁగ నుపాయంబు వెదకి విషాదంబుఁ దప్పించికొనుట యుత్తమధర్మము. కుపుత్రుఁడై నసీవు పుట్టి కులమెల్ల నేలయేటఁ గలుపఁ జూచెదవు. జను లెవ్వనివృత్త మద్భుతంబుగఁ బొగడరో వాని జన్మంబు గాల్పనే? దానతపస్సత్యవిద్యాధనలాభవిక్రమంబులఁ గీర్తి సంపాదింపని యధముని మేను నిరుపయోగంబు. దానిం గేవలమాంసపిండ మనియే యెన్నవలయు. వాఁడు స్త్రీ గాఁడు పురుషుఁడుం గాఁడు. విద్యాసంపద్విక్రమాదులఁ గీర్తి సాధించినవాఁడే పురుషుఁడు. పూర్వోత్తరపరిశీలనంబు మాని కాపురుషోచితంబు కీర్తిధ్వంసకారణంబు దుఃఖమూలంబు నగుభిక్షావృత్తిం బ్రదుక నేల తలంచెదవు? లోకావమానభాజనం బైనసీవలన మేమెల్ల బ్రదుకలేనివారమైతిమి. ఇఁక మేము నీయట్లు జీవితాపేక్ష పెట్టక యవమానమునకుఁ దలఁకి యీ దేశము విడిచి యెట కేనియుం బోయెదము. నిరమర్షుఁడు నిరుత్సాహుఁడు నిర్వీర్యుఁడు నగునీవు కలిపురుషుఁడవుగాని నాకుఁ గొడుకు గావు. క్షత్రియాంగన యెవ్వతేనియు నీయట్టికొడుకును గనకుండుఁగాక యని వేఁడెద దేవతలకు ప్రమో

క్కు లిడిమెద. ఇప్పటికైనను నీకుఁ బౌరుషంబు గలదేని తెంపుఁ జేసి యాలంబునఁ బగవారిం జంపుము. శాంతిదయ లిప్పుడు తగవు. ఇట్టిచోట్ల వానిం బ్రగ్రహించువాఁడు పురుషుఁడు గాఁడు. కావున మన స్సినుము చేసికొని యాత్మసుఖదుఃఖములఁ బట్టక యనికి నడిచి పగవారలఁ జెండాడి సుహృదమాత్యబాంధవప్రముఖులకు సంతోషముఁ గావింపు మనిన విని పుత్రుండు తల్లిం జూచి యిట్లుల నన్ననియెదవు. నేను బోరఁ బొలిసిన నీకు దుఃఖంబకాని యొండు లేదు. అప్పటికి నీ కీరాజ్యభోగాదుల నెయ్యది ప్రయోజన మనుటయు విదుల కొడుకునకు మఱియు నిట్లనియె. ఏది యెట్లయినను లోకనింద్యచరిత్రకులలోకముల మనశత్రువులు పొందుదురుగాకయనియు లోకస్తుత్యచరిత్రకులలోకములను మన సుహృద్బంధువులు పొందుదురుగాకయనియును నేఁ దలంతు. నీ విట్లు పోరికి వెఱచి యింట నుంటివేని నీకీర్తి సెడుటయకాక నీనిమిత్తమున మనవారందఱుం గీర్తిభ్రష్టు లగుదురు. భృత్యరహితులై పరపిండముఁ దినుచు శరీరయాత్ర నడపువానివృత్తిని నీ వవలంబింపవలదు. విక్రమార్జితధనమున బ్రాహ్మణాదులఁ బోషించి తత్సుకృతం బనుభవింపుము. సకలప్రాణులు పర్జన్యుని సురలు సురేంద్రు నెట్టు లట్టుల సర్వభూతముల నెవ్వని నుపజీవించు వానిజీవితము ఫలవంతము. నిజభుజార్జితవిభవంబున మెఱయువాఁ డుభయలోకముల సుఖించు. ఇత్తెఱఁ బౌరుషముఁ బరిత్యజింపఁగ నీకుఁదగదు. హీనులు నడుచుత్రోవం బడవలదు. శక్తి కొలఁది విక్రమముఁ జూపక జీవితకాంక్షి యగుక్షత్రియుఁడు చోరుఁ డనంబడు. అర్థవంతములు గుణవంతములు నగునిన్నిమాటలు సెప్పినను ముమూర్షున కౌషధంబుమాడ్కి నీ కింతకు రుచింపదయ్యె. సింధురాజుపరిజను లిప్పటికిని గ్రమ్మఱ నీవు గయ్యమునకు వత్తువొకో యనితలఁచి తమదౌర్బల్యమునకుఁ దలఁకుచుఁ దమగెలుపు నంత మెచ్చక సహాయసంపన్నుం బగువ్యవసాయముఁ జేయుచున్నారు. నీపౌరుషముఁ జూడఁ గోరినతక్కటిజనులు నీ విక్లే యుండుదేని పిదప దూఱుదురు. కావున దిట్టవై గిరిదుర్గాదులం బదిలపఱిచి భండనమునకుఁ బొమ్ము. కాలప్రాప్తంబు లగువ్యసనములకు వెఱచి పూఁచిపట్టికొన్న నీదేహ మెప్పటికైనను నశించునదియకాని జరామరణవర్జితంబై యెండ్లుపూం డ్లుండునది గాదు. సర్వకాలంబులందు సమ్యగ్జయంబుఁ బొందుదు వని నీకుఁ బెద్దలు సంజయనామం బిడిరి. ఇపు డాపేరు నిరర్థకంబు గాకుండఁ బోరాడుము. నీవు చిన్నవాఁడవైయుండ సమ్యగ్దర్శనుండైనయొక్క బ్రాహ్మణుండు వచ్చి యీకుమారుఁడు పెరిగి పెద్దవాఁడై మహారాజ్యము సేయుననియు నొక్కమహాసంకటముఁ బొంది మఱల దానిం బాసి పెంపుఁ గాంచుననియు నాతోఁ జెప్పినవాఁడు. కావున నీవు గెలుతువనినమ్మెద. దానం జేసియే పలుమాఱులు నిన్ననికిఁ బొమ్మని నిర్బంధించెద. పగ

ఱ భంజించి యర్థవంతుండవై జనుల కాప్యాయనము సేయువాని కర్థసిద్ధి నియతంబు. అర్థసిద్ధి యగుం గా దది యట్లుండె. మీతండ్రి తాతలు నడచిన తెరువు దప్పక నడువుము. ఇది యంతయు నెఱింగి యుద్ధమునఁ దలంపు వెట్టుము. ఇందులకు మాఱుపలుకవలదు. శత్రువులు రాజ్యముఁ గొని పోవఁగ రేలుంబవళ్లు కూడు గానక పరితపించుటకంటె నెండొక్కటి దుఃఖము గాదు. మరణప్రాయంబైనదారిద్ర్యమాత్ర మంతచింతాకరంబు గాదుగాని యిన్నినాళ్లు విభవమున బ్రదికి యింకఁ బేరును బెంపు నాఱడివోవఁగ బ్రదుకఁ గోరుట మరణముకంటె దుఃఖకరంబు. పతిపుత్రవధంబును నాకు దానికంటె దుఃఖ మనితోఁపదు. నేనుత్తమకులంబునఁ బుట్టి యుత్తమకులంబునే చొచ్చి పతి యెంతయు గారవమునఁ బోషింపఁ బెరిగి భక్తిపురస్సరం బయిననీశుశ్రూషనుం గాంచి తుది నెట్లు కుజీవనంబుఁ బడయుదు. నేనును గోడలు నుత్తమప్రకారంబున నిన్నినాళ్లు బ్రదికి యింక నవియన్నియుఁ బాసి చింత పెల్లునఁ గుందుచుండ నెట్లు చూతువు? మనవలన సుఖజీవికఁ గాంచుఋత్విగాచార్యపురోహితులు లాఁతులకు దాసులై యుండఁ జూచిన నెట్లగుదువు. అప్పటికి నీప్రాణ మేల? ఇపుడు నాచెప్పినట్లు శ్లాఘ్యకృత్యముఁ జేయవేని నాకుఁ జిత్తశాంతి యెక్కడిది? బ్రాహ్మణుఁడు వచ్చి యాచించెనేని నేనును నీతండ్రియు లే దనినవారము గాము. నీనిమిత్తమున దారిద్ర్యము మూఁడిన నట్టు లనవలయుఁగదా. ఎట్లు లందునో తలంచికొనినం గుండె బగులు. నా కట్టిసంకటపాటు వాటిల్లకుండఁ జూచికొనుము. ప్రాణములనైన విడుతుఁగాని లాఁతులఁ గొలిచి కుడువఁ జాలను. నీ విట్లే పౌరుషహీనుఁడవై పడియుండుదేని మాప్రాణములన్నియుఁ బోయినయవియ యని నిశ్చయింపుము. ఆపత్సముద్రమునఁ దేపవై మమ్ముఁ గడతేర్పుము. శత్రువులం జయించి చచ్చినను వాఁడు కీర్తిమంతుఁడై నెగడు. పేరుగలపగవాని నొక్కనిఁ జంపినంతన యశస్సు సిద్ధించు. ఇంద్రుఁడు వృత్రాసురు నొకనిఁ జంపియకదా మహేంద్రుఁ డనుఁ బేరు వడసి త్రైలోక్యనాథుఁ డయ్యె. అనుమానంబు మాని యాలమునకు నడిచి పేరు సెప్పి. కవచధారు లయినశత్రువులఁ జీఱి తత్సేనాముఖముఁ జిందఱవందఱగావించి తొలుత ముఖ్యపురుషుని వధింపుము. బలవిక్రమఘనుం డొక్కఁడు దెగిన పదంపడి తక్కుంగలవారు వెతలం బడి యవశులై సర్వకామసమృద్ధులు నీకొడఁగూర్తురు. పూర్వరాజులు ప్రాణసంశయంబు పొసఁగినప్పుడైనను రాజ్యమునకుఁ బెల్లగుచేటును జిక్కినపగవాని మిగులఁ బెట్టుటయుం జేయరు. రాజ్యము స్వర్గద్వారం బమృతసదృశంబునుం గావునఁ దద్రక్షణము రాజున కవశ్యకర్తవ్యంబని తలంచి యొక్కట దానికిఁ బ్రతిరోధంబు వచ్చినం దీర్పుట మే లని నిశ్చయించి కొఱవితెఱఁగునఁ బగఱ పయిం బడి [illegible] బొనర్చి స్వధర్మముఁ

బాలింపుము. ఇంక నిట్టులే స్వజనులకు శోకంబును బరులకు మోదంబునుం గావించుచు దీనుం డైననిన్ను దైన్యంబు గదురఁ జూడకుండువిధముఁ జేయుము. శత్రువుల గెలిచి ప్రతిష్ఠితుండ వై తొల్లింటియట్లు సౌవీరకన్యలకు సంతోషముఁ గావింపుము. అట్లు గాక విద్యాభిజనయౌవనరూపసంపన్నుండ వై లోకవిశ్రుతుండ వై ననీ వనడ్వాహంబుచాడ్పున లాఁతులకుఁ బనులు సేయుచు వారి వెన్నంటి తిరుగుచుఁ బరాన్నంబునఁ బొట్ట పూడ్చుకొనుచుండఁ జూతునేని యప్పుడు నామనం బెరియు. మనకులంబున జనించువాఁ డెవ్వఁడేనియు నీచవృత్తిం గొనకుండుఁగాక యని యెల్లప్పుడుం గోరుదు. బ్రహ్మవిహితం బయినక్షత్రధర్మం బంతయుఁ బెద్దలు సెప్పఁగ నేను వినినదానను. క్షత్రియకులజాతుఁ డితరులకు వెఱచి యెట్టిసంకటసమయములం దైనను దనపౌరుషం బుడివోవఁగ ప్రమొక్కక మత్తమాతంగంబుభంగి నురువడింపవలయు. ధర్మమునకును బ్రాహ్మణులకును బ్రణమిల్లుచుఁ దనకుఁ దోడున్నను లేకున్నను నితరుల శాసించుచు దుష్కృతంబులకుఁ బ్రతివిధాన మొనరించుచు యావజ్జీవంబు గడుపవలయు నని చెప్పిన విని సంజయుండు తల్లీ, నీహృదయం బెంతగట్టిదో గాని యెఱుంగరాదు. అయోమయంబు గాఁబోలు. కాకున్న నేకపుత్రుం డయినన న్నిట్లు క్రూరకర్మంబున నియోగింపఁజన్నె. క్షత్రధర్మం బింతకష్టంబై యున్నె యనినఁ గొడుకునకుఁ దల్లి వెండియు నిట్లనియె. ధర్మార్థములపొంటె విద్వాంసులకు సర్వావస్థల ననుభవింపక తీఱదు. కావున నీ కింతయొత్తి చెప్పవలసివచ్చె. కులధర్మము నడుప ముఖ్యం బయినయీకాలమునఁ గార్య మాలోచింపక మార్దవంబుఁ గొని యపకీర్తిపాలుగానున్న నీ కిపుడు హితంబు బోధింపక వాత్సల్యంబే తలంచితినేని యది వాత్సల్యంబు గాదు. శత్రువులపై వాత్సల్యమున నీహితము నుపేక్షించినదాన నగుదు. సజ్జనగర్హితం బయిన యీమూర్ఖమార్గము విడువుము. అవిద్య జనుల కున్న తెలివిం బొనడంచుచు నంతటం బర్వుచుండు. నీవు దానికిఁ జిక్కి కార్యాకార్యంబుల నరయకున్న నాకుఁ బ్రియుండవు కావు. ధర్మార్థముల మాని సదాచారముఁ బరిహరించి దైవమానుషోద్యోగంబు నొప్పరికించి యవినయంబునం బోవుపుత్రుండు పుత్రుండు గాఁడు. మఱి శత్రుండు. అట్టిపుత్రునిచే సంతసించువానికి సంతతిఫలంబు శశవిషాణంబు. మఱియు విహితకర్మములఁ బరిత్యజించి నింద్యకర్మముల నాచరించువాఁ డుభయలోకసుఖభ్రష్టుఁ డగు. క్షత్రియునకు సంగ్రామంబు ధర్మంబనియు నిరుత్సాహత్వం బధర్మంబనియు విహితంబయియుండ నిప్పటినీనడవడి యోగ్య మని యెట్లు చెప్పఁ దగు? క్షత్రియుండు ప్రాణముల దాఁపక కడిమి మెఱయఁ బోరాడి గెలిచెనేని రాజ్యంబు పెంపుఁ గాంచి యైహికసుఖముఁ బొందు. మడిసెనేని వీరస్వర్గ మధిగమించు. నీ వీరెంటిలో నొక్కటి సేయకుండిన నామనంబు

శాంతిఁ బొందదు. ప్రాజ్ఞుఁడు దనకుఁ బ్రియాప్రియము లల్పములు గావించికొని సమయమునందు సముచితప్రకారంబున వర్తించుఁగాని నీయట్ల ప్రాణములపై నింతప్రీతి వెట్టి కర్తవ్యంబుఁదప్పఁడు. సైంధవుల నందఱం జంపివత్తువేని నిన్ను గార వింతు. దిట్టవు గమ్ము. అనికి లెమ్ము. నీకు గెలుపు తప్ప దనిన విని సంజయుండు విదులం జూచి తల్లీ, పుత్రవాత్సల్యంబు మాని నీ కిట్లు పలుకఁ బాడియే? మూక జడులవిధమున నేమియు ననక కరుణ పట్టుము. కోశబలసహాయసంపద లేని నే నెట్లు శత్రువుల గెల్వఁజాలుదు. దీని నెఱింగియకదా దుష్కృతకరుఁడు స్వర్గమునుంబోలె రాజ్యముపై నాశ విడిచితి. పరిణతప్రజ్ఞవై యిన్నిమాటలు సెప్పుదువుగదా. తొలుత నాకుసహాయసంపద గలుగునుపాయ మాలోచించి పదంపడి యివియెల్లఁ జెప్పుము. నీచెప్పిన ట్లంతయుం జేయుదు ననిన సంజయునకు విదుల యిట్లనియె. వత్సా, తొడరినయాపదల కులికి యిఁక నెట్లు చేయుదు నని యాత్మావమానము సేయరాదు. కొన్నియర్థములు లేకయును గొన్ని యుండి నశించియునుఁ గార్యము జెఱుచుఁ గావున నర్థానర్థనిర్ణయంబు లెస్స యెఱింగి మఱి కార్యములఁ గడంగ వలయుఁగాని మొఱకుఁదనమునం జేసి కేవలకోపమున నారంభింపరాదు. సర్వకా ర్యములును సంశయగోచరఫలంబులకాని నిశ్చితఫలంబులు గావు. అందులకై కార్యములఁ బూననివా రొకనాఁడైనను మేలు గాంచనేరరు. ఫల మగుం గా దనక చేయఁగలయత్నములెల్లఁ జేయువారల కొకప్పుడు ఫలసిద్ధియు వేఱొక ప్పుడు తదభావమునుం గలుగు. ఇం దెయ్యది మేలు నీవ చెప్పుము. సర్వార్థము లనిత్యము లనియెఱుంగునతండు ప్రతికూలములఁ బరిత్యజింప నోపుఁగాని నంత టివాఁడు గానరాఁడు. కావునఁ గార్యములు కర్తవ్యము లని నిశ్చయింపవలయు. సిద్ధికిఁ దగినయుపాయముల నిరపాయం బగు తెఱంగునఁ బన్నవలయు. జాగరూక తమై మెలంగవలయు. ఫలము గాఁగలయది యనుతలంపున దేవబ్రాహ్మణసమా రాధనప్రముఖము లగుమంగళముల నాచరింపవలయు. వానియొద్దకు శ్రీదేవి తాన వచ్చు. పౌరుషంబుఁ జేయుము. పురుషార్థము సాధింప నిప్పు డర్హుఁడవు. నీవిజయమునకుఁ దగిన నిదర్శనములను నుపాయములను నే నెఱుంగుదు. ఎట్లం టేని? క్రుద్ధులు లుబ్ధులు పరిక్షీణులు మత్తులు తిరస్కృతులు స్పర్ధాకరులుము న్నగువారలకు ముందుగ నిచ్చుటయు సమయములందుఁ దోడ్పడుటయుఁ బ్రియ ములఁ బల్కుటయు మున్నుగా బహుప్రకారంబు లగునుపాయములఁ బన్ని చం డమారుతంబు మేఘపటలంబునుంబోలెఁ దొలుత భేదింపుము. అట్లు చేసితివేని వారు వశవర్తులై నీకుఁ బ్రియములు సేయుదురు. సర్వకార్యములందును నిన్నుఁ బురస్కరింతురు. జనులు పెక్కం డ్రవ్విధమున నీకుఁ దోడయినపదంపడి శత్రు రాజు త్యక్తజీవనుండై నీవు క్రమ్మఱ సంపన్నుఁడవైతి వని యూహించి యుంట

నున్న పామున కెట్టు లట్టు నీకు వెలిచుచుఁ బరాక్రమవంతుఁడై ననిన్ను వశీకరించు కొనఁజాలక తుది వాదముల మాని నీ కడఁగియుండు. దాన నీవు ప్రతిష్ఠితుం డవై ధనంబు పెంపు సంపాదింపఁగలవు. అప్పటికి నిన్ను మిత్రు లందఱు నాశ్ర యింతురు. అట్లు గాక నిరుత్సాహుఁడ వగుదువేని యెవ్వరుం జేరరారు. ధన హీనుని సుహృద్బాంధవులు పరిత్యజించుటయు, జుగుప్సపడుటయు, నూఱడిం చుటయు లోకసహజంబులుగదా. శత్రుఁడు లోఁగి వచ్చినను నమ్మియుండరాదు. అది యెప్పటికైనను జేటు దెచ్చు. అంతయుఁ బరికించిన నెట్టిసంకటసమయ మునందును భయపడుట రాజునకుఁ దగదు. భయము మదికిఁ దోఁచినను బౌరు షము పట్టి యుండవలయుఁగాని భయపడిన ట్లగపడరాదు. రాజు వెఱచినట్లు దోఁచెనేని యమాత్యప్రముఖులు పుడమిం బృథక్కరింతురు. కొందఱు శత్రు వుల నాశ్రయింతురు. కొంద ఱందుల కొల్లక యెటకేనియుం బోవుదురు. కొం దఱు ముం దెన్నఁడేనియుఁ దమ్ముఁ బఱచినభంగపాట్లం దలపోసి యారాజుం దె గటార్పఁ జూతురు. అత్యంతసుహృదు లగువారు తమ తేనికి మేలు గోరుచు దాసిం జేయఁ జాలక బద్ధవత్సము లగుధేనువులకై వడిఁ దమబాంధవులు పడినట్లు తలంచి యాతనితోడ వగచుచుండుదురు. కావున నీవు వెఱ పుడుగుము. నీబు ద్ధిపౌరుషప్రభావముల నెఱుంగఁ గోరి యింత చెప్పితి. అంతయు నెఱుంగుదువేని మఱియు లెస్స చెప్పెద. సౌమ్యచిత్తుఁడవై జయముఁ గొన లెమ్ము. నీ వెఱుం గనికోశములు పెక్కులు మనకుఁ గలవు. నే నెఱుంగుదు. వానినెల్లఁ జెప్పెద. నీసుఖదుఃఖములు తమయవియకాఁ దలంచుసుహృదులుం బెక్కండ్రు గలరు. ఈసహాయము చాలుఁగదా. ఇఁకఁ దడయక లేచి బలముఁ గూర్చికొని యనికి నడచి శత్రువుల గెలువు మని తల్లి బోధించిన నయ్యుపన్యాసంబు వినీ వగదొ లంగినచిత్తంబుతో నాసంజయుండు తల్లిం జూచి దేవీ, భావివిజయంబుఁ దెల్పితి వి గావున నింక నేను జలమునం బుడమి నుంచుట మున్నగుదుష్కరకృత్యముల నైనం జేయుదు. నీవలన ధర్మతత్త్వంబుఁ దెలియఁ గోరి యించించుక మాఱు సెప్పుచు నూరకున్నవాఁడను. అమృతముచందమున భవదుపన్యాసం బెంత గొ నినను దనివి దీఱదు. నీబోధించినభంగి నిదె పోరికిఁ గట్టాయితంబై నడచి పగఱ భంజించి వత్తు నని తల్లికి మనఃప్రియంబుగఁ బలికి యట్లచేసె. జయనామకం బయినయీయితిహాసమును విజిగీషుఁ డగురాజునకు సంకటసమయంబునందు మంత్రిప్రముఖులు వినిపించిన శత్రువిజయంబు సేకూఱు. గర్భిణి యగుక్షత్త్రి యాంగన దీని వినెనేని విద్యాతపోదానశౌర్యధైర్యసాధుచర్యావిభవాదిసమగ్రుం డైనపుత్రుం గాంచు. ఇట్టియితిహాసములెల్ల నీవు వినియుందువుగదా. ఇం కనైనను ధార్తరాష్ట్రులపైఁ గరుణ మాని సంగరము చేసి రాజ్యము సా

ధింపు మనినేఁ జెప్పితి నని యాధర్మరాజునకుఁ దెల్పుము. భీమార్జునులం జూచి యుత్తమక్షత్రియకులంబున జనించినమీ కెయ్యది పోలు నట్టియంగనఁ జరింపుఁడు. అర్జునుఁడుపుట్టి పురిటిలోఁ నున్నపు డశరీరవాణి పలికినపలుకులు తప్పకుండఁ జెల్లింప ధర్మంబు గలదనియు నందులకెల్ల నీవు తోడగుదువనియును నమ్మియున్నదానను. లోకధారణసమర్థం బగుధర్మమున కివె పదివేలుమ్రొక్కులు మ్రొక్కెద. నకులసహదేవులంజూచి విక్రమార్జితభోగములఁ గోరుఁ డనిచెప్పు మంటి ననుము. పతులకుఁ బ్రతాపసంధుక్షణంబుఁ గావింపు మని పరమపతివ్రత యగుకోడలికిఁ జెప్పుము. కురుసభలోనం బాండురాజుకోడ లెవ్వగుం బడనిభంగపాటుఁ పడె నని వినినంతన నామనంబునఁ జిచ్చు వెట్టి కాల్చిన ట్లున్నయది. దేవతలనైనను నేలకుంగూలకుఁ దేనేర్చుభీమార్జునులు గలరనియుఁ బాండవకార్యం బుద్ధరింప నీవు పెనుఁబ్రాపు గలవనియు నమ్మికతో నున్నదానను. ఇఁక నీకుఁ జెప్ప నేల? నాకుశలముఁ గొడుకులకుఁ గోడలికి నెఱింగింపుము. కృష్ణా, పోయి రమ్ము. తెరువున శుభ మగుత మని దీవించి కుంతీదేవి వీడ్కొల్పినం బన్నగతల్పుఁ డప్పాండురాజమహిషికిఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి క్రమ్మఱి సింహగమనమునఁ గొన్నియడుగులు నడిచి తనతోడ వచ్చుచున్నధృతరాష్ట్రభీష్మద్రోణాదుల నింక నిలువుం డని మరల్చి సాత్యకితోడ రథారూఢుండై కర్ణుం బిల్చి నన్నంపివత్తువు రమ్మనిచెప్పి యతనిం దనతేరెక్కించికొని పురంబువెలుపలి కరిగి యచట రాధేయునితో రహస్యోక్తులు కొన్ని పలికి యట నతని వీడ్కొలిపి యతిత్వరితగమనంబున నుపప్లావ్యపథంబు పట్టి చనియె. అట్టియెడం బురజనులు పిండుగట్టి యక్కటా? కౌరవు లిట్లు బుద్ధిహీనులై వాసుదేవునిహితోపదేశము విన రైరి. వీరి కెల్లఁ గాలావసానం బయ్యె. దుర్యోధనుబాలిశత్వమున మేలు గలుగ దని తమలోఁ బలుకుచుండిరి. ధృతరాష్ట్రుఁడు తక్కటివారుం గొలువుకూటమున కరిగిరి.

### భీష్మద్రోణులు దుర్యోధనునకు హితముఁ జెప్పుట.

అంత భీష్మద్రోణులు దుర్యోధనుం బిలిచి కుమారా, వాసుదేవునితోఁ గుంతి చెప్పినపలుకులెల్ల నీవును విన్నవాఁడవుగదా. పాండవులు తత్ప్రకారంబు సేయువార లేకాని రాజ్యమునఁ బాలియ్యకున్న శాంతిఁ బొందెడువారు గారు. నీ వెన్నియిడుమలఁ బెట్టినను ధర్మమునకుఁ జిక్కి వార లిన్నినాళ్లు సైరణమై నుండిరి. మీరు పాంచాలిం బఱిచినపాట్లు సైఁచునట్టివియే? వారిశాంతి వారికిఁ దగుఁ గాని యితరుల కలవడదు. ఇప్పటికిని వారు శాంతిఁ బూని సంధిఁ జేయుదమన్న నీవు గాదంటివి. వారల నీవు జయించు టడియాసయ కాని నెఱవేఱునది గాదు. అర్జునుం గెలుచు [illegible] గనప్పటికిఁగదా మనము జయింతు మ

నితలంపవలయు. మే మందఱము వానిం గెలువఁ జాలము. ఇంద్రులకు నజేయు లయినపౌలోమకాలకేయనివాతకవచులను వాఁడు దెగటార్చె. విరాటుపసులం బట్టినపుడు మనల నందఱను వాఁడొక్కరుఁడే గెల్చి పసులఁ గొనిపోయె. వాని విక్రమమునకు నిదర్శనం బొక్కటి చాలదే? మఱియు నీవును నీతమ్ములు నీ కర్ణాదులును ధనుర్బాణతూణీరకవచఖడ్గాదిధారులై రథము లెక్కి ఘోషయాత్ర కరిగి గంధర్వులచేఁ జిక్కినపుడు వాఁడుగదా మిమ్ము రక్షించినవాఁడు. గతంబు గడచె. ఇంకనైనను శాంతిఁ బొంది గోవిందునివెంట నంటియుపప్లావ్యంబున కరిగి ధర్మనందనునకు మ్రొక్కుమువేని ధర్మశీలుఁడు వత్సలుఁడు ప్రియంవదుఁడు నగునయ్యజాతశత్రుఁడు శాంతచిత్తుఁడై నినుఁ జేదోయిం గ్రుచ్చి యెత్తి కౌఁగిటం జేర్చి గారవించు. భీమునితోఁ బరస్పరాలింగనము నిర్వర్తించి నీ కెఱిఁగిన కవ్వడినిఁ గవలనుం గాఢాదరమునఁ గౌఁగిలింపుము. వాసుదేవప్రముఖు లందఱు నందులకు సాంద్రానందంబునం దేలుదురు. యుద్ధార్థులై వచ్చిన రాజులెల్లనుం బ్రమోదభరితులై నిజనివాసములకుఁ జనుదురు. నీకుఁ గలరాజ్య మేలుచు సుఖముండుము. యుద్ధము మానుము. యుద్ధమునం బహుజనక్షయంబకాని నీకు గెలుపు గానేరదు. అందుల కెన్నియేనుత్పాతంబులు దోఁచుచున్న వనిచెప్పుచున్నంత నాదుర్యోధనుఁ డధోముఖుండై బొమలు ముడివెట్టి యొకయోరఁ జూచుచు నేమియుం బలుకకుండుటయు శాంతనవుఁ డక్కటా! యసూయాదిదుర్గుణదూరుండై సత్యాదిసుగుణగణములకు నెలవైనపార్థునితో నెదురుపోరాడవలసి వచ్చె నింతకంటె దుఃఖతరంబు గలదే యని ద్రోణుమొగముఁ జూచుచుఁ బలికి యూరకుండె. భారద్వాజుఁడును శాంతనవుమొగంబుఁ గాంచుచు నత్యంతవిషాదవేదనాపరీతమానసుండై యర్జునుఁడు నా కశ్వత్థామకంటె మీఁదుమిక్కిలి గూర్చువాఁడు. క్షాత్రధర్మ మవలంబించి వానితోడఁ గయ్య మొనరింపవలసి వచ్చె. ఈబ్రదుకు గాల్పనే! నాస్తికుఁడు కుటిలుఁడు శఠుఁడు మిత్రద్రోహియు నగుదుర్యోధనుఁడు యజ్ఞసత్కారమునకు మూర్ఖుఁ డర్హుఁడుగానిచందమున హితోపదేశమున కనర్హుఁడు. ఎంత వారించి చెప్పినను దనపాపపుఁదలంపు మానఁ డని పలికి క్రమ్మఱ గాంధారేయుదెసమొగంబై యయ్యా, నీమేలు గోరి తండ్రియుఁ దాతయు విదురుఁడును వాసుదేవుఁడును నేనునుం జెప్పఁగలయంతయుఁ జెప్పఁగ నించుకైనను విననైతివి. బహుసేనాసమూహంబు దోడు గలదు నా కేమి యని పాండవసేనావ్యూహంబుఁ దరింపఁ బూనెదవు. త్యక్తవస్త్రంబు మఱలఁ గట్టుచందమున నత్యంతలుబ్ధుండవై పాండవభోగ్యం బయినరాజ్యంబుఁ గోరెదవు. అది యొడఁగూడదు. వా రడవులనున్నపుడే గెలుచుట దుష్కరం బయ్యె. ఇఁక నిప్పుడెట్లు సుకరం బగు? సకలరాజు లెవ్వనికిఁ గింకరులై యాజ్ఞ సేయుదురో యాకు

శేఁడు ధర్మరాజును ధనరత్నాదులఁ బూజించి పంచె. ద్రౌపది దీవన లిచ్చున ట. గాండీవి పోరాడునఁట. భీముఁ డతనికిఁ దోడునడుచునఁట జనార్దనుఁడు మంత్రి యఁట. జితేంద్రియులు తపోధనులు నగుబ్రాహ్మణులు ప్రతిదినంబును జయాశీర్వా దంబులఁ బ్రయోగింతురఁట. ధర్మజుఁడు గెలుచునో నీవ గెలుతువో యది నీ వ యాలోచింపుము. యుద్ధమన్న నాకును మీతాతకును నేమియుఁ గొఱంత లేదు. చదివితిమి. చెప్పితిమి. బ్రాహ్మణులకుఁ దృప్తిగా నిచ్చితిమి. యజ్ఞము ము లొనర్చితిమి. సమస్తసుఖభోగముల ననుభవించితిమి. ఆయుస్సు గడచనవచ్చె. కృతకృత్యు లగుమా కేవిచారంబును లేదు. నీవు పెక్కేండ్లు సుఖముండవలసిన వాఁడవు. పాండవులతోడఁ బగ పెట్టికొని సుఖమును, రాజ్యమును, మిత్రములను, ధనములను గోల్పడి యాఱడిపోవుదువే యని వగచెద. ఎన్నిమాఱులైన నాచెప్పె నది యిదియే. యుద్ధతాత్పర్యము మాని సంధి చేసి సుఖింపుము లేకున్నఁ జెడియె ద వనిచెప్పుచున్నంత నతండు వారల నిరాకరించి యూరకుండుటయు నందఱు నిజ నివాసంబుల కరిగిరి.

## శ్రీకృష్ణుఁడు కర్ణునితో రహస్యోక్తులు పలుకుట.

అంత ధృతరాష్ట్రుఁ డభ్యంతరమందిరంబున కరిగి సంజయుం బిలిచి గో విందుండు కర్ణునిఁ దనతేరెక్కించికొని తోకొనిచని కొన్నిమాటలు రహస్య ముగఁ బలికె నని వింటి నీ వెఱుంగుదేని చెప్పు మనుటయు నతం డతని కిట్లనియె. వాసుదేవుఁడు పురంబు వెలుపలికిఁ జని కర్ణుం జూచి యెవ్వరు వినకుండ నిట్లని చెప్పె. కర్ణా, నీవు వేదపారగు లగుబ్రాహ్మణుల సేవించియు వేదశాస్త్రములఁ జదివియు ధర్మతత్త్వమెల్ల నెఱింగినవాఁడవు గావునఁ జెప్పెద * కానీనుఁడు † స హోఢుఁడు నను నిరువురును బదంపడి యాయింతిం బెండ్లియగువానికిఁ బుత్రు లగుదు రని ధర్మశాస్త్రవిదులు విధించిరి కావునఁ గుంతికిఁ గన్యాత్వమున జనించిన నీవు పాండురాజునకుఁ బుత్రుఁడవు. పాండవులు పితృసంబంధులనియు యాదవులు మాతృసంబంధులనియుఁ దత్త్వముఁ దలపోసి నాతోడఁ దమ్ము లగుధర్మజాదుల పాలికి రమ్ము. ఏను వారికి నీ వన్నవని యెఱిఁగించెద. వారలు, నభిమన్యుప్రము ఖకుమారులును, యదువృష్ణిభోజాంధకులు, నచటఁ జేరినరాజు లందఱును నీకు మ్రొక్కుదురు. దివ్యౌషధీరత్నసంభృతగంగాదిమహానదీసలిల పూరితహిరణ్మయ కుంభములఁ దెప్పించి నిన్ను మహారాజ్యమునఁ బట్టాభిషిక్తుం గావించెద. అయ్యభి షేకశోభనంబుఁ బొంది తేజరిల్లుచు నీవు మంగళోత్సవంబున నీరథంబున నుం డి ధర్మరాజు యువరాజై ధవళచామరంబులు వైవను, వాయుపుత్రుండు శ్వే

* కానీనుఁడు పెండ్లిగానికన్యకుఁబుట్టినవాఁడు. † సహోఢుఁడు పెండ్లికాలమున గర్భవతి గానుండినవనితకుఁ బుట్టినవాఁడు.

తచ్ఛత్రంబు పట్టను, సవ్యసాచి సారథ్యంబు సేయను, మాద్రేయులును, ద్రౌపదేయులును, సౌభద్రుండును, పాంచాలురును, యదువృష్ణిభోజాంధకులును, నేనుం గొలిచి పరివేష్టించి రాఁగ నెల్లవారికి నేత్రోత్సవం బొనర్పుము. ధౌమ్యుఁడు నీకుఁ బురోహితుండై హితం బొడఁగూర్చు. ద్రౌపదియు నిన్నా అవసమయమునం బొందును. అవ్విధంబున విభవంబు మెఱయఁ దమ్ములతోడఁ గలసి నక్షత్రగణసమన్వితుం డై నచంద్రునిచందమునఁ దేజరిల్లుచు నాంధ్రద్రవిడకుంతలదశార్ణప్రముఖసకల దేశాధీశులు గొలువ రాజ్యపాలనంబుఁ జేయుము. అట్లయినఁ గుంతీదేవి సాంద్రానందంబునం బొదలు. మిత్రు లుల్లసిల్లుదురు. శత్రులు తల్లడిల్లుదురని కేశవుండు సెప్పిన విని రాధేయుఁ డతని కిట్లనియె

## కర్ణుఁడు కృష్ణునికిఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట.

జనార్దనా, నీవు నాశ్రేయ మభిలషించి ప్రణయసౌహార్దముల నిట్లు చెప్పితివి. ధర్మముఁ బరిశీలింప నేను పాండుపుత్రుఁడననియుఁ, గుంతి కన్యాత్వంబున నన్నుఁ గనియెననియుఁ, బాండవులు నాకుఁ దమ్ములనియు నెఱుంగుదు. అయిన నట్లు చేయుట యుఱవు గా దనితలంచెద. ఎట్లంటేని. కుంతి నన్నుఁ గని దయమాలి యేట వైచుటయు దైవవశమున నధిరథుం డనుసూతకులజుఁడు నన్నెత్తికొని తన కంతకుమున్ను సంతతి లేమిం జేసి సంతసించుచు భార్య యగురాధ కిచ్చె. రాధయుఁ బ్రేమమున నన్నెత్తికొని నంతన నాయమచన్నులు చేపె. అంత నా రాధ తనమేన నామూత్రపురీషము లింకుచుండిన నేవగించుకొనక ప్రేముడి గడలుకొన సైరణతోఁ బెంచి పెద్దవానిం జేసె. అధిరథుండును నామీఁదఁ బుత్రవాత్సల్యము నునిచి విధిచోదితప్రకారంబున జాతకర్మాదిసంస్కారంబు లొనరించె. వసుషేణుఁ డనుపేరు నా కతఁడు పెట్టినదియకదా. రాధాధిరథులే నాకుఁ దల్లిదండ్రు లని భావించియున్నవాఁడ. బ్రాహ్మణసేవనంబునను శాస్త్రాధ్యయనంబునను నేను ధర్మవేది నని నీవ చెప్పితివిగదా. ఇప్పుడు వారికిఁ బుత్రకృత్యంబు నిర్వర్తింపక పాండవులతోఁ గూడుట ధర్మం బగునే? మఱియు నేను సూతకులంబునఁ బెక్కండ్రఁ బెండ్లియైతి. వారియందుఁ బుత్రులు పౌత్రులును నా కనేకులు గలరు. వారలపైఁ బ్రేముడి విడిచి రాఁగ మనస్సు గొలుపదు. అదియునుంగాక దుర్యోధనుఁడు నన్నెంతయుఁ గరుణ బొంపిరివోవఁ జేరఁ దీసి చెలిమి చేసి నన్ను నమ్మి యేను గాండీవికిఁ జాలుదు ననుతలంపునం బాండవులతోడఁ బగఁ బెట్టికొనియె. అతనికారుణ్యమున నీపదుమూఁడేఁడులు విభవము మెఱయ మన్ననతో వివిధభోగములఁ బడసితి. సంగ్రామంబు ముట్టవచ్చినయీసమయమున ధార్తరాష్ట్రులఁ దొఱంగి వచ్చుట యుచితంబు గాదు. అట్లయిన ననత్యదోషము నాకుఁ దప్పదు. మఱియు నిప్పుడు పాండవులతోఁ గలియుట నా

కును సవ్యసాచికి నత్యంతాపకీర్తికారణంబుగా కుండునే? ఏను గుంతీపుత్రుండ నుమాట గుప్తంబుగనే యుంచుము. ధర్మరాజు నన్నుఁ దనయన్నఁగా నెఱింగెనే ని తాను రాజ్యమెల్ల నెల్లక నాతలపైఁ గట్టఁ బూను. నాకు రాజ్యమెల్ల వచ్చిన ను దుర్యోధనున కిచ్చువాఁడనగాని యొండు గాదు. మఱియుఁ బరమధార్మికుఁ డై నధర్మరాజే యీరాజ్యభారము వహింప నర్హుఁడుగాని మాబోంట్లు గారు. కావున నిది యిట్లు నడువ నిమ్ము. పాండవులె జయింతురని నాకుం దెల్లంబు. భీమసేనుండును మాద్రేయులును ద్రౌపదేయులును సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిచేకితానకేకయవిరాటప్రముఖులుం దనకుఁ దోడురాఁగఁ గృష్ణసారథికం బయిన రథం బారోహించి సవ్యసాచి సమరము సేయ ధర్మరాజునకు గెలుపు సమకూఱకున్నె? నీ వధ్వర్యుఁడుగా, ధర్మజుఁడు బ్రహ్మగా, బీభత్సుండు హోతగా, భీముఁడు ప్రస్తోతగా, మాద్రేయులు శామిత్రంబు సేయువారుగా, సౌభద్రుఁ డుద్గాతగా, సాత్యకి ప్రతిప్రస్థాతగాఁ గృపద్రోణశిష్యు లగురాజులు సదస్యులుగా, గాండీవముఁ గవదొనలును స్రుక్స్రువంబులుగా, రథపఙ్క్తులు యూపస్తంభములుగా మఱియు రణసాధనంబు లనేకంబులు సమగ్రయజ్ఞసాధనములుగాఁ గాలపురుషుఁడు యజ్ఞ మవశ్యము సేయువాఁడు. ఏను మున్నుగాఁగలవారు పొలియుట దాని కవసానంబు. కురుస్త్రీలపరిదేవనం బవభృథంబు. ఇది యాసన్నంబయియుండ నెట్లు వల దనవచ్చు? క్షత్రియుల కూరక యింటఁ జచ్చుటకంటెఁ బుణ్యతమం బయినకురుక్షేత్రంబున శస్త్రనిధనముఁ బొందుట కీర్తికరంబై స్వర్గలోకసుఖప్రదంబు గావున సమరమగుట మేలు. కులగిరు లెంతదాఁక నుండు నంతదాఁకను భారతవీరులయుద్ధమును బ్రాహ్మణులు కథలుగాఁ జెప్పుచుండుదురు. మనమంత్రము బాహిరవెట్టక ధర్మరాజును యుద్ధమునకుఁ బురికొల్పికొని రమ్మనిన విని కేశవుఁడు చిఱునవ్వు నవ్వి కర్ణున కిట్లనియె. రాజ్య మేలఁగ నీకు భాగ్యము లేదుగాఁబోలు. కాకున్న నేను బుడమియెల్ల నీ కిత్తు ననిన వలదందువే? పాండవులకు జయము ధ్రువము. ఇంచుకేనియు సంశయింపవలదు. అర్జునరథమునం గపిధ్వజంబు తిర్యగూర్ధ్వభాగముల యోజనమాత్రప్రకాశంబై గిరితరుప్రభృతులం దవులక వెలుంగుచున్నది. అందు విశ్వకర్మ నిర్మించినమహామాయాప్రభావంబున జయావహంబులు శత్రుభయంకరములు నగుభూతగణములు దోఁచుచున్నవి. ఏను సారథ్యంబు సేయ నారథం బధిరోహించి సవ్యసాచి వజ్రనిర్ఘాతంబుచాడ్పున జ్యాఘోషంబు భీషణంబుగఁ గావించుచు గాండీవమున సంధించి యైంద్రాగ్నేయవాయవ్యాదిదివ్యాస్త్రములఁ బ్రయోగించి భీష్మద్రోణకృపదుర్యోధనసింధురాజప్రముఖుల నడ్డగించునెడ నాతనిం జూచితేనియు, యుధిష్ఠిరుఁడు జపహోమాదినిష్ఠులు దీర్చి నిజసేనారక్షణంబు సేయుచు నాదిత్యునట్లు ప్రతాప

తపంబుగాయుచు శత్రువాహినులకుఁ దాపంబుఁ గావించుచుండఁ గాంచితేని యు, భీముఁడు గదాపాణియై యేనుంగులఁ బీనుంగులఁ జేయుచు రౌద్రంబు మెఅయ దుస్ససేనునిఱొమ్ము వ్రచ్చి నెత్తురు ద్రాగుచుండఁ గంటివేనియుఁ, గవలు వనగజంబులు మ్రాఁకులంబోలె ధార్తరాష్ట్రసేనలం గూల్చుచుండఁ గనుఁగొంటివేనియుఁ, గృతాదిధర్మము లగుధైర్యాదుల విడిచి కలిధర్మము లగుభయాదులం బొందెదవు. పెక్కు లేల? ఈకాలంబు సులభతృణకాష్ఠసమృద్ధంబై సర్వౌషధీఫలభరితంబై నిష్పంకరసవత్పానీయంబై యల్పమక్షికంబై సమశీతోష్ణంబై యున్నయది. ఎనిమిదవనాఁడమావాస్య రాఁగలయది. పుణ్యదినములయందు, సంగ్రామారంభంబు సేయఁదగు నని భీష్మద్రోణాదులకును దుర్యోధనునకుఁ దోడువచ్చినరాజుల కందఱకునుం జెప్పుము. మీకోర్కి నెఱవేఱ నేనుం బాండవులను సమరమునకుఁ బురికొల్పెద. అందఱు శస్త్రనిహతులై యుత్తమగతిం బొందుదురుగాక యని కేశవుఁడు సెప్పిన విని కానీనుఁ డాకంసారిం బ్రశంసించి యిట్లనియె. మహాత్మా, తెలిసితెలిసి యేల యిట్లు నన్ను మోహింపఁజేయఁదలంచెదవు. పృథివికెల్ల నిప్పుడు చేటుకాల మాసన్నం బయ్యె. అందులకు నేనును, శకునియు, దుశ్శాసనుఁడును, దుర్యోధనుఁడును నిమిత్త మైతిమి. కౌరవులకుఁ బాండవులకును ఘోరసంగ్రామంబు గాఁగలయది. అందుఁ బాండవులకు జయంబును ధార్తరాష్ట్రులకు పజయంబునుం దప్పదు. అన్నింటికిం దగినయుత్పాతంబులు పెక్కులు దోఁచుచున్నవి. శనైశ్చరుఁడు రోహిణీశకటమును బీడించుచున్నాఁడు. అంగారకుఁడు జ్యేష్ఠయందు వక్రుండై మైత్రిఁ గావించువానివిధమున ననూరాధం బ్రార్థించుచున్నాఁడు. చంద్రకళంకము వ్యావృత్తం బయ్యె. అపర్వమునందు రాహువు సూర్యుని గ్రసింపఁ జూచుచున్నాఁడు. ఆకసంబునుండి కొఱవులు పడుచున్నవి. మింట మబ్బులేకున్న నుఱుములు పెలుచ వినంబడుచున్నవి. భూకంపము గల్గుచున్నది. ఏనుంగులు పెల్లఱచుచున్నవి. గుఱ్ఱములు ఖాణమును నీరుం గోరక కన్నీరు గురియుచున్నవి. ఇవి బహుప్రాణివినాశసూచకంబులుగా వున దారుణరణము గాఁగలయది. ధార్తరాష్ట్రులసేనలయందు గజవాజిపదాతివర్గంబుల కల్పము భుజించినను బురీషం బెక్కుడగుచున్నది. మృగము లపసవ్యగతిం దిరుగుచున్నవి. కంకగృధ్రబకశ్యేనవృకమక్షికాసంఘములు మిక్కిలి చేరుచున్నవి. ప్రయత్నమున మ్రోయించినను భేరులు ప్రస్ఫుటముగ మ్రోయవు. ఉదపానములకుం జప్పళ్లు మిగులుచున్నవి. నెత్తురువాన గురియుచున్నది. పరిఖాప్రాకారతోరణాదిసమన్వితంబై గంధర్వనగరంబు గానంబడుచున్నది. ప్రాతస్సాయంసంధ్యలందు నల్లనిపరివేషము సూర్యునిఁ గప్పిన ట్లాసైనికులకుఁ దోఁచుచున్నది. పక్షు లేకపక్షనేత్రపాదంబులై గనఁబడుచున్నవి. వఱళ్లు లఱచుచున్న

వి. రక్తపాదంబులు నీలగ్రీవంబులు నగుపక్షులు భయంకరంబులై సంధ్యారాగమున కెదురై పఱచుచున్నవి. మఱియు దుర్యోధనునకుఁ దూర్పెఱ్ఱగను, దక్షిణదిక్కు శస్త్రవర్ణంబుగను, బడమర పచ్చికుండవిధమునను దక్కటిదిక్కులు ప్రదీప్తములుగనుం దోఁచుచున్నవఁట. బ్రహ్మద్వేషగురుద్వేషభృత్యవిద్వేషములు నానాఁటఁ బెరుగుచున్నవి. ఇవి యన్నియుం బరాజయసూచకంబులు గావున ధార్తరాష్ట్రులు గెలువఁ జాల రనినిశ్చయించితి. పాండవసైన్యంబులందు మృగములు ప్రదక్షిణములుగఁ దిరుగుచున్నవనియు, హంససారసచాతకమయూరములు మిక్కిలి ప్రాలుచున్నవనియు, నెవ్వరు మ్రోయింపకున్నను భేరీప్రముఖవాద్యములు లెస్స మ్రోయుచున్నవనియు విన్నవాఁడఁ గావున వారు గెల్తు రనినిశ్చయించితి. మఱియుఁ గలలోఁ ధర్మరాజు సహస్రసోపానం బగుప్రాసాదంబుఁ దమ్ములతో నారోహించుచుండఁగను, నతం డస్థిసంచయారూఢుండై స్వర్ణపాత్రమునందు ఘృతపాయసంబుఁ గుడుచుచుండఁగను, భీముఁ డున్నతపర్వతం బెక్కి పుడమినెల్ల గ్రసించుచందమున వీర్యముఁ జూపుచుండఁగను, గాండీవి నీతోడఁ దెల్లయేనుంగు నెక్కియుండఁగను, నకులసహదేవసాత్యకు లుత్తమవాహనారూఢులై యుండఁగను, మఱియు మీరందఱు శ్వేతమాల్యాంబరాతపత్రధారులై యుండఁగనుం జూచితిని. మే మందఱము నెత్తునితలచీరలఁ జుట్టి యుష్ట్రయోజితంబు లగురథముల నెక్కి దక్షిణదిక్కున కరుగుచుండఁగనుం గాంచితి. ధార్తరాష్ట్రసైనికులలో నశ్వత్థామకృపకృతవర్మలు ముప్పురే శ్వేతమాల్యాదిధారులై యుండునట్లు గనుంగొంటి. మే మందఱము వేగంబ గాండీవాగ్నిం జొత్తు మింతయు నిక్కవంబు. ఈ సంగ్రామంబునం దరిఁ ద్రొక్కితిమేని యీలోకముననే క్రమ్మఱ నిన్నుఁ జూతుము. అట్లు గాదేని పరలోకమున సమాగమం బగు ననుటయుఁ గృష్ణుండు నే నెంత చెప్పిననుం బ్రయోజనంబు పుట్టదయ్యె. అందఱకుం గాలావసాన మయ్యెఁ గాఁబోలు. చేటుకాల మాసన్న మగుడు నుంచియు మంచిగాఁ దోఁప దనిపలికి యారాధేయుని వీడ్కొలిపి సాత్యకిసమేతుండై పదపద పోనిమ్ముపోని మ్మని దారుకునకుఁ జెప్పి యతిత్వరితగమనంబున నారాయణుఁ డుపప్లావ్యమునకుఁ జనియె. కర్ణుఁడును గనకభూషితం బైనతనతేరెక్కి మాతోడఁ గ్రమ్మఱి వచ్చె నని సంజయుండు సెప్పిన విని కాలప్రాప్తంబు మార్ప నెంతటివానికి నలవిగా దనిపలికి ధృతరాష్ట్రుఁడు సంజయు నింటికిఁ బోవంబనిచి యుచితప్రకారమున నుండె.

### కుంతి కర్ణున కతండు దనపుత్త్రుఁ డగుటఁ జెప్పుట.

అవ్విధమున మధుసూదనుఁ డరిగినపదంపడి విదురుఁడు కుంతీదేవియొద్ద కరిగి దేవీ, నే నెన్ని తెఱంగులఁ జెప్పినను దుర్యోధనుండు సంధి వినఁడు. ఉపప్లావ్యంబున నుండియు యుధిష్ఠిరుఁడు జ్ఞాతులమీఁది సౌహార్దమునం జేసి ధర్మమునే కోరు

చున్నవాఁడు. ధృతరాష్ట్రుఁడును మదించినకొడుకులమతమే యనువర్తించి గర్వితుండై ధర్మముఁ దప్పి నడుచుచున్నవాఁడు. కర్ణశకునిదుశ్శాసనదుర్యోధనుల దురుద్యోగంబునం జేటు తప్పదు. సర్వలోకేశ్వరుం డైనజనార్దనుండు తానే పనిపూని వచ్చి సామవచనముల ననునయించిన నీపాలను లవి వినక యివ్విధమున నధర్మము పట్టిన నెవ్వరు వగవరు ? కురుకులక్షయంబు మూఁడెనేయని నేను రేలుంబవల్లు నిద్రఁ గానక పెన్వగలఁ బొగులుచుండెద ననిన విని కుంతీదేవి పాండవులు పాంచాలాదిసహాయులై యర్థముకొఱకు జ్ఞాతిగురువృద్ధప్రముఖులఁ జంపఁదలఁచిరే యని నేనుం గుందుదు. అయ్యర్థంబు గాల్పనే? కర్ణాదులదుర్మంత్రంబునం జేసి పెద్దలు సెప్పినను వినక దుర్యోధనుఁడు వారికిఁ బుడమిం బాలియ్యఁడయ్యె నేమి సేయుదు నని కొంతసేపు వగచి విదురుని వీడ్కొల్పి యిందులకెల్లఁ గర్ణుఁడుగదా మూలము. వానికి నేను దనజన్మరహస్యంబుఁ దెల్పి పాండవులతోఁ జెలిమి వాటిల్లుచందముఁ గావించి సంగ్రామంబు చాలించునంతప్రయత్నముఁ జేయుదు నని తనలో నిశ్చయించి మఱునాఁడు భాగీరథీతీరంబున సూర్యాభిముఖుండై జప మొనర్చుచున్నయావైకర్తనునొద్ద కరిగి యెండవేఁడిమి కోర్వలేక యతనియుత్తరీయమునీడఁ గూర్చుండి జపావసానముఁ బ్రతీక్షించుచుండె. ఎండవేఁడిమి వీఁపు సోఁకునంత కాసూర్యసూనుండు జపం బొనర్చి క్రమ్మఱి పాండురాజుమహిషిం గనుంగొని స్మేరవదనుండై దేవీ, రాధాధిరథులకుఁ బుత్రుఁడై నకర్ణుఁడనునేను బ్రొమ్మొక్కెద నని చెప్పి వినయమునఁ గేల్దోయి మొగిచి పాదప్రణామం బాచరించుటయుఁ గుంతి యిట్లనియె. వత్సా, నీవు రాధాధిరథులకుఁ బుత్రుఁడవుగావు. మఱి నాకుఁ గన్యాత్వంబునందు సకలలోకకర్మసాక్షి యగుమార్తండునివలనఁ బుట్టితివి గావునఁ గౌంతేయుండవు. ధర్మజాదులు నీతమ్ములు వారితోఁ గలహించి ధార్తరాష్ట్రులతోఁ జేరుట నీకు సముచితంబుగాదు. యుధిష్ఠిరాదులతోడఁ గూడుట నాకు సంతోషప్రదంబు. తల్లిదండ్రులకు సంతోష మొనర్చుట యకదా పుత్రులకుఁ బ్రధానధర్మంబు. మున్నర్జునుండు దిగ్విజయమున సాధించినయుధిష్ఠిరసంపదను ధార్తరాష్ట్రాపహృతంబై నదానిం గ్రమ్మఱ గ్రహించి తమ్ములతోడ సుఖింపుము. నేఁడు మొదలుగఁ గర్ణార్జునులు రామకృష్ణులట్లు సుహృదులై యుండఁ గౌరవులు చూతురుగాక. తమ్ము లేవురు పరివేష్టింపఁగ నీవు దేవగణపరివృతుండై యజ్ఞవేదిం గూర్చున్నబ్రహ్మచాడ్పునఁ దేజరిల్లుదువు. పార్థుఁడనుమాట నీకుఁ దగుఁగాని సూతపుత్రుఁ డనుమాట తగ దనుచున్నంతఁ గుంతివచనంబు సత్యంబు తత్ప్రకారంబు సేయు మనుపలుకులు సూర్యమండలమునుండి వినవచ్చె. అట్లు కుంతీసూర్యులు చెప్పినను నిశ్చలచిత్తుండై కర్ణుఁ డామాటలం గొనక యప్పాండుపత్ని కిట్లనియె. నీవచనంబు సత్యంబై యున్నను గ్రహింపనొల్లను.

నీవు దయమాలి నన్నుఁ బరిత్యజించుటయు రాధాధిరథులు బుత్రవాత్సల్యమునఁ బెంచి జాతకర్మాదిసంస్కారము లొనరించిరి. సర్వసంస్కారములు క్షత్రియకులోచి తముగఁబొందక పాండవులతో నేఁ డెట్లు గలియవచ్చు? అపుడెల్ల నూరకుండి యిపుడు కార్యార్థంబు నన్నుఁ బిల్చినం బ్రయోజనంబు పుట్టునే? మఱియు ని ప్పుడు వారితోఁ గలియుదునేని యర్జునునకుఁ గర్ణుఁడు వెఱచి ముందులేనిభ్రా తృత్వం బిప్పుడు చేసికొని కలిసె నని యందఱు న న్నందురు. కృష్ణార్జునులకు స కలరాజులు వెఱచువారు గావున నన్ను నట్లే తలంచుట సిద్ధంబు. అయ్యపకీర్తి నే నెల్లను. అదియునుంగాక ధార్తరాష్ట్రులు ప్రతిదినమును వసువులు వాస వుంబోలెఁ బూజించుచు నర్జునునకు నేఁ జాలుదు నని పెద్దయు నమ్మి నన్నుఁ దే పఁగాఁ జేసికొని సంగ్రామసముద్రంబుఁ గడవనీఁదఁ దలఁచియుండ ముట్టివచ్చిన యీసమయమున వారలఁ గాదని పాండవులతోడఁ జేరను. కౌరవులయన్నముఁ దిని బ్రదికినవారికి వారిఋణముఁ దీర్ప నిదియకాదె సమయంబు. ఇంతకాలము వారివలన వృద్ధిం బొంది యిప్పుడు తొలఁగుట రాజద్రోహంబు గాకుండునే? దానికిఁ గడచినపాతకము వేఱొక్కటి గలదే? కావున ధార్తరాష్ట్రులకుఁగాఁ బాండవులతోడ వెనుదీయక భండనంబు సేయుదు. నీ విట్లు వచ్చి చెప్పుటంజేసి నీకుఁగా ధర్మజభీమనకులసహదేవులు పోరఁ జిక్కినను వధింపను. అర్జునుండు చి క్కెనేని తప్పక చంపుదు నింతయు నిక్కవంబు. నీకుఁ గొడుకులు సవ్యసాచితోడ నేవురుగాని నాతోడ నేవురుగాని యగుదురు. ఇంతియ కాని మే మిరువుర ము బ్రదుకుదు మనుటయు నాఱ్వురు కొడుకు లనుటయు నింక లేదు. అ ర్జునుని జంపినను వానిచేఁ జచ్చినను నాకుఁ గీర్తి వాయదు. ఇందులకు మా ఱు సెప్పవల దని కర్ణుఁడు తెగఁబాఱి పలికిన విని కుంతీదేవి కాఁగలదానిం దప్పిం చుట దుష్కరం బని యూహించి కొంతవడికిఁ దాన యూఱడిల్లి యర్జునేతరులం జంప ననుప్రతిజ్ఞను సంగ్రామరంగంబున మఱవవల దనిబోధించి యతని వీడ్కొ ల్పి తానును నిజావాసంబుఁ జేరె.

## శ్రీకృష్ణుఁడు పాండవులతోఁ గురుసభలో నడిచినవృత్తాంతముఁ జెప్పుట.

అంత నక్కడ వాసుదేవుఁ డుపప్లావ్యము సేరి ధర్మరాజు విరాటద్రుపద ధృష్టద్యుమ్నప్రముఖులు గొలువఁ దమ్ములతోఁ బేరోలగమున్న సమయమున నతని యొద్దకుఁ జని కురుసభం బుట్టినవిశేషములఁ దెల్పి విశ్రమార్థంబు నిజనివాసం బునకుఁ జనుటయు ధర్మరాజు విరాటప్రముఖులను నిజస్థానములకుఁ బోవం బనిచి సూర్యుఁడు పడమరఁ గ్రుంకినపదంపడి సంధ్యోపాసనాదికర్తవ్యములం దీర్చి తమ్ములుం దానును దానవాంతకుమందిరంబున కరిగి పుండరీకాక్షా! కురుసభలో నడిచినవృత్తాంతములఁ గ్రమ్మఱ [illegible] సోపదేశముఁ బెడ

చెవిం బెట్టి యుత్పథప్రవృత్తుం డైనయాదుర్యోధనునకుఁ గురుపితామహుఁ డైన యాపగేయుఁ డేమి సెప్పె? ఆచార్యుఁ డైనభారద్వాజుఁ డెయ్యది బోధించె? తండ్రి యగుధృతరాష్ట్రుఁ డేది వచించె? గాంధారి యెద్దానిం గఱపె? మాకు వారికిం బినతండ్రి యగువిదురుఁ డేమి వివరించె? సభాసదు లందఱు నేరీతిం దెల్పిరి? వాని నెల్ల వినఁ గోరెద. కామక్రోధలోభాభిభూతచిత్తుండై యాపండితమ్మన్యుండు భవదీయహితోపదేశం బాదరింపక కులక్షయం బాపాదింపం దొడంగె. ఇతికర్తవ్యతామూఢుం డైననాకు నీవే గతివి నాథుఁడవు గురుఁడ వనిపల్కుటయు గదాగ్రజుండు పాండవాగ్రజున కిట్లనియె. కురుసభామధ్యమునఁ బెద్దయుం బ్రొద్దు నేను హితము బోధించినపదంపడి యాదుర్యోధనుఁడు తద్వచనముల గ్రహింపక నిరాకరించుటయకాక పెలుచ నపహసించినం గోపోద్దీపితుండై శాంతనవుండు దుర్యోధనా, కులక్షేమార్థంబు నేను గొన్నిమాటలఁ జెప్పెద విని కులము రక్షింపు మని వాని కిట్లనియె. లోకవిశ్రుతుఁ డగుశంతనునకుఁ దొలుత నే నొక్కఁడనే పుత్త్రుఁడ నగుటయు నేకపుత్త్రుఁడు పుత్త్రుఁడు గాఁ డనుతలంపుతో నమ్మహీపాలుఁడు కులాభివృద్ధికై బహుపుత్త్రులఁ బడయం గోరుటయు నేను దాని నెఱింగి కులవృద్ధినిఁ బితృమనోరథపూరణంబునుం జేయఁ దలంచి నిత్యబ్రహ్మచారినై రాజ్య మేలకుండుదు నని దుష్కరప్రతిజ్ఞఁ జేసి సత్యవతిం దండ్రికిం బెండ్లి సేసితి నిదియెల్ల నీవు నెఱింగియుండుదువుగదా. మాతండ్రికి సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యు లనువా రిరువురుకొడుకులు పుట్టిన నందుఁ జిత్రాంగదుఁడు గంధర్వహతుం డగుటయు విచిత్రవీర్యుని రాజ్యాభిషిక్తుం జేసి యిరువురుకన్యకల నతనికిం బెండ్లి చేసితి. అం దొక్కనిమిత్తంబున జామదగ్న్యునితోడిపోరు నాకు ఘటిల్లె. అందు మిగులఁ బేరు గాంచితి నదియు నీవు విని యుండుదువు. ఆవిచిత్రవీర్యుఁడు పరశురామునకు వెఱచి ప్రోషితుండై భార్యలయెడ నత్యంతకామంబున సురతలోలత్వంబునం జేసి రోగప్రాప్తుండై పరలోకగతుం డయ్యె. అట్టియెడ రాష్ట్రమరాజకం బగుటయుఁ బ్రజలును, భృత్యులును, బురోహితులు, నాచార్యులును మున్నుగాఁగల బ్రాహ్మణు లందఱును, సత్యవతీదేవియు నన్ను రాజ్య మేలు మని నిర్బంధించినను నేను సత్యంబ పాటించి దాని నొల్లక భారతకులాభివృద్ధిం గోరి సత్యవతితోడ నాలోచించి కృష్ణద్వైపాయనమునీంద్రుం బ్రార్థించినం దత్ప్రసాదంబున విచిత్రవీర్యునిపత్నులయందు ధృతరాష్ట్రపాండులును వేఱొక్కతెయందు విదురుఁడుం బుట్టిరి. మీతండ్రి యంధుఁడై రాజ్యార్హుఁడు గామిం జేసి పాండురాజు రాజయ్యె. కావునఁ బాండవులు రాజ్యార్హులు. వారికి సగ మిమ్ము. నేను బ్రదికియుండఁగ నిట్లు చేయరాదు. నామాట విని శాంతిఁ బొందుము. మీరు వారును నా కొక్కరూపయయినను

ధర్మమును నీతల్లిదండ్రులమతంబును విదురునభిప్రాయంబు నరసి చెప్పితి. పెద్దల మాటలు వినవలయుఁగదా. వినవేని నీవు చెడుటయకాక పుడమికిం జేటుఁ దెత్తు వని భీష్ముఁడు సెప్పినపదంపడి ద్రోణుఁ డిట్లనియె. ప్రతీపశంతనులు కొలముపాఁడి దప్పక యెట్లు వర్తించిరో యట్లే దేవవ్రతుం డైనభీష్ముఁడును గులరక్షణంబు పొంకె మిక్కిలి పాట్లుపడియె. పాండురాజును దనభుజబలంబున రాజ్యమునకుఁ బెంపుఁ గావించి ధర్మముఁ దప్పక పాలించుచుండి ధృతరాష్ట్రునకును విదురునకును రాజ్యమెల్ల నప్పగించి కుంతీమాద్రులతోడ నడవి కరిగి యచటఁ గొడుకులఁ గని కొంతకాలమునఁ గాలధర్మమొందె. రాజ్యనీతివిదుఁడైనవిదురుఁడు సర్వకార్యములఁ దీర్పఁగ నాపగేయునిప్రాపున ధృతరాష్ట్రుఁడు సింహాసనస్థుండై రాజ్య మేలుచుండె. పాండురాజపుత్రులు పెద్దవారలైనపదంపడి తండ్రిరాజ్యమును దామే న్యాయముగఁ బొంద నర్హులు గారు. కావునఁ గులక్షయమున కొడఁబడక వారిసాఁబాలు వారి కిచ్చి నీసాఁబాలు నీవు గొని వివిధభోగముల ననుభవింపుము. ఇన్నిమాటలు నీమేలు గోరి చెప్పితింగాని యొండుగాదు. భీష్ముఁడు నీ కెంత దగు ననిపల్కె నంతమాత్రతో సంతసింపుము. మోమోడక యింత చెప్పితి. నిన్నుఁ జూచి నాకు మోమోడం బని లేదు. దేవవ్రతునివలన జీవికఁ గొన్నవాఁడన కాని నీవలనఁ గొన్నవాఁడను గాను. భీష్ముఁ డేవలన నిలుచు నావలన ద్రోణుఁ డుండుననియు నతం డెయ్యది సేయు నితండు నయ్యదియే చేయుననియు నమ్ముము. మీ రందఱు శిష్యులయినను నాకు సవ్యసాచి యశ్వత్థామయట్టివాఁడు. నీతోఁ బెక్కులేల? ధర్మ మేవలన నిలుచు నావలన జయము దప్ప దని యాచార్యుఁడు చెప్పినపదంపడి విదురుఁడు శాంతనవున కిట్లనియె. మహారాజా! నశించినకౌరవ కులమునకుఁ బునరుద్ధారముఁ గావించిననీ విపుడు నే నింత మొఱపెట్టుకొనుచున్న నేల యుపేక్షించెదవు? కులపాసనుఁ డగుదుర్యోధనుఁ డనఁగ నెవ్వఁడు? ఆదురాత్మునిమతము నీవు నేల యనువర్తింతువు? ధర్మార్థదర్శి యగుతండ్రిశాసనం బతిక్రమించునీలోభినిమిత్తమునఁ గులమునకుఁ జేటు వచ్చుచందము పొసఁగె. నన్ను ధృతరాష్ట్రునిఁ దక్కటివారినిఁ జిత్తరువులోనిప్రతిమలంబోలె నొకమూల నిలిపి కులక్షేమము నీకుఁ బోలినభంగి నొనరింపుము. తనసృజించినప్రజలఁ దానే సంహరించుజగదీశ్వరునివిధమున నీనిలిపినకులము చెడుచుండ నీ వేల యూరకచూచెదవు. చేటుకాల మాసన్నంబైన నీకును మతి సెడియెనేని నన్ను ధృతరాష్ట్రునిం దోడ్కొని యడవులకుఁ బొమ్ము. కాదేని దురాత్ముం డగుదుర్యోధనుని బంధించి పాండవులను రాజ్యమున నిల్పి సర్వము నీవ శాసింపుము. ఇంతటనైన నం బ్రసాదించి కులంబు గావవే యనిచెప్పి చింతాదీనమానసుండై పలుమాఱులు రోఁజుచుండె. పదంపడి గాంధారి కులక్షయమునకు వెఱచి చింతాశోకసంతప్తచిత్తయై

కొడుకుం బిలిచి యేలరా నీవిట్లు మొఱకుఁదనమునఁ గులమునకుఁ జేటు దెచ్చె
దవు? మునులు మున్నగుసభాసదు లందఱు వినంగఁ జెప్పెద వినుము. శాంతన
వుండు సర్వజ్ఞుండు. అతండు గలయంతకు మీతండ్రియు విదురుఁడునుం దన్మ
తంబు నడుపవలసినవారు. వారిమాటల నిరాకరింప నీకుఁ దగదు. ఈరాజ్యమం
తయుఁ బాండురాజుసొమ్ము. తత్పుత్రులు దీని కనర్హు లను టెట్లు చెల్లును?
కావునఁ బెద్దలమాటల విని వారికి రాజ్య మిచ్చి కులము రక్షింపుము. న్యాయా
గతం బయినరాజ్యమును ధర్మపుత్రుం డేలుగాక యనివచించుటయుఁ బిదప ధృత
రాష్ట్రుఁడు కొడుకున కిట్లనియె. దుర్యోధనా, నేనుం గొన్నిమాటలు సెప్పెద. పితృ
భక్తి గలాఁడవేని నాచెప్పినది చేయుము. మే లయ్యెడి. కురుకులమునకుఁ
జంద్రుఁడు కర్త యని నీవు నెఱుంగుదువుగదా. అతనికి బుధుఁడును, వానికిఁ
బురూరవుఁడును, వాని కాయువును, వానికి నహుషుఁడును, వానికి యయాతి
యునుం గ్రమంబునఁ బుట్టిరి. ఆయయాతికి శుక్రాచార్యపుత్రిక యగు దేవయాని
యందు యదుతుర్వసులు వృషపర్వకూఁతు రగుశర్మిష్ఠయందు ద్రుహ్యుఁడు
ననుఁడు పూరుఁడు ననువారలుంగా నేవురుకొడుకులు జనించిరి. వారిలో యదు
ప్రభృతు లగునలువురు దండ్రికిఁ బెడవాయుటం జేసి శాపమున రాజ్యముఁ బొంద
రైరి. పూరుఁడు కొండికవాఁడయ్యుఁ బితృవాక్యపరిపాలనంబునం జేసి రాజ్య
ప్రాప్తుఁ డయ్యె. జ్యేష్ఠుండై నను గుణములఁ గనిష్ఠుఁడయ్యె నేని రాజ్యమునకుఁ
దగఁడు. కనిష్ఠుండై నను గుణముల జ్యేష్ఠుఁడగు నేని రాజ్యార్హుఁ డగు. ఆపూరు
నృపాలుఁడు మనకు వంశకర్త. ఆవంశమునందు నాతండ్రికిఁ బితామహుఁ డైన
ప్రతీపుఁడు ముల్లోకములందు నిజవిమలకీర్తి నెఱపి దేవాపిబాహ్లీకశంతను లను
ముప్వురుకొడుకులం గాంచె. ఆప్రతీపుఁడు జ్యేష్ఠపుత్రుఁ డగు దేవాపిని సర్వగుణ
సముల్లసితుని రాజ్యాభిషిక్తుం జేయ సకలసంభారము లొడఁగూర్చుచుండ నతండు
త్వగ్దోషరోగదూషితుం డని ప్రజలు వానికి రాజ్యాభిషేకము మెచ్చకుండుటయు
నాతండ్రికొడుకులు చింతాసంతప్తచిత్తులయి తపోవనమున కరిగిరి. ప్రతీపునిద్వి
తీయపుత్రుఁ డైనబాహ్లీకుఁడు పితృరాజ్యముఁ గోరక మాతులగృహంబు సేరె.
పదంపడి శంతనుఁడు బాహ్లీకునిచే ననుజ్ఞాతుండై కౌరవరాజ్య మేలె. అతనియ
నంతరము మాతండ్రి విచిత్రవీర్యుఁడు రాజయ్యె. మాయన్నదమ్ములలో నేను
జ్యేష్ఠుఁడనయ్యు హీనాంగుఁడ నగుటం జేసి పాండురాజు రాజ్యాభిషిక్తుండై నిజ
భుజబలమున రాజ్యమునకుఁ బెంపు గావించె. కావున నతనిపుత్రుఁ డగుయుధిష్ఠి
రుఁడే యీకౌరవరాజ్యమున కర్హుఁ డగుంగాని నీవు గావు. రాజపుత్రులుగాని
వార లెట్లు రాజ్యముఁ బడయఁ దగుదురో నీవ యాలోచింపుము. వారికి రాజ్య
మీకుండు టనుచితంబు. మఱియు రాజునకు వలయుసకలగుణము లతనికిఁ గలవు.

ఇంతటనైన వారిరాజ్యము వారి కిచ్చి కులము రక్షింపుము. లేకున్న సపరివారుం డవై చెడియెద వని బహుప్రకారంబుల నాంబికేయుఁడు సెప్పినను వినక మర్యాద నెఱుంగక మొగంబు గంటువెట్టికొని ధూర్తుండై కొలువు వెడలిపోయె. వారితోడన కర్ణాదు లగుకొందఱురాజు లప్పడే లేచిపోయిరి. నేనును సామదానభేదముల సమయోచితంబుగఁ బ్రయోగించి దుర్యోధను నూఱడించియు, బుజ్జగించియు, నదలించియుఁ, దృణీకరించియు, ధిక్కరించియుఁ, గర్ణశకునులఁ బ్రత్యేకంబ వెఱపించియు, వివిధమంత్రణములఁ దోడువచ్చినరాజలోకంబు భేదించియు, నారదాదిమహామునులచేతఁ జెప్పించియుఁ, దుదిఁ బాండవుల కైదూళ్లయిన నిమ్మని క్రమ్మఱ సాంత్వనంబున బోధించియు, మాయలు పన్ని విచిత్రదారుణంబు లగుకొన్నియమానుషకృత్యము లొనరించియు శక్తికొలఁది పెక్కుపోకలఁ బోయితి. ఎన్ని చేసినను వాఁడు నామాట చెవిం బెట్టఁడయ్యె. పెక్కు లేల? వాఁడు సామాద్యుపాయత్రయసాధ్యుఁడు గాఁడు. మన సొప్పి రాజ్యమునఁ బాలియ్యఁడు. పదునొకం డక్షౌహిణులు దోడు గల వని మదించినవాఁడు. భీష్ముని సేనాపతిం జేసికొని భండనంబున కందఱు పుష్యంబునఁ గురుక్షేత్రంబునకు నడువుఁ డని నియమించినవాఁడు. దండముదక్క నెందుపాయమున నాదురాత్ముఁడు సాధ్యుఁడుగామి సిద్ధంబు. వారికిఁ బోఁగాలం బయ్యె నేమి చేయవచ్చు నని చెప్పి యచ్యుతుండు కుంతీసందేశంబునుం దెల్పిన విని ధర్మరాజు కేశవుసమక్షమునఁ దమ్ముల కిట్లనియె.

## పాండవులు ధృష్టద్యుమ్నుని సర్వసేనాధిపతిం జేయుట.

కురుసభలోనడిచినవృత్తాంతములనెల్లను గుంతీసందేశమును గేశవుఁడు చెప్పఁగ మీరందఱును వింటిరిగదా. ఇఁక యుద్ధముదక్క వేఱొక్కటి కార్యసాధకంబు గాదయ్యె. మనకుఁ గూడినయేడక్షౌహిణులకుఁ బ్రత్యేకంబ యేడుగురు సేనాధిపతుల నేర్పఱిచి సర్వసేనానాయకుంగా నొక్కశూరవర్యుని నియమింపవలయు. పాంచాలనాథుఁ డైనద్రుపదుఁడును, మత్స్యపతి యగువిరాటుఁడును, శూరశేఖరుం డైనసాత్యకియు, జరాసంధసుతుం డైనసహదేవుఁడును, యదువర్యుం డగుచేకితానుండును, శిశుపాలపుత్రుం డైనధృష్టకేతుండును, భండనోద్దండుం డగు శిఖండియు ననువా రేడ్వురు సేనాపతులఁగా నియమింపఁ దగు ననితలంచెద. వారందఱు శూరులు వేదవిదులు హ్రీమంతులు నీతిమంతులు యుద్ధవిశారదులు సర్వాస్త్రయోధులుంగదా! భీష్ము నెదిరించి యేడక్షౌహిణులం జక్క నడిపింప నేర్పరి యగుశూరు నొక్కని సర్వసేనాధిపతిఁగా నిరూపింపవలయు. అందుల కెవ్వఁడు దగునొకో యనియూహించెద. మీరుఁ బోలినవానిఁ దెలుపుఁ డనిన విని సహదేవుఁ డిట్లనియె. అజ్ఞాతవాససమయంబున మనకుఁ బెనుఁబ్రాపై మన సుఖదుఃఖములు [illegible] త్రమునఁ దలంచువాఁడును ప్రబలవీర్యు

డును మత్స్యేశ్వరుఁడు నగువిరాటుఁడు సర్వసేనాధిపత్యంబునకుఁ దగు ననినాకుఁ దోఁచుచున్నది. అతండు భీష్మునోర్వఁ జాలు నని నయనంతరంబ నకులుఁ డిట్లనియె. సత్కులప్రసూతుఁడును, ధైర్యధుర్యుండును, శ్రీమంతుఁడును, భరద్వాజముని వలన వేదశాస్త్రముల నధిగమించినప్రౌఢుఁడును, మనకు మిగులఁ గూర్మి సేయు శ్వశురుఁడును, పాంచాలదేశాధీశుఁడు నైన ద్రుపదుఁడు సర్వసేనానాయకత్వం బునకుఁ దగినవాఁడు. ఆదివ్యాస్త్రవేది ద్రోణాచార్యునితోడ నిరంతరస్పర్ధ సేయు చున్నవాఁడు. శతశాఖాశోభితం బైనమహావృక్షముచందమున ననేకపుత్రపౌత్ర పరివృతుం డైనయతండు భీష్మద్రోణుల నిలువరింపఁ జాలుననియు నిఖిలాక్షౌహి ణీపతిత్వంబున కర్హుండనియు నేఁ దలంచెద నని చెప్పినపిదంపడి సవ్యసాచి యిట్ల నియె. పాంచాలరాజుతపోబలంబుననను మునివరప్రభావంబుననను వహ్నికుండము నందు దివ్యకవచఖడ్గధనుర్బాణతూణీరరథరథ్యములతోడ ద్రోణవధార్థంబు జనిం చినధృష్టద్యుమ్నుని సర్వసేనాధిపతిం జేయుము. సింహసంహననుం డైనయా వీరుఁడు పిడుగులంబోనిభీష్మనారాచములనోర్వఁ జాలినవాఁడు. వేగమున యమ దూతసమంబులు పాతమునఁ బావకోపమంబులు జామదగ్న్యసోఢవ్యములు నగు నాపగేయునమ్ములను లాఁతివాఁ డోర్వఁ జాలఁ డనియూహించెద ననినపిదప భీముఁ డిట్లనియె. భీష్మవధార్థంబు పుట్టినశిఖండి సర్వసేనల కధిపతి గాఁ దగిన వాఁడు. సిద్ధులు రాజర్షులు మున్నగువా రతనివిక్రమంబు మిక్కిలి కొనియాడు దురు.. వానిం గెలుచువాఁడు కౌరవసేనలో నొక్కఁడుం గానంబడఁడు. శాంతనవు నితోడ వెనుదీయక పోరాడ నాతనిఁదక్క లాఁతి నొక్కనిం గాన నని చెప్పుటయు ధర్మరాజు కృష్ణునిఁ జూపి యీమహానుభావుఁడు సకలరాజులబలాబలంబులను సారాసారంబులను సాకల్యముగ నెఱింగినవాఁడు. ఈసర్వేశ్వరుఁ డెవ్వని నియమిం చు నతండు కృతాస్త్రుఁడైన నకృతాస్త్రుఁడైనను వృద్ధుఁడైనను యౌవనస్థుఁడైనను సకలకార్యభారము వహింప నర్హుఁడు. ఈదేవదేవునిశాసనంబు మనకు విజయ మూలంబు. మనప్రాణములును, రాజ్యమును, భావాభావములును, సుఖదుఃఖము లు నితనియధీనములు. ఇంతనియందే సర్వంబు సుప్రతిష్ఠితం బై యున్నది. ఇతండు నియమించినవానికి సర్వసేనాధిపత్యాభిషేకంబొనర్చుట శ్రేయంబు. రాత్రి గడ చనవచ్చె. రేపకడన కురుక్షేత్రమునకు వెడలవలయు. ఇమ్మహాత్ముఁడు నిర్ణయించు గాక యని యుధిష్ఠిరుఁడు చెప్పిన విని వనజనాభుండు సవ్యసాచిం జూచి యయ్యి జాతవైరి కిట్లనియె. మహారాజా, నీయుదాహరించినవారలే దండనాథులుగాఁ దగి నవార లని నేను దలంచెద. శత్రునిర్మూలనంబుఁ జేయఁ జాలినయవ్వీరులు పోర నింద్రునికైనను వెఱపు పుట్టింతురు. లుబ్ధులు పాపాత్ములు నగుధార్తరాష్ట్రులం జెప్ప నేల! నీకుఁ బ్రియము సేయఁ దలంచి శాంత్యర్థము మహాప్రయత్నముఁ

జేసితి. వివేకవికలుఁ డైనయాబాలిశుఁడు తాను మిగుల బలియుఁ డనిమదించి వినఁడయ్యె. ఇఁక మనవలనఁ గొఱంత లేదు. చేయఁగలయంతయుం జేసి చూచితిమి. వారు వధసాధ్యులే కాని శమసాధ్యులుగారు. సేనలఁ గూర్చికొని పోరికి సమకట్టినదుపుము. ప్రబలబలుం డైనమహాబలనందనుని, మేటివిలుకాఁ డైనకిరీటిని, యమతుల్యు లయినకవలను, శూరశేఖరు లగుసాత్యకిధృష్టద్యుమ్నులను, దీవ్రప్రతాపుఁ డైనయభిమన్యుని, నజేయు లయినద్రౌపదేయులను, యుద్ధలంపటు లగుద్రుపదవిరాటులనుం జూచి రేని యాధార్తరాష్ట్రు లెదుర నిలువం జాలుదురే? వారిబలముకంటె మనబలము మిగుల సారవంతము గావున మనము గెల్తు మనుట తప్పదు. ధృష్టద్యుమ్ను నిన సర్వసేనాపతిత్వమునం దభిషేకింపఁ దగు ననిపలికినరాజీవాక్షు వీడ్కొని ధర్మరాజు తమ్ములుం దాను గ్రమ్మఱి నిజనివాసంబున కరిగి యారాత్రి యుచితప్రకారంబున నడిపి మఱునాఁడు రేపకడన మేల్కొని పాండవాగ్రజుండు గోవిందుఁడును, విరాటద్రుపదధృష్టద్యుమ్నసాత్యకిప్రముఖులును, దమ్ములునుం గొలువఁ బేరోలగంబుండి యెట్టకేలకు నెల్లవారలు వినం గార్యనిశ్చయంబుఁ బలికి తగువారలతో సముచితసంభాషణంబులు నిర్వర్తించి పంకజాక్షునభిమతంబునఁ బాంచాలనాథప్రముఖుల నేడ్వురనుం బ్రత్యేకంబ సప్తాక్షౌహిణులకుం బతులఁగా నభిషేకించి సమరసంరంభావష్టంభసముల్లసితుం డైనధృష్టద్యుమ్ను నకుఁ బుణ్యతీర్థసలిలంబుల సముచితసంవిధానంబున సర్వసేనానాయకత్వంబున నభిషేకం బొనర్చి యాజ్యసేచనసుప్రజ్వలితహుతవహుల చందమునం దేజరిల్లు నయ్యేనమండ్రుదొరలను సముచితాలాపంబుల నారాధించి వారల నందఱనుం గాండీవికిఁ జూపి సముచితవిధమున వీరినెల్లం గాచుట నీపని యనిచెప్పి జగద్రక్షకుం డైనయధోక్షజుం డీభారమెల్ల వహించి నడిపించి మేలు గావించువాఁ డింక మనకరవాయిగొనం బని లేదు సర్వసైన్యసహితంబుగా నెల్లి కురుక్షేత్రంబునకు నడువవలయు నని నిరూపించి కిరీటికిఁ దేరు గడప శౌరిం బ్రార్థించి ప్రస్థానభేరి సఱువం బంచుటయు శత్రుహృదయపుటదారణం బై దారుణం బై నయాభాంకారముతోడ శంఖపణవప్రముఖవాదిత్రనిస్వనంబు ప్రస్థానసంభ్రమభ్రమద్వీరభటపటలపరస్పరాహ్వాననినదంబును సమగోత్సవప్రహృష్టవీరయోధసింహనాదంబునుం గలిసి దిక్తటంబు లవియించుచు యుగవిగమసమయసంక్షుబ్ధసాగరారావంబు ననుకరించె. సకలసైన్యంబులును యుద్ధసన్నద్ధంబు లయ్యె.

### పాండవులు సైన్యములతోఁ గురుక్షేత్రమునకు వెడలుట.

అంత మఱునాఁడు పాండవులు కల్యకరణీయములం దీర్చి వాసుదేవసాత్యకిద్రుపదధృష్టద్యుమ్నశిఖండివిరాటకేకయాదిసహితంబుగ సంగరోత్సాహదోహలితచిత్తంబులతోఁ బాంచాలికడ కరిగి యద్దేవి నామంత్రణంబు చేసి తత్ప్రభు

తిపుణ్యాంగన లొసంగుశుభాక్షతంబులు గైకొని గోహిరణ్యాదిదానములం బ్రాహ్మణుల నర్చించి తదీయాశీర్వాదములం గ్రహించి వందిమాగధసందోహస్తోత్రములం జిత్తగించుచు శోభనపదార్థములం గనుంగొనుచు మాంగల్యసూచకశుభశకునంబులకు నెమ్మనంబుల నలరుచు శంఖదుందుభికాహళాదిమంగళవాద్యనిస్వనంబులు సెలంగ వెడలిరి. అప్పుడు సౌభద్రద్రౌపదేయపరివృతుండైన ధృష్టద్యుమ్నుండును, మాద్రేయులును, భీమసేనుండును రెండువేలయేనుంగులు పదివేలగుఱ్ఱములు పదివేవురుపదాతులు పంచశతరథంబులుం గలసైన్యముతోడ సేనాముఖంబునం బొలిచిరి. విరాటజయత్సేనులు నిజవాహినీపరివృతులై యావెంట నడచిరి. కృష్ణసారథికం బగుదివ్యరథం బారోహించి గాండీవాదిసకలసాధనసంభృతుండై సవ్యసాచి గదాకార్ముకాదిధారు లగుయుధామన్యుండు నుత్తమౌజుండు ననుపాంచాలకుమారులు పరివేష్టింప నావెంట నరిగె. అయిదువేలేనుంగు లన్నిరథము లిరువదివేలగుఱ్ఱములు బహుసహస్రసంఖ్యాక లగువీరభటులుం గొలువ యుధిష్ఠిరుం డుత్తమరథారూఢుండై ధవళచ్ఛత్రచామరాదిసకలోపచారంబు లుల్లసిల్ల సైన్యమధ్యమునం దేజరిల్లె. యాదవశిరోమణి యైనచేకితానుండు చేదినాథుం డైనధృష్టకేతుండును నిజసైన్యపరివృతులై ధర్మనందనుపిఱుందదెస నరిగిరి. శతసహస్రరథపరివృతుండై సాత్యకి యావెంట నడిచె. పాంచాలరాజు తనకుమారులు గొలువ నేకాక్షౌహిణీపరివేష్టితుండై యరిగె. సత్యధృతిశ్రేణిమద్వసుధానాదు లిరువదివేలయేనుంగు లన్నిరథములు పదికోట్లగుఱ్ఱములు బహుసహస్రపదాతివర్గంబునుం బరివేష్టింప నడిచిరి. తక్కుంగలసకలసైన్యములుం దోడునడిచె. ఇవ్విధంబున సన్నద్ధుండై యుధిష్ఠిరుండు వెడలుటయు వెంటన సకలపరిచారకులు శకటపటకుటీరాదిసకలసాధనంబుల నెడఁగూర్చికొని నడిచిరి. వివిధపదార్థసంభృతంబులై యంగళ్లుం గూడ నరిగె. యుధిష్ఠిరానుమతిం బెక్కండ్రు వైద్యులు సేనలతోడ నరిగిరి. ఇట్లు సంపూర్ణగంగాప్రవాహంబుచందంబునఁ బఱపైనదండు ధృష్టద్యుమ్నపాలితం బై నడువ ధర్మరాజుబెడ్లికిఁ బోవు తెఱంగున ససంభ్రమముగా నరిగి కురుక్షేత్రంబుఁ దఱియం జొచ్చి ఋష్యాశ్రమంబులు దేవాయతనంబులు పుణ్యతీర్థంబులు పితృవనంబులుం బరిహరించి మధురసలిలసంభృతంబనూషరంబు తృణకాష్ఠసమృద్ధంబు పరిశుద్ధంబు నగుహిరణ్వతీనదీతీరంబు విడిదలగా నిరూపించి విడియుటకు సూచకంబుగ నిజశంఖ మొత్తుటయు వాసుదేవార్జునులు పాంచజన్యదేవదత్తంబులం బూరించిరి. భీమసేనాదులును నిజశంఖములొత్తిరి. అట్లు విడిసినపదంపడి ధృష్టద్యుమ్నుండం దొక్కరమణీయస్థలంబున రాజమందిరంబును నుచితస్థానంబులం దక్కటివారికి నివాసంబులను నేర్పఱుప శిల్పివరుల నియమించి సముచితప్రకారమున శిబిరములఁ గట్టించి రక్షార్థంబు

చుట్టు నగడ్తం ద్రవ్వించి తాను జుట్టునుం దిరిగి మహోదారం బయినయా స్కంధావారంబు సురక్షితంబు చేసె. విమానసన్నిభంబు లగునాశిబిరంబులం జూచి నెమ్మనంబున నలరి ధర్మరాజు సర్వశిబిరంబులందును నానావిధభక్ష్యభోజ్యాదిపదార్థంబులను ధనుర్బాణతూణీరఖడ్గకవచతోమరగదాపరశ్వధభిండివాలాదిసకలసాధనంబులను జేర్పించి యుచితస్థానంబుల నుచితవిధముగా నందఱకు నిరూపింపించి నిజశిబిరంబునం దాను వసించె. అత్తెఱంగున శిబిరంబున విడిసి ధర్మరాజు సంధినాఁటికౌరవులవచనములఁ దలపోసి వాసుదేవుం జూచి మహాత్మా, మందుఁడైనసుర్యోధనుఁ డేమి చెప్పె? ఎద్ది చేసిన మన కిప్పుడు ధర్మహాని దొడరకుండు? ఆదుష్టచతుష్టయముమతంబును, భీష్మవిదురులమాటలచొప్పును, గుంతీదేవియభిప్రాయంబును సాకల్యముగ నెఱింగినవాఁడవు గావునఁ బ్రమ్మఱ దివ్యచిత్తమున లెస్స విచారించి నిర్ణయింపుమనుటయు నతనికిఁ నారాయణుఁడు మేఘగంభీరనిస్వనంబున నిట్లనియె. నీచెప్పినధర్మార్థసహితహితవచనములనెల్ల సాకల్యముగ నానుయోధనునకుఁ జెప్పితి. భీష్మవిదురాదు లగుపెద్దలుం జెప్పిరి. ఎవ్వరెంత చెప్పినను నాబాలిశుఁ డించుకేనియు వినఁడయ్యె. ధర్మధ్వంసంబును గీర్తినాశంబును బరికింపఁడయ్యె. తన్నుఁ గర్ణుఁడు గెలిపించు నని దురాశ పెట్టికొని మదించినవాఁడు. ఇఁక నీయొద్ద దాఁప నేల! తమకు హితముఁ దెల్పుచున్ననన్ను మిూవాఁ డని శంకించి పట్టి చెఱఁ బెట్టం దనుకించె. వానిపాపనిశ్చయంబు కొనసాగకుండె. పదంపడి భీష్మద్రోణాదులును వాని కేమియుం జెప్ప నొల్లరైరి. విదురుఁడొక్కరుఁ డప్పటికిం జెప్పుచుండె. ఎవ్వరు చెప్పినను నాదురాత్మునియెడఁ బ్రయోజనం బెయ్యది? మూఢాత్ము లగుకర్ణశకుని దుశ్శాసనులు నీయెడం దప్పులు పలికిరి. వానినెల్ల నీతోఁ జెప్ప నేల? సర్వపాపంబులకును నెల వగునాదురాత్ముఁడు నీయెడ నుచితముగ వర్తింపఁడు. మనము రాజ్యమునం బాలీకున్న శాంతిఁ బొందువారము గాము గావున నీకుఁ గర్తవ్యంబు యుద్ధముదక్క వేఱొక్కటి గలదే యని వనజోదరుండు తెలియఁ జెప్పుటయు నచ్చటిరాజులెల్ల నేమియుం బలుకక యతనిమొగముఁ జూచుచుండిరి. సైన్యంబునం గిలకిలారావంబు నింగిముట్టె. అట యుధిష్ఠిరుఁ డవధ్యవధంబునకుఁ గొందలం బందుచు నిట్టూర్పునిగిడించి భీమార్జునులం జూచి యెద్దాని నొల్లక మనము వనవాసాద్యాయాసంబులఁ గుడిచితి మయ్యనర్థంబు వచ్చెనకాని యెంతయత్నము చేసిననుం దప్పదయ్యె. అవధ్యు లగువారితోడ సంగ్రామం బెట్లు చేయం జను? గురువులు వృద్ధులు మున్నగుపూజార్హులం జంపిన విజయం బెట్లు చేకూఱు నని వగచుచున్నయన్నకు ధనంజయుం డిట్లనియె. కుంతీవిదురులమతం బెల్ల వాసుదేవుండు చెప్పిన నవధరించితివిగదా. వారియును ధర్మముఁ జెప్పరసి నాకు దృఢనిశ్చయం

బు గలదు. సర్వలోకేశ్వరుం డై నజనార్దనుండు నియమించినకార్యంబున సంశ యింప నేల? ఇఁకమీఁద యుద్ధము చాలించుట పౌరుషంబు గా దనుటయుఁ గృష్ణుఁ డిది యిట్ల యనిపలికె. ఆపలుకులు విని యందఱు యుద్ధసంకల్పము నా టినమనంబుల నుత్సాహంబు పొంపిరివోవ నొప్పిరి.

కౌరవులు సైన్యములతోఁ గురుక్షేత్రమునకు వెడలుట.

అక్కడ దుర్యోధనుండును దేవకీనందనుఁ డరిగినపదంపడి కర్ణశకునిదు శ్శాసనులం బిలిచి తనవచ్చినకార్యము నెఱవేఱమింజేసి యలిగినవాసుదేవుఁడు పాండవుల ననికి నడిపించికొనివచ్చు. అతనికి యుద్ధమే యభిమతంబు. భీమార్జును లతనిమతంబ యనువర్తించువారు. వీరు మువ్వురు యుద్ధమే కర్తవ్యం బని యొ క్కమాటగఁ జెప్పినపదంపడి ధర్మజుండును మున్ను మనపఱిచినపాట్లం దలపోసి పోరికి సమకట్టి వచ్చుట తప్పను. విరాటద్రుపదులకును దత్పుత్రులకును మన మీఁద నీసు మిగులఁ గలిగియుండు. దారుణం బై నరణంబు గాఁగలయది. కావు న మనముం బోరికిఁ గట్టాయితంబై నడువవలయు. కురుక్షేత్రమునందుఁ దృణ కాష్ఠజలసమృద్ధంబై శత్రువులకుఁ జొర నలవిగానిచోట శిబిరముల నిర్మింపను ద్రోవలు చక్కపెట్టను దగినవారలఁ బంపవలయు. ఎల్లి దండని వీటఁ జాటింప వలయు ననిపల్కుటయు వారు మఱునాఁడు తత్ప్రకారంబున నంతయుం జేయిం చిరి. ఆవృత్తాంతము విని సకలరాజులును బ్రమోదము నొందిరి. కౌరవేశ్వరుం డును గొలువునం గలయందఱునుం బోవం బనిచి యుచితప్రకారమున నుండె. అ ట్టియెడఁ బ్రస్థానోచితంబు లగువివిధవ్యాపారముల నిర్వర్తింప నుత్సుకు లైన భూకాంతులబహుప్రకారకార్యజాతంబులను గజవాజిరథములకుఁ దగినసవరణ లు గావించుచతురపరిచారకులసంభ్రమంబునను నానావిధాయోధనసాధనసంవి ధానంబులందును మణిమయాదినానాభూషణంబుల నాయితపఱుచుటలందునుం దత్పరు లగువీరభటులసంరంభంబునను బ్రయాణసమయసముచితబహువిధప దార్థసంగ్రహణనిపుణపరిజనవ్రాతసంక్షోభంబునను గరిపురం బిటునటుం బఱచు జనులతిరుగుడుపాట్లు సుళ్లుగాఁ, గరితురగస్యందనవ్రాతంబు మీనస్తోమంబుగా శంఖదుందుభిప్రముఖనానావాదిత్రనిర్ఘోషంబు కల్లోలమాలికాస్ఫాలనరవంబు గాఁ, గోశసంచయంబు రత్ననిచయంబుగా విచిత్రభూషణభూషితంబు లగుకర్త శంబులు కల్లోలంబులుగా, శస్త్రాస్త్రసంఘాతంబులు నురుగుతెట్టెలుగా, సౌధవీ థు లద్రిగణంబులుగా, మహార్ణవంబు ననుకరించి సంగరోత్సాహంబునఁ జంద్రో దయంబునకుంబలె ఘూర్ణిల్లుచుండె. అంత మఱునాఁడు సుయోధనుండు హస్త్య శ్వరథపదాతివర్గసారాసారంబుల లెస్స పరిశీలించి సర్వరథంబులందును ధనుర్బా ణతూణీరశక్తితోమర శూలముద్గరభిండివాల గదాఖడ్గప్రముఖ సకలసాధనంబు

లఁ బెట్టించి వ్యాఘ్రచర్మావరణంబు గావించి ధ్వజంబు లెత్తించి యొక్కొక్కనికి వేలువేల నాలుగేసియుత్తమాశ్వములఁ బూన్పించి హయరహస్యవేదు లగునిపుణసారథుల నియమించి యొక్కొక్కరథమునకుం బ్రత్యేకంబ హయరక్షకుఁ డొక్కఁడు రథికుఁ డొక్కఁడు సారథి యొక్కండు చక్రరక్షకు లిద్దఱు తద్రథసారథు లిద్దఱుంగా నేడ్వుర నిర్ణయించి యొక్కొక తేరికిం బ్రత్యేకంబ యంకుశధారు లిద్దఱుత్తమధనుర్ధరు లిద్దఱు ఖడ్గధరు లిద్దఱు శక్తిపినాకధారి యొక్కఁడుంగా నేడ్వురుపరిజనులు వేఱ్వేఱ గలయేనుఁగులఁ బదింటిని నొక్కొకయేనుంగునకుఁ బదిగుఱ్ఱములను నైక్కొకహయంబునకుఁ బదుగురఁ బదాతులను సంగరంబునఁ గొఱంతవడినప్పుడు పూర్తికిఁగా నొక్కొక్కరథమున కేఁబదియేనుఁగులను నొక్కొకయేనుంగునకు నూఱుగుఱ్ఱంబులను నొక్కొకగుఱ్ఱమున కేడ్వురుపదాతులను నిరూపించి పదునొకండక్షౌహిణుల నీసంవిధానంబునఁ బోరి కాయితపఱిచి ద్రోణాచార్యుఁడు, కృపాచార్యుఁ, డశ్వత్థామ, కర్ణుఁడు, సైంధవుఁడు, శల్యుఁడు, కాంభోజనాథుఁడగుసుదక్షిణుఁడు, కృతవర్మ, శకుని, బాహ్లికుఁడు, భూరిశ్రవసుఁడు ననువారల నక్షౌహిణులుపదునొకొంటికిం బ్రత్యేకంబ నాయకులఁగా నేర్పఱిచి యాదండనాథులకు దివ్యసలిలాభిషేకంబుఁ గావించి తదీయచిత్తసమారాధనం బాచరించి యగ్గించి వారల నందఱం దోడ్కొని భీష్ముపాలి కరిగి కేలుమోడ్పు ఫాలభాగంబున ఘటియించి వారలం జూపి యిట్లనియె. పితామహా, భారద్వాజప్రముఖులగునీశూరులను మనయక్షౌహిణులు పదునొకొంటికిఁ బతులఁ గావించితి. ఈసేనల కన్నింటికిని నీవు పతివై కాపు సేయవలయు. సేన యెంత పెద్ద యున్నను సర్వసేనానాయకుఁ డొక్కఁడు లేకుండినయేని చీఁమలబారుచందమునఁ గయ్యంపుదఱి నిచ్చమెయిఁ బాఱుచుండు. లోకమునం దొకసమతికి మెప్పుగఁ దోఁచిన యది వేఱొక్కనికి విరుద్ధముగఁ దోఁచు. విశేషించి సేనాపతులకు శౌర్యకారణంబునఁ బరస్పరస్పర్ధ పుట్టుటకతనఁ బలువిధంబులై చీకాకుపడుఁ గావున సర్వసేనలు నొక్కనియానతిమెయి మెలంగనవలయు. తొల్లి బ్రాహ్మణవైశ్యశూద్రులందఱు హైహయులమీఁదికి దండెత్తి వచ్చి పెక్కుమాఱు లోడినపదంపడి బ్రాహ్మణులా హైహయులపాలి కరిగి యిది యేమికారణం బెప్పుడును మీరే గెలుతురనియడుగ వారావిప్రులం జూచి మే మందఱ మొక్కమొగంబై యొకశూరవర్యునిమాటమెయి నడుచువారము గావున జయంబుఁ గొనిమెదము. మీ రట్లుగాక వేఱువేఱ తమకుఁ దమకుఁ దోఁచినట్లెల్ల వర్తించుటం జేసి యోడుచున్నవారని కలిగినకారణంబు సెప్పిన విని బ్రాహ్మణులామీఁద నొక్కమాటమెయి నడిచి పోరికి వచ్చి గెల్చిరని విందుముగదా. కావున మనయక్షౌహిణులు పదునొకొంటికి నొక్కని పతిగా [illegible] నిరూపింపఁ దలఁచెద. అందులకు నీవు

దక్క నొండొక్కఁడర్హుఁడు గాఁడు. నీవు తేజస్వులలో నాదిత్యునిచందమునను యక్షులలోఁ గుబేరునివిధమునను బర్వతంబులలో మేరువుమాడ్కి నీయున్న వీరలోకంబులోనెల్ల నధికుఁడవు. ధర్మనిష్ఠుండవు. బుద్ధిప్రభావమున భార్గవున కెన వత్తువు. సర్వకాలంబు మదీయహితముఁ గోరువాఁడవు. కావున సర్వసేనాధిపతిత్వంబు వహింపుము. భవద్భుజబలరక్షితు లయినమమ్ము నింద్రునకైనం దేఱిచూడవచ్చునే యని సముచితాలాపంబుల సవినయంబుగఁ బ్రార్థించుటయు భాగీరథీపుత్త్రుఁ డాగాంధారిపుత్త్రున కిట్లనియె. సుయోధనా, నీకోరిన ట్లగుఁ గాక. అయిన నే నొక్కటి చెప్పెద వినుము. మీయట్ల పాండుపుత్త్రులును నాకుఁ గూర్మి చేయువారలే. కావున వారికి శ్రేయము సెప్పుటయు నీకుగాఁ బ్రాణముల డాఁపక పోరుటయును నాకుఁ గర్తవ్యంబు లయ్యె. నన్ను మార్కొని పోరువాఁడు సవ్యసాచిదక్క నొండొక్కఁడు గానరాఁడు. అమ్మహాబుద్ధి లాతు లెవ్వరు నెఱుంగనిదివ్యాస్త్రగ్రామంబు నేర్చినవాఁడు. క్షణమాత్రలోన లోకమెల్ల నమానుషంబుగఁ గావింపఁ జాలిననాకును బాండవులం బట్టియఁ జేతు లాడవు. వారునునన్ను నొంచియు వెనుదీయుదురు. నేను వారుదక్కఁ దక్కటియోధులనెల్లఁ గూల్చెద. మఱియు నిం కొక్క సమయంబు వినుము. తొలుత నేనొండెఁ గర్ణుఁ డొండెఁ బోరికి నడువవలయుఁగాని యే మిరువురముంగూడి నడుచుట లేదు. వాఁ డెల్లప్పుడు నాతోడ నత్యంతస్పర్ధ చేయుచుండు నిట్లయిన సేనాపతిత్వమున కియ్యకొందు ననుచున్నంత రాధేయుండు క్రోధవిధేయుండై దుర్యోధనుం గాంచి యేను మున్న చెప్పితింగదా. భీష్ముఁడు పడునంతకు నే ననిసేయను. ఇతండు తెగినపదంపడి గాండివితోడఁ బోరాడుదు ననిపలికె. అంత దుర్యోధనుఁడు పురోహితపురస్సరుండయి భీష్మునకు దివ్యసలిలంబుల సకలసేనాపతిత్వమున నభిషేకముఁ గావించుటయు నట్టియెడ శంఖభేరీప్రముఖవాదిత్రనిస్వనంబు యోధసింహనాదంబులతోడం గలిసి గోదసీకుహరంబుఁ దూఁటుకట్టె. అట్లు భీష్మాభిషేకంబు సేయుతఱి రుధిరవర్షం, బశనిపాతింబు, భూకంపం, బుల్కాపాతం, బశరీరవాణీప్రచారంబు, సృగాలనినదంబు మున్నగునుత్పాతంబులు దోఁచె. అంత నామఱునాఁడు సుయోధనుఁ డయ్యుత్పాతంబులశాంత్యర్థంబును విజయావాప్త్యర్థంబును నానాదానంబు లాచరించి బ్రాహ్మణాశీర్వాదములం బడసి పెద్దలయనుజ్ఞఁ గొని తాలధ్వజసముల్లసితస్యందనారూఢుం డై నభీష్ముండు సేనాముఖంబునం దేజరిల్ల నేకాదశాక్షౌహిణీపరివృతుండై ససంభ్రమంబుగ వెడలి కురుక్షేత్రంబుఁ దరియం జని యం దొక్కరమణీయప్రదేశంబున నిర్మితంబు లయిన శిబిరంబులందు సముచితవిధానంబున విడిసి రాధేయుండును దానును జుట్టం దిరిగి యెల్లవారికి విడిదలలు నిరూపించి నడిమి శిబిరంబునఁ దాను వసించుటయు

నాస్కంధావారంబు గజపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రావిధంబున బంధురంబై యొప్పె.

బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్రపోవుట.

అవ్విధమునం గౌరవపాండవులు యుద్ధసన్నద్ధులై యుండఁ గైలాస శైలంబుచాడ్పున నవదాతుండు నీలాంబరధరుండు మదిరాస్వాదనారుణలోచనుండు నగుబలభద్రుఁ డక్రూరోద్ధవగదసాంబప్రద్యుమ్నచారుదేష్ణాదులతోడఁ బాండవస్కంధావారంబునకుఁ జనుదెంచె. చనుదెంచినయాహలాయుధుం గాంచి ధర్మరాజు సపరివారుండై లేచి యెదురేగి యతనికరంబు నిజపాణితలంబున నంటుచుఁ దోడ్తెచ్చి యుత్తమాసనమున నాసీనుంజేసి సముచితప్రకారంబునం బూజించుటయు నాపూజం గ్రహించి వృద్ధు లగువిరాటద్రుపదుల కెఱఁగి తనకుఁ బ్రణమిల్లినవాసుదేవభీమార్జుననకులసహదేవులం గాఢాలింగనంబున నాదరించి యుధిష్ఠిరసమన్వితుండై కూర్చుండి యందఱు నాసీనులయినపదంపడి వాసుదేవుం గాంచి యారాజలోకంబెల్ల నాకర్ణింప నిట్లనియె. అత్యంతరౌద్రంబై బహుప్రజాక్షయకారణం బైనరణంబు గానున్నది. ఈసంబంధిబాంధవసుహృజ్జను లందఱు నీసంగ్రామమునకుఁ దప్పి యెలమి నున్నఁ జూచిన మేలుగదా యని తలంచియుంటిని. బాంధవు లందఱును మన కొక్కరూపకాని వేఱుగాదు. పాండవులట్లు ధార్తరాష్ట్రులును సంబంధులే కావున వీరికి వారికినిం దోడ్పడు మని యీకృష్ణునకుఁ బలుమాఱు లేకాంతమునం జెప్పితి. అర్జునుమీఁదిపక్షపాతమునం జేసి నామాట నడుపక యుద్ధమే సాగునట్లు చేసె. కృష్ణునియభినివేశముఁ బరికించినం బాండవులే గెల్తు రనితోఁచుచున్నది. ఇతని కెదురై ధార్తరాష్ట్రులకుఁ దోడ్పడి పోరాడను నీతనిఁ బాసియుండనునాకు మనసు గొలుపదు. దుర్యోధనుఁడును భీమసేనుఁడును గదాయుద్ధమున నాకు శిష్యు లగుటంజేసి యిద్దఱియెడను బ్రేమంబు తుల్యంబు. వా రిరువురు పోట్లాడి చంపుకొనునెడఁ జూడ నోపను. తక్కటిబంధువులును బోరఁ బొలియుచుండఁ జూడ నొల్లను. కావునఁ బాండవులయనుజ్ఞఁ బడసి తీర్థముల సేవింపఁ బోయెద నని చెప్పవచ్చితిఁ బోయి వత్తు నని ధర్మరాజు నామంత్రణంబు చేసి చనియె.

రుక్మి పాండవకౌరవులం గలియ వచ్చి ప్రత్యాఖ్యాతుఁ డగుట.

అయ్యవసరంబున భోజనాథుఁడును దేవేంద్రసఖుఁ డైనభీష్మకునిపుత్రుఁడును శ్రీకృష్ణునిదేవి యగురుక్మిణికి సోదరుఁడు నగురుక్మి యనువాఁడు గంధమాదననిలయుం డైనద్రుముఁ డనుకింపురుషేశ్వరునితోడఁ జతుష్పాదవిలసితం బైన ధనుర్వేదమెల్ల నేర్చి విజయనామకం బయినధనుర్వరంబును బడసినవాఁడు పాండవస్కంధావారంబునకుఁ జనుదెంచె. వానివిజయంబు [illegible] శార్ఙ్గగాండీవములును

ముల్లోకములం గలవిండ్లలోనెల్ల మిగులఁ బొగడ్త కెక్కినవి. అందు శార్ఙ్గంబును గోవిందుఁడు మురనరకాసురుల సంహరించి షోడశస్త్రీసహస్రంబుతోడం గ్రహించె. వరుణపాలితం బయినగాండీవంబును సవ్యసాచి ఖాండవదహనమున నగ్నిదేవుని సంతృప్తుం జేసి తత్ప్రసాదంబునఁ బడసె. రుక్మియు ద్రుమమునివలన విజయనామక చాపంబు గ్రహించె రుక్మిణీహరణసమయంబున వాసుదేవుని వధింపక క్రమ్మఱ నని ప్రతిన వట్టి గంగాప్రవాహంబుచందంబున మిక్కిలి పఱపైనమహాసేనతోడఁ గృష్ణుని వెన్నంటి నడిచి యతం డద్దేవదేవునితోడఁ బోరాడి తుది నోడి సిగ్గఱి క్రమ్మఱికుండెననగరంబునకుఁ జనియె. నాఁటంగోలె రుక్మి పరాజితుం డై నచోటు భోజ కటంబునాఁ బరఁగె. ఆరుక్మియనువాఁ డొక్కయక్షౌహిణితోడఁ బంకజాక్షునకుఁ బ్రియంబు సేయువాఁడై పాండవస్కంధావారముఁ జొచ్చి యుధిష్ఠిరుం గాంచ నరిగె. వానిం జూచి ధర్మరాజు కొన్నియడుగు లెదురువచ్చి తోడ్కొని పోయి యుచితాసనమున నాసీనుం జేసి యథాన్యాయముగఁ బూజించుటయు నతం డా పూజలం గ్రహించి వాసుదేవధర్మరాజసమక్షమున సకలరాజులు వినంగ గాండీవిం బిలిచి యయ్యా, యీయుద్ధమున నీకు వెఱపు గలదేని యేను దోడ్పడి నాకుఁ బాలుపెట్టినవారల భీష్మద్రోణకృపకర్ణాదుల నెవ్వరినైన నను బిలుకుమార్చెద. ఇంత యేల? ఈయున్నరాజు లందఱు నిక్కడ నీయొద్దన యుండుదురుగాక. నే నొక్కండన పోయి ధార్తరాష్ట్రులఁ దదీయుల నందఱనుం జంపి పుడమినెల్ల నీ కిచ్చెద. పరాక్రమంబున నాకు సమానుఁ డీభూమండలంబున నొక్కఁడును లేఁ డని రజ్జులు పలికిన విని యర్జునుఁడు నవ్వుచుఁ గృష్ణయుధిష్ఠిరులు వినంగ వాని కిట్లనియె. కౌరవులకులమునఁ బుట్టి విశేషించి పాండురాజునకుఁ బుత్త్రుఁడనైన నేను ద్రోణాచార్యునకు శిష్యుఁ డనుపేరు పెట్టికొని వాసుదేవునిసాహాయ్యంబుఁ బడసి గాండీవం బనువిల్లు చేతఁ బట్టికొని యెట్లు వెఱచితి ననిచెప్పుదు? ఘోష యాత్రకు వచ్చిచిక్కినధార్తరాష్ట్రులం దప్పింప గంధర్వులతోఁ బోరాడునప్పుడును, ఖాండవదహనంబున నింద్రాదులతోఁ గయ్యముసేయునప్పుడును, నివాతకవచ కాలకేయులఁ జక్కాడునప్పుడును, గోగ్రహణంబునఁ గురువీరుల జయించునప్పుడును, సర్వలోకమహేశ్వరుం డైనమహాదేవు నెక్కటెక్కటిపోర మెప్పించునప్పుడును నాకెవ్వరు దోడు వచ్చిరి? ద్రోణకృపాచార్యుల నారాధించి దివ్యాస్త్రంబుల నేర్చియు, మహాదేవునిప్రసాదంబునఁ బాశుపతాస్త్రంబు సాధించియు, లోకపాలురవలనఁ దత్తదస్త్రముల గ్రహించియు, గాండీవంబు నక్షయతూణీరంబులఁ బడసియుఁ బొగడిక గన్న నేను వెఱతు ననిచెప్పుదునే? వజ్రాయుధంబు మూర్తిమంతంబై తాన వచ్చి మీఁదఁ బడినను నాయట్టివానికి వెఱపు పుట్టునే?

తెలియక పలికితివి. నా కించుకేనియు వెఱపు లేదు. నీతోడు వలదు. నీకుఁ దగినవారియొద్దకుఁ బొమ్మని నిరాకరించుటయు నారుక్మి తనసేనతోడఁ గ్రమ్మఱి చనియె. చని దుర్యోధనునొద్దకుఁ బోయి యర్జునునితోఁ జెప్పినవిధమునం జెప్పుటయు నాగాంధారేయుఁడు నాశూరమ్మన్యుని నిరాకరించె. అవ్విధంబునఁ బాండవులును గౌరవులునుం బ్రత్యాఖ్యానంబు సేయఁగ నతండు సిగ్గఱి క్రమ్మఱియె. అట్లు బలభద్రుఁడును రుక్మియుఁ దక్కఁ దక్కటివార లందఱకును నిరువాగులందు సంగ్రామంబు సంఘటిల్లె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునివరేణ్యా, యివ్విధంబునఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వుచున్న యయ్యుభయసైనికు లామీఁద నేమి చేసిరి తెలియఁ జెప్పు మనియడుగ నతం డతని కిట్లనియె.

అయ్యవసరంబున నిశాసమయమునందు ధృతరాష్ట్రుఁడు సంజయుని రావించి సూతనందనా, సేనాసన్నివేశానంతరము కౌరవులు పాండవులు నేమిచేసిరి. సాకల్యంబుగఁ జెప్పుము. బహుజనక్షయకారణం బయినరణంబునం బెక్కుదోషములఁ జూచుచుండియు నేను నికృతిలోలుఁ డైనకొడుకును నియమించి యాత్మహితం బొనరింపఁ జాలనైతిఁ గావునఁ బౌరుషముకంటె దైవమే బలవత్తరంబని తోఁచెడి. ఇతరసమయములం దెన్నిదోషములు దోఁచినను దుర్యోధనుఁ డగపడినపు డవియన్నియు మాఱుపడుచుండె. ఏమి చేయవచ్చు? కానున్నది కాకమానదు. సంగ్రామంబున మేను దొఱంగుట యుత్తమక్షత్రియ ధర్మంబని యాఱడిల్లెద ననిన ధృతరాష్ట్రునకు సంజయుఁ డిట్లనియె. మహారాజా, యీప్రశ్నము నీకుఁ దగినయదియ. నీపై దోషము లన్నియు నుండ వానినెల్ల దుర్యోధనునిపై నేల యారోపించెదవు? ఆత్మదుశ్చారిత్రమునం బొసఁగినకీడు కాలముమీఁదను దైవముమీఁదనుం బెట్టఁ దగదు. లోకనింద్యము లయినకార్యములఁ జేసినవాఁడు వధ్యుఁ డని పెద్ద లందురు. నీకొడుకులు తులువలై పాండవులకు నికారంబులు చేసిన నీ వప్పు డొప్పరికించితివి. వారు ధర్మాత్ములు గావున సమయము గడిపి సంధికి వత్తుమన్న నదియుం గొనసాగనీవయితివి. నీయపచారంబుననే గజవాజిరథపదాతివర్గంబులతో రాజులకు మృత్యువాతం బడవలసివచ్చె. ఇఁక నే మనం గలదు. జనులు కర్మములఁ గాలవశమునను యదృచ్ఛవలనను బూర్వకర్మవశత్వంబునను జేయుదురు. ఎట్టులైన నేమి? అనర్థముఁ దెచ్చికొంటివి. స్థిరచిత్తుండవై యాకర్ణింపు మనియిట్లనియె.

### దుర్యోధనుఁ డులూకుఁ డనుదూతను బాండవులపాలికిఁ బంపుట.

అత్తెఱంగునఁ బాండవులును గౌరవులును హిరణ్వతీనదీతీరంబున సేనాసమేతులై విడిసినపదంపడి దుర్యోధనుఁడు స్కంధావారమునకుఁ దగినరక్షణం బొనర్చి కర్ణశకునిదుశ్శాసనులతోఁ గొంతవడి మంతనంబుండి యులూకుం డనుకిత

వపుత్రుని రావించి యేకాంతమున వానికిఁ బరుషము లగుకొన్ని యుపాలంభవచనముల బోధించి యివి నీవు పాండవులం గని వాసుదేవునిసన్నిధిని విరాటద్రుపదధృష్టద్యుమ్నాదులు వినంగఁ బల్కు మనిపంచిన నయ్యులూకుండును బాండవస్కంధావారమున కరిగి రాజీవాక్షుండును దమ్ములును ద్రుపదవిరాటప్రముఖులుం బరివేష్టింప నిండుకొలువున్నధర్మరాజుం గాంచి దేవా, సుయోధనుఁ డీయున్నవార లందఱు వినంగ మీతో నాడఁ బంచినపలుకులు కొన్ని గలవు. నాపైనలుక పూనక యాకర్ణింపవలయు ననిన విని పాండవాగ్రజుం డులూకుం జూచి యాదురాత్ముఁడు పలుకు మనినపలుకు లెల్లఁ బలుకుము. దూతవైననీవలనం దప్పు లేదు గావున వెఱవం బని లేదు వివరింపు మనుటయు నులూకుఁ డాసభలో దుర్యోధనుండు పలికినచందముగా నయ్యజాతశత్రున కిట్లని చెప్పం దొడంగె. బహువత్సరంబులు పూఁచిపట్టినకయ్యం బిప్పటికి వచ్చె. వాసుదేవుఁడు నీతమ్ములుం బలుదెఱంగులఁ బ్రేలినపలుకు లెల్ల సంజయుఁడు చెప్పఁగ వింటిమి. ఊరక తమ్ముఁ దాము పొగడికొనినం బ్రయోజనంబు లేదు. అవియన్నియుం దలంపునకుఁ దెచ్చికొని కార్యమునం జూపుము. మఱియు నీవు పరమధార్మికుఁడననియు సర్వభూతముల కభయప్రదుఁడననియుం బేరు పెట్టికొని యిపుడు ప్రజాక్షయకారణం బైనఘోరసంగ్రామంబున కెట్లొడంబడితివి? కల్లుబెక్కముచాడ్పునఁ బ్రకాశంబుగా ధర్మధ్వజం బెత్తించి ప్రచ్ఛన్నప్రకారమునఁ బాపము లొనర్చుట బైడాలవ్రతం బనఁబడు నని తొల్లి ప్రహ్లాదుఁడు తనరాజ్యము సురలపహరించికొనినప్పుడు చెప్పె నని వినంబడు. ఆబైడాలవ్రతస్వరూపంబును మాతండ్రికి నారదుఁడు చెప్పఁగ వింటి నెట్లంటేని? దుష్టాత్మకం బైనమార్జాలం బొక్కటి లోఁతుల నమ్మింపఁగ వంచన పూని చిత్తము పరిశుద్ధ మగుచందము ప్రకటించుచుఁ జేతుల మీఁది కెత్తి గంగాతీరంబునఁ గపటధర్మనిష్ఠమై నుండె. అట్లున్నంతఁ బెద్దకాలంబునకు దానిమోస మెఱుంగక వివిధపక్షిజాతంబులు నమ్మి చేరువం జేరి పూజించుచుండ నదియుఁ దనపని సఫలం బయినదియ కాఁ దలంచుచు ముదం బదియుండఁగ నెలుకలు కొన్ని వచ్చి యాపిల్లిం జూచి తదీయతపశ్చర్య కాశ్చర్య మొంది దీనిం జేరిన మే లగునో కాకున్న మనకుఁ దనకుం గలజాతివైర మెత్తి చంపునో యని కొండొకకాలంబు వగచి పదంపడి యిది యట్లు చేయదు. మఱి తనకు మనకుం గలమాతులభాగినేయసంబంధంబుఁ దలపోసి రక్షించు నని నిశ్చయించి యాబిడాలమును డాయం జని యయ్యా, మేము భవత్ప్రసాదంబున సుఖంబుండఁ దలఁచి శరణాగతుల మైతిమి. నీవ మాకు బరమసుహృదుఁడవు. ధార్మికాగ్రగణ్యుండ వైననీవు మమ్ము సురేంద్రుఁడు సురలం బోలెఁ బ్రోవవలయు నని మూషకంబులు చెప్పిన విని యమ్మూషకవైరి తప

శ్చర్యయు భవద్రక్షయు ననునీకార్యద్వయంబు నాకు దుష్కరం బయ్యె. అయిన ను మీకు హితము సేయవలయుఁ గావున నెట్టులైన రెంటి నరయుచుండుదు. మీరును ముదిసిననాకు భక్తితాత్పర్యంబునఁ బరిచర్య సేయుఁడు. ఇఁకమీఁద న డువ నోపనినన్ను గంగాతీరమునకుఁ గొనిపోవుఁ డనిచెప్పిన విని యెలుక లట్ల యని తమలోనివృద్ధబాలగణంబుల నాబిడాలంబున కప్పగించి నిజకార్యతాత్పర్యం బునఁ దిరుగుచుండె. ఆబిడాలంబును బ్రతిదినము నయ్యెలుకల మ్రింగుచు నా నాఁట బలిసి తేజోవిశేషసమన్వితంబై యుండఁ గాంచి యెలుకలు దమలో విచా రించుచున్నంత దిండికనామధేయం బైనయొక్కమూషకంబు తమవారలం జూచి మీరెల్లఁబనిగలిగి నదీప్రాంతమున కరుగుఁడు నే నీబిడాలంబుతోడ నేఁడు పోయెద నని యానాఁడు వారలం బనిచి తా నాపిల్లితోడం బోవుటయు నాపక్షిధ్వంసి యెఱుంగక డిండికముం దినియె. అంతఁ గొన్నినాళ్లకు మూషకము లన్నియుఁ బిండుగట్టి యొక్కచోటం జేరి డిండికం బగపడమికిఁ గతం బరయుచున్నంతఁ గో కిలనామకం బయినవృద్ధమూషకంబు తమవారలఁ గలయంజూచి యీపిల్లి ధర్మ నిష్ఠితంబు గాదు. ఫలమూలాహారమాత్రంబున శరీరయాత్ర గడపుదానిపోలెఁ గపటము పన్నియున్నది. దీనియొద్దఁ గాపుంచిన యెలుకల నన్నింటి నిదియే మ్రిం గియుండవలయుఁ గాదేని దీనిపురీషము రోమనిబిరీసంబై యుండదు. అదియునుం గాక మున్ను ముదిసికృశించియున్నయది యిప్పుడు నానాఁటం బెరుగుచున్నది. మన గుంపునుం దఱుఁగుచున్నది. ఏడెనిమిదివాళ్లనుండి డిండికం బగపడకున్నది. దాని నిదియే మ్రింగియుండు ననితోఁచెడి. ఇఁక దీనిపొత్తు మనకుఁ దగ దనుటయుఁ దక్కఁ గలయెలుకలన్నియుఁ దమలోఁ దత్ప్రకారంబు నిశ్చయించి యెటకేనియుం బాఱి పోయె. దుష్టాత్మకం బైనయాబిడాలంబు నిచ్చమెయిం జనియె. నీవు నట్లె బై డాలవ్రతం బవలంబించినవాఁడవు. నోటిమాటచొప్పునఁ గార్యము గన్పట్టదయ్యె. నీ వేదాధ్యయనంబు శాంతిపరిగ్రహంబును లోకవిశ్వాసార్థంబకాని యొండు గాదు. ఈకపటము మాని క్షాత్రధర్మంబు పట్టి కార్యముల నడుపుము. బాహువీర్యమునఁ బుడమిని సాధించి వివిధదానముల దేవపితృబ్రాహ్మణుల నారాధింపుము. బహువర్షములు మిక్కిలి యిడుములఁ బడినతల్లికన్నీరు దుడువుము. ఐదూళ్లిచ్చినఁ జాలు నని నీ వన్నను మే మీక మి మ్మలిగించి పోరికిఁ గట్టాయితంబై యున్న వారము. నీకు హితముఁ గోరుచున్న విదురుని దుష్టచిత్తుని వెడల నడిచితిమి. జతుగృహదహనాదికంబు లయినయెగ్గు లెన్నియేఁ జేసితిమి. మగవాఁడవై తేని యవియన్నియుం దలపోసి మానము వాటించి యనికి రమ్ము. సంధికి వచ్చి కృష్ణుఁడు శాంతికైనను బోరికైనను ధర్మనందనుఁడాయితపడియున్నవాఁ డనిప లికె. సమరమునకుఁ గాలము ప్రాప్తం బయ్యె. విజయసబంటవై తేని రమ్ము.

ఉత్తమక్షత్రియకులంబున జనించి ద్రోణాచార్యునకు శిష్యుఁడవై వివిధాస్త్రముల నేర్చిన నీకు సంగ్రామంబు సంప్రాప్తం బయ్యెనని వెఱవం దగ దనిపలికి యట భీమసేనుం గనుంగొని యిట్లనియె.

విరాటనగరంబున వల్లవుఁ డనుపేరు పెట్టికొని వంటలవాఁడవై కడుపు ప్రోచికొన్న నీకుఁ బౌరుషం బెక్కడిది? తిండిపోత వగునీవు. భక్ష్యభోజ్యాదిసమవాయసమయమునఁ జేరఁదగినవాఁడవకాని యాయోధనంబునకుఁ జాలుదువే? రణాంగణంబున నాచే నిహతుండవై గద యూఁదికొని నేలం బడుదువు. నాఁడాసభలో దుశ్శాసనుఱొమ్ము వ్రచ్చి నెత్తురు ద్రావుదు ననియు ధార్తరాష్ట్రుల నందఱం జంపుదుననియుఁ బ్రతిన వట్టితివిగదా. శక్యం బగునేని యిప్పుడు చెల్లింపుము. వట్టిమాటలు పల్కినమాత్రన ప్రయోజనంబు పుట్టదు. పోటుగలమానిసివై తేని పోరికి నడిచి రమ్మని చెప్పి వివ్వచ్చు నాననం బాలోకించి యిట్లనియె.

ధనంజయా, శౌర్యంబు గలదేని మమ్ము గెలిచి నీవు పుడమినేలుట కాదేని మాచేఁజచ్చుటయును దక్క నొండొక్కగతి మీ కిప్పుడు లేమి నిక్కంబు. క్షత్రియాంగన యదర్థంబు కొడుకులం గను నందుల కిది యవసరంబు. రాజ్యంబు గోల్పాటు నడవుల నిడుమలపాటు పాంచాలిభంగపాటునుం దలపోసి మగవాఁడవై తేని వేగ పోరికి సమకట్టి దిట్టవై రమ్ము. బలవీర్యశౌర్యధైర్యాస్త్రలాఘవచాతుర్యంబులు గలవాఁడవేని కోపమునకుఁ బ్రతీవిధానంబుఁ జేసికొమ్ము. మీరు దక్క నొండొక్కయుత్తమక్షత్రియకులజనితుల కిన్నిపాట్లు పడినపదంపడి గుండె పగులకుండునే? యుద్ధకామునకు శత్రునిగ్రహంబు రాజ్యసాధనం బునను రెండు ప్రధానకార్యంబులు గావునఁ బౌరుషంబుఁ జూపుము. మేము ద్రౌపదిం బఱిచినపాట్లు మనుష్యమాత్రున కోర్చునట్టివియే? మఱియు మాటిట్లు వినుచుఁ బరాక్రమహీనులై మీరు పండ్రెండేండ్లు ఘోరకాంతారములఁ గష్టపుఁబాటు పడి పదంపడి విరాటునకు దాసులై బ్రదికితిరి. సంకటపాటు వాటిల్లినపుడుం గోపముఁ జూపనివాఁడు మగవాఁడగునే? అమర్షంబెకదా పౌసుషంబు. క్రోధబలవీర్యశస్త్రాస్త్రపరిజ్ఞానాదులు గలవేని యిక్కడఁ జూపుము. ఉభయసేనలును జయమంగళప్రదంబు లయిననీరాజనోపచారంబులం బడసి కయ్యమునకుఁ గాలుద్రవ్వుచున్నయవి. కురుక్షేత్రము కర్దమరహితంబై సంగ్రామరంగంబునకుఁ దగియున్నది. చతురంగములుం గూడియున్నవి. ఎల్లి భండనంబు గాఁగలయది. కేశవుం దోడ్కొని మమ్ము మార్కొని పోరాడుము. ఊరక యింటఁ గూర్చుండి వారిం బరిమార్తు వీరిం దెగటార్తు నని యుబ్బుచుఁ దన్నుఁ దాన పొగడికొనినం బ్రయోజనంబు గానరాదు. శత్రుభీకరమూర్తి యగుభీష్ముని మార్కొనక గంధమాదనగిరి నారోహింపఁ దలఁచుబాలిశునిచాడ్పున నేల పొగడికొనియెదవు?

అమ్మహాత్ము నెదిరించి నిలువ నీబోటి కలవియే ? ధనుర్వేదాచార్యుం డైనద్రో ణాచార్యుం గెలువఁగున్న నీకు రాజ్య మెక్కడిది? అయ్యవక్రవిక్రముని నీవు గెలు చుట గాలికి మేరుగిరి తునియలై పడు నన్న ట్ల సంభావితంబు. మిన్ను వడ్డను యుగము మాఱిన నయ్యది కాఁగలపని గాదు. అజేయుం డై నరాధేయుని నింద్రతుల్యుం డై నశల్యునిం గెలువ నీకుఁ దరమే? ప్రాణములపై నాస గల వాఁ డెవ్వఁడేనియు వీరి నెదిరించి నడువమి సిద్ధంబు. తెలియక నడిచెనేని చచ్చు టయు సిద్ధంబు. నూతిలో నుండుకప్పచాడ్పున నీయింట నుండి యెన్నియైనం బలుకవచ్చుఁగాని ప్రాచ్యదాక్షిణాత్యప్రతీచ్యోదీచ్యప్రముఖసకల దేశాధీశసాం ద్రంబై మందాకినీప్రవాహంబుచందంబునఁ బఱపై సురలకైనం జెనకరానికురు సేనం జొచ్చి ప్రాణములతోఁ బోవచ్చునే? మఱియు గజసేనామధ్యస్థితుండ న గునన్ను మార్కొనం దలంచెదవు. ఇది నీబుద్ధిలేమికి నిదర్శనంబు. నిన్నుఁ జూచి మే మొక్కింతయు వెఱవము. నీకు వాసుదేవునితోడ్పాటును, దాడియంతటిగాం డీవం బనువిల్లును, నగ్నిదత్తం బైనయరదంబును, దివ్యధ్వజంబును, నక్షయ్య తూణీరద్వయంబునుం గలదనియు నీవు మేటివిలుకాఁడవనియు నే నెఱుంగుదు. ఎఱిఁగియెఱిఁగియే మీకు రాజ్య మొసఁగనైతి. నీవిక్రమంబెల్ల రేపు చూతము గదా. నిరుపయోగంబు లగుప్రస్తుతివచనంబులం బ్రయోజనంబు లేదు కావున నామాటలు చాలించి చక్క నిలిచి గండడరి భండనంబు సేయుము. అప్పుడు ప్రసిద్ధి వచ్చుఁగాని వట్టిపొగడికల రానేరదు. పొగడికొన్నమాత్రన కార్యము లొడఁగూడునేని యందఱును నీయట్ల యాత్మవికత్థనములఁ గావించికొని సిద్ధా ర్థు లగుదురు. ప్రొద్దువోవనియుబ్బుమాటల నెవ్వరికైన లేమిడి గల్గునే? మీ రేడ్చుచుండఁగ నేను బదుమూఁడేండ్లు నిష్కంటకముగ రాజ్య మేలితి. ఇంకను మిమ్మందఱ దెగటార్చి యేలుదు. జూదమున నోడి పాఱునపుడు నీగాండీవంబు ను భీమునిగదయును నెక్కడికిఁ బోయె? మీ రందఱు మాకు దాసులై యుండ నాదాస్యంబుఁ దొలఁగింపఁగఁ బాంచాలిదక్క నొండొక్కగతి మీకుఁ గలుగ దయ్యెఁగదా. మఱియు మీ రందఱు గొడ్డువోయినవా రని మే మంటి మది నిక్కంబ. నీవు గొడ్డువోయికదా పేడివై తల జడ వేసికొని విరాటునింటఁ గన్ని యల కాట నేర్పుచుంటివి. భీముఁడు వంటలవాఁడై వరవుడంబులు సేయుచుండె. అది మదీయపౌరుషంబున నైనదియకదా. తలజడ వేసికొనుట పోర వెఱచిపా ఱుట మున్నగునవియకదా క్షత్రియులకు నీచకర్మంబులు. నీకును వాసుదేవున కును వెఱచి నేను రాజ్యమునం బాలిత్తుననుమాట మానుము. కృష్ణుఁ డిచ్చటఁ జూపినమాయలు నింద్రజాలంబులును శస్త్రాస్త్రములతోడఁ బోరాడునపు డడ్డము రావు. వేవురు వాసుదేవులు[illegible]జయులయినను నన్ను మార్కొ

ని పొలియుదురుగాని యనిఁ జక్క నిలువనేరరు. భీష్మునితోడం బోరాట తలచేఁ గొండఁ బగులనడుచుచంద మయ్యెడి. కృపాచార్యుండు మహామీనంబుగా, వివింశతి క్రూరనాగంబుగా, భారద్వాజుండు మహాగ్రాహంబుగాఁ, గర్ణశల్యులావర్తంబులుగాఁ, గాంభోజరాజు బడబానలంబుగా, బృహద్బలుండు మహాసాలంబుగా, సౌమదత్తి తిమింగిలంబుగా, యుయుత్సుండు తోయంబుగా, భగదత్తుండు మారుతంబుగా, శ్రుతాయుః కృతవర్మ లగాధహ్రదంబులుగా, దుశ్శాసనుండు ప్రవాహంబుగా, శల్యసుషేణచిత్రాయుధప్రముఖులు వివిధయాదోగణంబులుగా, జయద్రథుండు పర్వతంబుగా, శకుని ప్రపాతంబుగా, శాంతనవుఁడు వేగంబుగా నర్ణవంబుచాడ్పున ఘూర్ణమానం బై నకురుసేనావ్యూహంబు నీఁదుము. దాని నీఁదఁజాలక బంధుమిత్రసహాయవర్గంబు దెగటారినపదంపడి పశ్చాత్తాపంబునం గుందెదవు. అప్పుడు క్షీణపుణ్యుండు స్వర్గంబునుంబోలె నీవు రాజ్యంబుపైఁ గాంక్షఁబాయుదు వని వివరించి నకులసహదేవులం జూచి యిట్లనియె. యుధిష్ఠిరునిపై ననురాగంబును నాపై ద్వేషంబును మీరు చిన్ననాఁటం గోలెఁ బట్టినవారుగదా. వనవాసాద్యాయాసంబులను ద్రౌపదీపరిభవంబును గుడిచితిరి కావునఁ బౌరుషంబు గలదేని రేపు సంగ్రామరంగంబునఁ జూపుఁ డని పలికి మురాంతకునాననంబాలోకించి యిట్లనియె.

జనార్దనా, పాండవరక్షణార్థంబు నాత్మరక్షణార్థంబు నోటదక్కి చక్కనిల్చి దురంబు సేయుము. నాతోడ్పాటుగలసవ్యసాచితోడఁ బోరు వలదనియు, నే నెట్టులయిన ధార్తరాష్ట్రులఁ జంపించి పాండవులకు రాజ్య మిత్తుననియుం బల్కితి వని సంజయుండు మాకుఁ దెల్పినవాఁడు. సత్యప్రతిజ్ఞుండ వగుదువేని తే పామాట నడిపింపుము. నీ విచ్చటికి సంధికై వచ్చినపుడు మాయలు చేసి నిజశరీరమునఁ బెక్కురూపములు చూపితివిగదా. ఆరూపములనెల్ల నెల్లి భండనంబునం జూపుము. ఆమాయలకు నింద్రజాలములకును మేము వెఱవము. అట్టివి పెక్కులు మేముం జేయనేర్తుము. ఉన్నట్లుండి మింటి కెగయుదుము. రసాతలంబుఁ జొత్తుము. ఇంద్రపురమున కరిగి వత్తుము. ఆమాయలెల్ల మామెఱుంగనియవి గావు. అర్జుననికి నడిపించికొని రమ్ము. నీపౌరుషంబుఁ జూతుము. శత్రువులకు శోకముఁ గావింపఁ జాలినపౌరుషంబకదా లోకంబునం బౌరుషం బనంబడు. కంసునికి భృత్యుఁడై యున్ననీ కట్టిపౌరుషం బెక్కడిది? నిష్కారణంబ నీకు లోకమునఁ బ్రఖ్యాతి యెక్కుడయ్యె. అసమర్థులకును బూర్వకర్మవశమునఁ బ్రఖ్యాతి గల్గుటయుం గలదు. నీబుద్ధివిక్రమప్రభావంబులు రేపు చూతముగదా యనినుడివి యట విరాటద్రుపదుల కిట్లనియె. మహాగుణులయ్యు భృత్యులు భర్తలఁ బరికింపని విధంబున భర్తలును భృత్యులం బరికింపరు. ప్రజాసర్గం బిట్టిదయైయుండు.

మేము మీకుఁ దగినపతులు గామనికదా మీరు పాండవులం జేరితిరి. మీ రంద ఱుం బిండుగట్టికొని రండు, మాతోఁ బోరాడుఁడు, మీ ప్రతాపంబుఁ జూత మని వచించి యంత ధృష్టద్యుమ్నుదెస మొగంబై నీవు ద్రోణుం జంపుదు నని యున్నవాఁడవకదా. అది యిపుడు దెలియ నగు. నీ వందులకుఁ జాలుదువే యని చెప్పి పదంపడి శిఖండిం జూచి నీవు స్త్రీపూర్వుండ వనుతలంపున గాంగేయుండు నీతోఁ బోరు సలుపఁడు. కావున వెఱపుదక్కి యుక్కుమిగిలి రణంబు సేయుము. నీపౌరుషం బంతయుం జూచెద మని దుర్యోధనుండు గఱపినవిధమునఁ దూలనాడె.

### పాండవు లులూకునకుఁ బ్రతివచనము లిచ్చుట.

అట్లు తూలనాడుటయుఁ గొలువునఁ గూర్చున్న రాజు లందఱు నాశీవిషము లచాడ్పునఁ బెద్దయు రోఁజుచు నాసనంబులు విడిచి బాహువిక్షేపంబు లొనరించుచు నొండొరులం జూచుచుండ వృకోదరుండు వేఁడినిట్టూర్పు నిగిడించుచు మొగంబు ద్రిప్పి కన్నుఁగవఁ గెంపు గదుర దామోదరు నవలోకించిన నతనికింకిరిపాటు నరసి సరసిజోదరుండు నవ్వుచు నీమాటలు వింటిమి. మీరాజుతలం పెఱింగితిమి. అది యట్ల యగుఁగాక యని యయ్యులూకునకుఁ జెప్పి ధర్మనందను మోమునఁ జూడ్కి నిలిపియుండఁ గ్రమ్మఱ నయ్యులూకుఁడు దుర్యోధనుఁ డను మనినవిధమున నర్జునుం బునఃపునరధిక్షేపవచనముల నాక్షేపించె. దారుణంబు లగునమ్మాటల విని బీభత్సుండు క్రోధావేగసంక్షుబ్ధచిత్తుండై ఫాలభాగమార్జనంబు సేయుచుండె. వాసుదేవార్జునులం దూలనాడినవిధంబు తమచెవులు సూఁడిన చందంబుగా రోషణభీషణమూర్తులై మాద్రేయులును, సౌభద్రుండును, ద్రౌపదేయులును, సాత్యకివిరాటద్రుపదధృష్టద్యుమ్నశిఖండిధృష్టకేతుకేకయప్రముఖు లగుయోధవీరు లందఱు రక్తచందనరూషితంబులు కేయూరాంగదాదిభూషణభూషితంబులు నగునిజభుజంబుల నప్పళించుచుఁ బండ్లు పటపట గొఱుకుచు సెలవులు నాకుచు నాసనంబులు విడిచి లేచి పైకిఁ దూఁకఁ దమకింపుచున్నంతఁ దదీయాకారభావం బెఱింగి మారుతాత్మజుండు తటాలునం గన్నులు మీఁది కెత్తి చూచి యవుడుగఱచి వామకరతలంబు దక్షిణపాణితలంబున నప్పళించుచు మూర్తి గొన్నరౌద్రంబుమాడ్కి నుద్రేకించి యులూకున కిట్లనియె.

మూఢా, యశక్తులకుంబోలె మాకుఁ బ్రోత్సాహనంబుఁ గావింప దుర్యోధనుండు పలికినపలుకులెల్ల నీవలన వింటిమి. ఇఁక నేఁ జెప్పెద వినుము. విని దుష్టకష్టనికృష్టాత్ములయినకర్ణశకునిదుశ్శాసనులును సకలరాజలోకంబును వినుచుండ మీ రాజునకుఁ దెల్పుము. ఓరీ దురాచారా, పరమధార్మికుఁడై నధర్మరాజు కులక్షేమముఁగోరి సంధిఁ గావింపఁ దలంపుతో సకలలోకపూజార్హుండై నదాశార్హుని మీ యొద్ద కనిచె. అద్దేవదేవుఁడు వచ్చి యంత దేర్చినను గాలము దీఱుటం జేసి యా

మాటల నీవు పెడచెవిం బెట్టితివి. ఇంతియకాని మీకు వెఱచినవారము గాము. రమ్ము. ఎల్లి భండనంబు గాఁగలయది. గాంధారీపుత్రుల నందఱను నేను దెగటార్తు నని ప్రతిజ్ఞ చేసితి. సముద్రము చెలియలికట్ట వాసి వచ్చినను గొండలు బలుతునియలుగఁ బగిలినను నాప్రతిన తప్పదు. లోకపాలురతోడ్పాటు వడసి వచ్చినను బాండవులు ప్రతిజ్ఞఁ జెల్లింపకమానరు. ఏను దుశ్శాసనునురంబుఁ బగిలించి తనివి తీఱ వానినెత్తురు ద్రావుదు. మఱియు గదాదండంబున నీతొడలు విఱుగ నడిచి నీతల దాఁపటికాలం దన్నుదు. మీకు నూఱుగురకు నేన మృత్యు వని నమ్ముము. అనికి రా వెఱచి కరిపురంబున డాఁగియుండిననేమొగాని పోలికలనికి వత్తువేని నాచేఁ జచ్చి గ్రద్దలపా లగుదు వింతయు నిక్కువంబు. మీరకా దెవ్వరు నా కెదురైన నందఱను నేలఁ బెట్టి కాలఁ జమురుదు. భీష్ముఁడు సేనాముఖంబునఁ గలఁ డని తేఁకువఁ బూనవలదు. ఎవ్వరికిని మేము వెఱవము. పౌరుషము గలవేని వెనుదీయక యనికి సమకట్టి రమ్మని చెప్పుచున్నంత సహదేవుఁడు క్రోధారుణితలోచనుండై యులూకుం బిలిచి నామాటలం గొన్ని దుర్యోధనుతోఁ జెప్పు మని యిట్లనియె. పాపాత్మా, నీవు పుట్టి తండ్రిం గూడ నిందపాలు చేసితివి. ధృతరాష్ట్రునకు నీవు పుత్రుఁడవై పుట్టవేని మాకుఁ గౌరవులతోడ వైరము రాకయే యుండు. నీపయిం గలప్రేమువిం దవిలి నీతండ్రియుఁ బాపమతియై చిన్ననాఁటంగోలె మా కెగ్గులే చేయుచున్నవాఁడు. నీనిమిత్తమునఁ గులనాశమును బ్రజానాశంబునుం బొసఁగె. మాతోడిపగ నీకు సమూలధ్వంసంబుఁ గావింపకమానదు. నిన్నుఁ జంపుట నిక్కంబు. విలుకాండ్రందఱునుం జూచుచుండఁగ నీపగకు మూల మగుశకునిని నేను దెగటార్తు ననుటయు నయ్యిరువురమాటలు విని యర్జునుండు చిఱునగవు నెమ్మొగంబునం బొడమఁగ భీమసేనుం జూచి నీతోఁ బగ పెట్టికొన్నవారు బ్రదుకనేరరు. వారికెల్లఁ గాలంబు దీఱె. ఈయులూకునిఁ గుత్సింప నేల? చెప్పినమాటలనెల్ల నుగ్గడించుటయకదా దూతలకృత్యంబు. వీనియెడం గింకిరిపాటు వల దనిపలికి యట ధృష్టద్యుమ్నప్రముఖశూరలోకంబు నాలోకించి వింటిరే మీరెల్ల నాదుర్యోధనుదుర్భాషణప్రకారంబు. విశేషించి వాసుదేవుని నన్నునుం బలుదెఱంగులఁ దూలనాడె. అమ్మాటలు విని మీరు మాహితముఁ గోరినవారలు గావున సంరంభావష్టంభసముద్రిక్తులై తిరి. వాసుదేవునిప్రభావంబునను మీప్రయత్నంబునను వారికిఁ దోడ్పడినసకలరాజలోకంబు నే నించుకేనియు గణింపను. మీయందఱిచే ననుజ్ఞాతుండనై యా బాలిశునకుఁ దగినప్రతివచనముల నెకకొన్నింటి నీయులూకునకుం జెప్పెద. వానిదుర్భాషలకెల్లఁ బ్రత్యుత్తరములు రేపు గాండీవంబునం బల్కెద. తలఁచినయది శౌర్యమునఁ జూపవలయుఁగాని నపుంసకులయట్లు వట్టిమాటలం

జెప్పిపుచ్చినం బ్రయోజనం బెయ్యది? యనవుడు నందఱు నవ్వచనోపచారంబున కద్భుతం బంది యవ్వీరశేఖరుం బ్రశంసించిరి. అంత నయ్యర్జునుండు కన్నుఁగవం గదిరిన కెంపుతోడఁ గలిసి చిఱునగవు వింత చెలువు గావింప ఘోరాభిరామమూర్తియై నిట్టూర్పు నిగిడించుచు జనార్దను మొగమునఁ జూడ్కి నిలిపి యన్నదమ్ములఁ గలయం గనుంగొని యులూకుం బిలిచి కితవపుత్రా, కులపాంసనుండైన యాదుర్యోధనునితో నామాటగా నిట్లు చెప్పు మని యిట్లనియె. పాపాచారా, నీవు పుట్టిననాఁడు మొదలుగాఁ బాండవులయెడఁ గుటిలప్రవర్తనంబు నడిపితివ కాని యొండు గాదు. పోరికి వత్తు మని మమ్మేల వెఱపించెదవు? సంగ్రామంబునకు మేము భీతిల్లము. ఇది తెల్లము. నిజభుజవిక్రమంబున శత్రువులఁ బోరికిఁ బిల్చువాఁడె మగవాఁడుగాని పరులప్రాపునఁ బిల్చువాఁ డెన్నఁడు గానేరఁడు. మఱి వాఁడు నపుంసకుఁ డనఁబడు. నీకు విక్రమంబు గలదేని రమ్ము. మాన్యవృద్ధులం దోడికొనిపోరికి వచ్చువాఁడు క్షత్రియకులమున నీచుఁ డనఁగ దూఱు వడయు. స్వశక్తి లేనినీవు మమ్ము వెఱపింపఁ బూనుటకు నా కెంతయు నద్భుతం బయ్యెడి. బలవిక్రమాధికుల నధిక్షేపించుట యంతకంటె నబ్బురం బని వేఱ చెప్పవలయునే? కురుపితామహుండైన భీష్ముని మున్నిడికొని వచ్చిన నమ్మహాత్ముని మేము వధింప నొల్లమని తలంతువేమొ? అదియంతయుఁ గల్ల. మ మ్మెదిరించి వచ్చువారలఁ బిలుకుమార్ప కుడుగము. ఎల్లవారుం జూచుచుండఁగఁ బితామహుని వధియింతుము. పదంపడి యాచార్యుం బొరివుత్తుము. అట నీదుర్మంత్రి యగు రాధేయుం జక్కాడుదుము. వారు ముగురు దెగినపదంపడి రాజ్యమునందును జీవితమందును బుత్రులయందును నిరాశుండవై వృకోదరుగదాఘాతంబునఁ దొడలు విఱిగి నేలం బడి మాకుఁ జేసినయెగ్గులనెల్లం దలంచికొని పశ్చాత్తాపంబునఁ గుందుదువు. భీముఁడు దుశ్శాసనుఱొమ్ముఁ జీల్చి నెత్తురు ద్రావక మానఁడు. మాప్రతిజ్ఞలన్నియుం దప్పక తీర్తుము. భీష్మద్రోణులు మమ్మెల్లఁ జంపి నిన్ను గెలిపింతు రనుట యడియాసయ కాని కొనసాగునది కాదు. నీయభిమానమునకును, దర్పమునకును, క్రోధమునకును, గౌటిల్యమునకును, బరుసఁదనమునకును, గ్రౌర్యంబునకును, ధర్మద్వేషంబునకును, బెద్దలమాట వినమికిని, సర్వాపనయంబులకును ఫలంబు వేగంబ కుడిచెదవు. తెలతెలవేగునంతకు సర్వసేనాసన్నాహంబుతోడ నాలమునకు రమ్ము. వాసుదేవసహాయుండైననే నలిగితినేని నీకు రాజ్యమును బ్రాణమునుం దక్కదింతయు నిక్కువంబని చెప్పు మనినపదంపడి వాసుదేవుఁ డిట్లనియె. ఉలూకా, మీరాజుతో నామాటగా నిట్లనుము. పెక్కుమాట లేల? దుర్మతీ, యెల్లి భండనంబు గాఁగలయది. పౌరుషంబు వాటించి చక్కనిలుము. జనార్దనుఁ డర్జునునకు సారథ్యంబు సేయుంగాని యని సేయఁ డని వెఱవు దక్కరాదు. క్రోధారుణవీక్ష

ణంబునఁ జూచితినేని నీవును మీవారును దక్షిణంబ నీఁగుదురు. యుధిష్ఠిరు నియోగంబునను బార్థుప్రార్థనంబునను సారథికృత్యంబున కొడంబడితి. నీవు నేర్చినమాయ లన్నియుం జూపుము. మింటి కెగసినను బాతాళంబు సొచ్చినను సాగరంబుల డాఁగినను గాండీవిదివ్యరథంబు వెంట నంటివచ్చు. నీ వెంచుఁ బోఁ గలవు. భీమసేనుఁడు నేసినప్రతిన లన్నియుఁ దప్పక తీర్చువాఁడు. పరమధర్మాత్ము లగుపాండవు లత్యంతకుత్సితపాపాచారుం డైననిన్నుఁ జూడ రనిపల్కి నయనంత రంబ ధర్మనందనుఁ డయ్యులూకుం బిలిచి నామాటలు గొన్ని మీదొర కెఱిఁగింపు మనియిట్లనియె. నీవు పాపాత్ముఁడవు గావున నందఱు నట్టివారలే యని తలంచి నాపై దోషముల నారోపించెదవు. సత్యానృతంబులను ధర్మాధర్మంబులను దైవం బెఱుంగు. నోరికి వచ్చినట్లు నీవు ప్రేలినంతన యేమగు? పిపీలికాదులమొడనైనను నేను గీడు దలంపను. ఇఁక జ్ఞాతివధంబునకుఁ దొడరుదు నని యెట్లు చెప్పవచ్చు! కులహాసియొల్లకకదా యైదూళ్లయినను మాజీవికకుఁ జాలు నంటి. నీ వంతమాత్రయుం జేయ నొల్లవైతివి. సర్వలోకేశ్వరుం డైననారాయణుండు తాన వచ్చి సంధి సేసిననుం గార్యంబు సాగనీవయితివి. ని న్నే మనవచ్చు? మీ కందఱకుం గాలావసానం బయ్యె. అనికి మేము వెఱవము. నీమాటలెల్ల వింటిమి. తదర్థ మెఱింగితిమి. నీతోఁ బెద్దయుం బ్రొద్దు పలుకనేల? పోరికిఁ గట్టాయితంబై రమ్మంటి నని చెప్పు మనినపిదప నకులుఁ డులూకా, నీదుర్బుద్ధిం జేసి కులక్షయంబును బ్రజానాశంబునుం దొడరె. మావలనం దప్పు లేదు. చేయఁ గలయంతయుం జేసి చూచితిమి. పోరికి రమ్ము. పుత్రమిత్రబంధుసహితంబుగఁ జావు మని నే నంటి నని యానుయోధనునకుఁ దెల్పు మనియె. అంత విరాట ద్రుపదులు వానిం బిలిచి పాండవులను దాసు లనిపల్కితివిగదా. ఎవ్వ రెవ్వరికి దాసు లగుటయు తేపు పోర నెఱుంగ నగు నని మేము నుడివితి మని యానుయోధనున కెఱింగింపు మనిరి. అట శిఖండి భీష్మవధార్థంబు జనించిన నేను భీష్మంజంపువాఁడ నని మీయేలికకుఁ దెలియఁ జెప్పు మనియె. పదంపడి ధృష్టద్యుమ్నుఁడు నేను ద్రోణాచార్యుం గూల్చెద. నాజన్మంబు తదర్థం బగుట యెఱుంగవే యని నామాటగా మీభూపాలునకుఁ దెల్పు మనియె. అంద ఱట్లు చెప్పినపిదప నజాతశత్రుఁ డాకితవపుత్రుం బిలిచి యయ్యా, యేను జ్ఞాతివధంబునకొల్లక యెన్ని చేసిన నానుయోధనుఁడు సాగనీఁడయ్యె, ఏమి చేయవచ్చు? కానున్నది కాకమానదు. ఇచట నుండఁ గోరుదేని యుండుము. ప్రోచెద నని యయ్యులూకు నాదరించి యుచితప్రకారంబున వీడుకో లిచ్చి యనిచి ధృష్టద్యుమ్నుం బిలిచి రేపు సంగ్రామం బని మనసేనలకెల్లఁ దెల్పు మని నియమించి కొలువు లేచి యుచితప్రకారంబున నుండె. అంత నప్పాంచాలరాజకుమారుండు నేను ద్రోణు నెది

రింతుఁగదా యని యుబ్బుచు నర్జునుఁడు గర్ణుని, శిఖండి భీష్ముని, ధృష్టకేతుఁడు శల్యుని, నుత్తమౌజనుఁడు కృపుని, నకులుఁ డశ్వత్థామను, శైబ్యుఁడు కృతవర్మను, సాత్యకి సింధురాజును, సహదేవుఁడు శకునిని, జేకితానుఁడు శలుని, ద్రౌపదేయు లేవురు త్రిగర్తపతులను, సౌభద్రుఁడు వృషసేనుని, దక్కటి యోధవీరులు దమకుఁ దమకుఁ బోలినవారలను మార్కొందుదు రనివిభాగించి సమరసన్నాహ మూహించుచుండె.

అంతనక్కడ నులూకుఁడు వచ్చి ధర్మరాజాదులు పలికినచందమెల్ల నేర్పడం జెప్పిన విని కురురాజు కర్ణశకునిదుశ్శాసనులం జూచి యెల్లి భండనం బని మన సేనలకుఁ దెల్పుఁ డని పలుకుటయు వారయ్యుత్సాహమునఁ బొదలుచుండి రని సంజయుండు చెప్పిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, గాండీవి భీష్ముం జంపుదు నని ప్రతిజ్ఞ చేసె ననిన విని మందు లగునాకొడుకు లేమి చేసిరి? అర్జునుఁ డట్లు ప్రతినఁ బట్టినపదంపడి శాంతనవుఁ డెబ్బంగి బ్రదుకువాఁడు? నాకుం జూడ నతండు హతుఁ డగు నని యతోఁచెడి. ఆమాట విని మాతండ్రి యేమి చేసె? తెలియఁ జెప్పు మనుటయు సంజయుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. ధర్మజాదులవచనంబుల విని గాంగేయుండు నీకొడుకునకు మనఃప్రియంబుఁ గావించువాఁడై దేవసేనానాయకుం డయినకుమారస్వామికి మ్రొక్కిడి కురురాజుం గాంచి కుమారా, యేను సర్వసేనలకు నాయకుఁడఁగాఁగ నీకు వగ పేల? వివిధవ్యూహములఁ బన్నింపను దైవగాంధర్వమానుషంబు లగువివిధమాయాచిత్రములఁ జూపను నేను బృహస్పతినేర్చినంత నేర్తు. దేవాసురు లెత్తివచ్చినను నేను సేనానాయకుఁడుగాఁగ వెఱవం బని లేదు. పాండవులకుఁ జేయార్పరానివిధంబుగ సమ్మోహంబుఁ గావింతు ననిపల్కిన వినిభవత్పుత్రుం డత్యంతసంతుష్టచిత్తుండై పితామహా, నీవు సేనానాథుఁడవై సర్వకార్యములు నిర్వహింపఁబూనిన నాచార్యుండు కోట్లలు చేసి సంగ్రామంబు సేయఁగడంగినను దేవాసురు లెత్తివచ్చిరేనియు నాకు వెఱపు లేదు. అది యట్లుండె. మనసైనికులందును వారిసైనికులందునుం గలయతిరథమహారథాదుల నేర్పడంజెప్పుము. వినఁ గుతుకం బయ్యెడి. నీ వందఱితారతమ్యంబు లెఱుంగుదువుగదా యనియడిగిన దుర్యోధనునకు భీష్ముఁ డిట్లనియె.

## భీష్ముఁడు దుర్యోధనునకుఁ గౌరవులలో నతిరథాదుల నిరూపించి చెప్పుట.

కుమారా, మనసేనయందును వారిసేనయందును బెక్కండ్రు రథికులు గలరు. ముఖ్యులఁ జెప్పెద నాకర్ణింపుము. నీ వతిరథుఁడవు. నీతమ్ములందఱు సమరథులు. కృపద్రోణాచార్యులయాచార్యకంబున ననేకాస్త్రముల నేర్చినవారు. రథరణప్రకారంబును గజసమరచమత్కారంబును గదాఖడ్గాదిసాంపరాయభేదం

బును లెస్సనెఱుంగుదురు. పాండవులతోడ నిత్యవైరంబు పాటించినశూరులు. పాంచాలబలంబు గండడఁగింపఁ జాలుదురు. నన్నే నేఁ జెప్పికొన నేల? నాకొలఁది నీవ యెఱుంగుదువు. పాండవులకుఁ జిత్తక్షోభంబుఁ గావింపఁ జాలుదు. భోజనాథుఁ డైనకృతవర్మ యతిరథుఁడు. దివ్యాస్త్రవేదులకుం జెనకరానియతండు నీకు సర్వార్థములను సాధించియిచ్చు. మద్రరాజగుశల్యుఁ డతిరథుఁడు. రణమున వాసుదేవునితోడ నిరంతరస్పర్ధ సేయుచుండు. నీపైఁ గలప్రేమభావంబు నంజేసి తనకు మేనల్లురగుపాండవులం బరిత్యజించి నీకుఁ దోడ్పడినవాఁడు. ఇంద్రుఁడు దానవులంబోలె నతండు నీశత్రులం జెండాడు. భూరిశ్రవసుఁ డతిరథుఁడు. నీ కెల్లపుడు హితముఁ గోరువాఁడు. సింధురాజగుజయద్రథుఁడు మహారథుఁడు. పాండవు లరణ్యవాసము సల్పుచున్నతఱి నతండు ద్రౌపదిం గామించినం గోపించి పాండుపుత్రులు దన్నుఁ బలుదెఱంగులం బరిభవించుటంజేసి యీసునఁ బాండవులతోడఁ బెనంగఁ గోరి మహాదేవు నుగ్రతపమున మెప్పించి వరముఁబడసినవాఁడు గావునఁ బ్రాణముల దాఁపక పోరాడు. కాంభోజరాజగు సుదక్షిణుఁ డేకరథుఁడు. కాంభోజరథికులు పెక్కండ్రు పరివేష్టింప ననికి నడిచి యాతండు నీకార్యంబు నెఱవేఱఁ గడిమి సూపు. మాహిష్మతీపతి యగునీలుఁ డతిరథుఁడు. సహదేవునితోడఁ దెగనిపగ పట్టినవాఁడు గావునఁ బాండవుల నుక్కడంపఁ గడంగు. అవంతీశ్వరు లగువిందానువిందు లర్ధరథులు. పరస్పరసహాయంబున నతిరథున కెనగాఁ బోరాడుదురు. త్రిగర్తపతు లేవురు సోదరులు మహారథులు. విరాటగోగ్రహణంబునందును దిగ్విజయంబునందునుం బాండవుల కోడిరి గావున నాఁటిపగ పాటించి తదీయసేనం గలంపఁజూతురు. నీకుమారుఁడును దుశ్శాసనతనయుఁడును సమరథులు. పోర వాఁడిమి సూపుదురు. దండధారుఁ డేకరథుఁడు. కోసలేశ్వరుం డయినబృహద్బలుఁడు సమరథుఁడు. కృపాచార్యుఁ డతిరథోత్తముఁడు. శరస్తంబజాతుం డైనయమ్మహాత్ముఁడు కార్తికేయున కెనవచ్చువాఁడు. చిచ్చుచందమున రణాంగణంబున దుర్నిరీక్షతేజుండై వెలుంగుచు నీశత్రులఁ బిలుకుమార్చు. భవన్మాతులుం డైనశకునియేకరథుఁడు. అతనియొద్ద మేటిసైనికులు గలరు. దివ్యాస్త్రవిదుం డైనయశ్వత్థామ విలుకాండ్రకెల్ల మేటి. అతం డేసినయమ్ములు గాండీవముక్తంబు లగుసవ్యసాచిమార్గణంబులట్టు లెంతవానినైన నొప్పించు. అమ్మహారథోత్తముఁడు జీవితప్రియత్వం బనుదోషమును బడయఁడేని రెండవయర్జునుం డనం జెప్పఁ దగినవాఁడు. అతం డొక్కరథికుండే దేవదానవులనేనియు నిర్జింపఁ జాలు. రుద్రాంశసంభూతుం డైనయతండు గొనయమ్ము సారించి విడిచెనేని కొండలయినం బగులు. ప్రళయకాలానలతుల్యుం డగు నతనివిక్రమంబుఁ జెప్పఁ గొలఁది గాదు. ద్రోణాచార్యుఁ డతిరథులందఱికంటె నుత్త

ముఁడు. అక్కడ నిక్కడం గలరాజు లందఱు నతనిశిష్యులే కావున నమ్మహారథశ్రేష్ఠునివీర్యము నెఱుంగుదురు. దేవదానవగంధర్వమనుష్యరాక్షసాదు లందఱుం బిండుగట్టి యొక్కమ్మడి పైఁబడిన నాదివ్యాస్త్రవిదుఁడు వారల నెల్లఁ బిలుకుమార్చి విజయంబుఁ గొను. అతండు వృద్ధని భావింపరాదు. అతనికిఁ గలలా వెవ్వారికిని లేమి నిక్కవంబు. అర్జునునిఁ బుత్రుకంటె నెక్కవ ప్రేముడి న్మన్నించుఁ గావున నతని నొనేయఁ డని తలంచెద. పాంచాలబలంబు రూపుమాపు. పౌరవుఁడు మహారథుఁడు. సత్యశ్రవసుఁ డేకరథుఁడు. కర్ణపుత్రుం డగువృషసేనుఁడు మహారథుఁడు. నీకుఁ బ్రియంబుఁ గావించువాఁడై పగఱ భంజించు. జలసంధుఁడు మహారథుఁడు. రథస్థుండై యుండియు గజాయూథుండై యుండియు నతండు నిపుణప్రకారంబునఁ బ్రాణములు డాఁపక పోరొనర్చు. బాహ్లికుఁ డతిరథుఁడు. తత్పుత్రుఁడగు సోమదత్తుఁడు నట్టివాఁడు. కయ్యి మన్నవారికి సంతోషంబకాని వెత వుడమదు. నీకుఁగా నెంతపనినైనం జేయుదురు. అలంబసుఁ డనురాక్షసుఁడు మహారథుఁడు. రణమున నతఁడు వివిధమాయలఁ బన్ని యతిక్రూరకృత్యములఁ జేయు. ప్రాగ్జ్యోతిషాధిపతి యగుభగదత్తుఁడు సమరథుఁడు. అతండు సుప్రతీకం బనుతనయేనుఁగు నెక్కనేని యైరావతంబు నెక్కిన పురందరుండు దానవులంబోలె శత్రుసేనలం జీకాకుపఱుచు. దిగ్విజయంబునాఁటంగోలె నతండు ధనంజయునితో స్పర్ధ సేయుచున్నవాఁడు గావునఁ బాండవులం బట్టిపోనీక పెనంగు. గాంధారరాజు లగువృషకుఁ డచలుఁ డనువా రన్నదమ్ములిద్దఱును సమరథులు. శత్రువిధ్వంసనోపాయంబుఁ గడు నేర్తురు. నీకుఁ జెలికాఁడును, మంత్రియుఁ, బ్రియుఁడు, నాత్మస్తుతిపరాయణుండును, గలహప్రియుండును నగుకర్ణుఁడు సహజకవచకుండలవియోగంబునను, జామదగ్న్యశాపంబున నస్త్రగ్రామసన్నిధానరాహిత్యంబునను, బ్రాహ్మణశాపంబునను నాకుంజూడ నర్ధరథుఁ డనితోఁచు ననుటయు నాచార్యుఁడు శాంతనవువచనంబు సమీచీనంబు. కర్ణుఁడు నోటఁ జెప్పినట్లు భండనమునఁ గార్యముఁ జూపనివాఁడు గావున నర్ధరథుఁడే యగు ననుటయు రాధేయుం డుదగ్రక్రోధవిధేయుండై గాంగేయున కిట్లనియె.

### కర్ణభీష్ము లొండొరుల నధిక్షేపించికొనుట.

పితామహా, నీ వేల నన్నేకతప్పయినం జేయనివానిఁ గేవలద్వేషమునఁ దూలనాడెదవు? ఈదుర్యోధనునిమిత్తమున నీ వే మన్నను సైఁచియున్నవాఁడను. నాయెడ నేలోపంబు గలుగఁ గర్ణుఁ డర్ధరథుఁ డనిపల్కితివి? నాకుం జూడ ముదిసిననీ వర్ధరథుఁడ వని తోఁచుచున్నది. సరివారిలోఁ దక్కువగా నన్నిట్లు తేజోహీనుఁ [illegible] మయినకయ్యమునఁ గార్యముసేదు

పొంటెుగదా ? మంచివానిచందమున నగపడు చిట్లు గూఢప్రకారంబునఁ గార్య ధ్వంసంబుఁ జేయఁ జూచెద వింతియకాని యొండు గాదు. నాబీరంబు నీ వే మెఱింగితివి? ఏండ్లు చెల్లినజరఠులును ధనంవతులును బాంధవులును మహారథులు గారు. ఎవ్వరైన నేమి? కడిఁదిమగఁటిమి గలవారెల్ల మహారథు లని చెప్పక తప్పదు. మంత్రాదిపరిజ్ఞానవిశేషంబున బ్రాహ్మణులును, బలవీర్యాధిక్యమున రాజులును, ధనాధిక్యమున వైశ్యులును బూజ్యతం గాంతురు. వయఃకృతం బయిన యాధిక్యంబు శూద్రులకే జ్యేష్ఠత్వకారణం బని పెద్దలు సెప్పుదురు. కావున బలవీర్యములఁ జక్కఁగ విచారించి చెప్పవలయుఁగాని నోరికి వచ్చినట్లెల్లఁ బలుకరా దని చెప్పి దుర్యోధను దెస మొగంబై యాపగేయుం జూపి మహారాజా, యీముదుకఁ డొక్కఁడు లేకుండిన నేమి కొఱఁత యగు? నీ కెగ్గు సేయుచున్న యీమహాత్ముం బరిహరింపుము. వీఁ డుండినం గార్యంబు సెడు. వీని వెడల నడిచితివేని నే నొక్కఁడన భండనంబునఁ బాండవులను బాంచాలురను సకలసహాయసహితంబుగాఁ గ్రోల్పులి వృషభంబులంబోలెఁ జక్కాడుదు. అదియునుంగాక యీయల్పజ్ఞుండు శూరశేఖరుల తారతమ్యం బే మెఱుంగు? పెద్దలమాటలు వినవలయునన్నమాత్రన ముదిమదిఁ దప్పినయట్టివారిమాటలుం గ్రాహ్యంబు లగునే? ఇతరు లెవ్వరు పోరాడి గెలుపు సాధించినను యశంబు సేనానాయకుం జెందుఁ గావున నీదురాచారుండు పడునంతకు భండనంబు సేయ నొల్లను. ఇతండు దెగిన పదంపడి నే నెవ్వరి నెట్లు చేయుదునో నీవ యెఱుంగుదు వనుచున్నంత శాంతనవుఁ డావైకర్తనున కిట్లనియె. బహువత్సరపరిచింతితం బయినయీసంగ్రామకార్యంబుభారమెల్ల నీదుర్యోధనుఁడు నాతలన నిలిపియునికిం జేసి యిపుడు పరస్పరభేదంబు పుట్టించినఁ గార్యంబునకుఁ జేటు వాటిల్లు ననుతలంపున నే నూరకున్న కతన బ్రదికితివి. ముదుకఁ డయిననాయెదుట యావనస్థుండ వయిననీవు నిలువఁ జాలుదువే? నాబీరంబును లావును నీ వే మెఱింగితివి? నీకు గురు వగుజామదగ్న్యుఁడును నన్ను గెలువఁ జాలఁ డయ్యె. నీ వెంతవాఁడవు. నీతో నిపుడు పెక్కేల? నాముదిమియు నీయావనంబును సవ్యసాచి యెఱుంగు. ఆత్మప్రశంసనంబు చేసికొనునీవును మగవాఁడవే? నీ వశక్తదుర్జనుఁడవు గావునఁ గౌరవులకుఁ బాండవులకును దీఱరానిపగ గావించితివి. అర్జునునకు నేఁ జాలుదు నని యడిబీరంపుఁబలుకులు మనరాజుకొలువులోనం బల్కుచుంటివిగదా. మగవాఁడవైతేని పార్థుని మార్కొను మని గంగాపుత్త్రుండు కోపాటోపదీపితుండై పలుకుచుండ గాంధారేయుండు రాధేయుం గినిసి యాగాంగేయుం జూచి పితామహా, యిప్పుడిట్లు మీలోనం బరస్పరభేదంబు వాటింపఁ దగునే? నన్నును గార్యంబునుం బరికించి ప్రసన్నుండ వగు మని సవినయంబుగఁ బ్రార్థించి యిఁకఁ బాండవసైన్యం

బునం గలమహారథాదుల నిరూపించి చెప్పవే యనియడుగుటయుఁ గుమారా, పాండవసైన్యంబునందలిశూరులఁ జెప్పిన నీమనంబు నొచ్చు. తఱిమియడిగినం జెప్పకయుండఁ గాదు. కుతూహలంబు గలదేని వినుము చెప్పెద నని యిట్లనియె.

## భీష్ముఁడు దుర్యోధనునకుఁ బాండవులలోనిమహారథాదుల నిరూపించి చెప్పుట.

అగ్నితుల్యుం డైనధర్మనందనుం డతిరథుఁడు. నాగాయుతబలుం డగుభీమసేనుఁ డెనమండ్రుమహారథు లనఁ బేర్కొనఁ దగినవాఁడు. గదాయుద్ధమున వానికి సాటివచ్చువా రెవరును లేరు. వానిచేఁత లమానుషంబులు. మాద్రేయు లిద్దఱు సమరథులు. వా రందఱును దపోమహిమంబునను బ్రహ్మచర్యాదివ్రతప్రభావంబునను నమితబలవీర్యములం బొంపిరివోవువారు. మార్తుర నుక్కడంప నేర్తురు. తాఁకు సైరింపఁ జాలుదురు. బాల్యముమొదలుగా వార లన్నింటను మీయం దతికింపఁ జేసెఁ డెక్కువ యని చెప్పవలసినవారు. అబాలవిక్రము లగునబ్బాలురు దాల్చుకైదువుల లాఁతు లెత్తనైనం జాలరు. వారివిండ్ల నెక్కువెట్టనైన నోపరు. రాజసూయార్థంబు దిగ్విజయ మొనరించినపుడు వారిలో నెవ్వరేమేమి చేసిరి దాని నీవు నెఱుంగుదువు. చిన్ననాఁడు మొదలుగా నీవు గావించినయెగ్గులను ద్రౌపదిం బఱిచినపాట్లను వనవాసాద్యాయాసంబులనుం దలపోసి లయకాలరుద్రుచందమున రౌద్రంబు మెఱయఁ బోర వాఁడిమి సూపుదురు. అర్జునుఁ డింతవాఁడని చెప్పఁ గొలఁది దోఁపదు. దేవదానవగంధర్వయక్షరాక్షసులయందు నంతటివాఁ డింతకుము న్నొక్కఁడు నున్నట్లు నే నింతకు విననైతి. చూడ నైతి నని చెప్ప నేల? ఇంకను వానికి సాటిరాఁదగువాఁడు పుడమిం బుట్టఁడు. మనసైన్యంబునందును వారిసైన్యంబునందు నర్జునుం బోలినవిలుకాఁ డొక్కఁడును లేఁడు. అట్టిమహావిక్రమశాలికి వాసుదేవుఁడు సహాయుఁ డయ్యె. రథికుఁ డర్జునుఁడఁట. సారథి జనార్దనుఁడఁట. విల్లు గాండీవంబఁట. రథరథ్యములు దివ్యములఁట. కవచం బభేద్యంబఁట. తూణీరంబు లక్షయ్యమార్గణపరిపూర్ణంబులఁట. అస్త్రంబులు పాశుపతమాహేంద్రాగ్నేయయామ్యవారుణవాయవ్యకౌబేరాదులఁట. గదాదిసాధనంబు లుగ్రదర్శనంబులఁట. అతని మార్కొని గెల్తు మని యెట్లు పలుకవచ్చు? అమ్మేటిమగండు తనసైన్యంబుఁ గాచికొనుచు నీబలంబు రూపుమాపకుండునే? కాలకేయనివాతకవచప్రముఖు లగుదానవుల నింద్రులకు నజేయులయినవారల నమ్మహారథుఁడు వధించె ననవినమే? గాడ్పుతోడ్పాటునం బేర్చుకార్చిచ్చు చాడ్పున జనార్దనుసాహాయ్యంబున నుక్కుమిగిలి మార్కొనవచ్చువివ్వచ్చు నెదిరింప నేను ద్రోణాచార్యుండుం దక్కఁ దక్కటివా రెవ్వరును జాలరు. యౌవనస్థుం డైనయగ్గాండీవిని మార్కొనఁగ వృద్ధు లగు మేము జాలమొకో యని యొకానొకసందియంబు [illegible] వానిశౌర్యంబుఁ జెప్పవలయునే యనుచుండఁ

గొలువునం గూర్చున్న రాజులమనంబులు చేవచెడి నిర్విణ్ణంబులై యుండె. భీష్ముండు వెండియు నిట్లనియె. ద్రౌపదేయు లేవురు మహారథులు. విరాటపుత్త్రుఁ డైన యుత్తరుఁ డట్టివాఁడు. అభిమన్యుఁ డతిరథోత్తముఁడు. వాసుదేవార్జునుల కెనవచ్చువాఁడు. తనతండ్రులుపడినపాట్లు దలంచి భండనంబునఁ గడిమి సూపు. వృష్ణివీరుఁ డైనసాత్యకి యతిరథోత్తముఁడు. పాండవులమీఁదిప్రేమంబునం జేసి నీసేనం జిక్కుపఱుచు. విరాటద్రుపదులు మహారథులు. వృద్ధు లని భావింపరాదు. క్షత్త్రధర్మంబు లెస్స పాటించియుఁ బాండవులతోడిబంధుత్వసంబంధంబుఁ దలంచియుఁ బ్రాణముల కాసపడక పెద్దయుం బెనంగి నీసేనల నుఱుమాడుదురు. పాంచాలరాజపుత్త్రుం డైనశిఖండి మహారథుఁడు. పాంచాలప్రభద్రకరథికసమేతుండై నడిచి నీసేనం దెగటార్పఁ జూచు. పాండవసర్వసేనానాయకుం డైనధృష్టద్యుమ్నుఁడు మహారథుఁడు. దేవవరప్రసాదలబ్ధంబు లగురథరథ్యాదులం గ్రహించి యనికి నడుచునేని యతండు లయసమయరుద్రుమాడ్కి రౌద్రంబుఁ జూపుచు నీసేనం జెండాడు. వానిపుత్త్రుఁ డగుక్షత్త్రధర్మ యనువాఁడు బాల్యమున నత్యంతపరిశ్రమంబు సేయమిం జేసి యర్ధరథుఁడు. శిశుపాలపుత్త్రుం డైనధృష్టకేతుఁడు మహారథుఁడు. పుత్త్రసహితుం డైనయాచేదీశ్వరునితోడిపోరు మనవారికి భరం బగు. ఉత్తమోజసుఁడు, యుధామన్యుఁడు, క్షత్త్రదేవుఁడు, జయంతుఁ, డమితౌజుఁడు, సత్యజిత్తు నన్నగుపాంచాలకుమారులు మహారథులు. కౌంతేయులబంధుత్వంబునం జేసి నీసైన్యంబుఁ గలంప విక్రమింతురు. అజుఁడు భోజుఁడు నను వారు మహారథులు. లోహితధ్వజు లగుకేకయపతు లేవురు తోడంబుట్టువులు మహారథు లజేయులు. కాశికుఁడు, నీలుఁడు, సూర్యదత్తుఁడు, శంఖుఁడు, మదిరాస్యుఁడు నను వారు మహారథులు. చిత్త్రాయుధుఁడు చేకితానుఁడు నను వా రిద్దఱు మహారథులు. వారు సవ్యసాచికిఁ గడుం గూర్తురు. తాఁ గోర్తురు. సమరచాతుర్యంబు నేర్తురు. వ్యాఘ్రదత్తుండును జంద్రసేనుండును మహారథులు. సేనాబిందుఁడు వాసుదేవభీమసేనులకు సమానుఁడు. నన్నును ద్రోణాచార్యుని నీ వెంతవార లనితలంతువో యతం డంతవాఁడు. పాండవార్థంబు విక్రమించి నీమూఁకలఁ జీకాకుపఱుచు. కాంశ్యుఁ డేకరథుఁడు. ద్రుపదపుత్త్రుఁ డైనసత్యజితుఁ డనువాఁడు ధృష్టద్యుమ్నునకుఁ దుల్యుఁడు. వాఁ డెనమండ్రుమహారథు లనఁ బేర్కొనఁదగినవాఁడు. యశస్కాముఁ డైనయాకుమారుఁడు పాండవులమీఁదియనురాగమునం జేసి యీసున నీసేనం బిలుకుమార్చు. పాండ్యుఁడు శ్రేణిమంతుఁడు వసుధానుఁడు నతిరథులు. రోచమానుఁడు మహారథుఁడు. కుంతిభోజుఁ డతిరథుఁడు. అతండు దనకు భాగినేయు లగుపాండవులకు విజయంబు సమకూర్పం గోరి కడిందిమగంటిమిం జూపు. హిడింబానందనుం డగుఘటోత్కచుం డతిరథోత్తముఁడు. పెక్కండ్రురాక్షసులు

వానియానతిమెయి నడుచుచుండుదురు. అతం డనేకమాయావైచిత్ర్యముల నెఱుంగు. పాండవప్రియంకరుం డైనవానిదురంబు మనకు భరం బగు. ఇంకనుం బెక్కండ్రు మహారథులు గలరుగాని వారినెల్లఁ బేర్కొన నెంతయేఁ బ్రొద్దు వలయు. ప్రధానులం బేర్కొంటి. చక్రగాండీవధారు లయినవాసుదేవార్జునులు సకలసైన్యములఁ గాచుచు నడిపింతురు. నేను భవద్విజయంబుఁ గోరి ప్రాణములపై నాస మాని యందఱను మార్కొని నిలువరింతుఁగాని శిఖండి నొక్కని నాపయి నమ్ములేయుచున్నను మార్కొనను. వాఁడు స్త్రీపూర్వకుండనియు స్త్రీలను స్త్రీపూర్వులను మార్కొనమి నాకు వ్రతంబనియు నీవు నెఱింగియుండుదుగదా యనవుడు దుర్యోధనుఁడు పితామహా, శిఖండి యెట్లు స్త్రీపూర్వుఁ డయ్యె? తత్ప్రకారంబు తేటపడం జెప్పవే యనియడుగ గాంగేయుఁడా గాంధారేయున కిట్లనియె.

భీష్ముఁడు దుర్యోధనున కంబోపాఖ్యానంబు చెప్పుట.

మాతండ్రియగు శంతనుమహీపాలునకుఁ బ్రియము సేయఁ గోరి నేను రాజ్యము విడుచుటయు బ్రహ్మచర్యవ్రతంబుఁ బూనుటయును లోకమునకెల్లఁ దెల్లంబుగదా. అమ్మహారాజునంతరంబు నేను సమయపరిపాలనపరుండనై సత్యవతీసూనుం డయినచిత్రాంగదునకు రాజ్యాభిషేకముఁ గావించి వానితమ్ముఁ డగు విచిత్రవీర్యుని యువరాజపదంబున నిల్పితి. ఆచిత్రాంగదుఁ డల్పకాలముననే గంధర్వనిహతుండగుటయు విచిత్రవీర్యుని రాజ్యాభిషిక్తుం జేసి యతనికిఁ దగిన కన్నియలం బెండ్లి సేయఁ దలంచి కాశిరాజుకూఁతు లంబయు నంబికయు నంబాలికయు ననుమువ్వురకు స్వయంవరంబు నడుచుట విని నే నొక్కండన తేరెక్కి తదీయస్వయంవరస్థానంబునకుఁ జని వీర్యశుల్క లగునమ్ముగురుకన్యకలం దేరెక్కించికొని శంతనుపుత్రుఁ డైనభీష్ముఁడు వీర్యశుల్క లగుకాశిరాజకన్యకలం గొనిపోవుచున్నవాఁ డని రాజలోకంబునెల్లఁ గలయ నాలోకించి యెలుంగురాల్పడ నేర్పడం జెప్పుటయు నచటఁ గూడినరాజు లందఱు ననేకరథగజవాజిపదాతిబృందములతో నొక్కపెట్ట నాపైఁ గవిసి శరవర్షంబుఁ గురియించిరి. అందుల కలిగి నేను గండడరి వారిపై ననర్గళప్రసారంబుగ మార్గణాసారంబుఁ బఱపించి యేనుఁగులఁ గూల్చియు గుఱ్ఱములఁ జక్కాడియుఁ దేరులఁ బొడిచేసియు యోధవీరులఁ జెండాడియు వారిగుండెల బెండువడంజేసి దనుజగణసంహారోద్ధతుం డైనపురుహూతుచందమునఁ దేజరిల్లుచుండ నారాజులు నావేఁడిమి సైఁపఁ జాలక పోరు మాని కాందిశీకు లగుడు నే నాకన్నియలం దోడ్కొని గజపురమున కేతెంచి సత్యవతీదేవి కెఱింగించి యద్దేవిమెప్పు వడసి తదనుమతంబున నమ్ముగురుకన్నియలను విచిత్రవీర్యునకుఁ బెండ్లి సేయం దలంచియున్నెడఁ గాశిరాజుపెద్దకూఁతు రంబయనునది లజ్జాభరంబు గదుర నాయొద్దకు వచ్చి యోభరతపుంగవా, సర్వ

ధర్మజ్ఞుఁడవు గావున నీతో నొక్కమాట చెప్పెద. విని యుచితంబు నడుపుము. నేను మున్న సౌభపతి యైనసాళ్వుని మనంబున వరించితి. అతండును నాపై ననురాగంబు గలిగియుండె. ఇది యెఱుంగక మాతండ్రి నాకు స్వయంవరంబుఁ జాటించె. లాఁతివానిపైఁ దగులంబు గలనన్ను నీతమ్మునికిఁ బెండ్లిసేత ధర్మం బగునే? నీ వెఱుంగనిధర్మువుం గలదే? యనిచెప్పిన విని నేను దద్వృత్తాంతము సత్యవతికిఁ దెల్పి తదనుమతంబు వడసి మంత్రిఋత్విక్పురోహితులు మున్నగుద గువారిం దోడుపఱిచి యాయంబను దాదితోడ సాళ్వునొద్ద కనిచి యంబికాంబాలికలను విచిత్రవీర్యునకుఁ బెండ్లిచేసితి. అంబయునిట వెడలి సాళ్వుం జేరి తనరాక సాకూతంబుగ నెఱింగించిన నతండు భీష్ముఁడు గొనిపోవఁ బ్రీతితో నేగి యేకతంబుననో క్రమ్మఱి వచ్చిననిన్నుఁ బరిగ్రహింప నొల్లను. అన్యగృహీత యగు దానిం బరిగ్రహించుట నాబోఁటియుత్తమక్షత్రియునకు ధర్మంబు గాదు. అదియునుంగాక శూరశేఖరుఁ డైనభీష్ముఁడు గ్రహించినదానిని గ్రహింప నే వెఱచెద. నీయిచ్చవచ్చినయెడకుఁ బొమ్ము. ఇట నిలువం బని లే దని మాఱుసెప్పుటయుఁ గాశిరాజుపెద్దకూఁతురు మదనవేదనాదూయమానమానసయై యంతఁ బోక క్రమ్మఱ నాసాళ్వుం బిలిచి యోమహీపాలశేఖరా, భీష్ముఁడు గొనిపోవఁ బ్రీతితో నేగినదానఁ గాను. మన కిరువురకుం గలయనురాగం బెఱుంగక మాతండ్రి స్వయంవరంబు సాటించుటయు భీష్ముఁడు దనతమ్మునికిఁ బెండ్లి సేయ మమ్ముఁ గొనిపోయిననపుడు చేయునది లేక కరిపురంబున కరిగి నీపైఁ గలతగులంబుఁ దెల్పుటయు గాంగేయుఁడు సముచితరక్షావిధానంబుతో నన్ను నీయొద్ద కనిచి నాచెల్లెండ్రనంబికాంబాలికలఁ దనతమ్మునికిఁ బెండ్లిచేసె. నీయాన నామనంబు నీయందె నిత్యానురక్తంబై యున్నయది. పరులఁ గోరదు. అత్యంతభక్తురా లగునన్ను విడువం బాడియే? అనుగ్రహించి గ్రహింపు మని పలుదెఱంగులం బ్రార్థించిన నాసాళ్వుం డొల్లక దానిఁ బొమ్మని తఱిమిపలికి తూలనాడి వెడల నడిచె. అవ్విధంబున సాళ్వుఁడు వెడలంగొట్టిన నేడ్చుచు నయ్యంబ సాళ్వపురంబు నిష్క్రమించి యక్కటా! యేమి చేయుదు? ఎట్లు క్రమ్మఱి గజపురి కరుగుదు? ఏగతిఁ దండ్రిపాలి కేగుదు? ఎయ్యది గతి? తండ్రి చేసినస్వయంవరంబున నింత పుట్టె. భీష్ముఁ డిందుల కెల్ల మూలం బయ్యె. వాఁడు గొనిపోవఁ దమకించి నపుడే నిజమనోభిప్రాయం బేల బేలనై యతని కెఱింగింపనైతి. స్వయంకృతాపరాధమున కిది ఫలం బయ్యె. నాకుఁ దనమీఁదఁ గలిగినతగుల మాఱడిపుచ్చిన సాళ్వుం గాల్పనే? దైవంబు నా కిన్నిగతులఁ గావించె నేమందు? పూర్వదుష్కృతంబు లనుభవింపక తీఱవు. ఈయనర్థంబునకు మూలం బయినభీష్ము నెవ్విధంబుననైన సాధింతు. పోర వానిం గెల్చుట యెంతవారికి నలవి గాదు. కావున ఘోర

తపంబున గాంగేయుం దెగటార్తు నని తనలో నిశ్చయించి పురమార్గంబుల విడిచి వనమార్గములం దవిలి చని యొక్కమునిపల్లెం గాంచి యారేయి యట నిల్చి పుణ్యశీలు రగునచ్చటితాపసులకుఁ దనవృత్తాంతము సవిస్తరముగాఁ దెల్పి సన్న్యసించి యిచ్చటఁ దపము సేయ వచ్చితి బాంధవులకడకుఁ బో నొల్ల నను టయు శైఖావత్యుఁ డనుముని యత్యంతశోకావేగంబున నిశ్శ్వసింపుచున్న యక్కన్నియ నూరార్చి నీకార్యంబు నెఱవేఱఁగఁ బ్రయత్నముఁ జేయుదు నని పలికె. అట్టియెడఁ దాపసులుకొంద ఱీకన్నియమేనిసౌకుమార్యంబునకును దపో నిష్ఠకుం గడు దవ్వు గావున దీనిఁ దండ్రిపాలి కనుచుట మే లనిరి. మఱికొందఱు దానిచేటునకు నేను మూలం బని నన్ను నిందించిరి. వెండియుంగొందఱు దానిం బెండ్లిగాఁగ సాళ్వు నియ్యకొల్పుట యుచితం బనిపలికిరి. ఇంకనుంగొంద ఱందుల కొల్లక దానిం బిలిచి యోరాజపుత్రీ, సన్న్యసనియమంబు నీకు దుష్కరంబు. మాచెప్పినహితంబు విని తండ్రిపాలి కరుగుము. స్త్రీలకుఁ దండ్రియొండె బతి యొండెఁ గాక లాఁతులు రక్షకులు గారు. ఎంతవిషమసమయములందైనను వారిం బాయరాదు. అదియునుంగాక నీ వొంటిమై నీయాశ్రమంబునఁ దపంబు సేయుదువేని రాజు లెవ్వరైన వచ్చి కామింతు రనుటయు నంబ వారికిఁ గేలు మోడ్పు ఘటియించి మహాత్ములారా, తండ్రియింటఁ బుట్టిననాఁడు మొదలుగాఁ బలువిధంబు లగుమన్ననలతో సుఖముండిననే నిపుడు బాంధవులనికారంబునకు భాజనంబై యెట్లు వసియింతు. పూర్వకృతదుష్కృతంబునంజేసి యీయవస్థ గుడువక తీఱదు. పరలోకంబుననైన సుగతి గలుగుపొంటె నిపు డిచట మీప్రా పునం దపంబు సేయుదు నాన తిండని ప్రార్థించిన విని వార లందఱుం దానికా ర్యంబుఁ జింతించుచున్నంత హోత్రవాహనుఁ డనురాజర్షి యచ్చటికి వచ్చెఁ. వచ్చినయాహోత్రవాహనున కచ్చటితాపసు లాతిథ్యసత్కారంబుఁ గావించి యాకన్నియవృత్తాంతముఁ దవిలి తమలో మాట లాడుచుండ నాహోత్ర వాహనుఁడును దనదౌహిత్రి యగునయ్యంబయెడరు సాకల్యంబుగా నడిగి తెలిసి కొని శోకపరీతచిత్తుండై కొండొకవడి యూరకుండి యట దానిం బిలిచి కల్యాణీ, నీవు తండ్రియింటికిఁ బోవలదు. నేను నీమనంబుకసటు వాయ నుపా యంబుఁ జెప్పెద. తడయక జామదగ్న్యుపాలికిఁ బోయి యమ్మునీంద్రు నాశ్ర యింపుము. నాకు నెచ్చెలియగుటంజేసి యత్తపోధనుండు నిన్ను మన్నించి గార వించి భీష్ము నియ్యకొల్పి విచిత్రవీర్యునకుఁ బెండ్లి సేయు. ఆభీష్ముఁడు విన(డేని విక్రమించి వధించు. దాన నీవగ కొంత తఱుఁగు నని విని యంబ మాతా మహుం జూచి మహాత్మా, భార్గవరాముఁ డెచట నుండువాఁడు నే నెట్లు గాంచు దాన ననియడుగ నతండు దాని కిట్లనియె. పరశురాముఁడు మునిగణస్తూయ

మానుండును గంధర్వాప్సరోగణసేవ్యమానుండునై మహేంద్రపర్వతమునం బర మతపోనిష్ఠ సల్పుచుండు. అచ్చటి కరిగి యమ్మునివల్లభుం గాంచి నాపేరు చెప్పిన నతండు నీకార్యంబు నెఱవేర్చు ననుచున్నంతఁ బరశురామశిష్యుఁ డగునకృతవ్రణుఁ డచటికి విచ్చేయుటయు నందఱు నతనికి స్వాగతార్ఘ్యపాద్యాదిపూర్వకంబుగా సముచితసపర్యఁ గావించియున్నంత భార్గవరాముఁ డిపు డెచ్చట విచ్చేసియున్నవాఁ డెచ్చోటికిఁ జనిన నమ్మహానుభావుదర్శనంబుఁ బడయ నగు ననియడిగిన హోత్రవాహనున కకృతవ్రణుఁడు భవద్దర్శనార్థం బిట కెల్లి రాఁ దలఁచినవాఁ డని చెప్పి యీకన్నియ యెవ్వతె? యేల యీవనంబునకు వచ్చె ననియడుగ నయ్యకృతవ్రణునకు హోత్రవాహనుఁ డీకన్నియ దనకు దౌహిత్రియవుటయు దాని నాపగేయుఁడు గొనిపోవుటయు మున్నగునెల్లవృత్తాంతములం దెల్పుచున్నంత నంబ యయ్యకృతవ్రణునకుఁ గేలుమోడ్చి మహాత్మా, నామాతామహుఁడు సెప్పినదెల్ల నిక్కువంబు. క్రమ్మఱి వీటి కరుగుదు నేని యంతకంటె లజ్జయు నవమానంబును లేదు గావున జామదగ్న్యరాముఁ డెయ్యది చెప్ప నద్దానిం జేయనున్నదాన ననవుడు నకృతవ్రణుండు దాని కిట్లనియె. నీదుఃఖము భీష్ముఁడు సాళ్వుఁడు ననునిద్దఱివలనం బుట్టినయది. సాళ్వ నియ్యకొల్పుట భీష్మం గెల్చుట యనురెంటిలో నీ వెద్దానిం జేయఁ గోరెదవు చెప్పుమనియడుగుటయు నంబ మునీంద్రా, నామనంబు సాళ్వునిపైఁ దవిలియునికి నెఱుంగక గాంగేయుఁడు నన్నుఁ గొనిపోయె. ఇతరాపహృత యనుభావమున సాళ్వుఁడు గ్రహింపఁడయ్యె. ఇందుల కెయ్యది ప్రతివిధానం బగు దాని నీవ నిశ్చయింపుము. ధర్మసూక్ష్మంబు నే నెఱుంగనేర ననిన విని యకృతవ్రణుండు దానిం బిలిచి యోరాజపుత్రీ, భీష్ముఁడు గొనిపోవకుండునేని సాళ్వుఁడు నిన్నుఁ దలతో గ్రహించు. పరశురాముఁ డానతియొసంగినదానిం జేయ కుడుగనివాఁడయ్యు నన్యాపహృత యగుదాని నతం డెట్లు గ్రహించు? అందు వానితప్పు గానరాదు. నీశోకమున కెల్ల భీష్ముఁడే మూలం బని నాకుఁ దోఁచెడి. దుర్మదాంధుఁ డయినయతనికిఁ బ్రతీకారంబు కర్తవ్యం బనిపలికిన నంబయు నాకు నదియ తోఁచుచున్న దని యందులకుఁ దగిన మాట లాడుచున్నంత నాదినంబు గతప్రాయంబయ్యె. అంత మఱునాఁడు దివ్యతేజోవిరాజితుఁ డయినభార్గవరాముఁడు ధనుర్బాణతూణీరఖడ్గపరశ్వథాద్యాయుధధరుండై శిష్యగణంబు పరివేష్టించిరాఁగ నయ్యాశ్రమంబునకు వచ్చుటయు నచ్చటితాపసులును హోత్రవాహనుఁడు నక్కాశిరాజజ్యేష్ఠపుత్రియుఁ బ్రత్యుత్థానంబుఁ గావించి విధియుతంబుగ నాసనార్ఘ్యాదివిధానంబులఁ బూజించి సముచితసల్లాపంబు సల్పుచున్నంత సృంజయకులధుర్యుం డైనహోత్రవాహనుఁ డంబను జూపి మునివరేణ్యా, యీకన్నియ నాదౌహిత్రి కాశిరాజపుత్రి. మీ

కుఁ గొన్నిమాటలఁ దెలుప వేఁచియున్నది. దానివిన్నపం బాలింపు మనుటయు నంబ రామునకుఁ బాదాభివాదనం బాచరించి మహానుభావా, నిన్ను శరణు సొచ్చితి. శోకసాగరంబున మునింగినన న్నుద్ధరింపవే యని కన్నీరు జాలువాఱఁ బలవించుచుండఁ గరుణించి జామదగ్న్యమునీంద్రుఁడు శోకములకుఁ దగనితదీయరూపసౌకుమార్యంబునకుఁ జింతిల్లుచు నీకన్నియ యేమి చెప్పనెకో యని విచారించివిచారించి దానిం గరుణార్ద్రదృష్టి నాదరించి యిఁకఁ జెప్పు మనుటయు నంబ తనవృత్తాంత మంతయు విన్నవించె. విన్నవించిన విని భార్గవుం డక్కన్నియ నూరార్చి భీష్మునొద్దకుఁ దగినవానిం బంపి యతండు దనతమ్మునికి నిన్నుఁ బెండ్లి సేయువిధముఁ గావించెద. అతం డందుల కియ్యకొనఁడేని రణమున నుక్కడంతు. సాళ్వుం బెండ్లిగాఁగఁ దలంతువేని వాని నియ్యకొల్పెద. ఇందు నీవు దేనిం గోరెద వనియడుగ నాకన్య మునీంద్రా, భీష్ముఁడు గొనిపోవుట కారణంబుగా సాళ్వుఁడు మదీయచారిత్రంబునకు శంకించి గ్రహింప నొల్లఁడయ్యె. ఇం దెయ్యది యుచితం బనితోఁచు దానిం జేయుము. నాకుంజూడ మదీయవ్యసనంబులకెల్ల భీష్ముఁడు మూలము గావున నాదురభిమానగ్రస్తుం జంపుట యుచితం బనితోఁచుచున్న దని యశ్రుపూర్ణలోచనయై చెప్పుటయు రాముఁడు దాని కిట్లనియె. రాజపుత్త్రీ, సాళ్వుఁడును భీష్ముఁడును నాయానతిం దలలఁ దాల్చువారు గావున వారి నియ్యకొల్పి నీశోకం బుడిపెద నంమలకు సంతసింపుము. భీష్ముం జంపింపఁ దలంపు మానుము. బ్రహ్మవిదులనిమిత్తమునఁ గాని బ్రాహ్మణానుజ్ఞ పొసంగినఁ గాని వేఱొక్కతెఱంగున శస్త్రములఁ బూన నని ప్రతిజ్ఞ చేసినవాఁడను. అదియునుంగాక భీష్మునిపై నంతకోపము గలదేని నీకు నమస్కార్యుం డైనయయ్యాపగేయుఁడు నీయడుగులకు మ్రొక్కునట్లు చేసెద. క్రోధ ముడుగు మని యెంత యనునయించి చెప్పినను వినక యంబ మునివల్లభా, నాతోఁ జేసినప్రతిజ్ఞ దప్పకుండ భీష్ముని వధింపు మనినిర్బంధించి యడుగుచున్నంత నొక్కముని జామదగ్న్యున కిట్లనియె. మహాత్మా, శరణాగత యగునీకన్యకప్రార్థన నిరాకరింప వలదు. నీవు పోరికిఁ బిల్చితివేని భీష్ముఁడు నీపనిచినపనిఁ జేయు. కాకున్న నోడితి ననియైనం బలుకు నప్పటికి దీనికార్యము చేసినట్ల యగు. నీవచనంబును సత్యం బగు. బ్రహ్మద్వేషులను వధించుట శరణాగతులఁ బ్రోచుట యనురెండును నీకుఁ బ్రతిజ్ఞాతకృత్యంబులుగదా. కావున శరణాగతపరిత్రాణార్థంబు భీష్మునితోఁ గయ్యము సేయు మనిచెప్పిన విని భార్గవుండు పూర్వప్రతిజ్ఞఁ దలపోసి యట్ల చేయుదు ననియొడంబడియె.

పరశురాముఁ డంబను దోడ్కొని కురుక్షేత్రమునకు వచ్చుట.

అట్లు నిశ్చయించి భార్గవరాముఁడు మఱునాఁడు ప్రాతఃకరణీయములఁ

దీర్చి బ్రహ్మవాదు లగుతపోధనులు కొందఱు వెంటరాఁగ నయ్యంబను దోడ్కొని సరస్వతీతీరసముల్లసితం బయినకురుక్షేత్రము సేరి మూఁడవనాఁడు తనరాక నా కెఱింగించిపుచ్చె. నేను నమ్మునీంద్రుఁడు విచ్చేయుట విని యత్యంతసంతోషం బునం బొదలుచు వేగంబ ఋత్విక్పురోహితప్రముఖబ్రాహ్మణోత్తమపురస్కృతుఁ డనై మధుపర్కాదిపూజాద్రవ్యసంగ్రహంబుతోఁ జని యప్పరమతపోధనుం గాంచి సాష్టాంగదండప్రణామం బాచరించి విధివిహితవిధానంబునం బూజించినం గ్రహించి యమ్మునివరుండు నన్నుఁ బిలిచి గాంగేయా, యేతలంపున నీ వీయం బను గొనిపోయి క్రమ్మఱ విసర్జించితివి. నీవు హరించుట కారణంబుగా సాల్వుఁడుం బరిగ్రహింప నొల్లఁడయ్యె. అన్యాపహృత యగుదానిం బరిగ్రహింపకునికి సము చితంబకదా. ఇవ్విధమున నీకన్నియ నీమిత్తమున నవమానభాజనంబయ్యె. ఇట్టిరా జకన్యకనవమానింపఁ దగునే? కావున మన్నియోగమున నీకన్నియం గ్రహించి నీత మ్మునికిఁ బెండ్లిసేయు మనియె. అనుటయు నేను వినయావనతుఁడనై మహాత్మా, పరానురక్తచిత్త యగునీకన్నియం దమ్ముని కెట్లు పెండిలి సేయుదు? తనకు సాల్వ నిపైఁ దగులంబు గల దని యీకన్నియ తాన తొలుత నా కెఱింగించుటం జేసి యీసాల్వునొద్దకుఁ బనిచితి. భయానుక్రోశార్థలోభకామము లెవ్వి పొసఁగినను క్షాత్రధర్మము విడువరా దని నాకు వ్రతము గల దని మాఱు సెప్పుచున్నంతఁ గ్రోధపర్యాకులలోచనుండై గురుఁడు రాజపుత్రా, నామాట వినవేని నిన్ను మంత్రిమిత్రబాంధవసహితంబుగఁ బిలుకుమార్తు నని యత్యంతసంరంభంబునం బల్కుటయు నే నందుల కప్పుడు గినియక క్రమ్మఱఁ బాదప్రణామం బాచరించి మునీంద్రా, యేను నీకు శిష్యుఁడను. నీయనుగ్రహమునఁ జతుర్విధాస్త్రముల నేర్చితి. శిష్యునిపై గురువునకుఁ గింకిరిపడం దగునే? ఏల నాతోడఁ బోరాడెద వని సవినయంబుగఁ బ్రార్థించితి. అప్పటికిని గోప ముడుగక రాముఁడు రోషభీషణ శోణలోచనుండై యోరా, యేను గురుఁ డనుతలఁపును భక్తియుం గలదేని నామాట నిరాకరింతువే? ఇఁకనైన నాకుఁ బ్రియంబు కర్తవ్యం బని తలంతు వేని యీకాశిరాజకన్యకను దమ్మునికిఁ బెండ్లి సేయుము. కాదేని నాకుఁ జిత్త శాంతి గలుగదు. పోర నిన్నుఁ బరిమార్చ కుడుగ ననిన విని నేను నమర్షవ శుండనై యిట్లంటి. బ్రహ్మర్షివర్యా, నీపలికినది కానిపని. వృథా శ్రమం బేల? గురుఁ డనుభావమునం జేసి నిన్నింత వేఁడికొంటి. పరానురక్తచిత్త యగుయు వతి నింట నుంచుకొనుట పాము నుంచికొనుట యెట్లు లట్టుల చిత్తక్షోభకరంబు గాకమానదు. దానఁ గలుగుదోషములు లోకవిదితంబులు గావున నేఁ జెప్పవల యునే? మఱియు నది ధర్మం బని యెవ్వరుం జెప్పరు. ఇంద్రుఁడు వెఱపించినను ధర్మంబు విడువను. ప్రసాదించి యీపని మానుము. కాదేని నీకుఁబోలినభంగి

నచిరంబ చేయుము. గురుఁడైన నవలేపదోషదూషితుండై కార్యాకార్యము లెఱుంగక యుత్పథంబునం బోవునేని పరిత్యాగంబు కర్తవ్యం బని తొల్లి మరుత్తక్షితీశుఁడు సెప్పె నని. పురాణంబులందు వినంబడుచున్నది. గురుభక్తితాత్పర్యంబున నెంతప్రార్థించినను గురువృత్తి నరయక నీవు పోరాడుమనన్నమాత్రన నేను వెఱచువాఁడఁ గాను. గురువును బ్రాహ్మణుని విశేషించి తపోవృద్ధునిం దెగటార్పరా దను తలంపున నోర్చితి. ఆయుధపాణియై రణాంగణంబున మార్కొనవచ్చినవాని బ్రాహ్మణునైనను జంపఁదగు. దాన బ్రహ్మహత్య రాదని ధర్మవచనములందు సునిశ్చితంబై యున్నది. ఉత్తమక్షత్రియకులమున జనించిననాకు క్షాత్రధర్మపరిత్యాగంబు పోలదు. ఎవ్వని కెయ్యది కులధర్మంబు దాని నాచరించినం దప్పు లేదు. మఱి శ్రేయోవృద్ధి యగు. కావున నాతతాయి వగునిన్ను గురు వని భావింపక సమరంబు సేయుట కులధర్మంబగుటం జేసి యిదె నేను బోరికి సమకట్టి రానున్నవాఁడ. అమానుషంబు లగుమదీయభుజబలవీర్యములఁ జూతువు. ఈకురుక్షేత్రము సమరసముచితస్థానంబు. వేగంబ సకలసన్నాహముల సమకట్టుము. ఇచట మదీయశరశతసంభిన్నగాత్రుండవై యుత్తమలోకములం బొందెదవు. తొల్లి నీవు క్షత్రియులఁ బెక్కండ్రఁ బలుమాఱులు వధించి తదీయరుధిరమునఁ బితృతర్పణం బెచ్చోటఁ గావించితి వాశమంతపంచకంబున కిపుడు నడువుము. అచ్చోటన నేను నిన్ను వధించి భవద్రుధిరమున నీచేఁ దెగినక్షత్రియులకుఁ దర్పణంబుఁ గావించెద. నీమదం బుడిపెద. నీతోడిపోరికి సైన్యసాధనంబులు వలదు. "నేనొక్కరుండన సకలక్షత్రియుల నిర్జించితి" ననుభవదీయవికత్థనం బప్పుడు భీష్ముఁడొండెఁ దత్తుల్యుఁడొండె జనింపమిం జేసి చెల్లె. తృణప్రాయు లగునారాజులపయి నీప్రతాపంబు దీపించెఁగాని తేజోఘను లగునస్మదాదులు పుట్టినయిక్కాలంబున నించుకేనియు సాగునే? నీయుద్ధదర్ప మడంచెద నని చెప్పిన విని రాముఁడు నవ్వుచు నోకౌరవ్యా, యిదె నేను గురుక్షేత్రమునకు నడిచెద. మదీయశరతతిపీడితుండవై నేలం బడి కంకగృధ్రాదుల కెరయైయున్న నిన్నుఁ జూచి నీతల్లి జాహ్నవీదేవి పరిదేవనంబు సేయుఁగాక, సమరసన్నాహములు సమకట్టి రమ్మని వచించినయమ్మునికిఁ బ్రణమిల్లి నీకోరినట్లు పోరికి వత్తు నని యొడంబడి సమరసన్నాహంబులు కట్టాయితంబు గావించి వచ్చువాఁడనై కరిపురంబున కరిగితి. భార్గవుండును గురుక్షేత్రమునకుఁ జనియె. అంత నేనును బురంబు సొచ్చి సత్యవతికి నివేదించి యద్దేవియనుమతంబు వడసి శుక్లమాల్యాంబరభూషణాదుల ధరించి బ్రాహ్మణోత్తమవిహితస్వస్తికృత్యుండనై ధవళతురంగయోజితంబు సర్వోపకరణసమంచితంబు సూతవిద్యావిశారదసారథిసమానీతంబు నగునుత్తమరథం బారోహించి శ్వేతచ్ఛత్రచామరప్రముఖరాజోపచారంబులు

సెలంగ వందిమాగధసందోహస్తుతిపాఠరవంబు పెంపెసంగ వెడలి యతిరయ మునఁ గురుక్షేత్రంబు దరియ నరిగితి. అట్టియెడ మాతల్లి మందాకిని రూపవతి యై నాముందటం జూపట్టి కాశిరాజకన్యామూలకంబుగా మా కిరువురకుం బొసఁ గినసమరసన్నాహప్రకారం బెఱింగి మాన్పఁ దలంచి పుత్రా, పరశురామునితోడ రణము వలదు. క్షత్రియక్షయకరం బయినతదీయపరాక్రమంబు లోకవిదితంబు. అతండు పోరు మానునట్లు చేసెద నని నాతోఁ జెప్పి యప్పరశురాముకడ కరిగి యయ్యా, శిష్యునిపై నలిగి యిట్లు పోరికి నడువఁ జనునే యని పలుదెఱంగులం బ్రార్థించియు నతండు దనవేడికోలు నిరాకరించుటకు విన్నఁబోయినచిత్తముతోఁ గ్రమ్మఱి పుత్రస్నేహమ్మున నాయొద్దకరుగుదెంచి వత్సా, నీవైన గురువుతోడిపోరు మానరాదో యనవుడుఁ గృతాంజలినై నేను దల్లీ, క్షాత్రధర్మము విడిచిన క్షత్రి యునకు మేలిమి గల్గదు గావునఁ బోరికి సమకట్టి వచ్చినభార్గవునకు వెఱచియుండరా దనిపలికిన నజ్జనని యదృశ్య యయ్యె. అవ్విధంబున నరిగి నేను భార్గవుం గాంచి శంఖంబుఁ బూరించిన నతండును నన్ను మార్కొన నుత్సహించియుండె. అప్పుడు పురందరప్రముఖబృందారకులు సిద్ధవిద్యాధరగంధర్వ దేవర్షిప్రభృతులును నంతరి క్షమున నిలిచిరి. దేవదుందుభులు మ్రోసె. కుసుమవర్షంబు గురిసె. హస్తిపుర నివాసు లగువివిధజనులును భార్గవశిష్యులును భండనంబుఁ జూడ వేడుక గడలు కొనఁగ నంతటఁ బెరసియుండిరి.

## భీష్ముఁడు పరశురామునితో యుద్ధము చేయుట.

అంత నేను సమరసముత్సుకుండ నై యమ్మునిం గాంచి మహాత్మా, మీరు భూచారులై యున్నవారు. రథస్థుండ నగునాకు మీతోడ రణము సేయఁ జనదు. మేలిమిమెయిమఱువు దొడిగి తేరెక్కి రాఁ దగు ననిన నమ్ముని వల్లభుఁ డెంచుక నగి నాకు భూమి రథము, వేదములు రథ్యములు, వాయువు సారథి, గాయత్రి కవ చంబు గావున నీడెందంబున సందియంబు సేయం బని లేదని పలుకుచు నిజత పోమహిమంబునఁ గల్పితం బయినకవచంబు దొడిగి సర్వసాధనసంభృతం బుత్త మహయయోజితంబు హిరణ్మయం బకృతవ్రణసారథికంబు నగుదివ్యరథమున నారూఢుండై చూపట్టి నన్నుఁ బోరికిఁ జీరుచుండె. అప్పుడు నేను వినయావన తుండనై బాణపాతత్రయదూరమునఁ దేరు డిగ్గి ధనుర్బాణాదులు నం దునిచి కాల్నడతో నాద్విజోత్తము డాయ నరిగి విధియుతంబుగఁ బాదాభివందనం బాచ రించి మహాత్మా, నాకు సమానుఁడు నధికుఁడు గురుఁడు నగునీతోడఁ గయ్యము సేయ ననుజ్ఞఁ గొనవచ్చితి విజయశోభనంబు గలుగ దీవింపు మనిప్రార్థించినఁ బ్రసన్నుండై గురుండు నన్నుఁ గరుణార్ద్రదృష్టి నాదరించి యోకురుశ్రేష్ఠా, శ్రేయ స్కాముఁ డగువాని కిది కర్తవ్యంబు. విశిష్టులతోడ వెఱవక రణము సేయుట

యుత్తమక్షత్రియధర్మంబు. నీ వనుజ్ఞఁ గొనవచ్చుటం జేసి మే లయ్యె. కావున్న శపింతు ననియుంటి. నిన్ను గెలువ వచ్చిననేను నీకు విజయాశీర్వాదంబు సేయం జనునే? ధైర్యము పట్టి పోరాడుము. భవచ్చరిత్రకు మెచ్చితి. ధర్మంబ నీకు రక్షఁ గావించు నని యనుజ్ఞ యొసంగినఁ గ్రమ్మఱి నేను రథారూఢుండనై శంఖ ధ్మానంబుఁ గావించితి. అట నాజమదగ్నితనయుం డొక్కమొగి నలువదియమ్ములుం బదంపడి తొమ్మిదిశరమ్ములు నేసి రథరథ్యసారథిసహితంబుగ నన్నుఁ గప్పటయు నేనును మనమున దేవబ్రాహ్మణులకుఁ బ్రణమిల్లి యమ్మునిం జూచి క్షత్రధర్మంబు పట్టుటం జేసి యాచార్యుఁ డనితలంపక నీపై నమ్ములు పఱపించెద ననిపలికి యగ్గించి తొలుత నతం డేసిననారసమ్ములకు మాఱేసి వారించి నిశితభల్లమున విల్లు ద్రుంచి యతిరయంబున మార్గణగణంబు మేనం గీలించిన నయ్యాచార్యుండు మదీయశరవిక్షతగాత్రుండై నెత్తురుఁ జొత్తిల్లి గైరికాదిధాతుపటలపరాగపరీతమేరుభూధరంబుచందముననుం హిమాపగమసమయకుసుమితాశోకానోకహంబుచాడ్పుననుం బొల్పారుచు వెడవెడ గదిరినయలుకతో వేఱొక్కవిల్లెత్తి రుక్మపుంఖము లగుశిలీముఖంబులు నాపైఁ గురియించె. మర్మభేదనచణంబు లగునమ్మార్గణంబులఁ బ్రతివిశిఖంబుల వారించి నేనును గ్రమ్మఱ నంపతుంపరం గుప్పించినం బరశురాముఁడు సోలి నేలకు వ్రాలుటయుఁ గరుణావిష్టుఁడనై నేను బ్రాహ్మణోత్తముఁడు పరమధర్మాత్ముఁడు నగుగురునిం గాడ నేసితి నత్యంతఘోరకర్మం బయినక్షత్రధర్మంబింత కష్టం బగునే యని విసివి శరప్రయోగంబుఁ జాలించియున్నంతఁ గొంతవడి కమ్మునివరేణ్యుండు దెలిసె. గభస్తిమాలి యస్తగిరిశిఖరవిన్యస్తప్రశస్తకర్ణికారస్తబకంబుచందంబునం బొల్చుటం గాంచి కయ్యముఁ జాలించె. పదంపడి నేను గ్రమ్మఱి వీటి కరిగి నిపుణసూతాపనీతశల్యుండనై రథ్యములకు శల్యాపనోదనాద్యుపచారంబులఁ జేయించి యారాత్రి యుచితప్రకారంబునం గడపితి. అంతఁ బ్రభాతం బగుటయు సూర్యోదయావసరంబున సమరసన్నాహముతో రథారూఢుండనై కురుక్షేత్రంబుఁ దఱియం జొచ్చుచుండ భార్గవుఁడుం బోరికి సమకట్టి వచ్చి నన్ను మార్కొనియె. అట్టియెడఁ దొల్లింటిచందమునం దేరు డిగ్గి పాదచారినై యయ్యాచార్యునొద్దకుఁ జని పాదప్రణామం బాచరించి సమరమున కనుజ్ఞాతుండనై మగిడి తేరెక్కి వెఱపు మాని యంపసోనఁ బఱగించినం గినిసి జామదగ్న్యుండు ప్రతిశరముల మద్విశిఖంబుల మాయించి నాపయిం బెక్కునారసంబు లేసిన నేను నిశితభల్లముల వానిం ద్రుంచి బహుశిలీముఖములఁ బ్రయోగించుటయు నయ్యుభయనారాచంబులు గగనమంటపంబుఁ గప్పె. అటఁ దీవ్రప్రతాపదీపితుం డైనభార్గవుండు నాపయిం గినిసి దివ్యాస్త్రములఁ బ్రయోగించువాఁ డగుటయు నేనును హాహానినాదంబు రోదసీకుహరంబునం బర్వఁగ వాయవ్యాస్త్రం

చేసితి. అతండు గుహ్యకాస్త్రంబున దాని నివారించుటయు నే నాగ్నేయాస్త్రంబుఁ బ్రయోగింపఁగ నతండు వారుణాస్త్రంబునఁ బ్రతిహతంబుఁ గావించె. ఇవ్విధమున దివ్యాస్త్రకౌశలంబుఁ జూపుచుండ నన్ను డాపలించి వచ్చి యాద్విజవర్యుండు మదీయవక్షంబున వాఁడితూపు నాటుటయు నేను సొమ్మసిల్లి తేరిపయి నెఱఁగఁ బడినం జూచి సమయజ్ఞుం డై నసారథి తేరు దొలఁగించె. అకృతవ్రణప్రముఖు లగుజామదగ్న్యశిష్యులును గాశిరాజకన్యకయు నత్యంతమోదమునం బొదలుచుండిరి. అంతఁ గొంత సేపునకు లబ్ధచేతనుఁడనై నే నతిరయమునం గురుని మార్కొని బాణజాలంబుఁ గురియించిన నతండు మాఱేసి వానిఁ దుత్తునియలు గావించినం గనలి నేను దీప్తాస్యం బయినయొక్క మార్గణంబు గాడ నేసినం గురుండు తెలివి దప్పి నేల కొఱగె. మిన్నుఁ బాసి నేలం బడినసూర్యునిచాడ్పున నయ్యవక్రవిక్రముండు పుడమికి వ్రాలుటయు హాహాకారంబు లెసంగె. తపోధనులును గాశిరాజపుత్త్రియు సంత్రస్తచిత్తంబులతో దిగ్భ్రమంబునఁ బఱచిరి. అట నేను డాయం జని శిశిరోపచారంబు లొనరింపఁగ మూర్ఛ దేఱి భార్గవుఁడు లేచి భీష్మ, నిలు మిం కెక్కడకుఁ బోయెదవు హతుఁడ వైతి వనిపల్కుచు నేను దే రెక్కునంతలోనఁ జారుకార్ముకంబున నిశితశరం బరివ్రోసి మదీయవామభాగంబు నొనేయుటయుఁ బెనుగాలికిఁ దూలుద్రుమానిమాడ్కిఁ గంపితసర్వాంగుఁడనై తేరిమీఁద నెఱఁగంబడితి. పడి తెప్పిఱిల్లుకొనునంతలో నభ్భార్గవుండు నాతేరిగుఱ్ఱములం జంపి చలంబు నెఱయ హస్తలాఘవంబు మెఱయ ననర్గళప్రసారంబుగ మార్గణాసారంబుఁ గురియించుచుండ నేనుం గన్నుఁగవఁ గెంపు సొంపార క్షణమాత్రలోన నెక్కుయుమ్మడిగఁ బెక్కమ్ములు గుప్పించినం గగనభాగంబు సూర్యకిరణప్రచారంబున కించు కేనియు నెడ లేనివిధంబుగా శరమయంబయి గన్పట్టె. బాణజాలంబులపరస్పరాభిఘాతంబునం జిచ్చు పుట్టి యెండ వేఁడిమిం బేర్చి శరప్రచారరయసంభూతవాతవశమున మండి క్షితితలపతితంబు లగుశరశకలముల నేర్చుచుండె. అప్పటికిని నిలువక పరశురాముఁడు కరలాఘవచాతుర్యంబున శతసహస్రాయుతప్రయుతార్బుదఖర్వసంఖ్యాకంబు లయినదీప్తనారాచంబులం బఱగించిన నేను వాని కన్నింటికిఁ దత్క్షణంబ మాఱేసి తుత్తునియలు గావించుటయుఁ దత్కాండంబులు భండనధరిత్రీమండలంబునఁ గొండలట్లు గుప్పలై పడియుండె. అవ్విధంబున నత్యంతదారుణంబుగ రణంబు సేయుచుండి సూర్యాస్తమయసమయమునఁ జాలించితిమి. అట మఱునాఁడుం బూర్వప్రకారంబున సన్నద్ధులమై యే మిరువురముం బోరాడుచుండ భార్గవుండు నాపైఁ గినిసి వీఁ డలంతులఁ బోవఁ డనియూహించి కాలదండంబుచందంబున మండుచు నత్యంతఘోరరూపం బయినశక్తిం బ్రయోగించుటయు నేను దివ్యబాణంబు లేసి నడుమన దాని మూఁడుతునియలు

గావించితి. అట్టియెడఁ గమ్మతావులు గుబుల్కొలుపుచల్లనియెమ్మెదెమ్మెరలు వీచె. అది యట్లు వికలమ్మగుట కలిగి క్రమ్మఱ రాముఁడు ద్వాదశాత్మకుం డయినభాస్కరునిలయకాలద్వాదశమూర్తు లనంగ నతిశయతతేజస్స్ఫూర్తిసమంచితంబు లగుపండ్రెండుశక్తు లొక్కపెట్ట ప్రయోగించుటయు నేనుం బండ్రెండుదివ్యశరంబు లేసి వానినెల్ల రూపుమాపితి. అవియు నవ్విధమ్మున వమ్మగుటయు జమదగ్ని నుండు క్రోధాగ్నిదందహ్యమానమానసుండై మఱియుం గొన్నితీవ్రశక్తుల నేసినం గేడెంబున వానినెల్ల నేను నివారించుచుఁ దదీయరథరథ్యసారథులపై వాఁడితూపులు పెక్కు లేయుచుండఁ గ్రోధావిష్టుండై యతండు దివ్యాస్త్రం బొకటి వింట సంధించుటయు నాచుట్లు నెచ్చటఁ జూచిన నించుకేనియు నెడ లేక శరపరంపర లావరించె. అంతట. నేనుం గినిసి యస్త్రవిద్యానైపుణ్యం బగణ్యంబుగా నంపసోనం గురియించిన నతండు నెత్తుటఁ దేలుచు వీఁకమైఁ దాఁకుటయు నప్పటిదురంబుచందంబు చూపఱ కబ్బురం బయ్యె. అట్లుడివ్యానికడిమి మెఱయఁ బోరాడుచున్నంతఁ గొంతసేపునకు సహస్రకిరణుం డపరదిగ్వధూటీనిటలతటంబునం గాశ్మీరతిలకాలంకరణం బగుటయు నాఁటిరణమ్ము సాలించితిమి. ఇట్లు ప్రతిదినము దినాంతమునఁ జాలించుచు నిశాంతంబునఁ దొడంగుచు బహుప్రకారములఁ బోరుచుండ నిరువదిరెండుదినమ్ములు సనియె. అమ్మఱునాఁటి సంగరంబున నుగ్రుండై భార్గవుండు నిరర్గళప్రసారంబుగ మార్గణాసారంబుఁ గురియించి నాసారథిం గూల్చి మదీయభుజాంతరమున నిశితభల్లం బొక్కటి నాట నేయుటయు నేనుం దెలివి దప్పి నేలకు వ్రాలితి. నన్ను హతునకా వగచి రాముఁడుం దదీయులుం బరమసంతోషమునఁ బెలుచ నార్చిరి. పోరు చూడ వచ్చినకౌరవులందఱుం గొందలం బందినడెందంబులతో విన్నఁబోయిరి. అట్టియెడ సూర్యాగ్నిసమతేజోవిరాజితు లయినబ్రాహ్మణోత్తము లెనమండ్రు నాకు సన్నిధియై పుడమిపయిం జేర్పక నన్నుఁ దమచేతుల నిడికొని సుహృద్బాంధవులచందమున శిశిరోపచారంబులను స్వస్తివాచనంబునుం గావించుచుండఁ గొండొకవడికిఁ దెలిసి నేను వారల నగ్గించి నాతేరికి సారథికృత్యంబు సల్పుచున్నమాతల్లిని గంగాదేవిం గాంచి సభక్తికంబుగసాష్టాంగదండప్రణామం బాచరించినన ద్దేవి దీవించి చనియె. అంత నేను రథారూఢుండనై సారథికృత్యంబునుం జేయుచు నద్భుతప్రకారమునఁ బోరాడుచు గండడరి యొక్కవాఁడినారసంబు గాడ నేసినఁ బరశురామదేవుఁడు విల్లు విడిచి మోఁకరించికొని నేల కొఱగె. అప్పుడు నెత్తురు గురియుట, కొఱవులు రాలుట, పిడుగులు పడుట, పుడమి వడఁకుట, చండమారుతంబు వీచుట, వఱళు లఱచుట, మొరయింపకున్నను దుందుభులు మ్రోయుట, కంకగృధ్రాదులు వ్రాలుట, రాహువు రవిం గప్పుట మున్నగునుత్పాతంబులు దారుణాప

తంబులై దోఁచె. అటఁ గొండొకసేపునకు లబ్ధచేతనుండై జమదగ్నిసూనుఁడు కోపాటోపదీపితుండై తాళమాత్రం బయినయుద్దండకోదండంబు చేతఁ గొని గొనయంబు సారించి పోరి కాయితంబై వచ్చునంతలోన భానుమంతుఁడు మంద మరీచిమండలుండై పడమర సేరుటయు సుఖశీతమారుతపురస్కృతంబుగా వివిధ తారాగ్రహగణసమంచితంబై రాత్రియే తెంచుటయు రణవిరమణంబుఁ జేసితిమి.

భీష్మునకు వసువులు స్వప్నమున సాక్షాత్కరించి మోహనాస్త్ర మిచ్చుట.

అంత నారాత్రి నేను రాజధాని సొచ్చి కర్తవ్యములఁ దీర్చి శయనంబుఁ బొందించి బ్రాహ్మణులను దేవతలను బితృదేవతలను నక్తంచరభూతగణములను మనంబున ధ్యానించి పరశురామునితోడఁ దీఅరానిపో రయ్యె: ఇరువదిమూఁడు దినము లిప్పటికిఁ గడచె. అమ్మహావిక్రముం గెలువ నగునేని మీరు ప్రసాదించి కలలోఁ గానిపించి యతనిం గెలువ నుపాయంబు బోధించిన మేలగు ననితలంచి తలంచి కొండొకవడికి నిద్రించుచుండఁ బ్రభాతసమయమున నాకు వలపట నెనమండ్రు బ్రాహ్మణోత్తములు పగలు రథమునుండి నేలంబడి మూర్ఛిల్లిననన్ను శిశిరోపచారస్వస్తివాచనాదికృత్యంబుల లబ్ధచేతనుం గావించినవారు సాక్షాత్క రించి గాంగేయా, లెమ్ము నీ కించుకేనియు వెఱవం బనిలేదు. మేము నిన్ను రక్షిం తుము. నీవు మాశరీరంబవకాని లాఁతివాఁడవు గావు. పరశురాముఁడు నిన్ను గెలువలేఁడు. నీవ యతనిం గెల్తువు. తద్విజయార్థంబు ప్రజాపతినిర్మితం బయిన సమ్మోహనాస్త్రం బిచ్చెదము. దీని నతఁడును భూమండలమున నిఁక నెవ్వరు నెఱుం గరు. అది పూర్వదేహమున నీ వెఱింగినదియకాని వేఱొక్కటి గాదు. అది నీకు సదాసన్నిహితంబై పరమవిజయంబు గావించు. తత్ప్రయోగమున నీ కతండోడు నింతియకాని మృతిఁ బొందఁడు. కావున గురువధపాతకంబు మూఁడునొకో యని తలంకనుఁ బని లేదు. అదియునుంగాక యతండు సమ్మోహితుం డగుటయే మనకు విజయం బని తలంపవలయుఁగాని చిరకాలజీవి యగునతనిం జంపవలయు నని పూనినం బ్రయోజనంబు పుట్టదు: కావున నిదియే కర్తవ్యం బనిచెప్పి నా కయ్యస్త్రరాజంబు ప్రయోగోపసంహారప్రకారపూర్వకంబుగా నుపదేశించి యదృ శ్యులైరి. పదంపడి నిశావసానంబున నేను మేల్కాంచి ప్రాతఃకరణీయములఁ దీర్చి యయ్యస్త్రమును జిత్తమున లెస్స యనుసంధించి యెప్పటియట్ల సంగ్రామ భూమి కరిగి చలంబు డింపక పోరాడుచుండ భార్గవుండు పూర్వదినకోపాటోపంబు దీపింప నిలింపరాజాశనిసమస్పర్శంబును కాలదండతుల్యంబు నగుశక్తిం బ్రయో గించుటయు నయ్యది చిచ్చుచందమున మండుచు వ్యోమయానంబుచాడ్పున నతిరయమున వచ్చి మదీయస్కంధసంధిదేశంబు విక్షతంబుఁ గావించిన నేను గైరి కధాతుపటలారుణం బయిన మహీధరంబుపోలె రక్తసంసిక్తగాత్రుండనై.

యొప్పుచు మృత్యుసన్నిభం బయినయొక్కతీవ్రశరం బమ్మునినిటలతటమున నాటితి. దాన నతండు శృంగసంగతకులాచలంబుతీరున నొప్పారుచు సంరంభసముల్లసితుండై ఘోరనారాచం బొక్కండు నాఱొమ్మున గాఁడ నేసిన నేను రుధిరపరీతుండనై మూర్ఛిల్లి నేల గొఱగి కొండొకవడికిఁ దెలిసి ఘోరశక్తిని బిడుగువంటిదాని నతనిభుజాంతరమున నాటుడు నాద్విజుండు గాత్రకంపంబుతో విహ్వలుం డగుటయు నకృతవ్రణుఁ డుచితోపచారంబులను భద్రవచనప్రకారంబునను బలుదెఱంగుల నూరార్చినం దేఱి యత్తపోధనుం డుదగ్రక్రోధసమగ్రుండై బ్రహ్మాస్త్రం బేసె. నేనుం బ్రతివిధానార్థంబు బ్రహ్మాస్త్రంబయేసిన నయ్యాస్త్రంబులు రెండును నడుమ నొండొంటిం దాఁకుటయు నాకసంబు తేజోమయం బయ్యె. తత్తేజంబునకు సర్వభూతములు నార్తిం జెందె. దేవగంధర్వఋషిప్రముఖులుం బరమసంతాపంబుఁ బొందిరి. ధాత్రి వడఁకె. దిగ్దాహంబు పుట్టె. గగనచరప్రాణిజాలంబునకు నిలువ నెడ గలుగదయ్యె, లోకముననెల్ల హాహాకారంబులు మీఁదుమిక్కిలి యెసంగె. అయ్యవసరంబున నే నిదియ తఱి యని తలంచి చిత్తమున లెస్స నెలకొల్పియున్న సమ్మోహనాస్త్రంబు వింట సంధింపఁ బూనుచున్నంత హాహానినాదంబులతో నారదుండు నామ్రోలం బొడగట్టి యోభీష్మా! వలదువల దుడుగుముడుగుము సమ్మోహనాస్త్రప్రయోగంబు. వీరె వేల్పు లందఱు మింట నుండి తదస్త్రంబు నిషేధింపుచున్నవారు. బ్రాహ్మణుఁడు తాపసుఁడు గురుఁడు నగురాముని కవమానంబు సేయఁ జన దనిపల్కుటయు నేను దల యెత్తి చూచిన నంతరిక్షస్థితు లయినయయ్యెనమండ్రు బ్రాహ్మణోత్తములు నన్నుఁ బిలిచి యోభరతకులదీపకా. దేవర్షిచర్యుం డైననారదుండు పనిచినవిధంబు సేయుమది నీకును లోకజాలంబునకును శ్రేయస్కరం బని యొక్కమాటగాఁ జెప్పిన విని యయ్యస్త్రరాజం బుపసంహరించి బ్రహ్మాస్త్రంబు దీపింపఁ జేసితి. అంత భీష్మున కోడుట ఘటించెఁగా యని కోపావిష్టుండై యున్న పరశురాముపాలికిఁ దత్పితృపితామహాదు లగుజమదగ్నిప్రముఖులు లేతెంచి వత్సా, నీ కేల యిట్టిసాహసంబు? భీష్మునితోఁ బోర నేల? క్షత్రియకులసంభవకారణంబున నతనికి సమరము ధర్మ్యమైనను బ్రాహ్మణకులసంభూతుండైననీ కది తగునే? స్వాధ్యాయవ్రతతపశ్చర్యావిధానంబులుకదా విప్రకులోత్పన్నునకుఁ గర్తవ్యధర్మములు. తొల్లి నిమిత్తవిశేషముకలిమిం జేసి శస్త్రగ్రహణంబు నీకుఁ గార్యం బనిపల్కితిమి. అంతమాత్రన యది తీఱినపదంపడియుం దానిఁ గొనఁ దగునే? భీష్మునితోడ నింతదనుకఁ జేసిన కయ్యము చాలు. ఇఁక నుడుగుము. ఈశాంతనవుఁడు వసువులలో నొక్కరుఁడకాని సామాన్యక్షత్రియుండు గాఁడు. నీ కజేయుఁడు. ఇఁకఁ గొంతకాలమునకు నారాయణసఖుం డైననరుఁ డనునునివర్యుండు పాండురాజక్షేత్రమున దేవేంద్రు

నంశచే జనించి యర్జునుఁ డనఁబరఁగి నిజప్రతాపంబు దీపింపఁజేయు శూరశేఖరుఁ డితనికి మృత్యు వని బ్రహ్మవిధానంబు గలదు. ఇఁకమీఁద నస్త్రశస్త్రములఁ బరిత్యజించి తపోనిష్ఠ నల్పుట నీకుఁ దగు నని బోధించిన విని రాముఁడు పోర మఱలుట నాకు వ్రతంబు గాదు. భీష్ముని మఱల్పుఁడు. పిదప నేనుం గయ్య ముడిగెద నని పలుకుటయు వారు నారదుండు తోడ నేతేర నాకడకు విచ్చేసి యయ్యా, గురువుతోడికయ్యము మానుము. బ్రాహ్మణావమాననంబే తగ దనిన గురు నవమానింపరా దని వేఱ చెప్పవలయునే? మఱియు నీ కితఁ డవధ్యుఁడు. మేము గురువులము గావున ని న్నింత వారించి చెప్పితిమి. కయ్య ముడుగు మనిచెప్పిన నేనును సమరపరాఙ్ముఖత్వంబు నాయట్టివానికిఁ దగునే లోభకార్పణ్యభయాదు లెవ్వి పొసంగినను ధర్మరక్షణంబే పరమవ్రతం బనియున్నవాఁడ ననిపల్కుచుండ మజ్జనయిత్రి జాహ్నవీదేవియు నప్పుడు నాపాలి కేగుదెంచి పుత్రా, రాముని తోడ రణంబు సేయవల దని యనునయించి బోధించె. అప్పటికిని నేను సమర సన్నాహవ్రత ~రంబు మానకుండుటయు మాతల్లియు నారదుఁడు నమ్మునులుం బ్రమ్మఱ రాముసెద్దకుఁ జని బ్రాహ్మణులనెమ్మనంబు వెన్నవలెం గఱంగు నని లోకవిదితమైయుండఁ దద్విరుద్ధంబుగ నవధ్యుం డైనభీష్మునిపైఁ గ్రోధ మింత పూన నేల యని బహుప్రకారంబుల నూరార్చి శస్త్రము లవలఁ బెట్టించుటయు నేనును సమర ముడిగితి. అయ్యెడ నయ్యేనమంద్రుఁను వచ్చి యిపుడు గురుఁ డయినరామునడుగుల కెఱఁగుట నీకు శ్రేయస్కరం బనిచెప్పి నన్నుఁ దోడ్కొని యరిగి శిష్యునితప్పు లన్ని మన్నించి కరుణింపు మని పలుకుచున్నంత నేనుం దనచరణములకు సాష్టాంగదండప్రణామం బాచరించిన నప్పరశురామదేవుఁడు ప్రేమబంధురంబుగ నన్నుఁ గ్రుచ్చియెత్తి కౌఁగిటం జేర్చి వత్సా, నీశక్తికి భక్తికిని మెచ్చితిని. ఈపృథివీమండలముననెల్ల నీ కెనవచ్చుక్షత్రియుఁ డొక్కరుఁడు లేఁడని వచించి యాదరించి యప్పుడ యంబను బిలిచి నాశక్తికొలఁది నీకుఁగాఁ బోరాడితి. నేను భీష్ముం గెలువ నోపను. ఇం కెయ్యదియేనిం జేయఁ గోరుదు నేని చెప్పు మది చేసెద. భీష్ముని శరణుసొచ్చుటయే నీకుఁ బోలినగతి యని నాకుఁ జూడఁ దోఁచుచున్న దని నిశ్శ్వసించుచుఁ జెప్పుటయు నక్కాశీశకన్యక భార్గవ రామునకుఁ గేలుమోడ్పు ఘటించి మహానుభావా, శక్తికొలఁది పోరి చూచితివి. శాంతనవుఁ డజేయుఁ డయ్యె. నీవలనం గొఱంత లేదు. ఏ నింక భీష్ముఁ బ్రార్థింపను. భీష్ముని వధింపఁగఁ గ్రూరతపంబు సేయుదాన ననిపలికి యమ్మునియనుజ్ఞ వడసి తపోవనంబున కరిగె. నారదాదులును మాతల్లియు మమ్మిద్దఱ నామంత్రణంబుచేసి చనిరి. రామదేవుఁడు నన్ను వీడ్కొలిపి తనతోడ వచ్చిన మునులు వెంట రా మహేంద్రపర్వతమునకుఁ బోయె. ఏనును రథారూఢుండనై

యెడనెడ విప్రాశీర్వాదంబులను ప్రశంసావచనంబులను నాకర్ణించుచుఁ బురము సొత్తెంచి సర్వవృత్తాంతములను సత్యవతీ దేవికి నివేదించిన నద్దేవి మదీయవిజయం బభినందించి కాశీశ్వరకన్యకపూన్కికిఁ దలఁకుచు దానితెఱంగు దెలియఁ దగినవారల నెల్లచోట్లకుఁ బనుచుచు నెఱుంగుచుండె. నేనును డెందమున నందులకుఁ గొందలం బందుచుండియుఁ దపోవనములకుఁ జనినవారలుదక్కఁ దక్కటి రాజులనెల్ల నుక్కడంచుచుంటిని.

నారదుఁడు భీష్మున కంబవృత్తాంతముఁ జెప్పుట.

అంత నొక్కనాఁడు నారదపారాశర్యులు నాయొద్దకు వచ్చిన నేను గాశీశ్వరకన్యకతెఱం గంతయు సవిస్తరంబుగఁ దేటపఱిచిన విని వారు దైవాధీనంబులగుకార్యములకు వగవం బని లే దని నాకు బోధించి రందు నారదుఁడు దాని యనంతరకృత్యంబు వివరింప వింటిని. దాని విను మని సురనదీసూనుఁడు సుయోధనున కిట్లనియె. ఆకాశిరాజకన్యక యమునాతీరమునకుఁ జని యాఱునెలలు నిరాహారయుఁ బదపడి యొక్కయేఁడు యమునాజలమున శరీరయాత్ర నడపుచుఁ బిదప నేకవత్సరంబు జీర్ణపర్ణములఁ దినుచు మఱియుఁ బలుదెఱుంగులఁ గఠిననియమములతోఁ బండ్రెండేండ్లు తీవ్రకోపమునఁ బాదాంగుష్ఠాగ్రమున నిల్చి బాంధవప్రభృతు లెంద ఱెంత వారించి చెప్పినను వినక రోదసీకుహరంబునఁ దాపము పెంపెసఁగ ఘోరతపంబు సల్పి యట నందాశ్రమ, ములూకాశ్రమము, చ్యవనాశ్రమము, బ్రహ్మస్థానము, దేవయజనస్థానం బయినప్రయాగక్షేత్రంబు, కౌశికాశ్రమము, మాండవ్యాశ్రమము, దిలీపాశ్రమము, పైలగర్గాశ్రమము మున్నగు పుణ్యాశ్రమములను భోగవతి రామహ్రదము మున్నగుపుణ్యతీర్థములను సేవించుచుఁ బుడమినెల్లెడం ద్రిమ్మరుచుండె. ఒక్కనాఁ డస్మజ్జనని గంగాదేవి యేల యిట్టిక్రూరతపంబు సేసెద వని దాని నడుగ నది నన్నుఁ బరాభవించినభీష్ముని వధింపఁగ నీతపంబు సలిపెద ననుటయు నద్దేవి నీతలంపు నెఱవేఱనేరదు. మఱి నీవు కుటిలప్రవర్తనవగుటం జేసి కుటిలప్రచారయుఁ దుస్తీర్థయుఁ గ్రూరయాదోగణాభీలయుఁ బ్రావృట్భిన్నవేళల నుదకరహితయు నగునేఱై పాఱఁ గలదాన వని శపించె. అదియుఁ దీర్ఘసేవానిమిత్తమున వత్సదేశమున కరిగి నిజతపఃఫలంబులో సగమున నదియై యంబ యనుపేరం బరఁగి తక్కటిసగమున మేను దాల్చి యవ్విధంబున భాగీరథీశాపంబు నిస్తరించి వెండియు నాపయి నలుకతో మహానుభావు లగుమును లెందఱు వారించినను వినక పతిలోకహీనం బైనతనబ్రదిమికి వగచుచు నతిక్రూరప్రకారంబునఁ దపోనిష్ఠ సల్పుచున్నంత మహేశ్వరుఁడు ప్రత్యక్షంబై వరంబు వేఁడు మనుటయు నది దేవా, యేను భీష్ముని వధించునట్లు వరం బిమ్మని యడుగ నద్దేవుఁడు దానిం బిలిచి యీజన్మమున నీకు భీష్మవధంబు

దుష్కరంబు. జన్మాంతరమున నీవు పాంచాలపతి యగు ద్రుపదునకుఁ దొలుతఁ గూఁతురై పుట్టి పదంపడి పురుషుండవై శాంతనవుని ననిం గెల్తు వప్పు డిది స్మృతిగోచరంబు గాఁగల దని పలికి యదృశ్యుఁ డయ్యె. అంత నయ్యంబయు శరీరధారణంబునకు విసివి యరణ్యమునఁ గాష్ఠములఁ బేర్చి సొద గావించి చిచ్చు వెట్టి రగుల్కొలిపి భీష్ముని వధింతు నని పలికి యందుఁ జొచ్చె.

ద్రుపదునకు శిఖండి జనించుట.

అయ్యవసరంబునఁ బాంచాలరాజు పుత్రార్థిని యగుమహిషికోర్కి నెఱవేర్పం దలంచి శంకరుం గుఱించి తపంబు సేసిన నమ్మహాదేవుఁడు సన్నిధియై యేమి గోరెద వనియడుగ నయ్యజ్ఞసేనుఁడు నాతోఁ బగ వాటించుచున్న భీష్ముం జంపఁ జాలినకొడుకు నిమ్మని వేఁడిన నవ్వేఁడికోలు చిత్తగించి చిత్తజదమనుండు తొలుత నీకుఁ గూఁతురై పుట్టి పదంపడి కారణవిశేషమునఁ బురుషత్వంబుఁ బొంది పుత్త్రుఁ డగువాఁడు శంతనుపుత్రుని వధించు నని చెప్పి యంతర్హితుం డయ్యె. ద్రుపదుఁడును వీటి కేతెంచి శంకరువరంబు తనదేవి కెఱింగించిన నాయమయు ఋతుస్నాతయై ప్రయతచిత్తంబుతోఁ బతిసంగమం బనుభవించి వేఁకటి యయ్యె. పరమేశ్వరవరంబునం జేసి కాశిరాజకన్యక చైతన్యం బప్పాంచాలరాజుదేవియుదరంబు సొచ్చె. ద్రుపదపత్నియు నిజనాథుండు పుత్రలాభమున కెంతయు సంతసంబునం బొదలుచుఁ దనకు సకలాభిమతపరిపూర్తిఁ గావించుచుండఁ బరమానందమునం దేలుచుండి యుచితకాలమునఁ గూఁతుం గని యయ్యర్థంబు వెలిపుచ్చక నిగూఢంబుగ మంత్రరక్షణంబుఁ గావించి కుమారుఁ డుదయమయ్యె నని ప్రకాశముగ రాజున కెఱింగించి పుచ్చె. అప్పాంచాలనాథుండును నిగూఢప్రకారమునఁ దదీయస్త్రీత్వముఁ దెలిపిన విని మంత్రరక్షణతత్పరుండై దానికిఁ బుత్త్రోచితప్రకారంబుగా విధివిహితవిధానంబున జాతకర్మాదిసంస్కారంబులఁ జేయింపఁగ నక్కన్నియయు గూఢప్రకారమున మంత్రముతోఁ దల్లి దన్నురక్షించుచుండ శిఖండి యనం బరఁగి పెరుగుచుండె. తదీయమంత్రంబు నెవ్వరు నెఱుంగరైరి. నే నొక్కండను గూఢచారులవలనను నారదమునివలనను నెఱింగితి. అట్లు పెరుగుచున్నయాకన్నియకు యజ్ఞసేనుఁ డక్షరశిక్షాదు లాచరించి చిత్రశిల్పాదుల నేర్పి ధనుర్విద్యాగ్రహణార్థంబు ద్రోణాచార్యుపాల నిడిచి కొంతకాలమున దానికి యౌవనం బాసన్నమగుటం జూచి యాఁడుది యగుటకు వగచి యుమాపతివచనంబు నమ్మి యుండాక నీకన్నియ మగవాఁ డని మఱుఁగుపఱిచితిమి. ఇపుడు జవ్వనంబు మేన నివ్వటిల్లుచున్నయది. ఇం కెట్లు చేయఁ దగునో యని చింతిల్లుచుండ నతనిభార్య యిందులకు వగవం బని లేదు మహేశ్వరువచనం బనృతం బగునే యది యుచితసమయమున నెఱవేఱకమాన దని

యూరార్చి తగినకన్నియం దెచ్చి పెండ్లి సేయుట తగు నని చెప్పిన విని పాంచాలపతి యిది యుచితం బని తలంచి దశార్ణ దేశనాథుం డైనహిరణ్యవర్మ యను రాజుకూతుం దెచ్చి శిఖండికి సముచితప్రకారంబునఁ బాణిగ్రహణంబు సేయించి యుత్సవోత్తరంబుగ నిజపురప్రవేశంబుఁ గావించె. దశార్ణరాజతనయయుఁ జతుర గావున శిఖండి యాఁడుది యవుట నెఱింగి లజ్జించుచు నెట్టకేలకు దాదికి నెచ్చెలులకుం జెప్పిన వాం డ్రయ్యెడరు దమరాజునకు విన్నవించిరి. శిఖండియు మంత్రరక్షణతాత్పర్యమునఁ దనయాఁడుఁ దనము బాహిరవెట్టక పురుషునట్లు రాజకులమున విహరించుచుండె.

అంత నక్కడ దశార్ణదేశాధీశుండు తనయల్లుఁడు మగవాఁడుగామికి వగపు గదురఁ దీవ్రకోపదీపితుండై పాంచాలపతియొద్దకుఁ దగినదూతను గొన్నిమాటలఁ జెప్ప మనిపంచిన వాఁడు వచ్చి ద్రుపదుం గాంచి యయ్యా, కూఁతునకుఁ గొడుకని నెపం బిడి మాకూఁతుం బెండ్లి సేసి మమ్ము వంచించితివి. నీకు దీనఁ గలుగు లాభ మెయ్యది? నీదుర్మంత్రమునకు ఫలముఁ గుడిచెద వని మారాజు నీ కెఱింగింపఁ బంచినాఁ డనిచెప్పిన విని యజ్ఞసేనుఁడు పట్టువడినదొంగ తెఱంగున నేమియుం బలుకఁ దోఁపక కొండొకవడి యూరకుండి పదంపడి యయ్యా, యిట్టు లనం దగునే? ఎట్టివారలకైన నిట్టిపనులం గొంచెమేనియుఁ బ్రయోజనంబు లే దని నే నెఱుంగనే? అది యెక్కడిమా టని మధురసంభాషణమ్ముల ననునయించి సంశయము వాయఁ బరీక్షింపఁ గోరిన నుపాయాంతరంబున నయ్యత్నముఁ ద్రోచి పుచ్చి యాదూతను వీడ్కొల్పుటయు వాఁ డరిగి కలిగినదంతయు హిరణ్యవర్మకుఁ దెలిపె. హిరణ్యవర్మయుఁ గార్యము తెఱంగు మంత్రులతోడ నాలోచించి నిశ్చయించి పాంచాలపతిం బట్టి చెఱఁ బెట్టఁ దలంచి బలఁగంబుఁ గూర్చికొని వివిధ వరూథినీసమన్వితుండై పుడమి గ్రక్కదల నతిరయంబున నడిచి పాంచాల దేశంబుఁ జొచ్చి కాంపిల్యపురంబు ముట్టడించి యిఁక నెందుఁ బోవచ్చుఁ జక్కనిలు మనుమాటలం జెప్పఁగ ద్రుపదునొద్దకు దూతం బుత్తెంచిన వాఁ డవ్విధంబుఁ దెల్పి చనియె. యజ్ఞసేనుఁడును బదంపడి సాంత్వవచనములఁ దెల్పఁ దగిన దూతల నద్దశార్ణరాజుపాలికిఁ బంపి యభ్యంతరమందిరంబున కరిగి శిఖండిజననితో నేకాంతమున నీవు కూఁతునకుఁ గొడు కనునెపంబు వెట్టుటం జేసి నేనును భవద్వచనం బియ్యకొన్నదాన నింతలు వుట్టె. హిరణ్యవర్మ పురంబు ముట్టడించినవాఁ డిప్పటి కెయ్యది ప్రతివిధానం బగునోగాని నా కెయ్యదియుం దోఁప దయ్యె. నీకుఁ బోలినవిధంబుఁ దెల్పు మనిన నద్దేవియు మహారాజా, సవతాండ్రకుఁ గొడుకులు గలిమియు నాకు లేమియుం జూచి రోషవిషాదవివశనై పరమేశ్వరువరము నమ్మి పుట్టినబిడ్డ కొడుకని ప్రకాశంబుఁ గావించి నిగూఢప్రకారంబున మంత్రము

నీ కెఱింగించితి. నీవును మహాదేవువాక్యార్థంబుమీఁదినమ్మికకతముననే కూఁతు నకుఁ బుత్రకృత్యములు గావించితివి. ఈశ్వరుఁ డిప్పుడైనఁ దనయిచ్చినవరంబు నెఱవేర్పకున్నె యని యూహించెద ననుటయు నప్పాంచాలరాజు మంత్రుల రావించి పెద్దయుం బ్రొద్దు మంతనంబుండి యనునయము సాగకుండినఁ గయ్యము కర్తవ్యంబ యగు నని కార్యంబు నిశ్చయించి నిసర్గగుప్తం బయినకాంపిల్యపురం బునకు విశిష్టప్రకారమున వెండియు గుప్తి గావించె. వియ్యములతోడఁ గయ్యము గాక నెయ్యము పొసంగుతెఱంగు నెఱవేఱ గురుదేవతార్చనంబులు హోమం బులుం జేయించె. ఇట్లు దైవమానుషప్రకారంబునఁ దగువిధం బాచరించుచుండ దండనాథులును భండనంబున కాయితంబై యుండిరి.

## శిఖండి స్థూణాకర్ణుఁ డనుయక్షునివలనఁ బురుషత్వంబు నొందుట.

అయ్యవసరంబున శిఖండి తనజన్మంబునిమిత్తంబునఁ దల్లిదండ్రులకుఁ గడవరానియాపద వచ్చె నని వగచి యది దీఱఁ దనప్రాణవియోగంబు దక్క నొండొక్కగతి గానరా దని నిశ్చయించి యత్యంతవిషాదవేదనాభరంబు గదుర ననశనవ్రతమున మేను విడువం బూని యాప్రోలిచేరువ నడవి తెరువు పట్టి కొంత చని స్థూణాకర్ణనామకయక్షునివాసంబు తద్భయంబునం జేసి సర్వజనవిసర్జితంబు నగువనంబు సొచ్చి సుధాలేపనదీపితంబు లాజాదిశోభనద్రవ్యపరిష్కృతంబు సమున్నతప్రాకారతోరణసమంచితంబు నగుతద్భవనంబుఁ గాంచి యభ్యంతరం బున కరుగుటయు నయ్యక్షుఁ డింతీ, యేమిపని గలుగ నిటకు వచ్చితివి చెప్పుము చేసెద ననవుడు శిఖండి నాకార్యంబు నెఱవేర్పఁగఁ బరమేశ్వరుఁ డొక్కరుఁడ నేర్చు. నీ కది చెప్పనేల యని యెంత చెప్పినను వినక వెండియు స్థూణాకర్ణుఁడు కుబేరుననుచరుం డగునా కశక్యము గలుగదు. దుష్కరంబైనం జేయుదుఁ జెప్పుమని నిర్బంధించి యడుగుటయు శిఖండి తనజన్మరహస్యంబును దననిమి త్తమున దశార్ణవిభునివలనం దల్లిదండ్రులకు దుస్తరం బయినసంకటపాటు వాటిల్లుటయుఁ దనకుఁ బురుషత్వలాభం బందులకుఁ బ్రతివిధానం బగుటయుం దేటపఱిచి మమ్ముఁ గావఁగఁ దలఁతువేని హిరణ్యవర్మ మాప్రోలికి వచ్చునం తకుమున్న నాకుఁ బుంస్త్వముఁ బ్రసాదింపు మనిప్రార్థించె. తత్ప్రార్థనం బాక ర్ణించి స్థూణాకర్ణుండు ప్రతిజ్ఞాప్రకారంబునఁ దనపుంస్త్వహానికిఁ గొండొకవగచి యదంపడ భవితవ్యములకు వగచినం బ్రయోజనంబు వుట్ట దని నిశ్చయించి దశార్ణవిభుమెప్పుతోడబంధుజనపరిత్రాణంబుఁ గావించుపొంటెఁ బదిదినములు నాపురుషత్వముఁ దాల్చి యామీఁద దాని నాకుఁ గ్రమ్మఱ నొసంగునది యని శిఖండితో సంకేతం బొడంబఱిచి తనపుంస్త్వము నిచ్చి తదీయస్త్రీత్వము గ్ర హించె. శిఖండియు స్థూణాకర్ణునిప్రసాదమునఁ బురుషత్వము వహించి వర్ణనీయ

యక్షరూపసముల్లసితుండై పరమసంతోషమునఁ బురి కేతెంచి జననీజనకులం గనుంగొని తాను మగవాఁ డయినవిధం బంతయు సవిస్తరంబుగఁ దెలియఁ జెప్పిన విని ద్రుపదుఁడు భార్యయుం దాను బరమేశ్వరువరమునఁ గడవరానివ్యసనార్ణవంబు నిస్తరింపఁ గంటిమిగదా యని యానందలహరిం దొప్పదోఁగుచున్నంత హిరణ్యవర్మపురోహితుం డేతెంచి యతఁడు చెప్పినవిధంబుగాఁ బరుసంపుఁబలుకులు కొన్ని పలికినం దా నందులకుఁ గింకిరిపాటు గాంచక పాంచాలవిభుం డద్దశార్ణవిభుపురోహితునకు సముచితప్రకారంబున నాసనార్ఘ్యపాద్యమధుపర్కాదివిధానంబులఁ బూజఁ గావించి మీరాజు వాస్తవం బెఱుంగక పెఱవారిమాటల విని యలిగినవాఁడు. ఆఁడుదానికిఁ దనకూఁతుం దెచ్చి పెండ్లి సేయఁగ మే మంత వెడంగులమే యని యుచితవచనంబులఁ జెప్పి యనిచి తనపురోహితబ్రాహ్మణుని రావించి యయ్యా, మీరు దశార్ణవిభుఁ డగుహిరణ్యవర్మపాలికిఁ బోయి శిఖండియెడ నాఁడుఁదనంబు వితర్కింపఁ బని లేదు. లాఁతులదురుక్తుల నమ్మరా దని తేటపడం జెప్పుట యిప్పటికి మే లని పంచిన నప్పురోహితుం డయ్యర్థంబు దశార్ణపతి కెఱింగించె. ఆతండును దద్వచనంబు విని నాగరికప్రకారంబునఁ దగినయువిదలఁ బనిచి శిఖండిపుంస్త్వంబు వారివలనఁ దెలిసి యత్యంతసంతోషసమాక్రాంతస్వాంతుండై పరులమాటలు నమ్మి తా నంతలు సేఁతకుఁ దన్నుఁ దాన నిందించికొని కూఁతుం గినిసి సంబంధి యగుపాంచాలవిభునినగరి కరిగి యతండు చేసినసత్కృతుల గ్రహించి యల్లున కనేకగజంబులను బహుతురంగములను బెక్కురథములను వేనవేలు మొదవులను దాసీసహస్రంబులను బహుళధనరత్నరాసులను నిచ్చి నిజపురంబునకుఁ జనియె.

### స్థూణాకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము గలుగుట.

అట్టియెడఁ గుబేరుఁడు లోకయాత్రావశమున నవ్వనమున కరుదెంచి సర్వాలంకారసముల్లసితం బయినస్థూణాకర్ణుమందిరంబుసొంపు పెంపుఁ గనుంగొని మెచ్చుచుఁ గొండొకవడి యుండి స్థూణాకర్ణుఁ డేలొకో యింతకు నన్నుఁ గాంచఁ డయ్యె. మదించినవాఁడు గాఁబోలు. వీని కిపు డుగ్రదండంబు కర్తవ్యంబు వానిం దోడితెం డని చుట్టనున్నయక్షులతోఁ జెప్పుటయు వా రట్ల యని యరిగి వానిం దోడ్కొని వచ్చి ముందటఁ బెట్టి దేవా, యీయక్షుఁడు పాంచాలరాజపుత్త్రి యగుశిఖండికిఁ దనపుంస్త్వ మిచ్చితదీయస్త్రీత్వము గ్రహించియునికిం జేసి సిగ్గుపెంపున దేవరసన్నిధికి రాకున్నవాఁ డకాని యొండు గాదని విన్నవించిన నయ్యక్షేశ్వరుం డట్లగునేని వీని కాఁడుఁదనంబ యుండుఁగా కని తొలుత శపించి క్రమ్మఱ యక్షులు పలుదెఱంగులం బ్రార్థించినం గరుణించి శిఖండి యాయువు గలకాలమెల్ల నాఁడుఁదనము వహించి యనంతరంబు పురుషుఁ డగు నని శాపా

నుగ్రహంబు ప్రసాదించి యథేచ్ఛం జనియె. స్థూణాకర్ణుఁడుం గుబేరుని వీడ్కొని విధిప్రాప్తం బైనతనయోఁడుఁదనమునకు వగచుచు నచ్చటన యుండె. అంత నొక్కనాఁడు శిఖండి సమయపాలనతాత్పర్యమునఁ దల్లిదండ్రులయనుమతిఁ బడసి యవ్వనంబునకుఁ జని స్థూణాకర్ణుం గాంచి సమయప్రకారంబున వచ్చితి. నీమగతనము గ్రహించి నాయోఁడుఁదనముఁ గ్రమ్మఱ నా కిమ్మని యడుగ నయ్యక్షుఁ డయ్యా, నాకు యక్షేశ్వరునిశాపమునంజేసి పెద్దకాలము స్త్రీత్వ మనుభావ్య మయ్యె. విధికృతంబునకు వగవం బని లేదు. దైవప్రాప్తం బయినపుంస్త్వమున నీవు సుఖింపుము. నీసమయపాలనతాత్పర్యమునకు మెచ్చితి నని చెప్పి వీడ్కొల్పినం బరమానందంబు డెందంబున సందడిగొన మగిడి పురంబు సొచ్చి యప్పాంచాలరాజకుమారుండు జననీజనకుల కంతయు నివేదించుటయు ద్రుపదుఁడునిజదేవియు సుహృద్బాంధవులుం దాను నెంతయు ముదంబునంబొదలి దేవ గురుబ్రాహ్మణపూజనం బాచరించి శస్త్రాస్త్రవిద్యానైపుణ్య లాభార్థం బాకుమారుని ద్రోణాచార్యునకు శిష్యుఁ గావించె.

సుయోధనా, శిఖండియు ధృష్టద్యుమ్నుఁడు దక్క టిపాంచాలకుమారులును మీరుం గలసి యాచార్యునొద్ద ధనుర్విద్యాప్రావీణ్యంబు నేర్చికొనుట నీవ యెఱుంగుదువుగదా. ఇవ్విధమున శిఖండివృత్తాంతంబు నేను వేగులవాండ్రవలన నించించుక యెఱింగియున్నను బ్రత్యక్షసర్వార్థుం డయిననారదమునివలన సాకల్యముగ నెఱింగితి. ఇప్పగిదిం గాశీపతికన్యక యగునంబ శిఖండియై పుట్టుటం జేసి స్త్రీపూర్వుం డయినయాశిఖండి భండనంబున గండడరి నొంచినను నేను వానికి మాఱేయు టుడుగుదు. స్త్రీలను స్త్రీపూర్వులను స్త్రీనామకులను స్త్రీరూపులను నే నని మార్కొన నని వ్రతంబుఁ బూనినవాఁడఁ గావున నెట్లయిన నగుదుంగాని వ్రతభంగముఁ గావించికొన నొల్లను. భీష్ముఁడు భగ్నవ్రతుఁ డయ్యె ననుటకంటె నొండొక్కయపయశంబు గలదే యని చెప్పిన విని దుర్యోధనుం డట్లు వ్రతము పూనఁగ నిమ్మహానుభావునక తగు నని మందాకినీనందను నభినందించి యాదిన శేషంబు గడపె.

మఱునాఁడు సముచితప్రకారంబున దండనాథమండలపరివృతుండై నిండోలగం బుండి గాంధారీనందనుండు గంగానందనుం గాంచి పితామహా, లోకపాలోపమభీమార్జునప్రముఖవీరలోకరక్షితంబయి దేవదానవాదులకు నజేయంబయినపాండవసైన్యంబు సమయింప నీ కెన్నినాళ్లు పట్టు. ఆచార్యుండును, గృపాచార్యుండును, గురుపుత్రుండును, రాధేయుండు నెన్నిదినంబులలోపల సమయింప నేర్తు రనియడుగ నక్కురుపితామహుండు కుమారా, వారు దమకొలందులఁ దార చెప్పుదురుగాక యేను నాకొలంది వచియించెద విను మని యిట్ల

నియె. మాయాయుద్ధమున మాయావులను ధర్మయుద్ధమున ధార్మికులనుం గెలుచుట ధర్మువు గావునఁ దత్ప్రకారంబు దప్పక కయ్యంబు సేయుదు. ఒక్కొకనాఁటికిఁ బదివేవురుయోధులను వేవురురథికులనుం జంపుదు ఇట్లు దివ్యాస్త్రకౌశలంబు మెఱయఁ జలంబు నెఱయఁ బోరాడుచుఁ బాండవసేనాసమూహంబు నొక్కనెలకుఁ గడతేర్తు నిది నాచాలెడికొలంది యనిన విని సుయోధనుఁ డాచార్యుమొగమునం జూడ్కి నిలిపి మీచాలెడికొలంది యెట్లని యడుగుటయు నా ధృతరాష్ట్రసంభవునకుఁ గుంభసంభవుఁ డిట్లనియె. ఏను ముదిసినవాఁడఁ గావున నంతచెప్పఁ జాలఁగాని మీతాత చాలెడికాలమున నేనుం బాండవసైన్యంబు రూపడంపఁ జాలుదు ననుటయుఁ గృపాచార్యుఁడు నాకు రెండునెలలు పట్టునని యె. ఆచార్యపుత్రుండు దాను పదిదినములకుఁ బాండవసైన్యంబు భండనంబునం బొరివుత్తు ననియె. కర్ణుఁడు దినపంచకములో నేను వారిసైన్యమంతయుఁ బొలియింతు ననియె. ఆమాట విని శాంతనవుఁడు కిలకిలనవ్వి రాధేయా, పుండరీకాక్షసహాయుండై భండనంబునం గోదండ పాండిత్యంబుఁ జూపుగాండీవియెదుటం బడకమున్న మనరాజుకొలువులో నీవెన్ని చెప్పినం జెల్లు నింత యేల? నీకొలఁది నీవ యెఱుంగుదు వనియె ననిచెప్పి సంజయుండు ధృతరాష్ట్రునకు వెండియు నిట్లనియె.

ఇవ్విధంబున నీకొడుకునెడం బుట్టినవిశేషంబుల వేగులవారివలన విని ధర్మనందనుండు తమ్ములును వాసుదేవప్రముఖు లగుసుహృద్బాంధవులును దగినవారుం గొలువఁ గొలువుండి తమ్ములం గలయం గనుంగొని యక్కడ దుర్యోధనుండు పితామహద్రోణకృపద్రౌణికర్ణులం బిలిచి పాండవసైన్యంబు సమయింప మీ కెంతకాలము పట్టు ననియడుగుటయుఁ బితామహుఁడు నాచార్యుఁడును దమ కొక్కనెల పట్టుననియుఁ గృపాచార్యుండు దనకు రెండునెలలు పట్టుననియు నాచార్యపుత్రుండు దనకుఁ బదినాళ్లు పట్టు ననియు రాధేయుండు దన కేనునాళ్లు చాలు ననియుం జెప్పి రని తెలియవచ్చె ననిచెప్పి యర్జునుదెస మొగంబై ధార్తరాష్ట్రసైన్య మంతయుఁ బిలుకుమార్ప నీకెన్నినాళ్లు పట్టును నీకొలంది చెప్పు మనిన విని మహేంద్రనందనుండు వసుదేవనందనునాననం బాలోకించి ధర్మనందనున కిట్లనియె. మహారాజా, వారు మేటిశూరులు గావున నట్లు చెప్పిరి. తమప్రతిన నెఱవేర్పఁ గడంగుదురుగాక. నాకొలంది వినుము. వాసుదేవసహాయుండ నైననే నొక్కండనే క్షణమాత్రంబునధార్తరాష్ట్రులయేకాదశాక్షౌహిణులయని యననేల స్థావరజంగమాత్మకంబు లగుముల్లోకంబులను సంహరింపఁ జాలుదు. సర్వభూతమహేశ్వరుం డైనశూలపాణి కైరాతద్వంద్వయుద్ధమున మెచ్చి యుగాంతకాలమునఁ దాను బ్రయోగించునట్టిపాశుపతాస్త్రంబు నతిఘోరాకారంబయినదాని

నాకుఁ బ్రసాదించె. అది నాకు సన్నిహితమై యున్నది. దానిం బితామహుఁ డాచార్యుఁడు కృపాచార్యుఁ డాచార్యపుత్త్రుఁడు నెఱుంగరు. సూతపుత్త్రున కెం తదవ్వో నీవ యెఱుంగుదువు. అయిన నెక్కుపెట్టి యట్లు గావించుట కీర్తికరంబు గాదు గావున నితరాస్త్రంబులనే శత్రుసైన్యంబుఁ జెండాడుదు. అది యిప్పు డేల? అప్పటికిఁ బోలినభంగిఁ జూచెద. డెందంబునఁ గొందలంబు మానుము. భీమసే నుండు, గవలు, సాత్యకి, శిఖండి, ధృష్టద్యుమ్నుండు, యుధామన్యుఁ, డుత్తమౌ జుండు, విరాటద్రుపదులు, ఘటోత్కచుండు, దత్పుత్త్రుం డయినయంజనపర్వుఁ, డభిమన్యుండు, ద్రౌపదేయులు మున్నగునీవారలెల్ల ముల్లోకంబులనైన నేటఁ గ లుపఁ జాలినవారు. వా రందఱు దివ్యాస్త్రవిదులు సమరకాంక్షు లపరాజితులని యు నీచిత్తంబునకుఁ దెల్లంబకదా. అది యట్లుండె. నీకోలంది నీ వెఱుంగవుగాని మనంబున నించుక యలిగి కన్నుఁగవఁ గెంపు పెంపారఁ జూచిన నెవ్వారెట్లయ్యె దరో యది తుదిఁ జూతువు. దేవతలైన నీసైన్యంబు నెదిరింప వెఱతురు. కౌర వులమాట యిఁకఁ జెప్పవలయునే? జయమంగళంబు నీకుఁ గరగతంబయనిపలికె నని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని.

క. అనఘుఁడు వైశంపాయన, మునివరుఁ డుద్యోగపర్వమును వివరింపన్
విని జనమేజయమహిపతి, ఘనసమ్మదసింధువీచికాతతిఁ దోఁగెన్.

మ. సమిదంతర్గతవహ్నిమాడ్కి నెవఁ డాశ్చర్యస్వమాయాకృతో
త్తమమధ్యాధమచిత్రగాత్రముల నంతర్యామియై తారత
మ్యమునం దోఁచియు వానిదోషసముదాయం బంట కాత్మప్రకా
శమున న్వెల్గుచు నిత్యశుద్ధుఁ డగు నాసర్వాత్ము నెంతు న్మదిన్.

ఇది శ్రీకాళహస్తి నగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్కమహీపాల కరుణాపు రస్సర బహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషా కవిత్వ చమత్కార పరితో షితబుధస్తోమ సీతారామకవి లలామపుత్త్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనృసింహ సుధీవర్య సచ్ఛాత్త్ర, విబుధ జనవిధేయ వేంకటరంగ నామ

ధేయ ప్రణీతం బైన శ్రీమదాంధ్ర వచనభారతంబునం దుద్యోగపర్వ
మున శ్రీకృష్ణుఁడు సంధికార్యార్థంబు కరినగరంబునకుఁ జని కౌరవ స
భామధ్యంబున నుచితవచనంబులఁ జెప్పుటయు, దంభోద్భ వాఖ్యా
నంబును, మాతలీయోపాఖ్యానంబును, గాలవమహర్షి చరిత్రం
బును,దుర్యోధనాదికంబైన దుష్టచతుష్టయంబు చేయఁ దలం
చిన దురుద్యోగం బెఱింగి యోగేశ్వరుం డైనశ్రీకృష్ణుఁడు
విశ్వరూపంబుఁ జూపుటయు, విదులాపుత్రశాసనం బును,
సంధి పొసఁగమిం జేసి కృష్ణుండు మగిడి యరుగువాఁడు
కర్ణుం దనతేరెక్కించికొని రహస్యంబుఁ దెల్పుటయు,
వాసుదేవుఁ డుపప్లావ్యము సేరి సంగ్రామంబు నిశ్చయిం
చినం బాండవులు సైన్యసహితంబుగాఁ గురుక్షే
త్రంబునకు నడుచుటయుఁ, గౌరవసైన్యనిర్యా
ణంబును, నులూకదూతాభి గమనంబును,
రథాతిరథ సంఖ్యానంబును, నంబోపా
ఖ్యానంబునన్నది ద్వితీయాశ్వాసము.
ఉద్యోగపర్వముసమాప్తము.



# ఆంధ్ర గ్రంథమాల

నెం. 3, 7 తంబుశెట్టివీధి, చెన్నపురి.

ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధ విషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసములకొకటివంతున ప్రచురింపఁబడును. వెలువడిన గ్రంథములు:—

1. శతకమంజరి (ప్రథమసంపుటము): వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్టరఘువీర, నారాయణ, కాళహస్తీశ్వర, దాశరథి, రంగశాయి, రామతారక, రామచంద్ర శతకములు పది యిందు గలవు. ఒక్కొక్క శతకమునకు పీఠికయు, పాఠభేదములును గలవు. (ఈ శతకములు విడిగను దొరకును.) ౧-౮-౦
2. బసవపురాణము (ద్విపద): పాల్కురికి సోమనాథుఁడు. అనేక తాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ౨-౮-౦
3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము ౦-౪-౦
4. కమలాక్షి (చిన్న విచిత్రకథ): శ్రీ రాయసం వేంకటశివుడుగారు, యమ్.ఏ., యల్.టి. ౦-౮-౦
5. నీతినిధి: ఇది యొక యుత్కృష్టనీతిగ్రంథము. ఇది తొలుదొల్తనే రెండు [illegible]కు ముందొక భారతీయుడను నొక పండితునిచే టిబేతుభాష[illegible] రచియింపబడి సదపడి యనేకభాషల బరివర్తితమై వ్యాప్తిని [illegible] అనువాదకులు: శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ౧-౪-౦
6. [illegible]స్వామిచరిత్రము (పద్యకావ్యము): శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి కృతము. శ్రీ రామభక్తాగ్రణియు, గాయకపితామహుఁడు నగు శ్రీ త్యాగరాజుగారి చరిత్ర మిందు సరసముగ [illegible]పబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచియించిన కృతులను నిందుఁ జేర్పబడినవి. ౦-౧౦-౦
7. [illegible]పదము (వచనము): బౌద్ధమత ధర్మప్రబోధక గ్రంథమగు 'త్రిపిటకము' నందలిది. బౌద్ధమతధర్మతత్త్వము లిందు చక్కగా ప్రతిపాదింపబడినవి. అనువాదకులు: శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు, యమ్.ఏ., యల్.టి. ౧-౧౦-౦

కాశీనాథుని నాగేశ్వరరావు, వ్యవస్థాపకుఁడు.